శ్రీ

పార్థసారథీయము

# చతుర్వేద భాష్యము

ప్రథమ భాగము

(వేదాలు వివిధ విషయాలు, ఋక్, యజు స్సంహితలు)



డా॥ క్రోవి పార్థసారథి

శ్రీ

# పార్థసారథీయము

# చతుర్వేదభాష్యము

(వేదాలు-వివిధ విషయాలు)



ప్రముఖ శ్రీవిద్యా ప్రచారకులు
అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,
ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, మెంఫిస్, అమెరికా ఆస్థాన విద్వాంసులు,
డా॥ క్రోవి పార్థసారథి

# చతుర్వేదభాష్యము

## తెలుగులో మొదటిసారిగా వ్రాసిన వేదభాష్యము

విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపించిన
మాధవ విద్యారణ్యుల పేరుతో
ఆయన సోదరుడు సాయనాచార్యులు
క్రీ॥శ॥ 1380 ప్రాంతంలో
“విద్యారణ్యభాష్యము”
అనే పేరుతో నాలుగు వేదాలకు
భాష్యము వ్రాశాడు.

మళ్ళీ 634 సం॥ల తరువాత
డా॥ క్రోవి పార్థసారథి గారిచే
“పార్థసారథీయము”
అను పేరుతో అతిసులభశైలిలో వ్రాయబడింది
“చతుర్వేదభాష్యము”

# రచయిత గురించి

| | | |
|---|---|---|
| పేరు | : | **క్రోవి పార్థసారథి** |
| పుట్టినతేది | : | 13-12-1949 |
| తల్లిదండ్రులు | : | శ్రీమతి సత్యపర్వతవర్ధనమ్మ, శ్రీకృష్ణమూర్తి గారు |
| స్వగ్రామం | : | ఖొజ్జిర్లిపేట, మచిలీపట్టణం, కృష్ణాజిల్లా |
| విద్యాభ్యాసం | : | |
| సెకండరీ స్కూల్ | : | శ్రీ రంగనాయక హైందవ పాఠశాల, సర్కిల్‌పేట, మచిలీపట్టణం (పొట్టా పిచ్చయ్య గారి బడి) |
| మిడిల్ స్కూల్ | : | జె.బ్రాంచి, మచిలీపట్టణం |
| 8వ క్లాసు | : | జిల్లా పరిషత్ హైస్కూలు, కంచికచర్ల |
| 9వ క్లాసు | : | శ్రీమంత్ రాజాగారి హైస్కూలు, చల్లపల్లి |
| 12వ | : | హిందూహైస్కూలు, మచిలీపట్టణం. |
| బి.కాం. | : | ఆంధ్ర జాతీయ కళాశాల, మచిలీపట్టణం |
| ఎమ్.కాం. | : | గోవింద రామ్ సెక్సేరియా కాలేజ్ ఆఫ్ కామర్స్ & ఎకనామిక్స్, నాగపూర్ యూనివర్శిటీ, నాగపూర్ (మహారాష్ట్ర) |
| ఎమ్.ఫిల్ | : | అమ్రావతి యూనివర్సిటీ (మహారాష్ట్ర) |
| పిహెచ్.డి | : | నాగార్జున యూనివర్సిటీ (ఆంధ్రప్రదేశ్) |
| వ్రాసిన పుస్తకాలు | : | శ్రీవిద్యాసారథి - లలితా సహస్రనామ భాష్యము, శ్రీకైవల్యసారథి - విష్ణు సహస్రనామ భాష్యము, సౌందర్యలహరి, శ్రీవిద్య మొదలైన 33 పుస్తకాలు. |
| ఉపన్యాసాలు | : | యోగవాసిష్టము, భగవద్గీత, ఉత్తరగీత, ఉద్ధవగీత, త్రిపురారహస్యము, రామాయణ కథా సుధ వంటి అనేక భక్తి, వేదాంత విషయాల మీద 1650 గం॥ |

దీక్షానామము : పరమానందనాథ

వివాహము : 13-12-1977 భార్య రమాదేవి
తెలుగు హెచ్.ఓ.డి., వి.పి.ఎస్. పబ్లిక్ స్కూల్, విజయవాడ. 12-1-2014న స్వర్గస్తురాలైంది

పురస్కారాలు

1. ఉగాది పురస్కారము : ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వము వారిచే 21-3-2004న
2. ఉత్తమ ఉపాధ్యాయ : ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వము వారిచే 5-9-2004న

ఆస్థాన విద్వాంసులు :

1. అవధూతదత్త పీఠం, మైసూరు 29-5-2005
2. ఇండియా కల్చరల్ సెంటర్ అండ్ టెంపుల్, మెంఫిస్, అమెరికా 31-3-2010

సత్కారాలు : శృంగేరి, కంచి పీఠాధిపతులు, గణపతి సచ్చిదానంద స్వామి మాతాకరుణామయి వంటి వారిచే

అవార్డులు : ఇప్పటి వరకు 11 ప్రపంచ రికార్డులు 3 జాతీయ రికార్డులు, సంఘమిత్ర అవార్డు

ఉద్యోగం : నోబుల్ కాలేజి మచిలీపట్టణంలో 1974 సం॥లో కొద్ది నెలలు
1975 నుంచి శాతవాహన కళాశాల, విజయవాడ

పదవీ విరమణ : 31-12-2007 కామర్స్ డిపార్ట్‌మెంటులో రీడరుగా

చేసిన యాగాలు : 1. 1-12-2008 నుంచి 25-12-2008 వరకు అష్టోత్తరశత చండీయాగము
2. 1-3-2009 నుంచి 25-12-2009 వరకు సహస్ర చండీయాగము

3. 1-2-2010 నుంచి 25-12-2010 వరకు సహస్ర వనదుర్గాపంచశతీ మహావిద్యాయాగము
4. 2011 సం॥ గణపతి యాగము
5. 4-3-2014 నుంచి 30-3-2014 వరకు అతిరుద్ర మహాయాగము
6. 24-10-2014 నుంచి 22-11-2014 వరకు (కార్తీకమాసం) అతిరుద్ర మహాయాగము

12 గం॥ నిరవధిక ఉపన్యాసాలు ప్రపంచ రికార్డు : 1. 26-10-2013 న ఉదయం 7 గం॥ నుండి సాయంత్రం 7 గం॥ల వరకు లలితా సహస్ర నామ భాష్యము గాంధీనగరం విజయవాడ లోని శివరామకృష్ణ క్షేత్రంలో
2. 27-1-2014న ఉదయం 8 గం॥ల నుండి రాత్రి గం॥ 8-00ల వరకు "శ్రీవిద్య-మంత్ర, యంత్ర, తంత్ర రహస్యాలు" మాతా విజయేశ్వరీ దేవి (కరుణామయి) పెంచలకోన వారి ఆధ్వర్యంలో నోవా ఫంక్షన్ హాలు, నాచారం, సికిందరాబాద్ నందు

సన్మానాలు : 1) 13-12-1999న కనకాభిషేకము
2) 1-8-1998న సువర్ణఘంటాకంకణము
3) 3-11-2002న గండపెండేరము

చిరునామా : 23-11/1-10/2, దేవీనిలయం,
ఓగిరాల వారి వీధి, సత్యనారాయణపురం
విజయవాడ-11.
ఫోన్ : 0866-2530672
సెల్ : 9866820574

# ప్రణతులు

ఒకసారి ఉపన్యాసం చెబుతున్నప్పుడు శ్రోతలలో ఒకాయన లేచి "వేదాలమీద ఉపన్యాసం చెప్పకూడదా? వేదంలో చెప్పిన విషయాలు తెలుసుకోవాలని మాలో చాలామందికి కోరికగా ఉంది. వేదం చదువుకున్న వాళ్ళెవరూ మాకు చెప్పటం లేదు. మీరయినా ఆ పని చెయ్యకూడదా?" అన్నారు. ఆయన ఉద్దేశ్యంలో "వేదపండితులు ఎవరూ మాకు వేదం గురించి చెప్పటంలేదు" అనే మాట గట్టిగా స్ఫురిస్తోంది. అసలు వారికి తెలియని విషయం ఏమంటే వేదపండితులు వేదం చదువుకున్నారు అంతేకాని దాని అర్ధం వాళ్ళకీ తెలియదు. వేదార్థం తెలియాలంటే వేదభాష్యం చదువుకోవాలి. అలాంటివారిని మనం వ్రేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. వేదంలో ఏముందో వాళ్ళు మనకు చెప్పరు. ఒకవేళ చెప్పినా, వాళ్ళభాష, చెప్పేవిధానము మనకు అర్ధంకావు. అందుకే ఉపన్యాసకులందర్నీ వీళ్ళు అడుగుతూనే ఉన్నారు. అందులో భాగంగానే నన్ను అడిగారు. ఆ క్షణంలో అందరిలాగానే నేనుకూడా నవ్వేసి ఊరుకున్నాను. ఉపనిషత్తుల మీద నేను ఉపన్యాసాలివ్వటం పుస్తకం వ్రాయటం, దాన్ని ఉపన్యాసాలుగా చెప్పి సి.డిగా ఇవ్వటంకూడా జరిగింది. సరే చూద్దాం అని ఊరుకున్నాను.

26-10-2013న లలితా సహస్రనామ భాష్యం ఉదయం 7 గం॥ల నుండి సాయంత్రం 7 గం॥ల దాకా పన్నెండు గంటలపాటు ఉపన్యాసం చెప్పాను. ఆ సమయంలో వేదాలమీద కూడా ఇలా ఉపన్యాసం చెబితే ఎలా ఉంటుంది? అని ఆలోచించాను. ఒకవేళ నేను చెబితే జనం వినగలరా? ఒక ప్రయత్నంగా ఉపనిషత్తులు- బ్రహ్మవిద్య అనే విషయంమీద, రోజూ గంటన్నర చొప్పున

పదిరోజులపాటు చెప్పాను. ఈ పదిరోజులపాటు నేను ప్రారంభం చేసే సమయానికి అందరూ వచ్చి కూర్చునేవాళ్ళు. ఉపన్యాసం పూర్తి అయ్యేదాకా ఎవరూ కదిలేవారు కాదు. ఇప్పుడు నాకు రెండు విషయాలు అర్ధమయినాయి. 1. వేదాలమీద పన్నెండు గంటలు ఉపన్యాసం నేను చెప్పగలను. 2. శ్రోతలు కూడా కూర్చుని వింటారు. అయితే వేదాలమీద పుస్తకం నేనే వ్రాసుకోవాలి. ఈ కార్యక్రమాలన్నీ విజయవాడలోనే మా యింటి దగ్గరే ఉన్న శివరామకృష్ణ క్షేత్రంలోనే జరిగాయి. ఈ మధ్యలోనే నా భార్య రమాదేవి 12-1-2014న గతించింది. విచిత్రం ఏమంటే 27-1-2014న హైదరాబాదులో శ్రీవిద్య-మంత్ర యంత్ర తంత్ర రహస్యాలు అనే విషయం మీద పన్నెండు గంటలపాటు ఉపన్యాసం చెప్పాను. సరిగ్గా ఆవిడ పోయిన పదిహేనవ రోజు. ఈ కార్యక్రమాలన్నీ పూర్తయిన తరువాత వేదాలమీద పుస్తకం వ్రాయాలి అనుకున్నాను. కాని అది నా బోటివాడికి సాధ్యమా? నేను కామర్స్ అధ్యాపకుణ్ణి. అలాంటి నాకు వేదాలమీద పుస్తకం వ్రాయటం సాధ్యమా? బాగా ఆలోచించాను. సాధ్యమే అనిపించింది. 'సౌందర్యలహరి' లోని ఆరవ శ్లోకంలో మన్మథుడికి కాలుచేతులు లేవు అసలు శరీరమే లేదు. ధనుస్సు చూద్దామా? పూలధనస్సు బాణాలు చూద్దామా పూలబాణాలు వింటినారి చూద్దామా తుమ్మెదల వరుస. రథం చూద్దామా దక్షిణ దిక్కు కొండగాలి. సారథి వసంతుడు. వీటిలో ఏవీకూడా యుద్ధం చెయ్యటానికి పనికిరావు. అయినప్పటికీ పరమేశ్వరికృపవల్ల అత్యంత శక్తిశాలురయిన మునీశ్వరుల మీదకి యుద్ధానికి వెళ్ళి గెలుస్తున్నాడు. దీనికి కారణం పరమేశ్వరి కృపాకటాక్షణాలు ఆయనమీద పూర్తిగా ప్రసరించటమే. పరమేశ్వరుని

కృప ఉంటే జరగనిది ఏదీలేదు.

వ్యాసభగవానుడు కూడా బదరికావనంలో తపస్సు చేసి పరమాత్మ సాక్షాత్కారం పొంది ఆ తరువాతే బ్రహ్మసూత్రాలు వ్రాశాడు. అందుకే నేను కూడా పరమేశ్వరుని కృప పొందాలంటే అతిరుద్రమహాయాగం చెయ్యాలి అని సంకల్పించుకుని 4-3-2014న యాగం ప్రారంభం చేశాను. నేను ఒక్కడినే. ప్రతిరోజూ ఉదయం 8-00 గంటలకు ప్రారంభం చేస్తే సాయంత్రం 6-00 గంటలయ్యేది. రోజుకు ఐదు రుద్రాలయ్యేవి. ఇలా 29-3-2014తో యాగం పూర్తయింది. 30-3-2014 పూర్ణాహుతి. ఆ మరునాడు సంవత్సరాది. 4-4-2014 జయనామ సంవత్సర చైత్రశుద్ధ పంచమి, రోహిణి నక్షత్రం. పుస్తకానికి శ్రీకారం చుట్టాను. ఇంట్లో మాట్లాడేవారు కూడా ఎవరూ లేరు. నేను ఒక్కడినే. దాంతో పగలు రాత్రి తేడాలేదు. రాత్రి పన్నెండు గంటలదాకా కూర్చునే వాణ్ణి. మళ్ళీ రెండు, రెండున్నర కల్లా లేచేవాణ్ణి. పుస్తకం వ్రాయటమే పని. గతంలోనే ఉపన్యాసాల కోసం కొన్ని ఉపనిషత్తులు, శతరుద్రీయం, శ్రీసూక్తం ఇలా వ్రాసి పెట్టుకున్నాను. దశోపనిషత్తులు, గర్భోపనిషత్తు వంటివి కొన్ని పుస్తకాలుకూడా ప్రచురించాను. దాంతో నా పని కొంతవరకు సులువైంది. 7-7-2014 వేదాలమీద నేను వ్రాసే పుస్తకం పూర్తయింది. కనీసం ఐదువందల పేజీలు వచ్చినా సరిపోతుంది అని వ్రాయటం ప్రారంభించాను. కాని ఆశ్చర్యంగా పుస్తకం పూర్తయ్యే సరికి పదహారువందల పేజీలు అయింది. 1380 ప్రాంతంలో సాయణాచార్యుడు నాలుగు వేదాలకు కలిపి భాష్యం వ్రాశాడు. అదే విద్యారణ్య భాష్యం ఆ తరువాత మళ్ళీ నాలుగు వేదాలకు కలిపి ఎవరూ భాష్యం వ్రాయలేదు. తెలుగులో ఇంతవరకు

అటువంటి పుస్తకం లేదు. దీనికి **పార్థసారథీయము** అని నామకరణం చేశాను.

నాలుగు వేదాలకు అంటే వేదంలో చెప్పిన అన్ని సూక్తాలకు వివరణ అనవసరం అనిపించింది. అందుకే కొన్ని సూక్తాలకు మాత్రమే వివరణ ఇచ్చాను. సూక్తాలు కూడా పెద్దగా ఇవ్వలేదు. వాటివల్ల సామాన్యుడికి ఉపయోగం లేదు. భాష్యము అంటే సూక్తాలకు నాచేతనయినంతవరకు ఇచ్చిన వివరణ అంతకుమించి ఏదో ఉందని భావించద్దు.

ఇది సామాన్యుడి కోసం వ్రాసిన పుస్తకం. వేదం అంటే ఏమిటో సామాన్యుడికి అర్థం కావాలని చేస్తున్న ప్రయత్నం. నా యీ ప్రయత్నం ఫలిస్తే నా జన్మ ధన్యమైనట్లే. ఈ పుస్తకం చదివితే సామాన్యుడికి తప్పనిసరిగా వేదాలమీద ఒక అవగాహన కలుగుతుంది.

వేదంలో ఒక్క సంహితే కాకుండా, బ్రాహ్మణాలు, అరణ్యకాలు, ఉపనిషత్తులు కూడా వ్రాయటం జరిగింది. యజ్ఞయాగాలలో కొన్నిటిని సంక్షింప్తంగా చెప్పాను. ఉపనిషత్తులు మాత్రం 108 పూర్తిగా వ్రాశాను. వేదాలయొక్క అంతిమలక్ష్యం మోక్షసాధన. అందుకే ఉపనిషత్తులను పూర్తిగా వ్రాయటం జరిగింది.

వ్రాసేటప్పుడు శైవము, వైష్ణవము, శాక్తేయము, ద్వైతము, అద్వైతము దేనిమీద పక్షపాతం చూపలేదు.

నేను సంప్రదాయవాదిని. వేదాలంటే నాకు అత్యంత గౌరవం ఉంది. కాని ఛాదస్తాన్ని ఎక్కడా ఉపేక్షించలేదు.

ఈ పుస్తకం వ్రాయటానికి నాకు అత్యంత ప్రోత్సాహమిచ్చిన శ్రీ

గరిమళ్ళ సోమయాజుల శర్మగారికి నమస్సుమాంజలులర్పిస్తున్నాను.

అలాగే నాకు సహకారమందించిన మిత్రులు శ్రీ ధూళిపాళ రామకృష్ణ గారికి, శ్రీ వి.వి. రమణగారికి నా కృతజ్ఞతలు.

నాకు ఎప్పటికప్పుడు సలహాలు ఇస్తూ పుస్తకరచనలో సహకరించిన అనుంగుమిత్రులు కవితాకృష్ణ **శ్రీ పింగళి వేంకటకృష్ణారావు** గారికి ప్రత్యేక కృతజ్ఞతలు.

ఈ పుస్తక రచనకు సహాయపడిన అందరికీ పేరు పేరునా కృతజ్ఞతలు తెలియజేస్తూ–

పై నుండి ఈ పుస్తకరచనను అనుక్షణం వీక్షిస్తున్న నా భార్య రమాదేవిని స్మరిస్తూ –

ఈ పుస్తకాన్ని ఆదరిస్తారని ఆశిస్తూ –

బుధజన విధేయుడు

**క్రోవి పార్థసారథి**

01–01–2015

జయ నామ సంవత్సర

పుష్య శుద్ధ ఏకాదశి గురువారం

# ప్రథమ అధ్యాయము

# వేదాలు
# వివిధ విషయాలు

# విషయసూచిక


1. వేదము
2. వేదవ్యాసుడు
3. వేదంలో భాగాలు
4. వేదాలెన్ని
5. వేదం చదివేటప్పుడు అర్థం తెలియాలా?
6. వేదానికి స్వరం అవసరమా?
7. వేదభాష్యాలు
8. సాయణాచార్యుడు
9. వేదము – గురుపరంపర
10. జగత్తంతా వేదంవల్లనే జీవిస్తోంది.
11. వేదాలు అపౌరుషేయాలా?
12. పాఠవిశేషాలు
13. వేదాన్ని ఎందుకు ఆదరించాలి?
14. వేదము దేవతలు
15. వేదమాత గాయత్రి
16. ఓంకారము
17. శైవ వైష్ణవాలు
18. వేదకాలంలో స్త్రీ
19. యజ్ఞయాగాలలో పశుబలి నిషేధమా
20. వేదం అద్వైతమా?

21. వేదకాలము
22. వాస్తు మూఢాచారమా?
23. స్త్రీలకు కూడా స్వర్గం ఉంటుందా?
24. యజ్ఞాలు వామాచారమా?
25. వామాచారం చెయ్యవచ్చా?
26. మోక్షం ఎలా వస్తుంది?
27. మంత్రాలకు చింతకాయలు రాలతాయా?
28. మంత్రశక్తి తగ్గిపోతుందా?
29. వేదంలో స్త్రీ దేవతలు
30. వేదాలు స్త్రీలు చదవవచ్చా?
31. వరకట్నము
32. వేదాలకు ఆదరణ రావాలంటే
33. పంచశాంతులు
34. వేదం ఏం చెబుతోంది ?
35. అపరావిద్య

# పార్థసారథీయము

# చతుర్వేదభాష్యము

# వేదాలు - వివిధ విషయాలు

ఇష్టప్రాప్తిని, అనిష్ట పరిహారాన్ని పొందటానికి చెప్పిన అలౌకికమైన ఉపాయమే వేదము అన్నారు. అసలు ఈ వేదాలు ఎలా వచ్చినాయి? అనే విషయంమీద భిన్నవాదనలున్నాయి. ఇందులో సంప్రదాయవాదులు, చరిత్రకారులు అని రెండు రకాలవారున్నారు. సంప్రదాయ వాదులంటే వేదాన్ని పరమేశ్వర స్వరూపంగా భావించేవారు. వీరి ప్రకారం వేదాలు సాక్షాత్తు పరమేశ్వరుడి ముఖం నుంచే వచ్చినాయి. పరమేశ్వరుడే వాటిని చెప్పాడు. పరమేశ్వరుడు నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు కదా? మరి ఆకారం లేని పరమేశ్వరుడు, అవయవాలు లేని పరమేశ్వరుడు, నోరులేని పరమేశ్వరుడు వేదాలను ఎలా చెప్పాడు? అనేది ప్రశ్న. దీనికి సమాధానం ఏమంటే కొంతమంది ఆప్తఋషులు సమాధిస్థితిలో ఉండి వేదమంత్రాలు దర్శించారు. వారే ఆ మంత్రాలకు ద్రష్టలు, ఋషులు అనబడతారు. ఋగ్వేదంలోని మంత్రాలను సుమారు 403 మంది ఋషులు దర్శించారు. ఇది సంప్రదాయవాదుల వాదన. వీరి ప్రకారం వేదాలు అపౌరుషేయాలు.

ఇక చరిత్రకారుల విషయానికొస్తే పూర్వకాలంలో ఆస్ట్రియా, హంగేరీ ప్రాంతాలనుంచి కొన్ని తెగలవారు మధ్య ఆసియాకు వలస వచ్చారు. అలా వచ్చిన వారినే ఆర్యులు అంటారు. వీరు మధ్య

ఆసియాలో కొంతకాలం ఉండి ఆ తరువాత వారిలో కొంతమంది భారతదేశానికి వలస వచ్చారు. వీరిని 'ఇండో ఆర్యన్స్' భారతీయ ఆర్యులు అంటారు. వీరు వచ్చేటప్పుడు త్రోవలో కొండలు, కోనలు, భయంకరమైన అడవుల ఎడారులు, నదులు సముద్రాలున్నాయి. ఈ ప్రకృతివల్ల తమకు ఏదైనా ఆపద కలుగుతుందేమో అని భయపడి ప్రకృతిని స్తుతించారు. అవే స్తోత్రాలు, సూక్తాలు అనబడ్డాయి. అలా వచ్చిన వారు మనదేశంలో 'సప్తసింధు' ప్రాంతంలో నివాసం ఏర్పరచుకున్నారు. సప్తసింధు అంటే జీలం, చీనాబ్, రావి, బియాస్, సట్లజ్, గంగ, సింధునదుల మధ్య ప్రాంతము. దేశంలోనే అత్యంతసారవంతము, సుందరమైన ప్రాంతం.

వీరు వచ్చినప్పుడు ఇక్కడ ఉన్న స్థానికులతో యుద్ధాలు జరిగినాయి. ఆ యుద్ధాలలో స్థానికులను ఓడించి బందీలుగా పట్టుకుని, వారితో దాస్యం చేయించుకున్నారు. వీరినే దాసులు అన్నారు. ఇక వీరికి స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు లేవు. మనదొడ్లో పశువులకిందే లెక్క. వీరికి పుట్టిన పిల్లలు పుట్టుదాసులు. వారిమీద యజమానికి పూర్తిహక్కు ఉంటుంది. వీరినే శూద్రులు అన్నారు. యజ్ఞయాగాది క్రతువులు జరిగే చోటికి వీరు రాకూడదు. ఏ శుభకార్యాలలోను పాల్గొనరాదు. యజమానికి ఎదురు చెప్పరాదు. వీరి జీవితం పశువులకన్న హీనంగా ఉండేది. 'దొరా! నేను నీ బానిసను. కాళ్ళు మొక్కుతా' అనటం, దొర వస్తుంటే నమస్కారం చేస్తూ నేలమీద పడుకోవటము చేసేవారు. వీరి స్త్రీలు యజమాని సొంత ఆస్తి. వారిని ఏ రకంగానైనా వాడుకోవచ్చు. ఇది వీరి జీవితం. వీరిలో కొంతమంది అడవులలోకి పారిపోయి వీలైనప్పుడు వచ్చి యుద్ధాలు చేస్తుండేవారు. వీరిని దస్యులు అన్నారు. తరువాత కాలంలో

వీరే దొంగలుగా, రాక్షసులుగా పరిగణించబడ్డారు. ఆర్యులు ప్రకృతిని చేసిన స్తోత్రాలే వేదమంత్రాలు.

ఆర్యులు సప్తసింధు ప్రాంతంనుంచి క్రమేణా గంగాపరీవాహక ప్రాంతానికి విస్తరించారు. దీన్నే ఆర్యావర్తము అన్నారు. వేదకాలాన్ని రెండు భాగాలుగా చెబుతారు. 1. తొలివేదాకలము 2. మలివేదకాలము. ఆర్యులు సప్తసింధు ప్రాంతంలో ఉన్నది తొలివేదకాలము. ఈ కాలంలో కేవలము ఋగ్వేదం ఒకటే ఉంది. మిగిలిన వేదాలు ఏవీలేవు. యజ్ఞయాగాది క్రతువులు కూడా లేవు. ఆర్యులు గంగా పరివాహక ప్రాంతానికి విస్తరించిన కాలాన్ని మలివేదకాలము అన్నారు. ఈ కాలంలోనే మిగిలిన వేదాలు వచ్చినాయి. యజ్ఞయాగాది క్రతువులు కూడా ప్రారంభమయినాయి. తొలివేద కాలంలో సామాజిక వ్యవస్థ చాలా బాగుండేది. ఆ రోజుల్లో వర్ణవ్యవస్థ లేదు. కులమత బేధాలు లేవు. అందరూ సమానమే. ఎవరికి చేతనయిన వృత్తివారు చేసేవారు. సమాజంలో స్త్రీకి చాలా గౌరవం ఉండేది. ప్రతిపనిలోను స్త్రీ పాత్ర ఉండేది. భార్య లేకుండా సామాజికపరంగా గాని, మతపరంగాగాని, రాజకీయ పరంగాగాని ఏ కార్యక్రమాలు చెయ్యటానికి వీలులేదు. రాజుయొక్క ఆంతరంగిక సలహా మండలిలో రాణికూడా సభ్యురాలు. కాని మలివేదకాలం వచ్చేటప్పటికి కొన్ని మార్పులు, సర్దుబాట్లు జరిగాయి. సమాజంలో స్త్రీ గౌరవం కొంతవరకు తగ్గింది. మలివేదకాలంలో చివరలో వచ్చిందే పురాణ, ఇతిహాసకాలము. ఈ కాలంలో అనేక మార్పులు చోటు చేసుకున్నాయి. ఇది చరిత్రకారుల వాదన.

ఇంకో విషయం. వ్యాసుడు రాకముందు ఒకే వేదం ఉండేది. వ్యాసుడు దాన్ని నాలుగు వేదాలుగా చేశాడు అని చాలామంది

భావిస్తున్నారు. అది నిజంకాదు. వ్యాసుడు రాకముందు వేదం అంతా ఒకటిగానే ఉండేది. అంటే ఋక్కులు, యజస్సులు, సామాలు, అన్నీ కలిసే ఉండేవి. వ్యాసుడు వాటన్నింటిని విభజించి నాలుగు వేదాలుగా చేశాడు.

వేదం నాలుగు భాగాలుగా ఉంటుంది. 1. సంహిత 2. బ్రాహ్మణము 3. అరణ్యకము 4. ఉపనిషత్తు

సంహిత అంటే మంత్రభాగము. సంహితకు వివరణ బ్రాహ్మణము. బ్రాహ్మణంలో పరిశిష్ట భాగం అరణ్యకము. అరణ్యకాలలో పరిశిష్ట భాగము ఉపనిషత్తు ఈ నాలుగు భాగాలు కలిస్తేనే వేదము. అంతేకాని వీటిలో కొన్ని భాగాలే వేదము అనే వాదన సరికాదు.

వేదంలో చెప్పింది సాకారమా? నిరాకారామా? అన్నప్పుడు ఉపనిషత్తులలో సాకారబ్రహ్మ, నిరాకారబ్రహ్మ రెండింటినీ వివరించటం జరిగింది అనే విషయాన్ని గుర్తించండి.

వేదంలో అనేక విషయాలు చెప్పారు. ఇంకో రకంగా చెప్పాలంటే వేదంలో చెప్పని విషయంలేదు. వేదంలో చెప్పబడిన చాలా విషయాలు సైన్సులో కూడా చెప్పబడ్డాయి. ఉపనిషత్తులలో అనేక మంత్రాలు చెప్పారు. ఆ మంత్రాలను జపం చెయ్యతలచుకున్నవారు వాటిని గురుముఖతః చెప్పుకుని తరువాత జపం చెయ్యండి. పుస్తకం చూసి చదివితే ఇబ్బందులు వస్తాయి జాగ్రత్త.

వేదమనేది ప్రాచీన భారతీయ విజ్ఞాన భాండాగారం. కాబట్టి వేదాన్ని ఆదరించండి. సంప్రదాయాన్ని కాపాడండి. మీ గౌరవాన్ని పెంపొందింప చేసుకోండి.

వేదంలో సమాజానికి ఉపయోగించే అనేక విషయాలు చెప్పబడ్డాయి. వాటిలో కొన్నైనా చూద్దాం.

# 1. వేదము

**ఇష్టప్రాప్త్యనిష్ట పరిహారయోః అలౌకికం ఉపాయం యోగ్రంథః వేదయతి స వేదః** "ఇష్టప్రాప్తిని, అనిష్ట పరిహారాన్ని పొందటానికి అలౌకికమైన ఉపాయాన్ని చెప్పేదే వేదము." అన్నాడు సాయణుడు.

ఎవరీ సాయణుడు? ఈయననే సాయణాచార్యుడు అంటారు. వీళ్ళు ముగ్గురు అన్నదమ్ములు. పెద్దవాడు మాధవుడు, రెండవ వాడు సాయణుడు, మూడవవాడు ప్రభాకరుడు. వీరిలో పెద్ద వాళ్ళిద్దరూ శాస్త్రపండితులు, హైందవధర్మం మీద అభిమానం బాగా ఉన్నవాళ్ళు. మూడవవాడు ప్రభాకరుడు. కన్నడ భాషలో ప్రసిద్ధకవి. స్వతహాగా వీరు తెలుగువారు. వీరిలో పెద్దవాడయిన మాధవుడే తరువాత కాలంలో సన్యసించి 'విద్యారణ్య' నామంతో **మాధవ విద్యారణ్యుడై** శృంగేరీ మహాసంస్థానానికి అధిపతి అయినాడు. విజయనగర సామ్రాజ్య స్థాపకుడు ఈయనే. విజయనగర సామ్రాజ్యం స్థాపించిన తరువాత కొంతకాలం బుక్కప్రభువు దగ్గర మంత్రిగా ఉన్నాడు. ఆ తరువాత తాను రాజగురువై, తమ్ముడైన సాయణుణ్ణి మంత్రిగా చేశాడు. ఆ సమయంలో బుక్కప్రభువు వేదాలకు భాష్యం వ్రాయమని మాధవుణ్ణి అడిగినప్పుడు "మహారాజా! ఆ పనికి నేనెందుకు? నా తమ్ముడు సాయణుడు చేస్తాడు" అన్నాడు. తరువాత ఈ సాయణాచార్యుడు వేదభాష్యం వ్రాసి దానికి అన్నగారైన మాధవుడి పేరు పెట్టాడు. అన్నదమ్ములిద్దరికి ఒకరిమీద ఒకరికి వల్లమాలిన అభిమానం. అందుకే వేదభాష్యం వ్రాసే అవకాశం తమ్ముడికి కల్పించాడు అన్నగారు. తాను వ్రాసిన భాష్యానికి అన్నగారి పేరు పెట్టాడు తమ్ముడు. ఇప్పటికి కూడా ఆ భాష్యం అన్నగారైన మాధవ విద్యారణ్యుడి పేరుమీదనే

**'విద్యారణ్యభాష్యము', విద్యారణ్యము** అని ప్రసిద్ధి చెందింది. ఈ రోజున కూడా మనకి అత్యంత ప్రమాణం ఈ భాష్యమే. నాలుగువేదాలమీద లభిస్తున్న ఆఖరు భాష్యం ఇదే. దీన్ని వ్రాసి సుమారు 635 సం॥లు అయ్యింది.ఆ తరువాత మళ్ళీ ఎవరూ నాలుగు వేదాలకు భాష్యం వ్రాయలేదు.

వేదానికి ఇచ్చిన నిర్వచనంలో "ఇష్టప్రాప్తిని, అనిష్ట పరిహారాన్ని పొందటానికి అలౌకికమైన ఉపాయంచెప్పేదే వేదము" అన్నారు. ఇక్కడ జాగ్రత్తగా చూడండి. **ఇష్టప్రాప్తి** అంటే ఏమిటి? కోరుకున్నది పొందటం. మనకి సిరిసంపదలు, భోగభాగ్యాలు, ధనధన్యాలు, విద్య, పదవులు, హోదా కావాలని జీవితంలో ప్రతివాడు కోరుకుంటాడు. కాని ఆ కోరికను తీర్చుకునే మార్గమేది? కేవలం మానవ ప్రయత్నం సరిపోదు. దైవంకూడా అనుకూలించాలి. దానికోసం మనం ఏం చెయ్యాలి అనేది వేదం చెబుతోంది. భగవంతుడి కృపకు పాత్రులు కావాలంటే ఏం చెయ్యాలి? భగవంతుణ్ణి దయ చూపమని ప్రార్థించాలి. అలా ప్రార్థించే ప్రార్థనలనే **'సూక్తాలు'** అంటారు. వేదంలో ఇలాంటి సూక్తాలు అనేకానేకాలున్నాయి. అలాగే **అనిష్టపరిహారము** అంటే ఏమిటి? ఇష్టం లేనిదాన్ని, అవసరం లేనిదాన్ని వదిలించుకోవటము. మనం దరిద్రంతో బాధ పడుతున్నాం. ఈ దరిద్రాన్ని వదిలించుకోవాలంటే ఏం చెయ్యాలి? దరిద్రదేవతను కరుణించమని ప్రార్థన చెయ్యాలి. ఇలాటి ప్రార్థనలు ఇందాక చెప్పినట్లుగా వేదంలో సూక్తాల రూపంలో ఉన్నాయి. ఇప్పుడు మానవుడు తనకు కావలసినవి పొందటానికి, అవసరం లేనివి వదిలించుకోవటానికి తాను చేసే ప్రయత్నాలు తాను చేస్తాడు. అవన్నీ లౌకికాలు. తన అధీనంలో లేని వాటిని అలౌకికాలు అంటారు. అంటే కేవలము భగవంతుడి దయ అన్ని మాట. ఇటువంటి అలౌకికమైన

ఉపాయాన్ని చెప్పేదే వేదము అన్నాడు భాష్యకారుడైన సాయణాచార్యుడు.

**సకల దేవతానాం ధర్మస్య పరబ్రహ్మ తత్త్వశ్చ చ ప్రతిపాదకం వేదం**

సకల దేవతల గురించి, ధర్మాన్ని గురించి, పరబ్రహ్మతత్త్వాన్ని గురించి ప్రతిపాదించేదే వేదము. వేదంలో **సకల దేవతానాం** అందరి దేవతల గురించి చెప్పబడింది. దేవతలు అంటే - మనకన్న అలౌకికమైన శక్తులు గలవారు. భక్తుల కోరికలు తీర్చగల శక్తిసంపన్నులు. ఇంద్రుడు, అగ్ని, అశ్వనీ దేవతలు, మరుత్తులు, ఇలాంటివారంతా. వీరిని గురించి వేదంలో చెప్పబడింది. **ధర్మస్య** ధర్మాన్ని గురించి చెప్పబడింది. మానవుడు ఏ పనులు చెయ్యాలి? ఏవి చెయ్యకూడదు? మొదలైన విషయాలు వేదంలో చెప్పబడ్డాయి. **పరబ్రహ్మతత్త్వశ్చ** పరమేశ్వర స్వరూపాన్ని గురించి, పరమేశ్వర తత్త్వాన్ని గురించి వేదంలో చెప్పబడింది. వేదం నాలుగు భాగాలుగా ఉంది. అందులో ఆఖరుభాగం ఉపనిషత్తు. ఈ ఉపనిషత్తులో బ్రహ్మవిద్య చెప్పబడింది. అదే పరమేశ్వరతత్త్వము. కాబట్టి ఈ రకంగా సకల దేవతల గురించి, ధర్మాన్ని గురించి, పరబ్రహ్మతత్త్వాన్ని గురించి ప్రతిపాదించేదే వేదము.

లోకంలో ఏ మానవుడూ పరిపూర్ణుడు కాదు. ఈ కారణం చేత మానవుడు చెప్పిన విషయాలు ఎంత గొప్పవైనా అవి పరమార్థమని, భ్రాంతి రహితమని చెప్పలేము. కాబట్టి అతీంద్రియ సత్యాలకు సంబంధించినంత వరకు **అతీంద్రియ సత్యాలు** అంటే ఇంద్రియాలకు అందనటువంటివి. మనశక్తికి మించినవి. వీటికి సంబంధించినంత వరకు స్వతస్సిద్ధము, స్వతః ప్రమాణము, నిత్యసిద్ధము, బ్రహ్మ వాక్కు

అయిన వేదాన్ని మాత్రమే నిర్దుష్టమైన అంత్య ప్రమాణంగా తీసుకోవాలి. **స్వతస్సిద్ధము** స్వతహాగా ఏర్పడినది. **నిత్యసిద్ధము** ఎల్లప్పుడూ ఉండేది. శాశ్వతమైనది. **స్వతః ప్రమాణము.** తనకు తానే ప్రమాణమైనది. అంతకన్న ఎక్కువైనది ఏదీ లేనిది. చిన్నవస్తువులను పెద్దవాటితో పోల్చి వాటి గొప్పతనం చెబుతాం. చాలా పెద్దది అని చెప్పటానికి సముద్రంతో పోలుస్తాం. కాని సముద్రాన్ని చెప్పాలంటే పోల్చటానికి ఇంకేదీ లేదు. అలాగే వేదం స్వతః ప్రమాణం. ఏదైనా ఒక విషయం చెప్పాలంటే వేదాన్ని ప్రమాణంగా తీసుకుని చెప్పాలి. అంతకన్నా ప్రమాణం ఇంకొకటి లేదు. వేదానికి వేదమే ప్రమాణము. అందుకే వేదాన్ని స్వతః ప్రమాణము అంటారు. **బ్రహ్మవాక్కు** వేదాలు అపౌరుషేయాలు. అవి ఎవరినోటినుండీ చెప్పబడలేదు. సాక్షాత్తు బ్రహ్మముఖం నుంచే వచ్చినాయి. అందుకే వేదాన్ని బ్రహ్మవాక్కు అంటున్నాము. ఈ కారణం చేతనే స్వతస్సిద్ధము, స్వతః ప్రమాణము, నిత్యసిద్ధము, బ్రహ్మవాక్కు అయిన వేదాన్ని మాత్రమే అంత్యప్రమాణంగా స్వీకరించాలి. వేదమే ఆఖరు ప్రమాణం. అంతకన్న ఎక్కువైనది ఇకలేదు. ఈ విషయాన్నే **"బ్రాహ్మణోనిర్దోషత్వేన వేదస్య కర్తృదోషాఽసంభవాత్ స్వతస్సిద్ధం ప్రామాణ్యం తదవస్థమ్"** అన్నాడు సాయణుడు. అంటే ఒకవేళ వేదమే గనక మానవుడిచే చెప్పబడి ఉంటే అందులో తప్పనిసరిగా లోటుపాట్లు ఉండేవి. ఇప్పుడలాటివేవీ వేదంలో లేవు కాబట్టి ఇది అపౌరుషేయము, స్వతఃప్రమాణము.

వేదము అనే పదం విత్ అనే ధాతువు నుంచి వచ్చింది. విత్ అంటే జ్ఞానము అని అర్థం. అందుకే వేదము జ్ఞానోపదేశమైన గ్రంథము. లోకంలో శాశ్వతమైన ధర్మానికి, జ్ఞానానికి వేదమే ఆధారం. వేదంలో ప్రతిపాదించిన అలౌకిక, ఆధ్యాత్మిక సిద్ధాంతాలతో పాటుగా

వేదభాష కూడా శాశ్వతమైనదే. వేదభాష ఋషుల, ఆప్తఋషుల రచన అని కొంతమంది చెబుతారు. అసలు ఋషి అంటే జ్ఞానంతో సంసారార్ణవాన్ని దాటినవాడు అని అర్థం. ఈ ఋషులు మూడు రకాలు. 1. దేవర్షి 2. రాజర్షి 3. బ్రహ్మర్షి ఇంకొక సంప్రదాయం ప్రకారం ఋషులు నాలుగు రకాలు. 1. మహర్షి 2. పరమర్షి 3. శ్రుతర్షి 4. కాండర్షి. మరి ఆప్తఋషి అంటే ఎవరు? సత్యాన్ని స్వయంగా సాక్షాత్కరించుకున్న వాడు, నిస్వార్ధపరుడు అని అర్థం.

ఇప్పుడు ఈ ఋషులు ఎవరెవరో చూడండి.

1. మహర్షులు – వ్యాసుడు మొదలైన వారు
2. పరమ ఋషులు – ఖేలాదులు
3. శ్రుత ఋషులు – శుశ్రుతాదులు
4. కాండ ఋషులు – జైమిని మొ॥ వారు
5. దేవ ఋషులు – నారదుడు మొ॥ వారు
6. రాజ ఋషులు – జనకుడు మొ॥ వారు
7. బ్రహ్మ ఋషులు – వశిష్టాదులు

కాలుతున్న కట్టె నుంచి పొగ వచ్చినట్లుగా, వేదాలన్నీ ఈ అనంత సత్త (పరబ్రహ్మ) యొక్క నిశ్వాసలు అంటోంది బృహదారణ్యకము. వేదం ద్వారా అన్ని పురుషార్థాలు పొందబడతాయి. అందుకే ఇది వేదము అనబడుతోంది అన్నాడు దేవమిత్రుడు.

స్వతఃస్వరూపుడైన పరమేశ్వరుడు, ఆదికవి అయినబ్రహ్మ మనసులో వేదాలను ఆవిర్భవింప చేశాడు అంటోంది భాగవతము.

శాశ్వతాలైన వేదాలను సృష్టికర్త కల్పారంభంలో జ్ఞాపకం తెచ్చుకున్నాడని, తరువాత అవి గురుశిష్య పరంపరగా ప్రచారమైనాయని స్మృతులు చెబుతున్నాయి. జగత్తును సృష్టించిన తరువాత శ్రీమన్నారాయణుడు వేదాన్ని మరీచి మొ॥ వారికి ప్రవృత్తి ధర్మంగాను, సనక సనందనాదులకు నివృత్తి ధర్మంగాను ఉపదేశించాడు అన్నాడు శంకరుడు. ప్రవృత్తి ధర్మము అంటే సంసార ధర్మాన్ని ఆచరిస్తూ సృష్టి కార్యక్రమంలో పాలుపంచుకోవటం, నివృత్తి ధర్మము అంటే - సంసార బంధాలు లేకుండా కేవలము మోక్షమార్గంలో చరించటం. బ్రహ్మమానస పుత్రుడు మరీచి. ఇతను కర్దముని కుమార్తె కళను వివాహం చేసుకున్నాడు. ఇతని కుమారుడే కశ్యపుడు. వీరంతా బ్రహ్మమానస పుత్రులు, ప్రజాపతులు. సృష్టి వేగంగా పెరగటం కోసం మైధున సృష్టిని ప్రారంభించిన వాళ్ళు. ఇది ప్రవృత్తి ధర్మం. సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులు బ్రహ్మమానస పుత్రులే. కాని ప్రవృత్తి ధర్మాన్ని కాదని నివృత్తి మార్గంలో చరించారు. ఇక్కడ శ్రీమన్నారాయణుడు అంటే పరమేశ్వరుడు.

# ౨. వేదవ్యాసుడు

పూర్వకాలంలో వేదం మొత్తం ఒకటిగానే ఉండేది. అంటే ఒకే వేదం ఉన్నదని కాదు. నాలుగు వేదాలు కలిసి ఒకటిగానే ఉన్నాయన్న మాట. కృతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగంలో మూడు వంతుల కాలంవరకు అలాగే ఉంది. అయితే మానవుల మేధస్సు క్రమేణా క్షీణిస్తోంది. ఆ రోజుల్లో ఒకటిగా ఉన్న వేదాన్ని అందరూ చదవగలిగారు. అర్ధంకూడా చేసుకోగలిగారు. రానురాను ఆ వేదాన్ని అర్థం చేసుకోవటం కష్టం అయింది. దాంతో వేదానికి ఆదరణ తగ్గటం మొదలయింది. ద్వాపరయుగము చివరలోకి వచ్చేసరికి వేదానికి ఆదరణ చాలావరకు తగ్గిపోయింది. అప్పుడు బ్రహ్మదేవుడు అపాంతరతముడు అనే ఒక మానసిక పుత్రుణ్ణి సృష్టించి భూలోకంలోకి వెళ్ళి వేదాన్ని బాగా ప్రచారం చేసి రమ్మన్నాడు. భూలోకానికి వచ్చాడు అపాంతరతముడు పరిస్థితిని సమీక్షించాడు. వేదానికి ఆదరణ తగ్గటానికి కారణం ఏమిటి? అని ఆరా తీశాడు. అప్పటివరకు ఋక్కులు, యజస్సులు, సామాలు అధర్వణ మంత్రాలు అన్నీ కలిసి కలగా పులగంగా ఉన్నది వేదం. విషయాన్ని గ్రహించాడు. వేదవిభజన చేశాడు. అంటే ఋక్కులు, యజస్సులు, సామాలు, అధర్వణ మంత్రాలు విడివిడిగా తీశాడన్న మాట. ఋగ్వేదంలో మంత్రాలను **ఋక్కులు** అని యజుర్వేదంలో మంత్రాలను **యజస్సులు** అని సామవేదంలో మంత్రాలను **సామములు** అని అంటారు. అప్పటి వరకు ఇవన్నీ కలసి ఉండేవి. అంటే మనం బజారుకు వెళ్ళి సంచిలో కూరలు తీసుకుని ఇంటికి తెచ్చి ఒకచోట కుమ్మరించాం. ఇప్పుడు అవన్నీ ఒకదానితో ఇంకొకటి కలిసిపోయి ఉంటాయి. అలానే ఉంది అప్పటి వేదం యొక్క స్థితి. ఇప్పుడు అపాంతరతముడు తీరుబడిగా కూర్చుని కుమ్మరించిన

కూరల కుప్పలో నుంచి దొండకాయలు, బెండకాయలు, దోసకాయలు, మిరపకాయలు విడివిడిగా ఏరినట్లుగా ఏరి దేనికవి కుప్పలుగా పెట్టాడు. అంటే కలగాపులగంగా ఉన్న వేదంలోనుంచి ఋక్కులన్నీ ఒక చోట, యజస్సులన్నీ ఒకచోట, సామాలన్నీ ఒకచోట, అథర్వణ మంత్రాలు ఒకచోట పేర్చాడు. ఇదే వేదవిభజన అంటే. ఇలా చేసేప్పుడు మంత్రాన్ని దర్శించిన ఋషి కాలము పట్టి ఋగ్యజుస్సామా లను విభజించాడు. అంటే ఋషి, ఆయన పుత్రులు, బంధువులు, శిష్యులు, గోత్రీకులు దర్శించిన మంత్రాలను ఒకచోట చేర్చాడు. అయితే ఒకే దేవతకి సంబంధించిన సూక్తాలన్నీ ఒకేచోటకి చేర్చిఉంటే చాలా బాగుండేది. ఉదాహరణకి ఋగ్వేదంలో ఇంద్రుడికి సంబంధించిన సూక్తాలు 250 పైగా ఉన్నాయి. కాని ఇవన్నీ ఒకచోట లేవు. అలాగే మిగిలిన దేవతలు. సంపదకు సంబంధించిన మంత్రాలు ఒకచోట, శత్రుసంహారం ఒకచోట ఆరోగ్యానికి సంబంధించినవి ఒకచోట, ఇలా విషయం ప్రాతిపదికగా ఉన్నా బాగుండేది. కాని అలాకూడా లేవు. **నేనే గనక అప్పుడు ఉండి ఉంటే లేదా నాకే అపాంతరతముడు కనిపించి ఉంటే దేవతల ప్రాతిపదికగా లేదా విషయ ప్రాతిపదికగా వేదవిభజన చెయ్యమని అలా చేస్తే చదివే వారికి సౌకర్యంగా ఉంటుందని అపాంతరతముడికి చెప్పి ఉండేవాణ్ణి.** ఇలా వేదవిభజన చేసి బాగా ప్రచారం చేశాడు. దాంతో వేదానికి ఆదరణ బాగా పెరిగింది అప్పటినుంచే వేదాలు నాలుగు 1. ఋగ్వేదము 2. యజుర్వేదము 3. సామవేదము 4. అథర్వణ వేదము అని ప్రచారంలోకి వచ్చాయి. అపాంతరతముడు ఈ మాటని బ్రహ్మదేవుడికి చెప్పాడు. చాలా ఆనందించాడు బ్రహ్మ. ప్రతిమహాయుగంలోను ద్వాపరయుగం చివరలో ఇటువంటి పరిస్థితి ఏర్పడుతుంది. కాబట్టి కుమారా! నువు ఏదో రూపంలో భూలోకానికి వెళ్ళి వేదవిభజన చెయ్యవలసింది అన్నాడు. సరేనన్నాడు

అపాంతరతముడు. యుగాలు నాలుగు 1. కృతయుగం 2. త్రేతాయుగం 3. ద్వాపరయుగం 4. కలియుగం. ఈ నాలుగు యుగాలు కలిపితే ఒక మహాయుగము అవుతుంది. ఇప్పటివరకు 27 మహాయుగాలు పూర్తయినాయి. ఇది 28వ మహాయుగం. అంటే 28సార్లు వేదవిభజన జరిగిందన్న మాట. ఇంతవరకు వేదవిభజన చేసినవారు

1. స్వయంభువు (అపాంతరతముడు)
2. ప్రజాపతి
3. ఉశనుడు (శుక్రాచార్యుడు)
4. బృహస్పతి (గురువు)
5. సవిత
6. మృత్యుడు
7. మఘవుడు
8. వశిష్టుడు
9. సారస్వతుడు
10. త్రిధాముడు
11. త్రివృషుడు
12. భరద్వాజుడు
13. అంతరిక్షుడు
14. ధర్ముడు
15. త్రయ్యారుణి
16. ధనుంజయుడు
17. మేధాతిథి

18. ప్రతీ
19. అత్రి
20. గౌతముడు
21. హర్యాత్ముడు
22. వాజశ్రవసువు
23. సోముడు
24. తృణబిందువు
25. భార్గవుడు
26. శక్తి
27. జానుకర్ణి
28. కృష్ణద్వైపాయనుడు

ఈ రకంగా 28 మహాయుగాలలోను 28 మంది వేదవిభజన చేశారు. కాగా **ఏకోనత్రింశస్సంప్రాప్తే ద్రౌణిర్వ్యాసో భవిషతి** రాబోయే 29వ మహాయుగంలో ద్రోణాచార్యుని కుమారుడైన అశ్వత్థామ వేదవిభజన చేసి వ్యాసపదవిని అలంకరిస్తాడు అని చెబుతున్నాయి పురాణాలు.

వేదాలను విభజించిన వాడిని **వేదవ్యాసుడు** అంటారు. 28వ మహాయుగంలో వేదాలు విభజించిన వాడు సత్యవతీనందనుడు. కృష్ణద్వైపాయనుడు. అతడే మనకు తెలిసిన వేదవ్యాసుడు. **వ్యాసుడు అనేది ఒకరి పేరు కాదు. అది ఒక స్థానము. పీఠము.** అక్కడ ఎవరుంటే అతన్నే వేదవిభజన చేసిన వాడిని వ్యాసుడంటారు.

ద్వాపరయుగంలో వేదవిభజన చేసిన తరువాత వ్యాసభగవానుడు నాలుగు వేదాలను తన శిష్యులైన 1. జైమిని 2. వైశంపాయనుడు 3. పైలుడు 4. సుమంతులకు అప్పగించి వాటిని ప్రచారం చెయ్యమని

చెప్పాడు. ఆ సమయంలో యజుర్వేదాన్ని వైశంపాయనుడికి ఒప్పగించాడు. వైశంపాయనుడి శిష్యులలో ముఖ్యమైనవాడు యాజ్ఞవల్క్యుడు. అతడు ఈ వేదాన్ని క్షుణ్ణంగా అభ్యసించాడు. ఆ కాలంలో ఒకసారి మేరు పర్వతం మీద దేశంలోని మహర్షులందరూ కలిసి ఒక సభ ఏర్పాటు చేశారు. దానికి ఋషులందరూ రావాలని ఆంక్ష విధించారు. లేకపోతే బ్రహ్మహత్యాపాతకం చుట్టుకుంటుందని కూడా తీర్మానం చేశారు. అనుకున్న ప్రకారం సభ ప్రారంభమైంది. కాని కారణాంతరాల వల్ల వైశంపాయనుడు మాత్రం సభకి వెళ్ళలేకపోయాడు. ఋషుల తీర్మానం ప్రకారం అతనికి బ్రహ్మహత్యా పాతకం చుట్టుకుంది. ఆ పాపం నుంచి నిష్కృతి లభించాలంటే తపస్సు చేసి ధారపొయ్యాలి. వైశంపాయనుడి శిష్యులందరూ గురువుగారి కోసం తపస్సు చేస్తున్నారు. ఆ సమయంలో యాజ్ఞవల్క్యుడు అక్కడకి వచ్చాడు. అందరూ ఇలా తపస్సు చెయ్యటానికి కారణం ఏమిటి అని అడిగాడు. విషయం తెలుసుకుని "గురుదేవా ! వీళ్ళంతా అల్పజ్ఞానులు. మీపాప పరిహారం కోసం వీళ్ళేం చెయ్యగలరు? నాకు అనుమతి ఇవ్వండి. నేను ఘోరమైన తపస్సు చేస్తాను." అన్నాడు. ఈ రకంగా యాజ్ఞవల్క్యుడు తన తోటివారిని అవమానించటం గురువుగారికి నచ్చలా. దాంతో "సాటివారిని అవమానించే గర్విష్టితో నాకు పనిలేదు. నా శిష్యుడిగా ఉండే అర్హత నీకు లేదు. నేను చెప్పిన వేదవిద్యను ఇక్కడే వదిలేసి వెళ్ళు" అన్నాడు.

యాజ్ఞవల్క్యుడు నిజంగానే శక్తి సంపన్నుడు. స్వాభిమాని కూడా. గురువుగారు అన్న మాటని అవమానంగా భావించి వెంటనే వైశంపాయనుడు చెప్పిన వేదవిద్య అంతా అక్కడే కక్కేశాడు. ఈ భాగమే కృష్ణయజుర్వేదము.

ఆ తరువాత సూర్యుణ్ణి ఆరాధించి ఆయన దగ్గర వేదవిద్యని

అభ్యసించాడు. ఈ భాగాన్నే శుక్లయజుర్వేదము అంటారు. సూర్యుడు రథం మీద ప్రయాణం చేస్తూ యాజ్ఞవల్క్యుడికి ఈ వేదాన్ని చెప్పాడు. రథం నడిచే శబ్దంలో యాజ్ఞవల్క్యుడికి వేదంలోని కొన్ని స్వరాలు సరిగా వినిపించలేదు. అందుకే కృష్ణయజుర్వేదానికి, శుక్లయజుర్వేదానికి స్వరంలో తేడా ఉంటుంది. మన ప్రాంతంలో ఉన్నది కృష్ణయజుర్వేదం. ఉత్తరదేశంలో ఉన్నది శుక్లయజుర్వేదం. స్వరంలో తేడా ఉంది కాబట్టి అర్థంలో కూడా తేడా ఉంటుంది. శుక్లయజుర్వేదాన్నే వాజసనేయసంహిత అని కూడా అంటారు. 'వాజః' అంటే అన్నము. 'సని' అంటే దానము. 'వాజసని' అంటే అన్నదానము. యాజ్ఞవల్క్యుని తండ్రి నిరతాన్నదానం చేసేవాడట. అందుచేత అతన్ని 'వాజసని' అనేవారు. వాజసని కుమారుడు కాబట్టి యాజ్ఞవల్క్యుడు 'వాజసనేయుడు' అనబడ్డాడు. అతడు చెప్పిన సంహిత భాగాన్ని **వాజసనేయ సంహిత** అంటారు. ఈ రకంగా వేదాలు ఐదు అయినాయి.

**వ్యాసపూర్ణిమ :**

**వ్యాసం వశిష్టనప్తారం శక్తేః పౌత్రమ కల్మషమ్ ।**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥**

| | | |
|---|---|---|
| బ్రహ్మమానసపుత్రుడు | – | వశిష్టుడు |
| వశిష్టుని కుమారుడు | – | శక్తి |
| శక్తి కుమారుడు | – | పరాశరుడు |
| పరాశరుని కుమారుడు | – | కృష్ణద్వైపాయనుడు (వ్యాసుడు) |
| వ్యాసుని కుమారుడు | – | శుకుడు |

**వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।**
**నమో వై బ్రహ్మనిధయే వాశిష్టాయ నమో నమః ॥**

సాక్షాత్తు శ్రీమహావిష్ణువుయొక్క అంశావతారము వ్యాసుడు వేదాలను విభజించటానికి, ధర్మాన్ని ప్రచారం చెయ్యటానికే భూలోకంలో అవతరించాడు. వేదవిభజన చేసిన తరువాత, వేదంలో చెప్పిన ధర్మాన్ని సామాన్య మానవులకు అందించాలనే ఉద్దేశ్యంతోనే అష్టాదశ (18) పురాణాలు వ్రాశాడు. అవి

**మద్వయం భద్వయం చైవ । బ్రత్రయం వచతుష్టయం ।**
**అనాపలింగకూస్కాని పురాణాని పృథక్ పృథక్ ॥**

**మద్వయం :** మకారంతో వచ్చేవి రెండు

1. మత్స్యపురాణము 2. మార్కండేయ పురాణము

**భద్వయం :** భకారంతో వచ్చేవి రెండు.

1. భవిష్యపురాణం 2. భాగవతము.

ఇక్కడ భాగవతము అంటే-శ్రీమద్భాగవతము అని కొందరు, దేవీ భాగవతమని కొందరు వాదిస్తుంటారు. ఈ రెండింటిలో ఇదమిద్ధంగా ఇది అని దేన్నీ చెప్పలేము.

బ్రత్రయం : బ్ర అనే అక్షరంతో ప్రారంభమయ్యేవి మూడు. 1. బ్రహ్మపురాణము 2. బ్రహ్మాండ పురాణము 3. బ్రహ్మవైవర్త పురాణము

వచతుష్టయమ్ : వకారంతో ప్రారంభమయ్యేవి నాలుగు 1. వామనపురాణము 2. వాయుపురాణము 3. విష్ణుపురాణము 4. వరాహపురాణము

అ-అగ్నిపురాణము
నా-నారద పురాణము
ప-పద్మపురాణము
లిం-లింగ పురాణము
గ-గరుడ పురాణము

కూ–కూర్మ పురాణము స్కాం–స్కాంద పురాణము

ఇలా పద్దెనిమిది పురాణాలు వ్రాసిన తరువాత, పరబ్రహ్మ తత్త్వాన్ని ప్రతిపాదించటం కోసం బ్రహ్మసూత్రాలు వ్రాశాడు.

"ఇవన్నీ వ్రాసినవాడు ఒకరు కాదు" అని కొంతమంది వాదిస్తుంటారు. దీనికి కారణం ఒకమనిషి ఇన్ని గ్రంథాలు వ్రాయలేడు అని. అది ఏ మాత్రం పసలేని వాదన. ఎందుకంటే నా ఉద్యోగం నేను చేసుకుంటూ 33 పుస్తకాలు వ్రాశాను. భిన్నమైన అంశాలమీద 1600 గంటలు ఉపన్యాసాలు చెప్పాను. సామాన్యమైన మానవుడిని నేనే ఇన్ని పుస్తకాలు వ్రాసినప్పుడు, కేవలము దానికోసమే జన్మించిన వాడు, దైవాంశ సంభూతుడు అయిన వ్యాసుడు ఇన్ని వ్రాయటంలో విచిత్రం ఏముంటుంది?

ఆషాఢపూర్ణిమను వ్యాసపూర్ణిమ అంటాం. దీనికి కారణం ఏమిటో చూద్దాం.

పూర్వకాలంలో కాశీనగరంలో వేదనిధి, వేదవతి అనే దంపతులుండే వారు. వేదనిధి చాలా గొప్పపండితుడు. కడుబీదవాడు అయినా సుఖంగా సంసారం చేస్తున్నారు. కాలం గడిచిపోతోంది. తండ్రి ఆబ్దీకం వస్తోంది.

వ్యాసుణ్ణి భోక్తగా పిలిస్తే బాగుండును అనుకున్నాడు. కాని వ్యాసుడు ఎక్కడ ఉంటాడు? పెద్దవాళ్ళు చెప్పిన దాని ప్రకారం ప్రతిరోజు మధ్యాహ్నం పన్నెండు గంటలకు వ్యాసుడు గంగానదిలో స్నానం చేస్తాడు. అయితే ఏ రూపంలో వస్తాడో తెలియదు. గంగానది దగ్గర కాపలా కూర్చున్నాడు వేదనిధి. అపరాహ్నం అయింది. స్నానానికి వచ్చే వారి సంఖ్య క్రమేణా తగ్గిపోతోంది. వ్యాసుడి కోసం ఎదురు చూస్తున్నాడు వేదనిధి. ఇంతలో ఒక భిక్షువు గంగలో స్నానం

చెయ్యటానికి వచ్చాడు. సందేహం లేదు. అతడే వ్యాసుడు. చకచకా వెళ్ళి అతడి రెండు కాళ్ళు పట్టుకున్నాడు వేదనిధి. తనను కరుణించమని వేడుకున్నాడు. తిరస్కరించాడు భిక్షువు. ఛీత్కరించాడు. అయిన పాదాలు వదల్లేదు వేదనిధి. చివరికి ఏం కావాలి? అన్నాడు వ్యాసుడు. నా తండ్రి ఆబ్దీకం. కాబట్టే రేపటి రోజున మా యింటికి బిక్షకి రావాలి అన్నాడు. సరే అన్నాడు వ్యాసుడు.

మర్నాడు భిక్షకు వచ్చాడు. భోజనం చెయ్యబోతూ అడిగాడు వ్యాసుడు నీ పిల్లలు ఎక్కడ? అని చెప్పాడు వేదనిధి తనకు సంతానం లేదు అని పిల్లలు లేని వారింట్లో భోజనం చెయ్యను అని విస్తరి ముందు నుంచి లేచాడు వ్యాసుడు. పాదాలు పట్టుకున్నాడు వేదనిధి. పుత్రసంతానం ప్రసాదించమని వేడుకున్నాడు. అతడి కన్నీళ్ళు చూసి కరిగిపోయాడు వ్యాసుడు. "నీకు పదిమంది పుత్రసంతానం కలుగుతుంది. జీవితంలో సకల భోగాలు అనుభవించి, చివరకు విష్ణులోకం చేరతావు" అని వరమిచ్చాడు. మళ్ళీ తమ దర్శనం నాకు ఎప్పుడు లభిస్తుంది? అన్నాడు వేదనిధి. ఇప్పుడు వ్యాసుడు చెబుతున్నాడు. "ఓ బ్రాహ్మణోత్తమా ! ప్రతి సంవత్సరం ఆషాఢపూర్ణిమ రోజున నేను జనులకు దర్శనమిస్తాను" అన్నాడు. మళ్ళీ ప్రశ్నించాడు వేదనిధి. "స్వామీ! నిన్ను గుర్తించటం ఎలా?"

"ఓ బ్రాహ్మణశ్రేష్ఠా ! వేదపండితుల యందు, శాస్త్రపండితుల యందు, పురాణాలు, ఆధ్యాత్మిక ఉపన్యాసాలు చెప్పేవారియందు నేనుంటాను. కాబట్టి ఆ రోజున వేదపండితులు, ఆధ్యాత్మిక వేత్తలు, పురాణ ప్రవచకులను సత్కరించండి. ఆ సత్కారము నాకు చెందుతుంది. ఇకనుంచీ ఆషాఢపూర్ణిమ, గురుపూర్ణిమ, వ్యాసపూర్ణిమగా పిలువబడుతుంది" అన్నాడు.

అప్పటి నుంచి ఆషాఢ పూర్ణిమ వ్యాస పూర్ణిమగా పిలువబడుతోంది. ఇదే వ్యాసుడు జన్మించిన రోజు. వేదాలు విభజించిన రోజు. బ్రహ్మసూత్రాలు వ్రాయటం ప్రారంభించిన రోజు. ఆ రోజున పండితులను సత్కరించటం మన సంప్రదాయం.

# 3. వేదంలో భాగాలు

వేదము అంటే – విద్య అని అర్థం. వేదంలో రెండు రకాల విద్యలున్నాయి. ముండకోపనిషత్తులో శౌనకుడు విద్యాభ్యాసం పూర్తి చేసి, ఓ గురుదేవా! నాకు వివాహం చేసుకోవాలని లేదు. కాబట్టి మోక్షమార్గాన్ని ఉపదేశించండి అంటాడు. అప్పుడు గురువుగారు శౌనకుడితో వేదంలో రెండు రకాల విద్యలున్నాయి. 1.అపరావిద్య 2. పరావిద్య. అపరావిద్య అనేది లౌకిక ప్రయోజనాలకు ఉపయోగించేది. ఈ లోకంలో సిరిసంపదలు భోగభాగ్యాలు, పదవులు, స్త్రీసుఖము, రాజ్యము, దాసదాసీలు ఇవన్నీ పొందటానికి ఉపయోగించేది అపరావిద్య. ఇక రెండవది పరావిద్య. ఇదే మోక్షవిద్య. అంటూ మోక్షమార్గాన్ని ఉపదేశిస్తాడు. ఇంకొక రకంగా చెప్పాలి అంటే పరావిద్య – జ్ఞానకాండ. అపరావిద్య – కర్మకాండ. వేదం నాలుగు భాగాలుగా ఉంటుంది. 1. సంహిత 2. బ్రాహ్మణము 3. అరణ్యకము 4. ఉపనిషత్తు. దీనిలో

**1. సంహిత :** ఇది పూర్తిగా మంత్రభాగము. పద్యరూపంలో గాని, గద్యరూపంలో గాని, రెండు రకాలుగా గాని ఉంటుంది.

**ఋక్సంహిత :** ఋగ్వేదానికి 21 శాఖలు ఉండేవని మహాభాష్యకారుడైన పతంజలి చెప్పాడు. ప్రస్తుతం దొరుకుతున్న శాఖలు మాత్రం రెండు. 1. శాకలశాఖ 2. భాష్కలశాఖ. వీటి మధ్య తేడాలు పెద్దగా లేవు. ఉన్నదల్లా శాకల శాఖలో కన్న ఎనిమిది సూక్తాలు అధికంగా భాష్కలశాఖలో కనిపిస్తున్నాయి. 2. ప్రథమ మండలంలో కొంత భాగం భాష్కలశాఖలో వేరే స్థానంలో ఉంది. ఇదే ఈ రెండు శాఖలమధ్య గలతేడా అని పండితులు అంటారు. మొత్తంమీద ఋగ్వేద

శాఖలన్నింటిలోను ప్రస్తుతం దొరుకుతున్న 'శాకల పాఠం' గురుశిష్యపరంపరగా వస్తున్నది. అదే అన్ని విధాల సరియైనది అని పండితాభిప్రాయం.

ఋగ్వేదానికి గల సంహిత భాగాన్నే ఋక్సంహిత అంటారు. ఇది పది మండలాలుగా విభజింపబడింది. మొత్తం పదిమండలాలలోను కలిపి 1017 సూక్తాలున్నాయి. అవిగాక ఎనిమిదవ మండలంలో పదకొండు వాలఖిల్య సూక్తాలు ఖిలసూక్తాలుగా గుర్తించారు. వాటితో కలిపి ఋక్సంహితలో మొత్తం 1028 సూక్తాలు ఉన్నాయి. ఋగ్వేదంలోని మంత్రాలను ఋక్కులు అంటారు. ఇవి ఛందోబద్ధంగా పద్యరూపంలో ఉంటాయి. ఈ మొత్తం సూక్తాలలో 10552 ఋక్కులు లేదా మంత్రాలు ఉంటాయి. ఋక్సంహితలో ఇంకొక విభాగం కూడా ఉంది. దాన్ని 'అష్టకవిభాగము' అంటారు. ఋక్సంహితలో ఉన్న 64 అధ్యాయాలను 8 అష్టకాలుగా విభజించారు. అష్టకము అంటే 8 అధ్యాయాల సమూహము. అంటే ఒక్కొక్క అష్టకంలోను ఎనిమిది అధ్యాయాలు చొప్పున, ఎనిమిది అష్టకాలు 8 × 8 = 64 అధ్యాయాలున్నాయన్న మాట. మొత్తం మీద ఈ సంహితలో 1,028 సూక్తాలు, 10,552 ఋక్కులు, ఆ ఋక్కులలో మొత్తం 2,97,265 అక్షరాలున్నాయి.

ఋగ్వేదానికి ఉపవేదం ఆయుర్వేదం.

**కృష్ణయజుస్సంహిత :** యజ్ఞయాగాలు చేసే విధానం ఇందులో వివరించబడింది.

యజుర్వేదానికి రెండు సంప్రదాయాలున్నాయి. 1. బ్రహ్మసంప్రదాయము 2. ఆదిత్యసంప్రదాయము. బ్రహ్మసంప్రదాయాన్నే కృష్ణయజుర్వేదము అని, ఆదిత్య సంప్రదాయాన్ని శుక్లయజుర్వేదమని

శతపథ బ్రాహ్మణంలో చెప్పబడింది. వీటిలో కృష్ణయజుర్వేదం దక్షిణ భారతదేశంలోను, శుక్లయజుర్వేదం ఉత్తర భారతదేశంలోను ప్రసిద్ధి చెందినాయి.

దేవతలను పూజించటానికి, వారికి హవిస్సు లందించటానికి ఉపయోగించే మంత్రాలనే యజస్సులు అంటారు. గానయోగ్యత లేకుండా చదివే మంత్ర సముదాయాన్ని యజస్సు అంటారు. అంటే దీనిలోని మంత్రాలు పద్యాల రూపంలో కాకుండా వచన రూపంలో ఉంటాయి. కృష్ణయజుర్వేదంలో మంత్ర, అర్థవాద బ్రాహ్మణ భాగాలు అన్నీ కలిసి ఉంటాయి. అందువల్ల చదివే వారికి కొంత బుద్ధివ్యామోహం కలుగుతుంది. కాబట్టే దీన్ని కృష్ణయజుర్వేదము అన్నారు.

యజుర్వేదంలోని మంత్రాలను యజస్సులు అంటారు. కృష్ణయజుర్వేదానికి మొత్తం 86 శాఖలున్నాయి. కాని ప్రస్తుతం 4 శాఖలు మాత్రమే దొరుకుతున్నాయి. అవి 1. తైత్తిరీయశాఖ 2. మైత్రావరుణీయశాఖ 3. కఠశాఖ 4. కాపిష్ఠలశాఖ,.

1. తైత్తిరీయ సంహితలో 7 కాండలు 44 ప్రపాఠకాలు 635 అనువాకాలు ఉన్నాయి.
2. మైత్రావరుణీయ సంహితలో 4 కాండలు 54 ప్రపాఠకాలు 2144 మంత్రాలు ఉన్నాయి.
3. కఠసంహితలో 5 కాండలు 40 అధ్యాయాలు, 3091 మంత్రాలు ఉన్నాయి.
4. కాపిష్ఠల సంహితలో 6 కాండలు ఉన్నాయి. ఇవి అష్టకాలుగా విభజించ బడ్డాయి. వీటిలో కొంత భాగం దొరకటం లేదు.

**శుక్లయజుస్సంహిత :** శుక్లయజుస్సంహిత కూడా

కృష్ణయజుస్సంహితలాగానే యజ్ఞయాగాలు చేసే పద్ధతిని వివరిస్తుంది. ఈ సంహితలో యజ్ఞయాగాది క్రియల్లో ఉపయోగించే మంత్రాలు, అర్థవాదాలు మాత్రమే ఉన్నాయి. బ్రాహ్మణ భాగాలు విడిగా ఉన్నాయి. చదివే వారికి బుద్ధివ్యామోహం కలిగించవు. అందుకే దీన్ని శుక్లయజుర్వేదము అన్నారు. ఈ సంహితకు రెండు పాఠాలున్నాయి. 1. మాధ్యందిన పాఠము 2. కాణ్వపాఠము. ఈ రెండింటికీ పెద్దగా తేడాలేదు. చదవటంలో మాత్రమే కొంచెం తేడా కనిపిస్తుంది. వీటిలో మాధ్యందిన పాఠాన్నే వాజశనేయసంహిత అంటారు. ఈ రెండింటిలోను మాధ్యందిన శాఖ ఉత్తరదేశంలోను, కాణ్వశాఖ దక్షిణ దేశంలోను ప్రచారంలో ఉన్నాయి.

కాణ్వసంహితలో 40 అధ్యాయాలు 328 అనువాకాలు 2086 మంత్రాలు ఉన్నాయి.

మాధ్యందినసంహితలో 40 అధ్యాయాలు, 303 అనువాకాలు 3988 మంత్రాలు, 29,625 శబ్దాలు, 88,875 అక్షరాలు ఉన్నాయి. అంటే మాధ్యందిన సంహిత కన్న కాణ్వసంహితలో 25 అనువాకాలు ఎక్కువ.

యజుర్వేదానికి ఉపవేదం ధనుర్వేదం.

**సామసంహిత :** సామసంహితలో ఎక్కువ మంత్రాలు ఋగ్వేదంలోని 8,9 మండలాల నుంచే స్వీకరించారు. సామవేదం కూడా యజుర్వేదంలాగే యజ్ఞాలు చెయ్యటంలో బాగా ఉపకరిస్తుంది. సోమయాగంలో ఇందులోని మంత్రాలను ఉద్గాతలు గానం చేస్తారు. సామ అనే పదానికి గానము అని అర్థం. పాదబద్ధంగా ఉండే మంత్రం ఋక్కు. అదే గానం చెయ్యబడితే సామము అవుతుంది. సామగానం చాలా కష్టమైంది. **వేదానాం సామవేదోస్మి** సామవేదం సాక్షాత్తు

భగవత్స్వరూపము అని చెబుతోంది భగవద్గీత. అతినిద్ర లేకుండా జాగరూకులైన పండితులకే సామవేదం వశమవుతుంది అని ఋగ్వేదం చెబుతోంది. సామవేదం బాగా తెలిసిన వాడికే తత్త్వము బోధ పడుతుంది. అని వృద్ధబృహద్దేవత చెబుతోంది.

సామవేదం యొక్క ముఖ్యమైన ప్రయోజనం యజ్ఞయాగాలలో గానం చెయ్యటమే. సామసంహితలోని మంత్రాలు, ఋక్కులకు స్వరంలో తేడా ఉంది. ఈ మంత్రాలను గానం చేసే విధానం సంగీత గ్రంథాలలో వివరించబడింది. సామవేదానికి ఉపవేదం గాంధర్వవేదం.

సామవేదానికి వెయ్యిశాఖలున్నాయని వ్యాకరణ మహాభాష్యకారుడైన పతంజలి చెప్పాడు. కాని ప్రస్తుతం మాత్రం మూడుశాఖలే లభ్యమవుతున్నాయి. అవి 1. రాణాయనీయశాఖ 2. కౌథుమశాఖ 3. జైమినీయ శాఖలు.

సామసంహిత రెండు భాగాలుగా ఉంటుంది. 1. పూర్వార్చికము 2. ఉత్తరార్చికము. అర్చిక అంటే ఋక్కుల సమూహము అని అర్థం.

పూర్వార్చికలో ఆరు ప్రపాఠకాలున్నాయి. ప్రతి ప్రపాఠకము రెండు అధ్యాయాలుగా ఉంది. అంటే మొత్తం ఆరు ప్రపాఠకాలు, పన్నెండు అధ్యాయాలు ఉన్నాయన్న మాట. మొదటి ఐదు ప్రపాఠకాలలోను ప్రతిదానికి పది దశతులున్నాయి. దశతి అంటే – పది మంత్రాలు గల భాగము. ఆరవ ప్రపాఠకంలో తొమ్మిది దశతులు మాత్రమే ఉన్నాయి. ఈ రకంగా చూస్తే ఆరు ప్రపాఠకాలు, పన్నెండు అధ్యాయాలు, యాభై తొమ్మిది దశతులు ఉన్నాయి.

ఉత్తరార్చికలో తొమ్మిది ప్రపాఠకాలు ఉన్నాయి. ప్రతి ప్రపాఠకంలోను రెండు లేదా మూడు అధ్యాయాలున్నాయి. మొదటి ఐదు ప్రపాఠకాలోను రెండు అధ్యాయాల చొప్పున మొత్తం తొమ్మిది

ప్రపాఠకాలలోను కలిపి ఇరవై రెండు అధ్యాయాలున్నాయి. ఈ రెండు అర్చికాలకు మధ్య **మహానామ్న్యార్చిక** అనే పేరుతో పది మంత్రాలున్నాయి. వీటికి ఋషిదేవత ఛందస్సు లేవు.

మొత్తం మీద పూర్వార్చికలో 585, ఉత్తరార్చికలో 1220 మొత్తం 1805 మంత్రాలున్నాయి. అయితే ఇవి కాక అరణ్యకకాండలో 55 మంత్రాలు, మహానామ్న్యార్చికలో 10 మంత్రాలు కలిపి మొత్తం 1870 మంత్రాలున్నాయని విమర్శకులు చెబుతున్నారు. ఈ రకంగా చూస్తే సామసంహితలో ప్రపాఠకాలు 15, దశతులు 179, మంత్రాలు 1870 ఉన్నాయి.

**6. అధర్వ సంహిత :** అధర్వ సంహితకి యజ్ఞయాగాలలో ప్రాముఖ్యత లేదు. యజ్ఞం చెయ్యటానికి నలుగురు ఋత్విక్కులు కావాలి. 1. బ్రహ్మ 2. అధ్వర్యుడు 3. హోత 4. ఉద్గాత. ఇందులో హోత ఋగ్వేద పండితుడై ఉండాలి. అధ్వర్యుడు యజుర్వేద పండితుడు. ఉద్గాత సామవేద పండితుడు. ఇక బ్రహ్మ అధర్వ వేదపండితుడై, మిగిలిన మూడు వేదాలు బాగా తెలిసి ఉండాలి. మిగిలిన ముగ్గురు ఋత్విక్కులు చేసిన తప్పులు ఎక్కడివక్కడ దిద్దుకుంటూ, యజ్ఞానికి ఏ విధమైన అంతరాయం కలగకుండా చూడాలి.

అధర్వ సంహిత ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక విషయాలను వివరిస్తోంది. ఇందులోని 144 సూక్తాలలో శారీరక చికిత్స చెప్పబడింది. రాజ్యానికి, రాజధర్మానికి సంబంధించిన విషయాలు 244 సూక్తాలలో వివరించబడ్డాయి. సమాజ స్వరూపం 75 సూక్తాలలోను, ఆధ్యాత్మిక విశేషాలు 86 సూక్తాలలోను వివరించబడ్డాయి.

అధర్వ వేదానికి తొమ్మిది శాఖలున్నాయి అన్నాడు పతంజలి.

వీటిలో పిప్పలాద, శౌనక శాఖలు మాత్రమే ఇప్పుడు దొరుకుతున్నాయి. పిప్పలాద శాఖకే కాశ్మీర పాఠము అని కూడా పేరు. ఇందులో అనేక తేడాలు కనిపిస్తున్నాయి. ప్రస్తుతము శౌనక శాఖను ప్రామాణికంగా అందరూ అంగీకరిస్తున్నారు.

అధర్వ సంహితలో 20 కాండలున్నాయి. వాటిలో 19, 20 కాండలు మధ్యలో కలిశాయని పాశ్చాత్యుల అభిప్రాయం. ప్రతికాండ ప్రపాఠకాలుగా, అనువాకాలుగా, దశతులుగా, సూక్తాలుగా విభజించబడింది. మొత్తం మీద ఈ సంహితలో 20 కాండలు, 736 సూక్తాలు, 5918 మంత్రాలు ఉన్నాయి. ఈ వేదానికి ఉపవేదం 'అర్థవేదం'.

**2. బ్రాహ్మణము :** సంహితకు వివరణే బ్రాహ్మణము. సంహిత పూర్తిగా మంత్రభాగము. ఆ మంత్రాలతో యజ్ఞయాగాది క్రియలు ఎలా చెయ్యాలో వివరిస్తుంది బ్రాహ్మణము. ఇక్కడ జాగ్రత్తగా చూడండి. యజ్ఞయాగాదులు అంటే ఏమిటి? సంహితలో చెప్పిన మంత్రాలు చదువుతూ అగ్నిలో ఆహుతులు సమర్పించటమే యజ్ఞయాగాలు చెయ్యటమంటే. అలాటప్పుడు యజ్ఞానికీ, యాగానికీ మధ్య గల తేడా ఏమిటి? లౌకిక ప్రయోజనాల కోసం చేసేది యాగము. అశ్వమేధము, రాజసూయము, వాజపేయము, పుత్రకామేష్టి మొదలైనవి. మరి యజ్ఞము అంటే సంహితలో చెప్పిన మంత్రాలన్నీ చదువుతూ, ఫలాపేక్ష లేకుండా, పరమేశ్వర పరంగా అగ్నిలో ఆహుతులు సమర్పించటం. యాగఫలం యజమానికి చెందుతుంది. యజ్ఞఫలం పరమేశ్వరుడికి లేదా దేశానికి చెందుతుంది. అంతేకాని యజ్ఞకర్తకు మాత్రం చెందదు. ఈరకంగా యజ్ఞయాగాది క్రతువుల గురించి చెప్పేవి బ్రాహ్మణాలు.

**బ్రాహ్మణాలు కూడా వేదాలేనా?**

వేదం నాలుగు భాగాలుగా ఉంది. 1. సంహిత 2. బ్రాహ్మణము 3. అరణ్యకము 4. ఉపనిషత్తు. ఇది మనందరికీ తెలిసిన విషయం. అయితే ఏ భాగాన్ని వేదం అంటారు? అనే అనుమానం చాలామందికి ఉంది. ఈ అనుమానం నిన్న, ఇవాళ వచ్చింది కాదు. అతిప్రాచీనకాలంనుంచి ఈ చర్చ జరుగుతూనే ఉంది. దీనికి కారణం ఏమంటే? వేదాలు అపౌరుషేయాలు. అవి ఎవరివల్లా చెప్పబడలేదు. సాక్షాత్తు పరమేశ్వరుడే వాటిని చెప్పాడు అనేది మన నమ్మకం. దీనికి తగ్గట్టుగానే వేదమంత్రాలను కొంతమంది మహర్షులు దర్శించారు. అని చెప్పబడుతోంది. అలాంటప్పుడు మంత్ర భాగానికి వ్యాఖ్యాన భాగమైన బ్రాహ్మణాలు ఎలా వేదాలవుతాయి? దీనికి తగ్గట్టుగా కొంతమంది పాశ్చాత్యులు సంహితభాగము ఒక్కటే వేదము అన్నారు. దీంతో మన అనుమానం మరీ ఎక్కువవుతోంది. ఎందుకంటే మనకి మనమీద, మనవాళ్ళమీద కన్న పాశ్చాత్యులమీద నమ్మకం మిన్న. చివరకు నీ భార్య పతివ్రత అనే మాటకూడా పాశ్చాత్యులు చెబితేనే నమ్ముతాం. అది మన దౌర్భాగ్యం. వాళ్ళు చెప్పిన ఏ విషయాన్నైనా తేలికగా నమ్మేస్తాం.

అసలింతకీ వాస్తవం ఏమిటి? బ్రాహ్మణాలు వేదమా? కాదా? అంటే – దీనిమీద చాలామంది ఇంతవరకు పరిశోధనలు చేశారు. అలాగే ప్రాచీన కాలంలో వేదాలకు భాష్యం వ్రాసిన మహానుభావులున్నారు. వాళ్ళేమంటారో కూడా పరిశీలిద్దాం.

జైమిని వ్రాసిన పూర్వమీమాంస గ్రంథానికి భాష్యం వ్రాసిన వాడు శబరస్వామి. ఆయన **మంత్రాశ్చ బ్రాహ్మణం చ వేదః** అన్నాడు. అంటే మంత్రభాగము (సంహిత) బ్రాహ్మణాలు కూడా వేదమే. అలాగే శంకరాచార్యుల వారు బృహదారణ్యకోపనిషత్తుకు భాష్యం వ్రాస్తూ

**వేదానువచనేన మంత్రబ్రాహ్మణాధ్యయనే** మంత్రభాగాన్ని, బ్రాహ్మణాన్ని కూడా అధ్యయనం చేయటమే వేదానువచనము అని చెప్పి బ్రాహ్మణాలు కూడా వేదంలో భాగమేను అన్నారు. కుమారిలభట్టు కూడా తంత్రవార్తికంలో సంహిత, బ్రాహ్మణము రెండూ వేదమేను అన్నాడు. ఆపస్తంభుడు తన శ్రౌతసూత్రాలలో **మంత్ర బ్రాహ్మణయో ర్వేదనామధేయమ్** మంత్రాలకు, బ్రాహ్మణాలకు రెండింటికీ వేదమని పేరు అన్నాడు. అలాగే వేదాలకు భాష్యం వ్రాసిన సాయణాచార్యుడు **మంత్ర బ్రాహ్మణాత్మక శబ్దరాశిర్వేదః** మంత్రభాగము, బ్రాహ్మణభాగము రూపాలలో ఉన్న శబ్దరాశి అంతా వేదమేను అన్నాడు. ఈ మాటనే షడ్గురుశిష్యుడు కూడా సమర్థించాడు. స్థూలంగా కనక పరిశీలిస్తే మంత్రభాగమే వేదమని తెలుస్తోంది. కాని బ్రాహ్మణాలు మంత్రభాగానికి వ్యాఖ్యానరూపాలు. వీటిని మహర్షులు యజ్ఞయాగాది కర్మలను నిరూపించటం కోసం వ్రాశారు. కాబట్టి మంత్రభాగం ఎప్పుడు వేదమవుతుందో, అప్పుడే దాని వ్యాఖ్యభాగం కూడా వేదమవుతుంది. కాని ఇది గౌణము అంటే అంత ప్రాధాన్యత లేనిదన్న మాట. దయానంద సరస్వతి మొదలైన ఆధునికవాదులు బ్రాహ్మణాలు వేదాలుకావు అన్నారు. మాక్సముల్లర్ మొ॥ పాశ్చాత్యులు కూడా ఇదే మాట చెప్పారు. కాని తరువాత కాలంలో భారతీయులు అనేకమంది దీనిమీద పరిశోధనలు నిర్వహించి బ్రాహ్మణాలు కూడా వేదమే అని తేల్చారు. ఈ రకంగా చూసినట్లైతే బ్రాహ్మణాలుకూడా వేదమే అనే విషయం తెలుస్తుంది.

**బ్రాహ్మణాల వల్ల ప్రయోజనం ఏమిటి ?**

సంహిత అంటే మంత్రభాగము దానివల్ల ఉపయోగం కనిపిస్తోంది. మరి బ్రాహ్మణాల వల్ల ఉపయోగం ఏమిటి? ఇదికూడా

చాలామందిని పట్టి పీడిస్తున్న ప్రశ్న. మంత్రభాగం అయిన సంహితను సరిగా అర్థం చేసుకోవటానికి బ్రాహ్మణాల అవసరం ఎంతైనా ఉంది. యజ్ఞయాగాలకు సంబంధించిన పదార్థాలను దేవతలకు సమర్పించేవి మంత్రాలు. యజ్ఞాన్ని ఎలా చెయ్యాలో, ఎలాచేస్తే ఏరకమైన ప్రయోజనం వస్తుందో వివరించి చెప్పేవి బ్రాహ్మణాలు. సంహితలో రహస్యంగా ఉన్న అర్థాలను పూర్తిగా వివరిస్తాయి. బ్రాహ్మణాలను ఆధారంగా చేసుకునే నిరుక్తం కూడా వ్రాయబడింది. అసలు **'నిరుక్తం'** అంటే ఏమిటి? వేదనిఘంటువు. పూర్వకాలంలో ఎవరోపండితుడు వేదంలో ఉండే పదాలకు అర్థం వ్రాశాడు. దానికి వ్యాఖ్య వ్రాశాడు యాస్కుడు. అదే నిరుక్తం. గతంలో ప్రతివేదానికి విడివిడిగా నిఘంటువు ఉండేది. కాని యాస్కుడు నిరుక్తం వ్రాసిన తరువాత అవన్నీ మరుగున పడిపోయాయి. ఇప్పుడు నిరుక్తం ఒక్కటే మిగిలింది. సంహితలోని పదాలకు అర్థం చెప్పేటప్పుడు, నిర్వచించేప్పుడు బ్రాహ్మణాలనే ఆధారంగా తీసుకోవటం జరిగింది. కాబట్టి మంత్రభాగం పూర్తిగా అర్థంకావాలి అంటే బ్రాహ్మణాలు బాగా ఉపయోగిస్తాయి.

మన ఋషీశ్వరులకు అతీతమైన శక్తి ఉంది. మన కంటికి కనిపించని వాటిని, ఇంద్రియాల వల్ల తెలుసుకోలేని వాటిని వారు తమ అతీతశక్తితో తెలుసుకోగలిగారు. దీన్నే తపఃశక్తి అని, దివ్యదృష్టి అని కూడా అంటారు. ఆ రకంగా మంత్రానికి నిజమైన అర్థం తెలుసుకుని బ్రాహ్మణాలలో వివరించారు. వీటి ఆధారంగానే వేదనిఘంటువులను వ్రాయటం జరిగింది. అయితే ఆధునికవాదులు కాని, పాశ్చాత్యులు గాని వీటిని అంగీకరించరు. వారి దృష్టిలో అతీతశక్తులు లేవు. కారణం ఏమంటే అటువంటి శక్తులేవీ వారికి లేవు. అవి నిరూపితం కాలేదు అంటారు. ప్రతివిషయము నిరూపితం

కాదు. అది నిరూపించేశక్తి మనదగ్గర లేకపోతే, పెద్దవాళ్ళు చెప్పింది నమ్మాల్సిందే. యోగవాసిష్టంలో శ్రీరాముడు వశిష్టుడితో "గురుదేవా! వేదాలలో చెప్పిన విషయం నిజమో కాదో నిరూపించి చూడాలి కదా?" అంటాడు. ఆ మాటకి వశిష్టుడు "రామా! ఇప్పటివరకు అనేకమంది మహానుభావులు ఈ విషయాలనుపరిశీలించి, అధ్యయనంచేసి నిజమే అని తేల్చారు. కాబట్టి మళ్ళీ నువు వాటిని పరిశీలించవలసిన అవసరం లేదు. వేదంలో చెప్పిన దాన్ని పూర్తిగా నమ్మవచ్చు. అవన్నీ సత్యాలే." అని చెబుతాడు. కాబట్టి పాశ్చాత్యుల వాదనలు, హేతువాదుల విమర్శలు మనం పట్టించుకోవలసిన అవసరం ఏ మాత్రమూ లేదు.

వైదిక కర్మలు చెయ్యటానికి బ్రాహ్మణాలు మానవుణ్ణి ఉత్తేజపరుస్తాయి అని సూత్రకారులైన ఆపస్తంభుడు మొ॥ వారు చెప్పారు. బ్రాహ్మణాలలో అనేక ఉపాఖ్యానాలు కూడా చెప్పబడ్డాయి. కాబట్టి బ్రాహ్మణాల వల్ల కేవలము మంత్రార్థమే కాకుండా భారతీయ సంస్కృతి, అప్పటి ప్రజల తత్త్వచింతన, ఆలోచనావిధానం కూడా మనకు తెలుస్తాయి. ప్రతివేదానికి విడివిడిగా బ్రాహ్మణాలున్నాయి.

1. ఐతరేయ బ్రాహ్మణము – ఋగ్వేదము
2. కౌషీతకీ బ్రాహ్మణము – ఋగ్వేదము
3. తైత్తిరీయ బ్రాహ్మణము – కృష్ణయజుర్వేదము
4. శతపథ బ్రాహ్మణము – శుక్లయజుర్వేదము
5. తలవకార బ్రాహ్మణము – సామవేదము
6. తాండ్యబ్రాహ్మణము – సామవేదము
7. ఛాందోగ్యబ్రాహ్మణము – సామవేదము
8. గోపథ బ్రాహ్మణము – అథర్వవేదము

**3. అరణ్యకము :** అరణ్యకాలు బ్రాహ్మణాలకు పరిశిష్ట భాగాలు. యజ్ఞయాగాల లోని రహస్యాలను మహర్షులు అరణ్యాలలో చర్చించారు. అందుకే దీన్ని **"అరణ్యే పాఠత్వాత్ అరణ్యకమ్"** అరణ్యాలలో చదవతగ్గవి కాబట్టే ఇవి అరణ్యకాలు అనబడతాయి అన్నాడు సాయణాచార్యుడు. ఇది అరణ్యంలో అధ్యయనం చేయతగింది కాబట్టి అరణ్యకము అన్నాడు సురేశ్వరాచార్యుడు. సంహితకు అనుబంధంగా బ్రాహ్మణము ఉన్నట్లే, బ్రాహ్మణానికి అనుబంధంగా అరణ్యకము ఉన్నది. నాలుగు వేదాలకు కూడా అరణ్యకాలున్నాయి. అవి :

1. ఐతరేయారణ్యకం – ఋగ్వేదం
2. కౌషీతకీ అరణ్యకం – ఋగ్వేదం
3. మైత్రాయణీ అరణ్యకం – కృష్ణయజుర్వేదం
4. తైత్తిరీయారణ్యకం – కృష్ణయజుర్వేదం
5. బృహదారణ్యకం – శుక్లయజుర్వేదం
6. తలవకార అరణ్యకం – సామవేదం

అథర్వణ వేదానికి అరణ్యకాలు ఏవీ అందుబాటులో లేవు.

బ్రాహ్మణాలు కర్మకాండ. ఉపనిషత్తులు జ్ఞానకాండ. ఈ రెండింటికీ మధ్యన ఉన్నది సంకర్షణకాండ. అదే భక్తికాండ. దీనికి మూలం అరణ్యకాలు. శాండిల్యుడు భక్తిమీమాంస అనే పేరుతో ఒక గ్రంథం వ్రాశాడు. అది భక్తి కర్మ జ్ఞానకాండలకు వారధి. దీనినే భక్తి దర్శనము అంటారు. **అథాతోభక్తిజిజ్ఞాస** అంటూ ప్రారంభం అవుతుంది ఈ గ్రంథం. దీనికి స్వప్నేశ్వరస్వామి భాష్యం వ్రాశాడు. దీనికి 'భక్తిచంద్రిక' అనే పేరుతో వ్యాఖ్య వ్రాసినవాడు శ్రీకృష్ణలీలాతరంగిణి వ్రాసిన **నారాయణతీర్థులవారు.** ఈయన తెలుగువాడు. గుంటూరు

దగ్గర 'కాజ' అనే గ్రామంవాడు.

**ఉపనిషత్తు :** ఇది జ్ఞానకాండ ఉప సమీపమునందు, ని- దిగువ స్థానములో, షద్ - కూర్చొనుట. బ్రహ్మవిద్యలో నిష్ణాతుడైన గురువుగారు, బ్రహ్మవిద్య తెలుసుకోవాలనే కోరిక గల శిష్యుడు వీరిద్దరూ మానవ సంచారం పెద్దగా లేని అటవీ ప్రాంతంలో ప్రశాంత వాతావరణంలో, నదీతీరంలో ఆశ్రమం నిర్మించుకుని ఉంటారు. సామాన్యంగా గురువుగారు తన ఆశ్రమంలో శిష్యులకు బ్రహ్మవిద్య బోధిస్తుంటాడు. ఆసక్తి గల శిష్యులు ఆయనకు దగ్గరలో, ఆయనకకన్న దిగువ స్థాయిలో కూర్చుని అంటే ఒక చెట్టుక్రింద గురువుగారు ఒక గట్టుమీద కూర్చుని ఉంటాడు. శిష్యులు క్రింద ఆయనకన్న దిగువన కూర్చుంటారు. గురువుగారు చెబుతుంటాడు. శిష్యులు అత్యంత శ్రద్ధగా వింటుంటారు. అయితే శిష్యులు గురువు గారికి విద్య నేర్పినందుకు ఏం చెల్లిస్తారు? ఏమి చెల్లించరు. కేవలము ఆయనకు సేవచేసి ఆయన దగ్గర విద్యాభ్యాసం చేస్తారు. చదువుపూర్తిఅయి వెళ్ళిపోయేటప్పుడు మాత్రం గురువుగారు కోరిన దాన్ని గురుదక్షిణగా చెల్లిస్తారు.

వేదం నాలుగు భాగాలుగా ఉన్నది అని గతంలో చెప్పుకున్నాం. అందులో నాల్గవ భాగమే ఉపనిషత్తు అసలు ఉపనిషత్తు. అంటే బ్రహ్మవిద్య. బ్రహ్మవిద్యా పరిశీలకులైన విద్వాంసులకు జనన మరణాలు లేకుండా చేసేది. ఆ జన్మాది మరణాదికమైన దానిని నశింపచేసేది. బ్రహ్మపదార్ధ లాభం కలుగచేసేది అది ఉపనిషత్తు అంటే.

**ఉపనిషత్తులు ఎన్ని ?**

ఇది చాలా పెద్ద ప్రశ్న. ముందుగా అసలు ఈ ఉపనిషత్తు ఎక్కడ ఉన్నది అనే విషయం చూద్దాం. వేదవిభజన చేసిన తరువాత వ్యాసభగవానుడు నాలుగు వేదాలను తన శిష్యులైన 1. జైమిని 2.

వైశంపాయనుడు 3. పైలుడు 4. సుమంతులకు వాటి ప్రచార బాధ్యతను ఒప్పగించాడు. వాళ్ళు గురుశిష్యపరంపరగా వేదాన్ని ప్రచారం చేశారు. ఇలా చేస్తున్నప్పుడు అందులో కొన్ని మార్పులు కూడా జరిగినాయి. అలా జరిగి వేదాలు కొన్ని శాఖలుగా ఏర్పడ్డాయి. ఈ రకంగా చూస్తే

ఋగ్వేదానికి 21 శాఖలు, కృష్ణ శుక్ల యజుర్వేదాలకు కలిపి 109 శాఖలు, సామవేదానికి 1000 శాఖలు, అధర్వవేదానికి 50 శాఖలు వెరసి 1180 శాఖలు ఏర్పడ్డాయి. ప్రతి శాఖకి చివరన ఒక ఉపనిషత్తు చెప్పబడింది. ఒక శాఖలో చెప్పిన ఉపనిషత్తు ఇంకొక శాఖలో చెప్పరు. ఇలా చూస్తే 1180 ఉపనిషత్తులు ఉన్నాయనే విషయం మనకు తెలుస్తోంది. యజుర్వేదంలో రుద్రోపనిషత్తు 109 శాఖలలోను చెప్పబడింది. అందుకే దానిని **శతేనరుద్రీయం ఇతి శతరుద్రీయం** వందసార్లు చెప్పారు కాబట్టే దాని శతరుద్రీయము అని చెప్పటం జరిగింది.

శుక్లయజుర్వేదానికి సంబంధించినది ముక్తికోపనిషత్తు. ఇందులో ఆంజనేయుడు శ్రీరామచంద్రుణ్ణి అడుగుతాడు. రామా! వేదాలు ఎన్ని? ఉపనిషత్తులు ఎన్ని? అవి ఏవి? అని దానికి సమాధానంగా శ్రీరాముడు చెబుతున్నాడు. ఓ ఆంజనేయా!

**ఋగ్వేదాది విభాగేన వేదాశ్చత్వార ఈరితాః**
**తేషాంశాఖాహ్యనేకాస్యస్తు ఉపనిషద స్తదా**
**ఋగ్వేదశ్యతుశాఖాః స్యుః ఏకవింశతి సంఖ్యయా**
**నవాధిశతంశాఖా యజుషోమారుతాత్మజ**
**సహస్ర సంఖ్యయా జాతాశ్శాఖా స్సామ్నాః పరంతప**
**అధర్వణస్యశాఖాస్యుః పంచాశద్భేదతోహరే**

వేదాలు నాలుగు. వాటికి అనేక శాఖలున్నాయి. అలాగే వేదాలకు ఉపనిషత్తులు కూడా అనేకాలున్నాయి. ఋగ్వేదానికి 21 శాఖలు, యజుర్వేదానికి 109 శాఖలు, సామవేదానికి 1000 శాఖలు, అధర్వణ వేదానికి 50 శాఖలు ఉన్నాయి.

**ఏకైకస్యాస్తు శాఖాయా ఏకైకోపనిషన్మతా**

అందులో ప్రతిశాఖకు ఒక ఉపనిషత్తు చెప్పబడింది.

ఈ రకంగా చూస్తే 1180 ఉపనిషత్తులు ఉన్నాయి. కాని ఇవాళ అవన్నీ మనకి లభ్యం కావటంలా, వాటి పేర్లుకూడా సరిగా తెలియవు. ప్రస్తుతం మనకి 200 ఉపనిషత్తులు మాత్రమే దొరుకుతున్నాయి అంటున్నారు.

ముక్తికోపనిషత్తులోనే ఆంజనేయుడు అడుగుతున్నాడు. స్వామి! ముక్తి ఎలా కలుగుతుంది? దానికి శ్రీరామచంద్రుడు చెబుతున్నాడు. "హనుమా !

**'మాండూక్యమేకమేవాలం ముముక్షూణాం విముక్తయే'**
**తథాప్యసిద్ధిం చేత్జ్ఞానం దశోపనిషదం పఠ**

ముక్తి పొందటానికి మాండూక్య మొకటి చాలు మాండూక్యోపనిషత్తుకు శంకరుడు భాష్యం వ్రాశాడు. గౌడపాదుడు కారికలు వ్రాశాడు. అది చదివినప్పటికీ జ్ఞానసిద్ధి కలగకపోతే దశోపనిషత్తులు చదువవలసినది. ఏమిటా దశోపనిషత్తులు అంటే

**ఈశ కేన కఠ ప్రశ్న ముండక మాండూక్య తిత్తిరి ।**
**ఐతరేయం చ ఛాందోగ్యం బృహదారణ్యకం దశః ॥**

1. ఈశావాశ్యోపనిషత్తు – శుక్లయజుర్వేదం
2. కేనోపనిషత్తు – సామవేదం
3. కఠోపనిషత్తు – కృష్ణయజుర్వేదం

4. ప్రశ్నోపనిషత్తు - అధర్వణవేదం
5. ముండకోపనిషత్తు - అధర్వణవేదం
6. మాండూక్యోపనిషత్తు - అధర్వణవేదం
7. తైత్తిరీయోపనిషత్తు - కృష్ణయజుర్వేదం
8. ఐతరేయోపనిషత్తు - ఋగ్వేదం
9. ఛాందోగ్యోపనిషత్తు - సామవేదం
10. బృహదారణ్యకోపనిషత్తు - శుక్లయజుర్వేదం

ఇవి మొత్తం పది. నిరాకారబ్రహ్మని వివరిస్తాయి. పరబ్రహ్మ సర్వాంతర్యామి. చరాచర జగత్తంతా ఆవరించి ఉన్నాడు. **అయమాత్మా బ్రహ్మ** నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని అని వివరిస్తాయి. హనుమా ! ఒకవేళ అవి చదివినా నీకు జ్ఞానం గనక రాకపోయినట్లైతే **విదేహముక్తా విచ్ఛాచేద్ అష్టోత్తరశతం పఠ.** నీకు విదేహముక్తి యందు కోరిక ఉంటే 108 ఉపనిషత్తులు చదువవలసింది. అని 108 ఉపనిషత్తులు పేర్లు వివరిస్తాడు.

ఈ 108 ఉపనిషత్తులను రెండు రకాలుగా విభజించటం జరిగింది. 1. వేదాల ప్రకారము 2. విషయాన్ననుసరించి

1. వేదాల ప్రకారము ఈ ఉపనిషత్తులను విభజించినట్లైతే

| | | |
|---|---|---|
| ఋగ్వేదానికి సంబంధించినవి | - | 10 |
| కృష్ణయజుర్వేదానికి సంబంధించినవి | - | 32 |
| శుక్లయజుర్వేదానికి సంబంధించినవి | - | 19 |
| సామవేదానికి సంబంధించినవి | - | 16 |
| అధర్వణ వేదానికి సంబంధించినవి | - | 31 |
| వెరసి | - | 108 |

2. విషయపరంగా చూస్తే

| | | | |
|---|---|---|---|
| 1. | వైష్ణవోపనిషత్తులు | – | 14 |
| 2. | శైవోపనిషత్తులు | – | 15 |
| 3. | శాక్తేయోపనిషత్తులు | – | 8 |
| 4. | వేదాంతోపనిషత్తులు | – | 24 |
| 5. | యోగోపనిషత్తులు | – | 20 |
| 6. | సన్యాసోపనిషత్తులు | – | 17 |
| 7. | దశోపనిషత్తులు | – | 10 |
| | వెరసి | | 108 |

ఈ 108 ఉపనిషత్తులకు **ఉపనిషద్ బ్రహ్మేంద్ర** అనే పండితుడు వ్యాఖ్య వ్రాశాడు సంస్కృతంలో. అయితే తెలుగులో ప్రార్థనాగాన ప్రచార సంఘం తరపున **విద్వాన్ గర్రె సత్యనారాయణ గుప్త** గారు **ఉపనిషత్ కల్పతరువు** అనే పేరుతో పండితులతో అర్థాలు వ్రాయించి మూడు సంపుటాలుగా ముద్రించారు.

ఈ 108 ఉపనిషత్తులు చదవటం అనేది అంత తేలిక అయిన పనికాదు. అందుకే శంకరులవారు దశోపనిషత్తులు చదవండి చాలు అన్నారు. వాటన్నింటికీ త్రిమతాచార్యులు భాష్యాలుకూడా వ్రాశారు. ఇవికూడా చదవలేకపోతే మాండూక్యోపనిషత్తు ఒక్కటి చదవండి.

ఈ ఉపనిషత్తులలో కొన్ని వాక్యాలు మహావాక్యాలుగా చెప్పబడ్డాయి. వాటిలో నాలుగు చాలా ముఖ్యమైనవి. ఉపనిషత్తులలో కేవలము బ్రహ్మవిద్యే కాకుండా ఉపాసనా మంత్రాలు కూడా చెప్పబడ్డాయి.

# 4. వేదాలెన్ని

అసలు వేదాలు ఎన్ని? ఇది చాలా విచిత్రమైన ప్రశ్న. ఎందుకంటే ఇప్పటిదాకా మనం వేదాలు నాలుగు అని చెప్పి ఇప్పుడు వేదాలు ఎన్ని అని అడుగుతున్నాము. దీనికి కారణం ఏమంటే వేదానికి 'త్రయీవిద్య' అని పేరుంది. త్రయము అంటే –మూడు అని అర్థం. చాలా కాలం వేదాలు మూడుగానే పరిగణింపబడేవి. 1.ఋగ్వేదము 2. యజుర్వేదము 3. సామవేదము ఈ మూడింటి ద్వారానే యజ్ఞ యాగాలన్నీ చేస్తుండేవారు. **'త్రిభిర్వేదైర్విధీయతే'** అంటోంది సత్యాషాఢ సూత్రం. చాలా కాలం ఈ మూడింటినే వేదము అన్నారు. ఋగ్వేదంలోని పదవ మండలంలోని 90వ సూక్తంలోని 9వ మంత్రంలో **యజ్ఞాత్ ఋచస్సామాని జజ్ఞిరే– యజుస్తస్మాదజాయత'**

సర్వాత్మక పురుషుని హోమయుక్తమైన ఆ యజ్ఞమునుండి ఋక్ యజుస్సామాలు పుట్టినాయి. దాని నుంచే గాయత్రి మొ॥ ఏడు ఛందస్సులు ఉత్పన్నమైనాయి. అని చెప్పబడింది. అలాగే ఐతరేయ బ్రాహ్మణంలో **తయోవేదా అజాయంత ఋగ్వేద ఏవాగ్నే రజాయత యజుర్వేదోవాయోః. సామవేద ఆదిత్యాత్. త్రయ్యావిద్యేతి బ్రూయాత్.**

తైత్తిరీయ బ్రాహ్మణంలో

**యం ఋషయః త్రయోవిదోవిదుః ఋచః సామానియజూంసి**

ఈ రెండు చోట్లాకూడా వేదాలు మూడు. అవి ఋక్ యజుస్సామాలు అని చెప్పబడింది. అంటే ఆ రోజుల్లో అధర్వణ వేదాన్ని ఎవరూ పెద్దగా పట్టించుకోలా. దానికి ప్రాముఖ్యత లేదు.

యజ్ఞయాగాది క్రతువులు చేసేటప్పుడు 1. హోత – ఋగ్వేద పండితుడు. 2. అధ్వర్యుడు – యజుర్వేద పండితుడు 3. ఉద్గాత –

సామవేద పండితుడు. హోత వేదమంత్రాలు చదువుతుంటాడు. అధ్వర్యుడు యజ్ఞకార్యక్రమం నిర్వహిస్తుంటాడు. ఉద్గాత సామగానాలు గానం చేస్తుంటాడు. మరి పూర్తిగా యజ్ఞ నిర్వహణ బాధ్యత ఎవరు తీసుకుంటారు? అప్పుడు బ్రహ్మయొక్క అవసరం ఏర్పడింది. పై ముగ్గురూ ఈ పని చెయ్యలేరు. దాన్ని అధర్వణ వేదపండితుడే చెయ్యాలి. అంటే బ్రహ్మ అధర్వణ వేదపండితుడై మిగిలిన వేదాలు కూడా తెలిసి ఉండాలి. తన పని తాను చేసుకుంటూ మిగిలిన వాళ్ళు చేసే తప్పులు సరిదిద్దగలవాడై ఉండాలి.

**ఋగ్విదమేన హోతారం వృణీష్వ యజుర్విదం అధ్వర్యుమ్.**
**సామవిదం ఉద్గారతామ్ అధర్వాంగిరోవిదం బ్రహ్మణమ్.**

మొదటి మూడు వేదాలు యజ్ఞంలో వాగ్రూపమైన సగభాగాన్ని మాత్రమే పూర్తి చేస్తాయి. మిగిలిన సగభాగాన్ని అధర్వణ వేదపండితుడైన బ్రహ్మ పూర్తి చేస్తాడు. ఈ కారణంచేతనే బ్రహ్మగా అధర్వణ వేదపండితుడు మాత్రమే ఉండాలి అని చెబుతోంది గోపథబ్రాహ్మణం.

మొదటగా వేదాలు మూడే. కాని కాలక్రమంలో వేదాలు నాలుగు అన్నారు. ఋగ్వేద బ్రాహ్మణాలు కాని, శ్రౌతసూత్రాలు గాని అధర్వణవేద ప్రస్థావన చెయ్యలేదు. దీనికి కారణం అధర్వణవేదంలో శ్రౌతప్రక్రియకు ప్రాధాన్యత లేదు. మూడు వేదాలలోను యజ్ఞసంబంధంఎక్కువ అభిచారంతక్కువ ఉంటుంది. అధర్వణ వేదంలో మాత్రం అభిచారంఎక్కువ, యజ్ఞసంబంధంతక్కువ ఉంటుంది. వైదికులు అభిచారాన్ని అధర్మముఅనలేదు సరికదా కొంతవరకు ధర్మమేను అని కూడా అన్నారు. కాని లౌకిక వ్యవహారాలు వివరించే ధర్మశాస్త్రాలు మాత్రం అధర్వణ వేదంలోని అభిచారిక కర్మలను తీవ్రంగా

ఖండించాయి. అధర్వణ వేదాన్ని నిందించాయి కూడా.

అధర్వణ వేదానికి **'అధర్వాంగీరసః'** అని పేరుంది. **అధర్వులు, ఆంగిరసులు** అనే రెండు వంశాలను ఈ పదం చెబుతోంది. అధర్వశబ్దం వేదంలోని మంగళకరమైన భాగాన్ని, ఆంగీరసశబ్దం అమంగళకరమైన అభిచారిక భాగాన్ని చెబుతోంది అన్నారు.

అధర్వణ వేదంలో చెప్పిన కొన్ని అభిచార కర్మలు ఘోరమైనవి అని ధర్మశాస్త్రాలు గోలపెట్టాయి. ఈ కారణం చేతనే అధర్వణ వేదాన్ని వేదంగా అసలు ఒప్పుకోలేదు. విష్ణుస్మృతిలో అధర్వణ వేదంలో చెప్పిన మారణప్రయోగాలు చేసేవారు చడిచప్పుడు లేకుండా చంపేవారిలో ఒకరుగా చెప్పబడ్డారు. వైద్యులు, జ్యోతిష్కులు కూడా అవైదికులు అనే ధర్మశాస్త్రం చెబుతోంది. ఇన్ని రకాలుగా ధర్మశాస్త్రాలు అధర్వణ వేదాన్ని నిందించినప్పటికీ శత్రుసంహారానికి అధర్వణవేదం చెప్పిన అభిచార ప్రయోగాలు పరమాయుధాలు అని ఒప్పుకున్నాయి. అధర్వణవేదాన్ని నాలుగవ వేదంగా అంగీకరించినాయి. గోపథ బ్రాహ్మణంలో

**ఋగ్విదమేవహోతారం వృణిష్వ. యజుర్విదం అధ్వర్యుమ్ సామవిదం ఉద్గాతారమ్. అధర్వాంగీరోవిదం బ్రహ్మాణమ్**

అని చెప్పి అధర్వణవేదాన్ని నాలుగవవేదంగా అంగీకరించినాయి బ్రాహ్మణాలు. కాబట్టి వేదాలు నాలుగు అని చెప్పక తప్పదు.

**వేదానికి ఎన్ని పేర్లున్నాయి?**

వేదానికి ఎన్ని పేర్లున్నాయి? ఇది చాలా పెద్దప్రశ్న. వేదానికి తొమ్మిది పేర్లున్నాయి. అవి

1. శ్రుతి 2. అనుశ్రవము 3. త్రయి 4. ఆమ్నాయము 5.

సమామ్నాయము 6. ఛందము 7. స్వాధ్యాయము 8. ఆగమము 9. నిగమము.

వేదం గురుశిష్య పరంపరగా వస్తుంది. గురువు చెప్పిన దాన్ని జాగ్రత్తగా విని తిరిగి అలాగే ఉచ్చరిస్తాడు శిష్యుడు. అలాగే వేదం అంతా నేర్చుకుంటాడు. అందుకే శ్రుతి అని, అనుశ్రవము అని దీనికి పేర్లు వచ్చాయి.

గతంలో చెప్పుకున్నట్లుగా ఋగ్ యజుస్సామాలకు త్రయి అని పేరు. దీన్నే త్రయీవిద్య అంటారు. 'మ్నా' అంటే అభ్యాసము అని అర్థం. ఎప్పుడూ అభ్యసింపబడు తుంటుంది. కాబట్టి దీన్ని ఆమ్నాయము, సమామ్నాయము అంటారు.

ప్రత్యేకమైన ఛందస్సు కలది కాబట్టి ఛందం అనబడింది. వంశపారంపర్యంగా వేదాధ్యయనం జరుగుతుంది. కాబట్టి స్వాధ్యాయము అంటారు.

పరమేశ్వరుని నిశ్వాస రూపంగా వెలువడుతోంది కాబట్టి ఆగమము అన్నారు. యాస్కుడు దీన్నే నిగమము అన్నాడు.

# 5. వేదం చదివేటప్పుడు అర్థం తెలియాలా?

ఇది చాలా పెద్ద ప్రశ్న. అర్థం తెలుసుకుని వేదాన్ని చదవాలి అని కొందరి వాదన. కాగా కేవలం పారాయణ చేస్తే చాలు. అర్థం తెలియవలసిన అవసరం లేదు అంటారు కొందరు. అసలు వేదం చదవాలంటేనే 12 సం॥ కాలం పడుతుంది. వేదానికి అర్థం తెలియాలంటే షట్శాస్త్రాలు 1 శిక్ష 2. కల్పము 3. వ్యాకరణము 4. ఛందస్సు 5. నిరుక్తము 6. జ్యోతిషము ఇవి కూడా చదవాలి. దీనికి జీవిత కాలం సరిపోదు. అందుకని అర్థం తెలియకపోయినా కేవలం వేదపారాయణ చేస్తే చాలు. వీరి వాదన ప్రకారం వేదార్థం తెలియకపోయినా కొంపఏమీ మునిగిపోదు. వాటిని కంఠస్థం చేసి పారాయణ చేసినా చాలు. ఇది వీరి వాదన. ఈ రెండు వాదనలు పరిశీలిస్తే అర్థం తెలిసి పారాయణ చెయ్యాలని సంప్రదాయవాదులు, అర్థం తెలియకపోయినా పారాయణచేస్తే చాలు అని వారిలోని ఆధునికులు చెబుతున్నారు. వీరు పూర్తిగా ఆధునికులు కారు.

అధ్యయన విధితోపాటుగా అర్థజ్ఞానాన్ని కూడా నిత్యకర్మగా చెబుతున్నది వేదం. బ్రాహ్మణుడైన వాడు ఏ కోరికా లేకుండా వేదాధ్యయనం చెయ్యాలి అంటోంది **మహాభాష్యం.** సాయణాచార్యుడు కూడా తన **వేదభాష్య భూమికలలో** అధ్యయనం లాగానే అర్థజ్ఞానం కూడా కావాలి అని చెప్పాడు. అర్థం తెలియకుండా వేదం చదవటం వల్ల అలౌకిక పురుషార్థోపాయాన్ని తెలుసుకోవటం సాధ్యం కాదు. కాబట్టి కేవలము వల్లెవేయటంవల్ల వేదలక్ష్యమేమి సిద్ధించదు. కాబట్టి అర్థజ్ఞానం ఉండి తీరాలి అన్నాడు. "అర్థం తెలియకుండా వేదపారాయణ చేసేవాడు అందులో ఏముందో తెలియకుండా ఏదో బరువును

మోసేవాడు మాత్రమే. అటువంటివాడు పూలు పండ్లు ఇవ్వలేని ఎండిపోయిన చెట్టుమొద్దులాంటివాడు. "అర్థం తెలుసుకుని పారాయణ చేస్తే అన్ని పాపాలను పోగొట్టుకుని శుభాన్ని పొందుతాడు" అన్నాడు యాస్కుడు.

"వేదాన్ని మూలం మాత్రమే పారాయణ చేసేవాడు పూలు పండ్లు లేని వాక్కును సేవిస్తున్నాడు. వేదవాక్కు అనే ఆవు వాడికి ధర్మ, బ్రహ్మజిజ్ఞాస రూపమైన పాలను ఇవ్వదు. కాబట్టి అర్థం తెలియని వేదపారాయణ గారడీ వాడు సృష్టించిన మాయాగోవు లాంటిది" అని ఋగ్వేదమే చెబుతున్నది అన్నాడు సాయణుడు.

**"నార్థజ్ఞానవిహీనం చ శబ్దస్యోచ్చారణం ఫలతి**
**భస్మని వహ్నివిహీనేన నప్రక్షిప్తం హవిర్జ్వలతి"**

అగ్ని లేని చోట పడేసిన కట్టెలు మండవు. నిప్పులేనిబూడిదలో పోసిన ఆజ్యము మండదు. అలాగే అర్థం తెలియని వేదపారాయణ ఫలితానివ్వదు.

**అర్థజ్ఞాన మజానానాం నానావిధ శబ్దమాత్ర పాఠవతామ్**
**ఉపమేయశ్చక్రీవాన్ మలయజభారస్యవోఢైవ**

అర్థజ్ఞానం లేకుండా పారాయణ చేస్తే, గాడిద మీద సువాసన వెదజల్లే గంధపు చెక్కలు వేసి తీసుకు వెడితే గాడిదకు ఏ రకమైన ఉపయోగం ఉంటుందో అదే ఉపయోగం పారాయణ చేసేవాడికి ఉంటుంది.

ఇంకో రకంగా చెప్పాలంటే సి.డి. ప్లేయర్‌లో సిడిని పెట్టి వేదపారాయణ చేయిస్తే ఆ ప్లేయరుకు ఎంత ఫలితముంటుందో, అంతే ఫలితం అర్థం తెలియకుండా వేదపారాయణ చేసే వాడికి

ఉంటుంది. కాబట్టి అర్థం తెలుసుకుని మాత్రమే వేదపారాయణ చెయ్యాలి.

మొత్తంమీద వీటన్నింటినీ పరిశీలిస్తే, అర్థం తెలుసుకుని మాత్రమే వేదపారాయణ చెయ్యాలి నిజమే కాని అర్థం తెలుసుకోవటం అంత సులువుకాదు కదా? ఇలాంటి సమయంలో మధ్యే మార్గంగా ఒక పని చెయ్యవచ్చు. **తాను చదివే సూక్తాలకి పూర్తిగా అర్థం తెలియకపోయినా కనీసం అందులోని విషయం ఏమిటో తెలుసుకుంటే ప్రస్తుత కాలానికి సరిపోతుంది.**

అయితే అర్థం తెలియకుండా వేదపారాయణ చేస్తే ప్రయోజనం ఉంటుందా అనేది ప్రశ్న. ఉంటుంది. పారాయణ చేసినంత మాత్రం చేతనే ఫలితముంటుంది. కాని అర్థం తెలుసుకుని పారాయణ చేస్తే ఫలితము ఇంకా ఎక్కువగా, సంపూర్ణంగా ఉంటుంది.

# 6. వేదానికి స్వరం అవసరమా?

వేదాన్ని పుస్తకం చూసి చదవటానికి లేదు. తప్పనిసరిగా గురుముఖతః మాత్రమే నేర్చుకోవాలి. ఎందుకంటే దానికి స్వరం ఉంటుంది. ఈ స్వరము 5 రకాలుగా ఉంటుంది.

1. అనుదాత్తము : అక్షరానికి క్రింద అడ్డగీత ఉంటుంది. అంటే ఆ అక్షరాన్ని నొక్కి క్రిందకి పలకాలన్న మాట.
2. ఉదాత్తము : అక్షరానికి ఏ గుర్తూ ఉండదు. మామూలుగా పలకాలి.
3. స్వరితము : అక్షరానికి పైన నిలువు గీత ఉంటుంది. అంటే ఆ అక్షరాన్ని పైకి పలకాలి.
4. దీర్ఘస్వరితము : అక్షరానికి పైన రెండు నిలువు గీతలు ఉంటాయి. అంటే ఆ అక్షరాన్ని పైకి దీర్ఘంగా పలకాలి.
5. ప్లుతము : ఈ అక్షరాన్ని క్రిందికీ, పైకీ, క్రిందికీ పలకాలి.

వేదాధ్యయనం చేసేటప్పుడు వేదాన్ని ఎలాపలకాలి అనే విషయం తైత్తిరీయోప నిషత్తులోని శిక్షావల్లిలో వివరించారు. స్వరాన్ని బట్టి అర్థం మారుతుంది. ఉదాహరణకి చిన్నపిల్లవాణ్ణి రమ్మని పిలుస్తాం. “నాన్నా! రారా!” ఇదే మాటని ప్రేమగాను, కోపంగానూ కూడా పలుకుతాం. కేవలం స్వరం తేడా అంతే. అర్థం మాత్రం మారిపోతుంది. అలాగే వేదంలో కూడా స్వరాన్ని పట్టి అర్థం మారిపోతుంది.

కృష్ణయజుర్వేదంలోను, శుక్లయజుర్వేదంలోను కొన్ని మంత్రాలు ఒకటే. కాని స్వరం వేరు. ఈ కారణంచేత అర్థం కూడా వేరుగానే ఉంటుంది. కాబట్టి స్వరం గనక సరిగా లేకపోతే సరైన ఫలితం రాకపోగా విపరీతఫలితం కూడా వస్తుంది.

ఇక్కడ చిన్నమంత్రం చూడండి. ఇంద్రుడి మీద విజయం సాధించటం కోసం వృత్రాసురుడు హోమం చేస్తున్నాడు. **ఇంద్రశత్రుర్వర్ధస్య.** అని మంత్రం. ఇంద్రశ్శత్రుః అంటే ఇంద్రునికి శత్రువు. ఇంద్రుని చంపేవాడు వర్ధిల్లాలి. ఋత్విక్కులు చదివేటప్పుడు మంత్రంలో మొదట ఉదాత్తం చెప్పారు. దీంతో తత్పురుష సమాసం రావలసింది పోయి బహువ్రీహి వచ్చింది. అప్పుడు 'ఇంద్రుడు చంపేవాడుగా ఎవరికి ఉన్నాడో వాడి శత్రువు' అని అర్థం వచ్చింది. ఇంద్రుడు చంపేవాడు వృత్రాసురుడు. అతడి శత్రువు ఇంద్రుడు. కాబట్టి ఇంద్రుడు వర్ధిల్లాలి అని మంత్రార్థం. కేవలము స్వరము తేడా రావటంతో వృత్రాసురుడు వర్ధిల్లాలి అనటానికి బదులుగా ఇంద్రుడు వర్ధిల్లాలి అని అర్థంవచ్చే మంత్రంతో హోమం చేశారు. ఇంద్రుడి బలం పెరిగింది వృత్రాసురుడు నశించాడు. కాబట్టి వేదమంత్రాలు నేర్చుకునేటప్పుడు గురుముఖతః మాత్రమే నేర్చుకోవాలి. ఈ విషయం చాలా ముఖ్యమైనది. అయితే నేను మొన్న 2013 డిసెంబరులో ఒకసారి నెల్లూరు దగ్గర ఉన్న పెనుశిలకోన వెళ్ళాను మాతా విజయేశ్వరీదేవి (కరుణామయి) దగ్గరకు. వారు అమెరికా వాళ్ళని తీసుకువచ్చి ఇక్కడ యోగా, భారతీయ సంప్రదాయాలు నేర్పుతుంటారు. ఆ రోజున వాళ్ళంతా అక్కడ కూచుని వేదం నేర్చుకుంటున్నారు. మాతాజీ ముందుగానే వేదపండితులతో వేదాన్ని సంత చెప్పించి రికార్డు చేయించారు. ఆ రికార్డు పెట్టుకుని వీళ్ళంతా సంత  చెబుతున్నారు.

ఇది కూడా ఒక రకంగా గురుముఖతః నేర్చుకుంటున్నదే.

**మననాత్త్రాయత ఇతి మంత్రః**

అంటోంది మంత్రశాస్త్రం. మననం చేసే వాణ్ణి రక్షించేదే మంత్రము. **విహితార్థాభిదాయకః మంత్రః** విధించబడ్డ అర్థాన్ని చెప్పేదే మంత్రము. నిరుక్తంలో **మంత్రామననాత్** అన్నారు. **మనన హేతుః మంత్రః** మననం చెయ్యటానికి హేతువయింది మంత్రము. ఈ రకంగా మంత్రానికి అనేక నిర్వచనాలున్నాయి. "యజ్ఞయాగాది కర్మలు చేస్తూ వాటి స్వరూపాన్ని స్మరించటం కోసం ప్రత్యేకంగా ఉచ్చరించే శబ్దాలేమంత్రాలు" అన్నారు. వేదంలో సంహిత భాగానికే మంత్రభాగము అని పేరు. ఈ మంత్రాలు ఋక్కులు, యజస్సులు, సామాలు అని మూడు రకాలు. దేనిచేత దేవత స్తుతించబడుతుందో అది ఋక్కు అనబడుతుంది. ఋక్కు అంటే స్తుతి అని అర్థం. అర్థాన్ని బట్టి పాదవ్యవస్థ గలది ఋక్కు అన్నాడు జైమిని. పాదబంధంతో, వృత్త బంధంతోఉన్న అర్థయుక్తమైన మంత్రము ఋక్కు అనబడుతుంది. అన్నాడు విష్ణుమిత్రుడు. దేవతలను పూజించటానికి, వారికి హవిస్సు లర్పించటానికి ఉపయోగించే మంత్రాలే యజస్సులు, ఛందోబద్ధం కానివి, గాన యోగ్యత లేనివి యజస్సులు.

సామ – అంటే గానము అని అర్థం. ఋక్కులే రాగబద్ధంగా గానం చెయ్యబడితే సామాలు అనబడతాయి.

సాయణుడు మంత్రాలను 9 రకాలుగా చెప్పాడు.

1. అనుష్టానస్మారకాలు
2. స్తుతిరూపాలు
3. యుష్మచ్ఛబ్దాంతాలు

6. విచారరూపాలు
7. పరిదేవన రూపాలు
8. ప్రశ్న రూపాలు

4. అమంత్రణరూపాలు

5. ప్రైషరూపాలు

9. సమాధానరూపాలు

కాని ఉవటుడు మంత్రాలు 13 రకాలు అన్నాడు. అలాగే శాబరభాష్యంలో కూడా మంత్రాలు 13 రకాలు అన్నారు. ఇలా మంత్రవిభాగం ఒక్కొక్కరి దృష్టిలో ఒక్కొక్క విధంగా ఉన్నది.

**మంత్రానికి శక్తి ఉన్నదా ?** ఇది ఈ రోజున అందరికీ ఉన్న అనుమానమే. లౌకికంగానే ఆలోచించండి. మంత్రము అంటే మాటే. మాటే మంత్రము. మనం ఎవరినైనా పిలిస్తే అతడు వస్తున్నాడు కదా. మరి అలాటప్పుడు దేవత మాత్రం ఎందుకు రాదు? అయితే మంత్రానికి శక్తి లేదు. అని వాదించే వారు చాలామంది ఉన్నారు. వాళ్ళకి నేను చెప్పే సమాధానం ఒక్కటే. "నేను వెధవని. ఎందుకూ పనికి రాను. నాకు ఏమీ చేతకాదు" ఇదే మంత్రం. ప్రతిరోజూ క్రమం తప్పకుండా ఏకాగ్రతతో ఈ మంత్రాన్ని ఒక గంట జపం చేసి చూడండి. ఒక సంవత్సర కాలం చెయ్యండి. ఫలితం ఏమిటో మీకే తెలుస్తుంది. మంత్రానికి శక్తి ఉన్నదో లేదో మీకే అర్థం అవుతుంది. జపం మంత్రం ఏకాగ్రతతో చెయ్యాలి.

మంత్రాధిదేవత స్వరూపం ఎలా ఉంటుంది? అనేది కూడా ఒక ప్రశ్నే. మంత్ర దేవతా స్వరూపాన్ని వివరించేందుకు ప్రత్యేకంగా ఒక గ్రంథం ఉన్నది. అదే **బృహద్దేవత.** దేవత మంత్రంచేత ప్రతిపాదించబడుతుంది. **'యాతేనోచ్యతే సా దేవతా'** మంత్రం చేత ఏ దేవతైతే చెప్పబడుతుందో అదే దేవత. ఇది దేవతా లక్షణము. బృహద్దేవతలో ఒకే దేవతగా పరమేశ్వరుడే ప్రతిపాదించబడ్డాడు. ఇది ఏకేశ్వరోపాసనను బలపరుస్తుంది.

# 7. వేదభాష్యాలు

భాష్యము అంటే

**సూత్రార్థో వర్ణ్యతే యత్ర పదై సూత్రానుసారిభిః**
**స్వపదానిచ వర్ణ్యంతే భాష్యం భాష్య విదోవిదుః ॥**

సూత్రాన్ని అనుసరించి, సూత్రంలోని పదాలను వివరించి చెప్పటమే భాష్యము. సూత్రాన్ని అనుసరించే వాక్యాలతో సూత్రార్థాన్ని వివరిస్తూ, సూత్రంలోని పదాలను వివరించటము.

మరి వ్యాఖ్య అంటే

**పదచ్ఛేదః పదారోక్తి విగ్రహో వాక్య యోజనా**
**ఆక్షేపస్య సమాధానం వ్యాఖ్యానం పంచలక్షణం ॥**

1. పదచ్ఛేదము, 2. ప్రతిపదార్థము 3. సమాస విగ్రహము 4. వాక్యయోజన 5. ఆక్షేపణ, సమాధానము. ఈ ఐదు లక్షణాలు గలదాన్ని వ్యాఖ్య అంటారు.

**అల్పాక్షరమసందిగ్ధం సారవద్విశ్వతో ముఖం**
**అస్థోభ మనవద్యం చ సూత్రం సూత్ర విదోవిదుః ॥**

కొద్ది అక్షరాలు మాత్రమే కలిగి, అనుమానానికి తావులేని అర్థాన్ని వివరిస్తూ, ఆకారంలో చిన్నదై ఏ విధమైన దోషములు లేని వాక్యమే సూత్రము.

శ్లోకరూపమైన సూత్రాలను కారికలు అంటారు.

మొత్తం మీద పరిశీలిస్తే భాష్యము అంటే వ్యాఖ్యాన విశేషము, వివరణ అని అర్థం. వేదాల యొక్క అర్థం తెలుసుకోవటం కోసం వేదాలకు 25 మంది భాష్యం వ్రాశారు.

**'నిరుక్తము'** అంటే – వేద నిఘంటువు. వేదంలో రహస్యంగా ఉన్న అర్థాలను ఏరి ప్రాచీన కాలంలో ఎవరో ఒక మహానుభావుడు ఒక నిఘంటువు తయారుచేశాడు. దానికి **'యాస్కుడు'** వ్యాఖ్య వ్రాశాడు. దాన్నే **నిరుక్తము** అంటారు. వేదానికి భాష్యం వ్రాసిన వారంతా ఈ నిరుక్తాన్నే ఆధారంగా తీసుకున్నారు. ఇక వేదభాష్యాలు చూస్తే

**ఋగ్వేద భాష్యము :** ఋగ్వేదానికి 11 మంది భాష్యం వ్రాశారు. షట్శాస్త్రాలలోను చెప్పిన విషయాలు ఆధారంగా వేదాలకు భాష్యం వ్రాశారు. యాస్కుని తరువాత అదే పద్ధతిలో ఋగ్వేదానికి భాష్యం వ్రాసినవాడు **స్కందస్వామి.** అంతకు ముందు కొంతమంది వేదానికి భాష్యం వ్రాశారని ఇతడు చెప్పటంవల్ల తెలుస్తోంది. కాని వాళ్ళ పేర్లు మాత్రం తెలియవు. ఇతడు యజ్ఞపరంగా ఈ భాష్యం వ్రాశాడు. స్కందస్వామికి భాష్యం వ్రాయటంలో సహాయం చేసినవాడు **నారాయణాచార్యుడు.** ఋక్సంహితలో 5, 6, 7 అష్టకాలకు కొంతవరకు భాష్యం వ్రాశాడు. వేదభాష్యకారులలో గొప్పవాడు **ఉద్గీతాచార్యుడు.** ఇతడు వ్రాసిన భాష్యం కొంతవరకే మనకు దొరుకుతుంది. ఈయన కూడా యజ్ఞపరంగానే భాష్యం వ్రాశాడు. ఆ తరువాత **హస్తామలకుడు** కూడా వేదభాష్యం వ్రాశాడు అంటారు. కాని ఇది దొరకటం లేదు. తరువాత కౌశిక గోత్రీకుడైన **వేంకట మాధవుడు** ఋక్సంహితకు భాష్యం వ్రాశాడు. ఇది యజ్ఞపరంగానే ఉంటుంది. దీని పేరు **'ఋగర్థదీపిక'.** తరువాత లక్ష్మణాచార్యుడు ఋక్సంహితకు **వేదభూషణము** అనే పేరుతో భాష్యం వ్రాశాడు. ద్వైత సంప్రదాయ ప్రవర్తకుడైన మధ్వాచార్యుడు, **ఆనందతీర్థుడు** పరమేశ్వరుడు విష్ణువే అని ప్రతిపాదిస్తూ భాష్యం వ్రాశారు. ఆ తరువాత **ఆత్మానందతీర్థుడు, ముద్గలాచార్యుడు దేవస్వామి, చతుర్వేదస్వామి** కూడా ఋక్సంహితకి

భాష్యాలు వ్రాశారు. శ్రీకృష్ణుని చరిత్ర వేదమంత్రాలలో ఉన్నది అంటాడు చతుర్వేదస్వామి.

**యజుర్వేద భాష్యాలు :**

యజుర్వేదానికి భాష్యం వ్రాసిన వారిలో అతిప్రాచీనుడు **భట్టస్వామి.** ఇతని భాష్యం ఇప్పుడు దొరకటం లేదు. యజుర్వేద భాష్యకారులలో ప్రసిద్ధుడు **భట్టభాస్కరుడు.** తరువాత **దుర్గాచార్యుడు** కూడా యజుర్వేద భాష్యం వ్రాశాడు కాని అది లభ్యం కావటం లేదు. తరువాత భోజరాజు ఆ స్థానంలో ఉన్నాడని చెబుతున్న **ఉవటుడు** ఆ తరువాత **మహీధరుడు** యజుస్సంహితకు భాష్యం వ్రాశారు. ఈ మహీధరుడే 'మంత్రమహోదధి' అనే పేరుతో తంత్రశాస్త్రం కూడా వ్రాశాడు. ఆ తరువాత **భవస్వామి, గుహదేవుడు** కూడా యజుర్వేదానికి భాష్యం వ్రాశారు.

**సామవేదభాష్యము :** అలాగే సామవేదానికి **మాధవుడు, భరతస్వామి, గుణవిష్ణువు** అనే ముగ్గురు భాష్యాలు వ్రాశారు. వీరందరూ ఒక్కొక్క వేదానికి భాష్యం వ్రాయగా రెండు మూడు వేదాలకు కలిపి భాష్యం వ్రాసిన వాళ్ళు కొంతమంది ఉన్నారు. **ధానుష్కయజ్వ** అనే పండితుడు ఋక్ యజుసామ వేదాలకు భాష్యం వ్రాశాడంటారు. కాని ఇది దొరకటంలేదు. లంకాధిపతి **రావణుడు** ఋక్ యజుర్వేదాలకు ఆధాత్యత్మికపరంగా భాష్యం వ్రాశాడు. ఆర్యసమాజ స్థాపకుడైన **స్వామిదయానంద సరస్వతి** ఋగ్వేదంలో 7వ మండలం వరకు, యజుర్వేదానికి భాష్యం వ్రాశాడు. తరువాత కొంతమంది పండితులతో భాష్యం వ్రాయించి అన్ని వేదాలకు కూడా **వైదిక ప్రచార సమితి, హైదరాబాద్** పేరుతో ఆచార్య డా॥ **మర్రి కృష్ణారెడ్డి** గారు వేదభాష్యాన్ని మనకు అందజేస్తున్నారు. దయానంద సరస్వతి ఆధునికవాది.

# 8. సాయణాచార్యుడు

అన్ని వేదాలకు సంప్రదాయబద్ధమైన భాష్యం వ్రాసిన మహానుభావుడు. ఈయన తెలుగువాడు కావటం మన అదృష్టం. మాయణాచార్యుడు, శ్రీమతి వీరి తల్లితండ్రులు. ఇతని అన్న మాధవాచార్యుడు. తమ్ముడు ప్రభాకరుడు. క్రీ.శ. 1315–1387 కాలంలో 72 సంవత్సరాలు జీవించాడు. విజయనగరాన్ని పాలించిన బుక్కప్రభువు ఆస్థానంలో పండితుడిగా, మంత్రిగా కూడా ఉన్నాడు. బుక్కరాయలు మాధవ విద్యారణ్యుణ్ణి వేదాలకు భాష్యం వ్రాయమని అడిగినప్పుడు, దానికి సమర్థుడు నా తమ్ముడైన సాయణుడు. కాబట్టి వేదభాష్యం అతడు వ్రాస్తాడు అని చెప్పాడు. బుక్కరాయల కోరిక మీద సాయణుడు వేదభాష్యంవ్రాసి తన అన్నగారైన మాధవవిద్యారణ్యుడి పేరు పెట్టాడు. దీనికే **విద్యారణ్యభాష్యము** అని పేరు. దీన్ని వ్రాసింది సాయణాచార్యుడైనా మాధవ విద్యారణ్యుడి పేరుతోనే ఈ రోజుకు కూడా పిలువబడుతోంది. సంప్రదాయవాదులకు ఇదే అత్యంత ప్రామాణికమైన భాష్యము. **నాలుగు వేదాలకు కలిపి వ్రాసిన సంప్రదాయబద్ధమైన ఆఖరు భాష్యం ఇదే.**

ఇప్పటివరకు మనం చెప్పుకున్నదంతా వేదాల పరిచయం మాత్రమే. ఈ విషయాలను ఎంతోమంది శ్రమపడి పరిశోధించి మనకు అందజేశారు. ముందుగా నా గురుదేవులైన విరజానందనాథ, సదానందనాథ, శుకానందనాథులకు నమస్కరించి, ధర్మసంస్థాపనే ధ్యేయంగా స్థాపించబడిన శృంగేరీ, పూరి, బదరీ, ద్వారక పీఠాధిపతులకు సాష్టాంగదండ ప్రణామాలాచరించి, హైందవ ధర్మ పరిరక్షణ కోసం అహరహం శ్రమిస్తున్న శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద

స్వామి వారి పాదపద్మాలకు నమస్కరించి, భగవతిమాతా విజయేశ్వరీదేవి (కరుణామయి) వారికి, మాతా శివచైతన్య వారికి, వాసుదేవానందగిరి స్వామివారికి నమస్కరించి వేదం ఏం చెబుతోంది? అనే విషయం అందరికీ తెలియాలనే ఉద్దేశ్యంతో అతిసులభశైలిలో, హరితస గోత్రీకుడనైన క్రోవి పార్థసారథి అను నేను నా గురువులకృపాకటాక్ష వీక్షణాలతో వారు అనుమతించినంత వరకు **'పార్థసారథీయము'** అనే పేరుతో ఈ **చతుర్వేద భాష్యాన్ని** వ్రాసి మీకందిస్తున్నాను. భాష్యము అంటే వ్యాఖ్యాన విశేషము, వివరణ అని అర్థం. అంతకు మించి ఇందులో ఇంకా ఏదో ఉన్నదని భావించవద్దు. దీన్ని ఉపన్యాసాలుగా కూడా చెప్పి సి.డి.లుగా కూడా మీకందరికీ అందించాలనే కోరికతో ఈ పుస్తకం వ్రాయటం ప్రారంభిస్తున్నాను. **సాయణుడు వ్రాసిన విద్యారణ్య భాష్యం తరువాత సుమారు 635 సం॥ తరువాత వస్తున్న చతుర్వేద భాష్యమిది.** తెలుగులో మొదటిసారిగా వస్తున్న వేదభాష్యమిది. నా యీ ప్రయత్నాన్ని మన్నించి పండితులు, పామరులందరూ నన్ను ఆశీర్వదింతురు గాక.

# 9. వేదము - గురుపరంపర

వేదం అంతా గురుశిష్య పరంపరగానే ప్రవర్తిల్లుతున్నది. కాబట్టి ముందుగా గురువును చూద్దాం.

జీవితంలో నీకు కావలసిన విషయాన్ని వివరించి చెప్పేవాడు, నీకు మంచి మార్గం చూపి ఫలితాన్ని సాధించేలా తోడ్పడేవాడు 'గురువు'

'నీకు కావలసిన విషయాన్ని' అంటే నువ్వు కోరుకున్న మంచి విషయాన్ని అనే కాదు, నీకు అవసరమైన విషయం, నీకు బాగా ఉపయోగించే విషయం అని అర్థం. ఈ రకంగా చూస్తే 1. లౌకిక గురువు 2. పారలౌకిక గురువు అని రెండు రకాలవాళ్ళు ఉంటారు. జీవితంలో బ్రతకటానికి అవసరమైన విద్యను నేర్పే గురువునే 'లౌకిక గురువు' అంటాము. ఎవరికైనా మొట్టమొదటి గురువు తల్లి. తరువాత తండ్రి. వీరిద్దరి తరువాతే గురువు స్థానం. అందుకే **'మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ'** అన్నారు. ప్రతిప్రాణికీ జీవితంలో అనేకమంది గురువులు ఉంటారు. చిన్నప్పుడు 'ఓనమాలు' దిద్దించేవాడు గురువు. ఆ తరువాత ప్రతి సంవత్సరము ఒక క్లాసు పెరుగుతున్న దగ్గర నుంచీ పాఠాలు చెప్పేవారు మారుతుంటారు. హైస్కూలులో, కాలేజీలో, యూనివర్శిటిలో పాఠాలు చెప్పిన వారందరూ మనకు గురువులే. పిహెచ్.డి చేస్తే అక్కడ మన 'గైడు' కూడా మన గురువువే. లోకంలో మంచి విషయాలు, మనకి కావలసిన విషయాలు, మనం ఎదగటానికి ఉపయోగించే విషయాలు చెప్పేవారందరూ మనకు గురువులే. మానవుడు అనేక విషయాలను ప్రకృతి నుంచి, పరిసర ప్రాంతాల నుంచి నేర్చుకుంటాడు. వీరందరూ గురువులే. వీళ్ళందరూ లౌకిక గురువులు. అలాగే మనకి మంత్రోపదేశం చేసేవాడు గురువు.

ఆ మంత్రానికి అర్థం వివరించి చెప్పేవాడు, చతుర్విధ పురుషార్ధాలను సాధించటానికి అవసరమైన విషయాలు చెప్పేవాడు. మోక్షసాధనకు మార్గం చూపేవాడు. వీరందరూ గురువులే. అందుకే దత్తాత్రేయుడు యదుమహారాజుతో అంటాడు 'ఓ మహారాజా! నాకు 24 మంది గురువులున్నారు. విచిత్రమేమంటే వీరిలో ఒక వేశ్యకూడా ఉంది. ఆవిడకూడా నాకు గురువే అంటాడు. రామకృష్ణ పరమహంస నాకు ఐదుగురు గురువులున్నారు అని చెబుతూ వారిలో చేపలకోసం కొలనులో ఒంటికాలిమీద నుంచున్న కొంగ, చేపలు పట్టేవాడు కూడా నా గురువులే అంటాడు.

మానవుడు ఎన్ని రకాల విద్యలు నేర్చుకున్నా, ఎన్ని పదవులు చేపట్టినా, జీవితంలో ఎంత గౌరవం పొందినా అతడికి కావలసింది మనశ్శాంతి. అది లేకపోతే జీవితంలో ఏం సాధించినా ఒకటే. చివరి రోజుల్లో బట్టలు చింపేసుకుని, పిచ్చెక్కి రోడ్లమీద తిరుగుతాడు. జీవితంలో డబ్బు సంపాదించటమే ముఖ్యంకాదు. ఇక్కడ ఒకచిన్న ఉదాహరణ. నాకు బాగా తెలిసిన వ్యక్తి డబ్బులు బాగా సంపాదించాడు. తింటే అయిపోతుంది అని సరిగా తినేవాడు కాదు. కంటినిండా నిద్రకూడా పోయి ఎరగడు. కోట్లుకూడపెట్టాడు. కాని 56 సం॥ కూడా పూర్తి కాకుండానే మతిమరుపు జబ్బు పట్టుకుంది. బాగున్నరోజుల్లో తాళాలు బొడ్డున కట్టుకు తిరిగేవాడు. ఏ రోజు వెచ్చాలు ఆరోజు లెక్క పెట్టి ఇంట్లో ఇచ్చి మిగిలినవి బీరువాలో పెట్టి తాళం వేసుకునే వాడు. ఎవర్నీ నమ్మేవాడు కాదు భార్యనికూడా. భార్యని ఇంట్లో పెట్టి తాళం వేసి బయటకు వెళ్ళేవాడు కాని చివరిదశలో ఆస్థుల వ్యవహారాలు అన్నీ భార్యే చూసు కోవలసి వచ్చింది. వంటిమీద బట్టలుకూడా లేకుండా బయటకి వెళ్ళిపోయేవాడు. ఏదీ గుర్తుండదు. చివరకు గొలుసులతో కట్టేసి గదిలో పెట్టారు. అన్నంకూడా తినే

వాడు కాదు. ఒకసారి నేను వెళ్ళినప్పుడు నన్ను గుర్తు పట్టాడు. చచ్చిపోవాలనిపిస్తోంది అంటూ ఏడ్చాడు. పాపం ఎలాంటివాడైనా ఇలాంటి పరిస్థితి మాత్రం పగవాడికి కూడా రాకూడదు. చివరకి సరైన తిండి లేక, మనశ్శాంతి లేక అరవై సంవత్సరాలు కూడా నిండకుండానే వచ్చిపోయాడు. ఆ రోజున చూడటానికి వెళ్ళాను. చాలా భయంకరంగా ఉన్నాడు. ఎముకలగూడు తప్ప ఇంకేమీ లేదు. ఒక డొక్కు సైకిలు, బుజంమీద టవలుతో విజయవాడ వచ్చాడు. కోట్లరూపాయలు సంపాదించాడు. చివరకు మనశ్శాంతి లేక ప్రత్యక్ష నరకం చూసి మరీ మరణించాడు. డబ్బేప్రాణం అనుకునే వారందరికీ ఒక ఉదాహరణగా మిగిలిపోయాడు. ఈ మనశ్శాంతి కావాలంటే మనక్కావలసింది **భూమావిద్య.** అదే బ్రహ్మవిద్య. అంత గొప్పవాడైన నారదుడిక్కుడా మనశ్శాంతి లేదు అన్నప్పుడు సనత్కుమారుడు భూమావిద్యను ఉపదేశించాడు ఛాందోగ్యోపనిషత్తులో. ఆ విషయాన్ని గతంలో మనం చెప్పుకున్నాం. అందుకే “ఏ మహానుభావుడు జీవితంలో నీకు బాగా గుర్తుంటాడో, ఎవరిరూపం నీమనసులో సదానిలచిపోతుందో, అవసరమైనప్పుడు ఎవరు నీకు సన్మార్గాన్ని ఉపదేశిస్తారో, ఎవరి దగ్గరకు వెళ్ళినంత మాత్రం చేత నీకు మనశ్శాంతి లభిస్తుందో, ఎవరిమీద నీకు విపరీతమైన నమ్మకము, అచంచలమైన విశ్వాసము ఉంటాయో అతడే నీకు గురువు. సర్వకాలసర్వావస్థల యందు శిష్యుడికి సన్మార్గాన్ని బోధించి తరుణోపాయం చూపేవాడే గురువు.”

మనకు మొత్తం 7 రకాల గురువులున్నారు.

1. సూచక గురువు – చదువు చెప్పేవాడు
2. వాచక గురువు – కులధర్మాలు, ఆశ్రమ ధర్మాలు బోధించేవాడు

3. బోధక గురువు – మహామంత్రాలు ఉపదేశించేవాడు

4. నిషిద్ధ గురువు – వశీకరణ, మారణ, ప్రయోగాలు నేర్పేవాడు

5. విహిత గురువు – లౌకిక విషయాలమీద, విషయభోగాల మీద విరక్తి కలిగించేవాడు

6. కారణగురువు – జీవబ్రహ్మైక్యాన్ని బోధించేవాడు

7. పరమ గురువు – జీవాత్మ పరమాత్మల గురించి చెప్పి మోక్షమార్గాన్ని చూపేవాడు

ఇక్కడ గురువుకు, వేదానికి సంబంధం ఏమిటి? అనే ప్రశ్న వస్తుంది. వేదం అంతా కూడా ఆరోజునుంచి ఈరోజువరకు గురుశిష్యపరంపరగానే చెప్పబడుతోంది. గురువుగారు తన శిష్యులకి, ఆ శిష్యులు తమ శిష్యులకి, వారు తమ శిష్యులకీ ఇలా ఒకరి నుంచి ఒకరికి చెప్పబడుతోంది వేదం. వేదంలో స్వరము ఉంటుంది. కాబట్టి వేదాన్ని ఎవరూ పుస్తకం చూసి చదవటానికి లేదు. పదాలు ఎలా పలకాలి అనేది తప్పనిసరిగా గురువుగారి ముఖతః నేర్చుకుని తీరాల్సిందే. వేదం చదివేటప్పుడు స్వరం గనక తప్పుపోతే అర్థం మారిపోతుంది. వృత్రాసురుడు ఇంద్రుణ్ణి జయించటం కోసం యాగం చేశాడు. ఆ సమయంలో ఋత్విక్కులు స్వరం తప్పుగా పలకటంవల్ల వృత్రుడికి లభించాల్సిన విజయం ఇంద్రుడికి లభించింది. అలాగే దేవీ భాగవతంలో సత్యవ్రతుడు కథ. ఇలా చెప్పుకుంటూ పోతే అనేక ఉదాహరణలు. కాబట్టి వేదంలో గురువు ప్రాముఖ్యత ఎనలేనిది.

**శరీరం సురూపం తథావాకళత్రం యశశ్చారు చిత్రం ధనం మేరుతుల్యం।**

**మనశ్చేన లగ్నం గురోరంఘ్రిపద్మే తతఃకిం తతః కిం తతః కిం తతః కిం॥**

ఆరోగ్యవంతమైన అందమైన శరీరమున్నా, అందమైన భార్య ఉన్నా, కీర్తిప్రతిష్ఠలు, ధనధాన్యాలు ఎన్ని ఉన్నా గురువుయొక్క కృపాకటాక్ష వీక్షణాలు లేకపోతే ఏమీ ఉపయోగం లేదు అన్నారు శంకర భగవత్పాదుల వారు గుర్వష్టకంలో

స్కాందపురాణంలో 275 శ్లోకాలతో **'గురుగీత'** చెప్పబడింది. అందులో **'తస్మైశ్రీ గురవే నమః'** అనే మకుటంతో వచ్చే 28 శ్లోకాలు గురుమాహాత్మ్యాన్ని వివరిస్తున్నాయి. గురుగీతమీద నేను ఉపన్యాసం ఇచ్చాను. అది సి.డి.గా కూడా దొరుకుతుంది. కావలసిన వాళ్ళు తీసుకుని వినవచ్చు. మనం పిల్లలకి చిన్నప్పుడు నేర్పించే

**గురుర్బ్రహ్మ గురుర్ విష్ణుః గురుర్ దేవో మహేశ్వరః ।**
**గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మైశ్రీ గురవే నమః ॥**

అనే శ్లోకం కూడా గురుగీతలోదే. ఇందులో గురువు త్రిమూర్తి స్వరూపుడు. గురువే పరమేశ్వరుడు. అటువంటి గురువుకు నమస్కారము. గురువు త్రిమూర్తి స్వరూపుడు ఎందుకవుతున్నాడు? బ్రహ్మదేవుడు సృష్టికర్త. శిష్యుడి హృదయంలో జ్ఞానము అనే బీజాన్ని నాటతాడు కాబట్టి గురువు బ్రహ్మ అనబడతాడు. విష్ణువు స్థితికారకుడు. శిష్యుని మనసులో నాటబడిన జ్ఞానబీజాన్ని పెంచి జాగ్రత్తగా పోషిస్తాడు. అందుకే అతడు గురువు అనబడతాడు. లయకారకుడు రుద్రుడు. ఇక్కడ మహేశ్వరుడు అంటే లయకారకుడైన రుద్రుడు అని అర్థం. శిష్యుని హృదయంలో ఉన్న అజ్ఞానాన్ని లయం చేస్తాడు కాబట్టి అతడు ఈశ్వరుడు అనబడతాడు. అంతిమంగా మోక్షమిచ్చేది

పరమేశ్వరుడు, ఆ మోక్షమార్గాన్ని చూపేది గురువు. అందుకే అతడు సాక్షాత్తు పరబ్రహ్మ అనబడతాడు. అటువంటి గురువుకు నేను నమస్కరిస్తున్నాను. గురుగీతలోనే మూడు శ్లోకాలు ఉన్నాయి. అవి

**స్థావరం జంగమం వ్యాప్తం । యత్కించిత్సచరాచరం ।**
**తత్పదం దర్శితం యేన । తస్మైశ్రీ గురవే నమః ॥**
**అఖండమండలాకారం । వ్యాప్తం యేన చరాచరం**
**త్వం పదం దర్శితం యేన । తస్మైశ్రీ గురవే నమః ॥**
**చిన్మయం వ్యాపితం సర్వం । త్రైలోక్యం స చరాచరం**
**అసిత్వం దర్శితం యేన । తస్మైశ్రీ గురవే నమః ॥**

ఈ మూడు శ్లోకాలలోను కూడా తత్పదం, త్వం పదం అసిత్వం అంటే **తత్త్వమసి మహావాక్యం** గురించి చెబుతున్నాడు. మహావాక్యాలు నాలుగు. వాటిలో 'తత్త్వమసి' అనే మహావాక్యానికి అర్థం తెలుసుకుంటే, మిగిలిన మూడింటికీ అర్థం తేలికగా తెలుస్తుంది. ఈ కారణం చేతనే 'తత్త్వమసి' అనే మహావాక్యార్థాన్ని వివరించి చెప్పి, పరమేశ్వర స్వరూపాన్ని సాక్షాత్కరింపచేసేవాడు. అటువంటి గురువుకు నమస్కారము. అంటున్నాడు ఈశ్వరుడు పార్వతీదేవితో. అటువంటి గురువు గనక మనల్ని కరుణిస్తే జరగనిది అంటూ ఏదీ లేదు.

**మూకం కరోతు వాచాలం పంగుం లంఘయతే గిరిం**
**యత్కృపదామహం వందే**

**దేవదేవ నీదుమహిమ పరుగుతీయు కుంటివాడు**
**మాతయౌనుగొడ్రాలే... నటనసూత్రధారీ ।**

ఆయన కృపగనకఉంటే కుంటివాడు పరుగులు తీస్తాడు. మూగవాడు మాట్లాడతాడు. అందుకే గురుకృప సంపాదించాలి.

ఒకసారి ఒక తను నా దగ్గరకి "స్వామీ ! పంచదశి మహామంత్రానికి అర్థం కావాలి" అన్నాడు. "ఏమయ్యా! మీ గురువు గారున్నారు కదా? ఆయన్నే అడగచ్చు కదా?" అన్నాను. "లేదండీ ! మా గురువుగారికి ఏమీ తెలియదు. నేనిప్పటికి రెండు సంవత్సరాలుగా ఆయనకు ఊడిగం చేస్తున్నాను. మంత్రానికి అర్థం మాత్రం నాకు చెప్పలేదు. ఆయనకి తెలిస్తే చెప్పేవాడు కదా. ఆయనకి కూడా తెలియదు. అందుకే మీ దగ్గరకు వచ్చాను" అన్నాడు. ఒక్క క్షణం ఆగి నువ్వు జపం చేస్తున్నావా? ఎలా చేస్తున్నావు? అని అడిగాను. దానికి అతను ప్రతిరోజు ఉదయం 108సార్లు చేస్తాను అన్నాడు. కనీసం పదిలక్షలయినా జపం చేసి నా దగ్గరకు రా ! మంత్రానికి అర్థం అప్పుడు చెబుతాను అన్నాను. ఇది జరిగి రెండు సంవత్సరాలు దాటింది. ఇంతవరకు మళ్ళీ అతను నాకు కనిపించలా?

ఇక్కడ ఒక్క విషయం చూడండి. మా గురువుగారికేమీ తెలియదు. ఆయనకేమీ రాదు. ఏదో మంత్రం మాత్రం చేసుకుంటాడు అంతే. తనకే తెలియనివాడు నాకేం చెబుతాడు? ఇది అతడి భావన. ఇక్కడ మనం గుర్తించవలసిన విషయాలు కొన్ని ఉన్నాయి. గురువంటే అమితమైన భక్తి గౌరవం ఉన్నవారికే మంత్రం చెప్పాలి. ఇతరులకు కాదు. గురువుమీద అచంచలమైన విశ్వాసం ఉండాలి. ఆయన దగ్గర మనకి చనువు ఉన్నది కదా అని చులకనగా చూడరాదు. ఆయన చెబితే వినాలి. లేకపోతే మాట్లాడకుండా కూర్చోవాలి అంతే.

గురువుగారిమీద అచంచలమైన భక్తి, విశ్వాసము ఉండాలి. గురువుగారి కన్న సంఘంలో నేను ఎక్కువ స్థాయిలో ఉన్నాను అనో, ధనవంతుణ్ణి అనో అహంకరించరాదు. అలాంటి వాణ్ణి శిష్యుడుగా అంగీకరించరాదు.

ఒకసారి మధ్యాహ్నం పన్నెండు గంటల సమయం. నేను కాలేజినుంచి అప్పుడే వచ్చాను. ఎవరో ఇద్దరు వ్యక్తులు వచ్చారు లోపలికి. వారి చేతుల్లో ఏవో సంచూలున్నాయి. వాటిని టేబులుమీద పెట్టారు. గురువుగారు వస్తున్నారు. అని చెప్పి చేతులు కట్టుకుని నుంచున్నారు. ఇంతలో ఒకాయన. యాభై సంవత్సరాల లోపు వయసుంటుంది. తెల్ల పంచె మడతవేసి లుంగీగా కట్టుకున్నాడు. చొక్కా లేదు. ముఖాన విబూధి, కుంకుమ. మెడలో రుద్రాక్షలు, లావుగా, తెల్లగా ఉన్నాడు. లోపలికి వచ్చాడు. 'నమస్కారం రండి' అన్నాను. ఎవరో తెలియదు. గురువుగారు అన్నారు. నేను కూర్చున్న కుర్చీలోంచి లేచి 'కూర్చోండి' అన్నాను. ఆ కుర్చీలోనే కూర్చున్నారాయన. ఇంతకీ విషయం ఏమంటే – ఆయనకి అమ్మవారికి సంబంధించిన మంత్రాలు కావాలి. చాలామంది దగ్గరకు వెళ్ళాడు. వాళ్ళకీ, ఆయనకీ కుదరలా. గడచిన రాత్రి అమ్మవారు కలలో కనిపించి నా దగ్గరకు వెళ్ళమన్నదట. అందుకని వచ్చాడట. ఆయన హైదరాబాదుకు నలభైకిలోమీటర్ల దూరంలో ఒక ఆశ్రమం కూడా నడుపుతున్నాడు. చుట్టుప్రక్కల వారందరికీ ఉపదేశాలు చేస్తాడు. పూజలు చేయిస్తాడు. కాని విచిత్రమేమంటే తనకి ఏ ఉపదేశములేదు. తనకు మంత్రం కావాలి. మంచి గురువుకోసం వెతుకుతున్నాడు. అమ్మవారు నా దగ్గరకు వెళ్ళమంది వచ్చాడు. నేను తిథి వారాలు చూసి నాలుగు రోజుల తరువాత శుక్రవారం నాడు ఉదయం 6–00 – 6–30 గం॥ల మధ్యన గాని, మధ్యాహ్నం 11–30 – 12–00 గం॥ మధ్యన గాని రమ్మన్నాను. విజయవాడలో తనకు శిష్యులున్నారట. గురువారం రాత్రే విజయవాడ వస్తాను. శుక్రవారం ఉదయం మీ దగ్గరకు వస్తాను అని చెప్పి వెళ్ళిపోయాడు. మనిషిలో ఎక్కడా వినయ విధేయతలు లేవు. పైగా కూర్చోమనగా నేను కూర్చునే కుర్చీలో కూర్చున్నాడు. నా దగ్గర మంత్రం

చెప్పుకోవటానికి వచ్చినవాడు క్రిందనే కూర్చోవాలి అలా చెయ్యాలా.

శుక్రవారం వచ్చింది. ఉదయమే వస్తా అన్నాడు. రాలేదు. మధ్యాహ్నం పదకొండున్నర, పన్నెండు, ఒంటిగంట అయింది. అప్పుడు ఫోన్ చేశాడు మాచర్ల దగ్గర ఉన్నాను. ఇంకో అరగంటలో వస్తాను అని రెండు గంటలకు వచ్చాడు. నేను మంత్రం చెప్పలా. సమయం దాటిపోయింది. అని చెప్పాను. కోపంగా వెళ్ళిపోయాడు. అతనికి శ్రద్ధ, భక్తి లేవు. అందుకే మంత్రం చెప్పలా.

**'సుతుడైన హితుడైన సోదరుండైన కులహీనుడైనను కొలవవలయు'**

**'గురుడు బోధింపనెంచిన అరుగరాదు.'**

**'అతడు బోధింపకుండిన అడుగరాదు.'**

**'గురునింద వినరాదు కూడి సేయగరాదు గురునకప్రియమును కూర్చరాదు'**

ఇక్కడ విషయం ఏమంటే అసలు మీ గురువుకు ఏమీ తెలియనవసరం లేదు. గురువుగారికి గురువుగారు, వారి గురువుగారు ఇలా ఉంటారు. మనం జపం చేసేటప్పుడు వారిలో ముగ్గురు వరకు చెప్పుకుంటాం. వారినే 'గురుత్రయము' అంటాం. ఈ ముగ్గురే కాదు. గురుమండలము అనేది ఉంటుంది. వీళ్ళు కొన్నివేలమంది, లక్షలమంది ఉంటారు.

**ఆదినాథసమారంభాం శంకరాచార్యమధ్యమాం**
**అస్మదాచార్య పర్యంతాం వందే గురుపరంపరాం ॥**

ఈ పరంపరలో మొదటివాడు ఆదినాథుడు. ఆయనే పరమేశ్వరుడు. అక్కడి నుంచి శంకరాచార్యుల వారు ఆ తరువాత

నీకు మంత్రోపదేశం చేసిన గురువు. ఈ మధ్యలో ఎంతమంది ఉన్నారో చూడండి. ఇదంతా గురుపరంపర. మరి వీళ్ళంతా ఎక్కడున్నారు.

**జీవన్ముక్తాః చరంతేతే త్రిషులోకేషు సర్వదా ।**

జీవన్ముక్తులై ముల్లోకాలలోను తిరుగుతుంటారు. వీళ్ళనే పవిత్రమైన ఆత్మలు, ముక్తాత్మలు అంటారు. అలా తిరుగుతూ ఎవరైనా మంచిపని చేయాలనుకున్నప్పుడు ఆ పనిలో వారికి సహకరిస్తుంటారు. నారదుడు ఈ రకమైన పవిత్రాత్మ. ముక్తాత్మ. కాబట్టి ఇక్కడ గురువు అంటే కేవలము ఒక వ్యక్తి కాదు. అది ఒక శక్తి. అదే పరమేశ్వర స్వరూపము. ఏవైనా గొప్ప నులు చెయ్యాలంటే ముందుగా గురువు అనుగ్రహం కావాలి.

వ్యాసభగవానుడు బ్రహ్మసూత్రాలు వ్రాయాలి అనుకున్నప్పుడు ముందుగా బదరికావనానికి వెళ్ళి అక్కడ తీవ్రమైన తపస్సు చేసి పరమేశ్వర సాక్షాత్కారం పొంది, తరువాత బ్రహ్మసూత్రాలు వ్రాశాడు. నేనుకూడా 'చతుర్వేద భాష్యం' వ్రాయలని సంకల్పించినప్పుడు నాకు తెలియకుండానే 4-3-2014 నుంచి 29-3-2014 వరకు **అతిరుద్రమహాయాగం** చేశాను. ప్రతిరోజు ఉదయం 8 గం॥లకు కూర్చుంటే సాయంత్రం 6 గం॥కు అయ్యేది. రోజూ 66 సార్లు నమకం హోమం జరిగేది. రుద్రము అంటేనే 11 అని అర్థం. ఏకాదశ రుద్రము అంటే 11 × 11 = 121. అతిరుద్రము 11 × 11 × 11 వెరసి 1331 సార్లు నమకాన్ని హోమం చెయ్యటం. దీన్ని నేను ఒక్కడినే పూర్తిచేసి 30-3-2014న పూర్ణాహుతి చేశాను. ఆ తరువాత 4-4-2014 జయనామ సంవత్సర చైత్రశుద్ధ పంచమి శుక్రవారం రోహిణీ నక్షత్రం ఉదయం ఈ పుస్తకం వ్రాయటానికి శ్రీకారం చుట్టాను. 7-7-2014న పుస్తకం పూర్తయింది.

ఇక్కడ మళ్ళీ ఒకచిన్న అనుమానం వస్తుంది. గురుమండలము, గురుపరంపర ఇవన్నీ ఉన్నాయా? వీళ్ళు మనకి కనిపిస్తారా? అని ఇవన్నీ నిజంగానే ఉన్నాయి. ఆ మహానుభావులందరినీ ప్రత్యక్షంగా దర్శించాను నేను. ఇక్కడ నా అనుభవాన్ని చెప్పటం చాలా ముఖ్యం. 2009 సంవత్సరం **'సహస్రచండీయాగం'** చేశాను. ఆ యాగం 1-3-2009 నుంచి 19-12-2009 వరకు సాగింది. ప్రతిరోజూ 4 చండీ హోమాలు జరుగుతాయి. అప్పుడు కూడా నేను ఒక్కడినే హోమాలన్నీ చేస్తుండేవాడిని. ఆ రోజుల్లో గురుమండలాన్ని దర్శించాను. ముందు నాకు తెలియలేదు. ఎవరిదో ఆత్మ ఇలా వచ్చికూచుంది అనుకున్నాను. ఆ మరునాటి నుండి సామాన్యంగా ప్రతిరోజూ ఎవరో ఒకరు వస్తుండేవారు. అందులో కొంతమంది ఆడవాళ్ళు కూడా ఉన్నారు. ఒక్కొక్క రోజు చాలామంది వచ్చేవాళ్ళు. యజ్ఞకుండం చుట్టూ కూచుని చూస్తూ ఉండేవారు. అప్పుడు తెలిపింది అదే గురుపరంపర. వాళ్ళయొక్క అనుగ్రహంతోనే నేను ఇన్ని కార్యక్రమాలు చేపట్టగలిగాను. అంతదాకా ఎందుకు? **ఏమీ తెలియని నేను చతుర్వేద భాష్యం వ్రాయటానికి ఉపక్రమించానంటే, ఇదంతా నా గురువుల అనుగ్రహంతప్ప వేరు కాదు.**

'వేదం' అనేది పూర్తిగా గురువుమీదనే ఆధారపడి ఉంటుంది. ఆయన అనుగ్రహం ఉంటేనే కర్మకాండ అంటే యజ్ఞయాగాది క్రతువులు చెయ్యటంలో నిష్ణాతులం కాగలం. అలాగే మోక్షం కూడా పొందగలం.

# 10. జగత్తంతా వేదంవల్లనే జీవిస్తోంది

నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయిన పరబ్రహ్మ చరాచర జగత్తంతా ఆవరించి ఉన్నాడు. సృష్టికి ముందు నిరాకారుడుగా ఉన్న ఆ పరబ్రహ్మ సృష్టి తరువాత 84 లక్షల జీవరాసుల రూపంలో జగత్తంతా తానై ఉన్నాడు. అంటే సృష్టికి ముందు, సృషి తరువాత కూడా పరమేశ్వరుడు ఈ జగత్తును ఆవరించే ఉన్నాడు. జగత్తంతా ఆవరించిన పరమేశ్వరుని రూపాన్ని ఏ రకంగా కీర్తించగలం? అందుకే ఆ రూపము **'అణోరణీయాం మహతో మహీయాం'** అనబడుతున్నది. అణువుకన్న చిన్నదైనది. మహత్తుల కన్న పెద్దది. అంతకన్న పెద్దదైనది ఇంకేదీ లేదు. ఈ కారణం చేతనే పరమేశ్వరుడు. కేవలము తన మూడు అడుగులతో మూడు లోకాలను ఆక్రమించాడు అని చెప్పటం జరిగింది. అతని మహిమ చాలా గొప్పది. దాన్ని వర్ణించటానికి మాటలు చాలవు. అందుకే **ఋగ్వేదం మొదటి మండలంలోని 52వ సూక్తంలో** "ఓ పరమేశ్వరా ! ఈ భూమి పదిరెట్లు పెద్దదయినా నీకు సరిరాదు. ఈ భూమిమీద ఉన్న జీవరాశి అంతా రాత్రింబవళ్ళు జీవితకాలం కీర్తించినా, నీ శక్తినీ, జ్ఞానాన్ని, పరాక్రమాన్ని వర్ణించలేవు. లోకాలన్నీ నువ్వే వ్యాపించి ఉన్నావు. భూలోక భువర్లోకాలు రెండూ కలసినా నీ స్వరూపంతో సరికావు. సముద్రము, రోదసి రెండూ కలసినా నీ గాంభీర్యాన్ని కొంచెం కూడా పొందలేవు" అంటున్నారు.

ఆ పరమేశ్వరుడు అపారమైన కరుణామయుడు. ఆయనకి ఎవరిమీదా ద్వేషం లేదు. మనం అనుకుంటున్నట్లుగా దేవతలమీద ప్రేమా లేదు. రాక్షసుల మీద ద్వేషము లేదు. కేవలము ధర్మాన్ని కాపాడటమే ఆయన పని. లోకాలను రక్షించటమే ఆయన ధ్యేయం. బలిచక్రవర్తి రాక్షసరాజు. రాబోయే మన్వంతరంలో ఆయనే ఇంద్రుడు.

బలిచక్రవర్తి ద్వారం దగ్గర కాపలా కాస్తున్నాడు పరమేశ్వరుడైన శ్రీమహావిష్ణువు. కాబట్టి రాక్షసులైనా ధర్మానికి హాని కలిగించనంత వరకు వాళ్ళని ఏమీ చెయ్యడు. ధర్మానికి హాని కలిగితే దేవతలను కూడా క్షమించడు. ఎంత దుర్మార్గుడైనా సరే అతణ్ణి వెంటనే శిక్షించడు. అతడు మారటానికి అవకాశం ఇస్తాడు. వేచి చూస్తాడు. రామాయణంలో చూడండి. రావణుడు రథాన్ని, ఆయుధాల్ని అన్నింటినీ కోల్పోయి నిస్సహాయంగా నేలమీద నుంచున్నాడు. సమయం దొరికింది కదా అని చంపలేదు శ్రీరామచంద్రుడు. ఇంకా మారతాడేమో అని అవకాశమిచ్చాడు. ఇప్పటికీ సమయం మించిపోలేదు. చేసిన తప్పు ఒప్పుకుని సీతను ఒప్పగించు. లేదా మళ్ళీ బలాన్ని సమకూర్చుకుని రా ! రావణా ! నేడు పోయి రేపురా! అన్నాడు. ధర్మాన్ని రక్షించటమే ఆయన పని. అంతేకాని ధర్మం తప్పిన వాళ్ళని చంపటం కాదు. వీలైనంత వరకు వాళ్ళు మారేలాగా చూస్తాడు. సమస్త లోకాలు ఆ పరమేశ్వరుని శరీరం నుంచే ఆవిర్భవించాయి. లోకాలకు అతడే తండ్రి. ఈ లోకంలో మంచివాళ్ళు, చెడ్డవాళ్ళు, దుర్మార్గులు, దోపిడీదారులు, తపఃసంపన్నులు, భక్తులు, అందరికీ అతడే కన్నతండ్రి. అంతా అతని బిడ్డలే. అందుకే **ప్రథమ మండలంలోని 95వ సూక్తంలో** “భూమ్యాకాశాలలో ఉండే జీవరాశిని ఉద్ధరించటానికి పరమేశ్వరుడు కన్న తండ్రిలాగా రెండు చేతులూ చాస్తున్నాడు. తననుంచి పుట్టిన ఈ లోకాలను కాపాడటమే అతని ధ్యేయం. ఆ పరమేశ్వరుణ్ణి తల్లిగా, తండ్రిగా, భర్తగా, మిత్రుడుగా, గురువుగా ఎవరు ఎలా భావన చేస్తే అలాగే భాసిస్తాడు. యశోదాదేవికి కుమారుడిగా, ద్రౌపదికి సోదరుడిగా, అర్జునుడికి మిత్రుడిగానే దర్శనమిచ్చాడు. ఇదే విషయం వేదంలో కూడా చెప్పబడింది.

పరమేశ్వర స్వరూపము అంటే గొప్పదైన జ్ఞానము. అది దివ్యమైన కాంతి రూపంలో ప్రకాశిస్తుంటుంది. దేవీభాగవతంలో తారకాసురుని బాధలు పడలేక దేవతలు, మునులు, ఋషులు, అందరూ ఆ పరమేశ్వరిని ప్రార్థిస్తారు. అప్పుడు ఆమె వారికి దర్శనమిచ్చింది. ఆ రూపంలో ఎలా ఉన్నది అంటే

**కోటిసూర్యప్రతీకాశం చంద్రకోటి సుశీతలం**
**విద్యుత్కోటి సమానాభమరుణ తత్పరం మహః ॥**

కొన్ని కోట్ల సూర్యులయొక్క కాంతితో, కొన్నికోట్ల చంద్రులయొక్క చల్లదనంతో, కొన్ని కోట్ల మెరుపులు ఒక్కసారిగా ప్రకాశిస్తే ఎలా ఉంటుందో అలా. దివ్యమైన తేజస్సు వారి ముందు ప్రత్యక్షమైంది. అది అనంతమైనది. దానికి పైన లేదు, క్రింద లేదు, అడ్డం అంతకన్నా లేదు. అంటే ఆ రూపం ఈ జగత్తంతా వ్యాపించి ఉన్నది. ఈ రకంగా పరమేశ్వర స్వరూపం కోటానుకోట్ల కిరణాలతో ప్రకాశిస్తున్నది.

**తేషాం అనంతకోటీనాం మయూఖానాం మహేశ్వరీ ।**

అనంతమైన ఆ కిరణ సముదాయం నుంచి

**అష్టోత్తర శతంవహ్నే షోడశోత్తర శతంరవే ।**
**షట్త్రింశ తదుత్తరశతం చంద్రస్య కిరణాశ్శివే ॥**

ఆ కిరణాల నుంచి 108 కిరణాలను అగ్నిదేవుడు, 116 కిరణాలను సూర్యుడు, 136 కిరణాలను చంద్రుడు తీసుకున్నారు. ఈ ముగ్గురూ కలసి 108+116+136 = 360 కిరణాలను మాత్రమే తీసుకున్నారు. ఈ 360 కిరణాలే వృత్తంలోని 360 డిగ్రీలు. ఈ 360 కిరణాలే చాంద్రమానంలో సంవత్సరానికి రోజులు.

**బ్రహ్మాండం భాసయంతస్తే పిండాండమపిశాంకరి**
**దివాసూర్యౌ, తథారాత్రౌసోమో, వహ్నిశ్చ సంధ్యయోః**

ఈ 360 కిరణాలతోనే చరాచర జగత్తంతా ప్రవర్తిల్లుతున్నది. పగటిపూట సూర్యుడు, రాత్రిపూట చంద్రుడు, సంధ్యవేళలయందు అగ్ని కాంతులను ప్రసరింప చేస్తున్నారు.

**హాయనాత్మా మహాదేవహప్రజాపతి రితిస్మృతి**

ఆ పరమేశ్వరుడు, ప్రజాపతియే కాలపురుషుడు అదే కాలచక్రము. చాంద్రమానంలో సంవత్సరానికి 360 రోజులు. 12 మాసాలు. ఈ మాసాలే మేషాదిరాసులు. ఈ మాసాలే కాలచక్రానికి గల 12 ఆకులు. నిరంతరము తిరుగుతుండే ఈ కాలచక్రానికి 720 మంది కుమారులు. 360 పగళ్ళు 360 రాత్రులు. వెరసి 720. వీరే కాలచక్రం కుమారులు అంటోంది. **ప్రథమ మండలంలోని 164వ సూక్తం.**

ఈ చరాచర జగత్తుని సృష్టించిన తరువాత జీవుల్ని సృష్టించాడు పరమేశ్వరుడు. మానవదేహాన్ని సృష్టించిన తరువాత అందులో ప్రవేశించాలి అనుకున్నాడు. బ్రహ్మరంధ్రం గుండా ప్రవేశించాడు. అలా ప్రవేశించిన ఆ పరమేశ్వరుడు జీవుడిలో ఉండి జీవాత్మ అయినాడు. నవరంధ్రాలతోను లౌకిక సుఖాలు అనుభవిస్తూ తనకు ఈ దేహానికి సంబంధం లేదు అనే మాటతోపాటుగా, ఈ దేహంలోకి ప్రవేశించిన మార్గం కూడా మరిచిపోయి, పూర్తిగా అజ్ఞానంలో కూరుకుపోయి నేను అంటే దేహము అనుకుంటున్నాడు. జీవాత్మ, పరమాత్మ రెండూ వేరు వేరు అని భావన చేస్తున్నాడు. **ముండకోపనిషత్తు**లో చెప్పినట్లుగా సంసారమనే వృక్షం మీద రెండు పక్షులు కూర్చుని ఉన్నాయి. ఆ రెండు పక్షులు ఒకే రూపంతో, ఒకే రంగులో చూడటానికి ఒకలాగే ఉన్నాయి. అందులో ఒకటి దొరికిన కాయలు పండ్లు తింటోంది. రెండవది ఏమీ తినకుండా దిక్కులు

చూస్తోంది. ఇందులో కాయలు పండ్లు తింటున్నది జీవాత్మ. ఆ కాయలు పండ్లే కర్మఫలాలు. మరి పరమాత్మ? ఏ రకమైన కర్మ చెయ్యదు. అందుకే ఏమీ తినకుండా చూస్తూ కూర్చున్నది. నిజానికి ఈ రెండూ వేరు వేరా? అంటే వేరుకాదు. మరి ఎందుకు అలా కనిపిస్తున్నాయి? అజ్ఞానంవల్ల. అజ్ఞానం గనక తొలగిపోతే జీవాత్మ పరమాత్మల మధ్య భేదం లేదు. ఆ రెండూ ఒకటే అనే విషయం తెలుస్తుంది. అప్పుడు అక్కడ రెండు పక్షులుండవు. ఆ రెండూ ఒకటే అయిపోతాయి. **ఋగ్వేదంలోని ప్రథమ మండలంలోని 164 వ సూక్తంలో** "ఒకరిమీద ఒకరికి అత్యంత ప్రేమగల పక్షులు ఒకచెట్టునే ఆశ్రయించి ఉన్నాయి. అందులో ఒకటి దొరికిన కాయలు తింటున్నది. రెండవది ఏమీ తినుండా చూస్తూ కూచున్నది. ఆ రెండు పక్షులే జీవాత్మ, పరమాత్మ" అని వివరించబడింది.

చరాచర జగత్తంతా పరమేశ్వరుణ్ణించే ఆవిర్భవిస్తున్నది. మళ్ళీ పరమేశ్వరుడిలోనే లీనమవుతున్నది. ఈ జగత్తులో ఉన్నది ఆత్మతత్త్వం ఒక్కటే. అంతకుమించినది ఏదీలేదు. ఆత్మతత్త్వాన్ని గురించి తెలుసుకుంటే జగత్తులో ఇంక తెలుసుకోవలసినది ఏదీ ఉండదు.

పూర్వకాలంలో ఒక మహారణ్యంలో పుణ్యానానందముని తపస్సు చేసుకుంటున్నాడు. ఆయన ఆశ్రమంలోనే కూర్చుని. ఇంతలో ఆ మునీశ్వరుడికి ఏవో మాటలు వినిపించాయి. అవి ఏమిటా అని శ్రద్ధగా ఆలకించాడు. ఆకాశంలో రెండు హంసలు ఎగురుతూ వాటిలో అవి మాట్లాడుకుంటున్నాయి. ఆడహంస అడుగుతున్నది. "నాథా ! లోకంలో దేన్ని గురించి తెలుసుకుంటే ఇంక తెలుసు కోవలసింది ఏదీ ఉండదో, దాన్ని వివరించవలసింది." అని అడిగింది. దానికి మగహంస "ఓ దేవీ! కుమ్మరివాడు మట్టిని తెచ్చి నీరుపోసి బాగా తొక్కి, ముద్దలాగా

చేసి దాంతో కుండలు, చట్టిలు, బానలు ఇలా రకరకాల పాత్రలు తయారుచేస్తాడు. ఇక్కడ పాత్రలు వేరైనా అందులో ఉన్న మట్టి ఒక్కటే. అలాగే కంసాలి బంగారం కరిగించి రకరకాల ఆభరణాలు తయారుచేస్తాడు. ఆభరణాల పేరు వేరైనా, ఆకారం వేరైనా అందులో ఉన్న బంగారం ఒక్కటే. బంగారం గురించి తెలుసుకుంటే అన్ని ఆభరణాల గురించి తెలుస్తుంది" అన్నది. ఆ మాటలు విన్న ఆడుహంస "స్వామీ ! తెలిసింది. పరమాత్మని గురించి తెలుసుకుంటే అన్నింటి గురించి తెలుస్తుంది. ఇంక తెలుసుకోవలసినది ఉండదు" అంటుంది. ఈ మాటలు విన్న పుణ్యానంద ముని ఆ హంసలు రెండూ శివశక్తులని, తనకోసమే ఆత్మతత్త్వాన్ని బోధిస్తున్నాయని తెలుసుకుని "కామకలావిలాసమ" అనే శ్రీవిద్యాపరమైన సూత్రగ్రంథాన్ని వ్రాశాడు. దీనివల్ల మనకు తెలిసేది ఏమంటే 'ఆత్మతత్త్వాన్ని గురించి తెలుసుకుంటే అన్నింటి గురించి తెలుస్తుంది. ఇది తెలుసుకోకుండా దేన్ని గురించి తెలుసుకున్నా ప్రయోజనం లేదు. ఇదే విషయం **ఋగ్వేదంలోని ప్రథమ మండలంలోని 164వ సూక్తం** చెబుతోంది. "అన్ని కాలాల్లోను, అన్ని దేశాల్లోను ఉండేది ఆత్మ. దీన్నుంచే దేవతలు కూడా ఉద్భవిస్తున్నారు. అందరూ ఈ ఆత్మకి అధీనులై ఉంటారు. కాబట్టి ఆత్మతత్త్వం తెలుసుకుంటే ఈ లోకంలో అన్నీ తెలుసుకున్నట్లే. ఆత్మతత్త్వాన్ని తెలుసుకోకుండా ఋగ్వేదమే కాదు ఏ వేదం చదివినా ప్రయోజనం శూన్యం. ఆత్మతత్త్వం తెలిసినవారే నిజమైన ఆనందం పొందుతారు." అంతేకాదు దేవుడు, జగత్తు అంతా కూడా ఈ వేదం మీదనే ఆధారపడి ఉన్నాయి. పరమేశ్వరుడు ఈ జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. అలాగే ఈ వేదం కూడా అన్నిచోట్ల వ్యాపించి ఉన్నది. అనంతమైన శబ్దాలుకల ఈ వేదం అనేకమైన అర్థాలు కలిగి ఉన్నది. ఈ వేదం నుంచే పవిత్రమైన గ్రంథాలు పుట్టాయి. దీన్నుంచే సమస్త జగత్తుకు కారణమైన ఈశ్వరుడు

కూడా ఏర్పడుతున్నాడు. కాబట్టి ఈ జగత్తంతా వేదంవల్లనే జీవిస్తోంది, అంటోంది వేదం.

**సంప్రదాయాలు :** ప్రతిదేశంలోను, ప్రతిజాతిలోను, ప్రతి మతంలోను కొన్ని సంప్రదాయాలు, కట్టుబాట్లు ఉంటాయి. ఇవి కేవలము మనదేశంలోనే ఉన్నాయి. ఇతర దేశాలలో ఉండవు అనుకోవటం మన తెలియనితనం, అమాయకత్వం అంటే. పూర్వకాలంలో ఈ కట్టుబాట్లు పూర్తిగా ఆచరించేవారు కాలక్రమేణా అవి కొంతవరకు సడలిపోయినాయి. రాజ్యాంగం తయారుచేసేటప్పుడు ఈ కట్టుబాట్లు సంప్రదాయాలు కూడా లెక్కలోకి తీసుకున్నారు. రెండు వందల సంవత్సరాల క్రితం నటవిట గాయకులను ఇంట్లోకి రానిచ్చేవారు కాదు. వారికి సభాగౌరవం లేదు. సహపంక్తి భోజనం కూడా లేదు. శుభకార్యాలలో మేళం వాళ్ళకి విడిగా భోజనం పెడతారు. వారితోపాటే నటవిట గాయకులుకూడా కూర్చునేవారు. వీళ్ళకి ఎక్కడా పనికూడా ఇచ్చేవారు కాదు. వీరికి వావివరుసలుండవని అప్పటివారి నమ్మకం. నా చిన్నప్పుడు మా యింటిదగ్గర ఒక మహానటుడు ఉండేవాడు. ఆయనకు ముప్పై బంగారు పతకాలు వచ్చినాయి. హరిశ్చంద్రుడుగా ఆయన నటనకు మెచ్చి చల్లపల్లి రాజావారు కాటికాపరి సీనులో వెండిబిందె బహూకరించారు. ఇంతగొప్ప నటుడు మొదట్లో ప్లీడరు గుమాస్తాగా చేసేవాడు ఈయన నాటకాలు వేస్తాడని ప్లీడరుగారు ఉద్యోగంలోకి రావద్దన్నారట. అది ఆ రోజున నటుల పరిస్థితి. కాని ఈ రోజున సినిమా యాక్టర్లకు విశేషమైన ఆదరణ ఉంది. వాళ్ళనే మనం మార్గదర్శకులుగా తీసుకుంటున్నాం. వారిని ప్రత్యక్ష దేవతలుగా కొలుస్తున్నాం. దేవాలయాలు కూడా కట్టిస్తున్నాం. సమాజం మారిపోయింది. విలువలు, కట్టుబాట్లు గంగలో కలిసిపోయినాయి. కాలం మారింది. కాలంతోపాటుగా మనమూ

మారాలి.

పూర్వకాలంలో వేదపండితుడన్నా శిష్టాచారపరుడన్నా చాలా గౌరవం ఉండేది. ఈ రోజున వేదానికి, సంప్రదాయానికి గౌరవం లేదు. వేదాన్ని, మనం సంప్రదాయాన్ని హేళన చేసేవాడు, అవమానించేవాడు గొప్పగా చూడబడుతున్నాడు. ఇదంతా దుష్టసంప్రదాయం. మీ సంప్రదాయాన్ని రక్షించుకోండి. మీ గౌరవాన్ని మీరు నిలబెట్టుకోండి. మనవారిని మనం అవమానించుకోవటం గొప్పదనం కాదు. చేతనైతే జాతి గొప్పదనాన్ని ప్రపంచానికి చాటి చెప్పండి.

# 11. వేదాలు అపౌరుషేయాలా?

పురుషునిచేత చెప్పబడినవి పౌరుషేయాలు అనబడతాయి. అపౌరుషేయాలు అంటే పురుషునిచేత చెప్పబడనివి అని అర్థం. వేదాలు అపౌరుషేయాలు అంటే వేదాలు ఎవరిచేతా చెప్పబడలేదు. ఇది మనకు తెలిసిన విషయం. ఇప్పుడు చిన్న అనుమానం. ఎవరిచేతా చెప్పబడకపోతే ఎలా వచ్చాయి?

'సాక్షాత్తు బ్రహ్మముఖం నుంచి వచ్చాయి.' అని సమాధానం. పరబ్రహ్మ నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు కదా? ఆకారం లేనివాడు. మరి అలాంటప్పుడు, బ్రహ్మకి ఆకారమే లేకపోతే కన్ను ముక్కు నోరు ఎలా వచ్చాయి? అతని నోటినుంచి వేదాలెలా వచ్చాయి? మళ్ళీ ప్రశ్న. సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపులైన బ్రహ్మవేత్తలవల్ల వేదాలు చెప్పబడ్డాయి. **బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి**. బ్రహ్మను గురించి తెలుసుకున్నవాడు తాను కూడా బ్రహ్మమే అవుతున్నాడు. ఇది ఉపనిషద్ వాక్యం. అతడే 'బ్రహ్మవేత్త'. అటువంటి బ్రహ్మవేత్తలవల్ల వేదాలు చెప్పబడ్డాయి. కాబట్టి వేదాలు స్వయంగా బ్రహ్మచే చెప్పబడినట్లుగానే భావించాలి. ఇది ఒక వాదన. ఇది కొంతవరకు సమర్థనీయంగానే ఉంది. కాని అసలు విషయం ఏమంటే **వేదమంత్రాలు ఎవరిచేతా చెప్పబడలేదు. ఆప్తర్షులైన కొంతమంది మహర్షులచేత దర్శించబడ్డాయి.** అసలు ఆప్తర్షులు అంటే ఎవరు? 'ఋషి' అంటే జ్ఞానముచేత సంసార సాగరాన్ని దాటినవాడు అని అర్థం. ఆప్తఋషి సత్యాన్ని స్వయంగా సాక్షాత్కరించుకున్నవాడు. నిస్వార్థపరుడు. అని అర్థం. నిరంతరము సత్యాన్వేషణలోనే కాలం గడుపుతూ, ఏ రకమైన స్వార్థము లేకుండా లోకంలోని అందరి ప్రయోజనాలను ఆకాంక్షిస్తూ, అన్ని రకాల జీవరాశి సుఖంగా ఉండాలని కోరుతూ పరబ్రహ్మను దర్శించినవాడు ఆప్తఋషి. ఇటువంటి

మహానుభావులు సమాధిస్థితిలో ఉన్నప్పుడు దర్శించిన మంత్రభాగాలే వేదాలు.

శరీరానికి బయటగాని, లోపలగాని, ఏదైనా ఒక ప్రదేశంలో సాధకుడు తన చిత్తాన్ని నిలపటమే ధారణ అనబడుతుంది. ఏ ప్రదేశంలో చిత్తాన్ని లగ్నం చేశామో, దానియందే జ్ఞాని వృత్తి అఖండధారావాహిక రూపంలో సాగినప్పుడు దాన్ని ధ్యానము అంటారు. ధ్యానంలో ఉన్నప్పుడు కేవలము ధ్యేయాన్ని మాత్రమే చూస్తూ, నేను ధ్యానం చేస్తున్నాననే భావాన్ని కూడా మరచిపోవాలి. ఆ స్థితిలో చిత్తం తన స్వరూపస్థితి పొందుతుంది. దాన్నే **'సమాధి'** అంటారు. ధ్యానానికి అంతిమఘట్టం, యోగానికి పరమావస్థ 'సమాధి'. ఈ సమాధి రెండు రకాలుగా ఉంటుంది. 1. సవికల్ప సమాధి 2. నిర్వికల్ప సమాధి. బాహ్యప్రపంచాన్ని మరిచిపోయి సంకల్ప వికల్పాలు ఏవీ లేని స్థితి. అటువంటి నిర్వికల్ప సమాధిస్థితిలో ఉండి వేదమంత్రాలను దర్శించారు ఆప్తఋషులు.

నిత్యము సత్యము శాశ్వతమైనది పరమేశ్వర స్వరూపము. ఆ పరమాత్మ ఉచ్ఛ్వాస నిశ్వాసలే వేదాలు అని పెద్దలు చెబుతున్నారు. మన ఇంద్రియాలకు కనిపించే సత్యాలు చాలా అల్పమైనవి. తపస్సంపన్నులైన మహర్షులు ఇంద్రియాలకు గోచరించని విషయాలను కూడా సమాధి స్థితిలో తెలుసుకోగలిగారు. ఈ రకంగా నిర్మలమైన అంతఃకరణతో వారు కనుగొన్న జ్ఞానఖండికలే వేదమంత్రాలు. వారు ఈ మంత్రాలను రచించలేదు. అనంతమైన ఈ విశ్వంలో పరమేశ్వరుని ఊపిరిగా సంచరిస్తున్న శబ్దతరంగాలను తమ తపశ్శక్తితో పసికట్టి, వాటిని లోకకళ్యాణం కోసం మనకందించారు. "ఆ పరమేశ్వరుని ప్రేరణవల్లనే ఈ వేదమంత్రాలు వారి హృదయాల్లో ప్రవేశించాయి."

అని ఋగ్వేదం చెబుతోంది. వేదమంత్రాలను దర్శించిన మహర్షులనే 'ద్రష్టలు' అంటారు. ద్రష్ట అంటే దర్శించినవాడు అని అర్థం. వేందవమంత్రాలన్నీ ఇలా మహర్షులచే దర్శించబడ్డవే. మహాభాష్యకారుడైన పతంజలి కూడా తన 'మహాభాష్యం'లో ఈ విషయాన్ని అంగీకరించాడు.

ఋక్సంహితలో 1028 సూక్తాలున్నాయి. వీటిని సుమారు 403 మంది మహర్షులు దర్శించారు. అలాగే మిగిలిన వేదాలలో కూడా. మొత్తం మీద ప్రతి వేదమంత్రాన్ని ఎవరో ఒక ఋషి దర్శించాడు. ఋగ్వేదంలో 1028 సూక్తాలు ఉన్నాయి అన్నాం కదా. ఇందులో ప్రతి సూక్తంలోను కొన్ని ఋక్కులు లేదా మంత్రాలుంటాయి. ఒక్కొక్క సూక్తాన్ని ఒక్కొక్క ఋషి దర్శించాడు. కొన్నిచోట్ల ఒక సూక్తంలోని కొన్ని మంత్రాలను మాత్రమే ఒక ఋషి దర్శించాడు. అంటే ఒకే సూక్తాన్ని ఇద్దరు ముగ్గురు ఋషులు దర్శించారు. ఒకే ఋషి కొన్ని సూక్తాలను దర్శించటం జరిగింది. ఉదాహరణకు ఋగ్వేదంలోని ప్రథమ మండలంలో 121 నుంచి 164 వరకు గల సూక్తాలను దీర్ఘతముడు దర్శించాడు. ఈ సూక్తాలన్నింటిలోనూ దేవత ఒకరు కాదు. అనేకులు ఒక్కొక్క సూక్తంలో వేరు వేరు దేవతలు కూడా ఉంటారు. ఋగ్వేదంలోని ప్రతిసూక్తానికి ఋషి, దేవత, ఛందస్సు ఉంటుంది. మంత్రం పద్యరూపంలో ఉంటేనే ఛందస్సు ఉంటుంది. లేకపోతే ఋషి, దేవత మాత్రమే ఉంటుంది. గద్యరూపంలో ఉన్న మంత్రాలకు ఛందస్సు ఉండదు.

వేదమంత్రాలు దర్శించిన ఋషులలో ప్రధానమైన వారిని చూద్దాం. వీరిలో కొంతమంది నాలుగు వేదాలలో (ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణ వేదమంత్రాలు దర్శించారు

ఇలా చూసినట్లైతే

| **వ.నెం.** | **ఋషి** | **ఋగ్వేదము** | **కృష్ణయజు** | **శుక్లయజు** | **సామవేదము** | **అధర్వణ** | **మొత్తం** |
|---|---|---|---|---|---|---|---|
| 1. | వశిష్ఠుడు | 104 | 53 | – | 43 | 14 | 214 |
| 2. | వామదేవుడు | 46 | 55 | – | 36 | 5 | 142 |
| 3. | విశ్వామిత్రుడు | 46 | 33 | – | 29 | 13 | 121 |
| 4. | భరద్వాజుడు | 59 | 18 | – | 29 | 4 | 110 |

మంత్రాలను దర్శించారు.

శుక్లయజుర్వేదంలో 1401 మంత్రాలను 'ప్రజాపతి' దర్శించాడు. ఈయన కృష్ణయజుర్వేదంలో 220 మంత్రాలు దర్శించి మొత్తం 1621 వేదమంత్రాలు దర్శించాడు అని చెప్పబడుతున్నాడు. వేదంలో అతిఎక్కువ మంత్రాలు దర్శించిన వాడు ఈయనే. అయితే ఈ మంత్రాలన్నీ యజుర్వేదానికి సంబంధించినవే. నాలుగు వేదాలలోని మంత్రాలను దర్శించిన ఋషులను చూసినట్లైతే

1. ఋగ్వేదంలో ఎక్కువ మంత్రాలు దర్శించినవాడు వశిష్ఠుడు. ఇతడు 104 మంత్రాలు దర్వించాడు.

2. కృష్ణయజుర్వేదంలోను, శుక్లయజుర్వేదంలోను కూడా ఎక్కువ మంత్రాలు దర్శించినవాడు ప్రజాపతి. ఇతడు కృష్ణయజుర్వేదంలో 220 శుక్ల యజుర్వేదంలో 1401 మంత్రాలు దర్శించాడు.

3. సామవేదంలో ఎక్కువ మంత్రాలను దర్శించినవాడు వశిష్ఠుడు. ఇతడు 43 మంత్రాలు దర్శించాడు.

4. అధర్వణ వేదంలో ఎక్కువ మంత్రాలు దర్శించినవాడు అధర్వణ మహర్షి. ఇతడు 148 మంత్రాలు దర్శించాడు మొత్తంమీద నాలుగు వేదాలలోను కలిపి ఎక్కువ మంత్రాలను దర్శించినవాడు వశిష్ఠుడు. ఇతడు మొత్తం 214 మంత్రాలను దర్శించాడు.

కొన్ని మంత్రఖండికలను ఇద్దరిద్దరు దర్శించారు. ఈ విషయం శుక్ల యజుర్వేదంలో కనిపిస్తుంది. ఇంద్ర బృహస్పతులు, ఇంద్రాగ్నులు, అశ్వనీ దేవతలు మొ॥వారు. అధర్వణ వేదంలో వాలఖిల్యులు కొన్ని మంత్రాలను దర్శించారు. వీరు అరవై వేల మంది. వేదమంత్రాలు దర్శించిన వారిలో 23మంది స్త్రీలుకూడా ఉన్నారు. ఇప్పుడు మనం మంత్రద్రష్టలైన మహర్షులను విడివిడిగా చూద్దాం.

**1. వశిష్ఠుడు** : ఇతడు మూడు జన్మలెత్తాడు. మొదటిసారి బ్రహ్మమానసపుత్రుడు. ఈ జన్మలోనే నాలుగు వేదాలలోను అనేక మంత్రాలను దర్శించాడు. ఇతడి భార్య అరుంధతి. పంచభూతాలు వసువులు అనబడతాయి. అణిమాది సిద్ధులు గలవాడు. పంచభూతాలను వశం చేసుకున్నవాడు. అందుకే వశిష్ఠుడు అనబడ్డాడు. దక్షప్రజాపతి యజ్ఞం చేసినప్పుడు వీరభద్రుడు అక్కడున్న వాళ్ళందరిని చంపేశాడు. వారితోనే వశిష్ఠుడు కూడా మరణించాడు. ఇతడితో బాటే అరుంధతి కూడా మరణించింది. వీరిద్దరూ ఆకాశంలో నక్షత్రాలైనారు. వీరికి ఏడుగురు కుమారులు. వారందరూ కూడా బ్రహ్మర్షులే.

బ్రహ్మదేవుని హోమాగ్ని నుంచి మళ్ళీ జన్మించాడు. ఇది రెండవ జన్మ. ఈ జన్మలో అరుంధతి అక్షమాల అనే పేరుతో జన్మించి ఇతని

భార్య అయింది. నిమిచక్రవర్తి శాపంతో ఈ జన్మ పూర్తయింది. మిత్రావరుణుల కుమారునిగ మూడవ జన్మ ఎత్తాడు. ఈ జన్మలో నారదుని చెల్లెలుగా పుట్టింది అరుంధతి.

వశిష్ఠుడు ఋగ్వేదంలో 104 సూక్తాలు, కృష్ణయజుర్వేదంలో 53 మంత్రాలు, సామవేదంలో 43 దశతుల్లో కొన్ని మంత్రాలు, అధర్వణ వేదంలో 14 సూక్తాలు మొత్తం మీద వేదంలో 214 (ఎక్కువ) మంత్రాలను దర్శించిన మహర్షి.

**2. వామదేవుడు :** ఇతడు గౌతముని కుమారుడు. రామాయణంలో దశరథ మహారాజు పురోహితుడుగా ఉన్నాడు. వశిష్ఠుని మిత్రుడు. మాతృగర్భంలో ఉన్నప్పుడే అశ్వనీదేవతలను స్తుతించాడు. ఇతడు అధర్వ ఆంగీరసుల కుమారుడని బృహదారణ్యకం చెబుతోంది. ఇతడు ఋగ్వేదంలో 46 మంత్రాలను, కృష్ణయజుర్వేదంలో 55 మంత్రాలను, సామవేదంలో 36 మంత్రాలను, అధర్వణ వేదంలో 5 మంత్రాలను మొత్తంమీద నాలుగువేదాలలోను కలిపి 142 మంత్రాలను దర్శించాడు.

**3. విశ్వామిత్రుడు :** కుశుని మనుమడైన గాధిరాజుకుమారుడు విశ్వామిత్రుడు. ఋచీకుని భార్య సత్యవతి ఇతని సోదరి. ఇతడు కన్యాకుబ్జానికి చెందినవాడు. జన్మతః ఇతడు క్షత్రియుడు. కాని వశిష్ఠుని మీద కోపంతో తపస్సు చేసి రాజర్షి తరువాత బ్రహ్మర్షి అయినాడు. చాలా కోపం, ఆవేశం గలవాడు. రామాయణంలోని బాలకాండలో ఇతణ్ణి గురించిన వివరాలు చెప్పబడ్డాయి. అజీగర్తుని కుమారుడైన శునశ్శేపుణ్ణి యాగంలో ఆహుతి కాకుండా కాపాడాడు. ఇతడు ఋగ్వేదంలో 46 మంత్రాలను, కృష్ణయజుర్వేదంలో 33 మంత్రాలను, సామవేదంలో 29 మంత్రాలను, అధర్వణ వేదంలో 13 మంత్రాలను

మొత్తం నాలుగు వేదాలలోను కలిపి 121 మంత్రాలను దర్శించాడు.

**4. భరద్వాజుడు :** అత్రిమహర్షి కుమారుడు భరద్వాజుడు. ఇతడు తపస్సు చేసి ఇంద్రుణ్ణి మెప్పించి తన ఆయుషు పొడిగించుకున్నాడు. ఇలా రెండుసార్లు అయింది. మూడోసారి మళ్ళీ ఇంద్రుణ్ణి గురించి తపస్సు చేశాడు. ఇంద్రుడు ప్రత్యక్షమై ఏం కావాలి? అన్నాడు. నా ఆయుష్షును పొడిగించు అన్నాడు భరద్వాజుడు. ఇప్పటికి రెండుసార్లు ఆయుష్షును పొడిగించుకున్నావు. మళ్ళీ ఇప్పుడు అదే కావాలంటున్నావు. ఏం చెయ్యాలనుకుంటున్నావు? అన్నాడు ఇంద్రుడు. మహేంద్రా వేదాలను సమగ్రంగా అధ్యయనం చెయ్యాలనుకుంటున్నాను. అన్నాడు భరద్వాజుడు తన చేతిలోకి మూడు గుప్పిళ్ళు మట్టిని తీసుకున్నాడు ఇంద్రుడు, తన ఎదురుగా ఉన్న మూడు కొండలను చూపిస్తూ భరద్వాజా నువు తెలుసుకోవాల్సింది అదిగో ఆ ఎదురుగా ఉన్న కొండంత. ఇంతవరకు నువ్వు తెలుసుకున్నది ఇంత అంటూ తన గుప్పిటలో ఉన్న మట్టిని చూపాడు. అయినప్పటికీ భరద్వాజుడు ఏ మాత్రం నిరుత్సాహ పడకుండా వేదాధ్యయనం కొనసాగించాడు. చివరకు సావిత్ర్యాగ్నిని ఉపాసించి వేదవిజ్ఞానాన్ని తెలుసుకున్నాడు. రామాయణంలో శ్రీరామచంద్రుడు వనవాసానికి వెళ్ళినపుడు అరణ్యకాండలో భరతుడికి ఆతిధ్యమిచ్చి బ్రహ్మాండమైన విందు ఏర్పాటు చేశాడు. దానికే **'భరద్వాజుడివిందు'** అని కూడా పేరొచ్చింది.

విమాననిర్మాణాన్ని గురించి ఈయన ఒక పుస్తకం కూడా వ్రాశాడు అని అంటారు. విమానాన్ని ఏ లోహంతో తయారుచెయ్యాలి? విమానంలో కూర్చుని శత్రువ్యూహాలు కనిపెట్టే విధానం, శత్రువులను నాశనం చేసే విధానం ఇలా అనేక విషయాలు అందులో

వివరించాడట. అయితే ఆ పుస్తకం ఇప్పుడు మనకు లభ్యం కావటంలేదు.

ఇతడు ఋగ్వేదంలో 59 కృష్ణయజుర్వేదంలో 18, సామవేదంలో 29, అథర్వణ వేదంలో 4 మొత్తం అన్ని వేదాలకు కలిపి 110 మంత్రాలను దర్శించాడు.

**5. గృత్సమదుడు :** గొప్ప తపస్వి అయిన 'వీతహవ్యుని' కుమారుడు. బృహస్పతితో సమానమైన పండితుడు. ఇంద్రునికి ముఖ్య స్నేహితుడు. ఇతడు అచ్చు ఇంద్రుని పోలికలతో ఉండేవాడు. ఒకసారి రాక్షసులు ఇతన్ని చూసి ఇంద్రుడనుకొని ఎత్తుకుపోయి తాళ్ళతో కట్టేశారు. మనువు యొక్క కుమారుడు 'వరిష్ఠుడు' ఒకసారి వేయి సంవత్సరాల పాటు సత్రయాగం చేశాడు. అందులో గృత్సమదుడు సామగానం చేశాడు. అలా సామగానం చేస్తూ పొరపాటున తప్పు చదివాడు. దాంతో కోపించిన వరిష్ఠుడు పదివేల సంవత్సరాలు జంతువై అడవిలో తిరగవలసింది అని ఇతన్ని శపించాడు. ఇతడు ఋగ్వేదంలో 39 సూక్తాలను దర్శించాడు.

**6. దీర్ఘతముడు :** బ్రహ్మకుమారుడు అంగీరసుడు. అంగీరసుని కుమారుడు ఉచథ్యుడు. ఉచథ్యుని కుమారుడు దీర్ఘతముడు, ఇతని తల్లి మమత. గర్భంలో ఉన్నప్పుడే వేదజ్ఞానమున్నదతనికి. బృహస్పతి ఇతన్ని గ్రుడ్డివాడివి కమ్మని శపించాడు. ఈ కారణంగానే ఇతడు దీర్ఘతముడనబడ్డాడు. బుద్ధిలో బృహస్పతి. గౌతముడు ఇతని కుమారుడు. ఇతనికి ఇద్దరు భార్యలు. పెద్ద భార్య 'ప్రద్వేష' ఈమె కుమారుడే గౌతముడు రెండవ భార్య 'ఉశిజ' ఈమెకు పదకొండు మంది కుమారులు. వారిలో కక్షివంతుడు చాలా గొప్పవాడు. అతడు కూడా ఋగ్వేద మంత్రాలను దర్శించాడు. దీర్ఘతముని అనుగ్రహం

వల్ల సుధేష్ణకు అంగ, వంగ, కళింగ, పుండ్ర, శుంగులు అనే రాజులు కలిగారు. వారు తమ పేర్లతో ఐదు రాజ్యాలను కూడా స్థాపించారు. అవి భాగల్పూరు, బెంగాలు, ఆంధ్ర, రాజసాహి, తామ్రనిక రాజ్యాలు.

దీర్ఘతముడు ఋగ్వేదంలో 39 సూక్తాలను దర్శించాడు.

**7. అగస్త్యుడు :** వరుణుని కుమారుడు. కుండ నుంచి పుట్టాడు. కాబట్టి 'కుంభ సంభవుడు' అంటారు. ఇతని భార్య లోపాముద్ర. ఇతని కుమారుడే 'దృఢదస్యుడు' వాతాపిని సంహరించి ఇల్వలుని పీచమడచినవాడే యీ మహర్షే. వింధ్యపర్వతానికి గర్వభంగం చేసినవాడు. సముద్రాలను ఆపోసన పట్టినవాడు, ఇతడే. రామరావణ యుద్ధం జరుగుతున్న సమయంలో శ్రీరాముడికి ఆదిత్యహృదయం ఉపదేశించినది ఈయనే. ఈ మహర్షి ఋగ్వేదంలో 24 సూక్తాలను కృష్ణయజుర్వేదంలో 19, అధర్వణ వేదంలో 4 మొత్తం అన్ని వేదాలలోను కలిపి 47 మంత్రాలను దర్శించాడు.

**8. గౌతముడు :** ఇతణ్ణే గోతముడు అని కూడా అంటారు. ఇతడు రాహుగణుని కుమారుడు. ఈయన ఋగ్వేదంలో 21 మంత్రాలు, కృష్ణయజుర్వేదంలో 80 మంత్రాలు, సామవేదంలో 20 మంత్రాలు అధర్వణ వేదంలో 7 మంత్రాలు వెరసి 128 మంత్రాలను దర్శించాడు.

**9. ప్రజాపతి :** దేవుడు అనే మనువు కుమారుడు. ఇతనికి ధూమ్ర, బ్రహ్మవిద్య, మనస్విని, రతి, శ్వాస, శాండివి, ప్రభాత అనే ఏడుగురు భార్యలు. కాగా ధరుడు, సోముడు, అహుడు, అనిలుడు, అగ్ని, ప్రత్యూషుడు, ప్రభాసుడు అనే కుమారులు ఉన్నారు. ఇతడు శుక్ల యజుర్వేదంలో 1401 మంత్రాలు, కృష్ణ యజుర్వేదంలో 220 మంత్రాలు వెరసి 1621 మంత్రాలను దర్శించాడు. ఇంత పెద్ద సంఖ్యలో మంత్రాలను దర్శించిన ఋషి ఇతడొక్కడే. ఇతడు దర్శించిన

మంత్రాలన్నీ యజుర్వేదానికి సంబంధించినవే.

**10. పరమేష్ఠి :** ఇతడు బ్రహ్మయొక్క శిష్యుడు. జైమినీయ బ్రాహ్మణంలో ఇతడు ప్రజాపతి శిష్యుడు అని చెప్పబడింది. ఈయన కృష్ణయజుర్వేదంలో 60 మంత్రాలు, శుక్లయజుర్వేదంలో 59 మంత్రాలు. వెరసి వేదంలో 119 మంత్రాలను దర్శించాడు అయితే ఈయన దర్శించిన మంత్రాలన్నీ యజుర్వేదానివే.

**11. ఆత్రేయుడు :** ఇతడు వామదేవుని శిష్యుడు. ఒక నక్షత్రం నుంచి ఇంకొక నక్షత్రానికి వెళ్ళగల శక్తి గలవాడు. తన శిష్యులకు నిర్గుణ బ్రహ్మను బోధించాడు. ఈయన కృష్ణ యజుర్వేదంలో 57 మంత్రాలను దర్శించాడు.

**12. మేధా తిథి :** ఈ పేరు గల వాళ్ళు పురాణేతి హాసాలలో ముగ్గురున్నారు. అందులో మొదటివాడు రాజు. చివరి ఇద్దరూ వేదమంత్రాలు దర్శించారు. రెండవ వాడు కణ్వుని కుమారుడు. ఇతనికి దుష్యంతుడు, ప్రవీరుడు కుమారులు. బృహదారణ్యకంలో ఇతడు స్వాయంభువ మనువు మనవడు అని చెప్పగా, మహాభారతంలో వానప్రస్థం స్వీకరించి తపస్సు చేసి స్వర్గాన్ని చేరిన రాజర్షి అని చెప్పారు. ఈయన కృష్ణయజుర్వేదంలో 47, సామవేదంలో 29 అధర్వణ వేదంలో 2 వెరసి 78 మంత్రాలను దర్శించాడు.

**13. మధుచ్ఛందుడు :** ఇతడు విశ్వామిత్రుని 51వ కుమారుడు అని ఐతరేయ బ్రాహ్మణం చెబుతోంది. ఇతడు కృష్ణయజుర్వేదంలో 47 మంత్రాలు, అధర్వణ వేదంలో 5 మంత్రాలు వెరసి 52 మంత్రాలను దర్శించాడు.

**14. నారాయణుడు :** బ్రహ్మపుత్రుడైన ధర్ముని కుమారుడు. ధర్ముడికి దక్షుని కుమార్తెల వల్ల నరనారాయణులు జన్మించారు. వీరు

శ్రీమహావిష్ణువు యొక్క అవతారము అని భారతంలోని శాంతిపర్వంలో చెప్పబడింది. నారాయణుని తెల్ల వెంట్రుక నుంచి బలరాముడు, నల్లవెంట్రుక నుంచి కృష్ణుడు జన్మించారు. ఈయన కృష్ణయజుర్వేదంలో 45 మంత్రాలు, శుక్లయజుర్వేదంలో 44 మంత్రాలు వెరసి 89 మంత్రాలను దర్శించాడు.

**15. కుత్సుడు :** రాజర్షి అయిన గురువు కుమారుడు. కృష్ణయజుర్వేదంలో 43 మంత్రాలు దర్శించాడు.

**16. వరుణుడు :** అదితి, కశ్యపుల కుమారుడు. ఇతడికి గౌరి, వరుణాని, చర్షణి అని ముగ్గురు భార్యలు. సుషేణుడు, వంది, వశిష్ఠుడు కుమారులు. వారుణి ఇతని కుమార్తె. ఇతడు యమునానదీతీరంలో రాజసూయం చేశాడు. బారతంలో అర్జునుడికి గాండీవాన్నిచ్చాడు. ఇతడు కృష్ణయజుర్వేదంలో 30 మంత్రాలను, శుక్ల యజుర్వేదంలో 35 మంత్రాలను వెరసి 65 మంత్రాలను దర్శించాడు.

**17. ఆంగీరసులు :** అంగిరస వంశస్థులు. కృష్ణుడు, అజీగర్తి, చ్యవనుడు, అయాస్యుడు, సంవర్తుడు, సుధన్వుడు ఈ వంశం వారే. వీరు కృష్ణయజుర్వేదంలో 29 మంత్రాలను, అధర్వణవేదంలో 8 మంత్రాలు వెరసి 37 మంత్రాలు దర్శించారు.

**18. శునఃశ్శేపుడు :** ఇతడు అజీగర్తుని కుమారుడు. హరిశ్చంద్రుడు ఇతణ్ణి యజ్ఞపశువుగా తెచ్చాడు. ఇంకొక కథ ప్రకారం ఇతడు ఋచీకుని కుమారుడు. అంబరీషుడు ఇతణ్ణి యజ్ఞపశువుగా తెచ్చాడు. ఇతణ్ణే దేవరాతుడు అని కూడా అంటారు. ఈయన కృష్ణయజుర్వేదంలో 24 మంత్రాలు, సామవేదంలో 17 అధర్వణ వేదంలో 8 వెరసి 49 మంత్రాలను దర్శించాడు.

**19. జమదగ్ని :** ఋచీకమహర్షికి సత్యవతి వల్ల కలిగిన

సంతానము. ఇతడి మేనమామ విశ్వామిత్రుడు. ప్రసేనజిత్తు కుమార్తె రేణుక ఇతని భార్య. ఇతనికి ఐదుగురు కుమారులు. వీరిలో ఐదవవాడు పరశురాముడు. ఈయన కృష్ణయజుర్వేదంలో 19 అథర్వణవేదంలో ఒకటి, సామవేదంలో 13 దశతులో కొన్ని మంత్రాలను వెరసి 33 మంత్రాలను దర్శించాడు.

**20. దధ్యంగుడు :** అథర్వుని కుమారుడు. ఇంద్రుడు ఇతడికి మధువిద్యను చెప్పి ఇంకెవరికైనా నువ్వు ఈ విద్యను చెబితే నీ తల పగిలిపోతుంది. అన్నాడు. కొంత కాలానికి అశ్వనీ దేవతలు ఆ విద్య నేర్చుకోవాలి అనుకున్నారు. ముందుగానే దధ్యంగుని తల నరికి గుర్రం తల అంటాంచారు. ఈయన శుక్లయజుర్వేదంలో 103 మంత్రాలు దర్శించాడు.

**21. యాజ్ఞవల్క్యుడు :** బ్రహ్మరాతుని కుమారుడు. వైశంపాయనుని మేనల్లుడు. ఆయనదగ్గరే యజుర్వేదాన్ని నేర్చుకున్నాడు. ఒకసారి గురువుగారితో వివాదం వచ్చి తాను నేర్చుకున్న యజుర్వేదం అంతా వదిలేసి, సూర్యుణ్ణి ఉపాసించి మళ్ళీ యజుర్వేదాన్ని అభ్యసించాడు. దీనికే శుక్లయజుర్వేదం అని పేరు. జనక మహారాజుకు ఇతనికీ దగ్గరసంబంధం ఉంది. ఈయన శుక్లయజుర్వేదంలో 81 మంత్రాలు దర్శించాడు.

**22. బృహస్పతి :** అంగిరసుని పుత్రుడు. భాగవతంలో ఇతడు అగ్నిదేవుని కుమారుడు అని చెప్పబడింది. ఇతడు దేవతల గురువు. తార ఇతని భార్య. వానరజాతిలోని తారుడు ఇతని కుమారుడే. కుశధ్వజుడు బృహస్పతి కుమారుడని ఉత్తర రామాయణంలో చెప్పబడింది. ఈయన శుక్లయజుర్వేదంలో 34 మంత్రాలు దర్శించాడు.

**23. వివస్వంతుడు :** అదితికశ్యపుల కుమారుడు. విశ్వకర్మ

కుమార్తె సంజ్ఞ ఇతని భార్య. ఇతని కుమారుడే వైవస్వతమనువు. సూర్యవంశానికి మూలపురుషుడు. యమి, యములు ఇతని సంతానమే. ఒకసారి ఇతడు యజ్ఞంచేసి కశ్యపుడికి దక్షిణగా దక్షిణ దిక్కును సమర్పించాడు. అప్పటి నుంచి దానికి దక్షిణదిశ అని పేరు వచ్చింది. 28 మంది ప్రజాపతులలో ఒకడు. అశ్వనీ కుమారులుగా పేరు పొందిన నాసత్య దస్రులు ఇతని కుమారులు. వారు సంజ్ఞాదేవి నాసిక నుంచి జన్మించారు. ఈయన శుక్లయజుర్వేదంలో 28 మంత్రాలు దర్శించాడు.

**24. కణ్వుడు :** ఇతణ్ణి గురించి బ్రహ్మపురాణంలో ఒక విచిత్రమైన కథ ఉంది. ఇతడికి సామానికి ఆధారం దొరక్క ఆలోచిస్తున్నాడు. ఆ సమయంలో పిల్లి ఒక తుమ్ము తుమ్మింది. ఆశబ్దం ఆధారంగా సామబుక్కు చెప్పాడు. భారతంలో శకుంతలను పెంచినతండ్రి ఈయన. కశ్యపవంశస్థుడు కాబట్టి కాశ్యపుడు అనబడ్డాడు. దుష్యంతుని కుమారుడైన భరతునితో 'గోవితతము' అనే యాగం చేయించాడు. ఈయన సామవేదంలో 29 దశతుల్లో కొన్ని మంత్రాలను దర్శించాడు.

**25. సౌభరి :** ఇతని తండ్రి 'సోభరి' నీటి మధ్య కూర్చుని తపస్సు చేసేవాడు. ఆ రోజుల్లో మత్స్యదేశాన్ని పాలించే మహారాజు సకల భోగాలు అనుభవిస్తున్నాడు. అది చూసిన సోభరి తాను కూడా అలా భోగాలు అనుభవించాలి అనుకుని మాంధాత దగ్గరకు వెళ్ళి 'ఓ మహారాజా! నీ కుమార్తెలను నాకిచ్చి వివాహం చేయవలసింది' అన్నాడు. ఒక్క క్షణం ఆలోచించాడు మాంధాత. ఎదురుగా ఉన్నవాడు తాపసి. అందులోను వృద్ధుడు. అందుచేత 'ఋషీశ్వరా! నా కుమార్తెలు అంగీకరిస్తే తప్పకుండా నీవడిగినట్లే చేస్తాను.' అన్నాడు. అప్పుడు తన తపశ్శక్తితో మంచి యవ్వనాన్ని సుందర రూపాన్ని పొంది, తాను

సుఖంగా ఉండటానికి బంగారు మందిరాలుకూడా నిర్మించుకున్నాడు. మాంధాత మారు మాట్లాడకుండా తన కుమార్తెలనిచ్చి వివాహం చేశాడు. వాళ్ళతో సకల భోగాలు అనుభవించాడు మహర్షి. కొంత కాలానికి చేసిన తప్పు తెలిసింది. దాంతో మళ్ళీ తపస్సు చేసి మోక్షం పొందాడు అని విష్ణు పురాణము, భాగవతాల్లో చెప్పబడింది. ఇతడు సామవేదంలోని 13 దశతుల్లో కొన్ని మంత్రాలు, అధర్వణవేదంలో రెండు మంత్రఖండికలు వెరసి 15 మంత్రాలను దర్శించాడు.

**26. ప్రస్కణ్వుడు :** పురాణేతి హాసాలలో ఈ పేరుగల వారు ఇద్దరు కనిపిస్తారు. ఒకడు మేధాతిథి' కుమారుడు ఇతని వంశంలోని రాజులంతా బ్రాహ్మణులుగా మారినవారే రెండవ వాడు కణ్వమహర్షి కుమారుడు. ఈ పేరుగల మహర్షి సామసంహితలో 13 దశతుల్లోని కొన్ని మంత్రాలను, అధర్వణ వేదంలో 6 మంత్రాలను వెరసి 19 మంత్రాలను దర్శించాడు. మంత్రాలలో వీరి పేరు చెప్పేటప్పుడు' మేధాతిథి కుమారుడు ప్రస్కణ్వుడు' అని 'కణ్వుని కుమారుడు ప్రస్కణ్వుడు' అని చెబుతారు.

**27. నృమేధుడు :** ఇతడు ఒక అంగీరసుడు అని చెబుతోంది పంచవింశ బ్రాహ్మణము. సామవేదంలోని 13 దశతుల్లో కొన్ని మంత్రాలను దర్శించాడు.

**28. ప్రాగాధుడు :** ఇతని గురించిన వివరాలేవీ తెలియవు. ఇతడు సామవేదంలో 8 దశతుల్లో కొన్ని మంత్రాలు దర్శించాడు.

**29. కశ్యపుడు :** ఇతడు మరీచి పుత్రుడు. సంతానం కోసం 'కశ' అనే మద్యాన్ని సేవించాడు కాబట్టి 'కశ్యపుడు' అనబడ్డాడు. దక్షప్రజాపతి కుమార్తెలయిన అదితి, దితి, దనువు, కాల, అనాయువు, సింహిక, క్రోధ, పృథ, విశ్వ, వినత, కద్రువ, కపిల మొదలైన వారిని

వివాహం చేసుకున్నాడు. దేవతలు, దానవులు, మృగాలు, పక్షులు, వృక్షాలు జగత్తంతా ఇతని సంతానమే. ఇతడు ప్రజాపతి దేవర్షి. ఆదిత్యులు, రుద్రులు, మరుత్తులు ఇతని సంతానమే. ఇతడు బ్రహ్మయొక్క అంశ అని చెబుతోంది భారతము. కుబేరునికి గురువు. ఇతణ్ణే 'అరిష్టనేమి' అని కూడా అంటారు. ఇతడు సామవేదంలోని 7 దశతుల్లో కొన్ని మంత్రాలను దర్శించాడు.

**30. రేభుడు :** ఇతని గురించిన వివరాలు దొరకలేదు. ఇతడు సామవేదంలో ఐదు దశతుల్లోని కొన్ని మంత్రాలు దర్శించాడు.

**31. అత్రి :** ఇతడు బ్రహ్మనేత్రాల నుంచి ఆవిర్భవించాడు అని భాగవతం చెబుతోంది. సప్తర్షులలో ఒకరు. అనసూయభర్త అత్రిమహర్షి. వీరికి ముగ్గురు కుమారులు చంద్రుడు, దత్తాత్రేయుడు, దుర్వాసుడు.

'ఆత్మదానము' అని గణపతి స్వామివారు ఒక పుస్తకం వ్రాశారు. దాన్ని **'దత్త జననము'** అనే పేరుతో నేను ఉపన్యాసంగా చెప్పాను. అందులో అత్రిమహర్షి వివాహం ముందు నుంచీ ఉంటుంది. ఆ ఉపన్యాసం చెప్పినంతసేపు సమాధిస్థితిలో ఉన్న అత్రిమహర్షి ఒంటికాలిమీద నుంచుని, తెల్లటిపంచె ధరించి, నడుముకు ఎర్రని కాశితువాలు చుట్టుకుని, పెరిగినజుత్తు ముడివేసుకుని, రెండుచేతులు పైకి ఎత్తి నమస్కారం చేస్తూ తపోనిష్ఠలో ఉన్న అత్రిమహర్షి నా ఎదురుకుండా నిలబడి ఉన్నాడు. వీలయితే మీరుకూడా ఆ ఉపన్యాసం వినండి. అత్రిమహర్షిని, దత్తాత్రేయుణ్ణి దర్శించి తరించండి. ఈ అత్రిమహర్షి సామవేదంలోని 4 దశతుల్లో కొన్ని మంత్రాలను దర్శించాడు.

**32. అధర్వుడు :** ఈయననే అధర్వణుడు అని కూడా అంటారు. అధర్వణ వేదానికి మూలపురుషుడు ఇతడే. ఇతడు

బ్రహ్మమానసపుత్రుడు. కర్దముని కుమార్తె 'శాంత'ను వివాహం చేసుకున్నాడు. ఈ అధర్వుడే అంగీరసుడు అని కూడా పిలువబడతాడు. భృగుమహర్షి శాపంవల్ల అగ్నిదేవుడు సముద్రంలో దాక్కున్నప్పుడు, దేవతల కోసం ఈ అధర్వుడే అగ్నిదేవుని వెదికి కనుక్కున్నాడు. బ్రహ్మద్వారా బ్రహ్మవిద్యను తెలుసుకున్న వాడు. ఇతడు అధర్వణ వేదంలో 148 సూక్తాలను దర్శించాడు.

**33. భృగువు :** ఇతడు బ్రహ్మకుమారుడు. భృగువంశానికి మూలపురుషుడు. ఈ వంశస్థులే భార్గవులు. ఇతడికి రెండు జన్మలున్నాయి. దక్షయజ్ఞంలో ఇతడు మరణించి తిరిగి వరుణిని బ్రహ్మయజ్ఞ సమయంలో పుట్టాడు. నహుషుణ్ణి ఇంద్రపదవి నుంచి తొలగించటానికి అగస్త్య మహర్షికి సలహా ఇచ్చింది ఇతడే. ఇతడు అధర్వణ వేదంలోని 30 సూక్తాలను దర్శించాడు.

**34. శౌనకుడు :** ఇతడి అసలు పేరు గృత్సమదుడు. శునకుని కుమారుడు కాబట్టి శౌనకుడు అనబడ్డాడు. ముండకోపనిషత్తులో ఇతని ప్రస్తావన ఉంది. ఇతడు **'ఋగ్వేదానుక్రమణిక' 'ఋక్ప్రాతిశాఖ్య'** అనే గ్రంథాలు వ్రాశాడు. అశ్వలాయనుడు ఇతని శిష్యుడు. ఇతడు అధర్వణ వేదంలో 10 సూక్తాలు దర్శించాడు.

**35. శుక్రుడు :** ఇతడు వశిష్ఠుని కుమారుడు. అధర్వణ వేదంలో 9 సూక్తాలను దర్శించాడు.

**36. వాలఖిల్యులు :** వీరు అరవై వేలమంది, సూర్యుణ్ణి స్తుతి చేస్తూ సూర్యోదయం నుంచి సూర్యాస్తమానందాకా పక్షుల రూపంలో ఎగురుతూ సూర్యుని ముందు నడుస్తుంటారు. వీరు అంగుష్ట ప్రమాణదేహులు, నిత్య బ్రహ్మచారులు. చెట్టుకు తలక్రిందులుగా వ్రేలాడుతూ తపస్సు చేసేవారు. వేదశాస్త్రాలన్నీ సూర్యుని దగ్గరే

నేర్చుకున్నారు. వీరు సామవేదంలోని 3 దశతుల్లో కొన్ని మంత్రాలను దర్శించారు.

**37. జంట ఋషులు :** ఇద్దరిద్దరు చొప్పున కొన్ని మంత్రాలను దర్శించిన వారిని జంట ఋషులు అంటారు. వీరు **ఇంద్రుడు, బృహస్పతి.** వీరిద్దరూ వాజుపేయ యాగానికి సంబంధించిన మంత్రాలను దర్శించారు. **ఇంద్రాగ్నులు** కొన్ని మంత్రాలు, **అరుణత్రసదస్యులు** కొన్ని మంత్రాలు, **పురుమీఢాజమీఢులు** కొన్ని మంత్రాలు, **అశ్వనీ దేవతలు** కొన్ని వేదమంత్రాలను దర్శించారు. అయితే ఆ మంత్రాలన్నీ శుక్లయజుర్వేదానికి సంబంధించినవే.

అలాగే కొన్ని మంత్రాలను ముగ్గురు ఋషులు చొప్పున దర్శించారు. వారు **ఇంద్ర అగ్ని విశ్వకర్మలు** కొన్ని మంత్రాలు దర్శించారు. శతరుద్రీయంలోని మంత్రాలకు పరమేష్ఠి దేవప్రజాపతులు. శుక్లయజుర్వేదంలోని సౌత్రామణి అంగభూత కర్మల మంత్రాలకు ప్రజాపతి, అశ్వ, సరస్వతి ఋషులు. వీరే కాక ఇంకా అనేకమంది ఋషీశ్వరులు వేదమంత్రాలను దర్శించి మనకందించారు.

వేదమంత్రాలు దర్శించిన వారిలో కొంతమంది క్షత్రియులుకూడా ఉన్నారు. విశ్వామిత్రుడు రాజుగా ఉన్నప్పుడు అతని కుమారుడు ఋషభుడు ఆర్షసామాన్ని దర్శించాడు. ఇది క్షత్రియ సామం.

**స్త్రీలు వేదాలు చదవచ్చా?** ఇది కొన్ని లక్షల డాలర్ల ప్రశ్న. అనాదిగా ప్రతివారికీ ఈ అనుమానం వస్తూనే ఉంది. స్త్రీకి వేదం చదివే అర్హత లేదు అంటారు శిష్టాచారులు. అయితే వేదమంత్రాలు దర్శించిన వారిలో కొంతమంది స్త్రీలు కూడా ఉన్నారు. వీరిలో కొందరు.

1. ఉశన – భృగుమహర్షి భార్య. శుక్రాచార్యుని తల్లి.

2. గౌరవీతి, 3. చైలకి, 4. జయ 5. ప్రాదురాక్షి 6. భరద్వాజపుత్రి 7. మేధ (దక్షుని కుమార్తె) 8. రమ్యాక్షి 9. లోపాముద్ర (అగస్త్యుని భార్య) 10. లోగాక్షి 11. వసుశ్రుత 12. వారుణి 13. విదర్భి 14. విశ్వవార 15. వృష 16. శిరింభిర (భరద్వాజుని కుమార్తె) 17. సర్వరాజ్ఞి 18. కద్రువ (నాగమాత) 19. సునీతి 20 అసురి. 21. హైమ. వీరంతా బ్రహ్మవాదినులు శుక్లయజుర్వేదంలోని మంత్రాలు మాత్రమే దర్శించారు. ఋగ్వేదంలోని 126వ సూక్తంలోని 7వ మంత్రాన్ని 'రోమశ' అనే స్త్రీ దర్శించింది. పదవ మండలంలోని 125వ సూక్తాన్ని 'అంభృణపుత్రి' అనే స్త్రీ దర్శించింది త్వష్టప్రజాపతి కుమార్తెలు త్వాష్ట్రులు కొన్ని సామమంత్రాలు దర్శించారు.

ఆ రోజుల్లో స్త్రీలకి కూడా ఉపనయనం చేసి వారికి వేదం నేర్పించే వారు. ఇది ఆ రోజుల్లో సంప్రదాయము. యజ్ఞయాగాదిక్రతువులలో యజమాని భార్య కూడా కొన్ని మంత్రాలు చదవాలి.

ఇప్పటివరకు వేదమంత్రాలు దర్శించిన ఋషులను గురించి చెప్పుకున్నాం. కేవలం వీళ్ళు కొందరు మాత్రమే. వీళ్ళుగాక ఇంకా అనేకమంది మహర్షులున్నారు.

## 12. పాఠవిశేషాలు

పూర్వకాలంలో ఋక్కులు, యజస్సులు, సామాలు అన్నీ కలిసి ఉండేవి. వాటిని వ్యాసుడు వేరుచేశాడు. అని గతంలో చెప్పుకున్నాం. ఇలా ఒకే మంత్రాలను ఒక చోట కూర్చటానే 'సంధానము' అంటారు. ఈ కూర్పునే 'సంహిత' అని కూడా అంటారు. వీటిని వ్యాసుడు తన శిష్యులైన పైలుడు, వైశంపాయనుడు. జైమిని, సుమంతుడు అనే వారికిచ్చాడు అని మహీధరుడు, భట్టభాస్కరుడు, దుర్గాచార్యుడు వారి భాష్యాలలో వ్రాశారు. అయితే ఆయన ఏర్పాటు చేసిన సంహిత అనేక మార్పులు చెందింది. కొందరు మహర్షులు ఆ వేదాలను క్రమద్ధంగా వాళ్ళకి అనుకూలంగా మళ్ళా కూర్చారు.

అవే శాఖలు అనబడ్డాయి. సంహిత అనేది మంత్రభాగం. సంహితలు రెండు రకాలు. 1. నిర్భుజ సంహిత 2. ప్రతృణ సంహిత. నిర్భుజ సంహితలో పాఠం యథాక్రమంగా ఉంటుంది.

**'అగ్నిమీడే పురోహితమ్'**

ప్రతృణ సంహిత మళ్ళీ రెండు రకాలు. 1. పదసంహిత 2. క్రమసంహిత ముందుగా పదసంహిత పాఠం చూద్దాం.

**అగ్నిమ్, ఈడే, పురః ఉ హితమ్**

క్రమసంహిత పాఠం దీన్ని మొదటగా **'బాభ్రవ్యుడు'** అనే ఋషి చెప్పాడు.

**అగ్నిమ్, ఈడే, ఈడే పురోహితమ్ పురోహితమితి పురఃఉ హితమ్**

ఈ క్రమంపాఠం ఎనిమిది రకాలయింది. ముందుగా అసలు **సంహితపాఠం** చూద్దాం.

ఓషధయః సంవదన్తే సోమేన సహరాజ్ఞా

యస్మైకృణోతి బ్రాహ్మణస్తం రాజాన్పారయామసి

**పదపాఠం**

ఓషదయః । సం । వదన్తే । సోమేన । సహ । రాజ్ఞా ।

యస్మై। కృణోతి । బ్రాహ్మణః । తం । రాజన్ । పారయామసి ।

**క్రమపాఠం**

ఓషధయః సం । సంవదన్తే । వదన్తే సోమేన । సోమేన సహ ।

సహరాజ్ఞా । రాజ్ఞేతి రాజ్ఞా ।

యస్మై కృణోతి । కృణోతి బ్రాహ్మణః । బ్రాహ్మణస్తం ।

తంరాజన్ । రాజన్ పారయామసి । పారయామసీతి పారయామసి ॥

ఈ క్రమంపాఠం ఎనిమిది రకాలుగా రూపాంతరం చెందింది.

1. జట 2. మాల 3. శిఖ 4. రేఖ 5. ధ్వజం 6. దండం 7. రథం 8. ఘన

వీటిలో మొదటి ఏడురకాలు దరిదాపుగా కనుమరుగై పోగా కేవలము ఘనమాత్రమే మిగిలింది. మంత్రం చివర నుంచి మొదటిదాకా చెప్పి మళ్ళీ మొదటి నుంచి చివరిదాకా చెప్పటాన్నే ఘన అంటారు.

# ఘనపాఠం

ఈ ఘనపాఠం రెండు రకాలుగా ఉంటుంది.

1. ఘనము 2. ఘన వల్లభము. మళ్ళీ అవి ఒక్కొక్కటి రెండు రకాలుగా ఉంటాయి. ఇలా చూస్తే ఘన మొత్తం నాలుగు విధాలుగా ఉంటుంది.

ఇప్పుడు పై మంత్రంలో మొదటి పాదం చూద్దాం.

**"ఓషధయః సంవదన్తే సోమేన సహరాజ్ఞా"**

ఇప్పుడు దీనికి ఘన చూడండి. చివర నుంచి మొదటికి.

**రాజ్ఞేతిరాజ్ఞా ! సహరాజ్ఞా ! సోమేన సహ ! వదన్తే సోమేన ! సంవదన్తే ! ఓషధయః సం ।**

ఇప్పుడు మొదట నుంచి చివరకు

**సంవదన్తే । వదన్తే సోమేన । సోమేన సహ । సహరాజ్ఞా । రాజ్ఞేతి రాజ్ఞా।**

ఇప్పుడు రెండవపాదం చూడండి.

**"యస్మైకృణోతి బ్రాహ్మణస్త్రం రాజాన్పారయామసి"**

ఇప్పుడు ఈ పాదానికి ఘన చూడండి. చివర నుంచి మొదటికి

**పారయామసీతి పారయామసి । రాజన్ పారయామసి ।**

**తం రాజన్ । బ్రాహ్మణస్త్రం । కృణోతి బ్రాహ్మణః । యస్మైకృణోతి।**

ఇప్పుడు మొదటి నుంచి చివరకు

**కృణోతి బ్రాహ్మణః । బ్రాహ్మణస్తం । తం రాజన్ । రాజన్**

పారయామసి। పారయామసీతి పారయామసి ।

ఘన చదివిన వారిని ఘనపాఠీ అంటారు. ఆ రోజుల్లో వేదమంత్రాలు వ్రాయటానికి లేదు. కాబట్టి వేదమంత్రాలను యథాతథంగా ఉంచటానికే ఈ ప్రక్రియలు చెయ్యబడ్డాయి.

ఋగ్వేద సంహితలో ప్రతి సూక్తానికి ఋషి, దేవత, ఛందస్సు చెప్పబడ్డాయి. ఈ సంహిత పారాయణ, జపం హోమాల్లో ఎక్కడైనా సరే ఋషి దేవత ఛందస్సులు చెప్పి తీరాలి. ఇదే ఋగ్వేదం ప్రత్యేకత.

ఋక్సంహితలో పది మండలాలున్నాయి. వాటిలో

2వ మండలం – గృత్సమదుడు

3వ మండలం – విశ్వామిత్రుడు

4వ మండలం – వామదేవుడు

5వ మండలం – అత్రి

6వ మండలం – భరద్వాజుడు

7వ మండలం – వశిష్ఠుడు

ఈ మండలాలను ఈ ఋషులు, వారి సంతతి, వారి గోత్రీకులు దర్శించారు. అదే 1,8,9,10 మండలాలు ఒక్కొక్కటి ఒక్కొక్క పద్ధతిలో ఉంటాయి. 8వ మండలంలో మూడువంతులు సూక్తాలు కణ్వుడు, అతని వంశీయులచే దర్శించ బడ్డాయి. 9వ మండలంలో అన్ని సూక్తాలు పవమాన సోమదేవత గురించే ఉంటాయి.

# 13. వేదాన్ని ఎందుకు ఆదరించాలి?

ఇది కోటానుకోట్ల రూపాయలు ప్రశ్న. దీనికి సరైన సమాధానం చెప్పలేకపోయినా కొంతవరకైనా ఈ అనుమానాన్ని నివృత్తి చెయ్యటానికి ప్రయత్నం చేద్దాం. వేదాలు ప్రాచీన భారతీయ విజ్ఞానభాండాగారము. ఎంతమందో ఋషీశ్వరులు సంవత్సరాల తరబడి సమాధిస్థితిలో ఉండి దర్శించినవే ఈ వేదమంత్రాలు. ఇవి ఎవరూ వ్రాసినవి, చెప్పినవి, రచించినవి కాదు. సాక్షాత్తు పరమ పురుషుడే ఈ లోకాలను ఉద్ధరించాలనే ఉద్దేశ్యంతో, ధర్మార్ధ కామ మోక్షాలనే చతుర్విధ పురుషార్ధాలను అందరికీ అందించాలనే కోరికతో సమాధి స్థితిలో ఉన్న ఆప్త ఋషులకు దర్శింపచేసిన ఇహపర సాధకమైన విజ్ఞాన నిధి ఈ వేదాలు.

వేదంలో అనేకానేక విషయాలు చెప్పబడ్డాయి.

**1. ఆకాశయానం :** ఒకచోట నుంచి ఇంకొక చోటికి వెళ్ళాలంటే గంటల తరబడి ప్రయాణం చెయ్యాలి. ఒక్కోసారి రోజుల తరబడి కూడా ప్రయాణం చెయ్యాల్సి ఉంటుంది. రైట్‌సోదరులు విమానం కనిపెట్టిన తరువాత ఆకాశయానం ఉపయోగంలోకి వచ్చింది. దీంతో ప్రయాణ సమయం చాలావరకు తగ్గిపోయింది ఈ రోజున. కాని పూర్వకాలంలో ఎలా ఉండేది అని ఆలోచిస్తే, విమానాలు ఆ రోజునే ఉపయోగంలో ఉండేవని తెలుస్తోంది. **ఋగ్వేదంలోని ప్రథమ మండలంలోని 116వ సూక్తంలో** తగ్రుడు అనే రాజర్షి తన కుమారుడు భుజ్యుడు అనేవాణ్ణి శత్రువులతో యుద్ధం చెయ్యటానికి విమానంలో పంపాడు. ఆ విమానాన్ని అశ్వనీ దేవతలు నడిపారట. అది పూర్తిగా యంత్రాలతో నడిచింది. భరద్వాజుడు "విమాన విజ్ఞానశాస్త్రము" అనే పుస్తకం వ్రాశాడు. అందులో విమానం ఎలా నడపాలి. ఏ రకంగా

మరమ్మతు చెయ్యాలి. అనే విషయాలతోపాటుగా శత్రువిమానాలు ఎక్కడున్నాయో మనం ఇక్కడ నుంచే ఈ విమానంలోంచే చూడచ్చు. వాటిని నాశనం కూడా చెయ్యచ్చు. అంటే రాడారు వ్యవస్థ కూడా ఉన్నదన్న మాట. యజుర్వేదంలోను, అథర్వణ వేదంలోను కూడా విమానయానం గురించి చెప్పటం జరిగింది. అంటే **ప్రపంచం కళ్ళు తెరవకముందే మనం విమానయానం చేశామన్న మాట.**

**2. ఆరోగ్యానికి మందులు :** ఎంత గొప్పవాడైనా, ఉక్కు శరీరం వాడైనా, జీవితంలో తప్పనిసరిగా ఎప్పుడో ఒకప్పుడు మందులు వాడాల్సిందే తప్పదు. ఇవాళ్టి రోజున మనం ఎక్కువగా ఇంగ్లీసు మందుల మీద ఆధారపడుతున్నాం కాని పూర్వకాలంలో అలా జరగలేదు. వైద్యం రెండు రకాలు 1. మూలికా వైద్యం 2. ఆయుర్వేదం. అడవులలోను కొండలలోను అనేక మొక్కలు పెరుగుతాయి. ప్రతిమొక్కతోను ఉపయోగం ఉంది దాని విలువ తెలిస్తే ప్రాచీన కాలంలో అడవుల వెంబడి తిరిగి అనేక రకాల మూలికలు సేకరించి వాటిని వండి, నూరి మందులు తయారుచేసే వారు. ఈ మందులు అనేక రకాలుగా ఉపయోగించేవి. పోయిన కంటి చూపు తెప్పించటానికి, విరిగిన కాలు అతికించటానికి, చివరకి ముసలితనాన్ని పోగొట్టి నిండు యవ్వనాన్ని తెప్పించటానికి కూడా ఈ మందులు వాడేవారు. **వైద్యోనారాయణో హరిః** వైద్యుడు సాక్షాత్తు పరమేశ్వరుడు అని వారి నమ్మకం. ఋగ్వేదానికి ఉపవేదం ఆయుర్వేదం ఓషధీ సూక్తాలు ఋగ్వేదంలో ఉన్నాయి. యజుర్వేదంలో మూలికల గురించి వివరించారు. అధర్వణ వేదంలో చాలా భాగం ఓషధుల గురించే ఉన్నది. క్షయ, కుష్ఠ వంటి వ్యాధులకు కూడా మందులు చెప్పారు.

**3. విద్యుత్తు :** ఆధునిక ప్రపంచంలో విద్యుచ్ఛక్తిని కనుక్కున

తరువాత అనేక విప్లవాత్మక మార్పులు వచ్చాయి పారిశ్రామిక రంగంలో. విద్యుత్తు ఈ రోజున తప్పనిసరి అయిపోయింది. జీవితంలో ఒక భాగము విద్యుత్తు.

కాని ఇది వేదకాలంలోనే ఉంది. విద్యుత్తు యొక్క లక్షణాలను యజుర్వేదంలో చెప్పారు. అది అగ్ని స్వరూపము. దానికి రెండు తలలు. వస్తూ పోతూ ఉంటుంది. రవ్వల రూపంలో ఆవిర్భవిస్తుంది. ధనాత్మకము, ఋణాత్మకము అని రెండు మార్గాలు అని కూడా చెప్పారు. ఈ మాటలను బట్టి విద్యుత్తును గురించి ఆ కాలంలోనే పూర్తి అవగాహన ఉన్నదనే విషయం మనకి తెలుస్తోంది.

**4. స్త్రీకి సమాన హక్కులు :** ఈ రోజుదాకా స్త్రీకి సమానహక్కులు మనం కల్పించలేకపోయాం. సమాజంలో స్త్రీ బాధపడుతూనే ఉంది. కాని వేదకాలంలో స్త్రీలకు ఈ మాట ఋగ్వేదంలో చెప్పబడింది. స్త్రీ పురుషులు ఇద్దరూ సంసారమనే బండికి చక్రాలు. ఇద్దరూ సమానంగా ఉంటేనే బండి తిరుగుతుంది. పురుషుడితో పాటు స్త్రీ కూడా యజ్ఞయాగాలలో పాల్గొనాలి. ఆవిడ అక్కడ కొన్ని మంత్రాలు కూడా చదవాలి. స్త్రీ లేని పురుషుడు పూర్ణపురుషుడు కాదు. అతడు ఏ కర్మ చెయ్యటానికి అర్హుడు కాదు. వివాహం అయిన తరువాత స్త్రీ తన ఇంట్లో మకుటం లేని మహారాణి. ఆ యింటి మీద తనకు అధికారము వస్తుంది. అధికారంతో పాటుగా బాధ్యతలు కూడా ఉంటాయి. వేదంలో స్త్రీకి సమానహక్కు, గౌరవము, ఆస్తి హక్కు కూడా ఉంది.

**5. ఇల్లు ఎలా ఉండాలి :** ఇల్లు ఎలా ఉండాలి? ఈ రోజున పెళ్ళి అయిన తరువాత నేను నా భార్యా వేరే కాపురం ఉండాలి. కుటుంబం అంటే నేను, నా భార్య, నా పిల్లలు, అంతేకాని తల్లితండ్రి నా కుటుంబ సభ్యులు కారు. ఇది పాశ్చాత్య సంప్రదాయం. అదే మనకూ కావాలి

అనుకుంటున్నాం. ఇది చాలా గొప్ప సంస్కృతి అని భావిస్తున్నాం. అయితే ఆ రోజున అలా లేరు. ఇల్లు అంటే నేను నా భార్య పిల్లలు, తల్లితండ్రులు, అన్నదమ్ములు, అక్క చెల్లెళ్ళు. అందరూ మనవాళ్ళే ఇది భావన. అధర్వణ వేదంలోని గృహసూక్తంలో

**మా గృహాలు మధుర సంభాషణలు కలవై ఉండాలి. ఆకలి దప్పికలు లేకుండా, సంతోషంతో నిండి పోవాలి. ధనధాన్యాలు, సిరిసంపదలు పుష్కలంగా ఉండాలి. బంధుమిత్రులతో ఇల్లు ఎప్పుడూ కళకళలాడుతూ ఉండాలి. కుటుంబ సభ్యులంతా ఆరోగ్యంతో ఉండాలి. ఆహార పదార్థాలు, పాడిపంట పుష్కలంగా ఉండాలి." అని భావించారు. లోకకళ్యాణం కోరుకున్నారు.**

**6. పూర్ణాయుష్షు:** ఇవాల్టి రోజున మానవుడు డెబ్బైసంవత్సరాల వరకు జీవిస్తున్నాడు. ఒక రకంగా చెప్పాలంటే అదే పూర్ణాయువు. కాని ఆ రోజుల్లో ప్రతి మనిషి వంద సంవత్సరాలు జీవించేవాడు. పెద్దవాళ్ళు ఉండగా చిన్నవాళ్ళు మరణించటం జరిగేది కాదు. అసలు మానవుడి ఆయుష్షు వందసంవత్సరాలు. జఠరాగ్నిని జాగ్రత్తగా కాపాడుకున్నవాడు ఇంకా మూడు వందల సంవత్సరాలు జీవించవచ్చు. ఇంద్రియ నిగ్రహం పాటిస్తే మూడు వందల సంవత్సరాలు, యోగాభ్యాసం ప్రాణాయామం చేస్తే మూడు వందల సంవత్సరాలు వెరసి వెయ్యి సంవత్సరాలు మానవ జీవితం ఉంటుంది అని చెబుతున్నాయి వేదాలు.

**జాతీయ భావన :** ఈ రోజున మన చుట్టూ గిరిగీసుకున్నాం. ఇది నా ఊరు. నా జిల్లా, నారాష్ట్రం ఇలా మాట్లాడుతున్నాం. ఒకే భాష మాట్లాడే మనం రెండు రాష్ట్రాలుగా విడిపోయాం. ప్రాంతీయతత్త్వం. అధికారదాహం. కాని ఆనాడు ఇవేమీ లేవు. అంతా

ఒకటే కుటుంబం. వసుధైక కుటుంబం. సంకుచిత భావాలు లేవు. అందరిదీ విశాలహృదయమే. యజ్ఞయాగాదిక్రతువులు చేసినప్పుడు నా దేశంలో అందరూ సుఖసౌఖ్యాలతో, సిరిసంపదలతో బాగుండాలి. అనుకున్నారు అంతేకాని దేశసంపద అంతా నా ఒక్కడికే సొంతం కావాలి అని ఎవరూ అనుకోలా. ఎవరికి నష్టం వచ్చినా అందరూ బాధపడ్డారు. అందరిలోనూ ఒకటే భావన 'జాతీయ భావన'. ఇవి కొన్ని మాత్రమే. ఇంకా ఇలాంటి విషయాలు అనేకం ఉన్నాయి వేదాలలో. వీటిని బట్టి వేదాలను ఆదరించాలా? వద్దా? అనేది మీరే నిర్ణయించుకోండి.

# 14. వేదము - దేవతలు

మానవులకన్నా ఎక్కువ శక్తి గలవారు, పూజలు, స్తోత్రాలచే ప్రీతి చెందేవారు, మానవుల కోరికలు తీర్చేవారు దేవతలు. దేవతలంతా స్వర్గలోకంలో ఉంటారు. అసలు దేవతలు ముప్పైముగ్గురు అని బృహదారణ్యకం చెబుతోంది. ఏకాదశ రుద్రులు 11, ద్వాదశాదిత్యులు 12, అష్టవసువులు 8 ఇంద్రుడు, ప్రజాపతి వెరసి 33. ఇంత మంది దేవతలను చెప్పినప్పటికీ వేదంలో చెప్పింది ఏకేశ్వరోపాసన. **'సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా'** సాధకుని కోరికలు తీర్చటానికి అనువుగా పరమేశ్వరుడికి రూపం కల్పించబడింది. పరమేశ్వరుడే అగ్ని, ఇంద్రుడు, రుద్రుడు మొదలైన పేర్లతో పిలువబడుతున్నాడు. అతని కళ్యాణ గుణాల ఆధారంగా ఇన్ని పేర్లు రూపాలు ఏర్పడ్డాయి. ఆయుష్షునిచ్చేవాడు కాబట్టి అగ్ని అని, బలము వీర్యము ఇస్తాడు కాబట్టి ఇంద్రుడని, మంచివారిని రక్షిస్తాడు కాబట్టి మిత్రుడని, దుర్మార్గులను శిక్షిస్తాడు కాబట్టి వరుణుడని, దృష్టినిస్తాడు కాబట్టి సవిత, ధనాన్నిస్తాడు కాబట్టి బ్రహ్మ ఇలా రకరకాల పేర్లతో పిలవబడి రకరకాల దేవతలు ఏర్పడ్డారు.

వేదంలో అనేక పేర్లు చెప్పబడినా నిజంగా ఉన్నది ఒకే దేవత. అగ్నిని స్తుతి చేస్తూ "ఓ అగ్ని నువ్వు పుట్టినప్పుడు వరుణుడవు. ప్రజ్వలించినప్పుడు మిత్రుడవు అవుతున్నావు. నీలోనే అందరూ దేవతలు ఉన్నారు" అన్నారు అలాగే **ఋగ్వేదం ఒకట మండలంలోని 164 సూక్తం 46వ మంత్రంలో** 'మేధావులు ఆదిత్యుని ఇంద్రుడు, మిత్రుడు, వరుణుడు, అగ్ని అంటారు. అతడు స్వర్గమందున్నాడు" అన్నారు. అగ్నికి భూమిమీద నిప్పు, అంతరిక్షంలో మెరుపు, స్వర్గంలో సూర్యుడు ఇలా అనేక రూపాలున్నాయి. దీన్ని బట్టి చూస్తే ఉన్నది ఒకే దేవత

కాని పేర్లుమాత్రం అనేకం అని తెలుస్తుంది.

దేవతలు కూడా మానవుల లాగానే ఇదే రూపంలో ఉన్నారు. దేవతలకి తల, కన్ను, ముక్కు, చెవులు, నోరు, జుట్టు, బుజాలు, కాళ్ళు చేతులు ఉన్నాయి. కొందరు దేవతలు దుస్తులు వేసుకున్నారు ఉదాహరణకి ఉషస్సు ఆడంబరమైన దుస్తులు ధరించిన దేవత. కొందరు దేవతలకి కవచము, శిరస్త్రాణము, ఆయుధాలు కూడా ఉన్నాయి. ఇంద్రుడికి వజ్రాయుధం ఉంది. కొంతమందికి ఈటెలు, విల్లంబులు ఉన్నాయి. ప్రతి దేవతకి ప్రకాశించే రథం ఉంది. సామాన్యంగా ఆ రథాన్ని గుర్రాలు లాగుతాయి. పూషుడి రథాన్ని మేకలు లాగుతాయి. దేవతలు తమ రథాలమీద వచ్చి యాగంలో దర్భాసనాల మీద కూచుంటారు. వారికి ఇష్టమైన పానీయం సోమరసం.

దేవతలు ఎంతమంది? అన్నప్పుడు ఋగ్వేదము, అధర్వవేదము దేవతల సంఖ్య 33 అని చెబుతున్నాయి. వారిలో 11 మంది భూమిమీద, 11 మంది అంతరిక్షంలో, 11 మంది స్వర్గంలో ఉన్నారు. అయితే ఒకచోట దేవతలు మూడు కోట్లమంది అనికూడా చెప్పబడింది. దేవతలు మూడు స్థానాలలో 1 భూలోకము 2. అంతరిక్షము 3. స్వర్గములలో ఉంటారు అని యాస్కుడు నిరుక్తంలో చెప్పాడు. నిరుక్తకారుల అభిప్రాయంలో భూమిమీద అగ్ని, అంతరిక్షంలో – వాయువు, స్వర్గంలో – సూర్యుడు, ఈ ముగ్గురే దేవతలు. ఈ విషయం **ఋగ్వేదం పదవమండలంలోని 158వ సూక్తంలోని మొదటి మంత్రంలో** చెప్పబడింది. "దేవతల ఉపద్రవం నుంచి – సూర్యుడు, ఆకాశం ఉపద్రవం నుంచి వాయువు, భూమి ఉపద్రవం నుంచి అగ్ని మమ్ము రక్షించు గాక".

వేదంలో చెప్పిన దేవతలలో తరతమ భేదాలున్నాయి. వారిలో కొందరు బలవంతులు, కొందరు దుర్బలులు. కొందరు వృద్ధులు మరికొందరు యువకులు. ఈ విషయం ఋగ్వేదంలోని ఒకటవ మండలంలో 27వ సూక్తంలోని 13వ మంత్రంలో చెప్పబడింది. "బలవంతులకు నమస్కారము. దుర్బలులకు నమస్కారము. యువకులకు నమస్కారము. వృద్ధులకు నమస్కారము" దేవతలలో ఇంద్రుడు బలవైనవాడు. శత్రువులను సంహరించేవాడు. దేవతలందరిలోను ఉన్న ఒక లక్షణం ఏమంటే 'దేవతలందరూ మంచి తేజస్సుతో ప్రకాశిస్తుంటారు.

ఋగ్వేదంలో ముఖ్యమైన దేవతలు 33. కృష్ణయజుర్వేదంలో వంద పైగా దేవతలున్నారు. శుక్లయజుర్వేదంలో దేవతలు 34, ఋక్ యజుస్సామాలలో ఉన్న దేవతలందరూ అధర్వణ వేదంలో చెప్పబడ్డారు. నాలుగు వేదాలలోను చూసినట్లైతే ముఖ్యమైన దేవతలు :

1. ఇంద్రుడు
2. అగ్ని
3. సూర్యుడు
4. విష్ణువు
5. రుద్రుడు
6. సోముడు
7. ద్యావాపృథివి
8. మరుత్తులు
9. అశ్వనీ దేవతలు
10. సవిత
11. ప్రజాపతి

12. వాయువు
13. పురుషుడు
14. వరుణుడు
15. ఉషస్సు
16. పూష
17. బృహస్పతి
18. యముడు
19. విశ్వేదేవులు
20. ఈశ్వరుడు
21. పితరులు
22. మిత్రావరుణులు

వీళ్ళలో కొంతమంది అన్ని వేదాలలోను కనిపిస్తే కొంతమంది ఒకటి, రెండు వేదాలలో మాత్రమే కనిపిస్తారు. ఇప్పుడు వీళ్ళని గురించి చూద్దాం.

**1. ఇంద్రుడు :** ఇతడు అన్ని వేదాలలోనూ కనిపిస్తాడు. ఇంద్రుడు అంతరిక్షంలో ఉండే దేవత. **ఋగ్వేదంలోని ఒకటవ మండలంలోని 51వ సూక్తం రెండవ** మంత్రంలో 'ఇంద్రుడు అంతరిక్షంలో ప్రకాశము కలిగిస్తాడు." అని చెప్పబడింది. అలాగే నిరుక్తంలో కూడా ఈయన పేరు అంతరిక్ష స్థానంలోనే ఉన్నది. ఇంద్రుడు పుట్టుక కలిగినవాడు. **3వ మండలంలోని 48వ సూక్తంలో** "ఇంద్రా నువ్వు జన్మించిన రోజునే పిపాసివయినావు. పర్వతాలలో ఉన్న సోమరసాన్ని త్రాగావు. నీ తల్లి అదితి చనుపాలు ఇవ్వటానికి ముందు నీకు సోమరసం పట్టించింది. ఇంద్రుడు తల్లిని అన్నము అడిగాడు" అని చెప్పబడింది. అలాగే **4వ**

**మండలంలోని 18వ సూక్తంలో** ఇంద్రుడు త్వష్ట ఇంట్లోకి వెళ్ళి అక్కడ ఉన్న సోమాన్ని బలవంతంగా తీసుకుని తాగేశాడు. ఇప్పుడు వామదేవుడు అంటున్నాడు. "అదితి ఇంద్రుణ్ణి అనేక మాసాలు మోసి కన్నది. మరి ఇంద్రుడు ఇలాటిపని ఎందుకు చేశాడు?" ఆ మాటలు విన్న అదితి "వామదేవా! కొందరు దేవతలు పుట్టారు. కొందరు పుడుతున్నారు. వాళ్ళతో ఇంద్రుణ్ణి పోల్చవద్దు" అంటుంది. ఈ రెండు సూక్తాలు కూడా ఇంద్రుని పుట్టుకను చెబుతున్నాయి. ఇంద్రుడు సహజమైన పద్ధతిలోనే జన్మించాడు. పుట్టిన వెంటనే ఆకాశాన్ని ప్రకాశింపచేశాడు. ఇంద్రుడు మహాబలవంతుడు. గొప్ప యోధుడు. అతడు పుట్టగానే దేవతలంతా అతన్ని చూసి భయపడ్డారు. దేవతలే కాదు భూమి ఆకాశము కూడా అతణ్ణి చూసి భయపడ్డాయి. రాక్షస సంహారం కోసమే ఇంద్రుడు జన్మించాడు. **ముఖాదింద్రశ్చాగ్నిశ్చ** ఆ పరమేశ్వరుని ముఖం నుంచి ఇంద్రుడు అగ్ని పుట్టారు అని పురుష సూక్తంలో చెప్పబడింది.

ఋగ్వేదంలో మొత్తం 1028 సూక్తాలు ఉండగా అందులో నాల్గవ వంతు ఇంద్రుణ్ణి గురించే ఉన్నాయి. ఇంకా కొన్ని ఇతర దేవతలతో కలసి ఉన్నాయి. మొత్తం మీద గనక చూసినట్లైతే 300దాకా సూక్తాలలో ఇతడు మనకి దర్శనమిస్తాడు. అంతరిక్షంలో ఉంటూ జలాధిదేవతగా, యుద్ధాధిదేవతగా కీర్తించబడ్డాడు. అతని శరీరము బాగా దృఢంగా ఉంటుంది. అతనిది బానకడుపుకన్న పెద్దది. అందుకే **3వ మండలంలోని 36వ సూక్తంలోని '8వ మంత్రంలో**' ఇంద్రుని ఉదరము పెద్ద తటాకము వంటిది' అదే సోమానికి ఆధారభూమి' అని చెప్పారు. అతని కేశపాశాలు హరితవర్ణాలు. ఇతడు చాలా పెద్ద శరీరం కలవాడు. తన శరీరంతో ముల్లోకాలను అతిక్రమించాడు. భూమికన్న పదిరెట్లు

పరిమాణం గల శరీరం కలవాడు. 8వ **మండలంలోని 59వ సూక్తంలో** 'ఓ ఇంద్రా! వందద్యులోకాలైనా నీకు సరితూగవు. వందభూలోకాలు కూడా నీకు సరికావు. వందమంది సూర్యులైనా నిన్ను ప్రకాశింప చేయలేరు అని చెప్పారు ఈ లోకంలోని అతనికి సృష్టి అంతా, భూమి ఆకాశాలుకూడా హద్దులు కావు. ఇంతవరకు పుట్టినవారిలో కాని, ఇకముందు పుట్టబోయే వారిలో గాని అతనితో సమానమైన వారు లేరు. దేవతలంతా ఆతని ఆజ్ఞకు బద్ధులై ఉంటారు. ఇతడు ఈ జగత్తుకు అధిపతి. కామరూపి. చాలా బలమైన భుజాలు కలవాడు.

ఇంద్రాగ్నులు కవలలు. పూష కూడా ఇంద్రుని సోదరుడే. మరుత్తులు అతని సేవకులు. సోమపాన ప్రియుడు, ఇతని వీరకృత్యాలకు సోమపానమే కారణము. వృత్రాసురుని సంహరించటానికి మూడు చెరువుల సోమరసం త్రాగాడు. ముప్పై సరస్సుల మద్యాన్ని ఒకేసారి తాగగలవాడు. సోమపానం బాగా చేసి అనారోగ్యం పాలయ్యాడు. అప్పుడు దేవతలు **'సౌత్రామణి'** యాగం చేసి ఇతడి అనారోగ్యం పోగొట్టారు. వృత్రాసురుడు జలాన్ని దిగ్బంధించాడు. ఇంద్రుడు అతన్ని సంహరించి జలాలను విడుదల చేశాడు. అలా జలాలను వదిలినవాడు కావటంవల్లనే ఇంద్రుడనబడ్డాడు. ఇందు అంటే – జలబిందువు అని అర్థం. వర్షాలు కురిపించి మానవులకు జలాన్నిచ్చేవాడు ఇంద్రుడే.

ఇంద్రుడు వజ్రాయుధం ధరించి రాక్షస సంహారం చేస్తాడు. వజ్రాయుధం త్వష్టచేత నిర్మించబడింది. **మొదటి మండలంలోని 32వ సూక్తంలో** ఇంద్రుడు వజ్రాయుధము గలవాడు. దాన్ని త్వష్ట సృష్టించి ఇచ్చాడు అని చెప్పబడింది. ఈ సూక్తములో ఇంద్రుడు వృత్రాసురుని సంహరించి జలములను విడుదల చేయించటం చెప్పబడింది. ఇంకొక

చోట వజ్రాయుధము 'కావ్య ఉశునుడి' చేత నిర్మించబడింది అన్నారు. ఇది లోహనిర్మితమని, బంగారు నిర్మితమనికూడా చెప్పారు. వజ్రాయుధునికి నాలుగు కోణాలున్నాయని, వంద కోణాలున్నాయని, వంద అంచులున్నాయని, వందకణుపులున్నాయని, వేయి అంచులున్నాయని రకరకాలుగా చెప్పబడింది. ఇంద్రుడికి వజ్రాయుధమే కాకుండా ధనుర్బాణాలు, అంకుశము కూడా ఆయుధాలు.

ఇంద్రుడు రథంమీద తిరిగేవాడు. అది బంగారు రథం. దానికి కట్టిన గుర్రాలు ఆకుపచ్చ రంగులో ఉంటాయి. రథానికి గుర్రాలు, వంద, వెయ్యి, పదివేలు, పదకొండు వేలు అని చెప్పబడింది. ఇంద్రుని సారథి వాయువు. ఇంద్రుని రథాన్ని, అశ్వాలని ఋభువులు నిర్మించారు.

ఇంద్రుడు **కృష్ణయజుర్వేదంలో 29 అధ్యాయాలలో** చెప్పబడ్డాడు. ఇతడు ఐశ్వర్య ప్రదాత. శత్రునాశనకారి. దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తాడు. అధార్మికులను, దుష్టబుద్ధి గలవానిరిని చోరులను సంహరిస్తాడు. ఇంద్రుణ్ణి సేవించిన మానవులు సకలైశ్వర్యాలు అనుభవిస్తారు.

శుక్లయజుర్వేదంలో వైదిక దేవతలకు ఇతడు తలమానికం అని చెప్పబడ్డాడు. వర్షాన్ని కాంతిని లోకాలకు ప్రసాదిస్తాడు. ఇంద్రుడు లేని యజ్ఞం అంటూ ఉండదు. అందుకే **'దేవరాజు'** అని ఇంద్రుడికి బిరుదు. సామసంహితలో వశిష్ఠుడు "ఓ ఇంద్రా! తండ్రి కుమారునికి ధనాన్ని జ్ఞానాన్ని ఇచ్చినట్లుగా నువ్వు మాకు జ్ఞానము, ధనము ఇవ్వవలసింది" అని ప్రార్థించాడు. ఇంద్రుని మిత్రులకు గుర్రాలు, ఏనుగులు, సౌందర్యం, ధనం అన్నీ కోకొల్లలుగా దొరుకుతాయి. ఇంద్రుడు వేగంగా వెడతాడు. ఆబోతులాగా భయంకరుడు. ఏమరుపాటు లేకుండా మానవులను రక్షిస్తాడు. అధర్వసంహితలో

ఇంద్రుడు మొత్తం 156 సూక్తాలలో స్తుతించబడ్డాడు. ఇంద్రుడు ధనాధిపతి, వర్షానిచ్చేవాడు, శత్రునాశనం చేసేవాడు. **ఇంద్రుడి జన్మదినం మాఘ శుద్ధ అష్టమి.** వ్యాపారంలో లాభాలు రావాలన్నా, గోసంతతి వృద్ధి చెందాలన్నా ఇంద్రుణ్ణి పూజించాలి.

ఉపనయనంలో బ్రహ్మచారి పాపాలను ఇంద్రుడు తొలగిస్తాడు. ఈయనతోనే అన్ని రకాల వైదికకర్మలు ప్రారంభమయినాయి. ఇతని ఖడ్గాలు భయంకరమైన పిశాచాలను కూడా నాశనం చేస్తాయి. అన్నిరకాల ఫలితాలు ఇచ్చే ఓషధులను బ్రహ్మ ఇంద్రుడికిచ్చాడు. మనల్ని ద్వేషించే శత్రువులను చంపి ఇంద్రుడు మనకి సుఖాలు ఇస్తాడు. యజ్ఞయాగాది క్రతువులు జరిగినప్పుడు ఇంద్రుడు హవిర్భాగం తీసుకుని, యజమాని కోరిన ఫలితాన్నిస్తాడు.

ఒకసారి దేవతలంతా ఒక యజ్ఞం చేశారు. గృత్సమదుడు ఆ యజ్ఞానికి వచ్చాడు. ఎలాగైనా సరే ఇంద్రుణ్ణి బంధించాలని దస్యులు ఆ యజ్ఞానికి వచ్చారు. ఇంద్రుడు దస్యులని చూసి గృత్సమదుడు (శౌనకుడు) వేషంలో తప్పించుకున్నాడు. యజ్ఞంలో ఉన్న గృత్సమదుడే ఇంద్రుడు అని భావన చేసిన దస్యులు గృత్సమదుణ్ణి బంధించారు. అప్పుడు గృత్సమదుడు ఇంద్రుడు ఈ రకంగా ఉంటాడు అని ఇంద్రుని లక్షణాలను వివరిస్తూ **రెండవ మండలంలోని పన్నెండవ సూక్తం** చెప్పాడు. ఇందులో 15 మంత్రాలున్నాయి. ఇవి పూర్తిగా ఇంద్రుని లక్షణాలను తెలుపుతాయి. గృత్సమదుడు ఇంద్రుడు ఒకే పోలికలో ఉంటారు.

ఇంద్రుడు విపరీతమైన తేజస్సుతో ప్రకాశిస్తుంటాడు. అతడు పుట్టుకతోనే దేవతలకు అధిపతి. మానవులలో గొప్పవాడు. పరాక్రమవంతుడు. తన బలంతో భూమ్యాకాశాలను వణికించినవాడు.

బలహీనంగా ఉన్న భూమిని బలంగా చేశాడు. పర్వతాలను అదుపులో పెట్టాడు. తేజోమయమైన అంతరిక్షాన్ని నిర్మించాడు.

వృత్రాసురుని సంహరించి సమస్త జలాలను విడిపించాడు. బలాసురుడు బంధించిన గోవులను విడిపించి కాపాడాడు. రెండు మేఘాల మధ్య అగ్నిని సృష్టించాడు. రణరంగంలో వీరవిహారం చేస్తాడు. అతడే ఇంద్రుడు.

ఈ చరాచర జగత్తులను నిర్మించినవాడు. దస్యులను ఓడించినవాడు. శత్రువులను జయించినవాడు. అతడేఇంద్రుడు ప్రజలందరికీ సమృద్ధిగా ధనాన్నిస్తాడు. దరిద్రులకు, యాచకులకు, ధనాన్నిచ్చేవాడు. యజ్ఞం చేసిన వాణ్ణి రక్షించే వాడు అతడేఇంద్రుడు.

గుర్రాలు, ఏనుగలు, ఆవులు, రథాలు, గ్రామాలు తన అధీనములో ఉంచుకున్న వాడు. జలాన్ని ప్రేరేపించేవాడు, సూర్యుణ్ణి ఉషను ఉదయింప చేసేవాడు. అతడే ఇంద్రుడు. ఉభయసేనలచే ఆహ్వానింపబడేవాడు, ఒకరకపు రథాలమీద ఇద్దరు మనుష్యులచే ఆహ్వానింపబడువాడు అతడేఇంద్రుడు.

అతడు లేకపోతే జయము లేదు. సకల లోకాలకు ప్రతినిధి. నాశనము తెలియని పర్వతాలను కూడా నాశనం చేసినవాడు. అతడేఇంద్రుడు. వజ్రాయుధంతో అనేకమందిని పాపాత్ములను సంహరించేవాడు, అర్హులైన వారికి సిద్ధిని ప్రసాదించేవాడు, దస్యులను నాశనం చేసినవాడు అతడేఇంద్రుడు. పర్వతాలలో దాక్కున్న శంబరాసురుణ్ణి నలభైసంవత్సరాలు వెదికిపట్టుకున్నవాడు. తన పరాక్రమంతో నిద్రపోతున్న 'అహి' అనే దైత్యుణ్ణి సంహరించిన వాడు అతడేఇంద్రుడు.

సప్తవర్గములు గలవాడు, బలవంతుడు, అభీష్టవరదుడు సప్తసింధులను ప్రవహింప చేసినవాడు అతడేఇంద్రుడు. అతన్ని చూడగానే భూమ్యాకాశాలు ప్రణమిల్లుతాయి. అతని బలం ముందు పర్వతాలు గడగడ లాడతాయి. వజ్రబాహువు. వజ్రహస్తుడైన వాడే ఇంద్రుడు, యజ్ఞం చేసే యజమానిని రక్షించేవాడు. అతని స్తోత్రములు మనకు సోమము, అన్నము అయినవాడు. అతడేఇంద్రుడు అంటూ ఇంద్రుడి లక్షణాలను వివరించాడు గృత్సమదుడు.

ఈ రకంగా ఋగ్వేదంలోనే కాకుండా మొత్తం వేదంలోనే ప్రముఖ స్థానం వహించిన దేవత ఇంద్రుడు.

**2. అగ్ని:**

**అగ్నిమీళే పురోహితమ్ యజ్ఞస్య దేవమృత్విజమ్ ।**
**హోతారమ్ రత్నధాతమమ్॥**

ఇది అగ్నిని స్తుతి చేసే మంత్రం. "అగ్నిదేవుడు యజ్ఞానికి పురోహితుడు. దేవతలకు ఋత్విజుడు. అతడే హోత. సంపదల ప్రదాత. అటువంటి అగ్నిని అర్చించెదము" అంటూ అగ్నిదేవుడి సూక్తంతోనే ప్రారంభమవుతుంది ఋగ్వేదం. ఈ సూక్తంలో మొత్తం 9 మంత్రాలున్నాయి.

అగ్ని అంటే ఎవరు? మనదృష్టిలో నిప్పు, మంట, జ్వాల, అగ్ని అన్నీ ఒకటే. కాని నిశతంగా పరిశీలిస్తే అగ్ని రెండు రకాలు 1. లౌకికంలో ఉపయోగించేది 2. యజ్ఞయాగాదులందు ఉపయోగించేది. ఇక్కడ లౌకికంలో ఉపయోగపడేది అంటే వంటఇంట్లో 'స్టౌ' అంటిస్తే మచ్చేది మంట. కాలిన కొరివిలో ఉండేది నిప్పు. అది అగ్ని కాదు. యజ్ఞయాగాదులు చెయ్యటానికి హోమకుండంలో ప్రజ్వలింపచేసేదే

అగ్ని. మనం దేవతలకు ఆహుతులు సమర్పిస్తున్నప్పుడు ఆ ఆహుతులను సరాసరి దేవతలకి అందించేదే అగ్ని. ఋగ్వేదంలో ఇంద్రుడికి మొదటి స్థానం కాగా అగ్నికి రెండవ స్థానం అందుకే ఋగ్వేదంలోని మొదటి సూక్తంలో

"అగ్ని శాశ్వతమైనవాడు. అగ్నిని పూర్వకాలంలో ఋషులు పూజించారు. ప్రస్తుతం పూజిస్తున్నారు. అగ్నిదేవుడు దేవతలను యజ్ఞానికి తీసుకువస్తాడు. అగ్ని వల్ల ధనము, విజ్ఞానము, సంపద, శక్తి కలుగుతాయి. సంతానము కలుగుతుంది. కీర్తి ప్రతిష్ఠ కలుగుతాయి.

అగ్నియే యజ్ఞయాగాలను కాపాడుతుంది. ఆహుతులను దేవతలకు అందిస్తుంది. అతడు హోమద్రవ్యాలకు కారకుడు. విశేష విజ్ఞానవంతుడు. అతడు సకల యశస్వి. అగ్నిని అర్చించేవారికి అన్ని శుభాలు చేకూరుస్తాడు. ఓ అగ్నిదేవా! రాత్రింబవళ్ళు మేము నిన్ను స్తుతి చేస్తున్నాము. మాదోషాలను రూపుమాపవలసింది. అగ్ని ప్రకాశవంతుడు యజ్ఞరక్షకుడు. ఫలప్రదాత. అటువంటి అగ్నికి నమస్కారము. తండ్రి ఎప్పుడూ తన పిల్లలకు మేలు కలిగిస్తాడు. అలాగే ఓ అగ్నిదేవా ! నువ్వు మాకు తండ్రిలాగా సమస్తాన్నీ చేకూర్చవలసింది," అంటూ అగ్నిదేవుణ్ణి ప్రార్థిస్తారు.

ఋగ్వేదంలో రెండవ స్థానం అగ్నిదేవుడిది. ఇతడు సుమారు 200 సూక్తాలలో స్తుతించబడ్డాడు. అంతేకాక నాలుగు వేదాలలోను స్తుతించబడ్డవాడు. ఈయన ఆకారం చూసినట్లైతే

**చత్వారిశృంగా త్రయో అస్యపాదాః ద్వేశీర్షే సప్త హస్తాసో అస్య**

ఆయనకు నాలుగుకొమ్ములు, మూడుకాళ్ళు, రెండుతలలు,

ఏడుచేతులు, ఏడునాలుకలు ఉన్నాయి. ఈయన ఏడునాలుకల గురించి ముండకోపనిషత్తులో చెప్పబడింది.

**కాళీ కరాళీచ మనోజవాచ సులోహితా యాచ సుధూమ్రవర్ణా**

**విస్ఫులింగినీ విశ్వరుచీ చ దేవీ వేలయమానా ఇతి సప్త జిహ్వా ॥**

1. కాళీ 2. కరాళీ 3. మనోజవా 4. సులోహితా 5. ధూమ్రవర్ణా 6. విస్ఫులింగినీ 7. విశ్వరుచీ. ఇవి సప్తజిహ్వాలు.

ఆయన ఘృతపృష్టుడు – ఆయన వీపు నెయ్యి. ఘృతముఖుడు – ముఖం నెయ్యి, ఘృతప్రతీకః – ఆయన అవయవాలు నెయ్యి. మంచి నాలుక కలవాడు. ఘృతకేశం–ఆయన జుట్టు నెయ్యి అంటే ప్రకాశించే జుత్తు కలవాడు. ఎర్రని జుత్తు, ఎర్రని గడ్డము గలవాడు. జ్వాలలే నోరుగా గలవాడు. పదునైన దవడలు గలవాడు. బంగారు దంతాలు కలవాడు. జ్వాలాముఖుడు. పదునైన బాణాలు గలవాడు. మండే తల గలవాడు. ద్యావాపృథివిల పుత్రుడు. ఇంద్రుడు, అగ్ని కవలపిల్లలు.

అరణి మథిస్తే అగ్ని పుడుతుంది. అంటే అరణి కర్రలే అతని తల్లితండ్రులు. అగ్ని పుట్టగానే తల్లి తండ్రులను భక్షిస్తాడు. అగ్ని జలం నుంచి కూడా పుడతాడు అని చెప్పబడింది. అదే సముద్రంలో పుట్టే బడబాగ్ని. ఇతడు సరస్సులో పెరిగిన వృషభంగా చెప్పబడతాడు. అగ్నికి మూడు జన్మలున్నాయంటోంది **ఋగ్వేదంలోని పదవ మండలంలోని 45 వ సూక్తం.** అగ్ని మొదట ఆకాశంలో విద్యుత్తు రూపంలో జన్మించాడు. రెండవ జన్మ జాతవేది అనే పేరుతో భూమిమీద

జరిగింది. మూడవజన్మ జలం మధ్యన జరిగింది. అతడు జన్మించగానే ద్యావాపృథువులను పరిపూర్ణము చేశాడు. ప్రజలు వర్షంకోసం యజ్ఞం చేసినప్పుడు అతడు మబ్బుల వైపు వెళ్ళి వాటిని కొట్టి నీరు తెచ్చాడు. అతడు జ్యోతిర్మయుడు. కాంతివంతుడు. ఇతడు స్వర్గంలో జన్మించి వాయువుచేత భూలోకానికి తేబడ్డాడు అని **ఒకటవ మండలంలోని 93వ సూక్తం** చెబుతోంది. అగ్నికిరణాలు కాంతిమయములు. అవికాంతులు విరజిమ్మి చీకట్లను పారద్రోలతాయి. అవి సూర్యకిరణాల లాగా తీక్షణంగా ఉంటాయి. తన జ్వాలాదంతాలతో శత్రువులను హరిస్తాడు. శూరుని లాగా శత్రువులను హింసిస్తాడు. అటువంటి ఓ అగ్నీ! మమ్మల్ని రక్షించవలసినది అని ప్రార్ధిస్తున్నారు **143వ సూక్తంలో.**

అగ్ని మూడులోకాల్లోను మూడురూపాల్లో ఉంటాడు. భూలోకంలో అగ్ని, అంతరిక్షంలో వాయువు, స్వర్గలోకంలో సూర్యుడు. స్వర్గంలో పుట్టిన అగ్నిని దివ్యపక్షి అని, ఆకాశపు గ్రద్ద అని చెప్పటం జరిగింది. ఈ రకంగా మూడు స్థానాలలో అగ్ని పుట్టటం వల్ల మూడు శిరస్సులు కలవాడు, మూడు శరీరాలు కలవాడు, మూడు రకాలైన ప్రకాశాలు కలవాడు అని చెప్పబడుతున్నాడు. **ఒకటవ మండలంలోని 146వ సూక్తంలో** సవనములు అనే మూడు తలలు గలది, ఛందస్సులు అనే ఏడు శిరస్సులు గలది, అయిన యజ్ఞాగ్ని హవిస్సు భక్షిస్తున్నాడు అని చెప్పబడింది. అంటే భూలోక భువర్లోక సువర్లోకాలే అతని శిరస్సులు. ఏడు నాలుకలు అనే కళ్ళాలు గలవాడు అని అర్థం. అతడు ముదిమి ఎరగనివాడు. గొప్ప రక్షకుడు. అరణి మథించటం వల్ల పుట్టాడు కాబట్టి 'బహుజన్మ' అని చెప్పబడుతున్నాడు. అగ్ని దేవుడు సూర్యునితో సమానమైన ప్రకాశము కలవాడు. మెరుపుతో సమానమైన ప్రకాశము కలవాడు. భూమిమీద అరణ్యాలను నశింపచేస్తాడు.

అగ్నిజ్వాలలు సముద్రపు అలలతోను, పిడుగులతోను పోల్చబడ్డాయి. అగ్నియొక్క ఎర్రనిపొగ ఆకాశం వరకు వ్యాపించి, ఆకాశానికి ఆధారస్తంభం లాగా కనిపిస్తుంది. ఇతడు ధూమధ్వజుడు. అందుచేతనే ధూమకేతువు అనబడతాడు. ఇతడు బంగారు రధాన్ని అధిరోహిస్తాడు. దాన్ని ఎర్రని గుర్రాలులాగుతాయి. యజ్ఞయాగాదులు జరుగుతున్నప్పుడు దేవతలను ఇతడే తన రథంమీద తీసుకువస్తాడు. ఇతడే దేవతలకు హవిస్సు అందిస్తాడు కాబట్టి దేవతల ముఖముగా చెప్పబడుతున్నాడు. నెయ్యి, సమిధలు, సోమరసం ఆహారంగా తీసుకుంటాడు. మానవులు సమర్పించే ఆహుతులు తీసుకోవటానికి దేవతలను తీసుకువస్తాడు. యజ్ఞానికి ఇతడే ముఖ్యుడు, ఇతడే పురోహితుడు, ఋత్విక్కు, అధ్వర్యుడు కూడా. ఇతడు హవ్యవాహనుడు. కవ్యవాహనుడు. సృష్టించబడే ప్రాణుల విషయం తెలిసినవాడు కావటంచేత 'జాతవేదుడు అనబడతాడు. విశ్వమంతా తెలిసిన వాడు కాబట్టి 'విశ్వవేదుడు' అనబడతాడు. తనభక్తుల కోరికలు తీర్చి వారిని రక్షిస్తాడు.

కృష్ణయజుర్వేదంలో మొత్తం 40 అధ్యాయాలున్నాయి. అందులోని 31 అధ్యాయాలలో అగ్నిని గురించి చెప్పబడింది. అగ్ని ఋజుప్రవర్తన కలిగిన వాళ్ళకు సహాయం చేస్తాడు. చేయూత నిస్తాడు. అనుక్షణం వారిని రక్షిస్తుంటాడు. ఈ జగత్తులో జరిగే ప్రతివిషయము అతడికి తెలుసు. తన భక్తులను సదా రక్షిస్తాడు. ఇతడు లోకంలో అన్నింటికీ అధిపతి. అన్ని రకాల సంపదలు అతని అధీనంలోనే ఉంటాయి. దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తాడు. మానవులు చేసే అనేక రకాలైన పాపాలను నాశనం చేస్తాడు. జగత్తు యొక్క సృష్టి స్థితి లయాలకు ఇతడే కారకుడు. అజ్ఞానాన్ని నశింపచేసి జ్ఞానజ్యోతులు వెలిగిస్తాడు.

స్వార్ధపరులను నిరసిస్తాడు. లోకాలు నాశనం చేసే ద్రోహులను తరిమికొడతాడు. తెల్లవారగానే లోకాలన్నీ ప్రకాశింపచేస్తాడు. భౌతికంగా అగ్నిరూపంలో దర్శనమిస్తాడు. జఠరాగ్ని రూపంలో ప్రాణులయందుంటాడు. విద్యుత్తు రూపంలో జలం నుంచి ఉద్భవిస్తాడు. అగ్నిని సేవించిన వారు మంచి వ్యక్తులు, గృహస్థులు అవుతారు. అగ్నిదేవుని ఉపాసించిన వారికి జ్ఞానం కలుగుతుంది. సిరిసంపదలు భోగభాగ్యాలు పెరుగుతాయి. అపమృత్యువు ఉండదు. ఒకటేమిటి? అగ్నిదేవుడు ఏది కావాలన్నా ఇస్తాడు. అందుకే కృష్ణయజుర్వేదంలో అగ్నిదే ప్రధమ స్థానము. శుక్లయజుర్వేదంలో కూడా అగ్నిదేవుడికే మొదటి స్థానం ఇవ్వబడింది. అగ్నిదేవుడికి ద్యులోకం తండ్రి. కాగా భూమి తల్లి. ఇతడు నాలుగు రకాలుగా జన్మిస్తాడు. 1. వర్షపుధారల నుంచి విద్యుత్తుగాను, 2. అరణి మధించటంవల్ల, 3. రాళ్ళ ఒరిపిడి వల్ల 4. ఓషధుల రాపిడివల్ల అగ్నిగాను పుడతాడు. 5. సముద్రంలో బడబానలంగా కూడా ఉంటాడు. 6. అడవులయందు దావానలంగా వ్యాపిస్తాడు. ఋషులలో మొదటివాడుగా అంగీరసుడనే పేరుతో పుట్టాడు. దేవతలలో కూడా ముందుగా పుట్టినవాడు అగ్నే. మొదటిసారి దివినుంచి అగ్నిరూపంలో, రెండవసారి బ్రహ్మనుంచి, మూడవసారి నీటిలో బడబానలంగా పుట్టాడని చెబుతోంది శుక్లయజుర్వేదం. ఇతడి శరీరమంతా నెయ్యి. బంగారు తేజస్సుతో ప్రకాశిస్తుంటాడు.

అగ్నిదేవుడు గరుత్మంతునితో పోల్చబడ్డాడు.

| | | |
|---|---|---|
| త్రివృత్స్తోమము | – | ఇతని శిరస్సు |
| గాయత్రమనే | – | సామనేత్రం |
| బృహద్రధంతరసామాలు | – | రెక్కలు |
| పంచదశస్తోమాలు | – | ఆత్మ |

| | | |
|---|---|---|
| 21 ఛందస్సులు | - | అవయవాలు |
| యజస్సులే | - | పేర్లు |
| వామదేవ్యమనేసామము | - | శరీరము |
| యజ్ఞాయజ్ఞీయములనే సామము | - | తోక |

ఈ వేదంలో అగ్నికి ప్రాముఖ్య చాలా ఉంది. ఇతడు సర్వదేవతా స్వరూపుడు. జీవులకు విజ్ఞానము ఇస్తాడు. వాయురూపంతో శరీరంలో సంచరిస్తాడు. ఆకాశంలో కనిపించే సూర్యుడు ఇతడే. అంతరిక్షంలో ఉన్న ఇంద్రుడు కూడా ఇతడే. జీవులు తిన్న ఆహారాన్ని జీర్ణం చేసే జఠరాగ్ని ఇతడే. ఇతని ద్వారానే దేవతలకు హవిర్భాగాలు అందుతాయి. అందుకే దేవతలకు ముఖం వంటివాడు అంటోంది వేదం. శరీరంలో వాగింద్రియము అగ్ని. మానవులు చేసిన అన్ని రకాల పాపాలను నశింపచేస్తాడు.

అగ్నికి ముగ్గురు సోదరులు కూడా ఉన్నారంటోంది ఈ వేదం. వీరు 1 భువఃపతి 2. భువనపతి 3. భూతపతి. వషట్కారానికి భయపడి వీరు భూమిలోకి వెళ్ళిపోయారు అప్పుడు అగ్ని దుఃఖంతో నీళ్ళలో మునిగిపోయాడు. దేవతలు మళ్ళీ ఇతణ్ణి తెచ్చి యజ్ఞావికారంలో ఉంచారు. అగ్నిసోదరులను వేదికమీద దక్షిణ, పశ్చిమ, ఉత్తర దిక్కులు అధిపతులుగా చేశారు.

అగ్నిని గురించి ఒక కథను చెబుతోంది శుక్లయజుర్వేదం. ఒకసారి రాక్షసులు దేవతలకు భయపడి భూలోకంలో – లోహంతోను, అంతరిక్షంలో – వెండితోను, స్వర్గంలో – బంగారంతోను మూడు భవనాలు నిర్మించగా అగ్ని వాటిని తగులపెట్టాడు ఆ సమయంలో అగ్నికి 1. హిరణ్యకాముడు 2. రజతకాముడు 3. లోహకాముడు అని ముగ్గురు కుమారులు కలిగారు. ఇటువంటి అగ్నిదేవుడు

సిరిసంపదలు, భోగభాగ్యాలు, పశువులు, పాడి, ఏవి కావాలన్నా ఇస్తాడు. రోగాలు ఈతిబాధలు, కష్టాలు, అన్ని రకాల దుఃఖాలు పోగొడతాడు.

సామవేదంలో కూడా అగ్నికి ముఖ్యస్థానమున్నది. ఇతడు ప్రత్యక్ష దైవం. జ్వాలారూపుడు. దేవతలకు దూత, దేవతలకు హవిస్సులు ఇతడే అందిస్తాడు. మానవులకు ఆయుష్షు, ఆరోగ్యము, బలము, తేజస్సు ఇస్తాడు.

అధర్వణ వేదంలో 56 సూక్తాలలో స్తుతించబడ్డాడు. యజ్ఞాలలో దేవతలకిచ్చే హవిస్సును రాక్షసులు దొంగిలిస్తారు. ఆ దుర్మార్గులను చంపి హవిస్సును రక్షించమని అగ్నిని ప్రార్థిస్తారు. అగ్ని వారి కోరిక మన్నిస్తాడు. ఉపనయన సమయంలో అగ్నిని ప్రార్థిస్తారు. పెండ్లి కాని స్త్రీలకు వివాహం చెయ్యటానికి సహకరిస్తాడు. భూతప్రేత పిశాచ బాధలు నివృత్తి చేస్తాడు.

కామ్యకర్మలయందు 'దేవతలకు సాయం చేసినట్లుగా మానవులకు కూడా సహాయం చెయ్యమని అగ్నిని ప్రార్థిస్తారు. రాక్షస సంహారానికి, దొంగిలించబడిన అవులను రక్షించటానికి ఇతణ్ణి ప్రార్థిస్తారు.

**ఋగ్వేదంలోని ఒకటవ మండలంలోని 70వ సూక్తం** చూడండి.

అగ్ని బుద్ధిగోచరుడు. కాంతిమంతుడు. దేవతల మానవుల కర్మలన్నీ తెలిసినవాడు. అటువంటి అగ్ని మాకు అన్నాన్ని ప్రసాదించాలి.

అగ్ని జలమందున్నాడు. జంతువుల యందు, జీవులయందు ఉన్నాడు. ఇళ్ళల్లో ఉన్నాడు. పర్వతాల్లో ఉన్నాడు. అటువంటి అగ్నికి

హవిస్సు లివ్వండి. అతడు మనకు శుభాలను ఇస్తాడు. రాత్రిపూట వెలుగులు ప్రసాదిస్తాడు. అగ్నిని ఆరాధించే వారికి ధనము, జ్ఞానము అంటే ఇహపరాలు రెండూ లభిస్తాయి.

అగ్నిదేవుడు మా పశువులకు శుభాలు కలిగించాలి. జనులందరు మమ్మల్ని గౌరవించేటట్లు చెయ్యాలి. అగ్నిని ప్రజలు అన్నిచోట్లా పూజిస్తారు. తండ్రియొక్క ఆస్థిపాస్థులు కుమారుడు తీసుకున్నట్లే, అగ్ని నుంచి మానవులు అన్నీ పొందుతారు. అగ్ని అందరికీ తండ్రిలాంటివాడు. తనను అర్చించిన వారికి, అర్చించని వారికి కూడా కోరికలు తీరుస్తాడు. అగ్నిదీనులను, ఆపన్నులను రక్షిస్తాడు. దుష్టులను దుర్మార్గులను శిక్షిస్తాడు. శత్రువులను సంహరిస్తాడు. కాబట్టి అగ్నిని అర్చించండి. అంటోంది వేదం.

శ్రీసూక్తంలో కూడా ధనధాన్యాలు, సిరిసంపదలు కావాలని అగ్నిదేవుణ్ణే ప్రార్థిస్తాం.

**3. సూర్యుడు :** ఋగ్వేదంలో ప్రత్యేకంగా పది సూక్తాలలో స్తుతించబడ్డాడు. అంతే కాకుండా నాలుగు వేదాలలోను కనిపించే దేవత. **ఋగ్వేదంలోని మొదటి మండలంలోని 115వ సూక్తంలో**

మిత్ర, వరుణ, అగ్నులకు కన్నులాంటివాడు సూర్యుడు. అతడు గొప్ప కిరణాలతో ఉదయించి భూలోక భువర్లోక సువర్లోకాల యందు వ్యాపించాడు. సూర్యకిరణాలు శుభప్రదాలు. చిత్రవిచిత్రమైన రంగులు కలిగి ఉంటాయి. నీటిని పీలుస్తాయి. ఆకాశమంతా కాంతులు ప్రసరింపచేస్తాయి. సూర్యుడు తన కిరణాలను ఇంకొక చోటికి పంపినప్పుడు, ఇక్కడ రాత్రి అవుతుంది. సూర్యుడు మిత్రావరుణలతో కలిసి ఆకాశంలో దర్శనమిస్తాడు. అతని కిరణములు అనంతములు. ప్రకాశవంతమైనవి. చీకట్లను పారద్రోలతాయి. ఆ సూర్యకిరణాలు

లేకపోతే జగత్తంతా చీకటే. ఈ కారణంచేతనే ఈ సూక్తానికి ఋషి అయిన అంగీరసుని కుమారుడైన కుత్సుడు "ఓ సూర్య కిరణములారా ! సూర్యుడు ఉదయిస్తున్నాడు. పాపాలను పారద్రోలి మమ్మల్ని రక్షించండి. మిత్రుడు, వరుణుడు, అదితి, సింధువు, భూమి, అంతరిక్షము మమ్మల్ని రక్షించాలి" అని ప్రార్థిస్తున్నాడు.

సూర్యుడు ఉషస్సు ననుసరించి ఉదయిస్తాడు. విశ్వానికి ఇతడు గూఢచారి. మిత్రావరుణులకు, అగ్నికి నేత్రము. చరాచర జగత్తుకు ఆత్మ. ఇతణ్ణి ఆకాశంలో ఎగిరే పక్షి అని, ఎర్రగద్ద అని, ఆకాశము యొక్క వజ్రాభరణం అని, స్వర్గంలో ప్రకాశించే మణి అని, విశ్వకర్మ అని, దేవపురోహితుడని చెప్పడ్డాడు. ఇతని పుట్టుకను గురించి రకరకాలుగా చెబుతోంది వేదం. ఇతడు 1. మిత్రావరణులచేత పుట్టించ బడ్డాడు. 2. ఇంద్ర విష్ణువులచేత పుట్టించబడ్డాడు. 3. అగ్నిచేత పుట్టించబడ్డాడు. 4. అంగీరసుల చేత పుట్టించబడ్డాడు. **పదవ మండలంలోని 190వ సూక్తంలో** సూర్యచంద్రాగ్నులను పూర్వకాలంలో ఈశ్వరుడు పుట్టించాడని చెప్పబడింది. ఇతడు రథం మీద ప్రయాణం చేస్తాడు. ఆ రథానికి ఒకటే గుర్రం, ఒకే చక్రం ఉంటాయి.

**'సప్తయంజంతి రథమేకచక్ర ఏకోవహాతి సప్తనామాః'** సూర్యుడి రథానికి ఉండే చక్రమే కాలచక్రం. దానికి ఉండే 12 ఆకులు 12 మాసాలు. అతని గుర్రం పేరు 'సప్త', అందుకే సప్తాశ్వరథము అని చెప్పినప్పుడు సప్త అనే పేరుగల గుర్రాన్ని కట్టిన రథము అని అర్థం. సప్త అంటే – ఏడు అని కూడా అర్థం ఉంది. కాబట్టి సూర్యుడిరథానికి ఏడు గుర్రాలున్నాయని చెబుతారు. నిజానికి సూర్యుడి రథానికి ఉన్నది గొప్ప కాంతిపుంజము. దాన్నే సప్త అనేపేరుగల గుర్రము అంటారు.

అయితే ఆ కాంతి పుంజాన్ని విడగొట్టినప్పుడు ఏడురంగులు వస్తాయి. అంతేకాకుండా సప్త అంటే ఏడు అని అర్థం ఉంది. దీనివల్లనే ఆ రథానికి ఏడు గుర్రాలు ఉన్నాయి అంటారు.

సూర్యోపాసనవల్ల రోగాలు తగ్గుతాయంటోంది ఋగ్వేదము. **'ప్రస్కణ్వుడు'** అనే ఋషి తాను దర్శించిన మూడు మంత్రాలు జపించి, తనకున్న చర్మరోగాన్ని పోగొట్టుకున్నాడు. ఆ మూడు మంత్రాలే **తృచము.** అనే పేరుతో ప్రసిద్ధి చెందినాయి. తరువాత కాలంలో భాస్కరరాయల వారు దీనికే **తృచభాస్కరము** అనే పేరుతో మంత్రశాస్త్ర గ్రంథం కూడా వ్రాశారు.

ఋగ్వేదంలో అక్కడక్కడ చెప్పిన 60 1/2 ఋక్కులను **'మహాసౌరము'** అనే పేరుతో ఒకచోటకి చేర్చారు. ఆరోగ్యం కావలసినవారు సౌరపారాయణ, అరుణ పారాయణ చేస్తారు. వీటితో పాటుగా సూర్యనమస్కారాలు కూడా చేస్తారు.

కృష్ణయజుర్వేదంలోని 15 అధ్యాయాలలో చెప్పబడ్డాడు ఈ సూర్యుడు. ఇతడు స్వయంప్రకాశి. వర్షం కురిపించటం ద్వారా జీవులను పాలిస్తున్నాడు. ఇతడు సర్వవ్యాపకుడు. స్థావరజంగమాల యందు ఆత్మగా ఉంటాడు. భూమి ఆకాశము అంతటా వ్యాపించి ఉంటాడు.

ఇతడు ఉదయిస్తే లోకంలోని మానవుల పాపాలన్నీ నాశనమై పోతాయి. దుర్మార్గులు చెడ్డపనులు వదిలేస్తారు. శరీరానికి ఆరోగ్యం కావాలంటే సూర్యుణ్ణి పూజించాలి. **ఆరోగ్యం భాస్కరాదిత్యేత్** అని చెప్పబడుతోంది.

శుక్లయజుర్వేదంలో 'సవిత' అనే దేవతే సూర్యుడు అని

చెప్పబడుతోంది. ఇతడు మేధావి, ధనదాత, సర్వజనప్రియుడు, క్రాంతిదర్శి, హిరణ్యపాణి అని చెప్పబడింది.

ఒకసారి యుద్ధంలో రాక్షసులు 'పాశ్రితము' అనే ఆయుధాన్ని విసిరారు. దాంతో సూర్యుని రెండు చేతులు తెగిపోయినాయి. అప్పుడు దేవతలు బంగారు చేతులు ఇతడికి అతికించారు. అప్పటినుంచి 'హిరణ్యపాణి' అని పిలువబడుతున్నాడు. అందర్నీ మేలుకొల్పి వారి వారి కర్మలయందు నిమగ్నమయ్యేట్లు చేస్తాడు. ఇతడు వేగంగా నడుస్తాడు కాబట్టి 'తరణి' అని, అందరికీ కనిపిస్తాడు కాబట్టి 'విశ్వదర్శతుడు' అని ప్రకాశిస్తాడు కాబట్టి 'జ్యోతిష్కృతుడు' అని పిలువబడుతున్నాడు. దృష్టి కోసం, వర్చస్సు, జ్ఞానం, ఆరోగ్యం కోసం ఇతడు అర్చించబడతాడు.

సామవేదంలో ఇతని స్థానం అంతరిక్షమని చెప్పబడుతోంది. ఇతడు లోకాలకు ప్రత్యక్ష దైవం. వాయుమండలంచేత ప్రేరేపింపబడి లోకాలు పాలిస్తుంటాడు. ఏడు గుర్రాలు లాగే రథం మీద అవిశ్రాంతంగా తిరుగుతుంటాడు. దేవతలందరికీ కన్నులాంటివాడు. ప్రజలు ఇతణ్ణి ఆరోగ్యము, తేజస్సు, బలం కోసం ప్రార్థిస్తారు. సూర్యుణ్ణి గురించి ఈ వేదం –

యజమానికి ధనాన్ని, ఆయుష్షును ఇచ్చేవాడు. సోమరసాన్ని బాగా త్రాగుతాడు. వాయువుతో ప్రేరేపించబడి సంచరిస్తూ లోకాలను రక్షిస్తాడు. ఇతడు ఉదయించి ఒక్కసారిగా భూమ్యాకాశాలను ఆవరించాడు. సూర్యకాంతి ప్రాణుల్లో ప్రాణవాయువుగా సంచరిస్తుంది. లోకంయొక్క జీవనాడి సూర్యుడు. అతడు పగటిపూట ముప్ఫై ముహూర్తాల కాలం ప్రకాశిస్తాడు. గొప్ప మహిమకలవాడు. అతడు ఉదయించగానే రాత్రితోపాటు నక్షత్రాలు కూడా కనిపించకుండా

పోతాయి. మండుతున్న అగ్నిజ్వాలలలాగా అతని కిరణాలు ప్రపంచాన్ని వెలుగులతో నింపుతాయి. అతన్ని ఆరాధించే వారికి ఆరోగ్యాన్ని ఇస్తాడు. వారి పాపాలను హరిస్తాడు. చంద్రుడికి కూడా కాంతులిచ్చేవాడు. ఏడు గుర్రాల రథంమీద కూర్చుని యజ్ఞశాలకు వస్తాడు. అందరూ అతనికి హవిస్సు లివ్వండి" అని చెబుతోంది.

అధర్వ వేదంలో కూడా సూర్యుణ్ణి గురించి చెప్పబడింది. ఋగ్వేదంలో చెప్పబడ్డ సూర్యుడే ఇక్కడ మిత్ర, పూష, ఆదిత్య పేర్లతో చెప్పబడ్డాడు. ఇక్కడ సూర్యుడు ధనాన్ని ఇచ్చే దేవత. సుఖప్రసవాన్ని కలుగజేసేవాడు. వాతపిత్త రోగాలు నివారించే వాడు, కామెర్లు, అన్ని రకాల శస్త్రబాధలు నివారిస్తాడు. శత్రునాశనం చేస్తాడు. స్మార్తకర్మలలో మన పిల్లవాణ్ణి రక్షించమని సూర్యుణ్ణి వేడుకుంటాం. ఈయన సవితృరూపంలో ధనాన్ని బలాన్నిస్తాడు. త్వష్ట రూపంలో సంతానాన్నిస్తాడు. ఉదయించే సూర్యుడు గోవులకు రోగాలు కలిగించే క్రిముల్ని చంపుతాడు. బాలగ్రహ శాంతికి, క్షయ, కుష్టురోగాలు తగ్గటానికి సూర్యుణ్ణి ప్రార్థిస్తారు.

ఈ రకంగా వేదకాలంలోనే కాకుండా ఈ రోజున కూడా ఆరోగ్యం కోసం సూర్యోపాసన చేయటం జరుగుతోంది.

**4. విష్ణువు :** ఇతడు దేవతలందరిలోకీ గొప్పవాడు. ఋగ్వేదంలో కేవలము 5 సూక్తాలలోనే ఇతడు కీర్తించబడ్డాడు. తన మూడు అడుగులతో ముల్లోకాలు ఆక్రమించాడు. **ఒకటవ మండలంలోని 154, 155, 156 సూక్తాలలో విష్ణువు స్తుతించబడ్డాడు.** ముల్లోకాలను విష్ణువే సృష్టించాడు. విష్ణువే ఊర్ధ్వలోకాన్ని స్థాపించాడు. మూడు విధాలుగా లోకాలను కల్పించాడు. తాను చేసిన మహాకార్యాల వల్ల సమస్త

జనులచే స్తుతించబడుతున్నాడు. అతని మూడడుగులలోనే సమస్త లోకాలు నిండి ఉన్నాయి. అతడు మహోన్నత పదమునందు నివసిస్తాడు. తన మూడడుగులతో ఈ జగత్తంతా ఆక్రమించినాడు. విష్ణువు ఒక్కడే భూమి, నీరు, తేజస్సు, సమస్త లోకాలు సృష్టించాడు. యజ్ఞయాగాలు చేసేవారు విష్ణుపదము చేరి సుఖంగా ఉంటారు. విష్ణు పదము మధుర ప్రవాహము గలది. విష్ణువుకు ప్రియమైనది. మహోత్కృష్టమైనది.

విష్ణువు స్తోత్రప్రియుడు. వీరుడు, శూరుడు, కామగమనం కలవాడు. విష్ణువు సర్వస్వానికి స్వామి. పాలకుడు. మూడు అడుగులతో సమస్త లోకాలు ఆక్రమించాడు. తన యొక్క రెండు అడుగులతో భూమ్యాకాశాలు ఆక్రమించాడు. వాటినే మానవుడు స్తుతి చేస్తున్నాడు. మూడవ అడుగు ద్యులోకంలో ఉంది. అది ఎలా ఉంటుందో మానవుడు ఊహించను కూడా లేడు. గొప్ప దేహము కలవాడు. వివిధ రూపాలుగా కనిపించే వాడు. అందరికన్నా గొప్పవాడు.

ఓ విష్ణువా ! నువ్వు గొప్ప వాడివి లోకాలకు సుఖాన్నిచ్చేవాడివి. సమృద్ధిగా అన్నము ఇచ్చే వాడివి. సర్వరక్షకుడవు. మాటిమాటికీ నిన్ను అర్చిస్తున్నాను. హవిస్సులు అర్పిస్తున్నాను. విష్ణువు నిత్యుడు. జగత్కర్త. స్వయంభువు మహాత్ముడు. అటువంటి విష్ణువుకు హవిస్సులిచ్చినవాడు అన్నవంతుడవుతాడు. విష్ణువు యజ్ఞకర్త. జలములకు కర్త. ఓ జనులారా ! మీరంతా విష్ణువును కీర్తించండి. అతడి నామాన్ని జపించండి. విష్ణువు స్వర్గాన్ని సృష్టించగలడు. వర్షాలు కురిపించగలడు. యజ్ఞయాగాలు చేసిన వారికి మంచి ఫలితాన్నిస్తాడు." అని చెప్పబడింది.

కృష్ణయజుర్వేదంలో 7 అధ్యాయాలలో విష్ణువును గురించి

చెప్పబడింది. అతడు యజ్ఞాలను రక్షిస్తాడు. **యజ్ఞోవైవిష్ణుః** యజ్ఞస్వరూపమే విష్ణువు. అందరికీ జ్ఞానాన్నిస్తాడు. జగత్తంతా వ్యాపించి ఉంటాడు అని చెప్పబడింది. శుక్ల యజుర్వేదంలో విష్ణువు యజ్ఞానికి అధిష్ఠాత. యజ్ఞమే విష్ణుస్వరూపము అని చెప్పబడింది. వృత్రాసురుడు మొదలైన రాక్షస సంహారంలో ఇంద్రుడికి స్నేహితుడు. అగ్ని, వాయువు మొదలైన రూపాలు ధరించాడు. వరాహరూపంతో భూమిని ఉద్ధరించాడు.

అటువంటి శ్రీమహావిష్ణువు యొక్క పరమపదాన్ని జ్ఞానులు మాత్రమే చూడగలరు. ద్యులోకం మధ్యన ఉండే ఆదిత్య మండలమే పరమపదము అని చెప్పబడింది.

సామవేదంలో విష్ణువు స్థానం అంతరిక్షము అన్నారు. అతడు సర్వవ్యాపకుడు. త్రివిక్రముడు.

తన మూడు పాదాలతో జగత్తును ఆక్రమించాడు. అతని పాదంలోనే ఈ జగత్తు ఉన్నది. అతణ్ణి ఎవరూ హింసించలేరు. అతడు ధర్మప్రవర్తకుడు. ఇంద్రుడికి మంచి మిత్రుడు. జ్ఞానులు విష్ణుపదాన్ని ఎప్పుడూ చూడగలుగుతారు. స్తోత్రాలు చేస్తూ భక్తులు విష్ణువుయొక్క పరమపదాన్ని దర్శిస్తారు. విష్ణువు సర్వవ్యాపి. భూమి నుంచి ఆకాశందాకా అంతటా వ్యాపించి ఉన్నాడు. తన భక్తులను, సత్పురుషులను సదా రక్షిస్తాడు. వారి కోరికలు తీరుస్తాడు అని చెప్పబడింది. అధర్వణవేదంలో విష్ణువు ప్రసక్తి లేదు.

ఈ రకంగా విష్ణువు గొప్పతనాన్ని వేదంలో వివరించటం జరిగింది.

**5 రుద్రుడు :** ఇతడు నాలుగు వేదాలలో చెప్పబడ్డాడు. ఋగ్వేదంలో ఇతడు కేవలము మూడు సూక్తాలలోనే చెప్పబడ్డాడు. ఇతడు చాలా

బలమైనవాడు. మహా కోపం గలవాడు. శత్రువులను నిర్దాక్షిణ్యంగా సంహరిస్తాడు. ఎప్పుడూ ధనుర్బాణాలు ధరించి రథంమీద తిరుగుతుంటాడు. భక్తులయందు మంచి వారి యందు అపారమైన దయ గలవాడు. **మొదటి మండలం 114వ సూక్తం**లో ఇతడీ పేరు కపర్ది. చాలా బలమైనవాడు. ఇతడు సకల ప్రాణులకు సుఖాన్ని కలిగిస్తాడు.

ఇతనికి వాయువులు పుత్రులు. ఇతడు శత్రుంజయుడు. వరప్రదుడు. జనులు యాగాలు చేసి ఆయన అనుగ్రహాన్ని కోరతారు. వారికి సుఖశాంతులు ప్రసాదిస్తాడు. ఆయన రాకమాత్రంచేతనే జనులు సంతానవంతులవుతారు. రుద్రుడు కాంతివంతుడు. యజ్ఞనిర్వాహకుడు. అటువంటి రుద్రుడు కోపాన్ని వదలి తమని అనుగ్రహించమని భక్తులు వేడుకుంటున్నారు. ఆ రుద్రుడు వరాహంలాగా దృఢకాయుడు. జటాజూటము గలవాడు. దివ్యమైన తేజస్సుతో ప్రకాశిస్తుంటాడు. ఓ రుద్రా ! మేమిచ్చే హవిస్సులు తీసుకుని మాకు ఆరోగ్యాన్ని ప్రసాదించవలసినది.

ఓ రుద్రుడా ! మాలో పెద్దవారిని చంపద్దు. చిన్నవారిని చంపద్దు. పిల్లలను చంపద్దు. మా తల్లిదండ్రులను చంపవద్దు. ఏడ్చేవారిని కడుపులో ఉన్నవారిని చంపవద్దు. మా సేవకులను, పశువులను చంపవద్దు. నీకు హవిస్సులు అర్పిస్తున్నాము. అందరినీ సుఖంగా చల్లగా చూడవలసింది.

ఓ రుద్రా ! నీవు శత్రునాశకుడవు. నీ ఆయుధాలు మాకు దూరంగా ఉంచు. వాటిని మా శత్రువులమీద ప్రయోగించవలసింది. మేమంతా నీ రక్షణ కోరుతున్నాము. అంటున్నారు. అలాగే **రెండవ మండలంలోని 33వ సూక్తం**లో రుద్రుడు మరుత్తులపితరుడు

అంటున్నారు.

ఓ రుద్రా ! నీవిచ్చే ఔషధాల వల్ల మేము నిండు నూరేళ్ళు సుఖంగా ఉండాలి. నీవు వజ్రబాహుడవు. మమ్ము పాపాల నుంచి రక్షించు. పాపాలు మా దగ్గరకు రాకుండా చూడు. అన్యధా స్తుతులచే మేము నీకు కోపము తెప్పించము. మా వారందరిని ఔషధముల ద్వారా బలవంతులుగా చెయ్యవలసింది. రుద్రా ! ఔషధాలతో అందరికీ సుఖాలు ప్రసాదించవలసినది.

రుద్రుడు దృఢమైన అంగములు గలవాడు. బహురూపుడు. బంగారు ఆభరణాలతో శోభిల్లుతుంటాడు. పూజనీయుడు. ధనుర్ధారి. అడవి మృగంలాగా భయంకరుడు. శత్రువినాశకుడు. అటువంటి ఓ రుద్రా ! నీకు మేము నమస్కరిస్తున్నాము. నీవు బహుధనదాతవు. సాధురక్షకుడవు. మాకు ఔషధములు ఇవ్వవలసింది అంటున్నారు. అలాగే **ఒకటవ మండలంలోని 43వ సూక్తం**లో రుద్రుడు జ్ఞానవంతుడు. వరాలిచ్చేవాడు. ఈ భూమి రుద్ర సంబంధమైన ఓషధులు కలిగి ఉండాలి. మా సేవకులకు, సంతానానికి, అందరికీ రుద్రీయమైన ఔషధాలు అందాలి.

రుద్రుడు సూర్యునిలాగా మంచి కాంతితో ప్రకాశిస్తాడు. అతడు మా గుర్రాలను, మేకలను, నరనారీజనాన్ని సుఖంగా ఉండేటట్లు చూడాలి. అని ప్రార్ధిస్తున్నారు.

కృష్ణయజుర్వేదంలో 8 అధ్యాయాలలో రుద్రుని ప్రసక్తి ఉన్నది. ఇతడు ప్రజలకు జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు. శారీరక, మానసిక రోగాలు పోగొడతాడు. ఈయన దయతో సంతానము, రాజ్యము, ధనము పొందటానికి వీలవుతుంది. **కృష్ణయజుర్వేద సంహితలోని 4వ కాండలోని 5వ ప్రపాఠకంలో 'శతరుద్రీయము' ఉన్నది.** దీన్నే నమకము

అంటారు. ఇందులో రుద్రుని విశ్వవ్యాపకత్వము వివరించబడింది. వివరాలకు **'శతరుద్రీయము'** చూడండి.

శుక్లయజుర్వేదంలో ఇతనికి ప్రముఖ స్థానమున్నది. జగత్తులోని ప్రతి అణువు ఇతని రూపమే. అందుచేతనే బహురూపుడు అనబడుతున్నాడు. రుద్రుని దయవల్లనే జనులు అన్నం తినగలుగుతున్నారు. 'మూజవత్పర్వతము' ఇతని నివాస స్థానము. ధనుస్సు, బాణాలు, కత్తి, అంకుశము ఇతని ఆయుధాలు. ఇతడు మేఘంలో ఉండి వర్షాన్ని కురిపిస్తాడు. కైలాసంలో ఉండి సుఖాన్నిస్తాడు. ఇతడు నీలగ్రీవుడు, **శుక్లయజుర్వేదంలో 16వ అధ్యాయం పూర్తిగా రుద్రుణ్ణి గురించే చెబుతోంది.** శతరుద్రీయము ఇక్కడ కూడా చెప్పబడింది. ఇతడు అతిబలవంతుడు, క్రూరుడు, భయంకరుడు. కాని భక్తులపట్ల అమితమైన ప్రేమ గలవాడు. బోళాశంకరుడు. సామవేదంలో ఇతని ప్రసక్తి పెద్దగా లేదు. కాని అథర్వణ వేదంలో 11 సూక్తాలలో చెప్పబడ్డాడు. సంతాన నష్టం జరుగుతున్న స్త్రీ సంతానం కోసం రుద్రుణ్ణి ప్రార్థిస్తుంది. వాక్పటిమకోసం, వడదెబ్బ తగిలినప్పుడు, పఠించే రుద్రమంత్రాలు ప్రత్యేకంగా ఉన్నాయి.

రుద్రుడు అభిషేక ప్రియుడు. రుద్రాధ్యాయము (నమకచమకాలను) చెబుతూ రుద్రుడికి స్నానం చేయిస్తారు. అదే అభిషేకము. ఈ మంత్రాలతోనే హోమం చేస్తారు. అదే రుద్రహోమము. అతిరుద్రము అంటే నమకాన్ని 1331 సార్లు చెబుతూ హోమంగాని అభిషేకంగాని చెయ్యటం. మహారుద్రము అంటే 14,641 సార్లు నమకంతో అభిషేకం గాని, హోమంగాని చేసినట్లైతే భక్తుడు రుద్రునికృపకు పాత్రుడు కాగలడు. ఇందులో సందేహం లేదు.

నేను 4-3-2014 నుంచి 29-3-2014 వరకు

అతిరుద్రమహాయాగం చేసి 30-3-2014వ పూర్ణాహుతి చేశాను. ప్రతిరోజు ఉదయం 8 గం॥ల నుంచి సాయంత్రం 6 గం॥ వరకు ఈ యాగం నేను ఒక్కడినే చేశాను.

**6. సోముడు :** అన్ని వేదాలలోను చెప్పబడ్డాడు సోముడు. సోమరసానికి అధిదేవత సోముడు. సోమరసము, సోమలతలే సోమదేవతగా చెప్పబడుతున్నాయి. ఋగ్వేదంలోని 9వ మండలం పూర్తిగాను, ఇంకా ఆరు సూక్తాలలోను మొత్తం 113+6 = 119 సూక్తాలలో సోమదేవతను గురించి చెబుతున్నారు.

ఇతడు బహునేత్రుడు. సహస్రాక్షుడు, ఇంద్రుడు చేసిన గొప్ప పనులన్నీ సోమరసం త్రాగటంవల్లనే. స్వర్గంలో ఉన్న సోమరసం దివ్యపక్షిచేత భూలోకానికి తీసుకురాబడింది. ఇది "మూజవత్పర్వతాలలో" పుట్టింది. సోమలత యొక్క చిన్న చిన్న కొమ్మలు ఆకులు రాళ్ళతో చితక్కొడతారు. అప్పుడు ఆ కొమ్మలనుండి ఆకుల నుండి రసం వస్తుంది. తిరగలిలో వేసి ఈ ఆకులు తిప్పుతారు. అలా వచ్చిన రసాన్ని ఉన్ని వస్త్రంతో వడగడతారు. తరువాత పెద్ద పెద్ద జాడీలలో పోసి జాగ్రత్త చేస్తారు. సోమరసాన్ని పాలతోకాని, పెరుగు, బార్లీ, తేనెలతోగాని కలిపి యజ్ఞయాగాలలో వాడతారు. అనంతరం ఋత్విక్కులు, యజమాని సోమరసాన్ని త్రాగుతారు. ఇది త్రాగినవారు అమరులవుతారు. ఇది పరమౌషధం. దీన్ని తాగితే కళ్ళు లేనివారికి కళ్ళు, కాళ్ళు లేనివారికి కాళ్ళు వస్తాయి. మూగవాడు మాట్లాడగలుగుతాడు. అందుకే దీన్ని 'వాచస్పతి' అంటారు. ఇది అమృతము అని చెప్పబడుతోంది.

కృష్ణయజుర్వేదంలోకూడా దీన్ని గురించి 12 అధ్యాయాలలో చెప్పబడింది. ఈ సోముడు అనే దేవత సమస్త జగత్తును సృష్టిస్తుంది.

కోరిన కోరికలన్నీ తీరుస్తుంది. మానవులను సత్కర్ములుగా చేసేట్లుగా ప్రేరేపిస్తుంది. సమస్త విద్యలను ఇస్తుంది.

శుక్లయజుర్వేదంలో సోముడు ప్రకాశవంతమైనవాడు. అమృతమయుడు. ఆహ్లాదకరుడు అని చెప్పబడింది. ఇతడు హరితవర్ణుడు. ఇతడే సూర్యుణ్ని, ఓషధులు పుట్టించాడు. అంతరిక్షాన్ని విస్తరింపచేశాడు. ఈ సోముడే ఉగ్రరూపంతో దుర్జనుల్ని శిక్షిస్తాడు. హోమంలో ఉపయోగించే సోమాన్ని ఏడుగురు దేవతలు రక్షిస్తారు. వారు

1. స్వానుడు (ధని చేసేవాడు)
2. భ్రాజుడు (ప్రకాశించేవాడు)
3. అఙ్ఘారి (పాపాలు పోగొట్టేవాడు)
4. బంభారి (విశ్వాన్ని భరించేవాడు)
5. హస్తుడు (ఎప్పుడూ సంతోషంగా ఉండేవాడు)
6. సుహస్తుడు (మంచి చేతులు కలవాడు)
7. కృశానుడు (దుర్భలను జీవింపచేసేవాడు) అని చెప్పబడింది.

సామవేదంలో దీని ప్రస్తావన ఉంది. ఇది ఒక తీగె. ఉత్తరభారతంలోని పర్వతాలలో పెరుగుతుంది. 'మాజవం' అనే కొండమీద బాగా పెరుగుతుంది. రాతి పలకల మధ్యన నలగగొట్టి రసాన్ని తీస్తారు. దీన్ని సోమం లేదా పవమానం అంటారు. సోమరసం దేవతలకి చాలా ప్రీతిపాత్రమైనది. అందుకే దీన్ని యజ్ఞంలో వాడతారు. దేవతలకు సమర్పించిన తరువాత యజ్ఞం చేసేవారు దీన్ని త్రాగుతారు. సోమం త్రాగిన వారిని **'సోమపీథి'** అంటారు. ఇది గొప్ప వైదిక గౌరవం కలిగిన బిరుదు. సోమరసం అద్భుతమైన పనులు చేస్తుంది. నీళ్ళను

పుట్టిస్తుంది. దేవతలను సేవిస్తుంది. ఇంద్రుడికి బలాన్ని, సూర్యుడికి కాంతిని ఇస్తుంది. అని చెప్పబడింది. అథర్వణ వేదంలో సోమాన్ని చంద్రుడు అని చెప్పటం జరిగింది. కులాన్ని అపవిత్రం చేసే స్త్రీని శిక్షించేవాడు సోముడు. అవివాహిత అయిన స్త్రీకి సౌభాగ్యాన్ని ప్రసాదిస్తాడు. శత్రుసంహారం కోసం వెడుతున్న సైన్యాన్ని ఉత్తరంవైపు నుండి రక్షిస్తాడు అని చెప్పబడింది.

ఈ విధంగా సోమమే, సోముడు, చంద్రుడు అని చెప్పబడ్డాడు వేదంలో

**7. ద్యావాపృథువులు :** వీరు భూమి ఆకాశము, జంట దేవతలు. దేవతలకు మానవులకు కూడా తల్లితండ్రులు. ఋగ్వేదంలోని 159, 160వ సూక్తాలు వీరిని గురించి చెబుతున్నాయి.

ద్యావాపృథువులు యజ్ఞవర్ధకములు. యజమాని వారిని స్తుతి చేస్తున్నాడు. ద్యావాపృథువులు యజమాని కోరికలు తీర్చాలి. తల్లితండ్రులయిన ద్యావాపృథ్వులు మాకు సామర్ధ్యము, రక్షణ, అమృతత్వము ప్రసాదించాలి. ఓ దేవతలారా ! ప్రజలు మీ బిడ్డలు. కర్మలు చేసి అనుగ్రహించమని ప్రార్ధిస్తున్నారు. మీరు మీ సంతానాన్ని రక్షించండి. అని ప్రార్ధిస్తున్నారు. అయితే ద్యావాపృథ్వులు, అక్క చెల్లెళ్ళు ఒకే జన్మస్థానము కలవారు అని ఈ సూక్తంలోనే 4వ మంత్రంలో చెప్పబడింది.

సూర్యుడు శుభకరుడు. జలప్రదాత, పోషకుడు. అతడు ద్యావాపృథ్వులను సర్వదా గమనిస్తున్నాడు. ద్యావాపృథ్వులు తల్లితండ్రులు. ఒకరితో ఒకరు కలియని వారు. వేరు వేరుగా ఉంటారు. లోకాలన్నీ రక్షిస్తారు. ప్రాణులన్నింటినీ తల్లిదండ్రులు లాగా రక్షిస్తారు. వారి కుమారుడు సూర్యుడు. అన్ని భూతాలకు సుఖాలు కలిగించే

ద్యావాపృథువులను పరమేశ్వరుడు సృష్టించాడు. ద్యావాపృథ్వులు సమృద్ధమైన అన్నాన్ని కలిగి ఉన్నాయి. వారి దయవల్లనే మేము సంతానము కలవారమయినాము అని చెబుతున్నది ఈ సూక్తం. మొత్తం మీద ద్యావాపృథ్వులు లోకాలను రక్షిస్తుంటారు. అంటోంది ఋగ్వేదం. కృష్ణ యజుర్వేదంలో వీరి ప్రసక్తి పెద్దగా లేదు. శుక్ల యజుర్వేదంలో వీరు తల్లిదండ్రులుగా చెప్పబడ్డారు. వీరిద్దరూ లోకాలకు శుభాలను చేకూరుస్తారు. సామవేదంలో వీరి గురించి చెప్పలేదు. అధర్వణ వేదంలో వీరు అభిచారకృత్యాల నుంచి కాపాడతారని చెప్పబడింది. వీరు అమృతము, హవిస్సు దేవతలకు చేరే మార్గం సుగమం చేస్తారు. వనస్పతులను, మానవులను రక్షిస్తారు. వీరు లేకుండా అగ్నిలేదు. ఆజ్యాహుతులను వీరు రక్షిస్తారు. యజ్ఞంలో హోమం చేసిన పశువుయొక్క భాగాలను వీరు స్వీకరిస్తారు అని చెప్పబడింది.

**8. మరుత్తులు :** వీళ్ళు దేవతలు. దితికశ్యపుల సంతానం. దితి కుమారులందరినీ ఇంద్రుడు చంపేస్తున్నాడు. దీంతో దితి చాలా బాధపడి ఇంద్రుని సంహరించగల కుమారుణ్ణి ప్రసాదించమని భర్తను కోరింది. అలాగే అన్నాడు కశ్యపుడు. దితి గర్భవతి అయింది. ఈ విషయం ఇంద్రుడికి తెలిసి 14 సం॥ బాలుడిగా దితికి సేవలు చేస్తున్నాడు. ఒకరోజున దితి అశుచిగా నిద్రపోయింది. ఆ సమయంలో ఇంద్రుడు సూక్ష్మరూపంలో ఆమె గర్భంలో ప్రవేశించి పిండాన్ని ముక్కలు ముక్కలుగా నరికాడు. ఆ పిండం ముక్కలు చావలేదు సరికదా చంపవద్దు అంటూ ఏడుస్తున్నాయి. ఈ శబ్దానికిదితికి మెలకువచ్చి జరిగింది తెలుసుకుని వాళ్ళని చంపద్దు అని ఇంద్రుని వేడుకుంది. వారు నీకు శత్రువులు కారు. మిత్రులు అంటూ వారిని ఇంద్రుడికి వప్పగించింది. ఇంద్రుడు వారికి మరుత్తులు అని నామకరణం చేశాడు. వారు మొత్తం 49 మంది. వారే మరుద్గణాలు.

ఋగ్వేదంలో 33 సూక్తాలలో పూర్తిగాను, ఇంకా తొమ్మిది సూక్తాలలో ఇంద్రుడు, అగ్ని, పూషలతో కలిపి స్తుతించబడ్డారు. వీరు పృష్ణిరుద్రుల సంతానము. వీరు వాయుపుత్రులని, స్వర్గపుత్రులని చెప్పబడ్డారు. వీరంతా కలిసే స్తుతించబడ్డారు. వీరందరిదీ ఒకే మనస్సు. వీరిలో ఎక్కువ తక్కువ కాని, పెద్ద చిన్న గాని ఏవీలేవు. వీరు ఎఱ్ఱగాను, బంగారు రంగులోను ఉంటారు. మెరుపులే వీరి కళ్ళు. బంగారు గొడ్డళ్ళు, ధనుర్బాణాలు. వీరి ఆయుధాలు, వీరు బంగారు ఆభరణాలు ధరిస్తారు. బంగారు కిరీటాలు, భుజకీర్తులు, కడియాలు ధరిస్తారు. వీరి రథాన్ని ఎఱ్ఱరంగు గుఱ్ఱాలు, వేగంగా పోగలవి లాగుతాయి. వీరు బలపరాక్రమాలు గలవారు. అతిక్రూరులు. వీరి మాట పిడుగులాంటిది. పర్వతాలను కూడా పీకెయ్యగలరు. అడవులు, అందులోని జంతువులను నాశనం చేస్తారు.

వీరికి వర్షం కురిపించటం ముఖ్యమైన పని. మేఘాల ద్వారా చీకటి పుట్టిస్తారు. కొన్నిచోట్ల వీరిని దేవగాయకులని చెప్పారు. ముఖ్యంగా ఇంద్రుని స్నేహితులు. ఇంద్రుడి బలాన్ని ప్రార్ధనలతోను, స్తుతులతోను పెంచుతారు. వీరి సాయంతోనే ఇంద్రుడు వృత్రుని సంహరించాడు. భక్తులను వీరు పాపాల నుంచి రోగాల నుంచి రక్షిస్తారు. ఔషధాలను ఇస్తారు. అని చెప్పబడింది. మరుత్తు (వాయువు) నుంచి సూర్యుడు పుట్టాడు. పృథివి పుట్టింది. మరుత్తులు వర్షం కురిపిస్తారు. కొత్త విత్తనాలను రక్షిస్తారు అని అథర్వణవేదం చెబుతోంది.

**9. అశ్వనీ దేవతలు :** సూర్యుడు, సంజ్ఞాదేవి భార్యాభర్తలు. వీరు అశ్వాల రూపంలో విహరించినప్పుడు ఇద్దరు కుమారులు కలిగారు. వారే అశ్వనీ దేవతలు. నాసత్యుడు, దస్రుడు అని వీరి పేర్లు. వీరు దేవవైద్యులు. హిమాలయ పర్వతాలలో దొరికే మూలికలు తెచ్చి,

మందులు తయారుచేసి రోగాలు తగ్గిస్తుండే వారు. వీరికి యజ్ఞంలో హవిర్భాగం లేదు. చ్యవనుడు తనకు వీరు చేసిన మేలుకు ప్రతిఫలంగా యజ్ఞాలలో హవిర్భాగం వచ్చేలా చేశాడు.

ఋగ్వేదంలో వీరు చాలా సూక్తాలలో కనిపిస్తారు. వీరు కవలలు. యువకులు. మంచి తేజస్సు గలవారు. బంగారుఛాయతో మెరిసి పోతుంటారు. కామరూపులు మంచి విజ్ఞానం కలవారు. వీరు రథంమీద ప్రయాణం చేస్తారు. ఆ రథం తేనె రంగులో ఉంటుంది. బంగారు మయమైంది. చక్కగా అలంకరించబడి ఉంటుంది. దివ్యమైన కాంతో ప్రకాశిస్తుంటుంది. ఈ రథానికి మూడు చక్రాలుంటాయి. సూర్యుడు, చంద్రుడు, కాలము ఈ మూడు చక్రాలు. ఈ రథాన్ని గుర్రాలు లాగుతాయని, హంస, గ్రద్ద మొదలయిన పక్షులు లాగుతాయని, ఎనుబోతులు లాగుతాయని, గాడిదలు లాగుతాయని రకరకాలుగా చెప్పబడింది. వీరు స్వర్గంలో ఉంటారు. అయితే వీరి నివాసం గురించి స్పష్టంగా చెప్పలేదు. సముద్రంలో ఉంటారని, పర్వతాలలో ఉంటారని రకరకాలుగా చెప్పబడింది. తెల్లవారుఝామున 'ఉష' అనే దేవత వీరిని మేలుకొలుపుతుంది. అశ్వనీ దేవతల తల్లిదండ్రులు వివస్వంతుడు, సరణ్య అని కూడా చెప్పారు. ఉషస్సు వీరి సోదరి. వీరు తమ భక్తుల కోరికలు తీరుస్తారు. స్వర్గం నుంచి నిధులు తెచ్చి ఇస్తారు. స్వర్గలోక వైద్యులు అనేక వ్యాధులకు మందులిస్తారు.

చ్యవనమహర్షికి ముసలితనం పోగొట్టి యవ్వనాన్ని మంచి రూపాన్ని ఇచ్చారు. రేభుడు అనే ఋషి శత్రువుల చేతిలో తీవ్రంగా గాయపడి మరణించే పరిస్థితి దాపురించినప్పుడు అతన్ని బ్రతికించారు. **'అత్రిసప్తవధ్రి'** అనే ఋషిని రాక్షసులు హింసించి యజ్ఞకుండంలో పారేసినప్పుడు అతన్ని రక్షించి యవ్వనాన్నిచ్చారు. ఋజ్రాశ్వుడు

గ్రుడ్డివాడు. అతడికి చూపునిచ్చారు. 'నిశ్చలా' అనే స్త్రీకి యుద్ధంలో కాలుతెగిపోయింది. అప్పుడు అశ్వనీదేవతలు ఆమెకు శస్త్రచికిత్స చేసి లోహంతో చేసిన కాలు అమర్చారు.

అశ్వనీదేవతల వృత్తాంతము చూస్తే వైద్యరంగంలో ఆ రోజున మనం సాధించిన అద్భుతాలు అనేకానేకం కనిపిస్తాయి. ఇది నిజంగా భారతీయులు గర్వించదగిన విషయం **మొదటి మండలంలోని 116వ సూక్తంలో**

విదురుని భార్యను శత్రువులు అపహరించారు. వారితో యుద్ధం చేసి ఆమెను రక్షించారు అశ్వినులు. వీరి వాహనము గాడిద. అది బలము, వేగము గలది. ఇంద్రుని గుర్రాలతో సమానమైనది. తుగ్రుని కుమారుడైన భుజ్యుడు మరణించాడు. అతని దేహాన్ని నీటిలో మునగకుండా నడిచే నావల మీద సురక్షితంగా తండ్రి దగ్గరకు చేర్చారు. భుజ్యుని కోసం వేగవంతమయిన వంద చక్రాలుగల ఆరు గుర్రాలు కట్టిన మూడు రథాలలో మూడు రాత్రులు మూడు పగళ్ళు దేశమంతా గాలించి, చివరకు భుజ్యుణ్ణి రక్షించారు. వేదుడనే రాజర్షికి ప్రశస్తమైన తెల్లగుర్రాన్నిచ్చారు. చ్యవనుని వార్ధక్యాన్ని పోగొట్టారు. బావిలో ఉన్న 'నందర్షిని' బయటకు తీశారు. గోతమర్షి కోసం బావిని తెచ్చి అతని దాహం తీర్చారు. ఇంద్రుడు కాదన్నప్పటికీ దధ్యంగుడిదగ్గర మధువిద్య నేర్చుకుని అతణ్ణి రక్షించారు. తోడేలు నోట పడిన వర్తక పక్షిని విడిపించారు. ఖేలుడి భార్య నిశ్చలకు లోహపుకాలు అంటించారు. జాషుడు అనే రాజును శత్రువులు ముట్టడించినప్పుడు అతణ్ణి రక్షించారు. వశుడికి అంతులేని ధనరాశులిచ్చారు. శయుడనే వాడికోసం గొడ్డుటావును పాలిచ్చే దానిగా చేశారు. రాక్షసులు రేభుడు అనే ఋషివి తాళ్ళతో కట్టి నీటిలో పారేస్తే, అతన్ని రక్షించారు. ఈ

రకంగా అశ్వనీ దేవతలు దేవవైద్యులని, వైద్యశాస్త్రంలో అద్భుతాలు చేశారని, భక్తుల కోరికలు తీరుస్తారని చెప్పింది ఋగ్వేదం.

శుక్లయజుర్వేదంలో నాసత్యుడు, దస్రుడు వీరి పేర్లు. వీరు యజ్ఞంలో ఋత్విక్కులు. దేవతలకు అధ్వర్యులు. శ్రోత్రేంద్రియానికి దేవతలు. దేవవైద్యులు. 'నముచి' అనే రాక్షసుడు ఇంద్రుని పరాక్రమాన్ని హరించినప్పుడు ఇంద్రుణ్ణి రక్షించి మళ్ళీ వీర్యవంతుడిగా చేశారు అని చెప్పబడింది.

**10. సవిత :** ఋగ్వేదంలో 11 సూక్తాలలో చెప్పబడ్డాడు. ఇతడు బంగారు రంగులో ఉంటాడు. జుట్టుకూడా బంగారమే. ఇతని బట్టలు బంగారంతో చేసినవి. రథం కూడా బంగారందే. రథాన్ని గుర్రాలు లాగుతాయి. ఇతడు పొడవైన చేతులు కలవాడు. ఆ చేతులు దిగంతముల వరకు వ్యాపించి ఉంటాయి. తెలతెలవారుతుండ గానే తన చేతులు చాపి జీవులందరినీ మేలు కొలిపి వారి వారి కర్మలు చేయవలసిందిగా బోధిస్తాడు. తూర్పునుంచి తన కాంతులు ప్రసరింపచేసి భక్తుల పాపాలు పోగొడతాడు దుస్వప్నాలు రానీయడు. దుర్మార్గులను, రాక్షసులను పారద్రోలతాడు. దేవతలకు ఇతడు నాయకుడు. అతన్ని అడ్డగించగలవారు లేరు. రాత్రిపూట అందరూ విశ్రాంతి తీసుకునేట్లుగా చేస్తాడు. గాయత్రీమంత్రం ద్వారా ప్రజలకు మంచి బుద్ధినిమ్మని కోరతాడు.

కృష్ణయజుర్వేదంలో ఇతడు 22 అధ్యాయాలలో చెప్పబడ్డాడు. ఇతడు చాలా గొప్పవాడు. మానవుల బుద్ధిని కూడా మంచి పనులు చేసేందుకు ప్రేరేపిస్తాడు. ఇతడు మంచి విద్వాంసుడు. మానవులను కూడా విద్వాంసులుగా చెయ్యటానికి ప్రయత్నిస్తాడు. సూర్యుడులాగానే జగత్తును ప్రకాశింపచేస్తాడు.

ఈ దేవత తన భక్తులకు మంచి సంతానం, పశువులు, భూమి ఇస్తాడు. వారి సంతానాన్ని, సిరిసంపదలను రక్షిస్తాడు. సవితాదేవత అనుగ్రహం ఉంటే సంతానం మంచి మార్గంలో నడుస్తుంది. మంచి మధురమైన వాక్కు కలుగుతుంది. ఈయన దయవల్ల రాజు ఆరోగ్యంగా రాజ్యాన్ని పాలిస్తాడు. మంచి నడవడి, మంచి బుద్ధి కలుగుతాయి. ఆయుషు పెరుగుతుంది. అని చెప్పబడింది.

**11. ప్రజాపతి :** కృష్ణయజుర్వేదంలో ప్రజాపతిని గురించి 19 అధ్యాయాలలో చెప్పబడింది. జగత్తును గురించి ఇతడికి పూర్తిగా తెలుసు. అందుచేత జ్ఞానులకు అన్ని విషయాలు తెలిసేటట్లుగా చేస్తాడు. ఇతడు విజ్ఞానదేవత. మానవుల విజ్ఞానాన్ని పెంచుతాడు. మంచివాళ్ళని రక్షిస్తాడు. పశువులను కాపాడతాడు. ఇతని దయవల్ల శత్రువులను ఎదుర్కొగలుగుతాము. ధర్మానికి హాని చేసేవారిని శిక్షిస్తాడు. తన భక్తులకు ఐశ్వర్యము, ఉత్తమ సంతానము ప్రసాదిస్తాడు.

శుక్లయజుర్వేదంలో ఇతణ్ణి గురించి కొంచెం ఎక్కువ చెప్పబడింది. ఇతడు మనస్సు, వాక్కులకు అభిమాని. సర్వదేవతాప్రియుడు. ఇతని కన్న గొప్పవారు లేరు. ఇతడు అన్నింటియందు అంతర్యామిగా ఉన్నాడు. సృష్టి స్థితి సంహారాలు చెయ్యటంలో సమర్థుడు. జీవులు తమ తమ కర్మను ఎలా అనుభవించాలో నిర్ణయిస్తాడు. ఇతడు ముల్లోకాలను ధరిస్తాడు. సముద్రంలో బడబానలం రూపంలో ఉన్న అగ్నిని ప్రకాశింపచేశాడు. వర్షం రూపంలో జలంలో విద్యుత్తుగాను, ద్యులోకంలో సూర్యునిగాను ప్రకాశిస్తాడు. ఇతడే హిరణ్యగర్భుడు. సృష్టికి ముందు నుంచీ ఉన్నాడు. తన వాక్కుతోనే ప్రజలను పుట్టించాడు. పృథివిని విస్తరింపచేశాడు. విశ్వేదేవులు ఇతని పుత్రులు. ఇతడు నిధి రక్షకుడు. ఇతనికి మొత్తం 21 అవయవాలున్నాయి. అవి

నెలలు-12, ఋతువులు-5, లోకాలు-3, ఆదిత్యుడు-1 మొత్తం 21 అగ్ని, పృథివి, వాయువు, అంతరిక్షము, ఆదిత్యుడు, ద్యులోకము, జలము, వరుణుడు అందరూ ప్రజాపతి స్వరూపులే. జగత్తును సృష్టించటానికి ప్రజాపతి ఈ రూపాలు ధరించాడు అని చెప్పబడింది.

**12. వాయువు :** కృష్ణయజుర్వేదంలోని 13 అధ్యాయాలలో చెప్పబడ్డాడు. యుద్ధవిద్యలో ఆరితేరినవాడు. ఇతని విజ్ఞానం ద్వారానే మనం వర్షాన్ని పొందుతున్నాం. దుర్జనులను, అనాచారులను శిక్షిస్తాడు. ఇతన్ని సేవించిన స్త్రీ విదుషీమణి అయి మంచి సంతానాన్ని పొందుతుంది.

శుక్లయజుర్వేదంలో వాయువు సర్వవ్యాపి. ఆకాశపుత్రుడు ఏ పని అయినా చేయగలడు. మహాబలవంతుడు. ప్రాణవాయువునే వాచస్పతిఅంటారు. ముల్లోకాలు వ్యాపించి ఉంటాడు కాబట్టి 'త్రివృత్' అనబడతాడు. నాలుగు దిక్కులచేత స్తుతించబడతాడు కాబట్టి 'చతుష్టోముడు' అనబడతాడు. ఇతడి వాహనం లేడి. భక్తులను రక్షిస్తాడు. వారి కోరికలు తీరుస్తాడు. అని చెప్పబడింది.

**13.పురుషుడు :** సామవేదంలో సమాధిస్థితిలో ఉన్న ఆప్తర్షులు చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే అని విశ్వరూపాన్ని దర్శించగలిగారు. అదే పురుషుడు. అతడికి అనేక శిరస్సులు, నేత్రాలు, కాళ్ళు, చేతులు ఉన్నాయి. అతడు త్రివిక్రముడు. అతనికున్న మూడు పాదాలలోను ఒక పాదం భూమి. చలనమున్నవి చలనంలేనివి ప్రాణమున్నవి ప్రాణం లేనివి అన్నీ ఈ జగత్తంతా అతడి స్వరూపమే. అన్నింటియందు అంతర్లీనంగా ఉన్నాడు. భూతభవిష్యద్వర్తమానాలు అతడే. అతనిలో నాల్గవభాగమే ఈ జగత్తు. అతడు కేవలం నిమిత్తమాత్రడు అని చెప్పబడింది. ఈ రకంగా పురుషుణ్ణి గురించి

చెబుతోంది వేదం.

**14. వరుణుడు :** అదితి కశ్యపుల కుమారుడు వరుణుడు. సత్యపాలన, జగత్తును సక్రమంగా నడపటం ఇతని కర్తవ్యాలు. ఋగ్వేదంలో మొత్తం 12 సూక్తాలలో పూర్తిగాను. 24 సూక్తాలలో మిత్రునితో కలిపి స్తుతి చెయ్యబడ్డాడు. **ప్రథమ మండలంలోని 24వ సూక్తంలో**

వరుణుడు అంతరిక్షంలో పరాక్రమవంతుడు. రెక్కలు ఉన్న పక్షులు కూడా ఇతన్ని చేరలేవు. నిరంతరము ప్రవహించే నదులు కూడా అతణ్ణి దాటలేవు.

వరుణుడు ఆధారం లేని అంతరిక్షంలో ఉన్నాడు. అక్కడ విపరీతమైన తేజస్సుతో ప్రకాశిస్తున్నాడు. అతని కిరణాలకు మూలము అంతరిక్షము.

సూర్యుడు ఉదయించటానికి, అస్తమించటానికి అనుగుణంగా ఆకాశంలో విశాలమైన మార్గం ఏర్పరచాడు. ఆధారంలేని అంతరిక్షంలో కదలటానికి అవకాశం కల్పించాడు. అటువంటి వరుణుడు మా శత్రువులను దూరం చేస్తాడు. ఓ దేవా ! మాతో పాపాలు చేయించే వారిని మా నుంచి దూరంగా తీసుకువెళ్ళి వాళ్ళను సంహరించు. మేం చేసిన పాపాలను మన్నించు.

వరుణుడి మహిమవల్లే నక్షత్రాలు, చంద్రుడు రాత్రులందే కనిపిస్తున్నారు.

ఓ వరుణదేవా ! నేను అర్పించే హవిస్సు స్వీకరించి మా ఆయువును రక్షించు.

శునస్సేపుడు యూపస్తంభానికి కట్టబడి ఉన్నాడు. వరుణుణ్ణి ప్రార్థించాడు. వరుణుడు శునశ్శేపుణ్ణి రక్షిస్తాడు. దేవా ! మేము నిన్ను

స్తుతి చేస్తున్నాము మా బంధాలను త్రెంచి వేయవలసినది అంటున్నారు.

మానవులు చేసే పనులను చారులద్వారా ఎప్పటికప్పుడు తెలుసుకుంటాడు. సూర్యుడే ఇతని కన్ను.

ఇతని ఆజ్ఞవల్లనే ఉషస్సు ఉదయిస్తుంది. మేఘాలు వర్షిస్తాయి. నక్షత్రాలు ప్రకాశిస్తాయి. ఇతడు దేవతలను సక్రమ మార్గంలో నడిపిస్తాడు. ఇతడికి కోపం చాలా ఎక్కువ. తన నియమాలు, ఆజ్ఞలు కఠినంగా అమలుపరుస్తాడు. అందుకే ఇతణ్ణి **'దృఢవ్రతుడు'** అంటారు. అపరాధులను కఠినంగా శిక్షిస్తాడు. ఇతడి ఆయుధం "పాశం" ఋతువులు కాలములను సక్రమంగా నడిపిస్తాడు.

భక్తుల పాపాలనే గాక వారి తల్లితండ్రుల పాపాలను కూడా క్షమిస్తాడు. తన భక్తులకు మరణభయం లేకుండా చేసి మోక్షం ప్రసాదిస్తాడు.

**15. ఉషస్సు :** ఋగ్వేదంలోని 20 సూక్తాల్లో వివరించబడింది ఈ దేవత. ప్రతిరోజూ ఒకే సమయంలో ఉదయిస్తుంది. నిర్ణీత మార్గంలోనే ప్రయాణిస్తుంది. జీవులకు కర్తవ్యాన్ని బోధిస్తుంది. ఉషస్సు ఒక స్త్రీగానే చెప్పబడింది. చీకట్లు పారద్రోలుతుంది. జ్ఞానజ్యోతులు వెలిగిస్తుంది. ఈమె స్వర్గానికి పుత్రికగా చెప్పబడింది. ఈమె రథాన్ని ఎర్రని గుర్రాలు త్రాడుతో లాగుతున్నాయి. తన భక్తులకు సంపద, సంతానం అందిస్తుంది అని చెప్పబడింది.

**16. పూష :** ఋగ్వేదంలో ఇతన్ని 8 సూక్తాలలో పూర్తిగాను, ఇంద్రుడు చంద్రుడులతో కలిపి కొన్నిచోట్ల కీర్తించారు. రాత్రి పోగొట్టుకున్న వస్తువులు పగటిపూట తిరిగి వచ్చేట్లుగా చేసే శక్తిగలవాడు. ఇతడిది బోసి నోరు. దంతాలు లేవు. అందుకే కేవలం 'జావే' అతడి ఆహారము. జావ అంటే ద్రవరూపంలో చిక్కగా ఉండే

ఆహారం. నమలవలసిన అవసరం లేదు. ఇతడు వీరుడు. ఇంద్రునికి యుద్ధంలో సహాయపడతాడు. గోధనాన్ని అపహరించిన 'ఫణి' జాతిని సంహరించి ఆవులను కాపాడాడు. మనకి త్రోవలో కలిగే ఆపదలను పోగొడతాడు. అని చెప్పబడింది. ఈ కారణాల వల్ల పూష ప్రజలచే స్తుతించబడుతున్నాడు. వారి కోరికలు తీరుస్తాడు.

**17. బృహస్పతి :** ఋగ్వేదంలో 11 సూక్తాలలో స్తుతించబడ్డాడు. ఇతడు దేవగురువు. యజ్ఞపురోహితుడు. బృహస్పతి లేకపోతే యజ్ఞం పూర్తికాదు. దేవతలను సంతోషపెట్టే మంత్రాలను స్వయంగా ఇతడే చదువుతాడు. ఇతనితోపాటుగా ఇంకొంత మంది కలిసి మంత్రాలు చదువుతారు. అందువల్లనే ఇతడు గణాలకు పతి 'గణపతి' అనబడతాడు. ధనుర్బాణాలు, గొడ్డలి ఇతని ఆయుధాలు. భక్తుల కోరికలు తీరుస్తాడు.

**18. యముడు :** సూర్యుని కుమారుడు. ప్రేతాత్మల సామ్రాజ్యానికి అధిపతి. మరణించిన ప్రతివాడు ముందుగా అగ్నివల్ల దహించబడి, యమలోకం చేరతాడు. అక్కడ అధర్వ అంగిరసాది పితరులతో కలిసి ఆనందం పొందుతాడు. ఇతడు యజ్ఞంలో ఆహుతులు స్వీకరిస్తాడు. యముని దగ్గర పెద్ద పెద్ద కుక్కలుంటాయి. మరణించిన వారిని మరణించబోయే వ్యక్తులను గుర్తించి వారిని యమలోకం చేరుస్తాయి. ఇతడు వివస్వంతుడు సంజ్ఞాదేవీల కుమారుడు. యముని వార్తాహరుడు 'గుడ్లగూబ'

**19. విశ్వేదేవులు :** శుక్ల యజుస్సంహితలోని 17 అధ్యాయాలలో చెప్పబడ్డారు. వీరు సుఖానికి కారకులు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తారు. వీరున్నచోట మంచివిద్య, శిక్షణ, ధనము పుష్కలంగా ఉంటాయి. భ్రమ మొ॥ దోషాలు ఉండవు. శత్రువులని శిక్షిస్తారు. యోగవిద్యను

బాగా ప్రచారం చేస్తారు. వీరివల్ల రాజ్యపాలన మెరుగవుతుంది.

**20. ఈశ్వరుడు :** కృష్ణయజుర్వేదంలోని 11వ అధ్యాయాలలో ఇతడు చెప్పబడ్డాడు. ఇతడు జగత్తును సృష్టించాడు. కాలచక్రాన్ని ఏర్పాటు చేశాడు. ఋతువులు, మాసాలు, తిథులు, సంవత్సరాలు సృష్టించాడు. జగత్తునంతటినీ ప్రకాశింప చేస్తున్నాడు. ఇతన్ని సేవించి దుష్టులను సంహరించవచ్చు.

**21. పితరులు :** కృష్ణయజుర్వేదంలో 5 అధ్యాయాలలో చెప్పబడ్డాడు. ప్రజలను దుఃఖం నుంచి రక్షిస్తారు. వారి శత్రువులను శిక్షిస్తారు. వీరివల్ల మానవులకు ఆనందము విద్య లభిస్తాయి. ధార్మిక జీవనం అలవడుతుంది.

**22. మిత్రావరుణులు :** శుక్లయజుర్వేదంలో వీరిని గురించి చెప్పబడింది. వీరు జ్ఞానాన్ని ప్రసాదిస్తారు. ఈతిబాధలు లేకుండా ప్రజలను పాలిస్తారు. పంచప్రాణాలలో ప్రాణవాయువు ఉదానవాయువులకు వీరు ప్రతీక. వీరు రాత్రి చివరిభాగంలో ఉదయిస్తారు. వరుణుడు దుష్టశిక్షణ చేస్తే, మిత్రుడు శిష్టరక్షణ చేస్తాడు. వీరు హిరణ్యరూపులు. పాపపుణ్యాలను పరిగణిస్తారు. వాగింద్రియం మైత్రావరుణమని చెబుతోంది శుక్లయజుర్వేదం.

వరుణుడు ద్యులోకాన్ని అంతరిక్షాన్ని స్తంభింపచేశాడు. భూమి వైశాల్యాన్ని కొలిచాడు. అడవిలో ఉన్న చెట్లపైదాకా ఆకాశాన్ని వ్యాపింపచేశాడు. గుర్రాలకు, మానవులకు, వీర్యాన్ని పెంపొందింపచేశాడు. ఆవులలో పాలు, మానవులలో క్రతు సంకల్పం గల మనస్సు, ప్రజలలో జఠరాగ్ని, ద్యులోకంలో సూర్యుడు, పర్వతంలో తీగె రూపంలో ఉంటాడు. వీరందరినీ ఇతడే స్థాపించాడు. తన

కిరణాలతో జగత్తును ఆవరిస్తాడు కాబట్టి 'వరుణుడు' అనబడుతున్నాడు. మిత్రుడు వరుణుడికి కన్ను. ఈ వరుణుడే సూర్య మార్గాన్ని సుగమం చేశాడు. దుష్టులను దుర్మార్గులను శిక్షిస్తాడు. రాజసూయానికి ఇతడే ద్రష్ట.

ఎక్కువ కాలం జీవించాలన్నా, జ్ఞానం కావాలన్నా, సుఖసంతోషాలు కావాలన్నా వీరిద్దరినీ ప్రార్థించాలి అంటోంది వేదం.

ఇప్పటిదాకా నాలుగు వేదాలలోను ప్రముఖులైన దేవతలను కొంతమందిని చెప్పుకున్నాం. వీరు కాక వేదంలో ఇంకా అనేకమంది దేవతలున్నారు. దేవతలు ఎంతమంది ఉన్నా, అందరూ పరమేశ్వరుని ప్రతిరూపాలే. వేదంలో చెప్పింది ఏకేశ్వరోపాసన మాత్రమే ఉన్నది ఒకరే దేవత. అతడే పరమేశ్వరుడు.

# 15. వేదమాత గాయత్రి

ఇది పూర్తిగా సంప్రదాయ బద్ధమైన గ్రంథము. అలా అని చాదస్తాన్ని మాత్రం లెక్కలోకి తీసుకోవటం జరగదు. సంప్రదాయాన్ని, భారతీయ తత్త్వాన్ని గౌరవిస్తూ, అవసరమైన చోట 'ఇది చాదస్తము' అని ఖచ్చితంగా చెప్పటం జరిగింది. ఈ కారణం చేతనే వేదమాత గాయత్రి కాబట్టి ముందుగా గాయత్రీ మహామంత్రంతోనే ఈ గ్రంథం ప్రారంభించబడుతోంది. ఇక్కడ చిన్న అనుమానం గాయత్రి వేదమాత ఎందుకు అవుతోంది? అసలు గాయత్రికి, వేదానికి సంబంధం ఏమిటి?

ప్రస్తుతం మనం జపం చేస్తున్న గాయత్రీ మహామంత్రాన్ని దర్శించినవాడు విశ్వామిత్రుడు. ఆయనే ఋషి. విశ్వామిత్రుడు తపస్సు చేస్తున్నప్పుడు ముందుగా ఆయనకు గాయత్రీదేవి దర్శనమయింది. ఆ తరువాత ఆ దేవినుంచి వేదాలన్నీ వచ్చినట్లుగా కనిపించింది. అందుకే వేదమాతగాయత్రి అని చెప్పబడుతోంది.

గాయత్రి అనేది ఒకఛందస్సు. ఒకమంత్రము. ఒకదేవత ఈమంత్రాన్ని ఉపనయన సమయంలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు ఉపదేశం చేస్తారు. అప్పటి నుండి వారు ఈ మంత్రాన్ని త్రిసంధ్యల యందు జపించాలి. గాయత్రీ మహామంత్రాన్ని జపించటము నిత్యము చేయవలసిన విధి. ఇది సాక్షాత్తు పరబ్రహ్మస్వరూపం. ఈ మంత్రానికి

| | |
|---|---|
| సవిత | – దేవత |
| అగ్ని | – ముఖం |
| బ్రహ్మ | – శిరస్సు |
| విష్ణువు | – హృదయం |

రుద్రుడు - శిఖ

పృథివి - యోని అని చెప్పబడుతోంది.

వేదమాత గాయత్రి. వేదాలకు ఆవిడే తల్లి అని చెప్పబడుతోంది. గాయత్రి మంత్రం జపంచెయ్యకుండా ఏమంత్రోపదేశము తీసుకోరాదు. కాబట్టి గాయత్రీ మహామంత్రాన్ని ముందుగా చూద్దాం.

ఇప్పటివరకు ఈ మంత్రానికి 24 మంది ఋషులు, 24 ఛందస్సులు, 24 మంది దేవతలు, 24 శక్తులు ఉన్నాయి. అని చెబుతోంది దేవీ భాగవతం.

గాయత్రి మంత్రానికి 24 మంది ఋషులున్నారు. వారు

1. వామదేవుడు
2. అత్రి
3. వశిష్ఠుడు
4. శుక్రుడు
5. కణ్వుడు
6. పరాశరుడు
7. విశ్వామిత్రుడు
8. కపిలుడు
9. శౌనకుడు
10. యాజ్ఞవల్క్యుడు
11. భరద్వాజుడు
12. జమదగ్ని
13. గౌతముడు
14. ముద్గలుడు
15. వ్యాసుడు

16. లోమశుడు
17. అగస్త్యుడు
18. కౌశికుడు
19. వత్సుడు
20. పులత్స్యుడు
21. మాండూకుడు
22. దుర్వాసుడు
23. నారదుడు
24. కశ్యపుడు

గాయత్రీ మంత్రానికి 24 ఛందస్సులున్నాయి. అవి

1. గాయత్రి
2. ఉష్ణిక్
3. అనుష్టుప్
4. బృహతీ
5. త్రిష్టుభము
6. పంక్తి
7. జగతి
8. అతిజగతి
9. శక్వరి
10. అతిశక్వరి
11. ధృతి
12. అతిధృతి
13. విరాట్
14. ప్రస్తారపంక్తి

15. కృతి
16. ప్రకృతి
17. ఆకృతి
18. వికృతి
19. సంకృతి
20. అక్షరపంక్తి
21. భూః
22. భువః
23. స్వః
24. జ్యోతిష్మతి

గాయత్రీ మంత్రానికి దేవతలు 24 మంది ఉన్నారు. వారు

1. అగ్ని
2. ప్రజాపతి
3. చంద్రుడు
4. ఈశానుడు
5. సవిత
6. ఆదిత్యుడు
7. బృహస్పతి
8. మైత్రావరుణుడు
9. భగుడు
10. యముడు
11. గణేశుడు
12. త్వష్ట
13. పూష

14. ఇంద్రాగ్ని
15. వాయువు
16. వామదేవుడు
17. మైత్రావరుణుడు
18. వైశ్వదేవుడు
19. మాతృకలు
20. విష్ణువు
21. వసువు
22. రుద్రుడు
23. కుబేరుడు
24. అశ్వనీకుమారులు

ఈ దేవతలలో మైత్రావరుణుడు పేరున్నవారు ఇద్దరున్నారు. అంతేకాని పొరపాటు కాదు.

గాయత్రీ మంత్రానికి 24 శక్తులున్నాయి. అవి

1. వామదేవి
2. ప్రియా
3. సత్యా
4. విశ్వభద్ర
5. విలాసినీ
6. ప్రభావతి
7. జయా
8. శాంతా
9. కాంతా
10. దుర్గా

11. సరస్వతీ
12. విద్రుమా
13. విశాలేశా
14. వ్యాపినీ
15. విమలా
16. తమోపహారిణీ
17. సూక్ష్మా
18. విశ్వయోని
19. విజయా
20. వశా
21. పద్మాలయా
22. పరాశోభా
23. భద్రా
24. త్రిపదా

గాయత్రీ మంత్రానికి వర్ణాలు (రంగులు) 24 అవి

1. సంపంగి
2. అవిసె
3. పగడము
4. స్ఫటికము
5. పద్మపుష్పము
6. బాలాదిత్యుడు
7. శంఖకుందేలు
8. శ్వేతవర్ణ పగడము
9. పద్మరాగము

10. ఇంద్రనీలమణి
11. ముత్యము
12. కుంకుమ
13. కాటుక
14. రక్తము
15. వైడూర్యము
16. తేనె
17. పసుపు
18. పాలమిశ్రణము
19. సూర్యకాంతి
20. చిలుకతోకరంగు
21. శతపత్రకాంతి
22. కౌతకీపుష్పము
23. మల్లికాకుసుమము
24. కరవీరపుష్పకాంతి

గాయత్రీ మంత్రానికి 24 వర్ణతత్త్వములున్నాయి. అవి

1. నేల
2. నీరు
3. కాంతి
4. గాలి
5. ఆకాశము
6. గంధము
7. రసము
8. రూపము

9. స్పర్శ
10. శబ్దము
11. వాక్కు
12. పాణి, పాదము
13. పాయు
14. ఉపస్థ
15. ఘ్రాణము
16. జిహ్వా
17. చక్షువు
18. చర్మము
19. శోత్రము
20. ప్రాణము
21. అపానము
22. వ్యానము
23. ఉదానము
24. సమానము

గాయత్రీ మంత్రానికి 24 రకాల ముద్రలున్నాయి. అవి

1. సుముఖము
2. సంపుటము
3. వితతము
4. విస్తృతము
5. ద్విముఖము
6. త్రిముఖము

7. చతుర్ముఖము
8. పంచముఖము
9. షణ్ముఖము
10. అధోముఖము
11. వ్యాపకాంజలికము
12. శకటము
13. యమపాశము
14. గ్రథితము
15. షణ్ముఖోన్ముఖము
16. ప్రలంబము
17. ముష్టికము
18. మత్స్యము
19. కూర్మము
20. వరాహము
21. సింహక్రాంతము
22. మహాక్రాంతము
23. ముద్గరము
24. పల్లవము

అయితే ముప్పై రెండు అక్షరాలు గల గాయత్రీ మంత్రానికి ముద్రలు ఈ విధంగా ఉంటాయి.

1. త్రిశూలము
2. యోని
3. సురభి

4. అక్షమాలా
5. లింగము
6. అంబుజము

ఈ రకంగా ఉన్న గాయత్రి మంత్రం బ్రహ్మ క్షత్రియ, వైశ్యులందరిచేత జపించబడుతోంది. అయితే

**ఓంకారవ్యాహృతిపూర్వాం గాయత్రీం బ్రాహ్మణో జపేత్**

**త్రిష్ఠుబం చైవ రాజన్యో జగతీం వైశ్వ ఏవ చ.**

ఓంకార వ్యాహృతి పూర్వకమైన గాయత్రిని – బ్రాహ్మణులు

త్రిష్ఠుప్ ఛందస్సులో – క్షత్రియులు

జగతీ ఛందస్సులో – వైశ్యులు ఈ మంత్రాన్ని జపిస్తారు.

అంతే కాకుండా మంత్రశాస్త్రంలో ప్రతి మంత్రానికి గాయత్రి ఉంటుంది.

**కాత్యాయనాయవిద్మహే కన్యకుమారి ధీమహి తన్నో దుర్గిః ప్రచోదయాత్।**

**మహాదేవ్యై చ విద్మహే। విష్ణుపత్న్యై చ ధీమహి తన్నో లక్ష్మీః ప్రచోదయాత్॥**

గాయత్రీ మంత్రం అత్యంత మహిమోపేతమైనది.

పూర్వకాలంలో ఒకసారి అనావృష్టి వచ్చింది. దాదాపుగా పదిహేను సంవత్సరాలు వర్షపు చుక్కైనా కురవలేదు. పాడిపంటలు లేవు. చెట్లు చేమలుకూడా అంతరించి పోయాయి. భరించలేని కరువు. పశువులు గడ్డిలేక చచ్చిపోతున్నాయి. పసిపిల్లలకు పాలులేవు. ఆకలికి

తాళలేక కొందరైతే మృతకళేబరాలను పీక్కుతినే స్థితికి వచ్చారు. ఇంతదాకా ఎందుకు పిల్లలకు పాలుఇవ్వలేక, వారిని పెంచలేక గొంతుపిసికి చంపేసినవారు కూడా ఉన్నారు. మొత్తం మీద ఘోరకలి విలయతాండవం చేస్తోంది.

ఆ రోజుల్లో కొంతమంది పండితులు ఒకచోటచేరి ఈ దుర్భరస్థితి నుంచి తప్పించుకోవటానికి మార్గంలేదా? అని ఆలోచించసాగారు. చివరకు వారికి గౌతముడు గుర్తు వచ్చాడు.

గౌతముడు ఒకమహర్షి. మహాతపస్సంపన్నుడు. పరదేవతను ఆరాధిస్తూ ఉండేవాడు. ఆవిడయొక్క కరుణవల్ల విత్తనాలు చల్లగానే అవి మొలకెత్తి ఫలితాన్ని ఇచ్చేటట్లుగా వరం పొందాడు. కాబట్టి ఇప్పుడు మనమంతా గౌతముణ్ణి శరణు వేడితే ఆ మహర్షి మనలను కరుణిస్తాడు అని ఆలోచించి గౌతముడి ఆశ్రమానికి ప్రయాణమయ్యారు.

కుటుంబ సమేతంగా వచ్చిన ఇంతమంది పండితులను చూసి, వారికేదో ఆపద వచ్చిందని గ్రహించి, వారిని ఆహ్వానించి ఆతిధ్యమిచ్చాడు గౌతముడు. ఆ తరువాత జరిగిన విషయం తెలుసుకుని, ప్రజలు ఆకలిదప్పులతో అల్లాడుతున్నారన్న మాట విని విచారించి అపరదేవతను ప్రార్ధించాడు.

**నమోదేవి ! మహావిద్యే ! వేదమాతః ! పరాత్పరే !**
**వ్యాహృత్యాది మహామంత్రరూపే ! ప్రణవరూపిణి !**
**సామ్యావస్థాత్మికే ! మాతః ! నమో హ్రీంకార రూపిణి**
**స్వాహా స్వధా స్వరూపే ! త్వాం నమామి సకలార్ధదామ్**
**భక్తకల్పలతాం దేవీం అవస్థాత్రయ సాక్షిణీం**

**తుర్యాతీత స్వరూపాం చ సచ్చిదానంద రూపిణీం**
**సర్వవేదాంత సంవేద్యాం సూర్యమండల వాసినీం**
**ప్రాతర్బాలాం రక్తవర్ణాం మధ్యాహ్నే యువతీం పరాం**
**సాయాహ్నే కృష్ణవర్ణాం తాం వృద్ధాం నిత్యం నమా మ్యహమ్**

ఆ దేవత మహిమవల్ల వచ్చిన వారందరికీ నివాసం ఏర్పాటుచేసి, గతంలో దేవత తనకిచ్చిన వరమహిమ వల్ల వారందరికీ భోజన సదుపాయాలు ఏర్పాటు చేశాడు. ఇంతకాలం అన్నపానాదులు లేక, అవి ఎలాఉంటాయో కూడా మరచిపోయిన వాళ్ళకి ఆ పరదేవత దయవల్ల పంచభక్ష్యాలతో సమృద్ధిగా ఆహారం దొరికింది. ఆ ఆనందానికి తట్టుకోలేక అన్నదానం చేసి తమ ప్రాణాలని నిలబెట్టిన గౌతముణ్ణి వేనోళ్ళకొనియాడారు. ఆ పరమేశ్వరిని పరిపరివిధాల స్తుతించారు. పండితులంతా యజ్ఞయాగాలు చెయ్యనారంభించారు. ఆశ్రమానికి ఎటు చూసినా నూరు యోజనాల వరకు ఆశ్రితులున్నారు. అందర్నీ సంరక్షిస్తున్నాడు గౌతముడు.

కొంత కాలానికి నారదుడు వచ్చి గౌతముడు చేస్తున్న పనికి మెచ్చుకుని “మహర్షీ! ఆపద కాలంలో వీళ్ళని ఆదుకున్నావు. వారికోసం ఆ పరాశక్తి ఇచ్చిన వరప్రభావం ఉపయోగించటం వల్ల నీ శక్తి మరింతగా పెరిగింది. తనకున్న శక్తితో పదిమందికీ ఎవరైతే ఉపకారం చేస్తారో వారిశక్తి ద్విగుణీకృత మౌతుందని చెప్పబడింది. ఇప్పుడు నీకూఅంతే జరిగింది. ఇంద్రాది దేవతలంతా నువు చేస్తున్న పనిని వేనోళ్ళ కొనియాడుతున్నారు” అన్నాడు. ఈ మాటలు విన్న పండితులకు ఈర్ష్య కలిగింది. గౌతముడికి ఇంత పేరు రావటం వాళ్ళు సహించలేకపోయారు. ఎలాగైనా సరే గౌతముడి ప్రతిష్ఠకు మచ్చ

కలిగించాలి అనుకున్నారు. కాలం గడుస్తోంది.

వానలు పడటం మొదలు పెట్టాయి. క్రమంగా నేల చల్లబడింది. ఏరులు పారాయి. నదులు పొంగాయి. విత్తనాలు మొలకెత్తుతున్నాయి. పండితులు కూడా వెళ్ళిపోవటానిక సన్నద్ధమౌతూ మాయాగోవును ఒకదాన్ని సృష్టించారు. అది వచ్చి ఆశ్రమ ప్రాంగణంలోని పంటను, ఆహారాన్ని నాశనం చెయ్యటం మొదలుపెట్టింది. అది చూసిన గౌతముడికి కోపం వచ్చింది. ఆవును కొట్టటం ఇష్టంలేక అదిలించాడు. అంతే ఆ అదిలింపుకు మాయాగోవు కింద పడి చచ్చిపోయింది. ఇదంతా చాటునుంచి చూస్తున్న పండితులు “గౌతముడు గోవును చంపాడు. గోహత్య మహాపాతకం. ఇంక ఇతడి ఇంట భోజనం చెయ్యటం కూడా పాపం. మేం వెళ్ళిపోతున్నాం” అని బయలుదేరారు. ఈ మాయ తెలియని గౌతముడు వారిని బ్రతిమాలాడు. ఈ పాపం పోయే ఉపాయం చెప్పమన్నాడు. అప్పుడు వారు గౌతముడికి అసాధ్యమయ్యేపని ఏదా? అని ఆలోచించి చివరకు గంగను తెచ్చి గోవుమీద ప్రవహింపచేస్తే ఈ పాపం పోతుందన్నారు.

గౌతముడు చాలా సంవత్సరాలు శివుణ్ణి గురించి తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమై గౌతముడి కోర్కె ప్రకారం తన జటాజూటం నుంచి రెండు బొట్లు విదిల్చాడు. అంతే చచ్చిన గోవు లేచినుంచుంది. ఈ రకంగా గౌతముని చేత తేబడింది కాబట్టి గౌతమి అనీ, గోవును బ్రతికించటానికి వచ్చింది కాబట్టి గోదావరి అనీ ఆ నదికి పేరు వచ్చింది.

ఆవులేచి నుంచోగానే ‘గౌతముడు మాయాగోవును బ్రతికించాడు’ అని గెలిచేశారు పండితులు. దివ్యదృష్టితో అసలు విషయం

తెలుసుకున్న మహర్షి వారిమీద కోపించి “ఇక నుంచీ గాయత్రీ జపం మీకు నిష్ఫలమవుతుంది. వేదాధ్యయనం, యజ్ఞకర్తవ్యం మీకు ఉండవు. మీరంతా ధర్మహీనులు, నీతిదూరులు అయి భ్రష్టు పట్టిపోతారు. వావీ వరుసా లేకుండా పశువుల్లా ప్రవర్తిస్తారు. తరతరాలకు మీ గతి ఇంతే” అని శపించాడు.

చేసిన తప్పు క్షమించమని పండితులంతా ప్రాధేయపడగా ద్వాపరయుగంలో పరమేశ్వరి అంశతో యదువంశంలో నందగోవుని ఇంట శ్రీకృష్ణుడు పుడతాడు. అతని జన్మతో మీకు శాపవిమోచనమవుతుంది అన్నాడు.

ఈ రకంగా పండితులు చేసిన తప్పుకు శిక్ష అనుభవించి, పరమేశ్వరి దయవల్ల మళ్ళీ గాయత్రీ అనుష్ఠానం చేసి బ్రహ్మతేజస్సును పొందారు. గాయత్రి జపం చేసినవాడు బ్రహ్మతేజస్సుతో వెలుగొందుతాడు. ఈ కథ దేవీభాగవతంలో ఉన్నది.

**వ్యాహృతులు :**

వ్యాహృతి అంటే – శ్రోత్రేంద్రియానికి తెలిసే స్థూలమగు రూపము. ఉచ్చరించబడి వ్యాప్తి చెందేది.

భూః, భువః, సువః, మహః, జనః, తపః, సత్యం అనేవి సప్తవ్యాహృతులు. వీటిలో

| | | |
|---|---|---|
| భూః | – | సన్మాత్ర |
| భువః | – | స్వరము |
| సువః | – | సుఖస్వరూపము |
| మహః | – | సర్వాతిశయము గలది |

| | | |
|---|---|---|
| జనః | – | సర్వానికి కారణమైనది |
| తపః | – | పాలన స్వరూపము గలది |
| సత్యము | – | బ్రహ్మము |

**తైత్తిరీయోపనిషత్తులో**, శిక్షావల్లిలోని ఐదవ అనువాకంలో పరబ్రహ్మకు అంగ భూతాలయిన వ్యాహృతుల ఉపాసన చెప్పబడింది. వ్యాహృతులు అంటే కర్మలలో ఉపయోగించేవి అని అర్థం. భూః, భువః, సువః అనేవి మూడు వ్యాహృతులు. మహాచమస్యుడనే మహర్షి తపస్సు చేసి మహః అనే నాల్గవ వ్యాహృతిని కనిపెట్టాడు. మహః అనేదే బ్రహ్మము. మహః అనేది శరీరమైతే భూః, భువః, సువః అనేవి అంగాలు. అంగాలకు ఉనికి లభించినట్లుగా, మహః వల్ల మిగిలిన వాటికి ఉనికి లభిస్తోంది. వ్యాహృతులు బ్రహ్మకు అంగాలు కాబట్టి వీటి ఉపాసన చెప్పబడింది. వ్యాహృతుల ఉపాసన నాలుగు రకాలు.

1. లోకదృష్టితో ఉపాసన :

| | | |
|---|---|---|
| భూః | – | భూలోకాన్ని దృష్టిలో ఉంచుకుని |
| భువః | – | అంతరిక్ష్యాన్ని దృష్టిలో ఉంచుకుని |
| సువః | – | స్వర్గలోకాన్ని దృష్టిలో ఉంచుకుని |
| మహః | – | ఆదిత్యలోకాన్ని దృష్టిలో ఉంచుకుని |

ఉపాసన చెయ్యాలి. దీనితో లోకాలన్నీ సూర్యుని వెలుగుతో ప్రకాశమవుతాయి.

2. దేవదృష్టితో ఉపాసన :

| | | |
|---|---|---|
| భూః | – | అగ్ని దృష్టితో |
| భువః | – | వాయు దృష్టితో |
| సువః | – | ఆదిత్య దృష్టితో |

మహః - చంద్రుని దృష్టితో

ఉపాసన చెయ్యాలి. అన్ని తేజస్సులు చంద్రునిచే పూజ్యములు.

3. వేదదృష్టితో ఉపాసన :

భూః - ఋగ్వేదము

భువః - యజుర్వేదము

సువః - సామవేదము

మహః - ఓంకారము

ఓంకారాన్ని మొదట, చివర చేర్చటం వల్లనే వేదాలు పూజనీయమవుతున్నాయి.

4. ప్రాణదృష్టితో ఉపాసన :

భూః - ప్రాణవాయువు

భువః - అపాన వాయువు

సువః - వ్యానవాయువు

మహః - అన్నము

ఈ రకంగా భావించి ఉపాసన చెయ్యాలి. లోకంలో ప్రాణులన్నీ అన్నం చేతనే వృద్ధి చెందుతున్నాయి. ఈ రకంగా 16 వ్యాహృతులు హిరణ్యగర్భుడికి అంగాలు. వీటిని తెలుసుకున్న వాడే పరబ్రహ్మ గురించి తెలుసుకోగలుగుతాడు.

గాయత్రిని ఉపేక్షించినవాడు దేన్నీ పొందలేడు.

గాయత్రి ఛందస్సులో 24 అక్షరాలు ఒక్కొక్క పాదానికి ఆరు చొప్పున నాలుగు పాదాలుగా ఉన్నాయి. ఈ విషయం ఛాందోగ్యోపనిషత్తులో చెప్పబడింది. ఇతర ఛందస్సులలో ఇంకా ఎక్కువ అక్షరాలున్నాయి. కాని వాటన్నింటిలోకి గాయత్రియే శ్రేష్ఠమైనది.

స్థావరజంగమాత్మకమైన ప్రాణి సమూహమంతా గాయత్రియే. వాక్కు – గాయత్రి, సమస్త ప్రాణాలు – గాయత్రి. వాగ్రూపమైన గాయత్రి అందరి పేర్లనూ ఉచ్చరిస్తోంది. కాబట్టి గాయత్రి అందరి పేర్లలోనూ ఉన్నది. ఈ రకంగా ప్రాణిజాతి అంతా గాయత్రియే. గాయత్రి అంటే ప్రాణులను రక్షించేది అని అర్థం. ఈ లక్షణాలు గల గాయత్రి ఈ పృథివే తప్ప వేరేకాదు. చరాచరాలన్నీ ఈ భూమిలోనే ఉన్నాయి. అందుచేతనే చరాచర జగత్తు నంతటనూ గానం చేస్తూ, – పాడుతూ, త్రాణంచేస్తూ – కాపాడుతూ ఉండే గాయత్రియే ఈ భూమి.

పృథివీ రూపమైన గాయత్రి శరీరంలో ఉండే పంచభూతాలు, ఇంద్రియాల సమూహము ఒక్కటే. పురుషుని శరీర రూపమైన గాయత్రి, పురుషుని హృదయ కమలంలో ఉండే పురుషుడు ఇద్దరూ ఒకటే.

ఆ పురుషునిలోనే అంటే గాయత్రిలోనే ప్రాణాలు ప్రతిష్ఠితమై ఉన్నాయి అని చెప్పబడింది.

**బృహదారణ్యకోపనిషత్తు**లో గాయత్ర్యోపాసన వివరిస్తూ "ఉపనిషత్తులో చెప్పిన 'భూమి, అంతరిక్ష్యం, ద్యౌః' ఈ మూడు పదాల్లోనూ మొత్తం ఎనిమిది అక్షరాలున్నాయి. ద్యౌః అనే పదంలో దకార యకారాలను రెండు అక్షరాలుగా లెక్కపట్టాలి. ఇవి మూడు లోకాల పేర్లు. గాయత్రి మంత్రానికి పాదానికి ఎనిమిది అక్షరాలున్నాయి. మూడుపాదాలున్నాయి. అని బృహదారణ్యకం చెబుతోంది. కాబట్టి మూడు లోకాలు మొదటి పాదం. ఈ రకంగా మూడు లోకాలను గురించి తెలుసుకున్నవాడు ముల్లోకాలను జయిస్తాడు.

ఉపనిషత్తులో చెప్పిన 'ఋచ యజూంసి సామాని' అనే

మూడుపదాల్లోనూ ఎనిమిది అక్షరాలున్నాయి. ఇవి గాయత్రికి రెండోపాదం. అంటే వేదాలు రెండవ పాదమన్నమాట. ఈ విషయం తెలుసుకున్నవాడు త్రయీవిద్య అనగా వేదవిద్యవల్ల వచ్చే ఫలితాన్ని పొందుతాడు.

మంత్రంలో చెప్పిన 'ప్రాణ అపాన వ్యానం' అనే దాంట్లోని ఎనిమిది అక్షరాలు గాయత్రికి మూడవపాదం. ఇక్కడ వ్యా అనే అక్షరంలో వకార యకారాలను రెండు అక్షరాలుగా లెక్కపెట్టాలి. ఈ విషయం తెలుసుకున్నవాడు సమస్తాన్ని పొందుతాడు.

ఉపనిషత్ మంత్రంలో 'తురీయదర్శితంపదం' అనేది నాల్గవపాదము. 'దర్శితపదం' అనే పదానికి ఆదిత్యమండలాంతర్గతుడైన పురుషుడు కనిపిస్తున్నాడని అర్థం. అంటే అన్ని లోకాలకు పైన ఆధిపత్యం స్థాపించి ప్రకాశిస్తున్నాడు. ఈ రకంగా గాయత్రిలో నాల్గవపాదం తెలుసుకున్నవాడు కీర్తితో ప్రకాశిస్తాడు.

తురీయపదం సత్యంలో ప్రతిష్ఠితమై ఉన్నది. నేత్రమే సత్యం. ఏదైనా ఒక విషయాన్ని నేను చూశాను. నేను విన్నాను అని చెప్పినప్పుడు చూసినదాన్నే నమ్మటం జరుగుతుంది. అందుచేతనే నేత్రం సత్యం. తురీయ పాదానికి ఆశ్రయమైన సత్యం బలంలో ప్రతిష్ఠితమై ఉన్నది. అందుకనే సత్యంకన్న బలం ప్రకాశమైనది. ప్రాణమే ఆ బలం. త్రిపద గాయత్రి ప్రాణాలను రక్షిస్తుంది. గాయత్రి ప్రాణంలో ప్రతిష్టితమై ఉన్నది. వాగాది ప్రాణాలను రక్షించేది గాయత్రి. గానము చేసే వాడిని రక్షించేది గాయత్రి. ఉపాసన చేసేవాణ్ణి రక్షించేది గాయత్రి.

ఉపనయన సమయంలో వటువుకు త్రిపదగాయత్రి ఉపదేశిస్తారు.

**అస్యశ్రీ గాయత్రి మహామంత్రస్య విశ్వామిత్రఋషిః ।**

గాయత్రీఛందః । శ్రీ సవితాదేవతా । యంబీజం । ఈం శక్తిః । ఐం కీలకం । జపే వినియోగః ॥

**న్యాసము :** ఓం తత్సవితుః బ్రహ్మాత్మనే । ధీమహి సత్యాత్మనే । వరేణ్యం విష్ణ్వాత్మనే । ధియో యోనః జ్ఞానాత్మనే । భర్గోదేవస్య రుద్రాత్మనే । ప్రచోదయాత్ సర్వాత్మనే ॥

**ధ్యానము :** ముక్తావిద్రుమహేమనీల ధవళచ్ఛాయైర్ ర్ముఖై స్త్రీక్షణైః
యుక్తా మిందునిబద్ధరత్న మకుటాం తత్వార్థ వర్ణాత్మికాం ।
గాయత్రీం వరదాభయాం కుశకరాం శ్శుభ్రం కపాలం గదాం
శంఖం చక్ర మథారవిందయుగళం హస్తై ర్వహంతీం భజే ॥

**మం॥** ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం
భర్గోదేవస్య ధీమహి । ధియోయోనః ప్రచోదయాత్

ఇది ఇరవై నాలుగు అక్షరాల మంత్రం. మూడు పాదాలు, పాదానికి ఎనిమిది అక్షరాలు ఉంటాయి. అయితే ఇందులో ముందు చెప్పిన 'ఓం భూర్భువస్సువః' అంటే ఓం భూః, ఓం భువః, ఓం సువః ఇవి మూడు వ్యాహృతులు. ఆ తరువాతది గాయత్రి మంత్రం. ఇది వేదమంత్రం. ఉపనయనం అయిన వారు మాత్రమే జపం చెయ్యాలి. ఉపనయన సమయంలో ఈ మంత్రాన్ని ఉపదేశం చేస్తారు.

ఇక్కడ చిన్న ప్రశ్న వస్తుంది. ఈ మంత్రాన్ని ఉపనయనం కాని

వారు జపం చెయ్యకూడదా? చెయ్యరాదు అనే చెబుతున్నాయి వేదము, శాస్త్రాలు కూడా. మరి **'గాయత్రీ పరివార్'** లాంటి సంస్థలు ఈ మంత్రాన్ని అందరికీ ఉపదేశం చేస్తున్నాయి కదా? సమాజంలో అనేక రకాల మార్పులు వస్తున్నాయి. ఆ మార్పులలో ఇది ఒకటి. **వేదంలో చెప్పిన విషయం చెప్పగలం అంతేకాని ఇలాంటి విషయాలు నిర్ణయించే శక్తి నాకు లేదు.** గతజన్మలో చేసిన కర్మఫలితాన్ని బట్టి క్రిమికీటకాదుల నుంచి ఎవరైనా, ఏజీవి అయినా స్త్రీ పురుష, జాతి, వర్ణ, కుల, మత భేదం లేకుండా ఏ ప్రాణి అయినా మోక్షం పొందవచ్చు. కాని వేదమంత్రాలు చదవాలంటే మాత్రం ఉపనయనం అయితీరాలి. ఇక్కడ ఒకవిషయం తెలుసుకోవాలి. ఉపనయనము వేరు. సంధ్యావందనము వేరు. సంధ్యావందనము అంటే సంధ్యా సమయంలో భగవంతుడికి వందనసమర్పణ చెయ్యటం. భగవధ్యానం చెయ్యటం. ఈపని ఎవరైనా చెయ్యవచ్చు. ఇందులో వేదమంత్రాలు ఉండవు. దీనిమీద గుంటూరుకు చెందిన **'శృంగేరి శ్రీవిరూపాక్ష పీఠాధీశ్వరులు** జగద్గురు శ్రీకల్యాణానంద భారతీ మాంతాచార్యుల వారు **'సర్వవర్ణాలవారికీ (స్త్రీ పురుషులతో సహా) సంధ్యోపాసన'** పుస్తకం కూడా వ్రాశారు. **దీన్ని నోరి నరసింహశాస్త్రి ఛారిటబుల్ ట్రస్ట్ వారు ప్రచురించారు.** ఇది అమూల్యము. ఆసక్తి గలవారు చూడవచ్చు.

ఇక్కడ చాలా ముఖ్యమైన విషయం ఏమంటే **ఉపనయనం కాకపోతే బ్రాహ్మణుడి క్కూడా గాయత్రీ మంత్రం చెప్పరు.**

ప్రతిమంత్రానికి గాయత్రిఉంటుంది. కొన్ని గాయత్రీ మంత్రాలు ఇక్కడ ఇవ్వటం జరుగుతోంది.

**మంత్రము:** ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం। భర్గోదేవస్య ధీమహి। ధియోయోనః ప్రచోదయాత్ ॥

ఇందులో మొదట మూడు వాహృతులు. ఓం భూః, ఓం భువః , ఓం సువః మిగిలినది మాత్రమే మంత్రము.

ఏ మంత్రానికైనా గాయత్రి ఉంటుంది. మంత్ర జపం తరువాత మంత్ర గాయత్రిని తప్పనిసరిగా చేసితీరాలి.

గాయత్రీమంత్రాన్ని ఉపాసించే వారికి ఇహపరాలు పూర్తిగా లభిస్తాయి. వారు ధర్మాధర్మ విముక్తులై ముక్తి పొందుతారు.

**సదాశివాయ విద్మహే సహస్రాక్షాయ ధీమహి।**
**తన్నః సాంబ ప్రచోదయాత్ ॥**

**1 పురుషస్య విద్మ సహస్రాక్షస్య మహాదేవస్య ధీమహి।**
**తన్నో రుద్రః ప్రచోదయాత్ ॥**

**2 తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి।**
**తన్నో రుద్రః ప్రచోదయాత్ ॥**

**3 తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహి।**
**తన్నో దంతిః ప్రచోదయాత్ ॥**

**4 తత్పురుషాయ విద్మహే చక్రతుండాయ ధీమహి।**
**తన్నో నందిః ప్రచోదయాత్ ॥**

**5 తత్పురుషాయ విద్మహే మహాసేనాయ ధీమహి।**
**తన్నః షణ్ముఖః ప్రచోదయాత్ ॥**

**6 తత్పురుషాయ విద్మహే సువర్ణపక్షాయ ధీమహి।**
**తన్నో గరుడః ప్రచోదయాత్ ॥**

7 వేదాత్మనాయ విద్మహే హిరణ్యగర్భాయ ధీమహి ।
తన్నో బ్రహ్మ ప్రచోదయాత్ ॥
8 నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి ।
తన్నో విష్ణుః ప్రచోదయాత్ ॥
9 వజ్రనఖాయి విద్మహే తీక్షణదగ్ంష్ట్రాయ ధీమహి ।
తన్నో నారసింహగ్ం ప్రచోదయాత్ ॥
10 భాస్కరాయ విద్మహే మహాద్యుతికరాయ ధీమహి ।
తన్నో ఆదిత్యః ప్రచోదయాత్ ॥
11 వైశ్వానరాయ విద్మహే లాలీలాయ ధీమహి ।
తన్నోః అగ్నిః ప్రచోదయాత్ ॥
12 వాగ్దేవ్యైచ విద్మహే కామరాజాయ ధీమహి
తన్నో దేవీ ప్రచోదయాత్ ॥
13 కాత్యాయనాయ విద్మహే కన్యకుమారి ధీమహి ।
తన్నః దుర్గిః ప్రచోదయాత్ ॥
14 సదాశివాయ విద్మహే సహస్రాక్షాయ ధీమహి ।
తన్నః సాంబః ప్రచోదయాత్ ॥
15 నవాక్షర్యై చ విద్మహే మహాదేవ్యై చ ధీమహి ।
తన్నో చండీ ప్రచోదయాత్ ॥
16 మహాదేవ్యై చ విద్మహే విష్ణుపత్నీ చ ధీమహి ।
తన్నో లక్ష్మీ ప్రచోదయాతు ॥

# 16. ఓంకారము

నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు పరమేశ్వరుడు. ఆయన గనక ఒక రూపం ధరిస్తే, అదే ఓంకారము. అంటే ఓంకారమే పరమేశ్వర స్వరూపము. అతడే పరబ్రహ్మ. **'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ'** ఈ కారణం చేతనే వైదిక కార్యక్రమాలు ప్రారంభించేటప్పుడు **'హరిఃఓం'** అని, ముగించేటప్పుడు **'ఓం తత్సత్'** అని చెప్పటం జరుగుతుంది.

**ఓంకార మంత్ర సంయుక్తం నిత్యం ధ్యాయంతు యోగినః**

**కామదం మోక్షదం తస్మై ఓంకారాయ నమోనమః ॥**

ఓంకారమనే మంత్రాన్ని గనక నిత్యం గానం చేసినట్లైతే ఇహము పరము రెండూ లభిస్తాయి. బ్రతికినంత కాలము సుఖశాంతులతో ఉండి, మరణానంతరము మోక్షం పొందుతాడు.

ఓంకారము యొక్క ప్రాముఖ్యత ఉపనిషత్తులలో చెప్పబడింది. మాండూక్యోప నిషత్తులో **ఓమిత్యేతదక్షర మిదగ్ం సర్వం.** బ్రహ్మజ్ఞాని అయిన గురువు గారి ఎదురుగా కొంచెం దిగువలో జిజ్ఞాసువు అయిన శిష్యుడు సాకార బ్రహ్మోపాసనలో నిష్ణాతుడు. బ్రహ్మవిద్యని తెలుసుకోవటానికి వచ్చి కూర్చున్నాడు. గురువుగారు చెబుతున్నాడు. **ఓమిత్యేతదక్షరమిదగ్ సర్వం** ఈ చరాచర జగత్తంతా ఓంకారములోనే ఉన్నది. ఓంకారమనే అక్షరంలో ఈ జగత్తంతా నిండి ఉన్నది. **తస్యోపవ్యాఖ్యానమ్.** దీన్ని వ్యాఖ్యానిస్తున్నాడు.

**భూతంభవత్ భవిష్యదితి సర్వమోంకారయేవ**

**యచ్ఛాన్యత్ త్రికాలాతీతం తదప్యోంకారమేవ ॥**

భూతభవిష్యద్వర్తమానాలు అన్నీ ఓంకారమే. అందుకే ఓంకారము

సకల లోకాలకు, జగత్తులకు ప్రతీక.

ప్రశ్నోపనిషత్తులో సత్యకాముడు పిప్పలాదుడికి నమస్కరించి "మహర్షీ! మానవుడు మరణించేదాకా ఓంకారాన్ని ధ్యానం చేస్తే ఏ లోకాలకు పోతాడు?" అని అడుగుతాడు. దానికి బదులుగా పిప్పలాదుడు "సత్యకామా! ఓంకారము పరబ్రహ్మము, అపరబ్రహ్మము కూడా. సాకారము, నిరాకారము కూడా. అందుకే జ్ఞానులంతా ఓంకారాన్నే ఉపాసిస్తారు. ఇందులో అకార ఉకార మకారాలు ఉన్నాయి. ఇవి మూడు వేదాలకు ప్రతీక అంటాడు. ఉపనిషత్తులలో ఓంకారాన్ని గురించి ప్రముఖంగా చెప్పినవి కొన్ని ఉన్నాయి. శైవోపనిషత్తులయిన అధర్వశిర, అధర్వ శిఖ ఉపనిషత్తులు కొంతవరకు చెప్పగా యోగోపనిషత్తులయిన నాదబిందు, ధ్యానబిందూపనిషత్తు ఓంకారాన్ని వివరించాయి.

## నాదబిందూపనిషత్తు

ఇది ఋగ్వేదానికి సంబంధించినది. ఇందులో 56 మంత్రాలు ఉన్నాయి. ఓంకారాన్ని వివరించే ఈ ఉపనిషత్తు మీద నాకు మక్కువ ఎక్కువ. అందుకే కొన్ని శ్లోకాలు కూడా ఇస్తున్నాను.

**అకారో దక్షిణ పక్ష ఉకారస్తూత్తరః స్మృతః ।**

**మకారః పుచ్ఛమిత్యాహు రర్ధమాత్రాతు మస్తకమ్ ॥**

ఓంకారాన్ని ఒక హంసతో పోల్చి చెబుతున్నారు. ఓంకారము అనే హంసకి అకారము కుడి రెక్క. ఉకారము ఎడమ రెక్క. మకారము తోక. అర్ధమాత్రమే మస్తకము.

**పాదాదిదకం గుణాస్తస్య శరీరం తత్త్వముచ్యతే ।**

**ధర్మోస్య దక్షిణం చక్షు రధర్మోధోపరః స్మృతః ॥**

పాదాలే గుణాలు. శరీరమే ప్రణవ తత్త్వము. దాని కుడికన్ను ధర్మము. ఎడమకన్ను అధర్మము.

**భూర్లోకః పాదయోస్తస్య భువర్లోకస్తు జానునీ ।**
**సువర్లోకః కటీదేశే నాభిదేశే మహర్జగత్ ॥**

దాని పాదాలు భూర్లోకము. జానువులు భువర్లోకము. కటిప్రదేశము సువర్లోకము. నాభి మహర్లోకము.

**జనో లోకస్తు హృద్దేశే కంఠే లోకస్తపస్తతః ।**
**భ్రువర్ల లలాట మధ్యేతు సత్యలోకో వ్యవస్థితః ॥**

దాని హృదయము జనోలోకము. కంఠము తపోలోకము. భ్రూమధ్య భాగం సత్యలోకము.

**సహస్రారమితీ వాత్ర మంత్ర ఏవ ప్రదర్శితః ।**
**ఏవమేతాం సమారూఢో హంసయోగ విచక్షణః ॥**

దాని సహస్రారంలో ప్రణవ మంత్రము ప్రతిష్ఠితమై ఉన్నది. ఈ ప్రణవ మంత్ర పక్షిని అధిరోహించిన వాడు హంసయోగవిచక్షుణుడు.

**నభిద్యతే కర్మచారైః పాపకోటిశతైరపి ।**
**ఆగ్నేయీ ప్రథమామాత్రా వాయువ్యేషా తథా పరా ॥**

ప్రణవోపాసనను శతకోటి పాపకర్మలు కూడా బాధించలేవు. ప్రణవము మొదటి మాత్ర అగ్నిదేవతాకము. రెండవది వాయుదేవతాకము.

**భానుమండల సంకాశా భవేన్మాత్రాతథోత్తరా ।**

**పరమాచార్ధ మాత్రాయా వారుణీం తాం విదుర్బుదా ॥**

ఓంకారము యొక్క ఉత్తరమాత్ర సూర్యమండలం లాగా ప్రకాశిస్తుంది. పరమమైన అర్ధమాత్ర వరుణ దేవతాకము.

త్రికాలములలోను, ఇన్ని మాత్రలతోను ఓంకారము ప్రతిష్ఠితమై ఉన్నది. నిరంతరము ధ్యానము, ధారణ, అభ్యాసము వల్లనే ఓంకారము విశదమవుతుంది. ఓంకారానికి 12 మాత్రలు ప్రసిద్ధంగా ఉన్నాయి.

**ఘోషిణీ ప్రథమామాత్రా విద్యున్మాత్రా తథాపరా ।**
**పతంగినీ తృతీయాస్యా చ్చతుర్థీ వాయువేగినీ ॥**
**పంచమీ నామధేయాతేతు షష్టీ చైంద్ర్యభి ధీయతే ।**
**సప్తమీ వైష్ణవీనామ అష్టమీశాంకరీతిచ ॥**
**నవమీ మహతీనామ ధృతిస్తు దశమీమతా ।**
**ఏకాదశీ భవేన్నారీ బ్రాహ్మీతు ద్వాదశీపరా ॥**

1. ప్రథమమాత్ర ఘోషిణి
2. విద్యుత్తు
3. పతంగిని
4. వాయవేగిని
5. నామధేయ
6. ఐంద్రి
7. వైష్ణవి
8. శాంకరి
9. మహతి
10. ధృతి

11. నారి

12. బ్రాహ్మి.

ప్రణవాన్ని ఉపాసన చేస్తూ సాధకుడు

1. ప్రథమ మాత్రలో మరణిస్తే – భారతదేశంలో సార్వభౌముడుగా తిరిగి జన్మిస్తాడు.
2. ద్వితీయ మాత్రలో మరణిస్తే – మహాత్ముడుగా జన్మిస్తాడు
3. తృతీయమాత్రలో మరణిస్తే – యక్షగణంలో మహాత్ముడౌతాడు
4. నాల్గవమాత్రలో మరణిస్తే – గంధర్వుడుగా జన్మిస్తాడు
5. ఐదవమాత్రలో మరణిస్తే – చంద్రలోకంలో దేవత్వముతో నివసిస్తాడు
6. ఆరవమాత్రలో మరణించినవాడు – దేవేంద్రుని సాయుజ్యం లభిస్తుంది
7. ఏడవమాత్రలో మరణించినవాడు – విష్ణుపదం పొందుతాడు
8. ఎనిమిదవ మాత్రలో మరణించినవాడు – రుద్రలోకంలో రుద్రుని పొందుతాడు.

9. తొమ్మిదవ మాత్రలో మరణించినవాడు - మహర్లోకం పొందుతాడు
10. పదవ మాత్రలో మరణించినవాడు - జనోలోకం పొందుతాడు
11. పదకొండవ మాత్రలో మరణించినవాడు - తపోలోకం పొందుతాడు
12. పన్నెండవ మాత్రలో మరణించినవాడు - బ్రహ్మలోకం పొందుతాడు

ఆ తరువాత శుద్ధుడు, సర్వవ్యాపకుడు, నిర్మలుడు ఎవరివలన జ్యోతిసులు పుడుతున్నాయో ఆ పరబ్రహ్మను పొందుతాడు.

## అధర్వశిఖోపనిషత్తు

ప్రణవము పరబ్రహ్మ స్వరూపము. ప్రణవానికి నాలుగు పాదాలుంటాయి. అవే నాలుగు వేదాలు. ఈ రకంగా నాలుగు పాదాలతోకూడిన ఓంకారము పరమాత్మ స్వరూపము.

1. ప్రణవము యొక్క మొదటి మాత్ర అకారము. దీనికి భూతము పృథివి. ఇది ఋక్కులతో కూడినది. దీనికి అధిదేవత బ్రహ్మ. పితృదేవతలు, అష్టవసువులు, గాయత్రి ఛందస్సు. గార్హపత్యాగ్ని ప్రధమ మాత్ర ఎరుపు రంగులో బంగారు కాంతితో ఉంటుంది.
2. ప్రణవానికి రెండవ మాత్ర ఉకారము. దీనికి భూతము ఆకాశము. ఇది యజస్సులతో కూడినది. దీనికి అధిదేవత విష్ణువు. ఏకాదశ రుద్రులు, పితృదేవతలు త్రిష్టుప్ ఛందస్సు దక్షిణాగ్ని. రెండవమాత్ర నలుపు రంగులో విద్యుత్ కాంతితో ఉంటుంది.
3. ప్రణవము యొక్క మూడవ మాత్ర మకారము. దీనికి భూతము

స్వర్గము. సామగానాలతో కూడినది. అధిదేవత రుద్రుడు. ద్వాదశాదిత్యులు, పితృదేవతలు, జగతి ఛందస్సు, ఆహవనీయాగ్ని, మూడవమాత్ర తెలుపురంగులో శుక్లవర్ణంతో ఉంటుంది.

4. ప్రణవము యొక్క చివరిది నాల్గవది అయిన అర్ధమాత్ర సామలోకము. ఓంకారము అధర్వమంత్రాలతో కూడిన అధర్వవేదము సంవర్తకాగ్ని. మరుత్తులు విరాట్టు ఏకఋషి భాస్వతి అనబడును. అకార ఉకార మకారాలకు చివర అతిసూక్ష్మమైన అర్ధమాత్ర ఉంటుంది అదే నాదము, నాల్గవమాత్ర లక్ష్మీదేవి వర్ణంతో అన్ని రంగులతోను ఉంటుంది. ఇదే ఓంకారము.

ఓంకారము నాలుగు అక్షరాలు, నాలుగు పాదాలు కలిగి ఉంటుంది. నాలుగు శిరస్సులుంటాయి. నాల్గవది అర్ధమాత్ర. ఇది స్థూలమైనపుడు హ్రస్వము, దీర్ఘము, ప్లుతము అని చెప్పబడుతుంది.

3,4 మాత్ర ప్రణవాన్ని క్రమంగా మూడుసార్లు ఉచ్చరించి నాల్గవసారి 5 మాత్రలు గల ప్రణవాన్ని ప్లుతముగా ఉచ్చరించాలి. ఇలా ఉపాసించినప్పుడు శాంతమైనది, ఆత్మయైనది, సమస్తము ప్రణవము అని ఉపాసించినట్లైతే, ఆత్మజ్యోతి ఒక్కసారిగా ప్రకాశిస్తుంది.

ఒక్కసారి ప్రణవాన్ని ఉచ్చరిస్తే పరమపదముకు, ఉత్తమమైన స్థానానికి తీసుకుపోతుంది. కాబట్టే ఓంకారము అంటారు.

ప్రాణులన్నీ లయించే స్థానం కాబట్టి ప్రళయము అంటారు. అన్ని ప్రాణులను పరమాత్మలో చేరుస్తుంది కాబట్టి ప్రణవము అంటారు.

నాలుగు పాదాలతో ఉన్నది. అందరి దేవతలకు, అన్ని వేదాలకు యోనిస్థానము. సకల వాచ్య వస్తువులు కూడా ప్రణవాత్మకము.

దేవతలందరూ ప్రణవ స్వరూపమే. ఈప్రణవము అందరినీ అన్ని దుఃఖాల నుండి భయముల నుండి తరింపజేస్తుంది. కాబట్టి **'తారణము'** అనబడుతుంది.

తారణము చేస్తుంది అంటే రక్షిస్తుంది కాబట్టి **తారకము** అనబడుతుంది.

సమస్త దేవతలు విశ్రమించే స్థానము విష్ణువు అనబడుతుంది. ప్రాణులన్నింటినీ మళ్ళీ మళ్ళీ సృష్టిస్తుంది కాబట్టి బ్రహ్మ అనబడుతుంది.

అన్ని ప్రాణులయొక్క హృదయంలో ధ్యానయోగ్యమైన పరమాత్మను దీపములాగా ప్రకాశింపచేస్తుంది కాబట్టి **ప్రకాశము** అనబడుతుంది.

సమస్త ప్రకాశాలకు పరమప్రకాశమై మాటిమాటికీ దేహంలోని మెరుపులాగా ప్రకాశిస్తుంది కాబట్టి **'విద్యుత్'** అంటారు. సమస్త దిక్కులందు అంతర్యామిగా ప్రవేశించి సమస్త లోకాలయందు వ్యాపిస్తుంది కాబట్టి **వ్యాపి** అనబడుతుంది.

ఒక రకంగా చెప్పాలి అంటే ఇవన్నీ మహాదేవుని నామాలే.

ప్రణవము మొదటి మాత్ర – జాగ్రత్తు

రెండవ మాత్ర – స్వప్నము

మూడవ మాత్ర – సుషుప్తి

నాల్గవ మాత్ర – తురీయము

ఒక్కొక్క మాత్ర భిన్నమాత్రలయందు లయం చెందుతాయి. ఇది స్వయంప్రకాశము. దీనికి వెలుగునిచ్చేది వేరొకటి లేదు. దీన్ని గనక శ్రద్ధగా ధ్యానం చేస్తే పూర్వపదము కలుగుతుంది. ఇది స్వయంగా బ్రహ్మ కాబట్టి మోక్షం ఇస్తుంది. ఓంకారము ధ్యానము, ధారణ, సమాధి

స్థితులందు ఉపయోగిస్తుంది.

సకల కరణములు ఉపసంహరించటంవల్ల ధరింపదగిన దాన్ని ధరింపచేయుట వల్ల బ్రహ్మము తురీయము అనబడుతుంది.

స్థూలశరీరంలో ఉన్న దశేంద్రియాలను మనస్సులో స్థాపించి ధ్యానించటం వల్లనే విష్ణువు అనబడుతుంది.

సూక్ష్మదేహంలోని తత్త్వాలు ఇంద్రియాలు మనసులో చక్కగా నిలిపి ధ్యానం చేసేవాడు రుద్రుడు.

ప్రాణము ఇంద్రియాలు మనస్సులో చేర్చి నాదాంతమైన పరమాత్మ యందు నిలిపి ఈశానుడిని ధ్యానం చెయ్యాలి. ఎక్కువగా ఈశాన పరమాత్మనే ధ్యానం చెయ్యాలి. లోకంలో అన్ని ప్రాణులు త్రిమూర్తులతో సహా అందరూ పుడుతూనే ఉంటారు కాని వీటన్నింటికీ కారణమైన దానికి మాత్రం పుట్టుక లేదు. అది నాశరహితమైంది. ఇలా సమస్త కారణాలకు కారణమైనవాడు, సకల సంపదలు కలవాడు, సర్వేశ్వరుడు, శంభువు, ఆకాశం మధ్యన నివశించేవాడు అయిన పరమాత్మను ధ్యానం చెయ్యాలి. ఆ పరమాత్మే ధ్యానింపదగిన ధ్యేయవస్తువు.

ఇలా **ఒకసారి ధ్యానం చేస్తే శతాధిక యజ్ఞాలు 74సార్లు చేసిన ఫలితం వస్తుంది.** ఓంకారాన్ని ధ్యానం చేసేవాడికి ప్రణవస్వరూపము, వివిధ రకాల ధ్యానాలు, అన్ని రకాల యోగాలు, జ్ఞానము, దాని ప్రయోజనము అన్నీ తెలుసుకోగలుగుతాడు. వాటిని తెలుసుకోగలిగేవాడు ఈశ్వరుడే. అందుచేత అన్నింటినీ వదిలి ఈశ్వరుణ్ణే ధ్యేయవస్తువుగా ధ్యానం చెయ్యాలి. ఇలా ధ్యానం చేసినవాడు జనన మరణ దుఃఖాల నుంచి విముక్తుడవుతాడు.

# ధ్యానబిందూపనిషత్తు

మానవుడు ఎంత పాపంచేసినా, ఆ పాపం హిమాలయ పర్వతం అంత ఉన్నా సరే ఒక్క ధ్యానయోగంతో నశించిపోతుంది. ఇంకొక దాని కోసం మనం వెతుక్కోవలసిన పనిలేదు. ఓంకారము పరమ బీజాక్షరము. బిందువు, నాదము వీటికి పైన ఉంటుంది. అందులో శబ్దము, అక్షరాలు క్షీణించగా నిశ్శబ్దములో పరమపదముగా ఉన్నది. అనాహత చక్రంలో వినిపించే ప్రణవాన్ని విన్నవాడికి ఏ సంశయాలు ఉండవు.

తలవెంట్రుకలోని లక్షోవంతు ఉంటుంది పరబ్రహ్మ. **'వాలాగ్ర శతసాహస్రంతస్య భాగస్య భాగినః'** యోగంలో మనసు లయం అయిన తరువాత బ్రహ్మచైతన్యములో ఉన్న యోగి నిరంజన భావాన్ని పొందుతాడు. పూవులో సువాసనలాగా, పాలలో నేయిలాగా, నువ్వులలో నూనెలాగా, మట్టిలో బంగారంలాగా, మణిహారంలో దారంలాగా, అన్ని ప్రాణులయందు ఆత్మ అంతర్లీనంగా ఉంటుంది. విజ్ఞుడయినవాడు అటువంటి బ్రహ్మమునందు స్థితి గలిగి ఉంటాడు. గతంలో చెప్పినట్లుగా పాలలో నెయ్యిలాగా మానవశరీరంలో బ్రహ్మము బయట, లోపలా కూడా ఆవరించి ఉన్నది. ఈ కనిపించేదంతా ఒక వృక్షము. ఆ వృక్షము నీడ నిష్కళంకమైనది. సకల నిష్కళ భావములందు అంతటా వ్యాపించింది. 'ఓం' అనే ఏకాక్షరమే ముముక్షువైన వాడు ధ్యానం చెయ్యవలసింది. ప్రణవము యొక్క మొదటి మాత్ర అకారము లయమైనప్పుడు భూమి, అగ్ని, ఋగ్వేదము, భూః అనే వ్యాహృతి బ్రహ్మ లీనమవుతాయి. రెండవ మాత్ర అయిన ఉకారము లయమయినప్పుడు అంతరిక్షము, యజుర్వేదము, వాయువు, భువః అనే వ్యాహృతి, విష్ణువు లీనమవుతాయి. మూడవ మాత్రమకారము

లయమైనప్పుడు స్వర్గలోకము, సూర్యుడు, సామవేదము, సువః అనే వ్యాహృతి, మహేశ్వరుడు లీనమవుతాయి.

| | | |
|---|---|---|
| అకారము | – | పీతవర్ణము, రజోగుణము |
| ఉకారము | – | శ్వేతవర్ణము, సత్వగుణము |
| మకారము | – | నలుపువర్ణము, తమోగుణము |

అకార ఉకార మకార అర్థమాత్ర, బిందువు, నాదము, కళ, కళాతీతము అనే ఎనిమిది అంగాలతో ప్రకాశించేది, నాలుగు పాదాలు గలది, మూడు వ్యాహృతులు, ఐదుగురు అధిదేవతలు, ఎనిమిది స్థానాలుగల ఓంకారాన్ని తెలిసినవాడే బ్రాహ్మణుడు.

ప్రణవాన్ని ధనుస్సుగా, మనస్సు బాణంగా, బ్రహ్మ లక్ష్యంగా చేసి జాగ్రత్తగా భేదించాలి. బ్రహ్మ స్వరూప లక్ష్యమునందు ప్రయోగించిన బాణము బ్రహ్మమయము అవుతున్నది. ఈ రకంగా పరమాత్మయందు, ప్రపంచమునందు సమభావము కలిగి ఉన్నట్లైతే, అన్ని కార్యాలు, కర్మలు, నివృత్తి పొందుతాయి. ఓంకారము వల్లనే 4 వేదాలు, 16 స్వరాలు, 3 లోకాలు సర్వజగత్తు ఆవిర్భవిస్తున్నది. ఇక్కడ చిత్రం ఏమంటే–

హ్రస్యమైన ప్రణవము – పాపాలను భస్మం చేస్తుంది

దీర్ఘప్రణవము – సకల సంపదలు ఇస్తుంది

అర్థమాత్రతో కూడిన ప్రణవము –మోక్షాన్నిస్తుంది.

ఈ ప్రణవము ఎలాంటిదంటే – 1. తైలధారలాగా అవిచ్ఛిన్నమైనది. అటువంటి ప్రణవాన్ని తెలిసినవాడు – వేదాలన్నీ చదవకపోయినా తెలిసినవాడు. హృత్పద్మ మందలి కర్ణికలో ఉన్న దీపంలాగా ప్రకాశించేవాడు, అంగుష్టమాత్ర ప్రమాణము గలవాడు,

నిశ్చలుడు, ప్రణవస్వరూపుడు అయిన పరమేశ్వరుణ్ణే ధ్యానించాలి. ఎడమవైపున్న ఇడానాడితో వాయువును పూరించి, కుంభకము చేసి, శరీరానికి మధ్యలో జ్యోతిరూపంలో ఉన్న ఓంకారాన్ని ధ్యానం చెయ్యాలి. పూరకానికి – బ్రహ్మ, కుంభకానికి విష్ణువు, రేచకానికి రుద్రుడు, దేవతలు. జీవాత్మ క్రింద ఉన్న అరణి కొయ్య, పరమాత్మ పైనున్న అరణికొయ్య, ఈ విధంగా భావించి, ధానము అనే అభ్యాసంతో పరమాత్మను దర్శించాలి. అలా ఓంకార నాదముతో రేచక, పూరక, కుంభకాదుల నాదము లయమయ్యేదాకా శక్తికొలది ధ్యానము చేస్తూనే ఉండాలి.

**గమాగమస్థం గమనాది శూన్యం ఓంకారమేకం రవికోటి దీప్తమ్**

**పశ్యంతి యే సర్వజనాంతరస్థమ్ హంసాత్మరంతే విరజాభవంతి ॥**

గమానాగమనము లందు ఉండేది, గమనాగమనాలు లేనిది, కోటిసూర్యుల కాంతితో ప్రకాశించేది, అన్ని జీవుల హృదయమందు ఉండేది, హంస రూపమైనది, ఏకమైనది, అయిన ఓంకారాన్ని దర్శించిన వారు రజోగుణరహితులై మోక్షాన్ని పొందుతారు. మూడు జన్మల సృష్టిస్థితిలయాలకు కారణమైన మనస్సు లయం చెందటమే 'విష్ణుపదము' అంటారు. హృదయ కమలము 8 దళాలతోను 32 కేసరాలతోను కూడి ఉంటుంది. ఆ కమలము మధ్యన సూర్యమండలము, దాని మధ్యన చంద్రమండలము, దాని మధ్యన అగ్నిమండలము, దాని మధ్యన దివ్యమైన కాంతి, ఆ కాంతిలో రత్నఖచితమైన పీఠమున్నది. దానిమీద వాసుదేవుడున్నాడు. ఇలా భావన చేసి శ్రీమహావిష్ణువును పూరక ప్రాణాయామంలో ధ్యానించాలి.

నల్లనివాడు, నాలుగు భుజాలు గలవాడు అయిన ఆ వాసుదేవుణ్ణి నాభిస్థానంలో ధ్యానం చెయ్యాలి. కుంభక ప్రాణాయామంలో హృదయ స్థానంలో పచ్చని రత్నంలాగా ప్రకాశించేవాడు, కమలాసనుడు చతుర్ముఖుడు అయిన బ్రహ్మను ధ్యానం చెయ్యాలి.

రేచక ప్రాణాయామంలో లలాటంలో జ్ఞానాత్మ కలవాడై త్రినేత్రుడు, శుద్ధస్ఫటికం లాగా తెల్లనివాడు, నిష్కళంకుడు, పాపనాశనుడు అయిన శంకరుని ధ్యానించాలి. ఇలా చేస్తే త్రిరావృతప్రాణాయామము అంటారు. ఈ విధంగా పరమేశ్వరుణ్ణి ఆరాధించిన వారు వేదవేత్త అనబడతాడు.

ఈ రకంగా ఓంకారము ధ్యానము వివరించటం జరిగింది.

**ప్రశ్నోపనిషత్తు**లో సత్యకాముడు పిప్పలాదమహర్షికి నమస్కరించి "మహర్షీ ! మానవుడు మరణించే దాకా ఓంకార ధ్యానం చేస్తే ఏ లోకాలకు పోతాడో వివరించండి" అని అడుగుతాడు. దానికి పిప్పలాదుడు.

సత్యకామా ! ఓంకారమనేది పరబ్రహ్మము, అపరబ్రహ్మము కూడా. పరబ్రహ్మము అంటే – సర్వాతీత నిర్గుణబ్రహ్మ. అపరబ్రహ్మము అంటే సాకారము – వ్యక్తరూపం గల హిరణ్యగర్భుడు అందుచేత పండితుడు, జ్ఞానులు ఓంకారాన్నే ఉపాసిస్తారు.

ఓంకారము నాదబ్రహ్మము. దీన్నే ప్రణవము అంటారు. దీన్నుంచే సమస్త శబ్దాలు, మంత్రాలు ఉత్పన్నమైనాయి. అందుచేతనే ఓంకారము సర్వమంత్రాలకు హేతువు.

సగుణ బ్రహ్మను ఓంకారంతో ఉపాసించవచ్చు. అలాగే అవ్యక్తమైన పరబ్రహ్మని శబ్దంతో సూచించటానికి ఓంకారమే గుర్తు. ఓంకారంలో అకార, ఉకార, మకారాలు అనే మూడు అక్షరాలున్నాయి.

ఓంకారమనేది మూడు వేదాలకు ప్రతీక. ఇందులోని

అ కారము – ఋగ్వేదము
ఉ కారము – యజుర్వేదము
మ కారము – సామవేదము

దీనిలో ఒక అక్షరాన్ని మాత్రమే ధ్యానించినట్లైతే సాధకుడు మరణానంతరము స్వర్గసుఖాలనుభవించి, తరువాత భూలోకంలో మళ్ళీ జన్మిస్తాడు. రెండు అక్షరాలను కలిపి ధ్యానిస్తే సాధకుడు సూక్ష్మశరీరంతో చంద్రలోకానికి పోయి అక్కడ సుఖాలనుభవించి తిరిగి మానవలోకంలో జన్మిస్తాడు. మూడు అక్షరాల రూపమైన ఓంకారాన్ని గనక ధ్యానిస్తే సాధకుడు తేజోవంతమైన సూర్యలోకానికి పోతాడు. పాముకుబుసాన్ని వదిలినట్లుగా జీవి తన శరీరానికి అంటుకున్న పాపాలు వదిలించుకుంటాడు. ఆ తరువాత సామవేద భావంచేత బ్రహ్మలోకానికి పోతాడు. కల్పాంతము వరకు అక్కడ ఉండి, ఆ తరువాత పరబ్రహ్మలో లీనమవుతాడు.

ఓంకారము యొక్క మూడు మాత్రలను విడివిడిగా ధ్యానించేవాడు మృత్యుంజయుడు కాలేడు. మూడు మాత్రలను కలిపి ధ్యానించేవాడు అచంచలమైన ఆత్మనిష్ఠను పొందుతాడు. ఓం కారోపాసకుడు.

ఋగ్దేవతలచే – భూలోకము
యజుర్దేవతలచే – చంద్రలోకము
సామదేవతలచే – బ్రహ్మలోకము

పొందుతాడు. ఓంకారము ద్వారానే జ్ఞాని అయినవాడు శాశ్వతమైన బ్రహ్మలోకాన్ని పొంది కల్పాంతాన పరబ్రహ్మలో

లీనమవుతాడు." అని సమాధానం చెప్పాడయ్యా ! ఇదేవిధంగా **ఛాందోగ్యోపనిషత్తు**లో కూడా ఓంకారోపాసన గురించి వివరించబడింది. దాన్ని మీకు చెబుతాను వినండి.

**ఓమిత్యే తదక్షర ముద్గీథ ముపాసీత**

ఓంకారాన్ని 'ఉద్గీత' దృష్టితో ఉపాసించాలి. యజ్ఞంచేసేటప్పుడు సామగీతాలు గానంచేసేవాడు 'ఉద్గాత'. అతడు చేసే సామగాన భాగాన్ని 'ఉద్గీత' అంటారు. ఓంకారాన్ని ఉద్గీత దృష్టితో ఉపాసించాలి. అంటే ఓంకారము, ఉద్గీత రెండు ఒకటే అని భావించి ఉపాసన చెయ్యాలి.

ఓంకారము పరబ్రహ్మకు శబ్ద ప్రతీక. ఇది కేవలం ఉపాసన కోసం ఏర్పరచుకొన్న చిహ్నము. ఉపాసన అంటే ఒకే శబ్దాన్ని జపించటం మాత్రమేకాదు. మనసును పూర్తిగా దానిమీద లగ్నంచేసి, ఆ శబ్దాన్ని నిరంతరం ధ్యానం చెయ్యటమే ఉపాసన. కర్మకాండలో ఒక భాగంగా, పరబ్రహ్మకు శబ్దప్రతీకగా ఓంకారము ఉపయోగించబడుతుంది.

ఓంకారంతోనే త్రయీ విద్యలో చెప్పబడిన వైదికకర్మలన్నీ ప్రారంభమవుతాయి. త్రయీ విద్య అంటే వేదవిద్య. ముందుగా ఓంకారాన్ని ఉచ్చరించే దేవతాస్తుతిగాని, కర్మ ప్రారంభంగాని జరుగుతుంది. వేదోక్తమైన కర్మ అంతా ఓంకారాన్ని పూజించటానికే జరుగుతుంది. ఓంకారము పరబ్రహ్మ స్వరూపము కాబట్టి, ఆ పరబ్రహ్మను అర్చించటానికే ఈ కర్మకాండ అంతా జరుగుతుంది. ఓంకారము యొక్క మహిమవల్ల, ఓంకారోపాసన వల్లనే వైదికకర్మలు

నిర్వహించబడుతున్నాయి. యజ్ఞమనేది ప్రాణము, అన్నములతో నిర్వహించబడుతున్నది. ప్రాణము, అన్నము కూడా ఓంకారము. కాబట్టి యజ్ఞము కూడా ఓంకారమే దీని ఫలితంగానే సూర్యుని ద్వారా వర్షం కురుస్తుంది. ఆ వర్షం ద్వారా అన్న ప్రాణాలు ఉత్పత్తి అవుతాయి. ఓంకారమనే అక్షరాన్ని ఈ విధంగా తెలుసుకున్నవాడు తెలుసుకోనివాడు ఇద్దరూ కర్మని చేస్తూనే ఉంటారు. కాని ఈ విషయం తెలియకుండా కర్మచేసేకన్న తెలుసుకుని కర్మని ఆచరిస్తే ఫలితము కొన్నిరెట్లు అధికంగా ఉంటుంది.

ఓంకారాన్ని గురించి అధర్వణవేదానికి సంబంధించిన **'అధర్వశిఖోపనిషత్తు'**లో పూర్తిగా వివరించబడింది. ఇప్పుడు ఆ ఉపనిషత్తును మీకు వివరిస్తాను వినండి.

**అధర్వశిఖోపనిషత్తు :**

**ఓం. అథ హైనం పైప్పలా దోఽ ంగిరాం సనత్కుమారశ్చా థర్వణ ముువాచ (1) భగవన్కి మాదౌ ప్రయుక్తం ధ్యానం ధ్యాయితవ్యం కిం తత్ ధ్యానం కోవా ధ్యాతా కశ్చ ధ్యేయః (2) సఏభ్యోఽ ధర్వాప్రత్యువాచ, ఓ మిత్యేత దక్షర మాదౌప్రయుక్తం ధ్యానం ధ్యాయితవ్య మితి (3)**

పైప్పలాదుడు, ఆంగిరసుడు, సనత్కుమారుడు అనేవారు ముగ్గురు అధర్వణముని దగ్గరకు వెళ్ళి నమస్కరించి, "గురుదేవా ! సృష్టి సమయంలో బ్రహ్మాది దేవతలు ఏమి ఉపయోగించారు ? ధ్యానమంటే ఏమిటి ? ధ్యానింపతగినది ఏది ? ధ్యానానికి సాధనము ఏది ? శ్రేష్ఠమైన ధ్యాత ఏది ? ధ్యేయము ఏది ? వీటిని మాకు వివరించవలసినది" అని అడిగారు. ఆ మాటలు విన్న అధర్వణమహర్షి

చెబుతున్నాడు. "నాయనలారా ! బ్రహ్మజిజ్ఞాసువులారా ! ప్రణవాక్షరమే మొదటగా ఉపదేశింపబడినది. అదియే ధ్యానము. ఆ ప్రణవమే ధ్యానింపబడవలసినది.

**ఏత దక్షరం పరంబ్రహ్మాస్య పాదా శ్చత్వారో వేదా శ్చతుష్పా దిద మక్షరం పరం బ్రహ్మ (4) పూర్వాస్యమాత్రా పృథివ్యకార స్సఋగ్భి రృగ్వేదో బ్రహ్మా వసవో గాయత్రీ, గార్హపత్యః (5) ద్వితీయాంతరిక్షగ్ం స ఉకార స్స యజుర్భి ర్యజుర్వేదో విష్ణూ రుద్రాస్త్రిష్టు బ్దక్షిణాగ్ని (6) తృతీయా ద్యౌస్సమకార స్ససామభి స్సామ వేదో రుద్రా ఆదిత్యా జగత్యాహవనీయః (7)**

ప్రణవాక్షరము పరబ్రహ్మస్వరూపము. దీనికి నాలుగు పాదాలు (మాత్రలు) ఉన్నాయి. ఈ నాలుగుపాదాలే వేదాలు. దీనిలో మొదటి మాత్ర అకారము దీనికి భూతము పృథివి. ఇది ఋక్కులతో కూడి ఉన్నది. దీనికి అధిదేవత – బ్రహ్మ పిత్రుదేవతలు – అష్టవసువులు, గాయత్రి ఛందస్సు, గార్హపత్యాగ్ని.

రెండవ మాత్ర – ఉకారము

దీనికి భూతము – ఆకాశము. యజస్సులతో కూడినది.

అధిదేవత – విష్ణువు

పిత్రుదేవతలు – ఏకాదశరుద్రులు

చందస్సు – త్రిష్టప్ చందస్సు. దక్షిణాగ్ని

మూడవమాత్ర – మకారము

దీనికి లోకము – స్వర్గము.

సామగానములతోకూడినది

| | | |
|---|---|---|
| అధిదేవత | – | రుద్రుడు |
| పిత్రుదేవతలు | – | ద్వాదశాదిత్యులు |
| చందస్సు | – | జగతిచ్ఛందస్సు. |

ఆహవనీయాగ్ని

**యాఽ వసానేఽ స్య చతుర్థ్యర్థమాత్రా స సోమలోక ఓంకార స్సాధర్వణ మంత్రై రధర్వవేద స్సంవర్తకోఽ గ్నిర్మరుతో విరాదే కర్షి ర్భాస్వతీః స్మృతాః (8) ప్రథమా రక్తపీతా మహద్బ్రహ్మ దైవత్యా, ద్వితీయా విద్యుమతీ కృష్ణా విష్ణుదైవత్యా, తృతీయా శుభాశుభాశుక్లా రుద్రదైవత్యా, యావసానేఽ స్యచతుర్థ్యర్థమాత్రా సా విద్యుమతీ సర్వవర్ణా పురుషదైవత్యా (9) స ఏష హ్యోంకారః, చతురక్షర శ్చతుష్పాద శ్చతుశ్శిర శ్చతురర్థమాత్ర స్థూలమేతద్ధ్రస్వదీర్ఘ ప్లుతఇతి, ఓం 1 ఓం 2 ఓం 3 ఇతి (10)**

**త్రిరుక్తా చతుర్థ శ్శాంత ఆత్మా ప్లుత ప్రణవ ప్రయోగేన సమస్త మోమితి ప్రయుక్త ఆత్మజ్యోతి స్సకృదావర్తతే (11) సకృదుచ్చారితమాత్ర సఏష ఊర్ధ్వమున్నామయ తీత్యోంకారః (12) ప్రాణాం త్సర్వా న్ప్రలీయత ఇతి ప్రళయః ప్రాణాం త్సర్వా న్పరమాత్మని ప్రణామయతీ త్యేతస్మా త్ప్రణవః చతుర్ధావస్థితఇతి సర్వదేవ వేదయోనిస్సర్వవాచ్యవస్తు ప్రణవాత్మకమ్ (13)**

| | | |
|---|---|---|
| నాల్గవది | – | అర్ధమాత్ర |
| దీనికి లోకము | – | సో మ లో క ము. |

అధర్వణవేదము

| | | |
|---|---|---|
| మరుత్తులు | – | విరాట్టు |
| ఋషి | – | భాస్వతి |

అకార ఉకార మకారములకు చివర ఉండే సూక్ష్మమైన అర్థమాత్రమే నాదము. ఇప్పుడు ప్రథమమాత్ర – ఎరుపురంగులో

ఉంటుంది. దీనిశక్తి స్వర్ణకాంతి గలది. దీనికి అధిదేవత బ్రహ్మ.

రెండవమాత్ర - నలుపురంగులో ఉంటుంది. దీనిశక్తి విద్యుత్కాంతిగలది. అధిదేవత విష్ణువు.

మూడవ మాత్ర - తెల్లగా ఉంటుంది. దీని శక్తి శుక్లవర్ణము. అధిదేవత రుద్రుడు.

నాల్గవ మాత్ర - అర్ధమాత్ర, లక్ష్మీదేవి వంటి వర్ణము గలది. దీని శక్తి సమస్త వర్ణాలతోను ఉంటుంది. దీనికి అధిదేవత పరమాత్మ. ఈ రకంగా ఓంకారానికి నాలుగు పాదాలు ఉన్నాయి.

3, 4 మాత్రలు గల ప్రణవాన్ని ఉచ్చరించి, నాల్గవసారి ఐదుమాత్రలు గల ప్రణవాన్ని ఉచ్చరించాలి. ఈ రకంగా ఉపాసనచేసినట్లైతే శాంతము, ఆత్మస్వరూపము, ప్రణవము అయిన ఆత్మ జ్యోతి ఒక్కసారిగా ప్రకాశిస్తుంది.

ఒక్కసారి ప్రణవాన్ని ఉచ్చరించినంత మాత్రంచేత ఉత్తమస్థానాలు లభిస్తాయి. పరమపదము లభిస్తుంది. కాబట్టి ఇది - ఓంకారము అనబడుతుంది. ప్రాణాలన్ని ఇందులోనే లయం చెందుతాయి. కాబట్టి 'ప్రళయము' అనబడుతుంది. సకలప్రాణులను పరమాత్మయందు లీనం చేస్తుంది. కాబట్టి 'ప్రణవము' అనబడుతుంది.

నాలుగుపాదాలతో కలిసి ఉండటంచేత - సకల దేవతలకు, వేదములకు కూడా యోనిస్థానము అయి ఉన్నది.

**దేవాశ్చేతి సంధత్తాం సర్వేభ్యో దుఃఖభయేభ్య స్సంతారయతీతి తారణా త్తారః (14) సర్వే దేవాః సంవిశంతీతి విష్ణుః, సర్వాణి బృంహ యతీతి బ్రహ్మా, సర్వస్యాంతః స్థానేభ్యోஉ ధ్యే యేభ్యోప్రదీపవ త్ప్రకాశ యతీతి ప్రకాశః (15) ప్రకాశేభ్య స్సదోమి త్యంతఃశరీరే విద్యుద్వ**

**ద్యోతయతి ముహుర్ముహురితి విద్యుద్వత్తృతీయా ద్దిశం దిశం భిత్వా సర్వాన్లోకా న్వ్యాప్నోతి వ్యాపయతీతి వ్యాపనా ద్వ్యాపీ మహాదేవః (16)**

సమస్త దేవతలు ప్రణవస్వరూపమే. సమస్త దుఃఖములనుండి, భయములనుండి తరింపచేయునది కాబట్టి 'తారణము' అనబడుతుంది. తారణము చేస్తుంది. కాబట్టి – 'తారకము' అనబడుతుంది.

సమస్త దేవతలు విశ్రమించే స్థానాన్ని 'విష్ణు' స్థానము అంటారు. అన్ని ప్రాణులను మళ్ళీ సృష్టిస్తుంది. కాబట్టి 'బ్రహ్మ' అనబడతాడు. ప్రాణుల యొక్క హృదయమందు దీపమువలె ప్రకాశిస్తుంది కాబట్టి 'ప్రకాశము' అనబడుతుంది. అన్ని వెలుగులకు వెలుగై దేహములోపల ఓం అని మెరుపువలె ప్రకాశిస్తుంది. కాబట్టి 'విద్యుత్తు' అనబడుతుంది. సమస్త దిక్కులందు అంతర్యామిగా ఉండి లోకములన్నింటినీ వ్యాపించి ఉంటుంది. కాబట్టి 'మహాదేవుడు' అనబడుతుంది.

**పూర్వాస్యమాత్రా జాగర్తిజాగరితం ద్వితీయా స్వప్నం తృతీయా సుషుప్తి శ్చతు తురీయం మాత్రా మాత్రాః ప్రతిమాత్రా గతా స్సమ్య క్షమస్తానపి పాదాఞ్జయతీతి స్వయం ప్రకాశ స్స్వయం బ్రహ్మా భవతీ త్యేషసిద్ధికర ఏతస్మాద్ధ్యానాదౌ ప్రయుజ్యతే (17) సర్వకరణోపసంహారత్వా ద్ధార్య ధారణా ద్బ్రహ్మాతురీయమ్, సర్వకరణాని మనసి సంప్రతిష్ఠాప్య ధ్యానం విష్ణుః (18)**

| | | |
|---|---|---|
| ప్రణవము యొక్క మొదటి మాత్ర | – | జాగ్రదవస్థ |
| రెండవమాత్ర | – | స్వప్నావస్థ |
| మూడవమాత్ర | – | సుషుప్తి |
| నాల్గవమాత్ర | – | తురీయము. |

ఒక్కొక్క మాత్ర, విభిన్న మాత్రలయందు లయం చెందుతాయి. ఓంకారము స్వయం ప్రకాశమైనది. దీనిని శ్రద్ధగా ధ్యానంచేస్తే మోక్షం సిద్ధిస్తుంది. కాబట్టే ఓంకారము ధ్యానము, ధారణ, సమాధులయందు వినియోగించబడుతున్నది. స్థూలశరీరంలోని దశేంద్రియాలను మనస్సునందు లయం చేసి ధ్యానించటమే విష్ణువు. (విష్ణుస్థితి)

**ప్రాణం మనసి సహకరణై స్సంప్రతిష్ఠాప్య ధ్యాతా రుద్రః, ప్రాణం మనసి హకరణై ర్నా దాంతే పరమాత్మని సంప్రతిష్ఠాప్య ధ్యా యీ తేశానం ప్రధ్యాయితవ్యగ్ం (19) సర్వ మిదం బ్రహ్మవిష్ణు రుద్రేంద్రాస్తే సంప్రసూయంతే సర్వాణి చేంద్రి యాణి సహభూతై ర్న కారణం కారణానాంధాతాధ్యాతా కారణంతు ధ్యేయ స్సర్వైశ్వర్య సంపన్నస్సర్వేశ్వర శ్శంభు రాకాశమధ్యే (20) ధ్రువం స్తబ్ధ్వాధికం క్షణ మేకం క్రతు శతస్యాపి చతు స్సప్తత్యాయత్ఫలం త దవాప్నోతి (21)**

సూక్ష్మదేహంలోని తత్త్వాలను, ఇంద్రియాలను మనసులో లయంచేసి ధ్యానించేవాడు ఇంద్రుడు. ప్రాణమును, ఇంద్రియాలను మనసున చేర్చి నాదాంతమైన పరమాత్మయందు నిలిపి ఆ పరమేశ్వరుణ్ణి ధ్యానించాలి. ఆ పరమేశ్వరుడు ఆది మధ్యాంతములు లేనివాడు. నాశనరహితుడు. సమస్త కారణములకు కారణమైనవాడు. సకల సంపదలకు ఆలవాలమైనవాడు. అతడే సర్వేశ్వరుడు, ఓంకారరూపంలో ఉంటాడు. ఆ పరమాత్మయే ధ్యానింపదగిన ధ్యేయ వస్తువు. ఈ రకంగా ఒక్కసారి ధ్యానము చేసినవాడు, శతాధిక యజ్ఞములు 74సార్లు చేసిన ఫలితము పొందుతాడు. అంటే 7400 యజ్ఞములుచేసిన ఫలితాన్ని పొందుతాడు.

**కృత్స్న మోంకారగతిం చ సర్వధ్యాన యోగజ్ఞానానాం యత్ఫల**

**మోంకారో వేద పర ఈశోవా (22) శివ ఏకో ధ్యేయ శ్శివంకర స్సర్వమన్య త్పరిత్యజ్య సమస్తాథర్వశి ఖైతా మథీత్య ద్విజో గర్భవాసాద్విముక్తో విముచ్యత ఏతామథీత్య ద్విజోగర్భవాసా ద్విముక్తో విముచ్యత ఇత్యోగ్ం సత్య మిత్యుపనిషత్ (23) (అధర్వశిఖోపనిష త్సమాప్తా)**

ఓంకార ధ్యానము చేసినవాడు సమస్త ప్రణవస్వరూపము, సకల విధములైన ధ్యానములు, సకల యోగములు, సకల జ్ఞానములు, వాటి ప్రయోజనములు తెలుసుకొనగలుగుతాడు.

**గోపథ బ్రాహ్మణం**లో ఓంకారం గురించి చెప్పబడింది.

అథర్వణ వేదంలో అనేక విషయాలను వివరించటం జరిగింది. అందులో ప్రణవం ఒకటి.

పరబ్రహ్మ బ్రహ్మదేవుణ్ణి ఒక తామరాకుమీద సృష్టించాడు. తన కోరికలు, లోకాలు, దేవతలు, వేదాలు, యజ్ఞాలు, శబ్దాలు, భూతాలు, స్థావర జంగమాలు, వీటన్నింటినీ ఏ రకంగా ఏకాక్షరం వల్ల తెలుసుకోగలుగుతాను అని ఆలోచించి, బ్రహ్మచర్యాన్ని పాటించి, చివరకు 'ఓం' అనే అక్షరాన్ని కనుకున్నాడు. ఓంకారంలో రెండు వర్ణాలు, నాలుగు మాత్రలు ఉన్నాయి. ఇది సర్వవ్యాపి, ఏ మాత్రము మార్పుల లేనిది, బ్రాహ్మీమయము. దీనినుంచే కోరిన వస్తువులు, సమస్త లోకాలు, దేవతలు, శబ్దాలు, యజ్ఞాలు, స్థావరాలు, జంగమాలు అన్నీ పుట్టినాయి.

దీని మొదటి అక్షరం నుంచి స్వర్గం వచ్చింది. రెండవ అక్షరం నుంచి తేజస్సు, వెలుగు పుట్టినాయి. ఓంకారంలోని మొదటి స్వరమాత్ర నుంచి భూమి, ఓషధులు, అగ్ని వృక్షాలు, భూః అనే వ్యాహృతి, గాయత్రి

ఛందస్సు, మూడు విధాలైన స్తోమాలు, వసంత ఋతువు, తూర్పు దిక్కు, వాక్కు, నాలుక సృష్టించబడ్డాయి.

దాని రెండవ స్వర మాత్ర నుంచి అంతరిక్షం, వాయువు, యజుర్వేదము. భువః అనే వ్యాహృతి, త్రిష్టుప్ ఛందస్సు, పదిహేను విధాలైన స్తోమాలు, పశ్చిమ దిక్కు గ్రీష్మ ఋతువు, ఉశ్వాస నిశ్వాసల కుపయోగించే అవయవాలు నిర్మించబడ్డాయి. మూడవ స్వర మాత్ర నుంచి స్వర్గం, సూర్యుడు, సామవేదం, 'స్వః' అనే వాహృతి, జగతీఛందస్సు, ఉత్తర దిక్కు వర్ష ఋతువు, కళ్లు మొదలైనవి సృష్టించబడినాయి. దాని నాల్గవమాత్ర నుంచి నీరు, చంద్రుడు, అధర్వవేదము. అంగీరసులు, నక్షత్రాలు, అనుష్టుప్ ఛందస్సు,, దక్షిణ దిక్కు, శరదృతువు, మనస్సు పుట్టినాయి. దాని మకార మాత్ర నుంచి ఇతిహాసాలు, పురాణాలు, వాక్కు ఛందోయుక్తమైన భాష, ఉపనిషత్తులు, పృథత్, కరత్, గుహాన్, మహత్, తత్, శం, ఓం అనే వ్యాహృతులు, నృత్యము, గానము, చైత్ర రథ దేవతలు. తేజస్సు, వెలుతురు, ఊర్ధ్వ దిక్కు, అథో దిక్కు, హేమంత ఋతువు సృష్టించబడినాయి.

ఈ ఓంకారం సహాయంతోనే దేవతలు అసురులను జయించారు. ఓంకారమే అన్ని వేదాలకు మూలం. ఓంకారమే ప్రపంచానికి ఆధారం. ఈ రకంగా దిక్కులు, ఛందస్సు, పంచభూతాలు, వేదాలు, ఋతువులు, సూర్యచంద్రులు, పురాణాలు, ఇతిహాసాలు, అన్నీ ఓంకారము నుంచే పుట్టాయి అని చెబుతోంది గోపథ బ్రాహ్మణం.

## తలవకారారణ్యకంలో ఓంకారోపాసన

"ఛాందోగ్యోపనిషత్తు సామవేదానికి సంబంధించిన తలవకార బ్రాహ్మణంలోనిది. దీనిలో నిత్యజీవితంలో ఆచరణ యోగ్యమైన

ఉపాసనకు ప్రాధాన్యత ఇవ్వబడింది. దేవతా స్వరూపాన్ని గాని, దానికి సమానమైనదాన్ని గాని లక్ష్యంగా పెట్టుకుని, ఆ గమ్యం చేరటం కోసం ఏకాగ్రతతో నిరంతర సాధన చెయ్యటమే ఉపాసన. ఓంకారోపాసన, అన్నోపాసన, ప్రాణోపాసన ఇలా ఉపాసన అనేక రకాలు. ఉపాస్య దేవతతో తాదాత్మ్యం చెందిన ఉపాసకుడికి ఆ దేవతకుండే శక్తులన్నీ వస్తాయి. అజ్ఞానాన్ని నిర్మూలన చెయ్యటానికి ఉపాసన సహకరిస్తుంది. అందుకే ఉపాసనకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వబడింది. అలా అని ఈ ఉపనిషత్తంతా ఉపాసననే కాదు. పరబ్రహ్మను లక్ష్యంగా తీసుకుని సగుణోపాసన నుండి నిర్గుణోపాసనకు తీసుకుపోబడింది.

**"ఓమిత్యే తదక్షర ముద్గీథముపాసీత"**

ఓంకారాన్ని ఉద్గీథ దృష్టితో ఉపాసించాలి. యజ్ఞము చేసేటప్పుడు సామగీతాలను గానం చేసేవాడు 'ఉద్గాత'. అతడు గానం చేసే సామగాన భాగాన్ని 'ఉద్గీథ' అంటారు. ఓంకారాన్ని ఉద్గీథ దృష్టితో ఉపాసించాలి. అంటే ఓంకారము, ఉద్గీథ రెండూ ఒకటే అని భావించి ఉపాసన చెయ్యాలి. ఓంకారము పరబ్రహ్మకు శబ్దప్రతీక. ఇది కేవలం ఉపాసనకోసం ఏర్పరచుకున్న చిహ్నం. ఉపాసన అంటే ఒక శబ్దాన్ని జపించటం మాత్రమే కాదు. మనస్సును పూర్తిగా దానిమీద లగ్నంచేసి, ఆ శబ్దాన్ని నిరంతరం ధ్యానం చెయ్యటమే ఉపాసన. కర్మకాండలో ఒక భాగంగా, పరబ్రహ్మకు శబ్దప్రతీకగా ఓంకారము ఉపయోగించడుతుంది.

జగత్తులో ప్రాణులయొక్క పుట్టుక, స్థితి, లయాలకు స్థానం భూమి కాబట్టి జీవరాసులన్నిటికీ ఆధారము భూమి. అలాగే

భూమికి ఆధారం – జలం

జలానికి ఆధారం - ఓషధులు

ఓషధులకు ఆధారం - పురుషుడు

పురుషునికి ఆధారం - వాక్కు

వాక్కుకు ఆధారం - ఋక్కు

ఋక్కుకు ఆధారం - సామం

సామానికి ఆధారం - ఉద్గీథం

ఉద్గీథ అంటే ఓంకారము అని గతంలో చెప్పటం జరిగింది. ఓషధుల వల్ల అన్నం; అన్నం వల్ల శరీరం కలుగుతోంది. శరీరంలోని అవయవాలన్నింటిలోకి ముఖ్యమైనది వాక్కు. ఈ రకంగా పృథివ్యాది భూతాలు ఒకదానికన్న ఇంకొకటి శ్రేష్ఠమైనవి. వీటన్నింటిలోకి ఉద్గీథం అంటే ఓంకారము శ్రేష్ఠమైనది. ఓంకారము పరమాత్మకు ప్రతీక. అందుచేత ఓంకారాన్ని పరమాత్మగానే భావించాలి. పృథివ్యాది రసాల్లో ఓంకారము ఎనిమిదవది. పైన చెప్పినట్లుగా

భూమికన్న - జలము

జలముకన్న - ఓషధలు

ఓషధులకన్న - పురుషుడు

పురుషుని కన్న - వాక్కు

వాక్కు కన్న - ఋక్కు

ఋక్కు కన్న - సామం

సామంకన్న - ఉద్గీథ (ఓంకారము)

శ్రేష్ఠమైనవి. వీటిలో వాక్కే, ఋక్కు ప్రాణమే సామం, ఓంకారమే ఉద్గీథం. ఈ విధంగా వాక్ప్రాణాలు, ఋక్సామాలు అని మిధునాలు అవుతున్నాయి. ఈ రకంగా ఋక్సామాలను గ్రహించటం వల్ల

ఋక్సామాల వల్ల నిర్వర్తించబడే కర్మలన్నీ వాక్ప్రాణాలవల్ల నిర్వర్తించినట్లే అని గ్రహించాలి.

ఈ మిథునము ఓంకారంతో కలుస్తుంది. మిధునం అంటే జంట (దంపతులు) మిధునంలోని అవయవాలు ఒకదానితో ఒకటి కలిసినప్పుడు, ఒకదాని కోరిక ఇంకొకటి తీరుస్తుంది. ఇది ధర్మం. ఓంకారానికి సమస్త కోరికలు తీర్చేశక్తి ఉన్నది. ఈ మిధునం ఓంకారంతో కలవటంవల్ల, ఓంకారానికున్న శక్తి దీనికి కూడా వస్తుంది. అంటే అన్ని కోరికలు తీర్చే శక్తి ఈ మిధునానికి వస్తున్నది. ఇంకా విపులంగా చెప్పాలంటే ఋక్సామాలు లేదా వాక్ప్రాణాలు ఓంకారంతో చేరినప్పుడు ఓంకారానికి గల సర్వకామాప్తిత్వ గుణం అనగా అన్ని కోరికలు తీర్చే శక్తి ఆ మిధునానికి వస్తోంది. కాబట్టి ఉపాసకుడు ఓంకారాన్ని ఉపాసించినట్లైతే అతని సమస్త కోరికలు తీరతాయి. ఓంకారమనేది అనుమతి తెలియజెయ్యటానికి ఉపయోగిస్తుంది. ఈ విషయం తెలుసుకుని ఓంకారోపాసన చేసినట్లైతే సాధకుని కోరికలు తప్పనిసరిగా తీరతాయి.

ఈ ఓంకారంతో త్రయీవిద్యలో చెప్పబడినటువంటి వైదికకర్మలన్నీ ప్రారంభించ బడతాయి. త్రయీవిద్య అంటే ఋగ్యజుస్సామవేదాలు. ముందుగా ఓంకారాన్ని ఉచ్చరించే దేవతాస్తుతిగాని, కర్మప్రారంభంగాని జరుగుతుంది. వేదోక్తమైన కర్మఅంతా ఓంకారాన్ని పూజించటానికే జరుగుతుంది. ఓంకారము పరబ్రహ్మ స్వరూపము కాబట్టి ఆ పరబ్రహ్మను అర్చించటానికే ఈ కర్మకాండ అంతా జరుగుతుంది. ఓంకారము యొక్క మహిమవల్ల, ఓంకారసారం వల్లనే వైదిక కర్మలు నిర్వహించబడుతున్నాయి. యజ్ఞమనేది ప్రాణము, అన్నములతో నిర్వహించబడుతోంది. ప్రాణము,

అన్నము కూడా ఓంకారమే. కాబట్టి యజ్ఞముకూడా ఓంకారమే. దీని ఫలితంగానే సూర్యుని ద్వారా వర్షం కురుస్తుంది. వర్షం ద్వారా అన్న ప్రాణాలు ఉత్పత్తి అవుతున్నాయి.

ఓంకారమనే అక్షరాన్ని ఈ విధంగా తెలుసుకున్నవాడు, తెలుసుకోనివాడు ఇద్దరూ ఓంకారం ద్వారా కర్మ చేస్తూనే ఉన్నారు. కాని ఈ విషయం తెలియకుండా కర్మ చేసేకన్న తెలుసుకుని కర్మనాచరిస్తే ఫలితము కొన్నిరెట్లు అధికంగా ఉంటుంది.

**మేధస్సు కోరేవాడు చేయవలసిన మంత్రాలు :**

మేధస్సు (బుద్ధి)ని కోరే సాధకుడు జపించవలసిన మంత్రాలను, సంపదను కోరేవాడు జపించవలసిన మంత్రాలను చెబుతున్నారు. ఓంకారము యొక్క మహత్యం చెప్పబడింది. ముందుగా మేధస్సు కోరేవాడు జపించవలసిన మంత్రాలు. ఓంకారమనేది అన్ని వేదాలకు మూలమైనది. వేదసారమంతా ఓంకారంలోనే ఉన్నది. ఇది అమృత స్వరూపము. శాశ్వతము. పరమేశ్వర స్వరూపమైన ఓంకారమే నాకు ప్రజ్ఞను అనగా మేధస్సును, బుద్ధిని ఇచ్చుగాక. అమృత స్వరూపమైన బ్రహ్మజ్ఞానం పొందే శక్తి నాకు లభించుగాక.

బ్రహ్మజ్ఞాన సముపార్జనకు కావలసిన శక్తి నా శరీరానికి కలుగుగాక. పరుషమైన మాటలు నా నోటి నుండి రాకుండుగాక. గురూపదేశాన్ని చక్కగా వినగలిగే శక్తి నాకు కలుగుగాక. ఓంకారమా! నీవు బ్రహ్మకు ఒర (కోశము) వంటి దానవు. నీలోనే పరబ్రహ్మ దాగి ఉన్నాడు. నా ఆత్మజ్ఞానాన్ని రక్షించు. రాగద్వేషాలవల్ల నా బుద్ధి శీలము చెడకుండా కాపాడు. నన్ను బ్రహ్మజ్ఞానం పొందదగిన వాడిగా చెయ్యి. ఇవి మేధస్సు కోరేవాడు జపించవలసిన మంత్రాలు.

**సంపదను కోరేవాడు చేయవలసిన మంత్రాలు :**

ఓంకారమా! మేధస్సును, శరీర పాటవాన్ని ఇచ్చిన తరువాత సంపదను ఇవ్వవలసినది. ఇక్కడ సంపద అంటే అన్న వస్త్రాలు, గోవులు మొదలైనవి. అవి చిరకాలము సమృద్ధిగా ఉండేటట్లు చెయ్యవలసినది. లౌకిక, మోక్ష విద్యను కోరినవారు, సద్బుద్ధి, ఇంద్రియ నిగ్రహము గల విద్యార్థులు అన్ని దిక్కుల నుండి శాంతచిత్తులై నా దగ్గరకు వత్తురుగాక. వీరందరినీ మంచి విద్యార్థులుగా తీర్చిదిద్ది, లోకంలో అత్యంత ధనికులు పొందే గౌరవం కన్న మిక్కిలి గౌరవము నేను పొందుదును గాక. ఇక బ్రహ్మతో ఐక్యము పొందాలని కోరుతున్నాడు. ఓంకారమా! బ్రహ్మకు నీవు వర (కోశము) వంటిదానవు. నీవు నాలో ప్రవేశించు. అప్పుడు నేను కూడా ప్రణవస్వరూపుడనే అవుతాను. ఇక నీకూనాకూ భేదం ఉండదు. ఓ ప్రణవమా! నీవే దేవతారూపము. నిన్నుస్మరించి నా పాపాలు పోగొట్టుకుంటాను. నీవు అనేక రూపాలు పొంది అనేక దేవతలుగా కనిపిస్తున్నావు. నువ్వు నాకు ఆత్మ స్వరూపం తెలిసేటట్లు చెయ్యి నన్ను కూడా నీలో లీనమొనర్చుకో.

ఈ అనువాకంలో సంపదకోసం కొన్ని మంత్రాలున్నాయి. ఉపనిషత్తు అంటే జ్ఞానప్రకరణం కదా ! మరి ఇక్కడ సంపద దేనికి? అనే అనుమానం రావచ్చు. అజ్ఞానికి ధనం పాపహేతువు. జ్ఞానికి వచ్చినసంపద సద్వినియోగమవుతుంది. యజ్ఞయాగాది క్రతువులు చెయ్యటానికి సంపద కావాలికదా! అందుకని ఈ ప్రకరణంలో ముందుగా జ్ఞానమడిగి తరువాత సంపద నడుగుతున్నాడు.

ఈ రకంగా ఉపనిషద్వాఙ్మయంలో ఓంకారాన్ని గురించి చెప్పబడింది.

# 17. శైవ వైష్ణవాలు

పూర్వకాలం నుంచి శివుడే పరమేశ్వరుడు లేదా విష్ణువే పరమేశ్వర స్వరూపము. అని వాదనలు చాలా వినిపిస్తూనే ఉన్నాయి. ఎవరి వాదనకు తగిన కారణాలు వారు బలంగా చూపిస్తూనే ఉన్నారు. ఒకరి గొప్పతనాన్ని ఇంకొకరు చస్తే ఒప్పుకోరు. శివుణ్ణి పరమేశ్వరుడుగా అంగీకరించే వారిని శైవులని, విష్ణువును పరమేశ్వరుడుగా అంగీకరించే వారిని వైష్ణవులని అంటారు. వీరి భక్తి బాగా ముదిరిపోయి వీరవైష్ణవులు, వీరశైవులు అనబడ్డారు. ఒకానొక కాలంలో అయితే వైష్ణవ ప్రాబల్యం ఉన్న చోట శైవులని, శైవ ప్రాబల్యం ఉన్న చోట వైష్ణవులని చంపేసేవారు. శైవ ప్రాబల్యం ఎక్కువగా ఉన్న కర్నాటకలో రజకుడు (చాకలివాడు) శైవభక్తుల బట్టలు ఉతికి తీసుకుని తను వస్తున్నట్లు గుర్తుగా గంట వాయిస్తూ వచ్చేవాడు. అతని ఎడమచేతిలో గంట కుడిచేతిలో కత్తి ఉండేవి. వైష్ణవులు కూడా ఇలాగే ఉండేవారు. ఆ సమయంలో అతనికి ఎవరూ ఎదురుగా రాకూడదు. ఒకవేళ వస్తే వారి తల తెగ నరికేవాడు. అతడికి రాజుగారి వత్తాసు కూడా ఉండేది. శైవ వైష్ణవుల మధ్య మతయుద్ధాలు కూడా జరిగేవి. దీనిలో కొంత భాగాన్ని ఒక గొప్ప సినీనటుడు 'దశావతారం' పేరుతో తీసిన సినిమాలో కూడా చిత్రీకరించాడు. మనం మామూలుగా చూస్తే త్రిమూర్తులలో రెండవవాడు విష్ణువు. మూడవవాడు రుద్రుడు. కాలక్రమేణా ఈ విష్ణువే శ్రీమహావిష్ణువు శ్రీమన్నారాయణుడు అని పిలువబడ్డాడు. ఇతడే రాముడుగా, కృష్ణుడుగా, నారసింహుడుగా దుష్టశిక్షణ కోసం భూమిమీద అవతరించాడు. అలాగే వేదంలో చెప్పిన రుద్రుడే ఈశ్వరుడైనాడు.

అసలు వేదం వీరి గురించి ఏం చెబుతుందో చూద్దాం.

**విష్ణువు :** దేవతలందరిలోకీ గొప్పవాడు. ఋగ్వేదంలో కేవలము ఐదు సూక్తాలలోనే ఇతడు కీర్తించబడ్డాడు. తన మూడడుగులతో ముల్లోకాలను ఆక్రమించాడు. ఋగ్వేదంలోని ఒకటవ మండలంలో 154, 155, 156 సూక్తాలలో ఇతడు స్తుతించబడ్డాడు. భూమి, నీరు, తేజస్సు, సమస్త లోకాలు ఇతనే సృష్టించాడు. యజ్ఞయాగాలు చేసేవారు విష్ణుపదము చేరతారు. మంత్రశాస్త్రం ప్రకారం విష్ణువు అలంకార ప్రియుడు. కృష్ణయజుర్వేదంలో ఏడు అధ్యాయాలలో విష్ణువును గురించి చెప్పబడింది. **యజ్ఞోవైవిష్ణుః** విష్ణువు యజ్ఞస్వరూపుడు. జగత్తంతా వ్యాపించి ఉంటాడు. శుక్ల యజుర్వేదంలో కూడా యజ్ఞము విష్ణుస్వరూపము అని చెప్పబడింది. మహావరాహ రూపంలో భూమిని ఉద్ధరించాడు. విష్ణువు యొక్క పరమపదాన్ని జ్ఞానులు మాత్రమే చూడగలరు.

సామవేదంలో విష్ణువు స్థానం అంతరిక్షం. ఇతడు సర్వవ్యాపకుడు, త్రివిక్రముడు, తన మూడుపాదాలతో జగత్తును ఆక్రమించాడు. అతని పాదంలోనే ఈ జగత్తు ఉన్నది. అతడు ధర్మప్రవర్తకుడు. ఇంద్రుడికి మంచిమిత్రుడు. అతన్ని ఎవరూ హింసించలేరు. అధర్వణ వేదంలో విష్ణువు ప్రసక్తి లేదు.

విష్ణువు యొక్క గొప్పతనాన్ని గురించి నారాయణసూక్తంలో చెప్పబడింది. ఇతడు సహస్రశీర్షుడు. అనేక నేత్రములు గలవాడు. లోకాలకు సుఖాన్నిస్తాడు. సర్వత్రా వ్యాపించి ఉంటాడు. జగత్తుకు ఆధారమైన వాడు. చరాచర జగత్తుకు అతీతమైనవాడు. అతడే పరంజ్యోతి, పరాత్పరుడు, పరమేశ్వరుడు. జగత్తంతా లోపలా బయటా

వ్యాపించి ఉంటాడు. సర్వవ్యాపి. అతడు ఎక్కడో లేడు. మన హృత్పద్మంలోనే ఉంటాడు. అతడే పరమాత్మ. అతడే పరబ్రహ్మ. అతడే వాయువు. అతడే ఆత్మ, అతడే సత్యము, లోపలా బయటా ఉండేది అతడే. నారాయణోపనిషత్తు వంటి వైష్ణవోపనిషత్తులలో ఇతన్ని గురించి చెప్పబడింది. వీటిమీద వివరాలకు ఉపనిషత్తులు చూడండి. విష్ణువు యొక్క సర్వవ్యాపకత్వాన్ని నారాయణసూక్తం వివరిస్తోంది.

**రుద్రుడు :** ఇతడు నాలుగు వేదాలలోను చెప్పబడ్డాడు. ఋగ్వేదంలో కేవలము మూడు సూక్తాలలోనే చెప్పబడ్డాడు. చాలా బలమైన వాడు. మహాకోపం గలవాడు. శత్రువులను నిర్దాక్షిణ్యంగా సంహరిస్తాడు. ఎప్పుడూ ధనుర్బాణాలు ధరించి రథం మీద తిరుగుతుంటాడు. అపారమైన దయగలవాడు. సకల ప్రాణులకు సుఖాన్ని కలిగిస్తాడు.

కృష్ణ యజుర్వేదంలో ఎనిమిది అధ్యాయాలలో రుద్రుని ప్రసక్తి ఉన్నది. ఇతడు జ్ఞానప్రదాత. మానవుల శారీరక, మానసిక రోగాలు పోగొడతాడు.

కృష్ణయజుర్వేదంలో నాల్గవ కాండలోని ఐదవ ప్రపాఠకంలో శతరుద్రీయము ఉన్నది. దీన్నే నమకపాఠము, రుద్రము అంటారు. ఇందులో 169 మంత్రాలతో రుద్రుణ్ణి స్తుతిస్తారు. ఈ మంత్రాలతోనే రుద్రుడికి అభిషేకము, రుద్రహోమము చెయ్యబడతాయి. రుద్రుడు అభిషేక ప్రియుడు. శుక్లయజుర్వేదంలో కూడా శతరుద్రీయం చెప్పబడింది. నమకంలోని మంత్రాలలో శత్రువుల బారినుంచి, రోగాల బారినుంచి, రక్షించమని అతన్ని ప్రార్థిస్తూ, రుద్రుడికి సర్వవ్యాపకత్వము చెప్పబడింది. సామవేదంలో రుద్రుని ప్రసక్తి పెద్దగా లేదు కాని అథర్వణ వేదంలోని పదకొండు సూక్తాలలో ఇతడు చెప్పబడ్డాడు. సంతాన నష్టం

జరుగుతున్నప్పుడు సంతానం కోసం ప్రత్యేకంగా రుద్రుణ్ణి ప్రార్థిస్తారు. ప్రత్యేకంగా శైవోపనిషత్తులు రుద్రుణ్ణి గురించి చెబుతాయి. రుద్రసూక్తం (నమకం) రుద్రుని సర్వవ్యాపకత్వాన్ని వివరిస్తోంది.

**ఋగ్వేదంలో పదవ మండలంలోని తొంభైయవ సూక్తము పురుషసూక్తము.** ఇందులో పరమేశ్వరుడు అనేక శిరస్సులు, అనేక బావులు, పాదాలు, కనులు గలవాడు. అతని నుంచే బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులు అనే చాతుర్వర్ణాలు, భూమ్యాకాశాలు చరాచర జగత్తు ఆవిర్భవించాయి. అని చెప్పబడింది.

ఇక్కడ విచిత్రం ఏమంటే వైష్ణవులు, శైవులు కూడా ఇది తమకు సంబంధించినది గానే చెబుతారు. విష్ణువుకు, శివుడికీ కూడా అభిషేకం చేసేటప్పుడు పురుషసూక్తము చెబుతారు. ఇక్కడ విష్ణువే పరమేశ్వరుడు అని, శివుడే పరమేశ్వరుడు అని చెప్పటమే వీరి ముఖ్యోద్దేశ్యం.

ఇక్కడ మనం గమనించాల్సిన విషయం ఏమంటే శివుడితో ఐక్యత పొందటాన్ని శైవులు ఒప్పుకోరు. అలాగే విష్ణువుతో ఐక్యత పొందటాన్ని వైష్ణవులు ఒప్పుకోరు. ఈ రెండు మతాలలోను జీవుడు వేరు. దేవుడు వేరు. మరణానంతరము విష్ణుభక్తులు పరమపదంచేరి అక్కడ శ్రీమన్నారాయణుని సన్నిధిలో ఉండిపోతారు. అదే శివభక్తులైతే కైలాసం చేరి పరమశివుని సన్నిధిలో ఉండిపోతారు. ఈ కోణంలో చూస్తే కేవలం వైష్ణవులు, కేవలం శైవులు ఇద్దరూ ద్వైతులే. వీరిద్దరికీ ఏ మాత్రము పడదు. బద్ధవిరోధులు. పోనీ సర్దుకుపోయే ప్రయత్నాలు ఎవరైనా చేశారా అంటే, అదీ లేదు. ఈ విషయంలో వైష్ణవులకన్న శైవులే ఒకడుగు ముందుకు వేశారు అని చెప్పవచ్చు. ఎందుకంటే వైష్ణవోపనిషత్తులతో శివుడి ప్రసక్తి ఉండదు. ఎక్కడైనా శివుడు అనే పదం వస్తే దానికి మంగళకరుడు, శుభకరుడు అని అర్థం చెబుతారు.

కాని శైవోపనిషత్తు అయిన రుద్రహృదయోపనిషత్తులో శివకేశవులు ఇద్దరూ ఒకటే అని ప్రతిపాదించారు.

**యేర్చంతి హరిం భక్త్యా । తేర్చయంతి వృషధ్వజమ్ ।**
**యేద్వేషంతి విరూపాక్షం । తేద్విషంతి జనార్ధనమ్ ॥**

విష్ణువుకు భక్తితో నమస్కరించే వారు శివుణ్ణి అర్చించినట్లే. శివుని ద్వేషించిన వారు విష్ణువును ద్వేషించినట్లే. విష్ణువును ద్వేషించిన వారు శివుణ్ణి ద్వేషించినట్లే.

**యో రుద్రం నాభిజానంతి । తేనజానంతి కేశవమ్ ।**
**రుద్రాత్ ప్రవర్తతే బీజం । బీజయోని ర్జనార్ధనః ॥**

రుద్రుని గురించి బాగా తెలిసిన వారే కేశవుని కూడా తెలుసుకోగలుగుతారు. రుద్రుని నుంచి బీజం వస్తుంది. ఆ బీజమే జనార్దనుడు అన్నారు.

ఈ రకంగా శివకేశవులకు అభేదం చెప్పింది శైవోపనిషత్తు అయిన రుద్ర హృదయోపనిషత్తు. కాబట్టి శైవులే శివకేశవుల సమన్వయానికి నడం బిగించారని చెప్పవచ్చు.

వేదాంతోపనిషత్తులలో కృష్ణయజుర్వేదానికి సంబంధించిన **స్కందోపనిషత్తు** ఒకటి. అందులో కూడా శివకేశవులకు భేదం లేదు అని చెప్పటం జరిగింది.

**శివాయ విష్ణురూపాయ । శివరూపాయ విష్ణవే**
**శివస్య హృదయగ్ం విష్ణుః । విష్ణోశ్చ హృదయగ్ం శివః**
**యధాశ్శివ మయోవిష్ణుః । యేవం విష్ణుమయ శ్శివః**

శివుడన్నా, విష్ణువన్నా ఒకటే. శివుని రూపమే విష్ణువు. అలాగే విష్ణువు రూపమే శివుడు. శివుని హృదయంలో విష్ణువు, విష్ణువు

హృదయంలో శివుడు ఉంటారు. శివకేశవులిద్దరూ ఒక్కటే అని ప్రతిపాదించింది స్కందోపనిషత్తు.

గతంలోనే కాదు. ఈ రోజున కూడా వైష్ణవులకు శైవులకు పడదు. ఈ మధ్యనే ఒక వైష్ణవుణ్ణి కలిశాను. అతనితో మాట్లాడిన సారాంశం ఏమంటే వారు పరమతాలేవైనా ఒప్పుకుంటారు. కాని శైవాన్ని మాత్రం ఒప్పుకోరు. అలాగే శైవులు కూడా.

మతము అనేది మానవుణ్ణి మంచి మార్గంలో పెట్టటానికి ఉపయోగించాలి. అంతేకాని విద్వేషాలు రెచ్చకొట్టటానికి మాత్రం కాదు. శివుడైనా, కేశవుడైనా సత్యాన్నే పలకండి. ధర్మాన్ని ఆచరించండి. తోటి మనిషికి సహాయం చెయ్యండి. మంచి నడవడి కలిగి ఉండండి. స్వార్ధబుద్ధిని వదిలెయ్యండి. జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. కాబట్టి ఎవరిని అర్చించినా, ఆ అర్చన పరమేశ్వరుడికే చెందుతుంది అని గుర్తించండి. **సర్వదేవ నమస్కారః కేశవంప్రతి గచ్ఛతి** ఇక్కడ కేశవుడు అంటే పరమేశ్వరుడు అని అర్థం.

కాని మీ మతాన్ని మీరు గౌరవించుకోండి. ఇతర మతాలను గౌరవించండి. భగవంతుడు ఎవరైనా పదిమందికీ మంచినే చెయ్యండి. పదిమందికీ సహాయం చెయ్యమనే చెబుతాడు. అందరినీ సమాన దృష్టితో, పిపీలికాది బ్రహ్మపర్యంతము నీ స్వరూపంగానే భావించి ప్రేమించాలి. **మతం మంచికి, మానవత్వానికి మార్గదర్శకం కావాలి. అంతేకాని మతం మత్తులో, మతం ముసుగులో విద్వేషాలు సృష్టించవద్దు.**

# 18. వేదకాలంలో స్త్రీ

వేదకాలంలో స్త్రీకి గౌరవము ఉండేదా? ఇది ప్రశ్న. మొన్న ఒకవేద పండితుడు మాట్లాడుతూ వేదకాలమనేది ప్రత్యేకంగా ఎక్కడా లేదు. అన్నాడు. అసలు వేదకాలం అంటే ఏది? పూర్తిగా వేదాలు ఆవిర్భవించిన కాలం. ఆ రోజుల్లో స్త్రీకి గౌరవం ఉండేదా? అనేది ప్రశ్న. వేదకాలం రెండుగా చెప్పబడుతుంది. 1. తొలివేదకాలం 2. మలివేదకాలం

తొలివేదకాలంలో స్త్రీకి బాగా గౌరవము ఉండేది. స్త్రీని ఇంటికి దీపం. కంటికి వెలుగు అనే వారు. ఆ రోజులలోనే ఆడపిల్లలకు ఆస్తిహక్కు ఉన్నది. ఈ విషయం **ఋగ్వేదంలోని పదవ మండలంలోని 108వ సూక్తంతో** చెప్పబడింది. యుక్తవయస్కురాలైన కన్యకు మాత్రమే వివాహం చేసేవారు. ఋగ్వేదం పదవ మండలంలోని 85వ సూక్తంలో క్రొత్తగా వివాహమైన కన్యకు – "ఓ వధువా! నీ అత్తమామల మీద, మఱదుల మీద సామ్రాజ్ఞివికా. అందరి మీద పెత్తనం చెలాయించు. చివరిదశలో భర్తని కూడా పిల్లవాడిలాగా చూడమని చెబుతున్నారు. పుట్టింటి గౌరవం, మెట్టినింటి గౌరవము ఇనుమడింపచేసేది స్త్రీ **వివాహమైన తరువాత అత్తవారింటికి మకుటంలేని మహారాణి.** ఇంట్లో అన్ని అధికారాలు ఆమెవే. అంత ప్రాముఖ్యత నిచ్చారు.

స్త్రీ గర్భవతి అయినప్పుడు ఆ గర్భాన్ని రక్షించటానికి **ఋగ్వేదం పదవ మండలంలో 162 సూక్తంతో హోమం** చేసేవారు. గర్భానికి నష్టం రాకూడదని భగవంతుణ్ణి ప్రార్థించేవారు.

వివాహం జరిగిన తరువాత వధూవరుల జీవితం సుఖంగాసాగాలని భగవంతుణ్ణి ప్రార్థించేవారు. అని చెబుతోంది

ఛాందోగ్య బ్రాహ్మణం. ఆమె పిల్లలకు ఏ పరిస్థితిలోనూ ఆపదరాకూడదు. ఆమె భర్తతోకలిసి సుఖంగా జీవించాలి. వివాహ సమయంలో వరుడు వధువుతో "ఓ కన్యా ! నువు నాతోపాటుగా, నేను చేసే అన్ని కర్మలయందు సమానమైన అధికారం పొందుతూ నా వెంట నడచి రావలసినది మనిద్దరం ఒకరినొకరు అర్థం చేసుకుని మంచి మిత్రులు లాగా ఉందాం" అంటాడు.

పాణిగ్రహణ సమయంలో "ఓ కన్యకా! నేను నీ పాణిని గ్రహిస్తున్నాను. నా వృద్ధాప్యం పండే వరకు నువ్వు నాతోనే ఉండాలి. ప్రసన్నమైన దృష్టితో నాకు ప్రీతి కలిగించు. పశువులకు శుభం కలిగించు. అందరికీ సుఖశాంతులు కలిగించు" అనేవాడు.

ఈ రకంగా వివాహం తరువాత అత్తవారింట్లో స్త్రీకి సర్వహక్కులు లభించేవి. సమాజంలో స్త్రీకి చాలా గొప్పస్థానం ఉండేది. పురుషులతో పాటుగానే స్త్రీలకి కూడా ఉపనయన సంస్కారము ఉండేది. వారుకూడా వేద వేదాంగాలు నేర్చుకునే వారు. యజ్ఞయాగాదులు జరిగినప్పుడు భర్తతోపాటుగా భార్యకూడా కొన్ని మంత్రాలు చదివేది. ఆధ్యాత్మిక చర్చలలో స్త్రీలు కూడా పాల్గొనేవారు. జనకుని ఆ స్థానంలో గర్గుని యొక్క కుమార్తె గార్గేయి యాజ్ఞవల్క్యుడితో వాదనకు దిగుతుంది. అలాగే జనకుని మంత్రి మైత్రేయుని కుమార్తె మైత్రేయి గొప్ప ఆధ్యాత్మిక చింతన కలిగినది.

వేదమంత్రాలను కొంతమంది మహర్షులు సమాధి స్థితిలో ఉండి దర్శించారు అన్నాం. అలా దర్శించిన వారిలో భృగుమహర్షి భార్య, శుక్రాచార్యుని తల్లి – ఉశన

| | | |
|---|---|---|
| భరద్వాజుని కుమార్తె | – | శిరింభిత |
| దక్షుని కుమార్తెలు | – | మేధ, కద్రువ |

త్వష్టప్రజాపతి కుమార్తెలు - త్వాష్ట్రులు

ఇలా మనకు తెలిసి 25 మంది పైగా స్త్రీలు వేదమంత్రాలను దర్శించారు.

వివాహం చేసుకునే విషయంలో క్షత్రియులలో స్వయంవర పద్ధతి ఉండేది. వివాహానికి వచ్చిన రాకుమారులంతా తమ తమ ఆసనాల మీద కూర్చునేవారు. రాకుమారులను చూసుకుంటూ వచ్చి, నచ్చినవారి మెడలో పూలహారం వేసే రాకుమారి. ఈ రకంగా తొలి వేదకాలంలో స్త్రీకి అత్యంత గౌరవం ఉండేది.

కాలక్రమేణా మలివేదకాలం వచ్చేసరికి పురుషాధిక్యత పెరిగిపోయింది. ఆ తరువాత వంద సంవత్సరాల క్రితం వరకు చూసినట్లైతే స్త్రీ బానిసగా, పురుషుడికి సుఖాన్నిచ్చే సాధనంగా, పిల్లల్ని కనే యంత్రంగా చూడబడింది. ఈ రోజున కూడా మనదేశంలో పురుషాధిక్యత కొనసాగుతూనే ఉంది

# 19. యజ్ఞయాగాలలో పశుబలి నిషేధమా

యజ్ఞంలో అయితే నల్లమేకని బలి ఇవ్వాలి. దాని శరీరంలో గుండె దగ్గర అతిపలచగా ఉండే 'వప'ని హోమం చేసిన తరువాత దానిన యజమాని, అతని భార్య తినాలి. అప్పుడే వారు 'సోమయాజులు, సోమిదేవి' అనబడతారు అని వేదం చెబుతోంది. అదే యాగాలలో అయినట్లైతే ఒక్కొక్క యాగానికి విడివిడిగా పశువుల సంఖ్య నిర్ణయించబడింది. ఇందులో ఒక్క మేకే కాకుండా అన్ని రకాల పశువులు ఉంటాయి.

వాజపేయ యాగంలో – 17 రకాల పశువులు బలి ఇవ్వాలి.

అశ్వమేధయాగంలో గుర్రంతో పాటుగా – 340 రకాల గ్రామ్యపశువులు. 360 రకాల అరణ్యపశువులు బలి ఇవ్వాలి.

అశ్వమేధ యాగంలో ఒక పెద్ద జంతు ప్రదర్శనశాల ఏర్పాటు చెయ్యటం జరుగుతుంది. మనం అరణ్యంలోకి వెళ్ళినా 360 రకాల అరణ్యకపశువులను చూడం.

ఇక నరమేధంలో అయితే – పశువుకు బదులుగా మనిషిని బలిఇస్తారు. ఇందులో మొత్తం 11 యూపస్తంభాలుంటాయి. మొదటి స్తంభానికి 48 మందిని మిగిలిన పదిస్తంభాలకు ఒక్కొక్క దానికి పదిమంది చొప్పున 11×10 = 110 మందిని వెరసి 110+48 = 158 మందిని యూపస్తంభాలకు కట్టేస్తారు. వీరందరినీ యజ్ఞంలో బలి ఇస్తారు. వీరు గాక 185 పశువులను బలిగా ఇస్తారని చెప్పబడింది. అయితే ఇందులో మనుషుల్ని బలిఇవ్వరు. చివరకు వాళ్ళని వదలివేస్తారు అని కొంతమంది చెబుతున్నారు. కాని అది నిజంకాదని శునశ్శేపుడి ఉపాఖ్యానం మనకు చెబుతోంది. ఈ ఉపాఖ్యానం లోపలి

పేజీల్లో ఉంది. ఇందులో యజ్ఞపశువుగా వెళ్ళిన శునశ్శేపుడు విశ్వామిత్రుని దయవల్ల బ్రతికి బయటపడ్డాడు. కాబట్టి నరబలి ఉండేది అనేమాట రూఢిఅవుతోంది. 158 మంది మానవులు కాక 185 పశువులను కూడా బలిగా ఇస్తారని చెప్పబడింది. గోమేధంలో అయితే అక్కడ బలిచ్చే ఆవుల సంఖ్యకు లెక్కలేదు. ఆవులతోపాటుగా మిగిలిన పశువులు గూడా బలి ఇవ్వబడతాయి. అశ్వమేధం గాని, నరమేధం గాని జరిగేటప్పుడు మనబోటివాళ్ళు వెళ్ళటం కష్టం 340 జంతువుల్ని అక్కడ చంపితే అదంతా పెద్దరక్తపు మడుగులాగా వైతరిణీనదిలాగా ఉంటుంది. ఘోరాతిఘోరమైన ఆ దృశ్యాన్ని మనం చూడలేం. నరవేధమైతే సరేసరి.

1. ఈ పరిస్థితిని దృష్టిలో పెట్టుకుంటే యజ్ఞంలో పశువధ నిషేధించాలి అని చెప్పవచ్చు. ఇందులో అనుమానం లేదు.
2. భారత దేశంలో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు రెండు కూడా యజ్ఞంలో పశువధ నిషేధించాయి.
3. ఎక్కడైనా ఇటువంటివి జరుగుతుంటే జీవకారుణ్యసంఘం వారు తప్పకుండా అడ్డుపడతారు.
4. రామానుజాచార్యుడు – అసలు పశువధ వద్దన్నారు.
5. మధ్వాచార్యుల వారు మాత్రం పిండితో ఒక బొమ్మ చేసి క్రతువును పూర్తి చెయ్యాలి అన్నాడు.
6. ఆధునికులు మంత్రంలో ఉన్న పశువుల పేర్లకు వేరే మూలికలు చెప్పి వాటిని హోమం చెయ్యాలి అన్నారు.

దీనిని బట్టి రామానుజుల వారు, మధ్వాచార్యులవారు కూడా యజ్ఞయాగాలలో పశువధని ఒప్పుకోలేదు.

ఇకపోతే జీవకారుణ్య సంఘం వారు. ఎక్కడైనా యజ్ఞంచేస్తామని బోర్డు పెడితే, ఆ సంఘం వారు ఇక్కడికివచ్చి అడ్డంగా కూచుంటారు. జీవహింస చేయకూడదనేది వీరిసిద్ధాంతం.

జీవహింస చాలాచోట్ల జరుగుతోంది. ప్రతిరోజు కొన్నివేల జంతువులను కబేళాలలో చంపటం జరుగుతోంది. మరి ఆ విషయం వీళ్ళ కళ్ళకు కనపడదా? మరి అక్కడెందుకు మాట్లాడరు? దీనికి సమాధానం వీరికే తెలియాలి. ఇన్ని పశువులని వధిస్తే అది ఒక పెద్ద కబేళాలా ఉంటుంది. **ఈ పరిస్థితులలో పశువధ నిషేధించి తీరాలి. ఇక్కడ రెండవ ఆలోచన లేదు. ఇది నా అభిప్రాయం మాత్రమే కాని సంప్రదాయం ప్రకారం పశువధ జరిగి తీరాలి. యజ్ఞంలో చంపబడిన పశువు స్వర్గానికి పోతుంది.**

బలిహరణంలో సమర్పించే పురోడాశము పశుసారంగా భావించడుతోంది. పశుసారము అంటే పశుత్వమే. పశువును హవనం చెయ్యటం అంటే పశుత్వాన్ని నాశనం చెయ్యటమే. అందుచేత పశువుకు బదులుగా పురోడాశము చాలు. పశుబలి అవసరం లేదు అంటోంది కౌషీతకీబ్రాహ్మణము.

# ౨౦. వేదం అద్వైతమా?

వేదం ఏ సిద్ధాంతాన్ని గురించి చెబుతోంది? ద్వైతమా? అద్వైతమా? విశిష్టాద్వైతమా? ఈ ప్రశ్న ఇప్పటిది కాదు. చాలా సంవత్సరాల నుంచీ ఉన్నదే. దీన్ని గురించి చెప్పాలి అంటే ముందు త్రిమతాల గురించి చూద్దాం.

హైందవ ధర్మంలో ప్రముఖంగా ఉన్నవి మూడు మతాలు.

1. అద్వైతము–దీన్ని ప్రతిపాదించినది ఆదిశంకరులు
2. ద్వైతము–దీన్ని ప్రతిపాదించినది మధ్వాచార్యుల వారు
3. విశిష్టాద్వైతము–దీన్ని ప్రతిపాదించినది రామానుజాచార్యులు

అద్వైతసిద్ధాంతంలో జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటే. జీవుడే దేవుడు. నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని. ద్వైత సిద్ధాంతంలో జీవుడువేరు దేవుడువేరు. విశిష్టాద్వైతంలో ఈశ్వరుడు, జీవుడు, ప్రకృతి. ఈ మూడు సత్యమైనవి. ఇక్కడ ఈశ్వరుడు స్వతంత్రుడు. జీవుడు, ప్రకృతి పరతంత్రులు.

ఇప్పుడు మనముందున్న ప్రశ్న – ఈ మూడు సిద్ధాంతాలలో వేదంలో చెప్పింది ఏది ? వేదం దేన్ని ప్రతిపాదిస్తోంది.

నిశతంగా పరిశీలించినట్లైతే వేదంలో ఇంద్రుడు, అగ్ని, వరుణుడు, వాయువు, సోముడు, ఆదిత్యుడు, అశ్వనీ దేవతలు, ఇలా చాలామంది దేవతలు చెప్పబడ్డారు. అందుకని అది బహుదేవతారాధన కాదు. ఉన్నది ఒక్కటే దైవం. సమయానుకూలంగా రూపం మార్చుకుని సాధకుని కోరిక ప్రకారం ప్రత్యక్షమవుతుంది. అది ఏకేశ్వరోపాసన. **'సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా'** సాధకుల కోరికలు

తీర్చటానికి నిరాకారుడైన పరమేశ్వరుడికి ఒకరూపం కల్పించబడింది. ఆ పరమేశ్వరుడు నిరాకారుడు, నిర్గుణుడు. ఆయనే మోక్షమిచ్చేవాడు. అయితే ఇక్కడ ఇంకో ప్రశ్న వస్తుంది. పరమేశ్వరుడు సాకారుడా? నిరాకారుడా? పరమేశ్వరుడికి సాకారము, నిరాకారము రెండూ చెప్పబడ్డాయి. ఒకసారి అర్జునుడు శ్రీకృష్ణపరమాత్మణ్ణి అడుగుతాడు. 'స్వామీ! నీకు రెండు రూపాలున్నాయట కదా? అప్పుడు భగవానుడు అంటాడు "ఔను నాకు రెండురూపాలున్నాయి. 1. సాకారము 2. నిరాకారము. సాకారము అజ్ఞానుల కోసం నిరాకారము జ్ఞానుల కోసం" అని ప్రశ్నోపనిషత్తులో చెబుతాడు. 'ఓంకారము పరబ్రహ్మ స్వరూపము. అది సాకారము, నిరాకారము కూడా' వైష్ణవోపనిషత్తులలో విష్ణువే పరమేశ్వరుడు. అతనికి ఆకారముంది. శైవోపనిషత్తులలో శివుడే పరమేశ్వరుడు. అతనికి ఆకారమున్నది. శాక్తేయోపనిషత్తులలో శక్తి పరమేశ్వరస్వరూపము. ఆవిడకు ఒక ఆకారమున్నది. ఈ ఉపనిషత్తులన్నీ సాకారాన్ని చెబుతున్నాయి. మరికొన్ని ఉపనిషత్తులు నిరాకారాన్ని చెబుతున్నాయి. ఏది ఏమైనప్పటికీ, ఏ ఉపనిషత్తులో అయినా సరే చెప్పేది ఒకటే ఆ పరమేశ్వర స్వరూపం నుంచే ఇంద్రుడు, అగ్ని, అష్టదిక్పాలకులు, వరుణుడు, వాయువు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, 84 లక్షల జీవరాశి, చరాచర జగత్తు అంతా ఆవిర్భవించింది. సృష్టి ప్రారంభం కాకముందు పరమేశ్వరుడు ఈ జగత్తంతా ఆక్రమించి ఉన్నాడు. సృష్టి జరిగిన తరువాత 84 లక్షల జీవరాశి రూపంలో ఈ జగత్తంతా ఆక్రమించి ఉన్నాడు. అంటే పరమేశ్వరుడే జగత్తు. జగత్తే పరమేశ్వరుడు.

పరమాత్మని ధ్యానం చేస్తున్నప్పుడు నిరాకారము మీద ఏకాగ్రత కుదరదు. ధ్యానంలో కూర్చున్నప్పుడు ధారణ చెయ్యాలంటే, ధ్యేయం

మీద లక్ష్యం ఉండాలి. ఆ ధ్యేయ వస్తువుకు ఆకారంలేదు అంటే సామాన్యుడికి లక్ష్యంకుదరటం కష్టమవుతుంది. అందుకే సాకారం చెప్పబడింది. సాధకుడు దేన్ని ఆరాధిస్తాడో, దాన్నే పొందుతాడు అంటోంది శాస్త్రం. అంటే విష్ణువును ఆరాధించే వారు మరణానంతరము వైకుంఠం చేరతారు. ఈశ్వరుణ్ణి ఆరాధించే వారు కైలాసం చేరతారు. శక్తిని ఆరాధించే వారు మణిద్వీపం చేరతారు. నిరాకారాన్ని ధ్యానం చేసేవారు పరమాత్మలో లీనమవుతారు.

ముక్తి నాలుగు రకాలు అని చెబుతోంది ముక్తికోపనిషత్తు. 1. సాలోక్యము 2.సామీప్యము 3. సారూప్యము 4. సాయుజ్యము. అంతః పూజ చేసేటప్పుడు షట్చక్రాలలోను పరమేశ్వరుణ్ణి ఆరాధిస్తారు.

1.అనాహత పద్మంలో పరమేశ్వరుణ్ణి ఆరాధించేవారు పరమేశ్వరుడు ఉండే లోకంలోనే ఉంటారు. ఇది సాలోక్యముక్తి.

2.విశుద్ధి చక్రంలో ఆరాధించేవారు పరమేశ్వరుడికి అత్యంత సమీపంగా ఉంటారు. సౌందర్యలహరిలో చెప్పినట్లుగా బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మహేశ్వరుడు, సదాశివుడు వీరు అమ్మవారిని విశుద్ధి చక్రంలో ఆరాధించి ఆమె కూర్చునే ఆసనానికి మొదటి నలుగురు కాళ్ళు కాగా సదాశివుడు పైన ఉండే పలక అయినాయి. ఇంద్రుడు తమ్మిపడగ (ఉమ్మిపాత్ర) అయినాడు. అలాగే వైష్ణవంలో లక్ష్మీదేవి, ఆదిశేషుడు, గరుడుడు, నారదుడు ఇలాంటివారే. అదే శైవంలో నంది మొదలైన వారు.

3.ఆజ్ఞాచక్రంలో పరమేశ్వరుణ్ణి అర్చించేవారు పరమేశ్వరుని రూపంలోనే ఉంటూ భక్తులకోరికలు తీరుస్తారు. వీరు సృష్టి స్థితిలయాలు తప్ప పరమేశ్వరుడు చేసే పనులన్నీ చేస్తారు.

ఇక్కడ మనం గుర్తించవలసిన విషయం ఏమంటే ఈ మూడు

రకాలయిన ముక్తులు పొందిన వారు తమ పుణ్యఫలం ఉన్నంతవరకే అక్కడ ఉండి తరువాత భూలోకంలో మళ్ళీ జన్మిస్తారు.

4. పరమేశ్వరుణ్ణి సహస్రదళ పద్మంలో ధ్యానించేవారు మోక్షం పొందుతారు. ఇదే సాయుజ్యము. వీరికి జన్మరాహిత్యం జరుగుతుంది. పునర్జన్మ ఉండదు.

ఇక్కడ ఉండే పురుషుడు అనేక వేల శిరస్సులు, బాహువులు, పాదాలు కలిగి ఉంటాడు. అన్ని రంగులు, అన్ని ఆయుధాలు ధరించి ఉంటాడు. అన్ని రకాలయిన ఆహార పదార్థాలను భుజిస్తాడు. అతడు పరమేశ్వరుడు. ఇక్కడికి చేరినవారికి పునర్జన్మ ఉండదు. అదే సాయుజ్యము. అయితే పరమేశ్వరుడు హృత్పద్మంలో ఉంటాడు అన్ని కొన్నిచోట్ల చెప్పటం జరిగింది. ఉపనిషత్తుల్లో ప్రముఖంగా చెప్పబడేవి పది

**ఈశ కేన కఠ ప్రశ్న ముండక మాండూక్య తిత్తిరి**
**ఐతరేయం చ ఛాందోగ్యం బృహదారణ్యకం దశః**

| | |
|---|---|
| 1. ఈశావాశ్యోపనిషత్తు | 6. మాండ్యూకోపనిషత్తు |
| 2. కేనోపనిషత్తు | 7. తైత్తిరీయోపనిషత్తు |
| 3. కఠోపనిషత్తు | 8. ఐతరేయోపనిషత్తు |
| 4. ప్రశ్నోపనిషత్తు | 9. ఛాందోగ్యపనిషత్తు |
| 5. ముండకోపనిషత్తు | 10. బృహదారణ్యకోపనిషత్తు |

త్రిమతాచార్యులు వీటికి వ్యాఖ్య వ్రాశారు. పరమేశ్వరుడు చరాచర జగత్తంతా ఆక్రమించి ఉన్నాడు అని చెబుతున్నాయి ఈ ఉపనిషత్తులు. ఛాందోగ్యోపనిషత్తులో సత్యకామజాబాలి కథ ఇందుకు చక్కని ఉదాహరణ. (ఈ కథ కోసం ఛాందోగ్యోప నిషత్తు చూడండి) అందులో సత్యకాముడికి పరబ్రహ్మ తత్త్వాన్ని చెప్పటం జరుగుతుంది. పరబ్రహ్మ

తత్వం నాలుగు పాదాలుగా ఉంటుంది.

1. తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం నాలుగు దిక్కులు – మొదటి పాదం
2. నదీనదులు అడవులు కొండలు, ఎడారులు, సముద్రాలు – రెండవ పాదం
3. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు – మూడవ పాదం
4. ప్రాణము, దృష్టి, శ్రోత్రము – నాల్గవ పాదము

అంటే చరాచర జగత్తంతా, 84 లక్షల రకాలయిన జీవరాశి పరమేశ్వర రూపమే. శ్రీమద్భాగవతంలో చెబుతాడు చూడండి.

**అన్ని రూపులు నీ రూపమైనవాడ**
**ఆదిమధ్యాంతములు లేక అలరువాడ**

ఈ రకంగా పరమేశ్వరుడు చరాచర జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. అన్నింటి యందు అంతర్లీనంగా ఉన్నాడు. జగత్తులోని ప్రతిప్రాణి, ప్రతివస్తువు, ప్రతిజీవి యందు అంతర్యామిగా ఉంటూ వాటిని నియంత్రిస్తున్నాడు. అతడే ఆత్మ. అతడే పరమేశ్వరుడు అటువంటి పరమేశ్వరుణ్ణి మనం పొందాలంటే ఆయన ధరించిన రూపాన్నే మనం అర్చించాలి. నిరాకారాన్ని అర్చించిన వాడు నికారుడవుతాడు. సాకారాన్ని అర్చించిన వాడు సాకారుడవుతాడు. విష్ణువు, ఈశ్వరుడు, శక్తి వంటి దేవతలను ఆరాధించిన వారు మరణానంతరము ఆ దేవతలను చేరి అక్కడ ఉంటారు. విష్ణువును అర్చించేవారు వైకుంఠం ఈశ్వరుణ్ణి అర్చించే వారు కైలాసము, అమ్మవారిని అర్చించే వారు మణిద్వీపం చేరతారు. వారికి పునర్జన్మ ఉండదు. నిరాకారాన్ని అర్చించేవారు నిరాకారులయిపోతారు. అంటే

వీరి జీవాత్మ పరమాత్మలో లీనమయిపోతుంది. వీరికి పునర్జన్మ ఉండదు. ఇదే సాయుజ్యము, పరమపదము, కైవల్యము అంటారు.

ముక్తి అంటే విముక్తి. ఐహికబంధాలనుంచి విముక్తి. అరిషడ్వర్గాలు, నేను నాది అనే అహంకార మమకారాలను వదలినవాడు మాత్రమే ముక్తుడవుతాడు. పరమేశ్వరుడు ఎక్కడ ఉన్నాడు? అంటే, నీలోనే ఉన్నాడు. చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపము. పిపీలికాది బ్రహ్మపర్యంతము అంతా పరమేశ్వరమయమే అని మనోవాక్కాయ కర్మలచే జగత్తులోని అణువణువునా పరమేశ్వరుణ్ణి దర్శించ గలిగినవాడు ముక్తుడు. అతని జీవాత్మ పరమాత్మలో లీనమవుతుంది. అని ఒకరంటే అతడు పరమపదం చేరతాడు. అని ఇంకొకరంటారు. **ఈ రెండింటిలోను జీవికి మరుజన్మ లేదు.**

**వేదంలో ఎక్కడా కూడా అద్వైతము, ద్వైతము, విశిష్టాద్వైతాల గురించి చెప్పలేదు.** సంహిత, బ్రాహ్మణము, అరణ్యకాలలో ఈ మాటే లేదు. ఉపనిషత్తులలోనే సాకారము, నిరాకారము, పరబ్రహ్మ స్వరూపము, మోక్షములను గురించి చెప్పటం జరిగింది. అందుకే **త్రిమతాచార్యులు ఉపనిషత్తులలోని కొన్ని వాక్యాలు తీసుకొని వారికి అనుగుణంగా ద్వైతము అద్వైతము విశిష్టాద్వైతము అని వ్యాఖ్యలు చేశారు.** ఎవరి సిద్ధాంతాలు వారు ప్రచారం చేస్తున్నారు. కాని **మనదేశంలో ఎక్కువమంది అనుసరిస్తున్నది మాత్రం శంకరభగవత్పాదుల వారు ప్రబోధించిన అద్వైత సిద్ధాంతమే.**

# 21. వేదకాలము

ఒకచోట వేదాలమీద ఉపన్యాసం చెబుతూ వేదకాలంలో ఆశ్రమధర్మాలు సజావుగా సాగుతుండేవి. అన్నాను. ఉపన్యాసం అయిపోయిన తరువాత ఒకాయన నా దగ్గరకు వచ్చి “స్వామి! అన్యథా భావించద్దు. వేదకాలము అనేది ప్రత్యేకంగా ఎక్కడాలేదు. అన్నాడు. స్వరం అయితే తక్కువగానే ఉంది. కాని ఆవేశము, కసి బాగా కనిపిస్తున్నాయి అతని మాటల్లో. వేదాన్ని నేను అవమానించాను అనే కోపం అతనిలో తీవ్రంగా కనిపిస్తోంది. పూర్తిగా సనాతనవాది. ఆ సమయంలో నాచుట్టుప్రక్కల పదిమంది ఉన్నారు. ఈ మాటలు అంతా విన్నారు. ఇప్పుడు నేను తప్పు చెప్పటం జరిగిందా? లేకపోతే ఆయనే పొరపాటు పడ్డాడా? ఏదిఏమైనా చుట్టుప్రక్కల వాళ్ళ కందరికీ దానిమీద ఆసక్తి పెరిగిపోయింది. అందులో కొంతమంది ఎవరిది తప్పు? అన్నట్లుగానే చూశారు. అవతలవ్యక్తి వేదపండితుడు. అతనితోపాటు ఇంకా కొంతమందికూడా ఉన్నారు.

అందుకే మీకు ఏదైనా అనుమానం వస్తే విడిగా వచ్చి అడగండి. **సర్వవిదాం సమాజే మౌనం విభూషణం అపండితానాం** అన్నాడు భర్తృహరి తన సుభాషితాల్లో దానికి ఏనుగు లక్ష్మణకవి తెలుగులో

**సర్వవిదులగు సుజనుల సభలలోన**
**మౌనమెభూషణంబు మూఢమానవులకు**

అన్నాడు. కాబట్టి మీ అనుమానాలు, ఎప్పుడూ ఒంటరిగా ఉన్నప్పుడు అడగండి. ఇప్పుడు అసలు ‘వేదకాలము’ అనేది ఉన్నదా? లేదా? అనే విషయం చూద్దాం. వేదకాలము అంటే అదే మీ నీచమైన పదంకాదు. వేదాలను అవమానించే పదం అంతకన్నా కాదు.

సనాతనుల దృష్టిలో వేదకాలము అంటే "వేదాలు ఎవరో చెప్పారు లేదా వ్రాశారు. అలా చెప్పబడిన లేదా వ్రాయబడిన కాలాన్నే వేదకాలము అని ఆధునికులు వక్రభాష్యం చెబుతున్నారు" అని. వేదాలను ఎవరూ వ్రాయలేదు అని సాక్షాత్తు బ్రహ్మముఖం నుంచే వచ్చినాయి. కాబట్టి, వేదకాలము అనేది ప్రత్యేకంగా ఒకటుందని సనాతనులు అంగీకరించరు. ఈ మాట ఎవరైనా అంటే వారిని మ్రింగేసేటట్టుగా చూస్తారు. ఇప్పుడు అదే జరిగింది.

నేనుకూడా సనాతనవాదినే. కాకపోతే ఛాందసుణ్ణి మాత్రం కాదు. వేదాలను అవమానించటం లేదు.

చరిత్రకారుల ప్రకారం ఆస్ట్రియా, హంగేరి ప్రాంతాల నుంచి కొన్ని తెగలవారు మధ్య ఆసియాకు వచ్చి, తరువాత భారతదేశానికి వచ్చారు. వీరినే భారతీయ ఆర్యులు అంటారు. ఇలా వలస వచ్చిన ఆర్యులు మొదటగా సప్తసింధు ప్రాంతానికి వచ్చారు. మనదేశంలో కెల్లా అతిసుందరమైన, సస్యశ్యామలమైన ప్రాంతం. అదే ప్రస్తుత సింధు మైదానము. ఇలా మనదేశానికి వలసవచ్చే సమయంలో వారు ప్రకృతికి భయపడి, దాన్ని ఆరాధిస్తూ కొన్ని స్తోత్రాలు చేశారు. అవే వేదమంత్రాలు. వారు సప్తసింధు ప్రాంతానికి చేరి అక్కడ నివాసం ఏర్పరచుకున్నది తొలివేదకాలం. ఈ కాలంలో ఋగ్వేదం ఒకటే ఉంది. తరువాత ఆ ప్రాంతంనుంచి గంగా పరీవాహక ప్రాంతమంతా విస్తరించారు. ఆ సమయంలోనే యజుర్వేదము, సామవేదము వచ్చినాయి. ఈ కాలాన్ని మలివేదకాలము అన్నారు.

తొలివేదకాలంలో యజ్ఞయాగాది క్రతువులు లేవు. వర్ణవ్యవస్థ లేదు. స్త్రీకి సమాజంలో ఉన్నతమైన స్థానం కల్పించబడింది. సమాజశ్రేయస్సే లక్ష్యంగా ఉంది. కాని మలివేదకాలం వచ్చేసరికి

కొన్ని తేడాలు, సర్దుబాట్లు వచ్చాయి. ఉదాహరణకు తొలివేదకాలంలో భార్య లేనివాడు ఏ రకమైన కార్యక్రమాలు సామాజికపరంగా గాని రాజకీయపరంగా గాని, మతపరంగా గాని చెయ్యటానికి లేదు. కాని మలివేద కాలంలో భార్యలేని రాముడు బంగారు సీతను ప్రక్కన పెట్టుకుని అశ్వమేధయాగం చెయ్యవచ్చు అన్నారు. ఇవన్నీ సర్దుబాట్లే.

మలివేదకాలం చివరలో పురాణాలు, ఇతిహాసాలు రామాయణ మహాభారతాలు వచ్చినాయి.

ఇక్కడ ఇంకొక చిన్న విషయం ఏమంటే ఆర్యులు ప్రపంచంలో చాలాచోట్ల మధ్య ఆసియా, జర్మనీ మొదలైన ప్రాంతాలలో కూడా ఉన్నారు. ఈ కారణంచేతనే మన దేశానికి వచ్చిన వారిని (ఇండోఆర్యన్స్) **"భారతీయ ఆర్యులు"** అంటారు. పర్షియన్ల ప్రధానదేవత అగ్ని. మనకి కూడా ఋగ్వేదంలో రెండవ ప్రధానదేవత అగ్ని. యజుర్వేదంలో ప్రధానదేవత అగ్ని. పర్షియన్లది 'జొరాష్ట్రియన్' మతం వారి పవిత్రగ్రంథం **"జింద్ అవెస్థా"** దీనికి, వేదంలో చెప్పిన కొన్ని విషయాలకు పోలిక ఉన్నది అంటారు.

మనదేశాన్ని పాలించిన వారిలో కొంతమంది రాజులు వేదాన్ని ఆధారంగా చేసుకుని రాజ్యపాలన చేశారు. వారి మతాన్నే వైదికమతం అన్నారు.

వేదభాషకు జర్మనీ, పర్షియన్, లాటిన్ వంటి భాషలకు సంబంధం ఉన్నది అంటారు పండితులు. ఎవరు ఔనన్నా, ఎవరు కాదన్నా, ఎవరికి కోపం వచ్చినా చరిత్ర మాత్రం మారదు. ఇది కఠోరమైన సత్యం. వేదమంత్రాలు చెప్పబడిన లేదా దర్శించబడిన కాలమే వేదకాలము.

రామాయణకాలంలోను, భారతకాలంలోను అంటే కృతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగాల వరకు వైదిక మతం బాగా వ్యాప్తిలో

ఉంది. ఆ రోజులలో యజ్ఞయాగాది క్రతువులు, ఆధ్యాత్మిక చర్చలు బాగా జరుగుతుండేవి. అయితే చరిత్రకారులు ఈ కాలాన్ని మళ్ళీ రెండుగా విభజించారు. తొలివేదకాలము, మలివేద కాలము. ఇందులో అతిప్రాచీనమైన కాలాన్ని తొలి వేదకాలము అన్నారు. ఈ కాలంలో సమాజంలో స్త్రీకి సమున్నతమైన స్థానం ఉండేది. మలివేదకాలం వచ్చేసరికి స్త్రీ పట్ల కొంచెం చిన్నచూపు, వివక్షత చూపటం జరిగి క్రమేపీ అది పెరిగిపోయింది. ఉదాహరణకు రామాయణకాలంలో సతీసహగమనం లేదు. దశరధుడు పాండురాజు మరణించినప్పుడు ఆయన భార్యలు ఎవరూ సహగమనం చెయ్యలా? భారతకాలం వచ్చేసరికి శంతనుడు మరణించినా అతని భార్య సత్యవతి సహగమనం చెయ్యలా. విచిత్రవీర్యుడు మరణించినప్పుడు అతని భార్యలు అంబిక, అంబాలికలు సహగమనం చెయ్యలా. తరువాత కాలంలో వారికి పుట్టిన సంతానమే దృతరాష్ట్రుడు, పాండురాజు మరణించినప్పుడు కూడా కుంతిసహగమనం చెయ్యలా. మాద్రి సహగమనం చేసింది. అంటే అప్పుడది ఐచ్ఛికం. ఆ తరువాత కాలంలో సహగమనము నిర్బంధమైంది.

ఈ రకంగా వేదకాలమంటే వేదమంత్రాలు ఋషులచేత దర్శించబడిన కాలము. వేదమంత్రాలు చెప్పబడిన కాలము. వేదాలను ప్రమాణంగా తీసుకుని పాలించిన కాలాన్ని, వైదికమతం ప్రచారంలో ఉన్న కాలము అంటారు. మనకి చేరువగా ఉన్న పల్లవులు, చోళాలుకూడా వైదిక మతావలంబులే.

# 22. వాస్తు మూఢాచారమా?

మొన్న ఒకాయన నా దగ్గరకు వచ్చి ఇదేమాట అడిగాడు "వాస్తు మూఢాచారమా? మూఢనమ్మకమా? అసలు వేదంలో వాస్తు గురించి ఏం చెప్పారు?" అని ఇప్పుడు మనం వాస్తుని గురించి చూద్దాం.

వాస్తుంటే అది ఒక శాస్త్రం. ఖచ్చితంగా చెప్పాలంటే 'ఇంజనీరింగ్' అన్న మాట. వాస్తు అనేది అనాదిగా ఉన్నదే. ఇవాళ్టి రోజున క్రొత్తగా రాలేదు. వేదకాలంలో కూడా వాస్తు ఉన్నది అని మనం ఖచ్చితంగా చెప్పవచ్చు. ఈ జగత్తు ఎలా ఉత్పత్తి అయింది? అన్నప్పుడు వడ్రంగులు మొదలైన వారందరూచేరి జగత్తును నిర్మించారు. అని ఋగ్వేదంలో చెప్పబడింది. ఇంద్రుడు, విష్ణువు భూమికి సంబంధించిన కొలతలు ప్రారంభించారని కూడా చెప్పబడింది. అలాగే త్వష్ట దేవతల శిల్పి, వడ్రంగి అని చెప్పబడింది. సుధన్వుని కుమారులైన ఋభువులు కూడా వడ్రంగులే.

పురాణాలు, ఇతిహాసాలలో వాస్తు గురించి చెప్పబడింది. రామాయణ కాలంలో కుబేరుడి కోరిక మీద విశ్వకర్మ లంకానగరాన్ని నిర్మించాడు. అలాగే నగరంలో అనేక భవనాలున్నాయి. రాజప్రాసాదాలు, అధికారులభవనాలు, సామాన్యుల భవనాలు, ఆలయాలు. ఒక భవనాన్ని చూడగానే ఇది రాజభవనము, మంత్రిగారు ఉండే భవనము అని తెలియాలి. దానికి అనుగుణంగానే భవననిర్మాణం జరుగుతుంది. అలాగే తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం. నాలుగు దిక్కులు. ఇంటికి సింహద్వారం ఎటు ఉండాలి? అన్నప్పుడు తూర్పుగాని, పడమర గాని ఉండాలి అన్నారు. ఇలా అయితే సూర్యకిరణాలు సరాసరి ఇంట్లో పడతాయి. క్రిమికీటకాలు నశిస్తాయి. భవనంలో కిటికీలు ఒకదానికి ఎదురుగా ఒకటి ఉండాలి

అన్నారు. గాలి ఇల్లంతా ప్రసరిస్తుంది కాబట్టే అలా చెప్పారు. శాస్త్రము అంటే సైన్సు. మనం చెప్పుకునే శాస్త్రాలన్నీ విజ్ఞానశాస్త్రంలోని భాగాలే. ఇంటిముందు వెనక నాలుగువైపులా ఖాళీ ఉండాలి అన్నారు. సైన్సుకూడా దీన్ని ఒప్పుకుంటుంది.

మహాభారతంలో కూడా వాస్తు గురించి చెప్పబడింది. మయుడు రాక్షసశిల్పి. శ్రీకృష్ణుని ఆజ్ఞమేరకు బిందుసరం దగ్గర 14 నెలలు కష్టపడి ఒక సభా భవనాన్ని నిర్మించి, ఎనిమిదివేలమంది రాక్షస భటులతో మోయించి తెచ్చి దాన్ని ధర్మరాజుకు కానుకగా ఇచ్చాడు. ఇదంతా వాస్తుచాతుర్యం. ఈ సభాభవన నిర్మాణంలో అనేక రకాలయిన మణులు, రత్నాలు, వెండి, బంగారం విరివిగా వాడారు. ఉన్నవి లేనట్లుగా, లేనివి ఉన్నట్లుగా అనిపించేందుకు కొన్ని యంత్రాలు కూడా వాడారు. ఇదే మయసభ. తారకాసురుని కుమారులు బ్రహ్మను గురించి తపస్సు చేసి, ఆయన్ని మెప్పించి కామగమనం కల మూడుపురాలు నిర్మించుకున్నారు. ఇవే త్రిపురాలు. వారే త్రిపురాసురులు.

పరమేశ్వరి కోరిక మీద ఈశ్వరుడు ఇంతవరకు లోకంలో ఎక్కడా లేని విధంగా అందమైన, నిరాధారమైన లోకాన్ని నిర్మించిఇచ్చాడు. అదే మణిద్వీపము.

ఇవన్నీ వాస్తుశాస్త్రం ప్రకారమే నిర్మించటం జరిగింది. మనదేశంలో ఈ రోజున కూడా వాస్తుకు చాలా ప్రాముఖ్యత ఉన్నది. ఇల్లు కట్టుకునే వారు ఎవరైనా సరే వాస్తు ప్రకారమే కడతారు. ఇందులో సందేహం లేదు. అయితే వాస్తులో రకాలున్నాయి. ఎవరి వాస్తు వారిది.

అయితే వాస్తు మూఢనమ్మకమా? అనేది ప్రశ్న. గతంలోనే చెప్పుకున్నాం వాస్తు అంటే 'ఇంజనీరింగ్' అని. అలాటప్పుడు ఇంజనీరింగ్ మూఢాచారము ఎందుకవుతుంది? ఇంట్లోకి గాలి

వెలుతురు బాగారావాలి అనుకోవటం మూఢాచారం కాదు కదా? ఇల్లు అందంగా, ఆకర్షణీయంగా కనిపించాలనుకోవటం మూఢాచారం కాదు కదా !

ఇవాల్టి రోజున వాస్తుసిద్ధాంతులు కొంతమంది ఒకరకంగా చెబితే, కొంతమంది ఇంకోరకంగా చెబుతారు. దాంతో మనం గందరగోళం ఎదుర్కొంటున్నాం. అసలు శాస్త్రంలోనే లోపం ఉన్నది అనుకుంటున్నాం. ఇది శాస్త్రంలో లోపంకాదు, చెప్పేవాడిలో లోపం. చెప్పేవాడు సరిగా చెప్పనంత మాత్రంచేత శాస్త్రంతప్పుకాదు. వాస్తులో ఎన్ని రకాలున్నా, ప్రధానమైన సూత్రాలు ఒకటే.

కాబట్టి ఎవరైనా సరే ప్రధానమైన సూత్రాల వరకు అంటే గాలి వెలుతురు బాగా ఉన్నాయా? గదులు విశాలంగా మనం ఉండటానికి అనుకూలంగా ఉన్నాయా? సూర్యరశ్మి ఇంట్లోకి వస్తోందా లేదా? ఇలాటి విషయాల వరకు ప్రతివారు ఖచ్చితంగా చూసుకోవాలి. ఆ తరువాత విషయాలు మీ నమ్మకము, సంప్రదాయము, అనుభవాలనుపట్టి ఏర్పాటు చేసుకోండి.

ఇల్లుకట్టటానికి ముందే వాస్తు కావాలా అక్కర్లేదా అనేది నిర్ణయించుకోండి. కావాలి అంటే అది ఎలా కావాలో కూడా ఖచ్చితంగా తేల్చుకోండి. అంతవరకే. తరువాత కలిసి రాలేదనో, ఇంకొకటి అనో మార్పులు చెయ్యకండి. **మీకు నచ్చిన వాస్తు ఇంకొకరికి నచ్చాలని ఏమీలేదు. కాబట్టి అతిచాదస్తానికి పోయి ధనం వృధా చేసుకోకండి.**

# 23. స్త్రీలకు కూడా స్వర్గం ఉంటుందా?

లోకంలో గొప్ప గొప్ప పనులు చేసిన వారందరూ స్వర్గానికి పోతారు. గొప్ప పనులు అంటే దానధర్మాలు చేసినవారు, బావులు, చెరువులు త్రవ్వించటం, చెట్లు నాటించటం, సత్రాలు కట్టించటం, అన్నదానం చెయ్యటం, పేదలకు వస్త్రదానం, బీదవిద్యార్థులకు స్కూలుఫీజులు కట్టటం, చదువుకునేందుకు పుస్తకాలుకొనివ్వటం, వృద్ధాశ్రమాలు, అనాథాశ్రమాలు నిర్వహించటం, ఉచితవైద్యసేవలు అందించటం, దేశంకోసం పాటుపడటం, పదిమంది కోసం ప్రాణత్యాగాలు చెయ్యటం వంటి పనులు చేసిన వారందరూ స్వర్గానికి పోతారు. అదే దుర్మార్గమైన పనులు చేసిన వారు, దొంగతనాలు, దోపిడీలు, హత్యలు, మానభంగము వంటి పనులు చేసినవారు నరకానికి పోతారు. అయితే స్వర్గ నరకాల్లో వీరు ఎంతకాలం ఉంటారు? అనేది ప్రశ్న. వారు చేసిన పనిని బట్టి వారు స్వర్గంలో ఉండే కాలము నిర్ణయించబడుతుంది. నేరం చేసినప్పుడు శిక్ష నిర్ణయించినట్లుగానే ఇక్కడ కూడా ఈ పని చేసినవారు ఇంత కాలంపాటు స్వర్గం లేదా నరకంలో ఉంటారు అంటున్నాయి పురాణాలు. దీనికి అందరికీ అర్థం అయ్యే రీతిలో సాధారణ నియమము ఏమంటే – మనం చేసిన పని గురించి ఎంత కాలమైతే భూలోకంలోని ప్రజలు చెప్పుకుంటారో, అంత కాలం అతడు స్వర్గ నరకాలు అనుభవిస్తాడు. ఉదాహరణకు మనం బాటసారుల కోసం ఒక సత్రము కట్టించాం. బాటసారులు అందులో విశ్రాంతి తీసుకుంటున్నారు. మనం మరణించి, చేసిన మంచి పనికిగాను స్వర్గానికి పోతాం. ఈ లోకంలో ఎంత కాలమైతే మనం కట్టించిన సత్రము ఉపయోగంలో ఉంటుందో,

ఒకవేళ అది లేకపోయినా, ఎంత కాలమైతే ఆ సత్రము గురించి చెప్పుకుంటారో, అంత కాలము అతడు స్వర్గంలో ఉంటాడు. అశోకచక్రవర్తి లాంటి వారిని గురించి ఇవాళ కూడా చాలా గొప్పగా చెప్పుకుంటున్నాం. అంటే ఆయన మరణించి ఇంత కాలమైనా ఇంకా ఆయన స్వర్గంలోనే ఉన్నాడు. మహాభారతంలోని సత్యవ్రత మహారాజు ఇందుకు చక్కని ఉదాహరణ. ఆయన రాజ్యం చేసిన కాలంలో అనేక యజ్ఞాలు, యాగాలు చేశాడు. మరణించిన తరువాత స్వర్గానికి పోయాడు. చాలా కాలం తరువాత 'నీ పుణ్యఫలం అయిపోయింది. ఇక ఇక్కడి నుంచి వెళ్ళిపో' అన్నాడు ఇంద్రుడు. తన పుణ్యఫలం పూర్తికాలేదు. అని భూలోకానికి వెళ్ళి ఇంకా తను చేసిన మంచి పనులను గురించి అక్కడ చెప్పుకుంటున్నారు అని ఋజువు చేసి, మళ్ళీ స్వర్గానికి తిరిగి వెళ్ళాడు.

నరకబాధలు కూడా అంతే. మనం చేసిన చెడుపనుల వల్ల ఇతరులు ఈ లోకంలో ఎంతకాలం బాధలు అనుభవిస్తారో, అంత కాలం మనం నరకంలోనే ఉంటాం.

ఇక్కడ ఇంకో విచిత్రం ఏమంటే స్వర్గలోకంలో శాశ్వత సభ్యత్వం కూడా ఉంటుంది. విశ్వజిద్యాగము, అగ్నిచయనము వంటి కర్మలు చేసిన వారు శాశ్వతంగా స్వర్గలోకంలోనే ఉంటారు. కఠోపనిషత్తులో ఈ విషయం యముడు నచికేతుడికి చెబుతాడు. ఆ రకమైన కర్మలు చేసేటప్పుడు **"శాశ్వత స్వర్గలోక సిద్ధ్యర్థం"** అని సంకల్పం కూడా చెప్పటం జరుగుతుంది.

అసలింతకీ స్వర్గంలో ఏముంటుంది? పురాణాలలో చెప్పినదాని ప్రకారం స్వర్గంలో ఆకలి దప్పికలుండవు. కష్టాలు, దుఃఖము ఉండవు. ప్రశాంతమైన వాతావరణం. నిరంతర ఆనందం మాత్రమే ఉంటాయి.

రంభ, ఊర్వశి లాంటి అప్సరాంగనలు కొన్నివేల మంది ఉంటారక్కడ. వారు నిరంతరము తమ ఆటపాటలతో స్వర్గంలో ఉన్న వారిని సంతోషపరుస్తూ ఉంటారు. అందుకే చాలామందికి భగవంతుడి మీద కన్న స్వర్గసుఖాల మీద, అక్కడ ఉండే అప్సరాంగనల మీద మక్కువ ఎక్కువ. ఇక్కడ ఒక చిన్న ఉదాహరణ. పూర్వకాలంలో ఒక బ్రాహ్మణుడు కఠోరమైన నియమాలతో తపస్సు చేస్తున్నాడు. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకో అన్నాడు. అప్పుడు ఆ తపస్వి చిరుకోపంతో "స్వామీ! నువు వెళ్ళిపోయి నాకు రంభని పంపించు" అన్నాడట. ఈ రకంగా స్వర్గసుఖాల కోసం యజ్ఞయాగాలు చేసిన వారు చాలామంది ఉన్నారు కఠోపనిషత్తులోని నచికేతుని తండ్రి గౌతముడు చేసిన విశ్వజిద్ యాగము కూడా అలాంటిదే.

ఇక ఇప్పుడు ప్రశ్నఏమంటే స్త్రీలు కూడా స్వర్గానికి వెడతారా? ఇందులో సందేహం ఏ మాత్రం అవసరం లేదు. పుణ్యకార్యాలు చేసినవారందరూ తప్పనిసరిగా స్వర్గానికి చేరతారు. వీరు మనుషులే కానవసరం లేదు. పశుపక్ష్యాదులు కూడా స్వర్గం చేరతాయి. దేవీభాగవతంలో ఒక కథ ఉన్నది. హిమాలయ పర్వతాల నుంచి ఒక చాతక పక్షి ఆహారం వెతుక్కుంటూ కాశీనగరానికి వచ్చింది. ఆహారం కోసం గుడిచుట్టూ ఉదయం నుంచీ సాయంత్రం దాకా తిరిగింది. ఆ రోజున ఏ ఆహారము దొరకలా. చివరకు అలాగే అది మరణించింది. ఆ రోజు శివరాత్రి తెలియకుండానే ఉపవాసం ఉండి గుడిచుట్టూ ప్రదక్షిణాలు చేసి ఆలయంలోనే మరణించింది. కాబట్టి స్వర్గానికి పోయి మరుజన్మలో కాశీరాజుగా జన్మించింది. కాబట్టి మంచి పనులు చెయ్యటానికి, స్వర్గనరకాలు పొందటానికి స్త్రీ పురుష పశుపక్ష్యాదుల భేదం ఏదీ లేదు. ఎవరైనా స్వర్గానికి పోతారు. గోదానం చేసినవాడు

వైతరణిని తేలికగా దాటతాడు అన్నారు. మా మామగారు పోయిన పదిసంవత్సరాలకి, మా అత్తగారు గోదానం చేసింది. శాస్త్రప్రకారం ఆవిడ కూడ వైతరణిని తేలికగానే దాటుతుంది కదా. నిరతాన్నదానం చేసినవారు స్వర్గం చేరతారు. మనకు తెలిసిన వారిలో 'డొక్కా సీతమ్మగారు'. ఏ సమయంలో వెళ్ళినా వంటచేసి మరీ భోజనం పెట్టేవారట. ఆవిడ మాత్రం స్వర్గానికి వెళ్ళకుండా ఎందుకుంటుంది? భర్తచేసిన పుణ్యకార్యాలలో సగం ఫలితం భార్యకి కూడా వస్తుంది. కాబట్టి ఆవిడ స్వర్గం చేరుతుంది. మహాభారతంలో స్వర్గారోహణ పర్వంలో ద్రౌపది కూడా స్వర్గానికి బయలుదేరి వెళ్ళింది కదా?

మరి స్త్రీలకు కూడా స్వర్గమున్నది అని ఎందుకు చెప్పలేదు. అంటే ఇక్కడ కొన్ని అభ్యంతరకరమైన విషయాలున్నాయి. స్వర్గానికి పోయిన వాడు అప్సరాంగనలతో కాలం గడుపుతాడు. అన్నారు. ఒక స్త్రీ విషయంలో అలా చెప్పటం సమంజసం కాదు కాబట్టి ఊరుకున్నారు. అంతేకాని మంచి పనులు చేసిన స్త్రీలకు కూడా తప్పనిసరిగా స్వర్గం వస్తుందనటంలో సందేహం లేదు. ఇక్కడ ఒక చిన్న ఉదాహరణ.

ఒకసారి ఒక పండితుడు తానొక్కడే ఒక క్రతువు చెయ్యటం ప్రారంభించాడు. అతని భార్య అడిగింది 'ఈ క్రతువు చేస్తే ఏం జరుగుతుంది?' ఈ క్రతువు చేస్తే స్వర్గం వస్తుంది. అన్నాడు భర్త. 'అయితే నేను కూడా చేస్తాను' అన్నది భార్య. అప్పుడు భర్త "ఓసి పిచ్చిదానా! నేను స్వర్గానికి పోయి రంభాది అప్సరసలలో హాయిగా కాలక్షేపం చేస్తాను. అక్కడి కొచ్చి నువ్వేం చేస్తావే" అన్నాడు.

ఆ మాటలు విన్న భార్య చాలా అమాయకంగా "అక్కడ మన్మధుడు, నలకూబరుడు లాంటి వాళ్ళుకూడా ఉంటారట కదా! మా బామ్మ చెప్పింది" అన్నది.

ఇక్కడ చూడండి ఎంత విపరీతమైన అర్థం వస్తోందో. అందుకే స్త్రీల స్వర్గం గురించి ఎక్కడా మాట్లాడలేదు. స్వర్గం అంటే అప్సరాంగనలే కాదు. అది ఆకలి దప్పికలు, కష్టాలు, దుఃఖము లేని స్థితి ఆనందస్థితి. కాబట్టి మంచి పనులు చేసిన స్త్రీలు కూడా తప్పనిసరిగా స్వర్గానికి పోతారు. ఇందులో సందేహం లేదు.

పూర్వకాలంలో ద్రవిడ దేశంలో ఒక స్త్రీ ఉండేది. ఆవిడకి వివాహమైన కొద్దిరోజులకే భర్త మరణించాడు. సంతానం లేదు. బంధువులు లేరు. ధనం లేదు. దాంతో సంపన్నుల ఇంట్లో దాసిగా ఉండి జీవితం వెళ్ళబుచ్చుతోంది. వారిచ్చే ధనం జాగ్రత్త చేసుకుంటూ, దాన్ని వడ్డీకి త్రిప్పుతూ, దొంగసొమ్ము అతిచౌకగా కొని, ఎక్కువధరకు అమ్మి ధనం కూడబెట్టింది. ఎప్పుడూ ఎవరికీ దానధర్మాలు చేసి ఎరగదు. భగవధ్యానము అంటే ఏమిటో తెలియదు. ఒకరోజున ఒక బ్రాహ్మణుడు ఈమె గురించి తెలిసి, ఆవిడ దగ్గరకు వచ్చి జీవితం బుద్బుదప్రాయమని, ఎంత సంపాదించినా, అవేవీ మనతో రావని, కాబట్టి పుణ్యకర్మలు చెయ్యవలసింది అని హితబోధ చేశాడు. దాంతో ఆ స్త్రీ కార్తీకమాసంలో ఉదయమే నదీస్నానం చేసి, శివాలయంలో దీపారాధన చేసి ప్రతిరోజు దీపదానం ఇచ్చింది. దాని ఫలితంగా మరణానంతరము మోక్షం పొందింది.

ఈ కథ కార్తీక పురాణంలో ఉన్నది. మనం పురాణాలు గనక చూసినట్లైతే ఇలాటివారు అనేకమంది కనిపిస్తారు. మీరాబాయి, సక్కుబాయి, శబరి వంటి పుణ్యస్త్రీలు అనేకమంది మోక్షం పొందారు. కార్తీకమాసంలో ప్రతిరోజు శివాలయంలో దీపారాధన చేసిన 'పోలి' స్వర్గానికి పోయింది. ఈ రోజున కూడా కార్తీకమాసం అమావాస్య వెళ్ళిన మరునాడు మన స్త్రీలు పోలిని స్వర్గానికి పంపుతారు. అది

పెద్ద ఉత్సవంలాగా చేస్తారు. అరటిదొప్పలలో తెల్లవారుఝామునే దీపాలు వెలిగించి నదిలో వదుల్తారు. ఇలా పురాణాలు, భక్తుల కథలు చూస్తే స్వర్గానికి పోవటమే కాదు, అంతకన్న ఎక్కువదైన మోక్షం పొందిన స్త్రీలు చాలామంది ఉన్నారు.

ఇవన్నీ పురాణాలు కదా అనుకుంటారేమో? వేదంలోని విషయాలు పామర జనానికి తేలికగా అర్థం కావాలనే ఉద్దేశ్యంతోనే పురాణాలు వ్రాశారు. పురాణాలలో చెప్పిన విషయాలన్నీ వేదసమ్మతాలే. అందుకే వేదానికి అర్థం చెప్పాలంటే పురాణాలను కూడా లెక్కలోకి తీసుకోవాలి అని చెప్పాడు సాయణాచార్యుడు.

ఈ రకంగా **అనేకమంది స్త్రీలు గతంలో స్వర్గము, మోక్షము పొందారు. కాబట్టి స్త్రీలకు స్వర్గం ఉంటుందా అనే అనుమానం అణుమాత్రంకూడా అవసరం లేదు.**

# 24. యజ్ఞాలు వామాచారమా?

యజ్ఞాలు వామాచారమా? అనే విషయాన్ని చూసే ముందు అసలు వామాచారము అంటే ఏమిటో చూద్దాం. వామాచారము అనే పదం శాక్తేయానికి సంబందించినది. శాక్తేయము అంటే పరమేశ్వరుణ్ణి శక్తిస్వరూపంగా ఆరాధించటం.

**అర్చనం ద్వివిధం చైవ వామదక్షిణ భేదతః**
**వామేనవా దక్షిణేన పూజనంతు యధా రుచిః**

శక్తిని అంటే అమ్మవారిని రెండు రకాలుగా అర్చించవచ్చును. 1. వామాచారము 2.దక్షిణాచారము. ఈ రెండు మార్గాలలోను ఏ రకంగా అర్చించినా దేవి సంతసిస్తుంది అని చెబుతున్నాయి శాక్తేయ గ్రంథాలు. క్షీరసాగర మధనం జరిగినప్పుడు దేవతలు అనుసరించినది దక్షిణాచారము. రాక్షసులు అనుసరించినది వామాచారము. దక్షిణాచారము అంటే వైదికసంప్రదాయం వేదాలలో చెప్పినవిధంగా దేవిని అర్చించటం. వేదంలో 1. అపర 2. పర అని రెండు రకాలు విద్యలు చెప్పబడినాయి. కాబట్టి దక్షిణాచారంలో ఈ రెండు రకాల అర్చనలు ఉంటాయి. ఇందులో అపరావిద్యనే కౌళాచారము అంటారు. ఈ లోకంలో కావలసిన సిరిసంపదలు, భోగభాగ్యాలు, పదవులు, గౌరవము, కీర్తి, ప్రతిష్ట వంటి వాటికోసం ఈ రకమైన అర్చన చెయ్యటం జరుగుతుంది. ఇక రెండోది పరావిద్య. దీన్నే సమయాచారము అంటారు. ఇది మోక్షవిద్య. మోక్షగాములైన వారందరూ కూడా శివశక్తులు ఇద్దరూ ఒకటే. వారి మధ్య భేదం లేదు అని నమ్ముతారు. వీరు అనుసరించే మార్గాన్నే సమయాచారము అంటారు. సమయుడు అంటే శివుడు. సమయమంటే శక్తి. వీరిద్దరికి తేడాలేదు. వీరికి ఐదురకాల సామ్యము (పోలిక) ఉన్నది అంటారు. అవి

1. అధిష్టాన సామ్యము – శివశక్తులు ఇద్దరూ ఒకే స్థానాన్ని అధిష్టించి ఉండటము.
2. అనుష్టాన సామ్యము – ఇద్దరూ ఒకే పనిలో నిమగ్నమై ఉండటము.
3. అవస్థాసామ్యము – ఇద్దరూ ఒకే అవస్థలో నిమగ్నమై ఉండటము.
4. రూపసామ్యము – ఇద్దరూ ఒకే రూపంలో ఉండటము.
5. నామసామ్యము – ఇద్దరిపేర్లు ఒకే రకంగా ఉండటము.

పరమేశ్వరుడు అంటే శివశక్తుల స్వరూపము. అంతేకాని కేవలము పురుషాకారము కాదు. అలా అని స్త్రీరూపము కాదు. ఉమామహేశ్వరులు, లక్ష్మీనారాయణులు, సీతారాములు. స్త్రీ పురుషులు ఇద్దరూ కలిసినదే పూర్ణపురుషుని రూపము. అదే పరమేశ్వర స్వరూపము. సమయాచారంలో ప్రధానమైనది అంతరారాధన.

అపరావిద్య అంటే ఇదే కౌళాచారము. భగవంతుడు వేరు భక్తుడు వేరు అని భావన చేసి భగవంతుడి రూపాన్ని అర్చించటం. ఇది బాహ్యపూజ. వీరికి మోక్షంతో పనిలేదు. వారి కోరికలు తీరితే చాలు.

ఇక వామాచారము అంటే – అపసవ్య మార్గం. ఇదికూడా బాహ్యపూజే. మనకి ఏవైతే ఇష్టమో, అవే భగవంతుడికి కూడా ఇష్టము అని భావించి నివేదన చేస్తుంటారు. వీరు మద్యము, మాంసము వంటి పదార్థాలు భగవంతుడికి నివేదన చేస్తారు. 2011 డిసెంబరు 2, 3 తారీకులలో మైసూరులో శ్రీవిద్య మీద అంతర్జాతీయ సదస్సు జరిగింది. దానికి నేను ప్రత్యేకఅతిథిగా వెళ్ళటం జరిగింది. అక్కడికి భూటాన్ నుంచి ఒక తాంత్రికుడు వచ్చాడు. నల్లని బట్టలు ధరించాడు. చేతిలో త్రిశూలము. మెడలో పుర్రెలమాల. ముఖాన నల్లని అర్ధచంద్రకారము

తిరగేసిన పెద్ద బొట్టు. వెనకాల నలుగురు ఆడశిష్యులు. ఈయన పూజావిధానం ఏమిటంటే ప్రతిరోజు శ్రీచక్రానికి మద్యంతో అభిషేకంచెయ్యటం. మాంసనివేదన. ఇది వామాచారము. వీరు భగవంతుడికి బలులు కూడా సమర్పిస్తుంటారు.

మొన్న ఒక పెద్దాయన నాదగ్గరకు వచ్చి "దేవుడికి బలి ఇవ్వటమనేది వామాచార సంప్రదాయం కదా! యజ్ఞంలో అనేక రకాల జంతువులను బలి ఇస్తున్నారు. అశ్వమేధం లాంటి యాగంలో కొన్నివందల పశువులు చంపబడుతున్నాయి అంటున్నారు. నరమేదంలో 150 మంది దాకా మనషులు బలి ఇవ్వబడుతున్నారు. గోమేధంలో ఆవులు చంపబడుతున్నాయి. మనం ఒకటి రెండు కోళ్ళు, గొర్రెలు లాంటివి చంపితేనే వామాచారము అంటున్నాం. మరి ఇన్ని వందల జీవులు చంపబడే యజ్ఞాలు, యాగాలు కూడా వామాచారమే కదా?" అని అడిగాడు.

ఇక్కడ ఒక్క విషయం గమనించాలి. వామాచారము అనేది శాక్తేయ సంప్రదాయం. కాని యజ్ఞయాగాలు శాక్తేయం కాదు. అయితే ఇక్కడ జీవుల్ని మనుషులతో సహా చంపటం ఒక్కటే సారూప్యత. కాని ఇక్కడ గుర్తించాల్సింది ఏమంటే యజ్ఞయాగాలు లోకకళ్యాణం కోసం చేస్తారు. దేశంలో వర్షాలు పడాలని, పంటలు బాగా పండాలనీ చేసేవి. స్వార్ధంతో చేసేవి వామాచారంలో పూజలు. ఈ రెండూ ఒకటి ఎలా అవుతాయి? గ్రామం కోసం ఒక వ్యక్తిని, దేశం కోసం – ఒక గ్రామాన్ని బలిపెట్టినా తప్పుకాదు. అది ధర్మమే అవుతుంది.

మన కాలికి ఏదో వ్యాధి సోకింది. కాలు చచ్చుబడిపోయింది. దానివల్ల మిగిలిన శరీరానికి కూడా ప్రమాదమున్నది. అటువంటప్పుడు ఆ కాలు అంతవరకు నరికెయ్యాలి తప్పదు. అది తప్పుకాదు. యజ్ఞంలో

ఇచ్చే పశుబలి లోకకళ్యాణం కోసం కాబట్టి దాన్ని తప్పు పట్టరాదు. కాని వామాచారం అలా కాదు.

ఈ విషయాలను దృష్టిలో పెట్టుకుంటే **యజ్ఞాలు వామాచారం కాదు. వేదాలు వామాచారాన్ని సమర్ధించవు.**

# 25. వామాచారం చెయ్యవచ్చా?

మొన్న ఒక పెద్దాయన నా దగ్గరకు వచ్చి "స్వామీ! నాది ఒక చిన్న అనుమానం. వామాచార సంప్రదాయం మనం పాటించవచ్చా? అది తేలికగా సిద్ధిస్తుందట కదా?" అని అడిగాడు. ఈ అనుమానం ఆయనకే కాదు. చాలామందికి ఉంటుంది. అందుకే దీన్నిగురించి చూద్దాం.

**అర్చనం ద్వివిధం చైవ వామదక్షిణ భేదతః**

**వామేన వా దక్షిణేన పూనంతు యధారుచిః ॥**

భగవంతుడి అర్చనా విధానము రెండు రకాలుగా ఉన్నది. వామాచారము, దక్షిణాచారము. భక్తులు వారికి ఇష్టమైన దాన్ని పాటించవచ్చును.

అసలు వామాచారము, దక్షిణాచారము అంటే ఏమిటో చూద్దాం. మనకి తేలికగా తెలియాలంటే క్షీరసాగరమధనం జరిగేటప్పుడు దేవతలు పాటించింది దక్షిణాచారము. రాక్షసులది వామాచారము వైదిక పద్ధతిలో నడిచేది దక్షిణాచారము. అవైదికము వామాచారము. దక్షిణాచారము మళ్ళీ రెండు రకాలుగా ఉంటుంది. 1. సమయాచారము. ఇది మోక్షగాములైన వారు అనుసరించే మార్గము. 2. కౌళాచారము. లౌకికమైన కోరికల కోసం పాటించే ఆచారము.

కౌళాచారము అంటే ఈ లోకంలో కావలసిన కోరికలు సిరిసంపదలు, భోగభాగ్యాలు, పదవులు, ఇష్టార్థప్రాప్తి వీటికోసం పాటించే ఆచారము, చేసే కర్మలు. ఇదంతా అపరావిద్య. కాగా సమయాచారము పరావిద్య. ఈ లోకంలో ప్రతిమానవుడు సుఖమయ జీవితం గడపాలనే అనుకుంటాడు. వాటిని సాధించుకోవటానికి

పూజలు, అర్చనలు, యాగాలు, హోమాలు చేస్తాడు.

మరి వామాచారము అంటే ఏమిటి? ఇదికూడా అపరావిద్యే. అంటే ఐహికమైన కోరికలు తీరటంకోసం చేసే ప్రక్రియ. కాకపోతే క్రియావిధానంలో కొంచెం తేడా అంతే. మానవుడు తాను దేనివల్లయితే సుఖాలు పొందుతాడో, దానివల్లనే దేవతకూడా సుఖిస్తుందని, ఆనందిస్తుందని, సంతోషిస్తుందని వారి నమ్మకం. అందుకే తమకు ఇష్టమైన పదార్ధాలు భగవంతుడికి నివేదన చేస్తారు వామాచారంలో. భగవంతుడికి మధ్యంతో అభిషేకం చేస్తారు. మద్యము, మాంసము నివేదన చేస్తారు. బలులు ఇస్తారు. రక్తంతో తడిపిన అన్నపు ముద్దలతో హోమం చేస్తారు.

ఇక్కడ ఒక విషయం గుర్తు తెచ్చుకోండి. ఇది యధార్ధ సంఘటన. సుమారు రెండు సంవత్సరాల క్రితం ఈనాడు పేపరులో వచ్చిన వార్త. హైదరాబాదులోని ప్రత్యంగిరా దేవాలయంలో డి.జి.పి. దినేష్ రెడ్డి గారిమీద ఏవో ప్రయోగాలు చేస్తూ, ఆలయంలో అర్ధరాత్రి సమయంలో మద్య మాంసాలతో హోమాలు చేస్తున్నారు అని ఈ విషయం మీద రెడ్డిగారికే రిపోర్టు చెయ్యటం జరిగిందని, దానిమీద వారు సమగ్ర విచారణకు ఆదేశించారనేది విషయం. తరువాత ఏం జరిగిందీ వార్త లేదు. ఇందులో నిజానిజాలు, సాధ్యాసాధ్యాలు ఎంత వరకు ఉన్నప్పటికీ, ఆలయం చుట్టుప్రక్కల ఉన్నవాళ్ళు కొందరు ముందుకు వచ్చి అర్ధరాత్రి హోమాలు జరుగుతుంటాయని, హోమంలో రక్తము, మాంసము, మద్యము కూడా వాడుతుంటారని చెప్పారు.

ఇదంతా వామాచార పద్ధతి. రాక్షసులు రాత్రించరులు. అందుకే వారు ఇలాంటి పనులు చేస్తారు. పశుబలులు ఇస్తారు. కొన్నిచోట్ల నరబలికూడా ఇవ్వటం జరుగుతుంది. మనం కొన్ని వార్తలు

వింటుంటాం. నేలలో ఉన్న నిధిని బయటకు తియ్యటం కోసం బలులు ఇస్తున్నారని, కొన్ని సమయాల్లో నరబలి కూడా ఇచ్చారని పేపర్లో వార్త వస్తుంటుంది. కొన్ని సంవత్సరాల క్రితం హైదరాబాదు జంతు ప్రదర్శన శాలలో ఉన్న వయసుకువచ్చిన ఆడపులిని చంపేసి, దాని చర్మం తీసుకుని వెళ్ళిపోయారు. దీనిమీద ప్రభుత్వం సీనియర్ ఐ.ఎ.ఎస్. ఆఫీసరు ఎ.వి.యస్. రెడ్డి గారిని విచారణకు కూడా నియమించింది. తరువాత ఆపులిచర్మంతోను, రక్తంతోను ఒరంగల్‌లోని కాళీఆలయంలో ఆరాత్రి హోమం జరిగింది అని కూడా పేపరులో వచ్చిన వార్త. అస్సాంలోని కామాఖ్య దేవాలయం ఇలాంటిదే. నరకాసురుడు పాలించిన ప్రాగ్జ్యోతిషపురమే అస్సాం ప్రాంతమని, అక్కడ ఉన్న కామాఖ్యాదేవిని అర్చించటానికే పదహారువేలమంది స్త్రీలను చెరపట్టాడని చెబుతారు. అక్కడికి మనబోటి వాళ్ళు కాలుకూడా పెట్టలేని పరిస్థితి. అక్కడిదాకా అవసరం లేదు మన గ్రామదేవతల ఆలయాలలోకూడా ఈ బలులు జరుగుతూనే ఉంటాయి. కోడి, మేక, గొర్రెలే కాకుండా దున్నపోతుల్ని కూడా గతంలో కూడా గతంలో బలి ఇచ్చేవారట. అన్నం రాసిగా పోసి, జంతువును చంపి దాని రక్తం అన్నం మీద పోసి అమ్మవారికి నివేదన చేసేవారట. ఇలా చేస్తే భగవంతుడు త్వరగా ప్రసన్ను డవుతాడు, మన కోరికలుకూడా త్వరగా తీరతాయి అంటారు. వామాచారంలో ఘోరమైన సంప్రదాయా లున్నాయి. స్త్రీ పురుషుల జననాంగాలను పూజిస్తారు. ఇంకా నీచమైన పనులు చేస్తారు. శివభక్తులలో **'అఘోరీలు'** అని ఉన్నారు. వారైతే కొంత కాలం మలమూత్రాలు తింటారు, కొంత కాలం చచ్చి బయటపడి ఉన్న కాకులు, కుక్కలు వంటి జంతువులను తీసుకుపోయి దాచుకుని మరీ తింటారు. గంగానది వద్దున సగం కాలిన శవాలను ఎత్తుకుపోయి పీక్కు తింటారు. ఇవన్నీ వామాచార సంప్రదాయమే.

ఇలా చేస్తే త్వరగా మోక్షం సిద్ధిస్తుందని వారి నమ్మకం. మంత్రజపం చేసేటప్పుడు కూడా దిగంబరంగా కూర్చుని జపం చెయ్యాలని చెబుతారు. రక్తమాంసాలతో హోమం చేస్తే ఆ మంత్రం త్వరగా సిద్ధిస్తుందట. ఈ రోజున బాగా పేరున్న ఒక స్వామి, ఇప్పుడు కూడా ప్రతిరోజు రాత్రిపూట ఇలాగే హోమాలు చేస్తారు. అని చెబుతుంటారు. పధ్నాలుగుసంవత్సరాలబాలుడి నాలుక కోసి హోమం చేస్తే బ్రహ్మాస్త్రం సిద్ధిస్తుందట.

దశకంఠుడు ఈశ్వర సాక్షాత్కారం కోసం తపస్సు చేస్తున్నాడు. ఎంత కాలం గడిచినా ఈశ్వరుడు కనికరించలా. అందుకని హోమం చేసి తన తలలు ఒక్కక్కటిగా నరికి హోమకుండంలో వేశాడు. చివరికి ఈశ్వరుడు సాక్షాత్కరించాడు.

రావణుడు యుద్ధానికి బయలుదేరేటప్పుడు నికుంభిలా యాగం చేసి బలులు సమర్పించేవాడు. ఇవన్నీ వామాచార సంప్రదాయాలే. మంత్రం త్వరగా సిద్ధించాలంటే మృతకళేబరం మీద కూర్చుని జపం చెయ్యాలనేది వారి సిద్ధాంతం. దీంట్లో భాగమే శవచింతామణి. ఈ మధ్యన ఒక మాట చాలా గట్టిగా వినిపిస్తోంది. ఒక పెద్దాయన జపం చేసుకునేచోట పుర్రెలుపాతిపెట్టి అదేఆసనంగా చేసుకున్నాడని జనం చెప్పుకుంటున్నారు. అలాగే పుర్రెలమాలతో కాళి, స్మశాన భైరవి లాంటి మంత్రాలు జపం చేస్తే త్వరగా సిద్ధిస్తాయిన ప్రతీతి.

దేవతలలో కూడా సాత్వికమైన వారు, తామసమైన వారు కూడా ఉన్నారు. వామాచార సంప్రదాయం అనేది తామసమైన దేవతలకు మాత్రమే వర్తిస్తుంది. లలితా పరమేశ్వరి, రాజరాజేశ్వరి, శ్రీమహావిష్ణువు లాంటి దేవతలకు వామాచారం ఉండదు. వీరు సత్త్వగుణ ప్రధానమైన వారు. అదే ఉగ్రదేవతలు ఉంటారు చూడండి. కాళి, బగళ, ప్రత్యంగిర,

వారాహి, నారసింహ, వీరికి వామాచార సంప్రదాయం ఉంది. వీరి పూజలో బలులు సమర్పిస్తారు.

వామాచార సంప్రదాయంలోదే విశాఖపట్టణం దగ్గర ఉన్న శ్రీచక్రపురంలోని మేరువు రూపంలో కట్టిన ఆలయం. అక్కడ శ్రీచక్రం మేరువుగా తొమ్మిది అంతస్థులలో ఆలయ నిర్మాణం జరిగింది. అందులో ఎక్కడ ఏ దేవత ఉండాలో, ఆ దేవత విగ్రహాన్నికూడా రంగులువేసి మరీ పెట్టారు. మొత్తం 170 మంది దేవతలు ఉంటారు. చాలా చక్కగా ఉంటుంది ఆలయం. కాని ఇక్కడ విచిత్రం ఏమంటే ఒక్క దేవతవంటి మీద నూలుపోగుకూడా ఉండదు. కాళ్ళు బారచాచుకుని కూచుని ఉంటాయి. శరీర భాగాలు మనకు సరిగా కనపడవేమో అని రంగులుకూడా వేశారు. ఇదంతా వామాచార సంప్రదాయమే. జానపద కథల్లోని మాంత్రికులంతా ఈ కోవకు చెందినవారే.

ఇక మంత్రసిద్ధి. వామాచారంలో మంత్రం త్వరగా సిద్ధిస్తుందట కదా? ఇది ప్రశ్న. నిజమే. ఇందులో సందేహం లేదు. అయితే అలా మంత్రసిద్ధి పొంది సుఖజీవితం గడిపినవాడు ఎవడైనా ఉన్నాడా?

ప్రస్తుతం అతనికి బాగా ఉండచ్చు. కాని తరువాత కాలంలో మాత్రం తీరని నష్టం జరుగుతుంది అని గుర్తుంచుకోండి. నాకు తెలిసన ఒకాయన ఎంతసేపు ఇలాంటివే చేస్తుండేవాడు. ఒకటి రెండుసార్లు నేను చెప్పాను కూడా వినలేదు. ఆయనకి జరిగిన దారుణం తెలుసా? నలభైసంవత్సరాల కూతురు కళ్ళముందే చచ్చిపోయింది. అయినా ఆయనకి బుద్ధి రాలేదు. ఇలాటి ఉదాహరణలు కోకొల్లలు. వామాచార సంప్రదాయకుడైన ఏ మాంత్రికుడైనా విజయం సాధించాడా? త్రిలోకాధిపత్యం సాధించాడా? అంత గొప్ప రావణబ్రహ్మ పరిస్థితి

ఏమైంది? వామాచారము అంటే అవైదికము. ఈ పద్ధతిని ఆచరించిన రాక్షసులు ఏమయ్యారు?

మీరంతా చదువుకున్నవారు. ఆలోచనాశక్తి, విచక్షణా జ్ఞానము ఉన్నవారు. వామాచార సంప్రదాయంలో ఉన్నవారు చివరి రోజులలో చాలా కష్టాలు అనుభవించారు. కొంతమంది నీచమైన చావుచచ్చారు అనికూడా మనకి చరిత్ర చెబుతోంది. షేక్స్పియర్ వ్రాసిన డా॥ ఫాస్టస్ నాటకం అలాంటిదే. అద్భుతమైన శక్తులు సంపాదించిన నాయకుడు చివరకు దీనాతిదీనంగా మరణిస్తాడు.

2011 డిసెంబరులో మైసూరులో శ్రీవిద్యమీద అంతర్జాతీయ సదస్సు జరిగింది. దానికి భూటాన్ నుంచి ఒక మాంత్రికుడు వచ్చాడు. అతడు శ్రీచక్రానికి ఆల్కహాల్‌తో అభిషేకం చేసి, మాంసం నివేదన చేస్తాడు. సదస్సుకు హాజరైన ఇతర సభ్యులు చాలామంది అతను వచ్చినందుకుగాను నిర్వాహకులకు తమ నిరసన తెలియచేశారు. కాని ఇక్కడ అలాటి వారిని మనం స్వాగతిస్తున్నాం. లౌకికమైన కోరికలు తీరటానికి కౌళాచారమున్నది. మానవుడి జీవిత ధ్యేయము మోక్షసాధన. అలాంటప్పుడు మనకు ఏం కావాలో, మనమేం చెయ్యాలో మీరే నిర్ణయించుకోండి.

ఆటలు ఆడేటప్పుడు, పరుగు పందేలవంటి పోటీలలోను తాత్కాలికంగా ఉత్తేజం పొందటానికి ఉత్ప్రేరకాలు (స్టెరాయిడ్స్) వాడతారు. కాని వీటి వాడకం నిషేధం. ఎందుకంటే తాత్కాలికంగా ఉత్తేజం కలిగించినా శరీరం గుల్లయిపోతుంది. ఆ తరువాత ఎందుకూ పనికిరారు. అలాగే వామాచారసంప్రదాయం కూడా. తాత్కాలికంగా ఉపయోగిస్తుంది. కాని చివరకు చెరుపు చేస్తుంది అని చెబుతున్నారు పెద్దవాళ్ళు.

శ్రీవిద్యలో నిష్ణాతులయిన కొంతమంది ఈ మధ్య వామాచార సంప్రదాయం అనుసరిస్తున్నారని కూడా చెప్పుకుంటున్నారు. ఇది మంచి పద్ధతి కాదేమో ఒకసారి ఆలోచించండి.

**అమ్మవారికి ఆల్కహాల్‌లో అభిషేకం చేసినవాడు అదే తీర్థంగా తీసుకుంటాడు అది హానికరమే కదా? దిగంబర పూజలు చేస్తే పర్యవసానం మీకు తెలుసు కదా? ఇటువంటి పనులుచేసి చేతులారా నీచమైన చావుకొని తెచ్చుకోవటం అంత అవసరమా? ఆలోచించండి. నిర్ణయం మీకే వదిలేస్తున్నాను.**

# 26. మోక్షం ఎలా వస్తుంది?

జీవితంలో కొంచెం జ్ఞానమున్న ప్రతివాడు అనుకుంటాడు. నాకు ఇదే ఆఖరు జన్మ కావాలి. పునర్జన్మ వద్దు. మళ్ళీ ఈ లోకంలోపుట్టి కష్టాలుపడుతూ, నేను జీవించలేను. నాకుమోక్షం కావాలి. ఏపాటి ఆధ్యాత్మిక చింతన ఉన్నవాడయినా అనుకునే మాటలే ఇవి. అసలు మోక్షం అంటే ఏమిటో చూద్దాం. 'మోక్షం' అంటే ముక్తి. విముక్తి. ఐహికబంధాల నుంచి విముక్తి. ఈ రకంగా ఐహిక బంధాల నుంచి విడివడిన వాడికి జన్మరాహిత్యం కలుగుతుంది. పునర్జన్మ ఉండదు. అటువంటి స్థితి ఎలా సిద్ధిస్తుంది? ఇప్పుడొక చిన్న ఉదాహరణ చూడండి.

ఒకసారి సాయంత్రం ఏడు గంటలు సమయం. ఒకాయన నా దగ్గరకు వచ్చాడు. ఆ సమయంలో నేను ఏదో వ్రాసుకుంటున్నాను. వచ్చినాయన నాకన్న వయసులో పెద్దవాడు. సంపన్నుడు. అన్ని రకాలుగాను స్థితిమంతుడు అలా అని కొంచెం అహంకూడా ఉంది. పెద్దాయన వచ్చాడు కదా అని నా పని ఆపేసి ఆయనతో మాట్లాడుతూ కూచున్నాను. మోక్షం గురించే చెబుతున్నాడు. నా దగ్గరకు వచ్చింది నా నుంచి ఏదో తెలుసుకోవాలని కాదు. తనకు ఏదో తెలుసు అది నాకు చెప్పాలని. నిజానికి ఆయనకి తెలిసింది చాలా తక్కువ. ఒక గంట కాలం గడిచింది. ఇక నేను బయలుదేరతాను అన్నాడు. అంతవరకు ఆయన మాట్లాడుతున్న విషయం పూర్తి కాలా. మధ్యలోనే లేచాడు 'విషయం పూర్తిగా చెప్పి వెళ్ళండి' అన్నాను. లేదు టైము ఇప్పటికే ఎనిమిదయింది. నేను ఇంటికి వెళ్ళేటప్పటికి ఇంకా గంట పడుతుంది. నేను వెళ్ళేదాకా మా ఇంట్లో ఎవరూ భోజనాలు చెయ్యరు. అంతా నాకోసం ఎదురు చూస్తుంటారు. నా భార్యకు వంట్లో

బాగుండదు. అయినా ఆవిడ నేను లేకుండా ఏమీ తినదు. మాఅబ్బాయి, కోడలు సరే సరి. నాకు ఒకమనవడు ఉన్నాడు మొన్ననే రెండవ ఏడు వచ్చింది. వాడు కూడా తాత వస్తేనే కాని ఏమీతినను అని భీష్మించుకుంటాడు. అంతదాకా ఎందుకండీ మా కుక్కపిల్లకూడా నేను పెడితేనే బిస్కట్టైనా తింటుంది. లేకపోతే ఏమీ తినకుండా అలాగే కూచుంటుంది. అన్నాడు. ఈ మాటలు చెబుతున్నప్పుడు ఆయన ముఖం వెయ్యి కాండిల్ బల్బులాగా వెలిగిపోతోంది. ఇంట్లో తనకు ఎంత ప్రాముఖ్యత ఉన్నదో చెప్పి పొంగిపోతున్నాడు. ఇంతవరకు నాతో ఆయన మాట్లాడిన దాని సారాంశం ఏమంటే ఆయనకు మరుజన్మ ఉండకూడదు. మోక్షం కావాలి.

ఒకసారి నేను చండీ హోమం చేస్తున్నాను ఒకావిడ వచ్చారు. వారు నాకు పరిచయం ఉన్నవారే. ఎప్పుడైనా వస్తుంటారు. లేకపోతే ఫోనుచేసి మాట్లాడు తుంటారు. సాక్షాత్తు అమ్మవారే వచ్చింది అనే భావనతో 'రండమ్మా! కూచోండి. రెండు నిమిషాలు' అని చెప్పి అధ్యాయం పూర్తిఅయిన తరువాత 'ఏమ్మా! నాకు ఇంకా ఒకగంట సమయం పడుతుంది కూర్చుంటారా?' అన్నాను. లేదండి వెళ్ళిపోతాను. ఒక చిన్నమాట మిమ్మల్ని అడుగుదామని వచ్చాను అన్నారు.

'చెప్పండమ్మా'

'ఏమీ లేదు. నేను ఇంకా జన్మలు ఎత్తాలి అనుకోవటం లేదు. ఇదే ఆఖరు జన్మ కావాలి. నా బాధ్యతలు అన్నీ తీరిపోయినాయి. ఇప్పుడు నేనేం చెయ్యాలో చెప్పండి. నన్ను ఎప్పుడు రమ్మంటారు?"

'అమ్మా రేపు సాయంత్రం ఐదు గంటలకు రాగలరా?"

'లేదండి. అమ్మాయి, అల్లుడు వచ్చారు. అల్లుణ్ణి ఇంట్లో వదిలి అత్తగారు ఊరి వెంబడి తిరుగుతోంది అనుకుంటారు'

'పోనీ ! నాలుగు రోజులు పోయిన తరువాత రండి'

'అల్లుడు వెళ్ళిపోతాడు. కాని అమ్మాయి, పిల్ల ఇక్కడే ఉంటారు. మనవరాలు చిన్న పిల్ల. దానికి నా దగ్గర బాగాఅలవాటు. నన్నువదిలి అసలు ఉండలేదు.'

'సరే పోనీమ్మా! మీకు వీలయినప్పుడు నాకు ఫోనుచేసి రండి.'

'అలాగే పదిరోజుల తరువాత వస్తాను' అని వెళ్ళిపోయారు.

ఈ రెండు సందర్భాలలోను చూడండి. వాళ్ళ కోరిక మోక్షం. అంటే బంధాల నుంచి విముక్తి కావాలి. మరి వాళ్లకి ఉన్నవేబంధాలు. ఈ బంధాలు మూడు రకాలుగా ఉంటాయి.

1. బలవంతంగా బిగించిన బంధాలు
2. బాధ్యతలతో కూడిన బంధాలు
3. ప్రేమ, అభిమానాలతో పెనవేసుకుపోయిన బంధాలు

ఏవైనా బంధాలే. చేతులుకట్టేశారు. కొబ్బరితాడుతో కట్టెస్తే బిగిసిపోయి బాధగా ఉంటుంది. నూలుతాడుతో కట్టెస్తే గట్టిగా ఉంటుంది. పట్టుతాడుతో కట్టేస్తే చూడటానికి అందంగానే ఉంటుంది. కాని అదికూడా బంధమే. సామాన్యంగా మనందరికీ ఉండేవి ఈ రకమైన బంధాలే. చేతులకు సంకెళ్ళు వేసినప్పుడు అవి బంగారపువైనా, వెండివైనా, ఇనప సంకెళ్ళైనా తేడా ఏమీలేదు. మనం కదలటానికి వీలుండదు. వెంటనే అనుమానం వస్తుంది. బంధాలుండకూడదా? మనవలతో ప్రేమగా ఉండరాదా? అని. ఎందుకు ఉండరాదు. మనవలన్నా, భర్త, భార్య, బంధువులు, స్నేహితులు ఎవరిమీదైనా ప్రేమాభిమానాలు కలిగి ఉండచ్చు. కాకపోతే అవి బంధాలు కాకూడదు. అలా బంధాలు ఉండటం తప్పా?

ఏం కాదు. ఈ లోకంలోనే ఉండాలి అనుకున్నప్పుడు, లౌకిక వ్యవహారాలలో జీవించాలి అనుకున్నప్పుడు ఈ రకమైన బంధాలు ఉండి తీరాలి. కాకపోతే ఈ బంధాలు కలిగి ఉండి, బంధనాలు లేని స్థితిని కోరుకోరాదు అంతే. మీకు నిజంగానే మోక్షం కావాలంటే ఏ రకమైన బంధాలు ఉండరాదు. మీదేహం మీదకూడా మీకు అభిమానంఉండరాదు. ఏ రకమైన కోరికలులేని స్థితే మోక్షము.

మమ, నాది అనుకుంటే బంధము. నమమ నాది కాదు అనుకుంటే మోక్షం. వెలుతురు చీకటి రెండూ ఒకేచోట ఉండవు. చీకటిగాఉన్న గదిలో దీపం వెలిగిస్తే చీకటి పారిపోతుంది. అంతేకాని వెలుతురుతో పాటు చీకటి కూడా ఉండదు. అలాగే ఇహము పరము రెండూ ఒకసారే రావు.

**యాత్రాపి భోగోవచతత్ర మోక్షః। యత్రాసి మోక్షోనచ తత్రభోగః**

భోగం కావాలి అనుకుంటే మోక్షం ఉండదు. మోక్షం కావాలనుకుంటే భోగం ఉండదు. ఈ రెండింటలోను ఏదో ఒకటే ఉంటుంది. ఇక్కడ ఒక విషయం చూడండి.

ఒకసారి ఇంద్రుడు దధ్యమహర్షి ఆశ్రమానికి వెళ్ళాడు. వచ్చినవాడు దేవరాజైన ఇంద్రుడు. ఘనంగా స్వాగతం చెప్పాడు దధ్యుడు. కుశల ప్రశ్నలైన తరువాత 'వచ్చిన పని ఏమిటో సెలవివ్వండి. అన్నాడు దధ్యుడు. నా కోరిక తప్పక తీరుస్తానని మాట ఇస్తే చెబుతాను అన్నాడు ఇంద్రుడు. అలాగే అన్నాడు దధ్యుడు. బ్రహ్మవిద్య కావాలి అని అడిగాడు ఇంద్రుడు. ఆలోచనలో పడ్డాడు దధ్యుడు. ఇంద్రుడు నిరంతరము సుఖాలలో తేలిఆడేవాడు. అతడికి బ్రహ్మవిద్యను చెప్పటం ఎలా? తాను చెబుతానని మాటిచ్చాడు. ఒకవేళ చెబితే అపాత్రదానం.

చెప్పకపోతే మాట తప్పినందుకు మహాపాపం. ఏం చెయ్యాలి? ఆలోచిస్తున్నాడు. ఇప్పుడు ఇంద్రుడే అడిగాడు మళ్ళీ. 'ఏం మహర్షీ! ఏమిటాలోచిస్తున్నావు? నాకు బ్రహ్మవిద్య చెబుతానన్నావు. చెబుతావా? చెప్పవా?" మాటలో కరుకుదనం ఉంది. చేసేది లేక చెబుతాను అన్నాడు. మరునాడు శిష్యులతోపాటుగా రమ్మన్నాడు.

ఆ మరునాడు ఇతర శిష్యులతోపాటుగా గోచీ పెట్టుకుని, చేతిలో దర్భలు పట్టుకుని వచ్చాడు ఇంద్రుడు. పాఠం మొదలయింది. "ఈ చరాచర జగత్తంతా మిధ్య. రాజులు, రాజ్యాలు, సుఖాలు, భోగాలు అన్నీ మిధ్య" అన్నాడు దధ్యుడు. వెంటనే లేచాడు ఇంద్రుడు చాలా కోపంగా మహర్షిని చూసి "ఓ మహర్షీ! నువ్వు కావాలని నన్ను అవమానిస్తున్నావు. నా స్వర్గంమిధ్యా? అప్సరసలు, భోగాలు ఏవి మిధ్య? ఇలాంటి మాటలు ఇకెవరికైనా చెబితే నీ తల కాస్తా నరికేస్తాను" అని చెప్పి అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

అందుకే అర్హులుకాని వారికి విద్యను చెప్పరాదు.

మానవుడు ముందుగా తనకు ఏది కావాలో నిర్ణయించుకుని దానికి తగ్గట్టుగా నడచుకోవాలి. ఇక్కడ ఒక విషయం మరచిపోకూడదు.

**మనయేన మనుష్యాణాం కారణం బంధమోక్షయోః**

బంధానికి, మోక్షానికి కూడా కారణం మనస్సే. కాబట్టి నీ మనస్సుని దేనిమీద లగ్నం చెయ్యగలిగితే దాన్నే పొందుతావు.

కాబట్టి నిజంగా మోక్షం కావాలి అనుకుంటే మీరు చేయవలసిన

పనులు వదిలి పారిపొమ్మని చెప్పటం లేదు. ఆ పనులన్నీ మీ బాధ్యతలుగా తీసుకుని వాటిని పూర్తి చెయ్యాలి. అంతేకాని వాటితో మమేకం కాకూడదు. కుమ్మరిపురుగు బురదలోనే తిరుగుతుంది. కాని దాని వంటికి బురద అంటదు. అలాగే మనం కూడా బాధ్యతలు నెరవేర్చాలి అంతేకాని వాటిలో లీనమై పోరాదు.

ఈ రకంగా కోరికలు లేని స్థితికి చేరిన మానవుడు నిష్కాముడు, ఆప్తకాముడు, పూర్ణకాముడు అనబడతాడు. అతడికి ఈ జగత్తంతా పరమాత్మ స్వరూపంగానే కనిపిస్తుంది. చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపంగా భావించగలగటమే ఆత్మసాక్షాత్కారము. ఈ స్థితికి చేరినవాడే జీవన్ముక్తుడు. మోక్షం పొందటానికి కుల, మత, జాతి, లింగ భేదాలు లేవు. అందరూ మోక్షానికి అర్హులే.

# 27. మంత్రాలకు చింతకాయలు రాలతాయా?

ఇది చాలా పెద్దప్రశ్న. ఇక్కడ తెలుసుకోవలసిన విషయం ఒకటుంది. మంత్రము అంటే – కేవలము మాట. **'మాటే మంత్రము'** మనం ఎవరినైనా పిలిస్తే ఆ వ్యక్తి వస్తున్నాడు కదా ! రోడ్డు మీద ఒక ఆవు పోతోంది. దా! దా! అమ్మా దా ! అని పిలిస్తే ఆ ఆవు ఆగి మీవైపు చూస్తుంది కదా. తినటానికి ఏమైనా పెడతానంటే వస్తుంది కదా నా చిన్నప్పుడు పల్లెకారులు ఒక బుట్టలో చిన్న చిన్న చేపలు పోసుకుని "కృష్ణా వారికి ఆహారం వేస్తాం" అంటూ వచ్చేవాళ్ళు. రెండు రూపాయలిస్తే కొన్ని చేపలు తీసి రోడ్డుమీద పోసి 'కృష్ణా! రా! రా!' అంటూ అరుస్తుండే వారు. కృష్ణపక్షి ఒక రకమైన గ్రద్ద, ఎరుపు రంగులో ఉంటుంది. మెడ చుట్టూ, కాళ్ళు మాత్రం తెల్లగా ఉంటాయి. అప్పటివరకు ఆకాశంలో ఒక్కటీ ఉండేది కాదు. వీరు పిలవటం మొదలుపెట్టిన కొద్దిసేపటికే కృష్ణపక్షులు వరుసగా వచ్చి నేలమీద పోసిన చేపలు తన్నుకుపోయేవి. కృష్ణపక్షి అంటే విష్ణుమూర్తి వాహనం అని వారి నమ్మకం.

మనం పిలిస్తే త్రోవన పోయే ఆవు ఆగి వెనక్కి తిరిగి వస్తోంది. ఆకాశంలో ఎక్కడో ఉన్న పక్షి క్రిందకి దిగి వస్తోంది. అలాంటప్పుడు దేవత మాత్రం ఎందుకు రాదు? అసలు రాదు అనే అనుమానం ఎందుకు?

సంకల్పం రెండు రకాలుగా ఉంటుంది. 1. సిద్ధ సంకల్పము 2. అసిద్ధ సంకల్పము.

సిద్ధసంకల్పము అంటే ఈ పని జరిగి తీరుతుంది. అదే సంకల్పము. 'జరగకపోతే' అనే అనుమానం ఉండదు. గుప్పెట మూసి ఈ గుప్పెట్లో బంగారు ఉంగరము ఉన్నది అని సంకల్పం చేస్తే, గుప్పెట

తెరిచేటప్పటికి ఉంగరము ఉండి తీరుతుంది. కావాలంటే మీరు కూడా ప్రయత్నించవచ్చు. దీనికి నిశ్చలమైన మనస్సు, స్థిరచిత్తము కావాలి. ఇది సిద్ధపురుషులకు సాధ్యమవుతుంది. బ్రహ్మదేవుడు చేసే సృష్టికూడా ఇలాంటిదే. ఆయన సంకల్పంతోనే జగత్సృష్టి జరుగుతుంది. నిశ్చలమైన మనస్సు, స్థిరచిత్తము లేకపోతే అది అసిద్ధ సంకల్పమవుతుంది. ఆ సంకల్పం సిద్ధించదు. నేను ఈ పని చెయ్యగలను అనుకునే వాడే ఆ పని సాధిస్తాడు.

ఒకసారి అమెరికాలో ఉపన్యాసం చెబుతున్నప్పుడు ఒకాయన ఇదే ప్రశ్న అడిగాడు. నేను వెంటనే “మీరు లేచి మీ ప్రక్కన ఉన్న వారిని బండ బూతులు తిట్టండి” అన్నాను.

‘తిడితే ఊరుకుంటాడేమిటి? పళ్ళు రాలగొడతాడు’ అన్నాడు. మంత్రానికీ, తిట్లకీ తేడా ఏం లేదు. రెండూ మాటలే. ఈ మాటకి పళ్ళు రాలినప్పుడు, అదే మాటకు చింతకాయలు మాత్రం ఎదుకు రాలవు? ఆలోచించండి.

మీకు మంచి జరగాలని ఆలోచిస్తే ఆ మంచే జరుగుతుంది. కళ్ళు మూసుకుని ఏకాగ్రతతో ఒకే మాటని పదేపదే ఉచ్చరిస్తే మన సంకల్పం తప్పకుండా నెరవేరుతుంది. ఇందులో ఏ అనుమానము లేదు.

# 28. మంత్రశక్తి తగ్గిపోతుందా?

ఇది కూడా చాలామందిని పట్టి పీడించే ప్రశ్న. పన్నెండు సంవత్సరాలు కష్టపడి నియమ నిష్టలతో తపస్సు చేసి, కొంత శక్తిని సంపాదించాం. ఈ శక్తి మనదగ్గరే అలాగే ఉంటుందా? లేకపోతే తగ్గటం కాని పెరగటం కాని జరుగుతుందా? ఇది మన అనుమానం. ఇక్కడ ఒకచిన్న ఉదాహరణ చూడండి. కష్టపడి సంపాదించి కొన్నికోట్ల రూపాయలు జాగ్రత్తగా దాచిపెట్టాం. కొంత కాలానికి ఈ ధనం ఏమవుతుంది. మీరే ఆలోచించండి. దానిలోంచి కొద్దికొద్దిగా తీసివాడుకుంటున్నాం అనుకోండి కొంత కాలానికి ఆ నిధి కాస్తా తగ్గిపోతుంది. అలాగే తపఃశ్శక్తి. దీనికి విశ్వామిత్రుడు మంచి ఉదాహరణ. విశ్వామిత్రుడు పదివేల సంవత్సరాలు తపస్సు చేశాడు. ఒకరోజున ఉదయం లేచేసరికి ఎదురుగా మేనక జలకాలడుతూ కనిపించింది. భరించలేకపోయాడు. కొంతకాలం పాటు మేనకతో గడిపాడు. ఆ సమయంలో ఉదయంపూట హిమాలయాల్లో విహరిస్తే, సాయంత్రం అయ్యేసరికి వింధ్యపర్వతానికి వచ్చేవారు. ఆ మరునాడు కన్యాకుమారికి పోయేవారు. మేనక అప్సరాంగన. ఆవిడకి కొన్ని అతీతశక్తులుంటాయి. వాటిలో వాయుగమనం ఒకటి. వీరు వింధ్యపర్వతం మీద ఉండగా ఉన్నట్టుండి నాకు ఇక్కడబాగాలేదు, మనం హిమాలయాలకు వెళ్ళిపోదాం అనేది. సరే అనేవాడు విశ్వామిత్రుడు. ఆవిడ తన అతీతశక్తితో గాల్లో ఎగిరిపోయేది. పక్షికి రెక్కలుంటాయి. అది కక్కడికైనా ఎగరగలదు. కాని విశ్వామిత్రుడు సామాన్యమానవుడు. ఇతడికి అతీతశక్తులు లేవు. ఉన్నది ఒకటే తపశ్శక్తి. దాన్ని ఉపయోగించే అతడు కూడా గాల్లో ఎగిరిపోయేవాడు.

ఇలా కొంతకాలం గడిచింది. విశ్వామిత్రుడి దగ్గర తపశ్శక్తి క్రమేణా తగ్గిపోతోంది. ఆయన ఆ విషయం గమనించలా. ఒకరోజున మేనక 'నాధా! మనం ఇక్కడి నుంచి కన్యాకుమారి వెడదాం' అంది. సరే అన్నాడు మహర్షి. మేనక గాల్లోకి లేచింది. విశ్వామిత్రుడు రెండు చేతులూ పైకెత్తి గాల్లో ఎగరటానికి ప్రయత్నించాడు. కాళ్ళు నేల మించి పైకి లేవలా! మళ్ళీ ప్రయత్నం చేశాడు. లాభం లేదు. వెంటనే పెద్దగా అరిచాడు 'మేనకా! నేను గాల్లో తేలలేకపోతున్నాను' అన్నాడు. ఆవిడ సమాధానంగా 'మహర్షీ! నీ దగ్గర శక్తిఅయిపోయిందన్నమాట' అన్నది మళ్ళీ మహర్షి 'ఇప్పుడు నేనేం చెయ్యను?' అన్నాడు. మేనక ఒక నవ్వు నవ్వి 'శక్తి లేనివాడివి నువు నాకెందుకు? నాదోవన నేను పోతున్నాను' అంది. 'మరినేనో' బిక్కమొహం పెట్టాడు మహర్షి. 'ఓ మహర్షీ! నీ తపశ్శక్తిని హరించటానికే నేను ఇక్కడికి వచ్చాను. నాపని పూర్తయింది. ఇకనేను పోతున్నాను. నీబాధలు నువ్వుపడు' అని మేనక దేవలోకానికి వెళ్ళిపోయింది. చాలా విచారించాడు మహర్షి. పదివేల సంవత్సరాలు చేసిన తపస్సు కొద్దికాలంలో నాశనమయి పోయింది. విచారించి ప్రయోజనం లేదు. మళ్ళీ తపస్సు చెయ్యటం ప్రారంభించాడు. పదివేల సంవత్సరాలయినాయి. ఇప్పుడు త్రిశంకుడు వచ్చాడు. దేవతలమీద కోపంతో, అహంకారంతో అతణ్ణి బొందితో కైలాసానికి పంపాడు. దానికోసం తన తపఃశ్శక్తి అంతా ధారపోశాడు. ఇలా జరిగినందుకు విచారించాడు. మళ్ళీ తపస్సుచేశాడు. ఈసారి రంభ వచ్చింది. ఆవిణ్ణి చూడగానే కోపంతో ఊగిపోయాడు. గతంలో మేనక వచ్చి నా తపశ్శక్తిని నాశనం చేసింది. ఇప్పుడు నువువచ్చావా? చూడు నిన్నేంచేస్తానో? అంటూ రంభని రాయిగా మారిపొమ్మని శాపంపెట్టాడు. రంభకాస్తా రాయిగా మారిపోయింది. దానికి

విశ్వామిత్రుని తపశ్శక్తి కాస్తా ఖర్చయిపోయింది.

ఇలా మనం ఎవరికన్నా వరాలిచ్చినా, శాపాలిచ్చినా, అద్భుతాలు ప్రదర్శించినా మనదగ్గర ఉన్న శక్తి తగ్గిపోతుంది. అంతదాకా ఎందుకు? గుడిలో దేవుడికి కొంతశక్తి ఉంది. దాంతోనే భక్తుల కోరికలు తీరుతుంటాయి. కొంత కాలానికి ఆ శక్తి తగ్గిపోతుంది. తిరుపతి వేంకటేశ్వరుణ్ణే ఉదాహరణగా తీసుకోండి. అక్కడికి వెడితే మన కోరికలు తీరుతున్నాయి కదా? మరి ఆ శక్తి తగ్గిపోదా? ఆ శక్తి తగ్గిపోకుండానే ప్రతిరోజు తెల్లవారుఝామున రెండు గంటలనుంచి, రాత్రి పన్నెండు గంటలదాకా ఏదో ఒక సేవ, ఉత్సవము, ఊరేగింపు, హోమాలు, జపాలు, పారాయణలు జరుగుతూనే ఉంటాయి. ఇవి గాక బ్రహ్మోత్సవాలు. వీటిద్వారా స్వామివారికి శక్తి మళ్ళీ సమకూరుతుంటుంది. ఏ దేవాలయంలోనైనా సరే. అక్కడ జరిగే జపాలు, తపాలు, హోమాలు, యాగాలవల్ల దేవతశక్తి పెరుగుతుంది. ఇవి గాక మహా కుంభాభిషేకం చేస్తారు. దక్షిణాది దేవాలయాల్లో కుంభాభిషేకం ప్రతిసంవత్సరము చేస్తారు. దీనివల్ల శక్తి పెరుగుతుంది. ప్రతిరోజు ఆలయాల్లో సహస్రనామ పారాయణ చేసేది భగవంతుడికి శక్తి పెరగటానికే. తద్వారా మన కోరికలు తీరతాయి.

మనకున్న శక్తిని ప్రతిఫలం ఆశించకుండా పదిమందికి మంచి జరగటం కోసం ఉపయోగించినా మనశక్తి పెరుగుతుంది. ఇక్కడ మనం గుర్తుంచుకోవలసిన విషయం ఒక్కటే. ప్రతిఫలం ఆశించకుండా సహాయం చేస్తే నీ శక్తి పెరుగుతుంది. ప్రతిఫలం కోసం అయితే శక్తి తగ్గిపోతుంది.

ఇక్కడ గౌతముడు మంచి ఉదాహరణ. ఈయన గాయత్రీ దేవిభక్తుడు. ఇతని భక్తికి మెచ్చి దేవి ఒక వరమిచ్చింది. గౌతముడు

గనక విత్తనాలు చల్లితే, అవి వెంటనే మొక్కలై, చెట్లై, పూవులు కాయలు కాచి ఫలితాన్నిస్తాయి. ఒకసారి దేశంలో కరువు వచ్చినప్పుడు గౌతముడు తనకున్న వరం సహాయంతో దేశప్రజలందరినీ రక్షించాడు. అప్పుడు అతని శక్తి తగ్గిపోలేదు? అది నిస్వార్ధంగా చేసిన పని కాబట్టి ఆ శక్తి కొన్ని రెట్లు పెరిగిపోయింది.

దీనివల్ల మనకి తెలిసే విషయం ఏమంటే మనదగ్గర ఉన్న శక్తి పెంచుకోవటము, లేదా వృధా చెయ్యటము అనేది కేవలం మనచేతుల్లోనే ఉంది. ఎవరికైనా మంచి చేస్తే మనశక్తి పెరుగుతుంది. అయితే ఆ పని నిస్వార్ధంగా చెయ్యాలి. దానివల్ల ప్రతిఫలం ఆశించకూడదు. ఎవరికైనా చెడు చేస్తే మనఃశ్శక్తి తగ్గిపోతుంది. అందుకే జపతపాలు చేసేవారు కామక్రోధాలను కొంచెం అదుపులో పెట్టుకోవాలి.

## 29. వేదంలో స్త్రీ దేవతలు

వేదంలో స్త్రీ దేవతలకి అంత ప్రాధాన్యత లేదు. వేదంలో ఎక్కువసార్లు చెప్పింది 'అదితి'. దితి అంటే బంధము అని అర్థం. న దితి – బంధాలు లేనిది అతిథి. ఋగ్వేదంలో ప్రత్యేకంగా అదితిని గురించి విడిగా చెప్పిన సూక్తం ఏదీ లేదు. ఆవిడ మిత్రావరుణులకు తల్లి మంచి పుత్రులు గలది. ఉగ్రులు, వీరులు అయిన పుత్రులు గలది. ఆవిడకు ఎనిమది మంది కుమారులు. ఆమె రుద్రులకు తల్లి. వసువులకు కూతురు. ఆదిత్యులకు సోదరి. ముసలితనం లేనిది. గొప్ప వ్యాప్తి గలది. ఆపదల నుంచి కాపాడుతుంది. మొత్తం మీద అదితికి రెండు లక్షణాలున్నాయి. 1. ఆవిడ మాతృత్వం. ఆవిడ మిత్రావరుణలకు తల్లి. 2. శారీరక బంధాల నుంచి పాపాల నుంచి విముక్తి కలిగించ గల శక్తి. ఆవిడకు ఒక రూపం లేదు. వేదంలో ఆవిడ రూపం చెప్పలేదు. ఈవిడ ఋగ్వేదంలో ఎనభైసార్లు చెప్పబడింది.

రెండవ దేవత దితి. గతంలో చెప్పినట్లుగా దితి అంటే – బంధాలు కలది అని అర్థం. ఈవిడ ఋగ్వేదంలో మూడుసార్లు చెప్పబడింది. ఇప్పుడు మనం చెబుతున్నట్లుగా లక్ష్మి, సరస్వతి, పార్వతి మొదలైన దేవతలు ఋగ్వేదంలో లేరు. ఇక్కడ ఒక చిన్న అనుమానం వస్తుంది. మరి శ్రీసూక్తం సంగతి ఏమిటి? అని శ్రీసూక్తంలో దేవత లక్ష్మి కాదు. అగ్నిదేవుడు. మనకి ధన ధాన్యాలు ఇమ్మని అగ్నిదేవుణ్ణి ప్రార్థన చేస్తున్నాము. కొన్నిచోట్ల దేవతల భార్యలు చెప్పబడ్డారు. ఇంద్రుడిభార్య ఇంద్రాణి. వరుణిడిభార్య – వరుణాని, అగ్నిభార్య – అగ్నాణి. వీళ్ళకి వాళ్ళ భార్యలుగా తప్ప వేరే ప్రాముఖ్యత అనేది లేదు.

ఈ రకంగా సంహితలో స్త్రీ దేవతలు లేరు. ఉన్న ఒకరిద్దరికి

కూడా ప్రాముఖ్యత లేదు. మరి ఇంతమంది దేవీ స్వరూపాలున్నాయి కదా ? అవెక్కడివి? అంటే దుర్గ, చండి, కాళి, లక్ష్మి ఇత్యాది దేవీ స్వరూపాలన్నీ ఉపనిషత్తులలో చెప్పబడ్డాయి. ఉపనిషత్తులు కూడా వేదాలలో భాగమే.

# ౩౦. వేదాలు స్త్రీలు చదవవచ్చా?

ఇది చాలా పెద్ద ప్రశ్న. అనాదిగా వస్తున్న శేషప్రశ్న. ఈ ప్రశ్నకు సమాధానం చెప్పే ముందు అసలు వేదం ఎవరు చదవాలి ? అనే విషయం చూద్దాం. చిన్నప్పుడే ఉపనయనం చేసి గురుకులానికి పంపేవాళ్ళు పూర్వకాలంలో. అక్కడ వేదాధ్యయనం జరిగేది. చాతుర్వర్ణముల వారు ఉన్నారు కదా ? వీరిలో ఎవరు వేదం చదవవచ్చు? ఇది మళ్ళీ ప్రశ్న.

బ్రహ్మక్షత్రియ వైశ్యులు వేదం చదువవచ్చు. ఇందులో కూడా బ్రాహ్మణులకు వేదం చదివే అధికారము, వేదాన్ని విద్యార్థులకు బోధించే అధికారము. (అధ్యయనము, అధ్యాపనము) రెండూ ఉన్నాయి. మిగిలిన ఇద్దరికీ అంటే క్షత్రియులకు వైశ్యులకు వేదాధ్యయనం చేసే అధికారం ఉంది. కాని అధ్యాపనం (బోధించే అధికారము) మాత్రం లేదు. ఇలా ఎందుకని? అంటే బ్రాహ్మణుడు తన జీవితాంతం వేదం కోసమే వెచ్చిస్తున్నాడు. వేదమే అతడి జీవనం. వేదమే అతడి ఊపిరి. మిగిలిన వాళ్ళకి అలాకాదు. వేదం చదువుతారు అంతే. వాళ్ళ వృత్తి వేరు. క్షత్రియుడు రాజ్యపాలన చెయ్యాలి. వైశ్యుడు వ్యవసాయం, పశుపోషణ, వర్తకము, వాణిజ్యము అన్నీ చూడాలి. వాళ్ళు వేదం నేర్చుకుంటారు. అంతేకాని జీవితమే వేదం కాదు వాళ్ళకి. అందుకే వాళ్ళకి ఆ అధికారం (అధ్యాపనం) లేదు. మరి శూద్రుడికి వేదం చదివే అధికారం లేదా? "వేదం చదవాలంటే ముందు ఉపనయనం కావాలి. ఉపనయన సంస్కారం ఉన్న వాళ్ళందరూ వేదం చదవటానికి అర్హులే కాని శూద్రులకి ఉపనయన సంస్కారం చెప్పబడలా ? అందుచేత వారు వేదాధ్యయనం చెయ్యరు. మరి స్త్రీలు వేదాధ్యయనం చెయ్యవచ్చా? స్త్రీలు చెయ్యవచ్చా అంటే స్త్రీలకి ఉపనయన సంస్కారం

ఉంటే వేదాధ్యయనం చెయ్యవచ్చు. ఆ సంస్కారం లేదు కదా ! ఉపనయనం లేకపోతే వేదాధ్యయనం లేదు. ఇందులో అనుమానం ఏముంటుంది? అయితే పూర్వకాలంలో స్త్రీలు వేదాధ్యయనం చేశారు కదా ! గార్గేయి, మైత్రేయి లాంటి వారు ఇంకా అనేకమంది వేదవేదంగాలన్నీ చదివారట కదా? గార్గేయి మైత్రేయి వీరిద్దరూ కూడా బృహదారణ్యకోపనిషత్తులో మనకి కనిపిస్తారు. గర్గుని కుమార్తె గార్గేయి. జనక మహారాజు ఆస్థానంలో యాజ్ఞవల్క్యుడితో వాదనకు తలపడుతుంది ఈవిడ. ఇక రెండో ఆవిడ మైత్రేయి. జనక మహారాజు మంత్రిమైత్రేయుని కుమార్తె. ఆధ్యాత్మిక విషయాలలో బాగా ఆసక్తి కలది. యాజ్ఞవల్క్యుడి దగ్గర ఉన్న ఆధ్యాత్మిక సంపదకి ముచ్చటపడి ఆయన్ని వివాహం చేసుకుంది. అప్పటికే ఆయనకి కాత్యాయని అనే భార్య, పిల్లలు కూడా ఉన్నారు. యాజ్ఞవల్క్యుణ్ణి శారీరక అవసరాల కోసం కాక ఆధ్యాత్మిక చింతనతో వివాహం చేసుకుంది. వీరిద్దరూ వేదాలు చదివారా? తెలియదు. ఆధ్యాత్మిక విషయాలలో మాత్రం బాగా ఆ శక్తి కలవాళ్ళు. శాస్త్రచర్చలు చేయగల సమర్ధులు. గంధర్వ అనే స్త్రీ యజ్ఞయాగాదుల నిర్వహణ గురించి జనక మహారాజుతో చర్చలు జరిపేది అని ఐతరేయ బ్రాహ్మణంలో చెప్పబడింది. యజ్ఞయాగాలు అనేవి వేదానికి సంబంధించినవి కాబట్టి ఈవిడ వేదాలు చదివి ఉండవచ్చు. ఐతరేయ బ్రాహ్మణంలోనే స్త్రీలకు ఉపనయనం చేసి వేదాలు నేర్పించే వారు అని ఉంది. అది గాక యజ్ఞయాగాలు జరుగుతున్నప్పుడు చివరలో దానికి సంబంధించిన మంత్రాలు కొన్ని యజమాని భార్య చదువవలసి ఉన్నది. ఆవిడే ఆ మంత్రాలు చదివేది. అవన్నీ యజ్ఞయాగాలకు సంబంధిచినవి. మరి యజ్ఞయాగాలంటే వేదమే. దీన్ని బట్టి చూస్తే **స్త్రీలు కూడా వేదాలు చదివేవారు అని**

**తెలుస్తోంది.** ఈ విషయం అరుణంలో కూడా చెప్పబడింది. పూర్వకాలంలో స్త్రీలకి ఉపనయనం జరిగేది. ఆ రోజుల్లో వాళ్ళకి రజోదర్శనం ఉండేది కాదు. కాబట్టి స్త్రీలకి కూడా పురుషులకు మల్లేనే ఉపనయనం జరిగేది. కాని వృత్రాసుర సంహారం తరువాత ఇంద్రుడు బ్రహ్మహత్యాపాతకాన్ని కొంత స్త్రీలకి ఇచ్చాడు. అప్పటి నుంచీ స్త్రీలకి రజోదర్శనం మొదలయింది. ఉపనయనం ఆగిపోయింది. వేదాధ్యయనం కూడా నిలిచిపోయింది. ప్రస్తుతం స్త్రీలు వేదాలు చదువుతున్న దాఖలాలు లేవు. ముఖ్యమైన విషయం ఏమంటే "మద్రాసుకు దగ్గర పదికిలోమీటర్ల దూరంలో ఒకావిడ వేదాలు చదువుకున్నది. 2006, 2007 ప్రాంతంలో నేను ఆవిడను కలవటం జరిగింది" అని విజయవాడ కృష్ణలంకకు చెందిన ఒక పెద్దాయన వేదపండితుడు (ఆయనకి షుమారు 90 సం॥ వయస్సు) నాకు చెప్పాడు. ఆయన పేరు వ్రాయటానికి ఒప్పుకోలేదు. ఆమె భర్త చైన్లు గారు అని కూడా చెప్పారు.

ఇంకా చెప్పాలంటే వేదమంత్రాలను దర్శించిన స్త్రీలు ఉన్నారు. భృగుమహర్షి భార్య ఉశన, గౌరీవీతి, చైలకి, జయ, ప్రాదురాక్షి, భరద్వాజపుత్రి, లోపాముద్ర, కద్రువ ఇలాంటి వారు చాలామంది ఉన్నారు అంటోంది శుక్లయజుర్వేదం. ఋగ్వేద మంత్రాలు కూడా కొంతమంది స్త్రీలు దర్శించారు. వీళ్ళని బ్రహ్మవాదినులు అనేవారు.

మరి ఈ రోజున స్త్రీలు వేదం చదవచ్చునా ? అంటే ఉపనయనం చేయబడిన స్త్రీ వేదాధ్యయనం చెయ్యవచ్చు? ఇందులో ఏ రకమైన అనుమానం లేదు. కాని కృష్ణావతార పరిసమాప్తి సమయంలో కలియుగంలో స్త్రీలకు వేదం చదివే అర్హత లేదు అని చెప్పాడు పరమాత్ముడు.

# 31. వరకట్నము

వివాహ సమయంలో వరుడికి వధువు తరఫున ఇచ్చే కట్నకానుకలనే వరకట్నము అంటారు. వరుడికి ఇచ్చే కట్నము. కట్నము కానుక, బహుమానము అని అర్థం. పిల్లకి వివాహం చేసి అత్తవారింటికి పంపుతున్న సమయంలో వరుడికి, అత్త మామలకు, ఆడబిడ్డలకు అందరికీ కానుకలు పంపటం ఆవారం. మా పిల్ల మీ ఇంటికి వస్తోంది. జాగ్రత్తగా చూసుకోండి. అని వారందరికీ తెలియచేస్తున్నాము. అలాగే వివాహ సమయంలో వరుడికి కట్నాలు చదివించటం జరుగుతుంది. స్థాలీపాకము, సదస్యము, నాకబలి, అప్పగింతలు వివాహం తరువాత గృహప్రవేశము, సత్యనారాయణ స్వామి వ్రతము. ఇవి కాక అత్తగారికి, ఆడపడుచుకు లాంఛనాలు. ఇవన్నీ ఇవ్వటం ఒక సాంప్రదాయంగా ఏర్పడింది.

కొంతకాలం క్రితం ఆడపిల్లల జనాభా తక్కువ ఉండేది. అందుకే ఎదురు ధనమిచ్చి పిల్లని తెచ్చుకునే వారు. మీలో చాలామందికి గుర్తుండే ఉంటుంది. మన వైపున పిల్లలు కాకుండా కేరళ ప్రాంతంలో 'పాలఘాట్' నుంచి ఆడపిల్లల్ని కొనుక్కు తెచ్చుకునే వారు. అలా తెచ్చుకుని వివాహం చేసుకునేవారు. వివాహం తరువాత వారికి పుట్టినిల్లు అంటే తెలియదు. పుట్టినిల్లు, మెట్టినిల్లు అంతా ఇదే. అలాగే వెళ్ళిపోయేవి వాళ్ళ జీవితాలు. అలాటి వాళ్ళు నాక్కూడా తెలుసు. మా తాతమ్మ వాళ్ళ అమ్మ పాలఘాట్ నుంచే వచ్చిందట. తరువాత కాలంలో కన్యాశుల్కం చెల్లించారు. ఈ రకమైన కన్యాశుల్కం కొంతకాలం రాజ్యమేలింది. తరువాత వరకట్న పిశాచి అందుకుంది. తలతాకట్టు పెట్టయినాసరే కట్నం చెల్లించాల్సిందే. ఆ కట్నం వేలు, లక్షలు దాటి కోట్లలోకి వెళ్ళిపోయింది. ఎంత కట్నం ఇచ్చినా సరే

ఇంకా కావాలి అని ఆడపిల్లకి వేధింపులు తప్పటం లేదు. ఒక్కోసారి కిరసనాయిలు డబ్బాలు తగలబడతాయి. గ్యాస్ స్టౌలు పేలతాయి. ఫలితం వధువు దుర్మరణం. ఈ రకమైన వార్తలు ప్రతినిత్యం మనం పేపర్లో చూస్తూనే ఉన్నాం. వరుడు బీదవాడా? అంటేకాదు. అమెరికాలో సాఫ్ట్‌వేర్‌లో పని చేస్తున్నాడు. మరి దీనికి కారణం ఏమిటి? అత్యాశ. కష్టపడకుండా డబ్బులు సంపాదించాలనే కోరిక. తెల్లవారేసరికి ధనవంతుడై పోవాలి.

ఇది ఒక సాంఘిక దురాచారం. బాల్యవివాహంలాగా, సతీసహగమనం లాగా, కన్యాశుల్కంలాగా వరకట్నం కూడా ఒక దురాచారమే. ఇది కేవలం దురాచారం కాదు కాన్సరు లాంటి దారుణమైన వ్యాధి. ఇక్కడ ఒక చిన్న ఉదాహరణ. పిల్లవాడు సాఫ్ట్‌వేర్ ఉద్యోగి. ఆస్ట్రేలియా వెడుతున్నాడు. పిల్లవాడి తండ్రి రాష్ట్రప్రభుత్వంలో గుమాస్తా. తల్లి సెకండరీ గ్రేడ్ టీచరు. ఒక్కడే కొడుకు. పిల్ల తండ్రి ఎల్.ఐ.సి.లో ఆఫీసరు. ఇద్దరే కుమార్తెలు, పెద్దపిల్ల యం.బి.ఎ., చేసింది. సంబంధం బాగుంది అని వివాహం చేశారు. పెళ్ళి కాగానే పిల్లవాడు మామగారితో హనీమూన్‌కి వెళ్ళొస్తాం. మలేషియా, సింగపూరులకు ట్రిప్పు ఏర్పాటు చెయ్యండి అన్నాడట. పిల్లతండ్రి నోరు తెరిచాడు. మూడునిద్రలకి వచ్చినప్పుడు కారు కొనిపెట్టండి అన్నాడట. ఫోన్లే మారుతీకారు తీసుకుందాం. అని రంగు చూసుకురండి. నేను వెళ్ళి డబ్బులు కట్టేస్తాను. అన్నాడు పిల్లతండ్రి. అలా కాదు. కారు మేం చూసుకుని వచ్చాం. ఖరీదు ముప్ఫై లక్షలు అన్నాడట అల్లుడు. మూర్ఛపోయినంత పనైంది మామగారికి. కళ్ళ వెంబడి నీళ్ళు తిరిగాయి. సాఫ్ట్‌వేర్ ఉద్యోగి అంటే తేలికగా వస్తాడా? ఆ మాత్రం ఇవ్వకపోతే ఎలా ? అందట అత్తగారు. ఎలాగూ మగపిల్లలు

లేరు కదా! ఆ ఇచ్చేదేదో ఇప్పుడే ఇచ్చేస్తే పోలా? ఎందుకీ గోల? అన్నాడట పిల్లవాడి తండ్రి. అన్నింటికన్న విచిత్రం ఏమంటే పెళ్ళయిన తరువాత ఉద్యోగానికని బెంగుళూరు వెళ్ళి కొత్త కాపురం పెట్టిన వారంరోజులకే పిల్లకికూడా చెప్పాపెట్టకుండా ఆస్ట్రేలియా వెళ్ళిపోయాడు. పదిరోజులకి గాని వీళ్ళకి తెలియలేదు. అదేమిటి? అంటే ఉద్యోగానికి రమ్మన్నారు వెళ్ళిపోయాడు తప్పేమిటి? అందట అత్తగారు. పెళ్ళై ఇంకా ఏడాదికాలా! పిల్ల పుట్టినింట్లోనే ఉంది. ఇవి మనదృష్టికి వచ్చినవి. మన దృష్టికి రానివి, వెలుగుచూడనివి ఎన్నెన్నో? అందుకే 'జామాతాదశమగ్రహః' అల్లుడు పదవగ్రహము అన్నారు. వీటన్నింటికీ కారణం ధనం.

ఈ వరకట్నం విషయంలో వేదం ఏమంటోంది? **వేదంలో కట్నం ప్రసక్తి లేదు.** ఋగ్వేదంలో పదవ మండలంలో 85వ సూక్తం వివాహాన్ని గురించి చెబుతున్నది. దీన్ని వివాహసూక్తం అంటారు.

వరుడి మిత్రులు కాని, బంధువులు కాని పిల్లతండ్రి దగ్గరకు వచ్చి మీ పిల్లని మాకిమ్మని కోరేవారు. కన్యాదాత వరుని గుణగణాలు పరిశీలించి, తాను తనవారు తృప్తి చెందితేనే వివాహానికి ఒప్పుకునే వారు. ఇక వివాహం వధువు ఇంట్లోనే జరగాలనే నియమం ఏమీలేదు. వధువు ఇంట్లోగాని వరుని ఇంట్లోగాని వీలునుబట్టి జరిగేది. ఓ కళ్యాణీ ! నీ సౌభాగ్యం కోసం నేను నీ పాణిగ్రహణము చేస్తున్నాను. నన్ను భర్తగా స్వీకరించి వృద్ధాప్యం వచ్చే వరకు నాతోనే ఉండవలసింది. ఓ ఇంద్రా! ఈమె గర్భమున పదిమంది సంతానము కావాలి. భర్తతో కలిపి పదకొండుమంది ఉండాలి. అంటే భర్తని కూడా తన బిడ్డలాగే చూసుకోవాలి. అని అంటున్నారు. వధువా! అత్తవారింటికి నీవే పట్టపురాణివి. అత్తమామలను ఆడపడుచులను, మరదులను అందరినీ

జాగ్రత్తగా చూసుకో. పశువులను ప్రేమగా చూడవలసింది. అంటున్నారు. అంతేకాని **ఓ వధువా! నీ తండ్రి నుంచి ధనం మూట కట్టుకురా! అవి ఎక్కడా చెప్పలేదు.**

ఇది ఒక దుష్టసంప్రదాయం. కొంతమంది స్వార్ధపరులు ఆచారం పేరుతో ఏర్పాటు చేసిన దారుణం. ఇలాంటి వారంతా అశుద్ధంలో తిరిగే పురుగులై కొన్నివేలసార్లు జన్మిస్తారు. అని చెబుతుంటూడు ఒక పెద్దాయన.

జరిగిపోయిన కాలం వదిలేస్తే ఓ భావిభారతపౌరులారా ! ఆడపిల్ల అత్తవారింటికి రావలసింది వేలు, లక్షలు పట్టుకుని కాదు. భర్తయొక్క చిటికెన వ్రేలు పట్టుకుని రావాలి. పిల్లగుణవంతురాలు కావాలి సంప్రదాయ కుటుంబంలోంచి రావాలి. అలాగే పిల్లవాడు విదేశాల్లో ఉన్నాడనో, అతడి వెనక ఆస్థులున్నాయనో పరుగులెత్తకండి. యోగ్యుడైనవాణ్ణి, సంస్కారవంతుడైన వాణ్ణి ఎంచుకోండి. వరకట్న పిశాచిని తరిమికొట్టండి. **లక్షలు సంపాదించే వాడికన్న యోగ్యుడైన పిల్లవాడు మేలు అని గుర్తించండి. అలాగే కోట్లరూపాయలు కట్నంగా తెచ్చే పిల్లకన్న సంప్రదాయబద్ధమైన పిల్ల మేలు అని తెలుసుకోండి.**

# 32. వేదాలకు ఆదరణ రావాలంటే

పూర్వకాలంలో వేదాలకు విపరీతమైన ఆదరణ ఉండేది. బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులందరూ వేదం చదువుకునేవారు. కొంచెం గ్రహణశక్తి ఉన్నవారు వేదంతోపాటుగా దాని అర్థంకూడా చదివేవారు. వ్యాసుడు వేదాలు విభజించి వాటిని తనశిష్యులకు ఇచ్చి ప్రచారం చెయ్యమన్నాడు. అలా గురుపరంపరగా వచ్చిన వేదాలు శాఖోపశాఖలుగా విస్తరించినాయి. సామవేదానికి వెయ్యి శాఖలు వచ్చాయంటే ఆ వేదానికి ఎంత ఆదరణ ఉన్నదో మనకు అర్థమవుతుంది. రానురాను దేశకాల మానాలలో మార్పులు చోటు చేసుకున్నాయి. విదేశీ దండయాత్రలు. మహమ్మదీయుల రాకతో హిందూత్వం కొంతవరకు దెబ్బతిన్నది. ఆ తరువాత ఆంగ్లేయుల రాకతో పూర్తిగా మంట కలిసిపోయింది. ఉపాధికోసం వారిని ఆశ్రయించక తప్పలేదు. ఈ సందర్భంలోనే ఆంగ్లభాష, పాశ్చాత్య నాగరికత నేర్చుకోవలసిన అవసరం ఏర్పడింది. సామానమైన మానవుడు జీవించాలంటే వారిని అనుకరించక, ఆశ్రయించక తప్పలేదు. ఈ పరిస్థితులలో వేదానికి ఆదరణ తగ్గటం మొదలుపెట్టింది. ఆంగ్లం చదువుకున్న వారికే ఉద్యోగం, దాంతో వేదాలు నశించిపోయినాయి. అంటే వేదాలకు ఉన్న శాఖలు బాగా దెబ్బతిన్నాయి. ఈ క్రమంలో

ఋగ్వేదానికి 21 శాఖలుంటే – ప్రస్తుతం ఒకటే దొరుకుతోంది

కృష్ణ శుక్లయజుర్వేదాలు రెండింటికీ కలిపి 109 శాఖలుంటే – ప్రస్తుతం (4+2) ఆరు మాత్రమే దొరుకుతున్నాయి

సామవేదానికి వెయ్యిశాఖలుంటే – ప్రస్తుతం మూడు మాత్రమే దొరుకుతున్నాయి

అధర్వవేదానికి 50 శాఖలుంటే – ప్రస్తుతం రెండు మాత్రమే దొరుకుతున్నాయి

ఈ రకంగా వేదం బాగా నశించిపోతోంది. కారణం ఇంగ్లీషు చదువులు. వేదం చదివిన వాడికి ఉపాధి కరువు. దైనందిన అవసరాలు తిండికీ బట్టకీ కూడా వెతుక్కోవలసిన పరిస్థితి వేదపండితులు కొంతమంది తినటానికి తిండికూడా సరిగాలేక అతిదయనీయమైన దరిద్రంలో జీవిస్తున్నారంటే మనమంతా సిగ్గుపడాలి. ఇటువంటి పరిస్థితిలోకూడా కొన్ని కుటుంబాలు వేదం నేర్చుకొని, వైదిక విజ్ఞానాన్ని ఈ మాత్రమైనా మనకి అందిస్తున్నారంటే, అటువంటి వారందరికీ నిజంగా మనమంతా, జాతి మొత్తం రెండు చేతులెత్తి నమస్కారంచెయ్యాలి. పాదాభివందనం చెయ్యాలి. ఏం చేసినా జాతి వారిఋణం తీర్చుకో లేదు.

ఏది ఏమైనా వైదిక వాఙ్మయం ఇలా నాశనం కావటం మన దురదృష్టం ఇందులో అనుమానం లేదు.

ఇక పోతే ఒక్క విషయం. అవి నాశనమై పోయాయి. లేకపోతే మనకి అనేక విషయాలు తెలిసేవి. అంటూ చెప్పటం అనవసరం. పోయినవి పోయినాయి. ఉన్న వాటిని జాగ్రత్త చేసుకోండి. వాటిలో ఉన్న విషయాలను అర్థం చేసుకోండి. ఇప్పటికైనా పోగా మిగిలిన వాటిని మనం ఆదరిస్తుంటే, వాటిని తరచి చూసి వాటిలో విషయాలు మనం తెలుసుకొంటుంటే, అవి కూడా ఉంటే బాగుండేది ఇంకా ఎక్కువ విషయాలు తెలిసేవి అనుకోవచ్చు. అదేం జరగటం లేదు. ఇక్కడ నన్ను క్షమించండి. నా మీద కోపం తెచ్చుకోవద్దు. వాస్తవాన్ని ఆలోచించండి. వేంకటేశ్వర స్వామివారు వేదిక్ యూనివర్శిటీని ప్రారంభిస్తే వేదాలకు ఆదరణ పెరగదు. దానివల్ల కేవలం ఒకశాతం

వరకు మాత్రమే ప్రయోజనం ఉంటుంది. అంతే, అంతకన్న ఆదరణ రాదు.

వేదాలకు ఆదరణ పెరగాలంటే, వేదం చదువుకున్న వాడికి జీవనభృతి కలిగించాలి. వేదపండితుడితో దేవాలయంలో వేదపారాయణ చేయిస్తున్నాం. అతడికి కొంత భృతి కూడా ఇస్తున్నాం కదా? నిజమే. మీరు ఇచ్చేభృతి వితంతువుకిచ్చే మనోవర్తింలాంటిది. నన్ను అపార్ధం చేసుకోవద్దు. ఇది చాలదు. ఇది కాదు కావలసింది. మరేంచెయ్యాలి? ఇప్పటికే మీకు అర్థం అయి ఉంటుంది. వేదాలకి కూడా ఇతరమైన చదువుతోపాటుగా, డిగ్రీలతో పాటుగా సమానహోదా కల్పించాలి. అంటే వేదిక్ డిగ్రీ. వేదిక్ బి.ఎ., వేదిక్ ఎం.ఎ. ఇలా వేదాన్నికూడా పాఠ్యాంశగా ప్రవేశపెట్టండి. ఆ డిగ్రీని కూడా ఇతర డిగ్రీలతో పాటుగా సమానంగా చూడండి. బ్యాంకులో ఉద్యోగానికి డిగ్రీఅర్హత. అది వేదిక్ డిగ్రీ కూడా కావచ్చు. అలా ఎప్పుడైతే వేదాలనుకూడా మామూలు పాఠ్యాంశాలుగా ప్రవేశపెట్టగలిగామో, అప్పుడు వేదాలకు ఆదరణ అనేది దానంతట అదే పెరుగుతుంది. ఆసక్తి ఉన్నవాడు చదువుతాడు.

ఇప్పుడు వచ్చే ప్రశ్న ఇంకోటుంది. వేదాల్లో డిగ్రీ తీసుకుని ఏం చేస్తారు? అలా చెప్పాలంటే మిగిలిన వాటిలో (విభాగాల్లో) డిగ్రీలు తీసుకుని మాత్రం ఏం చేస్తున్నారు? ఉదాహరణకు బి.ఎ డిగ్రీని తీసుకుంటే అందులో అనేక విభాగాలు ఉన్నాయి. కొన్నింటి పేర్లు కూడా మనకి తెలియవు. వీరంతా ఏం చేస్తున్నారట? అంతేకాదు లలిత కళలలో కూడా డిగ్రీలున్నాయి కదా? సంగీతంలో బి.ఎ. డాన్సులో ఎమ్.ఎ., ఈ రకంగా వేదాన్నికూడా మిగిలినచదువులాగా చేయగలిగితే, వేదానికి ఆదరణ అనేది పెరుగుతుంది. కేవలం వేదం

చెప్పటం కాదు. చదివినంత వరకు దానికి అర్థంకూడా చెప్పగలిగితేనే వేదానికి ఆదరణ పెరుగుతుంది. **మీరు చదవండి. మీకు ఉపాధి దొరుకుతుంది. అని భరోసా ఇవ్వగలిగితే వేదంనేర్చుకోవటానికి చాలా మంది ముందుకు వస్తారు.** అవేమీ మనం చెయ్యకుండా వేదం చదువుకోవటానికి ఎవరూ రావటం లేదు అంటే ఎందుకొస్తారు. కొంచెం ఆలోచించండి. వేదానికి నిజంగా ప్రాచుర్యంరావాలి అని అనుకుంటే, యూనివర్సిటీ స్థాయిలో దాన్ని పాఠ్యాంశంగా చేర్చండి. వాళ్ళకి డిగ్రీలు, పిహెచ్.డి.లు ఇవ్వండి. ఇతర డిగ్రీలతో పాటు సమాన హోదా కల్పించండి.

ఈ బాధ్యత పూర్తిగా ప్రభుత్వానిది. గతాన్ని వదిలేస్తే వర్తమానంలో 2014 ఎన్నికలలో బిజెపి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది కాబట్టి, వారికి భారతీయత మీద అత్యంతమైన గౌరవం ఉంది కాబట్టి, ప్రదానమంత్రి శ్రీ నరేంద్రమోడీ గనక చెయ్యాలనుకుంటే ఈపని తప్పనిసరిగా నెరవేరుతుంది. అప్పుడు 'విద్యారణ్యభాష్యము' 'పార్థసారథీయము' వంటి అనేక పుస్తకాలు వస్తాయి. వేదానికి బహుళ ప్రచారం జరుగుతుంది.

# 33. పంచశాంతులు

వేదం చదవటం మొదలు పెట్టినప్పుడు ముందుగా శాంతిమంత్రాలు చదవాలి. ఈమంత్రాలు ఐదువేదాలకు విడివిడిగా ఉన్నాయి. ఐదువేదాలు అంటే 1.ఋగ్వేదము 2. కృష్ణయజుర్వేదము 3. శుక్లయజుర్వేదము 4. సామవేదము 5.అధర్వణవేదము. ముందుగా మనం శాంతిమంత్రాలు చదివి తరువాత వేదంలోకి వెడదాం.

**1. ఋగ్వేద శాంతి మంత్రం :**

**ఓం వాఙ్ మే మనసి ప్రతిష్ఠితా ! మనో మే వాచి ప్రతిష్ఠతమ్ ।**

**ఆవిరావీర్మ ఏధి ! వేదస్య మ ఆణీస్థః శ్రుతం మే మా ప్రహాసీః ।**

**అనేనాధీతేనాహోరాత్రాన్సందధామి। ఋతం వదిష్యామి। సత్యం వదిష్యామి।**

**తన్మామవతు । తద్వక్తారమవతు । అవతు మామ్ । అవతు వక్తారమ్ ।**

**ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ॥౧॥**

నా వాక్కు నిరంతరము మనస్సునందు స్థిరమగుగాక. నా మనస్సు వాక్కునందు నెలకొని ఉండునుగాక. జ్యోతిస్వరూపమైన ఓ పరమాత్మా ! నా అజ్ఞానము పోగొట్టి జ్ఞానము పొందేట్లుగా అనుగ్రహించవలసినది. ఓ మనోవాక్కులారా! నాకు విజ్ఞానము ప్రసాదించటానికి సమర్ధులగుదురుగాక. నేను విన్న విషయాన్ని, అధ్యయనం చేసిన విషయాన్ని మర్చిపోకుండా రాత్రింబవళ్ళు అనుసంధానము చేయుదునుగాక. యధార్ధ వస్తువైన పరమాత్మను గురించి తెలుసుకుంటాను. సత్యాన్ని తెలుసుకుంటాను. ఆ పరమాత్మ

నన్ను రక్షించును గాక. నా గురువును రక్షించునుగాక. త్రివిధతాపములు శాంతించునుగాక.

**2. కృష్ణయజుర్వేద శాంతి మంత్రం :**

**ఓం సహ నావవతు। సహ నౌ భునక్తు। సహ వీర్యం కరవావహై**

**తేజస్వి నావధీతమస్తు । మావిద్విషావహై ॥**

**ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ॥౨॥**

గురుశిష్యులైన మమ్ము ఆ పరమాత్మ రక్షించునుగాక. మాకు పోషణ కలుగచేయునుగాక. మేమిద్దరము కలసి విద్యకు సామర్థ్యము కలుగచేతుముగాక. మేము చదివిన విద్య తేజస్వంతమగునుగాక. మేము పరస్పరము ద్వేషము లేకుండా ఉందుముగాక. త్రివిధతాపములు శాంతించునుగాక.

**3. శుక్ల యజుర్వేద శాంతి మంత్రం :**

**ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే ।**

**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా వ శిష్యతే ॥**

**ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ॥3॥**

ఆ బ్రహ్మము పూర్ణమైనది. ఈజగత్తు కూడా పూర్ణమైనదే. ఆ పూర్ణము నుండే ఈ పూర్ణము వచ్చింది. ఈ పూర్ణముకూడా ఆ పూర్ణముగానే ప్రకాశిస్తున్నది. త్రివిధ తాపములు శాంతించునుగాక.

**4. సామవేద శాంతి మంత్రం :**

**ఓం ఆప్యాయంతు మమాంగాని వాక్ ప్రాణశ్చక్షుః శ్రోత్రమథోబలమింద్రియాణి**

చ సర్వాణి । సర్వం బ్రహ్మోపనిషదమ్ । మాహం బ్రహ్మ నిరాకుర్యామ్ ।

మా మా బ్రహ్మనిరాకరోత్। అనిరాకరణమస్త్వ నిరాకరణం మేస్తు ।

తదాత్మని నిరతే య ఉపనిషత్సు ధర్మాస్తే మయి సంతు। తే మయి సంతు॥

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ॥౪॥

ఉపనిషత్తులచే ప్రబోధించబడే బ్రహ్మము నా వాక్కు, కళ్ళు, చెవులు, ప్రాణాలు, బలము, ఇంద్రియములను రక్షించునుగాక. బ్రహ్మము నన్ను నిరాదరించకుండును గాక. నేను బ్రహ్మమును నిరాదరించకుండా నన్ను అనుగ్రహించునుగాక. ఉపనిషత్తులలో చెప్పిన ధర్మాలు నాలో స్థిరపడి ఉండును గాక. త్రివిధతాపములు నశించునుగాక.

**5. అధర్వణ వేద శాంతి మంత్రం :**

ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః

స్థిరైరంగై స్తుష్టువాగ్ంం సస్తనూభిః వ్యశేమ దేవహితం యదాయుః

స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవాః స్వస్తినపూషా విశ్వవేదా

స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తినో బృహస్పతిర్ధధాతు ॥

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ॥౫॥

ఓ దేవతలారా ! మంచివిషయాలనే మా చెవులతో విందుముగాక. మంచి దృశ్యాలనే మా కంటితో చూసెదముగాక. బలమైన అవయవాలతో ఆరోగ్యంగా ఉండి మిమ్ము స్తుతిస్తూ జీవించెదముగాక. ప్రాచీనుడు, ప్రసిద్ధి చెందిన వాడు, కీర్తివంతుడు అయిన ఇంద్రుడు, అన్నీ తెలిసిన పూష (సూర్యుడు) మిక్కిలి వేగముగల వాయుదేవుడు, ఆధ్యాత్మిక సంపదను రక్షించే బృహస్పతి మాకు విషయాలు గ్రహించగల బుద్ధిని, వాటిని అనుసరించగల ధైర్యాన్ని ఇచ్చి అనుగ్రహింతురు గాక. త్రివిధతాపములు శాంతించునుగాక. 1. ఆధిదైవిక, 2. ఆధిభౌతిక 3. ఆధ్యాత్మిక తాపాలనే త్రివిధ తాపములు అంటారు.

# 34. వేదం ఏం చెబుతోంది ?

అధర్వణ వేదానికి సంబంధించినది ముండకోపనిషత్తు. అందులో కథ. పూర్వ కాలంలో పాంచాల దేశంలో త్రిగర్త అనే గ్రామం ఉండేది. ఆ గ్రామంలో 'శునకు'డు అనే ఒక గొప్ప పండితుడు ఉండేవాడు. ఆయన దగ్గర పాండిత్యంతో పాటుగా సిరిసంపదలు కూడా పుష్కలంగా ఉండేవి పైగా ఉదార స్వభావుడు. విద్యమీద విపరీతమైన ఆసక్తి గలవాడు. ఈ కారణంచేత ఆ ప్రాంతంలో ఉండే విద్యార్థులు చాలామందికి తానే భోజనము, వసతి కూడా ఏర్పాటు చేసి విద్య నేర్పించేవాడు. దాంతో ఆయన కీర్తిప్రతిష్ఠలు నలుమూలలా వ్యాపించాయి. ఆ యింట్లో నిరంతరం అతిథి సత్కారం కూడా జరుగుతుండేది. దాంతో ఆయన్ని అందరూ 'ఆదర్శగృహస్తు' అంటుండేవారు.

శునకుని పెద్ద కుమారుడు శౌనకుడు. విద్య నేర్చుకొనటానికి అంగీరసుడి దగ్గరకు వెళ్ళాడు. కఠోరమైన నియమాలు పాటిస్తూ విద్యాభ్యాసం పూర్తి చేశాడు. మంచి మేధావిగా గుర్తింపు పొందాడు. ఆశ్రమంలోని వారంతా శౌనకుడి దీక్షకు, మేధాసంపత్తికి మెచ్చుకునేవారు. విద్యాభ్యాసం పూర్తి అయింది. సమావర్తనం ఏర్పాటు చేశారు గురువుగారు. సమావర్తనం పూర్తి కాగానే ఇంటికివెళ్ళి నచ్చిన కన్యను వివాహమాడి గృహస్థాశ్రమంలో ప్రవేశించాలి. కాని వివాహం చేసుకోవాలని, గృహస్తు కావాలని లేదు శౌనకుడికి. మోక్షమార్గంలో చరించాలని ఉంది. అందుకని ఒంటరిగా గురువుగారి దగ్గరకు వెళ్ళి "గురుదేవా ! దేన్ని గురించి తెలుసుకుంటే అన్నీ తెలుస్తాయో, దయచేసి ఆ విషయాన్ని నాకు వివరించండి" అన్నాడు. ఆ మాటలు వినగానే అర్థమయింది గురువుగారికి. ఇతడు బ్రహ్మవిద్యను గురించి

అడుగుతున్నాడు అని. ఇప్పుడు చెబుతున్నాడు. "నాయనా శౌనకా! **లోకంలో రెండు రకాల విద్యలున్నాయి. అవి 1. అపరావిద్య 2. పరావిద్య.** వీటినే లౌకికవిద్య. అలౌకిక లేదా పారలౌకిక విద్య అని కూడా అంటారు. లౌకికమైన కోరికలు తీర్చుకోవటానికి ఉపయోగించేది అపరావిద్య. ఈ లోకంలో బ్రతకటానికి కావలసిన విద్య, ఉద్యోగము, వివాహము, గృహము, సంతానము, ఉన్నతపదవులు, గౌరవము, పేరుప్రతిష్ట ఇవన్నీ పొందటానికి ఉపయోగించేది. 2. పరావిద్య. ఇది బ్రహ్మవిద్య, మోక్షవిద్య. ఇదే జ్ఞానవిద్య. అపరావిద్యని అభ్యసించినవాడు ఈ లోకంలో కావలసినవన్నీ పొందగలుగుతాడు. అదే పరావిద్య నభ్యసించిన వాడికి పునర్జన్మ ఉండదు. జన్మరాహిత్యం కలుగుతుంది. అతనికి సాయుజ్యం కలుగుతుంది. కాబట్టి లౌకిక సుఖాలు కావాలంటే అపరావిద్య, మోక్షం కావాలంటే పరావిద్యలను అభ్యసించాలి" అన్నాడు. ఈ మాటలు విన్న శౌనకుడు "ఓ గురుదేవా ! నాకు లౌకిక సుఖాల మీద కోరికలేదు. మోక్షమార్గాన్ని చూపండి" అన్నాడు. అప్పుడు ఆంగీరసుడు తన శిష్యుడైన శౌనకుడికి **పరావిద్యను** ఉపదేశించాడు.

ఇలాగే ఛాందోగ్యోపనిషత్తులో **'భూమావిద్య'** అని ఒక కథ ఉంది. ఒకసారి నారద మహర్షి సనత్కుమారుడి ఆశ్రమానికి వెళ్ళాడు. సనత్కుమారుడు నారదుణ్ణి సాదరంగా ఆహ్వానించాడు. ఉచితాసనం చూపించాడు. కూర్చున్నాడు నారదమహర్షి. కుశల ప్రశ్నలు అయిన తరువాత "నారద మహర్షీ ! నీ రాకకు కారణం ఏమిటి?" అన్నాడు సనత్కుమారుడు. "ఏమీ లేదు మహర్షీ! ఏ కారణంచేతనో గాని నాకు మనశ్శాంతి లేకుండా ఉన్నది. దానికోసమని మీ దగ్గరకు వచ్చాను." అన్నాడు. విన్నాడు సనత్కుమారుడు. విషయం అర్థమైంది. కాని అది

నారదుడికి కూడా తెలియాలి. అందుకే నారదుణ్ణి అడిగాడు. "నువ్వు ఏ విద్యలు అభ్యసించావు నారదా?" అన్నాడు. దానికి నారదుడు "నీకు తెలియని విషయం ఏముంది మహర్షీ! వేద వేదాంగాలు చదివాను. ఎన్నో కళలు నేర్చుకున్నాను. సంగీతము, సాహిత్యము, సాధన చేశాను. ఒకటేమిటి? ఈ లోకంలో నాకు తెలియని విద్య అంటూ ఏదీ లేదు. అయినా నాకు మనశ్శాంతి కలగటం లేదు. ఆత్మజ్ఞానం లభించలేదు. ఆత్మజ్ఞానం కలిగితే అన్ని దుఃఖాలు వాటంతట అవే నశిస్తాయని విన్నాను.'' అన్నాడు. ఆ మాటలు విన్న సనత్కుమారుడు "ఓ నారదా! నువ్వు చదివిన దానికి ప్రతిఫలం నీకు దక్కింది కదా?" అన్నాడు. అర్థం కాలేదు నారదుడికి. మళ్ళీ సనత్కుమారుడే అన్నాడు. "నారదా! నువ్వు లౌకికమైన విద్యాభ్యాసం చేశావు. దానివల్ల ఈ లోకంలో ధనము, ధాన్యము, సిరిసంపదలు లభిస్తాయి. గౌరవము లభిస్తుంది. నువ్వు ఎక్కడికి వెళ్ళినా మంచి ఆదరణ లభిస్తుంది అందరూ నీకు నమస్కారం చేస్తారు. నిన్ను గౌరవిస్తారు. సత్కరిస్తారు. అటువంటి గౌరవసత్కారాలకు నీకు కొదవలేదు కదా? అవి పుష్కలంగా నీకు లభిస్తూనే ఉన్నాయి కదా? నువ్వు చదువుకున్న దానికి నీకు తగిన ఫలితం లభిస్తోంది కదా? మరింకేం కావాలి?" అన్నాడు. ఇవే మాటలు లౌకికంలో చూడండి. ఒకాయన వచ్చాడు. "స్వామీ! నేను బి.టెక్ పాసయ్యాను. రెండుసార్లు బంగారు పతకాలు పొందాను. ప్రధానమంత్రి కూడా నన్ను సత్కరించారు. నా వయస్సు 35 సంll ఇప్పుడు నేను ఒకపెద్ద కంపెనీలో మంచి ఉద్యోగం చేస్తున్నాను. నెలకు ఐదు లక్షలు నా జీతము" అన్నాడు. బాగుంది నీకు ఇంకేం కావాలి? నువు చదువుకున్న దానికి తగిన ఫలితం నీకు వచ్చింది కదా? ఇప్పుడు నారదుడి పరిస్థితి అదే. అతను చదివిన దానికి ఫలితం అతనికి దక్కుతోంది. ఎక్కడికి

వెళ్ళినా గౌరవ మర్యాదలు, సత్కారాలు, నమస్కారాలు, పాదాభివందనాలు. వీటికి లోటులేదు. మరింకేం కావాలి? అదే మాట అడిగాడు సనత్కుమారుడు. మెల్లగా చెప్పాడు నారదుడు. "స్వామీ నాకు మనశ్శాంతి లేదు" అన్నాడు. వెంటనే అడిగాడు సనత్కుమారుడు. "నారదా ! నువ్వు చదివిన దాని ఫలితం నీకు వస్తోంది. మనశ్శాంతి లేదు అంటున్నావు. మనశ్శాంతి కోసం నువు ఏం చదివావు?" ఆశ్చర్యంగా చూశాడు నారదుడు. అదేమిటో అర్థం కాలా? అందుకే 'మనశ్శాంతి కోసం నువు ఏంచదివావు?' అన్నాడు. అప్పుడు సనత్కుమారుడే చెప్పాడు. 'నారదా! **వేదంలో రెండు రకాల విద్యలున్నాయి 1. అపరావిద్య.** దీన్నే లౌకిక విద్య అంటారు. దీన్ని అభ్యసించిన వారికి లౌకికమైన ఫలితమే వస్తుంది. అదే ఇప్పుడు నువు పొందుతున్నది. **ఇక రెండవది పరావిద్య.** ఇదే బ్రహ్మవిద్య మోక్షవిద్య. ఈ విద్యను అభ్యసించిన వారికి లౌకికమైన విషయాలతో సంబంధం ఉండదు. తామరాకు మీద నీటిబొట్టు లాగా భవబంధాలలో చిక్కుకోడు. కుమ్మరి పురుగు బురదలోనే తిరుగుతుంది. కాని దాని వంటికి బురద మాత్రం అంటదు. అలాగే అతడికి కూడా ఏ బంధాలు ఉండవు. అన్నీ బాధ్యతలుగా నిర్వర్తిస్తాడు. కష్టాలు వస్తే క్రుంగిపోడు. సుఖాలు కలిగితే ఆనందించడు. నిరంతరము పరమాత్మ ధ్యానంలోనే కాలం గడుపుతాడు. అతడికి జన్మరాహిత్యం కలుగుతుంది. పునర్జన్మ ఉండదు" అన్నాడు. ఆ విషయాలు పూర్తిగా ఆకళింపు చేసుకున్న నారదుడు పరావిద్యను బోధించమని అడిగాడు. అప్పుడు పరావిద్యను ఉపదేశించాడు సనత్కుమారుడు. అదే భూమావిద్య. బ్రహ్మవిద్య.

దీన్ని బట్టి మనకి తెలిసిందేమిటంటే వేదాలలో రెండు రకాల విద్యలున్నాయి. **వేదం ఏం చెబుతోంది? అంటే ఈ రెండు రకాల విద్యలనే చెబుతోంది. అవే 1. అపరావిద్య 2. పరావిద్య.**

వేదం మొత్తం నాలుగు భాగాలుగా ఉన్నది అని చెప్పుకున్నాం కదా. ఈ మొత్తం వేదంలో, నాలుగు వేదాలలోను కూడా చూచినట్లైతే ఎక్కువ శాతము అపరావిద్యే మనకి కనిపిస్తుంది. పండితులెవరూ కూడా నామీద కోపగించవద్దు. సంహిత భాగము అంతా మంత్రభాగము. ఋక్సంహితలో 1028 సూక్తాలు ఉంటాయి. సూక్తాలు అంటే స్తుతులు. దేవతలని మనం చేసే ప్రార్థనలు. దేవతలను అనేక మంత్రాలతో ప్రార్థించి ఓ దేవతా నాకు ధనం కావాలి. పుత్రులు కావాలి. సుఖం కావాలి. రాజ్యం కావాలి. ఇలా ఏదో ఒకటి కావాలనే అడుగుతాము. ఈ సూక్తాలలో ఎక్కువ భాగము 99 శాతము అలాంటివే. మిగిలిన వేదాలలోని మంత్రాలు. దేవతలను అర్చించటానికి, వారికి హవిస్సులు ఇవ్వటానికి సంబంధించినవి. ఇలా ఏ వేదంలోనైనా సంహిత భాగంలోని మంత్రాలతో దేవతలను ప్రార్థించి మన కోరికలను తీర్చమని అడుగుతాము. ఇది అపరావిద్య. ఇక బ్రాహ్మణ భాగానికి వెళ్ళినట్లైతే యజ్ఞయాగాది క్రతువులు చేసేందుకు విధివిధానాలను వివరించేవి బ్రాహ్మణాలు. ఈ యజ్ఞయాగాదుల వల్ల దేవతలు ప్రీతి చెంది మన కోరికలు తీరుస్తారు. కాబట్టి ఇదికూడా అపరావిద్యయే.

జ్ఞానవిద్య అనబడే ఉపనిషత్తులు కూడా చాలావరకు అపరావిద్యనే బోధిస్తున్నాయి. అన్నిరకాలైన దేవతల మంత్రాలు, ఉపాసనలు వీటిలోనే చెప్పబడ్డాయి. అటువంటి భాగము అంతా అపరావిద్యయే. ఇక ఉపనిషత్తులలో కొన్ని వేదాంతము, పరమేశ్వరతత్త్వము బోధిస్తాయి. అవి పరావిద్య. ఈ విధంగా చూస్తే వేదంలో సంహిత, బ్రాహ్మణాలు చాలావరకు అపరావిద్య. ఉపనిషత్తులలో చెప్పింది పరావిద్య. ఇప్పుడు రెండురకాల విద్యలు ఎప్పుడు, ఎక్కడ, ఎలా చెప్పబడ్డాయో చూద్దాం.

# 35. అపరావిద్య

వేదంలో రెండు రకాల విద్యలు చెప్పారు. 1. అపరావిద్య 2. పరావిద్య. అపరావిద్య అంటే లౌకిక విద్య. ఈ లోకంలో కావలసిన సుఖాలు పొందటానికి ఉపయోగించేది, సిరిసంపదలు, భోగభాగ్యాలు, ఉన్నత పదవులు, గౌరవము, కీర్తి, ప్రతిష్ఠ మొదలైనవి పొందటానికి ఉపయోగించేది. ఇది కర్మకాండ. ఇక రెండవది పరావిద్య. ఇది జ్ఞానకాండ మోక్షవిద్య. మరణానంతర సుఖం పొంటానికి ఉపయోగించేది. అది కూడా శాశ్వతమైన సుఖం పొందటానికి ఉపయోగించేది. మరణానంతరము మానవుడు రెండు రకాల సుఖాలు పొందుతాడు. 1. స్వర్గము 2. అపవర్గము. వీటిలో మళ్ళీ స్వర్గము అనేది అశాశ్వతము. మానవుడు చేసిన పుణ్యఫలము ఉన్నంత వరకే స్వర్గసుఖాలు అనుభవిస్తాడు. ఆ తరువాత మళ్ళీ భూలోకంలో జన్మించి తాను చేసిన కర్మఫలితాన్ని అనుభవిస్తాడు. భారతంలో ఇంద్రద్యుమ్న మహారాజు వృత్తాంతమే ఇందుకు ఉదాహరణ. ఈ మహారాజు చాలా కాలం స్వర్గంలో ఉన్నాడు. ఒకరోజున "ఓ మహారాజా! నువ్వు చాలా రోజుల నుంచి స్వర్గంలో ఉన్నావు. నువు చేసిన పుణ్యఫలం అయిపోయింది. కాబట్టి ఇక్కడ నుంచి వెళ్ళిపోవలసింది.' అని స్వర్గంలోంచి గెంటేశాడు ఇంద్రుడు. నేను చేసిన పుణ్యం ఇంకా ఉంది. కాబట్టి నేను ఇక్కడే ఉంటాను అన్నాడు మహారాజు. నీ పుణ్యఫలం ఇంకా ఉందని నిరూపించుకో అని ఇద్దరు భటులనిచ్చి భూలోకానికి పంపాడు ఇంద్రుడు. ఇంద్రద్యుమ్నుడు గతంలో తాను పాలించిన రాజ్యానికి వచ్చి తాను యజ్ఞయాగాలు చేసిన స్థలానికి వచ్చాడు. అక్కడ చెట్టుమీద ఉన్న కొంగ ఆయన్ని గుర్తుపట్టి "ఓ మహారాజా ! నువ్వు గోదానాలు ఇచ్చినప్పుడు వదిలిపెట్టిన నీళ్ళే ఇలా పెద్ద సరస్సుగా

మారింది. ఇవాళ్ళ ఇది ఎన్నో లక్షల మందికి త్రాగునీరు అందిస్తోంది. ఎన్నో వేల ఎకరాలు దీనిక్రింద సాగవుతున్నాయి. నాబోటివాళ్ళు అనేకులు దీనిని ఆశ్రయించి జీవిస్తున్నారు." అన్నది. ఆ మాటలు విన్న ఇంద్రద్యుమ్నుడు నేను చేసిన పుణ్యఫలం ఇంకా ఉంది. నేను ఇంకా స్వర్గంలోనే ఉండచ్చు అని స్వర్గానికి పోతాడు. కాబట్టి స్వర్గలోకం కూడా అశాశ్వతమే. శాశ్వతమైనది మోక్షము. దీనికి దోహదం చేసేది జ్ఞానకాండ. అపరావిద్య అంటే – కర్మకాండ. పరావిద్య అంటే జ్ఞానకాండ. వేదంలో ఈ రెండు కాండలు చెప్పబడ్డాయి అన్నాం. ముందుగా అపరావిద్యను చూద్దాం.

మనం చేసే కర్మకాండ అంతా అపరావిద్యే. ఏ దేవతని ప్రార్ధించినా, ఏ భగవంతుణ్ణి అర్చించినా, పూజలు, పునస్కారాలు, జపాలు, తపాలు, అర్చనలు, హోమాలు, యజ్ఞాలు, యాగాలు ఇవన్నీ కర్మకాండ. అపరావిద్య. ఈ అపరావిద్య వేదంలో ఎప్పుడు ఎక్కడ ఏ విధంగా చెప్పబడిందో వివరంగా చూద్దాం. మంత్రాలు, యంత్రాలు, తంత్రాలు, సూక్తాలు, ప్రార్ధనలు అన్నీ అపరావిద్యే. వేదం నాలుగు బాగాలుగా ఉన్నది. 1. సంహిత 2. బ్రాహ్మణము 3. అరణ్యకము 4. ఉపనిషత్తు. దీనిలో మొదటి మూడు భాగాలలో తొంభై శాతము పైన అపరావిద్య. ఉపనిషత్తులలో కూడా సగభాగం అపరావిద్య. మిగిలిన సగభాగమే పరావిద్య.

శ్రీ

# పార్థసారథీయము

# చతుర్వేదభాష్యము

## ( ఋక్సంహిత )




ప్రముఖ శ్రీవిద్యా ప్రచారకులు

అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,

ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, మెంఫిస్, అమెరికా ఆస్థాన విద్వాంసులు,

డా॥ క్రోవి పార్థసారథి

# విషయసూచిక


1. అందరికీ మంచి జరగాలి
2. మంచి మార్గం
3. సర్వప్రదాత అగ్ని
4. శిష్టరక్షణ
5. జ్ఞానసముపార్జనతో పవిత్రులు
6. జ్ఞానవిజ్ఞానమయకోశం వేదం
7. భగవంతుణ్ణి గుర్తించిన వాణ్ణి వేదం ప్రేమిస్తుంది
8. శశీయసి
9. ఆత్మనివేదన
10. పరమేశ్వర స్వరూపం
11. దానము
12. అప్పుల బాధ
13. సంతానము
14. శ్రీమహావిష్ణువే పరమేశ్వరుడు
15. కుక్కను నిద్ర పుచ్చుటము
16. రాక్షస సంహారము
17. అందర్నీ కాపాడేది పరమేశ్వరుడే
18. అజ్ఞానులు
19. పవమానసోముడు
20. సృష్టికర్త పరమాత్మ
21. శ్రమకు తగ్గ ఫలితం
22. అన్నదానము
23. పితృమేధము

24. గోధనము
25. మరణానంతర స్థితి
26. మనస్సు
27. సింధునది
28. పరమాత్మ
29. అరణ్యాలు
30. ప్రేతము
31. గర్భరక్షణ
32. స్వర్గనరకాలు
33. వర్ణాశ్రమాలు
34. ఊర్వశి–పురూరవులు
35. దక్షిణ
36. దేవతలు ఎందరు?
37. దస్యులు
38. అశ్వనీదేవతల గొప్పతనము
39. వాక్స్వరూపాలు
40. వివాహము
41. ఆడపిల్లకు ఆస్తిలో హక్కు
42. ఓషధీసూక్తము
43. ఋతువులు
44. వృత్రాసురవధ
45. రోలు రోకలి
46. అందర్నీ గౌరవించండి
47. ఏకోదరుల మధ్య సంబంధము
48. పాచికలు
49. దైవత్వం

50. నేలమీద నీటిమీద నడిచే వాహనాలు
51. సోమరసము
52. బానిసల తిరుగుబాటు
53. విషానికి విరుగుడు
54. అన్నము
55. జగత్స్వరూపం
56. జగదుత్పత్తి
57. పురుష సూక్తము
58. నాసదీయ సూక్తము
59. ధనం కావాలంటే
60. శ్రీసూక్తం
61. ఋభు సూక్తం
62. శత్రుసంహారం కోసం మన్యుసూక్తం
63. పరమేశ్వరుడు సర్వాంతర్యామి
64. నారాయణ సూక్తమ్
65. భూసూక్తము
66. నీళాసూక్తము
67. దుర్వాసూక్తము
68. మృత్తికాసూక్తము
69. అఘమర్షణ సూక్తము
70. మేధాసూక్తము
71. అనిష్ట పరిహారం కోసం దుర్గా సూక్తము
72. సర్వేజనా స్సుఖినోభవంతు

# 2.1 ఋక్సంహిత

సంహిత అంటే మంత్రభాగము. ఋగ్వేదానికి సంబంధించిన మంత్రభాగాన్నే ఋక్సంహిత అంటారు. గతంలో ఈ వేదానికి 21 శాఖలున్నాయి. కాని ఈ రోజున **శాకలశాఖ** గురుశిష్య పరంపరగా ప్రచారంలో ఉంది. ఋగ్వేదంలోని మంత్రాలను ఋక్కులు అంటారు. మొత్తంమీద ఋగ్వేదంలో 1028 సూక్తాలు, వాటిలో 10,552 ఋక్కులు లేక మంత్రాలు, ఆ మంత్రాలన్నింటికీ కలిపి 2,97,265 అక్షరాలున్నాయి. ఇక్కడ గొప్పతనమేమంటే సంహిత మొత్తంమీద ఎన్నిఅక్షరాలున్నాయో కూడా చెప్పారు. అంటే తప్పుదొర్లటానికి ఆస్కారం ఏమాత్రంలేదు. ఇక ఈ సంహితలో ఏంచెప్పారో చూద్దాం.

## 1. అందరికీ మంచి జరగాలి

**'లోకాస్సమస్తా సుఖినోభవంతు'** ఇది మనం సాధారణంగా కోరే కోరిక. మనకి రెండు రకాల కోరికలుంటాయి. 1. స్వార్థంతో కూడుకున్నవి 2. నిస్వార్థమైనవి. స్వార్థంతో కూడినవి అంటే భగవంతుణ్ణి పూజిస్తాం. స్వామీ నాకు ధనం కావాలి. నా పుత్రపౌత్రులంతా సుఖంగా ఉండాలి. అని అడుగుతాం. అంతేకాని మిగిలిన వాళ్ళగురించి పట్టించుకోం. ఇందులోనే ఇంకోరకమైన కోరిక ఉంది. అందులో ఓ దేవా ! నా ప్రక్కవాడు నాశనమై పోయినా సరే నాకుమాత్రం బాగుండాలి. వాళ్ళందరి ధనం నాకే రావాలి అనుకోవటం. ఇది దుర్మార్గమైన ఆలోచన. ఇంకొక రకంఉంది. నాకు బాగుండకపోయినా ఫరవాలేదు. నా ప్రక్కవాడు మాత్రం బాగుండకూడదు. ఇది నీచమైన ఆలోచన. అలాగే నేను బాగుండాలి

అనుకోవటం ఒకపద్ధతి. నాతో పాటు చుట్టుపక్కల వాళ్ళు కూడా బాగుండాలి అనుకోవటం రెండవ పద్ధతి. నాకు లేకపోయినా నా చుట్టుపక్కల వారు బాగుండాలి అనుకోవటం చాలా గొప్పదైన కోరిక. పూర్వకాలంలో మహర్షులు యజ్ఞయాగాది క్రతువులు చేసేటప్పుడు ఈ రకమైన నిస్వార్ధబుద్ధితోనే చేసేవాళ్ళు. మనం అంత నిస్వార్ధంతో చెయ్యకపోయినా, నాతో పాటు నా చుట్టుప్రక్కల అందరూ బాగుండాలి. అనుకోవటం చాలా మంచిది. లౌకికంగా చూసినా ఈ రకమైన కోరిక చాలామంచిది. మన చుట్టుప్రక్కల అన్నీ గుడిశెలు. మన ఇల్లు ఒక్కటే మంచి భవనం అనుకోండి. చుట్టూ ఉన్నవారి కళ్ళు ఎప్పుడూ మనమీదే ఉంటాయి. మనకి భద్రత అనేది ఉండదు. ఈ దృష్ట్యా చూసినా సమాజానికంతటికీ మేలుజరగాలి. అందుకే "లోకాస్సమస్తాః సుఖినోభవంతు" అంటాం. ఈ విషయంలో వేదం ఏం చెబుతోందో చూద్దాం. ఋగ్వేదంలోని **రెండవ మండలంలోని 21వ సూక్తంలో** ఇంద్రుణ్ణి ప్రార్ధిస్తున్నారు. ఇక్కడ ఇంద్రుడు అంటే పరమేశ్వరుడే. ఇంద్రుడు శత్రువులందర్నీ ఓడిస్తాడు. అజేయుడు. సర్వదా జయశీలుడు. యుద్ధంలో ఎవరినైనా సరే ఓడిస్తాడు. జనులందరికీ పూజనీయుడు. బలవంతులైన శత్రువులనుకూడా పరాజితులుగా చేస్తాడు. గొప్ప దానగుణం గలవాడు. కోరిన కోరికలు తీర్చేవాడు. పూర్వకాలంలో అంగిరసుల గోవులు దొంగిలించబడ్డాయి. అప్పుడు వారు ఇంద్రుణ్ణి స్తుతించి ఇంద్రుని దయవల్ల వారి గోవులను తిరిగి పొందగలిగారు. అటువంటి "ఓ ఇంద్రా ! ఓ పరమేశ్వర స్వరూపమా! మాకు ఎక్కువ ధనాన్ని సౌభాగ్యాన్ని ప్రసాదించవలసింది. మా ధనాన్ని పెంచ వలసింది. మమ్మల్ని రక్షించవలసినది. ఓ పరమేశ్వరా ! మితిలేని ఐశ్వర్యము, ఆరోగ్యము, మధురమైన వాక్కు మాకు

ప్రసాదించవలసింది. మాకు ప్రతిరోజు మంచి రోజు కావాలి" అంటున్నారు.

ఓ పరమేశ్వరా! మంచి అనేది నా ఒక్కడికే కాదు. మా **అందరికీ సామూహికంగా శుభంజరగాలి** అంటోంది వేదం.

# ౨. మంచి మార్గం

అందరికీ మంచి జరగాలి అంటే అందరూ మంచి పనులే చెయ్యాలి. కడివెడు పాలైనా సరే ఒక ఉప్పుకల్లు పడితే నాశనమయిపోతాయి. ఎంత మంచివాడైనా సరే చెడుమిత్రుల సాంగత్యంవల్ల నాశనమయి పోతాడు.

**వేరు పురుగు చేరి వృక్షంబు చెరచు**
**చీడపురుగు చేరి చెట్టంత చెరచు**
**కుత్సితుండు చేరి గుణవంతు చెరచురా**

అన్నారు. ఈ విషయం అందరికీ తెలిసిందే. అలాగే మనం మంచి వాళ్ళమైతే సరిపోదు. ఎదుటివాడు మనల్నిచూసి సహించలేక మనమీద శత్రుత్వం పెంచు కోవచ్చు. అసూయ ద్వేషం వీటివల్ల శత్రుత్వం. మానవుడు ఎంత మంచివాడుగా ఉండాలి అనుకున్నా ఉండలేడు. కారణం అంతఃశత్రువులు. బాహ్య శత్రువులను జయించటం తేలిక. ఎందుకంటే వారు కళ్ళఎదురుగా కనిపిస్తుంటారు. కాని అంతశ్శత్రువులు కనిపించరు. వీరివల్ల ప్రమాదం చాలాఎక్కువ. వీళ్ళని గనక జయిస్తే లోకంలో అన్నింటినీ జయించినట్లే. అన్నింటికీ మించింది జ్ఞానము. జ్ఞానసముపార్జన కావాలంటే పరమేశ్వరుడి అనుగ్రహం కావాలి. అందుకే **ఋగ్వేదంలోని రెండవ మండలంలోని 23వ సూక్తంలో** పరమేశ్వర స్వరూపమైన 'బ్రహ్మణస్పతి' (ఇతడే బృహస్పతి)ని ప్రార్థిస్తున్నాడు.

"ఓ బ్రహ్మణస్పతీ ! నువ్వు చాలా గొప్పవాడివి. మంత్రాలన్నింటికీ అధిపతివి. నువ్వు అపారమైన జ్ఞానం కలవాడివి. అన్నివైపులా నిందలు, అంధకారము అజ్ఞానాలను దూరం చేశావు. నీ రథము మిక్కిలి ప్రకాశవంతమైనది. రాక్షసులను నాశనం చేస్తుంది. స్వర్గప్రదము.

నీకు హవిస్సులర్పించేవారిని సన్మార్గాన నడిపిస్తావు. వారికి పాపం కలగకుండ కాపాడతావు. నువ్వు అందర్నీ రక్షిస్తావు. నిన్ను అర్చించిన వారికి దుఃఖాలు గాని, నష్టాలు గాని ఉండవు. పాపాలు బాధించవు. శత్రువులు అతన్ని హింసించలేరు. దొంగలు అతన్ని దోచుకోలేరు. అందుకే ఓ దేవా ! నువ్వు నాకు రక్షకుడవు. నన్ను సన్మార్గంలో నడిపించవలసింది. అన్ని రకాల ఉపద్రవాల నుండి మా అందర్నీ రక్షించవలసినది. మమ్మల్ని మంచిమార్గంలో నడిపించు. నిన్ను శరణు వేడిన వారికి భయం, పాపం, ఆపద, నాశనము, శత్రువులు అనేవి ఉండవు. చెడుమనస్సు గలవారు వారివైపు కూడా రారు. ఓ దేవా ! మా అతః శత్రువులను నాశనంచెయ్యి. మమ్మల్ని మంచి మార్గంలో నడిపించు, జ్ఞానాన్ని ప్రసాదించు. చెడుమార్గాన్ని పట్టిస్తున్న మా అజ్ఞానాన్ని నాశనం చేసి మా మార్గాన్ని నిష్కంటకం చెయ్యి."

కేవలము మానవుడు అనుకున్నంత మాత్రాన తాను ఏ పనీ చెయ్యలేడు. అందుకే బ్రహ్మణస్పతీ నేను మంచి మార్గాన నడవాలనుకుంటున్నాను. దయచేసి నన్ను మంచి మార్గాన నడిపించవలసింది, అని పరమేశ్వరస్వరూపమైన బ్రహ్మణస్పతిని ప్రార్థిస్తున్నాడు.

భగవంతుణ్ణి గనక నమ్ముకుంటే మనకి కావలసినవన్నీ అతడే చూస్తాడు. మనం దేనికీ భయపడనవసరం లేదు. భగవంతుణ్ణి నమ్మటం అంటే భారం ఆయన మీదనే వెయ్యాలి. **"అన్యధాశరణం నాస్తి త్వమేవ శరణం మమ"** అంటూ శరణాగతి పొందాలి. ఇదే విషయం చెబుతోంది వేదం కూడా. "పరమేశ్వరుడు అన్ని రకాల బాధలు తీరుస్తాడు. ఆయన అనుగ్రహం గనక ఉంటే ఏ ఆపదరాదు. ఎలాంటి భయము ఉండదు. అటువంటి వాడికి అన్నీ శుభాలే జరుగుతాయి. ఓ దేవా ! **నా శత్రువులను నాశనం చేసి అన్ని రకాలుగాను నాకు మంచిని కలుగజెయ్యి"**

# ౩. సర్వప్రదాత అగ్ని

లౌకికంలో మనం వాడుకునే ప్రతిదీ అగ్నికాదు. అన్నం వండుకునేందుకు కుంపట్లో వెలిగించేది నిప్పు. చలికాచుకునేది మంట. అదే చలిమంట. దేవతలకు ఆహుతలందించేది అగ్ని. హోమకుండంలో ప్రజ్వరిల్లేది – అగ్నిజ్వాల. అగ్ని అనే పదం చాలా పవిత్రమైనది. యజ్ఞయాగాదులలో ఉపయోగించేదే అగ్ని. అంతేకాని సిగరెట్టు అంటించేది అగ్నికాదు. అది నిప్పు.

పూర్వకాలంలో విశ్వానరుడు అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతని భార్య శుచిష్మతి. ఈ దంపతులకు పిల్లలు లేరు. కాశీక్షేత్రానికి పోయి ఘోరమైన తపస్సు చేశాడు విశ్వానరుడు. శివుడు ప్రత్యక్షమైనాడు. "పుత్రుడు కావాలి" అన్నాడు విశ్వానరుడు. 'తథాస్తు' అన్నాడు శివుడు. ఈశ్వరుని అనుగ్రహంతో గర్భవతి అయింది శుచిష్మతి. కాలచక్రం తిరుగుతోంది. తొమ్మిదినెలలు నిండినాయి. పండంటి మగబిడ్డకు జన్మనిచ్చింది శుచిష్మతి. ఆ బిడ్డకు 'వైశ్వానరుడు' అని దేవతలు నామకరణం చేశారు. శుక్లపక్ష చంద్రునిలాగా పిల్లవాడు పెరుగుతున్నాడు. ఒకరోజు నారదుడు వచ్చాడు విశ్వానరుని ఆశ్రమానికి. సాదరంగా ఆహ్వానించాడు విశ్వానరుడు. కుశలప్రశ్నలు అయిన తరువాత తనపిల్లవాణ్ణి పిలిచి నారదుడికి చూపించి "మునీంద్రా! పిల్లవాడి రూపురేఖలను బట్టి అతని జాతకం చెప్పవలసినది" అన్నాడు. పిల్లవాణ్ణి చూశాడు నారదుడు. చాలా చక్కగా ఉన్నాడు. కాని ఏదో లోపం కనిపిస్తోంది. నారదుడి మనస్సు కలత చెందింది. అదే మాట పైకి అనేశాడు, 'పన్నెండవ ఏట పిల్లవాడికి ప్రాణగండం ఉన్నది." ఆ మాటలు విన్న విశ్వానరుడు హతాసుడైనాడు. తల్లిదండ్రులు దుఃఖిస్తున్నారు. అది చూసిన పిల్లవాడు వారికి ధైర్యం

చెప్పి శివుణ్ణి గురించి తపస్సు చేస్తాను అని వెళ్ళిపోయి గంగానది వడ్డున కూర్చుని ఈశ్వరుణ్ణి గురించి తపస్సు చెయ్యటం మొదలు పెట్టాడు. కొంత కాలం గడిచింది. ఇంద్రుడు ప్రత్యక్షమై 'నీకు ఏం కావాలి బాలకా ? చెప్పు ఇస్తాను అన్నాడు. ఆ మాటలు విన్న వైశ్వానరుడు 'నిన్నెవరు పిలిచారు? నువ్వెందుకు వచ్చావు? వెళ్ళిపో. నాకు ఈశ్వరుడు కావాలి' అన్నాడు. దాంతో కోపగించిన ఇంద్రుడు తన వజ్రాయుధంతో ఒక్క దెబ్బ వేశాడు. ఆ దెబ్బకి స్పృహ తప్పి పడిపోయాడు బాలుడు. అప్పుడు ఈశ్వరుడు ప్రత్యక్షమై పిల్లవాణ్ణి లేవదీసి దీర్ఘాయుష్మంతుడిగా దీవించి అగ్నిలోకానికి అధిపతిగా చేశాడు. ఈ రకంగా వైశ్వానరుడు అగ్నిదేవుడైనాడు.

అగ్నిదేవుడు 'సర్వభక్షకుడు' అగ్నిలో ఏ పదార్ధం వేసినా క్షణాల్లో మాడి మసి అయిపోతుంది. ఈ విషయం అందరికీ తెలుసు. కాని ఋగ్వేదంలో ఆయన సర్వరక్షకుడు, సర్వప్రదాత కూడా అని ఉంటుంది. లోకంలోని ప్రజలందరినీ రక్షిస్తాడు. ఎవరికి ఏది కావాలన్నా ఇస్తాడు. ఈ విషయం **మూడవ మండలంలోని ఒకటవ సూక్తంలో** చెప్పబడుతోంది.

"అగ్ని విపరీతమైన తేజస్సు కలవాడు. అతని తేజస్సుతో అంతరిక్షం అంతా వ్యాపించాడు. అగ్ని యజ్ఞంచేసే యజమానిని తేజోవంతునిగా చేసి అతనికి అన్నము, ధనము, సంపూర్ణ సంపద ప్రసాదిస్తాడు. కేవలము స్తుతిచేసినంత మాత్రంచేతనే అగ్ని అభివృద్ధి చెందుతాడు. మధురమైన జలధారలు వర్షిస్తాడు. జలములకు జన్మస్థానము అంతరిక్షము. అగ్ని అంతరిక్షవాసి. అందుకే జలము మధ్యన అగ్ని ప్రశాంతచిత్తుడై ఉంటాడు. అగ్ని సమస్త లోకాలకు తండ్రి. మానవరక్షకుడు, శత్రువులను సంహరిస్తాడు. యుద్ధంలో

సేనను రక్షిస్తాడు. విపరీతమైన తేజస్సుతో ప్రకాశిస్తాడు. యజమాని కోసం జలాన్ని ఉత్పత్తి చేసినవాడు అగ్ని. జలగర్భుడు, ఔషధ గర్భుడు. అటువంటి ఓ అగ్నీ ! నేను నిన్ను ప్రార్ధన చేస్తున్నాను. నాకు జ్ఞాన సముపార్జన చెయ్యాలనే కోరిక ఉన్నది. నా కోరిక తీర్చు. నాకు జ్ఞానాన్నివ్వు. ధనాన్నివ్వు. నా పశువులను రక్షించు. పుత్రపౌత్రాదులను రక్షించు. ఓ అగ్నిదేవా! నీవు సర్వరక్షకుడవు, సర్వప్రదాతవు. నన్ను రక్షించవలసింది."

ఇక్కడ ఒక విషయం గమనించాలి. సముద్రంలో అగ్ని ఉంటుంది. అదే బడబాగ్ని అంటాం. సముద్రంలో అంటే నీటిలో అగ్ని ఎలా ఉంటుందనేది ప్రశ్న. దానికి సమాధానం ఇక్కడ దొరుకుతోంది. జలానికి జన్మస్ధానం అంతరిక్షం. అగ్ని అంతరిక్షంలో ఉంటాడు. వారిద్దరూ (జలము, అగ్ని) అన్నా చెల్లెళ్ళు, అందుకే జలం మధ్యలో అగ్ని హాయిగా విశ్రమిస్తాడు. అదే **బడబాగ్ని.**

# 4. శిష్టరక్షణ

**"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"**

అన్నాడు భగవానుడు గీతలో. దుర్మార్గులను శిక్షించటం మంచి వాళ్ళని రక్షించటం ఆయనపని. దానికోసం ప్రతి యుగంలోను ఈ లోకంలో అవతరిస్తాను అంటున్నాడు. ప్రతియుగంలోను అంటే 'అవసరమైనప్పుడు' అని అంతే కాని యుగానికి ఒకసారి అని అర్థం కాదు. ధర్మాన్ని రక్షించటమనేది మనందరి బాధ్యత. **"ధర్మోరక్షతి రక్షితః "** మనం ధర్మాన్ని రక్షిస్తే ఆ ధర్మం మనల్ని రక్షిస్తుంది. ధర్మాన్ని రక్షించటం అంటే ఎవరితోనూ యుద్ధం చెయ్యవలసిన పనిలేదు. నీ పరిధిలో నీకు చేతనైనంత వరకు అబద్ధం ఆడకుండా ఉండటం, పరోపకారం, ఇవన్నీ ధర్మాన్ని రక్షించే పనులే. అధర్మ మార్గంలో చరించే వాళ్ళని శిక్షించటానికి మనక్కూడా బలం కావాలి. వాళ్ళని శిక్షించగలిగేవారు కొంతమందే ఉంటారు. ఇంకా అధర్మం పెరిగిపోతే, వాళ్ళని శిక్షించటం ఇక్కడి వాళ్ళ వల్ల కాకపోతే అప్పుడు సాక్షాత్తు ఆ పరమేశ్వరుడే ఈ లోకానికి వచ్చి ఆ పని పూర్తి చేస్తాడు. కంసుణ్ణి సంహరించటానికి శ్రీకృష్ణుడు, రావణుణ్ణి హతమార్చటానికి శ్రీరామచంద్రుడు, హిరణ్యకశ్యపుడి కోసం నృసింహస్వామి, మహిషాసురుడి కోసం అమ్మవారు. ఇలా భిన్నమైన రూపాలలో ఆవిర్భవించి ధర్మసంస్థాపన గావించటం జరుగుతుంది. దుష్టశిక్షణ చెయ్యటానికి పరమేశ్వరుడు రెండు రకాల అవతారాలు ఎత్తుతాడు. 1. అంశావతారము 2. పూర్ణావతారము. వరహావతారము, నృసింహావతారము, పరశురాముడు వంటిని అంశావతారాలు, రాముడు, కృష్ణుడు పూర్ణావతారాలు. ఏది ఏమైనా దుష్టశిక్షణ చేసేది

పరమేశ్వరుడే. ఈ విషయంలో సందేహం లేదు.

“ఓ పరమేశ్వరా ! రాక్షసజాతిని సమూలంగా నాశనం చెయ్యి. వాళ్ళని అడ్డంగా నరికెయ్యి. వాళ్ళ శిరస్సు ఛేదించు. బ్రహ్మద్వేషుల మీద సంతాపప్రదమైన అస్త్రాన్ని ప్రయోగించు. అన్ని దిక్కులలో ఉండే దుర్మార్గులను, క్రూరులను నాశనం చెయ్యి. ఓ దయామయా ! ఎక్కడైనా సరే మంచి వారిని రక్షించు.” ఈ రకంగా దుష్టశిక్షణ చెయ్యమని పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నది వేదం.

# 5. జ్ఞానసముపార్జనతో పవిత్రులు

లోకంలో రెండు మార్గాలున్నాయి. ప్రవృత్తి మార్గము. నివృత్తి మార్గము. ప్రవృత్తి మార్గము అంటే లౌకిక మార్గము. ఇక రెండోది నివృత్తి మార్గము. దీన్నే మోక్షమార్గము అంటారు. ఈ రెండు మార్గాలకీ ఉన్న తేడా ఒక్కటే. మమ అనుకుంటే ప్రవృత్తి. నమమ అనుకుంటే నివృత్తి. అలాగే అజ్ఞానము ప్రవృత్తి, జ్ఞానము నివృత్తి. లోకంలో సత్పురుషులు నివృత్తి మార్గంలో ప్రయాణం చేస్తారు. వీరిలక్ష్యం మోక్షసాధన. పురుషార్ధాలు నాలుగు. ధర్మార్ధ కామమోక్షాలు. కాని నిజంగా చెప్పాలి అంటే పురుషార్ధము అంటే మోక్షము. మిగిలిన మూడు ధర్మార్థ కామాలు ఆ మోక్షసాధనకు మెట్లు. హంసకు ఒక గొప్ప లక్షణం ఉంది. పాలలోనుంచి నీటిని వేరు చేయగల శక్తి హంసకే ఉన్నది. ఇప్పుడు చూడండి పాలనుంచి నీటిని వేరుచేసి హంస కేవలము పాలను మాత్రమే ఏరకంగా స్వీకరిస్తుందో, అలాగే మోక్షమార్గంలో ప్రయాణంచేసే సత్పురుషుడు కూడా అజ్ఞానాన్ని వేరు చేసి జ్ఞానాన్ని మాత్రమే తీసుకుంటాడు. ఈ విషయం ఋగ్వేదంలోని **నాల్గవ మండలంలోని రెండవ సూక్తంలో** చెబుతున్నారు.

గుర్రాలను కాచే రౌతు, ఆ గుర్రాల గుంపులో, తాను ఎక్కి కూర్చోవటానికి అనువుగా విశాలమైన వెన్ను గలవేవి, విశాలమైన వెన్ను లేనివేవి అని ఏ రకంగా తెలుసుకుంటాడో, అలాగే సత్పురుషులు, మోక్షవాదులు జ్ఞానాన్ని అజ్ఞానాన్ని విడదీసి చూడగలుగుతారు. పరమేశ్వర దర్శనం కోసం ఎప్పుడూ మంచి పనులే చేస్తారు. కమ్మరివాడు ఇనుమును కొలిమిలో కరగపెట్టి శుభ్రం చేసినట్లుగా, తత్త్వజ్ఞానంతో వారు తమనితాము పవిత్రం చేసుకుంటారు. **"జ్ఞానాగ్ని సర్వకర్మాణి భస్మనా కురుతేర్జునా"** జ్ఞానమనే అగ్నిలో అన్ని కర్మలు

భస్మమైపోతాయి. జ్ఞానికి ఇంక కర్మవాసనలుండవు అంటున్నాడు భగవానుడు గీతలో. ఎప్పుడైతే జ్ఞానసముపార్జన జరిగిందో, అప్పుడు కర్మ పూర్తిగా క్షయమైపోతుంది. కాబట్టి సన్మార్గంలో ప్రయాణం చేసే మోక్షవాదులు జ్ఞానసముపార్జనతో తమను తాము పవిత్రం చేసుకుంటారు. అంటోంది వేదం.

# 6. జ్ఞానవిజ్ఞానమయకోశం వేదం

వేదంలో చెప్పబడని విషయం లేదు. జ్ఞాన విజ్ఞాన విషయాలన్నీ చెప్పబడ్డాయి. విజ్ఞానము అంటే లౌకికమైన జీవనానికి పనికివచ్చే కర్మకాండ. మోక్షమార్గాన్ని చూపేదే జ్ఞానకాండ. ఈ సంహిత బ్రాహ్మణాలు ఎక్కువ బాగము కర్మకాండని గురించే చెబుతాయి. ఉపనిషత్తులలో చాలా భాగము జ్ఞానకాండను వివరిస్తాయి. మొత్తం మీద చూసినట్లైతే వేదంలో రెండు కాండలు చెప్పబడ్డాయి. అందుకే వేదంలో చెప్పని విషయం లేదు. లౌకిక పారలౌకిక విషయాలన్నీ చెప్పబడ్డాయి. ఋగ్వేదంలోని **4వ మండలంలోని 58వ సూక్తంలో**

"జ్ఞానము పూర్తిగా అజ్ఞానంతో కప్పబడి ఉంటుంది. ఈ జ్ఞానాన్ని దేవతలు కనుక్కున్నారు. ఈ జ్ఞానం మూడు భాగాలుగా ఉంది. ఇందులో ఒక భాగాన్ని ఇంద్రుడు, రెండవ భాగాన్ని సూర్యుడు కనుక్కోగా మూడవ భాగాన్ని ఋషీశ్వరులు తమ తపశ్శక్తితో కనిపెట్టారు. ఈ వేదాలన్ని పరమాత్మ నుంచే వచ్చాయి. అలా పరమాత్మ నుంచి వచ్చే వేదాలలో జ్ఞానం ఉన్నది. ఈశ్వరుని అనుగ్రహం ఉంటేనే ఈ విషయం తెలుస్తుంది. లేకపోతే తెలియదు. ధ్యానం చేసేవాడి మనసునుంచి ఈ జ్ఞానం ప్రవాహంలాగా వస్తుంది. వేటగాడి చేత తరుమబడే మృగంలాగా, పల్లానికి ప్రవహించే నదిలాగా అత్యంత వేగంగా, ఏ మాత్రము ప్రతిబంధకాలు లేకుండా, ఒకవేళ ఉన్నా వాటిని ఛేదించుకొని ముందుకు సాగుతుంది. ప్రియురాలు తన భర్తను చేరినట్లుగా ఈ జ్ఞానం ఈశ్వరుణ్ణి చేరుతుంది. పరమేశ్వరుడికి వేదాలపైన మక్కువ ఎక్కువ. ఎనలేని విజ్ఞానమయమైన ఈ వేదం మాకు అత్యంత పవిత్రతను ఇవ్వాలి" అని చెప్పబడింది. ఈ రకంగా వేదం జ్ఞానవిజ్ఞానమయము అని తెలుస్తోంది.

# 7. భగవంతుణ్ణి గుర్తించిన వాణ్ణి వేదం ప్రేమిస్తుంది

వేదమంటేనే పరమేశ్వరుడు. అలాగే పరమేశ్వరుడంటేనే వేదం. వేదమన్నా పరమేశ్వరుడన్నా ఒకటే. వేదం పరమేశ్వర స్వరూపం. అలాంటప్పుడు వేదం ఎవరిని ప్రేమిస్తుంది? అంటే వేదస్వరూపుడైన భగవంతుణ్ణి ప్రేమించినవాణ్ణి వేదం ప్రేమిస్తుంది. ఋగ్వేదంలోని **ఐదవ మండలంలోని 44వ సూక్తంలో** "ఎవరైతే సర్వకాల సర్వావస్థల యందు పరమాత్మను గుర్తిస్తాడో, వాణ్ణి ఋక్కులు ప్రేమిస్తాయి. ఎవరైతే ఎప్పుడూ పరమేశ్వరుణ్ణి గుర్తిస్తాడో అతణ్ణి సామములు ప్రేమిస్తాయి. అటువంటి వాడికి దేవుడు అన్ని వేళలా సహాయంగా ఉంటాడు. అగ్ని ఈశ్వరుణ్ణి ఎప్పుడో గుర్తించాడు కాబట్టే అతణ్ణి సామములు ప్రేమిస్తున్నాయి." అని చెప్పబడింది. కాబట్టి వేదం ఎవరిని ప్రేమిస్తుంది అంటే భగవంతుణ్ణి గుర్తించిన వాణ్ణి మాత్రమే ప్రేమిస్తుంది.

# 8. శశీయసి

ఋగ్వేదంలోని **అరవై ఒకటవ సూక్తంలో** ఒక చిన్నకథ చెప్పటం జరిగింది. ఇందులో 'శశీయసి' అనే పేరుగల స్త్రీ చాలా ఉత్తమురాలు. ఇక్కడ విచిత్రం ఏమంటే ఆవిడ ఇచ్చిన దానంవల్ల ఆమె భర్తకు కూడా పేరు ప్రఖ్యాతులు వచ్చినాయి.

పూర్వకాలంలో 'రథవీతి' అనే మహారాజు ఆత్రేయ వంశస్థుడైన 'అర్చనాముని' అనేవాణ్ణి హోతగా పెట్టుకుని ఒక యజ్ఞం చెయ్యటం మొదలుపెట్టాడు. యజ్ఞం జరుగుతోంది. ఆ సమయంలో రాకుమార్తె అటుగా వచ్చింది. ఆ పిల్లని చూసిన హోత చాలా ముచ్చటపడినవాడై 'రాజా! నీ కుమార్తెను నా కుమారుడైన **'శ్యావాశ్వుడికి'** ఇచ్చి వివాహం చెయ్యవలసినది. అన్నాడు. ఆ మాటలు విన్న మహారాజు కూడా ఆనందంగా 'సరే' అన్నాడు. కాని రాజుగారి భార్యమణి గారు మాత్రం దీనికి సమ్మతించలేదు. పై పెచ్చు "ఋషి కాని వాడికి మా కుటుంబంలోని పిల్లను ఇచ్చేది లేదు" అన్నది. దాంతో ఆ వివాహ ప్రయత్నము ఆగిపోయింది.

దీనినిబట్టి మనకు ఒక విషయం తెలుస్తోంది. ఆ రోజుల్లో రాకుమార్తెలను బ్రాహ్మణులు వివాహమాడే వారు. వీటినే 'అనులోమ వివాహాలు' అంటారు. ఈ విషయం గతంలో మనం చెప్పుకున్నాం. అయితే శ్యావాశ్వుడికి ఆ పిల్ల నచ్చింది. ఆమెమీద మనసయింది, కాని ఏం ప్రయోజనం. తాను ఋషి కాదు కాబట్టే పిల్ల తల్లి ఈ వివాహానికి ఒప్పుకోలేదు. ఆమెను వివాహమాడలాంటే తాను ఋషి అయి తీరాలి. వేరే మార్గం లేదు. అందుచేత కఠోరమైన నియమాలు ఆచరిస్తూ తపస్సు చెయ్యటం ప్రారంభించాడు. బిక్షాటనం చేసి తపస్సు చేస్తున్నాడు. బిక్షకోసం దేశసంచారం చేస్తున్నాడు.

అలా సంచారం చేస్తూ 'శశీయసి' వద్దకు వచ్చాడు. అసలు ఈ శశీయసి ఎవరు? 'విదదశ్వుడు' ఒక బ్రాహ్మణ శ్రేష్ఠుడు. అతనికి ఇద్దరు కుమారులు 1.తరంతుడు 2. పురుమీహ్లుడు. ఇందులో పెద్దకుమారుడైన తరంతుని భార్య శశీయసి. ఆవిడ శ్యావాశ్వుడు బిక్షకు వచ్చాడనే విషయం భర్తకు చెప్పింది. భర్త తరంతుడు 'వచ్చిన వారిని ఆదరించవలసింది' అన్నాడు. శశీయసి శ్యావాశ్వుడికి గుర్రాలు, పశువులు కొన్ని ఆభరణాలు ఇచ్చింది. భర్త తరంతుడు కూడా అతనికి కొంత ధనమిచ్చి, తన సోదరుడైన పురుమీహ్లుడి దగ్గరకు పంపాడు. శశీయసి ఇచ్చిన గుర్రం మీద వెడుతున్నాడు శ్యావాశ్వుడు. త్రోవలో సోమపానం చేస్తూ దర్శనమిచ్చారు మరుత్తులు. శ్యావాశ్వుడు వారిని పరిపరివిధాల స్తుతించాడు. వారు ఆనందించిన వారై శ్యావాశ్వుణ్ణి ఋషిగా గుర్తించారు. అంతేకాదు వేదమంత్రాలు దర్శించే ద్రష్టగా కూడా చేశారు. ఈ రకంగా ఋషి అయిన శ్యావాశ్వుడు రథవీతి మహారాజు దగ్గరకు వెళ్ళాడు. మహారాజు తన భార్య సమ్మతితో తన కుమార్తెనిచ్చి శ్యావాశ్వుడికి వివాహం చేశాడు.

ఋగ్వేదంలోని ఐదవ మండలాన్ని దర్శించినవారు అత్రిమహర్షి, అతని వంశస్థులు. ఈ వంశానికే సంబంధించిన శ్యావాశ్వుడు ఈ మండలంలో మరుత్తుల యొక్క అనుగ్రహంతో 52వ సూక్తం నుంచి 61వ సూక్తం వరకు మొత్తం పది సూక్తాలు దర్శించాడు. శశీయసి ఇచ్చిన దానం వల్ల ఆమె భర్తకు ఎనలేని ఖ్యాతి వచ్చింది. అని **ఈ సూక్తంలోని 8వ మంత్రంలో** చెప్పబడింది.

# 9. ఆత్మనివేదన

భగవంతుడి సాక్షాత్కారం కావాలంటే అతిసులువైన మార్గం భక్తి. ఆ జీవి స్త్రీనా, పురుషుడా? వారి కులము, మతము జాతి వీటితో ఏ మాత్రం సంబంధం లేదు. కేవలము భక్తి ఉంటే చాలు, ఈ మాట అధ్యాత్మరామాయణంలో శ్రీరామచంద్రుడే చెబుతాడు.

రాముడు శబరిదగ్గరకి వెళ్ళి ఆమె ఆతిథ్యం స్వీకరిస్తాడు అప్పుడు శబరి "ఓ రామా ! ఇంతకాలంగా నేను నీకోసం ఎదురుచూస్తున్నాను. ఇప్పటికి నా గురువుల మాట నిజమైంది. నీ దర్శనం నా గురువులకు కూడా కలగలేదు. నేను స్త్రీని. అజ్ఞానిని. హీనజాతిలో పుట్టినదాన్ని. నీ దాసుల, దాసుల నూరవతరము పొందటానికి కూడా అర్హత లేనిదాన్ని. అటువంటి నేను సాక్షాత్తు నీ దర్శనం చెయ్యగలిగాను. రామా ! మనస్సుకు, వాక్కుకు అందని నిన్ను ఏరకంగా దర్శించగలిగానో? దేవదేవ ! నిన్ను స్తుతించటం కూడా తెలియని దాన్ని. నన్ను అనుగ్రహించవలసింది" అంటుంది. ఆ మాటలు విన్న రాముడు

**పుంస్త్వే స్త్రీ స్త్వే వా జాతి నామాశ్రమాదయః**
**న కారణం మద్భజనే భక్తి రేవహి కారణం ॥**

శబరీ ! నన్ను భజించటానికి స్త్రీయా? పురుషుడా? వారి కులము. మతము, జాతి, పుట్టుక, ఆశ్రమము అనే బేధాలు ఏవీ లేవు. కావలసింది కేవలము భక్తి మాత్రమే అంటాడు.

దేవీ భాగవతంలో అమ్మవారు హిమవంతుడికి చెబుతుంది. "భక్తి మూడు రకాలు. 1. తామసభక్తి 2. రాజసభక్తి 3. సాత్త్వికభక్తి. ఇవి మళ్ళీ ఒక్కొక్కటి మూడు భాగాలవుతాయి. అప్పుడు సత్వగుణ

ప్రధానమైన భక్తితో అర్చించిన వారే నన్ను పొందగలరు” అంటుంది. అలాగే

భాగవతంతో తొమ్మిది రకాల భక్తులు చెప్పబడ్డాయి.

**శ్రవణం కీర్తనం విష్ణో స్మరణం పాదసేవనమ్ ।**
**అర్చనం వందనం దాస్యం సఖ్యం ఆత్మనివేదనమ్ ॥**

1. శ్రవణము 2. సంకీర్తనము 3. స్మరణము 4. పాదసేవ 5. అర్చన 6.వందనము 7. దాస్యము 8. సఖ్యము 9. ఆత్మనివేదన

భగవత్సాక్షాత్కారము కావాలి, మోక్షం కావాలి అంటే ఆత్మనివేదన ఒక్కటే మార్గము. ఆ రోజున ఆత్మనివేదన, ఆత్మార్పణం చేసుకున్నవాడు బలిచక్రవర్తి.

వేదంలో చెప్పిన మాటలు ప్రజలకు చాలా తేలికగా చేరటానికే పురాణాలు వ్రాయబడ్డాయి. పురాణాలు చెబుతున్నాయి అంటే ఆ విషయం వేదంలో చెప్పబడింది అని అర్థం. కాబట్టి భక్తివల్లనే భగవస్సాక్షాత్కారం జరుగుతుంది అనేది వేదంలో చెప్పబడిన మాట.

ఋగ్వేదంలోని **ఆరవ మండలం మొదటి సూక్తంలో** “భగవంతుని దివ్యమైన గుణాలు వింటూ, అతని దివ్యనామాన్ని సంకీర్తన చేస్తూ, ఆత్మార్పణం చేసుకున్నవాళ్ళు తప్పక ఆ పరమేశ్వరుని సాక్షాత్కారం పొంది, చివరకు మోక్షం పొందుతారు” అని చెప్పబడింది.

# 10. పరమేశ్వర స్వరూపం

పరమేశ్వర స్వరూపం ఎలా ఉంటుంది అనే విషయం ఇంతవరకు చూసినవాళ్ళు లేరు. మరి మనం ఆధ్యాత్మిక గ్రంథాలు, భక్తిగ్రంథాలు, ఉపనిషత్తులు చూస్తున్నాం కదా! వీటిల్లో పరమేశ్వర స్వరూపాన్ని గురించి చెబుతున్నారు కదా! అంటే అవన్నీ ఊహాజనితాలు. కల్పనలు. పరమేశ్వర స్వరూపాన్ని వివరించటానికి ఉపనిషత్తులు చాలావరకు ప్రయత్నించినాయి. కాని పూర్తిగా చెప్పలేకపోయినాయి. ఎందుకు చెప్పలేకపోయినాయి అంటే – పరమేశ్వర సాక్షాత్కారం పొందిన వారికి ఈ లోకంతో సంబంధం ఉండదు. పరమేశ్వరుడు ఈ రకంగా ఉంటాడు అని మనకి చెప్పాలని, మనం చేసే సత్కారాలు అందుకోవాలని ఉండదు. నిజం చెప్పాలంటే అది ఒక ఉన్మాదావస్థ. పరిసరాలమీద ఏమాత్రం దృష్టిఉండదు. ఎవరైనా ఏమైనా అనుకుంటారేమో అనే ఆలోచన ఉండదు. అసలు బాహ్యజగత్తు అతని కంటికి కనిపించదు. ఇక్కడ ఒక చిన్న ఉదాహరణ. ఒకసారి ఒక యోగీశ్వరుడు కలకత్తా మహానగరానికి వచ్చాడు. ఆయన శిష్యులు ఆయన్ని ఒక హోటలులో దింపారు. ఆయన చాలా గొప్పయోగి. ఆత్మసాక్షాత్కారం కోసం ఎదురు చూస్తున్నాడు. అంటే పూర్తిగా పండిపోయాడన్నమాట. ఆ రోజుసాయంత్రం ఉన్నట్టుండి ఆకాశం మేఘావృతమైంది. గాలి బాగావీస్తోంది. కారుమబ్బులు పట్టినాయి. పెద్ద పెద్ద మెరుపులు వస్తున్నాయి. వాతావరణం చాలా ఆహ్లాదకరంగా ఉంది. ఆ సమయంలో ఈ యోగీశ్వరుడు తన గదిలో నుంచి బయటకు వచ్చాడు. ఆకాశంలోకి చూస్తూ, పెద్ద పెద్దగా అరుస్తూ గంతులు వేస్తున్నాడు. నాట్యం చేస్తున్నాడు. విషయం ఏమంటే ఆ సమయంలో అతనికి

ఆత్మసాక్షాత్కారమైంది. కారుమేఘాలలో, పెద్దగా మెరుస్తున్న మెరుపులలో పరమేశ్వరుడు కనిపించాడు. ఈ జగత్తంతా పరమేశ్వరమయము అనే విషయం అర్ధమైంది. ఆ పరమేశ్వరుడు తనలోనే ఉన్నాడు. తానే పరమేశ్వర స్వరూపము అని తెలిసింది. తాను తప్ప ఈ జగత్తులో ఇంకేదీ లేదు. అందుకే అంత ఆనందం. పరమేశ్వరుడు ఆనందస్వరూపుడు. ఆ ఆనందాన్ని ఇప్పుడు ఆ యోగి పొందుతున్నాడు.

ఇప్పుడు చెప్పండి. పరమేశ్వర స్వరూపాన్ని గురించి ఏం చెప్పాలి? అది ఎలా ఉంటుందని చెప్పాలి? నిజంగా అది అనుభవైక వేద్యం. అనిర్వచనీయం. అందుకే ఏ గ్రంథాలు కూడా పరమేశ్వరస్వరూపాన్ని వివరించలేకపోయినాయి. పరమేశ్వర సాక్షాత్కారం పొందిన వారికి జన్మరాహిత్యం కలుగుతుంది. వారికి మరుజన్మ ఉండదు. అలాటి వారికి ఈ లోకంలో ఏ రకమైన బాంధవ్యాలు ఉండవు. **'బ్రహ్మవిద్ బ్రహ్మైన భవతి'** బ్రహ్మను గురించి తెలుసుకున్నవాడు సాక్షాత్తు తానుకూడా పరబ్రహ్మ అవుతాడు. అతడు ఇతరులతో ఏ రకమైన సంబంధాలు పెట్టుకోడు. ఈ కారణం చేతనే పరమేశ్వర స్వరూపం ఎలా ఉంటుంది అనే విషయాన్ని చెప్పటం కష్టం. ఇదే విషయాన్ని వేదంలో కూడా చెబుతున్నారు. పరమేశ్వరుణ్ణి అవయవాల ద్వారా గుర్తించలేము. **నచక్షుర్గచ్ఛతి నవాగ్గచ్ఛతి నోమనః** పరమేశ్వరుడు ఉన్నచోటికి కళ్ళు, వాక్కు, మనస్సు మొ॥ ఇంద్రియాలు వెళ్ళలేవు. అంటే ఇంద్రియాల ద్వారా అతన్ని తెలుసుకోలేము.

ఋగ్వేదంలోని **ఆరవకాండలోని తొమ్మిదవ సూక్తం**లో "నా హృదయంలో వెలుగుతున్న జ్యోతి నుంచి నా చెవులు దూరంగా

పోతున్నాయి. అంటే పరమేశ్వరుణ్ణి గురించి చెవుల ద్వారా గాని, కనుల ద్వారా గాని, మనసు ద్వారా గాని, ఇతర ఇంద్రియాల ద్వారా గాని తెలుసుకోలేము. నేను ఆ పరమాత్మకు చాలా దూరంలో ఉన్నాను. అటువంటి నేను పరమేశ్వర స్వరూపం గురించి ఏం చెప్పగలను? ఎలా చెప్పగలను?" అంటున్నారు.

# 11. దానము

మనము కష్టపడి సంపాదించిన దాన్ని ఇతరులకోసం త్యాగం చెయ్యటాన్నే 'దానము' అంటారు. తల్లిదండ్రులు సంపాదించిన ధనధాన్యాలు, ఆస్తిపాస్తులు కూడా దానం చెయ్యవచ్చును కదా ! అవి కూడా మనవే కదా! ఇదీ ప్రశ్న. ఇతరులు సంపాదించిన ధనాన్ని దానం చేసిన దానికన్న, మనం సంపాదించిన ధనాన్ని దానం చేస్తే వచ్చే ఫలితము గొప్పది. ఏది ఏమైనా దానం చేసిన వాడికి స్వర్గలోకసౌఖ్యము కలుగుతుంది. మహాభారతంలో ఒక కథ ఉన్నది. పూర్వకాలంలో ఇంద్రద్యుమ్నమహారాజు చాలాకాలం స్వర్గంలో ఉన్నాడు. ఒకసారి ఇంద్రుడు స్వర్గంలో ఉన్న వారి లెక్కలు చూస్తూ ఈ ఇంద్రద్యుమ్నుడు చాలా కాలంగా ఇక్కడే ఉన్నాడు. "ఇతడు చేసిన పుణ్యకార్యాలఫలం ఎప్పుడో అయిపోయింది. కాబట్టి అతడు భూలోకానికి వెళ్ళిపోవాలి" అని నిర్ణయంచేశాడు. అలా కాదు. నేను చేసిన పుణ్యకార్యాల గురించి ప్రజలు ఇంకా చెప్పుకుంటూనే ఉన్నారు. కాబట్టి నేను ఇక్కడే ఉండాలి అన్నాడు సత్యవ్రతుడు. ఇద్దరు భటులతో ఇంద్రద్యుమ్నుణ్ణి భూలోకానికి పంపి విషయం నిరూపించమన్నాడు ఇంద్రుడు.

ఇంద్రద్యుమ్న మహారాజు భూలోకానికి వచ్చాడు. అంతా కొత్తగా ఉంది. గతంలో తాను పాలించిన రాజ్యమే కాని దాని రూపురేఖలు పూర్తిగా మారిపోయినాయి. తనకు తెలిసిన వారెవరూ కనిపించలేదు. అందుకని మార్కండేయుడి దగ్గరకు వెళ్ళి ఓ మహర్షీ! నన్నెరుగుదువా? అన్నాడు. నువ్వెవరో నాకు తెలియదు. నాకన్న పెద్దవాడు 'ప్రావాకర్ణుడు' అనే గుడ్లగూబ ఉన్నది. దాని దగ్గరకు వెళ్ళమన్నాడు మార్కండేయుడు. ప్రావాకర్ణుడి దగ్గరకు పోయి అడిగాడు ఇంద్రద్యుమ్నుడు. నువ్వెవరో

నాకు తెలియదు. నాకన్న పెద్దవాడు 'నాళీకజంఘుడు' అనే కొంగ ఉంది దాన్ని అడుగవలసింది అన్నాడు ప్రావాకర్ణుడు. ఇప్పుడు నాళీకజంఘుడి దగ్గరకు వెళ్ళి నన్నెరుగుదువా? అన్నాడు ఇంద్రద్యుమ్నుడు. నువ్వెవరో నాకు తెలియదు. నాకన్న పెద్దవాడు 'ఆకూపారుడు' అనే తాబేలు ఇక్కడి మడుగులో ఉన్నది. దాన్ని అడగవలసింది అన్నది కొంగ. ఇంద్రద్యుమ్నుడు ఇంద్రుని భటులతో కలిసి ఆకూపారుడి దగ్గరకు వెళ్ళి నేనెవరో నీకు తెలుసా? అన్నాడు. మరుక్షణంలో తాబేలు నమస్కరించి "తెలియకపోవటమేమిటి? పూర్వకాలంలో నువు ఈ దేశాన్ని పాలించిన ఇంద్రద్యుమ్న మహారాజువు. అనేక యజ్ఞాలు, యాగాలు, క్రతువులు చేశావు. ఆ సమయంలో లెక్కలేనన్ని గోదానాలిచ్చావు. గోదానం ఇచ్చేటప్పుడు వదిలిపెట్టిన నీటివల్ల ఇదిగో ఈమడుగు ఏర్పడింది. దీని ద్వారానే కొన్ని లక్షల ఎకరాల భూమి సాగవుతున్నది. ఈ మడుగు కొన్నిలక్షల మందికి త్రాగునీరు అందిస్తోంది. మాబోటివారు అనేకులు ఈ మడుగు ఆధారంగానే జీవిస్తున్నారు. నువ్వు చాలా గొప్పవాడివి. నువ్వు చేసినపని తరతరాలకీ నిలచిపోతుంది." అన్నది. ఆ మాటలు విన్న ఇంద్రద్యుమ్నుడు 'అదిగో, నేను చేసిన పుణ్యకార్యాల గురించి జనులు ఇంకా చెప్పుకుంటూనే ఉన్నారు. కాబట్టి నేను ఇంకా స్వర్గలోకంలోనే ఉండవచ్చు" అంటూ స్వర్గానికి వెళ్ళాడు. జరిగిందంతా విన్న దేవేంద్రుడు కూడా ఇంద్రద్యుమ్నుణ్ణి స్వర్గంలోనే ఉండనిచ్చాడు. ఇదంతా ఇంద్రుడికి తెలియదా అంటే తెలియదని కాదు, మనకు తెలియాలనే అలా చేశాడు.

దీనివల్ల మనకు తెలిసేది ఏమంటే మనం చేసిన మంచి పనులను గురించి లోకంలో ఎంతవరకు చెప్పుకుంటారో అంతవరకు మనం

స్వర్గసుఖాలు అనుభవిస్తాము. అలాగే మనం చేసిన పాపపు పనుల గురించి లోకంలో ఎంత కాలం చెప్పుకుంటారో అంత కాలం నరకలోకంలో కష్టాలు అనుభవిస్తాము. కాబట్టి మంచి పనులు చెయ్యండి. పదిమందికి సహాయం, ఉపకారం చెయ్యండి. దానధర్మాలు చెయ్యండి. ఫలితంగా స్వర్గసుఖాలు అనుభవించండి అని చెబుతోంది వేదము.

**ఋగ్వేదంలో ప్రథమ మండలంలోని 125, 126 సూక్తాలు** దానాన్ని గురించి చెబుతున్నాయి. ఇక్కడ 125వ సూక్తంలో 7 మంత్రాలు, 126వ సూక్తంలో 7 మంత్రాలు ఉన్నాయి. కాగా 126వ సూక్తంలోని 7వ మంత్రాన్ని **'రోమశ'** అనే స్త్రీ దర్శించింది.

పూర్వకాలంలో సింధు దేశాన్ని స్వనయుడు అనే మహారాజు పరిపాలించేవాడు. ఆయన గొప్పదాన గుణం కలవాడు.

స్వనయుడు ఉదయం పూట తన దగ్గరకు వచ్చిన వాళ్ళకి ఎక్కువ ధనాన్ని దానంగా ఇస్తాడు. కక్షీవంతుడు ఒకరోజున రాజువద్దకు వెళ్ళి దానం పుచ్చుకుని ఆ ధనాన్ని తన తండ్రికి ఇచ్చాడు. అతని తండ్రి ఆ ధనంతో తన పిల్లలను పోషించి సుఖంగా ఉన్నాడు. ఇప్పుడు తండ్రి కుమారుడితో

"కుమారా ! నువు ఆ రాజుకు ఉదయపు అతిథివి అయినావు. త్రాడుతో పక్షుల్ని మృగాల్ని కట్టేసినట్లుగా ఆ రాజు నిన్ను ధనంతో కట్టేశాడు. అటువంటి ఆ మహారాజుకు మంచి ఆవులు, గుర్రాలు, ధనము సమృద్ధిగా ఉండాలి. ఇంద్రుడు ఆ రాజుకు అధిక సంపద లివ్వాలి.

నిన్న ఉదయం ఆ రాజు నా కుమారుడికి ధనమిచ్చాడు. ఆ రాజును చూడటానికి నేను ఈ ఉదయం ఆయన యజ్ఞం చేస్తున్న

చోటికి సోమరసాన్ని తీసుకువచ్చాను. ఓ దేవతలారా! మీరు సోమాన్ని స్వీకరించండి. ఆ రాజు సిరిసంపదలతో పుత్రపౌత్రాదులతో సుఖంగా ఉండాలి. ఆవులు పాలిస్తాయి. సుఖాన్నిస్తాయి. యాగం చేసేవారిని చేయబోయేవారిని సుఖపెడతాయి. జనులను సంతోషపెట్టేవారిని అన్న సమృద్ధి హేతువులయిన ఆజ్యధారలతో ఆనందపరుస్తాయి.

దేవతలను అర్చించి వారిని ప్రీతి చేసినవాడు స్వర్గం పొందుతాడు. దేవతల మధ్యనే తిరుగుతాడు. అతని కోసం మంచినీరు ప్రవహిస్తుంది. మంచి పంటలు పండుతాయి. అతడు సర్వసౌఖ్యాలు అనుభవిస్తాడు.

దానము చేసినవారికే అందమైన మంచి వస్తువులు లభిస్తాయి. దానం చేసిన వారికే స్వర్గందక్కుతుంది. దానం చేసినవారు మరణంలేనివారవుతారు. చిరాయువును పొందుతారు. మరణించినా వారిపేరు ఈ లోకంలో వినిపిస్తూనే ఉంటుంది.

దేవతలను తృప్తి పరచే వారికి దుఃఖకరమైన పాపం కలగదు. దేవతలను స్తుతించే వారికి, పూజించే వారికి వార్ధక్యము రాదు. ఈ పనులు చేయనివారు పాపాలపాలవుతారు. కష్టాలు పొందుతారు.

స్వనయుడు సింధుదేశపు రాజు. ఇతరులు అతణ్ణి హింసించలేరు. అతడు నాకు వేయి సోమయాగాల కీర్తిని కలుగచేశాడు. అటువంటి రాజుకోసం నేను మంచి స్తుతులు చేస్తున్నాను.

స్వనయుడు ధనదాత. నేను అతన్ని యాచించాను. **అతడు కక్షీవంతుడు అను నాకు అనేక ఆభరణాలు ఇచ్చాడు. మంచి గుర్రాలనిచ్చాడు. ఈ రకంగా అతని కీర్తి** లోకంలో శాశ్వతము అయింది.

స్వనయుడు నల్లని గుర్రాలు కట్టిన, అందమైన స్త్రీలు కూర్చున్న పదిరథాలు ఇచ్చాడు. అరవై వేల గోవులనిచ్చాడు. వాటన్నింటినీ మరునాడే కక్షీవంతుడు తన తండ్రికిచ్చాడు. పదిరథాలు, గోసమూహాలు, వీటిముందు నలభై ఎర్రనిగుర్రాలు నడుస్తున్నాయి. తరువాత సేవకులు పశువులకు ఆహారంగా గడ్డితీసుకుని వస్తున్నారు.

మా బంధువులంతా అన్యోన్యానురాగం కలవారు. హవిస్సులిచ్చేవారు. వారి కోసం ధనంతో నిండిన పదకొండు రథాలు దానంగా తీసుకున్నాను.

నా భార్య రోమశ సంభోగార్హురాలు. ఆమె నాకు అనేక సుఖాలనిస్తుంది.

ఇందులో ఆఖరి మంత్రాన్ని రోమశ అనే స్త్రీ దర్శించింది. బహుశః ఆవిడ కక్షీవంతుని తల్లి కావచ్చు. ఈ రెండు సూక్తాలలోను కక్షీవంతుడే ఋషి. ఇక ఆఖరు మంత్రంలో

"నాథా ! నేను గాంధార దేశపు గొర్రెలాగా రోమాలు కలిగి సంపూర్ణురాలనయి ఉన్నాను. నన్ను సమీపించవలసింది."

ఈ రకంగా దానం చేసిన వారికి ఉత్తమగతులు ప్రాప్తిస్తాయని, వారి కీర్తి ద్యులోకంలో శాశ్వతంగా ఉంటుందని చెబుతోంది వేదం.

దానం చేసేటప్పుడు మనతాహతుకు తగ్గట్టుగా దానం చెయ్యాలి. ఈ విషయం చాలా జాగ్రత్తగా గుర్తుంచుకోవాలి. ఒక చిన్న ఉదాహరణ. పూర్వకాలంలో ఒక పేదబ్రాహ్మణుడు ఉండేవాడు. యాయవారం చేసి కడుపు నింపుకునేవాడు. అటువంటి పరిస్థితిలో కూడా ప్రతిరోజూ ఒక 'తోటకూరకాడల కట్ట' కొని తప్పనిసరిగా దానం ఇచ్చేవాడు. ఇతని దాననిరతిని చూశాడు పరమేశ్వరుడు. ఒకరోజున పరమేశ్వరుడే

స్వయంగా వచ్చి దానం తీసుకుని 'అష్టైశ్వర్యప్రాప్తిరస్తు' అని దీవించాడు.

కొంతకాలం జరిగింది. ఈ బీద బ్రాహ్మణుడు చాలా ధనవంతుడైనాడు. అయినా సరే క్రమం తప్పకుండా ప్రతిరోజూ 'తోటకూర కాడలకట్ట' మాత్రం దానం చేస్తూనే ఉన్నాడు. అలా దానం చేస్తూ 'అంతకింతయింది, ఇంతకెంతవునో' అనుకునేవాడు. అంటే "గతంలో ఈ తోటకూరకాడలకట్ట దానం చేసినందుకు ఇంత ధనవంతుణ్ణి అయ్యాను. మళ్ళీ ఇప్పుడు కూడా అదే దానం చేస్తున్నాను. ఇంకా ఎంత ధనవంతుణ్ణి అవుతానో?" ఇది అతడి భావన. చూస్తున్నాడు పరమేశ్వరుడు. ఒకరోజున మళ్ళీ ఆయనే వచ్చి దానం తీసుకుంటున్నాడు. ఈ బ్రాహ్మణుడు 'అంతకింతయింది ఇంతకెంతవునో?' అంటూ తోటకూరకాడల కట్ట దానం చేశాడు. పరమేశ్వరుడు దాన్ని తీసుకుంటూ 'అంతకింతయింది. ఇంతకి అంతే అవుతుంది' అని అక్కడ నుంచి వెళ్ళిపోయాడు. అంటే "ఓ పిచ్చిబ్రాహ్మణుడా! ఏమీ లేని స్థితిలో ఈ దానం చేశావు. అష్టైశ్వర్యాలు పొందావు. మళ్ళీ ఇప్పుడు కూడా అదే దానం చేస్తున్నావు కాబట్టి నీకు మళ్ళీ అదే స్థితి వస్తుంది. అని అర్థం"

కొద్దిరోజులు గడిచాయి దొంగలుపడి ఈ బ్రాహ్మణుడి ఆస్తిపాస్తులన్నీ దోచేశారు. మళ్ళీ రోడ్డున పడ్డాడు బ్రాహ్మణుడు. ఇక్కడ గ్రహించాల్సిన విషయం ఏమంటే మనస్థాయిని బట్టి దానం చెయ్యాలి. మన ఒక రూపాయి దానం చేశాం. మరి రాజుగారు అలా చెయ్యరాదు కదా ! తైత్తిరీయోపనిషత్తులో ఈ విషయం చెబుతూ ఇంతకన్న ఎక్కువ ఇవ్వలేకపోయాను అని సిగ్గుపడుతూ దానం చెయ్యాలి అంటోంది వేదం.

# 12. అప్పుల బాధ

జీవితంలో అప్పుల బాధ దుర్భరమైనది. ఇక్కడ అప్పు అనే పదానికి అర్థం జాగ్రత్తగా పరిశీలిద్దాం. అప్పు మూడు రకాలు 1. దైనందిన జీవితం గడవటం కోసం చేసే అప్పు 2. విలాసాల కోసం చేసే అప్పు. 3. పెద్ద పెద్ద ఆస్తులు, వాహనాలు కొనటానికి చేసే అప్పు. మొదటిది దైనందిన జీవితం గడవటం కోసం చేసే అప్పు. ఈ రకమైన అప్పు తీరే ఉపాయం కనపడదు. ఆదాయం లేదు. ఖర్చు మాత్రం పెరుగుతుంటుంది. ఆ ఖర్చుల కోసమే అప్పులు చెయ్యటం, అప్పు ఇచ్చిన వాళ్ళు ఇంటిచుట్టూ తిరగటం, గోల చెయ్యటం. చాలా దుర్భరమైన స్థితి. ఇటువంటి అప్పు పగవాడికి కూడా వద్దు. ఇక రెండో రకం వ్యసనాలకు, విలాసాలకు చేసే అప్పు. పానశాలలు, జూదగృహాలు బాగుచెయ్యటం కోసం చేసే అప్పు. దీనిలోంచి బయటకు రావటం చాలా కష్టం. మానవుడు అలవాట్లకి బానిస అయి ఒక రకమైన ఉన్మాదంలో ఉంటాడు. ఎవరు ఏం చెప్పినా వినడు. ధర్మరాజంతటి వాడు జూదానికి బానిస అయి భార్యతో సహా సర్వస్వాన్నీ కోల్పోయాడు. నలమహారాజు కూడా జూదంలో సర్వస్వాన్నీ కోల్పోయి అడవుల పాలయ్యాడు.

ఈ రకమైన అప్పులోంచి బయట పడటం చాలా కష్టము. ఇక మూడో రకమైన అప్పు. ఇళ్ళు, భవనాలు, పొలాలు, స్థలాలు, వాహనాలు మొ॥వి కొనటానికి చేసే అప్పు. ఇదికూడా అంత మంచిదేం కాదు. ఎంతైనా అప్పు అప్పే. అమెరికాలో ఆర్థికమాంద్యం వచ్చినప్పుడు, చాలామంది భారతీయులకు ఉద్యోగాలు పోయినాయి. ఉద్యోగంలో ఉన్నప్పుడు ప్రతివాళ్ళు ఆస్తులు కొనేశారు అప్పుచేసి. వీళ్ళు చేసిన అప్పు కేవలము బ్యాంకు, ఫైనాన్స్ సంస్థల దగ్గర. ప్రతినెలా

మొదటి వారంలో వీళ్ళు పెద్ద మొత్తంలోనే అప్పువాయిదా చెల్లించాలి. లేకపోతే వడ్డీమీద వడ్డీ పడుతుంది. అటువంటి సమయంలో ఇల్లు గడవక, అప్పుతీర్చే మార్గం లేక చాలా అవస్థలు పడ్డారు. కొన్న ధరకన్నా తక్కువకు ఇళ్ళు అమ్ముకున్నారు. కొంతమందైతే ఏం చెయ్యాలో తెలియక దూలానికి వేలాడి ఆత్మహత్యలు చేసుకున్నారు. ఈ రకమైన అప్పులో కొంత వెసులుబాటు ఏమంటే అన్నీ సవ్యంగా ఉంటే ఈ అప్పుతీరటం పెద్ద ఇబ్బంది కాదు. ఏది ఏమైనా అప్పు అప్పే. అప్పుల బాధ భరించటం చాలా కష్టం. ఋగ్వేదంలోని **ఏడవ మండలంలోని నాల్గవ సూక్తంలో** "అప్పు లేని వారి వద్ద కావలసినంత ధనం ఉంటుంది. అప్పు తీర్చే ధనం చాలా గొప్పది. అప్పు లేనివాడు ఏ రకమైన బాధలు పడకుండా సుఖంగా జీవిస్తాడు" అంటున్నారు.

# 13. సంతానము

వివాహము అనేది వంశాన్ని అభివృద్ధి చేసుకోవటానికి ఏర్పాటు చేసిన మార్గం. ప్రతిమానవుడు వివాహం చేసుకొని సత్సంతానాన్ని పొంది పున్నామనరకం నుంచి రక్షించబడతాడు. పుత్రులు కలిగినప్పుడు తల్లితండ్రుల ఆనందానికి అవధులుండవు. అయితే

**పుత్రోత్సాహము తండ్రికి పుత్రుడుదయించినపుడు పుట్టదు.**

**జనులా పుత్రుని కనుగొని పొగడగ పుత్రోత్సాహము నాడు పొందు**

పుత్రుడు కలిగాడనే ఆనందం ఆ పిల్లవాడు ఎదిగి తల్లితండ్రులకు మంచి పేరు తెచ్చినప్పుడు మాత్రమే కలుగుతుంది. సంతానంలో కూడా అనేక రకాలున్నాయి.

1.అగ్నిసాక్షిగా వివాహం చేసుకున్న భార్యయందు కలిగే సంతానము. ఇది మళ్ళీ రెండు రకాలు 1. ధర్మసంతానము 2. కామసంతానము

**ధర్మసంతానం** ఇది నాలుగు రకాలుగా ఉంటుంది. 1. కేవలము ధర్మాన్ని రక్షించటం కోసం, వంశాభివృద్ధి కోసం, తిథి, వార, నక్షత్రాలు చూసి సంతానం పొందటం, వీరు చాలా గొప్పవారవుతారు.

2.భార్యకు భర్తవల్ల సంతానం కలగకపోతే భర్త అనుమతితో పరపురుషుని ద్వారా సంతానం పొందటం, భారతంలో పాండవులు ఈ రకమైన సంతానవే. వీరుకూడా ధర్మసంతానంగానే పరిగణించబడతారు.

3.సంతానం కలగనపుడు ఇతరుల పిల్లలను దత్తత తీసుకోవడం. వీరుకూడా చట్టబద్ధమైన సంతానమే. కాకపోతే వాళ్ళు మన పిల్లలు కాదని లోలోపల మనకి బాధగానే ఉంటుంది. అలాగే సంతానానికి

కూడా పుట్టింటిమీద మమకారం ఉంటుంది. ఎన్ని సంవత్సరాలైన వీరు పరాయివారుగానే ఉంటారు. ఈ కారణం చేతనే దత్తు తీసుకునేటప్పుడు చిన్నపిల్లల్ని, పసిపిల్లల్ని తెచ్చుకోవాలి.

4. కొన్ని సందర్భాలలో ఇతరుల బీజాన్ని తీసుకుని మన క్షేత్రంతో ప్రవేశపెట్టడం జరుగుతుంది. ఈ విషయం మూడోకంటి వాడికి కూడా తెలియదు. వీరు కూడా చట్టబద్ధమైన సంతానమే.

**కామసంతానం :** కేవలము కోరికలు తీర్చుకునే సమయంలో కలిగిన సంతానం. ఇలాంటప్పుడు తల్లితండ్రులకు కోరికలు తీరవు. అప్పుడు వారికి కలిగిన సంతానం కూడా స్థిరత్వం లేకుండా, ఏదోచెయ్యాలనే ఆలోచనతో, ఆవేశంతో ఉంటారు. ఇలాంటివారే జనం మధ్యనకూర్చుని, రోడ్డుమీద పోతున్నప్పుడు మధ్య మధ్యలో పెద్దగా అరుస్తుంటారు. వికృతచేష్టలు చేస్తుంటారు. కొంతమందైతే షాపులమీద, బస్సులమీద రాళ్ళు విసురుతుంటారు. అసలు తాము ఏం చేస్తున్నామో తెలియని స్థితిలో ఉంటారు. వీరంతా కామసంతానం. వీరివల్ల తమకుగాని, ఇతరులకు గాని ఏ రకమైన ఉపయోగం ఉండదు. కొంతమంది సమాజంలో అణగద్రొక్కబడి, విపరీతమైన కష్టాలు అనుభవించి, ఏమీ చేయలేక, పగ, ప్రతీకారాలతో రగిలిపోతూ మరణిస్తారు. ఇలాంటివారు మరుజన్మలో ఉగ్రవాదులుగా జన్మిస్తారు.

అందుకే **ఏడవ మండలంలోని 4వ సూక్తంలో** ఇతరుల ఉదరమున పుట్టినవాడు, దత్తపుత్రులను కుమారులుగా భావించరాదు. అంటోంది వేదం.

# 14. శ్రీమహావిష్ణువే పరమేశ్వరుడు

చరాచర జగత్తులో పరమేశ్వర స్వరూపము అంటే శ్రీమహావిష్ణువే. మనం ఏ పని చెయ్యాలన్నా శక్తి కావాలి. ఆ శక్తిని పరమేశ్వరుడే ఇవ్వాలి. అంటే విష్ణువే ఇవ్వాలి. మన నోట్లోంచి వచ్చే ప్రతిమాటా ఆ పరమేశ్వరుని స్తుతే కావాలి. లోకంలోని ప్రజలందరికీ మేలు చేసే శక్తి, సేవ చేసే శక్తి ఆ పరమేశ్వరుడు మనకి ఇవ్వాలి. ఆ శక్తితోనే మనం లోకాలకు మేలు చెయ్యగలుగుతాం. ఈ విషయాలన్నీ **ఏడవ మండలంలోని నూరవ సూక్తంలో** చెప్పటం జరిగింది.

"శ్రీమహావిష్ణువు అందరిచేతా కీర్తించబడతాడు. విష్ణువుకు హవిస్సులు ఇచ్చేవాడు, మంత్రాలతో ఆయనను పూజించేవాడు, ధనాన్ని కోరితే వారికి విష్ణువు ధనాన్నిస్తాడు. కోరికలు తీర్చే ఓ విష్ణుమూర్తీ! అందరికీ మేలుచేసేదయిన నీ అనుగ్రహాన్ని మా మీద ప్రసరింపచేయుము. అందువల్ల మాకు అనేక అశ్వములు, ధనము లభిస్తాయి. ఈవిష్ణువు చాలామహిమ గలవాడు. తన మూడు పాదములతో ముల్లోకాలను ఆక్రమించాడు. పెద్దవాటన్నింటి కన్నా పెద్దవాడు. అతనికన్న పెద్దది ఇంక ఏదీలేదు. ఈ భూమి అంతా మానవులు నివసించేందుకు యోగ్యంగా చెయ్యాలనే కోరికతో భూమిమీద అడుగు పెట్టాడు. విశాలమైన నివాస ప్రదేశాన్ని ఏర్పాటు చేశాడు. ఓ దేవా ! నువ్వు స్తుతులకు స్వామివి. అందుకే నిన్ను కీర్తిస్తున్నాను. నీవు మహత్తువు. నేను అణువును అయినప్పటికీ నిన్ను స్తుతిస్తున్నాను. ఓ స్వామీ ! నీ విశ్వరూపాన్ని దర్శించినప్పుడు చెప్పటానికి వీలులేనంతగా పెరుగుతున్నావు. నీ మాహాత్మ్యాన్ని ఏ ఒక్కడూ తెలుసుకోలేడు. మాకు కేవలము రెండు లోకాలు మాత్రమే

తెలుసు. వాటిపైన ఉండే లోకాలు నీకే తెలుసు. ఓ దేవా! వషట్కారంతో నిన్ను ఆహ్వానిస్తున్నాను. నా ప్రార్ధన మన్నించు. నా నోటినుంచి వచ్చే ప్రతిమాటా నీ స్తుతే కావాలి. నీ అనుగ్రహం మాకు శాశ్వతంగా ప్రసాదించు. విష్ణువును శరణు వేడినవాడు శాశ్వత సుఖాలు అనుభవిస్తాడు. త్రికరణశుద్ధిగా విష్ణువును సేవించేవాడు లోకంలోని ప్రజలందరినీ సేవిస్తున్నాడు. ఓ విష్ణుదేవా! నువ్వు మాకు అనేక రకాలైన సంపద లిచ్చావు. అతిశ్రేష్ఠమైన జ్ఞానాన్ని, నిస్వార్ధ ప్రజాసేవ చేసే శక్తినికూడా మాకు ప్రసాదించవలసినది.”

# 15. కుక్కను నిద్ర పుచ్చటము

వశిష్ఠుడు ఒక రోజు రాత్రిపూట వరుణుడి ఇంటికి వెళ్ళాడు. అక్కడ ఉన్న కుక్క వశిష్టుణ్ణి చూసి మొరుగుతూ వెంట పడింది. అప్పుడు **ఏడవ మండలంలోని 54వ సూక్తం** పారాయణ చేసి ఆ కుక్కని వశిష్టుడు నిద్ర పుచ్చాడు.

ఓ సారమేయమా ! సారమేయము అంటే ఇంద్రుని కుక్క. నువ్వు బయలుదేరిన చోటికే తిరిగి వస్తావు. నువ్వు దొంగలు, బందిపోట్ల దగ్గరికి వెళ్ళు. సుఖంగా నిద్రపో. మమ్మల్ని బాధించకు. నువు వెళ్ళి పందిని చీల్చి చంపెయ్యి. మమ్మల్ని మాత్రం బాధించవద్దు. సూర్యుడి సాయంతో ప్రాణులన్నింటినీ నిద్ర పుచ్చుతాము. నువ్వు మమ్మల్ని బాధించవద్దు. ఎక్కడ పడుకున్నవారు అక్కడే నిద్రపోతారు. నువు అందరినీ నిద్రపోయేట్టుగా చేయవలసింది."

దీనికి సాయణాచార్యుడు "వశిష్టుడికి మూడు రోజులు అన్నం దొరకలేదు. నాల్గవరోజు రాత్రి వరుణుడి ఇంటికి వెళ్ళాడు. ద్వారం దగ్గర కుక్క భయపెట్టి బెదిరించింది. ఈ సూక్తం చదివి వశిష్ఠుడు ఆ కుక్కని నిదురపుచ్చాడు" అని భాష్యం వ్రాశాడు.

# 16. రాక్షస సంహారము

మనం రాక్షసులు అని ఒక పదాన్ని వాడుతూ ఉంటాం. రాక్షసి అంటే జుట్టు విరగబోసుకుని, పెద్ద ఆకారంతో, వంటిమీద రక్తం కారుతున్న చర్మం వస్త్రంగా ధరించి, ఆయుధాలు చేత్తో పట్టుకుని, క్రూరమైన పనులు చేస్తూ, భయంకరంగా ఉంటారు అని మన భావన. వాళ్ళు ఎక్కడో అడవులలో తిరుగుతుంటారు. మృగాలనే కాక మనుషుల్ని కూడా ఎత్తుకుపోయి తింటారు. ఇది మనకు తెలిసిన విషయం. అయితే రాక్షసులు ఎక్కడో లేరు. ఇక్కడే మన ప్రక్కనే, మన సమాజంలోనే ఉన్నారు. ఇందాక మనం చెప్పిన లక్షణాలన్నీ వారికీ ఉన్నాయి. మనతో ఉంటూ, మన సమాజంలోనే తిరుగుతున్న రౌడీషీటర్లు, ఖూనీకోరులు, బందిపోట్లు, దుర్మార్గులు, నీచులు మతోన్మాదులు, ఉగ్రవాదులు అందరూ రాక్షస జాతికి చెందినవారే. కాకపోతే కాలక్రమంలో ఈ రాక్షసులు కూడా కొంత నాగరికత నేర్చుకున్నారు. అందుకే అందమైన దుస్తులు ధరించి, కార్లలో తిరుగుతుంటారు. ఆ రోజులలో కూడా రావణుడు, హిరణ్యకశ్యపుడు వంటివారు గొప్ప నాగరికులు. రథాలలో తిరిగారు. రాజ్యాలు పాలించారు. పైకి వీరు ఎలా కనిపించినా అసలైన రాక్షసుడు వారిలో నిద్ర పోతుంటాడు. సమయం వచ్చినప్పుడు లేస్తాడు.

ఎవరో బయట వాళ్ళదాకా అవసరం లేదు. చాలా మంచివాళ్ళము అనుకుంటున్న మనలోనే ఈ రాక్షసుడు నిద్రావస్థలో ఉంటాడు. అప్పుడప్పుడు మెలకువ వచ్చి లేస్తుంటాడు కుంభకర్ణునిలాగా.

ఇంతకీ ఎవరీ రాక్షసులు. మానవుడిలో ఉండే సత్వగుణమే దైవము. తమోగుణమే రాక్షసుడు. ఈ గుణాలు ఏ మేరకు ఉంటే ఆ మేరకు అతడిలో రాక్షసుడు ఉంటాడు. మనలో ఉండే అరిషడ్వర్గాలే

రాక్షసులు. ఈ రాక్షసుల వల్లనే అబద్ధంఆడటం, దొంగతనాలు, దోపిడీలు, హత్యలు, అత్యాచారాల వంటివి జరుగుతుంటాయి. అవి లేకుండా ప్రతి మానవుడు హాయిగా సుఖశాంతులతో జీవించాలంటే రాక్షసప్రవృత్తి నాశనంకావాలి. దీనికి పరమేశ్వరుని కృప కావాలి. అందుకే ఋగ్వేదంలోని **7వ మండలంలోని 104వ సూక్తంలో** 'ఓ పరమేశ్వరుడా! రాక్షస సంహారం చేసి మానవులను కాపాడు ధర్మాన్ని నిలబెట్టు' అని ప్రార్థిస్తున్నారు. ఈ సూక్తంలో మొత్తం 25 మంత్రాలున్నాయి.

"ఓ ఇంద్ర సోములారా ! మీరు రాక్షసులకు దుఃఖం కలిగించండి. వారిని చావగొట్టండి. అంధకారంలో వృద్ధి చెందేవారిని నేల కరిపించండి. అజ్ఞాన రాక్షసులను విముఖులుగా చేసి హింసించండి. ముక్కలు ముక్కలుగా చేసి దూరంగా విసిరివేయండి.

అనర్ధ ప్రశంసకులు, అక్రమాలు చేసే రాక్షసులను అణచి వేయండి. వారిని అగ్నిలో వేసిన చమురులాగా అంతం చెయ్యండి. బ్రహ్మద్వేషులు, మాంసభక్షకులు, ఘోరమైన కళ్ళు, వాక్కు గల రాక్షసులను సర్వదా ద్వేషించేటట్లు చేయండి. దుర్మార్గపు పనులుచేసే రాక్షసులను అంధకారంలో పడేసి చంపండి. వాళ్ళలో ఒక్కడు కూడా బ్రతికి బయటపడకూడదు. రాక్షససంహారం కోసం క్రొత్త క్రొత్త ఆయుధాలు సృష్టించండి. అంతరిక్షంలో నాలుగు వైపులకు మీ ఆయుధాలు విసరండి. అగ్నిలాగా కాల్చేవి, తపింపచేసేవి, దృఢమైనవి, రాళ్ళతో చేసినవి అయిన ఆయుధాలతో రాక్షసుల ప్రక్కటెముకలు విరకొట్టండి. ఇంద్ర సోములారా ! వేగంగా పరుగులెత్తే గుర్రాల మీద వచ్చి ద్రోహులైన రాక్షసులను మట్టుపెట్టండి. రాక్షసులు పాపాత్ములు. ఎప్పటికైనా మనకి ద్రోహం తలపెడతారు. కాబట్టి వాళ్ళని

సుఖంగా ఉండనివ్వద్దు. నన్ను అబద్ధమాడేట్లు చేసిన రాక్షసులను నామరూపాలు లేకుండా చెయ్యండి. కళ్యాణ గుణాలు గల నన్ను దోషినిగా చేసిన వాణ్ణి పాములమీద పడుకోబెట్టండి. ఓ అగ్నిదేవా! మా అన్నాన్ని నష్టపరిచేవాడు, మా పశువులు, వాటి సంతానాన్ని నాశనం చేసేవారు, దొంగలు, ధనాన్ని హరించేవారు అయిన రాక్షసులు సంతాన సహితంగా నాశనం కావాలి. మమ్మల్ని రాత్రులు, పగళ్ళు బాధలు పెట్టే రాక్షసులు చచ్చిపోవాలి. వారి సంతానం కూడా మిగలరాదు. సోముడు పాపాత్ముణ్ణి, మిథ్యావాదిని వదలడు. చంపేస్తాడు. రాక్షసులను, అసత్యమాడే వారిని కూడా చంపుతాడు. ఓ అగ్నిదేవా! నేను అసత్యవాదిని, మిథ్యావాదినీ అయితే నన్ను కూడా నాశనం చెయ్యి. నేను రాక్షసుడనైతే నా భార్యా పిల్లలతో సహా నన్ను కూడా నాశనం చెయ్యి. ఒకవేళ నేను రాక్షసుడను కాకపోతే, నన్ను రాక్షసుడు అన్నవాణ్ణి సకుటుంబంగా నాశనం చెయ్యి. రాత్రులందు గుడ్లగూబ రూపంలో తిరిగే రాక్షసుల తల పగిలిపోవాలి. ఓ మరుత్తులారా! రాత్రులందు పక్షి రూపంలో తిరుగుతూ మానవులను హింసించే రాక్షసులను సంహరించండి. ఓ ఇంద్రా! నీ వజ్రాయుధంతో నలుదిక్కులా ఉన్న రాక్షసులను నాశనం చెయ్యి. ఈ రాక్షసులు కుక్కలను వెంట పెట్టుకుని ఇంద్రుణ్ణి హింసించటానికి వస్తున్నారు. ఇంద్రుడు వజ్రాయుధానికి పదును పెడుతున్నాడు. దాన్ని త్వరగా రాక్షసులమీద ప్రయోగించాలి. ఇంద్రుడు హింసించే వారిని కూడా హింసించేవాడు. రంపంతో చెట్లను కోసినట్లుగా రాక్షసులను తెగనరుకుతాడు. ఇంద్రా క్షుద్రమైన గుడ్లగూబలాగా హింసించే రాక్షసులను సంహరించు. మమ్మల్ని రాక్షసులు చుట్టుముట్టరాదు. రాక్షసులు దూరమై పోవాలి. ఓ ఇంద్రా! మగరాక్షసులను నాశనం చెయ్యి. మాయలతో హింసించే ఆడరాక్షసిని నాశనం చెయ్యి. చంపటమే

పనిగా పెట్టుకున్న రాక్షసుల తలలు తెగనరుకు, వాళ్ళు సూర్యోదయాన్ని చూడరాదు. ఓ దేవతలారా! మీ మీ ఆయుధాలు ప్రయోగించి రాక్షస సంహారము చేయండి. మంచి వారిని రక్షించండి" అని దేవతల రూపంలో ఉన్న పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నారు.

# 17. అందర్నీ కాపాడేది పరమేశ్వరుడే

చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. సృష్టికి ముందు నిరాకారంగా ఉన్న పరమేశ్వరుడు జగత్తుని ఆక్రమించి ఉన్నాడు. సృష్టి తరువాత అదే పరమేశ్వరుడు 84 లక్షల రకాలయిన జీవరాసుల రూపంలో ఈ జగత్తుని ఆక్రమించాడు. మొత్తం మీద చూస్తే సృష్టికి ముందు గాని, సృష్టి తరువాత గాని ఈ జగత్తంతా పరమేశ్వర స్వరూపమే ఆక్రమించి ఉన్నది. ఈ జగత్తులో ప్రాణమున్నవి, ప్రాణం లేనివి, చలనమున్నవి, చలనం లేనివి అన్నీ పరమేశ్వర స్వరూపమే, అన్నింటిలోనూ ఆ పరమేశ్వరుడే ఉన్నాడు. ఇంకా విచిత్రం ఏమంటే అన్ని పదార్థాలు ఆయనలోనే ఉన్నాయి. ఈ జగత్తే ఆయన స్వరూపమైనప్పుడు, ఇందులోని వస్తువులు, ప్రాణులు అన్నీ ఆయనలో ఉన్నట్లే కదా! ఈ విషయం తెలిసిన వాళ్ళు భగవంతుణ్ణి స్తుతి చేస్తూ ఉంటారు. వాళ్ళు స్తుతించేది ఆ పరమేశ్వర స్వరూపాన్నే అని గుర్తించాలి. జగత్తులోని ప్రజలందరికీ జ్ఞానాన్ని ప్రసాదించి వారిని కాపాడేది ఆయనే. ఈ విషయం ఋగ్వేదంలోని **ఎనిమిదవ మండలం**లో వివరిస్తున్నారు. భగవంతుడు తన విశ్వరూపాన్ని చెబుతున్నాడు. "ఓ భక్తాగ్రేశ్వరా ! ఒక్కసారి నిదానంగా కళ్ళు తెరచి చూడు నేను నీ ఎదుటనే ఉన్నాను. సత్యాన్ని దర్శించగలిగిన వాళ్ళు మాత్రమే నన్ను దర్శించగలుగుతారు. వాళ్ళు స్తుతించేది నా రూపాన్నే. వారికి జ్ఞానం ప్రసాదించేది, వారిని కాపాడేది కూడా నేనే." అంటున్నాడు.

# 18. అజ్ఞానులు

లోకంలో రెండు రకాల వాళ్ళున్నారు. 1. అజ్ఞానులు 2. జ్ఞానులు. ఈ జగత్తంతా పరమేశ్వర స్వరూపము. పరమేశ్వరుడు తప్ప ఇంకేమీ లేదు అనుకునే వాళ్ళు జ్ఞానులు. పరమేశ్వర స్వరూపాన్ని అంగీకరించని వాళ్ళు అజ్ఞానులు. అజ్ఞానుల దృష్టిలో ఈ జగత్తు దానంతట అదే సృష్టించబడింది. భగవంతుడు లేడు, వేదాలు లేవు. ఈ వేదాలన్నీ కొందరు స్వార్ధపరులు కల్పించిన కథలు. స్వర్గనరకాలు లేవు. పాపపుణ్యాలు లేవు. ఇలా భావిస్తుంటారు. వీళ్ళనే నాస్తికులు, చార్వాకులు అంటారు. ఇటువంటి వాళ్ళవల్ల మిగిలిన వాళ్ళు కూడా చెడిపోయే అవకాశమున్నది. ధర్మం గతితప్పుతుంది. వీళ్ళ కబంధ హస్తాలనుంచి సత్పురుషులు రక్షించబడాలి. అందుకే **ఎనిమిదవ మండలంలో** "ఓ మిత్రావరుణలారా ! ఎవరైతే భగవతత్త్వాన్ని ఇష్టపడరో, ఎవరు ఆధ్యాత్మిక చర్చలలో పాల్గొనరో, ఎవరు వాటియందు విముఖత ప్రదర్శిస్తారో అటువంటి అజ్ఞానుల కబంధహస్తాలనుంచి సత్పురుషులు రక్షించబడాలి." అని ప్రార్ధిస్తున్నారు.

# 19. పవమానసోముడు

ఋగ్వేదంలోని కర్మకాండకు సోమరసానికి చాలా దగ్గర సంబంధం ఉంది. ఈ కారణం చేతనే సోమరసము, దీనికి అధిదేవత సోముడు విస్తృతంగా స్తుతి చెయ్యబడ్డారు. పవమానము అంటే వడబోసిన సోమరసము అని అర్థం. సోమలత యొక్క చిన్న చిన్న ఆకులు, కొమ్మలు తెచ్చి రోటిలో బాగా తొక్కి, లేదా తిరగలిలో వేసి తిప్పి ఆ రసాన్ని పిండటం జరుగుతుంది. తరువాత సోమరసాన్ని ఉన్ని వస్త్రాలలో వడగడతారు. ఇలా వడగట్టిన సోమరసాన్ని పవమానము అంటారు. ఇలా తీసిన సోమరసాన్ని నీళ్ళతోగాని, పాలు, పెరుగు, తేనె మొదలైన వాటితో కలిపి సేవిస్తారు. సోమరసం అమృతంగా చెప్పబడుతున్నది. దీన్ని తాగిన వారిని అమరులుగా చేస్తుంది. అందుకే దీన్ని అమృతము అని కూడా అంటారు. ఈ విషయాలన్నీ మనం గతంలో చెప్పుకున్నాం. ఈ సోమాన్ని గురించి ఋగ్వేదంలోని **తొమ్మిదవ మండలం**లో పూర్తిగా చెప్పబడింది. అది గాక ఇతరత్రా ఆరు సూక్తాలలో చెప్పబడింది.

సోమలతకి ఇతర దేవతలకు లాగా అవయవాలు లేవు. అందుకే బహునేత్రుడు, సహస్రాక్షుడు అన్నారు. ఈ సోమరసాన్ని త్రాగే ఇంద్రుడు అనేక యుద్ధాలలో విజయం సాధించాడు.

పవమాన సోమమా ! మాకు నలువైపులా ఉండి ఎక్కువ మొత్తంలో అధిక ధనాన్ని ఇవ్వవలసినది. నీ బలంతో మేము యుద్ధంలో శత్రువులను ఓడిస్తాము. మాకు ధనాన్ని ప్రసాదించు. సోమము అన్నదాత. అందరికీ అన్నాన్నిస్తాడు.

పవిత్ర స్వరూపుడవైన ఓ సోముడా ! అందరికీ తండ్రివి నీవే.

అందరి ప్రాణములు నీ నుంచే ఆవిర్భవించినాయి. ఈ సకల జగత్తుకు నీవే అధిపతివి. మేము నివసించటం కోసం ఈ భూమిని ఏర్పాటు చేశావు. మాకందరికీ నివాసాలు ఏర్పాటు చేశావు. జీవరాసికి దేహము ఇచ్చింది కూడా నువ్వే. ఈ లోకంలోని జనులందర్నీ పవిత్రులుగా చేస్తున్నది నువ్వే. ఓ దేవా ! ఇహపరాలతో సంబంధం లేని సంపదను మాకివ్వు. మానవులంతా నీ మీద అమితమైన ప్రేమతో ఉన్నారు.

చంటిబిడ్డ తల్లితండ్రుల దగ్గరకు వెళ్ళినట్లుగా పవమానసోముడు భక్తుల దగ్గరకు త్వరగా పరుగెడతాడు. పవిత్ర హృదయాల్లో నివసించటానికి ఆరాటపడతాడు. ఇతడు భక్తులకు అన్ని సౌభాగ్యాలు ఇస్తాడు. వాళ్ళ పాపాలు నాశనం చేస్తాడు. వారికి ధనము, ఆవులు ఇస్తాడు. ఇతడు ధనవర్షి, కామవర్షి, రాక్షసహంత. యజమానికి ధనాన్ని ఇస్తాడు. అతని మహిమ వల్లే లోకాలు నివసిస్తున్నాయి. నదులు ప్రవహిస్తున్నాయి.” అంటూ పవమాన సోముని మహిమలు చెప్పటం జరిగింది.

# ౨౦. సృష్టికర్త పరమాత్మ

చరాచర జగత్తు ఏ రకంగా సృష్టించబడింది? అని ఆలోచిస్తే, సృష్టికర్త పరమాత్మ అని తెలుస్తుంది. ఋగ్వేదంలోని **పదవమండలంలో 81, 82 సూక్తాలు** ఈ విషయాన్ని చెబుతున్నాయి. ముందుగా 81వ సూక్తం

విశ్వకర్మ మాకు తండ్రి. అతడు సకల భువనాలు హవనము చేశాడు. తాను కూడా స్వయంగా అగ్నిలో ప్రవేశించాడు. సకల లోకాలను అగ్నికి ఆహుతి చేశాడు. ఆ తరువాత తాను కూడా హతమై పోయాడు.

ఇక సృష్టికాలంలో విశ్వకర్మ ఈ సృష్టి ఎలా చేశాడు? అతడు ఎక్కడ నుంచుని భూమిని, ఆకాశాన్ని సృష్టించాడు? అంటే ఆయన యొక్క నేత్రాలు, ముఖము, చేతులు, కాళ్ళు అన్ని దిశలందు వ్యాపించి ఉన్నాయి. ఆ దివ్య పురుషుడు తన కరచరణములచే (కాళ్ళు చేతులతో) భూమి, ఆకాశాలను సృష్టించాడు. అతడు మాత్రం ఒక్కడే. మళ్ళీ ఇంకో ప్రశ్న. సృష్టికర్తలయిన ద్యావాపృథ్వులు ఏ చెట్టుతో ఈ జగత్తును నిర్మించారు? దేనిమీద నుంచుని ఈశ్వరుడు ఈ సకల జగత్తును సృష్టించాడు? ఈ ప్రశ్నకి సమాధానము పరమాత్మ అనే వృక్షంతో ఈ జగన్నిర్మాణము జరిగింది అని గతంలో చెప్పుకున్నాం. 81వ సూక్తంలోని 5,6,7 మంత్రాలలో విశ్వకర్మను ప్రార్థిస్తున్నారు. ఓ విశ్వకర్మా ! మాకు ఉత్తమ, మధ్యమ, అధమ దేహాలను చూపవలసింది. ఇక్కడ మూడు రకాల దేహాలు ఏమిటి? అంటే

1. ఉత్తమ భూతాని – దేవశరీరాణి
2. మధ్యమభూతాని – మనుష్య శరీరాణి

3. అధమభూతాని - పశుపక్ష్యాణి

4. నికృష్ట భూతాని - క్రిమికీటకాది శరీరాణి

1. ఉత్తమ భూతాలు - దేవతలు 2. మధ్య భూతాలు - మానవులు 3. అధమభూతాలు - పశువులు, పక్షులు 4. నికృష్ట భూతాలు - క్రిమికీటకాదులు అంటున్నాడు సాయణుడు.

ఓ విశ్వకర్మా ! నువ్వు ఈ భూమ్యాకాశాలలో యజ్ఞం చేశావు. స్వయంగా సృష్టికర్తవు.

ఇప్పుడు **82వ సూక్తం చూడండి.**

విశ్వకర్మ మొదట జలాన్ని సృష్టించాడు. ఆ తరువాత ద్యావాపృథ్వులను సృష్టించాడు. ఇప్పుడు స్థావరజంగమాత్మక జగత్తు ఏర్పడింది. అప్పుడు ఋషులు ప్రాణులకు ధనాదులు సమకూర్చారు. ఆ ఋషులే యజ్ఞయాగాలు చేశారు. ఇది ద్యులోకము ఇది భూలోకము. ఇవి దేవతలను రాక్షసులను అతిక్రమించి ఉన్నాయి. విశ్వకర్మ వల్ల ఈ జలము గర్భం దాల్చింది. ఆ గర్భంలో దేవతలందరూ ఉన్నారు. ఆ విశ్వకర్మ జనన మరణాలు లేనివాడు. అతని నాభియందు ఈ బ్రహ్మాండమంతా ఉన్నది. ఆ బ్రహ్మాండములోనే ప్రాణులన్నీ ఉన్నాయి. ఈరకంగా అన్ని లోకాలను సృష్టించిన విశ్వకర్మను మీరు ఎరుగరు. మీ బుద్ధికి అతణ్ణి గురించి తెలుసుకునే శక్తి లేదు. మంచు పొరలాంటి అజ్ఞానము ఆవరించిన ప్రజలు నానాకల్పనలు చేస్తున్నారు. వారు కేవలము ఐహికసుఖాల కోసమే ఆలోచిస్తున్నారు. అంతేకాని తాత్త్విక విషయాల గురించి ఆలోచించరు. ఈ చరాచర జగత్తును సృష్టించింది ఆ పరమేశ్వరుడే అనే విషయాన్ని తెలుసుకోలేరు. అని చెబుతోంది.

# 21. శ్రమకు తగ్గ ఫలితం

ఎవరైనా సరే రైతుగాని, కార్మికుడు గాని ఇంకొకడు గాని శ్రమకు తగిన ఫలితాన్ని పొందాలి. అందరికీ తాము పడిన కష్టానికి సరైన ఫలితం రావాలి. కష్టపడటం మనం చేయగల పని. మంచి ఫలితం రావాలంటే పరమేశ్వరుడి అనుగ్రహం కావాల్సిందే. సంవత్సర కాలం వళ్ళు వంచి బాగా వ్యవసాయం చేస్తాడు రైతు. మంచి విత్తనాలు చల్లాడు. సకాలంలో ఎరువులు వేశాడు. చీడపీడలు రాకుండా జాగ్రత్తలు తీసుకున్నాడు. పంట కోతకు వచ్చింది. కోశాడు. ఇప్పుడు తప్పనిసరిగా ప్రకృతి అనుకూలించాలి. అది కాకుండా ఏ వర్షమో వచ్చిందనుకోండి. పండిన ధాన్యం మొత్తం తడిసిపోతుంది. కంకులలోనే మొలకలు వచ్చే పరిస్థితి. చెయ్యగలిగింది లేదు. ఇక్కడే ఒక చిన్న ఉదాహరణ. నాకు బాగా తెలిసిన ఇద్దరు వ్యక్తులు, పదవ క్లాసు పూర్తి చేసి విజయవాడ ఐటిఐలో చేరారు. ఒకరు మెకానికల్, ఇంకొకరు ఎలక్ట్రికల్. చదువు పూర్తయిన తరువాత ఎలక్ట్రికల్ చదివినతనికి రైల్వేలో ఉద్యోగం వచ్చింది. చాలా అదృష్టవంతుడు అనుకున్నారు. వివాహం చేసుకుని జీవితంలో స్థిరపడిపోయాడు. మెకానికల్ చదివినతను చిన్న చిన్న ఉద్యోగాలు చేస్తూ కాలక్రమంలో బి.టెక్, ఎమ్.బి.ఎ., పూర్తి చేసి చిన్న ఫ్యాక్టరీలు ప్రారంభించి ఇప్పుడు కోట్ల రూపాయలకధిపతి అయినాడు. ఇక్కడ చూడండి. ఇద్దరు చదివిందీ ఒకటే చదువు. కాని ఇవాల్టి పరిస్థితి ? అందుకే ఓ పరమేశ్వరా మా శ్రమకు తగిన ఫలితాన్నివ్వు అని ప్రార్థిస్తున్నారు ఋగ్వేదంలోని **పదవ మండలంలోని 106 వ సూక్తంలో**. ఇక్కడ అశ్వనీ దేవతలను ప్రార్థన చేస్తున్నారు. దేవత పేరు ఏదైనా రూపం మాత్రం పరమేశ్వరుడే.

ఓ అశ్వనీ దేవతలారా ! మీరు యజ్ఞానికి రావలసింది. ఎద్దులు పచ్చిక బయలుకు వచ్చినట్లుగా మీరు యజ్ఞానికి రండి. అలా వచ్చేటప్పుడు దానం చెయ్యటానికి ధనాన్ని తెండి. అలా వచ్చి ఇక్కడ సోమాన్ని త్రాగండి. తల్లితండ్రులు తమ పిల్లల పట్ల ప్రేమ కలిగి ఉన్నట్లుగా మా విషయంలో మీరు ఆసక్తి చూపండి. మాకుఉపకారం వేసి శాంతిని ప్రసాదించండి. మీరు తేజోమయమయిన ఆకాశంలో ఉంటారు. జగత్తులోని జనులను మీరే పోషిస్తున్నారు. జగత్తును లయం కూడా చేస్తున్నారు. పరిణామశీలమైన నా దేహానికి యవ్వనము ప్రసాదించండి. నదిని దాటగలవాడు ఇంకొకణ్ణి దాటించగలడు. అలాగే నన్ను సమస్త ఆపదల నుంచి గట్టెక్కించండి. మాకు ఆశ్రయం కలిగించండి. ఈ పవిత్ర యజ్ఞానికి మీరురండి. మేమిచ్చే ఆహుతులు స్వీకరించండి. సోమపానం చెయ్యండి. మేఘాలు మంచి తియ్యని నీటిని ఇచ్చినట్లుగా, పశువులలో పాలను సృష్టించండి. సంవత్సర కాలం కష్టపడి వ్యవసాయం చేసిన రైతుకు మంచి పంట నివ్వండి. అతడికి ధనధాన్యది రూపమైన సంపద ఇవ్వండి" అంటూ శ్రమకు తగిన ఫలితం ఇమ్మని పరమేశ్వరుణ్ణి ప్రార్ధిస్తున్నారు.

# 22. అన్నదానము

మనం సంపాదించిన దాన్ని ధర్మార్ధ కామ మోక్షాలకు వినియోగించాలి అనేది ఆర్యోక్తి. ప్రతివ్యక్తి కూడా ఉదయం పూట ధర్మము చెయ్యాలి. అంటే ధర్మకార్యాలు పూజావిధులు నిర్వర్తించాలి. మధ్యాహ్నం అప్పుడు మన లెక్క ప్రకార ఉదయం 9 లేదా 10 గంటల నుండి అని అర్ధము. ధన సంపాదన చెయ్యాలి సాయంత్రం వరకు. మహాఅయితే సూర్యాస్తమయం దాకా. ఆ తరువాత కామము. అంటే నీకు కావలసిన కోరికలు తీర్చుకోవటం. భార్యాబిడ్డలతో సుఖంగా కాలక్షేపం చెయ్యటం. ఆ తరువాత మోక్షమార్గము. తెల్లవారుఝామున 4 గంటల నుంచి జపము, తపము, ధ్యానము చెయ్యాలి.

ఎవరైనా యాచకుడు వస్తే తప్పనిసరిగా నీకున్న దానిలో తృణమో, పణమో ఇచ్చి పంపాలి. ఒక్కొక్కసారి బాగా చదువుకున్న వాళ్ళు, పండితులు వస్తుంటారు. వారిని ఉచితరీతిన సత్కరించాలి. దానము ఎప్పుడూ సత్పాత్రంగా ఉండాలి. ఎవరైనా ఆకలితో బాధ పడుతుంటే అతనికి అన్నం పెట్టండి. అంతేకాని డబ్బులు మాత్రం ఇవ్వద్దు. వాటిని అతడు దుర్వినియోగం చేస్తాడు. వారుణవాహినిలో కలిపేస్తాడు. దానాలన్నింటిలోకి అన్నదానం చాలా గొప్పది. ఆకలితో ఉన్నవాడికి అన్నం పెడితే అది అక్షయమవుతుంది. ఇక్కడ మనం గుర్తుంచుకోవలసి విషయం ఒకటుంది. దానం చేసేటప్పుడు ఎవరైనా సరే, ఎవరికైనా సరే, మంచి వస్తువునే ఇవ్వండి. మనం ఇచ్చింది వాళ్ళు ఉపయోగించాలి. లేకపోతే మీకు దానం చేసిన ఫలితం దక్కదు. ఒకసారి మానాన్న ఆబ్దీకంలో భోక్తలకు బట్టలు పెడదామని తీసుకువెళ్ళాను. వాటిని తడిపి ఆరవేసి ఇవ్వటం సంప్రదాయం. కానీ అక్కడ ఒక పెద్దాయన చెప్పాడు. 'బాబూ ! వాటిని తడపకండి.

మీరిచ్చినవి వాళ్ళు కట్టుకోరు. మళ్ళీ షాపులో ఇచ్చి డబ్బులు తెచ్చుకుంటారు. మీరు గనక వాటిని తడిపితే, అవి ఎందుకూ పనికి రాకుండా పోతాయి" అన్నాడు. అప్పటి నుంచీ ఇక ప్రతిసారీ ఆ డబ్బు లేవో నేనే ఇస్తాను. అంతేకాని వాళ్ళకి బట్టలు మాత్రం పెట్టను. ఒకవేళ ఎవరికైనా బట్టలు పెట్టాలి అంటే మీరు కట్టుకునే బట్టలే వారికి కూడా పెట్టండి. మీకు పనికి రానివి అవతల వాళ్ళకి ఎలా పనికి వస్తాయి? బియ్యం ఇవ్వాలి. మంచి బియ్యం, మీ ఇంట్లో బియ్యం ఇవ్వండి. అంతేగాని ముక్కి పోయినవి, పురుగులు పట్టినవి మాత్రం ఇవ్వద్దు. అవే కొన్ని రెట్లయి మీ కోసం తిరిగి వస్తాయి గుర్తుంచుకోండి. అసలు దానం ఇవ్వకపోతే ఏమవుతుంది? ఇది చాలా పెద్ద ప్రశ్న. పూర్వకాలంలో ఒక పెద్దావిడ ఉండేదట. ఆవిడ పేరు నారాయణమ్మ. చిన్నప్పుడే భర్త పోయాడు. ఎవరూ లేరు. భర్త తాలూకు ఆస్తి మాత్రం ఉంది. దాంతోనే కాలక్షేపం చేస్తోంది. సుఖంగానే బ్రతుకుతోంది. కాని పిల్లికి కూడా బిచ్చం పెట్టదు. భోజనం చేస్తూ ఎంగిలి చేత్తో కాకిని కూడా తోలదు. ఒక అన్నం మెతుకు అవతల పడిపోతుందేమో అని భయం. ఆవిడ ఇంటికికూడా ఎవర్నీ రానిచ్చేది కాదు, భోజనం పెట్టవలసి వస్తుంది అని భయం. ఆవిడ పెద్దదయిపోయింది. అవసానకాలం సమీపిస్తోంది. ఇంతవరకు పుట్టి బుద్ధి ఎరిగిన తరువాత ఎవరికీ ఏ రకంగానూ ఏదీఇవ్వలా. దానం, ధర్మంలాంటివి ఎలా ఉంటాయో కూడా తెలియదు. ఇప్పుడు పరమేశ్వరుడు ఆలోచిస్తున్నాడు. ఈవిడకి అవసానకాలం సమీపించింది. ఈవిడ చేసిన పుణ్యకార్యాలు ఏవీ లేవు. ఎవరికీ ఏ దానమూ చెయ్యలా. మళ్ళీ జన్మ ఏ రకంగా జన్మించాలి? ఏం తిని జీవిస్తుంది? ఎలా ? విపరీతంగా ఆలోచించాడు. ఆ మరునాడు ఆ పరమేశ్వరుడే పేదబ్రాహ్మణుడి రూపంలో బిక్షకు

వచ్చాడు. వాకిట్లో నుంచుని "భవతీ ! బిక్షాందేహి" అన్నాడు. లోపల ఇల్లుతుడుస్తోంది నారాయణమ్మ. యాచకుడి మాట వినగానే వళ్ళు మండిపోయింది నారాయణమ్మకి. మహాకోపంగా కసిరింది పొమ్మని, వాకిట్లో యాచకుడు వెళ్ళలా. మళ్ళీ పిలిచాడు. 'అమ్మా బిక్షాందేహి' అన్నాడు. విపరీతమైన కోపంతో బయటకి వచ్చింది నారాయణమ్మ. ఇల్లుతుడుస్తోంది. చేతిలో ఇల్లు తుడిచేగుడ్డ ఉంది. దాన్ని యాచకుడి మీదకి విసరికొట్టి, పొమ్మని గద్దించింది చూస్తున్నాడు పరమేశ్వరుడు. ఆ గుడ్డను తీసుకుని దూరంగా వెళ్ళి అందులో ఏమైనా ఉన్నదేమో అని జాగ్రత్తగా చూశాడు. పొరపాటున నేలమీద పడిపోయిన కందిగింజ ఒకటి ఆ గుడ్డలో ఉంది. 'హమ్మయ్య' అంటూ ఆ గింజని జాగ్రత్తగా తీసుకున్నాడు. "నారాయణమ్మా! మరుజన్మలో నువు తినటానికి ఏమి ఇవ్వాలా అని ఆలోచిస్తున్నాను. ఆ సందేహం కాస్తా తీర్చేశావు. ఇదిగో ఈ కందిగింజే నీకు ఆహారం. మరుజన్మలో కందిచెట్టు మీద పురుగువైపుట్టి, కందిగింజలే తింటూ కాలంగడుపుదువుగాని'' అంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. ఆ మరుజన్మలో కందిచెట్టు మీద పురుగై పుట్టి చాలాకాలం జీవించింది నారాయణమ్మ.

మనం చేసిన మంచి, చెడు మనకి కొన్నిరెట్లై తిరిగి వస్తాయి. వాటినే మనం అనుభవించాలి. పూర్వకాలంలో ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. ఒకరోజు రాత్రిపూట వాళ్ళంటికి ఒక దొంగ వాడొచ్చాడు. ఆ సమయానికి పెరట్లో బావి దగ్గర స్నానం చేస్తున్నాడు బ్రాహ్మణుడు. ఇంట్లో అందరూ నిద్రపోయిన తరువాత లోపలికి వెడదాము అని దొంగవాడు ఆ పెరడులోనే చెట్లు గుబురులో కూచున్నాడు. స్నానం చేస్తున్న బ్రాహ్మణుడు భార్యతో చెబుతున్నాడు. 'నేను రేపు

తెల్లవారుఝామునే లేచి పొరుగూరు వెడతాను. ఆ రెండు మూటలు సిద్ధం చెయ్యి" అన్నాడు. సరేనన్నది భార్య. ఈ మాటలు దొంగవాడు విన్నాడు. ఇప్పుడు ఆలోచిస్తున్నాడు. ఈ బ్రాహ్మణుడు తన భార్యతో రెండు మూటలు సిద్ధం చెయ్యమని చెబుతున్నాడు. అదులో ఒకటి అన్నం మూట, రెండోది నగలమూట కావచ్చు. తాను లేకపోతే వాటికి భద్రత లేదు కదా! అందుకని వాటిని కూడా తనతో తీసుకుపోతున్నాడు. నేను ఈ రాత్రి ఈ ఇంటికి కన్నం వెయ్యటం ఎందుకు. రేపు ఇతని వెనకాలే వెళ్ళి త్రోవలో ఒంటరిగా ఉన్నప్పుడు ఆ నగలమూట తీసుకుని పోతే సరిపోతుంది. అనుకున్నాడు. రాత్రంతా అక్కడే కూచున్నాడు. ఈ బ్రాహ్మణుడు తెల్లవారుఝామునే లేచాడు. భార్య ఇచ్చిన రెండు మూటలూ తీసుకుని బయలుదేరాడు. అతని వెనకాలే బయలుదేరాడు దొంగవాడు, చాలా దూరం ప్రయాణం చేశాడు బ్రాహ్మణుడు. సూర్యుడు నడినెత్తికి వచ్చాడు. కొంచెం విశ్రాంతి తీసుకుంటే బాగుండు అనిపించింది. దూరంగా ఒక చెరువు కనిపించింది. దాని దగ్గర ఆగాడు. కాళ్ళు చేతులు కడుకున్నాడు. అక్కడే ఒక చెట్టు క్రింద కూచుని ఒక మూటవిప్పాడు. కొంచెం దూరంలో ఇంకో చెట్టు వెనకాల నక్కి చూస్తున్నాడు దొంగవాడు. బ్రాహ్మణుడు రెండో మూట విప్పుతూ 'ఒరే నాయనా ఇటురా!' అన్నాడు దొంగవాడు దాక్కున్న చెట్టువైపు చూసి. తటపటాయించి దొంగవాడు వచ్చాడు. "ఒరే నాయనా ! ప్రొద్దుటినుంచీ నా వెనకే వస్తున్నావు. బాగా అలసిపోయి ఉంటావు. వెళ్ళి నువు కూడా కాళ్ళు చేతులు కడుక్కుని రా. ఈ భోజనం చెయ్యి. కాసేపు విశ్రమిద్దువు గాని" అన్నాడు. ఆశ్చర్యపోయాడు దొంగవాడు. తన గురించి అంతా తెలిసిపోయింది ఈ బ్రాహ్మణుడికి. వెళ్ళి కాళ్ళు చేతులు కడుక్కుని వచ్చాడు. రెండో మూటను దొంగవాడికి ఇస్తూ. "ఇది నాకు. ఇది నీకు. అసలు నాకు మిగిలేది ఈ రెండోదే. నా

ముందున్నది నేను ఎంత తిన్నా రేపు ఉదయం బయటకు పోయేదే. ఇతరులకు పెట్టేదేరా నాయనా మనకు మిగిలేది.” అన్నాడు.

మనం ఎంత తిన్నా, ఎన్ని సుఖాలనుభవించినా ఉపయోగం ఏమీ లేదు. ఇతరులకు దానం చేసిందే మనకి మిగిలేది. అందుకే ప్రతివాళ్ళు తప్పనిసరిగా ఎంతో కొంత మన శక్తికొద్దీ దానం చెయ్యాలి.

దరిద్రుడే చస్తాడు. ధనవంతుడు చావడు అని ఏమీ లేదు. ఈ భూమిమీద పుట్టిన ప్రతివాడు మరణించాల్సిందే. వారి వారి కర్మల ననుసరించి మళ్ళీ జన్మించాల్సిందే. తనకున్న దాన్ని ఇతరులకు పంచి ఇచ్చేవాడి ఐశ్వర్యం ఎన్నటికీ తరగదు. ఉన్నదంతా నేనొక్కడినే తినాలి అనుకునే వాడికి మిత్రులు ఉండరు. ఆకలితో వచ్చిన వాడికి అన్నం పెట్టకుండా, తానొక్కడే తినేవాడు అశుద్ధం తినేవాడితో సమానం. అతడికి ఎవరూ స్నేహితులుండరు. పైగా శత్రువులుంటారు. ఇతరులకు సాయం చేసేవాడికి ఏలోటూ రాదు. అతడికి అందరూ అన్ని విధాలా సాయం చేస్తారు. అన్నం పెట్టి మనిషిని తృప్తి పరచగలం. ఇంకా ఏమిచ్చినా మనిషి ‘చాలు’ అనడు. అందుకే **దానాలన్నింటిలోకి అన్నదానం మిన్న** అంటారు. ఋగ్వేదంలో **10వ మండలంలోని 117వ సూక్తంలో** అన్నదానాన్ని గురించి చెబుతున్నారు.

దేవతలు ఆకలిని సృష్టించారు. అది ప్రాణం తీసేస్తుంది. అన్నం తిన్నంత మాత్రంచేత మృత్యువు నుంచి తప్పించుకోలేము. దానమే ప్రాణాన్ని రక్షిస్తుంది. దానం చేసినవాడి ధనానికి ఎప్పుడూ లోటురాదు. దానం చెయ్యని వాణ్ణి ఎవరూ సుఖపెట్టలేరు.

ఆకలితో వచ్చిన అన్నార్తుడికి పెట్టకుండా తాను తినేవాడికి ఎంత వెతుక్కున్నా సుఖము అనేది దొరకదు.

అన్నము కోరి వచ్చినవాడికి అన్నం పెట్టేవాడు దాత. అతనికి సంపూర్ణ యజ్ఞఫలం లభిస్తుంది. అటువంటి వాడికి శత్రువులలో కూడా మిత్రులు ఏర్పడతారు. ఆకలితో ఉన్నవాడు తన స్నేహితుని దగ్గరకు వచ్చినప్పుడు, అతడికి ఆ మిత్రుడు అన్నం పెట్టకపోతే అతడు స్నేహితుడే కాదు. అతన్ని వెంటనే వదిలేసి ఇంకొక మంచి మిత్రుణ్ణి చూసుకోవటం మంచిది. ధనానికి స్థిరత్వం లేదు. ఒకసారి ఒకరి దగ్గర ఉంటుంది. ఇంకోసారి ఇంకొకరి దగ్గర ఉంటుంది. కాబట్టి ధనమున్నప్పుడు దానము చెయ్యటం మంచిది. ఉదారుడు కానివాని భోజనము వృధా అవుతుంది. అతని భోజనము అతనికి మృత్యువు అవుతుంది. దేవతలను అర్చించకుండా, ఇతరులకు పెట్టకుండా తాను మాత్రమే తినేవాడు పాపాన్ని మూట కట్టుకుంటున్నాడు. లోకంలో అందరూ యాచకులే. కాకపోతే స్థాయే భేదం. అంతే. కొంతధనం ఉన్నవాడు ఇంకా ఎక్కువ ఉన్నవాణ్ణి అడుగుతాడు. అంటే లక్షాధికారి కోటీశ్వరుణ్ణి, కోటీశ్వరుడు వందకోట్లున్న వారిని, అతడు వెయ్యికోట్లున్న వారిని అడుగుతారు. తక్కువ ధనము ఉన్నవాడు ఎక్కువ ధనం ఉన్నవాణ్ణి కీర్తిస్తాడు. మనకి రెండు చేతులున్నాయి. రెండూ ఒకేలాగా ఉండవు. చేతికి ఉన్న ఐదువేళ్ళు ఒకేలాగా ఉండవు. అన్నదమ్ములిద్దరూ సమానదాతలు కాలేరు. బాగా ఆకలితో ఉన్నవాడికి అన్నం పెట్టండి. అతడు హాయిగా భోజనం చేసి త్రేన్చినప్పుడు మన ఆనందానికి అవధులుండవు. ఇవ్వటంలో ఉన్న ఆనందం పుచ్చుకోవటంలో ఉండదు. కాబట్టి దానం చెయ్యండి. అందులోను అన్నదానము శ్రేష్ఠము అని చెబుతోంది వేదం. **191వ సూక్తం**లో అందరి హృదయాలు, ఆలోచనలు సంకల్పాలు ఒకటిగా ఉండాలి అంటోంది.

**సమానీవ ఆకూతిః సమానాహృదయానినః**

**సమానమస్తునో మనో యథావః సుసహాసతిః ॥**

మీ సంకల్పాలన్నీ సమానంగా ఉండాలి. మీ హృదయాలు సమానంగా ఉండాలి. మీ మనసులు సమానంగా ఉండాలి. మీరు పూర్తిగా కలిసి ఉందురు గాక. అంటోంది వేదం.

# 23. పితృమేధము

మానవుడి ప్రాణాలు ఉత్క్రమించిన తరువాత ఆ జీవి దేవయాన పితృయానముల ద్వారా బయలుదేరుతుంది అని మనం గతంలో చాలాసార్లు చెప్పుకున్నాం. వీటినే ఉత్తరాయణము, దక్షిణాయణము అంటారు. ఉత్తరాయణము అంటే దేవయానము. ఈ మార్గంగుండా ప్రయాణం చేసిన జీవికి పునర్జన్మ ఉండదు. అతడు అర్చిరాదిమార్గంగుండా ప్రయాణం చేసి బ్రహ్మలోకం చేరి, కల్పాంతం వరకు కర్మ బ్రహ్మతో అక్కడే ఉండి, కల్పాంతాన కర్మ బ్రహ్మతో పాటుగా పరబ్రహ్మలో లీనమవుతాడు. అదే పితృయానం అంటే దక్షిణాయణం గుండా ప్రయాణం చేసినవారు స్వర్గసుఖాలు అనుభవించి, కర్మశేషాన్ని అనుభవించటం కోసం తిరిగి ఈ లోకంలో జన్మిస్తారు.

మానవుడు మరణించిన తరువాత వారి వారి సంప్రదాయాల ప్రకారం మృతదేహానికి సంస్కారం జరుగుతుంది. కొంతమంది మృతదేహాన్ని దహనం చేస్తే, కొంతమంది ఖననం చేస్తారు. సన్యాసుల, యోగుల కళేబరాలను జలచరాలకు ఆహారంగా నదిలోగాని, సముద్రంలో గాని పడేస్తారు. మృతదేహంతో పాటుగా అతని భార్య, మిగిలిన స్త్రీలు స్మశానానికి వెళ్ళటమనేది, కొంతమందికి మాత్రమే ఆచారం. ఈ రోజునకూడా స్త్రీలు స్మశానానికి వెళ్ళటం కొన్ని కులాల వారిలోనే జరుగుతుంది. **పదవ మండలంలోని 18వ సూక్తంలో** ఈ విషయాలన్నీ చెప్పబడుతున్నాయి. “మృతి చెందిన వ్యక్తికి సంబంధించిన వారికి చెబుతున్నారు పితృయానాన్ని వదిలిపెట్టండి దానివల్ల చిరాయువు లభిస్తుంది. మీరంతా యజ్ఞయాగాది క్రతువులు చేసి పుత్ర, పౌత్ర, గోసమృద్ధి పెంపొందించుకోండి. సంచితకర్మను

నాశనం చెయ్యండి.

మరణించిన మానవుల వద్దకు తిరగి రండి. ఇక్కడ మేము చేసే పితృమేధ యజ్ఞము సఫలం కావాలి. మా పిల్లలను, మిగిలిన వారిని రక్షించటానికి మృత్యుదేవత వచ్చే మార్గంలో రాళ్ళు వేసి, మృత్యుదేవత రాకుండా ఆపుదాము. అంటే ఇక్కడ ఏదో ఒక మందు చెబుతున్నారు. ఆ మందును వాడి మృత్యువును ఆపుదాము అనేది వీరి భావన కావచ్చు. ఆ మందు ఏమిటో నాకు తెలియలేదు.

కాలం గడిచి పోతుంది. పెద్దవాళ్ళు జీవించి ఉండగా, చిన్నవాళ్ళు మరణించరు. పెద్దవారు చనిపోతే, ఆ తరువాత వారు కుటుంబ బాధ్యతలు స్వీకరించాలి. అంతేకాని కుటుంబ నిర్వహణ నిలిచిపోరాదు. సుమంగళులు అందరూ బాధ పడకుండా ముందు ఇల్లు చేరాలి. (బహుశః వీరంతా స్మశానానికి వెళ్ళి ఉంటారు. ) అక్కడ నుంచి ఇంటికి రావాలి అంటున్నారు. ఇప్పుడు మృతుని భార్యతో అంటున్నారు. అమ్మా నువ్వు ఇక ఇల్లు, పిల్లల గురించి ఆలోచించు. ఇంకలే. నీ భర్త మరణించాడు. నీతో ఇంతకాలం కాపురంచేసినభర్త మరణించాడు. నువ్వు నీ కర్తవ్యాన్ని నిర్వహించావు. అయిపోయింది. ఇంక ఇంటికివెళ్ళు. అని చెప్పి ఇప్పుడు మరణించిన వ్యక్తితో అంటున్నారు. మృతుడా మా పుత్రులు వీరులు. గర్వించిన శత్రువులను మేము జయిస్తాము. ఈ భూమి తల్లివంటిది. సుఖాన్నిస్తుంది. నువ్వు నేలతల్లిని చేరవలసింది. ఈ భూదేవి గొంగళిలాగా నీకు మెత్తని స్పర్శ ఇస్తుంది. నువ్వు యజ్ఞాలు, దానాలు చేసినట్లైతే ఈ భూమి నీ శరీరాన్ని రక్షిస్తుంది. ఇక్కడ మృతకళేబరాన్ని పాతిపెట్టి ఓ పృథ్వీ ! ఇతన్ని బాధించవద్దు. తల్లి బిడ్డను చూసేటట్లుగా ఈ మృతకళేబరాన్ని కప్పి జాగ్రతా ఉంచుము. ఓ భూదేవీ ! దీనిమీద స్థూపాకారంగా నిలువుము.

(సమాధి మీద స్థూపంలాగా ఏర్పాటు చేశారన్న మాట.) ఇప్పుడు అంటున్నారు ఈ స్థూపము మరణించిన వాని కోసం సకల సౌకర్యాలు గల ఇల్లు అవుతుంది. అందులోనే అతని ఎముకలు ఉంటాయి. వాటిని పితృదేవతలు రక్షిస్తారు" అంటున్నారు.

# 24. గోధనము

ప్రాచీన కాలంలో మనదేశంలో గోసంపద ఎక్కువగా ఉండేది. బహుశః గేదెలు ఉండేవి కాదేమో?అన్నీ ఆవులే. మన దేశంలో ఆవుచాలా పవిత్రమైనవి. గోవును కాలితో తన్నరాదు. అంటోంది ధర్మశాస్త్రం. ఆవుకు సంబంధించి పది వీర్యాలున్నాయి. అవి

1. అప్పుడే పితికిన పాలు (గుమ్మపాలు)
2. వేడిపాలు
3. మీగడ
4. తోడుపెట్టిన పాలు
5. బాగా తోడుకోని పాలు
6. గడ్డ పెరుగు
7. వెన్న
8. నెయ్యి
9. గోదావరి
10. గోదావరి రసం

ఇవన్నీ బలవర్ధకాలు. అందుకే గోవుకు అంత ప్రాధాన్యత వచ్చి ఉంటుంది. ఆవులని పెంచటమే కాదు మాకు ఆవులు కావాలి అని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నారు. **పదవ మండలంలోని 19వ సూక్తంలో**

"ఓ గోవులారా ! మీరు మా వద్దకు రండి. మాకు పాలివ్వండి. మిమ్మల్ని పోషించండి. ఈ గోవులు మళ్ళీ మళ్ళీ మా దగ్గరకు రావాలి. అవి మా అధీనంలోనే ఉండాలి. ఈ గోధనము మా దగ్గరే ఉండాలి. గోవులు ఇంటికి రావాలి అని ప్రార్థిస్తున్నాను. గోసమూహమును, గోసంచారమును ప్రార్థిస్తున్నాను. గోవులు మేత మేసి తిరిగి ఇంటికి రావాలి. గోవులను వెదికేవాడు, మేపేవాడు, వాటిని ఇంటికి తెచ్చేవాడు అందరూ క్షేమంగా తిరిగిరావాలి. ఇంద్రా! నువ్వు మాకు ఆవులను ఇవ్వవలసింది. మేము ఆవుపాలు త్రాగుతాము. గోపాలా ! గోవులను మా వద్దకు తీసుకురా! ఓ గోవులారా! మీరు ఇంటికి రండి. ఎక్కడ నుండి తిరిగి రావాలి? అంటే నలువైపుల నుండి గోపాలా నలుదిశల నుండి గోవులను తోలుకు రావలసినది" అంటున్నారు.

# 25. మరణానంతర స్థితి

మానవుడు మరణించిన తరువాత ఏం జరుగుతుంది అనే విషయాన్ని వివరిస్తున్నారు **పదవ మండలంలోని 14వ సూక్తంలో**

మరణించిన వ్యక్తిని ఉద్దేశించి చెబుతున్నారు. ఓ మృతపితా ! మన పూర్వీకులు వెళ్ళిన దారిలోనే వెళ్ళు. యముణ్ణి వరుణుణ్ణి దర్శించు. స్వర్గంలో నీ పితరులను కలుసుకో. నువు చేసిన కర్మఫలాన్ని కలుసుకో. పాపాలను వదిలెయ్యి. 'అస్త' అనే గ్రహంలో నివశించు. ఉజ్వలమైన దేహాన్ని ధరించు. స్మశానంలో ఉన్న పిశాచాల్లారా! ఇక్కడి నుంచి దూరంగా వెళ్ళిపోండి. ఈ స్థలాన్ని పితృదేవతలు మృతుల యొక్క యజమానుల కోసం ఏర్పాటు చేశారు. యముడు దీన్ని మరణించిన వారికి ఇచ్చాడు. మృతపితా! నాలుగు కళ్ళు, విచిత్రమైన రంగు గల రెండు కుక్కలు అక్కడ ఉంటాయి. వాటిదగ్గరనుంచి వెంటనే వెళ్ళిపో. పూర్వము మరణించిన వారు యముని దగ్గరకు వెళ్ళిన ఉత్తమ మార్గం గుండా వెళ్ళి వారిని చేరవలసింది. ఓ యమధర్మరాజా! నీ దగ్గర నాలుగు కనులు గలవి, నీ గృహాన్ని రక్షించేవి అయిన ఆ రెండు కుక్కల బారి నుంచి ఈ మృతజీవిని కాపాడు. అతనికి శుభాలు కలిగించు. అతన్ని రక్షించవలసింది" అని యముణ్ణి ప్రార్థిస్తున్నారు.

# 26. మనస్సు

ఈ లోకంలో జీవి దేనివల్ల జీవించి ఉంటోంది? ఏది లేకపోతే చనిపోతుంది. ఇప్పుడు అసలు ఉన్నదేది? పోయిందేది? ఇదీ ప్రశ్న. ఎంతో కాలంగా మానవులను వేధిస్తున్న ప్రశ్న. సమాధానం లేని శేషప్రశ్న. ప్రాణము, ఆత్మ ఉంటే మనిషి జీవించి ఉంటాడు. ఇవి లేనివాడు మరణించినవాడు. ఈ ప్రాణము, ఆత్మ అనేవి ఎలా ఉంటాయి? వీటి చూసినవాడు ఇంతవరకు లేడు. వాటి లక్షణాలు ఏమిటో కూడా తెలియవు. ఋగ్వేదం **పదవ మండలంలోని 58వ సూక్తం**లో ప్రాణము మనసు రెండూ ఒకటే అంటున్నారు. పూర్వకాలంలో ఇక్ష్వాకు వంశానికి చెందిన 'అసముడు' అనే మహారాజుండేవాడు. ఆయనకు 1 బంధు 2 సుబంధు 3.శ్రుతబంధు 4.విప్రబంధు అనే నలుగురు సోదరులు పురోహితులుగా ఉండేవారు. ఒకసారి రాజుగారు యజ్ఞం చెయ్యాలని సంకల్పించి తన పురోహితులను వదిలి, కొంతమంది మాయావులను ఆశ్రయించాడు. దాంతో పురోహితులకు కోపం వచ్చింది. ఈ విషయం తెలిసిన మాయావులు పురోహితులలో మొదటి ఇద్దరినీ చంపేశారు. మిగిలిన ఇద్దరూ చనిపోయిన వారిని పునర్జీవులుగా చెయ్యాలని వారి మనసును (ప్రాణాన్ని) ఆహ్వానిస్తున్నారు. మరణించిన వాణ్ణి బ్రతికించే ప్రయత్నం చేస్తున్నారు. 'వివస్వంతుని కుమారుడైన యముని దగ్గరకు నీ మనసు చేరింది. దాన్ని మేం తిరిగి రప్పిస్తాం. నువ్వు తిరిగి ఈ లోకంలో జీవించి ఉంటావు.

నీ మనసు చాలా దూరానికి స్వర్గాని పోయింది. మేము దాన్ని తిరిగి రప్పిస్తాము. నీ మనసు అతిదూరాన ఉన్న సముద్రం దగ్గరకు పోయింది. దాన్ని మేము తిరిగి రప్పిస్తాము.

నీ మనసు దూరాన ఉన్న జలమధ్యమందలి చెట్లతీగలు చేరింది. దాన్ని తిరిగి మేము రప్పిస్తాము.

నీ మనసు దూరాన ఉన్న ఉషస్సును చేరింది. దాన్ని మేము తిరిగి రప్పిస్తాము.

నీ మనసు భూత, భవిష్యత్తు వంటి దూర తీరాలకు వెళ్ళిపోయింది. దాన్ని తిరగిగి మేము రప్పిస్తాము" అంటున్నారు. మరణించిన వారిని బ్రతికించటమనేది ప్రక్రియ.

# 27. సింధునది

దేశం సుభిక్షంగా ఉండాలంటే జలసంపద బాగా ఉండాలి. దీనికి నదులు కావాలి. అదికూడా జీవనదులు కావాలి. మన దేశంలో గంగ, యమున, కావేరీ, గోదావరి, సింధు, బ్రహ్మపుత్ర అనే ఆరు నదులు ప్రసిద్ధి చెందిన జీవనదులు. ఇప్పుడు ఋగ్వేదంలోని **పదవ మండలంలోని 75వ సూక్తం**లో సింధునదిని గురించి చెబుతున్నారు.

నదులు ఏడు ఏడుగా మూడు రకాలై భూలోకము, ఆకాశము, ద్యులోకము నుంచి బయలుదేరినాయి. వాటన్నింటిలోను మంచి ప్రవాహం కలది సింధునది. ఓ సింధునదీ ! నీవు పంట భూములవైపు పారటానికి వరుణుడు నీ కోసం మార్గం ఏర్పాటు చేశాడు. ఈ భూమిమీద ఉత్తమ మార్గంలో నువ్వు ప్రయాణం చేస్తావు. ఈ జగత్తులోనే నీకు ఉన్నతమైన స్థానం ఉంది. నేలనుంచి ఎగిసిపడే సింధు నది ధ్వని ఆకాశాన్ని కప్పివేస్తూ మహావేగంగా ప్రవహిస్తున్నది. అది శబ్దం చేస్తూ ప్రవహిస్తుంటే ఉరుములతో కూడిన వాన వచ్చినట్లుంటుంది. తల్లి దగ్గరకు పిల్లలు వచ్చినట్లుగా ఉపనదులన్నీ వచ్చి సింధునదిలో కలుస్తాయి. యుద్ధానికి వెళ్ళే రాజుగారికి రెండువైపులా సేన ఉన్నట్లుగా సింధునదికి రెండు వైపులా నదులుంటాయి. గంగ, యమున, సరస్వతి, శతుద్రి, సట్లజ్, పురుష్ణి, రవి, అపిక్ని, చీనాబ్, వితస్త, ఘేలమ్, సుషోమ, సోహాన్, అర్జకీయ, వ్యాస నదులారా! ఈ స్తోత్రాన్ని వినండి. సింధూ, నువ్వు మొదటగా 'తృష్టామ్'లో ప్రారంభమైనావు. ఆ తరువాత సుపర్తు, రస, శ్వేత్య నదులతో కలిశావు. క్రము గోమతులను కుభ, మేహత్ నదులతో కలుపుతూ, వాటితోపాటుగా ప్రవహిస్తావు. సింధునది సరళగామిని

శ్వేతవర్ణ. ఈ నదినీరు నాలుగువైపులకు ప్రవహిస్తుంది. అన్ని నదుల్లోకి వేగమైనది సింధునది. ఆడుగుర్రము లాంటిది. అందమైన గుర్రం లాంటిది. అందమైన రథము లాంటిది తెల్లని వస్త్రములాంటిది. బంగారు ఆభరణము వంటిది. మధువర్ధక పుష్పాలతో ఆచ్ఛాదింపబడి ఉంటుంది. సింధునది రథంలో అన్నంతీసుకురావాలి.” అని ప్రార్థిస్తున్నారు.

# 28. పరమాత్మ

నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు పరమాత్మ. అతడు సర్వాంతర్యామి. చరాచర జగత్తంతా ఆక్రమించి ఉన్నాడు. ఈ జగత్తంతా ఆ పరమాత్మ నుంచే ఆవిర్భవించి అతనిలోనే లీనమవుతుంది. ఆ పరమాత్మని గురించి వివరిస్తోంది. **పదవ మండలంలోని 125వ సూక్తము**. ఇక్కడ విశేషం ఏమంటే ఈ సూక్తాన్ని దర్శించింది ఒక స్త్రీ. ఆమె **'అంభృణ పుత్రి'**

"నేను వసువులతోను, రుద్రులతోను సంచరిస్తుంటాను. ఆదిత్యులు దేవతల వెంట ఉంటాను. మిత్రావరుణులు నా యందున్నారు. నేను ఇంద్రుడు, అగ్ని, అశ్వనీ దేవతలకు ఆధారము అవుతున్నాను. సోమము రాళ్ళమధ్యన నలగకొట్టబడి తయారవుతుంది. దాన్ని నేను అనుభవిస్తాను. నేను త్వష్ట, పూష, భృగుడు మొ॥ వాళ్ళని ధరిస్తున్నాను. యజ్ఞంచేసే యజమానికి ధనాన్నిచ్చేది నేనే.

నేను రాజ్యానికి అధీశ్వరిని. ధనాన్ని ఇచ్చే దానను. నేనే జ్ఞానవతిని. యజ్ఞ పదార్థములందు శ్రేష్ఠమైన దాన్ని. దేవతలు నన్ను అన్ని స్థావరములందు నియమించారు. నేను సమస్త ప్రాణులందు ఉన్నాను.

ఎవడు ప్రాణము కలిగి ఉన్నాడో, వింటున్నాడో, చూస్తున్నాడో అవన్నీ నా వల్లనే చేస్తున్నాడు. నన్ను నమ్మని వారు క్షీణించి పోతారు. నేను చెప్పినదే నిజము.

దేవతలు మానవులు ఎవరిని శరణు వేడుతున్నారో అతడికి నేను ఉపదేశం చేస్తున్నాను. నేను అనుకున్న వాణ్ణి బలశాలిగా, విద్వాంసుడిగా చేస్తాను.

ఇంద్రుడు శత్రువులను సంహరించేటప్పుడు అతణ్ణి ఆవహించి నేనే యుద్ధం చేస్తాను. భూమ్యాకాశాల యందు పూర్తిగా ఆవరించి ఉన్నాను.

నేనే ఆకాశాన్ని సృష్టించాను. ఆకాశమే లోకానికి తల అవుతోంది. సముద్ర జలంలో ఉంటాను. అక్కడి నుంచే అన్నిలోకాలకు విస్తరిస్తాను. నేను ద్యులోకాన్ని తాకగలను. నేను భవనాలు నిర్మిస్తాను. వాయువులాగా అంతటా వ్యాపిస్తాను. నా మహిమ చాలా గొప్పది. నేను ద్యావాపృథ్వులను అతిక్రమించాను.

ఈ సూక్తం పూర్తిగా అద్వైత సిద్ధాంతాన్ని వివరిస్తోంది. ఈ స్త్రీమూర్తి **'అహం బ్రహ్మాస్మి'** నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని అంటున్నది. అంతా నేనే చేస్తున్నాను. నా కన్నా వేరుగా ఎవరూ లేరు అంటోంది. **ఇదే అద్వైత సిద్ధాంతము.**

# 29. అరణ్యాలు

అరణ్యము అంటే పెద్ద పెద్ద చెట్లు, మహావృక్షాలు, పొదరిళ్ళు, ముళ్ళ పొదలు, మృగాలు, పులులు, సింహాలు చాలా భయంకరంగా ఉంటుంది. అటువంటి అరణ్యాన్ని స్తుతి చేస్తున్నారు **పదవ మండలంలోని 146వ సూక్తంలో** ఓ మహారణ్యాల్లారా! మీరు చూస్తుండగా కనిపించకుండాపోతారు. చూపుకు అందనంత దూరానికి వెళ్ళిపోతారు. ఒంటరితనము మీకు భయం కలిగించదా?

ఇక్కడ ఒక మృగము ఆబోతులాగా రంకె వేస్తుంది. ఒక పక్షి కిచకిచ శబ్దం చేస్తుంది. దానికి సమాధానంగా మిగిలిన పక్షుల అరుపులు. అవన్నీ అరణ్యపు కీర్తిని పాడుతున్నట్లుంటుంది.

ఈ అరణ్యంలో ఒక మూల ఆవులు తిరుగుతున్నాయి. ఇంకొక చోట పొదరిళ్ళు. ఇది సాయంకాలం. అడవిగుండా అనేక బండ్లు పోతున్నాయి.

ఒకడేమో ఆవుల్ని పిలుస్తున్నాడు. ఇంకొకడు కట్టెలు కొడుతున్నాడు. రాత్రులందు అరణ్యంలో రకరకాల ధ్వనులు వస్తాయి.

అరణ్యాలు ఏ ప్రాణినీ చంపవు. పులులు, దొంగలు లేకపోతే అరణ్యంలో భయమనేది ఉండదు. అక్కడ దొరికే పండ్లు కాయలు తిని హాయిగ కాలక్షేపం చెయ్యవచ్చు. అడవుల్లో కస్తూరి సువాసనలు గుబాళిస్తున్నాయి. ఆహారం ఉన్నది. శ్రమలేదు." అంటూ అరణ్యం ఎలా ఉంటుందో వివరించారు.

# 30. ప్రేతము

మరణించిన మానవుణ్ణే ప్రేతము అంటాం. ఆ ప్రేతాన్ని గురించి చెబుతోంది **పదవ మండలంలోని 154వ సూక్తం.**

కొందరు పితృదేవతలు సోమరసాన్ని తాగితే మరికొందరు నేతిని తాగుతారు.

ఓ ప్రేతమా! ఏ పితరుల కోసం మధువు పరుగులు పెడుతోందో వారిని చేరవలసింది.

కఠినమైన తపస్సు చేసి, స్వర్గం చేరిన పితరులున్నారు. ఓ ప్రేతమా నీవు వారిని చేరుము. యుద్ధభూమిలో మాయామోహాలు వదిలిన, బహుదక్షిణలిచ్చిన పితరులున్నారు. ఓ ప్రేతమా నువ్వు వారిని చేరు. ఓ యమధర్మరాజా ! పుణ్యబుద్ధితో తపస్సు చేసిన పితరుల దగ్గరకు ఈ ప్రేతాన్ని చేర్చుము.

సత్కర్మలు చేసినవారు, సూర్యారాధకులు, తపస్సంపన్నులు అయిన పితరుల దగ్గరకు ఈ ప్రేతాన్ని చేర్చుము.

## 31. గర్భరక్షణ

గర్భవతిగా ఉన్న స్త్రీ గర్భాన్ని రక్షించమని **పదవ మండలంలోని 162వ సూక్తంలో** ప్రార్థిస్తున్నారు. రాక్షస హంతకుడైన అగ్ని అన్ని రకాల బాధలు దూరము చేయుగాక, ఓ నారీ ! నీ గర్భాన్ని ఆక్రమించిన బాధలు, వ్యాధులు అన్నీ అగ్ని తొలగించును గాక. ఓ నారీ ! నీ గర్భాన్ని రాక్షసులు, రోగాలు ఆక్రమించినట్లైతే అగ్ని వాటిని నాశనము చేయుగాక. పురుష వీర్యము పడనప్పుడు, శుక్రస్థితి సమయంలోను, గర్భగమనంలోను, ప్రసవ సమయంలోను నీ గర్భానికి నష్టము తలపెట్టిన వారిని మేము దూరం చేస్తాము. నీ గర్భాన్ని నష్టపరచటానికి నీ తొడలు చాచేవాడిని, స్త్రీ పురుషుల మధ్య దూరే వాణ్ణి మేము నాశనం చేస్తాము. నీ సోదరుడు గాని, భర్తగాని, భర్తకు సంబంధించిన వారుగాని నీ గర్భానికి కీడుతలపెడితే, వారిని నాశనం చేస్తాము జాగ్రదావస్థలో గాని, స్వప్నావస్థలో గాని, సుషుప్తిలో గాని నీ గర్భానికి కీడు కలిగించే వారిని మేము నాశనం చేస్తాము.

అన్ని రకాలుగా స్త్రీ గర్భానికి కీడు తలపెట్టిన వారిని నాశనం చేసి, గర్భాన్ని రక్షిస్తామని చెబుతోంది ఈ సూక్తం.

# 32. స్వర్గనరకాలు

మానవులు జీవించి ఉండగా ఈ లోకంలో చేసే కర్మఫలితం అనుభవింపచేసేదే స్వర్గం లేదా నరకం. స్వర్గనరకాలు మరణానంతరము మాత్రమే పొందుతారు. మంచి పనులు, పుణ్యకార్యాలు చేసినవారు, దానధర్మాలు చేసినవారు, యుద్ధంలో మరణించిన వారు స్వర్గానికి పోతారు. చెడ్డపనులు, అత్యాచారాలు, దొంగతనాలు దోపిడీలు, హత్యలు చేసేవారు నరకానికి పోతారు. ఋగ్వేదంలో స్వర్గం ఆకాశం మధ్యలో విష్ణువుయొక్క అత్యున్నత పదంలో ఉన్నట్లు చెప్పబడింది. ఇది గొప్ప తేజోమయమైన లోకం. ఇక్కడ ఆకలి దప్పికలుండవు. సంసారబాధలు, కష్టాలు, కన్నీళ్ళు ఏ మాత్రం ఉండవు. ఇక్కడికి వచ్చిన వాళ్ళు బ్రహ్మానందాన్ని పొందుతారు. యుద్ధంలో వీరమరణం పొందినవారు, విరివిగా దానాలు ఇచ్చిన వారు, స్వర్గానికి పోతారు. ఈ లోకంలో వారు చేసిన మంచి పనులను ఎంతవరకు గుర్తుంచు కుంటారో, అంతవరకు వారు స్వర్గంలోనే ఉంటారు. అలాగే అబద్ధాలాడే వాళ్ళు, చెడుపనులు చేసేవాళ్ళు, హత్యలు, దోపిడీలు చేసేవారు నరకానికి పోతారు. అగాధమైన గోతిలో త్రోయబడతారని చెబుతోంది వేదం.

# 33. వర్ణాశ్రమాలు

**చాతుర్వర్ణం మయాసృష్టం గుణకర్మ విభాగ చ**

మానవులు చేసే వృత్తులను బట్టి నాలుగు వర్ణాలను నేనే విభజించాను అన్నాడు భగవానుడు గీతలో. ఐతే **పదవ మండలంలోని 90వ సూక్తం**లో ఆ విరాట్పురుషుని ముఖము నుంచి – బ్రాహ్మణుడు, బాహువుల నుంచి – క్షత్రియుడు, ఊరువుల నుంచి–వైశ్యుడు, పాదముల నుంచి–శూద్రుడు పుట్టారని పురుషసూక్తంలో చెప్పటం జరిగింది. కాబట్టి చాతుర్వర్ణాలున్నాయి. అయితే చతురశ్రమాలు 1. బ్రహ్మచర్యం, 2. గృహస్తాశ్రమము, 3. వానప్రస్తము 4. సన్యాసము. వీటి ప్రసక్తి ఎక్కడా లేదు. కాని పసుపు రంగు వస్త్రాలు, పొడవైన జడలు ధరించి తపస్సు చేశారని వేదంలో కొన్నిచోట్ల చెప్పబడింది. కాబట్టి చతురాశ్రమాలు కూడా ఉన్నాయనుకోవచ్చును.

# 34. ఊర్వశి-పురూరవులు

ఊర్వశి అప్సరాంగన. నరనారాయణులు బదరికావనంలో తపస్సు చేస్తున్నారు. ఆ సమయంలో వీరి తపస్సుకు భంగం కలిగించటం కోసం కొంతమంది అప్సరసలు వచ్చి అక్కడ ఆడటము, పాడటము చేస్తున్నారు. వాళ్ళ అందచందాలు ప్రదర్శిస్తున్నారు. చూశాడు నారాయణుడు. తన చేత్తో తొడమీద రాసుకున్నాడు. అంతే వెంటనే ఒక సుందరి పుట్టుకొచ్చింది. ఆవిడ అక్కడికి వచ్చిన అప్సరాంగనలందరికన్నా అందంగా ఉన్నది. ఊరువు నుంచి పుట్టింది కాబట్టి ఊర్వశి అని నామకరణం జరిగింది. ఆమె దేవవేశ్య. అప్సరాంగన.

ఇళ, బుధుల కుమారుడు పురూరవుడు. ఒకసారి అప్సరాంగన ఊర్వశిని కలిశాడు. మోహించాడు వివాహం చేసుకోమని అడిగాడు. సమ్మతించింది ఊర్వశి. కాకపోతే ఒక షరతు. తనకు కుమారుడు కలిగినట్లైతే పురూరవుణ్ణి వదలి వెళ్ళిపోతానంది. పురూరవుడి వల్ల తాను తల్లి కాకుండా ఉన్నంతవరకే అతనితో ఉంటుందన్న మాట. సరే అన్నాడు పురూరవుడు. వారిద్దరికీ వివాహమయింది. కొంత కాలం కలిసి జీవించారు. అతనితో అన్ని సుఖాలు అనుభవించింది. మాతృమూర్తి అయింది. దాంతో వెళ్ళిపోవటానికి బయలుదేరింది. వద్దన్నాడు. పురూరవుడు. బ్రతిమిలాడాడు. ఎన్నో రకాలుగా చెప్పి చూశాడు. లాభంలేదు. చివరకు వెళ్ళిపోయింది ఊర్వశి. వేశ్య అంటే వెలయాలు అని అర్థం. వెలయాలు. వెలకి ఆలు ఎవరు ధనం ఎక్కువ ఇస్తే వారికి భార్య అంతేకకాని నీకు మాత్రమే కాదు. ఊర్వశి దేవవేశ్య. అప్సరాంగన. దేవలోకంలో నాట్యం చెయ్యటం. ఎవరైనా తపస్సు చేస్తుంటే చెడగొట్టటం ఇవి ఆవిడ కర్తవ్యాలు మరి ఆవిడ నిలకడగా

పురూరవుడితో ఎలా ఉంటుంది. అంతేకాదు పురూరవుడు మానవుడు. ఊర్వశి దేవవేశ్య. వీరిద్దరికీ పొత్తు ఎలా కుదురుతుంది? ఒకవేళ కుదిరినా ఎంతకాల ఉంటుంది. గతకాలంలో మేనకా విశ్వామిత్రుల సంగతేమిటి? వేశ్యలతో జీవితం ఇలాగే ఉంటుంది. ఈ ఉదంతం అంతా ఋగ్వేదంలోని **పదవ మండలంలో 95వ సూక్తం**లో వివరించ బడింది. వెళ్ళిపోవటానికి బయలుదేరిన ఊర్వశితో పురూరవుడు అంటున్నాడు.

ఊర్వశీ ! మనసునిండా అనురాగాన్ని నింపుకో. ఇప్పుడే మనం మాట్లాడుకుందాము. మనం మాట్లాడుకోకపోతే ముందు మనకు సుఖం ఉండదు.

వట్టి మాటలతో ఉపయోగం ఏమిటి? పురూరవా! నేను నీ దగ్గర నుంచి బయటకు వచ్చేశాను. నేను గాలిలాంటిదానను. నీకు అందను.

ఊర్వశీ ! నీ విరహము భరించలేను. నువు లేకపోతే నేను పూర్తిగా అశక్తుడనై పోతాను. బాణాలు కూడా సంధించలేను. యుద్ధంచెయ్యలేను. రాజకార్యాలు చక్కబెట్టలేను. నా సైనికులు కూడా యుద్ధం చెయ్యటం మరచిపోయారు.

పురూరవా! నీ దగ్గర నాకు సవతుల పోరు లేదు. నన్ను నువ్వు ఎంతగానో తృప్తిపరచావు. నేను నీ ఇంటికి వచ్చాను. నాకు అన్ని సుఖాలు చూపించావు. ఊర్వశీ ! మిగిలిన అప్సరాంగనలు ఎవరూ నువ్వు వచ్చిన తరువాత రాలేదు. పురూరవా! నువు పుట్టినప్పుడు దేవతాస్త్రీలు వచ్చి చూసి వెళ్ళారు. నిన్ను యుద్ధానికి పంపి దశ్యులను నాశనం చెయ్యటానికే దేవతలు నిన్ను పెంచి పెద్ద చేశారు.

పురూరవుడు అప్సరసల వైపు వెళ్ళాడు. వారు కాస్తా మాయమై పోయారు. వారితో ముచ్చటలాడాలి అనుకున్నాడు. వారిని తాకాలి అనుకున్నాడు. వారు మాయమై పోయారు. అప్పుడు ఆకాశం నుంచి మెరుపుతీగలాగా ఊర్వశి వచ్చింది. పురూరవుని కోరికలన్నీ తీర్చింది. ఆవిడకి కుమారుడు కలిగాడు.

పురూరవా ఈ భూమండలాన్ని పాలించే కుమారుణ్ణి నా వల్ల కన్నావు. 'కుమారుడు గనక జన్మిస్తే, నేను నీ దగ్గర ఉండను' అని ఆ రోజే చెప్పాను. ఇలా జరుగుతుందని నాకు తెలుసు. నేను చెప్పినా నువ్వు వినలేదు. ఇప్పుడెందుకు వృధామాటలు?

ఊర్వశీ ! నీ కుమారుడు నా దగ్గరకు వస్తాడా? ఏడవకుండా ఉంటాడా ? మనల్ని ఎవరు విడదీయాలనుకుంటున్నారు?

రాజా! జాగ్రత్తగా విను. కుమారుడు నీ దగ్గరే ఉంటాడు. ఏమీ ఏడవడు. నీ కొడుకుని నీ దగ్గరకు పంపుతాను. ఓ మూర్ఖా! నువు ఇంక ఇంటికి తిరిగిపో! నన్ను నువ్వు అందుకోలేవు.

ఊర్వశీ ! నిన్ను ప్రేమించే భర్త ఇవాళ్ళ పడిపోయాడు. ఇంక లేవడు. అతణ్ణి మృగాలు తినేస్తాయి.

పురూరవా! నువు అలా అనుకోకు. క్రూరమృగాలు నిన్ను తినరాదు. రాజా! స్త్రీల ప్రేమ నిలిచేది కాదు. స్త్రీలది వక్రహృదయము. నేను అనేక రకాలుగా మానవులతో తిరిగాను. నాలుగు సంవత్సరాలు మనుష్యుల మధ్య ఉన్నాను. ఆకలి తీర్చుకున్నాను.

ఊర్వశీ! ఏమైనా సరే నువ్వు మాత్రం నన్ను వదిలి వెళ్ళవద్దు. అని బ్రతిమాలుతున్నాడు. పురూరవుడు. ఆఖరుగా చెబుతున్నది ఊర్వశి. ఇళాపుత్రా! పురూరవా! నువు మృత్యుంజయుడవుతావు. నిన్ను దేవతలు

పూజిస్తారు. స్వర్గం చేరి సుఖాలు అనుభవిస్తావు. అని చెప్పి ఊర్వశి కాస్తా వెళ్ళిపోయింది. ఎంత గొప్పగా చూసినా వేశ్యలు నిలకడగా ఒకచోట ఉండదు.

# 35. దక్షిణ

యజ్ఞయాగాది క్రతువులయందు చివరగా ఋత్విక్కులకు ఇచ్చేది దక్షిణ. దక్షిణ ఇవ్వకపోతే ఆ కర్మ సఫలం కాదు. అంటే ఏదైనా ఒక క్రతువు చేసి (పూజగాని, అర్చనగాని, యజ్ఞంగాని, యాగంగాని) పురోహితుడికి తగిన ధనం గనక ఇవ్వకపోతే, మనం చేసిన క్రతువు యొక్క ఫలితం మనకి దక్కదు. అది కాస్తా ఆ క్రతువు చేయించిన పురోహితుడికే చెందుతుంది.

పూర్వకాలంలో సుశీల అనే గోపిక రాధకు ఇష్టసఖి. ఈ సుశీల నిజంగానే సుశీల. రూపవతి, గుణవతి ఒక రోజు సుశీల శ్రీకృష్ణుడితో ఏకాంతంగా ఉన్నప్పుడు రాధ చూసింది. దాంతో కోపగించి మళ్ళీ ఈ ప్రాంతంలో కనిపించావంటే భస్మమై పోతావు అని శపించింది.

సుశీల అనేక సంవత్సరాలు శ్రీకృష్ణుడి కోసం తపస్సు చేసి చివరకు లక్ష్మీదేవిలో కలిసిపోయింది. ఒకసారి బ్రహ్మాది దేవతలు యజ్ఞం చేశారు. యజ్ఞఫలం వారికిరాలా. అప్పుడు ఆ యజ్ఞం సఫలం కావాలని ఆ పరమేశ్వరిని ప్రార్థించారు. ఆ పరాశక్తి సలహామీద విష్ణువు లక్ష్మీదేవి అంశతో దక్షిణాదేవిని సృష్టించి దేవతలకిచ్చాడు. బ్రహ్మ ఆమెను యజ్ఞపురుషునికి సమర్పించాడు. యజ్ఞసఫలమైంది. కాబట్టే **దక్షిణ లేని కర్మ సఫలం కాదు** అని చెప్పబడింది.

ఈ విషయాన్నే ఋగ్వేదంలోని **పదవ మండలంలోని 107వ సూక్తం**లో చెబుతున్నారు. ఈ సూక్తానికి ఋషి ప్రజాపతి కుమార్తె అయిన దక్షిణ. దేవత ఋత్విక్కులకు ఇచ్చే దక్షిణ.

యజ్ఞయాగాది క్రతువులలో దక్షిణ ఇచ్చే పద్ధతి ప్రారంభమైంది. దక్షిణ ఇచ్చేవారు ఉన్నత ఆసనంమీద కూర్చుంటారు. బంగారం దక్షిణగా ఇచ్చినవారు అమరులవుతారు. వస్త్రదానం చేసినవారు సోమాన్ని

పొందుతారు. అందరూ దీర్ఘాయుష్య పొందుతారు. దక్షిణ ఇవ్వటం వల్ల పుణ్యకర్మలు పూర్తి అవుతున్నాయి. దేవతార్చనలో ఇదికూడా ఒక భాగము. సంకల్పం మంచిది కాకపోతే దేవతలు ఆ పని సఫలంకానీయరు.

దేవతలకు తృప్తి కలిగించి దానాలు చేసేవారి కోరికలను దక్షిణలు తీరుస్తున్నాయి. దక్షిణ తీసుకోవటానికి పురోహితులందరికీ అధికారమున్నది. దక్షిణ ఇచ్చేవాడు రాజుగా భావించబడతాడు. దక్షిణలు ఇచ్చి పురోహితుల్ని తృప్తి పరచేవారు ఋషి, బ్రహ్మ అనబడుతున్నారు. గుర్రాలు, ఆవులు, బంగారం అన్నీ దక్షిణలు అవుతున్నాయి. అన్నము కూడా దక్షిణ అవుతోంది. విద్వాంసుడు దక్షిణను దేహకవచముగా భావిస్తాడు. దాత (ఇచ్చేవాడు)కి మృత్యువు లేదు. అతడు దేవత. అతడికి దరిద్రము, దుఃఖము, బాధలు ఉండవు. భూమిమీద, స్వర్గంలోను ఉన్నవారు అతనికి దక్షిణ ఇస్తారు. దాతలకు పాడి ఆవులు, అందగత్తె అయిన వధువు, సుర లభిస్తాయి. సర్వత్ర అతనికి విజయం సిద్ధిస్తుంది.దాతకు అలంకరించిన జవనాశ్వము ఇవ్వబడుతుంది. అతని కోసం అందమైన ఇల్లుకూడా ఎదురు చూస్తుంటుంది. గుర్రం దానమిచ్చిన వారికి – అందమైన వాహనము, అలంకరించ బడిన రథము, సిద్ధంగా ఉంటాయి. యుద్ధ సమయంలో దేవతలు వారిని రక్షిస్తారు. యుద్ధంలో దాతకు విజయం కలుగుతుంది" అని దక్షిణ ఇవ్వటం వల్ల ఫలితం చెప్పబడింది.

# 36. దేవతలు ఎందరు?

వేదంలో అనేకమంది దేవతలు చెప్పబడ్డారు. ఇంద్రుడు, అగ్ని, విష్ణువు, రుద్రుడు, సోముడు, మొ॥వారు. కాబట్టి వేదంలో అనేకమంది దేవతలున్నారు అని చెప్పకూడదు. ఉన్నది పరమాత్మ ఒక్కడే ఇన్ని రూపాలలో వారికి దర్శనమిచ్చాడు. ఇది ఏకేశ్వరోపాసన. **'ఏకంసద్విప్రా బహుదావదంతి'** అంటోంది వేదం. ఉన్న తత్త్వం ఒక్కటే. కాని విజ్ఞులు దాన్ని ఇంద్రుడని, యముడని, అగ్నిఅని, వాయువని అనేక పేర్లతో పిలుస్తున్నారు.

ఇక్కడ ఇంకో అనుమానం వస్తుంది. వేదంలో చెప్పింది అద్వైతమా? ద్వైతమా? విశిష్టాద్వైతమా? వేదంలో ఈ ప్రశ్నకు తావులేదు. ఇవన్నీ ఉపనిషత్తులలో కనిపిస్తాయి. అంతే గాని సంహిత భాగంలో ఇవి లేవు. ద్వైతాద్వైతాలు ఏవీ వేదంలో చెప్పలేరు.

## 37. దస్యులు

వేదంలో ఈ మాటని చాలాసార్లు వింటాం. వీరు దేవతలకు ప్రత్యర్థులు, వీళ్ళని రాక్షసులు, పణులు, ద్రుహులు, అరాతులు, అసురులు, యాతధానులు, దానవులు అని కూడా అంటారు. వీళ్ళు మాంసాహారులు. తమోగుణ ప్రధానులు. నరభక్షకులు. దొంగలు. యజ్ఞయాగాలు నాశనం చేస్తారు. పరమ మూర్ఖులు, దుర్మార్గులు. వీళ్ళు రాత్రిచరులు. వెలుగు అంటే ఇష్టపడరు. అజ్ఞానులు కదా. అందుకని చీకట్లో తిరుగుతారు. ఇంద్రుడు మొదలైన దేవతలు వీరిని చీకటిగా ఉండే పెద్దగోతులో పడేసి వాళ్ళు పైకి రాకుండా బలమైన రాళ్ళు అడ్డం పెట్టారు.

ఈ రకంగా ఋక్సంహితలో వివిధ దేవతల గురించే కాక అనేక విషయాలను గురించి కూడా చెప్పటం జరిగింది.

# 38. అశ్వనీదేవతల గొప్పతనము

అశ్వనీదేవతలు చాలా గొప్ప పనులు చేశారు. ఇవాల్టిరోజున కూడా మన విజ్ఞానశాస్త్రం ఊహించలేని పనులు ఆ రోజునే వారు చేశారు. ఈ కారణంచేతనే వారిని గురించి చెప్పటం జరుగుతోంది. వారిని చూసి మనం చాలా నేర్చుకోవాలి.

సూర్యుడికి సంజ్ఞాదేవి యందు కలిగినవారే అశ్వనీదేవతలు. వీరు కవలలు. నాసత్యుడు, దస్రుడు అని వీరి పేర్లు. సూర్యుడియొక్క కాంతిని భరించలేక సంజ్ఞాదేవి తన ఛాయను సూర్యుని దగ్గర వదిలి తాను అరణ్యాలకు వెళ్ళి 'బడబ' అనే ఆడగుర్రమై సంచరిస్తోంది. కొంత కాలానికి సూర్యభగవానుడికి నిజం తెలిసి తాను మగగుర్రమై అరణ్యాలకు వెళ్ళి సంజ్ఞాదేవిని కలిశాడు. వారిద్దరికీ అప్పుడు పుట్టినపిల్లలే అశ్వనీదేవతలు. వీరు దేవవైద్యులు. హిమాలయ పర్వత ప్రాంతలో తిరిగి, మూలికలు సేకరించి, వాటితో మందులు తయారుచేసి ప్రజల రోగాలు తగ్గిస్తుండేవారు. "వీరు మందులు తయారుచేస్తారు కాబట్టి వీరికి యజ్ఞయాగాలలో హవిర్భాగం ఇవ్వరాదు" అని శాసించాడు ఇంద్రుడు. ఇక్కడ గమనించవలసిన విషయం ఏమంటే దేవరాజైన ఇంద్రుడు అతిగా సోమరసాన్ని పానం చెయ్యటంవల్ల అతని ఆరోగ్యం బాగా దెబ్బ తిన్నది. అప్పుడు అశ్వనీదేవతలు కొన్ని మందులిచ్చారు. బృహస్పతి 'సౌత్రామణి' అనే యాగం చేసి ఇంద్రుని అనారోగ్యం పోగొట్టారు. సుకన్యభర్త చ్యవనుడు గ్రుడ్డివాడు, వృద్ధుడు. అతని అంధత్వాన్ని రూపుమాపి, యవ్వనాన్ని ప్రసాదించారు అశ్వనీ దేవతలు. దానికి కృతజ్ఞతగా ఇంద్రుణ్ణి ఎదిరించి అశ్వనీదేవతలకు హవిర్భాగాన్నిప్పించాడు చ్యవనుడు. ఋగ్వేదంలో అశ్వనీదేవతల గొప్పతనం చాలాచోట్ల చెప్పబడింది. గతంలో దేవతల

గురించి చెబుతున్నప్పుడు అశ్వనీదేవతల గురించి కూడా చెప్పుకున్నాం. ఇప్పుడు మళ్ళీ ఎందుకు చెబుతున్నాము అంటే అశ్వనీదేవతలు గొప్ప వైద్యులు. ఆ రోజున అనేక విచిత్రాలు చేశారు. అవి గనక మనం తెలుసుకోగలిగితే వైద్యరంగంలో మనం ఎంత ముందున్నామనే సంగతి తెలుస్తుంది. **ఋగ్వేదంలోని ప్రథమ మండలంలో** 52వ సూక్తంలో

రేభుడు అనే ఋషిని కొంతమంది ప్రత్యర్థులు కోపం వచ్చి నీళ్ళలోకి త్రోసేశారు. అతడు అపాయకర పరిస్థితిలో ఉన్నప్పుడు అశ్వనీదేవతలు అతన్ని రక్షించారు. అలాగే వందనుడు అనే ఋషిని నీళ్ళలో పారేశారు శత్రువులు. అతణ్ణి రక్షించారు అశ్వనీదేవతలు. కణ్వఋషి అంధకారంలో బాధలు పడుతుంటే అతణ్ణి రక్షించి సూర్యకాంతిని చూపించారు. 'అంతకుడు' అనే వాణ్ణి శత్రువులు బావిలో త్రోసేస్తే అతన్ని రక్షించారు. భుజ్యుడు అనే ఋషిని సముద్రంలోకి నెట్టి వేయబడిన వాణ్ణి రక్షించారు. అలాగే కర్కంధుడు, వయ్యుడు. అనే వారిని కూడా రక్షించారు. బాగా ధనవంతుడు శుచంతుడు. అతన్ని సభలయందు చేర్పించారు. ఘర్ముడు అనేవాడి మీద కోపం వచ్చి ప్రవృంజనుడు అతణ్ణి నిప్పుల్లోకి త్రోసేశాడు. అది చూసి బాధ పడుతున్నాడు అతని తండ్రి అత్రి. అప్పుడు అశ్వనీదేవతలు ఘర్మణ్ణి రక్షించారు. అలాగే పృశ్నిగుడు, పురుకుత్సుడిని కూడా రక్షించారు.

పరావృతుడు మహర్షి. అతడు కుంటివాడు. అతడి కుంటితనాన్ని పోగొట్టి మామూలు మనిషిగా చేశారు. అంధఋషి గ్రుడ్డివాడు. అతడికి చూపు తెప్పించారు. శ్రోణఋషికి మోకాళ్ళు లేవు. అతడు నడువలేడు. శస్త్రచికిత్స చేసి అతడు నడిచేటట్లు చేశారు. వర్తికపక్షిని తోడేలు మింగేసింది. అది మరణించింది. దానికి మందులువాడి మరణించిన పక్షిని మళ్ళీ బ్రతికించారు. నిశ్చల అనే స్త్రీ నడవలేదు. ఆవిడకి ధనాపేక్ష

బాగా ఉంది. ముందు ఆవిడకి తగిన ధనాన్నిచ్చి తరువాత **కుంటితనానికి చికిత్స చేసి నడిచేటట్లు చేశారు. ఇది చాలా అద్భుతం.** అశ్విని కుమారుడు 'వశుడు' అనే పేరు గల ఋషి, అతన్ని రక్షించారు.

'యుశిజ' అనే ఆమె కుమారుడు దీర్ఘశ్రవుడు. వర్తకం చేస్తుండేవాడు. అతని కోసం కృత్రిమ వర్షాన్ని కురిపించారు. కక్షీవంతుణ్ణి రక్షించారు. ఈ కక్షీవంతుడు కొన్ని వేదమంత్రాలకు ద్రష్ట, కణ్వుని కుమారుడు త్రిశోకుడు. అతని ఆవుల్ని రక్షించారు. ఇంకా గొప్ప విషయం ఏమంటే అశ్వనీ దేవతల రథానికి గుర్రాలు లేవు. స్వయంగా నడిచేది. అలా ఏర్పాటు చేశారు. వైజ్ఞానిక శాస్త్రంలో ఇది చాలా అద్భుతమైన విషయం. తనంత తాను నడిచేది అంటే బహుశః కారులాంటిది కావచ్చు. కాని ఆ రోజుల్లో, సైన్సు ఏ మాత్రము వృద్ధి చెందని రోజుల్లో ఇది పరమాద్భుతం.

ఎండిపోయిన నది వరదలై పారేట్లు చేశారు. రాహుగ్రహణము నుంచి సూర్యుణ్ణి రక్షించారు. మాంధాత క్షేత్రపాలక యజ్ఞం చేస్తుంటే అతని ఆటంకాలు రాకుండా కాపాడారు. భరద్వాజుణ్ణి రక్షించారు. ఈ భరద్వాజుడే విమానశాస్త్రాన్ని వ్రాశాడు.

శయుడు అనే మహర్షికి దుఃఖం లేని మార్గం చూపారు. మనువుకు జీవన మార్గం చూపించారు. 'న్యూమరస్మి' అనే ఋషికి వెదురు బాణాలు ప్రయోగించటం నేర్పారు. భయంకరమైన యుద్ధంలో శర్యాతి మహారాజును రక్షించారు. మనువుకు విత్తనాలు ఇచ్చి వ్యవసాయం చేయించారు. విమదుడనే రాజుకు, అతని భార్యకు స్పర్ధలు వచ్చినాయి. వారిద్దరికి మధ్యవర్తిత్వం నెరపి రాజీ చేశారు. తమను స్తుతి చేసిన వారికి ఎర్రని గోవుల్నిచ్చారు. సుదాసుడు ధనం కావాలి అంటే అతనికి ధనాన్నిచ్చారు. యజ్ఞయాగాలలో హవిస్సులందించే

వారికి సుఖాలనిచ్చారు. కృశానుడు యుద్ధంలో శత్రువుల చేతికి చిక్కబోతుంటే అతన్ని రక్షించారు. పురుకుత్సుని పొగరుబోతు గుర్రాన్ని రక్షించారు.

ఆవుల్ని రక్షించే వారిని, ధనం కోసం, భూమి కోసం పోరాడే వాళ్ళని రక్షిస్తారు. ఇంద్రుని కుమారుడైన కుత్సుణ్ణి, తుర్వీతుడు, దభీతి, పురుహూంతి మొదలైన వారిని రక్షించారు. అని చెప్పబడింది.

112వ సూక్తంలో

వినుదుని భార్యను శత్రువులు అపహరిస్తే ఆమెను రక్షించారు. అశ్వినుల వాహనం గాడిద. చాలా వేగవంతమైనది. ఎన్నో యుద్ధాలలో పాల్గొన్నది. తుగ్రుని కుమారుడు భుజ్యుడు. అతణ్ణి అతిజాగ్రత్తగా నీళ్ళమీద నడిచేవి, మునగనివి అయిన నావలమీద తీసుకుపోయి రక్షించారు. అంటే ఈ నావలు ఎవరూ నడపకుండా స్వయంగా నడుస్తాయి. ప్రస్తుతం మన మరపడవల లాటివి. ఆ రోజుల్లోనే వీటిని ఆవిష్కరించారు అశ్వనీ దేవతలు. ఇక్కడ ఇంకో విషయం చూడండి. నేలలేని, పట్టు ఏ మాత్రము లేని, నిరాధారమైన సముద్రంలో నూరు తెడ్లు గల ఓడమీద ఉన్న భుజ్యుని అశ్వినులు రక్షించారు. నూరుతెడ్లుగల ఓడ అంటే చాలా పెద్దది. అంత పెద్ద ఓడలున్నాయన్న మాట ఆరోజుల్లో, వేదుడు అనే రాజర్షి కోసం ప్రశస్తమైన తెల్లని గుర్రాన్ని తెచ్చి ఇచ్చారు. కక్షీవంతుడికి మంచి మేధస్సు కలుగజేశారు. అంగీరసులు సౌత్రామణి యాగం చేస్తూ, కల్లుకావాలని అశ్వనీ దేవతలను అడిగారు. అప్పుడు గుర్రపు డెక్కలనుంచి కల్లు తీసి ఇచ్చారు. ఇంకొక విచిత్రం ఏమంటే ఊకనిప్పుని చల్లని నీటితో అర్చించారు. అత్రిమహర్షిని చీకటి గృహంలో తలక్రిందులుగా కట్టేస్తే, అతణ్ణి విడిపించి సంపూర్ణ ఆయుష్షు, బలము కలుగజేశారు. గౌతమ మహర్షి

కోసం ఒక బావిని తెచ్చి దాని అడుగుభాగం పైకి ఉండేటట్లుగా చేసి ఆయన దాహాన్ని తీర్చారు. ఈ నీటితో గౌతముడు ధనవంతుడైనాడు. చ్యవన మహర్షికి మందులు ఇచ్చి అతని **వార్ధక్యాన్ని పోగొట్టారు. ఇది చాలా అద్భుతం.** నందఋషి బావిలో పడి ఉన్నప్పుడు అతణ్ణి బావి నుంచి కాపాడాడు. 116, 117 సూక్తాలలో అధర్వుని కుమారుడైన దధ్యంగుడికి మధువిద్య తెలుసు. దాన్ని ఇతరులకు చెప్పరాదు. ఒకవేళ చెబితే 'నీ తలకాస్తా ఖండిస్తాను' అన్నాడు ఇంద్రుడు. అశ్వనీదేవతలు మధువిద్య కోసం దధ్యంగుడి దగ్గరకు వెళ్ళారు. విషయం తెలుసుకుని ముందుగానే దధ్యంగుని శిరస్సు ఆయన శరీరం నుంచి వేరుచేసి గుర్రపుతల అంటించారు. దధ్యంగుడు మధువిద్యను అశ్వనీ కుమారులకు చెబుతున్నాడు. ఈ విషయం ఇంద్రుడికి తెలిసి హుటాహుటిన వచ్చి దధ్యంగుడి శిరస్సు ఖండించాడు. అక్కడే ఉన్న అశ్వనీదేవతలు శస్త్రచికిత్స చేసి దధ్యంగుడి శిరస్సు అతనికి అంటించారు.

వైద్యశాస్త్రంలో ఈ రోజుకు కూడా ఇది చాలా గొప్పదయిన విషయం. నపుంసకుని భార్య అయిన నద్రిమతికి సంతానాన్ని ప్రసాదించారు. వైద్యచరిత్రలో ఇదికూడా చాలా గొప్పదైన సంఘటన. మందబుద్ధులకు మేధస్సును ఇచ్చారు. ఈ రోజున అయితే మనందరికీ ఇది మనకి చాలా ఉపయోగకరంగా ఉంటుంది. ఖేలుడి భార్యకి ఇనుపకాలు అతికించారు. జహ్నుమహర్షి సంతతి వారికి సంతానాన్ని ప్రసాదించారు. వట్టిపోయిన ఆవును మళ్ళీ పాడిఆవుగా చేశారు. కృత్రిమ వర్షాలు కురిపించారు. వృషదుని కుమారుడికి రెండు చెవులు ప్రసాదించారు. ఒక పిచ్చుక తోడేలు నోటికి చిక్కి అశ్వనీదేవతలకు మొరపెట్టుకుంది. ఆ మొర ఆలకించి పిచ్చుకను రక్షించారు.

ఋుశ్రాశ్వుడు అనే మహర్షికి తండ్రి శాపం వల్ల కళ్ళు పోయాయి. అశ్వనీదేవతల మందులతో మళ్ళీ అతడికి చూపు వచ్చింది. 'శయువు' అనువాని ఆవు గొడ్డుపోయింది. అటువంటి ఆవును మళ్ళీ పాలిచ్చేట్లుగా చేశారు.

ఈ రకంగా ఎన్నో అద్భుతాలు చేశారు అశ్వనీ దేవతలు. వారు చేసిన వాటిలో విరిగిపోయిన కాలుకు లోహపుకాలు అతికించటం, అంధుడికి చూపు ప్రసాదించటం వట్టిపోయిన ఆవు పాలిచ్చేట్లుగా చెయ్యటం, నపుంసకుడికి పుత్రసంతానం ప్రసాదించటం, తెలివి లేనివాడికి తెలివితేటలు ఇవ్వటం, దధ్యుడి తల ఇంద్రుడు నరికితే దాన్ని మళ్ళీ అంటించటం. చ్యవనుడికి యవ్వనం ప్రసాదించటం. రథానికి స్వయంచాలకత్వం కలుగచేయటం, వంటివి మహాద్భుతమైన పనులు. **వైద్యశాస్త్రంలో అశ్వనీదేవతలు గొప్ప కార్యక్రమాలు నిర్వహించారు. కాబట్టి మన వేదంలో చాలా గొప్ప విషయాలున్నాయి. మన పూర్వీకులు మహామేధావులు. అనే మాటని గుర్తించండి. ఆ గొప్పతనాన్ని మనం కూడా సంపాదించటానికి ప్రయత్నిద్దాం.**

# 39. వాక్స్వరూపాలు

మనం మాట్లాడుతూ ఉన్నాం ఆ సమయంలో మన నోటినుంచి వచ్చే శబ్దమే వాక్కు. ఈ విషయం అందరికీ తెలుసు. అయితే అసలు వాక్కు ఎలా ఏర్పడుతుంది? ఎక్కడ నుంచి వస్తుంది? అనే విషయాలు మాత్రం తెలియవు. నిజం చెప్పాలంటే ఇవి మనకి అవసరం లేదు. వాక్కుకు నాలుగు రూపాలుంటాయి. అంటే నాలుగు స్థాయిలలో రూపాంతరం చెందిన శబ్దము వాక్కు రూపంలో నోటిద్వారా బయటకు వస్తోంది. ఈ రూపాలు లేదా స్థాయిలు ఏవంటే 1. పర 2. పశ్యంతీ, 3. మధ్యమ 4. వైఖరి. ఇప్పుడు వీటిని విడివిడిగా చూద్దాం.

**1. పరావాక్కు:** ఏదైనా ఒక విషయాన్ని గురించి చెప్పాలి అంటే ముందుగా దాని గురించిన ఆలోచన రావాలి. ఈ ఆలోచన మెదడులో కలుగుతుంది. దాన్నే పరాస్థానము అంటారు. అక్కడ ఆవిర్భవించిన వాక్కునే పరావాక్కు అంటారు. ఇది పూర్తిగా అవ్యక్తము. ఇంద్రియ గోచరము కాదు. ఇక్కడ ఒక్క నిమిషం ఆగి వ్యక్తము, అవ్యక్తము అనే పదాలకు అర్థం చూడండి. మామూలుగా చెప్పాలి అంటే వ్యక్తము - కంటికి కనిపించేది. అవ్యక్తము - కంటికి కనిపించనిది. అయితే ప్రతివస్తువు కంటికి కనిపించదు. గాలి వీస్తున్నది. గాలిని కంటితో చూడలేము. కాబట్టి వ్యక్తము అంటే - ఇంద్రియాల వల్ల తెలుసుకోబడేది. అవ్యక్తము అంటే - ఇంద్రియాల వల్ల తెలుసుకోలేనిది. ఇప్పుడు మెదడులోకి ఏదో ఆలోచన వచ్చింది. ఆ ఆలోచనను మనం కంటితో చూడలేం. ఇంద్రియాల ద్వారా కూడా తెలుసుకోలేం. అందుకే దాన్ని పూర్తిగా అవ్యక్తము అన్నారు. ఇది పరమేశ్వర స్వరూపము.

**2. పశ్యంతీ వాక్కు:** పరాస్థానంలో వచ్చిన ఆలోచన గాలి బుడగ ఆకారంలో చిన్నగా ఆధారచక్రంలోకి చేరుతుంది. దీన్నే పశ్యంతీ వాక్కు అంటారు. ఇది కూడా  అవ్యక్తమే. అప్పుడే పుట్టిన పిల్లవాడి ఏడుపులాగా ఉంటుంది. ఏదో ఉందని తెలుసు. కాని అది ఏమిటో మాత్రం తెలియదు. అప్పుడే మొలక వచ్చిన విత్తనంలా ఉంటుంది. విత్తనంలోంచి మొలక తెల్లగా చిన్నకాడ రూపంలో బయటకి వస్తుంది. కాని అది ఏ రకమైన మొక్క, ఏ రకమైన చెట్టు మొదలయిన విషయాలు తెలియవు. అలాగే పశ్యతీ వాక్కు కూడా. ఇదీ అవ్యక్తమే అని చెప్పాలి. మొక్క ఉందని తెలుసు కాని అది ఏమొక్కో తెలియదు. అలాగే వాక్కు ఉందని తెలుసు, కాని దానికి అర్థం మాత్రం తెలియదు.

**3. మధ్యమావాక్కు:** పశ్యంతీ స్థానం నుంచి అంటే ఆధారచక్రం నుంచి ఈ గాలిబుడగ ఊర్ధ్వముఖంగా ప్రయాణం చేసి అనాహతపద్మం చేరుతుంది. ఇది మధ్యమావాక్కు అనబడుతుంది. ఇది పూర్తిగా అవ్యక్తం కాదు. అలా అని వ్యక్తం కూడా కాదు. తెలిసీ తెలియకుండా ఉంటుంది. పశ్యంతీవాక్కు మొలక వచ్చిన ధాన్యపుగింజలా ఉంటుంది. అని చెప్పుకున్నాం. కాని ఇప్పుడు అనాహత చక్రంలో తెలిసి తెలియకుండా ఉంటుంది. సరిగా మాటలు రాని పిల్లవాడు మాట్లాడితే ఎలా ఉంటుందో అలాగే ఉంటుంది.

**4. వైఖరీ వాక్కు:** అనాహత పద్మంలో మధ్యమగా ఉన్న వాక్కు విశుద్ధి చక్రం చేరి, అక్కడ అచ్చులతో కలిసి స్పష్టమైన వాక్కు అవుతుంది. ఇదే వైఖరీ వాక్కు.

శరీరంలో షట్చక్రాలున్నాయి.

1. ఆధారచక్రము : దీన్నే మూలాధారము అంటారు. ఇది గుదస్థానంలో ఉంటుంది. దీనికి నాలుగు దళాలుంటాయి.

2. స్వాధిష్ఠానము : ఇది లింగస్థానంలో ఉంటుంది. దీనికి ఆరు దళాలుంటాయి.

3. మణిపూరము : ఇది నాభిస్థానంలో ఉంటుంది. దీనికి పది దళాలుంటాయి.

4. అనాహతము : ఇది హృదయ స్థానంలో ఉంటుంది. దీనిలో 12 దళాలుంటాయి.

5. విశుద్ధి చక్రము : ఇది కంఠస్థానంలో ఉంటుంది. దీనికి 16 దళాలుంటాయి.

6. ఆజ్ఞా చక్రము : ఇది భృకుటి స్థానంలో ఉంటుంది. దీనికి రెండు దళాలు మాత్రమే ఉంటాయి.

7. సహస్రదళపద్మము : ఇది షట్చక్రాలన్నింటికీ పై భాగాన ఉన్న చక్రము. దీనిలో వెయ్యి దళాలుంటాయి.

షట్చక్రాలలోను అక్షర సమామ్నాయం చెప్పబడుతోంది. ముందుగా ఈ ఆరు చక్రాలలోను ఎన్ని దళాలున్నాయో చూద్దాం.

| | |
|---|---|
| ఆధారచక్రంలో–4 | అనాహతంలో–12 |
| స్వాధిష్ఠానంలో–6 | విశుద్ధి చక్రంలో–16 |
| మణిపూరకంలో–10 | ఆజ్ఞాచక్రంలో–2 |

వెరసి 50 దళాలున్నాయి ఈ ఆరుచక్రాలలోను. సంస్కృతంలో వర్ణాలు యాభై. షట్చక్రాలలోని ఒక్కొక్క దళంలోను ఒక్కొక్క వర్ణం ఉంటుంది. ముందుగా

1. విశుద్ధి చక్రంలోని 16 దళాలలోను అ నుంచి అః వరకు అచ్చులు ఉంటాయి. వీటినే స్వరములు అంటారు.

2. అనాహత చక్రంలోని 12 దళాలలోను క నుంచి ఠ వరకు 12 అక్షరాలుంటాయి. ఇవి హల్లులు. ఈ చక్రాలలో హల్లులు ఇక్కడ నుంచే ప్రారంభమవుతాయి.

3. మణిపూరం చక్రంలోని 10 దళాలలోను డ నుంచి ఫ వరకు హల్లులుంటాయి.

4. స్వాధిష్ఠాన చక్రంలో 6 దళాలలోను బ నుంచి ల వరకు హల్లులుంటాయి.

5. ఆధారచక్రంలోని 4 దళాలలోను వ నుంచి స వరకు హల్లులుంటాయి.

6. ఆజ్ఞాచక్రంలోని 2 దళాలలోను హ కారము క్షకారములు ఉంటాయి.

7. సహస్ర దళపద్మంలోని వెయ్యిదళాల యందు అన్ని వర్ణములు ఉంటాయి.

పరాస్థానంలో ఉద్భవించిన వాక్కు పూర్తిగా అవ్యక్తము. ఆధారచక్రం చేరిన వాక్కు కూడా అవ్యక్తమనే చెప్పాలి. ఈ పశ్యంతీ వాక్కు అనాహతం చేరి 'మధ్యమ' అవుతున్నది. ఇది కొంతవరకు తెలుస్తుంది. కాని పూర్తిగా తెలియదు. మారాకు వేసిన విత్తనంలా, మాటలు సరిగా రాని పిల్లవాడి మాటలు లాగా ఉంటుంది. దీనికి కారణం. ఇక్కడ పూర్తిగా హల్లులే ఉంటాయి. అచ్చులు ఉండవు. అందుకే ఉచ్చారణలో స్పష్టత అనేది ఉండదు. అనాహతంలో అస్పష్టంగా ఉన్న మధ్యమవాక్కు విశుద్ధిచక్రం చేరేసరికి అక్కడ ఉన్న అచ్చులతో కలిసి స్పష్టత రూపొందించుకుని నోటిద్వారా వైఖరీ వాక్కుగా బయటకు వస్తుంది. ఇది పూర్తిగా వ్యక్తము.

ఈ రకంగా వాక్కు పరా, పశ్యంతీ, మధ్యమ, వైఖరి అని నాలుగు రూపాలుగా ఉంటుంది.

**ఋగ్వేదంలోని ప్రథమ మండలంలోని 164వ సూక్తంలోని 45వ మంత్రంలో** ఈ విషయాన్ని వివరిస్తూ

"వాక్కు నాలుగు విధాలు. కేవలము మేధావులకు మాత్రమే ఈ విషయం తెలుసు. ఇందులో మూడు రకాల వాక్కు వ్యక్తం కాదు. నాల్గవది మాత్రమే మానవులు మాట్లాడే వాక్కు" అని చెప్పబడింది. లలితా సహస్రనామాలలో కూడా

**"పరా ప్రత్యక్చితీరూపా పశ్యంతీ పరదేవతా**
**మధ్యమా వైఖరీరూపా భక్త మానస హంసికా॥"**

అంటూ వాగ్రూపాలను వివరించటం జరిగింది. ఇలాంటి అద్భుతాలు లలితా సహస్రంలో ఇంకా చాలా ఉన్నాయి.

# 40. వివాహము

"ఆడపిల్లకు రజస్వలా పూర్వ వివాహమే చెయ్యాలి" అని శిష్టాచారసంపన్నులు చెబుతున్న మాట. ఇప్పటికీ ఇలాటి వివాహాలు జరుగుతూనే ఉన్నాయి. రజస్వలా పూర్వ వివాహం చేయకపోతే ఆ యింట్లో ఆచారవంతులు ఎవరూ భోజనం చెయ్యటమే కాదు కనీసం మంచినీళ్ళు కూడా తాగరు. ఒక రకంగా చెప్పాలంటే గతంలో వాళ్ళని వెలివేసేవారు. ఆడపిల్లకు రజస్వలాపూర్వవివాహం చెయ్యమని వేదంలో ఉన్నదా? ఈ విషయం జాగ్రత్తగా పరిశీలించినట్లైతే "ఉన్నది. వేదం **'అష్టవర్షాభవేత్కన్యా'** అని చెప్పింది. కాబట్టి అలాగే చెయ్యాలి" అంటారు. వేదం ఇలాగే చెప్పిందా? అనే విషయం చూద్దాం.

వేదంలో ఈ మాట ఎక్కడా చెప్పబడలా. **ప్రౌఢలై వరసమాగమము కోరే కన్యలకు మాత్రమే వివాహం చెయ్యాలి. స్త్రీ చిహ్నాలు లేని, రజస్వల కాని కన్యలు పుట్టినింట్లోనే ఉండాలి.** అని చెప్పింది వేదం. మరి చిన్నపిల్లలకి వివాహం చెయ్యాలనే పద్దతి ఎలా వచ్చింది? మనదేశం మీదకి మహమ్మదీయుల దండయాత్రలు జరిగాయి. గజనీ మహమ్మదు గోరీ మహమ్మదు ఈ దండయాత్రలు ప్రారంభించారు. ఆ తరువాత వాళ్ళ ఏలుబడి కూడా కొనసాగింది. గజనీ దేశసంపద కొల్లగొట్టటానికే వచ్చాడు. కాని గోరీ మహ్మదీయ సామ్రాజ్యాన్ని స్థాపించాడు. వాళ్ళ మతాన్ని విస్తరింపచేసుకోవటము అనేది వారి ముఖోద్దేశ్యము. దాంతో పెళ్ళి కాని స్త్రీ కనిపిస్తే చాలు ఎత్తుకుపోయి పెళ్ళి చేసుకునే వారు. ఆ సమయంలో జాతిని రక్షించటం కోసం ఆడపిల్లలకి చిన్నప్పుడే వివాహం చెయ్యాలి అనే సంప్రదాయాన్ని నెలకొల్పారు. తురుష్కులు వివాహం అయిన స్త్రీ జోలికి వాళ్ళు వెళ్ళేవారు కాదు. అయితే వివాహమయింది అని ఎలా తెలుస్తుంది? వివాహితలకు

నల్లపూసలు కట్టటము మహ్మదీయుల ఆచారం కాబట్టి మెడలో నల్లపూసలు కనిపిస్తే ఆవిడ వివాహిత అని గుర్తు. వివాహితల జోలికి పోకూడదు అని ఖురాన్ చెబుతోంది. కాబట్టి మనవారు కూడా చిన్న పిల్లలకే వివాహం చేసి వివాహమైంది అని గుర్తుగా మెడలో నల్లపూసలు కట్టటం ప్రారంభించి స్త్రీలకు, జాతికి కూడా రక్షణ కల్పించారు. అప్పటినుంచే స్త్రీకి వివాహ సమయంలో నల్లపూసలు కట్టటం ఆచారంలోకి వచ్చింది. అంతకు ముందు కాలంలో నల్లపూసలు కట్టే ఆచారం మనకి లేదు. ఇలా బాల్యవివాహాలు చెయ్యటం అనేది తరువాత కాలంలో ఒక దురాచారంగా మారిపోయింది. మొదట జాతిని రక్షించటానికి ప్రారంభించిన సంప్రదాయం రానురాను దురాచారమైంది. కొందరు ఛాందసులు నెలల పిల్లలకు కూడా పెళ్ళి చేసిన సంఘటనలు ఉన్నాయి. ఛాందసుడు అంటే – చదువుకున్న మూర్ఖుడు, లోకజ్ఞానము లేనివాడు. తెలివితక్కువవాడు అని అర్థం. ఈ బాల్యవివాహాలు మాన్పించటానికి మళ్ళీ సంఘసంస్కర్తలు రావలసి వచ్చింది. అయితే ఈ బాల్యవివాహాలు ఒక్క బ్రాహ్మణులలోనే ఉన్నాయా? అంటే మిగిలిన వాళ్ళు కూడా ప్రతివిషయంలోను పండితులైన బ్రాహ్మణులనే అనుసరించే వారు. కాకపోతే కేవలం శిష్టాచారసంప్రదాయకులైన బ్రాహ్మణుల దగ్గర ఇప్పటికి కూడా అక్కడక్కడ ఈ ఆచారం కనిపిస్తూనే ఉంది.

రజస్వల అయిన పిల్లలకు పెళ్ళి చేసి అత్తవారింటికి పంపేవారు. పిల్లవాడి బంధువులుగాని మిత్రులు గాని పిల్లతండ్రిదగ్గరికి వెళ్ళి పిల్లనిమ్మని అడిగేవారు. పిల్లతండ్రి వరుని గుణగణాలు, స్థితిగతులు విచారించి, నచ్చితే, వివాహానికి అంగీకరించేవాడు. పెళ్ళి ఎక్కడ చెయ్యాలి అనే సమస్య వచ్చినప్పుడు ఇప్పటిలాగా వధువు ఇంట్లోనే

చెయ్యాలనే నియమం ఏదీ లేదు. వీలుని బట్టి వధువు కాని, వరుడు కాని ఎవరి ఇంట్లోనైనా వివాహం జరిగేది. పెళ్ళి అయిన తరువాత కన్యాదాత పెండ్లికుమార్తెను బూరుగు లేదా మోదుగుచెట్టు కర్రతో చేసిన ఎడ్లబండి మీద కూర్చోబెట్టి అత్తవారింటికి పంపేవాడు. ఆ సమయంలోనే కన్యకు అరణంగా ఇచ్చే వస్తువులు కూడా ఇచ్చి పంపేవారు.

వివాహానికి గుర్తుగా వధువు చేతిని వరుడు పట్టుకునే వాడు. ఇదే 'పాణిగ్రహణము' అనబడుతుంది. వధువు చెయ్యి పట్టుకుని "ఓ కళ్యాణీ ! నీకు సౌభాగ్యం కలగటం కోసం, జీవితాంతము నువ్వు నాతో ఉండటం కోసం నీ పాణిని గ్రహిస్తున్నాను" అని వరుడు చెబుతాడు. ఆ సమయంలో అక్కడున్న పెద్దలంతా వధూవరుల నాశీర్వదిస్తారు. ఇది ఈ రోజునకూడా పాటించబడే సంప్రదాయం. పెళ్ళి అయిన తరువాత కుమార్తెను అత్తవారింటికి పంపుతూ "అమ్మా! నువ్వు భర్త ఇంటికి యజమానురాలివై, భర్తకు అనుకూలవతివై, సంతానవతివై సుఖంగా ఉండవలసినది" అని ఆశీర్వదిస్తారు.

అత్తవారింటికి వెళ్ళేటప్పుడు పెళ్ళికుమార్తె కట్టిన చీర 'కృత్య' అనే దుష్టశక్తి యొక్క రూపంగా భావించి దాన్ని వదలి వేసేవారు. ప్రత్యేకించి పెండ్లి కుమారుడు ఆ చీరను తాకడు. ఈ ఆచారం ఇప్పటికి కూడా కొన్నిచోట్ల కనిపిస్తోంది.

"కల్యాణి అయిన ఈ వధువు ఇక్కడ కూచున్న వారిలో తనకు నచ్చిన వారిని వరునిగా ఎన్నుకుంటుంది" అని అర్థం వచ్చే మంత్రాలు కూడా వేదంలో ఉన్నాయి. ఇది స్వయంవర పద్ధతి. క్షత్రియులకు మాత్రమే పరిమితమైంది.

వివాహం జరిగేటప్పుడు పై వర్ణంవారు క్రింద వర్ణం స్త్రీని వివాహం చేసుకుంటే దాన్ని అనులోమ వివాహం అంటారు. అదే క్రింది వర్ణం వారు పై వర్ణం స్త్రీని వివాహం చేసుకుంటే అది విలోమ వివాహం అవుతుంది. ఉదాహరణకు బ్రాహ్మణ వర్ణంవారు క్షత్రియ కన్యను వివాహం చేసుకుంటే అనులోమ వివాహమని, క్షత్రియ వర్ణం వారు బ్రాహ్మణ కన్యను వివాహం చేసుకుంటే విలోమ వివాహమని అంటారు. వేదంలో ఎక్కడా అనులోమ విలోమ వివాహాల ప్రసక్తి చెప్పబడలేదు. ఇలాగే వివాహం చెయ్యాలి అని ఎక్కడా చెప్పలేదు. కాని పురాణాలలో అనులోమ వివాహాలు చెప్పబడ్డాయి. ఒక్క దేవయాని, యయాతిల వివాహం మాత్రమే విలోమ వివాహంగా చెప్పబడింది.

ఋగ్వేదంలో **పదవమండలంలోని 85వ సూక్తం** వివాహాన్ని గురించి చెబుతోంది. ఈ సూక్తంలో మొత్తం 47 మంత్రాలున్నాయి.

ఈ సూక్తంలో సూర్యపుత్రికి అశ్వనులతో వివాహం జరిగింది. 20వ మంత్రంలో చెబుతున్నాడు. ఓ సూర్యా! అత్తవారింటికి వెళ్ళేటప్పుడు బూరుగ, మోదుగ కర్రలతో అందంగా నిర్మించిన రథము ఎక్కవలసినది.

28వ మంత్రంలో పెండ్లికుమార్తె తాను కట్టుకున్న వస్త్రాన్ని వదిలేసింది. పాపదేవత అయిన కృత్య ఆ స్త్రీని విడిచిపోయింది. ఆమె వంశం వర్ధిల్లింది.

29వ మంత్రం. కృత్య వెళ్ళిపోయింది. మలిన వస్త్రాన్ని వదలండి. బ్రాహ్మణులకు దక్షిణలివ్వండి. భార్యాభర్తలు కలుసుకుంటున్నారు.

30వ మంత్రం. భర్త తన భార్య వస్త్రాన్ని ముట్టుకోరాదు. ఒకవేళ ముట్టుకుంటే అతడు ఎంతటి ధనవంతుడైనా దరిద్రుడవుతాడు.

32. పగతో ఈ దంపతుల దగ్గరకు వచ్చేవారు పాడు కావాలి. శత్రువులు నాశనం కావాలి.

33. వధువును సుమంగళిగా ఆశీర్వదించేవారు వచ్చి ఆశీర్వదించండి.

36. ఓ కళ్యాణీ ! నీ సౌభాగ్యము కోసము నీ పాణిగ్రహణము చేయుచున్నాను. నన్ను భర్తగా స్వీకరించి వృద్ధాప్యము వరకు నన్ను జాగ్రత్తగా నడిపించవలసింది.

26. ఆశ్వినులు నిన్ను రథంమీద తీసుకు వెడతారు. ఓ కళ్యాణీ! అత్తవారింటికి వెళ్ళి ఇల్లాలువి కావలసింది. భర్తను అనుసరించి ఉండవలసింది.

27. ఆ ఇంట బిడ్డలను కను. ఆనందంగా ఉండు. జాగ్రత్తగా మసలుకో. భర్తతో సుఖంగా కాపురంచెయ్యి. ముసలితనం వచ్చేదాకా ఆ ఇంట్లో పెత్తనం చెయ్యి.

46. ఓ వధువా ! నీ అత్త మామలమీద, మరుదుల మీద సామ్రాజ్ఞివికా. అందరి మీదా పెత్తనం చెలాయించు.

వివాహం తరువాత గృహప్రవేశ సమయంలో పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నారు.

43. ప్రజాపతి మాకు సంతానాన్ని ప్రసాదించాలి. ముసలితనము వచ్చేదాకా మమ్మల్ని కలిపి ఉంచాలి. ఓ వధువా ! సుమంగళివై భర్త ఇంట ఉండి అతని వారికి, పశువులకు శుభములు చేకూర్చవలసినది.

44. నీ చూపు దోషరహితం కావాలి. భర్తకు శుభకరం కావాలి. పశువులకు క్షేమం కలిగించాలి. నీవు వీరమాతవు కావాలి.

42. వధూవరులారా ! మీరు కలిసి ఉండండి. విడివిడిగా ఉండద్దు. పుత్రపౌత్రులతో చాలా కాలం జీవించండి.

45. ఓ ఇంద్రా! ఆమెకు మంచి కుమారుల నివ్వవలసింది. ఆమెకు పదిమంది పుత్రులు పుట్టాలి. భర్తతో కలసి పదకొండు మంది కావాలి. అంటే చివరిదశలో భర్తను కూడా కుమారుడిలాగానే చూడాలి అని అర్థం.

47. ఓ దేవతలారా ! మా ఇద్దరి మనసులు ఏకం చెయ్యండి. మా ఇద్దరిని సంయుక్తులుగా చెయ్యండి. అధర్వణ వేదసంహితాభాగంలోని 14వ కాండలో రెండు అనువాకాలున్నాయి. వాటిలో పూర్తిగా వివాహానికి సంబంధించిన క్రతువు చెప్పటం జరిగింది.

వివాహం అయిన తరువాత కన్య అత్తవారింటికి బయలుదేరుతుంది. త్రోవలో కొన్ని మంత్రాలు చదువుతూ కన్యను తీసుకువెడుతూ "వాహనాలు ఎక్కి మేము మంచి మార్గం గుండా బయలుదేరి వెడుతున్నాము. ఈ మార్గంలో ఎవరికీ ప్రాణహాని జరగదు. ఈ వనస్పతుల యందున్న గంధర్వులు, అప్సరసలు వధువుకు సుఖాన్ని కలుగజేస్తారు. ఈమె దగ్గర ఉన్న ధనం కోసం దొంగలు వస్తున్నారు. యజ్ఞదేవతలు వీరిని తరిమికొడతారు. బందిపోటు దొంగలు ఈ దంపతులను చేరకుందురు గాక. దుర్గమమైన ఈ మార్గాన్ని మేము తేలికగా దాటగలము. మా శత్రువులు పారిపోవాలి. ఈ సతి దగ్గర ఉన్న ధనమును సవిత రక్షించాలి."

కన్య అత్తవారింటికి వచ్చింది. ధాత ఆమె కోసం గృహం రూపంలో ఒక లోకాన్ని సృష్టించాడు. ఆ యువతి యందు ఆమెభర్త

బీజమును ప్రవేశపెట్టును గాక. ఆమె సంతానవతి అగుగాక. ఓ వధువా! నీకు సంతానము కలుగుగాక. ఓ వధువా ! నీవు చల్లని మనసు గల దానవై బిడ్డలను కని, అందరినీ అదుపులో ఉంచుకుని మా అందరికీ ఆనందాన్ని అందించవలసింది. బావగారికి, భర్తకు మనస్తాపము కలిగించవద్దు. పశువులను కూడా ప్రేమగా చూడవలసింది. నియమనిష్ఠలు పాటించవలసింది. వీరులైన (పండితులైన) కుమారులను కనవలసినది. అత్తమామలకు, భర్తకు, ఇంట్లో వారందరికీ సుఖాన్ని కలిగించుము. ఓ దేవతలారా! ఈమె సుమంగళి. ఈమెకు అన్నీ శుభాలే కలిగించండి. వృద్ధస్త్రీలు ఈమెను ఆశీర్వదించి ఇళ్ళకు వెడతారు. ఆహ్లాదాన్ని కలిగించే మంచము వేశారు. వధువు ఆ మంచమును ఎక్కవలసినది. ఓ వధూవరులారా! మీరిద్దరూ సుఖంగా ఉండండి. పిల్లల్ని కనండి. మీకు ప్రజాపతి సంతానాన్ని ఇచ్చును గాక. వరుని ప్రతి అవయవము నుండి వ్యాధులు తొలగిపోవు గాక. ఆ వ్యాధులు మా కెవరికీ అంటకుండు గాక. ఓ వధువా ! నేను విష్ణువును నీవు లక్ష్మివి. నేను సామమును నువు ఋక్కువు. నేను ఆకాశాన్ని నీవు భూమివి మనము కలసి సంసారము చేసి సంతానము పొందుదాము. మాకు మంచిదాత అయిన కుమారుడు కలుగుగాక. మేము ఏ రకమైన బాధలు లేనివారమగుదుము గాక."

ఇది అథర్వణ వేదంలోని మంత్రార్థం. వివాహ సమయంలో ఈ విధమైన మంత్రాలు చదువుతారని వేదం చెబుతోంది.

# 41. ఆడపిల్లకు ఆస్తిలో హక్కు

ఆడపిల్లకి ఆస్తిలో హక్కు ఉన్నదా? లేదా? ఉన్నది అని కొంతమంది, లేదు అని కొంతమంది, ఎవరికి అనుకూలమైన ధోరణిలో వాళ్ళు చెబుతూ వచ్చారు. ప్రస్తుత పరిస్థితిలో తండ్రి గనక వీలునామా వ్రాయకుండా మరణించినట్లైతే, ఆయన ఆస్తిలో ఆడపిల్లలకు కూడా సమానహక్కు ఉన్నది. ఒకవేళ వీలునామా వ్రాస్తే దాని ప్రకారము పంపకం జరుగుతుంది. అయితే పూర్వకాలంలో పరిస్థితి ఎలా ఉండేది? ఆడపిల్లకి ఆస్తిలో హక్కు ఉన్నది అని చెబుతోంది వేదం. ఋగ్వేదంలోని **పదవ మండలంలోని 108వ సూక్తంలో** ఈ విషయము చెప్పబడింది. ఈ సూక్తంలో మొత్తం 11 మంత్రాలున్నాయి.

బృహస్పతి గోశాలలో ఉన్న ఆవులను బలాసురభటులైన 'పణులు' అనేవారు ఎత్తుకుపోయి దూరంగా ఒక పెద్దకొండ గుహలో దాచిపెట్టారు. బృహస్పతి ఇంద్రుడి దగ్గరకు పోయి తన ఆవులు ఎవరో ఎత్తుకు పోయారు అని ఫిర్యాదు చేశాడు. వెంటనే ఇంద్రుడు స్పందించి తన కుక్క అయిన 'సరమ'ను ఆవులను వెతకమని పంపించాడు. సరమ ఆవులు వెతుకుతూ వెళ్ళి వెళ్ళి చివరకు ఆవులను దాచి పెట్టిన కొండగుహ చేరింది. అక్కడికి వచ్చిన సరమను చూశారు పణులు. ఇప్పుడు అంటున్నారు. సరమా ! నువ్వు ఏ పనిమీద ఇక్కడికి వచ్చావు? ఇది చాలా దూరంగా ఉన్న ప్రదేశము. ఈ మార్గంలో వచ్చేటప్పుడు ఒక్కసారి వెనక్కి తిరిగి చూసినట్లైతే ఇక్కడికి రాలేరు. ఎన్నిరోజులు ప్రయాణం చేశావు? త్రోవలో ఉన్న నది ఎలా దాటగలిగావు? అయినా మా దగ్గర ఏముందని ఇంత దూరం ప్రయాణం చేసి వచ్చావు?" అన్నారు.

ఆ వచ్చినది వాళ్ళ జాతి కాదు. పరాయి జాతి. అందుకే వెంటనే గుర్తు పట్టేశారు. ఎందుకు వచ్చావు? అని అడిగారు. ఆ మాటలు విన్న సరమ చెబుతోంది.

పణులారా ! నేను ఇంద్రుని దూతగా వచ్చాను. మీరు గోధనాన్ని దాచి ఉంచారు. దాన్ని తీసుకుపోవటానికి వచ్చాను. ఈ నదిని దాటటం కష్టమే అయినా దాటి వచ్చాను అన్నది.

సరమా ! నువ్వు ఇంద్రుని దూతగా ఇక్కడికి వచ్చాను అంటున్నావు. ఆ ఇంద్రుడి పరాక్రమం ఎలాంటిది? అతడి సేన ఎంత ఉంది? ఒకవేళ అతడు వచ్చినా మా దగ్గర ఆవులు తీసుకుని వాటిని రక్షిస్తాడా. అన్నారు. ఆ మాటలు విన్న సరమ చెబుతోంది. ఇంద్రుడు అపజయం ఎరుగని వాడు. ఎంతటి వారైనా సరే అతణ్ణి ఓడించలేరు. ఓ పణులారా! ఇంద్రుడు వచ్చి మిమ్మల్ని హతమారుస్తాడు అంది. పణులు సమాధానం చెబుతున్నారు. ఓ సరమా ! నువ్వు స్వర్గం నుంచి ఇక్కడికి వచ్చావు కాబట్టి ఈ ఆవులలో నువ్వు కోరిన వాటిని నీకు ఇస్తాము. అయినా యుద్ధం చెయ్యకుండా ఆవులు ఎవరిస్తారు?మా దగ్గర కూడా బలమైన, పదునైన ఆయుధాలు అనేకమున్నాయి అన్నారు. ఆవులు ఇస్తాము అని సంధి ప్రతిపాదన చేస్తూ, మా దగ్గర కూడా ఆయుధాలున్నాయి మేము కూడా యుద్ధం చేస్తాం అని హెచ్చరిస్తున్నారు. ఆ మాటలు విన్న సరమ అంటోంది. మీ మాటలు అంగీకారం కావు. మీరు పాపం చేస్తున్నారు. ఇక్కడికి వచ్చే మార్గాలన్నీ దేవతలు ఆక్రమిస్తారు. మీరు తప్పించుకోలేరు. ఇంద్రుడు మిమ్మల్ని సంహరిస్తాడు. అంగీరస, అయాస్య ఋషులు తమ పరివారంతో ఇక్కడికి వచ్చి ఈ ఆవుల్ని తోలుకుపోతారు.” ఈ మాటలు విన్న

పణులు అంటున్నారు. “సరమా ! దేవతలు మాకు భయపడ్డారు. నిన్ను పంపించారు. నిన్ను మేము మా సోదరిగా భావిస్తున్నాము. ఇంక నువ్వు తిరిగి వెళ్ళవద్దు. ఈ గోధనంలో నీకు భాగము ఇస్తాము.”

ఈ సూక్తంలో ఇది తొమ్మిదవ మంత్రం. ఇందులో పణులు ప్రతిపాదిస్తున్నారు. సరమ వాళ్ళ సోదరి అంటున్నారు. నువు ఇక్కడే ఉండు. ఈ ఆస్తిలో నీ వాటా నీకు ఇస్తాము అన్నారు. అంటే ఆస్తిలో ఆడపిల్లకి హక్కు ఉన్నదని మనకు తెలుస్తోంది. ఆ మాటలు విన్న సరమ “ఓ పణులారా! పరాక్రమవంతుడైన ఇంద్రుడు నన్ను ఇక్కడికి గోవుల కోసం పంపాడు. వాటిని వదిలి మీరు దూరప్రాంతాలకు పారిపోండి. మీరు ఆవులను దాచినస్థలం దేవతలకు తెలిసింది. కాబట్టి పారిపోయి ప్రాణాలు దక్కించుకోండి అన్నది.

ఈ రకంగా ఈ సూక్తంలోని 9వ మంత్రంలో ఆడపిల్లకు ఆస్తి హక్కు ఉన్నదని చెబుతోంది వేదం.

# 42. ఓషధీసూక్తము

జ్వరం వచ్చినా ఒంట్లో అనారోగ్యంగా ఉన్నా ఏవో మందులు వాడతాం. మనది భారతదేశం. మన దేశంలో ఇంటింటా వైద్యం జరుగుతుంది. గృహవైద్యం అందరికీ తెలుసు. చిన్న చిన్న అనారోగ్యాలకి గచ్చాకు, పచ్చాకు వైద్యం చేస్తుంటాం. దీని కారణం భారతీయ వైద్యమైన ఆయుర్వేదానికి మంచి ప్రాచుర్యం ఉన్నది మనదేశంలో రోగము, దాని లక్షణాలు. దానికి వాడవలసిన మందు ఇవన్నీ పాటల రూపంలో వ్రాసి బహుళ ప్రచారం చేశారు. గతంలో ప్రతిఇంట్లోను చిన్న పిల్లలు ఆడుకుంటూ ఈ పాటలు పాడేవారు. ఉదాహరణకి గుడి గుడి గుంజం గుండే రాగం, ఒప్పులకుప్పా వయ్యారిభామా, కొండమీద కొక్కిరాయి కాలుజారి కూలిపోయే, దానికేం మందు వేపాకు చేదు, వెల్లుల్లిగడ్డ. ఈ పాటలన్నీ ఆయుర్వేద వైద్యానికి సంబంధించనవే. ఇంగ్లీషు భాషమీద, ఇంగ్లీషు చదువుల మీద వ్యామోహం పెరిగిపోయి అమ్మా నాన్నా అని పిలిపించుకోవటమే అవమానంగా భావిస్తున్న ఈ రోజుల్లో. ఆ పాటలు పాడేవారు. కనుమరుగై పోయారు. ఆయుర్వేద మందులు వాడే వారు కూడా తగ్గిపోతున్నారు. గతకాలంలో

**శరీరే జర్జరీ భూతే వ్యాధిగ్రస్థే కళేబరే**

**ఔషధం జాహ్నవీతోయం వైద్యోనారాయణో హరిః**

అంటూ మందిచ్చే వైద్యుణ్ణి సాక్షాత్తు శ్రీమన్నారాయణుడుగా భావించేవారు. ఈ కారణం చేతనే అనారోగ్యం చేసినప్పుడు మందులు వాడటమే కాకుండా మంత్రాలు కూడా పెట్టేవారు. స్తోత్రాలు చదివేవారు. ఇప్పటికి కూడా పిల్లవాడికి జ్వరం వచ్చింది అంటే

రుద్రాభిషేకం చేయించే వాళ్ళున్నారు. ఈ క్రమంలోనే పిల్లలు అనారోగ్యాన్ని దూరం చెయ్యమని ఓషధులను ప్రార్థన చేసేవారు. ఓషధీ సూక్తంతో మంత్రించిన జలము పిల్లవాడితో త్రాగించటం కాని, ఈ సూక్తం చదువుతూ పిల్లవాడి శరీరమంతా చేత్తో తుడవటం కాని చేసేవారు. అలా చేస్తే పిల్లవాడి అనారోగ్యం తగ్గిపోతుందని వారి నమ్మకం. నమ్మకానికి మించింది లేదు. వాళ్ళ రోగాలు తగ్గిపోయేవి కూడా.

ఋగ్వేదంలోని పదవ మండలంలోని **97వ సూక్తం ఓషధీ సూక్తం**. ఇందులో 22 మంత్రాలుంటాయి. పూర్వకాలంలో దేవతలు ఓషధులను సృష్టించారు. అవి 107 స్థానాలలో లభిస్తాయి.

ఓషధులారా ! మీ రూపాలు అసంఖ్యాకములు. మీరు అనేకచోట్ల లభిస్తారు. దయచేసి నన్ను ఆరోగ్యవంతునిగా చేయండి. మీరు రోగుల విషయంలో సంతుష్టులు కండి. వ్యాధులు తగ్గించండి. మీరు తల్లిలాంటివారు. వైద్యంకోసం ఆవులు, గుర్రాలు, వస్త్రాలు, ఒకటేమిటి నన్ను సైతము అర్పించుకోవటానికి సిద్ధంగా ఉన్నాను. ఈ విషయం ప్రతిజ్ఞ చేసి చెబుతున్నాను. వైద్యుడు ప్రాణాన్ని రక్షిస్తాడు. అతడికి ఎంతిచ్చినా తక్కువే.

**'శరీరమాద్యం ఖలు ధర్మశాసనం'** ధర్మాన్ని సాధించాలంటే ముందు ఈ శరీరము ఉండాలి కదా?

ఓషధులారా ! రావి, మోదుగ మీ నివాస స్థానాలవుతున్నాయి. మీరు గనక రోగాన్ని తగ్గించినట్లైతే మీకు ఆవులను ఇవ్వటం ధర్మం. (ఆయుర్వేదంలో రావి, మోదుగ చెట్లకు చాలా ప్రాముఖ్యత ఉన్నది. అందుకే యజ్ఞయాగాదుల్లో సమిధలు రావి, మోదుగలే ఎక్కువ వాడతారు.)

రాజులు సమితియందు సమావేశమైనట్లుగా ఓషధులు వైద్యుని వద్ద సమావేశమవుతాయి. ఓషధుల గురించి తెలిసిన వాణ్ణి విద్వాంసుడు అంటారు. అతడు వ్యాధులను పట్టి బంధిస్తాడు.

రోగాలు తగ్గించటానికి నాకు చాలా రకాలైన ఓషధులు తెలుసును.

కొట్టము నుండి ఆవులు బయటకు వచ్చినట్లుగా, రోగి శరీరము నుంచి రోగాలన్నీ బయటకి వస్తాయి.

ఓషధులారా ! మీ తల్లి ఆరోగ్యకారి. ఇక మీరు దేహబాధను తగ్గించి రోగిని ఆరోగ్యవంతునిగా చెయ్యండి.

దొంగ సామాన్లుగది దాటినట్లుగా, ఓషధులు రోగాలను దూరం చేస్తాయి.

బలవంతుడు సామాన్య ప్రజలను లోబరచుకున్నట్లుగానే ఓషధులు రోగాలను వశం చేసుకుంటాయి. రోగం శరీరంలో నుంచి పూర్తిగా పోవాలి అనేది ఆయుర్వేద సిద్ధాంతము. ఈ రోజుల్లో వైద్యం ఒక వ్యాపారం. ఆకాశంలో పక్షులు ఎగిరినట్లుగా, గాలి వీచినట్లుగా ఓ రోగమా త్వరగా వెళ్ళిపో అనేవారు.

ఓషధులారా ! జగత్తులోని ఓషధులన్నీ ఏకమై నాప్రార్ధన మన్నించండి. మమ్మ్మ రోగాల నుండి కాపాడండి. ఈ ఓషధులు వరుణపాశము నుండి, యమపాశము నుండి మమ్మల్ని రక్షించాలి. ఓషధులు అనుగ్రహించిన ప్రాణికి అనిష్ఠము ఉండదు. ఓషధులకు రాజు చంద్రుడు. అతడు మనసుకు సుఖాన్నిస్తాడు. ఓషధులు రోగికి శక్తిని ప్రసాదించును గాక. ఓ ఓషధులారా నేను మిమ్మల్ని తవ్వి తీస్తున్నాను. కాబట్టి కోపగించి నాకు, రోగికి కూడా నష్టము కలిగించవద్దు. నాకు మేలు కలుగచేయండి. మా రోగాలు తగ్గించండి.

నా యీ స్తోత్రాన్ని విన్నా, వినలేకపోయినా ఓషధులన్నీ ఈ ఓషధికి శక్తిని ప్రసాదించును గాక. ఈ స్తోత్రాన్ని విన్న ఓషధులు తమ రాజైన చంద్రుడితో "ఓ రాజా! మమ్మల్ని స్తుతించేవారిని, అతని దగ్గర చికిత్స పొందే వారిని కూడా మేము రక్షిస్తాము" అని అభయమిచ్చినాయి. ఇది ఫలశ్రుతి.

ఈ రకంగా రోగాలు వచ్చినప్పుడు కేవలము మందులు వాడటమే కాకుండా, ఆ మందులను రోగం తగ్గించమని ప్రార్థించేవారు.

దీంతోపాటుగా రోగాన్ని నాశనం చెయ్యమని కూడా ప్రార్థన చేసేవారు. **ఋగ్వేదంలో పదవ మండలంలోని 163వ సూక్తం** ఈ విషయాన్ని చెబుతోంది. ఇందులో మొత్తం ఆరు మంత్రాలున్నాయి.

నీ కళ్ళు, ముక్కు, చెవులు, శిరస్సు, నాలుకల నుండి వ్యాధిని తొలగిస్తున్నాము.

మెడలో ఉండే ధమనులు, ఎముకల సంధులు, చేతులు, కాళ్ళ నుండి వ్యాధిని తొలగిస్తున్నాము.

అన్ననాడి, హృదయము, మూత్రాశయముల నుండి వ్యాధిని తొలగిస్తున్నాము.

నీ ఊరువులు, పిక్కలు, పాదాలు, కటిప్రదేశము, మలద్వారముల నుండి వ్యాధిని తొలగిస్తున్నాము.

మూత్రస్థానము, వేళ్ళు, గోళ్ళు సర్వాంగముల నుండి వ్యాధిని తొలగిస్తున్నాము.

నీ సర్వాంగముల నుండి వ్యాధిని తొలగిస్తున్నాము.

ఈ రకంగా సూక్తం చదివి చేత్తో రోగి శరీరాన్ని తాకితే వ్యాధి తగ్గిపోతుంది. మాటే మంత్రము మంత్రానికి ఆ శక్తి ఉన్నది.

# 43. ఋతువులు

కాలచక్రంలో పాడ్యమినుంచి పౌర్ణమి లేదా అమావాస్యదాకా తిథులు పదిహేను. ఇప్పుడు

| | | |
|---|---|---|
| 15 తిథులు | – | ఒక పక్షము |
| రెండు పక్షములు | – | ఒక మాసము |
| రెండు మాసములు | – | ఒక ఋతువు |
| మూడు ఋతువులు | – | ఒక అయనము |
| రెండు అయనములు | – | ఒక సంవత్సరము |

అంటే సంవత్సరానికి ఆరుఋతువులన్న మాట. అధర్వణవేదంలో వామదేవుడనే ఋషి ఋతువులను ఇలా భావించాడు.

1. చైత్ర వైశాఖ మాసములు – వసంత ఋతువు
2. జ్యేష్ట ఆషాఢ మాసములు – గ్రీష్మ ఋతువు
3. శ్రావణ భాద్రపద మాసములు – వర్ష ఋతువు
4. ఆశ్వయుజ కార్తీక మాసములు – శరదృతువు
5. మార్గశిర పుష్య మాసములు – హేమంత ఋతువు
6. మాఘ ఫాల్గుణ మాసములు – శశిర ఋతువు

ఇవి ఈ రోజున మనం చెబుతున్న ఋతువులు. కాని కృష్ణయజుర్వేదంలోని **4వ కాండలోని 4వ ప్రపాఠకంలోని 11వ అనువాకంలో** మాసాలు, ఋతువులు, ఈ విధంగా ఉన్నాయి.

మధుమాసం, మాధవమాసం – చైత్ర వైశాఖాలు–వసంత ఋతువు

శుక్రం, శుచి – జ్యేష్ఠ ఆషాఢాలు – గ్రీష్మ ఋతువు

నభం నభస్యం - శ్రావణ భాద్రపదాలు - వర్ష ఋతువు

ఇషం ఊర్జం - ఆశ్వయుజ కార్తీకాలు - శరదృతువు

సహం సహస్యం - మార్గశిర పుష్యాలు - హేమంత ఋతువు

తపం తపస్యం - మాఘ ఫాల్గుణాలు - శిశిర ఋతువు

**ఋగ్వేదంలోని ప్రథమ మండలంలోని 15వ సూక్తంలో** ఋతువులను దేవతలతో సమానంగా చూశారు. ఈ సూక్తంలో "ఓ ఇంద్రా! ఋతువులతో కలసి నీవు సోమపానము చెయ్యవలసినది. ఓ మరుత్తులారా ! ఋతుసహితులై మీరు సోమపానము చెయ్యండి. ఓ త్వష్టా ! భార్యా సహితుడవై ఋతువులతో కలసి సోమపానము చేయవలసినది. ఓ అగ్నీ! ఋతువులతో కలసి సోమపానము చెయ్యి. ఓ మిత్రావరుణులారా ! ఋతువులతో కలిసి సోమపానము చెయ్యవలసినది. ఓ ఆశ్వినులారా ! ఋతువులతో కలిసి సోమపానము చెయ్యండి" అంటూ ఋతువులకు కూడా దేవతలతో సమానస్థాయి కల్పించారు. **ఋతువులు అంటే కాలచక్రం. కాలం పరమేశ్వర స్వరూపము.**

# 44. వృత్రాసురవధ

పూర్వకాలంలో చిత్రకేతువు అనే ఒక మహారాజు ఉండేవాడు. అతనికి అనేకమంది భార్యలు. కాని సంతానం మాత్రం లేదు. దాంతో రాజు అంగీరసుడనే మునీశ్వరుడి ఆధ్వర్యంలో పుత్రకామేష్టి యాగం చేసి పాయసాన్నాన్ని పట్టపురాణి అయిన 'కృతద్యుతి'కి ఇచ్చాడు. కాలక్రమంలో ఆమె గర్భవతి అయి పండంటి మగబిడ్డను కన్నది. దాంతో రాజుగారికి పట్టపురాణి అన్నా, పిల్లవాడన్నా ప్రేమ విపరీతంగా పెరిగిపోయింది. అది చూసిన ఇతర భార్యలు దీనికంతటికీ కారణము ఈ పిల్లవాడు అని నిశ్చయించి రాకుమారుడికి విషం పెట్టి చంపేశారు. కుమారుడు మరణానికి విపరీతంగా శోకిస్తున్నాడు, చిత్రకేతువు. ఆ సమయంలో నారదుడు వచ్చి మరణించిన కుమారుని తన తపోబలంతో బతికించాడు. అతణ్ణి చూసిన చిత్రకేతువు పిల్లవాడి దగ్గరకు పోయి కుమారా! అంటూ దగ్గరకు తీసుకోబోయాడు. కాని పిల్లవాడు మాత్రం దూరంగా వెళ్ళి "నువ్వెవరు? నీకు నాకు ఏమిటి సంబంధం? ఇప్పటికి ఎన్నోజన్మ లెత్తాను. ఎంతమంది తల్లితండ్రులన్నారు. ఇప్పుడు నేను పరమేశ్వర స్వరూపుణ్ణి. నాకు ఏ బంధాలు లేవు." అంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. చిత్రకేతువుకు జ్ఞానోదయమైంది. తరువాత నారదుడి దగ్గర మంత్రోపదేశం పొంది కాళిందీ నదీతీరంలో మంత్రసిద్ధిని విద్యాధరత్వము పొంది విమానమెక్కి ఆకాశ మార్గాన తిరుగుతున్నాడు.

ఒకరోజున విమానంలో కైలాస ప్రాంతంలో విహరిస్తున్నాడు చిత్రకేతువు. ఆ సమయంలో కైలాసంలో సభ జరుగుతున్నది. ఆ సభలో శివుడు పార్వతిని కౌగిలించుకుని కూర్చున్నాడు. అది చూసి ఆక్షేపించాడు చిత్రకేతువు. దాంతో పార్వతికి కోపం వచ్చి రాక్షస యోని

యందు జన్మించమని శపించింది. మరుజన్మలో చిత్రకేతువే వృత్రాసురుడుగా జన్మించాడు.

ఇంద్రుణ్ణి సంహరించటం కోసం తపస్సు చేసి విశ్వరూపుణ్ణి సృష్టించాడు త్వష్టప్రజాపతి. అతన్ని కాస్తా సమాధి స్థితిలో ఉండగానే చంపేశాడు ఇంద్రుడు. ఇప్పుడు మళ్ళీ వృత్రాసురుణ్ణి సృష్టించాడు త్వష్ట. వృత్రాసురుడు బ్రహ్మను గురించి తపస్సు చేసి పగలుకాని, రాత్రికాని, జీవము ఉన్న వాటితో కాని, జీవము లేని వాటితో కాని, ఆయుధంతోకాని, ఆయుధంలేకుండా కాని తనకు మరణం సంభవించకుండా వరం పొందాడు. తరువాత స్వర్గం మీద దాడి చేశాడు. ఇంద్రుడు పారిపోయి శ్రీమహావిష్ణువును శరణు వేడాడు. సమయం వచ్చేదాకా వృత్రునితో స్నేహం చెయ్యమన్నాడు విష్ణుమూర్తి. వృత్రునితో సఖ్యంగా ఉంటూనే ఒకనాటి సంధ్యా సమయంలో వృత్రుడు సముద్రపు ఒడ్డున ఉన్న సమయంలో ఇంద్రుడు సముద్రపు నురుగుతో కొట్టి వృత్రుని సంహరించాడు. వృత్రాసుర వధ **ఋగ్వేదంలోని ప్రథమ మండలంలోని 52వ సూక్తంలో వివరించబడింది.** "ఇంద్రుడు చాలా బలం కలవాడు. యుద్ధంలో ఎవరిపైన అయినా దాడి చేస్తాడు. నీళ్ళు లేని ఆకాశంలో మబ్బులు నింపుతాడు. వర్షాలు కురిపిస్తాడు. మరుత్తులు మహావీరులు. యుద్ధంలో ఇంద్రుని వెంటనే ఉంటారు. మరుత్తులు ఇంద్రుడికి అండగా ఉండి వృత్రుడితో తలపడ్డారు. వృత్రుడు వారెవరినీ లెక్కచెయ్యలేదు. జలాన్ని బంధించాడు. ఆకాశాన్ని ఆవరించి అదృశ్యుడైనాడు. అటువంటి వృత్రుణ్ణి ఇంద్రుడు తన వజ్రాయుధంతో దవడ పగలకొట్టాడు. వృత్రుడు భయంకరంగా గర్జించాడు. ఆ ధ్వనికి ద్యులోకము కూడా కంపించిపోయింది. అప్పుడు ఇంద్రుడు సోమరసము త్రాగాడు. వజ్రాయుధాన్ని ధరించి వృత్రుడి తలకాస్తా

నరికేశాడు. వృత్రుడు మరణించాడు. అతడు బంధించిన జలాన్ని విడిపించాడు ఇంద్రుడు.” అంటూ వృత్రాసుర వధను వివరిస్తోంది వేదము.

# 45. రోలు రోకలి

వేదంలో ఏం చెప్పారు? అనే ప్రశ్న మాటిమాటికి వస్తూఉంటుంది. ఏం చెప్పారు అనటానికి బదులుగా వేదంలో ఏం చెప్పలేదు? అని ప్రశ్నించుకుంటే చాలా బాగుంటుంది. అసలు వేదంలో చెప్పని విషయం లేదు. ఒక చిన్న ఉదాహరణ. అన్నం వండుకోవాలంటే బియ్యం కావాలి. పొలంలో ధాన్యం పండుతాయి కాని బియ్యం పండవు. పండిన ధాన్యం నుంచి పొల్లును వేరు చేసి, బియ్యం తీసుకుని వంట చేసుకోవాలి. అలా పొల్లు వేరు చెయ్యాలంటే అనేక పద్ధతులున్నాయి. ధాన్యాన్ని పశువులతో తొక్కించి పొల్లును వేరుచేయవచ్చు కాని ఈ పద్ధతిలో సమయము, శ్రమ కూడా ఎక్కువ. ధాన్యాన్ని తిరగలిలో త్రిప్పి పొల్లును వేరుచేయచ్చు. కాని పొల్లుతో బాటు బియ్యం కూడా పోతాయి. తిరగలిలో త్రిప్పేటప్పుడు చాలా బియ్యం ముక్కలైపోతాయి. కాబట్టి శ్రమ, నష్టం ఎక్కువ, ఫలితం తక్కువ. ఇంకొక పద్ధతిలో రెండు చేతులతోను ధాన్యాన్ని నలిపి పొల్లు తీసెయ్యవచ్చు. శ్రమ చాలా ఎక్కువ. ఇవన్నీ ఆలోచించి ధాన్యం రోట్లో పోసి, రోకలితో దంచితే చాలా సులువుగా ఉంటుంది. కాబట్టి ధాన్యం నుంచి పొల్లును అలాగే వేరు చెయ్యాలి అని చెబుతోంది వేదం. సోమరసం తియ్యటానికి కూడా రోలు రోకలే వాడాలి అని చెబుతోంది. **ఋగ్వేదంలోని మొదటి మండలంలోని 28వ సూక్తం** ఈ విషయం చెబుతోంది. ఒక్క ధాన్యమే కాదు సోమరసం తియ్యటానికి కూడా ఈ పద్ధతిని వాడమంటోంది.

ఇంద్రా! రోలు రోకలి ఉపయోగించి, దంచి, పిండితీసిన సోమరసాన్ని సేవించవలసింది. యజమాని భార్య రోటిలో దంచి తీసిన సోమరసాన్ని సేవించు. అంటే రోటిలో దంచి తీసిన సోమరసం

శ్రేష్ఠమైనదన్న మాట. ఓ ఇంద్రా! గుర్రానికి కళ్ళెంలాగా త్రాడుచుట్టి, అటూ ఇటూ త్రిప్పి, రోట్లో దంచిన సోమరసాన్ని త్రాగవలసింది. ధాన్యాన్ని దంచటానికి రోలు ప్రతి ఇంట్లోను ఉంటుంది. రోలు రోకలి యజ్ఞసాధనాలు. అవి ఇంద్రుని గుర్రాల్లాగా శబ్దం చేస్తున్నాయి అంటున్నారు.

# 46. అందర్నీ గౌరవించండి

ఋగ్వేదంలో చాలా గొప్పదైన విషయాన్ని చెబుతున్నారు. చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. ప్రాణమున్నవి, ప్రాణం లేనివి, చలనమున్నవి, చలనం లేనివి అన్నీ పరమేశ్వర స్వరూపమే. నేను పరమేశ్వర స్వరూపమే. నా ఎదురుగా ఉన్న నువ్వు పరమేశ్వర స్వరూపమే. పిపీలికాది బ్రహ్మపర్యంతము అంతా పరమేశ్వర స్వరూపమే. కాబట్టి జగత్తులోని ప్రతిజీవిని, ప్రతిప్రాణిని అత్యంత గౌరవంగా చూడాలి. నీలో ఉన్న ఆత్మే నీ సమీపంలో ఉన్న క్రిమికీటకాదులలో కూడా ఉన్నది. ఇక మనుష్యుల దగ్గరకు వస్తే మానవులంతా ఒకటే. బలమున్న వాళ్ళు, బలం లేనివాళ్ళు, యువకులు, వృద్ధులు, పెద్దలు, పిన్నలు అందర్నీ గౌరవించాలి అంటోంది ఋగ్వేదం. మన కన్నా పెద్దవారిని తప్పనిసరిగా గౌరవించాలి. వయసులో పెద్ద కావచ్చు. ఇతర విషయాల్లో పెద్ద కావచ్చు. ఎవరు పెద్దవారు అనే ప్రశ్న వచ్చినప్పుడు.

**"బ్రాహ్మణో జ్ఞానతో జ్యేష్ఠ; క్షత్రియస్య పరాక్రమః**
**వైశ్యో ధనస ముద్దిశ్చ, శూద్రస్య సుఖమావాప్నుయాత్"**

| | | |
|---|---|---|
| బ్రాహ్మణులలో | – | జ్ఞానియైనవాడు |
| క్షత్రియులలో | – | పరాక్రమవంతుడు |
| వైశ్యులలో | – | అత్యంత ధనవంతుడు |
| శూద్రులలో | – | సుఖాన్ని అనుభవించేవాడు |

పెద్దవాళ్ళుగా చెప్పబడుతున్నారు. మనం వీరినే కాదు అందర్నీ గౌరవించాలంటోంది వేదం. **ప్రథమ మండలం మొదటి సూక్తంలోని 27వ మంత్రం** ఈ విషయాన్ని వివరిస్తోంది. "బలవంతులకు

నమస్కారము, బలహీనులకు నమస్కారము, యువకులకు నమస్కారము, వృద్ధులకు నమస్కారము, స్త్రీలకు నమస్కారము, పురుషులకు నమస్కారము. అందరికీ నమస్కారము. లోకంలో మనకన్న పెద్దవారిని, గొప్పవారిని తప్పనిసరిగా గౌరవించాలి. అంతేకాదు మనకన్న చిన్నవారు, తక్కువ స్థాయిలో ఉన్న వారికి కూడా నమస్కారము. అందరికీ నమస్కారము. అంటోంది వేదం.

నీకన్న వయస్సులో పెద్దవారిని గౌరవించు. విద్యలో పెద్దవారిని గౌరవించు. ఏ రకంగా అయినా సరే నీకన్న గొప్పవారిని గౌరవించు. నీకన్న చిన్న వారిని, పండితులు కాని వారిని అభిమానించు. ఈ రకంగా లోకంలో పెద్ద చిన్న అందరినీ గౌరవించమంటోంది వేదం.

# 47. ఏకోదరుల మధ్య సంబంధము

మన సమాజంలో ఏకోదరులు వివాహం చేసుకుని సంతానాన్ని పొందవచ్చునా? అనేది చాలా పెద్ద ప్రశ్న. ఇలా చెయ్యకూడదు. ఏకోదరులు అంటే అన్నా చెల్లెలు, అక్కా తమ్ముడు. వీరి మధ్య లైంగిక సంబంధాలు పనికిరావు. వారికి కలిగే సంతానం అనారోగ్యవంతులవుతారు. తల్లితండ్రులిద్దరిలో ఒకే రక్తం ప్రవహిస్తున్నది కాబట్టి ఆ ఇద్దరిలోనూ ఒకే రకమైన లోపాలుంటాయి. ఈ లోపాలే వాళ్ళకి కలిగే సంతానానికి కూడా వస్తాయి కాబట్టి ఏకోదరుల వివాహం సమర్ధనీయం కాదు. ఇది ప్రపంచంలోని అన్ని దేశాలలోను, అన్ని ప్రాంతాలలోను ఉన్న సంప్రదాయం. అయితే విషయాన్ని వివరించి చెప్పకుండా ఇది తప్పు. ఇలా చేయకూడదు అని చెప్పింది మతం. దాని విడమరచి చెప్పింది విజ్ఞానశాస్త్రం. మతము, విజ్ఞానశాస్త్రము రెండూ ఒకే విషయాన్ని చెబుతాయి. కాకపోతే మతం ఇలా చెయ్యండి అంటుంది. విజ్ఞానశాస్త్రం విడమరిచి చెబుతుంది. అంతే తేడా. మరి మతం అలా ఎందుకు వివరించలేదు అంటే ఆ రోజుల్లో విద్యావంతులు చాలా తక్కువ. చెప్పినా అర్ధం చేసుకోతగ్గస్థాయి వాళ్ళకిలేదు. అందుకే ఇలా చెయ్యాలి, ఇలా చెయ్యరాదు అని చెప్పారు. వీలైతే పాపపుణ్యాలకి ముడిపెట్టారు. కారణం ఆ రోజుల్లో పాపభీతి మానవుడికి ఎక్కువగా ఉండేది.

ఏకోదరుల వివాహం పనికి రాదు అనే మాట కొన్నివేల సంవత్సరాల క్రితం వేదం చెప్పింది. **ఋగ్వేదంలోని పదవ మండలంలోని పదవ సూక్తం**లో యమి, యముల సంవాదంలో ఈ విషయం వివరించబడింది. ఈ సూక్తంలో 14 మంత్రాలున్నాయి.

అదితి కశ్యపుల కుమారుడు 'వివస్వంతుడు' ఇతడు మహర్షి. వేదంలో కొన్ని మంత్రాలను కూడా దర్శించాడు. ప్రత్యేకించి శుక్లయజుర్వేదంలో 28 మంత్రఖండికలను దర్శించాడు. విశ్వకర్మ కుమార్తె సంజ్ఞాదేవిని వివాహం చేసుకున్నాడు. వైవస్వతమనువు ఇతని కుమారుడే. యమ, యమిలు కూడా ఇతని సంతానమే. యమి–స్త్రీ, యముడు–పురుషుడు. సముద్రం మధ్యలో ఒక ద్వీపము. అది నిర్జనప్రదేశము. ఆ ద్వీపంలో ఉన్నది యవ్వనవతి అయిన యమి కామపీడిత అయి ఉన్నది. కామార్తురాలయిన యమి తన సోదరుడైన యముని సంపర్కం కోరుతున్నది. ఇంతలో యముడు అక్కడికి వచ్చాడు. అతనితో అంటున్నది.

"ఇది విశాలమైన సముద్రం. ఆ సముద్రం మధ్యలో పెద్ద ద్వీపము. అదీ కూడా జనం ఎవరూ లేని ప్రదేశము. ఇక్కడ నేను నీ కోసమే ఎదురు చూస్తున్నాను. నువ్వు నా సోదరుడివి. నీ వల్ల నాకు కలిగే కుమారుడు చాలా గొప్పవాడవుతాడు. కాబట్టి నా కోరిక తీర్చి పుత్రుణ్ణి ప్రసాదించు" అన్నది ఆ మాటలు విన్న యముడు "ఓ యమీ! నేను నీకు సహచరుణ్ణే. అందులో సందేహం లేదు. కాని నువ్వు కోరినట్లుగా నీతో సంపర్కం మాత్రం చెయ్యలేను. ఎందుకంటే నువ్వు నా సోదరివి. అది గాక నువ్వు అన్నట్లుగా ఇది నిర్జన ప్రదేశము కాదు. ప్రజాపతి పుత్రులయిన దేవతలంతా చూస్తున్నారు" అన్నాడు. ఇప్పుడు యమి మళ్ళీ అంటోంది.

"ఓ యమా ! నువ్వు చెప్పింది నిజమే. మానవులకైతే ఇటువంటి సంపర్కము నిషేధము. దేవతలు ఇటువంటి సంపర్కాన్ని ఇష్టపూర్వకంగా చేస్తారు. అందుకనే నాకు ఇలాంటి కోరిక కలిగింది. నువ్వు కూడా అలాగే చెయ్యి. నాకు పుత్రుణ్ణి ప్రసాదించు. నాతో

సంభోగించి నా దేహమునందు నివసించవలసినది" అన్నది. యముడు అంటున్నాడు.

"నేను ఇలాంటిది ఎప్పుడూ చెయ్యలేదు. నిజమే చెబుతున్నాను. అంతరిక్షంలో ఉన్న ఆదిత్యుడు మన ఇద్దరికీ తండ్రి. సంజ్ఞాదేవి మన ఇద్దరికీ తల్లి. మనం సహోదరులము. కాబట్టి మన మధ్య సంపర్కము పనికి రాదు" అన్నాడు. ఆ మాటలు విన్న యమి అంటోంది.

"ప్రజాపతి మనల్ని ఈ దశలోనే దంపతులుగా చేశాడు. ఆయన ఎప్పుడూ పొరపాటు చెయ్యడు. మన ఈ సంబంధము ద్యావాపృథువులకు కూడా తెలుసును. గతంలో జరిగిన కాలం ఎవరికి తెలుసు? ఎవరు చూశారు? ఎవరు చెప్పారు? మిత్రావరుణుల మహాధామమయిన రాత్రింబవళ్ళు గురించి నీ అభిప్రాయం ఏమిటి? భార్యాభర్తలు ఏకశయ్యాగతులై రమిస్తారు. అలాగే ఓ యమా! నీ ముందు నా దేహాన్ని ఉంచుతాను. రా ! మనిద్దరం ఒకేచోట ఉండి రథచక్రాలలాగా ఒకే పని చేద్దాం" అన్నది. రథచక్రాలు రెండూ తిరిగితేనే రథం కదులుతుంది. అలాగే స్త్రీ పురుషులు ఇద్దరూ కలిస్తేనే సంసారం అవుతుంది. అందుకే మనిద్దరం ఒకేచోట ఉండి సంసారం చేద్దాము అన్నది. ఆ మాటలు విన్న యముడు అంటున్నాడు.

దేవతలకు చారులున్నారు. వాళ్ళు రాత్రింబవళ్ళు తిరుగుతూ ఉంటారు. ఓ యమీ! నువ్వు త్వరగా ఇంకొకరి దగ్గరకు వెళ్ళి రథచక్రముల వంటి ఏక కార్యము చేయవలసింది. రాత్రింబవళ్ళలో యముడికి భాగం ఉంది. ఆ భాగాన్ని యజమానులు అందించాలి. సూర్యుని తేజస్సు యముని కోసం ఉదయించాలి. పరస్పర సంబంధం ఉన్న ద్యావాపృథువులు యముడికి బంధువులు. ఈ యమీ యములిద్దరూ సహోదరులు కాబట్టి వాళ్ళు ఇతరులను వరించాలి.

రాబోయే కాలంలో స్త్రీలు ఏకోదరులు (సోదరులు) కానివారిని మాత్రమే భర్తలుగా పరిగ్రహిస్తారు. అందుచేత నన్ను వదలిపెట్టు. ఇంకెవరినైనా భర్తగా పొందవలసినది. అతడు నీ కోరిక తీర్చగలడు. అన్నాడు. ఇప్పుడు యమి అంటున్నది "సోదరుడు ఉండగా సోదరిని అనాధగా చేసేవాడు ఏ రకమైన సోదరుడు? సోదరి యొక్క దుఃఖాన్ని తీర్చలేనివాడు ఎలా సోదరుడవుతాడు? నేను కామార్తనై ఉన్నాను. ఈ విషయం తెలుసుకుని నా కోరిక తీర్చవలసింది" అన్నది. ఆ మాటలు విన్న యముడు చెబుతున్నాడు.

"ఓ యమీ ! నీతో సంగమించటానికి నేను ఒప్పుకోను. సోదరితో సంభోగించిన వాణ్ణి పాపాత్ముడుగా ఛీత్కరిస్తారు. కాబట్టి నన్నువదిలి మరెవరితోనైనా సుఖించవలసింది. నీ సోదరుడు నీతో మైధునానికి ఒప్పుకోడు" అని తెగేసి చెప్పేశాడు. ఇప్పుడు యమి అంటున్నది. యమా ! నీవు బలహీనుడవు. నీ మనసు, హృదయము నాకు ఏ మాత్రము అర్ధం కావటంలేదు. త్రాడు గుర్రాన్ని కట్టేసినట్లు, తీగ చెట్టును అల్లుకున్నట్లు పరాయిస్త్రీ నిన్ను ఆలింగనం చేసుకుంటున్నది కదా? మరి నన్నెందుకు కాదంటున్నావు?" అంది. ఆఖరుగా యముడు చెబుతున్నాడు. "ఓ యమీ! నువు కూడా అన్యపురుషుణ్ణి ఆలింగనం చేసుకో. తీగచెట్టును అల్లుకున్నట్లుగా నువ్వు అతణ్ణి పెనవేసుకుని సుఖించి అతని సాహచర్యము చేయవలసింది. అంతేకాని నేను మాత్రం నీ కోరిక అంగీకరించను అన్నాడు. ఈ సంవాదంలో యమి తన సోదరుడైన యముణ్ణి ఒప్పించాలని చాలా ప్రయత్నం చేసింది. కాని యముడు మాత్రం దానికి ఒప్పుకోలా. **ఏకోదరులమధ్య సంబంధముపనికిరాదు** అని ఖచ్చితంగా చెప్పాడు. **ఇది ఈనాడు మన సైన్సుకూడా చెబుతున్న మాట.**

# 48. పాచికలు

జూదము అనేది చాలా పెద్ద వ్యసనము. సప్తవ్యసనాలలోకీ అతినీచమయింది జూదక్రీడ. దీనితోనే రాజ్యాన్ని, సోదరులను చివరకి కట్టుకున్నభార్యని కూడా ఓడిపోయి అడవులపాలయ్యాడు ధర్మరాజు. సర్వస్వాన్నీ కోల్పోయాడు నలమహారాజు. ఈ ఆటలోనే మాటా మాటా పెరిగి తలపగలకొట్టి చంపేశాడు బలరాముడు రుక్మిణి సోదరుడైన రుక్మిని. ఇలా మనం చూసినట్లైతే గతంలో ఎంతోమంది మహారాజులు తమ సర్వస్వాన్నీ కోల్పోయి అవమానాలపాలయ్యారు. ఇక్కడ జూదము అంటే పాచికలఆట. దీనికోసం ప్రత్యేకంగా పాచికలు బంగారంతో నవరత్నాలు పొదిగి చేయించేవారు. ఏనుగు దంతంతో చేయించేవారు. ఆ పాచికలు తమతోనే తీసుకుపోతూ ఉండేవారు. ఈ వ్యసనంలో చిక్కినవాళ్ళకి ఏది ఏం జరిగినా ఇబ్బంది లేదు. కాని జూదం మాత్రం ఆడకుండా ఉండలేరు. తరువాత కాలంలో పలనాటి భారతంలో కోడిపందాలరూపంలో జూదం ఆడి అన్నదమ్ములు ఒకరినొకరు చంపుకున్నారు.

ఈ కోడిపందేలాట అనేది ఇవాల్టికి కూడా జరుగుతూనే ఉంది. సంక్రాంతి పండగ వచ్చింది అంటేచాలు ఈపందాలు తప్పనిసరిగా జరుగుతాయి. కోట్లాది రూపాయలు చేతులు మారతాయి. మనకందరికీ తెలుసు వీటిని ఆపవలసిన పోలీసు డిపార్టుమెంటువారు కూడా ఏమీచెయ్యలేక ప్రేక్షకపాత్ర పోషిస్తున్నారు. దీనికి కారణం అక్కడ ఉండేది సామాన్య ప్రజానీకం కాదు ప్రజానాయకులు. వాటాల కొనుగోలు, అమ్మకము కూడా ఒకరకమైన జూదమే. గతంలో 'హర్షద్ మెహతా' దెబ్బకి చాలామంది దేశంలో ఎక్కడోకాదు మన విజయవాడ నగరంలోకూడా అన్నీ కోల్పోయి తెల్లవారేప్పటికి ఏమీచెయ్యలేని స్థితిలో

దూలానికి వేళ్ళాడారు. ఈ రోజుల్లో నిరాఘాటంగా సాగుతున్న పేకాట కూడా జూదమే. సప్తవ్యసనాలలో జూదము ఒకటి. సప్తవ్యసనాలు అంటే 1. స్త్రీ 2. జూదము 3. పానము 4. వేట 5. వాక్పారుష్యము 6. తగని ఖర్చు 7. కఠిన దండన. నిజం చెప్పాలంటే ఇవి నిషేధము. కాని ఇదిమాత్రం యథేచ్ఛగా సాగుతూనే ఉంది. ఇలా అనేక రకాలుగా సాగుతున్న ఈ జూదక్రీడ వద్దు అని చెబుతోంది వేదం. ఓడిపోయిన కొద్దీ పట్టుదల పెరుగుతుంది. ఇంకా ఇంకా ఆడాలి. తప్పనిసరిగా గెలవాలి అనిపిస్తుంది. ఓటమి ఖాయం అని తెలిసి కూడా ఆటను వదలివెళ్ళలేరు. అంతగా కట్టి పడేస్తుంది. అటువంటి జూదక్రీడ వద్దు అని హితవు చెబుతోంది వేదం. ఇక్కడ జూదము అంటే పాచికలఆట. **ఋగ్వేదంలోని పదవ మండలంలో 34వ సూక్తంలో ఈ విషయం చెబుతున్నారు చూడండి. ఈ సూక్తంలో** 13 మంత్రాలున్నాయి.

పెద్ద పెద్ద పాచికలు, అందమైన పాచికలు జూదపు పలక మీద ఉంటే చూడటానికి ఎంతో అందంగా ఉంటుంది. 'ముజవాన' పర్వతంమీద పుట్టిన సోమలత యొక్క రసము మరింత ఆనందం కలిగిస్తుంది. 'విభీతక' వృక్షంతో చేసిన పాచికలు నాకు మహదానందాన్ని కలిగిస్తాయి. విభీతక వృక్షము అంటే తాండ్రచెట్టు.

నా భార్య అందమైనది. ఆమె నన్నెప్పుడూ నిర్లక్ష్యంచెయ్యలేదు. నాపట్ల విపరీతమైన గౌరవము, ప్రేమ, అభిమానము చూపిస్తుంది. కాని కేవలము ఈ పాచికల కారణంగానే అనురాగవతి అయిన భార్యను వదిలేశాను. ఆమె నన్ను వదలి వెళ్ళిపోయింది.

జూదము ఆడేవాణ్ణి అత్త మామలు తిడతారు. చుట్టుపక్కల వాళ్ళు వ్యసనపరుడు అంటారు. ఈసడించుకుంటారు. అతడికి అవసరమైతే డబ్బులు కూడా ఎవరూ ఇవ్వరు. ముసలి గుర్రాన్ని, వట్టిపోయిన

ఆవుని కొనేవారెవరుంటారు. అతడు అందరి దగ్గర అప్పులు చేస్తాడు కాబట్టి చేసిన బాకీలుతీర్చమని అడగనివాడంటూ ఉండడు.

ఒకసారి పాచికలు చేత్తో పట్టుకుంటే వాటిని వదలటం కష్టం. ఎవరి ధనం మీదనైనా పాచిక యొక్క పాడుకన్ను పడింది అంటే అతడి భార్య వ్యభిచారిణిగా మారిపోతుంది. ఎందుకంటే అతడు తన ధనాన్నంతా పోగొట్టుకుంటాడు. ఆట ఆడటానికి ధనం ఇమ్మని భార్యని వేధిస్తాడు. భర్త కోరిక తీర్చటానికి భార్యకు ఇంతకన్న గత్యంతరం లేదు. అలా కాకపోతే, ఒకవేళ ఆవిడ అభిమానవతి అయితే ఆత్మహత్య చేసుకోవాలి. అతని తల్లిదండ్రులు, అన్నదమ్ములు అతనెవరో మాకు తెలియదు. అతనికీ మాకు సంబంధం లేదు. అతను చేసిన బాకీలు మేంతీర్చం కావాలంటే అతణ్ణి పట్టుకుపోండి' అంటారు.

జూదము ఆడను అని నిర్ణయించుకుని దానికి దూరంగానే ఉంటాడు. కాని ఎప్పుడైతే పాచికలను చూశాడో మరుక్షణంలోనే అతని మనసు అటువైపు లాగుతుంది. చెడుతిరుగుళ్ళకు అలవాటుపడ్డ ఆడది మిండగాడి దగ్గరకే పోతుంది. అలాగే జూదగాడు కూడా జూదగృహానికే చేరతాడు. జూదము ఆడటానికి కూచున్నప్పుడు రొమ్ముచరిచి ఆటకు ఉపక్రమిస్తాడు. తప్పకుండాగెలుస్తాను, గెలుపునాదే, అని ధీమాగా ఉంటాడు. దానికి అనుకూలంగా తనుబయలుదేరుతున్నప్పుడు కాకి ఎదురు వచ్చింది కాబట్టి ఈ రోజంతా తనకు కలసివస్తుంది అనిభావిస్తాడు. తీరా ఆట ప్రారంభించాక పందెం ఎప్పుడూ తనకు అనుకూలంగానే పడదు. ఒకసారి తనకు అనుకూలంగా ఇంకొకసారి ఎదుటివారికి అనుకూలంగా పడుతుంది. ఎదుటివాడు గనక 'శకునిమామ'లాగా నేర్పరి అయితే ఎప్పుడూ అతనికి అనుకూలంగానే పడుతుంది.

దీనివల్ల ఓడిపోవటం కూడా జరుగుతుంటుంది. అటువంటి సమయంలో పట్టుదల పెరుగుతుంది. పాచికలు చేతిలో నిలవవు. అంకుశంలాగా గ్రుచ్చుకుంటాయి. బాణంలాగా పొడుస్తాయి. కత్తిలాగా కోస్తాయి. గెలిచినవాడు కొడుకు పుట్టినంతగా ఆనందిస్తాడు. మహదానందం చెందుతాడు. కాని ఓడినవాడు మాత్రం ప్రాణంపోయినంతగా బాధపడతాడు.

పాచికల పీటమీద 53 గళ్ళు ఉంటాయి. ఆ పీటమీద ఆడేటప్పుడు పాచికలు సూర్యుడు ఆకాశంలో తిరుగుతున్నట్లుగా ఉంటుంది. ఎంతటి బలవంతుడైనా సరే పాచికలను పట్టుకుని ఆడకుండా ఉండలేడు. దేశాన్ని పాలించే మహారాజు కూడా పాచికలకు దాసోహం అంటాడు. ఒకసారి పందెం అనుకూలంగా ఉంటే ఇంకోసారి ప్రతికూలంగా ఉంటుంది. పాచికలకు చేతుల్లేవు. కాని చేతులున్న వాడి చేతిలో పడి ఓటమిని చవిచూస్తాయి. మండుతున్న నిప్పుకణాలలాగా పీటమీద కూచుంటాయి. చేతికిమాత్రం చల్లగా తగులుతాయి. గుండెలు మండిస్తాయి.

జూదరి భార్య దీనాతిదీనంగా ఏడుస్తుంది. పిల్లలువీధిని పడతారని తల్లి బాధపడుతుంది. అప్పిచ్చినవాడు తనడబ్బులు తిరిగి ఎలావస్తాయి అని ఆలోచిస్తాడు. అప్పులవాళ్ళు ఇంటికివస్తారనే భయంతో రాత్రులు ఇంటికిరాడు. ఎక్కడో కాలక్షేపం చేస్తాడు.

తన భార్య పరిస్థితి, ఆవిడపడే ఆవేదన చూసి జూదరి గుండె పగిలిపోతుంది. ఇతరుల భార్యల సౌభాగ్యం, తనభార్య దురవస్థ చూసి చాలా బాధపడతాడు. జూదగృహానికి బయలుదేరి వెళ్లేటప్పుడు అట్టహాసంగా గుర్రంమీద పెడతాడు  కాని సాయంత్రానికి, తన దగ్గర ఉన్నది అంతా పోగొట్టుకుని, దరిద్రుడై చలిమంట దగ్గర చేరతాడు.

కట్టుబట్టకూడా మిగలదు.

అని పాచికలాడే జూదరి పరిస్థితి వివరించి ఇప్పుడు అంటున్నారు. "ఓ పాచికా నీ బలంలో ప్రధాని ఉన్నాడు. సేనాని ఉన్నాడు. మహారాజు ఉన్నాడు. అంటే పాచిక అన్నింటికన్నా బలమైనది. అందుకే నేను చేతులు జోడించి నీకు నమస్కరిస్తున్నాను. నిజంగా చెబుతున్నాను. నిన్ను మాత్రం నేను ధనం అడగను." అంటే ధనం కోసం పాచికలు ఆడను. అని నిర్ణయించుకుని జూదరికి హితవు చెబుతున్నారు.

ఓ జూదరీ ! జూదం మాత్రం ఆడవద్దు. పోయి పొలందున్నుకో. కష్టపడి సంపాదించు. వచ్చిన దాంతో తృప్తి పొందు. దానివల్ల నీ భార్య నీ దగ్గరే ఉంటుంది. పాడిపశువులు ఉంటాయి అనిచెబుతూ ఈ మాటలు నేను చెప్పటం లేదు. ప్రత్యక్ష దైవమైన సూర్యనారాయణుడు నాతో ఈమాటలు చెప్పిస్తున్నాడు. **'తన్మేవిచేష్టే సవితాయ సూర్యః'** అని చెబుతున్నాడు. సాక్షాత్తు భగవంతుడే చెబుతున్నాడు అంటే నమ్మకం ఎక్కువ ఉంటుంది. కాబట్టి వ్యసనపరుడు జూదం ఆడటానికి వెళ్ళడు అని ఆశ. ఇలా చెప్పి ఇప్పుడు ఆఖరు మంత్రంలో పాచికలను ప్రార్థిస్తున్నాడు. "ఓ పాచికలారా! మమ్మల్ని మీ బంధువులుగా భావించండి. మాకు శుభాలు చేకూర్చండి. మీ దురాలోచనలు మామీద ప్రయోగించవద్దు. మా శత్రువుమీద మీప్రతాపం చూపండి. వారిని నాశనం చెయ్యండి. ఇతరులజోలికి పోవద్దు."

ఈ రకంగా ఈ సూక్తంలో పాచికలు ఆడితే వచ్చే నష్టము, దానివల్ల కలిగే దుఃఖము, అన్నీ వివరించి జూదరిని కష్టపడకుండా ఎక్కువ ధనం సంపాదించటం కోసం పాచికలు ఆడద్దు. కష్టపడి

సంపాదించండి. అని హితబోధ చేస్తున్నది వేదం. ఆనాడు పాచికలాడే వారికి చెప్పిన మాటలే ఈనాడు పేకాటరాయుళ్ళకు, గుర్రపు పందేలు ఆడేవారికి ఇతరత్రా జూదం ఆడేవారికి కూడా హితవు చెబుతోంది వేదంలోని ఈ సూక్తం.

# 49. దైవత్వం

దేవతలు అంటే మానవుల కన్న అతీతమైన శక్తి కలవారు. పశువులకు పక్షులకు ఏ రకమైనశక్తి ఉండదు. అవి గతంలో తాము చేసిన కర్మఫలాన్ని అనుభవిస్తాయి. అంతేకాని ఈ జన్మలో అవి ఏ రకమైన కర్మచెయ్యలేవు సరికదా ఆలోచించను కూడా లేవు. పశుపక్ష్యాదులకన్న గొప్పశక్తి గలవాడు మానవుడు. ఇతడికి మనసు ఉంది. దాంతో ఆలోచించగలడు. ఏది మంచో, ఏది చెడో తెలుసుకోగలడు. ఈ జన్మలో కర్మలు చేయగలడు. దానము, ధర్మము, యజ్ఞయాగాలు, క్రతువులు, తపస్సు ఇవన్నీ చెయ్యగలడు. దేవతలకు అతీతమైన శక్తులుంటాయి. వారు వరాలు, శాపాలు కూడా ఇవ్వగలరు. అయితే ఇక్కడ చిన్న అనుమానం ఏమంటే, దైవత్వము ఎలా సిద్ధిస్తుందని. దైవత్వమనేది రెండు రకాలుగా ఉంటుంది. 1. జన్మతః వచ్చేది 2. కర్మతః వచ్చేది. యజ్ఞయాగాది క్రతువులు చేసేవారు దైవత్వాన్ని పొందుతారు.

వైష్ణవయాగాలు చేసిన వారు విష్ణులోకానికి, రుద్రయాగాలు చేసిన వారు కైలాసానికి, వైదికయాగాలు చేసిన వారు వారు బ్రహ్మలోకం చేరతారు. అమ్మవారికి సంబంధించిన చండీయాగాలు, వనదుర్గా యాగాలు చేసినవవారు మణిద్వీపం చేరతారు. వీరందరికీ దైవత్వం వస్తుంది. అంతరారాధనలో విశుద్ధి చక్రంలో పరమేశ్వరుణ్ణి ఆరాధించే వారు ఆ రూపాన్నే పొందుతారు. ఇదే సారూప్యముక్తి. ఇక్కడ ఒక్క విషయం మాత్రం గుర్తుంచుకోవాలి. ఆ యాగాలు తమకోసం చేసుకోవాలి. అంతేకాని డబ్బులు తీసుకుని ఇతరుల కోసం యజ్ఞయాగాలు చేసేవారికి వచ్చేది ఆ ధనమే. అంతకన్న ఇతరమైన

ఫలితం ఏదీరాదు. విష్ణుపదవి, రుద్రపదవి, బ్రహ్మపదవి కూడా ఇలా వచ్చేవే. నవమబ్రహ్మ ఆంజనేయుడు ఇరవైతొమ్మిదవ మహాయుగంలో వ్యాసుడ అశ్వద్ధామ అని చెబుతున్నాయి పురాణాలు.

యజ్ఞదత్తుడు అనే బ్రాహ్మణుని కుమారుడు గుణనిధి. జారుడు, చోరుడు, చాలా పెద్ద దుర్మార్గుడు. కేవలము శివరాత్రి రోజున ఉపవాసం ఉండి జాగారం చేసినందున మరుజన్మలో కళింగరాజకుమారుడిగా జన్మించాడు. ఈశ్వరుని అర్చించి ఆయన దయవల్ల అలకాపురికి, ఉత్తరదిశకు అధిపతి అయి కుబేరుడయినాడు. అలాగే విశ్వానరుడనే బ్రాహ్మణుని కుమారుడు శివుణ్ణి గురించి తపస్సు చేసి అగ్నిదేవుడయినాడు. 'అగ్నిచయనము' అనే యాగం చేసిన యముడు యమలోకానికి అధిపతి అయినాడు. వంద అశ్వమేధ యాగాలు చేసిన నహుషుడు ఇంద్రుడయినాడు. కాబట్టి మానవులుగా జన్మించిన వారు కూడా యజ్ఞయాగాది క్రతువులు చేసి దైవత్వాన్ని సంపాదించారు. కేవలము యజ్ఞయాగాలే చెయ్యానవసరం లేదు. సమాజసేవ. **'మానవసేవే మాధవసేవ'**గా పనిచేసినవారు, కూడా దైవత్వాన్ని పొందుతారు. ఈ విషయం **మొదటి మండలంలోని 161వ సూక్తం** వివరిస్తోంది.

సుధన్వుడు అంగీరస వంశం వాడు. అతని కుమారులు ముగ్గురు 1. ఋభుడు 2. విభుడు 3. వాజుడు. వీరుకూడా శిల్పులే. త్వష్టప్రజాపతి చమసపాత్ర (పానపాత్ర) ఒకటి తయారుచేస్తే ఋభువులు నాలుగు పాత్రలు తయారుచేశారు. ఒక గుర్రం నుంచి అదే గుర్రాన్ని, రథం నుంచి రథాన్ని, ఆవునుంచి ఇంకొక ఆవును తయారుచేశారు. ప్రస్తుతం మన క్లోనింగ్ పద్ధతి అన్నమాట. ఒక ఆవును నాలుగు ఆవులుగా కూడా చేశారు. వర్షపు నీటిని ఎత్తైన పాత్రంలో నిల్వచేసి,

అక్కడ నుంచి క్రిందికి పారించి పంటలు పండించారు. వీళ్ళని దర్శించటానికి ద్యులోకం నుండి మరుత్తులు, భూలోకం నుంచి అగ్ని, ఆకాశము నుంచి వాయువు, సముద్రము నుంచి వరుణుడు వచ్చారు. అంటే వారు అత్యంత ముఖ్యులై చివరకు దేవతలుగా పరిగణించబడ్డారు. మంచిపనులు చేసినవారు దేవతలుగా పరిగణించడతారు.

ఈ విషయాన్ని నొక్కి వక్కాణిస్తోంది వేదం. వాల్మీకి రామాయణం వ్రాసినప్పుడు, రాముడు దశరథమహారాజు కుమారుడు. కేవలము మానవమాత్రుడు. కాలక్రమేణా వైష్ణవ ప్రాబల్యం పెరిగి విష్ణుమూర్తి అవతారంగా, దేవుడుగా పరిగణించబడ్డాడు. దీనికి కారణం రాముడికి ఉన్న మంచి లక్షణాలు.

**కాబట్టి ఓ చదువరులారా! మంచి పనులు చేసినవాడు ఎప్పుడూ గొప్పవాడే. ఇతరులకు సహాయం చేసినవారు ఎప్పుడూ దైవసమానులే. అందుచేత మంచి పనులు చెయ్యటానికి ప్రయత్నించండి. ఇతరులకు చేతనైనంత వరకు సహాయం చెయ్యండి. మీరు కూడా దైవసమానులు కండి. దైవత్వాన్ని పెంపొందింపచేసుకోండి.**

# 50. నేలమీద నీటిమీద నడిచే వాహనాలు

రవాణా మార్గాన్ననుసరించే రవాణా వాహనాలు ఏర్పాటు చెయ్యబడతాయి. పట్టాలమీద రైలు మాత్రమే నడుస్తుంది. రైలు రోడ్డుమీద నడవదు. పడవలు నీటిలోనే ప్రయాణం చేస్తాయి. అంతేకాని రోడ్డుమీద నడవ్వు. అయితే కొన్ని చిన్న విమానాలు నీటిమీద దిగేటట్లుగా రూపొందించబడ్డాయి. అంతేకాని అవి నీటిమీద ప్రయాణం చెయ్యవు. రోడ్డుమీద, నీటిమీద కూడా నడిచే వాహనాలు ఇంతవరకు నేను చూడలేదు. కాని విచిత్రం ఏమంటే ఇటువంటి ప్రయత్నాలు కొన్నివేల సంవత్సరల క్రితమే జరిగినాయి. **మొదటి మండలంలోని 116వ సూక్తంలోని 18వ మంత్రంలో** ఈ విషయం చెబుతున్నారు. కాశీరాజు కుమారుడు దివోదాసు. ఇతడు ధనము, అన్నము కావాలని అశ్వనీ దేవతలను ప్రార్థించాడు. అప్పుడు అశ్వనీదేవతలు ఒక మొసలి, ఎద్దు కట్టిన రథం మీద దివోదాసుకు అన్నము, ధనము తెచ్చారు. రథాన్ని ఎద్దు మొసలి లాగుతున్నాయి. వీటిలో ఒకటి జలచరము ఇంకొకటి భూచరము. కాబట్టి నేలమీద, నీటిమీద, రథం నడిపించటానికి వారు ప్రయత్నం చేశారన్న మాట.

వేగంగా వెళ్ళటానికి రథానికి రెండు చక్రాలు కాకుండా మూడు చక్రాలు ఏర్పాటు చేశారు. **మొదటి మండలంలోని 34వ సూక్తంలో** ఈ విషయం చెప్పారు. కాలక్రమేణా తెలిపిన విషయం ఏమంటే మూడుచక్రాల వాహనాలు వాటిని లాగే జంతువులకు సుఖంగా ఉంటాయే కాని వేగంగా పోవటానికి మాత్రం ఇవి ఉపయోగించలేదు. అందుకే అవి వాడకంలోకి రాలేదు. ఏదిఏమైనా వేగం పెంచటానికి ఆ రోజుల్లో పరిశోధనలు జరిగాయని తెలుస్తోంది.

# 51. సోమరసము

సోమరసాన్ని గురించి మనం చాలాసార్లు చెప్పుకున్నాం. సోమలతను తిరగలిలో వేసి త్రిప్పిగాని, రోలు రోకలి ఉపయోగించి గాని రసం తీస్తారని చెప్పుకున్నాం. కాని రోట్లో వేసి రోకలితో దంచి పిండి తీసిన సోమరసం చాలా శ్రేష్ఠమైనది అని **మొదటి మండలంలోని 28వ సూక్తంలో** వివరించబడిన సూక్తార్థము.

ఇంద్రా ! రోలు రోకలి ఉపయోగించి తీసిన సోమరసము సిద్ధంగా ఉంది. వచ్చి త్రాగవలసింది.

యజమాని భార్య యాగశాలలో ప్రవేశించి వెళ్ళిపోయేటప్పుడు రోటిలో వేసి దంచి తీసిన సోమరసం సిద్ధంగా ఉంది. కవ్వానికి త్రాడుకట్టి త్రిప్పి రోటిలో దంచి తీసిన సోమరసం సిద్ధంగా ఉంది. రోలు రోకలి ధాన్యం దంపటానికే కాదు. వైదిక కర్మలలో కూడా బాగా ఉపయోగపడతాయి అంటున్నారు అంటే రోటిలో దంచి తీసిన సోమరసం శ్రేష్ఠమైనదన్న మాట.

# 52. బానిసల తిరుగుబాటు

బానిసలు రెండు రకాలు 1. కొనితెచ్చిన బానిసలు 2. గర్భదాసులు, రెండవ రకం వారు మనదగ్గర బానిసలుగా ఉన్నవారికి పుట్టిన సంతానము. వీరిని పుట్టుబానిసలు అనికూడా అంటారు. వీరికి విముక్తి లేదు. అందుకే ఇక్కడ బానిసలు తిరుగుబాటు చేశారు. **మొదటి మండలంలోని 108వ సూక్తం**లో ఈ విషయం వివరించారు.

బ్రహ్మకుమారుడు అంగీరసుడు. అంగీరసుని కుమారుడు ఉచథ్యుడు. అతని కుమారుడు దీర్ఘతముడు. ఇతని తల్లి మమతః గర్భంలో ఉన్నప్పుడే వేదజ్ఞానమున్న వాడు. దీర్ఘతముడు. బృహస్పతి శాపంవల్ల ఇతడు గ్రుడ్డివాడయినాడు. బుద్ధిలో బృహస్పతి. ఇతని కుమారుడే గౌతముడు. ఇతడు చేసే పని పిల్లల్ని కనటం అంతే. ఇతనితో విసిగిపోయిన భార్యాపిల్లలు అతనికి కర్రలు కట్టి నదిలో పారేశారు. ఆ సమయంలో అంగరాజు ఇతన్ని రక్షిస్తాడు. అంగరాజుకు పిల్లలు లేరు. దీర్ఘతముడి వల్ల అంగరాజు భార్య యొక్క దాసి ఒక కుమారుణ్ణి కన్నది. అతడే కక్షివంతుడు. ఈ **విషయం 51వ సూక్తం**లో చెప్పారు. కాని 108వ సూక్తంలో గర్భబానిసలు దీర్ఘతముడిని తాళ్ళతో కట్టి నదిలో పారేశారు. అప్పుడు దీర్ఘతముడు అశ్వినీదేవతలను ధ్యానించి వారి సాయంతో బయటపడ్డాడు అని చెబుతున్నారు. ఇక్కడ దీర్ఘతముణ్ణి నీటిలో పారేసినవారు తిరుగుబాటు చేసిన గర్భదాసులన్న మాట. దీన్నిబట్టి తిరుగుబాటు అనేది ఆ రోజులలో కూడా ఉన్నదని తెలుస్తోంది.

# 53. విషానికి విరుగుడు (ఋగ్వేదం)

విషము అంటే ప్రాణాన్ని హరించేది. దీనివల్ల శరీరంలో రక్తప్రసరణ ఆగిపోయి, శ్వాసనాళాలు మూసుకుపోయి జీవి మరణించటం జరుగుతుంది. ఈ విషపదార్థం ఎక్కడినుంచి వస్తుంది? ఫలానా వస్తువు మనకి విషము అని చెప్పలేం. కొన్ని పదార్థాలు మాత్రమే మనకి తెలుసు. **లవణం శుకానాం విషం** ఉప్పు చిలుకకు విషము అంటారు. అలాగే అనేక పదార్థాలు. వీటిలో కొన్ని ప్రకృతి నుంచి వచ్చినవి. అంటే స్వతః సిద్ధంగా ఉన్న పదార్థాలు. వీటినే **'పాషాణాలు'** అంటారు. కొన్నిటిని రసాయనాలతో తయారుచేస్తారు. కొన్ని చెట్లనుంచి వస్తాయి. (నాగముష్టి, విషముష్టి చెట్లు.) కొన్ని జంతువుల నుంచి వస్తుంది. (పాములు తేళ్ళు). వీటిలో కూడా కొన్ని పాముల విషం మరీ ప్రాణాంతకము. ఉదా : త్రాచుపాము. అలాగే ఆఫ్రికా సాలీడు. ఈ విషజంతువులు చాలావరకు కొండ ప్రాంతాలలోనే ఉంటాయి. ఆఫ్రికా అడవులలో ఎక్కువగా ఉంటాయి. ఇక్కడ విచిత్రం ఏమంటే పాము కోరలలో ఉండే విషంవల్ల పాముకు ఏ రకమైన హాని జరగదు. అది ఎవరినైనా కరిస్తే, వారికి మాత్రం ప్రమాదం. ఇలా అనేక రకాలుగా తయారైన ఈ విషపదార్థం మిగిలిన జీవుల ప్రాణాలు మాత్రం హరిస్తుంది. దీన్ని తక్కువ మోతాదులో వాడితే మందుగా కూడా ఉపయోగిస్తుంది. అన్ని రకాల విషాల నుంచి మమ్మల్ని రక్షించమని ఋగ్వేదం **మొదటి మండలంలోని ఆఖరు సూక్తం 191వ సూక్తం**లో ప్రార్థిస్తున్నారు. ఈ సూక్తానికి ఋషి అగస్త్యుడు. దేవత–అప్, తృణ, సూర్యులు. ఇందులో మొత్తం 16 మంత్రాలున్నాయి. ఈ సూక్తము యొక్క అర్థం చూద్దాం.

తక్కువ విషమున్నవి, ఎక్కువ విషమున్నవి అయిన భూచరాలు, జలచరాలు, అదృశ్య ప్రాణులు నన్ను చుట్టుముట్టినాయి. శర, కుశర మొదలైన గడ్డియందున్న విషము నన్ను చుట్టుముట్టినది. గోవులకొట్టములో, జింకలు మొ॥వి విశ్రాంతి తీసుకునే ప్రదేశంలో, ఈ విషప్రాణులు నన్ను చుట్టుముట్టినాయి. అవి అదృశ్యంగా ఉంటాయి. కంటికి కనిపించవు. కాబట్టి వాటిపట్ల మానవుడు అప్రమత్తంగా ఉండాలి. భుజములందు విషమున్నవి, కోరలయందు, వివిధ శరీర భాగములందు విషమున్న జీవులకు ఇక్కడ ఏం పని? మీరందరూ వెళ్ళిపోండి. దూరంగా వెళ్ళిపోండి. సూర్యుడు తూర్పున ఉదయించి అదృశ్యంగా ఉన్న ఈ విషప్రాణులను నాశనం చేస్తాడు అంటే సూర్యరశ్మికి క్రిమికీటకాలు నశిస్తాయి. సూర్యుడు అనేక రకాలైన విషాన్ని నాశనం చేసి ప్రాణులకు శుభాన్ని కలుగచేస్తాడు. సూర్యుడు విషాన్ని విరిచేస్తాడు. మధువిద్య విషాన్ని అమృతంగా మారుస్తుంది. శకుంతక పక్షి విషాన్ని మింగి వెంటనే కక్కేసింది. అంతేకాని ప్రాణాలు వదలదు. అలాగే మేము కూడా ప్రాణాలు వదలము. సూర్యుడు విషాన్ని విరిచేస్తాడు. మధువిద్య విషాన్ని అమృతంగా మారుస్తుంది. అగ్నిదేవుని ఏడు నాలుకలు ఎరుపు, నలుపు, తెలుపు, రంగులు కలవి 21 రకాలైన పక్షుల విషాన్ని విరిచేస్తాయి. విషనాశకమైన తొమ్మిది నదులను స్మరిస్తాను. స్త్రీలు కుండలలో నీరు పట్టినట్లుగా 21 పక్షులు, తొమ్మిది నదులలోని నీరు నీలోని విషాన్ని దూరం చెయ్యాలి. ముంగిసలోని విషాన్ని దూరం చెయ్యాలి. పర్వతం నుంచి వచ్చిన ముంగిస అంటోంది. వృశ్చికమా ! నీ విషానికి ఏ రకమైన ప్రభావము లేదు.

ఈ సూక్తంలో విషాన్ని హరించే మధువిద్యను చెప్పారు. అదేమిటో మనకు తెలియదు. అలాగే తొమ్మిది నదుల్లోని నీరు 21 పక్షులు

విషాన్ని విరుస్తాయి అన్నారు. ఇవికూడా మనకి తెలియదు. వేదంలో చెప్పిన ఇలాటి విషయాలు తెలుసుకోవటానికి శాస్త్రవేత్తలు, వైద్యులు, సంస్కృత, వేదపండితులు సంయుక్తంగా కృషి చేస్తే ఫలితం ఉండచ్చు.

**ఎప్పుడో మరణించిన మహారాజు కలలోకి వచ్చి ఫలానా కోటలో బంగారం దాచి పెట్టాను. త్వవండి. అని చెప్పిన మాటలు నమ్మి కోటంతా గోతులు పెట్టినవారికి ఇలాటి పరిశోధనలు చేయించటం పెద్ద లెక్కలోది కాదు.**

# 54. అన్నము

అన్నము అంటే తినే ఆహారము. అంతేకాని మనం ఇంట్లో వండుకునే పదార్ధమే అన్నం కాదు. ఏ ప్రాణికి ఏది ఆహారమవుతుందో, అదే దానికి అన్నము. కొంతమందికి వరి అన్నమైతే, కొంతమందికి గోధుమ, రాగి, సజ్జ వంటి దాన్యాలు అన్నము. పశువులకు గడ్డే అన్నము. కొన్ని జంతువులకు విసర్జితాలు అన్నము. ఈ అన్నాన్ని గురించి **మొదటి మండలంలోని 187వ సూక్తంలో** చెబుతున్నారు. ఇందులో పదకొండు మంత్రాలున్నాయి. సూక్తార్థము చూడండి.

నేను వెంటనే జీవధారకము, బలానిచ్చేది అయిన అన్నరూప పితరుని స్తుతి చేస్తున్నాను. ఈ అన్న శక్తి వల్లనే ఇంద్రుడు వృత్రుని సంహరించాడు. ఓ స్వాదుపితా! ఓ మధురపితా! నువ్వే మమ్మల్ని రక్షించాలి. నువు శుభాన్నిచ్చేవాడివి. మాకు ఆశ్రయము ఇవ్వవలసినది. నీ రుచి మాకు అయిష్టం కాకూడదు. నువు మాకు మిత్రుడవు. అద్వితీయ సుఖకరుడవు. గాలి అంతరిక్షంలో వ్యాపించినట్లుగానే అన్నరసము అన్ని జగములందు వ్యాపించింది. అన్నరసాన్ని ఆస్వాదించినవాడు బలవంతుడవుతాడు. దేవతలు కూడా తమ మనసులో అన్నాన్నే కోరతారు. ఓ మధురపితా! మేఘాలు బాగా వర్షించినప్పుడు మాకు భోజనము అందించుము. మేము మా ఇష్టప్రకారము యవలు ఇతర ధాన్యాలు, ఓషధులు తిని బలంగా ఉంటాము. పెరుగు కలిపిన పేలపిండి చాలా బలమైన ఆహారము అని చెబుతున్నారు. ఓ తండ్రీ ! నిన్ను స్తుతిచేసి ఆవునుంచి పాలు తీసుకున్నట్లుగా, నీనుండి అన్నరసాన్ని గ్రహిస్తాము. ఈ అన్నరసము దేవతలనే కాకుండా మానవులను కూడా తృప్తి పరుస్తుంది అంటున్నారు.

# 55. జగత్స్వరూపం

దేవతల కృత్యాలకు రంగస్థలంవంటిదైన ఈ జగత్తు వేదంలో మూడు భాగాలుగా చెప్పబడుతోంది. 1. భూమి 2. వాయువు. (ఇదే వాతావరణము లేదా అంతరిక్షము అన్నారు.) 3. స్వర్గము. భూమిపైన ఉన్న ప్రదేశమంతా ఆకాశము అన్నారు. జగత్తు ఊర్ధ్వలోకము, అథోలోకము అని రెండు భాగాలుగా చెప్పబడింది. స్వర్గలోకం కాంతికీ, దేవతలకీ నివాస స్థానం, ఆకాశంకప్పు స్వర్గం. ఆకాశం కప్పుమీద జరిగినట్లు కనిపించే సూర్యసంబంధమైన విషయాలు స్వర్గానికి సంబంధించినవి. ఆకాశంలో కనిపించే మెరుపులు, వాన, గాలి అన్నీ కూడా అంతరిక్షానికి సంబంధించినవి. ఆకాశం కప్పు, భూమి, అంతరిక్షం, స్వర్గం అనే మూడు లోకాలకీ, కాంతి లోకమనే నాల్గవ లోకానికీ మధ్యన ఉన్నది. ఈ మూడు లోకాలకీకూడా మళ్ళీ ఒక్కొక్క దానికి అంతర్విభాగాలున్నాయి. మూడు భూములు, మూడు అంతరిక్షాలు మూడు స్వర్గాలు.

భూమికి పర్యాయపదాలుగా మహీ (పెద్దది) పృథివీ (విశాలమైనది) ఉర్వీ (విశాలమైనది), ఉత్తునా (వ్యాపించినది) అపారా (హద్దులు లేనిది) అనే పదాలు చెప్పబడ్డాయి. భూమి ఏ ఆకారంలో ఉన్నది అనే మాట వచ్చినప్పుడు భూమిని చక్రంతో పోల్చి చెప్పారు. దీనివల్ల భూమి గుండ్రంగా ఉన్నది అని తెలుస్తోంది. అయితే శతపథ బ్రాహ్మణంలో భూమి గుండ్రంగా ఉన్నది అని ఖచ్చితంగా చెప్పారు.

భూమికి నాలుగు దిక్కుల పేర్లు చెప్పారు. భూమి నాలుగు దిక్కులు కలది అన్నారు. కొన్నిచోట్ల మధ్య భాగాన్ని ఐదవది గాను ఆకాశ భాగాన్ని ఆరవది గాను చెప్పటం కూడా జరిగింది. మూడు స్వర్గాలు

ప్రత్యేకంగా గుర్తించబడినప్పుడు పైది, మధ్యది క్రిందది అని చెప్పారు. 'పరమేవ్యోమన్' అని చెప్పిన ఉన్నత స్వర్గం దేవతలకి, పితరులకి, సోముడికి నివాస స్థానము.

స్వర్గము భూమి రెండూ కలిపి ఒక ద్వంద్వముగా భావించబడి 'ద్యావాపృథువులు' అ చెప్పబడ్డాయి. ఈ రెండూ ఒకదానికి ఒకటి అభిముఖంగా ఉంటాయని చెప్పబడింది. అయితే భూమికి స్వర్గానికీ మధ్య ఎంత దూరం ఉన్నదో ఎక్కడా చెప్పలేదు "పక్షులు కూడా విష్ణు స్థానానికి ఎగరలేవు" అని చెప్పారు. అయితే 'ఇక్కడ నుంచి ఒక గుర్రం వెయ్యి రోజులలో వెళ్ళే దూరంలో స్వర్గమున్నది' అని ఐతరేయ బ్రాహ్మణంలో చెప్పబడింది. అలాగే పంచవింశబ్రాహ్మణంలో "స్వర్గలోకం ఈ లోకాన్నుంచి వెయ్యి ఆవులు ఒకదాని మీద ఒకటి నిలబెడితే ఉన్నంత దూరంలో ఉంది" అని చెప్పారు.

అంతరిక్షము అంటే మంచు, మబ్బులు ఉండే ప్రదేశం. అందుకే దాన్ని 'రజస్' అంటారు. ఇది నీటితోను, చీకటితోను నిండి ఉంటుంది. ఇది మూడు భాగాలుగా ఉత్తమ, పరమ, తృతీయ అనే పేర్లతో పిలువబడుతుంది. ఇది జలానికి, సోముడికి, అగ్నికీ నివాస స్థానము. ఇది విష్ణువుకు చెందినది. అంతరిక్షాన్ని రెండుగా కొన్నిచోట్ల, మూడుగా కొన్నిచోట్ల విభజించి చెప్పారు.

చరాచర జగత్తుని భూమి, అంతరిక్షము, స్వర్గము అని మూడు భాగాలుగా చెప్పారు కాబట్టి అంతరిక్షము అనేది భూమికి పైన మాత్రమే ఉన్నది. సూర్యుడు రాత్రివేళ రెండు వైపులా భూమికి చుట్టూ తిరుగుతాడు. అంటే రాత్రి అనేది సూర్యాస్తమాన సూర్యోదయాల మధ్య ఉన్నది అని అర్థం. "సూర్యుడు రాత్రివేళ పైకి, పగటి సమయంలో

క్రిందికీ ప్రకాశిస్తాడు'' అని ఐతరేయ బ్రాహ్మణం చెబుతోంది. "నక్షత్రాలు రాత్రిపూట ప్రకాశిస్తాయి. పగలు ఎక్కడికో పోతాయి" అన్నారు.

అంతరిక్షమనేది దేవతా సంబంధమైన జలానికి స్థానం కావటంచేత ఇది 'సముద్రము' అని చెప్పబడుతోంది. అనావృష్టిని కలిగించే రాక్షసులతో యుద్ధం జరిగినప్పుడు ఏడు నదులు ప్రవహిస్తాయి అని చెప్పటంవల్ల ఇది భూమికి సమానంగా చెప్పబడుతోంది. పర్వత అనే శబ్దానికి మబ్బు అనికూడా అర్థం ఉంది. ఇంద్రుడు మొ॥ దేవతలు విడిపించిన ఆవులని మబ్బు అంతకు ముందు దాచి ఉంచుతుంది అని భావిస్తున్నారు. వానమబ్బులు నీరు కారుతూ, కదులుతూ, ఉరుముతూ ఉంటాయి. అందుచేత ఈ మబ్బులే ఆవులుగా చెప్పబడ్డాయి. ఇక్కడ వానే ఆవులపాలు.

# 56. జగదుత్పత్తి

చరాచర జగత్తు రెండు రకాలుగా ఏర్పడింది అని చెబుతోంది వేదం. 1. వడ్రంగులు మొదలైన వారంతా చేరి ఈ జగత్తును నిర్మించారు. 2. జగత్తు సహజంగానే ఏర్పడింది. ఈ జగత్తును నిర్మించటం కోసం ఇంద్రుడు ఆరు ప్రదేశాలు కొలిచాడు. విశాలమైన భూమిని, పైకప్పుని వేశాడు. విష్ణువు భూమికి సంబంధించిన ప్రదేశాలన్నింటినీ కొలిచాడు. ఇక్కడ కొలిచే సాధనం ఏమిటి అన్నప్పుడు ఆ సాధనం సూర్యుడు అని చెప్పారు. మరి కొలిచేవాడు వరుణుడు. పితృదేవతలు రెండు లోకాలను కొలిచి విశాలమైనవిగా చేశారు. భూమిని కొలవడం అనేది తూర్పునుంచి మొదలవుతుంది. అగ్ని, ఇంద్రుడు మరుత్తులు అందరూ ఈ పనిచేశారు. ఈ జగత్తును కలపతోనే కట్టారు. వేదంలో ఒకచోట "భూమి, స్వర్గము ఏ చెట్టు కర్రతో చెయ్యబడ్డాయి" అని అడిగారు. దీనికి సమాధానం తైత్తిరీయ బ్రాహ్మణంలో "బ్రహ్మ అనే చెట్టు" అని సమాధానం వచ్చింది. స్వర్గానికి భూమికీ ఆధారంగా స్తంభాలున్నాయి. కాని ఆకాశానికి మాత్రం వాసాలు లేవు. 'ఆతా' అనేది ద్వారము లేదా ద్వారబంధానికి పేరు. ప్రపంచం అనే ఇంటికి ద్వారం తూర్పు. ఇందులోంచే ఉషస్సు (కాంతి) లోపలకు ప్రవేశిస్తుంది. సవిత భూమిని తాళ్ళతో గట్టిగా కట్టేశాడు. విష్ణువు కొయ్యముక్కలతో దాన్ని బిగించాడు. బృహస్పతి దాని చివరలని మోస్తాడు. ఈ జగన్నిర్మాణానికి కర్తలు దేవతలు. కాని వృత్తి నైపుణ్యంగల వారు దేవతల వడ్రంగులు త్వష్ట, ఋభువులు అని చెప్పబడింది. ఋగ్వేదం ఆఖరి మండలంలో జగత్సృష్టికి సూర్యుడు ముఖ్యమైన దేవత అని చెప్పబడింది. సూర్యుడు హిరణ్యగర్భుడు అనే పేరుతో ప్రసిద్ధి చెందాడు. ఆయనే ప్రజలకు అధిపతి ప్రజాపతి అని

చెప్పబడింది.

ఋగ్వేదంలో అసత్ నుంచి సత్ వచ్చింది. ఏమి లేని దాన్నుంచి ఈ జగత్తు ఆవిర్భవించింది అని చెప్పబడింది. బ్రాహ్మణస్పతి కమ్మరిలాగా ఈ జగత్తుకు ఒక రూపం ఏర్పరిచాడు. లేనిదాన్నుంచి ఉన్నది పుట్టించబడింది. ఆ తరువాత వరుసగా భూమి, శూన్యప్రదేశాలు, దక్షుడు, అదితి పుట్టారు. అదితి తరువాత దేవతలు పుట్టారు. ఆ తరువాత దేవతలు సూర్యుణ్ణి సృష్టించారు. అదితికి ఎనిమిది మంది కుమారులు. ఎనిమిదవ వాడు ఆదిత్యుడు. అదితి అతన్ని పారేసింది. అతన్ని కేవలము ఉదయించటానికీ, అస్తమించటానికే పుట్టించింది. ఇక్కడ ముందుగా జగత్తు, తరువాత దేవతలు, తరువాత సూర్యుడు పుట్టారు అని చెప్పబడింది.

ఋగ్వేదంలోని **పదవ మండలంలోని 72వ సూక్తంలో**

సృష్టి ప్రారంభంలో బ్రాహ్మణస్సతి కర్మకారుడిలాగా దేవతలను సృష్టించాడు. అసత్ నుంచి సత్ ఉత్పన్నమైంది.

దేవతల సృష్టికన్న ముందే అసత్ నుంచి సత్ ఉత్పన్నమైంది.

ఆ తరువాత దిశలు. దిశల నుంచి వృక్షాలు వచ్చినాయి.

వృక్షాలనుంచి పృథివి, పృథివి నుంచి దిశలు వచ్చినాయి. అదితి నుంచి దక్షుడు, దక్షుని నుంచి అదితి ఉత్పన్నులైనారు. దక్షా ! నీ పుత్రిక అదితి దేవతలకు జన్మనిచ్చింది. దేవతలు అమరులు. స్తుతించ తగినవారు.

దేవతలు జలములందుండి మహోత్సాహంగా నాట్యం చేశారు. అందువల్ల ధూళి లేచింది.

దేవతలు మేఘాలలాగా అన్ని లోకాలు ఆవరించారు. సూర్యుడు

నిఘూఢముగా ఉన్నాడు. దేవతలు అతన్ని ప్రకాశింపచేశారు.

అదితికి ఎనిమిది మంది కుమారులు. వారు 1. మిత్ర 2. వరుణ 3. ధాత 4. ఆర్యమ 5. అంశ 6. భగ, 7. వివశ్వత 8. ఆదిత్యులు వారిలో ఎనిమిదవ వాడైన ఆదిత్యుణ్ణి ఆకాశంలో వదిలి మిగిలిన ఏడుగురిని తీసుకుని దేవలోకానికి వెళ్ళింది అదితి. జనన మరణములకు అంటే ఉదయించటం అస్తమించటం కోసం ఆదిత్యుణ్ణి ఆకాశంలో వదిలేసింది. అని చెప్పబడింది. **పదవ మండలంలోని 81వ సూక్తంలో** విశ్వకర్మ నేత్రాలు, విశ్వకర్మ ముఖము, బాహువులు, పాదములు అన్ని దిశలందు ఉన్నాయి. ఆ దివ్యపురుషుడు తన కరచరణాదులతో ద్యావాపృథువులను సృష్టించాడు అని చెప్పి తరువాత మంత్రంలో ద్యావాపృథివులు ఏ వృక్షముతో చేయబడినారు. ఓ విద్వాంసులారా ! మీరే ఆలోచించండి అన్నారు. **82వ సూక్తంలో** విశ్వకర్మ శరీరాలను సృష్టించాడు. మొదట జలాన్ని, తరువాత ద్యావాపృథువులను సృష్టించాడు. ఆయనే సకల భువనకర్త. దేవతలకు పేర్లు పెట్టాడు. అని చెప్పబడింది. **పదవ మండలంలోని 129వ సూక్తంలో** "ప్రళయం జరిగినప్పుడు సత్తు లేదు అసత్తు లేదు. భూమి లేదు ఆకాశం లేదు. లోకాలు లేవు. అంతా జలమయంగా ఉంది. అప్పుడు మృత్యువు లేదు. అమరత్వం లేదు. రాత్రి లేదు. పగలు లేదు. అంతా శూన్యము. పరబ్రహ్మ ఒక్కడే ఉన్నాడు. అతడు తప్ప ఇంకేదీ లేదు. సృష్టికి పూర్వము అంతా అంధకారం అలముకుని ఉన్నది. అంతా జలమయము. ముందుగా మనసులో కోరిక పుట్టింది. దానిలోంచి బీజము వచ్చింది. అదృశ్యము నుంచి దృశ్యపదార్థము అవతరించింది. బీజరూపంలో మానవుడు పుట్టాడు. మహిమలు ఆవిర్భవించినాయి. దేవతలు సృష్టి తరువాతనే అవతరించారు." అని

చెప్పబడింది.

ఋగ్వేదంలోని **పదవ మండలంలోని 190వ సూక్తంలో**

ప్రజ్వలిత తపస్సు నుంచి యజ్ఞము, సత్యము ఆవిర్భవించినాయి. ఆ తరువాత రాత్రింబవళ్ళు, జలము, సముద్రము కలిగినాయి. సముద్రము నుంచి సంవత్సరము పుట్టింది. తరువాత రాత్రింబవళ్లు కలిగినాయి. పూర్వకాలాన్ననుసరించే ఈశ్వరుడు సూర్యచంద్రులను, భూమి, అంతరిక్షము, స్వర్గాలను సృష్టించినాడు. అని చెప్పబడింది.

జగదుత్పత్తి గురించి పురుషసూక్తంలో చెప్పబడింది.

# 57. పురుష సూక్తము

ఋగ్వేదంలో పదవ మండలంలోని తొంభైయవ సూక్తము పురుష సూక్తము. దీనికి ఋషి నారాయణుడు. దేవత అవ్యక్త పురుషుడు. (కంటికి కనిపించని) పరమేశ్వరుడు. ఈ సూక్తము అనుష్టుప్, త్రిష్టుప్ ఛందస్సులలో ఉంది.

సహస్రశీర్షా పురుషః సహస్రాక్ష స్సహస్రపాత్ ।
స భూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠ ద్దశాఙ్గులమ్ ॥
1 పురుష ఏవేదగ్ం సర్వం, యద్భూతం యచ్చభవ్యమ్ ।
ఉతామృతత్వ స్యేశానః, యదన్నే నా తిరోహతి ॥
2 ఏతావానస్య మహిమా అతో జ్యాయాగ్ంశ్చ పూరుషః ।
పాదోస్య విశ్వాభూతాని త్రిపాద స్యామృతం దివి ॥
3 త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః పాదోస్యేహా భవాత్పునః ।
తతో విష్వ జ్వ్యక్రామత్ సాశనానశనే అభి ॥
4 తస్మా ద్విరాడజాయత విరాజో అధి పూరుషః ।
సజాతో అత్యరిచ్యత పశ్చా ద్భూమి మథోపురః ॥
5 యత్పురుషేణ హవిషా దేవా యజ్ఞ మతన్వత ।
వసంతో అస్యాసీదాజ్యం గ్రీష్మ ఇధ్మశ్శరద్ధవిః ॥
6 సప్తాస్యాసన్ పరిధయః త్రిస్సప్త సమిధః కృతాః ।
దేవా యద్యజ్ఞం తన్వానాః అబధ్నన్ పురుషం పశుమ్ ॥
7 తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్, పురుషం జాత మగ్రతః ।
తేన దేవా అయజన్త సాధ్యా ఋషయశ్చయే ॥

8 తస్మాద్యజ్ఞాత్సర్వ హుతః సంభృతం పృషదాజ్యమ్ ।
పశూగ్ం స్తాగ్శ్చక్రే వాయవ్యాన్ ఆరణ్యాన్ గ్రామ్యాశ్చయే
9 తస్మాద్యజ్ఞాత్సర్వహుతః ఋచస్సామాని జజ్ఞిరే ।
ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాత్ యజుస్తస్మాదజాయత ॥
10 తస్మాదశ్వా అజాయన్త యేకేచో భయాదతః ।
గావోహజజ్ఞిరే తస్మాత్ తస్మాజ్జాతా అజావయః ॥
11 యత్పురుషం వ్యదధుః, కతిధా వ్యకల్పయన్ ।
ముఖం కిమస్య కౌ బాహూ, కావూరూ పాదా వుచ్యేతే ॥
12 బ్రాహ్మణో–స్య ముఖమాసీత్; బాహూరాజన్యః కృతః ।
ఊరూతదస్య యద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రో అజాయత ॥
13 చంద్రమా మనసో జాతః చక్షో స్సూర్యో అజాయత ।
ముఖాదింద్రశ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయురజాయత ॥
14 నాభ్యా ఆసీదంతరిక్షమ్ శీర్ష్ణోద్యౌస్సమవర్తత ।
పద్భ్యాం భూమిర్దిశ శ్రోత్రాత్ తథా లోకాగ్ం అకల్పయన్॥
15 వేదాహమేతం పురుషం మహాన్తం ఆదిత్య వర్ణం తమసస్తు పారే
సర్వాణి రూపాణి విచిత్య ధీరః నామాని కృత్వా అభివదన్ యదాస్తే
16 ధాతా పురస్తాద్య ముదాజహార
శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్రః ।
త మేవం విద్వా నమృత ఇహ భవతి
నాన్యః పంథా అయనాయ విద్యతే॥

17 యజ్ఞేన యజ్ఞ మయజంత దేవాః తాని ధర్మాణి ప్రథమా న్యాసన్ ।
తే హ నాకం మహిమానస్సచన్తే యత్ర పూర్వే సాధ్యాస్సంతి దేవాః ।
18 అద్భ్యస్సంభూతః పృథివ్యై రసాచ్చ విశ్వకర్మణ స్సమవర్తతాధి
తస్య త్వష్టా విదధ ద్రూపమేతి తత్పురుషస్య విశ్వమాజాన మగ్రే
19 వేదాహ మేతం పురుషం మహాంతమ్ ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్
తమేవం విద్వానమృత ఇహ భవతి నాన్యః పంథా విద్యతేయనాయ
20 ప్రజాపతిశ్చరతి గర్భే అంతః అజాయమానో బహుధా విజాయతే ।
తస్య ధీరాః పరిజానంతి యోనిమ్ మరిచీనాం పద మిచ్ఛంతి వేధసః
21 యో దేవేభ్యం ఆతపతి, యో దేవానాం పురోహితః
పూర్వో యో దేవేభ్యో జాతః, నమో రుచాయ బ్రాహ్మయే ।
రుచం బ్రాహ్మం జనయంతః, దేవా అగ్రే తదబ్రువన్
యస్త్వైవం బ్రాహ్మణో విద్యాత్, తస్య దేవా అసన్ వశే ॥
22 హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ, అహోరాత్రే పార్శ్వే
నక్షత్రాణి రూపమ్, అశ్వినౌ వ్యాప్తమ్
ఇష్టం మనిషాణ, అముం మనిషాణ, సర్వం మనిషాణ ॥
23 ఓం తచ్ఛం యోరావృణీమహే, గాతుం యజ్ఞాయ
గాతుం యజ్ఞపతయే, దైవీ స్వస్తిరస్తు నః ।
స్వస్తిర్మానుషేభ్యః, ఊర్ధ్వం జిగాతు భేషజమ్
శం నో అస్తు ద్విపదే, శం చతుష్పదే ॥
24 *ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః*

మన కంటికి కనిపించే ఈ జగత్తంతా ఆ పరమాత్మ యొక్క విశ్వరూపము. ఆ పరమాత్మ ఈ జగత్తులో ఉన్న సమస్త జీవులయందు

ఉన్నాడు. జగత్తులోని 84 లక్షల జీవరాసి ఆయన స్వరూపమే. ఈ కారణం చేతనే ఆయన అనేక శిరస్సులు నేత్రములు, పాదములు కలిగి ఉన్నాడు. ఆయన ఈ బ్రహ్మాండమంతటా లోపలా బయటా కూడా వ్యాపించి ఉన్నాడు. ఈ శరీరంలో కేవలము పది అంగుళాలకే పరిమితమైన ఉదరమందున్నాడు. ఆయనే ఈ జగత్తుగా పరిణామము చెందుతున్నాడు. అయినప్పటికీ ఈ అవస్థ ఆయనకు కేవలము కల్పితమే. ఆయన త్రికాలముల యందు ఉంటాడు. ఈ జగత్తును పొందగల శక్తి కన్న ఇంకా ఎక్కువైన శక్తి గలవాడు.

ఆవిరాట్పురుషుడు మొదటగా దేవతలను సృష్టించాడు. తరువాత సృష్టి చేసే సామర్థ్యం పొందటానికి దేవతలంతా కలసి ఒక యజ్ఞం చెయ్యాలి అనుకొన్నారు. అప్పటికి ఈ సృష్టి పూర్తిగా జరగలేదు. అందుకని ఆ యజ్ఞానికి కావలసిన సమిధలు పూర్తిగా దొరకలేదు. అందుచేత దేవతలు విరాట్పురుషుని స్వరూపాన్నే హవిస్సుగా భావన చేసి మానసిక యజ్ఞం చేయసాగారు. ఆ యజ్ఞానికి నేయికై వసంత ఋతువును, పురోడాశము (హవిస్సు) కోసం శరద్రుతువును, మనసులో భావన చేశారు. ఆ యజ్ఞానికి గాయత్రి మొదలై ఛందస్సులు ఏడు మేరలుగా, ఆ ఏడింటితో ఏర్పడిన ఇరువది ఒక్క సమిధలు భావన చేశారు. అంతట వారు ఆ పురుష పశువును యూపస్తంభానికి కట్టేసి యజ్ఞం పూర్తి చేశారు. ఈ రకంగా దేవతలు, సాధ్యులు, ఋషులు కలిసి చేసిన ఆ మానస యజ్ఞము నుండి 'పృషత్' అనే ఆజ్యము వచ్చింది. వాయుదేవతాకములగు పశువులు, గ్రామాలలో ఉండే ఆవులు, వేదాలు, గాయత్రి మొ॥ ఛందస్సులు ఆ యజ్ఞము నుంచి పుట్టినాయి.

ఆ మానస యజ్ఞము నుండి గుఱ్రాలు, నోటిలో పైన, క్రింద

దంతాలుగల గాడిదలు, ఆవులు, మేకలు, గొర్రెలు పుట్టినాయి. దేవతలు విరాడ్రూపుని సంకల్పముతో పుట్టించినప్పుడు అనేక విధాలుగా ఆలోచనలు చేశారు. ఇక ఆయన శరీర భాగాల గురించి చెబుతున్నారు. ఆయన ముఖము నుండి బ్రాహ్మణుడు. బాహువుల నుండి క్షత్రియులు, తొడల నుండి వైశ్యులు, పాదముల నుండి శూద్రులు పుట్టారు. ఆయన మనసు నుంచి చంద్రుడు, నేత్రముల నుంచి సూర్యుడు, ముఖము నుండి ఇంద్రుడు, అగ్ని, ప్రాణముల నుండి వాయువు, నాభి నుంచి అంతరిక్షము ఏర్పడ్డాయి. ఆయన శిరస్సువలన స్వర్గము, పాదముల వల్ల భూమి, చెవుల నుండి దిశలు, ఏర్పడ్డాయి. ఈ రకంగా లోకాలన్నీ సృష్టించబడ్డాయి.

ఋగ్వేదంలో ముద్గలోపనిషత్తు అని ఒక ఉపనిషత్తు ఉన్నది. అందులో పురుష సూక్తము యొక్క అర్థము వివరించబడింది. అయితే పురుషసూక్తంలోని మిగిలిన మంత్రాలనీ ఫలశ్రుతిని తెలియచేస్తున్నాయి. ఇక్కడ ఒక్క నిమిషం ఆగుదాం. చాతుర్వర్ణ్య వ్యవస్థను గురించి మొదటగా చెప్పింది ఈ పురుష సూక్తంలోనే. చాతుర్వర్ణ్ణాలు ఆ విరాట్పురుషుని నుంచే ఆవిర్భవించాయి అని.

ఒకసారి ఒక యూనివర్శిటీలో తెలుగు డిపార్ట్‌మెంటులో తెలుగు ఉపాధ్యాయులకు 'రిఫ్రెషర్ కోర్సు' క్లాసులు జరుగుతున్నాయి. ఆ సమయంలో ఒక రోజున ఒక చిన్న కార్యక్రమం ఏర్పాటు చేసి, ఆ కోర్సుకు వచ్చిన లెక్చరర్లు అందరినీ ఏదో ఒక అంశంమీద కొద్దిసేపు అందరూ మాట్లాడండి అన్నారు. కొందరు పద్యాలు చదివారు. కొందరు గేయాలు చదివారు. కొందరు కథలు చెప్పారు. ఈ రకంగా అందరూ తమ తమ ప్రజ్ఞాపాటవాలు చూపుతున్నారు. ఒకాయన లేచి పురుషసూక్తంలో కొంత భాగం చదివి చాతుర్వర్ణ్ణాలు ఈ రకంగా

ఏర్పడ్డాయి. పరమేశ్వరుని ముఖం నుండి బ్రాహ్మణుడు, బాహువుల నుండి క్షత్రియుడు, ఊరువుల నుంచి వైశ్యుడు, పాదాల నుంచి శూద్రుడు జన్మించారు. అని చెప్పాడు. అందరూ చప్పట్లు కొట్టారు. మహదానందంగా ఆయన ఇవతలకి వచ్చి తన కుర్చీలో కూచున్నాడు. ఇంతలో ఒక నాస్థికవాది లేచి "వ్రాసే వాడికి లేకపోతే చెప్పేవాడికైనా ఉండాలి. మానవులు స్త్రీ పురుష సమాగమం వల్లనే పుడతారు. అంతేకాని కాళ్ళనుంచి చేతుల నుంచి పుడతారా ఎక్కడైనా? కొంతమంది తమ ఆధిక్యతని చూపుకోటానికే ఇలాంటి మాటలు చెబుతుంటారు." అంటూ దులిపేశాడు. ఇందాక ఈ విషయాలు మాట్లాడిన పండితుడి ముఖం వెలవెలపోయింది. మిగిలిన వాళ్ళు కూడా ఎవ్వరూ మాట్లాడకుండా అలా ఉండిపోయారు. ఇక్కడ ఈ విషయాన్ని మనం చూద్దాం.

అసలు సృష్టి ఎలా జరుగుతుంది. సృష్టి రెండు రకాలు. బ్రహ్మ చేసినది మానసిక సృష్టి. ప్రజాపతులు చేసినది మైధున సృష్టి. ఇక పోతే సృష్టి నాలుగు రకాలుగా జరుగుతుంది అని ఉపనిషత్తులు చెబుతున్నాయి. దీన్ని మన విజ్ఞానశాస్త్రం కూడా ఒప్పుకుంటోంది.

1. అండజాలు–గ్రుడ్డునుంచి పుట్టినవి. పక్షులు, పాములు మొ॥
2. శ్వేదజాలు–చెమట నుంచి, మలిన పదార్థముల నుంచి పుట్టినవి. క్రిములు, కీటకాలు.
3. ఉద్భిజాలు–నేల నుంచి పుట్టినవి. చెట్లు, వృక్షాలు
4. జారజాలు–స్త్రీ జననేంద్రియము నుంచి పుట్టినవి. మనుషులు, పశువులు మొ॥

ఈ రకంగా సృష్టి జరుగుతుంది. బ్రాహ్మణుడు బ్రహ్మముఖం నుంచి పుట్టాడు. బ్రాహ్మణుడు అంటే బ్రహ్మతేజస్సుతో ప్రకాశించేవాడు.

అంటే ఆ పరమేశ్వరుని ముఖం దివ్యమైన తేజస్సుతో ప్రకాశిస్తున్నది. సృష్టిలో మొదట అందరూ బ్రాహ్మణులే. జనాభా పెరిగే కొద్దీ వారికి రక్షణ కావలసి వచ్చింది. అందుకనే పరమేశ్వరుడు బలవంతులైన పరాక్రమవంతులైన క్షత్రియులను సృష్టించాడు. ఇంకొంత కాలం పోయే సరికి ప్రజల మనుగడకు ధనం అవసరమైంది. దానికోసం రహస్యాలు దాచగల వైశ్యుణ్ణి సృష్టించాడు. ఇతడు ఆ రహస్యాలకు సంకేతంగా ఊరు ప్రదేశం నుంచి ఆవిర్భవించాడు. ఆ తరువాత వీరందరికీ సేవలు చెయ్యటానికి శూద్రుణ్ణి సృష్టించాడు. వీరందరూ ఎక్కడ నుంచి పుట్టినా విరాట్పురుషునిలో భాగాలే. మన శరీరంలో ఏ అంగమూ ఎక్కువ కాదు ఏదీ తక్కువా కాదు. ఒకవేళ పాదాలు పనికి రానివి అనుకుంటే వాటిని నరికెయ్యండి. చాతుర్వర్ణాలలో అన్ని వర్ణాలు సమానమే. అందరూ విరాట్పురుషునిలో భాగాలే. ఇక పంచముల గురించి ఎక్కడా చెప్పలేదు కదా? ఇది ప్రశ్న. ఈ పంచములనే 'నిషాదులు' అన్నాడు సాయణుడు. ఈ రకంగా పరమేశ్వర స్వరూపం నుంచే సృష్టి జరిగింది అని చెబుతోంది పురుషసూక్తం.

వర్ణవ్యవస్థని గురించి చెప్పేటప్పుడు **చాతుర్వర్ణం మయాసృష్టం గుణకర్మ విభాగచ** అన్నాడు భగవానుడు గీతలో. అంటే మానవులు చేసే వృత్తులను బట్టి ఈ వర్ణవ్యవస్థ ఏర్పాటు చేయబడిందన్న మాట. ఆ రోజుల్లో ఒక వర్ణంలోని వారు ఇంకో వర్ణంలోకి మారటం కూడా జరిగేది. క్షత్రియుడైన విశ్వామిత్రుడు బ్రాహ్మణుడైనాడు. అలాగే బ్రాహ్మణుడైన రావణుడు క్షత్రియుడైనాడు. వర్ణాంతర వివాహాలు కూడా జరిగినాయి. అయితే అవి కేవలము అనులోమంగానే జరిగాయి. సృష్టిని గురించి **నాసదీయ సూక్తం**లో కూడా చెప్పబడింది.

# 58. నాసదీయ సూక్తము

ఋగ్వేదము–**10** మండలము - **129** సూక్తము ఇందులో మొత్తం ఏడు మంత్రాలున్నాయి.

నాసదాసీన్నో ఉ_సదాసీత్ తదానీం నాసీద్రజో నో వ్యోమా పరో యత్ ।

కిమావరీవః కుహ కస్య శర్మ న్నంభః కిమాసీ ద్గహనం గభీరమ్ ॥

**1** న మృత్యురాసీదమృతం న తర్హి న రాత్ర్యా అహ్నా ఆసీత్ ప్రకేతః ।

ఆనీదవాతం స్వధయా తదేకం తస్మాద్ధాన్యన్న పరః కిం చనాస ॥

**2** తమ ఆసీత్ తమసా గూళ్హమగ్రే ప్రకేతం సలిలం సర్వమా ఇదమ్

తుచ్ఛ్యే నాభ్వపిహితం యదాసీత్ తపసస్తన్మహినా జాయతైకమ్ ॥

**3** కామస్తదగ్రే సమవర్తతాధి మనసో రేతః ప్రథమం యదాసీత్ ।

సతో బంధుమసతి నిరవిందన్ హృది ప్రతీష్యా కవయో మనీషా॥

**4** తిరశ్చీనో వితతో రశ్మిరేషా మధః స్విదాసీ3దుపరి స్విదాసీత్ ।

రేతోధా ఆసన్ మహిమాన ఆసన్ త్స్వధా అవస్తాత్ ప్రయతిః పరస్తాత్॥

**5** కో అద్ధా వేద క ఇహ ప్ర వోచత్ కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః

అర్వాగ్దేవా అస్య విసర్జనే నా_థా కో వేద యత ఆబభూవ ॥

**6** ఇయం విసృష్టిర్యత ఆబభూవ యది వా దధే యది వా న

యో అస్యాధ్యక్షః పరమే వ్యోమన్ త్సో అంగ వేద యది వా న వేద

**7** సూక్తార్థం

ప్రళయం జరిగినప్పుడు సత్తులేదు. అసత్తు, భూమి లేదు. ఆకాశం లేదు. ఏమీలేదు. అంతా జలమయంగా ఉంది. ఆ సమయంలో మృత్యువు లేదు. దైవత్వం లేదు. రాత్రిలేదు. పగలులేదు. అప్పుడున్నది పరమేశ్వరుడు ఒక్కడే. అతడు తప్ప ఎవరూ లేరు ఏదీ లేదు. సృష్టి

ప్రారంభానికి ముందు అంతా చీకటి గాడాంధకారంగా ఉండేది. అంతా జలమయం. అప్పుడు తపః ప్రభావంతో ఏకమ్ ఒక్కటే వచ్చింది.

మొదటగా మనసులో కోరిక పుట్టింది. ఆ కోరిక నుంచి బీజము వచ్చింది. అవ్యక్తము నుంచి వ్యక్తము ఆవిర్భవించింది. బీజరూపంలో మానవుడు ఆవిర్భవించాడు. మహిమలు ఆవిర్భవించాయి. మానవుల కార్యకలాపాలు విస్తరించినాయి. అన్నం క్రింద, భోక్త పైన ఉన్నారు. జీవి ఆహారం తింటున్నది. ప్రకృతితత్త్వాన్ని తెలిసినవారెవరూ లేరు. దాని గురించి వివరించగలిగిన వారు అంతకన్నా లేరు. అసలు ఏ కారణం చేత ఈ సృష్టి మొదలయిందో తెలియదు. దేవతల కోసం సృష్టి జరిగిందా అంటే కాదు. ఎందుకంటే దేవతలు కూడా మానవుల తరువాతనే అవతరించారు. సృష్టి ఎప్పుడు, ఎక్కడ, ఎలా మొదలైంది ఎవరికీ తెలియదు. విభిన్నమైన ఈ సృష్టి ఎక్కడ నుంచి జరిగింది? ఏ కారణంతో జరిగింది? సృష్టి చేసింది ఎవరు? ఈ విషయాలన్నీ ఆ పరమాత్ముడికే తెలియాలి.

అంతా అనిశ్చితంగా ఉంది. అనిశ్చితమైంది నిశ్చితము ఎలా అవుతుంది? అనిశ్చితము అనిశ్చితమే. ఇదే సత్యము అని చెబుతోంది ఈ సూక్తం. సృష్టిని గురించి ఈ సూక్తంలో చెప్పిన విషయాలు పాశ్చాత్యులుకూడా అంగీకరించారు.

# 59. ధనం కావాలంటే

ఈ లోకంలో సుఖంగా జీవించాలి అంటే సిరిసంపదలు, భోగభాగ్యాలు, అష్టైశ్వర్యాలు, దాసదాసీజనము, అధికారము ఇలా ఒకటేమిటి అన్నీ కావాలి. 'సుఖము' అనే పదానికి అంతం లేదు. సిరిసంపదలు, ధనధాన్యాలు ఎంత ఎక్కువ ఉంటే అంతగా సుఖం పొందవచ్చు అనుకుంటాడు మానవుడు. వీటిని సంపాదించటానికి మానవుడు విపరీతమైన శ్రమపడాలి. ఈ శ్రమతో పాటుగా భగవంతుడి అనుగ్రహం కూడా ఉండాలి. అలా భగవంతుడి అనుగ్రహం పొందటానికి కొన్ని మంత్రాలు, సూక్తాలు వేదంలో చెప్పబడ్డాయి.

సిరిసంపదలు, ధనధాన్యాలు, భోగభాగ్యాలు ఇచ్చేది లక్ష్మీదేవి. అటువంటి లక్ష్మీదేవిని మనకి అందించేవాడు అగ్ని. అందుకనే ఓ అగ్నిదేవా ! లక్ష్మీ కటాక్షం మాకు కలిగేలా చూడవలసింది అని అగ్నిదేవుణ్ణి ప్రార్థనచేస్తాం. దీనికి కారణం ఏమంటే ఋగ్వేదంలో ప్రధానమైనదేవత ఇంద్రుడు కాగా రెండవవాడు అగ్ని. మన కోరికలు తీర్చేవాడు అగ్నిదేవుడు. అందుకే మనం సుఖమయ జీవితాన్ని ప్రసాదించ మని, దానికి కావలసిన ధనధాన్యాలు, దాసదాసీజనము, సిరిసంపదలు అన్నీ ఇవ్వవలసిందని ఋగ్వేదంలో అగ్నిదేవుణ్ణి కోరుతున్నాం. దీన్నే **'శ్రీసూక్తము'** అంటారు. సామాన్యంగా ఎక్కువమంది ప్రజలు శ్రీసూక్తాన్ని పారాయణ చేస్తూనే ఉంటారు.

ఇది మొత్తం పదిహేను మంత్రాలతో ఉన్న సూక్తం. ఇందులోని పదిహేను మంత్రాలను **'ఋక్కులు'** అంటారు.

శ్రీసూక్తానికి విద్యారణ్యులవారు, పృథ్వీధరుడు, శ్రీకంఠులవారు, శతానందుడు మొదలైన అనేకమంది భాష్యాలు కూడా వ్రాశారు.

ఇందులోని పదిహేను ఋక్కులు పదిహేను మంత్రాలుగా జపించవచ్చు. వాటన్నింటికీ ఋషి, దేవత, ఛందస్సు, బీజము, శక్తి, కీలకము అన్నీ విడివిడిగా చెప్పబడినాయి. ఋగ్వేదంలోని **"సౌభాగ్యలక్ష్మీ"** ఉపనిషత్తులో కూడా దీని ఉపాసనావిధానము చెప్పబడింది. ముందుగా ఈ మంత్రాన్ని గురువుగారి దగ్గర చెప్పుకుని ఆ తరువాతనే జపం చెయ్యాలి. మంత్రజపం చేసేటప్పుడు నియమనిష్ఠలు ప్రత్యేకంగా తప్పనిసరిగా పాటించాలి. అప్పుడు మాత్రమే ఆశించిన ఫలితం వస్తుంది. ఇందులోని పదిహేను మంత్రాలను విడివిడిగా ఉపాసన చేయవచ్చు. ఈ మంత్రాలన్నింటికీ కలిపి ఒక యంత్రంకూడా ఉన్నది. వీటికి విడివిడిగా కూడా యంత్రాలున్నాయి.

# శ్రీసూక్త యంత్రం

ఈ యంత్రంలో అష్టదళము, ద్వాదశదళము, షోడశదళములున్నాయి. ముందుగా మధ్య దళంలో 'శ్రీం' బీజము, సాధ్యం అన్నిచోట సాధకుని కోరిక వ్రాయాలి. ఆ తరువాత అష్టదళపద్మములోని ఒక్కొక్క దళమునందు ఒక్కొక్క ఋక్కు చొప్పున ఎనిమిది దళాలయందు ఎనిమిది ఋక్కులను వ్రాయాలి. ఇక ద్వాదశ దళము, షోడశదళము 12+16 = 28 దళాలు ఉంటాయి. శ్రీసూక్తంలో మొత్తం పదిహేను ఋక్కులున్నాయి. వాటిలోని ఎనిమిది ఋక్కులను అష్టదళంలో వ్రాయటం జరిగింది. ఇక మిగిలిన ఏడు ఋక్కులు. ఒక్కొక్క ఋక్కుకు రెండు పాదాలు అంటే 7 × 2 = 14 పాదాలు ఉన్నాయి. వీటిని రెండు ఆవృతులుగా ద్వాదశ, షోడశ దళాలలో సవ్యంగా (ఎడమ నుంచి కుడికి) వ్రాయాలి. ఈ యంత్రం వెండితోగాని, రాగితోగాని, బంగారంతోగాని దేనితోనైనా చేయవచ్చు. ప్రతిరోజు యంత్రాన్ని పాలతో అభిషేకించి పంచపూజలు చేసి మీరు కోరిన ఋక్కును జపం చేసి, యంత్రాధిదేవతకు చక్కెరపొంగలి నివేదన చెయ్యాలి. ఇలా చేస్తే సాధకుని కోరిక తప్పకతీరుతుంది.



# ౬౦. శ్రీసూక్తమ్

**హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణరజతస్రజామ్ ।**
**చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మ మావహ ॥1**

అగ్ని దేవుణ్ణి విష్ణురూపుడుగా వైష్ణవులు, రుద్రరూపుడుగా శైవులు, దుర్గా స్వరూపిగా శాక్తేయులు భావిస్తారు. అలాగే మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతి స్వరూపురాలు లక్ష్మీదేవి. ఆవిడ బంగారుకాంతితో ప్రకాశిస్తూ, బంగారు వెండి పూలతో పూజించబడుతూ ఉంటుంది. నిత్యసంతోషిణి. చంద్రసహోదరి. భక్తులకు ధనధాన్యాలను ప్రసాదించే దేవత. ఓ అగ్నిదేవా! అటువంటి లక్ష్మీదేవిని నాకు దయ చేయించవలసినది.

ఈ మంత్రాన్ని బంగారుపూసల జపమాలతో ముప్పై రెండు లక్షలు జపం చేస్తే సిద్ధిస్తుంది.

**తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీమనపగామినీమ్ ।**
**యస్యాం హిరణ్యం విందేయం గామశ్వం పురుషానహమ్॥2**

ఓ అగ్నిదేవా! ఏ లక్ష్మీదేవి నా దగ్గరకు వస్తే నేను ధనము, పశువులు, వాహనాలు, దాసదాసీలు పొంది సుఖంగా ఉంటానో, అటువంటి లక్ష్మీదేవిని నాకు అనుగ్రహించవలసినది.

ఈ మంత్రం ప్రతిరోజు పదివేలు చొప్పున ముప్పై మూడు రోజులు జపం చేస్తే సిద్ధిస్తుంది.

**అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాథ ప్రబోధినీమ్ ।**
**శ్రియం దేవీముపహ్వయే శ్రీర్మా దేవీ జుషతామ్ ॥3**

సేనాసమూహంలో ముందు రథాలు, తరువాత గుర్రాలు, ఆ

తరువాత ఏనుగులు నడుస్తుంటాయి. అటువంటి సేనాస్వరూపమైన రాజ్యలక్ష్మిని నాకు అనుగ్రహించవలసినది.

ఈ మంత్రాన్ని రోజుకు పదివేలు చొప్పున పన్నెండు సంవత్సరాలు జపం చేస్తే మంత్రసిద్ధి జరుగుతుంది. సాధకుడు రాజ్యాధికారి అవుతాడు.

**కాంసోఽస్మితాం హిరణ్యప్రాకారా మార్ద్రాం జ్వలంతీం తృప్తాం తర్పయన్తీమ్।**

**పద్మేస్థితాం పద్మవర్ణాం తామిహోపహ్వయే శ్రియమ్ ॥4**

బంగారుకోట యందుండేది, చిరునవ్వులు చిందించేది, భక్తుల కోరికలు తీరుస్తూ వారిని చల్లగాచూసేది అయిన విద్యాలక్ష్మిని నాకు అనుగ్రహించవలసినది.

ఈ మంత్రాన్ని ఎనిమిదిలక్షలు జపంచేస్తే సిద్ధిస్తుంది. సాధకుడు గొప్ప కవి, పండితుడు అవుతాడు.

**చంద్రాం ప్రభాసాం యశసా జ్వలన్తీమ్ శ్రియంలోకే దేవజుష్టా ముదారామ్।**

**తాం పద్మినీం ఈం శరణమహం ప్రపద్యే అలక్ష్మీర్మే నశ్యతాం త్వాంవృణే॥5**

చంద్రస్వరూపిణియై, చంద్రుని లాగా ప్రకాశిస్తూ, మహాదైశ్వర్యము ఔదార్యముల వలన కలిగిన కీర్తిచేత పద్నాలుగు లోకములందు వ్యాపించిన మహాలక్ష్మిని ఇంద్రాది దేవతలు ప్రార్ధిస్తున్నారు. అటువంటి లక్ష్మీదేవిని శరణువేడి ప్రార్ధిస్తున్నాను.

ఈ మంత్రాన్ని ముప్పైలక్షలసార్లు జపంచేస్తే సిద్ధిస్తుంది. సాధకుడు ఐశ్వర్యవంతుడవుతాడు.

**ఆదిత్య వర్ణే తపసోఽధిజాతో । వనస్పతిస్తవ వృక్షోఽథబిల్వః ।**

**తస్య ఫలాని తపసా నుదన్తు మాయాన్తరాయాశ్చబాహ్యాఅలక్ష్మీః ॥6**

బాలభానునిలాగా ప్రకాశించే లక్ష్మీదేవి బిల్వవనంలో తపస్సు

చేస్తూ ఉంటుంది. ఆ తపఃప్రభావం చేత అక్కడి కొలనులో స్నానమాచరించిన వారికి, బిల్వఫలాలు తిన్నవారికి అలక్ష్మి (దరిద్రము) దాపురించదు. అటువంటి ఆ లక్ష్మీదేవి నా అంతరింద్రియ, బాహ్యేంద్రియ అభాగ్యము పోగొట్టును గాక.

ఈ మంత్రాన్ని నలభై నాలుగు లక్షలసార్లు జపం చేస్తే, సాధకుడికి దారిద్ర్య నివృత్తి, మహాదైశ్వర్య లాభము కలుగుతుంది.

**ఉపైతు మాం దేవసఖః కీర్తిశ్చ మణినా సహ ।**
**ప్రాదుర్భూతోఽస్మి రాష్ట్రేఽస్మిన్ కీర్తి మృద్ధిం దదాతుమే7**

ఓ లక్ష్మీదేవి ! నేను ఈ భూలోకంలో కడుబీదవాడుగా జన్మించి నిన్ను సేవిస్తున్నాను. అట్టి నాకు ధనాధిపతిఅయిన కుబేరుడు నీఅనుజ్ఞతో ధనమును ప్రసాదించు గాక. నీ సేవకురాలైన కీర్తిదేవత నన్ను చేరుగాక.

ఈ మంత్రాన్ని ముప్ఫైరెండులక్షలసార్లు జపంచేస్తే మంత్రసిద్ధి కలిగి సాధకుని కోరిక తీరుతుంది.

**క్షుత్పిపాసామలాం జ్యేష్ఠా మలక్ష్మీర్నాశయా మ్యహమ్ ।**
**అభూతిమసమృద్ధిం చ సర్వాంనిర్ణుదమే గృహాత్ ॥8**

దేవదానవులు క్షీరసాగరమధనం చేసినప్పుడు ఆకలిదప్పికలచే అలసి మలినమైన అవలక్షణములు గల దరిద్రదేవత (జ్యేష్ఠాదేవి) పుట్టింది. ఆవిడ లోకం అంతా వ్యాపించింది. ఓ లక్ష్మీదేవీ ! నిన్ను సేవించిన నేను నీ కృపతో ఆ దరిద్రాన్ని నాశనము చేయగలుగుతున్నాను. నువ్వు నా ఇంట ఉండి నాకు ఏ కొరతా లేకుండా చూడవలసినది.

ఈ మంత్రం ముప్పై రెండు లక్షలు జపం చేస్తే సిద్ధించి సాధకుడికి ఏ కొరతా లేకుండా చేస్తుంది.

**గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్ ।**

**ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్॥9**

మంచి గంధపు సువాసనలచే పరిమళించునది, ఎవరిచేతను తిరస్కరించ బడనిది, పంటలచే పుష్టి గలిగినది, సకల భూతాలకు ఆశ్రయమైనది అయిన మహాలక్ష్మిని నేను సేవిస్తున్నాను.

ఈ మంత్రాన్ని పదహారు లక్షలు జపం చేస్తే సిద్ధిస్తుంది.

**మనసః కామమాకూతిం వాచ స్సత్యమశీమహి ।**

**పశూనాగ్ం రూపమన్నస్య మయి శ్రీ శ్శ్రయతాం యశః10**

ఓలక్ష్మీదేవి ! నా మనోరథాన్ని, సంకల్పాన్ని, క్షీరాన్నము తినే భాగ్యము నీ అనుగ్రహమువల్ల నేనుపొందుతున్నాను. సంపద, కీర్తి నన్ను ఆశ్రయించ నివ్వవలసినది.

ఈ మంత్రాన్ని ఎనభై లక్షలు జపం చేస్తే సాధకుడికి సంకల్పసిద్ధి, వాక్సిద్ధి కలుగుతాయి.

**కర్దమేన ప్రజా భూతా, మయిసంభవ కర్దమ ।**

**శ్రియం వాసయ మే కులే మాతరం పద్మమాలినీమ్ ॥11**

లక్ష్మీదేవి కుమారుడు కర్దముడు (మన్మథుడు) ఓ కర్దమా ! నీవు మా యింట వశింపుము. కమలధారిణి అయిన నీ తల్లి లక్ష్మీదేవి కూడా నా ఇంట ఉండేట్లుగా చేయవలసినది.

ఈ మంత్రాన్ని ముప్పై రెండు లక్షలు జపం చేస్తే సాధకుని కోరిక తీరుతుంది. వంశాభివృద్ధి జరుగుతుంది.

**ఆపస్సృజన్తుస్నిగ్ధాని చిక్లీత వస మే గృహే ।**

**ని చ దేవీం మాతగ్ం శ్రియం వాసయ మే కులే ॥ 12**

పాలు, వెన్న, జున్ను మొదలైన జిడ్డుగల భోగ్యవస్తువులను దేవతలు నాకిత్తురు గాక. లక్ష్మీదేవి కుమారుడు చిక్లీతుడు (కాముడు) కామసంకల్పము లేనివారు ధనధాన్యాలు సంపాదించటానికి ప్రయత్నించరు. పురుషార్థాలన్నీ కూడా కామసాధ్యాలు కామేశ్వరీ స్వరూపమైన మహాలక్ష్మి కామము గల వారి యందు మాత్రమే ఉంటుంది. కాబట్టి ఓ కామమా ! మా యింట ఉండుము. నేను, నా వారందరూ ప్రవృత్తిమార్గంలో నడుస్తాము. ఓ చిక్లీతుడా ! నువ్వు నా యందు నిలచి, నీ తల్లియైన లక్ష్మీదేవి శాశ్వతముగా ఇంట ఉండునట్లుగా చేయవలసినది.

ఈ మంత్రం అరవై నాలుగు లక్షల సార్లు జపం చేస్తే సిద్ధిస్తుంది.

**ఆర్ద్రాం యఃకరిణీం యష్టిం పింగళాం పద్మమాలినీమ్ ।**

**చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో ! మమావహ ॥13**

ఓ అగ్నిదేవా! తడిసిన దేహము కలది, పుష్టికరమైనది, పసుపు రంగుతో అలరారుతున్నది, కమలముల దండలు మెడన ధరించినది, చంద్రునిలాగా రమణీయమైనది, బంగారువన్నె కలది, అయిన లక్ష్మీదేవిని నా కోసం ఆహ్వానించవలసినది.

ఈ మంత్రాన్ని ముప్పై రెండు లక్షలు జపం చేస్తే సాధకుని కోరిక సిద్ధిస్తుంది.

**ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం, సువర్ణాం హేమమాలినీమ్ ।**

**సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ ॥14**

ఓ అగ్నిదేవా ! సూర్యునిలాగా ప్రకాశించేది, బంగారుఛాయలో ఉండేది, ఐశ్వర్యాన్ని ఇచ్చేది అయిన మహాలక్ష్మి లోకరక్షకురాలై బంగారుకమలముల హారములతో, రెండువైపులా మదపుటేనుగలచే సేవించబడుతూ ఉన్నది. అటువంటి గజలక్ష్మిని నాకోసం పిలుచుకు రావలసింది.

ఈ మంత్రాన్ని ముప్పై రెండు లక్షలు జపం చేస్తే సాధకుని కోరిక తీరుతుంది.

**తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామినీమ్ । యస్యాం**

**హిరణ్యం ప్రభూతం గావో దాస్యో ఉ-శ్యాన్ విన్దేయం పురుషానహమ్ ॥15**

ఓ అగ్నిదేవా ! ఏ లక్ష్మీదేవి కరుణవల్ల నేను ధనధాన్యాలు, భోగభాగ్యాలు, దాసదాసీలు, పుత్రపౌత్రాదులు, కీర్తిప్రతిష్టలు పొంది సుఖిస్తానో, అటువంటి లక్ష్మీదేవిని నాకు ప్రసాదించవలసినది.

ఈ మంత్రాన్ని ప్రతిరోజూ మూడువేల నూట ఎనిమిదిసార్లు జపం చేస్తే మంత్రసిద్ధి జరిగి సాధకుని కోరిక తీరుతుంది. పులిచర్మము మీద కూర్చుని ఇంద్ర నీలమణుల మాలతో ఐదులక్షలు జపం చేస్తే శత్రునాశనము దర్భాసనంమీద కూర్చుని రుద్రాక్షమాలతో తొమ్మిది లక్షలు జపం చేస్తే విద్యాప్రాప్తి. పేముతో చేసిన ఆసనం మీద కూర్చుని బంగారుపూసల మాలతో గనక కోటిజపం చేస్తే అతడు మహారాజవుతాడు.

**సంపుటిత శ్రీసూక్తము :** ఇదే శ్రీసూక్తాన్ని మహాలక్ష్మి మంత్రంతోను, దుర్గా మంత్రంతోను సంపుటం చేసి పారాయణ చేస్తే దాన్ని **సంపుటిత శ్రీసూక్తము** అంటారు. పూర్వకాలంలో మహాపేదరికాన్ననుభవించిన మాధవాచార్యుడు సంపుటిత శ్రీసూక్తాన్ని

పారాయణచేసి లక్ష్మీదేవి అనుగ్రహం పొందాడు. ఎవరీ మాధవాచార్యుడు? ఈయనే మాధవ విద్యారణ్యుడు చాలా గొప్ప పండితుడు, కడు బీదవాడు. ధనంకావాలి అని లక్ష్మీదేవిని ఉపాసించాడు. లక్ష్మీదేవి ప్రత్యక్షమై మాధవా నీకు ఈ జన్మలో ధనయోగం లేదు. మరుజన్మలో నీ కోరిక తీరుతుంది అని చెప్పింది. ఆలోచించాడు మాధవుడు. సన్యసించాడు. అప్పటి నుంచే మాధవ విద్యారణ్యుడుగా పిలుబడ్డాడు. సన్యాసం తీసుకుంటే అంతటితో గతజన్మ పూర్తి అయిపోయి కొత్త జన్మ మొదలవుతుంది. అందుకే ఆ పని చేశాడు. ఇప్పుడు అడిగాడు లక్ష్మీదేవిని నాకు ధనం కావాలి అని. ఒకరోజున నేల తవ్వుతుండగా అతనికి బంగారు నాణాలు బస్తాలకొద్దీ దొరికాయి. తాను సన్యాసి. ఏం చేసుకోవాలి ఈ ధనాన్ని. సరిగ్గా అదే సమయంలో కాకతీయసామ్రాజ్యం తురుష్కుల వశమైంది. అక్కడ నుంచి వీలైనంత వరకు బంగారు నాణాలు మూటకట్టుకుని పారిపోయి వస్తున్నారు హరిహరరాయలు, బుక్కరాయలు. వాళ్ళని చేరదీశాడు. వాళ్ళకి హిందూధర్మం మీద విపరీతమైన గౌరవం ఉంది. అప్పుడు తనకు దొరికిన ధనం, వాళ్ళు తెచ్చిన ధనమంతా కలిపి విజయనగర సామ్రాజ్యాన్ని నిర్మించాడు మాధవాచార్యుడు. తరువాత బుక్కప్రభువు రాజయ్యాడు. ఆ కాలంలోనే మాధవ విద్యారణ్యుని తమ్ముడు సాయణాచార్యుడు నాలుగు వేదాలకు భాష్యం వ్రాశాడు. అలా వ్రాసి దానికి అన్నగారి పేరు పెట్టాడు. దీన్నే **'విద్యారణ్య భాష్యము'** అంటారు. మనకు దగ్గరగా ఉన్న సంప్రదాయబద్ధమైన వేదభాష్యం ఇదే. ఈ విద్యారణ్యుడు శృంగేరీ మహాసంస్థానానికి అధిపతిగా కూడా ఉన్నాడు.

విద్యారణ్యుడు అనేక గ్రంథాలు కూడా వ్రాశాడు. **వేదాంత**

**పంచదశి** అనే వీరు వ్రాసిన గ్రంథాన్ని నేను ఉపన్యాసంకూడా చెప్పి సిడిగా ఇచ్చాను. ఆ సమయం లోనే ఆయన దర్శనం కూడా అయింది. ఆ రోజు ఉదయం పది గంటల ప్రాంతం. నేను అమెరికాలో ఒక గదిలో కూర్చుని రికార్డరు ముందు పెట్టుకుని 'వేదాంత పంచదశి' చెబుతున్నాను. గదిలో ఎవరూ లేరు నేనొక్కడినే. నా దృష్టి అంతా ఉపన్యాసంమీదే ఉంది. ఇంతలో ఎవరో ఒక సన్యాసి. నల్లగా ఉన్నాడు. మామూలు సన్యాసి కాదు శృంగేరీ, కంచి పీఠాధిపతులలాగా జేగురురంగు బట్టలు కట్టుకున్నాడు. ఆ బట్టలు బుజం మీద ముడివేసుకున్నాడు. పిక్కలదాకా వంటి మీద బట్టలున్నాయి. శిరోముండనం జరిగి 20–25 రోజులయి ఉంటుంది. కొద్దికొద్దిగా జుట్టువస్తోంది. నల్లని జుట్టు. నా ప్రక్కనే సోఫాలో కూర్చుని వంగి పుస్తకంలోకి తలపెట్టి చూస్తున్నాడు. నాకు కొంచెం ఇబ్బంది అనిపించింది. నేను ఉపన్యాసం చెబుతుంటే ఈనెవరు మధ్యలో. కొంచెం చిరాగ్గా ప్రక్కకి చూశాను. ఒక్క క్షణం నా ముఖంలోకి చూసి నవ్వేశాడు. అంతే ఎవరూ లేరు. కళ్ళముందు ఇప్పటికీ నాకు కనిపిస్తూనే ఉంటుంది ఆ దృశ్యం. ఆయన మాధవిద్యారణ్యుడు. ఈయన శ్రీసూక్తానికి భాష్యం వ్రాశాడు. ఆయన చెప్పినప్రకారము శ్రీసూక్తం పారాయణ చేస్తే అఖండైశ్వర్యం ప్రాప్తిస్తుంది. కాబట్టి సంపుటిత శ్రీసూక్త పారాయణ చేసి ఎవరైనా ఫలితం పొందవచ్చు.

### సంపుటిత శ్రీసూక్తము

ఇందులో ముందుగా లక్ష్మీమంత్రము, తరువాత దుర్గా మంత్రము చెప్పి శ్రీసూక్తంలో ఒక ఋక్కు చెప్పాలి. ఆ తరువాత దుర్గామంత్రము, లక్ష్మీమంత్రము చెప్పాలి. ఇప్పుడు చూడండి.

**ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీద ప్రసీద శ్రీం**

హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః

దుర్గే స్మృతా హరసిభీతి మశేషజంతోః
స్వస్థైః స్మృతా మతి మతీవ శుభాం దదాసి ॥

హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణరజతస్రజామ్
చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ ॥

దారిద్ర్య దుఃఖభయహారిణికాత్వదన్యా
సర్వోపకార కరణాయ దయార్ద్ర చిత్తా ॥

ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీద ప్రసీద
శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః ॥

ఇప్పుడు ఒక బుక్కు పూర్తి అయింది. ఇలా పదిహేను బుక్కులు చెప్పాలి. పారాయణ చేసేటప్పుడు ఒకటి నుంచి పదిహేను బుక్కులదాకా పైనుంచి క్రిందికీ, క్రింద నుంచి పైకి, మళ్ళీ పై నుంచి క్రిందకి చేస్తే ఒక ఆవృత్తి అవుతుంది. ఇలా చెయ్యటానికి కనీసం గంట సమయం పడుతుంది. బిల్వవృక్షం క్రింద కూర్చుని, ఈ మంత్రజపం కనీసం ఒక సంవత్సరకాలమయినా చేస్తే కొంతవరకు ఫలితం కనిపిస్తుంది. ప్రతిరోజూ లక్ష్మీదేవిని పాలతో అభిషేకంచేసి క్షీరాన్నం నివేదన చెయ్యాలి. అమావాస్య, ఇతర పరవడిరోజుల్లో ఎక్కువ ఆవృత్తులు చెయ్యాలి. విద్యారణ్యుడు దీన్ని పారాయణ చేసే బంగారునిధి పొందాడు.

# 61. ఋభుసూక్తము

ఋగ్వేదంలోని **ప్రథమ మండలంలో ఇరవయ్యవ సూక్తాన్ని** ఋభుసూక్తము అంటారు. ఈ సూక్తాన్ని దర్శించినవాడు కణ్వుని కుమారుడు 'మేధాతిథి' ఇది గాయత్రీ ఛందస్సులో ఉంటుంది. దీనికి దేవత ఋభువులు. ఈ సూక్తంలో మొత్తం ఏడు మంత్రాలుంటాయి.

అంగీరసుని కుమారుడు సుధన్వుడు. అతనికి ముగ్గురు కుమారులు. వారే 1. ఋభుడు 2. విభుడు 3. వాజుడు వీళ్ళని వేదంలో **'ఋభువులు'** అంటారు. స్వతహాగా వీరు మానవులు, శిల్పులు. అంటే మన భాషలో ఇంజనీర్లన్నమాట. ప్రయాణమార్గాలైన భూమార్గము, జలమార్గము, వాయుమార్గము నిర్మించే వారు. దేవతల శిల్పి త్వష్ట. ఇతడు దేవతలకోసం 'చమసము' అనే పాత్ర తయారుచెయ్యగా ఋభువులు దాన్ని నాలుగుగా చేశారు. ఈ ఋభులు త్వష్టను కూడా మించిపోయారు. అనే కానేక ఘనకార్యాలు చేసి దైవత్వాన్ని పొందారు. వీరు ఘటనాఘటన సమర్థులు. వీరిని స్తుతి చేస్తూ చెప్పిన మంత్రాలే. ఋభు సూక్తాలు.

**సూక్తార్థము :**

1. ఋభువుల కోసం బ్రాహ్మణులు ఈ సూక్తాన్ని రచించారు. ఇది అపారమైన ధనాన్ని ఇస్తుంది.
2. ఇంద్రుని రథాన్ని లాగేవి హర్యశ్వాలు. అంటే ఆకుపచ్చని రంగులో ఉండే గుర్రాలు. కేవలము తలచినంత మాత్రం చేతనే అవి రథానికి కట్టబడతాయి. అటువంటి గుర్రాలను తయారుచేసిన వారు ఋభువులు. వాళ్ళు యజ్ఞముల యందు ఉంటారు.
3. అశ్వనీ దేవతల రథము ఎక్కడికైనా పోగలదు. ఆ రథాన్ని

తయారుచేసిన వాళ్ళు ఈ ఋభువులే, అంతేకాదు పాలిచ్చే ఆవును కూడా వారే సృష్టి చేశారు.

4. ఋభువులు మంత్రవేత్తలు, కల్లాకపటం లేనివారు. అన్నిరకాల పనులు చక్కపెట్టగల సమర్థులు. వారు తల్లితండ్రులను తిరిగి యవ్వనవంతులుగా చేశారు.

5. ఋభువులకు ఆనందాన్ని కలిగించే సోమరసము ఇంద్రుడు, మరుత్తులు, ఆదిత్యులకు కూడా ఇష్టమైనదే.

6. ఓ ఋభువులారా ! మేము చేసే స్తోత్రాలు వినండి. ఇందులోని ఒక్కొక్క మంత్రానికి 21 రెట్లు ఫలితాన్ని మాకు ప్రసాదించండి.

7. ఋభువులు తాము చేసిన గొప్ప పనులవల్ల దేవతలైనారు. యజ్ఞంలో దేవతలతో సమానంగా భాగంపొందారు.

ఈ సూక్తం పారాయణ చేస్తే అపారధనం లభిస్తుంది. అలాగే ఋగ్వేదంలోని **ప్రథమ మండలంలోని 11వ సూక్తం.** దీనికి ఋషి - అంగిరస పుత్రుడు కుత్సుడు, దేవత ఋభువు, ఛందస్సు-జగతి, త్రిష్టప్. ఇందులో మొత్తం ఐదు మంత్రాలుంటాయి.

**సూక్తార్థము :**

1. ఋభువులు గొప్ప పనులు చేశారు. అందమైన చక్రాలు గల రథాన్ని తయారుచేశారు. ఇంద్రుని వాహనాలుగా నాలుగు గుర్రాలను, సిద్ధం చేశారు. తల్లితండ్రులకు యవ్వనాన్నిచ్చారు. ఆవుకు దూడను ఏర్పాటు చేశారు.

2. ఓ ఋభువులారా! మా యజ్ఞం కోసం హవిస్సులు అందించండి. మంచి పనులు చెయ్యటానికి కుమారులను, మనమలను ఇవ్వండి. సంతానంతో పాటు సుఖంగా జీవించటానికి ధనాన్ని బలాన్ని

ఇవ్వవలసింది.

3. ఓ ఋభువులారా ! మేము కర్మలు ఆచరించటానికి అవసరమైన ధనాన్నివ్వండి. మా కుమారులకు, వారి కుమారులకు కూడా ధనాన్ని ప్రసాదించండి. గుర్రాల కోసం ధనాన్నివ్వండి. యుద్ధంలో మమ్మల్ని లెక్క చెయ్యనివారు ఎవరైనా సరే, వారిని మేము ఓడించాలి.

4. మమ్మల్ని రక్షించటానికి ఇంద్రుణ్ణి ఆహ్వానిస్తున్నాము. ఋభువు, విభువు, వాజులను, మరుద్గణాలను, అశ్వనీదేవతలను, మిత్రావరుణులను ఆహ్వానిస్తున్నాము. వారందరూ వచ్చి సోమపానం చెయ్యాలి. మమ్మల్ని ధనార్జనకు, శత్రుసంహారానికి ప్రోత్సహించాలి.

5. సుధన్వుని కుమారులలో మొదటివాడైన ఋభుడు మాకు ధనాన్ని, యుద్ధానికి అనుకూల వాతావరణము కల్పించాలి. మూడవవాడైన వాజుడు మమ్మల్ని రక్షించాలి.

ఇలా వేదంలో ధనం కోసం కొన్నిసూక్తాలు చెప్పబడ్డాయి.

# ౬౨. శత్రుసంహారం కోసం మన్యుసూక్తం

జీవితంలో శత్రువులు లేకపోతే మనకి ఎదురుండదు. అనుకున్న పనులన్నీ సాధించగలుగుతాం. ఐతే శత్రువులు లేకపోవటమనేది కల్లోని మాట. ఎంతటి అజాతశత్రువుకైనా ఎవరో ఒకరు శత్రువుంటారు. అటువంటి శత్రువుల మీద విజయం సాధించాలి అన్నా, శత్రుసంహారం చెయ్యాలి అన్నా మన్యుసూక్త పారాయణ చెయ్యమంటోంది ఋగ్వేదం. ఋగ్వేదంలోని పదవ మండలంలోని 83, 84 సూక్తాలు మన్యుసూక్తంగా చెప్పబడుతున్నాయి. దీనికి ఋషి మన్యువు. ఈ సూక్తానికి దేవత పేరు కూడా మన్యువే. సూక్తమంతా జగతి, త్రిష్టుప్ ఛందస్సులలో ఉంటుంది. ఈ సూక్తంలో మొత్తం పదిహేను మంత్రాలుంటాయి.

సామాన్యంగా శత్రుసంహారం కోసం మన్యుసూక్త పారాయణ చేస్తుంటారు. దీనిలో విశేషం ఏమిటంటే ఈ సూక్తాన్ని పైనుంచి క్రిందకు అంటే ఒకటి నుంచి పదిహేను మంత్రాలవరకు, మళ్ళీ తిరిగి క్రిందినుంచి పైకి అంటే పదిహేను నుంచి ఒకటవ మంత్రం వరకు పారాయణ చేస్తారు. ఇది అనులోమ విలోమ పారాయణ. మామూలుగాకన్న దీనికి బలం ఎక్కువ. ఫలితం కూడా ఎక్కువే. శత్రువు బలంగా ఉన్నప్పుడు అర్థాశ్చ, పాదాశ్చ, పూర్ణాశ్చ అని మూడు రకాలుగా పారాయణ చేస్తారు. ఇలా మూడు రకాలుగాను పారాయణ చేస్తేనే ఒక ఆవృతి పూర్తి అవుతుంది. దీనికి కనీసం గంట సమయం పడుతుంది. ఇలా నలభై రోజులు పారాయణ చేస్తే కోరిక తీరుతుంది. ఇప్పుడు ఈ సూక్తానికి అర్థం చూద్దాం.

**హరిః ఓమ్**

**యస్తే మన్యో విధద్వజ్రసాయకసహఓజః పుష్యతి విశ్వమానుషక్**

**సాహ్యామదాస మార్యం త్వయా యుజా సహస్కృతేన సహసా సహస్వతా॥1**

మన్యువు అనే ఈ దేవత వజ్రదేహుడు. బాణములాగా శత్రువులను తీక్షణంగా హింసిస్తాడు. అతన్ని పూజించిన వారికి ఓజస్సు, బలము కలుగుతాయి. అతని సహాయంతోనే మేము ఆర్యులు, దస్యులు అనే రెండు రకాల శత్రువులను ఓడించ గలుగుతాము. (దస్యులు అంటే ఒక జాతి దొంగలు) ఓ మన్యుదేవా ! నీవు బహుకర్తవు, బలరూపుడివి అంతేకాదు మహాబలవంతుడవు కూడా.

**మన్యురింద్రో మన్యురేవాస దేవో మన్యుర్హోతా వరుణో జాతవేదాః**

**మన్యుం విశ ఈళతే మానుషీర్యాః పాహి నో మన్యో తపసా సజోషాః॥2**

ఇందులో మన్యువే ఇంద్రుడు. అతడే దేవత. హోత వరుణుడు. లోకంలోని మానవులందరూ ఈ మన్యువును స్తుతిస్తారు. ఓ మన్యూ ! నువు మా తండ్రితో కలసి మమ్మల్ని రక్షించవలసినది.

**అభీహి మన్యో తవసస్త వీయాన్ తపసాయుజా విజహి శత్రూన్**

**అమిత్రహా వృత్రహా దస్యుహా చ విశ్వావసూ న్యాభరా త్వన్నః ॥3**

మన్యూ ! నీవు చాలా బలవంతుడవు. ఇక్కడకు వచ్చి నాతండ్రి సహాయంతో నా శత్రువులను నాశనం చెయ్యవలసినది. నీవు శత్రుసంహారకుడవు. దస్యహంతకుడవు. మా కోసం అన్ని రకాల ధనములను తీసుకురావలసినది.

**త్వం హి మన్యో అభిభూత్యోజా స్స్వయం భూర్భామో అభిమాతిషాహః**

**విశ్వచర్షణి స్సహురిస్సహావా నస్మా స్వోజః పృతనాసుధేహి ॥4**

ఓ మన్యూ! నీవు ఇతరులను ఓడించే వాడివి. స్వయంభువువు.

కాంతి మంతుడవు. శత్రుంజయుడవు. మా సేనలను పరాక్రమవంతులుగా చేయవలసినది.

**అభాగ స్సన్న పపరేతో అస్మి తవ క్రత్వా తవిషస్య ప్రచేతః**
**తంత్వామన్యో అక్రతుర్జిహీళాహం స్వాతనూర్బలదేయా యమేహి ॥5**

మంచి జ్ఞానం గల ఓ మన్యూ ! నీకు నేను యజ్ఞభాగం ఇవ్వలేకపోయాను. నీవు చాలా గొప్పవాడవు. అయినప్పటికీ నిన్ను నేను అర్చించలేకపోయాను. ఆ కారణంచేత నేను సిగ్గు పడుతున్నాను. నీ యిష్టప్రకారము నాకు ఫలప్రదానం చెయ్యటానికి రావలసింది.

**అయం తే అస్మ్యుపమే హ్యర్వాఙ్ప్రతీ చీనస్సహురే విశ్వధాయః**
**మన్యో వజ్రి న్నభి మామావవృత్స్వహనా వదస్యూన్ ఋతబో ధ్యాపేః॥6**

ఓ మన్యుదేవతా! నేను నీ దగ్గరకు వచ్చిచేరాను. నాకు ప్రసన్నుడవు కావలసినది. ప్రత్యక్షం కావలసినది. నువ్వు అక్రమాలు సహించగలవు. అందరినీ భరించగలవు. ఓ దేవా ! నన్ను నీ ఆత్మీయుడిగా భావించి నాకు అభ్యుదయాన్ని ప్రసాదించవలసినది. దానివల్ల నేను దస్యులను జయించగలుగుతాను.

**అభిప్రేహి దక్షిణతో భవామేధా వృత్రాణి జంఘనావభూరి**
**జుహోమి తే ధరుణ మ్మధ్వో అగ్రముభా ఉపాంశు ప్రథమా పిబావ ॥7**

ఓ దేవా ! నా దగ్గరకు రా ! నా కుడిప్రక్కన నుంచో, దానివల్ల శత్రు సంహారము మనమిద్దరము చెయ్యగలము. నీ కోసం ఉత్తమమైన సోమరసాన్ని హవనము చేస్తాను. ముందు మనం ఎక్కడైనా ఒంటరి ప్రదేశంలో సోమపానం చేద్దాము.

**త్వయా మన్యో సరథమారుజంతో హర్ష మాణాసో ధృషితా మరుత్వః**
**తిగ్మేషవ ఆయుధాః సంశిశానా అభిప్రయంతు నరో అగ్నిరూపాః ॥8**

ఓ మన్యుదేవతా ! మరుత్తులు మొ॥ వారు కూడా నీతో కలసి ఒకే రథం మీద కూచోవాలి. వారందరూ శౌర్యము, పరాక్రమము గలిగి, పదునైన బాణాలు ధరించి, ఎగసిపడే అగ్నిలాగా నీ సాయం కోసం యుద్ధానికి తరలి రావాలి.

**అగ్నిరివ మన్యో త్విషిత స్సహస్వ సేనానీర్నస్సహురే హూతఏధి**

**హత్వాయ శత్రూన్విభజస్వ వేద ఓజో మిమానో విమృధోనుదస్వ ॥9**

మన్యూ! నువ్వు అగ్నితో సమానమైన పరాక్రమము, కాంతి కలవాడవు. శత్రువులను జయించవలసింది. ఓ సహనశీలా ! నిన్ను పిలుస్తున్నాను. యుద్ధంలో నాకు సేనాపతి అయి శత్రునాశనం చెయ్యవలసింది. శత్రువుల ధనాన్ని నాకు ఇవ్వవలసినది.

**సహస్వ మన్యో అభిమా మస్మే రుజన్ మృణన్ ప్రమృణన్ ప్రేహి శత్రూన్**

**ఉగ్రంతే పాజోనన్వారు రుధ్రే వశన్నయసఏక జత్వమ్ ॥10**

మన్యూ ! మమ్మల్ని ఎదిరించే శత్రువులను నాశనం చెయ్యి. వారిని కొడుతూ, చీల్చి చండాడుతూ ముందుకు దూకవలసింది.

**ఏకో బహూనా మసిమన్యవీళితో విశం విశం యూధయే సంశిశాధి అకృత్త**

**రుక్త్వయా యుజా వయం ద్యుమంతం ఘోషం విజయాయ కృణ్మహే॥11**

ఓ మన్యూ ! నీకు స్తుతి జరుగుతున్నది. యుద్ధంలో నువ్వు సహాయంగా ఉండగా మాకు ఏ హానీ జరగదు.

**విజేషకృదింద్ర ఇవానవబ్రవో..3..స్మాకం మన్యో అధిపా భవేహ ప్రియంతే**

**నామ సహురే గృణీమసి విద్మాతముత్సం యత ఆ బభూథ॥12**

మన్యూ ! నువు ఇంద్రునితో సమానమైనవాడవు. నీ మాటకు ఎదురుండదు.

**ఆ భూత్యా సహజా వజ్రసాయకసహో బిభర్ష్యభిభూత ఉత్తరమ్**

**క్రత్వానో మన్యో సహమేధ్యేధి మహాధనస్య పురుహూత సంసృజి ॥13**

ఓ మన్యువూ నీవు వజ్రము వంటి శరీరము గలవాడవు. శత్రువులను ఓడించి పరాభవిస్తావు. శత్రువులను నాశనం చేస్తావు. నువు కర్మసహితుడవై మా యుద్ధంలో పాల్గొనాలని మేము నిన్ను ప్రార్థిస్తున్నాము.

**సంసృష్టం ధన ముభయం సమాకృత మస్మభ్యంధత్తాం వరుణశ్చమన్యుః**

**భియం దధానా హృదయేషు శత్రవః పరాజితాసో అపనిలయంతాం ॥14**

ఓ వరుణ మన్యులారా ! యుద్ధంలో లభించిన గోవులను, తెచ్చిన ధనాన్ని మాకు అందించండి. మమ్మల్ని చూసి శత్రువులు భయపడి పోవాలి. మాచేతిలో వారు ఓడిపోవాలి.

**ధన్వనాగా ధన్వనా జిం జయేమ ధన్వనా తీవ్రా స్సమదో జయేమ**

**ధనుశ్శత్రో రపకామం కృణోతు ధన్వనా స్సర్వాః ప్రదిశో జయేమ ॥15**

మా ధనస్సులతో శత్రువుల ఆయుధాలను జయిస్తాము. మా ధనస్సుతో యుద్ధంలో గెలుస్తాము. ఆ ధనస్సుతో మదించిన శత్రుసంహారం చేస్తాము. ఈ ధనస్సుతో అన్ని దిక్కులను జయింతుము గాక.

ఈ రకంగా శత్రుసంహారం కోసం మన్యుసూక్తం ఋగ్వేదంలో చెప్పబడింది.

# ౬౩. పరమేశ్వరుడు సర్వాంతర్యామి

పరమేశ్వరుడు సర్వాంతర్యామి. అన్నింటియందు అంతర్లీనంగా ఉంటాడు. చరాచర జగత్తంతా ఆవరించి ఉంటాడు. పిపీలికాది బ్రహ్మపర్యంతము అన్ని ప్రాణులయందు, అన్ని వస్తువుల యందు ఉంటాడు. ఇక్కడ అక్కడ అని లేదు ఈ జగత్తంతా ఆయన స్వరూపమే. ఛాందోగ్యోపనిషత్తులో సత్యకామజాబాలి కథ. జాబాలి అనే దాసిపుత్రుడు సత్యకాముడు. విద్యాభ్యాసం పూర్తిచేసి బ్రహ్మవిద్యని తెలుసుకోవటం కోసం గౌతముడి దగ్గరకు వెళ్ళాడు. శుశ్రూష చేస్తున్నాడు. కొన్ని సంవత్సరాలు గడిచినాయి. గౌతముడు ఏమి చెప్పలా. సమావర్తనానికి సన్నాహాలు జరుగుతున్నాయి. తనతో వచ్చిన వాళ్ళంతా విద్యాభ్యాసం పూర్తి చేశారు. వాళ్ళందరూ వెళ్ళిపోతున్నారు. కాని సత్యకాముడికి మాత్రం ఏమీ చెప్పలేదు గౌతముడు. విచారిస్తున్నాడు సత్యకాముడు. తాను చేసిన అపరాధం ఏమిటి? తనకు ఎందుకు గురువుగారు బ్రహ్మవిద్యను బోధించటం లేదు? లోలోపలే బాధపడుతున్నాడు. ఒకరోజున గురువుగారు పిలిచారు. 'సత్యకామా!' అన్నారు. వెంటనే పరుగున వచ్చాడు సత్యకాముడు. చేతులు కట్టుకుని నుంచున్నాడు. 'ఏమి ఆజ్ఞ గురువుగారూ?' అన్నట్లుగా. గురువుగారే చెప్పారు. "సత్యకామా! మన గోశాలలో బాగా చిక్కిపోయిన ఆవులు, ఆబోతులు నాలుగువందలు దాకా ఉన్నాయి. వాటిని అడవికి తీసుకుపోయి బాగా మేపి, వాటి సంఖ్య రెట్టింపు అయిన తరువాత తిరిగి రావలసింది." అన్నారు. సరే అన్నాడు సత్యకాముడు. ఆవులు ఆబోతులు తోలుకుని అడవికి బయలుదేరాడు. ఆవులు అడవిలో మేస్తున్నాయి. సత్యకాముడు చెట్టు క్రింద కూచుని విచారిస్తున్నాడు. నేనేం పాపం చేశాను? ఏ అపరాధం చేశాను? ఈ

ఆవుల సంఖ్య ఎప్పటికి రెట్టింపు అవుతుంది? ఇవి బాగా గడ్డి మెయ్యాలి. బలంగా తయారుకావాలి. పిల్లల్ని పెట్టాలి. ఆ పిల్లలు ఎదిగి మళ్ళీ పిల్లల్ని పెట్టాలి. ఇలా ఎన్ని సంవత్సరాలు ఉండాల్సి వస్తుందో? అని బాధపడుతున్నాడు. కాలం గడుస్తోంది. కొన్ని సంవత్సరాలు తిరిగి పోయినాయి. ఒకరోజున ఆవులు మేస్తున్నాయి. సత్యకాముడు చెట్టు క్రింద కూచుని ఆలోచిస్తున్నాడు. ఇంతలో ఆలమందలో నుంచి ఒక ముసలి ఆబోతు సత్యకాముడి ఎదురుగా నుంచుని సత్యకామా! అన్నది. ఆలోచనలలో నుంచి బయటకు వచ్చాడు సత్యకాముడు. ఆబోతు మాట్లాడుతున్నది. ఆశ్చర్యపోయాడు. అలాగే వింటున్నాడు. ఆబోతే మళ్ళీ అంటోంది. 'సత్యకామా! నీకు పరబ్రహ్మస్వరూపం గురించి కావాలి కదా ! నేను చెబుతాను విను. పరబ్రహ్మస్వరూపం నాలుగుపాదాలుగా ఉంటుంది. అందులో తూర్పు, పడమర ఉత్తరం దక్షిణం నాలుగుదిక్కులే పరబ్రహ్మ స్వరూపంలో మొదటి పాదము. ఓ సత్యకామా! గురువుగారు చెప్పినట్లుగా ఈ ఆవుల సంఖ్య రెట్టింపు అయింది. కాబట్టి నువు ఆవుల్ని తోలుకుని ఆశ్రమానికి బయలుదేరు. పరబ్రహ్మ యొక్క రెండవ పాదాన్ని నీకు అగ్నిదేవుడు చెబుతాడు" అంది. చాలా ఆనందించాడు సత్యకాముడు. ఆవుల్ని తోలుకుని ఆశ్రమానికి బయలుదేరాడు. ఆ మరునాడు సాయంత్రం అయింది. సత్యకాముడు ఒక తటాకం దగ్గర ఆగాడు. ఆవులన్నీ నీళ్ళు త్రాగి విశ్రమించినాయి. తానుకూడా అగ్నిని ప్రజ్వలింపచేసి చెట్టుక్రింద కూచున్నాడు. ఇంతలో అగ్నిహోత్రుడు ప్రత్యక్షమయి సత్యకామా! పరబ్రహ్మ స్వరూపంలో రెండవపాదం నీకు చెబుతాను. విను. ఆకాశం, అడవులు, కొండలు, ఎడారులు, లోయలు, నదీనదాలు, సముద్రాలు. అన్నీ పరబ్రహ్మ స్వరూపమే. ఇక బయలుదేరు. మూడవ పాదాన్ని

ఒక హంస చెబుతుంది" అన్నాడు. ఆ రాత్రికి అక్కడే ఉండి మరునాడు ఉదయమే బయలుదేరాడు సత్యకాముడు. రోజంతా ప్రయాణం చేశాడు. సాయంత్రం అయింది. మళ్ళీ తటాకం దగ్గర ఆగాడు. ఆవులు నీరు త్రాగి గడ్డి మేస్తున్నాయి. చీకటి పడుతోంది. అగ్నిని ప్రజ్వలింపచేసి దాని దగ్గర కూచుని సంధ్యావందనం చేస్తున్నాడు. ఆ సమయంలో ఒక హంస వచ్చి అక్కడ వాలి సత్యకాముడితో అంటోంది. "సత్యకామా! పరబ్రహ్మ యొక్క మూడవ పాదం చెబుతాను విను. సూర్యుడు, చంద్రుడు నక్షత్రాలు, గ్రహాలు అన్నీ పరబ్రహ్మ స్వరూపాలే. నాల్గవ పాదాన్ని ఒక నీటి పక్షి చెబుతుంది" అంటూ ఎగిరిపోయింది. తెల్లవారిన తరువాత మళ్ళీ బయలుదేరాడు సత్యకాముడు. మళ్ళీ సాయం సమయం. ఒక సరస్సు దగ్గర ఆగాడు. అగ్నిని ప్రజ్వలింప చేసి జపం చేసుకుంటున్నాడు. ఆ సమయంలో ఒక నీటి పక్షి వచ్చి అక్కడ వాలి చెప్పటం మొదలుపెట్టింది. "సత్యకామా! పరబ్రహ్మ స్వరూపంయొక్క నాల్గవ పాదాన్ని చెబుతాను విను. ప్రాణం బ్రహ్మ. మనస్సు బ్రహ్మ, దృష్టి బ్రహ్మ, శ్రోతం బ్రహ్మ. ఓ సత్యకామా! ఇక బయలుదేరి ఆశ్రమానికి వెళ్ళు. ఇప్పుడు నీకు పరబ్రహ్మ స్వరూపం గురించి పూర్తిగా తెలిసింది" అన్నది. పరమానందం చెందాడు సత్యకాముడు. రాత్రి బాగా చీకటి పడింది. కాని అతని కళ్ళ ముందు దివ్యమైన కాంతులు కనిపిస్తున్నాయి. అతడి మనస్సు ఆనంద డోలికలలో తేలిపోతోంది. రాత్రంతా పరమానందంలో తేలిపోయాడు. ఎప్పుడు తెల్లవారుతుందా? అని ఎదురు చూస్తూ కూచున్నాడు. తెలతెలవారింది. లేచాడు. ఆవుల్ని తోలుకుని ఆశ్రమానికి బయలుదేరాడు. ప్రొద్దువాలే సమయానికి ఆశ్రమ ప్రాంగణం చేరుకున్నాడు. సత్యకాముడు వస్తున్నాడన్న వార్త ముందుగానే చేరింది

గౌతముడికి. సత్యకాముడికి ఎదురు వచ్చాడు. సత్యకాముడి ముఖం విపరీతమైన తేజస్సుతో ప్రకాశిస్తోంది. "సత్యకామా! ఏమైంది? నీ ముఖం దివ్యమైన కాంతులతో ప్రకాశిస్తోంది. నీకు ఎవరైనా బ్రహ్మవిద్యను ఉపదేశించారా?" అని అడిగాడు. జరిగిందంతా చెప్పాడు సత్యకాముడు. ఆనందించాడు గురువుగారు. సత్యకామా! నువు చాలా వరకు విషయం తెలుసుకున్నావు. మిగిలింది నేను చెబుతాను విను. అంటూ బ్రహ్మవిద్యను పూర్తిగా బోధించాడు. సత్యకాముడు కొంతకాలం తరువాత గురుకులాన్ని స్థాపించాడు. అతని శిష్యుడు ఉపకోశలుడు. ఆ ఉపకోశలుడికి అగ్నులు బ్రహ్మోపదేశం చేస్తాయి. "ఉపకోశలా ! ప్రాణమే బ్రహ్మ. ఆకాశమే బ్రహ్మ. ఆనందమే బ్రహ్మ" హృదయమందే బ్రహ్మతత్త్వముంటుంది. ఆనందము అనేది ఆ తత్త్వము యొక్క నిజస్వరూపము. భూమి, సూర్యుడు, చంద్రుడు ఆ పరబ్రహ్మ యొక్క రూపాంతరాలే. సూర్యునిలో ఉన్న బ్రహ్మతత్త్వము, నీలో ఉన్న బ్రహ్మతత్త్వము ఒకటేను" అని చెబుతాయి.

ఈ రెండు కథలను బట్టి తెలిసేది ఏమంటే ఈ జగత్తులో నాలుగు దిక్కులు పరబ్రహ్మ స్వరూపమే. భూమ్యాకాశాలు, సముద్రాలు, నదులు, పరబ్రహ్మ స్వరూపమే. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, పరబ్రహ్మ స్వరూపమే. ప్రాణం బ్రహ్మ. శ్రోత్రం బ్రహ్మ. దృష్టి బ్రహ్మ. సూర్యుడిలో ఏ తత్త్వమయితే ఉన్నదో అదే నీలోనూ ఉన్నది. చంద్రునిలో ఏ తత్త్వమయితే ఉన్నదో అదే నీలోనూ ఉన్నది. అంటే చరాచరాత్మకమైన జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. ఈ జగత్తులో పరమేశ్వర స్వరూపం తప్ప ఇంకేం లేదు. అలాగే బృహదారణ్యకోపనిషత్తులో ఉద్దాలకుడు అంతర్యామి ఎవరో వివరించ మని యాజ్ఞవల్క్యుణ్ణి అడుగుతాడు. ఈ రకంగా పరమేశ్వరుడు సర్వాంతర్యామి. అన్నింటియందు ఉన్నాడు. ఈ జగత్తంతా ఆవరించి ఉన్నాడనే విషయం అనేక చోట్ల చెప్పబడింది. ఋగ్వేదంలోని నారాయణ సూక్తంలో ఈ విషయం చెప్పబడింది.

# 64. నారాయణ సూక్తమ్

**ఓం సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువమ్ ।**
**విశ్వం నారాయణ న్దేవమ్ అక్షరం పరమం పదమ్ ॥1**

వేయి శిరస్సులు గలవాడు, అనేక నేత్రములు గలవాడు లోకాలకు సుఖాన్ని కలిగించేవాడు, అన్నింటి యందు వ్యాపించి ఉన్నవాడు, సమస్త ప్రాణికోటికి ఆధారమైన వాడు, శాశ్వతమైన వాడు, అందరికీ శుభానిచ్చేవాడు, మోక్షస్థానమైన వాడు అయిన శ్రీమన్నారాయణుడికి నమస్కారము.

**విశ్వతః పరమా న్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్ ।**
**విశ్వ మేవేదం పురుష స్తద్విశ్వ ముపజీవతి ॥2**

చరాచర జగత్తుకు అతీతమైనవాడు, జగత్తే తానైన వాడు, నిత్యుడు, సర్వవ్యాపకుడు, జగత్తు అంతటికీ జీవనాధారమైన నారాయణునికి నమస్కారము.

**పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివ మచ్యుతమ్ ।**
**నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్ ॥3**

విశ్వపతి, విశ్వానికి ఈశ్వరుడు, నాశనము లేనివాడు, మంగళప్రదుడు, తెలుసుకోతగిన వాడు, పరమాత్ముడు, విశ్వాత్ముడు, విశ్వపరాయణుడు అయిన శ్రీమన్నారాయణునికి నమస్కారము.

**నారాయణ పరోజ్యోతి రాత్మా నారాయణః పరః**
**నారాయణ పరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః**
**నారాయణ పరో ధ్యాతా ధ్యానం నారాయణః పరః ॥4**

ఆ శ్రీమన్నారాయణుడే పరంజ్యోతి. అతడే పరమాత్మ స్వరూపుడు. అతడే పరబ్రహ్మ. అతడే పరమతత్త్వము. ధ్యానము అతడే. ధ్యానం చేసేవాడు అతడే.

**యచ్చ కించి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా**

**అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః ॥5**

బ్రహ్మాండంలో ఈ జగత్తంతా మహదాకాశంలో వేరుగా కనిపించే ఘటాకాశంలాగా వేరుగా కనిపిస్తున్నది. ఈ జగత్తు లోపలా బయటా కూడా శ్రీమన్నారాయణుడే వ్యాపించి ఉన్నాడు.

**అనన్తమవ్యయం కవిగ్ం సముద్రేఽన్తం విశ్వ శంభువమ్।**

**పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యథోముఖమ్ ॥6**

అతడు అనంతుడు. అచ్యుతుడు. సంసార సాగరం నుంచి విముక్తి కలిగించి సుఖాన్నిచ్చేవాడు. కంఠానికి దిగువ భాగంలో నాభికి పై భాగాన 12 అంగుళాల ప్రమాణం కలిగి అధోముఖంగా ముకుళించిన పద్మంలాగా హృదయమున్నది.

**అథో నిష్ట్యా వితస్త్యాన్తే నాభ్యా ముపరి తిష్ఠతి ।**

**జ్వాలమాలాకులం భాతి విశ్వస్యాఽయతనం మహత్ ॥7**

**సన్తతగ్ం శిలాభిస్తు లంబత్యాకోశసన్నిభమ్ ।**

**తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్ ॥8**

**తస్య మధ్యే మహానగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః**

**సోఽగ్రభుగ్విభజన్ తిష్ఠ న్నాహార మజరః కవిః**

**తిర్యగూర్ధ్వ మధశ్శాయీ రశ్మయ స్తస్య సంతతా ॥9**

ఆ హృదయకమలాన్నాశ్రయించి జ్వాలా సమూహంతో వెలుగుతూ జీవులన్నింటికీ ప్రధాన స్థానమై, అనేకమైన నాడీ మండలాలకు ఆలంబనమై, సగము విచ్చిన పద్మంలాగా హృదయ స్థానంలో పై భాగాన ఒక కమలమున్నది. అందులోనే సర్వము ప్రతిష్ఠతమై ఉన్నది. దాని మధ్యన దివ్యమైన కాంతులు ప్రసరింప చేసే అగ్ని ఉన్నాడు. అదే జఠరాగ్ని.

**సన్తాపయతి స్వం దేహ మాపాదతల మస్తకః**
**తస్య మధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః ॥10**

మనము తిన్న ఆహారాన్ని ఈ జఠరాగ్ని సముచిత భాగాలుగా చేసి పైకి క్రిందకీ ప్రక్కలకీ పంపుతుంది. ఆ అగ్నికిరణాలు ఆపాదమస్తకము వ్యాపించి ఉన్నాయి. ఇలా ధ్యానం చేసే యోగులు గొప్ప తేజోవంతులవుతారు.

**నీలతో యదమధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా ।**
**నీవారశూకవత్తన్వీ పీతాభా స్వత్యణూపమా ॥11**

ఈ జఠరాగ్ని మధ్యన అతిసూక్ష్మమైన అగ్నిశిఖ ఉన్నది. అది నీలమేఘంలోని మెరుపులాగా ప్రకాశిస్తున్నది. అది అణు స్వరూపంతో ధాన్యపుగింజ ముల్లులాగా ఉండి పచ్చని వన్నెతో ప్రకాశిస్తుంటుంది.

**తస్యా శ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః ।**
**స బ్రహ్మ స శివ స్సహరి స్సేన్ద్ర స్సోక్షరః పరమస్స్వరాట్ ॥12**

ఆ అగ్నిశిఖ మధ్యన పరమాత్మ ఉంటాడు. అతడే బ్రహ్మ. అతడే విష్ణువు. అతడే శివుడు. అతడే ఇంద్రుడు. నాశనము లేనివాడు. అన్నింటికీ మూలకారణమైన వాడు. స్వయంప్రకాశకుడు. అతడే

మరమాత్మ.

**ఓం తద్బ్రహ్మ ఓం తద్వాయుః ఓం తదాత్మా ఓం తత్సత్యం**
**ఓం తత్సర్వం ఓం తత్పురోర్నమః**
**అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు**
**త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వమింద్రస్త్వగ్ం**
**రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః**
**త్వం తదాప ఆపో జ్యోతి రసోమృతం**
**బ్రహ్మ భూర్భువస్సువరోమ్ ॥13**

ఓం అనే ప్రణవమే పరబ్రహ్మస్వరూపము. అదే వాయువు, అదే ఆత్మ. అదే సత్యము. అన్నింటికీ కారణమైనది అదే. ఆ పరబ్రహ్మ స్వరూపానికి నేను నమస్కరిస్తున్నాను. ఆ పరమాత్మ అందరి హృదయాలలోను నెలకొనిఉంటాడు. పర్వతగుహల్లో సంచరిస్తాడు. విశ్వమంతా వ్యాపించిఉంటాడు.

ఓ దేవా ! నువ్వే యజ్ఞము. నువ్వే వషట్కారము. నువ్వే ఇంద్రుడు. నువ్వే రుద్రుడు. నువ్వే విష్ణువు. నువ్వే బ్రహ్మవు. ప్రజలను రక్షించేవాడవు నువ్వే. స్వయం ప్రకాశమైన ఆత్మజ్యోతివి నువ్వే. అమృత స్వరూపానివి నువ్వే. రసరూపుడవు నువ్వే. బ్రహ్మ స్వరూపుడవు నువ్వే. భూలోక, భువర్లోక, సువర్లోకాలలో ప్రణవ నాదానివి, ప్రణవ స్వరూపానివి నువ్వే. అటువంటి ఓ పరమాత్మా! నీకు నమస్కారము.

ఇందులో శ్రీమహావిష్ణువే పరమేశ్వర స్వరూపము. అతడే శ్రీమన్నారాయణుడు. ఈ జగత్తంతా ఆవరించి ఉన్నాడని చెప్పారు. కృష్ణయజుర్వేదంలోని **స్కందోపనిషత్తులో**

**వ్యతిరిక్తం జడం సర్వం స్వప్నవచ్చవినశ్యతి ।**

**చిజ్జడానాంతు యోద్రష్టా సోచ్యుతో జ్ఞానవిగ్రహో ॥**

ఆత్మకన్న ఇతరమైన వస్తువులన్నీ జడాలే. అవన్నీ నశించిపోతాయి. చేతనాచేతనములు రెండింటినీ చూసేవాడే విష్ణువు. అతడు నాశనము లేనివాడు.

**స ఏవహి మహాదేవ స్సఏవహి మహోహరిః ।**
**స ఏవజ్యోతిషాంజ్యోతి స్సఏవ పరమేశ్వరః ॥**

ఆ మహాదేవుడే విష్ణువు. జ్యోతులకెల్ల జ్యోతియైన వాడు. పరమేశ్వరుడు.

**స ఏవహి పరంబ్రహ్మ తద్బ్రహ్మాహం న సంశయః ।**
**జీవశ్శివ శ్శివోజీవ స్సజీవః కేవలః శ్శివః ॥**

ఆ విష్ణువే పరబ్రహ్మ స్వరూపము. నేను ఆ బ్రహ్మమునే అయి ఉన్నాను. ఇందులో అనుమానం లేదు. జీవుడే శివుడు. శివుడే జీవుడు. ఆ జీవుడే శివుడు.

విష్ణువే పరమేశ్వరుడు అని చెబుతున్నారు విష్ణువు అంటే సర్వవ్యాపకుడు అని అర్థం. నిరుక్తంలో **చరాచరేషు భూతేషు విశనాద్విష్ణురుచ్యతే ॥** తన యొక్క విభూతులైన చరాచరాత్మకములైన భూతములు అన్నింటియందు వ్యాపించి ఉండువాడు. అని చెప్పబడింది.

అందుకే పరమేశ్వరుడు సర్వవ్యాపి. కృష్ణయజుర్వేదంలోని శతరుద్రీయంలో కూడా ఈశ్వరుడికి సర్వవ్యాపకత్వమే చెప్పబడింది. కాబట్టి ఈశ్వరుడు అంటే పరమేశ్వరుడు, పరబ్రహ్మ. అతడు సర్వవ్యాపి సర్వాంతర్యామి. మానవుల యొక్క హృత్పద్మంలోనే సూక్ష్మరూపంలో ఉంటాడు అని చెబుతోంది వేదం.

# 65. భూసూక్తము

ఓ గార్హపత్య ప్రదేశమా ! నువ్వు త్రిలోకాత్మవు. నువ్వు బాహుళ్యము చేత భూమిని, శ్రేష్ఠత్వము చేత ద్యులోకానివి, మహత్వముచేత అంతరిక్షానివి అవుతున్నావు. ఓ అదితి దేవీ! గార్హపత్య ప్రదేశ రూపురాలయిన ఓ భూదేవీ! నీ ఒడిలో గార్హపత్యాగ్నిని, యజమాని తినటానికి యోగ్యమైన అన్నం కలగచెయ్యటంకోసం నిన్ను స్తోత్రం చేస్తున్నాము.

గార్హపత్యాగ్ని ఆదిత్యరూపంలో చరించేవాడై, తెల్లని వర్ణనము కలవాడై, జగత్తును ఆక్రమిస్తాడు. అలా ఆక్రమించటంలో తన తల్లి అయిన భూమిని చేరుతుంటాడు. ఆదిత్య రూపమయిన గార్హపత్యాగ్ని సంబంధమైన 30 సంఖ్య గల స్థానము ప్రకాశిస్తున్నది. (ఒక రోజులో పగటిపూట 15, రాత్రిపూట 15 వెరసి 30 సంఖ్య అవుతుంది) వేదంలో చెప్పిన స్తోత్ర రూపమైన వాక్కు పక్షిలాగా ఆకాశంలో సంచరించే సూర్యుణ్ణి ఆశ్రయించినది. ఓ గార్హపత్యాగ్ని ! నిన్ను గురించి మేము చేసిన ఉద్వాసన రూపమయిన ప్రతికూలత నీ మనసులో అట్టిపెట్టుకోవద్దు. జ్ఞానస్వరూపమైన నీ కాంతులతో మేము ఇచ్చే ఆహుతులు దేవతలకు అందించవలసినది. ఆదిత్యుడి కాంతి ఉచ్ఛ్వాస రూపమై ఉదయము, నిశ్వాస రూపమై అస్తమయము చేస్తూ భూమి ఆకాశాల మధ్య సంచరిస్తోంది. ఓ గార్హపత్యమా! యజమానుల కోసం నిన్ను ఆరాధిస్తున్నాను. ఓ దక్షిణాగ్నీ! నేను కోపంతో నిన్ను దారిద్ర్య హేతువుతో ఉద్వాసనము చేశాను. ఇప్పుడు మళ్ళీ నిన్ను నేను ప్రజ్వలింపచేస్తున్నాను. ఓ ఆహవనీయాగ్నీ! నా కోపంతో నిన్ను ఉద్వాసన చేశాను. అందువల్ల నీ తేజస్సు భూమిలో ప్రవేశించి ధ్వంసమైంది. అటువంటి నీ తేజస్సును ఆదిత్యుడు, విశ్వేదేవతలు

మళ్ళీ తీసుకువస్తారు. సర్వవ్యాపకుడయిన విష్ణువు యొక్క భార్య, లక్ష్మీదేవి ప్రియసఖి, విష్ణువల్లభ అయిన భూదేవికి నమస్కారము. గురువుగారి దగ్గర శాస్త్రాలు చదివి ధనుస్సును కూడా పట్టుకున్నది అన్ని పనులు సిద్ధింపచేయునది అయిన భూదేవిని ధ్యానించుచున్నాను. భూదేవి యొక్క జ్ఞానము చక్కగా కలిగేటట్లుగా ఆమెను ధ్యానించటానికి మమ్ములను ప్రేరేపించును గాక. ఓ భూదేవీ! అమృత రూపమైన కర్మఫలాన్ని రక్షించేది, శ్రవణా నక్షత్రరూపమైనది, అయిన నీ శరీరము గూర్చి జనులు వింటున్నారు. నేను కూడా శ్రవణా నక్షత్రము యొక్క పుణ్యమైన కీర్తి రూపమైన వాక్కును వింటున్నాను. గొప్ప గుణాలు గలది, అమితంగా ప్రకాశించేది, సంతాపము లేనిది, మాకు అభిముఖమైన శ్రవణా నక్షత్రాన్ని మేము ఆరాధిస్తున్నాము. ముల్లోకాలు ఆక్రమించిన విష్ణువు కీర్తిని కోరేదై శ్రవణా నక్షత్రరూపము పొందింది.

జీవజాలాన్ని పుట్టించేది, వాటికి తగిన స్థలాలు ఏర్పాటు చేసేది, మల మూత్రాలన్నీ భరించేది, క్షమా అనే సార్ధకనామం గల భూదేవీ! మా దుఃఖాలను నశింపచేయవలసినది. అనంతమైనది, ప్రాణులందరికీ తల్లి అయినది. మధుకైటభుల మేథస్సుతో వృద్ధి పొందినది. గొప్ప గుణాలు కలది, పూజ్యురాలు, పరమాత్మ సంబంధమైనది, తనను ఉపాసించే వారిని రక్షించేది, అనేక పదార్థాలతో నిండినది, జగత్తులకు ఆశ్రయమైనది, సుఖస్వరూపిణి, అనేక రకాల పంటలకు ఆలవాలమైనది, పారిజాత వృక్షము మొదట్లో, మణిమయ మంటపంలో సకల లోకాలు ధరించి ఉండే భూదేవిని ధ్యానిస్తున్నాను. అందమైనది, యవ్వనవతి నాలుగు భుజముల యందు రెండు నల్లకలువలు, వరిధాన్యపుకంకి, చిలుక ధరించిన భూదేవికి నమస్కారము. విద్వాంసులందరు ఆ దేవిని కీర్తించి జ్ఞానాన్ని పొందుతున్నారు.

ప్రణవంతో ప్రతిపాదించబడే ఓ పరమాత్మా ! మాకు ఆధ్యాత్మికమైన విఘ్నములు రాకుండు గాక. ఆధిదైవిక, ఆధిభౌతిక విఘ్నాలు రాకుండు గాక.

## భూసూక్తమ్

ఓమ్ భూమిర్భూమ్నా ద్యౌ ర్వరిణా న్తరిక్షం మహిత్వా ।
ఉపస్థేతే దేవ్యదితేగ్నిమన్నాద మన్నాద్యాయాదధే ॥1
ఆయఙ్గౌః పృశ్నిరక్రమీదసనన్మాతరం పునః ।
పితరఞ్చ ప్రయన్త్సువః ॥2
త్రిగ్ం శద్ధామ విరాజతి వాక్పతఙ్గాయ శిశ్రియే
ప్రత్యస్య వహద్యుభిః ॥3
అస్య ప్రాణాదపానత్యన్తశ్చరతి రోచనా
వ్యఖ్యన్మహిషస్సువః ॥4
యత్వా క్రుద్ధాః పరోవపమన్యునా యదవర్త్యా
సుకల్పమగ్నే తత్తవ పునస్త్వోద్దీపయామసి ।
యత్తే మన్యుపరోప్తస్య పృథివీ మనుదధ్వసే
ఆదిత్యా విశ్వే తద్దేవా వసవశ్చ సమాభరన్ ॥5
మేదినీ దేవీ వసుంధరా స్యాద్వసుధా దేవీ వాసవీ (వాసుకీ)
బ్రహ్మవర్చసః పితృణామ్ శ్రోత్రం చక్షుర్మనః ॥6
దేవీ హిరణ్యగర్భిణీ దేవీ ప్రసోదరి ।
సదనే సత్యాయనే సీద ॥7
సముద్రవతీ సావిత్రీ ఆ(హ)నో దేవీ మహ్యంగి(కీ)
మహో ధరణీ మహోత్యతిష్ఠత్ ॥8

శృఙ్గే శృఙ్గే యఙ్ఞే విభీషణీ
ఇన్ద్రపత్నీ వ్యాపినీ సరసిజ ఇహ ॥9
వాయుమతి జలశయనీ స్వయం ధారాజా సత్యంతో పరి
మేదినీ  సోపరిధత్తంగాయ10
విష్ణుపత్నీం మహీం దేవీం మాధవీం మాధవప్రియామ్ ।
లక్ష్మీం ప్రియసఖీం దేవీం నమామ్యచ్యుతవల్లభామ్ ॥11
ధనుర్ధరాయై విద్మహే సర్వసిద్ధ్యై చ ధీమహి
తన్నో ధరా ప్రచోదయాత్ ॥12
శృణ్వన్తి శ్రోణామమృతస్య గోపాం
పుణ్యామస్యా ఉపశృణోమి వాచమ్ ।
మహీందేవీం విష్ణుపత్నీ మజూర్యాం
ప్రతీచీమేనాగ్ం హవిషా యజామః ॥13
త్రేధా విష్ణు రురుగాయో విచక్రమే
మహీన్దివం పృథివీ మన్తరిక్షమ్
తచ్ఛ్రోణైత్రిశవ ఇచ్ఛమానా
పుణ్యగ్గ్ శ్లోకం యజమానాయ కృణ్వతీ ॥14
స్యోనాపృథివిభవానృక్షరానివేశనీ యచ్ఛానశ్శర్మ సప్రథాః15
అదితిర్దేవా గంధర్వా మనుష్యాః పితరో సురాస్తేషాగ్ం
సర్వ భూతానాం మాతా మేదినీ మహతా మహీ
సావిత్రీ గాయత్రీ జగత్యుర్వీ పృథ్వీ బహులా విశ్వా
భూతాకతమాకాయాసా సత్యేత్యమృతేతి వసిష్ఠః 16

ఇక్షుశాలియవసస్యఫలాఢ్యే పారిజాత తరుశోభితమూలే
స్వర్ణ రత్నమణి మంటప మధ్యే చిన్తయేత్ సకల లోకధరిత్రీమ్ 17

శ్యామాం విచిత్రాం నవరత్న భూషితాం
చతుర్భుజాం తుంగపయోధరాన్వితామ్ ।
ఇన్దీవరాక్షీం నవశాలి మంజరీం
శుకం దధానాం శరణం భజామహే ॥18

సక్తుమివ తితఉనా పునంతో యత్ర ధీరా మనసా వాచ మక్రత
అత్రా సఖాయస్సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీర్నిహితాధివాచి 19

*ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః*

# ౯౯. నీళాసూక్తము

విష్ణువు యొక్క భార్య నీళాదేవిని శరణు పొందుతున్నాము. త్రయస్త్రింశ స్తోమానికి అధిష్ఠానమైన ఊర్ధ్వదిగ్రూపిణి అయిన ఓ నీళాదేవీ! లోకాలను పాలించే ఓ భువనస్యపత్నీ ! వివస్వత్తు అనే వాయువు గల ఓ వివస్వద్వాతా। మాకు హితము చెప్పవలసినది. ఓ సవితా ! ఊర్ధ్వదిగ్రూపిణి అయిన ఈ నీళాదేవి మా కోసం నెయ్యి మొదలైన రస ద్రవ్యాలు చేకూర్చేది. పాలనశక్తి కలవారుగా చేసేది, పాలు మొదలైనవి అనుగ్రహించేది, ప్రీతి హేతువు, అయినది అయ్యేటట్లుగా ప్రేరేపించ వలసింది. విష్ణుపత్ని, శాంతరూపము కలది. దిక్కుల మధ్య స్థిరముగాఉండేది, అంతటా సమాన రూపము గలది, అయిన ఓ నీళాదేవీ ! సర్వవాయువులు మాకు హితము చేకూర్చుగాక. ద్యులోకానికి ఆధారభూతమైనది, భూమిని ధరించేది, ఈ జగత్తుకు అధినాయకురాలు, అన్నము కలిగించేది, ఐశ్వర్య సంపన్న, అయిన నీళాదేవి మాకు శుభములనిచ్చి, శాంతి సుఖము కలుగచేయును గాక. విష్ణుపత్ని అయిన నీళాదేవిని గురుముఖంగా తెలుసుకున్నాను. ఆ దేవి లక్ష్మియొక్క సఖి. జ్ఞానధ్యానాదుల కోసం మమ్ము ప్రేరేపించును గాక. ఓ దేవీ ! మాకు ధనం ఇవ్వటానికి ఆర్యముడు, బృహస్పతి, ఇంద్రులను ప్రేరేపించు. వాక్కు, సవిత, విష్ణువు, సరస్వతులను ప్రేరేపించు. మేము ఈ అభిషేకానికి ముందు కర్మారంభకులైన సోముడు, రాజు, వరుణుడు, అగ్ని, వీరిని అనుసరించి ప్రారంభించాము. అందువల్ల వారందరు మమ్ములను అనుగ్రహింతురు గాక. ఓ దేవీ ! సామ్రాజ్యము నిమిత్తము నేను నిన్ను అభిషేకించుచున్నాను. దేవతలందరి అనుమతితో సామ్రాజ్యం కోసం నిన్ను అభిషేకించుచున్నాను. రాజు సామ్రాజ్యము చేయాలనే

శుభసంకల్పంతో, ప్రతిబంధకా లయిన పాపాలను నివారించటానికి కూచుని ఉన్నాడు. దేవతా సంబంధమైన బాహువులు, పూష సంబంధమైన చేతులు, అశ్వనీ దేవతల సంబంధమైన ఔషధాలతో శాంతి కోసం, బ్రహ్మవర్చస్సు కోసం నిన్ను స్నానం చేయిస్తున్నాను. పవిత్రుదేవుని ప్రేరణతో, అశ్వనీ దేవతా సంబంధమైన బాహువులతో, పూషుని సంబంధమైన చేతులతో, ఇంద్రుని వీర్య రూప రసముతో, ఐశ్వర్యము, కీర్తి, బలము కోసం నిన్ను అభిషేకిస్తున్నాను. నీకు నేను చేసే ఈ అభిషేకము అమృతాభిషేకము అగుగాక.

# నీలాసూక్తమ్

నీళాందేవీగ్ం శరణమహం ప్రపద్యే ।1

స్తోమత్రయస్త్రిగ్ంశే భువనస్య పత్ని వివస్వద్వాతే అభినో గృణాహి ॥2

ఘృతవతీ సవితరాధిపత్యైః పయస్వతీరన్తి రాశానో అస్తు ।
ధ్రువా దిశాం విష్ణు పత్న్యఘోరా స్యేశానా సహసోయామ నోతా ।
బృహస్పతి ర్మాతరిశ్వోతవాయు స్సన్ధువానా వాతా అభినో గృణన్తు ॥3

విష్టమ్భోదివోధరుణః పృథివ్యా అస్యేశానా జగతో విష్ణుపత్నీ ।
విశ్వవ్యచా ఇషయన్తీ సుభూతిశ్శివానో అస్త్వదితిరుపస్థే ॥4

విష్ణుపత్న్యై చ విద్మహే శ్రీభూసఖ్యైచ ధీమహి ।
తన్నో నీళా ప్రచోదయాత్ ॥5

అర్యమణం బృహస్పతి మిన్ద్రం దానాయ చోదయ
వాచం విష్ణుగ్ం సరస్వతీగ్ం సవితారఞ్చ వాజినమ్ ।
సోమగ్ం రాజానంవరుణ మగ్నిమన్వారభామహే
ఆదిత్యాన్విష్ణుగ్ం సూర్యం బ్రహ్మాణశ్చ బృహస్పతిమ్ ॥6

దేవస్యత్వా సవితుః ప్రసవేశ్వినో ర్బాహుభ్యాం పూష్ణోహస్తాభ్యాగ్ం

సరస్వత్యై వాచో యంతుర్యంత్రేణాగ్నేస్త్వా సామ్రాజ్యేనాభిషించా

మీంద్రస్య బృహస్పతే స్త్వాసామ్రాజ్యే నాభిషించామి ॥7

నిషసాదధృత ప్రతోవరుణః పస్త్యాస్వ సామ్రాజ్యాయసుక్రతుః

దేవస్య త్వా సవితుః ప్రసవే । అశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యామ్ ।

అశ్వినోర్భైషజ్యేన తేజసే బ్రహ్మవర్చ సాయాభిషిఞ్చామి ॥8

దేవస్య త్వా సవితుః ప్రసవే । అశ్వినోర్బాహుభ్యాం పూష్ణోహస్తాభ్యామ్ ।

సరస్వత్యై భైషజ్యేన । వీర్యాయాన్నాద్యా యాభిషిఞ్చామి ॥9

దేవస్య త్వా సవితుః ప్రసవే  అశ్వినోర్బాహుభ్యాం పూష్ణోహస్తాభ్యామ్ ।

ఇంద్రస్యేంద్రియేణ శ్రియై యశసే బలాయాభిషించామి ॥

అమృతాభిషేకోస్తు ॥10

ఓం శాంతిః శాంతిః శాంతిః

# 67. దుర్వాసూక్తము

స్నానం చేసేటప్పుడు నెత్తిన మట్టి, గరిక పెట్టుకుని స్నానం చెయ్యాలి. ఇలా చేస్తే అన్ని పాపాలు నశిస్తాయి. వంశాభివృద్ధి జరుగుతుంది. అలాటి సమయంలో దుర్వ అంటే గరికను నెత్తిన పెట్టుకుని చెప్పే మంత్రాన్నే దుర్వాసూక్తము అంటారు.

**సహస్ర పరమాదేవీ శతమూలాశతాంకురా**
**సర్వగ్ం హరతుమే పాపం దూర్వా దుస్స్వప్న నాశనీ ॥**
**కాండాత్కాండా పురోహన్తీ పరుషః పరుషః పరి**
**ఏవానో దూర్వే ప్రతను సహస్రేణ శతేనచ ॥**
**యాశతేన ప్రతనోషి సహస్రేణ విరోహసి**
**తస్యాస్తే దేవీష్టకే విధేమ హవిషావయమ్ ॥**

పావన హేతువులయిన వెయ్యి ద్రవ్యాలకన్నా కూడా ఉత్కృష్టమైనది. బాగా ప్రకాశించేది, ఎన్నో మూలములు గలది, ఎన్నో అంకురాలు గలది, దుఃస్వప్ననాశని అయిన దూర్వాభిమానిదేవత నా పాపాలను పూర్తిగా హరించుగాక. పాపాలను నాశనం చేసే ఓ గరికా ! నువ్వు ప్రతికణుపుకు మొలుస్తూ, ప్రతి మొదలు నుంచీ పెరుగుతావు. అలాగే మమ్మల్నికూడా వందలు, వేలు సంతతితో అనేక రకాలుగా విస్తరింప చేయ వలసింది. ప్రతికణుపుకు వేర్లు పుట్టి నువ్వు పెరిగినట్లే మా వంశాన్ని వృద్ధి చేయ వలసింది. మేము నీకు హవిస్సుతో సపర్యలు చేస్తాము. నువు వందలు వేలుగా విస్తరించి నట్లుగానే మా వంశాన్ని కూడా అభివృద్ధి చేయవలసినది అని గరికను ప్రార్థిస్తున్నారు.

# 68. మృత్తికాసూక్తము

స్నానం చేసే సమయంలో మట్టిని నెత్తిన పెట్టుకుని స్నానం చెయ్యాలి. మట్టి అన్ని పాపాలను నశింప చేస్తుంది. అలా నెత్తిన పెట్టుకుంటూ చెప్పే మంత్రాలే మృత్తికా సూక్తము. ఇవి మొత్తం ఐదు మంత్రాలు.

**అశ్వక్రాంతే రథక్రాంతే విష్ణుక్రాంతే వసుంధరా**
**శిరసాధారయిష్యామి రక్షస్వయాం పదే పదే ॥**

**భూమిర్ధేనుర్ధరిణీ లోకధారణీ**
**ఉద్ధృతాపి వరాహేణ కృష్ణేన శతబాహునా ॥**

**మృత్తికే హనమే పాపం యన్మయా దుష్కృతం కృతమ్**
**మృత్తికే బ్రహ్మదత్తాసి కాశ్యపే నాభిమంత్రితా ॥**

**మృత్తికే దేహిమే పుష్టిం త్వయి సర్వం ప్రతిష్ఠితమ్**
**మృత్తికే ప్రతిష్ఠితం సర్వం తన్మే నిర్ణుద మృత్తికే ॥**
**తయా హేతేన పాపేన గచ్ఛామి పరమాం గతిమ్ ॥**

శుద్ధి హేతువులయిన గుర్రాలచేత, రథాలచేత, త్రివిక్రముడైన విష్ణువుచేత ఆక్రమించబడినది, ధనధారిణి అయిన ఓ భూదేవతా ! ఈ స్నానకర్మలో నిన్ను నెత్తిన పెట్టుకుంటున్నాను. స్నానంకోసం నీటిలోదిగే నన్ను అడుగడుగునా రక్షించవలసింది. కామధేనువులాగా ప్రీతిచేసేది, పంటలుపండేది, ప్రాణాలు ధరించేది అయిన నిన్ను ప్రళయకాలంలో వేయిచేతులు గల వరాహరూపుడు ఉద్ధరించాడు. ఓ మృత్తికా! నేను చేసిన పాపాన్ని పోగొట్టు. నువ్వు బ్రహ్మదత్తవు. కాశ్యపుడు మొదలైన ఋషులు స్నానసమయంలో నిన్ను మంత్రించగా వారి పాపాలు పోగొట్టావు. నాకు పుష్టిని ఇవ్వవలసింది. ప్రాణాలు నిలపటానికి వీలైన ఓ మృత్తికా! నా పాపాలన్నింటినీ నశింపచెయ్యి. నువ్వు నా పాపాలు పోగొట్టు. నేను మోక్షం పొందుతాను.

# 69. అఘమర్షణ సూక్తము

తినకూడని పదార్ధాలు తినటం, త్రాగకూడని పానీయాలు త్రాగటం, చేయకూడని పనులు చెయ్యటంవల్ల వచ్చే పాపాలనుంచి రక్షించమని చేసే ప్రార్ధన ఇది.

హిరణ్య శృంగం వరుణం ప్రపద్యే తీర్థం మే దేహి యాచితః
య న్మయా భుక్త మసాధూనాం పాపేభ్యశ్చ ప్రతిగ్రహః

యన్మే మనసా వాచా కర్మణా వా దుష్కృతం కృతమ్
తన్న ఇన్ద్రో వరుణో బృహస్పతి స్సవితా చ పునన్తు పునః పునః

నమోఽగ్నయేప్సుమతే నమ ఇన్ద్రాయ
నమో వరుణాయ నమోవారుణ్యై నమోద్భ్యః

యదపాం క్రూరం యదమేధ్యం యదశాన్తం తదపగచ్ఛతాత్

అత్యాశనా దతీ పానా ద్యచ్చ ఉగ్రాత్ ప్రతిగ్రహాత్
తన్నో వరుణో రాజా పాణినా హ్యవమర్శతు

సోహమపాపో విరజో నిర్ముక్తో ముక్తకిల్బిషః
నాకస్య పృష్ఠ మారుహ్య గచ్ఛే ద్బ్రహ్మ సలోకతామ్

యశ్చాప్సు వరుణ స్స పునా త్వఘమర్షణః

ఇమం మే గంగే యమునే సరస్వతి శతు ద్రి స్తోమగ్ం సచతా పరుష్ణియా
అసిక్నియా మరుద్వృధే వితస్త యార్జీకీయే శృణు హ్యాసుషోమయా

నీటిలో మునిగి ప్రాణాయామం చేసేటప్పుడు ఈ సూక్తం చెప్పాలి. బంగారు కిరీటం గల వరుణుని అనుగ్రహం కోరుతున్నాను. ఆ వరుణుడు నా మీద ప్రేమతో నేను దిగటానికి తగిన ప్రదేశము ఇస్తాడు. పాపుల ఇంట్లో తిన్నప్పటికీ, పాపుల నుండి ప్రతిగ్రహము చేసినప్పటికీ, ఇంకా ఏవైనా పాపాలు చేసినప్పటికీ, దానంతటినీ ఇంద్రాది దేవతలు ప్రక్షాళనం చేస్తారు. అగ్నికి, ఇంద్రుడికి, వరుణుడు, వరుణుని పత్ని, జలాభిమాన దేవతలు అందరికీ నమస్కారము. (స్నానం చేసే ప్రదేశంలో) నీటి సంబంధమైన మరణానికి కారణమైన సుడి మొదలైంది, ఉమ్మివేయుట, వాత శ్లేష్మముల యొక్క పాపమంతా నాశనమగు గాక. దేవపితృ మనుష్యులు మొదలైన యజ్ఞాలు చెయ్యకుండా తిన్నది అత్యశనము. దేవ పితృ తర్పణలు చెయ్యకుండా త్రాగినది అతిపానము. అశాస్త్రీయంగా తీసుకున్నది ఉగ్రము, ఈ మూడింటివల్ల కలిగిన పాపము వరుణుడు పోగొట్టుగాక. దానివల్ల నేను పాపరహితుడనై, దోష నిర్ముక్తుడనై, స్వర్గములో హిరణ్యగర్భునితో పాటు, సమాన భోక్తృత్వాన్ని పొందుదును గాక. నీటియందున్న వరుణుడు నన్ను పవిత్రము చేయుగాక. ఓ గంగా, యమునా, సరస్వతీ, అర్జీయకీనదీ ! ఓ నదులారా! నా యీ స్తోత్రాన్ని వినండి. విని, ఈ నీటిలో కలిసి నన్ను రక్షించండి. ఓ అర్జకీ ! వరుష్ణీ ! ఇతర నదులారా మీరు నన్ను పవిత్రము చేయండి.

# 70. మేధాసూక్తము

మానవుడు తనకు తెలివితేటలు, ధారణశక్తి అనుగ్రహించమని చేసే ప్రార్థన ఇది.

మేధాదేవీ జుషమాణా న ఆగా ద్విశ్వాచీ భద్రా సుమనస్య మానా
త్వయా జుష్టా నుదమానా దురుక్తాన్ బృహద్వదేమ విదధే సువీరాః
త్వయా జుష్ట ఋషి ర్భవతి దేవి త్వయా బ్రహ్మాగతశ్రీ రుత త్వయా,
త్వయా జుష్టశ్చిత్రం విందతే వసు సా నో జుషస్వ ద్రవిణే న మేధే

మేధాం మ ఇంద్రో దదాతు మేధాం దేవీ సరస్వతీ
మేధాం మే అశ్వినా వుభావా దత్తాం పుష్కర ప్రజా

అప్సరాసు చ యా మేధా గంధర్వేషు చ యన్మనః
దైవీ మేధా సరస్వతీ సా మాం మేధా సురభి ర్జుషతాగ్ం స్వాహా

అమాం మేధా సురభి ర్విశ్వరూపా హిరణ్యవర్ణా జగతీ జగమ్యా
ఊర్జస్వతీ పయసా పిన్వమానా సా మాం మేధా సుప్రతీకా జుషన్తామ్
మయి మేధాం మయి ప్రజాం మయ్యగ్ని స్తేజో దధాతు
మయి మేధాం మయి ప్రజాం మయీంద్ర ఇంద్రియం దధాతు
మయి మేధాం మయిప్రజాం మయి సూర్యోభ్రాజో దధాతు

గ్రంథాన్ని, దాని అర్థాన్ని ధారణచేసే శక్తిని మేధ అంటారు. మేధకు అభిమానియైన దేవి ప్రీతి చెందినట్లైతే మాకు మంచి అవగాహన, మంచి మనసు, కలుగచేయు గాక. ఓ దేవీ ! నీచే

అనుగ్రహించబడిన మేము పురుషార్థానికి ఉపయోగించిన వేదబాహ్యమైన శబ్దాలు వదిలేసి వైదికాచార పరాయణులమై మంచి బిడ్డలు, శిష్యులు కలిగి, యాగాలు చేసి, పరిశుద్ధమైన అంతఃకరణతో పరబ్రహ్మ తత్వాన్ని చెపుతాము. ఓ మేధాదేవీ ! నీచే అనుగ్రహించబడినవాడు అతీంద్రియ దర్శి అవుతాడు. హిరణ్యగర్భుడవుతాడు. సంపదకలవాడవుతాడు. నీవు అనుగ్రహించిన వాడు, గోవులు, గుర్రాలు, ధనధాన్యాలు పొందుతాడు. ఓ మేధాదేవీ ! అటువంటి నీవు ధనాధిపతిలాగా నన్ను అనుగ్రహించవలసింది. ధనాధిపతి అనుగ్రహిస్తే దరిద్రుడు భాగ్యవంతుడౌతాడు అలాగే నీ అనుగ్రహంతో నేను మేధావంతుడనవుతాను. ఇంద్రుడు, సరస్వతి, అశ్వనీదేవతలు నాకు మేధను ఇత్తురు గాక. ఏ మేధ అయితే అప్సరసల యందు, దేవగాయకుల యందు, దేవతల యందు ఉన్నదో, వేదశాస్త్ర రూపమైన సరస్వతియందు ఉన్నదో, ఆ మేధ నా కోరికలు తీర్చును గాక.

కోరికలు తీర్చునది, సకల శాస్త్రధారణ క్షమమైనది, బంగారు రంగు గలది, జగదాత్మిక, పురుషార్థములచే పొందదగినది, జలవతి, ఆవుపాలు మొదలగు వాటిచే మమ్ము ప్రీతి పొందించునది, అయిన మేధాదేవి సుఖముగా నన్నుచేరుగాక.

అగ్ని వేదశాస్త్ర, గ్రహణ, ధారణ, పటుత్వాన్ని, బ్రహ్మతేజస్సును, అవిచ్ఛిన్నమైన పుత్ర పౌత్రాది సంతతిని కలుగచేయు గాక. ఇంద్రుడు మేధను, వీర్యపుష్టిని, సూర్యుడు చూడటంతోనే శత్రువులకు భయం కలిగించే ముఖతేజస్సును నాకు కలుగచేయుగాక.

## 71. అనిష్ట పరిహారం కోసం దుర్గా సూక్తము

శత్రునాశనము, ఐశ్వర్యప్రాప్తి కోసం ఈ సూక్తాన్ని చదువుతారు.

**జాతవేదసే సునవామ సోమ మరాతీయతో నిదహాతి వేదః**
**స నః పర్షదతి దుర్గాణి విశ్వా నావేవ సింధుం దురితాత్యగ్నిః**

తా మగ్నివర్ణాం తపసా జ్వలన్తీం వైరోచనీం కర్మఫలేషు జుష్టామ్ ।
దుర్గాం దేవీగ్ం శరణ మహం ప్రపద్యే సుతర సితతరసే నమః ॥

అగ్నే త్వం పారయా నవ్యో అస్మాన్స్వస్తిభి రతి దుర్గాణి విశ్వా ।
పూశ్చ పృథ్వీ బహులాన ఉర్వీ భవా తోకాయ తనయాయ శంయోః ॥
విశ్వాని నో దుర్గహా జాతవేద స్సింధుం న నావా దురితాతిపర్షి
అగ్నే అత్రివన్మనసా గృణానోస్మాకం బోధ్యవితా తనూనామ్ ॥

పృతనాజితగ్ం సహమానముగ్ర మగ్నిగ్ం హువేమ పరమాత్సధస్థాత్ ।
స నః పర్షదతిదుర్గాణి విశ్వాక్షామద్దేవో అతిదురితాత్యగ్నిః ॥82
ప్రత్నోషిక మీడ్యో అధ్వరేషు సనాచ్చ హోతా నవ్యశ్చసత్సి
స్వాంచాగ్నే తనువం పిప్రయస్వా స్మభ్యఞ్చ సౌభగ మాయజస్వ83
గోభి ర్జుష్టమయుజో నిషిక్తం తవేన్ద్ర విష్ణో రను సఞ్చరేమ
నాకస్య పృష్ఠ మభిసంవసానో వైష్ణవీం లోక ఇహమాదయన్తామ్84

యాగ సమయంలో అగ్నికోసం సోమలతను తీసుకువస్తాను. అగ్ని మా శత్రువులను నాశనం చేస్తాడు. మా సమస్త భయాలు పోగొడతాడు. సమస్త ఆపదలు నశింపచేస్తాడు. పడవతో సముద్రాన్ని దాటించినట్లు అగ్ని మమ్మల్ని పాపముల నుంచి తరింపచేస్తాడు.

అగ్నివర్ణము గలది, తన పరాక్రమముచే శత్రువులను నాశనం

చేసేది, పశువులు, పుత్రులు, మిత్రులు, స్వర్గము కోసం ఉపాసకులతో సేవించబడేది నవదుర్గలలో ప్రసిద్ధమైనది అయిన దుర్గను శరణు వేడుతున్నాను. సంసారము నుంచి తరింపచేసే ఓ దేవీ ! నీకు నమస్కారము.

ఓ అగ్నీ ! స్తుతింపదగిన నువ్వు మమ్ము క్షేమమైన ఉపాయంతో సమస్తమైన ఆపదలు దాటించి సంసారము నుండి తరింపజేయుము. నీ దయవల్ల మాకు నివాస యోగ్యమయిన నగరము, భూమి అంతా పెరుగును గాక, పంట భూములు పెరుగును గాక. నీవు పుత్ర పౌత్రులకు సుఖాన్నిచ్చే వాడవు కావలసినది.

ఓ జాతవేదుడా! ఆపదలన్నీ పోగొట్టే నువ్వు మా పాపాలన్నీ నావతో సముద్రాన్ని దాటినట్లుగా దాటించేస్తావు. జీవన్ముక్తుడైన మహర్షి లాగా నువ్వు మనసుచే బాధింపబడిన వాడవై మా శరీరాలకు రక్షకుడు కావలసింది.

శత్రుసేనను జయించునది, శత్రువులను పరాభవించేది, భయహేతువైన అగ్నిని ఆహ్వానిస్తున్నాము. అగ్ని మా ఆపదలు నశింపచేయుగాక. మా తప్పులు మన్నించి మహాపాతకముల నుండి రక్షించును గాక.

ఓ అగ్నీ నీవు యుగాల యందు స్తుతింపతగినవాడవై సుఖాన్ని విస్తరింప చేస్తున్నావు. కర్మఫలానిచ్చే వాడవు. స్తుతింపబడుతూ యాగదేశమున ఉంటావు. ఓ అగ్నీ! మా హవిస్సుతో తృప్తి పొందుము. మాకు మంచి భాగ్యము ఇమ్ము. ఓ ఇంద్రుడా! పాపములు లేని నిన్ను భృత్యుడులాగా అనుసరిస్తాను. గోవులచే తడుపబడేది, అమృతధారలచే సేవింపబడేది అయిన భాగ్యము మాకు కావాలి. దీనికోసం నేను

విష్ణువును సేవిస్తాను. స్వర్గంలో ఉండే దేవతలందరూ విష్ణుభక్తి గల నన్ను సంతోషపెట్టుదురు గాక. నా కోరికలు తీర్తురు గాక.

ప్రతిరోజూ నియమనిష్ఠలతో దుర్గాదేవిని ఎర్రని పూలతో అష్టోత్తర శతనామాలతో అర్చించి (108 ఎరుపురంగు పూలు సమకూరకపోతే అలంకరణకు కొన్ని పూలు వాడి, మిగిలినవి ఎరుపు అక్షతలు వాడవచ్చు) ధూప దీప నైవేద్యాలు సమర్పించి, ఆ తరువాత 108సార్లు దుర్గాసూక్తం పారాయణ చేసి, గూడాన్న నివేదన చెయ్యాలి. గుడాన్నము అంటే అన్నము, బెల్లము, జీడిపప్పు, ఏలకులు, పచ్చకర్పూరము, ఆవునెయ్యి కలిపి రుచికరంగా చేసిన పదార్థము. దీపారాధనకు ఎరుపు వత్తులు, ఆవునెయ్యి మాత్రమే వాడాలి. పవిత్రత పాటించాలి. ఇలా వందరోజులు మధ్యలో ఆపకుండా చేసి 101వ రోజున దుర్గా సూక్తం వందసార్లు హోమం చేసి, ఎనిమిది మంది ముత్తయిదువులను అర్చించి భోజనాదులు ఏర్పాటు చేసినట్లైతే కోరిన కోరిక సిద్ధిస్తుంది అని చెబుతోంది వేదం

# 72. సర్వేజనా స్సుఖినోభవంతు

దేశంలోనే కాదు ఈ ప్రపంచంలో అందరూ సుఖశాంతులతో వర్ధిల్లాలి. ఇది అందరి మాట. దేశంలో ప్రతిఒక్కరూ సుఖంగా ఉండాలి. వారికి ఏ రకమైన కష్టాలు రాకూడదు. ధర్మం నాలుగు పాదాలమీద నడవాలి. అందరూ మంచి పనులే చెయ్యాలి. చేతనయినంత వరకు ప్రక్క వాడికి సహాయం చెయ్యాలి. మోసం, దగా కుట్ర ఇలాటి ఏమీ ఉండకూడదు. బాగా ధనవంతులు, బాగా దరిద్రులు అసలు ఉండకూడదు. లోకంలో సంపద అంతా ఒకరి పరం కాకూడదు. గాలి, నీరు దొరికినట్లుగా సంపద కూడా అందరికీ చెందాలి. గాలి బుడగ జీవితం. ఎంత కాలముంటామో మనకే తెలియదు. మనం విపరీతంగా సుఖాలు అనుభవిస్తున్నాం అంటే, ఇంకొకరు అనుభవించాల్సిన సుఖాలు మనం అనుభవిస్తున్నామన్న మాట. ఈ విషయాలను దృష్టిలో పెట్టుకుని ఋగ్వేదంలోని **ఆరవ మండలంలోని 75వ సూక్తం** "నీ చుట్టూప్రక్కల వాళ్ళని గౌరవించు. సంఘాన్ని గౌరవించు ఆకలితో బాధపడే వారికి అన్నం పెట్టు. అనాథలను రక్షించు. మంచి పనులు చెయ్యటానికి నీకు పూర్తి శక్తికావాలి. ప్రతివారూ సామాజిక విలువలు కాపాడాలి. అసత్యం ఆడరాదు. అధర్మం చెయ్యరాదు. ధర్మం చెయ్యకపోయినా ఫరవాలేదు, అధర్మం మాత్రం చెయ్యకుండా ఉండాలి. ఇలా అందరికీ ఉపకారం చేస్తూ జీవితాన్ని ఇతరుల కోసం అన్నట్లుగా కొనసాగించాలి. మూర్ఖత్వము, హింస, రాక్షసత్వాలను దగ్గరకు కూడా రానీయద్దు. అందరికీ మంచి జరగాలి. ఆ పని పరమాత్మే చెయ్యాలి" వేదం అని చెబుతోంది.

శ్రీ

# పార్థసారథీయము

# చతుర్వేదభాష్యము

## ( కృష్ణయజుస్సంహిత)



ప్రముఖ శ్రీవిద్యా ప్రచారకులు
అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,
ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, మెంఫిస్, అమెరికా ఆస్థాన విద్వాంసులు,
డా॥ క్రోవి పార్థసారథి

# విషయసూచిక

1. యజ్ఞకుండం
2. సమిధలు
3. యజ్ఞము, యాగము, హోమము
4. యజ్ఞాలు ఎక్కడ చేస్తారు?
5. యజ్ఞంలోని సన్నివేశాలు
6. యాగం చేసిన వెంటనే ఫలితం వస్తుందా?
7. చెట్లలో చైతన్యం
8. స్త్రీకి సమున్నత స్థానం
9. భర్తృవియోగం
10. అన్న, ధన సమృద్ధి
11. వంశాభివృద్ధి
12. నిత్యయవ్వనం
13. వెండి దానము
14. గోసంపద
15. చంద్రుడికి క్షయరోగం
16. చేపలను చంపటం పాపం కాదా?
17. బ్రహ్మహత్యాపాతకము
18. వృత్రాసురవధ (గోఘృతానికి తేజస్సు)
19. అగ్నిసర్వరక్షకుడు
20. విశ్వకర్మ
21. అశ్వము
22. పితృదేవతలు
23. వ్యవసాయము
24. ఓషధులు (ఓషధీసూక్తము)

25. నాగపూజ
26. పంట బాగా పండాలంటే
27. యుద్ధంలోని విజయం సాధించాలంటే
28. వైద్యుడి గౌరవం లేదు
29. సంఘంలో గౌరవం
30. సిరిసంపదలకి ధర్మకర్తలం మాత్రమే
31. అశ్వమేధం
32. సంధ్యావందనము
33. సంధ్యావందనము ఎప్పుడు చెయ్యాలి?
34. నూరేళ్ళ జీవితం
35. రకరకాల యాగాలు
36. అన్నసమృద్ధి
37. నక్షత్రాలు
38. శతరుద్రీయము
39. రుద్రాధ్యాయము
40. చమకము
41. ఈశ్వరుడికి నమస్కార మంత్రాలు
42. శివోపాసన మంత్రాలు
43. పంచ బ్రహ్మల మంత్రాలు

# 2.2 కృష్ణయజుస్సంహిత

యజుర్వేదంలో బ్రహ్మ సంప్రదాయాన్నే కృష్ణయజుర్వేదము అంటారు. ఇది దక్షిణ భారతంలో బాగా ప్రసిద్ధి చెందింది. ఇందులో మొత్తం 86 శాఖలున్నాయి. కాని ప్రస్తుతం దొరుకుతున్నవి నాలుగు శాఖలు మాత్రమే. అవి 1. తైత్తిరీయశాఖ 2. మైత్రావరుణీయశాఖ 3. కఠశాఖ 4. కాపిష్ఠలశాఖ. శాస్త్రోక్తంగా అగ్నిని ప్రజ్వలింపచేసి, అందులో దేవతలకు ఆహుతులు సమర్పించటాన్నే 'యజ్ఞము' అంటారు. యజ్ఞము దేవతా స్వరూపము **'యజ్ఞోవైవిష్ణుః'** యజ్ఞము విష్ణు స్వరూపము. యజ్ఞమే బ్రహ్మ. యజ్ఞమే విష్ణువు. యజ్ఞమే రుద్రుడు. యజ్ఞమే సకల దేవతా స్వరూపము. యజ్ఞవేదిక ఇంద్రుడికి స్వారాజ్యపీఠము, అగ్నిదేవుడికి బంగారు సింహాసనం. సోముడికి విలాసవంతమైన భవనం, వరుణదేవుని విశ్రాంతి మందిరం, దేవతాగణాలన్నింటికీ దివ్యక్షేత్రం, కర్మిష్టులు స్వర్గంచేరటానికి దారియజ్ఞం. కృష్ణయజుస్సంహితలో యజ్ఞాన్ని గురించి ప్రముఖంగా చెప్పబడింది. అందుకే "యజుర్వేదం ఋగ్వేదానికి, సామవేదానికి, అథర్వణవేదానికి కూడా మూలాధారము. యజుర్వేదం లేకపోతే, మిగిలిన మూడు వేదాలకు అసలు ప్రయోజనమే లేదు" అన్నాడు సాయణుడు. వేదంలో కర్మకాండ, జ్ఞానకాండ రెండూ వివరించబడ్డాయి. యజ్ఞయాగాదులన్నీ కర్మకాండ. యజ్ఞస్వరూపుడు, జగత్పరిపాలకుడు అయిన శ్రీమహావిష్ణువు మనం చేసే యజ్ఞానికి సంతోషించి యజ్ఞఫలమైన మన కోరికను సిద్ధింప చేస్తాడు, యజ్ఞంలో అగ్నిహోత్రుని ద్వారా ఆహుతులను ఆయా దేవతలకు పంపి వారి అనుగ్రహం పొందుతాము. స్థూలంగా చెప్పాలంటే యజ్ఞాలు రెండు

రకాలు 1. శ్రౌతయజ్ఞాలు 2. స్మార్త యజ్ఞాలు.

**1. శ్రౌత యజ్ఞాలు :** అగ్నిహోత్రము, దర్శ, పూర్ణ, మాస, జ్యోతిష్టోమము.

2. స్మార్త యజ్ఞాలు ఐదు రకాలు. వీటినే పంచ మహాయజ్ఞాలు అంటారు.

1. దేవయజ్ఞము – దేవతల తృప్తికోసం అగ్నిలో హవిస్సులు ఇచ్చి హోమం చెయ్యటం.
2. పితృయజ్ఞము – పితృదేవతల ప్రీతికోసం స్వధాకారంతో తర్పణాలు ఇవ్వటము.
3. భూతయజ్ఞము – వైశ్వదేవం తరువాత భూతతృప్తికోసం బలి ఇవ్వటం.
4. మనుష్య యజ్ఞము– మనశక్తి కొద్ది అతిథులకు భోజనం పెట్టటం.
5. బ్రహ్మయజ్ఞం – ప్రతిరోజు వేదపారాయణ చెయ్యటం.

ఇంకా వివరంగా చెప్పాలి అంటే యజ్ఞాలు మూడు రకాలు.

**1. పాకయజ్ఞాలు :** ఇవి మళ్ళీ ఏడు రకాలు

1. ఔపాసన 2. స్థాలీపాకము 3. వైశ్వదేవము 4. అష్టకము 5. మాసశ్రాద్ధము 6. సర్పబలి 7. ఈశానబలి

**2. హవిర్యజ్ఞాలు :** ఇవి ఏడు రకాలు

1. అగ్నిహోత్రాలు 2. దర్శపూర్ణమాసలు 3. అగ్రయణం 4. చాతుర్మాస్యాలు 5. పిండపితృయజ్ఞాలు 6. నిరూఢ పశుబంధము 7. సౌత్రామణి

**3. సోమయజ్ఞాలు :** ఇవి మళ్ళీ ఏడు రకాలు.

1. అగ్నిష్టోమము 2. అత్యగ్నిష్టోమము 3. ఉక్థము 4. అతిరాత్రము 5. ఆప్తోర్యామము 6. వాజపేయము 7. పౌండరీకము

యజ్ఞాలు ఎన్ని రకాలుగా ఉన్నా ఏ రకమైనవైనా, అన్నీ కామ్యకర్మలే. అందుకే ఇదంతా అపరావిద్య అని చెప్పబడుతోంది. యజుర్వేదసంహితలో యజ్ఞాలు, యాగాలు నిర్వహించేందుకు అవసరమైన విధివిధానాలు చెప్పబడ్డాయి.

# 1. యజ్ఞకుండం

దేవతలను తృప్తిపరచటం కోసం వారికి ఇష్టమైన పదార్థాన్ని వారి పేరు చివర స్వాహాకారం కలిపి చెబుతూ అగ్నిలో హవనం చేయటాన్నే యజ్ఞము అంటారు. ఇలా మనం సమర్పించే వాటినే ఆహుతులు అంటారు. సామాన్యంగా ఆవునేతితోనే ఈ ఆహుతులు సమర్పిస్తారు. కొన్ని సందర్భాలలో అన్నము, పురోడాశము (పిండి రొట్టె) లాంటి పదార్థాలు కూడా సమర్పించటం జరుగుతుంది. ఈ ఆహుతులను ఇంద్రుడికి సమర్పిస్తున్నాము అనుకోండి **'ఇంద్రాయస్వాహా'** అని చెప్పటం జరుగుతుంది. దీని తరువాత 'ఇది ఇంద్రుడికే చెందుతుంది నాకు కాదు' అని అర్థం వచ్చే మంత్రం **'ఇంద్రాయ ఇదం నమమ'** అని కూడా చెబుతారు. దీన్ని త్యాగము అంటారు. ఈ రకంగా ఏ దేవతను ఉద్దేశించి, ఎవరి అనుగ్రహం కోసం ఈ యజ్ఞం చేస్తున్నామో వారి పేరుతో ఆహుతులు సమర్పించటం జరుగుతుంది. మనం సమర్పించే ఆహుతులను అగ్నిదేవుడు తన భార్య అయిన 'స్వాహా' దేవి ద్వారా దేవతలకు అందిస్తాడు. అందుకే ఆహుతులు ఇచ్చేప్పుడు ప్రతి ఆహుతికీ స్వాహాకారం చెప్పవలసిందే. మూలమంత్రాన్ని హవనం చేసేటప్పుడు ఒక్కొక్కసారి మంత్రం చివరనే స్వాహాకారం ఉంటుంది. అలాంటి సమయంలో కూడా స్వాహాకారము మళ్ళీ చెప్పాలా ? ఇది చాలామందికి వచ్చే అనుమానం. దీనికి సమాధానం, ముందు మంత్రం చెప్పి ఆ తరువాత స్వాహాకారం చెప్పాలి. మంత్రం చివరలో స్వాహాకారము ఉన్నా సరే మనం మళ్ళీ చెప్పాల్సిందే. దీనిలో అనుమానం లేదు. యజ్ఞం చేసే వ్యక్తిని **యజమాని, కర్త** అని పిలుస్తారు. భార్యా భర్తలు ఇద్దరూ పీటలమీద కూచుని చేయవలసిన కార్యక్రమం

ఇది. అందుకే ఉత్తర రామాయణంలో శ్రీరామచంద్రుడు అశ్వమేధ యాగం చెయ్యాలి అనుకున్నప్పుడు సీత యొక్క బంగారు విగ్రహాన్ని తన ప్రక్కన పెట్టుకున్నాడు. హిందూధర్మంలో ఏ పని చేసినా భార్యాభర్తలు ఇద్దరూ కలసి చెయ్యవలసిందే. సమాజంలో భర్తలేని భార్యస్థానం ఎలాంటిదో భార్యలేని భర్తస్థానం కూడా అలాంటిదే. ఒకవేళ భార్య లేకపోతే, భార్య తాలూకు వస్త్రాన్ని (చీరను) ప్రక్కన పెట్టుకుని పురుషుడు కార్యక్రమాన్ని నిర్వహించాలి.

యజ్ఞకుండ నిర్మాణం రకరకాలుగా ఉంటుంది. సామాన్యంగా చతురస్రాకారపు యజ్ఞకుండాలే ఉపయోగిస్తారు. వీటిలో పొడవు, వెడల్పు, లోతు ఆ మూడు ఒకటిగా ఉండాలి. హోమం చేసే మంత్రాన్ని బట్టి యజ్ఞకుండపు ఆకారం మారుతుంటుంది. లక్ష్మీదేవి మంత్రాలకైతే ఎనిమిది పలకలు గల కుండము, సుబ్రహ్మణ్య స్వామి – ఆరుపలకలు గల కుండము, శాక్తేయహోమాలయితే – యోనికుండము (త్రికోణాకారం) ఏర్పాటు చేయటం జరుగుతుంది. చతురస్రంగా ఉండే కుండంలో ఏ మంత్రాలైనా హవనం చెయ్యవచ్చు. అందుకే సామాన్యంగా చతురస్రంగా ఉండే హోమకుండాలే కనిపిస్తుంటాయి. హోమం చేయించే వారిని ఋత్విక్కు అంటారు. వీళ్ళు నలుగురుంటారు. 1. హోత 2. ఉద్గాత 3. అధ్వర్యుడు 4. బ్రహ్మ వీరిలో

**హోత :** ఋగ్వేద పండితుడు. ఋగ్వేద మంత్రాలు చదువుతుంటాడు.

**ఉద్గాత :** సామవేద మంత్రాలు చదువుతాడు. ఇతడు ఈ మంత్రాలను సంగీత పరంగా గానం చేస్తుంటే, దేవతలు కూడా వచ్చి వింటుంటారు.

**అధ్వర్యుడు :** యజుర్వేద పండితుడు. యజస్సులను చదువుతుంటాడు. యజ్ఞనిర్వహణ బాధ్యత ఇతనిదే

**బ్రహ్మ:** అధర్వ వేద పండితుడు. అధర్వ శిరస్సులు చదువుతూ యజ్ఞంలో ఏ పొరపాటు జరగకుండా చూడటం ఇతని పని. ఒకవేళ పొరపాటు జరిగితే వెంటనే ప్రాయశ్చిత్తం చేస్తాడు. అందుకే యజ్ఞనిర్వహణలో ఇతనిదే అగ్రస్థానం.

వీళ్ళలో ఒక్కొక్కరికి నలుగురు సహాయకులు ఉంటారు. వీరుగాక 'అగ్నీధ్రుడు', 'ప్రతిపస్థాత' 'ఉపద్రష్ట' అని ఇంకొంతమంది ఉంటారు. క్రతువు యొక్క పరిమాణాన్ని బట్టి ఋత్విక్కుల సంఖ్య కూడా పెరుగుతుంది. కొన్ని యాగాలలో 17 మంది వరకు ఋత్విక్కులు ఉంటారు.

ఇక యజ్ఞకుండం పరిమాణము క్రతువును బట్టి ఉంటుంది. ఒకసారి **మాతాకరుణామయి** పదిఅడుగుల హోమకుండాన్ని ఏర్పాటు చేసి వేయి మామిడిపండ్లతో హోమం చేశారు. అశ్వమేధంలాంటి యాగాలు చెయ్యాలంటే చాలా పెద్దహోమకుండం కావాలి.

యజ్ఞం చెయ్యాలంటే ముఖ్యంగా కావలసింది అగ్ని. యజ్ఞకుండం దగ్గర అరణి మధించి అగ్ని పుట్టించాలి. అరణి అంటే రావి, జువ్వి, కర్రలు వీటిలో ఒక కర్ర క్రింద, ఒక కర్రపైన ఉంచి రాపిడి కలిగిస్తే అగ్ని పుడుతుంది. ఆ అగ్నిని వేదమంత్రాల మధ్యన ప్రజ్వలింపచేస్తారు. ఆ తరువాత దూది, కొబ్బరిపీచు లాంటి పదార్థాలతో ఈ అగ్నిని సేకరించి హోమకుండంలో ప్రతిష్ఠ చేస్తారు. పూర్వకాలంలో అగ్ని తేలికగా లభించేది కాదు. అందుకే యజ్ఞయాగాదులలో అరణి మధించి అగ్నిని పుట్టించేవారు. ఇప్పుడు రోజులు మారాయి. అగ్గిపెట్టెలు అందుబాటులోకి వచ్చాయి. కాబట్టి అగ్నిప్రతిష్ఠాపనకు అగ్గిపెట్టె,

కర్పూరము వంటి వాటిని వాడచ్చు అంటారు సంప్రదాయవాదులలోని ఆధునికులు. 'ఇంద్రాయ స్వాహా, అగ్నయే స్వాహా, వరుణాయ స్వాహా' అంటూ ఆహుతులు సమర్పిస్తారు. నెయ్యి, పాలు, పెరుగు, సోమరసం మొదలైన పదార్థాలను ఆహుతులుగా సమర్పిస్తారు. వీటిలో మేకపిల్ల గుండె దగ్గరలో ఉండే చిన్న చర్మపు ముక్కను 'వప' అంటారు. వపాహోమము చాలా ప్రధానమైంది. అగ్నిదేవుడు దేవతలకు నోరు వంటివాడు. మనం సమర్పించిన ఆహుతులు తన భార్య స్వాహాదేవి ద్వారా దేవతలకు అందిస్తాడు. ఈ ఆహుతులను తీసుకుని దేవతలు యజమాని కోరిక తీరుస్తారు. ఇంద్రుడు, అగ్ని, వరుణుడు, యముడు, వాయువు మొదలైన వారు దేవతలు. వీరిలో ప్రధానమైన దేవత ఇంద్రుడు. అతడు మానవులకు కావలసిన సిరిసంపదలు, భోగభాగ్యాలు, రాజ్యము ఏది కావాలన్న ఇస్తాడు. శత్రుసంహారం చేస్తాడు.

# ౭. సమిధలు

యజ్ఞంలో సమిధలుగా ఏ పుల్లలు వాడాలి? అనేది కూడా అనుమానమే. హోమం చెయ్యటానికి ప్రత్యేకంగా 1) రావి 2) జువ్వి 3) మామిడి 4) వేప 5) మర్రి 6) నేరేడు 7) మారేడు 8) దేవదారులనే వాడతారు. ఏ దేవత నుద్దేశించి హోమం చేస్తున్నామో, ఆ దేవత కిష్టమైన సమిధలు వాడటం జరుగుతుంది. అయితే రావి అన్ని రకాల దేవతాహోమాలకు పనికి వస్తుంది. రావిపుల్లతో ఏ హోమం అయినా చెయ్యవచ్చును. ప్రాచీన కాలంలో ఈ హోమాలన్నీ రావి సమిధలలోనే చేసేవారు. చెట్టును కొట్టకుండా, క్రింద పడిన పుల్లలను మాత్రమే హోమానికి వాడేవారు. ఇతర రకాలయిన తుమ్మ, సరుగుడు, జామాయలు మొదలైన సమిధలు వాడితే సరిఅయిన ఫలితం రాకపోగా ఒక్కొక్కసారి విపరీతమైన ఫలం, చెడుఫలం కూడా వస్తుంది. యజ్ఞంయొక్క ఫలితం 'స్వర్గం'. ఈ కారణం చేతనే **వేదం చెప్పిన కర్మ యజ్ఞం** అని, **దాని ఫలితం స్వర్గం** అని చెబుతారు విజ్ఞులు.

యజ్ఞాలు అనేక రకాలుగా ఉన్నాయి. అని ఎంత కాలం సాగుతాయి? అనే విషయం మీద ఆధారపడి చెప్పబడుతాయి. ఉదయం మొదలుపెడితే సూర్యాస్తమానంలోపు పూర్తయ్యేవి కొన్ని. రెండు రోజులు జరిగేవి కొన్ని, మూడు రోజులు జరిగేవి కొన్ని. ఇలా పన్నెండు రోజులవరకు జరుగుతాయి. ఈ యజ్ఞాలలో ఇంకో రకం ఉన్నాయి. సంవత్సరం దగ్గర నుంచి వంద సంవత్సరాల వరకు సాగుతాయి. వీటినే సత్రయాగాలు అంటారు. పూర్వకాలంలో మునీశ్వరులంతా ఒకసారి ఒక సత్రయాగం వెయ్యిసంవత్సరాలు చేశారు. వీటినే

సత్రయాగాలు, దీర్ఘసత్రయాగాలు, మహాసత్రయాగాలు’ అంటారు. నైమిశారణ్యంలో ఋషీశ్వరులంతా సత్రయాగం చేస్తున్న సమయంలోనే సూతుడు శౌనకాది మహర్షులకు అష్టాదశ పురాణాలు వినిపించాడు. గతంలో నేను కూడా 2009 సంవత్సరంలో సంవత్సర కాలంపాటు సహస్రచండీహోమము, 2010లో సహస్ర వనదుర్గా మహావిద్యా మహాయాగము, 2012లో గణపతి మహాయాగము చేశాను. 4-3-2014 నుంచి 30-3-2014 దాకా అతిరుద్ర మహాయాగము చెయ్యటం జరిగింది. కాబట్టి ఈ యాగాలు ఎంతకాలం జరుగుతాయి అంటే చేసేవాడి ఓపిక.

# 3. యజ్ఞము, యాగము, హోమము

ఇక్కడ చెప్పిన యజ్ఞము, యాగము, హోమము అనే మూడు పదాలు మనం చాలా తరచుగా వాడేస్తుంటాము. ఇవన్నీ పర్యాయపదాలా? లేకపోతే వీటి మధ్యన తేడా ఏమైనా ఉందా? అనే ప్రశ్న అందరికీ వస్తుంది. వీటి మధ్య తేడా ఉన్నది. అదేమంటే? ...

కర్మలలో కామ్యకర్మ, నిష్కామకర్మ అని రెండు రకాలున్నాయి. కామ్యకర్మలో యజమాని తనకు కొంత లాభం కలగాలని, తన పనులు సక్రమంగా నేరవేరాలనే సంకల్పంతో చేసే క్రతువునే **'యాగము'** అంటారు. వీటికి ఉదాహరణ – సార్వభౌమాత్వాన్ని పొందటం కోసం చేసే అశ్వమేధము, వాజపేయము మొ॥వి. ఈ రకమైన యాగాలలోనే 'ఇష్టి' అనబడే యాగాలు కొన్ని ఉన్నాయి. వాటిలో పుత్రులు కావాలని చేసే యాగాలనే 'పుత్రకామేష్టి' యాగము అంటారు. రామాయణంలో దశరథ మహారాజు పుత్రసంతానం కోసం అశ్వమేధయాగం చేసి, తరువాత పుత్రకామేష్టి చేశాడు. ఇలాంటి యాగాలు ఇంకా చాలా ఉన్నాయి. ఒక గంట, రెండు గంటలు పట్టేవి హోమాలు అంటారు. ఇవి కూడా లౌకికమైన కోరికల సాధనకే ఉపయోగిస్తాయి. పారలౌకిక దృష్టితో చేసే క్రతువును యజ్ఞము అంటారు. ఇందులో ఏ రకమైన కోరిక ఉండదు. ఒకవేళ ఉంది అంటే అది దేశప్రజల కోసమో, లోకకళ్యాణం కోసమో అయి ఉంటుంది. మొత్తంమీద ఫలాపేక్ష లేనిది యజ్ఞం. పూర్వకాలంలో మహర్షులు యజ్ఞాలు చేసేవాళ్ళు. వారికి కావలసిన సంబారాలు అన్నీ రాజుగారే పంపేవారు. దీనికి కారణం ఆ యజ్ఞఫలం రాజుగారికి, దేశప్రజలకే చెందుతుంది. మొత్తంమీద అగ్నిహోత్రుని ద్వారా దేవతలకు ఆహుతులు అందించే ప్రక్రియనే

యాగము, యజ్ఞము లేదా హోమము అంటారు. ఇందులో ఇంకో విశేషం ఏమంటే యజ్ఞయాగాదులలో హవిర్భాగం తీసుకోవటానికి దేవతలే ఇక్కడికి వచ్చేవారు. వేదకాలంలో అలా జరిగింది. కాని ఈ రోజుల్లో జరుగుతుందా? అనే అనుమానం చాలామందికి వస్తుంది. ఇందులో అనుమానం ఏమాత్రం లేదు. దేవతలు వచ్చి తప్పకుండా తమకు రావలసిన భాగం తాము తీసుకు వెడతారు. ఇది అనుభవైవేద్యం. నేను సహస్ర చండీయాగం చేసిన రోజుల్లో **హోమకుండంలో నుంచి ఒక చెయ్యి బయటకు వచ్చి నేను సమర్పించే ఆహుతులు తీసుకోవటం ప్రత్యక్షంగా, నా కళ్ళారా నేను చూశాను.** ఒకసారి కాదు, రెండు మూడుసార్లు చూశాను. అలాగే ఆ సందర్భంలోనే నా గురుమండలాన్ని కూడా దర్శించటం జరిగింది. నిష్కామ్యంగా చేస్తేనే ఈ రకమైన అనుభవం కలుగుతుంది. కామ్యకర్మలో కలగదు. ఎందుకంటే కామ్యకర్మలో నీక్కావలసింది కోరిక తీరటం. అంతేకాని భగవత్సాక్షాత్కారం కాదు.

# 4. యజ్ఞాలు ఎక్కడ చేస్తారు?

పూజలు, వ్రతాలు చేసినట్లుగా యజ్ఞయాగాది క్రతువులు ఇంట్లో చెయ్యరు. ఇది చాలా పెద్ద తంతు. ఇవాల్టి రోజున మనం కూడా ఏ పుట్టినరోజు వేడుకో అయితే ఇంట్లో చేస్తాం అదే వివాహమయితే, తప్పనిసరిగా బయట ఎక్కడైనా ఒక హాలు తీసుకుని అందులో చేస్తాం. వివాహానికి ఎక్కువమంది బంధువులు, మిత్రులు, వస్తారు. అలాగే యజ్ఞయాగాది క్రతువులు కూడా. సామాన్యంగా వీటిని పెద్ద పెద్ద ఖాళీ ప్రదేశాలలో చెయ్యటం జరుగుతుంది. ఊరిచివర పొలం చదునుచేసి, అందులో చలువ పందిళ్ళు వేసి, విడిది గృహాలు ఏర్పాటు చేసి, భోజన వసతులు కల్పించి, పెద్ద యాగశాల నిర్మించి అందులో ఈ యజ్ఞాలు, యాగాలు నిర్వహిస్తారు. పూర్వకాలంలో ధర్మరాజు రాజసూయం చేసినప్పుడు యాగశాల ఎలా నిర్మించాడో చెబుతాడు. ఆ రోజుల్లో అయితే వచ్చే వాళ్ళు తాహతని బట్టి విడిది గృహాలు కూడా ఏర్పాటు చేసేవారు. ప్రతిరోజు ఉదయం నుంచి మధ్యాహ్నం దాకా యజ్ఞం జరుగుతుంది. సాయంత్రం ఆధ్యాత్మిక కార్యక్రమాలు, వేదాంత చర్చలు, గోష్ఠులు, విద్వత్సభలు, వినోద కార్యక్రమాలు జరుగుతాయి. ఆఖరు రోజున పూర్ణాహుతి చేసి వచ్చిన వారందరినీ సత్కరించటం జరుగుతుంది. అయితే ఆ వచ్చిన వాళ్ళు కూడా యథాశక్తిగా కట్నకానుకలు తీసుకుని వస్తారు. ఇవాల్టి రోజున మన ఇంట్లో వివాహ వేడుక ఎలా జరుగుతుందో, ఆ రోజున యజ్ఞయాగాది క్రతువులు కూడా అలానే జరిగేవి. ఈ రోజున కూడా యజ్ఞయాగాది క్రతువులు చేస్తే ఇలానే జరుగుతుంది. పూర్ణాహుతి చెయ్యటానికి ముందుగానే అక్కడికి వచ్చిన పండితుల్ని, పెద్ద వాళ్ళని సత్కరించటము జరుగుతుంది. యజ్ఞం పూర్తి అయి అందరూ తిరుగు ప్రయాణమయ్యేటప్పుడు అందర్నీ ఉచితరీతిన సత్కరించటమనేది సంప్రదాయం.

# 5. యజ్ఞంలోని సన్నివేశాలు

యజ్ఞంలో ముఖ్యమైన సన్నివేశాలు మూడుంటాయి. 1. పురోడాశభక్షణం 2. సోమపానం 3. పశ్వాలంభనం. ఇప్పుడు వీటిని విడివిడిగా చూద్దాం.

**1. పురోడాశము :** 'పురోడాశము' అంటే పిండి రొట్టె. బియ్యంపిండితో గాని, గోధుమపిండితో తయారుచేసే ఒక రకమైన రొట్టె. పిండిలో వేడినీరు, ఆవుపాలు కలిపి తయారుచేస్తారు. ఒక రకంగా చెప్పాలంటే పూజాది కార్యక్రమాల్లో మనం తయారుచేసే 'పచ్చిచలిమిడి' లాంటిదన్న మాట. దేవతకు నివేదన చేసి దాన్ని ప్రసాదంగా స్వీకరిస్తారు. యజ్ఞంలో ఆహుతులు సమర్పించేటప్పుడు కూడా ఈ పురోడాశాన్నే కుండ పెంకులమీద కాల్చి ఆహుతిగా సమర్పిస్తారు. ఈ పిండి రొట్టెని

ఒక కుండ పెంకు మీద కాలిస్తే – ఏకకపాల పురోడాశము

రెండు కుండ పెంకుల మీద కాలిస్తే – ద్వికపాల పురోడాశము

ఇలా పదకొండు కుండ పెంకుల మీద ఆ రొట్టెని కాలుస్తారు. పదకొండు కుండ పెంకుల మీద కాలిస్తే – ఏకాదశ కపాల పురోడాశము అంటారు. ఇలా కాల్చిన ఈ రొట్టెనే ఆహుతులుగా సమర్పిస్తారు.

**2. సోమపానం :** సోమలత అనేది గొప్ప మహిమ గల తీగ. ఇది మూజవత్పర్వత ప్రాంతంలో బాగా దొరుకుతుంది. దక్షిణ భారతదేశంలో ఇది లభ్యం కాదు. మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్ ప్రాంతాలలో దీనికి ప్రత్యామ్నాయంగా 'తిప్పతీగె' వాడతారు. మూజవత్పర్వత ప్రాంతము అంటే హిమాలయ పర్వత ప్రాంతము. ఈ తీగె చిన్న

చిన్న కొమ్మలు (అంశువులు)గా ఉంటుంది. చెట్టు దగ్గర చాలా జాగ్రత్తగా దాని ఆకులను, చిన్న చిన్న కొమ్మలు కోసి తెచ్చి యజ్ఞయాగాదులు చేసేవారికి విక్రయిస్తారు. వారు కూడా దీనికి ప్రతిఫలంగా గోవులను ఇచ్చుకొంటారు. కొన్న తరువాత యజమాని, అతని కుటుంబ సభ్యులు దాని నెత్తిమీద పెట్టుకుని, వేదమంత్రాలలో ఊరేగింపుగా తెస్తారు. అలా తెచ్చి ముందుగా రోట్లో దంచి ఆ తరువాత రాతి తిరగలిలో వేసి తిప్పుతారు. అలా తిప్పే సమయంలో దాని ఆకులు నుంచి ఆకుపచ్చని రసం బయటకు వస్తుంది. అలా వచ్చిన రసాన్ని ఉన్నిగుడ్డలో పోసి వడగడతారు. తరువాత దాన్ని పవిత్రమైన ప్రదేశంలో ఉంచి హోమంచేసి మిగిలిన దానిని యజ్ఞం అయిపోయాక నెయ్యి, పెరుగు, బార్లీ, పాలు, తేనెలో కలపి అప్పుడు యజమాని, ఋత్వికులు దానిని పుచ్చుకుంటారు. (త్రాగుతారు)

సోమపానం చేసిన వారికి ఆకలి దప్పిక ఉండవు. మరణం కూడా దగ్గరకు రాదు. యజ్ఞంలో సోమపానం చేసిన వాణ్ణి 'సోమపీథి" అంటారు. ఇది దేవతలకు, ప్రత్యేకంగా ఇంద్రుడి చాలా ఇష్టమైన పదార్థం. ఇది చాలా బలవర్ధకం కూడా వృత్రాసురుణ్ణి సంహరించటానికి ఇంద్రుడు మూడు చెరువుల సోమరసం త్రాగాడు. ఇది అమృతం కన్న కూడా గొప్పది.

**3. పశ్వాలంభనం :** పశ్వాలంభనం అంటే పశువుని చంపటం. ఇంకా కొమ్ములు రాని చిన్న మేకపిల్లను తెచ్చి మంత్రాలు చదువుతూ యజ్ఞకుండం దగ్గర యూప స్తంభానికి కట్టేస్తారు. యూపస్తంభము అంటే బలిపశువును కట్టెయ్యటానికి ప్రత్యేకంగా చెయ్యటబడిన కొయ్యగుంజ. అలా కట్టేసిన మేకపిల్లను వేదమంత్రాలు చదువుతూ సంహరిస్తారు. యజ్ఞంలో చంపబడిన మేక సరాసరి స్వర్గానికి పోతుంది.

ఆ తరువాత దాని పొట్ట కోసి గుండె దగ్గరగా ఉండే వప అనే చర్మాన్ని హోమం చేస్తారు. దాంతో పాటుగా మేకపిల్ల శరీర భాగాలుకూడా హోమం చెయ్యటం జరుగుతుంది.

ఈ రకంగా యజ్ఞం చేసిన యజమానిని "సోమయాజి", 'దీక్షితులు' అంటారు. చైనం చేసిన వాడిని 'చైన్లు' అంటారు. అశ్వమేదం చేసిన వాణ్ణి - అశ్వమేధయాజి - వాజపేయం చేసిన వాణ్ణి - వాజపేయయాజి అంటారు.

ఇక్కడ ఒక విషయం గుర్తుంచుకోవాలి. పశ్వాలంభన, పశువును చంపటం, పశువును బలి ఇవ్వటం అనేది వేదవిహితమైన కర్మ. గొర్రె, ఎద్దు, ఆవు, చివరకి మానవుణ్ణి కూడా యజ్ఞపశువుగా ఉపయోగించారు. ఇవన్నీ పోయి చివరికి మేక మాత్రం స్థిరపడింది. ఇందుకు మనం చెప్పుకున్నట్లుగా యజ్ఞంలోనివధ వధ కానేకాదు అది స్వర్గదాయకం అని శాసనాలు కూడా ఉన్నాయి. ఇది నిజమా?కాదా? అనే విషయం మీద చర్చలు జరపాలన్నా, తీర్పు ఇవ్వాలన్నా అప్పటి దేశకాలమాన పరిస్థితుల ఆధారంగానే అది జరగాలి. ఇవాళ్ళ మనం చూస్తూ ఉంటాం. "మహాభారతం మీద న్యాయనిర్ణయం" అని సభ ఏర్పాటు చేస్తారు. సాహితీవేత్తలు రెండు జట్లుగా ఏర్పడి పాండవులదే ధర్మము వారికే రాజ్యాధికారం ఉందని కొందరు, రాజ్యాధికారం ధర్మం రెండూ కౌరవులవే అని కొందరు వీరావేశంతో వాదిస్తారు. ద్రౌపది ఐదుగురిని వివాహం చేసుకోవటం ధర్మవిరుద్ధం అని బల్లగుద్ది వాదిస్తారు. క్రింద కూచున్న జనం పిచ్చివాళ్ళలాగా చప్పట్లు కొడుతుంటారు. ఇదంతా ఒక తమాషా, ఆ రెండు గంటలూ అయిపోయిన తరువాత ఎవరి డబ్బులు వాళ్ళు జేబులో వేసుకుని వెళ్ళిపోతారు. ఇక్కడ విషయం ఏమంటే భారతంలో జరిగిన

విషయాలను ప్రస్తుత కాలమాన పరిస్థితులతో లెక్కించటం. ఆ పరిస్థితులు చెప్పాలి అంటే ఆ రోజున ఉన్న కాలమాన పరిస్థితులను లెక్కలోకి తీసుకుని మాట్లాడాలి.

అలాగే యజ్ఞంలో పశుబలికూడా. ఆ రోజుల్లో అది ధర్మమే అన్నారు. కాని రానురాను కాలంలో చాలా మార్పులు వచ్చాయి. అనేక సంస్కరణలు జరిగాయి. పశుబలి జీవహింస అని తేల్చారు. రామానుజుడు వైదిక యజ్ఞం పనికి రాదన్నాడు. మధ్వాచార్యుడు పిండితో మేక బొమ్మను చేసి కార్యక్రమం నడిపించండి అన్నాడు. తరువాత కాలంలో వచ్చిన ఆధునికులు అక్కడ మేషము, అశ్వము లాంటి పదాలకు అర్థం ఓషధులు అంతేకాని మేక, గుర్రం కాదు అన్నారు. ఇది సహజం. శ్రీవిద్యలో మకార పంచకం ఉండి తీరాలి అని చెప్పబడింది. అది లేకుండా శ్రీవిద్య లేదు అని చెప్పారు. మకార పంచకము అంటే మద్యము, మాంసము, మత్స్యము, ముద్ర, మైధునము, కాలం మారేటప్పటికి జ్ఞానార్ణవ తంత్రంలో మద్యము అంటే చంద్ర కిరణముల నుంచి జాలువారిన అమృతబిందువులు అంతే కాని మాధవీలత నుంచి తీసిన రసము కాదు. అలాగే మైధునము అంటే జీవాత్మ పరమాత్మల కలయిక అంతే కాని స్త్రీ పురుషుల సంభోగము కాదు అంటూ అర్థం చెప్పారు. అలాగే యజ్ఞంలో పశువు అనే పదానికి ఔషధము అని అర్థం చెప్పారు. ఏమైతేనేం పశుబలి, జంతుహింస మాన్పించారు. ఈ రోజున ఎవరైనా యజ్ఞం చేసి పశుబలిఇస్తే అది నేరముగా పరిగణింపబడి శిక్ష కూడా వేయటం జరుగుతుంది.

## 6. యాగం చేసిన వెంటనే ఫలితం వస్తుందా?

ఇది మనకు చాలా తరచుగా ఎదురయ్యే ప్రశ్న. మంత్రానికి చింతకాయలు రాలతాయా? మంత్రజపం చేస్తే ఫలితాన్ని చూపి నిరూపించగలరా? వీటికి గతంలో సమాధానం చెప్పాను. **"నేను వెధవని. నాకేం తెలియదు. నేను ఎందుకూ పనికి రాను. నేను ఏ పనీ చెయ్యలేదు"** ఇదే మంత్రంగా తీసుకుని ఒక సంవత్సరం పాటు ఏకాగ్రతతో జపం చెయ్యండి. ఫలితం అనుభవంలోకి వస్తుంది. ఇక యాగం కాని యజ్ఞం కాని చేస్తే ఫలితం వెంటనే వస్తుందా? ఇక్కడ ఒక మాట గుర్తు పెట్టుకోండి. కొన్ని పనులకు ఫలితము వెంటనే కనిపిస్తుంది. నిప్పులో చెయ్యి పెడితే కాలి బొబ్బలెక్కుతుంది. కత్తికోసుకుంటే గాయమై రక్తం వస్తుంది. వెంటనే ఫలితం కనిపిస్తుంది. ప్రతిచోటా అలా కాదు. తలనొప్పిగా ఉందని డాక్టరు దగ్గరకు వెళ్ళాం. ఆయన మందు ఇచ్చారు. వేసుకున్నాం. వెంటనే తలనొప్పి గాని, జ్వరం గాని, రోగం గాని తగ్గవు. కొంత సమయం పడుతుంది. మరణానంతరము స్వర్గలోకం పొందాలని యాగం చేస్తాం. యాగం పూర్తయిన వెంటనే స్వర్గం రాదు. ముందు నువ్వు మరణించాలి. ఆ తరువాతే స్వర్గం వచ్చేది. ఇలా కొన్ని పనులకు ఫలితం రావాలంటే సమయం పడుతుంది. ఏదైనా తినంగానే కడుపునొప్పి రాదు. కొంతసేపు కావాలి. కాబట్టి ఓపికతో ఆగి చూడగలిగితే ఫలితం కళ్ళకు కనిపిస్తుంది. ఇక్కడ ఇంకొక ముఖ్యమైన విషయం ఏమంటే నమ్మకమనేది గట్టిగా ఉండాలి. నమ్మకం లేకపోతే డాక్టరు ఎంత గొప్పవాడైనా ఆయన ఇచ్చే మందు పని చెయ్యదు. రోగం తగ్గదు. నమ్మకం ఉంటే ఆయన ఏమందిచ్చినా నీ రోగం తగ్గుతుంది. అలాగే ఇక్కడ కూడా వేదాలమీద, యజ్ఞయాగాల మీద నమ్మకముంటేనే ఫలితం కనిపిస్తుంది.

# 7. చెట్లలో చైతన్యం

చెట్లకు కూడా ప్రాణమున్నది అని నిరూపించాడు జగదీష్ చంద్రబోస్. వాటి నుంచి కొమ్మలు, రెమ్మలు, పూలు, ఆకులు కోసేస్తే అని చాలా బాధపడతాయి. చెట్టును కొట్టేస్తే మరణిస్తుంది. అదే ఎరువేసి నీరు పోస్తే బాగా ఎదుగుతుంది. ఈ విషయాలు అందరికీ తెలుసు. దీనిమీదనే జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు 'పుష్పవిలాపము' అనే గేయాన్ని వ్రాశారు. దాన్ని ఘంటసాల గానం చేశారు. భగవంతుడి పూజకు పూలు కోసుకురావటానికి వెళ్ళి, చెట్టు దగ్గర నిలబడి పూలు కోయబోయాడు భక్తుడు. అప్పుడు 'మా ప్రాణాలు తీస్తావా' అని ఆ పూలు విలపించినాయట.

**నేనొక పూలమొక్క కడనిల్చి తటాలున కొమ్మవంచి**
**గోరానెడు నంతలోన విరులన్నియు జాలిగ నోళ్ళు విప్పి**
**మాప్రాణముల్ తీతువాయంచు బావురుమన్నవి కుంగిపోతి**

అన్నాడు. అలాగే ఇక్కడ కృష్ణయజుర్వేదంలో **మొదటి కాండ, మొదటి ప్రపాఠకంలోని రెండవ అనువాకంలో** యజమాని దర్శయాగం చెయ్యాలని సంకల్పించాడు. దానికి అవసరమైన దర్భ తేవటానికి అడవికి వెళ్ళాడు అధ్వర్యుడు. దర్భలు కొయ్యబోయాడు. వాటిని చూసే సరికి జాలి కలిగింది. హాయిగా స్వేచ్ఛగా పెరుగుతున్న దర్భను కోస్తున్నాను కదా ! అని బాధపడుతూ నా స్వార్థం కోసం మిమ్మల్ని కొయ్యటం లేదు. అంటూ ఆ దర్భలకు వివరణ ఇస్తున్నాడు.

"ఓ దర్భలారా! దేవతలకోసం మిమ్మల్ని కోస్తున్నాను. వర్షం వచ్చి మళ్ళీ మీరు పెరుగగలరు. దేవతారాధనకు తప్పనిసరిగా మీరు కావాలి. నిన్ను నిలువునా చీల్చినా, అడ్డంగా త్రుంచినా, అది దేవతల

కోసమే. నా ఇల్లు కప్పుకోవటానికో, ఇంకో దానికోసమో నిన్ను కొయ్యటం లేదు. నా స్వంతం కోసం నిన్ను కొయ్యటం లేదు. యజ్ఞం కోసం మిమ్మల్ని కోస్తున్నాను. మళ్ళీ వర్షం పడినప్పుడు మీరు శాఖోపశాలుగా విస్తరించాలి. అలా మీరు మళ్ళీ ఎదగటానికి అనుకూలంగానే కోస్తున్నాను" అంటున్నాడు.

దీన్ని బట్టి చెట్లకు ప్రాణమున్నదని, మనం వాటిని కోసినా, కొట్టేసినా, అవి చాలా బాధపడతాయని, వాటి నుంచి ఒక్క ఆకును కోసినా, పూవును తెంచినా అవి దుఃఖిస్తాయని భావిస్తున్నాడు. నా స్వార్థం కోసం మిమ్మల్ని కొయ్యటం లేదు. కేవలం యజ్ఞం కోసం మాత్రమే మిమ్మల్ని కోస్తున్నాను. అని సంజాయిషీ ఇచ్చుకుంటున్నాడు. వర్షం పడగానే మీరు ఇంకా బాగా గుబురుగా పెరగాలి. పెరుగుతారు అని ధైర్యం చెబుతున్నాడు. దీనివల్ల వారి అహింసాభావన, నిస్వార్థ ప్రవృత్తి మనకు తెలుస్తున్నాయి.

# 8. స్త్రీకి సమున్నత స్థానం

**యత్రనార్యేషు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః**

ఈ విషయాన్ని సుయోధనుడు తన తండ్రికి చెప్పి, రాజసూయం నిర్విఘ్నంగా పూర్తి కావటానికి కారణం ద్రౌపదేను అంటాడు.

స్త్రీలు ఎక్కడైతే గౌరవించబడుతారో అక్కడ దేవతలు ఆనందంతో నాట్యం చేస్తారు. ఇది ఆర్యోక్తి. సమాజంలో స్త్రీకి సమున్నత స్థానం ఉంటేనే ఆ సమాజం అభివృద్ధి చెందుతుంది. స్త్రీ పురుషులు వేరు వేరు కాదు. ఇద్దరూ సమాజమనే శరీరంలో రెండు భాగాలు. సంసారమనే బండికి రెండు చక్రాలు. ఏ చక్రం పాడయిపోయినా బతుకుబండి కుంటుపడి పోతుంది. సంసారం నాశనమై పోతుంది. శరీరంలో కుడికాలు బలంగా ఉంది. కాని ఎడమకాలు బలహీనంగా, సన్నగా ఉంది. ఏ మాత్రం బరువు మొయ్యలేదు. ఈ పరిస్థితిలో శరీరం ఎలా నుంచుంటుంది? ఒక కాలు బలంగా ఉండటం కాదు. రెండవ కాలు కూడా కనీసం మామూలుగా ఉండాలి. రెండు కాళ్ళు ఒకే రకంగా ఉంటే శరీర కదలికలు హాయిగా ఉంటాయి. కాబట్టి సమాజంలో స్త్రీని ఎప్పుడూ గౌరవంగానే చూడాలి. స్త్రీకి సమున్నత స్థానం కల్పించాలి. దానికోసమే ఈ రోజున కూడా మనం నానా ఇబ్బందులు పడుతున్నాం. 'మహిళా బిల్లు తెస్తాం' అటున్నాం, చాలా కాలం నుంచి 'నిర్భయ' చట్టం అమల్లోకి తెచ్చాం అంటున్నాం. ఇవన్నీ స్త్రీలని ఉద్ధరించటానికే. మనం ఏం చెప్పినా, ఎన్ని చెప్పినా మనది పురుషాధిక్య సమాజం. ఇందులో అనుమానం లేదు.

కాని వేదకాలంలో సమాజంలో స్త్రీకి ఎంతో గౌరవమున్నది. యజ్ఞం చెయ్యాలి అంటే స్త్రీ పురుషులు ఇద్దరూ కలిసే చెయ్యాలి. అంతేగాని ఒంటరిగా చెయ్యటానికి ఎవరికీ అధికారం లేదు. భర్తవల్లనే

భార్యకి యజ్ఞం చేసే అధికారం కలుగుతోంది. యజ్ఞం చేసే సమయంలో భార్య అనేక సహాయాలను భర్తకు చెయ్యాలి. కాబట్టి ఆ స్త్రీ పైన భర్తకు, ఇతర కుటుంబ సభ్యులకు గౌరవం రెట్టింపవుతుంది. ధర్మరాజు రాజసూయం చేసేటప్పుడు వచ్చిన వారికి భోజనాదికాలన్నీ ద్రౌపదీదేవి స్వయంగా చూసేదట. అందరూ భోజనం చేసిన తరువాత కాని తాను తినేది కాదట. ఈ విషయాన్ని స్వయంగా సుయోధనుడే తనతండ్రికి చెప్పి రాజసూయం నిర్విఘ్నంగా పూర్తి కావటానికి కారణం ద్రౌపదేను అంటాడు. ఈ రోజున యజ్ఞయాగాది క్రతువులు చెయ్యటము లేదు. నేను యాగాలు చేసినప్పుడు అక్కడ కావలసినవన్నీ నా భార్యే స్వయంగా చూసుకునేది. ఇంట్లో జరిగే అనేక కార్యక్రమాలు భార్యాభర్తలు కలిసే చెయ్యాలి. చేస్తున్నారు. కాని పాశ్చాత్య నాగరికత ఎక్కువవుతోంది. యువత అటువైపు ఆకర్షితులవుతున్నారు. వాళ్ళకి నిజానిజాలు తెలియజేసి యధార్థాన్ని వివరించాల్సిన అమ్మా నాన్నలకే మన సంప్రదాయాల మీద నమ్మకం ఉండటం లేదు. ఇంక వాళ్ళు పిల్లలకేం చెబుతారు? మొత్తం మీద చూస్తే స్త్రీలకు సమున్నత స్థానం ఇస్తోంది వేదం అని తెలుస్తోంది. ఈ విషయం మొదటికాండలోని మొదటి ప్రపాఠకంలోని పదవఅనువాకంలో చెప్పబడింది.

# 9. భర్తృవియోగం

వివాహం అయిన తరువాత స్త్రీ పురుషులు భార్యాభర్తలుగా పరిగణించబడతారు. వారిద్దరి జీవితాలు ఒకటిగానే ఉండాలి. ఇద్దరూ ఒకటిగానే ప్రయాణించాలి. కష్టంలో గాని సుఖంలో గాని ఒకరికి ఒకరు తోడుగా ఉండాలి. అలాటిది ఆ ఇద్దరిలో ఎవరైనా ముందుగా కాలం చేసినట్లైతే రెండవ వాళ్ళ జీవితం దుర్భరమవుతుంది. ఇది అనుభవైక వైద్యం. ఆ వియోగాన్ని భరించలేక ఆసువులు బాసిన వాళ్ళు కూడా ఉన్నారు. గతకాలంలో మరణించిన భర్తతో పాటుగా భార్య సహగమనం చేసేది. సతీసహగమనాన్ని మాన్పించటానికి సంఘసంస్కర్తలు రావలసివచ్చింది.

వేదకాలంలో స్త్రీలు భర్తృవియోగం భరించరానిదిగా భావించేవారు. స్త్రీలు తమ సర్వస్వాన్ని వదిలెయ్యటానికైనా సిద్ధపడేవాళ్ళు కాని భర్తతో వియోగం పొందటానికి మాత్రం ఇష్టపడే వాళ్ళు కాదు. భార్య శరీరమైతే భర్త అందులోని ఆత్మ. ఈ సహజీవనం కోసం వారు అగ్నిదేవుణ్ణి ప్రార్థించేవారు. **ఒకటవ కాండ ఒకటవ ప్రపాఠకంలోని పదవ అనువాకంలో** "ఓ అగ్నీ ! నేను మంచి సంతానము కలదానను. మంచి భర్త గలదానను. నువ్వు శతృనాశకుడవు. నిన్ను ఎవరూ ఎదిరించలేరు. అటువంటి నిన్ను నేను అర్చిస్తున్నాను. నాకు ఆయుష్షు, సంతానము, వర్చస్సు ఉన్నాయి. నా భర్తను నేను మళ్ళీ మళ్ళీ కలుస్తాను. నేను చిరకాలము సుమంగళిగా జీవించాలి. నాకు దీర్ఘకాలము సౌభాగ్యాన్ని ప్రసాదించు." అని ప్రార్థిస్తున్నది యజమాని భార్య.

# 10. అన్న, ధన సమృద్ధి

ఎవరికైనా సరే లోకంలో సుఖంగా జీవించాలంటే కావలసింది సిరిసంపదలు. ధనధాన్యాలు, వీటిని మనం కష్టపడి సంపాదించుకుంటాం. మనం ఎంత కష్టపడినా భగవంతుని అనుగ్రహం లేనిదే లోకంలో దేన్నీ సాధించలేం. భగవంతుని అనుగ్రహం కావాలంటే పూజలు, అర్చనలు జపాలు, చెయ్యాలి. వీటన్నింటికన్నా భగవంతుణ్ణి ప్రసన్నుడిగా చేసుకోవటానికి తేలికైన మార్గం యజ్ఞయాగాలు. మన కోరికలు తీర్చేవాళ్ళు ఇంద్రుడు, అగ్ని. అందుకే యజ్ఞం చేసి మాకు అన్నసమృద్ధి, ధనసమృద్ధి కలిగించమని ఇంద్ర, అగ్ని మొ॥ దేవతలను ప్రార్థిస్తున్నారు. కృష్ణయజుర్వేదంలోని **ఒకటవ కాండ ఒకటవ ప్రపాఠకంలోని 14వ అనువాకంలో**

ఓ ఇంద్రాగ్నులారా ! మీరు యజ్ఞం చెయ్యటానికి అన్నము, ధనము ఇస్తారు. మీకు సంతోషం కలగటానికి, మాకు అన్నం లభించటానికి మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాము.

ఓ దేవతలారా ! లోకంలో అల్లుడు దౌహిత్రుణ్ణి, బావమరిది మేనల్లుణ్ణి ఇస్తారు. మీరు వారిని మించిన ఎక్కువమంది సంతానాన్ని ఇస్తారు. కాబట్టి సోదరసదృశ పురోడాశమును మీకు అర్పించి మిమ్మల్ని సంతోషపెడుతున్నాము. ఇంద్రాగ్నులారా! మీరు వృత్రాసురుని సంహరించారు. మా స్తోత్రాలు దోషము లేనివి. అవి అన్నంతో కల్పించబడినవి. మీరు వాటిని స్వీకరించండి. యజమానికి అన్నం ప్రసాదించండి. ఓ సూర్యదేవా ! అన్నం లభించే కర్మకోసం నిన్ను యాచిస్తున్నాను.

నేను పూషా దేవతను స్తుతిస్తున్నాను. అతడు ఆహ్లాదాన్ని,

ఓషధులని, దుఃఖ వినాశకాలను మాకు ఇచ్చుగాక.

భూమివల్ల ఆవులు, గుర్రాలు, అన్నము లభిస్తాయి. ఓ భూదేవి! వీటిని మాకు ప్రసాదించు గాక. ఓ క్షతిపతీ ! నీవు మాకు నెయ్యివంటి పదార్థాలను ఇవ్వవలసినది.

ఓ అగ్నీ ! ధనం సంపాదించటానికి మిమ్మల్ని మంచి మార్గంలో నడిపించండి. మమ్మల్ని పాపమార్గము నుండి రక్షించవలసినది, మీకు అనేక నమస్కారములు.

ఓ అగ్నిదేవా ! మా హవిస్సులు తీసుకుని మాకు ధనము అన్నము ప్రసాదించవలసినది.

ఓ అగ్నిదేవా ! మా పిల్లలు మనమలు సుఖంగా ఉండేట్లు చేయవలసినది.

ఓ దేవతలారా ! మీ ప్రీతి కోసం మేము యజ్ఞయాగాది క్రతువులు చేస్తాము. మాకు అన్నము ధనము, సుఖసంతోషాలు ప్రసాదించండి." అని ప్రార్థిస్తున్నారు.

# 11. వంశాభివృద్ధి

లోకంలో ఏ జీవికైనా సరే కావలసింది వంశాభివృద్ధి పశువులుగాని, పక్షులు గాని, క్రిమికీటకాలు గాని, మానవులు, రాక్షసులు ఎవరైనా సరే వంశాభివృద్ధినే కోరుకుంటారు. తమ వంశాన్ని అభివృద్ధి చేసుకోవటానికే వివాహం చేసుకుంటారు. 'పురుష సంతానం కావాలి అని తపిస్తారు. ఇదంతా వంశాభివృద్ధి కోసమే.'

జంతువులు, పశువులు, పక్షులు, మృగాలు, క్రిమికీటకాలు, వీటిని జాగ్రత్తగా పరిశీలిస్తే తమ వంశాన్ని జాతిని అభివృద్ధి చేసుకోవటానికి అవి ప్రాణాలు కూడా అర్పిస్తాయి. తేలు చూడండి. సంతానం కలగగానే తల్లితేలు ప్రాణాలు వదుల్తుంది. ఆ విషయం తెలిసికూడా సంతానాన్ని కంటుంది. ఒక రకమైన ఎలుక సంతానం కోసం నెలరోజుల పాటు నిద్ర, ఆహారము కూడా లేకుండా సంభోగ క్రియలో పాల్గొని చివరకు ప్రాణాలు విడుస్తుంది. ఒక రకమైన మిడత సంభోగ క్రియలో ఉండగా, ఆడమిడత దాని శరీరాన్ని శిరస్సుతోసహా పూర్తిగా తినేస్తుంది. తన శరీరాన్ని కోల్పోతున్నా సంభోగక్రియ ఆగదు. సంతానోత్పత్తి కోసం కొనసాగుతూనే ఉంటుంది.

అందరూ అనుకునేట్లుగా సంభోగక్రియ అన్నిజీవులకీ ఆనందదాయకం కాదు. పిల్లి, పులి, సింహాము మొదలైన వాటికి అది చాలా బాధాకరము. మొగ జంతువు పురుషాంగము ముళ్ళు ముళ్ళుగా ఉంటుంది. దీంతో సంభోగ క్రియలో ఆడజంతువు శరీరం కోసుకుపోయి రక్తం కారుతుంది. విపరీతమైన బాధ కూడా కలుగుతుంది. అందుకే సంభోగక్రియకు ఆడజంతువు త్వరగా ఇష్టపడదు. ఈ కారణం చేతనే ఆ సమయంలో పిల్లులు పెద్దగా అరుస్తూ ఉంటాయి. బాధాకరమైనప్పటికీ సంతానాభివృద్ధి కోసం,

వంశాభివృద్ధి కోసం అవి బాధను భరిస్తాయి. తమ ప్రాణాలను కూడా లెక్క చేయవు. దీన్ని బట్టి వంశాభివృద్ధి అంటే ఎంత కోరికో తెలుస్తుంది.

మానవులలో అయితే కేవలం సంతానాభివృద్ధి కాదు. వంశాభివృద్ధి కావాలి. మనవి పితృస్వామ్య కుటుంబాలు. తండ్రి యొక్క ఇంటి పేరు పిల్లలకు వస్తుంది. వివాహం అయిన తరువాత స్త్రీ ఇంటి పేరు గోత్రము కూడా మారిపోతాయి. అందుకే ఆడపిల్లని ఆడ పిల్ల అంటారు. ఎంతమంది ఆడపిల్లలు పుట్టినా వంశం నిలవాలంటే, తమ ఇంటి పేరు నిలవాలంటే కుమారుడు తప్పనిసరిగా ఉండాలి. ఈ కారణం చేతనే మగపిల్ల వాణ్ణి 'వంశాంకురము' 'వంశోద్ధారకుడు' అంటారు.

కృష్ణయజుర్వేదంలోని **ప్రథమకాండ, ప్రథమ ప్రపాఠము, పదకొండవ అనువాకంలో**

"ఓ సముద్రాది దేవతలారా! నాకు ఆనందకరమైన మనస్సు ఇవ్వండి. మీ అనుగ్రహంతో నాకు మంచి దేహము, కాంతివంతమైన రూపముగల పుత్ర పౌత్రులు లభించగలరు." అంటున్నారు. పుత్రపౌత్రులు లభించటమంటే వంశాభివృద్ధి జరగటం అన్న మాట.

# 12. నిత్యయవ్వనం

జీవితంలో బాల్యము, కౌమారము, యవ్వనము, వృద్ధాప్యము అనేవి నాలుగు దశలు. కాలచక్రంతో పాటుగా ఈ దశలు మన ప్రమేయం లేకుండానే వస్తాయి. వీటిని ఎవరూ ఆపలేరు. ఈ అవస్థలన్నింటిలోకి వృద్ధాప్యము చాలా భయంకరమైనది. శరీరంలో పటుత్వం తగ్గిపోతుంది. కాళ్ళు చేతులు పనిచెయ్యవు. శరీర భాగాలు మన అధీనంలో ఉండవు. మోకాళ్ళు ముందుకు, మోచేతులు వెనక్కి వంగిపోతాయి. దృష్టిమందగిస్తుంది. ఎదురుగా ఏమున్నదో కనిపించదు. ఆకలిదప్పికలు మందగిస్తాయి. నోటినుండి, ముక్కు నుండి ద్రవాలు స్రవిస్తుంటాయి. మలమూత్రాల మీద నియంత్రణ ఉండదు. కూర్చోలేడు, నుంచోలేడు, ప్రతిదానికీ ఎవరి మీదయినా ఆధారపడాలి. ఇంట్లో వాళ్ళు చీటికి మాటికి విసుక్కుంటారు. ఇటువంటి వృద్ధాప్యాన్ని, ముసలితనాన్ని ఎవరూ కావాలనుకోరు.

పూర్వకాలంలో చంద్రవంశపు రాజు యయాతి. వేటకు వెళ్ళి నూతిలో పడి ఉన్న శుక్రాచార్యుని కుమార్తె దేవయానిని రక్షించి వివాహమాడాడు. రాక్షసరాజైన వృషపర్వుని కుమార్తె శర్మిష్ట దేవయానికి దాసిగా వచ్చింది. యయాతి దేవయానికి తెలియకుండా శర్మిష్టను కూడా వివాహం చేసుకున్నాడు. ఈ విషయం తెలిసి శుక్రాచార్యుడు యయాతి మహారాజును 'జరాభారంతో దుఃఖించవలసింది' అని శపించి, ఎవరైనా ఇష్టపడి తీసుకుంటే నీ ముసలితనాన్ని వారికిచ్చి, వారి యవ్వనాన్ని నువ్వు అనుభవించవచ్చు అన్నాడు. అనుభవించాలనే కోరిక ఉంది. అందుచేత తన కుమారులను పిలిచి తన ముసలితనాన్ని తీసుకుని, వారి యవ్వనాన్ని తన కిమ్మని కోరాడు మహారాజు. ఎవరూ అంగీకరించలేదు. వాళ్ళందరికి రాజ్యాధికారం లేకుండా శపించాడు యయాతి. చివరకు శర్మిష్టకు జన్మించిన ఆఖరుకుమారుడు 'పూరుడు'

తండ్రి ముసలితనాన్ని తీసుకుని తనయవ్వనాన్ని తండ్రికి ఇచ్చాడు. మహారాజు తనవితీరా సుఖాలనుభవించి, చివరకు పూరుడి యవ్వనంతోబాటుగా రాజ్యాధికారాన్ని కూడా అతనికి ఇచ్చాడు.

ఆ రోజునే కాదు ఈ రోజున కూడా వృద్ధాప్యం ఎవరూ కావాలనుకోరు. తప్పదు కాబట్టి భరిస్తున్నారు. వయస్సు పెరిగినా, ముసలివారైనా తాము యవ్వనవంతులుగా కనిపించాలని జుట్టుకు రంగు వేస్తారు. చిన్నపిల్లలు వేసే బట్టలు వేసుకుంటారు. గలగలా మాట్లాడుతుంటారు. ఇదంతా తాము ముసలివారము కాదు అని మిగిలిన వారు అనుకోవాలని ఆరాటం. వేదంలో కూడా ఋషులుకూడా ముసలితనాన్ని ఇష్టపడేవారు కాదు.

కద్రువ కుమారుడైన 'కపర్ణీరుడు' **'భూమిర్భూమ్నా'** అనే వేదమంత్రాన్ని దర్శించి, దాన్ని జపం చేసి ముసలితనం రాకుండా చూసుకున్నాడు. పాములన్నీ కూడా ఈ మంత్రాన్ని జపించి ముసలితనాన్ని పోగొట్టుకున్నాయి. మంచియవ్వనాన్ని పొందాయి. ఈ మంత్రమహివల్లనే అగ్ని ముసలితనం లేకుండా ఉన్నాడు. మహర్షులు కూడా ఈ మంత్రాన్ని జపించి, యజ్ఞంద్వారా అగ్నిలాగానే ముసలితనం లేకుండా ఉన్నారు. ఈ విషయం **ఒకటవ కాండలోని మూడవ ప్రపాఠకం పదవకొండవ అనువాకంలో** చెప్పబడింది.

"ఓ అగ్నిదేవా ! నీ అనుగ్రహంతో మాకు ఉత్తమ దేహము, కాంతివంతమైన శరీరము ఇవ్వవలసింది" అంటున్నారు.

ఉత్తమ దేహము అంటే-నిత్యయవ్వనము, ఆరోగ్యవైన శరీరము.

కాంతివంతమైన దేహము-మంచిరూపము, వర్చస్సు

ఇవి కావాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నారు.

# 13. వెండి దానము

ఏవైనా క్రతువులు చేసినప్పుడు దానాలు ఇవ్వటం పరిపాటి. అలాంటి సమయంలో దశదానాలు, షోడశదానాలు ఇవ్వటం జరుగుతుంది. దశదానాలు అంటే

| | |
|---|---|
| 1. గోదానము | 6. వస్త్రదానము |
| 2. భూదానము | 7. ధాన్యదానము |
| 3. తిలదానము | 8. గుడదానము |
| 4. హిరణ్యదానము | 9. రౌప్యదానము (వెండి దానము) |
| 5. ఆజ్యదానము | 10. లవణదానము |

షోడశ దానాలు అంటే

| | |
|---|---|
| 1. గోదానము | 9. శయ్యాదానము |
| 2. భూదానము | 10. గృహదానము |
| 3. తిలదానము | 11. అగ్రహారదానము |
| 4. హిరణ్యదానము | 12. రథదానము |
| 5. రత్నదానము | 13. గజదానము |
| 6. విద్యాదానము | 14. అశ్వదానము |
| 7. కన్యాదానము | 15. భాగదానము |
| 8. దాసిదానము | 16. మహిషీదానములు |

ఇలా దానాలిచ్చేటప్పుడు వెండి, బంగారము, వస్త్రాలు, భూమి లాంటివి తప్పనిసరిగా దానం ఇస్తారు. అయితే కొన్నిచోట్ల పూజాదికాల్లో వెండి వస్తువులు వాడటం కూడా చెయ్యరు. ఇది శాస్త్రం కాదు. వాళ్ళు ఏర్పరచుకున్న సంప్రదాయం. అలాగే రుద్రాక్ష వాడరు. రుద్రుని యొక్క కనుల నుంచి వచ్చిన నీటిబిందువే రుద్రాక్ష. అందుకే వాటిని వాడము అంటారు. మరి వెండివస్తువులకు ఏమైంది. వెండి

వస్తువులు దానం ఇవ్వకపోవటానికి కారణం వేదం ఏం చెబుతోందో చూద్దాం. **ఒకటవ కాండ, ఐదవ ప్రపాఠకం మొదటి అనువాకంలో** ఒక చిన్న కథ చెబుతున్నారు.

ఒకసారి దేవదానవ సంగ్రామం జరిగింది. ఎప్పుడు యుద్ధం జరిగినా రాక్షసులే గెలుస్తారు. కాని ఇప్పుడు విచిత్రంగా రాక్షసులు ఓడిపోయారు. దేవతలు గెలిచి రాక్షసుల దగ్గర ధనాన్ని లాగేసుకున్నారు. కాని దేవతలకి చిన్న అనుమానం వచ్చింది. మళ్ళీ రాక్షసులు గెలిచి ఈ ధనంకాస్తా పట్టుకుపోతారేమో అని భయపడి, ఆ ధనమంతా అగ్నిదేవుడి దగ్గర దాచారు. కథ మామూలే. **ఆడదానిని జూడ, అర్థంబు మరి జూడ బ్రహ్మకైనను పుట్టు రిమ్మతెగులు** అన్నారు. ధనాన్ని చూస్తే ఎంతటి వాడికైనా దురాశ కలుగుతుంది. ఇప్పుడు అగ్నిదేవుడికి కూడా అలాగే కలిగింది. వెంటనే తన దగ్గర దేవతలు దాచిన ధనమంతా తీసుకుని పారిపోయాడు. విషయం దేవతలకి తెలిసింది. అగ్నిదేవుడి వెంటపడి చివరకు ఎలాగైతే ఏం అగ్నిదేవుణ్ణి పట్టుకున్నారు. అతని దగ్గర నుంచి డబ్బులాక్కునే ప్రయత్నం చేశారు. దాంతో అగ్నిదేవుడు పెద్దగా ఏడవటం మొదలుపెట్టాడు. అప్పటినుంచే రుద్రత్వము (ఏడ్పు) ఏర్పడింది.

అగ్ని అలా ఏడవటం వల్ల కన్నీరు కారింది. ఆ కన్నీరే 'వెండి' అయింది. ఈకారణము చేతనే అంటే అగ్ని యొక్క కన్నీరు కాబట్టి యజ్ఞయాగాలలో వెండి దానానికి పనికి రానిది అయింది. ఒకవేళ యజ్ఞంలో వెండి దానము గనక ఇచ్చినట్లైతే సంవత్సరము లోపల యజమాని ఇంట్లో ఏడుపులు వినిపిస్తాయి. అంటే ఎవరో ఒకరు మరణిస్తారు. కాబట్టే "యజ్ఞయాగాదులలో వెండి దానం పనికి రాదు" అని చెబుతోంది వేదం.

# 14. గోసంపద

మానవుడికి కావలసినది తన వంశాభివృద్ధి. ఆ తరువాత సిరిసంపదలు. ఆ రోజుల్లో గోధనమే ధనము. ఈ కారణంచేతనే ఎవరింట్లో చూచినా గోసంపద విస్తారంగా ఉండేది. తన సంతానాన్ని, ధేనుసంతానాన్ని వృద్ధిచెయ్యమని అగ్నిని ప్రార్థించేవారు. **ఒకటవ కాండలో ఐదవ ప్రపాఠకంలోని ఆరవ అనువాకంలో** ఈ రకమైన ప్రార్థన మనకు కనిపిస్తున్నది.

"నేను మానవ సంతానాన్ని, ధేనుసంతతిని చూస్తున్నాను. వారంతా నా ఇంట్లో ఉండాలి.

ఓ ఆవులారా! మీ పాలు రుచిగా ఉంటాయి. బలాన్ని కలిగిస్తాయి. నేను మీ పాలు త్రాగుచున్నాను.

ఓ పశువులారా ! మీరు భూలోకంలో మా ఇంట్లోనే ఉండండి. ఇక్కడే తిరగండి. ఇక్కడే ఆడండి. నా కోసం మీ సంతానాన్ని వృద్ధి చెయ్యండి.

ఓ దూడా ! నువ్వు మీ అమ్మ దగ్గర ఉన్నావు. పాలు త్రాగటానికి ఇటు, అటు పరుగులు పెడుతున్నావు. అలా పరుగులు పెట్టి అనేక దూడలు ఉన్నట్టుగా అనిపిస్తున్నావు. నీ తల్లి పాలకు నువ్వే కారణము. నేను యజమానిని. నాకు ధనసమృద్ధి కలిగించటానికి నా దగ్గరకు రావలసినది. నువ్వు పెరిగి అనేక రెట్లు అయ్యేట్లుగా నిన్ను పోషిస్తాను. పాలు, పెరుగు, వెన్న, నెయ్యి రూపాలలో ఉండే ధనము నావద్ద ఉండుగాక.

ఓ అగ్నిదేవా! నేను ప్రతిరోజు ఉదయము, సాయంత్రము నీకు

నమస్కరిస్తున్నాను.

అగ్నీ ! నువ్వు యజ్ఞసామ్రాట్టువు. గోపాలకుడవు. మా ఇంట్లో నేనిచ్చే హవిస్సులతో వృద్ధి పొందుతున్నావు. నేను నిన్ను ఆరాధిస్తున్నాను.

ఓ అగ్నిదేవా ! కొడుకుకు తండ్రిలాగా మాకు సులభ సాధ్యుడవు కావలసినది, మా క్షేమం కోసం మాకు దగ్గరివాడవు కావలసినది, మాకు అత్యంత సన్నిహితుడవు కావలసినది. మాకు రక్షకుడవు కావలసినది. మంగళప్రదుడవై నిత్యము మా ఇంటనే మాకు దగ్గరగా ఉండుము.

ఓ అగ్నీ! నీవు ఎంతో పవిత్రుడవు. ఎంతో కాంతి గలవాడవు. మేము మీకు మిత్రులము. కాబట్టి మా దగ్గరకు రా !

అగ్ని ధనవంతుడు, వసువులచేత, రుద్రులచేత ఆదరింపబడేవాడు. అటువంటి ఓ అగ్నీ! మాకు ధనాన్నివ్వవలసినది. నా ఇంట్లో ఉన్న పశువులారా! మీరు పాలు బాగా ఇవ్వాలి. దానివల్ల నాకు ధనం పెరగాలి.

ఓ గోవులారా ! మంచి నెయ్యినివ్వండి. మీ సంఖ్య వేలు అయ్యేట్లుగా నేను మిమ్మల్ని పోషిస్తాను. మీ సంపద నన్ను చేరుగాక. ఓ అగ్నీ ! నీవు బలవంతుడవు. శత్రుసంహారము చేసేవాడివి. కోరికలు తీర్చేవాడివి. అటువంటి నిన్ను నేను ప్రతిరోజు ఆరాదిస్తున్నాను. నీ అనుగ్రహంతో నేను వందసంవత్సరాలు జీవించాలి. నా సంతానానికి ఆయురారోగ్య ఐశ్వర్యాలు, కలిగించమని నిన్ను ప్రార్థిస్తున్నాను.”

# 15. చంద్రుడికి క్షయరోగం

దక్షప్రజాపతికి ముప్పైమూడు మంది కుమార్తెలు. వారిలో 27 మందిని చంద్రునికిచ్చి వివాహం చేశాడు. వారే అశ్వని, భరణి నుంచి రేవతి వరకు గల నక్షత్రాలు. చంద్రుడికి రోహిణి అంటేనే ఎక్కువ మోజు. దాంతో ఎక్కువ కాలం ఆమెతో గడుపుతున్నాడు. మిగిలిన వాళ్ళని ఏ మాత్రం పట్టించుకోవటం లేదు. భర్త నిరాదరణను భరించలేని భార్యలు తమ తండ్రి అయిన ప్రజాపతి దగ్గరకు వెళ్ళి విషయం వివరించారు. చంద్రుడికి కబురు చేశాడు ప్రజాపతి. విషయమడిగాడు. నిజమేనా? అన్నాడు. తలదించుకున్నాడు చంద్రుడు. ఇది పద్ధతి కాదు. వివాహం చేసుకున్న వారందరూ 27 మంది నీ భార్యలే. అందరినీ సమానంగానే చూడాలి. అదే ధర్మం. చంద్రా! ఏనాడూ ధర్మాన్ని తప్పవద్దు అని హెచ్చరించాడు. తన పొరపాటు దిద్దుకుంటానని భార్యలందర్నీ తీసుకుని వెళ్ళిపోయాడు. కాని పరిస్థితి యథాతథంగానే ఉంది. చంద్రుడు రోహిణితోనే ఉంటున్నాడు. విషయం మళ్ళీ దక్షప్రజాపతి దగ్గరకు వెళ్ళింది. ఈసారి విపరీతమయిన కోపం వచ్చింది. చంద్రుడికి 'యక్ష్మ' అనే రోగం వస్తుందని శాపం పెట్టాడు ప్రజాపతి. అదే క్షయరోగం. అది రాజైన చంద్రుడికి వచ్చింది కాబట్టి **'రాజయక్ష్మ'** అన్నారు. పాపం చెయ్యటం వల్ల వచ్చింది కాబట్టి **'పాపయక్ష్మ'** అన్నారు. భార్యలవల్ల వచ్చింది కాబట్టి **'జాయేన్య'** అన్నారు. క్షయవ్యాధితో బాధపడుతున్న చంద్రుడు భార్యలతో 'ఇక మీదట తప్పు చెయ్యను. మిమ్మల్నందర్నీ సమానంగా చూసుకుంటాను. నా రోగం తగ్గే విధానం ఆలోచించండి అన్నాడు. అప్పుడు చంద్రుని భార్యలందరూ కలిసి ఆదిత్యదేవతాకము అయిన 'ఆదిత్యేష్టి' అనే క్రతువు చేసి

చంద్రుడికి క్షయరోగం నుంచి విముక్తి కలిగించారు. ఈ విషయమంతా **రెండవ కాండ మూడవ ప్రపాఠకములోని ఐదవ అనువాకంలో** వివరించబడింది.

క్షయరోగం వచ్చిన వారు ఈ యజ్ఞం చేస్తే ఆ రోగం పోతుంది. అయితే అమావాస్యనాడు ఈ క్రతువును చెయ్యాలి. ఆ తరువాత శుక్లపక్షచంద్రుడిలాగా రోగి ఆరోగ్యం దినదినాభివృద్ధి చెందుతుంది.

# 16. చేపలను చంపటం పాపం కాదా?

చిన్నచేపని పెద్దచేప తినేస్తుంది. అంతకన్న పెద్దచేప దీన్ని తింటుంది. ఇది లోకరీతి. లోకంలో ప్రతిప్రాణి ఆహారం కోసం ఇంకొక ప్రాణిమీద ఆధారపడుతుంది. సముద్రంలో చేపల్నిపట్టి తింటాయి కొంగలలాంటి పక్షులు. వాటిని పట్టుకుని తింటాయి గ్రద్దలు. ఇక్కడ ఒక తమాషా అయిన విషయం చెబుతాను. వినండి. ఒకసారి టి.వి.లో ఒక ప్రోగ్రాము వచ్చింది. అందులో సముద్రం దగ్గర జీవులు. వాటి జీవన విధానము చూపిస్తున్నాడు. ఒక కొంగ సముద్రంలోకి మునిగి చేపలను నోటితో కరచుకుపోతోంది. వాటిని తిని మళ్ళీ వస్తోంది. ఈసారి వచ్చి నీటిమీద ఈదుతూ చేపలకోసం వెతుకుతోంది. ఇంతలో ఒక పెద్ద చేపవచ్చి ఆ కొంగను కాస్తా లటుక్కున పట్టుని నీటి లోపలికి వెళ్ళిపోయింది.

అసలు విషయానికి వస్తే ఇలా జీవులను చంపి తినటం పాపం కాదా? ఇది ప్రశ్న. పాపమని కొందరు, కాదని మరికొందరు వాదిస్తుంటారు. ఇక్కడ విచిత్రమైన విషయం ఏమంటే నీళ్ళలో తిరిగే చేపలను చంపటం మాత్రం పాపం కాదు అంటోంది వేదం. ఈ విషయం **రెండవకాండలో ఆరవ ప్రపాఠకంలో ఆరవ అనువాకంలో** చెప్పబడింది.

అగ్నిదేవుడికి ముగ్గురు అన్నలు ఉన్నారు. వారంతా దేవతలకు హవిస్సు అందజేస్తూనే మరణించారు. అది చూసిన అగ్నిదేవుడు "దేవతలకు హవిస్సులందించే వాడు మరణిస్తాడు" అని తీర్మానించుకుని, దేవతలకు కనిపించకుండా పోయి సముద్రంలో దాక్కున్నాడు. భూలోకంలో బ్రాహ్మణులు యజ్ఞయాగాలు చేస్తున్నారు.

కాని అగ్నిదేవుడు వాటిని దేవతలకు కోసం తీసుకుపోవటంలా. అసలు అగ్నిదేవుడే యజ్ఞానికి రావటంలా. దీంతో దేవతలకు హవిస్సులు అందటం లేదు. దేవతలందరికీ ఏమైందో తెలియలేదు. అగ్నిదేవుడి కోసం వెదకటం మొదలుపెట్టారు. ఎంతకీ అగ్ని వారికి కనిపించలా. ఆ సమయంలో నీటిలో ఉన్న చేప అగ్ని నీటిలో దాక్కున్నాడని దేవతలకు చెప్పింది. దేవతలు అగ్నిదేవుణ్ణి వెదికి పట్టుకున్నారు. తాను నీటిలో దాక్కున్న విషయం చేప దేవతలకి చెప్పింది అనే విషయం అగ్నికి తెలిసి "ఓ చేపా! నేను ఇక్కడ దాక్కున్న విషయం నువ్వు దేవతలకు చెప్పావు. కాబట్టి జాలరులు నిన్ను పట్టుకుని చంపుతారు" అని శాపం పెట్టాడు. అప్పటి నుంచి జాలరులు చేపలను పడుతున్నారు. ఇక్కడ బాధాకరమైన విషయం ఏమంటే చేపలతో సహా అన్ని జలచరాలు, పక్షులు, మానవులు అందరూ చేపల్ని చంపి తింటారు. కాని చేపమాత్రం ఎవరికీ ఎదురు తిరగలేదు. ఈ కారణంచేతనే చేపని చంపినప్పటికీ పాపంకాదు అంటున్నారు.

ఆ తరువాత దేవతలు అగ్నిదేవుణ్ణి హవ్యవాహకుడిగా నీ పని నువ్వు చెయ్యి అన్నారు. అప్పుడు అగ్ని "ఓ దేవతలారా! హోమం చేసేటప్పుడు అగ్నిలో కాకుండా బయటపడే (హవ్యము) పదార్థాన్ని నా అన్నలకిచ్చేట్లయితే నేను హవ్యవాహకుడిగా ఉంటాను అన్నాడు. సరేనన్నారు దేవతలు. అప్పటి నుంచి యజ్ఞకుండము బయట పడిన పదార్థము (హవ్యము) అగ్ని అన్నలకే చేరుతోంది.

# 17. బ్రహ్మహత్యాపాతకము

బ్రాహ్మణుణ్ణి చంపినట్లైతే బ్రహ్మహత్యా పాతకం చుట్టుకుంటుంది. పంచ మహాపాతకాలలో బ్రహ్మహత్య ఒకటి. పంచ మహాపాతకాలు అంటే

1. బంగారం దొంగిలించటం 2. సురాపానము 3. బ్రహ్మహత్య

4. గురుపత్నీ సంగమము 5. ఈ పనులు చేసినవారి సహవాసము

మొదటి నాలుగు మహాపాతకాలు అని చెప్పి అటువంటి పాతకులతో సహవాసము కూడా మహాపాతకమేను అన్నారు.

ఈ పాతకం నుంచి ఎవరికీ మినహాయింపు లేదు. రావణబ్రహ్మను సంహరించినందుకు శ్రీరామచంద్రుడికి బ్రహ్మహత్యాపాతకం చుట్టుకుంది. రామేశ్వరంలో శివలింగ ప్రతిష్ఠ చేసి దాన్నుంచి బయటపడ్డాడు రాముడు. అలాంటప్పుడు త్వష్టప్రజాపతి కుమారుడు విశ్వరూపుణ్ణి సంహరించాడు ఇంద్రుడు మరి బ్రహ్మహత్యాపాతకం ఇంద్రుణ్ణి చుట్టుకోలేదా? చుట్టుకున్నది. ఆ విషయమంతా **రెండవకాండ, ఐదవ ప్రపాఠకము మొదటి అనువాకంలో** చెప్పబడింది.

త్వష్ట ఒక ప్రజాపతి. ఇంద్రుణ్ణి సంహరించటానికి విశ్వరూపుడు అనే వాణ్ణి సృష్టించాడు. ఇతడికి మూడు శిరస్సులుంటాయి. అందుకే 'త్రిశిరుడు' అంటారు. ఇతడు దేవతల పురోహితుడు, రాక్షసులకు మేనల్లుడు. ఇతడు ఒక తలతో సోమపానం చేశాడు. రెండవ శిరస్సుతో సురాపానము చేశాడు. మూడవ శిరస్సుతో అన్నం తిన్నాడు.

విశ్వరూపుడు ప్రత్యక్షంగా దేవతలకు హవిస్సు సమర్పించమని

చెప్పాడు. రాక్షసులకు హవిర్భాగము అందించండి అని పరోక్షంగా అన్నాడు. ఇలా ముందు ఒక మాట వెనక ఒక మాట మాట్లాడే వాళ్ళు చాలా ప్రమాదకారులు. పరోక్షంగా రాక్షసులకు సహాయం చేస్తున్నాడు. అని అతని మూడు తలలను నరికేశాడు ఇంద్రుడు. అలా నరకబడిన ఒక తలలోని సోమరసం త్రాగినది కవుజుపిట్ట. రెండవ తలలోని కల్లు త్రాగినది పిచ్చుక. మూడవ తలలోని అన్నం తిన్నది తీతువు పక్షి.

ఇంద్రుడు విశ్వరూపుణ్ణి చంపేశాడు. కాబట్టి ఆయనకి బ్రహ్మహత్యాపాతకం చుట్టుకుంది. లోకంలోని ప్రాణులన్నీ ఇంద్రుణ్ణి గేలిచేస్తున్నాయి. ఆ పాపం నుంచి విముక్తి పొందటం ఎలా? అని ఆలోచించాడు. ముందుగా భూమి దగ్గరకు వెళ్ళి బ్రహ్మహత్యాపాతకంలో మూడోభాగము తీసుకోమన్నాడు. అప్పుడు భూమి "ఇంద్రా! జనులు నన్ను ఇష్టం వచ్చినట్లు తవ్వేస్తున్నారు. దానివల్ల నాకు విపరీతమైన బాధ కలుగుతోంది. ఇలా తవ్విన గుంతలు ఒక సంవత్సరం లోపల నిండి పోవాలి. అప్పుడు నా బాధలు తీరతాయి అంది. సంవత్సరంలోపు ఆ గుంతలు నిండేట్లుగా వరమిచ్చాడు ఇంద్రుడు. ఈ వరము తీసుకుని బ్రహ్మహత్యా పాతకంలో మూడవ వంతు తీసుకుంది భూమి. ఇలా తీసుకున్న బ్రహ్మహత్యాపాతకంలో మూడో భాగము ఊసరక్షేత్రము (చవిటినేల) అయింది. ఆ హితాగ్ని ఎవరూ అక్కడ నివశించడు.

ఇప్పుడు ఇంద్రుడు వృక్షాల దగ్గరకు పోయి బ్రహ్మహత్యా పాతకంలో మూడోవంతు తీసుకోమన్నాడు. దానికి వృక్షాలు "ఇంద్రా! మమ్మల్ని కొట్టినచోట మాకు బాధ కలుగుతుంది. అలా బాధకలగకుండా మాకు వరంప్రసాదించు" అన్నాయి. సరేనన్నాడు

ఇంద్రుడు. చెట్టును కొట్టిన చోట మరికొన్ని మొలకలు మొలుస్తాయి అన్నాడు. ఈ వరం తీసుకుని, ఆ పాపంలో మూడవవంతు వృక్షాలు తీసుకున్నాయి. బ్రహ్మహత్యాపాతకం చెట్ల నుంచి బయటకు వచ్చి గడ్డ కడుతుంది. చెట్టు నుంచి రసంగా బయటకు వచ్చి గడ్డ కడితే దాన్ని తినరాదు.

ఇంద్రుడు స్త్రీల దగ్గరకు వెళ్ళి తన పాపంలో మూడవ వంతు తీసుకోమన్నాడు. దానికి స్త్రీలు “ఓ ఇంద్రా! మేము ఋతు సంబంధమైన వీర్యంవల్ల సంతానం పొందుతున్నాము. మా కోరిక ననుసరించి ప్రసవము వరకు పురుషుని కలిసేటట్లుగా వరం ఇమ్మని అడిగారు. ఇంద్రుడు ఆ వరం ఇచ్చాడు. ఆ వరం ప్రకారము స్త్రీలు ప్రసవము వరకు పురుషునితో సంగమించగలుగుతున్నారు. అప్పుడు స్త్రీలు బ్రహ్మహత్యా పాతకంలో మూడవవంతు తీసుకున్నారు. బ్రహ్మహత్యలో మూడవ భాగము స్త్రీల రజస్సుఅయింది. ఈ కారణంచేతనే రజస్వల అయిన స్త్రీతో సంభోగించరాదు. రజస్వల అయిన స్త్రీతో సంగమించటం వల్ల ఆవిడకు మిథ్యాపవాదు కలవాడు జన్మిస్తాడు.

అటువంటి స్త్రీతో అరణ్యంలో సంభోగిస్తే ఆవిడకు దొంగ పుడతాడు. రజస్వల అయి సిగ్గుతో మాట్లాడే స్త్రీతో సంగమిస్తే ఆమెకు సిగ్గుపడేవాడు పుడతాడు.

రజస్వలయై స్నానం చేసే స్త్రీకి సంభోగంవల్ల మరణశీలుడు పుడతాడు.

రజస్వలయై నూనె స్నానం చేసే స్త్రీకి సంభోగంవల్ల కుష్ఠురోగి పుడతాడు.

రజస్వలయై బొమ్మలు గీసే దానికి సంభోగంవల్ల జుట్టు లేనివాడు పుడతాడు.

రజస్వలయై కంటికి కాటుక పెట్టుకునే దానికి సంభోగంవల్ల గ్రుడ్డివాడు పుడతాడు.

రజస్వలయై పండ్లు తోముకొనే దానికి సంభోగంవల్ల పుచ్చుపల్లు గలవాడు పుడతాడు.

రజస్వలయైం గోళ్ళు కత్తిరించుకొనే దానికి సంభోగంవల్ల పిప్పిగోళ్ళువాడు పుడతాడు.

రజస్వలయై గడ్డి కోసే దానికి సంభోగంవల్ల నపుంసకుడు పుడతాడు.

రజస్వలయై త్రాడు పేనుతున్న దానికి సంభోగంవల్ల ఉరి వేసుకొనేవాడు పుడతాడు.

రజస్వలయై ఆకులో నీరు త్రాగేదానికి సంభోగంవల్ల పిచ్చివాడు పుడతాడు.

రజస్వలయై కాల్చిన మూకుడుతో నీరు త్రాగే దానికి సంభోగంవల్ల పొట్టివాడు పుడతాడు.

రజస్వలయైన స్త్రీ పచ్చిమూకుడులో గాని, దోసిలితో గాని నీరు త్రాగాలి. అని చెబుతోంది వేదం.

ఇవి వేదంలో చెప్పిన విషయాలు. నా స్వంత అభిప్రాయాలు కావు. ఇందులో నా ప్రమేయం ఏ మాత్రమూ లేదు. ఇది ఎంతవరకు నిజమో చెప్పలేము. ప్రస్తుత కాలంప్రకారం ఇది మూర్ఖత్వం కూడా కావచ్చు.

# 18. వృత్రాసురవధ (గోఘృతానికి తేజస్సు)

విశ్వరూపుణ్ణి ఇంద్రుడు చంపేశాడు. ఈ విషయం త్వష్ట ప్రజాపతికి తెలిసింది. మరింత కోపంతో హోమం చేశాడు. వృత్రుణ్ణి సృష్టించాడు. అతడు పుడుతూనే లోకాలను ఆక్రమించాడు. లోకాలన్నీ చీకటిమయం చేశాడు. అందుకే అతడికి వృత్రుడు అని పేరు కలిగింది. వృత్రాసుర సంహారము **రెండవ కాండలోని ఐదవ ప్రపాఠకంలోని రెండవ అనువాకంలో** చెప్పబడింది.

తనను సంహరించటానికే వృత్రాసురుడు జన్మించాడు అనే విషయం ఇంద్రుడికి తెలిసింది. ప్రజాపతి దగ్గరకు వెళ్ళాడు. "నాకు శత్రువు పుట్టాడు. అతడు నాకన్న బలవంతుడు" అని చెప్పాడు. ఇంద్రుడి చేతిలో ఉన్న వజ్రాయుధం మీద తన కమండలంలోని మంత్రజలాన్ని చల్లాడు బ్రహ్మ. 'ఈ వజ్రాయుధంతో వృత్రాసుర సంహారము చెయ్యి' అంటూ వజ్రాయుధాన్ని ఇంద్రుడి చేతికి ఇచ్చాడు. వజ్రాయుధం తీసుకుని బయలుదేరాడు ఇంద్రుడు. వజ్రాయుధాన్ని ధరించిన ఇంద్రుణ్ణి చూశారు 'అగ్ని, సోములు'. 'ఇంద్రా ! మేం వృత్రుని ముఖంలో ఉన్నాము. అతన్ని మాత్రం చంపద్దు.' అంటూ అరిచారు. ఆ మాటలు విన్నాడు ఇంద్రుడు.

' ఓ దేవతలారా! మీరు నా వాళ్ళు. నాకు సంబంధించిన వాళ్ళు. నా దగ్గరకు వచ్చేయండి" అన్నాడు.

'మాకు హవిర్భాగాలు ఏర్పాటు చెయ్యి" అని అడిగారు అగ్ని, సోములు.

పూర్ణమాసి అనే యాగంలో అగ్నిదేవుడికి, సోమదేవతకీ కూడా దశకపాల పురోడాశాన్ని ఏర్పాటు చేశాడు ఇంద్రుడు. పురోడాశము

– బియ్యం పిండి లేదా గోధుమ పిండితో తయారుచేసిన రొట్టె. దశకపాల పురోడాశము అంటే – తయారు చేసిన రొట్టెను పది కుండపెంకుల మీద కాలుస్తారు.

ఇంద్రా! మేము వృత్రాసురుని నోటిలో అతని దంతాల క్రింద ఉన్నాము. బయటకు రాలేము" అన్నారు అగ్నిసోములు. ఆ మాటలు విన్న ఇంద్రుడు చలి జ్వరము, తాపము పుట్టించాడు. ఈ రకంగా శీతజ్వరము, తాపము జన్మించినాయి. ఈ విషయం తెలిసిన వాడికి శీతజ్వరము, తాపము ఉండవు. ఇంద్రుడు ఈ రెండింటినీ వృత్రాసురునిమీద ప్రయోగించాడు. శీతజ్వరముతో వృత్రుడుబాధ పడ్డాడు. తాపంతో అతని నోరు వణికిపోయింది. దాంతో నోరు తెరిచి పెట్టాడు. నోట్లో దాక్కున్న అగ్నిసోములు బయటకు వచ్చేశారు. అప్పుడు ప్రాణాపానాలు వృత్రాసురుని వదలినాయి. ఈ **అనువాకంలోని ఐదవ మంత్రంతో హవనం చేస్తే దీర్ఘాయుష్షు కలుగుతుంది.** ఇప్పుడు వజ్రాయుధాన్ని తీసుకుని వృత్రుని మీదకు వెళ్ళాడు. 'వృత్రుడు భూమి నుంచి ఆకాశందాకా వ్యాపించి ఉన్నాడు. అతన్ని చంపవద్దు' అన్నాయి భూమి ఆకాశాలు. అందుకు ఇంద్రుడు సుముఖంగా లేడు. ఈ విషయం తెలిసి భూమ్యాకాశాలు ఇంద్రుణ్ణి వరమడిగారు. "నేను నక్షత్రాలతో కూడి ఉండాలి' అని అడిగింది ఆకాశం. మానవులు, పశువులు, పక్షులు, కొండలు, నదులు, సముద్రాలతో కూడి ఉండాలి అంది భూమి. ఇద్దరి కోరికలు తీర్చాడు ఇంద్రుడు. అప్పటినుంచీ నక్షత్రాలతో ఆకాశము, చిత్రవిచిత్రంగా భూమి ప్రకాశిస్తున్నాయి. ఈ రకంగా ద్యావాపృథ్వుల అనుగ్రహంతో వృత్రాసురుని సంహరించాడు ఇంద్రుడు.

వృత్రుని సంహరించిన ఇంద్రుడు అగ్ని, సోములు హవ్యవాహకులుగా కావాలి అని అడిగాడు. ఆ మాటలు విన్న

అగ్నిసోములు “మేము చాలాకాలం వృత్రుని దంతాల క్రింద నలిగి మా తేజస్సును కోల్పోయాము. ఆ తేజస్సు వృత్రుని దగ్గరే ఉంది” అన్నారు. ఇప్పుడు వృత్రుని దగ్గర నుంచి ఆ తేజస్సు ఎవరు తేగలరు? అని దేవతలు చర్చించారు.

‘ఆవు. అందరికీ కావలసింది. అదే అగ్నిసోముల తేజస్సును ఆవే తేగలదు’ అని నిశ్చయించారు. ఆవుని అర్థించారు. ఇప్పుడు ఆవు అంటోంది. ‘ఓ దేవతలారా! మీరు ఆడినట్లే నేను ఆ తేజస్సును తెస్తాను. కాని ఆ తేజస్సు నా యందే ఉండిపోవాలి. అది నాలోని ఆహారము నందు చేరాలి.’ అని వరమడిగింది. సరేనన్నారు దేవతలు. ఆవు వృత్రుని తేజస్సు తెచ్చింది. ఆ వరం వల్లనే ఆవులోని పాడి పదార్థాలు ఆహార పదార్థాలయినాయి. ఆవుపాలు మనకి ఆహారమయినాయి. ఆజ్యము – అగ్నితేజస్సు, పాలు – సోముని తేజస్సు. పౌర్ణమాస కర్మకు దేవత ప్రజాపతి.

# 19. అగ్నిసర్వరక్షకుడు

అగ్నిదేవుడు చాలా గొప్పవాడు. మహాబలశాలి. ఆయన్ని ఎదిరించగలవారు లేరు. అందుకే ఓ అగ్నిదేవా! నీ ఆయుధాలు మా శత్రువుల మీద ప్రయోగించు. మమ్మల్ని రక్షించవలసింది. అని ప్రార్థిస్తున్నారు **నాల్గవకాండ, ఆరవ ప్రపాఠకములోని మొదటి అనువాకంలో**

మరుత్తులారా! మీరు గొప్ప దానగుణం కలవారు. బలాన్ని కలిగించే అన్నాన్ని మాకు అందించండి.

ఓ అగ్నీ! ఆకలిబాధలు, ఇతర బాధలు మా శత్రువులను చేరుగాక.

ఓ అగ్నిదేవా! నువ్వు భూమిమీద ఉన్నావు. బెత్తపుచెట్టు నందున్నావు. నదు లందున్నావు. నువ్వు బలానికి తేజస్సువు అవుతున్నావు. ఓ అగ్నీ ! వేదమంత్రాలతో నువ్వు ఇక్కడికి రా. మా యజ్ఞంలోని అగ్నిజ్వాలలను వృద్ధి చెయ్యవలసింది. అగ్ని సర్వత్ర మందుతున్నాడు. అతడికి ముసలితనం లేదు. అతనికి దప్పిక లేవు. ఓ అగ్నీ ! ఈ కర్మలో మా కోసం దేవతలను ఆవహించి యజ్ఞానికి తీసుకురావలసినది. ఓ దేవా! నీ ఆయుధాలు మా మీద కాక శత్రువులమీద ప్రయోగించవలసినది. మా కోసం శాంతమూర్తి కావలసినది. ఓ అగ్నీ ! ద్రవాలను పోషింపచేసే నీ తేజస్సుకు నమస్కారము. పదార్థాలను ప్రకాశింపచేసే నీ తేజస్సుకు నమస్కారము. నీ ఆయుధాలు మా మీద కాక శత్రువుల మీద ప్రయోగించవలసినది. మా కోసం పావకుడవు, శాంతమూర్తివి కావలసినది. మానవుల యందున్న అగ్నికి, ఉదకమందున్న అగ్నికి, అరణ్యములందున్న అగ్నికి, యజ్ఞముల యందున్న అగ్నికి, ఆదిత్యరూపుడైన అగ్నికి హవిస్సు

అర్పించబడింది. "ఓ దేవతలారా! దేవతలకు మధురమైన నేతితో కలిసిన హవిస్సులను మీకు అర్పిస్తున్నాను. మీరు స్వయంగా హవిర్భాగాలను అందుకోండి.

ప్రాణాలవల్లనే దేవతలకు దైవత్వము కలిగింది. ప్రాణాలవల్లనే అగ్ని పెరుగుతున్నాడు ప్రాణములే దేవతలు. ఆ దేవతలు ఆకాశంలో లేరు. భూమి మీద లేరు. మీ దేహంలోనే ఉన్నారు. ఓ అగ్నీ ! నీ ఆయుధాలు మాపైన గాక శత్రువులపైన ప్రయోగించవలసింది. అగ్నిజ్వాలలు రాక్షసులను నాశనం చేస్తాయి. అగ్నీ మాకు ధనధాన్యాలు కలిగింతువు గాక. మమ్మలను రక్షింతువు గాక."

# ౨౦. విశ్వకర్మ

చరాచర జగత్తును సృష్టించిన వాడు పరమేశ్వరుడు. ఆయన సర్వాంతర్యామి. మానవుల హృదయాలయందున్నాడు. ఈ విషయాలు **నాల్గవకాండలో ఆరవ ప్రపాఠకంలోని రెండవ అనువాకంలో** చెబుతున్నారు.

ఎవరు ఈ సమస్త జగత్తులు ధరిస్తున్నాడో, ఎవడు ఋషో ఎవరు హోతో, ఎవరు మాకు తండ్రియో అటువంటి ఆ పరమేశ్వరుడు మాకు ధనధాన్యాలను ఇవ్వాలి. అతడు హృత్పద్మంలోనే ఉన్నాడు.

తన సంకల్పమాత్రంచేతనే జగత్తు యొక్క సృష్టి స్థితి లయాలు చేస్తున్నాడు. ఆయనే ధాత, విధాత, సంహర్త, పరముడు, సర్వజ్ఞుడు. పూర్వకాలంలో సప్తఋషులు కూడా ఆయనలోనే ఉన్నారు. ఆ పరమపురుషుడే సప్తఋషులకు వారు కోరిన స్థానాలు ఇచ్చాడు.

మమ్ములను పుట్టించినవాడు, పోషించేవాడు, ఈ లోకాలను పాలించేవాడు. వివిధ రకాల దేవతల పేర్లు పెట్టుకున్నప్పటికీ ఉన్నది ఒక్కడే. రెండవ వారు లేరు. పరమేశ్వరుని గురించి తెలియని వారు మాత్రమే బహురూప భావన చేస్తుంటారు. మొదటగా ఆ పరమ పురుషుడు కొందరు ప్రజాపతులను సృష్టించాడు. వారు ఈ దృశ్యమానమైన జగత్తును సృష్టించారు. ఆ ప్రజాపతులు తమ మాహాత్మ్యము వల్ల ముసలితనము లేని వారైనారు. ఈ లోకాన్ని సృష్టించిన వాణ్ణి ఎవరూ తెలుసుకోలేరు. అతని తత్త్వము ఎవరికీ తెలియదు. ఇంద్రియాల ద్వారా అతణ్ణి తెలుసుకోలేరు. ఆ పరమేశ్వర తత్త్వము అత్యంత రహస్యమైనది. అది ద్యులోకం కన్నా చాలా దూరాన ఉన్నది. భూమికన్న దూరాన ఉన్నది. దేవతలు గాని, రాక్షసులు గాని

దాన్ని చేరుకోలేరు. ఏ గర్భంలో అయితే మొదటగా దేవతలు రాక్షసులు కలిసి ఉన్నారో, ఆ గర్భం పూర్వ కాలంలో జలంలో ఉన్నది. ఏ గర్భంలో దేవతలందరూ ఉన్నారో ఆ గర్భం మొదటగా జలముల యందున్నది దేనియందైతే అన్ని లోకాలు నిలిచి ఉన్నాయో అది అజామయుని నాభియందు ఉన్నది.

అటువంటి అండ మధ్యమునుంచి మొదటగా విశ్వకర్మ జన్మించాడు. తరువాత గంధర్వుడు, సోముడు జన్మించారు. ఆ పరమేశ్వరుడు చక్షురాది ఇంద్రియాలకు తండ్రి. ద్యావాపృథ్వులను తన ఇష్టప్రకారము సృష్టించాడు. చక్షురాదులు స్థిరపడిన తరువాతనే ద్యావాపృథ్వులు విస్తరిల్లినాయి. ఆ పురుషుడు అన్ని వైపులకు కళ్ళు, ముఖాలు, కాళ్ళు, చేతులు గలవాడు. ద్యావాపృథ్వులను ఆయనే సృష్టి చేశాడు. తన చేతులతోనే ఈ విశ్వాన్ని వశం చేసుకున్నాడు. అనిత్యమయిన జగత్తులన్నీ స్వాధీనం చేసుకున్నాడు. ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. పరమాత్మ అప్పుడు ఎక్కడ ఉన్నాడు? ఎక్కడ నుంచున్నాడు? పరమేశ్వరుడు ఏరణ్యం నుంచి ద్యావాపృథులను సృష్టి చేశాడు?

విశ్వకర్మకు విశిష్ఠ స్థానాలున్నాయి. నువ్వు స్వయంగా యాగం చేసి విషయం తెలుసుకుంటావు. విశ్వకర్మ వాచస్పతి కర్మలందు మనసు లగ్నం చేస్తాడు. చేయిస్తాడు. అతడు విశ్వంభుడు, సాధుకర్ముడు.

ఓ విశ్వకర్మా! మేమిచ్చిన హవిస్సులతో సుఖంగా ఉన్నావు. నువ్వు స్వయంగా యాగం చెయ్యి. ఆ కర్మలో మా శత్రువులు మాకు మిత్రులగుదురు గాక. మాకు ధనవంతుడు, విద్యావంతుడైన కుమారుడు కావాలి.

ఓ విశ్వకర్మా ! యజమాని నీకు హవిస్సు లర్పిస్తున్నాడు. అతణ్ణి ధనవంతునిగా చెయ్యవలసింది. అతడు యోగ్యుడు కావాలి. ఓ ఋత్విక్కులారా! లోకంలో అన్నింటికీ అతడే తండ్రి. అతడే సత్యము, నిత్యము, శాశ్వతము. అతని కోసం హోమం చెయ్యండి. అంటోంది వేదము.

# 21. అశ్వము

**నాల్గవకాండలోని ఆరవ ప్రపాఠకంలోని ఏడవ అనువాకంలో** గుర్రాన్ని వర్ణిస్తున్నారు. ఇందులో పదమూడు మంత్రాలున్నాయి.

ఓ అశ్వమా ! నువ్వు సముద్రం నుంచి పుట్టావో, మంచి శౌర్య పరాక్రమాలు గల గుర్రానికి పుట్టావో తెలియదు. కాని నువ్వు పుట్టినప్పుడు పెద్ద కేక పెట్టావు. డేగరెక్కలకు, జింక కాళ్ళకు ఉండే వేగము నీకున్నది.

అగ్నిదేవుడు గుర్రాన్నిచ్చాడు. వాయువు దాన్ని రథానికి కట్టాడు. మొదటగా ఈ రథము ఇంద్రుడు ఎక్కాడు. గంధర్వులు గుర్రపు పగ్గాలు పట్టుకున్నారు. వసువులు సూర్యుని సాయంతో రథాన్ని ప్రకాశింపచేశారు.

ఓ అశ్వమా ! నీవు అగ్నివి. వాయువువు. ఆదిత్యుడవు, నీకు యజ్ఞమందు, సోమము నందు ప్రాధాన్యత ఉన్నది. నీకు ద్యులోకంలో బంధత్రయమున్నది అంటారు. ద్యులోకంలో మూడు బంధాలున్నట్లే జలమధ్యమున బంధత్రయమున్నది అంటారు. నీది ఉత్తమజన్మ. నీ వంటిని తోమటానికి ఇనప సాధనాలు, గిట్టలకు కొట్టటానికి ఇనపనాడాలు ఉన్నాయి. అవి రాతిమీద నడవటానికి ఉపకరిస్తాయి. నీ ఇనప కళ్ళెము రౌతును కాపాడుతున్నది. ఓ అశ్వమా ! నువ్వు రక్షించే దానివి. ఆకాశమున పరుగెత్తే దానవు. పక్షివంటి దానవు. నీ రూపాన్ని మనసులో ఊహించుకున్నాను. ధూళి లేని మార్గంలో వేగంగా వెళ్ళే నీ తలను చూశాను? నువ్వు అన్నము సాధించటం మానవుడు చూశాడు. నీకు ఓషధులు, శనగలు ఆహారంగా ఇచ్చాడు. ఇప్పుడు విజయేచ్ఛగల నీ ఉత్తమ రూపాన్ని దర్శిస్తున్నాను. అశ్వమా ! నిన్ను అనుసరించి రథము, రథం వెనక మానవులు పడతారు. నిన్ను

అనుసరించే ఆవులు జీవిస్తున్నాయి. దాసదాసీజనులు జీవిస్తున్నారు. నీ సాయంతోనే సేనలు విజయం సాధిస్తున్నాయి. దేవతలు నీ సామర్థ్యం గుర్తించి నిన్ను హవిస్సుగా స్వీకరించారు. (అశ్వమేధము) ఈ గుర్రం తల బంగారం వంటిది. దీని కాళ్ళు ఇనుప ముక్కలు. మనోవేగం. దేవతలంతా గుర్రాన్ని హవిస్సుగా అంగీకరించారు. మొదటిసారి దీనినెక్కిన ప్రజాపతికూడా దీన్ని తినచ్చు అని గ్రహించాడు. ఆటలకోసం బాగా వ్యాప్తి చెందినాయి. ఇవి బాగా బలిసి ఉంటాయి. ఈ గుర్రాలు శౌర్యం, పరాక్రమం కలిగి హంసలలాగా గుంపులు గుంపులుగా ఉంటాయి. గుర్రం శరీరం వేగానికి అనువుగా ఉంటుంది. గుర్రం మనసు వాయువేగంతో ఉంటుంది. రణరంగములో శత్రుసైన్యాన్ని ఎదిరించి ముందుకు పోతుంది.

ఈ అశ్వము అన్నహేతువు. మనసున దేవతలను ధ్యానించే వారు గుర్రాన్ని వధ్య స్థానానికి తీసుకుపోయారు. ఋత్విక్కులు ముందుగా ప్రజాపతిని ప్రార్థించి, దీని నాభిని ప్రజాపతికి సమర్పించి, విద్వాంసులు పృష్ఠభాగమును తీసుకుంటారు. ఈ అశ్వము స్వర్గంలో ఉన్న తల్లితండ్రులను చూడటానికి వధ్యస్థానం చేరింది. ఓ అశ్వమా ! నువ్వు దేవతలకు ప్రీతిపాత్రమవవలసింది. దేవతల దగ్గరకు వెళ్ళవలసింది. యజమానికి యజ్ఞఫలాన్ని అందించవలసింది."

అంటూ అశ్వమేధం చేసే సమయంలో గుర్రం యొక్క విశిష్ఠతను వివరిస్తున్నారు. తరువాత అనువాకాలలో గుర్రాన్ని చంపి దాని మాంసము వండటం చెబుతున్నారు.

# ౨౨. పితృదేవతలు

పితృదేవతలు గంభీరమైన వారు. విచిత్రమైన సేన కలవాళ్ళు. వీళ్ళకి బాణబలం ఉన్నది. ఎవరికీ లొంగని వారు మహావీరులు. వీరంతా శాంతమూర్తులు. ఈ విషయాలన్నీ **నాల్గవకాండ ఆరవ ప్రపాఠకంలోని ఆరవ అనువాకంలో** వివరిస్తున్నారు.

పితరులు ఆపద కాలంలో సాయం చేస్తారు. శక్తిసంపన్నులు గంభీరులు. విచిత్రమైన సేనగలవారు. ఇతరులకు శక్యం కానివారు. శత్రుసేనలను క్షణాల్లో నాశనం చేయగలవారు. మా పితృదేవతలు వేదపరులు. అనుగ్రహం కలవారు. ద్యావాపృథ్వులు కూడా మా పితృదేవతలలాగానే మా కోసం శాంతమూర్తులు అగుదురు గాక. యజ్ఞాలు వృద్ధిచేసే పూషదేవత పాపాల నుండి మమ్మల్ని రక్షించుగాక. మా పితరులబాణము, రెక్కలాగా పడిన చోటును కప్పి వేస్తున్నది, దాని మొన సింహపు దంతంలాగా బాగా పదునైనది, ఆవుచర్మముతో కట్టబడినది, పితరుల ప్రేరణ గలది. ఆ బాణాలు చూస్తే శత్రుసేన పారిపోతుంది. అటువంటి పితరుల బాణము మాకు సుఖమును ప్రసాదించుగాక." అని ప్రార్థిస్తున్నారు.

# 23. వ్యవసాయము

వ్యవసాయము, పంటలు పండించటము. అనేది నీటితో ముడిపడిన విషయం పంటలు పండాలంటే పుష్కలంగా నీరు కావాలి. ఎరువులు కావాలి. పొలం దున్నటానికి నాగలి, ఎద్దులు కావాలి. అయితే వ్యవసాయం ఎలా జరుగుతుంది అనే విషయం **నాల్గవ కాండలోని రెండవ ప్రపాఠకంలో ఐదవ అనువాకంలో** చెబుతున్నారు.

కర్షకులారా ! తోలు బొక్కెనలు సిద్ధం చెయ్యండి. ఈ బావిలో ఎప్పుడూ నీరు ఉండేటట్లుగా చేద్దాము. ఈ బావి మంచి బొక్కెనలు గలది, మంచి తోలు తాళ్ళు గలది, మంచి చేదలు గలది, మేము దీనిలో తరగని నీటిని నింపుతున్నాము.

వ్యవసాయ శాస్త్రజ్ఞులు దేవతల సుఖం కోరేవారు. వారు నాగలి సిద్ధం చేసి కాడిని కట్టెదరు గాక.

రైతులారా ! నాగళ్ళను సిద్ధం చెయ్యండి. వాటిని కాడికి కట్టండి. ఇది సేద్య యోగ్యమైన నేల. స్వస్తి వాక్యాలతో నేల దున్నండి. విత్తనాలు జల్లండి. పంట పండి ఫలితము మాకు అందును గాక.

నాగలి వజ్రంలాగా గట్టిది. రైతు తేలికగా దాన్ని వాడవచ్చు. ఆ నాగలి మట్టి బెడ్డలను పెకలించి దున్నును గాక. పంట వచ్చిన తరువాత ఆవుదూడలు, గొర్రెలు, గొర్రెల బండ్లను సాధించ కలుగును గాక. (కొనగలుగుతాము)

మాకు సుఖము కలిగేటట్లుగా నాగలి దున్నును గాక. రైతులు ఎడ్లకు సుఖం కలిగేటట్లుగా తోలెదరు గాక. పర్జన్యుడు మంచివాన కురిపించును గాక. వాయువు, ఆదిత్యుడు మాకు సుఖాలు ప్రసాదించును గాక.

ఓ నాగేటిచాలా ! సూర్య, వరుణ, ఇంద్ర, అగ్ని, పూష, ఓషధ, ప్రజల కోరికలు తీర్చుదానవు కమ్ము. నాగేటిచాలు మంచి నేతితో తడుపబడినది. దేవతలు, మరుద్గణాలు నాగలిచాలును ఆమోదించారు. ఆ చాలు బలాన్నిచ్చే నీటితో తడుపబడినది. నీరు నిండిన ఓ నాగేటిచాలా! మా కోసం నువ్వు అంతటా వ్యాపించ వలసినది. అంటూ నేలను దున్నే నాగలి, వ్యవసాయములను వివరిస్తున్నారు.

# 24. ఓషధులు (ఓషధీసూక్తము)

రోగాలు తగ్గాలి అన్నా, శరీరం ఆరోగ్యంగా ఉండాలి అన్నా ఓషధులు కావాలి. ఆ రోజున మందు అంటే ఆయుర్వేదమే. అందుకే ఋగ్వేదానికి ఉపవేదం ఆయుర్వేదం. చెట్ల ఆకులు, కొమ్మలు, పూలు, కాయలు, దుంపలు అన్నీ ఏరితెచ్చి, వాటిని వండి లేహ్యాలు తయారుచేసే వాళ్ళు. పొడి కొట్టి మాత్రలు తయారుచేసే వాళ్ళు. ఆయుర్వేదంలో మందు ఎంత కాలం నిలవుంటే అంత మంచిది. దానిశక్తి పెరుగుతుంది. అలా చేసిన మందులువాడి రోగాలు తగ్గించేవాళ్ళు. అశ్వనీదేవతలు దేవవైద్యులు, **నాల్గవకాండలోని రెండవ ప్రపాఠకంలోని ఆరవ అనువాకం. ఓషధీ సూక్తం**. ఇందులో ఓషధుల గురించి వివరించటం జరిగింది.

ఓ ఓషధులారా! మాకు తల్లుల వంటి వారు. మా యజమానిని రోగరహితుడుగా చేయండి.

ఓషధులలో కొన్ని తీగెలు, కొమ్మలు, రెమ్మలు, ఆకులు, పూలు, కాయలు ఉంటాయి. ఓషధులారా ! మా పాపాలు నశింపచేయండి. మా దుఃఖాన్ని రూపు మాపండి. మీకు రావి, మోదుగచెట్లు నివాసంగా ఏర్పాటు చెయ్యబడ్డాయి. మీరు నేలలో పెరుగుతారు. మానవులకు అన్నం పెట్టి పోషిస్తారు. మేము అన్నం తినాలని ఓషధులను చేత్తో తీసుకున్నాము. తినకముందే ఆకలి మాయమై పోయింది. ఓషధులు కలిసినప్పుడు, వాటి గుణాలు తెలిసిన విద్వాంసుడు ఉన్నప్పుడు రోగాలు త్వరగా నశించి పోతాయి. రోగాలు తగ్గిస్తాడు కాబట్టే అతడు భిషక్ (వైద్యుడు) అనబడతాడు.

ఓషధులారా ! తల్లిగా మీరు మా ఆకలి తీర్చారు. అసలు మీరు అందుకే పుట్టారు. మీరు ఆకులు గలవారు, ఆకలి తీర్చేవారు. ఆకలి

ఒక రోగంలాంటిది. దాన్ని దూరము చెయ్యండి.

మానవుడా! ఓషధులు నీ దేహానికి బలాన్నిస్తాయి. బయటి మందులు ఉదరంలో ప్రవేశించి, శరీరమంతా వ్యాపించి, రోగాలను తగ్గిస్తాయి. ఓషధులు శరీరంలో ప్రవేశించి రాజుగారు శత్రువులను సంహరించినట్లుగా వ్యాధులను నాశనం చేస్తాయి.

ఓ వ్యాధులారా ! మీరు, శ్లేష్మంతో వచ్చినా, కఫంతో వచ్చినా, వాతము, పిత్తము దేనివల్ల వచ్చినా సరే వెళ్ళిపోండి. బాధలన్నింటితోను వెళ్ళిపోండి. అశ్వఓషధి, సోమఓషధి, బలఓషధి, ఓజోఓషధి వీటన్నింటినీ మా యజమాని కోసం సమకూర్చాము.

ఫలసహిత, ఫలరహిత, పుష్పసహిత, పుష్పరహిత ఓషధులు అన్ని బాధల నుండి మమ్మ విముక్తులుగా చేయుగాక. అని ఓషధులను ప్రార్థిస్తున్నారు.

"మేము ఏ జీవినందు ప్రవేశిస్తాయో, ఆ జీవి నశించదు" అంటున్నాయి ఓషధులు.

ఓషధులన్నీ మాకు పూర్తిగా వ్యాధులు తగ్గించటానికి సహకరించాలి. ఓషధులారా ! మిమ్మల్ని త్రవ్వుతున్న నేను నశించకుందును గాక. నేను ఎవరికోసం త్రవ్వుతున్నానో, అతడు నశించకుండును గాక. మాకు సంబంధించిన మనుషులు, పశువులు ఎవరికీ రోగాలు రాకుండుగాక.

''ఎవరికి చికిత్స చెయ్యటానికి వైద్యుడు మమ్మల్ని ఉపయోగిస్తున్నాడో, అటువంటి వ్యక్తిని వ్యాధుల నుంచి తరింపచేద్దాము'' అని ఓషధులు తమ ప్రభువైన సోమరాజుతో అంటున్నాయి.

## 25. నాగపూజ

పాములు చెట్లు, పుట్టలు ఉన్న ప్రదేశాల్లో బాగా తిరుగుతూ ఉంటాయి. అలాగే పంటపొలాల్లో పాములుంటాయి. నేలమీద జల్లిన విత్తనాలు, పండిన పంట తినటానికి ఎలుకలు తిరుగుతుంటాయి. ఆ ఎలుకల కోసం పాములు తిరుగుతాయి. మనదేశంలో ఉన్న పాముల్లో విషంలేనివే ఎక్కువ. కాని ఆ పాముకు విషముందో లేదో మనకు ఎలా తెలుస్తుంది. ముందు పాముని చూస్తేనే గుండె ఆగిపోతుంది. చీకట్లో పాముతోక తొక్కాం. అది కాటేసింది. పాము కరించింది అంటేనే సగం చచ్చిపోతాడు మనిషి భయంతో. అందుకే మన దేశంలో పామునికూడా దేవతగా చేసి పూజ చేస్తాం. నాగులచవితి నాడు పాలు పోస్తాం, పాముమంత్రాలు జపం చేస్తాం. అదే విషయం **నాల్గవకాండలో** వివరిస్తున్నారు.

"ఓ సర్పరాజమా ! నీకు నమస్కారం చేస్తున్నాను. నీకు పూజలు చేస్తున్నాను. నాకు, నా వారికి, నా పశువులకు ఏ రకమైన అపకారము చెయ్యవద్దు" అని ప్రార్థిస్తున్నాడు.

## 26. పంట బాగా పండాలంటే

పంట బాగా పండాలంటే మంచి విత్తనాలు కావాలి. మంచి నేల కావాలి. మంచి ఎరువులు కావాలి. సకాలంలో వర్షాలు కురవాలి. ఇన్ని ఉంటే గాని సరిగా పంటలు పండవు. పూర్వకాలంలో రసాయన ఎరువులు లేవు. పూర్తిగా సేంద్రియపు ఎరువుల మీదనే ఆధారపడే వారు. పంట కోసిన తరువాత ధాన్యాన్ని తీసుకుని, మిగిలిన ఆకులు, గడ్డి మొదలైనవన్నీ పొలంలో వేసి తగులబెట్టేవారు. ఇలా చేస్తే నేలలో ఉన్న దోషాలు నశిస్తాయని, తరువాత వేసే పంట బాగా పండుతుందని వారికి తెలుసు. ఈ పద్ధతి ఇప్పటికి కూడా చెరకు పొలాల్లో అమలు చేస్తున్నారు. ఈ విషయం **ఐదవ కాండలోని రెండవ ప్రపాఠకంలోని ఐదవ అనువాకంలో** చెప్పబడింది.

## 27. యుద్ధంలోని విజయం సాధించాలంటే

ఎవరైనా సరే యుద్ధం చేసేటప్పుడు విజయం సాధించటమే లక్ష్యంగా పెట్టుకుంటారు. విజయం సాధించటానికి భౌతికమైన సైనిక బలం కావాలి. యుద్ధం చేసే నైపుణ్యం కావాలి. ఇవన్నీ ఉన్నా యుద్ధంలో గెలవలేదంటే భగవంతుని అనుగ్రహం లేదన్నమాట. భగవంతుడి అనుగ్రహం కోసం పూజలు, బలులు, యజ్ఞాలు, యాగాలు చెయ్యటం జరుగుతుంది. రామాయణంలో రావణుడు రాముణ్ణి జయించటం కోసం 'నికుంభిలాయాగం' చేశాడు. అలా చేస్తే నికుంభిలాదేవి ప్రత్యక్షమై రావణుడికి విజయాన్నిస్తుంది. శ్రీరామచంద్రుడు లంకానగరం మీద దండయాత్ర చేద్దాం అనుకున్నప్పుడు ముందుగా చండీహోమం చేశాడు. ఇలా చెయ్యటం పరిపాటి, కాని వేదం ఏం చెబుతోందో చూద్దాం. **ఆరవకాండలోని రెండవ ప్రపాఠకంలోని మూడవ సూక్తం** ఈ విషయం చెబుతోంది.

యుద్ధరంగంలో ప్రవేశించేటప్పుడు రాజులు **'ఉపసద్ధోమం'** చేసి యుద్ధానికి బయలుదేరేవారు. అగ్ని, విష్ణు, సోమ దేవతాకమైన బాణంతో దేవతలు రాక్షసులను జయించేవారు. శత్రుపురాన్ని భేదించేవి కాబట్టి ఈ ఆహుతులకు 'ఉపసత్తు' అని పేరు. ఇప్పుడు కూడా ఈ ఉపసత్తులతో యాగం చేసి యుద్ధానికి వెడితే విజయం సిద్ధిస్తుంది.

# 28. వైద్యుడి గౌరవం లేదు

పరిస్థితులు ఎప్పుడూ ఒకలాగే ఉండవు. ఇవాల్టి రోజున వైద్యుడు అంటే మార్కెట్‌లో బోలెడు డిమాండు. అదే ఎందులోనైనా స్పెషలిస్ట్ అంటే అసలు ఆయనకి ఖాళీనే ఉండదు. ఆయనతో మాట్లాడాలంటేనే గంటల తరబడి కూచోవాలి. రెండు గదుల్లో రోగులను కూర్చోపెట్టి, తనే అటూ, ఇటూ తిరుగుతుంటాడు. సాధ్యమైనంత వరకు ఎక్కువమందిని చూడాలి. లేకపోతే ఆసుపత్రినడువదు. కాని పూర్వపు రోజుల్లో ఇలా ఉండేది కాదు. నటవిటగాయకులకు పంక్తి భోజనం కూడా ఉండేది కాదు. ఇంకా ముందు కాలానికి వెడితే వైద్యం చేసేవాడికి అసలు గౌరవం ఉండేది కాదు. ఎవరిదాకానో ఎందుకు? అశ్వనీ దేవతలు, వైద్యులు, వేళ్ళు, ములకలు, ఆకులు, ఏరుకునే వాళ్ళు. కాబట్టి వాళ్ళకి యజ్ఞయాగాదులలో హవిర్భాగం లేదు. అన్నాడు ఇంద్రుడు. ఆ తరువాత చ్యవనుడికి అశ్వనీదేవతలు వైద్యం చేసి ముసలితనాన్ని పోగొట్టారు. ఆ కృతజ్ఞతతో చ్యవనుడు యాగంచేసి అందులో హవిర్భాగాన్ని ఇప్పించాడు.

అగ్ని జలం బ్రాహ్మణుడు వీరి ముగ్గురియందు అదృష్టశక్తి ఉంటుంది. కాబట్టి లౌకిక వైద్యులు కూడా అగ్ని, బ్రాహ్మణుడు, జలం ఈ మూడింటిలో ఒకదాన్ని దగ్గర ఉంచుకుని చికిత్స చేసేవారు. అలా జరగటంవల్ల అశ్వనీదేవతల అనుగ్రహం కలుగుతుందని, వారిదయ ఉంటేనే రోగాలు తగ్గుతాయి అని వారి నమ్మకం.

ఈ విషయాలన్నీ **ఆరవ కాండలో నాల్గవ ప్రపాఠకంలోని తొమ్మిదవ అనువాకంలో** చెప్పబడ్డాయి.

# 29. సంఘంలో గౌరవం

ఎవరికైనా సంఘంలో గౌరవము మర్యాద ఉండాలని ఉంటుంది. సంఘంలో గౌరవం ఉండాలంటే మంచి పనులు చెయ్యాలి. అందరికన్నా గొప్ప పనులు చెయ్యాలి. లేదా మంచి అధికారం ఉండాలి. చేతినిండా డబ్బు, ఇంకొకరికి సాయంచేసే ఉదార గుణం ఉండాలి.

వీటిలో ఏమున్నా సంఘంలో గౌరవం దొరుకుతుంది. కాని భగవంతుడి అనుగ్రహం మాత్రం గట్టిగా ఉండాలి. భగవంతుడి అనుగ్రహం కావాలంటే జపము, తపము, పూజలు, అర్చనలు, యజ్ఞయాగాలు చెయ్యాలి. వేదంలో ఇటువంటి చిట్కాలు కొన్ని చెప్పబడ్డాయి. అందులో ఒకటి ఇరవై నాలుగు రోజులు చేసే యాగము. దీని వివరాలు **ఏడవ కాండలో నాల్గవ ప్రపాఠకంలోని ఒకటవ అనువాకంలో** చెప్పబడింది.

దేవతల గురువు బృహస్పతి. కాని దేవతలకు అతనిమీద పూర్తి నమ్మకం లేదు. దేవతల నమ్మకం సాధించాలంటే ఏం చెయ్యాలి అని దీర్ఘంగా ఆలోచించాడు బృహస్పతి. అప్పుడు అతడికి తట్టింది ఒక యాగము. అదే చతుర్వింశతి రాత్రము. అంటే ఇరవై నాలుగు రాత్రులు, ఇరవై నాలుగు పగళ్ళు. ఈ యాగం చెయ్యాలి. ఈ యాగం చేస్తే ప్రజల విశ్వాసం పొందటం జరుగుతుంది. బృహస్పతి ఈ యాగం చేశాడు. ఫలితం దక్కింది. దేవతల విశ్వాసం పొందగలిగాడు. ఫలితంగా దేవగురువైనాడు. ఎవరైనా అధికారుల విశ్వాసం పొందాలంటే ఈ యాగం చెయ్యాలి. ఈ యాగం చేసిన వారిమీద ప్రజలకు మంచి గౌరవము, విశ్వాసం ఏర్పడతాయి." అని చెప్పబడింది.

ఈ రకంగా వేదంలో ఒక్కొక్క ఫలితం కోసం ఒక్కొక్క యాగం చెప్పబడింది. కాని అవన్నీ లోకకల్యాణం కోసమే. అని గుర్తించాలి.

## ౩౦. సిరిసంపదలకి ధర్మకర్తలం మాత్రమే

ప్రతి మానవుడు కోరుకునేది సంపాదన. అతడు ఏం చదువుకున్నా, ఏ పని చేసినా కావలసింది సంపాదన. ఈ రోజున కావలసింది **'ఎలా సంపాదించావనికాదు. ఎంత సంపాదించావు?'** అని దీంతో మానవుడు ఎంత నీచానికైనా దిగజారుతున్నాడు. ఎన్ని ఘోరాలైనా చేస్తున్నాడు. వందలు, వేలు, లక్షలకోట్లు సంపాదించినా తృప్తి ఉండటం లేదు. ఇంకా సంపాదించాలనే ఆరాటం. ప్రాణం పోతుంది. అని తెలిసినా కూడా ఇంకా ఇంకా సంపాదించాలి అనేదే కోరిక. **"స్విస్ బ్యాంకులో దాచిన డబ్బులో సగంపైన మనదేశానికి సంబంధించినదే"** అంటే దేశాభివృద్ధికి ఉపయోగపడాల్సిన సొమ్ము ఎలా పక్కదారులు పడుతోంది? దానివల్ల మనకు నష్టం ఎంత? అనే విషయం తలచుకుంటే చాలా బాధాకరంగా ఉంటుంది. "విదేశీ బ్యాంకుల్లో దాచిన డబ్బులు బయటికి తీస్తే, ఇండియాలో ఒక్కొక్క కుటుంబానికి లక్ష రూపాయల చొప్పున ఇవ్వవచ్చు" అంటే ధనంమీద వ్యామోహం ఎంతగావేళ్ళు పాతుకుపోయిందో, అవినీతి ఎంతగా వేళ్ళు పాతుకుపోయిందో మనకు అర్థం అవుతోంది. ఇంత సొమ్ము మనం ఏం చేసుకుంటాం. ఇది నాది అని చెప్పుకోగలమా? జీవితంలో ఒక్కసారైనా దాన్ని కంటితో చూడగలమా? మరి దేనికి ఈ డబ్బు? ఎందుకీ సంపాదన? ఈ సంపాదన కోసమే కన్నవాళ్ళని, అవసరమైతే కట్టుకున్న వాళ్ళని కూడా వదిలి విదేశాల్లో ఒంటరిగా ఉంటున్నామంటే మనకున్న డబ్బు జబ్బుకు మందు ఎక్కడైనా దొరుకుతుందా? **ధనమూలమిదం జగత్.** ధనం ముందు అన్నీ దిగదుడుపే. అది ఈనాటి భావన. కాని ఈ ధనాన్ని గురించి వేదం ఏం చెబుతోందో చూడండి.

**భౌతికమైన సిరిసంపదలకు మనం యజమానులం కాదు. కేవలం ధర్మకర్తలం మాత్రమే. యజమాని పరమేశ్వరుడు.**

అంటోంది వేదం. ఈ భావనతోనే మనం జీవించాలి. సమాజంలో హెచ్చుతగ్గులు ఉండరాదు. ధనికుడు, దరిద్రుడు అనే తేడా ఉండరాదు. అలా అయితే అందరిలోను స్నేహభావముంటుంది. కాబట్టి ఈ భావనతోనే స్నేహమయ, జీవితాన్ని లోకకళ్యాణం కోసం యజ్ఞయాగాలు చేస్తూ సాగించండి. ఈ లోకంలో అందరూ సుఖంగా ఉండాలి. అనే భావన అందరిలోను ఉండాలి అంటోంది వేదం.

దేశంలోని సంపద అంతా మనదగ్గరే ఉంటే, ఎప్పుడో ఒకసారి, మనచుట్టూ ఉన్న వారే మనమీద దాడిచేసి ఇల్లు లూటీ చేసే ప్రమాదం ఉన్నది. కాబట్టి భౌతిక సంపదకు మనం ధర్మకర్తలం మాత్రమే కాని యజమానులం కాదు. అని గుర్తించండి.

# 31. అశ్వమేధం

ఇది ఒక పెద్ద యాగం. క్షత్రియులు మాత్రమే చేసే యాగం. ఫాల్గుణశుద్ధ అష్టమినాడు సుముహూర్తాన రాజుగారు ఒక గుర్రాన్ని వదిలి పెడతారు. అది దాని ఇష్టం వచ్చిన దిక్కుగా సంవత్సరంపాటు తిరుగుతుంది. దానిమీద రాజలాంచనాలు ఉంటాయి. అది ఎవరి అశ్వమో, ఎందుకు వెడుతోందో ఒక బంగారు రేకు మీద వ్రాసి దాని ముఖాన కడతారు. దాని వెనక రక్షణగా గొప్ప వీరులు, సేన ఉంటాయి. అది చూసిన పొరుగు రాజ్యాల రాజులు స్నేహభావంతో ఎదురెళ్ళి కానుకలు సమర్పిస్తారు. ఎవరికైనా ఇష్టం లేకపోతే అశ్వాన్ని పట్టుకుని బంధించవచ్చు. అప్పుడు దానితోపాటుగా వచ్చిన వీరులతో యుద్ధం చేసి గెలవవలసి ఉంటుంది. యుద్ధంలో ఓడిపోతే సామంతులై కప్పం కట్టాలి. ఈ రకంగా సంవత్సరకాలం దేశమంతా తిరుగుతుంది గుర్రం.

మళ్ళీ వసంతకాలం పూర్తి కాకుండా ఈ యాగాన్ని పూర్తి చెయ్యాలి. ఇలా అశ్వమేధయాగం చేసినవాడు దేశానికిచక్రవర్తి అవుతాడు. అతడి రాజ్యంలో సిరిసంపదలు తాండవమాడతాయి.

యాగపరిసమాప్తి అయిన తరువాత, యాగానికి వచ్చిన బంధువులు, మిత్రులు, శ్రేయోభిలాషులు అందరినీ ఉచిత రీతిన సత్కరించాలి.

రామాయణంలో దశరథమహారాజు పిల్లలు కావాలనే కోరికతో ఈ యాగం చేశాడు. ఉత్తరకాండలో శ్రీరామచంద్రుడు కూడా అశ్వమేధయాగం చేశాడు. భారతంలో ధర్మరాజు అశ్వమేధం చేశాడు. ఇక్ష్వాకు వంశానికి చెందిన నహుషుడు అనే మహారాజు నూరు అశ్వమేధయాగాలు చేశాడు. భూలోకంలో నూరు అశ్వమేధాలు చేసిన వారికి ఇంద్రపదవి వస్తుంది. వృత్రాసుర సంహారం చేసిన ఇంద్రుడికి

బ్రహ్మహత్యామహాపాతకం చుట్టుకుంది. ఆ సమయంలో నహుషుడు ఇంద్రుడయ్యాడు. యాగానికి అశ్వాన్ని వదిలే సమయంలో

"ఓ అశ్వమా ! మా దేశంలో బ్రాహ్మణులందరూ బ్రహ్మజ్ఞానం కలవారు కావాలి. క్షత్రియులు పరాక్రమవంతులు, ధర్మరక్షకులు కావాలి. వైశ్యులు ధనార్జన బాగా చెయ్యాలి. దేశంలో పంటలు బాగా పండాలి. ప్రజలందరూ ఆరోగ్యంగా ఉండాలి. అందరూ సుఖంగా ఉండాలి. వేగంగా పరుగెత్తే బలిష్టమైన గుర్రాలు, బరువులు మోసే ఎద్దులు జన్మించాలి. స్త్రీలందరూ అందగత్తెలు కావాలి" అనే అర్థం వచ్చే మంత్రాలు చదివి అశ్వాన్ని వదులుతారు. వేదంలో అశ్వమేధ యాగాన్ని గురించి ఏం చెప్పారో చూద్దాం.

**ఐదవ కాండలో** అశ్వమేధ యాగాన్ని గురించి చెప్పారు. ఒకప్పుడు బ్రహ్మగారి కనుగుడ్డు ఏదో రోగం వచ్చి ఉబ్బిపోయింది. అలా ఉబ్బిపోయి కంటి నుంచి జారి భూమిమీద పడి గుర్రమయింది. అది పై నుండి పడటం వల్ల దానినుంచి పుట్టిన ప్రాణికే 'అశ్వము' అని పేరు వచ్చింది. ఇప్పుడు దీనికి ప్రతిక్రియ ఏమిటి? అని ఆలోచించారు దేవతలు. అశ్వమేధ యాగాన్ని ఆచరించి బ్రహ్మగారి కన్ను సర్దుబాటు చేశారు. అశ్వమేధ యాగం చెయ్యటం వల్ల పాతకాలు, మహాపాతకాలు, ఉపపాతకాలు అన్నీ నశించిపోతాయి. ఇప్పుడు దేవతలుగా ఉన్న వాళ్ళు పూర్వజన్మలో అశ్వమేధ యాగాలు చేసినవారే అవటం గమనార్హం. ఈ యాగం చేస్తే బ్రహ్మహత్య, గోహత్య మొదలైన పాతకాలు అన్నీ నశిస్తాయి. రాజ్యానికి క్షేమం కలుగుతుంది. ప్రజలంతా సుఖశాంతులతో వర్ధిల్లుతారు.

కలియుగంలో అశ్వమేధ యాగం నిషేధించబడింది. ఒకవేళ ఎవరైనా ఎక్కడైనా ఈ యాగం చెయ్యతలచుకుంటే పిండితో చేసిన

గుర్రం బొమ్మను అశ్వానికి ప్రత్యామ్నాయంగా వాడాలి. ఈ యాగంలో గుర్రాన్ని చంపి దాని శరీర భాగాలు హోమం చెయ్యటం జరుగుతుంది. గుర్రంతోపాటుగా 400 పశువులను కూడా చంపటం జరుగుతుంది.

పదిహేను సంవత్సరాల క్రితం మన రాష్ట్ర ముఖ్యమంత్రి ఒకాయన ఈ యాగం చేశాడు అని చెప్పుకున్నారు. తరువాత కాలంలో హైదరాబాదులో ఒకరు ఈ యాగం బహిరంగంగానే చేశారు. అశ్వమేధ యాగం చేసిన వారిని **అశ్వమేధయాజి** అంటారు.

# 32. సంధ్యావందనము

సంధ్యా సమయంలో భగవంతుడికి నమస్కారం చెయ్యటమే సంధ్యావందనము అనబడుతుంది. అయితే మామూలుగా దేవుని విగ్రహానికి నమస్కారం చేసినట్లుగా కాకదీనికి ప్రత్యేక విధానం చెప్పబడింది. సంధ్యావందనము గాయత్రీ మంత్రోపాసన. రెండూ కలిపి చెయ్యాలి.

కర్మలు మూడు విధాలు 1. నిత్యములు 2. నైమిత్తికములు 3. కామ్యములు

**1. నిత్యములు :** వీటిని ప్రతిరోజు చేసి తీరాలి. వీటిని చేస్తే ప్రత్యేకంగా పుణ్యం రాదు. చెయ్యకపోతే పాపం మాత్రం వస్తుంది. ఉదాహరణకి ప్రతిరోజు భోజనం చెయ్యాలి. చేస్తే క్రొత్తగా వచ్చేది ఏమీ లేదు. కాని భోజనం చెయ్యకపోతే నీరసం వస్తుంది. ఓపిక ఉండదు. ఏపనీ చెయ్యలేవు. కాబట్టి భోజనం చెయ్యాలి. అలాగే ఈ రకమైన కర్మలు కూడా. ఇందులో శ్రుతులలో చెప్పబడినవి శ్రౌతకర్మలు 1. అగ్నిహోత్రము, దర్శపూర్ణ, మాస జ్యోతిష్టోమాది శ్రౌతకర్మలు నిత్యములు. సంధ్యావందనము, ఔపాసన మొదలైన స్మార్తకర్మలు నిత్యములు.

కాబట్టి సంధ్యావందనము నిత్యకర్మ. ప్రతిరోజు చేసి తీరవలసిన కర్మ. ఇది చెయ్యకపోతే మిగిలిన ఏ కర్మ చెయ్యటానికి అధికారం లేదు. కాబట్టి ఇది అత్యంత ప్రధానమైన నిత్యకర్మ. సంధ్యావందనము చేయని బ్రాహ్మణుడు శూద్రునితో సమానము, ఇతడు జన్మాంతరంలో నరకానికి పోతాడు. నీచమయినజన్మ ఎత్తుతాడు.

సూర్యుడు నక్షత్రాలు లేని సంధికాలమునే సంధ్యాకాలము అంటారు. ఈ సమయంలో ఉపాసించబడే దేవత గాయత్రి. సంధ్యావందనము మూడు కాలములందు చెయ్యాలి. అవే 1. ప్రాతసంధ్య 2. మాధ్యాహ్నిక సంధ్య 3. సాయంసంధ్య ఈ మూడు కాలాలయందు గాయత్రి, సావిత్రి, సరస్వతిగా ఆ దేవత ఉపాసించబడుతున్నది.

# 33. సంధ్యావందనము ఎప్పుడు చెయ్యాలి?

ముందుగా ఉదయం పూట సంధ్యావందనము చూద్దాం. తెల్లవారకముందు నక్షత్రాలు ఉండగానే ప్రారంభం చేసి గాయత్రీ మంత్రజపం చెయ్యాలి. అదే సాయంసంధ్య అయినట్లైతే సూర్యబింబము ఉండగానే అంటే అర్ధాస్తమయ సమయంలో సంధ్యావందనం ప్రారంభం చెయ్యాలి. ఇక మధ్యాహ్న సమయంలో అపరాహ్ణము వేళ సంధ్యావందనము చెయ్యాలి. అంటే పన్నెండు గంటలకు సంధ్యా వందనము ప్రారంభం చెయ్యాలి.

సంధ్యా వందనం చేసే సమయంలో సూర్యుడికి అర్ఘ్యప్రదానము తప్పనిసరిగా ఇవ్వాలి. సూర్యుడి యొక్క గమనానికి కొంతమంది రాక్షసులు అడ్డు పడుతుంటారు. మనం అర్ఘ్య ప్రదానం చేసినప్పుడు మంత్రించిన ఈ నీటిబిందువుల వల్ల వారు సూర్యుని ముందు నుంచి క్రింద పడిపోతారు. దాంతో సూర్యగమనము సాఫీగా సాగుతుంది.

ఇక గాయత్రీ మంత్రం తప్పనిసరిగా చెయ్యాలి. ఈ మంత్రానికి దేవత సవిత. ఈ సవిత పరమేశ్వర స్వరూపము. ఇతణ్ణి గురించి గతంలో చెప్పుకున్నాం. బంగారు ఛాయగలవాడు. తెల్లని దుస్తులు ధరించి బంగారు రథం మీద ప్రయాణిస్తూ, దిక్కుల వరకు వ్యాపించిన తన చేతులతో ప్రాణులన్నింటినీ తట్టి లేపుతాడు. అందరికీ జ్ఞానప్రదాత. అసలు గాయత్రి అంటేనే పరమేశ్వర స్వరూపం, ఆ దేవతకి.

**అగ్నిర్ముఖం, బ్రహ్మశిరః విష్ణుర్హృదయం, రుద్రశ్శిఖా, పృథివీ యోనిః**

ఇవన్నీ పరమేశ్వరుడికి సంబంధించినవి. అందుకే గాయత్రి అంటే పరమేశ్వర స్వరూపము. ఈ మంత్రాన్ని ఉపాసనచేసిన వాడికి ఏ మంత్రమైనా తేలికగా సిద్ధిస్తుంది. అందుకే గాయత్రీ మంత్రజపం చెయ్యాలి. ఎంత చెయ్యాలి? కనీసం రోజుకు వెయ్యి అయినా చెయ్యాలి. పూర్వకాలంలో గౌతముడు గాయత్రీ మంత్రాన్ని సిద్ధింప చేసుకుని గొప్పశక్తిని పొందాడు. కాబట్టి సంధ్యావందనము గాయత్రీ మంత్రజపము ఉపనయనమయిన ప్రతివాడు తప్పనిసరిగా చేసితీరాలి. ఈ మంత్రజపం చెయ్యకపోతే ఏ మంత్రమూ సిద్ధించదు.

స్త్రీలు, శూద్రులు సంధ్యావందనము చేయవచ్చా? అనేది చాలా పెద్దప్రశ్న. గతకాలంలో స్త్రీలకుకూడా ఉపనయనము చేసేవారు కాబట్టి స్త్రీలుకూడా గాయత్రీ మంత్రాన్ని జపించి వేదాధ్యయనం చేసేవారు. కాని ఈ రోజున పరిస్థితి ఏమిటి?

సంధ్యాసమయంలో భగవంతుడికి చేసే వందనమే సంధ్యావందనము. దీన్ని ఎవరైనా చెయ్యవచ్చు. కులమతాలతోను స్త్రీ పురుష బేధాలతోను ఇక్కడ పనిలేదు. భగవధ్యానము కూడా ఎవరైనా చెయ్యవచ్చు. **స్త్రీలకు, శూద్రులకు సంధ్యావందనము’ అని కళ్యాణానందభారతీస్వామివారు ఒక చిన్నపుస్తకం కూడా వ్రాశారు.** అందులో నారాయణ దశాక్షరి మంత్రం కూడా ఇవ్వబడింది. దీన్ని ఎవరైనా చెయ్యవచ్చు.

కాని వేదమంత్రాలు మాత్రం ఉపనయన సంస్కారం అయినవారు మాత్రమే చదవాలి.

# 34. నూరేళ్ళ జీవితం

'ఆరోగ్యమే మహాభాగ్యము'. ఇది నానుడి. మానవుడికి ఏమున్నా, ఏం లేకపోయినా ఫరవాలేదు. కాని ఆరోగ్యం మాత్రం పూర్తిగా ఉండాలి. అందమైన భార్య, చదువు, ధనం, అధికారం ఏమున్నా ఆరోగ్యం లేకపోతే ప్రయోజనం లేదు. మాట స్వచ్ఛంగా ఉండాలి. చూపు నిలకడగా, తీక్షణంగా ఉండాలి. మాట స్పష్టంగా వినిపించాలి. కాళ్ళు చేతులు ఒకటేమిటి? శరీరమంతా మన వశంలోనే ఉండాలి. వేదంలో దీన్ని గురించి చెబుతూ

"ఓ పరమేశ్వరా ! నా వాక్కు ముఖంలో స్థిరంగా ఉండాలి. నేను చెప్పే విషయం అందరికీ స్పష్టంగా తెలియాలి. నా శ్వాసనాళాలు సరిగా పని చెయ్యాలి. కనుగుడ్డు స్థిరంగా ఉండాలి. కంటిచూపు స్పష్టంగా ఉండాలి. చెవులు సరిగా పనిచెయ్యాలి. అవతలవాళ్ళు చెప్పే మాటలు పూర్తిగా తెలియాలి. చేతులు బలంగా పనిచేసే శక్తితో ఉండాలి. కాళ్ళు నడవగలిగే శక్తి కలిగి ఉండాలి. అన్ని అవయవాలు నా అధీనంలో ఉండాలి. ఓ పరమేశ్వరా ! నా పూజలు, అర్చనలు, ప్రార్ధనలు అందుకుని, నాకు సంపూర్ణమైన ఆరోగ్యాన్ని ప్రసాదించు. నేను చేసిన పాపాలను నశింపచేసి నూరుసంవత్సరాలు సుఖంగా, ఆరోగ్యంగా జీవించే ఆయుష్షు నాకు ఇవ్వవలసింది" అని ప్రార్థిస్తున్నారు.

## 35. రకరకాలయాగాలు

'పరమేశ్వరుడు' అంటే తేజోమయమైన కాంతిబింబం. అది విపరీతమైన కాంతి. కొన్నికోట్ల సూర్యులు ఒక్కసారిగా ప్రకాశిస్తే వచ్చే కాంతి. ఆ కాంతిలో వేడి ఉండదు చల్లదనం ఉంటుంది. అది కూడా కొన్నికోట్ల చంద్రులు ఒక్కసారి వస్తే ఉండే చల్లదనం. కొన్నికోట్ల మెరుపుతీగలు ఒక్కసారి మెరిస్తే ఉండే కాంతి. అంత కాంతివంతంగా ఉంటాడు పరమేశ్వరుడు. ఆయన్ని చర్మచక్షువులతో చూడలేం. ఆయనకి రూపం లేదు. జగత్తంతా ఆవరించి ఉన్నాడు. ఆయన నుంచి వచ్చే కాంతి కిరణాల వల్లనే ఈ జగత్తు ప్రవర్తిల్లుతున్నది. ఆ కిరణాలలో నూటఎనిమిది కిరణాలను అగ్నిదేవుడు, నూటపదహారు కిరణాలు సూర్యుడు, నూటముప్ఫైఆరు కిరణాలను చంద్రుడు తీసుకున్నారు. వీరివల్లనే జగత్తు ప్రవర్తిల్లుతున్నది. ఈ మొత్తం కిరణాలు 108+116+136 = 360. ఇదే పరమేశ్వర స్వరూపం. కాలస్వరూపం.

**హాయనాత్మా మహాదేవః ప్రజాపతి రితిస్మృతి**

కాల స్వరూపమే ప్రజాపతి అంటున్నాయి యామళ గ్రంథాలు. సృష్టి ప్రారంభంలో కాలం ఒకటిగా సంవత్సరంగా ఉండేది. అప్పుడు ప్రజాపతి ఋతువులను ఏర్పాటు చెయ్యాలనే కోరికతో పంచరాత్రయాగం చేశాడు. తరువాత ఋతువులు సృష్టించాడు. **'బబురుడు'** అనే ముని ఈ యాగంచేత బాగా మాట్లాడగలిగే శక్తి సంపాదించాడు. అతడికి **'వాచస్పతి'** అని బిరుదు కూడా ఉంది.

పంచరాత్ర యాగంలో

1. అగ్నిష్టోమం 2. పంచదశ□స్తోమం 3. సప్తదశస్తోమం 4. త్రివృత్ స్తోమం 5. విశ్వజిత్

అనే యాగాలు, అశ్వమేధయాగము ఏడవ కాండలో వివరించబడ్డాయి.

కఠోపనిషత్తులో నచికేతుని తండ్రి చేసేదే విశ్వజిద్‌యాగము. శాశ్వత స్వర్గ లోకప్రాప్తి కోసం ఈ యాగం చేస్తారు. ఇందులో తన ఆస్తిని తనతో సహా కుమారులకు, భార్యకు పంచి ఇచ్చి, తన వాటాగా వచ్చిన దానిని అందరికీ దానధర్మాలు చెయ్యాలి.

ఈ రకంగా అనేక యాగాలను వివరించింది కృష్ణయజుర్వేద సంహిత.

# 36. అన్నసమృద్ధి

కృష్ణయజుర్వేదంలో దేవతలను చాలాచోట్ల అన్నసమృద్ధి కావాలి, ధనసమృద్ధి కావాలి, అనే అడుగుతారు. **నాల్గవకాండలోని ఆరవ ప్రపాఠకంలోని పన్నెండవ అనువాకంలో** అన్నసమృద్ధి కావాలని ప్రార్థిస్తున్నారు.

తూర్పు, పడమర, దక్షిణం, ఉత్తరం, ఊర్ధ్వ, మధ్యమ, అధమ మొత్తం ఏడు దిశలు మాకు అన్న ప్రదాలు అగుగాక. అన్నము ధన ప్రదేశమున ఉండి విశ్వేదేవతల ప్రేరణతో మమ్ము రక్షించును గాక.

ఈ రోజున మరుత్తులు, దేవతలు అందరూ మమ్ము రక్షింతురు గాక. అగ్నులు చక్కగా ప్రజ్వరిల్లాలి. విశ్వేదేవతలు మాకు రక్షకులు కావాలి. అన్ని రకాల ధనము, అన్నము మాకు లభించాలి.

మాయొక్క అన్నముల ప్రేరణచే అగ్ని, ఇంద్ర, బృహస్పతి, మరుత్తులు, బంగారు రథాల మీద సోమపానం చెయ్యటానికి రావాలి.

ఓ దేవతలారా ! మీరు అన్న సంపాదకులు. మా అన్నాన్ని, ధనాన్ని రక్షించండి. మధురమైన ఈ భోజనం ఆరగించండి. సంతుష్టులు కండి. సంతృప్తి చెంది దేవమార్గంలో ప్రయాణం చేసి మీ పట్టణానికి చేరండి.

నాకు చిన్నప్పుడు, మధ్య వయసులో, అన్నం కలుగుగాక. అన్నంవల్ల దేవతలు ప్రసన్నులవుతారు. అన్నంవల్ల అన్నిదిశలు స్వాధీనమవుతాయి.

నన్నునేను పాలతో ఏకం చేసుకుంటున్నాను. నాకు అన్నం లభించును గాక.

వాయువా ! నువ్వు సముద్రమంత గొప్పవాడివి వర్షప్రదుడవు. ఇహపర సుఖాలు ఇచ్చేవాడవు. నువ్వు నా దగ్గరకు రావలసింది.

మరుత్తులారా ! మీరు మరుద్గణ స్వరూపులు. ఇహపరసుఖాలు కలిగించేవారు. రండి.

వాయువా రక్షణ కోరేవాడవు. పరిచర్యలతో కూడిన వాడివి. ఇహపరాలను కలిగించే వాడవు. నువు రావలసింది. నాకు సమృద్ధిగా అన్నం ప్రసాదించవలసింది" అని ప్రార్థిస్తున్నారు.

## 37. నక్షత్రాలు

దక్షప్రజాపతి కుమార్తెలు నక్షత్రాలు. ఈ నక్షత్రాలు మొత్తం 27. వీళ్ళని చంద్రుడికిచ్చి వివాహం చేశాడు దక్షుడు. ప్రతి నక్షత్రానికి ఒక దేవత చెప్పబడింది. **కృష్ణయజుర్వేదంలోని 4వ కాండలోని 4వ ప్రపాఠకంలోని 10వ అనువాకంలో** ఈ విషయాలు చెప్పబడ్డాయి.

| | నక్షత్రము | | దేవత |
|---|---|---|---|
| 1. | కృత్తిక | – | అగ్ని |
| 2. | రోహిణి | – | ప్రజాపతి |
| 3. | మృగశిర | – | సోముడు |
| 4. | ఆర్ద్రా | – | రుద్రుడు |
| 5. | పునర్వసు | – | అదితి |
| 6. | పుష్యమి | – | బృహస్పతి |
| 7. | ఆశ్రేష | – | సర్పము |
| 8. | మఖ | – | పితరులు |
| 9. | పుబ్బ | – | ఆర్యముడు |
| 10. | ఉత్తర | – | భగము |
| 11. | హస్త | – | సవితా |
| 12. | చిత్ర | – | ఇంద్రుడు |
| 13. | స్వాతి | – | వాయువు |
| 14. | విశాఖ | – | ఇంద్రాగ్ని |
| 15. | అనూరాధ | – | మిత్రుడు |
| 16. | జ్యేష్ఠ | – | ఇంద్రుడు |
| 17. | మూల | – | పితరులు |

18. పూర్వాషాఢ – ఆపో

19. ఉత్తరాషాఢ – విశ్వేదేవులు

20. శ్రవణం – విష్ణువు

21. ధనిష్ఠ – వసువు

22. శతభిషం – ఇంద్రుడు

23. పూర్వాభాద్ర – అజఏకపాత్

24. ఉత్తరాభాద్ర – అహిర్బుధ్ని

25. రేవతి – పూషా

26. అశ్వని – అశ్వని

27. భరణి – యముడు

ఒక్కొక్క నక్షత్రానికి 4 పాదాలు. 27 నక్షత్రాలకు కలిపి 27 × 4 = 108 పాదాలు. మేషం నుండి మీనం వరకు రాసులు 12. ఒక్కొక్క రాశికి 9 పాదాలు చొప్పున 12×9 = 108 నక్షత్రాలు ఉంటాయి. ఉదాహరణకి మేషరాశిలో అశ్వని – 4 పాదాలు, భరణి – 4 పాదాలు, కృత్తిక – 1 పాదము వెరసి 9 పాదాలు. అలాగే వృషభరాశిలో కృత్తిక – 3 పాదాలు, రోహిణి 4 పాదాలు, మృగశిర 2 పాదాలు వెరసి 9 పాదాలు ఉంటాయి. ఇలా రాశికి 9పాదాలు చొప్పున 27 నక్షత్రాలు 12 రాశులలోను తిరుగుతాయి. ఇదంతా జోతిష్యశాస్త్రము. ఇలా కృష్ణయజుర్వేదంలో అనేక విషయాలు చెప్పారు.

# 38. శతరుద్రీయము

రుద్రుడు అంటే త్రిమూర్తులలో మూడవవాడు, సంహారకర్త. ప్రళయ కాలంలో లోకాలన్నీ నాశనం చేసేవాడు. ఇతడు మహాబలవంతుడు, భయంకరమైన ఆయుధాలు కలవాడు. మెరుపులు, పిడుగులు కూడా అతని ఆయుధాలే. ఓషధులన్నీ అతని అధీనంలోనే ఉంటాయి. శత్రుమర్దనుడు, భక్తవశంకరుడు. దేవాలయంలో అర్చించేది ఈ రుద్రుణ్ణే. అతన్ని గురించి చెప్పే మంత్రాలే 'రుద్రము' అనబడతాయి. రుద్రుడు అంటే శివుడు కాదు.

వేదంలో రకరకాల దేవతల గురించి చెప్పినప్పటికీ, అంతమంది దేవతలు లేరు. ఉన్నది ఒక్కడే అదే పరమేశ్వరుడు. మనం చేసేది ఏకేశ్వరోపాసన. ఈ కారణంచేతనే కొన్నిచోట్ల రుద్రుణ్ణి సూర్యుడుగా, అగ్నిస్వరూపుడుగా, ఇంద్రరూపుడుగా చెప్పటం జరిగింది. శ్రీమహావిష్ణువు అంటే శ్రీమన్నారాయణుడే. **నారాయణుడికి నారాయణసూక్తంలో సర్వవ్యాపకత్వం చెప్పబడింది.** అలాగే రుద్రుడు అంటే ఈశ్వరుడే అని చెప్పి **శతరుద్రీయంలో ఈశ్వరుడికి కూడా సర్వవ్యాపకత్వం చెప్పబడింది.**

ఋగ్వేదంలో రుద్రుడికి అంత ప్రాముఖ్యత లేదు. కేవలము మూడు సూక్తాలలో పూర్తిగా చెప్పబడ్డాడు. ప్రథమ మండలంలోని 43, 114 సూక్తాలలోను, రెండవ మండలంలోని 33వ సూక్తంలోను పూర్తిగా చెప్పబడి, ఇంకా రెండుచోట్ల కొన్ని మంత్రాలలో మాత్రమే చెప్పబడ్డాడు. 2–33లో ఆయన పీతవర్ణంతో ప్రకాశిస్తుంటాడు. అభీష్ట వరదుడు. వజ్రబాహువు, స్థిరమైన అవయవాలు కలవాడు. దృఢాంగుడు. ఉగ్రుడు, దీప్తిమంతుడు. ఎల్లప్పుడు బంగారు ఆభరణాలు

అలంకారంగా ధరించి ఉంటాడు. సకలభువనాలకు అధిపతి. తిరుగులేని బలముగలవాడు. ధనుర్ధారి. రథం ఎక్కి తిరిగుతుంటాడు. మృగంలాగా అతిభయంకరుడు. శత్రువులను తృటిలో నాశనం చెయ్యగలవాడు. అభీష్టవరదుడు. సర్వజ్ఞుడు. మరుత్తులు ఇతని కుమారులు.

1.114లో ఇతణ్ణి కపర్ధి అంటారు. ఇతడు చాలా బలమైనవాడు. శత్రునాశకుడు. శత్రుంజయుడు. వాయువులు అతని పుత్రులు. యజ్ఞనిర్వాహకుడు. అధిక జ్ఞానవంతుడు. 1.43లో వరాలు ఇచ్చేవాడు. ఇతడు స్తుతులకు, యజ్ఞాలకు ప్రభువు. అతనివద్ద జలరూప ఔషధాలున్నాయి. సూర్యునిలాగా ప్రకాశిస్తుంటాడు. బంగారములాగా ప్రియమైనవాడు. భక్తులయందు కరుణగలవాడు. సంపదలు ఇచ్చేవాడు. సుఖాన్ని ఇచ్చేవాడు. గుర్రాలు, మేకలు, నరనారీజనము, గోవులు అన్నింటికీ సుఖాన్ని కలిగిస్తాడు. యజ్ఞాలు పాడుచేసేవారిని శిక్షించి, యజ్ఞాలను రక్షిస్తాడు. యజ్ఞరక్షకుడు. శత్రుసంహారం చేసి భక్తులకు కావలసినవి ప్రసాదిస్తాడు. రుద్రుని స్తుతించిన వారికి అన్ని రకాల పాపాలు నశించి సుఖాలు కలుగుతాయి.

రుద్రుడు నీతిని బోధిస్తాడు. భక్తులు దానిఫలితాన్ని అనుభవిస్తారు. భక్తులు యాగాలు చేసి రుద్రుడికి హవిస్సులు అర్పిస్తారు. ఆయన అనుగ్రహం పొందుతారు. ఆయన రాక మాత్రం చేతనే భక్తులు సంతానవంతులవుతారు. అతడు దృఢగాత్రుడు. మంచి కాంతిగలవాడు. జటాజూటము గలవాడు. దివ్యమైన తేజస్సు గలవాడు. ద్యులోకము నుంచి ఔషధాలు తెచ్చి భక్తులకు ఆరోగ్యాన్నిస్తాడు. అన్నాన్నిస్తాడు. పుత్రపౌత్రులను ప్రసాదిస్తాడు. అందుకే భక్తులు ఓ రుద్రా ! మాలో ఎవరినీ చంపవద్దు. ఏడుస్తున్న

వారిని, కడుపులో ఉన్న వారిని, వృద్ధులైన తల్లి తండ్రులను, మా పశువులను, సేవకులను ఎవరినీ చంపవద్దు. వారందరికీ సుఖాన్ని ప్రసాదించ వలసింది. ఓ రుద్రా! శత్రుసంహారం కోసం ఉపయోగించే పదునైన, బలమైన నీ ఆయుధాలను మాకు దూరంగా ఉంచు. మాకు ధనాన్ని, సుఖాన్ని ప్రసాదించవలసింది అని ప్రార్థిస్తారు.

**కృష్ణయజుర్వేదంలోని నాల్గవకాండలోని ఐదవ ప్రపాఠకంలో** మొత్తం పదకొండు అనువాకాలున్నాయి. ఈ ప్రపాఠకంలో మొత్తం 169 మంత్రాలున్నాయి. దీన్నే **నమకము** లేదా **'శతరుద్రీయము'** అంటారు. ఈశ్వరుని విశ్వరూపభావన ఇందులో కనిపిస్తుంది. ఏడో ప్రపాఠకంలో **చమకం** ఉన్నది. పంచభూతాలు, ఆరురుతువులు, ఎనిమిది దిక్కులు సమస్త ప్రకృతి మాకు శుభం కలుగచెయ్యాలని కోరటమే ఇందులోని ప్రధానాంశం. నమక చమకాలు రెండింటినీ కలిపి **రుద్రాధ్యాయము** అంటారు. ఇవే అభిషేక మంత్రాలు. అలాగే శుక్లయజుర్వేదంలో 16వ అధ్యాయం శతరుద్రీయ మంత్రాలు చెబుతుంది. ఇందులో మొత్తం 66 మంత్రాలుంటాయి. వీటిలో ఇంచు మించుగా కృష్ణయజుర్వేదంలోని శతరుద్రీయంలో చెప్పిన విషయాలే చెప్పబడ్డాయి.

కృష్ణయజుర్వేద తైత్తిరీయ సంహితలోని నాల్గవకాండలోని ఐదవ ప్రపాఠకములో మొత్తం పదకొండు అనువాకాలున్నాయి. వీటినే **'నమకము'** అంటారు. అలాగే ఏడవ ప్రపాఠకములోని పదకొండు అనువాకాలను చమకము అంటారు. ఆలయాలలో ఈశ్వరుడికి అభిషేకంచేసే సమయంలో చదివే మంత్రాలు ఇవే. ఈ నమక చమకాలు రెండింటినీ కలిపి **'రుద్రాధ్యాయము'** అంటారు. ఈ రెండింటినీ కలిపి **'రుద్రోపనిషత్తు'** అని కూడా అంటారు.

వేదానికి అనేకశాఖలున్నాయి. ప్రతిశాఖలోను చివర ఒక ఉపనిషత్తు చెప్పబడింది. ఒకసారి చెప్పిన ఉపనిషత్తును మళ్ళీ ఇంకొకసారి ఇంకొక శాఖలో చెప్పటం జరగదు. కాని కృష్ణయజుర్వేదానికి 101 శాఖలున్నాయి. అన్ని శాఖలలోను చివర ఈ రుద్రోపనిషత్తు చెప్పబడింది. ఇలా ఈ రుద్రము వందసార్లు చెప్పబడింది. **'శతేనరుద్రీయం ఇతిశతరుద్రీయం'** కాబట్టి దీన్ని **'శతరుద్రీయము'** అన్నారు అని చెప్పాడు భట్టభాస్కరుడు. దీన్ని గురించి **సూతసంహితలో**

**"శతశాఖాగతం సాక్షాచ్ఛతరుద్రీయ ముత్తమమ్**
**తస్మాత్ జపమాత్రేణ సర్వపాపై ప్రముచ్యతే"**

వంద శాఖలలో చెప్పబడింది కాబట్టి శతరుద్రీయము అనే ఈ రుద్రాధ్యాయము ఉత్తమమైనది. దీనిని జపం (పారాయణ) చేసినంత మాత్రంచేత అన్ని పాపాలు నశిస్తాయి. అన్నారు.

మామూలుగా చెప్పేటప్పుడు ముఖ్యమైన విషయాలను రెండు మూడుసార్లు నొక్కి చెప్పటం జరుగుతుంది. అలాంటిది రుద్రాధ్యాయాన్ని వందసార్లు చెప్పారు అంటే దాని ప్రాముఖ్యత చెప్పకనే తెలుస్తోంది.

**"శతేషు శాఖాసు పఠ్యతే రుద్రీయమ్ శతరుద్రీయమ్"**

వందశాఖల యందు చెప్పబడింది. కాబట్టి దీన్ని శతరుద్రీయము అన్నారు.

రుద్రాధ్యాయంలో వేలకొలది రుద్రదేవతా మూర్తులున్నారని చెప్పబడుతోంది. శతము, సహస్రము అనే సంఖ్యా వాచికాలు అపరిమితాలు. రుద్రాధ్యాయములో అసంఖ్యాకమైన రుద్రదేవతలున్నారు కాబట్టి దీన్ని శతరుద్రీయము అన్నారు.

నీలకంఠ పండితుని అభిప్రాయంలో స్థితి కర్త, జగద్రక్షకుడు అయిన విష్ణువుకు శివమయత్వం చెప్పటంచేత, విష్ణుకృతమైన జగద్రక్షణ శివకృతమవుతున్నది.

**యచ్చకించిత్ జగత్సర్వం దృశ్యతే శ్రూయతేపివా**

**అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః**

శ్రవ్య దృశ్యమానమైన ఈ జగత్తులో లోపలా బయటా అంతటా శ్రీమన్నారాయణుడు వ్యాపించి ఉన్నాడు అంటోంది నారాయణ సూక్తము. అంటే విష్ణువు సర్వవ్యాపకుడు.

**సర్వోహ్యేష రుద్రః తస్మై రుద్రాయ నమో అస్తు**

అంటూ సర్వవ్యాపకత్వాన్ని ఈశ్వరుడికి కూడా చెబుతోంది వేదం. దీనివల్ల శివకేశవులిద్దరికీ సర్వవ్యాపకత్వమున్నది. వారిద్దరి మధ్యన భేదం లేదు. స్కందోపనిషత్తులో

**స ఏవహి మహాదేవస్స ఏవహి మహా హరిః**

**స ఏవ జ్యోతిషాం జ్యోతి స్స ఏవ పరమేశ్వరః**

ఆ విష్ణువే మహాదేవుడు. అతడే హరి. కాంతులన్నింటికీ కాంతియైనవాడు. అతడే పరమేశ్వరుడు.

**శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే**

శివుడే విష్ణువు. విష్ణువే శివుడు. వీరిద్దరి మధ్యన భేదం లేదు.

**శివశ్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయ శివః ।**

**యధాశ్శివయో విష్ణుః ఏవం విష్ణు మయశ్శివః ॥**

శివుని హృదయమే విష్ణువు. విష్ణువు హృదయమే శివుడు. వారిద్దరి మధ్యన భేదం లేదు.

ఈ రకంగా శివకేశవులు ఇద్దరూ ఒకటే. వారి మధ్య భేదం లేదు అని చెబుతోంది ఈ రుద్రోపనిషత్తు. ఇందులోని పదాలన్నీ శివుడు పరమేశ్వర స్వరూపము అని ప్రతిపాదిస్తున్నాయి. ముందుగా మనం నమకాన్ని చూద్దాం. ఇది మొత్తం పదకొండు అనువాకాలుగా, నూటఅరవైతొమ్మిది మంత్రాలుగా ఉంటుంది. నమక, చమకాలు చదువుతూ ఈశ్వరుడికి స్నానం చేయించటాన్నే 'అభిషేకము' అంటారు. ఇలా అభిషేకము పదకొండుసార్లు చేస్తే, దాన్ని ఏకాదశరుద్రాభిషేకము అంటారు. ఇది ప్రజలు చెప్పుకునే మాట. కాని ఒకసారి నమకం చెబితే దాన్ని ఏకవారము అంటారు. రుద్రము అంటే పదకొండు అని అర్థం. కాబట్టి నమకాన్ని పదకొండుసార్లు చదివితే రుద్రాభిషేకము అంటారు. అలాటి రుద్రాభిషేకాలు పదకొండుసార్లు చేస్తే దాన్ని ఏకాదశ రుద్రాభిషేకము అంటారు. అంటే పదకొండు మంది నమకం చదువుతూ ఉండాలి. అదే సమయంలో పదకొండు మంది అభిషేకం చెయ్యాలి. 11 × 11 = 121 సార్లు నమకం చెబుతూ శివుణ్ణి అభిషేకించటమే ఏకాదశ రుద్రాభిషేకము. 11 × 11 × 11 = 1331 సార్లు నమకం చదువుతూ అభిషేకం చేస్తే **అతిరుద్రము** అని, 11 × 11 × 11 × 11 = 14,641 సార్లు నమకం చెబుతూ అభిషేకిస్తే దాన్ని **మహారుద్రము** అంటారు. ఈ రకంగా ఈశ్వరుడికి అభిషేకం చెయ్యవచ్చు. లేదా హోమం చెయ్యవచ్చు. ఇవన్నీ సామూహికంగా చేసేవి. 8-3-2014 నుంచి 29-3-2014 వరకు రోజుకు ఆరు రుద్రాలు చొప్పున నేను ఒక్కడినే **అతిరుద్రయాగము** పూర్తి చేసి 30-3-2014న పూర్ణాహుతి చేశాను. ఆ తరువాతే ఈ పుస్తకం వ్రాయటానికి ఉపక్రమించాను. అతిరుద్రం కాని, మహారుద్రం కాని చేస్తే పరమేశ్వరుడి సంపూర్ణానుగ్రహం కలుగుతుంది. నమకము,

చమకము, పురుష సూక్తములను ప్రతిరోజు పారాయణ చేస్తే బ్రహ్మలోకం పొందుతారు. శతరుద్రీయం అధ్యయనం చేసినవాడు పరమపవిత్రుడవుతాడు. రుద్రాధ్యాయము పారాయణ వల్ల అన్ని పాపాలు నశిస్తాయి. రుద్రాధ్యాయము బ్రహ్మస్వరూపము.

ఈ నూటఅరవైతొమ్మిది మంత్రాలను వేరే మంత్రాలతో సంపుటీకరణం చెయ్యటం జరుగుతుంది. దీన్ని **'పాశుపతము'** అంటారు. ఇందులో నమక మంత్రాలకు వెనక, ముందు వేరే మంత్రాన్ని సంపుటి చేస్తారు. ఉదాహరణకు **కుబేరపాశుపతము.** ఇందులో ముందు కుబేర మంత్రము, నమక మంత్రము, కుబేర మంత్రము. ఇలా 169 మంత్రాలకీ చెప్పాలి. మంత్రశాస్త్రంలో పాశుపతానికి చాలా ప్రాముఖ్యత ఉన్నది. ఇది తిరుగులేని ప్రయోగంగా చెప్పబడుతోంది. ఈ విధంగా ఒకసారి నమకం చెప్పటానికి అనుభవం ఉన్న వాళ్ళకైతే గంటపైన పడుతుంది. పదకొండుసార్లు చెయ్యాలంటే కనీసం పదిగంటలు పడుతుంది.

ఇప్పుడు మనం నమకపాఠాన్ని, దాని అర్థాన్ని చూద్దాం. అధర్వవేదంలోని 11వ కాండలోని 6,7 సూక్తాలలో కూడా రుద్రుణ్ణి గూర్చి చెప్పటం జరిగింది. నమకంలో మొత్తం పదకొండు అనువాకాలుంటాయి.

# 39. రుద్రాధ్యాయము

## ఓం నమో భగవతే రుద్రాయ

### ప్రథమ అనువాకం

ఇందులో 15 మంత్రాలున్నాయి.

**1. ఓం నమస్తే రుద్ర మన్యవఉతోత ఇషవే నమః ।**
**నమస్తే అస్తు ధన్వనే బాహుభ్యాముతతే నమః ॥**

ఓ రుద్రా ! నీ క్రోధానికి నమస్కారము. నీ బాణానికి నమస్కారము. నీ ధనుస్సుకు నమస్కారము. నీ బాహువులకు నమస్కారము. వీటిని మా మీద ప్రయోగించద్దు. మా శత్రువుల మీద ప్రయోగించవలసినది.

**2. యాతఇషు శ్శివతమాశివంబభూవతే ధనుః ।**
**శివాశరవ్యాయా తవతయానోరుద్రమృడయః ॥**

ఓ రుద్రా ! సుఖాన్ని కలిగించే నీ బాణానికి, అటువంటి బాణాన్ని ప్రయోగించే నీ ధనుస్సుకు, ఆ బాణములు ఉంచే అమ్ములపొది. ఈ మూడింటికీ నమస్కారము.

**3. యాతేరుద్ర శివాతనూ రఘోరా పాపకాశినీ ।**
**తయానస్తనువాశ స్తమయా గిరిశన్తాభిచాకశీహి ॥**

కైలాస పర్వతంమీద ఉండి భక్తులకు నిరంతరము సుఖాన్ని ఇచ్చే ఓ రుద్రుడా! ఆయుధాలు ధరించకుండా భక్తుల భయాన్ని పోగొట్టి అభయాన్నిచ్చే నీ రూపానికి నమస్కారము.

**4. యామిషు ఙ్గిరిశన్తహస్తే ॥ బిభర్ష్యస్తవే ।**

**శివాంగిరిత్రతాం కురుమాహిగ్ంసీః పురుషంజగత్ ॥**

కైలాసము నందు ఉండి లోకాలన్నింటికీ సుఖాన్ని ప్రసాదించే రుద్రుడా ! శత్రువులంతా నాశనమయినారు. శత్రువు మీద ప్రయోగించటానికి తీసిపట్టుకున్న బాణాన్ని శాంతింప చేయవలసినది. లేకపోతే లోకాలన్నీ నాశనమయిపోతాయి.

**5. శివేనవచసా త్వా గిరిశాచ్ఛా వదామసి ।**

**యథానస్సర్వమిజ్జగద యక్ష్మగ్ం సుమనాఅసత్ ॥**

కైలాసవాసి అయిన ఓ రుద్రా ! నిన్ను స్తుతి చేస్తున్నాను. మా వారందరూ (పిల్లలు, మనమలు, పశువులు అందరూ రోగాలు లేకుండా అనుగ్రహించవలసినది.)

**6. అధ్యవోచదధివక్తా ప్రథమోదైవ్యోభిషక్ ।**

**అహీగ్శ్చ సర్వాన్జం భయన్ త్సర్వాశ్చయాతుథాన్యః**

దేవతలో ముఖ్యుడు, దేవతలను పాలించుటలో సమర్థుడు, స్మరించినంత మాత్రము చేతనే సమస్త రోగాలు పోగొట్టేవాడు అయిన రుద్రుడు నన్ను సభయందు మెచ్చుకుని గొప్పవాడని చెప్పగలిగిన రుద్రుడు క్రూరగ్రహాలను, రాక్షసులను నాశనం చేసి నన్ను రక్షించుగాక.

**7. అసౌయస్తామ్రో అరుణ ఉతబభ్రు స్సుమఙ్గలః ।**

**యేచేమాగ్ం రుద్రాఅభితోదిక్షు ॥ శ్రితా స్సహస్ర**

**శోవైషాగ్ం హేడ ఈమహే ॥**

ఆదిత్యరూపుడై లోకాలను రక్షించే రుద్రుడు, ఆ మహాత్ముని ఆజ్ఞలు అమలు చెయ్యటం కోసం లోకమంతా సంచరించే వివిధ

రకాల ఏ ఏ రుద్రులు ఏర్పాటు చెయ్యబడ్డారో వారికి అందరికీ నమస్కారము. చేయవలసిన పనులు చేయకపోవటం వల్ల కలిగే పుణ్యపాపాల వల్ల, మా మీద కలిగే క్రోధం వల్ల, మమ్ము బాధించకుండా ఉండునట్లుగా వారికి నమస్కారము.

**8. అసౌయోవసర్పతి నీలగ్రీవోవిలోహితః ।**
**ఉతైనం గోపాఅదృశన్నదృశన్నుదహార్యః ॥**
**ఉతైనం విశ్వాభూతాని సదృష్టో మృడయాతినః ॥**

ఏ రుద్రుడు ప్రతిరోజు ఉదయానికి ముందు, సాయంత్రం తరువాత ఉదయాస్తమానములు చేస్తూ ప్రాణులందరికీ ప్రత్యక్షమవుతున్నాడో, అట్టి రుద్రుడు మాకు సాక్షాత్కరించి మమ్ము రక్షించు గాక.

**9. నమో అస్తునీలగ్రీవాయ సహస్రాక్షాయ మీఢుషే ।**
**అథోయే అస్య సత్వానోఽహం తేభ్యోఽకరం నమః**

కాలకూటము మ్రింగుటచే నీలమైన కంఠముకలవాడు, వేయికనులు కలిగి ఇంద్రరూపుడయినవాడు, పర్జన్యుని రూపంలో వర్షం కురిపించేవాడు అయిన రుద్రునికి నమస్కారము. ఆయనను ఆశ్రయించిన మహనీయులకు కూడా నమస్కారము.

**10. ప్రముంచధన్వన స్త్వముభయోరార్ని యోర్జ్యామ్ ।**
**యాశ్చతేహస్తఇషవః ॥ పరాతా భగవోవప ॥**

ఓ రుద్రా ! నీ ధనస్సు యొక్క రెండు మొనలందు ఎక్కుపెట్టిన అల్లెత్రాడును సడలింపుము. ప్రయోగించటానికి చేతితో పట్టుకున్న బాణాలను అమ్ములపొదిలో ఉంచుము.

**11. అవతత్యధనుస్త్వగ్ం సహస్రాక్షశ తేషుధే ।**

**నిశీర్యశల్యానాం ముఖాశివోన సుమనాభవ ॥**

లెక్కలేనన్ని కన్నులు, అమ్ముల పొదులు గల రుద్రుడా ! ధనుస్సును వెూపెడలించి బాణాలు ప్రయోగించటానికి ఉపయోగించనిదిగా చేయుము. బాణముల యొక్క ములుకులు అమ్ముల పొదిలో తలక్రిందులుగా ఉంచుము. మా యందు అనుగ్రహము గలవాడవై మా అపచారములను మన్నించవలసింది.

**12. విజ్యంధనుః కపర్దినో విశల్యో బాణవాగ్ంఉత ।**

**ఆనేశన్న స్యేషవ ఆభురస్య నిషఙ్గధిః ॥**

జటాజూటము ధరించిన రుద్రుని ధనుస్సు శాంతమయి అల్లెత్రాడు లేనిది అగుగాక. అతని బాణములు అమ్ములపొదిలో పెట్టబడినవై బాధించటానికి అసమర్ధములగుగాక. అమ్ములపొది గోడకు తగిలించబడినదై బాణములు తీయటానికి వీలుగాకుండుగాక. ఈతని కత్తివర ఎక్కడో తగిలించి ఉండటంవల్ల, దానిలో నుంచి కత్తిని తీయటానికి ఉపయోగించకుండును గాక.

**13. యాతేహెతిర్మీఢుష్టఘహస్తేబభూవతే ధనుః ।**

**తయాస్మాన్ విశ్వతస్త్వమయక్ష్మ యాపరిబ్భుజ ॥**

మానవుల కోరికలు తీర్చు ఓ రుద్రుడా ! నీ ఖడ్గము, ధనుస్సులచే మానవుల భయాన్ని పోగొట్టి మమ్ము రక్షింపుము.

**14. నమస్తే అస్త్వాయుధాయ నాతతాయ ధృష్ణవే ।**

**ఉభాభ్యాముతతే నమో బాహుభ్యాం తవధన్వనే ॥**

ఓ రుద్రా ! హింసించటానికి సమర్థమయి, ధనుస్సు నందు సంధింపబడని కారణాన శాంతమయిన నీ బాణానికి నా నమస్కారము. ధనుస్సును పట్టుకుని బాణాన్ని ప్రయోగించే నీ చేతులకు నమస్కారము. బాణాలను ప్రయోగించే ధనస్సుకు నమస్కారము.

**15. పరితేధన్వ నోహేతి రస్మాన్వృణక్తు విశ్వతః ।**
**అథోయఇషుధిస్తవారే అస్మన్నిధే హితమ్ ॥**

ఓ రుద్రా ! నీ ధనుస్సు వల్ల మేము, మా వారు ఎవరూ బాధింపబడకుండుదురు గాక. భయంకరమైన అమ్ములపొదిని మా దగ్గర నుంచి తీసి, మా శత్రువుల దగ్గర ఉంచవలసినది.

## ద్వితీయానువాకం

ఇందులో 13 మంత్రాలున్నాయి.

**16. నమో హిరణ్య బాహవేసేనాన్యేదిశాంచ పతయే నమః**

బాహువులందు బంగారు ఆభరణాలు ధరించినవాడు, యుద్ధంలో సేనలను నడుపు రుద్రునికి నమస్కారము. దిక్కులు పాలించే రుద్రునికి నమస్కారము.

**17. నమో వృక్షేభ్యోహరికేశేభ్యః పశూనాంపతయే నమః**

ఆకుపచ్చని రంగుగల ఆకులు అనే వెంట్రుకలు గల వృక్షరూపులైన రుద్రులకు నమస్కారము. పశుపతి అయిన రుద్రునికి నమస్కారము.

**18. నమసస్పింజరాయత్విషీమ తేపథీ నాంపతయే నమః**

బంగారు ఛాయగలవాడు, గొప్ప తేజస్వి అయిన రుద్రునకు

నమస్కారము. దేవయానము, పితృయానము, విదేహముక్తులను నియమించిన రుద్రునకు నమస్కారము.

**19. నమో బభ్లుశాయ వివ్యాథినేన్నానాంపతయే నమః**

ఎద్దుమీద కూర్చుని శత్రువులను బాణాలతో కొట్టే రుద్రునకు నమస్కారము. ప్రాణులకు, జీవనాధారమైన అన్ని రకాల అన్నములకు నాథుడైన రుద్రునికి నమస్కారము.

**20. నమో హరికేశాయోప వీతినె పుష్టానాంపతయే నమః**

నిత్యయవ్వనుడు, నల్లని వెంట్రుకలు గలవాడు, యజ్ఞోపవీతము దాల్చినవాడు అయిన రుద్రునికి నమస్కారము. దశవిధ పుష్టులకు పాలకుడైన రుద్రునికి నమస్కారము.

**21. నమో భవస్య హేత్యై జగతాంపతయే నమః**

సంసారబంధాలు త్రెంచి వేసే రుద్రునకు నమస్కారము. సర్వలోక పాలకునికి నమస్కారము.

**22. నమో రుద్రాయాఽఽతతావినే క్షేత్రాణాం పతయే నమః**

ఎక్కుపెట్టిన ధనుస్సుచే శత్రువులను సంహరించి భక్తులను కాపాడే రుద్రునికి నమస్కారము. వీరి మడులు పాలించు రుద్రునికి నమస్కారము.

**23. నమ స్సూతాయాఽహన్త్యాయవనానాం పతయే నమః**

జగత్తనే రథానికి సారధి వంటివాడు, శత్రువులకు అలవిగానివాడయిన రుద్రునికి నమస్కారము. వనములకు అధిపతి

అయిన రుద్రునికి నమస్కారము.

**24. నమో రోహితాయస్థపతయే వృక్షాణాం పతయే నమః**

ఎర్రని వర్ణముగల ప్రభువుకు నమస్కారము. వృక్షముల పాలించు రుద్రునికి నమస్కారము.

**25. నమో మన్త్రిణే వాణిజాయ కక్షాణాంపతయే నమః**

రాజసభలో మంత్రిరూపంలో ఉన్నవాడు, వర్తకులకు దొర అయిన రుద్రునికి నమస్కారము. వనంలోని గుల్మములు మొ॥ వాటికి నాథుడయిన రుద్రునికి నమస్కారము.

**26. నమో భువన్తయె వారివస్కృతా యౌషధీనాం పతయే నమః**

భూమిని పోషించేవాడు, ధనాన్ని కల్పించేవాడు అయిన రుద్రునికి నమస్కారము. ఓషధులకు ప్రభువైన రుద్రునికి నమస్కారము.

**27. నమ ఉచ్చైర్ఘోషాయా క్రన్దయతేపథీనాం పతయే నమః**

యుద్ధ సమయంలో గొప్ప ధ్వని చేసి శత్రువులను పీడించే రుద్రునికి నమస్కారము. పదాతిదళాల ప్రభువుకు నమస్కారము.

**28. నమఃకృత్స్నవీతా యధావతే సత్వానాంపతయే నమః**

సైన్యాన్ని పర్యవేక్షించేవాడు, శత్రుసైన్యాలను తరిమికొట్టేవాడు, శరణాగతుల రక్షించేవాడు అయిన రుద్రునికి నమస్కారము.

## తృతీయానువాకం

ఇందులో 17 మంత్రాలున్నాయి.

**29. నమస్సహసనాయ నివ్యాధిన ఆవ్యాధినీనాం పతయే**

నమః

శత్రువులను జయించేవాడు, అధికంగా కొట్టేవాడు అయిన రుద్రునికి నమస్కారము. అన్ని ప్రదేశములందు వ్యాపించి శత్రువులను ఓడించి, వీరులను పాలించు రుద్రునకు నమస్కారము.

**30. నమః కకుభాయ నిషఙ్గిణేస్తేనానాం పతయే నమః**

దేవతలందరిలోను ప్రధానమైనవాడు, ఖడ్గధారి అయిన రుద్రునకు నమస్కారము. దొంగలకు ప్రభువైన వానియందు కూడా అంతర్యామి అయిన రుద్రునకు నమస్కారము.

**31. నమో నిషఙ్గిణ ఇషుధిమతే తస్కరాణాంపతయే నమః**

ధనస్సులో బాణం సంధించటానికి సిద్ధంగా ఉన్నవాడు, అమ్ములపొది మూపున దాల్చినవాడు అయిన రుద్రునికి నమస్కారము. బాహాటంగా చోరీలు చేసే దారి దోపిడీదారులను పాలించే రుద్రునకు నమస్కారము.

**32. నమో వఞ్చ తేపరి వఞ్చతేస్తాయూ నాంపతయే నమః**

ప్రభువు దగ్గరే ఉంటూ, అతనికోసం లావాదేవీలు నడుపుతూ, వీలైనప్పుడు సొమ్ము హరించే వంచకుని రూపంలో ఉన్న రుద్రునికి నమస్కారము. యజమాని ఇంట్లోనే ఉంటూ, అతనికి తెలియకుండా సొమ్ము అపహరించే ఇంటిదొంగలకు పాలకుడైన రుద్రునకు నమస్కారము.

**33. నమో నిచేర వేపరిచరా యారణ్యానాం పతయే నమః**

యజమాని ఇంట్లో నమ్మకంగా తిరుగుతూ దొంగతనం చెయ్యటానికి అవకాశం కోసం ఎదురు చూసేవాడు, అంగడి వీధిలో

దొంగతనం చెయ్యటానికి ఎదురు చూస్తున్నవాడి రూపంగల రుద్రునకు నమస్కారము. దారి దోపిడీలు చేసే అరణ్యపు దొంగలకు ప్రభువైన రుద్రునకు నమస్కారము.

**34. నమస్సృ కావిభ్యోజిఘాగ్ం సద్భ్యోముష్ణతాం పతయే నమః**

పదునైన ఆయుధాలు ఆత్మరక్షకు వాడేవారు, వాటితో ఇతరులను చంపటానికి చూసేవారి రూపంలో గల రుద్రునికి నమస్కారము. వ్యవసాయదారులై భూస్వాముల ధాన్యము హరించే దొంగల నాయకుని రూపంలో ఉన్న రుద్రునికి నమస్కారము.

**35. నమోసిమద్భ్యోనక్తంచరద్భ్యః ప్రకృన్తానాం పతయే నమః**

కత్తులు పట్టుకుని రాత్రులందు దోపిడీలు చేసే దొంగల రూపంలో ఉన్న రుద్రునికి నమస్కారము. మానవులను చంపి వారి ధనాన్ని అపహరించే దొంగల నాయకుని రూపంలో ఉన్న రుద్రునికి నమస్కారము.

**36. నమ ఉష్ణీషిణేగిరిచరాయ కులుంచానాంపతయే నమః**

గ్రామస్థులతో కలిసిపోయి, వారి మధ్యనే తిరుగుతూ దొంగతనాలు చేసే వారి రూపం గల రుద్రునికి నమస్కారము. కొండలవెంబడి తిరుగుతూ, కట్టెలు కొట్టుకోవటానికి వచ్చే వారి బట్టలు అపహరించే దొంగరూపంలో ఉన్న రుద్రునికి నమస్కారము.

**37. నమ ఇషుమద్భ్యో ధన్వావిభ్యశ్చవో నమః**

ఓ రుద్రులారా ! భక్తులు కాని వారిని భయపెట్టటం కోసం బాణాలు పట్టుకున్న మీకు నమస్కారము. చేతితో ధనుస్సును ధరించిన

మీకు నమస్కారము.

**38. నమ ఆతన్వానేభ్యః ప్రతిదదానే భ్యశ్చవో నమః**

ధనస్సును ఎక్కుపెట్టు రుద్రులకు నమస్కారము. ధనుస్సులో బాణాలు సంధించే రుద్రులకు నమస్కారము.

**39. నమ ఆయుచ్ఛద్భ్యో విసృజద్భ్యశ్చవో నమః**

బాణం సంధించి అల్లెత్రాడు లాగుతున్న రుద్రులకు నమస్కారము. బాణాలను శత్రువుల మీద ప్రయోగిస్తున్న రుద్రులకు నమస్కారము.

**40. నమోౖఽస్యద్భ్యో విధ్యద్భ్యశ్చవో నమః**

బాణం లక్ష్యం వైపుకు వెళ్ళేట్లు చేస్తున్న రుద్రులకు నమస్కారము. బాణం లక్ష్యాన్ని భేదించేట్లు చేస్తున్న రుద్రులకు నమస్కారము.

**41. నమ ఆసీనేభ్యశ్శయా నేభ్యశ్చవో నమః**

కూర్చుని విశ్రాంతి తీసుకుంటున్న మీకు నమస్కారము, పడుకున్న మీకు నమస్కారము.

**42. నమస్స్వపద్భ్యో జాగ్రద్భ్యశ్చవో నమః**

నిద్రపోతున్న మీకు నమస్కారము. మేలుకున్న మీకు నమస్కారము.

**43. నమస్తిష్ఠద్భ్యో ధావద్భ్య శ్చవో నమః**

నుంచుని ఉన్న మీకు నమస్కారము, పరుగెడుతున్న మీకు నమస్కారము.

**44. నమస్సభాభ్య స్సభాపతిభ్యశ్చవో నమః**

సమూహములుగా చేరిన మీకు నమస్కారము. ఆ సభలకు ప్రభువులైన మీకు నమస్కారము.

**45. నమో అశ్వేభ్యోశ్వపతిభ్యశ్చవో నమః**

రుద్రులారా ! దరిద్రరూపులై మరునాటికి ఏమీ మిగుల్చుకోని మీకు నమస్కారము. శ్రీమంతులైన మీకు నమస్కారము.

## చతుర్ధానువాకము

ఇందులో 17 మంత్రాలున్నాయి.

**46. నమ ఆవ్యాధినీభ్యో వివిధ్యన్తీభ్యశ్చవో నమః**

అంతటా వ్యాపించి శత్రువులను పీడించు రూపంగల రుద్రులకు నమస్కారము.

**47. నమ ఉగణాభ్యస్తృగ్ం హతీభ్యశ్చవో నమః**

సప్తమాతృకాది శక్తుల రూపంగల మీకు నమస్కారము. హింసించటంలో సమర్థులైన దుర్గ మొదలైన ఉగ్రదేవతల రూపంగల రుద్రులకు నమస్కారము.

**48. నమోగృత్సే భ్యోగృత్సపతిభ్యశ్చవో నమః**

విషయాసక్తి రూపం గల మీకు నమస్కారము. విషయాసక్తులను పాలించువారి రూపంగల మీకు నమస్కారము.

**49. నమోవ్రాతేభ్యో వ్రాతపతిభ్యశ్చవో నమః**

నానావిధ జాతుల సమూహరూపంగల రుద్రులకు నమస్కారము.

ఆ సమూహములకు పాలకులగు వారిరూపం గల మీకు నమస్కారము.

**50. నమో గణేభ్యో గణపతిభ్యశ్చవో నమః**

ప్రమథగణాల రూపమయిన మీకు నమస్కారము. వారి ప్రభువుల రూప మయిన మీకు నమస్కారము.

**51. నమో విరూపేభ్యో విశ్వరూపేభ్యశ్చవో నమః**

వికృతరూపం గలవారి రూపంగల మీకు నమస్కారము. విశ్వరూపాన్ని (అన్ని జీవుల రూపాన్ని) ధరించిన మీకు నమస్కారము.

**52. నమో మహద్భ్యః క్షుల్లకేభ్యశ్చవో నమః**

అష్టసిద్ధులను ఎనిమిది ఐశ్వర్యములు గలవారి రూపులైన మీకు నమస్కారము. అని లేని అల్పుల రూపులయిన మీకు నమస్కారము.

**53. నమో రథిభ్యోరథేభ్యశ్చవో నమః**

రథికుల రూపులైన మీకు నమస్కారము. అలా కాని వారి రూపం గల మీకు నమస్కారము.

**54. నమోరథేభ్యోః రథపతిభ్యశ్చవో నమః**

రథస్వరూపులైన మీకు నమస్కారము. ఆ రథానికి ప్రభువులైన మీకు నమస్కారము.

**55. నమస్సేనాభ్యః స్సేనానిభ్యశ్చవో నమః**

సేనల రూపంలో ఉన్న మీకు నమస్కారము. సేనాపతుల రూపంలో ఉన్న మీకు నమస్కారము.

**56. నమః క్షత్తృభ్యస్సంగ్రహీతృభ్యశ్చవో నమః**

గుర్రాలను తోలే వారి రూపంగల మీకు నమస్కారము. రథం తోలేవారి రూపం గల మీకు నమస్కారము.

**57. నమస్తక్షభ్యో రథకారేభ్యశ్చవో నమః**

వడ్రంగుల రూపంగల మీకు నమస్కారము. రథం తయారుచేసే వారి రూపంగల మీకు నమస్కారము.

**58. నమః కులాలేభ్యః కర్మారేభ్యశ్చవో నమః**

కుమ్మరివారి రూపంగల మీకు నమస్కారము. కమ్మరి వారి రూపం గల మీకు నమస్కారము.

**59. నమః పుంజిష్టేభ్యో నిషాధేభ్యశ్చవో నమః**

పక్షులను వేటాడేవారి రూపం గల మీకు నమస్కారము. చేపలన పట్టుకునే వారి రూపంగల మీకు నమస్కారము.

**60. నమ ఇషుకృద్భ్యోధన్వకృద్భ్యశ్చవో నమః**

బాణాలు తయారుచేసేవారి రూపం గల మీకు నమస్కారము. ధనుస్సులు తయారుచేసేవారి రూపంగల మీకు నమస్కారము.

**61. నమో మృగయుభ్య శ్శ్వనిభ్యశ్చవో నమః**

వేటాడే వారి రూపం గల మీకు నమస్కారము. కుక్కల మెడలకు త్రాడు తగిలించి పట్టుకునే వారి రూపంగల మీకు నమస్కారము.

**62. నమశ్శ్వభ్య శ్శ్వపతిభ్యశ్చవో నమః**

కుక్కల రూపంగల మీకు నమస్కారము. వాటిని పాలించే

క్షేత్రపాలకుల రూపంగల మీకు నమస్కారము.

## పంచమానువాకము

ఇందులో 15 మంత్రాలున్నాయి.

**63. నమో భవాయ చ రుద్రాయ చ**

సర్వప్రాణులకు కారణమైన వానికి నమస్కారము. రోదనమునకు కారణమైన దుఃఖాన్ని హరించే వాడికి నమస్కారము.

**64. నమశ్శర్వాయచ పశుపతయేచ**

అజ్ఞానంతో పశువులవలె ప్రవర్తించే వారిని పాలించువానికి నమస్కారము.

**65. నమో నీలగ్రీవాయ చ శితికంఠాయచ**

కాలకూటము ధరించటంచేత నల్లనయిన కంఠం గలవాడికి నమస్కారము. మిగిలిన దేహమంతా తెలుపు రంగులోఉన్న రుద్రునికి నమస్కారము.

**66. నమః కపర్ది నేచవ్యుప్త కేశాయచ**

జటాజూటము ధరించి పాశుపతాది వేషంలో ఉన్నవానికి నమస్కారము. ముండిత శిరస్కుడై సన్యాసి వేషంలో ఉన్న వాడికి నమస్కారము.

**67. నమస్సహస్రాక్షాయచ శతధన్వనేచ**

ఇంద్రుని రూపంలో వేయి కనులు గల రుద్రునకు నమస్కారము నూరు ధనుస్సులు ఒకేసారి ధరించగల రుద్రునికి నమస్కారము.

**68. నమోగిరి శాయచ శిపివిష్టాయచ**

భక్తులను అనుగ్రహించటానికి కైలాసంలో ఉమామహేశ్వరుల రూపంలో ఉన్న వాడికి, నమస్కారము లోకాలను రక్షించటం కోసం విష్ణురూపుడైన వాడికి నమస్కారము.

**69. నమో మీఢుష్టమాయ చేషుమతేచ**

ప్రాణులను పోషించటానికి మేఘరూపంలో వర్షించేవాడికి నమస్కారము, సత్పురుషులను బాధించే వారిని శిక్షించటానికి బాణాలు ధరించిన వానికి నమస్కారము.

**70. నమో హ్రస్వాయచ వామనాయచ**

పొట్టి శరీరము, పొట్టి అవయవాలు గలవాడికి నమస్కారము.

**71. నమో బృహతేచ వర్షీయసేచ**

పెద్ద ఆకారంగల వాడికి, నమస్కారము. గొప్ప గుణాలు గలవాడికి నమస్కారము.

**72. నమో వృద్ధాయచ సంవృధ్వనేచ**

వయసుమళ్ళినవానికి, నమస్కారము. వేదంలో స్తుతించబడిన వానికి నమస్కారము.

**73. నమో అగ్రియాయచ ప్రథమాయచ**

సృష్టికి ముందే ఉన్న వాడికి. నమస్కారము. సభలో ఉత్తముడైన వాడికి నమస్కారము.

**74. నమ ఆశవే చాజిరాయచ**

సమస్త జగత్తును వ్యాపించినవాడికి, నమస్కారము. గమనములో సమర్ధుడైన వాడికి నమస్కారము.

**75. నమ శ్శీఘ్రియాయచ శీభ్యాయ చ**

శీఘ్రముగా నడిచే వాడికి, నమస్కారము. జలప్రవాహమందున్న వాడికి నమస్కారము.

**76. నమఊర్మ్యాయ చావ స్వన్యాయచ**

తరంగముల యందున్న రుద్రునకు నమస్కారము. నిశ్చలమైన నీటి యందున్న రుద్రునకు నమస్కారము.

**77. నమస్స్రోతస్యాయచ ద్వీప్యాయచ**

జలప్రవాహమందున్న వానికి నమస్కారము. జలప్రవాహం మధ్యన భూమియందున్న రుద్రునికి నమస్కారము.

## షష్ఠానువాకము

ఇందులో 15 మంత్రాలున్నాయి.

**78. నమో జ్యేష్ఠాయ కనిష్ఠాయచ**

విద్య ఐశ్వర్యము మొ॥ వానిచే అధికుడయిన వాని రూపం గల రుద్రునికి నమస్కారము. అవి తక్కువైన అల్పుడయిన వాని రూపంగల రుద్రునికి నమస్కారము.

**79. నమః పూర్వజాయ చాపరజాయచ**

సృష్టి ఆరంభంలో హిరణ్యగర్భుని రూపంలో జగత్తులు సృష్టించిన వానికి నమస్కారము. ప్రళయ కాలంలో కాలాగ్నిరూపంలో ప్రళయంకావించిన వానికి నమస్కారము.

**80. నమో మధ్యమాయ చాపగల్భాయచ**

దేవమానవ తిర్యగాది రూపంలో ఆవిర్భవించిన వానికి నమస్కారము ఇంద్రియ జ్ఞానము లేని పసిపిల్లవాడి రూపంగల రుద్రునకు నమస్కారము.

**81. నమో జఘన్యాయచ బుధ్నియాయచ**

ఆవులు, దూడలుగా ఆవిర్భవించిన వానికి నమస్కారము చెట్లు కొమ్మలు రెమ్మల రూపంలో ఉన్న వానికి నమస్కారము.

**82. నమస్సోభ్యాయచ ప్రతిసర్యాయచ**

పుణ్యపాపాలతో కూడిన మానవలోకంలో ఉన్న వానికి నమస్కారము. వివాహాది సంస్కారములచే సంస్కరింపబడు పురుషునకు నమస్కారము.

**83. నమో యమ్యాయచ క్షేమ్యాయచ**

పాపం చేసిన వారిని శిక్షించే యముని రూపంలో ఉన్న వానికి నమస్కారము. మోక్షము పొందే వాని రూపంలో ఉన్న వానికి నమస్కారము.

**84. నమ ఊర్వర్యాయచ ఖల్యాయచ**

భూమియందు ధాన్యరూపంలో పుట్టిన వానికి నమస్కారము. ధాన్యం నూరుతూ కళ్ళంలో మేధి మొ॥ వాటి రూపంలో ఉన్న వానికి నమస్కారము.

**85. నమ శ్లోక్యాయ చావసాన్యాయచ**

వైదిక మంత్రాలచే చెప్పబడటం చేత వాటి యందున్న వానికి,

వేదాంత మందున్న వానికి నమస్కారము.

**86. నమో వన్యాయచ కక్ష్యాయచ**

అడవిలో చెట్లరూపంలో ఉన్న వానికి, పొదలలో తీగల రూపంలో ఉన్న వానికి నమస్కారము.

**87. నమశ్రవాయచ ప్రతిశ్రవాయచ**

ధ్వని రూపంలో ఉన్నవానికి, ప్రతిధ్వని రూపంలో ఉన్న వానికి నమస్కారము.

**88. నమ ఆశుషేణాయ చశురథాయచ**

భక్తులను రక్షించటానికి వేగంగా నడిచే సేనగల వాడికి, వేగంగా వెళ్ళే రథం గలవాడికి నమస్కారము.

**89. నమశ్శూరాయ చావభిన్దతేచ**

యుద్ధములో ధైర్యము గలవాడికి, శత్రువుల వధించువాడికి నమస్కారము.

**90. నమో వర్మిణేచ వరూధినేచ**

కవచము గలవాడికి, మంచి విల్లు గలవాడికి నమస్కారము.

**91. నమో బిల్మినేచ కవచినేచ**

శిరస్త్రాణము ధరించిన వానికి, కవచము దాల్చిన వానికి నమస్కారము.

**92. నమశ్శ్రుతాయచ శ్రుతసేనాయచ**

వేదముల వల్ల ప్రసిద్ధమైన వానికి, వేదముల యందు ప్రసిద్ధమైన

సేనగల వాడికి నమస్కారము.

## సప్తమానువాకము

ఇందులో 16 మంత్రాలున్నాయి.

**93. నమో దున్దుభ్యాయ చాహనన్యాయ చ**

భేరియందు శబ్దరూపమైన వానికి నమస్కారము దాన్నివాయించే దండమందు తాడన రూపంలో ఉన్న వాడికి నమస్కారము.

**94. నమో ధృష్ణవేచ ప్రమృశాయ చ**

యుద్ధంలో వెన్నుచూపని వానికి నమస్కారము. శత్రుసైన్యముల వృత్తాంతము తెలుసుకునే రుద్రునకు నమస్కారము.

**95. నమో దూతాయచ ప్రహితాయచ**

యజమానికి ఇతరుల వృత్తాంతము తెలియచేసే వాని రూపంగల వానికి నమస్కారము. యజమానిచే పంపబడని వానికి నమస్కారము.

**96. నమో నింషఙ్గిణే చేషుధిమతేచ**

ఆశ్రయించిన వారిని రక్షించటానికి ఆయుధాలు ధరించి ఉండే రుద్రునకు నమస్కారము.

**97. నమ స్తీక్ష్ణేషవేచాయుధినేచ**

వాడి అయిన బాణాలు, అసంఖ్యాకమైన ఆయుధాలు గల వాడికి నమస్కారము.

**98. నమస్స్వాయుధాయచ సుధన్వనేచ**

త్రిశూలమనే ఆయుధము, పినాకమనే ధనుస్సు గల వానికి నమస్కారము.

**99. నమస్స్రుత్యాయచ పథ్యాయచ**

భక్తులను రక్షించటానికి కాలిబాటలోను, రాజమార్గంలోను సంచరించే రుద్రునికి నమస్కారము.

**100.నమః కాట్యాయచ నీప్యాయచ**

కాలువనందు, సెలయేటినందు జలరూపంలో ఉండే రుద్రునికి నమస్కారము.

**101.నమసూద్యాయచ సరస్యాయచ**

బురద ప్రదేశములందు, కొలనులందు జలరూపమున ఉన్న రుద్రునికి నమస్కారము.

**102.నమో నాద్యాయచ వైశన్తాయయచ**

నదులయందు, చిన్న చిన్న సరస్సులయందు జలరూపమున ఉన్న వానికి నమస్కారము.

**103.నమః కూప్యాయచావట్యాయచ**

నూతియందు జలరూపంలో ఉన్నవానికి, పల్లములయందు జలరూపంలో ఉన్న వాడికి నమస్కారము.

**104.నమో వర్ష్యాయ చావర్షాయచ**

వర్షముల వల్ల వచ్చే నీటియందున్న వాడికి, వర్షమువల్ల రాని సముద్రపు నీటియందున్న వాడికి నమస్కారము.

**105.నమో మేఘ్యాయచ విద్యుత్యాయచ**

మేఘముల యందున్న వానికి, మెరుపుల యందున్న వానికి నమస్కారము.

**106.నమ ఈద్ధ్రియాయచాతప్యాయచ**

శరత్కాలంలో నిర్మలమైన మేఘమందున్న వాడికి నమస్కారము. ఎండలో వర్షం వస్తే, ఆ వర్షంలో ఉన్నవాడికి నమస్కారము.

**107.నమో వాత్యాయచ రేష్మియాయచ**

గాలితో కూడిన వానియందున్న వానికి, ప్రళయ కాలంలో వచ్చే రాళ్ళ వర్షం రూపంలో ఉన్నవాడికి నమస్కారము.

**108.నమో వాస్తవ్యాయచ వాస్తుపాయచ**

గృహాన్ని నిర్మించే చోట ఉన్న వానికి, గృహాన్ని నిర్మించే చోటును పాలించే వానికి నమస్కారము.

## అష్టవ అనువాకము
## యజస్సు

ఇందులో 17 మంత్రాలున్నాయి.

**109.నమస్సోమాయచ రుద్రాయచ**

పార్వతితో కూడిన వానికి, రోదనకు కారణమైన దుఃఖాన్ని పోగొట్టే వాడికి నమస్కారము.

**110.నమస్తామ్రాయ చారుణాయచ**

ఆదిత్య రూపంలో ఉదయకాల మందు మిక్కిలి ఎర్రగా ఉండి, తరువాత ఎరుపు రంగులో ఉండు వానికి నమస్కారము.

**111.నమశ్శఙ్గాయచ పశుపతయేచ**

సుఖాన్ని కలిగించే వానికి, పశువులను రక్షించే వానికి నమస్కారము.

**112.నమ ఉగ్రాయచ భీమాయచ**

శత్రువులను చంపటానికి కోపం గలవానికి, తనను చూడగానే శత్రువులకు భయం కలిగించే వాడికి నమస్కారము.

**113.నమో అగ్రేవధాయచ దూరేవధాయచ**

ఎదురుగా ఉన్న శత్రువును తేలికగా చంపే వానికి, అలాగే దూరంగా ఉన్న శత్రువును కూడా చంపేవానికి నమస్కారము.

**114.నమో హన్త్రేచహనియనేచ**

లోకంలో ఎప్పుడు, ఎవరు, ఎక్కడ శత్రువులను చంపితే, అప్పుడు అక్కడ అలా చంపే వారిలో ఉండే వానికి నమస్కారము.

**115.నమో వృక్షేభ్యో హరికేశేభ్యః**

ఆకుపచ్చని రంగు గల కల్పతరువులు మొదలైన వృక్షముల రూపంలో ఉండు వానికి నమస్కారము.

**116.నమస్తారాయ**

ప్రణవము చేత ప్రతిపాదింపబడే రుద్రునకు నమస్కారము.

**117.నమశ్శమ్భవేచ మయోభవేచ**

విషయసుఖాలు ఇచ్చే వానికి నమస్కారము. మోక్షమిచ్చే వానికి నమస్కారము.

**118.నమ శ్శఙ్కరాయచ మయస్కరాయచ**

తండ్రి మొ॥ వారి రూపంలో లౌకిక సుఖము, ఆచార్యుని రూపంలో మోక్షము కలిగించు వానికి నమస్కారము.

**119.నమశ్శివాయచ శివతరాయచ**

దోషత్వము లేక కళ్యాణ రూపుడైన వానికి, తన భక్తులకు కూడా దోషత్వము లేకుండా చేయు పరమకళ్యాణ రూపుడైన రుద్రునకు నమస్కారము.

**120.**నమస్తీర్థ్యాయచ కుల్యాయచ

ఎల్లప్పుడు పుణ్యతీర్థములందుండే వానికి, గంగానదీ తీరంలో లింగరూపంలో ఉండే వానికి నమస్కారము.

**121.**నమః పార్యాయ చావార్యాయచ

సంసార సాగరానికి ఆవలిగట్టున ముముక్షువులచే ధ్యానింపబడే రుద్రునికి, సంసారంలో ఫలాలను ఇస్తున్న రుద్రునికి నమస్కారము.

**122.**నమః ప్రతరణాయ చోత్తరణాయచ

మంత్ర తంత్రాదులచే పాపము పోగొట్టు వానికి, తత్వాన్ని బోధించి సంసారము నుండి విముక్తునిగా చేయువానికి నమస్కారము.

**123.**నమ ఆతార్యాయచా లాద్యాయచ

జ్ఞానమున్నప్పటికీ కామ్యకర్మలు చేయటంచేత పునర్జన్మ నెత్తిన జీవుని రూపంలో గల రుద్రునకు జీవులను ఆ కర్మలకు ప్రేరేపించు రుద్రునకు నమస్కారము.

**124.**నమ శ్శష్ప్యాయచ ఫేన్యాయచ

గంగానదీ తీరంలో పుట్టిన దర్భలచే పూజింపబడు రుద్రునకు, ఏటినురగచే పూజింపబడు రుద్రునకు నమస్కారము.

**125.**నమ స్సికత్యాయచ ప్రవాహ్యాయచ

ఇసుక నేలలు స్వరూపముగా గల రుద్రునకు నమస్కారము.

## నవమానువాకము

ఇందులో 19 మంత్రాలున్నాయి.

**126.నమ ఇరిణ్యాయచ ప్రపథ్యాయచ**

చవిటినేలలయందున్న వానికి, సారవంతమైన నేలలయందున్న వానికి నమస్కారము.

**127.నమః కిగ్ంం శిలాయచ క్షయణాయచ**

రాతిప్రదేశమందున్న వానికి, నివాస యోగ్యమైన ప్రదేశమందున్న వానికి నమస్కారము.

**128.నమః కపర్ది నేచ పులస్తయేచ**

జటాజూటము ధరించిన వానికి, భక్తుల ఎదుట ఉండేవానికి నమస్కారము.

**129.నమో గోష్ఠ్యాయచ గృహ్యాయచ**

ఆవులు ఉండేచోట ఉన్న వానికి, గృహములందున్న వానికి నమస్కారము.

**130.నమ స్తల్ప్యాయచ గేహ్యాయచ**

తల్పమునందున్న వానికి, మేడయందున్న వానికి నమస్కారము.

**131.నమః కాట్యాయచ గహ్వరేష్ఠా యచ**

మళ్ళ తీగెలతో ప్రవేశించటానికి వీలుకాని అరణ్యమందున్న వానికి, దుర్గమమైన పర్వత గుహలయందున్న వానికి నమస్కారము.

**132.నమో హ్రుదయ్యాయచ నివేష్ప్యాయచ**

లోతైన మడుగులయందున్న వానికి, చల్లని మంచు

నీటియందున్న వానికి నమస్కారము.

**133.నమః పాగ్ం సవ్యాయ చ రజస్యాయచ**

కంటికి కనిపించని దుమ్మునందున్న వానికి, స్థూలమైన దుమ్మునందున్న వానికి నమస్కారము.

**134.నమ శ్శుష్క్యాయ హరిత్యాయచ**

ఎండిన కట్టెలయందున్న వానికి, పచ్చికట్టెల యందున్న వానికి నమస్కారము.

**135.నమో లోప్యాయచోలప్యాయచ**

గడ్డికూడా మొలవని ప్రదేశములందున్న వానికి, తృణాదుల యందున్న వానికి నమస్కారము.

**136.నమ ఊర్వ్యాయచ సూర్మ్యాయచ**

భూమియందున్న వానికి, మంచి మంచి తరంగాలు గల నదులయందున్న వానికి నమస్కారము.

**137.నమః పర్ణ్యాయచ పర్ణ శద్యాయచ**

పచ్చిఆకుల యందున్న వానికి, ఎండుటాకుల యందున్న వానికి నమస్కారము.

**138.నమోఽపగుర మాణాయచాఽభిఘ్న తేచ**

దుష్టులు దుర్మార్గులను ఎదిరించటానికి ఆయుధాలు ధరిస్తున్న వానికి, వారితో యుద్ధం చేస్తున్న వానికి నమస్కారము.

**139.నమ ఆఖ్ఖిద తేచ ప్రఖ్ఖిదతేచ**

మానవులు చేసిన కర్మననుసరించి కొందరిని ఎక్కువగాను,

మరికొందరిని తక్కువగాను బాధించే వానికి నమస్కారము.

**140.నమోవః కిరికేభ్యో దేవానాగ్ం హృదయేభ్యః**

దేవతలకు ప్రీతి పాత్రమైన భక్తులకు ఎక్కువ ధనాన్నిచ్చే రుద్రావతారులైన మీకు నమస్కారము.

**141.నమో విక్షీణ కేభ్యో దేవానాగ్ం హృదయేభ్యః**

దేవతలకు ప్రియులు, నాశనము లేని వారు అయిన మీకు నమస్కారము.

**142.నమో విచిన్వత్కేభ్యో దేవానాగ్ం హృదయేభ్యః**

దేవతలకు ప్రీతిపాత్రులు, భక్తులు కోరిన దానిని సంపాదించే వారు అయిన మీకు నమస్కారము.

**143.నమ ఆనిర్ హతేభ్యో దేవానాగ్ం హృదయేభ్యః**

దేవతలకు ప్రీతిపాత్రమైన వారు, కొంచెము కూడా లేకుండా పాపాన్ని పూర్తిగా హరించే వారు అయిన మీకు నమస్కారము.

**144.నమ ఆమీవత్కేభ్యోః దేవానాగ్ం హృదయేభ్యః**

దేవతలకు ప్రీతిపాత్రమైన వారు, స్థూలమైన ప్రపంచం రూపంలో పరిణమించిన వారు అయిన మీకు నమస్కారము.

## దశమానువాకము

ఇందులో 12 మంత్రాలున్నాయి.

**145.ద్రాపే అన్ధసస్ప తేదరిద్ర న్నీలలోహిత ఏషాం పురుషాణా**

**మేషాంపశూనాం మాభేర్మాఽఽమో ఏషాంకించనామమత్**

పాపం చేసిన వారిని నరకంలో పడవేసేవాడు, భక్తుల అన్నాన్ని రక్షించేవాడు, కేవలుడు (రాగద్వేషాలు లేనివాడు) కాలకూటాన్ని మ్రింగటంచేత కంఠము మాత్రము నీలివర్ణమై, మిగిలిన దేహము తెలుపు రంగులో ఉన్నవాడు అయిన ఓ రుద్రా! నీ భక్తులైన మా కుమారులు, వారి సంతతి వారికీ, మా ఆవులు, పశువులకు ఏ మాత్రము భయం కలిగించవద్దు. వీరెవరికీ ఏ మాత్రము హాని కలగకుండా, రోగాలు రాకుండా అనుగ్రహించవలసినది.

**146. యాతేరుద్రశివాతనూ శ్శివావిశ్వాహ భేషజీ**

**శివారుద్రస్య భేషజీ తయానో మృడజీవసే**

ఓ రుద్రా ! అన్ని వేళలయందు భక్తులయొక్క రోగాలు, దరిద్రము పోగొట్టి, జ్ఞానాన్ని ప్రసాదించి, సంసార దుఃఖాన్ని (భవబంధాలు) పోగొట్టేది, మంగళకరము, శాంతము అయిన నీ రూపంతో మేము ఏ రకమైన బాధలు లేకుండా జీవించేట్లు చేసి, జ్ఞానాన్ని ప్రసాదించి, భవబంధాలు తొలగించి మాకు మోక్షాన్ని ప్రసాదించవలసినది.

**147. ఇమాగ్ం రుద్రాయతవసే కపర్ది నేక్షయద్వీరాయ**

**ప్రభరామ హేమతిమ్ । యథానశ్శమసద్ద్విపదే**

**చతుష్పదే విశ్వం పుష్టంగ్రామే అస్మిన్నా అనాతురమ్**

మేము, మా పిల్లలు మొదలైన మనుష్యవర్గము, మా పశువులు మొదలైన పశువర్గము అంతా సుఖంగా ఉండటానికి, ఈ గ్రామంలో ఉండే ప్రాణులన్నీ బలంగా, ఆరోగ్యంగా ఉండేట్లుగా మా కోరికలు తీర్చటానికి సమర్థుడయిన వాడు, జటాజూటం ధరించిన వాడు,

శత్రునాశనము చేసేవాడు అయిన రుద్రుని ధ్యానము, అర్చన మొదలైన వాటితో ఆరాధిస్తాము.

**148.మృడానోరుద్రోతనో మయస్కృదిక్షయద్వీరాయ నమసా విధేమతే। యచ్ఛంచయోశ్చమను రాయజేపితా తదశ్యామ తవరుద్రప్రణీతౌ ॥**

ఓ రుద్రా ! మాకు ఈ లోకంలోను, పరలోకంలోను సుఖాన్ని ఇవ్వవలసింది. దాని కోసం పాపాలు పోగొట్టే నీకు నమస్కరించి ఆరాధిస్తాము. ఓ రుద్రా ! ప్రజాపతి మా ముఖాన ఏం వ్రాశాడో వాటిని మేము పూర్తిగా అనుభవించాలి అంటే నీ సంపూర్ణానుగ్రహం మాకు కావాలి.

**149.మానో మహాన్త ముత మానో అర్భకం మాన ఉక్షంత ముతమాన ఉక్షితమ్ । మానోవధీః పితరం మోత మాతరం ప్రియమాన స్తనువో రుద్రరీరిషః**

ఓ రుద్రా ! మా తండ్రులు, తాతలు, వయసు మళ్ళిన వారిని బాలురు, యవ్వనవంతులు, గర్భంలో ఉన్న వారిని అందరిని ఏ రోగాలు లేకుండా రక్షించవలసినది.

**150.మానస్తోకేతనయె మాన ఆయుషిమానోగోషుమానో ఆశ్వేషురీరిషః । వీరా న్మానోరుద్రభామితో వధీర్ హ విష్మన్తోనమసా విధేమతే**

ఓ రుద్రుడా ! ఒకవేళ మేము ఏదైనా అపచారం చేసినప్పటికీ నువ్వు కోపం తెచ్చుకోవద్దు. మా తల్లితండ్రులు, పిల్లలు, పశువులు,

సేవకులు ఎవరినీ ఏ రకంగానూ హింసించవద్దు. నీకు నమస్కారం చేసి, హవిస్సు సమర్పించి ప్రార్థిస్తున్నాము.

**151. ఆరాత్తేగోఘ్న ఉతపూరుషఘ్నే క్షయద్వీరాయ సుమ్నమస్మేతేఅస్తు ॥ రక్షాచనో అధిచ దేవబ్రూ హ్యధా చనశ్శర్మ యచ్ఛద్విబర్హాః**

ఓ రుద్రా ! మా వారిని, పశువులను చంపే క్రూరమైన నీ రూపము దూరంగా వెళ్ళిపోవు గాక. అందరికీ సుఖాన్నిచ్చే నీ శాంతమైన రూపం మావద్ద ఉండును గాక. ఓ దేవా ! మేము గొప్ప వాళ్ళమని దేవతలందరికీ చెప్పవలసింది. రెండు లోకాలకు అధిపతివి నువ్వే కాబట్టి మాకు ఇహపరాలు రెండూ ఇవ్వవలసినది.

**152. స్తుహిశ్రుతంగర్తసదంయు వానంమగన్నభీమ ముపహత్నుముగ్రమ్ మృడా జరిత్రేరుద్ర స్తవానో అన్యంతే ఆస్మన్ని వపన్తుసేనాః**

ఓ వాక్కా ! నువ్వు హృత్పుండరీకమందున్న వాడు, నిత్యయవ్వనుడు, ఏనుగు మీదికి దూకే సింహంలాగా ప్రళయ కాలంలో భయంకరమైన రూపం గలవాడు, ప్రసిద్ధుడు అయిన రుద్రుని స్తుతించవలసినది. ఓ రుద్రా ! నా వాక్కుచే స్తుతించబడిన వాడవై నాకు సుఖాన్ని కలిగించవలసింది. నీ సేనలు నన్ను వదలి నా శత్రువును వధించు గాక.

**153. పరిణో రుద్రస్య హేతిర్వృణ క్తుపరిత్వేషస్యదుర్మతి రఘయోః । అవస్థిరా మఘ వద్భ్యస్తనుష్వ**

**మీఢ్వస్తోకాయ తనయాయ మృడయ**

రుద్రుని ఆయుధము నన్ను, మా వారిని బాధింపకుండును గాక. కోపగించిన అతని కోపం కూడా మమ్ము బాధింపకుండును గాక. ఓ రుద్రా ! శత్రువులను సంహరించే నీ ఉగ్రరూపాన్ని మాయందు ప్రదర్శించవద్దు.

**154.మీఢుష్టమశివతమ శివోనస్సుమనాభవ । పరమే వృక్ష ఆయుధం నిధాయ కృత్తిం వసాన ఆచర పినాకం బిభ్రదాగహి**

భక్తుల కోరికలు తీర్చేవాడా ! ఓ శాంతస్వరూపుడా! నువ్వు మా మీద కోపం లేకుండా శాంతంగా ఉండవలసింది. భయంకరమైన నీ ఆయుధాలను పులితోలులో చుట్టి, చెట్టుమీద పెట్టి మా దగ్గరకు రావలసింది. వచ్చేటప్పుడు బాణాలు లేకుండా, కేవలము అలంకారం కోసం ధనస్సును మాత్రమే తేవలసింది.

**155.వికిరిదవిలోహిత నమస్తే అస్తుభగవః యాస్తెసహస్రగ్ం హేతయోన్యమస్మన్నివపన్తుతాః**

భక్తులకు ఎక్కువగా ధనాన్నిచ్చేవాడు, తెల్లని వర్ణము గలవాడు అయిన ఓ రుద్రా! నీకు నమస్కారము. అసంఖ్యాకమైన నీ ఆయుధాలు మమ్ము గాక మా శత్రువుని బాధించు గాక.

**156.సహస్రాణి సహస్రధాబాహువో స్తవహేతయః తాసామీ శానోభగవః పరాచీనా ముఖాకృధి**

ఓ భగవంతుడా ! నీ చేతిలో ఉన్న పదునైన అసంఖ్యాకమైన ఆయుధాలు మా మీదికి రాకుండా చూడవలసినది.

## ఏకాదశానువాకము

ఇందులో 13 మంత్రాలున్నాయి.

**157.** సహస్రాణిసహస్రశోయేరుద్రా అధిభూమ్యామ్ ।

తేషాగ్‍ం సహస్రయోజనేఽవధన్వానితన్మసి

ఈ భూమిమీద ఎన్ని ప్రమథ గణాలున్నాయో, ఎంత మంది గణపతులున్నారో, వారందరి ధనుస్సులకు అల్లెత్రాడు తీసి మాకు వేయియోజనాల దూరాన ఉంచుతాము.

**158.** అసిన్మహత్యర్ష వెన్తరిక్షేభ వా అధి

తేషాగ్‍ం సహస్రయోజనేఽవధన్వాని తన్మసి

మనకు కనిపిస్తున్న ఈ సముద్రాలు, ఆకాశం అంతటా ఆవరించి ఉన్న రుద్రుల యొక్క ధనస్సులకు అల్లెత్రాడు తీసి మాకు వేయియోజనాల దూరాన ఉంచుతాము.

**159.** నీలగ్రీవాశ్శితికంఠాశ్శర్వాఅధః క్షమాచరాః

తేషాగ్‍ం సహస్రయోజనేఽవధన్వానితన్మసి

కాలకూటాన్ని మ్రింగటంవల్ల నల్లనైన కంఠము, తెల్లని దేహము గలవారు, పాతాళ లోకంలో విహరించే వారు అయిన రుద్రమూర్తుల ధనుస్సులకు అల్లెత్రాడు తీసి వాటిని మాకు వేయియోజనాల దూరాన ఉంచుతాము.

**160.** నీలగ్రీవాశ్శితికంఠాదివగ్‍ం రుద్రాఉపశ్రితాః

తేషాగ్‍ం సహస్రయోజనేఽవధన్వానితన్మసి

కంఠము మాత్రమే నల్లగా ఉండి మిగిలిన దేహమంతా తెల్లగా

ఉండి స్వర్గంలో విహరించే రుద్రమూర్తుల ధనుస్సులకు అల్లెత్రాడు తీసి వాటిని మాకు వేయి యోజనాల దూరాన ఉంచుతాము.

**161.యేవృక్షేషుససిఞ్జరా నీలగ్రీవా విలోహితాః**
**తేషాగ్ం సహస్రయోజనేఽవధన్వానితన్మసి**

వృక్షములందున్న కంఠము నల్లనై బంగారు రంగులో ఉన్నవారు, ఎరుపు రంగువారు, తెలుపు రంగువారు అయిన రుద్రుల ధనుస్సులకు అల్లెత్రాడు సడలించి వాటిని మాకు వేయి యోజనాల దూరాన ఉంచుతాము.

**162.యేభూతానా మధిపతయో విశిఖాసః కపర్దినః**
**తేషాగ్ం సహస్రయోజనేఽవధన్వానితన్మసి**

భూతనాథులైన వారు, శిరోముండనం జరిగిన వారు, జటాజూటము ధరించిన వారు అయిన రుద్రుల ధనుస్సులకు అల్లెత్రాడు సడలించి వాటిని మాకు వేయి యోజనాల దూరాన ఉంచుతాము.

**163.యేఅన్నేషు వివిధ్యన్తి పాత్రేషు పిబతో జనాన్**
**తేషాగ్ం సహస్రయోజనేఽవధన్వానితన్మసి**

ఏ రుద్రులు తినదగిన అన్నము, త్రాగ తగిన పానీయములదుండి జనులు త్రాగే జలాన్ని, తినే అన్నాన్ని కలుషితం చేసే వారిని నానావిధాలుగా బాధిస్తారో అట్టి రుద్రుల ధనుస్సుల అల్లెత్రాటిని తీసి, వాటిని మాకు వేయి యోజనాల దూరంగా ఉంచుతాము.

**164.యేపథాం పథిరక్షయ ఐలబృదాయవ్యుధః**

తేషాగ్ం సహస్రయోజనేఽవధన్వానితన్మసి

అన్ని రకాలయిన లౌకిక, వైదిక మార్గాలను రక్షించే వారు, భక్తులను పోషించటానికి అన్న రూపం ధరించిన వారు, శత్రువులతో యుద్ధం చేసేవారు అయిన రుద్రుల ధనుస్సులకు అల్లెత్రాడు విడతీసి ఆ ధనుస్సులను మాకు వేయి యోజనాల దూరాన ఉంచుతాము.

**165.**యేతీర్థాని ప్రచరన్తి సృకావన్తో నిషఙ్గిణః
తేషాగ్ం సహస్రయోజనేఽవధన్వానితన్మసి ॥

ఏ రుద్రులు చేతులతో కత్తులు పట్టుకుని కాశి, ప్రయాగ వంటి క్షేత్రాలు రక్షించటానికి అక్కడ తిరుగుతుంటారో, వారి ధనుస్సుల అల్లెత్రాళ్ళను తీసి, వాటిని మాకు వేయి యోజనాల దూరాన ఉంచుతాము.

**166.**యఏతా వన్తశ్చ భూయాగ్ం సశ్చదిశో రుద్రావితస్థిరే
తేషాగ్ం సహస్రయోజనేఽవధన్వానితన్మసి

ఈ మంత్రాలలో చెప్పబడిన అసంఖ్యాకమై సమస్త దిక్కులందు వ్యాపించిన రుద్రుల యొక్క ధనుస్సులకు కట్టిన అల్లెత్రాళ్ళు సడలించి వాటిని మాకు వేయి యోజనముల దూరాన ఉంచుతాము.

**167.**నమోరుద్రేభ్యో యేపృథివ్యాం యేఽన్తరిక్షే యేదివియేషామన్న వాతోవర్ష
మిషవస్తేభ్యోదశ ప్రాచీర్దశ దక్షిణాదశ ప్రతీచీర్దశోదీచీ ర్దశో
ర్ధ్వా స్తేభ్యో నమస్తేనో మృడయంతు తేయం ద్విష్మోయశ్చనో
ద్వేష్టితం వోజమ్భేదధామి

భూమిమీద రుద్రులున్నారు. అన్నవే బాణంగా గల రుద్రులున్నారు. అన్ని వైపుల నుండి వారికి నమస్కరిస్తున్నాము. వారు

మాకు సుఖం కలిగింతురు గాక. మేము ద్వేషించే వారిని, మమ్ములను ద్వేషించే వారిని కూడా ఓ రుద్రులారా ! మీరు నాశనము చేయండి.

**168.నమోరుద్రేభ్యోయేన్తరిక్షే (స్థితా) యేషాంవాత ఇషవస్తేభ్యో**

**దశప్రాచీ ర్దశ దక్షిణా దశ ప్రతీచీర్దశోదీచీ ర్దశోర్ధ్వాస్తేభ్యో నమస్తే నో**

**మృడయంతు తేయం దిష్మో యశ్చనో ద్వేష్టి తంవో వోజమ్భేదధామి**

అంతరిక్షంలో రుద్రులున్నారు. వాయువు బాణాలుగా గల రుద్రులున్నారు. వారందరికీ నమస్కారము. వారు మాకు సుఖాన్ని ప్రసాదించాలి. వారికి అన్ని వైపుల నుండి నమస్కారము. వారు మాకు సుఖానివ్వాలి. మేము ద్వేషించే వారిని మమ్ము ద్వేషించే వారిని, ఓ రుద్రులారా ! మీరు నాశనం చెయ్యండి. మమ్ము ద్వేషించే వారిని కూడా నాశనం చెయ్యండి.

**169. నమోరుద్రేభ్యో యేది (స్థితా) యేసాం వర్ష మిషవస్తేభ్యో**

**దశప్రాచీ ర్దశ దక్షిణా దశ ప్రతీచీర్దశోదీచీ ర్దశోర్ధ్వాస్తేభ్యో నమస్తే నో**

**మృడయంతు తేయం దిష్మో యశ్చనో ద్వేష్టి తంవో వోజమ్భేదధామి**

ద్యులోకంలో రుద్రులున్నారు. వర్షమే బాణంగా గల రుద్రులున్నారు. వారందరికీ నమస్కారము. వారు మాకు సుఖానిత్తురు గాక. వారికి అన్ని వైపుల నుండి నమస్కారము. మేము ద్వేషించే వారిని, మమ్ము ద్వేషించే వారిని కూడా నాశనం చేయండి. ఓ రుద్రులారా ! మమ్మల్ని ద్వేషించే వారిని నాశనం చెయ్యండి.

మంత్రశాస్త్రంలో నమకంతో అనేక ప్రయోగాలు కూడా ఉన్నాయి.

# 40. చమకము

కృష్ణయజుర్వేదంలోని నాల్గవకాండలో ఐదవ ప్రపాఠకం రుద్రనమకాన్ని చెబుతుంటే ఏడవ ప్రపాఠకం చమకాన్ని చెబుతోంది. చమకంలో పదకొండు అనువాకాలుంటాయి. రుద్రుడికి అభిషేకం చేసేటప్పుడు నమక చమకాలు రెండూ చెప్పాలి.

ఏకాదశ రుద్రాభిషేకము అన్నప్పుడు నమకము, పూర్తిగా చెప్పి చమకంలో ఒక అనువాకము చెప్పాలి. ఇలా పదకొండుసార్లు చెప్పాలి. చమకము యొక్క అర్థం చూద్దాం. అగ్ని, విష్ణువులారా! మీరు మాయందు సమాన ప్రీతిగలవారు అగుదురు గాక. అన్నము, ధనము తీసుకుని మాకోసం రండి. మాకు అన్నము, జ్ఞానము, ఆకలి, జీర్ణశక్తి కలిగించండి.

త్రాగేందుకు చల్లని నీరు, శత్రువులను జయించే సామర్థ్యము ఇళ్ళు, పొలాలు, పుత్రపౌత్రాదులను ఇవ్వండి.

వేదశాస్త్రాది జ్ఞానాన్నివ్వండి. క్షయ మొదలైన రోగాలు రాకుండా చెయ్యండి.

అన్ని రకాల అన్నాలు, బంధువులను మాకు ఇవ్వండి. బంధువులతో సుఖంగా ఉండేటట్లు చెయ్యండి.

ఇంద్రుడు అగ్ని, సోముడు, సవిత మొదలైన దేవతలందరితోను సమానుడు. ఆయన మమ్మల్ని కరుణించుగాక.

అన్ని రకాల పాత్రలు, యజ్ఞానికి ఉపయోగించే వస్తువులు, మాకివ్వండి. మేము చేసే కర్మవల్ల దేవతలందరూ ప్రసన్నులై తమ తమ విధులు సక్రమంగా నిర్వర్తింతురు గాక.

పశువులు గర్భం ధరించును గాక. ఏడాదిలోపు దూడలు, రెండు, మూడు, నాలుగు సంవత్సరాల దూడలు మాకు కలుగును గాక. గొడ్డుటావులు చూడివి అగును గాక.

ఆయువు, ప్రాణము, అపానము, వ్యానము, నేత్రములు, శ్రోత్రములు, మనసు, వాక్కు, ఆత్మయజ్ఞము చేత కన్పించబడును గాక. చైత్రము నుంచి ఫాల్గుణము వరకు అన్ని మాసములు మాకు శుభప్రదమగును గాక. ఒకటి నుంచి అనంతమైన సంఖ్యలన్నీ మాకు శుభప్రదమగును గాక.

ఈ రకమైన ప్రార్ధనలతో రుద్రుడికి అభిషేకం జరుగుతుంది. లోకంలో అన్నీ ఇచ్చేది ఈశ్వరుడే అని చెబుతున్నాయి నమక చమకాలు. ఈశ్వరుడు సర్వప్రదాత. చమకంలోకూడా పదకొండు అనువాకాలుంటాయి.

*ఓమ్*

# అథ శ్రీరుద్రచమకమ్

**హరిః ఓమ్ అగ్నా విష్ణూ సజోష సేమావర్ధన్తు వాంగిరః ద్యుమ్నై ర్వాజేభిరాగతమ్ వాజశ్చ మే ప్రసవశ్చ మే ప్రయతిశ్చ మే ప్రసితిశ్చ మే ధీతిశ్చ మే క్రతుశ్చ మే స్వరశ్చ మే శ్లోకశ్చ మే శ్రుతిశ్చ మే జ్యోతిశ్చ మే సువశ్చ మే ప్రాణశ్చ మేఽ పానః (1) చ మే వ్యానశ్చ మే సుఽ శ్చ మే చిత్తం చ మ ఆధీతం చ మే వాక్చ మే మనశ్చ మే చక్షుశ్చ మే శ్రోత్రం చ మే దక్షశ్చ మే బలం చ మ ఓజశ్చ మే సహశ్చ మ ఆయుశ్చ మే జరా చ మ ఆత్మా చ మే తనూశ్చ మే శర్మ చ మే వర్మచ మేఽ జ్ఞాని చ మేస్థాని చ మే పరూగ్ంషి చ మేశరీరాణి చ**

మే. (2)

(౧)

జ్యైష్ఠ్యం చ మ ఆధిపత్యం చ మే మన్యుశ్చ మే భామశ్చ మేఽమశ్చ మేఽమ్భశ్చ మే జేమా చ మే మహిమా చ మే వరిమా చ మే ప్రథిమా చ మే వర్ష్మా చ మే ద్రాఘుయా చ మే వృద్ధం చ మే వృద్ధిశ్చ మే సత్యం చ మే శ్రద్ధా చ మే జగచ్చ (3) మే ధనం చ మే వశశ్చ మే త్విషిశ్చ మే క్రీడా చ మే మోదశ్చ మే జాతం చ మే జనిష్యమాణం చ మే సూక్తం చ మే సుకృతం చ మే విత్తం చ మే వేద్యం చ మే భూతం చ మే భవిష్యచ్చ మే సుగం చ మే సుపథం చ మ ఋద్ధం చ మఋద్ధిశ్చ మే క్లప్తంచ మే క్లప్తిశ్చ మే మతిశ్చమే సుమతిశ్చ మే (4)

॥౨॥

శం చ మే మయశ్చ మే ప్రియం చ మేనుకామశ్చ మే కామశ్చ మే సౌమనసశ్చ మే భద్రం చ మే శ్రేయశ్చ మే వస్యశ్చ మే యశశ్చ మే భగశ్చ మే ద్రవిణం చ మే యన్తా చ మే ధర్తా చ మే క్షేమశ్చ మే ధృతిశ్చ మే విశ్వం చ (5) మే మహశ్చ మే సంవిచ్చ మే జ్ఞాత్రం చ మే సూశ్చమే ప్రసూశ్చమే సీరం చ మే లయశ్చ మ ఋతం చ మేఽమృతం చ మే యక్ష్మం చ మేఽనామయచ్చ మే జీవాతుశ్చ మే దీర్ఘాయుత్వం చ మేఽనమిత్రం చ మేఽభయం చ మే సుగం చ మే శయనం చ మే సూషా చ మే సుదినం చ మే (6)

॥3॥

ఊర్క్చ మే సూనృతా చ మే పయశ్చ మే రసశ్చ మే ఘృతం చ

మే మధు చ మే సగ్ధిశ్చ మే సపీతిశ్చ మే కృషిశ్చ మే వృష్టిశ్చ మే జైత్రం చ మ ఔద్భిద్యం చ మే రయిశ్చ మే రాయశ్చ మే పుష్టంచ మే పుష్టిశ్చ మే విభు చ (7) మే ప్రభు చ మే బహు చ మే భూయశ్చ మే పూర్ణం చ మే పూర్ణతరం చ మేక్షితిశ్చ మే కూయవాశ్చ మేఽన్నం చ మేఽక్షుచ్చ మే వ్రీహయశ్చ మే యవాశ్చ మే మాషాశ్చ మే తిలాశ్చ మే ముద్గాశ్చ మే ఖల్వాశ్చ మే గోధూమాశ్చ మే మసురాశ్చ మే ప్రియఙ్గవశ్చ మేఽణవశ్చ మే శ్యామాకాశ్చ మే నీవారాశ్చ మే (8)

॥౪॥

అశ్మా చ మే మృత్తికా చ మే గిరయశ్చ మే పర్వతాశ్చ మే సికతాశ్చ మే వనస్పతయశ్చ మే హిరణ్యం చ మేఽయశ్చ మే సీసం చ మే త్రపుశ్చ మే శ్యామం చ మే లోహం చ మేఽగ్నిశ్చ మ ఆపశ్చ మే వీరుధశ్చమ ఓషధయశ్చ మే కృష్ణపచ్యం చ (9) మేఽకృష్టపచ్యం చ మే గ్రామ్యాశ్చ మే పశవ ఆరణ్యాశ్చ యజ్ఞేన కల్పన్తాం విత్తం చ మే విత్తి శ్చ మే భూతం చ మే భూతిశ్చ మే వసు చ మే వసతిశ్చ మే కర్మ చ మే శక్తిశ్చ మేఽర్థశ్చ మ ఏమశ్చ మ ఇతిశ్చ మే గతిశ్చమే (10)॥౫॥

అగ్నిశ్చ మ ఇన్ద్రశ్చ మే సోమశ్చ మ ఇన్ద్రశ్చ మే సవితా చ మ ఇన్ద్రశ్చ మే సరస్వతీ చ మ ఇన్ద్రశ్చ మే పూషా చ మ ఇన్ద్రశ్చ మే బృహస్పతిశ్చమ ఇన్ద్రశ్చ మే మిత్రశ్చ మ ఇన్ద్రశ్చ మే వరుణశ్చ మ ఇన్ద్రశ్చ మే త్వష్టా చ (11) మ ఇన్ద్రశ్చ మే ధాతా చ మ ఇన్ద్రశ్చ మే విష్ణుశ్చ మ ఇన్ద్రశ్చ మేఽశ్వినౌ చ మఇన్ద్రశ్చ మే మరుతశ్చ మ

ఇన్ద్రశ్చ మే విశ్వే చ మే దేవా ఇన్ద్రశ్చ మే పృథివీ చ మ ఇన్ద్రశ్చ మేఽ న్తరిక్షం చ మ ఇన్ద్రశ్చ మే ద్యౌశ్చ మ ఇన్ద్రశ్చ మే దిశశ్చ మ ఇన్ద్ర శ్చమే మూర్ధా చ మ ఇన్ద్రశ్చ మే ప్రజాపతిశ్చ మ ఇన్ద్రశ్చ మే **(12)** ॥5॥

అగ్ంశుశ్చ మే రశ్మిశ్చ మేఽ దాభ్యశ్చ మేఽ ధిపతిశ్చ మ ఉపాగ్ంశుశ్చ మేఽ న్తర్యామశ్చ మ ఇన్ద్రవాయవశ్చ మే మైత్రావరుణశ్చ మ అశ్వినశ్చ మే ప్రతిప్రస్థానశ్చ మే శుక్రశ్చ మే మన్థీ చ మ ఆగ్రయణశ్చ మే వైశ్వదేవశ్చ మే ధ్రువశ్చమే వైశ్వానరశ్చ మ ఋతుగ్రహాశ్చ **(13)** మేఽ తిగ్రాహ్యాశ్చ మ ఐన్ద్రాగ్నశ్చ మే వైశ్వదేవశ్చ మే మరుత్త్వతీ యాశ్చ మే మాహేన్ద్రశ్చ మ ఆదిత్యశ్చ మే సావిత్రశ్చ మే సారస్వతశ్చ మే పౌష్ణశ్చ మే పాత్నీవతశ్చ మే హారియోజనశ్చ మే **(14)** ॥౬॥

ఇధ్మశ్చ మే బర్హిశ్చ మే వేదిశ్చ మే ధిష్ణియాశ్చ మే స్రుచశ్చ మే చమసాశ్చ మే గ్రావాణశ్చ మే స్వరవశ్చ మ ఉపరవాశ్చ మేఽ ధిషవణే చ మే ద్రోణకలశశ్చ మే వాయవ్యా ని చ మే పూతభృచ్చ మ ఆధవనీయశ్చ మ ఆగ్నీధ్రం చ మే మేహవిర్ధానం చ మే గృహాశ్చ మే సదశ్చ మే పురోడాశాశ్చ మే పచతాశ్చ మేఽ వభృథశ్చ మే స్వగాకారశ్చ మే **(15)**

॥౭॥

అగ్నిశ్చ మే ఘర్మశ్చ మేఽ ర్కశ్చ మే సూర్యశ్చ మే ప్రాణశ్చ మేఽ శ్వమేధశ్చ మే పృథివీ చ మేఽ దితిశ్చ మే దితిశ్చ మే ద్యౌశ్చ మే

శక్వరీరఙ్గులయో దిశశ్చ మే యజ్ఞేన కల్పన్తామృక్చ మే సామ చ మే స్తోమశ్చ మే యజుశ్చ మే దీక్షా చ మే తపశ్చ మ ఋతుశ్చ మే వ్రతం చ మేఽహోరాత్రయో ర్వృష్ట్యా బృహద్రథన్తరే చ మే యజ్ఞేన కల్పేతామ్ **(18)** (౯)

గర్భాశ్చ మే వత్సాశ్చ మే త్ర్యవిశ్చ మే త్ర్యవీ చ మే దిత్యవాట్చ మే దిత్యౌహీ చ మే పఞ్చావిశ్చ మే పఞ్చావీ చ మే త్రివతశ్చ మేత్రివత్సా చ మేతుర్యవాట్చ మే తుర్యౌ హీ చ మే పష్ఠవాచ్చ మే పష్ఠౌహీ చ మ ఉక్షా చ మే వశా చ మ ఋషభ్యశ్చ **(17)** మే వేహచ్చ మేఽనడ్వాఞ్చ మే ధేనుశ్చ మ ఆయుర్యజ్ఞేన కల్పతాం ప్రాణో యజ్ఞేన కల్పతా మపానో యజ్ఞేన కల్పతాం వ్యానో యజ్ఞేన కల్పతాం చక్షుర్యజ్ఞేన కల్పతాగ్ శ్రోత్రం యజ్ఞేన కల్పతాం మనో యజ్ఞేన కల్పతాం వాగ్యజ్ఞేన కల్పతమాత్మా యజ్ఞేన కల్పతాం యజ్ఞో యజ్ఞేన కల్పతామ్ **(18)** ॥౧౦॥

ఏకా చ మే తిస్రశ్చ మే పఞ్చ చ మే సప్త చ మే నవ చ మ ఏకాదశ చ మే త్రయోదశ చ మే పఞ్చదశ చ మే సప్తదశ చ మే నవదశ చ మ ఏకవిగ్ంశతిశ్చ మేత్రయోవిగ్ం శతిశ్చ మే పఞ్చవిగ్ంశతిశ్చ మేసప్తవిగ్ంశతిశ్చ మే నవవిగ్ంశతిశ్చ మ ఏకత్రిగ్ంశచ్చ మే త్రయస్త్రిగ్ంశచ్చ **(19)** మే చతస్రశ్చ మేఽష్టౌ చ మే ద్వాదశ చ మే షోడశ చ మే విగ్ంశతిశ్చ మే చతుర్విగ్ం శతిశ్చ మేఽష్టావిగ్ం శతిశ్చ మే ద్వాత్రిగ్ంశచ్చ మేషట్త్రిగ్ంశచ్చ మే చత్వారిగ్ంశచ్చ మే చతుశ్చత్వారిగ్ంశచ్చ మేఽష్టాచత్వారిగ్ంశచ్చ మే వాజశ్చ ప్రసవశ్చాపిజశ్చ క్రతుశ్చ సువశ్చ మూర్ధా చ వ్యశ్నియశ్చా

న్యాయనశ్చాన్త్యశ్చ భౌవనశ్చ భువనశ్చాధిపతిశ్చ (20)

॥౧౧॥

ఇడా దేవహూ ర్మనుర్యజ్ఞ నీర్బృహస్పతిరుక్థామదాని శగ్ంసిషద్విశ్వేదేవాసూ క్తవాచః పృథివి మాతర్మా మాహిగ్ంసీర్మధుమనిష్యేమధు జనిష్యే మధు వక్ష్యామి మధు వదిష్యామి మధుమతీం దేవేభ్యో వాచాముద్యాసగ్ం శుశ్రూషేణ్యాం మనుష్యేభ్యస్తంమా దేవా అవన్తు శోభాయై పితరోఽనుమదన్తు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

## 41. ఈశ్వరుడికి నమస్కార మంత్రాలు

నమో హిరణ్యబాహవే హిరణ్యవర్ణాయ హిరణ్యరూపాయ

హిరణ్యపతయేంబికా పతయ ఉమాపతయే పశుపతయే నమో నమః

ఋతగ్ం సత్యం పరం బ్రహ్మపురుషం కృష్ణ పింగళమ్

ఊర్ధ్వ రేతం విరూపాక్షం విశ్వరూపాయ వై నమో నమః

సర్వోవై రుద్ర స్తస్మై రుద్రాయ నమో అస్తు,

పురుషో వైరుద్రస్సన్మహో నమో నమః

విశ్వం భూతం భువనం చిత్రం బహుధా జాతం జాయమానం చ యత్

సర్వోహ్యేష రుద్రస్తస్మై రుద్రాయ నమో అస్తు

బ్రహ్మ మొదలు స్తంబము వరకు ఉన్న పశువులకు పతి పశుపతి. పార్వతీపతి, అంబికాపతి, నిధనపతి, తేజోమయుడు, వేదాక్షరోత్పాదకుడు, అయిన ఈశ్వరునకు నమస్కారము.

పరబ్రహ్మ రెండు రకాలు. 1. వ్యావహారికము 2. పారమార్ధికము. హిరణ్యగర్భ రూపమైన బ్రహ్మ వ్యావహారికసత్యము. ఆ బ్రహ్మ భక్తులను అనుగ్రహించటానికి ఉమామహేశ్వరులుగా ఉన్నది. కుడివైపు ఈశ్వరుడు నల్లనివాడు. ఉమాదేవి పింగళవర్ణ అతడు యోగశక్తితో రేతస్సును బ్రహ్మరంధ్రంలో ధారణ చేశాడు. అందుకే

ఊర్ధ్వరేతస్కుడైనాడు. త్రినేత్రుడు కాబట్టి విరూపాక్షుడు. జగదాత్మకుడైన ఆ పురుషునికి నమస్కారము.

పార్వతీపతి అయిన రుద్రుడు జీవరూపంతో అన్నిశరీరములయందు ప్రవేశించాడు. ఆ సర్వాత్మకుడైన రుద్రునకు నమస్కారము. ప్రకృతి పురుషులలో చిదాత్మకుడైన పురుషుడే భక్తులను అనుగ్రహించటంకోసం రుద్రుని రూపంలో ఉన్నాడు. ఆయనకు నమస్కారము. జడము చేతనములతో కలసిన ఈ జగత్తంతా రుద్రుని స్వరూపమే. దీనికి విరుద్ధంగా ఈ జగత్తు లేదు. అటువంటి సర్వాత్మకుడైన రుద్రునకు నమస్కారము.

# 42. శివోపాసన మంత్రాలు

| | |
|---|---|
| నిధనపతయే నమః | నిధనపతాంతికాయ నమః |
| ఊర్ధ్వాయ నమః | ఊర్ధ్వలింగాయ నమః |
| హిరణ్యాయ నమః | హిరణ్యలింగాయ నమః |
| సువర్ణాయ నమః | సువర్ణలింగాయ నమః |
| దివ్యాయ నమః | దివ్యలింగాయ నమః |
| భవాయ నమః | భవలింగాయ నమః |
| శర్వాయ నమః | శర్వలింగాయ నమః |
| శివాయ నమః | శివలింగాయ నమః |
| జ్వలాయ నమః | జ్వలలింగాయ నమః |
| ఆత్మాయ నమః | ఆత్మలింగాయ నమః |
| పరమాయ నమః | పరమలింగాయ నమః |

ఏతత్సోమస్య సూర్యస్య సర్వలింగగ్గ్ం స్థాపయతి పాణి మంత్రం పవిత్రమ్

దేవాలయంలోగాని, మరెక్కడైనా సరే ఈశ్వరుణ్ణి దర్శించినప్పుడు ఈ మంత్రాలు చదవాలి. వీటివల్ల భక్తులు కోరిన కోరికలు తీరతాయి. చివరలో వారికి మోక్షం కూడా సిద్ధిస్తుంది.

# 43. పంచ బ్రహ్మాల మంత్రాలు

పరమేశ్వరుడు ఐదురూపాలలో ఉన్నాడు. అవే 1. సద్యోజాత 2. వామదేవ 3. అఘోర 4. తత్పురుష 5. ఈశానులు. వీరికి నమస్కరించేటప్పుడు ఈ మంత్రాలు చదవాలి.

**1.** సద్యోజాతం ప్రపద్యామి సద్యో జాతాయ వై నమో నమః
భవేభవేనాతిభవే భవస్వమామ్ భవోద్భవాయ నమః

**2.** వామదేవాయ నమో జ్యేష్ఠా నమః శ్రేష్ఠాయ నమో రుద్రాయ నమః
కాలాయ నమః కలవికరణాయ నమో బలవికరణాయ నమో బలాయ
నమో బలప్రమథనాయ నమః సర్వభూతదమనాయ
నమో మనోన్మనాయ నమః

**3.** అఘోరేభ్యో థఘోరేభ్యో ఘోరఘోర తరేభ్యః
సర్వేభ్య స్సర్వశర్వేభ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః

**4.** తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి
తన్నో రుద్రః ప్రచోదయాత్

**5.** ఈశాన స్సర్వవిద్యానా మీశ్వర స్సర్వభూతానాం బ్రహ్మాధిపతి
ర్బ్రహ్మణోధిపతి ర్బ్రహ్మా శివో మే అస్తు సదా శివోమ్

*దీంతో కృష్ణయజుస్సంహిత సమాప్తము*

శ్రీ

# పార్థసారథీయము

# చతుర్వేదభాష్యము

## ( శుక్లయజుస్సంహిత )




ప్రముఖ శ్రీవిద్యా ప్రచారకులు

అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,

ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, మెంఫిస్, అమెరికా ఆస్థాన విద్వాంసులు,

డా॥ క్రోవి పార్థసారథి

# విషయసూచిక


1. యజ్ఞం అన్నింటినీ ఇస్తుంది
2. శత్రునాశనము
3. గోమాత
4. ప్రజాపతి
5. దీర్ఘరోగానికి (పంచ హవిష్కేష్టి)
6. మాత్సర్యనిర్ధారణ కోసం
7. సంతానం కావాలంటే
8. పాపనివృత్తికి
9. బంధన విముక్తి
10. చర్మరోగానికి
11. పూర్ణాయుష్యకోసం
12. మృత్యుంజయ హోమం
13. రాజసూయయాగము
14. పితృమేధము
15. నరమేధము
16. అశ్వమేధము
17. పురుష సూక్తము
18. సంఖ్యామానం
19. వాజపేయం
20. అగ్నిచయనం
21. చతురాశ్రమాలు
22. ఏకేశ్వరోపాసన
23. ప్రభుత్వము – ప్రజలు
24. రాజ్యపాలన
25. ప్రహేళికలు (పొడుపు కథలు)
26. అంబిక రుద్రుని చెల్లెలు
27. మరణభయం

# 2.3 శుక్లయజుస్సంహిత

ఇందులో మొత్తం 40 అధ్యాయాలు, 1975 మంత్ర కండికలు, 3988 మంత్రాలు ఉన్నాయి. ఇందులో పూర్తిగా యజ్ఞయాగాదులకు సంబంధించిన విషయాలు చెప్పబడ్డాయి. పెద్ద పెద్ద యాగాలు అశ్వమేధం, వాజపేయం, రాజసూయం, నరమేధం, పితృయజ్ఞం, విశ్వజిద్‌యాగం చెప్పగా ఆఖరున 40వ అధ్యాయం ఉపనిషత్తును చెబుతోంది. అదే ఈశావాశ్యోపనిషత్తు. శుక్లయజుర్వేదంలో చెప్పిన 'విహవ్య' మంత్రాలు చాలా ప్రసిద్ధి చెందినవి. ఒకసారి విశ్వామిత్రుడు, జమదగ్ని మహర్షులు వశిష్టునిలో తగాదా పడ్డారు. అప్పుడు జమదగ్ని తపోనిష్ఠలో 'విహవ్య' అనే మంత్రాన్ని దర్శించాడు. ఈ మంత్రాన్ని జపించిన వాడు శత్రువు యొక్క ఇంద్రియ బలాన్ని, వీర్యాన్ని సంహరించగలరు. ఇటువంటి లౌకిక ప్రయోజనాలకు ఉపయోగించే మంత్రాలు ఈ వేదంలో ఉన్నాయి.

# 1. యజ్ఞం అన్నింటినీ ఇస్తుంది

ఆ రోజున యజ్ఞయాగాదిక్రతువులు చేశారు. మానవుడికి కావలసినవన్నీ యజ్ఞయాగాల ద్వారా సాధించుకోవచ్చు. అందుకే ఏం కావాలన్నా యాగం చేసేవాళ్ళు అలా సంపాదించినది కేవలము తమకోసం మాత్రమే కాదు. ఆ ఫలితం అందరూ అనుభవించాలి. ఈ కోరిక ప్రతివారిలోను ప్రబలంగా ఉండేది. ఈ విషయాలు **18వ అధ్యాయంలో** చెబుతున్నారు చూడండి.

"యజ్ఞం వల్ల మాకు అన్నం కలుగుగాక. ఆ అన్నాన్ని దానం చేసే అనుజ్ఞ కలుగును గాక. జ్ఞానము కలుగును గాక. వాక్కు, మనస్సు, నేత్రములు, శ్రోత్రములు కలుగును గాక. జ్ఞానేంద్రియ, శరీరేంద్రియ కౌశలము కలుగును గాక.

యజ్ఞంవల్ల మాకు ఓజస్సు కలుగును గాక. బలము, ఆత్మ, శక్తి, పుష్టి గల శరీరము, సుఖము కలుగును గాక. కవచము, అంగ ప్రత్యంగములు, అస్థులు, సర్వము కలుగును గాక. శరీరములు కలుగును గాక. ఆయువు కలుగును గాక.

యజ్ఞంవల్ల మాకు జ్యేష్ఠత్వము కలుగును గాక. ఆధిపత్యము, క్రోధము, తేజస్సు, బలము, జలము కలుగును గాక. జయము కలుగును గాక. మహిమ కలుగును గాక. విశాలత్వము కలుగును గాక. గృహము, విస్తారమైన క్షేత్రము కలుగును గాక. దీర్ఘాయుష్షు, అవిఛ్ఛిన్నమైన వంశము, అన్నము కలుగును గాక. ధనము, విద్య, మంచి గుణాలు కలుగును గాక.

యజ్ఞంవల్ల సత్యం కలుగును గాక. శ్రద్ధ, జగత్తు, ధనము, విశ్వము, తేజస్సు, క్రీడ, మేధము కలుగును గాక. సంతానము

కలుగును గాక. వంశము వృద్ధి చెందును గాక. పుణ్యము కలుగును గాక.

యజ్ఞము వల్ల మాకు ఋతము కలుగునుగాక. అమృతము ఆరోగ్యము, అనామయత్వము కలుగునుగాక. జీవనము కలుగునుగాక. దీర్ఘాయుష్షు కలుగును గాక. శత్రుత్వము లేకుండును గాక. భయము లేకుండును గాక. సుఖము కలుగును గాక. నిద్ర, శుభమార్గములు, సుదినములు కలుగునుగాక.

యజ్ఞం వల్ల గుర్రాలను నియంత్రించే శక్తి కలుగునుగాక. పోషకుడు కలుగును గాక. క్షేమం కలుగును గాక. ధృతి, విశ్వము, తేజము కలుగును గాక విజ్ఞాన సామర్ధ్యము కలుగును గాక. ప్రేరణ సామర్ధ్యము కలుగును గాక, జనన శక్తి కలుగును గాక ధనధాన్యాలు కలుగును గాక. వ్యవసాయానికి అడ్డు పడేవారు నాశనమగుదురు గాక.

యజ్ఞంవల్ల ఈ లోకంలో సుఖాలు కలుగును గాక. పరలోక సుఖాలు కలుగును గాక. ప్రియములు కలుగును గాక. ఇష్టమైన పదార్ధాలు, విషయ సుఖాలు, ప్రేమభావము, సౌభాగ్యము, ధనము, ఇల్లు వాకిలి, కీర్తిప్రతిష్ఠ కలుగును గాక.

యజ్ఞంవల్ల అన్నం కలుగునుగాక. సత్యవాణి కలుగును గాక. పాలు, నెయ్యి, పెరుగు, తేనె కలుగును గాక. సహపంక్తి భోజనము కలుగును గాక. సహవాసము, మంచి మిత్రులు, కృషి, వృష్టి, జయము, శత్రువులను నాశనం చేయగల శక్తి కలుగును గాక. యజ్ఞంవల్ల గోధనము, అశ్వధనం, ముక్తామణి, ధనసమృద్ధి, పుష్టి కలుగుగాక. విభుత్వము, ప్రభుత్వము కలుగును గాక. పూర్ణత, పరిపూర్ణత కలుగును గాక. అక్షయుత కలుగును గాక. అన్నము కలుగును గాక. అన్నము

లేని బాధ తెలియకుండును గాక.

యజ్ఞంవల్ల రావలసిన ధనం వచ్చును గాక. పూర్వసిద్ధి క్షేత్రాలు. ప్రశస్తి పొందిన క్షేత్రాలు కలుగును గాక. చేరవలసిన సుఖప్రదేశము కలుగును గాక. మంచి గమ్యస్థానము లభించును గాక. సమృద్ధిగా యజ్ఞఫలము లభించును గాక. యజ్ఞయాగాల సమృద్ధి, ద్రవ్యము, స్వకర్మ సామర్థ్యము కలుగునుగాక. మతి, సుమతి కలుగును గాక.

యజ్ఞంవల్ల మాకు ధాన్యం యవలు, మినుములు, నువ్వులు, పెసలు, శనగలు, కాకునులు, సాపలు, కోదలు, నీవారములు, గోధుమలు, మసూరములు కలుగును గాక.

యజ్ఞంవల్ల మాకు రాళ్ళు, మట్టి, పర్వతాలు, మహా పర్వతాలు, ఇసుక, వనస్పతి, బంగారము, వెండి, రాగి, ఇత్తడి, ఇనుము, సీసము కలుగును గాక.

యజ్ఞం వల్ల మాకు అగ్ని, జలము, తీగలు, ఓషధులు, వ్యవసాయోత్పత్తులు, వ్యవసాయేతర ఉత్పత్తులు, గ్రామీణ పశువులు, అరణ్య పశువులు, విత్తము, లాభము, నేను సంపాదించిన ఐశ్వర్యము కలుగునుగాక.

యజ్ఞము వల్ల మాకు గోధనము కలుగును గాక. మంచి వసతి, అగ్నిహోత్రము మొ॥ కర్మలు కలుగు గాక. ఆ కర్మలు చేయగల శక్తి లభించును గాక. ఇష్టమైనది పొందే ఉపాయము తెలియును గాక.

యజ్ఞము వల్ల మాకు అగ్ని కలుగును గాక. సోమము, సరస్వతి, పూష, బృహస్పతి, ఇంద్రుల అనుగ్రహము కలుగును గాక.

యజ్ఞము వల్ల మాకు మంచి మిత్రుడు వరుణుడు, ధాత, త్వష్ట, మరుత్తులు, విశ్వేదేవతలు, వారితో కూడిన ఇంద్రుని అనుగ్రహము

కలుగును గాక.

యజ్ఞమువల్ల మాకు భూమి, అంతరిక్షము, ద్యులోకము, వర్షము, నక్షత్రములు, దిశలు కలుగును గాక.

యజ్ఞము వల్ల మాకు అంశుగ్రహము కలుగును గాక. రశ్మి కలుగును గాక. ఆదాభ్యము, అధిపతి, ఉపాంసువు, అంతర్యామము కలుగును గాక. ఇంద్ర వాయువుల, మైత్రావరుణుల, అశ్వనీదేవతల అనుగ్రహము కలుగును గాక.

యజ్ఞము వల్ల మాకు అగ్రాయణము కలుగును గాక. వైశ్య దేవము, ధృవము, వైశ్యానరము, ఐంద్రాగ్ని, మహావైశదేవము మరుద్వతీయము, నిష్కైవల్యము, సావిత్రము, సారస్వతము, పత్నీవ్రతము, హరియోజనము కలుగును గాక. (ఇవన్నీ పాత్రలు)

యజ్ఞము వల్ల మాకు స్రువము, చమసము, వాయువ్యము, ద్రోణ కలశము, గ్రావణము, అధిషణద్వయము, పూతభృతము, ఆహవనీయ సోమము, వేది, దర్భలు, అవభృదము కలుగును గాక. (ఇవన్నీ యజ్ఞంలో వస్తువులు)

యజ్ఞం వల్ల మాకు అగ్ని కలుగును గాక. ప్రవర్గము, యజ్ఞవిశేషము, సూర్యము, ప్రాణము, అశ్వమేధము, పృథివి, దితి, శక్తులు, దిశలు కలుగును గాక.

యజ్ఞం వల్ల మాకు వ్రతము కలుగును గాక. ఋతువులు, తపము, సంవత్సరములు, అహోరాత్రములు, జంసము, జానుని, బృహద్రధంతర సామము కలుగును గాక.

యజ్ఞమువల్ల మాకు ఒకటి కలుగును గాక. మూడు మూడు, ఐదు ఐదు, ఏడు ఏడు, తొమ్మిది తొమ్మిది, పదకొండు పదకొండు,

పదమూడు పదమూడు, పదిహేను పదిహేను, పదిహేడు పదిహేడు, పంతొమ్మిది పంతొమ్మిది, ఇరవై ఒకటి ఇరవై ఒకటి, ఇరవై మూడు ఇరవై మూడు, ఇరవై ఐదు ఇరవై ఐదు, ఇరవై ఏడు ఇరవై ఏడు, ఇరవై తొమ్మిది ఇరవై తొమ్మిది, ముప్పై ఒకటి ముప్పై ఒకటి, ముప్పై మూడు ముప్పై మూడు కలుగును గాక.

యజ్ఞమువల్ల మాకు 4,8,12,16,20, 24,28, 32,36,40,44,48 సంఖ్యలు గల మంత్రములు కలుగు గాక.

యజ్ఞము వల్ల మాకు ఏడాదిన్నర దూడ కలుగును గాక. ఏడాదిన్నర దూడ కలుగును గాక. రెండు సం॥ దూడ కలుగును గాక. రెండు సంవత్సరాల దూడ కలుగును గాక. రెండున్నర సం॥ దూడ, మూడేళ్ళ ఆవు, ఆబోతు, ఎద్దు, అలాగే మూడున్నరేళ్ళ ఆవు, ఆబోతు, ఎద్దు కలుగును గాక.

యజ్ఞం వల్ల నాలుగేళ్ళ ఆవు, ఎద్దు కలుగును గాక. పరిపూర్ణమైన ఎద్దు కలుగును గాక. వంధ్య గోవు, యువవృషభము, గర్భపాతమైన ఆవు, బండిలాగు ఎద్దు, అప్పుడే ఈనిన ఆవు కలుగును గాక.

అన్నప్రదాన చైత్రమాసానికి, ప్రేరక వైశాఖానికి, జ్యేష్ఠానికి, యాగప్రధానమైన ఆషాఢానికి, యాత్రలు నిషేధించబడిన శ్రావణానికి, సూర్యప్రతాప భాద్రపదానికి, మూఢదివస ఆశ్వయుజానికి, తక్కువ పగలు గల కార్తీకానికి, విష్ణురూపమయిన మార్గశీర్షానికి, పుష్టి కలిగించు పుష్యానికి చివరిదయిన ఫాల్గుణ మాసానికి, భువనపతికి, అధిపతికి, ప్రజాపతికి స్వాహా !

ఓ అగ్నిదేవా ! ఇది నీ రాజ్యము. ఇక్కడ నువ్వే నియంతవు. నువ్వే యజమానివి. నువ్వే నియమించేవాడవు. విశిష్టమైన అన్నరసం కోసం నిన్ను అభిశంసిస్తున్నాను. మాకు వర్షము, ప్రజాధిపత్యము

కలిగించటానికి నేతితో నీకు అభిషేకిస్తున్నాను.

యజ్ఞంవల్ల ఆయువు పెరుగుతుంది. యజ్ఞంవల్ల ప్రాణం, నేత్రం, వినికిడి శక్తి, మాట, మనసు, ఆత్మ కలుగుతాయి. యజ్ఞంవల్ల బ్రహ్మ కలుగుతాడు. జ్యోతి స్వర్గము, స్తోత్రము కలుగుతాయి. యజ్ఞంవల్ల ఋగ్యజుస్సామాలు, బృహద్రథతర రసామము కలుగును గాక.

దేవతలారా యజ్ఞం చేసి మేం స్వర్గం చేరాం. మేము కూడా అమరుల మయినాము. మేము ప్రజాపతికి ప్రజలమైనాము.

వేదవచనాల వల్ల ఈ భూమిని అనుకూలంగా చేసుకుంటాము. భూమియందుండునట్లు సవిత మమ్మల్ని ప్రోత్సహించాలి.

విశ్వేదేవతలు మరుత్తులు హవిస్సులు స్వీకరించటానికి మా యజ్ఞానికి వస్తారు. వారందరూ నన్ను రక్షిస్తారు. ఆ దేవతల కృపవల్ల అగ్నులు ప్రజ్వరిల్లి, యజ్ఞ ఫలస్వరూపంగా మాకు అన్ని రకాల ద్రవ్యాలు దొరుకును గాక.

మాకు అన్నము, ఏడులోకాలు, నాలుగుదిశలు, స్వర్గము లభించాలి. ఈ యజ్ఞంలో ధనప్రాప్తి కలగటానికి విశ్వేదేవతలు అన్నంతో సహా మమ్మల్ని కరుణించాలి.

ఈ రోజున అన్నదానానికి మాకు అనుమతి లభిస్తుంది. అన్నమే ఋతువులను కల్పిస్తున్నది. దేవతలను కల్పిస్తున్నది. నన్ను పుత్ర పౌత్రాదులు గలవాడిగ చేస్తున్నది. నేను అన్నదానం చేసి దశదిశలు జయించగలను.

అన్నము మా ముందు ఉండునుగాక. మా వెనక ఉండునుగాక. మధ్యన ఉండునుగాక. అన్నమే హవిస్సు ద్వారా దేవతలను వర్ధిల్లచేస్తున్నది. అన్నమే నన్ను వీరకుమారుల్ని, వీరులైనమనమలను పొందేటట్లు చేసింది. నేను అన్నపతినై దశదిశలందు వ్యాపిస్తాను.”

అంటున్నాడు. అంటే యజ్ఞం వల్ల అన్నీ లభిస్తాయి. కాబట్టి అన్నదానం చేసి దశదిశలను ఆక్రమిస్తాను. ఇది వారి భావన. అంతేకాని **యజ్ఞం ద్వారా వచ్చిన దాన్ని తానొక్కడే అనుభవించాలి అనుకోలేదు.**

# ౨. శత్రునాశనము

ఋగ్వేదంలో ప్రధాన దేవత ఇంద్రుడు. యజుర్వేదంలో ప్రధానదేవత అగ్ని. మానవులకు ఏం కావాలన్నా ఈ ఇద్దరే ఇవ్వాలి. అందుకే ఏది కావాలన్నా అంటే ధనం, ధాన్యం, పుత్రులు, సంపద ఏది కావాలన్నా, శత్రునాశనం చెయ్యాలన్నా వీరినే ప్రార్థించేవారు. **రెండవఅధ్యాయంలో** ఇంద్రుణ్ణి ప్రార్థిస్తున్నారు. తమకు మంచి కుమారుడు కలగాలని.

"ఓ ఇంద్రా! హోమం చెయ్యగా మిగిలిన పదార్థాన్ని తినటంవల్ల నాలో ఇంద్రియబలము పెరుగుతుంది. ఇంద్రరూపి అయిన పరమేశ్వరుడు నాలో వీర్యాన్ని కలిగించాలి. నేను సుసంపన్నుణ్ణి కావాలి. దేవతల సంపదలు, మానవుల సంపదలు అన్నీ నన్ను సేవించాలి. భగవంతుడు నన్ను ఆశీర్వదించాలి. ఇప్పుడు పృథివి మనచేత ఆహ్వానింపబడింది. ఈ జగత్తుకు ఆవిడే నిర్మాత. ఆవిడ మనకుతల్లి. నేను అగ్నినై మిగిలిన పురోడాశాన్ని తింటున్నాను. నాకు అనుజ్ఞ ఇవ్వండి" అని ప్రార్థిస్తున్నాడు. నేను అగ్నినై పురోడాశము తింటాను అంటున్నాడు. మానవుడిలో జఠరాగ్ని ఉన్నది. ఆ జఠరాగ్నిలో ఇది కాస్తా హుతమవుతుంది. అందుకే దాన్ని నేను తింటున్నానని అంటున్నాడు. తన ఇంద్రియాన్ని వృద్ధి చెయ్యమని ఇంద్రుణ్ణి ప్రార్థించాడు. అగ్నికూడా ప్రధాన దేవతే. అందుకే అగ్నిదేవుని ప్రార్థిస్తున్నాడు. ఓ అగ్నీ ! నీకు సమిధలు, హవిస్సు అందిస్తున్నాను. వీటితో నువు బాగా వృద్ధిచెందు. నీతోపాటుగా మాకుకూడా వృద్ధిని కలిగించు. నీదయవల్ల మేము, మా పిల్లలు, మా పశువులు వృద్ధి చెందుతాము.

అగ్నిసోములు స్వర్గాన్ని జయించారు. నేను వారికి అనుకూలంగా ఉంటాను. అగ్నిసోములారా ! మమ్మల్ని ద్వేషించే వారిని, మా శత్రువులను నాశనం చెయ్యండి. నన్ను ద్వేషించేవారిని, నేను ద్వేషించేవారిని కూడా అగ్నిసోములు నాశనం చెయ్యాలి. అని ప్రార్థిస్తున్నాను.

మంచి కుమారుణ్ణి ఇమ్మని పితృదేవతలను ప్రార్థిస్తున్నారు. "ఓ పితృదేవతలా! అశ్వనీ దేవతల వంటి కుమారులను మాకు ప్రసాదించండి. అలాటి వారిని నా భార్య గర్భంలో ప్రవేశపెట్టండి" **పితృదేవతల అనుగ్రహం ఉంటేనే సత్సంతానం కలుగుతుంది.**

# 3. గోమాత

హిందువులకు పవిత్రమైనది ఆవు. అందుకే గోవును పూజించటం జరుగుతుంది. గోమూత్రం, గోమయం ఇవి రోగనిరోధకాలు. ఆవుపాలు మంచి పౌష్టికాహారము, చంటిపిల్లలకు తల్లిపాలు లేకపోతే ఆవుపాలుపోస్తారు. అనేక కార్యాలలో గోవును దానంగా ఇవ్వటం జరుగుతుంది. గృహప్రవేశం లాంటి సమయంలో నూతన గృహంలోకి ముందుగా ఆవును తీసుకువెడతారు. తరువాతే యజమాని వెళ్ళేది. మనం ఇంత పవిత్రంగా చూసుకునే ఆవు పరమపూజ్యమైనది. ఆవును కాలితో తన్నరాదు. ఆవుకు పదిరకాలు వీర్యాలున్నాయి అవి.

1. అప్పుడే పితికిన పాలు
2. వేడిపాలు
3. మీగడ
4. తోడుపెట్టిన పాలు
5. బాగా తోడుకోని పాలు
6. గడ్డ పెరుగు
7. వెన్న
8. నెయ్యి
9. గోదావరి
10. గోదావరిరసం

ఆవును గురించి వేదం ఏం చెబుతోందో చూద్దాం. **మూడవ అధ్యాయంలోని 20,21,22 మంత్రాలు** చూడండి.

ఓ గోవులారా ! మీరు పాలు నెయ్యి మొదలగు వాటిని ఆహారంగా ఇస్తున్నారు. కాబట్టి మీరు అన్నస్వరూపులు. మీ అనుగ్రహం వల్లనే నేను ఆహారం పొందుతున్నాను. మీరు పూజింపతగినవారు. శీలవంతులు. మీ సేన నన్ను వీర్యవంతునిగా చేస్తుంది.

మీరు బలరూపులు, మీ అనుగ్రహం వల్ల వేము బలవంతులమవుతున్నాము.

మేము అనేక రకాలైన ధనధాన్యాలు పొందుతాము. మీరు

దశతేజోవంతులు. మీ పాలు, పెరుగు, నెయ్యి వంటి పదిరకాల లాభాన్ని మేము పొందుతాము.

ఓ గోవులారా ! మీరు ధనవంతులు. గోశాలలో ఉండండి. మా ఇంట్లో ఉండండి. ఇక్కడే ఉండండి. ఓ గోవూ! నువ్వు యజ్ఞకార్యంలో నిమగ్నమై పోయావు. వివిధ రూపాలలో గల మీరు బలము, గోపతిత్వము రూపంతో నాలో ప్రవేశించి నన్ను బలవంతునిగ చేయవలసింది" అని ప్రార్థిస్తున్నాడు.

గోవును దేవతగా పూజించటమే కాదు. వినిమయ సాధనంగా కూడా ఉపయోగించేవారు. వస్తువులు కొన్నప్పుడు ప్రతిఫలంగా గోవునుఇచ్చేవారు. ప్రత్యేకంగా సోమలతను కొన్నప్పుడు దాని మూల్యంగా గోవులను అమ్మినవారికి ప్రతిఫలంగా ఇచ్చేవారు. ఇంకా ముఖ్యమైన విషయం ఏమంటే యజ్ఞం చేసేటప్పుడు యజ్ఞపరిసమాపన దశలో ఋత్విక్కులకు దక్షిణగా గోవులనే ఇచ్చేవారు. గోవు వైద్యప్రదమైనది. కాని చాలా మందికి తెలియని విషయం ఏమంటే, ఏదైనా ఆహారాన్ని ఆవుకు పెట్టి, బయటకు వచ్చిన తరువాత దాన్ని తిన్నట్లైతే స్త్రీలకు అనేక రకాలైన గర్భకోశ వ్యాధులు నశిస్తాయి. అంటే ఆవుకు పెసలు, మినుగులు లాంటి ధాన్యాలు పెడతాం. అవి పూర్తిగా జీర్ణం కావు. అలా జీర్ణంకాని గింజలు పేడద్వారా బయటకు వచ్చేస్తాయి. ఆ పేడను శుభ్రంగా కడిగి, ఆ గింజలను జాగ్రత్తగా తీసుకుని వాటిని ఆహారంగా తీసుకోవాలి. ఇది స్త్రీల గర్భకోశ వ్యాధులకు అమృతంలాంటిది. **గాయత్రీపరివార్ వ్యవస్థాపకులు పండిత రామశర్మగారు** ఆవుకు జొన్నలు పెట్టి, బయటకు వచ్చిన వాటిని తీసుకుని, దంచి వండుకుని తింటూ సంవత్సరంపాటు కాలం గడిపారు. ఈ రకంగా చూస్తే **గోమాత పరమ పవిత్రమైనది** అని తెలుస్తోంది.

# 4. ప్రజాపతి

శుక్లయజుర్వేదంలోని **ముప్పైరెండవ అధ్యాయంలో** సర్వమేధ మంత్రాలు అనే పేరుతో ప్రజాపతి స్వరూపాని వివరిస్తున్నారు. "అతడే అగ్ని, అతడే ఆదిత్యుడు, అతడే వాయువు, అతడే చంద్రుడు, అతడే వీర్యము, అతడే శబ్దము, అతడే జలము, అతడే ప్రజాపతి.

ఆ పరమ పురుషుని నుండే సమస్త లోకాలు, అవయవాలు నిమేష, వర్షాదులన్నీ ఉత్పన్నమైనాయి. నాటినుండి నేటిదాకా ఆ పురుషుని ఆదిమధ్యాంతములు తెలుసుకున్న వారు లేరు. అతడి పేరు మహాద్యశుడు. అతడికన్న ఎక్కువైన వారు కాని అతనితో సమానమైన వారుకాని లేరు. అతన్ని మించి అవతరించిన వారు కూడా లేరు.

అతడు అన్ని దిశలందు వ్యాపించి ఉన్నాడు. ఈ సృష్టిలో అందరికన్న ముందు జన్మించినది అతడే. గర్భంలో ఉన్నది అతడే. పుడుతున్నది అతడే. సర్వ అవయవములందు ఉన్నది అతడే.

అతనికి పూర్వం సృష్టి లేదు. అన్ని లోకాలను ఆక్రమించిన వాడు అతడే. ప్రజలను రక్షించిన వాడు అతడే. అగ్ని వాయువు ఆదిత్యుడు అనే మూడు జ్యోతులను సృష్టించాడు అతడే.

అతడే ద్యులోకాన్ని ధరించాడు. భూలోకాన్ని స్థిరపరిచాడు. స్వర్గాన్ని నిలిపి ఉంచాడు. పరమపదానికి అతడే ఆధారభూతుడు. ఆ ప్రజాపతిని యజ్ఞం ద్వారా అర్చిస్తున్నాను. అతనికి యజ్ఞంద్వారా హవిస్సులు అర్పిస్తున్నాను.

ఎవరిని తలచినంత మాత్రంచేతనే ద్యావాపృథ్వులు భయపడతారో, ఎవరి యందు సూర్యుడు ప్రకాశిస్తుంటాడో, ఎవరి గర్భంలో సకల జనులు ఉన్నారో, అటువంటి దేవతకు యజ్ఞపూర్వకంగా

హవిస్సులందిస్తున్నాను.

జ్ఞానియైన వాడు  అతణ్ణి తన బుద్ధిలోనే ఉన్నాడని భావిస్తాడు. దర్శిస్తాడు. సమస్త సృష్టి అతనియందే జరుగుతున్నది. చరాచర జగత్తంతా అతని యందే ప్రవర్తిల్లుతున్నది. అందరియందు అతడే. ఆ పరమ పురుషుడే జీవభావము, దేవభావములతో ప్రవర్తిల్లుతున్నాడు. అతడే ప్రతి దేహమందు జీవభావముతో నిలచి ఉన్నాడు. ప్రజల యందు వ్యాపించి ఉన్నాడు. వేదవేత్త, తత్త్వవేత్త అయిన ఆ పురుషుడు ఎక్కడున్నాడు అంటే, అతని రూపాన్ని దర్శించిన వారు గాని,  ఆ తత్త్వాన్ని చెప్పిన వారు గాని, ఇంతవరకు ఎవరూ లేరు. అతనిలో మూడువంతుల భాగము రహస్యంగా ఉంటుంది. ఆ రహస్యమైన బాగం తెలిసినవాడు తండ్రికే తండ్రి అవుతున్నాడు.

ఆయన మా బంధువు, మా పుట్టుకకు కారణంఆయనే. అతడు సమస్త తేజములు భువనములు తెలిసినవాడు. అతని కారణంగానే దేవతలకు అమృతము ఆహారమైంది. దేవతలు స్వర్గంలో క్రీడిస్తున్నారు.

అతడు అన్నిభూతాలకు అతీతుడు. అన్నిలోకాలకు, అన్నిదిశలకు, విదశలకు అతీతుడు. సత్యమునందు ప్రతిష్ఠితమైనవాడు.

ఆ మహాపురుషుడు ద్యావాపృథ్వులను, సమస్తలోకాలను, దశదిశలూ దాటి స్వర్గాన్ని, వాటి సత్యాన్ని దర్శించాడు. సత్యమునందే ప్రతిష్ఠితమైన వాడు. సత్యము, ఋతముల యందే ఉన్నాడు.

అతడు యజ్ఞయాగాలు చేసే ఇంట్లోనే ఉంటాడు. ఇంద్రుడికి చెలికాడు. అతన్ని ఇష్టపడని వారు లేరు.

మేధ పరమ పవిత్రమైనది. దానికోసం దేవతలు ఉపాసిస్తారు. ఓ దేవా ! నాకు కూడా అటువంటి మేధను ప్రసాదించవలసినది.

మాకు అగ్ని, ప్రజాపతి, ఇంద్రుడు, వాయువు, ధాతల బుద్ధిని ప్రసాదించుగాక. దేవతలు నా యందు మంచి సంపదను ప్రవేశపెడుదురు గాక. నా సంపదను, లక్ష్మిని, బ్రహ్మ, క్షత్రియులు అనుభవింతురు గాక.

ముప్పై ఒకటవ అధ్యాయంలో పురుష సూక్తాన్ని చెప్పారు. ఇందులో ప్రజాపతి స్వరూపాన్ని వివరించారు.

# 5. దీర్ఘరోగానికి (పంచ హవిష్కేష్టి)

శుక్లయజుర్వేదం పూర్తిగా యజ్ఞాలు యాగాల గురించే చెబుతోంది. లోకంలో ఏం సాధించాలన్నా ఒక యాగం చెయ్యండి. అంటోంది. జపతపాదుల కన్న కూడా అగ్నిద్వారా సమర్పించే ఆహుతులు దేవతలకు త్వరగా చేరతాయి. తద్వారా సాధకుడి యొక్క కోరిక కూడా సిద్ధిస్తుంది. ఈ వరుస క్రమంలో చెప్పేదే దీర్ఘరోగము.

అసలు దీర్ఘరోగము అంటే ఏమిటి? చాలా కాలంగా పీడిస్తున్న రోగాలనే దీర్ఘరోగాలు అంటారు. ఇవి సంవత్సరాల తరబడి మానవుణ్ణి పట్టిపీడిస్తూ ఉంటాయి. పక్షవాతం లాంటి వన్నమాట. పూర్వకాలంలో క్షయలాంటి రోగాలు కూడా ఉండేవి. కాని ప్రస్తుతం అవి కనుమరుగై పోయినాయి. ఏది ఏమైనా అసలు దీర్ఘకాలిక వ్యాధుల ఎందుకు వస్తాయి? అనే విషయం చూద్దాం.

ప్రాణము శరీరంలో ఉంటుంది. శరీరాన్ని అంటిపెట్టుకుని ఉంటుంది. ఇలా ప్రాణము శరీరాన్ని అంటిపెట్టుకుని ఉండటానికి కారణము అన్నరసము. అంటే ప్రాణం ఈ అన్నరసాన్ని తీసుకుని శరీరాన్ని అంటిపెట్టుకుని ఉంటుంది తద్వారా శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. ఇక్కడ ఒక్క విషయం చూడండి. ప్రాణానికి గనక అన్నరసము అందకపోయినట్లైతే ఆరోగ్యం దెబ్బ తింటుంది. రోగం వచ్చినప్పుడు ఈ అన్నరసము ప్రాణానికి చెందకుండా సోముడికి చెందుతుంది. అసలయితే మనం తీసుకున్న అన్నం మనస్సు మొ॥వాటితో కూడిన లింగశరీరానికి బలాన్నిస్తున్నది. ఈ కారణం చేతనే ప్రాణం దేహంలోనే ఉంటుంది. ఎప్పుడయితే ఈ అన్నరసము ప్రాణాగ్నికి చెందకుండా సోముడికి చెందుతున్నదో, అప్పుడు శరీరము

అగ్నిని పొందుతున్నది. అన్నరసము ప్రాణానికి గనక చెందకపోయినట్లైతే, శరీరం అగ్నికి చెందుతుంది అంటే శరీరం శుష్కించిపోతుంది. ప్రాణానికి, శరీరానికి అవినాభావ సంబంధమున్నది. మనం తిన్న అన్నం జఠరాగ్నికి చేరకపోయినట్లైతే, జఠరాగ్ని శరీరంలో ఉన్న మాంసధాతువుల్ని హరించేస్తుంది. ఇంకా వివరంగా చెప్పాలి అంటే శరీరాన్ని బాగా కష్టపెట్టి శ్రమచేస్తున్నాడు. కావలసిన ఆహారం మాత్రం తీసుకోవటం లేదు. అప్పుడు బయట నుంచి ఆహారం రావటం లేదు కాబట్టి శరీరంలో ఉన్న ధాతువులనే ఆహారంగా తీసుకుంటుంది జఠరాగ్ని. ఎవరైనా ఒక వ్యక్తి భోజనం చెయ్యకుండా ఒక నెలరోజులు నిరాహార దీక్ష చేశాడనుకోండి. అతని శరీరం బాగా జీర్ణించి పోతుంది. కళ్ళు లోతుకు పోతాయి. మనిషి సన్నబడి పోతాడు. కారణం అతడు ఆహారం తీసుకోవటం లేదు. ఆ కారణంగా శరీరంలోని నిల్వలు తరిగిపోతున్నాయి. అదే జరుగుతుంది. అటువంటి వాళ్ళు ఈ యాగం చెయ్యాలి. ఇది **చరుద్రవ్యకయాగము**. అంటే 'అత్తెసరు' పడేసి వండిన అన్నంతో హోమం చెయ్యాలి. అత్తెసరు అంటే ఏమిటో తెలియని వాళ్ళు కూడా ఉంటారు. వంట చేసుకోవటానికి ఇవాళ మనకు గ్యాస్‌స్టవ్, కుక్కరు వచ్చినాయి. కాని పూర్వ కాలంలో నా చిన్నప్పుడు కుంపట్ల మీద లేదా కట్టెల పొయ్యిమీదే వంట చేసేవాళ్ళు. అన్నం వండేందుకు రెండు పద్ధతులు ఉండేవి.

1. పొయ్యిమీద ఎసరు పడేసి, అది బాగా తెర్లిన తరువాత కడిగి వాడేసిన బియ్యం ఆ నీళ్ళలో పోసి, అన్నం ఉడికింది అనుకున్న తరువాత కొంచెం పదుమీదనే అన్నం వార్చే వాళ్ళు. అంటే ఉడుకుతున్న గిన్నెను క్రిందికి దింపి ఆ గిన్నెలో నీళ్ళు వంచేసి మళ్ళీ ఒక ఐదు నిమిషాలు గిన్నెను పొయ్యిమీద పెట్టేవాళ్ళు. ఇదొక పద్ధతి.

2. రెండవ పద్ధతిలో అత్తెసరు పడేసే వాళ్ళు. పొయ్యిమీద ఎసరు తెర్లిం తరువాత, కడిగిన బియ్యం నీళ్ళలో పోసి సన్నని మంటన ఉడకబెడతారు. గిన్నెలో నీళ్ళు వార్చరు. గంజి వార్చితే అన్నంలో బలం తగ్గిపోతుంది అని నమ్మకం.

ఈ రకమైన యాగం చెయ్యటానికి రెండవ రకంగా అత్తెసరు పడేసి అన్నం వండాలన్న మాట. ఆ అన్నానే 'చరువు' అంటారు. చరువుతో హోమం చెయ్యటంవల్ల అన్నరసం సోముడికి చెందకుండా ప్రాణానికే చెందుతుంది. శరీర రోగం తగ్గుతుంది.

అన్నరసాన్ని సోముడు గ్రహించినట్లైతే మనిషి క్షీణించి పోతాడు అన్నాం. అదే అన్నరసాన్ని వరుణుడు గనక గ్రహించినట్లైతే ఉదరకోశ వ్యాధి వస్తుంది. అన్నరసాన్ని వాక్కు అంటే సరస్వతి గనక పొందినట్లైతే మాట పడిపోతుంది. జీవాత్మ అగ్నావిష్ణులను ప్రవేశించినట్లైతే రోగి మరణోన్ముఖుడవుతాడు. ఈ రోగాలు తగ్గాలంటే

1. అష్టకపాల పురోడాశ ద్రవ్యక అగ్ని దేవతాకము
2. చరుద్రవ్యక సోమదేవతాకము
3. దశకపాల పురోడాశద్రవ్యక వరుణ దేవతాకము.
4. చరుద్రవ్యక సరస్వతీ దేవతాకము
5. ఏకాదశకపాల పురోడాశ ద్రవ్యక అగ్నావిష్ణుదేవతాకము అయిన **'పంచ హవిష్కేష్టి'** చెయ్యాలి.

# 6. మాత్సర్యనివారణ కోసం

దేవాసుర సంగ్రామం ఎప్పుడూ జరుగుతూనే ఉండేది. ఒకసారి దవేతలు, అసురులు యుద్ధానికి సిద్ధం అవుతున్నారు. దేవతల నాయకుడు ఎవరు? ఇదీ ప్రశ్న. దేవతలలో చాలామందికి తామే నాయకులు కావాలని కోరిక ఉంది. ప్రతివారు వాళ్ళ వాళ్ళ బలాలను సమీకరిస్తున్నారు. ఇంకొ కళ్ళు నాయకత్వాన్ని వీరు ఇష్టపడటం లేదు. దేవసైన్యం నాలుగు భాగాలుగా చీలిపోయింది. ప్రతిభాగానికి ఒకరు నాయకులయ్యారు.

| | | |
|---|---|---|
| 1. వసువులకు | – | అగ్ని |
| 2. రుద్రులకు | – | సోముడు |
| 3. మరుత్తులకు | – | ఇంద్రుడు |
| 4. ఆదిత్యులకు | – | వరుణుడు |

ఇందులో ఎవరూ ఇంకొకరి మాట వినరు. వారిని లెక్క చెయ్యరు. ఇలా అయితే అసురుల మీద విజయం కష్టం. అందుకని ఇంద్రుడు ప్రజాపతి దగ్గరకు వెళ్ళి ఏం చెయ్యమంటావని సలహా అడిగాడు. కొంచెం ఆలోచించి ప్రజాపతి ఒక యాగం చెయ్యమని సలహా ఇచ్చాడు. అదే **సంజ్ఞానీ నామక ఇష్టి.** ఆ యాగం చేశాడు ఇంద్రుడు. దాంతో దేవతలలో మాత్సర్యము అనేది పోయి, ఇంద్రుడే దేవతల నాయకుడుగా మిగిలిన వారందరూ అంగీకరించారు. కాబట్టి పరస్పరము మాత్సర్యాన్ని వదిలి, తనకు ప్రాధాన్యత రావటానికి ఇతరుల అంగీకారాన్ని కోరేవాడు ఈ యాగాన్ని చెయ్యాలి.

# 7. సంతానం కావాలంటే

పూర్వ కాలంలో ప్రజాపతి ప్రజలను సృష్టించాడు. ఆ ప్రజలకు ఇంద్రుడు, అగ్ని సంతానం కలగకుండా ప్రతిబంధకం కలిగించారు. దాంతో సంతానోత్పత్తి ఆగిపోయింది. ప్రజాపతికి ఈ విషయం తెలిసి ఇంద్రాగ్ని దేవతాకమైన ఏకాదశ కపాల పురోడాశద్రవ్యకమైన ఈ యాగం చేయించాడు. దాంతో ప్రజలకు సంతానం కలిగింది.

యవ్వనంలో ఉన్నవాడు, సంతానోత్పాదనలో సమర్థుడు, నపుంసకుడు కానివాడు, వృద్ధుడు కానివాడు, ఏ లోపాలు లేనివాడు గనక సంతానం పొంద లేకపోయినట్లైతే, సంతానం కలగటానికి ఇంద్రాగ్నులు ప్రతిబంధకాలుగా ఉన్నారని గుర్తించి ఇంద్రాగ్ని దేవతలకు సంబంధించిన ఏకాదశకపాల పురోడాశముతో ఈ హోమం చెయ్యాలి. పురోడాశము అంటే పిండిరొట్టె. కపాలము అంటే కుండ పెంకు. బియ్యంపిండి లేదా గోధుమపిండిని కుండ పెంకుల మీద కాల్చి దాంతో ఇంద్రాగ్నులకు హోమం చెయ్యాలి. ఏకాదశకపాలము అంటే ఆ రొట్టె ముక్కను పదకొండు కుండపెంకుల మీద కాల్చాలి. అలా కాల్చిన వాటితో హోమం చెయ్యాలి. అప్పుడు వారికి సంతానం కలుగుతుంది.

ఇతరులతో తగాదా ఏర్పడినప్పుడు కూడా ఈ యాగాన్ని చేసినట్లైతే శత్రువుల మీద విజయం సిద్ధిస్తుంది.

## 8. పాపనివృత్తికి

మానవుడు పాపాలు చెయ్యటము సహజం. అలా చేసిన పాపాల వల్ల కష్టాలు వస్తాయి. పాపాలయితే చేశాడు కాని కష్టాలనుభవించటానికి మాత్రం ఇష్టపడడు. అందుచేత చేసిన పాపాలు నాశనం కావటానికి కూడా ఒక యాగమున్నది. అదే ఇంద్ర దేవతాకమైన ఏకాదశ కపాల పురోడాశముతో హోమం చెయ్యటం, దీనివల్ల అన్ని రకాల పాపాలు నశిస్తాయి.

## 9. బంధన విముక్తి

తెలిసో, తెలియకో తప్పులు చేస్తాం. చేసిన తప్పుల వల్ల శిక్షలు అనుభవించాల్సి వస్తుంది. రాజభటులు ఖైదు చేస్తారు. సంకెళ్ళు వేస్తారు. ఇలాటి పరిస్థితిలో వీటి నుంచి తప్పుకోవాలి అంటే ఇంద్ర దేవతాకమైన ఏకాదశ కపాల పురోడాశ ద్రవ్యక యాగం చెయ్యాలి. అంటే పదకొండు కుండ పెంకులమీద కాల్చిన పిండి రొట్టెతో ఇంద్రుడికి హోమం చెయ్యాలి అని చెబుతోంది వేదం.

## 10. చర్మరోగానికి

చర్మవ్యాధి లక్షణాలు కనిపించగానే ఈ రకమైన యాగం చెయ్యాలి. ఇందులో సోముడు, పూష దేవతలకు వండిన అన్నంతో హోమం చేసినట్లైతే చర్మరోగాలు దూరమవుతాయి.

## 11. పూర్ణాయుష్యుకోసం

ఈ లోకంలో పరిపూర్ణమయిన ఆయుష్య అంటే వంద సంవత్సరాలు. ఇలా ఆరోగ్యంతో వంద సంవత్సరాలు జీవించాలంటే అగ్నిని ప్రార్థించాలి. అగ్నిదేవుని ప్రీతికోసం అష్టకపాల పురోడాశముతో

హోమం చెయ్యాలి.

"ఓ యజమానీ ! దేవతలలో శ్రేష్ఠుడైన అగ్ని నీకు సంపూర్ణమైన ఆయుష్యును ఇచ్చుగాక. ఒకవేళ అపమృత్యువు సంభవించినప్పటికీ, అగ్ని నీ ప్రాణాన్ని మళ్ళీ నీ దేహంలో ప్రవేశపెట్టును గాక. అన్ని రకాల వ్యాధులు నశించి పూర్ణాయుష్కుడ వవుదువు గాక"

ఓ అగ్నిదేవా ! చాలా యాగాలలో ఆవునేతినే వాడుతున్నారు. కాబట్టి ఇప్పుడు నేను కూడా గోఘృతంతోనే ఈ యాగము చేస్తున్నాను. నేను సమర్పించే హవిస్సులందుకుని నాకు పూర్ణాయువు ప్రసాదింతువు గాక" అని ప్రార్థిస్తారు.

## 12. మృత్యుంజయ హోమం

అపమృత్యువు అంటే అనుకోకుండా మృత్యువు రావటం. అకాల మృత్యువన్నమాట. ఒక్కొక్కసారి మనకి ఆరోగ్యం బాగా దెబ్బ తింటుంది. అటువంటి సమయంలో ఈ రకమైన హోమాలు ప్రత్యేకించి **'మృత్యుంజయ హోమం'** చెయ్యటం. జరుగుతుంది. ఈ హోమంలో ఆజ్యంతో పాటుగా బియ్యం, వండినఅన్నం, నల్లనువ్వులు కూడా ఉపయోగించటం జరుగుతుంది. **'త్రయంబకం యజామహే'** అనే మంత్రంతో ఈ హోమం చేస్తారు.

ఒకవేళ ఇబ్బంది ఎక్కువగా ఉన్నది అనిపిస్తే **'మృత్యుంజయ పాశుపతం'** హోమం చెయ్యటం జరుగుతుంది.

# 13. రాజసూయయాగము

రాజసూయము అనేది క్షత్రియులు మాత్రమే చేసే యాగము. అది కూడా సామ్రాట్ లేదా చక్రవర్తి కావాలనుకున్న మహారాజు ఈ యాగాన్ని చేస్తాడు. పూర్వ కాలంలో హరిశ్చంద్రుడు చేశాడు. తరువాత ధర్మరాజు రాజసూయాన్ని చేశాడు. అయితే ఒక విషయమేమంటే రాజసూయం చేసిన తరువాత భయంకరమైన యుద్ధం వచ్చి జననాశనము విపరీతంగా ఉంటుంది అని శాస్త్రాలు చెబుతున్నాయి. మహాభారతంలో ధర్మజుడు తన తండ్రుల్ని తాతల్ని స్వర్గలోకానికి పంపటం కోసం రాజసూయయాగం చేశాడు. ధర్మరాజు అలా నిర్ణయించుకున్నప్పుడే నారదుడు చెబుతాడు. "ఓ ధర్మనందనా! రాజసూయయాగం చేస్తే ఘోరమైన యుద్ధం సంభవించి జననాశనం విపరీతంగా జరుగుతుంది" అని ఈ మాట తెలిసి కూడా ధర్మజుడు కేవలం తన తండ్రులకు తాతలకు స్వర్గలోక ప్రాప్తి జరగాలనే కోరికతోనే ఈ యాగం చేశాడు.

ఈ యాగం ఫాల్గుణశుద్ధ దశమినాడు ప్రారంభమవుతుంది. యాగం చెయ్యాలంటే జైత్రయాత్ర చెయ్యాలి. ఇక ఈ యాగం గురించి **తొమ్మిదవ అధ్యాయంలో** వివరించటం జరిగింది. యాగంలో చెప్పే మంత్రాలకు అర్థం చూడండి.

"ఓ అగ్నీ ! నువ్వు శత్రుసేనను పరాభవించటమే కాదు. వారిని సుదూరంగా పారద్రోలాలి. శత్రువులను దూరం చేసిన నీవు యజ్ఞం చేసే యజమానికి బ్రహ్మవర్చస్సు ప్రసాదించవలసింది. యజమానీ ! సవితాదేవత అనుశాసనాలకు నిన్ను అధిపతిగా చెయ్యాలి. అగ్ని నిన్ను గృహస్థులకు అధిపతిగా చెయ్యాలి. సామ్రాట్టు వనవృక్షాలకు నిన్ను అధిపతిగా చెయ్యాలి. బృహస్పతి వాణికి నిన్ను అధిపతిగా చెయ్యాలి.

ఇంద్రుడు జ్యేష్ఠత్వానికి అధిపతిగా చెయ్యాలి. రుద్రుడు పశువులకు నిన్ను అధిపతిగా చెయ్యాలి. మిత్రావరుణులు నిన్ను ధర్మాధికారులకు అధిపతిగా చెయ్యాలి. దేవతలు నిన్ను అన్ని ధర్మాలకు అధిపతిగా చెయ్యాలి. ఓ హవిర్భాగ దేవతలారా! యజమానికి శత్రువులు లేకుండా చెయ్యండి. ఇంద్రుడు గొప్ప బలానిచ్చు గాక. ఓ జలమా ! నువ్వు ఎక్కడైనా ప్రవహిస్తావు. రాజ్యానిస్తావు. మాకు రాజ్యము ప్రసాదించవలసింది. దేవదత్తాదులకు రాజ్యాన్ని ప్రసాదించండి.

సముద్రజలమా! నువ్వు నదులకు స్వామిని. రాజ్యానిచ్చే దానవు మాకు రాజ్యము ప్రసాదించవలసింది. దేవదత్తాదులకు రాజ్యము ప్రసాదించవలసింది.

జలభ్రమణమా ! మాకు రాజ్యాన్ని ప్రసాదించు. దేవదత్తాదులకు కూడా రాజ్యాన్ని ప్రసాదించు.

స్థిరధర్మమున్న జలమా ! నీకు సూర్యతేజస్సు ఉన్నది. మాకు రాజ్యాన్ని ప్రసాదించు. దేవదత్తాదులకు రాజ్యాన్ని ప్రసాదించు.

యూపము నుండి స్రవించిన జలమా! నువు రాజ్యాన్నిచ్చే దానివి. మాకు రాజ్యాన్ని ప్రసాదించు. దేవదత్తాదులకు రాజ్యాన్ని ప్రసాదించు.

తటాకంలో ఉన్న జలమా ! నువ్వు పశువులకు పక్షులకు ఆనందం ఇచ్చేదానివి. మాకు రాజ్యాన్ని ప్రసాదించు. దేవదత్తాదులకు కూడా రాజ్యాన్ని ప్రసాదించు. బావిలో ఉండే జలమా ! నువ్వు రాజ్యాన్నిచ్చేదానివి. మాకు రాజ్యాన్ని ప్రసాదించవలసింది. దేవదత్తాదులకు కూడా రాజ్యాన్ని ప్రసాదించవలసినది.

అవశ్యాయ జలమా ! నిన్ను జనులందరూ కోరుతున్నారు. నువ్వు రాజ్యాన్నిచ్చే దానివి. మాకు రాజ్యాన్ని ఇవ్వవలసినది. దేవదత్తాదులకు కూడా రాజ్యాన్ని ప్రసాదించవలసింది.

తియ్యగా ఉండే ఓ జలమా ! నువు బలాన్ని రాజ్యాన్ని ఇచ్చేదానవు. మాకు రాజ్యాన్నివ్వలసింది. దేవదత్తాదులకు కూడా రాజ్యాన్ని ఇవ్వవలసినది.

శక్వరజ్వరమా ! నువ్వు ఆవుల వల్ల లభించినదానవు. నువ్వు రాజ్యాన్ని ఇచ్చేదానవు. మాకు రాజ్యాన్ని ప్రసాదించవలసింది. దేవదత్తాదులకు కూడా రాజ్యాన్ని ప్రసాదించు. నదులు గోవుల నుంచి ఆవిర్భవించాయి. అందుకే ఆవులవల్ల లభించావు అంటున్నారు.

దుగ్ధజలమా ! నీవు రాజ్యము ఇవ్వగలదానవు. మాకు రాజ్యాన్ని ప్రసాదించ వలసినది. అలాగే దేవదత్తాదులకు కూడా రాజ్యాన్ని ప్రసాదించవలసింది.

ఘృతరూపంలో ఉండే జలమా ! నువ్వు లోకాలను పోషించేదానవు. మాకు రాజ్యాన్ని ప్రసాదించవలసింది. దేవదత్తాదులకు రాజ్యాన్ని ప్రసాదించవలసినది.

ఘృతరాజు రూపంలో ఉండే జలమా! నువు లోకాలిస్తావు. దేవదత్తాదులకు రాజ్యాన్ని సంపాదించు.

మరీచి జలమా ! నీవు స్వయం శోభితవు. రాజ్యాన్నిచ్చే దానివి. మాకు రాజ్యాన్ని ప్రసాదించు, దేవదత్తాదులకు రాజ్యాన్ని ప్రసాదించవలసినది.

ఈ రకంగా పవిత్రమైన జలమా ! మాకు రాజ్యాన్ని ప్రసాదించవలసింది. అని జలాన్ని ప్రార్థిస్తున్నారు. ఓ పవిత్రజలములారా ! క్షత్రియుడైన ఈ యజమానికి (రాజసూయం చేసే రాజుకు) రాక్షసులు పరాభవించలేనటువంటి బలాన్ని ఇచ్చి, అతడికి రాజ్యాన్ని కూడా ఇవ్వవలసింది.

రాజసూయం చేసే మహారాజుకు శతృవులు లేకుండా సుస్థిరమైన

రాజ్యం ప్రసాదించమని ఇన్ని రకాలైన జలాన్ని ప్రార్థిస్తున్నాడు. ఇప్పుడు మనకి ఒక అనుమానం కూడా వస్తుంది. జలం రాజ్యాన్ని ఎలా ఇస్తుంది? అని అందుకే చెబుతున్నాడు. "జలం రాజ్యం ఇవ్వటమేమిటి? అని ఆశ్చర్యపోకండి. ఇదేం గొప్ప విశేషం కాదు. రాజ్యాన్ని నిర్మించేది, రక్షించేది జలములే. కేవలము ఒక జలంతో ఈ పని సాధ్యం కాదు. కాని ఇన్ని రకాల జలాలు కలిసి ఈ పని చెయ్యగలవు." ఈ రకంగా రాజుకు రాజ్యాన్ని, బలాన్ని ఇమ్మని జలాన్ని ప్రార్థించి ఇప్పుడు రాజును రక్షించమని వస్త్రము, బాణము వీటిని కూడా ప్రార్థిస్తున్నాడు. ముందుగా వస్త్రాన్ని ... ఓ వస్త్రమా ! యజమానిని గర్భంలో ధరించినట్లుగా కాపాడవలసినది. ఓ కంబళమా ! గర్భంలో ఉన్న యజమానిని కప్పే చర్మంటాది దానవు నువ్వు. యజమానిని గర్భంలో ధరించే యోనివి. ఇన్ని మాటలెందుకు? యజమానిని నువ్వు సర్వత్ర రక్షించాలి. ఇప్పుడు యజమానికి ముందుగా ధనస్సుచేతికి ఇచ్చి మూడు బాణాలు ఒకటి తరువాత ఒకటిగా వరుసగా మంత్రం చదువుతూ ఇస్తాడు.

1. ఓ బాణమా ! నువ్వు శత్రువును నాశనము చేయగలదానవు.
2. రెండవ బాణమా ! నువ్వు శత్రువును భేదించగలదానవు.
3. మూడవ బాణమా ! నువ్వు శత్రువును గడగడలాడించ గలదానవు.

ఇలా మూడు బాణాలు ఇచ్చి ఇప్పుడు ఆ బాణాలను ప్రార్థిస్తున్నాడు.

ఓ బాణమా ! నువ్వు తూర్పు దిక్కున ఉండి యజమానిని రక్షించుము. నువ్వు పడమటి దిక్కును రక్షించవలసింది. యజమాని ఉన్న చోటల్లా అతన్ని రక్షించు. ఓ బాణమా ! అన్ని దిక్కులయందు యజమానిని రక్షించవలసినది. ఇప్పుడు అక్కడ ఉన్న మానవులందరికీ

చెబుతున్నాడు. ఓ మానవులారా! యజమాని అందరి ముందు ప్రకటించబడ్డాడు. అగ్ని, ఇంద్రుడు, మిత్రావరుణులు, పూష, ద్యావాపృథువులు, అదితి వీరందరి ముందు యజమానికి అన్ని దిశలయందు నీకు రక్షణ ఉంటుంది అని చెబుతున్నారు.

1. ఓ యజమానీ ! నువ్వు తూర్పు దిక్కున ఉండు. అక్కడ నిన్ను గాయత్రి రక్షిస్తుంది. ధనరూప బ్రాహ్మణము నిన్ను రక్షిస్తుంది.
2. దక్షిణం దిక్కున ఛందము రక్షిస్తుంది. ధనరూప క్షాత్రము రక్షిస్తుంది.
3. పడమట జగతీచ్ఛందము రక్షిస్తుంది. సప్తదశ స్తోమములు నిన్ను రక్షిస్తాయి. వర్షఋతువు నిన్ను రక్షిస్తుంది.
4. ఉత్తర దిశన అనుష్టుప్ ఛందస్సు నిన్ను రక్షిస్తుంది. శరదృతువు నిన్ను రక్షిస్తుంది. యజ్ఞఫల స్వరూప ధనము నిన్ను రక్షిస్తుంది.
5. ఊర్ధ్వదిక్కున పంక్తి ఛందము నిన్ను రక్షిస్తుంది. హేమంత శశిర ఋతువులు నిన్ను రక్షిస్తాయి. తేజోరూపమైన ధనం నిన్ను రక్షిస్తుంది. ఇలా దశదిశల యజమానికి రక్షణ ఏర్పాటు చేస్తారు.

1. ఇప్పుడు పురోహితుడు ఫలాశ పాత్రలో ఉన్న జలముతో రాజును అభిషేకిస్తూ "ఓ రాజా ! చంద్రుడియొక్క కీర్తికాంతులతో నీకు అభిషేకం చేస్తున్నాను. సామ్రాట్‌వై వర్ధిల్లవలసింది. రాజువై మమ్మల్ని రక్షించవలసింది" అంటాడు తరువాత
2. రాజసోదరుడు ఔదుంబర పాత్రలోని జలంతో రాజును అభిషేకిస్తూ "ఓ రాజా! నిన్ను అగ్నియొక్క తేజస్సుతో అభిషేకిస్తున్నాను. ఏకమాత్ర క్షత్రియ పతివై వర్ధిల్లు. శత్రువుల బారి నుంచి ప్రజలను కాపాడు" అంటాడు.

3. రాజు గారి మిత్రుడు న్యగోధ పాత్రలోని జలంతో రాజుని అభిషేకిస్తూ "రాజా! నిన్ను సూర్య తేజస్సుతో అభిషేకిస్తున్నాను. ఏకమాత్ర క్షత్రియపతి వై వర్ధిల్లు. శత్రువుల బారినుండి ప్రజలను కాపాడు" అంటాడు.

4. వైశ్యుడు రాగిపాత్రలోని జలంతో రాజును అభిషేకిస్తూ "రాజా ! ఇంద్రుని బలంతో నిన్ను అభిషేకిస్తున్నాను. ఏకమాత్ర క్షత్రియపతివై వర్ధిల్లు. శత్రువుల బారి నుండి ప్రజలను కాపాడు" అంటాడు.

ఇలా రాజును అభిషేకించే సమయంలో పురోహితుడు కొన్ని మంత్రాలు చదువుతూ...

"దేవతలారా ! ఈ రాజుకు శత్రువులు లేకుండా చెయ్యండి. ఈయనని మహాసామ్రాజ్యంలో నుంచోపెట్టండి. ఇంద్రుడు ఇతనికి గొప్ప బలానిచ్చుగాక. రాకుమారుని దేశప్రజలకు అధిపతిగా చేయండి. (యువరాజు) కాని బ్రాహ్మణులకు మాత్రం **'సోముడే'** రాజు.

తరువాత యజమాని (రాజు)తో మూడు అడుగులు వేయిస్తూ

1. మొదటిది యజ్ఞపురుషుడు జగదీశ్వరుడు మొదటి పాదము పెట్టిన భూమి ఇది.
2. యజ్ఞపురుషుడు జగదీశ్వరుడు రెండవ పాదము మోపిన అంతరిక్ష మిది.
3. యజ్ఞపురుషుడు జగదీశ్వరుడు మూడవ పాదము మోపిన స్వర్గలోకమిది. అంటారు.

అంటే ఆ రాజు ముల్లోకాలు ఆక్రమించాడు. ముల్లోకాలకు

అధిపతి అని అర్థం.

ఈ రకంగా 'రాజసూయ యాగం చేసే రాజుగారు సాక్షాత్తు జగదీశ్వరుడి లాగా మూడడుగులతో ముల్లోకాలు ఆక్రమించాడు. దేవతలు, దశదిశలు, అందరూ అన్ని వైపుల నుంచి ఇతన్ని రక్షించండి. ఇతడు ప్రజలను కన్నబిడ్డలలాగా కాపాడతాడు' అంటూ ఆశీర్వదిస్తారు.

ఈ రకంగా సాగుతుంది రాజసూయ యాగము. సార్వభౌమాధికారం కోసం చేయబడుతుంది రాజసూయము. ఈ యాగము చేసిన వారిని **'సామ్రాట్టు'** అంటారు.

# 14. పితృమేధము

మరణించిన వ్యక్తికి చేసే సంస్కారము ‘పితృమేధము’. మరణించిన వ్యక్తి కళేబరాన్ని స్మశానానికి తీసుకుపోయి అక్కడ నేలలో గొయ్యి తీసి కళేబరాన్ని పాతిపెట్టి సమాధి కడతారు. ఆ తరువాత అతడు స్వర్గలోకం చేరాలని, అతడికి ఉత్తమజన్మ కలగాలని అగ్నిదేవుని ప్రార్థిస్తారు. ఈ విషయమంతా పితృమేధము **అనే 35వ అధ్యాయంలో** ఉన్నది. అందులో 22 మంత్రాలున్నాయి. ఇప్పుడు మనం ఆ మంత్రార్థం చూద్దాం.

కష్టాలు కలిగించే వారు, దేవతలను హింసించేవారు అయిన పణులు (అసురులు) ఇక్కడ నుంచి వెళ్ళిపోవాలి. ఈ స్థానాన్ని యముడు మృత్యువుకు ఇచ్చాడు.

ఓ మృతుడా ! నీ శరీర భాగాల కోసం సవిత భూమిలోపల స్థలమును కోరుతుంది. ఈ స్థలాన్ని వాయువు పవిత్రం చేస్తాడు. సవిత పవిత్రం చేస్తాడు. అగ్ని, సూర్యుడు తమ తేజస్సుతో ఈ ప్రదేశాన్ని పవిత్రం చేస్తారు. (అని చెప్పి స్థలాన్ని తవ్వి మరణించిన వాని అస్థికలు పాతిపెడతారు. ఆ తరువాత ఓషధులను పిలుస్తున్నారు)

ఓషధులారా! రావిచెట్టు మీద, మోదుగు ఆకుల మీద మీరు ఉన్నారు. మీరు ఈ మృతకళేబరాన్ని సేవించాలి. అందుకోసం భూమిలోకి రండి. ఓ మృతుడా ! నీ అస్థికలను సవిత భూదేవి వడిలో చేరుస్తుంది. ఓ భూదేవీ నువ్వు ఈ మరణించిన వాని కోసం శాంతమూర్తివి కావాలి. ఓ మృతుడా ! నిన్ను ప్రజాపతి యందు చేరుస్తున్నాను. ఆ ప్రజాపతి మా పాపములు దహించును గాక.

ఓ మృత్యువా ! నీ మార్గము దేవయానము కాదు. ఇంకేదైనా మార్గం గుండా వెళ్ళిపో. చెవులు, కళ్ళు ఉన్న నీతో చెబుతున్నాను. నువ్వు మా సంతానాన్ని మా వాళ్ళని తాకవద్దు. ఓ మృతుడా ! వాయువు, సూర్యుడు నీకు సుఖాన్నిస్తారు. ఇటుకలు కూడా నీకు సుఖాన్నిస్తాయి. అంటూ సమాధిలో ఇటుకలు పేరుస్తారు. ఓ మృతజీవీ! ఈ పార్థివాగ్ని నిన్ను దహనము చేయకుండా నీకు సుఖాన్ని కలిగించాలి.

నీ కోసం దిశలు ఏర్పడతాయి. జలం నీకు ఎక్కువ సుఖాన్ని కలిగించాలి. నదులు నీకు సుఖాన్ని ఇవ్వాలి. అంతరిక్షము నీకు శుభాన్ని చేకూర్చాలి. మృతుని బంధువులారా ! ఈ నది గులకరాళ్ళతో ఉన్నది. జాగ్రత్తగా నిలదొక్కుకోండి. జాగ్రత్తగా ఈ నదిని దాటండి. అశుభాలు అన్నీ ఈ నదిలో వదిలేస్తున్నాము. శుభకరములు, పథ్యములు అయిన అన్నములచే ఈ నదిని దాటుతున్నాము.

జలము, ఓషధులు మాతో స్నేహం చెయ్యాలి. మేము ద్వేషించే వారిని, మమ్మల్ని ద్వేషించే వారిని జలము, ఓషధులు శత్రువులులాగా చూడాలి. మేము ఎద్దుతోకను పట్టుకుని దాన్ని తాకుతున్నాము. ఈ ఎద్దు సురభియొక్క కుమారుడు. (సురభి అంటే కామధేనువు) ఇది మాకు అన్నీ శుభాలు చేకూర్చాలి. దేవతలను ఇంద్రుడు రక్షించినట్లుగా ఈ ఎద్దు మమ్మల్ని రక్షించాలి. అంధకారానికి అవతల స్వర్గీయ జ్యోతిని దర్శించాము. సూర్యుణ్ణి, అతని ఉత్తమజ్యోతిని చేరుకున్నాము. ఇలా చెప్పి ఊరి స్మశానానికి ఆవల లాంఛనంగా ఒక రాతిని ఉంచాలి. ఈ రాయి జీవించి ఉన్నవాళ్ళకి హద్దు అవుతున్నది. మిగిలిన వాళ్ళెవరూ మృత్యువాత పడరాదు. మృత్యువును పర్వతాలచాటున దాచివేయండి.

అందరూ వందసంవత్సరాలు జీవించండి.

ఓ అగ్నీ ! మా ఆయుష్షును పవిత్రం చెయ్యి. దుష్టులను దూరంగా ఉంచు. అగ్నీ! నువ్వు హవిస్సు వల్లనే పెరిగావు. ఘృతము వల్ల పరిపూర్ణుడవైనావు. ఘృతంతో పుట్టి పెరిగావు. గోఘృతాన్ని పానము చెయ్యి. తండ్రి తన కుమారుల రక్షించినట్లుగా మా పుత్రాదులను రక్షించు.

మరణించిన ఈ వ్యక్తి గోదానము చేశాడు. యజ్ఞయాగాదులు చేశాడు. దేవతలకు హవిస్సులిచ్చాడు.

పచ్చిమాంసము తినే అగ్నిని పారద్రోలుతున్నాను. అది పాపాన్ని మోసుకొని స్మశానానికి పోవాలి. యజ్ఞకుండంలోని అగ్ని దానికి భిన్నమైనది. ఇది దేవతలకు హవిస్సులు తీసుకుపోతుంది. ఓ అగ్నీ ! నువ్వు జాతవేదివి. పిత్రుదేవతలు ఎక్కడున్నారో నీకు తెలుసు. వారి కోసం వపను తీసుకువెళ్ళి వారి ఆశీస్సులు మాకు అందించు. ఓ భూమీ ! నీవు కంటక రహితము, శుభప్రదము అయి ఎన్నో సుఖాలు మాకు కలిగించవలసింది. ఈ జలము మా పాపాలు కడిగి మమ్ము పునీతులుగా చేస్తుంది. ఓ అగ్నీ నువ్వు ఇతడికోసం ఆవిర్భవించావు. ఇతడు మళ్ళీ నీలో జన్మించాలి. ఇతడు స్వర్గం చేరాలి. అంటూ 22 మంత్రాలు చెబుతారు.

# 15. నరమేధము

యజ్ఞయాగాలు చేసేటప్పుడు పశువును బలిఇవ్వటం పరిపాటి. అందులో మేక, గొర్రె, ఆవు, ఎద్దు లాంటివి బలిగా ఇవ్వబడతాయి. అయితే మనషిని యజ్ఞపశువుగా ఇచ్చే ప్రక్రియ కూడా ఉంది. ఇందులో బలి ఇవ్వదగిన 184 మంది వ్యక్తుల పట్టిక ఇవ్వబడింది.

పూర్వకాలంలో రుచికుడు అనే ఒక మునీశ్వరుడు ఉండేవాడు. అతనికి ముగ్గురు కుమారులు. వారిలో రెండవ వాడు శునశ్శేపుడు. ఒకనాడు అంబరీషుడు వచ్చి "మునీశ్వరా! నీకు లక్షగోవులు ఇస్తాను. నీ కుమారులలో ఒకరిని నాకు యాగపశువుగా ఇవ్వవలసింది" అన్నాడు. ఆలోచించాడు రుచికుడు. పెద్దకుమారుడు అంటే ఆయనకు చాలా ప్రీతి. అందుకని భార్యతో సంప్రదించాడు. ఆఖరు కుమారుడంటే ఆవిడకు ప్రీతి. ఇదే మాట రుచీక దంపతులు అంబరీషుడికి చెబుతుండగా రుచీకుడి రెండవ కుమారుడు విన్నాడు. పెద్దవాడు మా నాన్నకి కావాలి. ఆఖరువాడు మా అమ్మకి కావాలి. ఇక మిగిలిన నేను ఎవరికీఅక్కర్లేదు. కాబట్టి ఓ రాజా ! లక్ష గోవులు మా తండ్రికి ఇచ్చి నన్ను యాగపశువుగా తీసుకువెళ్ళు అన్నాడు. అంబరీషుడు మునీశ్వరుడికి లక్షగోవులిచ్చి శునశ్శేపుణ్ణి తీసుకుపోయాడు. అంబరీషుడి వెంట వెడుతున్న శునశ్శేపుడికి దుఃఖం ఆగటం లేదు. మార్గమధ్యంలో రాజుగారు విశ్రాంతి కోసం ఆగారు. ఆ సమయంలో ఒకచెట్టుక్రింద కూర్చుని విలపిస్తున్నాడు శునశ్శేపుడు. అప్పుడు అటుగా పోతున్న విశ్వామిత్రుడు శునశ్శేపుడి దగ్గరకు వచ్చి వృత్తాంతం తెలుసుకుని అతడికి ఒక మంత్రం చెప్పి 'బాలకా ! నువ్వు ఈ మంత్రాన్ని జపం చేస్తూ ఉండు. నీకేం కాదు' అని చెప్పి వెళ్ళిపోయాడు. మంత్రజపం చేస్తున్నాడు మునిబాలకుడు. అంబరీషుడు యజ్ఞవాటికకు

చేరుకున్నాడు. శునశ్శేపుణ్ణి యూపస్తంభానికి కట్టేశారు. యజ్ఞపశువును కట్టేసే స్తంభాన్ని 'యూపస్తంభము' అంటారు. యజ్ఞం ప్రారంభమైంది. తనకు సమయం ఆసన్నమైంది. ఆ మాట తలచుకుంటేనే దుఃఖం పెల్లుబికి వస్తోంది శునశ్శేపుడికి. అయినా సరే విశ్వామిత్రుడు చెప్పిన మంత్రాన్ని మాత్రం జపం చేస్తూనే ఉన్నాడు. ఆఖరు నిమిషంలో ఇంద్రుడు ప్రత్యక్షమై శునశ్శేపుణ్ణి రక్షించి అంబరీషుడికి యాగఫలాన్ని కూడా ఇచ్చాడు. ఈ కథ రామాయణంలో ఉంది. నరమేధానికి ఇది ఒక ఉదాహరణ. నరమేధాన్ని గురించి **ముప్ఫైయవ అధ్యాయంలో** చెబుతున్నారు. అందులోని మొదటి నాలుగు మంత్రాలలో --

"ఓ సవితాదేవా ! యజ్ఞానికి ప్రేరణ కలిగించు. యజమాని సంపదకు ప్రేరణ కలిగించు. వాణీపతి, దివ్యజ్ఞాన సంపన్నుడు అయిన వాచస్పతిని స్తుతి చేస్తున్నాము.

సవితయొక్క దివ్యమైన తేజస్సు మా కర్మలను, బుద్ధులను ప్రోత్సహించును గాక. ఆ తేజస్సు మాలో ప్రవేశించును గాక.

ఓ సవితా ! మాలోని దుర్గుణాలను తొలగించు. మంచి గుణాలు మాలో ప్రవేశపెట్టవలసింది. అని ముందుగా 'సవిత'ను ప్రార్థిస్తున్నారు.

ఈ యాగంలో మానవుణ్ణి యజ్ఞపశువుగా ఉపయోగిస్తారు. ఇక్కడ మొత్తం పదకొండు యూపస్తంభాలు (యజ్ఞపశువును కట్టేసే కొయ్యలు) ఉంటాయి. మొదటి స్తంభానికి నలభై ఎనిమిది మందిని, మిగిలిన పదింటికి ఒక్కక్క దానికి పదకొండు మందిని మొత్తం 48+110 = 158 మందిని పశువులుగా కట్టేస్తారు. వీరిని ఒక్కొక్క రకానికి ఒకొక్కరుగా కట్టేస్తారు. వాళ్ళందరినీ చెబుతున్నారు ఈ అధ్యాయంలోని ఇరవైరెండు మంత్రాలలో

**మొదటి యూపస్తంభానికి**

| | | |
|---|---|---|
| బ్రహ్మకోసం | – | బ్రాహ్మణుడు |
| క్షత్రియుల కోసం | – | క్షత్రియుడు |
| మరుత్తుల కోసం | – | వైశ్యుడు |
| తపస్సు కోసం | – | శూద్రుడు |
| అంధకారం కోసం | – | తస్కరుడు (దొంగ) |
| నరకానికి | – | అష్టాగ్నులు |
| పాపానికి | – | నపుంసకుడు |
| అయోగ్యులకు | – | అయోగ్యుడు |
| కామానికి | – | వ్యభిచారి |
| అతికృష్ణులకు | – | మాగధులు (వంది మాగదులు, భట్రాజు) |
| నృత్యానికి | – | సూతుడు |
| గీతానికి | – | శైలూషుడు |
| ధర్మానికి | – | సభాచరుడు |
| నరిష్ఠకు | – | భీమలుడు |
| నర్మమునకు | – | రేభము |
| హసుడికి | – | కరణవిష్టుడు |
| ఆనందానికి | – | స్త్రీ సఖుడు |
| ప్రమదముకు | – | కుమారీపుత్రుని |
| మేధకు | – | రథకారుని |
| ధైర్యానికి | – | సూత్రధారిని |
| తపస్సుకు | – | కులాలుడిని |
| మాయకు | – | కమ్మరిని |
| రూపానికి | – | మణికారుని |
| శుభమునకు | – | గింజలు నాటేవాడు |

| | | |
|---|---|---|
| శరవ్యమునకు | – | బాణకారుడు |
| హేతికి | – | ధనస్సులు తయారుచేసేవాడు |
| కర్మకు | – | జ్యానిర్మాతను |
| దిష్టకోసం | – | త్రాళ్ళు పేనేవాడు |
| మృత్యువుకోసం | – | వ్యాధిని |
| యముడికి | – | కుక్కలతో వేటాడేవాడు |
| నదులకు | – | పుల్కసపుత్రుని |
| ఎలుగుబంట్లకు | – | నిషాదుడు |
| పెద్దపులికి | – | ఉన్నతుడు (పొడవైనవాడు) |
| గంధర్వులు,అప్సరసలకు | – | వ్రాత్యుడు |
| ప్రియంగులకు | – | ఉన్మత్తుడు |
| సర్పాలకు | – | కుంటివాడు |
| ఆయులకు | – | కితవుడు |
| ఈర్యతకు | – | అకితవుడు |
| పిశాచాలకు | – | విదలకారిని |
| యాతుధానులకు | – | కంటకీకారుడు |
| సంధ్యకు | – | జారుడు |
| గోహకు | – | ఉపపతిడు |
| ఆర్తికి | – | పరివృత్తిని |
| నిర్రుతికి | – | ఇతుని |
| అపరాధ్యకు | – | అవివాహితుడు |
| నిష్కృతికి | – | రూపకరిని |
| సంజ్ఞానమునకు | – | స్మరకారిని |
| ప్రకామోద్యకు | – | ఉపసదుని |

వీళ్ళు మొత్తం 48 మంది. వీరిని మొదటి యూపస్తంభానికి కట్టేస్తారు. ఇక **రెండవ యూపస్తంభానికి**

| | | |
|---|---|---|
| ఉత్సాదులకు | – | కుబ్జను |
| ప్రముదకు | – | వామనుని |
| ద్వారములకు | – | స్రాముని |
| స్వపానికి | – | అంధుడిని |
| అధర్మానికి | – | బధిరుడిని |
| పవిత్రమునకు | – | వైద్యుని |
| ప్రజ్ఞానానికి | – | జ్యోతిష్యుని |
| అశిక్షకు | – | శకునములు అడుగువాడు |
| ఉపశిక్షకు | – | అభిప్రశ్నకర్త |
| వర్ణానికి | – | అనురుధుని |
| బలమునకు | – | ఉపదను |

వీళ్ళు పదకొండు మందిని రెండవ యూపస్తంభానికి కట్టేస్తారు. ఇక **మూడవ యూపస్తంభము.**

| | | |
|---|---|---|
| మర్యాదకు | – | ప్రశ్నవక్తను |
| అర్మలకు | – | హస్తిపాలుడు |
| జనమునకు | – | అశ్వపాలుడు |
| పుష్టికి | – | గోపాలుడు |
| వీర్యానికి | – | అవిపాలుడు |
| తేజమునకు | – | అజపాలుడు |
| ఇరకు | – | కీనాశుడు |
| కీలాలముకు | – | సురాకారుడు |
| భద్రమునకు | – | గృహపాలుడు |

| | | |
|---|---|---|
| శ్రేయస్సుకు | – | మహాజనుడు |
| అధ్యక్షమునకు | – | అనుక్షత్తారుడు |

ఈ పదకొండు మందిని మూడవ యూపస్తంభానికి కట్టేస్తారు. ఇక **నాల్గవ యూపస్తంభము.**

| | | |
|---|---|---|
| మాయకు | – | కట్టెలు కొట్టేవాణ్ణి |
| ప్రభకు | – | అగ్నివర్ధకుణ్ని |
| సూర్యలోకానికి | – | అభిషేక్తను |
| శ్రేష్ఠ స్వర్గానికి | – | పరివేషణ కర్త |
| దేవలోకానికి | – | పేశిత |
| మనుష్యలోకానికి | – | ప్రకరిత |
| అన్నిలోకాలకు | – | ఉపసేక్త |
| అమరుతి వధకు | – | ఉపమంథిత |
| మేధకు | – | రజకుడు |
| ప్రకామముకు | – | రంగులవాడు |
| ఋతమునకు | – | స్తేనహృదయుడు. |

ఈ పదకొండుమందిని నాల్గవ యూపస్తంభానికి కట్టేస్తారు. ఇక **ఐదవ యూపస్తంభము.**

| | | |
|---|---|---|
| వైరహత్యకు | – | పిశుడిని |
| వివక్తకు | – | క్షత్తను |
| ఔపద్రష్ట్యకు | – | అనుక్షత్తను |
| బలానికి | – | అనుచరుని |
| భూమికి | – | పరిష్కందుని |
| ప్రియమునకు | – | ప్రియవాదిని |
| అరిష్టమునకు | – | అశ్వవాదిని |
| స్వర్గానికి | – | భామదుధను |

| | | |
|---|---|---|
| శ్రేష్ఠనామకమునకు | – | పరివేష్టుని |
| మన్యుకు | – | లోహతాపకుడు |
| క్రోధానికి | – | నిసరుడు |

ఈ పదకొండు మందిని ఐదవ యూపస్తంభానికి కట్టేస్తారు. ఇక **ఆరవ యూపస్తంభము.**

| | | |
|---|---|---|
| శోకమునకు | – | అభిసర్త |
| క్షేమానికి | – | విమోక్త |
| ఉత్కూలవికూలములకు | – | శీతవానుడు |
| విపుషుకు | – | మానకారి |
| శీలమునకు | – | కజ్జలకారి |
| నిర్ఋతికి | – | కోశకారి |
| యమునకు | – | వంధ్య |
| యముడి కోసం | – | కవలలవాడు |
| అధ్వర్యులకు | – | అవతోకము |
| సంవత్సరమునకు | – | పర్యాయణి |
| యోగానికి | – | యోగి |

ఈ పదకొండు మందిని ఆరవ యూపస్తంభానికి కట్టేస్తారు. ఇక **ఏడవ యూపస్తంభానికి**

| | | |
|---|---|---|
| పరివత్సరమునకు | – | అవిజాతుని |
| ఇడావత్సరమునకు | – | కులట |
| ఇది వత్సరానికి | – | ప్రదరరోగిని |
| వత్సరానికి | – | వదులు వంటి దానిని |
| సంవత్సరానికి | – | శ్వేతకౌశను |
| ఋభువులకు | – | చర్మకారుడు |
| సంధ్యలకు | – | చెప్పులు కుట్టేవాడు |

సరులకు - ధీవరుడు

ఉపస్థావరులకు - దాశుడు

వైశంంతులకు - బైందుడు

నంగలమునకు - మృతకారుడు

ఈ పదకొండు మందిని ఏడవ యూపస్తంభానికి కట్టేస్తారు.

ఇక **ఎనిమిదవ యూపస్తంభానికి**

పారమునకు - మార్గరి

అవారమునకు - కైవర్తుడు

విషములకు - మైనాలుడు

స్వనములకు - పర్ణకుడు

గృహములకు - కిరాతుడు

సానువులకు - జంభకుడు

పర్వతములకు - కింపురుషుడు

బీభత్సమునకు - పుల్కసుడు

వర్ణమునకు - స్వర్ణకారుడు

త్రాసుకు - వర్తకుడు

తీర్థములకు - అంధుడు

ఈ పదకొండు మందిని ఎనిమిదవ యూపస్తంభానికి కట్టేస్తారు.

ఇక **తొమ్మిదవ యూపస్తంభానికి**

పశ్చాదోషానికి - గ్లాబిని

అన్ని భూతాలకు - సిధ్మలుని

భూతికి - జాగరణుని

అభూతికి - శయనము

ఆర్తికి - జనవాదిని

వ్యర్ధికి – ఉపగల్భుని

సశరముకు – ప్రచ్ఛిదుని

అక్షరాజముకు – కితవుడు

కృతమునకు – ఆదినవదర్శుని

త్రేతకు – కల్పకుని

ద్వాపరానికి – అధికల్పిని

ఈ పదకొండు మందిని తొమ్మిదవ యూపస్తంభానికి కట్టేస్తారు.

ఇక **పదవ యూపస్తంభానికి**

ఆస్కంధమునకు – సభాస్థాణుని

మృత్యువుకు – గోవ్యచ్ఛుని

అంతకునికి – గోఘాతిని

క్షుధకు – గోమాంసయాచకుని

దుష్కృతమునకు – చరకాచార్యుని

పాపమునకు – సైలగుని

ప్రతిశ్రుత్కమునకు – అర్తనుని

ఘోషమునకు – భషుని

అనంతమునకు – మూగవాణ్ణి

శబ్దానికి – కోలాహలకారిని

అంతమునకు – బహువాదిని

ఈ పదకొండు మందిని పదవ యూపస్తంభానికి కట్టేస్తారు.

ఇక **పదకొండవ యూపస్తంభము.**

మహాసమునకు – వీణావాది

క్రోశము – వేణువాది

ఆవరత్పరము – శంఖవాది

| | | |
|---|---|---|
| వనమునకు | – | వనపాలకుడు |
| అరణ్య శేషముకు | – | దానపాలకుడు |
| నర్మమునకు | – | వ్యభిచారి |
| హంసకు | – | చాకలి |
| యాదసముకు | – | శావలి |
| గ్రామణ్యం | – | గ్రామనేత్రం |
| గణకానికి | – | జ్యోతిర్విదం |
| అభిక్రోశాలికి | – | నిందకుడు |

ఈ పదకొండు మందిని పదకొండవ యూపస్తంభానికి కట్టేస్తారు. వీరు కాక

| | | |
|---|---|---|
| అగ్నికి | – | లావువాడు |
| పృధ్వికి | – | కుంటివాడు |
| వాయువుకు | – | ఛండాలుడు |
| అంతరిక్షానికి | – | వెదురుగడ మీద ఆడేవాడు. |
| దినానికి | – | బట్టతలవాడు |
| సూర్యుడికి | – | హరితనేత్రుడు |
| నక్షత్రాలకు | – | కిర్మీరుడు |
| చంద్రుడికి | – | కిలాసుడు |
| పగలుకు | – | శుక్లవర్ణ పింగళాక్షుడు |
| రాత్రికి | – | కృష్ణవర్ణ పింగళాక్షుడు |

వీళ్ళని కూడా తీసుకువస్తారు. వీరు కాకుండా ఇంకా ఎనిమిది మంది కావాలి. వారు బ్రాహ్మణులు, శూద్రులు కానివారు అయి ఉండాలి.

1. అతిపొడవువాడు
2. అతిపొట్టివాడు
3. అతిలావువాడు
4. అతిసనన్నువాడు
5. అతితెల్లనివాడు
6. అతినల్లనివాడు
7. వెంట్రుకలు లేనివాడు
8. అతివెంట్రుకలు గలవాడు

వీరు ప్రజాపతి దేవతాసంబంధగల వాళ్ళు.

1. అబ్రాహ్మణులు 2. అశూద్రులు 3. మాగదిపుశ్చలుడు, 4. జూదరి 5. నపుంసకుడు. వీరు ప్రజాపతి సంబంధం గలవారు. ఈ రకంగా యూపస్తంభాలకు 158 మందిని, వారు కాక మరికొంతమందిని మొత్తం 184 మందిని నరమేధానికి సిద్ధం చెయ్యాలి.

# 16. అశ్వమేధము

ఇది చాలా గొప్పయాగం. కృష్ణయజుర్వేదంలో దీన్ని గురించి కొంత చెప్పుకున్నాం. కాని శుక్ల యజుర్వేదంలో 22 నుంచి 25 వరకు నాలుగు అధ్యాయాలు పూర్తిగా అశ్వమేధ యాగము, దానికి సంబంధించిన మంత్రాలు, కలాపము విపులంగా చెప్పబడ్డాయి.

ఇది చాలా ప్రసిద్ధమైన యాగం. దీన్ని చేసిన వాడు సామ్రాట్, ఏకరాట్, సార్వభౌముడు అనిపించుకుంటాడు. ఏకఛత్రాధిపత్యం కలిగి ఉంటాడు. తన బలాన్ని చూపటానికే రాజు ఈ యాగాన్ని చేస్తాడు. సరిగ్గా చెప్పాలంటే మూడు రోజులు పడుతుంది ఈ యాగం. ఒక సంవత్సరం ముందు అంకురార్పణ చేసి అశ్వాన్ని వదుల్తారు. అది సంవత్సర కాలం పాటు నిరాటంకంగా దేశమంతా సంచరిస్తుంది. దాని ముఖాన ఒక బంగారు రేకుమీద "ఫలానా రాజుగారు అశ్వమేధం చేస్తున్నారు. ఇది అశ్వమేధాశ్వము. వీరులు ఎవరైనా ఉంటే దీనిని బంధించండి. లేకపోతే కానుకలు సమర్పించి సుహృద్భావంతో సంచరించండి'' అని వ్రాసి ఉంటుంది. ఆ అశ్వరక్షణ కోసం కొంతమంది వీరులు దాని వెనక వెడతారు. ఎవరైనా ఎదిరిస్తే వారితో యుద్ధం చేసి వారిని ఓడించాలి. ఇది రాజుగారి శౌర్యానికి, పరాక్రమానికీ కొలబద్ద. సంవత్సరం తరువాత మొదటిరోజు అగ్నిష్టోమం, రెండవ రోజు అశ్వమేధం, మూడవరోజు అతిరాత్రం జరుగుతాయి. అవబృధస్నానంతో ఇది పూర్తవుతుంది. రాజుయొక్క అభ్యుదయము, ప్రజా సంక్షేమముల కోసం అశ్వమేధం జరుగుతుంది.

పూర్వకాలంలో దశరథుడు ఈ యాగం చేశాడు. సగరుడు అశ్వమేధం చేసినప్పుడు ఇంద్రుడు అశ్వాన్ని ఎత్తుకుపోయి కపిలమహర్షి

ఆశ్రమంలో దాచాడు. శ్రీరాముడు ఈ యాగం చెయ్యాలనుకున్నప్పుడు ఆయన కుమారులు లవకుశులే అశ్వాన్ని బంధించారు. త్రిపురారహస్యంలో వంగదేశానికి చెందిన 'సుషేణుడు' అనే మహారాజు అశ్వమేధయాగాన్ని ప్రారంభించి, యాగాశ్వానికి రక్షణగా తన తమ్ముడు మహాసేనుణ్ణి పంపాడు. ఇరావతీ నదీ ప్రాంతంలో తంగణమహర్షి కుమారుడు అశ్వాన్ని దాచేశాడు.

ఇక్ష్వాకు వంశానికి చెందిన నహుషుడు నూరుఅశ్వమేధయాగాలు చేసి ఇంద్రపదవి పొందాడు.

**ఫాల్గుణశుక్ల అష్టమ్యామారంభః** ఈ యాగాన్ని ఫాల్గుణశుద్ధ అష్టమినాడు ప్రారంభం చెయ్యాలి అని చెబుతోంది వేదం. నాలగు బంగారు నాణెముల హారాన్ని అధ్వర్యుడు యజమాని మెడలో వేస్తాడు. దాన్ని 'నిష్కము' అంటారు. ఇప్పుడు యజమాని దానికి నమస్కరించి 'ఓ నిష్కమా ! నీవు పరిశుద్ధమైన దానివి. ఆయువును రక్షించే దానివి. నా ఆయువును రక్షించవలసింది' అని ప్రార్ధిస్తాడు.

అధ్వర్యుడు ఒక త్రాడును గుర్రానికి కడుతూ "ఓ అశ్వమా ! నీవు అందరికీ ఆశ్రయానివి. అందరినీ నియంత్రించే దానివి. నువ్వు అందరి మేలు కోరే అగ్నిదేవుని చేరుకోవలసింది. ఓ గుర్రమా ! నేను దేవతలు మరియు ప్రజాపతి కోసం నిన్ను తెచ్చాను. నిన్ను స్వయంగా వారి దగ్గరకు చేరుకునేటట్లుగా చేస్తాను. అని బ్రహ్మ దగ్గర అనుజ్ఞ తీసుకుని త్రాడు అశ్వానికి కడతాడు. తరువాత యాగకలాపము జరుగుతుంటుంది. ఈ సమయంలో వారు పరమేశ్వరుణ్ణి ప్రార్ధిస్తున్నారు **22వ మంత్రం** చూడండి.

**"ఓ బ్రహ్మ ! ఈ యాగం వల్ల మా దేశంలో పండితులు**

జన్మింతురు గాక. వీరులు, శూరులు, ధనుర్ధారులు జన్మింతురు గాక. బాగా పాలిచ్చే ఆవులు, ఎక్కువ బరువు మోయగల ఎద్దులు, వేగంగా పరుగెత్తగల గుర్రాలు, అందమైన స్త్రీలు, అన్ని రకాలుగాను సమర్ధులయిన పుత్రులు జన్మింతురు గాక. కావలసినంత వర్షము కురియును గాక. పంటలు సమృద్ధిగా పండును గాక. మాకందరకు శుభములు కలుగును గాక" అని ప్రార్థిస్తారు. ఇక 33వ మంత్రంలో

"యజ్ఞమువల్ల ఆయువు లభించును గాక.
యజ్ఞమువల్ల ప్రాణము లభించును గాక.
యజ్ఞమువల్ల అపానము లభించును గాక.
యజ్ఞమువల్ల వ్యానము లభించును గాక.
యజ్ఞమువల్ల ఉదానము లభించును గాక.
యజ్ఞమువల్ల సమానము లభించును గాక.
యజ్ఞమువల్ల నేత్రములు లభించును గాక.
యజ్ఞమువల్ల శ్రోత్రములు లభించును గాక.
యజ్ఞమువల్ల వాక్కు లభించును గాక.
యజ్ఞమువల్ల మనసు లభించును గాక.
యజ్ఞమువల్ల ఆత్మ లభించును గాక.
యజ్ఞమువల్ల బ్రహ్మ లభించును గాక.
యజ్ఞమువల్ల జ్యోతి లభించును గాక.
యజ్ఞమువల్ల స్వర్గము లభించును గాక.
యజ్ఞమువల్ల యజ్ఞము లభించును గాక.

అనే అర్థం వచ్చే మంత్రాలు చెబుతూ స్వాహాకారంతో అగ్నిలో

ఆహుతులు సమర్పిస్తారు. యజ్ఞంలో పశుబలి హింసకాదు. అది పాపముకాదు. 23వ అధ్యాయంలో **16వ మంత్రంలో** చెబుతున్నారు చూడండి.

**"ఓ అశ్వమా ! మేము నిన్ను వధించటం నీకు మరణముకాదు. నీవు దేవయానము గుండా దేవతలను చేరుకుంటావు. అక్కడ పుణ్యాత్ములుంటారు."**

ఇక **17వ మంత్రంలో** ఈ గుర్రాన్ని ఇక్కడ వధించటం చేత అది ముల్లోకాలకు అధిపతి అవుతుంది అని చెబుతున్నారు.

**పూర్వకాలంలో అగ్నియే పశువైనాడు. దేవతలు అగ్నిపశువుతోనే యజ్ఞం చేశారు. అగ్నిభూలోకాన్ని జయించి భూమికి అధిపతి అయినాడు.**

**వాయువు పశువైనాడు. దేవతలు వాయుపశువుతోనే యజ్ఞం చేశారు. వాయువు అంతరిక్షాన్ని జయించి అంతరిక్షానికి అధిపతి అయినాడు.**

**సూర్యుడు పశువైనాడు. దేవతలు సూర్యపశువుతోనే యజ్ఞం చేశారు. సూర్యుడు ద్యులోకాన్ని జయించి ద్యులోకానికి అధిపతి అయినాడు.**

**ఓ అశ్వమా ! యజ్ఞమున వధించబడిన నీవు ఈ ముల్లోకాలను జయించగలవు. ఈ ముల్లోకాలకు నీవే అధిపతివి."**

ఈ రకంగా యజ్ఞంలో వధించబడిన గుర్రానికి త్రిలోకాధిపత్యము వస్తుంది.

ఈ అధ్యాయంలో **19 నుంచి 30 మంత్రాల వరకు** కొన్ని విషయాలున్నాయి. వాటిలో "ఆ రాత్రి అశ్వమువద్ద అశ్వమహిషి

శయునించినది. అశ్వమహిషియోని యందు అశ్వము యొక్క రేతస్సు ప్రవేశపెట్టబడినది" అని అర్థం వచ్చే మంత్రాలున్నాయి. ఒకసారి నేను క్లాసు చెబుతున్నప్పుడు ప్రక్కక్లాసులో ఒక లెక్చరరు అశ్వమేధ యాగంలో మహారాణి గుర్రంతో సంగమిస్తుంది. ఇది వేదంలోనే ఉన్నది. అని చెప్పాడు. ఆ తరువాత పిల్లలు నా దగ్గరకు వచ్చి ఇది నిజమేనా? అని అడిగారు. ఇక్కడ మనం గుర్తించాల్సిన విషయం ఏమంటే మనం అనుకునే అర్థం వీటికి వర్తించదు. ఎందుకని అంటే అశ్వము అనేది ఒక పశువు. మహిషి అంటే మహారాణి. మానవకాంత అశ్వము వంటి పశువుతో సంగమించటము అనేది జరిగే పనికాదు.

గుర్రాన్ని చూస్తేనే ఈవిడ శరీరం భయంతో ముడుచుకుపోతుంది. ఒకవేళ గుర్రం యొక్క శరీరభాగమే గనక మానవకాంత దేహంలో బలవంతంగా ప్రవేశపెడితే, అక్కడ జరిగేది అశ్వమేధం కాదు. మహిషీ మేధం ఎందుకంటే మహారాణి కాస్తా చచ్చిఊరుకుటుంది. కాబట్టి వాళ్ళు అనుకున్నట్లుగా అక్కడ ఏమీ జరగదు. ఇక రెండో విషయానికొస్తే ఒకే జాతికి చెందిన జీవులకు సంతానోత్పత్తి జరుగుతుంది. అంతే కాని భిన్నజాతుల మధ్య సంతానోత్పత్తి జరగదు. కుక్కకు తోడేలుకు మధ్య సంతానోత్పత్తి జరుగుతుంది. కాని లేడికి సింహానికి మధ్య సంతానోత్పత్తి జరగదు.

కొంతకాలం క్రితం పేపరులో ఒక వార్త వచ్చింది. లండన్ పరిసారణ్యాలలో ఉండే లేడి మొదలైన జంతువులకి గనేరియా, సిఫిలీస్ వంటి సుఖవ్యాధులున్నాయట. ఇది ఎలారిగింది అంటే విహారం కోసం అటవీ ప్రాంతానికి వెళ్ళిన పశుప్రాయులు తమకున్న రోగాలను వాటికి అంటించారు. ఇక్కడ మీరు గ్రహించాల్సిన విషయం ఏమంటే అక్కడ రోగాలవరకే వాటికి అంటుకున్నాయి. అంతేకాని వాటికి

మానవమృగాలవల్ల సంతానంకలగలా. అలాకలగదు. ఇక్కడ మహిషి అంటే రాణి కాదు. అశ్వమహిషి. అని ఇంకో వాదనఉంది.

మరి దీనికి అర్థం ఏమంటి అంటే ఇవాల్టి రోజున అశ్వమేధయాగం చేసే వాళ్ళు లేరు. కలియుగంలో అది నిషేధము అన్నారు. కాబట్టి దాని అర్థం మనకి వివరించే వారు కూడా లేరు. మీరే మీ విజ్ఞతతో తెలుసుకోవటానికి ప్రయత్నించండి. **ఒకవేళ మీరు అనుకున్నదే నిజమైతే ఇంత హేయమైన, నీచమైన, దుర్మార్గమైన పని ఇంకొకటి ఉండదు. అశ్వమేధము వంటి పవిత్రమైన యాగానికి అది మాయని మచ్చ. ఇందులో సందేహం లేదు.**

మనకి ఒక సామెత ఉంది. "బ్రాహ్మణులంతా భోజనాలు చేస్తూ ఇంటికి వచ్చిన కొత్త కోడలితో 'అమ్మా ! కొంచెం లవణం తీసుకురా' అన్నారు. ఇంతలోనే అనుమానం వచ్చి ఒకరు ఆ పిల్లలతో 'లవణం అంటే తెలుసా?' అన్నారట. దానికి ఆ పిల్ల "సోమయాజులు గారింట్లో పుట్టాను. సోమయాజులు గారింట్లో పెరిగాను. లవణం అంటే నాకు తెలియదా? 'దూడపేడ' అన్నదట లవణము అంటే ఉప్పు అని అర్థం. అంతేకాని దూడపేడ కాదు.

**విషయం మనకి తెలియకపోయినా ఫరవాలేదు. మనకి అర్థం కాకపోతే నష్టం లేదు. కాని మిడిమిడి జ్ఞానంతో విపరీతార్థాలు చెప్పకండి. జాతి గౌరవాన్ని నాశనం చేసే ప్రయత్నం మాత్రం చెయ్యకండి.**

అశ్వమేధ యాగాంతంలో **ఇరవై ఐదవ అధ్యాయంలో 14 నుంచి 22 వరకు గల మంత్రాలలో** తమకు సంపూర్ణ ఆయురారోగ్య ఐశ్వర్యాలు, సకల శుభాలు కలగజేయమని దేవతలను ప్రార్థిస్తున్నారు.

అన్ని దిశలందు శత్రువులను నాశనం చేసేది, శుభప్రదమైనది అయిన యజ్ఞము మాకు లభించుగాక. దేవతలు మాకు మేలు చేతురుగాక. అప్రమత్తులై అను నిత్యము మమ్ము రక్షింతురు గాక.

ఎల్లప్పుడు దేవతల దానము మాకు లభించును గాక. మమ్మల్ని స్నేహభావంతో చూస్తూ దేవతలు మా ఆయుష్యును పొడిగింతురు గాక. సుభగ, సరస్వతి మాకు శుభములు కలిగింతురు గాక.

చల్లని గాలులు వీచును గాక. అశ్వనీ దేవతలు మాకు శుభాలు కలిగింతురు గాక.

పూష మాసంపదను పెంపొందిస్తూ మమ్ము రక్షించును గాక.

మేము దేవతలను ఎల్లప్పుడూ స్తుతి చేస్తుందుము గాక. దేవతలు ప్రసాదించిన ఆయువు మేము పూర్తిగా అనుభవింతుము గాక.

ఓ దేవతలారా ! సంవత్సరాలు గడిచిపోయినప్పటికీ, మాకు వార్ధక్యము వచ్చి నప్పటికీ, మా ఆయువును మధ్యలో త్రుంచకండి. పరిపూర్ణాయువు ప్రసాదించండి.

ఈ ప్రార్ధన యజమానిఒకడి కోసమే కాదు. ఆదేశప్రజలందరి కోసం. అశ్వమేధం వంటి గొప్ప యాగాలు దేశక్షేమం కోసం మాత్రమే చేయబడేవి.

# 17. పురుష సూక్తము

పరమేశ్వర స్వరూపాన్ని వివరిస్తూ చెప్పేసూక్తమే పురుషసూక్తం. ఇక్కడ పురుషుడు అంటే పరమ పురుషుడే. ఆదిమధ్యాంతములు లేనివాడు. సృష్టి స్థితి లయాలకు కారణ భూతమైనవాడు. అతనినుంచే ఈ జగత్తంతా ఆవతరించింది. భగవంతుడికి అభిషేకం చేసేటప్పుడు ఆయనను స్తుతి చేసే మంత్రాలు, సూక్తాలు చెప్పటం జరుగుతుంది. ఈశ్వరుడికి అభిషేకం చేసేటప్పుడు ముఖ్యంగా నమకం చెబుతారు. ఇది కృష్ణయజుర్వేదంలోను, శుక్లయజుర్వేదంలోను కూడా చెప్పబడింది. కాకపోతే కొంచెం తేడా. విష్ణువుకు అభిషేకం చేసేటప్పుడు నమకపాఠం చెప్పరు. పంచ సూక్తాలలో అభిషేకం చేస్తారు. శివుడికీ, విష్ణువుకీ ఇద్దరికీ అభిషేక సమయంలో పురుషసూక్తం చెబుతారు. **ఋగ్వేదంలోని పదవ మండలంలోని 90వ సూక్తం** పురుష సూక్తం. అలాగే **శుక్లయజుర్వేదంలోని 31వ అధ్యాయం పురుష సూక్తం.** ఇది మొత్తం 22 మంత్రాలతో ఉంటుంది.

**సహస్రశీర్షా పురుషః సహస్రాక్ష స్సహస్రపాత్.**

అతడు మహాపురుషుడు. కొన్ని వేల తలలున్నవాడు. కొన్నివేల కనులు, పాదాలు ఉన్నవాడు. ఈ చరాచర జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. సృష్టి ప్రారంభానికి ముందు ఆ పరమేశ్వరుడు నిరాకారుడుగా ఈ జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. సృష్టి తరువాత 84 లక్షల జీవరాసులుగా ఈ జగత్తంతా వ్యాపించాడు. అందుకే ఆ పరమేశ్వరుడికి 84 లక్షల రకాల శిరస్సులు ఉన్నాయి. జగత్తులోని జీవకోటికి ఎన్ని పాదాలు ఉన్నాయో అవన్నీ ఆయనవే. ఇక్కడ సహస్రము అంటే వేయి అని కాదు. అనంతమైన, లెక్కలేని అని అర్థం. ఇదంతా ఈ జగత్తంతా

ఆ మహాపురుషుడే. జరిగినది, జరుగుతున్నది, జరగబోయేది అంతా అతడే.

అన్నింటికీ అతడే ప్రభువు. ఇదంతా ఆయన మహిమ. మహిమ చేతనే వర్ధిల్లుతున్నాడు. ఇంకా మహిమ గల వాడవుతున్నాడు. అతనిలోని నాల్గవ భాగము నుంచే ఈ జగత్తు సృష్టించబడింది. మిగిలిన మూడు భాగాలు పైన దివిలో ఉన్నాయి. ఈ నాల్గవ భాగంతోనే అతడు సర్వత్ర వ్యాపించాడు. అతని నుంచే విరాట్పురుషుడు ఆవిర్భవించి ఈ భూమిని, లోకాలను సృష్టించాడు. అతడే యజ్ఞపురుషుడు. అతడు గ్రామాలలోను అరణ్యాలలోను ఉండే వాయుప్రధాన పశువులను సృష్టించాడు. అతని నుంచే ఋక్కులు, యజస్సులు, సామములు వచ్చినాయి. ఛందస్సులు వచ్చినాయి. అతని నుండే గుర్రాలు పుట్టినాయి. రెండు వైపులా దంతాలు గల ఏనుగులు పుట్టినాయి. అతని నుండే గోవులు, మేకలు ఆవిర్భవించినాయి. అతడు అందరికన్నా ముందు పుట్టాడు. అతడే దేవతలను, ఋషులను, సాధ్యులను సృష్టించాడు. ఋషులంతా ఒక మహాపురుషుని కల్పించారు కదా. అతడి రూపం ఏది? అతని ముఖమేది? బాహువులు ఏవి ?

బ్రాహ్మణుడు – అతడి ముఖము, క్షత్రియులు – బాహువులు, ఊరువులు – వైశ్యుడు, పాదాలు – భూమి. మనస్సు నుంచి – చంద్రుడు, కనుల నుంచి – సూర్యుడు. ముఖము నుంచి – ఇంద్రుడు, అగ్ని. ప్రాణముల నుండి వాయువు, నాభి నుంచి – అంతరిక్షము, శిరస్సు నుంచి – ద్యులోకము, పాదముల నుండి – భూమి; శ్రోత్రముల నుండి – దిశలు ఆవిర్భవించినాయి. ఈ రకంగా లోకాలన్నీ సృష్టించబడినాయి. దేవతలంతా ఈ పురుషునితో యజ్ఞం చేశారు. అప్పుడు ఘృతము – గ్రీష్మము, సమిధ – శరత్తు అయినాయి. దేవతలు

ప్రజాపతినే యజ్ఞపశువుగా చేశారు. అప్పుడు ఏడు పరిధులు, ఇరవైఒక్క సమిధలు అయినాయి.

అప్పుడు హిరణ్యగర్భుడు ఆవిర్భవించాడు. అతడి రూపాన్ని త్వష్ట నిర్ధారించాడు. అతడి రూపాన్ని తెలుసుకున్నవాడే మృత్యువును జయించగలడు. అతడు పుట్టుక లేనివాడు. అనేక రకాలుగా జన్మించేవాడు. అతణ్ణి జ్ఞానులు మాత్రమే దర్శించగలరు. అతనియందే అన్ని లోకాలున్నాయి. దేవతల కోసం తపించేవాడు, దేవతల పురోహితుడు, దేవతల నుంచి పూర్వమే ఆవిర్భవించిన వాడు, అయిన ఆ పరబ్రహ్మకు నమస్కారము.

పూర్వ కాలంలో దేవతలు బ్రహ్మయొక్క తేజస్సును సృష్టించి, ఆ తేజస్సుతో "ఈ తేజస్సును తెలుసుకున్న వాని అధీనమందు దేవతలు ఉంటారు" అని చెప్పారు.

ఆ పరమ పురుషునికి శ్రీ, లక్ష్మి భార్యలు. అహోరాత్రులు అతని పార్శ్వములు. నక్షత్రాలు అతని రూపము, అశ్వినులు అతని విశాలమైన ముఖమండపము.

ఓ దేవదేవా ! నన్ను నీ వాడుగా భావించి భవబంధాల నుంచి విముక్తుని చేయవలసినదని ప్రార్థిస్తున్నారు. ఇతడే విష్ణువని, శివుడని, పరమేశ్వరుడని భక్తులు చెబుతుంటారు.

# 18. సంఖ్యామానం

ఒకట్లు, పదులు, వందలు, వేలు అంటూ చిన్నప్పుడు సంఖ్యామానం చదువుతాం. ఇది ప్రతి వ్యక్తికీ జీవితంలో అత్యంత ముఖ్యమైనది. ఏ విషయాన్ని చెప్పాలన్నా ముందు సంఖ్యామానం కావాలి. వందల మైళ్ళు ప్రయాణం చేశాం. వేల సంవత్సరాల క్రితం, కలియుగం ప్రారంభమయి 5115 సంవత్సరాలయింది. మన దేశ జనాభా వందకోట్లు. ఇలా దేన్ని గురించి చెపాలన్నా సంఖ్యామానం తెలిసి తీరాలి. దైనందిన జీవితంలో ఉదయం లేచిన దగ్గర నుంచీ పాలప్యాకెట్టు 25 రూపాయలు. ఇక్కడ నుంచీ మొదలవుతుంది లెక్క. ఈ రకంగా సంఖ్యామానం మానవుడి జీవితంలో ప్రముఖస్థానం వహిస్తోంది. జీవితంలో ఏం తెలిసినా, తెలియకపోయినా డబ్బులు లెక్క పెట్టుకోవటం తెలియాలి. అంటే సంఖ్యామానం తెలిసి తీరాలి. అందుకే మానవ జీవితంలో సంఖ్యామానానికి అంత ప్రాముఖ్యత.

అయితే ప్రస్తుతం మనకి వాడుకలో ఉన్న సంఖ్యామానంలోని అత్యధిక సంఖ్య 'కోటి'. ఆ తరువాత చెప్పాలంటే మళ్ళీ మొదటి నుంచి రావలసిందే. పదికోట్లు, వంద కోట్లు, వెయ్యికోట్లు, పదివేల కోట్లు, లక్ష కోట్లు కాబట్టి అతిపెద్ద సంఖ్యలు చెప్పటానికి కష్టం అవుతోంది. అదే పాశ్చాత్య దేశాలలో ఉన్న సంఖ్యామానం ఒకట్లు, పదులు, వందలు, వేలు, లక్ష, పది లక్షలు, నూరు లక్షలు, మిలియను. పది మిలియన్లు నూరు మిలియన్లు, బిలియను

ఒక బిలియను అంటే – పదివేల కోట్లు అన్న మాట. మనకి సంఖ్యామానంలో అతిపెద్ద సంఖ్య – కోటి. పాశ్చాత్యుల సంఖ్యామానంలో అతిపెద్ద సంఖ్య – పదివేల కోట్లు. కాబట్టి పాశ్చాత్యుల

సంఖ్యామానమే గొప్పది. ఇది మన భావం.

ఒక సంఖ్యామానం ఏమిటి? అన్ని విషయాలలోను అంతే. **పాశ్చాత్యులు చాలా గొప్పవాళ్ళు. వాళ్ళ నాగరికత చాలా గొప్పది. వాళ్ళు చెప్పే విషయాలు చాలా గొప్పవి. కాబట్టి మనం వారిని అనుకరించాలి. అనుసరిస్తాం. ఇది మన విశాల మనస్తత్వం. మనల్ని మనం తక్కువగా చెప్పుకోవటం, అవతల వారిని, అందునా విదేశీయులు, పాశ్చాత్యుల గురించి గొప్పగా చెప్పటం అనేవి మనకి వెన్నతో పెట్టిన విద్య. మనవారిని, మన సంస్కృతిని, మన భాషని తక్కువచేసి మాట్లాడటం, అవమానించటం, అవతలి వ్యక్తులను పొగడటం భారతీయులకి అందులోను ప్రత్యేకంగా తెలుగు వారికి ఉన్న అతిపెద్ద జబ్బు. క్యాన్సరు కన్న ప్రమాదకరమైనది.**

ఒకసారి జపాన్‌దేశంలోని అతిపెద్ద ఓడరేవులో ఒక పెద్ద ఓడ ఆగింది. అందులో నుంచి సరుకుని దించుతున్నారు. పెద్ద పెద్ద పెట్టెలు. తాళ్ళతో కట్టినవి ప్రత్యేకంగా విదేశాలకి ఎగుమతి చెయ్యటం కోసం చేసిన ప్యాక్‌లు దించుతున్నారు. ఇంతలో విచిత్రంగా ఒక తట్టను దింపారు. అందులో సగం పైగా పీతలున్నాయి. అవి తట్టలోనే అటు ఇటు పరుగులు పెడుతున్నాయి. అక్కడ ఉన్న జపాన్ దేశస్థుడు ఆ తట్టని చూసి ప్రక్కవాడితో చూడు. ఈ తట్టకి కనీసం మూతకూడా పెట్టలేదు. అందులో పీతలు సగం బయటకు పోయినాయి. ఇది ఎక్కడి నుంచి వచ్చిందో' అన్నాడు. ఆ ప్రక్కన ఉన్నవాడు భారతీయుడు. వెంటనే అతను అన్నాడు 'నువ్వేం కంగారు పడకు. అది మా దేశం నుంచి వచ్చిందే. అందులో పీతలు ఎక్కడికి పోవు. జాగ్రత్తగా చూడు. బయటకు పోదామని ఏదైనా ఒక పీత ప్రయత్నం చేస్తుంటే, రెండవది దాని కాళ్ళు పట్టుకుని క్రిందికి లాగేస్తుంది. కాబట్టి ఏం భయం లేదు.

అందులోంచి ఒకటి కూడా బయటకి పోదు. మిగిలినవి పోనివ్వవు' అన్నాడు. ఇది మన గొప్పతనం. మనం గొప్పవాళ్ళం కాము. ప్రక్కవాడు అవుతానంటే సహించం. ఎక్కడైనా సరే ఇద్దరు తమిళులు కలిస్తే తమిళంలోనే మాట్లాడతారు. వారు ఎంత పెద్ద పదవిలో ఉన్నా సరే. అదే ఇద్దరు తెలుగువారు బయట కలిస్తే తప్పనిసరిగా ఇంగ్లీషులోనే మాట్లాడతారు. తెలుగులో మాట్లాడటం అవమానంగా భావిస్తారు. మన దగ్గర ఉన్న గొప్పతనాన్ని గుర్తించం. మనల్ని మనమే అవమానించుకుంటాం. ఇంకొకరికి అవకాశం ఇవ్వం. ఎదుటి వాడి దగ్గర ఏదో ఉన్నది అని వాడి వెంట పడతాం. ఇది మనకి ఉన్న జబ్బు. చాలారకాల జబ్బులకి మందు కనుక్కున్నారు కాని ఇంతవరకు దీనికి మాత్రం మందు కనుక్కోలేదు.

సంఖ్యామానాన్ని చూస్తే పాశ్చాత్యులది గొప్పమానము అంటున్నాం. వేదంలో ఏం చెప్పారో కూడా ఒకసారి చూద్దాం. పరమేశ్వర స్వరూపాన్ని గురించి చెబుతూ 'పరమేశ్వర స్వరూపం నుంచి వేలు, లక్షలు, కోట్లు, కోటానుకోట్ల కిరణాలు ప్రసరిస్తున్నాయి అంటున్నారు.

**సహస్రం ద్విసహస్రం చ చ లక్షకం**
**కోటిరర్బుద మేతేషాం పరాసంఖ్యా న విద్యతే**

అంటున్నాయి యామళగ్రంథాలు. దీన్ని బట్టి కోటిపైన కూడా సంఖ్య ఉన్నది అని తెలుస్తోంది. శుక్లయజుర్వేద సంహితలో **17వ అధ్యాయంలోని రెండువ మంత్రంలో**

"ఓ అగ్నిదేవా ! ఈ ఇటుకలు మాకు కామధేనువులు అగును గాక. అవి ఒకటికి – పది, పదికి – వంద, వందకు – వేయి, వేయికి

– ఆయుతము, ఆ యుతానికి – నియుతము, నియుతానికి – ప్రయుతము, ప్రయుతానికి – అర్బుదము, అర్బుదానికి – న్యర్బుదము, న్యర్బుదానికి – సముద్రము, సముద్రానికి – మధ్యము, మధ్యమానికి – అంతము, అంతానికి – పరార్ధములై నీ కృపవల్ల నాకు ఇహపరలోకములందు కామధేనువులు అగుగాక.” అని ప్రార్థిస్తున్నారు.

అప్పటి మానం ప్రకారం పది, వంద, వేయి, అయుతము (పదివేలు) నియుతము (లక్ష) ప్రయుతము (పది లక్షలు) అర్బుదము (కోటి) న్యర్బుదము (పదికోట్లు) సముద్రము (వందకోట్లు) మధ్యము (వేయి కోట్లు) అంత (పదివేల కోట్లు) పరార్ధము (లక్ష కోట్లు). పాశ్చాత్యుల సంఖ్యామానంలో

నూరు లక్షలు – కోటి, మిలియను – పదికోట్లు, పదిమిలియన్లు – నూరు కోట్లు, నూరు మిలియన్లు – వేయి కోట్లు, బిలియను – పదివేల కోట్లు.

ఇందులో అతిపెద్ద సంఖ్య ‘బిలియను’ – పదివేల కోట్లు

వేదంలో చెప్పిన సంఖ్య ‘పరార్ధము’ – లక్ష కోట్లు

వీటిలో ఏది పెద్దసంఖ్యో మీరే నిర్ణయించుకోండి. దూరాన్ని కొలవటానికి గతంలో మనం మైళ్ళు, ఫర్లాంగులు అనే వాళ్ళం. వాటిని మార్చి ప్రపంచం అంతా మారుతోంది మనం కూడా మారాలి అని కిలోమీటర్లు తెచ్చుకున్నాం. ఇంతగా అభివృద్ధి చెందిన అమెరికాలో దూరాన్ని కొలవటానికి ఇవాల్టికి కూడా ‘మైళ్ళు’ అనే కొలుస్తారు. రోడ్డు మీద కూడా ‘వేగము 80 మైళ్ళు’ అనే బోర్డు ఉంటుంది. అంటే వాళ్ళ సంప్రదాయం, సంస్కృతి వాళ్ళు వదలటం లేదు. మనమే వాటిని వదిలేస్తున్నాం. **ఏమైనా మనది విశాలమైన మనస్సు కదా !**

# 19. వాజపేయం

శుక్లయజుర్వేదంలోని **తొమ్మిదవ అధ్యాయంలో మొదటి 34 మంత్రాలలోను వాజపేయం వివరించబడింది.** వాజపేయము సోమయాగాలలో ఒకటి. ఇది రెండు రోజుల నుండి పన్నెండు రోజుల వరకు చెయ్యబడుతుంది. ఇందులో 17 రథాలతో పందెం, ఆ పందెంలో యజమాని గెలవటం చాలా ముఖ్యమైన అంశం.

ఋగ్వేదంలో సోమరసాన్ని వివరించారు. సోమలత కేవలం ఉత్తర భారతంలోనే దొరుకుతుంది. ఆ లత యొక్క చిన్న చిన్న కొమ్మలు, రెమ్మలు, కోసి తెస్తారు. అయితే వీటిని సేకరించి అమ్మేవారు వేరేఉంటారు. వారికి తగిన మూల్యాన్ని చెల్లించి, ప్రతిఫలంగా గోవులనిచ్చి ఈ సోమలతను వేదమంత్రాలు చదువుతూ, దాన్ని నెత్తిన పెట్టుకుని ఊరేగింపుగా తెస్తారు. సోమలతను శుభ్రం చేసి రాతి తిరగలిలో వేసి త్రిప్పుతారు. అప్పుడు ఆకుపచ్చని ద్రవం వస్తుంది. అదే సోమరసం. ఆ రసాన్ని ఉన్ని వస్త్రంతో వడపోసి, బానలతో పట్టి జాగ్రత్త చేస్తారు. ఈ రసాన్ని, పాలతో కాని, పెరుగు, వెన్న, తేనె మొదలైన వాటితో కలిపి స్వీకరిస్తారు.

ఈ రసము తుష్టి, పుష్టి, మతి, ధృతులను ఇస్తుంది. దీనిని తాగిన వాడికి మరణం రాదు. ఇది త్రాగిన వెంటనే మూగవాడు మాట్లాడగలుగుతాడు. అతడికి అతీతశక్తులు వస్తాయి. ఇది పరమ పవిత్రము. దేవతలకు, ప్రత్యేకించి ఇంద్రుడికి సోమరసమంటే చాలా ఇష్టం. సోమరసాన్ని త్రాగే ఇంద్రుడు వృత్రాసుర సంహారం చేశాడు. సోమరసాన్ని ఉపయోగించి చేసే యాగాలను సోమయాగాలంటారు. వాజపేయంలో కూడా సోమరసం ప్రధాన పాత్ర పోషిస్తుంది. అందుకే దీన్ని సోమయాగం అన్నారు.

ఈ యాగం చేసేటప్పుడు యజమాని తనకు బలము, వీర్యము, ధనము, తేజస్సు ఇత్యాదులు కావాలని దేవతలను ప్రార్థిస్తారు. 21 నుంచి 34 వరకు మంత్రాలలో ఈ విషయం చెప్పబడింది.

"యజ్ఞమున మాకు ఆయువు కలుగుగాక. ప్రాణము కావాలి, నేత్రాలు కలగాలి. యజ్ఞము నుంచి యజ్ఞం కలగాలి.

దిశలారా ! మీ యందున్న బలము, వీర్యము మాకు కావాలి. మీ యందున్న బలము ధనము, తేజస్సు మాకు కావాలి. అన్నం కల్పించిన వాడు ప్రజాపతి. సృష్టి ప్రారంభంలో ఓషధులు సృష్టించాడు. ఆ ఓషధులు మాకు కావాలి. ఈ లోకంలో అన్ని భూతాలను సృష్టించిన వాడు ప్రజాపతి. అతడు సమస్త వీరుల సహితంగా ధనాన్ని మాకు ప్రసాదించాలి. ఓ అగ్నీ ! ఇది మా యజ్ఞము, ఇందులో అన్నీ శుభాలే కలగాలి. అగ్నీ మాకు ధనాదులను ప్రసాదించుము.

ఓ అగ్నీ ! ఇది మా యజ్ఞము. మాకు శుభాలు కల్పించవలసింది. ధనాన్ని ప్రసాదించవలసింది. ఆర్యమ, పూష, బృహస్పతి, సరస్వతి మాకు ధనాన్ని ప్రసాదించాలి. ఒకే అక్షరమున్న మంత్రాన్ని జపం చేసి అగ్ని పంచప్రాణాలు గెలిచాడు. నేను నా పంచ ప్రాణములను గెలిచెదను.

రెండు అక్షరాల మంత్రాన్ని జపం చేసి అశ్వినులు మానవులను జయించారు. నేను కూడా ఆ మానవులను గెలవాలి.

మూడు అక్షరాల మంత్రజపం చేసి విష్ణువు ముల్లోకాలు జయించాడు. నేను కూడా ముల్లోకాలను గెలవాలి.

నాలుగు అక్షరాల మంత్రజపం చేసి సోమము నాలుగు కాళ్ళున్న పశువులను గెలిచింది. నేను కూడా చతుష్పాద జంతువులను గెలవాలి.

ఐదు అక్షరాలున్న మంత్రజపం చేసి పూష నాలుగు దిక్కులు,

అవాంతర దిశ, ఐదింటిని గెలిచాడు. నేను కూడా ఐదు దిక్కులు గెలవాలి.

ఆరు అక్షరాల జపం చేసి సవిత ఆరు ఋతువులను గెలిచాడు. నేను కూడా ఋతువులను గెలవాలి.

ఏడు అక్షరాల మంత్రజపం చేసి మరుత్తులు ఏడు గ్రామ్యా జంతువులను గెలిచారు. నేను కూడా ఆ గ్రామ్యా జంతువులను గెలవాలి.

ఎనిమిది అక్షరాల మంత్రజపం చేసి బృహస్పతి గాయత్రిని గెలిచాడు. నేను కూడా గాయత్రిని గెలవాలి.

తొమ్మిది అక్షరాల మంత్రజపం చేసి మిత్రుడు త్రివృత్తాన్ని గెలిచాడు. నేను కూడా దాన్ని గెలవాలి.

పది అక్షరాల మంత్రజపం చేసి వరుణుడు 'విరాజము'ను గెలిచాడు. నేను కూడా దాన్ని గెలవాలి.

పదకొండు అక్షరాల మంత్రజపం చేసి ఇంద్రుడు త్రిష్టప్ ఛందస్సును గెలిచాడు. నేను కూడా దాన్ని గెలవాలి.

పన్నెండు అక్షరాల మంత్రజపం చేసి విశ్వేదేవతలు 'జగతి'ని గెలిచారు. నేను కూడా దాన్ని గెలవాలి.

పదమూడు అక్షరాల మంత్రజపం చేసి వసువులు త్రయోదశ స్తోమమును గెలిచారు. నేను కూడా దాన్ని గెలవాలి.

పద్నాలుగు అక్షరాల మంత్రజపం చేసి రుద్రులు చతుర్దశ స్తోమాన్ని గెలిచారు. నేను కూడా దాన్ని గెలవాలి.

పదిహేను అక్షరాల మంత్రజపం చేసి ఆదిత్యులు పంచదశ స్తోమము గెలిచారు. నేను కూడా దాన్ని గెలవాలి.

పదహారు అక్షరాల మంత్రజపం చేసి రుద్రుడు షోడశ స్తోమాన్ని

గెలిచాడు. నేను కూడా దాన్ని గెలవాలి.

పదిహేడు అక్షరాల మంత్రజపం చేసి ప్రజాపతి సప్తదశ స్తోమాన్ని గెలిచాడు. నేను కూడా దాన్ని గెలవాలి.

నేను కూడా వాళ్ళలాగే వీటన్నింటినీ గెలవాలి. ఓ దేవతలారా ! ఓ అగ్నీ ! ఓ ఆర్యమా! ఓపూషా ! ఓబృహస్పతీ ! ఓ సరస్వతీ ! మాకు ధనాన్ని ప్రసాదించండి. మాకు శుభాలు కలుగచెయ్యండి” అంటూ యాగాంతంలో యజమాని దేవతలను ప్రార్థిస్తాడు.

# ౨౦. అగ్నిచయనం

చయనము అంటే – అగ్ని సంస్కారమైన శ్రౌతకర్మ. ఇది అగ్నిష్టోమాది సోమయాగాలతో కలిపి చేసేది. అంతేకాని స్వతంత్రంగా చేసేది కాదు. అయినప్పటికీ మిగిలిన వాటికన్న చయనానికే సంస్కారము ఎక్కువ, అందుకని చయనము చేస్తున్నారు అనే అంటారు.

పూర్వకాలంలో ప్రజాపతి ప్రజలను సృష్టించిన తరువాత, తనతో సృష్టించబడిన మానవ దేహంలో ప్రవేశించాడు. కాని ఆ దేహంలోనుంచి తిరిగి రావటం అతడివల్ల కాలేదు. అప్పుడు ప్రజాపతి "ఎవరు నన్ను ప్రజల నుండి ఉద్భవింపచేయగలరో, వారు సమృద్ధి పొందగలరు" అన్నాడు. దేవతలు ఆ మాట విని, అగ్ని రూపంగా ప్రజాపతి ఆవిర్భవించేట్లుగా ఇష్టకలతో చయనము చేశారు. దీంతో మానవ దేహంలో ఉన్న ప్రజాపతి అగ్నిరూపంలో బయటకువచ్చాడు. ప్రజాపతి మాట ప్రకారం దేవతలు సమృద్ధి గలవారైనారు. కాబట్టి చయనమనే కర్మ సర్వసమృద్ధమైనది. వారి కోరికలను బట్టి అగ్ని సంస్కారమైన చయనము అనే కర్మ చేయబడుతున్నది. చనము అనే ఈ కర్మ ఏ కోరికతో చేస్తే ఆ కోరిక నెరవేరుతుంది. దాన్ని అలాగే పిలుస్తారు. దేవతలు నన్ను పుణ్యాత్ముడిగా గుర్తించాలి అనే కోరికతో ఈ కర్మ చేసినట్లైతే, ఆ విధంగానే గుర్తిస్తారు. నేను ఉత్తమమైన గృహస్తాశ్రమ ధర్మాలతో కూడినవాణ్ణి కావాలి అనే కోరికతో ఈ యాగం చేస్తే, అది నెరవేరుతుంది.

నేను పశుసమృద్ధి గలవాడను కావాలి అనే కోరికతో చేస్తే పశుసమృద్ధి కలుగుతుంది.

తండ్రి, తాత, ముత్తాత, అలాగే కుమారుడు, మనుమడు,

మునిమనుమడు. వీరు ఆరుగురు. మధ్య లోతను. మొత్తం ఏడుగురు తనను ఆశ్రయించి వీరంతా జీవించాలి. అనే కోరికతో చేస్తే అలాగే వారందరికీ రక్షకుడుగా అవుతాడు.

అగ్ని చయనము చేస్తే ఏ రకమైన కోరికతో ఈ యాగము చేసినా, వారి కోరిక తప్పకుండా తీరుతుంది. అందుకే దీన్ని **"సర్వకామాస్తి అగ్నిచయనము"** అంటారు. ఉదయంపూట నిద్రలేవగానే వేదపండితుడుని, పుణ్యస్త్రీని, గోవును, అగ్నిచయనం చేసినవాణ్ణి చూడాలి. **11 నుంచి 15 వరకు ఉన్న ఐదు అధ్యాయాలలోను** అగ్నిచయనము క్రతువంతా కూడా సాంగోపాంగంగా వివరించబడింది.

కఠోపనిషత్తులో దీని ప్రస్తావన ఉంది. పూర్వకాలంలో గౌతముడు 'విశ్వజిద్' అనే యాగం చేశాడు. ఈ యాగం శాశ్వతబ్రహ్మలోక నివాసం కోసం చేస్తారు. గౌతముడు ఈ యాగం చేసి అందులో ఆఖరు భాగమయిన దానధర్మాలు చేస్తున్నాడు. ఈ దానధర్మాలలో ఆఖరుగా గోదానం ఇవ్వబోతున్నాడు. బక్కచిక్కినవి, లేవలేనివి, నడువలేనివి, చావటానికి సిద్ధంగా ఉన్నవి అయిన ఆవులు దానమిస్తున్నాడు. ఇలాటి దానాలు చేస్తే ఆనందములు అనే పాపలోకాలు వస్తాయి. కాబట్టి ఎలాగైనా సరే తండ్రితో ఈ దానం మాన్పించాలనుకున్నాడు అతని కుమారుడైన నచికేతుడు.

తండ్రీ ! నన్నెవరికి దానమిస్తున్నావు? అన్నాడు. యముడికి దానం ఇస్తాను అన్నాడు తండ్రి. తనను తాను దానం ఇప్పించుకుని మరీ యమలోకానికి వెళ్ళి, యమధర్మ రాజును కలిసి అతని దగ్గరనుంచి 'అగ్నిచయునము'' అనే క్రతువును గురించి తెలుసుకున్నాడు. నచికేతుడు ఏకసంధాగ్రాహి. దాంతో ఒకసారి వినగానే క్రతువిధానమంతా తిరిగి చెప్పేశాడు. నచికేతుడి

అసమానమైన ప్రతిభను గుర్తించి ఇకనుంచీ ఈ యాగము **'నాచికేతాగ్ని చయనము'**గా పిలువబడుతుంది అని వరం కూడా ఇచ్చాడు.

ఇప్పుడు ఆ యాగం **'నాచికేతాగ్ని చయనము'**గా చెప్పబడుతోంది.

# 21. చతురాశ్రమాలు

చాతుర్వర్ణాలు అంటే బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులు. అలాగే చతురాశ్రమాలు. 1. బ్రహ్మచర్యం 2. గృహస్థాశ్రమం 3. వానప్రస్థం 4. సన్యాసం. మానవ జీవితాన్ని నాలుగు భాగాలుగా చేశారు. మానవుడు ఏ వయస్సులో ఏం చెయ్యాలి? అనేది నిర్ణయించారు. మానవుడి ఆయుర్దాయం వందసంవత్సరాలు, దాన్ని నాలుగు భాగాలుగా చేశారు. ఒక్కొక్క భాగానికి ఇరవైఐదు సంవత్సరాలవుతుంది. ఇప్పుడు

| | | |
|---|---|---|
| ఇరవై ఐదు సంవత్సరాల వరకు | – | బ్రహ్మచర్యము |
| ఇరవై ఐదు నుంచి యాభై సం॥ వరకు | – | గృహస్థాశ్రమము |
| యాభై నుంచి డెబ్బైఐదు సం॥ వరకు | – | వానప్రస్థము |
| డెబ్బైఐదు నుంచి చివరి వరకు | – | సన్యాసము |

ప్రతి మానవుడి ప్రత్యేకించి బ్రాహ్మణుడి జీవితం ఇలాగే ఉండాలి. శుక్లయజుర్వేదంలో చతురాశ్రమాలకు సంబంధించిన విషయాలు చెప్పబడ్డాయి.

**బ్రహ్మచర్యము :** మానవుడు జన్మించిన తరువాత ఏడు సంవత్సరాలకు ఉపనయనం చేసి విద్యాభ్యాసం కోసం గురు కులానికి పంపుతారు. గురుకులము అంటే ఈ రోజుల్లో మనం చెప్పుకునే 'పబ్లిక్ స్కూలు' వీటిని కొంతమంది నిర్వహిస్తుండే వారు. ఆ రోజుల్లో అందరూ తపస్సు చేసేవారు. అందరికీ గడ్డాలు, మీసాలు ఉండేవి. గురుకులం అంటే చాలామంది పిల్లలుంటారు. ఆ ప్రాంతంలో పిల్లలందరికీ అక్కడే విద్యాబుద్ధులు నేర్పించటం జరుగుతుంది. గురుకులానికి అధిపతి ఒకరుంటారు. ఆయన పేరుతోనే గురుకులం

పిలువబడుతుంది. కాని అక్కడ విద్య బోధించేవాళ్ళు చాలామంది ఉంటారు. విద్యార్థుల స్థాయిని బట్టి విద్యాబోధన జరుగుతుంది. మనం గుర్తుంచుకోవలసిన విషయం ఏమంటే – వశిష్ఠుడి ఆశ్రమం అంటే అక్కడ ఆయన ఒక్కడి ఇల్లే ఉండుదు. ఆయనతో పాటు చాలా మంది నివసిస్తుంటారు. వీరందరికీ ఆయున పెద్ద. అంతా ఆయున కనుసన్నలలోనే జరుగుతుంటుంది. యజ్ఞయాగాదులు ఏం చేసినా ఆయన ఆధ్వర్యంలో అందరూ కలిసేస్తారు. అవన్నీ సామూహిక కార్యక్రమాలు. అక్కడ ఉండేవారంతా ఆయన శిష్యులే. ఆ రోజున వశిష్ఠుని ఆశ్రమం అంటే ఇవాల్టి రోజున 'సత్యన్నారాయణపురం' అన్న మాట. అది ఒక ప్రాంతం. అలాగే గురుకులాలు కూడా. వీటి నిర్వహణ బాధ్యత రాజుగారిది. అడవిలో దొరికే కందమూలాలు అన్నీ వాళ్ళే తెచ్చుకుంటారు. వీరికి కావలసిన వస్త్రాలు, ఇలాంటి అవసరాలు, రక్షణ బాధ్యత రాజుగారిది. ఆ రోజుల్లో విద్యాభ్యాసం మూడు రకాలుగా ఉండేది.

1. గురువుగారికి సేవ చేసి విద్య నేర్చుకోవటము
2. తగినంత ధనం ఇచ్చి విద్య నేర్చుకోవటము
3. తనకు తెలిసిన దాన్ని గురువు గారికి చెప్పి, తనకు కావలసిన దాన్ని ఆయన దగ్గర నుంచి తెలుసుకోవటము. ఈ మూడు పద్ధతులలోను ఎక్కువగా అంటే 99 శాతము మొదటి పద్ధతే అమలవుతుండేది. విద్యార్థులంతా గురువుగారి ఆశ్రమంలో పనులు చేస్తూ ఆయన దగ్గర విద్యనభ్యసించే వారు. భోజనం కూడా విద్యార్థులు మధుకరవృత్తితో సంపాదించుకోవాలి. మధుకర వృత్తి అంటే – తేనె టీగ పూవు పూవుకు వెళ్ళి తనకు కావలసిన తేనెను ఏ రకంగా సేకరిస్తుందో, అలా అంటే విద్యార్థులు ప్రతిరోజు మధ్యాహ్నంవేళ

చుట్టుప్రక్కల ప్రాంతాలలో ఉండే గృహస్థుల ఇండ్లకువెళ్ళి బిక్షాటనచేసేవారు. ఇలా విద్యార్థులు బిక్షకువస్తారని వారికి తెలుసు. అందుకే వీరికోసం వండిన దాన్లో కొంతభాగం కేటాయించేవారు. అలా విద్యార్థులు తెచ్చుకున్న దాన్ని అందరూ కలిసి తినేవారు. గురువుగారి ఆశ్రమంలో అన్ని పనులు చేసే వాళ్ళు. ఈ రకంగా గురుకులాలు ఉండేవి.

విద్యార్థుల ధారణ శక్తిని బట్టి అతడికి విద్యని బోధించేవాళ్ళు. ఎక్కువమంది వేదం చదువుకునే వాళ్ళు. కొంతమంది స్మార్తం, చదివేవారు. మరి కొంతమంది శాస్త్రాధ్యయనం కూడా చేసేవారు. ఇది అంతా వారి స్థాయినిబట్టి జరుగుతుండేది. పూర్వ కాలంలో **'తక్షశిల'** చాలా పేరున్న గురుకులం, విద్యాభ్యాసం సరిగా సాగకపోతే విద్యార్థిని చేతులతో గాని, కొరడాలతో గాని శిక్షించేవారు. ఒక్కొక్కసారి బండకొయ్య, కోదండం వంటి శిక్షలు కూడా విధించేవాళ్ళు. బండకొయ్య అంటే – అడుగున్న పొడవు, ఒకఅడుగు వెడల్పు, ఒక అడుగు ఎత్తు ఉన్న కొయ్యదుంగకు గొలుసు బిగించి ఉండేది. ఆ గొలుసును తెచ్చి అల్లరిచేసే విద్యార్థి కాలికికట్టి ఊడిపోకుండా తాళం వేసేవారు. ఆ విద్యార్థి ఎక్కడికి వెళ్ళాలన్నా ఆదుంగను భుజాన పెట్టుకుని వెళ్ళాల్సిందే. మాచిన్నప్పుడు నేను చదువుకున్న బడిలోకూడా బండకొయ్య ఉండేది. కోదండం అంటే పైన ఒకకర్ర కట్టి ఉండేది. దానికి విద్యార్థి చేతులు కట్టేసి వ్రేలాడ తీసేవారు. కొన్నిసార్లు క్రింద మంటకూడా పెట్టేవాళ్ళు అని మాపెద్దవాళ్ళు చెబుతుండే వారు. విద్యార్థులకు వేదాలు, వేదాంగాలు, సర్వశాస్త్రాలతో పాటుగా యోగశిక్షణకూడా ఇచ్చేవారు. అష్టాంగ యోగం నేర్పువారు. అష్టాంగయోగము అంటే–

1. యమము 2. నియమము 3. ఆసనము 4. ప్రాణాయామము 5. ప్రత్యాహారము 6. ధారణ 7. ధ్యానము 8. సమాధి

విద్యాభ్యాస సమయంలో ప్రతివిద్యార్థి యమ నియమాలు పాటించాలి. వీటిలో మళ్ళీ యమము – ఐదు రకాలు అలాగే నియమము – ఐదు రకాలు

**1. యమము :** యమము అంటే అణచివేయుట, వశంలోఉంచుకోవటము అని అర్థం. ఇది ఐదు రకాలు. 1) అహింస 2) సత్యము 3) అస్తేయము 4) అపరిగ్రహము 5) బ్రహ్మచర్యము

వీటిని దేశకాలమానాది భేదం లేకుండా సర్వకాల సర్వావస్థల యందు పాటించి తీరాలి. యమాన్ని పాటించే విషయంలో పట్టువిడుపులు, మినహాయింపులు లేవు. ఇది గొప్పవ్రతం.

**2. నియమము :** నియమము అంటే ఏర్పాటు. వ్రతనిష్ఠ. యమం లాగానే నియమము కూడా ఐదు రకాలు. 1) శౌచము 2) సంతోషము 3) తపస్సు 4) స్వాధ్యాయము 5) ఈశ్వరప్రణిదానము

ఈ రెండింటినీ గనక సరిగా పాటిస్తే చాలావరకు మానవుడు పవిత్రుడవుతాడు. ఇక చివరివి ధారణ, ధ్యాన సమాధులు యోగవిద్యార్థులతో మిగిలిన విద్యార్థులకు దూరంగా, నదీసంగమ ప్రదేశాల్లోనో, కొండచరియల్లోనో అంటే ఏకాంత ప్రదేశాలలో చేయించేవారు.

సామాన్యంగా విద్యార్థికి ఒక వేదం నేర్చుకోవాలంటే పన్నెండు సంవత్సరాల కాలం పడుతుంది. కొంతమందికి ధారణశక్తి ఎక్కువ ఉంటుంది. వారు ఒకటికన్న ఎక్కువవేదాలు నేర్చుకునేవారు. కొంతమంది ఏకసంధాగ్రాహులు (ఒకసారి చెబితే చాలు వారికి

వచ్చేస్తుంది) మాత్రం నాగలుగు వేదాలు చదివేవాళ్ళు. ఇలాంటి వారిని దేశం మొత్తంమీద వ్రేళ్ళతో లెక్కపెట్టచ్చు. తరువాత కాలంలో వీరు నేర్చుకున్న విద్య, వీరు చదివిన చదువే వీరి ఇంటిపేరుగా స్థిరపడిపోయింది.

ఒక వేదం చదివిన వారి ఇంటి పేరు - వేదంవారు

ఉదా : వేదం వేంకట్రాయ శాస్త్రి గారు

రెండు వేదాలు చదివిన వాళ్ళు - ద్వివేదుల వారు (ద్వివేదుల విశాలాక్షి గారు)

మూడు వేదాలు చదివిన వారు - త్రివేదుల వారు

నాలుగు వేదాలు చదివిన వారు - చతుర్వేదుల వారు

2005 సంవత్సరం ఏప్రియల్ నెలలో కర్ణాటక గవర్నరు టి.ఎన్. చతుర్వేది నన్ను సత్కరించారు. ఆదిశంకరులు చిన్నతనంలోనే నాలుగు వేదాలు చదివారు. ఇలాంటివారు దైవాంశ సంభూతులు.

భాష్యం చదివిన వారు - ద్విభాష్యం అప్పలాచార్యులవారు

వ్యాకరణాన్ని చదివిన వారు - వ్యాకరణం వారు

వీరి విద్యాభ్యాసం పూర్తి అయిన తరువాత స్నాతకవ్రతం ఆచరించేవారు. ఇది రెండు రకాలుగా ఉండేది. 1) గురుకులంలో జరిగేది. 2) ఇంటిదగ్గర జరిగేది. 1) గురుకులంలో స్నాతకము అంటే ఇవాల్టి రోజున మనం డిగ్రీ పూర్తి చేసుకుని, యూనివర్సిటీ నుంచి పట్టా తీసుకుంటాము. ఆ కార్యక్రమాన్నే స్నాతకోత్సవము ఇంగ్లీషులో 'కాన్వొకేషన్' అంటారు. ఈ స్నాతకోత్సవంలో బ్రహ్మచారిని అతడి

అర్హతను బట్టి గౌరవించేవారు. పైన కప్పుకునే బట్ట, (చొక్కా) స్వర్ణకుండలాలు, తలపాగ, చెప్పులు, గొడుగు, సింహతలాటాలు (చేతి కంకణాలు) ఇవి పాండిత్యానికి గుర్తుగా బహూకరించే వారు. స్వర్ణకంకణ ప్రదానము, కనకాభిషేకము, గండపెండేరము వంటి సత్కారాలు ఈ రోజున కూడా జరుగుతూనే ఉన్నాయి.

స్నాతక బ్రహ్మచారిని విద్వాంసుడుగా గుర్తించేవారు. వేదపండితులు, శాస్త్రపండితులు అందరినీ ఉచిత రీతిన గౌరవించే వారు. వేదానికి భాష్యం చదవట మనేది పెద్ద చదువు. అంటే వేదంతో పాటుగా షట్‌శాస్త్రాలు, ఆ తరువాత భాష్యం చదవాలి. వీరికి వేదార్థం తెలుస్తుంది. ఆ రోజుల్లో చాలామంది వేదభాష్యం చదివేవారు. ఇవాల్టి రోజున వేదభాష్యం చదివిన వారు రాష్ట్రం మొత్తం మీద ఇద్దరు ముగ్గురు ఉంటున్నారు. దీనికి కారణం వేదానికి ఆదరణ లేకపోవటమే. చాలా సంవత్సరాలు కష్టపడి వేదభాష్యం చదువుకున్నా ఉపాధి ఉండదు. గౌరవం లేదు. రోజు గడవదు. ఈ కారణాల వల్ల వేదాధ్యయనం తగ్గిపోతోంది. ప్రాచీన విజ్ఞానగని అయిన వేదాన్ని రక్షించుకోవటం మన కర్తవ్యం. విద్యాభ్యాసం నాలుగువర్ణాల వారికి, వారి వారి యోగ్యతనుబట్టి ఉండేది. గురుకులం నుంచి ఇంటికి వచ్చిన తరువాత మళ్ళీ ఇంటిదగ్గర స్నాతకవ్రతం ఆచరించి దేశాటనకు బయలుదేరి వెళ్ళేవాడు బ్రహ్మచారి. ఈ సమయంలోనే వివాహం నిశ్చయమయ్యేది. తిరిగి వచ్చి వివాహం చేసుకునేవాడు. ఈ రకమైన స్నాతకోత్సవం వివాహ సమయంలో ఇప్పటికీ ఆచారంగా మాత్రమే జరుగుతోంది.

ఏ మానవుడైనా సరే కనీసం యమ నియమాలు పాటిస్తే చాలు, చాలా గొప్పవాడవుతాడు.

**గృహస్థాశ్రమము :** స్నాతకం పూర్తయింది. దేశాటన చేసి తిరిగి వచ్చాడు. ఇక్కడ దేశాటన రెండు కారణాల వల్ల జరుగుతోంది.

1) ఇప్పటివరకు ఇతడు బ్రహ్మచారి. గురుకులం తప్ప లోకం అంటే ఏమిటో తెలియదు. అందుకని లోకజ్ఞానం కోసం దేశాటన చేస్తాడు.

2) ఇప్పటివరకు బ్రహ్మచారి. ఇతనికి కావలసినవన్నీ గురువుగారే చూసుకున్నారు. ఇప్పుడు నిజజీవితంలోకి వస్తున్నాడు. వివాహం చేసుకుని గృహస్థు కాబోతున్నాడు. సంసారికి చాలా అవసరాలుంటాయి. వీటికి ధనం కావాలి. చేతిలో చిల్లిగవ్వ కూడా లేదు. అందుకని దేశాటన చేసి, తన పాండిత్యాన్ని ప్రదర్శించి, నలుగురి మన్ననలు పొంది, సత్కారాలు కానుకలు పొందితే నాలుగు డబ్బులొస్తాయి.

ఈ రెండు కారణాల వల్ల దేశాటనం పూర్తి చేశాడు. గతంలో చూసి నిశ్చయం చేసుకున్న పిల్లని వివాహం చేసుకున్నాడు. గృహస్థుడయ్యాడు. ఇక్కడ వివాహం చేసుకున్నాడు అంటే ఎనిమిది సంవత్సరాల పిల్ల అని కాదు. రజస్వలా పూర్వ వివాహ వేదంలో చెప్పబడలేదు. ఇది కారణాంతరాల వల్ల, తరువాత కాలంలో కల్పించబడ్డ సంప్రదాయం అందుకే ఇది కల్పసూత్రాలలో చెప్పబడింది. అంతేకాని వేదంలో మాత్రం కాదు. బాల్యవివాహాలు వేదంలో లేవు. వీటిని గురించి ఋగ్వేదంలో 'వివాహము' అనే చోట వివరంగా చెప్పుకున్నాం.

వినయము, న్యాయంగా ప్రవర్తించటము, శాంతము, అందము, అధికారము గల స్త్రీ భార్యగా ఎన్నుకోబడేది. ఆవిడ పురుషుడికి జీవన

జ్యోతిగా, గృహస్థాశ్రమ నియమాలను పాటించే యోగ్యతకలదానిగా, సంపదకు, కీర్తికి మూలంగా కీర్తించబడేది అని చెబుతోంది వేదం. గృహస్థాశ్రమంలో ఉన్న స్త్రీలు వంట చెయ్యటం, ఇల్లు అలంకరించుకోవటం, శరీరాన్ని చక్కగా అలంకరించుకోవటం ఇంటి పనులు నిర్వర్తించటంలో ప్రావీణ్యం గలవారు. గృహస్థాశ్రమంలో ముఖ్యోద్దేశము సంతానాన్ని పొందటం. వంశాభివృద్ధి జరగటం. ఆ రోజుల్లో ఒకరు లేక ఇద్దరు మాత్రమే పిల్లలు ఉండాలి అనే ఆంక్ష ఏదీలేదు. వశిష్ఠ మహర్షికి వందమంది కుమారులున్నారు. తల్లులు తమ పిల్లలను పాలిచ్చి పెంచేవారు. తల్లిపాలు బిడ్డకు మంచి ఆహారం.

చతురాశ్రమాలలోను గృహస్థాశ్రమము చాలా గొప్పది. దీనికి బాధ్యత ఎక్కువ. సమాజంలో అందరికీ కావలసిన ఆహారం గృహస్తు మాత్రమే అందిస్తాడు. బ్రహ్మచారులకు, సన్యాసులకు అందరికీ ఆహారం అందించాలి. వీళ్ళెవరూ వంట చేసుకోరు. గృహస్తు వంట చేసి వీళ్ళందరి ఆకలి తీరుస్తాడు. అలాగే పశువులు, పక్షులకు కూడా. అన్ని ఆశ్రమాలు గృహస్థాశ్రమాన్ని ఆశ్రయించి ఉంటాయి. సన్యాసులకు బ్రహ్మచారులకు బిక్ష పెట్టాలి. అతిథుల్ని సత్కరించాలి. యజ్ఞయాగాది క్రతువులు చెయ్యాలి. గృహస్థాశ్రమంలో అనేక రకాలయిన విధులు నిర్వర్తించాలి 1. సుఖము 2. శాంతి 3. గతి 4. స్ఫూర్తి అనే నాలుగు ధర్మాలు గృహస్థాశ్రమంలో తప్పక పొందవలసినవి అని చెబుతోంది వేదం.

**వానప్రస్థము :** యాభై సంవత్సరాల వరకు సంసారము బాధ్యతలు. ఇవన్నీ అయిన తరువాత అంటే పిల్లలకు పెళ్ళిళ్ళు చేశాం, వాళ్ళంతా ఎవరి జీవితం వాళ్ళు జీవిస్తున్నారు. ఇక ఇప్పుడు భార్యా సమేతంగా వానప్రస్థానికి వెళ్ళాలి. ఈ వానప్రస్థము అనేది అరణ్య ప్రాంతాలలో,

నదీతీరాలలో, పుణ్యక్షేత్రాలలో చెయ్యటం జరుగుతుంది. ఈ సమయంలో లౌకికమైన విషయాలకు ఏ మాత్రము తావివ్వకుండా కేవలం ఆధ్యాత్మిక చింతనలోనే జీవితం గడపాలి. దేనిమీద ఆసక్తి ఉండరాదు. పక్షపాతము ఉండకూడదు. ఆపదలో ఉన్న వారికి సహాయం చెయ్యాలి. శరణన్న వారిని రక్షించాలి. ధర్మాన్ని ఎప్పుడూ తప్పరాదు. నియమనిష్ఠలతో కాలం గడపాలి. నిరంతరం భగవధ్యానంలోనే ఉండాలి. జీవులన్నింటి పట్ల ప్రేమ, అభిమానము చూపాలి. త్యాగబుద్ధిని బాగా అలవాటు చేసుకోవాలి. దేనిమీద ఆసక్తి ఉండరాదు. ప్రాణం నిలవాలి కాబట్టి ఆహారం తీసుకోవాలి. పూజలు, హోమాలు, జపాలు, తపాలు చేస్తూ కాలం గడపాలి. వానప్రస్థులు అలాగే కాలం గడిపేవారు.

**సన్యాసము :** సన్యాసము అంటే మంచి నడవడి అని అర్థం. గృహస్థాశ్రమంలో ఉండేవారు రంగు రంగుల వస్త్రాలు ధరిస్తారు. వానప్రస్థంలో తెల్లని వస్త్రాలు మాత్రమే ధరిస్తారు. అదే సన్యసించిన వారు కావిరంగు వస్త్రాలు మాత్రమే ధరిస్తారు. వాటినే కాషాయము అంటున్నాం. కాని నిజంగా అది ఏ రంగూ లేని, రంగు వెలిసిపోయిన వస్త్రం. తెల్లని వస్త్రాలు మనం వాడగా వాడగా కొంత కాలం అయ్యేసరికి వస్త్రంలో తెలుపు తగ్గిపోయి ఒక రకమైన రంగు కనిపిస్తుంది. రంగు వెలిసిపోయినట్లుగా ఉంటుంది. అది కావిరంగు. చూడటానికి బాగుండదు. అటువంటి వస్త్రాన్ని ధరించి భార్యని కుమారులకు వప్పగించి, అన్ని రకాల బంధాలు త్రెంచుకుని, మెడలోని జంధ్యాన్ని కూడా తీసేసి, శిఖను తీసేసి, ఒంటరిగా సత్యాన్వేషణ చేస్తూ, నదీ తీరాలలోను, పర్వత ప్రాంతాలలోను, అరణ్యాలలోను ఉండిన చోట ఉండకుండా తిరుగుతూ ఉండాలి. వానప్రస్థంలో కర్మలు చేశాడు.

ఇప్పుడు ఆ కర్మలు చెయ్యటం కూడా మానేశాడు. ఈ సన్యాసులు తాము తెలుసుకున్న సత్యాన్ని లోకంలోని జనులకు వివరించి చెబుతుండేవారు. సంసారము అంటే సారము లేనిది. లౌకిక సుఖాలు కేవలము క్షణికాలు. శాశ్వతమైన సుఖం కోసం ప్రయత్నం చెయ్యండి అని ప్రజలకు బోధించేవారు. ఆత్మానందం కోసం ప్రయత్నం చెయ్యండి అని బోధించేవారు. ఈ రకంగా చెప్పి జనన మరణాల భయం పోగొట్టేవారు. వైరాగ్యం పెంపొందింపచేసి సన్యాసులు ప్రజలను ధర్మమార్గంలో నడిపించే వారు అని చెబుతోంది వేదం.

# 22. ఏకేశ్వరోపాసన

వేదంలో రకరకాల దేవతల పేర్లు చెప్పారు కదా ? ఇంతమంది దేవతలున్నారా? అనేది మన అనుమానం, ఇంతమంది దేవతలు లేరు అనేది సమాధానం. అంతమంది లేనప్పుడు అన్ని పేర్లు ఎందుకు చెప్పారు? అనేది మళ్ళీ ప్రశ్న ఉన్నది. ఒక్కడే పరమేశ్వరుడు. జరగవలసినవి రకరకాల పనులు. మనల్నే ఉదాహరణగా తీసుకోండి, ఇంటి పని చేస్తున్నప్పుడు ఒక రకంగా ఉంటాం. తోట పనిచేస్తున్నప్పుడు ఇంకో రకంగా ఉంటాం. బయట పనులు చేసేటప్పుడు ఒక రకంగా ఉంటాం. ఇంటి వ్యవహారాలు చూసేటప్పుడు వేరే రకంగా ఉంటాం. ఇక్కడ ఉన్న మనం ఒకళ్ళమే. కాని పది రకాల పనులు చేస్తున్నప్పుడు పది రకాలుగా కనిపిస్తాం. తెలిసినవాడు మనల్ని ఎలా చూసినా గుర్తుపడతాడు. అదే తెలియని వాడు కొత్తవాడు అనుకోండి వీళ్ళందరూ వేరు వేరు వ్యక్తులు అనుకుంటారు. మనం ఎదురుగా ఉన్నా గుర్తించలేరు. కారణం మనం వాళ్ళకి పరిచయం లేకపోవటమే. ఒక్కొక్కసారి కొంతమంది మా ఇంటికి వచ్చి 'పార్థసారథి గారు కావాలి' అని నన్నే అడుగుతారు. నేనేవరో వారికి తెలియదు కదా ? ఇక్కడ ఒక చిన్న విషయం చెబుతాను. మొన్న సరిగ్గా పదిరోజుల క్రితం 2014 ఏప్రియల్ 24వ తారీఖున బంధువుల ఇంట్లో ఉపనయనానికి హైదరాబాదు వెళ్ళాను. కార్యక్రమం అంతా అయిపోయింది. ఇక బయలుదేరాలి. సాయంత్రం నాలుగయింది. ఐదు గంటలకు నాకు రైలు. అప్పటిదాకా పైన కూచుని ఏదో మాట్లాడుతున్నాం. క్రిందికి రమ్మని కబురు చేశారు. సరే దిగి క్రిందికి వచ్చాను. నేను వచ్చిన తరువాత వటువు తల్లికి, మేనత్తకు నేను వ్రాసిన **శ్రీవిద్యాసారథి,** లలితా సహస్రనామ భాష్యం, సౌందర్యలహరి

పుస్తకాలు ఇచ్చాను. వాళ్ళు చాలా ఆనందించారు. వటువు తాతగారు చెబుతున్నారు నెట్‌లో నుంచి పార్థసారథి గారి ఉపన్యాసాలు చాలా డౌన్‌లోడ్ చేసుకున్నారట. క్రితం రోజే సౌందర్యలాహరి కూడా డౌన్‌లోడ్ చేసుకున్నారట. 'వారివి దగ్గరదగ్గరగా అన్ని ఉపన్యాసాలు నా దగ్గర ఉన్నాయి' అనిచెప్పి నాదగ్గరకు వచ్చి 'స్వామీ ! మీరు అదృష్టవంతులు. పార్థసారథి గారిని చూడగలిగారు. ఇంతకీ ఆయన మీకు అన్నగారా ? గురువుగారా? బంధువా? మీకు ఏమౌతారు?' అని అడిగారు. ప్రక్కన ఉన్నవాళ్ళు కొంత మంది గొల్లున నవ్వేస్తుండగా ఆయన కూతురు అంటే వటువు తల్లి చెప్పింది "అయ్యో నాన్నా! ఆయనే పార్థసారథి గారు" అని

ఇక్కడ విషయం ఏమంటే సాక్షాత్తు పరమేశ్వరుడే వచ్చి మన ఎదురుగా నుంచున్నా ఆయన్ని మనం గుర్తు పట్టలేం. కారణం అంతకు ముందు ఆయన్ని గురించి మనకు తెలియకపోవటం. ఆయన్ని చూడకపోవటం. వేదంలో చెప్పింది ఇదే. ఉన్నది ఒక్కడే పరమేశ్వరుడు. ఆయన భిన్నమైన రూపాలలో మనకు కనిపిస్తున్నాడు. ఋగ్వేదంలో ఈ విషయం చెప్పుకున్నాం, శుక్లయజుర్వేదం కూడా ఇదే విషయాన్ని మళ్ళీ చెబుతోంది.

సర్వాంతర్యామి అయిన పరమాత్మ ఒక్కడే. అతడికి జన్మమృత్యుజరాదులు లేవు. అతడే సాధకుల కోరికల ననుసరించి ఇంద్రుడిగా, చంద్రునిగా, అగ్నిగా, సూర్యుడిగా తెలియబడుతున్నాడు. ఆయన ఆత్మస్వరూపుడు. ఆ పరమాత్మను గురించి తెలుసుకోవటంవల్ల మరణభయం పోతుంది. మరణభయం లేనివాడు ముక్తి కావాలని దానికోసం ప్రయత్నం చేస్తాడు. శుక్లయజుర్వేదంలో 40వ అధ్యాయం ఉపనిషత్తు. అదే **ఈశావాస్యోపనిషత్తు** అంటారు.

ఆ పరమేశ్వరుణ్ణి సంతోషపెడితే మనకి ఏం కావాలంటే అది ఇస్తాడు. ఇహం లేక పరం. ఏది కావాలన్నా ఇస్తాడు. ఇక్కడ చిన్న అనుమానం. రెండూ కావాలంటే? ఇహపరాలనేవి బంధమోక్షాలు. ఇహము అంటే బంధము. పరము అంటే మోక్షము. ఒకటి చీకటి, రెండవది వెలుతురు. ఇందులో ఏది కావాలన్నా ఉంటుంది. కేవలం మన తెలివితేటలు ప్రదర్శించటానికే అలా మాట్లాడతాం. అంతే. కాని రెండూ కావాలంటే సాధ్యం కాదు కదా? గది అంతా చీకటిగా ఉంది. లైటు వేశాం. చీకటి పోయింది. వెలుతురు వచ్చింది. ఈ రెండింటిలో ఏదో ఒకటే ఉంటుంది. అంతేగాని రెండూ ఉండవు. చీకటి వెలుతురు ఒకేసారి ఉండవు. అలాగే ఇహము పరము కూడా. పరమేశ్వరుణ్ణి సంతోష పెట్టటానికి అనేక సాధనాలు. పూజలు, వ్రతాలు, అర్చనలు, జపాలు. వీటన్నింటిలో యజ్ఞయాగాలు ఉత్తమమైనవి. యజ్ఞయాగాలలో మనమిచ్చే ఆహుతులను పరమేశ్వరుడు ప్రత్యక్షంగా తీసుకుంటాడు. ఇందులో సందేహం లేదు. సహస్రచండీయాగం చేస్తున్నప్పుడు నేనిచ్చే ఆహుతులు ఆ దేవత తన చేత్తో తీసుకోవటం నేను ప్రత్యక్షంగా చూశాను. అందుకే ఇది అనుభవైక వేద్యము. పరమేశ్వరుణ్ణి సంతోషపెట్టటానికి ఉత్తమమైన మార్గము యజ్ఞయాగాలు. అందుకే యజ్ఞమే అన్నింటినీ సాధించిపెడుతుంది. అన్ని కోరికలు తీరుస్తుంది. మానవ ప్రయత్నంవల్ల సాధ్యంకాని పనులు యజ్ఞయాగాలవల్ల జరుగుతాయి. మొండి రోగాలు నయమవుతాయి. శత్రునాశనంజరుగుతుంది. సిరిసంపదలు, భోగభాగ్యాలు వస్తాయి. సంతానంలేక అలమటిస్తున్న దశరథుడికి సంతానం కలిగింది. సంతానం కోసం యజ్ఞం చెయ్యాలి అని నేలదున్నుతున్న జనక మహారాజుకు యజ్ఞం చెయ్యకుండానే యజ్ఞఫలం దక్కింది. వర్షాలు

కురవటానికి, పంటలు పండటానికి కూడా యాగాలు చేసేవారు. భాగవతంలో గోవర్ధనోద్ధరణ ఘట్టము ఆ సందర్భంలోదే.

యజ్ఞాలు యాగాలు చెయ్యటానికి ఆజ్యంగా ఏం వాడాలి? ఇదీ మన ప్రశ్న. సామాన్యంగా గోఘృతము (ఆవునెయ్యి) ఆజ్యంగా వాడబడుతుంది. ఏ దేవతకి హోమం చెయ్యటానికైనా దీన్ని మనం వాడచ్చు. అయితే మనం చేసే హోమాన్ని బట్టి, ఆ దేవతని బట్టి ఇతర పదార్థాలు కూడా వాడటం జరుగుతుంది. రకరకాల ధాన్యాలు, పాలు, పెరుగు, తేనె, అన్నము, పేలాలు, అటుకలు, రకరకాలు పండ్లు, డ్రై ఫ్రూట్స్, పాయసము సుగంధ ద్రవ్యాలు మొదలైన అనేక పదార్థాలను హవిస్సుగా వాడచ్చు అని వేదంలో చెప్పారు. అయితే రకరకాలు పదార్థాలు సుగంధ ద్రవ్యాలు కలిపి పొడిగా కొట్టి హవిస్సుగా వాడతారు. దాన్ని **'శాకల్యము'** అంటారు. ఇది 43 రకాల పదార్థాల మిశ్రమం. ప్రస్తుతం 'హోమంపొడి' అనే పేరుతో **'గాయత్రీ పరివార్'** దీన్ని మనకందిస్తున్నది. మనకి కావాలంటే ఈ పొడిని పెద్దమొత్తంలో బస్తాలలో కూడా పంపిస్తారు. ఇది ప్రశస్తమైనది. ఇవాల్టిరోజున కొంతమంది వ్యాపారులు కూడా దీన్ని తయారుచేసి అమ్ముతున్నారు. ఇవి కాక యజ్ఞయాగాలలో వాడే స్రుక్కు, స్రువము, చమసము మొదలైన పాత్రల గురించి ఈ వేదంలో చెప్పారు.

హవిస్సులో ప్రధానమైనది సోమరసము. ఇది ఉత్తరభారతంలోనే దొరుకుతుంది. ఆంధ్ర, మహారాష్ట్ర ప్రాంతాలలో దీనికి ప్రత్యామ్నాయంగా **తిప్పతీగెను** వాడటం జరుగుతోంది. సోమరసం దేవతలకి, ప్రత్యేకించి ఇంద్రుడికి ప్రీతికరమైనది. ఇది మంచి బలము తేజస్సు ఇస్తుంది. యజ్ఞంచేసి యజ్ఞప్రసాదమైన సోమరసాన్ని తాగిన వారికి సంతానం కలుగుతుంది అని కూడా చెప్పింది వేదం. అంటే

సోమరసం ధాతువృద్ధి, శుక్రవృద్ధికారి అన్నమాట.

యజ్ఞయాగాది క్రతువులు చేసేటప్పుడు బంధువులు, స్నేహితులు, ఆసక్తి గలవారు అందర్నీ ఆహ్వానిస్తారు. సుదూర ప్రాంతాల నుంచి కూడా యజ్ఞయాగాలు చూడటానికి వస్తారు. ఈ విషయాలన్నీ వేదంలో చెప్పారు. భగవంతుణ్ణి ఏ పేరుతో పిలిచినా, ఏ రూపంతో కొలిచినా, ఉన్నదిఒక్కడే. అతడే పరమేశ్వరుడు. **అదే ఏకేశ్వరోపాసన.**

# 23. ప్రభుత్వము - ప్రజలు

ఏ ప్రభుత్వమైనా పదికాలాలపాటు నిలవాలి అంటే ప్రభుత్వానికి ప్రజలకి మధ్య సంబంధాలు బాగుండాలి. ప్రజలు ప్రభుత్వం బాగుండాలనీ, తమని పాలించే రాజు క్షేమంగా ఉండాలని భావించాలి. అతనికి విధేయులుగా ఉండాలి. అలాగే రాజు కాని, ప్రభుత్వం కాని ధర్మానికి ప్రతీకగా ఉండాలి. తమ రాజ్యంలోని ప్రజలంతా సుఖసంతోషాలతో హాయిగా ఉండాలని ఏ రకమైన కష్టాలు లేకుండా ఉండాలనీ భావించాలి. ప్రజలను కన్నబిడ్డలలాగా చూసుకోవాలి. అంతేకాని ఐనకాడికి దొరికిందంతా ప్రోగు చేసుకుని మూటలు కట్టుకోరాదు. **రాజు లేక ప్రభుత్వాధికారి ప్రజాధనానికి కాపలా కుక్క మాత్రమే.** ఈ విషయాన్నే వివరిస్తోంది శుక్లయజుర్వేదం.

తాము ఆరాధించే దేవతల అనుగ్రహంవల్ల తమను పాలించే మహారాజు సామ్రాట్టై, ఏకఛత్రాధిపతి కావాలని, ప్రజలంతా కోరుకునే వారు. ప్రజలకు స్వార్థమనేది ఉండేది కాదు. అందరూ లోకకళ్యాణం జరగాలనే కోరుకునేవారు. **"ఈ లోకంలో ఉండే మానవులకు, పశువులకు, పక్షులకు, అందరికీ ఏ రకమైన కష్టాలు నష్టాలు, ఉపద్రవాలు రాకుండా సుఖసంతోషాలతో, పిల్లా పాపలతో హాయిగా ఉండేటట్లుగా కరుణించమని ఆ పరమేశ్వరుణ్ణి 17వ అధ్యాయంలో ప్రార్థిస్తున్నారు.**

ఆ రోజుల్లో రాజు అంటే ధర్మానికి ప్రతీక. నిప్పులో ఒక కాలు, నేలమీద ఒక కాలుపెట్టి ధర్మాన్ని రక్షించేవారు. తీర్పులు చెప్పేటప్పుడు, నిర్ణయాలు తీసుకునేటప్పుడు తరతమ భేదాలు లేకుండా నిష్పక్షపాతంగా వ్యవహరించేవారు. సింహాసనాన్ని అధిష్ఠించి పట్టాభిషిక్తుడయ్యే రోజున ధర్మాన్ని రక్షిస్తానని ప్రతిజ్ఞ చేసేవాడు. ఆడిన

మాట తప్పేవాడు కాదు. దానికోసం తమ ప్రాణాన్నయినా ఇవ్వటానికి సిద్ధపడేవారు. బలిచక్రవర్తి, శిబిచక్రవర్తి ఇందుకు మంచి ఉదాహరణ. ప్రజాక్షేమాన్నే వారు కాంక్షించేవారు. ప్రజలఇబ్బందులు తమఇబ్బందులుగా భావించేవారు. అందుకే రాజును ప్రజలు విపరీతంగా గౌరవించే వారు. రాజుగారి కోసం, దేశం కోసం ప్రాణాలివ్వటానికి కూడా వెనకాడేవారు కాదు.

ప్రజలు ఎప్పుడూ సన్మార్గంలో ప్రవర్తిల్లేవారు. చెడుచూడాలనికాని, వినాలని కాని ఎప్పుడూ కోరుకునే వారు కాదు. మేము ఎప్పుడూ మంచి వాక్కులనే వినాలి. మంచి దృశ్యాలనే చూడాలి. మంచి పలుకులే మాట్లాడాలని భావించేవారు. దీనికోసం దేవతలను ఆరాధించే వారు. లోకంలో తల్లి, తండ్రి, భార్య, పిల్లలు, బంధువులు, స్నేహితులు, అందరూ సుఖంగా ఉండాలనే ఆ భగవంతుణ్ణి ఆరాధించేవారు. యజ్ఞయాగాదులలో కూడా ఇదే రకమైన ప్రార్ధన ఉండేది. తమ దగ్గర ఉన్న దాన్ని ఇంకొకరికి ఇవ్వటానికి ఏ మాత్రం వెనకాడే వారు కాదు. ఇతరులతో కలిసి పంచుకోవటం, ఆనందంగా జీవించటం. అనేవి వారి ఆశయాలు. తమ వారికే కాదు శత్రువులకు కూడా మంచి జరగాలని, ప్రార్ధించేవారు. శత్రునాశనం కన్న, అతనిలో మార్పురావాలని ప్రార్ధన చేసేవారు. శత్రువులు కూడా సుఖంగా ఉండాలని కోరుకునే వారు దేవతల కన్న గొప్పవారవుతారు. ఆనాటి ప్రజల భావన ఇలాగే ఉండేది అని చెబుతోంది వేదం.

పూర్వకాలంలో ఒక బీదబ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు చాలా గొప్ప పండితుడు. కడు బీదవాడు. రోజు బిక్షాటన చేసి కుటుంబాన్ని పోషించేవాడు. ప్రతిరోజు రాజుగారి దగ్గరకు వెళ్ళి ఆ రోజు తిథి వార నక్షత్రాలు చెప్పేవాడు. రాజుగారు అతడికి దినబత్యం ఇప్పించేవాడు. ఇలా తిరిగి మిట్టమధ్యాహ్నం మండిపోయే ఎండలో ఇల్లు చేరేవాడు

బ్రాహ్మణుడు. అతన్ని చూసి చాలా బాధపడ్డాడు రాజు. ఇక నుంచీ అతను ఇలా తిరగకుండా శాశ్వతంగా అతడికి ఉపాధి ఏర్పాటు చేశాడు. ఆ మర్నాడు రాజుగారి దగ్గరకు రాలేదు ఈ బ్రాహ్మణుడు. ఆరోగ్యం బాగాలేదు అనుకున్నాడు రాజు. రెండు, మూడు, నాలుగు రోజులు, వారాలు గడిచినాయి. బ్రాహ్మణుడి జాడలేదు. భటులను పంపించి వాకబు చేయించాడు. బ్రాహ్మణుడి ఆరోగ్యం బాగానే ఉంది. నిన్నటిదాకా దినబత్యాల కోసం ప్రతిరోజు తన దగ్గరకు వచ్చేవాడు. ఇప్పుడు తానే దినవెచ్చాలు పంపిస్తున్నాడు కాబట్టి రావటం మానేశాడు అనుకున్నాడు. ఆ మర్నాడు మధ్యాహ్నం బయలుదేరి బ్రాహ్మణుడి ఇంటికి వెళ్ళాడు. ఊరిచివర చెరువు దగ్గరకి వెళ్ళాడు అని చెప్పారు. అక్కడికి వెళ్ళాడు రాజు. చెట్టుక్రింద కూచుని జపం చేస్తున్నాడు బ్రాహ్మణుడు. రాజుగారు అతని దగ్గరకి వెళ్ళి "ఏమయ్యా బ్రాహ్మణోత్తమా! గతంలో ప్రతిరోజూ నన్ను ఆశీర్వదించి దినవెచ్చాలు తీసుకువెళ్ళేవాడివి. ఇప్పుడు నువ్వు కష్టపడకుండా వాటిని నేనే ప్రతిరోజు మీ ఇంటికి పంపిస్తున్నాను. నువ్వు నన్ను ఆశీర్వదించటం కాదుకదా కనీసం కంటికి కనిపించటం కూడా మానేశావు" అన్నాడు. ఆ మాటలు విన్న బ్రాహ్మణుడు లేచి రాజుకు నమస్కారం చేసి రాజా! ఇదివరకు కేవలము నిన్ను ఆశీర్వదించే వాణ్ణి ఇప్పుడు హాయిగా ప్రశాంతంగా జపం చేసుకుంటున్నాను. బ్రాహ్మణుడు చేసే జపంలో నాల్గవవంతు తాను నివసిస్తున్న భూమికి; నాల్గవ వంతు ఆదేశాన్ని పాలించే రాజుకు పోతుంది. మిగిలిన సగమే అతడికి వచ్చేది. కాబట్టి రాజా! గతంలో కేవలము ఆశీర్వాదమే నీకు దక్కేది. ఇప్పుడు నేను చేసిన జపంలో నాల్గవవంతు ఫలితం కూడా నీకు దక్కుతోంది" అన్నాడు.

ఈ రకంగా రాజు ప్రజల శ్రేయస్సు కోరితే ప్రజలు రాజు యొక్క శ్రేయస్సు కోరేవాళ్ళు.

# 24. రాజ్యపాలన

దేశం యొక్క అభివృద్ధి అనేది ఆ దేశాన్ని పాలిస్తున్న పాలకుల మీద ఆధారపడి ఉంటుంది. రౌతు గనక మంచి వాడైతే గుర్రం బాగా దౌడు తీస్తుంది. అలాగే పాలకులు సమర్ధులైతే దేశం చాలా బాగా అభివృద్ధి చెందుతుంది. స్వతంత్రం వచ్చి అరవై సంవత్సరాలు దాటింది కదా మనం అభివృద్ధి చెందలేదా అంటే, అభివృద్ధి చెందాం. కాని చెందవలసినంత మాత్రం అభివృద్ధి సాధించలా. మలేషియా, సింగపూరు లాంటి అతిచిన్న దేశాలతో పోల్చిచూసినా మన అభివృద్ధి ఎంతో మనకి తెలుస్తుంది. ఎప్పుడూ రాజ్యపాలకులు, వాళ్ళ పాలనావిధానం బాగుంటే దేశం బాగా అభివృద్ధి చెందుతుంది. ప్రజలు ఆరోగ్యంగా ఉంటారు. వేదకాలంలో రాజ్యపాలన, పరిపాలకులు, ఆ విధానమంతా చాలా బాగుండేది అని చెబుతోంది వేదం.

ఈ వేదంలో **తొమ్మిదవ అధ్యాయంలో** చెప్పిన విషయాలను బట్టి చూస్తే ఆ రోజుల్లో ప్రజలకు సంపూర్ణ స్వాతంత్ర్యం ఉంది. యజ్ఞయాగాదులు జరిగే సమయంలో సభలు నిర్వహించే వారు. ఆ సభలకు రాజు లేదా రాజపరివారములోని విద్వాంసులు హాజరయ్యేవారు. ప్రజలు తమ సమస్యలను వారిముందు ఉంచేవారు. ఆ సమస్యలను కూలంకుషంగా చర్చించి పరిష్కారాలు చూపేవారు విద్వాంసులు.

దేశం బలమైన ఉత్తమమైన అశ్వంతో పోల్చబడింది. ఆ గుర్రానికి మెడలో, నడుముకు, ముఖానికి బంధనాలుంటాయి. అలాగే దేశానికి కూడా పరిపాలనా పరమైన నియమాలుంటాయి. గుర్రానికి బంధాలుంటేనే వేగంగా పరుగెత్తి లక్ష్యాన్ని చేరుతుంది. అలాగే

నియమాలు ఉంటేనే రాజ్యం ప్రగతినిసాధిస్తుంది. దేశానికి అధికారి రాజు. రాజు ప్రజలచేత ఎన్నుకోబడతాడు. అతడికి వంశపారంపర్య హక్కు లేదు. అలా ఎన్నుకోవటానికి అనేక రకాల పద్ధతులున్నాయి. అనేక పరీక్షలు నిర్వహించేవారు. కత్తియుద్ధాలు. కర్రయుద్ధాలు, రాజనీతి, మొ॥వి అందులో ఉత్తీర్ణుడయిన వాడే రాజు. ఒక్కోసారి ఏనుగుకు పూలమాల ఇచ్చి పంపేవారు. ఆ మాల ఎవరిమెడలో పడితే వాడే రాజు. ఇలా రాజును ఎన్నుకున్న తరువాత వివిధ నదుల నుంచి సముద్రాలనుంచి సేకరించిన నీటితో అతన్ని అభిషేకించేవారు. ఆ సమయంలో రాజగురువు సభాసదులతో “ఓ సభాసదులారా! ఈ వ్యక్తిని ధర్మంకోసం, మంచిఐశ్వర్యము, పరాక్రమము, సామ్రాజ్యాల కోసం ఏకగ్రీవంగా అభిషేకించండి. ఇతడు సభాసదులైన మీకు, ఈ రాజ్యానికి, బ్రాహ్మణులకు రాజౌతాడు.” అని చెప్పి సభికుల అనుమతితో అతణ్ణి రాజుగా అభిషేకించేవారు. రాజ్యపాలనలో పురోహితుడు కూడా పెద్దపాత్ర పోషిస్తాడు. రాజు ధర్మపరంగా, ప్రజారంజకంగా పాలించేవాడు.

పరిపాలన అనేది ఒక్కరివల్ల అయ్యేది కాదు. దానికి ప్రత్యేకమైన వ్యక్తులు ఉండాలి. వారిని రాజ్యాధికారులుగా ఎన్నుకునే వారు. వారు మొత్తం 27 మంది. వీరు బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులకు ప్రతినిధులుగా ఉండే వారు. రాజసభలో మూడు విభాగాలుండేవి.

1. రాజార్యసభ 2. విద్వాంసుల సభ 3. ధర్మసభ. వీటిలో ఒక్కొక్క దానికి తొమ్మిది మంది సభ్యులుంటారు. $9 \times 3 = 27$ మంది సభ్యులు.

భూసేనలో 1. పదాతిదళము 2. గజదళము 3. ఆశ్వికదళము

4. రథదళము అని నాలుగు రకాలుండేవి.

రాజుగారికి పాలనాపరమైన సలహాలివ్వటానికి కొంతమంది మంత్రులను నియమించే వారు. ఉదా॥ న్యాయమంత్రి, విద్యామంత్రి, విదేశ వ్యవహారాలు, సేనాధిపతి ఇలా వివిధ రకాల మంత్రులు ఉండేవారు. అందులో సేనాధిపతిని సేనామంత్రి అంటారు. ఆ రోజుల్లో భూసేన, జలసేన అని రెండు రకాల సేనలుండేవి.

ఇక్కడ విచిత్రం ఏమంటే 'రాజుగారు ఈ రంగులో ఇలా ఉంటారు' అని చెబుతోంది వేదం. రాజుగారు పెద్ద పెద్ద మీసాలతో నలుపు ఎరుపు కలిసిన రంగుతో ఉంటాడు, మీసాలు పౌరుషానికి గుర్తు కాబట్టి రాజులందరికీ మీసాలు ఉంటాయి. కాని శరీరం ఈ రంగులోనే ఉంటుంది అనటానికి ప్రమాణం కనిపించదు. రాజు ఆ దేశానికి సర్వసహాధికారి. ఇతర అధికారులందరినీ వారి వారి యోగ్యతల ననుసరించి రాజే నియమిస్తాడు. విద్య సంస్కృతి బాగా ప్రచారం చేయించేవాళ్ళు. ప్రజలకు సుఖశాంతులు కలుగచెయ్యటం, శత్రువుల నుంచి, దొంగల నుంచి, ఆపదల నుంచి ప్రజలను రక్షించటం రాజుయొక్క ప్రధానకర్తవ్యం.

ప్రజాక్షేమం కోసం రాజుగారు యజ్ఞయాగాది క్రతువులు చేసేవారు. ఇలా యజ్ఞాలు చేసేటప్పుడు అవసరమైతే ప్రజలు తమవంతు సహకారం అందించేవారు. ఋషీశ్వరులు కూడా దేశక్షేమం కోసం యజ్ఞయాగాలు చేసేవారు. ఆ యాగాలకు సంబారాలు రాజే సమకూర్చేవాడు. రాక్షసులబారినుండి ఆ యాగాలను రక్షించేవాడు. విశ్వామిత్రుడు రాముణ్ణి యాగరక్షణకోసమే తీసుకువెళ్ళాడు. రాక్షసులను సంహరించే శక్తి విశ్వామిత్రుడికి లేక కాదు, యజ్ఞయాగాలు

చేస్తున్నప్పుడు అరిషడ్వర్గాల పొడకూడా సోకరాదు. ఒకవేళ సోకితే ఆ యజ్ఞం ఫలితానివ్వదు. అందుకే విశ్వామిత్రుడు రాముణ్ణి తీసుకువెళ్ళి, తన దగ్గరున్న అస్త్రాలన్నీ అతనికిచ్చి అతనిచేత రాక్షససంహారం చేయించాడు. అంతేకాని తానుచెయ్యలా.

ప్రజోపయోగమైన పనులు చెయ్యటం కూడా రాజుల కర్తవ్యమే. బాటలు వేయించటం, నీటి సౌకర్యాలు అంటే చెరువులు బావులు తవ్వించటం, పంటలు బాగా పండటానికి అవసరమన తోడ్పాటు అందివ్వటం, దేశాన్ని శత్రువుల బారి నుంచి రక్షించటం. ఆ రోజుల్లో దోపిడీ దొంగలు ఉండేవారు. వీరు అరణ్యాలలో నివసిస్తూ దారిని పోయే వారిని దోపిడీ చేసేవారు. గుంపులు గుంపులుగా వచ్చి ఊరిమీదపడి దోచుకునేవారు. హత్యలుకూడా చేసేవారు. ప్రపంచపు వింత అయిన చైనాలోని పెద్దగోడ ఇలాంటి దోపిడీ దొంగలను అరికట్టటానికి కట్టిందే. వీళ్ళు గుంపులుగా అరణ్యాలలో ఉండేవారు. ఈ రోజునైతే వీరు మనతోపాటుగానే ఉంటూ రాత్రిపూట బస్సులలో దోపిడీలు చేస్తున్నారు. వీలైతే బస్సులో ఉన్నవారందరినీ సజీవదహనం కూడా చేస్తున్నారు. ఒకవేళ వీళ్ళు పట్టుబడి కోర్టులో మరణశిక్ష విధించినా, ఏదో కారణం చేత క్షమాబిక్ష దొరుకుతుంది. ఇంకొక విషయం ఏమంటే, ఆ రోజుల్లో దొంగలు అరణ్యాలలో ఉండేవారు. కాని ఇవాల్టిరోజున కొందరు రాజకీయ నాయకులు, ప్రభుత్వాధికారులే పెద్దదొంగలు. ఒకచిన్న ఉదాహరణ చూడండి. రాజభరణాలు రద్దుచెయ్యకముందు మనదేశంలో ఒకచిన్న సంస్థానం ఉండేది. దానిపేరు **'బుందేల్‌ఖండ్'** రాజభరణాలు రద్దయిన తరువాత ఈ మహారాజుకు సంవత్సరానికి కొన్నివందల రూపాయలు మాత్రమే భరణంగా వచ్చేది. అది ఆయన ఖర్చులకు చాలదు. అందుకని ఆ

రాజుగారే కొంతమంది దొంగలను చేరదీసి, రాత్రిపూట బాటసారులను అటకాయించి దోపిడీలు చేయించేవాడు. బయటకు మాత్రం రాజుగారు చాలా ధర్మాత్ముడు.

ఒకరోజున మనబోటి బాటసారిని దోచుకున్నారు దొంగలు. ఏం చెయ్యాలో తెలియక లబోదిబోమంటుంటే ఊరిప్రజలు "మా రాజుగారు ధర్మాత్ముడు. వెళ్ళి ఆయనకు చెప్పండి. పోయిన సొమ్ము దొరుకుతుంది" అని సలహా ఇచ్చారు. రాజుగారికి ఫిర్యాదు చేశాడు బాటసారి. విచారించాడు రాజుగారు. ఆ పని చేసింది తన వారే అని తెలిసింది. మారుమాట్లాడకుండా వారు పోగొట్టుకున్న సొమ్ము ఇచ్చి పంపించేశాడు. **'బుందేల్‌ఖండ్‌కీ కహానీ'** అనే పేరుతో బాగా ప్రసిద్ధి చెందిన కథ ఇది.

ఈ రోజుల్లో ప్రజలదగ్గర నుంచి స్వాహా చేసిన ధనం లక్షలకోట్లు స్విస్ బ్యాంకులో మూలుగుతోంది. ఇదంతా దొంగతనం చేసిందే. చేసినవారు ప్రజలకు మేలు చేస్తామని చెప్పిన రాజకీయనాయకులే. కాని ఆ రోజుల్లో అలా ఉండేది కాదు. రాజుగారు సైన్యసమేతంగా వెళ్ళి దొంగల గుంపులమీద దాడి చేసి వారిని హతమార్చేవారు. పట్టుబడిన వారికి మరణశిక్ష విధించేవాడు రాజు. అంతేకాని వారికి క్షమాభిక్ష ఉండేది కాదు. రాజుగారికి ప్రత్యేకంగా చారులు ఉండేవారు. రాజ్యంలో జరుగుతున్న విషయాలన్నీ ఎప్పటికప్పుడు రాజుగారికి చేరవేసేవారు. చారులు తెచ్చిన వార్త ఆధారంగానే శ్రీరాముడు సీతను అడవులలో వదిలేశాడు. గ్రామాలకు గ్రామాధికారులుండేవారు. వీరంతా తలపాగా చుట్టటం అప్పటి ఆచారం. కోట చుట్టూ అగడ్తలుతవ్వి అందులో మొసళ్ళను పెంచేవాళ్ళు. అందుబాటులో ఉన్న వనరులతో దుర్భేద్యమైన కోట కట్టుకునేవారు. ఈ **విషయాలు**

పదహారవ అధ్యాయంలో ఉన్నాయి.

ఆ రోజుల్లో రాజ్యాలు చిన్నచిన్నవిగా ఉండేది. రాజులకు రాజ్యవిస్తరణ కాంక్ష ఎక్కువగా ఉండేది. నిరంతరము దండయాత్రలు జరుగుతుండేవి. రాజుగారు యుద్ధానికి బయలుదేరినప్పుడు పండితులు రాజుగారి విజయాన్ని కాంక్షిస్తూ వేదమంత్రాలు చదివేవారు. రాజుకు కుడిప్రక్కన మంత్రి, ఎడమవైపున సేనాని ఉండేవారు. ముందు వెనక ప్రక్కన అంగ రక్షకులు ఉండేవారు. సేనలో గుర్రాలు, ఏనుగులు, రథాలు, కాల్బలము ఉండేది. అతిరథులు, మహారధులు అని విభాగముండేది. ఒక వీరుడు యుద్ధానికి వెడుతున్నాడు. అంటే అతనొక్కడు కాదు. అతని వెంట చాలా సైన్యం ఉంటుంది. భారతంలో భీష్ముడు కదిలాడు అంటే ఆయన ముందు వెనక రెండు ప్రక్కల మహావీరులు అంగరక్షకులుగా ఉండేవారు. ఆయన రథచక్రాలను కాపాడే వారు, గుర్రాలను, సారథిని, కాపాడేవారు. ఎటువైపు నుంచీ శత్రువులు దొంగ దెబ్బ తియ్యకుండా ఆయన చుట్టూ చాలామంది వీరులు కాపలా ఉండేవారు. కారణం ఏమంటే వీరందరూ కలిపి చేసే యుద్ధం కన్న ఆయన ఒక్కడు చేసే యుద్ధం చాలా గొప్పది. అందుకని తమ ప్రాణాలు పణంగా పెట్టయినా సరే ఆ వీరుణ్ణి రక్షించేవారు. సైన్యంలోని వీరులందరు యుద్ధవిద్యలోనే కాదు యుద్ధనీతిలో కూడా నేర్పరులై ఉండేవారు.

దేశంలో దైవకార్యాలు, వసంతోత్సవం లాంటి ఉత్సవాలు బాగా జరిగేవి. సైనికులు ఈ కార్యక్రమాల్లో కూడా బందోబస్తు నిర్వహించేవారు. యుద్ధంలో రాజు విజయం పొందినప్పుడు విజయోత్సవాలు నిర్వహించి విజయానికి సహాయపడిన వీరులందరినీ సముచితరీతిన సన్మానించేవారు. ప్రస్తుతం మనం సైనికులకు

అశోకచక్ర, కీర్తిచక్ర పతకాలు ఇచ్చి గౌరవిస్తున్నట్లుగానే ఆ రోజుల్లో కూడా జరిగేది. ఆ రోజుల్లో వ్యవసాయం ప్రధానవృత్తి. ఎద్దులతో వ్యవసాయం చేసేవారు. నేలను దున్నటం, విత్తనాలు నాటటం, పంటలు కొయ్యటం, కుప్పలు వెయ్యటం, ధాన్యం నూర్చటం ఇవన్నీ అందరికీ తెలుసు. వ్యవసాయం కోసం చెరువులు, తటాకాలు తవ్వి నీటిని నిలువ చేసేవారు. వాటిని జాగ్రత్తగా కాపాడేవారు. ఇప్పటిలాగా చెరువులు కబ్జా చేసేవారు కాదు. పండిన పంటను, ఇతర వస్తువులను గిరాకీని బట్టి దేశవిదేశాల్లో అమ్ముతుండేవారు. ప్రయాణం చెయ్యటానికి గుర్రబ్బళ్ళు, సరుకులు చేరవేయటానికి ఎడ్లబళ్ళు, ముఖ్యమైన సాధనాలు. నౌకాయానం కూడా ఉంది. శాతవాహనులలో ప్రసిద్ధుడయిన గౌతమీ పుత్రశాతకర్ణికాలంలో నౌకాయానం బాగా ప్రసిద్ధి చెందింది. ఇతని కాలంలోనే నాణేలమీద ఓడబొమ్మలు కూడా ముద్రించారు. ఇతడికి **శ్రీసముద్రసోయపీతవాహన** అనే బిరుదుకూడా ఉంది.

ఆ రోజుల్లో ఆయుర్వేదం, మూలికావైద్యం బాగా ప్రాచుర్యంలో ఉండేవి. వైద్యానికి ఉపయోగించే మొక్కలను జాగ్రత్తగా పెంచేవారు. వాటిని దేవతల పూజలో ఉపయోగించే వస్తువులుగా ప్రచారం చేశారు. వినాయకచవితి రోజున వినాయకుణ్ణి ఇరవైఒక్క పత్రాలతో పూజిస్తాము. అవన్నీ ఔషధ గుణాలున్న మొక్కలు. దేవుడి పేరుతో వాటిని రక్షించేవారు. వాతము, పిత్తము, శ్లేష్మము, క్షయ, కుష్ఠ రోగాలకు కూడా మందులు వాడేవారు. వైద్యంలో మూలికలే కాకుండా లోహాలు భస్మంచేసి వాడేవారు. స్వర్ణభస్మం, తామ్రభస్మం, పగడభస్మం అలాంటివే. సూర్యకిరణాల వల్ల, చంద్ర కిరణాల వల్ల మందుల యొక్క శక్తి పెరుగుతుంది అని వేదం చెబుతోంది. కొన్నిరకాల ఆయుర్వేద

మందులు కార్తీకపూర్ణిమరోజు రాత్రి వెన్నెలలో పెట్టి ఆ తరువాత ఉపయోగిస్తారు.

ఈ రకంగా రాజ్యం పరిపాలించబడుతుండేది. ఇంచుమించు అన్ని వేదాలలోను ఇలాగే ఉంది.

# 25. ప్రహేళికలు (పొడుపు కథలు)

యజ్ఞం జరిగేటప్పుడు ప్రహేళికలు ఒక సంప్రదాయంగా ఏర్పడ్డాయి. ఇవన్నీ వేదాంత తత్త్వానికి సంబంధించినవి. బ్రహ్మజ్ఞానం కలిగించేవి. శుక్లయజుర్వేదంలోని **23వ అధ్యాయంలో 45 నుంచి 63 మంత్రాల వరకు ఈ ప్రహేళికలు చెప్పబడ్డాయి.** ఇందులో ఒకరు ప్రశ్న అడుగుతారు. ఇంకొకరు సమాధానం చెబుతారు. ఈ సంభాషణ హోత, అధ్వర్యుల మధ్యన నడుస్తోంది.

1. ఒంటరిగా సంచరించేవాడు ఎవరు?
   ఒంటరిగా సంచరించేవాడు సూర్యుడు.
2. నిరంతరము ఉదయించేది ఎవరు ?
   నిరంతరము ఉదయించేది చంద్రుడు
3. చలికి మందు ఏది ?
   చలికి మందు అగ్ని
4. పెద్ద పాత్రగా పిలువబడేది ఏది ?
   పెద్ద పాత్ర భూమి
5. సూర్యుని వంటి వెలుగు ఏది?
   బ్రహ్మ సూర్యునివంటి జ్యోతి
6. సముద్రం వంటి సరస్సు ఏది ?
   సముద్రం వంటి సరస్సు ఆకాశం
7. భూమికన్నా గొప్పది ఏది ?
   భూమికన్న గొప్పవాడు ఇంద్రుడు
8. పరిమితి లేనిది ఏది ?

పరిమితి లేనిది గోవు

9. విష్ణువు తన మూడు పాదాలతో ఆహవనీయ, గార్హపత్య, దక్షిణాగ్నులందు యజనము చేయగా సమస్త జగత్తు వాటిలోనే చేరింది. ఈ విషయం నువ్వెప్పుడన్నా ఆలోచించావా?

ఈ లోకాలు చేరిన మూడు స్థానాలలోను నేను ఉంటాను. వెంటనే భూలోకానికి వచ్చేస్తాను. ఒకే అంగతో నేను స్వర్గాన్ని తెలుసుకోగలను.

10. పురుషుడు వేటియందు ప్రవేశించి ఉన్నాడు?

పురుషుడు పంచభూతములందు ప్రవేశించి ఉన్నాడు.

11. పురుషుని యందు ఏవి ప్రవేశించి ఉన్నాయి?

పురుషుని యందు పంచభూతాలు ప్రవేశించి ఉన్నాయి.

12. పూర్వపు చిత్త ఏది ?

పూర్వపు చిత్త వర్షము.

13. పెద్దది, బరువయిన పక్షి ఏది ?

పెద్దది బరువయిన పక్షి అశ్వము.

14. పిశంగిల ఏది ? (తన రూపాన్ని తాను తినేది పిశంగిల)

పిశంగిల రాత్రి.

15. కురుపిశంగిల ఏది ?

'శ్వావిత్' కురు పిశంగిల (ఏదుపంది. కందమూలములు తినేది)

16. దూకుతూ నడిచేది ఏది ?

దూకుతూ నడిచేది కుందేలు.

17. పాకుతూ నడిచేది ఏది ?

పాకుతూ నడిచేది పాము.

18. ఈ యజ్ఞంలో అన్నము లెన్ని?
ఈ యజ్ఞంలో అన్నాలు ఆరు. (ఆరు రుచులే ఆరు అన్నాలు)

19. దీనికి అక్షరాలెన్ని ?
దీనికి అక్షరాలు వంద (ఛందమునందు అక్షరాలు వంద)

20. దీనికి హోమాలు ఎన్ని ?
దీనికి హోమాలు ఎనభై. (యూపానికి 20 చొప్పున నాలుగు యూపాలు $20 \times 4 = 80$)

21. హోతలు ఎంతమంది ?
హోతలు ఏడుగురు

22. ఎవరికి ఈ భువనపు నాభి తెలుసును?
నేను భువనపు నాభిని ఎరుగుదును.

23. ద్యావాపృథ్వీ అంతరిక్షములు తెలిసినవాడు ఎవరు?
ద్యావాపృథ్వీ అంతరిక్షములు తెలిసినవాడను నేను.

24. సూర్యుని ఉత్పత్తిస్థానము తెలిసిన వారెవరు?
సూర్యుని ఉత్పత్తిస్థానము తెలిసిన వాడను నేనే.

25. చంద్రుడు పుట్టిన స్థలము తెలిసిన వారెవరు?
చంద్రుడు పుట్టిన స్థలము తెలిసిన వాడును నేనే

26. పృథ్వికి పరమ అంతమేమది ?
ఈ వేదియే పృథ్వి యొక్క పరమ అంతము.

27. భువనముల నాభి ఏది ?
ఈ యజ్ఞమే భువనాలకు నాభి.

28. సేచన అశ్వము వీర్యము ఏది ?
ఈ సోమమే సేచన అశ్వపు వీర్యము.

29. వాణియొక్క పరమవ్యోమము ఏది ?

వాణియొక్క పరమవ్యోమము బ్రహ్మ.

ఇవన్నీ వేదాంతానికి సంబంధించిన ప్రశ్నలు

## 26. అంబిక రుద్రుని చెల్లెలు

బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, వీరు త్రిమూర్తులు. మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతి వీరు త్రిశక్తులు. వీరిద్దరినీ మూడు జంటలుగా (ద్వంద్వములుగా) చెప్పటం జరిగింది.

**వామేచ్ఛా బ్రహ్మభారత్యౌ జ్యేష్టాజ్ఞాన హరిక్షితి**
**రౌద్రీక్రియాశివాపర్ణే ఇత్యేతన్మిధునత్రయమ్**

వామ, జ్యేష్ఠ, రౌద్రి మూడు శక్తులు ఇచ్ఛా జ్ఞానక్రియాశక్తులు మూడు. వీటిలో వామ, జ్యేష్ఠ, రౌద్రి త్రిమూర్తులు. అలాగే ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులు త్రిశక్తులు. ఇవన్నీ కలిసి మిధునత్రయము (మూడు దంపతుల జంటలు) అయినాయి. అవి

1. వామ, ఇచ్ఛాశక్తులు–బ్రహ్మ, భారతి (సరస్వతి) వీరే వాణీహిరణ్య గర్భులు.

2. జ్యేష్ఠ, జ్ఞానశక్తులు – హరి (విష్ణువు) పృథివి (లక్ష్మి) వీరే లక్ష్మీనారాయణులు.

3. రౌద్రి, క్రియాశక్తులు – రుద్రుడు, కాళి. వీరే ఉమామహేశ్వరులు.

ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. త్రిమూర్తులు అంటే బ్రహ్మ, విష్ణువు, శివుడు కదా. మరిక్కడ రుద్రుడు అన్నారేమిటి? అని. త్రిమూర్తులలో ఉన్నవాడు రుద్రుడు. అంతేకాని శివుడు కాదు. ఇక శివుడు అంటే పరమశివుడు. పరమేశ్వరుడు, ఆయనే మహాదేవుడు మోక్షప్రదాత అయిన ఈశ్వరుడు. కాలక్రమేణా రుద్రుడు, శివుడు ఒకరుగానే చెప్పటం జరుగుతోంది.

ఇప్పుడు మనం చెప్పుతున్నది త్రిమూర్తి ద్వంద్వము. అందులో రుద్రుడు కాళి (ఈవిడే అంబిక అనబడుతుంది.) వీరిద్దరినీ ఒక జంటగా, భార్యాభర్తలుగా చెబుతున్నాం. కాని శుక్లయజుస్సంహితలోని **మూడవ అధ్యాయంలో యాభై ఏడవ మంత్రంలో అంబిక రుద్రుని చెల్లెలుగా చెప్పబడింది.** రుద్రుడు, అంబిక ఇద్దరూ చాలా క్రూరమైన దేవతలు. వీరిద్దరూ కలిసి విరోధులను నాశనం చేస్తారు. ఈ సంహితలో దేవతల నుంచి ప్రజలు ఏమి ఆశించారు అంటే దేవతలను ఏం కోరుతున్నారో చెబుతున్నారు. **ఇరవైఐదవ అధ్యాయంలో** "మనకు సకల శుభాలు ఇచ్చే దేవతల సద్బుద్ధి మనమీద ఎప్పుడూ ప్రసరించాలి. దేవతలు మంచి ప్రవర్తన కలవారు. యోగ్యుడయిన వాణ్ణి వారెప్పుడూ అభిమానించి ఆదరిస్తారు. మనకు కావలసినవన్నీ వారు ఇవ్వాలి. మన వాళ్ళందరికీ పూర్ణాయుష్యు ప్రసాదించాలి" అని ప్రార్థిస్తున్నారు. దేవతలలో ఇంద్రుడు గొప్పవాడు. అందుచేత లోకక్షేమం కోసం ఇంద్రుణ్ణి స్తుతి చేస్తారు. **ఇరవై ఐదవ అధ్యాయంలోని పందొమ్మిదవ మంత్రంలో**

"ఇంద్రుడు గొప్ప కీర్తి గలవాడు. అతడు మనకందరికీ శుభాన్ని కలిగించాలి. ఈ విశ్వమే తన సర్వస్వమైన పూష, మనకు శుభాలు కలిగించాలి. గరుత్మంతుడు, దేవగురువు బృహస్పతి మనకు మంచిని కలిగించాలి" అని ప్రార్థించారు.

ఈ విధంగా తమకు ఏవైతే కావాలో వాటికోసం దేవతలను ప్రార్థించటం జరిగింది.

# 27. మరణభయం

ఈ లోకంలో పుట్టిన ప్రతిజీవి మరణించి తీరాల్సిందే. అలాగే మరణించిన ప్రతిప్రాణి తిరిగి జన్మించాల్సిందే. ఇదే ధర్మము. మరణమే ధర్మముగా గలది. మర్త్యలోకము అదే భూలోకము. ఈ లోకంలో ప్రతివాడు చచ్చిపోతాడు. కాని విచిత్రం ఏమంటే చావు అంటే ప్రతివాడికీ భయమే. ఎవరూ ఈ లోకంలో శాశ్వతం కాదు. తన కళ్ళ ఎదురుగానే తన తాత, తండ్రి, పెదతండ్రి, పినతండ్రి అందరూ మరణించారు. బంధువులు, మిత్రులు, శత్రువులు అందరూ మరణించారు. మరణిస్తున్నారు. రేపో మాపో తాను కూడా మరణిస్తాడు. ఈ విషయం అతడికి పూర్తిగా తెలుసు. మరణం తప్ప వేరే దారి లేదు. ఈ మాట తెలిసికూడా చావంటే భయపడతాడు. చావటానికి ఇష్టపడడు. మృత్యువు రెండు రకాలు 1. సహజ మృత్యువు. భగవంతుడు ఇచ్చిన ఆయుర్దాయం తీరిపోయి మరణించటం 2. అకాల మృత్యువు. ఏదో కారణం చేత తన ఆయుష్య తీరకముందే మరణిస్తాడు. ఇటువంటి మరణాలు సాధ్యమైనంత వరకు ప్రమాదాల వల్ల జరుగుతాయి. జాగ్రత్తగా చూడండి. ఇలాంటి మరణాలను అసలు భరించలేడు. అకాల మరణం రాకుండా ఉండాలంటే ఈశ్వరుణ్ణి ప్రార్ధిస్తాం.

**త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్ ।**

**ఉర్వారుక మివబంధనాన్ మృత్యోర్ముక్షీయ మామృతాత్ ॥**

**ఇది మూడవ అధ్యాయంలోని అరవైయవ మంత్రం.** ఓ పరమేశ్వరా ! పండిన దోసకాయ తొడిమ నుంచి ఎలా ఊడిపోతుందో, అలాగే నేను కూడా అపమృత్యువు బారిన పడకుండా, భగవంతుడు

ఇచ్చిన ఆయుష్యును పూర్తిగా అనుభవించి, ఏ బాధలూ లేకుండా అనాయాసంగా మరణించాలి. స్వర్గమోక్షాల నుంచి నేను ఎప్పుడూ పతితుణ్ణి కాకూడదు. అంటూ ప్రార్థించేవారు. దీన్నే మృత్యుంజయ మహామంత్రము అంటారు. ఇది చాలాశక్తివంతమైనది. ప్రసిద్ధి చెందిన మంత్రం కూడా. అనాయాస మరణం కోరేవారు, అపమృత్యువును తప్పించుకోవాలనుకునే వారు ఈ మంత్రాన్ని ఇప్పుడు కూడా జపం చేస్తూనే ఉన్నారు. ఈ మంత్రం కాసెట్లుగా, సిడిల రూపంలోను కూడా దొరుకుతుంది.

ఆరోగ్యం దెబ్బ తిన్నప్పుడు ఈ రోజున కూడా ఈ మంత్రం జపం చేస్తాం. వర్తమానం బాగా లేనప్పుడు ఈ సిడిని ప్రతిరోజు ఇంట్లో ప్లే చెయ్యటం జరుగుతుంది. కొంచెం ప్రమాదం అని తెలిస్తే ఈ మంత్రంతో హమం కూడా చేస్తారు. ఈ మంత్రాన్ని నమకానికి సంపుటీకరణ చేసి **మృత్యుంజయ పాశుపతము** అని అభిషేకం చేస్తారు. ఒకసారి అభిషేకం చెయ్యాలంటే కనీసం ఒక గంట పడుతుంది. అటువంటిది పదకొండు సార్లు చెయ్యాలి అంటే ఉదయం ప్రారంభం చేస్తే సాయంత్రం పూర్తవుతుంది. మృత్యుంజయ పాశుపతం హోమం చెయ్యటం కూడా జరుగుతుంది. ఇవి కావాలంటే ఎవరైనా అయ్యవారిని మాట్లాడుకుని చేయించుకోవటం ఉత్తమం. సొంతంగా చేసుకోవాలంటే అలవాటుండాలి.

అపమృత్యువు నుంచి తప్పించుకోవటానికి ఆ రోజునే కాదు ఈ రోజున కూడా మృత్యుంజయ మహామంత్రం జపం చెయ్యటం, హోమాలు చెయ్యటం జరుగుతూనే ఉన్నది.

ఈ రకంగా శుక్లయజుర్వేదంలో దర్శపూర్ణమాసేష్టి మంత్రాలు,

పిండపితృ యజ్ఞమంత్రాలు, చాతుర్మాస్య యజ్ఞమంత్రాలు, అగ్నిష్టోమం, వాజపేయం, రాజసూయం, అశ్వమేధం, నరమేధం, సౌత్రామణి, అగ్నిచయనం, పురుషసూక్తం పితృమేధం చివరకు నలభైయవ అధ్యాయంలో ఈశావాశ్యోపనిషత్తు వివరించ బడ్డాయి. యజ్ఞయాగాది క్రతువులలో చెప్పవలసిన మంత్రాలన్నీ ఈ సంహితలోనే ఉన్నాయి.

*దీంతో శుక్లయజుస్సంహిత సమాప్తము.*

శ్రీ

## పార్థసారథీయము

# చతుర్వేదభాష్యము

## ( సామసంహిత )




ప్రముఖ శ్రీవిద్యా ప్రచారకులు

అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,

ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, మెంఫిస్, అమెరికా ఆస్థాన విద్వాంసులు,

డా॥ క్రోవి పార్థసారథి

# విషయసూచిక


1. యజ్ఞయాగాలు
2. వసుధైక కుటుంబం
3. గాలి బుడగ జీవితం
4. ఉత్తమగతులు
5. పరమేశ్వరుడు
6. ఇంద్రుడు
7. భోగాభిలాష కన్న త్యాగమే మిన్న
8. అతిథి
9. ప్రార్థనలు
10. ఇంద్రస్తుతి
11. అన్నం పరబ్రహ్మ స్వరూపం

# 2.4 సామసంహిత

సామము అంటే గానము అని అర్థం. ఋక్కులే రాగబద్ధంగా గానం చెయ్యబడితే అది సామము అవుతుంది. సామవేదాన్ని బాగా తెలుసుకున్నవాడే తత్త్వాన్ని తెలుసుకోగలడు అని 'బృహద్దేవత' చెబుతోంది. **వేదానాం సామవేదోస్మి** వేదాలలో సామవేదాన్ని నేనే అంటాడు భగవానుడు గీతలో. కాబట్టి సామవేదం సాక్షాత్తు భగవత్స్వరూపం. దీనికి ఉపదేవేదం 'గాంధర్వవేదం'

సామవేదం రెండు భాగాలుగా ఉంటుంది. 1. పూర్వార్చిక 2. ఉత్తరార్చిక. అంటే పూర్వభాగం, ఉత్తరభాగం అనచ్చు. ప్రతి అర్చిక కొన్ని ప్రపాఠకాలుగా, ప్రతిప్రపాఠకం కొన్ని దశతులుగా, ప్రతి దశతి కొన్ని మంత్రాలుగా విభజించబడ్డాయి. ఇలా చూస్తే పూర్వార్చికలో ఆరు ప్రపాఠకాలు, యాభైతొమ్మిది దశతులు ఐదు వందలయనభైఐదు మంత్రాలు ఉన్నాయి. అదే ఉత్తరార్చికలో తొమ్మిది ప్రపాఠకాలు, నూటఇరవై దశతులు. పన్నెండువందలఇరవై మంత్రాలు ఉన్నాయి. ఇవి కాక అరవై ఐదు మంత్రాలు విడిగా ఉన్నాయి అన్నారు. ఈ రకంగా చూస్తే సామసంహితలో 15 ప్రపాఠకాలు, 179 దశతులు, 1870 మంత్రాలు ఉన్నాయి. ఇందులో 1504 మంత్రాలు ఋగ్వేదంలోంచి తీసుకున్నవే. ఇక వేదంలో ఏముందో చూద్దాం.

# 1. యజ్ఞయాగాలు

ఆనాటి జీవన విధానము అనేది యజ్ఞయాగాలతో బాగా ముడిపడి ఉంది. మానవుడి కోరికలన్నీ యజ్ఞుల ద్వారానే తీరతాయి అని వారి నమ్మకం. అందుకే వారు దేవతలను ప్రార్థించేవారు. తమ కోరికలు తీర్చమని వేడుకునే వారు. వీరికి ప్రధానదైవం అగ్ని. సామసంహిత ప్రారంభంలోనే **మొదటి ప్రపాఠకంలో మొట్టమొదటి దశతిలో** వారు అగ్నిని ఏమని ప్రార్థిస్తున్నారో చూడండి.

**అగ్న ఆయాహి వీతయే గృణానః హవ్యదాతయే**
**హవ్యదాతయేనిహోతా సత్సి బర్హిషి**
**త్వమగ్నే యజ్ఞానా హోతా విశ్వేషాం హితః**
**దేవేభిర్మానుషేజనే**

ఓ అగ్నీ ! మా స్తుతులు వినటానికి, మేము సమర్పించే హవిస్సులు తినటానికి వచ్చి ఈ దర్భాననము మీద కూర్చుండవలసింది. నీవు దేవతలకు హవ్యవాహకుడవు.

ఓ అగ్నీ ! నువ్వు అన్ని యజ్ఞాలకీ హోతవు. మా హితవు కోరేవాడివి. నిన్ను ఋత్విక్కులు గార్హపత్యాది అగ్నులుగా స్థాపిస్తున్నారు. అగ్ని హవ్యవాహనుడు. యజ్ఞాన్ని సిద్ధింపచేసేవాడు. అటువంటి అగ్నిని అర్చిస్తున్నాను.

తనను ఉపాసించే వారికి ధనాన్నిస్తాడు. మహాబలశాలి. మా శత్రువులయిన రాక్షసులను సంహరించవలసింది. అగ్ని మిత్రుని వంటివాడు. తనను స్తుతించే వారికి ధనాన్నిస్తాడు.

ఓ అగ్నిదేవా ! మాకు అనంతమైన ధనాన్నివ్వవలసింది. లోభుల నుంచి రక్షించవలసింది.

మేము నిన్ను స్తుతించి నీ మనసును ఆకర్షిస్తున్నాము. నీ మనసుకు ఆనందం కలిగిస్తాము. మాకు ధనాన్నివ్వవలసింది. ఓ అగ్నిదేవా ! నువ్వు మా రక్షకుడివి. ఈ యజ్ఞము సర్వకారకము, దీన్ని పూర్తి చేయించవలసింది అని ప్రార్థిస్తున్నారు. మా శత్రువులను సంహరించవలసినది అంటున్నారు.

ఇంకొక చోట

"ఓ అగ్నీ ! దేవతలకు మంచి హవిస్సులు ఇచ్చేటట్లుగా భూమిని ప్రేరేపించవలసినది. మాకు గోసంపద, ఐశ్వర్యము ప్రసాదించవలసినది. నీకు యజ్ఞము అంటే ఇష్టం. అందుకే మేము నీ ద్వారా దేవతలను ప్రసన్నులుగా చేసుకోవాలి అనుకుంటున్నాము. మా ప్రతినిధిగా నీవే వారిని ఆహ్వానించవలసినది"

పూర్వార్చిక అగ్ని, ఇంద్ర, పవమాన, అరణ్యక పర్వాలుగా విభజించబడింది. వాటినే కాండలు అంటారు. వీటిలో ముఖ్యంగా అగ్ని, ఇంద్ర, పవమాన స్తుతులు కనిపిస్తాయి. ఆనాటి ప్రజలు తమ భౌతిక అవసరాల కోసం సుఖజీవనం కోసం యజ్ఞాలు సాధనాలుగా ఉపయోగించారు.

"ఓ సోమదేవా  నువు చాలా బలవంతుడివి. మా కోరికలు తీర్చగలవాడివి. అనేక సుఖాలను మాకు అనుగ్రహించవలసింది. నీవు మాకు పశుధనాన్ని, సకలైశ్వర్యాలను, వీరులైన పుత్రులను మంచి ఆహారపదార్థాన్ని ఇవ్వవలసినది." అంటున్నారు. ఈ రకంగా యజ్ఞయాగాలలో దేవతలను ప్రార్థించారు.

# ౭. వసుధైక కుటుంబం

కుటుంబము అంటే నేను నా భార్య నా పిల్లలు మాత్రమే అనే భావన వారిలో కనపడేది కాదు. సమాజం అంతా ఒకటే కుటుంబం అని భావించేవారు. ఏది కోరినా ఇది నాకు కావాలి అనే వారు కాదు. ఇది మాకు కావాలి. అనే అడిగేవారు. **రెండవ ప్రపాఠకంలో పదకొండవ దశతిలోని** ఏడవ మంత్రంలో "యజ్ఞాలు చెయ్యాలి అంటే నెయ్యి కావాలి. నెయ్యి కావాలంటే **మంచిపాలు పుష్కలంగాఉండాలి.** కాబట్టి మిత్రావరుణులారా ! మా గోవులు బాగా పాలిచ్చేటట్లుగా చూడండి. అంతేకాదు మధురానుభవం గల పరలోకాన్ని కూడా మాకు ప్రసాదించండి" అని ప్రార్ధిస్తున్నారు.

కోరికలు ఎప్పుడు తమకే పరిమితం కావు. తమ తరువాత వారిని కూడా దృష్టిలో పెట్టుకుని కోరటం జరుగుతుండేది. మాకే కాదు. మా పిల్లలకు మనుమలకు, మా సంతతి వారందరికీ ఈ అవకాశం ఉండాలి అని ప్రార్ధిస్తురు. మా వంశం అభివృద్ధి చెందాలి అని అడుగుతున్నారు. **నాల్గవ కాండలోని ఐదవ దశతిలో** "ఓ ఆదిత్యులారా ! మా పిల్లా పాపలకు, మా సంతతి వారందరికి దీర్ఘాయువును ప్రసాదించండి" దీర్ఘాయువు అంటే రోగాలతో రొష్టులతో ఎక్కువ సంవత్సరాలు జీవితం వద్దు. రోగాలు లేని జీవితం కావాలి. ఆరోగ్యవంతమైన జీవితం కావాలి. ఇది వారి కోరిక. అందుకే **నాల్గవ కాండ, ఐదవ దశతిలో** "ఓ ఆదిత్యులారా ! ఈ రోగాలను మాకు దూరంగా ఉంచండి. మమ్మల్ని బాధించే శత్రువులను కూడా మా దగ్గరకు రానీయకండి. వాళ్ళని దూరంగా తరిమెయ్యండి. మమ్మందరినీ పాపాల నుండి విముక్తులుగా చేయండి" అని ప్రార్ధించారు.

దేవతలలో ఐశ్వర్యానిచ్చేవాడు ఇంద్రుడు. అందుకని "ఓ ఇంద్రా ! మాకు మంచి ఐశ్వర్యము కలగాలి. నువ్వు ప్రసాదించిన ధనంతో సోమయాగం చేసి అందరినీ సత్కరిస్తాం. సామగానం చేసిన వారికి దక్షిణలు ఇవ్వటానికి ఆ ధనాన్ని ఉపయోగిస్తాం. అంటూ ధనధాన్యాల కోసం దేవతలను ప్రార్ధించేవారు.

మనం చేసే జపతపాలు సఫలం కావాలంటే నిష్టలు, నియమాలు, ఆచార వ్యవహారాలు పాటించాలి. అలా చేసినట్లైతే వారి కోరికలు త్వరగా తీరతాయి. అందుకే ఏదైనా కార్యసిద్ధి కోసం జపం చేసే సమయంలో నియమాలు జాగ్రత్తగా పాటించాలి. ఆచారము అంటే శుభ్రత అంతే ! ప్రతిరోజు స్నానం చేసి శరీరమంతా శుభ్రంగా కడుక్కొని తరువాత జపానికి కూర్చోవాలి. ఇలాంటప్పుడు కేవలము బాహ్యాపూజ కాదు. అంతఃకరణశుద్ధి ఉంటే మంత్రసిద్ధి త్వరగా జరుగుతుంది. కాబట్టి మడి ఆచారాలు జాగ్రత్తగా పాటించాలి. మడి ఆచారాలు అంతఃకరణ శుద్ధికోసమే అని గుర్తించాలి. ఆ రోజుల్లో వాళ్ళు చాలా ఆచారవంతులు, ధైర్యవంతులు కోరికలు సిద్ధింప చేసుకోవాలనే భావనతో ఉండేవారు.

# 3. గాలి బుడగ జీవితం

మానవజీవితం క్షణికమైనది. కూచున్నవాడు కూచున్నట్లే మరణిస్తాడు. బయటకి వెళ్ళినవాడు తిరిగి ఇంటికి వచ్చేదాకా నమ్మకంలేదు. చేతులో ఉన్న ముద్ద నోట్లోకి వెళ్ళేదాకా నమ్మకం లేదు. చిన్నవిషయం చెబుతాను వినండి.

నా చిన్నప్పుడు జరిగిన సంఘటన. మా ఇంటి దగ్గర వాళ్ళ దొడ్లో ఒక పెద్ద తాడిచెట్టు ఉంది. దాన్ని కొట్టెయ్యాలని చాలా కాలంగా అనుకుంటున్నారు. కుదరటం లేదు. చివరకి ఆ రోజున కుదిరింది. చెట్టు కొట్టేవాళ్ళు వచ్చారు. ముందు తల నరికేశారు. తరువాత చెట్టుకు తాళ్ళు కట్టారు. చెట్టు చాలావరకు మొదలు నరికేశారు. ఇక ఇప్పుడు ఎటు వైపుకు కావాలో అటువైపుకు పడవెయ్యాలి. అంటే తాళ్ళు పట్టుకుని కొంతమంది లాగుతారు. ఇంకొంతమంది మొదలు దగ్గర పట్టుకుని నెట్టేస్తారు. ఇప్పుడు తాళ్ళు పట్టుకుని లాగుతున్నారు. వాళ్ళ బలం సరిపోలా. ఇంకొకళ్ళు ఉంటే బాగుండు అనిపించింది. అప్పుడు సమయం మధ్యాహ్నం ఒంటిగంట. మా యింటిదగ్గరలోనే కూలి పనులు చేసుకునే వెంకట్రావు ఉండేవాడు. అతడు మామూలుగా పనికివెళ్ళి భోజనం చేయటానికి ఇంటికి వచ్చాడు. అతని భార్య కంచంలో అన్నం పెట్టింది. తినబోతున్నాడు. ఇంతలో చెట్టు కొడుతున్న వాళ్ళు వెళ్ళి "ఒరే ! వెంకట్రావ్ ! ఒక్కసారి రారా. మా నాయన కదా ! నువు కూడా వచ్చి తాడు పట్టుకోరా. ఒక్క నిమిషం ఆగితే చెట్టు గాలికి ఎటైనా పడచ్చు. అలా పడితే ఇబ్బంది అవుతుంది. ఒక చెయివెయ్యి చాలు వచ్చి తిందువు గాని" అని బ్రతిమిలాడారు. సరే కంచం ముందు నుంచి లేచి వాళ్ళతోపాటు వెళ్ళాడు ఈ వెంకట్రావ్. అందరితో పాటుగా ముందు వైపు తాడు పట్టుకున్నాడు. బలంగా

ముందు వాళ్ళు లాగారు. అదే సమయంలో చెట్టు మొదలు పట్టుకుని కొంతమంది తోశారు. పెద్ద శబ్దం చేస్తూ చెట్టు కాస్తా పడిపోయింది. తాడు వదిలి అందరూ తలా ఒక వైపుకీ పరుగులు తీశారు. చెట్టు కాస్తా పడిపోయింది. తప్పుకోలేకపోయాడు వెంకట్రావ్. అతడి మీద పడింది చెట్టు. చెట్టు పడేటప్పుడు పెద్ద శబ్దం ఆ శబ్దంలోనే అమ్మా ! అన్న వెంకట్రావు అరుపు. మరుక్షణంలో చెట్టు క్రింద గిలగిలా కొట్టుకున్న వెంకట్రావ్. అందరూ పోగయ్యేసరికి కొట్టుకోవటం ఆగిపోయింది. వెంకట్రావ్ కళేబరం మిగిలింది. ఒక్క నిమిషం ముందు భోజనానికి కూచున్నాడు. నిమిషం తరువాత శవమై పడిఉన్నాడు. కంచంలో అన్నం అతనికోసం అలాగే ఎదురు చూస్తోంది. అందరూ ఒక్కసారి ఘొల్లుమన్నారు. అందుకే అంటారు ఈ జీవితం బుద్బుదప్రాయము అని. ఈ క్షణాన ఉన్నాం ఇంకొక క్షణాన ఉండకపోవచ్చు. ఇదే జీవితం. ఈ విషయం మనందరికీ తెలుసు. మనకే కాదు వేదకాలంలోను అందరికీ తెలుసు. కాబట్టి బ్రతికి ఉండగానే భగవంతుణ్ణి సేవించాలి. నాలుగు మంచి పనులు చెయ్యాలి. ఈ విషయం మనకీ తెలుసు. కాని మనకి తీరుబడి ఉండదు. ఎంతసేపు పోగేసుకోవటంతోనే సరిపోతుంది. ఉన్న సమయం కాస్తా సంపాదనకే చాలదు.

**అర్థాగృహే నివర్తంతే స్మశానే మిత్ర బాంధవాః**

**సుకృతం దుష్కృతం చైవ గచ్ఛంత మనుగచ్ఛతి ॥**

నువు సంపాదించిన సొమ్ము ఎక్కడికీ పోదు. ఇక్కడే నీ ఇనప్పెట్టెలోనే చాలా జాగ్రత్తగా ఉంటుంది. ఇల్లువాకిలీ ఇక్కడే ఉంటాయి. బంధువులు, మిత్రులు స్మశానందాకా వస్తారు. అంతే తరువాత నీతో వచ్చేది నువు చేసిన మంచి చెడు. అవే పాపపుణ్యాలు.

వాటిని గురించి మనం పెద్దగా పట్టించుకోం. ఎందుకంటే పట్టించుకునే తీరిక, సమయం మనకి లేవు. ఈ కొంచెం సమయంలో ఇంకొంత సంపాదించవచ్చు. ఇదీ మన ఆలోచన. కాని ఆ రోజున వారి ఆలోచనావిధానం వేరుగా ఉండేది. బ్రతికి ఉండగానే భగవంతుణ్ణి సేవించాలి. నాలుగు మంచిపనులు చెయ్యాలి. అందుకే **ఒకటవ ప్రపాఠకంలోని ఏడవ దశతిలో** అంటున్నారు చూడండి.

"ఓ ఋత్విజులారా! యజ్ఞాధిపతి, హోత రుద్రుడు. సమస్తా హారాలను ఇచ్చే మహారాజు. బంగారు కాంతితో మెరిసిపోయే పరమాత్మను జీవించి ఉండగానే ప్రార్థించండి. ఆయన్ని ప్రసన్నం చేసుకోండి."

# 4. ఉత్తమగతులు

పరమేశ్వరుడు ప్రసన్నుడైతే ఉత్తమ గతులు కలుగుతాయి.

వారి దృష్టిలో మరణమనేది సహజంగా వచ్చేది. అది ఎవరికీ తప్పదు ఈ లోకంలో పుట్టిన ప్రతిప్రాణి మరణించాల్సిందే. కాకపోతే ఒకరు ముందు, ఒకరు వెనక. మానవుడు చేసుకున్న పాపపుణ్యాలను బట్టి అతని మరణము ఉంటుంది. అందుకే

**"మహాత్ముల పాపపుణ్యంబులు మరణ కాలంబునన్ తెలియు"** అంటారు.

పుణ్యాత్ముడు అనాయాస మరణం పొందితే, పాపాత్ముడు నీచమైన చావు చస్తాడు. కొంతమంది చూడండి. మరణించినప్పుడు అయినవాళ్ళెవరూ దగ్గరఉండరు సరికదా, శరీరభాగాలు కూడా ఛిద్రమై పోతాయి. ఆనవాలు కూడా ఏమీ మిగలదు. అందుకే జీవితంలో కొంచెంసేపైనా ఒకసారైనా ఒక మంచిపని చెయ్యండి.

వేదకాలంలో మరణానంతరం అతణ్ణి ప్రేతాత్మగా భావించారు. అలానే సంబోధించారు కూడా **ఒకటవ అధ్యాయంలోని ఏడవ ఖండంలో** "ఓ మృత పురుషుడా ! ఈ అగ్ని నీలో ఒక బాగము. నువు ఈ అంశతో కలిపి బాహ్యాగ్నితో కలిసిపో ! ఈ వాయువు నీ అంశ. నువు ఈ వాయువుతో కలిసి బాహ్యావాయువులో కలిసిపో. ఆదిత్యుని నుంచి మనకి ఆత్మలాభం కలిగింది. కాబట్టి తిరిగి జన్మించటం కోసం ఒక మంచి రూపాన్ని పొంది దేవతలందరికీ తండ్రి అయిన సూర్యునిలో ప్రవేశించు. పునర్జన్మకు సిద్ధంకా" అని చెప్పేవారు.

**'పునరపి జననం పునరపి మరణం'.** మానవుడు ఈ లోకంలో జన్మిస్తాడు. గతజన్మలలో చేసిన సంచితకర్మలో భాగమయిన ప్రారబ్ధకర్మ

అనుభవించటానికే జన్మిస్తాడు. ఈ జన్మలో అతనిశరీరం ఎలాఉంటుంది అనేది కూడా గతజన్మలలో చేసిన కర్మ ననుసరించే ఉంటుంది. పాపపు పనులు చేసిన వారు పశువులుగా పక్షులుగా జన్మిస్తారు. అంతకన్న నీచమయిన పనులు చేసిన వారు క్రిమికీటకాదులుగా జన్మిస్తారు. మానవుడుగా జన్మించాడు అంటే గతజన్మలలో చేసిన పుణ్యం ఎక్కువగా ఉందన్న మాట. అందులో కూడా దుర్మార్గపు పనులు చేసిన వారు కురూపులుగా, కుంటి, గ్రుడ్డి, చెవిటి మొదలైన అవయవలోపాలతో జన్మిస్తారు. అన్ని అవయవాలు బాగున్నాయంటే నువుచేసుకున్న పుణ్యం ఇంకా ఎక్కువ అన్న మాట. సంస్కారంగల ఉత్తమకుటుంబంలో జన్మించావు అంటే ఇంకా ఎక్కువ పుణ్యం చేసుకున్నావు. ఉత్తమ కులంలో జన్మించావు. నీ పుణ్యఫలం ఇంకా ఎక్కువ. ఎంతో గొప్ప పుణ్యం చేసుకుంటేనే గాని సంస్కారం గల ఉత్తమ కుటుంబంలో పండితుడిగా, మహాజ్ఞానిగా జన్మించవు. అలా జన్మించినందుకు నీజన్మని సార్ధకంచేసుకో. జీవితంలో ఇంకా మంచి పనులు చెయ్యి. ఆ పరమేశ్వరుణ్ణి ప్రార్ధించు. జన్మరాహిత్యం పొందటానికి ప్రయత్నించు. అంతేకాని దిగజారిపోవద్దు. "మనసా వాచా కర్మణా పరమేశ్వరుణ్ణి ధ్యానించు. సర్వం ఆ పరమేశ్వరమయం అని తెలుసుకుని మరణానంతరము ఈశ్వర సన్నిధానం చేరు. అందుకోసం పరమేశ్వరుణ్ణి సేవించు. సంసారబంధాల నుంచి విముక్తి చెయ్యమని ఆయన్ని ప్రార్ధించు. తనను సేవించిన వారికి మోక్షం ఇవ్వటంలో ఆయన పరమదయామయుడు" ఈ విషయం **ఒకటి, నాలుగు ప్రపాఠకాలలో** చెప్పటం జరిగింది.

**'సత్యం సర్వశ్రేయము'** ఈ భావన ఆ రోజుల్లో చాలా ఎక్కువగా ఉండేది. పరమాత్మ అనుగ్రహం ఎప్పుడూ సత్యాన్ని అనుసరించే

ఉంటుంది. ఈ విషయాలు **ఉత్తరార్చికలోని పదవ అధ్యాయంలో** చెప్పబడ్డాయి.

"ఓ ఉపాసకులారా! సత్యాన్ని అనుసరించే వారి కోరికలన్నీ భగవంతుడు తీరుస్తాడు. కాబట్టి ఆయన్ని స్తుతించండి. ప్రార్థించండి. లోకకల్యాణాన్ని కోరే భక్తుల కోరికలు కాదనడు. వారిని తప్పక అనుగ్రహిస్తాడు."

జీవుణ్ణి అనుగ్రహించాలంటే జీవుడికీ – దేవుడికి సంబంధం ఉండాలి. ఉండి తీరాలి. ఆ సంబంధం ఈ నాటిదికాదు. జన్మజన్మలబంధం ఉండాలి. "ఓ పరమేశ్వరా! నేను నీ భక్తుణ్ణి. మన ఇద్దరి సంబంధం ఇప్పటిది కాదు. ఎన్నో జన్మల నుంచి నేను నిన్ను అర్చిస్తున్నాను. నా కోరిక తీర్చవలసింది. ఓ పరమాత్మా! మన ఇద్దరి సంబంధం కొంచెం జ్ఞాపకముంచుకో. మంచి పనులు చెయ్యకుండా నాకు అడ్డుపడే దుర్మార్గులను నాశనంచెయ్యి. లోకకల్యాణానికి భంగం కలిగించే వారిని సమూలంగా నాశనంచెయ్యి. అని ప్రార్థిస్తున్నాడు. **పదహారవ అధ్యాయంలో**

నాకు నువ్వేదిక్కు. నువ్వుతప్ప వేరెవరూలేరు. నన్ను కరుణించు. నా కోరికలు తీర్చు. **'నీవే తప్ప అన్యుల నెరుంగ'** అనే భావన ఆ రోజున బాగా ఉండేది.

"ఓ సర్వేశ్వరా ! నేను నీ సేవకుణ్ణి. నిన్ను శరణు కోరుతున్నాను. సిరిసంపదలు, భోగభాగ్యాలు నాకు కలిగించవలసింది" అని ప్రార్థిస్తున్నాడు **ఒకటవ అధ్యాయంలోని పదకొండవ ఖండంలో.** లోకంలో ఎవరైనా ధనధాన్యాలు కావాలనే కోరతాడు. దరిద్రం అనుభవించాలి అనుకోడు. అందుకే "ఓ స్వామీ! మాకు, మా

సంతానానికి కూడా సంపదలివ్వు. దుఃఖాన్ని, దరిద్రాన్ని మాకు దూరంగా ఉంచు” అని ప్రార్థిస్తున్నారు. **రెండవ ప్రపాఠకంలోని మూడవ దశకంలో**

భగవంతుడు ఎప్పుడూ నిస్వార్థమైన కోరికలు త్వరగా తీరుస్తాడు. నాకు సిరిసంపదలు కావాలి. అనే కోరిక తీర్చేకన్న, మా గ్రామాన్ని, మా పట్టణాన్ని బాగు చెయ్యి. అన్న కోరిక త్వరగాసిద్ధిస్తుంది. ఇందులో సందేహంలేదు. దేవతల అనుగ్రహం ఉంటే జరగనిది ఏదీ లేదు.

**మూకం కరోతు వాచాలం పంగుం లంఘయతే గిరిం’**

**యత్కృపదామహ వందే**

**‘దేవ దేవ నీదు మహిమ పరుగు తీయు కుంటివాడు. మాతయౌను గొడ్రాలే’**

ఆ సర్వేశ్వరుడు తలచుకుంటే జరగనిది ఏదీ లేదు. ఘటనా ఘటన సమర్ధుడు ఆయన. ఒక్క విషయం చూడండి. **“ఏమీ తెలియని నాతో ఈ వేదభాష్యం వ్రాయిస్తున్నాడు” ఇంతకన్న ప్రత్యక్ష ప్రమాణం ఇంకేం కావాలి ఆ పరమేశ్వరుని గొప్పతనాన్ని చెప్పటానికి?** అందుకే “ఓ దేవతలారా ! మీ మహిమలు మాకు అర్థం కావు. మీరు మాకు అందించే రక్షణలు అజేయమైనవి. మమ్మల్ని సర్వదా రక్షించవలసింది” అని ప్రార్థిస్తున్నారు. **రెండవ అధ్యాయంలోని మూడవ ఖండంలో**

ఈ రకంగా పరమేశ్వరుడు అపారమయిన దయామయుడు. ఆయన తలచుకుంటే ఏదైనా క్షణంలో జరుగుతుంది. దరిద్రుడు ధనవంతుడవుతాడు. క్రూరాత్ముడైన అజామీలుడు లాంటి వారు కూడా మోక్షం పొందుతారు. ఇదే ఆనాటి వారి భావన.

# 5. పరమేశ్వరుడు

నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు పరమేశ్వరుడు. సృష్టి ప్రారంభానికి ముందు ఈ జగత్తంతా ఆవరించి ఉన్నాడు. సృష్టి తరువాత ఆ పరమేశ్వరుడే 84 లక్షల జీవరాసుల రూపంలో ఈ జగత్తంతా ఆవరించి ఉన్నాడు. మొత్తం మీద ఆ జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. ఆయన నుంచే ఈ జగత్తంతా ఆవిర్భవించింది. మళ్ళీ ఆయనలోనే లీనమవుతుంది. ఆయన ఘటనా ఘటన సమర్థుడు. అన్నింటికీ ఆయనే అతీతుడు. ఆయనకన్న అధికమైనది ఏదీ లేదు. ఆయన అనుజ్ఞతోనే ఈ జగత్తంతా ప్రవర్తిల్లుతున్నది. ఆయన ఉన్నాడు కాబట్టే గాలి సవ్యంగా వీస్తున్నది. వర్షం సరిగా కురుస్తున్నది.సముద్రం చెలియలికట్ట దాటకుండా ఉన్నది. ఆయన అనుగ్రహం లేకపోతే చీమకూడా కదలదు. ఆయన అనుగ్రహం సంపాదిస్తే మానవుడు ఏదైనా చేయగలడు. కావలసిందల్లా ఆయన అనుగ్రహము అంతే. కాబట్టి భగవంతుణ్ణి సేవించి ఆయన అనుగ్రహం సంపాదించాలి. ఈ విషయం **మూడవ అధ్యాయంలోని ఒకటవ ఖండంలో** చెప్పబడింది.

స్థావర జంగమాత్మకమైన ఈ జగత్తుకు అధిపతి ఉన్నాడు. ఆయన సర్వజ్ఞుడు అని అప్పటిప్రజలు గుర్తించారు. ఆయన దయకోసం శ్రమపడ్డారు. ఇప్పుడు మనం కూడా గుర్తిస్తున్నాం. కాని మన గుర్తింపు వేరు, వారి గుర్తింపు వేరు. తల్లి, తండ్రి, మిత్రుడు, బంధువు, శ్రేయోభిలాషి అన్నీ అతడే. దీని సారాంశము.

నీవే తల్లివి తండ్రివి నీవే నా తోడు నీడ

నీవే సఖుడౌ, నీవే గురుడవు దైవము

నీవే, నా పతియు గతియు నిజముగ

సమస్తము ఆయనే అందుకే

"ఓ పరమాత్మా ! నువు మా తండ్రికన్న గొప్ప ఐశ్వర్యవంతుడివి. నన్ను మన్నించకపోయినా నా సోదరుడి కన్నా గొప్పవాడివి. నా తల్లిలా చల్లని మనసుతో నాకు అన్నము, సిరిసంపదలు అన్నీ అనుగ్రహించు" అంటున్నారు. **మూడవ అధ్యయంలోని ఒకటవ ఖండంలో**

బిడ్డ ఎంత చెడ్డవాడైనా తల్లి, బిడ్డ క్షేమాన్నే కోరుకుంటుంది. ఇందులో సందేహం లేదు. తల్లిని నాశనం చెయ్యాలని కుమారుడు ప్రయత్నించినా, తల్లి మాత్రం అతడి క్షేమాన్నే కోరుకుతుంది. ఈ విషయం **ఉత్తరార్చికలోని నాల్గవ అధ్యాయంలో** చెప్పబడింది.

పరమేశ్వరుడు పరమదయామయుడు. ఎవరినీ శిక్షించడు. రాక్షసులను కూడా అతనెక్కడా క్రోధంతో ఎవరినీ చంపలేదు. హిరణ్యకశ్యపుడు, హిరణ్యాక్షులను కూడా శిక్షించలేదు. వారికి శాపవిమోచనం కలిగించాడు అంతే, ఎంతటి దుర్మార్గుడికైనా మారటానికి అవకాశం ఇచ్చాడు. ఆ అవకాశం వినియోగించుకోకపోతే వాళ్ళని శిక్షించాడు అనిపిస్తుంది. అది శిక్షకాదు, శాపవిమోచనం ఆయన అనుగ్రహం ఉంటే చాలు. మిగిలినవి ఏవీ అవసరం లేదు. అందుకే "ఓ పరమాత్మా ! నీవు పరమదయామయుడవు. ఎవరినీ శిక్షించటం గాని, సంహరించటం గాని నీ స్వభావం కాదు. ఇతరులకు సహాయం చేసే వాళ్ళకు మంచి ఫలితాన్ని ఇస్తావు. నీ కృపాకటాక్ష వీక్షణాలకు హద్దులు లేవు" అని చెబుతోంది. **మూడవ ప్రపాఠకంలోని ఏడవ దశతి**

"ఆయన కృప ఇంతటిది అని లెక్క కట్టలేం. మన సౌకర్యాల కోసం, రక్షణ కోసం సూర్యాది లోకాలు ఏర్పాటు చేశాడు" అంటోంది

**ఒకటవ అధ్యాయంలోని ఒకటవ ఖండం.**

ఓ పరమేశ్వరా ! నువు తప్ప మమ్మల్ని కాపాడేవారు ఎవరూ లేరు. అంటోంది సామవేదం. దీన్నే తరువాత కాలంలో 'శరణాగతి' అన్నారు **మూడవ ప్రపాఠకంలోని రెండవ దశతిలో.**

"ఓ స్వామీ ! తేజస్సును మాకిచ్చి మమ్మల్ని ప్రశంసిస్తున్నావు. నీకన్న ఎవరూ మమ్మల్ని ఇంతగా సుఖపెట్టలేరు. కాబట్టి మేము ఈ స్తోత్రంతో కరుణించమని నిన్నే ప్రార్థిస్తున్నాము" అంటున్నారు. ఈ రకంగా పరమేశ్వరుడు తప్ప వేరే దైవములేదు. ఆయనకృప ఉంటే చాలు ఇహము, పరము రెండూ లభిస్తాయి. అని భావన చేశారు.

# 6. ఇంద్రుడు

స్వర్గాధిపతి ఇంద్రుడు. దేవలోకానికి రాజు. ఋగ్వేదంలో ప్రధాన దేవత ఇంద్రుడు. సామవేదంలో కూడా ఇంద్రుడే ప్రధానదేవత. ఎందుకంటే సామవేదంలో ఉన్న మంత్రాలలో ఎనభైశాతము ఋగ్వేదంలోవే.

మానవులకు ఏం కావాలన్నా ఇచ్చేది ఇంద్రుడు, అతడు హరికి తల్లి, తండ్రి, గురువు, దైవము. ఒకటేమిటి? అన్నీ అతడే. అందుకే అతణ్ణి ఏ రకంగా స్తుతి చేస్తున్నారో చూడండి. **రెండవ ప్రపాఠకము** ఇంద్రకాండలో "ఓ ఇంద్రా ! సోమరసము సిద్ధమైనది. వచ్చి దానిని త్రాగవలసింది. ప్రసన్నుడవు కావలసింది. మాకు ధనాన్నిచ్చి మమ్మ సంతోషపెట్టవలసింది.

ఓ ఋత్విజులారా ! ఇంద్రుడు వృత్రాసురుని సంహరించాడు. అతనికి మీరు బలాన్ని కలిగిస్తున్నారు. అటువంటి ధనదాత అయిన ఇంద్రుడు మాకు ధనము ఇచ్చు గాక.

ఓ ఇంద్రా ! నువ్వు మహాసాహసివి. గుండెబలం గలవాడివి. ఈ యజ్ఞము ఇంద్రుని వర్ధిల్లచేసింది. ఇంద్రుడు భూమిమీద వర్షం కురిపించాడు.

ఇంద్రా ! నువు ఒక్కడివే ధనాధిపతివి. నన్ను ధనవంతునిగా చేయవలసింది.

అభిషోతలారా ! ఇంద్రుడు మహావీరుడు. గొప్పపరాక్రమవంతుడు. అతడికి అడుగడుగునా సోమము అర్పించండి. ఓ ఇంద్రా! నువ్వు అంతర్యామివి. ఈ సోమాన్ని నీకు అర్పిస్తున్నాను. దీన్ని కడుపారా త్రాగవలసినది. ఇంద్రా ! నువు

ఎప్పుడూ మా హితాన్నే కోరతావు. నువు చాలా ఉదారుడివి. వరదుడవు. నీ దగ్గర ఉన్న ధనము దానము ఇవ్వతగినది. ఓ దేవా! ఆకాశంలో ప్రకాశించేదంతా నీ అధీనములోనే ఉంది.

యదువు, తుర్వసుడు మొదలైన వారిని శత్రువులు ఓడించి అడవులకు పంపారు. అప్పుడు ఇంద్రుడు వారికి సహాయము చేసి వారి రాజ్యాలు వారికి ఇప్పించాడు. అటువంటి ఇంద్రుడు మాకు మిత్రుడు కావాలి. ఓ ఇంద్రా! శత్రువును ఓడించగలిగే ధనాన్ని మాకు ప్రసాదించవలసినది.

ఇంద్రుడు 'కద్రువుడు' అనే ఋషి ఇచ్చిన సోమము త్రాగి సహస్రబాహువు అనే శత్రువును శిక్షించినాడు. అప్పుడు ఇంద్రుని పరాక్రమము ప్రశస్తమైనది.

ఓ ఇంద్రా ! నీవు సర్వవ్యాపకుడవు. నీ ముందు నిలచి మేము నిన్ను కీర్తిస్తున్నాము. మా ప్రార్ధనలు ఆలకించు.

ఓ ఇంద్రా ! మా శతృవులను చెల్లాచెదరు చెయ్యి. మాకు అపకారం కలిగించే యుద్ధాలు నాశనంచెయ్యి. అలా లభించిన ధనాన్ని మాకు తెచ్చిపెట్టు.

ఓ ఇంద్రా ! నీ కోసం సోమరసము చేత్తో పట్టుకుని ఎదురుచూస్తున్నాము.

ఇంద్రుడు మానవులకు సామ్రాట్టు. నేత. శత్రుహంత. అటువంటి ఇంద్రుని బాగా కీర్తించండి. ఓ ఇంద్రా ! మేము ఇచ్చే సోమరసాన్ని త్రాగి, మాకు అధిక ధనరాసులు ఇవ్వవలసింది. మా శత్రువులను సంహరించవలసింది. మాకు సుఖాలు కలుగజేయవలసింది" అని ప్రార్ధిస్తున్నారు.

# 7. భోగాభిలాష కన్న త్యాగమే మిన్న

ఏ దేవతను ప్రార్థించినా, కీర్తించినా, స్తుతిచేసినా, కావలసింది ఒక్కటే. ధనము, సుఖశాంతులు, శత్రునాశనము. ఇక్కడ మనకి అనుమానం వస్తుంది. వారంతా ఋషీశ్వరులు కదా. మనకిమల్లె వారికి ఏ రకంగాను బాదరబందీ ఉండదుకదా ! మరి ఎప్పుడు చూసినా, ఏ సూక్తంలో చూసినా 'ఓ దేవా ! మాకు ధనరాసులు ఇవ్వవలసింది.' అనే అడుగుతున్నారు. అటువంటి వారికి ధనంమీద ఆశ ఎందుకు? ఇక్కడ మనం తెలుసుకోవలసిన విషయం ఒక్కటే. నిరంతరము వారు యజ్ఞయాగాది క్రతువులు చేస్తుండేవారు. యజ్ఞాలుయాగాలు చెయ్యాలంటే ధనం కావాలి. ఒకసారి ఒక యాగం చెయ్యాలంటే లక్షల రూపాయలు కావాలి. నేను గతంలో సహస్ర చండీయాగం చేసినప్పుడు కేవలము పూర్ణాహుతికి ఆ ఒక్కరోజు ఖర్చు లక్షా ముప్ఫై వేల రూపాయలు అయింది. ప్రతిరోజు ఈ యాగము నేను ఒక్కడినే చేసుకున్నాను. అదే పదిమందిని కూర్చోబెట్టి చేస్తే ఎంత అవుతుంది? దీనికి డబ్బులు ఎక్కడ నుంచి వస్తాయి? ఇలాటి సమయాల్లో పట్టువస్త్రాలు ఇవ్వటం జరుగుతుంది. సువర్ణదానం, గోదానాలు విరివిగా జరుగుతాయి. అన్నసంతర్పణ ఉంటుంది. వీటన్నింటికీ ధనం కావాలి కదా! అందుకే ఆ రోజున జనకమహారాజు యాగం చేస్తున్నాడు. యాగం జరిగే సమయంలో ఆధ్యాత్మిక చర్చలు, గోష్టులు సాయంత్రం పూట జరుగుతాయి. ఒకరోజున బాగా బలిసిన వెయ్యి ఆవులు, ఆబోతులు. వాటి శరీరం మీద మంచి విలువైన పట్టువస్త్రాలు కప్పి, కొమ్ములకు, గిట్టలకు, కాళ్ళకు, మెడలోను బంగారు హారాలు అలంకరించి సభాస్థలికి తెచ్చారు. జనకమహారాజు సభాసదులను చూసి మీలో గొప్ప పండితుడెవరో, ఆధ్యాత్మిక

ప్రపంచానికి రారాజు ఎవరో అతడు ఈ ఆవులను తీసుకువెళ్ళండి అన్నాడు. సభలోని వాళ్ళు ఎవరూ లేవలేదు. యాజ్ఞవల్క్యుడు లేచి శిష్యుణ్ణి పిలిచి 'ఈ గోవులన్నింటినీ ఆశ్రమానికి తోలుకువెళ్ళు' ఉన్నాడు. అప్పుడు సభలోని పండితులు లేచి యాజ్ఞవల్క్యుడితో 'నువు పండితుడివా? అని అడిగారు. కాదు. అన్నాడు మరి ఈ గోవుల నెందుకు తీసుకు వెడుతున్నావు? అన్నారు. అప్పుడు చెప్పాడు యాజ్ఞవల్క్యుడు "నేను ఒకయాగం చెయ్యాలి అనుకుంటున్నాను. దాని కోసం పట్టువస్త్రాలు, బంగారం, గోవులు కావాలి. వాటిని ఇప్పుడు అడగకుండా రాజుగారు ఇస్తున్నాడు. అందుకని నేను వీటిని తోలుకుపోతున్నాను" అన్నాడు. ఇలా యజ్ఞాలు యాగాలు చెయ్యాలంటే వారికి ధనం కావాలి. బంగారం, పట్టువస్త్రాలు, గోవులు కావాలి. వీటికిగాను ధనం కావాలి అంటే వాళ్ళకి ధనం కావాలి అనేది వాళ్ళ అవసరాలకో, సరదాలకో కాదు. భోగాలు అనుభవించటానికి అంతకన్నా కాదు. ఇంకొకరికి ఇవ్వటానికి, దానం చెయ్యటానికి, త్యాగం చెయ్యటానికి. భగవంతుడు అనుగ్రహించిన దాన్ని ఈ చేత్తో తీసుకుని ఆ చేత్తో ఇంకొకరికి దానం చేస్తారు. అందుకు వాళ్ళకి ధనం కావలసింది.

అసలు ఈ యాగాలు ఎందుకు చెయ్యాలి? కేవలం ధనం కోసమేనా? లేకపోతే సుఖము, శాంతి, సౌభాగ్యము వీటికోసమా? ఎందుకు? అంటే – మానవుడు చెయ్యవలసింది చతుర్విధ పురుషార్థ సాధన. ధర్మార్థ కామమోక్షాలను చతుర్విధ పురుషార్థాలు అంటారు. మానవుడు జీవించేది వీటిని సాధించటానికే. వీటిలో ముఖ్యమైనది, అసలు సాధించాల్సింది మోక్షము. మిగిలినమూడు ధర్మార్థకామాలు మోక్షం సాధించటానికి సోపానాలు. మోక్షం పొందాలంటే కామ్యకర్మలు

కాదు నిష్కామ్యకర్మ చెయ్యాలి. మరి దానికి కూడా ఇవన్నీ కావాలి. అందుకే భగవంతుణ్ణి ఎక్కువగా ధనం కోరేవారు. ఫలాపేక్ష లేకుండా అంటే – నిష్కామ్యంగా కర్మలు చేసేవారు. ఒక రకంగా చెప్పాలి అంటే ఇహానికి, పరానికి కూడా విలువ ఉన్న సమాజం అది. ఆ రోజున దానం ప్రతివాడు చేసేవాడు. దానం చెయ్యని వాడు పరమలోభి, లోకశత్రువుగా చూడబడేవాడు.

మనం అనుభవించేకన్న ఎవరికైనా దానం చెయ్యటమే శ్రేయస్కరము. **భోగం కన్న త్యాగమే మిన్న.** అని భావించేవారు.

# 8. అతిథి

రాక్షసుడు అనే పదాన్ని తరచు మనం ఉపయోగిస్తుంటాము. రాక్షసుడు భయంకరంగా ఉంటాడు. ఇతరులకు హానిచేస్తుంటాడు. పచ్చిమాంసం పీక్కు తింటుంటాడు. చచ్చిపోయిన జంతుకళేబరాలు ఖజాన వేసుకుని పోతుంటాడు. ఇలా చెప్పుకుంటాం. అందరు రాక్షసులు అలా ఉండరు. రాక్షసులలో కూడా రకాలున్నాయి. అరణ్యాలలో ఉండే రాక్షసులు ఒక రకంగా ఉంటే, పట్టణాలలో ఉండేవారు ఇంకో రకంగా ఉంటారు. ప్రాథమిక లక్షణాలు అందరివీ ఒకటే. కాని పట్టణాలలో ఉండేవారు కొంత నాగరికతతో ఉంటారు లంకలోని రాక్షసులలాగా అయితే ఇవాళ ఈ రాక్షసులు ఎక్కడో లేరు. మనతోనే మన ప్రక్కనే ఉన్నారు. వీళ్ళు కూడా నాగరికంగానే ఉంటారు. కాని ఇతరులను హింసించి ఆనందిస్తుంటారు. సంపద అంతా తమ దగ్గరే ఉండాలి అనుకుంటారు. తమ అధికారమే చెల్లుబాటు కావాలి అనుకుంటారు. ధనంకోసం పసిపిల్లల్ని కూడా అతికిరాతకంగా హత్య చేస్తారు. గతంలో ఎనిమిది సంవత్సరాల పిల్లనిచంపి ఫర్నేస్‌లో వేసి తగలపెట్టింది ఈ డబ్బు కోసమే. దానము, ధర్మము అనేవి మచ్చుకు కూడా వీళ్ళ దగ్గర కనపడవు. సామసంహితలో **ఉత్తరార్చికలో రెండవ ప్రపాఠకంలోని రెండవ దశతిలో** "లోభి లోకవిరోధి మానవ విరోధి దానంచేసేవారు లోకప్రియులు. దానం చేసే వారిని దేవతలు రక్షిస్తారు. దానం చెయ్యనివాణ్ణి దేవతలు భక్షిస్తారు. దానం చేసేవాణ్ణి అన్నం రక్షిస్తుంది. దానం చెయ్యనివాణ్ణి అన్నం భక్షిస్తుంది అని చెబుతోంది వేదం. దానం ఎప్పుడూ కుడిచేత్తోనే ఇవ్వాలనేది ఆనాటి సంప్రదాయం. ఈ రోజున కూడా అదే సంప్రదాయం కొనసాగుతోంది.

యజ్ఞమనేది ఆనాటి వారి జీవితంలో ఒక భాగమయిపోయింది. ప్రతిదానికి, ఏది కావాలన్నా యజ్ఞం చేసేవారు. యజ్ఞయాగాలు వారి జీవితంలో అంతగా అంతర్భాగం అయిపోయినాయి. మగపిల్లవాడు పుట్టాలన్నా యజ్ఞం చేసేవారు. దాంతో యజ్ఞానికి, అగ్నికీ ఎక్కువ ప్రాధాన్యత సంతరించుకుంది. అగ్నిని ఒకచోట మిత్రుడుగా, ఒకచోట అతిథిలాగా, తల్లిగా, తండ్రిగా, కుటుంబసభ్యుడుగా, బంధువుగా పోల్చి చెప్పారు.

యజ్ఞంలో సోమలతకు ప్రాధాన్యత ఎక్కువఉంది. ప్రతివారి ఇంట్లోను సోమలతను పెంచేవారు. దానియొక్క ఆకులు నలగగొట్టి, రసంతీసి, ఆ రసాన్ని ఉన్నిబట్టతో వడబోసేవారు అలా వడబోసిన సోమరసం రరకాల రంగుల్లో (పసుపు, తెలుపు, బూడిద రంగు, విచిత్ర వర్ణం) ఉంటుంది అని సామసంహితలోని పూర్వార్చిక, ఉత్తరార్చికలు చెబుతున్నాయి. గుర్తుంచుకోవలసిన విషయం ఏమంటే యుద్ధం హింసాత్మకము. కాబట్టి ఓ ఇంద్రా! యుద్ధం లేకుండాచెయ్యి అని చెబుతోంది **ఒకటవ అధ్యాయంలోని ఒకటవ ఖండిక** 'అతిథి దేవోభవ' ఇది ఆనాటి వారి భావన. ఇంటికి వచ్చిన అతిథిని సాక్షాత్తు పరమేశ్వరుడుగా ఆదరించే వారని చెబుతోంది సామసంహిత.

# 9. ప్రార్థనలు

దేవతలను ప్రార్థించేటప్పుడు సామాన్యంగా మనకి కావలసిన కోరికలను కోరటం జరుగుతుంది. అలాగే ఆ కాలంలోకూడా వారు దేవతలను ప్రార్థించి రకరకాల కోరికలు కోరుకునే వారు. ఓ అగ్నిదేవా ! నీవు మాకు ధనాన్ని ప్రసాదించు. ఓ ఇంద్రా! శత్రువులను నాశనం చెయ్యి. వర్షాలు కురిపించు. పంటలు బాగా పండించు. రోగాలు రాకుండా చూడు. అపమృత్యువు లేకుండా చూడు. ఇలా అనేక కోరికలు కోరటం జరుగుతుంది. మొదటి అధ్యాయంలోని మొదటి ఖండంలో మాకు గోధనం కావాలి అని అడుగుతున్నారు. నివసించటానికి మంచి గృహాలు కావాలి. **న్యాయంగా ధర్మంగా సంపాదించగల ధనమే మాకు కావాలి. అన్యాయంగా, వక్రమార్గంలో అవినీతిపరంగా సంపాదించే ధనము మాకు వద్దు అంటున్నారు.** ఈ రోజున చూడండి. 'ఎంత సంపాదించాము అన్నదే ప్రశ్న. అంతేకాని ఎలా సంపాదించామన్నది కాదు' ఇదీ భావన. ఈ రకమైన ఆలోచనలు ఆ రోజున లేవు. నైతిక విలువలకు ప్రాధాన్యత ఉన్నది. అందుకే ధనం లేకపోయినా నిజాయితీపరుడికి గుర్తింపు, గౌరవము ఉండేవి. అక్రమ సంపాదన మీద వారికి ఆసక్తి లేదు. వారి దృష్టిలో అది నీచమైంది. హీనమైంది. ఆ రోజున నైతికవిలువలు ఎంత గొప్పవో చూడండి. దేవతలను ప్రార్థించి ధనం, ధాన్యం, సౌభాగ్యం, మంచిసంతతి, సంపత్తి కోరుకునేవారు. దేవతలను వారు చేసే స్తోత్రాలు కూడా వింతగా ఉండేవి. మొదటి **అధ్యాయం మొదటిఖండంలో** "ఓ అగ్నిదేవా! స్తోత్రాలతోను, యజ్ఞంతోను నీ వద్ద నుండి కోరికలను మేఘాల నుంచి నీటిని పుట్టించినట్లుగా పుట్టిస్తున్నాడు. ఈ మాటలు జాగ్రత్తగా ఆలోచిస్తే దైవశక్తి నుంచే కోరికలు ఆవిర్భవిస్తాయి. వారంతా గోధనంతో పాటుగా

కుమారులు, కుమార్తెలూ, మనుమలు, వీరందర్నీ కోరుకొనేవారు.

శత్రునాశనం చెయ్యమని భగవంతుణ్ణి కోరేవారు. కుటిలబుద్ధి గలవారు, దుర్మార్గపు ఆలోచనలు చేసేవారు, దొంగలు, నీచులు అయిన శత్రువులను మా మార్గం నుంచి వేరు చేయవలసినది. అని అగ్నిదేవుని ప్రార్థించారు అని **మొదటి అధ్యాయం మొదటి ఖండం** చెబుతున్నది. మేము నీ కోసం గొప్ప స్తోత్రాలను చేస్తున్నాము. సూక్తాలను చెబుతున్నాము. వాటిని విని ఆనందించి మా కోరికలు, నెరవేర్చవలసింది అంటున్నారు.

**ఒకటవ అధ్యాయంలోని రెండవ ఖండంలో** "ఓ దేవా! మా భయాన్ని పారద్రోలు. తరిమికొట్టు. నిన్నెవరూ కదిలించలేరు" అని వారు ఇంద్రుడు, పూష మొదలైన దేవతలను భయాన్నిపోగొట్టే దేవతలుగా ప్రార్థిస్తూ, మాకు సుఖాన్ని కలిగించు, అన్నాన్ని సమృద్ధిగా ఇవ్వవలసింది'' అంటున్నారు. 'ఇంద్రుని కోసం అంతాకలిసి స్తుతిచెయ్యండి. ఇంద్రుడికిచ్చే అశ్వంకోసం, ఆవుకోసం, ఇంటికోసం ఇంద్రస్తోత్రం బాగా చెయ్యండి. వర్షం కురిపించే ఇంద్రుడు తనను స్తుతించేవారికి అన్నదాత, ధనదాత, సుఖదాత. ఓ ఇంద్రా! మేమంతా నీ స్నేహితులం. నీకోసమే స్తుతి చేస్తున్నాం" అంటున్నారు. అంటే దేవుణ్ణి స్నేహితుడిగా భావిస్తున్నారు.

దైవాన్ని పిలిచేటప్పుడు ఏదైనా ఒకప్రయోజనం ఉండాలి. ఘోరమైన తపస్సు చేశాం. భగవంతుడు ప్రత్యక్షమై ఏంకావాలి? అని అడిగాడు. మనకి కావలసిందేదో చెప్పాలి. అంతేకాని ఏంలేదు. ఊరికే పిలిచాను. నువు ఎలా ఉంటావో చూద్దామని పిలిచాను. మంత్రం పనిచేస్తుందో లేదో పరీక్షించటానికి పిలిచాను అనకూడదు. దీనివల్ల అనర్థం వస్తుంది. కుంతిభోజుని కుమార్తె 'కుంతీకుమారి! దుర్వాసుడికి

సేవలు చేసింది. సంతసించిన ఆయన 'బాలా! నీకు ఒక మంత్రం ఇస్తాను. ఏ దేవతని ఉద్దేశించి ఆ మంత్రజపం చేస్తే, మరుక్షణంలో ఆ దేవత ప్రత్యక్షమవుతుంది.' అని ఒక మంత్రాన్నిచ్చి వెళ్ళిపోయాడు. ఆ మంత్రం పనిచేస్తుందో లేదో చూద్దాం అని జపం చేసి సూర్యభగవానుణ్ణి పిలిచింది కుంతి. ప్రత్యక్షమైనాడు సూర్యుడు. ఏంకావాలి? అని అడిగాడు. 'ఏమీ అక్కర్లేదు. మంత్రమహిమ తెలుసుకుందామని నిన్ను పిలిచాను అంతే అంది. ఊరుకోలేదు సూర్యుడు నేను వచ్చినప్పుడు ఏదైనా ఇచ్చి వెళ్ళటం సంప్రదాయం. ఏమీ ఇవ్వకుండా అలా ఊరికే వెళ్ళకూడదు అన్నాడు. ఒకకుమారుణ్ణి ప్రసాదించి వెళ్ళాడు. ఆ కుమారుడే కర్ణుడు. మహాభారత యుద్ధానికి మూలపురుషుడు.

మార్కండేయుడు ఈశ్వర సాక్షాత్కారం పొందాడు. మళ్ళీ ఈసారి శ్రీమహావిష్ణువును గురించి ఘోరమైన తపస్సు చేశాడు. విష్ణుమూర్తి ప్రత్యక్షమై ఏం కావాలి? అన్నాడు. నాకు ఏమీ అక్కర్లేదు స్వామీ! అన్నాడు మార్కండేయుడు. నేను వచ్చినప్పుడు ఏదో ఒకటి ఇచ్చి వెళ్ళటం సంప్రదాయం. నేను వరం ఇవ్వకుండా వెళ్ళరాదు. కాబట్టి ఏదైనా కోరుకో అన్నాడు. 'వైష్ణమమాయ'ను చూడాలని ఉంది అన్నాడు మార్కండేయుడు. అలాగే అన్నాడు శ్రీమహావిష్ణువు.

మీరుకూడా గుర్తుంచుకోండి. భగవంతుణ్ణే కాదు. పెద్దవారిని ఎవరినైనా సరే ఊరికే పిలవరాదు. ఏపనీలేకుండా వారి దగ్గరకు వెళ్ళి వారి సమయం వృథా చెయ్యరాదు. బాగాపాలిచ్చే ఆవుని పాలుపితకటానికి పిలిచినట్లుగా ఇంద్రుణ్ణి పిలుస్తున్నారు అని చెబుతోంది వేదంలోని **ఒకటవ అధ్యాయం, రెండవ ఖండం.** కాబట్టి

ప్రయోజనసిద్ధి కోసమే భగవంతుణ్ణి ప్రార్థించాలి. ఒకటవ అధ్యాయంలోని రెండవ ఖండంలో అంటున్నారు చూడండి. “ఓ ఇంద్రా! గతంలో లాగానే గోవులు, అశ్వాలు, రథాలు, అధికధనము ఇవ్వటానికి రావలసింది”

ఈ రకంగా సామసంహితలో దైనందిన అవసరాలు తీర్చుకోవటానికి వీలుగా భగవంతుణ్ణి ప్రార్థించేవారు. ధనము, ధాన్యము, గుర్రాలు, ఏనుగులు, రథాలు, సుఖము ఇమ్మని కోరేవారు. శాంతిని ప్రసాదించమని వేడుకునేవారు. శత్రుసంహారం చెయ్యమని అడిగేవారు. వీరుచేసే అర్చనలు, యజ్ఞయాగాలు అన్నీ ఇహానికి సంబంధించినవే. పరానికి సంబంధించినభావన సామసంహితలో ఎక్కడా కనపడదు. అంటే ఇదంతా అపరావిద్య.

# 10. ఇంద్రస్తుతి

సామసంహితలోని రెండవ ప్రపాఠకము పూర్తిగా ఇంద్రస్తుతి. ఇంద్రుడు మహదైశ్వర్య సంపన్నుడు. అతనివద్ద అంతులేని సంపద ఉన్నది. జగత్తులోని సంపద అంతా అతని దగ్గరే ఉన్నది. అందుకే ఏది కావాలన్నా ఇంద్రుణ్ణే ధ్యానం చేస్తారు. వేదకాలంలో ఇంద్రుడే దేవత. మిగిలినవన్నీ తరువాత కాలంలో వచ్చినవే. ప్రస్తుతం మనం అనేకమంది దేవతలను పూజిస్తున్నాము. వివాహము, సంతానము కోసం – సుబ్రహ్మణ్యం, ధనం, ధాన్యంకోసం – లక్ష్మీదేవి, శత్రునాశనం కోసం – కాళి, ప్రత్యంగిర, నారసింహము, సుదర్శనము, ఆరోగ్యం కోసం – సూర్యుడు. కాని వేదకాలంలో ఏది కావాలన్నా ఇచ్చేది ఒకడే. అతడే ఇంద్రుడు. ఈ కారణం చేతనే వేదసూక్తాలలో ఇంద్రుని స్తుతియే ఎక్కువగా కనిపిస్తుంది. ఆయన్నే అన్ని రకాలుగా ప్రార్థిస్తారు. పూర్వార్చిక రెండవ ప్రపాఠకంలో

"ఇంద్రుడు వృత్రాసురుని సంహరించాడు. ఆయనకోసం మేము సోమాన్ని సిద్ధంచేశాం. ఓ ఇంద్రా! నువ్వు వచ్చి సోమరసాన్ని త్రాగవలసింది. నీవే మా సామ్రాట్టువు. ఓ ఇంద్రా! మాకు అవసరమైన ధనధాన్యాలను తీసుకురా! మా శత్రువును సంహరించు, మాకు సుఖాన్నివ్వు. ఓ ఇంద్రా ! నీ కోసం సోమం సిద్ధమైంది. వచ్చి ఆరగించు. మాకు శుభాలు కలిగించు. మా శత్రువులను సంహరించు. అధికంగా వర్షాలు కురిపించు. పంటలు బాగా పండాలి. మేము మాపిల్లాపాపలతో హాయిగా సుఖంగా జీవించాలి. యజ్ఞయాగాదులు సవ్యంగా నడిచే ఏర్పాటు చేయవలసింది అని ప్రార్థించారు.

పూర్వార్చికలోని మూడవ ప్రపాఠకములోని మొదటి దశతిలో ఇంద్రుడు మహాదాత. మేము అతణ్ణి స్తుతి చేస్తున్నాము. ఓ ఇంద్రా!

అన్నప్రాప్తి కోసం మా యందు దయ ఉంచి ఒక మంచి సోదరుని ప్రసాదించవలసింది అని అడుగుతున్నారు.

మానవ జీవితంలో అనేక రకాల ఖర్చులు వస్తుంటాయి. వాటిలో వృధా ఖర్చులు ఎప్పుడూ మనకు వద్దు. ఉదాహరణకు ఎవరైనా జాతకం చూసి నీకు ఈ సంవత్సరం ఖర్చుబాగా ఉంటుంది అన్నారనుకోండి. ఇప్పుడు ఖర్చు రెండు రకాలుగా జరుగుతుంది. మంచి పనులకు, చెడుపనులకు, పిల్లపెళ్ళిచేసి ఖర్చుచెయ్యటం మంచి ఖర్చు. అదే హాస్పిటల్‌లో చేరి బిల్లుకట్టటం రెండవ పద్ధతి. ఎలాగూ డబ్బులు ఖర్చు అవుతాయి అని మీ జాతకంలో ఉన్నప్పుడు మంచిగా ఖర్చు చేయండి. పిల్లపెళ్ళి కాకపోతే దైవకార్యం చెయ్యండి. అనవసరమైన ఖర్చు ఎందుకు? ఇదే మాట **నాల్గవ ప్రపాఠకంలోని రెండవ దశతిలో** చెబుతున్నారు.

"ఓ ఇంద్రుడా! నీవు ధనపతివి. నాకు ధనాన్ని అనుగ్రహించు. సామగానంతో నిన్ను స్తోత్రం చేస్తాను. వ్యర్థమైన ఖర్చులు చేయకుండా నన్ను కాపాడవలసింది." ప్రతి మానవుడికీ శరీరంలో తేజస్సు ఉంటుంది. ఆ తేజస్సును ఎక్కువ ఉండేటట్లుగా చేయవలసింది అంటున్నారు. **ఆరవ ప్రపాఠకంలోని పన్నెండవ దశతిలో** "ఓ పరమేష్ఠీ! ఓ ఇంద్రా ! స్వర్గతేజస్సుకు సమానంగా నా శరీరంలోని బ్రహ్మతేజస్సును పెంపొందించు. యజ్ఞాలకు నేను సంపాదించే హవిస్సులు కూడా సమృద్ధిగా ఉండేటట్లుగా చూడు" అని ప్రార్థిస్తున్నారు.

# 11. అన్నం పరబ్రహ్మ స్వరూపం

అన్నము అంటే మనం తినే ఆహారమే అన్నము. అంతేకాని బియ్యంతో వండినదే అన్నం కాదు.

| | | |
|---|---|---|
| మానవుడికి | – బియ్యం వండితే వచ్చేది | – అన్నము |
| గేదెకు | – గడ్డి | – అన్నము |
| క్రిములకు | – వ్యర్థ పదార్థాలే అన్నం | |

ఇలా అన్నము అనేది జీవిని బట్టి మారుతుంది. ఏదిఏమైనా జీవించటానికి అవసరమైన ఆహార పదార్థము అన్నము. అన్నం తింటేనే జీవిశరీరం నిలబడుతుంది. అందుకే అన్నం పరబ్రహ్మ స్వరూపము అంటారు. అటువంటి అన్నాన్ని నిందించరాదు అని చెబుతోంది వేదం. ఆరవ ప్రపాఠకంలోని పదవ దశతిలో

"అన్న దేవత దేవతలందరిలోకీ ముఖ్యమైన వాడు. సత్యస్వరూపుడు అయిన బ్రహ్మయొక్క పూర్వ స్వరూపము అన్నము. అన్నంతో జీవులను తృప్తిపరచవచ్చు. మానవుడికి ఏదిచ్చినా ఇంకచాలు అనడు. అన్నం పెడితే మాత్రం చాలు. ఇంక వద్దు అంటాడు. అన్నం తింటేనే ప్రాణాలు నిలుస్తాయి. ఇతరులకు ఏ మాత్రము అన్నం పెట్టకుండా, అంతా తానే తినెయ్యాలనుకునేలోభి వారి అన్నాన్నికూడా తానే తినేస్తున్నాడు అని అర్థం" అంటున్నాడు.

పరమేశ్వరుడు సర్వశక్తి సమర్థుడు. అతనికన్న ఎక్కువైనది ఏదీ లేదు. యుద్ధంలో మనకువవిజయం సాధించి పెట్టేది ఆ పరమేశ్వరుడే. అందుకే మహానామ్నార్చికలో

సర్వసమర్థుడైన పరమేశ్వరుడు యుద్ధంలో మనకు విజయాన్ని సాధించి పెడతాడు. అటువంటి ఆ పరమేశ్వరుణ్ణి ఎప్పుడూ

ప్రార్థించాలి. ఎప్పుడూ స్మరించాలి. జ్ఞాన, కర్మశక్తులు కలిగిన వాడు. సత్యస్వరూపుడు. ఆయన మనలోని ద్వేషాన్ని పోగొడతాడు." అని **'మహానామ్న్యార్చిక'**లో చెప్పారు.

పరమేశ్వరుని తత్త్వాన్ని తెలుసుకోవటమే 'జ్ఞానము'. జ్ఞానము అనేది పుస్తకాలు చదివితే రాదు. ఎవరైనా చెప్పినప్పుడువిన్నా రాదు. దానంతట అది రావాలి. అలా రావాలంటే పరమేశ్వరుని దయకావాలి. అందుకే **ఉత్తరార్చికలోని మొదటి ప్రపాఠకంలోని రెండవ దశతిలో** ఓ అగ్నిదేవా ! నువ్వు మాలో ఉన్న అజ్ఞానాన్ని పోగొట్టి జ్ఞానజ్యోతులు ప్రకాశింపచెయ్యటంకోసం ఈ యజ్ఞానికి రావలసింది. మాకు దివ్యగుణాలను అనుగ్రహించవలసింది. ఓ దేవా ! నువు నా హృదయమందు నివసించవలసింది" అని ప్రార్థిస్తున్నారు.

ఒక్క జ్ఞానమే కాదు ఐశ్వర్య ప్రదాత కూడా ఆ ఈశ్వరుడే. అందుకే **ఉత్తరార్చికలోని ఒకటవ ప్రపాఠకంలోని ఏడవ దశతిలో** తనను స్తుతి చేసేవారందరికీ పశువులు, ధనము, ఇచ్చే ఇంద్రుడు మాకు కూడా ఐశ్వర్యాన్ని ప్రసాదించుగాక. ఆ ఇంద్రుడు గొప్ప ఐశ్వర్యప్రదాత." అన్నారు.

పవమానసోముడు యుద్ధంలో నేర్పరి. బాణాలు ప్రయోగించటము, శత్రువులను నాశనం చెయ్యటము అనే రెండు పనులు సోమునివల్లే జరుగుతాయి. కాబట్టి "ఓ సోముడా! శతృనాశనం చేసి యజ్ఞాలకు అభయాన్ని ఇవ్వవలసినది" అని పవమానసోముణ్ణి ప్రార్థిస్తున్నారు.

పాపాలు చెయ్యటము అనేది సహజం. చేసిన పాపము యొక్క ఫలితము అనుభవించాలంటే కొన్ని జన్మలు ఎత్తాలి. కల్పాంతం వరకు

అనుభవించినా కర్మక్షయం కాదు. పరమేశ్వరుడి అనుగ్రహంతోనే మానవుడి పాపాలు క్షయమవుతాయి. అందుకే **ఉత్తరార్చికలోని ఆరవ ప్రపాఠకంలోని మొదటి దశతిలో**

"మిత్రాది దేవగణాలు మమ్మల్ని రక్షించాలి.

యజ్ఞస్థానమునందున్న అగ్ని మమ్మల్ని రక్షించాలి" అని ప్రార్థిస్తున్నారు.

ఏదైనా పని చెయ్యాలన్నా అనేక అడ్డంకులు వస్తాయి. ఈ అడ్డంకులనీ తొలగించుకుని పనులు పూర్తి చెయ్యాలి. అగ్ని ఐశ్వర్యప్రదాత. **ఉత్తరార్చికలోని ఏడవ ప్రపాఠకంలోని మూడవ దశతిలో** "అగ్ని కర్తవ్య నిర్వహణలోని ప్రతిబంధకాలు తొలగించగలడు. కాబట్టి ఉత్తమకర్మల ద్వారా ఆయనను స్తుతి చేయండి" అంటున్నారు.

ఈ రకంగా సామసంహితలో అగ్ని, ఇంద్రుడు, పవమానసోముడు మొదలైన దేవతలను ప్రార్థిస్తూ "ఐశ్వర్యము, జ్ఞానము, శాంతి కావాలంటే దేవతలను నిశ్చలమైన భక్తితో స్తుతిచెయ్యండి" అన్నారు.

ఎటువంటి వ్యక్తికైనా శత్రువులంటారు. నీ ఎదుదుగుదల, పేరు, ప్రతిష్ఠ చూసి కూడా నీకు శత్రువులు ఏర్పడతారు. అటువంటి శత్రువులందరినీ తరిమి వెయ్యాలి. వారిని నాశనం చెయ్యాలి. **ఉత్తరార్చికలోని తొమ్మిదవ ప్రపాఠకంలోని తొమ్మిదవ దశతిలో** "ఓ వీరులారా ! ఇంద్రుడు మహావీరుడు. దేవతల శత్రువులందర్నీ నాశనం చెయ్యగలడు. ఆయన కృపతో విజయాన్ని పొందండి. శత్రువులను సమూలంగా నాశనము చేయండి" అంటున్నారు.

ఈ విధంగా సామసంహితలో దేవతలను రకరకాలుగా ప్రార్థిస్తున్నారు.

*దీంతో సామసంహిత సమాప్తము*

శ్రీ

# పార్థసారథీయము

# చతుర్వేదభాష్యము

## ( అధర్వణసంహిత )



ప్రముఖ శ్రీవిద్యా ప్రచారకులు
అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,
ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, మెంఫిస్, అమెరికా ఆస్థాన విద్వాంసులు,
డా॥ క్రోవి పార్థసారథి

# విషయసూచిక


1. మానవసేవే మాధవ సేవ
2. బాధలు పెంచుకోకూడదు. పంచుకోవాలి.
3. మనుషులంతా ఒక్కటే
4. శతమానం భవతి
5. సమస్యలు – పరిష్కారాలు
6. సుఖప్రసవము
7. చేతబడి
8. సర్వపుష్టికర్మ
9. వితంతు వివాహము
10. శ్వేతకుష్ఠు నివారణ
11. చలిజ్వరము
12. గొడ్రాలికి సంతానము
13. రక్తస్రావం ఆగటానికి
14. సభలో విజయం పొందటానికి
15. అతిమూత్రము
16. సంపద కోసం
17. వంశపారంపర్య వ్యాధులు
18. పూర్ణాయుర్దాయం కోసం
19. అభిచార హోమానికి విరుగుడు
20. ఆవులకు పుష్టి

21. వివాదాల్లో విజయం
22. ఆయురారోగ్య ఐశ్వర్యాలు
23. క్రిమిరోగశాంతి
24. శత్రువులచేతిలో ఓడిపోయిన రాజు మళ్ళీ రాజ్యానికి రావటం
25. రాజ్యం సుస్థిరం కావటానికి
26. విఘ్న నివారణ
27. క్షయరోగ నివారణ
28. గృహసూక్తము
29. గోశాల
30. వ్యాపారంలో లాభం కోసం
31. స్త్రీవశీకరణము
32. పురుషుణ్ణి వీర్యసంపన్నుడిగా చెయ్యటానికి
33. విషానికి విరుగుడు
34. విరిగిన ఎముకలు అతుక్కోవటానికి
35. వర్షం కోసం
36. అభిచారదోష నివారణ
37. గోసూక్తము
38. జూదంలో గెలవటానికి
39. సర్వసంపదల కోసం
40. క్షయ, కుష్ఠురోగ నిర్మూలనకు
41. ఆరాతి (దరిద్ర దేవత)
42. కృత్యాప్రయోగనాశనము
43. క్రిమిచికిత్స

44. యాగవిఘ్నశాంతి
45. జయం కోసం
46. గర్భం గట్టిపరచటానికి
47. జలోదరం
48. రాక్షసపీడనివృత్తి
49. భార్యాభర్తల మధ్య కోపము
50. క్షిప్రవాతము (పక్షవాతము)
51. శంఖపుష్టి
52. గండమాల
53. ద్వేషించే వాడికి పుత్రసంతానం లేకుండా చెయ్యటానికి
54. సర్వసంపదలు
55. జూదంలో జయం సాధించటానికి
56. స్త్రీ పురుషులకు పరస్పరము ద్వేషం కలిగించటానికి
57. శతమానం భవతి
58. రాక్షస, పిశాచ, గ్రహాల నివారణ
59. కావలసిన కోరిక తీరటం కోసం
60. గర్భిణీస్త్రీకి రక్ష
61. క్షయ మొదలైన రోగాలకి చికిత్స
62. విరాట్పురుషుడు (20వ సూక్తం)
63. విరాట్పురుషుడు (21వ సూక్తం)
64. విరాట్పురుషుడు (22వ సూక్తం)
65. విరాట్స్వరూపము (23వ సూక్తం)
66. విరాట్స్వరూపము (24వ సూక్తం)

67. అతిథి దేవోభవ (సూక్తం-6)

68. అతిథిదేవోభవ (సూక్తం - 7)

69. అతిథిదేవోభవ (సూక్తం-8)

70. అతిథిదేవోభవ (సూక్తం-9)

71. అతిథిదేవోభవ (సూక్తం-10)

72. అతిథి దేవోభవ (సూక్తం-11)

73. దేవుడిచ్చిన శరీరము

74. రుద్రుడు (సూక్తం-5)

75. రుద్రుడు (సూక్తం-6)

76. రుద్రుడు (సూక్తం-7)

77. ప్రాణసూక్తం (సూక్తం-11)

78. ప్రాణసూక్తం (సూక్తం-12)

79. ప్రాణసూక్తం - (సూక్తం-13)

80. పృధ్వీసూక్తం

81. బాల్య వివాహాలు

82. సతీ సహగమనము

83. బహుభార్యత్వము

84. అధర్వవేదం - అభిచారకర్మ

85. లోకవశ్యం

86. నిద్రపుచ్చటం

87. దాంపత్యం

88. సభలో విజయం

89. గ్రహబాధలు

90. జ్వరం
91. స్త్రీ వశీకరణ
92. పురుషుణ్ణి వశపరచుకోవటానికి
93. వర్షం కురవటానికి
94. మూత్రం ఆగిపోతే
95. ఇంకా అనేకం

# 2.5 అధర్వణ సంహిత

వేదాల వరుసలో నాల్గవది అధర్వవేదం. అధర్వులు, ఆంగిరసులు అనే రెండు వంశాలను ఈ పదం చెబుతోంది. ఇందులో అధర్వ శబ్దం – మంగళకరమైనది కాగా ఆంగీరస శబ్దం అమంగళకరమైనది, ఆభిచారిక భాగము అని అర్థం చెబుతున్నారు. కాలక్రమేణా దీనికి 'అధ్వరణ వేదం' అనే పేరు స్థిరపడిపోయింది. అధర్వ సంహిత ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక విషయాలను వివరిస్తోంది. ఇందులో శారీరక చికిత్సకు చెందిన 144 సూక్తాలు ఉన్నాయి. ప్రతి అవయవం పేరు, స్వరూపము పూర్తిగా వర్ణించబడ్డాయి. 244 సూక్తాలలో రాజ్యానికి, రాజధర్మానికి సంబంధించిన విషయాలు, 75 సూక్తాలలో సమాజ స్వరూపం, 86 సూక్తాలలో ఆధ్యాత్మిక విశేషాలు వివరించబడ్డాయి.

మొత్తం మీద అధర్వ సంహితలో 20 కాండలు, 736 సూక్తాలు, 5918 మంత్రాలు ఉన్నాయి. ఇందులో 1200 మంత్రాలు ఋగ్వేదంలో నుంచి యధాతథంగా తీసుకున్నారు. ఇక సంహితలోని విషయాలు చూద్దాం.

# 1. మానవసేవే మాధవ సేవ

మానవుడు ఒంటరిగా నివసించటం లేదు. సభ్యసమాజంలో జీవిస్తున్నాడు. సమాజంలో మనమే కాదు. మనతోపాటుగా అనేకమంది మంచివాళ్ళు, చెడ్డవాళ్ళు, దుర్మార్గులు, దొంగలు, దోపిడీదార్లు, హంతకులు, అనేకమంది అనేక రకాల మనస్తత్వాలు గలవారు ఉన్నారు. వీరిలో ధనికులు, మధ్య తరగతి వారు పేదలు, నిరుపేదలు, ప్రతిరోజూ తిండికోసం వెతుకులాడే సంచారజీవులు. ఇలా అనేకమంది ఉన్నారు. వీరందరూ కలిస్తేనే సమాజం. అదే ఒక దేశం. సమాజం అభివృద్ధి చెందాలంటే ఉన్నవాడు లేనివాడిసంగతి చూడాలి. తప్పదు.

ఆధ్యాత్మికంగా ఆలోచించినా చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపం. జగత్తులో ఉన్న 84 లక్షల జీవరాశి పరమేశ్వర స్వరూపమే. చాతుర్వర్ణాలు పరమేశ్వర స్వరూపమే. గ్రామ్యజంతువులు, అరణ్యజంతువులు కూడా పరమేశ్వర స్వరూపమే. నీతోపాటుగా నీ పక్కన ఉన్నవాడు కూడా పరమేశ్వర స్వరూపమే. మరి నీ ఎక్కువ ఏమిటి? వారి తక్కువ ఏమిటి?

మిగిలిన వాళ్ళ సంగతి నాకు అనవసరం. నా సంపద పూర్తిగా నేనే అనుభవిస్తాను. నేను హాయిగా సుఖంగాఉంటాను. అంటే - శరీరం అంతా నీదే. ఇందులో కాళ్ళతో నాకు సంబంధం లేదు. వాటిని గురించి నేను పట్టించుకోను అని కాళ్ళు వదిలేసి మిగిలిన శరీరానికి మాత్రమే ప్రాధాన్యత ఇచ్చావనుకో. కాళ్ళు సరైన పోషణ లేక చచ్చుబడిపోతాయి. ఎక్కడికీ కదలల్లేవు. 'శరీరంలో ఏదో ఒక భాగంతో నాకు సంబంధం లేదు. దాన్నినేను శుభ్రం కూడా చెయ్యను' అని అలా వదిలేశాననుకో. ఏమవుతుంది? ఎండిపోయి కంపుకొడుతుంది. ఆ కంపు నీతోనే ఉంటుంది. మిగిలిన శరీరాన్ని చాలా అందంగా

అలంకరించుకుని పెద్ద కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా వెళ్ళావు. అక్కడ అందరూ నిన్ను ఆదరించారు గౌరవించారు. నీ కంపు కూడా నీతోనే ఉంది. దాన్ని అసహ్యించుకుంటారు కదా ? ఆ శరీరభాగం శుభ్రం చెయ్యనందుకు నిన్నే అంటారు. దానికి కారణం నువ్వే. సమాజంలో దొంగలు, దోపిడీదార్లు ఉన్నారంటే కారణం సమాజమే. అందరికీ తినటానికి తిండి, కట్టుకోటానికి బట్ట, ఉండటానికి ఇల్లు, చెయ్యటానికి పని ఉన్నదనుకోండి. ప్రతివాడికి జీవనోపాధి ఉన్నది. జీవితానికి భద్రత ఉన్నది. అటువంటి సమయంలో దొంగతనం, దోపిడీలు చెయ్యవలసిన అవసరం ఏముంటుంది? కాబట్టి ఆ పని చెయ్యవలసింది, సమాజాన్ని గురించి ఆలోచించవలసింది నువ్వే. **“మానవుడు ఏ సమాజంలో సభ్యుడుగా ఉన్నాడో, ఆ సమాజం గురించి మర్చిపోవటం మంచిది కాదు”** అంటోంది అధర్వవేదం.

సామాజికంగా చూసినా, ఆధ్యాత్మికంగా చూసినా మానవుడు సమాజం గురించి ఆలోచించాల్సిందే. ప్రతివాడు భగవంతుణ్ణి ధ్యానం చెయ్యాలి. భగవధ్యానంలోను ఆరాధనలోను అతని మనస్సు తత్పరమై ఉండాలి. సమాజాన్ని మరచిపోయి తోటి మానవులతో కఠినంగా కర్కశంగా, పాశవికంగా ప్రవర్తిస్తే ఏదో ఒక రోజున వాళ్ళ ఆగ్రహానికి, ఆవేశానికి గురికావలసివస్తుంది. ఈ విషయం దృష్టిలో పెట్టుకుని ప్రవర్తించాలి. సమాజమనేది భగవత్స్వరూపం. సమాజానికి సేవ చేయటమంటే భగవంతుడిని సేవించటంలాంటిదే. ఈ విషయాన్ని నొక్కి వక్కాణిస్తోంది. అధర్వవేదం.

మనకి కొంతమంది చెబుతుంటారు. “మాకు దేముడు గీముడు ఎవరూ లేరండి. చేతనైతే ఎవరికైనా అనాధపిల్లలకి ఇంత అన్నంపెడతాం. బట్టలు కొనిస్తాం. చదువుకోవటానికి పుస్తకాలిస్తాం.

అంతే. పూజలు వ్రతాలు మే చెయ్యం” అంటారు. వీరు చేసేది కూడా భగవదారాధనే. ఆరాధన అనేక రకాలు. పూజలు, వ్రతాలు, హోమాలు, యజ్ఞాలు, యాగాలు, క్రతువులు. వీటిలో సమాజసేవ ఒకటి. **‘దరిద్ర నారాయణసేవ’ ఇది ఒకటి. అంతా భగవదారాధనే భగవంతుడు కూడా తనను ఆరాధించటం కన్న, తన బాధ్యతలు నిర్వహిస్తూ సేవ చేయటం వల్లనే ఎక్కువ తృప్తి పొందుతాడు”** అంటోంది అధర్వవేదం.

తప్పులు చేసినవాడు, తాను తప్పుచేశాను అని గుర్తించి పశ్చాత్తాపపడి, భగవంతుడికి సేవ చేస్తే, భగవంతుడు కూడా అతడు చేసిన తప్పులు ఎంచడు. సంతోషిస్తాడు. కాబట్టి **సమాజంలో నివసిస్తున్న ఓ మానవులారా మీ సమాజాన్ని మీరు బాగు చేసుకోండి మీ ఇంటిని మీరు శుభ్రంగా ఉంచుకోండి అని చెబుతోంది అధర్వవేదం.**

## 2. బాధలు పెంచుకోకూడదు. పంచుకోవాలి.

సమాజంలో అనేక రకాల వాళ్ళు ఉంటారు. ఈ విషయం అందరికీ తెలుసు. వీరందరికీ ఒకే రకమైన జీవనం ఉండదు. కష్టాలు, కన్నీళ్ళు, అసలు జీవితం అంటేనే సుఖదుఃఖాలతో మిళితమైనది. కేవలం సుఖాలే, ఎవరికీ ఉండవు. అలా అని కేవలం దుఃఖాలే ఉండవు. వాళ్ళకి ఉండే సుఖాలు మాకుండవు కదా? అంటే ఎవరి స్థాయి వారిది. వాళ్ళకి ఉండే దుఃఖాలు కూడా మీకు ఉండవు.

అధర్వవేదంలోని సూక్తాలను గనక నిశతంగా పరిశీలిస్తే అనేక సత్యాలు బహిర్గతమవుతాయి. భూమిమీద నివసించే మానవుడికి వేదాలు నిధులవంటివి. అధర్వవేదం ఇక్కడి జీవనానికి ప్రాధాన్యమిస్తుంది. ప్రతివాడు తృప్తిగా, ఆనందంగా తోటివారితో కలిసి జీవితం గడపాలి. దానికి ఏం చెయ్యాలో మనం ఆలోచించాలి అంటోంది వేదం. నీ వంతు కృషి నువ్వు చెయ్యాలి. దీనికి అధర్వవేదం పరిష్కారం చెబుతోంది. **"తోటివాళ్ళ బాధలు ఎప్పుడూ పెంచటానికి ప్రయత్నం చెయ్యద్దు. ఆ బాధలు వాళ్ళతో పాటుగా పంచుకోండి. దాంతో వాళ్ళకి ఉపశమనం కలుగుతుంది. తద్వారా అందరూ హాయిగా ఉండగలుగుతారు. జీవితంలో వీలైనంత వరకు బాధలు పెంచుకోవద్దు. తగ్గించుకోవటానికి ప్రయత్నించండి. సుఖసంతోషాలతో జీవించండి"** ఇదే అధర్వణవేద సారాంశం. దీనికోసమే మిగిలిన వేదం అంతా చెప్పబడింది. ఈ ప్రయోజనాలు సాధించటానికి దేవతల సహాయం కోరాలి. ఇతర వేదాలు చెప్పిన కర్మకాండను కాదనటం లేదు. సమాజంలో ఇతరులకు, తనకు కూడా అవకాశాలు లభించాలి. అందరూ ప్రశాంతంగా జీవించాలి. దీనికి మార్గం తెలుసుకోవాలి

అంటోంది ఈ వేదం.

మానవుడు దేవతలకు ఎంతగానో ఋణపడి ఉన్నాడు. దేవతలకు మానవుల మీద ప్రేమ చాలా ఎక్కువ. అందుచేతనే నిరంతరము మానవులకు వారి అర్హతను బట్టి సహాయం చేస్తుంటారు. దేవతలలో కూడా కొంతమంది శక్తిమంతులైన వారున్నారు. మానవులకు హాని కలిగించవద్దని, పాపాలు ఇవ్వవద్దని మిగిలిన దేవతలు ఆ శక్తి గలవారిని ప్రార్థిస్తుంటారు. మానవులను దుఃఖాల నుంచి, కష్టాల నుంచి కాపాడమని ప్రార్థిస్తుంటారు.

అనేక సందర్భాలలో దేవతలు శ్రీమహావిష్ణువు దగ్గరకు వెళ్ళి రాక్షసంహారం చేసి భూలోకంలో మానవులను రక్షించమని ప్రార్థిస్తారు. పార్వతీదేవి పరమేశ్వరుడితో నాథా! భూలోకంలో మానవులకు తరుణోపాయం చెప్పవలసింది అని ప్రార్థిస్తుంది. ఈ రకంగా అనేకసార్లు దేవతలు శ్రీమహావిష్ణువును, ఈశ్వరుణ్ణి, పరాశక్తిని, దుష్టశిక్షణ, శిష్టరక్షణ చెయ్యమని ప్రార్థిస్తారు. దేవతలు ఎప్పుడూ మానవులకి మంచి చెయ్యటానికే చూస్తారు. కాని మనుషులే తమలోతాము విభేదాలు సృష్టించుకుని, అవతలివారి నాశనాన్ని కోరుతున్నారు. కాబట్టి మనం గనక జాగ్రత్తగా ఆలోచించి ఆ సహాయం అందుకోగలిగితే ఆహ్లాదకరమైన వాతావరణంలో, సంతోషసామ్రాజ్యాన్ని స్థాపించవచ్చు అంటోంది అధర్వణ వేదం.

# 3. మనుషులంతా ఒక్కటే

సమాజంలో పశువులు, పక్షులు, క్రిములు, కీటకాలు, మృగాలు, క్రూర జంతువులు, అనేక రకాల జీవులు, 84 లక్షల రకాలైన జీవరాశి ఉన్నది. వీరితో పాటుగా మానవుడు కూడా ఉన్నాడు. మిగిలిన జీవులకన్న మనిషికి ఆలోచనాశక్తి ఉన్నది. ఏ విషయం గురించైనా సరే మంచి, చెడు ఆలోచించగలడు. యుక్తాయుక్త విచక్షణా జ్ఞానము మానవుడికి పూర్తిగా ఉంది. ఈ కారణం చేతనే ఇతర జీవులపైన మానవుడు తన ఆధిక్యాన్ని చలాయిస్తున్నాడు. ఈ విచక్షణాజ్ఞానం ఉండటం మానవుడికి పెద్దవరం. కాని ఇదే పెద్దశాపంకూడా. పశువులకు గడ్డివేస్తే అన్ని పశువులు ఒకే చోటికివచ్చి ఆ గడ్డిని తింటాయి. ఆకలి వేస్తోంది. ఇంత గడ్డి తినాలి. అది ఎక్కడ దొరుకుతుంది? అంతే పశువుయొక్క ఆలోచన. తనతో పాటుగా మరికొన్ని పశువులు ఆ గడ్డిని తిన్నా, తనకు వచ్చే నష్టం ఏమీ లేదు. ఇది వాటి భావన. కాని మానవుడు అలాకాదు. ఇతడికి ఆలోచనాశక్తి ఉంది. మంచి, చెడు ఆలోచించే జ్ఞానం కూడా ఉంది. దాంతో అనేక విషయాలను ఆలోచిస్తాడు. ఇక్కడ ఉన్నవారిలో తమజాతి వారెవరు? తమకులం, మతం, తనక్కావలసిన వాళ్ళు, ఇష్టమైన వాళ్ళు, ఈ రకంగా ఆలోచిస్తాడు. దాంతో అందరితోను కలిసి హాయిగా జీవించలేడు. ఇలా ప్రతి మానవుడికీ శత్రువులు, మిత్రులు, తనవారు, బయట వారు అని తేడాలుంటాయి. ఇది సమాజంలో సహజంగా ఉండే పరిస్థితి. కాని ఇవేవీ ఉండకూడదు అని చెబుతోంది అథర్వవేదం.

“మనలో మనకు ఏ రకమైన శత్రుత్వము ఉండకూడదు. చివరకు మన శత్రువులతో కూడా విరోధం ఉండకూడదు. మన మనస్సులు ఇతరుల మనస్సులతో కలిసిపోవాలి. ఎటువంటి పరిస్థితిలోను మనం

విడిపోకూడదు. మన అందరి మనస్సులలోను మంచి ఆలోచనలే ఉండాలి. మనసులన్నీ దేవతల మీదనే కేంద్రీకృతం కావాలి. మనస్తత్వాన్ని చెడగొట్టే భావాలు, మాటలు మనం వినకూడదు. మాట్లాడరాదు. మనకు గిట్టని వాళ్ళ మాటలుగాని, విరోధుల మాటలుగాని ఎప్పుడూ వినరాదు. ఎవరిమీదా, ఎప్పుడూ, కోపం తెచ్చుకోకూడదు. ఆవులు, తమ దూడల మీద ఏ రకంగా శ్రద్ధ చూపుతాయో ఆ రకంగా మానవులు కూడా ఇతరుల మీద ప్రేమతో ఉండాలి. ఆవుకు దూడకు, ఉన్న పరస్పర ప్రేమ మానవులకు కూడా ఒకరిమీద ఒకరికి ఉండాలి. కుమారుడు తండ్రి అవసరాలు గమనించాలి. తండ్రి కుమారుని అవసరాలు గమనించాలి. మంచి చెడ్డలు విచారించాలి. తల్లి ఎప్పుడూ తన పిల్లల నందరినీ సమానంగా చూడాలి. భార్యభర్తతో ప్రేమగా మాట్లాడాలి. అన్నదమ్ముల మధ్య ద్వేషము అనేది ఉండరాదు. అక్కా చెల్లెళ్ళ మధ్య పరస్పరం మాత్సర్యం లేకుండా ఉండాలి. సోదరులంతా సమానంగా, ఒకరిమీద ఒకరు అభిమానంతో ఉండాలి. గౌరవంగాను, ప్రియంగాను మాట్లాడుకోవాలి. ఈ రకమైన ప్రవర్తన వల్ల దేవతలు కూడా మానవులను అభిమానిస్తారు. మానవులు ఎప్పుడూ ఇతరుల కన్న మేము పెద్ద వాళ్ళము, గొప్పవాళ్ళము అని ఆలోచించరాదు. అలాగే ఇతరులకన్న మేము చిన్నవాళ్ళము. తక్కువ వాళ్ళము అనే ఆలోచన ఉండరాదు. అందరూ ఒకే ఆలోచనతో ఉండాలి. ఒకే కుటుంబంలోని వ్యక్తులు పెద్దవాడు (ఆఫీసరు), రెండవ వాడు వ్యాపారి (చెప్పులషాపు), మూడవ వాడు (డాక్టరు), నాల్గవవాడు (న్యాయవాది) ఇలా తల ఒక పని చేస్తున్నారు. కాని అంతా కలిసే ఉంటారు. ఎవరి పని వారు చేసుకుంటారు. అలాగే సమాజంలోని వివిధ వృత్తుల వారు కలిసి మెలసి ఉండాలి.

అందరిలోను సోదర భావం తొణికిసలాడాలి. అందరూ ఇతరులకు ఉపయోగించే పనులే చెయ్యాలి. ప్రజలు వేరుపడరాదు. తియ్యటి భావనలతో, తియ్యటి మాటలతో ఒకరిని ఒకరు పలకరించుకోవాలి. అందరూ ఒకచోట కూచున్నప్పుడు ఒకే రకమైన ఆహారం, పానీయం తీసుకోవాలి. జాతి, కుల, మత, లింగ బేధాలు చూపరాదు. ఎవరినీ వేరు చెయ్యరాదు. ప్రేమతో అందరూ దగ్గర కావాలి. ఎవరినీ వేరు చెయ్యరాదు. వారి మధ్య తియ్యని సంభాషణలు ఏర్పడాలి. అందరూ కలిసి కట్టుగా, ఒకే కుటుంబంగా మెలగాలి. ఈ లోకంలో మనుషులంతా ఒక్కటే. ఎవరి ఎక్కువా లేదు, ఎవరి తక్కువా లేదు. కులాలు, మతాలు సమాజానికి అడ్డుగోడలు కారాదు. ఆచార వ్యవహారాలు మానవులను విడదియ్యకూడదు, మనుషులంతా ఒక్కటే అని ఈ వేదం నొక్కి వక్కాణిస్తుంది.

# 4. శతమానం భవతి

ఏదైనా ఒక క్రతువు (యజ్ఞయాగాదులు, పూజ, వ్రతము, అర్చన) లాటివి జరిగినప్పుడు గాని, వేదపారాయణ చేసిన సమయంలో గాని చివరలో యజమానిని ఆశీర్వదించటం జరుగుతుంది.

**శతమానం భవతి శతమైశ్వర్యం భవతి**
**శతశతం భవతి శతమనంతం భవతి**
**శతం దీర్ఘమాయుః**

'మహదైశ్వర్యంతో అది కొన్ని రెట్లై కలకాలము వర్ధిల్లవలసింది' అని దీని అర్థం.

మానవుడు ఎప్పుడూ జీవించి ఉండాలనే అనుకుంటాడు. ఈ జీవితం ఇంక చాలు అని ఎవరూ, ఎప్పుడూ అనుకోరు. వయస్సుమీద పడ్డా, శరీరం దేనికీ సహకరించక పోయినా, కదలలేని స్థితిలో ఉన్నా, ఏ వైద్యుడైనా వచ్చి మంచి మందు ఇవ్వకపోతాడా? ఏ దేవుడైనా కరుణించక పోతాడా? తాను గతంలోలాగా మళ్ళీ తిరగకపోతానా? అని ఎదురు చూస్తాడు. అంతేకాని మరణించటానికి ఇష్టపడడు.

ప్రపంచంలో ఎన్ని బాధలున్నా మానవుడు ఇంకా జీవించాలి అనే ఆశించాలి. బ్రతికి ఉంటే ఇవాళ కాపోతే రేపైనా ఏదో ఒకటి చెయ్యవచ్చు. కాబట్టి ప్రతివాడు సుదీర్ఘమైన జీవితాన్ని ఆశించాలి. తన జీవితమే కాదు. ఎవరి జీవితాన్ని అపహరించవద్దని దేవతలను ప్రార్థించాలి అంటోంది వేదం. **ఎనిమిదవ కాండలోని ఒకటవ సూక్తంలో** "చాలా సంవత్సరాలు శాశ్వతంగా సూర్యుణ్ణి చంద్రుణ్ణి చూడాలనే ఆశ. దేవతలతో చెబుతున్నారు." ఓ దేవతా! నన్ను అనుగ్రహించవలసినది. సూర్యచంద్రులను చాలా కాలం చూస్తూ,

అంటే అనేక సంవత్సరాలు నేను జీవించి ఉండాలి అని ప్రార్థిస్తున్నారు. ఇక్కడ ఇంకో విషయం కూడా ఉంది. కేవలం జీవించి ఉండటం మాత్రమే కాదు. మంచి ఆరోగ్యంతో, ఏ రోగాలు లేకుండా, ముసలితనం రాకుండా జీవించి ఉండాలి. తన శరీరంలోని ఏ ఇంద్రియాలు దెబ్బతినరాదు. శరీరం పూర్తిగా తన అధీనంలో ఉండాలి. ఇంకో రకంగా చెప్పాలి అంటే నిత్యయవ్వనం కావాలి అని దేవతలను ప్రార్థిస్తున్నారు.

మానవుడు ఎప్పుడూ ప్రశాంతంగా జీవించాలి. ప్రశాంతత లేకపోవటానికి కారణం అతని మనస్సు.

**'మనయేన మనుష్యాణాం కారణం బంధమోక్షయోః'**

మానవుడి బంధమోక్షాలకు కారణం అతడి మనస్సే.

బంధము అంటే – దుఃఖము

మోక్షము అంటే – సుఖము.

సుఖదుఃఖాలకు కారణం మానవుని మనస్సు అనుకోండి. ఈ మనస్సే దురుద్దేశ్యాలను పెంచుతుంది. అందుకే తన ఇల్లు, కుటుంబం వరకే ఇది పరిమితం కావాలి. అంటోంది వేదం. మానవుడు కుటుంబం మీద బాగా శ్రద్ధ తీసుకుని సత్ప్రవర్తనను పెంపొందించాలి.

ఇవన్నీ కావాలంటే ఒక గురువుగారు ఉండాలి. అతడు పరమగురువై ఉండాలి. తన శిష్యుణ్ణి పాపమార్గంలోకి వెళ్ళకుండా జాగ్రత్తగా కనిపెట్టి చూస్తుండాలి. శిష్యుడి హృదయంలో జ్ఞానబీజాన్ని నాటి, దాన్ని జాగ్రత్తగా పెంచి, పోషించి, హృదయంలో ఉన్న అజ్ఞానమనే చీకట్లు నాశనంచేసి జ్ఞానజ్యోతి వెలిగించాలి. మోక్షమార్గం చూపాలి. ఈ విధంగా మోక్షమార్గాన్ని శిష్యుడికి చూపే వాడే గురువు.

అటువంటి గురువు చెప్పినట్లుగా నడచుకుని సాధకుడు మోక్షం పొందాలి. అని చెబుతోంది వేదం.

ఈ రకంగా ఎక్కువ ఆయుష్యు కావాలని, తన కుటుంబం సుఖంగా ఉండాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నారు. 'ఆయుష్మాన్‌భవ' అంటోంది వేదం.

# 5. సమస్యలు - పరిష్కారాలు

మానవ జీవితం సమస్యలమయం. ధనవంతులైనా, దరిద్రులైనా, అధికారం ఉన్నా, అధికారం లేకపోయినా, ఎవరికైనా, గృహసమస్యలు, సామాజిక సమస్యలు వృత్తిపరమైన సమస్యలు, ఇలా ఒకటేమిటి? అనేకానేక సమస్యలు. విచిత్రం ఏమంటే భగవత్సాక్షాత్కారం పొందాము అని చెప్పిన ఋషులకు కూడా సమస్యలుంటాయి. వారు ఋషులు కాబట్టి సమస్యలు లేవు అని చెప్పటానికి లేదు. ఎవరి కష్టాలు వారివి. ఎవరి సమస్యలు వారివి. పీతకష్టాలు పీతవి. ఎదుటివారి సమస్యలకన్న మన సమస్యలు పెద్దవిగా కనిపిస్తాయి. కారణం అవి మనవికాబట్టి. ఆ రోజుల్లో మునీశ్వరులు, ఋషీశ్వరులు కూడా కష్టాలు అనుభవించారు. వాళ్ళకీ సమస్యలు వచ్చినాయి. ఈనాడు మన దృష్టిలో ఆ సమస్యలు చాలా చిన్నవి. వాటిని తేలికగా అధిగమించవచ్చు. కాని మన సమస్యలు మాత్రమే పెద్దవి. స్వాతంత్ర్యం కావాలనుకునే గృహస్థు జీవితం, వ్యక్తులకు, సమాజానికి కూడా కొన్ని సమస్యలు తెచ్చిపెడుతుంది. మన ఇష్టాయిష్టాలు, ఈర్ష్య, అసూయ , దురభిమానం, మాత్సర్యం ఇవన్నీ సమస్యలకు కారణాలే. ఈ సమస్యలు పరిష్కరించబడాలి అంటే ఒక దేవత తప్పనిసరిగా ఉండి తీరాలి.

ఈ సమస్యలు మన దేశంలోనే కాదు. ప్రపంచం మొత్తం మీద అన్ని దేశాల ప్రజలకు ఉన్నాయి. అవి గతంలో ఉన్నాయి. వర్తమానంలో ఉన్నాయి. భవిష్యత్తులో కూడా ఉంటాయి. పూర్వకాలంలో మహర్షులు యజ్ఞయాగాలు వేసి ఆ సమస్యలకి పరిష్కారం చెప్పారు. ఈ సమస్యల పరిష్కారానికి భౌతికంగా పరిష్కారమార్గం లేదా? అంటే లేదు అని కాదు, ఎంతగా ప్రయత్నించినా అవి పరిష్కారం కావటం లేదు. అందుకే ఈ యజ్ఞయాగాలు. వీటివల్ల దేవతలు అనుగ్రహిస్తారు. తద్వారా సమస్య

పరిష్కారమవుతుంది. ఇది వేదకాలంలో నమ్మకం. వేదకాలంలోనే కాదు, ఈ రోజునకూడా ఉన్న గట్టినమ్మకం. ఇతర వేదాలతో పోల్చి చూస్తే, అధర్వణ వేదంలో ఎక్కువమంది దేవతలున్నారు. దీని కారణం మానవుల సమస్యలు పెరిగాయి. వాటి పరిష్కారానికి ప్రత్యేకదేవతల ఆవిర్భావము జరిగింది. ఈ రకంగా అధర్వణ వేదంలో అనేకమంది దేవతలు చెప్పబడ్డారు. వారందరికీ ప్రత్యేక రూపాలు, మంత్రాలు, అర్చనలు ఉన్నాయి. ఈ దేవతలను అర్చించి తమ సమస్యల నుంచి బయట పడ్డారు ఆ నాటి ప్రజలు. మానవుడు తన ధర్మంగా తన ఇష్టదేవతలకు హవిస్సులు అర్పించటానికి త్రయీవిద్య ఉపయోగిస్తుంది. హిందూ ధర్మంలోనే కాదు ప్రపంచ దేశాలన్నింటిలోనూ ఉన్న సూత్రం ఒకటే. నీకున్న దాన్లో నువు కొంత భగవంతుడికి సమర్పిస్తే, ఆ భగవంతుడు తిరిగి కొన్ని వందలరెట్లుగా నీకు అందిస్తాడు. భగవంతుడి పేరుతో ఒక రూపాయి ఖర్చు చేస్తే, అది వందరూపాయిలై నీకు తిరిగి వస్తుంది. భగవంతుడు నీ దగ్గర ఏమీ తీసుకోడు. ఒకవేళ నువ్వు సమర్పించినా, అది అవసరమైన వాళ్ళకి ఇస్తాడు. నువు సమర్పించిన దాన్ని తీసుకుని, ప్రతిఫలంగా నీకు సిరిసంపదలు, భోగభాగ్యాలు అందిస్తాడు. నీ కుటుంబానికి తగిన రక్షణ కల్పిస్తాడు.

అధర్వణ వేదంలో రకరకాల వ్యాధులు, వాటిని పోగట్టే సూక్తాలు, కుటుంబం అభివృద్ధి చెందటానికి, సంతానాభివృద్ధికి, పశువులు, పంటభూములు అభివృద్ధి చెందేందుకు మంత్రాలు చెప్పబడ్డాయి. చేసిన పాపాలనుంచి, దోషాల నుంచి విముక్తి కలిగించే మంత్రాలు చెప్పబడ్డాయి. కుటుంబాల మధ్య సఖ్యత రావాలంటే మంత్రాలు, ప్రాయశ్చిత్త కర్మలు, గ్రామసభలలో ఐకమత్యం కోసం మంత్రాలు,

ప్రేమ ఫలించటానికి, వివాహం కావటానికి, స్త్రీ పురుషుల మధ్య ఉన్న విరోధం నిరోధించటానికి, అసూయకు మంత్రాలు చెప్పబడ్డాయి. భూతప్రేత పిశాచాలను వెళ్ళగొట్టటానికి అవసరమైన మంత్రాలు, ఇంద్రజాల మహేంద్రజాలాలకు మంత్ర తంత్రాలు, దేశంలో శాంతిస్థాపనకు మంత్రాలు, యుద్ధంలో విజయం సాధించటానికి, శత్రుసైనికులు పలాయంచిత్తగించటానికి మంత్ర తంత్రాలు. ఇలా ఎన్నో సమస్యలకు ఎన్నెన్నో పరిష్కారాలు చెప్పబడ్డాయి అధర్వణ వేదంలో

# ౬. సుఖప్రసవము

గర్భిణీస్త్రీ సుఖంగా ప్రసవించాలని కోరుతూ చెప్పే మంత్రం ఇది. **మొదటి కాండలో పరదకొండవ సూక్తము.** ఓ పూషదేవా ! ఇది ప్రసవకర్మ. ఆర్యముడు నీకు హవిస్సు అందిస్తాడు. ఓ దేవా ! ఈ స్త్రీకి సుఖప్రసవము కావాలి. ప్రసవ సంబంధమైన ఆటంకాలు తొలగిపోవాలి.

భువియొక్క నాలుగుదిశలు, దివియొక్క నాలుగుదిశలు, దేవతలు ఈ గర్భంలో ఉన్నారు. ఇప్పుడు ఆ దేవతలే గర్భంనుంచి బయట పడటానికి తెర తొలగిస్తారు.

ఓ పూషదేవా ! మావిని వేరుచెయ్యి. మేము సుఖప్రసవము కోసం వెళ్ళవలసిన మార్గాన్ని చెబుతున్నాము.

ఓ సుఖప్రసవదేవీ ! నేను చేసే ఈ సుఖప్రసవ కార్యానికి ప్రసన్నవు కావలసింది. గర్భిణీస్త్రీ యొక్క సంధి బంధాలు వదిలిపెట్టు. సూతి మారుతదేవీ ! గర్భాన్ని దిగువకు పంపవలసింది. మావి అనేది మాంసము కాదు. అది నీటిమీద నాచువంటిది. దాన్ని కుక్కలు తింటాయి. అది క్రింద పడిపోయినంత మాత్రంచేత ఏ ప్రమాదము లేదు.

ఓ గర్భవతీ ! నేను నీ యోనిని, పిల్లవాడు బయటకు వచ్చేటందుకు వీలుగా చేస్తున్నాను. బయటకు రావటానికి అడ్డంగా ఉండే నాడులు తప్పించి తల్లిని బిడ్డను వేరు చేస్తున్నాను. బిడ్డ నుంచి మావిని తీసేస్తున్నాను. మావి క్రింద పడిపోతుంది. గర్భంలో ఉన్న శిశువా! నువ్వు గాలిలాగా, మనసులాగా, ఆకాశంలో ఎగిరే పక్షిలాగా పదినెలలు మాతృగర్భంలోఉండి మావితోసహా గర్భమునుండి బయటకు రావలసింది.

ప్రసవసమయంలో ఈ సూక్తము చదివితే సుఖప్రసవమవుతుంది. అని చెబుతోంది అథర్వవేదం.

# 7. చేతబడి

రామయ్య మంచి సంపన్నుడు. పరమలోభి. దానికి తోడు తాను అనుకున్నది నెరవేరాలనే పట్టుదల. ఆ పని అయ్యేదాకా నిద్రపోడు. అతడికి ఒక్కతే కూతురు. రామయ్య మేనల్లుడు మోహన్, పిల్లవాడు మంచివాడు. బాగా చదువుకున్నాడు. ఆస్తిపాస్తులు కూడా ఫరవాలేదు. తనతో సమానంగా కాకపోయినా, బాగానే ఉన్నాయి. మంచి ఉద్యోగం చేస్తున్నాడు. బాదరబందీలు లేవు. కాబట్టి తన కూతుర్ని మేనల్లుడి కిచ్చి వివాహం చేస్తే బాగుంటుంది అనుకున్నాడు. మోహన్ తల్లిదండ్రులతో కూడా మాట్లాడాడు. వాళ్ళు సరే అన్నారు. ఇంతలో ఒకరోజున హటాత్తుగా మోహను ఎవరో పిల్లని వెంట పెట్టుకుని ఇంటికి వచ్చాడు. ఎవర్రా అంటే అప్పుడు చెప్పాడు అసలు విషయం. ఆ అమ్మాయి కూడా అతనితో పాటు పనిచేస్తోంది “ఇద్దరూ ఇష్టపడ్డారు ఇప్పుడు ఒక్కడే కుమారుడు కావటంతో తల్లితండ్రి కూడా ఒప్పుకున్నారు. వివాహం అయిపోయింది.

రామయ్య మాత్రం అగ్నిమీద గుగ్గిలం అయ్యాడు. ఏమైనా సరే ఈ సంబంధం నిలవటానికి లేదు. నిర్ణయం తీసుకున్నాడు. ఊరిచివర ఉన్న భేతాళ మాంత్రికుడు సుబ్బన్న దగ్గరకు వెళ్ళాడు. ఎంత ఖర్చైనా సరే మోహన్ ఆ అమ్మాయితో కలిసి ఉండటానికి వీలులేదు. ఆ అమ్మాయి తనంతట తానుగా ఇల్లు వదిలి వెళ్ళిపోవాలి అన్నాడు. అలాగే చేస్తాను అన్నాడు సుబ్బన్న.

అసలు ఇలాటి ప్రక్రియలు ఉన్నాయా? సుఖంగా సాగుతున్న కాపురాన్ని నాశనం చెయ్యచ్చా? దీనికి పద్ధతులు ఏవైనా ఉన్నాయా? అని ఆలోచిస్తే వాళ్ళ కాపురం నాశనం చెయ్యచ్చు. అంటోంది అధర్వణ వేదం. ఇది చాతబడి, అభిచారిక ప్రయోగము, తాంత్రిక విద్య

అంటారు. ఎవరిమీద ఈ ప్రయోగం చెయ్యాలో వారు వాడిన పూలు, వెంట్రుకలు తెచ్చి **మొదటికాండలోని పఢ్నాల్గవ సూక్తం** చదువుతూ నేలలో పాతిపెట్టాలి. అలా చేస్తే నీకోరిక నెరవేరి అవతల వాళ్ళ బ్రతుకు బండలయిపోతుంది. ఇలాటి ప్రయోగాలు అసలు చెయ్యకూడదు. అందులో నీకు లాభం ఉన్నా సరే ఈపని మాత్రంచెయ్యద్దు. ఒకవేళ మీరుగనక ఈపనిచేస్తే భ్రష్టు పట్టిపోతారు. జన్మజన్మలకీ ఆపాపం మిమ్మల్ని వెంటాడుతూనే ఉంటుంది. ఇప్పుడు ఈ సూక్తంలో ఏం చెప్పారో చూద్దాం.

పూసినచెట్టుకు పూలు త్రుంచేసినట్లే నేను ఈ స్త్రీ యొక్క భాగ్యము, శరీర సౌందర్యము, మనశ్శాంతి అన్నింటినీ తీసేసుకుంటున్నాను. ఇకనుంచి ఆమె కదలకుండా ఉండే పర్వతంలాగా పుట్టింట్లోనే ఉండిపోవాలి. సోమరాజా! ఈ కన్యను ముందు నువ్వు వివాహం చేసుకున్నావు. ఇప్పుడు ఈవిడ దౌర్భాగ్యురాలు అయింది. ఇకనుంచి ఈమె తన తల్లిదగ్గర గాని, తండ్రిదగ్గర, సోదరుడిదగ్గర ఉండిపోవాలి.

సోమరాజా ! వివాహమైన ఈమె, మరణించే వరకు తండ్రి ఇంట్లోనే ఉండిపోతుంది.

ఓ అబలా ! నీ భాగ్యమంతా ధనము, వస్త్రాలు దాచినట్లుగా నేను భద్రపరుస్తున్నాను. నువ్వు ఇక నుంచీ ఇక్కడే, నీ తండ్రిదగ్గరే ఉండిపోవాలి. ఇక నీకు కళత్రసౌఖ్యం లేదు" అని చెబుతున్నాడు. ఈ సూక్తంలో కేవలం నాలుగే మంత్రాలున్నాయి. ఇది చాలానీచమైన, హేయమైన, తుచ్ఛమైన, దుర్మార్గమైన చర్య. ఎప్పుడూ పొరపాటున కూడా ఇటువంటివి చెయ్యద్దు. ఒకవేళ చేస్తే, నిర్జనమైన ప్రదేశంలో, ఎడారిలో తొంభైవేలసంవత్సరాలు మర్రిచెట్టుకు పిశాచమై, నా అనే

వాళ్ళు లేక జీవచ్ఛవంలాగా తలక్రిందులుగా వ్రేలాడుతూ కాలం గడిపి, ఆ తరువాత కర్మశేషాన్ని అనుభవించటానికి భూలోకానికి వచ్చి అశుద్ధంలో పురుగై తొంభైవేల జన్మలు ఎత్తవలసివస్తుంది. ఈవిషయం దృష్టిలోపెట్టుకుని **ఎవరూ కూడా ఇటువంటి పనులు చెయ్యటానికి ప్రయత్నించవద్దు.**

# 8. సర్వపుష్టికర్మ

ధనము ధాన్యము, సిరి, సంపద అన్నీ కావాలి అంటే **మొదటికాండలోని పదిహేనవ సూక్తము** చూడాలి. ఈ ప్రక్రియలో అన్ని రకాల ధాన్యాలను కలిపి అన్నంవండి అందులో తేనెకలిపి హోమం చెయ్యాలి. మిగిలిన దాన్ని యజమాని తినాలి. ఇక సూక్తార్థము చూద్దాం.

మందగమనము గల నదులు మాకు అనుకూలంగా ప్రవహించాలి. వేగవంతమైన వాయువు మాకు అనుకూలంగా వేగంగా వీచాలి. పక్షులు మాకు అనుకూలంగా ప్రవర్తించాలి. నదులు, వాయువు, పక్షులు మా కోరికలు తీర్చాలి. నెయ్యి, తేనె కలిపి దేవతల కోసం అగ్నిలో ఆహుతి చేస్తున్నాను. దేవతలు వచ్చి ప్రత్యక్షంగా స్వీకరించాలి.

దేవతలారా ! రండి. ఇక్కడ పాలు, నెయ్యి పారుతున్నాయి. స్తుతులు గానం చెయ్యబడుతున్నాయి. ఈ యజమానికి పశుసమృద్ధి కలిగించండి. ధనసమృద్ధి కలిగించండి. నేలమీద ప్రవహించే సామాన్య నదులు, జీవనదులు అన్నీ కలిసి ప్రవహిస్తున్నాయి. ఈ జల ప్రవాహాలన్నీ మాకు, మా గోవులకు బంగారం ప్రసాదించాలి.

ప్రవాహాలలో పాలు, నేయి ప్రవహిస్తాయి. అవి మాకు మా గోవులకు బంగారం పండించాలి.

# 9. వితంతు వివాహము

భర్త మరణించినస్త్రీని వితంతువు అంటారు. అలాటి స్త్రీకి సౌభాగ్య లక్షణాలుండవు. సౌభాగ్యచిహ్నాలు అంటే 1.పసుపు కుంకుమ, 2 మెట్టెలు, 3 మంగళ సూత్రాలు, 4 గాజులు, 5 నల్లపూసలు. ఇవిలేని స్త్రీ విధవగా పరిగణించబడుతుంది. భర్త మరణించిన స్త్రీకి సహజంగా ఇవి ఉండవు. ఈ రోజున వితంతు వివాహాలు జరుగుతున్నాయి. కాని ఆ రోజుల్లో జరిగేవా? అనేది ప్రశ్న. జరిగిన దాఖలాలు మనకి కనిపించటంలేదు. ఒకవేళ వితంతుకు వివాహము చేయవలసి వస్తే ఈ సూక్తంతో ముందు హోమం చేసి ఆ తరువాతనే వివాహం చెయ్యాలి. ఈ సూక్తం చెప్పి ఆ స్త్రీకి ఉన్న దుర్లక్షణాలుతొలగించి, అన్ని శుభలక్షణాలతో స్త్రీకి వివాహం చెయ్యాలి. దుర్లక్షణాలు తొలగించటానికి **ఒకటవ అధ్యాయంలో పద్దెనిమిదవ సూత్రం** చూడండి.

తిలకం పెట్టుకునే చోట ఉన్న అసౌభాగ్యాన్ని పూర్తిగా ఈ శరీరము నుంచి తొలగిస్తున్నాను. శుభచిహ్నాలు మా సంతానానికి, అశుభచిహ్నాలు మా శత్రువులకు కలగాలి.

సవిత పాదాలయందున్న అలక్ష్మి (దరిద్రము పసుపు, మెట్టెలు లేకపోవటం)ని తొలగించు గాక. ఆర్యముడు, మిత్రుడు, వరుణుడు, కాళ్ళు చేతుల యందలి అలక్ష్మిని తొలగించాలి. (చేతులకు గోరింటాకు పెట్టాలి. గాజులు వెయ్యాలి) అందరికీ సలహాలిచ్చే అనుమతీదేవి మా స్తుతులు విని అభయాన్ని మాకు ప్రసాదించాలి. కోరిన కోరికలు తీరుస్తూ శరీరంలోని అన్నిరకాల దుర్లక్షణాలను తొలగించాలి.

నీ దేహంలో, జుట్టులో, కళ్ళలో ఇతర అవయవాలలో ఉన్న దుర్లక్షణాలను మేము మంత్రాలతో తొలగిస్తున్నాము. సవిత నీకు

శుభాలు కలిగించాలి.

సారంగమృగం పాదాలవంటి పాదాలు, ఎద్దుదంతాల వంటి దంతాలు, ఆవు యొక్క నడక, పాము బుసకొడుతున్నట్లుగా మాట ఇవన్నీ స్త్రీకి చెడు లక్షణాలు. వాటిని మేము నాశనము చేస్తున్నాము" అన్ని చెడు లక్షణాలు పోగొట్టి శుభలక్షణాలతో వివాహం చెయ్యాలి. ఒకవేళ చెడులక్షణాలు గల స్త్రీకి వివాహం చేయవలసి వస్తే ఈ పద్ధతి పాటించాలంటోంది వేదం. ఇది వితంతు వివాహం అనేది నా అభిప్రాయం మాత్రమే. ఇది వితంతు వివాహం కాదు. కేవలం చెడులక్షణాలున్న స్త్రీని గురించి చెప్పారు అని కొందరి అభిప్రాయం.

# 10. శ్వేతకుష్ఠు నివారణ

దీన్నే 'బొల్లి' అంటారు వంటిమీద తెల్లగా మచ్చలుఏర్పడతాయి. అవి దురద పెడతాయి. గోకితే నీరుకారుతుంది. ఇప్పుడు కూడా ఈ రకమైన రోగం కొంతమందికి కనిపిస్తూనేఉంది. ఇది పూర్తిగా తగ్గిన దాఖలాలు నాకుతెలిసి లేవు. అయితే ఇదేమీ ప్రాణాంతక వ్యాధి కాదు. శరీరం మీద మచ్చలు మాత్రం కనపడతాయి. అంతే. కొంతమందికి ఇది కాలీచీలమండలకు మాత్రమే ఉంటుంది. మరికొంతమందికి చేతులకు, వళ్ళంతా కూడా ఉంటుంది. దీని నివారణ విధానము **ఒకటవ కాండలో ఇరవై మూడవ సూక్తం**లో చెబుతున్నారు. ఇది మంత్రము, తంత్రము రెండూ కలిపి ఉన్న ప్రక్రియ. తంత్రము అంటే దానికి చేయవలసిన క్రియ. వాడే మందులు భృంగరాజము, పసుపు, నీలిమొక్కలు నూరి ఎండిన ఆవుపేడతో కలిపి గాయం ఉన్న చోట రక్తం కనిపించేంతవరకు బాగా రుద్ది రాయాలి. తరువాత ఈ సూక్తాన్ని నేతితో హోమం చెయ్యాలి.

రాత్రులందు పుట్టే హరిద్ర, భృంగ, ఇంద్ర, వరుణీ, ఓషధులారా! మీరు కుష్ఠురోగం వచ్చిన చోట పుండ్లుమాన్పి అక్కడ మీరంగు రప్పించండి.

ఓషధీ ! నువ్వు పుండును, తెల్లవెంట్రుకలను దూరముచేయవలసింది. రోగికి గతంలో ఉన్న ఎరుపురంగు రావాలి. తెలుపురంగు లేకుండాపోవాలి.

ఓ నీలిఓషధీ ! నువు నల్లగా ఉంటావు. నువు పుట్టినచోటు నల్లగా ఉంటుంది. నిన్ను ఉంచిన పాత్ర నల్లగా ఉంటుంది. కాబట్టి నిన్ను రాయటం వల్ల రోగికి ఉన్న పుండ్లు మాన్పవలసినది.

తెల్లవెంట్రుకలు పోయేటట్లుగా చేయవలసినది.

ఈ మంత్రంలో చర్మంమీద, ఎముకల మీద ఉన్న కుష్ఠువ్యాధిని నాశనం చేస్తున్నారు. శత్రువుల చేత కల్పించబడిన కృత్యవల్ల ఏర్పడిన తెలుపును కూడా నాశనము చేస్తున్నారు.

ఈ సూక్తము శ్వేతకుష్ఠుకే కాక, తెల్ల వెంట్రుకలకు కూడా ఉపయోగిస్తుంది తెల్లవెంట్రుకలు ఎక్కువగా ఉన్నచోట వాటిని కత్తిరించి పైనచెప్పిన మందు రాయాలి. ఈ సూక్తాన్ని నేతితో హోమం చెయ్యాలి.

**ఒకటవ కాండలోని ఇరవై నాల్గవ సూక్తం** కూడా శ్వేతకుష్ఠు కోసమే చెప్పబడింది.

నీలిఓషధీ ! మొదట నువ్వు సుపర్ణుడయిన గరుడుడి దగ్గర ఉన్నావు. అప్పుడు 'అసురి' అనేఆడది గరుడునితో యుద్ధంచేసి నిన్ను గెలిచి నీకు ఓషధిరూపం ఇచ్చింది.

అసురి మొదట నిన్ను భేషజంగా చేసింది. భేషజము అంటే – ఔషధము, మందు అని అర్థం. అది కుష్ఠురోగం పుండును నాశనం చేసింది. అక్కడ మచ్చకూడా పోయి మామూలు చర్మం ఏర్పడింది. ఓషధీ ! నీ తల్లితండ్రులు చక్కనివారు. నువ్వు చక్కదనాన్ని తేగలవు. ఈ వ్యాధిగ్రస్తుణ్ణి చక్కని రూపము గలవాడుగా చేయవలసింది.

ఓషధీ ! నువు నేల నుండి ఆవిర్భవించావు. నల్లని దానివి తెలుపును పోగొట్టే దానివి. ఈ పుండును పూర్తిగా మాన్పించు మచ్చ లేకుండా చెయ్యి. పూర్వపు రూపము తెప్పించవలసింది"

శ్వేతకుష్ఠు పోవటానికి **23వ సూక్తంలో మూడు ఓషధులు చెప్పారు.** 24వ సూక్తంలో నీలిఓషధి ఒక్కదానికే ఆ శక్తి ఉన్నది అంటున్నారు.

# 11. చలిజ్వరము

ప్రతిరోజు క్రమం తప్పకుండా వస్తుంది ఈ జ్వరం. ఇలా వేళతప్పకుండా వచ్చే జ్వరాలు ఇంకా ఉన్నాయి. అలాంటి జ్వరాలకి **ఒకటవ కాండలోని ఇరవై ఐదవ సూక్తం** చూడండి. ఇందులో గల తంత్రం. గొడ్డలిని నిప్పులో ఎర్రగా కాల్చి నీళ్ళలో వేసి, ఆ నీటితో రోగికి స్నానం చేయించి ఈ సూక్తం చదవాలి. ఇందులో మొత్తం నాలుగు మంత్రాలున్నాయి.

అగ్నిదేవుడు కాలిన గొడ్డలితో నీళ్ళలోకి ప్రవేశించాడు. జీవితాన్ని దుర్భరం చేసే ఓ జ్వరమా ! నీరు పోసిన ఆ శరీరాన్ని వదిలిపెట్టు. హోమం చేసేవారు నువు కూడా అగ్నిలోనే జన్మించావని చెబుతున్నారు.

దుఃఖకారకమైన ఓ జ్వరమా ! నీ గుణం ఉష్ణం. నువ్వు దేహాన్ని తపింపచేస్తావు. నీ పుట్టుక కట్టెలమంటలో జరిగింది. నీవల్ల దేహానికి పసుపురంగు వస్తుంది. అందుకే నిన్ను 'రూఢు' అన్నారు. కాబట్టి నువ్వు అగ్నిని తెలిసిన వాడివి. వేడినీళ్ళు పడ్డ మా శరీరాన్ని వదిలిపెట్టు. అగ్నితోనే పో.

ఓ జ్వరమా ! నువ్వు బయట తాపానివి, లోపల తాపానివి కూడా. పాపులను శిక్షించే వరుణుని కుమారుడివి. వేడినీరు పడిన ఈ శరీరాన్ని వదిలిపో.

చలితోపాటుగా వచ్చే జ్వరానికి నమస్కారము. చలితగ్గివచ్చే జ్వరానికి కూడా నమస్కారము. రోజువిడిచి రోజువచ్చే జ్వరానికి నమస్కారము. రెండు రోజులకు, మూడు రోజులకు వచ్చే జ్వరానికి కూడా నమస్కారము ఓ జ్వరమా ! నువ్వు త్వరగా రోగిని వదలి వెళ్ళిపో.

# 12. గొడ్రాలికి సంతానము

సంతానం లేని స్త్రీని 'వంధ్య' (గొడ్రాలు) అని అంటారు. అటువంటి స్త్రీకి సంతానం కలగటం కోసం శమీస్నానం చేయించాలి. శమీవృక్షము అంటే జమ్మిచెట్టు. జమ్మిఆకులు నీటిలో వేసి, జమ్మిచెట్టు క్రింద స్నానంచేయించాలి. ఈ సూక్తంలో ఆవిడకు పురోడాశపు పిండిముద్ద ఇచ్చి అలంకారంచెయ్యాలి. తరువాత ఈ సూక్తము పారాయణ చెయ్యాలి. **ఒకటవ కాండలోని ముప్పై రెండవ సూక్తం.**

జనులారా ! ఇది ఈ లోకంలోను ఆ లోకంలోను లేదు. ప్రాణులందు మాత్రమే ఉన్నది. ఇది అంతరిక్షంలో యక్షగంధర్వులలాగా నిలచిఉన్నది. ఈ లోకంలో జలము స్థావరములందు జంగమము లందు కూడా ఉన్నది. జలముయొక్క మూలస్థానమేదో నేటికీ తెలియదు.

భూమ్యాకాశాలు అక్షయమగు జలాన్ని పుట్టిస్తున్నాయి. అయినా కూడా అంతరిక్షంలో జలం అక్షయమై ఉన్నది.

ద్యులోకము విశ్వాన్ని ఆవరించి ఉన్నది. పృథివి విశ్వాన్ని ఆవరించి ఉన్నది. కాబట్టి విశ్వజ్ఞానము గల ద్యులోకానికి, విశ్వానికి ఆధారభూతమైన భూమికి నమస్కారం చేస్తున్నాను. ఈ స్త్రీకి సంతానం కలగాలి.

# 13. రక్తస్రావం ఆగటానికి

కత్తి మొదలైన వాటితో గాయమై రక్తస్రావం జరుగుతున్నప్పుడు ఈ సూక్తాన్ని చదవాలి. **ఒకటవకాండలోని పదిహేడవ సూక్తము.** స్త్రీకి రజస్సు ఎక్కువగా స్రవిస్తున్నప్పుడు కూడా సూక్తం చదువవచ్చును.

స్త్రీకి వ్యాధి కారణంగా నిరంతరము రక్తము స్రవిస్తున్నది. మేము చేసిన చికిత్స వల్ల వ్యాధియొక్క మూలము నాశనమై పోవుగాక. రక్తము తన స్థానమందే నిలచును గాక.

దేహంలో క్రింది భాగాన ఉన్న ధమనులారా ! రక్తస్రావాన్ని అరికట్టించండి. పై భాగంలో ఉన్న ధమనులారా! రక్తస్రావాన్ని అరికట్టించండి. చిన్న ధమనులు, పెద్ద ధమనులు కూడా రక్తస్రావాన్ని అరికట్టాలి.

హృదయంలో ఉండే నూరునాడులు, వేలసంఖ్యలో ఉన్న నాడుల మధ్య ఉన్న నాడులద్వారా రక్తము స్రవిస్తోంది. ఇప్పుడు మంత్రప్రభావంతో రక్తము స్రవించకుండును గాక. రక్తస్రావము చేసే నాడులకుమల్లే ఈ నాడులు కూడా ఆనందించుగాక. ఓ నాడులారా ! రజోనాడి, అశ్మరీనాడి, ధనుర్నాడి, బృహతీ నాడి చుట్టు ముట్టి ఉన్నాయి. కాబట్టి రక్తస్రావము ఆపి వ్యాధిగ్రస్తుడికి సుఖాన్నివ్వండి.

# 14. సభలో విజయం పొందటానికి

తాను పాల్గొనే సభలో విజయం సాధించటానికి శాయశక్తులా కృషి చేస్తారు. కాని సభలో పాల్గొనాలంటే ఆత్మస్థైర్యము కావాలి. దానికోసం పూర్వకాలంలో 'సహదేవు' చెట్టు వేరు తెచ్చి పాలతో అభిషేకం చేసి, పంచపూజలు చేసి, దాన్ని జేబులో పెట్టుకుని వెడితే సభలో జంకుగొంకు ఉండదు. ధైర్యంగా ఉంటాడు అని ఈ పని చేసేవారు. వేదం **ఒకటవకాండలోని ముప్ఫై నాలుగవ సూక్తం** చదువమని చెబుతోంది. సభలోకి ప్రవేశించక ముందు మధూకాన్ని తినాలి. మధూకము – విప్పచెట్టు. విప్పపూలు అమ్మవారికి ప్రీతి. ఇవి భద్రాచలం అడవుల్లో బాగా దొరకుతాయి. 'వీరుల్లత' ఇది మధురంలో పుట్టింది. మధురంగానే నిన్ను తవ్వుతున్నాను. నువ్వు మధురంగా పుట్టావు. మమ్మల్ని కూడా మధురంగా ఉండేటట్లు చేయవలసింది.

మధూలకమా! నా నాలుక చివర ఉండు. నాలుక మొదట్లో ఉండు, నా శరీరంలో ఉండు. నా రక్తంలో ఉండు. అన్నింటినీ తియ్యగా చెయ్యి, నా రాక,పోక, నామాట, నాచేత, అంతా మధుమయమగు గాక. ఇతరులకు నేను మధుమయుడను.

మధూలకమా! నువ్వు నా దగ్గర ఉన్నావు. నన్ను మధురంగా చెయ్యి. తేనెపట్టు ఉన్న కొమ్మను తేనెటీగలు సేవించినట్లు జనులు నిన్ను సేవిస్తారు.

ఓ ధర్మపత్నీ! చెరకుగడ అంతా తీపి ఉంటుంది. అలాగే నాలో తీపిని నింపుకుని నిన్ను వివాహం చేసుకుంటున్నాను. మనము ఇద్దరము పరస్పరము ద్వేషం లేకుండా ఉందాము. మధురమైన మాటలతో సంసారం చేద్దాము. ఈ మధురమైన వాక్కుతోనే సభలో విజయం సాధిస్తాను.

# 15. అతిమూత్రము

ఈ రోగం తగ్గటానికి 'ముంజ'తాడును నెత్తికి కట్టాలి. ఆ గడ్డితో తీసిన రసాన్ని త్రాగించాలి. పుట్టమట్టి, పొలాలలోమట్టి వ్రణాలు మాన్పటానికి ఉపయోగపడతాయి. **రెండవ కాండలోని మూడవ సూక్తంలో** ఈ విషయం వివరించబడింది.

ముంజవాన పర్వతము చాలా శ్రేష్ఠమైనది. దానిమీద ఈ రోగాన్ని తగ్గించే 'ముంజ' (గడ్డిలాటి ఔషధపు మొక్క) నేలమీద ఉంటుంది. ముంజమా ! నీ పైభాగాన్ని వ్యాధికి మరణఔషధంగా చేస్తున్నాను. నిన్ను వ్యాధినివారకఔషధంగా పరమ ఔషధంగా చేస్తున్నాను. ఓ ఔషధమా ! నిన్ను వాడగానే వ్యాధికాస్తా నయం చెయ్యి. మళ్ళీ వచ్చే వ్యాధులను రానీయద్దు. నీ జాతివారు అనేకులున్నారు. వారు కూడా రోగాన్ని తగ్గించగలరు. కాని రోగాన్ని నిర్మూలన చేయగలదానవు నువ్వే.

ఈ రోగాలన్నీ రాక్షసులవంటివి. ప్రాణాలుతీస్తాయి. శరీరాన్ని నాశనం చేస్తాయి. ప్రాణాలు తొలిచేస్తాయి. ఈ 'ముంజ' ఆ స్రావానికి దివ్యౌషధము. వ్యాధిని సమూలంగా నాశనం చేస్తుంది. పుట్టలు పెట్టే మట్టిఅడుగునఉన్న జలరాశి రోగనివారక ఔషధాలు నేలమీదకి తెస్తోంది. ఈ పుట్టమట్టి ఆ స్రావానికి ఔషధము. వ్యాధిని పూర్తిగా నాశనం చేస్తుంది.

పంటపొలాల్లో మట్టికూడా మహాఔషధమవుతోంది. అది పుండ్లను మాన్పుతుంది. ఈ మట్టి అస్రావఔషధంగా కూడా పనిచేస్తుంది. వ్యాధుల్ని సమూలంగా నాశనం చేస్తుంది.

ఔషధాలకు వాడే నీరు సుఖప్రదము. రోగాలను

శాంతింపచేస్తుంది. రోగాలు కలిగించే వాటిని ఇంద్రుని వజ్రము హతమార్చు గాక. రాక్షసుల చేతిలో ఉన్న రోగకారకాలయిన బాణాలు మా మీద పడకుండా ఉండుగాక.

# 16. సంపద కోసం

సంపద కావాలంటే **రెండవకాండలోని ఆరవ సూక్తాన్ని** హోమం చెయ్యాలి అంటున్నారు. సూక్తార్థం

అగ్నిదేవా ! సంవత్సరాలు నిన్ను వర్ధిల్లచేయుగాక. ఋషులు, ఋతువులు నిన్ను సమృద్ధునిగా చేయుగాక. సత్యస్వరూపులైన భూమ్యాకాశాలు నిన్ను సమృద్ధినిగా చేయుగాక. ఆ సమృద్ధులతో నువ్వు దివ్యలోకంలో మంచితేజస్సుతో ప్రకాశించవలసింది. ఆ తేజస్సుతో చరాచర జగత్తును, అన్ని దిశలను ప్రకాశింప చేయవలసింది.

అగ్నీ ! నువ్వు స్వయంగా ప్రజ్వరిల్లవలసింది. ఇతని కోరికలు తీర్చు. ఇతడికి మహదైశ్వర్యాన్ని ప్రసాదించు. నిన్ను సేవించే వారికి క్షయము ఉండరాదు. వారికి ఎప్పుడూ యశస్సు కలిగించవలసింది. ఓ అగ్నిదేవా ! ఈ బ్రాహ్మణులంతా నిన్ను ఆరాధిస్తున్నారు. వారికి అన్నీ శుభాలే కలిగించు. వారేమైనా తప్పులు చేస్తే మన్నించు. మా శత్రువులను జయించి మా పాపాలు పోగొట్టు.

అగ్నిదేవా ! నువ్వు స్వంత బలంతో వర్ధిల్లు. మిత్రులను పోషించు. వారందరికీ ఉపకారం చెయ్యి. రాజులు చేసే 'విహస్స' యజ్ఞంలో ప్రజ్వర్లిలవలసింది.

అగ్నిదేవా ! మాశరీరాన్ని శుష్కింపచేసే రోగాలు తగ్గించు. పాపబుద్ధిని తొలగించు. మా శత్రువులను సంహరించు, మా కష్టాలు దూరంచెయ్యి. మాకు పుత్రులు, పౌత్రులు, ధనము ప్రసాదించవలసింది.

# 17. వంశపారంపర్య వ్యాధులు

వంశపారంపర్యం అంటే తల్లితండ్రి దగ్గర నుంచి అని కాదు. వీరి వంశంలో ఎన్నో తరాల నుంచి అని అర్థం. మా కులదేవత, వంశపారంపర్యా వచ్చే ఆచారము అంటాము. కులదేవత అనేది మనం ప్రారంభించినది కాదు. ఎన్నో తరాలముందు నుంచే ఉన్నది. కొంతమందికి ఈ రకమైన రోగాలు, ఆచారాలు ఉంటాయి. మా మామగారి ఇంటికి ఒక ఆచారం ఉంది. ఇంట్లో మొదటగా పుట్టిన వారికి 'రమ' అని పేరు పెట్టాలట. మా మామగారి పేరు 'రమాకాంతశర్మ' ఆ ఇంట్లో నా భార్య మొదటి సంతానం. ఆవిడపేరు 'రమాదేవి'. మా మేనల్లుడి పేరు 'రమాశ్రీకాంత్' ఇక్కడ వంశపారపర్యంగా 'రమ' అనే పేరు వచ్చినట్లే, మధుమేహము వంటి కొన్ని రోగాలు కూడా సంక్రమిస్తాయి. పేరయితే ఇంట్లోని మొదటి సంతానానికే వస్తుంది. కాని రోగమయితే మాత్రం ఎక్కువమందికి వచ్చే అవకాశం ఉంది. అయితే ఒక్కమాట గుర్తుంచుకోండి. తల్లితండ్రులు చేసిన పుణ్యమే కాదు, వాళ్ళు చేసిన పాపం కూడా మనం అనుభవించాలి. ఈ రోగాలన్నీ గతంలో మనం చేసుకున్న పాపాల తాలూకు నిల్వలన్న మాట. వాళ్ళు సంపాదించిన ఆస్తితోపాటు, అప్పు, పుణ్యంతోపాటు, పాపం, రోగాలు కూడా మనం అనుభవించాలి. అలాంటి వాటిలో కుష్ఠు, క్షయ కూడా ఉన్నాయి అంటోంది వేదం. వాళ్ళు కూడబెట్టినవన్నీ మనకోసమే కదా. ఇక్కడ మనకి ఒక చిన్న అనుమానం వస్తుంది. తల్లితండ్రులు, తాతలు అంటే సరే. తరతరాలుగా కూడా ఇవి మనకి వస్తాయా? వస్తాయి. జనకమహారాజు వంశంలో కొన్ని తరాల క్రిందటివాడు దేవరాతుడు అనే ఆయన తపస్సుచేసి శివుణ్ణిమెప్పించి శివధనుస్సు తీసుకున్నాడు. దాన్నేకదా

శ్రీరామచంద్రుడు ఎక్కుపెట్టింది. అంతదాకా ఎందుకు? మీ ఇంటిపేరు ఎప్పటి నుంచీ వస్తోందో చూడండి. అలాగే కొన్ని రోగాలు కూడా వస్తాయి అని చెబుతోంది వేదం. అలా వచ్చే ఈ రోగాలకు మంత్రము, తంత్రము రెండూ కూడా **రెండవకాండలోని ఎనిమిదవ సూక్తంలో** చెప్పబడ్డాయి.

ఒక కుండలో నీరు తీసుకుని ఈ సూక్తంతో మంత్రించి, ఆ నీటితో రోగికి ఇంటి బయట స్నానం చేయించాలి. తరువాత ఈ సూక్తాన్ని హోమం చెయ్యాలి. అలాగే ఒక్కొక్క మంత్రంతో నీటిని మంత్రించి విడివిడిగా స్నానం చేయించాలి.

రెండవ మంత్రంతో – ఉషః కాలంలో

మూడవ మంత్రంతో – పొలంలో

నాల్గవ మంత్రంతో – ఎద్దులు కట్టిన నాగలి క్రింద

ఐదవ మంత్రంతో – శూన్యగృహంలో స్నానం చేయించాలి.

ఇక సూక్తానికి అర్థం చూద్దాం.

ప్రకాశవంతమైన 'విభృతి' అనే నక్షత్రం ఉదయించింది. వంశపారంపర్యా వచ్చే రోగాలు శరీరంపైన, క్రింద కూడా వదలివేయుగాక.

ఉషఃకాలము చీకట్లను మాయంచేసినట్లు ఈ సూక్తము వంశపారంపర్య వ్యాధులను మాయము చేయుగాక. రోగశాంతికారులయిన ఆదిత్యాదులు ఈ వ్యాధిని శాంతింపచేయాలి. అపస్మారము మొదలైన రోగకారక పిశాచాలు పారిపోవాలి. మందులు ఈ వ్యాధులను దూరం చెయ్యాలి.

కపిలవర్ణ అర్జునకర్ర, యవలపొట్టు, తిలలు, మంజరి వీటితో చేసిన తాయత్తు వంటి కంకణము ఈ వ్యాధిని తగ్గిస్తుంది. మందులు కూడా ఈ వ్యాధిని తగ్గిస్తాయి. రోగశాంతి కలిగించే ఎద్దులు కట్టిన నాగలికి నమస్కారము. కాడికి, కర్రుకు నమస్కారము, ఈ రోగానికి వాడే మందులు ఈ వ్యాధిని దూరం చేయుగాక.

కిటికీలు తెరిచి ఉన్న శూన్యగృహాలకు నమస్కారము. వదిలేసిన పాత గుంతలకు నమస్కారము. శూన్యగృహాది క్షేత్రపతికి, క్షేత్రీయ వ్యాధుల ఓషధులకు కూడా నమస్కారము, ఇవన్నీ ఈ వ్యాధిని దూరం చేయుగాక"

గమనిక : ఇక్కడ ఒక్క విషయం గమనించండి. ప్రతిమంత్రంలోను ఈ రోగం దూరము చేయబడుగాక. ఉపశమించుగాక అంటున్నారు. అంతేకాని రోగము నిర్మూలింపబడుగాక అని ఎక్కడా అనలేదు. అంటే రోగం తగ్గుతుందే కాని నిర్మూలింపబడదు. కర్మఫలం కదా. మళ్ళీ వస్తుంది. దీనికి శాశ్వత పరిష్కారం లేదు అని గుర్తించాలి.

# 18. పూర్ణాయుర్దాయం కోసం

పరిపూర్ణమైన ఆయుర్దాయం అంటే నిండు నూరేళ్ళు అంటారు. కాని సూర్యుడి దగ్గర నుంచి శుక్రుడు వరకు తొమ్మిది గ్రహాల కాలము నూటఇరవైసంవత్సరాలు. కాబట్టి పరిపూర్ణాయుర్దాయము అంటే నూటఇరవైసంవత్సరాలు అని అర్థం. అప్పుడుకూడా మానవుడు మరణించాలనుకోడు. ఈ ఆయుర్దాయం కావాలంటే **రెండవ కాండలో పదహారు, పదిహేడు సూక్తాలు చూడాలి.**

నెయ్యి, సమిధలు, పురోడాశము, పాలు, అన్నము, పాయసము, పసువు, ధాన్యము, యవలు, తిలలు, పేలాలు, పూరీలతో ఈ సూక్తం చెబుతూ హోమం చెయ్యాలి. 16వ సూక్తం

ప్రాణాపానములారా ! నన్ను మృత్యువు నుండి రక్షించండి.

ద్యావాపృథ్వీలారా ! నాకు వినికిడిశక్తిని కలిగించి కాపాడండి.

సూర్యదేవా! నాకు కంటిచూపును ఇచ్చి కాపాడు.

వైశ్వానరాగ్నీ ! దేవతలందరూ అధిష్ఠాన దేవతలైన అవయవాలను కాపాడవలసింది. 17వ సూక్తం

నీవు ఓజస్సువు. కాబట్టి నాకు ఓజస్సును ప్రసాదించుము.

నీవు సహనానివి. కాబట్టి నాకు సహనశక్తిని ప్రసాదించు

నీవు బలానివి కాబట్టి నాకు బలాన్ని ప్రసాదించు

నీవు ఆయుష్షువు కాబట్టి నాకు ఆయుష్షును ప్రసాదించు

నీవు వినికిడి శక్తివి. కాబట్టి నాకు వినికిడి శక్తిని ప్రసాదించు

నీవు కంటి చూపువు. కాబట్టి నాకు కంటిచూపును ప్రసాదించు

ఓ అగ్నీ ! అందరికీ నేనే పాలకుడవు. ఆయుష్యుకు భంగం కలిగించే వారి నుంచి నన్ను కాపాడవలసింది.

ఈ మంత్రాలతో హోమం చేస్తే పూర్ణాయువు సిద్ధిస్తుంది.

# 19. అభిచార హోమానికి విరుగుడు

అభిచార కర్మ అంటే ‘చేతబడి’ సరిగా చెప్పాలంటే ఇది ‘చేతబడి’ అనాలి. ఎవరో ఎక్కడో ఉండే ఒక మనిషి ఒక క్షుద్రమాంత్రికుడి చేతిలోపడి ఇబ్బందులు పడుతున్నాడు. ఒక్కోసారి ప్రాణాలు కూడా కోల్పోతున్నాడు. ఇది ఒక క్షుద్రప్రయోగం. చాలామందికి అనుమానం ఇలా జరుగుతుందా అనేది. మాటే మంత్రము, మాటకు శక్తిఉంది. మాటవల్ల మంచి జరిగితే, చెడుకూడా జరుగుతుందనే చెప్పాలి. మనం హోటల్‌లో కూర్చుని సర్వరుని ఇడ్లీ తెమ్మంటే – ఇడ్లీ తెస్తాడు. కాఫీ తెమ్మంటే – కాఫీ తెస్తాడు. లేదా బిల్లు తెమ్మంటే అదే తెస్తాడు. మనం చెప్పేదాన్ని బట్టి అతడు చెయ్యటం జరుగుతుంది. ఇలా మాటకు చాలాశక్తి ఉంది. మాటవల్ల ఏదైనా జరుగుతుంది. ఎవరైనా మనమీద అభిచారిక ప్రయోగం చేసినప్పుడు మనం **రెండవ కాండలోని 19,20,21,22,23 సూక్తాలతో హోమం చెయ్యాలి.** ఈ ఐదు సూక్తాలలోను మంత్రాలు ఒకటే. కాని దేవతలు వేరు వేరు. వాటిలో ముందుగా

| | | |
|---|---|---|
| 19 వ సూక్తం | – | అగ్నిదేవుడు |
| 20వ సూక్తం | – | వాయువు |
| 21వ సూక్తం | – | సూర్యుడు |
| 22వ సూక్తం | – | చంద్రుడు |
| 23వ సూక్తం | – | జలము |

చెప్పేవి ఒకే మంత్రాలు. ఈ మంత్రాలతోనే దేవతలందరికీ ఆహుతులు సమర్పించాలి. ముందుగా 19వ సూక్తం ఇందులో అగ్నికి.

1) ఓ అగ్నిదేవా ! నీకు దహించే శక్తి ఉన్నది. దాంతో మేము

ద్వేషించే వారిని, మమ్మల్ని ద్వేషించే వారిని దహించి వెయ్యవలసింది.

2) ఓ అగ్నీ ! నీకు సంహరించే శక్తి ఉంది. దాంతో మేము ద్వేషించే వారిని, మమ్మల్ని ద్వేషించే వారిని సంహరించు.

3) ఓ అగ్నిదేవా ! నువ్వు కాంతిమంతుడివి. దాంతో మేము ద్వేషించే వారిని, మమ్మల్ని ద్వేషించే వారిని సంహరించు.

4) ఓ అగ్నిదేవా! నీకు సంహరించగల శక్తి ఉంది. దాంతో మేము ద్వేషించే వారిని, మమ్మల్ని ద్వేషించే వారిని సంహరించు.

5) ఓ అగ్నీ ! నువు మంచి కాంతిమంతుడవు, ఆ కాంతితో మేము ద్వేషించే వారిని, మమ్మలను ద్వేషించే వారిని సంహరించు. ఈ రకంగా ఐదు సూక్తాలలోను అగ్ని, వాయు, సూర్య, చంద్ర, జలములకు ఆహుతులివ్వాలి. పై మంత్రాలలో 'అగ్ని' అన్న చోట వాయువు, సూర్యుడు, చంద్రుడు, జలము అని పేరు మార్చి అవే మంత్రాలు చెప్పాలి. దీంతో అభిచార ప్రయోగాలు శాంతిస్తాయి.

# ౨౦. ఆవులకు పుష్టి

మన గోశాలలో ఆవులు ఎక్కువ పాలివ్వాలంటే ముందు అవి పుష్టిగా, బలంగా ఉండాలి. బలంగా ఉన్న ఆవులే ఎక్కువ పాలిస్తాయి. బలం కోసం ఆవులకు తౌడు, తెలగపిండి, కొబ్బరిపిండి మొదలైనవి పెట్టి తినిపించాలి. ఇక్కడ ఒక క్షణం ఆగండి. ఆవు అంటే మనదేశంలో దొరికే గంగడోలు ఉన్న ఒంగోలు జాతి ఆవు. గంగ డోలు లేకపోతే అది ఆవుకాదు. ఒంగోలు జాతి అవులకు గంగడోలు ఉంటుంది. గంగడోలు అంటే ఆవు మెడక్రింద వ్రేలాడుతూ ఉండే చర్మము. జర్సీఆవులకు ఆ చర్మము ఉండదు. అలాగే ఆవుకు మూపురము ఉండాలి. జెర్సీ ఆవులకు మూపురం ఉండదు. గంగడోలు, మూపురం లేని హైబ్రీడ్ ఆవులు, ఆవులుగా పరిగణించబడవు. శాస్త్రప్రకారం చెప్పినట్లైతే హైబ్రిడ్ ఆవులను బెంగుళూరు వంటి ప్రాంతాలలో విరివిగా పెంచుతున్నారు. హోమానికి వాటి నెయ్యికూడా పనికిరాదు. పాశ్చాత్యదేశాలలో ముఖ్యంగా అమెరికా, లండన్, డెన్మార్కు లాంటి దేశాలలో హైబ్రీడ్ ఆవులే ఉంటాయి. అక్కడి ఆవులు పాలివ్వటం కోసమే ఉంటాయి. అందుగాను ఆ ఆవులకి మాంసం కూడా పెడతారు. ఆవు ముసలిదై పాలుసరిగా ఇవ్వకపోతే, దాన్ని ముక్కలుగా కోసి మిగిలిన ఆవులకు ఆహారంగా  పెడతారు. అలాగే మనదేశంలో కూడా ఆవులు పుష్టిగా పెరగాలనే కోరికతో రొయ్యపొట్టు, చేపలు, పనికిరాని మాంసం వాటికి పెడుతున్నారు. ఇలాటి ఆవులు బలంగా ఉంటాయి. పాలు ఎక్కువగా ఇస్తాయి. వీటి పాలు, నెయ్యి యజ్ఞయాగాలకి పనికి రావు. అయితే మన ప్రాంతంలో ఆవులు ఎక్కువ పాలివ్వవు. అందుకని బెంగుళూరు నుంచి వచ్చే 'నందిని' నెయ్యినే మనం యజ్ఞయాగాలకు వాడుతున్నాం. ఆవులు పుష్టిగా పెరగాలనే కోరికతో వాటికి అడ్డమైన

గడ్డి పెట్టకూడదు. సాత్వికాహారమే పెట్టాలి. ఆహారంతో పాటుగా **రెండవ కాండలోని ఇరవైఆరవ సూక్తం** చదవాలి. ఇందులో ఐదుమంత్రాలున్నాయి. వెళ్ళిపోయిన ఆవులు మళ్ళీ గోశాలకు తిరిగి రావాలి. వాటిని రక్షించటానికి గాను వాయువు ఆ పశువులతో ఉంటున్నాడు. త్వష్ట ఆవుకడుపులోని దూడలకు పేరు, రూపము ఇస్తున్నాడు. అటువంటి పశువులన్నింటినీ సవిత మన గోశాలలో ఉంచాలి.

గోవులారా ! మా గోశాలకు రండి. బృహస్పతి ఈ గోవులను గోశాలకు తెస్తాడు. 'సినీవాలి' గోవులను ఇంటికి తెచ్చి గోశాలలో ఉంచుతాడు. సినీవాలి అంటే ఒక దేవత. ఇక్కడికి ఎక్కువ సంఖ్యలో ఆవులు, గుర్రాలు రావాలి. వాటిని జాగ్రత్తగా చూసేందుకు సేవకులు కూడా రావాలి. మాకు యవలు మొదలైన ధాన్యము ఎక్కువగా సిద్ధించాలి. అందుకోసం నేను దేవతలకు హవిస్సులకు అర్పిస్తూ హోమం చేస్తున్నాను.

ఆవుల జున్నుపాలు నేను పారిస్తున్నాను. (ఆవు ఈనినప్పుడు వచ్చేవి జున్ను పాలు. కాబట్టి ఆవులు ఎక్కువగా ఈనినాయి) నేతిని పారిస్తున్నాను. (పాడి బాగా ఉన్నది) బలాన్నిచ్చే రసాన్ని నేతితో కలుపుతున్నాను. మా పుత్రులు పౌత్రులు, అందరూ పాడి కలవారు కావాలి.

నేను నాయింటికి ఆవులు, పాలు, ధాన్యము, భార్య, సంతానమును తెచ్చుకుంటున్నాను. అంటే కొత్తగా వేరే కాపురం పెడుతున్నాను. ఈ సూక్తంతో ఆహుతులు సమర్పించాలి. అగ్నిలో ఆహుతులిచ్చేటప్పుడు ఆజ్య, ఆహుతులే ముఖ్యమైనవి. ఆజ్యము అంటే

గోఘృతము, ఆవు నెయ్యి.

హోమం చెయ్యటానికి ఆవునెయ్యి తెచ్చుకుంటాం. ప్రస్తుత కాలంలో అన్నీ కల్తీనే. దీపారాధనచేసే నువ్వులనూనె కల్తీ. ఆవునెయ్యి విపరీతంగా కల్తీ. గొడ్డు కొవ్వును ఆవునెయ్యిగా అమ్ముతున్నారు. ఈ విషయం టి.వి.లో కూడా చాలాసార్లు చూపించారు. కాబట్టి జాగ్రత్తగా చూసికొనండి. దీపారాధన వత్తులుకూడా కల్తీనే. నవారు దారం కత్తిరించి వత్తులుగా అమ్ముతున్నారు. చేయగలిగింది ఏదీలేదు. గొంగట్లో అన్నం తింటున్నాం. 'తస్మాత్ జాగ్రత్త'

# 21. వివాదాల్లో విజయం

న్యాయస్థానంలో వాదప్రతివాదాలు జరిగేటప్పుడు, పండితచర్చలు జరిగే టప్పుడు, విజయాన్ని సాధించాలంటే **రెండవకాండలో ఇరవైఏడవ సూక్తాన్ని** చదవాలి. ముందుగా 'పాఠామూలము' అనే వేరుని మంత్రించి నోట్లో పెట్టుకుని సభాస్థలికి వచ్చిగనక వాదించినట్లైతే అతడికి ఎదురులేదు. ఈ సూక్తాని హోమం చెయ్యాలి.

ఓ పాఠఓషధీ ! నిన్ను నేను సేవిస్తున్నాను. ప్రతివాది అయిన శత్రువు ఎప్పటికైనా సరే నా చేతిలో ఓడిపోవాలి. ప్రతివాది గొంతు పూడ్చెయ్యి. అతడి నోట్లోంచి మాట పెగలరాదు. ఓ ఓషధీ ! గరుత్మంతుడు నిన్ను బయటకు తీశాడు. పంది నిన్ను నేలనుంచి త్రవ్వి బయటకు తీసింది. ఓ ఓషధీ ! ప్రతివాది మాట పడిపోవాలి. ఓ ఓషధీ ! రాక్షస సంహారం కోసం ఇంద్రుడు నిన్ను చేతికి కట్టుకున్నాడు. అసురులను జయించటానికి ఇంద్రుడు పాఠమూలము తిన్నాడు.

నీ ప్రభావంవల్లనే ఇంద్రుడు అడవికుక్కలవంటి రాక్షసులను నిరుత్తరులుగా చేశాడు. అలాగే నేను కూడా శతృసేనను నిరుత్తరులుగా చేస్తాను.

ఓ రుద్రా ! నువ్వు నీటినికూడా మందుగా చెయ్యగలవు. నేను సభలో విజయం సాధించేట్లుగాచెయ్యి.

ఓ దేవేంద్రా! ఎవరైతే తన శక్తితో అవతలి వాడిని ఓడించగలడో అతడి ప్రశ్నలు అన్నీ పెడత్రోవ పట్టించు, నీశక్తితో నేను ప్రతివాదిప్రశ్నలను త్రిప్పి కోట్టేటట్లుగా అనుగ్రహించు. సభలో విజయంసాధించటానికి దోహదం చెయ్యవలసింది.

# 22. ఆయురారోగ్య ఐశ్వర్యాలు

పిల్లవాడి ఆయురారోగ్య ఐశ్వర్యాల కోసం **రెండవకాండలోని ఇరవై ఎనిమిదవ సూక్తం** చదవాలి అంటోంది అధర్వణవేదం.

ఓ అగ్నిదేవా ! ఈ పిల్లలవాడు నిన్ను సేవిస్తున్నాడు. ఇతన్ని ఆరోగ్యవంతునిగా ఉంచు. ఇతడు రోగాలు, రొష్టులు లేకుండా, అపమృత్యువు రాకుండా, వృద్ధాప్యం వరకు హాయిగా జీవించాలి. మిత్రదేవత ఈ బాలుణ్ణి తల్లిలాగా చూసుకోవాలి. పాపములనుంచి రక్షించుము.

పగటిదేవత మిత్రుడు, రాత్రిదేవత వరుణుడు ఇద్దరూ ఏకమనస్కులై ఈ పిల్లవాడికి పూర్ణాయువు నివ్వవలసింది. అగ్నితో కలిసి మిగిలిన దేవతలు ఈ బాలుడికి పూర్ణాయువు ఇవ్వాలి.

ఓ అగ్నిదేవా! ఇంతవరకు పుట్టినవి, ఇక మీద పుట్టబోయే పశువులన్నింటికీ నువ్వే అధిపతివి. ఈ బాలుని ప్రాణాలు రక్షించవలసింది. ఇతనికి వార్ధక్యము రాకుండునుగాక. ఈ బాలుడు నూరు హేమంతాలు జీవించాలి. (సంవత్సరం హేమంతంతో మొదలవుతుంది. నూరు సంవత్సరాలు అని అర్థం.)

ఓ అగ్నిదేవా! ఈ బాలుడికి ఆయుష్షు, తేజస్సు, ఆరోగ్యము కలగాలి. ఓ మిత్రావరుణులలారా ఈ బాలుడికి సంతాన ఉత్పత్తికి శక్తి ప్రసాదించు. విశ్వేదేవతా! ముసలితనం వరకు ఈ బాలకుడిని సర్వసంపన్నుడుగా చేయవలసింది.

## 23. క్రిమిరోగశాంతి

క్రిమిరోగము అంటే వైరస్ వల్ల వచ్చే రోగము. ఈ రోగము తగ్గటానికి **రెండవ కాండలోని ముప్పై ఒకటవ సూక్తాన్ని** చెబుతున్నారు. ముందుగా నల్లశనగలకు నెయ్యి కలిపి ఈ సూక్తంతో హోమం చెయ్యాలి. తరువాత సూక్తాన్ని పారాయణ చెయ్యాలి.

ఇంద్రుడి దగ్గర ఒక పెద్ద రాయి ఉన్నది. అది అన్నిరకాల క్రిములను నాశనం చేస్తుంది. నేను ఆ రాళ్ళతో ఈ శరీరంలో ఉన్న క్రిములన్నింటిని శనగలలాగా పిండి చేసేస్తాను.

శరీరంలో ఉన్న క్రిములు కంటికి కనిపించేవి, కనిపించనివి. అన్నింటినీ నాశనం చేస్తాను. శరీరం లోపల వ్యాపించిన క్రిములను నాశనం చేస్తాను. రక్తమాంసాలను పాడుచేసే క్రిములను నాశనం చేస్తాను. క్రిములలో 'అల్గండు' 'శల్గ' అనేవి ముఖ్యమైనవి. ముందు అల్గండు క్రిములను బాగా శ్రమపడి నాశనం చేస్తాను. అవి నాశనమై పోయినాయి. ఇంకా మిగిలిన వాటిని ఈ మంత్రంతో నాశనము చేస్తాను.

ఈ క్రిములు క్రమంగా కొన్ని జీర్ణకోశంలోకి, కొన్ని తలలోకి, కొన్ని పక్కలందు, కొన్ని అధోముఖంగా తిరుగుతుంటాయి. వీటిలో కొన్ని నాశనం చెయ్యలేనివి ఉన్నాయి. వాటన్నింటినీ ఈ మంత్రజలంతో నాశనం చేస్తాను.

పర్వతాలలో ఉన్నవి, అరణ్యాలలో ఉన్నవి, పశువులందున్నవి, గాయముల యందున్నవి, అన్నపానముల ద్వారా శరీరంలోపల చేరినవి. వీటియొక్క ఉత్పత్తిని నేను నాశనం చేస్తున్నాను. మొత్తం క్రిములన్నీ నాశనమయి రోగికి ఆరోగ్యము చేకూరుగాక. అని ప్రార్థిస్తున్నారు.

# 24. శత్రువులచేతిలో ఓడిపోయిన రాజు మళ్ళీ రాజ్యానికి రావటం

యుద్ధంలో శత్రురాజులచేతిలో ఓడిపోయాడు మహారాజు. తరువాత తిరిగి రాజ్యాధికారం చేపట్టాలి. అంటే శత్రురాజును ఓడించి అధికారం కైవశం చేసుకోవాలి. దానికి మంత్ర తంత్రాలు చెబుతోంది అథర్వణ వేదం **మూడవకాండలోని మూడవ సూక్తం.** ఈ సూక్తంలో ఆరు మంత్రాలుంటాయి. ముందుగా శత్రుసేన ఆకారంలో పురోడాశం (పిండిరొట్టె) తయారుచేసి నీళ్ళలో దర్భలను పరచి, ఆ దర్భల మీద పురోడాశాన్ని పెట్టి, దాన్ని నీళ్ళలో ముంచెయ్యాలి. ఇది ఆభిచారిక ప్రయోగం. ఆ తరువాత ఈ సూక్తంతో క్షీరాన్నము మంత్రించి రాజుతో తినిపించాలి. తరువాత ఈ సూక్తంలో హోమం చెయ్యాలి.

"అగ్నిదేవా ! ఈ రాజు రాజ్యభ్రష్టుడు. తిరిగి రాజ్యంలో ప్రవేశించటానికి నీ సహాయము కావాలి. ఇతడు తిరిగి తన ప్రజలను పాలించేటట్లుగా అనుగ్రహించ వలసినది. ఇతన్ని రక్షించటానికి భూవ్యాకాశముల యందు వ్యాపించు. మరుత్తులు నీకు సాయపడతారు. ఇతడు నీకు నమస్కారం చేస్తున్నాడు. హవిస్సు కూడా అర్పిస్తున్నాడు. ఇతన్ని తిరిగి అతడి రాజ్యంలో ప్రతిష్టించవలసింది.

ఓ ఋత్విక్కులారా ! ఇంద్రునితో ఈ రాజుకు స్నేహము కలిగించండి. దేవతలు ఛందస్సులతోను, సౌత్రామణి యాగంతోను ఇంద్రుణ్ణి వీరుడుగా చేశారు.

పరాజయం పొందిన ఓ రాజా! వరుణుడు జలమునుంచి నిన్ను పిలచును గాక. సోముడు పర్వతముల నుండి, ఇంద్రుడు నీ ప్రజల నుండి పిలచును గాక. వారిచేత పిలువబడిన నీవు డేగలాగా రాజ్యంలో

ప్రవేశించు. ఎక్కువ వేగం గల దేవతలు శత్రువులు ఆక్రమించిన రాజ్యాన్ని ఈ రాజుకు కట్టబెట్టుదురు గాక. ఆశ్వినులు దాని మార్గం తేలిక చేస్తారు.

రాజా! నీవంటే అనుకూలత ఉన్న ప్రజలంతా నీకు సహకరిస్తారు. ప్రతికూలురైన వారు కూడా అనుకూలంగా మారతారు. ఇంద్రుడు, అగ్ని, విశ్వేదేవతలు నీకు ప్రజలను రక్షించే శక్తిని ఇస్తారు.

రాజా! నీ రాజ్యంలోకి నువ్వు మళ్ళీ ప్రవేశించినప్పుడు, నీతో సమానమైన బలం గలవారు. నీకన్న తక్కువ బలం కలవారు నీకు స్వాగతం చెబుతారు.

ఓ ఇంద్రా ! రాజ్యంలో శత్రువులందరినీ రాజ్యం నుంచి వెళ్ళగొట్టి, ఈ రాజును రాజ్యంలో ప్రతిష్ఠించవలసింది” అని ప్రార్థిస్తున్నాను.

# 25. రాజ్యం సుస్థిరం కావటానికి

శత్రురాజులను ఓడించాడు. అధికారం హస్తగతమైంది. ఇక రాజ్యంలో ఈ రాజుయొక్క అధికారం చెల్లుబడి కావాలి. దీనికి మంత్రం చెబుతున్నారు **మూడవకాండలో నాల్గవ సూక్తము**. ఈ సూక్తంలో ఏడు మంత్రాలున్నాయి.

ఓ రాజా ! శత్రువులు ఆక్రమించిన నీ రాజ్యం మళ్ళీ నీకు వచ్చింది. ఇక బలవంతుడవుకా, ప్రసిద్ధుడవుకా. రాజ్యంలో శత్రుశేషం లేకుండా చేసి ప్రజారంజకంగా పాలించు. దశదిశలు నిన్ను ప్రభువుగా అంగీకరించాలి. నీ రాజ్యంలోని ప్రజలంతా నీ అధికారాన్ని మన్నించి, నిన్ను గౌరవించాలి.

రాజా! ప్రజలు నిన్నే ప్రభువుగా కోరుకుంటారు. దిక్కులు విదిక్కులు అన్నీ నిన్ను సేవిస్తాయి. సింహాసనంమీద ఆశీనుడవు కావలసింది. మంచి బలశాలివికా. సేవకులకు భత్యము ఇవ్వవలసింది.

ఓ రాజా ! నీతో సమానమైన రాజులు నీ అధికారాన్ని అంగీకరిస్తారు. నీ దూతలు అగ్నిలాగా దేశమంతా సంచరిస్తారు. నీ భార్యాపిల్లలు ఆనందిస్తారు. నువ్వు మహాబలవంతుడివికా. ప్రజలను కన్న బిడ్డలలాగా కాపాడు.

అశ్వినులు మిత్రావరుణులు, మరుద్గణాలు, నిన్ను దగ్గర ఉండి రాజ్యప్రవేశము చేయిస్తారు. నీ మనసును దానాలు ఇవ్వటంమీద లగ్నంచెయ్యి. ఉగ్రుడవై సంపదలు అనుభవించవలసినది. ఒక్కొక్కసారి రాజు ఓడిపోయి దూరప్రాంతాలకు వెళ్ళిపోతాడు. అందుకని 'దూరదేశంలో ఉన్న ఓ రాజా! త్వరగా రావయ్యా! భూమ్యాకాశాలు నీకు శుభం కలుగచెయ్యాలి. వరుణుడు నిన్ను 'రాజా' అని పిలవాలి.

వరుణుడు పిలుస్తున్నాడు వచ్చి రాజ్యంలోకి అడుగు పెట్టు.

ఇంద్రా! వరుణుని సహితంగా ఈ రాజ్యంలో ప్రవేశించటానికి నువ్వు అనుమతించావు. కాబట్టి ప్రజలముందుకు రా ! ఇంద్రవరుణుల అనుమతి పొందిన రాజు రాజ్యప్రవేశం చేస్తాడు. అలా ప్రవేశించి దేవతలకు హవిస్సులిచ్చాను. ప్రజలను వారి పనులయందు నిమగ్నం అయ్యేలా చూడు. ఓ రాజా ! దేవతలు, జలదేవతలు నీకు, శుభాన్ని కలుగచెయ్యాలి. వీరంతా ఏకమస్కులై నిన్ను ఆశీర్వదింతురు గాక. నీవు మహాబలవంతుడివై ముసలితనము వరకు రాజ్యాన్ని పాలించవలసింది అంటూ హోమం చేస్తారు. అగ్నిదేవుడు అందర్నీ రక్షిస్తాడు.

# 26. విఘ్న నివారణ

విఘ్నము అంటే ఆటకంము. అడ్డు అని అర్థం. ఏదైనా ఒకపని చేస్తున్నప్పుడు లేదా చెయ్యాలి అనుకున్నప్పుడు అనేక విఘ్నాలు వస్తాయి. మనం ఆ పని చెయ్యటం ఇష్టం లేనివాళ్ళు ఈ ఆటంకాలు కలిగిస్తారు. ఇలా విఘ్నాలు కలిగించే వారిని రాక్షసులు అంటారు. ఈ రాక్షసులు ఎక్కడి నుంచో రారు. మనతో పాటే, మనచుట్టు ప్రక్కలే ఉంటారు. మనం ఈ పని చెయ్యటంవల్ల ఎవరికి ఆర్థికంగా నష్టం ఉంటుందో వారు ఆ పని జరగకుండా అడ్డు పడతారు. ఈ పని చెయ్యటంవల్ల మనకి పేరు వస్తుంది. అది ఇష్టంలేని వాళ్ళు, కేవలము మనకి పేరురావటం సహించలేని వాళ్ళు ఆ పనికి అడ్డుపడతారు. ఇదంతా అనుభవైక వేద్యం. చెబితే అర్థం కాదు. అది 2002వ సంవత్సరం. నేను శ్రీవిద్యాసారథి (లలితా సహస్రనామ భాష్యం) వ్రాసిన రోజులు. పుస్తకం వ్రాయటం, డి.టి.పి. అన్నీ అయిపోయినాయి. జులై ఒకటిన ప్రింటుకు వెళ్ళింది. నేను ప్రెస్‌లో డబ్బులుకూడా ఇచ్చేశాను. పేపరుకూడా తెప్పించారు. కాని పుస్తకం ప్రింటింగ్ మొదలు కాలేదు. నెలరోజులు దాటింది. పని ప్రారంభం కాలేదు. కారణం ఏమీలేదు. అప్పుడు నాకు తెలిసిన ఒక పెద్దాయనని అడిగాను. ఎందుకు ఇలా జరుగుతోంది? అని అప్పుడు ఆయన చెప్పాడు. "రోజూ మూడుపూటలా సంధ్యావందనం చేసుకునేవాడో, మీకులాగానే దేవుడికి పూజలు చేసేవాడో, ఎవరో ఒకరు మీపుస్తకం బయటకు రాకూడదు అని కోరుతున్నారు" ఆ మాటలువిన్న నేను ఆశ్చర్యపోయాను. దీనివల్ల ఆయనకు ఏమిటి లాభం? అన్నాను. 'ప్రత్యేకంగా లాభం అనేది ఏమీ లేదు. ఆ పుస్తకం బయటకు వస్తే

మీకు పేరు ప్రఖ్యాతులు వస్తాయి. అవి అతనికి ఇష్టంలేదు. అంతే" అన్నాడు. అప్పుడు నేనుకూడా ఇలాంటిదే ఒక ప్రక్రియ చేయవలసి వచ్చింది. చెప్పినాకూడా ఎవరూ నమ్మరు. ఇలా అనేకమంది, అనేక కారణాల వల్ల విఘ్నాలు, ఆటంకాలు కలిగిస్తారు. వాటన్నింటినీ అధిగమించి మనం ఆ పని చెయ్యాలి. అలాటి సమయంలో విఘ్ననివారణ కోసం **మూడవకాండలో తొమ్మిదవ సూక్తాన్ని** పఠించాలి. మనకోసం అయితే ఈ సూక్తాన్ని చదవచ్చు. కాని ఇతరుల కోసం అయితే ఈ సూక్తంతో మంత్రించి తాయత్తు వారి చేతికి కట్టండి. మొత్తం మనకి నూటఒక్క విఘ్నాలున్నాయని చెబుతున్నది శాస్త్రం. అన్ని రకాల విఘ్నాల నివారణకు ఈ సూక్తం ఉపయోగిస్తుంది. ఈసూక్తంలో ఆరు మంత్రాలుంటాయి. గిట్టలున్న, గిట్టలులేని జంతువులకు భూమి ఆకాశాలు తల్లితండ్రులవుతున్నాయి. ఓ దేవతలారా! ఆ జంతువులను మా మీదికి రాకుండా వెనక్కి మరల్చండి.

విఘ్ననివారణకు దేవతలే ఈ తాయత్తు ధరించారు. మనువు ధరించాడు. నేను ఆ తాయత్తు ధరించి గిత్తకు వట్టకొట్టినట్లు ఆ విఘ్నాలను నిర్వీర్యం చేస్తున్నాను.

ఇతరులు కల్పించిన విఘ్నాలు నివారించటానికి సాధకులు పింగళవర్ణము (గోరోజనము రంగు)తో కట్టిన తాయత్తు ధరిస్తారు. నేను ధరించిన ఈ తాయత్తు విషాన్నము, క్రూరజంతువుల బాధను నివారిస్తుంది.

శత్రువును జయించాలనుకునే వీరవరేణ్యులారా ! మీరు యుద్ధంలో రాక్షస మాయకు లోబడి ఉన్నారు. కోతులు కుక్కలను తరిమినట్లు ఈ తాయత్తు ఆ మాయలను తరిమేస్తుంది.

ఓ మణీ (తాయత్తు) ఇతరులు కల్పించిన విఘ్నాలు నివారించటం కోసం నేను నిన్ను ధరిస్తున్నాను. 'కాబవ' నివారణ కోసం నిన్ను ధరిస్తున్నాను. ('కాబవ' అనేది ఒక రకమైన విఘ్నము) వేగంగా పోయే రథము ఆటంకాలు లెక్క చేయకుండా పోయినట్లు ఏ రకమైన ఆటంకాలు లెక్క చేయకుండా ఈపని పూర్తిచేస్తాను.

భూమి మీద అనేక రకాల విఘ్నాలున్నాయి. వాటిని నివారించటానికి దేవతలు ఈ తాయత్తు సృష్టించారు. కాబట్టి దాన్ని నేను ధరిస్తున్నాను. నాకు విఘ్నాలు ఏవీ రాకుండుగాక.

# 27. క్షయరోగ నివారణ

మానవుడికి అనేక రోగాలు వస్తాయి. వాటిలో చాలా పెద్దరోగం క్షయ. పూర్వకాలంలో క్షయరోగానికి మందు లేదు. ఊపిరితిత్తులు బలహీనపడి, అవి పని చెయ్యక రోగి మరణించేవాడు. ఈ రోజున క్షయరోగం రావటానికి అనేక కారణాలు. నిరంతర స్త్రీ సంగమమువల్ల కూడా క్షయరోగం వస్తుంది. అటువంటి క్షయరోగ నివారణకు చింతపండు, చేపలు కలిపినఅన్నం ఈ సూక్తంతో మంత్రించి రోగితో తినిపించాలి. అడవినువ్వుల కట్టెతో కాచిననీటితో ఉదయంపూట ఈ సూక్తం చదువుతూ రోగికి స్నానంచేయించాలి. ఈ సూక్తంతో మంత్రిస్తే బాలగ్రహశాంతి జరుగుతుంది. ఏరకమైన రోగమైనాసరే, రోగిని తాకి ఈసూక్తం చదవాలి. యజ్ఞయాగాలు చెయ్యటంవల్ల అనారోగ్యంపాలైన వారికి కూడా ఈ సూక్తం దివ్యౌషధం. నిరంతరం యజ్ఞయాగాలు చెయ్యటంవల్ల పొగ లోపలికి పోయి ఊపిరితిత్తులు పాడయ్యే ప్రమాదముంది. **మూడవ కాండలో పదకొండవ సూక్తం** ఇది. ఈ అన్నంతో నీ శరీరంలో ఉన్న క్షయరోగాన్ని పోగొడుతున్నాను. క్షయరోగం తగ్గటం వల్ల నువ్వు చాలా కాలం జీవిస్తావు. ఇంద్రాగ్నులారా ! ఒకవేళ ఈ పిల్లవాడిని **పిశాచాలు పట్టిపీడిస్తుంటే** వెంటనే వాటిని తోలెయ్యండి.

ఇతని ఆయువు అంతరించిపోయినా, క్షీణించిపోయినా, మృత్యువుకు చేరువైనా ఇతన్ని ఈ లోకానికి ఈడ్చుకునితెస్తాను. వందసంవత్సరాలు జీవించేలా చేస్తాను.

ఈ అన్నం తినటంచేత ఇతడు శతాయుష్కుడవుతాడు. ఇంద్రుడు ఇతనిపాపాలు నాశనంచేసి వందసంవత్సరాలు జీవించేట్లుగా

ఆశీర్వదించాలి.

ఇతడు నూరువసంతాలు, నూరుశరదృతువులు జీవించాలి. (నూరు వసంతాలు అన్నా, నూరుశరదృతువులు, ఎలా చెప్పినా వందసంవత్సరాలు అనే అర్థం.)

పోయినప్రాణాలు, పోవటానికి సిద్ధంగాఉన్న ప్రాణాలు, తిరిగి శరీరంలో ప్రవేశించాలి. విద్వాంసులు మరణానికి ఏడువందల రోగాలు కారణము అంటున్నారు. అటువంటి రోగాలనుంచి విముక్తులుకావాలి.

ప్రాణవాయువులారా ! తొందరపడి ఈ శరీరంలోంచి వెళ్ళిపోకండి. ఇతని దేహంలో వృద్ధాప్యము వచ్చేవరకు ఉండండి.

ఓ వ్యాధిగ్రస్తుడా (రోగీ). ముసలితనంవచ్చేదాకా నువ్వు జీవించేటట్లుగా చేశాను. వార్ధక్యము నీకు శుభాలు, సుఖాలు ఇస్తుంది. మృత్యుకారకమైన ఏడువందల వ్యాధులు నీజోలికి రావు.

ఓ వ్యాధిగ్రస్తుడా ! పుట్టుకతోనే నిన్ను మృత్యువు పట్టుకున్నది. ఇప్పుడు బృహస్పతి నిన్ను అకాల మృత్యువు నుంచి రక్షిస్తాడు. నువ్వుసుఖంగా వందసంవత్సరాలు జీవిస్తావు.

**శతం జీవశరదోవర్ధమానః శతం హేమన్తాన్ఛతమ్ వసంతాన్ ।**

**శతం ఇంద్రో అగ్నిః సవితాబృహస్పతిః శతాయుషా హవిషా హర్షమేనామ్॥**

# 28. గృహసూక్తము

మనం ఉండటానికి నివసించటానికి ఏర్పాటు చేసుకునేది ఇల్లు. పూరిల్లు కావచ్చు, పెంకుటిల్లు కావచ్చు, రేకుల ఇల్లు కావచ్చు, డాబా కావచ్చు, మేడ కావచ్చు బహుళ అంతస్థుల భవనం కావచ్చు. ఇల్లు ఇటుకలతో కట్టచ్చు. కర్రలతో కట్టచ్చు ఇల్లు అందంగా ఉందా? రంగులు బాగా వేశారా? హాలు వెడల్పుగా విశాలంగా ఉందా? ఇది కాదు కావలసింది. ఇంట్లో వాళ్ళు సుఖంగా ఉన్నారా? ఇల్లు కళకళలాడుతూ ఉన్నదా? ఇంట్లో పిల్లాపాప ఆటలాడుతున్నారా? ముసలితాత, నాయనమ్మ బోసినవ్వులు నవ్వుతున్నారా? ఇవన్నీ ఉన్న ఇల్లు బృందావనం. ఇవి, లేని ఇల్లు 'కొంప'. కొంతమంది పెద్దఇల్లు కడతారు. ఇంట్లో లైటు వేస్తే కరంటు అయిపోతుందని చిన్న చిన్న బెడ్‌లైట్లు మాత్రమే వేస్తారు. అలాటి కొంపల్లో పట్టపగలే పిశాచాలు తిరుగుతాయి. ఇల్లు చూడటానికి కళాకాంతీ ఉండాలి. ఇంటినిండా మనుషులతో కళకళలాడుతుండాలి. అప్పుడే అది ఇల్లు అనిపించుకుంటుంది మనం ఉండబోయే ఇల్లు చాలా అందంగా కళకళలాడుతూ ఉండాలి. పాడిపంట సమృద్ధిగా ఉండాలి. ఇంట్లో ఎప్పుడూ పాలు, పెరుగు, తేనె, నెయ్యి కుండలతో ఉండాలి. ఇంట్లో వాళ్ళంతా మధురంగా మాట్లాడాలి. మేమంతా పిల్లాపాపలతో వంద సంవత్సరాలు జీవించి ఉండాలి. ఇల్లు ఎలా ఉండాలి అనే విషయం అధర్వణ వేదంలో **మూడవకాండలోని పన్నెండవ సూక్తం** వివరిస్తోంది. ఇందులో మొత్తం తొమ్మిది మంత్రాలున్నాయి. ఇక్కడే స్తంభాన్ని పాతి స్థిరపరుస్తున్నాను. ఈ గృహము మా కోరికలు తీర్చేది కావాలి. ఇందులో అగ్నిభయం ఉండరాదు. అందరికీ క్షేమంగా ఉండాలి. ఓ గృహమా !

ఇందులో ఉండే వారంతా మంచి గుణవంతులే కావాలి. అంటే గుణహీనులు ఇందులో ఉండరాదు. ఇందులో రోగరహితులు, అరిష్టరహితులు అయిన పుత్రునితో నివసింతును గాక. అంటే ఈ ఇంట్లో ఉండే నా కుమారులకు ఏ రోగాలు రాకూడదు. వాళ్ళు అరిష్ట రహితులు అంటే కష్టాలు లేనివాళ్ళు అదృష్టవంతులు కావాలి.

ఓ గృహమా! నువ్వు ఇక్కడే స్థిరంగా ఉండాలి ఈ ఇంట్లో అశ్వసంపద, గో సంపద అభివృద్ధి చెందాలి. ఇందులో ఉండే వాళ్ళు మధురముగా మాట్లాడాలి. ఈ ఇంట్లో పాలు, పెరుగు, నెయ్యి సమృద్ధిగా ఉండాలి. ఈ ఇల్లు భోగభాగ్యాలతో తులతూగాలి.

ఓ గృహమా ! ఇక్కడ భోగభాగ్యాలున్నాయి. మహాఛందోదేవతలున్నారు. అక్షయమైన ధనధాన్యాలున్నాయి. ఈ ఇంట్లోకి దూడలు పసిపిల్లలు రావాలి. మేతకై అడవికి వెళ్ళిన ఆవులు సాయంత్రానికల్లా పాలుచేపుతూ ఇంటికి తిరిగిరావాలి. వాస్తుశాస్త్రము తెలిసిన సవిత, వాయువు, బృహస్పతి ఈ ఇంటిని చక్కగా ఉంచాలి. మరుత్తులు ఈ నేలను పాలతోను, నీళ్ళతోను తడపాలి. భగదేవత ఈ నేలను దున్నును గాక.

ఓ గృహమా ! నీవు దేవివి. వాస్తుపత్నివి. ధాన్యపోషకవు. మొదటగా నిన్ను దేవతలు నిర్మించారు. నీవు గడ్డి కప్పుకున్నదానవు. (రెల్లు గడ్డి ఇల్లు) మంచి మనసున్నదానవు. నీలో నివసించే మాకందరికి పుత్రులతో కూడిన ధనం ఇవ్వవలసింది. ఓ వెదురుగడా! ఈ ఇంటి నడిమి గుంజమీద కదలకుండా ఉండవలసింది.

ఓ గృహమా ! నీలో ఉండేవారు ఆర్తులు కాకూడదు. నీలో ఉండే మేము మా పిల్లా పాపలతో వందసంవత్సరాలు సుఖంగా జీవించాలి.

ఈ ఇంటికి పసిపిల్లలు, చిన్నపిల్లలు రావాలి. ఆవులతోపాటుగా దూడలు రావాలి. పొంగి పొరలే పాలకుండలు, తేనెకుండలు, పెరుగు కడవలు ఉండాలి. ఇంట్లో పాడి పంట సమృద్ధిగా ఉండాలి. అమ్మా ! ఈ కుండలో అమృతమయమైన జలమున్నది. ఈ కుండలు తేనెతోను, పాలతోను నిండి ఉన్నాయి. వీటిని జాగ్రత్తగా ఇంట్లో పెట్టండి. మనం ప్రవేశించబోయే ఇంటిని ఆ కలశములోని నీటితో ప్రోక్షించండి. మేముచేసే శ్రౌత, స్మార్తకర్మలు ఈ ఇంటిని దొంగల భయం, అగ్నిభయం లేకుండా రక్షించాలి.

ఈ కలశంలోని నీరు క్షయరోగాన్ని నాశనం చేస్తుంది. నీ సేవకుల క్షయరోగాన్ని తగ్గిస్తుంది. ఈ పూర్ణకుంభాన్ని అక్షయ అగ్ని సహితముగా ఇంట్లోకి తీసుకువెళ్ళండి." అంటున్నారు. మనం ఉండే ఇల్లు ఎంత శుభప్రదంగా ఉండాలి అనే విషయం ఇందులో వివరించటం జరిగింది.

# 29. గోశాల

ఆవులు పెంచాలంటే పరిశుభ్రమైన విశాలమైన గోశాల ఉండాలి. **మూడవకాండలోని పద్నాల్గవ సూక్తంలో** గోవులన్నీ క్షేమంగా ఉండేందుకు గోశాలను గురించి చెబుతున్నారు. ఈ సూక్తంలో ఏడు మంత్రాలున్నాయి.

ఓ గోవులారా! మీకు శుభకరమైన కొట్టము (గోశాల) ఏర్పాటు చేస్తున్నాను. అందులో మీకు కావలసిన మేత మొదలైనవన్నీ ఏర్పాటయినాయి. మిమ్మల్ని వంశపారంపర్యంగా సమృద్ధిగా సుసంపన్నం చేస్తున్నాను.

గోవులారా ! మిమ్ము ఆర్యముడు సృష్టించును గాక. పూషబృహస్పతి, ఇంద్రుడు మీకు సుఖాలు కలిగించును గాక. మీ దగ్గరఉన్న పాలు, పెరుగు, నెయ్యి మొదలయిన పదార్థాలు మాకిచ్చి మమ్మల్ని పరిపుష్టులు చెయ్యండి.

ఓ గోవులారా! ఈ గోశాలలో పుత్రపౌత్రులతో సుఖంగా ఉండండి. ఏ రకమైన రోగాలు లేకుండా మంచి ఆరోగ్యంగా చిరకాలము జీవించండి. గోవులారా ! మా గోశాలకు రండి. ఇక్కడే ఉండి ఈగల లాగా వృద్ధి చెందండి. ఈ గోశాలలోనే బిడ్డాపాపలతో సుఖంగా వర్ధిల్లండి. మీరు మీ సంతానంతో మా గోశాలలో వర్ధిల్లండి.

ఓ గోవులారా ! మా గోశాల మీకు శుభప్రదము. ఇక్కడ మీరు ఈగల లాగా, తామర తుంపరగా వృద్ధి చెందండి. మేము మీకు సుఖాలు కలిగిస్తాము.

ఓ గోవులారా ! నేను మీ పాలకుడను. మిమ్మల్ని జాగ్రత్తగా పరిపాలిస్తాను. నన్ను మీ వాడిగా చూడండి. మేత మొదలైనవి ఇక్కడ అసంఖ్యాకంగా ఉన్నాయి. మీరు చిరకాలము పిల్లాపాపలతో ఉండాలని నా ప్రార్థన" అంటున్నారు.

# ౩౦. వ్యాపారంలో లాభం కోసం

పండిన పంట, తయారుచేసిన వస్తువులను దేశంలోని వివిధ ప్రాంతాలలో, విదేశాలలో కూడా అమ్మాలి. అలా అమ్మగలిగితేనే లాభము వస్తుంది. వ్యాపారంలో లాభం రావాలంటే కేవలం వస్తువును ఎక్కువ ధరకు అమ్మటమే కాదు. మంత్ర తంత్రాలను కూడా ఉపయోగించేవారు. **మూడవ కాండలోని పదిహేనవ సూక్తం** చూడండి. ఇందులో ఏడు మంత్రాలున్నాయి.

అమ్మదలుచుకున్న వస్తువును దుకాణానికి తెచ్చేప్పుడు 'వణిక్' కర్మ చెయ్యాలి. అది ఎలా అంటే –

ఈ సూక్తంతో వజ్రంగాని, వస్త్రముగాని, వక్కకాయనుకాని, గుర్రమునుగాని, ఏనుగునుగాని ఏదో ఒకదాన్ని మంత్రించాలి. వ్యాపారం చేసే వ్యాపారి ఈ సూక్తంతో హోమంచేసి ఇంద్రుడికి ఆహుతులివ్వాలి. ఈ సూక్తంలోని ఆరవఋుక్కుతో పూర్ణాహుతి చెయ్యాలి.

నేను వర్తకుణ్ణి. ఇంద్రుడు పరమైశ్వర్య వాణిజ్యవేత్త. అటువంటి ఇంద్రుణ్ణి నేను ప్రార్థిస్తున్నాను. ఇంద్రుడు ఇక్కడికి వచ్చుగాక. వాణిజ్యానికి శత్రువులను, మార్గవిరోధులను సంహరిస్తూ ఇక్కడికి వచ్చుగాక. ఈశానుడయిన ఇంద్రుడు మాకు ధనాన్నిచ్చు గాక. **'ఈశానోధనదా అస్తుమహ్యామ్'**

వ్యాపారం చెయ్యటానికి భూవ్యాకాశములందు అనేక మార్గాలున్నాయి. ఆ మార్గాలలో పాలు, నెయ్యి లభించుగాక. క్రమవిక్రయాల యందు లాభము ఆర్జించి మేము ఇండ్లకు వెడతాము.

అగ్నిదేవా ! నాకు ధనము, బలము కలిగించమని నీకు ఆజ్యఆహుతులు సమర్పిస్తున్నాను. నేను ధనవంతుడయ్యే వరకు నిన్ను

స్తుతిచేస్తూనే ఉంటాను. హోమాలు చేస్తుంటాను. నేతితో ఆహుతులు సమర్పిస్తాను.

అగ్నీ ! మేము ఈ దారిన నడిచి చాలాదూరము వచ్చాము. అందువల్ల కలిగిన వ్రతలోపాలే మయినా ఉంటే మన్నించు. మేము దూరదేశాలకు వచ్చాము. అందువల్ల కలిగే బాధలు భరించేశక్తి మాకు ప్రసాదించవలసింది.

వ్యాపారంలో తీసుకుపోయే సరుకు, దాన్ని లాభానికి అమ్మటము ఈ రెండూ మాకు సుఖప్రదాలగుగాక. ఇతరుల దగ్గర తీసుకున్న సరుకుకు మూల్యం చెల్లించటం నాకు తేలిక అగుగాక.

ఇంద్రాగ్నులారా ! మీరిద్దరూ ఒకటై మా హవిస్సులు స్వీకరించండి. మేము చేసిన అమ్మకము, అందువల్ల కలిగిన లాభము మాకు ఆనందాన్నిచ్చు గాక. ఓ అగ్నీ ! లాభం రాకుండా అడ్డం పడే దేవతలున్నారు. వారికి మేమిచ్చే ఆహుతు లందించి, వారిని తృప్తులుగా చేసి పంపివేయండి. దేవతలారా! నేను ధనాన్ని పెట్టుబడిగా పెట్టి ధనాన్ని (లాభము) కోరుతున్నాను. నేనుచేసే వ్యాపారంవల్ల లాభం కొద్దిగా కాదు. మరింత బాగా రావాలి.

ధనాన్ని పెట్టుబడిగా పెట్టి ధనం కోసం వ్యాపారం చేస్తున్న నేను ఏ ధనంతో వ్యాపారం చేస్తున్నానో దానియందు ప్రజాపతి, సవిత, సోముడు, అగ్ని, నాకు శ్రద్ధ కలిగింతురు గాక. ఓ అగ్నీ ! నీకు నమస్కారము చేస్తున్నాను. నిన్ను స్తుతి చేస్తున్నాను. నిన్ను సేవిస్తున్నాను. నీ శరణు కోరిన నాకు అన్నము, బలము సమృద్ధిగా లభించును గాక"

అంటూ ఇంద్రాగ్నులను ప్రార్థిస్తున్నారు.

# 31. స్త్రీవశీకరణము

లోకంలో సామాన్యంగా పురుషులందరూ కోరుకునేది తాను కోరిన, తాను వలచినస్త్రీ తనకు వశం కావాలని. ఇది సర్వసాధారణం. ఇలా కాదు అని చెప్పగలిగే వారు లక్షకి ఒకరు కూడా ఉండరు. అయితే ఇది మంచి పద్ధతి కాదు. **సామాజిక నియమాలు, విలువలు మనం పాటించాలి. లేకపోతే సమాజం అధోగతి పాలవుతుంది.** అసలు ఇలాటి మంత్రాలు నేనుఇక్కడ చెప్పకూడదు. అయినప్పటికి ఇది వేదం కాబట్టి, వేదంలో ఏముందో మీకు తెలియాలికాబట్టి ఇక్కడ చెబుతున్నాను. ఇటువంటి తాంత్రికాలు ఉపయోగించటానికి మాత్రం ఎప్పుడూ ఎవరూ ప్రయత్నం చెయ్యవద్దు.

స్త్రీవశీకరణ కోసం ఈ సూక్తం చెప్పబడింది. దీని తాంత్రిక ప్రయోగం సమాజశ్రేయస్సు కోసం ఇక్కడ నేను వ్రాయటం లేదు. ఈ సూక్తము **మూడవ కాండలోని ఇరవై ఐదవ సూక్తంగా** చెప్పటం జరిగింది. సూక్తార్థం చూడండి.

ఉత్తర దేవత నిన్ను కామార్తను చేయుగాక. సూదులవంటి మదన వికారము బాధించు నీకు ఈశయ్య సుఖకరము కాకుండునుగాక. కామబాణాన్ని నీ హృదయంలో నాటుతున్నాను. నీతోరమించుట నాకోరిక. నీకు ఆరాటము కలిగించటము నా సంకల్పము. అందుకే కామబాణాన్ని ఎక్కుపెట్టి నీ గుండెలోకి దూర్చుదును గాక.

కామదేవత బాణము నీ హృదయంలోకి ప్రవేశించి ప్లీహము (హృదయంలో ఎడమ ప్రక్కన ఉండే భాగము. మాంసపు ముద్ద)ను శుష్కింపచేయును గాక. మంటలు మండించే బాణాన్ని ఓ ప్రియసీ! నీ గుండెలో గుచ్చుతున్నాను. నీకు మోహము కలిగించే బాణం

తగిలింది. నీ గొంతు ఆరిపోయింది. మాట పెగలటం లేదు. నా దగ్గరకు రా ! ప్రేమగా మాట్లాడు. నా దానివికా.

ప్రేయసీ ! నిన్ను నాదాన్నిగా చేసుకోటానికి 'కశ' (కొరడా) వాడగలను. దాన్ని నీ తల్లి తండ్రుల నుంచే తేగలను. నువ్వు నా పనులకు, మనసుకు అనుకూలంగా ఉండవలసింది. మిత్రావరుణులారా ! ఈవిడకు ఏ రకమైన ఆలోచనలు రానీయకండి. ఆవిడ ఆలోచించే శక్తిని కోల్పోవాలి. ఆవిడ నాకు వశమైయేటట్లు, అధీనమయ్యేట్లు చెయ్యవలసింది అంటున్నారు. **ఇది చాలా నీచమైన ఆలోచన.**

# 32. పురుషుణ్ణి వీర్యసంపన్నుడిగా చెయ్యటానికి

పురుషుడికి వీర్యకణాలు తక్కువైనప్పుడు మనం డాక్టరుగారి దగ్గరకి వెళ్ళి మందులు పుచ్చుకుంటాం. ఆ తరువాత ఫలితం మన అదృష్టం మీద ఆధారపడి ఉంటుంది. దీనికి చిన్న వైద్యవిధానం చెబుతున్నాడు. **అధర్వవేదంలోని నాల్గవకాండలోని నాల్గవసూక్తంలో** ముందుగా 'కైథకీ' వేరును నేలను తవ్వితీసి శుభ్రంగా అరగదీసి పాలల్లో కలిపి ఈ సూక్తంతో మంత్రించి, త్రాగించాలి. తరువాత ఈ సూక్తంతో హోమం చెయ్యాలి. సూక్తార్థం చూడండి.

వరుణుడికి వీర్యనష్టం కలిగినప్పుడు మళ్ళీ అతణ్ణి వీర్యవంతుడిగా చెయ్యటానికి గంధర్వులు నేలనుతవ్వి తీసిన ఓషధినే ఇప్పుడు మేము కూడా తవ్వి తీశాము. మాకు వీర్యవృద్ధి కలిగించవలసింది.

సూర్యుని భార్య ఉష, సూర్యుడు ఇద్దరూ కూడా మమ్మల్ని వీర్యసంపన్నలుగా చేయుగాక. ఈ మంత్రము వల్ల వీర్యము సంపన్నమగు గాక. లోకాలకు వర్షాన్నిచ్చే ప్రజాపతి మమ్మ్మి వీర్యసంపన్నులుగా చేయుగాక.

వీర్యము కోరే ఓ మానవుడా ! నీ పుత్రపౌత్రులను రక్షించటానికి నీ మగతనము పాముపడగ వంటిది అగుగాక. ఓషధులు నిన్ను పరమ వీర్యవంతునిగా చేయుగాక.

వీర్యాన్ని పెంచే ఓషధులలో కైథకీ ఓషధి తలమానికమైనది. ఇది ఆబోతు వీర్యము కన్న కూడా సారవంతమైనది. ఓ ఇంద్రా! ఓషధులన్నింటి యందు ఉన్న వీర్యాన్ని ఇతనిలో చేర్చు. ఓషధీ ! నువ్వు వనస్పతులలో శ్రేష్ఠుడవు. అమృతమయమైన సోమానికి సోదరివి. అంగిరాదిఋషీశ్వరుల మంత్రప్రభావంతో వీర్యప్రదవుగా

పుట్టినదానవు.

అగ్నిదేవా ! ఇతడు వీర్యాన్ని కోరుతున్నాడు. ఇతనికి వీర్యము ప్రసాదించి ఎక్కుపెట్టిన ధనుస్సు చెయ్యి. ఓ సరస్వతీ ! ఓ బ్రాహ్మణస్పదీ ! ఇతనికి వీర్యాన్ని ప్రసాదించి ఎక్కుపెట్టిన ధనుస్సులాగా సిద్ధం చేయవలసినది.

ఓ వీర్యాభిలాషీ ! నా మంత్రప్రభావంతో నీ వీర్యాన్ని ఎక్కుపెట్టిన బాణంలాగా చేస్తున్నాను. ఆబోతులాగా ఆడుతూ, పాడుతూ నీ భార్యతో సంగమించవలసింది.

ఓషధీ ! గుర్రము, కంచర గాడిద, మేక, పొటేలు, ఆబోతుల వీర్యాన్ని ఈ పురుషుని యందు ప్రవేశపెట్టు. అంటే ఆ జంతువుల శక్తిని ఇతడిలో ప్రవేశపెట్టు. అతణ్ణి అమిత వీర్యవంతుడిగా సంతానవంతుడుగా చెయ్యవలసింది.

# 33. విషానికి విరుగుడు

పోకచెట్టు ముక్క నీటిలో వేసి, ఆ నీటిని ఈ సూక్తముతో మంత్రించి ఆనీటిని రోగితో త్రాగించాలి. ఈ విషయం **నాల్గవకాండలోని ఆరవ సూత్రంలో చెబుతున్నారు.**

తక్షకుడు సర్పజాతికి బ్రాహ్మణుడై మొదటగా పదిపడగలతో, పదిముఖాలతో పుట్టాడు. సోమపానం చేశాడు. కందమూలాలను విషంలేకుండా చేశాడు.

భూమ్యాకాశాలు, సప్తసముద్రాలు, వ్యాపించినంత వరకు ఉన్న కందమూలాల లోని విషాన్ని పోగొట్టటానికి ఈ మంత్రాన్ని ఉచ్చరిస్తున్నాము. ఓ విషమా! బంగారు రెక్కలు గల గరుత్మంతుడు మొదటగా నిన్ను పీల్చేశాడు. ఆ రకంగా నిర్వీర్యమైన నువ్వు ఈ వ్యక్తియొక్క తెలివి తప్పించద్దు. నీవు దూరిన ఈ వ్యక్తిలోని విషమంతా అన్నంలాగా జీర్ణమయిపోవాలి.

విషమా! నువ్వు చేత్తో బాణం ఎక్కుపెట్టి విషాన్ని ఇతని దేహంలో కొట్టావు. నేను నీ చేతిని, ఆ వింటినీ కూడా ఈ పోకచెట్టు ముక్కతోను, మంత్రంతోను నిర్వీర్యము చేస్తున్నాను.

బాణం యొక్క విషాన్ని తొలగిస్తున్నాను. లేహ్యములందు, విషపత్రాల యందు, వృక్షాలయందు, ఉన్న విషాన్ని నిర్మూలిస్తున్నాను.

బాణమా ! విషంలో మునిగిపోయిన నువ్వు నిర్వీమయిపో. నీ విషము పూర్తిగా నిర్వీర్యమగు గాక. సారహితమైన నీ ధనస్సు కూడా నిర్వీర్యమగు గాక. రంగరించిన విషం, లేపనవిషం, దూరంనుంచి విసరినవిషం, అన్నంలో కలిపినవిషం, నీటిలో కలిపినవిషం అంతా

నిర్వీర్యం చేస్తున్నాను. విషం పుట్టించే పర్వతాలను కూడా నిర్వీర్యం చేస్తున్నాను. విషం కోసం కందమూలాలు తవ్వినవాడు నిర్వీర్యుడవుతాడు. విషం నిర్వీర్యమవుతుంది. విషమున్న కందమూలాలు, పర్వతాలు నిర్వీర్యం కావాలి.

అని ప్రార్థించి ఈ సూక్తంతో హోమం కూడా చెయ్యాలి.

# 34. విరిగిన ఎముకలు అతుక్కోవటానికి

ఎముకలు విరిగినప్పుడు ముందుగా విరిగిన భాగాన్ని శుభ్రం చేసి **నాల్గవ కాండలోని పన్నెండవ సూక్తంతో** లక్కనీరు మంత్రించి విరిగినచోట చల్లాలి. తరువాత నెయ్యి, పాలు ఈ సూక్తంతో మంత్రించి గాయపడ్డ వాడితో త్రాగించాలి. ఈ సూక్తము అర్థము. "లక్కా నువ్వు ఎర్రగా ఉంటావు. స్రవించే రక్తాన్ని స్రవించకుండా చేసేదానివి.

గాయపడినవాడా ! నీకు తగిలిన గాయము, గాయపు మంట విరిగిన ఎముక లక్క ప్రభావంతో మానిపోతుంది. ఎముకలు అతుక్కుంటాయి.

నీ మూలుగు బాగుపడుతుంది. విరిగినఎముక అతుక్కుంటుంది. ఊడిన కండలు మళ్ళీ చేరతాయి.

మూలుగు ఆగిపోవుగాక. తెగిన చర్మము అతకును గాక. ఎముక నుంచి స్రవించిన రక్తం మళ్ళీ ఎముకలోకి ఎక్కునుగాక.

ఓ ఓషధీ ! వెంట్రుకలు వెంట్రుకలతో, చర్మం చర్మంతో కలిపివెయ్యి. ఎముకమీద రక్తాన్ని పట్టించు. విరిగిపోయిన ఇతర అవయవాలను సరిచెయ్యి. అతడు పని చేయగల సమర్ధుడుగా చేయుము. చికిత్స జరిగినవాడా! నువ్వు బాగుపడ్డావు. మంచం మీంచి లే. నుంచో, నడు, పరుగులెత్తు.

కత్తి తగిలిన గాయముకాని, రాయి తగిలిన గాయము కాని రథము భాగాల లాగా అతికించవలసినది. అని ప్రార్థించి ఈ సూక్తంతో హోమం కూడా చెయ్యాలి

# 35. వర్షం కోసం

వర్షాలు లేకుండా జనం అల్లాడిపోతున్నారు. త్రాగటానికి కూడా నీరు దొరకటం లేదు. నేల ఎండి బీటలు వారుతోంది. చెరువులు, కాలువలు, బావులు పూర్తిగా ఎండిపోయినాయి. ఇలా వర్షాలు లేని సమయంలో మనం అనేక పూజలు వ్రతాలు తాంత్రిక ప్రయోగాలు చేస్తాం. ఈశ్వరుడికి సహస్రఘటాభిషేకం చేస్తాం. అన్నాభిషేకం చేస్తాం. కప్పలకి వివాహం చేస్తాం. వరుణజపం చేస్తాం. వరుణహోమం చేస్తాం. ఇలా అనేక పనులు చేస్తాం. దీనికి ప్రత్యేకమైన ప్రక్రియ చెబుతోంది అధర్వణవేదం. **నాల్గవకాండలోని పదిహేనవ సూక్తం**తో మరుత్తులకు, ఇతర దేవతలకు గోఘృత హోమం చెయ్యాలి. ఇప్పుడు ఈ సూక్తానికి అర్థం చూద్దాం. నాలుగు దిశలందు ఉన్న మేఘాలు ఉదయించాలి. చిన్న చిన్న మేఘాలు అన్నీ గాలికి ఒకటై పోవాలి. అవి పెద్దగా గర్జిస్తూ (ఉరుముతూ) భూమిని తృప్తిపరచాలి. (వర్షించాలి)

దానం చేసే మరుత్తులు వర్షం కురిపించాలి. వాననీరు నేలలో నాటిన విత్తనాలను చేరాలి. వర్షధారలతో భూమి పూర్తిగా తడిసి భూమిలో అనేక పంటలు పండాలి.

మరుత్తులారా ! మిమ్మల్ని స్తుతి చేస్తున్నాము. మీరు మాకు నీటితో నిండిన మబ్బులను చూపండి. జలప్రవాహాలు వేరువేరుగా ప్రవహించాలి. వర్షధారలు భూమిని తడపాలి. నేలమీద ఉన్న అన్ని రకాల పంటలు బాగాపండాలి.

పర్జన్యా ! (ఇది ఒక మేఘము పేరు) బాగా గర్జించు. మరుత్తులు నిన్ను మెచ్చుకుంటారు. వర్షం అనేక రూపాలలో వర్షిస్తుంది. (చినుకులు, జడివాన, గాలివాన, కుండపోత) జలబిందువులు నేలను

తడుపును గాక.

మరుత్తులారా ! సముద్రంలో ఉండే నీటిని పైకి పంపండి. అది అంతా మేఘమయి వృషభం లాగా గర్జిస్తూ నీటితో భూమిని తడపాలి.

పర్జన్యా ! నాలుగు వైపులా గర్జించు. మేఘాలయందు ఉరమాలి. సూర్యకిరణాల వల్ల సముద్రంలో నీరు ఆవిరై పైకి పోతుంది. ఆ నీటిఆవిరి మేఘాలుగా అవుతుంది.

మానవులారా ! మరుత్తులు మిమ్మల్ని తృప్తులుగా చేయుగాక. కొండచిలువల లాగా ప్రవాహాలు ఉండాలి. గాలికి మేఘాలు నేలమీద వానగా పడాలి.

ఒక ప్రక్క మెరుపులు, ఇంకో ప్రక్క మబ్బులను తెచ్చే గాలి. వాయువుతో ప్రేరేపించబడిన మేఘము నేలమీద పడుతుంది.

మరుత్తులారా ! మేఘము, జలము, మెరుపు, వాననీరు, జలప్రవాహము అన్నీ భూమికి తృప్తి కలిగిస్తాయి. గాలికి కొట్టుకుపోయిన మేఘము భూమిపై వర్షం కురిపిస్తుంది.

మేఘస్వరూపమైన అగ్ని పంటలకు అధిపతి అవుతాడు. పుట్టిన వాళ్ళకి, పెరుగుతూ ఉండే వారికి, అందరికీ అగ్ని మా ప్రాణాలకు జీవనము, స్వర్గంలో అమృతము కలిగించి వర్షాని కురిపిస్తుంది.

సూర్యుడు జలదాత. అతడు సముద్రజలం వర్షించటానికి ప్రేరణ కలిగించి, సముద్రాన్ని బాగా బాధించాలి. మేఘము గుర్రంలాగా వేగం కలది, దానికి వర్షించే శక్తి పెరుగుతుంది. పర్జన్యా ! ఉరుములు మెరుపులతో వర్షపుచాయలు చూపిస్తూ, ప్రత్యక్షం కావలసింది. సూర్యుడు మాకు పిత్రుసమానుడు. అతడు వర్షాన్ని ఒంకరగా కురిపించుగాక. వర్షపుజలం పెద్దగా శబ్దంచేస్తూ నేలమీద

ప్రవహించాలి.

సంవత్సరమంతా వ్రతనియమాలు పాటించే బ్రాహ్మణుడిలాగా పర్జన్యుడు వర్షించు గాక.

మండూకీ ! శబ్దం చెయ్యి. రోదసీ ! వానరాకను సూచిస్తూ ధ్వనులు చెయ్యాలి. వర్షానికి సరస్సులు నిండిపోవాలి. మండూకీ అంటే – ఆడకప్ప, రోదసి – రోదసి అంటే ఆకాశము. వర్షం వచ్చే ముందు ఆకాశం మేఘావృతమై వానరాకను సూచిస్తూ పెద్దగా శబ్దాలు చేస్తుంది. ఓ మండూకములారా ! నిండు సరస్సులో చేరి వానరాక కోసం ఘోష చెయ్యండి. మరుత్తులను వర్షించేట్లు చెయ్యండి. ఓ పర్జన్యా! సముద్రం నుంచి పెద్ద పెద్ద మేఘాలు తీసుకురా! నేలను నాలుగువైపులా బాగా తడుపు. మెరుపులు, ఉరుములు, గాలితో కూడి వర్షించు. యజ్ఞము బహుముఖమై వర్ధిల్లుతుంది. నేలమీద పంటలు బాగా పండుతాయి.

# 36. అభిచారదోష నివారణ

అభిచారదోష నివారణ కోసం **నాల్గవకాండలో పందొనిమిదవ సూక్తాన్ని** హోమం చెయ్యాలి.

ఓ సహదేవీ ! నువు శత్రువును నాశనం చేస్తావు. స్వాభావిక శత్రువును కూడా చంపేస్తావు. ఎవరైనా కృత్యను ప్రయోగిస్తే వారి పిల్లలను, పాపలను కూడా గడ్డిని నరికినట్లు నరికెయ్యి (కృత్యాప్రయోగము పని చెయ్యదు)

ఓషధుల్లో నువ్వు ప్రధానమైనదానవు. రాక్షసులను సంహరించి, బలహీనులను రక్షిస్తావు.

దేవతలు మొదట నీ సాయంతోనే రాక్షసులను సంహరించారు. అందుకే నువ్వు ఓషధులకు అధిపతివి.

ఓ అపామార్గమా! నీ శాఖలు అపరిమితం కాబట్టి నీకు 'విబిన్దతి' అని పేరు. మమ్మల్ని బాధించే వారిని బాధించు. వాళ్ళని సంహరించు. మమ్మల్ని రక్షించవలసింది. అపామార్గము అంటే – ఉమ్మెత్త.

# 37. గోసూక్తము

మనదేశం పూర్తిగా వ్యవసాయం మీద ఆధారపడి ఉంటుంది. వ్యవసాయ దేశంలో ఆవులకు ఎద్దులకు ప్రాముఖ్యత ఎక్కువ ఉంటుంది. వేదకాలంలో గోవులు చాలా గొప్పఆస్థి. అదంతా గోసంపద. పవిత్రము పూజనీయము. అటువంటి గోవులను ప్రశంసిస్తూ **నాల్గవకాండలో ఇరవై ఒకటవ సూక్తము** చెప్పబడింది. ఈ సూక్తంలో మంత్రించిన నీటిని గనక త్రాగించినట్లైతే ఆవులు చాలా పుష్టిగా ఉంటాయి. ఈ సూక్తంలో మొత్తం ఏడుమంత్రాలున్నాయి. "గోవులు మావైపు రావాలి. మాకు శుభాలు కలిగించాలి. గోవులన్నీ గోశాలలోనే ఉండాలి. పిల్లలు గల రంగురంగుల గోవులు యజమానిఇంట్లో వృద్ధిచెందును గాక. ఇంద్రుణ్ణి ఆహ్వానించటానికి గాను చాలా రోజులవరకు గోవులు పాలివ్వాలి.

ప్రార్థించేవారికి ఇంద్రుడు గోవులుకలిగే ఉపాయం చెబుతాడు. అలా చెప్పి గోవుల్ని కూడా ఇస్తాడు. ఇంద్రుడు వారిధనాన్ని లాక్కోడు. వారికి ధనసమృద్ధిని కలిగిస్తాడు. అటువంటి గోవులు నష్టపడకుండ ఉండాలి. అవి దొంగలచే వధించబడరాదు. శత్రువులు వాటిని హింసించరాదు. గోవులను పూజించేవాడు, గోదానములు చేసేవాడు చాలాకాలము ఆ గోవులతోనే కలిసి ఉండాలి. అరణ్యంలో పరుగులుపెట్టి దుమ్ములేపే పులులు, సింహాలు ఈ ఆవులవైపు రాకుండును గాక. గోవులు కసాయివాడు ఉన్న దిక్కువైపుకు పోకుండును గాక. వీటి యజమాని ఏ మాత్రం భయంలేకుండా తిరిగే ప్రాంతలో ఈ గోవు యదేచ్ఛగా తిరుగును గాక. గోవులే సంపద. ఇంద్రుడు నాకు గోవులను ప్రసాదించుగాక. కనిపించే ఈ గోవులన్నీ

ఇంద్రస్వరూపాలు. వాటిని మనఃపూర్వకముగా ఇంద్రునకు అర్పిస్తాను. ఓ గోవులారా! కృశించిన మానవులకు బలాన్ని కలిగించండి. అంబారావము చేసే ఆవులారా! మా యింటికి శోభని తీసుకురండి. మీపాడి ఉత్తమమైనది.

గోవులారా ! మీరంతా సంతానవతులై వర్ధిల్లండి. పచ్చిక మైదానంలో గడ్డి మేయండి. దిగటానికి వీలైన చెరువులయందుమాత్రమే నీరుత్రాగండి. మిమ్మల్ని ఎవరూ ఎత్తుకుపోకూడదు. అడవి మృగాలు మిమ్మల్ని బాధ పెట్టకూడదు. రుద్రుని ఆయుధాలు మిమ్మల్ని తాకరాదు. మీరు బాగా బలంగా వృద్ధిచెందండి. కడవలతో మాకు పాలుఇవ్వండి" ఈ సూక్తంతో మంత్రిస్తే గోవులు బలంగా ఆరోగ్యంగా ఉంటాయి. పాలు ఎక్కువగా ఇస్తాయి.

# 38. జూదంలో గెలవటానికి

జూదంలో గెలవాలంటే కేవలము ఆట నైపుణ్యమే కాదు. దైవం యొక్క సహాయ సహకారాలు ఉండాలి. వాటికోసం **నాల్గవ కాండలో ముప్పై ఎనిమిదవ సూక్తాన్ని** చెబుతోంది వేదం. జూదం ఆడబోయే ముందు పాచికలు ఈ సూక్తంతో మంత్రించి ఆ తరువాతనే ఆట ప్రారంభం చెయ్యాలి. ఇక సూక్తార్థం చూడండి.

ఈ అప్సర ముడివిప్పి ధనాన్నిస్తుంది. ఆటలో గెలిపిస్తుంది. ఆమెను స్తుతి చేస్తున్నాను. జూదంలో గెలుపు కలిగించే అప్సరసను ఆహ్వానిస్తున్నాను.

మంత్రశాస్త్రంలో ఇలాటి వాటికి యక్షిణీవిద్య ఉపయోగిస్తుంది. యక్షిణిని ఉపాసించి సేవలు చేయించుకోవటం జరిగేది. ఇక్కడ అప్సరను ఆహ్వానిస్తున్నాడు. అప్సరసాధుదేవి. పాచికలు ఒకచోటికి చేర్చు. విజయం కోసం రకరకాలుగా సహాయం చేసే అప్సరసను స్తుతి చేస్తున్నాను. జూదంలో నాకు గెలుపునిచ్చే అప్సరసను ఆహ్వానిస్తున్నాను. 'కృత' అనే అక్ష సంఖ్య వల్ల గెలిపించి అప్సర ఆనందంతో గంతులు వేస్తోంది. ఆమె నా పాచికల యందు 'కృత'మై నన్ను గెలిపించటానికి తనమాయతో నా పాచికలందు ప్రవేవించాలి. ఆమె నాకు పాడి కలిగించాలి. నా జూదధనము ఎదుటివాడు గెలవకుండా ఉండాలి.

అప్సర గెలుపు కలిగించేటప్పుడు ఏడిపిస్తుంది. మళ్ళీ గెలవటానికి కోపం తెప్పిస్తుంది. జూదంలో ఆ అప్సర పాచికలలో ప్రవేశిస్తుంది. ఆనందిని, ప్రమోదిని అయిన అప్సరను నేను ఇక్కడికి ఆహ్వానిస్తున్నాను.

అప్సరసలు సూర్యకిరణాలు వ్యాపించే చోట సంచరిస్తారు. వారి భర్తలు సుదూరంగా అంతరిక్షంలో తిరుగుతూ సకల లోకాలు రక్షిస్తూ ఒక ప్రత్యేక దిశయందు సంచరిస్తారు. సూర్యుడు అంతరిక్షంలోని అప్సరసలతో కూడి మేము సమర్పించే హవిస్సు తీసుకోవటానికి రావలసింది.

అప్సరసలతో కూడిన సూర్యదేవా ! నువ్వు తెల్లని దూడలను అడుగు. వాటిని పెంచి పెద్ద చేసినప్పుడు మంచిపాడి మాకు లభించును గాక. తెల్లని రంగులో ఉన్న ఆవు గోశాలలో ఉన్నది. మీరు ప్రత్యక్షమయి మా ఆశీస్సులు, నమస్కులు అందుకోండి.

అప్సరసలేని ఓ సూర్యదేవా ! నువ్వు తెల్లని దూడలను రక్షించు. వాటిని పెంచి పెద్దగాచెయ్యి. ఇదిగో ఈ గడ్డి మంచిముత్యమగు గాక. మా గోశాల ఆవులకు పుష్టిని కలిగించు గాక. ఈ త్రాడుతో దూడను కట్టేస్తాను. మేము దానికి యజమానిని అవ్వాలి. ఇప్పుడు కాకపోతే ఇంకొద్ది కాలానికైనా ఈ కోరిక నెరవేరుతుంది. అంటున్నాడు.

ఈ సూక్తంతో హోమం కూడా చెయ్యాలి.

జూదంలో ఎప్పుడూ గెలవటము అనేది జరిగేపని కాదు. ఒకసారి మనం గెలిస్తే ఇంకొకసారి ఇంకొకరు గెలుస్తారు. ఓడినవాడు ధనాన్ని పోగొట్టుకుంటాడు. గెలిచినవాడు గెలిచాననే ఆనందంతో సంబరం జరుపుకుని ధనాన్ని ఖర్చు చేస్తాడు. "నిన్నటిరోజున గెలిచాను" అనే ధీమాతో మరునాడు ఆడతాడు. గెలుపు ఓటమి దైవాధీనం. జూదంలో గెలిచి ధనం సంపాదించి కూడబెట్టిన వారు ఎందరున్నారో చూడండి.

నా చిన్నతనంలో మాయింటి దగ్గర ఒకవైశ్యుడు ఉండేవాడు. ఆ రోజున ఆయన జమిందారు. కోట్లకుపడగలెత్తాడు అనటానికి

గుర్తుగా మేడపైభాగంలో పాముపడగలు కూడా ఉండేవి. ఆయనకి పేకాట వ్యసనం. వేలఎకరాలు పంటభూమి. రెండుసార్లు బందిపోట్లు ఇంటిమీద దాడిచేశారు. అంత స్థితిపరుడు. పేకాటలో అంతా పోగొట్టుకున్నాడు. కొడుకులు ఎక్కడో చిన్నచిన్న ఉద్యోగాలు చేసుకుంటున్నారు. వెయ్యిగజాల స్థలంలో పెద్దమేడ. ఒక వృద్ధాశ్రమానికి ఇచ్చేశారు. ఆడపిల్లలకు పెళ్ళి కాలేదు. నాకన్న పెద్దవాళ్ళు. తినటానికి తిండికూడా లేక ఒక స్వామీజీ ఆశ్రమంలో తలదాచుకున్నారు.

ఎవరిదాకానో ఎందుకు? మాతాతగారు ముప్పై ఎకరాల పొలం ముప్పైవేల రూపాయలకు అమ్మి తెల్లవారేసరికి రూపాయి లేకుండా పేకాడి పోగొట్టుకున్నాడట. కాబట్టి జూదవమాడి ధనం సంపాదించినవాడు, బాగుపడినవాడు లేడు. అక్కడ బాగుండేది కేవలం జూదశాల నిర్వాహకుడికి మాత్రమే.

ఇటువంటి సూక్తాలు ఎన్ని చదివినా, ఎన్ని హోమాలు చేసినా, జూదంలో ధనార్జన చెయ్యటము, కలిసి రావటము ఇవన్నీ జరగని పనులు. జూదంలో ఓడిపోయిన ధర్మరాజు అడవులకు పోతే గెలిచిన సుయోధనుడు కుక్కచావు చచ్చాడు. కాబట్టి **జూదంలో గెలిచినవాడు, ఓడినవాడు ఇద్దరూ నష్టపోతారని గుర్తించండి. జూదం జోలికి పోకండి.**

# 39. సర్వసంపదల కోసం

అన్నిరకాల సంపదలు కావాలంటే **నాల్గవ కాండలోని ముప్పై తొమ్మిదవ సూక్తాన్ని** హోమం చెయ్యమన్నారు. ఇప్పుడు ఈ సూక్తం అర్థం చూద్దాం.

భూమిలోపలఉన్న అగ్ని కారణంగానే ప్రాణులన్నీ నిలుస్తున్నాయి. ఆ ప్రాణుల వల్లనే అగ్నిదేవుడు సమృద్ధుడు అవుతున్నాడు. నేను కోరిన ఫలితం లభించు గాక.

భూమి, ఆవు; అగ్ని, దూడ; అవుతున్నారు. ఆ పృథ్వి అగ్నులవల్ల మా కోరికలు తీరుతున్నాయి. ముందుగా మాకు సంతానము, పుష్టి, ధనము కలగాలి.

అంతరిక్షంలోని వాయువువల్లనే గంధర్వులు మొదలైన వారు నిలుచున్నారు. గంధర్వాదుల వల్లనే వాయువు సమృద్ధుడవుతున్నాడు. అలాగే నా కోరికలు ఫలించుగాక.

అంతరిక్షం ధేనువు, వాయువు వత్సము అవుతున్నాయి. వాటివల్ల మా కోరికలు తీరాలి. ముందుగా ఆయువువల్ల సంతానము, పుష్టి, ధనము, లభించుగాక.

ద్యులోకంలోని సూర్యుడి వల్లనే ఆ లోకవాసులు నుంచున్నారు. వారివల్లనే సూర్యుడు సమర్ధుడవుతాడు. అలాగే నా కోరికలు తీరాలి.

ద్యులోకము - ధేనువు, వాయువు - వత్సము అవుతున్నాయి. ద్యులోకంలో సూర్యునివల్ల మా కోరికలు తీరతాయి. మాకు ముందుగా ఆయువు, సంతానము, పుష్టి, ధనస్సు, ధనము కావాలి. దిశలలో ఉన్న చంద్రుడివల్లనే ప్రజలందరూ జీవిస్తున్నారు. ఆ ప్రజలవల్ల చంద్రుడు సమృద్ధుడు అవుతున్నాడు. అలాగే మా కోరికలు తీరుగాక.

దిశలు ధేనువు, చంద్రుడు వత్సము అవుతున్నారు. దిశాచంద్రుల వల్ల మా కోరికలు తీరుతున్నాయి. ముందుగా మాకు ఆయువు, సంతానము, పుష్టి, ధనము కలగాలి.

అగ్నియందు అగ్ని ప్రవేశించి సంచరిస్తోంది. ఆ అగ్ని ఋషులకు పుత్రుడవు తున్నాడు. అతడు అపవాదులనుంచి కాపాడుతున్నాడు. అందుకే అగ్నికి నమస్కారం చేస్తూ హవిస్సు అందిస్తున్నాము. దేవతలకు అందించే హవిర్భాగము వ్యర్థం కానివ్వము. ఓ అగ్నీ ! నీవు జాతవేదివి. విశ్వజ్ఞాతవు. నీకు ఏడుజిహ్వాలున్నాయి. హృదయపూర్వకంగా మనః పూర్వకంగా నీ ఏడు ముఖాల యందు నేతితో ఆహుతులు అర్పిస్తున్నాను. హవిస్సులు అందుకోవలసింది. మాకు సర్వసంపదలు అనుగ్రహించ వలసింది.

# 40. క్షయ, కుష్ఠురోగ నిర్మూలనకు

దీనికి ప్రత్యేకంగా 'కుష్ఠ' ఔషధం ఉన్నది. దాన్ని వెన్నతో కలిపి ఈ సూక్తంతో మంత్రించి రోగికి ప్రతిలోమంలో రాయాలి. ఈ విషయమంతా **ఐదవ కాండలోని నాల్గవ సూక్తం** వివరిస్తోంది. ఇప్పుడు సూక్తార్థం చూడండి.

ఓ కుష్ఠ ఓషధీ ! నువ్వు పర్వతాలలో పుట్టావు. ఓషధులలో బలమైన దానివి. రోగనాశనివి. బాధపెట్టే రోగాలు తగ్గిస్తూ రావలసింది.

హిమాలయపర్వతాలలో పుట్టిన ఈ ఓషధి ఆరోగ్యసాధిని అని తెలిసి వెళ్ళిన వారికి, ఇది రోగనాశని అనికూడా తెలిసింది.

స్వర్గలోకంలో అశ్వద్ధవృక్షం దగ్గర దేవతలు అమృతసమానమైన ఈ కుష్ఠ ఓషధిని కనుక్కున్నారు.

స్వర్గంలో హిరణ్యానౌక విహరించే చోట దేవతలు ఈ ఓషధిని కనుక్కున్నారు.

బంగారు నావమీద ఈ ఓషధిని తెచ్చారు.

ఓ కుష్ఠ ఓషధీ ! నన్నుఆవహించు, నాకు రోగంలేకుండా చెయ్యి. నేను ఆరోగ్యవంతుడు కావాలి. ఓషధీ ! నువ్వు దేవతల ఆధిపత్యంలో పుట్టినావు. సోమునికి మంచి మిత్రుడవు. ప్రాణ, వ్యాన, నేత్రాలకు సుఖం కలిగించు. ఈ ఓషధి హిమాలయాల్లో ఉత్తరదిశన జన్మించింది. అక్కడ నుంచి తూర్పువైపు వచ్చింది. అక్కడ ప్రజలంతా కుష్ఠకు 'ఉత్తమ' అనే బిరుదును ఇచ్చారు.

ఓషధీ ! నీ పేరు ఉత్తమము. ఇది సమస్త వ్యాధులను తగ్గిస్తుంది.

శిరోవ్యాధి, నేత్రవ్యాధి, శరీరంలో రోగాలు పుట్టించే పాపాలు, వీటన్నింటినీ ఈ ఓషధి నిర్మూలించుగాక అంటున్నారు. ఆ రోజున కుష్ఠు, క్షయ భయంకరమైన రోగాలు.

# 41. ఆరాతి (దరిద్ర దేవత)

లోకంలో ధనవంతుడు కావాలి, సుఖంగా ఉండాలి అంటే కేవలము సిరిసంపదలు వస్తే సరిపోదు. దరిద్రదేవత మనల్ని వదలిపెట్టి వెళ్ళిపోవాలి. లేకపోతే ఎంత సంపాదించినా ప్రయోజనం శూన్యం. అందుకే ముందు దరిద్రాన్ని వదిలించు కోవాలి. పూర్వకాలంలో ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు రత్నగిరి నగరంలో ఉండేవాడు. మంచి పండితుడు. కాని నిర్దనుడు. ఏ మాత్రం ధనం లేదు. దీని మీద బాగా ఆలోచించి రత్నగిరి నగరం నాకేమీ సరిపోలేదు. ఇక్కణ్ణించి నివాసం మార్చేస్తే ఎలా ఉంటుంది? అని ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు 'రత్నగిరిలో తను ఉన్న ఇల్లు ఖాళీ చేసి హిమగిరికి వెళ్ళిపోదాము అని'. ఈ మాట ఇంట్లో వారందరికీ చెప్పాడు. వారుకూడా ఆలోచించి అలాగే వెళ్ళిపోదాం అన్నారు. బండీ తీసుకు వచ్చి సామానంగా అందులో ఎక్కించారు. మొత్తం సామాను ఎక్కిన తరువాత, కుటుంబ సమేతంగా తను కూడా బండి ఎక్కటానికి వచ్చాడు. బండిలో ఒక ముసలావిడ కూచుని ఉంది. చూశాడు. ఆశ్చర్యపోయాడు. "ఎవరు నువ్వు" అని అడిగాడు. 'నాయనా ! నా పేరు జ్యేష్ఠాదేవి. నేను నిన్ను నమ్ముకునే ఇంతకాలం ఇక్కడ ఉన్నాను. ఇప్పుడు నువ్వేమో ఇక్కడి నుంచి వెళ్ళిపోతున్నావు. నువ్వు వెళ్ళిపోయిన తరువాత నాకు ఇక్కడ ఇంకేం పనుంది? అందుకే నేనుకూడా నీతోపాటే బయలుదేరాను.' అంది. అర్థమయింది బ్రాహ్మణుడికి. అయినప్పటికీ తెలియనట్లుగా నువు నాతో రావటమెందుకు, నువ్విక్కడే ఉండిపో అన్నాడు. ఆ మాటలు విన్న జ్యేష్ఠాదేవి ఓ వెర్రి బ్రాహ్మణుడా! నువ్వు చేసినకర్మ నువ్వే అనుభవించాలి. నువ్వు వండుకున్న అన్నం

నువ్వేతినాలి కదా! అంది. ఆ మాటలు విన్న బ్రాహ్మణుడు పరిస్థితిని పూర్తిగా ఆకళింపు చేసుకుని **“పొరుగూరు పోయినా పూనిన ఖర్మం తప్పదు”** అంటే ఇదే కాబోలు అనుకుని అమ్మా నువ్వు కూడా నాతో వచ్చేట్లయితే నేను  ఇల్లు ఖాళీ చేసి వెళ్ళటం ఎందుకు? అని భార్యా పిల్లలని పిలిచి ‘ఇల్లు ఖాళీ చెయ్యటంలేదు. మనం ఊరు వదలిపెట్టి పోవటంలేదు. సామాను దించండి అని సామానంతా దించేసుకున్నాడు.

మంన చేసిన కర్మఫలం మనమే అనుభవించాలి. మంచిగాని చెడుకాని. దరిద్రం పోవాలంటే దరిద్రదేవతనే ప్రార్థించాలి. అందుకే **ఐదవ కాండలోని ఏడవ సూక్తం** చూడండి.

“ఆరాతా! మాకు పుష్కలంగా ధనం ఇవ్వవలసినది. నువ్వు మా చుట్టుపక్కల కనిపించవద్దు. మేము ఇచ్చే దక్షిణలకు అడ్డురావద్దు.

ఆరాతి దేవీ ! కేవలము మాటలు చెప్పేవాణ్ణి నీ దగ్గర ఉంచుకోవద్దు. నీకు నమస్కారం చేస్తున్నాను. మమ్ములను బాధించవద్దు.

దేవతల విషయంలో మా భక్తి వర్ధిల్లుగాక. అమ్మా ! నువ్వు మాత్రము మమ్మల్ని అనుగ్రహించు. యజ్ఞయాగాలలో దేవతలను తృప్తిపిరచటం కోసం మధురవాక్కులు పలుకుతున్నాము.

మనసులో సరస్వతీదేవి అనుగ్రహంతో ఏ కోరిక అయితే ఉన్నదో, దాని విషయంలో నాకు శ్రద్ధ కలుగును గాక. ఆరాతీ ! మా భక్తిశ్రద్ధలకు ఆటంకం కలిగించవద్దు. ఇంద్రుడు అగ్ని మాకు నాలుగు దిక్కుల నుండి ధనము పంచెదరు గాక.

ఓ ఆరాతీ ! నీవు లేమిని కలిగిస్తావు. కృశింపచేస్తావు. పీడిస్తావు. కాబట్టి దూరంగా జరుగు. మా దగ్గరకు రావద్దు. మానవుల

సంకల్పాలని అవహేళన చేస్తూ అలసత్వ రూపంలో వారిని ఆవహిస్తున్నావు.

మా ఆశలన్నీ నాశనం చేస్తున్నావు. నీకు నేను నమస్కారం చేస్తున్నాను. మమ్మల్ని కరుణించు.

ఈ భూమి హిరణ్యవర్ణ. సుభగ అది హిరణ్యకశ్యపుని వశమైంది. అటువంటి రమణీయమైన ధరిత్రికి ఇట్టి దుర్గతి కలిగించిన ఆరాతికి నమస్కారము.

అమ్మా మమ్మల్ని కరుణించి మా జోలికి రావద్దు"

అని దరిద్ర దేవత అయిన 'ఆరాతి'ని ప్రార్ధిస్తున్నారు.

ధనం కావాలంటే ముందు దరిద్రాన్ని వదిలించుకోవాలి. దీనికోసం ప్రత్యేకమైన వ్రతం ఉంది. అందులో విష్ణుమూర్తినే దరిద్రదేవతగా భావించి పూజించమని పురాణాలు చెబుతున్నాయి.

# 42. కృత్యాప్రయోగనాశనము

కృత్య అంటే ఒక శక్తి. అభిచార హోమాలలో ఇది ప్రయోగించబడుతుంది. హోమం చేసే వ్యక్తికి తన శత్రువు మీద గాని, తనకు కీడు తలపెట్టిన వారిమీద కాని విపరీతమైన కోపం వచ్చినప్పుడు ఈ కృత్యను ప్రయోగం చేస్తాడు. ప్రయోగం చేసే వ్యక్తినిబట్టి దాని శక్తి ఉంటుంది. దక్షయజ్ఞం జరిగినప్పుడు దాక్షాయణి అక్కడ దగ్ధమై పోయింది. దాంతో ఈశ్వరుడు విపరీతమైన కోపంతో జటాజూటం నుంచి ఒక జడను పీకి నేలకేసి కొట్టాడు. ఆ జడ నుంచే మహాశక్తివంతమైన కృత్య ఆవిర్భవించింది. అదే వీరభద్రుడు, భద్రకాళి. ఇలా ఆవిర్భవించిన కృత్య తనకు ఒప్పగించిన కార్యము చేసిపోతుంది. అంబరీషోపాఖ్యానంలో కూడా ఇలాంటి కృత్యే దుర్వాసుడి వెంటపడింది. మరి ఇటువంటి ప్రయోగాలు జరిగినప్పుడు తప్పించుకునే మార్గం ఉండదా? ఉంటుంది. నిజం చెప్పాలంటే దుర్వాసుడే అంబరీషుడి మీదకి కృత్యని ప్రయోగించాడు. అంబరీషుడు సుదర్శన మహామంత్రం చేసి దాన్నుంచి తప్పుకున్నాడు. దీన్నే ప్రయోగాన్ని తిప్పికొట్టటం అంటారు. ఎప్పుడైతే అంబరీషుడు సుదర్శనం చేశాడో అప్పుడు ఆ కృత్యకాస్తా వెనక్కితిరిగి తనను ప్రయోగించిన దుర్వాసుని వెంటపడింది. మనం ఎప్పుడైతే దాన్ని త్రిప్పి కొట్టగలిగామో, అప్పుడు అదికాస్తా దాన్నిప్రయోగించిన వాడిమీదకి పోయి అతణ్ణి నాశనం చేస్తుంది. దేవీభాగవతంలో కూడా అంతే అయింది. ఇంద్రాది దేవతలు రాక్షసుల వెంట పడ్డారు. రాక్షసులు శుక్రాచార్యుడి తల్లి 'ఉశన'ను శరణు వేడారు. ఆవిడ సమ్మోహనశక్తిని

ప్రయోగించింది. దేవతలు పారిపోయారు. ఈ శక్తులు పారిపోతే వదలవు. వెంటపడతాయి. అంతేజరిగింది. దేవతలు పారిపోయారు. సమ్మోహనశక్తి వారి వెంట పడింది. దేవతలు శ్రీమహావిష్ణువును శరణు వేడారు. విష్ణువు చక్రాయుధం ప్రయోగించాడు. అది సమ్మోహనాన్ని నాశనం చేసి దాన్ని ప్రయోగించిన శుక్రుని తల్లిని కూడా రెండు ముక్కలుగా చేసింది. కాబట్టి సమర్ధవంతంగా తిప్పికొడితే అది ప్రయోగించిన వారిని సమూలంగా నాశనం చేస్తుంది. కృత్యనుగనక మనమీద ప్రయోగం చేస్తే దాన్ని ఏ రకంగా తిప్పికొట్టాలి అనేది **ఐదవకాండలో పద్నాల్గవ సూక్తం** వివరిస్తోంది.

ఓషధీ ! పంది ముట్టెతో తవ్వగా మొదట గరుత్మంతుడు నిన్ను చూశాడు. నీవు కృత్యవై మమ్మల్ని చంపదలచుకున్న వారిని చంపై. ఓషధీ ! కృత్యను ప్రయోగించే వాళ్ళని వధించు. మమ్మల్ని బాధ పెట్టాలి అనుకున్న వారందరినీ వధించు. పేరు పేరునా వధించు.

దేవతలారా ! హింసకుల ఆయుధాలు విరగొట్టండి. మానవుడు మోహవశుడై బంగారం పట్టినట్లు ఈ కృత్య ప్రయోగించిన వాణ్ణి పట్టుకుంటుంది.

ఓషధీ ! కృత్యను ప్రయోగించిన వాణ్ణి చేయి పట్టుకుని గుంజుకుపోయి సంహరించవలసింది.

ఈ కృత్య, అసలుకృత్యను ప్రయోగించిన వాడి మీదకి పోవుగాక. కృత్యను ప్రయోగించిన వాడు స్త్రీ అయినా, పురుషుడైనా, గుర్రం గుర్రంతో కలిసినట్లుగా, కృత్యను కృత్యనాశనం చేస్తుంది. కృత్యని దేవతలు ప్రయోగించినా, మానవులు ప్రయోగించినా, ఇంద్రుడితో స్నేహము చేసి దాన్ని త్రిప్పిపంపుతాము. ఏనుగు మృగం మీద దూకి

పట్టినట్లుగా, కృత్య ప్రయోగించిన వాణ్ణి చంపేస్తుంది.

భూవ్యాకాశాల్లారా ప్రయోగించిన బాణముల్లాగా, కృత్యప్రయోగించిన వాడిని సంహరించాలి.

అగ్నివాయువుకు ప్రతికూలంగానూ, నీరు పల్లానికి ప్రవహించినట్లుగా నువ్వు కృత్యను సంహరించవలసినది" అంటూ ఈ సూక్తాన్ని హోమంచెయ్యాలి.

# 43. క్రిమిచికిత్స

క్రిములను నాశనం చెయ్యటానికి చికిత్సావిధానము చెబుతున్నారు **ఐదవకాండలోని ఇరవై మూడవ సూక్తంలో** కరవీరపు (గన్నేరుచెట్టు) వేరును పాలతో శుభ్రంగా కడిగి అభిషేకం చేసి చేతికికట్టాలి. ఇప్పుడు సూక్తార్థం చూడండి. భూమ్యాకాశాలు, సరస్వతి నన్ను అనుగ్రహించారు. వారు క్రిములను నాశనం చేస్తారు.

ఇంద్రా! ఈ కుమారుని క్రిములు హతమార్చు. నా మాటలవల్ల సమస్త శత్రువులు నాశనమైనారు.

నేత్రాలు, శ్రోత్రాలు, ముక్కులు, పల్లు వీటియందు క్రిములు నాశనమై పోయినాయి.

ఒకే రూపం గలవి రెండు, రెండు రూపాలు గలవి రెండు ఇలా అన్ని క్రిములు నాశనమవుతున్నాయి.

అనేక రూపాలున్న క్రిములన్నీ నాశనమవుతున్నాయి. కంటికి కనిపించని క్రిములను సూర్యుడు నాశనం చేస్తాడు. క్రిములలో వేగంగా ఎగిరేవి, పీడించేవి, గడగడ లాడించేవి, కంటికి కనిపించనివి వీటన్నింటిని హతమార్చండి. వేగంగా పరుగుపెట్టేవి నాశనమైనాయి. మెల్లగా నడిచేవి నాశనమయినాయి. శనగలను రాయితో రుద్దినట్లుగా క్రిములను నలిపి నాశనం చేశాము.

త్రిశీర్ష, త్రికకున, సారంగ, అర్జున, వర్ణక్రిములను నాశనం చేస్తున్నాము. వాటి పక్కటెముకలు విరుస్తున్నాము. తలలు తుంచేస్తున్నాము. క్రిములారా ! అత్రిమహర్షిలాగా, జమదగ్నిమహర్షిలాగా మిమ్మల్ని హతమారుస్తున్నాను. అగస్త్యుని మంత్రశక్తితో మిమ్ము నాశనం చేస్తున్నాను.

క్రిముల రాజు, మంత్రి నశించారు. సోదరులు, బంధువులు నశించారు. క్రిములను వంశమూలంగా నాశనం చేశాము.

క్రిములలో ఆడవాటిని, మగవాటిని రాయితో కొట్టి చంపాము. కొన్నింటిని నిప్పుతో కాల్చి బూడిద చేశాము. క్రిములన్నీ పూర్తిగా నాశనమయి పోయినాయి.

# 44. యాగవిఘ్నశాంతి

యజ్ఞయాగాదులు జరుగుతున్నప్పుడు అనేక రకాల విఘ్నాలు వస్తాయి. ముఖ్యంగా ఇవి రెండు రకాలు. 1. ఆ పని మనం ప్రారంభించకుండా చేసేవి. ఒక్క యజ్ఞయాగాలకే కాదు. ఇలాటి విఘ్నాలు ప్రతిదానికీ వస్తాయి. ఏదైనా ఒక మంచి పని చెయ్యాలి అనుకుంటే రాక్షసులు ఆ పని సాగనివ్వరు. ఈ రాక్షసులు ఎక్కడో ఉండరు. మన చుట్టుపక్కలే ఉంటారు. మనకి స్నేహితులుగానో, మేలుకోరే వాళ్ళుగానో ఉంటారు. కాని మనల్ని తప్పుదోవ పట్టించటానికి ప్రయత్నం చేస్తుంటారు. వీళ్ళు అంతఃశ్శత్రువులు కాదు. బాహ్యాశత్రువులు. మనం ఈ పని చెయ్యటం వాళ్ళకి ఇష్టం ఉండదు. అందుకే సలహా చెబుతున్నట్లే ఉంటారు. కాని అది మంచి సలహా కాదు. శల్యసారథ్యం చేస్తారు. మనం ఆ పని ప్రారంభించకుండా చూడాలని వారి కోరిక. ఇక రెండోవారు. ఏమైనా సరే. మనం ఆ పని ప్రారంభం చేశాం. అది పూర్తవటం వీళ్ళకి ఇష్టం ఉండదు. ఎంతసేపూ మనం ముందుకు సాగకుండా ఉండాలని ప్రయత్నం చేస్తారు. వీలైనప్పుడల్లా వాళ్ళ ప్రయత్నం వాళ్ళు చేస్తుంటారు. ఇక్కడ మనం గుర్తించాల్సిన విషయం ఏమంటే ఈ ప్రయత్నం చేసేది మన మిత్రుల రూపంలో ఉన్న రాక్షసులు అందుకే వీళ్ళదగ్గర ద్వైదీభావం కనిపిస్తుంది. ఒకసారి మనకి పూర్తిగా సపోర్టు చేస్తుంటారు. కాని సమయం వచ్చేసరికి కుంటి సలహాలు ఇస్తుంటారు. వీళ్ళు మనవాళ్ళు అని నమ్మితే మనం పూర్తిగా మునిగిపోయినట్లే. ఇదంతా కూడా అనుభవైకవేద్యము. ఇటువంటి విఘ్నాలు కలిగినప్పుడు మనం చాలా ఇబ్బందులు ఎదుర్కోవాల్సి వస్తుంది. అందుకని ముందుగానే ఈ విఘ్నాలు రాకుండా **ఆరవకాండలోని నాల్గవసూక్తాన్ని** చెబుతున్నారు.

తల్లిరూపంలోనే దూడ ఉండే ఆవుయొపాలతో పాయసం చేసి, దాన్ని ఈ సూక్తంతో మంత్రించి యజమాని దాన్ని తినాలి. ఆ తరువాత నెయ్యి, తేనె, పాయసము మూడు కలిపి హోమం చెయ్యాలి. ఈ సూక్తానికి అర్థం చూడండి. ఆరవకాండలోని అన్ని సూక్తాలలోను ఆరు మంత్రాలే ఉంటాయి.

సోమదేవా ! జగత్తును అనుగ్రహించే అదితి, మిత్రుడు మొదలైన వారు ఏ మార్గంలో సంచరిస్తారో, ఆ మార్గంలోనే మమ్మల్ని రక్షించటానికి రావలసింది.

ఓ సోమదేవా ! ఏ బలంతో నువ్వు రాక్షసులను మాకోసం వశపరచుకొన్నావో, ఆ బలంతోనే నువ్వు మమ్మల్ని నీ వారిగా చెప్పవలసింది.

దేవతలారా ! ఏ బలంతో మీరు అసురులబలాన్ని క్షీణింపచేస్తున్నారో, ఆ బలంతోనే మాకు సుఖశాంతులు ప్రసాదించండి. భార్యా ! నన్నే కామించు. తీగ చెట్టును అల్లుకున్నట్లుగా విడవకుండా నన్ను ఆలింగనం చేసుకో.

భార్యా ! నువ్వు నన్నే కామించు. నన్ను విడవకుండా ఉండేందుకు, పక్షి ఎగిరేటప్పుడు రెక్కలు కొట్టుకున్నట్లుగా నీ మనసును బాధించి వశపరచుకుంటాను.

ఓ భార్యా ! నువ్వు నన్నే కామించు. సూర్యుడు భూమ్యాకాశాలను వ్యాపించినట్లుగా నేను నీ నిండా వ్యాపించి ఉంటాను అంటున్నారు.

# 45. జయం కోసం

యుద్ధానికి వెళ్ళిన తరువాత జయాపజయాలు దైవాధీనాలు. బలమున్నవాడు గెలుస్తాడు. సైన్యం ఉన్నవాడు గెలుస్తాడు. అలా చెప్పటానికి లేదు. పదకొండు అక్షోహిణీల సైన్యం ఉన్న కౌరవులు, అందులో మూడువంతులు బలం కూడా లేని పాండవుల చేతిలో ఓడిపోలేదా! అందుకే గెలుపు, ఓటమీ దైవాధీనం అన్నారు. అలా చూస్తూ ఊర్కోలేం కదా ! మన ప్రయత్నం మనం చెయ్యాలి. అందుకే **ఆరవ కాండలో ఏడవ సూక్తం** ఒక చిన్న మంత్రం చెబుతోంది. ఈ సూక్తంతో మంత్రించిన తాయత్తు చేతికి కట్టి, ఆజ్యహోమం చెయ్యాలి. సూక్తార్థం చూడండి. దేవతల ఆయుధాలకి, రాజుల ఆయుధాలకి, వైశ్యుల ఆయుధాలకి, అన్నింటికీ నమస్కారము. ఓ మృత్యుదేవతా నీకు నా నమస్కారము.

ఓ మృత్యుదేవతా ! నీకు అనుకూలంగా చెప్పేవాడికి, వ్యతిరేకంగా ఉండేవాడికి అందరికీ నమస్కారం చేస్తున్నాను. నీ దుష్టబుద్ధికి, సద్బుద్ధికి కూడా నమస్కారము.

యాతుధానులకు నమస్కారము. (యాతుధానులు అంటే రాక్షసులు) వైద్యానికి నమస్కారము. మృత్యుకారణానికి నమస్కారము. బ్రాహ్మణులందరికీ ఇదే నమస్కారము. ఈ యుద్ధంలో నన్ను గెలిపించండి. నాకు విజయం చేకూర్చండి.

# 46. గర్భం గట్టిపరచటానికి

మానవులందరి శరీర పరిస్థితి ఒకే రకంగా ఉండదు. కొంతమంది శరీరం గట్టిగా ఉంటుంది. కొంతమందికి ఉండదు. కొంతమంది స్త్రీల శరీరనిర్మాణం గర్భాధారణ చేసేందుకు వీలుగాఉండదు. పిండం ఉత్పత్తిగానే గర్భస్రావం జరుగుతుంటుంది. అటువంటి వారి కోసం గర్భం గట్టి పరచటానికి **ఆరవకాండలో తొమ్మిదవ సూక్తం** దీన్ని గురించి చెబుతోంది. ఒక త్రాడు మంత్రించి గర్భిణీ స్త్రీ నడుముకు కట్టాలి. ఆ తరువాత పొలంలోని మట్టి, నల్లటిదుమ్ము మంత్రించి గర్భిణీస్త్రీ పడుకునే మంచం మీద జల్లాలి. తరువాత ఈ సూక్తంతో హోమం చెయ్యాలి. సూక్తార్థం చూడండి.

ఈ మహాపృథ్వి సమస్త భూతాలను గర్భంలో ధరించినట్లుగా ఈమె ప్రసవించే వరకు గర్భాన్ని ధరించి ఉండాలి.

ఈ నేల ఏ రకంగా వనస్పతులను ధరించి ఉంటుందో, అలాగే ఆమె ప్రసవించే వరకు గర్భాన్ని ధరించి ఉండును గాక. ఈ భూమి చరాచరాత్మక జగత్తును ఏ రకంగా ధరించి ఉంటుందో అలాగే ఈవిడ ప్రసవం అయ్యే వరకు గర్భాన్ని ధరించి ఉండుగాక.

ఈమె ప్రసవము అయ్యే వరకు గర్భాన్ని ధరించి ఉండి పండంటి బిడ్డకు జన్మనిచ్చుగాక.

# 47. జలోదరం

ఇది ఒక రకమైన వ్యాధి. కడుపునిండా నీరు చేరుతుంది. ఇంకా ఎక్కువైతే కాళ్ళకి కూడా నీరు పడుతుంది. అలాంటి వాళ్ళు కొంచెం ప్రమాదంలోఉన్నట్లే. పూర్వకాలంలో అయితే ఇది ప్రాణాంతకమైన జబ్బు. దానికి నివారణోపాయంగా చెబుతున్నారు **ఆరవకాండలోని పన్నెండవ సూక్తాన్ని.** రాత్రింబవళ్ళు ఎడతెగకుండా ప్రవహించేది, జనులకు ప్రాణదాయని జలము. శ్రేష్ఠమైన కర్మలు చేసే నేను ఆ జలదేవతను ఆహ్వానిస్తున్నాను.

అవిభిన్నముగ ప్రవహించే జలము ఫలప్రాప్తి కోసం మమ్మల్ని సమస్త పాపాల నుండి విముక్తులను చేయుగాక.

సవిత ప్రేరణ వల్ల మానవులు కర్మలు చేస్తారు. జలానికి శాంతి కలుగుతుంది. ఓషధులు సుఖప్రదము అవుతాయి.

హిమాలయ పర్వతాల నుండి బయలుదేరిన నదులు అన్నీ సముద్రంలో కలుస్తున్నాయి. అలా సముద్రంలో కలిసే నదులు నా కోసం మంచి ఓషధులను తీసుకురావాలి.

నా శరీరంలో కళ్ళు, కాళ్ళు, చేతులు, పిక్కలు వివిధ భాగాలను బాధపెట్టే వ్యాధులకు జలదేవత ఓషధులనిచ్చుగాక. వ్యాధులను తొలగించే ఓషధులు, వాటి చికిత్స ఈ జలానికి తెలిసి ఉన్నది.

నదులారా ! మీరంతా సముద్ర పత్నులు. సముద్రుడు మీకు ప్రభువు. మీరు ఆరోగ్యాన్ని ప్రసాదించే ఓషధులను మాకు ప్రసాదించండి. అందువల్ల మేము అన్నవంతులము అవుతాము. జలోదరం నుంచి తప్పించుకోగలుగుతాము.

# 48. రాక్షసపీడనివృత్తి

రాక్షసులు అంటే వీళ్ళకి ఏమీ కొమ్ములు ఉండవు. వికృతంగా ఉండరు. మెడలో పుర్రెలమాల ఉండదు. మనలాగానే ఉంటారు. కాకపోతే మహా దుర్మార్గులు అందులోను ప్రథమశ్రేణికి చెందిన దుర్మార్గులు, నీచులు. ప్రథమశ్రేణికి చెందిన అంటే ఏ రకమైన పని చెయ్యటానికి వెనకాడరు. ధర్మాధర్మాలు ఉండవు. నీతి న్యాయం ఉండవు. దయ క్షమ అనేవి వీరిని ఘంటువులోనే కనపడవు. పరోపకారం – ఈ పదం కూడా వీరికి తెలియదు. స్వార్థం. కేవలం స్వార్థం. తమకోసం ఇతరులు ఎంతమంది బలైపోయినా ఫరవాలేదు, దేశం మొత్తం నాశనమైనా ఫరవాలేదు, వాళ్ళ కోరిక తీరాలి.. అంతే ఇది రాక్షసత్వం. ఈ రకమైన లక్షణాలు ఉన్నవారంతా ఒక జాతి. వీరి ప్రవర్తన బట్టే వీరి వేషభాషలు, ఆహారవ్యవహారాలు ఉంటాయి. వీరు ఎక్కడో ఉండరు. మనలోనే ఉంటారు. మనతోపాటే ఉంటారు. పూర్వకాలంలో అరణ్యాలలో నివాసాలు ఏర్పాటు చేసుకుని నివసించేవారు. కాని ఇప్పుడు అరణ్యాలు నరికేశారు. అక్కడ చోటులేదు కాబట్టి మనతోపాటే, సభ్యసమాజంలోనే ఉంటున్నారు. కొంతకాలం క్రితం హైదరాబాద్ జంతు ప్రదర్శనశాలలో ఒక వయసులో ఉన్న ఆడపులిని పీక తెగ్గోసి, దాని చర్మం వలిచి తీసుకుపోయారు. అందుకే వీరిని చూస్తే క్రూరమృగాలైన పులులు, సింహాలు కూడా భయపడతాయి. ఇవాల్టి రోజున దారి కాచి, దోపిడీ చేసి, బస్సులోని వారందర్నీ సజీవంగా తగలబెట్టేసేవారు, అత్యాచారం చేసి సాక్ష్యాలు దొరకుండా హత్యలుచేసి ఆనందించేవారు. వీరంతా రాక్షసజాతి వారే. పురాణాలలోని రాక్షసులు కూడా వీరిని చూసి సిగ్గు పడతారు. వీళ్ళపీడ మనకి తగలకుండా ఉండటానికి **ఆరవకాండలో పదిహేడవ సూక్తం**

ఒక మంత్రం చెబుతోంది. ఇందులో సమిధలతోపాటుగా పదమూడు రకాల ద్రవ్యాలతో హోమం కూడా చెయ్యాలి. ఇది తంత్రం. ఇక సూక్తార్థం చూడండి.

లోకాలకు ప్రభువైన అగ్నిని చక్కని స్తుతులతో ప్రార్థించండి. అతడు మనల్ని శత్రువుల బారినుంచి రక్షిస్తాడు.

అగ్ని తన తీక్షణమైన తేజస్సుతో రాక్షసులను సంహరిస్తాడు. అగ్నిదూరదేశంలో ఎడారి ఇసుకలో ప్రకాశిస్తున్నాడు. అగ్ని అన్ని లోకాలను చూస్తున్నాడు. అతడు సూర్యుడి రూపంలో ప్రకాశిస్తున్నాడు.

భూలోకంపైన అంతరిక్షము, అందులో తెల్లటి అగ్ని అదే సూర్యుడు.

మనల్ని రక్షించటం కోసం వైశ్వానరాగ్ని దూరతీరాల నుంచి మా స్తుతులు విని ఇక్కడికి వస్తాడు.

ఇక్కడికి వచ్చి యజ్ఞంలో మనమిచ్చే ఆహుతులు స్వీకరిస్తాడు.

వైశ్వానరాగ్ని మనమిచ్చే ఆహుతులు స్వీకరించి మన శత్రువులను, రాక్షసులను సంహరించి, మనకు రక్షణ కల్పిస్తాడు. రాక్షస పీడనివృత్తి చేస్తాడు.

ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. ఈ సూక్తం చదివితే నిజంగా అగ్నిదేవుడు వచ్చి మనల్ని రక్షిస్తాడా? మనకి కనిపిస్తాడా? అని.

రక్షిస్తాడు. కనిపిస్తాడు కూడా. ఇక్కడ గుర్తించవలసిన విషయం ఏమంటే మన ప్రార్థనలో ఆర్తి ఉండాలి. దేవత వచ్చినా మీరనుకుంటున్నట్లుగా కిరీటం పెట్టుకుని, ఆభరణాలు ధరించి, వాహనం ఎక్కి అలా రాదు. నీకు తెలిసిన రూపంలోనే వస్తుంది. అంటే నీ బంధువు రూపంలోనో, స్నేహితుడు, పరిచయస్తుడు

రూపంలోనో, ఏదీ కాకపోతే సాటిమానవుడుగా వస్తుంది. ఒక్కొక్కసారి సరిగ్గా అఘాయిత్యం జరగబోయే సమయానికి ఎవరో అటుగా రావటం, ఈ దుర్మార్గుడు పారిపోవటం జరుగుతుంది. భగవంతుడే ఆ (ఎవరో) రూపంలో వచ్చి నిన్ను రక్షించాడు అని గుర్తించండి. ఈ రకంగా ఈ సూక్తంతో రాక్షసపీడ నివృత్తి అవుతుంది.

# 49. భార్యాభర్తల మధ్య కోపము

ఏ వ్యక్తికైనా సరే ఇంకొకరు చెప్పిన మాట నచ్చదు. వాళ్ళు చేసే పనీ నచ్చదు. అంతదాకా ఎందుకు మనం చేసిన పని చాలాసార్లు మనకే నచ్చదు. ఒక పని చేస్తాడు. కొంతసేపటి తరువాత అలాకాదు ఇలా ఉండాలి అనుకుంటాడు. కాని ఈ లోపల ఆ పని అయిపోతే దాని ఫలితం అనుభవించాలి. ఇలా తను చేసిన పని తనకే నచ్చనప్పుడు, ఇంకొకరు చేసిన పని ఎలా నచ్చుతుంది? అందులోను భార్య లేదా భర్త చేసిన పని ఎలా నచ్చుతుంది? భార్య అంటే తనకన్న తక్కువ స్థితిలో ఉన్నది. తనమీద ఆధారపడి జీవించేది. అది నిజం కాకపోయినా సరే. ఈ భావన అంతరాంతరాళాల్లో ఖచ్చితంగా ప్రతివాడికీ ఉండి తీరుతుంది. ఇక్కడ విచిత్రం ఏమంటే అదే పని భార్య చేస్తే నచ్చదు. పక్కింటి ఆవిడ లేదా ఆఫీసులో సహోద్యోగి, ఇలా బయటవాళ్ళు చేస్తే నచ్చుతుంది. ఇదీ సహజమే 'పొరుగింటి పుల్లకూర' అనేది అందుకే కదా, భార్యా భర్తలలో ఎవరికైనా ఇది ఒకటే. అందుకే ఇద్దరిమధ్య తగాదాలు. అవి బాగా ముదిరిపోతే ఇబ్బందులు. ఇప్పుడు ఇక్కడ ఈ రకమైన తగాదా బాగా ముదిరిపోయింది. ఒకరి ముఖం ఒకరు చూడటానికి కూడా ఇష్టపడటంలా అటువంటి సమయంలో **ఆరవకాండలోని ఇరవై ఒకటవ సూక్తం** చూడండి. ఇక్కడ తంత్రం ఏమంటే చేతిలోకి ఒక రాయిని తీసుకుని ఈ సూక్తంతో మంత్రించి, ఆ రాయిని నేలకేసికొట్టి, దానిమీద ఉమ్మి వేయాలి. భార్య, భర్త ఎవరైనా సరే ఇదేపని చెయ్యాలి. చేసేవారి మనసులో అవతలి వారిమీద కోపం పోవాలి అనే భావన ఉండాలి. ఇక సూక్తార్థం చూడండి. ధనుస్సుకు నారిని తీసేసినట్లుగా, నీమీద

కోపాన్ని పోగొడుతున్నాను. ఇక నుంచి మనం ఒకే మాటమీద స్నేహితుల్లా కలిసి ఉందాము.

మనం స్నేహితుల్లా కలసి ఉండటానికి, నీ మీద కోపాన్ని పెద్ద బండరాయి క్రింద పారేస్తున్నాను. ఆ కోపాన్ని కాళ్ళతో త్రొక్కి వేస్తున్నాను. కాలిక్రింద నలిపి వేస్తున్నాను. నువ్వు నాకు అనుకూలుడవు కావలసింది”

ఈ భావన త్రికరణశుద్ధిగా రావాలి. భార్య లేదా భర్త అవతలి వ్యక్తిమీద కోపం పోవాలి అని మనస్ఫూర్తిగా కోరి ఈ సూక్తంతో పైన చెప్పినట్లు చేసి, హోమం చేస్తే వారుకోరినట్లు తప్పనిసరిగా జరిగి తీరుతుంది. ఇందులో సందేహం లేదు. అయితే అలా జరగాలని వారు తీవ్రంగా వాంఛించాలి.

# 50. క్షిప్రవాతము (పక్షవాతము)

క్షిప్రము అంటే – శీఘ్రము, వడి గలది, వెంటనే అని అర్థం. ఇక వాతము అంటే – శరీరంలోని ఒక రుగ్మత. వాతము, పిత్తము, శ్లేష్మము. ఇందులో వాతము గనక ఎక్కువైతే శరీర భాగాలు కదలవు. పట్టేస్తాయి. ఆ భాగం పని చెయ్యదు. వైద్యశాస్త్రం ప్రకారం శరీరంలోని ఆ భాగానికి రక్తప్రసరణ అందదు. దాంతో ఆ భాగం చచ్చుపడిపోతుంది. ఇప్పుడు క్షిప్రవాతము అంటే వెంటనే వచ్చే వాతము. ఉన్నట్లుండి క్షణాల్లో వచ్చేస్తుంది ఈ రకమైన రోగం. సాధారణంగా శరీరంలోని ఒక భాగానికో, కాలు, చెయ్యి, మూతి ఒక కాలు ఒక చెయ్యి. ఇలా ఏమైనా జరగచ్చు. దీన్నే మనం పక్షవాతం అంటాము. ఇలా పక్షవాతం వస్తే తగ్గటానికి రోజులు పట్టచ్చు, నెలలు, సంవత్సరాలు పట్టచ్చు. అసలు తగ్గకనే పోవచ్చు. జీవితాంతం మంచంలోనే ఉండచ్చు. అటువంటి పక్షవాతానికి ఆయుర్వేదం, ఇంగ్లీషు వైద్యం అన్ని రకాల మందులు ఉన్నాయి. కాని అథర్వవేదంలో **ఆరవ కాండలోని యాభైమూడవ సూక్తంలో** దీనికి మందు, మంత్రము చెప్పటం జరుగుతోంది. పిప్పలిని ఈ సూక్తంతో మంత్రించి తినాలి. తరువాత సూక్తాన్ని హోమం చెయ్యాలి. అసలు మానవుడు ఆరోగ్యంగా జీవించాలంటే ఒక్క పిప్పలి చాలు. దీన్నే మనం పిప్పళ్ళు అంటాం. ప్రసవానంతరము స్త్రీకి ఇచ్చే కట్టెకారంలో పిప్పళ్ళపాలే చాలా ఎక్కువ ఉంటుంది. నోట్లో వేసుకుంటే తిమ్మిరి తిమ్మిరిగా ఉంటుంది. సరస్వతీ హోమం చేసేటప్పుడు దీన్ని వాడతాం. సూక్తార్థం.

పిప్పలి క్షిప్రవాతానికి ఔషధము. దీనిని మించినది ఇంకొకటి లేదు. దీన్ని సాక్షాత్తు దేవతలు సృష్టించారు.

పిప్పళ్ళు పుట్టినప్పుడే "జీవించి ఉన్న వ్యక్తి యందు మనము వ్యాపించి ఉన్నట్లైతే అతడికి ఏ రకమైన హాని కలగదు" అనుకున్నాయి.

ఓ పిప్పలీ ! నువ్వు వాతరోగానికి క్షిప్రవ్యాధికి దివ్యౌషధమై ఉన్నావు. నిన్ను ముందుగా అసురులు నాటారు. ఆ తరువాత దేవతలు వృద్ధి చేశారు.

పిప్పలిని నాటినవాళ్ళు రాక్షసులు. పెంచి పెద్ద చేసిన వాళ్ళు దేవతలు. కాబట్టి దేవదానవులకిద్దరికీ దీని ఉపయోగం తెలుసు. అందుచేత ఓ పిప్పలీ ! నా క్షిప్రవాతాన్ని (పక్షవాతము) నయం చెయ్యవలసింది.

# 51. శంఖపుష్పి

ప్రస్తుతం మనం ఆయుర్వేద ఔషధంగా వాడుతున్నాము. ఇది చాలా బలవర్ధకమైన ఔషధం. దీని వేరు తవ్వితీసి ఈ సూక్తంతో మంత్రించి చేతికి కట్టుకోవాలి. దీని పూలు తలో పెట్టుకుంటారు. సౌభాగ్యం కోరేవారు దీన్ని వాడాలి. దీని వివరాలు **ఆరవకాండలోని అరవైరెండవ సూక్తంలో** చెప్పబడ్డాయి. ఈ సూక్తానికి అర్థం చూడండి. ఖురాకార భగదేవత వల్ల నేను సౌభాగ్యవంతుడనవుతున్నాను. మేము చేసిన సేవకు ప్రసన్నుడై ఇంద్రుడు మాకు సౌభాగ్యం ప్రసాదిస్తాడు. శత్రువులు మమ్మల్ని వదిలిపోవాలి.

ఓషధీ ! నీవు భగదేవత వర్చస్సు గలదానవు. ఇతర వృక్షాలు ఏవీ కూడా నీ ముందు ఆగవు. అటువంటి నువ్వు నన్ను సౌభాగ్యవంతునిగా చేయవలసింది. శత్రువులంతా పారిపోవాలి. భగుడు అంధుడు. ఈ కారణంచేత పట్టిన చెట్టుమీదనే ఉంటున్నాడు. ఇతడు నాకు సౌభాగ్యము కలిగించు గాక. నా శత్రువుల పారిపోదురు గాక. నాకు సౌభాగ్యము కలుగుగాక.

# 52. గండమాల

ఇది చిన్న పిల్లలకి వచ్చే ఒక రకమైన రోగం. క్షణాలో వచ్చేస్తుంది. రాత్రంతా బాగానే ఉంటుంది. కాని తెల్లవారేప్పటికి మెడ చుట్టూ కాయలు కాయలుగా వస్తాయి. కొన్ని ఎర్రగా, కొన్ని నల్లగా ఉంటాయి. ఈ కాయలు కొన్ని పెద్దవిగా కొన్ని చిన్నవిగా కూడా ఉంటాయి. పూర్వకాలంలో ఇది వచ్చేది. చాలా ప్రమాదకరమైన జబ్బు. ఆ రోజుల్లో దీనికి మందు లేదు. దీన్నే 'కంఠమాల' అని కూడా అనేవారు. దీనికి చిట్కావైద్యమే చేసేవారు. ఆ రోజుల్లో వైద్యశాస్త్రం కూడా పెద్దగా అభివృద్ధి చెందలేదు. ఈ రోగం వచ్చిన వాళ్ళు బ్రతకటం చాలా కష్టం. ఆశలు వదిలేసుకోవటమే. గణపతి సచ్చిదానందస్వామి వారికి చిన్నతనంలో ఈ వ్యాధి సోకింది. వాళ్ళ నాన్నగారు నరసింహశాస్త్రి గారు అంతా అయిపోయిందని శోకాలు కూడా పెట్టేశారు. అప్పుడు వాళ్ళ అమ్మ జయలక్ష్మమ్మ గారు ఆయనతో కొంచెం గట్టిగా "బాధపడి ఉపయోగం లేదు కదా! పోయి కాస్సేపు జపం చెయ్యండి" అంటుంది. ఆ తరువాత పిల్లవాడు (సత్యన్నారాయణ ఈయనే ఇప్పుడు గణపతి సచ్చిదానంద స్వామి) తిప్పుకున్నాడు. ఈ విషయం ఆయన జీవిత చరిత్రలో ఉంది. దాన్ని నేను నలభై గంటలు సి.డి.గా ఉపన్యాసం చెప్పాను. ఇంతకీ విషయం ఏమంటే ఆ రోజుల్లో మందులు లేని మహమ్మారి. వైరస్ ద్వారా క్షణాల్లో వ్యాపించి ప్రాణాలు తీసేస్తుంది. గండమాల దాని పరిమాణాన్ని బట్టి మూడు రకాలుగా చెప్పబడుతుంది. 1. అల్పగండమాల 2. మధ్యవిధ గండమాల 3. అసాధ్యపు గండమాల. దీన్ని గురించి అథర్వణ వేదంలో **ఆరవ కాండలో రెండుసార్లు పదమూడవ సూక్తంలోను, నలభై ఒకటవ సూక్తంలోను. ఏడవ కాండలో పందొనిమిదవ సూక్తంలోను** మొత్తం మూడుసార్లు చెప్పటం

జరిగింది. అంటే ఆ రోజుల్లో ఇది ఎంత ప్రమాదమైన రోగమో ఊహించండి. ముందుగా **ఆరవకాండ పదమూడవ సూక్తం** : ఈ సూక్తంతో హోమం చెయ్యండి అన్నారు. సూక్తార్థం

1. గొంతుమీద నరముల యందు యాభైఐదు రకాలుగా వ్యాపించిన గండమాలలు మమ్ము వదలిపోవు గాక.

గొంతులో నాడులయందు వ్యాపించిన డెబ్బైఏడు గండమాలలు మమ్ము వదిలిపోవు గాక.

స్కంద ధమనులయందున్న తొంభైతొమ్మిది గండమాలలు మమ్ము వదిలిపోవు గాక.

నలభై ఒకటవ సూక్తంలో దీనికి కొంత తంత్రం కూడా చెబుతున్నారు.

శంఖం ఆరగదీసి మంత్రించి, కుక్క చొల్లును గండమాలల మీద రాయాలి.

బల్లిని మంత్రించి గండమాలల మీద కట్టాలి. ఇది అందులోని రక్తాన్ని పీల్చేస్తుంది.

సైంధవ లవణం గండమాలల మీద వేసి దానిమీద ఉమ్మి వెయ్యాలి. గండమాలలు గోమూత్రంతో కడగాలి.

దంతమలాన్ని మంత్రించి గండమాల మీద పుయ్యాలి.

**41వ సూక్తార్థము :** గండమాలా ! నా శరీరం నుంచి పక్షిలాగా ఎగిరిపో. ఆదిత్యుడు నీకు చికిత్స చేయుగాక. అమృతమయమైన చంద్రుడు. నిన్ను దూరము చేయుగాక. గండమాలలో ఒకటి ఎరువు కలిసిన తెలుపుది. ఇంకొకటి తెల్లనిది. ఇంకొకటి నల్లనిది. రెండు ఎరుపు రంగువి. గండమాలా ! నీ పేర్లు చెబుతున్నాను. మమ్మల్ని

చంపవద్దు. వదిలివెళ్ళు. మళ్ళీ పుట్టనిది, రామాయణనాడిని బాధించునది అయిన గండమాల రాలిపోవాలి. బాధ తగ్గిపోవాలి. గోమూత్రము దీన్ని పూర్తిగా రాల్చేయ్యాలి.

**ఏడవకాండలోని పందొనిమిదవ సూక్తం –** ఇందులో తంత్రం ఇందాక చెప్పిందే. గొంతునుండి చంకవరకు ప్రాకే గండమాల 'అపచిత' అనబడుతుంది. అది ఎరుపు, నలుపు రెండు రంగులు గలది. వాటి మూలము పిశాచాల యందున్నది. దేవతల మునుల, దయవల్ల నేను అటువంటి పిశాచాలను పారద్రోలుతున్నాను.

అసాధ్యమయిన గండమాలను, మధ్యవిధ గండమాల, అల్పగండమాలలు అన్నింటినీ చెట్టును నరికినట్లుగా నరికేస్తున్నాను.

గండమాలలో ఎప్పుడూ చీముకారేది, విపరీతంగా బాధించేది కూడా మందుల మంత్రాల ప్రభావంతో కరిగిపోతుంది. ఇది అంత పెద్దదేమీ కాదు. ఉప్పులాగా కరిగిపోతుంది. గొంతుకు ఉన్న గండమాల, చంకల దగ్గర ఉన్న గండమాల మందులకు, మంత్రాలకు కరిగిపోతుంది."

## 53. ద్వేషించే వాడికి పుత్రసంతానం లేకుండా చెయ్యటానికి

మనం ద్వేషించే పురుషుడికి పుత్రసంతానం లేకుండా చెయ్యటం అంటే అతనికి వంశనాశనం చెయ్యటమన్న మాట. వంశనాశనం అంటే అతని ఇంట్లో మగపిల్లలు పుట్టకూడదు. ఒకవేళ పుట్టినా జీవించి ఉండకూడదు. దీనికోసం మనం ఏం చెయ్యాలి అనేది **ఏడవకాండలోని ఎనిమిదవ సూక్తం** చెబుతోంది. ముందుగా కొంచెం తంత్రం. ఆడకంచర గాడిద మూత్రం రాతితో చిలికి, అభిమంత్రించి, దాన్ని అన్నంలో కలిపి అతని భార్యతో తినిపించాలి. ఆ మూత్రంలో ఆమె అలంకారాలు కూడా తడపాలి. ఆమెకు సీమంతం జరిగే సమయంలో ఈ మంత్రం చదువుతూ పెడితే ఆమెకు వంధ్యత్వము వస్తుంది. ఒక సూక్తార్థం చూడండి.

అగ్నిదేవా ! పుట్టిన నా శత్రువులను అణచి వేయవలసింది. పుట్టకుండా ఉన్న శతృవులను నాశనం చెయ్యి. (పుట్టకుండా చూడు) మేము నివసించే దేశాన్ని సౌభాగ్యవంతము చేయవలసింది. విశ్వేదేవతలు ఈ శత్రునాశనకర్మను ఆమోదిస్తారు.

ద్వేషించబడే ఓ స్త్రీ ! నువ్వు గర్భం ధరించటానికి లోపల ఉన్న నూరు నాడులు, బయట ఉన్న వెయ్యి నాడులు, రాళ్ళతో కొట్టి నువు సంతానవతివి కాకుండా నాశనం చేస్తాను. ఆ నాడులు పనికి రాకుండా చేస్తాను. ప్రతికూల స్త్రీ ! నేను నీ యోనిని బయటకు లాగుతున్నాను. నీకు స్త్రీలు గాని, పురుషులు గాని సంతానం లేకుండా చేస్తున్నాను. నీ గర్భధారణ స్థానాన్ని రాయితో మూసేస్తున్నాను. ఇక మీదట నీకు

సంతానం ఉండదు. నువ్వు గొడ్రులవుతావు. మీ వంశనాశనం జరుగుతుంది అని చెబుతోంది.

ఇటువంటి వెధవపనులు పొరపాటున కూడా చెయ్యకండి. ఆ పాపం జన్మజన్మలకి కట్టికుడుపుతుంది. జాగ్రత్త.

# 54. సర్వసంపదలు

సర్వసంపదలు కోరేవాడు. అగ్నిని ధ్యానం చెయ్యాలి. అగ్నికి హోమం చెయ్యాలి. ఈ విషయం **ఏడవకాండలోని ఇరవైరెండవ సూక్తంలో** చెప్పబడింది. సూక్తార్థం చూడండి. గోవులారా ! మాకు గోవ్రజము లభించేటట్లుగా స్తుతించతగిన వాడు, యుద్ధానికి ఉత్సాహపడేవాడు అయిన అగ్నిని అర్చించండి. మాకు కావలసిన ధనాన్ని ప్రసాదించండి. ఈ యజ్ఞానికి దేవతలను తీసుకుని రండి.

ముందుగా అగ్నిని నా యందు చేర్చుకున్నాను. మమ్మల్ని ద్వేషించే వారు మాకన్న ముందే ఈ యజ్ఞాన్ని ప్రారంభించినట్లైతే, అది నిన్ను వారు ఆనందింప చేయకుండు గాక. నీ బలంతో సహా మాకు ప్రత్యక్షంగా ఈ యజమాని న్యూనభావం కలవాడై యజ్ఞాలు చేస్తూ వర్ధిల్లాలి.

అగ్నిదేవుడు ఉషఃకాలంలో ఆవిర్భవిస్తాడు. అతడు ఉషస్సు యొక్క నోటినుంచే బయటకు వస్తాడు. అగ్ని ఉషస్సులోను, పగళ్ళలోను, భూమ్యాకాశాదులలోను ప్రవేశించి ప్రకాశిస్తున్నాడు. జాతవేద అగ్ని మొదటగా ఉషస్సు నందు, తరువాత రోజులందు ప్రకాశిస్తున్నాడు. అగ్నికి అనేక రూపాలున్నాయి. కాబట్టి సూర్యకిరణాల యందు చేరి భూమ్యాకాశాలను ప్రకాశింపచేస్తున్నాడు.

దేవా ! నీ ఘృతము దేవలోకంలో ఉంది. మనువు మొదలైన వారు నిన్ను నేతితోనే ప్రజ్వలింపచేశారు. దీప్తివంతమై, నీ పాత్రమగు జలము ఘృతమును నీ ముందుకు తెస్తుంది. ఆవులు నీ కోసం ఘృతాన్ని పితుకుతారు.

వరుణదేవా ! నీటిలో నీకు బంగారు గృహాలున్నాయి. కాబట్టి సత్యకర్ముడయిన వరుణుడు జలోదర రూపమయిన ఇతర గృహాలు వదలి, తన ఇంటనే వ్యాధులు కలిగించకుండా ఉండాలి.

వరుణా ! మా శరీరంలోని సమస్త వ్యాధి స్థానాలను వదలిపెట్టు. వరుణా మేము దుర్భాషలాడినట్లైతే ఆ పాపము నుండి మాకు విముక్తి కలిగించవలసింది. వరుణదేవా ! మా శరీరము మీద దిగువ మధ్య భాగంలో ఉన్న పాశాలు ఛేదించు. మేమంతా నిన్ను స్తుతి చేస్తూ నిర్భయంగా ఉంటాము.

వరుణదేవా ! నీ సర్వపాశముల నుండి మమ్మల్ని విడిపించు, నీకు సంబంధించిన ఉత్తమ, మధ్యమ, అధమ అనే మూడు రకాల పాశాల నుంచి మమ్మ విడిపించు. దుస్వప్నదురితము నుండి విడిపించు. అప్పుడు మేము ముల్లోకాలు చేరగలము.

# 55. జూదంలో జయం సాధించటానికి

జూదంలో జయించాలి అంటే **ఏడవ కాండలోని ఇరవై ఏడవ సూక్తాన్ని** చూడండి.

దేవా! నేను ప్రతిపక్షంలో వ్యక్తిని ఓడించేందుకు ఆడుతున్నాను. నన్ను ఘృతము కలవాడుగా చెయ్యి. మాతో ఆడదలిచిన వాణ్ణి పిడుగు పడిన చెట్టులాగా ధ్వంసం చేయవలసింది.

ఎవరు మాకు జూదంలో ధనం ఇప్పించారో, ఎవరు మా పాచికలతో. ఇతరుల పాచికలు ఓడింప చేశాడో ఆ దేవత మేము అందించే హవిస్సులు స్వీకరించు గాక.

ఓ పాచికలారా ! మీ పేరు 'సంవసవ' అయి ఉన్నది. ఈ పాచికలు 'ఉగ్రంపశ్య' 'రాష్ట్రభృత్' అనే పేర్లు కలిగి ఉన్నాయి. అటువంటి పాచికలను మేము హవిస్సు అర్పించి సేవిస్తున్నాము. మేము ధనవంతులమగుదుము గాక.

నేను ధనం కోసం పరితపిస్తాను. ధనాన్నివ్వమని దేవతలను ఆహ్వానిస్తున్నాను. మేము బ్రహ్మచర్యము ఆచరించాము. బభ్రుదేవత ఆవేశించిన ఈ పాచికలను పట్టుకున్నాము. ఆ దేవతలు మాకు విజయము, ఆనందము కలిగించు గాక **ఇలాంటి సూక్తాలు ఎన్ని చదివినా జూదంలో ఎప్పుడూ విజయం సాధించటం కష్టం. కాబట్టి ఇలాంటి పని చెయ్యొద్దు. కష్టపడి సంపాదించిన రూపాయే తృప్తినిస్తుంది.**

## 56. స్త్రీ పురుషులకు పరస్పరము ద్వేషం కలిగించటానికి

స్త్రీ పురుషులిరువురికీ ఒకరిమీద ఒకరికి ద్వేషం కలిగించాలి అంటే **ఏడవ కాండలోని ఇరవై ఎనిమిదవ సూక్తం** చూడండి. ముందుగా 'బాణాపర్ణ' చూర్ణము ఎర్రమేక మజ్జిగలో కలిపి, మంత్రించి, మంచంమీద జల్లండి. ఆ తరువాత సూక్తంతో హోమం చెయ్యండి.

ఓ బాణాపర్ణ ఓషధీ ! నువ్వు తాపము కలిగించే దానిని. ఆమెకు తాపము కలిగించి అతని నుండి విడదీయుము.

కోపం కలిగించే ఓ ఓషధీ ఆమెమీద అతనికి ద్వేషము, కోపము కలిగేటట్లుగా చేయవలసింది.

తృష్టికా ! నువ్వు తాపము కలిగించే దానివి. విషస్వరూపానివి. వట్టిపోయిన ఆవు ఆబోతుని కోరని విధంగా ఆమె అతన్ని కోరకుండుగాక. ఆమె అతనికి విషసమానమవును గాక.

**భార్యాభర్తల మధ్య విద్వేషాలు రగల్చటం మహాపాపం. అటువంటి పనిచేసినవాడు నేనమయిన చావు చస్తాడు.** అలాంటి పనులు చెయ్యకండి.

# 57. శతమానం భవతి

ప్రతివాడికీ ఈ లోకంలో పూర్తిగా పూర్ణాయుష్యుతో జీవించాలి అనుకుంటాడు. పూర్ణాయుష్యు అంటే వంద సంవత్సరాలు అని మనం చెబుతుంటాం కాని పూర్ణాయువు అంటే నూట ఇరవై సంవత్సరాలు అంటారు. దానికి కారణం రవి దగ్గర నుంచి శుక్రుడు దాకా ఉండే గ్రహాల కాలం మొత్తం నూట ఇరవై సంవత్సరాలు. శుభకార్యాలు జరిగినప్పుడు, గోదానము మొదలైనవి జరిగినప్పుడు ధాన్యము, యవలు **ఎనిమిదవ కాండలోని ఐదవ సూక్తముతో** అభిమంత్రించి కుమారుని తలమీద పొయ్యాలి. సూక్తార్థం చూడండి.

నీకు శత, ఆయుత వర్ష, ఆయువు రెండు మూడు నాలుగు యుగాలు కల్పిస్తున్నాము. ఇంద్రాగ్నులు, సమస్త దేవతలు కోపగించకుండా సిగ్గుపడకుండ దీన్ని ఆమోదిస్తారు. ఆయుత వర్షములు అంటే పదివేల సంవత్సరాలు అని అర్థం.

శరత్తు, హేమంత, వసంత, గ్రీష్మ, ఋతువులు నిన్ను రక్షించు గాక. వర్షఋతువు నీకు శుభప్రదమవుతుంది. ఆ కాలంలో ఓషధులన్నీ వృద్ధి చెందుతాయి.

మృత్యువు ద్విపాదులకు, చతుష్పాదులకు అందరికీ ప్రభువు. ఆ మృత్యువు నుంచి నిన్ను విడిపిస్తున్నాను.

అరిష్టా! నువ్వు మరణించవు. భయపడద్దు. అక్కడ ఎవరూ మరణించరు.

ఎక్కడైతే యజ్ఞము చేయబడుతున్నదో అక్కడ సమస్తము ఆవులు,

గుర్రాలు, ప్రజలు, పశువులు అన్నీ, అందరూ జీవిస్తారు. నేను చేసిన శాంతికర్మల వల్ల నిన్ను సమస్త దిశలు రక్షిస్తాయి. అన్ని రకాల అభిచార కర్మలనుంచి నిన్ను రక్షిస్తున్నాము. నీకు మరణం లేదు. మృత్యుంజయుడవు అవుతావు. నీలోని అన్ని అవయవాలు నీతోపాటే ఉంటాయి. నూటొక్క దేవతలు, అగ్ని, వైశ్వానరాగ్ని మొదలైన దేవతలు నిన్ను రక్షిస్తారు.

పూతవృక్షమా ! నీ దేహమందు అగ్ని ఉన్నది. నువ్వు రాక్షస సంహారివి. శత్రుసంహారివి. వ్యాధులను నివారించే దానివి. మా అభీష్టము తీర్చు. ఇతడికి పూర్ణాయువు ప్రసాదించు

# 58. రాక్షస, పిశాచ, గ్రహాల నివారణ

రాక్షస, గ్రహ, పిశాచాల చికిత్సకు ఈ సూక్తముతో తాండ్రచెట్టు కర్రముక్కలను ఆహుతులుగా ఇవ్వండి. అసాధ్యమైన గ్రహాన్ని లోబరచుకోవటానికి వీణాతూలముతో ఇంగుజాద్యము, మోదుగాకు వెనక భాగంతో ఆహుతులు ఇవ్వాలి. ఇంట్లో పిశాచాలున్నాయని అనుమానం వచ్చినప్పుడు ఆవకర్ర, శరమయబర్హిలను ఈ సూక్తంతో మంత్రించి గ్రహపీడితుడికి త్రాగించండి. ఈ విషయాలన్నీ **ఎనిమిదవ కాండలోని ఆరవ సూక్తంలో** చెప్పబడ్డాయి. అగ్ని బలశాలి. రాక్షస సంహారకుడు. అటువంటి అగ్నిమీద నాలుగువైపుల నుంచీ నెయ్యి పోస్తున్నాను. స్నేహితుడయిన అగ్నిని శరణువేడుతున్నాను. అగ్ని జ్వలించి క్రతువులందు ప్రజ్వరిల్లుతాడు. అటువంటి అగ్ని రాత్రింబవళ్ళు మమ్ము హింసకుల బారినుండి రక్షించుగాక.

ఓ అగ్నీ ! నిన్ను వేడుకుంటున్నాను. నీ ఇనుప కోరలతో రాక్షసులను కొరికెయ్యి. నీ జ్వాలలతో అభిచారకులను భస్మముచెయ్యి.

అగ్నీ ! నువ్వు రక్షించే వారిని, భక్షించే వారిని గుర్తించగలవు. నీ జ్వాలలు తీక్షణములు. నీ కోరలతో మా శత్రువులను నాశనం చెయ్యి. నన్ను బాధించే యాతుధానులను (రాక్షసులను) సంహరించు. అగ్నిదేవా! యాతుధానుల తోలువలు. నీ బలంతో వాళ్ళ కీళ్ళు విరగ్గొట్టు.

జాతవేదాగ్నీ ! మాకు కష్టం కలిగించే యాతుధానులు కూర్చున్నా, నుంచున్నా, తిరుగుతున్నా, వారిని పిప్పి చెయ్యి. నీ తీక్షణ జ్వాలలచే

వారిని భస్మము చెయ్యి.

ఓ అగ్నీ మా యజ్ఞముతో నీ బాణాలు సరిచేసుకో. మా మంత్రాలతో నీ అమ్ములకు పదునుపెట్టు. వాటితో మమ్ములను యాతనలకు గురి చేయు యాతుధానులను బాధించు. వారిచేతులు నరికెయ్యి.

అగ్నీ! మేము నిన్ను స్తుతి చేస్తున్నాము. మమ్మల్ని పాలించు. భయంకరంగా కేకలు పెట్టే యాతుధానులను వధించు. వారిని హతమార్చు. పచ్చిమాంసాన్ని తినే రాబందు వారి మాంసము తినాలి.

అగ్నిదేవా ! మా శాంతికి భంగం కలిగించే వారిని, మమ్మల్ని బాధించేవారిని హెచ్చరించు. కర్మసాక్షివైన నువ్వు, నీ జ్వాలాదృక్కులతో వారిని వశపరచుకో.

అగ్నిదేవా ! నీ జ్వాలానేత్రంతో యజ్ఞాలను రక్షించు, మా యజ్ఞాన్ని దేవతలకు చేర్చు.

కర్మసాక్షీ ! హింసే పరవధిగా పెట్టుకున్న రాక్షసులను అంతం చెయ్యి.

అగ్నిదేవా ! నువ్వు నిగ్రహానుగ్రహ సమర్థుడవు. నరులను హింసించే రాక్షసుల కోసం నాలుగు దిక్కులా వెతుకు. వారి శరీరంపై భాగాన్ని మూడు భాగాలు చెయ్యి. పాదాలు మూడు ముక్కలుగా నరకవలసింది. మమ్మల్ని రక్షించవలసింది.

9,10,11 సూక్తాలు కూడా రాక్షస సంహారమే.

# 59. కావలసిన కోరిక తీరటం కోసం

మానవుడికి అనేక కోరికలుంటాయి. వాటిలో కొన్ని కోరికలు తీరాలి. వాటికి ప్రాముఖ్యత ఉంటుంది. అలాటి కోరికలు తీరాలంటే **ఎనిమిదవ కాండలో పన్నెండవ సూక్తం** చూడాలి. ముందుగా ఒకతాయెత్తును పెరుగు, తేనె వీటిలో మూడురోజుల పాటు నానబెట్టి దాన్ని ఈసూక్తంతో మంత్రించి చేతికి కట్టాలి. తరువాత ఈ సూక్తాని హోమం చెయ్యాలి. ఈ తాయత్తు (మణి) కృత్యావిరోధి. వీరులకు కట్టుబడేది. ఇది వీరత్వము గలది. శత్రుసంహారకారి. మనలను రక్షించేది. సర్వశుభాలు కలిగించేది.

ఈ తాయత్తు శత్రుసంహారకారి. అన్నప్రదాయుని, అత్యంతసాహసి, బలవ్మైనది, ఉగ్రవ్మైనది. కృత్యాకారుని నశింపచేయటానికి వస్తున్నది.

ఈ తాయత్తు ప్రభావం చేతనే ఇంద్రుడు వృత్రాసురుని సంహరించాడు. రాక్షస సంహారము చేశాడు. దీని ప్రభావము చేతనే ఇంద్రుడు ద్యావాపృథ్వులకు అధిపతి అయినాడు. నాలుగు దిక్కులు గెలిచాడు.

ఇది రోగవిరోధకారి. యుద్ధంలో శత్రువులను వెన్నంటి సంహరిస్తుంది. అటువంటి ఈ తాయత్తు (మణి) మమ్ము రక్షించుగాక.

ఇది కృత్యావిరోధి. ఈ మాట అగ్ని, సోముడు, బృహస్పతి, సవిత, ఇంద్రుడు చెబుతున్నారు. ఆ దేవతలు అభిచారకులను త్రిప్పి పంపుదురు గాక.

నాకు కృత్యకు మధ్య భూమ్యాకాశాలను నిలుపుతున్నాను. కృత్యకు అడ్డంగా సూర్యుణ్ణి నుంచో పెడుతున్నాను. దేవతలు ఈ కృత్యను

మెడలు వంచి గెంటేస్తారు.

'స్రాక్త్య' అనే ఈ మణిని (తాయత్తు) కవచంగా ధరించేవాడు సూర్యుడు చీకట్లను పారద్రోలినట్లుగా కృత్యాదులను తరుముతున్నాడు.

ఈ మణి ఋషివంటిది. దానివల్ల శత్రుసేనను జయించాను. ప్రమాదకారు లయిన రాక్షసులను జయించాను. అంగీరసులతోను, అసురులతోను కల్పించబడిన ఈ కృత్యలు పడవలమీద మాత్రమే దాటగల తొమ్మిది నదుల అవతలకు వెళ్ళిపోవు గాక.

పరకృత్యలను నాశనం చేసే ఈ మణి (తాయత్తు) కవచ రూపంలో ఇంద్రుడు, విష్ణువు, సవిత, ప్రజాపతి, వైశ్వానరుడు మొదలైన దేవతలు, ఋషులు ఇతడికి ధరింపచేతురు గాక. పరకృత్య నాశనమయి ఇతనికి అభీష్టసిద్ధి జరుగును గాక. పదమూడవ సూక్తము కూడా ఇలాంటిదే.

# ౬౦. గర్భిణీస్త్రీకి రక్ష

లోకంలో అనేక రకాల దుష్టశక్తులు తిరుగుతుంటాయని అవి గర్భిణీ స్త్రీలను ఆవహించి గర్భానికి నష్టం కలిగిస్తాయని భయపడేవారు. ఆ దుష్టశక్తులను నాశనం చెయ్యటానికి రక్షలు కడుతుండే వారు. రక్ష అంటే – మంత్రించిన త్రాడు, లేదా తాయత్తు. దీని వివరాలు **ఎనిమిదవ కాండలోని పద్నాల్గవ సూక్తంలో** చెప్పబడ్డాయి. ముందుగా ఈ సూక్తంతో మంత్రించి ఒక తాయత్తును గర్భిణీ స్త్రీ చేతికి కట్టాలి. తెల్ల ఆవాలు మంత్రించి కట్టవచ్చు. ఇక సూక్తార్థము. "ఓ గర్భిణీ ! నువ్వు పుట్టగానే నీ బర్తకు బాధ కలిగించే వాటిని నివారించటం కోసం నీ తల్లి కావలసిన మంత్రసిద్ధి చేసింది. కాబట్టి 'దుర్నామ' 'అవిశ' 'వత్సప' వ్యాధులు నీ దగ్గరకు రావు.

పలాల, అనుపలాల, శర్కు, కోక, మలిమ్లుచ, పలీజక, ఆశ్రేష, వివ్రివాస, ఋక్షగ్రీవ, ప్రవెూలిన అనే వ్యాధులను నేను నిర్మూలిస్తున్నాను.

దుర్నామ వ్యాధీ ! నేను ఈమెకు దుర్నామ చికిత్స చేస్తున్నాను. కాబట్టి ఈమె ఊరువుల మధ్య సంకోచము కలిగించవద్దు. లోపలికి వెళ్ళవద్దు. ఊరువుల దిగువకు జరగద్దు.

దుర్నామ, సునామ రెండూ కలిసి ఉంటాయి. వీటిలో దుర్నామను నేను నాశనం చేస్తున్నాను. సునామ స్త్రీ యందు నిలచును గాక.

కృష్ణ, కేశ, స్తంభజ, తుండికాసుర దుర్మార్గులు వాళ్ళని గర్భిణి యొక్క ముష్కము నుండి, కటిసంధి ప్రదేశముల నుండి తొలగిస్తున్నాము.

వాసన చూసి నాశనము చేసే అనుజిఘ్రమును, స్పర్శించి హతమార్చే ప్రమృశని, మాంస భక్షకత్ర వ్యాధులను, నాలుకతో నాకి నాశనం చేసే రేరిహము, ఇవి కాకుండా ఇంకా మిగిలిన దుష్టశక్తులను పసుపు పచ్చని ఆవాలు నాశనము చేస్తాయి.

ఓ గర్భిణీ ! నీ సోదరుడిగా, తండ్రిగా, బంధువుగా, తెలిసినవాడుగా కలలో కనిపించి నిన్ను బాధించే వారిని ఈ తెల్లఆవాలు నాశనం చేస్తాయి. నిద్రపోయే టప్పుడు, మేల్కొన్నప్పుడు, బాధించే వారిని ఈ ఆవాలు నాశనం చేస్తాయి.

ఓ పర్షప (ఆవాలు) ఓషధీ ! ఈమె గర్భంలో ఉండే శిశువును బాధించాలని, నాశనం చెయ్యాలని చూసేవారిని నాశనం చేసి ఈమె గర్భాన్ని రక్షించవలసింది.

ఓ తెలుపు, పసుపు పర్షపములారా ! (తెల్ల ఆవాలు, పచ్చ ఆవాలు) గాడిదలాగా ఓండ్ర పెడుతూ ఈవిడ ఇంటి చుట్టూ తిరిగేవి, రోకలి రూపంలో నాట్యం చేసేవి, బానపొట్ట, భయంకరాకారము గలవి, వివిధ రూపాలు గలవి అయిన పిశాచాలను మీ వాసనతోనే నాశనం చెయ్యండి.

ఈ రకంగా గర్భిణీస్త్రీని పట్టి పీడించే దుష్టశక్తులు నాశనం కావాలని ప్రార్థించేవారు. దీని తరువాత ఉన్న 15,16 సూక్తాలు కూడా ఇలాంటివే. దీన్ని బట్టి సంతానాన్ని రక్షించుకోవటానికి వారు పడే ఆరాటం మనకి అర్థమవుతున్నది.

## 61. క్షయ మొదలైన రోగాలకి చికిత్స

**ఎనిమిదవ కాండలోని పదిహేడవ సూక్తంలో**, అన్ని వ్యాధులకు చికిత్సను గురించి చెబుతున్నారు. ముందుగా పదిచెట్ల ముక్కలను లక్క బంగారంతో మడిచి తాయత్తుగా చేసి, ఈ సూక్తంతో జపం చేసి, తాయత్తు మంత్రించి కట్టాలి. సౌత్రామణి యాగంలో ఓషధుల నుంచి తీసిన సురను మంత్రించి తాగించాలి. ఇది చాలా పెద్ద సూక్తం, ఇందులో మొత్తం ఇరవై ఎనిమిది మంత్రాలున్నాయి.

బభ్రు, శ్వేత, అరుణ వర్ణాలలో ఉన్న పొట్టివి, పొడుగువి లావువి, సన్నమువి అయిన ఓషధుల ఎదుట ఉండి ప్రార్ధిస్తున్నాము. ఈ ఓషధులకు ద్యులోకం తండ్రి, భూలోకం తల్లి సముద్రం మూలం. ఇవి దైవం చేత ప్రేరేపింపబడి క్షయరోగం నుంచి ఇతణ్ణి రక్షించుగాక. ఎదురుగా ఉన్న జలము, దివ్యఔషధులు ఇతని శరీరంలోని ప్రతి అంగము నుండి క్షయరోగాన్ని తొలగించు గాక. నుంచునేవి, వ్యాపించేవి, ఆశ్రయించేవి, పాకేవి అయిన ఓషధులను ప్రార్ధిస్తున్నాను. దేవతా సంబంధమైన ఓషధులను ప్రార్ధిస్తున్నాను. ఈ రోగి కోసం ఆహ్వానిస్తున్నాను. ఆ ఓషధులు వచ్చి ఈ రోగిని వ్యాధుల నుంచి కాపాడాలి. మహామహిమాన్వితమైన 'సహస్ర' పేరు గల ఓషధి ఇక్కడికి రావాలి. రోగాన్ని పోగొట్టేవి, విషాన్ని హరించేవి, జలోదరాన్ని నాశనం చేసేవి, కృత్యలను సంహరించేవి అయిన ఓషధులు ఇక్కడికి రావాలి. ఈ ఓషధులు ఇక్కడ ఉన్న ఆవులు, గుర్రాలు, పశువులు, ప్రజలు అందరినీ రక్షించాలి. ఓషధుల యొక్క మూలము మధురం, అగ్రము మధురం, మధ్యము మధురం, ఆకులు మధురం. ఈ మధురమైన ఓషధులు సేవించేవాడు అమృతం త్రాగినవాడవుతున్నాడు. భూమిమీద

వేలకొద్దీ ఆకులు గల ఓషధులున్నాయి. అవి మమ్మల్ని మృత్యుదాయక పాపముల నుండి రక్షించాలి. అంగీరసుడు చెప్పిన ఓషధులు పర్వతాలమీద, మైదానాల్లోను మొలుస్తున్నాయి. అవి రసవంతము శుభప్రదము అవుతున్నాయి. ఇవి మాకు సుఖాన్ని ఇవ్వాలి. సమగ్ర ఓషధులారా ! నా మాట వినండి. నేను ఇతనికి రోగం రూపంలో ఉన్న పాపాల నుంచి విముక్తి కలిగిస్తాను. మెరుపు మెరిసి, ఉరుము, ఉరిమి, గాలి వీచి, వర్షించి, ఓషధులను పోషిస్తున్నారు. అలా పోషింపబడిన మీరు రసవంతముకలై ఈ రోగులను కాపాడండి. తీగలలో ఆయుర్వేద శాస్త్రజ్ఞు లెరిగిన మందులు ఎన్నున్నాయో వాటన్నింటినీ మీ ముందుకు తెచ్చారు. అవన్నీ ఫలవంతములు, ఆరోగ్యవంతములు అయి ఈ రోగిని రక్షించుగాక. యముని పాశాల నుండి రోగిని ఈ ఓషధులు రక్షించును గాక.

**18వ సూక్తం పూర్తిగా శత్రునాశనం.**

## 62. విరాట్పురుషుడు (20వ సూక్తం)

విరాట్స్వరూపాన్ని గురించి **ఎనిమిదవ కాండలో ఇరవై నుంచి ఇరవై ఐదు వరకు సూక్తాలలో** వివరించబడింది. సృష్టికి ముందు విరాట్పురుషుడు ఒక్కడే ఉన్నాడు. అతడు రాగానే అతడే జగత్తవుతాడు అని భయపడ్డాడు. అతడు విక్రమించి గార్హపత్యంలో ప్రవేశించాడు. ఈ విషయం తెలిసినవాడు గృహపతి అవుతున్నాడు.

అతడు మళ్ళీ విక్రమించి ఆహువనీయాగ్నిలో ప్రవేశించాడు. ఈ విషయం తెలిసినవాడు యజ్ఞకర్త దక్షిణీయ వాస్తేయుడవుతున్నాడు. అతడు విక్రమించి సభలో ప్రవేశించాడు. ఈ విషయం తెలిసినవాడు సభలో సభ్యుడవుతున్నాడు.

అతడు విక్రమించి సమితి యందు ప్రవేశించాడు. ఈ విషయం తెలిసిన వాడు సమితియందు కీర్తివంతుడవుతున్నాడు.

అతడు విక్రమించి ఆహావనీయంలో ప్రవేశించాడు. ఈ విషయం తెలిసినవాడు ఆహవనీయుడవుతున్నాడు.

## 63. విరాట్పురుషుడు (21వ సూక్తం)

అతడు విక్రమించి అంతరిక్షాన్ని నాలుగు విధాలుగా ఆక్రమించి అక్కడ స్థిరపడ్డాడు. అప్పుడు దేవతలు, మనుష్యులు “మనం జీవించే విధానం అతడికి తెలుసు కాబట్టి అతణ్ణి మనవద్దకు ఆహ్వానిద్దాం” అనుకున్నారు. అనుకున్నదే తడవుగా ఆహ్వానించారు.

శక్తి–బలము వచ్చుగాక, స్వధ వచ్చుగాక, సత్యవాక్కు వచ్చుగాక, ఇరావతి వచ్చుగాక అన్నారు. అప్పుడు

ఇంద్రుడు వత్సము (దూడ); గాయత్రి అభిదానము, మేఘము

పొదుగు అయింది. బృహత్సామము, రథంతరము రెండుచనులు, యజ్ఞాయజ్ఞియ, సామములు రెండు చనులు అయినాయి. దేవతలు రథంతరసామంతో ఓషధులు, బృహత్సామంతో వ్యచను పితికారు. వామదేవసామంతో జలము యజ్ఞయాజ్ఞియసామంతో యజ్ఞము పితికారు. ఈ విషయం తెలిసినవాడికి అథంతరము ఓషధులు, బృహస్పతి 'వ్యచ' ప్రసాదించాడు. వామదేవుడు జలాన్ని యజ్ఞయాజ్ఞియము యజ్ఞాగ్ని ప్రసాదించాడు.

## 64. విరాట్పురుషుడు (22వ సూక్తం)

అతడు విక్రమించి వనస్పతులందు చేరాడు. వనస్పతులు అతన్ని హవనం చేసినాయి. అప్పుడు అతడు సంవత్సరమైనాడు. కాబట్టే తెగిపోయిన వనస్పతులు మళ్ళీ మొలకెత్తుతున్నాయి. ఈ విషయం గ్రహించిన వాడు శత్రువులను నష్టపరుస్తున్నాడు.

అతడు విక్రమించి పితరుల దగ్గరకు వెళ్ళాడు. పితరులు అతన్ని తమలో చేర్చుకున్నారు. అప్పుడు అతడు మాసాలు అయినాడు. కాబట్టే పితరులకు ప్రత్యేకమాసంలో నోటికి అందించబడుతోంది. ఈ విషయం తెలిసినవాడు పిత్రుయాన మార్గాన్ని తెలుసుకుంటాడు. అతడు విక్రమించి దేవతల దగ్గరకు వెళ్ళాడు. వారు అతన్ని తమలో చేర్చుకున్నారు. అప్పుడు అతడు అర్థమాసము అయినాడు. కాబట్టే దేవతలకు అర్థమాసంలో 'వషట్' చేస్తున్నారు. ఈ విషయం తెలిసినవాడు దేవయానం తెలుసుకుంటాడు. అతడు విక్రమించి మనుష్యుల దగ్గరకు వెళ్ళాడు. వారు అతన్ని తమలో లీనం చేసుకున్నారు. అతడు వెంటనే ప్రాదుర్భావం చెందాడు. కాబట్టే మనుషుల కోసం రెండవరోజు ఉపహరణము చేయబడుతున్నది. ఇది తెలిసినవాడి ఇంట్లో నిత్యం అన్నం వచ్చి చేరుతుంది.

# 65. విరాట్స్వరూపము (23వ సూక్తం)

అతడు విక్రమించి రాక్షసుల దగ్గరకి వెళ్ళాడు. వారు అతణ్ణి మాయా రా! అన్నారు. వారికి ప్రహ్లాదుని కుమారుడు విరోచనుడు వత్సమైనాడు. ఇనప గిన్నె పాత్ర అయింది. దాన్ని రెండు తలలు గల 'అత్వర్యుడు' పితికాడు. మాయను పితికాడు. ఆ మాయతోనే అసురులు జీవనం చేస్తున్నారు. ఇది తెలిసినవాడు 'ఉపజీవనీయుడవుతాడు' అతడు విక్రమించాడు. పితరుల దగ్గరకు వెళ్ళాడు. వారతన్ని 'స్వధా రా! అని ఆహ్వానించారు. వారికి యముడు వత్సమైనాడు. వెండిగిన్నె పాత్ర అయింది. దాన్ని మృత్యుదేవత 'అంతకుడు' పితికాడు. దాని నుండి స్వధ వచ్చింది. ఆ స్వధతో పితరులు ఉపజీవనం చేస్తున్నారు. ఇది తెలిసినవాడు ఉపజీవనీయు డవుతున్నాడు. అతడు విక్రమించాడు. మనుష్యుల దగ్గరకి వెళ్ళాడు. మనుష్యులు 'ఇరావతీ' రావలసింది అన్నారు. వారికి వివస్వత పుత్రుడు మనువు వత్సమైనాడు. భూమి పాత్ర అయింది. దాన్ని వేనుడి పుత్రుడు 'పృథువు' పితికాడు. అతడు కృషిని, సస్యాలను పితికాడు. కృషి, సస్యాలతో మానవులు ఉపజీవనం చేస్తున్నారు. ఇది తెలిసినవాడు ఉపజీవనయుడవుతున్నాడు.

అతడు విక్రమించాడు. సప్తఋషుల వద్దకు పోయాడు. వారు అతన్ని 'బ్రహ్మణవతీ రావలసింది' అన్నారు. వాళ్ళకి సోమరాజు వత్సము, ఛందస్సు పాత్ర అయింది. దాన్ని ఆంగీరస బృహస్పతి పితికాడు. బ్రహ్మ తపమును పితికాడు. కాబట్టి సప్తఋషులు బ్రహ్మ, తపస్సులతో ఉపజీవనం చేస్తున్నారు. ఇది తెలిసినవాడు బ్రహ్మవర్చస్వి అయి ఉపజీవనీయుడవుతాడు.

# 66. విరాట్స్వరూపము (24వ సూక్తం)

అతడు విక్రమించాడు, దేవతలను చేరాడు వారు అతన్ని 'ఊర్జా!రా' అన్నారు. అప్పుడు ఇంద్రుడు వత్సము, చమసము పాత్ర అయింది. సవిత దాన్ని పితికాడు. పితికినది ఊర్జ అయింది. దేవతలు ఊర్జతోనే ఉపజీవనం చేస్తున్నారు. ఇది తెలిసినవాడు ఉపజీవనీయుడవుతున్నాడు.

అతడు విక్రమించాడు, గంధర్వ అప్సరసలను చేరాడు. వారు అతన్ని 'పుణ్యగంధా! ఏహి' అని పిలిచారు. దానికి సూర్యవర్చపుత్రుడు చిత్రరథుడు వత్సమైనాడు. పుష్కర పర్ణము పాత్ర అయింది. దాన్ని చిత్రరథుడు పితికాడు. పితికినది పుణ్యగంధమైంది. గంధర్వ అప్సరసలు పుణ్యగంధంతోనే ఉపజీవనము చేస్తున్నారు. ఇది తెలిసినవాడు ఉపజీవనీయుడవుతున్నాడు. అతడు విక్రమించాడు. ఇతర జనులను చేరాడు. వారు అతన్ని 'తిరోధ ఏహి' అని ఆహ్వానించారు. దానికి విశ్వావసు పుత్రుడు కుబేరుడు వత్సమైనాడు. పచ్చిమూకుడు పాత్ర అయింది. దాన్ని కుబేరుడు పితికాడు. పితికినది తిరోధమైంది. ఇతర జనులు తిరోధముతో ఉపజీవనం చేస్తున్నారు. ఇది తెలిసినవాడు పాపాలను తిరోహితం చేసి ఉపజీవనీయుడవు తున్నాడు. అతడు విక్రమించాడు. సర్పాల దగ్గర కెళ్ళాడు. అవి అతన్ని 'విషవత్సేహి' అని ఆహ్వానించాయి. దానికి వైశాలేదుతక్షుడు వత్సమైనాడు. అలాబు పాత్ర అయింది. దాన్ని ఐరాత వంశ దృతరాష్ట్ర సర్పము పితికింది. ఆ పితికినది విషమైంది. ఆ విషంతోనే సర్పాలు ఉపజీవనం చేస్తున్నాయి. ఇది తెలిసినవాడు ఉపజీవనీయు డవుతాడు అంటూ విరాట్స్వరూపాన్ని గురించి వివరించింది ఇరవై నాల్గవ సూక్తం. పందొనిమిదవ సూక్తంలో విరాట్ విషయం సంవాదంగా చెప్పబడింది.

# 67. అతిథి దేవోభవ (సూక్తం-6)

మనకి చిన్నప్పటినుంచే చెబుతూనే ఉంటారు అతిథి, అభ్యాగతి, అగ్నిహోత్రుడు ఈ ముగ్గురూ ప్రతిరోజూ ఇంట్లో భోజనం చేస్తారు. వీరిలో ఒకరు భోజనానికి చెప్పి వస్తే ఇంకొకరు చెప్పకుండా ఆ సమయానికి వస్తారు. అతిథి అంటే – తిథి, వారం, నక్షత్రం లేకుండా వచ్చేవాడు. నతిథి – అతిథి. ఇలాంటివాడు సాక్షాత్తు దైవ సమానుడు. వీళ్ళని ఆదరిస్తే స్వర్గం ప్రాప్తిస్తుంది. వీళ్ళని తప్పనిసరిగా ఆదరించాలి అని చెబుతోంది వేదం. **తొమ్మిదవ కాండలోని ఆరు, ఏడు, ఎనిమిది, తొమ్మిది, పది, పదకొండు సూక్తాలు** అతిథి సత్కార విశేషాలను వివరిస్తున్నాయి. ముందుగా ఆరవ సూక్తం చూద్దాం. స్వర్గాన్ని కోరేవాడు సంప్రదాయానుసారము ఈ సూక్తాన్ని పారాయణ చెయ్యాలి.

అతిథి ప్రత్యక్ష బ్రహ్మ అవుతున్నాడు

అతని పురూషములు – సంభారములు, అనూక్యములు – ఋక్కులు. అతని లోమములు – సామము. హృదయము – యజస్సు, పరిస్తరణ – హవి

యజమాని అతిథిని చూసినప్పుడు–దేవయజనము చూసినవాడు అవుతున్నాడు.

అతిథితో సంభాషణ – దీక్ష, ఉదక ప్రార్థన – ప్రణయనము.

ఆ జలము యజ్ఞంలో ప్రణయనము చేయబడింది అవుతోంది. తర్పణము అర్పించటము, అగ్నిషోమీయ పశుబంధనము, అవస్థానము కల్పించటము – సదాహవిర్ధాన కల్ప.

ఉపస్తృణమే – బర్హి

ఉపశమనము ఆహరించినవాడు – తన కోసం స్వర్గ ద్వారాలు తెరిచినవాడు అవుతాడు.

కశిపు ఉపబర్హణమును ఆహరించుట – పరిధి

అంజన, అభ్యంజనాలు తేవటము – ఆజ్యము.

వడ్డించటానికి పదార్థాలు తేవటము – పురోడాశము తేవటము

భోజనానికి ఆహ్వానించటము – హవి స్వీకరించటానికి ఆహ్వానము

అక్కడ ధాన్యము, యవలు – సోమము

అక్కడ రోలు రోకలి – సోమాభిషవ శిలలు

శూర్పము – పవిత్రము, తుష – ఋజీషము, అభిషవణి – జలము

దర్వి – స్రవము, పవిత్రము చేయటం – ఆ యవనము

కలశములు – ద్రోణకలశములు

కృష్ణమృగచర్మము – వాయవ్యపాత్ర

## 68. అతిథిదేవోభవ (సూక్తం - 7)

అతిథిపతి (యజమాని) ఇది విలక్షణము, ఇది సాధారణము అని పరిశీలించటము – యజమాన బ్రాహ్మణమును చేయుట.

మరొకటి, ఇంకొకటి అనటం – ప్రాణములను పొడిగించుకొనుట.

ఉపహరణము – హవిస్సులు అందించటము.

వడ్డించిన పదార్థాలు అతిథి తనలోనే హోమం చేస్తున్నాడు.

ప్రియులైన, అప్రియులైన అతిథి రూపంలో ఉన్న వారిని స్వర్గము చేర్చాలి.

తనను ద్వేషించే వారి అన్నం తినరాదు.

తను ద్వేషించే వారి అన్నం తినరాదు.

తనను పరిశీలించుకొని, ఇతరులను పరిశీలించని వాని అన్నం కూడా తినరాదు.

**అన్నం తినేవాడు అన్నం పెట్టిన వాడి అన్ని పాపాలు భక్షిస్తున్నాడు.** ఎవరి అన్నం తింటున్నాడో, అతని ఏ ఒక్క పాపము విడవకుండా భక్షిస్తున్నాడు. ఎప్పుడూ అతిథులను ఆదరించేవాడు. యుక్త గ్రావ, ఆర్ద్ర, పవిత్ర, వితతాధ్వరుడు అవుతున్నాడు. అతిథికి అన్నం పెట్టటం – ప్రజాపత్య యజ్ఞం అవుతుంది. అతిథి సత్కారం చేసేవాడు – ప్రజాపతి అడుగులో అడుగు వేసిన వాడవుతున్నాడు. అతిథిని ఆహ్వానించటం – ఆహవనీయాగ్ని. గృహంలో ఉన్నది – గార్హపత్యాగ్ని. వంట చేసేది – దక్షిణాగ్ని అవుతున్నది.

## 69. అతిథిదేవోభవ (సూక్తం-8)

అతిథికన్న ముందు అన్నం తినేవాడు–తన యజ్ఞఫలము, కర్మఫలము పోగొట్టుకుంటున్నాడు.

అతిథకన్న ముందు తినేవాడు – తన ఇంటి పాడిని నాశనం చేసుకుంటున్నాడు.

అతిథికన్న ముందు తినేవాడు–తన బలము, వృద్ధి, నాశనం చేసుకుంటున్నాడు.

అతిథికన్న ముందు తినేవాడు – తన సంతానము, పశువుల నాశనం చేసుకుంటున్నాడు.

అతిథి కన్న ముందు తినేవాడు – తన కీర్తిప్రతిష్ఠ నాశనం చేసుకుంటున్నాడు.

అతిథి కన్న ముందు తినేవాడు – గృహలక్ష్మిని, సమైక్యతను నాశనం చేసుకుంటున్నాడు.

శ్రోత్రియుడు – అతిథకన్న ముందుగా భోజనం చేయరాదు.

అతిథి భోజనం చేసిన తరువాత గృహస్థు భోజనం చెయ్యటం యజ్ఞపు సార్ధకత.

మాంసము, ఆవుపాలు వంటి వాటిని తినరాదు.

# 70. అతిథిదేవోభవ (సూక్తం-9)

ఈ విషయం తెలిసినవాడు, పాలుశుద్ధిచేసి, భక్ష్యపదార్థాలు అతిథికి అందిస్తాడు.

సమృద్ధమైన అగ్నిష్టోమం చెయ్యటంవల్ల స్వర్గంలో తనకోసం ఎన్ని ద్వారాలు తెరచి ఉన్నాయో, అతిథి సత్కారము చేసినా అన్ని ద్వారాలు తెరచి వుంటాయి.

ఈ విషయాన్ని గ్రహించి నేతిని శుద్ధిచేసి తినే పదార్థాలు అతిథికి అర్పించిన వాడు - స్వర్గం చేరతాడు. అతిరాత్రం వల్ల తన కోసం స్వర్గంలో ఎన్నిద్వారాలు తెరిచి ఉంటాయో, అతిథి సత్కారం చేసినా అన్ని ద్వారాలు తెరిచి ఉంటాయి. సత్రయాగం వల్ల తనకోసం స్వర్గంలో ఎన్ని ద్వారాలు తెరిచి ఉంటాయో, అతిథి సత్కారం చేసినా అన్ని ద్వారాలు తెరిచే ఉంటాయి. ద్వాదశాహము చెయ్యటంవల్ల స్వర్గంలో ఎన్ని ద్వారాలు తెరచి ఉంటాయో, అన్నదానం చేసినా అన్ని ద్వారాలు తెరిచే ఉంటాయి. అటువంటివాడు, నిరతాన్నదానం చేసినవాడు కీర్తిప్రతిష్ఠలు పొందుతాడు. మరణానంతరము స్వర్గలోకం పొందుతాడు.

# 71. అతిథిదేవోభవ (సూక్తం-10)

అతిథి సత్కారము చెయ్యటం వల్ల ఉషలు హర్షధ్వానాలు వ్యక్తం చేశాయి. సవిత ప్రస్తుతిస్తున్నాడు.

బృహస్పతి తన శక్తితో ఉద్గాయనము చేస్తున్నాడు. త్వష్ట పుష్టి కలిగిస్తున్నాడు.

ఈ విషయం తెలిసిన వాడికి సంపదలు వృద్ధి చెందుతాయి. పశుసమృద్ధి కలుగుతుంది.

ఉదయించే సూర్యుడు హర్షధ్వానాలు వ్యక్తం చేశాడు.

కిరణాలు ప్రస్తుతిస్తున్నాయి.

సూర్యుడు మధ్యాహ్నము ఉద్గాయనం చేస్తున్నాడు.

అపరాహ్ణ భోజనం కలుగుతుంది.

ఈ విషయం తెలిసిన వాడికి సంపదలు వృద్ధి చెందుతాయి. పశుసమృద్ధి కలుగుతుంది.

అభ్రము పాదుర్భూతమై హర్షధ్వానాలు చేస్తున్నది. గర్జన స్తుతిస్తోంది.

ఈ విషయం తెలసిన వాడికి ధనసమృద్ధి, పశుసమృద్ధి కలుగుతుంది.

# 72. అతిథి దేవోభవ (సూక్తం-11)

క్షత్తని ఆహ్వానించేవాడు – శృతిని విన్నవాడవుతాడు.

ఏది ప్రతిశ్రవణమవుతుందో – అది ప్రత్యశ్రావమవుతుంది. చేత్తో పాత్రలు తీసుకుని వడ్డించటానికి అటు ఇటు తిరిగేవారు – చమసము, అధ్వర్యుడు అవుతారు.

అతిథులందు ఏ ఒక్కడూ కూడా ఆహుతులు ఇవ్వనివాడు ఉండడు. (అందరికీ ఇస్తాము)

అతిథులకు భోజనాలు పెట్టిన యజమాని అవబృథస్నానం చేసిన వాడవుతున్నాడు.

భోజన పదార్థాలు వేరువేరుగా అందించేవాడు. వేరు వేరు జనులకు దక్షిణలిచ్చే వాడవుతున్నాడు. భూమిమీద పిలిచిన వారి దగ్గర భుజిస్తున్నాడు అంటే భూమి మీద ఉన్న వివిధ రూపాల ప్రాణులు పిలిచినప్పుడు వారి దగ్గర భుజిస్తాడు. అంతరిక్షంలో పిలిచిన వారి దగ్గర భుజిస్తాడు. అంటే అంతరిక్షంలో ఉన్న వివిధ రకాలయిన ప్రాణులు పిలిచినప్పుడు భుజిస్తాడు అని అర్థం.

దివిలో ఉన్న వివిధ రకాలయిన ప్రాణులు పిలిచినప్పుడు భుజిస్తాడు. అలాగే ఆహ్వానించినప్పుడు దేవతలతో, వివిధ లోకాలలో భుజిస్తాడు. ఈ లోకము ఆ లోకము అని లేకుండా అన్ని లోకాల చేత ఆహ్వానించబడతాడు. ఈ లోకాన్ని ఆ లోకాన్ని అంటే భూలోకం, స్వర్గలోకం కూడా పొందుతాడు.

ఈ రకంగా అతిథులను సత్కరించినవాడు, అతిథులకు భోజనం పెట్టినవాడు. కాంతివంతమైన లోకాలకు పోతాడు. అతిథులకు అన్నం పెట్టటం అన్ని యజ్ఞాలకన్న గొప్పది అని చెబుతోంది అథర్వవేదం.

# 73. దేవుడిచ్చిన శరీరము

మానవ శరీరము ఏ విధంగా ఆవిర్భవించింది. అనే ప్రశ్న ఇంత కాలంగా మనల్ని పీడిస్తూనే ఉంది. ఇన్ని అవయవాలతో ఇంత పకడ్బందీగా, అత్యంత సుందరంగా ఈ శరీర నిర్మాణం ఎవరు చేశారు? ఇది ఎలా జరిగింది? ఇవి చాలా పెద్ద ప్రశ్నలు. ఈ ప్రశ్నలకు సమాధానం చెబుతున్నది. **పదవకాండలోని రెండవ సూక్తం.** ఇందులో ముప్పైమూడు మంత్రాలున్నాయి. ఈ సూక్తంలో ఏం చెప్పారో చూడండి.

మానవుడి శరీరము, మాంసము, కీళ్ళు, ఎవరు ఏర్పరచారు? అందమైన వేళ్ళకు ఎవరు పుష్టిని కలిగించారు?

అధరాలు (పెదవులు) ఎవరు ఏర్పరచారు? జంఘములు, జానుసంధులు ఎక్కడున్నాయి? ఇవన్నీ ఎవరికి తెలుసు?

మెడ, రొమ్ము, ఇవి ఏ దేవతలకు తెలుసు? స్తనాలు, కపోలాలు, స్కంధాలు వీటిని ఎవరు చేశారు?

భుజాలకు బలాన్నించింది ఎవరు? వీర్యాన్ని ఎవరు ఏర్పాటు చేశారు?

ముఖాన్ని తయారుచేసింది ఎవరు? ముఖాన్ని తొలిచి రంధ్రాలు ఏర్పాటు చేసి రెండు కళ్ళు, రెండు ముక్కులు, రెండు చెవులు, నోరు, వీటిని ఏర్పాటు చేసింది ఎవరు?

ఏ దేవత మహిమ వల్ల రెండు కాళ్ళ జీవులు, నాలుగు కాళ్ళ జంతువులు యమపురికి చేరుతున్నాయి? శరీరంలో ఎక్కువగా కదిలేది నాలుక, దాన్ని దవడల మద్యన పెట్టిన వాడెవరు? ఆ నాలుకకు

వాక్కు ఇచ్చింది ఎవరు? జీవిలో తిరిగే జలమును గురించి తెలిసింది ఎవరికి?

మొదటగా మానవుడి మెదడు, ముఖము, దవడలు ఏర్పాటు చేసి స్వర్గాన్ని చేరిన దేవత ఎవరు?

మానవుడు ప్రియము, అప్రియము, సంబంధము, ఆనందము, హర్షము, కోపము ఇవన్నీ ఎవరివల్ల పొందుతున్నాడు? మానవుడికి ఆర్తి, అపర్తి, నిర్ఋతి, మతి, అమతి ఇవన్నీ ఎక్కడినుంచి వచ్చాయి?

నీరు అందరికీ కావలసినది. సముద్రంలో ఉండేది, అంతటా ఉండేది. ఆ నీటికి ఎరుపు, పసుపు, ఇలా రకరకాల రంగులు ఎలా వచ్చాయి?

మానవుడిలో రూపము, మహిమ, నామము, జ్ఞానము. వీటిని ఎవరు ఏర్పాటు చేశారు?

మానవుడిలో ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన వాయువులను ఏర్పాటు చేసిన దేవత ఎవరు?

మానవుడిలో సత్యము, అసత్యము, మృత్యువు, అమృతములను స్థాపించింది ఎవరు?

శరీరాన్ని కప్పి ఉంచే చర్మాన్ని ఎవరు ఏర్పాటు చేశారు? ఆయువు ఎవరిచ్చారు?

మానవుడికి వేగాన్ని ఎవరు కల్పించారు?

పగలు, రాత్రి ఏర్పాటు చేసింది ఎవరు?

సృష్టి అవిచ్ఛిన్నంగా సాగాలంటే మానవుడిలో వీర్యము ఉండాలి.

ఆ వీర్యాన్ని ఏర్పాటు చేసిందెవరు?

ఎవరి ప్రభావంతో మానవుడు భూమిని ఆక్రమించాడు? కొండలు, పర్వతాలు ఎక్కడ? కర్మలు ఎలా చేశాడు? ఎవరి ప్రభావం వల్ల వర్షాలు కురుస్తున్నాయి?

ఎవరివల్ల శ్రోత్రీయుడనబడుతున్నాడు? ఎవరివల్ల కాలమానం గణిస్తున్నాడు?

బ్రహ్మవల్లనే శ్రోత్రియాన్ని, పరమేష్టిని, అగ్నిని అందుకుంటున్నాడు. సంవత్సరాలు కాలమానము గణిస్తున్నాడు. ఏ కర్మవల్ల దేవతలకు అనుకూలంగా ఉండగలుగు తున్నాడు? ఏ ప్రకారము దేవ ప్రజలకు అనుకూలంగా ఉండగలుగుతున్నాడు?

బ్రహ్మవల్లనే దేవతలకు అనుకూలంగా ఉండగలుగుతున్నాడు.

భూమిని, ఉత్తరధ్వనాన్ని ఎవడు స్థాపించాడు? బ్రహ్మమే పైన క్రింద మధ్య భాగము, అంతరిక్షము, భూమి అన్నీ కల్పించాడు. బ్రహ్మమే మూర్ధము, హృదయము ఏర్పాటు చేశాడు. అధ్వర్యుడు ఏర్పాటు చేసిన శిరస్సు చక్కగా నిలిచి ఉంది. కేశాలు దేవతారూపాలు. ప్రాణాలు వాటిని రక్షిస్తున్నాయి. అన్నము, మనస్సుకూడా శిరస్సును కాపాడుతున్నాయి. బ్రహ్మపురిని తెలుసుకున్నవాడు పైన, క్రింద మాత్రమే కాదు దశదిశలయందు వ్యక్తమవుతున్నాడు.

బ్రహ్మపురిని తెలియనివాణ్ణి పురుషుడు అంటారు. అతని కళ్ళు, ప్రాణము, వార్ధక్యానికి ముందు అతణ్ణి వదలవు అంటే బ్రహ్మజ్ఞానం లేని మనిషికి ఇంద్రియాలు, ప్రాణము ముసలితనము వచ్చేదాకానే

సరిగా ఉంటాయి.

ఎనిమిది వంకర్లు, పన్నెండు ద్వారాలు కలది దేవతలపురము అయోధ్య అవుతున్నది. అందులో హిరణ్మయకోశము గల స్వర్గమున్నది.

ఆ హిరణ్మయ కోశంలోనే అన్నీ ప్రతిష్ఠితమై ఉన్నాయి. అది ఆత్మయొక్క స్థానము. దాన్ని బ్రహ్మజ్ఞులు మాత్రమే తెలుసుకోగలరు.

బ్రహ్మపురి పాపనాశిని, యశోసంపన్నము, కాంతివంతము, హిరణ్మయము, అపరాజితము. అటువంటి ఈ శరీరంలో బ్రహ్మ ప్రవేశిస్తున్నాడు.

ఈ రకంగా మానవదేహాన్ని సృష్టించి అందులో పరబ్రహ్మ ప్రవేశించాడు. 7,8 సూక్తాలు 'స్కంభ' సూక్తము. ఇందులో కూడా పరమేశ్వర స్వరూపాన్ని వివరించటం జరిగింది.

# 74. రుద్రుడు (సూక్తం-5)

రుద్రుడు రౌద్ర స్వభావంగలవాడు. హింసించే స్వభావం గలవాడు. మిక్కిలి బలమైనవాడు అని గతంలో మనం చెప్పుకున్నాం. ఇప్పుడు తమను రక్షించమని ఆ రుద్రుణ్ణి ప్రార్థిస్తున్నారు **పదకొండవ కాండలోని ఐదు, ఆరు, ఏడు సూక్తాలలో** ముందుగా మనం ఐదవ సూక్తం చూద్దాం. భవుడు, శర్వుడు మమ్మల్ని రక్షించాలి. భూతపతికి నమస్కారము, పశుపతికి నమస్కారము. ఓ దేవతలారా! మీరు ఎక్కు పెట్టిన బాణము మా మీద ప్రయోగించకండి. మమ్మల్ని మా పిల్లలని, పశువులని హింసించకండి.

ఓ పశుపతీ ! మమ్మల్ని కుక్కలు, నక్కలు గ్రద్దలు, కాకులు ఏవీ తాకకుండా ఉండును గాక. క్రిమికీటకాలు, పక్షులు మమ్మల్ని ఆహారముగా భావించకుండు గాక. అంటే కుక్కలు నక్కలు శవాలను పీక్కు తింటాయి. క్రిమికీటకాలు, పక్షులు కూడా అంతే ఇవి మమ్మల్ని ఆహారంగా భావించకుండు గాక. అంటే మాకు మృత్యువు రాకుండుగాక. నువ్వు మమ్మల్ని రక్షించాలి. ఓ రుద్రా ! నీ గర్జనకు నమస్కారము. ఆకాశంలోను స్వర్గంలోను కూడా ఉన్న నీకు నమస్కారము.

నీ ముఖానికి నమస్కారము, నీ దృష్టికి నమస్కారము, నీ నేత్రాలకు, నమస్కారము, నీ సమ్యక్‌దృష్టికి, ప్రత్యగాత్మకు నమస్కారము ఓ దేవా ! నీ అవయవాలకు నమస్కారము. ఉదరానికి నమస్కారము, నీ ముఖానికి నమస్కారము, నీ దంతాలకు నమస్కారము. రుద్రుడు నీలకంఠుడు, సహస్రాక్షుడు, అమితమైన వేగంగలవాడు, శత్రుసేనలను నాశనం చేసేవాడు. అటువంటి రుద్రుడు మమ్మల్ని బాధింపకుండును గాక.

ఆ భవుడు మమ్మల్ని సమస్త ఉపద్రవాల నుంచి రక్షించును గాక. అతనికి నమస్కారము.

భవుడికి నమస్కారము. ఒకసారి కాదు నాలుగుసార్లు నమస్కారము. మళ్ళీ నమస్కారము. ఓ పశుపతీ ! నీకు పదేపదే నమస్కారము చేస్తున్నాము. మాకు సంబంధించిన ఆవులు, మేకలు, గుర్రాలు, గొర్రెలు, ప్రజలు వీటిని (పంచ పశువులు) రక్షించవలసింది.

ఓ దేవా ! నువ్వే ద్యులోకము, నువ్వే విశాలమైన అంతరిక్షము, నువ్వే నాలుగు దిక్కులు, ఈ జగత్తులో ఉన్న జీవజాలమంతా నువ్వే మమ్మల్ని రక్షించవలసింది.

## 75. రుద్రుడు (సూక్తం-6)

ఓ పశుపతీ ! చరాచర జగత్తు నిండి ఉన్న బ్రహ్మాండం అంతా నువ్వే. నీకు నమస్కారము. మమ్మల్ని కాపాడు. మాంసాన్ని తినే జంతువులు, తలలు విరబోసుకుని ఏడుస్తూ తిరిగే పిశాచాలు మాకు దూరంగా ఉండుగాక. మా జోలికి రాకుండు గాక. రుద్రుడి ధనుస్సు ఆకుపచ్చగా ఉంటుంది. అనేక యుద్ధాలు చేసింది. కొన్నివేలమంది రాక్షసులను చంపింది. ఆ ధనుస్సు ఎక్కడ ఎక్కుపెట్టబడిందో ఆ దిశకు నమస్కారం చేస్తున్నాను. రుద్రా ! యుద్ధంలో నీ ముందు నిలవలేక పారిపోయి, దారికాచి నిన్ను దొంగదెబ్బ తియ్యాలని చాటుమాటుగా నక్కిన వాళ్ళని పట్టుకుని శిక్షిస్తావు. అలాగే మా శత్రువులను పట్టుకుని శిక్షించు.

భవుడు, రుద్రుడు ఇద్దరు ఏకమనస్కులు. ఇద్దరూ ఉగ్రమైన వారే. వారు అత్యంత సాహసోపేతులు. వారు ఏ దిశగా ఉన్నారో, ఆ

దిశకు నమస్కారము. ఓ రుద్రా ! ఎదుట ఉన్న నీకు నమస్కారము. ముందు ఉన్న నీకు నమస్కారము. కూర్చున్న, తిరుగుతున్న, పడుకున్న, ఏ పని చేస్తున్నప్పటికీ నీకు నమస్కారము.

రుద్రుడు వేయికళ్ళతో అన్నింటినీ తన వేయి కళ్ళలో కనిపెడుతూ ఉంటాడు. లోకంలో ఎక్కడ ఏం జరుగుతుందో చారుల ద్వారా ఎప్పటికప్పుడు తెలుసుకుంటాడు. సూక్ష్మదర్శి. తూర్పు వైపుగా అనేక బాణాలు వేస్తాడు. తలచుకుంది చేస్తాడు. అన్ని లోకాలు మ్రింగివేస్తాడు. అంత భయంకరుడు. అటువంటి రుద్రుడి దగ్గరకు మేము వెళ్ళకుండా ఉండాలి.

రుద్రుడు కపిలవర్ణంలో ఉంటాడు. శత్రువులను భయంకరంగా హింసిస్తాడు. కేసి అనే రాక్షసుడి రథాన్ని నేలమీద కూల్చేశాడు. అటువంటి రుద్రుడిని ఇతర దేవతల కన్న ముందే అతన్ని మేము స్తుతి చేస్తున్నాము. నమస్కారం చేస్తున్నాము. ఓ రుద్రా ! మమ్మి హింసించవద్దు. మామీద కోపం వద్దు, మమ్మల్ని అనుగ్రహించ వలసింది. మమ్మల్ని రక్షించవలసింది. అని ప్రార్థిస్తున్నారు.

## 76. రుద్రుడు (సూక్తం-7)

ఓ రుద్రా ! మా ఆవులు, మేకలు, గొర్రెలు, బర్రెలు వేటినీ కోరవద్దు. నీ ఆయుధాలను ఇతరత్రా ప్రయోగించు మమ్మల్ని హింసించేవారిని వధించు.

రుద్రుడి ఆయుధాలు వ్యాధులు. అవి దగ్గు, జ్వరము రూపంలో వచ్చి మనిషిని గుర్రంలాగా సకలించేటట్టు చేస్తాయి. మానవుడి ఆరోగ్యం నాశనం చేస్తాయి. అటువంటి రుద్రుని ఆయుధానికి

నమస్కారము.

ఆధారం లేకుండా అంతరిక్షంలో నిలిచాడు రుద్రుడు. అతడు లోకంలో యజ్ఞయాగాలు చెయ్యనివారిని, దేవతలను హింసించే వారిని, నాశనం చేస్తాడు. అటువంటి రుద్రుడికి రెండు చేతులూ ఎత్తి నమస్కారం చేస్తున్నాను.

ఓ పశుపతీ ! నీ కోసం అరణ్యాలలో తిరిగే పశువులు వన్యమృగాలు, హంసలు, గ్రద్దలు, కాకులు, వన్యపక్షులు ఉన్నాయి. నీ దివ్యమైన రూపం జలంలో ఉంది. జలం నీ అభిషేకానికే ఉన్నది. చేపలు, మొసళ్ళు, తిమింగలాలు అన్నీ నీకు ఆహారము అవుతాయి. రుద్రా ! నీకు దూరము, దగ్గర అనేది లేదు. అన్నింటినీ చూస్తూనే ఉంటావు. సమస్త భూమండలాన్ని ఒక్క క్షణంలోనే చూస్తావు. పూర్వసముద్రం దగ్గర నుంచి ఉత్తర సముద్రానికి క్షణంలో చేరగలవు.

ఓ రుద్రా! మాకు కష్టాలు కలిగించవద్దు. విషాన్ని, పిడుగులు మావద్దకు చేరనీకు. వీటిని ఇంకొకచోట వెయ్యి. భవుడు భూమి, ఆకాశము, స్వర్గము మూడింటికీ ప్రభువు. అతడు ఉన్న దిశకు నమస్కారము.

భవరాజా! యజమానికి సుఖాన్ని కలిగించాల్సింది. పశువులకు సుఖాన్ని కలిగించి పశుపతివగుము. నీ యందు భక్తి శ్రద్ధ ఉన్న వారికి, దేవతల భక్తులకు, పశువులకు కూడా సుఖాన్ని కలిగించు.

మాకన్న పెద్దవారిని హింసించకు. మాకన్న చిన్నవారిని హింసించకు. మా తోటివారిని హింసించకు. పిల్లలను హింసించకు. పెద్దలను హింసించకు, వృద్ధులను హింసించకు. స్త్రీలను హింసించకు. పురుషులను హింసించకు. మమ్మల్ని హింసించకు రుద్రునికి నమస్కారము. రుద్రుని ప్రమథ గణాలకు నమస్కారము. రుద్రగణాలకు

నమస్కారము. భయంకరమైన ముఖాలు గల కుక్కలకు నమస్కారము.

ఓ రుద్రా ! హుంకారాలు చేసే నీ సేనకు నమస్కారము. భయంకరమైన కేశినీ సేనకు, నమస్కృత సేనకు, నీతోపాటుగా భోజనం చేసే సేనకు అందరికీ నమస్కారము.

దేవా ! నువ్వు మాకు శుభాన్ని కలిగించు. అభయాన్నివ్వు. శత్రువుల బారినుండి రక్షించు అని ప్రార్థిస్తున్నారు.

రుద్రుణ్ణి గురించి ఇచ్చిన ఈ మూడు సూక్తాలు యజుర్వేదంలో చెప్పిన శతరుద్రీయము (నమకము) లాంటివే అయితే నమకంలో మొత్తం 169 మంత్రాలు మాత్రమే ఉన్నాయి. యజుర్వేదంలో రుద్రుడికి సర్వవ్యాపకత్వముతో పాటుగా భక్తులను రక్షించటము, దుష్టులను శిక్షించుటము ఆయనపని అని చెప్పారు. కాగా అధర్వ వేదంలో రుద్రుడు భయంకరుడు, ఉగ్రుడు. చాలా బలశాలి. శత్రువులను చీల్చి చెండాడతాడు, భక్తులను రక్షిస్తాడు అని చెప్పబడింది.

# 77. ప్రాణసూక్తం (సూక్తం-11)

జీవి జీవించాలంటే ప్రాణం కావాలి. ప్రాణము చాలా ముఖ్యమైన ఇంద్రియము. శరీరంలో కన్ను, ముక్కు, కాలు, చెయ్యి, నోరు ఏది లేకపోయినా బ్రతకచ్చు. కాని ప్రాణం లేకపోతే మాత్రం జీవించం. అందుకే ప్రాణం అంత ముఖ్యమైనది. ఈ విషయాన్ని **పదకొండవ కాండలోని మూడు సూక్తాలలో** వివరించారు. ముందుగా పదకొండవ సూక్తం చూద్దాం.

ఇది సర్వము ఎవరియందు వశమై ఉన్నదో, ప్రాణులన్నింటికీ ఈశ్వరుడు ఎవరో, ఎవరియందు ఇది సాంతం నిలిచి ఉన్నదో అటువంటి ప్రాణానికి నమస్కారము.

ధ్వని చేసే ప్రాణానికి నమస్కారము. గర్జించే ప్రాణానికి నమస్కారము. వర్షించే ప్రాణానికి నమస్కారము, విద్యుత్ ప్రాణానికి నమస్కారము.

ప్రాణం గనక ఉరిమితే ఓషధులు శబ్దం చేస్తాయి. గర్భం దాల్చి ధాన్యాదులను పండిస్తాయి.

కాలాన్ననుసరించి ప్రాణము ఓషధుల కోసం ఉరుముతుంది. ఆ సమయంలో భూమిని ఆశ్రయించి ఉన్న సమస్తము సంబరపడుతుంది.

ప్రాణం వర్షం కురిపించి ఈ భూమిని తడిపినప్పుడు తమకు మహాఉత్సవము జరుగుతుంది అని పశువులన్నీ సంబరపడతాయి.

ప్రాణంతో అభిషిక్తమైన ఓషధులు ప్రాణంతో అంటున్నాయి. "ప్రాణమా! మాకు ఆశలు కలిగించు సువాసనలు కూర్చు"

ప్రాణమా ! లోపలికి వస్తున్న నీకు నమస్కారము. బయటకు పోతున్న నీకు నమస్కారము. నుంచున్న నీకు నమస్కారము, కూర్చున్న నీకు నమస్కారము"

ప్రాణానికి నమస్కారం. అపానానానికి నమస్కారము. బయట ఉన్న నీకు నమస్కారము. లోపల ఉన్న నీకు నమస్కారము. సమస్త అయిన నీకు నమస్కారము. ప్రాణమా! తనువు నీకు ప్రియము, ఊపిరి ప్రేయసి అవుతున్నారు. మమ్మల్ని బ్రతికించటానికి నీ దగ్గర ఉన్న ఓషధులు మాకు ఇవ్వవలసింది.

కుమారుడు తండ్రికి ప్రీతిపాత్రుడవుతాడు. అలాగే ప్రాణాలు ప్రజలకు ప్రాణప్రదమవుతున్నాయి. ఈ చరాచర జగత్తుకంతటికీ ప్రాణమే సర్వేశ్వరుడు.

## 78. ప్రాణసూక్తం (సూక్తం-12)

ప్రాణమే మృత్యువు. ప్రాణమే బాధ. దేవతలు ప్రాణాన్నే ఉపాసన చేస్తారు. ప్రాణమే సత్యభాషణ ఉత్తమలోకాలు కల్పిస్తున్నది.

**ప్రాణోవిరాట్ ప్రాణోదేష్ట్రీ ప్రాణం సర్వముపాసతే**
**ప్రాణోహ సూర్యశ్చంద్రమాః ప్రాణమాహుః ప్రజాపతిమ్ ॥**

ప్రాణమే విరాడ్రూపము, ప్రాణమే సూర్యుడు, ప్రాణమే చంద్రుడు, ప్రాణమే ప్రజాపతి, ప్రాణమునందే సర్వమూ ఉపాసించబడుతున్నాయి.

ప్రాణాపానాలు ధాన్యము యవలు అని చెప్పబడుతున్నాయి. గర్భంలో ఉన్నవాడికి ప్రాణాపానాలు కలుగుతున్నాయి. ఏ విధంగా నువ్వు ప్రాణాన్ని, ఆహారాన్ని భుజిస్తున్నావో, ఆ విధంగానే అది మళ్ళీ జన్మిస్తుంది.

ప్రాణం ఆహాః మాతరిశ్వానాం వాతః హ ప్రాణముచ్యతే ।
ప్రాణేహభూతం భవ్యంచ ప్రాణే స్సర్వం ప్రతిష్ఠితమ్ ॥

ప్రాణమందే సర్వమూ ప్రతిష్ఠితమై ఉన్నది. ఓ ప్రాణమా ! నీవు వర్షించినప్పుడు అధర్వ, అంగీరస, దేవ, మనుష్యులు కల్పించిన ఓషధుల తలలు పుడతాయి.

ప్రాణము యొక్క మహత్తు ఎరిగినవారు ఉత్తమలోకాలు చేరతారు.

ఓ ప్రాణమా ! సమస్తమైన ప్రజానీకము నీకు అన్నము సమర్పిస్తున్నారు. అలాగే నీ ప్రభావాన్ని వీనులవిందుగా వినిపించే వారికి సమర్పించాలి. దేవతల లోపల సంచరించే ప్రాణమే భూతంగా పరివర్తన చెంది తిరిగి జన్మిస్తోంది. తండ్రి తన అన్ని అవయవాలతోను కుమారుని యందు ప్రవేశించినట్లు భూతభవిష్యత్తులు ప్రాణము నందు ప్రవేశిస్తున్నాయి.

## 79. ప్రాణసూక్తం - (సూక్తం-13)

జలమును హంస, శరీరం నుంచి ప్రాణం ఎగిరినప్పటికీ చీకట్లు విడిపోవు.

ప్రాణము అనేది విశ్వానికే జన్మనిచ్చినది. ఊపిరి పోసినది. త్వరగా శరీరంలోనికి ప్రవేశిస్తుంది. అటువంటి ప్రాణానికి నమస్కారము. అందరికీ జన్మనిచ్చే ప్రాణము నా యందు నిలచును గాక.

నిద్రపోయిన వాడికి ఏమీ తెలియదు. ఓ ప్రాణమా ! అలా నిద్రపోయిన వాణ్ణి మేల్కొల్పుము. నిద్రించే వాడి ప్రాణం నిదురించదు. ప్రాణమా ! నా నుంచి ముఖం మళ్ళించకు. నువ్వు నాకన్న వేరు కాదు. జలగర్భంలో ఉన్న అగ్ని లాగా నువు నాలోనే ఉంటావు. నన్ను విడిచి పోవద్దు.

# ౭౦. పృథివీసూక్తం

ఇది పృథివీ సూక్తం దీన్నే భూసూక్తం అని కూడా అంటారు. అయితే భూసూక్తం పేరుతో చిన్న సూక్తం ఇంకోటుంది. అది పంచసూక్తాలలో ఒకటి. అవి 1.పురుషసూక్తం 2. శ్రీసూక్తం 3. మన్యుసూక్తం 4. నీళాసూక్తం 5. భూసూక్తం. ఈ కారణంచేత దీన్ని **'పృథివీసూక్తం'** అనటమే శ్రేయస్కరం. ఇందులో మొత్తం 63 మంత్రాలున్నాయి. **పన్నెండవ కాండలోని ఒకటవ సూక్తమే** ఈ పృథివీ సూక్తం. అథర్వ వేదానికి తలమానికం ఈ పృథివీసూక్తం. ఇందులో భూమియొక్క ప్రాశస్త్యాన్ని చెప్పారు. భూమియొక్క గొప్పతనాన్ని చెప్పి, మాకు సుఖాలు కలిగించమని ప్రార్థిస్తున్నారు. ఇందులో ముప్పైయవ మంత్రంలో **'ఓ భూదేవీ' మాతోపాటు మా శత్రువులను కూడా పవిత్రం చెయ్యి' అనే కోరిక ఒక్క అథర్వవేదానికే కాదు. నాలుగు వేదాలకు కూడా తలమానికం.**

1. సత్యము, బృహద్వ్రతము, ఉగ్రమైన దీక్ష, తపస్సు, బ్రహ్మయజ్ఞము ఇవి ఈ భూమిని నిలబెడుతున్నాయి. అటువంటి భూమి మాకు విశాలస్థానము కల్పించును గాక.
2. ఈ భూమి మానవుల మధ్యనే ఉన్నది. అయినప్పటికీ అది మానవులను బాధించదు. ఒకచోట ఎత్తుగా ఉంటుంది. ఇంకొకచోట లోతుగా ఉంటుంది. మహాశక్తి కలిగిన ఓషధులన్నీ దీనిలోనే ఉన్నాయి. అటువంటి పృథివి మా కోరికలు తీర్చును గాక.
3. భూమిమీద సముద్రము, నదులు, పర్వతాలు, కొండలు, బండలు, రాళ్ళు, రప్పలు ఉన్నాయి. వ్యవసాయము ఇక్కడే జరుగుతోంది.

ఈ భూమిమీదనే అనేక రకాల ప్రాణులు నివశిస్తున్నాయి. అటువంటి భూమి మమ్మల్ని సుఖంగా చూచుగాక.

4. ఈ భూమిమీదనే దశదిశలు ఉన్నాయి. అన్నము ఇక్కడే ఉన్నది సమస్త ప్రాణులను ఈ భూమే భరిస్తున్నది. ఆ భూదేవి మాకు అన్నము ఇచ్చుగాక. గోసంపద నిచ్చుగాక.

5. ఈ భూమిమీద పూర్వకాలంలో అనేకమంది గొప్పవారు నివశించారు. దేవతలు రాక్షసులు ఈ భూమిమీదనే యుద్ధం చేశారు. ఆ భూమిమీదనే ఆవులు, గుర్రాలు, పక్షులు అన్నీ నివశిస్తున్నాయి. ఈ భూమి మాకు ధనాన్ని తేజస్సును ఇచ్చుగాక.

6. ఈ భూమి విశ్వంభర, వసుంధర, హిరణ్యవక్ష, వైశ్వానరుని, ఇంద్రుణ్ణి, అగ్నిని కూడా భరిస్తోంది. అటువంటి భూమి మాకు ధనాన్ని ప్రసాదించుగాక.

7. కనురెప్పలు కూడా ఆర్పని దేవతలు ఈ భూమిని అహర్నిశలు రక్షిస్తున్నారు. అటువంటి భూదేవి మాకు ప్రియమైన మధువును, వర్చస్సును కలిగించుగాక.

8. మొదట ఈ భూమి జలమునందున్నది. చాలా గొప్ప పురుషులు, మహాపురుషులు ఈ భూమిమీద సంచరించారు. ఈ భూదేవి హృదయము అమృతమయము. అటువంటి భూమి మాకు నివాసము కల్పించుగాక. దీప్తిని, బలాన్ని కలిగించుగాక.

9. భూమికి నాలుగువైపులా అహోరాత్రులు నీరు ప్రవహిస్తూ ప్రమాదం కలిగిస్తోంది. అటువంటి భూమి మాకు మంచి ఫలితాన్నిచ్చు గాక.

10. దేనిమీద శ్రీమహావిష్ణువు విశ్రమించాడో, దేనిని అశ్వనీ దేవతలు నిర్మించారో, దేనిని శత్రువులు లేకుండా చేసి ఇంద్రుడు తనవశమునందుంచుకున్నాడో, అటువంటి భూదేవి తల్లి బిడ్డకు పాలిచ్చినట్లుగా రుచికరమైన పదార్థాలు మనకు ఇచ్చుగాక.

11. ఓ భూదేవీ ! ఇక్కడ ఉన్న కొండలు, కోనలు, గిరులు, తరులు, పర్వతాలు మాకు శుభములు కలుగజేయుగాక.

12. తల్లీ ! నీ మధ్య భాగమునందు నీ పుష్టిప్రద పదార్థములయందు (సారవంతమైన నేలల యందు) మాకు నివాసం కల్పించు. మమ్మల్ని ధన్యులుగా చెయ్యి. ఈ భూమి మాకు తల్లి. పర్జన్యుడు మాకు తండ్రి, వీరు మమ్ములను రక్షించుగాక.

సారవంతమైన నేలలు అంటే – మధ్యధరా ప్రాంతమన్న మాట. అక్కడ పశుసంపద ఎక్కువ. పండ్లచెట్లు విపరీతం. ఆ ప్రాంతంలో బాగా దొరికేవి పాలు, పెరుగు, వెన్న, వివిధ రకాల పండ్లు, భూలోకంలో స్వర్గసీమ అని చెబుతారు ఈ ప్రాంతాన్ని.

13. ఈ నేలమీదనే వేదాలు పుట్టినాయి. అన్ని రకాల కర్మలు చేస్తున్నారు. యజ్ఞాలు, యాగాలు, క్రతువులు చేస్తున్నారు. అవి చెయ్యటానికి యూపస్తంభాలు పాతుతున్నారు. గోదానాలు ఇస్తున్నారు. అటువంటి భూమి మాకు శుభాలు కలిగించాలి.

14. ఓ భూమాతా ! మమ్మల్ని ద్వేషించే వారిని హతమార్చు. మాకు వ్యతిరేకంగా పని చేసేవారిని సంహరించు. మాకు హాని కలిగించే వారిని నాశనం చెయ్యి.

15. ఓ భూదేవీ ! ఇక్కడ మానవులు తిరుగుతున్నారు. వీరితోపాటుగా

అనేకమంది. పశువులు, పక్షులు, వన్యమృగాలు, క్రూరజంతువులు, మానవులు (పంచజనులు) వీరందరినీ నువ్వు భరిస్తూనే ఉన్నావు. వీరందరి కోసమే సూర్యుడు తన కాంతికిరణాలు ప్రసరింపచేస్తున్నాడు. అమృతాన్ని పంచుతున్నాడు. అటువంటి వీరందరినీ రక్షించవలసినది. వీరంతా నీ వారే నీ బిడ్డలే.

16. సూర్య కిరణాలు మాకు సంతానాన్ని, తియ్యటి మధురమైన వాక్కుని ప్రసాదించాలి. ఓ భూమి! నీవు మధుర పదార్థాలు మాకు ప్రసాదించు.

17. ఈ భూమి ధనానికి మూలము. ఓషధులకు మూలము. ధర్మాన్ని ధరిస్తుంది. సుఖాన్ని ఇస్తుంది. అటువంటి భూమిమీద ఎక్కడైనా సరే మేము సంచరించాలి. (ఇది మానవుడి కోరిక. కాని ఆచరణలో మానవుడి స్వార్థంవల్ల సాధ్యం కావటం లేదు. ఎక్కడిదాకానో ఎందుకు, ఆంధ్రా వాళ్ళు తెలంగాణాలో ఉండటానికి పని చెయ్యటానికి వీలులేదు. అని తెలంగాణా ముఖ్యమంత్రి చంద్రశేఖరరావు స్పష్టం చేశారు)

18. ఓ భూమి! నువ్వు అనేకమందికి నివాసము కలిగిస్తున్నావు. దేవరాజైన ఇంద్రుడు వేయి కళ్ళతో నీకు రక్షణ ఏర్పాటు చేశాడు. ఇక్కడ నివసించే మాకు బంగారం వంటి తేజస్సు కలిగించు. మమ్మల్ని ఎవరూ ద్వేషించకుండా చూడవలసింది.

19. అగ్ని అనేకచోట్ల ఉంది. ఈ భూమియందు జలమునందు, రాళ్ళయందు, మానవులయందు, ఆవులయందు, అశ్వములయందు కూడా ఉన్నది.

20. అగ్ని స్వర్గంలోఉంది. అంతరిక్షంలోఉంది. సముద్రంలోఉంది. అగ్నిని మానవులు ఆహుతులిచ్చి ప్రజ్వలింపచేస్తున్నారు.

21. అగ్ని దేనియందు నివసిస్తున్నాడో, ఏది అగ్నియొక్క ధూమాన్ని తెలియచేస్తోందో, అటువంటి భూమి మమ్మల్ని శక్తివంతులుగా చేయుగాక.

22. భూమిమీద యజ్ఞాలలో దేవతలకు హవిస్సులు సమర్పిస్తున్నారు. మానవులేమో జలము, అన్నము వల్ల జీవిస్తున్నారు. అటువంటి భూమి మాకు ఆయువు ప్రాణము ఇచ్చి అపమృత్యువు లేకుండా, మా ఆయువు ఉన్నంత వరకు జీవింప చేయుగాక.

23. భూమి సుగంధాన్ని వెదజల్లుతుంది. ఆ సుగంధము గంధర్వులు, అప్సరసలు, ఓషధులు ఆస్వాదిస్తున్నారు. అటువంటి సుగంధాన్ని మాకు కలిగించు. మమ్ము ద్వేషించేవారు ఉండకూడదు.

24. ఓ భూమీ ! నీ సువాసన కమలములుయందున్నది. అది ‘సూర్య’ వివాహంతో మానవులకు లభించింది. ఆ సుగంధాన్ని మాకుప్రసాదించు. మమ్మల్ని ద్వేషించే వారు ఉండకూడదు.

25. ఓ భూమీ ! పురుషులయందు, స్త్రీలయందు, భగునియందు, అశ్వముల యందు, నీడలయందు, మృగాలయందు ఉన్న నీ సుగంధము, కన్యలయందున్న వర్చస్సు ఇవన్నీ మాకు ఇవ్వవలసింది. మమ్ము ద్వేషించువారు ఉండకూడదు.

26. ఓ ధరిత్రీ ! నీ మీద అనేక శిలలు, రాళ్ళు, చిన్న చిన్న గులకరాళ్ళు, పెద్ద పెద్ద బండలు, కొండలు ఉన్నాయి. ఇలా నువ్వు అనేక రూపాలతో ఉన్నావు. అటువంటి భూమికి నేను నమస్కరిస్తున్నాను.

27. దేనిమీదైతే ఓషధులు స్థిరంగా నుంచుని ఉన్నాయో, ఏది సమస్తాన్ని భరిస్తున్నదో, అటువంటి భూమిని స్తుతిచేస్తున్నాను. నమస్కరిస్తున్నాను.

28. అమ్మా భూమీ ! మేము నిన్ను కాళ్ళతో తాకుతున్నాము. నీ మీద నుంచుంటున్నాం. కూర్చుంటున్నాం. పడుకుంటున్నాం. మేము చేసే ఈ పనుల వల్ల నీకు బాధ కలగకుండా ఉండుగాక.

29. వేదాలతో వర్ధిల్లేది, క్షమాగుణము గలది, అయిన భూమిని స్తుతిస్తున్నాను. ఆ భూమికి నేను ఆహుతులు అర్పిస్తున్నాను. భూమి అన్నరసాన్ని, బలాన్ని ధరించవలసింది.

30. మా మీద పవిత్రమైన జలం పడుతున్నది. దానివల్ల మేము పవిత్రులం అవుతున్నాం. దాన్ని మేము మా శత్రువులకు ఇస్తున్నాం. ఓ భూదేవీ ! మా **శత్రువులను కూడా పవిత్రం చెయ్యి.**

31. భూమి మీద ఉన్న దిశలన్నీ మేము నడిచేటప్పుడు సుఖప్రదము అగుగాక. మేము పడకుండా ఉండాలి.

32. ఓ భూమీ! నాకు తూర్పువైపుఉండి నన్ను రక్షించు. దక్షిణంవైపుఉండి నన్నురక్షించు. పడమటివైపుఉండి నన్నురక్షించు. ఉత్తరంవైపుఉండి నన్నురక్షించు. నాకు శుభాలు కలిగించు. దొంగలనుంచి నన్నుకాపాడు.

33. ఓ భూమీ ! మిత్రుడయిన సూర్యుని ముందు నిన్ను చూస్తున్నంత వరకు నా దృష్టి తగ్గకుండా ఉండుగాక.

34. భూమీ ! నువ్వు అందరికీ ప్రీతి కలిగిస్తావు. నేను పడుకున్నప్పుడు

అటు ఇటు దొర్లుతుంటాను. అప్పుడు నన్ను హింసించకు.

35. నేను గనక నిన్ను తవ్వితే వెంటనే నిండిపోతావు. కాని నేను నీ హృదయాన్ని నింపలేకున్నాను.

36. అమ్మా! రోజులు, పక్షాలు, మాసాలు, ఋతువులు, సంవత్సరాలు అన్నీ నీ కోసమే ఏర్పడినాయి. అవి మాకు ఫలప్రదం కావాలి.

37. ఈ భూమి పవిత్రమైన శీలం గలది. మెల్లగ కదుల్తుంది. నీటిలో ఉన్న అగ్నియే భూమి యందున్నది. ఈ అగ్ని దేవతలకు సుఖాన్నిస్తుంది. కాని దేవతలకు శత్రువులైన రాక్షసులకు సుఖాన్నివ్వదు. ఈ భూమి వృత్రాసురుని వరించలేదు. ఇంద్రుణ్ణి వరించింది. అందుకే భూదేవి పవిత్రశీల, ధర్మశీల.

38.39,40 ఏ భూమి మీదైతే హవిస్సులు అర్పించటానికి యజ్ఞకుండాలు నిర్మించారో, దేనిమీద బ్రాహ్మణులు వేదాలు గానం చేస్తున్నారో, దేనిమీద ఋత్విక్కులు ఇంద్రుడికి సోమము అర్పిస్తున్నారో, దేనిమీద ఋషులు యజ్ఞయాగాది క్రతువులు చేశారో, అటువంటి భూమి మాకు ధనాన్నిచ్చుగాక. రక్షణగా ఇంద్రుడు మా ముందు నడచును గాక.

41. ఏ భూమి మీద సత్పురుషులు ఆడుతూ, పాడుతూ, తిరుగుతున్నారో, ఎక్కడైతే దుందుభులు మ్రోగుతున్నాయో, ఆ భూమి నా శత్రువులను గెంటి వేయుగాక. నాకు శత్రువులు లేకుండా చేయును గాక.

42. ఈ భూమి మీద రకరకాల ధాన్యము పండుతుంది. పర్జన్యుడు వర్షం కురిపిస్తాడు. అందరినీ పోషిస్తాడు. అటువంటి భూమికి నేను నమస్కారం చేస్తున్నాను.

43. భూమిమీద అనేక రకాల మృగాలు, పశువులు, పక్షులు తిరుగుతున్నాయి. ఆటలాడుతున్నాయి. సమస్త విశ్వాన్ని తనలో ధరించే పృథివి యొక్క దిశలను ప్రజాపతి మా కోసం అందంగా తయారుచెయ్యాలి.

44. అనేక నిధులు తనలో దాచుకున్న భూమి నాకు బంగారము, రత్నాలు ఇచ్చుగాక. ధనాన్నిచ్చే భూదేవి నాకు ఆనందంగా మణులను ప్రసాదించుగాక.

45. భూమి మీద అనేక రకాల భాషలు మాట్లాడేవాళ్ళున్నారు. అనేక ధర్మాలున్నాయి. అయినప్పటికీ కదలకుండా అలాగే నుంచుని పాలిచ్చే ఆవులాగా ఈ భూమి నాకు అమితమైన ధనాన్నిచ్చు గాక.

46. భూమీ ! నీ మీద భయంకరమైన విషసర్పాలున్నాయి. కాటు వేసే కీటకాలున్నాయి. తమ కొండెతో కుట్టే తేళ్ళు, మండ్రగబ్బలు ఉన్నాయి. ఇవన్నీ నా దగ్గరకు కూడా రాకూడదు. అన్ని శుభాలతో మమ్మల్ని రక్షించాలి.

47. తల్లీ ! నీ మీద దుర్మార్గులు, సన్మార్గులు, దొంగలు, హంతకులు అందరూ తిరుగుతున్నారు. అందుచేత ఏ మాత్రము భయం లేనిది. శత్రురహితమైనది, శుభప్రదమయినది అయిన మార్గం మాకు చూపించు.

48. శత్రువులను భరించేది, పుణ్యపాపాలు సహించేది, గొప్ప గొప్ప పదార్థాలు గలది, వరాహాన్ని వెదుకుతున్నది అయిన ఈ భూమి వరాహానికి అందును గాక.

49. ఓ భూమీ ! నరమాంస భక్షకులు, యక్షరాక్షసులు, అడవి

మృగాలు, క్రూరమృగాలు వీటన్నింటినీ దూరం నుంచే సంహరించు. వాటిని మా దగ్గరకు కూడా రానీయద్దు.

50. గంధర్వులు, అప్సరసలు దానానికి ప్రతిబంధకమయ్యే రాక్షసులు, పిశాచాలు వీరిని మాతో కలవనీయకు.

51. ఈ భూమి మీద నాలుగు కాళ్ళ జంతువులు, హంసలు, గ్రద్దలు, రాబందులు, చిలకలు గోరువంకలు, కాకులు రకరకాల పక్షులు తిరుగుతున్నాయి. గాలి దుమ్ము లేపుతోంది. చెట్లని విరక్కొడుతోంది. ఆ గాలికి నిప్పుమండుతోంది.

52. రాత్రిపూట చీకటి నల్లగా ఉంటుంది. పొద్దుపొడుపు ఎర్రగా ఉంటుంది. వర్షంతో భూమి తడుస్తుంది. అటువంటి భూమి మాకు శుభప్రదమగు గాక.

53. భూమి, ఆకాశం, అంతరిక్షం, అగ్ని, సూర్యుడు, జలము, మేఘము, విశ్వేదేవతలు మాకు కదిలేశక్తి కలిగించారు.

54. నేను శత్రువులను అణచివేస్తాను. నా పేరే శత్రుదమనుడు. నేను సర్వదమనుడను. దశదిశల గల శత్రువులను అణిచి వేస్తాను.

55. ఓ భూమీ ! నువ్వు విస్తరించేటప్పుడు దేవతలు నీతో 'ఓ భూమీ ! విస్తరించు' అన్నారు. అప్పుడు అందరి ప్రాణాలు నీలో ప్రవేశించినాయి. అప్పుడు నాలుగు దిక్కులు ఏర్పరచావు.

56. భూమి మీద గ్రామాలు, అరణ్యాల, సభలు, సంగ్రామాలు, యుద్ధ తంత్రాలు ఉన్నాయి. అటువంటి భూమిని అందంగా వర్ణిస్తున్నాము.

57. భూమిలో పుట్టినవి, భూమిపైన పుట్టినవి, గుర్రంలాగా దుమ్ములేపుతున్నాయి. ఈ భూమి ఓషధులు, వనస్పతులలతో లోకాలను పోషిస్తున్నది.

58. నా మాటలు వినసొంపుగా ఉండుగాక. నా చూపు పడ్డవాడు నాకు సేవకుడగు గాక. నేను దీప్తవంతుడు, వేగవంతుడనై ఇతరులను రక్షిస్తాను. నన్ను భయపెట్టే వారిని సంహరిస్తాను.

59. ఈ భూమి పూర్తిగా శాంతమయి అందరికి సుఖాన్నిస్తుంది. అన్నాన్నిస్తుంది. నా పక్షాన పలుకుతుంది.

60. అన్నం తినే కంచం ఆ సమయంలో బయటకి వచ్చినట్లుగా, సముద్రంలో పడి ఉన్న భూమిని విశ్వకర్మ తన హవిస్సులతో బయటకు తెచ్చాడు.

61. ఓ భూమి, నువ్వు లోకాలకు ఆధారము. వరప్రదాయినివి. విశాలమైన దానివి. నీలో తగ్గిన భాగాన్ని ప్రజాపతి నింపుతాడు.

62. పృథ్వి ఫలించునుగాక. మేమంతా ఆరోగ్యంగా ఉందుము గాక. క్షయం, కుష్ఠు మొదలైన రోగాలు రాకుండా మేము దీర్ఘాయుష్కులమై ఉండాలి. ఈ భూమికి బలులు అర్పిస్తాము.

63. ఓ భూదేవీ ! నన్ను కరుణించు. సిరిసంపదలు కలిగించు, కీర్తిప్రతిష్ఠ కలిగించు, స్వర్గం కలిగించు. నన్ను దయతో చూడు. నా కోరికలన్నీ తీర్చు, నాకు ఎప్పుడూ శుభాన్ని కలుగచెయ్యి.

# 81. బాల్య వివాహాలు

అసలు బాల్యవివాహము అంటే ఏమిటి చిన్నపిల్లకే వివాహంచెయ్యటం. ఏమీ తెలియని పిల్లకి, నిజంగా చెప్పాలంటే తనకేముందో తనకే తెలియని పిల్లకి వివాహం చెయ్యటం. దీన్నే రజస్వలా పూర్వవివాహము అన్నారు. **'అష్టవర్షాత్ భవేత్కన్యా'** ఎనిమిది సంవత్సరాల పిల్లకే వివాహం చెయ్యటం. ఇలా చెయ్యమని వేదంలో చెప్పబడిందా? అన్నప్పుడు లేదు అని కూడా గతంలో చెప్పుకున్నాం. వేదంలో యుక్తవయస్కురాలైన పిల్లకు, తండ్రితో నేను వివాహం చేసుకుంటాను' అని చెప్పే పిల్లకు మాత్రమే వివాహం చెయ్యాలి. చిన్న ఉదాహరణ చూడండి. గిరిజా కళ్యాణంలో పార్వతీదేవి నేను 'ఈశ్వరుణ్ణి తప్ప ఎవరినీ వివాహం చేసుకోను.' అని చెప్పి అడవులలోకి వెళ్ళి తపస్సు చేసి ఈశ్వరుణ్ణి వివాహం చేసుకుంది. రామాయణంలో వివాహ సమయానికి సీతాదేవి పదహారు సంవత్సరాల పిల్ల. దశరథుడు ఋష్యశృంగుడికి తన కుమార్తె అయిన శాంతను ఇచ్చి వివాహం చేశాడు. ఆ రోజు నుంచీ ఋష్యశృంగుడు, శాంత సాంసారిక సుఖాలు అనుభవించారు. అంటే శాంత చిన్నపిల్ల కాదు. యుక్తవయస్సురాలు. భారతంలో స్వయంవరం ప్రకటించే సరికి ద్రౌపది యుక్తవయస్కురాలు. అలాగే అంబ, అంబిక, అంబాలికలు. భాగవతంలో రుక్మిణీదేవి, స్వయంవరం ప్రకటించే సమయానికి చిన్నపిల్ల కాదు. యుక్తవయస్కురాలు. వివాహానికి ముందే రాయబారాలుకూడా నెరపింది. లోపాముద్ర అగస్త్యుణ్ణి తప్ప ఇతరులను వివాహం చేసుకోను అని తెగేసి చెప్పింది తండ్రికి. ఇలా చెప్పుకుంటూ పోతే అనేక ఉదాహరణలు. వీరిలో అందరికీ యుక్తవయస్సు వచ్చిన తరువాతే

వివాహం జరిగింది. ఇది వేదసమ్మతము.

అలా అయితే బాల్య వివాహాలు. ఎప్పటి నుంచి ప్రారంభమైనాయి? అనేదే ప్రశ్న. సవ్యంగా నడిచిపోతున్న భారతావనికి విదేశీదండయాత్రలు ఎదురయ్యాయి. దీనిలో కూడా ముస్లిం దండయాత్రలు. సామాన్యంగా దండయాత్రలు రాజ్యవిస్తరణ కోసం జరుగుతాయి. కొన్నిసార్లు సంపదను కొల్లగొట్టటానికి కూడా జరుగుతాయి. కాని ముస్లిం దండయాత్రలు ఇందుకు భిన్నంగా జరిగాయి. వీరికాంక్ష రాజ్యవిస్తరణతో పాటు మతవ్యాప్తి. దాని కోసమే బహుభార్యాత్వం కూడా ఇస్లాంలో అంగీకరించ బడింది. సాధ్యమైనంత వరకు ఎక్కువమంది స్త్రీలను వివాహం చేసుకుని సంతానాన్ని ద్వారా మతవ్యాప్తి చేసేవారు. దీనికి అనుగుణంగా దండయాత్ర చేసిన రాజ్యాలలో స్త్రీలను పట్టుకుపోయి బలవంతంగా వివాహం చేసుకునే వారు. రాజ్యస్థాపన జరిగితే ఇక చెప్పవలసిన పనే లేదు. పాలకుల మాట ఎప్పుడూ చెల్లుబాటవుతుంది. కాబట్టి వారేం చేసినా అడ్డు, ఆపు ఉండేవి కావు. అవివాహిత అయిన యువతి కనక కంటబడితే, ఎత్తుకు వెళ్ళిపోయి వివాహం చేసుకునేవారు. అయితే ఇస్లాం సంప్రదాయంలో **వివాహితజోలికి వెళ్ళరాదు అని ఖురాను చెబుతోంది.** ఇటువంటి పరిస్థితిలో జాతిని రక్షించటం ఎలా అని పండితులంతా చర్చలు జరిపారు. అప్పుడు వాళ్ళకి రెండు ఉపాయాలు కనిపించాయి. 1. అవివాహిత అయిన యుక్త వయస్కురాలు వివాహం జరిగేదాకా ఇంట్లోంచి బయటకు రాకూడదు. 2. యుక్త వయస్సు రాకుండానే వివాహం చెయ్యటం.

జాగ్రత్తగా ఆలోచిస్తే మొదటిది అంటే యుక్తవయస్కురాలు తనకు వివాహం జరిగే దాకా ఇంట్లోంచి బయటకు రాకుండా ఉండటము.

ఇది జరిగే పని కాదు. ఒకవేళ ఆమె బయటకు రాకపోయినా, వివాహం కాని యుక్త వయస్కురాలు ఇంట్లో ఉన్నది అని తెలిస్తే సైనికులు వచ్చి ఎత్తుకుపోతారు. కాబట్టి దీనివల్ల పెద్దగా ఉపయోగం ఉండదు. ఇక రెండో పద్ధతిలో చిన్నపిల్లకే అంటే రజస్వలాపూర్వమే వివాహం చేసినట్లైతే, ఆ పిల్లకి వివాహం జరిగింది కాబట్టి. ఆమె జోలికి పోరు. ఏ రకంగా చూసినా ఇదే మంచి పద్ధతి అనిపించింది వారికి. వెంటనే తీర్మానం చేశారు. **'అష్టవర్షాత్ భవేత్కన్యా'** అన్నారు. ఎనిమిది సంవత్సరాల బాలికకే వివాహం చెయ్యాలి. అని తీర్మానించారు. దీన్ని కల్పసూత్రాలలో వ్రాశారు. కల్పసూత్రాలు అంటే కల్పించి వ్రాయబడినవి. ప్రతివారు ఈ పని తప్పనిసరిగా చెయ్యాలి అని శాసించారు. ఒకవేళ ఎవరైనా ఈ పని చెయ్యకపోతే వారికి బ్రహ్మహత్యా పాతకం చుట్టుకుంటుంది అన్నారు. వారి ఇంటికి ఎవరూ వెళ్ళరాదు అన్నారు. అలా చిన్నపిల్లకి వివాహం చెయ్యని వారికి సామాజిక బహిష్కారము కూడా విధించారు. ఈ భయంతోనైనా చిన్నపిల్లకి వివాహం చేస్తారు. తద్వారా జాతి రక్షింపబడుతుంది ఇదే వారి కోరిక. ఇందులో సమాజాన్ని రక్షించాలనే తపన కనిపిస్తుంది. పండితులందరూ ఒప్పుకున్నారు కాబట్టి ఈ పని అందరూ వేశారు. నిజంగానే జాతిని రక్షించారు. అప్పటినుంచే పిల్లకి వివాహం జరిగింది అనటానికి గుర్తుగా పాపిట సింధూరము పెట్టారు. కాళ్ళకు మెట్టెలు, మెడలో నల్లపూసలు కట్టారు. నల్లపూసలు కట్టటమనేది మన సంప్రదాయంకాదు. ముస్లింల సంప్రదాయం. అదైతే వారికి త్వరగా తెలుస్తుంది. అందుకే నల్లపూసలు కట్టారు. ఈ రకంగా బాల్యవివాహం జాతిని రక్షించుకునే దృష్టితో ఒక సత్సంప్రదాయంగా ప్రారంభమైంది. ఈ సంప్రదాయాన్ని ప్రారంభించి జాతిని రక్షించిన పండితులకు నిజంగా జోహార్లు

అర్పించాలి.

కాలక్రమేణా ఈ సంప్రదాయం వెర్రితలలు వేసింది. మహమ్మదీయులు పాలన అంతరించిపోయినా మనవాళ్ళు ఈ ఆచారం మాత్రం మానలా. నేను ఎనిమిది సంవత్సరాల పిల్లకే వివాహం చేశాను అంటే నేను ఐదు సంవత్సరాల పిల్లకే చేస్తాను అనే రోజులు వచ్చాయి. ఊయలలో ఉన్న మూడునెలల పిల్లకే వివాహం చేశారట. చివరకి కడుపులో ఉన్న పిల్లకి కూడా వివాహం చేసిన సందర్భాలున్నాయి అని మా పెద్దవాళ్ళు చెబుతుండేవారు.

ఇది ఇలా ఉండగా ఆడపిల్లలు తక్కువై పోవటము జరిగింది. కన్యాసుల్కం మొదలైంది. దీంతో చిన్నపిల్లలకి తన తండ్రికన్న పెద్ద వయసున్న వాడితో వివాహం చేశారు. ఇంకా చెప్పాలంటే ఆస్తిపాస్తులున్నాయని చావుకు సిద్ధంగా ఉన్నవాడికి కూడా పిల్లనిచ్చి పెళ్ళి చేశారు. పిల్ల పెద్దదయ్యేసరికి వాడు కాస్తా హరీ అయినేవాడు. దీనికేమో గుండు గీయించి ఇంట్లో కూచోబెట్టేవారు. జీవితం అంటే ఏమిటో తెలియకుండానే ఆ పిల్ల జీవితం నాశనమయ్యేది. ఇందులో స్వార్ధం కూడా ఉంది. ఇలా వివాహం చేస్తే ఇంట్లో పని చెయ్యటానికి జీతం బత్తెం లేని ఒక దాసి దొరుకుతుంది. దానివల్ల ఆస్తికూడా వస్తుంది. మా చిన్నప్పుడు మా చుట్టాల ఆవిడ ఒకామె ఉండేది. నాకు తెలిసేటప్పటికే ఆవిడకి తొంభై ఏళ్ళు. ఆవిడకి భర్త ఎలా ఉంటాడో కూడా తెలియదట. ఆయన వైపు నుంచి పాతిక ఎకరాలు పొలం మాత్రం వచ్చింది. దాయాదులు ఎవరో అనుభవించేవారు. ఎవరింట్లో ఏ పని ఉన్నా ముందు ఆవిడ వచ్చి నుంచునేది. ఒకసారి నాతో 'నా చేత్తో ఎన్ని పురుళ్ళు పోశానో లెక్క లేదురా!' అంది. ఇలా ఒక సత్సంప్రదాయంగా ప్రారంభమైన ఆచారం దుష్ట సంప్రదాయం

అయింది. దీన్ని మాన్పించటానికి రఘుపతి వెంకటరత్నం నాయుడు, కందుకూరి వీరేశలింగం వంటి మహానుభావులు ఎంతోమంది తీవ్రంగా శ్రమించారు.

ఇక్కడ గమనించాల్సిన విషయం ఏమంటే బాల్యవివాహము అనే ఈ దుష్ట సంప్రదాయం ఈ రోజున కూడా కొన్నిచోట్ల కనిపిస్తోంది. రెండు సంవత్సరాల క్రితం మహాశివరాత్రికి ఉపన్యాసాలకు శ్రీకాళహస్తికి వెళ్ళాను. కళ్యాణం జరిగే రోజున అక్కడ గుడిచుట్టూ చాలా బేనర్లు పెట్టారు. బాల్యవివాహం నిషేధం. చట్టరీత్యా నేరము అని. ఆ రాత్రి జిల్లాలోని అధికారులందరూ అక్కడికి వచ్చారు. ఆ రోజున చుట్టుపక్కల ఉన్న ప్రజలు తమ పిల్లలకి స్వామివారితో పాటుగా వివాహం జరిపిస్తారట. ఇవన్నీ బాల్యవివాహాలు. అంటే ఈ సంప్రదాయం ఇప్పటికి కూడా జీవించే ఉంది. 2002 నుంచి 2012దాకా గణాంకాలు పరిశీలిస్తే. ఈరోజున ప్రపంచం మొత్తంలో బాల్యవివాహాలు ఎక్కువగా జరుగుతున్నది బంగ్లాదేశ్‌లో. తరువాత స్థానం భారత్‌ది. ఐదు సం॥లలోపు పిల్లలకు జరిగిన వివాహాలు నమోదు చెయ్యని దేశాలలో మనదేశం అగ్రగామి.

**వేదంలో బాల్యవివాహం చెప్పలేదు. ఇది వేద విరుద్ధం.**

# 82. సతీ సహగమనము

పద్నాల్గవ కాండలో వివాహము, పదిహేనవ కాండ ఉపనయన సంస్కారము చెప్పారు. పద్దెనిమిదవ కాండలోని రెండవ సూక్తంలో యమియముల సంవాదము చెప్పబడ్డాయి. దీన్ని ఋగ్వేదంలో చెప్పుకున్నాం. తరువాత పితృమేధాన్ని వివరించారు. **పద్దెనిమిదవ కాండలోని మూడవ అనువాకంలో సతీసహగమనాన్ని** గురించి చెబుతున్నారు.

సతీసహగమనము అంటే ఏమిటి? మరణించినప్పుడు, భర్త దేహంతో పాటుగా భార్య చితిమీదకి ఎక్కి దహనమై పోవటం. పూర్వకాలంలో ఈ ఆచారము మన దేశంలో బాగా ఉండేది. అలా మరణించిన స్త్రీని 'సతి' అని పిలిచేవారు. ఆ స్త్రీకి దేవాలయాలు కట్టేవారు నిత్యము ధూపదీప నైవేద్యాలు కూడా జరిగేవి. ఈ సంప్రదాయము ఎక్కువగా రాజస్థాన్ ప్రాంతంలో ఉండేది. అయితే మన ప్రాంతంలో కూడా ఈ రకమైన ఆచారం ఉంది. ఊరికోసం త్యాగం చేసిన స్త్రీ అని, భర్త అత్త మామల కోసం త్యాగం చేసిన స్త్రీని అని దేవాలయాలు మనకి చాలానే కనిపిస్తాయి. మన ప్రాంతంలో వీరిని పేరంటాలమ్మతల్లి అని పిలుస్తారు. వీరందరి వెనుక ఒక కథ మాత్రం ఉండి తీరుతుంది.

సహగమనం చేసే సమయంలో భర్తశవంతో పాటుగా అతన్ని విడిచి ఉండలేను అని భావించే భార్య అతడితో పాటుగానే స్మశానానికి వెళ్ళేది. స్వచ్ఛందంగా చితిపైకి ఎక్కేది. అక్కడ పోగయిన జనం అందరూ పెద్ద పెద్దగా కేకలు పెడుతుండగా తనకు తానుగా వంటి మీద నూనెపోసుకుని నిప్పు అంటించుకుని కాలిబూడిదై పోయేది. ఆ తరువాత ఆమెకు సతీ ఆలయ నిర్మాణం, నిత్యపూజలు జరిగేవి. ఆ సతిని అర్చిస్తే అన్ని కోరికలు తీరతాయి అని ప్రజల నమ్మకం.

ఇక్కడ మనం గమనించవలసిన విషయాలు కొన్ని ఉన్నాయి. అవి ఏమంటే నిజంగా భర్తని విడిచి జీవించలేని స్త్రీ, భర్త మరణించాడు అని వినగానే గుండె ఆగి చచ్చిపోతుంది. అంతేగాని భర్త శవంతోపాటుగా ఊరేగింపుగా శ్మశానం దాకా వెళ్ళటం జరగదు. ఎటువంటి మనిషికైనా మరణభయం ఉంటుంది. యుద్ధంలో వీరోచితంగా మరణించటం వేరు. ఇక్కడ భర్త శవంతో పాటుగా మంటల్లో కాలిపోవటం వేరు. ఇది దారుణమైన సన్నివేశం. చూస్తూ చూస్తూ ఏ మనిషీ కూడా ఈ పని చెయ్యలేదు. ఒకవేళ నిజంగా మరణించాలనిపిస్తే ఉరివేసుకునో, పీకె తెగ్గోసుకునో, నీటిలో దూకి మరణిస్తుంది. అంతేకాని ఇంత దారుణమైన పనికి ఎటువంటి పరిస్థితిలోను ఏ జీవీ ఒడికట్టదు. ఒకవేళ అలాచేస్తే అతడు మరణించిన మరుక్షణంలోనే ఆ బాధ తట్టుకోలేక ఆపని చెయ్యచ్చు. అంతేకాని ఆ మర్నాడు తీరుబడిగా స్మశానానికి బయలుదేరి అందరూ చూస్తుండగా తనకు తాను దహనం చేసుకోదు. ఆ సమయంలో వర్ణణాతీతమైన బాధ భరించటానికి ఎవరూ సిద్ధపడరు.

ఇక్కడ ఇంకో విషయం గమనించాలి. భర్త మరణించినప్పుడు భార్య సహగమనం చేసింది. అంతే కాని భార్య మరణించినప్పుడు భర్త కూడా ఇలాగే సజీవ దహనమైన సందర్భాలు ఒక్కటికూడా లేవు. ఈ సంప్రదాయం మన దేశంలో మొదట్లో లేదు. రామాయణంలో దశరథ మహారాజు మరణించినప్పుడు ఆయన భార్యలు ఎవరూ సహగమనం చెయ్యలేదు. శంతన మహారాజు మరణించినప్పుడు ఆయన భార్య సత్యవతి జీవించే ఉంది. కురు, పాండవుల తాతగారు విచిత్రవీర్యుడు మరణించిన తరువాత ఆయన భార్యలు అంబిక, అంబాలికలు జీవించే ఉన్నారు. తరువాత కాలంలో వ్యాసుడివల్ల వారికి కలిగిన సంతానమే ధృతరాష్ట్రుడు, పాండురాజు పాండురాజు మరణించినప్పుడు మాద్రి సహగమనం చేసింది. అంతే కాని కుంతి

జీవించే ఉంది. భారతంలో చివరిదాకా కుంతీదేవి జీవించే ఉంది. అంటే సహగమనం చెయ్యాలని ఎక్కడా ఏ శాస్త్రంలోనూ చెప్పలేదన్న మాట. మరి ఈ ఆచారం ఎలా వచ్చింది?

ఇది ఒక దుష్టసంప్రదాయం. కొంతమంది స్వార్థపరులు కల్పించిన సంప్రదాయం. మన దేశంలో పిత్రుస్వామ్య కుటుంబాలున్నాయి. ఒక్క కేరళలో మాత్రమే మాతృ స్వామ్య వ్యవస్థ ఉండేది. పిత్రుసామ్య వ్యవస్థలో ఆస్థి హక్కు, అధికారం అంతా తండ్రికే చెందుతాయి. ఇప్పుడు ఒక ధనిక కుటుంబం. రాజకుటుంబం అనుకోండి. రాజుగారికి ముగ్గురు కుమారులు. రాజుగారు తన ఆస్థిని ముగ్గురికీ పంచి ఇచ్చాడు. ఇప్పుడు పెద్ద కుమారుడు మరణించాడు. అతడికి పిల్లలు లేరు. భార్య మాత్రమే ఉంది. అతని తరువాత అతని ఆస్తి, అతని భార్యకి వెడుతుంది. దాన్ని ఆమె ఏమైనా చేసుకోవచ్చు. చూస్తూ చూస్తూ అంత ఆస్థిని అన్ని కోట్ల రూపాయల ఆస్థిని వదులుకోవటానికి ఎవరూ సిద్ధపడరు. అన్న తమవాడే కాని వదిన పరాయిది. ఎక్కడో బయట నుంచి వచ్చిన స్త్రీ ఇంత ఆస్థిని తీసుకుపోతుంటే ఎలా ఊరుకుంటారు? అందులోను తన వాడనుకున్న భర్త మరణించినప్పుడు, ఆ కుటుంబంలో ఆ స్త్రీకి రక్షణ ఉండదు. అందుచేత ఆస్థిని తీసుకుని పుట్టింటికి వెళ్ళిపోతుంది. ఇలా తమ ఆస్థి వేరే చోటికి వెళ్ళిపోవటం చూసి భరించటం కష్టం. ఈ కష్టంలోంచే వచ్చింది ఒక క్రొత్త సంప్రదాయం. అన్న జీవించిఉన్న ఆఖరు క్షణాల్లోనే మిగిలిన వాళ్ళు "తమ వదిన చాలా మంచిది, మహాపతివ్రత, అన్ననివదిలి ఒక్కక్షణం కూడా ఉండలేదు. అన్నగారికి ఏమైనా జరిగితే ఆవిడ పరిస్థితి ఏమిటి అని హవేలీలో అందరూ భయపడుతున్నారు." ఈ రకమైన పుకారు బాగా వ్యాపిస్తుంది. వినటానికి చాలా గొప్పగా ఉంది. తేనె పూసిన కత్తి. దాని వెనక భయంకరమైన నిజం దాగి ఉంది. అన్నగారు మరణించగానే వదినగారు కూడా మరణిస్తారు.

ఇదే నిజం. అదే జరిగేది ఆ క్షణంలోనే. కొన్ని సందర్భాలలో మానసికంగా ఆమెని ముందే సిద్ధం చేసి చితి ఎక్కించేవాళ్ళు. అయితే కొన్నిసార్లు భార్య ఇష్టపడకపోయినా, తాను మరణించను అని ఏడ్చినా, గోల చేసినా పట్టించుకునే నాథుడుండడు. ఆచారం, సంప్రదాయం పేరుతో బలవంతంగా భర్త శవానికి కట్టి తగలబెట్టిన సంఘనటలు చాలా ఉన్నాయి. 1. నిజంగా చెప్పాలంటే ఇది ఒక దుష్టమైన, దుర్మార్గమైన, అతి కిరాతకమైన, నీచమైన, తుచ్ఛమైన, అతిహేయమైన, నికృష్టమైన సంప్రదాయం. సభ్యసమాజంలో మానవుడు తలదించుకోవలసిన సంప్రదాయం. బాల్యవివాహాల కన్న కూడా అతిదుర్మార్గమైనది ఈ సంప్రదాయం. ఊరందరి సమక్షంలో 'పాతివ్రత్యం అనే ముసుగులో కేవలము ఆ స్త్రీకి సంబంధించిన ఆస్థి కోసం, లేదా ఆవిడ బరువు బాధ్యతలు వదిలించుకోవటం కోసం నిలువునా తగలపెట్టే సంప్రదాయం. నీతి, నిజాయితీ, సంస్కారం, మానవత్వం అన్నింటినీ బహిరంగంగా, ఊరిజనం అందరి ముందర నిలువునా తగలపెట్టి, పాతిపెట్టే బహుగొప్ప సంప్రదాయం. ఇంకా దీన్ని గురించి వ్రాయాలంటే నాకు కళ్ళవెంబడి నీళ్ళు వస్తున్నాయి అంతేకాని మాటలు రావటం లేదు. ఇంత గొప్ప సంప్రదాయాన్ని కనిపెట్టిన ఆ మేధావంతుడికి జోహార్లు అర్పిస్తున్నాను. సంప్రదాయం ముసుగులో ఉన్న ఈ పిశాచాన్ని పార ద్రోలేందుకు కృషి చేసిన సంఘ సంస్కర్త రాజారామ్మోహనరావుని మనం తప్పనిసరిగా గుర్తుచేసుకోవాలి. నిజంగా చెప్పాలంటే బాల్యవివాహాల కన్న కొన్ని వేలరెట్లు ఘోరమైంది ఈ సంప్రదాయం.

ఈ సందర్భంలో వేదం ఏం చెబుతోంది అనే విషయాన్ని చూద్దాం.

ఇక్కడ మొదటి సూక్తంలో ఉన్న మొదట మంత్రం వినియోగంలో ప్రేతమా ! నీ భార్య పతిలోకాన్ని వరించి పురాణ ధర్మాన్ని పాటిస్తూ నిన్ను చేరుతోంది. అన్నారు ఇది పురాణ ధర్మము అని చెప్పారు.

అంతేకాని వేదధర్మం కాదు ఇక్కడ మంత్రం.

**'తస్మై ప్రజాంద్రవిణం చేహ దేహి'**

ఈ లోకంలోనే ఆవిడకు ధనము, సేవకులను ఇవ్వవలసింది. ఇది మంత్రార్థం. అంటే ఆస్థిహక్కు, వారసత్వపు హక్కు చెబుతోంది. అంతేకాని ఆ స్త్రీని కట్టెలమీద తగలపెట్టమని ఎక్కడా చెప్పలేదు వేదంలో అక్కడ చెప్పిన మంత్రాలలో ఆ స్త్రీని ఓదారుస్తున్నారు. అంతేకాని ఎక్కడా చితి ఎక్కమని చెప్పలేదు. సతీసహగమనం వేదంలో చెప్పలేదు.

## బాల్యవివాహాలు - సతీ సహగమనం

ఈ రెండింటిలోను ఏది అత్యంత దుర్మార్గమైనది అన్నప్పుడు

బాల్యవివాహం ఒక మహత్తరమైన ఆశయం కోసం ప్రారంభమైంది. ఆ తరువాత వెర్రితలలు వేసింది. సతీసహగమనం ఒక దుర్మార్గమైన ఆలోచనతో ప్రారంభమైన అతికిరాతకమైన దుష్టసంప్రదాయం. అయితే ఈ రెండింటిలోనూ వేదం దేన్నీ ఒప్పుకోవటం లేదు.

రెండూ వేదవిరుద్ధమే. రెండింటినీ ఖండించాల్సిందే. **కల్పసూత్రాలలో చెప్పారు కాబట్టి ఈ రోజున కూడా బాల్యవివాహం చేస్తాము అని చెప్పటం పరమ మూర్ఖత్వం. ఇందులో సందేహం లేదు.**

# 83. బహుభార్యత్వము

వేదంలో బహుభార్యాత్వాన్ని గురించి చెప్పారా? అసలు దీన్ని గురించి ఏమంటోంది వేదం? ఇదీ ప్రశ్న. అసలు నేను ఈ విషయం ప్రస్తావించదలచుకో లేదు. నిన్న మధ్యాహ్నం ఒకాయన ఫోన్ చేసి ఈ ప్రశ్న అడిగారు. అందుకని దీన్ని గురించి చెప్పటం జరుగుతోంది వివాహ వ్యవస్థ ఎలా ఉండాలి అనేది ఋగ్వేదంలో చెప్పారు అనుకున్నాం. అందులో బహుభార్యాత్వం గురించి ఏమీ లేదు. అందులోనే కాదు. అసలు వేదంలో దీన్నిగురించి ప్రస్తావనే లేదు. అయితే బహుభార్యాత్వం ఉన్నట్లా ? లేనట్లా? అంటే లేనట్లే అని చెప్పాలి. ఇక్కడ సామాజిక న్యాయము అనేది ఉంటుంది. తోటకి ఎవరూ కాపలా లేరు కదా అని తోటలోకి వెళ్ళి పూలు, కాయలు కోసి తెచ్చుకోకూడదు. వేదం ఏమీ చెప్పలేదు కాబట్టి బహుభార్యాత్వాన్ని సమర్ధించకూడదు. అది ధర్మసమ్మతం కాదు.

మరి ఆ కాలంలోనే దశరథ మహారాజుకు మూడు వందల మంది భార్యలున్నారు కదా? ఆయన క్షత్రియుడు. రాజులకు ఎక్కువమంది భార్యలు, ఎక్కువ మంది సంతానము అభిలషణీయము. వారి జీవితం ఎంత కాలమో వారికే తెలియదు. వీరుడు ఎప్పుడూ యుద్ధం చెయ్యటానికి ఉత్సాహపడతాడు. యుద్ధంలో జయాపజయాలు దైవాదీనాలు, కాబట్టి ఎక్కువ మంది కుమారులు ఉంటే, కనీసం ఒక్కడైనా జీవించి ఉంటాడు. తద్వారా వంశం నిలుస్తుంది అని ఆశ. ఈ కోరికతోనే భీష్ముడు ధృతరాష్ట్రుడికి గాంధారితో పాటుగా ఆమె సోదరిలని, ఇంకా మూడువందల మంది రాకుమార్తెలను తెచ్చి వివాహం జరిపించాడు. చివరకి వంశాన్ని నిలిపేవాడు కాదు కదా తలకొరివి పెట్టేవాడు కూడా మిగలలేదు. ఇలా క్షత్రియులకి ఎక్కువ

మంది భార్యలున్నారు. అదికూడా కేవలం వంశం నిలపటానికే.

మరి బ్రాహ్మణుల సంగతి ఏమిటి? బ్రాహ్మణులలో ఎంత వెదికి చూసినా కనిపించేది ఒక్క యజ్ఞవల్క్యుడే. ఇతడి భార్య కాత్యాయనివల్ల సంతానం కూడా ఉంది. ఈయన జనక మహారాజు గారికి గురువు. జనకుడి యొక్క మంత్రి మైత్రేయుడు. ఆయన కుమార్తె 'మైత్రేయి'

యాజ్ఞవల్క్యుడు జనకుని ఆస్థానానికి వచ్చినప్పుడు అతని జ్ఞానానికి మురిసిపోయి ఆయన్ని వివాహం చేసుకుంటాను అని పట్టుపట్టి వివాహం చేసుకుంటుంది. యాజ్ఞవల్క్యుని రెండవ భార్య 'మైత్రేయి' ఇంతకు మించి ఇద్దరు భార్యలున్న ఋషులు ఎవరూ కనిపించరు. కశ్యపుడు, దక్షుడు లాంటి వాళ్ళు ఉన్నారు కదా. అంటారేమో? వారు ప్రజాపతులు.

యజ్ఞవల్క్యుడి విషయంలో కూడా మైత్రేయి ఆయన దగ్గర ఉన్న బ్రహ్మవిద్యకు ఆశపడి ఆయన్ని వివాహం చేసుకుంది. అంతేకాని లౌకిక ప్రయోజనాల కోసం మాత్రం కాదు. చివరలో యాజ్ఞవల్క్యుడు నేను సన్యాసం స్వీకరిస్తాను. నాకు ఉన్న ఆస్తిని మీ ఇద్దరికీ సమానంగా పంచి ఇస్తాను అంటాడు భార్యలతో. అప్పుడు అంటుంది మైత్రేయి. "స్వామీ ! లౌకికమైన బంగారము, పట్టువస్త్రాలు, ఆవులు, ఆశ్రమాలు నాకెందుకు. అవన్నీ అక్కగారికే ఇచ్చెయ్యి. నాకు బ్రహ్మవిద్యని ప్రసాదించు" అని ఈ మాటలు విన్న యాజ్ఞవల్క్యుడు మహా ఆనందంతో మైత్రేయికి బ్రహ్మవిద్యని ఉపదేశిస్తాడు. ఇలా ఒక్క యాజ్ఞవల్క్యుడికి తప్ప ఇద్దరు భార్యలున్న వారు ఎవరూ లేరు. వేదంలో ఒక భార్య కన్న ఎక్కువ మంది స్త్రీలని వివాహం చేసుకోమని చెప్పలేదు. **వేదం బహుభార్యాత్వాన్ని సమర్థించలేదు.**

# 84. అధర్వవేదం - అభిచారకర్మ

అధర్వ వేదానికి **'అథర్వ ఆంగీరసః'** అని పేరు. ఇది భూర్జ్ పత్రాల్లో దొరికిన సంహిత భాగంలో ఉంది. ఇక్కడ అధర్వశబ్దం మంగళకరము శుభకరమైన అర్థాన్ని ఆంగీరస అనేది అభిచారిక అర్థాన్ని చెబుతోంది.

అధర్వ వేదంలో క్షుద్ర ప్రయోగాలు, మారణ తంత్రాలు కూడా చెప్పబడ్డాయి. అధర్వవేదం చెప్పిన మారణము అనే అభిచార ప్రయోగం చేసేవారు ఏడు రకాలైన గుట్టు చప్పుడు కాకుండా చంపే వారిలో ఉన్నారు. వైద్యులు, జ్యోతిష్కులు కూడా అవైదికులే. అశ్వనీదేవతలకి హవిర్భాగం లేకుండా చేసిన కారణం వారు వైద్యులు అనే. అందుకనే ధర్మశాస్త్రాలన్నీ అధర్వవేదాన్ని నిందించాయి.

అధర్వ వేదంలో క్షుద్రప్రయోగాలు చెప్పబడ్డాయి అన్నాం కదా ! అవి ఎలా చెప్పారో చూద్దాం. ఒక స్త్రీ ఒక పురుషుణ్ణి వివాహం చేసుకోవాలనుకుంది. కారణాంతరాల వల్ల ఆ వివాహం కాలేదు. ఇంకొక స్త్రీతో అతనికి వివాహం జరిగింది. ఇప్పుడు ఆ వివాహం నాశనం చేసి తాను ఆ పురుషుణ్ణి వివాహం చేసుకోవాలి. ఇది మొదటి స్త్రీ ఆశ. అందుకని ఇప్పుడు వివాహం జరిగిన స్త్రీ యొక్క జుట్టు, గాజులు, గోళ్ళు, వస్త్రాలు ఇత్యాదులు సేకరించి ఈ ప్రయోగం చేస్తారు. ఇక్కడ చూడండి. "విరగచూచిన చెట్టు నుంచి పూలు ఏ రకంగా కోస్తారో, అలాగే నీ సౌభాగ్యము, అందచందాలు అపహరిస్తున్నాను. ఈమె భూమిలో బాగా పాతుకుపోయింది. భర్త ముఖం మళ్ళీ చూడకుండా పుట్టింట్లోనే స్థిరంగా ఉండాలి. ఓ సోమా ! ఈమెను మెట్టినింటి నుంచి పుట్టింటికి వెళ్ళగొట్టు. అదృష్టహీన అయిన ఈమె

ఎవరో కట్టేసినట్లుగా జీవితాంతం పుట్టింట్లోనే పడి ఉండాలి. ఈమె భర్త ఈమె ముఖాన్ని తిరిగి చూడను కూడా చూడకూడదు.”

ఇవి క్షుద్రప్రయోగాలు. ఇవి జరుగుతాయా అనేది అనుమానం. ఏదైనా మాటే. మాటతో మంచి జరిగినప్పుడు, మాటవల్ల చెడుకూడా జరిగి తీరుతుందని గుర్తించాలి. మనస్ఫూర్తిగా ఏదైనా జరగాలి అనుకుంటే అది జరిగి తీరుతుంది. అదే సిద్ధ సంకల్పం. **ఇటువంటి ప్రయోగాలు చేస్తే, చేసినవాడికి తప్పనిసరిగా హాని జరుగుతుంది. ఎవరూ ఇలాంటి వాటికోసం ప్రయత్నించకండి.**

# 85. లోకవశ్యం

ఇష్టప్రాప్తి అంటే అనుకున్నది సాధించటం. ఈ లోకంలో జీవించటానికి అనేక పనులు చెయ్యాలి. సుఖంగా జీవించాలంటే ఇంకా చెయ్యాలి. అనుకున్నది సాధించాలంటే చాలా చెయ్యాలి. అలాటి అనేకానేకమైన సాధనలు ఉన్నాయి అథర్వ వేదంలో మచ్చుకి కొన్ని చూద్దాం. వీటిలో మొదటిది లోకవశ్యం. ఏదైనా సాధించాలంటే ముందు మనచుట్టూ ఉన్నవాళ్ళు మనల్ని గొప్పవాడుగా గుర్తించాలి. ఇలా అందరూ గుర్తిస్తేనే మనం చేసిన పని గొప్పదౌతుంది. నిజంగా మనం గొప్ప పని చేసినా దాన్ని ఎవరూ గుర్తించకపోతే అది నిరుపయోగం. ఉదాహరణకు క్రికెట్ ఆడుతున్నాం. మనం బాగా ఆడతాం. ఈ నమ్మకం మనకేకాదు. ఆట చూసే వాళ్ళకి కూడా ఉండాలి. మనం బ్యాటింగ్‌కి వస్తున్నాము అంటే, అందరూ అరుపులలో కేకలతో, కేరింతలతో, ఈలలతో, చప్పట్లతో మనకు స్వాగతం పలకాలి. ఇది వశీకరణ. మనం చేసే పని గొప్పది అని అందరూ గుర్తించాలి. ఇందులో మన కృషితో పాటు లోకవశ్యం కూడా ఉండాలి. లేకపోతే ఇలాంటివి జరగవు. ఇలా చెప్పుకుంటూ పోతే అనేకం. దీనికి కారణం ఏమిటి? అంటే లోకవశ్యం. ఆ వ్యక్తులకి పదిమందినీ కలుపుకుపోయే లక్షణం ఉంది. ఏ కార్యక్రమం అయినా అంతా కలిసి చేస్తారు. మరి నేను ఎవరినీ కలుపుకు పోను. ప్రజాసంబంధాలు నాకు లేవు. అంటే లోకవశీకరణ నా దగ్గర లేదు అని అర్థం.

మానవుడు తనచుట్టూ ఉన్న సమాజంతో చక్కని స్నేహసంబంధాలు నెలకొల్పటం ద్వారా దానిమీద తన ప్రభావాన్ని ప్రసరింపచెయ్యాలి. దీనికి ప్రత్యేకమైన సూక్తం చెబుతోంది అథర్వ వేదం.

"మీతో సమాన హృదయంతో స్నేహం చేస్తున్నాను. మీరు కూడా ఆవులలాగా సత్వగుణంతో పరస్పరం స్నేహంగా ఉండండి. తండ్రిమాట వినే కొడుకు, పిల్లల మనసు అర్థం చేసుకునే తల్లి, భర్తతో ప్రేమగా మాట్లాడే భార్య, తోబుట్టువులతో తగాదా పడని సోదరులు, ఇలా ప్రతివాళ్ళు ఇతరులను అర్థం చేసుకోవాలి. మంచి మాటలే మాట్లాడాలి. అవతలి వ్యక్తిలోని మంచి గుణాలే చూడండి. అందరితోనూ కలసి మెలసి ఉండండి. స్నేహం అనే పాశంతో అందర్నీ గట్టిగా బంధించి వశపరచుకుంటున్నాను" అంటోంది **మూడవ కాండలోని ముప్పైవ సూక్తం.**

## 86. నిద్రపుచ్చటం

సమాజంలో మన పనులు పూర్తి కావాలంటే మంచి మాట కావాలి. దాంతోపాటుగా కొందరిని నిద్రపుచ్చాలి అలా నిద్ర పుచ్చి మన పని చేసుకోవాలి. ఇలా నిద్ర పుచ్చటానికి **నాల్గవకాండలో** ఒక సూక్తాన్ని చెబుతోంది.

"వెయ్యి కిరణాలు గల సూర్యునిద్వారా వీళ్ళని నిద్రాపరవశుల్ని చేస్తున్నాను. గాలి ఎక్కువగా వీచకూడదు. ఓ వాయుదేవా! ప్రాణవాయు రూపంలో అందరి దేహాలలోను సంచరిస్తున్నావు. నా చుట్టూ ఉన్న వారిని నిద్రపోయేట్టు చెయ్యి. అచేతనమైన ఈ భవనం లోకాన్ని ఎలా చూపలేదో, అలాగే వీరంతా నన్ను చూడకుండా, అచేతనంగా నిద్రలో మునిగిపోవాలి. నా పని పూర్తయ్యే వరకు ఎవరూ లేవకూడదు."

# 87. దాంపత్యం

అధర్వవేదం అనేక విషయాలు చెబుతూ దాంపత్యం ఎలా ఉండాలో కూడా నిర్దేశించింది. **పద్నాల్గవ కాండ** ఈ విషయం చెబుతోంది.

“నేను సామాన్ని, నువ్వు ఋక్కువు. నేను ఆకాశాన్ని నువ్వు భూమివి. మనం కలిసి మెలిసి జీవిస్తూ సంతానవంతులమవుదాం”

దాంపత్యం ఎలా ఉండాలి అనే విషయాలు చెబుతున్నాడిక్కడ. భార్యాభర్త పాలు నీళ్ళలా కలిసి ఉండాలి అనే మాట మనవాళ్ళు ప్రపంచంలో మానవుడు బట్ట కట్టుకోవటం తెలియనిరోజు నుంచీ చెబుతూనే ఉన్నాడు. అందుకే మన వివాహ వ్యవస్థకు అంత ప్రాధాన్యత ఉంది. పాశ్చాత్యులు కూడా ఇప్పుడు మనవైపే మొగ్గు చూపుతున్నారు. అయితే ఇవాల్టి రోజున మనవాళ్ళు పాశ్చాత్య నాగరికతకు ఆకర్షితులై మన సంప్రదాయం మరిచిపోయి ప్రతిచిన్న విషయానికీ గొడవపడి భార్య భర్తలు మావిడాకులు తెంపి విడాకులు పుచ్చుకుంటున్నారు. దయచేసి తొందపడకండి. భార్యాభర్తలలో ఒకరు ఎక్కువా కాదు. ఇంకొకరు తక్కువా కాదు. నేను పురుషుణ్ణి అనే అహంకారం వదిలెయ్యండి. భార్యని గౌరవించండి. ఆవిడ మీ జీవితం. మీ శరీరంలో ఒక భాగం. ఒక కాలు చెయ్యి లేకుండా జీవించటం ఎంత దుర్భరమో భార్య లేకుండా జీవించటం అంతకన్నా దుర్భరం. అలాగే ఓ స్త్రీ నువ్వు కూడా మొండితనం. మూర్ఖత్వం వదలి పెట్టు. నీ సంసారాన్ని చక్కదిద్దుకో. భర్త భార్యని పిచ్చిగా ప్రేమించాలి. భార్య భర్తని బాగా అర్థం చేసుకోవాలి. ప్రతిమానవుడిలోను ఏదో ఒక బలహీనత ఉండి తీరుతుంది. ఆ బలహీనతను కనిపెట్టి దాన్ని గనక అందించగలిగితే భర్తని అర్థం చేసుకుని అతని కోరికలు తీర్చగలిగితే ఆ కోరికలు

చాలా చిన్నవి. భార్య మాత్రమే తీర్చగలిగేవి. మగవాడు ఆడదాని కొంగు పట్టుకుని తిరుగుతాడు. ఆడదానికి బానిస అవుతాడు. ఆవిడ చెప్పినట్లే చేస్తాడు. ఇందులో అతిశయోక్తి లేదు. నా భార్య లేకపోతే ఒక క్షణంకూడా ఉండలేను అని భర్త అనుకునేట్లుగా భార్య మసులుకోవాలి. అలాగే నా భర్త నా మాట జవదాటడు అని భార్య అనుకోవాలి. అదే పచ్చనిసంసారం.

కాబట్టి ఓ యువతా ఒకరిని ఒకరు అర్థం చేసుకోవటానికి ప్రయత్నించండి. మీ జీవితాన్ని సుఖమయం చేసుకోండి. స్వర్గసుఖాలలో తేలియాడండి.

వేదం ఇంకొక మాట చెబుతోంది. "ఓ ప్రజలారా ! మీరందరూ సమానమైన జ్ఞానం కలిగి ఉండండి. సమంగా పనిలో పాలుపంచుకోండి. ఎప్పుడూ మీ మనస్సులు ఒకే అర్థాన్ని గ్రహించాలి. ఒకే భావాన్ని ప్రకటించాలి. ఇలా ఉండి మీ జీవితాలు స్వర్గమయం చేసుకోండి" అని ఉపదేశిస్తోంది. వేదం ఏం చెబుతోంది? అంటే ఇదిగో ఇంత గొప్ప విషయాలు చెప్పింది అని కనీసం గుర్తించండి.

## 88. సభలో విజయం

పండితసభ జరిగినప్పుడు వాదప్రతివాదాలు జరుగుతుంటాయి. ఇక్కడ విషయం ఏమంటే మనకి తెలిసినది సమయానికి గుర్తు రావటం. దానిని జనానురంజకంగా చెప్పగలగటం. తద్వారా అవతలి వ్యక్తి మీద పై చేయి సాధిస్తాం. దీనికి కూడా మంత్రం చెబుతోంది **ఏడవకాండలో.**

"నరిష్ట" అంటే స్థంభన అని అర్థం. సభలో ఒకరి మాటను ఎక్కువమంది అంగీకరించినా, లేకపోయినా, ఎక్కువమంది మాటను మాత్రం అందరూ అంగీకరించి తీరాలి. ఇది సభా సంప్రదాయం. అందుకే దీని 'నరిష్ట' అన్నారు. అలాటి సభ నాకు అనుకూలంగా ఉండాలి. నేను ప్రతివాదుల తేజస్సుని, విజ్ఞానాన్ని హరించేస్తున్నాను. నాకు సభాగౌరవం లభించుగాక. ఉదయించే సూర్యుడు నక్షత్రాల తేజస్సు హరించినట్లుగా నేను నా ప్రత్యర్థుల శక్తి సామర్థ్యాలను హరించి వేస్తున్నాను" ఇది ఆ మంత్రానికి అర్థం.

## 89. గ్రహబాధలు

మానవుడు గతజన్మలలో చేసిన కర్మఫలితాన్ని ఈ జన్మలో అనుభవిస్తాడు. ఈ విషయం అందరికీ తెలుసు. అయితే ఆ ఫలితాన్ని ఇచ్చేదెవరు? అది అతడికి ఎలా అందుతుంది? ఈ విషయాలు కొద్దిమందికే తెలుసు. మనం చేసిన కర్మఫలాన్ని మనకి గ్రహాల ద్వారా అందచేస్తాడు పరమేశ్వరుడు. మన కర్మని బట్టే జాతక చక్రంలో గ్రహాలు ఉంటాయి. ఒక గ్రహం అనుకూలంగా ఉంది అన్నా, ప్రతికూలంగా ఉంది అన్నా దానికి కారణం మన సుకృతం ఇది పురాకృతం గ్రహబాధలు పడే వారికి జమ్మిఆకుపొడి. జమ్మికాయలో పెట్టి వారితో

తినిపించి నాల్గవకాండలో చెప్పిన సూక్తాన్ని చదివితే గ్రహబాధలు శాంతిస్తాయి.

## ౯౦. జ్వరం

జ్వరం వచ్చిప్పుడు కషాయం తాగటం వధ్యం చెయ్యటం సర్వసాధారణం. అయితే దీనికి **ఐదవ కాండలో** ఒక మంత్రం చెప్పారు. ఆ మంత్రం జపం చేస్తూ రోగితో జావ త్రాగించినట్లైతే జ్వరం త్వరగా తగ్గిపోతుంది. అంటోంది వేదం.

# 91. స్త్రీ వశీకరణ

ఈ వేదంలో స్త్రీ వశీకరణాన్ని గురించి చాలాసార్లు చెప్పటం జరిగింది. **ఆరవకాండలోని ఎనిమిదవ సూక్తం** దీనికోసం చెప్పిందే. సూక్తార్థం. “తమలపాకు తీగె తనకు ఆశ్రయమైన చెట్టును ఏ రకంగా కౌగిలించుకుంటుందో అలాగే నువ్వు నన్ను కౌగిలించుకో. నువ్వు నన్నే ఇష్టపడి, నా దగ్గరే ఉండేట్లుగా, ఇంకో చోటికి పోకుండా చేసి, ఈ ప్రయోగం ద్వారా నిన్ను వశపరచుకుంటున్నాను”

ఇక్కడ చిన్న అనుమానం. వశీకరణము అనేది స్త్రీలకేనా? పురుషులకి ఉండదా? ఏ స్త్రీ అయినా పురుషుణ్ణి వశం చేసుకోవాలంటే ఏ మంత్రము లేదా? ఏ చిట్కా చెప్పలేదా? ఎందుకని? ఇదంతా పక్షపాతం కాదా? అనే భావన ఎవరికైనా కలగచ్చు. ఇందులో తప్పులేదు. సమాధానం చెప్పాల్సిన బాధ్యత నాది. చెబుతాను.

ఒక పురుషుడు ఒక స్త్రీని ఇష్టపడుతున్నాడు అన్నా, ఆమెని వశం చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు అన్నా ఆమెతో కలిసి తిరుగుతున్నాడు అన్నా అతడికి పెద్దగా పోయేదేం లేదు. కాని స్త్రీ విషయంలో అలాకాదు. అది ఆవిడ శీలానికి సంబంధించిన విషయం. ఊర్వశి దేవవేశ్య. అందుకని పురూరవుడితో కొంత కాలం కాపురం చేసింది. తరువాత ఇంద్రుడి దగ్గరకు వెళ్ళిపోయింది. ఆవిడ వేశ్య కాబట్టి ఎవరూ పట్టించుకోరు. అదే ఒక స్త్రీ విషయంలో అలా కాదు కదా? మరి పురుషుడి విషయంలో అలా కాదా? అంటే మనది ఎంత చెప్పినా పురుషాధిక్య సమాజం. ఇంతకన్న చెప్పగలిగింది లేదు.

అయినా గుర్తించాల్సిన విషయం ఏమంటే ఈ వశీకరణ మంత్రాలు పురుషులే కాదు స్త్రీలు కూడా చెయ్యవచ్చు. అలా చెప్పటం సభ్యత కాదుకాబట్టి చెప్పటం లేదు. అంతే.

## 92. పురుషుణ్ణి వశపరచుకోవటానికి

ఒకే పురుషుడి కోసం ఇద్దరు లేదా అంతకన్న ఎక్కువ మంది పోటీ పడుతున్న సమయంలో, అతడు నాకే దక్కాలి అనుకుంటే **ఆరవ కాండలో** ఒక చిన్న చిట్కా చెప్పారు. మినుములు మంత్రించి స్త్రీలు తిరిగే చోట చల్లితే ఇక వాళ్ళ తన ప్రియుని వెంట పడరు. అప్పుడు అతన్ని తేలికగా పట్టుకోవచ్చు. సూక్తార్థం చూడండి.

"ఇతడు కామంతో ఎప్పుడూ నన్నే చూడాలి. నేను విరహంతో అతణ్ణి తలచుకుని బాధపడే పరిస్థితి నాకెప్పుడూ రాకూడదు"

# 93. వర్షం కురవటానికి

వర్షాల్లేవు. నేలంతా బీటలువారిపోయింది. సాగునీరు ఎలాగూలేదు. కనీసం త్రాగటానికి కూడా నీరులేదు. ఇటువంటి సమయంలో వేదం ఏం చెబుతోందో చూడండి. **మూడవ అనువాకంలో ఐదవ సూక్తం.** ఇందులో మొత్తం పదహారు మంత్రాలున్నాయి. ఇక్కడ మంత్రమే కాక కొంత తంత్రంకూడా ఉంది. ఈ సూక్తంతో నేతితో హోమం చెయ్యాలి. కాక, దివిధువక్ అనే ఓషధులను మంత్రించి నీటిలో వెయ్యాలి. ఇప్పుడు సూక్తం ఏం చెబుతోందో చూద్దాం. ఈశాన్య ఋతుపవనాలను చెబుతున్నారు. తూర్పుదిక్కున గాలితోకూడిన మబ్బులు పట్టాలి. అవి భయంకరంగా గర్జిస్తూ భూమికి తృప్తి కలిగేదాకా వర్షించాలి.

మరుత్తులు మంచి వర్షం కురిపించాలి. వాననీటికి విత్తనాలు మొలకెత్తి పంటలు బాగాపండాలి.

మరుత్తులను ప్రార్థిస్తున్నాను. మీరు మంచి వర్షం కురిపించండి. అన్నిరకాల పంటలు బాగాపండాలి.

పర్జన్యుడు గర్జిస్తూ అనేక రూపాలలో వర్షంకురిపించాలి.

మరుద్దేవతలారా సముద్రంలో ఉండే నీటిని మేఘాల రూపంలో పైకి పంపి, వర్షంగా కురిపించండి. భూమికి తృప్తి కలిగించండి. **పృథివీంతర్పయంతు**

పర్జన్యుడు పెద్దశబ్దంచేస్తూ వర్షం కురిపించాలి. నేలమీద జలప్రవాహం కావాలి.

మెరుపులు ఉరుములతో పెద్దగాలితో విపరీతమైన వర్షం రావాలి. పంటలు బాగా పండాలి. గాలితో ప్రేరేపించబడిన మేఘాలు భూమిమీద

జలం ప్రవహించే టట్లుగా వర్షం కురిపించాలి.

అగ్నిదేవుడు మా ప్రాణాలకు జీవనాధారమైన వర్షం కురిపించుగాక.

పితృసమానుడైన సూర్యుడు వంకరగా వర్షం కురిపించాలి.

నియమనిష్టలు పాటించే బ్రాహ్మణునిలాగా పర్జన్యుడు వర్షించాలి. కప్పలు బెకబెక లాడాలి.

ఓ మండూకమా శబ్దంచెయ్యి. ఓ తాదురీ వానరాకను సూచించే శబ్దం చెయ్యి. వర్షంవల్ల చెరువులు నిండితే ఆ నీటిలో నాట్యంచెయ్యండి. ఖణ్యఖ, షైమఖ, తాదురులారా ! మండూకములారా ! వానరాకను సూచిస్తూ శబ్దం చెయ్యండి. పర్జన్యా ! పెద్దపెద్ద మేఘాలతో వర్షించి నేలను బాగా తడుపవలసింది. ఖణ్వక, షైమఖ, తాదురి, మండూకాలు వానరాకను సూచిస్తూ శబ్దం చేస్తాయి. ఈ రోజున కూడా కప్పలు బెకబెకలాడితే వర్షం వస్తుందని మన నమ్మకం.

# 94. మూత్రం ఆగిపోతే

ఇది చాలా విచిత్రమైన వ్యాధి. ఉన్నట్టుండి ఒక్కసారిగా మూత్రం బంధించ బడుతుంది. ఏం చేసినా మూత్రం మాత్రం రాదు. మూత్ర నాళంలో కొన్ని గ్రంథులు ఉబ్బిపోయి ఆ నాళం మూసుకుపోతుంది. ఇటువంటి పరిస్థితి వచ్చినప్పుడు లోహపు గొట్టాన్ని మూత్రనాళంలోకి పంపాలి. అప్పుడు ఉప్పొంగుతున్న నది ఆనకట్ట తెగితే ఎలా ఉంటుందో అలా మూత్రం తన్నుకుంటూ బయటకు వస్తుంది. అంటోంది అధర్వ వేదం.

ఈ మాట నిజమే. కొంతమందికి ఇది అనుభవం కూడా కావచ్చు. రెండు సంవత్సరాల క్రితం నాక్కూడా ఇలాగే జరిగింది. అప్పుడు డాక్టరుగారు రబ్బరు ట్యూబును మూత్రనాళంలోకి పంపించి, ఆ మూత్రాన్ని బయటకు తీశేశారు. ఇది శాశ్వత పరిష్కారం మాత్రం కాదు. తరువాత నేను ఆపరేషను కూడా చేయించాను.

# 95. ఇంకా అనేకం

ఈ చెప్పిన విషయాలే కాదు. ఇంకా ఎన్నో ఎన్నెన్నో విషయాలున్నాయి ఈ వేదంలో

1) శత్రుసైన్య వశీకరణకు **మూడవకాండలో ఒకటవ సూక్తం**

2) మంచి గుణవతి అయిన భార్య కావాలంటే **ఆరవకాండ ఎనభై రెండవ సూక్తం**

3) యోగ్యుడైన భర్తని పొందటానికి – **ఆరవకాండ అరవైయవ సూక్తం**

4) గుండె జబ్బు – **ఒకటవ కాండ ఐదవ సూక్తం**

ఇప్పటి వరకు నేను చెప్పినవి కొన్ని మాత్రమే. ఇంకా చాలా విషయాలున్నాయి ఈ వేదంలో. మొన్ననే ఒక వ్యక్తి అడిగారు **'జింకు తయారుచేసే పద్ధతి అథర్వవేదంలో ఉందట కదా'** అని అలాగే **'అణుబాంబులు ఎలా తయారుచెయ్యాలో ఇందులో చెప్పారట కదా'** అని ఇలా చాలా విషయాలు ఇందులో ఉన్నాయని చెబుతున్నారు. అన్ని విషయాలు బహిరంగంగా ఉండవు. కొన్నింటిని సాంకేతిక పదజాలంతో చెప్పటం జరుగుతుంది. అటువంటి వాటిని సైన్సులో ప్రత్యేకించి ఆ విషయం మీద పరిజ్ఞానం ఉన్న వాళ్ళు కొంతమంది, వేదభాష్యం పూర్తిగా తెలిసిన వారితో కలిసి పరిశోధనచేస్తే చాలావిషయాలు బయట పడచ్చు. జర్మనీ వారు మన అథర్వవేదం ఉపయోగించే అంతగా అభివృద్ధి సాధించారు అని చెబుతుంటారు. మరి కళ్ళ ఎదురుగా వారు కనిపిస్తున్నప్పుడు మనం కూడా ప్రయత్నం

చెయ్యటంలో తప్పేం లేదు కదా ! ఎక్కడో కోటలో కొన్నిటన్నుల బంగారం నిక్షిప్తమై ఉంది. ఈ విషయం ఎప్పుడో చనిపోయిన మహారాజుగారు కలలో కనిపించి చెప్పారు అంటే ప్రభుత్వం చొరవ తీసుకుని కోటంతా గోతులు తవ్వించలేదా? మరి వేదాలమీద పరిశోధన చెయ్యటానికి మాత్రం అభ్యంతరం ఏముంటుంది? జర్మనీ వారు మనవేద సంపదను ఎత్తుకుపోయి వాడుకుంటున్నారు. అభివృద్ధి చెందుతున్నారు అని బాధపడే బదులు మీరుకూడా దానిమీద పరిశోధనలు చేసి నిజాలు నిగ్గుతేల్చవచ్చు కదా ! దీనికి ఎవరూ అభ్యంతరం చెప్పరు. కాబట్టి చిత్తశుద్ధితో శాస్త్రజ్ఞులు, వేద పండితులు కలిసి కూర్చుని పరిశోధన చేసినట్లైతే అధర్వవేదంలో దాగిన అనేక రహస్యాలు బయట పడవచ్చు దీనికి కోసం ప్రయత్నం జరగాలి జరుగుతుంది అని ఆశిద్దాం.

రాజు తలచుకుంటే సన్మానాలకు, ప్రభుత్వం తలచుకుంటే పరిశోధనలకు కొదవ ఏముంది?

*దీంతో అధర్వణ సంహిత సమాప్తము*

శ్రీ

# పార్థసారథీయము

# చతుర్వేదభాష్యము

## ( బ్రాహ్మణాలు )




ప్రముఖ శ్రీవిద్యా ప్రచారకులు

అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,

ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, మెంఫిస్, అమెరికా ఆస్థాన విద్వాంసులు,

డా॥ క్రోవి పార్థసారథి

# విషయసూచిక


1. బ్రాహ్మణము అంటే ?
2. బ్రాహ్మణాలు కూడా వేదాలేనా ?
3. బ్రాహ్మణాల వల్ల ప్రయోజనం
4. సంహిత – బ్రాహ్మణాలు
5. బ్రాహ్మణాల వరుస క్రమం
6. అంతరించిపోయిన బ్రాహ్మణాలు
7. గుర్తు తెలియని బ్రాహ్మణాలు
8. ఋషులు
9. తత్త్వజ్ఞానసంపన్నుడు – జనకుడు
10. సత్యకామజాబాలి
11. ముగ్గురు మిత్రులు
12. ప్రవాహణుడు – శ్వేతకేతువు
13. అశ్వపతి మహారాజు
14. ఇంకా అనేకులు
15. చాతుర్వర్ణాలు
16. చతురాశ్రమాలు
17. రాజు–రాజ్యం
18. జగత్తు ఎలా ఆవిర్భవించింది?
19. నదీ జలాలు – పంటలు
20. పంటలు
21. అరవై రోజుల పంట

22. ఓషధులు
23. సముద్రపు నీరు ఎందుకు ఉప్పగా ఉంటుంది?
24. రావివేప చెట్లకు ఎందుకు ప్రదక్షిణాలు చెయ్యాలి?
25. సూర్యచంద్రులు
26. ప్రకృతి వైపరీత్యాలు
27. ప్రకృతి సౌకర్యాలు
28. యజ్ఞం – దేవతలు
29. బ్రాహ్మణాలలో అనేక విషయాలు
30. ఆహితాగ్ని
31. ఋత్విక్కులు
32. ప్రాయశ్చిత్తం
33. యజ్ఞయాగాలు ఎవరు చెయ్యాలి?
34. పురోహితుడు
35. ఉపాఖ్యానాలు
36. యజ్ఞయాగాలు
    1. అగ్న్యాధానం
    2. అగ్నిహోత్రం
    3. దర్శపూర్ణమాసలు
    4. అనునిర్వాప్యేష్టి
    5. అభ్యుదితేష్టి
    6. అభ్యుద్దృష్టేష్టి
    7. దాక్షాయణ యజ్ఞం
    8. ఇళాదధేష్టి

9. సార్వసేని యజ్ఞం
10. శౌనక యజ్ఞం
11. వసిష్ట యజ్ఞం
12. సాకం ప్రస్థాయ్యేష్టి
13. మున్యయనేష్టి
14. తురాయణేష్టి
15. ఆగ్రయదేష్టి
16. శ్యామాకాగ్రాయణేష్టి
17. వేణుయవాగ్రయణేష్టి
18. వ్రీహ్యాగ్రయణేష్టి
19. చాతుర్మాస్య యాగాలు
20. వైశ్యదేవము
21. వరుణ ప్రఘాసం
22. సాకమేధం
23. శునాసీరీయం
24. సోమయాగాలు
25. జ్యోతిష్టోమము
26. దీక్షాయణీ మేష్టి
27. ప్రాయణీ యేష్టి
28. ఉదయనీయేష్టి
29. అతిధ్యేష్టి
30. ప్రవర్గ్య
31. ఉపసత్

32. గవామయనము
33. ఆదిత్యనామయనము
34. అంగీరసామయనము
35. ద్వాదశాహము
36. అగ్నిహోత్రము
37. వాజపేయం
38. రాజసూయం
39. అశ్వమేధం
40. గోమేథము
41. పురుషమేధం
42. కూశ్మాండ హోమం
43. వేయి సంవత్సరాల సత్రయాగం
44. సావిత్ర్యాగ్నిచయనము
45. ఇతర యాగాలు

37. ఐతరేయ బ్రాహ్మణము
1. శునశ్శేపుడు
2. బ్రహ్మ
3. సామెతలు

38. కౌషీతకీ బ్రాహ్మణము
1. సకాలంలో వర్షాలు
2. యజ్ఞపురుషుడు
3. యజ్ఞంలో పశుబలి అవసరం లేదు
4. మానవసేవే మాధవసేవ

5. విరాట్పురుషుడు
6. అగ్నికి ఆజ్యం

39. తైత్తిరీయ బ్రాహ్మణము
1. ఆడపిల్ల అత్తవారింట్లో సుఖంగా ఉండాలంటే ?
2. రోహిణి–సిరిసంపదలు
3. అశ్రద్ధ పనికిరాదు
4. కన్ను అబద్ధం చెప్పదు
5. విషువత్
6. పరస్పరం పోట్లాడుకోకూడదు
7. రెండుసార్లు అన్నం ఎందుకు తినాలి?
8. నక్షత్రాలే ప్రజాపతి శరీరం
9. ఆవులే అగ్నిహోత్రాలు
10. మానవులెలా పుట్టారు?
11. జుట్టు మెరుపు, బొల్లి
12. నక్షత్రాలు
13. తిథులు
14. కాలకంజుల యాగం
15. బ్రహ్మకైన పుట్టు రిమ్మ తెగులు
16. సృష్టి ప్రారంభంలో
17. దాచిపెట్టిన దానికన్న అనుభవించినదే ఉత్తమమైనది
18. వేదంలో ఏముందో తెలుసుకోవటం ఎవరికీ సాధ్యం కాదు.
19. మోదుగుచెట్టు ఎలా పుట్టింది?
20. ఎద్దేవా

40. శతపథ బ్రాహ్మణము

1. తత్త్వవేత్త
2. మృత సంజీవిని
3. ఊర్వశి – పురూరవులు
4. వృత్రాసుర వధ
5. కొంచెం ఎక్కువ

41. తలవకార బ్రాహ్మణం

1. పెద్దగా మాట్లాడకు, నేలకు చెవులుంటాయి.
2. చంద్రునిలో మచ్చ
3. సోమరసం
4. రాక్షసుల ఓటమి
5. పొరపాట్లు
6. సోమరసం గుణాలతో పెరుగు
7. ఈతిబాధలు
8. మేడిచెట్టు
9. బ్రహ్మహత్యాపాతకము
10. చ్యవనుడు
11. తనకు మాలిన ధర్మం

42. తాండ్యబ్రాహ్మణము

1. సౌమిత్రిసామము
2. ఇంద్రుడు
3. ప్రత్యామ్నాయము

4. మధ్యలో మాట్లాడరాదు
5. సామగానంతో రోగాలు మాయం
6. క్షత్రియసామము
7. త్వాష్ట్రీసామము
8. ఊర్ణాయవము
9. మరిచిపోయిన కర్మను జ్ఞాపకం చెయ్యకూడదు
10. వసిష్టుడే పురోహితుడు
11. నిజమైన పుత్రుడు
12. వైఖానస సామము
13. కాలేయము
14. శ్యావాస్వసామము
15. నీచోపమ

43. ఛాందోగ్య బ్రాహ్మణము
1. వివాహం
2. గుండ్రాయి దాస్తే పెళ్ళి అగిపోదు
3. సప్తపది
4. సీమంతం
5. ప్రార్థన
6. గోవధనిషేధము
7. ఆదిత్యుడు
8. ఇంకా అనేకం

44. ఉపబ్రాహ్మణాలు

1. నచ్చిన వాడికి పిల్లనివ్వటం ఎలా?
2. అయోగ్యుడికి ఇచ్చిన విద్య వినాశహేతువు
3. యజ్ఞాలు చెయ్యకపోయినా ఇబ్బంది లేదు
4. తపస్సు అంటే ఏమిటి?
5. ప్రాయశ్చిత్తాలు
6. ముసలితనం రాకుండా
7. గాయత్రీ మంత్రము
8. విద్యనుపదేశించటానికి అర్హతలు
9. సంహిత-రకాలు

45. గోపథ బ్రాహ్మణము
    1. శరీర నిర్మాణం
    2. ప్రపంచసృష్టి
    3. ప్రణవం
    4. గాయత్రీ మంత్రం
    5. ఋక్-సామాల సంబంధం
    6. గోపథము
    7. మర్మ గర్భ వివరణలు సుభాషితాలు
    8. ఉద్దాలకుడు
    9. ప్రేది-ఉద్దాలకుడు
    10. దక్షయజ్ఞం

# 3. బ్రాహ్మణాలు

సంహిత అంటే మంత్రభాగం. యజ్ఞయాగాది క్రతువులలో ఏ మంత్రాలు చదవాలి? అనే విషయాన్ని వివరిస్తుంది. ఆ క్రతువులు అంటే యజ్ఞయాగాలు ఎలా చెయ్యాలి అనే విషయాన్ని వివరించేది బ్రాహ్మణము. ఒకరకంగా చెప్పాలంటే సంహితకు వ్యాఖ్య. నాలుగువేదాలకు విడివిడిగా బ్రాహ్మణాలున్నాయి. కొన్ని వేదాలకు రెండు మూడు బ్రాహ్మణాలు కూడా ఉన్నాయి. కాలక్రమంలో అనేక బ్రాహ్మణాలు అంతరించి పోయినాయి. ఇలా అంతరించిపోయిన వాటిలో కొన్నిటిని పేర్లుకూడా తెలియదు. వాటిని ఎవరు వ్రాశారో కూడా తెలియదు. ప్రస్తుతం మనకు ఎనిమిది బ్రాహ్మణాలే దొరుకుతున్నాయి. అవి

1. ఐతరేయ బ్రాహ్మణము–ఋగ్వేదానికి సంబంధించినది
2. కౌషీతకీ బ్రాహ్మణము–ఋగ్వేదానికి సంబంధించినది.
3. తైత్తిరీయ బ్రాహ్మణము–కృష్ణయజుర్వేదానికి సంబంధించినది
4. శతపథ బ్రాహ్మణము–శుక్ల యజుర్వేదానికి సంబంధించినది.
5. తలవకార బ్రాహ్మణము–సామవేదానికి సంబంధించినది
6. తాండ్య బ్రాహ్మణము–సామవేదానికి సంబంధించినది.
7. ఛాందోగ్య బ్రాహ్మణము–సామావేదానికి సంబంధించినది
8. గోపథ బ్రాహ్మణము–అథర్వణ వేదానికి సంబంధించినది.

వీటిలో అనేక విషయాలు, ఉపాఖ్యానాలు, యజ్ఞయాగాదుల నిర్వహణ ఇలా అనేక విషయాలు చెప్పారు. యజ్ఞయాగాదుల నిర్వహణను ప్రతివేదంలోను వారి సంప్రదాయాలకు అనుగుణంగా చెప్పారు. ఇప్పుడు బ్రాహ్మణాల గురించి చూద్దాం.

# 1. బ్రాహ్మణము అంటే ?

బ్రాహ్మణులు వేరు, బ్రాహ్మణాలు వేరు.

బ్రాహ్మణులు - చాతుర్వర్ణాలలో ఒక వర్ణం

బ్రాహ్మణాలు - వేదంలో ఒక భాగము

ఈ రెండు పదాలకు సంబంధం ఏ మాత్రం లేదు. 'బ్రహ్మావైమంత్రః' బ్రహ్మ అంటే మంత్రము అని అర్థం చెబుతోంది శతపథ బ్రాహ్మణము. మంత్రము అంటే - మంత్ర భాగము. వేదాల్లో మంత్రాలన్నీ సంహితలో ఉంటాయి. కాబట్టి బ్రాహ్మ అంటే మంత్రభాగము, సంహిత భాగము అని అర్థం. భగవంతుడి ఉశ్వాస నిశ్వాసలే వేదాలు. ఇవి నాలుగు భాగాలుగా ఉన్నాయి. 1.ఋగ్వేదము 2. యజుర్వేదము 3. సామవేదము 4. అథర్వణ వేదము. ఇందులో ప్రతివేదము మళ్ళీ నాలుగు భాగాలుగా చెప్పబడుతోంది. 1. సంహిత 2. బ్రాహ్మణము 3. అరణ్యకము 4. ఉపనిషత్తు. ఇలా చూస్తే వేదంలో మొదటి భాగము సంహిత అదే మంత్రశాస్త్రము. ఈ మంత్రాలతోనే భగవంతుణ్ణి ఆరాధిస్తాం. అర్చిస్తాం. దీనికి అనేక రకాల మార్గాలు పూజలు, అర్చనలు, యజ్ఞాలు, యాగాలు మొదలైనవి. పూజలు అర్చనల కన్న భగవంతుణ్ణి త్వరగా చేరేవి, ఆయనకు ఎక్కువ ప్రీతికరమైనవి, యజ్ఞయాగాలు. ఈ యజ్ఞయాగాలు ఎలా చెయ్యాలి? అనే విషయాన్ని వివరించి చెప్పేవే బ్రాహ్మణాలు. సంహిత మంత్రభాగం అయితే బ్రాహ్మణము తంత్రభాగము. మంత్ర భాగానికి వ్యాఖ్యాన రూపమే ఈ బ్రాహ్మణము. సంహితలు యజ్ఞయాగాలలో చెప్పవలసిన మంత్రాలను చెబుతాయి. ఆ మంత్రాల వినియోగము అంటే ఆ మంత్రాన్ని ఏ రకంగా చెప్పాలి? చెబుతూ ఏం చెయ్యాలి ? ఎలా

చెయ్యాలి? అనే విషయాన్ని వివరించేదే **'బ్రాహ్మణము'** వివరణతో పాటుగా అవసరమైన చోట్ల వ్యాఖ్యానం కూడా చేస్తాయి ఈ బ్రాహ్మణాలు. సంహితలో రహస్యంగా ఉన్న అనేక విషయాలను, వ్యాఖ్యానాలు, ఉపాఖ్యానాలు ద్వారా మనకు తెలియజేస్తాయి. మంత్రభాగాన్ని ఎప్పుడు ఎక్కడ ఎలా చెప్పాలి? మంత్రాన్ని ఎలా వినియోగం చెయ్యాలి అనే విషయాలు వివరించేదే బ్రాహ్మణము.

**బ్రహ్మవై బ్రాహ్మణః :** బ్రహ్మ అంటే – యాగనిర్వాహకుడు అని అర్థం. నాలుగు వేదాలు అధ్యయనం చేసిన వాడు. యజ్ఞస్వరూపాన్ని బాగా నడిపించగలవాడు. ఇలా విషయం పూర్తిగా తెలిసినవాడు యజ్ఞం ఎలా జరగాలి అనేది ప్రణాళికాబద్ధంగా రూపొందిస్తాడు. ఈ రకంగా బ్రహ్మగారి చేత శాస్త్రబద్ధంగా రూపొందించబడిన యజ్ఞవిధానమే బ్రాహ్మణము.

బ్రాహ్మణాల తరువాత అరణ్యకాలు, ఉపనిషత్తులు విడిగా ఉన్నాయి. కాని కొన్నిచోట్ల అరణ్యకాలు, ఉపనిషత్తులు బ్రాహ్మణాల్లో భాగాలుగా ఉన్నాయి. ఉదాహరణకి "శతపద బ్రాహ్మణం" ఇది ఒక బ్రాహ్మణం. కాని ఇందులో అరణ్యకము, ఉపనిషత్తు కూడా కలిసి ఉన్నాయి. బృహదారణ్యకము, ఇది ఒక అరణ్యకము, ఉపనిషత్తు కూడా. **"శేషేబ్రాహ్మణశబ్దః"** మంత్రం కాకుండా గలిగదంతా బ్రాహ్మణము అన్నాడు జైమిని. అలాగే 'యాగానుష్ఠానంలో మనల్ని ప్రేరేపించే విధులే బ్రాహ్మణము' అన్నాడు ఆపస్తంభుడు. ఈ ప్రేరణ అంతా విధి, అర్థవాదాలతో మనకి లభిస్తున్నది అంటాడు సాయణాచార్యుడు. ఇప్పుడు విధి, అర్థవాదము అంటే ఏమిటో చూద్దాం.

**విధి :** ప్రత్యేక ప్రయోజనం ఆశించి యజ్ఞయాగాది కర్మలు చెయ్యాలని నిర్దేశించేది విధి. ఇది రెండు రకాలు.

**1. అప్రవృత్త ప్రవర్తకం :** మనం చెయ్యని యజ్ఞయాగాది కర్మలో మనల్ని ప్రేరేపించేవి. **అగ్నా వైష్ణవం, పురోడాశం, నిర్వపంతి, దీక్షణీయం.**

**2. అజ్ఞాత జ్ఞాపకం :** తెలిసిన విషయాన్ని మనకు తెలియచేసేవి. **ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్.**

**2. అర్ధవాదం :** విధిచేత ప్రేరేపించబడిన కర్మలను ప్రశంసిస్తూ, వాటిని ఆచరించటానికి మనల్ని ప్రోత్సహించేవి. విధింపబడని కర్మలను నిందిస్తూ వాటినుంచి మనల్ని నివర్తింపచేసేవి. వీటిని అర్ధవాదం అంటారు. ఇవి నాలుగు రకాలు.

1. స్తుతి 2. నింద 3. పరకృతి 4. పురాకల్పము

**1. స్తుతి :** దీన్ని ప్రశంస అని కూడా అంటారు. విధించబడిన కర్మయొక్క గుణగణాలను ఇది ప్రశంసిస్తుంది. ఉదాహరణకి వాయువు శీఘ్రంగా వెళ్ళే దేవత. కాబట్టి త్వరగా ఫలితాన్ని ఇస్తుంది. అని వాయుదేవతాక యాగాన్ని ప్రశంసిస్తోంది.

**2. నింద :** చేయకూడని పని, ఆచరించకూడని కర్మని నిందిస్తూ దాన్ని మనం చేయకుండా చేస్తుంది.

**3. పరకృతి :** ఇతరులు చేసిన విరుద్ధమైన విధిని చెప్పేది.

**4. పురాకల్పం :** ఐతిహ్యాన్ని తెలియజేసే వాక్యము.

ఈ నాలుగు గాక 1. హేతువు 2. నిర్వచనం 3. సంశయం 4. వ్యవధారణ కల్పన 5. ఉపమానం. వీటిని కూడా విధులుగానే చెబుతారు.

**ప్రాముఖ్యత :** బ్రాహ్మణాలలో ముఖ్యంగా చెప్పిన విషయం

ఏమిటి? బ్రాహ్మణాలలో ప్రధానంగా చెప్పింది 'యజ్ఞం'. పూజలు, అర్చనలు, జపాలు తపాలు. వీటికి ప్రాముఖ్యత లేదు. వేదంలో యజ్ఞయాగాలకే ప్రాముఖ్యత ఇవ్వబడింది. యజ్ఞయాగాలు చెబుతూ మధ్యలో సంహిత చెప్పిన సాంకేతిక పదాలను వివరిస్తున్నాయి. బ్రాహ్మణాల గొప్పతనాన్ని ఆధునికవాదులు గుర్తించారు. పాశ్చాత్య విమర్శకులు కూడా గుర్తించారు. యజ్ఞయాగాల చరిత్రను, మతస్వరూపాన్ని పరిశీలించే వారికి బ్రాహ్మణాలు చాలా గొప్ప ప్రమాణ గ్రంథాలు. అని పాశ్చాత్యులు ప్రశంసించారు. వైదిక సూక్తాలను అర్థం చేసుకోవటాని బ్రాహ్మణాలు మనకి చేస్తున్న సహాయం అంతా ఇంతా కాదు. వైదికనాగరికత, సంస్కృతి అర్థం చేసుకోవాలంటే బ్రాహ్మణాలు అవసరం చాలాఉంది.

## ౨. బ్రాహ్మణాలు కూడా వేదాలేనా ?

బ్రాహ్మణాలు కూడా వేదాలేనా ? అనే ప్రశ్న ఈనాటిది కాదు. ప్రాచీన కాలాల నుంచీ ఉంది. ముందుగా దీనికి కారణం చూద్దాం. వేదాలు అపౌరుషేయాలు. వేదం ఎవరిచేతనూ చెప్పబడలేదు. అలాగే ఎవరిచేతను వ్రాయబడలేదు. ఆప్త ఋషులు సమాధిస్థితిలో కూర్చుని ఆ పరమేశ్వరుని కృపతో దర్శించినవే వేదాలు. అని గతంలో మనం చెప్పుకున్నాం. వాళ్ళు ఏం దర్శించారు? వేదమంత్రాలను దర్శించారు. మంత్ర సమూహాలయిన సూక్తాలను దర్శించారు. అవే సంహిత అనబడింది. వేదంలోని మొదటి భాగం సంహిత. దీన్ని ఎవరూ చెప్పలేదు. ఆప్తఋషులు దర్శించారు. ఇక వేదంలోని రెండవ భాగం బ్రాహ్మణము. మంత్ర భాగానికి వివరణ, వినియోగమే బ్రాహ్మణము. దీన్ని ఎవరూ సమాధి స్థితిలో కూర్చుని దర్శించలేదు. మహర్షులు యజ్ఞయాగాది క్రతువుల్లో ఈ మంత్ర భాగాన్ని ఎలా వినియోగించాలో నిర్ణయించుకున్నారు. అలా నిర్ణయించిన వినియోగాన్ని గురుశిష్య పరంపరగా వ్యాప్తి చేశారు. ఇది సంహితకి వినియోగము. అందుకే సంహిత తరువాత భాగము బ్రాహ్మణము అని చెప్పబడింది. అంటే ఇది సంహితకి వివరణ. ఈ వివరణ ఇచ్చినవారు ఋషులు. కాబట్టి బ్రాహ్మణము అపౌరుషేయము కాదు. అవి పౌరుషేయాలు. ఈకారణంచేతనే ఈ అనుమానం వచ్చింది. సంహిత అపౌరుషేయము. బ్రాహ్మణము పౌరుషేయము. ఇప్పుడు ఈ అనుమానం వచ్చింది. అపౌరుషేయమైన సంహిత భాగం వేదం. మరి పౌరుషేయమైన బ్రాహ్మణంకూడా వేదమేనా ?

ప్రాచీనకాలం నుంచీ ఈ అనుమానం గల చర్చ ఇలా సాగుతూనే ఉంది. జాగ్రత్తగా పరిశీలించినట్లైతే బ్రాహ్మణాలకు కూడా వేదత్వాన్ని

ప్రసాదించారు. అంటే బ్రాహ్మణాలను కూడా వేదంలో ఒక భాగమేనని చెప్పటం జరిగింది. ఇప్పుడు గతకాలంలో ఉన్న పండితాభిప్రాయాలను విచారిద్దాం. జైమిని సూత్రాలకు భాష్యం వ్రాసిన నాడు, శబరస్వామి ఆయన **'మంత్రాశ్చ బ్రాహ్మణం చ వేదః'** మంత్రభాగము బ్రాహ్మణాలు కూడా వేదమేను అన్నాడు. బృహదారణ్యకాన్నికి భాష్యం వ్రాస్తూ శంకరుల వారు **'వేదానువచనేన మంత్ర బ్రాహ్మణాధ్యయనే'** సంహిత (మంత్రభాగము) మంత్ర భాగాన్ని, బ్రాహ్మణాన్ని అధ్యయనం చెయ్యటమే వేదము అన్నారు. అంటే సంహితతో పాటుగా, బ్రాహ్మణాన్ని కూడా వేదమని అంగీకరించారు. కుమారిలభట్టు మంత్రాలు, బ్రాహ్మణాలు రెండూ వేదమే అని అంగీకరించాడు. అలాగే మేధా తిథి, మస్కరి మొదలయిన వాళ్ళు కూడా బ్రాహ్మణాలు కూడా వేదమే అని అంగీకరించారు. ఆపస్తంభుడు తన శ్రౌతసూత్రాలలో **'మంత్ర బ్రాహ్మయోర్వేద నామధేయమ్'** మంత్రాలు, బ్రాహ్మణాలు రెండూ కూడా వేదమే అన్నాడు. సాయణుడు తన ఋగ్భాష్య భూమికలో మంత్ర, బ్రాహ్మణ రాశికూడా వేదమే అనబడుతున్నది అన్నాడు. షడ్గురుశిష్యుడు సర్వానుక్రమణికవృత్తి భూమికలో మంత్ర బ్రాహ్మణాలు రెండూ వేదమే అన్నాడు.

వేదం మొత్తం నాలుగు భాగాలుగా ఉన్నది. అవి 1. సంహిత 2. బ్రాహ్మణము 3. అరణ్యకము 4. ఉపనిషత్తు.

**1. సంహిత :** ఇది మంత్రభాగము. ఆప్తఋషులు దర్శించిన మంత్రాలు, సూక్తాలు ఇవన్నీ సూక్తాలు, ప్రపాఠకాలు, అధ్యాయాలు, కాండలు, మండలాలుగా ఉన్నాయి.

**2. బ్రాహ్మణాలు :** సంహితలో చెప్పిన మంత్రభాగానికి యజ్ఞయాగాదుల్లో వినియోగాన్ని వివరిస్తుంది.

**3. అరణ్యకాలు :** వానప్రస్థం తీసుకుని అరణ్యంలో కూచుని అధ్యయనం చేసే మంత్రభాగమే అరణ్యకాలు. బ్రాహ్మణాలకు ఉపనిషత్తులకు మధ్య వంతెన లాంటివి ఈ అరణ్యకాలు.

**4. ఉపనిషత్తులు :** ఇది పూర్తిగా జ్ఞానకాండ. ఇవి వేదము యొక్క అంతమందు ఉన్నాయి కాబట్టి వేదాంతము అనబడుతుంది.

ఈ నాలుగు భాగాలు కలిపి వేదము అనబడుతుంది. అయినప్పటికీ ఎక్కువగా వేదము అనే పదం మంత్రభాగానికే చెందుతుంది. అనేదే వాదన. ప్రధానంగా సంహిత వేదము అని చెప్పబడినా బ్రాహ్మణాలను వేదము అనటం గౌణం. (అప్రధానం) మంత్రం ఒక్కటే వేదం. మంత్ర వినియోగం వేదం కాదు అనటంలో అర్థంలేదు కదా. అందుకే బ్రాహ్మణాలు కూడా వేదమే.

దయానంద సరస్వతి లాంటి ఆధునిక వాదులు మంత్రభాగమే వేదము. బ్రాహ్మణాలు కాదు. అంటారు. ఈ వాదాన్ని పాశ్చాత్యులు చేస్తున్నారు. కాని దీనిమీద అధ్యయనం చేస్తున్నవారు మాత్రం మంత్ర బ్రాహ్మణాలు రెండు వేదమే అంటున్నారు.

# 3. బ్రాహ్మణాల వల్ల ప్రయోజనం

సామాన్యమైన మానవుడికి ఈ పుస్తకం చదువుతున్నప్పుడు వచ్చే అతిచిన్న ప్రశ్న. బ్రాహ్మణాల వల్ల ప్రయోజనం ఏమిటి? ఇంతవరకు మనం చెప్పుకున్న దాన్ని బట్టి బ్రాహ్మణాల వల్ల ప్రయోజనం ఉంది అనే విషయం మనకి తెలుస్తుంది. అయినప్పటికీ ఈ అనుమానం రాకుండా ఉండాలనే ఆలోచనతోనే ఈ విషయాన్ని ప్రత్యేకంగా చెప్పటానికి ప్రయత్నం చేద్దాం.

సంహిత అంటే మంత్రభాగము. ఈ సంహితయొక్క వినియోగం తెలియచేసేదే బ్రాహ్మణం. కాబట్టి యజ్ఞయాగాది క్రతువుల్లో మంత్రాలను ఎప్పుడు, ఎక్కడ, ఎలా చెప్పాలి? అనే విషయాలను వివరించేదే బ్రాహ్మణము. మంత్రము యొక్క అర్థాన్ని వివరించి చెప్పేదే బ్రాహ్మణము. యజ్ఞయాగాలకు సంబంధించిన ద్రవ్యాన్ని, దేవతను చెప్పేవి మంత్రాలు. యజ్ఞం ఎలా చెయ్యాలి? అలా చేస్తే ఏ ప్రయోజనాలు వస్తాయి? మొదలైన విషయాలను వివరించి చెప్పేవి బ్రాహ్మణాలు. వేదమంత్రాలలో అనేకమైన అర్థాలున్నవి. వాటిని తెలుసుకోవాలంటే నిఘంటువు చూడాలి. పూర్వకాలంలో ఎవరో ఒక మహానుభావుడు నాలుగు వేదాలకు కలిపి ఒక నిఘంటువు వ్రాశాడు. దానికి వ్యాఖ్య వ్రాశాడు 'యాస్కుడు'. దాన్నే **'నిరుక్తము'** అంటారు. ఇవాల్టి రోజున ఆ నిఘంటువు వ్రాసిన అసలు వ్యక్తి పేరు తెలియదు. కాని దానికి వ్యాఖ్య వ్రాసిన యాస్కుడి పేరుతోనే నిరుక్తముగా స్థిరపడిపోయింది. ఈ రోజున సామాన్య మానవుడికి తెలిసింది ఏమంటే – "నిరుక్తము–వేదాలకు నిఘంటువు. దీనిని వ్రాసిన వాడు యాస్కుడు."

పూర్వకాలంలో ప్రతివేదానికి విడిగా నిఘంటువు ఉండేది. కాని కాలక్రమేణా వేదానికి ఆదరణ తగ్గింది. దీనికి కారణం లౌకిక జీవితంలో వేదాన్ని వినియోగించటం లేదు. యజ్ఞయాగాది క్రతువులు చేసేవారు తక్కువై పోయారు. దీంతో వేద నిఘంటువులు కూడా కనిపించకుండా పోయాయి. మన అదృష్టం కొద్దీ మిగిలింది నిరుక్తం ఒక్కటే. దీన్ని వ్రాసినవాడు యాస్కుడు.

వాఙ్మయంలో చూసినట్లైతే ముందు బ్రాహ్మణాలు, తరువాత నిఘంటువులు వచ్చాయి. గతంలో చెప్పిన విషయాన్ని ఆధారంగా చేసుకుని ఇప్పుడు పుస్తకం వ్రాయటం జరుగుతుంది. వేదము అనేది. అత్యంత ప్రమాణమైనది. వేదంలో బాగమే ఈ బ్రాహ్మణాలు. కాబట్టి నిఘంటువు వ్రాసేటప్పుడు అప్పటివరకు వాడుకలో ఉన్న అర్థాలను తీసుకోవటం జరిగింది. ఆ అర్థాలన్నీ బ్రాహ్మణాలలో ఉన్నవే. కాబట్టి బ్రాహ్మణాలలో చెప్పిన అర్థాలనే నిఘంటువులో వ్రాయటం జరిగింది. ఇక్కడ ఒక క్షణం ఆగి కొన్ని పదాలకు నిఘంటువులో ఏ అర్థం చెప్పారు?, అదే పదానికి బ్రాహ్మణంలో చెప్పిన అర్థం ఏమిటి? అనే విషయాన్ని చూద్దాం.

1. 'క్షపా' అనే పదానికి నిఘంటువులో 'రాత్రి' అని అర్థం చెప్పారు. అదే ఐతరేయ బ్రాహ్మణంలో 'రాత్రయః క్షపాః' అన్నారు.

2. 'రేతః' అనే పదానికి నిఘంటువులో 'నీరు' అని అర్థం. అదే తాండ్య బ్రాహ్మణంలో "ఆపోహి రేతః" అన్నారు.

3. 'మఖః' అనే పదానికి నిఘంటువులో 'యజ్ఞము' అని అర్థం. అదే తైత్తిరీయ బ్రాహ్మణంలో 'యజ్ఞోవైమఖః' అన్నారు. ఇలా ప్రతి పదానికి బ్రాహ్మణంలో చెప్పిన అర్థాలే నిఘంటువులో చెప్పటం జరిగింది. ప్రతిపదానికి బ్రాహ్మణంలో అర్థం వెతకటం చాల కష్టమైన

పని. అదే నిఘంటువులో చూడటం చాలా తేలిక. అందుకే నిఘంటువు (నిరుక్తము) ప్రాముఖ్యతను సంపాదించుకుంది. ఇక్కడ మనం గుర్తించాల్సిన విషయం ఏమంటే ఈ నిరుక్తం (నిఘంటువు) వ్రాయటానికి ఆధారం బ్రాహ్మణాలు. కాబట్టి మంత్రభాగాన్ని సరిగా అర్థం చేసుకోవాలంటే బ్రాహ్మణాలు ఉండి తీరాలి. సంహితను సరిగా అర్థం చేసుకోవటానికి బ్రాహ్మణాలు చాలా ఉపయోగిస్తాయి.

మన ఇంద్రియాలకు కనిపించని విషయాలను కూడా దర్శించేవారు మహర్షులు. అలా దర్శించి మంత్రంలోని పదాలకు అర్థాలను బ్రాహ్మణంలో చెప్పారు. కాబట్టి ఏదైనా మంత్రాన్ని గురించి చెప్పాలంటే బ్రాహ్మణము పూర్తిగా తెలిసి ఉండాలి. బ్రాహ్మణాలను ఆధారంగా చేసుకునే నిఘంటువులు, ఇతర భాష్యాలు వ్రాయటం జరిగింది.

'వైదిక కర్మలు ఆచరించటానికి ఈ బ్రాహ్మణాలు మానవుడికి ప్రేరణ ఇస్తాయి' అంటాడు. ఆపస్తంభుడు. నిజంగా చెప్పాలంటే మంత్రార్థాన్ని వివరించి యజ్ఞయాగాది క్రతువులు చేస్తే ఫలితము ఏమిటో, యజ్ఞం చేసేటప్పుడు ఏ ద్రవ్యం వాడితే ఏ ఫలితం వస్తుందో కూడా వివరించి చెబుతోంది బ్రాహ్మణం. మానవుడు తన కోరిక తీరాలంటే ఏ రకమైన యాగం చెయ్యాలి? ఏ ద్రవ్యాలతో చెయ్యాలి? అనే విషయాలు చెప్పి, యాగం చెయ్యటానికి ప్రోత్సహిస్తుంది బ్రాహ్మణము. కాబట్టి బ్రాహ్మణాలద్వారా ప్రేరణ పొందిన వాడు మంత్రార్థాన్ని సరిగా తెలుసుకుని, యజ్ఞయాగాది క్రతువులు చేస్తాడు. తగిన ఫలితం కూడా పొందుతాడు. ఇది బ్రాహ్మణాల ముఖ్య ప్రయోజనం.

బ్రాహ్మణాలవల్ల ప్రాచీన చరిత్ర, సంస్కృతి, అప్పటి

ఆచారవ్యవహారాలు, కట్టుబాట్లు, జీవనవిధానము అన్నీ తెలుస్తాయి. కాబట్టి వేదంలో బ్రాహ్మణాల వల్ల చాలా ప్రయోజనం ఉంది. అంటున్నారు పరిశోధకులు.

# 4. సంహిత - బ్రాహ్మణాలు

సంహిత అంటే మంత్రభాగము. బ్రాహ్మణము అంటే ఆ మంత్రభాగము యొక్క వినియోగము. సంహితలో అనేక యాగాలకు సంబంధించిన మంత్రాలున్నాయి. వాటిలో ఎప్పుడు ఏ మంత్రాన్ని చదవాలి? ఆ మంత్రాన్ని ఏ విధంగా హోమం చెయ్యాలి? అనే వివరణ ఉంది బ్రాహ్మణంలో. ఈ విషయం గతంలో చెప్పుకున్నాం.

**ఋక్సంహిత :** వ్యాసమహర్షి వేదవిభజన చేసిన తరువాత, నాలుగు వేదాలను తన నలుగురు శిష్యులకు ఒప్పగించి వాటిని విస్తృతంగా ప్రచారం చెయ్యమన్నాడు. ఇక్కడ మనం ఒక విషయం గుర్తుంచుకోవాలి. ఏమంటే, వ్యాసుడి తరువాత అతని శిష్యులు వారి శిష్యులకు, ఆ శిష్యులు ఇంకొంత మందికి ఈ వేదాన్ని బోధించారు. ఇలా చేస్తున్నప్పుడు ప్రతి గురువుగారు వేదంలో కొన్నిచోట్ల తనకు అనుకూలమైన విధంగా మార్పులు చేసుకున్నాడు. అంటే కొన్ని సూక్తాలు ముందు, వెనక మార్పు చేశాడు. ఇలా మార్పు చేసిన వాటినే శాఖలు అన్నారు. ఎప్పుడైతే మంత్ర భాగంలో మార్పు చేశారో, అప్పుడు బ్రాహ్మణంలో కూడా తగిన మార్పులు చెయ్యాలి కదా ? మంత్రభాగాన్ని బట్టే బ్రాహ్మణం ఉంటుంది. ఈ లెక్కన చూసినట్లైతే ఋగ్వేదానికి 21 శాఖలున్నాయి అన్నారు. ఈ శాఖలు సంహితకు సంబంధించినవన్న మాట. మరి బ్రాహ్మణాలకుకూడా 21 శాఖలు ఉండి తీరాల్సిందే కదా! ఇందులో అనుమానం లేదు. కాని మనకు మాత్రం కేవలము 6 రకాల బ్రాహ్మణాలు మాత్రమే కనిపిస్తున్నాయి. సంహితకు 21 శాఖలున్నప్పుడు బ్రాహ్మణాలు కూడా 21 ఉండి తీరాల్సిందే. కాని లేవు. కేవలం ఆరే ఉన్నాయి. మిగిలిన పదిహేను రకాలు (శాఖలు) కాలగర్భంలో కలిసిపోయాయా? తెలియదు. అసలు ఉన్నాయి అని

చెప్పబడుతున్న శాఖలు

1. ఐతరేయ బ్రాహ్మణము 4.బహ్వృచబ్రాహ్మణము
2. కౌషీతకీ బ్రాహ్మణము 5.ఆశ్వలాయన బ్రాహ్మణము
3. పైంగి బ్రాహ్మణము 6.గాలవ బ్రాహ్మణము

ఋగ్వేదానికి ఈ ఆరు బ్రాహ్మణాలే ఉండేవి అని తెలుస్తోంది. ఈ ఆరు బ్రాహ్మణాలు ఇప్పుడు మనకి దొరకటంలా. వీటిలో కేవలము మొదటి రెండు బ్రాహ్మణాలు మాత్రమే దొరుకుతున్నాయి. అవే 1 ఐతరేయ బ్రాహ్మణము 2. కౌషీతకీ బ్రాహ్మణము. మిగిలిన నాలుగు నామమాత్రంగా మిగిలిపోయినాయి. వీటిలో ఐతరేయ బ్రాహ్మణానికే బహ్వృచ బ్రాహ్మణము అనికూడా పేరు.

**యజుస్సంహిత :**

యజుర్వేదం రెండుగా విడిపోయింది.

1. కృష్ణయజుర్వేదము 2. శుక్లయజుర్వేదము

కృష్ణ యజుర్వేదాని ప్రధానమైన శాఖ – తైత్తిరీయ శాఖ. దీనికి సంబంధించినది తైత్తిరీయ బ్రాహ్మణము. శుక్ల యజుర్వేదానికి మాధ్యందిన, కాణ్వ అనే పేర్లతో రెండు ప్రధాన శాఖలున్నాయి. వీటికి ప్రత్యేకమైన బ్రాహ్మణాలు ఉన్నాయి. మాధ్యం దిన శతపథ బ్రాహ్మణము. కాణ్వశతపథ బ్రాహ్మణము ఇవి కాకుండా ఇంకా పన్నెండు బ్రాహ్మణాలు ఉండేవి అని తెలుస్తోంది. అవి

1. చరక బ్రాహ్మణము
2. శ్వేతాశ్వర బ్రాహ్మణము
3. కారక బ్రాహ్మణము. దీన్నే శతాధ్యయన బ్రాహ్మణము అని కూడా అంటారు.
4. మైత్రాయణీ బ్రాహ్మణము

5. జాబాల బ్రాహ్మణము
6. ఖాండికేయ బ్రాహ్మణము
7. ఔఖేయ బ్రాహ్మణము
8. హారిద్రవిక బ్రాహ్మణము
9. తుంబురు బ్రాహ్మణము
10. అహ్వారక బ్రాహ్మణము
11. కంకతి బ్రాహ్మణము
12. ఛాగలేయ బ్రాహ్మణము

ఈ పన్నెండు బ్రాహ్మణాలు ప్రస్తుతం మనకి కనిపించటం లేదు. ఇవి కాలగర్భంలో కలిసిపోయినాయి.

**సామ సంహిత :** సామవేదం దగ్గర కొచ్చేసరికి వెయ్యి శాఖలు ఉన్నాయన్నారు. మరి వెయ్యి బ్రాహ్మణాలు ఉండాలి కదా ? నిజమే. కాని అన్ని బ్రాహ్మణాలు మనకి కనిపించటంలా ప్రస్తుతం ఉన్నది.

1. తలవకార బ్రాహ్మణము. దీన్నే జైమినీయ బ్రాహ్మణము అని కూడా అంటారు.
2. తాండ్య బ్రాహ్మణము. దీన్నే పంచవింశ బ్రాహ్మణము లేదా ప్రౌఢ బ్రాహ్మణము అంటారు.
3. ఛాందోగ్య బ్రాహ్మణము. దీనికి మంత్ర బ్రాహ్మణము అని కూడా పేరు.

ఆవి సామవేదానికి ప్రధానమైన బ్రాహ్మణాలు. ఇవి కాక

1. సామవిధాన బ్రాహ్మణము
2. దైవత బ్రాహ్మణము
3. వంశ బ్రాహ్మణము
4. సంహితోపనిషద్ బ్రాహ్మణము

ఈ నాలుగింటిని 'అనుబ్రాహ్మణాలు' అని కూడా అంటారు. ఇవి కాక

1. భాల్లవి బ్రాహ్మణము 3. రౌరుకి బ్రాహ్మణము
2. కాలవి బ్రాహ్మణము 4. శాట్యాయన బ్రాహ్మణము

ఈ నాలుగు బ్రాహ్మణాలు నామమాత్రంగానే మిగిలిపోయాయి.

**అధర్వ సంహిత :** అధర్వ వేదానికి ఉన్నది ఒక్కటే బ్రాహ్మణము. అదే గోపథ బ్రాహ్మణము. దీనికి సంబంధించిన ఇతర బ్రాహ్మణాల పేర్లు కూడా మనకి దొరకలేదు అని చెబుతున్నారు పరిశోధకులు. దీనికి కారణం అథర్వవేదం యజ్ఞయాగాలకు అంతగా ప్రాధాన్యతను ఇవ్వకపోవటమే కావచ్చు. ఇలా చూసినట్లైతే –

ఋగ్వేదానికి – 1. ఐతరేయ బ్రాహ్మణం 2. కౌషీతకీ బ్రాహ్మణం

యజుర్వేదానికి – 1. తైత్తిరీయ బ్రాహ్మణం 2. శతపథ బ్రాహ్మణం

సామవేదానికి – 1. తలవకార బ్రాహ్మణము 2. తాండ్య బ్రాహ్మణము 3. ఛాందోగ్య బ్రాహ్మణము. దీనికి నాలుగు ఉపబ్రాహ్మణాలు. అవి 1. సామవిధాన బ్రాహ్మణము 2. దేవతాధ్యాయ బ్రాహ్మణము 3. సంహితోపనిషత్ బ్రాహ్మణము 4. వంశ బ్రాహ్మణము.

అథర్వ వేదానికి – 1. గోపథ బ్రాహ్మణము ఉన్నాయి.

# 5. బ్రాహ్మణాల వరుస క్రమం

సంహిత భాగాన్ని వివరించే గ్రంథాలే బ్రాహ్మణాలు. ఇక్కడ మనం గమనించాల్సిన విషయం ఒకటుంది. ఏమిటంటే? బ్రాహ్మణాలన్నీ ఒక్కసారిగా రాలా? ఒక దాని తరువాత ఒకటి వచ్చాయి. ఏ గ్రంథం ముందు ? ఏది తరువాత? అన్నప్పుడు దానిలో వాడిన భాష ఆధారంగా కాలనిర్ణయం చెయ్యటం జరుగుతుంది. ఇదంతా సాహితీవేత్తలు, విమర్శకులు, చరిత్రకారుల పని.

సామవేదానికి సంబంధించిన పంచవింశతి బ్రాహ్మణము దీన్నే తాండ్య బ్రాహ్మణము అని కూడా అంటారు. అలాగే కృష్ణయజుర్వేదానికి సంబంధించిన తైత్తిరీయ బ్రాహ్మణము. ఈ రెండు మిగిలిన వాటికన్న ప్రాచీనమైనవి అన్నారు. తైత్తిరీయ బ్రాహ్మణంలో ఉన్న స్వరసంప్రదాయం చాలా పాతకాలంనాటిది అంటున్నారు. దీన్ని బట్టి ఈ రెండు బ్రాహ్మణాలు అతిప్రాచీనమైనవి అంటారు విమర్శకులు. ఈ వరుసలో చూసినట్లైతే సామవేదానికి సంబంధించిన తలవకార బ్రాహ్మణము. ఇదే జైమినీయ బ్రాహ్మణము మూడవది అన్నారు. ఆ తరువాత స్థానంలో నాల్గవది కౌషీతకీబ్రాహ్మణము. దీని తరువాత కొద్దికాలానికే ఐతరేయ బ్రాహ్మణము వచ్చింది. శతపథబ్రాహ్మణము వీటన్నింటి తరువాత ఆఖరున ఏర్పడింది. ఇందులో వాడిన భాష మిగిలిన బ్రాహ్మణాలలో కన్న సంస్కరించబడినది అన్నారు సాహితీ కారులు. ఇలా గనక చూసినట్లైతే బ్రాహ్మణాలవరుస ఈ విధంగా ఉందన్నమాట.

1. తైత్తిరీయ బ్రాహ్మణము 4. కౌషీతకీ బ్రాహ్మణము
2. తాండ్య బ్రాహ్మణము 5. ఐతరేయ బ్రాహ్మణము
3. తలవకార / జైమినీ బ్రాహ్మణము 6. శతపథ బ్రాహ్మణము.

అయితే పాశ్చాత్యుల దృష్టిలో ఈ వరుస సరికాదు. వారిలెక్క ప్రకారము బ్రాహ్మణాలు.

1. ఐతరేయ బ్రాహ్మణము 4. తాండ్య బ్రాహ్మణము
2. కౌషీతకీ బ్రాహ్మణము 5. తైత్తిరీయ బ్రాహ్మణము
3. తలవకార/జైమినీ బ్రాహ్మణము 6. శతపథ బ్రాహ్మణము

ఇదేవరుస అన్నారు. వీరి ప్రకారంకూడా తలవకార బ్రాహ్మణము చాలా ప్రాచీనమైందని, మనకు చాలా దగ్గరగా ఉన్న బ్రాహ్మణం 'శతపథ బ్రాహ్మణము' అన్నారు.

ఏది ఏమైనప్పటికీ ఐతరేయ బ్రాహ్మణము, పంచవింశ (తాండ్య) బ్రాహ్మణము, తైత్తిరీయ బ్రాహ్మణాలు మిగిలిన వాటికంటే ప్రాచీనమైనవి అని, శతపథ బ్రాహ్మణం అర్వాచనమైందని నమ్మవచ్చు.

పూర్వకాలంలో మనవారు ఈ విజ్ఞానాన్ని జాగ్రత్తగా దాచి మనకందించారు. విదేశీయుల దండయాత్రలు జరిగినప్పుడు ఈ వాఙ్మయాన్ని చాలావరకు నాశనం చేశారు. మిగిలిన దాన్ని వారు తీసుకుపోయారు. ఇక్కడ మన దేశంలో విచిత్రమైన పరిస్థితి ఏర్పడింది. మనవారికి మన సంప్రదాయం మీద, మన వాఙ్మయం మీద ఆసక్తి తగ్గిపోయింది. పాశ్చాత్యులను అనుకరించటం ప్రారంభించారు. ఆత్మాభిమానం అడుగంటి పోయింది. ఆ రోజుల్లో ఆధ్యాత్మిక విలువలు పడిపోయి లౌకిక విలువలకు ప్రాధాన్యత హెచ్చింది. దాంతో మనవారు మన సంప్రదాయం వదిలి పాశ్చాత్యుల వెనుక పరుగులు తీశారు.

ఇప్పటికి కూడా మన సంప్రదాయాన్ని, ఆచార వ్యవహారాలను వదిలిపెట్టి ఇతర సంప్రదాయాలను అనుకరించటం, అవి చాలా గొప్పవని చెప్పటం, మనల్ని మనసంప్రదాయాల్ని చులకన చేసి మాట్లాడటము అనేవి భారతీయులకు మాత్రమే అందులోనూ ప్రత్యేకించి తెలుగు వారికి మాత్రమే ఉన్న అతిగొప్పదైన కళ. ఇంత మహత్తరమైన కళ ప్రపంచంలోని ఏ దేశస్థులకీ కూడా లేదు. 'పొరుగింటి పుల్లకూర' అనే సామెత బహుశః మనల్ని చూసే ఏర్పడిందేమో. మాతృభాషలో మాట్లాడటానికి సిగ్గుపడే జాతి ప్రపంచంలో కెల్లా మన తెలుగుజాతి ఒకటేనేమో? ఒక చిన్నమాట. నేను కాలేజీలో పనిచేసే రోజుల్లో ఒక బ్యాంకు మేనేజరు ఇద్దరు అధికార్లతో సహా మొత్తం ఆరుగురు వచ్చారు కాలేజీకి. బ్యాంకులో ఏదో కొత్త స్కీము ప్రారంభం చేశారు. దాన్ని గురించి మాకు వివరించాలి. మమ్మల్ని అందులో సభ్యులుగా చేర్చాలి. అది వాళ్ళ అభిప్రాయం. అందరూ కూర్చున్న తరువాత మేనేజరు గారు సంబంధిత అధికారితో 'మీరు చెప్పండి' అన్నారు. అధికారి లేచి 'డియర్ ఫ్రెండ్స్' అంటూ ఇంగ్లీషులో మొదలు పెట్టాడు. అక్కడే ఉన్న నేను వెంటనే "ఏమండీ ! మన మందరం తెలుగువాళ్ళం. అందరికీ తెలుగు వచ్చు. మీరు తెలుగులో మాట్లాడవచ్చు కదా!" అన్నాను. అంతే ఆయన నోటికి బ్రేక్ పడిపోయింది. 'మీరంతా చదువుకున్న వాళ్ళు కదా ! అందుకని' అన్నాడు చిన్నగా. ఫరవాలేదు. మాకందరికీ తెలుగువచ్చు చెప్పండి అన్నా. అంతే నోట్లోంచి మాటరాలా. చాలా ఇబ్బందిగా నాలుగు మాటలు చెప్పి వెళ్ళిపోయాడు. ఇతరులను అనుకరించటమనేది మనసరదా. అసలు తెలుగు రానట్లే మాట్లాడితే ఇంకాగొప్ప. ఈ జాడ్యం ఇప్పుడే కాదు ఆ రోజుల్లోను ఉంది. అందుకే

మన సంప్రదాయాలు వదిలేసి పాశ్చాత్యులను అనుకరించటం మొదలుపెట్టారు. దాంతో భారతీయ విజ్ఞానం పూర్తిగా భ్రష్టు పట్టిపోయింది. వైదికవాఙ్మయం నిరాదరణకు గురిఅయింది. సహజంగా కొంత నశించిపోతే, మిగిలిన దాన్ని మన చేతులారా నాశనం చేసుకున్నాం. నిరాదరణకు గురిఅయిన కొన్ని బ్రాహ్మణాలు నశించి పోయినాయి.

# 6. అంతరించిపోయిన బ్రాహ్మణాలు

కేవలం మన నిరాదరణవల్ల కొన్ని బ్రాహ్మణాలు నశించిపోయాయి. అని చెప్పుకున్నాం. ఇవి ఏ వేదానికి సంబంధించినవో తెలుసుకాని అవి ఇప్పుడు దొరకటం లేదు. పూర్తిగా అంతరించి పోయినాయి. అలా అంతరించిపోయిన వాటిలో కొన్నింటిని చూద్దాం.

**ఋగ్వేద బ్రాహ్మణాలు :** ముందుగా ఋగ్వేదానికి సంబంధించిన బ్రాహ్మణాలు చూద్దాం.

**1. పైంగి బ్రాహ్మణం :** ఋగ్వేద శాఖలలో పైంగిశాఖ ఒకటి. ఈ శాఖకు సంబంధించిన బ్రాహ్మణమే పైంగి బ్రాహ్మణము. దీన్నే పైంగ్య బ్రాహ్మణమని, పైంగ్యాయని బ్రాహ్మణమని కూడా అంటారు. ఇది మనకి ఇప్పుడు దొరకటం లేదు. ఈ బ్రాహ్మణాన్ని చాలా సందర్భాలలో పేర్కొన్నారు. ఆపస్తంబ శ్రౌతసూత్రాలు బౌధాయన శ్రౌతసూత్రాలలో ఈ బ్రాహ్మణాన్ని గురించి చెప్పారు. శారీరక మీమాంస భాష్యంలో శంకరాచార్యుల వారు దీన్ని పైంగి రహస్యబ్రాహ్మణమని వ్రాశారు. ఇప్పుడిది పూర్తిగా అంతరించిపోయింది.

**2. గాలవ బ్రాహ్మణం :** ఋగ్వేదానికి ఉన్న శాఖలలో గాలవశాఖ ఒకటి. ఈ శాఖకు సంబంధించినది గాలవ బ్రాహ్మణం. గాలవ్యుడు పాంచాలదేశం వాడు. పతంజలి తన మహాభాష్యంలో గాలవుని ఉదహరించాడు.

**3. అశ్వలాయన బ్రాహ్మణం :** స్మృతితత్త్వము అనే గ్రంథంలో రఘునందునుడు అశ్వలాయన బ్రాహ్మణాన్ని పేర్కొన్నాడు. అయితే ఆధునికులు కొందరు ఐతరేయ బ్రాహ్మణానికే అశ్వలాయన

బ్రాహ్మణమని కూడా పేరున్నది అంటున్నారు.

**4. బాహ్వృచ బ్రాహ్మణం :** 'బాహ్వృచ' అనే పదం ఋగ్వేదానికి పర్యాయ పదంగా వాడబడింది. అది గాక ఋగ్వేదానికి బాహ్వృచశాఖ ఉన్నది. ఆ శాఖకు సంబంధించినది ఈ బ్రాహ్మణం. మీమాంస దర్శనానికి భాష్యం వ్రాసిన శబరస్వామి ఈ బ్రాహ్మణాన్ని ఉటంకించాడు.

**యజుర్వేద బ్రాహ్మణాలు :** యజుర్వేదానికి సంబంధించి 12 వరకు బ్రాహ్మణాలు నశించిపోయాయి.

**1. చరక బ్రాహ్మణం :** కృష్ణయజుర్వేద శాఖల్లో చరక శాఖ ఒకటి. ఈ శాఖకు సంబంధించినదే ఈ బ్రాహ్మణము. సాయణుడు తన ఋగ్వేదభాష్యంలో చరక బ్రాహ్మణాన్ని ఉటంకించాడు. దేవరాజయజ్వ నిఘంటువుకు వ్రాసిన భాష్యంలోను, స్కందస్వామి తన నిరక్తవ్యాఖ్యానంలోను, అనంతభట్టు భాషిక సూత్రంపైన వ్రాసిన వ్యాఖ్యలోను చరక బ్రాహ్మణాన్ని ఉటంకించారు.

**5. శ్వేతాశ్వర బ్రాహ్మణం :** చరకుల అవాంతర శాఖను శ్వేతాశ్వరశాఖ అంటారు. శ్వేతాశ్వరోపనిషత్తు ఈ బ్రాహ్మణంలోని భాగమే. దీన్నే మంత్రోపనిషత్తు అంటారు. యాజ్ఞవల్క్య స్మృతికి 'బాలక్రీడ' అనే పేరుతో వ్యాఖ్యానం వ్రాసిన విశ్వరూపాచార్యులు శ్వేతాశ్వర బ్రాహ్మణాన్ని పేర్కొన్నాడు.

**3. కారక బ్రాహ్మణం :** కారక శాఖ కూడా చరకశాఖల్లో ఒకటి. ఈ శాఖకు సంబంధించినదే కారక బ్రాహ్మణం. అపరార్కుడు వ్రాసిన యాజ్ఞవల్క్యస్మృతి వ్యాఖ్యలోను, వాసిష్ఠ ధర్మసూత్రాలలోను, వైఖానస, ఆపస్తంబ శ్రౌతసూత్రాలలోను కారక బ్రాహ్మణాన్ని పేర్కొన్నారు.

**4. మైత్రాయణి బ్రాహ్మణం :** మైత్రాయణి మహర్షికి ఆరుగురు శిష్యులు. వారు 1. మానవ 2. వారాహ 3. దుందువ 4. చాగలేయ 5. హరిద్రనీయ 6.శ్యామాయనీయులు. వీరందరికి మైత్రాయణీయులు అని పేరు. ఈ శాఖకు సంబంధించిన ఈ బ్రాహ్మణం. బోధాయన, సత్యాషాఢ శ్రౌతసూత్రాల్లో పేర్కొనబడింది.

**2. జాబాల బ్రాహ్మణము :** సత్యకామజాబాలి ఈ వేదశాఖకు ప్రవర్తకుడు. అదే జాబాల శాఖ. ఆ శాఖకు చెందినదే జాబాల బ్రాహ్మణము. విశ్వరూపాచార్యుడు తన 'బాలక్రీడ'లో ఈ బ్రాహ్మణం పేర్కొనబడింది.

**6. ఔఖేయ బ్రాహ్మణం :** ఔఖేయ శాఖకు సంబంధించినది ఈ బ్రాహ్మణం.

**7. ఖాండికేయ బ్రాహ్మణం :** ఖాండికేయుల్లో ఐదు శాఖలున్నాయి. ఖండికుని శిష్యులే ఖాండికేయులు, పాణిని తన అష్టాధ్యాయిలో 'ఖండికుని' ఉటంకించాడు.

**8. హారిద్రవిక బ్రాహ్మణం :** మైత్రాయణీయ శాఖలో హారిద్రవీయ శాఖ ఒకటి. ఈ శాఖకు సంబంధించినదే హారిద్రవిక బ్రాహ్మణం. సాయణుడు తన ఋగ్వేద భాష్యంలోను, యాస్కుడు తన నిరుక్తంలోను ఈ బ్రాహ్మణాన్ని పేర్కొన్నారు.

**12. తుంబురు బ్రాహ్మణం :** మహాభాష్యకారుడైన పతంజలి తుంబురు బ్రాహ్మణాన్ని పేర్కొన్నాడు.

**10. ఆహ్వారక బ్రాహ్మణం :** చరక శాఖల్లో ఒకటి ఆహ్వారక శాఖ. ఆ శాఖకు సంబంధించినది ఈ బ్రాహ్మణం. తన నిరుక్తవ్యాఖ్యానంలో దుర్గాచార్యుడు ఈ బ్రాహ్మణాన్ని పేర్కొన్నాడు.

**9. కంతకి బ్రాహ్మణం :** కంతకి శాఖకు చెందినది కంతకి బ్రాహ్మణం. మహాభాష్యంలో ఇది పేర్కొనబడింది.

**12. ఛాగలేయ బ్రాహ్మణం :** తైత్తిరీయశాఖలో ఒక భాగం భాగలేయ శాఖ. ఛాగలి మహర్షి శిష్యులకే ఛాగలేయులు అని పేరు. ఈ శాఖకు సంబంధించినదే ఈ బ్రాహ్మణం. బౌధాయన సూత్రాలలో ఈ బ్రాహ్మణాన్ని పేర్కొన్నారు.

**సామవేద బ్రాహ్మణాలు :** సామవేదానికి సంబంధించిన బ్రాహ్మణాలు నాలుగు ఇప్పుడు నశించిపోయాయి.

**1. భాల్లవి బ్రాహ్మణం :** లాంగలి మహర్షికి ఆరుగురు శిష్యులు. వారిలో భాల్లవి ఒకడు. భాల్లవికి సంబంధించిన బ్రాహ్మణమే భాల్లవి బ్రాహ్మణం. బృహద్దేవతలో ఈ బ్రాహ్మణం పేర్కొనబడింది. ఆపస్తంబ శ్రౌతసూత్రాలలో కూడా ఈ బ్రాహ్మణం కీర్తించబడింది.

**2. కాలబవిబ్రాహ్మణం :** సామవేదశాఖల్లో కాలబవి శాఖ ఒకటి. ఈ శాఖకు సంబంధించిందే ఈ బ్రాహ్మణం. ఆపస్తంబ శ్రౌత సూత్రాలలో ఈ బ్రాహ్మణం ప్రస్తావించబడింది.

**3. రౌరుకి బ్రాహ్మణం :** గోఖిల గుహ్యసూత్రంలోను, తైత్తిరీయ బ్రాహ్మణ భాష్యంలోను ద్రాహ్యాయణ శ్రౌతసూత్రవ్యాఖ్యలోను ఈ బ్రాహ్మణం పేర్కొనబడింది.

**4. శాట్యాయన బ్రాహ్మణం :** అంతరించిపోయిన బ్రాహ్మణాలలో ఎక్కువ గ్రంథాలలో పేర్కొనబడిన బ్రాహ్మణం ఇది. ఇందులో చాలా మంచివిషయాలున్నాయి అంటారు విమర్శకులు. ఆపస్తంబ శ్రౌతసూత్రంలోను, లాట్యాయన శ్రౌతసూత్ర వ్యాఖ్యానంలోను, శాయనుడు, వెంకటమాధవుడు తమ ఋగ్వేదభాష్యాలలోను ఈ

బ్రాహ్మణాన్ని పేర్కొన్నారు. ఇది సర్వజగ్ర్పసిద్ధమైన బ్రాహ్మణం.

ఈ రకంగా అనేక బ్రాహ్మణాలు పూర్తిగా నశించిపోయాయి. అవేవీ ఇప్పుడు దొరకటం లేదు.

# 7. గుర్తు తెలియని బ్రాహ్మణాలు

ఇప్పటివరకు నశించిపోయిన బ్రాహ్మణాలను గురించి చెప్పుకున్నాం. అవి ఏ వేదానికి సంబంధించినవో తెలుసు. కాని ఇక్కడ ఇంకోరకం బ్రాహ్మణాలున్నాయి. అవి ఏవేదానికి సంబంధించినవో తెలియదు. ఎవరు వ్రాశారో అంతకన్నా తెలియదు. కేవలము వాటి పేర్లు మాత్రమే తెలుసు. అంతకుమించి వాటి వివరాలు ఏవీ తెలియవు. ఇప్పుడు వాటిని కూడా చూద్దాం.

**1. సౌలభ బ్రాహ్మణం :** క్షత్రియుడైప్పటి గొప్ప మహర్షిఅయి జనకునితో అధ్యాత్మిక చర్చలుచేసిన సులభుడు దీన్నివ్రాసి ఉండవచ్చు. సాంఖ్యాయన, అశ్వలాయన గృహ్యసూత్రాలలో ఇది పేర్కొనబడింది. పతంజలి మహాభాష్యంలో కూడా చెప్పబడింది.

**2. అరుణేయ బ్రాహ్మణము :** గౌతమ వంశీయుడు అరుణి. అరుణి కొడుకు ఉద్దాలకుడు. ఇతన్ని ఉద్దాలకారుణి అనేవాళ్ళు. అరుణేయ బ్రాహ్మణాన్ని కుమారిలభట్టు తంత్ర వార్తికంలో పేర్కొన్నాడు.

**3. శైలాలి బ్రాహ్మణం :** ఆపస్తంబ శ్రౌతసూత్రాలలో ఇది పేర్కొనబడింది. దేవణభట్టు తన స్మృతిచంద్రికలో కూడా దీన్ని పేర్కొన్నాడు.

**4. అవ్యాఖ్యాన బ్రాహ్మణం :** 1926లో ఆక్టా ఓరియంటలియాలో డా॥ కాలంద్ ఈ బ్రాహ్మణంనుంచి చాలా భాగాలు ప్రచురించారు.

**5. మాషశరావి బ్రాహ్మణం :** ద్రాహ్యాయణ శ్రౌతసూత్రాలలో ఇది పేర్కొనబడింది.

**6. కాపేయ బ్రాహ్మణం :** ఆంగీరస గోత్రానికి సంబంధించిన

వారంతా కాప్యులు అనబడతారు. సత్యాషాఢ శ్రౌతసూత్రాలలో ఈ బ్రాహ్మణం పేర్కొనబడింది.

**7. పరాశర బ్రాహ్మణం :** కుమారిలభట్టు తన తంత్ర వార్తికంలో దీన్ని పేర్కొన్నాడు.

**8. నిరుక్త బ్రాహ్మణం :** న్యాయపరిశుద్ధిలో వేదాంత దేశికులు నిరుక్తశాఖను చెప్పారు. తైత్తిరీయోపనిషద్భాష్యంలో ఈ బ్రాహ్మణం చెప్పబడింది.

**9. రసామ్నాయ బ్రాహ్మణం :** స్మృతిరత్నాకరంలో ఈ బ్రాహ్మణం పేర్కొనబడింది.

**10, 11. భాష్కలబ్రాహ్మణం, మాండూకేయ బ్రాహ్మణం :** కవీంద్రాచార్య సరస్వతి గ్రంథాలయంలోని వ్రాతప్రతుల పట్టికలోని మొదటి పేజీలో ఈ బ్రాహ్మణాల రెండు పేర్లూ ఉన్నాయి.

**12, 13. త్రిఖర్వ బ్రాహ్మణం, కరద్విష బ్రాహ్మణం :** ఈ రెండింటినీ సాయణుడు తన భాష్యంలో పేర్కొన్నాడు. అంతేకాక ఇవి ఆపస్తంబ శ్రౌతసూత్రాలలోను, బౌధాయన శ్రౌతసూత్రాలలోను కూడా పేర్కొనబడ్డాయి.

ఈ బ్రాహ్మణాలన్నీ ఏ వేదానికి సంబంధించినవో తెలియదు. ఇవి కాక ఇంకా మనకు తెలియని బ్రాహ్మణాలు అనేకం ఉండవచ్చును.

# 8. ఋషులు

ఋషి అంటే మహాజ్ఞాని. తనయొక్క తపశ్శక్తితో, జ్ఞానంతో సంసార సాగరాన్ని దాటినవాడు. మనదేశం ఆధ్యాత్మికానికి పెట్టింది పేరు. ఈ దేశంలో ఋషీశ్వరులు చాలామంది ఉన్నారు. పూర్వకాలంలో హిమాలయ పర్వతప్రాంతంలో అందరూ ఋషులే. ఏకాంతంగా తపస్సు చేసుకోవాలి అనుకున్న ప్రతివారు హిమాలయాలకి వెళ్ళి అక్కడ తపస్సు చేసుకునేవారు. అక్కడే వారి జీవితం కూడా గడిపేవారు. సామాన్యంగా ఈ రకమైన ఋషులకు సంసారము ఉండదు. వీరిలో ఇంకో రకం వారున్నారు. వారు వివాహం చేసుకుని భార్య పిల్లలతో కలిసి ఆశ్రమ జీవనం సాగించే వారు. వశిష్ఠుడు మొదలైన వారు ఇందుకు చక్కని ఉదాహరణ.

ప్రస్తుత కాలంలో మనం చూస్తూ ఉన్నాం. కొంతమంది అనుకోకుండా అవకాశం కలిసొచ్చి గురువులై పోతున్నారు. వీరు కూడా హిమాలయాల్లో పన్నెండు సంవత్సరాలు తపస్సు చేసి ఇక్కడికి వచ్చాము అని చెబుతుంటారు. వీరిలో కొంతమందికి సంసారం అంతా ఉంటుంది. ఎక్కడికి వచ్చినా భార్యా సమేతంగానే వస్తారు. మాది 'ఋషి సంప్రదాయం' అని చెబుతుంటారు. ఇంకొక పెద్ద పీఠానికి అధిపతి ఒక పెద్దాయన ఉన్నాడు. ఆయనైతే సన్యాసం స్వీకరించాడు.కాని ఇంట్లోనే ఉంటాడు. ప్రతిరోజూ భార్యే రుచికరంగా వండిపెడుతుంది. ఇది తప్పా? అనచ్చు. తప్పే. ఎవరు చేయవలసిన పనులు వాళ్ళు చెయ్యాలి. గతంలో ఏ స్వామి ఇలా చెయ్యలేదు. ఇది సంప్రదాయం కాదు. కాని ఇలా చేసినా ఫరవాలేదు అని తప్పుడు సంకేతం పంపకూడదు. నువు చేశానని నిన్ను చూసి ఇంకొకడు చేస్తాడు. ధర్మం ఆచారం తగలబడిపోతాయి. ఆ రోజున

ఋషీశ్వరులంటే ఇలా ఉండేవారు కాదు. నిరంతరము సత్యాన్వేషణలోనే కాలం గడిపేవారు. వీరిలో మంత్రస్రష్టలు మంత్ర ద్రష్టలు ఉన్నారు. సమాధిస్థితిలో ఉండి వేదమంత్రాలను దర్శించారు. ఇటువంటి ఋషులు సర్వశ్రేష్టులు అని చెబుతోంది వేదం. వీరికి దేవతలను ఉద్ధరించే శక్తి కూడా ఉండేది.

ఋషులలో ప్రశస్తమైన వారిని సప్తఋషులు అంటారు. వీరు మొత్తం ఏడుగురు. మన్వంతరాన్ని బట్టి వీళ్ళు మారిపోతూ ఉంటారు. కుత్స, అత్రి, రేభ, అగస్త్య, కుశికగణ, వసిష్ఠ, వ్యశ్య వీరు ఏడుగురు ఋక్సంహితలో చెప్పిన సప్తఋషులు. గౌతమ, భరద్వాజ, విశ్వామిత్ర, జమదగ్ని, వశిష్ఠ, కశ్యప, అత్రి. వీరు బృహదారణ్యకంలో చెప్పబడ్డారు. అంగీరస, గవిష్ఠర, కక్షీవంత, కణ్వ, మేధాతిథి, త్రిశోక, కావ్యముద్గల వీరు అధర్వ వేదంలో చెప్పబడ్డారు. ప్రతి మన్వంతరము లోను ఈ ఋషులు మారిపోతుంటారు.

**1. దక్షసావర్ణి మన్వంతరంలో**

1. మేధాతిథి
2. వసువు
3. సత్యుడు
4. జ్యోతిష్మంతుడు
5. ద్యుతిమంతుడు
6. సవనుడు
7. హవ్యవాహనుడు

**2. రుద్రసావర్ణి మన్వంతరంలో**

1. ద్యుతి
2. తపస్వి
3. సుతవుడు
5. తపోధనుడు
6. తపోనిధి
7. తపోధృతి

4. తపోమూర్తి

**3. స్వాయంభువ మన్వంతరంలో**

1. మరీచి
2. అత్రి
3. అంగీరసుడు
4. పులస్త్యుడు
5. పులహుడు
6. క్రతువు
7. వశిష్ఠుడు

**4. సారోచిషమన్వంతరంలో**

1. ఔర్ద్దుడు
2. వసిష్ఠ పుత్రుడు
3. స్తంబుడు
4. కశ్యపుడు
5. పాణుడు
6. బృహస్పతి
7. దత్తుడు

**5. తామస మన్వంతరము**

1. పృథుడు
2. కావ్యుడు
3. అగ్ని
4. జహ్నుడు
5. ధాత
6. కసీవంసుడు
7. అకసీవంసుడు

**6. రైవత మన్వంతరంలో**

1. యదుధ్రుడు
2. వేదశిరుడు
3. హిరణ్యరోముడు
4. పర్జన్యుడు
5. ఊర్ధ్వబాహుడు
6. సత్యనేత్రుడు
7. దేవబాహుడు

**7. చాక్షుష మన్వంతరంలో**

1. భృగుడు
2. నభుడు
3. వివస్వంతుడు
4. సుదాముడు
5. విరజుడు
6. అతినాముడు
7. సహిష్ణుడు

**8. వైవస్వత మన్వంతరంలో**

1. వశిష్ఠుడు
2. అత్రి
3. గౌతముడు
4. కశ్యపుడు
5. భరద్వాజుడు
6. జమదగ్ని
7. విశ్వామిత్రుడు

**9. అశ్వత్థామ మన్వంతరంలో**

1. రామ
2. వ్యాస
3. ఆత్రేయ
4. దీప్తిమంత
5. బహుశ్రుత
6. భరద్వాజ
7. ద్రౌణి

**10. సూర్యసావర్ణి మన్వంతరంలో**

1. గౌతమ
2. అజర
3. శరద్వంత
4. కౌశిక
5. కాశ్యప
6. ఔర్వ్య
7. అత్రి

ఋగ్వేదం తరువాత కాలంలో సప్తఋషులకు నక్షత్ర మండలానికి సంబంధం ఏర్పడింది. సాయణుడు నక్షత్రవాచక 'ఋక్ష' శబ్దాన్ని సప్తఋషులు అని వివరించాడు. వీరిలో కొందరు ఋషులు మనకి

బ్రాహ్మణాలలో దర్శనమిస్తారు. వాళ్ళని ఒక్కసారి చూద్దాం. ఋషులలో కొంతమంది గోత్రఋషులుంటారు. మన గోత్రాలలో వారిపేర్లు చెబుతారన్న మాట. గౌతమస గోత్రం, కాశ్యపస గోత్రం, ఆత్రేయస గోత్రం మొ॥వి

**4. అగస్త్యుడు :** ఒకసారి మిత్రావరుణులు వస్తూ త్రోవలో ఊర్వశిని చూసి మోహించి స్ఖలనము పొందారు. ఊర్వశి వారి వీర్యము ఒక కుండలో భద్రపరచింది. దానిలో నుంచి అగస్త్యుడు, వశిష్ఠుడు జన్మించారు. ఇతడు చాలా గొప్పవాడు. కాలకేయుల సంహారం కోసం సముద్రజలాన్ని త్రాగేశాడు. వాతాపిని సంహరించాడు. వింధ్య పర్వతానికి గర్వభంగం చేశాడు.

ఈయన ఒకసారి మరుద్దేవతల నుద్దేశించి వృషభాలను ప్రోక్షించి పూజించాడు. ఇంద్రుడు ఆ పశువులను అపహరించాడు. మరుద్దేవతలు ఇంద్రుడి మీదకి దండయాత్రకి వచ్చారు. ఆ సమయంలో అగస్త్యుని సాయంతో ఇంద్రుడు సామవేద మంత్రాలు చదివి వారిని శాంతింపచేశాడు. ఇంద్రుడు  ఇతడికి మొదటగా బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశించాడు. ఈ విషయం కౌషీతకీ బ్రాహ్మణంలోను, తైత్తిరీయ బ్రాహ్మణంలోను ఉంది.

**7. కణ్వుడు :** కాశ్యప గోత్రీకుడు, ఒక మహర్షి. ఇతని వంశీయులు కణ్వులు. అత్రి, కణ్వ వంశాలకు సంబంధం ఉన్నదని పంచవింశద్బ్రాహ్మణము, కౌషీతకీ బ్రాహ్మణము చెబుతున్నాయి.

**1. గౌతముడు :** ఈయన గోత్రఋషి. ఈ గోత్రీకులకు అంగీరసులకు మంచి సంబంధాలున్నాయి. ఈయన జనక మహారాజుకు సమకాలీనుడు. ఒకసారి విదేహరాజు మాధవుడు వైశ్వానరాగ్నిని తన నోటిలో ధరించాడు. ఆ రాజుకు పురోహితుడు

గౌతముడు. గౌతముడు రాజును పిలిచాడు. నోటిలోని అగ్ని క్రింద పడిపోతుందనే భయంతో రాజు పలక లేదు. పోనీ అగ్ని పలుకుతుంది అని ఋగ్వేద మంత్రాలతో అగ్నిని స్తోత్రం చేస్తూ రాజును పిలిచాడు. రాజుగాని, అగ్నిగాని ఎవరూ పలకలా ? ఇప్పుడు తైత్తిరీయ సంహిత మంత్రంతో స్తోత్రం చేస్తూ చాలా కోపంగా పిలిచాడు రాజుని. అయినా రాజు పలకలేదు. అప్పుడు అగ్నిని ఉద్దేశించి ఋక్దేవతా మంత్రంతో పిలిచాడు. మంత్రంలో ఘృతం అనే శబ్దం రాగానే అగ్ని ఊర్ధ్వముఖంగా ప్రజ్వరిల్లింది. దాంతో రాజు భరించలేక అగ్నిని కాస్తా నేలమీద పడేశాడు. రాజు తాపాన్ని తగ్గించుకోవటానికి సరస్వతీ నదిలో స్నానం చేశాడు. అగ్ని తూర్పుగా ప్రజ్వరిల్లుతూ అంతటా వ్యాపించింది. రాజు ఋషి. ఇద్దరు మండుతున్న అగ్ని వెనక వెళ్ళారు. అది భూమిమీద నదులన్నింటినీ ఎండింప చేసింది. అని శతపథ బ్రాహ్మణం చెబుతోంది.

**5. కశ్యపుడు :** బ్రహ్మమానసపుత్రుడు కశ్యపుడు. ఇతడు ప్రజాపతి. దక్ష ప్రజాపతి కుమార్తెలను వివాహం చేసుకున్నాడు దేవతలు, రాక్షసులు, మానవులు అంతా ఇతని సంతానమే. విశ్వకర్మ ఒకసారి సర్వమేధము అనే యాగం చేశాడు. యాగం చివరలో కశ్యపుడికి భూదానం ఇవ్వాలి అనుకున్నాడు విశ్వకర్మ. కాని భూదేవి అందుకు ఒప్పుకోలేదు. అగ్ని తరువాత ఇంద్రుడి దగ్గర నుంచి 'సోమగుహ్యా జ్ఞానము' పొందిన మొట్టమొదటి మానవుడు. ఈ కశ్యపుడు.

**6. అత్రి :** ఈయన గోత్ర ఋషి. పరివార రూపంగా ప్రియమేధులు కణ్వులు, గౌతమ, కక్షీవంత గణాలతో అత్రిగణం కూడా వచ్చింది. అత్రిజమదగ్ని గోత్రములు క్రిమిసంహారకాలని ఛాందోగ్య బ్రాహ్మణము చెబుతోంది.

**3. యాజ్ఞవల్క్యుడు :** జనక మహారాజు గురువుగారు. శతపథ బ్రాహ్మణాన్ని వ్రాశాడు. ఇతనికి ఇద్దరు భార్యలు. 1. కాత్యాయని 2. మైత్రేయి. కాత్యాయనిని 'ఇతర' అనిపించేవాడు. ఆ ఇతర కుమారుడే ఐతరేయ బ్రాహ్మణాన్ని వ్రాసింది ఇతడు వైశంపాయనుడి శిష్యుడు. ఒకసారి జనక మహారాజు ఒక యాగం చేసి అందులో భాగంగా వెయ్యి ఆవులకు అలంకారాలు చేసి "ఆధ్యాత్మిక ప్రపంచంలో రారాజు ఎవరో వారు ఈ గోవులను తోలుకు వెళ్ళవచ్చు" అన్నాడు. అప్పుడు యాజ్ఞవల్క్యుడు సభలోని పండితులందరినీ ఓడించి ఆవులు తోలుకుపోయాడు. ఈయనకు ఇద్దరు భార్యలు. 1. కాత్యాయని 2. మైత్రేయి. జీవితం ఆఖరు సమయంలో తన ఆస్థినంతా పెద్ద భార్య కాత్యాయనికి వప్పగించి రెండవ భార్యకు ఆమె కోరిక మేరకు బ్రహ్మజ్ఞానం ఉపదేశించాడు.

**2. భృగువు :** బ్రహ్మమానసపుత్రుడు భృగువు. ఇతన్ని గురించి రకరకాల విషయాలు ప్రచారంలో ఉన్నాయి. హిరణ్యకశ్యపుని కుమార్తె దితి ఇతని పెద్ద భార్య. కర్దముని కుమార్తె ఖ్యాతిని వివాహం చేసుకున్నాడు. ఆమెవల్ల ధాత, విధాత అనే కుమారులు కలిగారు. ఒకసారి దేవతలు రాక్షసులను తరిమివేశారు. అప్పుడు రాక్షసులు భృగుపత్నిని శరణు వేడారు. విష్ణుమూర్తి చక్రాయుధం ప్రయోగించి భృగుపత్నిని చంపేశాడు. దాంతో భృగువు 'నువు మానవుడవై జన్మించి భార్యావియోగ దుఃఖాన్ని పొందుతావు అని శపించాడు. ఆ శాపం వల్లనే విష్ణుమూర్తి రామావతారం ఎత్తవలసి వచ్చింది.

కాని శతపథ బ్రాహ్మణంలో భృగువు వరుణ పుత్రుడు అని చెప్పబడింది. తైత్తిరీయ బ్రాహ్మణంలో భృగుగణం ద్రుహ్యుల

పురోహితులుగా ఉన్నారు. వీరికి ఆంగీరసులతో సంబంధం ఉంది. చ్యవనుడికే భార్గవుడు లేదా అంగీరసుడు అని పేరు. వీరిపై ఆక్రమణ ఫలితంగా సృంజయ వైతహవ్యులు సర్వనాశనం పొందారు. అని ఐతరేయ, జైమినీ బ్రాహ్మణాలు చెబుతున్నాయి.

**8. భరద్వాజుడు :** ఇతడు కూడా గోత్ర ఋషి. రామాయణంలో భరతుడికి గొప్ప విందు ఇచ్చాడు. విమానాల తయారీ మీద పుస్తకం వ్రాశాడు. దివోదాసు పురోహితుడు. పంచవిశద్బ్రాహ్మణంలో ఇతడు మంత్రద్రష్టగా, పేర్కొనబడినవాడు. ఐతరేయ బ్రాహ్మణంలో ఇతను చెప్పబడ్డాడు.

వీరు కాక బ్రాహ్మణాలలో ఇంకొంతమంది ఋషులు చెప్పబడ్డారు.

**1. కౌషీతకీ బ్రాహ్మణం :** దీనిలో చైత్రగార్గాయణి తన యజ్ఞం పూర్తి చెయ్యటానికి ఉద్దాలకుణ్ణి పురోహితుడుగా పెట్టుకున్నాడు. కేశిదార్భ్యుడు ఈ బ్రాహ్మణంలో చెప్పబడ్డాడు.

**2. శతపథ బ్రాహ్మణం :** దీనిలో శుచిపుత్రుడయిన శౌచేయి, ప్రాచీన యోగ్యుడు, ఉద్దాలకుని వద్ద బ్రహ్మతత్త్వాన్ని ప్రతిపాదించే అగ్నిహోత్రాన్ని తెలుసుకోవాలని అడిగారు.

**3. షడ్వింశ బ్రాహ్మణము :** మౌద్గల్యుని గురువు గ్లావమైత్రేయుడు, కుసురబిందు వనే ఉద్దాలక పుత్రుడు, ఇందులో చెప్పబడ్డారు.

**4. తాండ్యబ్రాహ్మణము :** ఇందులో కుసురబిందువు బహుభావ ఫలాన్నిచ్చే దశరాత్రయుగం చేసి భాగ్యం పొందాడు.

**5. పంచవింశ బ్రాహ్మణము :** భరతుల పురోహితులు వశిష్ఠ గణం.

ఇందులో విశ్వామిత్రుడు ఋషిత్వం సాధించటం పేర్కొనబడింది.

**6. జైమినీ యోపనిషద్ బ్రాహ్మణము :** సత్యకాముని సమకాలికుడు చిత్తశైలుడు జనకుని ఆస్థానాన్ని సంపాదించాడు.

**7. గోపథ బ్రాహ్మణము :** మౌద్గల్యుడు తత్త్వజ్ఞానం కోసం మైత్రేయుణ్ణి ఆశ్రయించాడు.

ఇలా బ్రాహ్మణాలలో అనేకమంది ఋషులు కనిపిస్తారు.

# 9. తత్త్వజ్ఞానసంపన్నుడు - జనకుడు

బ్రాహ్మణము అంటే యాగప్రక్రియను వివరించేది అని గతంలో మనం చెప్పుకున్నాం. ఈ బ్రాహ్మణాలులలో చాలామంది రాజులు, రాజర్షుల గురించి చెప్పబడింది. వీరు కూడా గొప్ప తత్త్వవేత్తలు. ఋషులతో పాటుగా చర్చలు జరిపేవారు. తత్త్వనిర్ణయం చేసేవారు. రాజ్యపాలనలోనే కాకుండా బ్రహ్మ విద్యానుభవంలో కూడా యాగవిధానంలో ఆరితేరినవారు.

ఆ రోజులలో ఉన్న మహారాజులలో గొప్ప తత్త్వవేత్త అని చెప్పదగిన వాడు జనకుడు. ఇతడు శ్రీరామచంద్రుని మామగారు సీతాదేవి తండ్రి. ఈయన ఎప్పుడూ ఏదో ఒక యజ్ఞం చేస్తూనే ఉండేవాడు. ఆయన సభలో ఆధ్యాత్మిక చర్చలు జరుగుతూనే ఉండేవి. శతపథ బ్రాహ్మణంలో ఒక చిన్నకథ ఉంది.

ఒకసారి జనకుడు సభను ఏర్పాటు చేశాడు. ఆధ్యాత్మిక చర్యలతో సభ రసవత్తరంగా సాగుతోంది. ఉన్నట్లుండి రాజుగారి ఒక చిన్న అనుమానం వచ్చింది. 'అగ్నిహోత్రం చేసే విధానం ఏమిటి?' ఇదే ప్రశ్నను సభలో అందరినీ ఉద్దేశించి ఈ ప్రశ్నవేశాడు. ఆ రోజున ఆస్థానంలో హేమాహేమీలు అంతా ఉన్నారు. ఉద్దాలకుని కుమారుని శ్వేతకేతువు, సోమశుష్మడు, యాజ్ఞవల్క్యుడు కూడా అక్కడే ఉన్నారు. మహారాజుగారు అడిగిన ప్రశ్నకు సమాధానం ఎవరికి తోచిన విధంగా వారు చెప్పారు. జనకుడుకి తృప్తికలగాలా? అయితే అందరికన్నా బాగా సమాధానం చెప్పిన యాజ్ఞవల్క్యుడికి రాజుగారు వందగోవుల బహుమానంగా ఇచ్చాడు. అలా ఇచ్చి "నిజానికి అగ్నియొక్క తత్త్వం

యాజ్ఞవల్క్యుడికి కూడా బోధ పడలేదు” అని సభ చాలించారు.

ఆ మాటలు విన్న సోమశుష్మడు, శ్వేతకేతువు ఇద్దరికీ చాలా కోసం వచ్చింది. వారు “ఈ రాజుగారు తనకు పరిపూర్ణమైన జ్ఞానం ఉన్నదని భావించి మనల్నందరినీ అవమానించాడు. దీనికి తగిన ప్రతీకారం తీర్చుకోవాలి. మన ఆధిక్యతను చాటాలి. బ్రహ్మవిద్య మీద అతనితో చర్చజరిపి అందులో ఓడించి ప్రతీకారం తీసుకుందాం అనుకున్నారు.

ఆ మాటలు విన్న యజ్ఞవల్క్యుడు వారితో “మిత్రులారా ! ఆయనతో వాదించి గెలవటం చాలా కష్టం. వాదనలో గెలిచినా మనకే అవమానం. రాజుగారిపైన గెలిచామంటారు. మనం వాదనలో ఓడిపోయాం అనుకోండి క్షత్రియుడి చేతిలో ఓడిపాయారు అంటారు. కాబట్టి ఈ ప్రయత్నం మానుకోండి. అని ఆ ప్రయత్నాన్ని వాళ్ళతో వివరింపచేసి అగ్నిహోత్రం యొక్క నిజమైన విధానం ఆయననే అడిగి తెలుసుకుంటాను అనుకుని, ఒంటరిగా జనకుడిని కలిసి విషయం తెలుసుకున్నాడు.

ఈ కథను బట్టి జనకుని దగ్గర అగ్నితత్త్వాన్ని తెలుసుకున్నాడు. యాజ్ఞవల్క్యుడు. ఈ విషయం శతపథ బ్రాహ్మణంలో ఉంది.

# 10. సత్యకామజాబాలి

పూర్వకాలంలో సత్యకామజాబాలి అని ఒక విద్యార్థి ఉండేవాడు. అతడు లౌకికమైనవవిద్య అంతా పూర్తిచేసి బ్రహ్మవిద్యను తెలుసుకోవాలి అనే కోరికతో గౌతముడి దగ్గరకు వచ్చాడు. గురువుగారికి నమస్కారం చేశాడు. బ్రహ్మవిద్యకోసం వచ్చాను అని చెప్పాడు. అప్పుడు గౌతముడు నీ పేరేమిటి? అన్నాడు.

నా పేరు సత్యకాముడు. నా తల్లిపేరు జాబాలి. మొత్తంమీద నన్ను సత్యకామ జాబాలి అంటారు అన్నాడు.

నీ తండ్రి ఎవరు? అన్నాడు గౌతముడు?

ఒక్క క్షణం ఆలోచించి నాకు తెలియదు. ఇంటికి వెళ్ళి మా అమ్మని అడిగి వస్తాను. అని వెళ్ళిపోయాడు సత్యకాముడు. ఇంటికివచ్చి తనతల్లితో అమ్మా, గురువుగారు నా తండ్రి ఎవరు? అని అడిగారు. కాబట్టి నా తండ్రి ఎవరో చెప్పవలసింది అన్నాడు. దానికి అతని తల్లి.

నాయినా ! నేను వయసులో ఉన్నప్పుడు అనేకఇళ్ళలో దాసీగాపనిచేశాను. ఇంతకన్న ఏమీచెప్పలేను. అంటుంది. అదే మాట గురువుగారికి చెప్పాడు సత్యకాముడు. ఆయన చాలా సంతోషించి నువ్వు సత్యాన్నే చెప్పావు. కాబట్టి నీ తండ్రి తప్పనిసరిగా బ్రాహ్మణుడే అయిఉంటాడు అని నిర్ణయం చేసి అతన్ని విద్యార్థిగా అంగీకరించాడు.

సత్యకాముడు గురువుకు సేవచేస్తూ ఆశ్రమంలోనే ఉండిపోయాడు. రోజులు, వారాలు, నెలలు, సంవత్సరాలు గడిచినాయి. తనతోపాటుగా వచ్చిన వారంతా సమావర్తనం పూర్తి చేసుకుని ఇళ్ళకు వెళ్ళిపోతున్నారు. సత్యకాముడికి మాత్రం ఏమీ

చెప్పలా గురువుగారు. ప్రతిరోజూ ఆశ్రమంలో పనులన్నీ చేస్తున్నాడు. తింటున్నాడు నిద్రపోతున్నాడు, అంతే. ఒక రోజున ఈ విషయం గురించే ఆలోచిస్తున్నాడు సత్యకాముడు. నేనెంత తప్పు చేశాను? ఏం పాపం చేశాను? నాకెందుకీ శిక్ష? గురువుగారు నాకు ఎందుకుగాను బ్రహ్మవిద్యను చెప్పటంలేదు? అని ఆలోచిస్తున్నాడు. ఇంతలో గురువుగారు సత్యకాముణ్ణి పిలిచి సత్యకామా! మన ఆశ్రమంలో వట్టిపోయిన ఆవులు నాలుగువందలుదాకా ఉన్నాయి. అవన్నీ బాగా చిక్కిపోయి ఉన్నాయి. వాటిని అడవికి తోలుకుపోయి, వాటిసంఖ్య రెట్టింపు అయ్యేక తిరిగిరా అన్నాడు. సత్యకాముడు ఆవుల్ని తోలుకుని అడవికి బయలుదేరాడు. చాలా రోజులు సంవత్సరాలు గడిచినాయి. అడవిలో గడ్డితిని ఆవులు బాగా బలిశాయి. కొన్ని ఆవులు సూడివైనాయి. కొన్ని ఈనినాయి. దూడలు పెరుగుతున్నాయి.

ఒకరోజున సత్యకాముడు సాయంసమయంలో ఒకచెట్టు క్రింద కూర్చుని ఆలోచిస్తున్నాడు. ఎప్పటికి ఈ ఆవులు పిల్లల్నిపెడతాయి? వాటి సంఖ్య రెట్టింపు ఎప్పుడవుతుంది? నేను ఆశ్రమానికి ఎప్పుడువెడతాను. గురువుగారు నాకు బ్రహ్మవిద్యను ఎప్పుడు చెబుతారు? ఇలా ఆలోచిస్తున్నాడు. ఆ సమయంలో ఆవుల మందలోంచి ఒక ముసలిఆబోతువచ్చి సత్యకాముడి ఎదురుగా నుంచుని, సత్యకామా! ఈ ఆవులు సంఖ్య రెట్టింపయింది. ఇక నీవు చింతించవలసిన పని లేదు. నీకు బ్రహ్మవిద్య కావాలి. అంతేకదా. నేను చెబుతాను విను. పరబ్రహ్మ స్వరూపం నాలుగు పాదాలుగా ఉంటుంది. అందులో ఒక పాదం ఇప్పుడు నేను చెబుతాను. చరాచర జగత్తులో నాలుగుదిక్కులు పరబ్రహ్మస్వరూపమే. రెండవ పాదాన్ని అగ్నిదేవుడు చెబుతాడు. ఆశ్రమానికి తిరుగు ప్రయాణంకా అన్నది.

ఆశ్చర్యపోయాడు సత్యకాముడు. ఆబోతు మాట్లాడటం ఏమిటి? అందులోను బ్రహ్మవిద్యను గురించి చెప్పటం ఏమిటి? అంతా ఆశ్చర్యంగా ఉంది అనుకున్నాడు. అటువైపుగా చూశాడు. ఇందాక తనతో మాట్లాడిన ఆబోతు ఇప్పుడు హాయిగా పడుకుని నెమరువేస్తోంది. ఆ రాత్రి నిద్ర పట్టలేదు సత్యకాముడికి.

మరునాడు ఉదయాన్నే లేచి ఆశ్రమానికి ప్రయాణం అయ్యాడు. సాయంత్రం దాకా నడిచి చీకటి పడే వేళకు ఒక సరస్సు దగ్గర ఆగాడు. ఆవులు నీరు తాగి హాయిగా విశ్రాంతిగా పడుకున్నాయి. తాను కూడా కాలు చేతులు కడుక్కుని, నీరు త్రాగి చెట్టు క్రిందకి చేరి నిప్పువెలిగించి దానిదగ్గర కూర్చుని సంధ్యావందనం చేసుకుంటున్నాడు. ఆ సమయంలో అగ్నిదేవుడు అతడికి ప్రత్యక్షమై, సత్యకామా! పరబ్రహ్మ స్వరూపంలో రెండవ పాదాన్ని చెబుతాను విను. ఈ జగత్తులో అడవులు కొండలు, ఎడారులు, నదులు, సముద్రాలు అన్నీ పరబ్రహ్మస్వరూపమే. ఇక మూడవ పాదాన్ని ఒక నీటిపక్షి చెబుతుంది అని అంతర్ధానం అయిపోయాడు. ఆ రాత్రి గడిచింది. మర్నాడు మళ్ళీ బయలుదేరాడు సత్యకాముడు. మళ్ళీసాయంత్రం ఒక నీటిమడుగు దగ్గర ఆగాడు. ఆ సమయంలో ఒక నీటిపక్షి వచ్చి సత్యకాముడి దగ్గర వాలి సత్యకామా! పరబ్రహ్మ స్వరూపంలో మూడవ పాదం నీకు చెబుతున్నాను. భూమి, ఆకాశం, నక్షత్రాలు, గ్రహాలు, సూర్యుడు, చంద్రుడు అన్నీ పరబ్రహ్మ స్వరూపమే. నాల్గవ పాదాన్ని ఒకహంస చెబుతుంది. అని ఎగిరిపోయింది. ఆ మరునాడు సత్యకాముడి దగ్గరకు ఒకహంస వచ్చి వాలి సత్యకామా! పరబ్రహ్మ స్వరూపంలో నాల్గవపాదం చెబుతాను. ప్రాణంబ్రహ్మ, దృష్టిబ్రహ్మ, శ్రోత్రం బ్రహ్మ, ఇప్పుడు నీకు పరబ్రహ్మ స్వరూపం అంతా తెలిసింది

అని ఎగిరిపోయింది. తరువాత ఆశ్రమం చేరిన సత్యకాముడికి ఎదురువెళ్ళాడు గౌతముడు. అతడి ముఖం చూసి ఏం జరిగింది అని అడిగాడు. జరిగిందంతా తెలుసుకుని చాలా ఆనందించి బ్రహ్మవిద్యను పూర్తిగా ఉపదేశించాడు.

ఈ రకంగా సత్యకామజాబాలి తన గురువుగారి దగ్గర బ్రహ్మవిద్యను అభ్యసించాడు. అటువంటి సత్యకాముడి శిష్యరికం చేశాడు జనక మహారాజు అని చెబుతోంది శతపథ బ్రాహ్మణం.

# 11. ముగ్గురు మిత్రులు

శలావతుని కుమారుడు శిలకుడు, చికితాయనుని కుమారుడు దాల్భ్యుడు జీవలుని కుమారుడు ప్రవాహణుడు. ఇందులో ప్రవాహణుడు క్షత్రియుడు. మిగిలిన ఇద్దరు బ్రాహ్మణులు వీరు ముగ్గురూ మంచి మిత్రులు. ఉద్గీథ విజ్ఞానంలో (సామగానంలో) మంచి నేర్పరులు. ఒకరోజున వారు ఉద్గీథ మీద చర్చిద్దామనుకున్నారు. ముందుగా ప్రవాహణుడు "మీరు బ్రాహ్మణులు. పూజనీయులు. అందుచేత మీ ఇద్దరూ చర్చించండి. నేను వింటాను" అన్నాడు. చర్చ ప్రారంభమైంది. ముందుగా శిలకుడు ప్రశ్నిస్తున్నాడు.

ఉద్గీథ రూపంలో ఉన్న సామానికి ఆశ్రయం ఏది ?

స్వరమే సామానికి ఆశ్రయము.

స్వరానికి ఆధారం ఏది ?

స్వరానికి ప్రాణమే ఆధారం. ప్రాణంవల్లనే స్వరం పుడుతోంది.

ప్రాణానికి ఆధారం ఏది ?

అన్నము.

అన్నానికి ఆధారం ఏది ?

జలము

జలానికి ఆధారం ఏది ?

(ఆ లోకము) స్వర్గలోకము. అక్కడి నుంచే వర్షం వస్తుంది.

ఆ లోకానికి ఆధారం ఏది ?

దానికి దాల్భ్యుడు "మనం స్వర్గాన్ని మించి మాట్లాడరాదు.

సామమే స్వర్గమని చెప్పబడింది. మనం కూడా సామాన్ని గురించే చర్చిద్దామనుకున్నాము" అన్నాడు. అప్పుడు శిలకుడు "నువ్వు చెప్పినట్లుగానే సామము అత్యంత శ్రేష్ఠమైనది. సామానికి ఆధారం లేదు. అటువంటప్పుడు సామానికి ఆధారం ఉందని ఎవరైనా అంటే వాడితల వెంటనే తెగిపడుతుంది" అన్నాడు. ఇప్పుడు దాల్భ్యుడు అడుగుతున్నాడు.

(ఆ లోకానికి) స్వర్గలోకానికి ఆధారమేది?

ఈ లోకము. ఇక్కడే యజ్ఞయాగాది కర్మలవల్లనే స్వర్గం పోషించబడుతోంది.

మరి ఈ లోకానికి ఆధారమేది?

సమస్త ప్రాణులు ఈ లోకానికి ఆధారం. ప్రత్యక్షంగా కనిపించే ఈ లోకాన్ని సామం అతిక్రమించకూడదు. సామాన్ని ఈ లోకంలోనే ప్రతిష్ఠిస్తున్నాము అన్నాడు దాల్భ్యుడు. ఇప్పుడు శిలకుడు అడుగుతున్నాడు.

ఈ లోకానికి ఆశ్రయం ఏది ?

ప్రవాహణుడు సమాధానం చెబుతున్నాడు.

స్వరాభిన్నమైన ఆకాశమే ఈ లోకానికి ఆశ్రయం. ఆకాశం అంతటా ఆవరించి ఉన్నది. అంటే అదే పరబ్రహ్మ అని గుర్తించాలి. సమస్తలోకాలు జీవకోటిఅంతా కూడా ఆకాశరూపమైన పరబ్రహ్మ నుంచే ఆవిర్భవించి, మళ్ళీ అందులోనే లీనమవుతున్నది. కాబట్టి ఈ లోకానికి ఆకాశమే ఆధారం. అటువంటి ఈ ఉద్గీతమే (ఆకాశమే) అన్నింటిలోకి శ్రేష్టమైనది. కాబట్టి ఉద్గీథాన్ని అనంతమైనదిగా, పరమాత్మ స్వరూపంగా భావించి ఉపాసించేవాడు బ్రహ్మాకాశ పర్యంతము ఉన్న

లోకాలన్నింటినీ జయిస్తాడు. ఉద్గీథను గురించి బాగా తెలుసుకున్నవాడు ఇతరుల కన్న ఉన్నతమైన జీవితం సాగిస్తాడు. చివరకు ఉత్తమ లోకాలు పొందుతాడు" అని చర్చను ముగించాడు ప్రవాహణుడు. ఈ రకంగా క్షత్రియులకు కూడా బ్రహ్మవిద్యలో బాగా ప్రవేశం ఉండేది.

# 12. ప్రవాహణుడు - శ్వేతకేతువు

పాంచాల దేశరాజు ప్రవాహణుడు, ఉద్దాలకుని కుమారుడు శ్వేతకేతువు. వీరిద్దరూ సమకాలికులు అని చెబుతోంది శతపద బ్రాహ్మణం. మనుస్మృతి వ్యాఖ్యాత మేధాతిథి ఒక వాక్యం వ్రాశాడు. అది ఏమంటే **"శ్వేతకేతువుకు పాంచాల దేశంలో ఒక క్షత్రియుడు స్నేహితుడు ఉండేవాడు"** అని ఈ రెండింటిని బట్టి మనకి అర్ధమయ్యేది ఏమంటే శ్వేతకేతువు ప్రవాహణుడు సమకాలికులే కాకుండా మంచి స్నేహితులు కూడా. దీనికి ఉదాహరణ చూడండి.

పూర్వకాలంలో పాంచాలదేశాన్ని ప్రవాహణుడు అనే రాజు పరిపాలిస్తున్నాడు. ఆ రోజుల్లో ఉద్దాలకుని కుమారుడు శ్వేతకేతువు అమితదర్పంతో రాజసభలో కాలు పెట్టాడు. అతడు అప్పుడే విద్యాభ్యాసం పూర్తిచేసి వచ్చాడు. దాంతో లోకంలోని విద్యనంతా చదివేశాను అన్నంతభావనతో ఉన్నాడు.

అతడు ఆస్థానంలో ప్రవేశించే సరికి అక్కడ రాజుగారు ఆధ్యాత్మిక చర్చలు జరుపుతున్నారు. పండితులంతా అక్కడ ఉన్నారు. ప్రశ్నలు అడగటం సమాధానం చెప్పటం జరుగుతోంది. సభలో ప్రవేశించిన శ్వేతకేతువును నువ్వు విద్యాభ్యాసం పూర్తి చేశావా? అడిగాడు రాజుగారు. అవును అన్నాడు శ్వేతకేతువు. అయితే నేనడిగే ప్రశ్నలకి సమాధానం చెప్పవలసింది అన్నాడు రాజు. రాజుగారు వేసిన ఏ ప్రశ్నకీ సమాధానం చెప్పలేదు శ్వేతకేతువు. రాజుగారు పంచాగ్నివిద్యను గురించి అడిగారు. తెలియదు అన్నాడు శ్వేతకేతువు. చివరకు రాజైన ప్రవాహణుడే ఉద్దాలకుడు, శ్వేతకేతువులకు పంచాగ్నివిద్యని వివరించి పంపాడు. అప్పటినుంచి ప్రవాహణుడు, శ్వేతకేతువు మంచి మిత్రులయినారు. ఈ విషయం **శతపథ బ్రాహ్మణంలో ఉంది.**

# 13. అశ్వపతి మహారాజు

కాశీనగరాన్ని పాలించేవాడు అశ్వపతి మహారాజు. మంచి ఆధ్యాత్మిక వేత్త. ఒకసారి

| | | |
|---|---|---|
| ఉపమాన్యుని కుమారుడు | – | ప్రాచీన శీలుడు |
| పులుషుని కుమారుడు | – | సత్యయజ్ఞుడు |
| భల్లుని కుమారుడు | – | ఇంద్రద్యుమ్నుడు |
| శర్కరాక్షుని కుమారుడు | – | జనుడు |
| అశ్వతరాశ్యుని కుమారుడు | – | బుడిలుడు |

వీరు ఐదుగురు మంచి మిత్రులు. సదాచార సంపన్నులు. ఉత్తమ గృహస్థులు, పరమ శ్రోత్రీయులు. వీరంతా ఒకచోట చేరి ఒకరోజున ఆత్మ అంటే ఏమిటి? బ్రహ్మతత్త్వం ఏమిటి? అని చర్చిస్తున్నారు. ఆ విషయం ఎంతకీ తేలలేదు. ఆ రోజుల్లో అరుణ మహర్షి కుమారుడు ఉద్దాలకుడు ఈ విషయంలో చాలాగట్టినాడు, అందుకని ఆయన దగ్గరకు వెళ్ళి విషయం తెలుసుకోవాలనుకున్నారు. అనుకున్నదే తడవుగా బయలుదేరి ఉద్దారకుడి దగ్గరకు వెళ్ళారు. విషయం చెప్పారు. విన్నాడు ఉద్దాలకుడు. వారితో "నాయనా ! మీ సందేహం నేను తీర్చాలి. ఇది నా బాధ్యత. కాని విషయం నాకు పూర్తిగా తెలియదు. అందుకని కాశీనగరాన్ని ఏలే అశ్వపతి మహారాజుగారి దగ్గరకు వెడదాం. ఆయన వీటిలో నిష్ణాతుడు మీతోపాటు నేను కూడా రాజుగారి దగ్గరకు వస్తాను అన్నాడు. సరే అందరూ కలిసి అశ్వపతిమహారాజు దగ్గరకు వెళ్ళారు. మహారాజు వీళ్ళందరినీ సాదరంగా ఆహ్వానించాడు. కుశలప్రశ్నలు అయిన తరువాత స్వామి! మీరు వచ్చినపని ఏమిటి అని అడిగాడు రాజు. విషయం చెప్పారు మునికుమారులు. అదివిన్న అశ్వపతిమహారాజు వారి అనుమానం తీర్చి, వాళ్ళని సత్కరించి పంపాడు. బ్రహ్మనిష్టాగరిష్టుడు అని పేరున్న ఉద్దాలకుడికి కూడా ఆత్మతత్త్వాన్ని వివరించాడు అశ్వపతి మహారాజు. ఈ విషయం **ఛాందోగ్యోపనిషత్తులోను, కౌషీతకీ బ్రాహ్మణంలోను** చెప్పబడింది.

# 14. ఇంకా అనేకులు

ఇప్పటి వరకు విదేహనగరాన్ని పాలించిన జనక మహారాజు, కాశీ నగరాన్ని పాలించిన – అశ్వపతి మహారాజు, పాంచాల నగరాన్ని పాలించిన – ప్రవాహుణుడు, ఇంకా ఇంకా అనేకమంది మహారాజులు ఆధ్యాత్మికవిద్యలో నిష్ణాతులు. వీరుకాక శతానీకుని కుమారులు చైకితాయనదాల్భ్యుడు, బకదాల్భ్యుడు, కేశిదాల్భ్యుడు. వీరి ప్రసక్తి కౌషితకీబ్రాహ్మణంలోను, జైమినీయబ్రాహ్మణంలోను ఉంది. ద్రుపద మహారాజుకు యాజ్ఞసేనుడు అని బిరుదు. ఈయన కుమారులు సుత్వాయాజ్ఞసేనుడు, శిఖండి, యాజ్ఞసేనుడు వీరంతా యజ్ఞయాగాల విషయాలమీద చర్చలు చేశారు అని జైమినీయ బ్రాహ్మణంలో ఉంది. ద్రుపదుని కుమారులు, కేశిగల్భ్యుడు సమకాలికులు.

జీవలచైలకి, ప్రాచీనశీల, ఔపమన్యుడు, సత్యయజ్ఞపౌలుషి, ఇంద్రద్యుమ్న, భాల్లవేయడు, జనశార్క రాక్షుడు, బుడిల ఆశ్వితరుశ్వి. అనే క్షత్రియులు ఉద్దాలకుడితో ఆధ్యాత్మిక చర్చలు జరిపారని శతపథబ్రాహ్మణంలో చెప్పబడింది.

'జీవల కారీరాది', 'ఆషాఢ సావయసుడు' అనే ఇద్దరు క్షత్రియులను గూర్చి జైమినీయ బ్రాహ్మణంలో చెప్పటం జరిగింది. వీరు కాక హిరణ్మయశకుడు, ఆ సోలవార్షి వృద్ధుడు, బ్రహ్మదత్త చైకితాయనుడు, కోసల రాజయిన బ్రహ్మదత్త ప్రాసేనజిత్తుడు వీరందరు సమకాలికులు. యజ్ఞయాగాది క్రతువుల గురించి చర్చలు జరిపేవారని కౌషీతకీ, జైమినీ బ్రాహ్మణాలు చెబుతున్నాయి. పర ఆట్లార అనే కోసలరాజు తాండ్య బ్రాహ్మణంలోను శతపథబ్రాహ్మణంలోను కనిపించగా 'నమీసాహ్యుడు' అనే మహారాజు తాండ్యబ్రాహ్మణంలో

కనిపిస్తాడు.

ఇక్కడ ఇంకొక విచిత్రమైన విషయం ఏమంటే 'సులభా' ఈవిడ ఒక క్షత్రియ స్త్రీ. ఈవిడ జనక మహారాజుతో ఆధ్యాత్మిక చర్చలు జరిపేది. జనకుడి మంత్రి మైత్రేయుడు. ఆయన కుమార్తె మైత్రేయి. ఈమె యాజ్ఞవల్క్యుని వివాహం చేసుకున్నది. ఈ మైత్రేయి, సులభా ఇద్దరూ ఒకరే అంటారు. ఈమె పేరుతోనే 'సౌలభ బ్రాహ్మణము' ఉండేది అంటారు. కాని ఇక్కడ ఆలోచించాల్సింది ఏమంటే సులభ క్షత్రియ స్త్రీ. కాని మైత్రేయి బ్రాహ్మణ స్త్రీ. కాబట్టి వీరిద్దరూ ఒకరు కాకపోవచ్చు. గర్గుని కుమార్తె గార్గేయి కూడా జనకుని ఆ స్థానంలో ఉండేది. యాజ్ఞవల్క్యుడితో ఈమె వాదించింది కూడా.

ఈ విధంగా అనేకమంది క్షత్రియులు స్త్రీలు కూడా, ఆధ్యాత్మిక విషయాలపైన చర్చలు చేసేవారని యజ్ఞ సంబంధమైన వివాదాల్లో పాల్గొనే వారని బ్రాహ్మణాలు చెబుతున్నాయి. **ఆధ్యాత్మిక విషయాలలో ఆరితేరిన బ్రాహ్మణేతరులను కూడా బ్రాహ్మణులు గానే పరిగణించేవారు.**

# 15. చాతుర్వర్ణాలు

ఈ కాలంలో వర్ణ వ్యవస్థ ఎలా ఉండేది? అసలు వర్ణ వ్యవస్థని గురించి బ్రాహ్మణాలు ఏం చెబుతున్నాయి? అనే విషయం చూద్దాం.

**'చాతుర్వర్ణం మయాసృష్టం గుణకర్మ విభాగచ'** మానవులు చేసే పనినిబట్టి వారిని నాలుగు వర్ణాలుగా నేనే విభజిస్తున్నాను. అన్నాడు భగవానుడు గీతలో. పురుష సూక్తంలో మొదటిసారిగా ఈ వర్ణ వ్యవస్థని గురించి చెప్పబడింది. ఈ విషయాలు గతంలో చెప్పుకున్నాం. వర్ణవ్యవస్థని గురించి బ్రాహ్మణాలు ఏమంటున్నామో చూద్దాం. మానవులు చేసే వృత్తులను బట్టే వర్ణ విభజన జరిగింది అని చెబుతోంది. శతపథ బ్రాహ్మణము. ఇక్కడ విచిత్రమైన విషయం ఏమంటే ఈ వర్ణవ్యవస్థ కేవలము మానవుల్లోనే కాదు దేవతలలో కూడా ఉండేది అని చెబుతోంది శతపథ బ్రాహ్మణం. ఈ వర్ణ వ్యవస్థ పశువులలోకూడా ఉన్నది అంటోంది ఐతరేయ బ్రాహ్మణం, అంతేకాదు చెట్లు, చేమలు, వృక్షాలలో ఉన్నది. ఛందస్సులలో కూడా ఉన్నది అంటున్నాయి శతపథ బ్రాహ్మణం, ఐతరేయ బ్రాహ్మణాలు.

ఇక వర్ణవ్యవస్థకి వచ్చినట్లైతే బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్ర నాలుగు వర్ణాలు ఉన్నాయి. మామూలుగా చెప్పేటప్పుడు పంచములు అంటారు కదా. మరి వారు చెప్పబడలేదా? చెప్పబడ్డారు. అరణ్యాలలో జీవించే నిషాధులే పంచములు. అన్నాడు సాయణుడు.

**బ్రాహ్మణులు :** వర్ణవ్యవస్థలో ముఖ్యమైన వర్ణంగా బ్రాహ్మణులు పరిగణించబడ్డారు. క్షత్రియులు అంటే అధికారం గలవారు. సమాజం మొత్తాన్ని శాసించేవారు. సమాజం అంతా వీరి అధికారానికి లోబడి ఉంటుంది అని అర్థం. కాని వారి అధికారం కేవలం మూడు వర్ణాలకే

పరిమితం. క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు ఈ మూడు వర్ణాలనే వారు శాసిస్తారు. బ్రాహ్మణుల మీద వీరికి అధికారం లేదు. బ్రాహ్మణులకు సోముడేరాజు అని తైత్తిరీయ బ్రాహ్మణం చెబుతోంది. బ్రాహ్మణులకు కొన్ని హక్కులు బాధ్యతలు ఉన్నాయి. అవి యజమాని దగ్గర నుండి దక్షిణ తీసుకోవటం, బహుమతులు తీసుకోవటం, అలాగే యజ్ఞయాగాలు చేసినప్పుడు అక్కడ మిగిలిన యజ్ఞశేషాన్ని భుజించటం వీరిహక్కు, వీరు ఇక్కడఉండాలి. ఇక్కడఉండకూడదు అనే నియమం లేదు. ఎక్కడైనా ఉండచ్చు. తమ ఇష్టం వచ్చినట్లుగా సంచారం చెయ్యవచ్చు.

అధ్యయనం–వేదాన్ని చదవటం (నేర్చుకోవటం)

అధ్యాపనం–వేదాన్ని ఇతరులకు (శిష్యులకు) బోధించటం

యజనం–యజ్ఞయాగాలు చెయ్యటం

యాజనం–యజ్ఞయాగాలు ఇతరులతో చేయించటం

సమయానుకూలంగా అత్యంత మెలుకువతో రాజుగారికి సలహా ఇవ్వాలి. ఇవి వీరివిధులు అని ఐతరేయ బ్రాహ్మణం చెబుతోంది. ఎక్కడైనా సరే, ఎటువంటి పరిస్థితిలోనైనా సరే బ్రాహ్మణుణ్ణి చంపటం బ్రహ్మహత్య మహాపాతకం అని శతపథ బ్రాహ్మణం చెబుతోంది. ఏ రాజైనా సరే బ్రాహ్మణుణ్ణి చంపాలనికాని, బాధలు పెట్టాలిఅని కాని ఆలోచిస్తే అతడికి దురవస్థలు ప్రారంభమైనట్లే. అని శతపథ బ్రాహ్మణం చెబుతోంది. బ్రాహ్మణులు పరమపూజ్యులు. దానదక్షిణల చేత సన్మానింప తగినవారు. అజేయులు, అవధ్యులు అంటోంది శతపథ బ్రాహ్మణం.

**పురోహితుడు :** పురోహితుడు అంటే పూజలు వ్రతాలు చేయించేవాడే కాదు. దేశం మొత్తాన్ని రక్షించేవాడు అని అర్థం.

రాజగురువన్న మాట.

ఇలాంటి బ్రాహ్మణులలో గొప్ప పండితులు, శమదమాది గుణాలు గలవాడు, దేశాన్ని రక్షించే సామర్థ్యం గలవాడిని పురోహితుడిగా నియమించాలని చెబుతోంది ఐతరేయ బ్రాహ్మణం. పురోహితుడికి నాలుగువేదాలు తెలిసిఉండాలి ప్రత్యేకించి అధర్వణవేదం మీద మంచి పట్టుఉండాలి. ప్రతి రాజ్యానికి ఒకరాజు ఉన్నట్లే, ఒక పురోహితుడు అంటే రాజగురువు ఉండి తీరాల్సిందే. ఆయన సలహా, సూచనల మేరకు మాత్రమే సాంఘిక, దైవిక కార్యక్రమాలను చేపట్టేవాడు రాజుగారు. ఇతని సలహా మేరకే రాజ్యపాలన జరిగేది అంటోంది ఐతరేయ బ్రాహ్మణం. సముద్రంనుండి భూమిని రక్షించినట్లుగా పురోహితుడు రాజును రక్షిస్తాడు పురోహితుడు ఎప్పుడూ సమర్థుడే ఉండాలి. అప్పుడు శత్రురాజులు వశమవుతారు. శత్రువులు నశిస్తారు. కాబట్టి పురోహితుడు సమర్థుడై ఉండాలి అంటోంది ఐతరేయ బ్రాహ్మణం. సభలో పురోహితుడికి మంచి ఆకర్షణీయమైనహోదా ఉంటుంది. ప్రధానమంత్రికన్నా ఇతనికి ఎక్కువగౌరవం ఉంటుంది. రాజమందిరం, అంతఃపురంతో సహా ఇతనికి ఎక్కడికైనా, ఏ సమయంలోనైనా ప్రవేశముంటుంది. ఇతన్నెవరూ అడ్డగించరు. సభలో రాజును కూడా శాసించగల శక్తి ఇతనికి మాత్రమే ఉంటుంది. సమర్థుడైన ఒక వ్యక్తి రెండు రాజ్యాలకు పురోహితుడుగా ఉండవచ్చు. దేవభాగశ్రౌతర్షుడు ఇతడు కురుదేశానికి, శృంజయ దేశానికి రెండు దేశాలకు రాజపురోహితుడు అని శతపథ బ్రాహ్మణం చెబుతోంది. ఈ కారణం చేతనే పురోహితుడు రాజుకు ఆత్మ అని చెబుతోంది ఐతరేయ బ్రాహ్మణం. ఈ రకంగా బ్రాహ్మణుడికి అత్యంత ఉత్తమమైన స్థానం కల్పించబడింది సమాజంలో.

**క్షత్రియులు :** క్షత్రియుడు బలపరాక్రమాలకు ప్రతీక అని చెబుతోంది ఐతరేయ బ్రాహ్మణం. ఈ భూమి అంతా క్షత్రియుడిదే. అంటే ఈ భూమి మీద అధికారం అతనిదే. మిగిలిన వారు ఎవరైనా సరే బ్రాహ్మణులుగాని, వైశ్యులు గాని, శూద్రులు గాని భూమి కావాలంటే అతణ్ణి యాచించాల్సిందే అంటోంది ఐతరేయ బ్రాహ్మణం. ప్రజలంతా క్షత్రియుడికి పన్నుల రూపంలో ధనం ఇస్తారు. దానికి ప్రతిగా అతడు ప్రజలకు రక్షణకల్పించాలి అని చెబుతోంది శతపథ బ్రాహ్మణం. యజ్ఞయాగాది క్రతువులు చేసే అధికారం క్షత్రియులకు కూడా ఉంది. కాని యజ్ఞశేషాన్ని తినే హక్కు మాత్రం బ్రాహ్మణుడిదే. అది క్షత్రియుడికి లేదు. అంటోంది ఐతరేయ బ్రాహ్మణం. క్షత్రియుడి వేషం అక్కడి సామాజిక పరిస్థితుల మీద ఆధారపడి ఉంటుంది. వీరెప్పుడూ రథాలమీద తిరుగుతారు అని చెబుతోంది శతపథబ్రాహ్మణం. శత్రువుల నుంచి దేశాన్ని రక్షించటం, చోరుల నుంచి కాపాడటం, ఆపదల నుంచి రక్షించటం. ప్రజలకు రక్షణ కల్పించటం అతని కర్తవ్యాలు. వర్ణాశ్రమ ధర్మాలను ప్రజలచేత ఆచరింప చేసేవాడు ఇతడే అంటోంది ఐతరేయ బ్రాహ్మణం. బ్రాహ్మణులు క్షత్రియులు ఎప్పుడూ పరస్పరము సహకారము, అవగాహన కలిగిఉండాలి. వీరు ఒకరి నొకరు ఆశ్రయించి ఉంటారు అంటోంది ఐతరేయ బ్రాహ్మణం. ఈ ఇద్దరూ ప్రజారక్షకులే. బ్రాహ్మణులేమో దైవశక్తితో, క్షత్రియుడు భుజబలపరాక్రమంతో ప్రజలను రక్షిస్తారు అంటోంది శతపథ బ్రాహ్మణం. క్షత్రియుడు ఎప్పుడూ బ్రాహ్మణులకు అధీనుడుగా ఉండాలి. భక్తిప్రపత్తులతో బ్రాహ్మణులను వశం చేసుకోవాలి. బ్రాహ్మణులు ఎవరికి వశమయి ఉంటారో, వారి రాజ్యం దిన దిన ప్రవర్ధమానమవుతుంది అంటోంది ఐతరేయ

బ్రాహ్మణం.

**వైశ్యులు :** సమాజంలో మూడవ వర్ణం వైశ్యులు. పై ఇద్దరికి లాగానే వీరికి కూడా ఉపనయనం జరుగుతుంది. యజ్ఞయాగాలు చెయ్యవచ్చు. వేదాన్ని చదవటం వరకే గాని ఇంకొకరికి నేర్పే అధికారం వీరికి లేదు. వీరు యజ్ఞశేషం తినరాదు అని ఐతరేయ బ్రాహ్మణం చెబుతోంది. వైశ్యుల ముఖ్యవృత్తులు వర్తకము, వాణిజ్యము, వ్యాపారము, వ్యవసాయము, పశుపోషణ. వీరు సంఘానికి వెన్నెముక లాంటివారు. వీళ్ళని క్షత్రియులు, బ్రాహ్మణులు తమ అదుపులో పెట్టుకోవటానికి ప్రయత్నం చేస్తారు అని ఐతరేయ, శతపథ బ్రాహ్మణాలు చెబుతున్నాయి. వైశ్యులు, శూద్రులు అసంపూర్ణ వర్ణాలుగా చెప్పబడ్డారు అంటోంది శతపథ బ్రాహ్మణం. తమ వ్యవసాయము పశువులు రక్షించుకోవటానికి తమంతట తామే క్షత్రియులకు లొంగి ఉండేవారు. అని చెబుతోంది శతపథ బ్రాహ్మణము. ఈ రకంగా వైశ్యులు సమాజంలో తమపాత్ర పోషించారు.

**శూద్రులు :** వీరిని గురించి ఒక గొప్ప విషయం రహస్యంగా ఉండిపోయింది. వేదకాలంలో ఈ దేశంలో ప్రవేశించిన ఆర్యులు ఆ ప్రాంతంలో స్థిరనివాసం ఏర్పాటు చేసుకుని నివసిస్తున్న స్థానికులతో యుద్ధంచేసి వాళ్ళని వశపరచుకుని దాస్యం చేయించుకున్నారు. ఆర్యులకి లోబడక అక్కడక్కడ దాక్కుని సమయం దొరికినప్పుడు ఆర్యులతో యుద్ధం చేసేవారు కొందరు. అలాంటి వారిని దశ్యులు అని, ఆర్యులకు లోబడి వారికి దాస్యం చేసినవారిని దాసులు అని పిలువసాగారు. ఈ దాసులే క్రమేణా శూద్రులయినారు. వీరివృత్తి సేవ. వీరు అసురుల నుంచి (దస్యులు) పుట్టారు అని చెబుతోంది తాండ్య బ్రాహ్మణం. ఇప్పుడు మనం చెప్పుకునే నాలుగు వర్ణాలలోను

హీనస్థితిలో ఉన్నవారు వీరే. వీరికి యజ్ఞయాగాలు చేసే అధికారం లేదని చెబుతోంది శతపథబ్రాహ్మణం. అంతేకాదు. యజ్ఞభూమిలోకి ప్రవేశంచను కూడా ప్రవేశించ కూడదు. యజమానితో మాట్లాడరాదు. ఆవులకు పాలు పితకరాదు. అని చెబుతోంది తాండ్య బ్రాహ్మణం. వివాహ సమయంలో శూద్రస్త్రీని పై వర్ణాల వారు వివాహం చేసుకునే వారు. ఆ స్త్రీకి పుట్టిన సంతతి కూడా శూద్రులు గానే పరిగణింపబడతారు. అయితే వారికి శూద్రులలో ఉన్నతమైన స్థానమున్నది అంటోంది శతపథ బ్రాహ్మణం. నీచ్యులు, అపాచ్యులు అనేవారు శూద్రులకన్న హీనులు అని చెబుతోంది ఐతరేయ బ్రాహ్మణం.

ఇక్కడ ఒక్క విషయం ఏమంటే ఏ శూద్రుడైనా సరే బ్రాహ్మణుల విజ్ఞానాన్ని సంపాదిస్తే, అటువంటి వాడు బ్రాహ్మణసమానుడుగా గౌరవింపబడతాడు అని ఐతరేయ బ్రాహ్మణం చెబుతోంది. ఇందులోని కవశోపాఖ్యానము దీనికి మంచి ఉదాహరణ. అలాగే ఐతరేయ బ్రాహ్మణకర్త అయిన మహీదాసు కూడా ఇలాటివాడే.

దీన్ని బట్టి మనకి తెలిసేదేమంటే **విద్యవల్ల, తపస్సువల్ల హీనవర్ణాల వారు కూడా ఉచ్ఛవర్ణాల వారి స్థాయిని పొందుతారు.**

# 16. చతురాశ్రమాలు

ఆశ్రమాలు నాలుగు. బ్రహ్మచర్యం, గృహస్థాశ్రమం, వానప్రస్థం, సన్యాసం. ఈ ఆశ్రమాల గురించి సంహితలో చెప్పుకున్నాం. కాని ఇప్పుడు బ్రాహ్మణాలలో వీటిని గురించి ఏం చెప్పారు? అనే విషయాన్ని చూద్దాం.

**బ్రహ్మచర్యం :** పూర్తిగా విద్యాభ్యాసానికి ఉపయోగించేది బ్రహ్మచర్యం. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు మూడు వర్ణాల వారు కూడా తమ పిల్లలకి ఉపనయనం చేసి విద్యాభ్యాసం కోసం గురువుగారి దగ్గరకి పంపుతారు. ఉపనయనము అనేది రెండవ జన్మ. అలా ఉపనయనం చేయబడ్డ వాళ్ళు ద్విజులు అనబడతారు. విద్యార్థులు గురుకులంలో చేరి విద్యాభ్యాసం చేస్తారు. విద్యాభ్యాసం చెయ్యటానికి మూడు పద్ధతులున్నాయి. 1. గురువు గారికి సేవలు చేసి విద్య నేర్చుకోవటము. 2. గురువు గారికి పుష్కలంగా ధనమిచ్చి విద్య నేర్చుకోవటము. 3. తనకు వచ్చిన విద్యను గురువు గారికి చెప్పి ఆయన దగ్గర తనకు కావలసింది నేర్చుకోవటము. ఇంక నాలుగవ పద్ధతి అనేది లేదు. అయితే ఎక్కువమంది గురువుకు సేవలుచేసి విద్యనేర్చుకునేవారు. విద్యార్థిదశను దీర్ఘసత్రంగా చెబుతోంది శతపథ బ్రాహ్మణం. గురువుగారికి సేవలు చెయ్యటం అంటే ఆశ్రమంలో జరిగే నిత్యాగ్ని హోత్రానికి, హోమాలకు కావలసిన సమిధలు తేవటం, పశువులను మేపటం వంటివి. ఐతరేయ, తైత్తిరీయ బ్రాహ్మణాలలో నాభానేధిష్ఠుడు, భరద్వాజుడు వీరి కథలు గురుకులంలో విద్యాభ్యాసం ఎలా జరిగేదో వివరిస్తాయి. భాగవతంలో కృష్ణుడు సుదాముడు గురుకులంలో ఎలా గడిపారో వివరించటం జరిగింది.

బ్రహ్మచారి అవలంబించవలసిన పద్ధతులు, ఆచారాలు, నిష్ఠలు

కొన్నిఉన్నాయి. ముందుగా అతడు నిద్రను త్యజించాలి. కృష్ణాజనాన్ని మాత్రమే ధరించాలి. నేలమీదనే పడుకోవాలి. కీర్తిప్రతిష్టల కోసం ఎదురు చూడరాదు. కోపము అనేది అసలు ఉండరాదు. ఇతరులను ఎప్పుడూ బాధించరాదు. మాటలతో కూడా. సౌందర్యపోషణ పనికిరాదు. సుగంధ ద్రవ్యాలు వాడరాదు. తాంబూలం వేసుకోరారు. స్త్రీని నగ్నంగా ఉన్నప్పుడు చూడరాదు. నేలమీద దిగువస్థానంలో మాత్రమే కూచోవాలి. మంచం మీద పడుకోరాదు. జీవహింస చెయ్యరాదు. నడిచేప్పుడు కూడా అతినెమ్మదిగా నడవాలి. సంగీతం వినరాదు. నృత్యం చూడరాదు. నేలమీద ఇష్టం వచ్చినట్లు ఉమ్మివేయరాదు అని గోపథబ్రాహ్మణం చెబుతోంది. వీరికి వేదవేదంగాలు చెప్పబడేవి. సంహిత, బ్రాహ్మణము, అరణ్యకము ఉపనిషత్తు శాస్త్రాలు అన్నీ చెప్పేవారు. ఇవి కాక న్యాయం తర్కం, ఇతిహాసాలు, పురాణాలు, జ్యోతిష్యం, సర్పవిద్య, సాముద్రికం మొదలైన అన్నివిద్యలు నేర్పబడేవి. అని శతపథ బ్రాహ్మణం చెబుతోంది. విద్యవిషయంలోను, యజ్ఞయాగాది కర్మల విషయంలోను చర్చలు జరుగుతుంటాయి. శతపథబ్రాహ్మణంలో ఇలాంటి వాదనలు, చర్చలు అనేకం వివరించబడ్డాయి. యాజ్ఞవల్క్యుడు శాకల్యుడు, ఉద్దాలకుడు ప్రాచీనశీలుడు ఇలా వీరి మధ్య జరిగిన వాదనలు వివరించింది శతపథ బ్రాహ్మణం. బ్రహ్మచారులు రెండు రకాలుగా ఉంటారు అని శతవథ బ్రాహ్మణం చెబుతోంది.

1. నైష్ఠిక బ్రహ్మచారులు 2. ఉపకుర్వాణ బ్రహ్మచారులు

**1. నైష్ఠికబ్రహ్మచారులు :** విద్యాభ్యాసం పూర్తి చేసి, సమావర్తనము, స్నాతక వ్రతము చేసి ఇంటికి పోకుండా, జిజ్ఞాసువై గురువుగారి దగ్గరే ఉంటూ నియమ నిష్టలతో బ్రహ్మచర్యం పాటిస్తూ, నిరంతరము

సత్యాన్వేషణలో కాలం గడిపేవాడు. వీరు వివాహం చేసుకోరు. కాబట్టి మిగిలిన ఆశ్రమాలు గృహస్తాశ్రమము, వానప్రస్తము ఉండవు. ఇలాటి బ్రహ్మచారులను శతపథబ్రాహ్మణం **'వర్చస్వంతులు'** అంటోంది.

**2. ఉపకుర్వాణ బ్రహ్మచారులు :** గురువుగారి దగ్గర విద్యాభ్యాసం పూర్తి చేసి, సమావర్తనమాచరించి ఇంటికి పోయి స్నాతకవ్రతం చేసి తగిన పిల్లను చూసి వివాహం చేసుకుని, గృహస్థాశ్రమంలో అడుగు పెడతారు. గురువుగారి దగ్గర నుండి వచ్చేటప్పుడు గురుదక్షిణ చెల్లించి రావాలి. సామాన్యంగా తనకు ఏం కావాలో గురువే చెప్పాలి. గురుదక్షిణ చెల్లించిన తరువాత మాత్రమే గురుకులం నుంచి బయటపడతారు. ఇక్కడ ఇంకొక ముఖ్యమైన విషయం. గురువుగారి దగ్గర ఆయన యజ్ఞశాల నుంచి గార్హపత్యాగ్నిని తెచ్చుకుని తన గృహంలో అగ్నిహోత్రాన్ని ప్రతిష్టించాలి. ఇక జీవితాంతం ఈ అగ్ని అతని ఇంట్లో ప్రజ్వరిల్లుతూనే ఉండాలి. పూర్వకాలంలో అగ్ని ఎక్కడ పడితే అక్కడ, ఎప్పుడు కావాలంటే అప్పుడు దొరికేది కాదు. అందుకే అగ్నిని ఇంట్లో ఉంచుకునేవారు. ఇవాల్టిరోజున ఆ అవసరం లేదు అంటారు ఆధునికులు.

ఇక గురువులు కూడా రెండు రకాలుగా ఉన్నారు.

**1. స్థిరగురువులు :** ఒకే ప్రాంతంలో ఆశ్రమాన్ని నిర్మించుకుని, తన వద్దకు వచ్చే వారికి విద్యాబోధన చేసేవాడు.

**2. సంచార గురువు :** వీరు దేశాటనం చేస్తుంటారు. ఇలాటి గురువులను (చరకులు) అంటారు. అంటోంది శతపథ బ్రాహ్మణం. ఏ రకమైన ఫలితము ఆశించకుండా ఆవిద్యాభ్యాసం పూర్తి చేసేవారు. విద్యని వీరిని కూడా శతపథ బ్రాహ్మణంలో చెప్పటం జరిగింది.

**స్త్రీ విద్య :** ఇక చాలా ముఖ్యమైన విషయం స్త్రీ విద్య. దీనికి

ప్రత్యేకమైన ఏర్పాట్లు జరిగినా, లేకపోయినా, స్త్రీవిద్యను నిషేధించలేదు. చాలా ఆ శక్తికరమైన విషయం ఏమంటే, స్త్రీలు యజ్ఞోపవీతంధరించి వేదాధ్యయనంచెయ్యటం. ఐతరేయ బ్రాహ్మణంలో ఈ విషయం చెప్పబడింది. ఐతరేయ బ్రాహ్మణంలో 'గంధర్వ' అనే స్త్రీ ఆశ్రమంలోని అగ్నిహోత్రాన్ని జాగ్రత్తగా రక్షించేది అన్నారు. ఇంకొక విషయం ఏమంటే యజ్ఞాలు కొన్నింటిలో యజమానిభార్య తప్పనిసరిగా కొన్నిమంత్రాలు చెప్పాలి. అంటే స్త్రీలు కూడా విద్యాభ్యాసము, వేదపఠనము చేసేవారు. ఛాందసులు ఈ విషయాన్ని ఒప్పుకోరు.

స్త్రీలకు ఎక్కువగా సంగీతము, నృత్యము, వంటవార్పు, కుట్లు, అల్లికలు, నూలు వడకడం ఇత్యాది పనులలో శిక్షణ ఇచ్చేవారని శతపథ బ్రాహ్మణం చెబుతున్నది.

**గృహస్థాశ్రమము :** సమావర్తనం పూర్తి చేసిన తరువాత స్నాతకవ్రతం చేసేవాడు. అప్పుడు తనకు అనుకూలవతి అయిన పిల్లను చూసి వివాహం చేసుకునేవాడు. సామాన్యంగా ప్రతివారూ తమ వర్గంలో వారినే వివాహం చేసుకునేవారు. అనులోమ వివాహాలు నిషిద్ధం కాదు. వివాహం చేసుకుంటేనే మానవుడికి పూర్ణత్వం సిద్ధిస్తుంది అని ఐతరేయ బ్రాహ్మణం చెబుతోంది. ఈ రోజున మనకి కూడా ఇదే నమ్మకమున్నది. యజ్ఞయాగాది క్రతువులు చెయ్యాలి అంటే భార్యాభర్త ఇద్దరూ పీటలమీద కూర్చోవలసిందే. ఇందులో ఎటువంటి ఆలోచనా లేదు. యజ్ఞయాగాది క్రతువులు "భార్య లేని వారికి నిషిద్ధం" అని శతపథ బ్రాహ్మణం చెబుతోంది.

వైవాహిక జీవితము చాలా మధురంగా ఉంటుంది అని బ్రాహ్మణాలు చెబుతున్నాయి. **వివాహం అనేది ఒక ఒప్పందం కాదు. అది ఒక పవిత్ర బంధం.** భార్య ప్రతిదానికీ భర్తమీదనే ఆధారపడి

జీవిస్తుంది. కాని **ఆవిడ ఒక బానిసలా కాక స్నేహితురాలిగా, గృహలక్ష్మిగా, ఇంటిదీపం, కంటివెలుగుగా చెప్పబడింది.** ఆధ్యాత్మిక విషయాలలో ఆమె భాగస్వామి అని ఐతరేయ బ్రాహ్మణం చెబుతోంది. శతపథ బ్రాహ్మణంలో స్త్రీని గృహలక్ష్మి అన్నారు. స్త్రీ హత్య నిషేధం. బ్రహ్మహత్య ఎంత భయంకరమైనదో, స్త్రీ హత్య కూడా అంతే భయంకరమైనది. అని శతపథ బ్రాహ్మణం చెబుతోంది. భార్యాభర్తలది అవినాభావ సంబంధం. వివాహమనేది జన్మజన్మల బంధం అంటున్నాయి బ్రాహ్మణాలు. భర్త భార్యలో ప్రవేశించి పుత్రునిగా జన్మిస్తాడు. అందుకే ఆవిడ 'జాయ' అనబడుతుంది. జాయ అంటే – అగ్నిసాక్షిగా పెండ్లాడిన భార్య అని చెబుతోంది ఐతరేయబ్రాహ్మణం. వివాహ వ్యవస్థకి పుత్రులు పరాకాష్ఠ. పుత్రులు లేకపోతే గృహస్త్రాశ్రమానికి పరిపూర్ణత లేదు.

వివాహ పద్ధతిలో స్వయంవరం ఉండేది. దాన్ని క్షత్రియులు మాత్రమే ఆచరించేవారు. ఈ విషయం ఐతరేయ బ్రాహ్మణంలో ఉంది. ఇక బహుభార్యాత్వము. క్షత్రియుల విషయంలో సమ్మతమే. ఎందుకంటే రాకుమారుడు వీరుడైతే అతను ఎంతకాలం ఉంటాడో తెలియదు. అందుకని ఎక్కువమంది సంతానం కావాలి అని బ్రాహ్మణాలు చెబుతున్నాయి. ప్రతీరాజుకు మహారాణి. ఈమెనే పట్టపురాణి, వావాత (ప్రియసతి) పరివృక్త (ఉపేక్షింపబడునది) పాలాగలి (శూద్ర) అని నలుగురు భార్యలుండేవారు. వీరందరికీ చట్టభద్రత ఉంది. అని శతపథబ్రాహ్మణం చెబుతోంది. బ్రాహ్మణులలో ఇద్దరు భార్యలున్న వారు యాజ్ఞవల్క్యుడు ఉచథ్యుని కుమారుడు దీర్ఘతముడు తప్ప ఇంకెవరూ కనిపించరు కాత్యాయని, మైత్రేయి యాజ్ఞవల్క్యుని భార్యలు. దీర్ఘతముడు గ్రుడ్డివాడు. ప్రద్వేష, ఉశిజ ఇతని భార్యలు. ఇతని కుమారుడే కక్షీవంతుడు. కాని బహు భర్తృత్వం మాత్రము నిషిద్ధం అని ఐతరేయ,

గోపథ బ్రాహ్మణాలు చెబుతున్నాయి. బహుభర్తృత్వం అంటే ఒకే స్త్రీ ఎక్కువ మంది పురుషులను వివాహం చేసుకోవటం. ఇలాంటి సంఘటనలు పురాణాలలో కూడా ఎక్కడా లేవు. భారతంలో ఒక్క ద్రౌపది మాత్రమే ఐదుగురిని వివాహమాడింది. మనదేశంలోనే పంజాబ్‌రాష్ట్రం దగ్గర ఉన్న ఒక ఆదివాసీ తెగలో ఈ రకమైన ఆచారం ఇప్పటికీ ఉన్నది. అందుకే ఆ రోజున ఇది అధర్మమని ఎవరూ అనలేదు. సగోత్రీకుల మధ్య వివాహం జరగరాదు. ఇది నిషిద్ధము. ఇంకొక విషయం ఏమంటే సజాతి వివాహాలు శ్రేష్ఠమైనవి. శతపథబ్రాహ్మణంలో అనులోమ వివాహాలు అంగీకరించబడ్డాయి. విలోమ వివాహాలు మాత్రం అంగీకరించలేదు. పురాణాలలో కూడా ఇటువంటి వివాహాలు యయాతి – దేవయానిల మధ్య తప్ప మరెక్కడా మనకి కనిపించవు.

దీన్ని బట్టి బ్రాహ్మణాలలో స్త్రీకి ఎంత గౌరవము, ప్రాధాన్యత ఉండేవో తెలుస్తోంది. మన వివాహ వ్యవస్థ చాలా పవిత్రమైనది. వరకట్నం ప్రసక్తి లేదు. భార్య భర్త చిటికెనవ్రేలు పట్టుకుని అత్తవారింటికి రావాలి. అంతే కాని వేలు, లక్షలు రూపాయలు కాదు. వేదకాలంలో కూడా స్త్రీధనాన్ని ఆశించే వారు కాదు.

**ఉత్తమం స్వార్జితం విత్తం । మధ్యమం పిత్రార్జితం ।**
**అధమంభ్రాత్రువిత్తంచ । స్త్రీవిత్తం అథమాధమం ॥**

ధర్మశాస్త్రం ప్రకారం స్త్రీధనాన్ని ఆశించేవాడు అధమాధముడు. అంతకన్న నీచత్వం ఇంకొకటి లేదు. స్త్రీకి సమానహక్కు కాదు అంతకన్న పెద్దదైన స్థానం ఇచ్చారు. ఆవిడ గృహలక్ష్మి. ఇంటివెలుగు కంటిదీపం. గృహహింస ఎక్కడా లేదు. స్త్రీ హత్య నిష్కృతిలేని పాపం. ఈ విషయాలు గుర్తించండి. ప్రతిరోజు పేపర్లో చూస్తూంటాం. 'కాళ్ళ పారాణి ఆరకముందే వివాహిత హత్య ఇటువంటి వార్తలు అనేకం. వీటిలో

వెలుగు చూసేవి కొన్ని మాత్రమే. కాబట్టి ఓ యువతా! జాగ్రత్తగా ఆలోచించండి. **సంసారమనే బండికి భార్య భర్త ఇద్దరూ చక్రాల వంటివారని గుర్తించండి. కోడలి ప్రాణం తియ్యమని కొడుకుని ప్రోత్సహించే ఓ అత్తా! నీ వివాహం జరిగినప్పుడు నీకే ఈ పరిస్థితి ఎదురైతే ఎలా ఉండేదో ఒక్కసారి నువ్వు కూడా మనిషివే అనేమాట గుర్తించి ఆలోచించు. కోడలిని కూతురులాగా చూడటం నేర్చుకో.**

దైనందిన జీవితంలో స్త్రీలు వడ్డిస్తే పురుషులు భోజనం చేసేవారు. వీరపుత్రులు కావాలనుకునే వారు భార్య ఎదురుగా భోజనం చేసేవారు కాదని శతపథ బ్రాహ్మణం చెబుతోంది. ఒకరినొకరు ఆకర్షించటం కోసం సుగంధ ద్రవ్యాలు వాడేవారు. శయ్యపైన ఎప్పుడూ భర్తకుడివైపు భార్యపడుకోవాలి. అని శతపథబ్రాహ్మణం చెబుతోంది. పెద్దవాళ్ళ దగ్గర వినయ విధేయతలు ప్రదర్శించాలి అని ఐతరేయ బ్రాహ్మణం చెబుతోంది. భర్తయొక్క అక్కలు, చెల్లెళ్ళు ఉంటే వారు భార్య మీదనే ఆధారపడేవారు అంటోంది ఐతరేయ బ్రాహ్మణం. కాబట్టి ఓ **ఆడపడచులారా! ఇంటికి వచ్చిన కొత్త కోడలి కష్టాలకు, వరకట్న చావులకు, మీరు కూడా చాలావరకు బాధ్యులనే మాట మరచి పోవద్దు. ఇదే పరిస్థితి మీ ఇంట్లో మీకెదురైతే ఎలా ఉంటుందో ఒక్కసారి ఆలోచించండి. సుఖమయ జీవితానికి దోహదం చెయ్యండి.**

వానప్రస్థ సన్యాసాశ్రమాల గురించి బ్రాహ్మణాలలో పెద్దగా చెప్పలేదు.

# 17. రాజు-రాజ్యం

దేశాన్ని పరిపాలించటానికే క్షత్రియుడు జన్మించాడు. ఈ భూమి అంతా క్షత్రియుడి అధికారంలో ఉంటుంది. ఈ విషయాలన్నీ గతంలో మనం చెప్పుకున్నాం. ఇప్పుడు రాజుని చూద్దాం. రాజు, క్షత్రియుడు. ఈ రెండు పదాల మధ్య తేడా ఏమిటి? క్షేత్రమున్న వారందరూ క్షత్రియులే. కాని రాజ్యమున్నవారే రాజులు. క్షత్రియ అనేది ఒక వర్ణం కూడా. ఆ వర్ణంలో జన్మించిన వారందరూ క్షత్రియులే కాని రాజ్యాన్ని పాలించేవాడే రాజు. ప్రజలకు రక్షణకావలసి వచ్చి పరమేశ్వరుడు క్షత్రియులను సృష్టించాడు. వారందరూ వీరులు శూరులే. అందరికీ పౌరుషము ఉంటుంది. దానికి తోడు అహంకారము. ఇలాటి పరిస్థితిలో ఎవరు రాజు కావాలి?

పూర్వకాలంలో మొట్టమొదటగా రాజ్యాన్ని పాలించటానికి గాను రాజును ఎన్నుకోవాలి. దానికి కొన్ని పద్ధతులు అనుసరించేవారు. రాజ్యంలోని క్షత్రియులందరినీ పిలిచి వారి మధ్యన పోటీ ఏర్పాటు చేసేవారు. ఆ పోటీలో నెగ్గిన వారిని రాజుగా ప్రకటించేవారు. ఈ పోటీ వీరోచిత విద్యలలో నిర్వహించేవారు. ఆ పోటీలో నెగ్గినవాడే రాజు" ఇక అప్పటి నుంచి వంశపారంపర్యా అతని పిల్లలు, మనుమలు, మునిమనుమలు రాజులయ్యే వారు. కొన్నిచోట్ల మాత్రం మొదటిసారి పట్టపు ఏనుగుకు గజమాల ఇచ్చి వదిలి వేసేవారు. అది పోయి ఎవరి మెడలో ఈ మాలను వేస్తుందో, వారినే రాజుగా ప్రకటింపబడేవారు. అతని తరువాత ఇక వంశపారంపర్యమే. ఉదాహరణకి మన దేశం చూడండి. 1947లో స్వతంత్రం వచ్చింది.

అప్పటి నుంచీ ఇప్పటిదాకా ఒకే వంశం పరిపాలిస్తోంది. చివరికి స్వాతంత్ర్యం వచ్చిన 67 సంవత్సరాలకు మొదటిసారిగా వంశపారంపర్యపు హక్కులను కాదని పూర్తి మెజారిటీతో ఇంకొక పార్టీ అధికారంలోకి వచ్చింది. సామాన్యంగా వంశపారంపర్య హక్కు రాజరికంలోనే ఉంటుంది. కాని మనదేశంలో ప్రజాస్వామ్యంలో వంశపారపర్యపు హక్కు ఒక కుటుంబానికి దక్కింది. ఇది గొప్ప ప్రపంచ రికార్డు. ఈ విధంగా రాచరికం వంశపారంపర్యమే అని శతపథ బ్రాహ్మణం చెబుతోంది. ప్రభుత్వం మొత్తం పదకొండు రకాలు అని ఐతరేయ బ్రాహ్మణం చెబుతోంది. మనం హారతిచ్చేటప్పుడు

**సామ్రాజ్యం బౌజ్యం సారాజ్యం వైరాజ్యం**

**పారమేష్టింగ్ం రాజ్యం మహారాజ్యామాధిపత్యం** ఇన్ని రకాల రాజ్యాలు అతడికే దక్కాలి. అతడు గొప్పవాడు కావాలి అని ఆకాంక్ష అంతే.

1. రాజ్యం 2. సామ్రాజ్యం 3. భౌజ్యం 4. స్వారాజ్యం 5. వైరాజ్యం 6. పారమేష్ట్యం 7. రాజ్యం 8. మహారాజ్యం 9. ఆధిపత్యం 10. స్వవశత్వం, 11. అవిష్ఠత్వం.

ఇందులో ఐదు ఈ లోకానికి సంబంధించినవి. మిగిలిన ఆరు పరలోకానికి సంబంధించినవి అన్నాడు సాయణాచార్యుడు. ఈ ఆధిపత్యాలు యజ్ఞాలకు సంబంధించినవి.

| | |
|---|---|
| రాజసూయం చేసినవాడు | – రాజు అవుతాడు |
| అశ్వమేధం చేసినాడు | – మహారాజవుతాడు |
| వాజపేయం చేసినవాడు | – సామ్రాట్టు చక్రవర్తి అవుతాడు |

అని శతపథ బ్రాహ్మణం చెబుతోంది.

బ్రాహ్మణాల కాలంలోకి వెళ్ళినట్లైతే దేశాన్ని ఐదు భాగాలుగా విభజించి చెప్పటం జరిగింది. ఆ దేశ భాగాల్లో ఉండే ప్రజలు భిన్న జాతులకు సంబంధించిన వారు కాగా వారిని పాలించే ప్రభువుల ఆధిపత్యం కూడా భిన్నంగానే ఉండేది.

తూర్పు భాగాన్ని పాలించేవాడు – సామ్రాట్టు అనబడతాడు

దక్షిణ భాగాన్ని పాలించేవాడు – భోజుడు అనబడతాడు

పడమర భాగాన్ని పాలించేవాడు – స్వరాట్టు అనబడతాడు

ఉత్తర భాగాన్ని పాలించేవాడు – విరాట్టు అనబడతాడు

మధ్యదేశాన్ని పాలించే వాడు – రాజు అనబడతాడు

అని చెబుతోంది ఐతరేయ బ్రాహ్మణం, ఈ ఐదింటికి మధ్యలో ఉన్న దేశంలో కురు, పాంచాల దేశాలున్నాయి. ఇవి రెండూ జంట దేశాలుగా పిలువబడతాయని శతపథ బ్రాహ్మణం చెబుతున్నది. ఈ ప్రాంతం బాగా నాగరికత చెందినది. అందుకే ఇక్కడి ప్రజలు, ప్రభువులు కూడా నాగరికులు. వీరు మాట్లాడే భాష స్వచ్ఛమైనది అని శతపథ బ్రాహ్మణము చెబుతోంది. సృంజయులు, మత్స్యులు, శిబులు వీరు కూడా ఈ మధ్య ప్రాంతంలోనే నివశించారు అని ఐతరేయ, శతపథ బ్రాహ్మణాలు చెబుతున్నాయి.

పశ్చిమదేశంలో నీచులు, అపాచ్యులు, అంబష్ఠ్యులు నివశించేవారు. అని ఐతరేయ బ్రాహ్మణం చెబుతోంది.

ఉత్తర దేశంలో ఉత్తరకురులు, ఉత్తరమద్రులు, బాహ్లీకులు, కేశులు, కేకయులు, కాంభోజులు ఉండేవారు. ఈ ఉత్తర దేశాలు కూడా విజ్ఞాన సంపన్నాలే.

ఒక వ్యక్తిని రాజుగా నిర్ణయించిన తరువాత అతడు అధికారం చెలాయించాలి అంటే పట్టాభిషేకం కావాలి. అందుకే రాజులకు పట్టాభిషేక మహోత్సవం ప్రధానం. ఇది రాజసూయంలో ఒక భాగంగా జరుగుతుంది. రాజసూయంలో ప్రతిపని, ప్రభుత్వంలోని భిన్న క్రియలకు ప్రతీక. ఇందులో రాజును 'రత్నం' అంటారు. అతణ్ణి రక్షించేవాడు 'రత్ని' అనబడతాడు. అటువంటి రత్నులచే స్వీకరించబడినప్పుడే రాజు పట్టాభిషేకానికి, ప్రజాపాలనకు అర్హుడవుతాడు. ఈ రత్నులు సామాన్యంగా 12 మంది ఉంటారు అని శతపథ బ్రాహ్మణం చెబుతున్నది. వారు

1. పురోహితుడు, 2. మహారాణి 3. సేనాని 4. సామంతులు 5. గ్రామపెద్దలు 6. సూతుడు 7. సేనావిభాగపు అధిపతి 8. అంగరక్షకుడు 9. కరగ్రాహకుడు 10. కోశాధికారి 11. పరిశ్రమల అధికారి 12. జూదశాలల మీద అధికారి

**'నావిష్ణుః పృథివీపతిః'** విష్ణ్వంశ లేనిదే రాజు కాలేడు. అందుకే రాజు దైవాంశ సంభూతుడు. అతడు అన్నింటికీ అతీతుడు శాసనాలు చేసేవాడు, వాటిని ఆచరణలో పెట్టేవాడు అతడే. న్యాయానికి, ధర్మానికి, సైన్యానికి అతడే సర్వాధికారి. అని చెబుతున్నాయి. శతపథబ్రాహ్మణము, ఐతరేయ బ్రాహ్మణాలు. వేదకాలంలో రాజ్యపాలనకు రెండు సభలుండేవి. వీటిలో 1. సమితి 2. సభ. సమితిలో గ్రామలనుంచి ఆయా జాతుల, వర్గాలయొక్క ప్రతినిధులు ఎన్నుకోబడేవారు. సభలోనేమో విద్వాంసులు, విజ్ఞానులు ఉండేవారు. వీరిని రాజు నియమించేవాడు. ఈ సమితి, సభ ప్రస్తుతం మనకి ఉన్న అసెంబ్లీ, కౌన్సిలు లాటివే. అసెంబ్లీలో సభ్యులను మనం ఎన్నుకుంటాం. ఆ రోజున సమితిలో సభ్యులను ప్రజలు ఎన్నుకునే వారు. కౌన్సిలులో

సభ్యులు కొంతమందిని ఎన్నుకుంటారు. కొంతమందిని నియమిస్తారు. ఆ రోజుల్లో సభలో సభ్యుణ్ణి రాజు నియమించేవాడు, సభ చాలా చిన్నగా ఉంటుంది. దీనికి ప్రాధాన్యత తక్కువ. సమితికే ప్రాముఖ్యత ఎక్కువ ఉండేది. ఈ రెండింటికీ అధ్యక్షుడు రాజే. బ్రాహ్మణాలలో సభని ప్రస్తావించారు. కాని సమితిని ప్రస్తావించలేదు. యువకులకు సభలో ప్రవేశమున్నదని తాండ్య బ్రాహ్మణం చెబుతోంది.

రాజుకు ప్రజలకు సంబంధాలు సామాన్యంగా ఉండేవి. అవసరమైనప్పుడు, యుద్ధ సమయంలోను ప్రజలతో సత్సంబంధాలు కలిగి ఉండటానికి ప్రజలతోపాటు రాజు కూడా భోజనం చేసేవాడు అని చెబుతోంది శతపథ బ్రాహ్మణం. ప్రజలు పన్నులు సవ్యంగానే చెల్లించేవారు. యుద్ధసమయంలో ప్రజలు తమ భార్యాబిడ్డలను కోటలోనే దాచేవారు. విలువైన వస్తువులను నేలలో దాచేవారు. **అలా రాజులు దాచిన ధనాన్నే, గుప్తనిధి అనే పేరుతో ఇవాళ్ళ మనవాళ్లు తవ్వుతున్నారు.** విజయం నాలుగు రకాలు.

1. జితి – సాధారణ విజయం
2. అబిజితి – జితికన్న కొంచెం ఎక్కువ
3. విజితి – రకరకాల శత్రువులను జయించటం
4. సంజీతం – శత్రుశేషం లేకుండా చెయ్యటం

మహారాణి, కొడుకులు, సోదరులు, రాజు తరువాత ఉన్నతమైన స్థానంలో ఉంటారు. రాణి, రాజసోదరులు పట్టాభిషేక మహత్సవంలో పాల్గొంటారు. రాజుగారి మిగిలిన భార్యలకు కూడా ఉన్నతమైన స్థానం, సమాజంలో గౌరవము ఉంటాయి. అశ్వమేధ యాగం చేసినప్పుడు పాయసంలో రాజుగారి నలుగురు భార్యలు భాగం తీసుకుంటారు. వావాత అంటే రాజుకు అత్యంత ప్రియసఖి దశరథుడికి కైకలాంటిది.

రాజుకు ప్రజలకు మధ్య రాయబారిగా ఉండేది. రాజును కలవలేనివారు ఈమెద్వారా తమ పనులు పూర్తి చేసుకునేవారు. ప్రజలసమస్యలను రాజుగారికి చెప్పేది. ఆవిడ చెబితే రాజు చేస్తాడని ప్రజల నమ్మకం అని ఐతరేయ బ్రాహ్మణం చెబుతోంది. పట్టాభిషేకం తరువాత రాజుగారు మిగిలిన నీటిని తన కుమారునకు ఇస్తాడు. యువరాజైన కుమారుడికి కూడా ప్రభుత్వంలో ఉన్నతస్థానం ఉన్నది. అంటోంది శతపథ బ్రాహ్మణము.

రాజులు దుర్మార్గులై సరిగా పాలన చెయ్యనప్పుడు వారిని గద్దెదించే అధికారం ప్రజలకు ఉన్నది అని శతపథ బ్రాహ్మణం చెబుతోంది. పదభ్రష్టుడైన రాజు 'రాద్యజ్ఞం' చేసి మళ్ళీ సింహాసనం ఎక్కేవాడు అని పంచవిశ్వబ్రాహ్మణము చెబుతోంది. పదభ్రష్టుడు అంటే యుద్ధంలో పదవి పోగొట్టుకున్నవాడు. అంతేకాని ప్రజలచేత గద్దెదింపబడిన వాడు కాదు. కొన్ని సందర్భాలలో దుర్మార్గుడైన రాజును మునులు, ఋషులు చంపి దేశాన్ని రక్షించేవారు. భాగవతం 'వేనమహారాజు' ఇందుకు చక్కని ఉదాహరణ.

దీన్ని బట్టి మనకి తెలిసేది ఏమంటే రాజుగారికి వంశపారంపర్యా హక్కు ఉంది. ప్రజలకు రాజునుశాసించే అధికారమున్నది. రాజుగారు ప్రజలమాట మన్నించేవాడు. రాముడు సీతాపరిత్యాగం చేసింది ప్రజలమాట కట్టుబడే ప్రజాస్వామ్య విలువలు ఉండేవి.

రాజుగారికి నాలుగు రకాల సైనిక దళాలుండేవి. రథ గజ తురగ పదాతిదళాలు. మంచిసేన 'స్వనీకము' అని పిలువబడేది. అని ఐతరేయ బ్రాహ్మణం చెబుతోంది. వీరులు శూరులు ఉన్న సేన, చూసే వారికి భయం గొలిపేది అంటున్నాయి కౌషీతకీ బ్రాహ్మణం, శతపథ బ్రాహ్మణాలు. మంచి సేనానాయకుడు – సుశేణుడు, సేనను

జయించిన వాడు 'సేనాజిత్' అనే బిరుదులలో గౌరవించే వారు. అంటోంది శతవధ బ్రాహ్మణం. రకరకాల సైనికులకు రకరకాల పేర్లు ఉండేవి.

గుర్రాలు, ఏనుగలు, రథాలు, సైన్యంలో ఉండేవి. బాణము, గొడ్డలి మొదలైన ఆయుధాలు ఉపయోగించే వారు. బాణాలు 45 అంగుళాలు పొడవు ఉండేవి.  బాణం కూడా నాలుగు భాగాలుగా చేయబడేది అంటోంది ఐతరేయ బ్రాహ్మణం

ఈ రకంగా రాజు రాజ్యపాలన జరుగుతూ ఉండేవి.

# 18. జగత్తు ఎలా ఆవిర్భవించింది?

చరాచర జగత్తంతా ఎలా ఆవిర్భవించింది అంటే సమాధానం సంహితలో చెప్పుకున్నాం. కాని జగత్తు ఎలా ఆవిర్భవించింది అనే మాట బ్రాహ్మణాలలో కూడా వివరించటం జరిగింది. ఇదంతా కూడా గోపథ బ్రాహ్మణంలో చెప్పబడింది. బ్రహ్మదేవుడికి సృష్టి చెయ్యాలనే కోరిక కలిగింది. ఆయన వెంటనే నీటిని సృష్టించి అందులో తన వీర్యాన్ని ఉంచాడు. దాని నుంచే చరాచర జగత్తంతా ఆవిర్భవించింది. మొదటగా నాలుగు దిక్కులు ఆవిర్భవించినాయి. బ్రహ్మయొక్క మనస్సు నుంచి చంద్రుడు ఆవిర్భవించాడు.

గోళ్ళ నుంచి – నక్షత్రాలు

రోమాల నుంచి – ఓషధులు పుట్టినాయి అంటోంది గోపథ బ్రాహ్మణం. అదే తైత్తిరీయోపనిషత్తులో అయితే పంచభూతాలలో మొదటగా ఆకాశం వచ్చింది.

ఆకాశం నుంచి – వాయువు

వాయువు నుంచి – అగ్ని

అగ్ని నుంచి – జలము

జలము నుంచి – భూమి

భూమి నుంచి – ఓషధులు వచ్చాయి

ఓషధుల నుంచి – అన్నం వచ్చింది

అన్నం నుంచే – జీవుడు ఉద్భవించాడు

అని చెబుతోంది.

# 19. నదీ జలాలు - పంటలు

ఈ జగత్తులో మానవుడికి బాగా అవసరమైనది నీరు. నీరు గనక లేకపోతే మానవుడి మనుగడే లేదు. త్రాగునీరు, సాగునీరు. రెండు రకాలుగాను నీరు కావాలి. అంతే కాదు దైనందిన జీవితంలో ప్రతిదానికి నీరు కావలసిందే. మానవుడు ఆచమనం చేసి నీరు తీసుకుంటే ఆ జలం పాపాన్ని పోగొడుతుంది అని గోపథ బ్రాహ్మణం చెబుతోంది. నీరు అనేకచోట్ల దొరుకుతుంది. బావులు, చెరువులు, నదులు, సముద్రాలు. అయితే సముద్రజలం మాత్రం త్రాగటానికి పనికి రాదు. మిగిలిన జలమంతా త్రాగటానికి కూడా యోగ్యమైనదే. వీటిలో కూడా **నదీజలం అత్యంత శ్రేష్ఠము** అని వేదం చెబుతోంది. మన దేశంలో గంగ, యమున, గోదావరి, సరస్వతీ, నర్మద, సింధు, కావేరి. నదులు జీవనదులు అన్నాం. వీటిలో నీరు ఎప్పుడూ ప్రవహిస్తూనే ఉంటుంది. అలాగే కావేరీ, తుంగభద్ర, కృష్ణవేణి, గౌతమి, భాగీరథీ అనే నదులు ఖ్యాతి పొందినాయి. ఇక్కడ విషయం ఏమంటే ఈ నదుల పేర్లు కొన్ని వేదంలో కనిపిస్తాయి. గంగ యమున సరస్వతుల పేర్లు నారాయణంలోని అఘమర్షణ స్నానఘట్టంలో **ఇమంమే గంగే యమునే సరస్వతి** అని ఈ నదుల పేర్లు చెప్పారు. ఈ నదుల్లో స్నానం చేస్తే మహత్తరమైన ఫలితం దక్కుతుంది. నదిలో స్నానం అంటే ప్రవహించే నీటిలో స్నానం చేస్తే మానసిక రుగ్మతలు, పాపాలు నశిస్తాయి.  గంగోత్రి కొండలలో పుట్టి హిమాలయ పర్వతాలలో అనేక వనమూలికలు, ఓషధల మీదుగా ప్రవహించి ఈలోకంలోకి వచ్చింది. కాబట్టి గంగాజలంలో అనేక ఓషధుల గుణాలున్నాయి. వీటివల్ల గంగలో స్నానం చేసినవారికి రోగాలు తగ్గిపోతాయి. తలవకార బ్రాహ్మణంలో 'వసతీవరీ' అని పిలవబడే పుణ్యనదీ జలంతో స్నానం చేస్తే జీవహింస వల్ల కలిగే పాపం కూడా పోతుందని చెప్పబడింది.

# ౨౦. పంటలు

పంటలను గురించి మాట్లాడేటప్పుడు మనకి సారువా నవంబరు, డిసెంబరు నెలలో చేతికి వచ్చే పంట. దాళువా ఏప్రియల్, మే నెలలలో చేతికి వచ్చే పంట. కొన్ని ప్రాంతాలలో మూడుపంటలు కూడా పండుతాయి అంటారు. ఈ పంటల గురించి బ్రాహ్మణాలు ఏమంటున్నాయో చూద్దాం. నదులు మనకు త్రాగునీరు సాగునీరు కూడా అందిస్తాయి. దీని కోసం కాలువలు త్రవ్వటం, ఆనకట్టలు కట్టటం, సేద్యపు నీటిపారుదల సౌకర్యాలు కలగచేయటం వంటివి చెయ్యాలి. అవి చేస్తాము కూడా. అయితే ఈ పనులన్నీ ఎవరినో చూసి నేర్చుకున్నవి కావు. పురాతన కాలం నుంచి మనకి వాడుకలో ఉన్నవే. సింధు నాగరికతలో ఆ రోజున ప్రతి ఇంటికీ త్రాగునీరు సరఫరా చేవారు అని చదువుకున్నాం. మనమే వీటన్నింటినీ ఇతరులకు నేర్పాంట. వేదంలో ధాన్యం రెండు రకాలుగా ఉంటుంది అన్నారు. భూమిని దున్ని వ్యవసాయం చేసి పండించిన పంట, దున్నకుండా, వ్యవసాయం చెయ్యకుండా పండిన పంట. ఇందులో మొదటిది వ్యవసాయము చేసి పండించిన పంట వడ్లు, గోధుమలు, యవలు, మినుములు, కందులు మొ॥వి. ఇక నీవారము, వెదురు బియ్యం రెండవ రకం. అంటే వ్యవసాయం చెయ్యకుండానే పండించిన పంట. ఇవి అడవుల్లో పండుతాయి. అందుకే గ్రామీణ పంటలు, అరణ్య పంటలు అని రెండు రకాలుగా చెప్పబడుతున్నాయి. కొన్ని పంటలు రెండుచోట్లా పండుతాయి. ఈ విషయాలు శతపథబ్రాహ్మణంలో చెప్పబడ్డాయి.

# 21. అరవై రోజుల పంట

ప్రతి సంవత్సరము జూన్, జులై నెలలు వచ్చేసరికి నారుమళ్ళు పొయ్యటం జరుగుతుంది. నారుమళ్ళు అంటే ఏమిటి? విత్తనాలు తెచ్చి జాగ్రత్తగా మొలకలు ఎత్తే విధంగా నారుమళ్ళు పోస్తారు. అవి ఎదిగిన తరువాత పొలం దున్ని నారుని తెచ్చి జాగ్రత్తగా నాట్లు వేస్తారు. ఇక అక్కడ నుంచి వ్యవసాయం పనులు వేగంగా జరుగుతాయి.

మనకి పంట దిగుబడి ఎంత వస్తుంది. హెక్టారుకు ఎన్ని క్వింటాళ్ళు పండుతాయి అనేది ముందు మనం నాటే విత్తనాలమీద ఆధారపడి ఉంటుంది. కేవలము దిగుబడే కాదు సమయం కూడా. ఐదు నెలలా, మూడు నెలలా, నాలుగు నెలలా ఎంతకాలం పంట? ఇది కూడా విత్తనాల మీదే ఆధారపడి ఉంటుంది. అంటే మనం తెచ్చుకునే విత్తనాలను బట్టే పంటకాలం, దిగుబడి రెండూ నిర్ణయమవుతాయి. అంతేకాదు విత్తనాన్ని బట్టే చీడపీడలు కూడా ఉంటాయి. ఇవన్నీ చూసుకుని తక్కువ సమయంలో ఎక్కువ దిగుబడి ఇచ్చే విత్తనాలను వాడటం శ్రేయస్కరం. కాని ఆ సమయంలో మన రైతు మాత్రం దారుణంగా మోసపోతున్నాడు. నకిలీ విత్తనాలు వస్తున్నాయి. ఆ విత్తనాలు నాటితే ఒక్కొక్కసారి పంట దిగుబడి దారుణంగా తగ్గిపోయి రైతు విపరీతంగా నష్టపోతాడు. ఎక్కడి దాకానో ఎందుకు? నా చిన్నప్పుడు దొడ్లో బెండచెట్లు పెట్టుకునే వాళ్ళం. ఒకసారి బెండ విత్తనాలు తెచ్చి నాటాం. మంచి ఎరువు కూడా వేశాం. మొక్కలు బాగా ఏపుగా ఐదు అడుగుల ఎత్తు ఎదిగినాయి. కాని ఒక్కటి కూడా పూవూ లేదు పిందా లేదు. చివరకు మొక్కలు పీకి పారేశాం. అదే రైతు పొలంలో విత్తనాలు వేసి ఉంటే ఎంత నష్టపోయేవాడో ఊహించండి.

**నకిలీ విత్తనాలు అమ్మే వ్యాపారస్తులారా? మీకు కలిగే తాత్కాలిక లాభం కోసం దేశాభివృద్ధిని నిలువునా పాతర వెయ్యకండి.** విజ్ఞతతో కళ్ళు తెరచి చూడండి. మీకు లాభము రావాలనుకోవటంలో తప్పులేదు. కాని అది ప్రక్క వాడికి ప్రాణాంతకం కాకూడదు. **ఆ రోజుల్లోనే 60 రోజులలో పండే వరిని సాగుచేశారు. అరవై రోజులలో పండే వరిని 'అశుప్రీహి' అన్నారు.**

# 22. ఓషధులు

మనదేశంలో అనేక ఓషధులున్నాయి. ప్రాచీన కాలం నుంచీ ఆయుర్వేదం, మూలికావైద్యం బాగా అభివృద్ధి చెందాయి. ప్రతి మొక్కా ఒక మందే. తెలిసి మనం ఉపయోగించుకోవాలి అంతే. వినాయక చవితికి 21 రకాలపత్రి వాడతాం. ఆ పత్రి అంతా ఎప్పుడూ మనకి అందుబాటులో ఉండాలి. అందుకే దాని వినియోగం చెప్పటం జరుగుతోంది. ఈ ఓషధులు ఎక్కువగా పర్వత ప్రాంతంలో దొరుకుతాయి. హిమాలయ పర్వతాలలో 'మృతసంజీవిని' అనే ఓషధి ఉన్నదని దాన్ని హనుమంతుడు తెచ్చాడని రామాయణంలోని యుద్ధకాండలో చెప్పటం జరిగింది. బల, అతిబల, నాగబల, మహాబల వీటిని బలచతుష్టయం అంటారు. బలానికి బాగా పని చేస్తాయి. హిమాలయాలలో 'సీబల' అనే ఓషధి దొరుకుతుంది. అది ఒక తీగె. అది గుండె జబ్బుకు అద్భుతమైన మందు అని చెబుతున్నాడు సాయణాచార్యుడు. బి.పి.కి ఉపయోగించే మొక్క **'సర్పగంధి'** దానినుంచే మాత్రలు తయారుచేసి గుండె జబ్బుకు వాడతారు. ఆ మందు పేరే **'సర్పాపిల్'** ఈ రకమైన ఓషధులు మనకు పర్వతాలలో దొరుకుతాయి. ఇవన్నీ చెప్పబడ్డాయి వేదంలో.

# 23. సముద్రపు నీరు ఎందుకు ఉప్పగా ఉంటుంది?

ఇది సామాన్యమైన మానవుడికి అంతు చిక్కని ప్రశ్న. సముద్రపు నీటిలో లవణాలు ఎక్కువ ఉంటాయి. అందుకే అవి ఉప్పగా ఉంటాయి అంటారు శాస్త్రవేత్తలు. కాని వేసవిలో ఎండ వేడికి సముద్రంలో నీరు ఎండిపోయి ఆవిరి అయి వర్షంగా కురుస్తుంది. ఆ వర్షపు నీరు చప్పగా ఉంటుంది. ఆ నీరు వాగులుగా ప్రవహించి నదిలో కలుస్తుంది. నదిలోనీరు తియ్యగా ఉంటుంది. ఆ నదులు సముద్రంలో కలుస్తాయి. ఇప్పుడు ఆ నీరంతా ఉప్పగా మారిపోతుంది. దీనికి కారణం ఏమిటి? ఈ ప్రశ్నకు సమాధానం చెబుతోంది గోపథ బ్రాహ్మణం. కాని దాంతో సామాన్య మానవుడు తృప్తి చెందకపోవచ్చు. ఇంతకీ గోపథ బ్రాహ్మణం ఏం చెప్పిందంటే "సృష్టికర్త నీటిని సృష్టించి అందులో తన ప్రతిబింబాన్ని చూసుకున్నాడు. ఆ సమయంలో ఆయన వీర్యం ఆ నీటిలో పడింది. దాంతో నీరంతా వేడెక్కి ఉప్పగా తయారయింది" అంటోంది. **ఎవరు నమ్మినా నమ్మకపోయినా వేదం చెప్పింది ఇదే.**

# 24. రావివేప చెట్లకు ఎందుకు ప్రదక్షిణాలు చెయ్యాలి?

మనం చేసే ప్రతిపనికి వెనకాల ఎంతో కొంత సైన్సు (విజ్ఞానము) ఉండి తీరుతుంది. ఈ పని చెయ్యడి మీకు లాభం ఉంటుంది అంటే మీరు చెయ్యరు. ఈ పని చెయ్యటం వల్ల ఫలానా దోషం పోయి మీకు శుభం కలుగుతుంది. స్వర్గం వస్తుంది. ఈ పని చెయ్యకపోతే మహాపాపం. అని చెబతారు. ఉదాహరణకు చాలా చిన్నపని. ఉదయం నిద్ర లేవాలి. తెల్లవారి బారెడు పొద్దెక్కేదాకా నిద్రపోరాదు. అలాటివారికి నాయనా! ఇలాడుకోవటం మంచిది కాదు. ప్రొద్దున్నే నిద్ర లేవకపోతే దరిద్రం. లక్ష్మీదేవి ఇంట్లోంచి వెళ్ళిపోతుంది. ఒక్క క్షణం కూడా ఉండదు. దరిద్ర దేవత తాండవం చేస్తుంది అనిచెప్పాం అనుకోండి. ఉదయాన్నే లేస్తాడు. మనం అనేక పనులను ఈ రకంగానే చేయిస్తుంటాం. వాటిలో రావివేప చెట్లకు ప్రదక్షణాలు ఒకటి, ఇక్కడ రావిచెట్టు అగ్నితత్త్వం గలది. ఆ చెట్టుకు ప్రదక్షిణం చేస్తే వంట్లో వేడి పుడుతుంది. తద్వారా స్త్రీలకు ఉన్న గర్భకోశ సంబంధమైన వ్యాదుల నివారణ జరుగుతుంది. తైత్తిరీయ బ్రాహ్మణంలో అగ్ని ఈ చెట్టులో సంవత్సరకాలం ఉండిపోతుంది. కాబట్టి ప్రదక్షిణ చేసే వారికి వంట్లో వేడిగా ఉంటుంది.

ఇక వేపచెట్లకు కూడా పవిత్రత ఉంది. రోగ నిరోధక శక్తి ఈ చెట్టు నుంచి మానవుడికి వస్తుంది. వేప చేదుగా ఉంటుంది. వేపగాలి ఎన్నో రోగాలను తగ్గిస్తుంది. ప్రత్యేకించి క్షయరోగమున్న చోట టి.బి. శానిటోరియాలలో వేపచెట్లు ఎక్కువగా పెంచుతారు. కారణం

వేపగాలికి క్షయరోగం చాలా వరకు తగ్గుతుంది. వేపచెట్టుకు స్త్రీ గర్భాన్ని పవిత్రం చేసే శక్తి ఉంది. అందుకే రావి, వేప ఈ రెండు చెట్లు శివపార్వతులు అంటారు. ఆ రెండూ కలిసి ఉన్నట్లైతే స్త్రీలు వాటికి తప్పనిసరిగా ప్రదక్షిణాలు చెయ్యాలి. అలా చేస్తే స్త్రీలకు త్వరగా సంతానం కలుగుతుంది. ఇలాటి నమ్మకాలు, భయం, పాపం చెప్పి ఆ పనులు చేయిస్తారు.

రావి చివుళ్ళు రక్తపోటు రాకుండా చేస్తాయి. వేప సంతానవతులుగా చేస్తుంది. అందుకే రెండింటినీ కలిపి ప్రదక్షిణాలు చేయాలి.

# 25. సూర్యచంద్రులు

సూర్యుడు లోకాలకు ప్రత్యక్ష నారాయణుడు. మిగిలిన దేవతలు ఉన్నారో లేరో తెలియదు కాని సూర్యుడు మాత్రం ఉన్నాడు. అందరికీ అంటే ఆస్థికులు, నాస్తికులు, ఇతర మతాలవారు ఎవరైనా సరే అందరికీ దర్శనం ఇస్తూనే ఉంటాడు. నువ్వు ఏమనుకున్నా ఇక్కడ నిమిత్తంలేదు. ఆయన కనిపిస్తే సూర్యోదయం ఆయన కనిపించకపోతే సూర్యాస్తమయం. నిజానికి సూర్యుడికి ఉదయం, అస్తమానం లేవు. నిరంతరము అలా తిరుగుతూనే ఉంటాడు. మనకి పగలయితే ఇంకోచోట రాత్రి. ఈ భూమిమీద విడిగా దిక్కులు, అనేవి లేవు. తుర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం. ఇలాంటి దిక్కులు ప్రత్యేకంగా లేవు. సూర్యుడు కనిపించిన వైపే తూర్పు కనిపించకుండా పోయిన వైపు పడమర అంతే. ఉదయానికి అస్తమానానికి మధ్య సంధ్యాసమయం. ఈ సమయంలో సూర్యోపాసన మంచిది.

అలాగే చంద్రుడు. అందగాడు. సోముడు. ఇతడు సోమానికి ప్రతీక. దేవతలు చంద్రుణ్ణి త్రాగుతారు (సోమాన్ని) కాబట్టి చంద్రుడి, కళలు తగ్గిపోతాయి. అయితే చంద్రుడు ఓషధులు వస్తువులు తీసుకుని తనకళలు పెంచుకుంటాడు. ఈ విషయాలన్నీ షడ్వింశబ్రాహ్మణంలో చెప్పటం జరిగింది.

# 26. ప్రకృతి వైపరీత్యాలు

మామూలుగా ఉండే స్థితి కాకుండా వేరొక స్థితి పొందటం. ఉన్నట్టుండి రాత్రికి రాత్రి భూమి కంపించటం. నదులుపొంగటం. అప్పటిదాకా ఆహ్లాదకరంగా ఉన్న వాతావరణం ఒక్కసారిగా మారిపోయి కుంభవృష్టి కురవటం జరుగుతుంది. అమెరికాలో అయితే ఉన్నట్టుండి వాతావరణం మారిపోతుంది. ఈదురు గాలులు. కుంభవృష్టి. రోడ్లమీద జనం తిరగవద్దు అని పోలీసు హెచ్చరికలు. 1977 నవంబరులో దివిసీమ ఉప్పెన, 2014 అక్టోబరులో విశాఖపట్నంలో తుఫాను బీభత్సం వీటినే ప్రకృతి వైపరీత్యాలు అంటారు. ఇలా ప్రకృతి వైపరీత్యాలు ఏర్పడినప్పుడు ప్రత్యేకంగా కొన్ని మంత్రాలు పఠించాలి అంటోంది షడ్వింశ బ్రాహ్మణం. ఈ బ్రాహ్మణంలో ఆరవ అధ్యాయం మూడవ ఖండం నుంచి చివరిదాకా అన్నీ ఇలాటివే. విపరీతము – శాంతి మంత్రము. ఇప్పుడు ఆ విపరీతాలు ఎలా ఉంటాయో చూద్దాం.

1. భూకంపాలు, అకాలవర్షాలు, చెట్లు అకాలంలో పూలు పుయ్యటం. పండ్లు పండటము. – **'అగ్నిం దూతం'** .. మంత్ర పఠనము

2. గుడ్లగూబలు ఇంట్లో ప్రవేశించటం. ధూళి వానలాగా కురవటం. చెట్ల నుంచి రక్తం కారటం. రాత్రిపూట ఇంద్రధనస్సు కనపడటం. ఒక్కొక్కసారి చెట్ల నుంచి రక్తంలా ద్రవం కారుతుంది. అలాగే రాత్రిపూట ఇంద్రధనుస్సు సూర్యకిరణాల పరావర్తనం చెందినప్పుడు ఇంద్ర ధనుస్సు ఏర్పడుతుంది. పగటి పూట మాత్రమే కనిపిస్తుంది 'వాత ఆ వాతు' మంత్రపఠనం. రాత్రిపూట ఇంద్రధనుస్సు రావటం విపరీతం.

3. తేనె పట్టులు ఎక్కడో తోటల్లో పెడతాయి. సామాన్యంగా

ఇవి పూదోటలోనే ఉంటాయి. కాని అవి వచ్చి ఇళ్ళలో పట్టులు పెడితే – **అధిత్సందేవం** అనే మంత్రజపం చెయ్యాలి.

4. హఠాత్తుగా తోకచుక్కలు కనపడటం – ఇటువంటి సమయంలో ఒక మంత్రం పారాయణ చెయ్యాలి. దేవతా ప్రతిమకు కళ్ళ వెంబడి నీరు కారటం. వీటికి శాంతి ప్రకరణాలున్నాయి.

నీళ్ళలో రాళ్ళు తేలటం, కొండరాళ్ళు దొర్లిపడటం. నాలుగుకన్న ఎక్కువ కాళ్ళతో పశువులు పుట్టటం. షడ్వింశ బ్రాహ్మణంలో ఇలాటివి అనేకం చెప్పబడ్డాయి.

# 27. ప్రకృతి సౌకర్యాలు

లోకంలో ప్రకృతి మనకు అన్నింటిని ఇస్తుంది. తినటానికి తిండి, కట్టుకోవటానికి బట్ట, ఉండటానికి ఇల్లు. ఈ పదాలకు అర్థం జాగ్రత్తగా చూడాలి. లోకంలో 84 లక్షల జీవరాశి ఉన్నది. అన్నీ అందరికీ ఒకేలా ఉండవు. ఆహార నిద్రాభయ మైధునాలే ఒకలా ఉంటాయి. మిగిలినవన్నీ ఏ జీవికి ఆ జీవికే ఉంటాయి. ఉదాహరణకు తినటానికి అన్నము. అన్నము అనేది అందరికీ ఒకటే కాదు. మనకి వరిఅన్నం. ఇంకొకరికి గోధుమఅన్నం ఇంకొకరికి జొన్న అన్నం. పశువులకు గడ్డి అన్నం. పక్షులకు ఆహారం వేరు. కట్టుకోవటానికి బట్ట, ఉండటానికి ఇల్లు. ఇవన్నీ వేరువేరుగా ఉంటాయి. ఇలా అందరికీ కావలసినవి ఇస్తుంది ప్రకృతి ఐతరేయ బ్రాహ్మణంలో ఈ విషయం చక్కగా వివరించారు. ఇందులో ప్రాచీనవంశం అనే వెదురుతో నిర్మించే శాల, సోమయాగం చేసి యజమాని ధరించే వస్త్రం. వీటిని వివరించింది. 'శాల్మలీ' వృక్షం (బూరుగు చెట్టు) నుంచి పట్టువస్త్రాలు తయారు చేస్తారని తైత్తిరీయసంహిత చెబుతోంది.

ఇవేకాక ప్రకృతి మనకు అనేక దివ్యమైన ఔషధాలు ఇస్తున్నది. 'నీలి' అనేది ఒక ఓషధి. ఇది నల్లగా ఉంటుంది. దీనివల్ల బొల్లి తగ్గుతుంది. జుట్టుకు రాస్తే జుట్టు మెరవదు. ఉదంబర వృక్షము (అత్తిచెట్టు మేడిచెట్టు) ఇది అన్నసారము నుంచి పుట్టింది. కాబట్టి మేడిపండు చాలా బలమైనది అని చెబుతోంది తైత్తిరీయ బ్రాహ్మణము. శమీవృక్షము (జమ్మి చెట్టు) జ్వరాన్ని తగ్గిస్తుంది. లోహశుద్ధికి దివ్యమైన ఓషధి ఇది. అలాగే జిల్లేడు వాతాన్ని హరిస్తుంది. దర్భ క్రిమికీటకాలను నశింప చేస్తుంది. అని తైత్తిరీయ బ్రాహ్మణం చెబుతోంది. పద్మలత దుంప క్షయవ్యాధికి దివ్యౌషధము. ఇంకా అనేక తీగలు, మొక్కలు, ఆకులు అన్నీ, ఓషధులుగా ఉపయోగిస్తున్నాయి. ఇవన్నీ మనకి ప్రకృతి ప్రసాదించే వరాలు అంటోంది తైత్తిరీయ బ్రాహ్మణం.

# 28. యజ్ఞం - దేవతలు

ఆయా దేవతలను ఉద్దేశించి సమర్పించే ఆహుతులే యజ్ఞం అనబడతాయి. శాస్త్రోక్తంగా అగ్నిని ప్రజ్వలింప చేసి అందులో దేవత పేరుచెప్పి ఆహుతులు సమర్పించటాన్నే యజ్ఞము అంటారు. ఉదాహరణకు **"ఇంద్రాయ స్వాహా"** అంటూ ఇంద్రుణ్ణి ఉద్దేశించి ఆహుతి సమర్పించి **ఇంద్రాయ ఇదం నమమ** ఇది ఇంద్రుడికే. నాకు కాదు. అంటూ త్యాగం చెప్పాలి. ఇలా వేదమంత్రాలు చదువుతూ ఆహుతులు సమర్పించటాన్నే యజ్ఞము అంటారు. బ్రాహ్మణాలలో యజ్ఞాలు పూర్తిగా వివరించబడ్డాయి.

**అసలు యజ్ఞాలు ఎలా జరుగుతాయి?**

ఇప్పుడు యజ్ఞము అంటే ఏమిటో చూశాం. ఇక యజ్ఞం ఎలా జరుగుతుందో చూద్దాం. యజ్ఞం చేసేటప్పుడు దేవతలను ఆహ్వానిస్తాము. ఈ దేవతలు మూడు రకాలు 1. పృథివీ దేవతలు 2. అంతరిక్ష దేవతలు 3. ద్యులోక దేవతలు. మనం ఏ రకమైన యజ్ఞం నిర్వహిస్తున్నామో దానికి సంబంధించిన దేవతలను ఆహ్వానిస్తాం. వాళ్ళకు కూర్చోవటానికి దర్భాసనాలు పరుస్తాం. ఇప్పుడు వాళ్ళు వచ్చి ఈ దర్భాసనాల మీద కూచుంటారు. ఇప్పుడు దేవతలకు ప్రధానమైన సోమరసంతోపాటు బియ్యం పిండి, గోధుమ పిండితో చేసిన రొట్టె (పురోడాశము) నెయ్యి, పాలు, పెరుగు, తేనె మొదలైన ద్రవ్యాలను దేవతలకు ఆహుతులుగా ఇస్తారు. అంతేకాక వివిధ రకాల ఋక్కుల (మంత్రాలు, సూక్తాలు)లతో దేవతలను ఆనందపరుస్తారు. చిన్ని ఉదాహరణ ఏమంటే గణపతి హోమం చేస్తున్నప్పుడు మోదకాలు

(ఉండ్రాళ్ళు) గణపతికి అత్యంత ప్రియమైనవి హవనం (హోమం) చేస్తూ, గణపతి మంత్రాన్ని చెప్పటం జరుగుతుంది. ఈ రకంగా క్రమపద్ధతిలో మంత్రం చెబుతుంటే ఆ గణపతి చాలా ఆనందిస్తాడు. ఆ తరువాత అక్కడికి వచ్చిన దేవతలను ఆయుష్య. ఆరోగ్యము, ఐశ్వర్యము, సుఖము, శాంతి, అధికారము, గౌరవము, కీర్తి, ప్రతిష్ట ఇత్యాదులు కావాలి అని ప్రార్థిస్తాము. ఇదంతా లౌకికానికి సంబంధించినది. ఇక్కడ గమనించవలసిన విషయం ఏమంటే వేదంలో చెప్పిన యజ్ఞయాగాది క్రతువులన్నీ లౌకికానికి సంబంధించినవే. అంతేకాని పారలౌకికానికి మాత్రంకాదు. ఈమాటచెబితే నేను ఏదోవేదాన్ని అవమానిస్తున్నాను అని కొందరు అనుకునే ప్రమాదం ఉంది. ఎందుకంటే ఇప్పటికే కొన్ని రకాల విమర్శలు వస్తున్నాయి. **"వేదంలో చెప్పిన విషయాలు ఇలా అందరికీ తెలిసేటట్లుగా బహిర్గం చేస్తున్నారు. ఇది తప్పుకాదా? ఆ రోజున సాయణుడు చెప్పాడంటే వేదార్థం పండితులకు మాత్రమే అర్థం అయ్యేలా చెప్పాడు. కాని ఇప్పుడు నువు చెప్పేది సామాన్యుడికి కూడా చేరుతోంది. అందులో అర్హత లేనివాళ్ళు చాలా మంది ఉన్నారు. వారందరికీ వేదార్థం బహిర్గతం చెయ్యవచ్చా?"**

ఇలాటి విమర్శలు చాలా వస్తున్నాయి. అందరికీ నేచెప్పే సమాధానం ఒకటే. హైందవధర్మాన్ని రక్షించేది నేను ఒక్కడినే కాదు. హిందువులంతా రక్షించాలి. నేను కేవలము ప్రచారకుణ్ణిమాత్రమే. మనధర్మం, సంస్కృతి, సంప్రదాయం ఇలా ఉంటాయి. అని చెబుతాను. దాన్ని పరిరక్షించాల్సింది మీరు. సామాన్యప్రజలు కాబట్టి వారందరికీ వేదంలో ఏముందో కొంచెం అయినా తెలియాలి. అందుకే ఈ పుస్తకం వ్రాస్తున్నాను. ఇది వేదాన్ని కించపరచటం కాదు. దీనివల్ల వేదంయొక్క

ప్రతిష్ఠ పెరుగుతుందే కాని తగ్గదు. కాబట్టి దయచేసి దీన్ని పదిమందికీ చేరనివ్వండి.

జాగ్రత్తగా పరిశీలిస్తే యజమాని గాని, ఋత్విక్కు గాని దేవతలను ఓ దేవతా! ఈ లోకం నుంచి విముక్తి కావాలి. నాకు స్వర్గం కావాలి. మోక్షం కావాలి అని ప్రార్థించిన సందర్భాలు లేవనే చెప్పాలి. అందుకే యజ్ఞయాగాది కర్మలు (బ్రాహ్మణాలలో చెప్పినవి) పూర్తిగా లౌకికాలు.

ఇక దేవతల విషయానికొస్తే – దేవతలు మొత్తం మూడు రకాలు అని గతంలో చెప్పుకున్నాం. వారు అందరూ కలిసి 33 మంది వీరు 1. భూమి 2. ఆకాశం 3. స్వర్గం అనే మూడు లోకాలకు సంబంధించిన వారు అని గతంలో చెప్పుకున్నాం. ఈ దేవతలు అష్టవసువులు ఎనిమిది మంది ఏకాదశ రుద్రులు, పదకొండు మంది ద్వాదశాదిత్యులు, పన్నెండు మంది, ప్రజాపతి, వషట్కారుడు, వెరసి 33 మంది

**1. అష్టవసువులు :** వీరు ఎనిమది మంది

1. ఆపుడు 2. ధ్రువుడు 3. సోముడు 4. అధ్వరుడు 5. అనిలుడు 6. ప్రత్యూషుడు 7. అనలుడు 8. ప్రభాసుడు. వీరి నాయకుడు అగ్ని.

ఇందులో ఎనిమిదవ వాడే భారతంలో భీష్ముడు.

**2. ఏకాదశరుద్రులు :** వీరు పదకొండు మంది. వీరి నాయకుడు ఇంద్రుడు. వీరు

1. అజైకపాదులు
2. అహిర్బుధ్న్యుడు
3. త్వష్ట
4. రుద్రుడు
5. హరుడు
7. వృషాకపి
8. శంభుడు
9. కపర్ది
10. మృగవ్యాధుడు
11. శర్వుడు

6. త్ర్యంబకుడు

వీరిలో పాఠాంతరము కూడా ఉంది. వీరి ప్రకారము

1. అజుడు
2. ఏకపాదుడు
3. అహిర్బుధ్న్యుడు
4. త్వష్ట
5. రుద్రుడు
6. హరుడు
7. శంభుడు
8. త్ర్యంబకుడు
9. అపరాజితుడు
10. ఈశానుడు
11. త్రిభువనుడు

**3. ద్వాదశాదిత్యులు :** వీరు మొత్తం 12 మంది. వీరి నాయకుడు వరుణుడు. వీరు :

1. ఇంద్రుడు
2. ధాత
3. పర్జన్యుడు
4. త్వష్ట
5. పూష
6. ఆర్యముడు
7. భృగుడు
8. వివస్వంతుడు
9. విష్ణువు
10. అంశుమంతుడు
11. వరుణుడు
12. మిత్రుడు

వీరు కాక ప్రజాపతి, వషట్కారుడు మొత్తం దేవతలు 33 మంది అని చెబుతున్నాయి పంచవిశ్వబ్రాహ్మణము, శతపథ బ్రాహ్మణాలు.

బృహదారణ్యకోపనిషత్తులో యాజ్ఞవల్క్యుడు శాకల్యుడితో యజ్ఞంలో హవిర్భాగం తీసుకునే దేవతలు 33 మంది వారు అష్టవసువులు. ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, ఇంద్రుడు, ప్రజాపతి వెరసి 33మంది అంటాడు.

యజ్ఞయాగాల్లో వచ్చే దేవతలు. వీరే కాకుండా ఇంకొంతమంది ఉన్నారు. వారు ఋభువులు. మరుత్తులు, విశ్వేదేవతలు, సాధ్యాలు, భృగు అంగీరసులు అని జైమినీయ బ్రాహ్మణం చెబుతోంది.

అసలు ఎవరీ దేవతలు? ఈ విషయాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే – వీరంతా ప్రకృతికి సంబంధించిన శక్తులు. దేవతలంతా విజ్ఞానం కలవారు. కాంతిమంతులు – వీరందరూ తమ యొక్క ప్రకాశత్వంతోనే దైవత్వాన్ని పొందారు. వీరందరూ మన కన్న గొప్పశక్తిమంతులు. గొప్ప గొప్ప పనులు చేస్తారు. అయితే సత్యమే దేవత, అసత్యం మానవుడు అని శతపథ బ్రాహ్మణం చెబుతోంది. ప్రజాపతి దేవతలను సృష్టించాడు. ఓషధులన్నీ దేవపత్నులు అని శతపథ బ్రాహ్మణం చెబుతోంది. అయితే జైమినీయ బ్రాహ్మణంలో శబ్దప్రకంపనలే దేవతా స్వరూపాలని చెప్పబడింది. ఇంద్రుడు మనసు, వాక్కుల నుంచి జన్మించాడు అని చెప్పబడింది.

దేవతలకి మనుష్యులకి తేడా ఉంది. ఈ తేడాని మనం వివిధ రకాలుగా అనుకుంటూ ఉంటాం. దేవతలకు అతీత శక్తులుంటాయని మానవులకు అలాంటివి ఏమీ ఉండవని చెబుతుంటాం. ఈ విషయం జైమినీయ బ్రాహ్మణంలో వివరంగా చెప్పారు. మనుష్యులకు నాయకుడు మనస్సు. దేవతల నాయకుడు జలం. మనుష్యులను జ్ఞానేంద్రియాలు కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము, మనస్సు, ప్రాణం నడిపిస్తున్నాయి. దేవతలకు నీరు, వాయువు, ఆదిత్యులు, దిక్కులు, భూమి మార్గదర్శకంగా ఉంటాయి. మానవుడు దేవతలకు నివాస భూమి అని చెప్పబడ్డాడు. దేవతలకు భూమి రథంగా చెప్పబడుతోంది.

ఇక్కడ ఇంకొక విషయం ఏమంటే దేవతలు పనులన్నీ రహస్యంగా చేస్తారు. పరోక్షంగా చేస్తారు. అగ్ని, వాయువు, ఆదిత్యుడు మూడు

లోకాలకు ప్రతినిధులు. ఈ లోకంలో మానవుడు చేసే అన్ని పనులకు వాళ్ళే సాక్ష్యం.

దేవతలందరికీ అగ్ని, ప్రజాపతి, ఇంద్రుడు ప్రతినిధులుగా చెప్పబడ్డారు. యజ్ఞంలో దేవతలకు సమర్పించిన హవిర్భాగాలు అగ్నిదేవుని ద్వారా దేవతలకు అందుతాయి. ఇక బ్రాహ్మణాలలో చెప్పిన దేవతలను చూద్దాం. ఇక్కడ ఒక్క విషయం గమనించండి. సంహితలో మనం దేవతల గురించి చెప్పుకున్నాం. వారిలో కొంతమందిని గురించి బ్రాహ్మణాలలో చెప్పటం జరుగుతోంది. కాబట్టి దేవతలలో ముఖ్యమైన వారిని ఇప్పుడు చూద్దాం.

**1. ప్రజాపతి :** ఇతడు సృష్టికర్త. జీవులన్నింటికీ ఆధారమైనవాడు. సృష్టి జరగకుండ ఉన్న రోజుల్లో ప్రజాపతి ఒక్కడే ఉండేవాడు. అతడే ప్రపంచంగా, జీవరాశిగా రూపొందాడు. ఈ సృష్టిలో మొదటగా జలం ఏర్పడింది. నీటినుంచి భూమి వచ్చింది. ఆ తరువాత దేవతలు, మానవులు, అందరూ ఏర్పడ్డారు. సర్వప్రాణులు సృష్టించబడ్డారు. అందరినీ రక్షించేవాడు అతడే. ఈ ప్రజాపతి యజ్ఞం చేసి దేవతలను పోషించాడు. కాబట్టి ప్రజాపతే యజ్ఞము అని చెప్పబడ్డాడు. బ్రాహ్మణాలలో దేవతలందరిలోను ప్రజాపతికి అగ్రస్థానం ఇవ్వబడింది.

ప్రజాపతి నుంచే ఈ సృష్టి అంతా జరిగింది. ఈ ప్రజాపతి మనస్సునుంచి మానవుణ్ణి, కనులనుంచి గుర్రాన్ని, శ్వాసనుంచి ఆవును, చెవులనుంచి గొర్రెలు, కంఠస్వరంనుంచి మేకను సృష్టించాడు. మానవుడు ప్రజాపతి యొక్క మనసు నుంచి సృష్టించబడ్డాడు. కాబట్టి అన్ని ప్రాణులలోను మొదటివాడుగా చెప్పబడుతున్నాడు. ప్రాణులన్నింటిలోను అతడే శక్తివంతుడు, బుద్ధిమంతుడు. ప్రజాపతి కేవలము తన సంకల్పం ద్వారా పంచభూతాలను, ఉచ్చారణ ద్వారా

భూలోక భువర్లోక సువర్లోకాలు సృష్టించాడు.

**2. అగ్ని :** యజ్ఞంలో దేవతలకు సమర్పించే ఆహుతులు అగ్ని ద్వారానే వారికి చేరతాయి. అందుకే దేవతలలో ప్రథమస్థానం అగ్నికే ఇవ్వబడుతుంది.

**'అగ్నిర్ అగ్రే దేవానాం'** అంటోంది తైత్తిరీయ బ్రాహ్మణము. దేవతలలో అగ్ని అగ్రగణ్యుడు. అగ్ని గతంలో చెప్పినట్లుగా వసువులకు నాయకుడు. అగ్నిదేవుడు దేవతలందరికీ ప్రతీక. అతడే అన్నపతి, వీర్యవంతుడు, సంతానానికి కారకుడు. ప్రతిగృహస్తుడు కూడా ఓ దేవతా ! నా పాపాలు ప్రక్షాళనం చేయవలసింది అని ప్రార్థిస్తాడు. యజ్ఞకుండంలో ఉన్న అగ్నివల్ల ధూమం (పొగ) ధూమంవల్ల మేఘాలు వస్తాయి. మేఘాల వల్ల వర్షం కురుస్తుంది. ఈ రకంగా అగ్ని సకల జీవుల జీవనానికి కారణం మవుతున్నాడు. ఈ విషయమంతా శతపథ బ్రాహ్మణంలో చెప్పబడింది. సోమయాగం చేసేటప్పుడు భార్యలతో కలసిఉన్న అగ్నికి తర్పణలు ఇవ్వబడతాయి.

**3. ఇంద్రుడు :** ఇతడు దేవరాజు. స్వర్గానికి అధిపతి. బలము, ఓర్పు, తేజస్సు గలవాడు. ఇంద్రుడు అగ్ని ఇద్దరూ లోకరక్షకులు.

**4. వరుణుడు :** ధర్మానికి అధిపతి. వరుణుడు రాజులకు రాజు. సామ్రాట్టు.

**5. మిత్రావరుణులు :** క్షత్ర ధర్మాలకు ప్రతీక. వీరిద్దరూ ఎప్పుడూ కలిసే ఉంటారు. మిత్రుడు పగటికి, వరుణుడు రాత్రికి చెందినవారు.

**6. సోముడు :** చంద్రుడే సోముడు. ఇతడే సోమలత. ఇతడు ఓషధులకు రాజు. వనస్పతులకు అధిపతి. సోమలతే దేవత.

**7. రుద్రుడు :** సమస్త భూతాలకు అధిపతి.

**8. సవిత :** ప్రేరకశక్తి గల దేవత. ఆదిత్యుని ఇంకొక రూపము.

**9. అశ్వనీ దేవతలు :** వీరు జంటదేవతలు. దేవ వైద్యులు.

**10. విష్ణువు :** దేవతలలో పెద్దవాడు అని చెబుతోంది ఐతరేయ బ్రాహ్మణం. విష్ణువు సర్వస్వతంత్రుడు. దేవతల పక్షాన రాక్షసులతో యుద్ధం చేసి వారిని ఓడించేవాడు. ఇతడు సర్వవ్యాపి.

**11. ఆదిత్యుడు :** ఇక్కడ ప్రత్యక్షనారాయణుడు సూర్యుడు. ఇతడికి దివ్యదృష్టి ఉంది. తన కాంతితో లోకాలన్నీ రక్షిస్తాడు. మానవులని కర్మలు చెయ్యమని చెప్పేవాడు ఇతడే. ఈ విషయాలు జైమినీయ బ్రాహ్మణంలో చెప్పబడ్డాయి.

**12. వాయువు :** దేవతలలో మితిమీరిన వేగం కలవాడు. జీవులకు వాయువే ప్రాణం. వాయువే జీవం. దేవతలకు హవిస్సు స్వాహా అనే పదంతో అర్పిస్తారు. పితృదేవతలకు స్వధా అనే పదంతో తర్పణ విడుస్తారు. దేవతలకు లోహపాత్రలు, చెక్క పాత్రలు వాడతారు. పితృదేవతలకు మట్టి పాత్రలు వాడతారు.

**13. స్త్రీ దేవతలు :** అదితి. దేవమాత ప్రపంచానికి తల్లి. ఈమె ప్రపంచాన్ని భరిస్తోంది.

బ్రాహ్మణాలలో యజ్ఞం శ్రేష్ఠమైనది. యజ్ఞం ప్రజాపతికి ప్రతీక, యజ్ఞం చెయ్యటం ద్వారా ఏదైనా సాధించవచ్చు. గోపథ బ్రాహ్మణంలో యజ్ఞస్వరూపాన్ని వివరించారు. యజ్ఞాలు మూడు రకాలు. 1. సోమయజ్ఞాలు ఇవి ఏడు 2. పాకయజ్ఞాలు ఇవి ఏడు 3. హవిర్యజ్ఞాలు ఏడు.

యజ్ఞాలు చేస్తే చెడుతొలగిపోయి శుభంకలుగుతుంది. పౌర్ణమినాడు యజ్ఞం చెయ్యటం శుభప్రదం. ధ్వరము అంటే హింస

అని అర్థం. అధ్వరము అంటే హింస లేనిది. యజ్ఞాన్ని అధ్వరము అంటారు. యజ్ఞంలో జరిగే పశువధ హింస కాదు. హింస అంటే శత్రుభావంతో, ద్వేషంతో ప్రాణులను గాయపరచటం, చంపటం. **యజ్ఞంలో వధించబడిన పశువుకు స్వర్గము వస్తుంది. కాబట్టి అది హింస కాదు. అంటారు ప్రాచీనులు, సంప్రదాయవాదులు. ఏ దృష్టితో చేసినా (వధించినా) అది హింసే అంటారు ఆధునికులు.**

# 29. బ్రాహ్మణాలలో అనేక విషయాలు

మానవ జీవితానికి పరమావధి పురుషార్థ సాధన. పురుషార్థాలు అంటే ధర్మ, అర్థ, కామ, మోక్షాలు. నిజానికి పురుషార్థాలు నాలుగు కాదు ఒక్కటే. అదే మోక్షము. మోక్షము అంటే ముక్తి. ముక్తి అంటే విముక్తి. సంసార బంధనాల నుంచి ఐహిక బంధనాల నుంచి విముక్తిని పొందటమే ముక్తి. మిగిలిన మూడు ధర్మ అర్థ కామాలు మోక్షం సాధించటానికి సోపానాలు. పరమ సత్యమైనది పరబ్రహ్మ. ఆ పరబ్రహ్మ సాక్షాత్కారమే మోక్షము. ఇంతమంది దేవతలు లేరు. ఉన్నది ఒక్కడే పరమేశ్వరుడు. ఆ పరమేశ్వరుడు వేదసారమైన ఓంకార స్వరూపుడు, గోపథ బ్రాహ్మణంలో ఓంకారము త్రిమూర్తి స్వరూపంగా చెప్పబడింది. శతపథబ్రాహ్మణంలో పరమేశ్వరుడు జగత్తునంతా సృష్టించిన ప్రథమతత్త్వం అని చెప్పబడ్డాడు. మొదటగా బ్రహ్మమే జగత్తు. బ్రహ్మమే దేవతలందరి సృష్టికర్త అని చెబుతోంది శతపథ బ్రాహ్మణం. త్రయీవిద్య అంటే ఋక్, యజు, సామాలే త్రయీవిద్య. అదే వేదవిద్య. ఆ వేదవిద్యయే పరబ్రహ్మ అని చెప్పబడింది. ఈ రకంగా బ్రాహ్మణాలలో సర్వజగత్తుకు మూలం పరమేశ్వర స్వరూపం అదే పరబ్రహ్మ అని చెప్పబడింది. ఆ తరువాత కాలంలో ఉపనిషత్తులలో పరమేశ్వరస్వరూపమే పూర్తిగా విచారించబడింది. **'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ'** అని ఉపనిషత్తులలో చెప్పారు. బ్రహ్మ, ఆత్మ రెండూ ఒక్కటే అనే శాండిల్యుని సిద్ధాంతం శతపథబ్రాహ్మణంలో చెప్పబడింది. ఉపనిషత్తుల ప్రధాన సిద్ధాంతం ఇదే.

**ఆత్మ :** బ్రాహ్మణాలలో ఆత్మ గురించి చెప్పబడింది. ఆత్మ సహజమైనది. జీవులకు చైతన్యాన్ని కలిగిస్తుంది. దేహం వేరు. ఆత్మ

వేరు. ఆత్మకి నివాస గృహం శరీరం. అందుకే దేహము ఆత్మ రెండూ కలిసే ఉండాలి అంటోంది తైత్తిరీయ బ్రాహ్మణం. ప్రజాపతి బ్రహ్మరంధ్రం గుండా శరీరంలో ప్రవేశించాడు. అని చెబుతోంది తైత్తిరీయ బ్రాహ్మణం. అలా ప్రవేశించి ఆహారాన్ని తీసుకుని, పేరు, రూపము పొందాడు. శతపథబ్రాహ్మణం జననమరణచక్రాలను వివరించింది. మానవ శరీరంలో పదిప్రాణాలు, ఒక ఆత్మ ఉన్నాయి. మొత్తం పదకొండు ఏకాదశ రుద్రులు అంటోంది. అయితే బృహదారణ్యకోపనిషత్తులో జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు మనస్సు వెరసి పదకొండు ఇవే ఏకాదశ రుద్రులు అని చెప్పబడింది.

సాధారణంగా ఆ లోకం ఈ లోకం, అది ఇది అనే పదాలు వాడుతుంటాం. అది అంటే దూరాన ఉన్నది. ఇది అంటే దగ్గరగా ఉన్నది. అలాగే ఆ లోకము అంటే స్వర్గం అని ఈ లోకము అంటే భూలోకం అని తైత్తిరీయ బ్రాహ్మణంలో చెప్పబడింది.

**స్వర్గనరకాలు :** ఇలా చెప్పుకుంటూ పోతే అసలు స్వర్గనరకాలు ఉన్నాయా? అనే అనుమానం వస్తుంది. వీటిని గురించి బ్రాహ్మణాలు ఏమంటున్నాయో చూద్దాం.

తైత్తిరీయ బ్రాహ్మణంలో స్వర్గానికి ఏడు ద్వారాలు ఉన్నాయని చెబుతున్నారు. అవి ఆశా, కామ సంకల్ప, బ్రహ్మ, యజ్ఞం, ఆపః, అగ్ని అనబడే ఏడు ద్వారాలున్నాయని చెబుతోంది. ఈ రకంగా తైత్తిరీయ బ్రాహ్మణంలో స్వర్గాన్ని వివరించి ఖచ్చితంగా చెప్పారు. కొన్నిచోట్ల స్వర్గం ఉన్నదా, లేదా అనే చర్చ కూడా జరిగింది. పంచవింశ ద్బ్రాహ్మణం, శతపథబ్రాహ్మణాలలో స్వర్గం ఉన్నదా లేదా అని ఆలోచిస్తుంటే, జైమినీయబ్రాహ్మణంలో స్వర్గాన్ని చూసిన వాళ్ళు లేరు. కాబట్టి స్వర్గం లేదు. అన్నారు.

మనం మామూలుగా మాట్లాడుతూ పుణ్యపాపాలు అంటాం. ఈ పుణ్యపాపాలు పూర్తిగా పురాకృత సుకృతము. మంచిపనులు చేస్తే పుణ్యము, చెడ్డపనులు చేస్తే పాపము వస్తుంది. ఈ విషయమే తైత్తిరీయ బ్రాహ్మణంలో పుణ్యకర్మే సుకృత మని చెప్పబడింది. ఇంకొకచోట సూర్యలోకమే స్వర్గము అన్నారు. స్వర్గమనేది మరణానంతరము మనం పొందేది. పుణ్యకార్యాలు చెయ్యటంవల్ల స్వర్గంవస్తుందని శతపథ బ్రాహ్మణం చెబుతోంది. యజ్ఞాలుచెయ్యటం, తపస్సుచెయ్యటం అనేవి పుణ్యకార్యాలు. వీటివల్ల స్వర్గంవస్తుందని ఐతరేయ బ్రాహ్మణం చెబుతోంది. ఇతర లోకాలలో ప్రాణులు జన్మించవు. భూలోకంలోనే జన్మిస్తాయి. మానవుడి సంపూర్ణ ఆయుర్దాయం వందసంవత్సరాలు. ఇదే పూర్ణాయుష్యు.

గాలి బుడగ మానవ జీవితం. కాబట్టి యజ్ఞయాగాదులు వాయిదా వెయ్యకండి. అంటోంది శతపథ బ్రాహ్మణం. **పెద్దపెద్ద యాగాలు చెయ్యలేకపోయినా ప్రస్తుత కాలాన్ని బట్టి చండీహోమం, వనదుర్గా, మహావిద్యలాంటి హోమాలయినా చెయ్యండి. మీకు నా సహకారం తప్పకుండా ఉంటుంది.**

మరణధర్మం గలది భూలోకం. ఇక్కడ పుట్టిన ప్రతిజీవి మరణించి తీరవలసిందే. పగలు, రాత్రి, మాసము, సంవత్సరము వీటివల్ల మానవుడి ఆయువు నశిస్తోంది. మానవుడి పూర్ణాయువు వందసంవత్సరాలు. కావాలంటే అంతకన్న ఎక్కువ కాలం జీవించగలడు. జఠరాగ్నిని కాపాడుకున్నవాడు 300 సం॥లు, ధ్యానంవల్ల 300 సం॥లు, యోగంవల్ల 300 సం॥లు. ఇలా వెయ్యి సంవత్సరాలు మానవుడు జీవించగలడు.

బ్రాహ్మణాలన్నీ పునర్జన్మని అంగీకరించాయి. కౌషీతకీ

బ్రాహ్మణంలో పునర్జన్మ బదులు పునర్మృత్యువు అన్నారు. యజ్ఞయాగాది కర్మలు చెయ్యటం వల్ల మానవుడు పునర్జన్మ అనే చక్రాన్ని జయిస్తాడు. రాహుణగోతముడు 'మిత్రవింద' అనే యజ్ఞాన్ని తెలుసుకున్నాడు. ఇది తెలుసుకున్న జనకుడు దాన్ని ఆచరించి పునర్జన్మను, మరణాన్ని జయించాడని శతపథ బ్రాహ్మణంలో చెప్పబడింది. 'సావిత్రి విద్య' తెలిసినవాడు జననమరణాలను దాటగలడు అని తైత్తిరీయ బ్రాహ్మణం చెబుతోంది. **తైత్తిరీయ బ్రాహ్మణంలో బొందితో కైలాసంచేరటం కూడా చెప్పబడింది.**

పుత్రులు లేకపోతే ఆనందము, పరలోకము లేవు. పుత్రులు కలగనప్పుడు పుత్రేష్టి అనే క్రతువు చెయ్యాలని చెబుతోంది తైత్తిరీయ బ్రాహ్మణం. అదే పుత్రకామేష్టి.

అన్నింటికన్న ముఖ్యమైంది హింస. యజ్ఞంలో పశువధ జరుగుతుంది. కాబట్టి యజ్ఞం హింసాత్మకం అంటారు. అశ్వమేధ యాగంలో అహింస కోసం 'పర్యగ్నికరణం' తరువాత అడవి జంతువుల్ని వదిలి పెట్టేస్తారు. భూమిని దున్ని చదును చేస్తారు అది హింస కాదు. భూమికి హింస కలగకుండా కొంత గడ్డి వదులుతారు అంటోంది శతపథ బ్రాహ్మణం. రోకలితో రోలులో దంచేప్పుడు భూమికి దెబ్బ తగలకుండా జింకచర్మాన్ని పరిచి, దానిమీద రోలు ఉంచి దంచుతారు అంటోంది శతపథ బ్రాహ్మణం. మానవుడు పాపాలు చెయ్యటానికి అతడి ప్రవృత్తే కాక పరిసరాలు కూడా తోడ్పడతాయి. మితిమీరిన నిద్ర, సోమరితనం, కోపం, ఆకలి, జూదం, కామక్రీడలో అతిగా పాల్గొనటం. ఇవన్నీ పరమ పాపాలు అని చెబుతోంది. తైత్తిరీయ బ్రాహ్మణం. సోమలతను నలగకొట్టటం కూడా పాపమే అని భావించారు. అందుకే ఓ సోమలతా ! మమ్ము క్షమించవలసింది అని ప్రార్థించారు.

గృహస్తును పాపాల నుంచి అగ్నిదేవుడు రక్షిస్తాడని, అసత్యవాదిని వరుణుడు శిక్షిస్తాడని చెబుతోంది తైత్తిరీయ బ్రాహ్మణం, ఈ రకంగా బ్రాహ్మణాలతో అనేక విషయాలు చెప్పబడ్డాయి.

# 30. ఆహితాగ్ని

ఈ మాట మనం చాలాసార్లు వింటుంటాం. శిష్టాచార సంపన్నులు, వేదపండితులు వీళ్ళని గురించి చెప్పేటప్పుడు 'ఆహితాగ్ని' అనే పదం వాడతాం. ఈ పదానికి అర్థం చాలా వివరంగా చెబుతోంది తలవకార బ్రాహ్మణం. మనం చేసే కర్మలో మొట్టమొదటిది అగ్నిహోత్రం. అగ్నిని ఉద్దేశించి చేసే కర్మ ఇది. అందుకే దీన్ని అగ్నిహోత్రము అంటారు. దీన్ని ఎవరు చెయ్యాలి అంటే ఆహితాగ్ని అయినవాడు చెయ్యాలి అంటారు. మరి ఆహితాగ్ని అంటే ఎవరు? కొన్ని ఫలితాలు ఆశించి కర్మలు చేస్తున్నాం. సామాన్యంగా ప్రతి మానవుడు కూడా స్వర్గాదిఫలాలు ఆశించే కర్మలు చేస్తాడు. ఈ కర్మలు చెయ్యాలంటే కొన్ని అర్హతలు కావాలి. వాటిలో ఒకటి అగ్నిని సిద్ధింపచేసుకోవటం. 'అగ్న్యాధానం' అనే కర్మ చేసి అగ్నిని సంపాదించాలి. ఇక తరువాత చేసే యాగాలు, కర్మ అంతా ఈ అగ్నిలోనే చేయటం జరుగుతుంది. అంటే అన్ని యాగాలకు అసలు మూలం అగ్న్యాధానము. దాన్ని చేసిన వాడికే మిగిలిన యాగాలు చేసే అర్హత వస్తుంది. అటువంటి వ్యక్తినే ఆహితాగ్ని అంటారు. ఇలాటి వ్యక్తి మాత్రమే అగ్నిహోత్రం చెయ్యాలి.

**'జ్యోతిష్టోమేన స్వర్గకామోయజేత'** జ్యోతిష్టోమం చెయ్యటంవల్ల స్వర్గం సిద్ధిస్తుంది. అయితే స్వర్గము అనేది మరణానంతరము సిద్ధించేది కదా? ఇది అనుమానం. అది సరికాదు. స్వర్గము అంటే – దేవలోకము, సుఖము అని అర్థం. చిన్న ఉదాహరణ చూడండి ఇది స్వర్గంలా ఉంది అంటాం. ఇక్కడ స్వర్గము అంటే సుఖము అని అర్థం. ఇది సుఖంగా అత్యంత సుఖంగా ఉంది. లోకంలో ధనం కొందరికి, ధాన్యం కొందరికి ఇలా రకరకాల కోరికలు ఉంటాయి. కాని విచిత్రం ఏమంటే

అందరికీ సుఖం కావాలి. ఎవరి కోరికలు వారివి. కాని సుఖం మాత్రం అందరికీ కావాలి. ఈ సుఖం అనేది మరణానంతరమే రావాలి అని ఏమీలేదు. మానవుడు బ్రతికి ఉండగానే ఈ లోకంలోనే అనుభవించవచ్చు. ఇంత ప్రయోజనకారి అయిన ఈ యాగాన్ని ఆచరించే పద్ధతి ఎలాంటిది? అంటే–

యజమాని భార్యతో కలిసి ఒక శుభముహూర్తంలో అగ్నిష్టోమం చేస్తాను అని సంకల్పించి, ఆ యాగం చేయించే ఋత్విక్కుల కోసం కబురు చెయ్యాలి. అలా ఆహ్వానింపబడిన ఋత్విక్కులను యజమాని వారి వారి కార్యాలకు విభాగాలకు నియోగిస్తాడు. సోమయాగంలో ఋత్విక్కుల సంఖ్య 16. వీరిని నాలుగు భాగాలుగా విభజిస్తారు. ఆ బాగాలకు అధ్వర్యుడు, బ్రహ్మ, హోత, ఉద్గాతలు అధిపతులు. వీరిలో అధ్వర్యుడు యజుస్సులతోను హోతఋక్కులతోను, ఉద్గాత సామాలతోను, కార్యక్రమాలు చేస్తారు. నాలుగు వేదాలు తెలిసిన బ్రహ్మ కర్తవ్యంలో ఏ లోటు రాకుండా కనిపెట్టి చూస్తుండాలి. యాగారంభంలో అధ్వర్యుడు దీక్షీయ అనే ఇష్టిని చేయించి యజమానికి అతని భార్యకు దీక్ష నివ్వాలి. దీక్షాకాలంలో యజమాని దంపతులు వంటికి వెన్న రాచుకోవాలి కంటికి కాటుక పెట్టుకోవాలి. యజమాని గోటితో గోకకూడదు. దీనికి జింక కొమ్ము వాడాలి. ఆహారంగా పాలు, అత్తిపళ్ళు, పెరుగు, పేలాలు తీసుకోవాలి. లేకపోతే వట్టి అన్నం మాత్రం తినవచ్చు. అబద్ధం ఆడరాదు. అపశబ్దాలు పలకరాదు. పళ్ళు కనిపించేటట్లు నవ్వరాదు. స్త్రీ సుఖం పరత్యజించాలి. ఎప్పుడూ యాగశాల నుంచి బయటకు వెళ్ళరాదు. ఋత్విక్కులకు దక్షిణ ఇచ్చేదాకా ఎవరేమిచ్చినా తీసుకోకూడదు. యజ్ఞద్రవ్యం కావాలంటే దూతల్ని నలుదిక్కులకు పంపాలి. ఇది యజ్ఞవిధి. ఈ రకంగా ఈ యాగం చెయ్యటానికి అనేక నిష్ఠలు చెబుతోంది తలవకార బ్రాహ్మణం.

# 31. ఋత్విక్కులు

యజ్ఞంలో పాల్గొనే ఋత్విక్కులలో బ్రహ్మ ప్రధానమైన వాడు అతడు అథర్వ వేదంలో నిష్ణాతుడై ఉండాలి. యజ్ఞయాగాలలో కలిగే అనేక లోపాలను బ్రహ్మ సరిదిద్దాలి. అన్ని లోపాలకు ప్రాయశ్చిత్తం చేయించాలి. అని చెబుతోంది గోపథబ్రాహ్మణం.

అగ్న్యాధ్యేయం కన్న- పూర్ణాహుతి

పూర్ణాహుతి కన్న- అగ్నిహోత్రం

అగ్నిహోత్రం కన్న-దర్శపూర్ణమాసలు

దర్శపూర్ణమాసలకన్న- ఆగ్రయణం

ఆగ్రయణం కన్న- చాతుర్మాస్యం

చాతుర్మాస్యం కన్న- పశుబంధం

పశుబంధం కన్న- అగ్నిష్టోమం

అగ్నిష్టోమంకన్న- రాజసూయం

రాజసూయం కన్న- వాజపేయం

వాజపేయం కన్న- సర్వమేధం

సర్వమేధం కన్న- దక్షిణావంతాలు

దక్షిణవంతాల కన్న- దక్షిణలు

ఆ దక్షిణలకన్న-సహస్రదక్షిణం ఉత్తమమైనవి

యజ్ఞయాగాలు నిర్వహించటానికి ఋత్విక్కులు నలుగురు కావాలి. 1. బ్రహ్మ 2. హోత, 3. ఉద్గాత 4. అధ్వర్యుడు. వీరికి సహాయకులు ముగ్గురు చొప్పున ఉంటారు.

1. బ్రహ్మకు – బ్రహ్మణాచ్ఛంసి, పోత, అగ్నీధ్రుడు

2. ఉద్గాతకు – ప్రస్తోత, ప్రతిహర్త, సుబ్రహ్మణ్యుడు

3. హోతకు – మైత్రావరుణుడు, అచ్ఛావాకుడు, గ్రావస్తుత్

4. అధ్వర్యుడు – ప్రతిప్రస్థాత, నేష్ట, ఉన్నేత

ఈ రకంగా మొత్తం 16 మంది ఋత్విక్కులుంటారు.

# 32. ప్రాయశ్చిత్తం

కర్మ చేసేటప్పుడు ఏదైనా పొరపాటు జరిగితే ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. అలా చేసినట్లైతే జరిగిన పొరపాటు సరిదిద్దబడుతుంది. దానివల్లవచ్చే ఆపద కూడా దాదాపుగా రాదనే చెప్పాలి.

అలాగే జీవితంలో పొరపాట్లు చేసి వాటిని దిద్దుకోలేక పతితులైన వారు ఎందరో ఉంటారు. అలాటి వాళ్ళని ఉద్ధరించటానికి తాండ్య బ్రాహ్మణంలో 17వ అధ్యాయంలో రెండవ ఖండలో ఉన్న **'వ్రాత్యస్తోమాల'**ను చెప్పటం జరిగింది. దీని ముఖ్యాశయం పతితులు, భ్రష్టులు, మొదలైన బ్రాహ్మణేతరులకు ప్రాయశ్చిత్తం చేసి శుద్ధిపరచటం. ఈ వ్రాత్యస్తోమాలు ఆరురకాలుగా ఉన్నాయి. అందులో ఒకటి కుమారులకు యువకులకు చేయతగినది ఒకటి ముసలివారికి చేసేది.

ఆ రోజుల్లో వ్రాత్యులకు కుషీతకుడు గురువుగా ఉండేవాడు. వ్రాత్యుడు అంటే ఉపనయన సంస్కారము లేని ద్విజుడు. అంటే వయసు పెరిగినా ఉపనయనం లేకుండా పని, పాటు, చదువు సంధ్యా లేకుండా తిరిగేవాళ్ళు. వీరందరూ భ్రష్టాచారులై తిరుగుతుండే వారు. అలాటి వారిని చూసి 'లుశాకపి' అనేవాడు వీళ్ళందర్నీ శపించాడు. ఆ శాపంతో వ్రాత్యులు ఇంకా భ్రష్టులై పోయారు. అందువల్ల కుషీతక శిష్యులు అందరూ వెలివేయబడ్డారు. ఈ విషయమంతా తాండ్య బ్రాహ్మణంలోని 17వ అధ్యాయంలో చెప్పబడింది.

తాండ్య బ్రాహ్మణంలోని 25వ అధ్యాయంలో సారస్వత యజ్ఞాలు అని మూడు యజ్ఞాలు చెప్పబడ్డాయి. వాటిలో ఒకటి మిత్రావరుణులకు, రెండవది ఇంద్రాగ్నులకు మూడవది ఆర్యముడికి సంబంధించినవి. **సరస్వతీ వినశనే దీక్షంతే** అని చెప్పినట్లు సరస్వతీనది ప్రవహించే

ప్రాంతం. అది అంతరించిన ప్రదేశంలో యాగదీక్ష తీసుకోవాలి. ఈ సరస్వతి యొక్క తూర్పు, పడమరలు అన్ని లోకాలకు కనపడతాయి. కాని దాని మధ్య భాగం మాత్రం కనపడదు. అంటే ఆ నది అంతర్వాహిని అన్న మాట. ఇక్కడే యాగం నిర్వహించాలి. దృషద్వతినది సరస్వతి మధ్యలో కలుస్తుంది. ఆ సంగమ ప్రదేశంలో బలదేవతాక చరువును, హోమం చేస్తారు. తరువాత దృసది, ఆ నది అంతరించిన చోట యమునలో అవబృధం చెయ్యాలి. అంతేకాని సరస్వతిలో మాత్రం చెయ్యరాదు. ఒకవేళ సరస్వతిలో చెయ్యటం అనివార్యమైతో సరస్వతీ జలం బయటకు తెచ్చుకుని స్నానం చెయ్యాలి. అని చెప్పబడింది.

# 33. యజ్ఞయాగాలు ఎవరు చెయ్యాలి?

ఎవరి తండ్రి, తాత యాగాలు చేస్తారో అతడే యజ్ఞయాగాలు చెయ్యటానికి అర్హుడు అంటోంది తాండ్య బ్రాహ్మణం. నా తండ్రి తాత యాగం చెయ్యలేదు కాబట్టి నేను చెయ్యటానికి వీలులేదు. అని యాగప్రక్రియ మానెయ్యమని కాదు. ఇందులో అంతరార్థం ఏమంటే నువ్వు గనక యజ్ఞయాగాదులు చెయ్యకపోతే ఇక ముందు నీ వంశంలో ఎవరూ చెయ్యటానికి వీలుండదు కాబట్టి ప్రతి ఒక్కరూ యజ్ఞయాగాది క్రతువులు చేసితీరాలి. ఇదీ అందులో అంతర్లీనంగా ఉన్న అర్థం.

ఇక్కడ ఒక చిన్న విషయం గమనించండి. ఒకసారి ఒక పెద్దాయన, వేదం చదువుకున్న వ్యక్తి మాట్లాడుతూ "వీళ్ళంతా చేసే యాగాలను మేం అంగీకరించం" అన్నాడు. నేను వెంటనే ఎందుకని అన్నాను. దానికి ఆయన యాగం చెయ్యాలంటే-

1. శిఖ ఉండి తీరాలి.
2. ఉపనయనం నాలుగు రోజులు జరగాలి.
3. ఐదురోజులు పెళ్ళి జరగాలి.
4. రజస్వలాపూర్వ వివాహం జరగాలి.
5. యజమాని తండ్రి, తాత, ముత్తాత యజ్ఞం చేసి ఉండాలి.
6. యజమాని ఆహితాగ్ని అయి ఉండాలి.
7. బలి అంటే పశుబలి మాత్రమే ఇవ్వాలి.
8. ఆయన వేదంచదువుకుని ఉండాలి.

ఇలాంటివారు చేస్తేనే యాగం అవుతుంది అన్నారు. ఇక్కడ మనం విషయాన్ని జాగ్రత్తగా పరిశీలిద్దాం.

1. శిఖ అంటే అది గోష్పాదంఅంత ఉండాలి. కాని ప్రస్తుతం ఉన్న చాలామంది ధరించేది శిఖ కాదు నాలుగు వెంట్రుకలతో కనిపించీ కనిపించనట్లుగా ఉండే 'పిలక' శిఖ అనేది జ్ఞానానికి చిహ్నం. పిలక లౌకికం.

2. ఉపనయనం నాలుగు రోజులు జరగాలి. ఇది మీయొక్క ఉత్సాహము ఆర్థిక స్తోమత మీద ఆధారపడి ఉంటుంది.

3. వివాహం ఐదు రోజులు. ఇది కూడా ఉత్సాహము, ఆర్థిక స్తోమత. ఒక రోజు వివాహం అంటేనే లక్షలు కావాలి. వేదిక అద్దె లక్షలరూపాయలు, మరి ఐదు రోజులు పెళ్ళి అంటే

4. రజస్వలా పూర్వ వివాహం. ఇది వేదంలో చెప్పబడలేదు. బాల్యవివాహం క్రిందికి వస్తుంది. చట్టరీత్యా నేరము.

5. యజమాని తండ్రి యజ్ఞం చేసి ఉండాలి. మా తండ్రి చెయ్యలేదు. అంటే నేను చెయ్యటానికి లేదా? అంతే కాదు ఇక మా వంశంలో వారెవరూ చెయ్యకూడదు. ఇలా చూస్తే చాలామందికి యజ్ఞం చేసే అర్హత ఉండదు.

6. యజమాని ఆహితాగ్ని అయి ఉండాలి. గతకాలంలో లాగా ఇంట్లో కూచుంటే భుక్తి గడవదు. జాగ్రత్తగా ఆలోచించండి.

7. పశుబలి చట్టరీత్యా నేరము. ఆ రోజుల్లో చట్టం ఒప్పుకుంది. ఈ రోజున కాదు. ప్రత్యామ్నాయం వెతుక్కోవాలి. లేకపోతే లోపల కూర్చోవాలి.

8. వేదపండితుడు కావాలి. వేదపండితుడు అంటే ఎంతో కొంత వేదం చదువుకుంటాడు. అంతేకాని పూర్తిగా వేదమే

చదువుకోవాలి, అంటే అన్నం ఎవరు పెడతారు? వేదం చదువుకున్నవాడికి దానిమీద ఉద్యోగం రావటం కష్టం. భుక్తి గడవదు. కాబట్టి లౌకిక విద్య ఏదో ఒకటి నేర్చుకుని ఎంతో కొంత వేదం చెప్పుకుని, వేదం అంటే మంచి అభిప్రాయం కలిగిఉంటే చాలు.

ఈ విషయాలు జాగ్రత్తగా దృష్టిలో పెట్టుకుని, ఏ రకంగా అయితే వేదవిద్య ప్రచారం అవుతుంది? అనే విషయం ఆలోచిచండి. అంతేకాని లేనిపోని ఆటంకాలు కల్పించవద్దు. బ్రహ్మక్షత్రియ వైశ్యులలో ఎవరైనా యజ్ఞయాగాలు చెయ్యవచ్చు. ఇంకొక విషయం ఏమంటే **కర్మసిద్ధాంతంలో యజ్ఞయాగాలు నిషాదులు కూడా చెయ్యవచ్చు. అని చెప్పబడింది. కాబట్టి కొంచెం పెద్దమనసు చేసుకుని ఏ రకంగా అయితే పదిమంది ఈ కర్మలు కొన్నైనా చెయ్యగలుగుతారో ఆలోచించండి. అంతరించిపోతున్న సంప్రదాయాన్ని విస్తరింప చేయటానికి ప్రయత్నించండి. సాధ్యమైనంత వరకు ఎక్కువమందితో ఇవి చేయించండి. వైదికమతాన్ని విస్తరింపచెయ్యండి.** వేదాన్ని అందరూ తెలుసుకోవాలి. వేదంలో ఏముందో అందరికీ (బ్రాహ్మణేతరులకి కూడా) హిందువు అన్న ప్రతివాడికీ తెలియాలి. అప్పుడే వైదిక ధర్మం నిలబడుతుంది. నేను ప్రచారకుణ్ణి మాత్రమే. ఇక్కడ నేను అంటే నా వంటివారు పూర్తిగా ప్రచారకులు అంతే. ప్రతిహిందువు, ప్రతిభారతీయుడు రక్షకుడే. కాబట్టి వేదాన్ని గురించి అందరికీ తెలియాలి. యాగాలు, హోమాలు, అర్చనలు, క్రతువులు అందరూ చెయ్యాలి. ఇవి ఏఒక్కరి కాపీరైటుకాదని మనంగుర్తిస్తేనే వైదికమతం ఉద్ధరించబడుతుంది.

చాతుర్మాస్యాలు మూడు రకాలు. 1. ఇష్టిరూపంలో ఉండేవి 2. పశుయాగం 3. సోమయాగం

ఈ బ్రాహ్మణంలో 18వ అధ్యాయంలో రాజసూయాన్ని వివరించారు. ఇది చెయ్యాలంటే ఒక సంవత్సరంపైన పడుతుంది. ఇది క్షత్రియులే చెయ్యాలి. ఇందులో

సోమయాగాలు - 6, పశుయాగాలు - 2, ఇష్టులు - 129 ఉంటాయి. ఇది ఫాల్గుణ బహుళ చతుర్దశి ప్రారంభం అవుతుంది. ఈ యాగంలో చరువును మద్యంతో కలిపి దేవతలకు అర్చించి మిగిలిన దాన్ని రాజు స్వీకరిస్తాడు. దీనివల్ల సార్వభౌమాధికారం, పశుసంపద వృద్ధి పొందుతాయి. ఈ రకంగా తాండ్య బ్రాహ్మణం అనేక విషయాలు చెబుతోంది.

## 34. పురోహితుడు

రాజ్యపాలనలో ముఖ్యమైన పాత్ర పోషిస్తాడు పురోహితుడు. గతంలో మనం చెప్పుకున్నట్లుగా పురోహితుడు అన్ని వేదాలు చదివిన వాడై ఉంటాడు. రాజ్యం క్షేమంగా ఉండాలి అని పురోహితుడు ఎప్పుడూ రాజు వెన్నంటే ఉంటాడు. రాజు కూడా పురోహితుడితో కలిసి మెలిసి ఉండాలి. అతనితో సత్సంబంధాలు కలిగి ఉండాలి అని చెబుతోంది బ్రాహ్మణం. పురోహితుడు సర్వకార్య సర్వావస్థల యందు రాజ్యాన్ని ప్రజలను కాపాడుతూనే ఉంటాడు. అందుకనే ప్రజలంతా రాజుకు విధేయులై ఉంటారు. ఈ రకంగా రాజ్యపాలనలో పురోహితుడికి ప్రముఖపాత్ర ఉన్నది అని చెబుతున్నది ఐతరేయ బ్రాహ్మణం.

## 35. ఉపాఖ్యానాలు

వేదం ఎప్పుడూ కూడా రాజులాగా ఆజ్ఞలు జారీ చేస్తుంది. ఇది చెయ్యి ఇది చెయ్యవద్దు అంటుంది. అయితే ఇలాటి వేదం కూడా కొన్ని సమయాలలో మానవుడికి అతిచేరువగా వచ్చి చిన్న కథ చెప్పి, ఆ కథలో ఒక నీతిని చెప్పి 'నాయనా! కాబట్టి ఈ పని చెయ్యి' అని చెబుతుంది. వీటినే ఉపాఖ్యానాలు అంటారు. ఇవన్నీ మనం చిన్నపిల్లలకి చెప్పే నీతికథల్లాంటివి. కథంతా చెప్పి "కాబట్టి బాలలూ మనం ఎప్పుడూ అబద్ధం చెప్పరాదు" అంటాం. అసలు కథలో ముఖ్యమైన విషయం ఇది. దీన్ని చెప్పటానికే ఈ కథ అంతా చెప్పింది. కొన్ని విషయాలు హృదయానికి హత్తుకుపోయేలాగా చెప్పాలి అంటే దాని వెనక తప్పనిసరిగా ఒక కథ ఉండితీరాలి. అదే ఉపాఖ్యానము. ఇలాంటి ఉపాఖ్యానాలు బ్రాహ్మణాలలో చాలా ఉన్నాయి.

## 36. యజ్ఞయాగాలు

దేవతల పేరు చెప్పి అగ్నిలో ఆహుతులను సమర్పించటమే యజ్ఞము అనబడుతుంది. యజ్ఞయాగాల గురించి బ్రాహ్మణాలలో వివరించటం జరిగింది. ప్రతి వేదము కూడా యజ్ఞయాగాలను చెబుతోంది. అంటే ప్రతిబ్రాహ్మణంలోను యజ్ఞయాగాలున్నాయన్న మాట. కాకపోతే వారి సూత్రాలకు అనుగుణంగా కొద్ది మార్పులతో ఈ యాగాలు అన్ని బ్రాహ్మణాలలోను ఉన్నాయి. ఈ కారణం చేతనే వాటిని విడిగా ఇక్కడ ఇవ్వటం జరుగుతోంది. యజ్ఞయాగాలలో ముఖ్యమైన వాటిని ఇక్కడ ఇస్తున్నాను.

1. అగ్న్యాధానము

2. అగ్నిహోత్రము
3. దర్శపూర్ణమాసలు
4. అనునిర్వాప్యేష్టి
5. అభ్యుదితేష్టి
6. అభ్యుద్ధృతేష్టి
7. దాక్షాయణ యజ్ఞం
8. ఇళాదధేష్టి
9. సార్వసేని యజ్ఞము
10. శౌనక యజ్ఞము
11. వసిష్ఠ యజ్ఞము
12. సాకం ప్రస్థాయ్యేష్టి
13. మున్యయేష్టి
14. తురాయణేష్టి
15. ఆగ్రయణేష్టి
16. శ్యామాకాగ్రయణేష్టి
17. వేణుయనాగ్రయణేష్టి
18. వ్రీహ్యాగ్రయణేష్టి
19. చాతుర్మాస్యయాగాలు
20. వైశ్యదేవము
21. వరుణ ప్రఘాసము

22. సాకమేధము
23. శునాసీరీయము
24. సోమయాగాలు
25. జ్యోతిష్టోమము
26. దీక్షాయణీమేష్టి
27. ప్రాయణీయేష్టి
28. ఉదయనీయేష్టి
29. అతిథ్యేష్టి
30. ప్రవర్గ్య
31. ఉపసత్
32. గవామయనము
33. ఆదిత్యానామయనము
34. అంగీరసానామయనము
35. ద్వాదశాహము
36. అగ్నిహోత్రము
37. వాజపేయము
38. రాజసూయం
39. అశ్వమేధము
40. గోమేధము
41. పురుషమేధము

42. కూశ్మాండహోమం

43. వేయి సంవత్సరాల సత్రయాగం

44. సావిత్ర్యాగ్నిచయనము

45. ఇతర యాగాలు

ఇవే కాక ఇంకా అనేక యాగాలున్నాయి.

అగ్నిహోత్రంలో నేయి, ధాన్యము, వీటితో పాటుగా నేతితో తయారుచేసిన పురోడాశము (పిండిరొట్టె)లను ఆహుతులుగా సమర్పిస్తూ చేసే కర్మనే యాగము అంటారు. ఈ యాగాలు నాలుగు రకాలు 1. దర్వీహోమము 2. ఇష్టి 3. పశుయాగము 4. సోమయాగము

**1. దర్వీహోమము :** ప్రతిరోజు ఉదయం, సాయంత్రం రెండు పూటలా పెరుగు, పాలు, బియ్యం మొదలైన ద్రవ్యాలతో చేసే అగ్నిహోత్రవైదిక కర్మ.

**2. ఇష్టి :** ప్రతి నెలలోను రెండుసార్లు పౌర్ణమి, అమావాస్యలకు పిండి, పాలు, నెయ్యి మొదలయిన వాటితో చేసిన పురోడాశముతో చేసే హోమము.

**3. పశుయాగము :** పశువుల శరీర భాగాలు, పిండి మొదలైన ఇతర పదార్థాలతో తయారైన పురోడాశముతో ప్రత్యేక సమయాల్లో చేసే యాగాలు.

**4. సోమయాగం :** ప్రత్యేకంగా వసంత ఋతువులోను, ఇతర కాలాల్లోను చెయ్యబడే యాగాలు. వీటిలో సోమరసం ద్రవ్యంగా వాడబడుతుంది.

ఇవిగాక యజ్ఞాలు మూడు రకాలు. అవి 1. పాకయజ్ఞాలు 2. హవిర్యజ్ఞాలు 3. సోమయజ్ఞాలు

1. పాకయజ్ఞాలు ఏడు

1. అష్టకము 2. పార్వణము 3. స్థాలీపాకము 4. శ్రద్ధాశ్రావణి, 5. ఆగ్రహాయణి 6. చైత్రి 7. ఆశ్వయజి

వీటిలో హోమద్రవ్యాన్ని ముందుగానే తయారుచేసుకుంటారు.

2. హవిర్యజ్ఞాలు ఇవి ఏడు

1. అగ్న్యాధేయం 2. అగ్నిహోత్రం 3. దర్శపూర్ణమాసలు 4. ఆగ్రాయణం 5. చాతుర్మాస్యం 6. నిరూఢ పశుబంధం 7. సౌత్రామణి. వీటిలో రకరకాల పదార్థాలు ద్రవ్యంగా వాడతారు. పశుమాంసంకూడా వాడబడుతుంది. వీటిని ఇష్టులు, పశుయాగాలు అంటారు.

3. సోమయాగాలు ఇవి ఏడు

1. అగ్నిష్టోమం 2. అత్యగ్నిష్టోమం 3. ఉక్థ్యం 4. షోడశి 5. వాజపేయం 6.అతిరాత్రం 7. ఆప్తోర్యామం

అగ్నిష్టోమాన్నే జ్యోతిష్టోమం అని కూడా అంటారు. 1.ఉక్థ్యం 2. షోడశి 3.వాజపేయం 4. అతిరాత్రం ఈ నాలుగు అగ్నిష్టోమానికి వికారాలు.

ఇవి గాక సత్రయాగాలు రెండు రకాలు

**1. రాత్రిసత్రము :** పన్నెండు నుంచి వందరోజుల వరకు జరిగే యాగము

**2. ఆయనసత్రము :** వందరోజులు దాటి చేసే యాగము.

ప్రతి సోమయాగంలోను యజుర్వేద పండితుడైన అధ్వర్యుడు

హోమం చేస్తుంటే, సామవేద పండితుడు ఉద్గాత స్తోత్రం చేస్తాడు. ఋగ్వేదపండితుడు మంత్రాలు చదువుతాడు. ప్రతియాగంలోను అధ్వర్యుడు, ఉద్గాత, హోత అనే ముగ్గురు ఉంటారు. వీరిలో అధ్వర్యుడు హోమం చేస్తాడు. ఉద్గాత గానం చేస్తాడు. హోత మంత్రోచ్చారణ చేస్తాడు.

ఇక్కడ ఒక ముఖ్యమైన విషయం గుర్తుంచుకోండి. ఋక్కులను సామవేద పండితుడు ఉద్గాత గానం చేస్తే అది స్తోత్రం అంటారు. సామగానం చెయ్యటానికి నలుగురు ఋత్విక్కులుంటారు. వారు

1. ఉద్గాత 2. స్తోత 3. ప్రతిహర్త 4. సుబ్రహ్మణ్యుడు.

మూడు ఋక్కులకు ఒక సామగానం చెయ్యాలి. దీన్ని నిర్ణీత సంఖ్యలో ఆ ఆవృత్తిగా చెయ్యాలి. ఆవృత్తులు కొన్నిచోట్ల 15 ఇంకొన్ని చోట్ల 28గా ఉంటుంది. ఈ సంఖ్యనే 'స్తోమం' అంటారు. గానం చెయ్యాల్సిన మంత్రాలు ఒక క్రమంలో ఏర్పాటు చేస్తాం. దాన్నే 'విష్టుతి' అంటారు.

ఏ యాగం చెయ్యాలన్నా ముందుగా అగ్న్యాధానం చెయ్యాలి.

అధ్వరము అంటే యాగము అని అర్థం. యజ్ఞం చెయ్యటానికి ఋత్విక్కులు నలుగురు ఉంటారు. 1. హోత 2. అధ్వర్యుడు 3. ఉద్గాత. 4. బ్రహ్మ. వీరు వరుసగా ఋగ్ యజుస్సామ అథర్వ వేదపండితులు. వీరి పరిభాషలో చెప్పాలంటే ఈ వేదాలకు

| | | |
|---|---|---|
| ఋగ్ వేదము | – | హోతృవేదము |
| యజుర్వేదము | – | అధ్వర్యువేదము |
| సామవేదము | – | ఉద్గాతృవేదము |
| అధర్వణవేదము | – | బ్రహ్మవేదము |

ఇలా వేదాలకు ఋత్విక్కుల పేర్లతో పిలుస్తారు.

యజ్ఞయాగాలు, వాటి స్వరూప స్వభావాలు, వినియోగం అంటే నిర్వహణా విధానము, ఈ వివరాలన్నీ యజుర్వేదంలో వివరంగా చెప్పబడ్డాయి. ఈ విషయం కృష్ణయజుర్వేదంలో బాగా చెప్పబడింది.

యజ్ఞయాగాలలో చెప్పవలసిన మంత్రాలు సంహిత భాగంలో ఉంటే, ఆ మంత్రాల వినియోగం, యజ్ఞంచేసే విధానం అన్నీ బ్రాహ్మణాలలో ఉంటాయి. యజ్ఞం చెయ్యటం అనేది చాలా శ్రమతో కూడిన పని. ఒకరివల్ల అయ్యేది కాదు. చాలామంది కలిసి చేయవలసిన పని. అందుకే ఏదైనా ఒక పెద్ద పని మనం పూర్తి చేసినప్పుడు "హమ్మయ్య ఇక్కడికి ఒక యజ్ఞం అయింది" అంటాం. అంటే మనం చేసినపని అంత ఉత్కృష్టమైంది అన్నమాట. ఎంతోమంది కష్టపడి పనిచేస్తే తప్పించి ఈ కార్యక్రమం సకాలంలో పూర్తికాదు. యజ్ఞంలో మనం చేయవలసిందంతా వివరంగా చెబుతున్నాయి బ్రాహ్మణాలు; చేసేటప్పుడు మనకి ఏ రకమైన అనుమానం రాదు. ఇది ఇలా జరగాలి. అంతే ఇక దానికి తిరుగులేదు. అనవసరమైన ప్రశ్నలకు తావులేదు.

యజ్ఞంలో హవనం చేయబడేది పురోడాశము. పిండిరొట్టె. ఇది బియ్యంపిండితో గాని, గోధుమపిండితో గాని చెయ్యబడుతుంది. అయితే ఆ పిండి ఎలా వస్తుంది? ఇది ప్రశ్న. వడ్ల నుంచి బియ్యం తియ్యటానికి అనేక పద్ధతులున్నాయి. వడ్లు తిరగలిలో త్రిప్పవచ్చు. పశువులతో తొక్కించవచ్చు ఇంకా ఇంకా అనేక పద్ధతులు. కాని ఈ బ్రాహ్మణం చెబుతోందో తెలుసా? కొయ్యరోట్లో వడ్లుపోసి కొయ్య రోకళ్ళతో దంచాలి. ఆ తరువాత పొట్టును వేరుచేస్తే బియ్యం

బాగుచేసినవి వస్తాయి. ఆ బియ్యాన్ని మాత్రమే వాడాలి. ఆ బియ్యం పిండిగా చేసి ఆ పిండితో పురోడాశము తయారు చెయ్యాలి. పురోడాశము అంటే పిండి రొట్టె, గోధుమపిండితో గాని, బియ్యం పిండితో గాని తయారుచేయబడింది. ఈ విషయం తైత్తిరీయ బ్రాహ్మణంలో చెప్పబడింది.

యజ్ఞాలు కాని యాగాలు కాని ఎన్నిఉన్నాయి అంటే చెప్పటంకూడా కష్టమే. అసంఖ్యాకమైన యజ్ఞయాగాలు. వీటిలో ప్రతిదానికీ విధివిధానం చెప్పుకుంటూ రావాలంటే చాలా సమయం పడుతుంది. అందుకని తేలికైన మార్గం ఒకటి కనిపెట్టారు. యాగాలన్నింటినీ కొన్ని భాగాలుగా చేశారు. ఒక విభాగంలో కొన్ని యాగాలుంటాయి. ఒక విభాగంలో ఒక యాగాన్ని తీసుకుని దాన్ని ప్రకృతియాగము అంటారు. దాని క్రియాకలాపము పూర్తిగా వివరిస్తారు. మిగిలినవి వికృతి యాగాలు. వాటిలో వచ్చే తేడాలు మార్పులు మాత్రం వివరిస్తారు. మిగిలిన వాటికి ప్రకృతి యాగంలాగానే చెయ్యాలి అని చెబుతారు. ఈ రకంగా యజ్ఞయాగాలు ఎలా చెయ్యాలో వివరిస్తున్నాయి బ్రాహ్మణాలు.

యజ్ఞయాగాలు చెయ్యటం చాలా కష్టమైన పని అన్నాం. మరి అన్ని వ్యయ ప్రయాసలకుఓర్చి ఈయజ్ఞాలు యాగాలు ఎందుకు చెయ్యాలి. యజ్ఞయాగాలు చేస్తే ప్రయోజనం ఏమిటి? దీనికి సమాధానం కావాలి. యజ్ఞాలు చెయ్యటంవల్ల జీవాత్మకు ఒక రకమైన సంస్కారం ఏర్పడుతుంది. దాన్నే కొంతమంది చిత్తశుద్ధి అంటారు. ఇదే యజ్ఞయాగాలు చేస్తే సిద్ధించే పరమమైన ప్రయోజనం. మనిషి పుట్టిందగ్గర నుంచి, మరణించేదాకా 40 సంస్కారాలున్నాయి అంటున్నాయి గౌతమ ధర్మ సూత్రాలు, వీటిలో ఏడు హవిర్యజ్ఞాలు,

ఏడు సోమయజ్ఞాలు కూడా ఉన్నాయి.

**1. హవిర్యజ్ఞాలు :**

1. అగ్న్యాధానం
2. అగ్నిహోత్రం
3. దర్శపూర్ణమాసలు
4. అగ్రయణం
5. చాతుర్మాస్యం
6. ని ం ా డ,
పశుబంధం
7. సౌత్రామణి

**2. సోమ యజ్ఞాలు :**

1. అగ్నిష్టోమం
2. అత్యగ్నిష్టోమం
3. ఉక్థ్యం
4. షోడశి
5. వాజపేయం
6. అవిరాత్రం
7. ఆప్తోర్యామం

యజ్ఞాలు చెయ్యటంవల్ల జీవాత్మకు ఒక సంస్కారం ఉంటుంది అంటే కనిపించని ప్రయోజనం కోసం ఎవరూ కష్టపడరు. దానికోసం ప్రాకులాడరు. అందుకనే కామ్యకర్మలు. అనేక కామ్యకర్మలు చెప్పబడ్డాయి. ఈ కామ్యకర్మలు రెండు రకాలు 1. సంస్కారం కోసం చెప్పబడ్డవి. 2. లౌకిక ప్రయోజనాల కోసం చెప్పబడ్డవి. సామాన్యంగా మానవుడికి కావలసినవి లౌకిక ప్రయోజనాలు ఇవి లెక్కలేనన్ని వీటికోసమే ఎక్కువమంది ఈ క్రతువులు చేస్తుంటారు. ఇప్పుడు మనం కొన్ని యాగాలు చూద్దాం.

## 1. అగ్న్యాధానం

ఈ కర్మ చెయ్యనివాడు ఏ శ్రౌతకర్మనీ చెయ్యటానికి లేదు. ఇది స్వతంత్రమైన కర్మ. ఏ ఇతర కర్మకు అంగంకాదు. ఏ హోమమైనా

అగ్న్యాధానం ద్వారా సంస్కరించ బడిన శ్రౌతాగ్నిలోనే జరగాలి. అగ్ని మూడు రకాలు 1. గార్హపత్య 2.ఆహవనీయ 3. దక్షిణాగ్నులు. ఈ మూడు అగ్నులు కాని 4. సభ్య 5. అవసథ్యాగ్నులుతో కలిపి ఐదు కాని సిద్ధించటమే దీని ప్రయోజనం.

**అగ్న్యాధానం ఎలా చెయ్యాలి ?**

ఆదానం చెయ్యటానికి ముందురోజున ముందుగా సంకల్పంచేసి ఋత్విగ్వరుణం చెయ్యాలి. తరువాత అధ్వరుడు రెండు అరణులు పట్టుకొస్తాడు. అరణి అంటే నిప్పురాజేసే రెండుచెక్కలు. ఈ చెక్కలు శాస్త్రంలో చెప్పినట్లుగా పన్నెండు అంగుళాల వెడల్పు, నాలుగు అంగుళాల ఎత్తు పదహారు అంగుళాల పొడవు ఉన్న చెక్కలు. జమ్మిచెట్టు మీద మొలచిన రావిచెట్టు దీన్నే బదనిక అంటారు. ఆ రావిచెట్టు కర్రతో తయారుచేసిన చెక్కలు. ఇవి కోసిన తరువాత నీడలో ఎండాలి. అలా నీడలో ఎండిన చెక్కలనే ఇక్కడ వాడాలి. వేదిక దగ్గర పడమట దిక్కున గార్హపత్యాగ్ని కుండము, వేదికకు తూర్పున ఆహవనీయాగ్ని కుండము, వేదికకు ఆగ్నేయ దిశగా దక్షిణాగ్నికుండము నిర్మించాలి. మిగిలిన రెండు అగ్నులు సభ్య, అవసథ్యాగ్నులను కూడా ఆదానం చెయ్యాలనుకుంటే తూర్పు దిక్కుగా వరుసగా ఆ కుండాలు కూడా నిర్మించాలి.

ఇప్పుడు మనం మూడు అగ్నికుండాలు నిర్మించాం కదా. ఆ మూడూ ఒకే రకంగా ఉండవు.

| | |
|---|---|
| గార్హపత్యాగ్ని కుండం | – గుండ్రంగా ఉంటుంది |
| ఆహవనీయాగ్నికుండం | – చతురశ్రంగా ఉంటుంది |
| దక్షిణాగ్నికుండం | – అర్ధ చంద్రాకారంగా |

ఉంటుంది

గార్హపత్యాగ్ని కుండం మధ్య భాగం నుంచి ఆహవనీయాగ్ని కుండం మధ్య భాగానికి సరిగ్గా 96 అంగుళాలు దూరం ఉండాలి. కుండాలు ఇలాగే ఉండాలి.

ఇక మంగళాస్నానాలు పూర్తి చెయ్యాలి. ఆ తరువాత యజమాని ఔపాసనాగ్ని నుంచి అగ్నినితెచ్చి, గార్హపత్యాగ్నికి పడమరవైపున ఉంచి, అందులో కడగని బియ్యంతో ఉడికీ ఉడకకుండా అన్నం వండాలి. ఇలా వండిన అన్నాన్ని **బ్రహ్మౌదనపాకము** అంటారు. తరువాత ఆ అన్నాన్ని ఆ అగ్నిలోనే హోమం చేసి, మిగిలిన అన్నాన్ని నాలుగు ముద్దలు చేసి అధ్వర్యుడు, హోత, బ్రహ్మ, అగ్నీధ్రుడు అనే నలుగురు ఋత్విక్కులకు ఇవ్వాలి. అలా ఇచ్చి కొద్దిగా అన్నాన్ని ఆ పాత్రలో మిగల్చాలి. అధ్వర్యుడు తన ఎడమచేతిలో అన్నం ముద్దను పెట్టుకుని, కుడిచేత్తో మిగిలిన అన్నిటిలో నేయి పోసి ఊరిలో ఉన్న పెద్దరావిచెట్టు యొక్క పచ్చికొమ్మలు (సమిధలు) మూడింటితో ఆ అన్నాన్ని కలియబెట్టి, వాటికి అంటుకున్న అన్నంతో సహ వాటిని హోమం చెయ్యాలి. దీన్నే **సమిధాదానము** అంటారు. ఆ రాత్రి జాగారం చెయ్యాలి. తెల్లవారుఝామున అరణిలు రెండింటినీ ఆ అగ్నిలో కాచి దాన్ని చల్లార్చి యజమాని కివ్వాలి. అతను అగ్నిమథనం జరిగే వరకు వాటిని చేత్తో పట్టుకునే ఉండాలి. క్రింద పెట్టరాదు.

ఇంతకు ముందే సప్తమృత్తికలు, సప్తవనస్పతులు తెచ్చి అక్కడ పెట్టుకోవాలి. ఇప్పుడు వాటిని ఒక్కొక్కటి రెండు భాగాలుగా చేసి, అందులో మళ్ళీ ఒక భాగాన్ని రెండు భాగాలుగా చేసి, అలా వచ్చిన నాల్గవ భాగాన్ని గార్హపత్య కుండంలోను, ఇంకొక నాల్గవ భాగాన్ని

దక్షిణాగ్ని కుండంలోను ఉంచాలి. ఇంకా సగభాగం ఉంటుంది. దాన్ని ఆహవనీయాగ్ని కుండంతో ఉంచాలి.

సప్తమృత్తికలు అంటే : 1. ఇసుక 2. ఎడారి మట్టి 3. ఎలుకలు తవ్విన మట్టి 4. పుట్టమట్టి 5. ఎండని చెరువులో మట్టి 6. పంది కుళ్ళగించిన మట్టి 7. సున్నపురాయి.

సప్తవనస్పతులు అంటే : 1. రావి 2. ఉదుంబరము 3. మోదుగ, 4. జమ్మి 5. వికంకతము (పుల్లవెలగ) 6. పిడుగుపడి చచ్చినచెట్టు 7. తామరాకు

ఈ రెండింటి మీద బంగారం ఉంచాలి.

ఇంతకుముందు చల్లార్చిన అగ్నిమీద ఉన్న బూడిద తీసివేసి, దానిమీద అరణులు పెట్టి, తెల్లగుర్రాన్ని ఎదురుగా కట్టి, అరణులను మథించాలి. అగ్ని పుట్టగానే అధ్వర్యుడు కొబ్బరిపీచు మొ॥ వాటితో అగ్నిని పెద్దదిగా చేసి, బ్రహ్మ సామగానం చేస్తుండగా, గార్హపత్య కుండంలో ఇదివరకు ఉంచిన సంబారాల మీద ఈ అగ్నిని ఉంచాలి. దీన్నే **గార్హపత్యాగ్న్యాధానం** అంటారు.

మరునాడు సూర్యోదయం అవుతుండగా, గార్హపత్యాగ్నిని ప్రజ్వలింపచేసి, దానిలో నుంచి కాలుతున్న రావిసమిధలు తీసి అధ్వర్యుడు చేత్తో పట్టుకుంటాడు. అప్పుడు అగ్నీధ్రుడు లౌకికాగ్ని గార్హపత్యాగ్ని లేదా మథించిన అగ్నిని సామగానం జరుగుతుండగా దక్షిణాగ్నికుండంలో ఉంచాలి. ఇదే **దక్షిణాగ్న్యాధానము** అనబడుతుంది.

తరువాత ఋత్విక్కులు గుర్రాన్ని నడిపించుకుంటూ ఆహవనీయాగ్ని కుండం దగ్గరకు వెళ్ళాలి. వాళ్ళకి కుడివైపు బ్రహ్మరథ చక్రాన్ని మూడుసార్లు త్రిప్పుతాడు. గుర్రం ఆహవనీయాగ్ని కుండానికి

వెనక్కి తిరిగి ఆహవనీయాగ్ని కుండం దాటాలి. బ్రహ్మసామగానం చేస్తుండగా ఆహవనీయాగ్ని కుండంలో అగ్నిని ఉంచాలి. ఇది **ఆహవనీయాగ్న్యాధానం** అనబడుతుంది. ఇప్పుడు ఈ అగ్నులను నెయ్యి, సమిధలు వేసి ప్రజ్వరిల్ల చెయ్యాలి.

తరువాత రావి, జమ్మి సమిధలు మూడు మూడు చొప్పున ఒక్కొక్కటి అగ్నిలో వేసి ఆజ్యంతో పూర్ణాహుతి చెయ్యాలి. ఇప్పుడు యజమాని అగ్నులకు నమస్కారం చేసి అధ్వర్యుడికి దక్షిణ సమర్పించాలి. ఇది అగ్న్యాధానానికి సంబంధించిన ప్రధాన కర్మ.

ఆదానం చేసిన తరువాత దానికి అంగంగా ఒక ఇష్టిక్రతువు చెయ్యాలి. దానికి దేవత అగ్ని. అష్టకపాల పురోడాశం ద్రవ్యం. దీని తరువాత పరమానేష్టులు మూడు చెయ్యాలి. అందులో వరుసగా పవమానాగ్ని పావకాగ్ని, శుచ్యగ్ని దేవతలు. ఈ మూడింటిలోనూ ద్రవ్యం అష్టకపాల పురోడాశము. పవమానేష్టులు చేసిన రోజు సాయంత్రమే అగ్నిహోత్రం ప్రారంభించాలి.

## 2. అగ్నిహోత్రం

మనం వైదిక సంప్రదాయంలో ఒక పదాన్ని వాడుతుంటాం. 'ఆహితాగ్ని' అని సామాన్య ప్రజానీకంలో శిష్టాచార సంపన్నుడు, అంటే నిత్యము అగ్నిహోత్రం చేసేవాడు అని అర్థం. కాని ఆహితాగ్ని అంటే అగ్న్యాధానం చేసినవాడు అని అర్థం. ఇతడు విధిగా కొన్ని శ్రౌతకర్మరలు నిర్వహించవలసి ఉంటుంది. వాటిలో అగ్నిహోత్రం చాలా ముఖ్యమైనది. ఇది నిత్యకర్మ. అగ్నిహోత్రానికి చాలా ప్రాముఖ్యత ఉన్నది. ఏ మానవుడైనాసరే అగ్నిహోత్రం చెయ్యకుండా ఇంకే పనీ చెయ్యరాదు. పైన మనం మూడు అగ్నులు చెప్పుకున్నాం. 1. గార్హపత్య 2.

ఆహవనీయ 3. దక్షిణాగ్నులు. వీటిలో గార్హపత్యాగ్నిని జీవితాంతం కాపాడాలి. హోమం జరుగుతున్నప్పుడు, రాత్రులందు అంటే ఎటువంటి పరిస్థితిలోనైనా సరే యజమాని, లేదా అతని భార్య ఈ అగ్ని గృహంలో తప్పనిసరిగా ఉండి తీరాలి. ఒకవేళ ఇద్దరూ బయటకు వెళ్ళవలసిన పరిస్థితి ఏర్పడితే, యజమాని ఆ అగ్నిని మంత్ర పూర్వకంగా తనలోకి ఆవాహన చేసుకుని, వెళ్ళిన చోట తనలోని అగ్నిని అక్కడ అవాహన చెయ్యాలి. ఒకవేళ యజమాని ఇలా అగ్నిని తనలో ఇముడ్చుకుని వెళ్ళవలసి వస్తే, అతని భార్య అతని దగ్గరగా, అతన్ని తాకుతూనే ఉండాలి.

**గమనిక :** ఇక్కడ ఒక చిన్న విషయం. పూర్వకాలంలో అంటే కొన్ని వందల సంవత్సరాల క్రితం మానవుడికి నిప్పురాజేసే సాధనం లేదు. నిప్పురాజెయ్యాలి అంటే చెకుముకి రాళ్ళు, అరణి ఇలా ఏదో ఒక సాధనంతో బాగా కష్టపడి అగ్నిని రాజెయ్యవలసి వచ్చేది. అందుకని ఆ రోజున ఉన్న పరిస్థితులను దృష్టిలో ఉంచుకుని, నిత్యాగ్నిహోత్రం ప్రతివారిఇంట్లోనూ ఉండి తీరాలి. అగ్నికోసం ప్రత్యేకంగా ఒక గృహం నిర్మించాలి. ఆ గృహంలో రేయింపగళ్ళు అగ్ని అనేది అలా ప్రజ్వరిల్లుతూనే ఉండాలి. అని ఒకనియమాన్ని ఏర్పాటు చేశారు. కాబట్టి అగ్ని ఎప్పుడూ రక్షింపబడుతూ ఉండేది. అగ్నిని రాజెయ్యటం కష్టం కాబట్టి ఉన్న అగ్నిని జాగ్రత్తగా కాపాడుకోవాలి. అంటూ కఠినమైన నియమాలు విధించటం జరిగింది.

ఇలా అగ్నిని కాపాడుకోవటం నిత్యాగ్నిహోత్రులే కాదు. కుల మత విచక్షణ లేకుండా అందరూ ఈ పని చేస్తూనే ఉండేవారు. గత రోజుల్లో కట్టెల పొయ్యి మీదనే అన్నం వండుకునే వారు. వంట అయిపోయిన తరువాత కట్టెలు పొయిలోంచి ఇవతలకి లాగి వాటిమీద

బూడిద పోసేవారు. అంతేకాని నీరు పోసి కట్టెలు ఆర్పే వారు కాదు. మళ్ళీ సాయంత్రం వంట చేసుకోవాలంటే ఆ కట్టెల మీద బూడిద తీసేస్తే అందులో నిప్పు ఉండేది. దాంతోనే వంట చేసేవాళ్ళు. ఒకవేళ కుంపటి మీద అన్నం వండితే, వంట అయిన తరువాత ఆ నిప్పులు క్రిందపోసి దానిమీద ఒక గిన్నె బోర్లించేవారు గాలి తగలకుండా, గాలి లేకపోవటం వల్ల ఆ నిప్పు అలాగే ఆరిపోయేది. అగ్నిని నీరుపోసి ఆర్పకూడదు అనేది ఆ రోజున ఉన్న నియమం. ఇళ్ళల్లో పాలు కాచటానికి, ఉలవలు ఉడకబెట్టటానికి పిడకలతో దాలి ఏర్పాటు చేసేవారు. దీనికోసం గృహంలో ప్రత్యేకంగా దాలి గుంట ఉండేది. అందులో పిడకలు పేర్చి అంటించేవారు. దాలి గుంటలో నిప్పు ఎప్పుడూ అలానే ఉండేది. అంటే ఒక్క ఆహితాగ్ని ఇంట్లోనే కాదు కులమత ప్రసక్తి లేకుండా ప్రతివారి ఇంట్లోను అగ్ని రేయింబవళ్ళు అలాగే ఉండేది. అయితే ఈ రోజునఅగ్నిని రాజెయ్యటం పెద్ద కష్టం ఏమీకాదు. పైపెచ్చు సులువైన పద్ధతికూడా. దీనికోసం అగ్గిపెట్టెలు వచ్చేశాయి. అరణికి ప్రత్యామ్నాయమే అగ్గిపెట్టె, దీని సాయంతో క్షణాలో అగ్నిని సృష్టించవచ్చు, కాబట్టి పైన చెప్పిన విధంగా అగ్నిగృహాలు నిర్మించటం, రేయింబవళ్ళు ఎవరో ఒకరు ఆ అగ్నికి కాపలా కాస్తుండటము, ఏవీ చేయవలసిన పని లేదు. యజ్ఞయాగాది క్రతువులు చెయ్యాలన్నా అరణి మథించవలసిన అవసరం లేదు. అగ్గిపెట్టె ఉంటే చాలు అంటారు. ఆధునికవాదులు. వీరు నాస్తికులు కాదు. యజ్ఞయాగాలు చెయ్యద్దు అనరు. వీరి వాదన ప్రకారం ప్రత్యామ్నాయం **ఉన్నప్పుడు కూడా పాతపద్ధతులు పట్టుకు వేలాడటం ఛాందసం కదా? ఛాందసుడు అంటే తెలివికల మూర్ఖుడు.**

ఒక్క విషయం చూడండి వంటఇంట్లో కట్టెలు సరిగా మండకపోతే

ఇల్లంతా పొగ చుట్టేస్తుంది. అందుకనే కొన్ని ఇళ్ళల్లో వంట ఇల్లు విడిగా ఉండేది. దాన్నించి తప్పుకోవటానికి పొగలేనిపొయ్యి వచ్చింది. అది కాస్తా రూపాంతరం చెంది స్టౌ పైన చిమ్నీ ఏర్పాటు చెయ్యటం జరిగింది. అలాగే ఇంట్లో గనక హోమం చేస్తే ఇల్లంతా పొగ పట్టేస్తుంది. అందుకే యాగశాల విడిగాఉండేది. ఆ రోజుల్లో ఎక్కువ స్థలం ఉండేది. కాబట్టి యాగశాల, వంటశాల, దాలిగుంట ఇవన్నీ విడివిడిగా ఉండేవి. ఇప్పుడు బహుళ అంతస్థుల భవనాలు, ఎపార్ట్‌మెంటులు వచ్చేశాయి. ఈ రోజున వందగజాల స్థలం అంటే బంగారం కన్నా ఎక్కువై పోయింది. పది గ్రాములు బంగారం ఇచ్చినా గజం స్థలం రాదు. ఇవాళ్టి రోజున విజయవాడలో బందరు రోడ్డుమీద గజస్థలం అక్షరాలా రెండులక్షల రూపాయలు అమ్ముతోంది. ఇది విజయవాడను రాజధానిగా ప్రకటించక ముందు మాట. మిగిలిన చోట్ల కూడా దానికి తగ్గట్టుగానే ఉంటాయి కదా. మరి యాగశాల వంటశాల భోజనాల గది విడివిడిగా ఎలా కట్టగలం. అందుకే ఇప్పుడు ఇంకొక సౌకర్యం కూడా ఏర్పాటు చేశారు. హోమకుండం పైన చిమ్నీ ఏర్పాటు చేశారు. అప్పుడు పొగ అంతా బయటకు వెళ్ళిపోతుంది. అంటే హోమం నట్టింట్లో కూడా చేసుకోవచ్చు. ఈ రకమైన సులువైన పద్ధతులు ఉన్నప్పుడు వాడుకోవచ్చు కదా? అంటారు ఆధునిక వాదులు. వీరు నాస్తికులు కాదు. వేదాలు, యజ్ఞయాగాలు అన్నీ నమ్ముతారు. కాకపోతే సౌకర్యాలు ఉపయోగించుకోండి. ఛాందసంవద్దు అంటారు. ఇది ఒక వాదన. సందర్భం వచ్చింది కాబట్టి చెప్పాను అంతే.

నేను కెనడా వెళ్ళినప్పుడు అక్కడ చిమ్నీ ఏర్పాటు చేసిన హోమకుండం చూశాను. ఊటీలాంటి ప్రదేశాలలో చలినుంచి తట్టుకోవటానికి ఇంట్లోనే నెగళ్ళు వేస్తారు. అలాగన్న మాట. దీనిస్థానంలోనే ఇప్పుడు హీటర్లు వాడుతున్నారు. ఇదంతా కేవలం

చదువరికి విషయం తెలియాలనే ఉద్దేశ్యంతోనే ఇక్కడ ఇవ్వటం జరిగింది. అంతేకాని వేదాలను కించపరచాలనే ఉద్దేశ్యంతో మాత్రం కాదు.

ఈ అగ్నిహోత్రంతో ఉదయం రెండు, సాయంత్రం రెండు ఆహుతులివ్వాలి. ఇదంతా ఒకటే కర్మ. ఉదయం మొదటి హోమానికి దేవత అగ్ని. రెండవ దానికి ప్రజాపతి. సాయంత్రం మొదటి హోమానికి దేవత సూర్యుడు. రెండో దానికి ప్రజాపతి. ఇందులో మొదటి హోమంలో దేవత అగ్ని. అందుకే దీనికి అగ్నిహోత్రం అని పేరు. హోమద్రవ్యం ఆవుపాలు. పాలు, పెరుగు, గంజి నిత్య ద్రవ్యాలు.

| | |
|---|---|
| పశువులు, స్వర్గం కావాలంటే | – పాలు ద్రవ్యం |
| ఇంద్రియ పుష్టికి | – పెరుగు |
| గ్రామాధిపంత్యం | – గంజి |
| అన్నసమృద్ధి | – అన్నం |
| ఓజస్సు, బలం | – బియ్యం |
| తేజస్సు | – ఎ ా ం ఖ ్య , |

హోమద్రవ్యాలు

అగ్నిహోత్రాన్ని స్వయంగా యజమానే చెయ్యాలి. మరీఅవసరం అయితే కుమారులు చెయ్యచ్చు. ఇంకా అవసరమంటే అందరికీ ఇబ్బందిఅయితే ఋత్విక్కు చేస్తాడు. ఇక అగ్నిహోత్రం చెయ్యాలి అంటే

సూర్యోదయం ప్రారంభం కాగానే – ప్రాతఃకాలాగ్ని సూర్యాస్తమానం జరుగుతుండగా సాయంత్రంఅగ్నిహోత్రం చెయ్యాలి.

# 3. దర్శపూర్ణమాసలు

దర్శ అంటే అమావాస్య. పూర్ణమాసం అంటే పూర్ణమి, పౌర్ణమి, అమావాస్యలకు ఈ యాగాలు చెయ్యాలి. ఈ రెండు ప్రత్యేక యాగాలకు కలిపిన ఇష్టి – దర్శపూర్ణమాసేష్టి అని పేరు.

మొదటగా ఇందులో ఉపవాసం ఉండాలి. తినే పదార్థాలు త్రాగే పానీయాల విషయంలో నియమం పాటించాలనే సంకల్పమే ఉపవాసం. వీటిలో ఉపవాసం చెయ్యకుండా హోమం చేస్తే దాన్ని దేవతలు స్వీకరించరు. ఆహార నియమాల వల్ల దేవతలు యజమానికి దగ్గరగా ఉంటారు. అలా దేవతలను సన్నిహితులుగా చేసుకోవటం కోసమే ఈ ఉపవాస దీక్షలు.

సూర్యోదయం నుంచి సూర్యోదయం దాకా ఒకరోజు. కౌషీతకీ మతం ప్రకారం సూర్యాస్తమానం తరువాత పూర్ణచంద్రుడు ఏ రోజున ఉంటాడో, ఆ రోజున పూర్ణమాస యాగం చేసే యజమాని ఉపవాసం ఉండాలి. అలాగే ఏ రాత్రి చంద్రుడు పూర్తిగా కనపడడో, ఆ రోజున దర్శయాగం చేసే యజమాని ఉపవాసం ఉండాలి. ఆ మరుసటి రోజున యాగం చెయ్యాలి.

దర్శపూర్ణమాస యాగాలలో ప్రధానంగా 'సామిధేనీ' మంత్రాలు, 'ప్రయాజ మంత్రాలు', 'అనుయాజమంత్రాలు' సస్వరంగా చదవాలి. ఇందులో సామిధేనీ మంత్రాలు అగ్నికి సంబంధించినవి. గాయత్రి ఛందస్సులో ఉంటాయి. గాయత్రి మంత్రంలో అక్షరాలు 24, మంత్రాలు మొత్తం 11. వీటిలో మొదటి, చివర మంత్రాలను మూడుసార్లు చదవాలి. అప్పుడు 11+4 = 15 మంత్రాలు చదివినట్లు అవుతుంది. ఇందులో 15 మంత్రాలు మంత్రానికి అక్షరాలు 24 కాబట్టి 15 × 24 = 360. ఇక్కడ 15 అంటే పక్షము, శుక్లపక్షము లేదా కృష్ణ

పక్షము 360 రోజులు సంవత్సరానికి. కాబట్టి ఈ యాగం చేసినవాడు రోజులు, పక్షాలు, సంవత్సరము అంటే కాలపురుషుణ్ణి పూజించినట్లవుతుంది.

ఇక ప్రయాజ మంత్రాలు ఐదు. ఈ ఐదు మంత్రాలు ఐదు ఋతువులకు 1)వసంత ఋతువు 2) గ్రీష్మ ఋతువు 3) వర్ష ఋతువు 4) శిశిర ఋతువు 5) హేమంత ఋతువుల ప్రతీక. కాబట్టి ఈ యాగం చేస్తే రోజులు పక్షాలు, ఋతువులు, సంవత్సరము ఇలా కాలపురుషుణ్ణి పూజించినట్లవుతుంది.

అనుయాజ మంత్రాలు మూడు. ఇవి ముల్లోకాలకు ప్రతీక. కాబట్టి ముల్లోకాలలో ఉండే వారందర్నీ పూజించినట్లే.

వీటి తరువాత పత్నీ సంయాజమంత్రాలు చదువుతూ గార్హపత్యాగ్నిలో హోమం చెయ్యాలి. దీనివల్ల దేవతలను, వారి భార్యలనుకలిపి యాగంచెయ్యటం జరుగుతుంది.

పూర్ణమాస యాగంలో మూడు యాగాలుంటాయి. 1. ఆగ్నేయం 2. అగ్నీషోమీయం 3. ఉపాంసు యాగం. ఇక్కడ అగ్ని, అగ్నిసోములు. ఇంద్రాగ్నులు ప్రధాన దేవతలు. దర్శయాగంలో కూడా మూడు యాగాలున్నాయి.

1) ఆగ్నేయ యాగం 2) ఇంద్రదేవతాకమైన దధియాగం 3) పయోయాగం. ఇక్కడ ఇంద్రాగ్నులు, ఇంద్రుడు ప్రధాన దేవతలు. పురోడాశము, పాలు, పెరుగు ప్రధాన హోమద్రవ్యాలు. సోమయాగం చేసిన యజమాని దర్శయాగంలో ఇంద్రాగ్నులకు పురోడాశానికి బదులు ఇంద్రుడికిగాని మహేంద్రుడికి గాని సాన్నాయ్యం (పాలు పెరుగు కలిపిన మిశ్రమం) ద్రవ్యంగా వాడాలి.

వీటి తరువాత స్విష్టకృద్ రూపమైన అగ్నికి యాగం చెయ్యాలి. 'స్విష్టకృత్' అంటే ఎవరెవరికి ఎంతెంత రావాలో దాన్ని పంచి పెట్టేవాడు. ఇక్కడ అగ్నిదేవుడు హోమం చేసిన పదార్థాలను ఆయా దేవతలకు చేరుస్తాడు. అలా చేసినందుకు అగ్నికి ప్రత్యేకమైన యాగం చెయ్యాలి. దాన్నే 'స్విష్టకృత్' యాగము అంటారు. దీంతో ప్రధాన యాగాలు పూర్తి అవుతాయి.

దర్శపూర్ణమాస యాగాలకు 12 రకాల వికృతీష్టులు చెప్పబడుతున్నాయి కౌషీతకీ బ్రాహ్మణంలో ప్రకృతీష్టిలో ఉన్న దేవత, క్రమం, హోమద్రవ్యం వీటిని మార్చటంవల్ల ఈ రకమైన వికృతీష్టులు ఏర్పడతాయి. ఇక్కడ గుర్తుంచుకోవలసిన విషయం ఏమంటే దేవతగాని, మంత్రంగాని, ద్రవ్యం గాని మారటం వల్ల వీటిలో ఏది మారినా ఫలితం మారిపోతుంది. అంటే ఇక్కడ యాగఫలితం మారుతుందన్న మాట. ఇప్పుడు ఈ 12 రకాల వికృతీష్టులు ఏమిటో చూద్దాం.

1. అనునిర్వాప్యేష్టి
2. అభ్యుదితేష్టి
3. అభ్యుర్ధృష్టేష్టి
4. దాక్షాయణ యజ్ఞం
5. ఇళాదధేష్టి
6. సార్యసేని యజ్ఞం
7. శౌనక యజ్ఞం
8. వసిష్ఠ యజ్ఞం
9. సాకంప్రస్థాయ్యేష్టి
10. మన్వయనేష్టి
11. తురాయణేష్టి
12. ఆగ్రయణేష్టి

## 4. అనునిర్వాప్యేష్టి

ఈ యాగాన్ని చేసి దేవతలు రాక్షసులమీద విజయం సాధించారు. కాబట్టి శత్రునాశనం కోరేవారు ఈ యాగం చేస్తారు. ఈ యాగాన్ని రెండు రకాలుగా చేయవచ్చు. 1 పౌర్ణమాసేష్టి చేసిన తరువాత అమావస్యేష్టిలో లాగా ఇంద్రదేవతాక మైన ఈ క్రతువు చెయ్యటం ఒక పద్ధతి. 2. అమావస్యేష్టి చేసిన తరువాత పౌర్ణమాసేష్టిలో లాగా అదితి దేవతాకమైన ఈ క్రతువు చెయ్యటం రెండవ పద్ధతి. ఈ రెండింటిలో ఏ పద్ధతి ప్రకారం చేసినా ఫలితం ఒకటే.

## 5. అభ్యుదితేష్టి

అమావాస్యకు ముందు రోజైన చతుర్దశినాడు దర్శయాగం చేస్తే అది అభ్యుదితేష్టి అనబడుతుంది. ఇందులో మూడు రకాల హవిస్సులుంటాయి.

1. అగ్నిదేవతకు – అష్టకపాల పురోడాశము
2. ఇంద్రుడికి – సాయంత్రం పిండిన పాలతో తయారైన పెరుగు
3. విష్ణువుకు – ప్రొద్దున పితికిన పాలు. దక్షిణగా ధనుస్సు ఇవ్వాలి.

ఈ యాగం వల్ల ఫలితం సుఖప్రయాణం, క్షేమప్రాప్తి.

## 6. అభ్యుద్దృష్టేష్టి

అమావాస్య తరువాత వచ్చే పాడ్యమినాడు ఈ యాగం చేస్తారు. ఇందులో మూడు రకాల హవిస్సులుంటాయి.

1. అగ్నికి – అష్టకపాల పురోడాశము

2. ఇంద్రుడికి–ఏకాదశ కపాల పురోడాశము
3. ఆదిత్య రూపుడైన వైశ్వానరునికి– ద్వాదశకపాల పురోడాశము

ఇందులో చేతికర్ర చెప్పులు దక్షిణగా ఇవ్వాలి.

యాగఫలితం – యజమానికి ఏ రకమైన భయం ఉండదు.

## 7. దాక్షాయణ యజ్ఞం

కౌషీతకీ మతం ప్రకారం క్రొత్త సంవత్సరం ఫాల్గుణ పూర్ణిమ నుంచి ప్రారంభమయ్యేది. దాక్షాయణ యజ్ఞం కొత్త సంవత్సరం ప్రారంభం రోజున ప్రారంభమవుతుంది. రకరకాల కోరికలున్న వారు ఈ యాగాన్ని చేస్తారు. ఈ దాక్షాయణ యజ్ఞం రెండు పున్నమి రోజులలో, అలాగే రెండు అమావాస్య రోజులలో చెయ్యాలి. మొదటి పూర్ణమి రోజున అగ్నిష్టోములకు ఏకాదశ కపాల పురోడాశాన్ని హోమం చెయ్యాలి. రెండో పూర్ణమి రోజున ఇంద్రదేవతాకమైన పాలు పెరుగు మిశ్రమం హోమం చెయ్యాలి. మొదటి అమావాస్య రోజున ఇంద్రాగ్ని యాగం, రెండవ అమావాస్య రోజు మైత్రావరుణ దేవతాకమైన పయస్యాగం చెయ్యాలి.

## 8. ఇళాదధేష్టి

దాక్షాయణ యజ్ఞం ఏ రోజునైతే ప్రారంభిస్తారో, ఆ రోజునే ఇళాదదేష్టి కూడా చెయ్యాలి. ఈ యాగం చేస్తే పశుసంపద, అన్నపానాదులు సమృద్ధిగా లభిస్తాయి.

## 9. సార్వసేని యజ్ఞం

దీన్ని పౌర్ణమాస్యలాగానే చెయ్యాలి. ఈ యజ్ఞం చెయ్యటం వల్ల శత్రువులను జయించ కలుగుతాడు.

## 10. శౌనక యజ్ఞం

దీన్నీ పౌర్ణమాస్యలాగానే చెయ్యాలి. వంశాభివృద్ధి కోసం ఈ యాగం చేస్తారు.

## 11. వసిష్ట యజ్ఞం

పూర్వకాలంలో వశిష్టుని కుమారులను సుదాముడి కుమారులు చంపేశారు. అప్పుడు పిల్లలు లేని వశిష్టుడు మళ్ళీ సంతానం పొందాలని వాళ్ళకి ఏ ఆపదా రాకుండా శత్రుక్షయం మాత్రం కలగాలనీ భావించాడు. అయితే ఇవన్నీ ఒకే యాగం వల్ల ఎలా జరుగుతాయి? అని ఆలోచించాడు. అలా ఆలోచించి తన తపశ్శక్తితో ఈ యాగాన్ని దర్శించాడు. అప్పుడు వశిష్టుడు ఈ యాగాన్ని చేసి కృతకృత్యుడైనాడు. అందుకే దీనికి వశిష్ట యజ్ఞం అని పేరు వచ్చింది. దీన్ని ఫాల్గుణ మాసం అమావాస్య నాడు ప్రారంభించాలి. ఇందులో సంతానాభివృద్ధి, శత్రునాశనం రెండూ కోరబడతాయి. అందుకే అమావాస్య నాడే దీన్ని ప్రారంభించాలి.

## 12. సాకం ప్రస్థాయ్యేష్టి

ఈ యాగంలో పాలు పెరుగులతో నిండిన కుండలు తీసుకున్న బ్రాహ్మణులు, అధ్వర్యుడు అంతా కలిసి హోమం దగ్గరకు వస్తారు. ఇదికూడా వసిష్ట యాగంలాగా అమావాస్య నాడే చేయబడుతుంది దీనివల్ల విద్య, తపస్సు లభిస్తాయి. సర్వోత్కృష్టత్వం లభిస్తుంది.

## 13. మున్యయనేష్టి

లౌకికమైన సుఖాలు సిరిసంపదలు, భోగభాగ్యాలు, పదవులు, స్వర్గం కోరేవాడు ఈ యాగం చేస్తాడు. దీన్ని పౌర్ణమాస్యలాగానే

పూర్ణిమనాడు చెయ్యాలి.

## 14. తురాయణేష్టి

'తుర' అనే మహర్షి దీన్ని దర్శించాడు. అందుకే తురాయణేష్టి అనబడుతోంది. ఇది కూడా పౌర్ణమినాడే ప్రారంభించబడుతుంది.

## 15. ఆగ్రయదేష్టి

అన్నము, ధాన్యము సంపూర్ణంగా కావాలనుకునే వాడు ఈ యాగం చేస్తాడు. పంటలుపండి ధాన్యం ఇంటికి తెచ్చేటప్పుడు ఈ యాగం చేస్తారు. ఇది మూడు రకాలుగా ఉంటుంది.

1) శ్యామాకాగ్రాయణేష్టి
2) వేణుయవాగ్రాయణేష్టి
3) వ్రీహ్యాగ్రయణేష్టి

## 16. శ్యామాకాగ్రాయణేష్టి

వర్షాకాలంలో శ్యామాక ధాన్యం (తృణ ధాన్యం) బాగా పండినతరువాత ఇంటికి తెచ్చి తరువాత అమావాస్య, పున్నమి రోజులలో దీన్ని చెయ్యాలి. తృణధాన్యంతో తయారైన చరవు హోమద్రవ్యంగా వాడాలి. పెరుగు, నెయ్యి కలిపి (మధుపర్కం) దక్షిణగా ఇవ్వాలి.

## 17. వేణుయవాగ్రయణేష్టి

వసంత ఋతువులో వెదురు బియ్యం ఇంటికి తెచ్చిన తరువాత చేసే యాగం ఇది.

## 18. వ్రీహ్యాగ్రయణేష్టి

బియ్యము, గోధుమలు ఉపయోగిస్తారు.

పై మూడు యాగాలు ఒకే విధంగా చేస్తారు. పంట చేతికి వచ్చినప్పుడు ముందుగా దేవతలకు అర్పించాలనే సంప్రదాయం ఈ యాగంలో కనిపిస్తుంది.

## 19. చాతుర్మాస్య యాగాలు

కౌషీతకీ బ్రాహ్మణంలో నాలుగు చాతుర్మాస్య యాగాలు వివరించటం జరిగింది. ఈ యాగాలు కూడా దర్శపూర్ణమాసలకు వికృతీష్టులు. అవి

1. వైశ్యదేవము 2. వరుణప్రఘాసము 3. సాకమేధము 4. శునాసీరీయము

## 20. వైశ్యదేవము

నూతన సంవత్సరాదినాడు అంటే ఫాల్గుణమాసం పూర్ణమి రోజున ఈ చాతుర్మాసేష్టిని ప్రారంభం చెయ్యాలి. చాతుర్మాస్యం ఎందుకు చెయ్యాలి? అంటే అనారోగ్యం తగ్గిపోవటానికి. ఋతువులు మారితే సామాన్యంగా ఆరోగ్యంలో తేడా వస్తుంది. ఒక్కోసారి జబ్బు చేస్తుంది. ఈ రకమైన జబ్బులు తగ్గాలి అంటే ఋతుసంధికాలంలో ఈ యాగం చెయ్యాలి. ఇందులో ముఖ్యంగా అగ్నికి హవిర్దానం చేస్తారు. ఇందులో సామిధేనీ మంత్రాలు, సంయాజ్య మంత్రాలు, ప్రయాజులు, అనుయాజులు ఉంటాయి. దీనికి అగ్నిషోములు, సవిత, నచోరూపమైన సరస్వతి, పూష రోగాన్ని తగ్గించే మరుత్తులు దేవతలు. ప్రధాన ద్రవ్యాలు పాలు, ఏకకపాలపురోడాశము. ఈ యాగం పూర్తిఅయిన తరువాత

పౌర్ణమేష్టి కూడా చెయ్యాలి. దీని ప్రయోజనం ఏమిటి? ఈ యాగం చేసినవాడు నక్షత్రం వంటి కాంతి కలిగి ఉంటారు. మిగిలిన చాతుర్మాస్యాలు కూడా ఇలాగే కాకపోతే కొద్దిగా దేవతలు, హోమద్రవ్యం మారుతుంది.

## 21. వరుణ ప్రఘాసం

సర్వపాప విముక్తి కోసం ఈ యాగం చేస్తారు. అసలు ఈ యాగం ఎలా వచ్చింది? అనే విషయం చూద్దాం.

వైశ్యదేవం చేసి ప్రజాపతి సంతానం పొందాడు. ఈ పిల్లలు జన్మించగానే వరుణునికి సంబంధించిన యవలు (ధాన్యము) తిన్నారు. దాంతో వరుణిడికి కోపం వచ్చి వారందర్నీ వరుణపాశంతో బంధించేశాడు. అప్పుడు ఆ పిల్లలు తమకు పాశాల నుంచి విముక్తి కలిగించమని కోరారు. ప్రజాపతి బాగా ఆలోచించి ఈ రకంగా వరుణుణ్ణి సంతోష పెట్టటటానికి ఈ యాగం చేశారు. దీంతో వరుణుడు సంతృప్తి చెంది పిల్లలను పాశాల నుంచి విముక్తులుగా చేశాడు. ఈ యాగంవల్ల చేసిన పాపాలనుంచి విముక్తి పొందుతాడు. ఇందులో ద్వాదశ కపాలపురోడాశాన్ని హోమం చెయ్యాలి.

## 22. సాకమేథం

ఇంద్రుణ్ణి గురించి చేసే యాగం ఇది. దీనికి అగ్ని, మరుత్తులు, ఇంద్రుడు, పితృదేవతలు, మహేంద్రుడు దేవతలు. ఇందులో గృహమేధీయం అనే యాగం సాయంకాలంలో చెయ్యాలి. ఇది పుష్టినిచ్చే కర్మ. 'పోష' అనే శబ్దం కలిగిన మంత్రాలు ఇందులో చదువుతారు. ఫలితం యజమాని పోషింపబడతాడు. ఇది ఫలం.

## 23. శునాసీరీయం

ఇందులో ప్రధానమైన దేవతలు ఇద్దరు. 1. శునా 2. సీర. యాగం అంతా వైశ్యదేవం లాగానే ఉంటుంది. చివరలో వైశ్యదేవంలో మరుత్తులకు యాగం చేస్తాం. ఇక్కడ శునాసీరీలకు యాగం చెయ్యాలి. ఇది రోగ నిరోధకంగా ఉపయోగిస్తుంది. ఈ యాగం అధికమాసంలో చేసి తెల్లని ఆవును దక్షిణా ఇవ్వాలి.

## 24. సోమయాగాలు

కౌషీతకీ బ్రాహ్మణంలో అత్యగ్నిష్టోమం, ఉక్థ్యం, షోడశి, అతిరాత్రం. ఈ సోమయాగాలకు ప్రకృతి యాగం అగ్నిష్టోమం. ఈ యాగాలలో చదవవలసిన మంత్రాలు ఎక్కువ ఉంటాయి.

**అగ్నిష్టోమము** ఇది ఒక రోజు జరిగే యాగం. అయినప్పటికి అంకురార్పణ చేసిన దగ్గర నుంచి అవభృథస్నానందాకా చాలా రోజులు పడుతుంది. ప్రధానయాగం జరిగే రోజున మూడుపూటలయందు సోమరసాన్ని హోమం చేస్తారు. ఇందులో ప్రధానద్రవ్యం సోమం. అందుకే దీనికి సోమయాగమని పేరు.

సోమలత ఆ రోజుల్లో పుష్కలంగా దొరికేది. ఈ రోజున దగ్గర దగ్గరగా నామమాత్రం అయిపోయింది. దీనికి ప్రత్యామ్నాయంగా మన రాష్ట్రంలో తిప్పతీగ అమృతవల్లి, మహారాష్ట్రలో పూలిక అనే లతను వాడతారు. సోమరసమే కాకుండా ప్రధాన యాగానికి ముందు రోజు పశుయాగం చేస్తారు. పురోడాశం అనే యాగంలో పురోడాశపుముక్కలు, యజ్ఞపశువు శరీర భాగాలు రెండూ కలిపి హోమం చేస్తారు.

ఐతరేయ బ్రాహ్మణంలో ముఖ్యంగా ఆరు యాగాలను వివరించి చెబుతున్నారు. అవి

1. జ్యోతిష్టోమము
2. గవామయనము
3. ఆదిత్యానామయమనము
4. అంగిరసామ యమనము
5. ద్వాదశాహము
6. అగ్నిహోత్రము

ఇవి ప్రధానమైన యాగాలు, ఇక్కడ ఒక్క విషయం గమనించండి. వేదంలో ఏం చెప్పారో తెలుసుకోవాలని కోరిక చాలామందికి ఉంది. ఆ కోరిక కొంతవరకైనా తీరుద్దామని ఈ పుస్తకం వ్రాస్తున్నాను. ఇప్పుడు ముఖ్యమైన యాగాలు ఆరున్నాయి. ఆ యాగాలు ఎలా చెయ్యాలి. అందులో మంత్రాలు ఎలా చెప్పాలి. మొదలైన విషయాలు అప్రస్తుతాలు. ఎందుకంటే వాటిని గురించి ఎక్కువగా తెలుసుకోవటం మీద మనకు ఆసక్తి ఉండదు. కాబట్టి ఈ యాగాలను గురించి సాధ్యమైనంత వరకు సంక్షిప్తంగా చెప్పుకుందాం.

## 25. జ్యోతిష్టోమము

సోమయాగాలు మూడు 1. గోష్టోమము 2. ఆయుష్టోమము 3. జ్యోతిష్టోమము. ఈ మూడింటిలోను ముఖ్యమైనది జ్యోతిష్టోమము ఈ యాగం ఏడు రకాలుగా సమాప్తి అవుతుంది. అందుకే దీన్ని **'సప్తసంస్థము'** అంటారు. సంస్థ అంటే సమాప్తి అని అర్థం. అంటే జ్యోతిష్టోమము ఏడు విధాలుగా ఉంటుంది.

1. అగ్నిష్టోమము
2. అత్యగ్నిష్టోమము
3. ఉక్థ్యము
4. షోడశి
5. వాజపేయము
6. అతిరాత్రము
7. ఆప్తోర్యామము

ఈ యాగాలన్నీ 'సోమము'తోనే చేస్తారు. అందుకే వీటిని

సోమయాగాలు అంటారు. 'యజ్ఞాయజ్ఞీయము' అనే అగ్నిష్టోమ సామముతో యాగం పరిసమాప్తి అవుతుంది కాబట్టి దీనికి **'అగ్నిష్టోమము'** అని పేరు.

జ్యోతిష్టోమము ఏడు విధాలు అని మనం చెప్పుకున్నాం. కాని ఐతరేయ బ్రాహ్మణంలో నాలుగు విధాలు మాత్రమే చెప్పబడ్డాయి.

1. అగ్నిష్టోమము 2. ఉక్థ్యము 3. షోడశి 4. అతిరాత్రము

వీటిలో అగ్నిష్టోమము ఒక్కటే ప్రకృతి యాగము. మిగిలిన మూడు వికృతి యాగాలు. ఇప్పుడసలు ప్రకృతి యాగము అంటే ఏమిటో చూద్దాం. ఆ యాగంలో ఆచరించవలసిన అంగాలన్నీ పూర్తిగా చెప్పబడినట్లైతే అది ప్రకృతి యాగము. దీని ప్రకారము అగ్నిష్టోమము ప్రకృతి యాగము. మరి వికృతియాగము అంటే ఏమిటి? ఏ యాగానికైతే అంగాలు పూర్తిగా చెప్పబడవో అది వికృతి యాగము అనబడుతుంది. మరి అలాంటప్పుడు ఈ యాగం ఎలా పూర్తి చేస్తారు? అని అనుమానం వస్తుంది. చాలా జాగ్రత్తగా చూడండి. వీటిలో చెప్పబడని విషయాలను ప్రకృతి యాగం నుంచి తీసుకోవాలి. అలాగే చేస్తారు. జ్యోతిష్టోమ యాగానికి నాలుగు అంగాలున్నాయి. అవి

1. దీక్షాయణీ మేష్టి
2. ప్రాయణీమేష్టి
3. ఉదయనేమేష్టి
4. అతిధ్యేష్టి

వీటిని గురించి ఐతరేయోపనిషత్తు బాగా వివరించింది. వీటితోపాటుగా సోమయాగానికి అంగాలయిన ప్రవర్గ్య, ఉపసత్‌లను కూడా ఈ బ్రాహ్మణంలో చెప్పటం జరిగింది.

## 26. దీక్షాయణీ మేష్టి

జ్యోతిష్టోమానికి అంగాలు నాలుగు అన్నాం కదా. ఇవన్నీ ఇష్టులు. వీటిలో మొదటిది దీక్షాయణీ యేష్టి. ఇది దర్శపూర్ణమాస యాగానికి వికృతి. అగ్ని విష్ణువు దీనికి దేవతలు. ఈ దేవతలలో పెద్దవాడు విష్ణువు. చిన్నవాడు అగ్ని. వీళ్ళ ఇద్దరి మధ్యనా మిగిలిన దేవతలంతా ఉంటారు. ఈ కారణాల వల్లనే అగ్నివిష్ణువులు సర్వదేవతా స్వరూపులు అని చెబుతోంది ఈ బ్రాహ్మణం. ఈ ఇష్టిలో వినియోగించే ద్రవ్యాలు. నెయ్యి, చెరవు. చెరవు అంటే హోమద్రవ్యము. ఆ రోజుల్లో వారు ఏంవాడారో తెలియదు కాని ఈ రోజున మాత్రం చెరవు అంటే అన్నము అని అర్థం. ఈ యాగం చేస్తే అప్రతిష్టవల్ల కలిగిన దోషం పోతుంది.

## 27. ప్రాయణీ యేష్టి

దీక్షాయణీ యేష్టిలాగానే ప్రాయణీ యేష్టి కూడా దర్శపూర్ణ మాస యాగానికి వికృతి. దీనికి దేవత ఆదిత్యుడు. త్వరగా స్వర్గం పొందటం కోసం ఈయాగము చేస్తారు. అందుకే దీనికి ప్రాయణీయేష్టి అని పేరు వచ్చింది. ఇందులో ఐదు దిక్కులందు ఐదుగురు దేవతలకు హోమం చెయ్యాలి.

| | | |
|---|---|---|
| తూర్పు దిక్కు | – | పథ్య అనే దేవత |
| దక్షిణ దిక్కు | – | అగ్ని |
| పడమర దిక్కు | – | సోముడు |
| ఉత్తరం దిక్కు | – | సవిత |
| ఊర్ధ్వ దిక్కు | – | అదితి |

అలా చేస్తే

| | | |
|---|---|---|
| పథ్య | – | వాక్కును వృద్ధి చేస్తుంది |
| అగ్నిషోములు | – | ప్రాణాపానాలు |
| సవిత | – | ప్రేరణ |
| అదితి | – | ప్రతిష్ఠ, పెంపొందిస్తా అని |

చెబుతున్నది ఈ బ్రాహ్మణము.

## 28. ఉదయనీయేష్టి

ఈ యాగం చేసిన వారు పైనఉన్న స్వర్గానికిపోతారు. అందుకే ఇది ఉదయనీయేష్టి అని పిలువబడుతోంది.

## 29. అతిధ్యేష్టి

దీనికి దేవత విష్ణువు. అతిథి అంటే – తిథి వారం, నక్షత్రం లేకుండా వచ్చేవాడు అని అర్థం. పూర్వకాలంలో బాటసారి ఎవరింట్లోనైనా భోజనం చెయ్యాలి. త్రోవన పోతూ ఆ ఊళ్ళో పెద్దవాళ్ళు ఎవరున్నరా అని చూసి వాళ్ళింటికి భోజనానికి వెళ్ళేవాడు. ఇంటి యజమాని కూడా ఎవరైనా అతిథులు వస్తారనే భావనతోనే వంటకాలు సిద్ధంచేసేవాడు. అపరాహ్ణం వేళకు ఎవరైనా వస్తే భోజనం చెయ్యమనటం ఆనాటిసంప్రదాయం. ఈ యాగంలో సోముడు అలాగే అతిథి అవుతాడు. ఇందులో నవకపాల పురోడాశము హోమం చేస్తారు. అంటే బియ్యం పిండి లేదా గోధుమపిండి రొట్టెని తొమ్మిది కుండ పెంకులమీద కాల్చి, దాన్ని హోమం చేస్తారు.

## 30. ప్రవర్గ్య

దీన్ని సోమయాగానికి అంగంగానే గాక స్వతంత్రంగా కూడా చేస్తారు. శరీరానికి శిరస్సులాగా యజ్ఞాలలో ఇదిచాలా ముఖ్యమైనది.

ప్రవర్గ్య అనేది మనం చేసే కర్మకాండే కాకుండా అందులో వాడే ఒక కుండ పేరు కూడా. దీన్నే 'మహావీరము' అని కూడా అంటారు. ఒకసారి శ్రీ మహావిష్ణువు దేవతలతో యుద్ధానికి తలపడ్డాడు. ఆ సమయంలో దేవతలవైపు చూసి అవహేళనగా నవ్వుతూ, గడ్డం క్రింద ధనుస్సు పెట్టుకుని నుంచున్నాడు. అప్పుడు ఇంద్రుడితో ప్రేరేపించబడిన చెదలు ధనుస్సు యొక్క వింటినారిని కొరికేశాయి. దాంతో ధనుస్సు ఒక్కసారిగా పైకి లేచింది. ఆ దెబ్బకు శ్రీమహావిష్ణువు తలకాస్తా తెగి క్రింద పడింది. ఆ తరువాత అశ్వనీ దవేతలు శస్త్రచికిత్స చేసి తలను మొండానికి అంటించారు. దీనికి గుర్తుగానే ప్రవర్గ్యలో శిరస్సు ఆకారంలో ఉన్న మట్టి పాత్రలో పాలు పోసి కాచి దాన్ని దేవతలకు ఆహుతిగా ఇస్తారు.

ఇందులో మూడు మట్టిపాత్రలుంటాయని వాటిని మహావీరము అంటారని చెప్పుకున్నాం. ఆ పాత్రలు తయారుచెయ్యటానికి ప్రత్యేకమైన విధానముంది. తరువాత ఆ పాత్ర నిండా నెయ్యి పోసి హోమకుండం మీద బాగా కాస్తారు. అందులో నెయ్యి బాగా వేడెక్కి పొగలువస్తుంది. ఇలా బాగా కాగిననేతిలో ఆవుపాలు లేక మేకపాలు పోస్తారు. ఒక్కసారిగా మంట భగ్గుమంటుంది.

రెండు మూడు సంవత్సరాల క్రితం కేరళ నంబూద్రిలు భద్రాచలం రామాలయంలో యాగం చేశారు. అప్పుడు జనం అంతా ఈ ప్రక్రియ చూశారు. ఇలా చెయ్యటంవల్లనే దానికి ప్రవర్గ్య అని పేరు వచ్చింది.

ఈ కర్మ చెయ్యటం వల్ల మంచి తేజస్సు వస్తుంది. స్వర్గం ప్రాప్తిస్తుంది. ప్రవర్గ్యం పూర్తి అయిన తరువాత మహావీరపాత్ర మొదలైనవి విసర్జించే చోటును బట్టి ఫలితం ఉంటుంది.

ఉద్వాసన ఉత్తర దిశగా జరిగితే – య౦ జ వ హా ని కి

అగ్నిలోపం ఉండదు.

నీటిలో విసర్జిస్తే - యజమాని తేజస్వి అవుతాడు

శత్రువు ఉన్నదిశగా విసర్జిస్తే - శత్రువు మరణిస్తాడు

మేడికొమ్మ మీద విసర్జిస్తే - శారీరక పుష్టి

దర్భదుబ్బుల మీద విసర్జిస్తే - సరైన కాలంలో వర్షాలు కురుస్తాయి.

## 31. ఉపసత్

ఇందులో ప్రధాన దేవతలు ముగ్గురు. 1. అగ్ని 2. సోముడు 3. విష్ణువు. ఈ యాగానికి ద్రవ్యం ఆజ్యమే. అంటే నేతితోనే ఈ హోమం చెయ్యటమన్న మాట. ప్రవర్గ్య చేసిన వెంటనే దీన్ని చేస్తారు. అగ్నిష్టోమయాగంలో మూడు రోజులు ఉదయం, సాయంత్రం కూడా ఈ హోమం చేస్తారు.

ఇవే కాకుండా 1.అగ్నిష్టోమీయము 2.ఐంద్రావాయువము, 3.మాక్షీంశంసనము అనే అంగ యాగాలు కూడా ఉన్నాయి.

## 32. గవామయనము

ఇది ప్రకృతి యాగం. దీన్ని మొత్తం 361 రోజుల పాటు చేస్తారు. ఇది మొత్తం మూడు భాగాలుగా విభజించారు. అవి 1. పూర్వక్షము 2. విషువము 3. ఉత్తర పక్షము. దీంట్లో 180 రోజులు పూర్వపక్షం చేస్తారు. తరువాత ఒక రోజున విషువము చేస్తారు. తరువాత మళ్ళీ 180 రోజులు ఉత్తరపక్షం చేస్తారు. ఈ మూడింటికీ గవామము అని పేరు.

## 33. ఆదిత్యనామయనము, 34. అంగీరసామయనము

ఈ రెండూ గవాయమనానికి వికృతులు పూర్వ కాలంలో ఆదిత్యులు అనే దేవతలు, అంగీరసులు అనే ఋషులు స్వర్గం పొందటానికి మేము ముందు అంటే మేము ముందు అని పోటీ పడ్డారు. చివరకు ఆదిత్యులే స్వర్గాన్ని పొందారు. ఆ తరువాత 60 సంవత్సరాలకు ఆంగీరసులు స్వర్గం పొందారు.

## 35. ద్వాదశాహము

ఇది 12 రోజులు చేసే క్రతువు. దీన్ని అహీవమని సత్రమని అంటారు. దీంట్లో పై రెండు లక్షణములు ఉన్నాయి. ఒకడే యజమాని, యజ్ అనే ధాతువుతో విధానము, దక్షిణావిధి ఇవి అహీనానికి లక్షణాలు. ఎక్కువమంది యజమానులు అసత్, ఉపయంతే, ఆసీరన్, ఉపేయుః అనే పదాలతో విధానము, సత్రమనే యాగలక్షణాలు, ఈ రెండు కూడా దీనిలో ఉన్నాయి. అందుకే ఇది అహీనము, సత్రము కూడా అవుతోంది. అహీనాలకు ఈ క్రతువు వికృతి.

ఇందులో మొదటిరోజు 'ప్రాయణీయము' జరుగుతుంది. చివరిరోజు ఉదయనీ యనే కర్మ జరుగుతుంది. పదోరోజు అనివాక్యం చేస్తారు. ఆ రోజుల్ని ఆ పేరుతోనే పిలుస్తారు.

## 36. అగ్నిహోత్రము

ఆహితాగ్ని అయిన వాడు జీవించి ఉన్నంత వరకు నిత్యము అగ్నిహోత్రం చేస్తూనే ఉండాలి. దీన్ని సాయంకాలం ప్రారంభించి ఉదయంతో పూర్తి చెయ్యాలి. ప్రతిరోజు వాడవలసిన ద్రవ్యాలు. పాలు, పెరుగు, గంజి, పశువృద్ధి కోరేవాడు. పాలతోను, ఇంద్రియ పటుత్వం కోరేవాడు పెరుగుతోను, గ్రామాధిపత్యం కోరేవాడు. గంజితోను,

అన్నసమృద్ధి కోరేవాడు – అన్నంతోను బలాన్ని కోరేవాడు – నేతితోను హోమం చెయ్యాలి.

## 37. వాజపేయం

ఇది అగ్నిష్టోమానికి వికృతియాగం. ఇందులో 17 దీక్షాదినాలు, మూడు ఉపసత్‌లు, ఒకరోజు సోమయాగం ఉంటుంది. 17 పశువులు ప్రజాపతికి బలి ఇస్తారు. తరువాత అగ్నిసోములు, ఇంద్రుడు, సరస్వతి వీరికి కూడా పశుబలి ఇస్తారు. ఇది చేస్తున్నప్పుడు 'సప్తదశస్తోమం' పఠించటము దీనికి ఉన్న ప్రత్యేక.

ఈ యాగంలో భాగంగా 17 రథాలతో పరుగుపందెం జరుగుతుంది. యజమాని ఇందులో పాల్గొని విజయం పొందుతాడు. తరువాత భార్యతో కలిసి సూర్యుడికి ఎదురుగా ఉన్న విజయస్తంభాన్ని అధిరోహిస్తాడు. ఇదే స్వర్గారోహణ, దీనికి భార్య అనుమతి తప్పనిసరి. ఈ యాగం చేసినవాణ్ణి 'వాజపేయి' అంటారు. వాజపేయం చేసిన రాజు సామ్రాట్ అనబడతాడు. **మనకి ప్రధానమంత్రిగా చేసిన 'అటల్ బిహారీ వాజపేయి' పూర్వీకులు ఎవరో వాజపేయం చేసి ఉంటారు. అందుకే ఆయన వాజపేయి అనబడ్డాడు.**

## 38. రాజసూయం

రాజసూయం, పురుషమేధం, అశ్వమేధం సర్వమేధ యాగాలు క్షత్రియ యాగాలు. అంటే వీటిని క్షత్రియులు మాత్రమే చేస్తారు. రాజసూయానికి ప్రధానదేవత వరుణుడు. రాజసూయంలో రాజు ప్రజాపతికి ప్రత్యక్ష ప్రతినిధి. క్షత్రియుడు రాజ్యాధికారం స్వీకరించిన తరువాత మాత్రమే ఈ యాగం చేస్తాడు. దీంతో

రాజుపవిత్రుడవుతాడు. అతడి ప్రతిష్ట పెరుగుతుంది. ఇది పూర్తి కావటానికి మొత్తం 14 నెలలు సమయం పడుతుంది. ఇందులో సోమయాగాలు ఆరు. పశుయాలు రెండు, ఇష్టులు నూటఇరవైతొమ్మిది, దర్వీహోమాలు ఏడు ఉంటాయి. సాధారణంగా ఫాల్గుణశుద్ధ పాడ్యమిన ఈ యాగం ప్రారంభం అవుతుంది.

ఇందులో సోమయాగాలు చేస్తున్న సమయంలో బ్రహ్మ రాజు చెయ్యి పట్టుకుని సభికులకు పరిచయం చేస్తూ "ఓ సభికులారా ! ఇతడు రాజకుమారుడు. మీకు రాజు. రక్షకుడు" అని చెబుతాడు. ఆ తరువాత అభిషేకం జరుగుతుంది. సముద్రాలు, నదులు, సెలయేళ్ళు, సరస్సులు ఇలా పదహారు పుణ్యతీర్థాలలోని నీరు, పెరుగు, పాలు, నెయ్యి, తేనె వీటన్నింటితోను, సుగంధ జలాలతోను రాజును అభిషేకం చేస్తారు. దీనికి ఉదంబరపాత్ర (మేడి చెక్కతో చేసిన పాత్ర) ఉపయోగిస్తారు.

రాజుగారు ధనుర్బాణాలు పట్టుకుని పులితోలు పరచిన మేడి సింహాసనం మీద కూర్చుంటాడు. అక్కడ ఆరు పార్థహోమాలు చేస్తారు. మహేంద్ర స్తోత్రం చదువుతారు. ఋత్విక్కులు నలుగురు అధ్వర్యుడు, బ్రహ్మ, హోత, ఉద్గాత. రాజును పవిత్ర జలంతో అభిషేకిస్తారు. ఈ కార్యక్రమంలో రాజబంధువులు, మిత్రులు, హితులు అందరూ పాల్గొంటారు. ఇప్పుడు రాజు నూతన వస్త్రాలు ధరిస్తాడు. మళ్ళీ ఆరు పార్థహోమాలు చేస్తారు. ఇక్కడే పన్నెండు ఇష్టులు కూడా చేస్తారు.

ఇప్పుడు రాజుగారుమూడు గుర్రాలు కట్టిన రథం ఎక్కి ఒక వీరునితో ద్వంద్వ యుద్ధం చేసి గెలుస్తాడు. రాజుకు ఇద్దరు అంగరక్షకులు కూడా ఉంటారు.

రాజుగారు బంధువులకు సంబంధించిన ఆవులమీద దండెత్తి జయిస్తాడు. కొంత ధనము, రాజ్యము వారికి ప్రతిఫలంగా ఇస్తాడు. ఆ తరువాత అధ్వర్యుడితో పాచికలాడతాడు. ఈ ఆటలో పందెం గోవు. అక్కడ కూడా జయిస్తాడు. సోమయాగం చివరలో హోత శునశ్శేపుని వృత్తాంతం చెబుతాడు.

ఆ మరునాటి నుంచి పదిరోజులపాటు పది రకాల ఇష్టులు చేస్తారు. పదకొండవ రోజున 'దశపేయం' జరుగుతుంది. ఈ సోమయాగంలో పది చమసలు (పాత్రలు) ఉపయోగిస్తారు. పదిమంది ఋత్విక్కులు సోమపానం చేస్తారు. అందుకే దీన్ని దశపేయము అంటారు.

ఒక సంవత్సరం తరువాత ఒక సోమయాగం చేస్తారు. దాంతో దీక్ష పూర్తవుతుంది. తరువాత మళ్ళీ కొన్ని సోమయాగాలు చేస్తారు. దీంతో రాజసూయం పూర్తి అవుతుంది.

మహాభారతంలో ధర్మరాజు రాజసూయం చేశాడు. అది చెయ్యమని చెప్పింది నారదుడు. అయితే రాజసూయ యాగం చేస్తే భయంకరమైన యుద్ధం సంభవిస్తుంది అని కూడా చెప్పాడు నారదుడు.

## 39. అశ్వమేధం

శతపథ బ్రాహ్మణంలోని 13వ కాండలో అశ్వమేధ యాగం గురించి చెప్పబడింది. ఇది క్షత్రియులు మాత్రమే చేసే యాగం. చారిత్రకంగా ప్రాముఖ్యత కలిగిన యాగం. ఇందులో అన్నీ శుభలక్షణాలున్న ఉత్తమజాతి గుర్రం బలిపశువుగా ఉంటుంది. గుర్రంతోపాటుగా ఇంకా చాలా పశువులు హోమద్రవ్యంగా వాడబడతాయి.

'సాంగ్రవణేష్టి' అనే ఇష్టితో ప్రారంభం అవుతుంది అశ్వమేధం. తరువాత ఆ గుర్రాన్ని సంవత్సరంపాటు స్వేచ్ఛగా తిరగటానికి వదిలేస్తారు. దాని రక్షణ కోసం కొంతమంది మహావీరులు, కొంత సైన్యం దాని వెనక పెడతారు. రాజుగారు దీక్ష తీసుకుని గుర్రం తిరిగి వచ్చేదాకా హోమాలు చేస్తుంటాడు. నటవిట గాయకులు తన వీరగాధలు గానం చేస్తుంటే వింటూ గుర్రం కోసం ఎదురు చూస్తుంటాడు.

ప్రధాన యాగం మూడు రోజులు. మొదటిరోజున కొన్ని హోమాలు చేస్తారు. రెండవ రోజు పవనాశ్వాన్ని యూపస్తంభం దగ్గరకు తెస్తారు. హోత ఋగ్వేదంలోని (సూర్యుణ్ణి అశ్వరూపంలో స్తుతించేది) సూక్తాన్ని గానం చేస్తాడు. అక్కడ 21 యూప స్తంభాలుంటాయి. వాటిలో మధ్య దానికి గుర్రాన్ని కట్టేస్తారు. దానికి రెండు వైపులా ఉన్న యూపస్తంభాలకు 340 గ్రామ్యపశువులు, 360 అరణ్యపశువులు బంధించబడతాయి. చూడటానికి పెద్ద జంతు ప్రదర్శనశాలలాగా ఉంటుంది. 'పర్యగ్నీకరణం' తరువాత అశ్వము, గ్రామ్యజంతువులు బలి ఇవ్వబడతాయి. అరణ్య జంతువులను వదలివేస్తారు. తరువాత వపాహోమం చేయబడుతుంది.

మూడవ రోజున అతిరాత్ర సోమయాగం చేస్తారు. తరువాత అవబృథంతో అశ్వమేధం పూర్తవుతుంది. ఈ యాగం సార్వభౌమాధికారానికి ఏకఛత్రాది పత్యానికి ప్రతీక. ఇందులో వినియోగించిన అశ్వం ప్రజాపతికి ప్రతీక.

## 40. గోమేధము

యజ్ఞయాగాది క్రతువుల్లో మేక, గొర్రె మొదలైన వాటితో పాటుగా మనిషిని కూడా బలి ఇచ్చేవారు అని చెప్పుకున్నాం ఇంకా విచిత్రమైన విషయం ఏమంటే మనం అత్యంత పవిత్రంగా పూజించే గోవును కూడా వధించేవారు. ప్రత్యేకంగా గోమేధము జరిగేది భారత భాగవతాల్లో చెప్పిన రంతిదేవుని ఉపాఖ్యానము దీనికి మంచి ఉదాహరణ. సంకృతియొక్క కుమారుడు రంతిదేవుడు. ఒకసారి ఇతడు యాగం చెయ్యపోతుండగా కొన్ని గోవులు వచ్చి మానవభాషలో "ఓ రాజా! నీ యాగంలో మమ్మల్ని కూడా హోమం చెయ్యి అన్నాయి. ఆ మాటలు విన్న రంతిదేవుడు సందేహిస్తున్నాడు. అప్పుడు ఆ గోవులు "ఓ రాజా! జ్ఞానులే ఈ పని చెయ్యచ్చు అని మమ్మల్ని ఇక్కడికి పంపారు. కాబట్టి దీనివల్ల నీకు ఏ పాపము రాదు. పైగా పుణ్యం కూడా వస్తుంది" అన్నాయి. అప్పుడు రంతిదేవుడు సందేహం వదలిపెట్టి ఆవులలో ఒక్కటి కూడా వదలకుండా అన్నింటినీ హోమం చేశాడు.

## 41. పురుషమేధం

ఇది కూడా అశ్వమేధం లాగానే ఒక సోమయాగము. ఇందులో పురుషుడే యజ్ఞపశువు. బ్రాహ్మణ లేక క్షత్రియ బాలకుడు బలిపశువు. ఇతన్ని వెయ్యి ఆవులు లేదా వంద గుర్రాలు ఇచ్చికొంటారు. ఇది వాయుదేవతాకము.

ఇందులో ప్రధానయాగం ఐదు రోజులు ఉంటుంది. మూడవరోజున పశువులు దేవతలకు బలి ఇవ్వబడతాయి. ఇందులో పురుషుడు కాక 158 రకాల పశువులు 158 మంది మనుషులను దేవతలకు బలిఇస్తారు.

ఇందులో పురుషుణ్ణి చివరలో వదలివేస్తారు. పురుషుణ్ణి బలి ఇవ్వరు అని కొంతమంది చెబుతున్నారు. కాని శునశ్శేపుడి వృత్తాంతం చూస్తే మాత్రం అది నిజంకాదు అని తెలుస్తుంది.

## 42. కూశ్మాండ హోమం

వైదిక మతంలో ప్రాయశ్చిత్తం ప్రధానమైనది. తెలిసిగాని, తెలియకగాని చేసిన అనేక రకాలయిన అపరాధాలకు ప్రాయశ్చిత్తం కూశ్మాండహోమం. దేవతలను అవమానించటంగాని, అప్పులుఎగవేయటం, గర్భపాతం మొదలైన వాటివల్ల వచ్చే పాపాలనుంచి విముక్తి కోసం, వ్యాధిరూపంలో పీడిస్తున్న పాపాలనుంచి విముక్తి కోసం ఈ హోమం చేస్తారు.

వైశ్యదేవం చేసిన వారు ఇతరుల ఇంట్లో భోజనం చెయ్యరు. తనభార్య వంట చెయ్యాలి, లేదా తాను స్వయంగా చేసుకోవాలి. బయటివారెవరైనా సరే ఆహితాగ్ని అయితేనే ఆ యింట్లో భోజనం చేస్తారు.

ఇందాకనే ఒక పురోహితుడు మాట్లాడుతూ నేను కూశ్మాండహోమాలు చేశాను. అందుకని వైశ్యదేవం చేసినవారు మా ఇంట్లో భోజనం చెయ్యవచ్చు అన్నారు. అవునండీ! నేను చేసుకున్నది రజస్వలానంతర వివాహం. శాస్త్రప్రకారం మా యింట్లో ఆహితాజ్ఞులు భోజనం చెయ్యరు. కాని నేను కూశ్మాండహోమం చేసి ప్రాయశ్చిత్తం చేసుకున్నాను. కాబట్టి ఇప్పుడు అభ్యంతరంలేదు అన్నారు అటువంటి వాటికి కూడా ఇది ప్రాయశ్చిత్తమన్నమాట.

ఇక్కడ గుర్తించాల్సిన విషయం ఏమంటే రజస్వలాపూర్వవివాహం వేదంలో చెప్పబడలేదు అందుచేత రజస్వలానంతర వివాహం దోషంకాదు. కాబట్టి దానికి ప్రాయశ్చిత్తం అవసరం లేదు. ఇది కేవలం ఛాందసం. అంతే.

## 43. వేయి సంవత్సరాల సత్రయాగం

ఈ బ్రాహ్మణంలో చివర **"అతిరాత్రం ప్రజాపతేః సహస్ర సంవత్సరః"** వేయి సంవత్సరాలు జరిపేది సత్రయాగము అన్నారు. ఈ యాగం చెయ్యటంవల్ల ప్రజాపతికి గతవైభవము వచ్చి సృష్టికి కావలసిన శక్తి ఏర్పడింది. అయితే భూలోకంలో ఆయుష్షు వంద సంవత్సరాలంటే పూర్ణాయువు అంటారు. అంతకు మించి ఉన్నవారు చాలా తక్కువ. మరి ఇక్కడ వేయి సంవత్సరాలు యాగము అంటున్నారు. అది ఎలా సాధ్యం? ఇక్కడే చెబుతున్నారు. సంవత్సరము అంటే రోజు అని కూడా అర్థం ఉంది. కాబట్టి వేయి సంవత్సరాలు అంటే వేయిరోజులు. అంటే ఇది వెయ్యి రోజులు చేసే యాగము.

## 44. సావిత్ర్యాగ్నిచయనము

ఇది ఒక ప్రత్యేకమైన క్రతువు. ఒక్క తైత్తిరీయ బ్రాహ్మణంలోనే చెప్పబడింది. మరి ఏ ఇతర బ్రాహ్మణాలలోను చెప్పబడలేదు.

పూర్వకాలంలో భరద్వాజుడు వేదాలను పూర్తిగా తెలుసుకోవాలి అనుకున్నాడు. కాని అలాచెయ్యాలంటే ఎంతో ఆయుష్షు కావాలి. ఎందుకంటే ఒక వేదం చదువుకోవాలి అంటే 12 సంవత్సరాలు పడుతుంది. అలాంటిది ఐదువేదాలు (యజుర్వేదం రెండుగా ఉంటుంది) 5 × 12 = 60 సంవత్సరాలు అప్పటికే ఆ మనిషికి 70 సంవత్సరాలు వచ్చేస్తాయి. నాలుగువేదాలు చదవాలంటే ఏకసంతాగ్రాహి అయి ఉండాలి. ఒక్కసారి విన్నంత మాత్రంచేతనే ఒప్పుచెప్పగల శక్తి ఉన్నవాడు కావాలి. పూర్వకాలంలో ఎవరో కొంతమంది మహానుభావులు ఉన్నారు. వాళ్ళే ఈ రోజున **'చతుర్వేదుల'** ఇంటి పేరుతో పిలువబడుతున్నారు. 2005 సంవత్సరంలో అవధూత దత్తపీఠానికి ఆస్థాన విద్వాంసునిగా నియమించ బడ్డప్పుడు నన్ను

సన్మానించిన వారిలో కర్నాటక గవర్నర్ **'టి.ఎన్.చతుర్వేది'** ఒకరు. వారి పూర్వీకులెవరో నాలుగు వేదాలు చదివారన్నమాట.

ఇప్పుడు భరద్వాజుడు ఇంద్రుణ్ణి గురించి తపస్సు చేశాడు. ఇంద్రుడు ప్రత్యక్షమై ఏం కావాలి అన్నాడు. నా ఆయుష్షు పెంచమన్నాడు భరద్వాజుడు, సరే అన్నాడు ఇంద్రుడు. భరద్వాజుని ఆయుష్యు 300 సంవత్సరాలు పెరిగింది. మళ్ళీ తపస్సు చేశాడు. మళ్ళీ తపస్సు చేశాడు. ఇలా తపస్సు చేసి మూడుసార్లుగా 900 సంవత్సరాలు ఆయువు పెంచుకున్నాడు. అతని ఆయువు 100. వెరసి 1000 సంవత్సరాలు జీవించాడు భరద్వాజుడు. వేదాధ్యయనం చేశాడు. మరణకాలం ఆసన్నమైంది. శరీరము, ఇంద్రియాలు పటుత్వాన్ని కోల్పోయినాయి. నడిచే ఓపిక కూడా లేక పడుకొని ఉన్నాడు. ఆ సమయంలో ఇంద్రుడు వచ్చి పరామర్శించాడు. అప్పుడు ఇంద్రుడు "ఓ భరద్వాజా! ఇప్పుడు నేను నీకు మళ్ళీ ఆయుష్షు ఇస్తే ఏం చేస్తావు? అన్నాడు. దానికి భరద్వాజుడు మళ్ళీ వేదాధ్యయనం చేస్తాను అన్నాడు. అప్పుడు ఇంద్రుడు తన దివ్యశక్తిలో మూడు పర్వతాలు చూపించాడు. అలా చూపి ఓ భరద్వాజా! అసలు వేదాల స్వరూపం ఇది. ఇక నీవు మూడవందల సంవత్సరాల కాలంలో చదివినది అంటూ గుప్పెడు మట్టిని చూపించాడు. అలా చూపి సంపూర్ణంగా వేదం గురించి తెలుసుకోవాలంటే ఎవరికీ వీలుకాదు. అది అసాధ్యము. నువ్వు వేదాలన్నీ చదవాలి అని గట్టి పట్టుదలతో ఉన్నావు కాబట్టి నేను ఒక మాట చెబుతాను. 'సావిత్రాగ్ని'ని ధ్యానం చెయ్యి. ఆ దేవతను సాక్షాత్కరింపచేసుకో. నీ కోరిక తీరుతుంది అని సావిత్రాగ్ని విద్యను ఉపదేశించాడు. వేదాలు మొత్తం చదివితే నీకు ఏ ఫలితం వస్తుందో, అదే ఫలితం సావిత్రాగ్నిని ఉపాసన చేసినా వస్తుంది. సావిత్రాజ్ఞి

జ్ఞానానికి, ఆదిత్యో పాధికమైన హిరణ్యగర్భ ప్రాప్తి ఫలితం. కర్మకాండలో హిరణ్యగర్భ ప్రాప్తి కన్నా అధికఫలం లేదు అన్నాడు. తరువాత భరద్వాజుడు సావిత్రాగ్నిని ధ్యానం చేసి, సాక్షాత్కరింప చేసుకుని, దేహత్యాగం చేసి ఆదిత్యలోకం చేరాడు. ఇంత గొప్పదైన సావిత్రాగ్ని క్రతువు, దాని ఉపాసన తైత్తిరీయ బ్రాహ్మణంలో చెప్పబడ్డాయి.

**సావిత్ర్యాగ్ని మాహాత్మ్యము :** విదేహదేశాన్ని పాలించే జనకమహారాజు సావిత్రాగ్నిని ఉపాసన చెయ్యాలి అనుకుని అహోరాత్రాభిమాన దేవతలను కలిశాడు. అప్పుడు వారు జనకమహారాజా! మమ్మల్ని ఎవరైతే సావిత్రాగ్ని రూపంగా ఉపాసిస్తారో, వారు సర్వపాపాల నుంచి, అపమృత్యువు నుంచి విముక్తులై సంపూర్ణాయుష్షు పొంది మరణానంతరము స్వర్గం పొందుతారు అన్నానికి లోటు లేకుండా సర్వాన్నసమృద్ధి కలవారై స్వర్గంపొందుతారు అన్నారు.

అశ్వత్థ మహర్షి కుమారుడు అహినమహర్షి సావిత్రాగ్నిని ధ్యానం చేసి సాక్షాత్కరించుకున్నాడు. దాని ఫలితంగా బంగారుహంస అయి స్వర్గలోకానికి వెళ్ళి ఆదిత్యునిలో తాదాత్మ్యం చెందాడు.

అలాగే శ్రౌతానుష్టానంలో సంపూర్ణపాండిత్యంగల దేవభాగమహర్షి సావిత్రాగ్నిని ధ్యానం చేస్తున్నాడు. ఆ సమయంలో ఆయనకు అశరీర వాక్కు వినిపించింది. “ఈ దేవభాగ మహర్షి సావిత్రాగ్నిని సాక్షాత్కరింప చేసుకోవటంతో జగత్తు మొత్తాన్ని తెలుసుకోగలిగాడు. ఆహా! ఏమీ? ఈ సావిత్రాగ్ని మాహాత్మ్యం? ఈ మహర్షికి సర్వజ్ఞత్వాన్ని కూడా ప్రసాదించింది” అంటూ ఆశ్చర్యాన్ని ప్రకటించింది. ఆ మాటలు విన్న మహర్షి నువ్వెవరు? అన్నాడు. నేనే సావిత్రాగ్నిని అని సమాధానం వచ్చింది. వెంటనే మహర్షి తనపైన

ఉన్న ఉత్తరీయాన్ని యజ్ఞోపవీతంగా ధరించి అమితమైన భక్తితో సావిత్రాగ్నికి సాష్టాంగ దండప్రణామాలాచరించాడు. తరువాత సావిత్రాగ్ని 'ఓ మహర్షీ! సావిత్రాగ్ని జ్ఞానఫలం లభించిందా? లేదా? అనే అనుమానం వద్దు. సావిత్రాగ్ని సాక్షాత్కరించటం చేత నీకు సర్వలోకాలు, సర్వఫలసిద్ధి కలిగింది" అని చెప్పింది.

వృష్ణికుమారుడు శూషమహర్షి ఒకసారి మంచి విజ్ఞానాన్ని ఆదిత్యుడి ద్వారా పొందాలి అనుకున్నాడు. అప్పుడు ఆదిత్యుడు "ఓ మహర్షీ! నా దగ్గరకు రా ! నన్ను సావిత్రాగ్ని స్వరూపంగా తెలుసుకో" అని చెప్పాడు. అందుచేత ఈ సావిత్రాగ్ని స్వర్గం పొందటానికే కాదు సంసార సాగరాన్ని దాటటానికి కూడా ఉపకరిస్తుంది. అమృత స్వరూపమైన పరమాత్మ నుంచి సావిత్రి పుట్టింది. కాబట్టే దానికి ఆ శక్తి వచ్చింది. ఆదిత్య మండలంలో బంగారు జుట్టుతోను, మీసాలు, కళ్ళు, నఖశిఖ పర్యంతము బంగారు రంగుతో ప్రకాశించే స్వరూపం ఏదైతే ఉన్నదో అదే సావిత్రాగ్ని. కాబట్టి సావిత్రాగ్ని స్వరూపాన్ని గూర్చి తెలుసుకున్న వాడికి ఆదిత్యమండలమే ప్రాప్తిస్తానము. ఓ మహర్షీ! అందుకే నిన్ను ఇక్కడికి రమ్మని, నన్ను సావిత్రాగ్నిగా తెలుసుకోమని చెప్పాను అన్నాడు. ఈ రకంగా సావిత్రాగ్ని స్వరూపము, వైశిష్ట్యము అంతా తైత్తిరీయ బ్రాహ్మణంలో వివరించబడింది.

# 45. ఇతర యాగాలు

ప్రత్యేకమైన యాగాలు చెయ్యటం ద్వారా మానవుడు కావలసిన ఫలాన్ని పొందవచ్చు. ఆదిత్యుడు అన్ని పాపాలు దాటి స్వర్గాన్ని కూడా అతిక్రమించి పోవాలి అనుకున్నాడు. అప్పుడు 'శదం' అనే యాగాన్ని చేసి తను అనుకున్నది సాధించాడు ఆదిత్యుడు. మానవులు కూడా ఈ యాగం చేసి తాము అనుకున్న ఫలితం పొందవచ్చు. సంతానము, సిరిసంపదలు పొందటానికి ఏవైనా అడ్డంకులుంటే వాటిని తొలగించుకోవటానికి 'ఉపశదం' అనే యాగం చెయ్యాలి. పూర్వకాలంలో కశ్యపుడు కూడా దీన్ని చేశాడు. అలాగే సమృద్ధిగా అన్నం కావాలనుకునే వాళ్ళు 'విరాట్' అనే యాగాన్ని చెయ్యాలి. పూర్వకాలంలో దేవతలు ఈ యాగం చేశారు. ఈ యాగం చెయ్యటం వల్ల సమృద్ధిగా అన్నీ రావటమే కాదు. అన్నాన్నితిని జీర్ణం చేసుకోగలుగుతారు.

స్వరాట్ అనే యాగం చేస్తే – స్వారాజ్యం సిద్ధిస్తుంది. స్వారాజ్యం అంటే తనకు తానుగా ప్రకాశలోకం. ఋషభం అనే శబ్దానికి శ్రేష్టము అని అర్థం. ఇంద్రుడు ఈ యాగం చేసి దేవతలలో శ్రేష్ఠుడైనాడు. 'వ్యోమ' అనే యాగం చేసి వ్యోమలోకాన్ని పొందవచ్చు అంటోంది తలవకార బ్రాహ్మణం.

ఇదే రకంగా అపచితి యాగం

సంఘంలో గౌరవం కోసం – ప్రజా,

పశుసంపదకు – మనస్తోమం చెయ్యాలి.

శత్రు సంహారం కోసం – పరిక్రీ,

తనవారిలో ప్రత్యేకత పొందటానికి – బృహస్పతిసవం

తేజస్సు, 'బ్రహ్మవర్చస్సు' కావాలంటే – త్రివృత్ అనే యాగం చెయ్యాలి.

ప్రజాపతి సృష్టి చేశాడు. ప్రజలెవరూ ఆయన్ని సృష్టి కర్త అని గుర్తించలా. దాంతో ఆయన 'ఉపహవ్యం' అనే క్రతువు చేసి గుర్తింపు పొందాడు. మరుద్దేవతలు శక్తివంతులై స్వర్గాన్ని జయించాలనే కోరికతో 'పంచశారదీయాన్ని' అనుష్టించి ఇష్టసిద్ధి పొందారు.

విశ్వజిద్ యాగం చేసి ప్రజలను సృష్టించిన ప్రజాపతి గొప్పదనాన్ని ఎవరూ గుర్తించలేదు. దాంతో సృష్టి అంతా మాలగా చేసి తనమెడలో వేసుకున్నాడు. అప్పుడు సృష్టి అంతా ఆయన పాదాక్రాంతమైంది. అందరూ ప్రజాపతిని గుర్తించారు. తరువాత ఇంద్రుణ్ణి తన వారసుడిగా చేయాలని తన మెడలోని మాలను ఇంద్రుడికిచ్చాడు. దాని ప్రభావంతో ఇంద్రుడు జగత్తంతటనీ జయించాడు. మానవుడు కూడా విశ్వజిద్‌యాగం చేసి జగత్తును జయించవచ్చు అంటోంది ఈ బ్రాహ్మణం. ఇంద్రుడు తనకు జయించటానికి వీలుకానిది ఏదీ ఉండకూడదని అభిజిద్యాగం చేశాడు. ఈ యాగంచేస్తే ప్రజలలో శ్రేష్టత్వము, శత్రువిజయం సిద్ధిస్తాయి.

సాద్యస్క్రం – శత్రునాశనం చేస్తుంది. స్వర్గాన్ని కోరేవాడు 'గోసవాన్ని' చెయ్యాలి. 'కులాయము' అనే క్రతువు సంతతి, సేవకులు, పశువులు, గృహాలు ప్రసాదిస్తుంది.

అంగీరసులు అనే మహర్షులు సామూహికంగా సత్రయాగం చేసి స్వర్గాన్ని పొందారు. కాని అదే వంశానికి చెందిన హవిష్మాన్, హవిష్కృత్ అనే ఇద్దరు లౌకిక సుఖాలకు లోనై సత్ర యాగం చెయ్యకపోవటం చేత స్వర్గం పొందలేదు. ఆ తరువాత జ్ఞానం పొంది

వారు 'స్వాధిష్టయే', 'అస్వా ప్రత్యామనుద్యుతిం' అనే సామాలను దర్శించి వాటిని రెండు రోజులు అనుష్టానం చేసి స్వర్గం పొందారు. కాబట్టి ఇప్పుడు కూడా ఈ యాగం చేసేటప్పుడు, వారి పేరుతో ఆ సామాలను వరుసగా మొదటి రెండు రోజులు గానం చేస్తారు.

దేవతలు 'త్రిరాత్ర క్రతువు' అనుష్టించి స్వర్గం పొందారు.

చతుర్రాత్ర యాగం చేసి అత్రిమహర్షి నలుగురు వీరులను కన్నాడు.

జమదగ్ని చతుర్రాత్ర యాగం వల్ల బహుసంతతిని, ప్రజాపశువులను పొందాడు.

'జితి' అనే ఐదురాత్రుల యాగం చేసి శత్రుసంహారము, విజయము పొందవచ్చు షడ్రాత్ర క్రతువుతో మరుద్దేవతలు స్వర్గం పొందారు.

సప్తరాత్ర యాగం సంపదల నిస్తుంది.

బృహస్పతి అష్టరాత్ర యాగం చేసి తేజశ్వి, యశశ్వి, బ్రహ్మవర్చసి అయినాడు. తేజస్సు కోరేవాడు తొమ్మిది రాత్రుల యాగం చెయ్యాలి.

శత్రుసంహారం కోసం దశరాత్రయాగం చెయ్యాలి. యాగం పూర్తయిన పదిరోజుల్లో శత్రువు మరణిస్తాడు.

వీర్యాన్ని కోరే వ్యక్తి 'గోష్టోమం' అనే ఏకాదశాహం చెయ్యాలి.

'విజితి' అనే ద్వాదశాహం ద్వారా శత్రునాశనం జరుగుతుంది. ఆంగీరస సత్రం – స్వర్గాన్నిస్తుంది.

మహానామ్ని – కుటుంబ సౌఖ్యము ఇస్తుంది.

'శ్యేన' అనే యాగాన్ని చేసి ఇంద్రుడు రాక్షస సంహారం చేశాడు.

'మైధాతిథం' అనే సత్రయాగం చేస్తే పశుసంపద కలుగుతుంది.

మేధాతిథి ఈ క్రతువు చేశాడు.

పదమూడు రోజుల దగ్గర నుండి వేయి సంవత్సరాల వరకు జరిగే యజ్ఞాలను సత్రాలు అంటారు. ఈ రకంగా బ్రాహ్మణాలలో అనేకానేక యజ్ఞాలు యాగాలు చెప్పబడ్డాయి.

# 37. ఐతరేయ బ్రాహ్మణము

ఋగ్వేదానికి ప్రసిద్ధమైన శాఖలు రెండున్నాయి. 1. శాకల శాఖ 2. భాష్కలశాఖ. వీటిలో శాకలశాఖకు సంబంధించినది ఐతరేయ బ్రాహ్మణము. దీనికే బహ్వృచ బ్రాహ్మణము అని కూడా పేరు.

పూర్వకాలంలో ఒక మహర్షికి చాలామంది భార్యలున్నారు. అందులో ఒకావిడ పేరు 'ఇతర' ఆమెకు ఒక కుమారుడున్నాడు. అతడిపేరు 'మహిదాసుడు' ఇతర యొక్క కుమారుడు కాబట్టి మహిదాసుని 'ఐతరేయుడు' అన్నారు. ఆ మహర్షికి మిగిలిన పిల్లలమీద ఎక్కువ ప్రేమ అభిమానం ఉండేవి. మహిదాసుణ్ణి కొంచెం తక్కువగా చూసేవాడు. ఒకసారి ఒక యాగం జరుగుతున్నది. అక్కడ సభకు వెళ్ళాడు మహర్షి. వెడుతూ తనతోపాటుగా కుమారులందరినీ తీసుకువెళ్ళాడు. మిగిలిన పిల్లలందరినీ తన దగ్గర, ఒళ్ళో కూచోబెట్టుకున్నాడు. మహిదాసును మాత్రం కొంచెం దూరంగా ఉంచాడు. మహిదాసుకు ఇది బాధాకరమనిపించింది. బిక్కమొగం వేశాడు. తల్లి దగ్గరకు వెళ్ళి జరిగింది చెప్పాడు. జరిగిన దానికి తల్లికూడా బాధ పడింది. తన కులదేవత అయిన భూదేవిని ప్రార్థించింది. వెంటనే భూదేవి ప్రత్యక్షమై మహిదాసుకు బ్రాహ్మణం వ్రాసే శక్తిని ప్రసాదించింది. ఆ తరువాత మహిదాసు ఈ బ్రాహ్మణాన్ని వ్రాశాడు. మహిదాసును ఇతర కుమారుడు కాబట్టి ఐతరేయుడు అనేవాళ్ళు. అందుకే అతడు వ్రాసిన బ్రాహ్మణము ఐతరేయబ్రాహ్మణమని చెప్పబడింది. అయితే ఆ మహర్షి యాజ్ఞవల్క్యుడు, ఆయనకు ఇద్దరు భార్యలు. పెద్దభార్య కాత్యాయని. చిన్నభార్య మైత్రేయి. కాత్యాయనినే ఇతర అనే వాళ్ళు. ఆవిడ కుమారుడే మహిదాసుడు. అతడు వ్రాసినదే

ఈ బ్రాహ్మణము అన్నాడు 'షడ్గురు శిష్యుడు.'

ఈ బ్రాహ్మణం మొత్తం ఎనిమిది బాగాలుగా ఉంటుంది. ఒక్కొక్క దాంట్లోను ఐదు అధ్యాయాలుంటాయి. ఇలా 8 × 5 = 40 అధ్యాయాలున్నాయి. ఒక్కొక్క అధ్యాయము కొన్ని ఖండాలుగా చెప్పబడింది. మొత్తం మీద 40 అధ్యాయాలలోను 285 ఖండలు ఉన్నాయి.

ఐతరేయ బ్రాహ్మణానికి సమగ్రమైన భాష్యం వ్రాసిన వాడు సాయణాచార్యుడు. భట్టభాస్కరుడు కూడా దీనికి భాష్యం వ్రాశాడు కాని అది పెద్దగా లభించదు. ఇంతకన్న దీనిమీద చెప్పుకోతగ్గ భాష్యాలు లేవు.

ఐతరేయ బ్రాహ్మణం సోమయాగాన్ని, ఇతర యాగాలు వివరించింది. దాంతో బాటుగా సమాజానికి కావలసిన వాటిని కూడా చెప్పింది. ఇందులో చెప్పిన ఒక గొప్ప విషయం చూడండి.

"సూర్యుడు అస్తమించటం ఉదయించటం అనేవి లేవు. సాయంత్రం అతడు కనిపించకుండా పోతాడు. మళ్ళీ ఉదయం కనిపిస్తాడు. అంటే ఆ సమయంలో ఈ భూగోళంలో ఇంకొక ప్రాంతంలో ఉంటాడు. అంటే ఈ భూగోళంలో ఒక ప్రాంతంలో పగలయితే ఇంకొక ప్రాంతంలో రాత్రి. ఈ విషయం తెలిసినవాడు సూర్యునితో సమానమయిన రూపాన్ని పొందుతాడు." ఇక్కడ చూడండి. మనకి రెండు విషయాలు తెలుస్తున్నాయి. 1. సూర్యుడికి ఉదయాస్తమానాలు లేవు. 2. సూర్యుడు ఒకేచోట ఉండకుండా సంచరిస్తుంటాడు. వీటిని బట్టి సూర్యుడికి ఉదయము అస్తమానము లేవు అనే విషయం వేదకాలంలోనే మనకి తెలుసు. అలాగే సూర్యుడు

సంచరిస్తుంటాడు. ఈ విషయం సరికాదని సూర్యుడు స్థిరంగా ఉంటాడు. భూమి సంచరిస్తుందని తరువాత కాలంలో శాస్త్రజ్ఞులు చెప్పారు.

ఇక్కడ ఇంకొక విషయం చెప్పబడింది. ఆ రోజుల్లో ప్రజలు కుమారుడు కావాలనే ఎక్కువగా కోరుకునే వారు. ఈ లోకంలో సిరిసంపదలు, భోగభాగ్యాలు అన్నింటికన్నా తల్లితండ్రులకు పుత్రుడే ఎక్కువ సౌఖ్యాన్నిస్తాడు అని నొక్కి వక్కాణిస్తోంది ఈ బ్రాహ్మణం. పురుషుడికి అన్నమే ప్రాణము, ఒంటి మీద బట్టే ఇల్లు, బంగారమే రూపం, పశువులే నిర్వాహకాలు. భార్యే స్నేహితురాలు అని చెబుతోంది బ్రాహ్మణం. కుమార్తె దైన్యహేతువని, పుత్రుడు జ్యోతిస్వరూపుడని చెబుతోంది. పుత్రుడు తనతండ్రి పరబ్రహ్మస్వరూపం పొందేలా చేస్తాడు అని చెబుతోంది.

దీనిబట్టి ఆ రోజుల్లో స్త్రీ సంతానం కన్నా పురుష సంతానాన్ని ఎక్కువ కోరుకునే వారు. ఇది వంశాభివృద్ధి కోసమై ఉండవచ్చు.

## 1. శునశ్శేపుడు

ఇది చాలాప్రసిద్ధమైన కథ. శునశ్శేపుడు అనే పేరుతో మనం రెండు కథలు వింటుంటాం. **రామాయణం**లో దీన్ని గురించి చెప్పటం జరిగింది.

'రుచికుడు' అనే ముని రెండవ కుమారుడు శునశ్శేపుడు. ఒకసారి అంబరీషుడు రుచికుడిదగ్గరకు వచ్చి నేను ఒక యాగం చేస్తున్నాను. నాకు యజ్ఞపశువుగా ఒక బ్రాహ్మణ బాలకుడు కావాలి. నీకు ముగ్గురు కుమారులున్నారు. వారిలో ఒకణ్ణి నాకు యజ్ఞపశువుగా ఇచ్చినట్లైతే నీకు లక్ష గోవులు ఇస్తాను అన్నాడు. లక్ష గోవులు అనేటప్పటికి ఆశ

కలిగింది రుచికుడికి. కాని ఎవరిని ఇవ్వాలి. పెద్దవాడు కర్మాధికారి. కాబట్టి వాణ్ణి ఇవ్వలేను. ఇక మిగిలిన ఇద్దరిలో, ఇంతకీ భార్య ఏమంటుందో? అని భార్యతో విషయం ప్రస్తావించాడు రుచికుడు. కడసారి కుమారుడు అంటే నాకు ప్రాణం. వాణ్ణి ఇవ్వటానికి నేను మాత్రం ఒప్పుకోను అంది భార్య. అన్నీ వింటూనే ఉన్నాడు రెండవ కుమారుడైన శునశ్శేపుడు పెద్దవాడు తండ్రికి కావాలి. ఆఖరువాడు తల్లికి కావాలి. ఇక మిగిలింది తనే కదా ! తాను ఎవరికీ అక్కర్లేదు. ఇలా ఆలోచించి అంబరీషుడితో రాజా! లక్షగోవులు మా తండ్రికి ఇచ్చి నన్ను తీసుకుపో అన్నాడు. రుచికుడికి ఆవులుఇచ్చి బాలుణ్ణితీసుకుని బయలుదేరాడు అంబరీషుడు. తాను మరణించబోతున్నాడు. ఈ విషయం తెలుసు శునశ్శేపుడికి. మరణించటం అతనికి ఇష్టం లేదు. దాంతో త్రోవలో విపరీతంగా ఏడుస్తున్నాడు. అతనితోసహా అంబరీషుడు ప్రయాణమై వెళ్ళిపోతున్నాడు. త్రోవలోఒకచోట విశ్రాంతి కోసం ఆగాడు అంబరీషుడు. ఆ సమయంలో అటుగా పోతున్న విశ్వామిత్రుడు శునశ్శేపుణ్ణి చూసి విషయం తెలుసుకున్నాడు. అతడికి ఒక మంత్రం చెప్పాడు. ఈ మంత్రం నువ్వు జపిస్తూ ఉండు. నీకు మరణంరాదు అన్నాడు. ఆమంత్రాన్ని జపిస్తున్నాడు శునశ్శేపుడు. అంబరీషుడు ప్రయాణమయి తన రాజ్యానికి వెళ్ళాడు. యజ్ఞానికి ఏర్పాట్లు పూర్తయినాయి. శునశ్శేపుణ్ణి యూపస్తంభానికి కట్టేశారు. అతడు విశ్వామిత్రుడు చెప్పిన మంత్రాన్ని జపం చేస్తూనే ఉన్నాడు. అప్పుడు ఇంద్రుడు ప్రత్యక్షమై అంబరీషుడు యజ్ఞంచెయ్యకుండానే యాగఫలాన్నిచ్చి, శునశ్శేపుణ్ణి విడిపించాడు.

ఇక రెండవ కథ. బ్రహ్మవైవర్త పురాణంలోది. అజీగర్తుని రెండవ కుమారుడు శునశ్శేపుడు. ఒకసారి భయంకరమైన కరువు వచ్చింది. తినటానికి తిండికూడా దొరకటం లేదు. ఆ సమయంలో తన రెండవ కూమారుడు శునశ్శేపుణ్ణి హరిశ్చంద్రుడికి అమ్మాడు అజీగర్తుడు.

హరిశ్చంద్రుడు యజ్ఞం చేస్తున్నాడు. శునశ్శేపుణ్ణి యూపస్తంభానికి కట్టేశారు. అతడు బ్రహ్మదేవుణ్ణి ప్రార్థించాడు. బ్రహ్మప్రత్యక్షమై, హరిశ్చంద్రుడికి యాగఫలాన్నిచ్చి శునశ్శేపుణ్ణి బ్రతికించాడు.

ఈ రకంగా దేవతలు ఇతన్ని విడిపించారు కాబట్టి అతడు దేవరాతుడు అనబడ్డాడు. విశ్వామిత్రుడు శునశ్శేపుణ్ణి తన పుత్రుడుగా స్వీకరించాడు. శునశ్శేపుణ్ణి అమ్మేశాడు కాబట్టి అతడి తండ్రి పిశాచమైనాడు. తన మూలంగా తండ్రి పిశాచమైనాడని విని, చాలా బాధపడి, గోదావరీ తీరాన తపస్సు చేసి తండ్రి పిశాచత్వాన్ని పోగొట్టాడు శునశ్శేపుడు. ఇక ఈ విషయంలో **ఐతరేయ బ్రాహ్మణం** ఏమంటోందో చూద్దాం.

ఇక్ష్వాకు వంశానికి చెందినవాడు హరిశ్చంద్ర మహారాజు. ఆయన వరుణదేవుని అర్చించి, నాకు కుమారుడు పుడితే వాణ్ణి నీకు అర్పిస్తాను అని మ్రొక్కుకుని ఒక కుమారుణ్ణి పొందాడు. అతడికి రోహితుడు అని పేరుకూడా పెట్టారు. పిల్లవాడు పుట్టగానే వచ్చాడు వరుణుడు. బాలుణ్ణి ఇమ్మన్నాడు. భారసాల అయిన తరువాత ఇస్తాను అన్నాడు హరిశ్చంద్రుడు. పదిరోజుల తరువాత మళ్ళీ వచ్చాడు వరుణుడు. సంవత్సరం తరువాత ఇస్తానన్నాడు. సంవత్సరం తరువాత వచ్చాడు వరుణుడు. హరిశ్చంద్రుడు ఏదో చెప్పి అతణ్ణి పంపేస్తున్నాడు. రోహితుడు పెద్ద వాడయ్యాడు. గురుకులానికి వెళ్ళాడు. విద్యాభ్యాసం

పూర్తయింది. రోహితుడు ఇంటికి తిరిగి వచ్చాడు. ఇప్పుడు అసలు విషయం చెప్పాడు హరిశ్చంద్రుడు. యజ్ఞపశువుగా వెళ్ళటానికి ఇష్టపడలేదు రోహితుడికి దాంతో ధనుర్బాణాలు తీసుకుని చెప్పాపెట్టకుండా ఇంట్లోంచి పారిపోయాడు. అడవులలోనే ఉంటున్నాడు. ఈ విషయం తెలిసి వరుణదేవుడు హరిశ్చంద్రుడికి జలోదరం తెప్పించాడు. ఏ మందులు వాడినా తగ్గని రోగం అది. ఈ విషయం కుమార రోహితుడుకి తెలిసింది. బయలుదేరి తండ్రి దగ్గరకు వస్తున్నాడు. త్రోవలో ఇంద్రుడు కలిసి, రోహితా ఇల్లు చేరితే చేతనత్వం పోగొట్టుకుంటావు. అంటే నీవు మరణిస్తావు అని చెప్పాడు. వెనక్కి తిరిగి వెళ్ళి పోయాడు రోహితుడు. ఇలా రెండుసార్లు జరిగింది. ఇక మూడవసారి రోహితుడు వరుణుని అనుగ్రహం పొంది తనకు బదులుగా ఇంకొక వ్యక్తిని కూచోపెట్టి యాగం చేయిస్తానన్నాడు. సరేనన్నాడు వరుణుడు.

ఆ సమయంలో అజీగర్తుడికి ముగ్గురు కుమారులు. పెద్దవాడు కర్మాధికారి అతణ్ణి ఇవ్వను అన్నాడు అజీగర్తుడు. మూడవ వాడంటే తనకు ప్రాణం అంది తల్లి. ఇక మిగిలింది రెండవ వాడు. అతడు తల్లి తండ్రుల అభిప్రాయం గ్రహించి రోహితుడి వెనక నడవటం మొదలుపెట్టాడు.

రోహితుడు, శునశ్శేపుడితోపాటుగా నగరానికి వచ్చారు. యాగం ఆరంభమైంది మానవుణ్ణి యూపస్తంభానికి కట్టటానికి ఎవరూ ముందుకు రాలా. అప్పుడు అజీగర్తుడే వంద గోవులు తీసుకుని కుమారుణ్ణి యూపస్తంభాని కట్టేశాడు. శునశ్శేపుని ప్రార్థన ఆలకించి వరుణుడు ప్రత్యక్షమై యాగం చెయ్యకుండానే రోహితుడికి

యాగఫలితాన్ని శునశ్శేపుడికి దీర్ఘాయువును, హరిశ్చంద్రునికి పూర్ణాయుర్దాయాన్ని ప్రసాదించాడు. ఇప్పుడు శునఃశ్శేపుడు మళ్ళీ తల్లితండ్రుల దగ్గరకు పోలా ! అప్పుడు విశ్వామిత్రుడు అతన్ని కుమారునిగా స్వీకరించాడు. ఇది ఐతరేయ బ్రాహ్మణంలోని శునశ్శేపోపాఖ్యానము. మనం చెప్పుకునే సత్యహరిశ్చంద్రుడు, ఈ కథలోని హరిశ్చంద్రుడు ఒకరు కాదు.

## 2. బ్రహ్మ

సంస్కృతంలో 'కః' అనే శబ్దానికి రెండు అర్థాలున్నాయి. 1.ఎవరు? 2.బ్రహ్మ. అయితే 'ఎవరు?' అనే అర్థమే ప్రసిద్ధమైనవి. మరి రెండో అర్థం ఎలా వచ్చింది? దీనికి ఐతరేయ బ్రాహ్మణంలో ఒక చిన్న ఉపాఖ్యానమున్నది.

పూర్వకాలంలో ఇంద్రుడు వృత్రాసుర సంహారం చేసి లోకాలన్నీ జయించి ప్రజాపతి దగ్గరకు వచ్చి ఓ ప్రజాపతీ ! నేను అన్ని లోకాల కన్న గొప్పవాడిని సమస్త ప్రాణులకన్న గొప్పవాడిని అన్నాడు. ఆ మాటలు విన్న ప్రజాపతి "నా గొప్పతనాన్ని నువ్వు తీసుకుంటే మరి నేనెవర్ని?" (అహంకః) అని ప్రశ్నించాడు. ఆ మాట విన్న ఇంద్రుడు 'ఓ ప్రజాపతీ ! ఆత్మని నువ్వు 'కః' అన్నావు. కాబట్టి ఇక నుంచీ నువ్వు ఆ శబ్దంతోనే పిలువబడతావు' అన్నాడు. అప్పటినుంచి 'కః' అనే పదానికి బ్రహ్మ అని కూడా అర్థం వచ్చింది. ఇక్కడ ప్రజాపతి యొక్క గొప్పతనాన్ని హరించటం చేత ఇంద్రుడు కాస్తా మహేంద్రుడైనాడు. దేవతలు మహేంద్రుడి కోసం మాధ్యం దినసవనాన్ని, నిష్కేవల్య శస్త్రాన్ని కేటాయించారు.

## 3. సామెతలు

బ్రాహ్మణాలలో ఉపాఖ్యానాలతో పాటుగా కొన్ని సామెతలు కూడా కనిపిస్తున్నాయి. వాటిలో ముఖ్యమైనవి.

**ఏరు దాటిన తరువాత తెప్ప తగలెయ్యటం.**

ఇది ఐతరేయ బ్రాహ్మణంలో కనిపిస్తున్న సామెత. ఇందులో మనం శునశ్శేపుని ఉపాఖ్యానం చూశాం. హరిశ్చంద్రుడు పిల్లలు లేక వరుణ దేవుణ్ణి ప్రార్థించాడు. కుమారడు కలిగితే వరుణిడికి బలి ఇస్తానన్నాడు. కుమారుడు కలిగాడు. కాని హరిశ్చంద్రుడు మాట నిలబెట్టుకోలా! మొక్కుబడి తీర్చలా. ఎప్పటికప్పుడు వాయిదా వేశాడు. చివరికి జలోదరం వచ్చింది. అప్పుడు గత్యంతంర లేక అజీగర్తుని కుమారుడు శునశ్శేపుణ్ణి తీసుకువచ్చి బలివ్వటానికి సిద్ధమయ్యాడు. శునశ్శేపుడు చివరకు దేవతలను ప్రార్థించి బ్రతికి బయటపడ్డాడు.

ఇక్కడ మనం తెలుసుకోవలసిన విషయం ఒకటుంది. అది ఏమంటే మనకి తెలిసిన సత్యహరిశ్చంద్రుడు సూర్యవంశపు రాజు. త్రిశంకుని కుమారుడు. సత్యవాక్పాలన దీక్ష కలిగినవాడు. ఇతని కుమారుడు లోహితాస్యుడు. ఇచ్చిన మాటకు కట్టుబడి భార్యను పిల్లవాడిని చివరకి తనకు తననే అమ్ముకున్న వాడు. కాబట్టి ఇక్కడ హరిశ్చంద్రులు ఇద్దరు. ఒకరు కాదు.

ఇక మన కథలో హరిశ్చంద్రుడు. పిల్లవాడు పుడితే వరుణుడి కిస్తానన్నాడు. మాట తప్పాడు. ఇవ్వలా. ఎప్పటికప్పుడు వాయిదా వేశాడు. తన పని అయిపోయిన తరువాత మొండిచెయి చూపే రకం. అందుకే ఏరు దాటిన తరువాత తెప్ప తగలేశే రకం అన్నమాట. ఈ సామెత బహుశః ఇప్పటినుంచే వచ్చిందేమో!

ఇవన్నీ కాక ఐతరేయ బ్రాహ్మణంలో ఇంకా అనేక విషయాలు చెప్పబడ్డాయి.

దేవతలు ఎప్పుడూ ప్రజలకు అభివృద్ధిని కలిగిస్తారు. దేవతల ప్రీతి కోసం మానవులు యజ్ఞం చేస్తారు. **యజ్ఞము అనేది దేవతల కోసం పన్నిన వలలాంటిది** అంటోంది బ్రాహ్మణం.

దేశానికి రక్షకుడు రాజు. చిన్న చిన్న మొక్కలు, పెద్ద వృక్షాలతో సహా రాజ్యంలో అంతటికీ రక్షణ కల్పిస్తాడు రాజు. ప్రజలంతా అభివృద్ధి చెందటానికి వీలుగా సహాయం చేస్తాడు. తన సాయం కోరిన వారిని కాపాడతాడు.

మానవుడు ఎప్పుడూ మంచి వారితోనే స్నేహం చెయ్యాలి. చెడ్డవారితో తిరిగే వారికి అన్నీ అనర్థాలే అంటోంది బ్రాహ్మణం. మానవుణ్ణి ప్రభుత్వాధికారం నుంచి ఒక దివ్యశక్తి కాపాడుతున్నది. ఓంకారం పరమ పవిత్రమైనది. మహత్తరమైన శక్తి కలది. ఓంకార జపం చేసిన వాడిని నరకం నుంచి విముక్తుడుగా చేస్తుంది. **ఏది దేనికి మొదలో అదే దానికి చివర కూడా** అవుతుంది అంటోంది ఈ బ్రాహ్మణం.

పంచభూతాల ద్వారా మానవుడు పొందే ఆనందం కన్న కుమారుని ముఖం చూస్తే కలిగే ఆనందం మిన్న అంటోంది. భర్త భార్యలో కుమారుడిగా జన్మిస్తాడు. అందుకే భార్యను జాయ అంటారు.

స్త్రీలకి పురుషులతో సమానమైన స్థానాన్ని కల్పించారు. ఇలాంటి విషయాలు ఈ బ్రాహ్మణంలో అనేకచోట్ల చెప్పబడ్డాయి.

# 38. కౌషీతకీ బ్రాహ్మణము

ఋగ్వేదానికి రెండు శాఖలు ఉన్నాయి అన్నాం. 1. శాకలశాఖ 2. శాంఖాయన శాఖ. ఈ రెండవ శాఖకు సంబంధించినదే కౌషీతకీ బ్రాహ్మణము. దీన్నే శాంఖాయన బ్రాహ్మణము అని సాఖాయన బ్రాహ్మణము అని అంటారు. కుషీతకుడు ఒక మహర్షి. ఆయన కుమారుడు కౌషీతకుడు. లేదా కౌషీతకి. ఇతడు వ్రాసినదే కౌషీతకీ బ్రాహ్మణము. ఉద్దాలకుడి శిష్యుడు గుణాఖ్యశాంఖాయనుడు. కహోల కౌషీతకి ఇతని శిష్యుడు. ఈ గురుశిష్యులలో ఎవరో ఒకరు ఈ బ్రాహ్మణాన్ని వ్రాసి ఉంటారని కొందరు విమర్శకుల అభిప్రాయము.

కౌషీతకీబ్రాహ్మణం మూడు దశకాలుగా ఉంది. దశకము అంటే పది అధ్యాయాలు. ఇలా చూస్తే ఇందులో మొత్తం ముప్పై అధ్యాయాలుంటాయి. వీటిని కొన్ని ఖండాలుగా విభజించారు. ఇలా మొత్తం చూస్తే కౌషీతకీ బ్రాహ్మణంలో మూడు దశకాలు, ముప్పై అధ్యాయాలు 272 ఖండలు ఉన్నాయి. ఐతరేయంలో చెప్పిన విషయాలే ఇందులోనూ చెప్పబడ్డాయి. విషయాలను వివరించే విధానం చాలా విపులంగా, విస్తారంగా ఉంటుంది. ఐతరేయంలో విషయాలు సంకీర్ణంగా ఉంటే కౌషీతకీ బ్రాహ్మణంలో విషయ నిరూపణ చక్కగా జరుగుతుంది. ఐతరేయ బ్రాహ్మణం కన్న అందంగా వ్రాయబడినా కౌషీతకీ బ్రాహ్మణం మాత్రం ప్రాచుర్యం పొందలేదు. సాయణుడు ఈ బ్రాహ్మణానికి భాష్యం వ్రాయలేదు. కారణం రెండింటిలోని విషయము ఒకటే.

ఐతరేయం లాగా ఇదికూడా సోమయాగాన్నే ప్రధానంగా వివరించింది. మధ్యలో ఎన్నో రకాల ఇష్టులు యాగాలు, ధార్మిక

తాత్త్విక విశేషాలు మనకందించింది. ఒక చిన్న ఉదాహరణ చూడండి. మాంసభక్షణ చేసినందువల్ల వచ్చే అనర్థం ఏమిటి? అన్నప్పుడు.

"ఈ లోకంలో మనుష్యులు పశువుల్ని ఎలా తింటున్నారో, ఇతర లోకాల్లో పశువులు మనుషుల్ని అలాగే తింటాయి" అంటుంది ఈ బ్రాహ్మణం. అంటే ఏ పశువునైతే చంపి మానవుడు తింటున్నాడో, ఆపశువే ఈమానవుణ్ణి అలాగే తింటుంది. కాబట్టి మానవులారా! మాంసం తినకండి అంటోంది.

## 1. సకాలంలో వర్షాలు

ఒకసారి దేవతలంతా అగ్నిదేవుణ్ణి తమ అధ్యక్షుడుగా ఎన్నుకుని, శుభకరము, సహాయకారి యజ్ఞార్హము అయిన రూపాన్ని అగ్నిలోనే ఉంచి, భయంకరమైన రూపాన్ని వేరు చేసి, పవమాన, పావక, శుచి పేర్లతో నీటిలోను, వాయువులోను, సూర్యులయందు దాచి పెట్టారు. అలా చేశారు కాబట్టే అగ్ని మానవులకు క్షేమం కలిగిస్తున్నాడు. లోకాలు దేవాసుర ఘర్షణకు గురి అయినప్పుడు అగ్నివారి నుంచి వేరై ఋతువులందు ప్రవేశించాడు. అసురులమీద దేవతలు విజయం సాధించారు. అప్పుడు వారు అగ్నిని ఆశ్రయించి ఆయనకి వరమిచ్చారు. దాని ప్రకారం అగ్నిహవ్యవాహకుడయ్యాడు. అంటే దేవతలకు హోమద్రవ్యం అగ్నిద్వారానే చేరుతుంది. దాంతో దేవతలు కూడా ఆనందిస్తారు. అగ్ని ఋతువులందు ప్రవేశించాడు కదా. అందువల్ల సకాలంలో వర్షాలు కురుస్తాయి. మానవుల కోరికలు తీరతాయి. అంటోంది కౌషీతకీ బ్రాహ్మణము.

## 2. యజ్ఞపురుషుడు

సృష్టి చెయ్యాలనే కోరికతో ప్రజాపతి తపస్సు చేశాడు. అప్పుడు ఆయన నుండి అగ్ని, వాయువు, సూర్యుడు, చంద్రుడు, ఉషస్సు ఆవిర్భవించాయి. ప్రజాపతి ప్రేరణతో అగ్న్యాదుల వీర్యం ఉషస్సులో నిక్షిప్తం అయింది. అప్పుడు వేయికనులు గల పురుషుడు ఉద్భవించాడు. అతని వల్ల నేలమీద తిరిగే జీవులు, నీటిలో తిరిగే జీవులు అన్నీ సృష్టించబడ్డాయి. ఆహారం ఉత్పత్తి అయింది. తపస్సు చేస్తున్న ప్రజాపతి ఉచ్ఛ్వాస నిశ్వాసల వల్ల భూమి ఆకాశము, వాతావరణము పుట్టినాయి. అగ్ని వాయువు సూర్యుడు, వీరి నుండి ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము ఉత్పన్నమైనాయి. ఈ విధంగా విస్తరించిన సృష్టి అంతా ప్రజాపతియొక్క తపఃఫలమే. యజ్ఞకర్మ ప్రవర్తకుడైన ప్రజాపతికి వైశ్యదేవాది యజ్ఞాలు వివిధ అంగాలైనాయి. ఆయన యజ్ఞపురుషుడైనాడు. ఇది తెలిసినవారు అన్నింటినీ పొందగలుగుతారు. యజ్ఞకర్మ యొక్క మర్మం తెలిసినవాడు యజ్ఞపురుషుడౌతాడు. అతడు పొందలేనిది ఏదీ ఉండదు. అంటోంది కౌషీతకీ బ్రాహ్మణం.

## 3. యజ్ఞంలో పశుబలి అవసరం లేదు

పశుబలి ప్రకరణంలో మనస్సే ప్రజాపతి, ప్రజాపతే యజ్ఞము, యజ్ఞం కోసమే యజ్ఞం మనఃపూర్వకంగా చెయ్యాలి అని చెప్పబడింది. బలిహరణంలో సమర్పించే పురోడాశము పశుసారంగా భావించబడుతున్నది. పశుసారము అంటే పశుత్వమే. అందుచేత పశుత్వాన్ని హవనం చెయ్యటం పశుత్వాన్ని నాశనం చెయ్యటమే

పశుబలి అని అర్థం కనిపిస్తోంది. దీనికి ప్రతీక పురోడాశాన్ని సమర్పించటం. అందుకే **యత్ర పురోడాశాన నిరూప్యతే తత్పురోడాశః స్విష్టకృదచ్యుతః** పశురూపమైన పురోడాశము ఎక్కడ నిరూపించబడదో, స్విష్టకృత్ అయిన ఆ పురోడాశము నాశనం లేనిది అవుతుంది. దీని సారాంశమేమంటే – యజ్ఞంలో పశువును కాకుండా పశుసంకేతమైన పురోడాశాన్ని సమర్పించాలి. అని చెబుతోంది కౌషీతకీ బ్రాహ్మణం.

## 4. మానవసేవే మాధవసేవ

భగవంతుడు సర్వేశ్వరుడు. చరాచర జగత్తంతా ఆక్రమించి ఉంటాడు. 84 లక్షల జీవరాశుల రూపంలో ఉన్నాడు. పిపీలికాది బ్రహ్మ పర్యంతము పరమేశ్వర స్వరూపమే. పరమేశ్వర సాక్షాత్కారం పొందటం అంటే జగత్తంతా పరమేశ్వరమయం అని అనుభవపూర్వకంగా తెలుసుకోవటం. ప్రతి ప్రాణిలోను, ప్రతిజీవిలోను, అన్నింటిలోను ఆ పరమేశ్వరుణ్ణి దర్శించగలగటమే. పరమేశ్వరుణ్ణి సేవించాలంటే ఎక్కడోఉన్న పరమపదం పోనవసరం లేదు. ఇక్కడే ఆ పరమేశ్వరస్వరూపం ఉంది. అని నమ్మి నీప్రక్కనే ఉన్న యాచకుడిలోను, పశువులోను, క్రిమికీటకాదులలోను ఆయన్ని దర్శించటం చాలా గొప్పది. ఈ లోకంలో అవసరమైన వారికి ఎవరికి, మనం సహాయంచేసినా అది ఆ పరమేశ్వరుడికే చెందుతుంది 'యజ్ఞోవైవిష్ణుః' యజ్ఞము విష్ణుస్వరూపము. ఇక్కడ ఒక్కమాట గుర్తుంచుకోండి. మనం ఏ ఆహారమైతే తింటామో, దాన్నే దేవతకు పెడతాం. మనకిష్టమైనవే దేవతలకి కూడా ఇష్టము. ఇదే మన భావన. పరమేశ్వరస్వరూపమైన నీ పొరుగువాడికి సాయం చేస్తే అది దైవానికి చేసినట్లే. కాబట్టి మానవసేవే మాధవసేవ అంటోంది ఈ బ్రాహ్మణము.

## 5. విరాట్పురుషుడు

పూర్వ కాలంలో సృష్టి చెయ్యాలనే సంకల్పంతో ప్రజాపతి తపస్సు చేశాడు. ఆ తపస్సులోంచి అగ్ని, వాయువు, ఆదిత్యుడు, చంద్రుడు, ఉషస్సు జన్మించారు. ఆ తరువాత మొదటి నలుగురు అగ్ని, వాయువు, ఆదిత్యుడు, చంద్రుడు, తపస్సు చేశారు, ఉషస్సుద్వారా వేయికనులు, వేయిపాదాలు, అనేకానేకమైన అంగాలు గల మహాపురుషుడు జన్మించాడు. అతడే విరాట్టు. ఈ విషయం కౌషీతకీ బ్రాహ్మణంలో చెప్పబడింది.

## 6. అగ్నికి ఆజ్యం

అగ్నిదేవుడికి అత్యంత ఇష్టమైనది ఆజ్యం. అసలు అగ్నిహోత్రం మండుతుంది. దానికి ఆజ్యం తోడైతే ఎలా ఉంటుందో చూడండి. అసలు అగ్నికి ఆజ్యం అనే మాట ఎలా వచ్చిందో చెప్పటానికి కౌషీతకీ బ్రాహ్మణంలో ఒక ఉపాఖ్యానముంది.

ఒకసారి దేవాసుర సంగ్రామం జరుగవలసిన అవసరం ఏర్పడింది. అప్పుడు అగ్నిదేవుడు దేవతలకు కనపడకుండా పారిపోయి ఋతువులలో ప్రవేశించి దాక్కున్నాడు. యుద్ధం ఆరంభమైంది. అంతం కూడా అయింది. దేవతలు విజయం సాధించి తిరిగి వస్తున్నారు. అగ్నిదేవుడుమాత్రం కనపడలేదు. దేవతలందరూ అతనికోసం వెతకటం మొదలుపెట్టారు. చివరకు యముడు, వరుణుడు, అగ్నిని కనుక్కున్నారు. అగ్నిదేవడు వారితో రావటానికి నిరాకరించాడు. వారు బ్రతిమాలాడారు. అప్పుడు అగ్ని ఒక విచిత్రమైన కోరిక కోరాడు. ఏమంటే 'నాకు ఆజ్యం కావాలి' అన్నాడు అప్పుడు దేవతలు అగ్ని కోరిన విధంగా ప్రయాజానుయాజులు, ఆజ్యము ఇచ్చి అగ్నిని తీసుకువచ్చారు. మనం వాడే 'అగ్నికి ఆజ్యం' అనే పదానికి మూలం

ఇదే. ఈ ఉపాఖ్యానం **కౌషీతకీ బ్రాహ్మణం**లో ఉంది.

ఈ రకంగా యజ్ఞము విష్ణు స్వరూపమని, యజ్ఞం వల్ల సాధించలేనిది ఏదీ లేదని చెబుతూ, యజ్ఞాలు ఎలా చెయ్యాలో వివరించింది కౌషీతకీ బ్రాహ్మణం.

# 39. తైత్తిరీయ బ్రాహ్మణము

కృష్ణయజుర్వేదానికి 86 శాఖలున్నాయి. వాటిలో చాలావరకు నశించి పోయినాయి. మిగిలినవి కేవలము నాలుగు. వాటిలో ప్రధానమైనది తైత్తిరీయశాఖ, దానికి సంబంధించినదే తైత్తిరీయ బ్రాహ్మణము. కృష్ణయజుర్వేదానికి ఈ రోజుకీ మిగిలి ఉన్న ఏకైక బ్రాహ్మణము. దీన్నే **'పరాయతము'** అని వైదికులంటారు.

మనం గతంలో చెప్పుకున్నట్లుగా కృష్ణయజుస్సంహితలో బ్రాహ్మణభాగాలు కూడా కలిసిపోయినాయి. అదే దానిలోని కృష్ణత్వము. కఠశాఖ, మైత్రాయణీశాఖ వీటివరకు సంహితలో దొరికే గద్యాలే బ్రాహ్మణ భాగాలుగా భావిస్తారు. కాని తైత్తిరీయ శాఖలో సంహితకన్న భిన్నంగా దొరుకుతున్న బ్రాహ్మణం ఇదొక్కటే. ఈ బ్రాహ్మణానికీ సంహితకీ పెద్దగా తేడాలేదు. వైశంపాయనుని శిష్యుడు పైంగియాస్కుడు. అతని శిష్యుడు తిత్తిరిమహర్షి. ఆ తిత్తిరి మహర్షి చెప్పినదే తైత్తిరీయ బ్రాహ్మణము. ఇది మూడు కాండలుగా, 44 ప్రపాఠకాలు లేదా అధ్యాయాలుగా, 338 అనువాకాలుగా ఉంటుంది. మూడవ కాండలో చివరి మూడు ప్రపాఠకాలను 'కాఠకములు' అంటారు. ఈ భాగం ఒకప్పటి కఠ శాఖకు సంబంధించినది. అందుకే కాఠకము అనబడుతుంది.

ఈ బ్రాహ్మణంలోని మొదటికాండలో అగ్న్యాధానవిధి, గవామయనశేషవిధి, వాజపేయ – సోమాదివిధి, నక్షత్రేష్టికామంత్రాలు, రాజసూయం నిరూపించబడ్డాయి. రెండవ కాండలో అగ్నిహోత్రవిధి, జపహోమాలు, సౌత్రామణి, ఒకే రోజు చేయవలసిన 'సవం' అనే పేరు గల యాగాలు, కామ్యపశుయాగాలు చెప్పబడ్డాయి. మూడవ

కాండలో నక్షత్రేష్టి, దర్శపూర్ణమాసవిధి, మనుష్య పశువిధి, అశ్వమేధం, సావిత్రిచయనం, నాచికేతాగ్ని చయనం మొదలైనవి చెప్పబడ్డాయి. ఈ బ్రాహ్మణానికి సాయణభాష్యము, భట్టభాస్కరుని భాష్యము మాత్రమే ఉన్నాయి.

యజ్ఞయాగాది కర్మలు వివరించటం కోసం ఏర్పడింది ఈ బ్రాహ్మణం. అయినప్పటికీ మధ్య మధ్యలో అనేక విషయాలను మనకు తెలియచేస్తుంటుంది.

## 1. ఆడపిల్ల అత్తవారింట్లో సుఖంగా ఉండాలంటే ?

దేశంలోనే కాదు ప్రపంచం మొత్తం మీద ఏ తల్లి అయినా, ఏ తండ్రి అయినా కోరుకునేది ఒక్కటే. వివాహం అయిన తరువాత తమ కుమార్తె అత్తవారింట్లో సుఖంగా ఉండాలి. అత్త మామలు, ఆమెను కన్నకూతరులా చూడాలి. ఆడుబిడ్డలు చాలా అభిమానంగా ఉండాలి. బావ, మరుదులు చాలా గౌరవంగా చూడాలి. ఇక భర్త (అల్లుడు) అమితమైన ప్రేమతో తమకుమార్తెను నెత్తినపెట్టుకోవాలి. తమ కుమార్తెకు ఏ రకంగానూ కష్టం కలగకూడదు. ఇది సహజంగా తల్లి తండ్రులందరూ కోరుకునే కోరిక. అలా ఆ పిల్ల జీవితం సుఖంగా ఉండాలంటే **స్వాతీనక్షత్రంలో కన్యాదానం** చెయ్యండి అని చెబుతోంది తైత్తిరీయ బ్రాహ్మణము. అలా చేస్తే సకల సౌభాగ్యాలతో పిల్ల అత్తవారింట్లో ఆనందంగా ఉంటుంది. ఆశ్రయం లేక గాని, అవమాన భారంతోగాని తిరిగి ఆమె పుట్టింటికి తిరిగి వచ్చే అవసరం ఉండదు.

## 2. రోహిణి-సిరిసంపదలు

మనం ఏ పని చేద్దాం అనుకున్నా మంచిరోజు చూడాలి

అనుకుంటాం. మంచిరోజు అంటే తిథి వారం నక్షత్రం యోగం కరణం. ఈ ఐదింటిని చూపేదే పంచాంగం. ఈ రోజున మనకి పంచాంగం చూడటం కూడా రాదు. అందుకే క్యాలండరుని చూస్తాం. ఇది కూడా పంచాంగం లాంటిదే. పంచాంగంలో ఎక్కువ మంది తిథి వారం చూస్తుంటారు. చవితి, షష్టి, అష్టమి, నవమి, ద్వాదశి పనికిరావు. అమావాస్య మనకి పనికిరాదు. కాని మద్రాసు వారికి అమావాస్య శ్రేష్ఠం. అమావాస్య ఆదివారం లేదా అమావాస్య మంగళవారం ప్రత్యంగిరా హోమాలకు మరీశ్రేష్టం. ఇలాగే నక్షత్రాలలో కూడా కొన్ని నక్షత్రాలు మంచివి కావు. సామాన్య విషయాలు వేరు. ఇక్కడ యజ్ఞయాగాది క్రతువులు. ఆదానము మంచి నక్షత్రంలో జరగాలి. ఆదానము అంటే ప్రారంభము. యజ్ఞయాగాదులు ప్రారంభించటం. ఈ పని చెయ్యటానికి మనకి యోగ్యమైన నక్షత్రం చూసుకోవాలి. నక్షత్రాలు చూసే పద్ధతి మనకి తెలుసు కదా! చంద్రుడు కృత్తికతో కలిసి ఉంటే, ఆ రోజు కృత్తికా నక్షత్రం. ఇది అగ్నినక్షత్రం ఈ రోజున సామాన్యంగా ఏ పనీ ప్రారంభించరు. కాని అగ్నితో సంబంధం ఉన్న పనులు మాత్రం చేస్తారు. ఉదాహరణకు కృత్తిక నక్షత్రంలో ఆదానం చేస్తే యజమానికి బ్రహ్మవర్చస్సు కలుగుతుంది. రోహిణీ నక్షత్రంలో ఆదానం చేస్తే సిరిసంపదలకు కొదువ ఉండదు. అని చెబుతోంది తైత్తిరీయ బ్రాహ్మణం.

## 3. అశ్రద్ధ పనికిరాదు

ఏ పని చేసేటప్పుడైనా అత్యంత శ్రద్ధగానే చెయ్యాలి. అశ్రద్ధ

అనేది అసలు పనికిరాదు. పూర్వకాలంలో దేవతలు ఒకసారి ధనగర్వంతో విర్రవీగుతూ అశ్రద్ధతో ఆదానం చేశారు. అంతే వారి సిరిసంపదలన్నీ నశించిపోయినాయి. దరిద్రులైనారు. వాళ్ళు చేసిన తప్పు తెలుసుకుని పునర్వసు నక్షత్రంలో అత్యంత శ్రద్ధతో అగ్న్యాధానం చేసి మళ్ళీ ధనికులైనారు. అందుకే ఆ నక్షత్రం పునర్వసు అని సార్ధకమయింది.

## 4. కన్ను అబద్ధం చెప్పదు

ఏ మనిషికైనా సరే మాట, మనసు బద్ధంచెబుతాయి కాని కన్ను అబద్ధం చెప్పదు. అది ఎదురుకుండా వస్తువును మాత్రమే అంటే యధార్థ స్వరూపం మాత్రమే చెబుతుంది. అందుకే ఎవరైనాసరే చూసిందినమ్ముతారు. అంతేకాని చెప్పింది నమ్మరు. ఎవరైనా ఒక విషయం చెప్పినప్పుడు నువ్వు చూశావా? అని అడుగుతాం. అతడు గనక నా కంటితోచూశాను అని చెబితే ఇంక మారుమాట్లాడకుండా నమ్మేస్తాం. కన్ను ఎప్పుడూ అబద్ధం చెప్పదు. కాని కొన్ని సమయాల్లో చూసినవన్నీ కూడా నిజాలుకాదు అనేది నగ్నసత్యం. అందరికీ తెలిసిన విషయం.

## 5. విషువత్

విషువత్ అంటే మధ్య రోజు అని అర్ధం. సంవత్సరాన్ని రెండు భాగాలు చేస్తాం. ఉదాహరణకు జనవరిఒకటి నుంచి జూన్ 30 వరకు ఒక భాగము. జులై ఒకటి నుంచి డిసెంబరు 31 వరకు రెండవ భాగము. ఇప్పుడు జూన్ 25 నుంచి జులై నాలుగు వరకు తొమ్మిది రోజులు. వాటి మధ్యన ఉండే ఐదవరోజు విషువత్ అంటారు. ఈ

తొమ్మిది రోజులలో గనక యాగం చేసినట్లైతే అష్టదిక్పాలకులు పాలించే ఎనిమిది స్వర్గాలు అంతకన్నా పైనుండే స్వర్గం పొందగలుగుతారు అని చెబుతోంది తైత్తిరీయ బ్రాహ్మణం.

## 6. పరస్పరం పోట్లాడుకోకూడదు

ఎంతటి వారైనా సరే పరస్పరం కలహించుకుంటే ఇద్దరూ నష్టపోతారు. అవతల వ్యక్తి లాభపడతాడు. ఈ సూత్రాన్నే చెబుతోంది ఈ బ్రాహ్మణం. ఒకసారి దేవతలు వాజపేయం చెయ్యాలి అనుకున్నారు. అయితే వీరిలో ఎవరు ముందు చెయ్యాలి అనే ప్రశ్న వచ్చింది. నేనుముందు అంటే నేనుముందు అంటున్నారు. తగవులాడుకుంటున్నారు. చివరకు ఒక ఒప్పందానికి వచ్చారు. అనుకున్న సమయంలో ఎవరైతే భూప్రదక్షిణం చేసి వస్తారో, వారు ముందు చెయ్యాలి. అని నిర్ణయించుకున్నారు. అనుకున్న ప్రకారం ముందుగా తిరిగి వచ్చి వాజపేయం చేశాడు బృహస్పతి. తరువాత బృహస్పతిని ఆశ్రయించి వాజపేయం చేసి స్వర్గాధిపతి అయినాడు ఇంద్రుడు. ఈ వృత్తాంతం చెప్పి తగువులాడుకుంటే ఉపయోగం లేదు. అని హితవు చెబుతోంది ఈ బ్రాహ్మణం.

## 7. రెండుసార్లు అన్నం ఎందుకు తినాలి?

ఒకసారి దేవతలు, పితృదేవతలు, మనుష్యులు, పశువులు, అసురులు అందరూ ఉపవాస రూపమైన తపస్సు చేశారు. వారిలో దేవతలు నేతితో నిండిన తమస పాత్రను చూసి హోమం చేసి పది, పదిహేను రోజులకోసారి భోజనం పదార్థం సాధించారు. అందుకే ఈ రోజున అమావాస్య, పౌర్ణమి దేవతల ప్రీతికోసం దర్శపూర్ణమాసలు జరుగుతున్నాయి. పితృదేవతలు నెలకోసారి భోజనం సంపాదించారు.

అందుకే పితృదేవతలకి మాసికం పెడుతుంటాము. అయితే మానవులు మాత్రం రోజుకు రెండుసార్లు భోజనం సంపాదించుకున్నారు. అందుకే రోజుకి రెండుసార్లు భోజనం చేస్తారు. జంతువులు ఒకేరోజు రెండు మూడుసార్లు తినే ఆహారం సంపాదించుకున్నాయి. అందుకే రోజులో మూడుసార్లు గడ్డి మేస్తాయి. రాక్షసులు మాత్రం సంవత్సరానికి ఒకసారే భోజనం చేశారు. ఇప్పటికీ అలాగే చేస్తుంటారు.

## 8. నక్షత్రాలే ప్రజాపతి శరీరం

చరాచర జగత్తంతా ప్రజాపతి శరీరమే అని గతంలో మనం చెప్పుకున్నాం. కాని ఇక్కడ నక్షత్రాలే అతని శరీరము అని చెబుతోంది తైత్తిరీయ బ్రాహ్మణం.

| | | |
|---|---|---|
| హస్తా నక్షత్రం | – | ప్రజాపతి హస్తం |
| చిత్తా నక్షత్రం | – | ప్రజాపతి శిరస్సు |
| స్వాతీ నక్షత్రం | – | ప్రజాపతి హృదయం |
| విశాఖ నక్షత్రం | – | ప్రజాపతి తొడలు |
| అనూరాధ నక్షత్రం | – | ప్రజాపతి పాదాలు |

ఈ రకంగా ప్రజాపతి నక్షత్ర స్వరూపి అంటోంది ఈ బ్రాహ్మణం.

## 9. ఆవులే అగ్నిహోత్రాలు

పూర్వకాలంలో ప్రజాపతి పర్వతాలు, కొండలు మొదలైన స్థావరాలు సృష్టించి హోమం ద్వారా అగ్ని, వాయువు, ఆదిత్యుడు అనే చేతనం కలిగిన వారిని సృష్టించాడు. ఈ ముగ్గురూ కూడా ప్రజాపతిలాగానే హోమం చేసి చేతనాన్ని సృష్టించాలి అనుకున్నారు. ఇప్పుడు అగ్ని – ప్రాణాల కోసం, వాయువు – శరీరం కోసం,

ఆదిత్యుడు - కన్నుల కోసం హోమం చేశారు. దాంతో ఒక ఆవు పుట్టింది. ఆవుపాలు పంచుకోవటానికి ముగ్గురికీ సామరస్యం కుదరలా. పేచీ వచ్చింది. దాంతో ఆపేచీ పరిష్కారానికి వారు ముగ్గురూ ప్రజాపతి దగ్గరకు వెళ్ళారు. ప్రాణాలు లేని అవయవాలు ఉపయోగం లేనివి. శరీరము, కళ్ళు ఇవి ప్రాణం లేనివి. వీటివల్ల ఉపయోగం లేదు. అన్నింటికన్న ప్రాణమే ముఖ్యం కాబట్టి ప్రాణం కోసం హోమం చేసిన అగ్నిదే ఆవు అన్నాడు ప్రజాపతి. ఈ విధంగా అగ్ని చేసిన హోమం వల్ల పుట్టింది ఆవు. కాబట్టి అప్పటినుంచి ఆవుకు అగ్నిహోత్రమనే పేరొచ్చింది.

## 10. మానవులెలా పుట్టారు?

ఈ జగత్తులో వివిధ రకాల ప్రాణులు ఆవిర్భవిస్తాయి. కాని మానవులెలా పుట్టారు అనేదే పెద్ద ప్రశ్న. దానికి సమాధానం చెబుతోంది తైత్తిరీయ బ్రాహ్మణం.

ప్రజాపతి సృష్టికి సంకల్పం చేశాడు. ప్రాణవాయువుతో బాగా బలం గల అసురులను సృష్టించాడు. అప్పుడు 'పిత' అనబడ్డాడు. తరువాత పితృదేవతలను సృష్టించాడు. ఇప్పుడు ఇంకేం చెయ్యాలి అని ఆలోచించాడు. మనుష్యుల్ని సృష్టించాడు. ఈ మనుష్యులు వైదిక లౌకిక వ్యవహారాలు మొదలు పెట్టారు. దాంతో జగత్తంతా కాంతి నిండిపోయింది. ఆ కాంతి అనుసరించి దేవతలను సృష్టించాడు ప్రజాపతి. దేవతలు, మనుష్యులు, పితరులు, అసురులు అనే నాలుగు రకాల సృష్టి అంతా జలం లాంటిది. జలం భోగానికి ఉపయోగపడినట్లే ఈ సృష్టి కూడా భోగానికి ఉపయోగపడుతుంది.

## 11. జుట్టు మెరుపు, బొల్లి

మనకి అనేక రోగాలు వస్తుంటాయి. కొన్ని ప్రాణాంతకాలైతే కొన్ని చిన్న రోగాలే కాని చాలా కాలం ఇంకా చెప్పాలంటే జీవిత కాలం అలాగే ఉంటాయి. వాటిలో బొల్లి ఒకటి. దీన్నే శ్వేతకుష్టు అని కూడా అంటారు. దీనివల్ల వంటిమీద తెల్లటి పొడలు ఏర్పడతాయి. అవి కాళ్ళకి కావచ్చు, చేతులకీ కావచ్చు, వళ్ళంతా కూడా కావచ్చు. నీలి అనే ఓషధి ఈ వ్యాధికి మంచి మందు అని చెబుతోంది ఈ బ్రాహ్మణం. అలాగే జుట్టు తెల్లబడటం. నిజంగా చెప్పాలంటే జుట్టు తెల్లబడటం, పల్లు ఊడిపోవటం, కంటిచూపు తగ్గిపోవటం, అవయవాలు సరిగా పని చెయ్యకపోవటం, ఇవన్నీ ముసలితనం లక్షణాలు. ప్రతివారికీ వచ్చేవే. కాని వీటిని ఎవరూ అంగీకరించరు. తొంభైసంవత్సరాలున్న ముసలివాడు కూడా తెల్లజుట్టు ఉండటానికి అంగీకరించడు. పూర్తిగా రంగువేసుకుని నల్లనిజుట్టుతో కనిపించాలనుకుంటాడు. అటువంటి వారికి దివ్యౌషధం 'నీలి' అనే ఓషధి. దీనివల్ల తెల్లజుట్టు నల్లబడుతుందని, బొల్లి వ్యాధి తగ్గిపోతుందని చెబుతోంది ఈ బ్రాహ్మణం.

## 12. నక్షత్రాలు

దక్షప్రజాపతి కుమార్తెలు 27 మందిని చంద్రుడు వివాహం చేసుకున్నాడు. వీరే నక్షత్రాలు. ఈ నక్షత్రాలు, వాటి అధిదేవతల గురించి గతంలో చెప్పుకున్నాం. ఇప్పుడు ఇక్కడ ఇంకో విషయం చెబుతోంది ఈ బ్రాహ్మణం. నక్షత్రాలు రెండు రకాలు. దేవనక్షత్రాలు,

యమ నక్షత్రాలు. కృత్తిక నుంచి విశాఖ వరకు 14 దేవ నక్షత్రాలు. అలాగే అనూరాధ నుంచి భరణి వరకు 13 యమ నక్షత్రాలు. వీటి అధిష్ఠాన దేవతలు, ఫలాలు ఈ బ్రాహ్మణంలో వివరించబడ్డాయి.

## 13. తిథులు

తిథులు అనగానే మనకి పాడ్యమి, విదియ ఇలా తెలుసు. ఈ తిథులకు శుక్లపక్షంలోను, కృష్ణపక్షంలోను పగలు, రాత్రి విడివిడిగా పేర్లున్నాయి. వాటన్నింటినీ చెబుతోంది ఈ బ్రాహ్మణం. ముందుగా తిథుల పేర్లు చూద్దాం.

1. పాడ్యమి
2. విదియ
3. తదియ
4. చవితి
5. పంచమి
6. షష్టి
7. సప్తమి
8. అష్టమి
9. నవమి
10. దశమి
11. ఏకాదశి
12. ద్వాదశి
13. త్రయోదశి
14. చతుర్దశి
15. పౌర్ణమి / అమావాస్య

వైదికపరంగా వీటికి ప్రత్యేకమైన పేర్లున్నాయి.

**శుక్లపక్ష పగటి తిథులు**

1. సంజ్ఞానము
2. విజ్ఞానము
3. ప్రజ్ఞానము
9. ఉపక్లప్తం
10. క్లప్తం
11. శ్రేయం

4. జానతు
5. అభిజానత్తు
6. సంకల్పమానం
7. ప్రకల్పమానం
8. ఉపకల్పమానం
12. వశీయం
13. ఆయత్
14. సంభూతం
15. భూతం

**శుక్లపక్షంలో రాత్రి తిథులు**

1. దర్శ
2. దృష్టా
3. దర్శితా
4. విశ్వరూపా
5. సుదర్శనా
6. ఆప్యాయమానా
7. ఆప్యాయమానా
8. ఆప్యాయా
9. సూనృతా
10. ఇరా
11. అపూర్వమాణా
12. పూర్వమాణా
13. పూరయంతీ
14. పూర్ణా
15. పూర్ణమాసి

**కృష్ణపక్ష పగటి తిథులు**

1. ప్రస్తుతం
2. విష్టుతం
3. సంస్తుతం
4. కల్యాణం
5. విశ్వరూపం
6. శుక్రం
7. అమృతం
8. తేజస్వి
9. తేజః
10. సమిద్ధం
11. అరుణం
12. భానుమతు
13. మరీచీ
14. అభిసత్తు
15. తపస్విత్తు

**కృష్ణపక్ష రాత్రి తిథులు**

1. సుతా
2. సున్వతీ
3. ప్రసుతా
4. సూయమానా
5. అభిసూయమానా
6. ప్రీతీ
7. ప్రసా
8. సంసా
9. తృప్తి
10. తర్పయంతీ
11. కాంతా
12. కామ్యా
13. కామజాతా
14. ఆయుష్మతీ
15. కామదుఘా

ఈ బ్రాహ్మణంలోని మూడవకాండలోని పదకొండవ ప్రపాఠకంలో నచికేతోపాఖ్యానము, నాచికేతాగ్నిచయనము వివరించబడ్డాయి.

## 14. కాలకంజుల యాగం

ఈ ఉపాఖ్యానం తైత్తిరీయ బ్రాహ్మణంలోది. శత్రువు మన కన్న బలమైనవాడు, వీరుడు అయినప్పుడు ప్రత్యక్ష యుద్ధంలో అతన్ని గెలవటం కష్టం అవుతుంది. అలాటి సమయంలో ఏదో ఒక మాయోపాయం పన్ని అతన్ని ఓడించవచ్చు. ఇది అధర్మం కాదు. ఇలా చెయ్యవచ్చు అంటోంది **తైత్తిరీయ బ్రాహ్మణం.**

కాలకంజులు అనబడే వారు రాక్షసులు. వీరికి స్వర్గం పొందాలని కోరిక. దాంతో ఇష్టకలు అనే ఇటుకలు పేర్చి యాగం చెయ్యటం మొదలుపెట్టారు. రాక్షసులు స్వర్గానికి రావటం ఇంద్రుడికి ఇష్టం లేదు. దాంతో కొంచెం ఆలోచించి ఒక ఉపాయం చేశాడు. మారువేషంలో వాళ్ళతో కలిసిపోయాడు. వాళ్ళతోపాటుగా ఇటుకలు పేర్చటం మొదలుపెట్టాడు. అందులో చిత్ర అనే పేరుగల ఇటుకను దానిలో

ఉంచాడు. అది ఇంద్రుడి ఆజ్ఞానుసారం వర్తిస్తుంది. యాగం పూర్తయింది. కాలకంజులు వారు పేర్చిన ఇటుక తలమీదుగా స్వర్గానికి బయలుదేరారు. రాక్షసులు రావటం చూసిన ఇంద్రుడు సమయం చూసి చటుక్కున తాను పేర్చిన చిత్ర అనే ఇటుకను తీసేశాడు. దాంతో పేర్చిన ఇటుకలన్నీ ఒక్కసారిగా కూలిపోయినాయి. వాటిమీద ఉన్న రాక్షసులు క్రింద పడబోతూ తమ రూపాలు మార్చుకుని సాలీళ్ళు అయి గాలిలో వ్రేలాడటం మొదలుపెట్టారు. ఈ కారణం చేతనే సాలీళ్ళు ఇటు నేలమీదా, అటు ఆకాశంలోనూ కాకుండా మధ్య ప్రదేశంలో వ్రేలాడుతాయి.

ఈ ఉపాఖ్యానంలో మాయోపాయంతో శత్రువుని జయించవచ్చు అని చెబుతూ, చిత్తా నక్షత్రంలో ఇష్టికా చయనం చేసినవాడు శత్రువులను నాశనం చెయ్యగలుగుతాడు అని చెబుతున్నారు.

## 15. బ్రహ్మకైన పుట్టు రిమ్మ తెగులు

**ఆడుదానిని చూడ అర్థంబు మరిజూడ**
**బ్రహ్మకైన పుట్టురిమ్మ తెగులు**

అన్నారు ఈ లోకంలో పాపాలకు మూలము ఏమిటి అంటే కాంతా కనకాలు, అందుకే ఒక ప్రజాసేవకుడు చెప్పాడు.

**కాంతా కనకాలె కదా పాపాలకు మూలము**
**అవి రెండూ మాకు వదిలి చేయండి పుణ్యము.**

ఈ లోకంలో ఎవరైనా సరే ఏదైనా ఒక పని చెయ్యాలి అంటే ఉండాల్సిన ప్రయోజనాలు రెండు. 1. స్త్రీ 2. ధనము. ఈ రెండూ లేకపోతే ఇంకా చెయ్యటానికి ఏ రకమైన పాపాలు ఉండవు. ఏ దుర్మార్గమైన పని చెయ్యాలన్నా ఈ రెండింటిలో ఏదో ఒకటి

తప్పనిసరిగా కారణం అవుతుంది. దేవదానవ సంగ్రామం జరగటానికి కారణము స్వర్గసుఖాలు అనుభవించటానికే. క్షీరసాగర మథనం చేశారంటే అమృతం తాగి జీవితాంతం సుఖాలు అనుభవించాలనే కోరికతోనే. రామరావణ సంగ్రామం జరిగింది ఒక స్త్రీ కోసం. ఇలా ఎక్కడ ఎప్పుడు ఏ యుద్ధం జరిగినా అయితే స్త్రీ కోసం, లేకపోతే ధనం, రాజ్యకాంక్షతోనే. అంతేకాదు అనుకోకుండా ధనం కాని, అందమైన స్త్రీ గాని ఎదురుపడితే ఇవతల వ్యక్తి ఎటువంటి వాడైనా రెండవ ఆలోచన వచ్చి తీరుతుంది. దానికి ఉదాహరణగా చెబుతున్నారు ఈ ఉపాఖ్యానాన్ని **తైత్తిరీయ బ్రాహ్మణం**లో

ఒకసారి దేవదానవులయుద్ధం చాలా భయంకరంగా జరిగింది. ముందు ముందు పరిస్థితి ఎలా ఉంటుందో తెలియదు. అందుకని దేవతలు తమ వద్ద ఉన్న విలువైన సామాను అంతా అగ్ని సోముల వద్ద దాచిపెట్టి మళ్ళీ దానవులతో యుద్ధానికి వెళ్ళారు. అంత ధనం ఒక్కసారిగా చూసే సరికి అగ్ని సోముల కిద్దరికీ ఆలోచనలో మార్పు వచ్చేసింది. ఆ ధనమంతా వారి దగ్గర ఉంటే జీవితాంతం సుఖంగా ఉండచ్చు కదా ! ఆలోచన రావటమే తడవుగా ఆ ధనాన్ని తీసుకుని ఇద్దరూ పారిపోయారు. యుద్ధంలో గెలిచి తిరిగి వచ్చారు దేవతలు. అగ్నిసోములు కనిపించలా వాళ్ళకోసం చాలా ప్రదేశాలు గాలించి చివరికి అగ్నిని పట్టుకుని అతనికి కొంత ధనం ఇచ్చి, అతని దగ్గర ఉన్న తమ ధనాన్ని తీసుకున్నారు. అగ్నిసోములు ఇద్దరూ దేవతలే అయికూడా విలువైన సొమ్ము చూసేసరికి వారి బుద్ధి మారిపోయింది. దాన్ని తీసుకుని పారిపోయారు. ఇంకా సోముడు దొరకలా. చివరకి సోముణ్ణి కూడా వెతికి పట్టుకుని ధనంతో పారిపోయినందుకు గట్టిగా బాది అతని దగ్గర ఉన్న ధనాన్ని స్వాధీనం చేసుకున్నారు. ఇక్కడ

తేడా చూడండి. అగ్ని బలమైన దేవత. అందుకని కొంత ధనం అతడికి ప్రతిఫలంగా ఇచ్చి మిగిలింది తీసుకున్నారు. సోముడు అగ్నితో పోలిస్తే అంత బలమైన వాడు కాదు. అందుకే అతణ్ణి తన్ని ధనం స్వాధీనం చేసుకున్నారు. దేవతలంతటి వారికే ఇలాంటి ఆలోచనలు వస్తే సామాన్యమైన మానవుడి పరిస్థితి ఏమిటి? ఎవరైనా ఇంతే అని చెబుతోంది తైత్తిరీయ బ్రాహ్మణం.

## 16. సృష్టి ప్రారంభంలో

సృష్టి ప్రారంభం కాకు ముందు చరాచర జగత్తంతా పరమేశ్వరుడే ఆక్రమించి ఉన్నాడు. జగత్తంతా శూన్యంగా ఉండేది. ఈ పర్వతాలు గాని, అరణ్యాలు గాని లోయలు, నదులు, ఎడారులు, రాజ్యాలు ఏవీ ఉండేవి కాదు. అంతా శూన్యం. ఆ శూన్యాన్ని పరమేశ్వరుడు ఆక్రమించి ఉన్నాడు. అలా ఉన్న ఆయనకు సృష్టి చెయ్యాలనే కోరిక కలిగింది. ఇప్పుడు సృష్టి చెయ్యాలని ఆలోచించటం మొదలుపెట్టాడు. ఆ సమయంలో ఆయనకు నీటిలో పద్మలత కనిపించింది. వెంటనే వరాహ రూపాన్ని ధరించి నీటిలో మునిగి మట్టిని పైకి తెచ్చి ఈ భూమిని, మిగిలిన సృష్టిని పూర్తి చేశాడు. అంటోంది తైత్తిరీయ బ్రాహ్మణం.

## 17. దాచిపెట్టిన దానికన్న అనుభవించినదే ఉత్తమమైనది

మనం కోట్లాది రూపాయలు సంపాదించాం. సంపాదించిన దాన్ని విదేశీ బ్యాంకుల్లో దాచి పెట్టాం. దానివల్ల మనకు ఉపయోగం ఏమిటి? అదంతా మనదే అని మనం చెప్పుకోలేం. దాన్ని తెచ్చి అనుభవించలేం. ఒకవేళ ఏ దొంగతనమైనా జరిగితే మన ధనం, బంగారం పోయింది అని పోలీసులకు ఫిర్యాదు కూడా చెయ్యలేం. కారణం అది నల్లధనం.

అది నల్లధనం కాక తెల్లధనం అయినా ఏం చెయ్యలేం. ఎంత ధనం వాడుకోగలుగుతాం. అందుకే మనం అనుభవించినదే ఉత్తమమైనది అనే విషయం చెబుతోంది తైత్తిరీయ బ్రాహ్మణం ఈ ఉపాఖ్యానంలో

ప్రజాపతికి ప్రజలను సృష్టి చెయ్యాలనే కోరిక కలిగింది. తపస్సు చేశాడు. ఆయనకు బంగారం కనిపించింది. ఆ బంగారం తన కోరిక తీరుస్తుంది కదా అని దాన్ని అగ్నిలో హోమం చేశాడు. కాని అలా జరగలా.మళ్ళీ హోమం చేశాడు. ప్రయోజనం లేదు. వెంటనే ఆయన ఆ బంగారాన్ని వైశ్వానరాగ్నికి ఆహుతి చేశాడు. అంటే తినేశాడన్న మాట. వెంటనే ఆయనకు ప్రజలను సృష్టించే శక్తి వచ్చింది.

ఈ సందర్భంగానే **'దాచి పెట్టిన దానికన్న అనుభవించిందే ఉత్తమమైనది.'** అని చెబుతోంది తైత్తిరీయ బ్రాహ్మణం.

## 18. వేదంలో ఏముందో తెలుసుకోవటం ఎవరికీ సాధ్యం కాదు.

భరద్వాజుడు మహర్షి. వయసులో పెద్దవాడయినాడు ఇంద్రుణ్ణి గురించి తపస్సు చేశాడు. ఇంద్రుడు ప్రత్యక్షమై ఏం కావాలి? అన్నాడు. నా ఆయుర్దాయాన్ని పొడిగించ వలసింది అన్నాడు భరద్వాజుడు. సరే అన్నాడు ఇంద్రుడు. భరద్వాజుని ఆయువు ఇంకా మూడువందల సంవత్సరాలు పొడిగించబడింది. కాలం గడిచింది. భరద్వాజుడి ఆయువు తీరబోతున్నది. మళ్ళీ తపస్సు చేశాడు భరద్వాజుడు ప్రత్యక్షమయ్యాడు ఇంద్రుడు. ఏం కావాలి అన్నాడు. ఆయువు పొడిగించు అన్నాడు భరద్వాజుడు. మళ్ళీ మూడు వందల సంవత్సరాలు పొడిగించాడు. కాలం గడిచింది ఆయుష్షు తీరిబోతోంది. మళ్ళీ తపస్సు చేశాడు భరద్వాజుడు ప్రత్యక్షమైనాడు ఇంద్రుడు. ఏం కావాలి? అన్నాడు

ఆయువు పెంచాలి అన్నాడు. ఇప్పుడు ఇంద్రుడు అడుగుతాడు. భరద్వాజా! ఇప్పటికి నీఆయువు ఆరువందల సంత్సరాలు పెంచాను. మళ్ళీ పెంచమంటున్నావు. ఇంతకీ ఏం చేస్తున్నావు? అన్నాడు.

దేవేంద్రా ! నేను వేదాధ్యయనం చేస్తున్నాను. వేదంలో ఏముందో తెలుసుకోవాలనే కోరికతోనే ఆయువు పెంచమంటున్నాను అన్నాడు. అప్పుడు ఇంద్రుడు భరద్వాజుడికి ఎదురుగా ఉన్న మూడు పర్వతాలు చూపించి, మూడు గుప్పెళ్ళు మట్టి తీసుకుని ఓ భరద్వాజా ! నీ ఎదురుగా ఉన్న మూడు పర్వతాలు మూడు వేదాలు. నువు తెలుసుకోవలసింది ఆ కొండంత. తెలుసుకున్నది ఇదిగో గుప్పెడు అంటూ చేతిలోని మట్టిని చూపించి భరద్వాజుడు అడిగినట్లుగానే ఆయువును మళ్ళీ మూడువందల సంవత్సరాలు పెంచాడు. ఈ విధంగా భరద్వాజుని ఆయుష్షు మూడుసార్లుగా పెరిగింది. మొత్తం వేయి సంవత్సరాలు జీవించి వేదాధ్యయనం చేశాడు.

ఈ వేయి సంవత్సరాలే కాదు అతని ఆయువు ఇంకా పెంచినా ఉపయోగం లేదు. వేదాల గురించి పూర్తిగా తెలుసుకోవటం ఎవరివల్లా కాదు అన్నాడు ఇంద్రుడు.

వేదంలో  ఒకటి కాదు అనే విషయాలు చెప్పటం జరిగింది. కాబట్టి వేదాన్ని పూర్తి తెలుసుకోవటం ఎవరికీవల్లా కాదు. ఇదంతా తైత్తిరీయ బ్రాహ్మణంలో ఉంది.

## 19. మోదుగుచెట్టు ఎలా పుట్టింది?

మోదుగు చెట్టు అంటే ఫలాశ వృక్షం. వైదిక కార్యక్రమంలో దీని ప్రాముఖ్యత చాలా ఎక్కువ. దైనందిన జీవితంలో భోజనం చేసేటప్పుడు విస్తరి వాడతాం కదా! అది మోదుగఆకులతో కుట్టింది.

ఈ మోదుగ చెట్టు ఏ విధంగా పుట్టిందని తైత్తిరీయ బ్రాహ్మణం చెబుతోందో చూద్దాం.

భూమి పైన మూడవ లోకంలో భూలోక, భువర్లోక, సువర్లోకాలు, మూడవది సువర్లోకం. అదే స్వర్గలోకం. ఆ దేవలోకంలో ఉండే సోమాన్ని గాయత్రీదేవి బలాత్కారంగా తీసుకువెళ్ళింది. అప్పుడు సోమానికి రక్షణ ఉన్న దేవతలకు, గాయత్రీదేవికి మధ్య యుద్ధంజరిగింది. ఆ యుద్ధంలో సోమలత యొక్క ఆకు ఒకటి నేలమీద పడింది. దీనినుంచే మోదుగుచెట్టు (ఫలాశ వృక్షం) మొలిచింది. అంటోంది తైత్తిరీయ బ్రాహ్మణం అందుకే దానికంత ప్రాముఖ్యత.

ఈ రకంగా మేడి, మర్రి, జువ్వి మొదలయిన వృక్షజాతులు ఆవిర్భవించాయి. అంటోంది.

## 20. ఎద్దేవా

హేళన చెయ్యటం అనే పదానికి ప్రత్యామ్నాయము ఎద్దేవా! తైత్తిరీయ బ్రాహ్మణంలో

**యదేవా దేవ హేడనం దేవాసశ్చ క్రుమా వయం**

ఇక్కడ హేడవ పదాన్ని వాడటం వల్ల యదేవా అనబడే పదం క్రమేపీ హేళనార్థకమై ఎద్దేవా అయింది.

ఈ రకంగా తైత్తిరీయ బ్రాహ్మణంలో అనేక యజ్ఞాలు యాగాలు విషయాలు, సామెతలు ఉపాఖ్యానాలు చెప్పబడ్డాయి.

# 40. శతపథ బ్రాహ్మణము

శుక్లయజుర్వేదానికి గల ఒకే ఒక బ్రాహ్మణము శతపథ బ్రాహ్మణము. ఇది మొత్తం నూరు అధ్యాయాలు గల గ్రంథం.

**శతంపంథానో మార్గాః అధ్యాయాః యస్య తచ్ఛతపథమ్** శుక్లయజుర్వేదానికి మాంధ్యందిన, కాణ్వశాఖలు రెండున్నాయి. అందుకని ఈ బ్రాహ్మణం మాంధ్యదిన శతపథ బ్రాహ్మణము అని కాణ్వశతపథ బ్రాహ్మణము అని రెండు రకాలుగా ఉన్నది. ఈ రెండింటికీ పేరులో తప్ప చెప్పుకోతగ్గ తేడాలు లేవు. అయితే సాయణుడు మాధ్యందిన శతపథానికి భాష్యం వ్రాశాడు. అందుచేత అదే అందుబాటులో ఉంది. ఈ బ్రాహ్మణం మొత్తం 14 కాండలు, 68 ప్రపాఠకాలు 100 అధ్యాయాలు 438 బ్రాహ్మణాలు 7624 ఖండికలుగా విభజించబడింది. ఈ బ్రాహ్మణానికి సమగ్రమైన భాష్యం సాయణభాష్యమే.

బ్రాహ్మణాలన్నింటిలోను శతపథ బ్రాహ్మణానికి చాలా గొప్పపేరుంది. దీనికి కారణం ఈ బ్రాహ్మణమంతా ఒక వరుస క్రమంలో చాలా చక్కగా తీర్చిదిద్దబడి ఉంటుంది. దీన్ని గనక అధ్యయనం చేస్తే ఇహము, పరము రెండూ అంటే యజ్ఞయాగాది నిర్వహణలోను, అలాగే బ్రహ్మవిద్యలోను కూడా ప్రసిద్ధుడవుతాడు. ఈ బ్రాహ్మణంలో అమూల్యమైన విషయాలెన్నో చెప్పబడ్డాయి. **పవిత్రుడైన మానవుడు చేస్తేనే ఏ పనైనా సఫలీకృత మవుతుంది.** మేం మంత్రం చేశాం. మాకు ఫలితం రాలేదు అంటారు. పవిత్రమైన మనస్సుతో మంత్రజపం చెయ్యండి. వెంటనే ఫలితం వస్తుంది. నిర్మలమైన మనస్సులో పరమేశ్వరుడు తాండవం చేస్తాడు. కాబట్టి

మానవుడికి పవిత్రత కావాలి. అవి కావాలంటే అబద్ధం ఆడరాదు. మానవుడు నీటితో పవిత్రుడు కావాలి. **అబద్ధాలాడరాదు. అబద్ధాలాడటం వల్ల మానవుడు అపవిత్రుడు అవుతాడు. జలం చాలా పవిత్రమైనది. అందుకే ముందుగా నీళ్ళను తాకి పవిత్రుడై ఆతరువాతే ఏక్రతువైనా చెయ్యాలి.**

పూర్ణపురుషుడు అంటారు. అంటే పురుషుడికి సంపూర్ణత అనేది కావాలి. అది ఎక్కడ నుంచి వస్తుంది? అంటే స్త్రీతో కూడినప్పుడే వస్తుంది. వివాహం చేసుకున్న భార్య పురుషుడిలో సగభాగం అవుతున్నది. భార్య లేకుండా ఏ పని అయినా చెయ్యగలడేమో కాని సంతానవంతుడు మాత్రం కాలేడు. అందుకే పురుషుడికి సంపూర్ణత్వం భార్యవల్లనే వస్తుంది. ఈ విషయంలో ఈ బ్రాహ్మణం ఏం చెబుతోందో చూడండి. భార్య భర్తలో సగభాగం. భార్య లేకుండా అతడు సంతానవంతుడు కాలేడు. అసంపూర్ణుడే అవుతాడు. భార్యను పొందిన వాడు, ఆమె ద్వారా సంతానం పొందిన వాడు మాత్రమే పరిపూర్ణతను సాధిస్తాడు.

ఇలాంటి విషయాలు ఇంకా చాలా ఉన్నాయి ఈ బ్రాహ్మణంలో

యజ్ఞయాగాలను చాలా చక్కగా నిర్వచించి వివరిస్తుంది శతపథ బ్రాహ్మణం. మనం వాడే హవిస్సును పట్టి యజ్ఞం మూడు విధాలు

1. ఇష్టి. ఇందులో ప్రధానహవ్యం పిండి.
2. పశుబంధం. ఇందులో ప్రధానహవ్యం పశువు.
3. సోమయాగం. ఇందులో సోమరసం ప్రధాన హవ్యము.

ఆచరణను బట్టి యజ్ఞాలు మూడు రకాలు

1. నిత్యం (ప్రతిదినం చేసే కర్మలు)

2. నైమిత్తికం (ఆయా సందర్భాల్లో, నిమిత్తం మాత్రమే చేసేవి)

3. కామ్యం (ప్రతిఫలం కోసం చేసేవి)

## 1. తత్త్వవేత్త

శతపథ బ్రాహ్మణంలో ఒక కథ ఉంది. ఒకసారి జనక మహారాజు ఒక యాగం చేస్తున్నాడు. ఆ యాగంలో భాగంగా వేదాంత చర్చలు జరుగుతున్నాయి. ఇప్పుడు జనక మహారాజు ఈ తత్త్వవేత్తలలో అధికుడు ఎవరో తెలుసుకోవాలి అనుకున్నాడు. వెంటనే వెయ్యిఆవులు గిట్టలకు, కొమ్ములకు, మెడలోను బంగారు హారాలతో పట్టు వస్త్రాలతో సభలోకి తెప్పించి, ఓ సభాసదులారా! తత్త్వవేత్త లందరిలోకి గొప్పవాడు ఎవరో అతడు ఈ ఆవుల్ని తీసుకుపోవచ్చు అన్నాడు. సభలో అందరూ చూస్తూ కూచున్నారు. ఎవరూ లేవటానికి, సాహసించలా, దాంతో యాజ్ఞవల్క్యుడు లేచి తన శిష్యుడితో 'ఆవులు మన ఆశ్రమానికి తోలుకు వెళ్ళవలసింది అన్నాడు. అప్పుడు సభలో ఉన్నవారందరూ మమ్మల్ని జయించి ఈ ఆవులు తీసుకువెళ్ళు అన్నారు. అప్పుడు యాజవల్క్యుడు వారందరినీ వాదనలో ఓడించి బంగారు ఆభరణాలతో సహా ఆవులు తోలుకుపోయాడు. అందరిలోకీ అతడే గొప్ప తత్త్వవేత్త.

## 2. మృత సంజీవిని

మరణించిన వారిని తిరిగి బ్రతికించేది మృతసంజీవిని. ఇది ఒక మంత్రం. ఇది ఒక మూలిక. రామాయణంలో లక్ష్మణుడు మూర్ఛపోయినప్పుడు హనుమంతుడు హిమాలయాల నుంచి ఈ మూలికనే తెస్తాడు. దాంతో లక్ష్మణుడు పునర్జీవితుడవుతాడు. సంజీవిని గురించి మనకు ఒక అపోహ ఉంది. ముంగీసకు సంజీవిని మూలిక తెలుసు. అందుచేతనే భయంకరమైన విషసర్పాన్ని కూడా చంపేయ

గలుగుతుంది అని. ఇది నిజంకాదు. ముంగీసకు సంజీవినీ మూలిక తెలియదు. అయితే పాముశరీరంలో ఉండే భయంకరమైన విషం ముంగీస శరీరంలో కూడా ఉంటుంది. ఈ కారణంచేతనే పాముకాటు ముంగీసకు హానికాదు. దేవాసుర సంగ్రామంలో మరణించిన రాక్షసులను తిరిగి బ్రతికించటం కోసం ఈ విద్య కావాలనుకున్నాడు శుక్రాచార్యుడు. ఈ విద్య ఈశ్వరుడి దగ్గరుంది. ఈశ్వరడి దగ్గరకు వెళ్ళి మృతసంజీవిని తనకు కావాలి అన్నాడు. ఆలోచించాడు ఈశ్వరుడు. చివరకి పదివేల సంవత్సరాలు తలక్రిందులుగా నుంచుని తపస్సు చెయ్యాలి. చుట్టూ పచ్చికట్టెలు పెట్టుకుని, వాటి నుంచి వచ్చే పొగ పీలుస్తూ ఈ తపస్సు చెయ్యాలి. అలా చేస్తే ఈ మంత్రసిద్ధి కలుగుతుంది అన్నాడు ఈశ్వరుడు. అలాగే చేసి మృతసంజీవినీ విద్యను సాధించాడు రాక్షస గురువైన శుక్రాచార్యుడు. ఇది మంత్రం. కాబట్టి మృతసంజీవిని మంత్రము, మూలిక రెండూ ఉన్నాయి.

**శతపథ బ్రాహ్మణం**లో దీన్ని గురించి ఏం చెప్పారో చూద్దాం.

ధధ్యుడు మహర్షి. ఈయననే దధ్యాధర్వుడు అనేవాళ్ళు. ఆయన రాగద్వేషాలకు అతీతుడు. కాంతా కనకాల మీద ఆశలు లేనివాడు. నిరంతరము వేదపారాయణ చెయ్యటం. శిష్యులకి పాఠం చెప్పటం. ఇవే ఈయన పనులు. శిష్యులందరికీ ధర్మోపదేశం చేస్తున్నాడు. దానికి దేవతలు కూడా మెచ్చుకున్నారు. దేవరాజైన ఇంద్రుడు దధ్యుని ఆశ్రమానికి వచ్చాడు. ఇంద్రుడంతటి వాడు వస్తాడంటేనే ఆశ్రమ వాతావరణం మారిపోయింది. మహర్షి దగ్గర ఇంద్రుడు అర్ఘ్యపాద్యాలు స్వీకరించి ఓ మహర్షీ ! నీ దీక్షకు, ధర్మతత్పరతకు నేను చాలా ఆనందించి నీకు ఏదైనా వరం ఇవ్వాలనుకుంటున్నాను? అన్నాడు ఆ మాటలు విన్న దధ్యుడు కొంచెంసేపు ఆలోచించాడు. తనకి ఏమీ

అవసరం లేదు. కాని దేవేంద్రుడంతటివాడు ఇస్తానంటే వద్దనటం భావ్యం కాదు. అతన్ని అవమానించటం అవుతుంది. అందుకని ఏదో ఒకటి అడగాలి. ఏమడగాలి. ఆలోచించి ఓ దేవేంద్రా! నాకు మధువిద్యను ప్రసాదించవలసింది అన్నాడు. మధువిద్య అంటే బ్రహ్మవిద్య. ఒక్కసారిగా అవాక్కయ్యాడు ఇంద్రుడు. కొంతసేపటికి తేరుకుని అలాగే చెబుతాను. కాని నువు దాన్ని ఇతరు లెవరికీ చెప్పరాదు. ఒకవేళ చెబితే నా వజ్రాయుధంతో నీతల తెగ నరుకుతాను అన్నాడు. అలా అని మధువిద్యని దధ్యుడికి అనుగ్రహించి వెళ్ళిపోయాడు. కాలం గడుస్తోంది. అశ్వనీ దేవతలకు హవిర్భాగం లేకుండా చేశాడు ఇంద్రుడు. వారు తమ గురువుగారైన దధ్యుడి దగ్గరకు వచ్చి మధువిద్యని ప్రసాదించమన్నారు. నేను గనక చెబితే నా తల నరికేస్తాను అని చెప్పాడు ఇంద్రుడు. కాబట్టి నేను చెప్పను అన్నాడు దధ్యుడు. అప్పుడు అశ్వనీదేవతలు దగ్గరలోనే ఉన్న ఒక గుర్రం తలను తెచ్చి దధ్యుడికి అతికించి ఇప్పుడు చెప్పండి గురుదేవా! అన్నారు. మధువిద్యను చెప్పటం మొదలుపెట్టాడు దధ్యుడు. ఈ విషయం తెలిసి ఇంద్రుడు వజ్రాయుధంతో దధ్యుడి శిరస్సు కాస్తా నరికేశాడు. అక్కడే సిద్ధంగా ఉన్న అశ్వనీదేవతలు గురువుగారి శిరస్సును మృతసంజీవిని సహాయంతో యథాప్రకారం అమర్చారు. దాంతో దధ్యుడు పునర్జీవితుడయ్యాడు. చివరికి ఇంద్రుడు తాను చేసిన పనికి తానే పశ్చాత్తాపపడతాడు. ఈ విషయమంతా **శతపథ బ్రాహ్మణం**లో ఉంది.

## 3. ఊర్వశి - పురూరవులు

వీరిని గురించి ఋక్సంహితలో చెప్పుకున్నాం. కాని మళ్ళీ శతపథ బ్రాహ్మణంలో ఈ విషయం చెప్పబడుతోంది. అసలు ఊర్వశి ఎవరు. పూర్వ కాలంలో నరనారాయణులు బదరికావనంలో తపస్సు

చేస్తున్నారు. ఆ సమయంలో వీరి తపస్సు భగ్నం చెయ్యటానికి ఇంద్రుడు అప్సరసలను పంపాడు. వారు నరనారాయణుల దగ్గర ఆడిపాడి తమ అందాలు ఒలక పోస్తున్నారు. అప్పుడు నారాయణుడు కళ్ళు తెరిచి తన చేత్తో తొడమీద రాచాడు. వెంటనే అతిలోక సుందరి అయిన స్త్రీ ఆవిర్భవించింది. అక్కడున్న అందరికన్న చాలా అందంగా ఉంది. దాంతో ఇంద్రుని పనుపున వచ్చిన అప్సరసలు తలవంచుకుని సిగ్గుతో వెళ్ళిపోయారు. ఆవిడే ఊర్వశి, ఊర్వశి దేవవేశ్య అయింది.

ఒకరోజున మిత్రావరుణులు బ్రహ్మదేవుని దగ్గర నుంచి తిరిగి వస్తూ దారిలో ఊర్వశిని చూశారు. వెంటనే సూర్యునికి రేః పతన మైంది. దాన్ని కుండలో భద్రపరచింది ఊర్వశి. ఇప్పుడు వరుణుడు కూడా ఆమెను మోహించాడు అతడికి రేః పతనమైంది. దాన్ని కూడా కుండలో భద్రపరిచింది. ఆరేతస్సు నుంచే వశిష్ఠుడు, అగస్త్యుడు ఆవిర్భవించారు. ఆ సమయంలోనే భూలోకంలో పుట్టి పురూరవుడికి భార్య కావలసింది అని సూర్యుడు ఊర్వశిని శపించాడు.

పూర్వకాలంలో సుధన్వుడు అనే రాజు రాజ్యం చేస్తూ ఒక రోజున వ్యాహ్యాళికని అరణ్యానికి వెళ్ళాడు. అది కుమారవనం. అక్కడ పార్వతీ పరమేశ్వరులు ఉంటున్నారు. ఆ వనంలో కాలుపెట్టిన పురుషుడు మరుక్షణంలో స్త్రీగా మారిపోతాడు. ఇది పార్వతీదేవి శాపము. ఆ శాపం ప్రకారం సుధన్యుడు కాస్తా స్త్రీ అయిపోయాడు. ఆ స్త్రీనే ఇళాదేవి. ఇళాదేవిని బుధుడు వివాహం చేసుకున్నాడు. ఇళబుధుల కుమారుడే పురూరవుడు.

ఒకసారి దేవలోకం వెళ్ళినప్పుడు ఊర్వశిని చూసి మోహించాడు. తనను వివాహం చేసుకోమని అడిగాడు. ఊర్వశి కూడా అదే స్థితిలో ఉంది. పురూరవుడితో వివాహానికి ఒప్పుకుంది. కాకపోతే మూడు

షరతులు పెట్టింది. అవి 1. తనెప్పుడూ నేతినే ఆహారంగా స్వీకరించాలి. 2. తన దగ్గర రెండు మేక పిల్లలు ఉన్నాయి. వాటికి ఏ హాని జరగకూడదు. 3. పడగదికి అవతల పురూరవుడు ఎప్పుడూ నగ్నంగా కనిపించరాదు. ఈ మూడు షరతులకు అంగీకరిస్తేనే వివాహం చేసుకుంటాను అంది. సరే అన్నాడు పురూరవుడు. ఊర్వశి పురూరవుల వివాహం జరిగింది. వారికి పదిమంది సంతానం కలిగారు. అయినప్పటికీ ఊర్వశి మీద వ్యామోహం ఏ మాత్రం తగ్గలేదు పురూరవుడికి.

ఊర్వశి భూలోకానికి వెళ్ళి చాలా కాలమైంది. ఆమెను తిరిగి రమ్మని విశ్వావసు అనే గంధర్వుడితో కబురు చేశాడు ఇంద్రుడు. ఆమె తిరిగి రావాలంటే పైన చెప్పిన షరతులలో ఏదో ఒకటి ఉల్లఘించాలి. అందుకని గంధర్వులు ముందుగా ఊర్వశి మేక పిల్లలను ఎత్తుకుపోయారు. ఈ విషయం ఊర్వశికి తెలిసింది. ఆ సమయంలో ఊర్వశి పురూరవులు ఆనంద డోలికలలో తేలియాడుతున్నారు. తన మేకలు పోయాయనే విషయం తెలియగానే ఊర్వశి ఏడవటం మొదలుపెట్టింది. ఆ సమయంలో పెద్దగాలి వాన వస్తోంది. ఊర్వశి బాధ పడటం చూడలేక పురూరవుడు మేకలను వెతకటానికి బయటకు పరుగెత్తాడు. అప్పుడు అతని వంటి మీద ఒక్క నూలు పోగు కూడా లేదు. ఆ సమయంలో గంధర్వులు పెద్ద పెద్ద మెరుపులు మెరిపించారు. ఆ మెరుపుల వెలుగులో పురూరవుడి దేహం పూర్తి నగ్నంగా కనిపించింది. ఇంకేం. వ్రతభంగం అయింది అని ఊర్వశి దేవలోకానికి తిరిగి వెళ్ళిపోయింది.

తరువాత అగ్నిదేవుణ్ణి అర్చించి, దేవలోకం చేరి తిరిగి ఊర్వశిని పొందగలుగుతాడు పురూరవుడు.

## 4. వృత్రాసుర వధ

ఈ ఉపాఖ్యానము కూడా శతపథ బ్రాహ్మణంలో ఉంది. త్వష్టప్రజాపతి ఇంద్రుణ్ణి సంహరించటం కోసం త్రిశిరుణ్ణి సృష్టించాడు. అతణ్ణి మాయోపాయంతో సంహరించాడు ఇంద్రుడు. ఈవిషయం తెలిసి హోమకుండం నుంచి వృత్రాసురుని సృష్టించాడు త్వష్ట. వృత్రుడు బ్రహ్మను గురించి ఘోరమైన తపస్సు చేసి పగలు కాని, రాత్రి కాని, ప్రాణం ఉన్న వాటిలో కాని ప్రాణం లేని వాటితో కాని, నేలమీద గాని, నీటిలో గాని, తనకు మరణం లేకుండా వరం తీసుకున్నాడు. అసలే బలవంతుడు. అందులో వరబలం కూడా కలిసింది. దేవలోకం మీద యుద్ధం చేసి, దేవలోకాన్ని ఆక్రమించాడు. ఇంద్రుడు విష్ణువును శరణు వేడాడు. విష్ణుమూర్తి సలహా మీద వృత్రునితో స్నేహంచేసి, సమయంచూసి అజాగర్తగా ఉన్న వృత్రుణ్ణి ఇంద్రుడు సముద్రపునురగతో తడిపిన వజ్రాయుధంతో నరికి చంపాడు. ఇలా వృత్రుని సంహరించినందుకుగాను ఇంద్రుడికి బ్రహ్మహత్యాపాతకం పట్టుకుంది.

## 5. కొంచెం ఎక్కువ

శతపథబ్రాహ్మణంలో చెప్పిన సామెత ఇది. యజ్ఞంలోకి సోమరసం కావాలి. సోమలతను తెచ్చి సోమరసం తీసుకోవాలి. సోమలతను కొనుక్కురావాలి.

దాన్ని విడిగా అమ్మే వ్యక్తులుంటారు. ఒకసారి ఒక వ్యక్తి సోమలతను అమ్మటానికి తెచ్చాడు. కొనటానికి వచ్చాడు ఒక యజమాని. ఇప్పుడు యజమాని అడుగుతున్నాడు.

ఈ సోమలతని అమ్ముతావా?

అమ్మటానికే తెచ్చాను.

దీని ఖరీదెంత ?

ఎంతో మీరే చెప్పండి?

ఒక ఆవునిస్తే ఈ సోమాన్నిస్తావా?

ఒక ఆవుకన్న కొంచెం ఎక్కువ ఖరీదు అవుతుంది.

పోనీ ఒక వస్త్రానికి ఇస్తావా?

ఒక మంచి వస్త్రం కన్న ఎక్కువ ఉంటుంది.

ప్రతిసారీ ఇలా సోమం ధర ఇంకొంచెం ఎక్కువ ఉంటుంది అంటాడు. అంతేకాని బేరం మాత్రం తెగనీడు.

ఈ రకంగా కేవలము యజ్ఞయాగాదులే కాక అనేక ఇతర విషయాలు కూడా చెప్పబడ్డాయి ఈ బ్రాహ్మణంలో

# 41. తలవకార బ్రాహ్మణం

వ్యాసభగవానుని శిష్యుడు జైమిని. జైమిని శిష్యుడు తలవకారుడు. సామవేదానికి ఉన్న బ్రాహ్మణాలలో తలవకార బ్రాహ్మణం ఒకటి. దీనిని వ్రాసినవాడు జైమిని. ప్రచారం చేసిన వాడు తలవకారుడు. అందుచేత అతని పేరుతో తలవకార బ్రాహ్మణము అని పిలువబడుతోంది. సామవేదానికి ఉన్న శాఖలలో తలవకార శాఖ ఒకటి. ఆ శాఖకు సంబంధించిన బ్రాహ్మణం కాబట్టి దీన్ని తలవకార బ్రాహ్మణము అంటారు. ఇది కర్ణాటక దేశంలో బాగా ప్రచారంలో ఉన్నది. ఈ బ్రాహ్మణంలో ఎన్ని ఖండాలు ఉన్నాయి అనే దానిమీద ఏకాభిప్రాయం లేదు. దీనికి ప్రసిద్ధమైన భాష్యాలు లేవు. సాయణాచార్యుడు దీనికి భాష్యం వ్రాయలేదు.

మిగిలిన బ్రాహ్మణాలలాగానే అగ్నిష్టోమము, గవామయనము మొదలైన యాగాలు వివరిస్తోంది ఈ బ్రాహ్మణం. కాకపోతే ద్వాదశాహయాగాలు ఇందులో ప్రసిద్ధి చెందినాయి. కర్మకాండతో పాటుగా అనేక లోకోక్తులు, చారిత్రక, వైజ్ఞానిక విశేషాలు కూడా ఇందులో ఉన్నాయి.

## 1. పెద్దగా మాట్లాడకు, నేలకు చెవులుంటాయి.

లౌకికంలో మనం అనేక విషయాలు మాట్లాడుతుంటాం. కోపం, ప్రేమ, అభిమానం ఇత్యాదులన్నీ ఉంటాయి. జీవితంలో రహస్యాలుంటాయి. మూడో వ్యక్తికి తెలియనివే రహస్యాలు. ఈ రహస్యాలు మాట్లాడేటప్పుడు ఎవరూ వినకూడదు అనే భావనతో చిన్నగా మాట్లాడతాం. గదిలోకి వెళ్ళి తలుపులు వేసుకుని మాట్లాడతాం. ఎవరైనా చాటుగా వింటారేమో అని భయం. అందుకే పెద్దగా

మాట్లాడకు గోడకు చెవులుంటాయి అంటాము. అంటే ఇంకెవరన్నా వినిపోగలరు అని అర్థం. ఇదే మాట చెప్పటానికి తలవకార బ్రాహ్మణం "పెద్దగా మాట్లాడకు నేలకు చెవులుంటాయి" అంటోంది. ఇదే రహస్యాలు మాట్లాడుకోవాలంటే ఆరుబయట ప్రదేశంలోకి వెళ్ళి మాట్లాడతారు జపాన్ వారు. మూడో వ్యక్తి ఎవరున్నా కంటికి కనిపిస్తారు కాబట్టి

## 2. చంద్రునిలో మచ్చ

నేలమీద నుంచుని చూస్తుంటే చంద్రుడు నున్నగా గుండ్రంగా కనిపిస్తాడు. అతనిలో ఒక చిన్న మచ్చ కూడా ఉన్నట్లుగా కనిపిస్తుంది. ఆ మచ్చ అందమైన ముఖానికి తిలకంలాంటిది అంటారు కవులు. ఆ మచ్చ కుందేలు అని చెబుతుంటారు జానపద కథల్లో. విచిత్రమేమంటే అలా మచ్చలాగా కనిపించేది ఒక పెద్ద పర్వతమని శాస్త్రవేత్తలు చెబుతున్నారు. ఈ బ్రాహ్మణం మాత్రం అది ఒక కుందేలు అంటోంది.

## 3. సోమరసం

ఎక్కడో హిమాలయాల్లో సోమలత అనేది పెరుగుతుంది. సంవత్సరానికి దీనికి ఏడు ఆకులు మాత్రమే ఉంటాయని కొంతమంది పదిహేను ఆకులుంటాయని కొంతమంది చెబుతుంటారు. సోమలతలో అనేక రకాలున్నాయి. ఈ సోమలతను నలగ్గొట్టి రసం తీస్తారు. ఆ తరువాత దీన్ని పెరుగు, తేనె మొదలైన వాటితో కలిపి త్రాగుతారు. దేవతలు ఈ సోమరసాన్ని త్రాగుతుండగా కొన్ని చుక్కలు భూమిమీద పడిపోయాయి. ఆ బిందువుల వల్లనే లతలు, ఓషధులు పుట్టాయి అంటున్నది ఈ బ్రాహ్మణం. సోమరసం అమృతతుల్యం.

## 4. రాక్షసుల ఓటమి

సామం చాలా గొప్పది అంటుంది తలవకార బ్రాహ్మణం ఉదాహరణకు గాయత్రీ సామాన్ని తీసుకోండి. దీని గొప్పతనాన్ని తెలియచేస్తూ "ప్రజాపతి ప్రజలందరినీ సృష్టించాడు. అయితే అతడికి సృష్టి అంతా నిర్జీవంగా కనిపించింది. అప్పుడు ప్రజాపతి గాయత్రి సామాన్ని గానం చేసి ప్రాణం నింపాడు" అని చెప్పబడింది. గాయత్రి సామం పఠించేవాడి ప్రాణాలకు ఎప్పుడూ రక్షణ అనేది ఉంటుంది. గాయత్రి అన్న పేరులో అంతరార్థం కూడా ఇదే. ఇవే కాదు రథతరం, బహిష్పవమానం కూడా ఇలాంటివే. దేవతలు సామగానంద్వారా రాక్షసులను ఓడించారు. వాళ్ళని తరిమివేసి ఈ భూలోకాన్ని ఆక్రమించారు. ఈ రకంగా సామగానం శత్రువులకు నాశనం, హాని కలిగిస్తుందని చెబుతోంది తలవకార బ్రాహ్మణం.

## 5. పొరపాట్లు

యాగం జరిగే సమయంలో జరిగే పొరపాట్లు ఎలా సరిదిద్దుకోవాలి అనే విషయాన్ని చెబుతోంది వేదం. సోమరసాన్ని హోమం చెయ్యటానికి ముందు 'ద్రోణకలశం' అనే పాత్రలో పోస్తారు. ఒకవేళ ఏదైనా ప్రమాదం జరిగి సోమరసం దానిలోంచి క్రిందికి పోతే, యజమాని ఆయువు తీరినట్లే. అయితే అదే పాత్రలో ఆవుపాలు పోసి యథావిధిగా యాగం చేస్తే, సోమయాగం చేసినట్లే అవుతుంది. యజమానికి పరిపూర్ణ ఆయుష్యు సిద్ధిస్తుంది. ఒకవేళ పొరపాటున ద్రోణకలశం గనక పగిలిపోతే, 'బ్రహ్మసామం'తో ప్రాయశ్చిత్తం చేసుకోవాలి అని చెబుతోంది ఈ బ్రాహ్మణం. యాగం కోసం తెచ్చిన

సోమలతను ఎవరైనా ఎత్తుకుపోతే, దగ్గరలో దొరికే సోమలతను తెచ్చి యాగం పూర్తి చెయ్యండి. అంతేకాని మళ్ళీ శాస్త్రోక్తంగా సోమాని కొనరాదు అని చెబుతోంది బ్రాహ్మణం.

## 6. సోమరసం గుణాలతో పెరుగు

యాగాలు ఏ రకంగా చెయ్యాలి అనే విషయం చెబుతూ అనేక వైజ్ఞానిక విషయాలు కూడా చెబుతోంది ఈ బ్రాహ్మణం. అగ్నిష్టోమము మొదలైన యాగాలలో మేడిచెట్టు కొమ్మలు సమిధలు అనేక రకాలుగా ఉపయోగించబడుతున్నాయి. ప్రజాపతి అన్నరసాన్ని దేవతలకు పంచి ఇస్తుండగా నేలమీద కొన్ని బిందువులు పడ్డాయి. ఆ బిందువుల నుంచి ఆవిర్భవించింది ఈ ఉదంబర వృక్షం. ఇది అన్నసారంలోనుంచి ఆవిర్భవించింది. అందుకని దీని పండు చాలా పుష్టికరం. చెట్టుకొమ్మలు కొట్టినప్పుడు, లేదా పుల్లలు విరిచినప్పుడు ఆ ప్రదేశం నుంచి జిగురుగా ఉండే పాలవంటి తెల్లని పదార్ధం స్రవిస్తుంది. దాన్ని గనక పాలల్లో కలిపితే పాలు కాస్తా పెరుగవుతుంది. ఈ పెరుగు సోమరసం యొక్క గుణాలను కలిగి ఉంటుంది. ఇలాంటి పెరుగుతోనే యజ్ఞాలు చేస్తారు అని చెబుతోంది తలవకార బ్రాహ్మణం.

## 7. ఈతిబాధలు

అగ్నిష్టోమము మొదలైన యాగాలు చెయ్యటంవల్ల యజమాని ఒకడికే కాదు అందరికీ ప్రయోజనం ఉంటుంది. ఏ దేశంలో అగ్నిష్టోమం చేశారో ఆ దేశంలో వర్షాలు సకాలంలో కురుస్తాయి. పంటలు బాగా పండుతాయి. ఓషధులు వనస్పతులు మంచి

ఫలాన్నిస్తాయి. నదులు నిండుగా ప్రవహిస్తాయి. శత్రువులు నశించిపోతారు. ప్రజలకు కూడా ఈతిబాధలు ఉండవు అని చెబుతోంది తలవకార బ్రాహ్మణం.

1. నిత్యాలు – ప్రతిరోజూ చేయవలసినవి. స్నానము, సంధ్యావందనము.

2. నైమిత్తికాలు : ఒకదాని నిమిత్తం ఒక సందర్భంలో చేయాల్సినవి. గ్రహణం పట్టినప్పుడు స్నానం చెయ్యటం.

3. నిషిద్ధ కర్మలు : ఎప్పుడూ చేయకూడనివి.

**'నా అనృతంబ్రూయాత్'** అబద్ధమాడరాదు. **అహింసాత్సర్వభూతాని** జీవహింస చేయరాదు.

ఇక్కడ ఒక చిన్న సందేహం. జీవహింస పనికిరాదని చెప్పిన వేదం యజ్ఞంలో పశుబలి ఇమ్మంటోంది కదా. మరి అది ఎంత వరకు సమంజసము? ఇక్కడ ఒక్క విషయం గమనించాలి. విధివాక్యాలు రెండు రకాలు 1. సామాన్యవిది 2. విశేషవిధి. సామాన్యాన్ని విశేషం బాధిస్తుంది. చిన్న ఉదాహరణ చూడండి. లోకంలో ఎవరినైనా కొట్టటం నేరం. ఇది సామాన్యం. కాని గురువు శిష్యుణ్ణి కొట్టవచ్చు. ఇది విశేషం. గురువుగారు శిష్యుణ్ణి కొట్టటం వాడి శ్రేయస్సు కోసం. కాబట్టి అది తప్పు కాదు. అలాగే ఇతరత్రా పశువును చంపితే అది హింస. యజ్ఞంలో పశువును చంపితే అది హింసకాదు అని వేదమే చెబుతున్నది.

తలవకార బ్రాహ్మణంలో ఈ రకంగా అనేక రకాలైన క్రతువులు చెప్పారు. వీటివల్ల అనేక ప్రయోజనాలున్నాయి. ఆ ప్రయోజనాలన్నీ కేవలము యజ్ఞం చేసిన యజమానికే కాదు. సమాజానికి కూడా. ఉదాహరణకి స్వర్గం రావాలి అని యజ్ఞం చేస్తే ఆ ఫలితం యజమానికే

చెందుతుంది. వర్షం కురవాలి అని యాగం చేస్తే, ఆ వర్షం యజమాని ఇంట్లోనే కురవదు కదా పంటలు బాగా పండాలి అని యాగం చేస్తే ఆ పంట యజమాని ఒక్కడి పొలంలోనే పండదు. కాబట్టి యజ్ఞయాగాలు ఎవరు చేసినా ఫలితం అందరికీ చెందుతుంది అని గుర్తించండి.

## 8. మేడిచెట్టు

ఉదంబర వృక్షము అంటే మేడిచెట్టు. దీన్నే అత్తిచెట్టు అని కూడా అంటారు. దీన్ని గురించి జైమినీయ బ్రాహ్మణంలో చెప్పటం జరిగింది. ప్రజాపతి అన్న సారం అంతా ఒకచోట చేర్చి ప్రజలకు పంచటం ప్రారంభించాడు. ఆ సమయంలో కొన్ని చుక్కలు నేలమీద పడి వాటినుంచి ఒకచెట్టు మొలిచింది. అదే మేడిచెట్టు. ఇది చాల శక్తివంతమైనది అని జైమినీయ బ్రాహ్మణం చెబుతోంది.

మేడిచెట్టు దత్తాత్రేయ స్వరూపని మంత్రశాస్త్రం చెబుతోంది.

## 9. బ్రహ్మహత్యాపాతకము

ఇంద్రుణ్ణి సంహరించటం కోసం వృత్రుణ్ణి హోమకుండం నుంచి సృష్టించాడు త్వష్ట ప్రజాపతి. వృత్రుడు తపస్సుచేసి బ్రహ్మనుంచి అనేకవరాలు పొంది, ఇంద్రుని సింహాసనం ఆక్రమించాడు. అప్పుడు ఇంద్రుడు విష్ణుమూర్తి సలహా పై మాయోపాయంతో వృత్రుణ్ణి సంహరించాడు. ఇంతవరకు జరిగిన కథ మనందరికీ తెలుసు. అయితే వృత్రుని సంహరించటం వల్ల ఇంద్రుడికి బ్రహ్మహత్యా పాతకం పట్టుకుంది. దాంతో ఇంద్రుడి మొహం కళాహీనమై పోయింది. అటువంటి తన ముఖాన్ని పదిమందికి చూపలేక దూరంగా పారిపోయి హిమాలయ పర్వతాల్లోని మానస సరోవరంలోని తామరపువ్వు కాడలోని

దిగువ భాగాన దాక్కున్నాడు. ఈ సమయంలోనే దేవతలు నహుషుణ్ణి ఇంద్రుడుగా చేశారు. తరువాత బృహస్పతి సలహామీద పదిరోజులపాటు ఇంద్రునితో ఒక యాగం చేయించి మళ్ళీ ఇంద్రుణ్ణి సింహాసనం మీద కూర్చోబెట్టారు. ఈ విషయమంతా **'జైమినీయ బ్రాహ్మణం'**లో ఉంది. బ్రహ్మహత్యాపాతకం పోవాలంటే చాలా కష్టపడాలి.

## 10. చ్యవనుడు

భృగువు యొక్క కుమారుడు చ్యవనుడు. ఇతని తల్లి పులోమ. చ్యవనుడు తల్లి గర్భంలో ఉన్నప్పుడు పులోముడు అనే రాక్షసుడు ఇతని తల్లిని ఎత్తుకుపోతున్నాడు. ఆ సమయంలో చ్యవనుడు గర్భంలోనుంచి క్రిందికి జారి ఆ రాక్షసుణ్ణి తీక్షణంగా చూశాడు. దాంతో రాక్షసుడు కాస్తా మరణించాడు.

చ్యవనుడు అనేక సంవత్సరాలు తపస్సు చేశాడు. ఇలా తపస్సు చేస్తున్న సమయంలో ఒక రోజున శర్యాతి మహారాజు అతని రాణివాసంతోను సైన్యంతోను విహారానికి అరణ్యానికి వచ్చాడు. అందరూ ఆ అరణ్యాలలో విహరిస్తున్నారు. శర్యాతి కుమార్తె సుకన్య చెలికత్తెలతో అరణ్యంలో తిరుగుతూ అక్కడ ఒక పుట్టను చూసింది. ఆ పుట్టలోపల నుంచి విపరీతమైన కాంతితో ఏవో రెండు ప్రకాశిస్తున్నట్లుగా అనిపించింది. బహుశః అవి మిణుగురు పురుగులు అయి ఉంటాయి అనుకుని ప్రక్కనే ఉన్న పుల్లలో రెండు చోట్లా పొడిచింది. వెంటనే ఏదో శబ్దం వినిపించింది. మెరుపు ఆగిపోయింది. భయపడింది సుకన్య. చెలికత్తెలతో పాటుగా మాట్లాడకుండా అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

భృగువు యొక్క కుమారుడైన చ్యవనుడు అక్కడ చెట్టు క్రింద

కూచుని తపస్సు చేసుకుంటున్నాడు. సంవత్సరాలు గడిచిపోయినాయి. శరీరమంతా పుట్టలు పెట్టింది. ఆ పుట్టలోంచి ఆయన కనులు మాత్రమే మిలమిలా మెరుస్తూ కనిపిస్తున్నాయి. వాటినే ఏవో పురుగులు అనుకుని పుల్లతో పొడిచింది సుకన్య అవి కాస్తా పని చెయ్యకుండా పోయినాయి.

శర్యాతి మహారాజు సైనికులందరికీ మలమూత్రాలు బంధించి పోయినాయి. క్రమంగా ఇది రాణివాసానికి కూడా వ్యాపించింది. కారణం తెలియటం లేదు. ఆ సమయంలో అరణ్యంలో జరిగిన వృత్తాంతమంతా వివరించింది సుకన్య తన తండ్రికి. రాజుగారు సేనాసమేతుడై వెళ్ళి పుట్ట తవ్వించాడు. లోపల చ్యవనుడు కనిపించాడు. కేవలము అస్తిపంజరము కనిపిస్తోంది. పైన చర్మంమాత్రం ఉంది. కళ్ళు లేవు. ఆ కళ్ళనే సుకన్య పొడిచేసింది. తనకుమార్తె చిన్నపిల్ల తెలియకచేసిన తప్పు కరుణించమని వేడుకున్నాడు మహారాజు. సుకన్యను తనకిచ్చి వివాహం చేస్తే క్షమిస్తా అన్నాడు చ్యవనుడు. ఎలా ? చ్యవనుడు వృద్ధుడు, తాపసి. రాకుమార్తె చిన్నపిల్ల. ఈ వివాహం జరగదు. మరి గట్టెక్కే మార్గం కనపడదు. ఇలాటి సమయంలో సుకన్య వచ్చి తండ్రితో “తండ్రీ ! ఈ అనర్ధానికంతటికీ కారణం నేను. కాబట్టి నేను మహర్షిని వివాహం చేసుకుంటాను అంది. చేసేదిలేక కుమార్తెతో చ్యవనుడి వివాహం జరిపించాడు. శర్యాతి మహారాజు

ఆ తరువాత కొంత కాలానికి అటుగా వచ్చిన అశ్వనీ దేవతలు పరిస్థితి కళ్ళారా చూసి చ్యవనుడికి మంచి ఆరోగ్యము, యవ్వనము వచ్చేట్లు చేశారు. దానికి ప్రతిగా అశ్వనీ దేవతలకు హవిర్భాగం ఇప్పించాడు చ్యవనుడు.

ఈ వృత్తాంతంతా జైమినీయ బ్రాహ్మణంలో ఉంది.

# 11. తనకు మాలిన ధర్మం

తనకు మాలిన ధర్మం మొదలు చెడ్డబేరం పనికి రావు. అనేది సామెత. ధర్మం చెప్పేటప్పుడు ఆ ధర్మంవల్ల మనకు హాని కలుగుతుంటే మనం ఆ ధర్మాన్ని అంటి పెట్టుకుని ఉండకూడదు. అందుకే తనకు మాలిన ధర్మం అంటే తనకు పనికిరాని ధర్మం ఏవైనా బేరం చేస్తే అసలకు ఇబ్బంది రాకూడదు.

తలహకార బ్రాహ్మణంలో ఒక చిన్నకథ ఉంది. ఒకసారి యజ్ఞం జరుగుతోంది. అగ్నిని పిలచి దేవతలకు హవిస్సులు తీసుకు వెళ్ళమన్నారు. అప్పుడు అగ్ని ముందుగా నాకు హవిర్భాగం ఇవ్వండి అప్పుడు చూద్దాం అన్నాడు. ఒకవేళ అగ్ని హవిస్సు దేవతలకు ఇచ్చిన తరువాత అగ్నికి గనక హవిస్సు లేకపోతే ! అందుకని ముందే నా భాగాన్ని నాకు ఇచ్చెయ్యి అంటున్నాడు. దీన్నిబట్టే తనకు మాలిన ధర్మం అనే సామెత వచ్చింది అని తెలుస్తోంది.

ఈ విధంగా అనేకానేక విషయాలు ఇందులో చెప్పబడ్డాయి.

# 42. తాండ్యబ్రాహ్మణము

సామవేదంలో కౌథుమశాఖకు సంబంధించిన బ్రాహ్మణం తాండ్యబ్రాహ్మణం. దీన్నే తాండ్యబ్రాహ్మణము, మహాబ్రాహ్మణము, ప్రౌఢబ్రాహ్మణము అంటారు. తాండి మహర్షి వ్రాశాడు కాబట్టి తాండ్య బ్రాహ్మణము అంటారు. ఇందులో ఇరవై ఐదు అధ్యాయాలున్నాయి కాబట్టి పంచవిశ్వబ్రాహ్మణము, ఇందులో ప్రతిపాదించిన విషయాల మహత్యాన్ని బట్టి మహాబ్రాహ్మణము అంటారు. సామవేదానికి గల బ్రాహ్మణాలలో తాండ్య బ్రాహ్మణము సాటిలేనిది. ఇందులో ఇరవైఐదు ప్రపాఠకాలు, మూడువందల నలభైఏడు ఖండాలు ఉన్నాయి. దీనిలో ప్రధానంగా సోమయాగాన్ని వివరించారు.

బ్రాహ్మణ వాఙ్మయంలో తాండ్య బ్రాహ్మణం చాలా ప్రసిద్ధి చెందినది. దీనికి కారణం ఇది చాలా ప్రాచీనమైనది. ఇరవైఐదు అధ్యాయాలు గల మహాగ్రంథం. ఇందులో అనేక రకాల సోమయాగాలు చెప్పబడ్డాయి. అన్నింటికి మించి సాయణుడు దీనికి సమగ్రమైన భాష్యం వ్రాశాడు. ఈ కారణాలతో ఇది చాలా ప్రసిద్ధి చెందినది.

## 1. సౌమిత్రిసామము

పూర్వకాలంలో 'దీర్ఘజిహ్వ' అనే రాక్షసి ఉండేది. దీని నాలుక చాలా పొడవుగా ఉండేది. మునీశ్వరులు యజ్ఞయాగాలు ప్రారంభిస్తే ఈ రాక్షసి తన పొడవైన నాలుకతో యజ్ఞకుండం దగ్గర ఉన్న ఆజ్యము, పురోడాశము వంటి వాటిని నాకి వేస్తుండేది. ఈ రకంగా యజ్ఞాలన్నీ పాడయిపోతున్నాయి. ఇంద్రుడు దాన్ని ఎలాగైనా చంపాలని

నిర్ణయించుకున్నాడు. తాను ఆ రాక్షసిని ఒంటరిగా చంపలేక సుమిత్రుడు అనే మహర్షి సాయంకోరాడు. సుమిత్రుడు అపవిత్రమైన సంస్కార రహితమైన యాగశాలలో ఆమెను వశం చేసుకుని ఇంద్రుడికి ఒప్పగించాడు. ఇంద్రుడు కాస్తా దాన్నిచంపేశాడు. అందువల్లనే సౌమిత్రసామము అనబడుతుంది.

## 2. ఇంద్రుడు

పూర్వకాలంలో కొంతమంది యతులకు రాజవిరోధులుండేవారు. ఇంద్రుడు వారిని కుక్కలకు ఆహారంగా చేశాడు. కుక్కలు తినగా ముగ్గురు పిల్లరాక్షసులు బ్రతికారు. వారు 1. పృథురస్మి 2. బృహద్గిరుడు 3. రాజయోజుడు. వీరు పిల్లలు కాబట్టి వారి పోషణ అతనే వహించాలి. వీరిలో పృథురశ్మికి క్షాత్రబలాన్ని సామాన్ని ఇచ్చాడు. బృహద్గిరుడికి బ్రహ్మవర్చస్సును ఇచ్చాడు. రాజయోవాజుకు పశువుల నిచ్చాడు అని చెబుతోంది ఈ బ్రాహ్మణము.

## 3. ప్రత్యామ్నాయము

యాగద్రవ్యాలు గనక లభ్యం కాకపోతే ప్రత్యామ్నాయాలు వాడవచ్చు అంటోంది వేదం. సోమలతకు బదులు ప్రతిగా పూతీకలత అంటే పుల్లజముడు తీగెను వాడచ్చు. అదికూడా లభించకపోతే ‘అర్జనతృణము’ వాడతారు.

సోమలతకు ప్రత్యామ్నాయంగా మన రాష్ట్రంలో తిప్పతీగ వాడతారు.

## 4. మధ్యలో మాట్లాడరాదు

ఈ మాట మనం చాలామందికి చెబుతుంటాం కాని ఎందుకో మాత్రం తెలియదు. ఎవరైన ఇంటికి అతిథి వస్తే – విద్వాంసుడైన బ్రాహ్మణుడు భోజనం చేస్తున్నప్పుడు అతని మనసు ఎవరూ నొప్పించరాదు. అతడి మనస్సు నొచ్చుకుంటే ఆతిధ్యం నాశనమై పోతుంది అంటోంది ఈ బ్రాహ్మణం. అందుకే మధ్యలో మాట్లాడరాదు అని చెబుతోంది.

## 5. సామగానంతో రోగాలు మాయం

ఆ రోజుల్లో చర్మరోగాలు కూడా సామగానం వల్ల తగ్గిపోయినాయని చెబుతోంది ఈ బ్రాహ్మణం. తొమ్మిదో అధ్యాయంలో కొన్ని మంత్రాలు వైతహవ్యము. దైవోదానం, మైత్రావరుణం వంటి మంత్రాలు ఋషులతో దర్శించబడ్డాయి. అందులో 'ఆకూపారము' అనే సామము ఒకటి. అంగిరసుని కుమార్తె 'ఆకుపార'. ఏదో దోషంవల్ల ఆమె శరీరమంతా ఉడుంచర్మంలా అయిపోయింది. అప్పుడు ఆమె ఇంద్రుణ్ణి ప్రార్ధించింది. ఇంద్రుడు ఆ దోషాన్ని తొలగించాడు. ఎటువంటి కోరికలైనా సామగానంతో స్తోత్రం చేస్తే, ఆ కోరికలు సిద్ధిస్తాయి అంటోంది ఈ బ్రాహ్మణం.

## 6. క్షత్రియసామము

బ్రాహ్మణ ఋషులే గాక క్షత్రియ ఋషులు కూడా కొన్ని సామములు దర్శించారు. 'ఆర్షభసామ' అనేది క్షత్రియసామము. విశ్వామిత్రుని కుమారుడు ఋషభుడు. అతడు పుట్టినప్పుడు విశ్వామిత్రుడు క్షత్రియుడుగానే ఉన్నాడు. అందువల్ల ఇది క్షత్రియ సామమయింది. దీన్నే "బ్రాహ్మణాచ్ఛంసి సామము" అని కూడా

అంటారు.

## 7. త్వాష్ట్రీసామము

సామాలు పురుషులే కాక కొన్నింటిని స్త్రీలు కూడా దర్శించారు. త్వష్ట యొక్క కుమార్తెలు 'త్వాష్ట్రులు' అనబడతారు. ఒకసారి ఇంద్రుడికి కంటిరోగం వచ్చింది. నిద్ర పట్టక బాధపడుతున్నాడు. ఆ సమయంలో ఎవరూ ఏమీ చెయ్యలేకపోయారు. అప్పుడు త్వష్టకుమార్తెలు వాళ్ళు దర్శించిన సామాన్ని గానం చేసి ఇంద్రుణ్ణి నిద్ర పుచ్చారు. ఇది ఈ విషయం 12వ అధ్యాయంలో ఉంది.

## 8. ఊర్ణాయవము

పూర్వకాలంలో ఆంగీరసులు సత్రయాగం చేశారు. దాని ఫలితంగా స్వర్గం పొందారు. అయినా దేవయానం మాత్రం వారికి తెలియలేదు. వారిలో కళ్యాణగుణుడు అనేవాడు అంతరిక్షానికి పోయి 'ఊర్ణాయువు' అనే గంధర్వుణ్ణి చూసి దేవయానం చెప్పమాని ప్రార్థించాడు. అతడు ఆ మార్గాన్ని కళ్యాణగుణుడికి చెప్పి ఈ మార్గాన్ని ఊర్ణాయువు చెప్పాడు అని మీ వాళ్ళకి చెప్పు. అంతే కాని నేనే కనుక్కున్నానని మాత్రం చెప్పకు అన్నాడు. కాని కళ్యాణగుణుడు ఆ మార్గం తానే కనుకున్నానని అబద్ధమాడాడు. దాంతో అతడి జ్ఞానం పూర్తిగా నశించి పోయింది. కుష్టురోగం కూడా వచ్చింది. ఆ సామానికి అంత శక్తి ఉన్నది.

## 9. మరిచిపోయిన కర్మను జ్ఞాపకం చెయ్యకూడదు

ఏదైనా ఒక కర్మ చేస్తున్నప్పుడు ఋత్విక్కు కర్మను మరచిపోతే

ప్రక్కన ఉన్నవారు దాన్ని జ్ఞాపకం చెయ్యకూడదు అని చెబుతోంది ఈ బ్రాహ్మణం 15వ అధ్యాయంలో. ప్రజాపతిని అతిథి లాగా ఆహ్వానించి చరవు, పురోడాశాలతో అతనికి సంతృప్తి కలిగింటేప్పుడు మధ్యలో మరచిపోయిన కర్మను ఎవరూ గుర్తు చెయ్యరాదు. అది ప్రజాపతికి అసంతృప్తి కలిగిస్తుంది.

## 10. వసిష్టుడే పురోహితుడు

వశిష్టుడు బ్రహ్మమానస పుత్రుడు. ఈ గ్రంథం మొదట్లో ఋషులను గురించి చెప్పుకునేటప్పుడు వశిష్టుణ్ణి గురించి చెప్పుకున్నాం. ఆ సమయంలోనే వశిష్టుడికి మూడు జన్మలు ఉన్నాయి అని కూడా చెప్పుకున్నాం. వసిష్ఠుడు అనేది ఒక వ్యక్తి పేరు అయినప్పటికి పురోహితుడు అనే అర్థంలో వాడబడుతోంది. దీనికి కారణం ఏమంటే అసలు పురోహితుడు అంటే వసిష్టుడే. ఈ విషయం తాండ్య బ్రాహ్మణంలో చెప్పబడింది.

పూర్వకాలంలో ఋషులందరికీ ఇంద్రుణ్ణి చూడాలి అనిపించిందట. అనుకున్నదే తడవుగా వారందరూ రకరకాల పద్ధతులలో ఇంద్రుణ్ణి ధ్యానించటం మొదలుపెట్టారు. ఎంత కాలమైనా వారి కోరిక తీరలా. అప్పుడు వసిష్టుడు ఒక ప్రత్యేకమైన మంత్రం 'నివహం' అనే సామంతో ఇంద్రుణ్ణి స్తుతించాడు. ఇంద్రుడు ప్రత్యక్షమైనాడు. దాంతో మిగిలిన వారందరి కన్నా వసిష్టుడే గొప్పవాడు. అని స్థిరపడిపోయింది. వేదంలో కూడా ఎక్కువ మంత్రాలు దర్శించినవాడు వసిష్టుడే. ఈ కారణాల చేతనే "వసిష్టుడే పురోహితుడు" అని స్థిరపడిపోయింది.

## 11. నిజమైన పుత్రుడు

ఏ తండ్రికైనా అనేకమంది కుమారులు ఉండచ్చు కాని అసలైన కుమారుడు ఒక్కడే ఉంటాడు.

**జలచరము లబ్ధి పుట్టవె**
**జలరాసికి మోదకరుడు చంద్రుండొకడే**
**కులముద్ధరింపనొకడె**

కొడుకులు ఎంతమంది ఉన్నా కులాన్ని ఉద్ధరించేవాడు, ఒక్కడే. తల కొరివి పెట్టేవాడు ఒక్కడే, అతడే నిజమైన కుమారుడు. అందుకే

**పుత్రోత్సాహము పుత్రుడుదయించినపుడు కాదు**
**జనులా పుత్రుని గనుగొని పొగడగ**
**పుత్రోత్సాహము నాడు పొందుర**

అతడే నిజమైన పుత్రుడు. ఈ విషయమే చెబుతోంది తాండ్య బ్రాహ్మణం ప్రజాపతి భూమిని, అందులోని జీవరాశిని సూర్యచంద్ర మండలాలు, స్వర్గలోకం నరకలోకం అంతా సృష్టించాడు. కాని ఈ సృష్టి ప్రజాపతి పెద్దరికాన్ని మన్నించలేదు. దాంతో కోపగించిన ప్రజాపతి ఈ సృష్టిసారము అంతా ఒక దండగా మార్చి మెడలో వేసుకున్నాడు. సృష్టిఅంతా అతని పాదాక్రాంతమైంది. కొంత కాలం తరువాత ఆమాలను ఇంద్రుడి మెడలో వేశాడు. ప్రజాపతికి చాలామంది కుమారులున్నారు. ఐనప్పటికీ ఆ మాలను ఇంద్రుడి మెడలోనే వేశాడు. దానికి ఇంద్రుడే తగినవాడు అని భావించాడు. ఈ రకంగా తండ్రి విశ్వాసానికి పాత్రుడైనాడు. ఆ తరువాత అనేకమైన యాగాలు చేసి సమస్త లోకాలకు అధిపతి కూడా అయినాడు ఇంద్రుడు. కేవలము తండ్రి ఇచ్చిన అధికారమే కాక తనయొక్క స్వశక్తితో కూడా అధికారాన్ని విస్తరింప చేసుకున్నవాడు నిజమైనపుత్రుడు అనబడతాడు.

## 12. వైఖానస సామము

ఈ సామాన్ని గనక గానం చేస్తే తీరనికోరిక అంటూ ఏదీఉండదు. ఈ విషయాన్నే చిన్న ఉపాఖ్యానం ద్వారా చెబుతోంది తాండ్య బ్రాహ్మణము.

విఖనసమహర్షి యొక్క కుమారులు వైఖానసులు. వీరు ఇంద్రుడికి అత్యంత ప్రీతిపాత్రులు. వీరు దేవతలకు చాలాఉపకారాలుచేశారు. దాంతో వీళ్ళ మీద కోపగించి రాక్షసులు వీరిని ఎత్తుకుపోయి 'మునిమరణము' అనే ప్రాంతంలో అందర్నీ చంపేశారు.

ఈ వైఖానసులు ఏమై పోయారో, ఎక్కడికి వెళ్ళారో తెలియలేదు. దాంతో ఇంద్రుడు నలుదిక్కులకు భటులనుపంపి వెతికించాడు. చివరకు వాళ్ళ మృతకళేబరాలు దొరికాయి. అది చూసిన ఇంద్రుడు అమితంగా దుఃఖించిన వాడై వైఖానససామాన్ని గానం చేశాడు. దాంతో మరణించిన వైఖానసులు పునర్జీవితులైనారు. వైఖానస సామంగానం చేస్తే తీరని కోరిక లేదు. అంటోంది ఈ ఉపాఖ్యానము.

## 13. కాలేయము

పూర్వకాలంలో లోకాల మీద ఆధిపత్యం సంపాదించటం కోసం దేవతలు, దానవులు పోటీ పడ్డారు. అప్పుడు దేవతలంతా తమ తండ్రి అయిన ప్రజాపతితో మొరపెట్టుకున్నారు. ప్రజాపతి వారికి ఒక సామాన్ని ఉపదేశించి "దీంతో మీరు దానవుల బెడద తొలగించుకోండి' అన్నాడు అలా అని **ఏతేనైతాన్ కాలయిష్యధ్వమ్** అన్నాడు. ఇలా అనటంవల్ల కాలేయము అనే పేరు దీనికి ఏర్పడింది. కలి అనే ఋషిచేత దర్శించబడింది కాబట్టి ఈ సామానికి కాలేయము అని పేరు వచ్చింది ఇది ఎనిమిదవ అధ్యాయంలో ఉంది.

## 14. శ్యావాస్వసామము

పూర్వకాలంలో శ్యావాశ్వమహర్షి సత్రయాగం చేస్తున్నాడు. ఆ సమయంలో కొందరు యాజ్ఞికులు కోపంతో అతణ్ణి నీళ్ళు లేని ప్రదేశానికి తీసుకుపోయి వదిలేసి వచ్చారు. అప్పుడు ఆ మహర్షి వృష్టిసాధనమైన ఈ సామాన్ని కనుక్కున్నాడు (దర్శించాడు) ఆ సామాన్ని గానం చేశాడు. ఆ అనావృష్టి ప్రాంతంలో వర్షం పడింది. అక్కడ పంటలు పండటం ప్రారంభమైంది. దాని ప్రభావంతోనే అతను ఆ ప్రదేశం నుంచి యజ్ఞభూమికి తిరిగి వచ్చాడు. ఈ సామాన్ని స్తోత్రం చేస్తే దారి తప్పినవాడు తిరిగి తన మార్గంలోకి వస్తాడు. ఇది ఎనిమిదవ అధ్యాయంలో ఉంది.

## 15. నీచోపమ

సామగానం చేసేటప్పుడు అన్ని మంత్రాలను ఒకే విధంగా గానం చెయ్యరు. రకరకాలుగా గానం చేస్తారు. ఇక్కడ సామగానం నీచోపమగా చెప్పటం జరిగింది. ఎద్దు ఉచ్చపోసేటప్పుడు ఆ ధారను భూమిమీద వంకరగానే పోస్తుంది. అలాగే సామగానం కూడా మెలికెలు మెలికలుగా చెయ్యాలి అని చెబుతోంది ఎనిమిదవ అధ్యాయంలో ఇలా నీచంగా, అశ్లీలంగా చెప్పిన ఉపమానాలు కూడా ఉన్నాయి. అయితే ఇది కావ్యం కాదు కాబట్టి అలా చెప్పటం దోషం కాదు అని గుర్తించాలి. ఈ రకంగా తాండ్య బ్రాహ్మణంలో అనేక విషయాలు చెప్పబడ్డాయి.

# 43. ఛాందోగ్య బ్రాహ్మణము

సామవేదానికి గల కౌథుమశాఖకు సంబంధించినది ఈ ఛాందోగ్య బ్రాహ్మణము. దీన్నే మంత్రబ్రాహ్మణము అని కూడా అంటారు. ఈ బ్రాహ్మణంలో నాలుగు వేదాలు, ఇతర బ్రాహ్మణాలు వీటిలో గల ప్రసిద్ధమైన మంత్రాలు ఉన్నాయి. ఇందులో యజ్ఞయాగాదుల ప్రసక్తే లేదు. మానవుడు తన జీవితంలో తప్పనిసరిగా ఆచరించవలసిన సంస్కారాలకు సంబంధించిన కొన్ని మంత్రాలు మాత్రమే ఉన్నాయి. ఇందులో మొత్తం పది ప్రపాఠకాలుంటాయి. వాటిలో మొదటి రెండు ప్రపాఠకాలు బ్రాహ్మణం కాగా చివరి ఎనిమిది ప్రపాఠకాలు ఛాందోగ్యోపనిషత్తు. మొత్తం మీద ఈ బ్రాహ్మణంలో రెండు ప్రపాఠకాలు, పదహారు ఖండలు, రెండు వందల యాభై ఏడు మంత్రాలు ఉన్నాయి. ఇక్కడ విచిత్రమయిన విషయం ఏమంటే ప్రతి బ్రాహ్మణంలోను యజ్ఞయాగాది కర్మలను వివరించి, ఇతర విషయాలను కొద్దిగా చెప్పటం జరుగుతుంది. కాని ఈ బ్రాహ్మణంలో గృహ్యకర్మలకే ప్రాధాన్యత. భారతీయ జీవనంలో ముఖ్యమైన వివాహం, గర్భాదానం, జాతకకర్మ, ఉపనయనం, సమావర్తనం, పశువృద్ధి, నాకబలి, స్థాలీపాకంలాంటి విషయాలను వివరించారు. చివరలో భోజనాదుల్లో క్రిమిదోషనివారక మంత్రాలు కూడా చెప్పబడ్డాయి.

దీనికి **'ఛాందోగ్యమంత్రభాష్యము'** అనే పేరుతో గుణవిష్ణువు, సాయణుడు వ్రాసిన **'వేదార్థప్రకాశము'** అనే రెండు భాష్యాలు ఉన్నాయి.

ఈ బ్రాహ్మణం సామవేదానికి సంబంధించినది. అయినప్పటికీ నాలుగు వేదాల్లో చెప్పిన మంత్రాలు ఇందులో ఉన్నాయి. ఇందులో చెప్పిన విషయాలు అన్ని దేశాలు, కాలాలు, మానవజాతి ఉన్నంతవరకు నిలిచి ఉంటాయి.

వివాహం జరుగుతున్న సమయంలో వరుడు వధువుతో **"నీ హృదయం నాది కావాలి. నీ అభీష్టం నాది కావాలి. మన ఇద్దరి ఆలోచనలు, భావాలు ఒకటే కావాలి"** అంటున్నాడు.

ఈ మంత్రంలో వివాహం యొక్క ప్రయోజనము, గృహస్థాశ్రమధర్మము అంతా ఇందులో వివరించి చెబుతున్నారు.

కుటుంబంలో స్త్రీ మకుటం లేని మహారాణి. కుటుంబ గౌరవం, ప్రతిష్ట పెరగాలి అన్నా, తగ్గిపోవాలి అన్నా ఇల్లాలే బాధ్యురాలు. వరుడు వివాహసమయంలో వధువుతో అంటాడు. **"నువ్వు అత్తవారింట్లో అత్తమామలు, ఆడుబిడ్డలు, బావమరదులు, అందర్నీ ప్రేమ అభిమానంతో చక్కగా చూసుకుంటూ, ఇంటికి దీపంలాగా, ఇంటికి యజమానురాలుగా ఉండవలసింది"**

అత్తవారింట్లో స్త్రీ చేపట్టే బాధ్యత సామాన్యమైనది కాదు. కుటుంబంలో భార్యగా, కోడలుగా, వదినగా, మరదలుగా, తల్లిగా, ఎన్ని రకాలుగానో ఆవిడ తన బాధ్యతలు నిర్వహించాలి. అవన్నీ కూడా ఈ బ్రాహ్మణంలో చెప్పబడ్డాయి.

## 1. వివాహం

ఛాందోగ్య బ్రాహ్మణంలో రెండు ప్రపాఠకాలు ఉన్నాయి అన్నాం కదా ! మొదటి ప్రపాఠకంలో పూర్తిగా మనకందరికీ అంటే సమాజానికి కావలసిన విషయాలు వాటికి సంబంధించిన మంత్రాలు చెప్పబడుతున్నాయి. ముఖ్యంగా వివాహం, గర్భాదానం, సీమంతం, జాతకకర్మ, ఉపనయనం, సమావర్తనం, పశువృద్ధి. వీటికి సంబంధించిన మంత్రాలు చెప్పబడతాయి.

వివాహం అయిన తరువాత వధూవరుల జీవితం సుఖంగాసాగాలని, వాళ్ళు సుఖసంతోషాలతో వర్థిల్లాలని హోమం చేసేవారు. భగవంతుణ్ణి ప్రార్థించేవారు.

ఇంద్రాది దేవతలలో ముఖ్యుడు అగ్ని. అటువంటి అగ్ని ఇక్కడికి వచ్చి ఈ కన్యకి కలగబోయే సంతానానికి అపమృత్యువు రాకుండా చూడాలి. మృత్యుపాశం నుంచి ఆ పిల్లల్ని విడిపించాలి. అలా విడిపించటానికి వరుణుడు అంగీకరించాలి. తన కుమారుడికి వచ్చిన ఆపదవల్ల తల్లి దుఃఖించకుండా ఉండాలి. అంటే ఈమె పిల్లలకు ఎటువంటి పరిస్థితిలోను ఆపద రాకూడదు. గార్హపత్యాగ్ని ఈ అమ్మాయిని రక్షించి ఏ కష్టాలూ లేకుండా దీర్ఘజీవితాన్ని అనుగ్రహించాలి. ఈ అమ్మాయి ఎప్పుడూ భర్తతో కలిసిమెలిసి ఉంటూ మంచికొడుకులను కనాలి. ఈమె పుత్ర సౌఖ్యాన్ని అనుభవించాలి. ఆడపిల్లల పుట్టగానే ఆమెను సోముడు ఆదిత్యుడికిస్తాడని, ఆదిత్యుడు అగ్నికి సమర్పిస్తాడని, అగ్ని ఆ పిల్లను ధనపుత్ర సమేతంగా వరుడికి దానం చేస్తాడు.

**సామోఽదదద్గంధిర్వాయ గంధర్వోద దగ్నయే**
**రయించ పుత్రాంశ్చా దదగ్నిర్మహ్యా మథో ఇమామ్ ॥**

ఈ విషయాన్ని గతంలో ఋగ్వేదంలోను, యజుర్వేదం లోనూ కూడా చెప్పటం జరిగింది.

సప్తపది అంటే వివాహ సమయంలో వధూవరులు ఇద్దరూ కలిసి ఏడడుగులు వేసే సన్నివేశం. ఈ సందర్భంలో వరుడు వధువుతో "ఓ కన్యా! నువ్వు నాతో పాటుగా, నేనుచేసే అన్నికర్మలయందు సమానమైన అధికారాన్ని పొందుతూ ఏడడుగులు నా వెంట నడచి రావలసింది. నేను కూడా నీ సఖ్యాన్ని పొందుతాను. మనిద్దరం పరస్పర

స్నేహంతో ఒకరిని ఒకరు అర్థం చేసుకుని అనురాగంతో ఉందాం” అంటాడు. అలాగే వధువు యొక్క చేతిని పట్టుకుని అంటే పాణిగ్రహణం చేసి “ఓ కన్యకా! సౌభాగ్యం కోరి నేను నీ హస్తాన్ని పరిగ్రహిస్తున్నాను. (పాణిగ్రహణం చేస్తున్నాను) నీ భర్తనైన నాతో వృద్ధాప్యం పండేవరకు నీవు వుండాలి. భగుడు, ఆర్యముడు, సవిత మొదలైన దేవతలు గార్హపత్యాగ్నిని సేవించటం కోసం నిన్ను నాకు సమర్పించారు.”

ఓ కన్యామణీ ! ప్రసన్నమైన దృష్టితో నాకు ప్రీతి కలిగించు. పశువులకు శుభం కలిగించు. మంచి మనస్సుతోను తేజస్సుతోను వర్ధిల్లు. మంచి వీరులు, దీర్ఘాయుష్షు కలవారు. అయిన పుత్రులను ప్రసవించు. నువ్వు ఎప్పుడూ పంచ మహాయజ్ఞాలతో దేవతలకు తృప్తి కలిగించు. కుటుంబానికి సుఖసంతోషాలు కలిగించే నువ్వు పుత్రులు, మిత్రులు, భృత్యులు, బంధువులు అందరికీ, అలాగే పశువులు, పక్షులు అన్ని జీవులకు కూడా సుఖాన్ని కలిగించు.

ప్రజాపతి మనకి పుత్రులు, పౌత్రులు అందరినీ ప్రసాదించాలి. ఆర్యముడు వారందరికీ మంచి ఆయుష్షు ఇవ్వాలి. త్వరగా నువ్వు నా దగ్గరకు చేరుకో. అందరికీ సుఖము శాంతి కలిగించు.

వర్షాలు కురిపించే ఓ ఇంద్రుడా! ఈ నూతన వధువుకు మంచి పుత్రులు ఐశ్వర్యము ప్రసాదించు. ఈమెకు పదిమంది కుమారులు కావాలి. పదకొండవ కుమారుడు భర్త అయిన నేనే కావాలి.

నీవు హృదయపూర్వకంగా చేసే పనులు నేను చేసే లౌకిక వైదిక కర్మలలో కలిసి పోవాలి. నీ హృదయం, నా హృదయం ఒకటిగా కలసి ఉండాలి. నువు ఎప్పుడూ నా మాటను పాటించాలి. బృహస్పతి నా కోసమే నిన్ను వినియోగించు కోవాలి అని ప్రార్థిస్తున్నాడు.

మనం మొదట్లోనే చెప్పుకున్నాం ఈ బ్రాహ్మణంలో ఇతర

వేదాలలోని, బ్రాహ్మణాలలోని మంత్రాలు అనేకం ఉన్నాయి అని. ఇప్పుడు మనం చెప్పుకున్నవన్నీ వివాహ సూక్తంలోని మంత్రాలు. గతంలో పలుచోట్ల వీటన్నింటినీ మనం చెప్పుకోవటం జరిగింది.

ఆ రోజులో దేశం పెద్దది. జనాభా తక్కువ. అందుకని పదిమంది పుత్రసంతానం కావాలి అనేవారు. ఉండటానికి, తినటానికి ఏ మాత్రం లోటు లేదు. మన ఇప్పటి పరిస్థితి వేరు. అందుకే అవే మంత్రాలు వివాహంలో చెప్పినా నిజంగా అంతమంది సంతానం కావాలని మనం కోరటం లేదు. సంతానంతోపాటు ఆవులు, గుర్రాలు, పశువులు కూడా కావాలని కోరేవారు. పాడిపంట రవాణా సౌకర్యాలు అన్నీ కావాలని కోరుతున్నారు. వివాహం అయింది. గృహప్రవేశం అయింది. తరువాత శయ్యపైన కూర్చున్న వధువుని చూస్తూ....

ఓ కన్యకా ! ఈ ఇంట్లో నీవు ధైర్యస్థైర్యాలు కలిగి ఉండు. ఇక్కడే నాతో సుఖించు. నీకు బంధువర్గానికి నా మీద మనసు ప్రసన్నంగా ఉండాలి. నాతో అత్యంత అనురాగంతో మెలగవలసింది.

**ఇలా దంపతులు అందరూ ఒకే మాటతో, ఒకే బాటలో అడుగులో అడుగు వేసుకుంటూ నడిస్తే సుఖసంసారమే కాదు. దేశభవిత బంగారుమయమవుతుంది. గృహమే స్వర్గసీమ అవుతుంది.** అంత గొప్పదనం కనిపిస్తోంది ఈ బ్రాహ్మణంలో.

అప్పుడు, ఇప్పుడు ఎప్పుడూ కూడా మగపిల్లలంటేనే మక్కువ ఎక్కువ. ఇది కేవలం వంశాభివృద్ధి కోసం అందుకే భర్త అంటున్నాడు. ఓ భార్యామణీ! మిత్రావరుణులు, అశ్వనీదేవతలు, అగ్ని, వాయువు. వీరంతా పురుషులే. అలాగే నీ గర్భంలో ఉన్న బిడ్డకూడా పురుషుడే కావాలి అని

ఇక్కడ ఒక్కమాట మరచిపోకూడదు. అందరూ మగపిల్లలే కావాలి అని అడిగితే రేపు వీరి వివాహం సంగతి ఏమిటి? వరుణ్ణి ఎన్నుకునే అధికారం పూర్తిగా ఆడపిల్ల చేతికి వెళ్ళిపోతుంది. గతంలో మీరు పుచ్చుకున్న వరకట్నం ఇప్పుడు లేదు. గతంలోకి మల్లే నలుగురు పిల్లల్ని చూసి ఒకర్ని మేం ఎంచుకుంటాం అనే అధికారం గాని, హక్కుగాని, అవకాశం గాని ఇప్పుడు లేవు. **దీనికి కారణం గతంలో మీరు చేసిన భ్రూణహత్యలే అని గుర్తించండి. స్త్రీ పురుష సంతానంలో ఎవరూ ఎక్కువా కాదు ఎవరు తక్కువా కాదు. ఇద్దరూ సమానమే** ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకుని జనాభా సమతుల్యతను పాటించండి. దేశ సక్రమమైన పురోభివృద్ధికి తోడ్పండి. ఇప్పటికే **అన్ని రంగాలలోను ఆడపిల్లలే ముందుంటున్నారు అనే సంగతి గుర్తుంచు కోండి. బంగారు తల్లుల జీవితాలను చిదిమివేయకండి. స్త్రీని అవమానించకండి. కోడలిని సజీవ దహనం చెయ్యటానికి సహకరించకండి. మీకు కూడా ఒక కూతురు ఉన్నది అనే మాట గుర్తించి విజ్ఞతతో మెలగండి.** గతకాలంలో మన ప్రాంతంలో ఆడపిల్లలు దొరకక కేరళరాష్ట్రం పాలఘాట్ ప్రాంతంనుంచి పిల్లలను కొనితెచ్చుకుని పెళ్ళి చేసుకునే వారు. ఇక్కడికి వచ్చిన తరువాత వారికి పుట్టినిల్లు అనేది ప్రత్యేకంగా ఉండదు. ఎప్పుడూ వారి పుట్టింటికి వెళ్ళరు. వాళ్ళు ఇక్కడికి రారు. ఒక పశువుని కొనితెచ్చినట్లుగా పిల్లని తెచ్చుకునేవారు. జనాభాలో స్త్రీల శాతం తగ్గిపోతే మళ్ళీ అదే పరిస్థితి వస్తుంది. **చరిత్ర పునరావృతం కానివ్వకండి. జనాభాలో స్త్రీలశాతాన్ని తగ్గిపోనివ్వకండి.**

రెండవ ప్రపాఠకంలో పశుక్షేమం, స్వేచ్ఛామరణం, దారిద్ర్య నిర్మూలన, కీర్తి, శుభం, పుణ్యం, విషనివారణ ఇలా అనేక విషయాలకు సంబంధించిన మంత్రాలు ప్రార్థనలు ఉన్నాయి. క్రిమికీటకాల

నాశనానికి అనేక మంత్రాలు ఉన్నాయి.

**బ్రహ్మయొక్క రెండవ ముఖము ఉపస్థేంద్రియము. వివాహం చేసుకోబోయే కన్యను సురతో అభిషేకించాలి.**

భారతీయుల జీవన విధానంలో ముఖ్యమైనది సంసారం. దీనికి మూలం వివాహం. పూర్వకాలంలో ఏ వివాహ వ్యవస్థ మనదేశంలో ఉన్నదో అదే నేటికీ ఆచరణలో ఉంది. దేశం అభివృద్ధి కావాలంటే సంతానం కావాలి. మగవాడు ఒంటరిగా ఏపని అయినా ఎంత కష్టమైన పనైనా చేస్తాడు. కాని స్త్రీ సహకారం లేకుండా సంతానాన్ని మాత్రం పొందలేడు. సంతానం అనేది స్త్రీ పురుషుల సమాగమము వల్లనే కలుగుతుంది. పురుషుడు స్త్రీని స్వీకరించాలి. స్త్రీ పురుషుల సమాగమమే వివాహం. సంతానోత్పత్తి కామమూలకం, కామం సురామూలకం. కాబట్టి వివాహం చేసుకోబోయే కన్యను సురతో అభిషేకించాలి అని ఈ బ్రాహ్మణం చెబుతోంది. ఇక్కడ మనం జాగ్రత్తగా గుర్తించవలసిన విషయం ఒకటుంది. కన్యయొక్క ఉపస్థేంద్రియాన్ని **ఆనందేంద్రియము** అంటారు. అది బ్రహ్మదేవుని రెండవ ముఖము. బ్రహ్మదేవుడు ఒక ముఖంతో వేదాలు చదువుతూ రెండవ ముఖంతో సంతానోత్పత్తి చేస్తాడు. ఈ ఇంద్రియం ద్వారానే స్త్రీలు పురుషులను వశపరచుకుంటున్నారు. స్త్రీలు అధికారిణులుగా ప్రవర్తిస్తున్నారు. స్త్రీ యొక్క యోని అగ్నికుండము. పురుషుడు రేతస్సు అనే ఆజ్యాన్ని యోని అనే అగ్నికుండము నందుంచుతాడు. దానివల్లనే సంతానోత్పత్తి కలుగుతున్నది అంటోంది ఈ బ్రాహ్మణం.

కన్యను కొత్త బట్టలతో అలంకరించాలి. ఆ వస్త్రాలు స్త్రీ లే తయారు చేయాలి. వాటితో స్త్రీలే కన్యను అలంకరించాలి. కొత్తబట్టలు ధరించిన ఈ కన్య వంద సంవత్సరాలు జీవించాలని, కాంతిమతియై,

ధనవంతురాలై ఉండాలని వరుడు కోరతాడు.

ఈ రోజున కూడా వివాహం జరుగుతున్నప్పుడు ఈ బ్రాహ్మణంలోని మంత్రాలు చదువుతారు.

## 2. గుండ్రాయి దాస్తే పెళ్ళి అగిపోదు

గుండ్రాయిని దాచేస్తే పెళ్ళి ఆగిపోతుందా అనేది ఒక సామెత. దీన్నే కొంచెం మార్పుతో ఆగిపోదు అంటారు. పెళ్ళిలో మనకు కొన్ని ఆచారాలున్నాయి. అందులో ఒకటి గౌరీపూజ. గుండ్రాయికి పసుపు రాచి కుంకుమ పెట్టి, ఆ రాయినే గౌరీదేవిగా భావించి పీటల మీద కూచోటానికి ముందు వధువుతో ఈ పూజ చేయిస్తారు. ఎవరైనా ఈ వివాహం జరగకుండా చూడాలి అనే కోరికతో గుండ్రాయిని ఎత్తుకుని వెళ్ళిపోయినంత మాత్రంచేత పెళ్ళి ఆగిపోదు. ఇంకో గుండ్రాయిని తెచ్చి దాని స్థానంలో పెడతారు. అందుకే ఈ సామెత వచ్చింది.

## 3. సప్తపది

వివాహ సమయంలో వధూవరులతో ఏడు అడుగులు నడిపిస్తారు. దీన్నే సప్తపది అంటారు. 'ఏడడుగులు నడిస్తే వారు వీరౌతారు' అనేది సామెత. ఇలా నడిచిన తరువాత వధూవరులు భార్యాభర్తలై ఒకరి కోసం ఒకరు జీవిస్తారు. ఒకరిమీద ఒకరికి అన్యోనానురాగం కలుగుతుంది. అయితే ఏడు అడుగులు ఎందుకు?

మొదటి అడుగు – అన్నసమృద్ధి కోసం

రెండవ అడుగు – బలం కోసం

మూడవ అడుగు – యజ్ఞం కోసం

నాల్గవ అడుగు – సౌఖ్యం కోసం

ఐదవ అడుగు – పశుసంపద కోసం

ఆరవ అడుగు – గోవులు, ధనం కోసం

ఏడవ అడుగు – సోమయాగం కోసం

వరుడు ఈ వాక్యాలు చెబుతూ ఏడుఅడుగులు వధువుతో కలిసి నడుస్తాడు.

## 4. సీమంతం

గృహిణి గర్భవతి కావాలని, అగ్ని, ఇంద్రుడు, బృహస్పతిలాగా ఉండే కుమారుడే కలగాలని, ఒక మంత్రంలో కోరతారు. గర్భిణీ స్త్రీ సౌభాగ్యం కోసం సీమంతం చేస్తారు. అలా సీమంతం చేసే ఆచారం ఇప్పటికీ ఉంది. అప్పుడు చదివే మంత్రాలలో అన్నప్రాసన, నామకరణము మొదలైన మంత్రాలన్నీ ఇందులో ఉన్నాయి. మిత్రావరుణులు, అగ్ని, అశ్వనీదేవతలు బిడ్డకు మేధాశక్తి కలిగించాలనే ఆశీర్వచనం కూడా ఇందులో ఉంది. బిడ్డకు ఆయుష్యు కలగాలని కోరతారు.

## 5. ప్రార్థన

హిందూ ధర్మంలో ప్రకృతిలోని ప్రతిఅణువు పరమేశ్వర స్వరూపమే. అందుకే ప్రతివస్తువును, ప్రతిజీవిని దేవతా స్వరూపంగా పూజిస్తాం. పామును సుబ్రహ్మణ్యుడి ప్రతిరూపం. వివాహం కావాలన్నా, సంతానం కలగాలన్నా, నాగదోషం పోవాలన్నా సర్పాలను పూజించాలి. నాగులచవితి, సుబ్రహ్మణ్య షష్టి వంటి రోజులు ఇలాంటివే. అందుకే గృహస్థు సర్పాలను కూడా పూజించాలి.

“ఓ సర్పాల్లారా! మీకు పూజ చేస్తున్నాను. బలి సమర్పిస్తున్నాను. నమస్కరిస్తున్నాను. సప్తఋషులతో మీరు చేసుకున్న సంధిని మరచిపోకండి. మమ్మల్ని హింసించవద్దు. “ఓ రుద్రా! మమ్ములను, మా బిడ్డలను, పశువులను, హింసించవద్దు. మమ్మల్ని ఆపదల నుంచి కాపాడాడు. రక్షించు. ఎప్పుడూ నిన్ను పూజిస్తాం. వజ్రాయుధం ధరించిన వాడు, అతిబలవంతుడు, శత్రునాశకుడు అయిన ఇంద్రుడు మమ్ము రక్షించుగాక. కాలపురుషుడు మమ్ములను రక్షించు గాక. అంటూ అందరు దేవతలను ప్రార్థిస్తారు.

## 6.గోవధనిషేధము

హైందవ సమాజంలో ఆవుకు ఉన్నతమైన స్థానం ఉంది. ఇవాల్టికి కూడా గోవును పూజిస్తాం. గోవు తిరిగితే చాలు ఆ స్థలం పవిత్రమవుతుంది అని భావిస్తాం. అటువంటి ఆవుకు పసుపు రాచి, బొట్టుపెట్టి పూజ చేస్తాం. గృహప్రవేశం కావాలంటే మనకన్న ముందు ఇంట్లోకి ఆవుని పంపుతాం. వైతరణిని దాటిస్తుందని గోదానమిస్తాం. ఎట్టి పరిస్థితిలోను గోవధనిమాత్రం ఒప్పుకోం. దీనికి కారణం గోమయం, గోమూత్రం, ఆవు పాలు, పెరుగు అన్నీ ఓషధులే. ఈ గోవు రుద్రులకు తల్లి. వసువులకు కూతురు, ఆదిత్యులకు చెల్లెలు. అమృతానికి నాభి, ఇలా పవిత్రమైనది, ఏ పాపము ఎరుగని గోవుని వధించకండి. అని చెబుతోంది ఈ బ్రాహ్మణము.

**‘ఘృతేన వర్ధతే బుద్ధి’** ఆవు నెయ్యి తింటే బుద్ధి పెరుగుతుంది. అని శాస్త్రం చెబుతోంది. ఇక్కడ ఒక్క విషయం. **ఆవు అంటే మన నాటుఆవు. ఒంగోలుఆవు. అంతేకాని పాలకోసం పెంచే జర్సీఆవు, మాంసంతిని పాలిచ్చే అమెరికా ఆవు కాదని గ్రహించండి.** దానికి

గంగడోలు, మూపురము ఉండి తీరాలి. అవి లేకపోతే అది ఆవుకాదు. పాలిచ్చే ఒక పశువు అంతే.

## 7. ఆదిత్యుడు

ఈ బ్రాహ్మణంలో అనేకమంది దేవతలను స్తుతించటం జరిగింది. ప్రత్యేకంగా ఇంద్ర, అగ్ని, యమ, వరుణ, ఆదిత్యులను గురించి చేసిన స్తోత్రాలున్నాయి. వాటిలో ఆదిత్యుణ్ణి గురించి చేసిన సోత్రాలు ఎక్కువ. అందులో ఒక సూక్తం.

ఓ దేవా ! ముల్లోకాలకు ప్రభువైన వాడా ! మహత్తరమైన గుణాలు కలిగి ఉన్న ఓ దేవా! మా కోరికలన్నీ నీవు తీర్చవలసింది. యజ్ఞము సత్యంలో ప్రతిష్టించబడింది. భూతకాలం, భవిష్యత్కాలము కూడా సత్యంలోనే ప్రతిష్టించబడినాయి. సత్యము అంటే – ఆదిత్యుడు. ఆకాశంలో ఉన్న ఆదిత్యుడు ఆకాశ స్వరూపుడు. అలాటి ఆకాశం నాకు అన్నము, ఐశ్వర్యము కలిగించాలి. ఓ ఆదిత్యా ! నీవు ధనాగారం లాగా ధనంతో నిండి ఉన్నావు. ప్రసన్నుడవై నీ భక్తుల కోరికలు తీర్చవలసింది. ఓ దేవా ! అన్నింటికన్నా ఆకాశం గొప్పది. నువ్వు ఆకాశానికి ఆకాశానివి. నీ కాంతితో ఆకాశాన్ని కూడా ప్రకాశించేటట్లుగా చేస్తున్నావు. ఈ విషయం నేను తెలుసుకోగలిగాను. కాబట్టి చతుర్వేదాలకు ప్రభువైన ఓ ఆదిత్యా! నాకు అన్ని రకాల భోగాలు కలిగించు.

ఓ దేవా ! నన్ను రక్షించు. నాకు సుఖసంతోషాలు, భోగభాగ్యాలు కలిగించవలసినది. నా భార్యకు అనారోగ్యం కలగనీయకు

ఈ బ్రాహ్మణంలో ప్రత్యేకంగా వివాహానికి కావలసిన మంత్రాలు చెప్పారు అన్నాం కదా! దానిలో భాగంగా భర్త తన భార్యకు ఏ రకమైన

అనారోగ్యం కలగకుండా చూసుకుంటానని బాస చేస్తాడు. ఈ లోకంలో భూమి, ఆకాశం, పర్వతాలు, నదులు ఎంత కాలం ఉంటాయో, అంతకాలం మాదాంపత్యం సుఖంగాఉండాలి అని ప్రార్థిస్తాడు. అన్నము అనే పాశంతో భర్త తన భార్యను పూర్తిగా బంధించి వేస్తున్నాడు. భార్యాభర్తల శరీరాలువేరైనా హృదయాలుఒకటే. అనే విషయాన్ని చెబుతోంది ఈ బ్రాహ్మణం.

## 8. ఇంకా అనేకం

ఇంతవరకు చెప్పినవే కాక ఇంకా అనేక మంత్రాలున్నాయి ఈ బ్రాహ్మణంలో. శరీరాన్ని ఆవహించిన దుష్టగ్రహాలను వెళ్ళగొట్టటానికి మంత్రం. సుఖప్రయాణానికి మంత్రం ధనాన్ని ఆర్జించటానికి మంత్రం. కీర్తిప్రతిష్టలు గడించటానికి మంత్రం. ధనాన్ని వృద్ధి చెయ్యటానికి మంత్రం, సుఖ కామ మంత్రాలు, వాస్తు హోమమంత్రాలు, వశీకరణ మంత్రాలు, విశ్వకర్మదేవత పూజావిధానము, విషనివారణ మంత్రాలు, తినే పదార్థాలలో, త్రాగే పదార్థాలలో క్రిముల నాశనంకోసం మంత్రాలు. ఇంకా చెప్పటానికి వీలు కానన్ని మంత్రాలు  ఈ బ్రాహ్మణంలో ఉన్నాయి. నిత్యకర్మ చేసే పురోహితులకు, స్మార్తులకు ఈ బ్రాహ్మణం అత్యంత ఉపయుక్తము.

# 44. ఉపబ్రాహ్మణాలు

సామవేదానికి ప్రధానమైనవి మూడు బ్రాహ్మణాలు. అవి 1. తలవకార బ్రాహ్మణం 2. తాండ్యబ్రాహ్మణం 3. ఛాందోగ్య బ్రాహ్మణం. వీటిలో మొదటి రెండు యజ్ఞయాగాలను వివరిస్తాయి. మూడవది వివాహాది సంస్కారాలను వివరిస్తుంది. ఇవి కాక ఇంకా నాలుగు

బ్రాహ్మణాలున్నాయి. అవి యజ్ఞయాగాదులను వివరించవు. అందుకే వాటిని ఉపబ్రాహ్మణాలు అన్నారు. అవి

1. సామవిధ బ్రాహ్మణము
2. దేవతాధ్యాయ బ్రాహ్మణము
3. సంహితోపనిషద్బ్రాహ్మణము
4. వంశబ్రాహ్మణము

వీటిలో చెప్పిన ముఖ్య విషయాలు చూద్దాం.

## 1. నచ్చిన వాడికి పిల్లనివ్వటం ఎలా?

ఆడపిల్లను నచ్చిన వాడికి ఇచ్చి పెళ్ళి చెయ్యాలి. ఇలానే ప్రతితండ్రీ అనుకుంటాడు. కాని అది ఎలా సాధ్యపడుతుంది? దానికి సామవిధ బ్రాహ్మణం ఒక విధానం చెబుతోంది.

పిల్లతండ్రి ఉపవాసంచేసి అమావాస్యరోజు రాత్రిపూట నాలుగురోడ్ల కూడలిలో అమ్మాయిని కూచోబెట్టి మూడుసార్లు మంత్రంతో అభిషేకం చెయ్యాలి. ఇలా మూడు అమావాస్యలలో గనక చేసినట్లైతే ఆ పిల్లకు నచ్చిన వాడితో పెండ్లి అవుతుంది. ప్రస్తుత కాలంలో ఇది జరిగే పనికాదు.

అయితే ఒక చిన్న విషయం గుర్తుంచుకోండి. **పిల్లకు తల్లికి నచ్చిన వాడితో అని కాకుండా యోగ్యుడైన వాడితో మీ పిల్లకు వివాహం చెయ్యండి.** అప్పుడు ఆ పిల్ల జీవితం సుఖంగా ఉంటుంది.

## 2.అయోగ్యుడికి ఇచ్చిన విద్య వినాశహేతువు

విద్యను ఎవరికి చెప్పాలి? ఎవరికి చెప్పకూడదు? అనే

విషయాలున్నాయి. తీవ్రవాదులకు, వినాశశక్తులకు విద్యను చెప్పకూడదు. ప్రపంచంలో ఉన్న అతితీవ్రవాదులకు ఆటంబాంబు తయారీ విధానంచెప్పాం అనుకోండి. మన దేశాలు ఏవీ ప్రపంచ పటంలో కనపడవు. వాళ్ళతోసహా ప్రపంచమే ఉండదు. అందుకే అన్ని రకాల విద్యలు అందరికీ చెప్పరు. ఈ విషయంలో సంహితోపనిషద్బ్రాహ్మణము ఏం చెబుతోందో చూడండి.

పూర్వకాలంలో ఒకసారి విద్య వచ్చి బ్రాహ్మణుణ్ణి ప్రార్ధించిందట. "ఓ బ్రాహ్మణోత్తమా! నేను నీ దాన్ని నన్ను చక్కగా అభ్యసించి రక్షించు. అయోగ్యుడు, దురభిమాని అయిన శిష్యుడికి మాత్రం నన్ను ఇవ్వద్దు. నన్ను నీలోనే ధరించి కాపాడు. నీకు ఎప్పటికైనా మంచే చేస్తాను. యోగ్యుడైన శిష్యుడు దొరక్కపోతే గురువు ఆ విద్యను తనలోనే ఉంచుకుని, ఎవరికీ చెప్పకుండా అయినా చచ్చిపోవాలి గాని **అయోగ్యుడి చేతికి మాత్రం విద్యను ఇవ్వరాదు. వాడివల్ల లోకకళ్యాణం జరగదు సరికదా వినాశనం జరుగుతుంది.**

## 3. యజ్ఞాలు చెయ్యకపోయినా ఇబ్బంది లేదు

పూర్వకాలంలో దేవతలంతా ప్రజాపతి దగ్గరకు వెళ్ళి "మహాత్మా! స్వర్గాన్ని సాధించే మార్గం ఏమిటి?' అని అడిగారు. ఆ మాటలు విన్న ప్రజాపతి చిరునవ్వు నవ్వి "ఓ దేవతలారా! రకరకాల యజ్ఞాలు యాగాలు క్రతువులు ఉన్నాయి. వాటిని ఆచరిస్తే స్వర్గం మీముందుంటుంది." అన్నాడు. దేవతలు యజ్ఞయాగాలు చేసి స్వర్గం పొందారు.

అయితే దేవతల కన్న తక్కువ వాళ్ళు, యజ్ఞయాగాలు చెయ్యలేని వాళ్ళు ఉన్నారు. మరి వారి సంగతి ఏమిటి? వారందరూ ప్రజాపతి

దగ్గరకు పోయి మా సంగతి ఏమిటి? అన్నారు. అప్పుడు ప్రజాపతి స్వర్గం పొందటానికి యజ్ఞయాగాలు చెయ్యటం ఒక మార్గం. యజ్ఞయాగాలలో చెప్పిన సామాలను గానం చెయ్యటం. అలా చేసిన మీకు స్వర్గం వస్తుంది. అది కూడా చేయలేనివారు భగవధ్యానం చెయ్యండి'' అన్నాడు. ఈ విషయం సామవిధ బ్రాహ్మణంలో చెప్పబడింది.

## 4.తపస్సు అంటే ఏమిటి?

తపస్సు అనే మాట మనం తరచువాడేస్తుంటాం. కాని తపస్సు అంటే ఏమిటి? అనే విషయాన్ని సామవిధ బ్రాహ్మణంలో చెప్పారు.

**ఇంద్రియాలను అదుపులో ఉంచుకోవటానికి ముఖ్యసాధనం తపస్సు.** ఇది మూడు రకాలుగా ఉంటుంది. 1. కృచ్ఛం 2. అతికృచ్ఛం 3. కృచ్ఛాతికృచ్ఛం.

**1. కృచ్ఛం :** మూడురోజులపాటు పగలుమాత్రమే సాత్వికాహారం తింటూ రాత్రి ఉపవాసం ఉండాలి. తరువాత మూడు రోజులు రాత్రి మాత్రమేతిని పగలు ఉపవాసం ఉండాలి. ఇంకొక మూడు రోజులు ఎవరినీ ఏమీ అడగకుండా అయాచితంగా వచ్చిన వస్తువులే తినాలి. ఇంకొక మూడురోజులు అసలు ఏమి తినకుండా పూర్తిగా ఉపవాసం ఉండాలి. ఇలా మొత్తం 12 రోజులు చెయ్యాలి. దీనిలో కూడా సత్వరఫలితం రావాలంటే పగలంతా నుంచుని ఉండాలి. రాత్రిళ్ళు కూచుని ఉండాలి. నిద్రపోకూడదు. పడుకోకూడదు. అబద్ధం ఆడరాదు. ప్రతిరోజు సామాలను పారాయణ చెయ్యాలి. చివరకు దేవతలకు తర్పణలిచ్చి, వంట తానే చేసుకుని, భగవంతుడికి నివేదన చేసి తాను

తినాలి.

**2. అతికృచ్ఛం :** గతంలో చెప్పినట్లుగానే చేస్తూ ప్రతిరోజూ కుడిఅరచేతిలో పట్టినంత అన్న మాత్రమే తినాలి. అదికూడా రోజుకు ఒకసారి మాత్రమే.

**3. కృచ్ఛాతికృచ్ఛం :** ఇది ఇంకా కటోరమైనది. ఇందులో 12 రోజులు కేవలం నీరు త్రాగి జీవించాలి. ఇలా 12 రోజులూ చెయ్యాలి మిగిలిన నియమాలు గతంలో లాగానే పాటించాలి.

## 5.ప్రాయశ్చిత్తాలు

ఒక్కొక్కసారి శాస్త్రంలో నిషేధించిన పనులు చేస్తాం. అటువంటి సమయంలో ప్రాయశ్చిత్త విధులున్నాయి. అన్ని కర్మలకు ప్రాయశ్చిత్తం ఉంది. ఎవరినైనా నొప్పించటం, బూతులు తిట్టటం, గురువుని, తల్లి తండ్రి తనకన్న పెద్దవారు వీరిని దూషించటం, ఆవుని కాలితోతన్నటం, ఇలాంటి అనేక విషయాలకు ప్రాయశ్చిత్తాలు చెప్పింది ఈ బ్రాహ్మణం.

## 6.ముసలితనం రాకుండా

దుంపలు, పండ్లు తింటూ జింక తోలు ధరించి, మౌనం వహించి ఒక నెలపాటు అడవిలో ఉండాలి. పుష్యపూర్ణమిన సూర్యుణ్ణి పూజించాలి. ఇలా వరుసగా నాలుగు సంవత్సరాలు చేస్తే ముసలితనం రాదు. మృత్యువు కూడా రాదు.

## 7. గాయత్రీ మంత్రము

దేవతాధ్యయన బ్రాహ్మణంలోని రెండవ ఖండంలో గాయత్రి మంత్రం చెప్పారు. గాయత్రి మంత్రం వివరాలు కావాలి అంటే నేను

ఉపన్యాసం చెప్పిన సి.డి. వినండి. ఓ దేవతా ! నాకు మంచి బుద్ధిని ప్రసాదించు. నాతో పాటుగా మా చుట్టూ ఉన్న వారికి, **ఈ సమాజానికి అంతటికీ మంచిబుద్ధిని ప్రసాదించవలసింది.** ఇది మంత్రార్థం. ఇందులోని నాల్గవ ఖండంలో పూర్తిగా సావిత్రీదేవత వర్ణించబడింది.

## 8.విద్యనుపదేశించటానికి అర్హతలు

విద్యను చెప్పాలి అంటే శిష్యుడికి ఏ లక్షణాలుండాలి ? గురువు ఎలా ఉండాలి? విద్యా నియమాలు, అధ్యయన తీరులు. అన్నీ సంహితోపనిషద్బ్రాహ్మణంలో చెప్పబడ్డాయి. శిష్యుణ్ణి అతడు **విద్యకు అర్హుడో కాదో పరీక్షించిన తరువాతనే విద్యని చెప్పాలి; లేకపోతే ప్రమాదం.**

## 9. సంహిత-రకాలు

సంహిత అంటే మంత్రభాగము. ఇది మూడురకాలు అని చెబుతోంది సంహితోపనిషద్బ్రాహ్మణము అవి

1. దేవసంహిత–ఇతరులకు వినిపించకుండా చేసే గానం
2. అసుర సంహిత–అతితీవ్రస్థాయిలో పెద్దగా చేసే గానం
3. ఋషి సంహిత–సమయాన్ని బట్టి మెల్లగా మంద్రంగా నడిచేది

దేవ సంహితవల్ల – స్వర్గ సుఖాలు వస్తాయి

అసుర సంహితవల్ల – పశు సంపద కలుగుతుంది

ఋషి సంహితవల్ల – మంచి తేజస్సునిస్తుంది

ఈ రకంగా ఉపబ్రాహ్మణాలలో అనేక విషయాలు చెప్పబడ్డాయి.

# 45. గోపథ బ్రాహ్మణము

అథర్వణ వేదానికి సంబంధించినది గోపథ బ్రాహ్మణము. ఇందులో యజ్ఞయాగాలతోపాటుగా ఇతర విషయాలెన్నింటినో ప్రతిపాదించటం జరిగింది. నిజానికి అథర్వసంహితకు దీనికి ఎలాంటి సంబంధము లేకపోయినా, అథర్వ సంహితకు వ్యాఖ్యాన రూపమైన గ్రంథమింకొకటి లేకపోవటం వల్ల గోపథబ్రాహ్మణం అథర్వ వేదానికి సంబంధించినది అని చెప్పబడుతోంది. అథర్వణ వేదంలో నిష్ణాతుడు యజ్ఞంలో బ్రహ్మగా ఉండాలని చెబుతోంది ఈ బ్రాహ్మణం. ఒకప్పుడు గోపథ బ్రాహ్మణంలో నూరు ప్రపాఠకాలు ఉండేవట. కాని ఇప్పుడు మాత్రం రెండు కాండలు, పదకొండు ప్రపాఠకాలు, రెండువందల యాభైఎనిమిది కండికలు ఉన్నాయి. దీనికి ఎవరూ వ్యాఖ్యానం గాని, భాష్యంగాని వ్రాయలా. గోపథ బ్రాహ్మణంలో యాగప్రస్తావన ఉంది. కాని దానికి పెద్దగాప్రాచుర్యం లేదు. ఎందుకని అంటే ఇందులోని విషయాలన్నీ ఇతర బ్రాహ్మణాలకు అనువాదమే. అందుకే ఎవరూ దీనికి వ్యాఖ్యకాని, భాష్యంకాని వ్రాయలేదు.

పురుషుడు, సంవత్సరము రెండూ ఒకటే అని పోల్చి చెబుతోంది ఈ బ్రాహ్మణం.

పురుషుడు ఒక్కడు - సంవత్సరం ఒకటి

పురుషునిలో ప్రాణాలు రెండు విధాలు - సంవత్సరానికి అయనాలు రెండు.

పురుషునిలో కాళ్ళు -2, చేతులు - 2, వేళ్ళు - 20 వెరసి 24. సంవత్సరానికి పక్షాలు - 24.

ఈ రకంగా చూస్తే సంవత్సరమే పురుషుడైనాడు.

**హాయనాత్మా మహాదేవః ప్రజాపతి రితిస్మృతిః ॥**

## 1. శరీర నిర్మాణం

మానవశరీరం ఏరకంగా నిర్మించబడింది? అనే విషయం మీద గోపథ బ్రాహ్మణం ఏమంటోందో చూడండి. మానవులకు తలపైన, తరువాత గడ్డాలు మీసాలు మొ॥ భాగాల్లో వెంట్రుకలు ఎందుకు వస్తాయి? వెంట్రుకలు నెరవటం తలనుంచే ఎందుకు ప్రారంభమవుతుంది? మానవుడు పళ్లు లేకుండా ఎందుకు పుడతాడు? క్రింది పళ్లు ముందు ఎందుకు వస్తాయి. ఎనిమిది లేదా పదవ ఏట ఎందుకు ఊడిపోతున్నాయి? ముందు చిన్న పళ్ళు వచ్చి పెద పెద్ద దంతాలు చివరికి ఎందుకు వస్తున్నాయి? మగవారికే గడ్డాలు మీసాలు ఎందుకు వస్తాయి? ఆడవారు నాజుగ్గా అందంగా ఎందుకుంటారు. వారిఎముకలు గట్టిగా ఎందుకు ఉంటాయి? ఇటువంటి ప్రశ్నలన్నీ వాళ్ళకి ఆ రోజే వచ్చాయి. అంటే శరీర నిర్మాణం గురించి వారికి ఆ రోజుల్లోనే అవగాహన ఉన్నది అనే విషయం తెలుస్తున్నది.

## 2. ప్రపంచసృష్టి

సృష్టిని గురించి అనేకచోట్ల అనేకరకాలుగా ఉంది. కాని గోపథ బ్రాహ్మణంలో ఏ వేదంలోనూ లేనంత విస్తారంగా చెప్పబడింది.

సృష్టికి ముందు పరబ్రహ్మ తానొక్కడే ఉండేవాడు. తనవంటివాడే ఇంకొకడు కావాలి అనుకున్నాడు. తపస్సు చేశాడు. శరీరంలో వేడిని పుట్టించి ఫాలభాగం నుంచి చెమటను కార్చాడు. ఆ స్వేదానికే సువేదం అంటే జ్ఞానం అని పేరు. దీనివల్ల ఆయనకు అంతా గోచరమవుతుంది.

అంతా అర్థమవుతుంది. మరింత తపస్సు చేయటం వల్ల ఆయన రోమకూపాల నుంచి స్వేదంధారలుగా వచ్చింది. ఆ స్వేద ధారలతో ప్రపంచాన్నంతటినీ సృష్టించి, ధరించి, పాలించాలి అనుకున్నాడు. వెంటనే స్వేదధారలలో తొంగి చూశాడు. అందులో తన ప్రతిబింబం కనిపించింది. ఆ సమయంలో ఆయునరేతస్సు ఆ స్వేదంలో పడింది. ఆ చెమటలో వేడి పుట్టించాడు. దాన్ని రెండు భాగాలుగా విభజించాడు. దానిలో ఒకటి త్రాగటానికివీలులేని లవణమయమైన సముద్రం. ఇంకొకటి త్రాగటానికి వీలుగాఉండే తియ్యనినీరు. పరబ్రహ్మ ఆ తియ్యని నీటిలో వేడి పుట్టించాడు. అందులో ఇంతకుముందే పడిన పరమేశ్వరుడి రేతస్సు ఎండిపోయి భృగుమహర్షి జన్మించాడు. అప్పుడు వెంటనే పరమేశ్వరుడు అదృశ్యమైనాడు.

భృగువుకు పరబ్రహ్మ కనపడలేదు. అన్నిదిక్కులకు బయలుదేరాడు భృగువు. ఆయన ప్రయత్నాలు ఫలించలేదు. తూర్పుదిక్కులో వాయువు అని, దక్షిణ దిక్కులో మాతరిశ్వుడని, పశ్చిమదిక్కులో పవమానం అని, ఉత్తరదిక్కులో వాతం అని. అశరీరవాణి పలికింది. అలాపలికి నీటిలో క్రిందికిచూడు అన్నది. చూశాడు భృగువు. క్రిందకు చూడటం వల్ల నోటినుంచి ఒక ఋషి పుట్టాడు. అతడే అధర్వుడు. ఆయన దేహం బ్రహ్మదేహంలాగా కాంతివంతంగా ఉంది. ఆయనకే సృష్టికార్యం జరిపే ప్రజాపతి అని పేరు. పరమేశ్వరుడు అధర్వణ ఋషి దేహాన్ని వెడెక్కించాడు. దాంతో ఆయన దేహంనుంచి పదిమంది ఋషులు పుట్టారు. వీరినుంచి మళ్ళీ పదిమంది అధర్వఋషులు పుట్టారు. ఇప్పుడు అధర్వణుడు, అధర్వ ఋషులు దర్శించిన మంత్రాలకే అధర్వమంత్రాలు అని పేరు. వాటినుంచే ఓంకారం ఉద్భవించింది.

ఆ తరువాత పరబ్రహ్మనుంచి భూమి, అంతరిక్షం, స్వర్గం అనే

మూడు లోకాలు ఆవిర్భవించినాయి. ఆయన తనపాదం నుంచి భూమిని, ఉదరంనుంచి అంతరిక్షాన్ని, తలనుంచి స్వర్గాన్ని సృష్టించాడు. అదే విధంగా భూమి నుంచి – అగ్ని, అంతరిక్షం నుంచి వాయువు, స్వర్గం నుంచి ఆదిత్యుణ్ణి సృష్టించాడు. ఈ ముగ్గురు నుంచే ముల్లోకాలు వచ్చినాయి. అగ్నివల్ల ఋగ్వేదం, వాయువు నుంచి యజుర్వేదం. ఆదిత్యుని నుంచి సామవేదం వచ్చాయి. ఋగ్వేదం నుంచి భూః అనే వాహృతి, యజుర్వేదం నుంచి 'భువః' అనే వ్యాహృతి సామవేదం నుంచి 'స్వః' అనే వ్యాహృతి వచ్చినాయి.

తరువాత ఉప్పునీటినుంచి సముద్రం పుట్టింది. సముద్రజలాలు అన్ని దిక్కులకు ప్రవహించి తమకు అధిపతిగా ఒక దేవుని కోరుకున్నాయి. ఆ విధంగా వరింపబడిన వాడే వరుణుడు. ఇప్పుడు వరుణుడు సముద్రాలకు అధిదేవత. ఆ వరుణుడి నుంచి పుట్టినవాడే 'ముచ్యుడు' అతడికే 'మృత్యువు' అని పేరు. ఇతని దేహం నుంచి రసాలుకారినాయి. ఈ రసము నుంచి పుట్టిన వారే ఆంగిరసులు అనబడ్డారు. అంగముల నుంచి పుట్టారు కాబట్టి ఆంగీరసులు అనబడ్డారు.

ఈ రకంగా అథర్వ ఆంగీరసులు, భృగ్వాంగిరసులు జన్మించారు. అంగిరసులు దర్శించిన వేదానికే అంగీరసవేదము అని పేరు. దీన్నుంచి 'జనత్' అనే వ్యాహృతి పుట్టింది. ఇప్పుడు పరబ్రహ్మ

| | | |
|---|---|---|
| తూర్పు దిక్కునుంచి | – | సర్పవేదాన్ని |
| దక్షిణ దిక్కునుంచి | – | పిశాచ వేదాన్ని |
| పశ్చిమ దిక్కునుంచి | – | అసుర వేదాన్ని |
| ఉత్తర దిక్కు నుంచి | – | ఇతిహాస వేదాన్ని |

ఊర్ధ్వ అథో దిక్కుల నుంచి – పురాణ వేదాన్ని సృష్టించాడు.

సర్పవేదం నుంచి – పృథిత్

పిశాచ వేదం నుంచి – కరత్

అసుర వేదం నుంచి – గుహన్

ఇతిహాస వేదం నుంచి – మహత్

పురాణవేదం నుంచి – తత్ అనే వ్యాహృతులను సృష్టించాడు. తరువాత పరబ్రహ్మ ఒక యజ్ఞాన్ని చేశాడు. అందులో

అగ్ని – హోత

వాయువు – అధ్వర్యుడు

సూర్యుడు – ఉద్గాత

చంద్రుడు – బ్రహ్మ

పర్జన్యుడు – సదుస్యుడు.

ఓషధులు, వృక్షాలు – చమస్సులు (చెక్క గరిటలెలు)

విశ్వే దేవతలు – హోతలు,

అథర్వాంగీరసులు – గోప్తలుగాను (యజ్ఞంలో జరిగే లోపాలు సవరించే వారు) చేశాడు అంటూ అథర్వవేదం పుట్టుక, దాని ప్రాముఖ్యత అథర్వాంగిరసుల ప్రాశస్త్యం అంతా గోపథబ్రాహ్మణంలో వివరించారు.

## 3.ప్రణవం

అథర్వణ వేదంలో అనేక విషయాలను వివరించటం జరిగింది. అందులో ప్రణవం ఒకటి.

పరబ్రహ్మ బ్రహ్మదేవుణ్ణి ఒక తామరాకుమీద సృష్టించాడు. తన కోరికలు, లోకాలు, దేవతలు, వేదాలు, యజ్ఞాలు, శబ్దాలు, భూతాలు, స్థావర జంగమాలు, వీటన్నింటినీ ఏ రకంగా ఏకాక్షరం వల్ల తెలుసుకోగలుగుతాను అని ఆలోచించి, బ్రహ్మచర్యాన్ని పాటించి, చివరకు 'ఓం' అనే అక్షరాన్ని కనుక్కున్నాడు. ఓంకారంలో రెండు వర్ణాలు, నాలుగు మాత్రలు ఉన్నాయి. ఇది సర్వవ్యాపి, ఏ మాత్రము మార్పులు లేనిది, బ్రాహ్మీమయము. దీనినుంచే కోరిన వస్తువులు, సమస్త లోకాలు, దేవతలు, శబ్దాలు, యజ్ఞాలు, స్థావరాలు, జంగమాలు అన్నీ పుట్టినాయి.

దీని మొదటి అక్షరం నుంచి స్వర్గం వచ్చింది. రెండవ అక్షరం నుంచి తేజస్సు, వెలుగు పుట్టినాయి. ఓంకారంలోని మొదటి స్వరమాత్ర నుంచి భూమి, ఓషధులు, అగ్ని, వృక్షాలు, భూః అనే వ్యాహృతి, గాయత్రి ఛందస్సు, మూడు విధాలైన స్తోమాలు, వసంత ఋతువు, తూర్పు దిక్కు, వాక్కు, నాలుక సృష్టించబడ్డాయి.

దాని రెండవ స్వరమాత్ర నుంచి అంతరిక్షం, వాయువు, యజుర్వేదము. భువః అనే వ్యాహృతి, త్రిష్టుప్ ఛందస్సు, పదిహేను విధాలైన స్తోమాలు, పశ్చిమ దిక్కు, గ్రీష్మఋతువు, ఉశ్వాసనిశ్వాసల కుపయోగించే అవయవాలు నిర్మించబడ్డాయి. మూడవ స్వరమాత్ర నుంచి స్వర్గం, సూర్యుడు, సామవేదం, 'స్వః' అనే వాహృతి, జగతీఛందస్సు, ఉత్తరదిక్కు వర్ష ఋతువు, కళ్లు మొదలైనవి సృష్టించబడినాయి. దాని నాల్గవమాత్ర నుంచి నీరు, చంద్రుడు, అధర్వవేదము. అంగీరసులు, నక్షత్రాలు, అనుష్టుప్ ఛందస్సు, దక్షిణ దిక్కు, శరదృతువు, మనస్సు పుట్టినాయి. దాని మకార మాత్ర నుంచి ఇతిహాసాలు, పురాణాలు, వాక్కు ఛందోయుక్తమైన భాష, ఉపనిషత్తులు,

పృథత్, కరత్, గుహాన్, మహత్, తత్, శం, ఓం అనే వ్యాహృతులు, నృత్యము, గానము, చైత్ర రథ దేవతలు. తేజస్సు, వెలుతురు, ఊర్ధ్వదిక్కు, అథోదిక్కు, హేమంత ఋతువు సృష్టించబడినాయి.

ఈ ఓంకారం సహాయంతోనే దేవతలు అసురులను జయించారు. ఓంకారమే అన్ని వేదాలకు మూలం. ఓంకారమే ప్రపంచానికి ఆధారం. ఈ రకంగా దిక్కులు, ఛందస్సు, పంచభూతాలు, వేదాలు, ఋతువులు, సూర్యచంద్రులు, పురాణాలు, ఇతిహాసాలు, అన్నీ ఓంకారము నుంచే పుట్టాయి అని చెబుతోంది గోపథ బ్రాహ్మణం.

## 4. గాయత్రీ మంత్రం

మంత్రాలలో గాయత్రీ మంత్రాన్ని మించినది లేదు. ఇది మూడు పాదాలలో ఉంటుంది. పాదానికి ఎనిమిది అక్షరాలుంటాయి. మొత్తం $3\times8 = 24$ అక్షరాలు. అయితే పూర్ణగాయత్రికి నాలుగు పాదాలుంటాయి. అందులో $4\times8 = 32$ అక్షరాలుంటాయి.

మైత్రేయవంశంలో పుట్టినవాడు గ్లావుడు. ఇతడు మౌద్గల్యుడికి వేదాలు, వాటి అర్థం తెలియవు అని నిందించాడు. అందుకు మౌద్గల్యుడు సకల వేదసారం, సకలాధారమైన గాయత్రీ మంత్రం నీకు తెలుసా? అని శిష్యుడి ద్వారా ప్రశ్నించాడు. ఆ తత్త్వం తనకు తెలియదని, తూలనాడి నందుకు క్షమించమని ప్రార్థించి గాయత్రీ మంత్ర తత్త్వాన్ని ఉపదేశించమని ప్రార్థించాడు గ్లావుడు. మౌద్గల్యుడు గాయత్రి తత్త్వాన్ని వివరించాడు. వేదాలు, ఛందస్సు, సవిత యొక్క శ్రేష్ఠమైన భాగాలు. అన్నం ఆయన యొక్క ప్రకాశం. ధియః అంటే విధులు లేక కర్మలు. వీటివల్లనే ఆయన లోకమంతా సంచరిస్తాడు. మనస్సు-సవిత, వాక్కు-సావిత్రి. మనస్సు ఉన్నచోట వాక్కుంటుంది.

వాక్కున్న చోట మనస్సుంటుంది. అగ్నియే సావిత్రి, పృథివి సావిత్రి. అగ్ని ఆదిత్యుడు. వేదాలు ఛందస్సు, యజ్ఞం, దక్షిణ ఒకటేమిటి సమస్త ప్రపంచం సావిత్రి. ఈ తత్వాన్ని తెలుసుకున్నవాడు సర్వపాపాల నుంచి విముక్తుడౌతాడు. సుఖసంతోషాలు పొందుతాడు అంటూ గాయత్రీ మంత్రాన్ని గురించి వివరించింది గోపథ బ్రాహ్మణము.

## 5. ఋక్-సామాల సంబంధం

మొదట్లో ఋక్, సామము రెండు మాత్రమే ఉండేవి. ఋక్కుకు 'సా' అని, సామకు 'అమ' అని పేరు. స్త్రీ లింగంలో ఉన్న ఋక్కు పుంలింగంలో ఉన్న సామతో జీవరాసులను అభివృద్ధి చేయటానికి మనం కలుసుకుందాం అని చెప్పింది. కాని సామ అందుకు ఒప్పుకోలేదు. ఋక్ కన్న తనే గొప్ప అన్నది. దానితో కోపించిన ఋక్ తానే రెండు భాగాలుగా విడిపోయి మొదటి భాగం, రెండవ భాగంతో మాట్లాడింది. కాని అది పలకలేదు. అప్పుడు తాను మూడు భాగాలుగా విడిపోయి సామను తిరిగి పలకరించింది. కాబట్టి సామ మూడు ఋక్కులచేత కీర్తించబడుతూ ఉన్నది. ఈ సంభాషణ పూర్తిగా 'సా' 'మ'ల మధ్య జరిగింది. కాబట్టి దీనినుంచే సామవేదం పుట్టింది. ఈ విధంగా ఋక్ సామాల మధ్య సంబంధాన్ని వివరించింది గోపథ బ్రాహ్మణము.

## 6. గోపథము

పూర్వకాలంలో 'ఫణి' అనే కొండజాతి వాళ్ళు బ్రాహ్మణుల ఆవులను ఎత్తుకుపోయి దూరంగా ఎక్కడో ఒక కొండగుహలో దాచేశారు. ఇంద్రుని యొక్క కుక్క సరమ ఆ ఆవులను వెతుక్కుంటూ వెళ్ళి చివరకు వాటిని చేరుతుంది. ఈ విషయం ఇంద్రుడికి తెలుస్తుంది.

అప్పుడు ఇంద్రుడు వారిమీద దండయాత్ర చేసి ఆవులను విడిపించాడు.

ఈ పనిలో అంగీరసులు ఇంద్రుడికి సాయపడ్డారు. ఈ విధంగా గోపథము అంటే – గోవుల యొక్క ఉనికిని కనుక్కున్నారు. కాబట్టి దీన్ని గోపథ బ్రాహ్మణము అన్నారు. గోవుల ఉనికిని అథర్వ ఆంగీరసులు తెలుసుకున్నారు కాబట్టి ఇది అథర్వ ఆంగీరస బ్రాహ్మణమైంది.

ఈ కథని ఋక్సంహితలో 'ఆడపిల్లకి ఆస్తిలో హక్కు' అని చెప్పుకున్నాం చూడండి.

## 7. మర్మ గర్భ వివరణలు సుభాషితాలు

ఈ బ్రాహ్మణంలో కొన్ని విషయాలు మర్మగర్భంగా వివరించబడ్డాయి. ఉదాహరణకి 'స్వేదము' సువేదము అనే పదమే స్వేదమయింది అంటున్నారు. సువేదము అంటే బాగా చదవటం. వేదాన్ని బాగా చెమట పట్టేటట్లుగా కష్టపడి చదవాలి. అందుకే సువేద అనే పదం స్వేదమయింది.

**కుంతాప సూక్తం :** అని ఒక సూక్త ఉంది. ఇక్కడ 'కు' అంటే చెడు. తాప అంటే తపింపచేయునది. చెడును తపింపచేసేది. చెడును నాశనం చేసే సూక్తం. అందుకే దీన్ని **'కుంతాప సూక్తం'** అన్నారు.

అలాగే కొన్ని సుభాషితాలు కూడా చెప్పబడ్డాయి. దేవతలు ప్రత్యక్షద్వేషులు. పరోక్ష ప్రియులు. యజ్ఞకర్మలో ఋత్విక్కులు అసమర్థులు గాను, బ్రహ్మచర్య దీక్షలేని వారు గాను, రాగద్వేషాలు గలవారుగాను ఉంటే ఆ యజ్ఞం నాశనమవుతుంది. ఋత్విక్కులు సదాచార సంపన్నులుగా ఉండాలన్న మాట. ఇక్కడ ఇంకొక గొప్ప విషయం చెప్పబడింది. చూడండి. తల్లితండ్రులు చిన్నతనంలో

కుమారుణ్ణి పోషిస్తారు. కుమారుడు పెద్దవాడై తల్లితండ్రులను పోషించాలి. ఈ విషయం తెలిస్తే ఇదే నిజమైన యజ్ఞం. తల్లితండ్రులకు సేవే నిజమైన శ్రాద్ధం, తర్పణ కూడా. **బ్రతికుండగా సరిగా చూడకుండా మరణించిన తరువాత శ్రాద్ధాదులు చేసినా ఉపయోగం ఏమీ లేదు.** జరిగిపోయిన కాలం పరిమితం. రాబోయే కాలం అపరిమితం. **గతంలో తప్పు చేస్తే క్రుంగిపోనవసరం లేదు. భవిష్యత్తులో మంచిచేసి ఆ చెడును పోగొట్టుకోవచ్చును.**

## 8. ఉద్దాలకుడు

కేవలము శాస్త్రాలు చదవటం కాదు. శాస్త్ర చర్చలు చేసి అందులోని విషయాన్ని అందరికీ తెలియచెయ్యాలి. లేకపోతే చదివిన చదువుకు సాఫల్యత ఉండదు. దానికి ఉదాహరణగానే ఈ ఉపాఖ్యానాన్ని చెబుతోంది గోపథ బ్రాహ్మణం.

అరుణుడు అనే ఆయన ఒక మహర్షి. ఆయన కుమారుడు ఉద్దాలకుడు. చాలా గొప్ప పండితుడు అని పేరు పొందాడు కూడా. అతని మెడలో ఒక రత్నాలహారము ఉంది. శాస్త్రచర్చలలో నన్ను జయించిన వారికి ఈహారాన్ని బహుమతిగా ఇస్తాను అన్నాడు. అలా అని దేశాటనకు బయలుదేరాడు. త్రోవలో అనేకమంది పండితులు ఎదురయ్యారు. కాని ఉద్దాలకుణ్ణి ఎదిరించి నిలిచిన వారు లేరు. చివరికి ఉత్తరదేశంలో పండితులు కొందరు శౌనకుణ్ణి (స్వద్రేరాయణుడు) నాయకుడిగా చేసుకుని ఉద్దాలకుడితో తలపడ్డారు. శాస్త్రచర్చలు చాలా రోజులు జరిగినాయి. శౌనకుడు ఉద్దాలకుని ఓడించలేదు కాని దీటుగా నిలిచాడు. దాంతో ఆనందించిన ఉద్దాలకుడు తన మెడలోని హారాన్ని శౌనకుడి మెడలో వేసి గౌరవించాడు. కేవలం శాస్త్రం చదువుకోవటమే

కాదు. మనకి తెలిసిన విషయం పదిమందికీ తెలియచెయ్యాలి. అలా జరగాలంటే ఆ రోజున శాస్త్రచర్చలు చేసే వారు. ఈ రోజున అనేక పద్ధతులున్నాయి. ఏ పద్ధతి అవలంభించినా **మనకి తెలిసిన విషయం పదిమందికి తెలియచెయ్యటమే పరమావధిగా ఉండాలి. ఆ ఉద్దేశ్యంతోనే, వేదాలను గురించి అందరికీ తెలియజెయ్యాలనే ఉద్దేశ్యంతోనే "చతుర్వేద భాష్యము" అనే పేరుతో ఈ గ్రంథం వ్రాయటం కూడా జరుగుతోంది. పుస్తకం చదవలేనివారి కోసం, ఉపన్యాసాలుగా చెప్పి సి.డి. కూడా ఇవ్వబడుతున్నది.**

## 9. ప్రేది-ఉద్దాలకుడు

పూర్వకాలంలో కౌశాంబీ నగరంలో (పాట్నా) 'ప్రేది' అనే పేరుగల పండితుడు ఒకడుండేవాడు. ఆయన శిష్యుడే ఉద్దాలకుడు. ఒకసారి గురువుగారు శిష్యుడితో 'కుమారా నీ తండ్రి సంవత్సర యజ్ఞం పూర్తి చెయ్యటానికి ఎన్ని రోజులు కావాలి?' అన్నాడు. దానికి ఉద్దాలకుడు పది అని సమాధానం ఇచ్చాడు. ఎందుకంటే ప్రధానమైన విరాట్‌ఛందస్సుకు అక్షరాలు పది. గురువుగారు మళ్ళీ అడిగాడు. ఈ సారి తొమ్మిది అన్నాడు శిష్యుడు, ఇక్కడ తొమ్మిది అంటే ప్రాణాలు తొమ్మిది. ప్రాణము అంటే గాలి. గాలి ప్రసరించే మార్గాలు శరీరంలో తొమ్మిది. అవే నవరంధ్రాలు. మళ్ళీ అడిగారు గురువుగారు. ఈసారి ఎనిమిది అన్నాడు శిష్యుడు, గాయత్రి అష్టాక్షరి. ఒక పాదానికి ఎనిమిది చొప్పున అక్షరాలుంటాయి. మళ్ళీ అడిగాడు గురువుగారు. ఈ సారి ఏడు అని జవాబిచ్చాడు. ముఖ్యమైన ఛందస్సులు ఏడు, ఇలా సంఖ్య తగ్గుతూ వస్తోంది. చివరకు రెండు అన్నాడు శిష్యుడు. మషికి రెండు పాదాలున్నాయి. పాదము అంటే కాలు అని కాదు. మార్గము అని అర్థం. అవే జ్ఞాన, కర్మ మార్గాలు. మళ్ళీ అడిగాడు గురువు గారు.

ఈసారి ఒకటి అన్నాడు శిష్యుడు. ఒక సంవత్సరము పూర్తిగా అని అర్థం. ఈ రకంగా సాగుతుంది ఈ ఉపాఖ్యానం **గోపథ బ్రాహ్మణంలో**

## 10. దక్షయజ్ఞం

జ్ఞాని అయినవాడు ఏ పనిలోనూ కూడా పరమాత్మ ఉనికిని మరువకూడదు. ఈ జగత్తంతా పరమాత్మమయం. జగత్తే పరమాత్మ, పరమాత్మే జగత్తు. ఈ విషయాన్ని వివరిస్తోంది **గోపథ బ్రాహ్మణం.**

దక్షయజ్ఞం. ఈ కథ అందరికీ తెలుసు. తన అల్లుడైన రుద్రుణ్ణి అవమానించటానికే ఈ యజ్ఞం ప్రారంభించాడు రుద్రుడు. యజ్ఞంలో రుద్రుడికి భాగం లేదు. దాంతో కోపించిన రుద్రుడు యజ్ఞాన్ని నాశనం చేశాడు. యజ్ఞంలో మిగిలిన అన్నశేషాన్ని చూడగానే భృగువుకి కళ్ళు పోయినాయి. దాన్ని సవిత్ృ దేవత చేతులతో తీసుకోబోయింది. ఆయన చేతులు పోయినాయి, బంగారు చేతులు అంటించారు. అందుకే ఆయన హిరణ్యపాణి అయినాడు. తరువాత సూర్యుడు దాన్ని తినబోయాడు. అతడికి పళ్ళు ఊడిపోయినాయి. సూర్యుడికి పళ్ళు లేవు. అందుకే సూర్యుడికి మెత్తటి పదార్థాలు నివేదన చెయ్యాలి. ఇలాగే ఇధ్మడికి శిరస్సు, బర్హిస్సుకు కీళ్ళు పడిపోయినాయి. చివరకు బృహస్పతి మంత్రోచ్చారణతో సూర్య చక్షువుతో చూస్తూ అశ్వనీదేవతల బాహువులతో స్వీకరించి లోపాన్ని సరిదిద్దాడు.

ప్రజాపతి శరీరఅవయవాల కధిపతి అయిన జీవాత్మ. రుద్రుడు – సర్వజ్ఞుడైన పరమాత్మ. యజ్ఞము అంటే పరమాణుసంయోగంతో ఏర్పడిన శరీరం. ప్రజాపతి యజ్ఞం నుంచి రుద్రుణ్ణి దూరం చెయ్యటంచేత తత్వాలు తమ పనులు తాము చెయ్యలేకపోయినాయి. కాబట్టి జ్ఞాని అయినవాడు ఏ కర్మలోను పరమాత్మ ఉనికిని మరువరాదు

అంటోంది గోపథ బ్రాహ్మణం.

ఈ రకంగా **గోపథ బ్రాహ్మణంలో అనేక విషయాలు** చెప్పబడ్డాయి.

*దీంతో బ్రాహ్మణభాగము సమాప్తము*

శ్రీ

# పార్థసారథీయము

# చతుర్వేదభాష్యము

## (అరణ్యకాలు)



ప్రముఖ శ్రీవిద్యా ప్రచారకులు
అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,
ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, మెంఫిస్, అమెరికా ఆస్థాన విద్వాంసులు,
డా॥ క్రోవి పార్థసారథి

# విషయసూచిక

1. అరణ్యకం అంటే ?
2. అరణ్యకాలు కూడా వేదాలేనా
3. అరణ్యకాల వల్ల లాభం ఏమిటి?
4. సంహిత–అరణ్యకము
5. నశించిపోయిన అరణ్యకాలు
6. అరణ్యకాల వరుస క్రమం
7. వేదాలకు ఆదరణ రావాలంటే
8. మహర్షులు
9. అరణ్యకాలు ఏం చెబుతున్నాయి?
10. కర్మనుంచి – జ్ఞానానికి
11. కర్మకాండ, జ్ఞానకాండల సమన్వయము
12. ఐతరేయారణ్యకము
    1. శరీరము హిరణ్మయము
    2. హ్రీంకారోపాసన
    3. ఉదరోపాసన
    4. హృదయోపాసన
    5. ప్రాణోపాసన
    6. ఆత్మోపాసన
    7. నిర్భుజోపాసన
    8. సంహితోపాసన

    9. ఇంద్రోపాఖ్యానము
    10. ప్రజాపతి ఉపాఖ్యానము
    11. విశ్వామిత్రోపాఖ్యానం
    12. విద్యకు అధికారులు

13. కౌషీతకీ అరణ్యకము
    1. ఆధ్యాత్మిక అగ్నిహోత్రం
    2. వేదానికి అర్థం తెలియాలా?
    3. మహావ్రతం
    4. గర్వం పనికిరాదు
    5. ఉపాసనా పద్ధతి
    6. మహావ్రతోపాసన
    7. సంహితోపాసన
    8. అక్షరోపాసన
    9. కాలసంహితోపాసన
    10. చతుర్విధ పురుషులు
    11. శరీరంలో దేవతలు
    12. మరణ సూచకారిష్టాలు
    13. గార్గాయణి ఉపాఖ్యానము
    14. బాలాకి
    15. ప్రతర్దనోపాఖ్యానము
    16. ఆకలిదప్పిక
    17. తాయత్తులు (మణులు)

18. పరమాత్మ

14. తైత్తిరీయారణ్యకం

1. ఆత్మ–శరీరము
2. శింశుమారుడు
3. శ్రీమహావిష్ణువు
4. నారాయణుడు
5. అరుణం
6. పంచయజ్ఞాలు
7. మతసంబంధమైన ఆచారాలు
8. కూశ్మాండ హోమం
9. పితృమేధం
10. ప్రవర్గ్య
11. యజ్ఞోపవీతం

15. బృహదారణ్యకము

1. ఓంకారోపాసన
2. వ్యాహృతుల ఉపాసన
3. హృత్పద్మం
4. బ్రహ్మవేత్త
5. ప్రాణోపాఖ్యానము
6. ప్రజ్ఞానం బ్రహ్మ
7. వెలుగులకు వెలుగు

8. హృదయ బ్రహ్మోపాసన
9. సత్య బ్రహ్మోపాసన
10. మనోమయుడు
11. విద్యుత్తే బ్రహ్మ
12. వాగ్బ్రహ్మ
13. వైశ్వానరాగ్ని
14. అన్నప్రాణాలే బ్రహ్మ
15. ఉక్థోపాసన
16. ప్రాణోపాసన
17. గాయత్రోపాసన

16. తలవకారారణ్యకము
    1. వాక్స్వరూపం
    2. ఓంకారోపాసన
    3. ఉద్గీతోపాసన
    4. ఉషస్తి
    5. పంచవిధసామోపాసన
    6. సప్తవిధ సామోపాసన
    7. గాయత్ర్యోపాసన
    8. విద్యుదుపాసన
    9. అశరీరసామము
    10. మూడుసార్లు చస్తాడు

11. సృష్టిక్రమము
12. ఓంకారము గొప్పదనము
13. ఋక్కులు లేని సామగానం
14. ఉద్గాత-ఉత్తర దిక్కున ఉండాలి
15. ఉచ్చైశ్రవోపాఖ్యానం

17. మైత్రాయణీయారణ్యకము

1. కాలమే కారణం
2. మనస్సే సాధనము
3. పరబ్రహ్మోపాసన
4. అన్నోపాసన
5. ఆదిత్యోపాసన
6. అన్నింటికీ మూలం మనస్సు
7. ఇదంతా నశించిపోయేదే

# అరణ్యకాలు

అరణ్యంలో చదవతగింది కాబట్టి దీన్ని అరణ్యకము అన్నారు. సంహితకు వ్యాఖ్యానము 'బ్రాహ్మణము' బ్రాహ్మణాలకు పరిశిష్ట భాగము అరణ్యకము. వేదంలో కొన్ని మంత్రాలను గర్భిణీస్త్రీలు, వృద్ధులు, అనారోగ్యంతో బాధ పడేవారు వినరాదు. అటువంటి మంత్రాలను ఊరిచివర నిర్జన ప్రదేశంలోను లేదా అరణ్యాలలోను చదివేవారు. వాటినే అరణ్యకాలు అన్నారు. ఈ రోజునకు ఉపనయనం జరిగే సమయంలో కొన్ని మంత్రాలను గర్భిణీస్త్రీలు వినరాదు. ఆ సమయంలో వారిని అక్కడ నుంచి పంపించి వేస్తారు.

వేదంలో సంహిత, బ్రాహ్మణాలు కర్మకాండ. ఉపనిషత్తులు జ్ఞానకాండ. ఈ రెండింటికీ వారధిగా ఉన్నది భక్తికాండ. అదే అరణ్యకము. భక్తి, ఉపాసన ఇక్కడి నుంచే ప్రారంభమైంది. సంహితను సరిగా అర్ధం చేసుకోవటానికి కూడా అరణ్యకాలు సహాయపడతాయి. ప్రతివేదానికి కొన్ని అరణ్యకాలుండేవి. వాటిలో చాలా భాగం కాలగర్భంలో కలిసిపోయినాయి. అలా నశించిపోయిన వాటిలో కొన్నిటికి పేర్లుకూడా తెలియవు.

ప్రస్తుతం మనకు ఆరు అరణ్యకాలు మాత్రమే లభిస్తున్నాయి. అవి

1. ఐతరేయారణ్యకము – ఋగ్వేదము
2. కౌషీతకీ అరణ్యకము – ఋగ్వేదము
3. తైత్తిరీయారణ్యకము – శుక్లయజుర్వేదము

4. బృహదారణ్యకము – శుక్లయజుర్వేదము

5. తలవకారారణ్యకము – సామవేదము

6. మైత్రాయణీయారణ్యకము – సామవేదము

అధర్వణ వేదానికి అరణ్యకాలు లేవు. ఇప్పుడు ఈ అరణ్యకాల గురించి చూద్దాం.

## 1. అరణ్యకం అంటే ?

**'అరణ్యే పార్యత్వాత్ అరణ్యకం'**

'అరణ్యంలో చదవతగినవి అరణ్యకాలు' అన్నాడు సాయణుడు.

**'అరణ్యాధ్యయనాచ్చై తథారణ్యకమితి'**

'అరణ్యంలో అధ్యయనం చేయతగింది కాబట్టి అరణ్యకము' అన్నాడు సురేశ్వరాచార్యులు.

"పెరుగు నుంచి వెన్నలాగా, మలయపర్వతం నుంచి చందన తరువులాగా, ఓషధుల నుంచి అమృతంలాగా, వేదాల నుంచి అరణ్యకాలు సారాంశాలుగా ఏర్పడుతున్నాయి'' అంటోంది మహాభారతంలోని శాంతిపర్వం.

వేదం నాలుగు భాగాలుగా విభజించబడింది. 1. సంహిత 2. బ్రాహ్మణము 3. అరణ్యకము 4. ఉపనిషత్తు. ఈ విభాగంలో మూడవది అరణ్యకం. సంహిత అంటే మంత్రభాగము. యజ్ఞయాదిక్రతుల్లో ఏ మంత్రాలు చదవాలి? ఏ సూక్తాలు పఠించాలి? ఏ స్తోత్రాలు చెయ్యాలి? అని వివరించేదే సంహిత భాగం. అదే మంత్రం. ఇక్కడ చిన్న అనుమానం. మంత్రము అంటే పది అక్షరాలు లేదా పాతిక అక్షరాలు

ఉండి చివరలో నమః అనో స్వాహా అనో అలా ఉంటుంది కదా. మరి ఇక్కడ ఇవన్నీ సూక్తాలు, ఒక్కొక్క సూక్తంలో చాలా ఋక్కులు ఉంటాయి. మరి ఇవి మంత్రాలా? ఇది అనుమానం. ఇవి మంత్రాలే. ఎలాఅంటే మంత్రాలలో ఏకాక్షరి ఒకే అక్షరంతో ఉండేవి, త్ర్యయక్షరి మూడు అక్షరాలు ఉండేవి. ఇలా ఆ దేవతను మనం చేసే ప్రార్థనను బట్టి మంత్రం ఉంటుంది. ఇరవైఅక్షరాల పైన గనక ఉన్నట్లైతే అవి మాలామంత్రాలు అంటారు. లలితాసహస్రము, విష్ణుసహస్రము వంటివి అన్నీ మాలామంత్రాలే. అంటే లలితాసహస్రం అనేది మొత్తం మాలామంత్రం. అందులో మళ్ళీ అనేక మంత్రాలున్నాయి. ఇక్కడ ఒక చిన్న ఉదాహరణ చూడండి. 'సౌందర్యలహరి' వంద శ్లోకాల గ్రంథము. ఇందులోని ప్రతిశ్లోకము ఒక మంత్రమే. దానికి వ్రాసిన భాష్యాలలో ప్రతిశ్లోకానికి ఒక యంత్రం. ఆ శ్లోకం పారాయణ చేయవలసిన విధానం. పూజ, నివేదన అన్నీ చెప్పారు పారాయణ ఫలము కూడా అక్కడే ఇవ్వబడింది. ఇలా ఒక శ్లోకాన్ని ఒక మంత్రంగా చేయచ్చు. లేదా వంద శ్లోకాలు కలిపితే ఒకే మంత్రం అవుతుంది. అలాగే ఉంటాయి మంత్రాలు. కాబట్టి ఋగ్వేదంలో ఉన్న సూక్తాలన్నీ మంత్రాలే. అక్కడ సూక్తము అంటే మంత్రాల సమూహము. అలాగే మిగిలిన వేదాలలో కూడా.

ఇంతకీ సంహిత అంటే – మంత్ర భాగము. భగవంతుణ్ణి ఎలా స్తుతి చెయ్యాలి? అనేది వివరిస్తుంది. యజ్ఞయాగాది క్రతువుల్లో ఆ మంత్రాల వినియోగమే బ్రాహ్మణము. వేదంలో ఉన్నవి రెండు మార్గాలు. 1. కర్మకాండ 2. జ్ఞానకాండ. కర్మకాండ అంటే యజ్ఞయాగాది క్రతువులే. అంతేగాని జపం, తపం ఇలాంటివి కనిపించవు. ఇంతవరకు మనం రకరకాల యజ్ఞాలు, యాగాలు చూశాం. ఇప్పుడు చిన్నగా

జ్ఞానకాండ వైపు బయలుదేరుతున్నాం. బ్రహ్మసూత్రాల్లో మొట్టమొదటి సూత్రం చూడండి. **'అథాతో బ్రహ్మజిజ్ఞాసా'**. ఇక మీద పరమేశ్వర స్వరూపాన్ని గురించిన జిజ్ఞాస. ఆలోచన. తెలుసుకోవాలనే కోరిక. అంటే ఇంత వరకు లౌకికమైన విద్యలన్నీ పూర్తయినాయి. ఇక పారలౌకిక విద్యను ప్రారంభం చేస్తున్నారు. లౌకిక విద్య అంటే యజ్ఞయాగాది క్రతువులు చేయటం, చేయించటంలో నిష్ణాతుడైనాడు. కాబట్టి ఇక పారలౌకిక దృష్టి. అలాగే ఇక్కడ కూడా యజ్ఞయాగాది క్రతువులన్నీ చేశాం. ఇప్పుడు పారలౌకికం వైపు ప్రయాణం చేస్తున్నాం. అందులో మొదటిది అరణ్యకాలు. ఇప్పటిదాకా గృహస్తాశ్రమంలో ఉండి కర్మకాండ అంతా నిర్వహించాడు. ఇక ఇల్లువాకిలి వదిలి వానప్రస్థానికి బయలుదేరాడు. అంటే సంహిత బ్రాహ్మణ భాగాలు పూర్తయినాయి. మూడవదశ మొదలవుతున్నది. అరణ్యకాలు బ్రాహ్మణాలకు పరిశిష్ట భాగాలు. అదే సమయంలో ఇవి ఉపనిషత్తులకు ఆధారమవుతున్నాయి.

యజ్ఞాలలోని రహస్యాలను మహర్షులు అరణ్యాలలో కూర్చుని చర్చించారు. ఇవి అరణ్యంలో మాత్రమే చదవతగినవి. కాబట్టే అరణ్యకాలని పేరు. సంహితకు అనుబంధంగా బ్రాహ్మణాలు ఎలా ఉన్నాయో, అలాగే బ్రాహ్మణాలకు అనుబంధాలు అరణ్యకాలు. కాని దురద్రుష్టవశాత్తు మనదేశంలో వేదాలకి ఆదరణ తగ్గిపోయింది. వేదంలో ప్రధాన భాగం సంహిత. సంహితకు అనుబంధం బ్రాహ్మణం. బ్రాహ్మణానికి అనుబంధం అరణ్యకం. సంహితకున్న ప్రాముఖ్యత అరణ్యకానికి లేదు. సంహితకే ఆదరణ కొరవడితే, అరణ్యకానికి ఎక్కడినుంచివస్తుంది ఆదరణ? అందుకే అరణ్యకాలు నశించిపోవటం మొదలుపెట్టాయి. కాలక్రమేణా చాలా అరణ్యకాలు

నశించిపోయినాయి. ప్రస్తుతం చాలా కొద్దిమాత్రమే దొరుకుతున్నాయి. అసలు అరణ్యకాలలో ఏముంది? అంటే, గృహస్థాశ్రమాన్ని వదిలి వానప్రస్థం స్వీకరించిన వాళ్ళు ఆచరించవలసినటువంటి యజ్ఞయాగాలకు సంబంధించిన వివరాలన్నీ అరణ్యకాలలో చెప్పబడ్డాయి. వీటిలో యజ్ఞస్వరూపం, యజ్ఞప్రయోజనం అన్నీ వివరించబడ్డాయి. బ్రాహ్మణాలలో కర్మకాండ చెప్పబడుతోంది. ఉపనిషత్తులు జ్ఞానకాండ. ఈ రెండింటి మధ్యన ఉన్నాయి అరణ్యకాలు. అంటే కర్మకాండకు, జ్ఞానకాండకు మధ్య వారధి ఈ అరణ్యకాలు.

# ౨. అరణ్యకాలు కూడా వేదాలేనా

వేదం నాలుగు భాగాలుగా ఉన్నది. 1. సంహిత 2. బ్రాహ్మణము 3.అరణ్యకము 4. ఉపనిషత్తు. వీటిలో వేదం అంటే ఏది ? ఈ ప్రశ్న ఇవాల్టిది కాదు. ప్రాచీన కాలం నుంచీ దీనిమీద చర్చ జరుగుతూనే ఉంది. ఈ చర్చలో ఎవరి అభిప్రాయాలు వారివి. సంహిత భాగాన్నే వేదము అనే వారు కొందరు సంహిత బ్రాహ్మణాలు రెండూ వేదాలే. మిగిలినవి కాదు అనే వారు కొందరు. అరణ్యకాలు కూడా వేదమే అని కొందరు. అరణ్యకాలు వేదం కాదని కొందరు. ఇలా రకరకాల వాదనలు. అసలు వీరి వాదనలకు ఆధారం ఏమిటి?

వేదాలు అపౌరుషీయాలు. వాటిని ఎవరూ చెప్పలేదు. సాక్షాత్తు బ్రహ్మముఖం నుంచే వచ్చాయి అన్నాం. అంటే బ్రహ్మనిష్టాగరిష్టులైన ఆప్తఋషులు సమాధిస్థితిలో ఉండి వేదమంత్రాలను దర్శించారు. ఆ మంత్రాలే సంహిత భాగము. ఇది అపౌరుషేయం కాబట్టి ఇదే వేదము అంటారు. మరి బ్రాహ్మణాల సంగతి ఏమిటి? అంటే సంహిత భాగంలో ఉన్నవి మంత్రాలు. మంత్రాలతో, స్తుతులతో పరమేశ్వరుడికి ఆహుతులు సమర్పించాలి. అంటే యజ్ఞయాగాది క్రతువులు చెయ్యాలి. ఆ క్రతువులు ఎలా చెయ్యాలి? ఈ మంత్రాలను ఏ రకంగా వినియోగించాలి అనే విషయాన్ని వివరించేవి బ్రాహ్మణాలు. అంటే సంహితభాగము యొక్క వివరణే బ్రాహ్మణము అన్నమాట. ఈ వివరణలను ఋషులు చెప్పారు. కాబట్టి బ్రాహ్మణము వేదం కాదు అని కొంతమంది, ఋషులు చెప్పినప్పటికీ బ్రాహ్మణాలు కూడా వేదమే అని కొంతమంది చెబుతున్నారు. వీరి లెక్కలోకూడా బ్రాహ్మణాల వరకే వేదము అనబడుతుంది. అరణ్యకాలుమాత్రం వేదంకాదు. అయితే అరణ్యకము అనేది బ్రాహ్మణంలో పరిశిష్ట భాగము. అలాంటప్పుడు

సగం వేదమయి మిగిలిన సగం వేదంకాకుండా ఎలా ఉంటుంది? కాబట్టి బ్రాహ్మణంతోపాటుగా అరణ్యకం కూడా వేదమే అన్నారు కొంతమంది. దీన్ని ఒప్పుకోము అంటారు ఇంకొందరు. కాబట్టి ఇప్పుడు అరణ్యకాలు వేదమా? కాదా? అంటే బ్రాహ్మణాలు వేదము అయినప్పుడు బ్రాహ్మణాలలో పరిశిష్ట భాగమయిన అరణ్యకాలు వేదమే. ఇందులో సందేహం లేదు.

# 3. అరణ్యకాల వల్ల లాభం ఏమిటి?

మంత్రసమూహమైన సంహితభాగాన్ని సరిగా అర్థం చేసుకోవటానికి, దాన్ని వినియోగించటానికి ఏర్పడింది బ్రాహ్మణం భాగం. అరణ్యకాలు కూడా ఇదే ప్రయోజనాన్నిస్తాయి అంటున్నారు విజ్ఞులు. బ్రాహ్మణాలు గృహస్థులను దృష్టిలో పెట్టుకుని చెప్పబడ్డాయి. ఇక అరణ్యకాలేమో వానప్రస్థులను దృష్టిలో పెట్టుకుని చెప్పబడ్డాయి. అరణ్యకాలలో చెప్పిన కొన్ని విషయాలు గ్రామాలలో చదవరాదు. దీక్ష తీసుకోని వారు (దీక్షితులు కానివారు) వాటిని వినరాదు. అందుకే వీటిని అరణ్యాలలో చదవాలి అని చెప్పటం జరిగింది.

**'అరణ్యేతదధీయతే'** అరణ్యంలోనే అధ్యయనం చెయ్యటంవల్ల వీటికి అరణ్యకాలు అని పేరు వచ్చింది. అన్నాడు సాయణుడు. అరణ్యకాలలోని విషయాలు చాలా ప్రధానమైనవి. అత్యంత రహస్యము ప్రమాదకరము అయినవి. అందుచేత దీక్షితులు కానివారు (దీక్ష తీసుకోనివారు) దీక్షాపరులు కానివారు అరణ్యకాలను వినకూడదు. ఈ కారణంచేతనే ఈ మంత్రాలను అరణ్యంలో చదువుతారు. ఇవి యజ్ఞయాగాలలోని అంతరార్థాలను, సాంకేతిక పదాలను వివరిస్తూ చక్కని వ్యాఖ్యానమిస్తాయి.

యజ్ఞయాగాల స్వరూపాన్ని వివరించే బ్రాహ్మణాలకు, ఆత్మతత్వాన్ని వివరించే ఉపనిషత్తులకు మధ్య వారధి వంటివి ఈ అరణ్యకాలు. మంత్రాలు చదువుతూ భౌతికంగా కర్మ చేస్తే భగవదనుగ్రహం కలుగుతుంది అని చెబుతాయి బ్రాహ్మణాలు. చిత్తశుద్ధితో మంత్రాలుచదివితేచాలు కర్మకాండ చేయకపోయినా భగవదనుగ్రహం కలుగుతుంది అని చెబుతాయి అరణ్యకాలు. కర్మకాండే కాదు. అసలు మంత్రాలు కూడా అవసరం లేదు. చిత్తశుద్ధితో

ధ్యానంచేస్తే ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది అని చెబుతాయి **ఉపనిషత్తులు.**

సంహితలో చెప్పిన పదాలకు అర్థాలు, నిర్వచనాలు చెప్పబడ్డాయి. అరణ్యకాలలో. అందుకే నిఘంటువులు వ్రాసిన వారు వేదాలను నిర్వచించేటప్పుడు అరణ్యకాలలో చెప్పిన అర్థాలను, నిర్వచనాలను వాడుకున్నారు. కాబట్టి వైదిక వాఙ్మయంలో బ్రాహ్మణాలలాగానే అరణ్యకాలు కూడా ముఖ్యమైన పాత్ర పోషిస్తున్నాయి అనే విషయాన్ని మనం గుర్తుంచుకోవాలి.

# 4. సంహిత-అరణ్యకము

వేదంలో ప్రతి సంహితకు ఒక బ్రాహ్మణము ఉన్నది. అలాగే ప్రతి బ్రాహ్మణానికి ఒక అరణ్యకమున్నది. అయితే గతంలో మనం చెప్పుకున్నట్లుగా కొన్ని బ్రాహ్మణాలతో పాటుగా అరణ్యకాలుకూడా నశించిపోయినాయి. దేశంలో యజ్ఞయాగాదులు బాగా జరిగినంత వరకు బ్రాహ్మణాలు బాగా ఉన్నాయి. ఎప్పుడైతే యజ్ఞయాగాలకు ఆదరణ తగ్గటం మొదలైందో, అప్పుడే బ్రాహ్మణాలు నశించిపోవటం ఆరంభమైంది. బ్రాహ్మణాలు నశించిపోవటంతో వాటికి పరిశిష్ట భాగాలయిన అరణ్యకాలు కూడా నశించిపోవటం మొదలైంది. ప్రస్తుతం మనకి దొరుకుతున్నవి చాలా తక్కువ. అవి ఏమిటో చూద్దాం.

**ఋగ్వేదము :** పూర్వకాలంలో ఋగ్వేదానికి 21 శాఖలుండేవి అని చెబుతున్నారు. వాటిలో చాలావరకు నశించిపోగా ఆరుశాఖలు మాత్రమే మిగిలాయి. 1. ఐతరేయ 2. కౌషీతకీ 3. పైంగి 4. బహ్వృచ 5. అశ్వలాయన 6. గాలవ శాఖలుండేవి. వీటికి బ్రాహ్మణాలు కూడా ఉండేవి. కాని కాలక్రమేణా వీటిలో చివరి నాలుగు బ్రాహ్మణాలు కూడా నశించిపోయినాయి. ఇక మిగిలినవి రెండు 1. ఐతరేయ బ్రాహ్మణము 2. కౌషీతకీ బ్రాహ్మణము. ఈ బ్రాహ్మణాలకు పరిశిష్ట భాగాలయిన ఐతరేయారణ్యకము. 2. కౌషీతకీ అరణ్యకము. ఋగ్వేదానికి దొరుకుతున్న అరణ్యకాలు ఈ రెండే.

**యజుర్వేదము :** యజుర్వేదము రెండు రకాలుగా ఉన్నది. 1. కృష్ణ యజుర్వేదము 2. శుక్ల యజుర్వేదము. వీటిలో శుక్ల యజుర్వేదానికి మాధ్యందిన శాఖ, కాణ్వశాఖ అని రెండు శాఖలున్నాయి. ఈ రెండు శాఖలకు రెండు బ్రాహ్మణాలున్నాయి. ఆ రెండింటి పేరు ఒకటే శతపథ బ్రాహ్మణము. మరి వీటి మధ్య తేడా

ఎలా తెలుస్తుంది? అందుకే వాటిని మాధ్యందిన శతపథబ్రాహ్మణము, కాణ్వ శతపథ బ్రాహ్మణము అంటారు. ఈ రెండింటిలోను పేరులో తప్ప విషయంలో తేడా లేదు. చాలా వరకు రెండూ ఒకటేగా ఉంటాయి. ఈ రెండు బ్రాహ్మణాలకు కలిపి ఒకటే అరణ్యకం ఉన్నది. అదే బృహదారణ్యకము. ఇక కృష్ణయజుర్వేదాన్ని గనక చూస్తే, దీనికి రెండు ప్రధానమైన శాఖలు కనిపిస్తున్నాయి. 1. తైత్తిరీయశాఖ 2. మైత్రాయణీ శాఖ. తైత్తిరీయ శాఖకు సంబంధించినది తైత్తిరీయ బ్రాహ్మణము. మైత్రాయణీయ శాఖకు సంబంధించినది మైత్రాయణీయ బ్రాహ్మణము. వీటికి విడిగా అరణ్యకాలు కూడా ఉన్నాయి. అవే 1. తైత్తిరీయారణ్యకము 2. మైత్రాయణీయారణ్యకము.

**సామవేదము :** ప్రాచీన కాలంలో సామవేదానికి చాలా ఎక్కువ ఆదరణ ఉండేది. అన్ని వేదాలలోకి సామవేదానికే ఎక్కువ ఆదరణ ఉండేదట. అందుకే దానికి ప్రచారం కూడా బాగాఉండేది. ఈ క్రమంలో సామవేదానికి వెయ్యి శాఖలు ఉండేవి. అయితే వీటిలో చాలా శాఖలు నశించిపోయినాయి. ప్రస్తుతం మూడు శాఖలు మాత్రవే కనిపిస్తున్నాయి. అవి 1. రాణాయనీయ 2. కౌథుమ 3. జైమినీయ శాఖలు. వీటిలో

1. రాణాయనీయశాఖను ప్రవర్తింప చేసినవాడు రాణాయనీయమహర్షి. దీనికి బ్రాహ్మణం లేదు.

2. కౌథుమ శాఖను ప్రవర్తింప చేసినవాడు కుథుమిమహర్షి. దీనికి రెండు బ్రాహ్మణాలున్నాయి. 1. తాండ్య మహాబ్రాహ్మణము 2. ఛాందోగ్య బ్రాహ్మణము. వీటిలో తాండ్య బ్రాహ్మణానికి అరణ్యకంగాని ఉపనిషత్తుగాని లేవు. ఛాందోగ్య బ్రాహ్మణానికి అరణ్యకం లేదు. ఉపనిషత్తు మాత్రం ఉంది. అదే ఛాందోగ్యోపనిషత్తు.

3.జైమినీయ శాఖను ప్రవర్తింప చేసినవాడు జైమినీ మహర్షి. ఈ శాఖకు సంబంధించినదే జైమినీయ బ్రాహ్మణము. దీన్నే తలవకార బ్రాహ్మణము అంటారు. దీనికి అరణ్యకం ఉంది. అదే తలవకారారణ్యకము.

సామవేదానికి ఉపబ్రాహ్మణాలు నాలుగు ఉన్నాయని గతంలో చెప్పుకున్నాం. అవి

1. సామవిధాన బ్రాహ్మణము 2. దేవతాధ్యయన బ్రాహ్మణము 3. సంహితోపద్బ్రాహ్మణము 4. వంశబ్రాహ్మణము. వీటికి అరణ్యకాలు ఏవీ కనిపించటం లేదు. మొత్తంమీదచూస్తే సామవేదానికి తలవకారారణ్యకము ఒక్కటే ఉన్నది.

**అధర్వణవేదము :** దీనికి సంబంధించిన బ్రాహ్మణం గోపథ బ్రాహ్మణం. ఒకానొక రోజున ఇందులో నూరు ప్రపాఠకాలుండేవి. కాని ఇప్పుడు కేవలము 11 మాత్రమే దొరుకుతున్నాయి. వీటిలో కూడా దేనికీ గుర్తింపులేదు అంటున్నారు పండితులు. నశించిపోయిన ప్రపాఠకాలలో అరణ్యకము ఉండి ఉండవచ్చు. కాని ప్రస్తుతము అధర్వవేదానికి అరణ్యకంలేదు. ఈ రకంగా చూసినట్లైతే నాలుగు వేదాలకు కలిపి ఆరు అరణ్యకాలు మాత్రమే ఉన్నాయి. అవి

1. ఐతరేయారణ్యకము 2. కౌషీతకీ అరణ్యకము 3. తైత్తిరీయరణ్యకము 4. మైత్రాయణీయరణ్యకము 5. బృహదారణ్యకము 6. తలవకారారణ్యకము

# 5. నశించిపోయిన అరణ్యకాలు

లోకంలో నాటిన ప్రతివిత్తనం మొలకెత్తదు. విత్తనాలు చల్లినప్పుడు కొన్నింటిని పక్షులు ఏరుకుతింటాయి. అంటే అవి వెంటనే నశిస్తాయి. కొన్ని చచ్చువి పుచ్చువి ఉంటాయి. ఇలా రకరకాల కారణాలచేత కొన్ని విత్తనాలు మొలకలే ఎత్తవు. మొలకెత్తిన ప్రతివిత్తనం ఫలసాయాన్నివ్వదు. ఫలసాయాన్నిచ్చేటప్పుడు కూడా అన్నీ మొక్కలు సమానమైన ఫలితాన్ని ఇవ్వవు. ఈ మాట ఒక్క విత్తనాలకే కాదు. గ్రంథాలకి, శాస్త్రాలకి కూడా చెందుతుంది. ఒకే విషయం మీద భిన్నమైన పుస్తకాలన్నప్పుడు వాటిలో కొన్ని ప్రజాదరణ పొందుతాయి. కొన్ని పొందవు. కొన్ని కాలగర్భంలో కలిసిపోతాయి. ఇది సహజం. వ్యాసుడు వేదవిభజన చేశాడు. అది అలాగే ప్రచారం జరగలా. ఆయన శిష్యులు, ప్రశిష్యులు ఎవరికివారు తమకుతోచిన మార్పులు చేశారు. అవి శాఖోపశాఖలుగా అయినాయి. ఒకటి రెండు కాదు. సామవేదానికి వెయ్యిశాఖలు వచ్చినాయి. సామాన్యంగా ప్రతిశాఖకీ ఒక బ్రాహ్మణము ఉండాలి. బ్రాహ్మణానికి పరిశిష్ట భాగమే అరణ్యకము. కాబట్టి ప్రతి బ్రాహ్మణానికి ఒక అరణ్యకం ఉండాలి. ఇలా చూస్తే వెయ్యి బ్రాహ్మణాలు వెయ్యి అరణ్యకాలు ఉండాలి కానిలేవు. ఆదరణ ఉన్నంతవరకు వేదశాఖలు విస్తరించినాయి. ఆదరణ తగ్గేటప్పటికి ఒక్కొక్కటి కనిపించకుండా పోయినాయి. అలా సంహిత శాఖలే చాలా పోయినాయి. వాటితో పాటే బ్రాహ్మణాలు, అరణ్యకాలు కూడా నశించిపోయినాయి. గాలివాన వస్తే ఎక్కువ నష్టం జరిగేది పెద్దపెద్దవృక్షాలకే. కొన్ని వృక్షాలకు కొమ్మలు విరిగిపోతాయి. కాండము మాత్రము మిగులుతుంది. కొన్ని కూకటి వేళ్ళతో సహా కూలిపోతాయి.

ప్రస్తుతం విశాఖపట్నం చూడండి. పూర్తిగా దెబ్బ తిన్నది. మొత్తం కోలుకోవాలంటే చాలా కాలం పడుతుంది. అంటే కొన్ని పాక్షికంగా నాశనమైతే కొన్ని పూర్తిగా నాశనమవుతాయి. కాని గడ్డిపరకలు మాత్రం చెక్కు చెదరవు. వాటికేం కాదు. వర్షం తగ్గగానే అవి మామూలుగానే ఉంటాయి. ఇక్కడా అంతే. శాఖోపశాఖలుగా విస్తరించిన ఈ వాఙ్మయం, అనాదరణ పెరిగేటప్పటికి ఎక్కువ శాఖలు ఉన్న వాటికి ఎక్కువ నష్టం జరిగింది. సామవేదానికి వెయ్యి శాఖలుండేవి. కాని ప్రస్తుతం మూడు శాఖలు మాత్రమే దొరుకుతున్నాయి. మిగిలినవి నాశనమై పోయినాయి. అలా పోయిన వాటిలో కొన్నింటి పేర్లు ఎక్కడైనా కనిపిస్తే ఆ శాఖ ఒకటి ఉండేది అనుకుంటాం. ఒకవేళ దానిపేరుకూడా ఎక్కడా కనపడలేదూ. దాన్ని గురించిన ఆలోచనే ఉండదు. ఇలాగే అరణ్యకాలకు కూడా జరిగింది. చాలా అరణ్యకాలు కనిపించకుండా పోయినాయి. కొన్ని నామమాత్రంగా మిగిలాయి. అంటే కొన్ని పేరుకు మాత్రం మిగిలాయి. మరికొన్ని ఊరు పేరు లేకుండా పోయినాయి. **ఏది ఏమైనా వైదిక వాఙ్మయం ఇలానాశనంకావటం మన దురదృష్టం. ఇందులో అనుమానం లేదు.**

ఇప్పుడు నశించిపోయిన అరణ్యకాలు ఏమున్నాయో చూద్దాం. ఈ నశించి పోయినవి ఒక వేదానికే కాదు. అన్ని వేదాలకు ఉన్నాయి.

**1. ఋగ్వేదము :** ఋగ్వేదానికి సంబంధించి ఐతరేయ, కౌషీతకీ అరణ్యకాలు మాత్రమే దొరుకుతున్నాయి. మరి నశించిపోయిన వేమిటో చూద్దాం.

1. **పైంగ్యారణ్యకము :** ఇది పైంగిశాఖకు చెందినది. ఆపస్తంభ సూత్రాలలోను, సత్యాషాఢ శ్రౌతసూత్రాలలోను దీని పేరు

కనిపిస్తోంది.

2. **బహ్వృచారణ్యకము :** ఇది బహ్వృచ శాఖకు సంబంధించినది. శబరస్వామి తన చరక భాష్యంలో దీన్ని ఉటంకించాడు.

3. **ఆశ్వలాయనారణ్యకము :** ఆశ్వలాయన బ్రాహ్మణంలో పరిశిష్ట భాగమిది. 'స్మృతితత్త్వము' అనే గ్రంథంలో రఘునందనుడు దీన్ని గురించి వ్రాశాడు.

4. **గాలవారణ్యకము :** గాలవ బ్రాహ్మణానికి చెందినది. పతంజలి మహాభాష్యంలో ఇది చెప్పబడింది.

**2. యజుర్వేదము :** యజుర్వేదానికి షుమారు 11 అరణ్యకాలు వామ మాత్రంగా ఉన్నాయి.

1. **చరకారణ్యకము :** ఇది చరక బ్రాహ్మణంలోది. లాహోరు డిఎపి కళాశాల గ్రంథాలయంలో వ్రాతప్రతిగా ఉన్నది. ఇంతవరకు ముద్రించబడలేదు.

2. **శ్వేతాశ్వతరారణ్యకము :** ఇది శ్వేతాశ్వర బ్రాహ్మణంలో ఉంది. ఈ బ్రాహ్మణాన్ని ఆత్మానందుడు, విశ్వరూపాచార్యులు ఉటంకించారు.

3. **కారకారణ్యకము :** ఇది కారక బ్రాహ్మణానికి చెందినది. ఈ అరణ్యక ప్రతులు కాశ్మీర్‌లో ఉన్నాయి. వాసిష్ట ధర్మసూత్రాలు, వైఖానస, ఆపస్తంభ, శ్రౌత సూత్రాలలో దీన్ని పేర్కొన్నారు.

4. **జాబాలారణ్యకము :** ఇది జాబాల బ్రాహ్మణానికి సంబంధించినది. విశ్వరూపాచార్యులు దీన్ని తన బాలక్రీడ వ్యాఖ్యానంలో పేర్కొన్నారు.

5. **ఖాండికేయారణ్యకము :** ఇది ఖాండికేయ బ్రాహ్మణంలోది. భాషిక

సూత్రంలో ఈ బ్రాహ్మణం చెప్పబడింది.

6. **ఔఖేయారణ్యకము :** ఔఖేయ బ్రాహ్మణ పరిశిష్టం ఇది. భాషిక సూత్రంలో ఈ బ్రాహ్మణం పేర్కొనబడింది.

7. **హారిద్రవికారణ్యకము :** హారిద్రవిక బ్రాహ్మణానికి పరిశిష్ట భాగం ఇది. యాస్కుడు నిరుక్తంలో దీన్ని పేర్కొన్నాడు.

8. **తుంబురు అరణ్యకము :** దీన్ని పతంజలి మహాభాష్యంలో పేర్కొన్నాడు.

9. **ఆహ్వరకారణ్యకము :** ఇది ఆహ్వరక బ్రాహ్మణంలోనిది. ఈ బ్రాహ్మణాన్ని దుర్గాచార్యుడు తన నిరుక్త వ్యాఖ్యానంలో వ్రాశాడు.

10. **కంకత్యారణ్యకము :** ఇది కంకతి బ్రాహ్మణం పరిశిష్ట భాగము. ఆపస్తంభ సూత్రాలలో ఇది పేర్కొనబడింది.

11. **చాగలేయారణ్యకము :** ఇది చాగలేయ బ్రాహ్మణానికి సంబంధించినది. స్కంద స్వామి ఋగ్వేద భాష్యంలో దీన్ని పేర్కొన్నాడు.

**3. సామవేదము :** దీనికి సంబంధించిన అరణ్యకాలు చాలా నశించిపోయాయి. కాని నాల్గింటి పేర్లు మాత్రమే మనకి తెలుసు. అవి

1. **భాల్లవ్యారణ్యకము :** భాల్లవి బ్రాహ్మణం పరిశిష్టభాగం ఇది. బృహద్దేవతా స్తుతి, ఆపస్తంభ శ్రౌతసూత్రాలలో పేర్కొనబడింది.

2. **కాలబవ్యారణ్యకము :** కాలబ బ్రాహ్మణానికి సంబంధించినది. ఆపస్తంభ శ్రౌత సూత్రాలలో ఇది పేర్కొనబడింది.

3. **రౌరుక్యారణ్యకము :** రౌరుకి బ్రాహ్మణానికి సంబంధించినది ఈ అరణ్యకము. తైత్తిరీయబ్రాహ్మణభాష్యంలో దీన్ని పేర్కొన్నారు.

**4. శాట్యాయనారణ్యకము :** శాట్యాయన బ్రాహ్మణం యొక్క పరిశిష్ట భాగం ఇది. ఆపస్తంభ శ్రౌతసూత్రాలు, సాయణభాష్యము మొదలైన చాలా చోట్ల ఇది పేర్కొనబడింది.

ఇవే కాక ఇంకా అనేక అరణ్యకాలు నశించిపోయినాయి. వాటి పేర్లు కూడా మనకి దొరకటం లేదు.

# 6. అరణ్యకాల వరుస క్రమం

నాలుగువేదాలకు కలిపి ఆరు అరణ్యకాలున్నాయనే నిశ్చయానికి వచ్చాం. అయితే వీటిలో ఏది ముందు? ఏది వెనక ? ఇదే ప్రశ్న. ఇక్కడ మనం గుర్తించాల్సిన విషయం ఒకటుంది. ఏమంటే వేదాలు అపౌరుషేయాలు. సృష్టి జరగటానికి ముందే అవి వచ్చినాయి. సృష్టి ప్రారంభంలో పరమేశ్వరుడు ఈ వేదాలను బ్రహ్మదేవుడి కిచ్చాడు. అని గతంలో మనం చెప్పుకున్నాం. వేదాలన్నీ అత్యంత ప్రాచీనమైనవే. అందులో ఏ రకమైన అనుమానం లేదు. కాని చరిత్రకారుల ప్రకారం వేదకాలము ఒకటి నిర్ణయించబడింది. వేదాల గురించి మాట్లాడుతున్నప్పుడు "వేదకాలము" అన్నాను. అక్కడ ఉన్న ఒక వేదపండితుడు "అసలు వేదకాలం అనేది ఎక్కడా లేదు" అన్నాడు చాలా తీవ్రస్వరంతో. అందుకే అసలు **వేదకాలము అనే మాటనే భరించరు సంప్రదాయవాదులు.** కాబట్టి ఇప్పుడు మనం చెప్పుకోబోయే విషయం కేవలము చరిత్రకారుల అధ్యయనం మాత్రమే. ఏ గ్రంథం ముందుగా వచ్చింది? ఏది తరువాత వచ్చింది? అనే విషయం నిర్ణయించటానికి కొన్ని పద్ధతులున్నాయి. 1. దానిలో ఉపయోగించిన భాష 2. విషయాలు 3. వాక్యనిర్మాణ పద్ధతి 4.వ్యాకరణము 5. అందులో చెప్పిన స్వరము. వీటి ఆధారంగా ఏది ముందు? ఏది వెనక? అనే విషయం నిర్ధారణ చేయటం జరుగుతుంది. ఇది చరిత్రకారుల అభిప్రాయం. సంప్రదాయవాదులు దీన్ని ఒప్పుకోరు. కాబట్టి **ఇది కేవలము చరిత్రకారుల నిర్ణయము అని గుర్తించండి.**

చరిత్రకాలరు ప్రకారం వేదం అంతా ఒకేసారి చెప్పబడలేదు. ముందు సంహిత భాగం చెప్పబడింది. అందులో కూడా ఋక్సంహిత

ముందుగా వచ్చింది. అలాగే ఆఖరున వచ్చింది అధర్వ సంహిత.

ఇలా చూసినట్లైతే క్రీస్తుపూర్వం ఎనిమిదవ శతాబ్దం నుంచి ఐదవ శతాబ్దం లోపు అరణ్యకాలు చెప్పబడ్డాయి. ఈ కాలంలోనే బ్రాహ్మణాలు కూడా చెప్పబడ్డాయి. అరణ్యకాలన్నీ జాగ్రత్తగా పరిశీలించినట్లైతే కొన్ని విషయాలు తెలుస్తున్నాయి.

అరణ్యకాలలో ఉపయోగించబడిన భాష, వాటిలో చెప్పబడిన విషయాలు, వాక్యనిర్మాణపద్ధతి, స్వరం, వ్యాకరణం ఇత్యాదులు పరిశీలించినట్లైతే ఈ క్రింది విషయాలు తెలుస్తాయి.

1. అరణ్యకాలన్నింటిలో అతిప్రాచీనమైనది **తలవకార అరణ్యకం**. ఇందులో ఉపయోగించిన భాష, విషయాలను పరిశీలిస్తే ఈ విషయం తెలుస్తుంది.
2. ఆ తరువాత స్థానంలో నిలిచేది **తైత్తిరీయారణ్యకం**. ఇందులోని **స్వరము, వాక్యనిర్మాణ పద్ధతి**ని పరిశీలిస్తే ఈ విషయాలు తెలుస్తున్నాయి. ఈ రెండు అరణ్యకాలు క్రీస్తుపూర్వం 8వ శతాబ్దంలో రూపుదిద్దుకున్నాయి.
3. తరువాత స్థానంలో నిలుచునేది **మైత్రేయారణ్యకం**. ఇందులో ప్రతిపాదించబడిన విషయాలను పట్టి ఈ విషయం తెలుస్తోంది.
4. ఐతరేయారణ్యకంలోని వృత్తాంతాలు, ప్రమేయాలు చూసినట్లైతే ఐతరేయానికి నాల్గవ స్థానం వస్తుంది.
5. ఆ తరువాత నుంచునేది **కౌషీతకీ అరణ్యకము**. ఐతరేయానికి, కౌషీతకానికి, భాష, భావము, స్వరము, వ్యాకరణము వీటిని

పరిశీలిస్తే **ఐతరేయ కౌషీతకీ** అరణ్యకాలు దగ్గర దగ్గరగా ఒకే కాలానికి సంబంధించినవి. క్రీస్తు పూర్వం 7వ శతాబ్దానికి సంబంధించినవి అని తెలుస్తుంది.

6. అరణ్యకాలన్నింటిలోను ఆఖరుదిగా గుర్తించబడింది బృహదారణ్యకము. ఇది క్రీస్తు పూర్వం '6'వ శతాబ్దికి చెందినదిగా భావించబడుతున్నది.

ఈ రకంగా కాలాన్ని బట్టి చూసినట్లైతే

1. తలవకారారణ్యకము – సామవేదము
2. తైత్తిరీయారణ్యకము – కృష్ణయజుర్వేదము
3. మైత్రాయణీయారణ్యకము – సామవేదము
4. ఐతరేయారణ్యకము – ఋగ్వేదము
5. కౌషీతకీఅరణ్యకము – ఋగ్వేదము
6. బృహదారణ్యకము – శుక్ల యజుర్వేదము

ఇది చరిత్రకారుల లెక్క. అంతేగాని దీన్ని సంప్రదాయవాదులు ఏ మాత్రమూ అంగీకరించరు. అధర్వణ వేదానికి అరణ్యకాలు లేవు.

# 7. వేదాలకు ఆదరణ రావాలంటే

వేదాలు నాశనమై పోయాయి. లేకపోతే మనకి అనేక విషయాలు తెలిసేవి. అంటూ చెప్పటం అనవసరం. పోయినవి పోయినాయి. ఉన్న వాటిని జాగ్రత్త చేసుకోండి. వాటిలో ఉన్న విషయాలను అర్థం చేసుకోండి. ఇప్పటికైనా పోగా మిగిలిన వాటిని మనం ఆదరిస్తుంటే, వాటిని తరచి చూసి వాటిలో విషయాలు మనం తెలుసుకొంటుంటే, అవి కూడా ఉంటే బాగుండేది ఇంకా ఎక్కువ విషయాలు తెలిసేవి అనుకోవచ్చు. అదేం జరగటం లేదు. ఇక్కడ నన్ను క్షమించండి. నా మీద కోపం తెచ్చుకోవద్దు. వాస్తవాన్ని ఆలోచించండి. వేంకటేశ్వర స్వామివారు వేదిక్ యూనివర్శిటీని ప్రారంభిస్తే వేదాలకు ఆదరణ పెరగదు. దానివల్ల కేవలం పదిశాతం వరకు మాత్రమే ప్రయోజనం ఉంటుంది. అంతే, అంతకన్న ఆదరణ రాదు.

వేదాలకు ఆదరణ పెరగాలంటే, వేదం చదువుకున్న వాడికి జీవనభృతి కలిగించాలి. వేదపండితుడితో దేవాలయంలో వేదపారాయణ చేయిస్తున్నాం. అతడికి కొంత భృతి కూడా ఇస్తున్నాం కదా? నిజమే. మీరు ఇచ్చేభృతి వితంతువుకిచ్చే మనోవర్తింలాంటిది. నన్ను అపార్థం చేసుకోవద్దు. ఇది చాలదు. ఇది కాదు కావలసింది. మరేంచెయ్యాలి? ఇప్పటికే మీకు అర్థం అయి ఉంటుంది. **వేదాలకి కూడా ఇతరమైన చదువుతోపాటుగా, డిగ్రీలతో పాటుగా సమానహోదా కల్పించాలి.** అంటే వేదిక్ డిగ్రీ. వేదిక్ బి.ఎ., వేదిక్ ఎం.ఎ. ఇలా పాఠ్యాంశాలుగా ప్రవేశపెట్టండి. ఆ డిగ్రీని కూడా ఇతర డిగ్రీలతో పాటుగా సమానంగా చూడండి. బ్యాంకులో ఉద్యోగానికి డిగ్రీఅర్హత. అది వేదిక్‌డిగ్రీ కూడా కావచ్చు. అలా ఎప్పుడైతే వేదాలను కూడా

మామూలు పాఠ్యాంశాలుగా ప్రవేశపెట్టగలిగామో, అప్పుడు వేదాలకు ఆదరణ అనేది దానంతట అదే పెరుగుతుంది. ఆసక్తి ఉన్నవాడు చదువుతాడు.

ఇప్పుడు వచ్చే ప్రశ్న ఇంకోటుంది. వేదాల్లో డిగ్రీ తీసుకుని ఏం చేస్తారు? అలా చెప్పాలంటే మిగిలిన వాటిలో (విభాగాల్లో) డిగ్రీలు తీసుకుని మాత్రం ఏం చేస్తున్నారు? ఉదాహరణకు బి.ఎ డిగ్రీని తీసుకుంటే అందులో అనేక విభాగాలున్నాయి. కొన్నింటి పేర్లు కూడా మనకి తెలియవు. వీరంతా ఏం చేస్తున్నారట? అంతేకాదు లలిత కళలలో కూడా డిగ్రీలున్నాయి కదా? సంగీతంలో బి.ఎ., డాన్సులో ఎమ్.ఎ., ఈ రకంగా వేదాన్నికూడా మిగిలినచదువులాగా చేయగలిగితే, వేదానికి ఆదరణ అనేది పెరుగుతుంది. కేవలం వేదం చెప్పటం కాదు. చదివినంత వరకు దానికి అర్థం కూడా చెప్పగలిగితేనే వేదానికి ఆదరణ పెరుగుతుంది. **మీరు చదవండి. మీకు ఉపాధి దొరుకుతుంది. అని భరోసా ఇవ్వగలిగితే వేదంనేర్చుకోవటానికి చాలామంది ముందుకు వస్తారు.** అవేమీ  మనం చెయ్యకుండా వేదంచదువుకోవటానికి ఎవరూ రావటంలేదు అంటే ఎందుకొస్తారు? కొంచెం ఆలోచించండి. వేదానికి నిజంగా ప్రాచుర్యంరావాలి అని అనుకుంటే, యూనివర్సిటీ స్థాయిలో దాన్ని పాఠ్యాంశంగా చేర్చండి. వాళ్ళకి డిగ్రీలు, పిహెచ్.డి.లు ఇవ్వండి. ఇతర డిగ్రీలతో పాటు సమాన హోదా కల్పించండి.

# 8. మహర్షులు

ఋషి అంటే మహాజ్ఞాని. పాంచభౌతిక శరీరంతో మన మధ్యనే తిరుగుతూ మనలను ఉద్ధరింపగోరే మహాత్ముడు. లోకంకోసం కర్మలు చేస్తుంటాడు. ఉపాసనలు చేస్తుంటాడు. కాని వాటితో అతనికి ఏవిధమైన సంబంధము ఉండదు. తాను చేసే కర్మలఫలితం లోకానికే. అంటే సర్వసుఖాలు త్యజించి, రాగద్వేషాలను జయించి, చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపము అని నమ్మి, ఆ పరమేశ్వర సాక్షాత్కారం అదే ఆత్మసాక్షాత్కారం పొందటానికి ఎదురు చూస్తున్న మహానుభావులు. వీళ్ళు ఋషులంటే. ఎక్కడో అడవులలో ఆశ్రమాలు నిర్మించుకుని తపస్సు చేస్తుంటారు. వీరుచేసే కర్మలన్నీ లోకరక్షణకోసమే. దేశం కోసమే. అందుకే రాజుగారు వీళ్ళని రక్షింస్తుండేవాడు వీరి ఆశ్రమాలను రాక్షసులు నాశనం చెయ్యకుండా కాపాడేవాడు. వీరుచేసే యజ్ఞయాగాది కర్మలకు సంబారాలన్నీ రాజుగారే సమకూర్చేవారు. ఇలా పరస్పరం గౌరవ భావంతో ఉండేవారు.

మన దేశంలో హిమాలయాల నుంచి, వింధ్యపర్వతాల వరకు ఉన్న ప్రదేశమే 'ఆర్యావర్తము' ఇది పవిత్ర భూమి. పుణ్యభూమి. దేశంలోని ఋషులంతా ఈ ప్రాంతంలోనే ఉండేవారు. దీన్నే **'బ్రహ్మావర్తము'** అని కూడా పిలిచేవాళ్ళు. దేశంలో అత్యుత్తమమైన ప్రదేశం ఇది. సరస్వతి, దుషద్వతి నదుల మధ్యనున్న ప్రదేశం. దీని తరువాత కురుక్షేత్రం మత్స్యదేశం, శూరసేన దేశం, పాంచాల, విదేహ, కోసల రాజ్యాలు. బ్రహ్మావర్తం తరువాత ఉత్తమమైన స్థానం. ఈ ప్రదేశం ప్రస్తుత పంజాబ్ రాష్ట్రంలో ఉంది. ఇక్కడే మహర్షులంతా జీవించే వారు అంటారు పరిశోధకులు.

ఇక్కడ అరణ్య ప్రాంతమంతా చాలా రమణీయంగా ఉండేది. చెట్లు, వృక్షాలు, మహావృక్షాలు, తీగెలు, పొదలు, ఓషధులు, సెలయేళ్ళు, నదులు, ఉపనదులు, పశువులు, పక్షులు, మృగాలు అన్నింటితోను రమణీయంగా ఉండేవి ఆ ప్రదేశాలు. అక్కడి వాతావరణం ప్రశాంతంగా ఉంటుంది. ఏకాగ్రత, ధ్యానము, తపస్సు వీటన్నింటికీ అనుకూలమైన ప్రదేశాలు. ఈ ప్రాంతాలలో తత్త్వవేత్తలైన మహర్షులు కందమూలాలు తింటూ తపస్సు చేసుకునేవారు. తీరిక సమయాలలో తత్త్వాన్ని గురించి చర్చలు జరిపేవారు. ఇవన్నీ సిద్ధక్షేత్రాలు. ఎందరో మహానుభావులు తరించిన చోటది.

ఈ ఋషీశ్వరులు అరణ్యంలో నివసించే ప్రదేశాలే ఆశ్రమాలు. ఇవి సామాన్యంగా వెదురుకర్రలు, రెల్లుగడ్డితో నిర్మించబడేవి. శాస్త్రప్రకారం అరణ్యంలో బ్రాహ్మణుడి నివాసం ఒక చెట్టు. ఆ చెట్టుక్రిందకూచుని తపస్సు చేసుకోవాలి. దగ్గరలో ఉన్న నదిలోస్నానంచెయ్యటం, కందమూలాలు తినటం. చెట్టుక్రింద కూర్చుని తపస్సు చేసుకోవటం. ఇతనికి ఆశ్రమం అంటే ఎండ వానల నుంచి తలదాచుకోవటం కోసం మాత్రమే. ఒకవేళ ఇతనికి వివాహమైతే అప్పుడు ఆశ్రమం యొక్క ఆవశ్యకత ఏర్పడేది.

గణపతి స్వామివారు దత్తాత్రేయుడి జననం మీద ఉపన్యాసాలు చెప్పారు. ఆ ఉపన్యాసాలన్నీ కలిపి కుప్పా కృష్ణమూర్తి గారు **ఆత్మదానము** అనే పేరుతో పుస్తకం వ్రాశారు. మూడు సంవత్సరాల క్రితం 2011 జనవరిలో నా సిడిల ఆవిష్కరణ కోసం స్వామివారి ఆశ్రమానికి వెళ్ళాను. ఆ సమయంలోనే ఆత్మదానము అనే పుస్తకం కూడా ఆవిష్కరణ జరిగింది. ఒక కాపీ నాకిచ్చారు స్వామివారు. మీ అనుజ్ఞ అయితే దీన్ని సిడిగా చేస్తాను అన్నాను. సరే అన్నారు తరువాత

దానిమీద ఉపన్యాసాలు చెప్పి సిడిగా చేసి 2012 జనవరిలో స్వామివారికి సమర్పించాను. అది దత్తాత్రేయుడి జననం. వివాహం కాక ముందు అత్రిమహర్షి తపస్సు చేయటం అనసూయాదేవితో వివాహం పరబ్రహ్మ సాక్షాత్కారం, సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే దత్తుడిగా జన్మించటం, ఇవి ఆ పుస్తకంలోని విశేషాలు.

నిజంగా చెప్పాలంటే అది ఒక అద్భుతమైన పుస్తకం. ఆ పుస్తకం ముందు పెట్టుకుని నేను చెబుతున్నాను. గదిలో ఎవరూ లేరు. నేను ఒక్కడినే ఉపన్యాసాలు చెబుతున్నాను. రికార్డింగ్ జరుగుతోంది. అత్రిమహర్షి ఆశ్రమజీవనం. ఆయన రోజూ నదికి వెళ్ళి స్నానంచేసి వచ్చేవారు. అలా వెడుతుంటే ఒకరోజున త్రోవలో ముల్లు గుచ్చుకుంటుంది. ఆ రోజు సాయంత్రం నారదుడు వస్తాడు ఆశ్రమానికి. కాలికి ఏమైంది అని అడిగాడు నారదుడు. ముల్లుగుచ్చుకుంది అన్నాడు అత్రిమహర్షి. త్రోవంతా ముళ్ళు, రాళ్ళు లేకుండా ఎవరైనా బాగుచేస్తే బాగుండును అంటాడు. మర్నాడు మహర్షి వెళ్ళేసరికి త్రోవంతా శుభ్రంగా ఊడ్చి ఉంటుంది. మాటల సందర్భంలో అంటాడు నారదుడితో. 'నారదా! ఎవరో ఈ రోజు త్రోవంతా శుభ్రం చేశారు.' అని. ఇంకెవరు? అమ్మ అనసూయాదేవే అయి ఉంటుంది అంటాడు నారదుడు. అద్భుతమైన సన్నివేశం. నేను ఉపన్యాసం చెబుతున్నంతసేపు నా కనుల ముందు కదలాడుతూనే ఉంది. అత్రిమహర్షి. కాళ్ళకి ముళ్ళు గ్రుచ్చుకున్న తీరు. అనసూయాదేవి త్రోవ శుభ్రంచెయ్యటం, అంతా నా కళ్ళ ముందు జరుగుతోంది. నేను ఉపన్యాసం చెబుతున్నాను పుస్తకం చూసి కాదు. నా కళ్ళకు కనిపిస్తున్న దృశ్యం చూసి. అత్రిమహర్షి తపస్సు చేస్తున్నాడు. తెల్లని పంచె మోకాళ్ళ వరకు కట్టుకున్నాడు. పైనఉత్తరీయాన్ని నడుముకు బిగించాడు.

చేతులకు, మెడలో రుద్రాక్షలు, నల్లని జుట్టు నెత్తిన ముడిపెట్టబడి ఉంది. పెరిగిన గడ్డం ఒంటికాలి మీద నుంచున్నాడు. కుడికాలి మీద నుంచుని, ఎడమకాలు ఎత్తి కుడిమోకాలు దగ్గర ఆనించి రెండు చేతులు పైకి ఎత్తి పెట్టి నమస్కారం చేస్తున్నాడు. ఆ స్థితిలో అలా నిలబడే తపస్సు ఆచరిస్తున్నాడు. ఆయన సమాధిలోంచి ఎప్పుడు బయటకు వస్తాడో ఆయనకు ఏం కావాలో? అవి సమకూర్చటానికి అతనిదగ్గరలో ఒక చెట్టుకు ఆనుకుని ఒంటికాలిమీద నుంచునిఉంది అనసూయాదేవి. ఎడమకాలు నేలమీద ఉంది. కుడికాలు మడిచి చెట్టుకు ఆనించింది. చేతులు కట్టుకుని ఉంది. ఆకుపచ్చ కల్నేతచీర, ఎరుపుబార్డరు. తెల్లజాకెట్టు ధరించిఉంది. నేను చెబుతున్నంత సేపు అత్రిమహర్షి అనసూయాదేవి నా కళ్ళముందే ఉన్నారు. తరువాత దత్తుడు చిన్నపిల్లవాడు వచ్చీ రాని నడకతో పరుగులు పెడుతూ వస్తున్నాడు. ఇతన్నీ ప్రత్యక్షంగా చూసి, అనుభవించి చెప్పింది **'దత్త జననము'** అనే సి.డి. ఆత్మదానము అనే పుస్తకము. వీలైతే చదవండి. లేదా వినండి. ఆ ఆత్మానుభూతిని మీరుకూడా పొందండి.

ఆ పుస్తకంలో అరణ్య ప్రాంతం ఎలా ఉంటుందో మహర్షి ఆశ్రమం ఎలా ఉంటుందో అన్నీ వివరించి చెప్పారు. కళ్ళకు కట్టినట్లు కనిపిస్తాయి. తలచుకుంటే ఇప్పటికి కూడా నా కళ్ళ ముందు నుంచుంటారు అత్రిమహర్షి అనసూయాదేవి, బాలదత్తుడు. అంతా అనుభవైక వేద్యం.

అవి ఋషుల ఆశ్రమాలు అంటే. పగటిపూట సూర్యుడు, రాత్రి చంద్రుడు. ఇద్దరూ ఇంట్లోనే ఉంటారు. వచ్చినప్పుడల్లా వరుణుడు కూడా ఇంట్లోనే ఉంటాడు. అక్కడ అంతా నిరాడంబరత, సత్యము,

ధర్మాల ప్రతీక ఈ ఆశ్రమాలు. రాగద్వేషాలకు చోటుండదు. అవి ఆశ్రమాలు అంటే. ఆ ఆశ్రమాలలో నివసించేవారు మహర్షులు. వీరంతా ఎవరో తెలుసా? పూర్వకాలంలో సమాధిస్థితిలో ఉండి వేదమంత్రాలను దర్శించిన ఆప్తఋషుల సంతతివారే. అదే పరంపర. వీరిలో కొందరు గృహస్థులు. కొందరు వానప్రస్థులు. మరికొందరు సన్యాసులు. గృహస్థులు వానప్రస్థులు అక్కడే ఆశ్రమాలు నిర్మించుకుని జీవిస్తుంటారు. కాని సన్యాసులు మాత్రం నిరంతరం సత్యాన్వేషణలోనే కాలం గడుపుతూ, ఒంటరిగా అడవుల వెంబడి, కొండల వెంబడి తిరుగుతుంటారు. ఆర్యావర్తంలో నివసించే వారే మహర్షులు. వారినుంచే సకల మానవులు సదాచారాన్ని, సచ్ఛీలతను నేర్చుకోవాలి. వారే శిష్టాచార సంపన్నులు.

అరిషడ్వర్గాలను జయించి సదాచార ప్రవర్తకులై తమయొక్క తపోబలంతో అన్ని విద్యలు కరతలామలకంగా ప్రకాశించే ఆర్యావర్తవాసులైన మహర్షులే శిష్టాచార సంపన్నులు. అర్జునుడు భగవానుణ్ణి అడుగుతాడు. ఓ దేవా ! శిష్టాచారులు అంటే ఎవరు? అని. దానికి భగవానుడు చెబుతాడు. "అర్జునా! అరణ్యాలలో కందమూలాలు తింటూ, అరిషడ్వర్గాలను జయించి, నిరంతరము సత్యాన్వేషణలో కాలం గడుపుతూ ఉండే మహర్షులు ఏ ఆచారాన్ని పాటిస్తారో, అదే శిష్టాచారము" అంటాడు. విద్య రెండు రకాలుగా ఉంటుంది. 1. హాదివిద్య 2. కాదివిద్య. హాదివిద్యలో నియమాలు నిష్టలు ఎక్కువ ఉంటాయి. కాదివిద్యలో వాటికి అంత ప్రాముఖ్యత ఉండదు. కొంత వరకు సడలింపు ఉంటుంది. ఏది ఏమైనా ఆర్యావర్తంలో పుట్టిన మహర్షుల నుంచే మానవులందరూ మంచి శీలము, సదాచారము నేర్చుకోవాలి.

ఆర్యావర్తంలో ఉండే ఋషులు తమ పూర్వీకులు ఏ పద్ధతులనైతే అనుసరించారో, వారుకూడా అదే పద్ధతి అనుసరించారు. వ్యవసాయం చేశారు. వారికి కావలసిన ధాన్యాలు పండించుకున్నారు. గోసంరక్షణ చేశారు. గోమాతను దేవతగా పూజించారు. గోసంపదను పూర్తిగా అనుభవించారు. అడవిలో తిరిగే లేళ్ళు, దుప్పులు, జింకలు వంటి వాటిని తమ పిల్లలలాగానే చూసుకున్నారు. ఆశ్రమ ప్రాంగణంలో చిలుకలు, గోరువంకలు మొదలైన పక్షులను కూడా పెంచారు.

అగ్నిని ఉపాసించటం అనేది సంప్రదాయం. ఋగ్వేదంలో ప్రధాన దేవత ఇంద్రుడు, తరువాత అగ్ని. కాగా యజుర్వేదంలో ప్రధాన దేవత అగ్ని. దేవతలకు ఇచ్చిన ఆహుతులను అగ్ని దేవతలకు అందజేస్తాడు. కాబట్టి అగ్నికి ప్రాముఖ్యత అనేది ఉండేది. అంతే కాకుండా మనకు ఏది కావాలన్నా అగ్నినే ప్రార్థించేవారు. అగ్నిదేవుడే అన్ని కోరికలు తీరుస్తాడు. శ్రీసూక్తంలో కూడా చూడండి. ధనధాన్యాలు, సిరిసంపదలు ఇచ్చే లక్ష్మీదేవిని నాకు అనుగ్రహించవలసింది అని అగ్నిదేవుణ్ణి ప్రార్థిస్తారు. వారు అనేక రకాల కర్మలు చేసేవారు. ఇష్టులు. (కోరికలు తీరటానికి చేసే హోమాలు) యాగాలు, యజ్ఞాలు ఎక్కువగా చేసేవారు. ఇక్కడ ఒక విషయం గమనించండి. ఏది కావాలన్నా వేదంలో యజ్ఞం చెయ్యండి అన్నారు. అంతేకాని పారాయణ చెయ్యండి. జపం చెయ్యండి అని చెప్పలా. ధనంకావాలి. శ్రీసూక్తాన్ని హోమంచెయ్యండి. విష్ణుసూక్తాన్ని హోమం చెయ్యండి. ఋభుసూక్తాన్ని హోమం చెయ్యండి అంతేకాని వాటిని పారాయణ చెయ్యండి అని వేదంలో ఎక్కడా చెప్పలా. యజ్ఞయాగాది క్రతువులు, హోమాలు చెయ్యటమనేది సామాన్యమైన విషయం కాదు. ఖర్చుతోకూడినపని. అందుకే రాను రాను యజ్ఞయాగాలు తగ్గిపోయినాయి. మంత్రశాస్త్రం అభివృద్ధి చెందింది.

పారాయణ, జపం, తపం వంటివి మంత్రశాస్త్రంలో చెప్పారు. ధనం కావాలంటే శ్రీసూక్తాన్ని వందసార్లు పారాయణ చేసి ఒకసారి హోమంచెయ్యండి అన్నారు. ఏ మంత్రమైనా సరే జపానికి, పారాయణకి ప్రాముఖ్యత ఇచ్చి, హోమాన్ని తగ్గించారు. కారణం సామాన్య మానవుడికి యజ్ఞయాగాలు కష్టమైనవి.

ఆ రోజుల్లో స్వర్గంకావాలి అని యాగం చేసేవారు. అదే మనకి కఠోపనిషత్తు. గౌతముడు అనే మహర్షి. స్వర్గలోకం కోసం 'విశ్వజిత్' అనే యాగం చేస్తున్నాడు. ఈ యాగానికి చేయవలసింది ఏమిటి? తనకున్నటువంటి ఆస్తిమొత్తాన్ని భార్య, పిల్లలు, తను. అందరికీ పంచెయ్యాలి. అందులో తనకు కూడా వాటా వస్తుంది. అందరికీ ఆస్తిపంచిన తరువాత, తనకు వచ్చిన భాగాన్ని అందరికీ ఇచ్చెయ్యాలి. యాగంలో ఆఖరుదశ ఇది. దానాలు ధర్మాలు చెయ్యటం. చివరగా గోదానం ఇవ్వటం. సన్యాసం తీసుకో తలచుకున్న వారుకూడా ఇలాగే తమకున్న ఆస్తిని అందరికీ దానం చేసి కట్టుకున్న బట్టలు కూడా వదిలేసి సన్యాసాశ్రమం స్వీకరించాలి. కాని మనవారు చూడండి. సన్యాసం తీసుకోవాలి అంటే ముందుగానే ఆస్థిపాస్థులన్నీ చాలా పుకడ్బందీగా అందరికీ ఇచ్చి, సన్యాసి అయిన తరువాత తనకు రోజూ భోజనం ఎవరు పెడతారు. ఇత్యాదులన్నీ జాగ్రత్తగా చూసుకుని అప్పుడు సన్యాసం తీసుకుంటున్నారు. ఈ మధ్యన ఒకాయన గవర్నమెంటు ఉద్యోగం చేసి రిటైరయ్యారు. పెన్షను రూ. 40,000/- వస్తుంది. కంచిస్వామి వారి దగ్గరకు వెళ్ళి 'స్వామీ! నేను సన్యాసం తీసుకోవాలనుకుంటున్నాను. మీరు నాకు ఇప్పించాలి' అన్నాడు. ఆయన ఒక్క క్షణం ఆలోచించి 'అలాగే నీ పేర ఉన్న ఆస్తిపాస్తులన్నీ ఇతరులకు ఇచ్చెయ్యి. నీకు వచ్చే పెన్సన్ కూడా గవర్నమెంటుకు

సరెండరు చేసి అప్పుడు రా! అన్నారు. ఆస్థులు అంటే పిల్లల పేరు మీద రాసేస్తాడు. కాని పెన్షను ఎలా? దాన్ని ఇంకొకళ్ళకి ఇవ్వరు కదా. చూస్తూ చూస్తూ నెలకు నలభై వేల రూపాయలు వదలుకోవాలి. సామాన్యమైన విషయం కాదు. అందుకే మళ్ళీ స్వామివారికి కనిపించలా. ఇది జరిగి షుమారు ఎనిమిది సంవత్సరాలైంది. అంతేకాదు ఇంకొక గొప్ప విషయం ఏమంటే ఇంకొకాయన ఇలాగే పెన్షను నలభై వేలు వస్తుంది. సన్యసించాడు. ఈ మధ్యన ఏదో పీఠానికి అధిపతి కూడా అయ్యాడని విన్నాను. పెన్షను మాత్రం మామూలుగానే తీసుకుంటున్నాడు.

ఇలాంటికాదు గౌతముడు చేసిన యాగం. తన సర్వస్వాన్నీ దానం చేశాడు. చివరకు తన కుమారుడు నచికేతుణ్ణి యముడికి దానం చేశాడు. యమధర్మరాజు దగ్గర అగ్నిచయనంతో పాటు బ్రహ్మవిద్యను కూడా తెలుసుకున్నాడు నచికేతుడు. అప్పటినుంచే అగ్నిచయనము అనే ఆక్రతువు **'నాచికేతాగ్ని చయనము'** అని పిలువబడుతున్నది.

అగ్నిదేవుడి తరువాత ప్రత్యక్ష దైవం సూర్యుడు. అని గతంలో మనం చెప్పుకున్నాం. అగ్నిదేవుడే అంతరిక్షంలో సూర్యుడు అని పిలువబడుతున్నాడు. ఇప్పుడు సూర్యారాధన చేశారు. త్రిసంధ్యల యందు సూర్యుణ్ణి ఉపాసించారు. ఆ సూర్యుడు సకల దేవతా స్వరూపుడు. ఆయనే పరబ్రహ్మ. సర్వవేదసారం గాయత్రి అన్నారు. గాయత్రీ మంత్రానికి అధిదేవత సవిత. అంటే సూర్యుడు. **'ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్'** ఆరోగ్యానికి సూర్యోపాసన చెయ్యాలి. పూర్వకాలంలో **'ప్రస్కణ్యుడు'** అనే మహర్షి సమాధిస్థితిలో మూడుమంత్రాలు దర్శించి, వాటిని ఉపాసించి తన చర్మరోగాన్ని పోగొట్టుకున్నాడు. ఆ మూడు మంత్రాలనే తృచ భాస్కరము అంటారు. తరువాత కాలంలో

భాస్కరరాయల వారు తృచభాస్కరము అనే పేరుతో సూర్యోపాసన వ్రాశారు. నేటికీ ఆరోగ్యం కోసం సూర్యోపాసన చేయబడుతోంది. వేదంలో చెప్పిన సౌరం, అరుణం అన్నీకూడా సూర్యోపాసన మంత్రాలే. ఇవన్నీ నిత్యపారాయణలో చేరిపోయినాయి.

## 9. అరణ్యకాలు ఏం చెబుతున్నాయి?

కర్మకాండకి జ్ఞానకాండకీ మధ్య వారధి అరణ్యకాలు. ఈ మాట గతంలో చెప్పుకున్నాం. అయితే సంహిత మంత్రభాగం. బ్రాహ్మణాలు సంహితకు వివరణ. జాగ్రత్తగా పరిశీలిస్తే ఈ రెండింటికీ పెద్ద తేడాలేదు. రెండూ ఒకటే. సంహిత భాగంలో చెప్పిన వాటిని సోదాహరణంగా, విపులంగా వివరించాయి బ్రాహ్మణాలు అంతే. మానవుడు లౌకిక జీవితంలో పొందాల్సిన సిరిసంపదలు, భోగభాగ్యాలు, ఉన్నత పదవులు వీటిని సాధించటానికి మార్గాన్ని చూపిస్తోంది. అదే కర్మకాండ. సంహిత బ్రాహ్మణాలు చెప్పేదిదే. మరి ఉపనిషత్తులు కేవలం జ్ఞానకాండ. కర్మకాండ నుంచి మానవుడు జ్ఞానకాండ వైపుకు ఎలా ప్రయాణిస్తాడు? ఇది ప్రశ్న దీనికి మార్గం చూపేవే అరణ్యకాలు. బ్రాహ్మణాల వరకు కర్మకాండను ప్రబోధించిన వేదాలు అరణ్యకాలలో జ్ఞానబోధను ప్రారంభించినాయి.

# 10. కర్మనుంచి - జ్ఞానానికి

మానవ జీవితంలో ప్రతిరోజూ ఐదు రకాల యజ్ఞాలు చెయ్యాలి 1. దేవయజ్ఞం 2. పితృయజ్ఞం 3. భూతయజ్ఞం 4. మనుష్య యజ్ఞం 5. బ్రహ్మయజ్ఞం.

1. ఇంద్రాది దేవతల పేరుతో అగ్నిలో ఆహుతులను సమర్పించటం దేవయజ్ఞం.
2. పితృదేవతలకు ప్రతిరోజు తర్పణలు ఇవ్వటం పితృయజ్ఞం.
3. పశువులు, పక్షులు, క్రిమికీటకాలకు ఆహారం సమకూర్చటం భూతయజ్ఞం.
4. వచ్చిన అతిథులను సత్కరించటం మనుష్య యజ్ఞం.
5. వేదాధ్యయనం చెయ్యటం బ్రహ్మయజ్ఞం.

ఈ ఐదురకాల యజ్ఞాలు ప్రతిరోజూ ప్రతివారు చెయ్యాలి. ఈ రోజున కూడా నిష్ఠాగరిష్ఠులైన వారి ఇళ్ళల్లో ఈ ఐదుయజ్ఞాలు జరుగుతూనే ఉంటాయి. ఈ ప్రక్రియ ఏర్పాటు చేసింది ఋషీశ్వరులే.

ఈ ఋషీశ్వరులే ఆధ్వర్యం వహించి మహారాజులతో అనేక రకాల యాగాలు చేయిస్తుండేవారు. అశ్వమేధము, రాజసూయము, వాజపేయము వంటి యాగాలు కూడా చేయించేవారు. ఈ యాగాలన్నీ ఉభయ తారకాలు. అంటే ఇటు ప్రజాక్షేమం కోసం, అటు రాజుకు కీర్తి ప్రతిష్ఠ సార్వభౌమాదికారం కోసం జరుగుతుండేవి. ఉదాహరణకు అశ్వమేధయాగం చూడండి. మంచి లక్షణాలున్న గుర్రాన్ని యజ్ఞపశువుగా చేసి జరిపే యాగంఇది. సంవత్సరం కాలంపాటు చేసే యాగం. ఇహము పరము రెండూ ఇందులో ఉన్నాయి.

అరణ్యకాలలో అశ్వమేధానికి విపరీతమైన ప్రాముఖ్యత ఉన్నది. అశ్వము సకలదేవతాస్వరూపము. అశ్వమేధం యజ్ఞసర్వస్వం ఇది సకల సృష్టికి సంకేతం.

వంద అశ్వమేధయాగాలు చేసినవాడు ఇంద్రపదవికి అర్హుడు అన్నారు. దానికి ఉదాహరణ నహుషుడు. ఆ రోజుల్లో రాజులు చాలామంది అశ్వమేధయాగాలు చేశారు. మిగిలిన యాగాలు రాజసూయము, వాజపేయము వంటివి ఉన్నాయి కాని, అవి చేసిన వారు తక్కువ. రాజసూయం ధర్మరాజు చేశాడు. అంతకుముందు కాలంలో హరిశ్చంద్రుడు చేశాడు అని చెప్పారు. వాజపేయము ఇది పేరు మాత్రమే తెలుసు. చేసిన రాజులు తెలియరు. అశ్వమేధం మాత్రం చాలామంది చేశారు. సగరుడు, దశరథుడు, రాముడు, నహుషుడు, ధర్మరాజు ఇలా చాలామంది చేశారు.

కలియుగంలో ఈ యాగాలు నిషిద్ధము అన్నారు. కాని గతంలో మన ముఖ్యమంత్రి ఒకాయన అశ్వమేధం చేశాడు అంటారు. షుమారు పది సంవత్సరాల క్రితం హైదరాబాదులో ఒకాయన ఈ యాగం చేశాడు. ఇప్పటికీ ఎప్పుడైనా ఆయన దగ్గర నుంచి ఉత్తరాలు వస్తుంటాయి **'అశ్వమేధయాజి'** అని. అయితే అశ్వమేధం క్షత్రియులు మాత్రమే చెయ్యాలి అని చెప్పబడింది. కాని ఈ అశ్వమేధయాజి బ్రాహ్మణుడు.

ఇలా అనేకానేక యాగాలు జరిగిన తరువాత ఋషులలోనే కొంత మార్పు వచ్చింది. దీనికి కారణం గతంలోనే చెప్పుకున్నాం. వ్యయభారం ఎక్కువ. శ్రమ కూడా చాలా ఎక్కువ. దాంతో యాగాలస్థానంలో ఉపాసనావిధానము వచ్చింది. అంటే ఇందాక చెప్పినట్లుగా మంత్రశాస్త్రం వచ్చింది. మంత్రాలు అది వరకు లేవని

కారు. వాటి ఉపాసనా విధానం క్రొత్తగా ఏర్పాటయింది. దాంతో భక్తికి బీజం ఏర్పడింది. ఉపాసన అంటే – ఏకాగ్రమైన మనస్సుతో జపించటము అని అర్థం. దానికే పతంజలి మహర్షి చెప్పాడు అష్టాంగ మార్గంలో ధారణ, ధ్యానము, సమాధి. ఇందులో కర్మ కలాపము అనేది లేదు. అంతా ధ్యానమే. యజ్ఞయాగాలు సామూహికంగా జరుగుతాయి. కాని జపతపాలు ఎవరికి వారు వంటరిగా చేసుకునేవి. మొదటగా ఓంకారోపాసన. దీన్ని గురించి ఉపనిషత్తులలో ముందర పేజీలలో వివరంగా చెప్పబడింది. కొన్ని ఉపనిషత్తులు ప్రత్యేకంగా ఓంకారాన్ని వివరించాయి. ఆ తరువాత రకరకాల దేవతల ఉపాసన. అగ్నివాయువు. సూర్యుడు, గణపతి, శివుడు, విష్ణువు, లక్ష్మి, సరస్వతి, రాజరాజేశ్వరి. వీటికి సంబంధించిన ఉపాసనవిధానాలన్నీ ఉపనిషత్తులలో చెప్పబడ్డాయి. అంటే ఋషులే చెప్పారు. ఈ రకంగా కర్మకాండ నుంచి క్రమంగా ఉపాసనాకాండ వైపుకు దారి మళ్ళింది. ఈ మధ్యలో భక్తిమార్గం ఏర్పడింది. భక్తితత్త్వము అనేది వైష్ణవంలోనే ఉంది అనుకుంటారు. కాని అలాకాదు. శైవంలోను భక్తితత్త్వం ఉంది. భక్తకన్నప్ప కనిపిస్తున్నాడు కదా. అలాగే శాక్తేయంలోనూ ఉంది. తామసభక్తి, రాజసభక్తి, సాత్వికభక్తి అని భక్తి మూడు రకాలు అంటోంది దేవీ భాగవతం. దీన్నుంచే మోక్షసాధన. వేదంలో ఎక్కడా మోక్షము అనేది చెప్పలేదు. అంటే సంహిత భాగం, బ్రాహ్మణాలు పూర్తిగా కర్మకాండనే చెబుతాయి. ఆ తరువాత మోక్షమార్గము అనేది ఏర్పడింది. ముక్తి నాలుగు రకాలు అని, ఐదు రకాలని చెప్పబడింది.

ముక్తికోపనిషత్తులోను, శివానందలహరిలోను ముక్తి నాలుగురకాలు చతుర్విధ ముక్తులు అన్నారు. అలాగే శాక్తేయంలోను, మహానారాయణోపనిషత్తులోను ఐదు రకాల ముక్తి పంచవిధముక్తుల గురించి చెప్పారు.

ఆ రోజులలో వేదాంత విద్య బాగా వ్యాపించిందీ క్షత్రియులలో కూడా కాశీరాజు అశ్వపతి, జనకుడు, ప్రవాహణుడు అరణ్యకాల ద్వారా పురూరవుడు (వీరి వంశంలో 47వ వారే శ్రీరామచంద్రమూర్తి) మొదలైనవారు బ్రహ్మవిద్యలో నిష్ణాతులు. అలాగే యాజ్ఞవల్క్యుడు ఈయన పేరు తెలియని వారుండరు. ఇలాటి వారు అనేకమంది

ఈ రకంగా మహర్షులు అరణ్యాలలో కూచుని చర్చలు చేసి కర్మకాండ నుంచి ఉపాసనాకాండ, భక్తికాండలకు వాటి నుంచి మోక్షమార్గం వైపుకు ప్రజల మనసులను మళ్ళించటంలో కృతకృత్యులైనారు.

# 11. కర్మకాండ, జ్ఞానకాండల సమన్వయము

ఐతరేయారణ్యకంలో పురుషుడు నాలుగు రకాలు అని చెప్పబడింది. 1. శరీర పురుషుడు 2. ఛందో పురుషుడు 3. వేదపురుషుడు 4. మహాపురుషుడు

1. దైహికమైన ఆత్మే శరీరపురుషుడు అనబడతాడు.
2. అక్షరాత్మకమైన గాయత్రి, త్రిష్టుప్, అనుష్టుప్ మొదలైన ఛందస్సమూహాన్ని ఛందోపురుషుడు అంటారు.
3. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణ వేదములలోని పరదేవతను వేదపురుషుడు అంటారు.
4. రోజులు, వారాలు, పక్షాలు, మాసాలు, అయనాలు వీటన్నింటితో కలిసిన సంవత్సరమే మహాపురుషుడు. అదే కాలపురుషుడు.

**హాయనాత్మా మహాదేవః ప్రజాపతి రితిస్మృతిః** అంటున్నాయి యామళ గ్రంథాలు.

కాలపురుషుడే ప్రజాపతి. ఇలా ఒక్కొక్క మెట్టు ఎక్కుతూ ప్రజాపతి దగ్గరకు వచ్చారు. ఏ పురుషుడైతే సర్వప్రాణుల యందు వినబడకుండా, కనబడకుండా, చూడబడకుండా ఉంటూ అన్నింటినీ వింటూ, చూస్తూ, తెలుసుకుంటూ ఉంటాడో అతడే ఆత్మ. అంటోంది ఐతరేయారణ్యకం.

ఆ విరాట్పురుషుని వాక్కు నుంచి పృథివి, అగ్ని, ముక్కు నుంచి అంతరిక్షం వాయువు, చెవుల నుంచి దిక్కులు, మనసు నుంచి చంద్రుడు, ఇలా సృష్టి జరిగింది అని చెబుతున్నాయి. పురుషుని దేహంలో పృథివి శరీరంగాను, అగ్ని వంటిలోని వేడిగాను, ఆకాశం ముక్కు రంధ్రాలు గాను, జలం రేతస్సుగాను వాయువు ప్రాణంగాను

చెప్పబడింది. అంటే పంచమహాభూతాల సమావేశమే పురుషుడు అన్నారు.

యజ్ఞయాగాలను మోక్షదృష్టితో కూడా చెయ్యవచ్చు అని చెబుతోంది కౌషీతకీ అరణ్యకం.

తైత్తిరీయోపనిషత్తులో తాత్త్విక విషయాలు చెప్పబడ్డాయి. భూః భువః సువః అనే మూడు వ్యాహృతులను ఓంకార సహితంగా జపం చేస్తే మోక్షమార్గం చేరవచ్చు అంటోంది ఈ అరణ్యకం. జగత్తులోని అన్ని లోకాలు బ్రహ్మలోకంలోని అంతర్భాగాలే. ఆ బ్రహ్మలోకమే విరాడ్రూపమైన ఆత్మయొక్క స్థానము. అక్కడ జన్మమృత్యు జరాదులు ఉండవు. అక్కడ పునర్జన్మ అనేది ఉండదు. కాబట్టి అటువంటి లోకానికి చేర్చమని మానవుడు ప్రార్థించటం మొదలుపెట్టాడు. తత్త్వజ్ఞాన సముపార్జన చేసినవారు మాత్రమే ఈ లోకం చేరగలరు.

చరాచరాత్మకమైన సృష్టిని గురించి, మోక్షోపాయం గురించి, చెప్పే పురుష సూక్తం ఈ అరణ్యకానికి మణిపూస, వేయితలలు, వేయికాళ్ళు, వేయి చేతులు ఉన్న పురుషుడే విరాట్పురుషుడు. ఇక్కడ వేయి అనేది అనేకము అనే అర్థంలో వాడటం జరిగింది. జగత్తులో ఉన్న జీవరాశి అంతటి యొక్క శిరస్సులే ఇక్కడ వేయి శిరస్సులు. అంటే చరాచర జగత్తులోని జీవకోటికి ప్రతీక విరాట్పురుషుడు. ఆ పురుషుని నుంచే 84 లక్షల జీవరాశి, సూర్యచంద్రులు, అగ్ని, వాయువు, భూమి, ఆకాశం అన్నీ ఆవిర్భవించటం జరిగింది. జగత్తే ఆ పురుషుడు. పురుషుడే ఆ జగత్తు.

యజ్ఞయాగాలన్నీ మానవుణ్ణి తత్త్వమార్గంలోకి మళ్ళించటానికి

ఉపయోగిస్తాయి. తత్త్వజ్ఞాని అయిన మానవుడి శరీరంలో మానసిక యజ్ఞం నిరంతరం కొనసాగుతూనే ఉంటుంది అది ఎలా అంటే–

చిత్తి అంటే – నిర్వికల్పమైన మనస్సు. హోమసాధనమైన స్రుక్కు.

చిత్తము అంటే – యజ్ఞవేదిక

దానిమీద పరచిన దర్భలు – సవికల్ప నిర్వికల్ప జ్ఞానవిషయాలు

అగ్ని – వాక్పతి

వాక్కుకు కారణభూతుడైన వాయువు – హోత

మనస్సు – ఋత్విక్కు

ప్రాణము – హవిస్సు.

తత్త్వజ్ఞాని శరీరంలో నిరంతర యజ్ఞం జరుగుతుంది. ఈ విధంగా అరణ్యకాలు కర్మకాండ నుంచి జ్ఞానకాండకు బాటవేసి, తత్త్వోపదేశం ద్వారా మోక్షమార్గం చూపుతున్నాయి. ఈ రకంగా కర్మజ్ఞానకాండల సమన్వయాన్ని చూపుతున్నాయి అరణ్యకాలు.

# 12. ఐతరేయారణ్యకము

ఋగ్వేదానికి గల శాఖలలో శాకలశాఖ ఒకటి. ఆ శాకలశాఖకు సంబంధించినది ఐతరేయారణ్యకము. యాజ్ఞవల్క్యుడికి ఇద్దరు భార్యలు. కాత్యాయని మైత్రేయి. కాత్యాయనిని ఇతర అని పిలిచేవాడు. ఆ ఇతర యొక్క కుమారుడే ఐతరేయుడు. అతను చెప్పినదే ఈ అరణ్యకం. ఐతరేయారణ్యకము.

ఈ అరణ్యకానికి షడ్గురుశిష్యుడు, సాయణుడు ఇద్దరూ భాష్యం వ్రాశారు. వారి ప్రకారం చూస్తే షడ్గురుశిష్యుడు దీనికి మోక్షప్రదవిభాగమని పేరు పెట్టాడు. ఇందులో 4 అరణ్యకాలు, 18 అధ్యాయాలు 61 ఖండలు ఉన్నాయి. అదే సాయణుడు వ్రాసిన భాష్యంతో 5 అరణ్యకాలు, 18 అధ్యాయాలు 61 ఖండలు ఉన్నాయి.

ఐతరేయారణ్యకంలోని మొదటి అరణ్యకం పూర్తిగా కర్మకాండను చెబుతోంది. 'గవామయనము' అనే యాగం ఒక సంవత్సర కాలం చెయ్యాలి. ఈ అరణ్యకంలో అనేక కర్మలు నిరూపించబడ్డాయి. ఇక్కడ విషయం ఏమంటే బ్రాహ్మణాలు పూర్తిగా కర్మకాండను చెప్పాయి. అయితే అరణ్యకాలు ముందు కర్మకాండతో ప్రారంభమయి ఆ తరువాత జ్ఞానకాండ వైపు సాగిపోయినాయి. చాలా ఉపనిషత్తులు ఈ అరణ్యకాలలో భాగాలయినాయి.

కర్మలు చెయ్యటం వల్ల మానవుడు తాత్కాలికంగా ప్రయోజనం పొందుతాడు. వీటివల్ల వచ్చేది కేవలము క్షణికానందం. మరి శాశ్వతమైన ఆనందం కావాలంటే ఏం చెయ్యాలి? ఈ విషయం మీద ఆలోచనలు చేశాడు దానికి సమాధానం దొరికింది. అదే ఆత్మదర్శనం. అంటే ఆత్మసాక్షాత్కారమన్న మాట. ఈ విషయం నిశ్చయమైన తరువాత

ఆత్మసాక్షాత్కారం అంటే ఏమిటి? అని ఆలోచించాడు. చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. ఆ పరమేశ్వరుణ్ణే నేను. అనే విషయం. మనసా వాచా కర్మణా అనుభవంతో తెలుసుకోవాలి. ఇలా తెలుసుకోవాలంటే దానికి తగిన జ్ఞానం కావాలి. అందుకే అరణ్యకాలలో మానవుడి ప్రయాణం జ్ఞానంవైపు సాగింది. అంటే అరణ్యకాలలో ముందు కర్మలను వివరించినప్పటికీ తరువాత జ్ఞానబోధ వైపు సాగింది. ఈ కారణంచేతనే అరణ్యకాలలో ఒకవైపు కర్మ, ఇంకొక వైపు జ్ఞానము రెండూ కనిపిస్తాయి. అందుచేతనే ఐతరేయారణ్యకంలోని రెండవ అరణ్యకం ఐతరేయోపనిషత్తును చెబుతున్నది. మొదటి అరణ్యకంలో గతంలో చెప్పినట్లుగా గవానయనం, దానిలో వైదిక కర్మలు చెప్పినా, రెండవ అరణ్యకం నుంచి జ్ఞానబోధ చెయ్యటం జరిగింది.

## 1. శరీరము హిరణ్మయము

ఇది చాలా అద్భుతమైన విషయం. శాస్త్రవేత్తలకు అందని విషయం. గర్భం ఏర్పడిన తరువాత దానికి తీసుకోవలసిన జాగ్రత్తలు చెప్పగలరు వైద్యులు. కాని పిండం ఎలా ఏర్పడుతుంది అనే విషయం మాత్రం ప్రశ్నార్థకమే. చరాచర జగత్తుకు కారణమైన వాడు, ప్రాణస్వరూపి అయిన బ్రహ్మ మానవ శరీరాన్ని సృష్టించాడు. చివరకు ఆ శరీరంలో తాను లేకపోతే ఎలా? అనుకున్నాడు. శరీరంలో ప్రవేశించాలి అని నిశ్చయించుకున్నాడు. అలా ప్రవేశించటానికి రెండు మార్గాలున్నాయి. ఒకటి పైనుంచి బ్రహ్మరంధ్రం ద్వారా, రెండవది క్రింద నుంచి ఇప్పుడు పరమేశ్వరుడు రెండవ మార్గాన్ని ఎంచుకున్నాడు. కాలివ్రేళ్ళ ద్వారా శరీరంలో ప్రవేశించాడు. మానవ శరీరంలోకి

ప్రాణమనేది కాలివ్రేళ్ళనుంచే ప్రవేశించింది. కాబట్టే వాటికి **'ప్రపదము'** అని పేరొచ్చింది. మానవుడికైతే కాలివ్రేళ్ళు ఉన్నాయి. మరి జంతువుల కాళ్ళకి వేళ్ళు ఉండవు కదా? అక్కడ ఏం జరిగింది? ఇది అనుమానం. పశువులలో గిట్టల ద్వారా ప్రవేశించాడు. అందువల్ల గిట్టలకే ప్రపదము అని పేరు వచ్చింది. ప్రాణి ఏదైనాసరే దాని కాలిచివరిభాగం నుంచే ప్రాణం ప్రవేశించింది అని గుర్తుంచుకోవాలి. ఈ రకంగా కాలివేళ్ళని ఆశ్రయించిన ప్రాణం ఊరువుల నాశ్రయించి ఇంకా పైకి వెళ్ళింది. ఆ తరువాత మనం తిన్న పదార్థాలు నిలబడటానికి ఖాళీ ప్రదేశం కావాలి. అందుకనే 'ఉదరం' ఏర్పడింది. ఉదరం దాకా వచ్చిన ఆ పరమేశ్వరుడు నాకు ఇంకొంచెం ఖాళీ ప్రదేశం కావాలి అనుకున్నాడు. హృదయం ఏర్పడింది. ఈ రకంగా జీవసృష్టి జరిగింది.

పరబ్రహ్మ నుంచే దేవతలు, దేవతల నుంచి వర్షము, వర్షం నుంచి ఓషధులు, ఓషధుల నుంచి అన్నము, అన్నం నుంచి రేతస్సు, రేతస్సు నుంచి ప్రజలు, ప్రజల నుంచి సారభూతమైన హృదయం, హృదయసారం నుంచి మనస్సు, మనస్సు నుంచి వాక్కు, వాక్కు నుంచి కర్మలు, కర్మలవల్లనే శరీరము ఏర్పడుతున్నది. ఈ శరీరము ఇరామయము. ఇర అంటే అన్నము అని అర్థం. ఇరామయం కాబట్టే హితరమణీయ మవుతున్నది. అందువల్లే శరీరము హిరణ్మయము అనబడుతున్నది.

అయితే ఐతరేయోపనిషత్తులోని 21వ మంత్రంలో పరమేశ్వరుడు శిరస్సులోని బ్రహ్మరంధ్రం ద్వారా శరీరంలోకి ప్రవేశించాడు అని, దానికి 'విదృతి' అని పేరు. ఇది ఆనంద స్థానము అని చెప్పబడింది.

## 2. హింకారోపాసన

'అహం' ఈ శబ్దంలో ఉన్న అచ్చును వదిలేసినట్లైతే మిగిలేది 'హం'. ఇప్పుడు ఈ పదాన్ని హింకరించి అర్థం చెప్పాలి. మహావ్రతంలో ఒకరోజులో పూర్తయ్యే యాగం ఉంది. అందులో హింకారం నిష్కేవల్యమవుతున్నది. అసలు హింకారంతో ఈ యాగం ప్రారంభమవుతుంది. అందుకే ఈ యాగానికి కూడా హ్రీంకారము అని పేరు వచ్చింది. హ్రీంకారము పరబ్రహ్మ చేత ప్రతిపాదింపబడింది. అది పరబ్రహ్మను పొందే సాధనం కూడా. అందుకే హ్రీంకారము అంటే పరబ్రహ్మమే. అని ఉపాసన చెయ్యాలి.

హింకారం పురుషుడు. ఋక్కు స్త్రీ. ఈ రెండూ కలిపి మిధునము అని ఉపాసన చేస్తే సంతానం కలుగుతుంది.

పొలంలో పంట పండాలంటే ముందు పొలాన్ని త్రవ్వాలి. ఆ తరువాత విత్తనాలు జల్లాలి. అప్పుడు ధాన్యము పుష్కలంగా పండుతుంది. అలాగే హింకారమనే గడ్డపారతో వేదం అనే నేలను గట్టిగా తవ్వి అన్ని రకాల సంపదలు పొందవచ్చు. గడ్డపారతో నేలను తవ్వి వ్యయసాయం చేసిన వాడు ఏ రకంగా ధాన్యాన్ని పొందుతాడో, అదే విధంగా హింకారోపాసన చేసినవాడు తన కోరికలు సిద్ధింప చేసుకుంటాడు. అని చెబుతోంది ఐతరేయారణ్యకం.

## 3. ఉదరోపాసన

లోకంలో మానవుణ్ణి సృష్టించే సమయంలో కాలివేళ్ళ ద్వారా శరీరంలోకి ప్రవేశించాడు. ఇప్పుడు పైకి వెళ్ళటం ప్రారంభించాడు.

అలా పైకి వెళ్ళి తొడల వరకు వచ్చి అక్కడి నుంచి ఏ అంగం ద్వారా పైకి వ్యాపించాడో అది ఉదరమైంది. పరబ్రహ్మ జీవుడితో 'ఉరుగృణీహి' ఓ జీవుడా ! ఆహారాన్ని దాచుకునేందుకు విస్తీర్ణమైన ఖాళీ ప్రదేశాన్ని నిర్మించవలసింది అన్నాడు. ఈ రకంగా బ్రహ్మ చెప్పటం వల్ల అది 'ఉదరము' అనబడింది. దానికి ఉదరమనే పేరు ఏర్పడింది.

శర్కరాక్షి మహర్షి చాలా గొప్పవాడు బ్రహ్మవేత్త. ఆయన కుమారులు శార్కరాక్ష్యులు. ఈయన పంచాగ్నుల మధ్య కూర్చుని చాలాకాలం తపస్సు చేశాడు. పంచాగ్నులు అంటే నాలుగువైపులా అగ్నులు. ఐదవది పైన నెత్తిమీద సూర్యుడు. ఇలా తపస్సు చేసి సూర్యమండలాన్ని వీక్షించాడు సూర్యమండలాన్ని వీక్షించటము అంటే సమాధిస్థితిలో ఉండి సూర్యమండలాన్ని వీక్షించటము. అంతేకాని కళ్ళు తెరిచి సూర్యుణ్ణి చూడటం కాదు. నా చిన్నప్పుడు కళ్ళు పరీక్ష చేయించుకోవటానికి ఒకసారి డాక్టరు దగ్గరకు వెళ్ళాను. నా ముందు ఒకతను వచ్చాడు. అతనికి పరీక్ష చేశారు డాక్టరు గారు. నేను అక్కడే ఉన్నాను. పరీక్ష చేసి 'ఏమయ్యా! సూర్యగ్రహణం మామూలుగా చూశావా? అన్నారు. అవును. అన్నాడతను నవ్వుతూ" అయితే అనుభవించు. రెటీనా తగలడిపోయింది. నీకు కొంతవరకే చూపు వస్తుంది. పూర్తిగా మాత్రం రాదు. ఇంకా కొన్నిసార్లు అలా వట్టికళ్ళతో గనక సూర్యుణ్ణి చూశానంటే నిన్ను చెయ్యి పట్టుకుని ఎవరైనా తీసుకువెళ్ళవలసి వస్తుంది జాగ్రత్త" అని చెప్పారు.

సూర్యోపాసన చేసేవాళ్ళు కొంతమంది ఇలా వట్టి కళ్ళతో సూర్యుణ్ణి చూస్తుంటారు. అది కూడా మధ్యాహ్నం గం. 12-30 లేదా ఒంటిగంట సమయంలో ప్రతిరోజూ అలా చూస్తూనే ఉండేవాళ్ళు. తలపైకి ఎత్తి సూర్యుణ్ణి చూస్తూ ఏవో మంత్రాలు చదువుతుండే వారు.

అది కాదు చెయ్యవలసినది. సూర్యుణ్ణి దర్శించటం అంటే సమాధి స్థితిలోనే దర్శించాలి. లేకపోతే కళ్ళు పోతాయి. పరమేశ్వర స్వరూపాన్ని చర్మచక్షువులతో వీక్షించలేము.

ఈ మహర్షి సూర్యమండలాన్ని వీక్షించటం ద్వారా దృఢమైన కనులు గలవాడు. అందుకే ఆయన శర్కరాక్షుడు అని ప్రసిద్ధి చెందాడు. ఆయన కుమారులు ఆత్మసాక్షాత్కారం పొందటం కోసం ఉదరమే పరబ్రహ్మ అనే భావనతో ఉపాసన చేశారు.

## 4. హృదయోపాసన

పరబ్రహ్మ ఉదరంలో ప్రవేశించి నాకు విస్తీర్ణమైన స్థానాన్ని కల్పించమని అడిగాడు. అప్పుడు ఉదస్సు అంటే హృదయం కల్పించబడింది.

పరమేశ్వరుడు ఎక్కడ ఉన్నాడు అంటే హృత్పద్మంలోనే ఉన్నాడు అని చెబుతాం. ఉద్ధవగీతలో భగవానుడు చెబుతాడు. నేను ఎక్కడో లేను. నీ హృత్పద్మంలోనే ఉన్నాను అని

పూర్వకాలంలో అరుణుడు ఒక మహర్షి. గొప్ప బ్రహ్మవేత్త. ఆయనని అందరూ అరుణమహర్షి అని పిలిచేవారు. ఆయన కుమారులు అరుణులు. వీరందరూ హృదయాన్నే బ్రహ్మగా ఆరాధించి తరించారు.

## 5. ప్రాణోపాసన

ప్రాణం శ్రేష్ఠమైనది. కాబట్టి ప్రాణమే బ్రహ్మగా ఉపాసన చెయ్యాలి. అని ఈ అరణ్యకం చెబుతోంది. దీనికి ఒక కథ కూడా చెప్పబడింది.

ఒకసారి శరీరంలోని ఇంద్రియాలు అన్నీ చిన్న సభ పెట్టి

మాట్లాడుకున్నాయి. ఆ సమయంలో వాటిలో వాటికి చిన్న సందేహం వచ్చింది. వాటిలో ఎవరు గొప్ప? అన్ని ఇంద్రియాలు నేను గొప్ప అంటే నేను గొప్ప అన్నాయి. వాదన ముదిరిపోయింది ఎంతకీ తేలలేదు. దాంతో మనమంతా కలిసి బ్రహ్మదేవుడి దగ్గరకు వెడదాం. ఆయన నిర్ణయానికి బద్దులం అవుదాం అనుకున్నాయి. అన్నీ కలిసి బ్రహ్మలోకం వెళ్ళినాయి. ప్రజాపతికి తమవాదం వినిపించి ఓ ప్రజాపతీ! మాలో గొప్పవారెవరో నీవే తేల్చవలసింది. అన్నాయి.

దీనికి నాదాకా రానవసరం లేదు. ఒక చిన్న సూచన పాటించండి. శరీరాన్ని వదలి మీలో ఒక్కొక్కరే ఒక ఏడాదిపాటు వెళ్ళిపోండి. సంవత్సరం తరువాత తిరిగి రండి. ఇలా వెళ్ళినప్పుడు ఎవరు లేకపోతే శరీరం అచేతనమవుతుందో వారే శ్రేష్ఠులు. వారే గొప్పవారు. తెలుసుకోండి అన్నాడు.

సరే అన్నాయి ఇంద్రియాలు. తిరిగి భూలోకం చేరాయి. శరీరంలో ప్రవేశించాయి. ఇప్పుడు మొదటగా కన్ను శరీరాన్ని వదిలి బయటకు వెళ్ళిపోయింది. సంవత్సరం పూర్తి కాగానే అనుకున్న ప్రకారము తిరిగి వచ్చింది. మిగిలిన ఇంద్రియాలతో “నేను లేకపోతే ఎలా ఉంది?” అని అడిగింది. దానికి మిగిలిన ఇంద్రియాలు “నువ్వు లేకపోతే ఏమీ నష్టం రాలేదు. లోక వ్యవహారాలన్నీ మామూలుగానే నడిచాయి. లోకంలో ఎంతమంది గ్రుడ్డివారు జీవించటం లేదు? వారికి లాగానే ఈ శరీరమూ ఉన్నది” అన్నాయి. మాట్లాడకుండా శరీరంలో ప్రవేశించింది కన్ను. ఇప్పుడు చెవి వంతు వచ్చింది. శరీరం నుంచి బయలుదేరి వెళ్ళిపోయింది శ్రవణశక్తి సంవత్సరం తరువాత తిరిగి వచ్చి “నేను లేకపోతే శరీరం ఎలా ఉన్నది? అని అడిగింది. ఇందాక

చెప్పిన సమాధానమే ఇప్పుడూ చెప్పాయి మిగిలిన ఇంద్రియాలు. మారు మాటాడకుండా శరీరంలో ప్రవేశించింది శ్రవణశక్తి. ఇలా శరీరంలోంచి ఒక్కొక్క ఇంద్రియమే బయటకు వెళ్ళి తిరిగి వచ్చినాయి. చివరకు ప్రాణము వంతు వచ్చింది. శరీరంలోంచి బయటకు వెళ్ళటానికి సిద్ధపడింది. కదులుతోంది. ఎప్పుడైతే ప్రాణం వెళ్ళటానికి సిద్ధపడిందో ఆ మరుక్షణంలోనే శరీరంలో అవయవాలన్నీ స్తంభించటం ప్రారంభించాయి. శరీరంలో కదలిక ఆగిపోతోంది. అర్ధమైంది ఇంద్రియాలకు. ఇంద్రియాలన్నింటిలో గొప్పది ప్రాణము. అని తెలిసింది.

వాగాది దేవతలంతా నీవే శ్రేష్ఠమైన దానివి అని ప్రాణాన్ని అంగీకరించాయి. అప్పుడు ప్రాణం ఇంద్రియాలన్నింటినీ వాటి పనుల్లో నియోగించింది.

| | | |
|---|---|---|
| ప్రాణమే | – | ప్రాతఃకాలం |
| వాక్కు | – | అగ్ని |
| చక్షువు | – | ఆదిత్యుడు |
| మనస్సు | – | చంద్రుడు |
| శ్రోత్రం | – | దిక్కులు |

ఇలా వాగాదులన్నింటికీ ప్రాణమే బ్రహ్మ. విశ్వామిత్రుడు, వామదేవుడు, అత్రి, భరద్వాజుడు, వశిష్టుడు, సామాన్యుడు ఇలా ఎన్నో పేర్లున్నాయి అని ఐతరేయారణ్యకం చెబుతోంది. కాబట్టి ప్రాణమే బ్రహ్మగా ఉపాసన చెయ్యాలి.

## 6. ఆత్మోపాసన

**"ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీన్నాన్యత్కించనమిషత్"** సృష్టికి ముందు ఏమీ లేదు. జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యాన్ని ఆక్రమించి పరబ్రహ్మ ఒక్కడే ఉన్నాడు. అప్పుడు పరబ్రహ్మ లోకాలు సృష్టించాలి అనుకున్నాడు. అంభస్సు, మరీచి, మరం (పృథివి) జలం అనే వాటిని సృష్టించాడు. లోకపాలకులను సృష్టించాడు. ఓషధులు వనస్పతులను సృష్టించాడు. అగ్ని మొదలైన దేవతలను కూడా సృష్టించాడు. మానవ శరీరంలో ప్రవేశించిన పరమాత్మకు మూడు స్థానాలున్నాయి. అవే జాగ్ర స్వప్న సుషుప్తులు. పరమాత్మ సాహచర్యం వల్లనే ఈ మూడు జీవుడికి కలుగుతున్నాయి. **ఆత్మస్వరూపం తెలిసినవాడు నిద్రపోయినా మేలుకునిఉన్నట్లే. ఆత్మస్వరూపం తెలియనివాడు మేలుకుని ఉన్నా నిద్రపోతున్నట్లే.**

చరాచర జగత్తంతా ఆత్మస్వరూపమే. ఈ విషయం తెలుసుకుని ఆత్మని ఉపాసన చెయ్యాలి.

## 7. నిర్భుజోపాసన

వాక్కును ఉపాసించే విధానం ఇక్కడ చెప్పబడుతోంది.

| | |
|---|---|
| కచటతప వర్గులు | – పృథివీ రూప భావన |
| శషసహ | – అంతరిక్ష భావన |
| అచ్చులు | – స్వర్గభావన |
| స్పర్శవర్ణాలు | – అగ్నిభావన |
| వాయువులో | – ఊష్మవర్ణాలు |
| ఆదిత్యునిలో | – అచ్చులు |

ఋగ్వేదంలో - స్పర్శవర్ణాలు

యజుర్వేదం - ఊష్మవర్ణాలు

సామవేదం - స్వరాలు

ఇలా భావన చెయ్యాలని చెబుతోందీ అరణ్యకం.

## 8. సంహితోపాసన

అక్షరాల సంశ్లేషాన్ని సంహిత అంటారు. ఈ సంహితను పరబ్రహ్మగా ఉపాసన చెయ్యటమే సంహితోపాసన.

వీరుడు అంటే - వాఙ్మయాన్ని సంపాదించిన వాడు

శూరుడు అంటే - అనుష్టాన దక్షుడు

మాండుకేయుడిలో ఈ రెండూ ఉన్నాయి. కాబట్టి ఆయన వీరుడు, శూరుడు, శూరవీరుడు.

మాండూకేయ పుత్రుడు మనస్సు పూర్వరూపమని, వాక్కు ఉత్తర రూపమని, ప్రాణమే సంహిత అని చెప్పాడు. తండ్రి కొడుకు ఇద్దరూ కూడా ప్రాణమే సంహిత అని చెప్పారు. సంహితోపాసన చేసిన వారు సంతానం, పశువులు, కీర్తి బ్రహ్మవర్చస్సు, స్వర్గము పొందుతారు.

## 9. ఇంద్రోపాఖ్యానము

ఐతరేయ అరణ్యకానికి సంబంధించినది ఈ ఉపాఖ్యానము. ఇందులో ప్రారంభంలోనే ఇంద్రోపాఖ్యానం గురించి చెబుతున్నారు. ఇది మహావ్రతము అంటున్నారు. ఏది మహావ్రతము అంటే సోమపానము చాలా విశేషమైనది. సోమరసము తుష్టి, పుష్టి

కలగచేస్తుంది. ధైర్యాన్ని బలాన్ని ఇస్తుంది. సోమరసము అమృతంతో సమానమైనది. సోమరసం త్రాగిన వారికి ఆయురారోగ్య ఐశ్వర్యాలు కలుగుతాయి. సోమలత చాలా చిన్నలత. సంవత్సరానికి ఏడు ఆకులు మాత్రమే దీనికి వస్తాయి అని కొన్నిచోట్ల చెప్పబడింది. ఇందులో మొత్తం 14 రకాలు ఉన్నట్లుగా తెలుస్తోంది. సోమలతను సేకరించి తెచ్చేవారు వేరే ఉంటారు. వారి దగ్గర సోమలతను కొనాలి. దీనికి పరిహారంగా గోవులను అర్పించటం ఆచారం. ఇలా గోవులను మారక ద్రవ్యంగా ఇచ్చి తీసుకున్న సోమలతను చాలా పవిత్రంగా భావించాలి. యజమాని ఆ సోమలతను నెత్తిన పెట్టుకుని వేదమంత్రాలు చదువుతూ తీసుకురావాలి. వచ్చిన తరువాత వేదమంత్రాలలో దాన్ని కొయ్యరోలు రోకలి, లేదా కొయ్య తిరగలిలో వేసి ఈ లతను తిప్పాలి. అప్పుడు ఆ లత అంతా నలిగిపోయి ఆకుపచ్చని రంగులో రసం వస్తుంది. ఆ రసాన్ని ఉన్ని వస్త్రంలో వడబోయాలి. తరువాత దానిని కుండలు, బానలలో పోసి జాగ్రత్త చెయ్యాలి. యజ్ఞం జరుగుతున్నప్పుడు ఈ సోమరసాన్ని నేతితో గాని, తేనెతో గాని కలిపి హోమం చెయ్యాలి. అలా హోమం చెయ్యగా మిగిలిన దాన్ని ఋత్విక్కులు, యజమాని, పానం చేస్తారు. ఇంద్రాది దేవతలను పిలిచినప్పుడు వారికి ఆహుతులతో పాటుగా సోమరసాన్ని కూడా ఇస్తారు. సోమరసమంటే దేవతలకు అత్యంత ప్రీతి. ఇంద్రుడికి సోమరసమంటే మరీ ఇష్టము. వృత్రాసురసంహారం కోసం మూడు చెరువుల సోమరసాన్ని త్రాగాడట ఇంద్రుడు. ఆ బలంతోనే వృత్రాసుర సంహారం చేశాడు అంటున్నారు. అప్పటినుంచి ఇంద్రుడు గొప్పవాడయినాడు. అందుకే ఇంద్రుడు చేసిన వ్రతము మహావ్రతం అన్నారు. గొప్పవాడైన ఇంద్రుణ్ణి ప్రసన్నుడిగా చేసుకోవటం కోసం ఈ వ్రతాన్ని ఆచరించటం జరుగుతుంది. అందుకే

మహాబలవంతుడైన వృత్రాసుర సంహారం జరిగిపోయింది. ఇంద్రుణ్ణి ఉద్దేశించి ఈ వ్రతం చెయ్యండి అని చెప్పబడింది. సాయణభాష్యం ప్రకారం ఇంద్రుణ్ణి ఉద్దేశించి చేయబడిన వ్రతం కాబట్టి దీన్ని మహావ్రతము అంటారు అని చెప్పటం జరిగింది.

## 10. ప్రజాపతి ఉపాఖ్యానము

'తదిదాస' అనే ఋగ్వేద మంత్రాన్ని వ్యాఖ్యానిస్తూ తత్ అనే శబ్దం యొక్క విశేషాన్ని చెప్పేందుకు గాను ఈ ఉపాఖ్యానం చెబుతున్నారు. ప్రజాపతి జగత్తును సృష్టించి తకారంతో మొదలుపెట్టి శబ్దోచ్చారణ ప్రారంభించాడు. మొదటగా 'తత' అన్నాడు. ఆ తరువాత 'తాత' అన్నాడు. ప్రజాపతి తన చేత సృష్టించబడిన హిరణ్యగర్భుడిని 'తాత' అని పిలిచాడు. అందుచేతనే ఇప్పటికి తల్లితండ్రులు తమ పిల్లల్ని 'తాత' అనే పితృవాచక శబ్దంతో పిలిచి ఆనందిస్తున్నారు. ఈ రోజుకు కూడా తల్లితండ్రులు తమ పిల్లల్ని అలా పిలవటం ఆచారంగా ఉన్నది.

## 11. విశ్వామిత్రోపాఖ్యానం

ఒకసారి సోమయాగం జరుగుతోంది. ఆ యాగంలో విశ్వామిత్రుడు హోత. అటువంటి సమయంలో ఇంద్రుడు విశ్వామిత్రుని వద్దకు వచ్చి అన్నాన్ని అర్థిస్తాడు. ఒక్కక్షణం మౌనం పాటించాడు విశ్వామిత్రుడు. ఇంద్రుడి అభిప్రాయం తెలిసింది అతడికి. వెంటనే ఓ ఇంద్రా! ఇదే నీకు అన్నము అంటూ బృహతీ ఛందస్సులో ఉన్న వేయి మంత్రాలు చెప్పాడు. విశ్వామిత్రుడు అలా చెప్పటంవల్ల ఇంద్రుడు స్వర్గాన్ని పొందాడు. ఆ మంత్రాలను ఓ మహర్షీ ! మళ్ళీ చదవండి

అన్నాడు. ఇప్పుడు విశ్వామిత్రుడు ఈ మంత్రాలను రెండుసార్లు పఠించాడు. దాంతో ఇంద్రుడి అనుగ్రహానికి పాత్రుడైనాడు విశ్వామిత్రుడు. ఇంద్రుడు మహదానందంతో ఓ మహర్షీ! నీకేం కావాలో కోరుకో అన్నాడు. ఏం కోరుకోవాలో తెలియలేదు. విశ్వామిత్రుడికి ఒక్కక్షణం ఆలోచించి దేవేంద్రా నీ తత్త్వాన్ని తెలుసుకోవాలి అనుకుంటున్నాను అన్నాడు. అప్పుడు ఇంద్రుడు ఓ మహర్షీ! "ఈ జగత్తులో సర్వం ప్రాణమయం. ఆదిత్యాది రూపాలతో అన్నిదిక్కులందు వ్యాపించింది. నేనే. నాకు అన్నమే ప్రీతికరమైనది. అన్నం వృద్ధి హేతువు. శ్రేయోదాయకం కూడా. అని చెప్పి ఓ మహర్షీ ఈ బృహతీ సహస్రంలో హల్లులు శరీరము. ఊష్మాలు ప్రాణము. ఈ రకంగా ప్రాణమనే శరీర ఆత్మభావన చేతనే వశిష్ఠుడు వశిష్టుడైనాడు. వశిష్టుడనే మహర్షి ఋషులందరిలోకీ గొప్పవాడయినాడు అని ఉపదేశించాడు.

ఈ ఉపాఖ్యానం శాంఖాయనారణ్యకంలో కూడా ఉన్నది.

## 12. విద్యకు అధికారులు

విద్యకు అధికారులు అంటే విద్యాభ్యాసం చెయ్యటానికి అర్హత గలవారు. వీరు మొత్తం మూడు రకాలుగా ఉంటారు. 1) ఉత్తములు 2) మధ్యములు 3) అధములు

1. సంసార బంధనాలు త్రెంచుకుని సర్వకాల సర్వావస్థల యందు ఏకాగ్రమైన చిత్తంతో పరమేశ్వర సాక్షాత్కారంకోసం ప్రయత్నం చేసేవారిని ఉత్తమాధికారులు అంటారు. ఉదా : మునీశ్వరులు, ఋషీశ్వరులు.
2. సంసారంలోనే ఉంటూ ఆత్మతత్త్వాన్ని ఉపాసించేవారు

మధ్యములు అనబడతారు. వీరే మధ్యమాధికారులు.

3. సంసార బంధనాలలో పూర్తిగా చిక్కుకుపోయి ఆత్మతత్త్వాన్ని తెలుసుకోలేని అజ్ఞానులు. ఇందులో ఆత్మతత్త్వాన్ని తెలుసుకున్న ఉత్తమాధికారులకు పునర్జన్మ ఉండదు.

మధ్యమాధికారులు ఉన్నత కుటుంబాలలో పుట్టి జీవితాన్ని చరితార్థం చేసుకుంటారు.

మూడవ కోవకు చెందినవారు సంసార సాగరమనే ఊబిలో చిక్కుకుని గానుగకు కట్టిన ఎద్దులాగా గిరగిరా తిరుగుతూ ఉంటారు.

మనం చేసే యజ్ఞయాగాలు జ్ఞానసముపార్జనకు మార్గాలు కావాలి. జ్ఞానం ద్వారానే మానవుడికి మోక్షం లభిస్తుంది. **'జ్ఞాదేవతుకైవల్యం'** జ్ఞానం వల్లనే ముక్తి లభిస్తుంది. కాబట్టి కర్మకాండ ద్వారా జ్ఞానసముపార్జన చేసి మోక్షం పొందాలి. అని చెబుతోంది ఐతరేయారణ్యకం.

ఈ రకంగా అనేకానేక విషయాలు ఐతరేయారణ్యకంలో చెప్పబడ్డాయి.

# 13. కౌషీతకీ అరణ్యకము

ఋగ్వేదానికి సంబంధించినది శాంఖాయన శాఖ. దీనికి సంబంధించినదే కౌషీతకీ బ్రాహ్మణము. దానిలో పరిశిష్ట భాగమే కౌషీతకీ అరణ్యకము. ఉద్దాలకుడి శిష్యుడు గుణాఖ్య శాంఖాయనుడు. అతని శిష్యుడు కహోల కౌషీతకీ. ఈ కౌషీతకి ప్రవర్తింప చేసిన బ్రాహ్మణము కాబట్టే దీన్ని కౌషీతకీ బ్రాహ్మణము అన్నారు. అందులో చివరి భాగమే కౌషీతకీఅరణ్యకము. ఇందులో మొత్తం 15 అధ్యాయాలు, 146 కాండలు ఉన్నాయి. ఈ అరణ్యకానికి ఎవరూ ఎలాటి భాష్యము వ్రాయలేదు. ఈ కారణంచేతనే దీనికి ప్రాచుర్యం లేదు.

## 1. ఆధ్యాత్మిక అగ్నిహోత్రం

కేవలం కర్మకే కాకుండా ఆధ్యాత్మిక జీవనానికి ఎంతో ప్రాముఖ్యత ఇచ్చింది ఈ అరణ్యకము.

| | | |
|---|---|---|
| జీవుని ప్రాణమే | – | ఆహవనీయము |
| అపానమే | – | గార్హపత్యము |
| వ్యానమే | – | అన్వాహార్యము |
| మనస్సే | – | ధూమం |
| కోపమే | – | అర్చకుడు |
| బొగ్గులు | – | శ్రద్ధ |
| పాలు | – | వాక్కు |
| సమిధలే | – | సత్యం |

వైరాగ్యంతో శరీరాన్ని సంస్కరించాలి. ఆ తరువాత బ్రహ్మయజ్ఞ నిష్ఠతో జీవించాలి. అలా జీవించే వాడికి అపమృత్యుభయం ఉండదు. ఆత్మను గురించి వినాలి. ఆత్మను మననం చేసుకోవాలి. ఆత్మను స్థిరంగా మనసులో నిలబెట్టాలి.

## 2. వేదానికి అర్థం తెలియాలా?

వేదం చదివితే సరిపోతుందా? దాని అర్థం కూడా తెలియాలా? అనే ప్రశ్నను మనం గతంలో చర్చించాము. ఇవి ఆధ్యాత్మిక విషయాలు. అంటే ఎక్కువమందికి వీటిమీద శ్రద్ధ ఉండదు. ఒకటి రెండుసార్లు చదివినా, విన్నా కూడా మరచిపోవటం జరుగుతుంది. అందుకే ఆధ్యాత్మిక విషయాలను అవసరమైనపుడల్లా వివరించటం జరుగుతూనే ఉంటుంది. దీనికి సాహిత్యంలో లాగా పునరావృత్తి దోషము అనేది ఉండదు. అందుకే మళ్ళీ గుర్తు చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నాం. కేవలం వేదం వల్లెవేసినట్లైతే ప్రతిరోజూ వేదం చదివితే టేపురికార్డరుకు ఎటువంటి ఫలితం వస్తుందో, అదే ఫలితం నీకూ వస్తుంది. దానికన్న నువ్వు ఏమీ ఎక్కువ కాదు తక్కువా కాదు. చదివిన దానికి అర్థం దానికీ తెలియదు, నీకూ తెలియదు. మనం చదివే దానికి అర్థం మనకి తెలియకపోతే గాడిద మీద గంధపు చెక్కలు వేసి తీసుకువెడితే గాడిదకు ఏం ఫలితం వస్తుందో, అర్థం తెలియకుండా వేదం చదివేవాడికి, మంత్రం చెప్పే వాడికి అదే ఫలితం వస్తుంది. గాడిద మీద గంధపు చెక్కలు వేసినా, తిరగటి రాళ్ళు వేసినా దానికి ఏమీ తెలియదు. దీనివల్ల దానికి వచ్చేది ఏమిటి అంటే సాయంకాలానికి యజమాని దానిమోహాన గుప్పెడు కాగితాలు పడేస్తాడు తినటానికి.

అలాగే నీక్కూడా యజమాని నాలుగుడబ్బులిస్తాడు అంతే. వేదం చదివిన దానికి నిజమైన ఫలితం రావాలి అంటే దాని అర్థం పూర్తిగా కాకపోయినా కొంతవరకైనా మనకి తెలియాలి. ఒకసారి ఒకచోట ఒక పురోహితుడు ఏదో కార్యక్రమం చేస్తూ తైత్తిరీయోపనిషత్తు చదువుతున్నాడు. ఆయన పెద్దవాడు. చదవటం అయిపోయిన తరువాత మీరు చదివిన దానికి అర్థం తెలుసా? అన్నాను" అర్థం నీ బోటిపురాణం చెప్పుకునే వాళ్ళకి. అంతేకాని మాకు అర్థంతో పనిలేదు" అంటూ తనకు తెలియదు అని నువ్వు పురాణాలు చెప్పుకునేవాడివి. నీతో నాకేంటి ఫో అని ఎంతో అందంగా చెప్పాడు.

ఏతావాతా తేలింది ఏమంటే తాను చదివిన దానికి అర్థం తనకు ఏ మాత్రం తెలియదు. అన్ని మంత్రాలకీ కాకపోయినా కొన్నింటికైనా అర్థం తెలుసుకోండి. అర్థం అంటే ప్రతిపదార్థం అవసరం లేదు. కనీసం ఇందులో ఈ విషయం చెబుతున్నారు. అనే మాటయినా తెలుసుకోవటానికి ప్రయత్నం చెయ్యండి. అప్పుడు చూడండి మీ గౌరవం కొన్నిరెట్లు ఇనుమడిస్తుంది. **వేదార్థం తెలిసిన వాడు సకల శ్రేయస్సులు పొందుతాడు. అన్ని పాపాలు పోగొట్టుకుని స్వర్గాన్ని పొందగలుగుతాడు.** అని చెబుతోంది ఈ అరణ్యకము.

## 3. మహావ్రతం

"హయనాత్మా మహాదేవః ప్రజాపతి రితిస్మృతి" కాలము (సంవత్సరము) ప్రజాపతి స్వరూపము. అని చెప్పుకున్నాం కదా! ఇప్పుడు ఈ మహావ్రతం అనేది కూడా ప్రజాపతి శరీరము. మహావ్రతం ప్రజాపతి శరీరమే కాదు ఇంద్రుడి శరీరం కూడా. ఋగ్ యజుస్సామ మంత్రాలతో నిర్మితమైంది పురుష శరీరము. మహావ్రత స్తోమం 25

భాగాలుగా నిండి ఉంది. నెలకు రెండు పక్షాలు. సంవత్సరానికి పన్నెండు నెలలు. అంటే సంవత్సరానికి 24 పక్షాలు. సంవత్సరం ఒకటి వెరసి ఇరవై ఐదు. శరీరానికి కాళ్ళురెండు, చేతులురెండు, కాలిచేతివ్రేళ్ళు ఇరవై. మొత్తం 24. పురుష శరీరం ఒకటి. వెరసి ఇరవైఐదు. ఈ రకంగా ప్రజాపతి శరీరము, సంవత్సరము ఒకటే అని చెబుతోంది. మహావ్రతం వినియోగించేది 12 అనువాకాలు ఉన్న మంత్రం. ఆ పన్నెండు సంవత్సరానికి నెలలు. పుంలింగం మహాన్ స్త్రీలింగం మహతి.

అగ్నిమహాన్ – పృథివి మహతి

వాయువు మహాన్ – అంతరిక్షం మహతి

బ్రహ్మ మహాన్ – బ్రహ్మణి మహతి

సూర్యుడు బ్రహ్మ – స్వర్గం బ్రహ్మణి ఇలా చెప్పబడింది.

ఒకసారి విశ్వామిత్రుడు తన మంత్రబలంతో ఇంద్రుడి దగ్గరకు వెళ్ళాడు. ఇంద్రుడు విశ్వామిత్రుడితో ఏదైనా వరంకోరుకోమన్నాడు. ఆ మాటలు విన్న విశ్వామిత్రుడు "దేవేంద్రా! నిన్ను తెలుసుకునే జ్ఞానం నాకు ప్రసాదించు. అంతే చాలు" అన్నాడు. ఇంద్రుడు మళ్ళీ చెప్పాడు. విశ్వామిత్రుడు ఇదే మాట చెప్పాడు. ఇలా చాలాసార్లు జరిగింది. అప్పుడు ఇంద్రుడు "ఓ మహర్షీ ! నేను మహాన్, నేనే మహతి. నేనే దేవత, నేనే దేవి. నేనే బ్రహ్మ నేనే బ్రహ్మణిని. స్త్రీ పురుష శబ్దాల సామరస్య రూపాన్ని నేనే. ఓ మహర్షీ! నా తత్త్వం అలానే ఉంటుంది. అది స్త్రీ పురుష విభేదాన్ని అధిగమించే తత్త్వం. ఈ తత్త్వాన్ని అర్థం చేసుకుంటే తపస్సు కూడా చెయ్యనవసరం లేదు." అన్నాడు. అదే పరమేశ్వర తత్త్వం.

# 4. గర్వం పనికిరాదు

ఉపాసన చేసేవాడికి గర్వము పనికి రాదు. నాకు తెలుసు అనే అహంకారం ఉండరాదు. ముఖే ముఖే సరస్వతి. ఎవరి దగ్గర ఏ విద్య ఉన్నదో తెలియదు. వారి దగ్గర ఉన్న విద్య మనకి తెలియాలని ఏమీలేదు. కాబట్టి అందరూ పరబ్రహ్మ స్వరూపులే. ఎవరు తక్కువాకాదు. ఎవరు ఎక్కువాకాదు. ఎవరి దగ్గరి నుంచైనా సరే విద్య నేర్చుకోవటానికి మనం ఎప్పుడూ సిద్ధంగా ఉండాలి. అని చెబుతూ దీనికి ఒక కథ చెప్పారు.

పూర్వకాలంలో గార్గాయణుడు అనే మునీశ్వరుడు ఒక యజ్ఞం చేయాలి అనుకున్న వాడై ఉద్దాలక అరుణి దగ్గరకు వచ్చి ఆ కర్మకాండ పూర్తి చేయించవలసింది అన్నాడు. సరే నన్నాడు ఉద్దాలకుడు. కాని అతనికి వేరే పని పడడంతో తన కుమారుడైన శ్వేతకేతువును పంపించాడు. గార్గాయణి మహర్షి, శ్వేతకేతువు ఇద్దరూ బయలుదేరి వెడుతున్నారు. మార్గమధ్యంలో గార్గాయణి "ఓ శ్వేతకేతూ ! నువ్వు నన్ను ఊర్ధ్వలోకానికి పంపగలవా? లేదూ ఊర్ధ్వలోకానికి వెళ్ళే మార్గం చెప్పగలవా? అని వినయంతో ప్రశ్నించాడు. ఆ మాటలు విన్న శ్వేతకేతువు "ఆ విషయం నాకు తెలియదు. మా తండ్రిగారిని అడిగి వస్తాను" అని తన తండ్రి దగ్గరికి వెళ్ళి విషయమంతా చెప్పాడు. ఆ మాటలు విన్న ఉద్దాలకుడు 'నాయనా ! శ్వేతకేతూ ! ఆ విషయం నాక్కూడా తెలియదు. గార్గాయణినే అడిగి తెలుసుకుందాము' అని చెప్పి కుమారుడితో కలిసి గార్గాయణి ముని దగ్గరకు వచ్చి "ఓ మహర్షీ! నన్ను మీ శిష్యుడిగా అంగీకరించండి" అన్నాడు. ఆ మాటలు విన్న గార్గాయణి "ఓ ఉద్దాలకా! నువ్వు నిజంగా బ్రహ్మజ్ఞానివి. తెలియని

దాన్ని నిజంగానే తెలియదని చెబుతున్నావు. నాతో రా ! నీకు విషయమంతా చెబుతాను. అంటూ ఉద్దాలకుణ్ణి తన వెంట తీసుకువెళ్ళి విషయాన్ని వివరించి చెప్పాడు.

హింకారోపాసన

ప్రతర్ధనోపాఖ్యాన

ప్రాణమే బ్రహ్మ

అజాత శత్రువు – బాలాకి

ఇవన్నీ ఐతరేయారణ్యకములో చెప్పుకోవటం జరిగింది. అందుకే వాటిని మళ్ళీ చెప్పటంలేదు.

## 5. ఉపాసనా పద్ధతి

ఉపాసనా పద్ధతిలో విలక్షణమైన తీరు ఈ అరణ్యకములో చెప్పబడింది.

పృథివి పూర్వరూపం – దివి ఉత్తరరూపం. వాయువు ఆ రెండింటినీ సంధానం చేసే సంహిత అన్నాడు మాండుకేయుడు. శాకల్యుడు అనే మహర్షి ప్రాణాన్ని వెదురు బొంగుతో పోల్చి చిన్న చిన్న వెదురు బొంగులు ఒక శాలలో ప్రధానమైన దూలం మీద ఆధారపడి ఉంటాయి. అలాగే ఆత్మప్రాణం మీద ఆధారపడి ఉంటుంది.

| | | |
|---|---|---|
| ప్రాణం | – | ఊష్మరూపం |
| ఎముకలు | – | స్పర్శరూపం |
| మజ్జ | – | స్వరరూపం |

ఇలా అక్షరాలకు శరీర విడిభాగాలు అనుసంధానం చేసి చెప్పారు.

సూర్యుణ్ణి ఉపాసించాలి అనుకోండి. మనలో ఉన్న అంతరాత్మ

సూర్యుడిలో ఉన్న ఆత్మతత్త్వము ఒకటే. మానవుడు అజ్ఞానంతో కొట్టుమిట్టాడుతున్నప్పుడు అశరీరమైన ప్రజ్ఞాత, ఆ అంతరిక్షంలో వెలిగిపోయే సూర్యుడు ఒక్కటే అని ఉపాసన చెయ్యాలి.

అగ్నిహోత్రం యజ్ఞయాగాలకు, కర్మకలాపాలకు ఆధారభూతం. ఈ అగ్నిహోత్రాన్ని ఆంతరంగికమైన ఆధ్యాత్మికాగ్నితో పోల్చి, ఆత్మని అగ్నిగా భావించి ఉపాసన చెయ్యాలి. దేవతలంతా పురుషునిలోనే ప్రతిష్ఠితమై ఉన్నారు.

| | | |
|---|---|---|
| అగ్ని | – | వాక్కులో |
| వాయువు | – | ప్రాణంలో |
| సూర్యుడు | – | నేత్రంలో |
| చంద్రుడు | – | మనస్సులో |
| దిక్కులు | – | శ్రోత్రంలో |
| జలం | – | రేతస్సులో |

భావించి ఉపాసన చెయ్యాలి.

పురుషునిలోనే దేవతలంతా నివశిస్తున్నారు.

| | | |
|---|---|---|
| వాక్కులో | – | అగ్ని |
| ప్రాణంలో | – | వాయువు |
| అపానంలో | – | విద్యుత్ |
| ఉదానంలో | – | పర్జన్యుడు |
| చక్షువులో | – | సూర్యుడు |
| మనస్సులో | – | చంద్రుడు |
| శ్రోత్రంలో | – | దిక్కులు |
| శరీరంలో | – | పృథివి |

రేతస్సులో - జలం

బలంలో - ఇంద్రుడు

కోపంలో - ఈశానుడు

తలలో - ఆకాశం

ఆత్మలో - బ్రహ్మ

ఇలా దేవతలు, పంచభూతాలు, దిక్కులు అన్ని పురుషునిలోనే ఉంటాయి అని చెబుతున్నారు. అంటే పురుషుడు దివ్యమైన వాడు అని అర్థం. శరీరాన్ని సంస్కరించి, దివ్యత్వ సిద్ధి కలిగించి, ఆ శరీరంలోనే బ్రహ్మయజ్ఞం నిర్వహించాలి. అలా చేసిన వాడు మృత్యువును జయించగలుగుతాడు.

కౌషీతకీ మహర్షి మానవుడు తన పాపాల నుంచి విముక్తుడవ్వాలంటే మూడు రకాల ఉపాసనా విధానాలు చెప్పాడు.

1. త్రిసంధ్యల యందు సూర్యుణ్ణి ఉపాసించాలి
2. సంతానం యొక్క దురద్రుష్టాలను దూరం చెయ్యటానికి చంద్రుణ్ణి ఆరాధించాలి.
3. పూర్ణచంద్రుని ఆరాధిస్తే ఐశ్వర్యం వెంటనే వస్తుంది. అతని పిల్లలు ఎప్పుడూ అతనికన్న ముందుగా చనిపోరు.

## 6. మహావ్రతోపాసన

ఇంద్రుడి యొక్క ఆత్మస్వరూపం ఏది? అంటే వేదాలే. ఈ ఆత్మ స్వరూపాన్ని ఉపాసించటమే మహావ్రతోపాసన. గతంలో మనం చెప్పుకున్నాం మహావ్రతము అంటే – ప్రజాపతి శరీరమే కాదు, ఇంద్రుని

శరీరం కూడా. ఇది సంవత్సర కాలము అన్నాం. కాలానికి ప్రతీక. అందుకే ఈ యాగం కూడా సంవత్సర కాలం చేస్తారు. ఈ మహావ్రతాన్ని అన్ని అరణ్యకాలలోను చెప్పటం జరిగింది. కాని కౌషీతకీ అరణ్యకంలో దాన్ని గురించి చాలా విపులంగా చెప్పారు.

## 7. సంహితోపాసన

సంహితోపాసన అనేది ఆధిదైవతము, ఆధ్యాత్మం అని రెండు రకాలు. ఈ సందర్భంగా సంహిత పృధివ్యాదులన్నింటికీ ఐదు రకాల అంశాలను ప్రతిపాదిస్తోంది. అవి 1. పూర్వరూపం 2. ఉత్తరరూపం 3. సంహిత 4. సంధి 5. సంధాత. ఈ ఐదింటితో కూడిన ఆధిదైవత, ఆధ్యాత్మ విధానాలు పూర్తిగా తెలుసుకుని ఉపాసన చేసిన వారికి పశువులు, బ్రహ్మవర్చస్సు, కీర్తి, ప్రతిష్ఠ, సిరిసంపద, మరణానంతరము స్వర్గలోకం కూడా లభిస్తుందని ఈ అరణ్యకం చెబుతోంది.

## 8. అక్షరోపాసన

దీన్ని వివరించిన వాడు మాండుకేయుడు. ఒక పదాన్ని తీసుకుంటే అందులో పూర్వాక్షరమే పూర్వరూపం అవుతుంది. అలాగే ఉత్తరాక్షరమే ఉత్తరరూపం అవుతుంది. ఈ రెండు అక్షరాల మధ్యన ఉండి, సంధిని కలిగిస్తున్న మాత్ర, ఏదైతే ప్రతిమాత్రను విభజిస్తున్నదో, ఏదైతే ప్రతిస్వరాన్ని తెలియజేస్తున్నదో అదే సంహిత. ఈ సంహితను పూర్తిగా తెలుసుకుని ఉపాసన చేసినవాడికి పూర్ణాయుష్షు, బ్రహ్మవర్చస్సు, సంతానము, కీర్తిప్రతిష్ట, సకలసుఖాలు, స్వర్గము లభిస్తాయి. అని చెబుతోంది ఈ అరణ్యకం.

## 9. కాలసంహితోపాసన

ఇది కాలానికి సంబంధించిన సంహితోపాసన. దీన్ని చెప్పినవాడు ఆర్తభాగుడు.

గతి పూర్వరూపం. నివృత్తి ఉత్తరరూపం. స్థితిసంహిత. స్థితిరూపమైన సంహితలో నిమిషము, కాష్ఠ, కల, క్షణము, ముహూర్తము, అహోరాత్రాలు, పక్షము, మాసము, ఋతువు, అయనము, సంవత్సరము, ఇవన్నీ చెప్పబడుతున్నాయి. ఈ సంహిత ఈ కాలాలను చెబుతున్నది. కాలం-గతి, నివృత్తి స్థితులను తెలియచేస్తున్నా, గత నివృత్తి స్థితిలచేత సమస్తము చెప్పబడుతున్నది అనేది ఆదిదైవతార్ధం.

ఆధ్యాత్మార్ధంలో చూసినట్లైతే భూతకాలం పూర్వరూపం, భవిష్యత్ కాలం ఉత్తరరూపం. ఈ రెండింటి మధ్యన ఉన్న వర్తమాన కాలం సంహిత. ఇదే కాల సంధి. దీన్ని గురించి పూర్తిగా తెలుసుకున్నవాడు సంతానము మొదలైన ఫలితాలను పూర్తిగా పొందుతాడు.

## 10. చతుర్విధ పురుషులు

పురుషులు నాలుగు రకాలుగా చెప్పబడుతున్నారు. 1. శరీర పురుషుడు 2. ఛందః పురుషుడు 3. వేదపురుషుడు 4. మహాపురుషుడు.

1. శరీర పురుషుడంటే - దైహికమైన ఆత్మ
2. ఛందః పురుషుడంటే - అక్షర సమామ్నాయాత్మకమైన గాయత్రి మొదలైన ఛందస్సులు తెలిసినవాడు.
3. వేదపురుషుడు అంటే - నాలుగు వేదాలసారాన్ని

తెలుసుకుని బ్రహ్మ నిష్టుడై యం జ్ఞ వం వ శ త్మ్యాన్ని తెలిసినవాడు.

4. మహాపురుషుడు అంటే – సంవత్సరస్వరూపం తెలిసి ఆత్మకు ఆదిత్యునితో ఉన్న ఏకత్వాన్ని తెలిసినవాడు.

## 11. శరీరంలో దేవతలు

ప్రజాపతి మానవ శరీరాన్ని సృష్టించిన తరువాత దేవతలు ఆ శరీరంలోని వివిధ అంగాలను ఆక్రమించారు.

వాక్కునాది అని – అగ్నివాక్కులో ప్రవేశించాడు

ప్రాణం నాది అని – వాయువు ప్రాణంలో ప్రవేశించాడు

అపానం నాది అని – విద్యుత్ అపానంలో ప్రవేశించాడు

ఉదానం నాది అని – పర్జన్యుడు ఉదానంలో ప్రవేశించాడు

చక్షువు నాది అని – ఆదిత్యుడు చక్షువులో ప్రవేశించాడు

మనస్సు నాది అని – చంద్రుడు మనస్సులో ప్రవేశించాడు

శ్రోతం నాది అని – దిక్కులు శ్రోత్రంలో ప్రవేశించాయి

శరీరం నాది అని – పృథివి శరీరంలో ప్రవేశించింది

రేతస్సు నాది అని - జలం రేతస్సులో ప్రవేశించింది

బలం నాది అని - ఇంద్రుడు బలాన్ని ఆవేశించాడు

మన్యువు నాది అని - మన్యువులో ఈశానుడు ప్రవేశించాడు

తలనాది అని - ఆకాశం తలను ఆవేశించినది

ఆత్మనాది అని - పరబ్రహ్మ ఆత్మని ఆవేశించాడు

ఈ రకంగా దేవతలంతా మానవ శరీరంలోనే ఉన్నారు. అని చెబుతోంది ఈ అరణ్యకం.

## 12. మరణ సూచకారిష్టాలు

మరణకాలం దగ్గర పడింది అని చెప్పటానికి కొన్ని లక్షణాలున్నాయి. సైన్సు ప్రకారం అయితే ఊపిరి సరిగా అందకపోవటం, గుండె, ఊపిరితిత్తులు సరిగా పని చేయకపోవటం, మూత్రపిండాలు పనిచేయకపోవటం, స్పృహ కోల్పోవటం, ఇవన్నీ మరణ సూచకాలు. అలాగే దిగంబరుడైన వ్యక్తి కలలో కనపడటం, తానే దిగంబరుడవటం, శిరస్సు లేకుండా తన శరీరం కనపడటం వంటివి కొన్ని మరణసూచకాలు. ఇవన్నీ ఈ అరణ్యకంలో వివరించారు.

## 13. గార్గాయణి ఉపాఖ్యానము

పూర్వకాలంలో గార్గాయణుడు అనే మునీశ్వరుడు ఒక యజ్ఞం చేయాలి అనుకున్న వాడై ఉద్దాలక అరుణి దగ్గరకు వచ్చి ఆ కర్మకాండ పూర్తి చేయించవలసింది అని అడిగాడు. సరే నన్నాడు ఉద్దాలకుడు. కాని అతనికి వేరే పని పడడంతో తన కుమారుడైన శ్వేతకేతువును

పంపాడు. గార్గాయణి మహర్షి, శ్వేతకేతువు ఇద్దరూ బయలుదేరి వెడుతున్నారు. మార్గమధ్యంలో గార్గామణి "ఓ శ్వేతకేతూ ! నువ్వు నన్ను ఊర్ధ్వలోకానికి పంపగలవా? లేదూ ఊర్ధ్వలోకానికి వెళ్ళే మార్గం చెప్పగలవా? అని వినయంతో ప్రశ్నించాడు. ఆ మాటలు విన్న శ్వేతకేతువు "ఆ విషయం నాకు తెలియదు. మా తండ్రిగారిని అడిగి వస్తాను" అని తన తండ్రి దగ్గరికి వెళ్ళి విషయమంతా చెప్పాడు. ఆ మాటలు విన్న ఉద్దాలకుడు 'నాయనా ! శ్వేతకేతూ ! ఆ విషయం నాక్కూడా తెలియదు. గార్గాయణినే అడిగి తెలుసుకుందాము' అని చెప్పి కుమారుడితో కలిసి గార్గాయణిముని దగ్గరకు వచ్చి "ఓ మహర్షీ! నన్ను మీ శిష్యుడిగా అంగీకరించండి" అన్నాడు. ఆ మాటలు విన్న గార్గాయణి "ఓ ఉద్దాలకా! నువ్వు నిజంగా బ్రహ్మజ్ఞానివి. తెలియని దాన్ని నిజంగానే తెలియదని చెబుతున్నావు. నాతో రా ! నీకు విషయమంతా చెబుతాను. అంటూ ఉద్దాలకుణ్ణి తన వెంట తీసుకువెళ్ళి చెప్పటం ప్రారంభించాడు.

ఈ లోకాన్ని వదిలి చంద్రలోకం చేరిన తరువాత అక్కడి నుంచి జీవులు తిరిగి ప్రయాణం చెయ్యాలి. చంద్రలోకము స్వర్గలోకానికి ద్వారము. శుక్లపక్షంలో చంద్రలోకం చేరిన వారు స్వర్గలోకం పోవటానికి అవకాశమున్నది. కృష్ణపక్షంలో చంద్రలోకంలో చేరితే తిరిగి భూలోకంలో జన్మించాలి. ఎవరైతే పుణ్యకర్మలు చేశాము అని చెప్పగలుగుతారో, వారే స్వర్గానికి పోతారు. పుణ్యకర్మలు తగినంతగా చేయని వారు తిరిగి వర్షం ద్వారా భూలోకానికి వస్తారు. వర్షపు బిందువు నుంచి భూమికి వచ్చిన జీవులు పశువులు, పక్షులు, క్రిములు, కీటకాలుగా జన్మిస్తారు. ఇదంతా కూడా వారి వారి పూర్వకర్మల ననుసరించి జరుగుతుంది. చంద్రలోకం నుంచి భూమి మీదకి రాగానే

కర్మ దేవతలు మీరెవరు? అని అడుగుతారు. అప్పుడు ఆ జీవులు "ఓ కర్మదేవతలారా! నేను చంద్రలోకం నుంచి దిగి వచ్చాను. ఇక్కడి నుండి 12వ నెలలోగాని, 13 నెలలో గాని ఉత్తమ రేతస్సులో నన్నుంచుము. మాతృగర్భం నుంచి మానవుడుగా నన్ను జన్మింప చేయవలసినది. నేను జన్మించిన 12 లేదా 13 నెలలో నాకు జ్ఞానోపదేశం కావాలి. ఓ ఋతుదేవతలారా! నాకు జ్ఞానాన్ని ప్రసాదించండి. ఈ సత్యతపస్సు వల్ల నేను కూడా ఋతు దేవతనే. నేను నువ్వు ఒక్కటే" అంటాడు.

ఇప్పుడు బ్రహ్మలోక మార్గం గురించి చెబుతున్నాడు. దేవయానంలో ప్రయాణమైన జీవాత్మ ముందుగా అగ్నిలోకానికి వెడతాడు. తరువాత వాయులోకము, వరుణ లోకము, ఆదిత్యలోకము, ఇంద్రలోకము, ప్రజాపతిలోకము వెళ్ళి చివరకు బ్రహ్మలోకానికి చేరతాడు. బ్రహ్మలోకంలో 'అరః' అనే సరస్సున్నది. అక్కడ 'యేష్టిహా' ముహూర్తాలు గడుపుతాడు. అక్కడ విరజానది ప్రవహిస్తుంటుంది. ఈ నదిలో స్నానం చేస్తే నిత్యయవ్వనము వస్తుంది. అక్కడ 'ఈల్యాః' అనే వృక్షము, 'సాయుజ్యము' అనే పట్టణము ఉన్నాయి. అపరాజిత అనే సౌధమున్నది. ఆ సౌధంలో ఇంద్రుడు, ప్రజాపతి ద్వారపాలకులుగా ఉంటారు. అందులో 'విభు' అనే వేదిక ఉంటుంది. దానిమీద 'విచక్షణ' అనే తేజోవంతమైన సింహాసనం ఉంటుంది. 'అమితేజాః' అనే గొప్ప పర్యంకముంటుంది. 'మానసి', 'చాక్షుసీ' అనే పేర్లుగల ఇద్దరు దేవకాంతలు చేతులతో పుష్పములు పట్టుకుని జగత్తులను చూపుతూ ఉంటారు. అప్సరసలు, మాతృదేవతలు, నదీమతల్లులు. దాసీజనము అక్కడ సహకరిస్తారు. అక్కడికి చేరిన వారు బ్రహ్మలోక సుఖాన్ని అనుభవిస్తారు. బ్రహ్మ స్వయముగావచ్చి 'నా ఐశ్వర్యాన్ని దర్శించండి. అనుభవించండి. విరజానదిలో స్నానం చెయ్యండి. మీకు ముసలితనం

రాదు' అని చెబుతాడు.

అతని దగ్గరకి 500 మంది అప్సరసలు వస్తారు. ఇవన్నీ బ్రహ్మలోకానుభవాలు. అందులో వందమంది తియ్యని పండ్లు తెస్తారు. వందమంది సుగంధలేపనాలు తెస్తారు. వందమంది పూలమాలలు తెస్తారు. వందమంది సుగంధ ద్రవ్యాలు తెస్తారు. వందమంది అతన్ని అలంకరిస్తారు. అతన్ని అందంగా అలంకరించి బ్రహ్మ దగ్గరకు తీసుకుపోతారు. త్రోవలో 'అరః' అనే సరస్సు చేరతారు. అందులో మానసికంగా స్నానం చేస్తారు. 'యేష్టిహా' ముహూర్తాలు అక్కడ గడుపుతారు. అక్కడ నుంచి విరజానదికి చేరతారు. అందులో కూడా మానసిక స్నానం చేస్తారు. అక్కడ తాము చేసిన పుణ్యపాపాలన్నీ వదిలేస్తారు. తనను ప్రేమించే వారికి పుణ్యాలు ద్వేషించే వారికి పాపాలు చేరతాయి. ఆ సమయంలో అతని నుండి సుఖదుఃఖాలు, పాప, పుణ్యాలు అన్నీ పారిపోతాయి. ఈ విధంగా ద్వంద్వాలన్నీ వదిలి అతడు ఈల్య అనే వృక్షాన్ని చేరతాడు. అప్పుడు బ్రహ్మ యొక్క సుగంధ చైతన్యం ఇతడిలో చేరుతుంది. అతడు సాయుజ్యము అనే పట్టణం చేరతాడు. అక్కడ బ్రహ్మచైతన్యము ఇతనిలో చేరుతుంది. తరువాత ఇంద్రుడు, ప్రజాపతి అనే ద్వారపాలకుల దగ్గరకు వస్తాడు. వారు అత్యంత ప్రేమతో మార్గాన్ని చూపిస్తారు. విభు అనే దివ్య సభావేదిక దగ్గరకు వెడతాడు. అక్కడ బ్రహ్మతేజస్సు అతనిలో ప్రవేశిస్తుంది. విచక్షణ అనే సింహాసనం చేరతాడు. బృహద్రదంతర సామగానాలు ముందు కాళ్ళలో వినిపిస్తాయి. ద్యైత, నౌధనగానాలు వెనక కాళ్ళలో వినిపిస్తాయి. వైరూప్య, వైరాజ, శాక్వర, రైవత ప్రజ్ఞలు ప్రకాశిస్తాయి. ఆ ప్రజ్ఞలతో సంభాషణ జరుగుతుంది. అక్కడ 'అమితౌజసము' అనే తేజోవంతమైన వాహనం కనిపిస్తుంది. అది ప్రాణవాయువు. భూత భవిష్యత్తులు

దానియందు కాళ్ళు, సంపదలు, ఆహారము వెనక కాళ్ళు. భద్రయజ్ఞాయజ్ఞీయములు రెండు శిరస్సులు, బృహద్రథంతర సామగానాలు రెండు ప్రక్క కర్రలు. యజస్సులు అడ్డంగా ఉండే చెక్కలు, సోమలతలు క్రింద ఉన్న చాపలు. ఉద్గీయాలు మెత్తని దిండ్లు. అక్కడ బ్రహ్మ ఆసీనుడై ఉంటాడు. జీవి వచ్చాడు అని తెలిసిన వెంటనే బ్రహ్మ అడుగుతాడు.

బ్రహ్మ : మీరెవరు?

జీవుడు : నేను ఋతుదేవతను, ఈ ఋతుధర్మాలతో నాకు సంబంధము ఉన్నది. ఆకాశం నుంచి శుక్లరూపంలో స్త్రీ గర్భంలో చేరాను. సంవత్సర తేజస్సుగా, అన్ని జీవాత్మలలాగా ఆత్మగా ఉన్నాను. నువ్వు అన్ని జీవాత్మలకు ఆత్మవై ఉన్నావు. నీ లాగా నేనుకూడా ఆత్మనే"

బ్రహ్మ : "నేను ఎవరు"

జీవుడు : నీవు సర్వాత్మవు.

బ్రహ్మ : సర్వాత్మ అంటే ఎవరు?

జీవుడు : ఇంద్రియ దేవతలు కాదు. ప్రాణవాయువు కాదు. అదే సత్యము. అదే సమస్త జగత్తు. నువ్వు కూడా ఈ జగద్రూపమై ఉన్నావు.

బ్రహ్మ : తెలియరాని నా పురుష రూపాన్ని నువ్వు ఎలా తెలుసుకున్నావు?

జీవుడు : ప్రాణవాయువు శ్వాసవల్ల

బ్రహ్మ : స్త్రీ రూపాన్ని ఎలా తెలుసుకున్నావు?

జీవుడు : వాక్కు ద్వారా

బ్రహ్మ : నపుంసక రూపం ఎలా తెలుసుకున్నావు?

జీవుడు : మనస్సు ద్వారా

బ్రహ్మ : వాసనలు ఏ రకంగా తెలుసుకున్నావు?

జీవుడు : ఘ్రాణేంద్రియం ద్వారా

బ్రహ్మ : రూపాన్ని ఎలా తెలుసుకున్నావు?

జీవుడు : నేత్రాల ద్వారా

బ్రహ్మ : శబ్దాన్ని ఎలా తెలుసుకున్నావు?

జీవుడు : శ్రోత్రేంద్రియం ద్వారా

బ్రహ్మ : రసాన్ని ఎలా తెలుసుకున్నావు?

జీవుడు : జిహ్వ ద్వారా

బ్రహ్మ : నువ్వు చేసే కర్మలను ఎలా తెలుసుకున్నావు?

జీవుడు : రెండు చేతుల ద్వారా

బ్రహ్మ : సుఖదుఃఖాలు ఎలా తెలుసుకున్నావు?

జీవుడు : శరీరం ద్వారా

బ్రహ్మ : ఆనందము, రతిసౌఖ్యము, సంతానోత్పత్తి ఎలా తెలుసుకున్నావు?

జీవుడు : ఉపస్థేంద్రియము ద్వారా

బ్రహ్మ : నడవటం ఎలా తెలుసుకున్నావు?

జీవుడు : పాదాల ద్వారా

బ్రహ్మ : సంకల్పాలు, భావాలు, కోరికలు ఎలా

తెలుసుకున్నావు?

జీవుడు : బుద్ధి ప్రజ్ఞతో జలమయమైన ఈ ప్రపంచం అంతా నాదే. నీది కూడా. సమస్త జగత్తు బ్రహ్మమయము. ఈ విషయం తెలిసినవాడు కూడా బ్రహ్మమే.” ఆ మాటలకు ఆనందించిన పరబ్రహ్మ ఓ జీవుడా నువ్వు కూడా ఇక్కడే నాతోపాటుగా అన్ని సుఖాలు అనుభవిస్తూ అజరామరుడవై ఉండవలసింది” అంటాడు అని చెప్పాడు గార్గాయణి మహర్షి.

## 14. బాలాకి

పూర్వకాలంలో కాశీనగరాన్ని ‘అజాత శత్రువు’ అనే రాజు పాలిస్తూండేవాడు. అతడు బ్రహ్మవేత్త. గార్గ్యవంశంలో పుట్టిన బాలాకి అనేవాడు వాచాలుడు. గర్విష్టి. అతడు ఒకసారి కాశీరాజు దగ్గరకు వెళ్ళి “రాజా! నీకు బ్రహ్మోపదేశం చేస్తాను” అన్నాడు. ఆ మాటలు విన్న కాశీరాజు ఆ బ్రాహ్మణుడికి వేయిగోవులు దానమిచ్చి “ఓ వేదవిదుడా! బ్రహ్మవేత్తలు, ఆధ్యాత్మిక చింతనాపరులు అందరూ జనకుని పేరే తలుస్తున్నారు. అతని దగ్గరకే పోతున్నారు. నీ ప్రభావం వల్ల నేను కూడా బ్రహ్మవేత్తనై జనకునితో సమానమైన వాడనిపించుకుంటాను. కాబట్టి నాకు బ్రహ్మోపదేశం చెయ్యవలసినది” అన్నాడు. బాలాకి చెప్పటం మొదలుపెట్టాడు. ఇతణ్ణే “గార్గ్యుడు” అని కూడా అంటారు.

“రాజా! సూర్యునిలో ఉన్న పురుషుడే బ్రహ్మ. అతన్నే నేను ఉపాసిస్తాను” అన్నాడు బాలాకి.

ఆ మాటలు విన్నరాజు సూర్యుని గురించి నాకు తెలుసును. అతణ్ణి అన్ని భూతాలకు మకుటాయమానంగా కాంతివంతంగా నేను ఉపాసన చేస్తాను. అంతేకాని అతను బ్రహ్మకాదు. ఈ రకంగా సూర్యుని ఉపాసించే వారు రాజవుతారు" అన్నాడు.

"చంద్రునిలో ఉన్న పురుషుని బ్రహ్మగా నేను ఉపాసిస్తాను" అన్నాడు బాలాకి.

"చంద్రుడు గొప్పవాడు. తెల్లని వస్త్రాలు ధరించిన సోమరాజు. అంతేకాని చంద్రుడు బ్రహ్మకాదు. ఈ రకంగా చంద్రుని ఉపాసన చేసేవారికి అన్నం లోటురాదు" అన్నాడు కాశీరాజు.

"విద్యుత్తులో పుట్టిన పురుషుణ్ణి బ్రహ్మగా ఉపాసన చేస్తాను" అన్నాడు బాలాకి.

"ఆ విద్యుత్తును మహాశక్తివంతమైన దాన్నిగా నేను ఉపాసిస్తాను. అంతేకాని విద్యుత్తు మాత్రం బ్రహ్మకాదు. ఈ రకంగా అతణ్ణి ఉపాసించేవారు సంతానము పొంది తేజోవంతులు, శక్తివంతులు అవుతారు" అన్నాడు కాశీరాజు.

"ఆకాశంలో ఉన్న పురుసుణ్ణి బ్రహ్మగా ఉపాసిస్తాను" అన్నాడు బాలాకి.

"నేను ఆకాశాన్ని పూర్ణమైన దానిగా, నిశ్చలమైనదానిగా భావించి ఉపాసిస్తాను. ఈ విధంగా ఆకాశాన్ని ఉపాసించేవారు సంతానము, పశువులతో సుఖంగా ఉంటారు." అన్నాడు కాశీరాజు.

"నేను వాయువులో ఉన్న పురుషుణ్ణి బ్రహ్మగా ఉపాసిస్తాను" అన్నాడు బాలాకి.

"నేను వాయురూపంలో. ఓటమి ఎరుగని సేన చేస్తున్నాను.

ఈ విధంగా వాయువును ఉపాసించే వారు శత్రువులను జయిస్తారు" అన్నాడు రాజు.

"నేను జలంలో ఉండే పురుషుణ్ణి బ్రహ్మగా ఉపాసిస్తాను" అన్నాడు బాలాకి.

"జలాన్ని ప్రతిరూపంగా భావించి నేను ఉపాసన చేస్తాను. ఈ విధమైన ఉపాసన చేసిన వారికి అన్నీ వారు కోరిన వస్తువులే లభిస్తాయి" అన్నాడు రాజు.

"అద్దంలో ఉండే పురుషుణ్ణి బ్రహ్మగా భావించి ఉపాసన చేస్తాను" అన్నాడు బాలాకి.

"నేను అద్దంలో ఉండే పురుషుణ్ణి కాంతివంతుడుగా భావించి ఉపాసిస్తాను. ఆ రకంగా ఉపాసించినవాడు దీప్తిమంతుడౌతాడు. అతని సంతానం కూడా దీప్తివంతమవుతుంది అన్నాడు అజాత శత్రువు.

"మనం నడిచేటప్పుడు వెనుక నుంచి వచ్చే శబ్దాన్ని నేను బ్రహ్మగా భావించి ఉపాసన చేస్తాను" అన్నాడు బాలాకి.

"ఆ విషయం నాకు తెలుసు. నేను ఆ శబ్దాన్ని వాయువు లేక ప్రాణంగా ఉపాసిస్తాను. ఈ రకంగా ఉపాసించేవాడు పూర్ణాయుర్దాయాన్ని పొందుతాడు" అన్నాడు రాజు.

"నేను దిక్కుదలందుండే పురుషుని బ్రహ్మగా ఉపాసిస్తాను. అన్నాడు బాలాకి.

"ఆ విషయం నాకు తెలుసు. నేనా పురుషుణ్ణి రెండవవాడు కలవానినిగా వేరు చేయబడని వానిగా భావించి ఉపాసిస్తాను. దిక్కులందుండే పురుషుణ్ణి ఈ రకంగా ఉపాసించేవాడు స్నేహితులు, అనుచరులు కలవాడవుతాడు" అన్నాడు రాజు.

నేను నీడలో ఉండే పురుషుణ్ణి బ్రహ్మగా ఉపాసిస్తాను” అన్నాడు బాలాకి.

“ఆ విషయం నాకు తెలుసు. ఆ ఛాయలో ఉండే పురుషుణ్ణి మృత్యువుగా భావించి నేను ఉపాసిస్తాను. ఈ రకంగా ఉపాసించేవాడు పూర్ణాయుర్దాయుడౌతాడు” అన్నాడు రాజు.

“బుద్ధిలో ఉన్న పురుషుణ్ణి నేను బ్రహ్మగా భావించి ఉపాసన చేస్తాను” అన్నాడు బాలాకి.

“ఆ విషయం నాకు తెలుసు. అతన్ని నేను ఆత్మగల వానిగా ఉపాసిస్తాను. ఈ రకంగా ఉపాసన చేసేవాడు ఆత్మవంతుడౌతాడు. బుద్ధిమంతుడౌతాడు” అన్నాడు రాజు.

బాలాకికి ఇంతకన్న విషయం తెలియదు. అందుకని మాట్లాడకుండా ఊరుకున్నాడు. అప్పుడు ఆ బ్రాహ్మణ్ణి చూసి “నీకు తెలిసిన బ్రహ్మజ్ఞానం ఇంతేనా? ఇంకేమైనా ఉన్నదా” అన్నాడు రాజు.

“ఇంతే! ఇంకేంలేదు” అని సమాధానమిచ్చాడు బాలాకి.

“ఈ కొంచెం తెలిసినంత మాత్రంచేత బ్రహ్మజ్ఞానం తెలిసినట్లు కాదు” అన్నాడు రాజు.

ఆ మాటలు విన్న బాలాకి “రాజా! నీవే శరణు. నాకు బ్రహ్మోపదేశం చెయ్యి” అన్నాడు.

అప్పుడు అజాతశత్రువు బాలాకిని నిద్రపోతున్న ఒక మనిషి దగ్గరకు తీసుకుపోయి “ఓ బ్రాహ్మణ శ్రేష్టుడా! నిద్రలే” అన్నాడు. అతడు లేవలేదు. చేతితో తట్టిలేపాడు నిద్రిస్తున్నవాడు లేచి కూర్చున్నాడు.

అప్పుడు రాజు బాలాకికి, "చేతితో తట్టి లేపటానికి పూర్వం పురుషుడు నిద్రిస్తున్నాడు పిలిచినా లేవలేదు. అప్పుడతడు ఎక్కడ ఉన్నాడు? ఇప్పుడు ఎక్కడ నుంచి వచ్చాడు?

జీవుడు నిద్రిస్తుండగా ఇంద్రియాల యొక్క విషయాలన్నింటినీ అనగా వాక్కు మొదలైన ప్రాణాల విజ్ఞానాన్ని పూర్తిగా గ్రహించి హృదయాకాశంలో నిద్రిస్తున్నాడు. హృదయాకాశము పరమాత్మ ఉండే చోటు. నిద్రావస్థలో ఉన్నప్పుడు పురుషుడు శరీరము, ఇంద్రియాలను తనలో లీనం చేసుకుంటాడు. ప్రాణాలన్నింటినీ తనలోకి ఆకర్షించుకుంటాడు. వాక్కు, చక్షువు, శ్రోత్రము మొ॥ ఇంద్రియాలు మనస్సుతో సహా లోపలకు ఆకర్షింపబడతాయి. ఆ స్థితిలో క్రియ అనేది ఉండదు. క్రియాఫలం ఉండదు. కాబట్టి ఆత్మ తన నిజస్థితిలో ఉంటుంది.

ఆత్మ స్వప్నావస్థలో ఉన్నప్పుడు దాని కర్మఫలాలు ప్రారంభమవుతాయి. స్వప్నస్థితిలో ఆత్మ మహారాజులాగా ఉంటుంది. గొప్ప బ్రాహ్మణునిలా ఉంటుంది. దేవతలవలె ఉచ్చస్థితులు, అసురులవలె నీచస్థితులు కూడా పొందుతుంది. రాజుగారు తన దేశంలో స్వేచ్ఛగా తిరిగినట్లుగానే, ఆత్మస్వప్నంలో ప్రాణాన్ని, ఇంద్రియాలను గ్రహించి తన దేహంలో యధేచ్ఛగా తిరుగుతుంది. అదే సుషుప్తావస్థలో ఆనందంతో కూడిన స్థితిని పొందుతుంది.

అగ్ని నుండి చిన్న చిన్న రవ్వలు పైకి లేచినట్లుగానే ఆత్మనుండి అన్ని ప్రాణాలు. ఇంద్రియాలు, లోకాలు, దేవగణాలు, భూతగణాలు పుడుతున్నాయి. ఇదే ఆత్మకు సంబంధించిన విషయాన్ని వివరించే రహస్యోపనిషత్తు" అని వివరించాడు రాజు.

## 15. ప్రతర్దనోపాఖ్యానము

దివోదాసుకుమారుడు ప్రతర్దనుడు. మంచి బలశాలి. మహావీరుడు. ఒకసారి ఇతడు తన శౌర్యపరాక్రమాలతో ఇంద్రుణ్ణి గెలవటానికి వెళ్ళాడు. అలా స్వర్గం చేరిన ప్రతర్దనుణ్ణి ఏదైనా వరం కోరమంటాడు ఇంద్రుడు. దానికి ప్రతర్దనుడు. నాకు ఏ వరము అవసరం లేదు. వరం ఇస్తానంటున్నావు కాబట్టి, నాకు కావలసింది ఏదో నువ్వే ఇవ్వు అన్నాడు. అలా కాదు ఒకరి కోసం ఇంకొకరు వరం కోరటం జరగదు. నీకేం కావాలో నువ్వే కోరుకో అన్నాడు ఇంద్రుడు, అసలు నాకు వరమే వద్దన్నాడు ప్రతర్దనుడు. అప్పుడు ఇంద్రుడు నా స్వరూపాన్నే నీకు వరంగా ఇస్తున్నాను అని తన స్వరూపాన్ని వివరించాడు.

ఓ ప్రతర్దనా ! త్వష్ట ప్రజాపతి కుమారుడైన త్రిశిరుణ్ణి నేను సంహరించాను. ఆరున్మ్మలనే యువతులను వేటకుక్కలకు ఆహారంగా వేశాను. చేసిన ప్రతిజ్ఞలను అతిక్రమించి స్వర్గంలో ప్రహారుని కుమారులను సంహరించాను. అంతరిక్షంలో పులోమునికుమారుల్ని సంహరించాను. భూమిమీద కాలకంజులనే రాక్షసులను చంపాను. ఇలా చేసిన నాకు ఏ మాత్రము హాని కలుగలేదు. ఇదంతా కూడా బ్రహ్మవిద్యా ప్రభావము. ఇంద్రుడనైన నన్నెవరు తెలుసుకుంటారో అతడికి జన్మమృత్యు జరాదులుండవు. పుణ్యపాపాలుండవు. ప్రజ్ఞాత్మ స్వరూపుడునైన ప్రాణమే నేను. నన్ను ఆయుష్యగాను, అమృతంగాను ఉపాసించు" అంటూ ప్రాణం యొక్క గొప్పదనాన్ని చెప్పాడు ఇంద్రుడు.

## 16. ఆకలిదప్పిక

ప్రజాపతి పురుషుణ్ణి సృష్టించి అతడి వాక్కులో అగ్నిని, ప్రాణంలో

వాయువును, అపానంలో విద్యుత్తు, ఉదానంలో పర్జన్యుడు, చక్షుస్సులో ఆదిత్యుడు, మనస్సులో చంద్రుడు, క్రోధంలో ఈశ్వరుడు, మూర్ధంలో ఆకాశం, ఆత్మలో బ్రహ్మని ప్రతిష్టింప చేశాడు. అప్పుడు ఈ శరీరం అమృతభాండంలాగా లేచి నిలుచున్నది. అందులోని దేవతలు పురుషుడి వల్ల మనకి ప్రయోజనం ఏముంది? ఇతనితో మనకెందుకు? అని ఒక్కసారిగా శరీరాన్ని వదిలి వెళ్ళిపోయారు. దాంతో శరీరం కదలిక లేక అన్నీ చిద్రాలతో (రంధ్రాలతో) చూడటానికి అసహ్యంగా ఉంది. ఆ పరిస్ధితి చూసి ప్రజాపతి శరీరంలో దేవతలను శాశ్వతంగా ఉంచటం కోసం, వారికి ఆకలి, దప్పిక సృష్టించాడు. అప్పుడు దేవతలు తమ ఆకలిదప్పికలు తీరక మళ్ళీ ఈ దేహంలోకే వచ్చారు. అసలు ఆకలిదప్పిక అనేవి లేకపోతే రంధ్రాలతో కూడిన శరీరం అసహ్యకరంగా ఉంటుంది. ఈ శరీరంలో దేవతలు ఉన్నప్పుడే శరీరం ఉపాధేయమవుతుంది.

## 17. తాయత్తులు (మణులు)

తాయత్తులు లేదా మణులు ధరించటము అనేది మతపరమైన ఆచారం. కాని విచిత్రం ఏమంటే ఇక్కడ పనికావటం ముఖ్యం. అంతేకాని మతంతో పనిలేదు. పిల్లవాడికి జ్వరం వచ్చింది. ఆ జ్వరం తగ్గటం ముఖ్యం. అంతే ఎక్కడైనా సరే మనం తాయత్తు కట్టిస్తాం. ప్రార్ధనలు చేయిస్తాం. గోరింత దగ్గు వచ్చింది. పిల్లవాడు గిలగిలా కొట్టుకుంటున్నాడు. ఫకీరుబాబా తాయత్తు కడితే రెండవ రోజుకు తగ్గు ముఖం పడుతుంది. ఇప్పటికే చాలామందికి ఇలా తగ్గింది ఈ మాట విన్నాం. నేను హిందువుణ్ణి. ఫకీరుబాబా దగ్గరకు వెళ్ళి

తాయత్తులు, గండాలు కట్టించను. అని మానేస్తామా? వెళ్ళి కట్టిస్తామా? ఇక్కడ మతం కాదు ముఖ్యం. ప్రాణం. పిల్లవాడి ప్రాణాలు నిలబడాలి. వాడి బాధ తగ్గాలి. అంతే మనక్కావలసింది. ఈ తాయత్తులు, మణులు అంతా మతపరమైన ఆచారం.

సుబ్రహ్మణ్యేశ్వరుడి ఆలయానికివచ్చే మహమ్మదీయుల సంఖ్య చాలా ఉంటుంది. కర్నూలుదర్గాకు వెళ్ళే హిందువులు చాలామంది అక్కడ కోరిన కోరికలు తీరతాయట. అలాగే హర్యానాదర్గాకి దేశం మొత్తంమీద పౌరులు హాజరవుతారు. నెల్లూరులో రొట్టెలపండగ. జనం కిటకిటలాడిపోతారు. ఇప్పటికీ జండా చెట్టు దగ్గర గండాలు కడతారు. ఇవన్నీ దివ్యమైన శక్తులు. అని మంత్రశాస్త్రం చెబుతోంది దివ్యమైన శక్తులు రావాలి అంటే –

1. పూర్వజన్మ సుకృతం ఉండాలి
2. తపశ్శక్తి, యోగశక్తి
3. దైవశక్తి (వరం)
4. రాళ్ళు, రతనాలు
5. మంత్రాలు, తాయత్తులు
6. ఓషధులు (చెట్లకొమ్మలు, వేర్లు)

ఈ ఆరింటివల్ల దివ్యశక్తులు వస్తాయి. అనుకున్న పనులు నెరవేరతాయి. ఊడుగుచెట్టు వేరుతో చేసిన చెప్పులు ధరిస్తే ఎంత దూరం తిరిగినా కాళ్ళకి అలసట అనేది ఉండదు. ఇక్కడ ఓషధిశక్తి. ఈ రకమైన ఆచారం మొదటగా కౌషీతకీ అరణ్యకంలో కనిపిస్తోంది. బహుశః ఇక్కడే ఇది ప్రారంభం అయిఉండవచ్చు. అంతులేని సంపద

కావాలి, మంచి ఆరోగ్యం, శత్రువుల మీద విజయం కావాలి అంటే 'బిల్వమణి' బిల్వము అంటే మారేడు తాయత్తు ధరించాలి. ఈ తాయత్తులలో మంత్రము, యంత్రము రెండూ ఉంటాయి. బిల్వమణి ధరించాలి అంటే మణి ధరించగోరే వ్యక్తి మూడు రోజులు కేవలము పాలు మాత్రమే ఆహారంగా తీసుకుంటూ, ఏనుగు నీడలో కాని, పెద్దపులి చర్మం మీద గాని, అగ్నిని ప్రతిష్టించి కొన్ని హోమాలు చెయ్యాలి. ముందు బిల్వమణిని తేనెలో, ఆ తరువాత అన్నంలో మూడురోజులు నానబెట్టాలి. ధరించటానికి ముందు ప్రార్ధనా పూర్వకమైన మంత్రాలు చదవాలి. ఆ మంత్రాల అర్థం.

"నేను మదగజం కాంతిని, శక్తిని పొంది దేవతలలాగా ప్రకాశిస్తాను. అగ్ని, ప్రజాపతి, తమ కాంతులను నాలో ప్రవేశపెట్టాలి. అశ్వనీదేవతలు మధురమైన కంఠస్వరాన్ని నాకుఇవ్వాలి. ఈమణిప్రభావం వల్ల నాశత్రువులందరూ సంహరింపబడాలి. వృత్తాసురుని మీద ఇంద్రుడిలాగా నా శత్రువులపై విజయాన్ని సాధిస్తాను. ఓ మరుద్దేవతలారా! మీబలంతోను, ఓ రుద్రా! నీ ఆయుధాలతోను, నా శత్రువులను నశింపచేయవలసింది. ఓ అగ్నిప్రజాపతులారా! ధైర్య స్థైర్యాలతో పాటు అపారమైన సంపదను నాకు అనుగ్రహించండి"

ఇలా ప్రార్థించి, ఆ మణిని పూజించి ధూపదీప నైవేద్యాలు సమర్పించి అప్పుడు దాన్ని చేతికిగాని, మెడలోగాని కట్టుకోవాలి.

బిల్వమణిని ధరించిన వాడికి అపజయమనేది లేదు. సుఖంగా ఉంటాడు. అతడి సంతతికి ఏ రకమైన ఆపదలు కూడా రావు. దొంగలవల్ల గాని, ఇతరుల వల్లగాని ఎలాటి ఇబ్బందులు రావు.

రాక్షసులవల్ల, పిశాచాల వల్ల ఎటువంటి హాని కలగదు. ఇలా ఆముదపు చెట్టు, చంద్రచెట్టుల తాయత్తుల గురించి కూడా కౌషీతకీ అరణ్యకంలో చెప్పబడింది.

## 18. పరమాత్మ

మానవ శరీరాన్ని పూర్తిగా వైరాగ్యంతో సంస్కరించాలి. అలా సంస్కరించిన వాడు తన ఆత్మనే అన్నిచోట్ల చూడగలుగుతాడు. ఆత్మని గురించే వింటాడు. మననం చేస్తాడు. ఆత్మనే ధ్యానం చేస్తాడు. వేదాధ్యయనం చేస్తూ బ్రహ్మచర్యం పాటిస్తూ శ్రద్ధతో నిత్యయజ్ఞంలో ఆత్మని గురించి తెలుసుకోవాలి. అలా తెలుసుకుని శాంతుడు, దాంతుడు, ఉపరతుడు, సహనశీలియై తనలోని పరమాత్మను సాక్షాత్కరింప చేసుకోవాలి.

వేదార్థం తెలియకుండా, వేదాన్ని అధ్యయనం చేసినా కేవలం బరువు మోసే ప్రాణి అవుతాడు కాని దాని సారాన్ని గ్రహించలేడు. గంధపు చెక్కలు మోసే గాడిద అవుతాడు. ఈ రకంగా అనేకానేక ఉపాసనలు, ఉపాఖ్యానాలను వివరిస్తూ కర్మకాండ నుంచి జ్ఞానకాండకు తీసుకువెడుతున్నది కౌషీతకీఅరణ్యకం.

# 14. తైత్తిరీయారణ్యకం

కృష్ణయజుర్వేదానికి గల తైత్తిరీయ శాఖకు సంబంధించినది ఈ అరణ్యకం. దీన్ని తిత్తిరిమహర్షి ప్రచారం చేశాడు. ఇందులో పదిప్రపాఠకాలు. 250 అనువాకాలు ఉన్నాయి. దీనికి భట్టభాస్కరుడు, సాయణుడు వ్యాఖ్యలు వ్రాశారు. ఇందులో కొంతవరకు కర్మకాండ వివరించినా తాత్త్విక అంశాలు అనేకం చెప్పబడ్డాయి.

ఈ భూమి జాయ. ఆకాశం భర్త. దంపతులు ఇద్దరూ కలసిపోతున్నారు. ఇద్దరి చేతుల్లోను ఇద్దరు కొడుకులున్నారు. వారే బృహస్పతి, అగ్ని. కూతురు సరమ అంటే వేది.

## 1. ఆత్మ-శరీరము

తైత్తిరీయారణ్యకము, ఆత్మ, దేహములను గురించి చెప్పింది. నేను అంటే దేహము కాదు ఆత్మ. ఈ శరీరం అశాశ్వతమైనది. అశాశ్వతమైన శరీరమే ఆత్మ అనుకుంటున్నాడు సాధకుడు. శరీరానికి కొన్ని వికారాలున్నాయి. ఆత్మకు వికారాలు లేవు అని చెబుతోంది అరణ్యకం.

మానవుడు ఒకప్పుడు విచారంగా ఉంటాడు ఒకసారి సంతోషంగా, ఒకసారి దుఃఖంతో ఉంటాడు. ఒకసారి సంగీతం వింటాడు. ఇంకోసారి సంగీతం పాడి వినిపిస్తాడు. ఒకసారి పుడతాడు. ఇంకోసారి చచ్చిపోతాడు. శరీరంలో వివిధ అంగాలెలా ఉన్నాయో అలాగే వికారాలు కూడా ఉన్నాయి. అంటోంది అరణ్యకము.

## 2. శింశుమారుడు

**శింశు మారాత్మనా విష్ణుః భూరాదీ నూర్ధ్వతస్థితాన్**
**దధ్రేశేషయతాన్ లోకాన్ సప్తలోకాన్ అథస్థితాన్ ॥**

శ్రీమహావిష్ణువు మొసలి రూపంలో ఊర్ధ్వలోకాలను ఆదిశేషుని రూపంలో అథోలోకాలను మోస్తున్నాడు.

శింశుమారుడు అంటే – పరబ్రహ్మ స్వరూపం.

## 3. శ్రీమహావిష్ణువు

ప్రతి యాగంలోను ఆయుష్కరమైన బ్రహ్మోపస్థానం జరుగుతుంది. ఇందులో యజమాని అన్ని లోకాల్లోను సంచరించి చివరకు స్వర్గాన్ని చేరుకుంటాడు. యజమాని చుట్టూ కవచంలాగా బ్రహ్మ ఆవరించి ఉంటాడు. సర్వసాక్షి అయిన ఈశ్వరుడి తేజస్సు తన ఆత్మ దృష్టితో యజమాని గ్రహిస్తాడు. శింశుమారమనే జలగ్రహానికి (మొసలి)కి

| | | |
|---|---|---|
| పరబ్రహ్మ | – | శిరస్సు |
| ధర్మం | – | మూర్ధం |
| చతుర్ముఖ బ్రహ్మ | – | పై దవడ |
| యజ్ఞం | – | క్రింది దవడ |
| విష్ణువు | – | హృదయం |
| సంవత్సరం | – | యోని |
| అశ్వినులు, మిత్రావరుణులు | – | పాదాలు |
| అత్రిమహర్షి | – | మధ్యశరీరం |

అగ్ని - పృచ్ఛానికి ప్రథమ భాగం

ఇంద్రుడు - ద్వితీయ భాగం

ప్రజాపతి - తృతీయ భాగం

పరబ్రహ్మ - నాల్గవ భాగం

ఇటువంటి శింశుమారుణ్ణి ఉపాసించిన వారికి అపమృత్యు భయం ఉండదు అంటోంది తైత్తిరీయారణ్యకము.

## 4. నారాయణుడు

ఈ అరణ్యకంలో విష్ణువుగా చెప్పబడే నారాయణుడే సృష్టికర్త. ఈ అరణ్యకంలో నారాయణోపాసన తప్ప ఇంకా ఇతరమైన ఉపాసనలేవీ చెప్పబడలేదు. పరబ్రహ్మ అంటే శ్రీమన్నారాయణుడు.

నారాయణుడే పరమేశ్వరుడు. అతనినుండే ఇంద్రుడు, బ్రహ్మ, రుద్రుడు మొదలైన దేవతలు అందరూ ఆవిర్భవించారు. వారందరూ ఆ విష్ణుస్వరూపాలే. నారాయణుడు తప్ప ఈ జగత్తులో ఇంకా వేరైనదైవం లేదు. **అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్త నారాయణస్థితః** ఆ నారాయణుడు అన్నింటికి బయట లోపలా కూడా ఉన్నాడు. నారాయణుడే పరమేశ్వరుడు.

ఈ విషయం తెలిసినవారికి పునర్జన్మం ఉండదు. అని చెబుతుంది ఈ అరణ్యకం.

## 5. అరుణం

తైత్తిరీయారణ్యకంలో మొదటి ప్రపాఠకంలో మనకి కనిపించేది అరుణ పారాయణ. సూర్యుని వర్ణన, మాహాత్మ్యం, ప్రశంస. వీటితో

కూడిన అద్భుతమైన మంత్రాలు ఇందులో ఉన్నాయి. ఆ మంత్రాలు, వాటి అర్థాలు కావాలంటే విడిగా అరుణం చూడండి. ఈ మంత్రాలు పఠిస్తూ సూర్య నమస్కారాలు చేస్తారు. **"ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్"** ఆరోగ్యాన్ని సూర్యుడిస్తాడు అంటోంది మంత్రశాస్త్రం. కాబట్టి ఆరోగ్యం కోసం సూర్యారాధన చేస్తారు. ఆ సూర్యారాధనే ఈ అరుణ పారాయణ. అయితే ఇది అరణ్యకంలో ఎందుకు చెప్పబడింది? అంటే ఇందులోని కొన్ని మంత్రాలు ఇంట్లో చదవరాదు. అంటున్నారు. అందుకే అరుణ పారాయణ, సూర్య నమస్కారాలు ఊరిచివర గాని, దేవాలయంలో గాని చేసేవారు గతంలో. కాని ప్రస్తుతం అరుణపారాయణ విషయంలో అలాటి పట్టింపు లేవీ ఉన్నట్టు లేవు. ఇంట్లోనే చేస్తున్నారు.

లోకంలో సకల జీవరాశికి ప్రాణశక్తి సూర్యుడు. భూమిలో విత్తనాలు నాటాం. వీళ్ళు పోశాం. సూర్యరశ్మి లేకపోతే మొక్క పెరగదు. అక్కడిదాకా ఎందుకు? ఒక చిన్న పని చెయ్యండి. మేడమీద గదిలో ఒకచివర గదిలోకి సూర్యరశ్మి వస్తున్నచోట ఒక కుండీలో పూలమొక్క పెట్టండి. కొన్ని రోజులకి ఆ మొక్క సూర్యరశ్మి వస్తున్న వైపుకు వంగిపోతుంది. సూర్యరశ్మి లేకపోతే మొక్కలు ఆహారం తయారు చేసుకోలేవు. మనకి కూడా సూర్యరశ్మి శోకకపోతే చర్మరోగాలు చస్తాయి. అందుకే ఆరోగ్యంగా ఉండాలంటే సూర్యుడి అనుగ్రహం కావాలి. ఇటువంటి మహిమ గల సూర్యుణ్ణి వివిధ కోణాలలో పరిశీలించి, అతన్ని చర్చించింది స్తుతించింది. ఆ స్తోత్రమే అరుణం. అరుణ పారాయణ చేస్తూ శ్రద్ధతో సూర్య నమస్కారాలు చేస్తే రోగాలు తగ్గి తీరతాయి. ఇది అనుభవైక వేద్యం.

అరుణంలో ఇంకో విశేషం ఏమంటే ఇందులో సూర్యవర్ణనే కాక సంవత్సరము, ఋతువులు వీటి వర్ణన కూడా ఉంది. కాలపురుషుడే

సంవత్సరము. అతడు ఋతువులను తమ పనులు చెయ్యమని ఆదేశిస్తాడు. ఆ ఆదేశం ప్రకారమే ఋతువులన్నీ సక్రమంగా పని చేస్తాయి.

వసంత ఋతువు – జీవితానికే వసంతం

గ్రీష్మ ఋతువు – ఎండలు బాగా కాస్తాయి

వర్ష ఋతువు – వర్షాలు బాగా కురిసి, విత్తనాలు మొలక లెత్తుతాయి.

శరద్రుతువు – ప్రసన్నంగా ఉంచుతుంది

హేమంత ఋతువు – చలి ఎక్కువ

శశిర ఋతువు – ఆకులన్నీ రాలిపోతాయి

ఈ విధంగా విభిన్న లక్షణాలతో ఉంటాయి ఈ ఋతువులు. వీటన్నింటినీ వర్ణించటం జరిగింది అరుణంలో.

## 6. పంచయజ్ఞాలు

గృహస్థులు ఆచరించాల్సినవి పంచయజ్ఞాలు. అవి 1. దేవయజ్ఞం 2. పిత్రుయజ్ఞం 3. భూతయజ్ఞం 4. మనుష్యయజ్ఞం 5. బ్రహ్మయజ్ఞము

1. దేవయజ్ఞం : ఇష్టదేవతలను ప్రతినిత్యమూ పూజించటం.
2. పితృయజ్ఞం : పితృదేవతలకు తర్పణలివ్వటం. స్వధాంతర్పయామి. స్వధాంతర్పయామి. స్వధాంతర్పయామి అని మూడుసార్లు నువ్వులు నీళ్ళు వదలాలి. ఇదే పితృదేవతలకు మనం చేసే తర్పణ.
3. భూతయజ్ఞం : కుక్కలు, పిల్లులు, పశుపక్ష్యాదులు వీటికి ఆహారం

పెట్టటము.

4. మనుష్యయజ్ఞం : ఇంటికి వచ్చిన వారిని సత్కరించటము, అతిథి దేవోభవ. దీన్ని సార్ధకం చెయ్యటం.

5. బ్రహ్మయజ్ఞం : వేదపారాయణ చెయ్యటం. వేదం నేర్చుకోవటం కాదు. దీన్ని మర్చిపోకుండా వల్లె వేయటం.

ప్రతి గృహస్తుడు ఈ ఐదు యజ్ఞాలు చేసి తీరాలి. ఈ అరణ్యకంలో 7,8,9 ప్రపాఠకాలు తైత్తిరీయోపనిషత్తు కాగా పదవ ప్రపాఠకం నారాయణోపనిషత్తు.

ఈ ఉపనిషత్తులను చివరలో పూర్తిగా వివరించటం జరిగింది.

## 7. మతసంబంధమైన ఆచారాలు

మతపరమైన ఆచారాలను వివరించటంలో తైత్తిరీయారణ్యకానిదే ప్రథమ స్థానము. స్వర్గం పొందాలంటే అగ్నిచయనము అనే క్రతువు చేయబడుతుంది. దీన్ని గురించే కఠోపనిషత్తులో చెప్పటం జరిగింది. ఈ క్రతువు నిర్వహణ అంతా నచికేతుడు యముడి దగ్గర చెప్పుకుంటాడు. అప్పటినుంచే ఇది నాచికేతాగ్ని చయనము అనబడుతుంది. ఈ అగ్నిచయనాన్ని అనుసరించే ఇంకా అనేక కర్మలు వచ్చాయి. అవి సావిత్రిచయనము, చాతుర్హోత్రచయనము, వైశ్వసృజచయనము అరుణకేతచయనము మొదలైనవి. అరుణకేతచయనాన్ని ప్రతిపాదించటం వల్లనే మొదటి ప్రపాఠకానికి అరుణము అని పేరు వచ్చింది.

ప్రకృతిని దేవతగా ఆరాధించటము ఈ అరణ్యకంలో బాగా కనిపిస్తుంది. అగ్ని, వరుణుడు, చంద్రుడు మొదలైన ప్రకృతి దేవతల

ప్రార్థన ఈ అరణ్యకంలో ఉంది. ఇందులో సూర్యోపాసన హెచ్చుగా ఉంది. ఆరోగ్యం కోసం సూర్యోపాసన చేస్తారు. కశ్యపుడు అనే పేరుగల సూర్యుడు మేరుపర్వతం దగ్గరే ఉంటాడు. గర్గమహర్షి వంశంలో జన్మించిన **ప్రాణత్రీతుడనే ఋషి సూర్యమండలం వృత్తాకారంగా తిరగటం చూసినట్లు అరుణంలో చెప్పారు.** కాని తరువాత పరిశోధనలు చేసి సూర్యగోళం స్థిరంగా ఉంటుంది. భూగోళమే దాని చుట్టూ తిరుగుతుంది అని నిర్ధారించటం జరిగింది. ఈ అరణ్యకంలోనే నక్షత్రాల పేర్లు, అధిదేవతలు, వాటి వర్ణన అంతా చెప్పబడింది.

బ్రహ్మక్షత్రియ వైశ్యులకు ఉపనయనము, యజ్ఞోపవీత ధారణ చెప్పబడింది. యజ్ఞోపవీతం ఎలా ఉండాలి? దాన్ని ఎలా ధరించాలి? అనే విషయాలు చెప్పి యజ్ఞోపవీత ప్రభావం వల్లనే దేవతలు రాక్షసులను త్రోసి రాజని, స్వర్గాన్ని ఆక్రమించారు. మూడు వర్ణాలవారు ఉపనయనం అయిన దగ్గర నుంచీ ప్రతిరోజు మూడు పూటలా సంధ్యావందనం చేసితీరాలి. సంధ్యావందనంలో ముఖ్యమైనది అర్ఘ్యప్రధానం. ఒకసారి మహాబలవంతులైన రాక్షసులు ఒక సమూహంగా ఏర్పడి 'మందేహుడు' అనే రాక్షసుణ్ణి నాయకుడుగా ఎన్నుకున్నారు. వీరంతా కలిసి ఘోరమైన తపస్సు చేసి ప్రజాపతిని మెప్పించి సూర్యుడితో యుద్ధం చేసి గెలిచే వరం పొందారు. వీరు ప్రతిరోజు త్రిసంధ్యల యందు (ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం) సూర్యునితో యుద్ధం చేసి అతన్ని బాధిస్తుంటారు. సంధ్యావందనం చేసేటప్పుడు మనం వదిలే అర్ఘ్యం బలంవల్ల ఆ రాక్షసుల నుంచి సూర్యుడికి విముక్తి లభిస్తుంది. అందుకే ప్రతివాడు తప్పనిసరిగా సంధ్యావందనం, అర్ఘ్యప్రదానం చేసి తీరాలి అంటోంది ఈ అరణ్యకం.

## 8. కూశ్మాండ హోమం

వైదిక మతంలో ప్రాయశ్చిత్తం ప్రధానమైనది. తెలిసిగాని, తెలియక గాని చేసిన అనేక రకాలయిన అపరాధాలకు ప్రాయశ్చిత్తం కూశ్మాండ హోమం. దేవతలను అవమానించటం, అప్పులు ఎగవేయటం, గర్భపాతం మొదలగువాటి వల్ల వచ్చే పాపాల నుంచి విముక్తి కోసం, వ్యాధిరూపంలో పీడిస్తున్న పాపాలనుంచి విముక్తి కోసం ఈ హోమం చేస్తారు.

వైశ్వదేవం చేసిన వారు ఇతరుల ఇంట్లో భోజనం చెయ్యరు. తన భార్య వంట చెయ్యాలి. లేకపోతే తాను స్వయంగా చేసుకోవాలి. బయటి వారు ఎవరైనా సరే ఆహితాగ్ని అయితే, ఆ ఇంట్లో భోజనం చేస్తారు.

ఇందాకనే మా పురోహితుడు మాట్లాడుతూ నేను కూశ్మాండ హోమాలు చేశాను. అందుకని వైశ్వదేవం చేసిన వారు మా ఇంట్లో భోజనం చెయ్యవచ్చు. అన్నారు. అవునండీ ! నేను చేసుకున్నది రజస్వలానంతర వివాహం. శాస్త్రప్రకారం మా ఇంట్లో ఆహితాగ్నులు భోజనం చెయ్యరు. కాని నేను కూశ్మాండ హోమం చేసి ప్రాయశ్చిత్తం చేసుకున్నాను కాబట్టి ఇప్పుడు అభ్యంతరం లేదు అన్నారు. అంటే అటువంటి వాటికి కూడా ఇది ప్రాయశ్చిత్తమన్న మాట.

ఇక్కడ గుర్తించాల్సిన విషయం ఏమంటే రజస్వలాపూర్వవివాహం వేదంలో చెప్పబడలేదు. అందుచేత **రజస్వలానంతర వివాహం దోషం కాదు.** కాబట్టి దానికి ప్రాయశ్చిత్తమే అవసరం లేదు. ఇది కేవలం ఛాందసం. అంతే

## 9. పితృమేధం

తైత్తిరీయారణ్యకంలో పితృమేధము అనే పేరుతో పితృకర్మలను వివరించటం జరిగింది. పితృకర్మలో ముఖ్యమైనది శవదహనం. దేహాన్ని విడిచిన తరువాత ప్రాణిని ప్రేతము అంటారు. ఇందులో ప్రేతాన్ని ఉద్దేశించిన ప్రార్థనలు హోమాలు చెప్పబడ్డాయి. జీవించి ఉన్నవారికి పుత్రులు, పౌత్రులు, బంధువులు అందరికీ ఏ రకమైన రోగాలు రాకుండా కష్టాలు కలగకుండా చూడమని ప్రేతాన్ని ప్రార్థిస్తారు. ఇక్కడ చెప్పే మంత్రాలలో ప్రేతం యొక్క గమ్యస్థానమైన యమపురి, దానికి వెళ్ళే మార్గం, త్రోవలో ఎదురయ్యే ఇబ్బందుల గూర్చి వివరించటం జరిగింది. 'నళము' అనే గడ్డిని విసరివేస్తూ "ఓ ప్రేతమా! నవ్వు దీన్ని నావగా ఉపయోగించుకో అంటారు. రెల్లుగడ్డిని విసరి వేస్తూ "దీంతో రాక్షసుల నుంచి నిన్ను నువ్వు రక్షించుకో" అంటారు. దర్భలు విసరేస్తూ 'వీటిని ఓషధులుగా వాడుకో' అంటారు. ఇందులో పితృదేవతలకు రాజయిన యముణ్ణి గురించి అనేక ప్రార్థనలు, ఆహుతులు ఉన్నాయి. చివరగా శవదహనం జరిగినచోట నుంచి వెళ్ళిపోతూ ఓ అగ్నిదేవా! ఇక్కడ గడ్డి మొదలైనవి పెరగటానికి దోహదం చెయ్యి" అని అగ్నిదేవుణ్ణి ప్రార్థిస్తారు.

## 10. ప్రవర్గ్య

దీన్ని సోమయాగానికి అంగంగానే గాక స్వతంత్రంగా కూడా చెయ్యవచ్చు. శరీరంలో శిరస్సులాగా యజ్ఞాలలో చాలా ముఖ్యమైనది ప్రవర్గ్య. ఇది మనం చేసే కర్మకాండకే కాక యజ్ఞంలో వాడే ఒక కుండపేరు కూడా. దీన్నే **'మహావీరము'** అని కూడా అంటారు. ఒకసారి

శ్రీమహావిష్ణువు దేవతలతో యుద్ధానికి సిద్ధపడ్డాడు. ఆ సమయంలో దేవతల వైపు చూసి అవహేళనగా నవ్వుతూ గడ్డం క్రింద ధనుస్సు పెట్టుకుని నుంచున్నాడు. అప్పుడు ఇంద్రుడి చేత ప్రేరేపించబడిన చెదలు ధనుస్సు యొక్క వింటినారిని కొరికేశాయి. దాంతో ధనస్సు కర్ర ఒక్కసారిగా పైకి లేచింది. ఆ దెబ్బకు విష్ణుమూర్తి తల కాస్తా తెగిపడిపోయింది. ఆ తరువాత అశ్వనీదేవతలు శస్త్రచికిత్స చేసి తెగిన తలను మొండానికి అతికించారు. దీనికి గుర్తుగానే ప్రవర్గ్యలో శిరస్సు ఆకారంలో ఉన్న మట్టిపాత్రలో పాలుపోసి కాచి దాన్ని దేవతలకు ఆహుతిగా సమర్పిస్తారు.

ఇందులో మూడు మట్టిపాత్రలు ఉంటాయని, వాటిని మహావీరము అంటారని చెప్పుకున్నాం. ఆ పాత్రలు తయారుచెయ్యటానికి ప్రత్యేకమైన కలాపం ఉంది. తరువాత ఆ పాత్ర నిండా నెయ్యి పోసి బాగా వేడి చేస్తారు. ఈ పాత్ర హోమకుండం మీదనే ఉంటుంది. అందులోని నెయ్యి బాగా వేడెక్కి పొగలు కక్కుతూ ఉంటుంది. ఇలా కాగిన నేతిలో ఆవుపాలు లేదా మేకపాలు పోస్తారు. ఒక్కసారిగా భగ్గున మండుతుంది. రెండు మూడు సంవత్సరాల క్రితం కేరళ నంబూద్రిలు భద్రాచలంలో యాగం చేశారు. అప్పుడు జనం అంతా ఈ ప్రక్రియ చూశారు. ఇలా చెయ్యటంవల్లనే దీనికి ప్రవర్గ్య అని పేరు వచ్చింది. యాగంలో ఇది పెద్ద ఆకర్షణ.

ఈ కర్మ చెయ్యటం వల్ల మంచి తేజస్సు కలుగుతుంది. స్వర్గం ప్రాప్తిస్తుంది. ప్రవర్గ్యం పూర్తి అయిన తరువాత మహావీర పాత్ర మొదలయినవి విసర్జించే చోటును బట్టి ఫలితం ఉంటుంది.

ఉద్వాసన ఉత్తర దిక్కున జరిగితే – యజమానికి అన్నలోపం ఉండదు

నీటిలో విసర్జిస్తే – యజమాని తేజస్వి అవుతాడు

శత్రువు ఉన్న దిశగా విసర్జిస్తే – శత్రువు మరణిస్తాడు

మేడికొమ్మ మీద ఉద్వాసన జరిగితే – శారీరక పుష్టి

దర్భ దుబ్బుల మీద ఉద్వాసన జరిగితే – సరైన కాలంలో వర్షాలు కురుస్తాయి.

## 11. యజ్ఞోపవీతం

సంధ్యోపాసన, వేదాలు చదవటం, యజ్ఞయాగాది క్రతువులు ఇవి చెయ్యటానికి యజ్ఞోపవీతం తప్పనిసరిగా కావాలి. యజ్ఞోపవీతం లేకుండా చేస్తే కార్యం సిద్ధించదు.

ఒకసారి దేవదానవులిద్దరూ స్వర్గం పొందాలనే కోరికతో యజ్ఞం చెయ్యాలను కున్నారు. దానవులు యజ్ఞోపవీతం లేకుండా, బ్రహ్మచర్యం పాటించకుండా యజ్ఞం చేసినా స్వర్గం పొందలేకపోయారు. దేవతలు యజ్ఞోపవీతం ధరించి, బ్రహ్మచర్యం పాటించి శాస్త్రప్రకారం యజ్ఞం చేసి ఫలితం పొందారు. అని చెబుతోంది తైత్తిరీయారణ్యకం.

ఒకసారి ఏదో కార్యక్రమం జరుగుతోందని తెలిసిన వాళ్ళ ఇంటికి వెళ్ళాను. వశిష్టులవారు వచ్చి యజమానితో "బాబూ! మీరు లేవాలి. ఇప్పటికే ఆలస్యమయింది" అన్నారు. యజమాని నెమ్మదిగా లేచాడు. వసిష్టుల వారు క్రింద నుంచి పైకి యజమానిని చూస్తూ "అయ్యా ! మెడలో జంధ్యమేది?" అన్నారు. యజమాని పళ్ళికిలిస్తూ "ఉతకటానికి చాకలివాడికి వేశాను" అన్నాడు అదేదో పెద్ద ఘనకార్యంలాగా ! తీరా చూస్తే ఎదురుగా గోడకున్న మేకుకు వ్రేలాడుతోంది జంధ్యం.

'ఇదేమిటి? దీన్ని ఇక్కడ వేశారా?' అన్నారు.

'ఎక్కడో ఒకచోట ఉంది కదా ! కానీయండి' అన్నాడు యజమాని మళ్ళీ ఇంకోసారి పళ్ళికిలించి

ఇది మనకి యజ్ఞోపవీతంమీద ఉన్న గౌరవం. ఆయనే తరువాత నాతో అన్నాడు. "మా గురువుగారి మెడలో జంధ్యం లేదు. మరి నేను మాత్రం ఎందుకు వేసుకోవాలి?" అని ఇక్కడ ఒక్క విషయం చూడండి. మీ గురువుగారు సన్యాసి ఆయనకు సంసారం లేదు. కర్మలు లేవు. మరి నీకు అన్నీ ఉన్నాయి కదా? ఆ స్థితికి చేరిన తరువాత నువు కూడా అలాగే ఉండు.

పోతులూరి వీరబ్రహ్మం గారు పోతూ త్రోవలో కల్లు త్రాగారు. గురువుగారు త్రాగారని శిష్యులుకూడా పూర్తిగా త్రాగేశారు. ఇది గమనించిన బ్రహ్మంగారు ఒకచోట ఆగి కమ్మరిశాలలో కరిగి ఉన్న ఇనుమును త్రాగేశారు. అది చూసిన శిష్యులకు తాము చేసిన తప్పు తెలిసింది. గురువుగారు చేశారు అని మనం చెయ్యకూడదు. గురువుగారు కూడా తననుండి తప్పుడు సంకేతాలు వెళ్ళకుండా జాగ్రత్త పడాలి.

ఒకసారి ఒకాయన బాగా చదువుకున్న వాడే. నాకు తారసపడ్డాడు. "వీటి మీద నాకు నమ్మకం లేదు. అందుకే నేను జంధ్యం తీసి పారేశాను. దేవుడంటే నాకు నమ్మకం లేదు. నా పేరుకూడా మార్చుకోవాలి అనుకుంటున్నాను" అన్నాడు. అన్నీ విని,

'మీకు పెళ్ళైందా?' అన్నాను.

'అయింది' అన్నాడు ఆయన.

"మరి మీ భార్య మెడలో మంగళసూత్రం కట్టారు కదా!"

అన్నాను.

'కట్టాను' సమాధానం చెప్పాడు.

"మీకు వీటిమీద నమ్మకం లేదు కదా. మరి మాంగల్యం ఎందుకు కట్టారు? పోనీ ఇప్పుడైనా సరే ఇంటికి వెళ్ళిన తరువాత, మీమెడలో జంధ్యం తీసివేసినట్లుగానే, ఆవిడ మెడలోని మాంగల్యంకూడా తీసేసి అప్పుడు చెప్పండి" అన్నాను.

అంతే... అతను ఇంక మాట్లాడలేదు. మౌనంగా ఉండిపోయాడు.

వీటన్నింటికీ కారణం వాటిమీద సరైన అవగాహన లేకపోవటం.

**కాబట్టి ఓ బ్రాహ్మణులా ! యజ్ఞోపవీతాన్ని ధరించటం అవమానంగా భావించకండి. మీ ధర్మాన్ని మీరు నెరవేర్చండి. ఒకవేళ కర్మకాండలు చేయలేకపోయినా యజ్ఞోపవీతం మాత్రం ధరించండి.**

ఈ రకంగా అనేకానేక విషయాలు చెబుతోంది తైత్తిరీయారణ్యకము.

# 15. బృహదారణ్యకము

శుక్ల యజుర్వేదానికి సంబంధించినది శతపథ బ్రాహ్మణము. శతపథ బ్రాహ్మణంలోని 14 కాండలలోను ఆఖరు కాండ బృహదారణ్యకము. మళ్ళీ దీనిలోని చివరి ఆరు అధ్యాయాలు బృహదారణ్యకోపనిషత్తుగా చెప్పబడుతోంది. శుక్ల యజుర్వేదానికి మాంధ్యందిన, కాణ్వశాఖలు రెండూ వేరువేరుగా ఉన్నాయి. వాటికి సంబంధించిన అరణ్యకాలు కూడా బృహదారణ్యకము అనే పేరుతో విడివిడిగా రెండు అరణ్యకాలు ఉన్నాయి కాని రెండింటిలోని విషయం ఒక్కటే. చిన్న చిన్న తేడాలు తప్ప విషయంలో మార్పు అనేది లేదు.

ఇలా చూసినట్లైతే మాధ్యందిన శాఖకు చెందిన శతపథ బ్రాహ్మణంలోని బృహదారణ్యకంలో '6' అధ్యాయాలు 44 బ్రాహ్మణాలు ఉండగా కాణ్వశాఖలోని బృహదారణ్యకంలో 6 అధ్యాయాలు 47 బ్రాహ్మణాలు ఉన్నాయి. వీటి విభాగాల్లో తప్ప విషయంలో తేడా ఏమీలేదు. ఈ అరణ్యకాన్ని చెప్పినవాడు యాజ్ఞవల్క్య మహర్షి. దీనికి సాయణాచార్యుడు భాష్యంవ్రాశాడు. ఇది అరణ్యకమే కాక ఉపనిషత్తుగా కూడా చెప్పబడుతోంది. అందుచేత దీనికి శంకరాచార్యులు, రామానుజాచార్యులు, ఆనందతీర్థులవారు. ముగ్గురూ కూడా వారి సూత్రాలకు అనుగుణంగా భాష్యం వ్రాశారు.

## 1. ఓంకారోపాసన

ఓంకారమనేది పరబ్రహ్మ స్వరూపం. పరబ్రహ్మ ఉపాసిస్తే లోకంలో తీరనిది ఏదీలేదు. ఇహము, పరము అన్నీ లభిస్తాయి. అందుకే ఓంకారోపాసనతో అనేక కోరికలు తీరతాయి. ఏ కోరిక తీరాలంటే

ఏ మంత్రాలు జపం చెయ్యాలి అనే విషయాన్ని వివరిస్తున్నారు.

**మేధస్సు కోరేవాడు చేయవలసిన మంత్రాలు**

మేధస్సు (బుద్ధి)ని కోరే సాధకుడు జపించవలసిన మంత్రాలను, సంపదను కోరేవాడు జపించవలసిన మంత్రాలను చెబుతున్నారు. ఓంకారము యొక్క మహత్వం చెప్పబడింది. ముందుగా మేధస్సు కోరేవాడు జపించవలసిన మంత్రాలు. ఓంకారమనేది అన్ని వేదాలకు మూలమైనది. వేదసారమంతా ఓంకారంలోనే ఉన్నది. ఇది అమృత స్వరూపము. శాశ్వతము. పరమేశ్వర స్వరూపమైన ఓంకారమే నాకు ప్రజ్ఞను అనగా మేధస్సును, బుద్ధిని ఇచ్చుగాక. అమృత స్వరూపమైన బ్రహ్మజ్ఞానం పొందే శక్తి నాకు లభించుగాక.

బ్రహ్మజ్ఞాన సముపార్జనకు కావలసిన శక్తి నా శరీరానికి కలుగుగాక. పరుషమైన మాటలు నా నోటి నుండి రాకుండుగాక. గురూపదేశాన్ని చక్కగా వినగలిగే శక్తి నాకు కలుగుగాక. ఓంకారమా! నీవు బ్రహ్మకు ఒర (కోశము) వంటి దానవు. నీలోనే పరబ్రహ్మ దాగి ఉన్నాడు. నా ఆత్మజ్ఞానాన్ని రక్షించు. రాగద్వేషాలవల్ల నా బుద్ధి శీలము చెడకుండా కాపాడు. పరుష వాక్కులు నా నోటినుండి రానీయకు. నన్ను బ్రహ్మజ్ఞానం పొందదగిన వాడిగా చెయ్యి. ఇవి మేధస్సు కోరేవాడు జపించవలసిన మంత్రాలు.

**సంపదను కోరేవాడు చేయవలసిన మంత్రాలు :**

ఓంకారమా! మేధస్సును, శరీర పాటవాన్ని ఇచ్చిన తరువాత సంపదను ఇవ్వవలసినది. ఇక్కడ సంపద అంటే అన్న వస్త్రాలు, గోవులు మొదలైనవి. అవి చిరకాలము సమృద్ధిగా ఉండేటట్లు చెయ్యవలసినది. లౌకిక, మోక్ష విద్యను కోరినవారు, సద్బుద్ధి, ఇంద్రియ నిగ్రహము

గల విద్యార్థులు అన్ని దిక్కుల నుండి శాంతి చిత్తులై నా దగ్గరకు వత్తురుగాక. వీరందరినీ మంచి విద్యార్థులుగా తీర్చిదిద్ది, లోకంలో అత్యంత ధనికులు పొందే గౌరవం కన్న మిక్కిలి గౌరవము నేను పొందుదును గాక. ఇక బ్రహ్మతో ఐక్యము పొందాలని కోరుతున్నాడు. ఓంకారమా! బ్రహ్మకు నీవు వర (కోశము) వంటిదానవు. నీవు నాలో ప్రవేశించు. అప్పుడు నేను కూడా ప్రణవస్వరూపుడనే అవుతాను. ఇక నీకూనాకూ భేదం ఉండదు. ఓ ప్రణవమా! నీవే దేవతారూపము. నిన్నుస్మరించి నాపాపాలు పోగొట్టుకుంటాను. నీవు అనేక రూపాలు పొంది అనేక దేవతలుగా కనిపిస్తున్నావు. నువ్వు నాకు ఆత్మ స్వరూపం తెలిసేటట్లు చెయ్యి నన్ను కూడా నీలో లీనమొనర్చుకో.

ఈ అనువాకంలో సంపదకోసం కొన్ని మంత్రాలున్నాయి. ఉపనిషత్తు అంటే జ్ఞానప్రకరణం కదా ! మరి ఇక్కడ సంపద దేనికి? అనే అనుమానం రావచ్చు. అజ్ఞానికి ధనం పాపహేతువు. జ్ఞానికి వచ్చినసంపద సద్వినియోగమవుతుంది. యజ్ఞయాగాది క్రతువులు చెయ్యటానికి సంపద కావాలికదా! అందుకని ఈ ప్రకరణంలో ముందుగా జ్ఞానమడిగి తరువాత సంపద నడుగుతున్నాడు.

## 2. వ్యాహృతుల ఉపాసన

ఐదవ అనువాకంలో పరబ్రహ్మకు అంగభూతాలయిన వ్యాహృతుల ఉపాసన చెప్పబడుతోంది. వ్యాహృతులు అంటే కర్మలలో ఉపయోగించేవి అని అర్థం. భూః, భువః, సువః అనేవి మూడు వ్యాహృతులు, మహాచమస్యుడనే మహర్షి తపస్సు చేసి 'మహః' అనే నాల్గవ వాహృతిని కనిపెట్టాడు. మహః అనే వ్యాహృతే బ్రహ్మము, ఆత్మ. మహః అనేది (అంగి) శరీరమైతే భూః భువః సువః అనేవి

అంగాలు. ఆ అంగాలకు ఉనికి లభించినట్లుగా 'మహః' వల్ల మిగిలిన వాటికి ఉనికి లభిస్తోంది. వ్యాహృతులు బ్రహ్మకు అంగాలు కాబట్టి ఈ అంగముల (వ్యాహృతుల) ఉపాసన చెప్పబడింది. ఆ ఉపాసన నాలుగు రకాలు.

**1. లోక దృష్టితో ఉపాసన :**

భూ – భూలోకాన్ని దృష్టిలో ఉంచుకుని

భువః – అంతరిక్షాన్ని దృష్టిలో ఉంచుకుని

సువః – స్వర్గలోకాన్ని దృష్టిలో ఉంచుకుని

మహః – ఆదిత్యలోకాన్ని దృష్టిలో ఉంచుకుని

ఉపాసన చెయ్యాలి. ఈ లోకాలన్నీ సూర్యుని వెలుగుతో ప్రకాశమవుతాయి. అందుకే ఈ ఉపాసన.

**2. దేవదృష్టితో ఉపాసన :**

భూః – అగ్నిదృష్టితో

భువః – వాయుదృష్టితో

సువః – ఆదిత్య దృష్టితో

మహః – చంద్రుని దృష్టితో

ఉపాసన చెయ్యాలి. అన్ని తేజస్సులు చంద్రునిచే పూజ్యములు.

**3. వేద దృష్టితో ఉపాసన :**

భూః – ఋగ్వేదము

భువః – యజుర్వేదము

సువః – సామవేదము

మహః – ఓంకారము

ఓంకారాన్ని మొదట, చివర చేర్చటంవల్లనే వేదాలు పూజనీయమవుతున్నాయి.

**4. ప్రాణ దృష్టితో ఉపాసన :**

భూః - ప్రాణవాయువు

భువః - అపానవాయువు

సువ - వ్యానవాయువు

మహః - అన్నము

గా భావించి ఉపాసన చెయ్యాలి. లోకంలో ప్రాణులన్నీ అన్నం చేతనే వృద్ధి పొందుతున్నాయి. ఈ రకంగా వ్యాహృతులు లోక 4, దేవ 4, వేద 4, ప్రాణ 4, మొత్తం 16. హిరణ్యగర్భునికి ఇవి అంగాలు. వీటిని తెలుసుకోగలిగినవాడే బ్రహ్మను తెలుసుకోగలుగుతాడు. అతడిని దేవతలు కూడా పూజిస్తారు.

పదహారు వ్యాహృతుల్ని సర్వాంగ పూరితమైన బ్రహ్మగా భావించి ఉపాసించటము అంటే మన దృష్టికి, బుద్ధికి గోచరించే విశ్వమంతా భగవంతుని రూపమే. అని భావన చెయ్యటము.

బ్రహ్మను పొందటానికి తగిన స్థానాలు ఆరవ అనువాకంలో చెప్పబడ్డాయి.

పద్మము వంటి ఆకారం గల హృదయాకాశంలో ఆ పరబ్రహ్మ ఉన్నాడు. అతడు మనోమయుడు (జ్ఞానమే ప్రధానముగా గలవాడు), అమృతుడు (మరణం లేనివాడు), హిరణ్మయుడు (స్వప్రకాశం గలవాడు)

శరీరంలో హృదయభాగం నందు సుషుమ్నానాడి ఉంది. రెండు

దవడల మధ్యన కొండ నాలుక ఉన్నది. దాని మధ్యభాగం నుండి కపాలాన్ని ఛేదించుకుని బయటకు పోవటమే పరమాత్మను చేరటానికి మార్గము. ప్రాణాన్ని కపాలం ద్వారా బయటకు పంపగలిగినవాడు ఋగ్వేదానికి, ప్రాణవాయువుకు అధిష్ఠానమైన భూః అనే వ్యాహృతి రూపంలో ఉండే అగ్నిలాగా ఈ లోకమంతా వ్యాపిస్తాడు. అంటే బయటకు వచ్చి అగ్నిలో కలసి లోకమంతా వ్యాపిస్తాడు.

అలాగే భువః అనే వ్యాహృతి రూపంలో ఉండే వాయువుతో కలిసి అంతరిక్ష మంతా వ్యాపిస్తాడు.

సువః అనే వ్యాహృతి రూపంలో ఉండే ఆదిత్యునితో కలిసి స్వర్గలోకమంతా వ్యాపిస్తాడు.

మహః అనే వ్యాహృతి రూపంలో ఉండే చంద్రునితో కలిసి ఆదిత్య లోకమంతా వ్యాపిస్తాడు.

ఈ రకంగా వ్యాహృతుల రూపంలో ఉండే బ్రహ్మలో కలసిపోతాడు.

ఈ రకంగా బ్రహ్మభావం పొంది అంటే తానుకూడా బ్రహ్మయై అందరి మనస్సులకు అధిపతి అవుతాడు. ఆకాశమే శరీరంగా కలవాడు, సూక్ష్మశరీరం కలవాడు, కనిపించే లక్షణాలు కలవాడు, కనిపించని లక్షణాలు కలవాడు, సత్యమైన స్వభావం కలవాడు, సమస్త ప్రాణులందు సంచరించేవాడు, ఆనందము మాత్రమే పొందేవాడు, సమాధి ద్వారా పరిపూర్ణానందము పొందేవాడు శాశ్వతుడు అవుతాడు.

ఏడవ అనువాకంలో బ్రహ్మను భూమి మొదలైన ఐదు పాంక్త రూపాలలో ఉపాసించటం చెప్పబడుతోంది.

పాంక్తము అంటే పంక్తి, వరుసకు సంబంధించినది. ఇక్కడ పాంక్త

ఆకాశమే ఆధారం అటువంటి ఈ ఉద్గీథమే – ఆకాశమే అన్నింటిలోకి శ్రేష్ఠమైనది. కాబట్టి ఉద్గీథాన్ని అనంతమైనదిగా, పరమాత్మ స్వరూపంగా భావించి ఉపాసించేవాడు బ్రహ్మకాశపర్యంతము ఉన్న లోకాలన్నింటిని జయిస్తాడు.

ఉద్గీథను గురించి బాగా తెలుసుకున్నవాడు ఇతరులకన్న ఉన్నతమైన జీవనం సాగిస్తాడు. చివరకు ఉత్తమలోకాలు పొందుతాడు అని శునకుని కుమారుడైన అధిధ్వనుడు తన శిష్యుడైన శాండిల్యునికి వివరించాడు.

## 4. ఉషస్తి

"శిష్యులారా ! నియమ నిష్ఠలతో కాలం వెళ్ళబుచ్చేవాడు ప్రాణం నిలుపుకోవటానికి ఎవరేమి ఇచ్చినా తీసుకుని తినవచ్చు. అది నిలిచిన తరువాత మాత్రం అలా చేయరాదు. అలాగే ప్రతి కార్యానికి ఒక అధిష్ఠాన దేవత ఉంటుంది. మంత్రము యొక్క అర్థము, అధిష్టాన దేవత తెలియకుండా చేసిన కర్మ నిరర్ధకము. పాపహేతువు కూడా అవుతుంది. ఈ విషయాలు తెలియటానికి 'ఉషస్తి' ఉదంతం వివరించబడింది.

కురుదేశంలో ఇభ్య అనే పల్లె ఉన్నది. ఆ పల్లెలో ఉషస్తి అనే ఋషి ఉండేవాడు. అతని భార్య పేరు ఆటకి. ఉషస్తి వేదవేదాంగ విదుడు, పండితుడు.

ఒకసారి కురుదేశంలో భయంకరమైన కరువు వచ్చింది. పంటలు పండలేదు. కాటకం విలయతాండవం చేస్తోంది. తినటానికి ఎక్కడా ఏమీ దొరకలేదు. తిండిలేక ప్రజలు మలమల మాడిపోతున్నారు.

ఆ రోజుల్లో ఉషస్తి ఆహారం లేక బాధపడుతూ ఒక మాపటివాడి దగ్గరకు వెళ్ళి తినటానికి ఏమైనా పెట్టమని అడిగాడు. అప్పుడా మావటీడు భయపడుతూ "బ్రాహ్మణోత్తమా! నావద్ద మినుములుతప్ప ఏమీలేవు. అవి కూడా నేను ఎంగిలి చేసినవి. కాబట్టి నేను మీకు ఏమి ఇవ్వగలను?" అన్నాడు. దానికి ఉషస్తి–

"ఫరవాలేదు. ఆ ఎంగిలి చేసిననే నాకు కొద్దిగా పెట్టు" అన్నాడు. మాపటివాడు ఆ ఎంగిలి మినుములు కొన్ని ఉషస్తికి దానంచేసి, తాగటానికి నీరుకూడా ఇచ్చాడు.

ఉషస్తి మినుములను మాత్రంతిని నీరువద్దన్నాడు. ఆ మాటలకు ఆశ్చర్యపోయిన మావటి "బ్రాహ్మణోత్తమా! ఎంగిలిమినుములు తిన్నావు కదా! మరి ఎంగిలినీరు త్రాగటానికి అభ్యంతరం ఏమిటి?" అన్నాడు.

దానికి ఉషస్తి "మిత్రమా! ప్రాణము నిలుపుకోవటానికి ఎక్కడి ఆహారమైనా తినవచ్చు. అందులో దోషంలేదు. ఇప్పుడు నాకు ఓపికవచ్చింది. కాబట్టి నీవిచ్చే నీళ్ళు అవసరం లేదు' అన్నాడు.

ఉషస్తి తను తినగా మిగిలిన మినుములను భార్యకోసం తీసుకువెళ్ళాడు. ఆమె వాటిలో కొంత భాగం మరునాటికి దాచి పెట్టింది.

మరునాడు ఉషస్తి భార్యతో "నాకు చాలా ఆకలిగా ఉన్నది. ఏవైనా పెడితే తిని రాజుగారి దగ్గరకు వెడతాను. రాజు ఏదో యజ్ఞం చేస్తున్నాడట అన్నాడు. అప్పుడు అతని భార్య క్రితం రోజుదాచి ఉంచిన మినుములు తెచ్చి ఇచ్చింది. వాటిని తిని రాజాస్థానానికి బయలుదేరాడు ఉషస్తి.

యజ్ఞం చాలా ఆర్భాటంగా జరుగుతోంది. అనేకమంది ఋత్విక్కులు యాగకలాపాలు నడిపిస్తున్నారు. ఉషస్తి సరాసరి ముగ్గురు ప్రధాన ఋత్విక్కుల దగ్గరకు వెళ్ళి వారిని నిలదీసి అడిగాడు. "ఋత్విక్కులారా! మీరు చేస్తున్న కార్యకలాపాలకు అధిష్ఠాన దేవతలెవరో మీకు తెలుసా? ఒకవేళ తెలియకుండా యాంత్రికంగా కలాపం జరిపిస్తే మీ తలతెగి క్రిందపడుతుంది. జాగ్రత్త."

ఋత్విక్కులకు నిజంగానే అధిష్ఠాన దేవతలెవరో తెలియదు. ఆ మాటలు విన్నరాజు "స్వామీ ! తమరెవరో నాకు తెలియచేయండి" అన్నాడు.

'రాజా ! చక్రుని కుమారుడను, నన్ను ఉషస్తి చాక్రాయణుడు అంటారు' అన్నాడు.

"ఓ మహాత్మా! మేము మీ కోసమే అన్వేషించాము. యజ్ఞానికి ఆచార్య స్థానం మీరేవహించాలనుకున్నాం. కాని మీరెక్కడున్నారో మాకు తెలియలేదు. అయినా సమయానికి విచ్చేశారు. యజ్ఞనిర్వహణ భారం మీరే వహించండి అన్నాడు రాజు. ఉషస్తి యజ్ఞానికి ఆధ్వర్యం వహించి అక్కడ ఉన్న ఋత్విక్కులను పిలిచి వారిని యజ్ఞాన్ని గురించి ప్రశ్నించాడు. వారికి యజ్ఞం గురించి, అధిష్ఠాన దేవతల గురించి ఏమీ తెలియదు. అప్పుడు మొదటి ఋత్విక్కుతో "మీరుచేసే కార్యకలాపాలకు అధిష్ఠానదైవం ప్రాణం. అన్ని జీవరాశులు ప్రాణంలో ప్రవేశిస్తాయి. ప్రాణంతోనే జీవిస్తాయి. ఇది తెలుసుకోకుండా యజ్ఞంచేస్తే కీడుమూడుతుంది" అన్నాడు తరువాత రెండవ వానితో, "మీరుచేసే కార్యకలాపాలకు అధిష్ఠాన దేవత ఆదిత్యుడు. అన్ని జీవరాశులకు అతడే ఆధారం. ఇది తెలుసుకోకుండా యజ్ఞంచేస్తే హానిజరుగుతుంది" అన్నాడు. తరువాత మూడవ ఋత్విక్కుతో "మీరు

చేసే కార్యకలాపాలకు అధిష్ఠానం అన్నం. జీవరాశులన్నీ అన్నం వల్లనే జీవిస్తున్నాయి. ఇది తెలుసుకోకుండా యజ్ఞం చేస్తే ప్రమాదంసంభవిస్తుంది." అన్నాడు తరువాత ఋత్విక్కులు ముగ్గురినీ చూసి ఈ విధంగా చెప్పాడు.

"మహానుభావులారా ! మానవుడికి జీవనాధారం ప్రాణం. అన్నంలేకపోతే జీవించలేదు. అన్నం కావాలంటే ఆహార పదార్థాల ఉత్పత్తి సూర్యునిమీద ఆధారపడి ఉన్నది. ఈ లోకంలో సూర్యుడికి సమానమైనవాడు అగ్ని, కాబట్టి అగ్నిని తృప్తిపరచినట్లైతే మానవుడికి కావలసినవి అన్నీ లభిస్తాయి.

ప్రతికార్యానికి ఒకఅధిష్టాన దేవత ఉంటుంది. మంత్రార్థము. అధిష్ఠాన దేవత తెలియకుండా చేసిన కర్మ నిరర్థకము, పాపహేతువు కూడా అవుతుంది" అని యజ్ఞకర్మ విశేషాన్ని వివరించాడు.

## 5. పంచవిధసామోపాసన

"సామము సాధువైనది. ఉత్తమమైనది. శుభప్రదమైనది. సామోపాసన గురించి తెలుసుకున్నవాడు లోకంలో ఐదువిధాలయిన సామాలను ఆరోపించుకుని ఉపాసన చేస్తాడు.

ఓంకారోపాసన ఎక్కువ ప్రయోజనాలనిస్తుంది. కాబట్టి సామోపాసన ఉత్తమమైనది. సాధువైనది సామము. అసాధువైంది సామంకాదు. అలాగే...

| | | |
|---|---|---|
| సామరూపము అంటే | – | ఉత్తమ రూపము |
| అసామరూపము అంటే | – | అశుభరూపము |
| సామం కలిగింది అంటే | – | శుభం కలిగింది |

అసామం కలిగింది అంటే - కీడు కలిగింది అని అర్థం.

ఈ విషయాన్ని తెలుసుకుని ఉపాసన చేసేవాడికి శాస్త్రసమ్మతమైన సాధుధర్మం శీఘ్రంగా వస్తుంది. మంచి ధర్మాలు, గుణాలు అతనికి లభిస్తాయి.

లోకదృష్టితో ఐదువిధాలయిన సామాలను ఉపాసించాలి.

1. భూమి - హింకారము
2. అగ్ని - ప్రస్తావం
3. అంతరిక్షం - ఉద్గీథం
4. ఆదిత్యలోకం - ప్రతిహారం
5. ద్యులోకం - నిధనం

ఈ రకంగా ఐదువిధాలైన సామాన్ని ఐదు లోకాలుగా భావించి ఉపాసించాలి. అలాగే అథోలోకాల సారూప్యంతో సామోపాసన చెప్పబడుతోంది. పై నుంచి క్రింది లోకాలకు

1. ద్యులోకం - హింకారము
2. ఆదిత్యలోకం - ప్రస్తావం
3. అంతరిక్షం - ఉద్గీథం
4. అగ్ని - ప్రతిహారం
5. భూమి - నిధనం

ఇది జీవులు పై నుంచి క్రిందికి దిగివచ్చే క్రమము.

ఈ విధమైన ఉపాసన తెలుసుకున్నవాడు లోకంలో ఐదువిధాల సామాలను ఆరోపించుకుని ఉపాసన చేస్తాడు. ముందుగా పంచవిధ సామాన్ని వానలో ఆరోపించటం. మొదటిది :

1. వానకు ముందువీచే గాలి - హింకారము
2. పెద్ద మేఘమే - ప్రస్తావం
3. మేఘం వర్షించటం - ఉద్గీథం
4. ఉరుములు, మెరుపుల ధ్వని - ప్రతిహారం
5. వర్షపునీరు మనను గ్రహించటమే - నిధనం

ఈ విధంగా ఉపాసన చేసినవాడు స్వయంగా వాన కురిపించుకోగలుగుతాడు.

రెండవది అన్ని రకాలజలాలలోను పంచవిధసామాన్ని ఉపాసించటం.

1. మేఘం ఘనీభవించటం - హింకారము
2. అది వర్షించటం - ప్రస్తావం
3. నదులు తూర్పు దిక్కుగా ప్రవహించటం - ఉద్గీథం
4. పడమటి దిక్కుగా ప్రవహించటం - ప్రతిహారం
5. నదులు సముద్రంలో కలవటం - నిధనం

ఈ రకంగా ఉపాసన చేసినవాడు అతను కావాలనుకుంటే తప్ప, నీటిలో మరణించడు. అతడికి నీటికరువు ఉండదు.

మూడవది ఋతువులలో పంచవిధ సామాన్ని ఉపాసించటం.

1. వసంత ఋతువు - హింకారము
2. గ్రీష్మ ఋతువు - ప్రస్తావం
3. వర్ష ఋతువు - ఉద్గీథం
4. శరదృతువు - ప్రతిహారం
5. హేమంత,శిశిర ఋతువులు - నిధనం

ఈ రకంగా ఉపాసన చేసినవాడు ఆ ఋతువులలో అన్ని భోగాలు అనుభవించగలుగుతాడు.

నాల్గవది పశువుల్లో పంచవిధ సామాన్ని ఉపాసించటం

1. మేకలు – హింకారము
2. గొర్రెలు – ప్రస్తావం
3. ఆవులు – ఉద్గీథం
4. గుర్రాలు – ప్రతిహారం
5. వీటన్నిటికీ ఆశ్రయమైన మానవుడు – నిధనం

ఈ రకంగా ఉపాసన చేసిన వాడికి పశుసంపద లభిస్తుంది.

ఐదవది ప్రాణాలలో పంచవిధ సామాన్ని ఉపాసించటం, ఇక్కడ ప్రాణాలు అంటే ఇంద్రియాలు.

1. ఘ్రాణేంద్రియము – హింకారము
2. వాక్కు – ప్రస్తావం
3. చక్షువులు – ఉద్గీథం
4. శ్రోత్రం – ప్రతిహారం
5. మనస్సు – నిధనం

ఈ విధంగా ఉపాసన చేసినవాడి జీవితం శ్రేష్ఠమైనది అవుతుంది.

## 6. సప్తవిధ సామోపాసన

సామాన్ని ఏడురకాలుగా ఉపాసిస్తారు. అదే సప్తవిధ సామోపాసన. సప్తవిధ సామాన్ని ఆదిత్య దృష్టితో ఉపాసించేవాడు మంచి సంపన్నుడు, భోక్త అవుతాడు.

1. హింకారము
5. ప్రతిహారం

2. ప్రస్తావము  6. ఉపద్రవము
3. ఆది  7. నిధనం
4. ఉద్గీథం

వీటిని సప్తసామాలు అంటారు. ఈ సప్తవిధ సామాన్ని వాక్ దృష్టితో ఉపాసించాలి. అంటే సప్తవిధ సామమే వాక్కు అని భావించాలి. వాక్కులో ఉండే

| | | |
|---|---|---|
| 'హు'కారము | – | సామంలోని 'హిం'కారమ |
| 'ప్ర' అనే శబ్దమే | – | సామంలోని 'ప్రస్తానము' |
| 'ఆ' అనే శబ్దమే | – | సామంలోని 'ఆది' (ఓంకారము) |
| 'ఉత్' అనే శబ్దమే | – | సామంలోని 'ఉద్గీథం' |
| 'ప్రతి' అనే శబ్దమే | – | సామంలోని 'ప్రతిహారము' |
| 'ఉప' అనే శబ్దమే | – | సామంలోని 'ఉపద్రవము' |
| 'ని' అనే శబ్దమే | – | సామంలోని 'నిధనం' |

ఈ విషయం తెలిసి ఎవరైతే సప్తవిధ సామాన్ని ఉపాసిస్తాడో, అతడు సంపన్నుడు, మంచి భోక్త అవుతాడు.

సప్తవిధ సామాన్ని ఆదిత్యదృష్టితో ఉపాసించాలి. ఆదిత్యుడికి వృద్ధి క్షయాలుండవు. కాబట్టి ఎప్పుడూ సమంగానే ఉంటాడు. అలా సమంగా ఉండటమే సామం. ఆదిత్యుడు లోకంలోని ప్రతి వ్యక్తికీ సమానంగానే కనిపిస్తుంటాడు.' ఆదిత్యునిలోనే సమస్తభూతాలూ అనుగతమై ఉన్నాయి. అంటే అంతకు ముందునుంచీ ఉన్నాయన్న మాట.

ఆదిత్యుడు ఉదయించటానికి మందు ఉండే ధర్మ స్వరూపమే

‘హిం’కారము. పశుగణమంతా ఈ ‘హిం’కారాన్నే అనుగమిస్తుంది. సూర్యోదయానికి ముందు పశువులన్నీ హింకారం చేస్తూ ఆదిత్యోపాసన చేస్తాయి.

ఆదిత్యుడు ప్రప్రథమంగా ఉదయించే సమయంలో ఉండే రూపమే ‘ప్రస్తానం’ మానవులంతా ఈ రూపాన్ని ఉపాసన చేస్తారు.

సూర్యుడు తన కిరణాలను ప్రసరింపచేసే సమయం (అంటే సూర్యోదయానికి మూడు ముహూర్తముల తరువాత)లో ఉండే రూపమే ‘ఆది’ (ఓంకారము). ఆదిత్యుని ఈ రూపాన్ని పక్షులు సేవిస్తున్నాయి కాబట్టే అవి కూడా సూర్యునిలాగా ఆకాశంలో తిరుగగలుగుతున్నాయి.

మధ్యాహ్న సమయంలో మండుతూ ఉండే ఆదిత్యుని రూపమే ‘ఉద్గీథం’, దీన్ని దేవతలు సేవిస్తారు.

అపరాహ్ణం ముందు ఆదిత్యుని మండుతూ ఉండే రూపమే ‘ప్రతిహారం’. ఈ రూపాన్ని గర్భంలో ఉండే పిండాలు సేవిస్తాయి.

సూర్యాస్తమయానికి ముందుండే ఆదిత్య రూపమే ‘ఉపద్రవము’. అడవి జంతువులు ఈ రూపాన్ని సేవిస్తాయి. అందుకే ఇవి మానవుల్ని చూసి భయపడి గుహల్లోకి పారిపోతాయి.

సూర్యాస్తమయానికి పూర్వం ఉండే ఆదిత్య రూపమే ‘నిధనం’. పితృదేవతలు ఈ రూపాన్ని సేవిస్తారు.

ఈ రకంగా ఆదిత్య రూపంలో సప్తవిధసామాన్ని ఉపాసించేవాడు ఆదిత్యరూపాన్ని పొందుతాడు. అదే విధంగా గాయత్రి సంజ్ఞ కలిగిన సామాన్ని ప్రాణంతో ప్రతిష్ఠితమై ఉన్నట్లు తెలుసుకున్నవాడు ఇంద్రియ నిగ్రహము, పూర్ణాయువు గలవాడౌతాడు. రథంతర సామం అగ్నిలో వ్యాప్తమై ఉన్నట్లు తెలుసుకున్నవాడు బ్రహ్మతేజస్సు కలవాడౌతాడు.

వామదేవసామం దంపతులందు ప్రతిష్ఠితమై ఉన్నట్లు గ్రహించిన వాడు ఎన్నడూ భార్య లేనివాడు కాడు. పూర్ణాయుష్షు పొందుతాడు.

## 7. గాయత్ర్యోపాసన

ఛందస్సులు అనేక రకాలున్నాయి. కాని బ్రహ్మజ్ఞానానికి ద్వారం గాయత్రి ఛందస్సు ఆ గాయత్రియే సోమరసాన్ని తెచ్చి దేవతలకిచ్చింది.

ఒకసారి దేవతలంతా గాయత్రి, త్రిష్టుప్, జగతి ఛందస్సులను సోమాన్ని తీసుకురమ్మని పంపారు. వీటిలో త్రిష్టుప్, జగతి ఛందస్సులు సోమాన్ని చేరలేక తిరిగి వచ్చేశాయి. అంతేకాకుండా వస్తూ త్రోవలో అలసట కారణంగా తమలోని కొన్ని అక్షరాలను వదలివేశాయి. గాయత్రి మాత్రం సోమం దగ్గరకు వెళ్ళి, దాన్ని రక్షించే వారందర్నీ ఓడించి సోమాన్ని తెచ్చి దేవతలకిచ్చింది. తిరిగి వచ్చేటప్పుడు త్రోవలో జగతి ఛందస్సు వదలిన ఒక అక్షరాన్ని, త్రిష్టుప్ ఛందస్సు వదలిన మూడు అక్షరాలను కూడా తనతో కలుపుకుని వచ్చింది. ఆ కారణంగా గాయత్రి అన్నింటికి మించినది అయింది. పైగా ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలాలు మూడింటిలోనూ వ్యాప్తమై ఉన్నది. బ్రాహ్మణునికి అత్యంతావశ్యకమవటంతో దాని గౌరవం ఇనుమడించింది. అందుచేతనే గాయత్రిని ఉపేక్షించినవాడు దేన్నీ పొందలేడు.

గాయత్రీ ఛందస్సులో 24 అక్షరాలు ఒక్కొక్క పాదానికి ఆరు చొప్పున, నాలుగు పాదాలుగా ఉన్నాయి. ఇతర ఛందస్సులలో ఇంకా ఎక్కువ అక్షరాలుంటాయి. కాని వాటన్నింటిలోకి గాయత్రియే శ్రేష్ఠమైనది. స్థావర జంగమాత్మకమైన ప్రాణి సమూహమంతా గాయత్రియే. వాక్కే గాయత్రి, సమస్త ప్రాణులూ గాయత్రి. వాగ్రూపమైన

గాయత్రి అందరి పేర్లను ఉచ్చరిస్తోంది కాబట్టి గాయత్రి అందరి పేర్లలోనూ ఉన్నది. ఈ రకంగా ప్రాణిజాతమంతా గాయత్రీ స్వరూపమే. గాయత్రి అనే శబ్దానికి ప్రాణులను గురించి పాడుతున్నది. ప్రాణులను రక్షిస్తున్నది అని అర్థం. ఈ లక్షణాలు గల గాయత్రి, ఈ పృథ్వి తప్ప వేరు కాదు. చరాచరాలన్నీ భూమిలోనే ఉన్నాయి. అందుచే చరాచర జగత్తునంతటినీ గానం చేస్తూ – పాడుతూ, త్రాణం చేస్తూ కాపాడుతూ ఉండే గాయత్రియే ఈభూమి.

పృథ్వీరూపమైన గాయత్రి, శరీరంలో ఉండే పంచభూతాలు, ఇంద్రియాల సమూహమూ ఒకటే. పురుషుని శరీర రూపమైన గాయత్రి, పురుషుని హృదయ కమలంలో ఉండే పురుషుడు ఒకటే. ఆ పురుషునిలోనే అంటే గాయత్రిలోనే ప్రాణాలు ప్రతిష్ఠితమై ఉన్నాయి. ఇంతవరకు గాయత్రి పేరుతో బ్రహ్మను గూర్చి అతని మహిమను గూర్చి వివరించాను. ఇది కార్యబ్రహ్మ విభూతి. ఇక శుద్ధ బ్రహ్మ మహత్వం వివరిస్తాను.

శుద్ధబ్రహ్మ కార్యబ్రహ్మ కన్న గొప్పది. పాంచభౌతికమైన జగత్తంతా శుద్ధ బ్రహ్మ యొక్క ఒక పాదమే. మిగిలిన మూడుపాదాలు ఆ పరబ్రహ్మలోనే ఉన్నాయి. గాయత్రి ద్వారా ప్రతిపాదించబడి, మూడు పాదములుగల అమృత స్వరూపమైన బ్రహ్మము ఇదే. ఆ పురుషునికి బయట లోపలా కూడా ఉన్న ఆకాశము ఒకటే. అదే విధంగా హృదయంలోపలా, బయటా ఉన్న ఆకాశము, ఆత్మకూడా. ఈ రకంగా బ్రహ్మన్ని గురించి తెలుసుకున్నవాడు బ్రతికిఉండగానే బ్రహ్మస్వరూపాన్ని పొందుతాడు.

## 8. విద్యుదుపాసన

విద్యుత్తు రూపంలో ఉండే పరబ్రహ్మ పాపాలు అనే చీకటిని పోగొడుతుంది. కాబట్టి పరమాత్మను విద్యుత్తుగా ఉపాసన చెయ్యాలి.

విద్యుత్తులో ఉన్న పురుషుడే ప్రాణం. సామబ్రహ్మ అమృతం. నేత్రంలో ఉన్నటువంటి వాడే పురుషుడు. ఆదిత్యుడిలో ఉన్నవాడు – అతిపురుషుడు. అదే విద్యుత్తులో ఉన్నవాడు పరమ పురుషుడు. వీరు మొత్తం ముగ్గురు పురుషులు. వీరిలో ఉన్నటువంటి వాడే పరమాత్మ అనబడతాడు. కాబట్టి పరమాత్మను తెలుసుకుని ఉపాసన చెయ్యాలి.

| | |
|---|---|
| నేత్రంలో ఉన్న పురుషుడు | – అనురూపుడు |
| ఆదిత్యుడిలో ఉన్న పురుషుడు | – ప్రతిరూపుడు |
| విద్యుత్తులో ఉన్న పురుషుడు | – సర్వరూపుడు |

ఈ రకంగా తెలుసుకుని ఉపాసన చెయ్యాలి. పరమాత్మ మనోమయుడు. అతడే సమస్తాన్ని నియమిస్తున్నాడు. అని గనక తెలుసుకుని ఉపాసన చేస్తే పరమాత్మకు సన్నిహితుడవుతాడు.

## 9. అశరీరసామము

ఉచ్చైశ్రవుడు, కేశిదాల్భ్యుడు మంచి స్నేహితులు. ఉచ్చైశ్రవునికి మేనల్లుడవుతాడు కేశిదాల్భ్యుడు. ఇతడు పాంచాల దేశాధిపతి. కురుదేశాన్ని పాలించే ఇతని మేనమామ ఉచ్చైశ్రవుడు మరణించాడు. దాంతో కేశిదాల్భ్యుడు బాగా బాధపడ్డాడు. ఒకరోజు వేటకని అరణ్యానికి వెళ్ళాడు. వేటసాగుతోంది. ఆ సమయంలో మరణించిన ఉచ్చైశ్రవుడు దాల్భ్యుడికి కనిపించి 'అశరీర సామాన్ని' గానం చేస్తే మోక్షం

పొందుతావు; అంతేకాదు జీవించి ఉన్నంతకాలము ఈ లోకంలో కీర్తి, ప్రతిష్ట, ధనధాన్యాలు కూడా పొందగలవు" సామగానం చేతనే ప్రజాపతికుమారుడు పతంగుడు కూడా మోక్షం పొందాడు. అశాశ్వతమైన ఈ లోకాన్ని వదిలి శాశ్వతమైన మోక్షాన్ని పొందాలంటే అశరీర సామాన్ని గానం చెయ్యాలి" అన్నాడు. ఆ తరువాత కేశిదాల్భ్యుడు 'ద్వాదశాహాన్ని' ఆచరించి అశరీర సామంగానం చేయించి మోక్షం పొందాడు అని చెబుతోంది తలవకార అరణ్యకం.

## 10. మూడుసార్లు చస్తాడు

ప్రతి మానవుడు మూడుసార్లు పుట్టి మూడుసార్లు చస్తాడు అని చెబుతోంది ఈ అరణ్యకం.

తండ్రిలో రేతస్సు రూపంలో మొదజన్మ. అక్కడి నుంచి తల్లి గర్భంలోకి చేరిన రేతస్సు రెండో జన్మ. తరువాత పెరిగి పెద్దవాడై యజ్ఞంలో ఆహుతులు, సమర్పించింది మూడవ జన్మ.

రేతస్సు రూపంలో తల్లి గర్భంలో పడ్డప్పుడు మొదటి జన్మ పూర్తవుతుంది. బ్రహ్మచారిగా దీక్ష తీసుకున్నప్పుడు రెండవ జన్మ పూర్తవుతుంది. ఈ లోకాన్ని వదిలిపోయిన తరువాత (మరణించిన తరువాత) మూడవజన్మ పూర్తవుతుంది. ఇలా ప్రతిమానవుడికి మూడు జన్మలుంటాయని చెబుతోంది ఈ అరణ్యకం.

## 11. సృష్టిక్రమము

పూర్వకాలంలో ప్రజాపతి ఋగ్వేదాన్ని తీసుకుని 'భూః' అని ఉచ్చరించి రసాన్ని పిండాడు. అది పృథివి అయింది. 'భువః' అని యజుర్వేద రసాన్ని పిండాడు. అది అంతరిక్షమైంది. (సువః) అని

సామవేద రసాన్ని పిండాడు. అది స్వర్గమయింది. ఈ మూడు రసాల నుంచి మళ్ళీ విడివిడిగా రసాలు తీశాడు. అవి అగ్ని, వాయువు, ఆదిత్యుడు అయినాయి. ఇలా వేదక్రమాన్ని పిండగలిగినప్పటికీ ప్రజాపతి ఓంకారాన్ని పిండలేకపోయాడు. ఓంకారమే వాగ్రూపమైంది. దాని రసమే ప్రాణమయింది. ఈ రకంగా ఇవి ప్రజాపతి వల్ల సృష్టించబడినాయి. వీటి ప్రతీకయే గాయత్రి చందస్సు. ఈ కారణంచేతనే గాయత్రి బ్రహ్మరూపంగా భావించబడుతున్నది.

## 12. ఓంకారం గొప్పదనం

ప్రజాపతి మూడు వేదాలను పిండి, ఆ రసాన్ని అక్కడే వదిలి పైకి వెళ్ళిపోయాడు. అలా పైకి వెళ్ళిన ప్రజాపతిని మొదటగా ఇంద్రుడు, చంద్రుడు, రుద్రుడు, సముద్రుడు, వీరు నలుగురు చూశారు. అందువల్ల ఆ నలుగురూ దేవతలలో గొప్పవారయినాడు. ఆ రసమే తపస్సు అయింది. ఆ రసాన్ని దేవతలు చూశారు. మూడు వేదాలు పరిశీలించి, అందులో ఓంకారాన్ని కనుక్కున్నారు. అటువంటి ఓంకారం వల్ల వేదాలు రసయుక్తాలని తెలుసుకుని తపస్సును వేదత్రయంతో కలిపి చేశారు. అలా చేసిన తపస్సు వల్ల వేదాలు సమృద్ధమైనానవి.

## 13. ఋక్కులు లేని సామగానం

పూర్వకాలంలో స్వర్గం దేవతల అధీనంలో ఉండేది కాదు. ఏమైనా సరే స్వర్గాన్ని పొందాలి అని దేవతలు విపరీతమైన ప్రయత్నం చేశారు. కాని స్వర్గాన్ని పొందలేకపోయారు. దాంతో ఏం చెయ్యాలో పాలుపోక ప్రజాపతి దగ్గరకు వెళ్ళి ‘ఓ ప్రజాపతీ’ వేము స్వర్గం పొందలేకపోతున్నాము. కాబట్టి మాయందు కరుణ కలిగి మేము స్వర్గం పొందే మార్గం మాకు ఉపదేశించవలసింది’ అన్నారు. అప్పుడు

ప్రజాపతి 'ఓ దేవతలారా! ఋగ్మంత్రం లేకుండా సామగానం చేస్తే స్వర్గం వస్తుంది' అన్నాడు. ఆ మాటలు విన్న దేవతలు ఋగ్మంత్రం లేకుండా సామాన్ని గానం చేశారు. దాంతో స్వర్గాన్ని పొందగలిగారు. వారు వదిలేసిన ఋక్కులన్నీ తీసుకుని ప్రజాపతి వాటిని పూజించి భద్రపరిచాడు. ఇక్కడ విషయం ఏమంటే ఆ ఋక్కులు చాలా గొప్పవి. నిజానికి దేవతలకు అవే అదృష్టం. వాటివల్లే వారు దేవతలైనారు. కాని ఇప్పుడు వాటినే కాదన్నారు. ఈ విషయం అసురులకి తెలిసింది. వెంటనే దేవతలు విడిచిపెట్టిన ఋక్కులన్నీ సంపాదించి బలవంతులైనారు. అసురులు బలవంతులైనారనే విషయం దేవతలకు చేరింది. తమ అదృష్టాన్ని తాము మళ్ళీ సంపాదించుకోవాలి అనుకున్నారు. ఇప్పుడు ఋక్కులతో కూడిన సామగానం చేశారు. అలా బలవంతులై దేవతలు అసురులను పారద్రోలగలిగారు. అందుకనే మధ్యాహ్నము, సాయంకాలము ఋక్కులతో కూడిన సామాన్ని, ఉదయం పూట ఋక్కులు లేని సామగానం చెయ్యాలి.

## 14. ఉద్గాత-ఉత్తర దిక్కున ఉండాలి

ఉద్గాత ఉత్తరదిక్కున ఉండాలి అనటానికి ఒక కథ ఉంది. పూర్వకాలంలో 'శర్యాతుడు' అనేవాడు యాగం చెయ్యాలి అనుకున్నాడు. అప్పుడు తూర్పుదిక్కు నుంచి బృహస్పతిని తీసుకుని దేవతలు వచ్చారు. దక్షిణ దిక్కు నుంచి బంబుడగు అజద్విషుని తీసుకుని పితృదేవతలు వచ్చారు. పశ్చిమ దిక్కునుంచి ఉశనవసుడు అనే కావ్యుని తీసుకుని అసురులు వచ్చారు. ఉత్తరదిక్కు నుంచి అయాస్యుడయిన అంగీరసునితో మానవులు వచ్చారు. వీరందరూ కూడా తాము తెచ్చినవారినే ఉద్గాతగా పెట్టుకోవాలని వత్తిడి చెయ్యటం

మొదలుపెట్టారు. ఆలోచించాడు శర్యాతుడు. అందరూ తమవారినే ఉద్గాతగా చూడాలనుకోవటం దురదృష్టం. ఎందుకంటే ఉద్గాత ఒకరే ఉంటారు. పదిమంది ఉండరు. ఏంచెయ్యాలా అని ఆలోచించి వారందరినీ బృహస్పతిని, అజద్విషుని, ఉశనవసుణ్ణి, ఆయాస్య అంగీరసుని ఈ నలుగురిని పిలిచి అందర్నీ ప్రశ్నలు వేయటం మొదలుపెట్టాడు. అందరిలోకి మానవులు తెచ్చిన అంగీరస అయాస్యుడు మంచి సమాధానాన్నిచ్చాడు. అందువల్ల అతణ్ణి ఉద్గాత స్వీకరించాడు శర్యాతుడు. ఉత్తర దిక్కు నుంచి వచ్చిన ఆంగీరసుణ్ణి ఉద్గాతగా స్వీకరించాడు కాబట్టి, ఉద్గాత ఉత్తరదిక్కునే ఉండాలి అనే సంప్రదాయం మొదలైంది.

## 15. ఉచ్చైశ్రవోపాఖ్యానం

పూర్వకాలంలో ఉచ్ఛైశ్రవుడు దాల్భ్యుడు. ఇద్దరూ స్నేహితులు. వారిలో ఒకరోజున అనుకోకుండా ఉచ్ఛైశ్రవుడు చనిపోయాడు. ఆ విషయం తెలిసిన దాల్భ్యుడు నిర్విణ్ణుడై పోయాడు. కొంత కాలానికి ఎలాగైనా సరే శోకాన్ని మరచిపోవటానికి వేటకు వెళ్ళాడు. అక్కడ అడవిలో వేటాడుతూ తన మిత్రుణ్ణి చూశాడు. ఆశ్చర్యపోయాడు. అతడు మానవ శరీరంలో లేడు. అతనితో మాట్లాడగలిగాడు దాల్భ్యుడు. అప్పుడు దాల్భ్యుడు తన మిత్రుడితో 'మిత్రమా!' నువ్వు ఇలా, ఎలా అయ్యావు?' అన్నాడు. అశరీర సామగానం చేస్తే ఇలాటి శరీరం కలుగుతుంది అని చెప్పాడు ఉచ్చైశ్రవుడు అప్పుడు తానుకూడా ఇటువంటి సామగానం చెయ్యగలవాణ్ణి వెతికి పట్టుకుని అటువంటి శరీరాన్ని పొందాడు దాల్భ్యుడు.

# 17. మైత్రాయణీయారణ్యకము

కృష్ణయజుర్వేదానికి గల నాలుగు శాఖల్లో మైత్రాయణీయ శాఖ ఒకటి. దీన్ని కాలాపశాఖ అని కూడా అంటారు. మైత్రాయణీయమహర్షి ఈ శాఖను తన శిష్యుల ద్వారా ప్రవర్తింపచేశాడు. మైత్రాయణీయ సంహితలో నాల్గవకాండ మైత్రాయణీయ బ్రాహ్మణము. దాని పరిశిష్టమే మైత్రాయణీయారణ్యకము. దీన్నే మైత్రాయణీయోప నిషత్తు అంటారు. ఇందులో మొత్తం 7 ప్రపాఠకాలు, 73 ఖండలు ఉన్నాయి. దీనికి సాయణాచార్యుడు భాష్యంవ్రాయలేదు. రామతీర్థుడు వ్రాసిన 'దీపిక' అనే వ్యాఖ్యానం మాత్రం లభిస్తున్నది.

## 1. కాలమే కారణం

ఈ లోకంలో అన్నింటికీ కాలమే కారణం అని చెబుతున్నది ఈ అరణ్యకం. ఈ భూమిమీద జీవరాశి అంతా కాలాన్ని అనుసరించి పుడుతున్నది. మరణిస్తున్నది కూడా. జీవరాశి అంతా కాలం వల్లనే వృద్ధి పొందుతున్నది. ఏ మాత్రం రూపంలేని కాలమే ఈనాటకమంతా నడిపిస్తున్నది అంటున్నది ఈ అరణ్యకము.

## 2. మనస్సే సాధనము

**'మనయేన మనుష్యాణాం కారణం బంధమోక్షయోః'** లోకంలో బంధానికీ మోక్షానికి కూడా కారణం మనస్సే. మమ 'నాది' అనుకుంటే బంధం, నమమ నాదికాదు. దానికీ నాకు సంబంధం లేదనుకుంటే మోక్షం. కాబట్టి ప్రతివాడు మనస్సును వశం చేసుకోవాలి. మనస్సు అదుపులో ఉంటే పుణ్యపాపాలను నశింప చేయవచ్చును. మనసు

ప్రసన్నమైనట్లైతే పుణ్యకార్యాలు చేస్తాడు. తద్వారా సుఖపడతాడు. లౌకిక విషయాల్లో చిక్కుకున్న మనసును పారలౌకిక విషయాలవైపు మళ్ళిస్తే మోక్షమార్గ దొరుకుతుంది. కాబట్టి ప్రతివారు మనసును బలవంతంగానైనా సరే పుణ్యకార్యాలవైపుకు మళ్ళించాలి అంటోందీ అరణ్యకం.

## 3. పరబ్రహ్మోపాసన

పూర్వజన్మకృతం అంటే గతజన్మలో చేసినది అది పాపం కావచ్చు పుణ్యం కావచ్చు. మనం ఏ పనిచేసినా దాని ఫలితాన్ని అనుభవించి తీరాలి. ఇందులో ఇంకొక మాటలేదు. అందుకే పెద్దవాళ్ళు చెబుతుంటారు చూడండి **'సుక్రుతం దుష్క్రుతం చైవ గచ్ఛంత మనుగచ్ఛతి'**

మానవుడు సంపాదించిన ధనధాన్యాలు భోగభాగ్యాలు, సిరిసంపదలు ఇవన్నీ ఇక్కడే ఉండిపోతాయి. కష్టపడి సంపాదించిన ఇల్లువాకిలి, పొలముపుట్రా, నగ నట్రా అన్నీ ఇక్కడే ఉంటాయి. నువ్వు సంపాదించిన ధనమంతా ఇనప్పెట్టెలోనే ఉంటుంది. ఎక్కడికీ పోదు. అలాగే మిగిలిన ఆస్తిపాస్తులు కూడా. ఇక్కడ ఒక చిన్న విషయం చూడండి. ఒక పెద్దాయన అంటే బాగా డబ్బులున్నవాడు. పెద్ద వాడయినాడు. ఒకరోజు మరణించాడు. శవాన్ని వాకిట్లో పెట్టారు. పిల్లలందరూ చేరి తగాదాదాలుడుతన్నారు. ఆస్తులపంపకాలు కాలా. ఇంతలో ఒక కూతురు వచ్చింది. నావాటా ఏదో తేలితేనే శవం ఇక్కడినుంచి కదుల్తుంది అంది. అంతే ఎవరు ఏం మాట్లాడుతున్నారో తెలియటంలా. అందరూ ఆవేశంతో ఊగిపోతున్నారు. ఇంతలో ఒక పిల్లవాడు 20 సం॥లోపు ఉంటుంది వయస్సు. మంచి పదునైన కత్తి

పట్టుకొచ్చి శవంయొక్క కుడిచేతి ఉంగరపువేలు నరికేశాడు. అప్పటిదాకా ఎవరూ పెద్దగా పట్టించుకోలా. ఉన్నట్టుండి వేలునరికేసేసరికి అరెరె ... అంటూ శవం దగ్గరకి వచ్చి ఏంపనిరా ఇది? అన్నారు. ఆ పిల్లవాడు మహాఉద్రేకంతో 'ఈ ఉంగరం మాకు వస్తుందట చెయ్యి నరికైనా పట్రమ్మంది మా అమ్మ' అన్నాడు. అతడు పెద్దకూతురుకొడుకు. శవాన్ని వాకిట్లోపెట్టి ఆస్థిపంపకాల కోసం తగువులాడు కోవటం ఒక పద్ధతి. ఇది అలా కాదు శవాన్ని ముక్కలుగా చేసి ఆస్థి పంపకాలన్న మాట. అసలు విషయం ఏమంటే, ఆ పెద్దాయన కొద్ది సంవత్సరాల క్రితం నవరత్నాలఉంగరం చేయించుకున్నాడు. అందులో బంగారంకు 20 గ్రాములదాకా ఉంది. తరువాత కాలంలో నీరుపట్టి చెయ్యిబాగా లావయిపోయింది. ఉంగరం బిగిసిపోయింది. ఉంగరంకోసి తియ్యవలసిన పరిస్థితి ఏర్పడింది. దాంతో అలాగే వదిలేశారు. ఇప్పుడు ఆయన పెద్దకూతురు తన కొడుకుతో చెప్పింది. 'ఆ ఉంగరం మనకే రావాలి చెయ్యి తెగ్గోసైనా సరే పట్టుకురా' అని పిల్లవాడు చెయ్యి కోసేశాడు. ఇది కూడా ఆయన చేసుకున్న కర్మఫలమే.

అందుకే పురాకృతకర్మలు అనుల్లంఘనీయాలు. ఎవరిముఖాన వ్రాసిపెట్టి ఉన్నది వారు అనుభవించి తీరాలి. మొన్నటికి మొన్న హైదరాబాద్‌లోని ఇంజనీరింగ్ కళాశాల విద్యార్థులు విహారయాత్రకు హిమాచల్‌ప్రదేశ్ వెళ్ళారు. 40 మంది నీళ్ళు లేకుండా పూర్తిగా ఎండిపోయిన నదిలో నుంచుని ఫొటోలు దిగుతున్నారు. దురదృష్టం వెనకాలే ఉంది. ఉన్నట్లుండి నదికి వరద వచ్చింది. అవతలవైపు తన్నేస్తోంది. ఒక్కసారిగా గేట్లు ఎత్తేశారు. అప్పటివరకు ఆనందంగా కేరింతలుకొడుతున్న ప్రదేశంలో హాహాకారాలు. తోటివిద్యార్థులు నీళ్లలో

కొట్టుకుపోతున్నారని, రక్షించేప్రయత్నం చేసినవాళ్ళు కూడా కొట్టుకుపోయారు. ఇంకావిషాదం ఏమంటే ఒకవిద్యార్థి. మంచి ఈతగాడు. స్నేహితులు మునిగిపోతుంటే నలుగుర్ని కాపాడాడు. కాని అతడుకూడా ప్రవాహంలో కొట్టుకుపోయాడు. మొత్తం 24మంది విద్యార్థినీ విద్యార్థులు ఇప్పటికి ఐదు రోజులైంది. ఇంకా జాతీయవిపత్తుసంస్థ సభ్యులు వెతుకుతూనే ఉన్నారు. ఆరు దేహాలు మాత్రం దొరికినాయి. ఎవరికర్మ వారు అనుభవించాలి. ఆంధ్రాలో పుట్టి హైదరాబాద్ ఇంజనీరింగ్ కళాశాలలో చదువుతున్న వాళ్ళకి హిమాచల్‌ప్రదేశ్‌లోని నదిలో మృత్యువు అందులోనూ మూకుమ్మడిగా రాసిపెట్టిఉంది. కర్మని ఎవరూ తప్పించలేరు. మృత్యువు సముద్రపు చెలియలి కట్టలాగా దాటలేనిది. మానవుడు అస్వతంత్రుడు. విషయ వాంఛలకులోనై పరమపదాన్నే మరచిపోతాడు. పరమేశ్వరుడున్నాడనే విషయమే గుర్తుండదు.

మరి ఈ స్థితి నుంచి బయటపడలేడా? అంటే బయటపడచ్చు. వేదాధ్యయనం చెయ్యి. మంచిమార్గంలో చరించు. చిత్తశుద్ధి కలిగిఉండు. తపస్సుచెయ్యి. ఆత్మతత్త్వాన్ని తెలుసుకో, తపస్సుచేత, ధ్యానంచేత పరమాత్మని పొందు. ఇలా చేసినట్లైతే బంధాలనుంచి విముక్తుడై శాశ్వతసుఖాలు అనుభవిస్తాడు.

అయితే ఇక్కడ చిన్నఅనుమానం "మనం ఎవరిని ధ్యానించాలి. కొంతమంది అగ్నిని, కొందరు వాయువు, కొందరు ఆదిత్యుణ్ణి, కొందరు శివుడిని, విష్ణువుని, శక్తిని ఇలా పూజిస్తున్నారు కదా. వీరిలో ఎవరిని అర్చింటచం శ్రేష్టం?" ఈ ప్రశ్న పూర్వకాలంలో క్రతువు అనే మహానుభావుణ్ణి వాలఖిల్యులు అడిగారు. అప్పుడు క్రతువు సమాధానం

చెబుతున్నాడు. 'ఓ వాలఖిల్యులారా! దేవతలంతా పరబ్రహ్మ స్వరూపమే. వారిలో ఎవరిని ధ్యానం చేసినా ఉత్తమగతులు పొందవచ్చు. చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. కాబట్టి ఎవరిని పూజించినా, ఎవరిని అర్చించినా, ఆ పూజ, అర్చనా అంతా పరమేశ్వరుడికే చెందుతుంది.

పరబ్రహ్మ స్వరూపము అనాదినిధనమైనది. అచింత్యము. అప్రమేయము. సృష్టికి ముందు అంతా తమోమయంగా ఉండేది. సృష్టి తరువాత రజస్సు, సత్త్వము అనే గుణాలు ఏర్పడినాయి. మనం త్రిమూర్తుల్ని చెబుతున్నాం. వీరిలో రుద్రుడు తమోరూపుడు. బ్రహ్మరజోగుణ సంపన్నుడు. విష్ణువు సత్త్వసంపన్నుడు. పరమేశ్వరుడు ఒక్కడే వివిధ రూపాలు ధరించాడు. బ్రహ్మగా సృష్టి చేస్తున్నాడు. విష్ణువుగా జగత్తులను రక్షిస్తున్నాడు. రుద్రుడుగా జగత్తును లయం చేస్తున్నాడు. అనేక భూతాలను అంటే 84 లక్షల రకాలైన ప్రాణికోటిని సృష్టించాడు. ఆయనే భూతపతి. భూతనాథుడు. ఈ జగత్తంతా ఆక్రమించి ఉన్నాడు. లోపల బయటా అంతటా ప్రకాశిస్తున్నాడు. బయట ఆదిత్యమండలంలో ఉండే హిరణ్మయ పురుషుడే హృత్పుండరీకంలో ఉన్నాడు. కేవలము పండితుడైన వాడు (పండితుడు అంటే జ్ఞాని. అంతేకాని శాస్త్రపండితుడు కాదు.) అంతర్ముఖుడై అంతరాత్మను దర్శించి బహిరాత్మను కూడా తెలుసుకోగలుగుతున్నాడు. ఈ రకంగా పరబ్రహ్మను ఉపాసించిన వారికి పునర్జన్మ ఉండదు అంటోంది ఈ అరణ్యకము.

## 4. అన్నోపాసన

**'అన్నం పరబ్రహ్మస్వరూపం'** అన్నారు. ఎందుకని అంటే ఆహారం తీసుకోకపోతే శరీరంలో అవయవాలు ఏవీ పనిచెయ్యవు శరీరం మన స్వాధీనంలో ఉండదు. అన్నం తింటేనే శరీరానికి తుష్టి, పుష్టి

కలుగుతుంది. దీనికి చిన్న ఉదాహరణ. ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు బ్రహ్మవిద్యను బోధిస్తున్నాడు. అలా బోధిస్తూ కుమారా! అన్నము చాలా ప్రధానమైనది. అన్నాడు. అన్నం తినకపోతే ఏకాగ్రత బాగా కుదురుతుంది కదా! అన్నాడు కుమారుడు. సరే అక్కడ ఆగిపోయాడు ఉద్దాలకుడు. కుమారుణ్ణి ఉపవాసాలు చెయ్యమన్నాడు. ఉపవాసాలు చేస్తున్నాడు కుమారుడు. కొంత కాలం అయింది. కుమారుణ్ణి పిలిచి నాయనా వేదం చెప్పు అన్నాడు చెబుతున్నాడు కుమారుడు. కళ్ళు మూతలు పడుతున్నాయి. మాట తడబడుతోంది. ఏంచెబుతున్నాడో తెలియటం లేదు. చెప్పాల్సింది గుర్తుకురావటంలేదు. అప్పుడు అడిగాడు తండ్రి ఏమైంది? అని నీరసంగా ఉంది. నిలబడే శక్తి లేదు. నోట్లోంచి మాటకూడా రావటం లేదు. అన్నాడు. అప్పుడు చెబుతాడు తండ్రి. కుమారా! చూశావు కదా! అన్నము అనేది జీవనాధారము. అన్నం గనక లేకపోతే జీవితం మనజాలదు. అందుచేతనే అన్నం పరబ్రహ్మ. ఈ విషయమే తైత్తిరీయోపనిషత్తులో కూడా చెప్పబడింది. **'అన్నం ననిన్ద్యాత్'** అన్నాన్ని నిందించకూడదు. అన్నాన్ని కాలితో తన్నకూడదు. అన్నాన్ని ఉపేక్షించకూడదు. ఈ రకంగా అన్నం పరబ్రహ్మ స్వరూపమనే భావనతోనే ఉపాసించాలి.

## 5. ఆదిత్యోపాసన

ఆదిత్యుడు అంటే సూర్యుడు. జగస్సాక్షి. కాబట్టి సూర్యోపాసన చెయ్యాలి అని గతంలో చెప్పుకున్నాం. అయితే ఇక్కడ ఆదిత్యుడు అంటే ఆదిత్య మండలాంతర్గతుడైన దేవత. అతడే సవిత. బంగారు రంగు దేహము గలవాడు. బంగారు వస్త్రములు ధరించినవాడు. అతడి రథము కూడా బంగారందే, గుర్రాలకు కట్టే త్రాళ్ళు కూడా బంగారానివే.

తన పొడవాటి చేతులతో, దిగంతముల వరకు వ్యాపించిన తన చేతులతో తెల్లవారగానే అందర్నీ మేల్కొల్పుతాడు. ఓ జనులారా! లేవండి. తెల్లవారింది. మీ మీ పనులకు బయలుదేరండి అని అందర్నీ నిద్ర లేపుతాడు. అతడు సవిత. అందరి అజ్ఞానాన్ని తొలగించి వారికి జ్ఞానాన్ని ప్రసాదించేవాడు. ఈ దేవతనే మనం ఉపాసించాలి.

## 6. అన్నింటికీ మూలం మనస్సు

పుట్టిన సమయంలో సామాన్యంగా అజ్ఞానిగానే ఉంటాడు. మానవుడు జ్ఞానసముపార్జన చెయ్యటమనేది కూడా అతని పూర్వజన్మకృతం మీదనే ఆధారపడి ఉంటుంది. గతజన్మలతో అతడు జ్ఞానమార్గంవైపు అడుగులు వేస్తే తప్ప ఈ జన్మలో జ్ఞానాన్ని గురించి ఆలోచించలేడు. అదే గతజన్మల వాసన.

అందుకే సామాన్యంగా అజ్ఞానంతోనే పుడతాడు. అజ్ఞానంతోనే పెరిగి పెద్దవాడవుతాడు. జ్ఞానసముపార్జన చెయ్యాలంటే అతని మనస్సు, బుద్ధి సహకరించాలి. ఎందుకంటే కొన్ని లక్షల జన్మలు ఎత్తాడు ఇప్పటికి. అన్ని జన్మలు అజ్ఞానంతోనే గడిపాడు. కాబట్టి ఒక్కసారిగా జ్ఞానం రావాలి అంటే రాదు. మనం తొడుక్కునే చొక్కా బాగా మాసిపోయింది. అది ఎంతగా మాసిపోయిందిఅంటే ఇల్లుతుడిచేగుడ్డ ప్రక్కన చొక్కానిఆరేస్తే ఇల్లుతుడిచే గుడ్డే శుభ్రంగా ఉంది. అది ఇప్పుడు మన మనసుయొక్క పరిస్థితి. అజ్ఞానంలో అంతగా కూరుకుపోయింది. మరి ఈ మురికి వదలటానికి ఎంత సమయం పడుతుందో ఆలోచించండి. ఒకరోజులో ఆ మురికి పోదు కదా. అలా చాలాసార్లు మురికిపోయేదాకా ఉతకాలి. అలాగే ఉన్నట్టుండి నేను జ్ఞానివి అయిపోవాలంటే అంత తేలికగా అయ్యే పనికాదు. మనసా వాచా కర్మణా నేను జ్ఞానిని కావాలి అనుకోవాలి. తనకు పట్టిన

అజ్ఞానాన్ని వదిలించుకోవటానికి ప్రయత్నించాలి. అజ్ఞానము అనేది రెండు విధాలుగా ఉంటుంది 1. అగ్రాహ్యాము 2. అన్యథాగ్రాహ్యాము.

**1. అగ్రాహ్యాము :** విషయం ఇది అని సరిగా తెలుసుకోలేకపోవటాన్నే అగ్రాహ్యాము అంటారు. మసక చీకట్లో త్రాడును చూసి అది త్రాడు అని తెలుసుకోలేక పోవటం.

**2. అన్యథాగ్రాహ్యాము :** త్రాడును చూసి ఇంకేదో అనుకోవటం త్రాడును చూసి పాము అనుకోవటం ఇది అన్యథా గ్రాహ్యాము. ఈ రెండూ అజ్ఞానమే. కాబట్టి ఈ రెండింటినీ వదిలించుకోవాలి. జ్ఞానంరావాలి అంటే ఈలోకంలో ఉండే సుఖాలు పూర్తిగా అనుభవించాలి. అవన్నీ అశాశ్వతము అనే విషయం తెలుసుకోవాలి. అప్పుడు శాశ్వతమైన సుఖంకోసం వెదుకులాడాలి. దానికి మనోనైర్మల్యం కావాలి.

మనస్సు రెండు రకాలు 1. శుద్ధము 2. అశుద్ధము. నిర్మలమైన మనస్సు శుద్ధము. కలుషితమైన మనస్సు అశుద్ధము. సంకల్ప వికల్పాలతో శుద్ధమైన మనస్సు కాస్తా అశుద్ధమైపోతుంది. విషయవాంఛలు మానవుణ్ణి అంతతేలికగా వదలవు. వెంటాడుతూ ఉంటాయి. సంసారము అంటే మానవుడి సంకల్ప వికల్పాలే. అజ్ఞాని అయినమానవుడు సంసారసాగరంలో కూరుకుపోతాడు. అంటే సంకల్ప వివకల్పాలతో శతమతమవుతుంటాడు. ఎప్పుడైతే వాటి నుంచి బయట పడతాడో అప్పుడు ఈ సంసారంనుంచి విడిపడ్డాడని చెప్పవచ్చు. వీటన్నింటికీ కారణం మనస్సు. కాబట్టే మనసునుజయించినవారికే ఇదిసాధ్యము. ఈ కారణం చేతనే జ్ఞానానికి గాని, అజ్ఞానానికి గాని, మంచికి చెడుకి బంధమోక్షాలకు అన్నింటికీ మూలకారణం మనస్సే అని చెబుతోంది ఈ అరణ్యకము.

# 7. ఇదంతా నశించిపోయేదే

చరాచర జగత్తులో దృశ్యమానమైనదంతా నశించిపోయేదే. ఏదీ శాశ్వతం కాదు. అనే విషయాన్ని గట్టిగా చెప్పింది ఈ అరణ్యకం. ఇప్పటివరకు ఈ భూమిని అనేకమంది మహారాజులు పాలించారు. ఎంతోమంది చక్రవర్తులున్నారు. వీరులు, శూరులు చాలామంది ఉన్నారు. తమఅధికారాన్ని దర్పాన్ని ప్రదర్శించిన వారు కొందరైతే, తమఅధికారంతో పదిమందికి మేలుచేసినవారు మరికొందరు. ఇప్పుడు వీరు ఎవరూ లేరు. హిరణ్యకశ్యపుడిలాంటివారు శాశ్వతంగా ఈశరీరంతో ఇలాగే ఉండాలి అని తపస్సుకూడా చేశారు. కాని కృతకృత్యులు కాలేదు. అంతదాకా ఎందుకు? సృష్టికర్త అయిన బ్రహ్మదేవుడే శాశ్వతం కాదు. బ్రహ్మకల్పం పూర్తయే సరికి ఆయనా వెళ్ళిపోతాడు. ఎప్పుడు ఏ జరుగుతుందో ఎవరికీ తెలియదు. దేవతల మీదకి రాక్షసులు దండయాత్ర చేస్తారు. దేవతలు పదవీ భ్రష్టులవుతారు. అరణ్యాల వెంబడి తిరుగుతారు. ఉన్నట్టుండి అనేక సంఘటనలు జరుగుతాయి. ఇప్పుడు ఉన్నది ఇంకాస్సేపటికి ఉండదు. ఈ మధ్యనే కెనడాలోని ఒక నదిలో ఒకతను గాలంవేసి చేపలు పడుతున్నాడు. అతని గాలానికి కొంచెం పెద్దచేప పడింది. ఆనందంతో నదిలోంచి గాలాన్ని బయటకు లాగుతున్నాడు. ఇంతలో ఎక్కడనుంచి వచ్చిందో ఒకగ్రద్ద వచ్చి ఆ చేపని కాస్తా తన్నుకుపోయింది. చేపతోపాటే గాలంకూడా వెళ్ళిపోయింది. అతడు నిలత్రొక్కుకోలేక నదిలో పడిపోయాడు. చేతిలో ముద్దనోట్లో పెట్టుకునే దాకా నమ్మకం లేదు. అలా అని నోట్లో పెట్టుకున్నది తినేదాకా నమ్మకం లేదు. ఈ మధ్యలోనే ఏం జరుగుతుందో ఎవరికీ తెలియదు. బయటకు వెళ్ళిన వ్యక్తి ఇంటికి తిరిగి వచ్చేదాకా నమ్మకం లేదు. గాలి బుడగజీవితం. మానవుడు

పుట్టిన దగ్గరనుంచే మృత్యువు నీడలా అతన్ని వెంటాడుతూనే ఉంటుంది. అవకాశం వచ్చినప్పుడు కాలనాగులాగా కాటు వేస్తుంది. ఇక్కడ ఒకచిన్న సంఘటన. నాకు బాగా తెలిసిన వ్యక్తి. ఉదయం పదిగంటలకు బయటకు వెడుతూ "అమ్మా! ఒక గంటలో వస్తాను. వంట చేసెయ్యి. భోజనం చేసి మళ్ళీ బయటకి వెళ్ళాల్సిన పని ఉంది" అని చెప్పి ఇంట్లోంచి బయటకు వెళ్ళాడు. వంట చేసుకుని కొడుకుకోసం ఎదురుచూస్తోంది తల్లి. 11.30 గం॥ అయింది. కొడుకు ఇంకా రాలేదు. ఇంతలో ఫోను మ్రోగింది. యాక్సిడెంటులో కుమారుడి తల నుజ్జునుజ్జు అయిపోయింది. తల్లిగుండెలు పగిలిపోయినాయి. వివాహమయి పదినెలలు. భార్య ఇరవైరెండు సంవత్సరాల పిల్ల. మూడోనెల గర్భవతి. కాలానికి ఇవేవీ అవసరం లేదు. లోకంలో అందరూ కాలానికి, కర్మకి బద్ధులే. అటువంటి ఈ జగత్తులో, ఈ సంసారంలో నేను, నాది అనుకోవటం, ఇంకా సంపాదించాలి. ఈ మొత్తం నాకే కావాలి. అనుకోవటం ఎంత పిచ్చితనం? ఎంత మూర్ఖత్వం? ఇదంతా అజ్ఞానమే. మానవుడు యధార్థాన్ని తెలుసుకోలేడు. ఈ విషయాన్ని తెలుసుకున్నాడు బృహద్రధుడు అనే మహారాజు.

పూర్వకాలంలో బృహద్రధుడు అనే మహారాజు తన రాజ్యాన్ని కుమారులకిచ్చి వెయ్యిసంవత్సరాలు తపస్సు చేశాడు. ఆ సమయంలో బ్రహ్మవేత్త అయిన శాకాయన్యుడు మహారాజు దగ్గరకు వచ్చి "రాజా! తపస్సు చాలు. ఇకలే నీకు ఏ వరం కావాలో కోరుకో' అన్నాడు. 'ఓ మహర్షీ! ఈ జగత్తు అంతా అశాశ్వతము. శాశ్వతమైనది పరమేశ్వరుడు ఒక్కడే. కాబట్టి నాకు పరమేశ్వరతత్త్వాన్ని బోధించవలసింది' అన్నాడు. అప్పుడు శాకాయన్యమహర్షి ఆత్మతత్త్వాన్ని వివరించాడు అని

చెబుతోంది మైత్రాయణీయారణ్యకం ప్రఖ్యాతి చెందిన కేనోపనిషత్తు ఈ అరణ్యకంలోదే. పూర్తిగా ఆత్మతత్త్వాన్ని బోధిస్తుంది ఈ అరణ్యకం.

*దీంతో అరణ్యక భాగం సమాప్తం.*

శ్రీ

# పార్థసారథీయము

# చతుర్వేదభాష్యము

## (ఉపనిషత్తులు)

### (శాక్తేయ, వైష్ణవ, శైవ, వేదాంతోపనిషత్తులు)




ప్రముఖ శ్రీవిద్యా ప్రచారకులు

అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,

ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, మెంఫిస్, అమెరికా ఆస్థాన విద్వాంసులు,

డా॥ క్రోవి పార్థసారథి

# విషయసూచిక


1. ఉపనిషత్తులు–రకాలు
2. ఉపనిషత్తులలో జగదుత్పత్తి
3. ఉపనిషత్తులు కూడా వేదాలేనా
4. ఉపనిషత్తుల వల్ల ప్రయోజనం
5. శాక్తేయోపనిషత్తులు
6. పంచదశి మహామంత్రము
7. త్రిపురోపనిషత్తు
8. బహ్వృచోపనిషత్తు
9. దేవీ ఉపనిషత్తు
10. సౌభాగ్యలక్ష్మి ఉపనిషత్తు
11. త్రిపురతాపినీ ఉపనిషత్తు
12. సీతోపనిషత్తు
13. సరస్వతీ రహస్యోపనిషత్తు
14. భావనోపనిషత్తు
15. లలితారహస్యోపనిషత్తు
16. వైష్ణవోపనిషత్తులు
17. తిరుమంత్రము
18. అవ్యక్తోపనిషత్తు
19. కృష్ణోపనిషత్తు
20. గారుడోపనిషత్తు
21. గోపాలతాపిని ఉపనిషత్తు
22. నారాయణోపనిషత్తు
23. కలిసంతరణోపనిషత్తు

24. దత్తాత్రేయోపనిషత్తు
25. తారసారోపనిషత్తు
26. నృసింహతాపిని ఉపనిషత్తు
27. రామతాపిని ఉపనిషత్తు
28. రామరహస్యోపనిషత్తు
29. హయగ్రీవోపనిషత్తు
30. వాసుదేవోపనిషత్తు
31. త్రిపాద్విభూతిమహానారాయణోపనిషత్తు
32. శైవోపనిషత్తులు
33. పంచాక్షరీ మహామంత్రము
34. అథర్వశిరోపనిషత్తు
35. అథర్వశిఖోపనిషత్తు
36. కైవల్యోపనిషత్తు
37. పంచబ్రహ్మోపనిషత్తు
38. భస్మజాబాలోపనిషత్తు
39. రుద్రాక్షజాబాలోపనిషత్తు
40. గణపత్యుపనిషత్తు
41. దక్షిణామూర్తి ఉపనిషత్తు
42. శరభోపనిషత్తు
43. బృహజ్జాబాలోపనిషత్తు
44. రుద్రహృదయోపనిషత్తు
45. శ్వేతాశ్వతరోపనిషత్తు
46. కాలాగ్ని రుద్రోపనిషత్తు
47. జాబాలోపనిషత్తు
48. అక్షమాలికోపనిషత్తు

49. వేదాంతోపనిషత్తులు
50. మహావాక్యాలు (శుకరహస్యోపనిషత్తు)
51. మహావాక్య వివరణ (పైంగలోపనిషత్తు)
52. మహావాక్యానుసంధానము (ఆత్మబోధోపనిషత్తు)
53. ఏకాక్షరోపనిషత్తు
54. ప్రాణాగ్నిహోత్రోపనిషత్తు
55. శారీరకోపనిషత్తు
    1. పంచభూతాలు
    2. గుణత్రయము
    3. అవస్థాత్రయము
    4. శరీరత్రయము
    5. పంచకోశాలు
56. సూర్యోపనిషత్తు
57. ముద్గలోపనిషత్తు
58. సావిత్ర్యుపనిషత్తు
59. అక్ష్యుపనిషత్తు
60. అన్నపూర్ణోపనిషత్తు
    1. మోక్షవిద్య
    2. జీవన్ముక్తి – విదేహముక్తి
61. కాషీతకీ బ్రాహ్మణోపనిషత్తు
    1. ప్రాణమే బ్రహ్మ
    2. ప్రత్యేక భోగాలు
    3. ఇతరుల అభిమానం సంపాదించటం
    4. ఇంద్రియ నిగ్రహము
    5. పాపాలు పోవటానికి సూర్యారాధన

6. మరణించే సమయంలో తండ్రి తన మహిమలను కుమారుని కివ్వటం
7. ప్రతర్దనుడు
8. ప్రాణము యధార్థతత్త్వము
9. బాలాకి
62. ముక్తికోపనిషత్తు
63. చతుర్విధముక్తులు – అధ్యాత్మోపనిషత్తు
64. ఆత్మోపనిషత్తు
65. గర్భోపనిషత్తు
1. శరీర విజ్ఞానము
2. పూర్వజన్మ జ్ఞానము
66. నిరాలంబ, సర్వసార ఉపనిషత్తులు
67. పైంగలోపనిషత్తు
68. మంత్రికోపనిషత్తు
69. మహోపనిషత్తు
1. జ్ఞానభూమికలు – అజ్ఞానభూమికలు
2. జీవన్ముక్తి, విదేహముక్తి
3. ఆత్మసాక్షాత్కారము
70. మైత్రాయణ్యుపనిషత్తు
71. వజ్రసూచికోపనిషత్తు
72. సుబాలోపనిషత్తు
1. జ్ఞానియొక్క కర్మ, స్థితి
2. అంతర్యామి
73. స్కందోపనిషత్తు

# ఉపనిషత్తులు

వేదంలో నాల్గవ భాగం ఉపనిషత్తు. ఇది బ్రహ్మవిద్య. వేదానికి అంతమందున్నది కాబట్టి దీన్ని వేదాంతమని కూడా అంటారు. మానవుడికి జ్ఞానాన్ని ప్రసాదించి, జన్మమృత్యుజరాదులు లేకుండా చేసి మోక్షమార్గాన్ని చూపుతాయి ఈ ఉపనిషత్తులు.

నాలుగు వేదాలకు కలిపి 1180 ఉపనిషత్తులు ఉన్నాయి. వాటిలో ప్రస్తుతము 200 మాత్రమే లభ్యమౌతున్నాయి. వీటిలో 108 ఉపనిషత్తులు చదివితే చాలు అని చెబుతోంది **ముక్తికోపనిషత్తు.** అసలు ముక్తి కలగాలంటే మాండూక్య మొక్కటి చాలు అన్నారు. మాండూక్యోపనిషత్తుకు గౌడపాదులవారు కారికలు కూడా వ్రాశారు. కారికలు అంటే శ్లోకరూపంలో ఉండే సూత్రాలు. మాండూక్యోపనిషత్తు చదివినా తత్త్వం బోధపడకపోతే దశోపనిషత్తులు చదవండి అన్నారు. ఈశ, కేన, కఠ, ప్రశ, ముండక, మాండూక్య, తిత్తిరి, ఐతరేయము, ఛాందోగ్యము, బృహదారణ్యకము ఈ పదిఉపనిషత్తులకు త్రిమతాచార్యులు వారి వారి మతాలకు అనుగుణంగా వ్యాఖ్య కూడా వ్రాశారు. ఉపనిషత్తులను వేదాలవారీగా చూస్తే

వేదాలవారీగా చూస్తే

| | | |
|---|---|---|
| ఋగ్వేదానికి | – | 10 |
| కృష్ణయజుర్వేదానికి | – | 32 |
| శుక్లయజుర్వేదానికి | – | 19 |
| సామవేదానికి | – | 16 |
| అధర్వణ వేదానికి | – | 31 |

| | | |
|---|---|---|
| మొత్తం ఉపనిషత్తులు | - | 108 |

విషయాన్ననుసరించి చూసినట్లైతే

| | | |
|---|---|---|
| శాక్తేయోపనిషత్తులు | - | 8 |
| వైష్ణవోపనిషత్తులు | - | 14 |
| శైవోపనిషత్తులు | - | 15 |
| వేదాంతోపనిషత్తులు | - | 24 |
| యోగోపనిషత్తులు | - | 20 |
| సన్యాసోపనిషత్తులు | - | 17 |
| దశోపనిషత్తులు | - | 10 |
| మొత్తం ఉపనిషత్తులు | - | 108 |

ఉపనిషత్తులలో కొన్ని ఉపాసనా కాండను, కొన్ని జ్ఞానకాండను ప్రబోధిస్తాయి. ఈ క్రమంలోనే సాకార, నిరాకారాలను వివరిస్తాయి. **వీటిలో అనేక మంత్రాలు, ఉపాసనలు చెప్పబడ్డాయి. ఇవన్నీ గురువు దగ్గర ఉపదేశం పొంది ఆ తరువాత మాత్రమే చేయండి.** లేకపోతే ఇబ్బందులు వస్తాయి. ఇప్పుడు ఉపనిషత్తుల గురించి చూద్దాం.

# 1. ఉపనిషత్తులు - రకాలు

వేదం నాలుగు భాగాలుగా ఉన్నది అవి 1. సంహిత 2. బ్రాహ్మణాలు 3. అరణ్యకాలు 4. ఉపనిషత్తులు.

ఇందులో సంహిత అంటే మంత్రభాగము. ఈ సంహితకు వ్యాఖ్యానమే బ్రాహ్మణము. బ్రాహ్మణాలలో యజ్ఞయాగాది కర్మలు ఎలా చెయ్యాలి అనే విషయాన్ని వివరించారు. సంహితలో చెప్పిన మంత్రాలకు ఇది వినియోగము. బ్రాహ్మణంలో పరిశిష్టభాగమే అరణ్యకాలు. ఇందులో కర్మ జ్ఞానాలకు సంబంధించిన విషయాలు చెప్పబడ్డాయి. అరణ్యకాలకు పరిశిష్టభాగమే ఉపనిషత్తు. ఇది పూర్తిగా బ్రహ్మవిద్య. నిష్టాగరిష్ఠుడు, బ్రహ్మవిద్యలో అసమానుడు అయిన గురువుదగ్గర కూర్చుని అత్యంతమైన శ్రద్ధతో ఆయనకు సేవలు చేస్తూ, ఆయన చెప్పేవిషయాలు వింటూ జ్ఞానసముపార్జన చెయ్యటమే ఉపనిషత్తు. ఉప–సమీపమునందు, ని–కొంచెం దిగువగా, ఆసక్తితో, షత్–కూర్చొనుట. ఇలా గురువుగారి దగ్గర ఆయనకన్న తక్కువ స్థాయిలో కూచుని ఆయన చెప్పేవిషయాలు విని బ్రహ్మజ్ఞానసముపార్జన చెయ్యటం. ఇది పూర్తిగా జ్ఞానకాండ. అయితే కొన్ని ఉపనిషత్తులలో మంత్రాలు, వాటి ఉపాసనా విధానాలుకూడా ఉన్నాయి. అవికూడా జ్ఞానసముపార్జనకు ఉపకరించేకాని వేరుకాదు.

పూర్వకాలంలో వేదంఅంతా ఒకటిగానే ఉండేది. ద్వాపరయుగంలో బ్రహ్మమానసపుత్రుడైన అపాంతరతముడు వేదవిభజనచేసి వేదాన్ని ప్రచారం చేశాడు. ప్రస్తుతం 28వ మహాయుగంలో వేదాలను విభజించినవాడు కృష్ణద్వైపాయనుడు. ఆయనే మనకు తెలిసిన వేదవ్యాసుడు. వేదాన్ని విభజించి ఆయన శిష్యులు 1. పైలుడు 2. వైశంపాయనుడు 3. జైమిని 4. సుమంతుడు

వీరికి ఆ వేదాలు అప్పగించి బాగా ప్రచారం చెయ్యండి అన్నాడు. వారు వారి శిష్యులకు వారు వారి శిష్యులకు గురుశిష్య పరంపరగా వేదం ప్రచారమైంది. ఇలా ప్రచారం జరిగే సమయంలో వేదానికి అనేక మార్పులు జరిగాయి. అలా మార్పులు జరిగిన వాటినే శాఖలు అన్నారు. ఈరకంగా చూస్తే ఋగ్వేదానికి 21 శాఖలు యజుర్వేదానికి 109 శాఖలు సామవేదానికి 1000 శాఖలు, అధర్వణ వేదానికి 50 శాఖలు వెరసి 1180 శాఖలు అయినాయి. ప్రతిశాఖలోను వేదానికి చివర ఒక ఉపనిషత్తు ఉంది. ఈ కారణంగానే మొత్తం 1180 ఉపనిషత్తులు ఉన్నాయి. వీటిలో ప్రస్తుతం దొరుకుతున్నవి కేవలము 200 మాత్రమే. సామాన్యమైన మానవుడికి ఇన్ని ఉపనిషత్తులు చదవటం చాలా కష్టం.

శుక్లయజుర్వేదానికి సంబంధించినది "ముక్తికోపనిషత్తు". ఈ ఉపనిషత్తులో హనుమంతుడు ఈమాటే శ్రీరామచంద్రుణ్ణి అడుగుతాడు. అప్పుడు శ్రీరాముడు హనుమా కేవలము 108 ఉపనిషత్తులు అధ్యయనంచేస్తే చాలు అని వాటిపేర్లు కూడా చెబుతాడు.

**ఈశకేన కఠ ప్రశ్న ముండక మాండూక్య తిత్తిరిః ।**
**ఐతరేయం చ ఛాందోగ్యం బృహదారణ్యకం తథా ।**
**బ్రహ్మ కైవల్య జాబాల శ్వేతాశ్వో హంస ఆరుణిః ।**
**గర్భోనారాయణో హంసో బిందు నాద శిర శ్శిఖా ।**
**మైత్రాయణీ కౌషీతకీ బృహజ్జాబాల తాపనీ ।**
**కాలాగ్నిరుద్ర మైత్రేయీ సుబాల క్షురిక మంత్రికా ।**
**సర్వసారం నిరాలంబం రహస్యం వజ్రసూచికమ్ ।**
**తేజో నాద ధ్యాన విద్యా యోగ తత్వాత్మబోధకమ్ ।।(7)**

పరివ్రాట్త్రిశిఖీ సీతా చూడా నిర్వాణ మండలమ్ ।
దక్షిణా శరభం స్కందం మహానారాయణాద్వయమ్ ।
రహస్యం రామతపనం వాసుదేవం చ ముద్గలమ్ ।
శాండిల్యం పైంగలం భిక్షు మహచ్ఛారీరకం శిఖా ।
తురీయాతీత సన్న్యాస పరివ్రాజాక్షమాలికా ।
అవ్యక్తై కాక్షరం పూర్ణా సూర్యాక్ష్యధ్యాత్మ కుండికా ।
సావిత్ర్యాత్మా పాశుపతం పరబ్రహ్మా వధూతకమ్ ।
త్రిపురాతపనం దేవీ త్రిపురా కఠ భావనా ।
హృదయం కుండలీ భస్మరుద్రాక్ష గణదర్శనమ్ ।
తారసార మహావాక్య పంచబ్రహ్మాగ్ని హోత్రకమ్ ।
గోపాలతపనం కృష్ణం యాజ్ఞవల్క్యం వరాహకమ్ ।
శాట్యాయనీ హయగ్రీవం దత్తాత్రేయం చ గారుడమ్ ।
కలి జాబాలి సౌభాగ్య రహస్య ఋచ ముక్తికా ॥8

1. ఈశావాస్యోపనిషత్తు
2. కేనోపనిషత్తు
3. కఠోపనిషత్తు
4. ప్రశ్నోపనిషత్తు
5. ముండకోపనిషత్తు
6. మాండూక్యోపనిషత్తు
7. తైత్తిరీయోపనిషత్తు
8. ఐతరేయోపనిషత్తు

9. ఛాందోగ్యోపనిషత్తు
10. బృహదారణ్యకోపనిషత్తు
11. బ్రహ్మోపనిషత్తు
12. కైవల్యోపనిషత్తు
13. జాబాలోపనిషత్తు
14. శ్వేతాశ్వతరోపనిషత్తు
15. హంసోపనిషత్తు
16. అరుణికోపనిషత్తు
17. గర్భోపనిషత్తు
18. నారాయణోపనిషత్తు
19. పరమహంసోపనిషత్తు
20. అమృతబిందూపనిషత్తు
21. అమృతనాదోపనిషత్తు
22. అధర్వశిరోపనిషత్తు
23. అధర్వశిఖోపనిషత్తు
24. మైత్రాయణీయోపనిషత్తు
25. కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్తు
26. బృహజ్జాబాలోపనిషత్తు
27. నృసింహతాపినీ ఉపనిషత్తు
28. కాలాగ్నిరుద్రోపనిషత్తు
29. మైత్రేయోపనిషత్తు
30. సుబాలోపనిషత్తు

31. క్షురికోపనిషత్తు
32. మంత్రికోపనిషత్తు
33. సర్వసారోపనిషత్తు
34. నిరాలంబోపనిషత్తు
35. శుకరహస్యోపనిషత్తు
36. వజ్రసూచికోపనిషత్తు
37. తేజోబిందూపనిషత్తు
38. నాదబిందూపనిషత్తు
39. ధ్యానబిందూపనిషత్తు
40. బ్రహ్మవిద్యోపనిషత్తు
41. యోగతత్త్వోపనిషత్తు
42. ఆత్మబోధోపనిషత్తు
43. నారదపరివ్రాజకోపనిషత్తు
44. త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్తు
45. సీతోపనిషత్తు
46. యోగచూడామణి ఉపనిషత్తు
47. నిర్వాణోపనిషత్తు
48. మండలబ్రాహ్మణోపనిషత్తు
49. దక్షిణామూర్తి ఉపనిషత్తు
50. శరభోపనిషత్తు
51. స్కందోపనిషత్తు
52. మహానారాయణోపనిషత్తు
53. అద్వయతారక బ్రహ్మోపనిషత్తు
54. రామరహస్యోపనిషత్తు

55. రామతాసిని
56. వాసుదేవోపనిషత్తు
57. ముద్గలోపనిషత్తు
58. శాండిల్యోపనిషత్తు
59. పైంగలోపనిషత్తు
60. భిక్షకోపనిషత్తు
61. మహోపనిషత్తు
62. శారీరకోపనిషత్తు
63. యోగశిఖోపనిషత్తు
64. తురీయాతీతోపనిషత్తు
65. సన్యాసోపనిషత్తు
66. పరమహంస పరివ్రాజకోపనిషత్తు
67. అక్షమాలికోపనిషత్తు
68. అవ్యక్తోపనిషత్తు
69. ఏకాక్షరోపనిషత్తు
70. అన్నపూర్ణోపనిషత్తు
71. సూర్యోపనిషత్తు
72. అక్ష్యుపనిషత్
73. అధ్యాత్మోపనిషత్తు
74. కుండికోపనిషత్తు
75. సావిత్రోపనిషత్తు
76. ఆత్మోపనిషత్తు
77. పాశుపతబ్రహ్మోపనిషత్తు
78. పరబ్రహ్మోపనిషత్తు
79. అవధూతోపనిషత్తు

80. త్రిపురతాపినీ ఉపనిషత్తు
81. దేవీఉపనిషత్తు
82. త్రిపురోపనిషత్తు
83. కఠరుద్రోపనిషత్తు
84. భావనోపనిషత్తు
85. రుద్రహృదయోపనిషత్తు
86. యోగకుండలి ఉపనిషత్తు
87. భస్మజాబాలోపనిషత్తు
88. రుద్రాక్షజాబాలోపనిషత్తు
89. గణపతి ఉపనిషత్తు
90. దర్శనోపనిషత్తు
91. తారసారోపనిషత్తు
92. మహావాక్యోపనిషత్తు
93. పంచబ్రహ్మోపనిషత్తు
94. ప్రాణాగ్నిహోత్రోపనిషత్తు
95. గోపాలతాపినీ ఉపనిషత్తు
96. కృష్ణోపనిషత్తు
97. యాజ్ఞవల్క్యోపనిషత్తు
98. వరాహోపనిషత్తు
99. శాట్యాయనీఉపనిషత్తు
100. హయగ్రీవోపనిషత్తు
101. దత్తాత్రేయోపనిషత్తు
102. గారుడోపనిషత్తు
103. కలిసంతరణోపనిషత్తు

104. జాబాలిఉపనిషత్తు
105. సౌభాగ్యలక్ష్మి ఉపనిషత్తు
106. సరస్వతీ రహస్యోపనిషత్తు
107. బహ్వృచోపనిషత్తు
108. ముక్తికోపనిషత్తు

ఈ ఉపనిషత్తులను రెండు రకాలుగా విభజిస్తారు.

1. వేదాల ననుసరించి 2 విషయానన్నుసరించి

# 1. వేదాన్ననుసరించి విభాగము

## ఋగ్వేదీయములు - 10

1. ఐతరేయ
2. కౌషీతకీబ్రాహ్మణ
3. నాదబిందు
4. ఆత్మబోధ
5. నిర్వాణ
6. ముద్గల
7. అక్షమాలిక
8. త్రిపుర
9. సౌభాగ్యలక్ష్మి
10. బహ్వృచ

## శుక్లయుజుర్వేదీయములు - 19

1. ఈశావాస్య
2. బృహదారణ్యక
3. జాబాల

4. హంస
5. పరమహంస
6. సుబాల
7. మంత్రిక
8. నిరాలంబ
9. త్రిశిఖి బ్రాహ్మణ
10. మండల బ్రాహ్మణ
11. అద్వయతారక
12. పైంగల
13. భిక్షుక
14. తురీయాతీత
15. అధ్యాత్మ
16. తారసార
17. యాజ్ఞవల్క్య
18. శాట్యాయనీయ
19. ముక్తిక

## కృష్ణయజుర్వేదీయములు - 32

1. కఠవల్లి
2. తైత్తిరీయ
3. బ్రహ్మ
4. కైవల్య
5. శ్వేతాశ్వతర
6. గర్భ
7. నారాయణ

8. అమృతబిందు
9. అమృతనాద
10. కాలాగ్నిరుద్ర
11. క్షురిక
12. సర్వసార
13. శుకరహస్య
14. తేజోబిందు
15. ధ్యానబిందు
16. బ్రహ్మవిద్య
17. యోగతత్త్వ
18. దక్షిణామూర్తి
19. స్కంద
20. శారీరక
21. యోగశిఖ
22. ఏకాక్షర
23. అక్షి
24. అవధూత
25. కఠరుద్ర
26. రుద్రహృదయ
27. యోగకుండలినీ
28. పంచబ్రహ్మ
29. ప్రాణాగ్నిహోత్ర
30. వరాహ

31. కలిసంతరణ

32. సరస్వతీరహస్య

## సామవేదీయములు-16

1. కేన
2. ఛాందోగ్య
3. ఆరుణిక
4. మైత్రాయణి
5. మైత్రేయ
6. వజ్రసూచిక
7. యోగచూడామణి
8. వాసుదేవ
9. మహత్
10. సన్న్యాస
11. అవ్యక్త
12. కుండిక
13. సావిత్రి
14. రుద్రాక్షజాబాల
15. దర్శన
16. జాబాలి

## అథర్వణ వేదీయములు - 31

1. ప్రశ్న
2. ముండక

3. మాండూక్య
4. అథర్వశిర
5. అథర్వశిఖ
6. బృహజ్జాబాల
7. నృసింహతాపిని
8. నారదపరివ్రాజక
9. సీత
10. శరభ
11. త్రిపాద్విభూతి మహానారాయణ
12. రామరహస్య
13. రామతాపిని
14. శాండిల్య
15. పరమహంస పరివ్రాజక
16. అన్నపూర్ణ
17. సూర్య
18. ఆత్మ
19. పాశుపతబ్రహ్మ
20. పరబ్రహ్మ
21. త్రిపురతాపిని
22. దేవి
23. భావన
24. భస్మజాబాల
25. గణపతి

26. మహావాక్య
27. గోపాలతాపిని
28. కృష్ణ
29. హయగ్రీవ
30. దత్తాత్రేయ
31. గారుడ

## 2. విషయాన్ననుసరించి విభాగము

### సన్న్యాసమును ప్రధానముగా బోధించిన ఉపనిషత్తులు - 17

1. ఆరుణికోపనిషత్
2. సన్న్యాసోపనిషత్
3. కఠరుద్రోపనిషత్
4. కుండికోపనిషత్
5. పరమహంసోపనిషత్
6. మైత్రేయోపనిషత్
7. బ్రహ్మోపనిషత్
8. జాబాలోపనిషత్
9. నారదపరివ్రాజకోపనిషత్
10. నిర్వాణోపనిషత్
11. భిక్షుకోపనిషత్
12. తురీయాతీతోపనిషత్
13. పరమహంస పరివ్రాజకోపనిషత్
14. పరబ్రహ్మోపనిషత్

15. అవధూతోపనిషత్
16. యాజ్ఞవల్క్యోపనిషత్
17. శాట్యాయనీయోపనిషత్

**యోగ విద్యలను ప్రధానముగా బోధించిన ఉపనిషత్తులు - 20**

1. అద్వయతారకోపనిషత్
2. అమృతనాదోపనిషత్
3. క్షురికోపనిషత్
4. తేజోబిందూపనిషత్
5. త్రిశిఖి బ్రాహ్మణోపనిషత్
6. దర్శనోపనిషత్
7. ధ్యానబిందూపనిషత్
8. నాదబిందూపనిషత్
9. బ్రహ్మవిద్యోపనిషత్
10. మండల బ్రాహ్మణోపనిషత్
11. యోగకుండల్యోపనిషత్
12. యోగచూడామణ్యుపనిషత్
13. యోగతత్త్వోపనిషత్
14. యోగశిఖోపనిషత్
15. వరాహోపనిషత్
16. శాండిల్యోపనిషత్
17. హంసోపనిషత్
18. అమృతబిందూపనిషత్
19. పాశుపత బ్రహ్మోపనిషత్

20. మహావాక్యోపనిషత్

## వేదాంత విజ్ఞానమును ప్రధానముగా బోధించిన ఉపనిషత్తులు - 24

1. అక్ష్యుపనిషత్
2. అధ్యాత్మోపనిషత్
3. అన్నపూర్ణోపనిషత్
4. ఆత్మోపనిషత్
5. ఆత్మోబోధోపనిషత్
6. ఏకాక్షరోపనిషత్
7. కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్
8. గర్భోపనిషత్
9. నిరాలంబోపనిషత్
10. పైంగలోపనిషత్
11. ప్రాణాగ్నిహోత్రోపనిషత్
12. మంత్రికోపనిషత్
13. మహోపనిషత్
14. ముక్తికోపనిషత్
15. ముద్గలోపనిషత్
16. మైత్రాయణ్యుపనిషత్
17. వజ్రసూచికోపనిషత్
18. శుకరహస్యోపనిషత్
19. సర్వసారోపనిషత్
20. సావిత్ర్యుపనిషత్
21. సుబాలోపనిషత్

22. సూర్యోపనిషత్
23. స్కందోపనిషత్
24. శారీరకోపనిషత్

## వైష్ణవ సిద్ధాంతమును ప్రధానముగా బోధించిన ఉపనిషత్తులు - 14

1. అవ్యక్తోపనిషత్
2. కలిసంతరణోపనిషత్
3. కృష్ణోపనిషత్
4. గారుడోపనిషత్
5. గోపాలతాపిన్యుపనిషత్
6. తారసారోపనిషత్
7. త్రిపాద్విభూతి
మహానారాయణోపనిషత్
8. దత్తాత్రేయోపనిషత్
9. నారాయణోపనిషత్
10. నృసింహతాపిన్యుపనిషత్
11. రామతాపిన్యుపనిషత్
12. రామరహస్యోపనిషత్
13. వాసుదేవోపనిషత్
14. హయగ్రీవోపనిషత్

## శైవసిద్ధాంతమును ప్రధానముగా బోధించిన ఉపనిషత్తులు - 15

1. అక్షమాలికోపనిషత్
2. అథర్వశిరోపనిషత్

3. కాలాగ్నిరుద్రోపనిషత్
4. అథర్వశిఖోపనిషత్
5. కైవల్యోపనిషత్
6. గణపత్యుపనిషత్
7. జాబాల్యుపనిషత్
8. దక్షిణామూర్త్యుపనిషత్
9. పంచబ్రహ్మోపనిషత్
10. బృహజ్జాబాలోపనిషత్
11. భస్మజాబాలోపనిషత్
12. రుద్రాక్షజాబాలోపనిషత్
13. శరభోపనిషత్
14. శ్వేతాశ్వతరోపనిషత్
15. రుద్రహృదయోపనిషత్

**శక్తి (దేవీ) సిద్ధాంతమును బోధించిన ఉపనిషత్తులు - 8**

1. త్రిపురోపనిషత్
2. త్రిపురతాపిన్యుపనిషత్
3. దేవ్యుపనిషత్
4. బహ్వృచోపనిషత్
5. భావనోపనిషత్
6. సరస్వతీ రహస్యోపనిషత్తు
7. సీతోపనిషత్
8. సౌభాగ్యలక్ష్మ్యుపనిషత్

## దశోపనిషత్తులు

1. ఈశావాస్యోపనిషత్తు
2. కేనోపనిషత్తు
3. కఠోపనిషత్తు
4. ప్రశ్నోపనిషత్తు
5. ముండకోపనిషత్తు
6. మాండూక్యోపనిషత్తు
7. తైత్తిరీయోపనిషత్తు
8. ఐతరేయోపనిషత్తు
9. ఛాందోగ్యోపనిషత్తు
10. బృహదారణ్యకోపనిషత్తు

వైష్ణవోపనిషత్తులలో మహానారాయణోపనిషత్తు ఒకటి. ఇది రెండు వేదాలలో కనిపిస్తోంది. 1. కృష్ణయజుర్వేదానికి సంబంధించిన తైత్తిరీయ బ్రాహ్మణము. 2.అధర్వణ వేదము. ఈ రెండింటిలోను అధర్వవేదానికి సంబంధించిన ఉపనిషత్తుకే ప్రాముఖ్యత ఇవ్వబడింది. అందుకే దాన్ని ఇక్కడ ఇస్తున్నాము.

# 2. ఉపనిషత్తులలో జగదుత్పత్తి

ఈ చరాచర జగత్తు ఏ రకంగా సృష్టించబడింది? అనేది చాలా పెద్ద ప్రశ్న. మనదేశంలోనే కాదు. ప్రపంచంలోని అన్ని దేశాలలోను, అన్ని మతాలలోనూ కూడా ఈ విషయం చర్చించబడింది. దీనిమీద అనేక వాదనలు వినిపిస్తున్నాయి. ఉపనిషత్తులలో కూడా ఈ విషయాలు చెప్పబడ్డాయి. ముందుగా సృష్టిక్రమాన్ని గురించి సాంఖ్యులు ఏమంటున్నారో చూద్దాం.

ప్రళయం జరిగిన తరువాత, మళ్ళీ సృష్టి ప్రారంభం కాక ముందు ఈ జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యాన్ని పరమేశ్వరుడు ఆవరించి ఉన్నాడు. ఆ తరువాత కొంత కాలానికి ఆ పరమేశ్వర తత్త్వంలో నుంచి ముందుగా అవ్యక్తము బయటకు వచ్చింది. అదే మాయ అదే సత్వగుణము. తరువాత అవ్యక్తం నుంచి మహత్తత్త్వము వచ్చింది. ఇదే హిరణ్యగర్భుడు. రజోగుణము. మహత్తత్త్వం నుంచి అహంకారము వచ్చింది. అదే విరాట్పురుషుడు. తమోగుణము. ఈ విధంగా అవ్యక్త, మహత్తత్త్వ అహంకారాలు, సత్వరజస్తమో గుణాలు వచ్చినాయి. తమోగుణం నుంచి ఈ జగత్తు ఆవిర్భవించింది. అవ్యక్తం నుంచి వ్యక్తం ఆవిర్భవించింది. అదే జగత్తు. జగత్తులో ముందుగా వచ్చింది ఆకాశము. ఆ తరువాత

**ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నిర్ఆపః, ఆపఃపృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషయదాదన్నం**

| | | |
|---|---|---|
| ఆకాశం నుంచి | – | వాయువు |
| వాయువు నుంచి | – | అగ్ని |
| అగ్ని నుంచి | – | జలము |

జలము నుంచి - భూమి

భూమి నుంచి - ఓషధులు

ఓషధుల నుంచి - అన్నము ఆవిర్భవించినాయి.

ఈ రకంగా జగత్తు సృష్టించబడింది అన్నారు. ఈ సృష్టిలో ప్రధానమైన దేవతలు ఐదుగురు. వీరే **ఆదిత్యం, అంబికం, గణనాథం, విష్ణుం, శివం.**

1. ఆదిత్యుడు 2. అంబిక 3. గణపతి 4. విష్ణువు 5. శివుడు. శంకర భగవత్పాదుల వారు ఈ ఐదుగురినే ప్రతివారూ అనునిత్యము తప్పనిసరిగా పూజించాలి అన్నారు. ఈ ఐదుగురు దేవతలకే **'పంచాయతనము'** అనే పేరు. ప్రతి హిందువు వీరందరినీ తప్పనిసరిగా అర్చించాలి. అతడు శైవుడైనా, వైష్ణవుడైనా, శాక్తేయుడైనా సరే అన్నారు. ఈ రకంగా పరమతసహనం చూపి అన్ని మతాలను ఒక త్రాటిమీదకి తెచ్చారు. పంచాయతనాన్ని అర్చించేటప్పుడు తమకు ఇష్టమైన దేవతను మధ్యలో ఉంచి, మిగిలిన నలుగురుని నాలుగు దిక్కులందు ఉంచాలి. వైష్ణవుడు సాలగ్రామాన్ని మధ్యలో ఉంచాలి. ఇది **వైష్ణవ పంచాయతనం** అంటారు.

శైవుడు బాణాన్ని (శివలింగము) మధ్యలో ఉంచాలి. ఇది **శైవపంచాయతనం** అంటారు. శాక్తేయులు శక్తిని (శ్రీచక్రాన్ని) మధ్యలో ఉంచాలి. దీన్ని **శక్తిపంచాయతనం** అంటారు. అలాగే గాణాపత్యులు గణపతిని, సౌరమతం వారు ఆదిత్యుణ్ణి మధ్యన ఉంచి, అందరు దేవతలను అర్చించాల్సిందే అన్నారు. ఈ ఐదుగురిలో ఏ దేవతను ఆరాధించేవారు ఆ దేవతనే పరమేశ్వర స్వరూపంగా భావిస్తారు. ఆ దేవతే చరాచర జగత్తుకు సృష్టికి మూలము అంటారు. ఆయనే

పరమేశ్వరుడు అని వీరి అభిప్రాయము. ఉదాహరణకు **నారాయణోపనిషత్తు**ను చూద్దాం. ఇందులో పరమేశ్వరుడు శ్రీమన్నారాయణుడు. "సృష్టి ప్రారంభంలో ఉన్నవాడు పరమ పురుషుడైన నారాయణుడొక్కడే. అతడే సృష్టి చెయ్యాలి అని సంకల్పించాడు. అప్పుడు శ్రీమన్నారాయణుని శరీరం నుంచి సూక్ష్మరూపి అయిన హిరణ్యగర్భుడు ఉదయించాడు. ఆ తరువాత తన్మాత్రలు, పంచభూతాలు పుట్టినాయి. ఈ రకంగా నారాయణుని శరీరంనుంచి బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు, మరీచి, కశ్యపుడు, ఇతర ప్రజాపతులు, అష్టవసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, సకలవేదాలు ఆవిర్భవించినాయి. ఒకటేమిటి? చరాచర జగత్తంతా శ్రీమన్నారాయణుని నుంచే ఆవిర్భవించింది" అని చెప్పబడింది.

అయితే వైష్ణంలో సృష్టి విధానం ఇంకోరకంగా కూడా చెప్పబడింది. జగత్తు యొక్క సృష్టి స్థితి లయాలు చూసేది నారాయణుడు. ఆయన ఇరవై ఐదు తత్త్వములు గల పురుషుడు అని వేదాలు కీర్తిస్తున్నాయి. అతడు ఆద్యంతములు లేని పురుషోత్తముడు. ఆయన కనులుతెరిస్తే పగలు. కనులుమూస్తే రాత్రి. అదే సృష్టి, ప్రళయము. దీన్నే "కల్పము" అంటారు. ఆయన అనంగుడు. కాళ్ళు చేతులు మొదలైన అంగాలు లేనివాడు. రూపం లేనివాడు. ఆయనే ఈ జగత్తులో సర్వాన్ని ఆవరించి ఉన్నాడు. అతనివల్లనే సర్వము సంభవిస్తున్నది. అతని నుంచే హిరణ్యగర్భుడు జన్మించాడు. దాని నుండి ఆకాశము, వాయువు, తేజస్సు, జలము ఆవిర్భవించాయి. జలము నుండి ఒక అండము వచ్చింది. అది హిరణ్మయము. ఈ హిరణ్మయమైన అండమే ప్రజాపతి అని వేదాలు చెబుతున్నాయి. పరమేశ్వరుడు ఆ అండాన్ని రెండు భాగాలుగా చేశాడు. అందులో పై

భాగము ఆకాశము కాగా క్రింది భాగము రసాతలము. ఈ అండము నుండి వచ్చిన మావి జలమునందుపడి భూమి ఏర్పడింది. ఈ భూమి అనేకవేలయోజనాల విస్తీర్ణము కలిగిఉన్నది. దానిలో పర్వతాలు, కొండలు, వృక్షాలు, లోయలు అన్నీ ఉన్నాయి. ఆ బరువును మోయలేక భూమి నీటిలో మునిగి పోయింది. అలా మునిగిపోతూ తనను రక్షించమని శ్రీహరిని ప్రార్థించింది. అప్పుడు శ్రీహరి ఆదివరాహమై భూమిని కోరలమీదమోసి రక్షించాడు. ఈ రకంగా జగత్తంతా శ్రీమహావిష్ణువుచేతనే సృష్టించబడింది. ఇది వైష్ణవంలో చెప్పిన సృష్టి విధానము.

ఇక శైవంలోకి వస్తే - శివుడే పరమేశ్వరుడు. **అథర్వశిరోపనిషత్తు**లో దేవతలంతా రుద్రుడు నివసించే స్వర్గలోకానికి వెళ్ళి 'దేవా ! నీవెవరవు?' అని అడుగుతారు. దానికి రుద్రుడు "ఈ సృష్టికి ముందు నేనొక్కడనే ఉన్నాను. ఇప్పుడున్నాను. భవిష్యత్తులో కూడా ఉంటాను. నాకన్న వేరైన వారెవరూ లేరు. నేను త్రికాలాతీతుడను. నిత్యానిత్యుడను. బ్రహ్మమును నేనే. చక్షురాది ఇంద్రియాలు నేనే. శ్రోతాది ఇంద్రియాలు నేనే. ఊర్ధ్వదిక్కు, అథోదిక్కు, దశదిశలు, విదిశలు నేనే. స్త్రీ, పురుషుడు, నపుంసకుడు కూడా నేనే. గాయత్రి, సావిత్రి నేనే. త్రిష్టుప్, అనుష్టుప్, జగతి మొ॥ ఛందస్సులు నేనే. గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని, ఆహవనీయాగ్ని నేనే. గోవును నేనే గౌరీదేవిని నేనే. జ్యేష్ఠుడను శ్రేష్ఠుడను నేనే. జలము, తేజస్సు, చతుర్వేదాలు, ఓంకారము, వషట్కారము, అన్నీ నేనే. ఈ జగత్తులో పైన క్రింద మధ్య, అడ్డము అన్నీ నేనే. నేను జగత్తంతా ఆవరించి ఉన్నాను. ఈ చరాచర జగత్తంతా నాచేతనే సృష్టించబడింది" అంటాడు.

శాక్తేయోపనిషత్తైన **'బహ్వృచోపనిషత్తు'**లో "ఈ సృష్టి ప్రారంభానికి ముందు పరమేశ్వరి ఒక్కతే ఉండేది. ఆవిడే ఈ జగత్తును సృష్టించింది. ఆమె నుండి ముందుగా బ్రహ్మ ఆవిర్భవించాడు. తరువాత విష్ణువు, రుద్రుడు, మరుదగ్గణాలు, గంధర్వులు, అప్సరసలు, కిన్నెరలు, భోగ్యము. అన్నీ ఆమెనుంచే ఆవిర్భవించాయి. అండజాలు, స్వేదజాలు, ఉద్భిజాలు, స్థావరాలు, జంగమాలు, పశువులు, పక్షులు, జంతువులు, మృగాలు, జలచరాలు, చెట్లుచేమలు పుట్టినాయి. చివరకు మానవుడు కూడా ఆమె నుంచే పుట్టాడు. ఇలా చరాచర జగత్తంతా ఆ పరమేశ్వరి నుంచే ఆవిర్భవించింది." అని చెప్పబడింది.

**గణపతి అధర్వశీర్షోపనిషత్తు**లో గణపతే పరమేశ్వరుడు అని చెప్పబడింది.

గుణత్రయ విభాగంవల్ల సృష్టి జరిగింది అని కొందరి అభిప్రాయం. గుణాలు మూడు. అవి 1. సత్వగుణము 2. రజోగుణము 3. తమోగుణము. ఈ గుణాల ననుసరించి సృష్టి మూడు రకాలుగా జరిగింది 1. ఏకగుణసృష్టి 2. ద్విగుణసృష్టి 3. త్రిగుణసృష్టి ముందుగా

**1. ఏకగుణసృష్టి :** ఇందులో ఒకే గుణముంటుంది.

| | | |
|---|---|---|
| 1. | సత్త్వగుణం వల్ల | – బ్రహ్మాది దేవతలు |
| 2. | రజోగుణం వల్ల | – మానవులు, మృగాలు, పశువులు, పక్షులు, జలచరాలు మొ॥వి |
| 3. | తమోగుణం వల్ల | – చెట్లు, చేమలు, పర్వతాలు మొదలైనవి ఆవిర్భవించాయి. ఇది ఏక గుణసృష్టి. |

**2. ద్విగుణ సృష్టి :** ఇందులో ప్రతిగుణము రెండు భాగాలుగా చేయబడింది. వాటి నుంచి ప్రాణికోటి ఆవిర్భవించింది. ముందుగా సత్త్వగుణము. ఇది మూడు భాగాలవుతోంది.

1. సత్త్వసత్త్వము నుంచి – విరాట్పురుషాదులు
2. సత్త్వరజము నుంచి – దేవపురుషులు, వాలఖిల్యులు, వైఖానసులు మొ॥ వారు
3. సత్త్వతమము నుంచి – యక్షులు, రాక్షసులు, విద్యాధరులు మొ॥ వారు
4. రజసత్త్వము నుంచి – మానవులు
5. రజోరజము నుంచి – పశువులు, మృగాలు
6. రజఃతమము నుంచి – స్వేదజాలు, అండజాలు జారజాలు
7. తమోసత్త్వము నుంచి – పైరులు, గడ్డిపంటలు మొ॥వి
8. తమోరజము నుంచి – చెట్లు, పొదలు, తీగెలు
9. తమోతమము నుంచి – భూమి, కొండలు, బండలు

**3. త్రిగుణసృష్టి:** ఇందులో ప్రతిగుణము మూడు భాగాలుగా ఉంటుంది. అవి మళ్ళీ ఒక్కొక్కటి మూడు భాగాలవుతాయి. ఈ రకంగా మొత్తం గుణాలు 27 భాగాలవుతాయి. వీటి నుంచే ఈ జగత్తంతా సృష్టించబడింది.

1. సత్త్వంలో తమోతమము – శేషుడు, వాసుకి మొ॥ వారు
2. సత్త్వంలో తమోరజము – దేవతలు, అంగిరసుడు మొ॥ వారు
3. సత్త్వంలో తమోసత్త్వము – కర్మదేవతలు, నవగ్రహాలు మొ॥వి
4. సత్త్వంలో రజోతమము – సిద్ధులు, సాధ్యులు

| | | |
|---|---|---|
| 5. | సత్త్వంలో రజోరజము | – సప్తఋషులు, శుకవామదేవాదులు |
| 6. | సత్త్వంలో రజోసత్త్వము | – దిక్పాలకులు, పంచబ్రహ్మలు |
| 7. | సత్త్వంలో సత్త్వతమస్సు | – విరాట్పురుషుడు, హిరణ్యగర్భుడు |
| 8. | సత్త్వంలో సత్త్వరజస్సు | – సూత్రాత్మ, నిర్వికల్ప సమాధి నిష్టులు |
| 9. | సత్త్వంలో సత్త్వసత్త్వము | – సర్వజ్ఞత్వము, సర్వేశ్వరత్వము, సర్వాంతర్యామిత్వము. |
| 10. | రజంలో తమోతమము | – కందిరీగలు, తేళ్ళు, పాములు, చీమలు |
| 11. | రజంలో తమోరజము | – మొసళ్ళు, పీతలు, నత్తలు మొ॥వి |
| 12. | రజంలో తమోసత్త్వము | – కాకులు, పిచ్చుకలు, చిలకలు, గోరింకలు. |
| 13. | రజంలో రజోతమము | – పులులు, సింహాలు, ఎలుగుబంట్లు |
| 14. | రజంలో రజోరజము | – ఏనుగులు, గుఱ్ఱాలు, కోతులు, మేకలు మొ॥వి |
| 15. | రజంలో రజోసత్త్వము | – శూద్రులు, మంగలి, మాల, చాకలి |
| 17. | రజంలో సత్త్వరజము | – పుణ్యకర్మలు, దుష్టశిక్షణ, శిష్టరక్షణ |
| 18. | రజంలో సత్త్వసత్త్వము | – బ్రహ్మవాదులు, వేదవిదులు, దశవిధ బ్రాహ్మణులు. |

దశవిధ బ్రాహ్మణులు అంటే – వేద విద్యా సంపన్నులు. ఆచారవంతులయిన 1.పంచవిధ ద్రావిడులు 2. పంచవిధ గౌడులు

1. ఆంధ్ర, 2. కర్నాటక 3. ద్రవిడ 4. ఘూర్జర 5. మహారాష్ట్రులు. ఈ ఐదుగురిని పంచద్రావిడులు అంటారు.

1. ఉత్కల 2. మైథిల 3. గౌడ 4. కన్యాకుబ్జ 5. సారస్వతులు. వీరిని పంచగౌడులు అంటారు. ఈ మొత్తం కలిపి దశవిధ బ్రాహ్మణులు అంటారు.

| | | |
|---|---|---|
| 19. | తమంలో తమోతమము | – కొండలు, బండలు, ముళ్ళచెట్లు, నిర్జన ప్రదేశాలు, చవిటి నేలలు. |
| 20. | తమంలో తమోరజము | – మంచి పంటలు పండే నేలలు |
| 21. | తమంలో తమోసత్త్వము | – పుణ్యక్షేత్రాలు, పుణ్యనదులు |
| 22. | తమంలో రజోతమము | – ముష్టి, వేము, బలురక్కసి, నాగజెముడు, తాడి, ఈత మొ॥ చెట్లు |
| 23. | తమంలో రజోరజము | – నిమ్మ, దానిమ్మ, బత్తాయి, మర్రి జమ్మి మొ॥వి |
| 24. | తమంలో రజోసత్త్వము | – అరటి, పనస, మామిడి, వెలగ, పద్మ, కలువ, పారిజాతము మొ॥వి |
| 25. | తమంలో సత్త్వతమము | – ఉలవ, జొన్న, అరిగ ధాన్యాలు |
| 26. | తమంలో సత్త్వరజము | – కంది, మినుము, నువ్వులు, నల్లవరి |
| 27. | తమంలో సత్త్వసత్త్వము | – తెల్లవరి, సన్నవరి, చెరకు, పెసర |

ఈ విధంగా గుణత్రయ విభాగంతో సృష్టి జరిగింది.

**బృహదారణ్యకోపనిషత్తు**లో సృష్టిని గురించి ఈ విధంగా ఉంది.

సృష్టికి పూర్వం మానవాకారంలో ఉన్న విరాడాత్మ మాత్రమే ఉండేది. అంతకన్న భిన్నమైనది ఏదీ లేదు. పురుషాకారంలో ఉన్న ప్రజాపతి తాను ఒక్కడే అయి ఉండి కూడా భయభ్రాంతుడైనాడు. ఒంటరిగా ఉన్న ప్రజాపతి ఆ ఒంటరితనంలోని ఆనందాన్ని అనుభవించలేక ఒక స్త్రీని కోరాడు. అలా కోరిన వెంటనే అపురూప సౌందర్యవతి అయిన స్త్రీ ఎదురుగా ప్రత్యక్షమైంది. అంటే తన శరీరంలోని కొంత భాగం నుంచే స్త్రీని సృష్టించాడన్న మాట. ఈ రెండు భాగాలే పతిపత్ని. అందుచేతనే ఈ శరీరం విత్తనంలోని బద్దలాంటిది. అందులోని రెండుబద్దలు స్త్రీ పురుషులకు ప్రతిరూపాలు.

ప్రజాపతి వల్ల కలిగిన స్త్రీ పేరు 'శతరూప'. ఇది ఆవిడ పేరు కాదు. ఆమె అనేక రూపాలు ధరించింది. అందుచేతనే శతరూప అనబడింది. ప్రజాపతే స్వాయంభువ మనువయినాడు. కుమార్తెతో రమించటం నిషిద్ధం కదా ! తన నుండి పుట్టిన నాతో ఏ విధంగా రమిస్తాడు? అని ఆలోచించి శతరూప ఆవుగా మారిపోయింది. పురుషుడు ఆబోతు అయినాడు. గోసంతతి వృద్ధి చెందింది. శతరూప ఆడుగుర్రం అయింది. ప్రజాపతి మగగుర్రం అయినాడు. అశ్వసంతతి వర్ధిల్లింది. శతరూప ఆడుగాడిద అయింది. పురుషుడు మగగాడిద అయినాడు. గార్ధభ సంతతి వర్ధిల్లింది. ఈ రకంగా ఆ స్త్రీ 84 లక్షలరూపాలు ధరించింది. పురుషుడు కూడా అన్ని రూపాలు ధరించాడు. ఈజగత్తులో 84 లక్షల రకాలైన జీవరాసి వృద్ధి చెందింది.

**సుబాలోపనిషత్తు**లో సృష్టికి పూర్వం జగత్తంతా పరమేశ్వరమయంగా ఉండేది. అతని నుంచి ముందుగా తమస్సు

పుట్టింది. తమస్సు నుంచి తన్మాత్రలు వచ్చాయి. తన్మాత్రల నుంచి పంచభూతాలు పుట్టినాయి. అది ఒక గ్రుడ్డుగా అయింది. పన్నెండు నెలల తరువాత పరమేశ్వరుడు ఆ గ్రుడ్డును రెండుగా చేశాడు. దానిలోని క్రింద భాగము భూమి. పై భాగము ఆకాశము అయింది. మధ్య భాగంలో దివ్యపురుషుడు, సహస్రశీర్షుడు, వేయికనులు, వేయిపాదాలు వేయిచేతులు గల వాడున్నాడు. ఇక్కడ వేయి అంటే అనేకమైన అని అర్థం. అతడే బ్రహ్మ. అతడు ముందుగా మృత్యువును సృష్టించాడు. అది మూడు అక్షరాలు, మూడు శిరస్సులు గలది. ఆ తరువాత ఏడుగురు మానస పుత్రులను సృష్టించాడు. వీరు విరాట్టులు. ఏడుగురు ప్రజాపతులను సృష్టించాడు. ఆ పరమపురుషుడైన బ్రహ్మముఖం నుండి బ్రాహ్మణులు, బాహువుల నుంచి క్షత్రియులు, ఊరువుల నుంచి వైశ్యులు, పాదాల నుంచి శూద్రులు మనసు నుంచి చంద్రుడు, కనుల నుంచి సూర్యుడు, చెవుల నుంచి వాయువు, హృదయం నుంచి సర్వజగత్తును సృష్టించాడు.

అపానము నుంచి – నిషాదులు, ఎముకల నుంచి – యక్షులు, రాక్షసులు, గంధర్వులు, రోమాల నుంచి – పర్వతాలు, లలాటం నుంచి – ఓషధులు, వనస్పతులు, క్రోధము నుండి – రుద్రుడు పుట్టారు. ఆ మహాభూతము యొక్క నిట్టూర్పు నుండి – నాలుగు వేదాలు, శిక్ష కల్పము వ్యాకరణము జ్యోతిషము, నిరుక్తము, ఛందస్సు, తర్కము, మీమాంస, ధర్మసూత్రాలు, వ్యాఖ్యానాలు, సర్వభూతాలు ఆవిర్భవించాయి అని చెప్పబడింది.

**మహోపనిషత్తు**లో ఆ పరమపురుషుని నుండి 14 మంది పురుషులు, ఒక కన్య జన్మించారు. తరువాత జ్ఞానేంద్రియాలు –5, కర్మేంద్రియాలు–5, మనస్సు–1 మొత్తం 11 ఇంద్రియాలు

ఆవిర్భవించాయి. అహంకారము ప్రాణము దేహము బుద్ధి. తన్మాత్రలు-5, పంచభూతాలు-5 ఉద్భవించాయి. ఈ రకంగా 25 తత్త్వములతో నిండిన విరాట్ పురుషుడు జన్మించాడు. ఈ సృష్టిలో పరమాత్మ అధిష్ఠాన రూపంలో ప్రవేశించాడు. 25 తత్త్వాలతో ఉన్న ఆవిరాట్పురుషుని నుంచి సంవత్సరాలు కాలస్వరూపంలో పుట్టినాయి. ఆ తరువాత పరమపురుషుడు ఇంకొక సంకల్పంతో హృదయంలో ధ్యానం చేశాడు. ధ్యానంలో ఉన్న అతని లలాటం నుంచి త్రినేత్రుడు, త్రిశూలపాణి అయిన పురుషుడు జన్మించాడు. తేజోవంతుడైన ఆ పురుషుని యందు యశస్సు, సత్యము, బ్రహ్మచర్యము, తపస్సు, వైరాగ్యము, మనస్సు, ఐశ్వర్యము ప్రణవసహిత వ్యాహృతులు, చతుర్వేదాలు, ఛందస్సులు అన్నీ ప్రకాశించాయి. అందుచేత అతడు ఈశానుడు మహాదేవుడు అనబడ్డాడు.

తరువాత మరి ఒక సంకల్పంతో ఆ పురుషుడు మళ్ళీ ధ్యానం చేశాడు. ధ్యానంలో ఉన్న అతని లలాటం నుంచి శ్వేదం పుట్టింది. ఆ శ్వేదమే జలమయింది. ఆ జలము నుంచి బంగారుకాంతి గల అండము పుట్టింది. దాని నుంచి చతుర్ముఖ బ్రహ్మ పుట్టాడు. ఆ బ్రహ్మ తూర్పుదిక్కుకు తిరిగి ధ్యానం చేశాడు. అప్పుడు భూః అనే వ్యాహృతి, గాయత్రీఛందస్సు, ఋగ్వేదము, అగ్నిదేవత ఆవిర్భవించాయి. బ్రహ్మ పడమర దిక్కుకు తిరిగి ధ్యానం చేశాడు. అప్పుడు భువః అనే వ్యాహృతి, త్రిష్టుప్ ఛందస్సు, యజుర్వేదము, వాయుదేవత ఆవిర్భవించారు. బ్రహ్మ ఉత్తర దిక్కుగా తిరిగి ధ్యానం చేశాడు. అప్పుడు సువః అనే వ్యాహృతి, జగతిఛందస్సు, సామవేదము, సూర్యుడు ఆవిర్భవించారు. తరువాత బ్రహ్మ దక్షిణ దిక్కుగా తిరిగి ధ్యానం చేశాడు. మహః అనే వ్యాహృతి, అనుష్టుప్ఛందస్సు, అథర్వణ వేదము, సోమదేవత ప్రభవించినాయి.

ఆ తరువాత బ్రహ్మ మళ్ళీ ధ్యానం చేసి క్షీరసాగరం మధ్యలో ఒక దేవుని దర్శించాడు. ఆ దేవత వేయి శిరస్సులతోను, వేయి కనులతోను ప్రకాశిస్తున్నాడు. విశ్వకల్యాణకారకమై, విశ్వాతీతమై, నిత్యమై విలసిల్లుతున్నాడు. అతడే శ్రీమన్నారాయణుడు. చరాచర జగత్తంతా అతని నుంచే ఆవిర్భవించింది. ఈ జగత్తుకు ఆధారభూతమైన వాడు అతడే. అని చెప్పబడింది.

**ఐతరేయోపనిషత్తు**లో సృష్టిని గురించి వివరించటం జరిగింది. సృష్టికి పూర్వం ఈ జగత్తంతా బ్రహ్మమయంగానే ఉండేది. దానికి భిన్నమైన పదార్థం ఏదీ లేదు. దాన్నే ఆత్మ అంటారు. ఈఆత్మ లోకాలను సృష్టించాలనుకున్నది. మరీచి, ఆపః, మర అనే మూడు పేర్లు గల లోకాలు సృష్టించింది. ద్యులోకానికి ఆవల ఉన్నది అంభస్సు, దానికి ఆశ్రయము స్వర్గము. అదే సువర్లోకము, దాని క్రింద భువర్లోరకము. దానిక్రింద భూలోకము ఉన్నాయి. భూలోకము మరణము ధర్మముగా గలది. ఇక్కడ పుట్టిన ప్రతిప్రాణి మరణిస్తుంది. భూలోకం క్రింద జలలోకమున్నది. అది క్రింద ఉన్న లోకాలచేత పొందబడుతున్నది. ఈ లోకాలన్నీ పంచభూతాలచే నిర్మించబడ్డాయి.

లోకాలను సృష్టించిన తరువాత “ఈ లోకాలను రక్షించే వారు లేకపోతే అవి నాశనమై పోతాయి. కాబట్టి లోకపాలకులను సృష్టించాలి” అని ఆలోచించి పంచభూతాలలో ప్రధానమైన జలాన్ని తీసుకుని దానితో అవయవాలు గల ఒక మానవాకారాన్ని సృష్టించింది. ఆ ఆకారమే విరాడ్రూపము.

పరమాత్మ విరాడ్రూపాన్ని దృష్టిలో ఉంచుకుని తీవ్రమైన ఆలోచన చేశాడు. అదే తపస్సు. దాని ఫలితంగా విరాడ్రూపానికి నోరు వచ్చింది.

ఆ నోటి మంచి మాట, మాట నుండి వాణికి అభిమాన దేవత అయిన అగ్ని ఉత్పన్నమైనాయి. తరువాత ముక్కు రంధ్రాలు వచ్చాయి. వాటినుండి ప్రాణం ఉత్పన్నమైంది. అంటే వాసన చూసే శక్తి వచ్చింది. ఆఘ్రాణశక్తి నుంచి వాయువు పుట్టింది. తరువాత నేత్రాలు వచ్చాయి. వాటి నుంచి సూర్యుడు ఆవిర్భవించాడు. తరువాత చెవులు ఏర్పడ్డాయి. వాటి నుండి దిక్కులు వచ్చినాయి. తరువాత చర్మము ఏర్పడింది. దాని నుంచి స్పర్శకు కారణమైన రోమాలు వచ్చాయి. చర్మము నుండే ఓషధులు, వనస్పతులు వచ్చినాయి. తరువాత హృదయము, దాని నుండి మనస్సు, దాని నుండి చంద్రుడు పుట్టారు. తరువాత నాభి. దాని నుంచి అపానము దాని నుంచి మృత్యువు ఉద్భవించినాయి. తరువాత పురుష జననేంద్రియము, దాని నుంచి వీర్యము, దానికి అధిష్టానమైన జలము పుట్టినాయి. ఈ రకంగా విరాట్పురుషుని అవయవాల నుంచి ఇంద్రియాలు, వాటి అభిమాన దేవతలు పుట్టారు.

పరమేశ్వరునిచే లోకపాలకులుగా సృష్టించబడ్డ అగ్ని మొదలైన ఇంద్రియాధి దేవతలు అవిద్యతో కూడిన మహాసముద్రంలో పడ్డారు. దానికి అంతం లేదు. అది ఇంద్రియాలవల్ల కలిగే క్షణిక సుఖాలతో కూడినది.

పరమేశ్వరుడు విరాడ్రూపానికి ఆకలి దప్పికలు కలిగేలా చేశాడు. అప్పుడు దేవతలందరూ "మేము కూచుని తినేందుకు వీలుగా మాకు తగిన స్థానాన్ని ప్రసాదించమని వేడుకున్నారు. ఆకలి తీరాలంటే ఆహారం కావాలి. అన్ని ఇంద్రియాలకు ఆహారం అన్నమే కాదు. వాటి ఆహారం వేరుగా ఉంటుంది. కంటికి దృశ్యము ఆహారము. చెవికి శబ్దం ఆహారము.

అప్పుడు పరమేశ్వరుడు దేవతల కోసం ఒక ఆవును సృష్టించాడు. దేవతలు ఇది మాకు సరిపోదు అన్నారు. గుర్రాన్ని సృష్టించాడు. అదీ చాలదన్నారు. అప్పుడు విరాడ్రూపాన్ని పోలిన పురుషుణ్ణి సృష్టించాడు. దాన్ని చూసి దేవతలు ఇది చాలా బాగుంది అన్నారు. పరమేశ్వరుని ఆజ్ఞ ప్రకారం ఇంద్రియాది దేవతలంతా వారి వారి స్థానాల్లో ప్రవేశించారు. అంటే అగ్నివాగ్రూపం ధరించి పురుషుని నోటిలో ప్రవేశించింది. వాయువు ప్రాణరూపం ధరించి ముక్కులోను, సూర్యుడు దృష్టిరూపంతో నేత్రాలలోను, దిక్కులు చెవులయందు, ఓషధులు, వనస్పతులు చర్మలోను, చంద్రుడు మనోరూపంతో హృదయమందు, మృత్యువు అపాన రూపం ధరించి నాభియందు, జలం వీర్యరూపం దాల్చి జననేంద్రియ మందు ప్రవేశించాయి. ఈ రకంగా దేవతలంతా వెళ్ళిపోగా ఇంక మిగిలినవి ఆకలి దప్పికలు. ఈ రెండింటినీ పరమేశ్వరుడు దేవతలందరిలోను భాగస్వాములుగా చేసాడు. దీనివల్ల ఏ దేవతకు హవిస్సు ఇచ్చినా, దానిలో ఆకలి దప్పికలకు కూడా భాగం కలుగుతుంది. ఆకలి దప్పిక అంటే కంటికి చూడాలనే కోరిక, చెవులకు వినాలనే కోరిక.

ఈ రకంగా ఇంద్రియాలను వాటి అధిష్ఠాన దేవతలను సృష్టించిన తరువాత అన్నాన్ని సృష్టించవలసి వచ్చింది. అప్పుడు జలం నుంచి ఆహారాన్ని సృష్టించాడు. అదే అన్నము.

ఇప్పుడు పరమేశ్వరుడు ఇంద్రియాలతో కూడిన మానవ శరీరంలో ప్రవేశించాలనుకున్నాడు. దానికి రెండు మార్గాలున్నాయి. 1. పాదాల చివరనుంచి అంటే క్రింద నుంచి 2. శిరస్సు నుంచి అంటే బ్రహ్మరంధ్రం నుంచి. ఇప్పుడు పరమేశ్వరుడు బ్రహ్మరంధ్రం ద్వారా మానవ శరీరంలో ప్రవేశించాడు. ఈ రకంగా పరమేశ్వరుడు

జీవకోటిని సృష్టించి, ఆ జీవకోటిలో ప్రవేశించి, జగత్తంతా తానే అయినాడు" అని చెప్పబడింది.

**పైంగలోపనిషత్తు**లో సృష్టిని గురించి వివరించారు. ఈ జగత్తు సృష్టింప బడటానికి ముందు పరమాత్మ ఒక్కడే ఉన్నాడు. అదే ఆత్మ. అది నిత్యమైనది. వికారాలు లేనిది. సత్యజ్ఞానానందమయమైనది. పరిపూర్ణమైనది. సనాతనముగా ఉన్నది. ఒకటిగానే ఉన్నది. రెండవది లేనిది. అదే పరబ్రహ్మ. అదే ఆత్మ. ఆ పరబ్రహ్మలో ఎడారిలో మృగతృష్ణలాగా ముత్యపుచిప్పలో వెండిలాగా, స్థాణువులో దొంగవాడిలాగా స్ఫటికంలో రేఖలు లాగా అనిపిస్తూ ఎరుపు తెలుపు నలుపు రంగులు గల సమాన త్రిగుణాలు కలిగి, నిర్వచించటానికి వీలు లేని మూలప్రకృతి ఉన్నది. ఆ మూలప్రకృతిలో ప్రతిబింబించిన పరబ్రహ్మమే సాక్షిచైతన్యము. ఆ మూలప్రకృతి వికారము పొంది సత్త్వగుణము వల్ల ఉద్రేకము పొంది అవ్యక్తమనే పేరుతో ఆవరణ శక్తిగా ఉంది. ఈ ఆవరణలో ప్రతిబింబించిన పరబ్రహ్మ ఈశ్వర చైతన్యము.

ఈ అవ్యక్తము పరమేశ్వరుని అధీనంలో ఉంటుంది. ఈ అవ్యక్తము నుంచి రజోగుణ ప్రధానమైన మహత్తత్త్వము వచ్చింది. ఇందులో ప్రతిఫలించిన పరబ్రహ్మయే హిరణ్యగర్భుడు, ఆ హిరణ్యగర్భుని నుంచి తమోగుణ ప్రధానమైన అహంకారము వచ్చింది. ఈ అహంకారంలో ప్రతిఫలించిన పరబ్రహ్మయే విరాట్స్వరూపము. ఆ విరాడ్రూపమే శ్రీమహావిష్ణువు. ఆ విరాడ్రూపాన్నుంచి తన్మాత్రలు, వాటినుంచి స్థూల రూపాలైన పంచభూతాలు పుట్టినాయి వాటిలో ముందుగా ఆకాశం పుట్టింది.

ఆకాశము నుంచి – వాయువు

వాయువు నుంచి - అగ్ని

అగ్ని నుంచి - జలము

జలము నుంచి - పృథివి

పుట్టినాయి. ఇప్పుడు సృష్టి చెయ్యాలి అని భావించిన పరమాత్మ పంచ భూతాలలో ఒక్కొక్క దాన్ని రెండు భాగాలుగా చేశాడు. ప్రతి భూతములోను సగము భాగము దాన్నే ఉంచి మిగిలిన సగభాగాన్ని నాలుగు భాగాలుగా చేసి, అందులో ఒక్కొక్క దానిలోను మిగిలిన ఒక్కొక్క భూతాన్ని కల్పించి పంచీకరణ చేశాడు. ఈ పంచీకరణ ఎలా జరిగిందంటే - ఉదాహరణకు ఆకాశాన్ని తీసుకుందాం. ఆకాశంలో సగభాగము 1/2 ఆకాశమున్నది. మిగిలిన సగభాగాన్ని నాలుగు భాగాలుగా చేశాడు. అంటే ఒక్కొక్క భాగము 1/8 అయిందన్న మాట. ఇప్పుడు ఆ నాలుగింటిలోను 1/8 వాయువు, 1/8 అగ్ని, 1/8 జలము, 1/8 పృథివి ఉన్నాయి. ఇలా ప్రతి భూతంలోను కూడా ఐదు భూతాలున్నాయి. ఇదే రకంగా అన్ని భూతాలను విభజించటం జరిగింది. దీన్నే పంచీకరణము అంటారు. ఈ రకంగా పంచీకరించిన భూతాలతోనే అనంతకోటి బ్రహ్మాండాలు, లోకాలు, గోళాలు సృష్టించబడ్డాయి.

ఈశ్వరుడు పంచమహాభూతాల రజోగుణాన్ని నాలుగు భాగాలుగా చేసి అందులోని మూడు భాగాల నుంచి ప్రాణశక్తిని సృష్టించాడు. నాల్గవ భాగంతో కర్మేంద్రియాలు సృష్టించాడు. తరువాత పంచభూతాల సత్వగుణాన్ని నాలుగు భాగాలు చేసి అందులోని మూడు భాగాలతో అంతఃకరణను నాల్గవభాగంతో జ్ఞానేంద్రియాలను సృష్టించాడు. ఈ సత్త్వగుణం వల్ల ఇంద్రియ పాలకులైన దేవతలను సృష్టించాడు. ఈ

రకంగా సృష్టించబడిన ఇంద్రియాలను అండము లోపల వ్యాపింప చేశాడు. అవి అండమంతా వ్యాపించినాయి. ఈశ్వరుని ఆజ్ఞతో అహంకార సహిత విరాట్టు సమస్త స్థూలాన్ని సృష్టించాడు. ఈశ్వరుని ఆజ్ఞతో హిరణ్యగర్భుడు సూక్ష్మభూతాలను పాలించాడు.

అండంలో ఉన్న ఇంద్రియాలు చైతన్యమూర్తి అయిన ఈశ్వరుడు లేకుండా స్పందన కలిగి ఉండటానికి, పనిచెయ్యటానికి సమర్థత లేకుండా ఉన్నాయి. ఈశ్వరుడు వీటిని చైతన్యవంతులుగా చెయ్యాలి అనుకున్నాడు. అన్నింటి యందు తాను ప్రవేశించాడు. అంటే జగత్తులోని జీవరాశియందు అంతటా తాను ప్రవేశించాడు. అప్పటి వరకు జడములుగా ఉన్న ఈ ఇంద్రియాలు పరమేశ్వరుడు ప్రవేశించగానే చైతన్యవంతమైనాయి. తమ కర్తవ్యం నిర్వహించటం మొదలు పెట్టినాయి. శరీరంలో ప్రవేశించిన ఈశ్వరుడు మాయచేత అజ్ఞాని అయి కర్తృత్వము, భోక్తృత్వము గలవాడయినాడు. 'దేహమే నేను' అనే భ్రాంతితో మేల్కొనటం, నిద్రపోవటం, కలలుకనటం మరణించటం వంటి ధర్మాలుగలవాడై కుమ్మరివాని సారెలాగా సంసారచక్రంలో పరిభ్రమిస్తున్నాడు." అని చెప్పబడింది.

ఈ రకంగా చరాచరజగత్తు ఎలా సృష్టించబడింది అనే విషయం ఉపనిషత్తులలో కూడా అనేక రకాలుగా చెప్పబడింది.

# 3. ఉపనిషత్తులు కూడా వేదాలేనా?

ఇది చాలా గొప్పదైన ప్రశ్న. అసలు ఈ ప్రశ్న ఎప్పటి నుండి వచ్చింది? అంటే వేదాలతో పాటుగానే ఈ ప్రశ్న కూడా పుట్టింది. పూర్వకాలం నుంచీ కూడా దీనిమీద ఎవరి వాదనలు వాళ్ళు వినిపిస్తూనే ఉన్నారు.

వేదాలు అపౌరుషేయాలు. అంటే వేదాలను ఎవరూ చెప్పలేదు. ఎవరూ వ్రాయలేదు. సాక్షాత్తు బ్రహ్మముఖం నుంచే వచ్చాయి. కొంతమంది ఆప్తఋషులు సమాధి స్థితిలో ఉండి వేదమంత్రాలను దర్శించారు. అలా దర్శించబడినవే వేదాలు. ఈ దర్శించిన వాటిని మంత్రాలు అంటారు, మంత్ర సమూహాన్నే సూక్తము అంటారు. ఈ మంత్రభాగాన్నే సంహిత అంటారు. కాబట్టి సంహితభాగమే వేదము అనబడుతుంది. మిగిలిన భాగం వేదం కాదు. అది వీరివాదన. అయితే గతంలో మనం ఒకమాట చెప్పుకున్నాం. ఏమంటే? వేదమంత్రాలకు, సంహితభాగానికి వివరణే బ్రాహ్మణాలు. సంహితలో చెప్పిన మంత్రాలను యజ్ఞయాగాది క్రతువులలో ఏవిధంగా వినియోగించాలి? అనే విషయాన్ని తెలియచేస్తూ, కర్మకాండ ఏవిధంగా జరగాలో వివరించాయి బ్రాహ్మణాలు. అంటే బ్రాహ్మణాలు ప్రత్యేకంగా లేవు అవి కూడా సంహితయొక్క భాగమే అని గతంలో చెప్పుకున్నాం. కాబట్టి వేదము అంటే సంహిత, బ్రాహ్మణము ఈ రెండే. మిగిలినవి కాదు అన్నారు. ఇక మూడవది అరణ్యకము. బ్రాహ్మణాలలో పరిశిష్టభాగమే అరణ్యకము. చిన్న ఉదాహరణ బ్రాహ్మణము పదిఅధ్యాయాలుగా ఉన్నది అనుకోండి. అందులో ఎనిమిదిఅధ్యాయాలు బ్రాహ్మణము. చివరి రెండు అద్యాయాలు

అరణ్యకము. కాబట్టి అరణ్యకాలు ప్రత్యేకంగా ఎక్కడి నుంచో రాలేదు. బ్రాహ్మణాలలో పరిశిష్టభాగమే. కాబట్టి అరణ్యకాలు కూడా వేదమే అన్నారు. ఇప్పుడు ప్రశ్న ఏమంటే ఉపనిషత్తులు ఋషిప్రోక్తాలు కదా ! అవి బ్రహ్మముఖం నుంచి రాలేదు. ప్రతి ఉపనిషత్తును ఎవరో ఒక ఋషి చెప్పారు. కాబట్టి ఉపనిషత్తులు అపౌరుషేయాలు కాదు. అందుచేత అది వేదం కాదు. ఇది వాదన. ఈ ఉపనిషత్తులు అరణ్యకాలలో పరిశిష్టాలు. అలాంటప్పుడు ఉపనిషత్తులు కూడా వేదాలేకదా? అరణ్యకాలు వేదము అనుకున్నాం. అందులో చివరి భాగమైన ఉపనిషత్తు కూడా వేదమే కదా?

బ్రాహ్మణాలు వేదాలే అని అంగీకరించాం గతంలో. ఛాందోగ్య బ్రాహ్మణంలో మొత్తం పది ప్రపాఠకాలున్నాయి. వాటిలో రెండు ప్రపాఠకాలు ఛాందోగ్య బ్రాహ్మణము కాగా మిగిలిన ఎనిమిది ప్రపాఠకాలు ఛాందోగ్యోపనిషత్తు. దీనికి అరణ్యకం లేదు. ఇక్కడ మొదటి రెండు అధ్యాయాలు వేదం అని ఉపనిషద్భాగాన్ని వేదంగా ఒప్పుకోము. అంటే ? అలాగే కౌషీతకీ అరణ్యకం. అందులో పరిశిష్ట భాగమే కౌషీతకీ ఉపనిషత్తు. అలాగే బృహదారణ్యకము. శతపథ బ్రాహ్మణంలో 14 కాండలున్నాయి. అందులో ఆఖరు కాండ బృహదారణ్యకము. దీనిలో చివరి ఆరు అధ్యాయాలు బృహదారణ్యకోపనిషత్తు.

కృష్ణయజుర్వేదానికి సంబంధించిన నాలుగుశాఖల్లో మైత్రాయణీయ శాఖ ఒకటి. మైత్రాయణీయ సంహితలో నాల్గవభాగము మైత్రాయణీయ బ్రాహ్మణము. దాని పరిశిష్టమే మైత్రాయణీయారణ్యకము. దీన్నే మైత్రాయణీయోపనిషత్తు అంటున్నారు.

కౌషీతకీ బ్రాహ్మణంలో చివరిభాగమే కౌషీతకీ అరణ్యకము. దానిలో చివరి భాగమే కౌషీతకీ ఉపనిషత్తు. ఈ రకంగా అరణ్యకాలలో చివరి భాగమే ఉపనిషత్తు. కొన్నిచోట్ల బ్రాహ్మణాలలో చివరి భాగం ఉపనిషత్తు. అలాంటప్పుడు బ్రాహ్మణాలు, అరణ్యకాలు మాత్రం వేదంగా అంగీకరిస్తాము. ఉపనిషత్తులు మాత్రం వేదంకాదు అనటంలో ఔచిత్యం ఎంతవరకు ఉన్నది? శరీరము అంటే శిరస్సు నుంచి శ్రీపాదం దాకా అంతా శరీరమే. కాలు చేతులు, శిరస్సు, హృదయము, ఉదరము, ఇవన్నీ శరీరంలోని భాగాలే. అలా కాకుండా తలకాయ ఒక్కటే శరీరము. మిగిలిన భాగాలు ఏవీ శరీరంకాదు. అంటే హాస్యాస్పదంగా ఉండదా? ఇదెక్కడి వాదన?

అయినా ఈ విషయం మీద పూర్వకాలంలో అనేకసార్లు చర్చలు జరిగాయి. ఈ వాదనలలో భారతీయులే కాదు విదేశీయులు కూడా పాలుపంచుకున్నారు. ఈ చర్చలవల్ల తేలింది ఏమంటే వేదము అపౌరుషేయము. వేదము అంటే ఒక్క సంహిత భాగమే కాదు. బ్రాహ్మణాలు, అరణ్యకాలు ఉపనిషత్తులు కూడా.

అలాంటప్పుడు వేదము అంటే అందులో ఉన్న నాలుగు భాగాలు 1 సంహిత 2. బ్రాహ్మణము 3. అరణ్యకము 4. ఉపనిషత్తు. ఈ నాలుగు కలిస్తేనే వేదము. కాబట్టి ఉపనిషత్తులు కూడా వేదమే. ఈ మాట మనం అంగీకరించి తీరాలి. మిగిలిన వాదనలన్నీ శుష్కప్రియాలు.

# 4. ఉపనిషత్తుల వల్ల ప్రయోజనం ఏమిటి?

సంహిత అంటే మంత్రభాగము. మంత్రము యొక్క వినియోగం బ్రాహ్మణం. బ్రాహ్మణం యొక్క పరిశిష్టభాగము అరణ్యకం. అరణ్యకం యొక్క పరిశిష్ట భాగమే ఉపనిషత్తు. సంహిత, బ్రాహ్మణము కర్మకాండ. ఉపనిషత్తు జ్ఞానకాండ. కర్మకాండ నుంచి జ్ఞానకాండకు వారధి అరణ్యకము. ఈ కారణం చేతనే 'ఉపాసన' అనేది అరణ్యకంలో ప్రారంభమయింది. రకరకాల ఉపాసనలు, చరాచర జగత్తంతా పరమేశ్వరమయము అని చెబుతున్నాయి అరణ్యకాలు. ఓంకారోపాసన, గాయత్ర్యోపాసన, ఉద్గీతోపాసన, ప్రాణోపాసన, శబ్దోపాసన, అన్నోపాసన, ఇలా రకరకాల ఉపాసనలు చెప్పబడ్డాయి. ఈ ఉపాసనల ద్వారా పరమేశ్వరుణ్ణి ఆరాదించాలి. తద్వారా మోక్షం పొందాలి. ఉపాసన వరకే అరణ్యకాలలో చెప్పటం జరిగింది. అంతేకాని పరమపదము, కైవల్యము, మోక్షము, సాయుజ్యము. ఈ మాటలు ఏవీ అరణ్యకాలలో వినపడవు. ఈ ఉపాసనామార్గం ద్వారా ఉపనిషత్తులలోకి ప్రవేశిస్తాడు. ఉపనిషత్తులలో కొన్ని మంత్రాలు చెప్పటం జరిగింది. నారాయణోపనిషత్తులో నారాయణమంత్రం, కృష్ణోపనిషత్తులో కృష్ణమంత్రం, గోపాలతాపినీ ఉపనిషత్తులో గోపాలమంత్రం. దేవీ ఉపనిషత్తులో పంచదశి మహామంత్రం. అలాగే చండీమంత్రం, దుర్గామంత్రం నారసింహము, గారుడము లక్ష్మీమంత్రం. యజుర్వేదంలోని మహానారాయణోపనిషత్తులో రకరకాల మంత్రాలు చెప్పబడ్డాయి. ఈ మంత్రాలన్నీ ఉపాసనాకాండకు సంబంధించినవే. నియమనిష్టలతో ఈ మంత్రాలను జపం చేస్తే కోరిన కోరికలు సిద్ధిస్తాయి. మానవుడి కోరికలు తీరాలంటే కేవలము

యజ్ఞయాగాది క్రతువులే చెయ్యనక్కరలేదు. ఈ మంత్రజపం చేస్తే చాలు. అయితే ఏ మంత్రం జపం చెయ్యాలి? మన కోరిక ననుసరించి గురువు గారిని అడిగి అవసరమైన మంత్రాన్ని జపం చేస్తే కోరిన కోరిక సిద్ధిస్తుంది. ఈ రకంగా అన్ని కోరికలు తీరిన తరువాత మోక్షసాధన కోసం ప్రయత్నించాలి.

అసలు జీవితంలో మానవుడు సాధించవలసింది ఏమిటి? ప్రతివాడు చతుర్విధ పురుషార్థాలు సాధించటానికే ప్రయత్నించాలి. ధర్మార్థకామమోక్షాలే చతుర్విధ పురుషార్థాలు. వీటిలో ముఖ్యమైంది నాల్గవ పురుషార్థమైన మోక్షం. ఈ మోక్షాన్ని సాధించటానికే మిగిలిన మూడు పురుషార్థాలు ఉన్నాయి. మోక్షసాధనకు ఇవి మెట్లు. కాబట్టి మానవుడి దృష్టి అంతా మోక్షంమీదనే ఉండాలి. ఆ మోక్షసాధన కోసమే జ్ఞానసముపార్జన చెయ్యాలి. **'జ్ఞానాదేవతు కైవల్యం'** జ్ఞానం ద్వారానే మోక్షసాధన జరుగుతుంది అంటాడు శంకరుడు. ఈ మాటను ఎవరూ కాదనలేదు.

ఇంతవరకు దేవతలకు మంత్రజపం చేసి లౌకికమైన కోరికలు తీర్చుకున్నాడు. లౌకికమైనవి అన్నీ అశాశ్వతాలు. ఈ లోకంలో మనం కావలసిన కోరికలన్నీ పొందాం. ఇవన్నీ అశాశ్వతము అని గుర్తించాం. అందుకే శాశ్వతమైన ఆనందం కావాలి అనుకున్నాడు. అది పరమపదంలోనే దొరుకుతుంది. అని తెలిసి దాని కోసం ప్రయత్నం ప్రారంభించాం. పరమేశ్వర స్వరూపం రెండు రకాలుగా ఉంటుంది. 1. సాకారము 2. నిరాకారము. వీటినే సాకారబ్రహ్మ, నిరాకారబ్రహ్మ అంటారు.

నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు పరబ్రహ్మ. అటువంటి

పరబ్రహ్మను ఉపాసన చేసినట్లైతే జీవాత్మ పరమాత్మలో లీనమై పోతుంది. అటువంటి సాధకుడికి పునర్జన్మ ఉండదు.

సాకార బ్రహ్మోపాసనలో పరమేశ్వర స్వరూపాన్ని రకరకాలుగా చెప్పటం జరిగింది. విష్ణువు, శివుడు, శక్తి ఇలా. మన దేశంలో ప్రధానమైన దేవతలు ఐదు. ఆదిత్యం, అంబికం, గణనాథం, విష్ణుం, శివం. వీరందరికీ రూపం చెప్పబడింది. పరమేశ్వరుణ్ణి గనక ఏ రూపంలో ఉపాసన చేస్తే మరణానంతరము సాధకుడు ఆ లోకాలకు చేరతాడు. అంటే విష్ణువును అర్చించిన వాడు వైకుంఠం చేరతాడు. శివుణ్ణి అర్చించినవాడు కైలాసం చేరతాడు. అమ్మవారిని అర్చించిన వాడు మణిద్వీపం చేరతాడు. సాకారభక్తి పూర్తిగా ద్వైతభక్తి. జీవాత్మ, పరమాత్మ రెండూ వేరు వేరు.

అదే నిరాకారోపాసనలో జీవాత్మ పరమాత్మ రెండు ఒకటే. మరణానంతరము సాధకుడి జీవాత్మ పరమాత్మలో లీనమై పోతుంది. అటువంటి వారికి పునర్జన్మ ఉండదు. సాకార బ్రహ్మోపాసనలో కూడా పరమపదము చేరిన వారికి జన్మరాహిత్యం కలుగుతుంది.

సాకారబ్రహ్మ, నిరాకార బ్రహ్మ ఈ రెండింటిలో దేన్ని ఉపాసించినా సాధకుడికి జన్మరాహిత్యం కలుగుతుంది. అతడికి పునర్జన్మ ఉండదు. ద్వైతంలోను, అద్వైతంలోను కూడా మోక్షం సిద్ధిస్తుంది.

ఈ రకంగా **'మానవుడికి జన్మరాహిత్యం కలుగచెయ్యటమే' ఉపనిషత్తుల యొక్క ముఖ్యోద్దేశము.** అదే ఉపనిషత్తుల ప్రయోజనము **కూడా.**

# 5. శాక్తేయోపనిషత్తులు

శక్తిని గురించి చెప్పే ఉపనిషత్తులను శాక్తేయోపనిషత్తులు అంటారు. సామాన్యంగా కాళి, చండి, దుర్గ వంటి ఉగ్రదేవతలను ఇవి వివరిస్తుంటాయి. వీటి పూజావిధానం కూడా కొంతవరకు వామాచార సంప్రదాయంలో ఉంటుంది.

కాని రానురాను సౌమ్యదేవత అయిన లలితా త్రిపురసుందరి ప్రధానదేవతగా చెప్పబడుతోంది. ఈమెను ఉపాసించే మంత్రము - పంచదశి మహామంత్రము. యంత్రము-శ్రీచక్రము, తంత్రము - అంతఃపూజ. ఇతర దేవతల ప్రసక్తి ఉన్నప్పటికి లలితాత్రిపుర సుందరియే పరమేశ్వరిగా చెప్పబడుతుంది. ఆవిడే మోక్షమివ్వగల దేవత అంటారు శ్రీవిద్యోపాసకులు.

పరమేశ్వర స్వరూపాన్ని స్త్రీమూర్తిగా భావించే ఉపనిషత్తులను శాక్తేయోప నిషత్తులు అంటారు. ఇవి మొత్తం ఎనిమిది అని గతంలో చెప్పుకున్నాం. వీటిలో పంచదశి మహామంత్రము. శ్రీచక్రము, లక్ష్మిఉపాసన, సరస్వతీ ఉపాసన, మానవదేహమే శ్రీచక్రము, అంతరారాధన అనే విషయాలను వివరించి చివరిగా పరమేశ్వరియే పరబ్రహ్మ స్వరూపము అనే విషయాన్ని వివరించారు. ఒకరోజు నాకు స్వప్నంలో దర్శనమైనది లలితా రహస్యోపనిషత్తు. ఈ ఎనిమిది ఉపనిషత్తులతో పాటుగా దాన్నికూడా ఇక్కడ ఇస్తున్నాను.

1. త్రిపురోపనిషత్తు - ఋగ్వేదము
2. బహ్వృచోపనిషత్తు - ఋగ్వేదము
3. దేవిఉపనిషత్తు - అధర్వణవేదము

4. సౌభాగ్యలక్ష్మీ ఉపనిషత్తు - ఋగ్వేదము

5. త్రిపురతాపినీ ఉపనిషత్తు - అధర్వణ వేదము

6. సీతోపనిషత్తు - అధర్వణ వేదము

7. సరస్వతీ రహస్యోపనిషత్తు - కృష్ణయజుర్వేదము.

8. భావనోపనిషత్తు - అధర్వణ వేదము

9. లలితారహస్యోపనిషత్తు - నాకు స్వప్నదర్శనమైనది.

ఇది సాకారబ్రహ్మోపాసన. శాక్తేయం మోక్షవిద్య కాదు. శాక్తేయంలోనే శుద్ధ సత్వప్రధానమైన దేవత రాజరాజేశ్వరి పరాభట్టారిక. లలితా త్రిపురసుందరి. ఈ దేవతనే పరమేశ్వరి అని చెప్పటం జరుగుతుంది. ఈమె మోక్షమివ్వగల దేవత. ఈ దేవత యొక్క అర్చనా విధానమే **శ్రీవిద్య** అనబడుతుంది. దీనిమీద వివరాలు కావాలంటే నేను వ్రాసిన **'శ్రీవిద్య'** పుస్తకం చూడండి. శ్రీవిద్యలో ప్రధానమైన మంత్రం పంచదశి, మహాషోడశి. యంత్రం శ్రీచక్రం. అర్చనావిధానము అంతరారాధన. ఇప్పుడు ముందుగా పంచదశీ మహామంత్రం చూద్దాం.

శ్రీవిద్యోపాసనకు కుల మత జాతి లింగ భేదాలు లేవు. ఎవరైనా శ్రీవిద్యోపాసన చెయ్యవచ్చు. ఇందులో ఏ రకమైన సందేహం లేదు.

# 6. పంచదశి మహామంత్రం

అమ్మవారిని పరమేశ్వరిగా భావించి అర్చించేది శ్రీవిద్య. శ్రీవిద్యలో ప్రధానమైనది **'పంచదశి' మహామంత్రము.** గాయత్రీ మంత్రం ద్విజులకోసం ఏర్పడగా పంచదశి మహామంత్రం అన్ని వర్ణాలవారి కోసం ఏర్పడింది. ఉపనిషత్తులలో రహస్యంగా చెప్పబడిన మంత్రమిది. ఈ మంత్రంలో మొత్తం పదిహేను అక్షరాలుంటాయి. అందుకే దీన్ని పంచదశి మహామంత్రము అన్నారు. సామాన్యంగా ప్రతిమంత్రానికి ఒకదేవత ఉంటుంది. ఉదాహరణకి

అష్టాక్షరీ మహామంత్రానికి దేవత – శ్రీమన్నారాయణుడు

పంచాక్షరి మంత్రానికి దేవత – ఈశ్వరుడు

కాగా పంచదశి మహామంత్రానికి దేవత – సాక్షాత్తు పరమేశ్వరి

ప్రతి మంత్రంలోనూ దేవత పేరుంటుంది. కాని **పంచదశి మహామంత్రంలో అన్నీ బీజాక్షరాలే ఉంటాయి. ఏ దేవత పేరు ఉండదు.** ఇందులో ఉండే పదిహేను అక్షరాలు పంచభూతాలకు ప్రతీక. ఈ సృష్టిలో మొదటగా ఆకాశం పుట్టింది.

ఆకాశం నుంచి – వాయువు

వాయువు నుంచి – అగ్ని

అగ్ని నుంచి – జలము

జలము నుంచి – భూమి పుట్టినాయి

పంచభూతాలలో ప్రతి భూతానికి కొన్ని లక్షణాలుంటాయి.

ముందుగా ఆకాశం.

| భూతము | - | లక్షణము |
|---|---|---|
| 1. ఆకాశము | - | శబ్దము |
| 2. వాయువు | - | శబ్దము, స్పర్శ |
| 3. అగ్ని | - | శబ్దము, స్పర్శ, రూపము |
| 4. జలము | - | శబ్దము, స్పర్శ, రూపము, రసము |
| 5. భూమి | - | శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము. |

ఇలా చూసినట్లైతే

| | | |
|---|---|---|
| ఆకాశము లక్షణము | - | 1 |
| వాయువు లక్షణాలు | - | 2 |
| అగ్ని లక్షణాలు | - | 3 |
| జలము లక్షణాలు | - | 4 |
| భూమి లక్షణాలు | - | 5 |
| వెరసి | | 15 |

ఈ పదిహేను లక్షణాలే పంచదశి మహామంత్రంలోని పదిహేను బీజాక్షరాలు. మంత్రశాస్త్రంలో ఇంత గొప్పతనము మరి ఏ ఇతర మంత్రానికీ లేదు.

ఈ మంత్రం మొత్తం మూడు ఖండాలుగా లేదా మూడు కూటములుగా ఉంటుంది. మొదటి కూటమిలో నాలుగు, రెండవ కూటమిలో ఐదు, మూడవ కూటమిలో మూడు వెరసి పన్నెండు అక్షరాలు ఉంటాయి. ఈ మూడు కూటములకు చివర మూడు హ్రీంకారాలు ఉంటాయి. ఈ రకంగా 12+3 = 15 అక్షరాలతో పంచదశి మహామంత్రము అలరారుతున్నది.

**క ఏ ఈ ల హ్రీం। హ స క హ ల హ్రీం। స క ల హ్రీం।**

ఈ మంత్రానికి దేవత, మంత్రంలో చెప్పబడే దేవత ఎవరు? అంటే – త్రిమూర్తి ద్వంద్వము. వాణిహిరణ్యగర్భులు, లక్ష్మీనారాయణులు, ఉమామహేశ్వరులు వీరే ఈ మంత్రానికి అది దేవతలు.

**కకారో బ్రహ్మరూపశ్చ। ఏకారో భారతీ మతమ్**

**ఈకారో విష్ణురూపశ్చ। లకారో పృథివీ మతమ్**

**హకారో రుద్రరూపశ్చ। రకారో రుద్రాణిముచ్యతే.**

మొదటి ఖండం చూడండి. అందులో ఐదు అక్షరాలున్నాయి. వాటిలో

| | | |
|---|---|---|
| కకారము | – | బ్రహ్మ |
| ఏకారము | – | భారతి వీరిద్దరే వాణీ హిరణ్యగర్భులు |
| ఈకారము | – | విష్ణువు |
| లకారము | – | పృథివి వీరిద్దరూ లక్ష్మీనారాయణులు |
| హకారము | – | రుద్రుడు |
| రకారము | – | రుద్రాణి (కాళి) వీరిద్దరూ ఉమామహేశ్వరులు. |

ఇలాగే మూడు ఖండాలలోను త్రిమూర్తి ద్వంద్వము చెప్పబడుచున్నది. ఈ మంత్రంలోని బీజాక్షరాలే పంచభూతాలు. మంత్రానిది దేవత – త్రిమూర్తి ద్వంద్వము. పంచభూతాలు అందుకే ఈ మంత్రానికి దేవత పరమేశ్వరస్వరూపము.

ఇక మంత్రార్థాన్ని గనక చూసినట్లైతే గాయత్రీ మంత్రానికి,

పంచదశి మహామంత్రానికి అర్థంఒకటే. ఈ మహామంత్రానికి పదిహేనురకాల అర్థాలు చెప్పారు భాస్కరరాయలవారు. వాటి వివరాలు కావాలంటే నేను వ్రాసిన **'వరివస్యా రహస్యము'** అనే పుస్తకం చూడండి.

పంచదశి మహామంత్రం జపం చెయ్యాలంటే పూర్వజన్మలలో చేసిన పుణ్యం కావాలి. అందుకే

**యశ్చినో పశ్చిమం జన్మ యదివాశంకర స్వయం**

**తేనైవ లభ్యతే విద్యా శ్రీమత్పంచదశాక్షరీ ॥**

ఎవరికైతే మరుజన్మ లేదో, ఎవరైతే సాక్షాత్తు పరమేశ్వరుడో అతడికి మాత్రమే పంచదశి మహామంత్రం లభిస్తుంది. ఇతరులకు లభ్యం కాదు.

ఈ మంత్రం ఎన్ని లక్షలు జపం చేస్తే సిద్ధిస్తుంది? ఇది చాలా పెద్ద ప్రశ్న. ఇక్కడ కావలసింది లక్షలజపంకాదు. ఏకాగ్రత కావాలి. నిశ్చలమైన మనస్సుతో భగవన్నామాన్ని ఒక్కసారి అనుకుంటే చాలు మంత్రసిద్ధి జరుగుతుంది. మంత్రజపం చేస్తే ఫలితం ఏమిటి?

**యాత్రాపి భోగో, నచ తత్ర మోక్షః యత్రాపి మోక్షో నచ తత్ర భోగః**

**శ్రీసుందరీ సేవన తత్పరాణాం భోగశ్చ మోక్షశ్చ కరస్త ఏవ ॥**

మానవుడికి భోగం కావాలంటే మోక్షం రాదు. మోక్షం కావాలంటే భోగాలు వదిలెయ్యాలి. కాని పరమేశ్వరిని ఆరాధించిన వారికి భోగము, మోక్షము ఏది కావాలంటే అది సిద్ధిస్తుంది.

# శ్రీచక్రము

అమ్మవారి యొక్క యంత్రం 'శ్రీచక్రం' ఇది చరాచర జగత్తుకు ప్రతీక. విశ్వమానవాళికి ప్రతీక. శ్రీచక్రాన్ని పూజించినట్లైతే ఈ జగత్తును, అందులోని జీవరాశిని అంతటినీ పూజించినట్లే నిన్ను నువ్వు గౌరవించుకోవటంతో పాటు అందరినీ గౌరవించినట్లే అని చెబుతోంది శాస్త్రము.

ఇందులో తొమ్మిది ఆవరణలుంటాయి. ఈ ఆవరణలలో వివిధ దేవతలుంటారు. వీరందరినీ పేరు పేరునా అర్చించటమే చక్రార్చన. ఈ అర్చన ఖడ్గమాలతో చెయ్యాలి.

లలితాత్రిపురసుందరిని చేసే స్తోత్రమే **'లలితా రహస్యనామ స్తోత్రము'** ఇది చాలా అద్భుతమైనది. ఇందులో మంత్ర యంత్ర తంత్ర విధానాలు, అనేక మంత్రాలు చెప్పబడ్డాయి. ఆసక్తి కలవారు నేను వ్రాసిన **'శ్రీవిద్యాసారథి'** (లలితా సహస్రనామ భాష్యం) చదవండి. శ్రీవిద్యను గురించి తెలుసుకోవాలంటే నేను వ్రాసిన **శ్రీవిద్య** పుస్తకం చదవండి. నా పుస్తకాలు, సి.డి.లు, ఇంటర్‌నెట్‌లో చూడవచ్చు. పుస్తకాలను డౌన్‌లోడ్ కూడా చేసుకోవచ్చు

# 7. త్రిపురోపనిషత్తు

ఋగ్వేదానికి సంబంధించినది ఈ ఉపనిషత్తు. ఇందులో పంచదశీ మహామంత్రాన్ని సంకేతార్థాలతో ప్రతిపాదిస్తున్నారు. పరమేశ్వర స్వరూపాన్ని స్త్రీమూర్తిగా చెప్పాలంటే ఆవిడే లలితా త్రిపుర సుందరి. రాజరాజేశ్వరిపరాభట్టారిక. ఆవిడయొక్క మంత్రమే పంచదశిమహామంత్రము. శ్రీవిద్యకు గాయత్రిలాంటిది పంచదశిమహామంత్రము. ఇందులో పదిహేను అక్షరాలుంటాయి. ఈ మంత్రం మొత్తం మూడు కూటములుగా ఉంటుంది. 1. వాగ్భవకూటమి 2. కామరాజ కూటమి 3. శక్తికూటమి. అమ్మవారి సూక్ష్మరూపమే పంచదశిమహామంత్రము. లలితా సహస్రంలో పంచదశి మహామంత్రం వివరించబడింది.

**శ్రీమద్భాగవకూటైక స్వరూప ముఖపంకజా**

**కంఠాదిః కటిపర్యంతం మధ్యకూటస్వరూపిణీ**

**శక్తికూటైక తాపన్న కట్యథో భాగధారిణః**

స్థూలశరీరాన్ని మూడు భాగాలుగా చెబుతున్నారు. అవే 1. వాగ్భవకూటమి 2. కామరాజకూటమి 3. శక్తికూటమి

1) శిరస్సు – వాగ్భవకూటమి

2) కంఠం దగ్గర నుంచి, కటిప్రదేశం వరకు – కామరాజకూటమి

3) కటిప్రదేశము నుంచి పాదాలదాకా – శక్తికూటమి.

ఇప్పుడు మంత్రంకూడా మూడు భాగాలవుతున్నది. మొత్తం 12 అక్షరాలు 3 హ్రీంకారాలు కలిసి 15 అక్షరాలు ఉంటాయి ఈ మూడు ఖండాలలో. ఆ అక్షరాలు ఏవి? అనే విషయం చెబుతున్నారు

ఉపనిషత్తులో

**కామో(క) యోనిః (ఏ) కామకలా (ఈ) వజ్రపాణిః (ల) గుహా (హ్రీం)।**

**హ(హ) సా(స) మాతరిస్వా (క) అభ్రం (హ) ఇంద్రః (ల) గుహా (హ్రీం) స(స) క(క)లా(ల) మాయ (హ్రీం)**

మంత్రంలో 12 బీజాక్షరాలు 3 హ్రీంకారాలు వెరసి 15 అక్షరాలున్నాయి. ఇవి మొత్తం మూడు ఖండాలలో ఉంటాయి. మొదటిఖండంలో నాలుగు, రెండవ ఖండంలో ఐదు, మూడవఖండంలో మూడు. వెరసి 12 బీజాక్షరాలుంటాయి. ప్రతి ఖండంచివర హ్రీంకారముంటుంది.

ఇలా మూడు హ్రీంకారాలుంటాయి. పన్నెండు బీజాక్షరాలు మూడు హ్రీంకారాలు. వెరసి పదిహేనుఅక్షరాలు గల దేవీమంత్రము. దీన్నే పంచదశి మహామంత్రము అంటారు. ఈ మూడు కూటములలోను

క ఏ ఈ ల హ్రీం – వాగ్భవకూటమి
హ స క హల హ్రీం – కామరాజకూటమి
స క ల హ్రీం – శక్తికూటమి

మొత్తం మంత్రాన్ని చూస్తే

**క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం॥**

శ్రీవిద్యలో ఉత్తమోత్తమమైనది పంచదశి మహామంత్రము.

**యశ్యనో పశ్చిమంజన్మ యదివా శంకరస్స్వయం**
**తేనైవ లభ్యతే విద్యా శ్రీమత్పంచదశాక్షరీ ॥**

ఎవరికైతే మరుజన్మ లేదో, ఎవరైతే సాక్షాత్తు ఈశ్వరుడో అతడికి మాత్రమే పంచదశిమహామంత్రము లభిస్తుంది. అంటే పంచదశి మహామంత్రాన్ని ఉపాసించిన వారికి, **శ్రీవిద్యను ఉపాసించిన వారికి మరుజన్మలేదు.** ఇక్కడ ఒక్క మాట గుర్తు పెట్టుకోవాలి. మంత్రాన్ని నేను ఉపదేశం పొందాను కదా ! నాకు జన్మరాహిత్యం జరుగుతుందా అని అడగకూడదు. జన్మరాహిత్యం జరగటమన్నా పునర్జన్మ లేదు అన్నా అర్థంఒకటే. ఆ సాధకుడు ముక్తుడవుతాడు. ముక్తి అనేది ఎవరికి సిద్ధిస్తుంది? పూర్ణకాముడు, నిష్కాముడు అయినవాడికి ముక్తి లభిస్తుంది. కాబట్టి అరిషడ్వర్గాలు, రాగద్వేషాలు వదలి, త్రికరణశుద్ధిగా పరమేశ్వరి పాదారవిందాలను సేవిస్తూ మంత్రజపం చేసినవాడికి మోక్షము వస్తుంది. ఇందులో సందేహం లేదు. దీనిమీద వివరాలకు నేను వ్రాసిన **'శ్రీవిద్య'** పుస్తకం చూడండి.

# 8. బహ్వృచోపనిషత్తు

ఇది ఋగ్వేదంలోది. ఇందులో అమ్మవారే పరమేశ్వరి అని చెబుతున్నారు. సృష్టికి ముందు కాలంలో ఆ దేవి ఒక్కతే ఉండేది. ఆమెయే ఈ బ్రహ్మాండాన్ని సృష్టించింది. ఆమెయే కామకళ, శృంగారకళ. ఆమె నుంచే బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మరుద్గణాలు, గంధర్వులు, అప్సరసలు, కిన్నెరలు, కింపురుషులు, సిద్ధులు, సాధ్యులు, భోగ్యము, భోగము అన్నీ ఆవిర్భవించినాయి. ఆమెనుంచే సకల జీవకోటి, అండజాలు, స్వేదజాలు, ఉద్భిజాలు, జారజాలు, సకలజీవులు, స్థావరాలు, జంగమాలు, సకల మానవకోటి ఆవిర్భవించింది. ఆవిడే పరాశక్తి. ఆవిడే శాంభవీవిద్య, హాదివిద్య, కాదివిద్య, సాదివిద్య. సాదివిద్య అంటే అనాదిగాఉన్న విద్య. స+ఆది విద్య. సాదివిద్య. ఆవిడే పురత్రయము, దేహత్రయముల యందు లోపలా బయటా అంతటా వ్యాపించి ఉన్నది. దేశకాల వస్తు సంబంధమువల్ల ఆ మహాత్రిపురసుందరియే 'ప్రత్యక్చితి' అవుతున్నది.

ఆమెయే ఆత్మ. ఆమెకన్న భిన్నమైనదంతా అనాత్మ. అసత్యము. కాబట్టే ఆమె బ్రహ్మసంవిత్తి, భావాభావకళా వినిర్ముక్త, చిద్విద్య, సచ్చిదానందలహరి, మహాత్రిపుర సుందరి అనబడుతుంది. అన్నింటియందు ఉండే అంతర్యామి. అన్నింటియందు వెలుపలా లోపలా కూడా ప్రకాశిస్తుంది. ఆమెయే ప్రియాన్ని, ఆనందాన్ని చేకూర్చేది. ఈ సకలము ఆ మహాత్రిపురసుందరియే. నువ్వు, నేను, ఈ జగత్తు, సకల దేవతాగణాలు, అంతా ఆ మహాత్రిపురసుందరియే. లలితాఖ్యమైన వస్తువొక్కటే సత్యము, నిత్యము, శాశ్వతము. అది అద్వితీయము, అఖండము. ఆ బ్రహ్మయొక్క పరతత్త్వమొక్కటే మిగిలి ఉండేది.

ప్రజ్ఞానంబ్రహ్మ అని, అహంబ్రహ్మాస్మి అని, తత్త్వమసి అని, అయమాత్మా బ్రహ్మ అని, సోహమస్మి అని పిలువబడే ఆమెయే మహాషోడశి, శ్రీవిద్య, పంచదశాక్షరి, మహాత్రిపురసుందరి, బాలాంబిక, బగళ, మాతంగి, స్వయంవర కళ్యాణి, భువనేశ్వరి, చాముండ, వారాహి, తిరస్కరిణి, శుకశ్యామల, లఘుశ్యామల, అశ్వారూఢ, ప్రత్యంగిర, ధూమావతి, సావిత్రి, గాయత్రి, సరస్వతి, బ్రహ్మానందకళ అనబడుచున్నది. దేనియందైతే సర్వదేవతలు ఉన్నారో, దానియందే ఋక్కులు కూడా ఉన్నాయి. దీనిని ఎరుగను అనుకునేవాడే దీనిని పూర్తిగా తెలిసినవాడు. **అతడికి పునర్జన్మ ఉండదు.**

# 9. దేవీ ఉపనిషత్తు

ఇది అధర్వణవేదంలోది. ఇందులో చండీమంత్రము, దుర్గామంత్రము చెబుతున్నారు. ఒకసారి దేవతలంతా పరమేశ్వరి దగ్గరకు వెళ్ళి "ఓ మహాదేవీ ! నీవెవరవు." అని అడిగారు. అప్పుడు ఆమె "నేను పరబ్రహ్మస్వరూపిణిని. నా వల్లనే ప్రకృతి పురుషులతో కూడిన ఈ జగత్తు ఆవిర్భవించింది. శూన్యము, అశూన్యము, ఆనందము, అనానందము నేనే. విజ్ఞానము నేనే అవిజ్ఞానము నేనే. తెలియదగినది అయిన బ్రహ్మ, అబ్రహ్మ కూడా నేనే. పంచభూతాలు నేనే. అపంచభూతాలు నేనే. అఖిలజగత్తును నేనే. వేదాన్ని నేనే అవేదాన్ని నేనే. విద్యను నేనే. అవిద్యనూ నేనే, అజను నేనే, అనజనూ నేనే. పైభాగము, క్రిందిభాగము, మధ్యభాగము నేనే, నేను వసువులతోను, రుద్రులతోను, ఆదిత్యులతోను, విశ్వేదేవతలతోను సంచరిస్తాను. మిత్రావరణులు ఇద్దరినీ భరిస్తాను. ఇంద్రాగ్నులను, అశ్వనీ దేవతలను భరిస్తాను. సోముడు, త్వష్ట, పూష, భగుడు, విష్ణువు, రుద్రుడు, వీరందరినీ ధరిస్తాను. యాగంచేసిన యజమానికోసం ధనాన్ని ధరిస్తాను. నా గురించి తెలుసుకున్నవాడు దేవీపదము పొందుతాడు." అని చెప్పింది. ఆ మాటలు విన్న దేవతలు **నమోదేవ్యై మహాదేవ్యై శివాయై సతతం నమః । నమః ప్రకృత్యై భద్రాయై నియతాః ప్రణతాః స్మృతామ్** దేవీ నీకు నమస్కారము. ఓ మహాదేవీ! నీకు నమస్కారము, శివా! నీకు ఎల్లప్పుడూ నమస్కారము, ప్రకృతీ, భద్రా నీకు అనేక నమస్కారాలు. అంటూ పరిపరివిధాల ఆ దేవికి నమస్కరించారు.

"దుర్గలలో ప్రశస్తమైన దానిని శరణు కోరుతున్నాను. అగ్నితో

సమానమైన వర్ణము గలది. తన వేడిచేత శత్రువులను మండింపచేసేది, పరమాత్మచేత చూడబడినది. కర్మలకు ఫలమైన స్వర్గము, ధనధాన్యాలు, భోగభాగ్యాలు, పశువులు, పుత్రులు మొదలైన వాటికోసం ఉపాసకులచే సేవించబడేది, అయిన ఆ దేవిని శరణు గోరుతున్నాను. ఆమె నా తమోగుణాన్ని నశింపచేయుగాక." ఇలా చెప్పి దేవతలు వాగ్దేవిని చూసి, విశ్వరూపులు, ప్రాణులు, స్తుతించినట్లుగా, వారు కోరినట్లుగా ఆ దేవి మాకు అన్నము, బలము ఎక్కువగా ఇచ్చునదై, మా సమీపమున ఉండుగాక. కాళరాత్రి, బ్రహ్మస్తుత, వైష్ణవి, కుమారస్వామితల్లి, సరస్వతి, అదితి, దాక్షాయణి మొదలైన పేర్లతో పిలువబడే శివునిభార్య అయిన శివకు నమస్కరిస్తున్నాము. మహాలక్ష్మి, సర్వసిద్ధి అయిన దేవి మాకు ప్రేరకురాలు అగుగాక. కాముడు, యోని, కమల, వజ్రపాణి, కుమారస్వామి, వాయువు, మేఘము, ఇంద్రుడు, గుహుడు వీరంతా ఆ దేవియొక్క మాయచేతనే ఆవిర్భవించారు. ఆమెయే విశ్వమాత, ఆదిశక్తి. ఆమెయే ఆత్మశక్తి, విశ్వమోహిని. పాశము అంకుశము ధనుర్బాణాలు ధరించినది. ఈ విషయాన్ని తెలుసుకున్నవాడు దుః ఖాల నుంచి తరిస్తాడు. **ఇక్కడ కామయోనిః అన్న చోట పంచదశీ మహామంత్రం చెప్పబడింది.**

ఓ భగవతీ ! నీకు నమస్కారము. తల్లీ మమ్ము రక్షించవలసినది. అష్టవసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, విశ్వేదేవతలు, ఆమెయే. యాతుధానులు (రాక్షసులు), అసురులు, రాక్షసులు, యక్షులు, పిశాచులు, సిద్ధులు, సత్త్వరజస్తమోగుణాలు ఆమెయే. ఇంద్రుడు, ప్రజాపతి, మనువులు ఆమెయే. నక్షత్రాలు, గ్రహాలు, జ్యోతిస్సులు, కల, కాష్ఠ మొదలైన కాలవిభాగాలు; ఆమెయే నిత్యము ఆమెకు నేను

నమస్కరిస్తాను. తాపహారిణి, భుక్తిముక్తిప్రదాయిని, అనంత, విజయ అయిన ఆ దేవికి నమస్కారము. ఆకాశబీజమైన 'హ'కారము. అగ్ని బీజమైన 'ర'కారము, లక్ష్మీ బీజమైన 'ఈ'కారము. బిందువులతో కలసిన **'హ్రీం' ఆ దేవి యొక్క బీజము.** దీనిని యతీశ్వరులు ధ్యానం చేస్తారు. వాఙ్మయి, బ్రహ్మ, భూమి, షష్ఠవక్రము, సూర్యుడు, వాముడు, శ్రోత్రము, బిందువు, సంయత్యష్టము తృతీయము, నారాయణునితో కూడినది. వాయువు అధరముతో కూడినది, విచ్చేయునది. ఇది నవార్ణవ మంత్రము. **'ఐం హ్రీం క్లీం చాముండాయైవిచ్చే'** ఇదే చండీమంత్రము. ఇది సర్వశుభాలను, మహదానందాన్ని ఇస్తుంది.

హృదయ పద్మమునందున్నది, బాలభానునితో సమానమైన కాంతిగలది, పాశాంకుశములు ధరించినది, సౌమ్య, వరద, అభయ హస్తములు గలది, త్రినేత్ర, రక్తవస్త్ర భక్తుల కోరికలు తీర్చేది, అయిన దేవిని సేవింతును. ఓ దేవీ ! నీకు నమస్కరిస్తున్నాను. మహాభయనాశిని, మహాదుర్గప్రశమని, మహాకారుణ్యరూపిణి, అయిన నీరూపాన్ని బ్రహ్మాదిదేవతలు కూడా తెలుసుకోలేరు. అందుకే నీవు అజ్ఞేయవు. నీకు అంతములేదు. అనంతవు. నీయొక్క జ్ఞానము మాకు లభించదు. అందుకే అలక్ష్యవు. నీకు జననములేదు అందుకే అజవు. తల్లీ! నువ్వు తప్పించి ఈ జగత్తులో ఏదీలేదు. అందుకే 'ఏక' అనబడతావు. ఈ జగత్తంతా వివిధ రూపాలతో నిండి ఉన్నావు. అందుకే అనేక అనబడుతున్నావు. మంత్రాలకు మాతృక అయిన ఓ దేవీ! శబ్దరూపిణీ, చిన్మయాతీతా, నీవే దుర్గవు. దుర్గమమైన కష్టాల నుంచి మమ్మెలను రక్షించేదానవు. అటువంటి దుర్గాస్వరూపిణి అయిన నీకు నమస్కరిస్తున్నాను. **దుం దుర్గాయై నమః** । ఓ తల్లీ ! దుర్గా ! మా

కష్టాలను హరింపచేయుము..

దుర్గకు, దురాచారాలను నాశనం చేసే దానికి, సంసారార్ణవతారిణికి నమస్కరిస్తున్నాను. అధర్వశీర్షమైన దేవీ ఉపనిషత్తును పదిసార్లు చదివితే చాలు, కష్టాలన్నీ తొలగిపోతాయి. 108సార్లు చదివితే కార్యసిద్ధి. రాత్రులందు, సంధ్యవేళల యందు చదివితే వాక్సిద్ధి కలుగుతుంది. మంగళవారం, అశ్వనీనక్షత్రంలో దేవి సన్నిధిన ఈ ఉపనిషత్తు చదివితే మహామృత్యువు దరిచేరదు.

# 10. సౌభాగ్యలక్ష్మీ ఉపనిషత్తు

ఋగ్వేదానికి సంబంధించినది ఈ ఉపనిషత్తు. ఇందులో శ్రీసూక్తపారాయణ విధానం చెబుతున్నారు. ఇది మొత్తం పదిహేను ఋక్కులు లేదా మంత్రాల సమూహం **సిరిసంపదలు ధనధాన్యాలు కావాలంటే శ్రీసూక్తం పారాయణ చెయ్యాలి** అని గతంలో ఋక్ సంహితలో చెప్పుకున్నాం. ఏదైనా ఒక మంత్రం జపం చెయ్యాలి అన్నా, మాలామంత్రాలు, లలితాసహస్రం, విష్ణుసహస్రం లాంటివి పారాయణ చెయ్యాలి అన్నా దానికి ఋషి, ఛందస్సు, దేవత, శక్తి, బీజం, కీలకం, వీటిని షడంగాలు అంటారు. ఇవి కావాలి. తరువాత న్యాసం చెప్పాలి. ఆ తరువాతే మంత్రపారాయణ జరగాలి. ఇప్పుడు శ్రీసూక్తం పారాయణచెయ్యాలంటే దానికి కూడా షడంగాలుకావాలి. ఆ వివరాలతో పారాయణ ఎలాచెయ్యాలి? అంటే శ్రీసూక్తం మొత్తం పారాయణ చెయ్యాలా? లేకపోతే అందులో ఉన్న ఒక్కొక్క మంత్రం విడివిడిగా పారాయణ చెయ్యాలా? ఈ విషయాలన్నీ వివరంగా చెబుతున్నది ఈ ఉపనిషత్తు.

ఒకసారి దేవతలంతా శ్రీమన్నారాయణుడి దగ్గరకువెళ్ళి “స్వామీ! శ్రీసూక్తాన్ని ఎలా పారాయణ చెయ్యాలి? శ్రీసూక్తానికి దేవత ఎవరు. ఋషి, ఛందస్సు ఇత్యాది వివరాలన్నీ చెప్పవలసిందని అడిగారు. అప్పుడు శ్రీమన్నారాయణుడు చెబుతున్నాడు.

ఓ దేవతలారా! చతుర్భుజ అయిన లక్ష్మీదేవిని ‘హిరణ్యవర్ణాం హరిణీం’ మొదలైన శ్రీసూక్తంలోని పదిహేనుఋక్కులతో ధ్యానంచెయ్యండి. ముందుగా శ్రీసూక్తానికి

**ఋషులు** – ఆనంద, కర్దమ, చిక్లీత, ఇందిరాసుతులు

ఇక **ఛందస్సు :**

హిరణ్యవర్ణాం మొదలైన మొదటి మూడు ఋక్కులకు అనుష్టుప్ ఛందస్సు.

కాంసోస్మితాం-నాల్గవ ఋక్కు దీనికి - బృహతీ ఛందస్సు

5,6 మంత్రాలకు - త్రిష్టుప్ ఛందస్సు

7-14 మంత్రాలకు - అనుష్టుప్ ఛందస్సు

15వ మంత్రానికి - ప్రస్తారపంక్తి ఛందస్సు

శ్రీసూక్తానికి - అగ్నిదేవత

హిరణ్యవర్ణాం - బీజం

తాంమ ఆవహ జాతవేద - శక్తి

కీర్తిమృద్ధిం దధాతుమే - కీలకం. జపే వినియోగః

హిరణ్యవర్ణాయ - అంగుష్ఠాభ్యాం నమః

హరిణ్యై - తర్జనీభ్యాం నమః

సువర్ణరజతస్రజాయై - మధ్యమాభ్యాం నమః

చంద్రాయై - అనామికాభ్యాం నమః

హిరణ్మయై - కనిష్టికాభ్యాం నమః

లక్ష్మై - కరతలకరపృష్టాభ్యాం నమః

ఇలాగే హృదయాది న్యాసము కూడా చెయ్యాలి. భూర్భువస్సువరోమితి దిగ్బంధః

**ధ్యానమ్ :**

**అరుణకమల సంస్థాతద్రజః పుంజవర్ణా**

**కరకమల దృతేష్టాభీతి యుగ్మాంబుజాతా**

**మణిమకుట విచిత్రాలంకృతిః పద్మమాలా**

**భవతు భువనమాతా సంతతం శ్రీః శ్రియై నమః ॥**

ధ్యానం చేసిన తరువాత శ్రీసూక్తానికి యంత్రం వేసుకోవాలి. ఆ యంత్రం ఎలా వెయ్యాలి అనే విషయాన్ని ఇక్కడ వివరించారు. ప్రతివారు ఆ యంత్రం గీసుకోలేరు కాబట్టి యంత్రం ఎలాగియ్యాలో వివరణ ఇవ్వకుండా యంత్రాన్ని ఇక్కడ ఇచ్చేస్తున్నాను.

యంత్రాన్ని లమిత్యాది పంచోపచారాలతో పూజించి, శ్రీసూక్తాన్ని జపం చెయ్యాలి. ఇలా పారాయణ చేసిన వారికి సిరిసంపదలు ధనధాన్యాలు పుష్కలంగా లభిస్తాయి. శ్రీసూక్తానికి శంకరాచార్యులవారు, విద్యారణ్యుల వారు కూడా భాష్యం వ్రాశారు. విద్యారణ్యుడి అసలు పేరు మాధవుడు. ఈయన గొప్ప పండితుడు. కాని చాలా బీదవాడు. అప్పుడు శ్రీసూక్తాన్ని లక్ష్మీమంత్రంతోను

**ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీద ప్రసీద**

**శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః**

**దుర్గేస్మృతా హరసి భీతి మశేష జంతోః**

**స్వస్థైస్మృతా మతిమతీవ శుభాం దదాసి**

**హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణ రజతస్రజామ్**

**చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ ॥**

**దారిద్ర్య దుఃఖ భయహారిణి కాత్వదన్యా**

**సర్వోపకార కరణాయ దయార్ద్ర చిత్తా ।**

**ఓం శ్రీం హ్రీం శ్రీం కమలేకమలాలయే ప్రసీద ప్రసీద**

**శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః ॥**

ఇది సంపుటీకరణం. ఇందులోని శ్రీసూక్త మంత్రాన్ని మారుస్తూ పారాయణ చెయ్యాలి. పారాయణ చేసేటప్పుడు ఒకటి దగ్గర నుంచి పదహారు ఋక్కులదాకా, పదహారవ ఋక్కు నుంచి ఒకటవ ఋక్కుదాకా, మళ్ళీ ఒకటి నుంచి పదహారవ ఋక్కు దాకా. ఇలా మూడుసార్లు పారాయణ చేస్తే ఒక ఆ వృత్తి అవుతుంది. ఒక ఆ వృత్తి చెయ్యటానికి గంట సమయం పడుతుంది. మీ వీలును బట్టి రోజుకు ఎన్ని ఆ వృత్తులు అనేది నిర్ణయించుకోవాలి. అమావాస్య, పౌర్ణమి, శుక్రవారం, ఏకాదశి రోజులలో వీలైనంత ఎక్కువ చెయ్యండి. పారాయణకు మంచి ఫలితం రావాలంటే మారేడుచెట్టుకింద కూర్చుని పారాయణ చెయ్యండి. మారేడు మొక్కలు కుండీలో పెట్టి నర్సరీలలో అమ్ముతున్నారు. ఆ మొక్క తెచ్చుకుని పారాయణ సమయంలో దగ్గర పెట్టుకుంటే కొంతవరకు సరిపోతుంది.

దేవాలయంలోను, యాగశాలలోను కూర్చుని పారాయణ చెయ్యటం రెండవ పక్షం. పారాయణ చేసేటప్పుడు పడమర వైపు తిరిగి కూర్చుని పారాయణ చెయ్యండి. ఆసనం కంబళి. నివేదన పాలకోవా, కలాకన్. దీక్షాసమయంలో అబద్ధాలాడటం, ఇతరులకు హానికలిగించటం, మాంసము తినటం మద్యము త్రాగటం లాంటివి నిషేధిస్తే మంత్రం త్వరగా సిద్ధిస్తుంది. మీకు ఏదైనా అనుమానం వస్తే నాకు ఫోన్ చెయ్యండి.

విద్యారణ్యుల వారు సంపుటిచేసి సంపుటితశ్రీసూక్తము అనే పేరుతో పారాయణ చేశారు. లక్ష్మీదేవి ప్రత్యక్షమైంది. ధనం కావాలి అని అడిగారు. ఈ జన్మలో నీకు ధనంరాదు. మరుజన్మలో వస్తుంది. అనిచెప్పింది. ఆలోచించాడు. మాధవుడు. సన్యాసం తీసుకున్నాడు. సన్యాసము అనేది శాస్త్రప్రకారము ఇంకొక జన్మ. ఇప్పుడు లక్ష్మీదేవిని

ప్రార్థన చేసి 'అమ్మా ఇప్పుడు నాకు ధనం రావాలి కదా! అన్నాడు. అలాగే అంది లక్ష్మీదేవి. ఒకరోజున పొలంలో తవ్వుతుంటే అందులో బంగారు నాణాలు రాశులుగా దొరికినాయి. ఆ సమయంలోనే హరిహరరాయలు, బుక్కరాయలు కాకతీయ సామ్రాజ్యంనుంచి పారిపోయివస్తున్నారు. వాళ్ళని చేరదీశారు. వారి దగ్గర ధనం ఉంది. వారి ధనము, తనకు లభించిన ధనము మొత్తం కలిపి విజయనగర సామ్రాజ్యాన్ని నిర్మించాడు మాధవ విద్యారణ్యుడు.

**సంపుటిత శ్రీసూక్తం పారాయణ చేస్తే ఒక సామ్రాజ్యాన్ని నిర్మించే ధనం దొరికింది.** అని గుర్తుంచుకోండి. కాబట్టి మీరుకూడా ఈ సంపుటిత శ్రీసూక్తం పారాయణ చేసి ఫలితం పొందండి. నెల్లూరుజిల్లా పెనుశిలకోన మాతాజీ అమ్మ **కరుణామయి ఆశ్రమంలో** ప్రతిరోజు సంపుటిత శ్రీసూక్తం పారాయణ చేయిస్తారు. దీనికి సంబంధించిన పుస్తకాలు విజయవాడ 'శివకామేశ్వరి గ్రంథమాల'లో దొరుకుతాయి. పుస్తకం ఖరీదు కూడా పదిరూపాయల ప్రాంతంలో ఉంటుంది.

శ్రీసూక్తంలో ఉన్న పదిహేను ఋక్కులను విడివిడిగా కూడా జపం చెయ్యవచ్చు. ఇందులో ఏదైనా అనుమానం ఉంటే నాకు ఫోన్ చెయ్యండి. ఫోన్ నెంబరు : 0866-2530672, సెల్ : 9866820574.

శ్రీసూక్తం పారాయణ చేసి అవకాశం వినియోగించుకోండి. సిరిసంపదలు పుష్కలంగా పొందండి.

# 11. త్రిపురతాపినీ ఉపనిషత్తు

ఈ ఉపనిషత్తు అథర్వణ వేదానికి సంబంధించినది. ఇందులో మొత్తం ఐదు అధ్యాయాలు. ఇరవై తొమ్మిది మంత్రాలు ఉన్నాయి. మొదటి అధ్యాయంలో గాయత్రీ మహామంత్రానికీ పంచదశి మహామంత్రానికి తేడాలేదు. రెండూ ఒక్కటే అనే విషయం నిరూపించబడుతోంది.

## 1. గాయత్ర్యర్థము

**గయాన్ ప్రాణాన్ త్రాయత ఇతి గాయత్రీ**

ప్రాణములను రక్షించునది గాయత్రి అని ఐతరేయ బ్రాహ్మణంలో చెప్పబడింది. గయలు అంటే ప్రాణాలు అని అర్ధం.

**'త ద్యత్ప్రాణా న్స్త్రాయతే తద్గాయత్రీ'** ప్రాణరక్షణ చేయునది గాయత్రి అని బృహదారణ్యకోపనిషత్తు వివరించింది. **'తస్మాద్గాయంతం త్రాయతే యతః'** గానము చేయువానిని రక్షించునది. **'గీయతే తత్త్వమనయా గాయత్రీతి'** అని శంకర భాష్యం.

గాయత్రీ మంత్రం రెండు రకాలుగా ఉన్నది.

1. బ్రాహ్మణులకు ఉపనయన కాలంలో ఉపదేశించేది.

2. వేదాలలో నిగూఢమైనది. ఇదే పంచదశీ మహామంత్రము.

అందుచేతనే గాయత్రీమంత్రం బ్రాహ్మణులకోసం ఏర్పడగా పంచదశీ మహామంత్రం అన్ని వర్ణాలవారి కోసం ఏర్పడింది అన్నాడు అగస్త్యమహర్షి. ఇంకా చెప్పాలి అంటే గాయత్రీమంత్రము, పంచదశీ మహామంత్రము రెండూ ఒక్కటే.

ఈ రెండింటి అర్థం కూడా ఒక్కటే.

శరీరాదులను రక్షించటంచేత గాయత్రి అని, తేజస్స్వరూపమవటంచేత సావిత్రి అని, వాగ్రూపం కావటంచేత సరస్వతి అని చెప్పబడుతోంది. **సవితృ ద్యోతనా త్త్వైవ సావిత్రీ పరికీర్తితా ।** ప్రపంచాన్ని సృజించి ప్రకాశింపచేస్తుంది కాబట్టి సావిత్రి అనబడుతోంది. **జాతః ప్రసవితృత్వాన్ వాగ్రూపత్వా త్సరస్వతీ** వాగ్రూపము గలది కాబట్టి సరస్వతి. ఇరవైనాలుగు అక్షరాలతో ఏర్పడ్డ ఛందస్సే గాయత్రి. ఛందస్సులు అనేక రకాలున్నాయి. కాని బ్రహ్మజ్ఞానానికి ద్వారం గాయత్రీఛందస్సు, ఆ గాయత్రియే సోమరసాన్నితెచ్చి దేవతలకిచ్చింది. ఛాందోగ్యోపనిషత్తులో.

ఒకసారి దేవతలంతా గాయత్రి, త్రిష్టప్, జగతి ఛందస్సులను సోమాన్ని తీసుకురమ్మని పంపారు. వీటిలో త్రిష్టప్, జగతి ఛందస్సులు సోమాన్ని తేలేక తిరిగి వచ్చేశాయి. అంతేకాకుండా తిరిగివస్తూ త్రోవలో అలసట కారణంగా తమలోని కొన్ని అక్షరాలను వదలివేశాయి. గాయత్రీమంత్రం సోమందగ్గరకు వెళ్ళి, దాన్ని రక్షించేవారందరినీ ఓడించి సోమాన్నితెచ్చి దేవతలకిచ్చింది. తిరిగి వచ్చేటప్పుడు త్రోవలో త్రిష్టప్, జగతి, ఛందస్సులు వదలివేసిన అక్షరాలను కూడా తీసుకువచ్చింది. ఆ కారణంగా గాయత్రీ ఛందస్సు అన్నింటికన్నా గొప్పదిఅయింది. అంతేకాకుండా ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలము మూడింటిలోనూ వ్యాప్తమై ఉన్నది. బ్రాహ్మణునికి అత్యంతావశ్యకమవటంచేత దానిగౌరవము ఇనుమడించింది. అందుచేతనే గాయత్రిని ఉపేక్షించినవాడు దేన్నీ పొందలేడు.

గాయత్రీ ఛందస్సులో 24 అక్షరాలు ఒక్కొక్క పాదానికి ఎనిమిది చొప్పున మూడు పాదాలుగా ఉన్నాయి. గాయత్రీ మంత్రానుష్టానము అంటే బ్రహ్మవిద్య ఛాందోగ్యోపనిషత్తులో

**సైషా చతుష్పదా షడ్విధా గాయత్రీ తదేతదృచాభ్య సూక్తం**

సర్వభూతాత్మకమై పరబ్రహ్మోపాసన విషయంగా ప్రసిద్ధిమైన గాయత్రీ స్వరూపము నాలుగు పాదాలు కలిగినది. వాక్కు, భూత, పృథివి, శరీర, హృదయ, ప్రాణములు అనే ఆరు విధాలయిన స్వరూపములు కలది అయి ఉన్నది. ఈ రకంగా నాలుగు పాదాలు కలిగి, ఆరు రకాలుగా ప్రసిద్ధమైన పరబ్రహ్మ స్వరూపాన్ని గాయత్రి అనే దృష్టితో ఉపాసన చెయ్యాలని చెప్పబడింది.

గాయత్రీ మంత్రానికి 24 అక్షరాలున్నాయి అవి నాలుగు పాదాలుగా ఉన్నాయి అన్నారు. అంటే పాదానికి ఆరు అక్షరాలు ఉన్నాయని చెబుతోంది ఛాందోగ్యోపనిషత్తు.

ఇతర ఛందస్సులలో ఇంకా ఎక్కువ అక్షరాలున్నాయి. కాని వాటన్నింటిలోకి గాయత్రియే శ్రేష్టమైనది. స్థావరజంగమాత్మకమైన ప్రాణిసమూహ మంతా గాయత్రియే. వాక్కు-గాయత్రి, సమస్తప్రాణాలు-గాయత్రి, వాగ్రూపమైన గాయత్రి అందరి పేర్లనూ ఉచ్చరిస్తోంది. కాబట్టి గాయత్రి అందరిపేర్లలోనూ ఉన్నది. ఈ రకంగా ప్రాణిజాతి అంతా గాయత్రియే. గాయత్రి అంటే ప్రాణులను రక్షించేది అనిఅర్థం. ఈ లక్షణాలుగల గాయత్రి ఈపృథివే తప్ప వేరేకాదు. చరాచరాలన్నీ ఈ భూమిలోనే ఉన్నాయి. అందుచేతనే చరాచర జగత్తునంతటనూ గానంచేస్తూ - పాడుతూ, త్రాణంచేస్తూ - కాపాడుతూ ఉండే గాయత్రియే ఈ భూమి.

పృథివీరూపమైన గాయత్రి శరీరంలోఉండే పంచభూతాలు, ఇంద్రియాల సమూహము ఒక్కటే. పురుషుని శరీరరూపమైన గాయత్రి, పురుషుని హృదయ కమలంలో ఉండే పురుషుడు ఇద్దరూ ఒకటే. ఆ పురుషునిలోనే అంటే గాయత్రిలోనే ప్రాణాలు ప్రతిష్ఠితమై ఉన్నాయి అని చెప్పబడింది.

బృహదారణ్యకోపనిషత్తులో గాయత్ర్యోపాసన వివరిస్తూ "ఉపనిషత్తులో చెప్పిన **'భూమి, అంతరిక్షం, ద్యౌః'** ఈ మూడు పదాల్లోనూ మొత్తం ఎనిమిది అక్షరాలున్నాయి. ద్యౌః అనే పదంలో దకార యకారాలను రెండు అక్షరాలుగా లెక్కపెట్టాలి. ఇవి మూడులోకాల పేర్లు. గాయత్రీమంత్రానికి పాదానికి ఎనిమిది అక్షరాలున్నాయి. మూడుపాదాలున్నాయి. కాబట్టి మూడులోకాలు మొదటి పాదం. ఈ రకంగా మూడు లోకాలను గురించి తెలుసుకున్నవాడు ముల్లోకాలను జయిస్తాడు.

ఉపనిషత్తులో చెప్పిన **'ఋచ యజూంసి సామాని'** అనే మూడు పదాల్లోనూ ఎనిమిది అక్షరాలున్నాయి. ఇవి గాయత్రికి రెండోపాదం. అంటే వేదాలు రెండవ పాదమన్నమాట. ఈ విషయం తెలుసుకున్నవాడు త్రయీవిద్య అనగా వేదవిద్యవల్ల వచ్చే ఫలితాన్ని పొందుతాడు.

మంత్రంలో చెప్పిన **'ప్రాణ అపాన వ్యానం'** అనే దాంట్లోని ఎనిమిది అక్షరాలు గాయత్రికి మూడవపాదం. ఇక్కడ వ్యా అనే అక్షరంలో వకార యకారాలను రెండు అక్షరాలుగా లెక్కపెట్టాలి. ఈ విషయం తెలుసుకున్నవాడు సమస్తాన్ని పొందుతాడు.

ఉపనిషత్ మంత్రంలో **'తురీయ దర్శితం పదం'** అనేది నాల్గవ

పాదము 'దర్శితపదం' అనే పదానికి ఆదిత్యమండలాంతర్గతుడైన పురుషుడు కనిపిస్తున్నాడని అర్థం. అంటే అన్ని లోకాలకు పైన ఆధిపత్యం స్థాపించి ప్రకాశిస్తున్నాడు. ఈ రకంగా గాయత్రిలో నాల్గవపాదం తెలుసుకున్నవాడు కీర్తితో ప్రకాశిస్తాడు.

తురీయపదం సత్యంలో ప్రతిష్టితమై ఉన్నది. నేత్రమే సత్యం. ఏదైనా ఒక విషయాన్ని నేను చూశాను. నేను విన్నాను అని చెప్పినప్పుడు చూసినదాన్నే నమ్మటం జరుగుతుంది. అందుచేతనే నేత్రం సత్యం. తురీయపాదానికి ఆశ్రయమైన సత్యం బలంలో ప్రతిష్ఠితమై ఉన్నది. అందుకనే సత్యంకన్న బలం ప్రకాశమైనది. ప్రాణమే ఆ బలం. త్రిపదా గాయత్రి ప్రాణాలను రక్షిస్తుంది. గాయత్రి ప్రాణంలో ప్రతిష్ఠితమై ఉన్నది. వాగాది ప్రాణాలను రక్షించేది గాయత్రి. గానము చేసేవాడిని రక్షించేది గాయత్రి. ఉపాసన చేసేవాణ్ణి రక్షించేది గాయత్రి.

ఉపనయన సమయంలో వటువుకు త్రిపదగాయత్రిని ఉపదేశిస్తారు. ఇది బ్రహ్మవిద్య.

అస్యశ్రీ గాయత్రీ మహామంత్రస్య విశ్వామిత్రఋషిః । గాయత్రీఛందః । శ్రీ సవితా దేవతా । యం బీజం । ఈం శక్తిః । ఐం కీలకం । జపే వినియోగః ॥

**న్యాసము** : ఓం తత్సవితుః బ్రహ్మాత్మనే । ధీమహి సత్యాత్మనే ।
వరేణ్యం విష్ణ్వాత్మనే । ధియో యోనః జ్ఞానాత్మనే ।
భర్గోదేవస్య రుద్రాత్మనే । ప్రచోదయాత్ సర్వాత్మనే ॥

**ధ్యానము** : ముక్తావిద్రుమహేమనీల ధవళచ్ఛాయై ర్ముఖై స్త్రీక్షణైః
యుక్తా మిందునిబద్ధరత్న మకుటాం తత్వార్థ వర్ణాత్మికాం ।
గాయత్రీం వరదాభయాం కుశకరా శ్శుభ్రం కపాలం గదాం

శంఖం చక్ర మథారవిందయుగళం హస్తై ర్వహంతీం భజే ॥

**మంత్రము** : ఓం భూర్భువస్సువః । తత్సవితుర్వరేణ్యం । భర్గోదేవస్య ధీమహి।

ధియోయోనః ప్రచోదయాత్ ॥

భూం, భువః, సువః అనే వ్యాహృతులు మిగిలిన మూడు పాదాలు మంత్రం.

ఇది త్రిపద గాయత్రి. అయితే కొన్ని శాఖలవారు ఇతర ఛందస్సులో ఉండే గాయత్రిని ఉపాసిస్తారు. ఇవి కేవలం కామ్యమంత్రాలు.

**తత్సవితుర్వృణీ మహే । వయం దేవస్య భోజనం । శ్రేష్ఠం వై సర్వధాతమమ్। తురంగ భగస్య ధీమహి ॥**

వాక్కే అనుష్టుప్. వాక్కే శరీరంలో ఉండే సరస్వతి. కాబట్టి వాక్స్వరూపమైన సరస్వతిని ఉపదేశిస్తున్నామని వీరికి నమ్మకం.

గాయత్రీ ఉపాసకుడు ఆవులు, గుర్రాలు, భూమి దానంగా తీసుకున్నా దానివల్ల కలిగే దోషం మొదటి పాదాన్ని జపం చేస్తే పోతుంది.

వేదవిద్యతో సమానంగా దానం తీసుకున్నా ఆ దానం వల్లవచ్చే పాపం మంత్రంలోని రెండవ పాదాన్ని జపం చేస్తే పోతుంది.

"లోకంలో ఉన్న ప్రాణాలన్నీ దానం తీసుకున్నా, ఆ పాపం మూడవ పాదాన్ని జపంచేస్తే పోతుంది. అంటే గాయత్రి మహిమ చాలా గొప్పది" అని చెప్పబడింది.

**శుద్ధ గాయత్రీ ప్రత్యక్షరం బ్రహ్మైక్య బోధితా ।**

శుద్ధగాయత్రిలోని ప్రతి అక్షరము పరబ్రహ్మాను గురించే బోధిస్తున్నది. అంటే జీవాత్మ పరమాత్మల ఐక్యాన్ని వివరిస్తుంది.

**మహామంత్రస్య చాపస్య స్థానే స్థానే పదే పదే ।**
**గూఢో రహస్య గర్భేన స్తో ప దేశ సముచ్ఛయః ॥**

గాయత్రీ మహామంత్రంలోని ప్రతిఅక్షరంలోనూ, ప్రతిస్థానమందు మహా రహస్యమున్నది.

గాయత్రీ మంత్రాన్ని ఉపాసన చేసేవారికి ఇహపరసుఖాలు పూర్తిగా లభిస్తాయి. హృదయపద్మమందు అధిష్టించిఉన్న గాయత్రిని ఉపాసనచేసేవారు ధర్మాధర్మ విముక్తులై ముక్తిని పొందుతారు.

గాయత్రీ మంత్రానికి 24 అక్షరాలున్నాయి. ప్రజాపతి సంవత్సర స్వరూపుడు. అతడే కాలస్వరూపుడు. సంవత్సరానికి 12 మాసాలు. మాసానికి రెండు పక్షాలు. ఈ రకంగా 24 పక్షాలుంటాయి. ఆ 24 పక్షాలే గాయత్రీ మంత్రంలోని 24 అక్షరాలు. సంవత్సరానికి మూడుకాలాలు.

1. వేసవికాలము, 2. వర్షాకాలము 3. శీతాకాలము. వీటి స్వరూపంగానే గాయత్రీమంత్రము మూడుపాదాలుగా ఉన్నది. మంత్రంలోని మూడుపాదాలు 1.భూలోకం 2. భువర్లోకం 3. సువర్లోకాలకు ప్రతీక. అందుచేతనే ఆ పాదాలను లోకాలకు అన్వయించి ధ్యానించాలి.

**1. మొదటి పాదము :** భూలోక సమన్వయము. భౌతికమైన సృష్టి రూపంలో ధ్యానం చెయ్యాలి.

**2. రెండవ పాదము :** భువర్లోక సమన్వయము. అంటే

శక్తిమయాత్మక రూపంలో ధ్యానం చెయ్యాలి.

**3. మూడవ పాదము :** సువర్లోక సమన్వయము. అంటే ప్రజ్ఞామయాత్మక దృష్టితో ధ్యానం చెయ్యాలి.

ఈ విధంగా ధ్యానం చేసేటప్పుడు ముందు ద్రవ్యాత్మక లోకానికి అధిష్టాన దేవతలయిన అష్టవసువుల అనుగ్రహం కలుగుతుంది. ఆ తరువాత శక్తిమయాత్మక లోకానికి అధిష్టాన దేవతలయిన ఏకాదశరుద్రుల అనుగ్రహం కలుగుతుంది. అటుపైన ప్రజ్ఞామయాత్మక లోకానికి అధిష్టాన దేవతలయిన ద్వాదశాదిత్యుల అనుగ్రహం కలుగుతుంది.

గాయత్రీ మంత్రంలోని ప్రతి అక్షరానికీ ప్రత్యేకమైన అర్ధం ఉన్నది. ఇప్పుడా అర్ధాన్ని వివరిస్తున్నాం.

| | | |
|---|---|---|
| ఓమ్ | – | బ్రహ్మ |
| భూః | – | ప్రణవస్వరూపము |
| భువః | – | దుఃఖనాశనము |
| స్వః | – | సుఖస్వరూపము |
| తత్ | – | ఆ |
| సవితుః | – | తేజస్సుచే ప్రకాశించు |
| దేవస్య | – | దేవునియొక్క |
| వరేణ్యం | – | శ్రేష్ఠమైన |
| భర్గః | – | పాపనాశనమైన తేజమును |
| ధీమహి | – | ధ్యానింతును |

యః - ఏదైతే

నః - మాయొక్క

ధియః - బుద్ధులను

ప్రచోదయాత్ - ప్రేరేపించునో, ఆ తేజస్సును ధ్యానింతును.

పంచదశీ మహామంత్రము గాయత్రీమంత్రము రెండూ ఒక్కటే అని చెబుతూ భాస్కరరాయలవారు తమ వరివశ్యా రహస్యంలోని 7,8,9,10 శ్లోకాలలో పంచదశీ మహామంత్రానికి గాయత్రీ మంత్రార్థం నిరూపించారు.

పంచదశీ మహామంత్రంలోని కకారానికి సర్వజగత్తునూ సృష్టించాలనే కోరిక గల బ్రహ్మ అని అర్థం. గాయత్రీ మంత్రంలోని మొదటి మూడుపదాలకు బ్రహ్మ క అని అర్థం. పంచదశిలో రెండవ అక్షరమైన ఏ కారానికి గాయత్రీ మంత్రంలోని సవితుః - శ్రేష్టమైన అని అర్థం. మూడవ అక్షరమైన ఈ కారము గాయత్రీ మంత్రంలోని భర్గోదేవస్యధీ అయిన పరమేశ్వరుణ్ణి సూచిస్తుంది.

ఈ రకంగా శ్రీవిద్యలోని ప్రథమ కూటమిలోని అక్షరాలు గాయత్రీమంత్రంలోని ప్రథమపాదంచే తెలియబడు జగత్కారణభూతులైన కామేశ్వరీ కామేశ్వరులను చెబుతోంది. వారిద్దరి సామరస్యమే పరమశివుడు. అతని పరిణామమే ఈ జగత్తు. అతడే సమస్త బుద్ధులకు ప్రేరకుడు. త్రిగుణాతీతుడు. ప్రణవస్వరూపుడు.

గాయత్రీమంత్రంలోని మహి అనే శబ్దము శ్రీవిద్యలోని లకారాన్ని సూచిస్తున్నది. లకారమనేది పృథివీ బీజం. కాబట్టి దానినుంచి పంచభూతాత్మకమైన జగత్తు తెలుస్తుంది. ఈ జగత్తంతా

పరమేశ్వరునివల్ల సృష్టించబడింది. ఆ పరమేశ్వరుని ప్రతిబింబమే మహాత్రిపురసుందరి.

గాయత్రీ మంత్రంలోని చివరి రెండుపాదాల అర్థం. శ్రీవిద్యలోని హ్రీంకారము ఒక్కటే. ఈ రకంగా గాయత్రి, పంచదశీ మహామంత్రాల అర్థం ఒక్కటే.

దేవీభాగవతంలోని 12వ స్కంధంలో గాయత్రీ మంత్రాన్ని వివరించారు. ఈ మంత్రానికి 24 మంది ఋషులు, 24 ఛందస్సులు, 24 మంది దేవతలు, 24 శక్తులు, 24 రంగులు, 24 వర్ణతత్త్వాలు 24 వర్ణముద్రలు చెప్పబడ్డాయి.

ఈ రకంగా ఉన్న గాయత్రీ మంత్రం బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులందరిచేత జపించడుతోంది. అయితే.

**ఓంకార వ్యాహృతిపూర్వాం గాయత్రీం బ్రాహ్మణో జపేత్**

**త్రిష్టుభం చైవ రాజన్యో జగతీం వైశ్య ఏవ చ.**

ఓంకారవ్యాహృతి పూర్వకమైన గాయత్రిని – బ్రాహ్మణులు, త్రిష్టుప్ ఛందస్సులో – క్షత్రియులు, జగతీ ఛందస్సులో – వైశ్యులు ఈ మంత్రాన్ని జపిస్తారు. అంతేకాకుండా మంత్రశాస్త్రంలో ప్రతి మంత్రానికి గాయత్రి ఉంటుంది.

**కాత్యాయనాయవిద్మహే కన్యకుమారి ధీమహి తన్నో దుర్గిః ప్రచోదయాత్।**

**మహాదేవ్యై చ విద్మహే। విష్ణుపత్న్యైచ ధీమహి తన్నో లక్ష్మీః ప్రచోదయాత్॥**

గాయత్రీ మంత్రం అత్యంత మహిమోపేతమైనది.

ఓం భూర్భువస్సువః ఇది వ్యాహృతిత్రయము

(ఓం భూః, ఓం భువః, ఓం సువః)

భూః, భువః, సువః, మహః, జనః, తపః, ఓగ్ంసత్యం ఇవి సప్తవ్యాహృతులు గాయత్రీ మంత్రాన్ని, బ్రహ్మచారి, గృహస్థులు – ప్రణవత్రయ సహితముగాను, వానప్రస్తులు – పంచ ప్రణవ సహితముగాను, సన్యాసులు – ఏకప్రణవ మంత్రమును జపించాలని వసిష్ఠాది మహర్షులు చెప్పారు.

ప్రణవత్రయము అంటే – వ్యాహృతిత్రయము ముందు ఒకటి, మొదటి పాదము ముందు ఒకటి, తురీయపాదము ముందు ఒకటి. మొత్తం మూడు ప్రణవాలు.

పంచప్రణవాలు అంటే ఆద్యంతములయందు ప్రణవాలు రెండు, గాయత్రీ మంత్రపాద త్రయాదిన ఉన్న ప్రణవాలు మూడు. మొత్తం ఐదు.

ఏకప్రణవము అంటే గాయత్రీ మంత్రంలోని మూడుపాదాలూ వ్యాహృతి త్రయములో కలిసిపోతాయి. వ్యాహృతిత్రయము అకార ఉకార మకారములలో కలిసిపోతుంది. ఇప్పుడు మిగిలేది ఓంకారము ఒక్కటే. ఇదే యతులు ఉపాసించ తగినది.

గాయత్రీ మంత్రానికి ఎంత అర్థం ఉన్నదో పంచదశీ మంత్రంలోగల ఒక పదానికే అంత అర్థం ఉంది. కాబట్టి పంచదశిని ఒకసారి జపిస్తే పూర్ణగాయత్రిని మూడుసార్లు జపించిన ఫలితం వస్తుంది. గాయత్రీ మంత్రంలోని మొదటి మూడు పదములకు సృష్టికర్త అయిన బ్రహ్మ అని అర్థము.

గాయత్రీ మంత్రంలో ఓంకారము తరువాత భూః భువః సువః

అని మూడు వ్యాహృతులున్నాయి. వీటికి త్రికము అని పేరు. ఈ త్రికము అనేకార్ధ బోధకము. అనేక భావనలకు, అనేక దిశలకు సంకేతము. ఇవి త్రిమూర్తులకు, సృష్టిస్థితి లయాలకు ప్రతీకలు. సత్వరజస్తమో గుణాలనే త్రివిధ గాయత్రి అంటారు.

భూః – బ్రహ్మ, భువః – ప్రకృతి, సువః – జీవుడు. ముల్లోకాలకూ ఈ త్రికము సంకేతము. అగ్ని వాయు సూర్యులకు ప్రతీక. విరాడ్రూపమైన భగవంతుని సంబంధమైన జ్ఞానాన్ని ప్రకాశింపచేసేది వ్యాహృతి.

భూర్భువస్సువః అనేవి బ్రహ్మయొక్క జ్ఞానదేహము నుంచి వ్యవహరింపబడటం చేత దీనికి వ్యాహృతులని పేరు వచ్చింది. భూర్భువస్సువములు బ్రహ్మస్వరూపము.

జలము ఓంకార రూపము. బ్రహ్మలేనిదే సృష్టిలేదు. వ్యాహృతులనుంచే అగ్ని, వాయువు, సూర్యుడు ఉద్భవించారు. ఈ వ్యాహృతులను జపించిన వారు సర్వవేద పారాయణ చేసిన ఫలితము పొందుతారు. వేదసారము ఉపనిషత్తులు. ఉపనిషత్సారము గాయత్రి. గాయత్రిసారము వ్యాహృతిత్రయము.

వ్యాహృతిత్రయము : 1) ఈశ్వరుడు, జీవుడు, ప్రకృతి
2) భూలోక, భువర్లోక, సువర్లోకములు
3) కరణము, శరీరము, సంసారము

స్వర్గ నరకాలు మానవుడే స్వయంగా సృష్టించుకుంటాడు. సత్త్వరజస్తమో గుణాలు బంధహేతువులు. వీటిని చక్కగా ఉపయోగించుకుంటే ముక్తికి కారణ మవుతాయి. త్రిమూర్తుల యొక్క, సృష్టి స్థితిలయల యొక్క తత్త్వము వ్యాహృతముల యందు నిగూఢమై ఉన్నది.

**తత్ :** గాయత్రీ మంత్రంలో తత్ అనే శబ్దము పరమాత్మనుద్దేశించి చెప్పబడుతోంది. కాని పరమాత్మరూపమైన వస్తువు సాధకుని దీక్షపైన, అతని కళ్ళలోని వెలుగుపైన ఆధారపడి ఉంటుంది. శబ్ద స్పర్శ రూప రస గంధములనబడే తన్మాత్రల చేత పరబ్రహ్మను సాధించటం సాధ్యంకాదు. అంతరాత్మ ద్వారానే అది సాధ్యం.

తచ్ఛబ్దముతో స్వయంభువమగు పరమాత్మ నిర్దేశింపబడిందని శంకర భాష్యంలో చెప్పబడింది. ఓం తత్ సత్ అనే మూడు శబ్దములు పరబ్రహ్మ నిర్దేశకములవటం చేత 'తత్' బ్రహ్మస్వరూపము.

**సవితు :** సవిత శబ్దానికి సూర్యుడని అర్థము, సూర్యుడు ప్రత్యక్ష దైవము. తేజస్వరూపి, పరమాత్మ తేజము స్థూలనేత్రాలకు సూర్యనారాయణమూర్తిగా గోచరిస్తుంది. ప్రకాశించే సూర్యగోళమే సూర్యుడు కాడు. తేజోమయుడైన సృష్టికర్తయే. 'సవిత' పరమాత్మకు అనేక శక్తులు, రూపాలు ఉన్నాయి. వాటిలో తేజశ్శక్తులను సవిత అంటారు. అటువంటి సవితనే గాయత్రీ మంత్రంలో ఉపాసన చేస్తారు.

సవిత ప్రాణులను సృష్టిస్తుంది. సర్వభావాలను కలిగిస్తుంది. పరమాత్మయొక్క ముఖం తేజోమండలంచేత కప్పబడి ఉంటుంది. సూర్యమండలంలోనే అవ్యయుడైన పరమాత్మను ధ్యానించాలి.

సూర్యునివల్లనే సృష్టి జరుగుతున్నది. అతడే స్థితికర్త. అతని యందే లోకాలు లయమవుతున్నాయి. అతని తేజస్సు నాశరహితమైనది. త్రివేదరూపి, తేజోమయుడు, సప్తాశ్వరథము మీద పయనిస్తూ ఉంటాడు. త్రిమూర్త్యాత్మకుడైన సవిత్రునకు భిన్నమైన దేవుడు లేడు. ప్రాణము, చంద్రుడు విద్యుత్తూ అన్నీ సూర్యుడే. సమస్త ప్రపంచమును సృష్టించి పాలించి లయమొందించువాడు సూర్యుడే. బంగారు గడ్డము, బంగారు కేశములు కలిగి సూర్యమండలంలో

కనిపిస్తున్నాడు. అతని కాలిగోరు నుంచి శిఖవరకు కాంతులచే ప్రకాశిస్తున్నాయి. లోకాలకు నేత్రమువంటివాడు, సృష్టి స్థితి లయాలకు కారణమైనవాడు, త్రివేద స్వరూపి, త్రిగుణస్వరూపి, త్రిమూర్త్యాత్మకుడు అయిన సవిత్రునకు నమస్కారము.

**వరేణ్యమ్ :** స్వీకరించటానికి, దానము చెయ్యటానికి యోగ్యమైన దానిని వరేణ్యమంటారు. ధర్మము, కర్తవ్యము, అధ్యాత్మ తత్త్వము, సచ్చిదానంద స్వరూపము, సత్యం శివం సుందరంవైపు మనలను నడిపించగల తత్త్వమే వరేణ్యమ్.

ఈశ్వర సంబంధమైన వరేణ్యశక్తి గాయత్రి యందున్నది. దీనివల్ల గాయత్రీ మంత్రోపాసకుని దృష్టి కోణము శ్రేష్ఠమవుతుంది. సంసారానికి భయపడనివారు, మోక్షగాములు సూర్యమండలంలో ఉన్న భర్గనామ తేజస్సును ప్రార్థించాలి. వరేణ్యము అంటే జనన మరణాది భయము నశించుటకు ప్రార్థింపతగినది. వరేణ్యము అంటే ప్రార్థించుటకు అర్హమైనది. అభేద జ్ఞానముచే తెలియతగినదే వరేణ్యము. సమస్త తేజములకన్నా శ్రేష్ఠమైనది, వర్ణింపతగినది, స్వర్గము, మోక్షము కోరువారు ప్రార్థింపతగినది.

**భర్గ :** చెడు నుండి, అజ్ఞానాంధకారము నుండి తప్పించి రక్షించే పరమేశ్వరుణ్ణి 'భర్గ' అంటారు. వరేణ్యశక్తి ఎంత అవసరమో భర్గ శక్తికూడా మనకు అంతే అవసరము. జీవితంలో మంచి చెడు అనే విషయాలు రెండున్నాయి. సద్విషయాలలో దేవశక్తులు, చెడ్డ విషయాలలో అసురశక్తులు ఉంటాయి. కాబట్టి చెడు విషయాలలో జాగర్త వహించవలసి ఉంటుంది.

సూర్యభగవానుని ఆత్మరూపము సర్వప్రాణులు ప్రార్థింపతగినది.

చైతన్య లక్షణమైనది, తేజమైనది అయిన భర్గము (తేజస్సు) సేవింపదగినది. కాంతి రూప మవటం చేత భర్గ అని, పూర్ణరూపముచే పురుషుడని, సర్వప్రాణి రూపి అవటంచేత ఆత్మ అని చెప్పబడుతుంది. ఈ భర్గము హృదయాకాశములోనూ బయట సూర్యమండలంలోనూ ప్రకాశిస్తుంది. సప్త స్ఫులింగములతో ప్రకాశించు అగ్ని, కాలాగ్ని రూపంలో ప్రకాశిస్తూ భర్గ అనే పేరుతో విరాజిల్లుతుంటుంది. ఈ భర్గము అన్నిటికన్న శ్రేష్ఠమైనది. పరిపూర్ణమైనది. అందుచేత పురుషుడని చెప్పబడుతుంది. సంసారపరమైన భయాన్ని తొలగించి, శుభాన్ని కలిగించటం చేత శివుడని చెప్పబడుతుంది. జనన మరణాది దుఃఖాలకు మూలకారణమైన పాపాలను నశింపచేసేదే భర్గము. అవిద్యను, దానివలన కలిగే పాపకార్యములను నశింపచేసే భర్గము స్వయంప్రకాశమైన బ్రహ్మతేజము. స్వప్రకాశముచే బాహ్యాంభ్యంతర ప్రపంచముల నుండి అంధకారమును తొలగచేయునది భర్గము. తేజోరూపమైన భర్గమే పరబ్రహ్మము. ఈశ్వరస్వరూపము, పురుష వాచ్యము, సత్యము, ధర్మరూపము, నాశరహితము అయిన భర్గమే ముక్తిహేతువైన విష్ణుతేజము. అదే శివుడని, శక్తి అని, సూర్యుడు అని, అగ్ని అని అంటారు. తేజోబలములను కోరువారికి భర్గోపాసన మిక్కిలి అవసరము. శారీరక, మానసిక, ఆర్థిక, చారిత్రక పుష్టి కలిగించునది భర్గము.

**దేవస్య** : సర్వప్రాణులలోను ఆత్మరూపమున ప్రకాశిస్తూ, కీర్తించబడుచూ, సర్వవ్యాప్తమైన వానిని దేవుడు అంటారు. సర్వప్రకాశుడు, చైతన్యరూపుడు, అఖండమైనవాడు, ఏకరూపము గలవాడు దేవుడు. ఒక్కదేవుడే సమస్త ప్రాణులలోనూ వ్యాపించి ఉండే

ఆత్మ. అతడే కర్మలకు ప్రభువు. సర్వకర్మలకు నివాస భూతుడు. స్వర్గమున ప్రకాశించేవాడు. ఎవరైతే అతణ్ణి ధ్యానిస్తారో, అతని హృదయంలో నివశించేవాడు దేవుడు.

**ధీమహి :** ధ్యానం చెయ్యటాన్నే ధీమహి అంటారు. మనం దేన్నయితే ధ్యానిస్తున్నామో, దానియందు మనస్సు లగ్నమవుతుంది. అప్పుడే ఆకాంక్ష అధికమవుతుంది. దానివల్లనే ప్రయత్నం జరుగుతుంది. దీనివల్లనే అభీష్టసిద్ధి జరుగుతుంది. అప్పుడే ధ్యానము సఫలమవుతుంది.

**ధియః :** 'ధీ' అంటే బుద్ధి. 'ధియః' అంటే బుద్ధులను ధర్మాది విషయకమే బుద్ధి. ధారణ చేసేదే బుద్ధి.

**యః :** యః అనే శబ్దానికి ఎవడైతే, ఏదైతే అని అర్థము. ఈ సంకేతము పరమాత్మకు వర్తిస్తుంది. గాయత్రీ మంత్రంలో ఇంతవరకు వర్ణించబడిన పరమాత్మయే ఇక్కడ చెప్పబడుతోంది. యఃశబ్దము ఆత్మరూపము. ఈ శుద్ధాత్మయే పరమాత్మ అందుచేతనే యః శబ్దము దేవుని నిర్దేశిస్తుంది.

**నః :** నః అంటే మాయొక్క అని అర్థం. పరమాత్మ నుంచి మంచి బుద్ధి లభించటం తనకొక్కడికే కాక మానవ సమాజానికే కావాలనీ సూచించటానికే మాయొక్క (నః) అ చెప్పబడింది. దీనివలన గాయత్రీ మంత్రోపాసన చేసేవారు విశ్వమానవాళి యొక్క శ్రేయస్సును దృష్టిలో ఉంచుకుని వసుదైక కుటుంబం కోసం ధ్యానం చేస్తారు.

**ప్రచోదయాత్ :** ప్రచోదయాత్ అంటే ప్రేరేపించుట, పెంపొందించుట. గాయత్రీ మంత్రము చెయ్యటంలో ఉద్దేశ్యము లోకంలోని జనులందరికీ మంచిబుద్ధిని ప్రసాదించమని ప్రార్థించటమే. ప్రచోదయాత్ అంటే మంచి బుద్ధిని ప్రేరణ చెయ్యమని పరమాత్మను

ప్రార్ధించటం.

పంచదశీ మహామంత్రంలోని క కారానికి సమస్త జగత్తునూ సృష్టించాలనే కోరిక గల బ్రహ్మ అని అర్ధం. గాయత్రీ మంత్రంలోని మొదటి మూడు పదాలకు బ్రహ్మ అని అర్ధం. రెండవ అక్షరమైన ఏకారము గాయత్రీ మంత్రంలోని సవితుః శ్రేష్ఠమైన అని అర్ధం. మూడో అక్షరమైన ఈకారము గాయత్రీ మంత్రంలోని భర్గోదేవస్య ధీ పరమేశ్వరుణ్ణి సూచిస్తుంది.

ఈ రకంగా శ్రీవిద్యలోని ప్రథమ కూటమిలోని రెండు అక్షరములూ, గాయత్రీ మంత్రంలోని ప్రథమ పాదముచేత తెలియబడు జగత్కారణభూతులైన కామేశ్వరీ కామేశ్వరులను చెబుతున్నది. వారిద్దరి యొక్క సామరస్యమే పరమశివుడు. అతని పరిణామమే జగత్తు. అతడే సమస్త బుద్ధులకూ ప్రేరకుడు, త్రిగుణాలకూ అతీతుడు. ప్రణవ స్వరూపుడు.

గాయత్రీమంత్రంలోని మహి అనే శబ్దము శ్రీవిద్యలోని లకారాన్ని సూచిస్తుంది. లకారము పృథివీ బీజం కాబట్టి, దానినుంచి పంచభూతాత్మకమైన జగత్తు తెలుస్తుంది.

ఈ జగత్తంతా పరమేశ్వరుని వల్ల సృష్టించబడింది. ఆ పరమేశ్వరుని ప్రతిబింబమే మహాత్రిపురసుందరి.

**"ధియో యోనః ప్రచోదయాత్, పరోరజసిసావదోం"** అను గాయత్రీ మంత్రం లోని చివరి రెండు పాదాల అర్ధము, శ్రీవిద్యలోని హ్రీంకారార్ధమూ ఒక్కటే.

**"తృతీయ తుర్యాంఘ్రి బోధికామాయాం"** అంటే గాయత్రీ మంత్రంలోని మూడు, నాలుగు చరణములచే చెప్పబడు అర్ధము,

హ్రీంకారార్థము ఒక్కటే. మూడవ పాదము **"ధియోయోనః ప్రచోదయాత్"** అంటే పరమేశ్వరుడు సర్వాంతర్యామియై మా బుద్ధులను ప్రేరణ చేయుగాక.

**"పరోరజసిసావదోం"** అనే నాల్గవ పాదానికి త్రిగుణాతీతుడైన పరమేశ్వరుడు, మాటలచేత వర్ణింపశక్యము కానివాడు, లక్షణములచేత మాత్రమే చెప్పదగినవాడు, ఓంకార స్వరూపుడు అని అర్థము. **'యతో వాచో నివర్తంతే'** అంటే మాటలచేత చెప్పనలవి కానివాడు.

**"సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ, వేదైశ్చ సర్వైరహమేవ వేద్య"** అంటే లక్షణముల చేత తెలియ తగినవాడు. మాయాబీజమైన హ్రీంకారానికి హృదయమని అర్థము. ఈ కారానికి సర్వాధారుడు, సర్వాంతర్యామి అయిన శివుడు అని అర్థము. ఈ రకంగా పూర్ణగాయత్రీ మంత్రంయొక్క అర్థం శ్రీవిద్యలోని ప్రథమకూటమిలో చెప్పబడింది.

జగత్తును సృష్టించాలనే కోరిక గల కామేశ్వరుడు, జగత్తుకు కారణభూతురా లయిన కామేశ్వరి, వీరిద్దరి సామరస్య స్వరూపమయిన పరమ శివతత్త్వము, సర్వ ప్రపంచ రూపంగా పరిణమించి సర్వాంతర్యామి అయి, సర్వాధారమయింది. కాబట్టి మన బుద్ధి, ప్రవృత్తులను పరబ్రహ్మ తత్త్వమందు ప్రేరణ చేయగాక అని శ్రీవిద్యలోని మొదటి కూటానికి అర్థము.

గాయత్రీమంత్రంలోని "తత్సవితుర్వరేణ్యం" అనే మూడుపదాల అర్థము శ్రీవిద్యలోని రెండవ కూటమియొక్క మూడు అక్షరములకు (హసక) చెప్పబడింది. గాయత్రిలోని "భర్గోదేవస్య ధీమహి" అనే ఆరు అక్షరాల అర్థం రెండవ కూటమిలోని హకారం చెబుతున్నది. గాయత్రీ మంత్రంలోని తత్సవితుర్ వరేణ్యం భర్గోదేవస్య ధీ అనే పదాల అర్థం

శ్రీవిద్యలోని మూడవకూటమిలోని స క అనే అక్షరాలకు వర్తిస్తుంది.

శ్రీవిద్యలోని రెండు, మూడు కూటములందు గల 'లహ్రీం' అనే రెండు అక్షరాలకూ, గాయత్రీ మంత్రంలోని 'మహి ధియోయోనః ప్రచోదయాత్। పరోరజసి సావదోం భాగానికి గల అర్థమే చెప్పబడింది.

**రెండవ అధ్యాయంలో** త్రిపురావిద్యను వివరించటం జరిగింది. శ్రీచక్రానికి తొమ్మిది ఆవరణలు ఉన్నాయి. ఇందులో ప్రతి ఆవరణకు ఒక అధిదేవత ఉన్నది. ముందుగా ఆవరణలను చూద్దాం.

**త్రైలోక్య మోహనం వందే । సర్వాశాపరిపూరకమ్**

**సర్వసంక్షోభణం చక్రం । సర్వసౌభాగ్యదాయకమ్**

**సర్వార్థ సాధకం చక్రం । సర్వరక్షాకరం పరం**

**సర్వరోగహరం చక్రం । సర్వసిద్ధిప్రదాయకమ్**

**సర్వానందమయం చక్రం । ఇతి చక్రకమం భజే ॥**

**1.ప్రథమావరణ :** ఇది భూపురము. దీనిలో మూడు రేఖలు ఉంటాయి. దీనిపేరు 'త్రైలోక్యమోహనచక్రము'. ఈ ఆవరణకు అధిదేవత–త్రిపుర

**2.ద్వితీయావరణ :** షోడశదళము. పదహారు దళాలు గల పద్మము. దీనిపేరు 'సర్వాశాపరిపూరకచక్రము' ఈ ఆవరణకు అధిదేవత – త్రిపురేసి

**3.మూడవ ఆవరణ :** అష్టదళము. ఎనిమిది దళాలు గల పద్మము. దీని పేరు 'సర్వసంక్షోభణచక్రము' ఈ ఆవరణకు అధిదేవత– త్రిపురసుందరి.

**4. నాల్గవ ఆవరణ :** చతుర్దశారము. పద్నాలుగు కోణములుగల చక్రము. దీని పేరు 'సర్వసౌభాగ్యదాయక చక్రము' ఈ ఆవరణకు అధిదేవత – **త్రిపురవాసిని**

**5. ఐదవ ఆవరణ :** బహిర్దశారము, పదికోణములు గల చక్రము. దీనిపేరు 'సర్వార్ధ సాధక చక్రము' ఈ ఆవరణకు అధిదేవత – **త్రిపురాశ్రీ**

**6. ఆరవ ఆవరణ :** అంతర్దశారము. పదికోణములు గల చక్రము. దీనిపేరు 'సర్వరక్షాకరచక్రము. ఈ ఆవరణకు అధిదేవత – **త్రిపురమాలిని.**

**7. ఏడవ ఆవరణ :** అష్టకోణము. ఎనిమిది కోణములు గల చక్రము. దీనిపేరు **'సర్వరోగహరచక్రము'** ఈ ఆవరణకు అధిదేవత–

**8. ఎనిమిదవ ఆవరణ :** త్రికోణము. మూడు కోణములు గల చక్రము. దీని పేరు 'సర్వసిద్ధిప్రదచక్రము' ఈ ఆవరణకు అధిదేవత – **త్రిపురాసిద్ధాంబ.**

**9. తొమ్మిదవ ఆవరణ :** బిందువు. దీనిపేరు 'సర్వానందమయచక్రము'. ఈ ఆవరణకు అధిదేవత – **మహాత్రిపురసుందరి.**

పరమేశ్వరిని త్రిపురసుందరిగా భావించి సేవించటము దీన్నే త్రిపురసుందరీ విద్య అంటారు.

**మూడవ అధ్యాయంలో** అమ్మవారి పూజలో వేయవలసిన దశముద్రలను చెప్పారు. అవి

1. సర్వసంక్షోభిణీ ముద్ర
2. సర్వవిద్రావిణీ ముద్ర
3. సర్వాకర్షిణీముద్ర

4. సర్వవశంకరీ ముద్ర
5. సర్వోన్మాదినీముద్ర
6. సర్వమహాంకుశ ముద్ర
7. సర్వఖేచరీ ముద్ర
8. సర్వబీజముద్ర
9. సర్వయోనిముద్ర
10. సర్వత్రిఖండ ముద్ర

**నాల్గవ అధ్యాయంలో**

మృత్యుంజయ మహామంత్రము.

**త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్.**
**ఉర్వారుక మివబంధనాన్ మృత్యోర్ముక్షీయమామృతాత్.**

**వాసుదేవ మంత్రం :**

ఓం నమ ఇతి త్రీణ్యక్షరాణి, భగవత ఇతి చత్వారి, వాసుదేవాయేతి పంచాక్షరాణి

| | | |
|---|---|---|
| ఓం నమః | – | మూడు అక్షరాలు |
| భగవతే | – | నాలుగు అక్షరాలు |
| వాసుదేవాయ | – | ఐదు అక్షరాలు |

వెరసి పన్నెండు అక్షరాల మహామంత్రమిది

**'ఓం నమో భగవతే వాసుదేవాయ'**

ప్రముఖంగా ఈ రెండు మంత్రాలను వివరించటం జరిగింది.

**ఐదవ అధ్యాయంలో** పరతత్త్వాన్ని వివరించారు.

బంధ మోక్షాలకు కారణం మనస్సు. కాబట్టి సంసార బంధనాలు

తెగితేనే కాని మోక్షమార్గం కనపడదు. అందుచేత మనసును వశంలో ఉంచుకుని పరమాత్మను శోధన చెయ్యాలి. జీవాత్మ పరమాత్మ వేరుకాదు. ఆ రెండూ ఒకటే. ఘటాకాశం మహదాకాశంకన్న బిన్నమైనది కాదు. ఘటం ఎప్పుడైతే పగిలిపోతుందో, అప్పుడు అందులో ఉన్న ఆకాశం (ఘటాకాశం) మహదాకాశంలో కలిసిపోతుంది. అలాగే ఆత్మపదార్ధం ఒక్కటే. అది జీవిలో ఉంటే జీవాత్మ అనబడుతుంది. జీవి నుంచి విడివడితే అది మహదాకాశంలో లీనమై పోతుంది. అదే సాయుజ్యము. ఈ విషయాలు తెలుసుకున్న వాడికి పునర్జన్మ ఉండదు.

# 12. సీతోపనిషత్తు

ఇది అధర్వణ వేదంలోది ఇందులో సీతాదేవియే పరమేశ్వరి అని చెబుతున్నారు.

ఒకసారి దేవతలంతా బ్రహ్మదేవుని దగ్గరకు వెళ్ళి, "దేవదేవా! ప్రజాపతీ! సీత అంటే ఎవరు? ఆవిడ రూపం ఎలా ఉంటుందో వివరించండి." అని అడిగారు. ఆ మాటలు విన్న ప్రజాపతి ఆ సీతాదేవి మూలప్రకృతి యొక్క రూపమే అయి ఉన్నందు వలన ప్రకృతి అని చెప్పబడుచున్నది. సీతా అను పదములో 3 అక్షరములున్నాయి. ఆవిడ సాక్షాత్ మాయాస్వరూపమై యున్నది. విష్ణువు ప్రపంచ బీజము, ఈకారము మాయ, సకారము సత్యము, అమృతము ప్రాప్తము. సోముడని చెప్పబడును. లక్ష్మీబీజము తకారము, శ్రీంకారము, వైరాజము, సోమ, అమృతావయవములు కల దేవి ఈకార రూపిణియగుచున్నది. ఆ దేవి మౌక్తికాదులతో అలంకరింపబడియున్నది. అట్టి రూపము ధరించియున్న మొట్టమొదటి మహామాయ శబ్దబ్రహ్మరూపము. అందువల్ల స్వాధ్యాయ సమయములో ప్రసన్నురాలవుతున్నది. సమున్నత భావనలనుత్పత్తి చేస్తుంది. రెండవ మాయ సాత్మిక పృథ్వీభాగములో హలాగ్రమున జన్మించి యున్నది. ఈకార స్వరూపిణి ఆ దేవియొక్క మూడ మాయ; అవ్యక్త రూపములో ఉంటుంది. శౌనకీయమగు శౌనకీ తంత్రములో సీతాదేవిని గురించి ఈ రీతిగా వర్ణింపబడింది. శ్రీరాముని సన్నిధిలో జగదానందకారిణియైనది, సృష్టి, స్థితి, లయకారిణి గూడ ఆ సీతాదేవియే. వ్యక్తముగా నున్న అన్ని శరీరముల యందు మూలప్రకృతి స్వరూపిణియై సీతాభగవతి జ్ఞేయరూపములో ఉన్నది. ప్రణవమగుట వలన ప్రకృతి అనబడుతుంది. బ్రహ్మావాదిని అనిగూడ అనబడుతుంది.

అథాతో బ్రహ్మజిజ్ఞాసా స్వరూపిణి. ఆ దేవి సర్వవేదమయి, సర్వదేవమయి, సర్వకీర్తిమయి, సర్వమయి, సర్వధర్మమయి, సర్వలోకమయి, సర్వాధార స్వరూప, కార్యకారణములు మరియు మహాలక్ష్మీ దేవేశుల యొక్క బిన్నా భిన్నరూప చేతనా చేతనాత్మక, బ్రహ్మాస్థావరాత్మ, గుణకర్మ విభాగ భేదముతో దేహ స్వరూపిణి, దేవ ఋషి మనుష్య గంధర్వ స్వరూపిణి, అసుర రాక్షస భూతప్రేత పిశాచ భూతాది భూతదేహ స్వరూపిణి, భూతేంద్రియ మనః ప్రాణరూపిణి అని తెలియబడుచున్నది.

ఆ సీతాదేవి మూడు రూపాలతో శక్తి స్వరూపిణిగా ఉన్నది. ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, సాక్షాత్ శక్తి అను నామములతో నున్నది. శ్రీ, భూ, నీళా, భద్రరూపినీ, ప్రభావరూపిణీ, సోమసూర్యాగ్ని రూపిణీ అవుతున్నది. సోమరూపిణిగా ఓషధులను పుట్టించుచున్నది. కల్పవృక్ష, పుష్ప, ఫల, లతా గుల్మాత్ములగు ఔషధ భేష జాత్మికగా నున్నది. అమృత రూపములో దేవతలకు మహాస్తోమ ఫలములనిచ్చుచున్నది. దేవతలకు అమృత రూపముగను, మానవులకు అన్నరూపముగను, పశువులకు తృణముచేతను, జీవులకు అనేక విధములుగా ఆహారమును ప్రసాదిస్తున్నది.

సూర్యాదులతో సకల భువనములను ప్రకావింపజేస్తున్నది. రాత్రింబవళ్ళ రూపమున కాలరూపముతో కలా నిమేషము మొదలుకొని ఘడియ జాము పగలు రాత్రి భేదములతో పక్ష, మాస, ఋతు అయన సంవత్సర భేదములతో మనుష్యులకు శతసంవత్సర కల్పనతో ప్రకాశిస్తున్నది, చిర క్షిప్ర రూపములో నిమేషము నుండి పరార్ధము వరకు కాలచక్రమును చక్రములుగా త్రిప్పుతూ తనయొక్క కాలవిభాగ విశేషముతో ప్రకాశిస్తూ ఆ దేవి కాలరూప అవుతున్నది.

ఆ దేవి అగ్నిరూపము గలదియై ప్రాణులకు ఆకలి దాహము రూపములోను (అన్నపానాది రూపములో), దేవతలకు ముఖరూపములోను, వనౌషధులకు శీతోష్ణ రూపములోను, కాష్ఠముల లోపల బైట నిత్యానిత్య రూపములోను ఉంటుంది.

శ్రీదేవి మూడురూపాలు ధరించి, భగవంతుని సంకల్పము ప్రకారము, లోకములను రక్షించటం కోసం ఆ రూపాన్ని ధరిస్తూ ఉంటుంది. శ్రీ అనియు, లక్ష్మి అనియు, లక్షింపబడును. భూదేవి సప్తసాగరాంభస్సుగను, సప్తద్వీపా వసుంధరగను, భూరాది 14 భువనములకు ఆధారాధేయ ప్రణవాత్మికా రూపముగను ఉంటుంది. నీళాదేవి ముఖవిద్యున్మానియై సకల ఓషధులకు, ప్రాణులకు పోషణము నిమిత్తమై సర్వస్వరూపంగా ఉంటుంది. దేవి సమస్త భువనములకు అథోభాగమున జలాకారాత్మికగా మండూక రూపములో భువనాధారముగా ఉంటుంది.

(క్రియాశక్తి యొక్క స్వరూపము) శ్రీహరియొక్క ముఖము నుండి నాదాన్ని, ఆ నాదము నుండి బిందువును, ఆ బిందువు నుండి ప్రణవాన్ని ఓంకారమునకు చివర రామ వైఖానస పర్వతమును, ఆ పర్వతమునకు కర్మజ్ఞానమయమగు ఉపశాఖలు వచ్చాయి. ఆ చోట త్రయీమయరూపములో సర్వార్థ దర్శనమేర్పడును. ఋక్ యజుస్సామములను మూడు వేదములను త్రయీ అంటారు. కార్యసిద్ధి నిమిత్తమై నాలుగవ వేదమేర్పడి యున్నది. వీటిని ఋగ్యజుస్సామాంగిరసములు అంటారు. చాతుర్హోత్ర ప్రధానములగుట వలన లింగాది త్రితయంము త్రయంము అవుతున్నది. అథర్వాంగిరసరూపము గూడ, సామ ఋగ్యజురాత్మకమే యగును. అభిచారభేద సామాన్యముతో ప్రత్యేకముగా దర్శనమవుతున్నాయి.

ఋగ్వేదము 21 శాఖలతో ఉన్నది. యజుర్వేదము 109 శాఖలతో ఉన్నది. సామవేదము 1000 శాఖలతో ఉన్నది. అథర్వణవేదము 50 శాఖలతో ఉన్నది. ముందుగా వైఖానస దర్శనము ప్రత్యక్ష దర్శనముగా నున్నది. ఋషులందరు మొట్టమొదట వైఖానస దర్శనాన్ని స్మరించెదరు. ఆ తరువాత కల్పము, వ్యాకరణము, శిక్ష, నిరుక్తము, జ్యోతిషము, ఛందస్సు ఇవి షడంగములు (వేదాంగములు) మరియు ఉపాంగములు మీమాంస, న్యాయములై ఉన్నాయి. ధర్మమును తెలిసికొనటానికి వేదవేదాంగములన్నింటి కంటే అధికముగ సమయానుకూలముగ ధర్మశాస్త్రాదు లేర్పడినాయి. మునీశ్వరుల అంతఃకరణ ప్రవృత్తియే ధర్మశాస్త్రమై ఉన్నది. ఓ మునీ! ఇంకా ఇతిహాస పురాణాలు ఉపాంగములుగ ఉన్నాయి. వాస్తువేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము, ఆయుర్వేదము, మునివేదము ఈ 5 వేదములును ఉపవేదాలు. దండము, నీతి, వార్త, విద్య, వాయుజయము. వీటితో 21 రూపములుగ స్వప్రకాశములై శాస్త్రములున్నాయి. వైఖానసమహర్షికి పూర్వము శ్రీ మహావిష్ణువు యొక్క వాక్కు ప్రభవించింది. మూడు వేదముల (త్రయీ) రూపములో సంకల్పించి, ఈ రీతిగా దేహి విజృంభిస్తున్నది. వైఖానస మహర్షికి ముందుగా సాంఖ్యశాస్త్ర రూపములో, ఏ రీతిగా అది పుట్టినదో దానిని గురించి వివరిస్తాను. ఇతిహాస పురాణములు పంచమ వేదమని చెప్పెదరు.

ఆ క్రియాశక్తి ఉత్తమమగు బ్రహ్మమయ రూపము; సాక్షాత్తు బ్రహ్మముయొక్క శక్తి స్మరించినంత మాత్రముననే ఆవిర్భావ ప్రాదుర్భావాత్మికగా అనుభవము నిస్తుంది. ఆ దేవి నిగ్రహానుగ్రహరూప; శాంతిరూప, తేజోరూప, వ్యక్తావ్యక్త కారణచరణ, సమగ్రావయవ రూపంలో భేదా భేదరూపముగ ప్రకాశిస్తుంది. భగవంతుడికి

సహచారిణిగ నుండును. అనపాయిని, అనవరతము సహాయాశ్రయములను ప్రసాదించు దేవి జన్మించియు జన్మించనట్లుంటుంది. నేత్రములు మూసికొని తెరచుకొన్నంత సమయములో సృష్టి, స్థితి, సంహార, తిరోధాన అనుగ్రహాది సర్వశక్తులను ప్రదర్శింపగలదేవి. సమర్ధతలో సాక్షాత్ శక్తిగా ప్రస్తుతింపడుతున్నది.

ఇచ్ఛాశక్తి మూడు విధములుగా నున్నది. ప్రళయ కాలములో విశ్రాంతి చెందుటను భగవంతుని దక్షిణ వక్షస్థలము నందు శ్రీవత్సాకారములో ఆ యోగశక్తి విశ్రమిస్తుంటుంది. భోగశక్తి భోగరూపములో, కల్పవృక్ష, కామధేను, చింతామణి, శంఖపద్మాది నవనిధులను ఆశ్రయించి ఉంటుంది. భగవదుపాసకులకు కామముతో గాని, అకామముతోగాని, భక్తియుక్తులగు మానవులకు నిత్యనైమిత్తిక కర్మలతోను అనుగ్రహిస్తుంది. మరియు భక్తులు అగ్నిహోత్రాదులతోను, యమనియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణ సమాధులచేత, గోపుర ప్రాకారాదులచేత, విమానాదులచేత, భగవద్విగ్రహార్చా పూజా కర్మస్నానాదుల చేత, పితృపూజాదులచేత, అన్నపానాదులచేత, భగవత్ ప్రీత్యర్ధమని చెబుతూ సర్వారాధనలను చేస్తున్నారు.

ఆ పిమ్మట ఆ సీతాదేవి వీరశక్తియుత చతుర్భుజయై, అభయవరద పద్మములను గలిగియున్నదై, కిరీటాద్యాభరణములను ధరించి యున్నదై, సర్వదేవతా పరివృతయై, కల్పవృక్షమూలమున నాలుగు ఏనుగులు రత్నఘటముల యొక్క అమృత జలములతో అభిషేకము చేస్తుండగా ప్రకాశిస్తూ, సమస్త దేవతలచేత బ్రహ్మాదులచేత వంద్య మానయై, అణిమాద్యష్టైశ్వర్య శోభితయై, సమ్ముఖమున కామధేనువుచే

స్తుతింపబడుచున్నదియై, వేదశాస్త్రములచే ప్రస్తుతింపబడుచున్నదై, జయాద్యప్సరస స్త్రీలచే పరిచర్యల నందుకొనుచున్నదై, సూర్యచంద్రులను దీపములచే ప్రకాశింప బడుచున్నదై, నారద తుంబురాదుల యొక్క గానముతో నుతింపబడుచున్నదియై, స్వాహా స్వధాదులనువారల వ్యజనముతో పూజింపబడుచున్నదియై, భృగువు మున్నగు పుణ్యపురుషులచే నర్చింపబడుచున్నదియై, దివ్య సింహాసనాసీనురాలై, సకల కారణ కార్యకారి అగు లక్ష్మీదేవి వీరలక్ష్మి అనే పేరుతో ప్రసిద్ధి గాంచినది.

# 13. సరస్వతీరహస్యోపనిషత్తు

ఇది కృష్ణయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో మొత్తం పది మంత్రాలున్నాయి. తత్త్వజ్ఞానం పొందటానికి అవసరమైన ఉపాసనా పద్ధతులను వివరిస్తోంది ఈ ఉపనిషత్తు.

పూర్వకాలంలో ఒకసారి మునీశ్వరులంతా భగవంతుడైన ఆశ్వలాయనుని పూజించి "ఓ మహానుభావా! మానవుడు తత్త్వాన్ని తెలుసుకోవాలి, జ్ఞానాన్ని పొందాలి అంటే ఏ మంత్రం జపం చెయ్యాలి? ఏ దేవతను ఉపాసించాలి? ఈ విషయాలను మాకు వివరించండి అన్నారు. ఆ మాటలు విన్న ఆశ్వలాయనుడు ఓ మునీశ్వరులారా! సరస్వతీ దశశ్లోకములు. (పది మంత్రాలు) ఉపాసన చేసి తరించండి. అంటూ ఆ మంత్రాలు ఉపదేశం చేశాడు.

సరస్వతీ దశశ్లోకి మహామంత్రానికి ఆశ్వలాయనుడు ఋషి. అనుష్టుప్ ఛందస్సు. వాగీశ్వరీ దేవత. యద్వాగితిబీజం, వాచమితిశక్తిః ప్రణోదేవీతి కీలకం. జ్ఞానసిద్ధ్యర్థే జపే వినియోగః శ్రద్ధా, మేధా, ప్రజ్ఞా, ధారణా, వాగ్దేవతా, మహాసరస్వతి. ఇలా అంగన్యాస కరన్యాసములు.

మంగళప్రదమైన ముత్యాలహారము, పచ్చకర్పూరము, చంద్రునిలాగా తెల్లదనము, గల ఆమె ఆహ్లాదకరమైన బంగారు సంపెంగపూలు ధరించినది, మహత్తరమైన ఉత్తుంగ పీనకుచకుంభములతో ప్రకాశిస్తున్న ఆ సరస్వతీ దేవిని మనసా వాచా ప్రార్థిస్తున్నాను. ఇప్పుడు మొదటి మంత్రము చెబుతున్నారు. ఇక్కడ **మంత్రాలు గురువుగారి దగ్గర చెప్పుకోండి.**

1. ప్రణోదేవీ ... అనే మంత్రానికి భరద్వాజుడు ఋషి. గాయత్రి, ఛందస్సు, సరస్వతీ దేవత. ఓం కారము బీజము శక్తి కీలకము.

(ప్రణవేన బీజశక్తి కీలకమ్) మంత్రంతోనే న్యాసము.

**మం. ఓం ప్రణోదేవీ సరస్వతీ వాజేభిర్వాజనీవతీ ధీనామవత్యవతు**

ఇక్కడ వాజము అంటే అన్నము, జ్ఞానేంద్రియాలకు ఆహారము. కంటికి చూసే శక్తి. చెవికి వినేశక్తి, చర్మానికి స్పర్శ, నాలుకకు రుచి, ముక్కుకు వాసన, అన్నీ బుద్ధి ద్వారానే గ్రహించాలి. ఈ రకంగా సాధకుడి బుద్ధి సంస్కరించబడాలి. ఆ దేవి నా బుద్ధిని కాపాడుగాక.

2. అనోదిన అనే మంత్రానికి అత్రిఋషిః, త్రిష్టుప్‌ఛందః సరస్వతీ దేవతా. హ్రీమితి బీజశక్తి కీలకం. ఇష్టార్ధే వినియోగః । మంత్రంతో న్యాసము చెప్పాలి.

**మం. హ్రీం అనోదినో భృహతః పర్వతదా సరస్వతీ యజత ఆగంతు యజ్ఞం హవం దేవీ జుజుషాణా ఘృతాచీ శగ్మాన్నో వాచం ఉశతిశృణోతు.**

దేవీ మేము భవసాగారాన్ని ఈదలేక, అందులో నుంచి బయటపడలేక అవస్థ పడుతున్నాము. మమ్మల్ని భవసాగరం నుంచి బయట పడవేయవలసింది.

3. పావకావ అనే మంత్రానికి. మధుచ్ఛంద ఋషిః, గాయత్రీ ఛందః, సరస్వతీ దేవతా శ్రీం ఇతిబీజశక్తి కీలకం. ఇష్టార్ధే వినియోగః మంత్రేణన్యాసః

**మం. శ్రీంపావకానస్సరస్వతీ వాజేభిర్వాజనీవతీ యజ్ఞం వష్టుధియా వసుః**

ఆమె అన్నానికి అన్నరసము వంటిది. ఈ యజ్ఞానికి వచ్చి మా హవిస్సులు స్వీకరించి మా బుద్ధిని సంస్కరించి మాకు అలౌకిక

ఆనందాన్ని కలుగచేయాలి.

4. చోదయత్రి అనే మంత్రానికి మధుఛందఋషిః, గాయత్రీ ఛందః, సరస్వతీ దేవతా । బ్లూమితి బీజశక్తి కీలకం. మంత్రంతో న్యాసము.

**మం. బ్లూం చోదయత్రీ సూనృతానాం చేతంతి సుమతీనాం**

**యజ్ఞం దధే సరస్వతీ॥**

వాక్కులను ప్రేరణ చేయునది, నాచేత పలికించేది, అయిన దేవి నాకు నీడగా ఉండి నన్ను ప్రేరేపించుగాక.

5. మహో అర్ణ అనే మంత్రానికి మధుచ్ఛంద ఋషిః గాయత్రిచ్ఛందః, సరస్వతీ దేవతా, సౌః ఇతి బీజశక్తి కీలకం. ఇష్టార్థే వినియోగః మంత్రంతో న్యాసము.

**మం. సౌః మహో అర్ణః సరస్వతీ ప్రచేతయతి కేతునాధియో విశ్వావిరాజతి**

ఏ దేవత అంతర్యామి రూపంలో ముల్లోకాలు పాలిస్తున్నదో, రుద్రుడు, ఆదిత్యుడు ఎవరిని ఆవేశించి ఆమెను ధ్యానిస్తారో ఆ సరస్వతి నన్ను రక్షించుగాక.

6. చత్వారివాక్ అనే మంత్రానికి దీర్ఘతమఋషిః త్రిష్టుప్ ఛందః , సరస్వతీ దేవతా ఐం ఇతి బీజశక్తి కీలకం. మంత్రంతో న్యాసము.

**మం. ఐం చత్వారి వాక్పరిమితా పదాని తాని విదుః బ్రాహ్మణాయో**

**మణీషిణః గుహాత్రీణి నిహితా సేంగియంతీ తురీయం**

**మనుష్యాఃవదంతి.**

ఏ దేవత నామజాతి భేదములచే ఎనిమిది విధాలుగా

చెప్పబడిందో, నిర్వికల్పాత్మగా వ్యక్తమైందో ఆ సరస్వతి నన్ను రక్షించుగాక.

7. యద్వాగ్వదంతీతి మంత్రస్య భార్గవఋషిః త్రిష్టుప్ ఛందః సరస్వతీ దేవతా క్లీం ఇతి బీజశక్తి కీలకం మంత్రేణ న్యాసః

**మం. క్లీం యద్వాంగ్వదంతీతి అవిచేతనా, రాష్ట్రీ దేవనాం నిషసాదమంద్రా,**

**చతస్ర ఊర్జం దుదుహే పయాంశి కృశ్చి దశ్యాః పరమం జగామ**

ఏ దేవత నామజాతి భేదములచే ఎనిమిది విధాలుగా చెప్పబడిందో, నిర్వికల్పాత్మగా వ్యక్తమైందో ఆ సరస్వతి నన్ను రక్షించుగాక.

8. దేవీ వాచమితి మంత్రస్య భార్గవఋషిః, త్రిష్టుప్ ఛందః, సరస్వతీ దేవతా, సౌః ఇతిబీజం కీలకం శక్తిః, మంత్రేణ న్యాసః

**మం. సౌః దేవీంవాచం అజనయంత దేవాః తాం విశ్వరూపా పశవో వదంతి, సానోమంత్రేషు ఊర్జం దుహానా ధేనుః వాగస్మా నుపసుష్టుతైతు.**

దేవతలు వాగ్దేవతను పుట్టించారు. అజ్ఞానులైన జీవులు ఆ వాక్కును పలుకుతున్నారు. అటువంటి కామధేనువు ద్వారా వచ్చే వాక్కు మమ్మల్ని చేరుగాక. మాకు ఉపయోగపడుగాక.

9. ఉతత్వ ఇతిమంత్రస్య. బృహస్పతి ఋషిః త్రిష్టుప్ ఛందః

సరస్వతీ దేవతా సమితి బీజం శక్తి కీలకం మంత్రేణ న్యాసః

**మం. సం ఉతత్వః పస్యన్నద దర్శవాచముతత్వ శృణోన్న శృణోతి ఏనాం ఉతోత్యస్మైతన్యా అం విసస్రే జాయేవ పత్య ఉశతీ సువాసాః**

వాక్కు చూసినా, విన్నా అందులోని విశేషము అర్ధంకాదు. కేవలము సరస్వతీ దేవి కృపతోనే అది జరుగుతుంది. అటువంటి సరస్వతీదేవి నాకు గ్రాహర్దశక్తిని ప్రసాదించుగాక.

10. అంబితమ ఇతి మంత్రస్య గృత్సమదఋషిః అనుష్టుప్ ఛందః సరస్వతీ దేవతా । ఐమి బీజంశక్తి కీలకం. మంత్రేణ న్యాసః

**మం. ఐం అంబితమే, నదీతమే, దేవతీతమే సరస్వతీ అప్రశస్తా ఇవ స్మసి ప్రశస్తిం అంబనస్కృధి చతుర్ముఖ ముఖాంభోజన వనహంస వధూః మమ మానసే రమతాం నిత్యం సర్వశుక్లా సరస్వతి**

ఓ అంబితములారా ! నదీతమా । సరస్వతీ । మాయందు అప్రశస్తిని పోగొట్టి ప్రశస్తిని కలగజేయుము. చతుర్ముఖుని ముఖమునకు ఆనందము కలిగించు సరస్వతి నిత్యము నా మానసమున నివసించు గాక.

ఓ సరస్వతీదేవీ ! నీకు నమస్కారము. నేను నిన్నే ధ్యానం చేస్తున్నాను. పాశాంకుశ ధారణి ముత్యాలహారము ధరించిన సరస్వతి ఎల్లప్పుడు నా వాక్కు నందుండు గాక.

కంబుకంఠి, సర్వాభరణ భూషిత, అయిన మహాసరస్వతి

ఎల్లప్పుడూ నాజిహ్వాగ్రమున ఉండును గాక.

ఏ ఉపాసకుడు నిరాటంకమైన కవిత్వము, భుక్తిముక్తి కోరతాడో అతడు సరస్వతీ దేవిని ఉపాసించి దశశ్లోకీ నిత్యము పారాయణ చేస్తాడు. ఈ రకంగా పారాయణ చేస్తే ఆరు నెలలో ఫలితము వస్తుంది. అతడు మంచి కవి అవుతాడు. మంచి పండితుడవుతాడు. మహాజ్ఞాని అవుతాడు. మరణానంతరము సరస్వతీదేవి సన్నిధి చేరతాడు. అతడికి పునర్జన్మ ఉండదు.

# 14. భావనోపనిషత్తు

ఈ ఉపనిషత్తు అధర్వణ వేదానికి సంబంధించినది. ఇందులో మొత్తం 49 మంత్రాలుంటాయి.

1 – 10 మంత్రాలు – మానవదేహమే శ్రీచక్రము

11 – 24 మంత్రాలు – శ్రీచక్రంలోని నవావరణలు

25 – 49 మంత్రాలు – అంతఃపూజా విధానాన్ని వివరిస్తాయి.

మోక్షగామియైన వాడు **'అహంబ్రహ్మాస్మి'** అని భావన చేసి అంతరారాధన మాత్రమే చెయ్యాలి. అటువంటి వాడికి సాయుజ్యం లభిస్తుంది. పునర్జన్మ ఉండదు. అని చెబుతోంది ఈ ఉపనిషత్తు. ఇప్పుడు ఉపనిషత్తును చూద్దాం. వేదాలయొక్క ముఖ్యోద్దేశ్యము మోక్షసాధన. మోక్షం కావాలనుకునే వాడు తప్పనిసరిగా అంతఃపూజ చెయ్యాలి కాబట్టి.

'అంతఃపూజ' అంటే ఏమిటో తెలియటానికే ఈ ఉపనిషత్తు అంతా ఇక్కడ ఇస్తున్నాను.

## భావనోపనిషత్తు వివరణ

**1. "ఓం శ్రీగురుః పరమకారణ భూతాశక్తిః"**

**గురుర్బ్రహ్మా, గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।**

**గురుస్సాక్షాత్పరంబ్రహ్మా తస్మై శ్రీగురవే నమః ॥**

మంత్రోపదేశం చేసి దీక్షనొసగిన గురువు త్రిమూర్తి స్వరూపుడు. అజ్ఞానమనే చీకటిని పారద్రోలి జ్ఞానమనే దీపకాంతిని చూపే మహానుభావుడు. అతని యొక్క ఉపదేశంతోనే బ్రహ్మాత్వం సిద్ధిస్తుంది.

అందుకే గురువు సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపము అని చెప్పబడింది.

**నగురోరధికం తత్త్వం । న గురోరధికం తపః ।**

**తత్త్వజ్ఞానాత్ పరం నాస్తి । తస్మై శ్రీగురవే నమః ॥**

గురువుకన్న ఎక్కువ అయిన తత్త్వము లేదు. తపస్సు లేదు. అతను శిష్యునకు ఉపదేశించే జ్ఞానము కన్న ఎక్కువైనది లేదు.

**వందే గురపదద్వంద్వం । అవాఙ్మానస గోచరం ।**

**శ్వేతరక్త ప్రభాభిన్నం । శివశక్త్యాత్మకంపరం ॥**

మనోవాక్కులకు గోచరించనిది, శ్వేత, రక్తకాంతులకన్న అధికమైన కాంతి నిచ్చునది, శివశక్త్యాత్మకమైనది అనగా పరబ్రహ్మస్వరూపమైనది అయిన గురు పాదములకు నమస్కరిస్తున్నాను. అందుకే **"ఓం శ్రీగురుః పరమకారణభూతాశక్తిః"** అనే గురుధ్యానంతో ఈ ఉపనిషత్తు మొదలవుతుంది.

**2. "తేన నవరంధ్రరూపోదేహః నవచక్రం రూపం శ్రీచక్రం"**

మానవదేహము నవరంధ్రములతో కూడినది. శ్రీచక్రము తొమ్మిది చక్రముల (ఆవరణల) సమూహము. త్వగాది ధాతువులు తొమ్మిది. శ్రీచక్రంలోని భూపురం దగ్గర నుండి బిందువు దాకా గల ఆవరణలన్నీ మానవదేహంలోని వివిధ అంగాలు. సాధకుని దేహంలోని షట్చక్రాలు శ్రీచక్రంలోని వివిధ చక్రాలతో ఐక్యము చెందుతున్నాయి. ఈ విషయాలన్నీ 'శ్రీచక్రము-మానవదేహము' అనే అధ్యాయంలో వివరించటం జరిగింది. ఈ రకంగా చూసినట్లైతే **"దేహో దేవాలయ ప్రోక్తోజీవోదేవ స్సనాతనః"** మానవదేహమే శ్రీచక్రము. సాధకుని దేహమే దేవాలయము అని భావించాలి.

### 3. వారాహీపితృరూపా, కురుకుళ్ళావతిదేవతామాతా ।

శ్రీచక్రానికి ప్రధానదేవత శ్రీదేవి, పరాత్పరి. ఆమె శరీరము నుంచి వచ్చిన కాంతిపుంజాలు అష్టసిద్ధులైన అణిమాదిదేవతలు. అలాగే సాధకుడికి తండ్రి వారాహి, తల్లి కురుకుళ్ళావతి. ఇక్కడ 'మాతా' అంటే సాధకుని యొక్క యోగ్యతను బట్టి కోర్కెలుతీర్చునది. అంటే ఐహికవాంఛలు, మోక్షములను ప్రసాదిస్తుంది. మానవ శరీరంలో ఉన్న నాడీమండలంలో ప్రాణనాడి అని చెప్పబడే సుషుమ్నానాడినే 'కురుకుళ్ళా' అంటారు. సుధాసింధువు మధ్య మణిద్వీపమందున్న శ్రీదేవి పట్టణానికి చిత్తము, అహంకారము అనబడే రెండు ప్రాకారాల మధ్య విమర్శరూపకమైన బావి యందుండేది కురుకుళ్ళావతీ అనే దేవత. ప్రముఖమైన దేవత కాబట్టి ఈమెను మాతృదేవతగా భావించాలి. **లలితాస్తవరత్నములో** ఈ విధంగా చెప్పబడింది.

**"కురువిందతరణి నిలయింకులాచలస్పర్ధికుచనమన్మధ్యాం।**
**కుంకుమవిలిప్తగాత్రీంకురుకుళ్ళా మనసికుర్మహేసతతం"॥**

కురువిందరత్నముల పైన నివసించునది, కులపర్వతములకు మించిన స్తనభారముచే వంగిన నడుము కలది, కుంకుమ పూయబడిన దేహము కలది అయిన కురుకుళ్ళాదేవిని మనసా ధ్యానించుచున్నాను. ఛాందోగ్యోపనిషత్తులో చెప్పినట్లుగా బ్రహ్మలోకానికి వెళ్ళేమార్గంలో రెండుఅమృతసరస్సులున్నాయి. అవి ఇరమ్మదీయములు అని చెప్పబడింది. ఇరము అంటే అన్నము మదీయము అంటే ఆనందము. అక్కడ అమృతవర్షము గల 'సోమసవనము' అనే వృక్షము ఉన్నది. ఆ పట్టణానికి అపరాజితము అని పేరు.

## 4. "పురుషార్థాస్సాగరాః"

సప్తసముద్రాలు, సప్తద్వీపాలు దాటిన తరువాత సుధాసముద్రమున్నది. దాని మధ్యలో మణిద్వీపము. మానవదేహంలోని సప్తచక్రాలే సప్తద్వీపాలు. ఆ పైన సప్త సముద్రాలు. ఆ తరువాత సుధాసముద్రము, మణిద్వీపము. సప్త సముద్రాలు సప్త ద్వీపాల వివరాలు ఈ దిగువ ఇవ్వబడ్డాయి.

**సప్త సముద్రాలు :**

1) లవణ (ఉప్పు) సముద్రము, 2) ఇక్షు (చెఱుకు) సముద్రము, 3) సురా (మద్యము) సముద్రము, 4) సర్పి (నెయ్యి) సముద్రము, 5) దధి (పెరుగు) సముద్రము, 6) క్షీర (పాలు) సముద్రము, 7) జల (నీరు) సముద్రము.

**సప్త ద్వీపాలు :**

1) జంబూ ద్వీపము 2) ప్లక్ష ద్వీపము 3) కుశ ద్వీపము 4) క్రౌంచ ద్వీపము 5) శాక ద్వీపము 6) శాల్మలీ ద్వీపము 7) పుష్కర ద్వీపము

బిందుస్థానాన్ని 'ద్వాదశాంతము' అంటారు. ఆధారచక్రం దగ్గర నుండి లెక్క పెట్టినట్లైతే బిందువు పన్నెండవది అవుతుంది.

1) కులపద్మము (మూలాధారానికి క్రింద రక్తవర్ణము గలిగిన సహస్రదళ పద్మము), 2) అష్టదళపద్మము 3) షడ్దళపద్మము 4) మూలాధారము 5) స్వాధిష్టానము 6) మణిపూరము 7) అనాహతము 8) విశుద్ధము 9) విశుద్ధలంబికాగ్రము అష్టదళము 10) అజ్ఞాచక్రము 11) సహస్రకమలము 12) ఆకుల పద్మము (సహస్రారకర్ణిక) దీనినే

బిందు స్థానమని, చంద్రమండలమని అంటారు.

**5. "దేహో నవరత్న ద్వీపః'**

సాధకుని శరీరమే సుధా సముద్రము మధ్యలో ఉన్నటువంటి నవరత్నమయమైన ద్వీపము ఇదే మణిద్వీపము. ఆ దేవికి నిలయము. అంటే దేవి ఎక్కడో లేదు. సాధకుని శరీరంలోనే ఉన్నది.

**6. "త్వగాదిసప్తధాతుభిరనేకైస్సంయుక్తా సంకల్పాః కల్పతరవః "**

మానవదేహము ఏడు దాతువుల వలన ఏర్పడింది. వాటినే సప్తధాతువులు అంటారు. అవి... 1) చర్మము 2) రక్తము 3) మాంసము 4) మెదడు 5) ఎముకలు 6) మజ్జ 7) శుక్లము

దేవి మణిద్వీపంలోని కల్పవృక్షాఛాయలో ఉంటుంది. మానవదేహంలోని సంకల్పాలే కల్పవృక్ష సముదాయము. ఆ చోటనే దేవి ఉంటుంది.

**7. "తేజఃకల్పకోద్యానం"**

సహస్రారంలో ఉండే దేవి యొక్క ప్రతిబింబమే జీవస్వరూపము, దానియొక్క కాంతి కిరణాలే శరీరమంతా వ్యాపించి ఉన్నాయి. ఈ కిరణాల కాంతులనే 'కల్పకోద్యానము' అంటారు.

**8. "రసనయాభావ్యమానా మధురామ్లతిక్తకటుకషాయ లవణరసా షడృతవః"**

నాలుకకు తెలిసే రుచులు ఆరు. ఈ ఆరు రుచులనే ఆరు ఋతువులుగా భావించాలి. వాటి వివరాలు ఈ విధంగా ఉంటాయి.

| రుచులు | - | ఋతువులు |
|---|---|---|
| 1. తీపి | – | వసంత ఋతువు |
| 2. ఉప్పు | – | గ్రీష్మ ఋతువు |
| 3. కారము | – | వర్ష ఋతువు |
| 4. పులుపు | – | శరదృతువు |
| 5. చేదు | – | హేమంత ఋతువు |
| 6. వగరు | – | శశిర ఋతువు |

ఈ రకంగా ఇప్పటి వరకు దేవీ నివాసమైన మణిద్వీపము, సాధకుని దేహము ఒకటే అని చెప్పబడింది. ఇక పరివార దేవతల వివరణ.

**9. "క్రియాశక్తి పీఠంకుడలినీ, జ్ఞానశక్తిర్గృహా, ఇచ్ఛాశక్తిర్మహాత్రిపురసుందరీ"**

మానవదేహము త్రిశక్తిమయము అవి 1) ఇచ్ఛా 2) జ్ఞాన 3) క్రియాశక్తులు. ఈ శక్తుల వలననే పనులు జరుగుతాయి. వీటిలో మొదటిదైన ఇచ్ఛాశక్తి అనేది విశ్వరూపము. జ్ఞానశక్తి అనేది మందిరము. క్రియాశక్తి అనేది పీఠము, ఏదైనా ఒక పని చేయాలనే ఆలోచన ముందుగా మెదడులో వస్తుంది. అదే ఇచ్ఛాశక్తి లేక పరాశక్తి. ఇది ఆధారాది చక్రాలగుండా పశ్యంతీ, మధ్యమా, వైఖరీ రూపములు పొందుతుంది.

**10. "జ్ఞాతాహోతా జ్ఞానమర్ఘ్యం జ్ఞేయగ్ంహవిః జాతృజానజ్ఞేయోనామ భేదభావనగ్ం శ్రీచక్రపూజనమ్"**

ఇక్కడ మూడు పదాలు చెప్పబడ్డాయి అవి

1. జ్ఞాత - విషయ పరిజ్ఞానము కలవాడు సాధకుడు
2. జ్ఞానము - తెలుసుకొనవలసినది
3. జ్ఞేయము - తెలుసుకొనబడినది

ఈ మూడింటిని 'త్రిపుటి' అంటారు. జ్ఞానము అభివృద్ధి చెందినప్పుడు మిగిలిన రెండూ అంటే జ్ఞాత, జ్ఞేయములు దానియందు లీనమయిపోతాయి. అప్పుడు మిగిలేది జ్ఞానము ఒక్కటే. అదే పరబ్రహ్మానందము.

సాధకుడే అంతర్యాగానికి యజమాని. అతడే జ్ఞాత. అర్ఘ్యమే జ్ఞానము. జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయాలను ఐక్యము చెయ్యటమే శ్రీచక్రపూజ. దేవి జ్ఞానాజ్ఞేయ స్వరూపిణి, జ్ఞానము వలన మాత్రమే తెలుసుకోతగినది. కాబట్టి త్రిపుటిని లయం చేయటమే శ్రీచక్రపూజ అయి బ్రహ్మానందాన్నిస్తుంది.

## 11. "వియతి సహిత శృంగారాదయో నవరసా అణిమాదయః'

**ప్రథమావరణ :**

ఇక్కడ శ్రీచక్రంలోని ఆవరణ దేవతలను వివరిస్తున్నారు. చక్రార్చన భూపురం నుంచి ప్రారంభించి బిందువుతో పూర్తి చెయ్యాలి. అందుకని ప్రధమావరణ అయిన భూపుర దేవతలను వివరిస్తున్నారు.

భూపురంలో మూడు రేఖలున్నాయి. వాటిలో మొదటి రేఖయందు అన్నివైపులా అణిమాది సిద్ధులున్నాయి. సాధకుని శరీరంలో నవరసాలున్నాయి. ఈ నవరసాలే ప్రధమావరణలోని ప్రధమరేఖలో ఉన్న దేవతలు. వాటి వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| సాధకుని శరీరంలోని నవరసాలు | | ప్రధమ రేఖలోని దేవతలు |
|---|---|---|
| 1. శృంగారరసము | – | అణిమాసిద్ధి |
| 2. హాస్యరసము | – | లఘిమాసిద్ధి |
| 3. కరుణరసము | – | గరిమాసిద్ధి |
| 4. రౌద్రరసము | – | మహిమాసిద్ధి |
| 5. వీరరసము | – | ఈశిత్వసిద్ధి |
| 6. భయానకరసము | – | వశత్వసిద్ధి |
| 7. భీభత్సరసము | – | ప్రాకామ్యసిద్ధి |
| 8. అద్భుతరసము | – | ప్రాప్తిసిద్ధి |
| 9. శాంత రసము | – | సర్వకామసిద్ధి |

**12. "కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్య పుణ్యపాప మయా బ్రాహ్మ్యాద్యష్టశక్తయః"**

భూపురంలో రెండవరేఖలో ఉన్న ఎనిమిదిమంది దేవతలు, సాధకుని శరీరంలోని మనోవికారాలుగా చెప్పబడ్డాయి. వాటి వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| మనోవికారాలు | | ద్వితీయ రేఖలోని దేవతలు |
|---|---|---|
| 1. కామము | – | బ్రాహ్మీ |
| 2. క్రోధము | – | మహేశ్వరి |
| 3. లోభము | – | కౌమారీ |
| 4. మోహము | – | వైష్ణవీ |
| 5. మదము | – | వారాహీ |
| 6. మాత్సర్యము | – | మహేంద్రీ |
| 7. పుణ్యము | – | చాముండా |

8. పాపము – మహాలక్ష్మి

## 13. "ఆధారనవకం ముద్రాశక్తయః"

సాధకుని శరీరంలో మూలాధారం నుండి ద్వాదశాంతము వరకు గల తొమ్మిది స్థానాలు భూపురంలోని తృతీయ రేఖలో గల తొమ్మిది ముద్రాశక్తులు వాటి వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| సాధకుని శరీరంలోని స్థానాలు | | ముద్రాశక్తులు |
|---|---|---|
| 1. మూలాధారము | – | సర్వసంక్షోభిణీ శక్తి |
| 2. స్వాధిష్టానము | – | సర్వవిద్రావణీశక్తి |
| 3. మణిపూరము | – | సర్వాకర్షిణీ శక్తి |
| 4. అనాహతము | – | సర్వవశంకరీ శక్తి |
| 5. విశుద్ధిచక్రము | – | సర్వోన్మాదినీ శక్తి |
| 6. లంబికాగ్రము | – | సర్వమహాంకుశాశక్తి |
| 7. ఆజ్ఞాచక్రము | – | సర్వఖేచరీశక్తి |
| 8. సహస్రారము | – | సర్వబీజాశక్తి |
| 9. ద్వాదశాంతము | – | సర్వయోని శక్తి |

## 14. "పృథివ్యాపస్తేజోవాయ్వాకాశ శ్రోత్రత్వక్ చక్షుర్జిహ్వా ఘ్రాణవాక్పాణి పాదపాయూపస్థ మనోవికారా షోడశశక్తయ"

**ద్వితీయావరణ :**

శ్రీచక్రంలో రెండవఆవరణ షోడశదళము. దీనిలో పదహారు దళాలుంటాయి. వీటిలో పదహారుమంది ఆకర్షణ దేవతలుంటారు. వీరు పంచభూతాలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సుల యొక్క స్వరూపాలు. వాటి వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| పంచభూతాలు, ఇంద్రియాలు | | ద్వితీయవరణలోని దేవతలు |
|---|---|---|
| 1. పృథివి | – | కామాకర్షిణీదేవి |
| 2. జలము | – | బుద్ధ్యాకర్షిణీదేవి |
| 3. అగ్ని | – | అహంకారాకర్షిణీదేవి |
| 4. వాయువు | – | శబ్దాకర్షిణీదేవి |
| 5. ఆకాశము | – | స్పర్శాకర్షిణీదేవి |
| 6. కన్ను | – | రూపాకర్షిణీదేవి |
| 7. ముక్కు | – | రసాకర్షిణీదేవి |
| 8. చెవి | – | గంధాకర్షిణీదేవి |
| 9. నాలుక | – | చిత్తాకర్షిణీదేవి |
| 10. చర్మము | – | ధైర్యాకర్షిణీదేవి |
| 11. వాక్కు | – | స్మృత్యాకర్షిణీదేవి |
| 12. పాణి (చేయి) | – | నామాకర్షిణీదేవి |
| 13. పాదము (కాలు) | – | బీజాకర్షిణీదేవి |
| 14. పాయువు (గుదము) | – | ఆత్మాకర్షిణీదేవి |
| 15. ఉపస్థ (రహస్యాంగము) | – | అమృతాకర్షిణీదేవి |
| 16. మనస్సు | – | శరీరాకర్షిణీదేవి |

**15. 'వచనాదానాగమన విసర్గానందహానో పాదానోపేక్షా బుద్ధ యోసంగ కుసుమాది శక్తి యోష్ఠా'**

**తృతీయావరణ :**

శ్రీచక్రంలో తృతీయావరణ అష్టదళపద్మము. ఇందులో ఎనిమిది దళాలుంటాయి. ఆ దళాలలో ఎనిమిదిమంది దేవతలుంటారు. మానవ

దేహంలో ఉండే కర్మేంద్రియాల ధర్మాలు. ప్రవృత్తి, నివృత్తి ఉపేక్ష అనేవే ఈ ఎనిమిది మంది దేవతలు. వాటి వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| ఇంద్రియ ధర్మాలు | | తృతీయావరణ దేవతలు |
|---|---|---|
| 1. వచనము | – | అనంగకుసుమాదేవి |
| 2. దానము | – | అనంగమేఖలాదేవి |
| 3. గమనము | – | అనంగమదనాదేవి |
| 4. విసర్గము (మలవిసర్జన) | – | అనంగమదనాతురాదేవి |
| 5. సంభోగము | – | అనంగరేఖాదేవి |
| 6. ప్రవృత్తి | – | అనంగవేగినీదేవి |
| 7. నివృత్తి | – | అనంగాంకుశాదేవి |
| 8. ఉపేక్ష | – | అనంగమాలినీదేవి |

**16. "అలంబుసా, కుహూ, విశ్వోదరీ, వరుణా, హస్తిజిహ్వా, యశస్వతీ, అశ్వనీ, గాంధారీ, పూషా, శంఖినీ, సరస్వతీ, ఇడా, పింగళా, సుషుమ్నా, చేతి, చతుర్దశనాద్యః, సర్వంక్షోభిణ్యాది చతుర్దశ దేవతాః"**

**చతుర్ధావరణ :**

శ్రీచక్రంలో నాలుగవఆవరణ చతుర్దశకోణము. ఇందులో పద్నాలుగు కోణాలుంటాయి. అవి పద్నాలుగు లోకాలకు ప్రతీక. మానవదేహంలోని పద్నాలుగు ముఖ్యమైన నాడులే ఈ ఆవరణలో ఉండే దేవతలు. వాటి వివరాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

| **దేహంలోని నాడులు** | | **చతుర్ధావరణలోని దేవతలు** |
|---|---|---|
| 1. అలంబుసా | – | సర్వసంక్షోభిణీదేవి |
| 2. కుహూ | – | సర్వవిద్రావిణీదేవి |
| 3. విశోప్దరీ | – | సర్వాకర్షిణీదేవి |
| 4. వరుణా | – | సర్వాహ్లాదినీదేవి |
| 5. హస్తిజిహ్వా | – | సర్వసమ్మోహినీదేవి |
| 6. యశస్వతీ | – | సర్వస్తంభినీదేవి |
| 7. అశ్వనీ | – | సర్వజృంభిణీదేవి |
| 8. గాంధారీ | – | సర్వవశంకరీదేవి |
| 9. పూషా | – | సర్వరంజనీదేవి |
| 10. శంఖినీ | – | సర్వోన్మాదినీదేవి |
| 11. సరస్వతీ | – | సర్వార్ధసాధికాదేవి |
| 12. ఇడా | – | సర్వసంపత్తిపూరిణీదేవి |
| 13. పింగళా | – | సర్వమంత్రమయీదేవి |
| 14. సుషుమ్నా | – | సర్వద్వంద్వక్షయంకరీదేవి |

**17. ప్రాణాపాన, వ్యానో, దాన, సమాన, నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయా దశవాయవ స్సర్వసిద్ధిప్రదాది దేవ్యో బహిర్దశారదేవతాః"**

**పంచమావరణ :**

శ్రీచక్రంలోని ఐదవఆవరణ బహిర్దశారము. ఇక్కడ పదికోణాలున్నాయి. వాటిలో పదిమందిదేవతలున్నారు. సాధకుని శరీరంలోని ప్రధానవాయువులు, ఉపవాయువులే ఈ దేవతలు. వాటి

వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| వాయువుల పేర్లు | | పంచమావరణలోని దేవతలు |
|---|---|---|
| 1. ప్రాణవాయువు | – | సర్వసిద్ధిప్రదాదేవి |
| 2. అపానవాయువు | – | సర్వసపత్ప్రదాదేవి |
| 3. వ్యానవాయువు | – | సర్వప్రియంకరీదేవి |
| 4. ఉదానవాయువు | – | సర్వమంగళకారిణీదేవి |
| 5. సమానవాయువు | – | సర్వకామప్రదాదేవి |
| 6. నాగవాయువు | – | సర్వదుఃఖవిమోచనీదేవి |
| 7. కూర్మవాయువు | – | సర్వమృత్యుప్రశమనీదేవి |
| 8. కృకరవాయువు | – | సర్వవిఘ్ననివారిణీదేవి |
| 9. దేవదత్తము | – | సర్వాంగసుందరీదేవి |
| 10. ధనుంజయము | – | సర్వసౌభాగ్యదాయనీదేవి |

**18. "ఏతద్వాయుదశక సంసర్గోపాధి భేదేన రేచకపూరక శోషక దాహక ప్లావకామృతమితి ప్రాణముఖ్యత్వేన పంచవిధోస్తి మనుష్యాణాం మోహకో దహఖో భక్ష్య భోజ్య లేహ్య చోష్య ప్రేయాత్మకం చతుర్విధమన్నం పాచయంత్యేతాః దశధనకలాసర్వజ్ఞత్వా ద్యంతర్దశారదేవతాః**

**షష్ఠమావరణ :**

శ్రీచక్రంలో ఆరవ ఆవరణ అంతర్దశారము. దీనిలో కూడా పది కోణాలు ఉంటాయి. ఈ కోణాలలో పదిమంది దేవతలున్నారు. సాధకుని శరీరంలోని దశవిధ వాయువుల వల్ల కలిగే గుణాలు, చతుర్విధాన్నములు పచనము చేయు శక్తులే ఈ దేవతలు. ఈ

ఆవరణలోని పది దేవతలు, వాటి వివరాలు ఈ దిగువ ఇవ్వబడ్డాయి.

| దశవిధవాయువుల గుణములు | | షష్ఠమావరణ దేవతలు |
|---|---|---|
| 1. రేచకము (ఊపిరి విడచుట) | – | సర్వజ్ఞాదేవి |
| 2. పూరకము (ఊపిరి పూరించుట) | – | సర్వశక్తిదేవి |
| 3. శోషకము (శోషిల్లుట) | – | సర్వైశ్వర్యప్రదాయిని |
| 4. దాహకము (దాహక గుణము) | – | సర్వజ్ఞానమయి |
| 5. ప్లావకము (ప్లావకగుణము) | – | సర్వవ్యాధి నివారిణి |

**వివిధ అన్నములు :**

| | | |
|---|---|---|
| 1. భక్ష్యము (తినదగినది) | – | సర్వాధారస్వరూపిణి దేవి |
| 2. భోజ్యము (భుజింపతగినది) | – | సర్వపాపహరాదేవి |
| 3. లేహ్యము (నాకి భుజింపతగినది) | – | సర్వానందమయిదేవి |
| 4. చోష్యము (పీల్చుతగినది) | – | సర్వరక్షాసర్వరూపిణి |
| 5. పేయము (త్రాగతగినది) | – | సర్వేపిసత్ఫలప్రదాదేవి |

## 19. "శీతోష్ణ సుఖదుఃఖేచ్ఛా సత్త్వరజస్తమోగుణా వశిన్యాది శక్త యోష్టా"

**సప్తమావారణ :**

శ్రీచక్రంలో ఏడవఆవరణ అష్టకోణము. దీని ఎనిమది కోణాలలోను ఎనిమిది మంది దేవతలున్నారు. వారుకూడా సాధకుని శరీరంలో ఉండే లక్షణాలే. వాటి వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| సాధకుని శరీరంలో గల లక్షణాలు | | సప్తమావరణలోని దేవతలు |
|---|---|---|
| 1. శీతము | – | వశినీ |

| | | |
|---|---|---|
| 2. ఉష్ణము | – | కామేశ్వరీ |
| 3. సుఖము | – | మోదినీ |
| 4. దుఃఖము | – | విమలా |
| 5. ఇచ్ఛ | – | అరుణా |
| 6. సత్వగుణము | – | జయినీ |
| 7. రజోగుణము | – | సర్వేశ్వరీ |
| 8. తమోగుణము | – | కౌళినీ |

## 20. "శబ్ద స్పర్శ రూప రస గంధాః పంచతన్మాత్రా పంచ పుష్పబాణాః"

**బాణాలు :**

దేవి చేతియందు పుష్పబాణమున్నది. అది ఒక పూవుకాదు. ఐదుపుష్పాలు అవే పంచతన్మాత్రలు. పంచభూతాల ధర్మాలు వస్తువుయొక్క స్థూలస్వరూపమే గుణము. సూక్ష్మరూపము తన్మాత్ర. బాణాలు మూడురకాలు.

| | | |
|---|---|---|
| 1. స్థూలములు | – | పుష్పబాణాలు |
| 2. సూక్ష్మములు | – | బీజరూపాలు |
| 3. కారణములు | – | వాసనారూపాలు |

ఈ బాణాల పేర్లు ఒక్కొక్క చోట ఒక్కొక్క విధంగా ఉన్నాయి.

1. కాదిమతంలో

| | | |
|---|---|---|
| 1. కమలము | – | ఎర్రతామర |
| 2. రక్తకైరవము | – | తెల్లకలువ |
| 3. కల్హారము | – | కొంచెము ఎరుపు రంగుకల కలువ |

4. ఇందీవరము - నల్లకలువ
5. సహకారము - మామిడిపూవు

దేవిచేతిలోని బాణాలవివరాలు ఇతర గ్రంథాలలో ఈ విధంగా ఉన్నాయి.

| | **కాలికాపురాణము** | **జ్ఞానార్ణవము** | **తంత్రరాజము** |
|---|---|---|---|
| 1. | హర్షణము | క్షోభణము | మదన |
| 2. | శోచనము | ద్రావణము | ఉన్మాద |
| 3. | మోహనము | ఆకర్షణము | మోహన |
| 4. | శోషణము | వశ్యము | దీపన |
| 5. | మారణము | ఉన్మాదము | శోషణ |

దేవి చేతిలో బాణాలు తన్మాత్రలు. అందుకనే దేవి. **'పంచతన్మాత్రసాయకా'** అని చెప్పబడింది.

**21. "మన ఇక్షుధనుః వశ్యోబాణః రాగఃపాశో ద్వేషోంకుశః"**

**ధనుస్సు :**

దేవి చేతిలో ఉన్న ఆయుధములు సాధకునిలో గల రాగద్వేషాలు.

చెరకువిల్లు - సాధకుని మనస్సు
బాణము - వశ్యత
పాశము - అనురాగము
అంకుశము - ద్వేషము

**22. "అవ్యక్త మహత్తత్త్వాహంకారాః కామేశ్వరీ, వజ్రేశ్వరీ,**

భగమాలిన్యోంతస్త్రి కోణాగ్రగాదేవతా"

**అష్టమావరణ :**

శ్రీచక్రంలో ఎనిమిదవ ఆవరణ త్రికోణము. అక్కడ ముగ్గురు దేవతలున్నారు. వారు సాధకుని మనసులోని....

1. అవ్యక్తము – కామేశ్వరీ
2. మహత్తత్త్వము – వజ్రేశ్వరీ
3. అహంకారము – భగమాలినీ

వీరు శక్తిస్వరూపిణులయిన పార్వతి, లక్ష్మి సరస్వతులు

**23. "పంచదశతిథి రూపేణ కాలస్య పరిమాణావలోకనం పంచదశనిత్యాః'**

**అష్టమావరణ :**

శ్రీచక్రంలో ఎనిమిదవ ఆవరణ అయిన త్రికోణంలో మూడు రేఖలున్నాయి. వాటిలో రేఖకు ఐదుగురు చొప్పున పదిహేనుమంది దేవతలున్నారు. వీరినే నిత్యాదేవతలంటారు. ఈ నిత్యలు తిథుల స్వరూపాలు. వీటి వివరాలు ఈ క్రింద ఇవ్వబడినాయి.

| | **తిథులు** | | **నిత్యాదేవతలు** |
|---|---|---|---|
| 1. | పాడ్యమి | – | కామేశ్వరీ |
| 2. | విదియ | – | భగమాలినీ |
| 3. | తదియ | – | నిత్యక్లిన్నా |
| 4. | చవితి | – | భేరుండా |
| 5. | పంచమి | – | వహ్నివాసినీ |

| | | |
|---|---|---|
| 6. షష్ఠి | – | మహావజ్రేశ్వరీ |
| 7. సప్తమి | – | శివదూతీ |
| 8. అష్టమి | – | త్వరితా |
| 9. నవమి | – | కులసుందరీ |
| 10. దశమి | – | నిత్యా |
| 11. ఏకాదశి | – | నీలపతాకా |
| 12. ద్వాదశి | – | విజయా |
| 13. త్రయోదశి | – | సర్వమంగళా |
| 14. చతుర్దశి | – | జ్వాలామాలినీ |
| 15. పూర్ణిమ అమావాస్య | – | చిత్రా |

ఈ నిత్యా దేవతల ధ్యానశ్లోకాలు, స్వరూపాలు నాచే వ్రాయబడిన **'శ్రీవిద్యాదర్పణము'**లో ఇవ్వబడినాయి. నిత్యలు తిథుల స్వరూపాలు, తిథులు కళాస్వరూపాలు. వీటివల్లనే కాలచక్రం తిరుగుతున్నది.

**24. "శ్రద్ధానురూపాధీర్దేవతాతయోః కామేశ్వరీ సదానంద ఘనాపూర్ణా స్వాత్మైక రూపాదేవతా"**

**నవమారణ :**

శ్రీచక్రంలో తొమ్మిదవ ఆవరణ బిందువు. ఇందున్న ప్రధానదేవతలు కామేశ్వరీ కామేశ్వరులు. ఇందులో సాధకుడి ఆత్మయే కామేశ్వరి, బుద్ధి కామేశ్వరుడు. కాబట్టి సాధకుడి ఆత్మ, దేవి రెండూ ఒక్కటే. ఎప్పుడయితే తన ఆత్మ దేవి స్వరూపం అయిందో, అప్పుడు అతడు పరబ్రహ్మ అవుతాడు. దీనినే బ్రహ్మాత్మైక్యాను సంధానము అంటారు. ఇదే జీవన్ముక్తి.

**25. "సలిలమితి సాహిత్యకరణగ్ం సత్వమ్"**

**ఇక్కడ నుంచి అంతర్యాగము వివరించబడుతోంది.** బాహ్యమైన వస్తువులన్నీ విషయ వాంఛలకు ప్రతీకలు. కాబట్టి వాటిని వదలి పెట్టెయ్యాలి. శరీరంలో ఉండే వస్తువుల చేతనే పూజ జరగాలి. పూజకు ముఖ్యమైనది జలము. సాధకుని శరీరంలో సత్వ రజ స్తమో గుణాలన్నాయి. వీటిలో మొదటి దానిని పెంపొందించి, మిగిలిన రెండింటినీ తగ్గించాలి. సత్వగుణమే జలము.

**26. "కర్తవ్యమకర్తవ్య మౌదాసీన్యమితి వివేక భావనాయుక్త ఉపచారః"**

**ఉపచారాలు :**

బాహ్యపూజలో దేవికి రాజోపచారాలు, దేవోపచారాలు, మంత్రోపచారాలు అని వివిధ రకాలైన ఉపచారాలున్నాయి. అయితే అంతఃపూజలో ఉపచారము అంటే నిత్యము కానివాటిని వదలివేయటము. బ్రహ్మపదార్ధమే సత్యము కాబట్టి మిగిలినవి వదలివేయాలి. ఉదాసీనభావము తూష్ణీభావంగా రూపొందకూడదు. ఇదే అంతఃపూజలో ప్రధానమైన ఉపచారము.

**27. "అస్తి నాస్తీతి కర్తవ్యతా అనుపచారః"**

**అనుపచారాలు :**

బ్రహ్మము ఒక్కటే సత్యము, నిత్యము. అది కనిపించనంత మాత్రం చేత లేదు అనుకోరాదు. సర్వజీవరాశులయందు పరబ్రహ్మమున్నది. అంతేకాని బ్రహ్మము లేదనుకోవటము అపచారము, తెలియనితనము, అపరాధము. ఇదే అనుపచారము, చేయతగనిది.

**28. "బాహ్యాంతఃకరణానాం రూపగ్రహణ యోగ్యతాస్తి త్వావాహనమ్"**

**ఆవాహన :**

దేహంలో బాహ్యేంద్రియాలు, అంతరింద్రియాలున్నాయి. ఆత్మ అనేది ఈ ఇంద్రియాల ద్వారానే ప్రకాశిస్తోంది. కాబట్టి వాటి యొక్క దేవతారూపాన్ని ఆవాహన చెయ్యటమే దేవిని ఆవాహన చెయ్యటము.

**29. "తస్యబాహ్యాంతఃకరణానా మేకరూప విషయ గ్రహణమాసనమ్"**

**ఆసనము :**

శరీరంలో ఉన్న జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనే పద్నాలుగు విభిన్నమైన ధర్మాలు కలిగిఉన్నాయి. ఆ ధర్మాలను అరికట్టి సర్వము బ్రహ్మపదార్ధము అని భావించటమే ఆసనసమర్పణ.

**30. "రక్తశుక్ల పదైకీకరణం పాద్యమ్"**

**పాద్యము :**

పాద్యము అంటే కాళ్ళు కడుక్కునేనీరు. ఆ దేవి సాధకుడి శరీరంలో ద్వాదశాంతంలో ఉన్నది. బ్రహ్మము (ప్రకాశశక్తి) ఆత్మశక్తిలో ప్రవేశించి శుక్లబిందువయింది. విమర్శ శక్తి శుక్లబిందువులో ప్రవేశించి రక్తబిందువయింది. ఈ రెండింటి కలయిక వలన మిశ్రమబిందువు ఏర్పడింది. ఇప్పుడు....

రక్తబిందువు - చంద్రుడు

శుక్లబిందువు - అగ్ని

మిశ్రమబిందువు - సూర్యుడు

మిశ్రమబిందువు నుంచి నాదము, దాని నుంచి కళలు ఆవిర్భవిస్తాయి. ఇప్పుడు మిశ్రమ బిందుస్వరూపమైన కామేశ్వరీ ద్వంద్వము యొక్క

కుడికాలు - శుక్లవర్ణమైన ప్రకాశాంశము

ఎడమకాలు - రక్తవర్ణమైన విమర్శాంశము

ఈ రెండు పాదాలను ధ్యానిస్తూ వాటికి భేదము లేదు అని తెలుసుకోవటమే పాద్యము.

**31. "ఉజ్జ్వల దామోదానుసంధానమర్ఘ్యమ్"**

**అర్ఘ్యము :**

అర్ఘ్యము అంటే చేతులు కడుక్కునే నీరు. శ్రమ తీరటానికి ఇచ్చే అల్పాహారం. అంటే త్రాగేందుకు ఇచ్చే నీరు. అంతఃపూజలో ఆత్మయే శ్రీదేవి అని గ్రహించి బ్రహ్మానందాను సంధానము చెయ్యటమే అర్ఘ్యప్రదానము.

**32. "స్వచ్ఛంస్వతస్సిద్ధ మిత్యాచమనీయమ్"**

**ఆచమనము :**

ఆచమనము అంటే మంత్రపూర్వకంగా నోటిలోకి తీసుకునే నీరు. ఆత్మ స్వరూపమైన దేవి స్వచ్ఛమైనది. ఆస్వచ్ఛత స్వయంసిద్ధమైనది అని గ్రహించుట.

**33. "చిచ్ఛంద్రమయీ సర్వాంగస్రవణగ్ం స్నానమ్"**

**స్నానము :**

బాహ్యపూజలో దేవతకు పంచామృత స్నానము చేయిస్తారు. కాని అంతఃపూజలో అదిలేదు. కుండిలినీశక్తి ఆధారచక్రంలో నిద్రిస్తూ ఉంటుంది. సాధకుడు ప్రాణాయామం చేసి కుండలినీశక్తిని గనక నిద్రలేపినట్లైతే, అది షట్చక్రాల గుండా ప్రయాణించి, గ్రంథిత్రయాన్ని భేదించి సహస్రారంచేరి తననోటితో సహస్రదళ పద్మాన్ని కరిచి పట్టుకుంటుంది. అప్పుడు సహస్రారము అనే చంద్రమండలం నుండి అమృతధారలు స్రవించి శరీరంలోని డెబ్బైరెండువేల నాడీమండలాన్నీ తడుపుతాయి. ఈ రకంగా అమృతవర్షము కురిపించటమే ఆత్మదేవత ((పరదేవత)కు స్నానము. ఈ రకంగా అమృతవర్షము వలన శరీరము సమశీతోష్ణమవుతుంది.

**34. "చిదగ్ని స్వరూప పరమానందశక్తి స్ఫురణం వస్త్రం"**

**వస్త్రము :**

వస్త్రము అంటే శరీరాచ్ఛదనకు ఉపయోగించేది. సాధకుని శరీరంలోని కాంతి అంతా ఆ పరాశక్తి యొక్క తేజస్సే. ఈ విషయం తెలిసి బ్రహ్మానందము పొందుటయే వస్త్రప్రదానము.

**35. "బ్రహ్మనాడీ బ్రహ్మసూత్రమ్"**

**యజ్ఞోపవీతము :**

యజ్ఞోపవీతాన్నే బ్రహ్మసూత్రము అంటారు. జగత్తుఅంతా బ్రహ్మమయమనే సూత్రము కాబట్టి ఇది బ్రహ్మసూత్రము. దేహంలో

ఉండే నాడులలో సుషుమ్నానాడి ముఖ్యమైనది. దీన్నే బ్రహ్మనాడి అనికూడా అంటారు. అంతఃపూజలో ఈ సుషుమ్నా నాడినే బ్రహ్మసూత్రము అని భావించాలి.

గాయత్రీమంత్రానికి ప్రతీక యజ్ఞోపవీతము. తొంభైఆరు బెత్తలు ప్రమాణం కల సూత్రము (దారము) తయారుచేసి దాన్ని మూడుచుట్లు చుట్టాలి. ఇప్పుడు రెండు చివరలు కలిపి ముడివెయ్యాలి. ఇందులోని సూత్రములో మూడు పోగులుంటాయి. అంటే మొత్తం ఇరవై ఏడు పోగులు ఉంటాయి. తొంభైఆరు బెత్తలు ప్రమాణము ఇవే తొంభైఆరు తత్త్వములు.

| | | |
|---|---|---|
| మూడు ఆవృతులు | – | త్రిగుణములు |
| మూడు ముడులు | – | మూడు గ్రంథులు |
| మూడు గ్రంథులు | – | బ్రహ్మముడి |
| ఇరవైఏడు పోగులు | – | ఇరవైఏడు భేదములు కల జగత్తు |

బ్రాహ్మణులు యజ్ఞోపవీతాన్ని ధరించి కర్మలు చేస్తారు. యజ్ఞోపవీతాన్ని తీసి వేయటమంటే సన్యాసం స్వీకరించటం. కర్మపరిత్యాగం చెయ్యటం. అట్టి సన్యాసి బ్రహ్మకాండను చేసేవాడు. సర్వకర్మ విముక్తుడు, జీవన్ముక్తుడు.

సుషుమ్నానాడిలో సూక్ష్మనాడులు కలిసేచోటును గ్రంథి అంటారు. అది ఇరవైఏడు సూక్ష్మనాడుల సమూహము. అందుకనే సుషుమ్నానాడి యజ్ఞోపవీతము కంటె సత్యమైనది. సహజమైనది. ఇదే కంఠ సూత్రము.

**36. “స్వవ్యతిరిక్తవస్తు సంగరహిత స్మరణం విభూషణమ్”**

**ఆభరణాలు :**

దేవతకు కంఠ సూత్రంతో పాటుగా వివిధ ఆభరణాలు సమర్పించాలి. సాధకుడు తాను కూడా పరబ్రహ్మ స్వరూపమే అని, మాయామోహంచేత తానుమనిషిగా ఉన్నానని గ్రహించి మాయాది వస్తువులతో తనకు సంబంధములేదు అని వాటిని పరిత్యజించటమే దేవికి ఆభరణములు అర్పించటము.

## 37. "సత్సంగ పరిపూతానుస్మరణం గంధః"

**గంధము :**

దేహానికి గంధం రాసుకోవటం చేత సువాసన రావటమే కాకుండా పవిత్రత కూడా వస్తుంది. సాధకుడి సహస్రారంలో ఆ పరాశక్తి ఉన్నదని, దాని కాంతిచేతనే అతని శరీరము తేజస్సుతో ప్రకాశిస్తుందని చెప్పటం జరిగింది. ఈ రకంగా జరగటం చేత సాధకుడు తాను ఎప్పుడూ పవిత్రుడనే అనేభావం కలిగిఉంటాడు. ఇదే దేవికి శ్రీచందనం సమర్పణ.

## 38. "సమస్త విషయాణాం మనసః స్థైర్యేణానుసంధానం కుసుమమ్"

**పూజ :**

భగవంతుని భక్తుడు నానావిధ పుష్పాలతో పూజిస్తాడు. ఇంద్రియవాంఛలకు లోనుగాకుండా, మనసును పరబ్రహ్మమందు లయంచేసి, సర్వము బ్రహ్మమని తెలుసుకోవటమే పుష్పపూజ.

**"అహింసా ప్రథమ పుష్పం, పుష్పమింద్రియనిగ్రహః ।**
**దయాక్షమాజ్ఞానపుష్పం పంచపుష్పం తతఃపరం" ॥**

అహింస, ఇంద్రియ నిగ్రహము, దయ, క్షమ, జ్ఞానము అనేవి పంచపుష్పాలు. సాధకుడు అరిషడ్వర్గాలు జయించి, అహంకారమనే పుష్పంతో దేవిని పూజించాలి. అంటే ఈ స్థితిలో నేను అనే అహంకారాన్ని, నాది అనే భ్రాంతిని వదలివెయ్యాలి.

**39. "తేషామేవ సర్వదాస్వీకరణం ధూపః"**

**ధూపం :**

సాధకుడు ఇంద్రియ చాపల్యానికి లోనుగాకుండా, ఇంద్రియాలను తన స్వాధీనంలో ఉంచుకోవటమే ధూపము.

**40. "పవనావచ్ఛిన్నోర్ధ్వజ్వలన సచ్చిదుల్కాకాశదేహో దీపః"**

**దీపం :**

బ్రహ్మతేజస్సు వాయువుతో కలసి జ్వాలగా ప్రకాశిస్తుంది. అది విశ్వమంతా వ్యాపించి ఉంది. సాధకుడి శరీరము పరబ్రహ్మము యొక్క కాంతిపుంజములతో ప్రకాశిస్తోంది. ఇప్పుడు సాధకుడు ఆకాశాన్నే తన శరీరంగా భావించి, తన శరీరంలో ఉన్న ఆ పరాశక్తిని, చిత్కలను దీపముగా భావించటమే దేవికి దీపసమర్పణ.

**41. "సమస్తయాతాయాత వర్జనం నైవేద్యమ్"**

**నైవేద్యము :**

పూజానంతరము నైవేద్యము చెయ్యాలి. ఇంద్రియ చాంచల్యము లేకుండా అంటే ఇంద్రియాలను జయించి బ్రహ్మాకారవృత్తితో ఉండటమే నైవేద్యము. ఇది బ్రహ్మానందానుభవము.

**42. "అవస్థాత్రయైకీకరణం తాంబూలమ్"**

**తాంబూలము :**

ఆకు వక్క సున్నము కలిస్తే తాంబూలము అవుతుంది. అవే జాగ్రత్ స్వప్న సుషుప్తి అనే మూడు అవస్థలు. ఆ మూడు అవస్థలను తురీయావస్థలో విలీనం చెయ్యటమే తాంబూలసమర్పణ.

## 43. మూలాధారాది బ్రహ్మబిల పర్యంతం, బ్రహ్మరంధ్రాదిమూలాధార పర్యంతం గతాగత రూపేణ ప్రాదక్షిణ్యమ్"

**ప్రదక్షిణము :**

శరీరంలో ప్రాణవాయువు ఆధారచక్రం నుండి సహస్రారము వరకు, సహస్రారం నుంచి ఆధారచక్రం వరకు సుషుమ్నామార్గం గుండా తిరుగుతూ ఉంటుంది. ఈ రకంగా ప్రాణవాయువు సంచారము చెయ్యటమే ఆత్మరూపంలో ఉన్న దేవతకు ప్రదక్షిణము. దీనికే అజపారూప హంస అని పేరు.

హకారసంజ్ఞ గల పరమాత్మ సకారసంజ్ఞ గల ప్రకృతితోకలసి హంస రూపమైన శబలబ్రహ్మము అవుతాడు. ఈ శబలబ్రహ్మము తొమ్మిదిద్వారాలుగల మానవశరీరము అనే పట్టణంలో ప్రవేశించి ఇంద్రియములు, ప్రాణములు, మనస్సుతో కూడినవాడై పంజరంలో బంధించబడిన పక్షిలాగా బయటకు వచ్చే ఉపాయం తెలియక ప్రాపంచిక బంధనాలతో కొట్టుమిట్టాడుతున్నాడు. అటువంటి హంస అనబడే జీవుడికి.

| | | |
|---|---|---|
| అగ్ని, చంద్ర మండలాలు | – | రెక్కలు |
| ఓంకారము | – | శిరస్సు |
| జ్ఞాననేత్రము | – | ముఖము |
| హకరసకారములు | – | పాదాలు |

(హకారము రుద్రబీజము సకారము శక్తి బీజము)

ఈ రకంగా ఉన్న హంసఅనే జీవుడు పాలలో ఉన్న నెయ్యిలాగా సమస్త ప్రాణికోటినీ ఆశ్రయించి ఉన్నాడు.

సహస్రారము అనేది ఎనిమిదిదళాలు కలిగిన పద్మము. ఇందులోని ఒక్కొక్క దళంలోనూ చిన్నచిన్నరేకులు నూటఇరవైఅయిదు చొప్పున ఉంటాయి. ఈ రకంగా మొత్తం వెయ్యిదళాలుంటాయి. అందుకే దాన్ని సహస్రదళకమలం అంటారు. ఎనిమిదిదళాలు ఎనిమిదిదిక్కులకు తిరిగి ఉంటాయి.

ఎనిమిది దళాల వివరాలు ఈ విధంగా ఉంటాయి.

| | |
|---|---|
| తూర్పుదిక్కు | – సద్బుద్ధి |
| ఆగ్నేయం | – నిద్ర, దప్పిక, ఆలస్యము |
| దక్షిణం | – క్రూరబుద్ధి |
| నైరుతి | – తాపబుద్ధి |
| పడమర | – విలాసము |
| వాయువ్యము | – నడచుట మొ॥ విషయములందు బుద్ధి |
| ఉత్తరము | – సురతము నందు ఆసక్తి |
| ఈశాన్యము | – ద్రవ్యము దానంచేసే తలంపు |
| పద్మాంతరాళంలో | – ఇహపరలోకవిముక్తి |

కింజల్కము (తామరపువ్వులోని కేసరములు) – మెలకువ

తామరదుద్దు - కల

దుంప - నిద్ర

ఆత్మ ఏక్షణాన సహస్రారాన్ని వదులుతుందో ఆ క్షణములోనే పరబ్రహ్మాలో ఐక్యమవుతుంది. దీనికే తురీయావస్థ అని పేరు.

**44. "తురీయావస్థ నమస్కారః"**

**నమస్కారము :**

దేవికి నమస్కారము చెయ్యటమంటే సాధకుడు తురీయావస్థ చేరటమే.

**45. "దేహశూన్య ప్రమాతృతా నిమజ్జనం బలిహరణమ్"**

**బలిహరణము :**

సాధకుడి స్థూలశరీరము మాయతో కూడుకున్నది. సూక్ష్మశరీరము జ్ఞాన స్వరూపము తాను జ్ఞానస్వరూపుడు కాబట్టి జీవాత్మను పరమాత్మ యందు విలీనం చేసినట్లు భావించటమే బలిసమర్పణ.

**46. "సత్యమస్తికర్తవ్య మకర్తవ్య మౌదాసీన్య నిత్యాత్మ విలాపనగ్ంహోమః"**

**ధ్యానము :**

సాధకుడు తాను ఆ దేవి యొక్క పాదముల నుండి వచ్చే తేజస్సులో విలీన మయినట్లుగా తలచి, తాను కూడా ఆ తేజస్సులో ఒక భాగమేనని, సర్వము పరబ్రహ్మ మయమని భావించటమే పరిపూర్ణధ్యానము.

**47. "స్వయం తత్పాదుకా నిమజ్జనం పరిపూర్ణధ్యానమ్"**

**ధ్యానము :**

సాధకుడు తాను ఆ దేవి యొక్క పాదముల నుండి వచ్చే తేజస్సులో విలీన మయినట్లుగా తలచి, తాను కూడా ఆ తేజస్సులో ఒక భాగమేనని, సర్వము పరబ్రహ్మ మయమని భావించటమే పరిపూర్ణ ధ్యానము.

**48. "ఏవ ముహూర్తత్రయం భావనయా యుక్తో భవతి, తస్య దేవతాత్మైక్య సిద్ధిః"**

**బ్రహ్మత్వసిద్ధి :**

ఈ విధంగా తనను తాను పరబ్రహ్మస్వరూపంగా భావించి మూడు ముహూర్తముల కాలము దేవియందు మనసులగ్నం చేసినవాడు ఆ దేవిలో ఐక్యత పొందుతాడు. దీనినే బ్రహ్మత్వం సిద్ధించటం అంటారు.

**49. చించితకార్యాణ్యత్నేన సిద్ధ్యంతి స ఏవ శివయోగీతి కధ్యత ఇత్యుపనిషత్॥**

**ఫలము :**

ఈ విధంగా అంతఃపూజచేసి సిద్ధుడైన సాధకుడికి కోరిన కోరికలు అప్రయత్నంగా నెరవేరతాయి. అతడినే శివయోగి అంటారు అని ఈ ఉపనిషత్తులో చెప్పబడింది. ఈ విధంగా అంతఃపూజతో పరమేశ్వరిని ధ్యానించిన వారికి జన్మరాహిత్యం కలుగుతుంది. అదే మోక్షము.

# 15. లలితా రహస్యోపనిషత్తు

2005 సంవత్సరం ఒకరోజు రాత్రి నిద్ర పోతున్న సమయంలో కల. అందులో ఒక వేదిక, పేడతో అలికి ముగ్గులు పెట్టినది. దానిమీద మధ్యలో ఒక చాప. దానిమీద ఒక వాలుబల్ల. దానిముందు నేను. తేజోమయమైన తెల్లటి దివ్యమైన కాంతి వేదికమీద పడుతోంది. ఆ కాంతిలో బల్లమీద ఒక పుస్తకం తెరచి ఉన్నది. దానిమీద 'లలితా రహస్యోపనిషత్తు' అని మాత్రం వ్రాసి ఉంది. నేను బల్ల ముందు కూర్చుని ఉపన్యాసం చెబుతున్నాను. నా ముందు మైకు లేదు. ఎదురుగా ఎంత మంది శ్రోతలున్నారో తెలియదు. అంతా చీకటిగానే ఉంది. ఎవరూ కనపడటంలా. అయినా ఉపన్యాసంమాత్రం ఆగటం లేదు.

మధ్యలో మెళకువ వచ్చినా అలాగే ఉంది. మళ్ళీ నిద్రలాంటిస్థితి. కలమాత్రం కొనసాగుతోంది. ఉపన్యాసం జరిగిపోతోంది. ఉపనిషత్తు కొన్ని భాగాలుగా కనిపిస్తోంది. పరమేశ్వరి తత్త్వము, సృష్టి, మంత్రము, యంత్రము, ముక్తి. ఈ విషయాల మీద సాగుతోంది ఉపన్యాసం. తెల్లవార్లూ ఇలాగే సాగింది.

తెల్లవారి నా భార్యకు చెప్పాను. ఎక్కడిదీ ఉపనిషత్తు? నేను ఎక్కడా చదవలేదు. గ్రంథస్తం చెయ్యమని ఆదేశమేమో? తరువాత కొద్దిరోజులకే విజయవాడ శివరామకృష్ణ క్షేత్రంలో 'రామకోటి ఉత్సవాల సందర్భంగా అక్కడ రావలసిన వక్త దూరదర్శన్ అసిస్టెంటు డైరెక్టరు శ్రీ ఓలేటి పార్వతీశం గారు రాకపోవటము. ఉత్సవ కమిటీ

నిర్వాహకులు నాకు ఫోన్‌చేసి రమ్మనటం జరిగింది. వెడితే ఏం చెప్పాలి? ఏమీ అనుకోలేదు. ఉపన్యాసానికి వెళ్ళాను. చేతిలో నేనువ్రాసిన 'దేవీ సప్తశతి భాష్యం' ఉంది. ఉపన్యాసం ప్రారంభం అయ్యేసరికి స్వప్నదృశ్యమైన ఉపనిషత్తు చెబితే బాగుండు అనిపించింది. అంతే అనుకోకుండా ప్రారంభం చేశాను. ఆద్యంతం చాలా గొప్పగా సాగింది ఉపన్యాసం. దీన్ని గ్రంథస్తం చేస్తే బాగుండు అన్నారు. **ధర్మపురుష శ్రీ యాబలూరి లోకనాథశర్మగారు** పుస్తకముద్రణకు ముందుకు వచ్చారు. పుస్తకం శ్రీ లోకనాథ శర్మ, విమలాకామేశ్వరి దంపతులకు అంకితం ఇవ్వబడింది. అదే ఇప్పుడు ఈ ఉపనిషత్తు. ఇది మొత్తం ఏడు అధ్యాయాలుగా ఉంటుంది.

## ఒకటవ అధ్యాయము (పరమేశ్వరీ తత్త్వము)

పూర్వకాలంలో ఒకసారి దేవతలంతా ఒకచోట చేరి పరతత్త్వాన్ని గురించి చర్చించుకోవటం మొదలుపెట్టారు. దక్షిణ దిక్కుకు పాలకుడు, మృత్యుదేవత అయిన యముడు లేచి "ఈ జగత్తులో ఆయువు తీరిన వారందరినీ నేను తీసుకువస్తున్నాను. వారు చేసిన పాపపుణ్యాల ననుసరించి వారు స్వర్గసుఖాలు, నరకయాతనలు అనుభవిస్తున్నారు. ఇంతకీ జీవరాశి జన్మకు కారణం ఏమిటో నాకు తెలియలేదు" అన్నాడు. ఆ తరువాత పశ్చిమ దిక్కును పాలించే వరుణుడు లేచి "లోకంలో అనేక రకాల జీవజాలమున్నది. అందులో భూచరాలు, జలచరాలు, ఖగచరాలు ఇలా అనేక జీవులున్నాయి. ఇవన్నీ ఏ రకంగా ఉద్భవించాయి ?" అని అడిగాడు. తూర్పు దిక్కును పాలించేవాడు, దేవరాజు అయిన ఇంద్రుడు లేచి "జగత్తులో జీవరాశిని సృష్టిస్తున్నది

చతుర్ముఖబ్రహ్మ. స్థితికారకుడు విష్ణువు. లయకారకుడు రుద్రుడు. ఈ త్రిమూర్తులవల్లనే జగత్తంతా ప్రవర్తిల్లుతున్నది. అయితే దేవతలంతా ఏ రకంగా ఉద్భవించారు ? ఈ త్రిమూర్తుల జననానికి కారణం ఏమిటి ? అనే విషయాలు మాత్రం బోధపడటంలేదు. ఓ సృష్టికర్తా! దేవతలందరిలోకీ నువ్వే ముందుగా పుట్టినవాడవు. కాబట్టి మా సంశయాలన్నీ నువ్వే తీర్చాలి. అసలు ఈజగత్తు ఏరకంగా ఆవిర్భవించింది? జగదావిర్భావానికి కారకులెవరు ? మొదలైన విషయాలన్నీ మాకు తెలియజెయ్యవలసింది" అన్నాడు. ఆ మాటలు విన్న బ్రహ్మదేవుడు, "దేవతలారా ! మీరడిగిన ప్రశ్నలకు సమాధానం పూర్తిగా నాక్కూడా తెలియదు. ఈ విషయాలన్నీ తెలిసినవాడు శ్రీమన్నారాయణుడు. ఆయనే విరాడ్రూపి. కాబట్టి మనమంతా ఆయన దగ్గరకు పోయి మనసంశయాలు నివృత్తి చేసుకుందాం." అన్నాడు. దేవతలంతా కలిసి శ్రీమన్నారాయణుని దగ్గరకు పోయి ఆయనను పరిపరివిధాల స్తుతించారు. వారి భక్తికి ప్రసన్నుడైన నారాయణుడు దేవతలనుద్దేశించి "మీరు వచ్చిన పనిఏమిటి? నావల్ల మీకు ఏంకావాలి ?" అన్నాడు. అప్పుడు బ్రహ్మదేవుడు శ్రీమన్నారాయణునికి నమస్కరించి "దేవాధిదేవా ! మాకందరికీ చిన్న అనుమానం వచ్చింది. అసలు ఈ జగత్తు ఏ రకంగా సృష్టించబడుతోంది? దీనికి కారకులెవరు ? ఈ విషయాలు మాకు సవిస్తరంగా తెలియజేయవలసినది" అన్నాడు. ఆ మాటలు విన్న శ్రీమన్నారాయణుడు "దేవతలారా! మీకందరికీ ఈ జగసృష్టి గురించి అనుమానం వచ్చింది. దాన్ని మీకు వివరిస్తాను. ఇది రహస్యాతిరహస్యమైనది. విద్వాంసులు మాత్రమే తెలుసుకోదగ్గది. లౌకికవాదులకు, ఆచారహీనులకు ఈ విషయాలు చెప్పరాదు.

ఈ చరాచర జగత్తును సృష్టించినది ఆ పరమేశ్వరి. ఆవిడే సృష్టి

స్థితి సంహారకారిణి. సృష్టి ప్రారంభానికి ముందు ఈ జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యాన్నంతటినీ పరమేశ్వరి ఆవరించి ఉన్నది. పరమేశ్వరికి రెండు రూపాలున్నాయి. 1. నిరాకారము 2. సాకారము. సృష్టిప్రారంభానికి ముందు ఆవిడ నిరాకారంగా ఉండేది. ఆ పరమేశ్వరి నుంచే ఈ జగత్తంతా ఆవిర్భవించింది. మళ్ళీ ఆవిడలోనే లయమవుతున్నది. ఆదేవి వల్లనే బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఇంద్రాది దేవతలు, అష్టవసువులు, దిక్పాలకులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, సూర్యుడు, చంద్రుడు, గ్రహాలు, మరుత్తులు అందరూ ఉద్భవించారు. ఆ పరమేశ్వరివల్ల ఒక్క దేవతలే కాదు, గరుడ, గంధర్వ, యక్ష, కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్య, నాగగణాలన్నీ ఆవిర్భవించాయి.

ఆ పరమేశ్వరియే సత్యమైనది, నిత్యమైనది శాశ్వతమైనది. భూమి, ఆకాశము, దశదిశలు, పైభాగము, క్రింది భాగము, మధ్యభాగము అంతా పరమేశ్వరి స్వరూపమే. నేల నీరు, నింగి అంతా పరమేశ్వరియే. ఆమె అద్వితీయము, అనన్యము, అజరామరము అయినది. ఆదిమధ్యాంతరహితమైనది. ఆమె గతంలో (భూతకాలంలో) ఉన్నది. వర్తమానంలో ఉన్నది, భవిష్యత్తులో ఉంటుంది. త్రికాలరూపి. త్రికాలాతీతమైనది ఆమెతో సమానమైన వారుగాని, అంతకు మించిన వారుగాని, ఎవరూ లేరు. ఆమె కామకళ, శృంగారకళ, సాదాఖ్యకళ. అండజాలు, శ్వేదజాలు, ఉద్బిజాలు, స్థావరాలు, జంగమాలు, పశువులు, పక్షులు, జంతువులు అన్నీ ఆమెవల్లనే ఆవిర్భవించాయి. ఆమెయే పరాశక్తి. శాంభవి. కాదివిద్య, హాదివిద్య, సాదివిద్య ఆమెయే. ఆవిడే త్రిపురసుందరి. ఆ పరమేశ్వరియే ఈ జగస్సృష్టికి కారకురాలు" అన్నాడు. ఆ మాటలు విన్న దేవతలు "దేవా! ఆ పరమేశ్వరి ఈ సృష్టిని ఎలా చేసిందో వివరించండి'' అన్నారు. చెప్పటం

ప్రారంభించాడు శ్రీమన్నారాయణుడు.

## రెండవ అధ్యాయము (జగత్సృష్టి)

వికారాలు లేనిది. సత్యజ్ఞానానందమయమైనది. పరిపూర్ణమైనది. సనాతనముగా ఉన్నది. ఏకముగా ఉన్నది. రెండవది లేనిది. అదే పరబ్రహ్మస్వరూపము. నిరాకారమైన ఆ పరబ్రహ్మయందు ఎడారులలో ఎండమావి లాగా, స్థాణువునందు దొంగవాడిలాగా, స్ఫటికంలోని రేఖలులాగా అనిపిస్తూ తెలుపు, ఎరుపు, నలుపు గల సమానత్రిగుణాలు కలిగి, అనిర్వచనీయమైన మూలప్రకృతి ఉన్నది. ఆ మూలప్రకృతిలో ప్రతిబింబించిన పరబ్రహ్మమే సాక్షి చైతన్యము.

గతంలో ప్రళయం వచ్చి జగత్తంతా నాశనమైపోయింది. ఆ సమయంలో కర్మ క్షయమైన జీవరాశి అంతటికీ మోక్షంసిద్ధించింది. కర్మక్షయం కాకుండా ఉన్న జీవరాశి, తమ కర్మను తమతో మూట కట్టుకుని మాయలో కలిసిపోయింది. ఇప్పుడు భూమి జలంలోను, జలం అగ్నిలోను, అగ్ని వాయువునందు, వాయువు ఆకాశమందు, ఆకాశము అహంకారమునందు, అహంకారము మహత్తత్త్వమందు, మహత్తత్త్వము అవ్యక్తమందు లీనమయినాయి. ఈ అవ్యక్తమే 'మాయ' అనబడుతుంది. ఈ రకంగా పంచభూతాలను, జీవరాశిని తనలో లీనంచేసుకున్నదయిన మాయఅనబడే అవ్యక్తము ఆ పరమేశ్వరిలో కలిసిపోయింది. అదే ఇప్పుడు మనం చెబుతున్న నిరాకారయై సృష్టి ప్రారంభానికి ముందున్న పరమేశ్వరి.

ఈ పరమేశ్వర తత్త్వానికి రూపంలేదు. గుణంలేదు. లింగభేదం అసలేలేదు. ఇది తేజోమయమైన కాంతిపుంజము. బ్రహ్మావాదులు దీన్నే పరమేశ్వరుడు అనికూడా అంటారు. కాబట్టి దేవతలారా ! పరమేశ్వరుడు

అన్నా, పరమేశ్వరి అన్నా ఒకటే. ఈ రెండు పదాలకు తేడాలేదు. అది శివశక్తుల ఏకీకృత రూపము.

సృష్టి ఆవిర్భావానికి ముందు, జగత్తునంతటినీ తనలో నిక్షిప్తం చేసుకున్న ఆ పరమేశ్వరి స్వరూపం ఒక్కటే ఉన్నది. ఆ పరమేశ్వరి ఇప్పుడు సృష్టిచెయ్యాలి అనుకుంది. సృష్టి ఎందుకు చెయ్యాలి ? తనలీలా వినోదం కోసం మాత్రం కాదు. అంతకుముందు ప్రళయం సంభవించినప్పుడు కర్మక్షయం కాకుండా, ఆ కర్మతోపాటుగా తనలో లీనమైపోయిన జీవులన్నింటికీ కర్మక్షయం చేసి వాటికి మోక్షం కల్పించాలనే ఉద్దేశ్యంతోనే సృష్టి చెయ్యాలనుకున్నది ఆ పరమేశ్వరి. ఇక సృష్టి ప్రారంభమైంది. నిరాకారంగా ఉన్న ఆ పరమేశ్వరి నుంచి సత్త్వగుణ ప్రధానమైన అవ్యక్తం బయటకు వచ్చింది. అదే మాయ. ఈ అవ్యక్తము లేక మాయ అనేది పరమేశ్వరి అధీనంలోనే ఉంటుంది. ఈ మాయవల్లనే సృష్టిస్థితిలయాలు అన్నీ జరుగుతున్నాయి. ఇప్పుడు అవ్యక్తము నుంచి రజోగుణ ప్రధానమైన మహత్తత్త్వము పుట్టింది. ఇదే హిరణ్యగర్భుడు. ఈ మహత్తత్త్వము నుంచి తమోగుణ ప్రధానమైన అహంకారం పుట్టింది. అదే విరాడ్రూపము. ఈ రకంగా పరమేశ్వరి నుంచి అవ్యక్తము (మాయ) మహత్తత్త్వము (హిరణ్యగర్భుడు) అహంకారము (విరాడ్రూపము) ఆవిర్భవించాయి.

ఈ అహంకారంనుంచే నామరూపాత్మకమైన జగత్తు ఆవిర్భవించింది. ముందుగా రూపాత్మక జగత్తు. అహంకారము నుంచి పంచభూతాల సూక్ష్మరూపాలయిన తన్మాత్రలు ఆవిర్భవించాయి. అవే శబ్ద స్పర్శరూప రస గంధాలు. ఆ తరువాత తన్మాత్రల స్థూలరూపాలయిన పంచభూతాలు ఆవిర్భవించినాయి. అవే పృథివి

ఆపః తేజోవాయురాకాశాలు. పంచభూతాలలో ముందుగా పుట్టింది ఆకాశము. ఆకాశము నుంచి వాయువు, వాయువు నుంచి అగ్ని, అగ్ని నుంచి జలము, జలంనుంచి భూమి, భూమినుంచి ఓషధులు, ఓషధులనుంచి వనస్పతులు, వనస్పతుల నుంచి అన్నము వచ్చింది. ఈ రకంగా రూపాత్మకమైన జగత్తు ఏర్పడింది. ఇక నామాత్మకమైన జగత్తు. అవ్యక్తము నుంచి ముందుగా ఓంకారము పుట్టింది. ఓంకారము నుంచి అకార ఉకార మకారాలు పుట్టాయి. వాటి నుంచి అక్షర సమామ్నాయం పుట్టింది. అక్షరాల నుంచి పదాలు, వాక్యాలు, మంత్రాలు, వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, సంగీతము, సాహిత్యము ఏర్పడ్డాయి. ఈ రకంగా ఆ పరమేశ్వరి నుంచే నామ రూపాత్మకమైన జగత్తు ఏర్పడింది.

ఇప్పుడు పంచభూతాలు పంచీకరణ చెయ్యబడ్డాయి. పంచభూతాలలో మొదటగా ఆకాశం పుట్టింది. ఆకాశంలో దానియొక్క లక్షణం శబ్దము మాత్రమే ఉన్నది. ఆకాశం నుంచి వాయువు వచ్చింది. వాయువు లక్షణం స్పర్శ. అందుచేత వాయువులో ఆకాశ లక్షణమైన శబ్దము, వాయు లక్షణమైన స్పర్శ ఉన్నాయి. తరువాత వాయువు నుంచి అగ్ని వచ్చింది. అగ్ని లక్షణము తేజస్సు. అగ్నియందు ఆకాశ లక్షణమైన శబ్దము, వాయు లక్షణమైన స్పర్శ, అగ్ని లక్షణమైన, తేజస్సు (అదే రూపము) మూడూ ఉన్నాయి. అలాగే అగ్నినుంచి జలము వచ్చింది. జలముయొక్క లక్షణము రసము. జలము నందు శబ్దస్పర్శ రూపరసములు ఉన్నాయి. జలమునుండి భూమి ఏర్పడింది. భూమి లక్షణము గంధము. భూమియందు శబ్ద స్పర్శ రూప రసగంధాలు ఏర్పడ్డాయి. ఈ పంచభూతాలలో గుణత్రయాన్ని కలిపి అనంతకోటి

బ్రహ్మాండాలను, ఆ బ్రహ్మాండాలకు తగిన లోకాలను, ఆ లోకాలకు తగిన గోళాలను, స్థూలశరీరాలను సృష్టించింది పరమేశ్వరి.

పరమేశ్వరి పంచమహాభూతాల యొక్క రజోగుణాన్ని నాలుగు భాగాలుగా చేసి, అందులో మూడు భాగాల నుంచి ప్రాణశక్తిని, నాల్గవ భాగంతో కర్మేంద్రియాలను సృష్టించింది. తరువాత పంచ మహాభూతాల యొక్క సత్త్వగుణాన్ని నాలుగు భాగాలు చేసి, అందులోని మూడు భాగాల నుంచి అంతఃకరణ చతుష్టయాన్ని, నాల్గవ భాగంతో జ్ఞానేంద్రియాలను సృష్టించింది. ఇంద్రియ పాలకులను సృష్టించింది. ఇప్పుడు పంచభూతాల తమోగుణమైన అహంకారముతో స్థూలశరీరాలను సృష్టించింది. ఈ రకంగా జగత్తులో జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, స్థూల సూక్ష్మ శరీరాలను సృష్టించటం జరిగింది. ఇప్పుడు ఆ పరమేశ్వరి తాను సృష్టించిన స్థూల శరీరాలలో ప్రవేశించాలనుకుంది. అనుకున్నదే తడవుగా బ్రహ్మరంధ్రం ద్వారా స్థూలశరీరాలన్నింటియందు వ్యాపించి సర్వవ్యాపకమైంది అన్నాడు శ్రీమన్నారాయణుడు.

## మూడవ అధ్యాయము (స్థూలశరీరము)

దేవదేవా ! ఆ పరమేశ్వరి ఈ జగత్తును సృష్టించింది. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు సృష్టించింది. మరి మిగిలిన దేహము, అంగాలు ఏ రకంగా ఏర్పడ్డాయో వివరించండి అన్నారు దేవతలు. ఆ మాటలువిన్న నారాయణుడు చెప్పటం మొదలుపెట్టాడు.

దేవతలారా ! పరమేశ్వరి పంచీకృత మహాభూతాల సాయంతో వ్యష్టిరూపం లోను, సమిష్టి రూపంలోను స్థూలదేహాలను యధాప్రకారం

సృష్టి చేయటం జరిగింది. ఆ దేహాలలో కపాలము, చర్మము, నరాలు, ఎముకలు, మాంసము, గోళ్ళు మొదలైనవి పృథివిఅంశలు. రక్తము, మూత్రము, లాలాజలము, స్వేదము మొదలైనవి జలముయొక్క అంశలు. ఆకలి, దప్పిక, ఉష్ణము, మోహము, మైధునము మొదలైనవి అగ్నియొక్క అంశలు. నడచుట, దాటుట, శ్వాసవిడచుట, పీల్చుట మొదలైనవి వాయువుయొక్క అంశలు. కామక్రోధాలు ఆకాశముయొక్క అంశలు. ఈ రకంగా కర్మసంచితము, చర్మాదులతోకూడినది, బాల్యాద్యవస్థలను అభిమానించేది, బహుదోషాలకు ఆశ్రయము అయిన స్థూలదేహము ఆవిర్భవించింది.

ఇక సూక్ష్మదేహము ఏ విధంగా వచ్చింది అంటే, పంచభూతాల రజోగుణాన్ని నాలుగు భాగాలుగా చేసి అందులోని మూడు భాగాలనుంచి ప్రాణాన్ని సృష్టించటం జరిగింది. ప్రాణాలు ఐదు రకాలు. అవి 1. ప్రాణ 2. అపాన 3. వ్యాన 4. ఉదాన 5. సమానములు.

**1. ప్రాణవాయువు :** ఇది హృదయమందుంటుంది. దీనికి అధిష్ఠానదేవత 'విశిష్ఠకుడు', ఇది శ్వాసాదులను ఇడపింగళనాడుల గుండా బయటకు పంపుతుంది.

**2. అపాన వాయువు :** ఇది గుదస్థానంలో ఉంటుంది. దీనికి అధిష్ఠానదేవత విశ్వకర్త. ఇది అధోముఖంగా సంచరిస్తూ శుక్లము, మలము, మూత్రము, రక్తములను కుహూనాడి, సినీవాలి నాడుల ద్వారా బయటకు పంపుతుంది. దీనిచే మలమూత్రాలు అధోముఖంగా విసర్జించబడతాయి.

**3. వ్యానవాయువు :** ఇది నాభిస్థానంలో ఉంటుంది. దీనికి అధిష్ఠానదేవత 'విశ్వయోని' ఇది బయటి శీతోష్ణాలను లోపలకు, లోపలి

శీతోష్ణాలను బయటకు పంపుతూ ఉంటుంది. భుజించిన ఆహారాన్ని శరీరమంతా వ్యాపింపచేస్తుంది.

**4. ఉదాన వాయువు :** ఇది కంఠస్థానంలో ఉంటుంది. దీనికి అధిష్ఠానదేవత 'అజుడు' ఇది మనసుయొక్క సంకల్ప వికల్పాలను మాటల రూపంలో వెల్లడిస్తుంది. సుషుప్త్యవస్థలో ఇంద్రియాలను స్వాధీనం చేసుకుని తనకు కారణమైన అజ్ఞానంలో మునిగిపోతుంది. జాగ్రదావస్థలో ఇంద్రియాలను వాటి వాటి స్థానాలలో నిలబెడుతుంది. ఈ వాయువు సుషుమ్నగుండా సహస్రారందాకా సంచరిస్తుంది.

**5. సమానవాయువు :** ఇది శరీరంలోని అన్ని అంగాలయందు సమానంగా వ్యాపించి ఉంటుంది. దీనికి అధిష్ఠానదేవత 'జయుడు'. ఇది జఠరాగ్నిని ప్రజ్వలింపచేసి తిన్న ఆహారాన్ని అరిగించి శరీరంలోని డెబ్భైరెండువేల నాడీ మండలానికి సమానంగా అందిస్తుంది.

ఉపవాయువులు కూడా ఐదు ఉన్నాయి. వీటిలో 1. నాగవాయువు వాంతిని కలిగిస్తుంది. 2. కూర్మవాయువు కనురెప్పలను కదిలిస్తుంది. 3. కృకరవాయువు తుమ్ములను కలిగిస్తుంది. 4. దేవదత్తవాయువు ఆవలింతలు కలిగిస్తుంది. 5. ధనుంజయవాయువు శరీరమంతా వ్యాపించి శరీరాభివృద్ధిని కలిగిస్తుంది.

ఇక పంచభూతముల రజోగుణముయొక్క నాల్గవభాగంతో కర్మేంద్రియాలను సృష్టించటం జరిగింది. వాక్కు, పాణి, పాదము, గుదము, ఉపస్థ అనేవి కర్మేంద్రియాలు. మాట్లాడటము, ఇవ్వటము, నడవటము, విడుచుట, ఆనందించటము అనేవి కర్మేంద్రియాల విషయాలు. అగ్ని, దేవేంద్రుడు, ఉపేంద్రుడు, మృత్యువు, ప్రజాపతి, కర్మేంద్రియాలకు వరుసగా అధిష్ఠాన దేవతలు.

ఇక పంచభూతముల సత్త్వగుణాన్ని నాలుగు భాగాలు చేసి, అందులోని మూడు భాగాలతో అంతఃకరణను సృష్టించటం జరిగింది. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనేవి అంతఃకరణ చతుష్టయము. ఆలోచించటము, నిశ్చయించటము, స్మరించటము, అభిమానించటము, అనుసంధానము చేయటము, అనేవి అంతఃకరణ విషయాలు. గళము, వదనము, నాభి, హృదయము, భ్రూమధ్యము అనేవి అంతఃకరణ స్థానాలు. చంద్రుడు, విష్ణువు, చతుర్ముఖబ్రహ్మ శంభుడు అంతఃకరణ చతుష్ఠయానికి వరుసగా అధిష్ఠానదేవతలు. పంచభూతాల సత్త్వగుణం నాల్గవ భాగంతో జ్ఞానేంద్రియాలను సృష్టించటం జరిగింది. శ్రోత్రము, చర్మము, చక్షువు, జిహ్వా, ఘ్రాణము అనేవి జ్ఞానేంద్రియాలు. శబ్ద స్పర్శ రూప రస గంధాలు జ్ఞానేంద్రియాల విషయాలు. దిక్కులు, వాయువు, భానుడు, వరుణుడు, అశ్వనీ దేవతలు జ్ఞానేంద్రియాలకు వరుసగా అధిష్ఠాన దేవతలు. ఇక పంచకోశాలు. 1.అన్నమయ 2. ప్రాణమయ 3. మనోమయ 4. విజ్ఞానమయ 5. ఆనందమయ కోశాలనే పంచకోశాలంటారు. అన్నరసముతో జన్మించి, అన్నరసముతో వృద్ధి చెంది, అన్నరసమైన పృథివిలోనే లీనమయ్యేది అన్నమయకోశము. ఇదే స్థూలదేహము. కర్మేంద్రియాలతో కూడిన ప్రాణమే ప్రాణమయకోశము. కర్మేంద్రియ సహితమైన మనస్సు మనోమయకోశము. ఈ మూడుకోశముల సమూహమే లింగదేహము. ఇదే సూక్ష్మదేహము. స్వస్వరూపజ్ఞానముతో ప్రకాశించేది ఆనందమయ కోశము. ఇదే కారణదేహము.

జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, ప్రాణాలు, పంచభూతాలు, అంతఃకరణ చతుష్టయము, కామము, కర్మము, తమస్సు (అవిద్య).

ఈ ఎనిమిది గల దేహము అష్టపురము. ఆ పరమేశ్వరి ప్రతిదేహంలోనూ ప్రవేశించి బుద్ధియందుండి 'విశ్వుడు' అనబడింది. విజ్ఞానాత్ముడని, చిదాభాసుడని, విశ్వుడుఅని, వ్యావహారికుడని, కర్మభవుడని, స్థూలశరీరాభిమానిఅని అతనికి పేర్లు. ఒక్కొక్క సూక్ష్మదేహమందు ప్రవేశించిన సూత్రాత్మ మనస్సు నధిష్ఠించి 'తైజసుడు' అని పిలవబడింది. ఇతడికి తైజసుడు, ప్రాతిభాసికుడు, స్వప్నకల్పికుడు అని పేర్లు. ఆ పరమేశ్వరి మాయతో కలిసి ఒక్కొక్క కారణ దేహమందు ప్రవేశించి 'ప్రాజ్ఞుడు' అనబడింది. ఇతడికి ప్రాజ్ఞుడు, అవిచ్ఛిన్నుడు, పారమార్థికుడు, సుషుప్త్యభిమాని అని పేర్లు. వేదాంత శ్రవణం వల్ల ప్రాప్తించే ఫలితము ప్రాజ్ఞుడికే చెందుతుంది.

జీవుడికి జాగ్ర, స్వప్న, సుషుప్తి, తురీయము, తురీయాతీతము అనే ఐదు  అవస్థలున్నాయి. ఆయాదేవతల అనుగ్రహంతో, జ్ఞానేంద్రియాలతో, శబ్దాది విషయ గ్రహణ జ్ఞానము జాగ్రదావస్థలో జరుగుతుంది. జాగ్రదావస్థలో జీవుడే సర్వకర్మలకు కర్త, భోక్త అవుతున్నాడు.

వాగాదికరణములు ఉపరమించినప్పుడు, గ్రాహ్యగ్రాహకరూపాలు సృష్టించటమే స్వప్నావస్థ. జాగ్రదావస్థలో విశ్వుడుగా ఉన్న జీవుడే స్వప్నావస్థలో తైజసుడుగా  నాడీమండలములో సంచరిస్తూ విషయాలను సృష్టించుకుని, స్వేచ్ఛగా అనుభవిస్తాడు.

జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలను బంధించి, మనస్సును కూడా నశింపచేసిన స్థితే తురీయము. తురీయస్థితి చేరినవాడే జీవన్ముక్తుడు. తురీయాతీతుడు విదేహ ముక్తుడు. ఈ రకంగా ఆ పరమేశ్వరి స్థూల శరీరాన్ని ఆవిర్భవింపచేసింది. అన్నాడు శ్రీమన్నారాయణుడు.

# నాల్గవ అధ్యాయము (మాయాస్వరూపము)

"దేవదేవా ! శ్రీమన్నారాయణా ! పరమేశ్వరి ఈ జగత్తును సృష్టించింది సరే ! ఆవిడ మాయా స్వరూపిణి అంటారు కదా ! అసలు మాయ అంటే ఏమిటి ? ఆ మాయా స్వరూపాన్ని వివరించవలసినది" అన్నాడు సృష్టికర్త అయిన బ్రహ్మదేవుడు. శ్రీమన్నారాయణుడు చెప్పటం మొదలుపెట్టాడు.

అనాది అయినది, అంతము గలది, ప్రమాణాలకు, అప్రమాణాలకు సాధారణమైనది మాయ. ఇది సత్తు కాదు, అసత్తు కాదు. సదసత్తు అంతకన్నా కాదు. స్వయముగా అధికమైనది. వికారములు లేనిది. నిరూపించటానికి వీలైన లక్షణాలు లేనిది మాయ.

జీవులకు అజ్ఞానము నశించిపోగా, సత్త్వగుణ ప్రధానులైన వారికి ఆత్మ సాక్షాత్కారము కలుగుతుంది. అజ్ఞానులకు అది సాధ్యంకాదు. వికారాలకు అనగా మార్పులకు తల్లియై, శాశ్వతమైన భగవదాజ్ఞా రూపమైనది మాయ. ఈ మాయవల్లనే జగత్తులో అనేక సంఘటనలు చోటు చేసుకుంటున్నాయి. దీనివల్లనే జగత్తు నిర్మించబడుతున్నది. మాయ అనేది పరమేశ్వరిని ఆశ్రయించిఉంటుంది. ఇది గౌరవమైనది. అంతము గలది. పుట్టించేది. భూతములందు ప్రకాశించేది. తెలుపు ఎరుపు నలుపు మొదలుగా గల అనేక రంగులు గలది. రకరకాల రూపాలు గలది. కోరికలు కలిగించేది. కోరికలు తీర్చేది. విషయ శూన్యమైనది. ఈ మాయవల్ల ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లు కనిపిస్తుంది. నిత్యము, సత్యము, శాశ్వతము అయినది ఆ పరమేశ్వరి. కాని మాయా ప్రభావంతో భగవంతుడు లేడు అనిపిస్తుంది. అశాశ్వతమైన జగత్తు శాశ్వతము అనిపిస్తుంది. భార్యాబిడ్డలు,

ధనధాన్యాలు, భోగభాగ్యాలు, ఇవన్నీ నిజం అనిపిస్తుంది. లోకంలో జీవి వాటికోసమే ప్రాకులాడతాడు. కాని ఇవన్నీ నశించిపోయేవే. ఎడారియందు ఎండమావిలాగా, సూర్యకాంతిలో ముత్యపుచిప్ప వెండి పాత్రలా కనిపించినట్లుగా, మాయా ప్రభావంచేత అశాశ్వతమైనవన్నీ శాశ్వతంగా కనిపిస్తాయి. అనిత్యమైనవి నిత్యంగా అనిపిస్తాయి. ఈ మాయా ప్రభావంచేతనే మానవుడు తాను సృష్టించిన ద్రవ్యాన్ని సంపాదించటానికి తానే పరుగులు పెడతాడు. ఈ జగత్తంతా నిజమనే భ్రమలో ఉంటాడు. ఈ మాయ ఎంత గొప్పది అంటే, తన కళ్ళఎదురుగా జీవులు మరణిస్తున్నా, కట్టడాలు కూలిపోతున్నా, వస్తువులు నశిసిస్తున్నా, మానవుడు అది నిజమని నమ్మలేడు. చివరకు తనజీవితం శాశ్వతంకాదు. అని తెలిసికూడా దానిమీద వ్యామోహం వదులుకోలేడు. అహంకార మమకారాలనుంచి బయటకు రాలేడు. జీవుడు అవిద్యా సంబంధంచేత మాయ అనే వలలో గట్టిగా చిక్కుకుపోయాడు. సృష్టి జరిగేటప్పుడు ముందుగా అవ్యక్తము, మహత్తత్త్వము, అహంకారము వచ్చినాయి. అహంకారము నుంచి తన్మాత్రలు, వాటినుంచి పంచభూతాలు ఆవిర్భవించాయి. అయితే సృష్టిక్రమంలో మొదటిదయిన అవ్యక్తమే మాయ. అవ్యక్తము అంటే కంటికి కనిపించనిది. అదే మాయ. ఈ మాయ పరమేశ్వరుణ్ణి ఆవరించి ఉంటుంది. అంటే జీవుడికీ, పరమేశ్వరుడికీ మధ్యన అడ్డుగా ఉంటుంది. ఈ మాయను గనక ఛేదించగలిగితే ఆత్మ సాక్షాత్కారమవుతుంది.

మాయ అనేది నీటి గుంటలో నాచువంటిది. ఈ నాచును దూరంగా త్రోసేస్తే వెళ్ళిపోతుంది. కాని మళ్ళీవచ్చి చేరుతుంది. అలాగే వేదాంతవిచారము, సజ్జన సాంగత్యము చేసినంత కాలము ఈ మాయ

వదలివేసినట్టుగా కనిపిస్తుంది. కాని ఆ తరువాత వెంటనే వచ్చిచేరుతుంది. అంటే విషయవాంఛలయందు మనసు ఎప్పుడయితే లగ్నమవుతుందో, అప్పుడు మాయ ఆవరించింది అని అర్థం. అయితే ఈ మాయ పరమేశ్వరుణ్ణి ఆవరించి ఉంటుంది కదా. దీనివల్ల ఆయనకు అపాయం లేదా ? అంటే – జగత్తులో ప్రతిప్రాణి మాయకు లోబడే ఉంటుంది. ఆ పరమేశ్వరి ఒక్కతే మాయకు అతీతురాలు. మాయ అనేది పరమేశ్వరి అధీనంలోనే ఉంటుంది. పాము కోరలలో ఉన్న విషంవల్ల పాముకు ఏ రకంగానూ హాని జరగదు. కాని దానిచేత కాటువేయబడ్డ ఇతరులకు మాత్రం హాని జరుగుతుంది. అలాగే పరమేశ్వరిని ఆవరించిన మాయవల్ల ఆమెకు ఏఅపకారము జరగదు.

మాయచేత కప్పబడిన మానవుడు, తాను మాయా ప్రభావానికి లోనై ఉన్నాను అని తెలుసుకున్నట్లైతే, మాయ అతన్ని వదిలిపెడుతుంది. దెయ్యంపట్టి పిచ్చివేషాలు వేస్తున్న మనిషికి, తనకు దెయ్యం పట్టిందనే విషయం తెలిస్తే, ఆ దెయ్యం మరుక్షణమే అతని వదిలివేస్తుంది. అలాగే మాయకూడా. నిద్రపోతున్నప్పుడు స్వప్నం వస్తుంది. అందులో రకరకాల విషయాలు అనుభవంలోకి వస్తాయి. కాని నిద్ర లేచిన తరువాత అదంతా కల, భ్రాంతి అనిపిస్తుంది. అదేవిధంగా కంటికి కనిపించే ఈ జగత్తంతా భ్రమ అని నిశ్చయంగా తెలుసుకోగలిగితే మాయ తొలగిపోతుంది. మాయ విడిపోతే భగవస్సాక్షాత్కారము జరుగుతుంది. అదే ఆత్మసాక్షాత్కారము.

జీవాత్మ పరమాత్మలమధ్య మాయ అనే తెరఉన్నది. అది పరమాత్మని దర్శించటానికి అడ్డుగా ఉన్నది. ఆ తెరగనక తొలగించగలిగితే ఆత్మదర్శన మవుతుంది.

మాయ రెండు విధాలు 1) అవిద్యామాయ 2) విద్యామాయ.

**1) అవిద్యామాయ :** ఇదే అజ్ఞానము. ఇది కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములని ఆరురకాలుగా ఉంటుంది. దీనివల్లనే మానవుడికి నేను నాది అనే అహంకార మమకారాలు ఏర్పడతాయి. ఈ కారణంగానే మానవుడు సంసారానికి బందీ అవుతున్నాడు.

**2) విద్యామయ :** ఇది భగవంతుని సన్నిధికి తీసుకుపోతుంది. విద్యామాయ వివేకము, వైరాగ్యము అని రెండు విధాలుగా ఉన్నది. దీనిని ఆశ్రయించిన వారు భగవంతుని శరణు పొందుతారు.

విద్యామాయ వ్యక్తం కాగానే అవిద్యామాయ తొలగిపోతుంది. మురికిగా ఉన్న నీటిలో సూర్యచంద్రుల ప్రతిబింబం కనిపించదు. అలాగే మాయ అనే పొర తొలగిపోనంత వరకు, నేను నాది అనే అహంకారమమకారాలు నశించనంత వరకు, పరమేశ్వర సాక్షాత్కారం జరగదు.

పరమేశ్వరుడనే సూర్యుడు ఈజగత్తును ప్రకాశింపజేస్తున్నాడు. కాని చిన్న మబ్బు తునక గనక అడ్డు వచ్చినట్లైతే సూర్యుడు కంటికి కనిపించడు. అలాగే మాయ అనే తెర పరమేశ్వరుణ్ణి మనంచూడకుండా కప్పివేస్తుంది.

చెరువులో నాచు పేరుకొని ఉన్నది. దాన్ని చెదరగొట్టినా మళ్ళీ వచ్చి యథాస్థితికి చేరుతుంది. కాని దానికి ఏదైనా ఒక కర్ర అడ్డుగా పెడితే, అదితిరిగిరాదు. అలాగే జ్ఞానము అనే కర్రతో మాయను నిరోధించినట్లైతే పరమాత్మ దర్శనం కలుగుతుంది.

నిర్మలమైన ఆకాశంలో సూర్యుడు ప్రకాశిస్తుంటాడు. అలాంటప్పుడు ఒక్కసారిగా ఆకాశం మేఘావృతమైతే, సూర్యుడు కనిపించడు. ఆ సమయంలో జ్ఞానజ్యోతులు అనే పెనుగాలులు వీచినట్లైతే, అజ్ఞానపుచీకట్లు తొలగిపోయి ఆత్మసాక్షాత్కారం

జరుగుతుంది.

మాయకు ఎవరూ అతీతులు కారు. జ్ఞానజ్యోతులచేత మాత్రమే మాయను ఛేదించాలి" అన్నాడు శ్రీమన్నారాయణుడు.

## ఐదవ అధ్యాయము (మంత్రము)

శ్రీమన్నారాయణా ! భూలోకంలో మానవులకు ఇహము పరము రెండు కావాలి. అలాంటప్పుడు ఆ దేవిని ప్రసన్నం చేసుకోటానికి మంత్రం ఏదైనా ఉన్నదా ? ఉంటే దాని వివరాలు ఏమిటో చెప్పవలసినది" అన్నాడు ఈశ్వరుడు. చెప్పటం మొదలు పెట్టాడు శ్రీమన్నారాయణుడు.

ఆపరమేశ్వరి సృష్టిస్థితి లయాలకు కారణభూతమై త్రిమూర్తులను, త్రిశక్తులను సృష్టించినది. త్రిశక్తులు అంటే మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతి. లోకంలోని మానవులకు శక్తినిచ్చేది కాళి, సంపదలనిచ్చేది లక్ష్మి, జ్ఞానాన్ని ప్రసాదించేది సరస్వతి. ఈ రకంగా ఈ ముగ్గురూ ఇహపరాలు ఇస్తుంటారు. త్రిమూర్తి స్వరూపమైనది, త్రిశక్తి స్వరూపమైనది. అయిన ఆ దేవియొక్క మంత్రంలో త్రిశక్తుల బీజాలే ఉంటాయి.

పరమేశ్వరిని జపించే మంత్రాలు మూడు. అవి 1. బాలామంత్రము 2. పంచదశి మహామంత్రము 3. షోడశి మహామంత్రము

**1. బాలా మంత్రము :** ఈ మంత్రంలో పరమేశ్వరిని బాలాత్రిపుర సుందరిగా జపిస్తారు. ఈమె తొమ్మిది సంవత్సరాలున్న కన్య. బాలా మంత్రంలో త్రిశక్తుల బీజాలుంటాయి. అవి. ఐం – వాగ్భవ బీజము,

క్లీం – కామరాజ బీజము, సౌః – శక్తి బీజము. ఈ మూడు బీజములు ఇదే వరుసలో ఉంటాయి. అయితే అనులోమ విలోమంగా ఉంటాయి. అందుచేత ఈ మంత్రానికి శక్తి ఎక్కువ.

బాలామంత్రానికి దక్షిణామూర్తి ఋషి, పంక్తి ఛందస్సు, బాలాత్రిపుర సుందరి దేవత, ఐం బీజం, సౌః శక్తి, క్లీం కీలకం. న్యాసము : ఐం । క్లీం। సౌః । సౌః । క్లీం। ఐం. మంత్రము – **ఐం క్లీం సౌః సౌః క్లీం ఐం.**

**పంచదశీ మహామంత్రము :** ఇది పదిహేను అక్షరాలతోకూడి మూడు ఖండాలుగా ఉంటుంది. ఆ ఖండాలనే కూటములు అని కూడా అంటారు. అవి 1. వాగ్భవకూటమి, 2. కామరాజకూటమి 3. శక్తికూటమి

ఈ మంత్రంలోని వాగ్భవకూటమిలో నాలుగు, కామరాజ కూటమిలో ఐదు, శక్తికూటమిలో మూడు వెరసి పన్నెండు బీజాలుంటాయి. ప్రతికూటమికి చివర హ్రీంకారముంటుంది. ఈ రకంగా మంత్రంలో మొత్తం పదిహేను బీజాక్షరాలుంటాయి.

భాషకు అక్షరాలుయాభై. అందులో అచ్చులుపదహారు. అచ్చులన్నీ శక్తి రూపాలు, హల్లులు శివరూపాలు. ఈ రకంగా ఉన్న అక్షరాలు మొత్తాన్ని మూడు భాగాలుగా చెయ్యటం జరిగింది.

1. అ నుంచి అః వరకు మొదటి భాగము, 2. క నుంచి త వరకు రెండవ భాగము, 3. థ నుంచి స వరకు మూడవ భాగము

ఈ మూడు భాగాలలో సత్త్వరజస్తమో గుణాలు, త్రిమూర్తులు, త్రిశక్తులు, జాగ్రస్వప్నసుషుప్తులు, చంద్రసూర్యాగ్ని దేవతల తత్త్వాలు చేర్చబడ్డాయి. అలాగే ఈ భాగాలలో మహాత్రిపురసుందరి, కామేశ్వరి,

భగమాలిని, నిత్యక్లిన్నా, భేరుండా, వహ్నివాసిని, మహావజ్రేశ్వరి శివదూతి, (రౌద్రి) త్వరిత, కులసుందరి, నిత్య, నీలపతాక, విజయ, సర్వమంగళ, జ్వాలామాలిని, చిత్ర మొదలయిన షోడశ నిత్యలను, చంద్రకళలను చేర్చటం జరిగింది. శివ, శక్తి, మాయ, శుద్ధవిద్య, జలము అనే ఐదు తత్త్వాలకు సంబంధించిన మొదటిఖండాన్ని వాగ్భవకూటమి అంటారు. అదే అగ్నిఖండము. తేజస్సు, వాయువు, మనస్సు, పృథివి, ఆకాశము అనే ఐదుతత్త్వాలకు సంబంధించిన రెండవఖండాన్ని కామరాజకూటమి అంటారు. అదే సూర్యఖండము. విద్య, మహేశ్వరి, పర, ఆత్మ, సదాశివ తత్త్వాలకు సంబంధించిన మూడవఖండాన్ని శక్తికూటమి అంటారు. అదే చంద్రఖండము. ఇక్కడ ప్రతిఖండానికి చివర హ్రీంకారము చెప్పబడింది. ఈ రకంగా పదిహేను అక్షరములు గలది ఈ మంత్రము. పంచదశిమహామంత్రానికి దక్షిణామూర్తి ఋషి, పంక్తి ఛందస్సు, లలితాత్రిపుర సుందరి దేవత, క ఏ ఈ ల హ్రీం । బీజం । హసకహల హ్రీం, శక్తి, సకల హ్రీం । కీలకము న్యాసము 1. క ఏ ఈ ల హ్రీం 2. హసకహల హ్రీం । 3. సకల హ్రీం. 4. క ఏ ఈ ల హ్రీం 5. హసక హల హ్రీం 6. సకల హ్రీం. మంత్రము **క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం॥**

ఈ మంత్రాన్ని జపించేటప్పుడు మొదటి కూటమిని రెండవ కూటమి తోను, రెండవ కూటమిని మూడవ కూటమితోను కలిపి ఉచ్చరించాలి.

పంచదశి మహామంత్రాన్ని మొత్తం నాలుగుబీజాలుగా లెక్కపెట్టాలి. ఇందులో మూడుకూటములు, మూడుబీజాలు, మంత్రము మొత్తము కలిపి ఒకబీజము.

మొదటికూటమి సృష్టిరూపము, రెండవకూటమి స్థితిరూపము, మూడవ కూటమి సంహారరూపము, సమిష్టికూటమి తిరోదానఅనుగ్రహ రూపము. సృష్టి స్థితి సంహారాలు ఒక్కొక్కటి మూడువిధాలు. అది ప్రతికూటమిలోనూ మూడు రకాలుగా ఉంటుంది.

1. సృష్టి సృష్టి, సృష్టి స్థితి, సృష్టి సంహారము
2. స్థితి సృష్టి, స్థితి స్థితి, స్థితి సంహారము.
3. సంహారసృష్టి, సంహారస్థితి, సంహార సంహారము

వీటన్నింటికీ త్రిమూర్తులు (బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు), త్రిశక్తులు (భారతి, పృథివి, రుద్రాణి) అధిపతులు.

ఈ ఆరుగురూ పంచదశిమహామంత్రంలోని ఒక్కొక్క అక్షరానికి దేవతలై ఉన్నారు.

**ప్రథమకూటమిలో :**

| | | |
|---|---|---|
| కకారము | – | బ్రహ్మ |
| ఏకారము | – | భారతి |
| ఈకారము | – | విష్ణువు |
| లకారము | – | పృథివి |
| హ్రీంకారములోని హకారము | – | రుద్రుడు |
| రకారము | – | రుద్రాణి |

రెండవ కూటమిలోని రెండవ హకారాన్ని మూడవ కూటమిలో మొదట చేర్చినట్లైతే రెండు మూడు కూటములు ఒకటే అవుతాయి. అప్పుడు.

| | | |
|---|---|---|
| హకారము | – | బ్రహ్మ |
| సకారము | – | భారతి |

| | | |
|---|---|---|
| కకారము | – | విష్ణువు |
| లకారము | – | పృథివి |
| హ్రీంకారములోని హకారము | – | రుద్రుడు |
| రకారము | – | రుద్రాణి |

ఈ రకంగా పంచదశి మహామంత్రానికి త్రిమూర్తులు, త్రిశక్తులే అధిదేవతలు. అంటే ఈ మంత్రానికి సృష్టి స్థితి లయకారిణి అయిన ఆ పరమేశ్వరియే అధిదేవత. పంచీకరణ జరిగినప్పుడు పంచభూతాలు పదిహేను భాగాలయినాయి. ఆ పదిహేను భాగాలే పంచదశిమహామంత్రం లోని పదిహేనుబీజములు.

**షోడశీ మహామంత్రము :** పరమేశ్వరిని జపించే మంత్రాలలో షోడశి మహామంత్రము అతిముఖ్యమైనది. దీన్నే మహాషోడశి అని కూడా అంటారు. ఇది ఇరవైఎనిమిది అక్షరాలుగల మంత్రం. ప్రణవము అంటే – ఓంకారము. ఇది పరమేశ్వర స్వరూపం. అలాగే పరమేశ్వరి స్వరూపమయిన ప్రణవాలు ఐదు ఉన్నాయి. **శ్రీం హ్రీం క్లీం ఐం సౌః** ఈ ఐదింటినీ **శక్తి ప్రణవాలు** అంటారు.

పంచదశిమహామంత్రానికి ముందు ఎనిమిది, తరువాత ఐదు బీజాలు చేర్చినట్లైతే అది మహాషోడశి అవుతుంది. ఈ శక్తి ప్రణవాలు పంచదశి మహామంత్రానికి ముందు అనులోమంగానూ, తరువాత విలోమంగాను చేర్చాలి. ఈ రకంగా చేసినట్లైతే పంచదశి మంత్రానికి ముందు ఎనిమిది, తరువాత ఐదు వెరసి పదమూడు బీజాలు, పంచదశిమంత్రంలోని మూడు ఖండాలను మూడు బీజాలుగా లెక్కించాలి. అప్పుడు మొత్తం పదహారుఅక్షరాలవుతాయి. ఇదే

మహాషోడశి. ఈ మంత్రానికి దక్షిణామూర్తి ఋషి, పంక్తి ఛందస్సు, మహాత్రిపుర సుందరీ రాజరాజేశ్వరి దేవతా, క ఏ ఈ ల హ్రీం బీజం । సకల హ్రీం శక్తిః । హసక హల హ్రీం కీలము. సౌభాగ్య విద్యా పంచదశి మూడు కూటములతోనూ రెండు ఆవృత్తులు న్యాసము ఉంటుంది. మంత్రము :

**శ్రీం హ్రీం క్లీం ఐం సౌః ఓం హ్రీం శ్రీం । క ఏ ఈ ల హ్రీం । హసకహల హ్రీం । సకల హ్రీం । సౌః ఐం క్లీం హ్రీం శ్రీం ॥**

పరమేశ్వరి యొక్క మంత్రజపం చేస్తే ఇహము, పరము కూడా లభిస్తాయి. అన్నాడు శ్రీమన్నారాయణుడు.

## ఆరవ అధ్యాయము (యంత్రము)

"దేవాధిదేవా ! శ్రీమన్నారాయణా ! పరమేశ్వరిని మంత్రం ద్వారా జపించాలి అన్నావు. మరి ఆమెను అర్చించటానికి యంత్రము ఏదీ లేదా? ఉంటే దాని స్వరూపం వివరించవలసినది" అని అడిగాడు ఇంద్రుడు. పరమేశ్వరికి ప్రతిరూపమైన యంత్రాన్ని (శ్రీచక్రాన్ని) వివరిస్తున్నాడు శ్రీమన్నారాయణుడు.

పరమేశ్వరికి ప్రతిరూపమైన యంత్రాన్నే 'శ్రీచక్రము' అంటారు. ఇందులో మొత్తం తొమ్మిదిచక్రాలు ఉంటాయి. అవి వరుసగా బిందువు, త్రికోణము, అష్టకోణము, పదికోణాలుగల చక్రాలు రెండు, పద్నాలుగు కోణములు గల చక్రము, అష్టదళము, షోడశదళము, భూపురత్రయము.

పరమేశ్వరి అంటే స్త్రీమూర్తి అనిగాని, పరమేశ్వరుడు అంటే పురుషుడు అనిగాని అర్థం కాదు. అది శివశక్తుల సమైక్యరూపము.

పరమేశ్వరి ప్రతిరూపమే శ్రీచక్రము. అంటే ఇది శివశక్తుల సంగమస్థానము. ఇందులో శివచక్రాలు నాలుగు, శక్తిచక్రాలు ఐదు వెరసి తొమ్మిదిచక్రాలున్నాయి. వీటిలో త్రికోణము, అష్టకోణము దశారద్వయము, చతుర్దశారము శక్తిచక్రాలు. కాగా బిందువు, అష్టదళము, షోడశదళము, భూపురము శివచక్రాలు. ఈ చక్రాలు అన్నీ విడివిడిగా ఉండవు. వీటికి అవినాభావ సంబంధమున్నది.

త్రికోణమందు – బిందువు

అష్టకోణమందు – అష్టదళపద్మము

దశారయుగ్మమందు – షోడశదళపద్మము

చతుర్దశారమందు – భూపురము సంయోగము చెంది ఉంటాయి.

శ్రీచక్రంలో ఉండే తొమ్మిది చక్రాలనే విడివిడిగా తొమ్మిది ఆవరణలు అంటారు.

**1. మొదటి ఆవరణ :** దీన్నే భూపురము అంటారు. ఇందులో మూడు రేఖలు ఉంటాయి. దీని పేరు త్రైలోక్యమోహన చక్రము.

**2. రెండవ ఆవరణ :** ఇది షోడశదళ పద్మము. పదహారు దళాలుగల పద్మము. దీన్ని సర్వాశాపరిపూరక చక్రము అంటారు.

**3. మూడవ ఆవరణ :** అష్టదళపద్మము ఎనిమిది దళాలు గల పద్మము. దీన్ని సర్వసంక్షోభణ చక్రము అంటారు.

**4. నాల్గవ ఆవరణ :** చతుర్దశారము. పద్నాలుగుకోణాలు గల పద్మము. దీన్ని సర్వసౌభాగ్యదాయక చక్రము అంటారు.

**5. ఐదవ ఆవరణ :** బహిర్దశారము. పదికోణాలుగల చక్రము.

దీన్ని సర్వార్థ సాధక చక్రము అంటారు.

**6. ఆరవ ఆవరణ :** అంతర్దశారము. పదికోణాలుగల చక్రము. దీన్ని సర్వరక్షాకర చక్రము అంటారు.

**7. ఏడవ ఆవరణ :** అష్టకోణము. ఎనిమిదికోణాలుగల చక్రము. దీన్ని సర్వరోగహర చక్రము అంటారు.

**8. ఎనిమిదవ ఆవరణ :** త్రికోణము. మూడుకోణాలుగల చక్రము. దీన్ని సర్వసిద్ధిప్రద చక్రము అంటారు.

**9. తొమ్మిదవ ఆవరణ :** బిందువు. దీన్ని సర్వానందమయ చక్రము అంటారు.

శ్రీచక్రంలో మూడువృత్తాలు కూడా ఉంటాయి. అవి భూపురానికి, షోడశదళానికీ మధ్యన ఉంటాయి.

శ్రీచక్రంలో పంచభూతాలు, తన్మాత్రలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, మాయ, **శుద్ధవిద్య,** మహేశ్వరుడు, సదాశివుడు అనే ఇరవైఐదు తత్త్వాలున్నాయి. ఇరవైఆరవ తత్త్వమే సాదాఖ్యకళ. అదే పరమేశ్వరి. శ్రీచక్రము బ్రహ్మాండానికి ప్రతీక. చరాచర జగత్తుకూ ప్రతీక. జగత్తును సృష్టించటానికి కావలసిన పంచభూతాలు, తన్మాత్రలు ఇందులోనే ఉన్నాయి. అలాగే శ్రీచక్రము జగత్తునందు గల ఎనభైనాలుగులక్షల జీవరాశికీ ప్రతీక. జీవులకు ఉండే జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు ఇందులో ఉన్నాయి. శ్రీచక్రము విశ్వమానవాళికి ప్రతీక. ఇతర జీవరాశికి లేనిది, మానవులకు మాత్రమే ఉన్నది అయిన ఆలోచించే శక్తిగల మనస్సు కూడా ఈ శ్రీచక్రంలోనే ఉన్నది. అందుచేతనే శ్రీచక్రము చరాచర జగత్తుకు ప్రతీక. జగత్తులోని జీవరాశికిప్రతీక, విశ్వమానవాళికి ప్రతీక. కాబట్టి శ్రీచక్రాన్ని

అర్చించినట్లైతే చరాచరజగత్తునూ అర్చించినట్లే. ఎనభైనాలుగు లక్షల రకాల జీవరాశిని అర్చించినట్లే. విశ్వమానవాళినంతటినీ అర్చించినట్లే

అంతేకాదు. శ్రీచక్రము అంటే సాక్షాత్తు మానవదేహమే. మానవ శరీరములోని

| | | |
|---|---|---|
| బ్రహ్మరంధ్రము | – | బిందువు |
| తలముందుభాగము | – | త్రికోణము |
| లలాటము | – | అష్టకోణము |
| భ్రూమధ్యము | – | అంతర్దశారము |
| కంఠము | – | బహిర్దశారము |
| హృదయము | – | చతుర్దశారము |
| నాభి | – | అష్టదళపద్మము |
| కటిప్రదేశము | – | షోడశదళ పద్మము |
| ఊరువులు | – | వృత్తత్రయము |
| పాదాలు | – | భూపురము |

అంతేకాదు శ్రీచక్రానికి, మానవ దేహంలోని షట్చక్రాలకు కూడా ఐక్యత ఉన్నది.

1. ఆధారచక్రానికి – త్రికోణంతో ఐక్యత
2. స్వాధిష్ఠానానికి – అష్టకోణంతో ఐక్యత
3. మణిపూరానికి – అంతర్దశారంతో ఐక్యత
4. అనాహతానికి – బహిర్దశారంతో ఐక్యత
5. విశుద్ధిచక్రానికి – చతుర్దశారంతో ఐక్యత
6. ఆజ్ఞాచక్రానికి – అష్టదళము, షోడశదళము, భూపురములతో ఐక్యత

7. సహస్రారానికి – బిందువుతో ఐక్యత

ఈ రకంగా శ్రీచక్రము అంటే మానవదేహంతప్ప వేరుకాదు.

శ్రీచక్రంలో ఇరవై నాలుగు సంధులు, ఇరవై ఎనిమిది మర్మస్థానాలు ఉన్నాయి. రెండు రేఖలు కలిసే స్థానాన్ని 'సంధి' అంటారు. మూడు రేఖలు కలిసే స్థానాన్ని 'మర్మస్థానము' అంటారు.

శ్రీచక్రంలో మొత్తం నలభైఐదు కోణాలుంటాయి. త్రికోణంలో మూడు, అష్టకోణంలో ఎనిమిది, అంతర్దశారంలో పది, బహిర్దశారంలో పది, చతుర్దశారంలో పద్నాలుగు వెరసి శ్రీచక్రంలోని కోణాలు నలభైఐదు. అంతేకాక శ్రీచక్రం భూప్రస్తారము, మేరుప్రస్తారము, కైలాసప్రస్తారము అని మూడు ప్రస్తారాలుగా ఉంటుంది.

శ్రీచక్రంలోని వివిధ ఆవరణలలోను వివిధ రకాలైన దేవతలుంటారు. ముందుగా

**ప్రథమావరణ :** ఇది భూతత్త్వాత్మకము. నాలుగువైపులా ద్వారాలు కలిగి, చతురస్రంగా ఉంటుంది. ఇందులో మూడు రేఖలు ఉంటాయి.

**ప్రథమరేఖలో :** అష్టసిద్ధులు, ద్వితీయ రేఖలో బ్రాహ్మి మొదలైన అష్టమాతృకలు, తృతీయ రేఖలో సర్వసంక్షోభిణి మొదలైన దేవతలుంటారు.

**ద్వితీయావరణ :** చంద్రకళా స్వరూపము ఇందులో చంద్రునియొక్క పదహారు కళలు కామాకర్షిణి మొదలైన ఆకర్షణ దేవతలరూపంలో ఉంటారు.

**తృతీయావరణ :** అష్టమూర్త్యాత్మకము. ఇందులో అనంగకుసుమ మొదలైన దేవతలుంటారు.

**చతుర్ధావరణ :** చతుర్దశ భువనాత్మకము. ఇందులో సర్వసంక్షోభిణి మొదలైన దేవతలుంటారు.

**పంచమావరణ :** దశావతారాత్మకము. ఇందులో సర్వసిద్ధిప్రద మొదలైన దేవతలుంటారు.

**షష్ఠ్యావరణ :** దశకళాత్మకము. ఇందులో సర్వజ్ఞ మొదలైన దేవతలుంటారు.

**సప్తమావరణ :** అష్టమూర్త్యాత్మకము. ఇందులో వశిన్యాది దేవతలుంటారు.

**అష్టమావరణ :** త్రిగుణాత్మకము. ఇందులో కామేశ్వరి, వజ్రేశ్వరి, భగమాలిని అనే దేవతలుంటారు.

**నవమావరణ :** బిందువు. ఇక్కడ శివశక్తులు ఉంటారు. ఇదే పరబ్రహ్మ స్వరూపము.

శ్రీచక్రానికి రెండు రకాలుగా అర్చన చెయ్యవచ్చు.

**1. సృష్టిపూజ :** బిందువు దగ్గర మొదలుపెట్టి భూపురందాకా తొమ్మిది ఆవరణలను అర్చించటం.

**2. సంహారపూజ :** భూపురం దగ్గర మొదలుపెట్టి బిందువుదాకా తొమ్మిది ఆవరణలను అర్చించటం. మేరు ప్రస్తారం మీద సృష్టిపూజ, కైలాసప్రస్తారం మీద సంహార పూజ చెయ్యాలి.

జగత్తు సృష్టి జరిగేటప్పుడు పంచభూతాలు పంచీకరణ చెంది పదిహేను భాగాలయినాయి. ఆ పదిహేను భాగాలే పంచదశి మహామంత్రం లోని పదిహేను బీజాక్షరాలు.

పంచదశి మహామంత్రంలో మొత్తం తొమ్మిది అక్షరాలే ఉన్నాయి. (ఒకసారి లెక్కించిన దానిని మళ్ళీ లెక్కపెట్టకూడదు) ఈ తొమ్మిది అక్షరాలవల్లనే తొమ్మిది ఆవరణలు గల శ్రీచక్రము ఏర్పడింది. అవి

1. లకారము : పృథివీబీజము. దీనివల్ల భూపురము వచ్చింది.
2. సకారము : చంద్రబీజము. దీనివల్ల షోడశదళము వచ్చింది.
3. హకారము : ఆకాశబీజము. దీనివల్ల అష్టదళము వచ్చింది.
4. ఏకారము : శక్తిబీజము. దీనివల్ల బహిర్దశారము వచ్చింది.
5. రకారము : అగ్నిబీజము. దీనివల్ల అంతర్దశారము వచ్చింది.
6. ఈకారము : మాయాబీజము. దీనివల్ల చతుర్దశారము వచ్చింది.
7. కకారము : మన్మథబీజము. దీనివల్ల అష్టకోణము వచ్చింది.
8. అర్ధచంద్రము : ఇదే నాదము. దీనివల్ల త్రికోణం వచ్చింది.
9. బిందువు : పరబ్రహ్మాత్మకము. దీనినుంచి శివశక్తుల స్వరూపమైన బిందువు వచ్చింది.

ఈ రకంగా పంచదశి మహామంత్రము నుంచే శ్రీచక్రము ఆవిర్భవించింది. అంటే ఆ పరమేశ్వరి యొక్క యంత్రము, మంత్రము రెండూ ఒక్కటే. ఆ తరువాత భక్తులకోసం ఆ దేవి నాలుగు భుజములతో ఒకరూపం ధరించి సాకార అయింది. అన్నాడు శ్రీమన్నారాయణుడు.

## ఏడవ అధ్యాయము (ముక్తి)

"శ్రీమన్నారాయణా ! పరమేశ్వరి యొక్క మంత్రాన్ని వివరించావు.

ఆమెకు ప్రతిరూపమైన యంత్రము, శ్రీచక్రాన్ని వివరించావు. ఆ పరమేశ్వరిని అర్చించి తరించాలంటే, మోక్షము సాధించాలంటే మార్గం ఏమిటో వివరించవలసింది" అన్నారు దేవతలంతా ముక్తకంఠంతో. ఆ మాటలు విన్న శ్రీమన్నారాయణుడు చెప్పటం మొదలుపెట్టాడు.

దేవతలారా ! పరమేశ్వరి అర్చనావిధానం రెండురకాలుగా ఉంటుంది. 1.బాహ్యపూజ 2. అంతఃపూజ. బాహ్యపూజ అంటే పరమేశ్వరి ప్రతిమను గాని, ఆమెకు ప్రతిరూపమైన యంత్రాన్నిగాని ఎదురుగా ఉంచుకుని, దేవతవేరు, నేను వేరు అనే భావంతో పూజించటం. ఇది లౌకికవాదులు చేస్తారు. ఇక రెండవది అంతః పూజ. సాధకుడు తన శరీరాన్నే శ్రీచక్రంగా భావించి, తానే పరమేశ్వరి స్వరూపాన్ని అనే భావనతో అర్చన చేస్తాడు. ఇది ముక్తికి మార్గము. ఇది కేవలము జ్ఞానులకు మాత్రమే సాధ్యము.

సాధకుడు నేను, నాది అనే అహంకార మమకారాలను వదలి వెయ్యాలి. అరిషడ్వర్గాలను జయించాలి. అప్పుడు ఈ జగత్తంతా ఒకటిగానే కనిపిస్తుంది. అందులో తేడాలుండవు. తరతమ భేదాలుండవు. అటువంటి స్థితిలో ఈ సృష్టి అంతా నావల్లనే జరుగుతోంది. సృష్టిస్థితి లయ కారకుడను నేనే. ఈ జగత్తు అంతా నాలోనే ఇమిడి ఉన్నది. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, గ్రహాలు అన్నీ నానుంచే ఆవిర్భవిస్తున్నాయి. నేనే పరబ్రహ్మస్వరూపాన్ని అని త్రికరణశుద్ధిగా భావిస్తాడు. అటువంటివాడే జ్ఞాని.

అమృతపానం చేసేవాడికి పాలతో ప్రయోజనం ఉండదు. అలాగే జ్ఞానమనే అమృతాన్ని సంపాదించిన వాడికి కర్తవ్యము ఏదీ ఉండదు ఆత్మజ్ఞాని, తత్త్వవేత్త, అనబడతాడు. అతడు అంతటా వ్యాపించ గలుగుతాడు. అతడు శరీరము ధరించి ఉన్నప్పటికీ, శరీరము

లేనివాడిగానే లెక్క. అతడు సర్వసన్యాసి. సర్వసంఘపరిత్యాగి. వంటిమీద బట్టలు కట్టుకోడు, స్నానంచెయ్యడు. తిండితినడు, నీరుత్రాగడు. ఒకచోట స్థిరంగాఉండడు. పిచ్చివాడిలాగా దేశాలవెంట తిరుగుతుంటాడు. ఎవరితోనూ మాట్లాడడు. ఒంటరి జీవనం చేస్తుంటాడు. ఎక్కువగా అరణ్యాలలోను, ఒంటరి ప్రదేశాలలోనూ సంచరిస్తూ నిరంతరము ఆత్మధ్యానం చేస్తుంటాడు. అతడికి సంకల్ప వికల్పాలుండవు. అతడు సర్వశాస్త్ర పండితుడు. కాని ఏమీతెలియనివాడు. శిష్టాచారుడు. కాని ఏఆచారము పాటించడు. కర్మలు చెయ్యటంలో నిష్ణాతుడు. కాని ఏ కర్మలు చెయ్యడు. భూత భవిష్యద్వర్తమానాలు పూర్తిగా తెలిసినవాడు. కాని ఏమీ తెలియనివాడు. తనలో తాను మాట్లాడుకుంటూ ఉంటాడు. ఆత్మసాక్షాత్కారము పొందినవాడు. జీవన్ముక్తుడు. ఈ శరీరాన్నివదలి గాలిలోగాలిలాగా, నీటిలో నీరులాగా, కాంతిలో కాంతిలాగా పరమాత్మలో లీనమవటానికి సిద్ధంగా ఉన్నవాడు. పండిపోయి రాలిపోవటానికి సిద్ధంగా ఉన్నవాడు. విదేహముక్తి లభించగానే అంటే దేహాన్ని విడిచిపెట్టగానే పరమాత్మలో లీనమవుతాడు. అదే మోక్షము, అదే సాయుజ్యము, అదే కైవల్యము. అదే ముక్తి. జీవాత్మ పరమాత్మల ఏకీభావము.

దేవతలారా ! ముక్తి అంటే విముక్తి. అదే ఐహికబంధనాల నుండి విముక్తి పొందటం. మానవుడికి ఉన్న శత్రువులలో ముఖ్యమైనవి రాగద్వేషాలు. రాగము అంటే అనురాగము. ఏదైనా ఒకవస్తువుపట్ల లేదా ఒక వ్యక్తిపట్ల ఉండే అపేక్ష. బలమైన కోరిక. ఆ కోరిక తీరకపోతే, ద్వేషం పెరుగుతుంది. రాగము అనేది జీవిని బంధించి వేస్తుంది. ద్వేషము ఇంకొకరిని బాధిస్తుంది. ఇవి ఉన్నంతవరకు మానవుడు

దేన్నీసాధించలేడు. అసత్యాన్ని సత్యమనుకుని భ్రమపడుతుంటాడు. అందుచేత ముందుగా రాగద్వేషాలను జయించాలి. మనసును పూర్తిగా అదుపులో ఉంచుకోవాలి. మనస్సే సంకల్పవికల్పాలకు కారణం. కాబట్టి మనసును జయించాలి. మనసును నశింపచెయ్యాలి. అమనస్కయోగము సాధించాలి. అమనస్కయోగము సాధించినవాడే మహాజ్ఞాని. సాక్షాత్తు పరమేశ్వరుడు. ఈ ఉపనిషత్తును విన్నంత మాత్రంచేతనే జన్మజన్మల పాపము నశించి పరమేశ్వరి అనుగ్రహం కలుగుతుంది. అంటూ **"లలితా రహస్యోపనిషత్తు"** ను పూర్తి చేశాడు శ్రీమన్నారాయణుడు.

*దీంతో శాక్తేయోపనిషత్తులు సమాప్తము.*

శ్రీ

# పార్థసారథీయము

# చతుర్వేదభాష్యము

## (ఉపనిషత్తులు)

### (వైష్ణవోపనిషత్తులు)



ప్రముఖ శ్రీవిద్యా ప్రచారకులు
అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,
ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, మెంఫిస్, అమెరికా ఆస్థాన విద్వాంసులు,
డా॥ క్రోవి పార్థసారథి

# 16. వైష్ణవోపనిషత్తులు

ఇది సాకార బ్రహ్మోపాసన శ్రీమహావిష్ణువే పరమేశ్వరుడు అని చెప్పే ఉపనిషత్తులను వైష్ణవోపనిషత్తులు అంటారు. వీటిలో పరమేశ్వరుడు విష్ణువని, కృష్ణుడు అని, నృసింహుడని, రాముడని, నారాయణుడు అని రకరకాలుగా చెప్పబడింది. వీరిలో నారాయణుడు శ్వేతద్వీపంలో ఉంటే శ్రీకృష్ణపరమాత్ముడు గోలోకంలో రాధాసమేతుడై ఉంటాడు. ఈ విషయంమీద కూడా భిన్నవాదనలున్నాయి. వీరందరికి ప్రత్యేక మంత్రాలున్నాయి. రామతాపినీ ఉపనిషత్తులో శ్రీరామచంద్రుని మంత్రాలు, నృసింహతాపినీ ఉపనిషత్తులో నృసింహ మంత్రం, గోపాలతాపినీ ఉపనిషత్తులో గోపాలమంత్రం చెప్పబడగా, నారాయణోపనిషత్తులో అష్టాక్షరీ మహామంత్రము చెప్పబడింది. ఈ మంత్రాన్నే రామానుజాచార్యుల వారు దేవాలయం పైకి ఎక్కి, అందరికీ వినపడేలాగా బిగ్గరగా అరిచి మరీ చెప్పారు అంటారు. ఈ మంత్రం విన్నంతమాత్రం చేతనే మానవుల పాపాలన్నీ తొలగిపోయి ముక్తి లభిస్తుంది అని వారి నమ్మకం. వైష్ణవంలో కులమత భేదాలు లేవని చాటిచెప్పాడు రామానుజుడు. అష్టాక్షరీ మంత్రాన్నే తిరుమంత్రము అంటారు. 'తిరు' అంటే పవిత్రమైన అని అర్థం. విశిష్టాద్వైతులలో తిరుమంత్రం ప్రసిద్ధి చెందింది. అయితే ఈ మంత్రాన్ని యథాతథంగా శూద్రులకు కూడా చెప్పవచ్చని కొందరు, చెప్పరాదని కొందరు అభిప్రాయాలు వ్యక్తం చేశారు. వైష్ణవులలోనే శ్రీవైష్ణవులు, వైఖానసులు, పాంచరాత్రులు, లక్ష్మీఉపాసకులు అని చాలా తేడాలున్నాయి. మధ్వులుకూడా వైష్ణవులే. కాని విశిష్టాద్వైతులకు, మధ్వులకు మధ్య తేడాలున్నాయి. వైష్ణవాన్ని చెప్పే 14 ఉపనిషత్తులు వివిధ వేదాలకు సంబంధించినవి.

| ఉపనిషత్తు | వేదం |
|---|---|
| 1. అవ్యక్తోపనిషత్తు | సామవేదం |
| 2. కృష్ణోపనిషత్తు | అధర్వణ వేదం |
| 3. గరుడోపనిషత్తు | అధర్వణ వేదం |
| 4. గోపాలతాపినీ ఉపనిషత్తు | అధర్వణ వేదం |
| 5. నారాయణోపనిషత్తు | కృష్ణ యజుర్వేదం |
| 6. కలిసంతరణోపనిషత్తు | కృష్ణ యజుర్వేదం |
| 7. దత్తాత్రేయోపనిషత్తు | అధర్వణవేదం |
| 8. తారసారోపనిషత్తు | శుక్లయజుర్వేదం |
| 9. నృసింహతాపినీ ఉపనిషత్తు | అధర్వణ వేదం |
| 10. రామతాపినీ ఉపనిషత్తు | అధర్వణ వేదం |
| 11. రామరహస్యోపనిషత్తు | అధర్వణ వేదం |
| 12. హయగ్రీవోపనిషత్తు | అధర్వణ వేదం |
| 13. వాసుదేవోపనిషత్తు | సామవేదం |
| 14. మహానారాయణోపనిషత్తు | అధర్వణ వేదం |

మహానారాయణోపనిషత్తు కృష్ణయజుర్వేదంలోను, అధర్వణ వేదంలోను కూడా చెప్పటం జరిగింది. కృష్ణయజుర్వేదంలో దుర్గ, చండి, రుద్ర, మృత్యుంజయ ఇలా అనేక మంత్రాలు చెప్పబడ్డాయి. అందుకే దీన్ని వైష్ణవులు అంగీకరించరు. అధర్వణ వేదంలోని ఉపనిషత్తులో వైష్ణవంలో పంచవిధ ముక్తులు ఇవ్వబడ్డాయి. అందుకే దాన్ని వారు అంగీకరిస్తారు. దాన్నే ఇక్కడ చెప్పటం జరిగింది. వైష్ణవంలో

బాగా ప్రసిద్ధి చెందింది తిరుమంత్రం. ముందుగా దాన్ని చూద్దాం. **'తిరు'** అంటే పవిత్రమైన అని అర్థం. **"ఈ మంత్రం చాలా పవిత్రమైనది. దీన్ని విన్నంతమాత్రం చేతనే ముక్తి లభిస్తుంది"** అంటారు.

# 17. తిరుమంత్రము

విష్ణుమూర్తికి సంబంధించిన మంత్రాలు అనేకం ఉన్నాయి. వాటిలో ఉత్తమోత్తమమైనది. **"ఓం నమో నారాయణాయ"** అనే అష్టాక్షరీ మహామంత్రము. దీన్నే తిరుమంత్రము అంటారు. రహస్యత్రయంలో ఇది మొదటిది.

**యథాసర్వేషు దేవేషు నాస్తి నారాయణాత్పరః ।**
**తథాసర్వేషు మంత్రేషు నాస్తి చాష్టాక్షరాత్పరః ॥**

దేవతలందరిలోకి నారాయణుడికన్న శ్రేష్ఠమైన వాడు లేడు. అలాగే మంత్రా లన్నింటిలోకీ అష్టాక్షరీ కన్న గొప్పది లేదు.

**భూత్వోర్ధ్వ బాహురద్యాత్ర సత్యపూర్వం బ్రవీమివః ।**
**హేపుత్ర । శిష్యాశ్చుణుత నమంత్రా ష్టాక్షరాత్పరః ॥**

ఓ శిష్యులారా ! కుమారులారా! అష్టాక్షరి కన్న శ్రేష్ఠమైన మంత్రం లేదు. చేతులెత్తి ప్రమాణంచేసి మరీ చెబుతున్నాను వినండి.

ఆ సర్వేశ్వరుడు నరనారాయణులుగా అవతరించినప్పుడు సాక్షాత్తు నారాయణుడే నరుడికి దీన్ని ఉపదేశించాడు. అంటే పరమేశ్వరుడే గురుశిష్యులుగా అవతరించి, ఘోరమైన సంసారమనే మహాసముద్రాన్ని దాటటానికి ఈ తారక మంత్రాన్ని ఉపదేశించాడు. ఇది ఎనిమిది అక్షరాలు గల మంత్రం. అష్టాక్షరి.

**''ఓమిత్యగ్రేవ్యాహరేత్, నమ ఇతి పశ్చాత్. నారాయణాయేత్యుపరితిష్ఠాత్, ఓ మిత్యేకాక్షరం, నమఇతి ద్వేక్షరే, నారాయణాయేతి పంచాక్షరాణి. ఏతద్వై నారాయణస్యా ష్టాక్షరమ్**

**పదమ్"** అంటోంది నారాయణోపనిషత్తు. ఈ మంత్రంలో మొదటగా ఓంకారము చెప్పాలి. తరువాత నమః అనాలి. ఆ తరువాత నారాయణాయ అని చెప్పాలి.

ఈ రకంగా ఓంకారము ఒక అక్షరము, నమః రెండు అక్షరాలు, నారాయణాయ ఐదు అక్షరాలు. వెరసి ఎనిమిది అక్షరాలు కలిగినది ఈ మంత్రము. ఈ మంత్రము యొక్క వివరణ **తారసారోపనిషత్తు**లో చెప్పబడింది.

ఒకసారి భరద్వాజుడు, యాజ్ఞవల్క్యుడి దగ్గరకు వచ్చి తారక మంత్రమేది? అని అడిగాడు. దానికి యాజ్ఞవల్క్యుడు **ఓం నమో నారాయణేతితారకం చిదాత్మక ఇత్యుపాసితవ్యం** ఓం నమో నారాయణాయ అనేదే తారక మంత్రము. దీనినే ఉపాసించాలి. ఇందులో

**ఓమిత్యేకాక్షరం ఆత్మస్వరూపం,**

**నమఇతి ద్వ్యక్షరం ప్రకృతి స్వరూపం,**

**నారాయణాయేతి పంచాక్షరం పరబ్రహ్మస్య రూపం**

**ఇతి యఏవేంవేద, సోమృతోభవతి.**

ఓంకారము ఆత్మస్వరూపము. నమః అనే రెండు అక్షరాలు ప్రకృతి స్వరూపము. నారాయణాయ అనే ఐదు అక్షరాలు పరబ్రహ్మ స్వరూపము. ఈ విషయం తెలిసిన వాడు అమృతుడు (మరణం లేనివాడు) అవుతాడు.

**ఓమితి బ్రహ్మోభవతి, నకారోవిష్ణుర్భవతి, మకారో రుద్రోభవతి. నకార ఈశ్వరోభవతి, రకారో అండం విరాడ్భవతి, యకారః పురుషోభవతి, ణకారో భగవాన్భవతి, యకారో పరమాత్మ భవతి.**

**ఏతద్వై నారాయణస్యాష్టాక్షరం వేద పరమ పురుషోభవతి.**

ఓంకారము–బ్రహ్మ, నకారము–విష్ణువు, మకారము–రుద్రుడు. నకారము–ఈశ్వరుడు. రకారము – అండము (విరాట్టు), యకారము – పురుషుడు, ణ కారము – భగవంతుడు. యకారము – పరమాత్మ. ఈ విధంగా అష్టాక్షరీ మంత్రానికి అధి దేవత శ్రీమన్నారాయణుడు. ఆయనే పరమాత్మ.

ఈ మంత్రంలో మొదటిది ఓంకారము. అదే ప్రణవము. ఇందులో అకార ఉకార మకారాలున్నాయి. ఇది ఒకటే అక్షరమైతే ఒకే అర్థం ఉంటుంది. కాని ఇది మూడు అక్షరాలుగా ఉన్నది. ఇందులోని అకారము – నారాయణ పదార్థము. పరమేశ్వరుని కళ్యాణ గుణములు తెలియచేస్తుంది. మకారము – ఆయన ఆత్మ శేషభూతుడని చెబుతుంది. ఉకారము–అవధారణార్థము చెబుతుంది. ఇక నమః అనే పదాన్ని చూస్తే

**పంథా నకార ఉద్దిష్టోమః ప్రధాన ఉదీర్యతే ।**
**విసర్గః పరమేశస్తు తత్రార్థోయం నిరుచ్యతే ॥**

నకారానికి మార్గము అని, మకారానికి ప్రధానమని, విసర్గకు పరమాత్మ అని అర్థము. భగవంతుణ్ణి పొందటానికి నమస్కారము ప్రధానమైన మార్గము. నమః అనే శబ్దానికి శరణాగతి అని అర్థము. ఇది ఆత్మసమర్పణాన్ని తెలియచేస్తుంది.

తిరుమంత్రంలో మూడవది 'నారాయణాయ'. నారములు అంటే నిత్యవస్తువుల యొక్క సమూహాము. అవి జ్ఞానానందము, అమలత్వము, జ్ఞానశక్తి, వాత్సల్యము, సౌశీల్యము, దివ్యమంగళ విగ్రహము, కాంతి సౌకుమార్యము, దివ్యాభరణములు, దివ్యాయుధములు, లక్ష్మీదేవి

మొదలైనవి.

**బ్రహ్మాండం తదంతస్థాః లోకాశ్చ స చరాచరాః ।**
**ఏవమండాన్యనంతాని తత్సర్వం నారముచ్యతే ॥**

బ్రహ్మాండమందు దాని లోకాలను, వాటిలో ఉండే చరాచర పదార్థాలు అనంతమైన అండములు ఇవన్నీ నారములు అనబడతాయి. అయనము అంటే – వీటికి ఆశ్రయమైనది. వీటికి ఆశ్రయముగా గలది. ఈ రకంగా ఎనిమిది దారములు గలది, మూడు పేటల మంగళసూత్రము వంటిది తిరుమంత్రము.

**అసారం అల్పసారంచ సారం సారతరం త్యజేత్ ।**
**భజేత్సారతమం శాస్త్రరత్నాకర ఇవామృతమ్ ॥**

అసారము – వేదబాహ్యమైన శాస్త్రాలు. అల్పసారము – కర్మకాండను వివరించే వేదాలు. సారం – సారముగల జ్ఞానకాండ (ఉపనిషత్తులు) సారతరం – ఎక్కువ శక్తి గల విష్ణుగాయత్రి, ఇవన్నీ వదిలేసి, భజేత్ సారతమం – అత్యధిక శక్తిగల తిరుమంత్రాన్ని జపించాలి.

విశిష్టాద్వైతులలో రెండు శాఖలున్నాయి. 1. తెంగలశాఖ (దక్షిణశాఖ) 2.వడగలశాఖ (ఉత్తరశాఖ) తెంగలశాఖ వారు నామము క్రింద పాదము పెడతారు. తిరుమంత్రాన్ని వైశ్యులకు, శూద్రులకు ప్రణవము లేకుండానే చెప్పాలి అని వడగల శాఖవారి అభిప్రాయము. తెంగలశాఖ వారు మాత్రం ఎవరైనా సరే ఈ మంత్రాన్ని ప్రణవ సహితంగా చెయ్యవచ్చు అంటున్నారు. తెంగలశాఖలో పిళ్ళై లోకాచార్యులు సుప్రసిద్ధులు. వీరు 'ముముక్షుప్పడి" అనే గ్రంథాన్ని వ్రాశారు. అది మూడు ప్రకరణాలుగా ఉంటుంది. అందులో ఒక్కొక్క

ప్రకరణంలో ఒక్కొక్క రహస్యము చెప్పబడింది. ఈ మూడు రహస్యాలు తెలిసిన మానవుడు ముక్తి పొందుతాడు. అవి 1. తిరుమంత్రము 2. ద్వయము 3. చరమశ్లోకము

కర్మ 1. వైదికము 2. తాంత్రికము 3. వైదిక తాంత్రికము అని మూడు విధాలు అని **పాంచరాత్రామృతార్ణవము** చెబుతోంది. దీనిలో

**వైదికం బ్రాహ్మణానాంతు । రాజ్ఞాం వైదిక తాంత్రికమ్ ।**

**తాంత్రికం వైశ్యశూద్రాణాం । సర్వేషాం తాంత్రికంతు వా॥**

బ్రాహ్మణులు - వైదికపరంగాను, వైశ్యులు శూద్రులు తాంత్రికపరంగాను, క్షత్రియులు వైదిక తాంత్రికంగాను కర్మ చెయ్యాలి. లేకపోతే అందరూ తాంత్రికంగా కూడా చెయ్యవచ్చును. నారాయణుడు అంటే ప్రత్యేకమైన దేవతకాదు. నారము అంటే ఆత్మస్వరూపము. నారములు అంటే నీరు అని అర్ధం. ఈ రకంగా ఆత్మ స్వరూపమైన వాడు, పంచభూతాలయందు ఆవరించి ఉన్నవాడు నారాయణుడు. అతడే పరమేశ్వరుడు.

**నారములనగా జలముల । పేరయనంబనగ నెలవు ప్రీతిగనాకున్**

**నారము లయనంబగుటను । నారాయణుడంద్రు జనులు నన్ను కిరీటీ॥**

అన్నాడు వ్యాసభగవానుడు మహాభారతం శాంతిపర్వంలో

నారములు అంటే నీరు. నీటియందు నివసిస్తాను కాబట్టి నన్ను నారాయణుడు అంటారు. ఈ మంత్రాన్నే రామానుజుడు దేవాలయం పైకెక్కి అందరికీ అరిచి మరీ చెప్పాడు.

ఈ రకంగా సకల వేదసారము, పరమేశ్వర స్వరూపము అయిన తిరుమంత్రాన్ని జపించిన వారికి పునర్జన్మ లేదు.

# 18. అవ్యక్తోపనిషత్తు

ఇది సామవేదానికి సంబంధించినది. ఇందులో మొత్తం పది మంత్రాలున్నాయి.

ఈ ఉపనిషత్తులో 32 అక్షరాలు గల నృసింహ మంత్రాన్ని చెప్పారు. చరాచర జగత్తంతా ఏ రకంగా సృష్టించబడిందో వివరించారు. నృసింహ మంత్రం యొక్క మాహాత్మ్యాన్ని తెలిపి ఆ మంత్రాన్ని జపించినవాడు మరణానంతరము నారసింహుణ్ణి చేరతాడు. అతడికి పునర్జన్మ ఉండదు. అని వివరించారు. ఇప్పుడు ఉపనిషత్తు చూడండి.

పూర్వకాలంలో సృష్టి జరగటానికి ముందు స్వర్గం లేదు. అంతరిక్షం లేదు. భూమి లేదు. తేజస్సు లేదు. ఆద్యంతములు లేనిది, స్థూలము కానిది, రూపం లేనిది, తెలుసుకోలేనిది, జ్ఞానరూపము, ఆనందరూపము అయిన పరబ్రహ్మ ఒక్కటే ఉన్నది. అది రెండు భాగాలయింది. ఒకటి ఆకుపచ్చగా, రెండవది ఎర్రగా ఉన్నాయి. వాటిలో ఎరుపు రంగులోది పురుషుడు. ఆకుపచ్చ రంగు స్త్రీ. వారిద్దరూ కలిశారు. అంటే స్త్రీ పురుషుల సమాగమము జరిగింది. బంగారుగ్రుడ్డు ఆవిర్భవించింది. అది పెద్దదయింది.

ఆ అండం నుంచి బ్రహ్మ పుట్టాడు. నేను ఎవరిని? నేను ఏం చెయ్యాలి? అని ఆలోచించాడు. అప్పుడు అశరీర వాణి వినిపించింది. 'ప్రజాపతీ! నువ్వు అవ్యక్తము నుంచి పుట్టావు. నువ్వు వ్యక్తాన్ని సృష్టించాలి' అని చెప్పింది. అప్పుడు బ్రహ్మ అసలు వ్యక్తము ఏమిటి? అవ్యక్తము ఏమిటి? నాకు వివరంగా చెప్పవలసింది అన్నాడు. అప్పుడు అశరీరవాణి బ్రహ్మను తపస్సు చెయ్యమంది. బ్రహ్మదేవుడు వెయ్యి సంవత్సరాలు తపస్సు చేశాడు.

అలా తపస్సు చేసి ఒక మంత్రాన్ని దర్శించాడు. ఆ మంత్రం అనుష్టుప్ ఛందస్సులో ఉన్నది. అన్ని మంత్రాలు కూడా దానికి అంగాలుగా ఉన్నాయి. ఆ మంత్రసారం తెలిస్తే జగత్తులో అన్నీ తెలుస్తాయి. బ్రహ్మదేవుడు ఆ మంత్రానికి ముందు ఓంకారము కలిపి వెయ్యి సంవత్సరాలు ధ్యానం చేశాడు. అప్పుడు లక్ష్మీదేవిని ఆలింగనము చేసుకున్నవాడు, గరుత్మంతుడు వాహనంగా గలవాడు, ఆదిశేషుని పడగతో కప్పబడిన శిరస్సు కలవాడు, సింహముతల, మానవశరీరము కలవాడు, సూర్యచంద్రులే నేత్రములుగా కలవాడు అయిన నారసింహుణ్ణి దర్శించి బ్రహ్మ అతనికి నమస్కరించాడు.

అతడు సింహం రూపంలో ఉన్నాడు కాబట్టి

– ఉగ్రం

మహాబలవంతుడు, వీర్యవంతుడు కాబట్టి

– వీరం

ఆయన శ్రీమహావిష్ణువు, జగత్తంతా వ్యాపించి ఉన్నాడు కాబట్టి

– మహావిష్ణుం

విపరీతమైన కాంతితో వెలుగుతున్నాడు కాబట్టి

– జ్వలంతం

ఆయనకు అన్నివైపులా ముఖాలున్నాయి. విశ్వరూపుడు కాబట్టి – విశ్వతోముఖం.

సింహం రూపంలో ఉన్నాడు కాబట్టి

– నృసింహం

అత్యంత భయంకరంగా ఉన్నాడు కాబట్టి

– భీషణం

అందరికీ అభయప్రదాత. మంగళకరుడు కాబట్టి

- భద్రం

మృత్యువు కూడా మృత్యువు. కాబట్టి

- మృత్యోర్మృత్యుం

ప్రజలకు అమృతతత్వాన్నిస్తాడు కాబట్టి

- నమామ్యహం

అన్నాడు. ఇది యజుర్వేద మంత్రం.

**ఉగ్రం వీరం మహావిష్ణుం జ్వలంతం సర్వతోముఖం**

**నృసింహం భీషణం భద్రం మృత్యోర్మృత్యుం నమామ్యహం॥**

ఇది మొత్తం 32 అక్షరాల మంత్రం. ఈ మంత్రాన్ని ఉచ్చరిస్తూ నమస్కారం చేశాడు బ్రహ్మ. దాంతో పరమేశ్వరుడు ప్రీతి చెందినవాడై ఓ ప్రజాపతీ నీకేం కావాలో చెప్పు అన్నాడు. ఆ మాటలు విన్న బ్రహ్మదేవుడు "దేవాది దేవా ! నేను అవ్యక్తం నుంచి ఆవిర్భవించాను. వ్యక్తాన్ని సృష్టించాలి అని తెలుసుకున్నాను. ఆ వ్యక్తమే నీవు అని కూడా తెలిసింది. కాబట్టి అసలు వ్యక్తము అంటే ఏమిటో నాకు చెప్పవలసినది. వ్యక్తము అంటే చరాచర జగత్తు కదా? ఈ జగత్తును సృష్టించటానికి నేను అశక్తుడను. కాబట్టి నాకు ఏదైనా ఉపాయం చెప్పవలసింది. అన్నాడు ఆ మాట విన్న దేవదేవుడు చెబుతున్నాడు. "ఓ ప్రజాపతీ! నేను నీకు సృష్టి చేసే ఉపాయం చెబుతాను. విను అగ్నియందు, స్వాత్మనే హవిస్సుగా చేసి, అనుష్టుప్ ఋక్కు చేత యజ్ఞం చెయ్యి. దాన్నే ధ్యానయజ్ఞము అంటారు. ఇది తెలిసిన వారికి అన్ని కోరికలు సిద్ధిస్తాయి. అతడు మరణానంతరము నన్నే పొందుతాడు" అన్నాడు.

మంత్రశాస్త్రంలో నృశింహ మంత్రాలు అనేకం ఉన్నాయి. చాలామంది అష్టముఖ గండభేరుండ బడబానల జ్వాలా నృశింహస్వామి మహామంత్రం కావాలి అని అడుగుతున్నారు. వారికోసం ఆ మంత్రాన్ని కూడా ఇక్కడ ఇస్తున్నాను.

ఈ మంత్రాన్ని అతిక్లిష్టమైన పరిస్థితిలో శత్రునాశనం కోసం చేస్తారు. ఇది చాలా ఉగ్రమైన మంత్రం. **అనవసరంగా దీని జోలికి పోకండి.**

**అష్టముఖ గండభేరుండబడబానల జ్వాలా నృశింహస్వామి మహామంత్రము.**

**ఓం ఐం హ్రీం శ్రీం ఓం ఘ్రౌం క్షౌం గ్ఘౌం హ్సౌం గ్లౌంశ్రీం క్ష్మాం హ్రోం హ్రీం ఫట్ అష్టముఖ గండభేరుండ బడబానల జ్వాలా నృశింహాయ, మహాశరఘాతకాయ, హుంఫట్, జ్వలజ్వల ప్రజ్వల ప్రజ్వ హన హన తపతప సర్వశత్రూన్ ఛిందింఛింది భిందిభింది హన హన సహస్రార హుం ఫట్ స్వాహా ॥**

పరమపురుషుడు చెప్పినట్లుగా ప్రజాపతి యజ్ఞం చేశాడు. దాంతో అతడికి అంతా తెలిసింది. ఏది చెయ్యటానికైనా సమర్థుడైనాడు. అన్నీ చేశాడు. ఈ రకంగా ఎవరు ధ్యానయజ్ఞం చేస్తారో అతడు సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సర్వకర్త అవుతాడు. లోకాలన్నీ జయించి పరబ్రహ్మను పొందగలుగుతాడు. ప్రజాపతి ఆ మంత్రంతోనే మూడు లోకాలను, ముక్కోటి దేవతలను సృష్టించాడు. దేవతలలో తాను ఇంద్రు డయ్యాడు. అలాగే ఏకాదశ రుద్రులను, ద్వాదశాదిత్యులను సృష్టించాడు. తాను విష్ణువైనాడు. అందుకే దేవతలలో ఇంద్రుడు, ఆదిత్యులలో విష్ణువు అధికులు.

మంత్రాలలోని నాలుగేసి అక్షరాలతో అష్టవసువులను సృష్టించాడు. మంత్రం మొదటి 12 అక్షరాలతో బ్రాహ్మణుని, పది అక్షరాలతో క్షత్రియుణ్ణి, పది అక్షరాలతో వైశ్యుణ్ణి సృష్టించాడు. అందుకే బ్రాహ్మణుడు ముఖ్యుడైనాడు. ఊరికే శూద్రుణ్ణి సృష్టించాడు కాబట్టి శూద్రుడు నిర్విద్యుడైనాడు. ప్రజాపతి రాత్రి, పగలు సృష్టించాడు. చీకటిని పోగొట్టాడు. ఆ మంత్రము యొక్క

ప్రథమ పాదము నుంచి - ఋగ్వేదము

రెండవ పాదము నుంచి - యజుర్వేదము

మూడవ పాదము నుంచి - సామవేదము

నాల్గవ పాదము నుంచి - అథర్వణవేదము

కల్పించాడు తరువాత

ఇరవైనాలుగు అక్షరాలు గలది- గాయత్రి

పదకొండు అక్షరాలు గలది - త్రిష్టుప్

నాలుగు పాదములు గలది - జగతి

ముప్పై రెండు అక్షరాలు కలది- అనుష్టుప్

ఇలా ఛందస్సులు సృష్టించాడు. ఈ జగత్తంతా అనుష్టుప్ ఛందస్సు నుంచే ఉత్పన్నమైంది. అనుష్టుప్ నందే ప్రతిష్ఠితమై ఉన్నది. ఈ విషయం తెలిసినవాడు ప్రతిష్టని పొందుతాడు.

ప్రజాపతి ప్రజలను ఎలా సృష్టించాలి అని ఆలోచించాడు. 'ఉగ్రం' అనే ఋక్కును గానం చెయ్యటం మొదలుపెట్టాడు. అప్పుడు ఉగ్రరూపుడయిన దేవుడు ఆవిర్భవించాడు. ఒకడు నల్లనివాడు ముందు ఎర్రనివాడు. పినాకము కలవాడు. స్త్రీ రూపము కలవాడు. అతణ్ణి

విభజించి స్త్రీలయందు స్త్రీ రూపాన్ని, పురుషుల యందు పురుష రూపాన్ని ఉంచాడు. ఇప్పుడు ప్రజలు సృష్టించబడ్డారు. ఇంద్రుడు దేవతలందరిలోను ఆఖరున పుట్టాడు. 'నీవు దేవతల కధిపతివి' అని చెప్పాడు. అప్పుడు దేవతలంతా ఇంద్రుడితో "నువ్వు మాకన్న తరువాత పుట్టావు. మాకు అధిపతి ఎలా అవుతావు?" అన్నారు. అదే మాట ప్రజాపతితో కూడా అన్నారు. అప్పుడు ప్రజాపతి ఇంద్రుణ్ణి అనుష్టుప్ చేత మంత్రించి సుదర్శనంతో కుడివైపు, పాంచజన్యంతో ఎడమవైపు రక్షించాడు. బంగారు రేకుమీద ఈ మంత్రం వ్రాసి ఇంద్రుడి మెడలో కట్టాడు. దాంతో ఎవరూ అతన్ని చూడటానికి కూడా వీలు కానంతవాడైనాడు. ఇంద్రుడికి అనుష్టుప్ విద్యని ఉపదేశించాడు. దేవతలంతా అతని ఆధిపత్యాన్ని ఒప్పుకున్నారు. ఇంద్రుడు స్వర్గానికి అదిపతి అయినాడు. ఈ విషయం తెలిసినవాడు స్వరాట్టు అవుతాడు. ఇంద్రుడు భూమిని, జలాన్ని జయించే విషయం తెలియక ప్రజాపతి దగ్గరకు వెళ్ళాడు. అప్పుడు ప్రజాపతి. కూర్మము, ఇంద్ర, నాగ, భుజగేంద్రులు గల భద్రాసనమిచ్చాడు. దాంతో భూమిని జయించాడు రెండు లోకాలకు (భూలోకము, స్వర్గము) అధిపతి అయినాడు.

ఈ విషయాలు తెలిసినవాడికి అన్ని విషయాలు తెలుస్తాయి. అతడు అన్ని వేదాలు చదివినట్లే. అన్ని యజ్ఞాలు చేసినట్లే. అన్ని తీర్థములయందు స్నానం చేసినట్లే. అన్ని పాతకాల నుంచి విముక్తుడవుతాడు. బ్రహ్మవర్చస్సు పొందుతాడు. తన వంశంలో ముందు వారిని తరువాత వారిని అందరిని పవిత్రం చేస్తాడు. అతడికి ఏ రోగాలు రావు. భూతప్రేత పిశాచాలు అతనివైపు తిరిగికూడా చూడవు. అతడు తలపెట్టిన పనులన్నీ పూర్తవుతాయి. అతడు సిద్ధపురుషుడవుతాడు. అందరూ అతన్ని తండ్రిగా భావిస్తారు.

రాజులుకూడా అతనిఆదేశాన్ని పాటిస్తారు. అతడు జీవన్ముక్తుడు. మరణానంతరము నృసింహుణ్ణి చేరతాడు. అతడికి పునర్జన్మ ఉండదు. అంటోంది ఈ ఉపనిషత్తు.

# 19. కృష్ణోపనిషత్తు

ఇది అథర్వణ వేదానికి సంబంధించినది. ఇందులో 9 మంత్రాలున్నాయి.

అవతారాలన్నింటిలోకి కృష్ణావతారం భిన్నమైనది. కృష్ణావతారం యొక్క ప్రాముఖ్యతను వివరిస్తోంది ఈ ఉపనిషత్తు.

కృతయుగంలో శ్రీరామచంద్రుడు వనవాసం చేస్తున్నాడు. ఆయన అతి సుందరాకారుడు. **పుంసాం మోహనరూపాయ** పురుషులను కూడా మోహంలో పడేస్తాడు. అటువంటి రామచంద్రమూర్తిని చూసి వనవాసులైన మునులందరూ మిమ్ము ఆలింగనము చేసుకుంటాము అని అడిగారు. దానికి రామచంద్రుడు నవ్వి ద్వాపరయుగంలో నేను కృష్ణుడుగా జన్మిస్తాను. అప్పుడు మీరు గోపికలుగా జన్మించండి మీ కోరిక తీరుతుంది అన్నాడు. ఆ విధంగానే కృష్ణావతార సమయంలో వారందరూ మళ్ళీ జన్మిస్తారు.

| | | |
|---|---|---|
| నందుడు | – | పరమానందము |
| ముక్తికాంత | – | యశోద |
| వేదములచే చెప్పబడు | | |
| బ్రహ్మపుత్రిక | – | దేవకి |
| వేదాలు | – | వసుదేవుడు |
| వేదార్థము | – | కృష్ణుడు |
| వాటిని కట్టుకర్ర | – | బ్రహ్మ |
| వెదురుకర్ర | – | రుద్రుడు |
| శిఖరము | – | ఇంద్రుడు |

స్నేహితులు - దేవతలు

గోపకులము - వైకుంఠము

అక్కడి చెట్లు - మహర్షులు

రాక్షసులు - లోభము, క్రోధము,భయము

తిరస్కరింపబడువాడు - కలి

మాయావిగ్రహరూపుడైన గోపుడు-సాక్షాత్తూ శ్రీహరి

ఆ వైష్ణవమాయ దుర్భేధ్యమైనది. ఆ మాయయే జగత్తును మోహింప చేస్తుంది. అది దేవతలచేత కూడా జయింప వీలుకానిది.

ఆదిశేషుడు - బలరాముడు

శాశ్వత పరబ్రహ్మమే - శ్రీకృష్ణుడు

16 వేలమంది గోపికలు - ఋక్కులు, ఉపనిషత్తులు

చాణూరమల్లుడు - ద్వేషము

ముష్టికుడు - మత్సరము

కువలయపీడనము (ఏనుగు) -దర్పము

బకాసురుడు - గర్వము

సుదాముడు - శమము

అక్రూరుడు - సత్యము

ఉద్ధవుడు - దమము

పాలసముద్రంలో పుట్టిన శంఖము-విష్ణు స్వరూపము

పాలకుండలు - పాలసముద్రము

శత్రుసంహారం చెయ్యటానికి, మిత్రులను రక్షించటానికి శ్రీహరి

అవతరించాడు.

| | | |
|---|---|---|
| బ్రహ్మయే | – | చక్రము |
| ధర్మము | – | చామరము |
| ఖడ్గము | – | మహేశ్వరుడు |
| రోలు | – | కశ్యపుడు |
| గద | – | శత్రుసంహారిణి కాళిమాత |
| మాయ | – | శార్గవమనే ధనుస్సు |
| శరత్కాలమే | – | భోజనము |
| గరుడుడు | – | వటవృక్షము |
| నారదుడు | – | సుదాముడు |
| భార్య | – | సర్వజంతుప్రకాశినియైన బుద్ధి |

పరమాత్మ కన్న భిన్నమైనది ఏదీలేదు. గోప స్త్రీలకన్న ప్రభువు భిన్నుడు కాడు. ఈ రకంగా వైకుంఠమే క్రిందికి దిగివచ్చింది" అని కృష్ణోపనిషత్తులో చెప్పబడింది.

సాక్షాత్తూ శ్రీమహావిష్ణువే శ్రీకృష్ణుడుగా భూమిమీద అవతరించాడు. అతడు తన దివ్యతేజస్సు చేత అవతారాలకు కారణమైనాడు. సుతపుడు అనే ప్రజాపతి తపస్సు చేసి శ్రీమహావిష్ణువును కుమారుడిగా కోరాడు. దాని ఫలితంగానే వసుదేవుని కుమారుడుగా హరి జన్మించాడు. అతడే వసుదేవునికుమారుడు వాసుదేవుడు. లోకక్షేమం కోసం పాలసముద్రంలో ఉంటాడు. కంసుడినుండి ఏర్పడిన ముప్పు తప్పించుకోవటానికి యశోదానందులచే స్వీకరించబడ్డాడు. ఇతడే సాధువులకు పరమాగతి.

సత్కార్యములు గలవాడు. సత్యము, నిత్యము అయినవాడు. సాధువులకు, సజ్జనులకు తానే మహదైశ్వర్యమైనవాడు. భూభారము తగ్గించటానికి శూరులైన యాదవ, పాండవ వీరులను సేనగా చేసుకున్నాడు. పతనమవుతున్న యదువంశాన్ని ఉద్ధరించాడు. సాధువులకు విశ్రాంతి స్థానమైనవాడు. యమునానదిలో జలక్రీడలాడిన పుణ్యచరితుడు. అన్ని భూతములందు ఉంటాడు. అతడే పరమపదాన్నిచ్చేవాడు సకల ప్రాణులకు ఆధారమైనవాడు. భక్తులకు ఎంతచేసినా తృప్తి చెందనివాడు. దేవతల గర్వాన్ని అణచినవాడు. యాదవులందరికీ గర్వము కలిగించినవాడు. అల్లులైన వారు అతన్ని పట్టలేరు. పరాజయము అనేది తెలియనివాడు. ఈ విశ్వమే అతని శరీరము. అతిపెద్దదైన దేహము గలవాడు. జగత్తులో ప్రకాశించేవన్నీ అతనిరూపాలే. అతడు అవ్యక్తుడు. అన్నింటి యందు అంతర్యామిగా ఉంటాడు. అనేకరూపాలు ధరించినవాడు. అనేకముఖములు గలవాడు అద్వితీయుడు అయిన పరబ్రహ్మ అతడే.'' అని చెబుతోంది. కృష్ణోపనిషత్తు.

# ౨౦. గారుడోపనిషత్తు

ఇది అధర్వణ వేదానికి సంబంధించిన ఉపనిషత్తు. ఇందులో మొత్తం ఐదు మంత్రాలున్నాయి. ఇందులో గరుడమంత్రాన్ని చెప్పి పాములు, తేళ్ళు, క్రిమికీటకాలు, చెట్లు, ఆకులు, కాయలు, పండ్లు. వీటన్నింటి నుంచి వచ్చే విషాన్ని నాశనం చెయ్యమని, మహానాగుల నుంచి, కాలకూటము వల్ల వచ్చే విషాన్ని నాశనం చెయ్యమని ప్రార్థిస్తున్నారు.

ఇందులో మహావిషాన్ని నాశనం చేయగల అమృత విద్యను వివరిస్తున్నారు. ఈ విద్యను మొదటగా పరమేశ్వరుడు నారదుడికి చెప్పగా అక్కడ నుంచి నారదుడు - బృహత్సేనుడికి, బృహత్సేనుడు - బృహత్పతికి, బృహత్పతి - ఇంద్రుడికి, ఇంద్రుడు - భరద్వాజుడికి, భరద్వాజుడు - తన శిష్యులకు చెప్పాడు. ఇది మహాగారుడవిద్య. దీనికి బ్రహ్మ ఋషి, గాయత్రి ఛందస్సు, గరుడుడు దేవత.

ఓం నమో భగవతే –అంగుష్ఠాభ్యాం నమః

మహాగరుడాయ –తర్జనీబ్యాం నమః

పక్షీంద్రాయ –మధ్యమాభ్యాం నమః

శ్రీవిష్ణువల్లభాయ –అనామికాభ్యాం నమః

త్రైలోక్యపరిపూజితాయ –కనిష్ఠికాభ్యాం నమః

ఉగ్ర భయంకర కాలానలరూపాయ–కరతలకరపృష్ఠాభ్యాం నమః

ఇలాగే హృదయాది అంగన్యాసము చెప్పాలి. భూర్భువస్సువరోం ఇతి దిగ్బంధః

ధ్యానమ్ :

స్వస్తికోదక్షిణపాదం వామపాదం తు కుంచితమ్
ప్రాంజలీకృత దోర్యుగ్మం గరుడం హరివల్లభమ్
అనంతో వామకటకో యజ్ఞసూత్రం తు వాసుకిః
తక్షకః కటిసూత్రంతు హారః కార్కోట ఉచ్యతే ॥

పద్మోదక్షిణ కర్ణేతు మహాపద్మస్తు వామకే
శంఖ శ్శిరప్రదేశేతు గుళికస్తు భుజాంతరే
పౌంద్రకాళిక నాగాభ్యాం చామరాభ్యా సువీజితమ్
ఏలాపుత్రకనాగాద్యై స్సేవ్యమానంముదాన్వితం ॥

కపిలాక్షం గరుత్మంతం సువర్ణ సదృశప్రభమ్
దీర్ఘబాహుం బృహత్ స్కందం నాగాభరణ భూషితమ్
అజానుతస్సువర్ణాభమా కట్యోస్తు హినప్రభమ్
కుంకుమారుణ మాకంఠం శతచంద్ర విభాననమ్ ॥

నీలాగ్ర నాసికావక్త్రం సుమహచ్చారుకుండలమ్
దంష్ట్రాకరాళ వదనం కిరీట మకుటోజ్వలమ్
కుంకుమారుణ సర్వాంగ కుందేందు ధవళానన
విష్ణువాహనమస్తుభ్యం క్షేమం కురు సదామమ ॥

ఏవం ధ్యాయేత్ త్రిసంధ్యా సుగరుడం నాగభూషణం
విషంనాశయతే శీఘ్రం తులారాశి మివానలః ॥

**మంత్రం :**

ఓం నమో భగవతే శ్రీమహాగరుడాయ పక్షీంద్రాయ విష్ణువల్లభాయ, త్రైలోక్య పరిపూజితాయ, ఉగ్రభయంకర కాలానలరూపాయ వజ్రనఖాయ, వజ్రతుండాయ, వజ్రదంతాయ, వజ్రదంష్ట్రాయ, వజ్రపుచ్ఛాయ, వజ్రపక్షాలంకృత శరీరాయ ఓం ఈం ఏహ్యేహి శ్రీమహాగరుడా ప్రతిహత శాసనాస్మిన్నా విశావిశ దుష్టానాం విషం దూషయ దూషయ స్పృష్టానాం విషం నాశయ నాశయ దందశూకానాం విషం దారయదారము ప్రలీనం విషం ప్రణాశయ ప్రణాశయ సర్వవిషం నాశయ నాశయ హనహన దహదహ పచపచ భస్మీకురు భస్మీకురు హుంఫట్ స్వాహా ॥

**మంత్రార్థము :**

ఓ మహాగరుడా! పక్షీంద్రా ! విష్ణువల్లభా, త్రైలోక్య పరిపూజితా, ఉగ్రభయంకర కాలానలరూపా, వజ్రనఖా, వజ్రతుండా, వజ్రదంతా, వజ్రదంష్ట్రా, వజ్రపుచ్ఛా, వజ్రపక్షాలంకృత శరీరా, ఓం ఈం మహాగరుడా! అప్రతిహత శాసనుడా, దీనియందు ఆవేశింపుము. దుష్టుల విషాన్ని పోగొట్టు. నన్ను తాకిన వారి విషము నశింపచేయి. దందశూకము (రెండు తలలపాము) విషము చీల్చుము. అణిగి ఉన్న విషాన్ని నశింపచేయి. సర్వవిషము నశింపచేయుము, చంపు, దహించు, భస్మము చెయ్యి, హుంఫట్ స్వాహా.

సూర్యమండలం వంటి వాడా, చంద్రమండలంతో సమానమైనవాడా! మహాగరుడా విషాన్ని హరించవలసింది. హుంఫట్

స్వాహా, ఓం క్షిపస్వాహా। అతడు చరిస్తున్నాడు. విషాలకు విషరూపి, విదూషకుడు, విషశోషకుడు, విషనాశకుడు, విషహారి. విషము నశించింది. అంతర్లీనమైన విషం నశించింది. నీ దయచే విషం నాశనమైనది. ఇంద్రుని వజ్రముచే విషము నాశనమయినది. గరుడునకు, విష్ణువాహకుడికి, వజ్రనఖుడు, వజ్రతుండుడు, వజ్రపక్షాలంకృత శరీరుడు అయిన గరుడునకు నమస్కారము. ఓ గరుడా! రా! విషాన్ని హరించు ఆవేసించు. ఓ గరుత్మంతా నువ్వు సుపర్ణుడివి. నీ శిరస్సు గాయత్రి, నేత్రము – స్తోమము, ఆత్మ–సామము, నీ శరీరము– వామదేవ్యము, రెక్కలు – బృహద్రధంతరాలు, పుచ్ఛము – యజ్ఞాయజ్ఞీయము, అంగములు – ఛందస్సులు, గిట్టలు – దిష్ణ్యములు, ఓ గరుత్మంతా ! నువ్వు స్వర్గానికి వెళ్ళు. సువర్లోకానికి వెళ్ళు. అతడు వెడుతున్నాడు. విషము నాశనమైనది. ఇంద్రుని వజ్రంతో విషం పోయింది. బ్రహ్మవల్ల విషం హతమైంది.

ఓ దేవా ! గరుత్మంతా ! నీవు తక్షకుడు, కర్కోటకుడు, మహాపద్ముడు, శంఖుడు, గుళిక, పౌంద్రకాళిక నాగకముల దూతవైనా సరే లేదా స్వయముగా అతడివే అయినా సరే ఆ విషము నాశనమయిపోయింది.

సాలెపురుగు, తేలు, గుర్రము, స్థావర జంగమముల విషమైనా సరే నాశనమైంది. అనంత, వాసుకి, తక్షక, కర్కోటక, పద్మక, మహాపద్మక, శంఖ, గుళిక, పౌంద్రుకాళిక మొదలైన దివ్యనాగుల విషమైనా సరే, ఎలుకలు, బల్లులు, పురుగులు, ఇంట్లో, కొండగుహల్లో, చెట్టు తొర్రలలో, గడ్డిపురుగులలో కట్టెలలో, చెట్టు బెరడు, ఆకు, పువ్వు, పండు, కాయలలో పుట్టిన వాటిదైనా సరే, ఉద్భిజాలు, స్వేదజాలు, జారజాల, విషమైనా సరే ఏ రకమైన విషమైనా సరే, ప్రాణుల విషంగాని,

పురుగుల పాముల, క్రిమికీటకాలు, చెట్లవల్ల వచ్చిన ఏ విషమైనా సరే నాశనమగుగాక. విషము నుంచి మానవజాతికి మేలు కలుగుగాక.

మంత్రశాస్త్రంలో గారుడ మంత్రాలు అనేకం ఉన్నాయి. వాటిలో కొన్నింటిని చూద్దాం.

1. ఓం క్షిం క్షిప స్వాహా
2. ఓం నమః పక్షిరాజాయ హ్రీం క్షిప ఓం స్వాహా
3. లం హాం క్షిప ఓం స్వాహా విషం స్తంభయ స్తంభయ
4. రం ఓం పక్షి స్వాహా రం దహ దహ పచ పచ దహదహ
5. వం పక్షి ఓం స్వాహా విషం సంప్లావయ సంప్లావయ
6. యం స్వా ఓం పక్షి హాం విషం సంక్రామయ సంక్రామయ
7. హా స్వా ఓం పక్షి

తత్పురుషాయ విద్మహే సువర్ణపక్షాయ ధీమహి తన్నోగరుడ ప్రచోదయాతు

ఏది ఏమైనా గురుముఖతః చెప్పుకుని మాత్రమే మంత్రం చెయ్యాలి. లేకపోతే మంత్రం సిద్ధించదు సరికదా ఇబ్బందులు కూడా రావచ్చు. జాగ్రత్త.

# 21. గోపాలతాపిని ఉపనిషత్తు

గోపాలతాపిని ఉపనిషత్తు ఇది అధర్వణ వేదానికి సంబంధించినది. ఇందులో ఈ విధంగా చెప్పబడింది. పూర్వకాలంలో కొందరు మునీశ్వరులు తపోనిష్ఠా గరిష్ఠుడైన ఒక బ్రాహ్మణుని దగ్గరకు పోయి "బ్రాహ్మణోత్తమా! గొప్పవాడైన దేవుడెవరు. మృత్యువు ఎవరికి భయపడుతుంది? ఎవరిని తెలుసుకున్నందువల్ల అన్ని విషయాలు తెలుస్తాయి? ఈ జగత్తు ఎవరివల్ల నడుస్తున్నది? ఈ విషయాలన్నీ దయచేసి మాకు వివరించవలసినది" అని అడిగారు. దానికి ఆ ద్విజశ్రేష్ఠుడు "తాపసోత్తములారా! శ్రీకృష్ణుడు పరదేవత. అతనిపేరు వింటేనే మృత్యువు కూడా భయపడుతుంది. అతన్ని గురించి తెలుసుకుంటే సర్వమూ తెలుస్తుంది. అతనివల్లనే ఈ జగత్తు నడుస్తున్నది" అన్నాడు. ఆ మాటలు విన్న తాపసులు "అసలు శ్రీకృష్ణుడు ఎవరో మాకు సవివరంగా చెప్పవలసింది" అంటూ ప్రార్థించారు. వారి ప్రార్థన ఆలకించిన వాడై, బ్రాహ్మణోత్తముడు.....

"అతడే పాపము పోగొట్టే మహానుభావుడు. వేదవిదుడు. అతడే పరబ్రహ్మ. అతన్ని స్మరించినంత మాత్రంచేతనే మృత్యువు తొలగిపోయి, సాధకుడు మృత్యువు లేనివాడు అవుతాడు" అన్నాడు. ఆ మాటలు విన్న మునీశ్వరులు "భూసురేంద్రా! శ్రీకృష్ణపరమాత్ముని రూపము ఏ రకంగా ఉంటుంది? అతన్ని ఏ రకంగా ఆరాధించాలి? మాకు వివరించండి" అని అడిగారు. బ్రాహ్మణుడు చెప్పటం ప్రారంభించాడు.

హిరణ్మయుడు, గోపవేషుడు, మేఘమువంటివాడు, తామరల వంటి కనులు గలవాడు, మెరుపువంటి వస్త్రము కలవాడు, రెండు

భుజములవాడు, జ్ఞానముద్ర కలవాడు, వనమాల ధరించినవాడు, దివ్యాలంకారభూషితుడు, రత్నపద్మమధ్యగతుడు, కాళిందీ జలకల్లోల మారుతము సేవించేవాడు, అయిన శ్రీకృష్ణుని సేవించినవాడు సంసార బంధనాల నుండి విడివడి ముక్తుడవుతాడు.

అతన్ని సేవించటానికి ఐదుపదములుగల మంత్రమున్నది. అందులో

క్లీం కృష్ణాయ - మొదటిపదము వల్లభాయ - నాల్గవ పదము

గోవిందాయ - రెండవ పదము స్వాహా - ఐదవ పదము

గోపీజన - మూడవ పదము

ఈ **మంత్రాన్ని ఉపాసన చేసినవాడు బ్రహ్మపదము పొందుతాడు.** అతడు ఒక్కడే అయి ఉండే అనేక రకాలుగా ప్రకాశిస్తున్నాడు. అతనిని సేవించిన వారికి శాశ్వతసుఖము కలుగుతుంది. అతడే వాసుదేవుడు, సచ్చిదానందుడు, బృందావనంలో కల్పవృక్షనీడన విశ్రమించినవాడు, విశ్వరూపుడు, సృష్టిస్థితిలయాలకు కారణమైన వాడు, విజ్ఞానరూపి, పరమానందుడు, కమలనేత్రుడు, కలమనాభుడు, కమలాపతి, నెమలి పింఛముతో అలరారేవాడు, కంసుని సంహరించినవాడు అతడే శ్రీకృష్ణ పరమాత్ముడు, దేవాదిదేవుడు. సృష్టి స్థితిలయకారకుడు. అతడే పరబ్రహ్మ" అని చెప్పబడింది.

# 22. నారాయణోపనిషత్తు

ఈ ఉపనిషత్తు కృష్ణయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో మొత్తం ఐదు మంత్రాలుంటాయి. ఇందులో ముఖ్యంగా అష్టాక్షరీ మహామంత్రం వివరించబడింది.

శ్రీమన్నారాయణుడే పరమేశ్వరుడు. అతని నుంచే చరాచర జగత్తంతా ఆవిర్భవించింది. బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు, ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు అంతా నారాయణుని నుంచే ఆవిర్భవించారు. అతణ్ణి అష్టాక్షరీ మహామంత్రంతోనే తెలుసుకోవాలి. ఈ మంత్రాన్ని ఉపాసించినవాడు. వైకుంఠం చేరతాడు అని చెబుతోంది ఈ ఉపనిషత్తు. ఇప్పుడు ఉపనిషత్తును చూద్దాం.

**మం॥ ఓం అథపురుషో హ వై నారాయణోఽకామయత, ప్రజాః సృజేయేతి, నారాయణాత్ ప్రాణో జాయతే, మన స్సర్వేంద్రియాణిచ, ఖం వాయు ర్జ్యోతి రాపః పృథివీ విశ్వస్య ధారిణీ, నారాయణా ద్బ్రహ్మా జాయతే, నారాయణా ద్రుద్రో జాయతే, నారాయణా దింద్రో జాయతే, నారాయణా త్ప్రజాపతిః ప్రజాయతే, నారాయణాత్ ద్వాదశాదిత్యా రుద్రా వసవ స్సర్వాణి ఛందాంసి, నారాయణాదేవ సముత్పద్యంతే, నారాయణాత్ ప్రవర్తంతే, నారాయణే ప్రలీయంతే, ఏత దృగ్వేదశిరోఽధీతే 1**

సృష్టి ప్రారంభంలో పరమపురుషుడైన నారాయణుడు జీవులను సృష్టించాలి అనుకున్నాడు. అప్పుడు సమిష్టి సూక్ష్మరూపి అయిన

హిరణ్యగర్భుడు ఆవిర్భవించాడు. ఆ తరువాత పంచభూతాలు - ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి పుట్టినాయి. నారాయణుని నుంచి బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు, మరీచి, కశ్యపుడు, దక్షుడు మొదలైన ప్రజాపతులు ఆవిర్భవించారు. ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, సకలవేదాలు ఆవిర్భవించినాయి. ఈ రకంగా చరాచర జగత్తంతా శ్రీమన్నారాయణుని నుంచే ఆవిర్భవించింది. ఇవన్నీ నారాయణుని యందే ఉన్నాయి. మళ్ళీ నారాయణుని యందే లయమవుతున్నాయి.

**మం॥**

**అథ నిత్యో నారాయణః బ్రహ్మ నారాయణః శివశ్చ నారాయణః, శక్రశ్చ నారాయణః, ద్యావాపృథివ్యౌ చ నారాణః, కాలశ్చ నారాయణః, దిశశ్చ నారాయణః, ఊర్ధ్వంచ నారాయణః, అధశ్చ నారాయణః, అంతర్బహిశ్చ నారాయణః, నారాయణ ఏ వేదగ్ం సర్వం, యద్భూతం యచ్చభవ్యం, నిష్కళంకో నిరజనంతో నిర్వికల్పో నిరాఖ్యాత శ్శుద్ధో దేవ ఏకో నారాయణః, న ద్వితీయోఽస్తి కశ్చిత్, య ఏవం వేద స విష్ణు రేవ భవతి, స విష్ణురేవ భవతి, ఏత ద్యజుర్వేద శిరోఽధీతే (2)**

నారాయణుడే నిత్యుడు. బ్రహ్మదేవుడు నారాయణుడే. శివుడు, ఇంద్రుడు, భూమి, ఆకాశము, కాలము, దశదిశలు, ఊర్ధ్వభాగము, అధోభాగము, మధ్యభాగము, అంతా నారాయణుడే.

బాహ్యాభ్యంతరముల యందున్నది నారాయణుడే. భూత భవిష్యద్వర్తమానాలు అన్నీ నారాయణుడే. అతడు నిష్కళంకుడు, నిరంజనుడు, నిర్వికల్పుడు. వాక్కులతో నిర్వచించటానికి వీలుకానివాడు. అద్వితీయుడు. ఈ లోకంలో నారాయణుడు తప్ప ఇంకెవరూ లేరు. ఈ విషయం తెలిసినవాడు సాక్షాత్తు నారాయణుడే అవుతాడు.

మం॥

**ఓమి త్యగ్రే వ్యాహరేత్, నమఇతిపశ్చాత్ నారాయణాయేత్యుపరిష్టాత్, ఓమిత్యే కాక్షరమ్, నమ ఇతి ద్వే అక్షరే, నారాయణాయేతి పంచాక్షరాణి, ఏతద్వై నారాయణ స్యాష్టాక్షరం పదమ్, యోహావై నారాయణస్యాష్టాక్షరం పదమధ్యేతి, అనప బ్రు వ స్సర్వ మాయురేతి, విందతే ప్రాజాపత్యమ్, రాయస్పోషం గౌపత్యమ్, తతోఽమృతత్వ మశ్నుతే తతోఽమృతత్వమశ్నుత ఇతి, ఏత త్సామవేద శిరోఽధీతే (3)**

ముందుగా 'ఓమ్' అనాలి. తరువాత 'నమో' ఆ తరువాత 'నారాయణాయ' అని పలకాలి. ఓమ్ అనేది – ఒక అక్షరం. నమః – రెండు అక్షరాలు. నారాయణాయ – ఐదు అక్షరాలు. మొత్తం కలిపితే ఓం నమో నారాయణాయ. ఇది అష్టాక్షరీ మహామంత్రము. ఈ మహామంత్రాన్ని జపించినట్లైతే సాధకుడు పొందనిది ఏదీలేదు. పూర్ణాయుష్యు, ధనధాన్యాలు, సకల సంపదలు, మరణానంతరము ప్రజాపతి పదవి కూడా పొందుతాడు.

**మం॥**

**ప్రత్యగానందం బ్రహ్మ పురుషం ప్రణవస్వరూపమ్, అకార ఉకారో మకార ఇతి, తా నేకధా సమభవ త్తదేత దోమితి య ముక్త్వా ముచ్యతే యోగీ జన్మసంసార బంధనాత్, ఓం నమోనారాయణాయేతి మంత్రోపాసకః, వైకుంఠభవనం గమిష్యతి, తదిదం పరం పుండరీకం విజ్ఞానఘనం తస్మా త్తటిదాభమాత్రమ్, బ్రహ్మణ్యోదేవకీ పుత్రో బ్రహ్మణ్యో మధుసూదనః, బ్రహ్మణ్యః పుండరీకాక్షో బ్రహ్మణ్యో విష్ణు రచ్యుతః ఇతి, సర్వభూతస్థ మేకం వై నారాయణం కారణపురుష మకారణం పరం బ్రహ్మోమ్, ఏతదథర్వశిరో౽ధీతే (4)**

అకార ఉకార మకారాలు మూడు అక్షరాలు. ఈ మూడు కలిపితే 'ఓం' అవుతుంది. ఓంకారానికి అర్థము – పరబ్రహ్మ. ఈ మంత్రాన్ని ఉపాసించే వాడు. వైకుంఠాన్ని చేరతాడు.

సర్వవ్యాపిగా ఉన్న ఆ పరమేశ్వరుడు హృత్పుండరీకమందు ఉన్నాడు. పరబ్రహ్మ స్వరూపమైన నారాయణుడు దేవకీపుత్రుడు, మధుసూదనుడు, పుండరీకాక్షుడు, అచ్యుతడు, సమస్త ప్రాణులయందు నారాయణుడొక్కడే అంతర్యామిగా ఉన్నాడు. అతడు సర్వవ్యాపి. సమస్త ప్రపంచానికి కారణభూతుడు, తనకు వేరే కారణము లేకుండానే స్వయంగా ప్రకాశిస్తున్నాడు. అతడు స్వయంప్రకాశి.

**మం॥ ప్రాతరధీయానో రాత్రికృతంపాపం నాశయతి,**

**సాయమధీయానో దివసకృతంపాపం నాశయతి, తత్సాయం ప్రాతరధీయానః అపాపో భవతి, మాధ్యందినమాదిత్యాభి ముఖోఽధీయానః పంచమహాపాత కోపపాతకాత్ ప్రముచ్యతే, సర్వవేద పారాయణ పుణ్యం లభతే, నారాయణ సాయుజ్య మవాప్నోతి, శ్రీమన్నారాయణ సాయుజ్య మవాప్నోతి, య ఏవం వేద, ఇత్యుపనిషత్ (5) (నారాయణోపనిష త్సమాప్తా)**

సర్వోపనిషనిషత్సారమైన ఈ ఉపనిషత్తును ప్రాతఃకాలమున పారాయణ చేస్తే - రాత్రి చేసిన పాపము, రాత్రిపూట పారాయణ చేస్తే పగటిపూట చేసిన పాపము నశించిపోతాయి. అతడు పంచ మహాపాతకాలు, ఉపపాతకాల నుంచి కూడా విముక్తుడౌతాడు అని ఉపనిషత్పారాయణ ఫలితాన్ని చెబుతోంది ఆఖరు మంత్రం.

# 23. కలిసంతరణోపనిషత్తు

కృష్ణయజుర్వేదానికి సంబంధించినది ఈ ఉపనిషత్తు.

ద్వాపరయుగం చివర భాగంలో నారదమహర్షి బ్రహ్మదేవుని దగ్గరకు పోయి "దేవదేవా! నేను భూలోకంలో సంచరిస్తూ పాపాలను ఏ విధంగా పోగొట్టగలను" అని అడిగాడు. దానికి బ్రహ్మదేవుడు "నారదా! సమస్త వేదరహస్యము, సంసార తరుణోపాయము చెబుతున్నాను శ్రద్ధగా వినవలసినది. భగవంతుడు, ఆదిపురుషుడు అయిన శ్రీమన్నారాయణుని నామము ఉచ్చరించినంతనే సమస్త పాపాలు నశించిపోతాయి" అన్నాడు.

"అయితే ఆనామము ఏది?" అని మళ్ళీ అడిగాడు నారదుడు. దానికి బ్రహ్మదేవుడు.

**"హరేరామ హరేరామ రామరామ హరేహరే !**

**హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే !"**

ఇదే శ్రీహరి నామమంత్రము. దీనిలో మొత్తం 16 నామాలున్నాయి. ఇది కలియుగంలో పాపాలన్నింటినీ నశింపచేస్తుంది. ఇంతకు మించిన ఉపాయమే లేదు. ఈ విషయం అన్ని వేదాలలోనూ చెప్పబడింది. ఈ రకంగా 16 కళలచేత కప్పబడిన జీవుని ఆవరణలు నశిస్తాయి. అప్పుడు మేఘములు తొలగిపోయిన సూర్యబింబం లాగా పరబ్రహ్మ ప్రకాశిస్తాడు.

ఈ నామ జపానికి ఏవిధమైన విధిలేదు. శుచిగా గాని, అశుచిగా గాని ఈ నామాన్ని సర్వకాల సర్వావస్థలయందు జపించవచ్చు. అలా జపించినవారు సామీప్య, సాలోక్య, సారూప్య, సాయుజ్యములు పొందుతారు. ఈ మంత్రాన్ని 31/2 కోట్లు జపం చేసినవారు

సర్వపాపాలనుండి విముక్తులవుతారు.

ఈ నామజపం చేసినవారు బ్రహ్మహత్యాపాతకము నుండి విముక్తులవుతారు. స్త్రీ హత్యాపాతకమునుండి తరిస్తారు. బంగారము దొంగిలించిన పాపమునుండి విముక్తులవుతారు. పరకాంతా గమనము వలన వచ్చిన పాపమునుండి విముక్తులవుతారు. దేవతలకు, పితృదేవతలకు, మనుష్యులకు చేసిన అపకారము వలన వచ్చిన పాపములనుండి విముక్తులవుతారు. సర్వధర్మములు త్యజించటం వల్ల వచ్చే పాపమునుండి విముక్తులవుతారు. సద్యోముక్తిని పొందుతారు. ఉంటూ 'హరేరామ' నామప్రభావాన్ని వివరించాడు.

# 24. దత్తాత్రేయోపనిషత్తు

ఇది అథర్వణ వేదానికి సంబంధించినది. ఇందులో నాలుగు మంత్రాలున్నాయి. ఇందులో దత్తాత్రేయ మంత్రము (షోడశి) దాని మాహాత్మ్యము చెప్పబడింది.

సత్యక్షేత్రంతో బ్రహ్మ నారాయణుడి దగ్గరకు వెళ్ళి నాకు తారకమంత్రం చెప్పవలసినది అన్నాడు. 'దాం' అనేదే తారకమంత్రము. దీనికి సదాశివుడు ఋషి, గాయత్రి ఛందస్సు, దత్తాత్రేయుడు దేవత. ఈ మంత్రం సర్వపాపాలను హరిస్తుంది.

**'ఓం శ్రీం హ్రాం క్లీం గ్లౌం ద్రాం' ఇది షడక్షరి**

**'ద్రాం దత్తాత్రేయాయ నమః' ఇది అష్టాక్షరి.**

**'ఓం ఆం హ్రీం క్రోం ఏహి దత్తాత్రేయాయ స్వాహా'** ఇది ద్వాదశాక్షరి.

దీనికి సదాశివుడు ఋషి. జగతి ఛ్ఛందస్సు. దత్తాత్రేయుడు దేవత. **"ఓం ఆం హ్రీం క్రోం ఏహ్యేహి దత్తాత్రేయాయ స్వాహా"** ఇది పద్నాలుగు అక్షరాల మంత్రం.

**'ఓం ఐం క్రోం క్లీం క్లూం హ్రాం హ్రీం హ్రూం సౌః దత్తాత్రేయాయ స్వాహా'** ఇది షోడశాక్షరి.

వీటిలో ఏ మంత్రమైనా చెప్పవచ్చు కాని షోడశి మాత్రం అర్హుడు కాని వాడికి చెప్పరాదు. ఇక్కడ వ్రాసిన మంత్రాలు ఏవీ చూసి చదవరాదు. దానివల్ల మంచి ఫలితం రాకపోగా దుష్ఫలితాలు వస్తాయి. **మంత్రం ఎప్పుడూ గురువుగారి దగ్గర చెప్పుకోవాలి.**

ఈ దత్తుడు అత్రిమహర్షి అనసూయల రెండవకుమారుడు. గణపతి సచ్చిదానంద స్వామి వారు వ్రాసిన **'ఆత్మనివేదన'** అనే పుస్తకాన్ని నేను ఉపన్యాసాలుగా చెప్పి **'దత్తజననం'** అనే పేరుతో సి.డి.కూడా ఇచ్చాను. నేను ఉపన్యాసాలు చెప్పే సమయంలో అత్రిమహర్షి, అనసూయాదేవి, దత్తాత్రేయుడు నా ఎదురుగానే ఉండేవారు. దత్తుడు అంతటి కరుణాసముద్రుడు. స్మరించినంత మాత్రం చేతనే తృప్తి చెందుతాడు. మహాజ్ఞానప్రదుడు. మహాయోగి, అవధూత, సర్వకామఫలప్రదుడు. పరయంత్ర తంత్ర మంత్రాలను నాశనము చేసేవాడు. గ్రహదోషాలు, పిశాచాలు, వ్యాధులు నివారించేవాడు. దుఃఖాన్ని పోగొట్టేవాడు, దరిద్రాన్ని నాశనం చేసేవాడు. అందరికీ ఆనందం కలిగించే దత్తునకు నమస్కారము.

ఈ ఉపనిషత్తు ప్రతిరోజు పారాయణ చేసినట్లైతే త్రిమూర్తులచే పవిత్రుడవుతాడు. లక్షగాయత్రి చేసిన ఫలితంవస్తుంది. పదివేలు మహారుద్రం చేసిన ఫలంవస్తుంది. పదివేలకోట్ల ప్రణవం చేసిన ఫలంవస్తుంది. అతడు తనవంశంలో ముందు వందమందిని, తరువాత వందమందిని తరింపజేస్తాడు. అతడు కూర్చున్న పంక్తి అంతా పవిత్రమవుతుంది. బ్రహ్మహత్యాది పాతకముల నుండి విముక్తి కలుగుతుంది. గోహత్యాపాతకము నుండి విముక్తుడవుతాడు. సర్వపాప విముక్తుడవుతాడు. తినకూడని పదార్థాలు తిన్న దోషం పోతుంది. సర్వమంత్ర యోగపారాయణు డవుతాడు. అతడే బ్రాహ్మణుడు. అని చెబుతోంది ఈ ఉపనిషత్తు.

# 25. తారసారోపనిషత్తు

ఇది శుక్ల యజుర్వేదానికి సంబంధించినది. ఇందులో మొత్తం నాలుగు మంత్రాలున్నాయి. ఇందులో అష్టాక్షరీ మంత్రమే తారక మంత్రము, ఈ మంత్రం ఉపాసించిన వారికి జన్మరాహిత్యం కలుగుతుంది. పునర్జన్మం ఉండదు. అని చెప్పారు. ఇక ఉపనిషత్తు చూడండి.

పూర్వకాలంలో భరద్వాజ మహర్షి ఒకసారి యాజ్ఞవల్క్యుడి దగ్గరకు వచ్చి "ఓ మహానుభావా! తారకము ఏది? తరింపచేసేది ఏమిటి? దయచేసి నాకు తెలియచెయ్యండి" అన్నాడు. ఆ మాటలు విన్న యాజ్ఞవల్క్యుడు "ఓ భరద్వాజ మహర్షీ! **ఓం నమో నారాయణాయ** అనేది చిదాత్మకమైన తారక మంత్రము. ఇందులో

ఓం – ఆత్మ స్వరూపము

నమః – ప్రకృతి స్వరూపము

నారాయణాయ – పరబ్రహ్మ స్వరూపము.

ఈ విషయం తెలిసిన వాడికి మరణముండదు. ఇందులో

| | |
|---|---|
| ఓం | – బ్రహ్మ. |
| నకారము | – విష్ణువు |
| మకారము | – రుద్రుడు |
| నకారము | – ఈశ్వరుడు |
| రకారము | – అండము (విరాట్టు) |

యకారము – పురుషుడు

ణకారము – భగవంతుడు

యకారము – పరమాత్మ

ఈ అష్టాక్షరీ మంత్రము పరమ పురుషుడు. ఓం అనే అక్షరమే పరబ్రహ్మ. దాన్నే ఉపాసించాలి. ఇది అష్టాత్మలు ఎనిమిది విధాలుగా అవుతుంది.

అకారము – మొదటి అక్షరము

ఉకారము – రెండవ అక్షరము

మకారము – మూడవ అక్షరము

బిందువు – నాల్గవ అక్షరము

నాదము – ఐదవ అక్షరము

నాదాంతము – ఆరవ అక్షరము

కళాతీతము – ఏడవ అక్షరము

తత్పురుషుడు – ఎనిమిదవ అక్షరము

ఈ తారకమే బ్రహ్మ. ఇదే ఉపాసించతగినది. ఓంకారము అనేది త్రికాలస్వరూపము, సర్వవర్ణాత్మకము, అన్ని ఛందస్సులు, అందరు దేవతలు, సర్వసృష్టి ఓంకారమే అని చెప్పాడు యాజ్ఞవల్క్యుడు. ఇప్పుడు భరద్వాజుడు మళ్ళీ అడుగుతున్నాడు. "స్వామీ ! ఏ మంత్రంతో శ్రీమన్నారాయణుడు ప్రీతి చెందుతాడో నాకు తెలియజెయ్యండి."

శ్రీమన్నారాయణుడే పరమాత్మ. అతడే దేవాదిదేవుడు. ఆదిపురుషుడు. ఆత్మస్వరూపి. నిత్యము, సత్యము, శాశ్వతమైన వాడు.

పురాణపురుషుడు, పురుషోత్తముడు. నిత్యుడు, బుద్ధుడు, ముక్తుడు, సత్యుడు, పరమానందుడు, అనంతుడు. పరిపూర్ణుడు. అతడే రాముడు. అతడే కృష్ణుడు. అతడే మోక్షప్రదాత. అతనిని అర్చించిన వారికి పునర్జన్మ ఉండదు. అంటూ ఉపనిషత్తును ముగించాడు యాజ్ఞవల్క్యుడు.

# 26. నృసింహతాపిని ఉపనిషత్తు

ఈ ఉపనిషత్తు అధర్వణ వేదానికి సంబంధించినది. ఇందులో రెండు భాగాలున్నాయి. 1. పూర్వతాపిని 2. ఉత్తరతాపిని. పూర్వతాపినిలో ఐదు అధ్యాయాలు 38 మంత్రాలు ఉన్నాయి. రెండవ భాగంలో తొమ్మిది అధ్యాయాలు 47 మంత్రాలు ఉన్నాయి. వెరసి 85 మంత్రాలున్నాయి. ఈ ఉపనిషత్తులో నృసింహ మంత్రం చెప్పి నృసింహుడే పరమేశ్వరుడు అనే విషయాన్ని ప్రతిపాదిస్తున్నారు. ఇక ఉపనిషత్తును చూద్దాం.

సృష్టి ప్రారంభానికి ముందు అంతా నీరే ఉండేది. ఆ నీటి మధ్య తామరాకు మీద ప్రజాపతి ఆవిర్భవించాడు. ఆయన మనస్సులో ఈ జగత్తునును సృష్టించాలనే కోరిక కలిగింది. వాక్కు, శరీరప్రవృత్తులకన్న ముందు కామము కలిగింది. అందుచేతనే పరమేశ్వర సంతతిలోని వారంతా మనస్సులో ఏదైతే అనుకుంటారో అదే చెబుతారు. అదే చేస్తారు.

ప్రజాపతి తపస్సు చేశాడు. అనుష్టుప్ చంధస్సులో ఉన్న నారసింహ మంత్రాన్ని దర్శించాడు. ఈ జగత్తంతా అనుష్టుప్ వల్లనే ఆవిర్భవిస్తున్నది. ఇందులో సముద్రాలు, పర్వతాలు, సప్తద్వీపాలతో కూడిన భూమి ఈ సామానికి మొదటి పాదము.

యక్షులు గంధర్వులు సేవించే అంతరిక్షం రెండవ పాదం, వసువులు, ఆదిత్యులు, రుద్రులు, సర్వదేవతలచే సేవించబడే ద్యులోకము. సామము తృతీయపాదము. నిరంజనము, పరమబ్రహ్మ రూపమైన ఆకాశము సామము యొక్క చతుర్ధపాదము.

ఇది తెలిసిన వాడికి అమృతత్త్వం సిద్ధిస్తుంది. ఈ మంత్రం గురువు ద్వారా చెప్పించుకోవాలి. అలా చెప్పుకుని ఉపాసన చేసేవాడు ముముక్షుమై మోక్షమార్గంలో సంచరిస్తాడు. **గురూపదేశం లేనివారికి మంత్రం సిద్ధించదు.**

ఈ మంత్రజపం చేసిన వారికి ఆయుర్దాయము, కీర్తి ప్రతిష్ట, ఐశ్వర్యము అన్నీ కలుగుతాయి. మంత్రం :

**ఉగ్రంవీరం మహావిష్ణుం జ్వలంతం సర్వతోముఖం**

**నృసింహం భీషణం భద్రం మృత్యుమృత్యుర్నమామ్యహం॥**

ఈ మంత్రం **'అవ్యక్తోపనిషత్తు'**లో కూడా చెప్పబడింది.

ఈ మంత్రాన్ని శిష్యుడికి కూడా అతడికి ఆసక్తి లేనిదే చెప్పరాదు. మంత్రమందు ఆసక్తి ఉన్నవారికే ఈ మంత్రం చెప్పాలి. ఇది తారక మంత్రము. ఈ విధంగా ఉపనిషత్తును తెలుసుకున్నవాడు అమృతత్త్వము పొందుతాడు.

**సకృత పురశ్చరణోమహావిష్ణోర్భవతి. మహావిష్ణోర్భవతి"** ఈ మంత్రం పురశ్చరణ చేసినవాడు సాక్షాత్తు శ్రీమహావిష్ణువు అవుతాడు. అని చెబుతోంది ఈ ఉపనిషత్తు.

దేవతలు మృత్యువు, పాపము, సంసారము వీటివల్ల భయపడి వారంతా ప్రజాపతి దగ్గరకు వెళ్ళి తమ భయం పోగొట్టమని అడిగారు. ప్రజాపతి వారికి నృసింహ దేవతాకమయిన ఈ మంత్రాన్ని దేవతలకు ఉపదేశించాడు. ఈ మంత్రాన్ని ఉపదేశము పొంది మృత్యువును జయించారు. దేవతలు. పాపము నుంచి తరించారు. కాబట్టి ఎవరైనా

మృత్యువునుండి పాపాల నుండి, సంసారము నుండి భయపడేవారు నారసింహ మంత్రాన్ని ఉపదేశం పొందాలి.

నృసింహ సంబంధమైన మాయమే ఈ సర్వాన్ని సృష్టిస్తున్నది. రక్షిస్తున్నది. కాబట్టి మాయే శక్తి అని తెలుసుకున్నవాడు పాపాలనుంచి, మృత్యువునుంచి తరిస్తాడు. సంసారంనుంచి తరిస్తాడు. అమృతత్వాన్ని పొందుతాడు.

ఈ మంత్రానికి అంగమంత్రాలు 1. ప్రణవము 2. సావిత్రి 3. యజస్సు 4. లక్ష్మి 5. నృసింహ గాయత్రి

1) ప్రణవము : ఇదే ఓంకారము. భూత భవిష్య ద్వర్తమానకాలాలు ఓంకారమే. వీటికి మించినది ఏదైనా ఉంటే అదికూడా ఓంకారమే. దానికి ఏడు అంగాలు, 19 ముఖాలు ఉన్నాయి.

2) సావిత్రి గాయత్రిచేత యజస్సుచేత చెప్పబడింది. దాంతోనే ఈ జగత్తంతా వ్యాపించబడింది. 'ఘృణి' అని రెండక్షరాలు, 'సూరియ' అని మూడక్షరాలు 'ఆదిత్యః' అని మూడక్షరాలు ఇదే సావిత్రి. అష్టాక్షరీ మంత్రము. ఓం **'ఘృణిసూర్య ఆదిత్యోం'**

**ఓం భూర్లక్ష్మీః భువర్లక్ష్మీః సువర్లక్ష్మీః కాలకర్ణీ**

**తన్నోలక్ష్మీః ప్రచోదయాత్**

ఇది మహాలక్ష్మి యజుర్గాయత్రి. 24 అక్షరాల మంత్రము. ఈ మంత్రం ఉపాసించిన వారు అధికమైన సంపద పొందుతారు.

**ఓం నృసింహాయ విద్మహే వజ్రనఖాయ ధీమహి**

**తన్నస్సింహగ్ం ప్రచోదయాతు**

**వజ్రనఖాయ విద్మహే తీక్షణ దగ్స్ట్రాయ ధీమహి**

**తన్నో నారసింహగ్ం ప్రచోదయాత్.**

దీన్ని నృసింహ గాయత్రి అంటారు.

నృసింహుని దర్శనం కావాలంటే ఆయనను ఈ క్రింది మంత్రాలతో స్తుతించాలి.

1. యశ్చవిష్ణుః
2. యశ్చమహేశ్వరః
3. యశ్చపురుషః
4. యశ్చేశ్వరః
5. యాసరస్వతీ
6. యాశ్రీః
7. యాగౌరీ
8. యాప్రకృతి
9. యావిద్యా
10. యశ్చోంకారం
11. యాశ్చతస్రోర్ధమాత్రా
12. యేవేదాస్సాంగాస్సశాఖాస్సేతిహాసాః
13. యేచ పంచాగ్నయః
14. యాస్సప్త మహావ్యాహృతయః
15. యేచాష్టౌ లోకపాలాః
16. యేచాష్టావసవః

17. యేచైకాదశరుద్రాః

18. యేచద్వాదశాదిత్యాః

19. యేచాష్టౌగ్రహాః

20. యానిపంచమహాభూతాని

21. యాశ్చకాలః

22. యశ్చమనుః

23. యశ్చమృత్యుః

24. యశ్చయమః

25. యశ్చాంతకః

26. యశ్చప్రాణః

27. యశ్చసూర్యః

28. యశ్చసోమః

29. యశ్చవిరాట్పురుషః

30. యశ్చజీవః

31. యచ్చసర్వం

32. యశ్చప్రజాపతిః

ఈ 32 మంత్రాలతో ప్రతిరోజూ స్వామిని స్తుతిస్తే ప్రీతిచెంది దర్శనమిస్తాడు.

**ఓం యోహవై నృసింహదేవో భగవాన్ యశ్చబ్రహ్మా భూర్భువస్సువ స్తస్మైవై నమోనమః**

నారసింహమంత్రరాజము యొక్క చక్రము. అన్ని కోరికలు

తీరుస్తుంది, మోక్షద్వారమైన సుదర్శన మహాచక్రము. ఇది వాఙ్మయము, యజుర్మయము, సామమయము, బ్రహ్మమయము. అమృతమయము. ఈ చక్రంలో తూర్పున వసువులు, దక్షిణాన రుద్రులు, పడమర ఆదిత్యులు, ఉత్తరాన విశ్వేదేవతలు మధ్యన బ్రహ్మ విష్ణు రుద్రులు పార్శ్వము లందు సూర్యచంద్రులు ఉంటారు. దేవతలంతా దీనిలోనే ఉంటారు. సుదర్శనచక్రాన్ని గురించి తెలుసుకున్నవాడు మహాత్ముడవుతాడు.

**ఓం క్ష్మ్రౌం సహస్రార హుంఫట్** ఇది సుదర్శన మహామంత్రము.

నారసింహ మంత్రాన్ని నిత్యము జపించేవాడు అగ్నిపూతుడవుతాడు. వాయుపూతుడవుతాడు. ఆదిత్యపూతుడు, సోమపూతుడు, సత్యపూతుడు, బ్రహ్మపూతుడు, విష్ణుపూతుడు, రుద్రపూతుడు, దేవపూతుడు, సర్వపూతుడు అవుతాడు. అతడికి మృత్యువు ఉండదు.

అన్ని రకాలయిన పాపాలు నశించిపోతాయి. బ్రహ్మహత్య, భ్రూహత్య, శిశుహత్యల వల్ల వచ్చే పాతకాలన్నీ నశించిపోతాయి. అతడు అగ్నిస్తంభన, జలస్తంభన చేస్తాడు. అందరు దేవతలను ఆకర్షిస్తాడు. అతడు యక్షులు, నాగులు, గ్రహాలు, మానవులు అందర్నీ ఆకర్షిస్తాడు. ఊర్ధ్వలోకాలు, అధోలోకాలు అన్నీ జయిస్తాడు. అగ్నిష్టోమము, వాజపేయము, అశ్వమేధము, రాజసూయము మొదలైన అన్ని యాగాలు చేసినవాడవుతాడు. అన్ని వేదాలు పారాయణ చేసినవాడవుతాడు. అతడు శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు అన్నీ చదవకపోయినా చదివినట్లే.

ఎక్కడ సూర్యుడు సూర్యుడు ప్రకాశించడో, ఎక్కడ వాయువు వీచదో, ఎక్కడ నక్షత్రాలు ప్రకాశించవో, ఎక్కడ అగ్ని దహించదో, ఎక్కడ మృత్యువు ఉండదో, ఎక్కడ దుఃఖమనేది లేదో, సదానందము, శాంతము, శాశ్వతము, సదాశివము, బ్రహ్మాదినందితము అయిన పరమపదము చేరతాడు. అతడికి పునర్జన్మ ఉండదు. అంటోంది నృసింహ పూర్వతాపినీ ఉపనిషత్తు.

ఉత్తరతాపినీ ఉపనిషత్తు మొదటి ఖండంలో ఓంకారాన్ని గురించి చెబుతున్నారు. ఓంకారము పరమేశ్వరస్వరూపము. భూతభవిష్యద్వర్తమానాలు పరమేశ్వరరూపము. అంతకుమించినది ఏదైనా ఉంటే అదికూడా పరమేశ్వర స్వరూపమే. ఈ ఆత్మబ్రహ్మము. ఆత్మను ఓంకారంతో ఐక్యముచేసి దాన్ని ఉపాసించాలి. అవస్థలు మూడు. జాగ్రస్వప్న సుషుప్తులు. ఈ ఆత్మను జాగ్రదావస్థలో ఉన్నప్పుడు స్వప్నసుషుప్తులు లేనిదిగను, స్వప్నంలో జాగ్రసుషుప్తులు లేనిదిగను, సుషుప్తిలో జాగ్రస్వప్నాలు లేనిదిగను, తురీయావస్థలో జాగ్రస్వప్న సుషుప్తులు మూడు లేనిదిగా, నిత్యానందము కలదిగా, ఏకముగా ఉన్నదిగా తెలుసుకోవాలి.

ఆత్మ నేత్రానికి ద్రష్టగా ఉన్నది. శ్రోత్రానికి, మనస్సుకు బుద్ధికి ప్రాణానికి, అన్నింటికీ ద్రష్టయై ఉన్నది. అన్నింటికీ సాక్షి అయిఉన్నది. వికారములు లేనిది. మహాచైతన్యము. సర్వజగత్తుకన్న ప్రియమైనది. ఆనందఘనమైనది. దివ్యమైనకాంతి గలది. ముసలితనము లేనిది. అభయము అమృతము అయినది. ఈ ఆత్మస్వరూపాన్ని నృసింహఅనుష్టుప్ రూపంలోనే తెలుసుకోవాలి. ఆత్మ సత్యము, నిత్యము, శుద్ధము, ముక్తము, సూక్ష్మము, పరిపూర్ణము, అద్వయము,

సదానంద చిన్మాత్రము. ఆత్మ ఎవరిచేత వ్యవహారితము కాదు. అటువంటి ఆత్మ నృసింహుడే. ఈ విషయం తెలిసిన వాడికి సుఖదుఃఖాలు ఉండవు. కోపతాపాలు, రాగద్వేషాలు ఉండవు. అహంకార మమకారాలు ఉండవు. నేనే పరమాత్మ స్వరూపము అని తెలుసుకుని ఈ జగత్తే నేను. నేనే జగత్తు అని ఎవడు భావించగలుగుతాడో అతడికి పునర్జన్మ ఉండదు.

# 27. రామతాపిని ఉపనిషత్తు

ఈ ఉపనిషత్తు అధర్వణ వేదానికి సంబంధించినది. ఇది మొత్తం రెండు భాగాలుగా ఉంటుంది. ప్రథమ భాగంలో ఐదు అధ్యాయాలు 16 మంత్రాలు ఉండగా రెండవ భాగంలో 17 మంత్రాలుంటాయి. మొత్తంమీద 33 మంత్రాలు ఉంటాయి. ఇందులో శ్రీరాముడే పరబ్రహ్మ స్వరూపము. రామ మంత్రాన్ని జపించిన వారికి పునర్జన్మ ఉండదు అని చెప్పబడుతోంది.

చిన్మయస్వరూపుడైన శ్రీమహావిష్ణువు రఘువంశంలో దశరథనందనుడిగా అవతరించి శ్రీరాముడు అనే పేరుతో పిలువబడ్డాడు. **రాతిరాజతేవా మహీస్థితః ఇతిరామః** భూమిమీద భక్తుల కోరికలు తీరుస్తూ రాజుగా విరాజిల్లుతున్నాడు కాబట్టి రాముడు అని చెప్పబడ్డాడు. రాక్షసులు ఎవరివల్ల మరణిస్తున్నారో అతడు రాముడు. మనుష్యుల మనసులను రంజింపచేస్తాడు కాబట్టి అభిరాముడు. భూలోకంలో రాక్షసులను నాశనం చేశాడు కాబట్టి రాముడు. తోటి రాజులందరికీ తనయొక్క ఆదర్శచరిత్రతో ధర్మమార్గాన్ని, నామజపంతో జ్ఞానమార్గాన్ని, రూపధ్యానంతో వైరాగ్యము, విగ్రహపూజతో ఐశ్వర్యము, ప్రదానం చేశాడు కాబట్టి ఈ లోకంలో రాముడు అని పిలువబడుతున్నాడు. అతడు ఆనందరూపుడు, నిత్యబ్రహ్మ. అందువల్లనే పరబ్రహ్మ రామ అనే పేరుతో ప్రతిపాదించబడుతున్నాడు. అతడే మొదట రామ అనే పేరుతో ప్రతిపాదించబడుతున్నాడు. అతడే మొదటగా సృష్టి చేశాడు. శరీరాన్ని సృష్టించాడు. పురుష దేవతలను, స్త్రీ దేవతలను సృష్టించాడు. దేవతలందరికీ రూపాన్ని కల్పించాడు.

ఆయనకు 18 చేతులున్నాయి. చేతులలో శంఖము, చక్రము, గద, పద్మము మొ॥వి ధరించి ఉన్నాడు. విశ్వరూపంలో అతనికి వెయ్యి చేతులున్నాయి. అన్ని రకాల ఆయుధాలు ఉన్నాయి. అనేక అవతారాలెత్తాడు. అనేక రకాల వాహనా లున్నాయి. ఆ పరబ్రహ్మ స్వరూపంలోనే ఆదిత్యం, అంబికం, గణనాధం, విష్ణుం, శివం అనే ఐదు రూపాలు కల్పించబడ్డాయి. పిపీలికాది బ్రహ్మపర్యంతము ఆవరించి ఉన్నాడు. కాబట్టి ముముక్షువులు రామనామాన్నే జపించాలి. రాముని విగ్రహాన్ని పూజించాలి. దేవతా స్వరూపమైన మంత్రాన్ని జపించాలి. యంత్రపూజ లేనిదే దేవతలు ప్రసన్నులు కారు. అందుకని రామయంత్రాన్నే అర్చించాలి.

శ్రీరాముడు సాక్షాత్తు పరమేశ్వరుడు. ఆయన స్వయంభువు. ఎవరిచేతా సృష్టించబడలేదు. గుణత్రయము, త్రిమూర్తుల సాయంతో సృష్టి స్థితి లయాలన్నీ చేస్తున్నాడు. రామబీజంతో ఈ జగత్తంతా నిండి ఉంది.

బీజాక్షర మంత్రాలతో చిన్మయులైన సీతారాములు పూజనీయులు. వీరే ప్రకృతి పురుషులు. 14 లోకాలు సృష్టించారు. వీరివల్లనే జగత్తులన్నీ స్థిరంగా ఉన్నాయి. ఆయన తనలోనుండే ఈ సృష్టి అంతాచేసి మళ్ళీ తనలోనే లయం చేసుకుంటున్నాడు.

**'రామాయ నమః'** అనే మంత్రంతో ఆయనను ప్రసన్నుడిగా చేసుకోవాలి. దశరథాత్మజుడైన రాముడే అనంతుడు. అతడు పరబ్రహ్మ అని భావన చెయ్యాలి. ఆయన సీతతో కలిసినప్పుడు అగ్నిషోమాత్మకమైన జగత్తు ఆవిర్భవిస్తున్నది.

మూలప్రకృతి అయిన సీతామాత రాముడి వామాంకము నందున్నది. ఆవిడ బంగారు శరీరఛాయ గలది. రెండు చేతులతో దివ్యాభరణములతో శోభిల్లుతున్నది. ఆయన కుడివైపున లక్ష్మణుడు ధనుర్బాణాలు ధరించి నిలబడి ఉన్నాడు. ఇలా రాముడు లక్ష్మణ సీతాసమేతుడై త్రికోణాకారంలో కనిపిస్తాడు.

రాక్షస సంహారం కోసమే ఈ భూమిమీద అవతరించాడు. ఖరదూషణాదులను వధించటానికే సీతాపహరణానికి అవకాశమిచ్చాడు. రావణుడితో సహా కొన్ని లక్షలమంది రాక్షసులను సంహరించటం కోసమే రామాయణం నడిచింది. దీనికోసమే అరణ్యవాసము, సీతాపహరణము, సుగ్రీవుడితో మైత్రి, వానరసేనసహాయము, వారధినిర్మాణము రామరావణయుద్ధం అన్నీ జరిగినాయి.

శ్రీరామచంద్రుడు రాక్షస సంహారం చేసి భూమిమీద ధర్మాన్ని నిలబెట్టాడు. అటువంటి రాముణ్ణి యంత్రంలో పూజించాలి. ఎడమవైపున సీతాదేవి, క్రింద నేలమీద హనుమ, కుడివైపున లక్ష్మణుడు. వెనక భాగంలో భరత శత్రుఘ్నులు రెండు ప్రక్కలా, ముందు భాగంలో సుగ్రీవుడు, విభీషణుడు, తారాసుతుడు (అంగదుడు), జాంబవంతుడు అందరూ ఉండగా వీరి మధ్యన రామచంద్రమూర్తి కొలువై ఉంటాడు.

**వామేభూమిసుతా పురశ్చ హనుమాన్ పశ్చాత్ సుమిత్రా సుతః**

**శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వయుభయోర్వాయు వ్యాది కోణాషుచ**

**సుగ్రీవశ్చ విభీషణశ్చ యువరాట్ తారాసుతో జాంబవాన్**

**మధ్యే నీలసరోజకోమలరుచిం రామం భజే శ్యామలమ్ ॥**

ఇదే యంత్రంలో ఉండే భావన. ఈ భావనలోనే యంత్రంగియ్యటం జరిగింది. బీజాక్షరాలు కూడా యంత్రంలో వ్రాయటం జరిగింది.

47 అక్షరాలు శ్రీరాముడి మాలామంత్రము.

**"ఓం నమో భగవతే రఘునందనాయ రక్షోఘ్న విశదాయ మధురప్రసన్న వదనాయామిత తేజసే బలాయ రామాయ విష్ణవే నమః ఓమ్"**

పట్టాభిషిక్తుడైన రాముని మంత్రమిది. భక్తుల త్రిగుణాలను నశింపచేస్తుంది. ఈ మంత్రము సర్వాత్మకమైనది. దీన్ని జపించినట్లైతే సర్వము సత్వరమే సిద్ధిస్తుంది. రామయంత్ర పూజావిధానము కూడా ఈ ఉపనిషత్తులో వివరించబడింది.

ఇక ఈ ఉపనిషత్తు రెండవ భాగాన్ని చూద్దాం. కురుక్షేత్రము కన్న గొప్పది కాశి. అన్ని రకాల సత్కర్మలకు, దేవతలకు, దేవపూజలకు నిలయము. అన్ని ప్రాణులు పరమాత్మను పొందటానికి యోగ్యమైన స్థానము. అవసానదశలో రుద్రుడే జీవుడికి ఇక్కడ తారక మంత్రాన్ని ఉపదేశిస్తాడు.

**రామాయ నమః, రామచంద్రాయ నమః, రామభద్రాయ నమః** ఇవి తారక మంత్రాలు. ఇవే సచ్చిదానంద స్వరూపాలు. తారక మంత్రాన్ని జపించిన వారికి ఏ రకమైన పాపాలు ఉండవు. బ్రహ్మహత్య, భ్రూణహత్య, శిశుహత్య, పంచమహాపాతకాల నుంచి బయటపడతాడు. సమస్త పాపాలనుండి విముక్తుడవుతాడు.

ఓంకారము పరబ్రహ్మస్వరూపము. ఇందులో అకార ఉకార మకారాలు బిందువు, అర్ధమాత్ర నాదము వెరసి ఆరు అక్షరాలున్నాయి. ఇందులో

| | | |
|---|---|---|
| లక్ష్మణుడు | – | అకారము. |
| శత్రుఘ్నుడు | – | ఉకారము. |
| భరతుడు | – | మకారము. |
| హనుమంతుడు | – | బిందువు. |
| రాముడు | – | అర్ధమాత్ర |
| సీత | – | నాదము. |

ఓంకారము త్రిమూర్తి స్వరూపము, అవస్థారూపము, స్థూలసూక్ష్మ కారణ శరీరాత్మకమైన విశుద్ధబ్రహ్మ. త్రిగుణాత్మకము, విశ్వాత్మకము. పరమాత్మ స్వరూపము.

పరమేశ్వరుణ్ణి ఎక్కడ అర్చించాలి అంటే అవి ముక్తక్షేత్రమైన వారణాసిలో అర్చించాలి. వారణాసి ఎక్కడ ఉన్నది? వరుణ, అసి ఈ రెండింటి మధ్యన అంటే భ్రూమధ్య భాగంలో ఆజ్ఞాచక్రంలో ఉన్నది.

పూర్వకాలంలో శివుడు తీవ్రమైన తపస్సు చేశాడు. రాముడు ప్రసన్నుడై దర్శనమిచ్చి ఏం కావాలో కోరుకో అన్నాడు. అప్పుడు శంకరుడు “రామా! కాశిలో గాని, మణికర్ణికలో గాని గంగానది వడ్డున గాని దేహత్యాగం చేసిన వారికి మోక్షం ఇవ్వాలి.” అని కోరాడు శంకరుడు. తథాస్తు అన్నాడు రాముడు. కాబట్టి ఏ ప్రాణి అయినా సరే కాశిలో మరణించినట్లైతే మోక్షం పొందుతుంది. శంకరా ! నేనుకూడా ఇక్కడే పాషాణరూపంలో ఉంటాను. నా తారక మంత్రాన్ని భక్తితో జపం చేసేవాడు బ్రహ్మాత్యాది పాతకాల నుంచి విడివడతాడు.

శంకరా మరణ సమయంలో ఏ జీవికైనా నువ్వు కుడి చెవిలో రామమంత్రాన్ని ఉపదేశిస్తే అతడు తప్పక మోక్షం పొందుతాడు" అని వరమిచ్చాడు.

ఒకసారి బ్రహ్మదేవుడు శ్రీరామచంద్రుణ్ణి 47 మంత్రాలతో స్తుతిచేసి ప్రసన్నం చేసుకున్నాడు. ఆ 47 మంత్రాలు ఈ ఉపనిషత్తులో ఇవ్వబడ్డాయి. ఆ మంత్రాలతో గనక స్తోత్రం చేస్తే శ్రీరాముడు త్వరగా ప్రసన్నుడవుతాడు, సాధకుడు మోక్షం కూడా త్వరగా పొందుతాడు.

రామమంత్రంలో ఈ మహాత్మ్యాన్ని వివరిస్తున్నారు.

రాం – అఖండైక రసానంద స్వరూపము

రామాయ – సత్యానంద చిదాత్మకము

నమః – పూర్ణ ఆనందైక కారణము

**రాం రామాయ నమః** ఈ మంత్రాన్ని సర్వదేవతలు ముముక్షువులు హృదయ పూర్వకంగా జపిస్తారు.

ఈ మంత్రాన్ని ప్రతిరోజు జపించేవాడు అగ్నిలాగా పవిత్రుడౌతాడు. వాయువులాగా, ఆదిత్యునిలాగా, చంద్రునిలాగా పవిత్రుడౌతాడు. మహావిష్ణువులాగా, శంకరునిలాగా పవిత్రుడవుతాడు. ఇతిహాసాలు, పురాణాలు, రుద్రాధ్యాయము లక్షసార్లు పారాయణ చేసిన ఫలితం పొందుతాడు. అటు పదితరాలు ఇటు పదితరాలు పావనం చేస్తాడు. అమృతత్వాన్ని పొందుతాడు.

రామ షడక్షరమంత్రం అన్ని మంత్రాలకన్నా శ్రేష్టమైనది. మానవుడు ఒకరోజులో గాని, వారంలోగాని, పక్షంలోగాని, మాసంలోగాని, సంవత్సరంలోగాని, జీవిత కాలంలోగాని చేసిన పాపం

అంతా ఒక్కసారి రామమంత్రజపం చేస్తే నాశనమై పోతుంది. పంచమహాపాతకాలు, ఉపపాతకాలు, సర్వపాపాలు క్షయమై పోతాయి.

ఈ మంత్రజపం వల్ల ఈ లోకంలో సిరిసంపదలు, భోగభాగ్యాలు, ఉన్నత పదవులు వస్తాయి. మరణానంతరము స్వర్గసుఖాలు పొందుతాడు. అర్హత గలవాడికి కైవల్యప్రాప్తి జరుగుతుంది.

రామమంత్ర జపంవల్ల తల్లికి చేసినద్రోహము, తండ్రికి చేసినద్రోహము, సోదరులకు చేసినద్రోహము నశించిపోతాయి. సంచితకర్మ అంతానశిస్తుంది. తల్లితండ్రులను వధించిన పాపము, గోహత్య, శిశుహత్య, బ్రాహ్మణహత్య, భ్రూణహత్యల వల్ల వచ్చే పాపము, చాంద్రాయణాది వ్రతాలతో కూడా పోని పాపము, ఎన్ని దానాలు చేసినా నాశనం కాని పాపము, నియమాలు అతిక్రమించటం వల్ల వచ్చిన పాపము, అన్నీ రామమంత్రజపంతో నశిస్తాయి. రామమంత్రం జపంచేస్తే దుర్భిక్షం ఉండదు. దీంతో సమానమైనమంత్రం ముల్లోకాల్లోనూ లేదు. ఈ మంత్ర జపం చేసినవారికి ఆయురారోగ్య ఐశ్వర్యాలు ప్రాప్తిస్తాయి. మరణానంతరము కైవల్యప్రాప్తి జరుగుతుంది. అతడికి పునర్జన్మ ఉండదు.

# 28. రామరహస్యోపనిషత్తు

ఈ ఉపనిషత్తు అధర్వణ వేదానికి సంబంధించినది. ఇందులో ఐదు అధ్యాయాలు 32 మంత్రాలు ఉన్నాయి. ఇందులో రకరకాల రామమంత్రాలతోపాటు సీతా, లక్ష్మణ, ఆంజనేయ మంత్రాలు కూడా చెప్పబడ్డాయి. ఈ **మంత్రాలు గురువుగారి దగ్గర చెప్పుకుని ఆ తరువాత జపం చెయ్యండి. లేకపోతే** మంత్రం సిద్ధించదు.

సనకాది మహర్షులందరూ హనుమంతుడి దగ్గరకు వెళ్ళి 'హనుమా! తారక బ్రహ్మ అయిన రామమంత్ర సముదాయాన్ని మాకు వివరించవలసింది. అని అడిగారు. అప్పుడు ఆంజనేయుడు చెబుతున్నాడు. ఓ మహర్షులారా! రాలీమంత్రాలు అనేకం ఉన్నాయి. వాటిని వివరంగా చెబుతాను వినండి.

**ఏకాక్షరి :** బ్రహ్మ ఋషి. గాయత్రి ఛందస్సు, శ్రీరాముడు దేవత.

రాం । రీం । రూం । రైం । రౌం । రః న్యాసము.

**ధ్యానమ్ :**

**సరయూతీర మందారవేదికా పంకజాసనే**
**శ్యామం వీరాసనాసీనం జ్ఞానముద్రోపశోభితమ్**
**వామోరున్యస్త తదస్తం సీతాలక్ష్మణ సంయుతం**
**అవేక్షమాణమాత్మాన మాత్మాన్యమిత తేజసమ్**
**శుద్ధస్ఫటిక సంకాసం కేవలం మోక్షకాంక్షయా**
**చింతయన్ పరమాత్మానం భానులక్షం జపేన్మనుమ్.**

**1. మంత్రం 'రాం'**

ఈ మంత్రం కల్పవృక్షంలాగా కోరికలు తీరుస్తుంది. 12 లక్షలు జపం చేస్తే సిద్ధిస్తుంది.

**రెండక్షరాల మంత్రం :**

2. రామః, రామ. సర్వఫలప్రదం.

**3. మూడు అక్షరాల మంత్రం :** ఇందులో ఆరు రకాల మంత్రాలున్నాయి.

1. తారకమంత్రం – ఓం రామః
2. మాయామంత్రం – హ్రీం రామః
3. రమా మంత్రం – శ్రీం రామః
4. అనంగమంత్రం – క్లీం రామః
5. వాక్ మంత్రం – ఐం రామః
6. స్వబీజ మంత్రం – రాం రామః ఫలితము – సర్వాభీష్ట సిద్ధి.

**4. నాలుగు అక్షరాల మంత్రం :**

రామచంద్ర, రామభద్ర

**5. ఐదు అక్షరాల మంత్రం :**

రామాయ నమః

**6. ఆరు అక్షరాల మంత్రం :** ఇది ఆరు రకాలుగా ఉంటుంది.

1) రాం రామాయ నమః
2) క్లీం రామాయ నమః
3) హ్రీం రామాయ నమః
4) ఐం రామాయ నమః
5) శ్రీం రామాయ నమః
6) ఓం రామాయ నమః

ఫలితము – చతుర్విధ పురుషార్థ ప్రాప్తి.

**7. ఏడు అక్షరాల మంత్రాలు :**

1) ఓం రామాయ నమః ఓం శ్రీం
2) హ్రీం రామాయ నమః హ్రీం
3) ఐం రామాయ నమః ఐం
4) క్లీం రామాయ నమః క్లీం
5) శ్రీం రామాయ నమః
6) రాం రామాయ నమః రాం
7) రామచంద్రాయ నమః
8) రామభద్రాయ నమః

ఫలితము : సర్వకామసిద్ధి

**8. ఎనిమిది అక్షరాల మంత్రాలు**

1) ఓం శ్రీం రామాయ నమః ఓం
2) ఓం రామాయ హుంఫట్ స్వాహా
3) ఓం శ్రీం శ్రీం రామాయ నమః
4) ఓం హ్రీం నమో రామాయ హ్రీం
5) శ్రీరామశ్శరణం మమ

ఫలితము : సర్వకార్యసిద్ధి

**9. తొమ్మిది అక్షరాల మంత్రము :**

1) ఓం శ్రీం రామాయ నమః శ్రీం ఓం
2) ఓం క్లీం రామాయ నమః క్లీం ఓం
3) ఓం రామచంద్రాయ నమః ఓం క్లీం ఓం
4) ఓం రామభద్రాయ నమః ఓం

ఫలితము – సర్వవాంఛాసిద్ధి

**10. పది అక్షరాల మంత్రము :**

1) ఓం రామచంద్ర ఓం రామభద్ర

2) క్షం రామచంద్ర శ్రీం రామభద్ర

3) జానకీవల్లభాయ హుం స్వాహా

4) రామాయ ధనుష్పాణయే నమః

ఫలితము సర్వవాంఛాసిద్ధి

**11. పదకొండు అక్షరాల మంత్రం**

1) ఓం రామాయ ధనుష్పాణయే స్వాహా

2) హ్రీం రామాయ ధనుష్పాణయే స్వాహా

3) శ్రీం రామాయ ధనుష్పాణయే స్వాహా

4) క్లీం రామాయ ధనుష్పాణయే స్వాహా

5) ఐం రామాయ ధనుష్పాణయే స్వాహా

6) రాం రామాయ ధనుష్పాణయే స్వాహా

**12. పన్నెండు అక్షరాల మంత్రాలు :** (ద్వాదశాక్షరి)

1) ఓం నమో భగవతే రామచంద్రాయ

2) ఓం హ్రీం భరతాగ్రజ రామ క్లీం స్వాహా

**13. పదమూడు అక్షరాల మంత్రము :** (త్రయోదశాక్షరి)

శ్రీరామ జయరామ జయజయరామ.

**14. పద్నాలుగు అక్షరాల మంత్రము**

ఓం శ్రీరామ జయ రామ జయ జయ రామ

**15. పదిహేను అక్షరాల మంత్రము** (పంచదశాక్షరి)

శ్రీరామ జయరామ జయజయ రామరామ

**16. పదహారు అక్షరాల మంత్రము** (షోడశాక్షరి)

నమః సీతాపతయే రామాయ హనహన హుం ఫట్.

**17. పదిహేడు అక్షరాల మంత్రము**

ఓం నమః సీతాపతయే రామాయ హనహన హుం ఫట్.

**18. పద్దెనిమిది అక్షరాల మంత్రము :**

ఓం నమో భగవతే రామాయ మహాపురుషాయ నమః

**19. పందొనిమిది అక్షరాల మంత్రము :**

ఓం నమో భగవతే రామాయ మహాపురుషాయ నమః ఓం

**20. ఇరవై అక్షరాల మంత్రము :**

ఓం నమో భగవతే రామాయ సర్వసౌభాగ్యం దేహిమే స్వాహా

**21. ఇరవైఒక్క అక్షరాల మంత్రము :**

ఓం నమో భగవతే రామాయ సకలాపన్నివారణాయ స్వాహా

**22. ఇరవైరెండు అక్షరాల మంత్రము :**

ఓం శ్రీం రాం దాశరధాయ, సీతావల్లభాయ సర్వాభీష్టదాయ నమః

**23. ఇరవైమూడు అక్షరాల మంత్రము :**

ఓం నమో భగవతే వీరరామాయ సకల శత్రూన్ హనహన స్వాహా ॥

**24. ఇరవైనాలుగు అక్షరాల మంత్రము :**

ఓం నమో భగవతే శ్రీరామాయ తారకబ్రహ్మణే మాం తారయ నమః ఓం

**25. ఇరవైఐదు అక్షరాల మంత్రము :**

క్లీం ఓం నమో భగవతే రామచంద్రాయ సకల జనవశ్యకరాయ స్వాహా

**26. ఇరవైఆరు అక్షరాల మంత్రము :**

ఓం క్లీం ఓం నమో భగవతే రామచంద్రాయ సకలజన వశ్యకరాయ స్వాహా

**27. ఇరవైఏడు అక్షరాల మంత్రము :**

ఓం క్లీం ఓం నమో భగవతే రామచంద్రాయ సకల జన వశ్యకరాయ స్వాహా ఓం ॥

**28. ఇరవైఎనిమిది అక్షరాల మంత్రము :**

ఓం నమో భగవతే రక్షోఘ్న విశదాయ సర్వవిఘ్నాన్ నివారయ నివారయ స్వాహా

**29. ఇరవైతొమ్మిది అక్షరాల మంత్రము :**

ఓం నమో భగవతే రక్షోఘ్న విశదాయ సర్వవిఘ్నాన్ నివారయ నివారయ స్వాహా ఓం

**30. ముప్పై అక్షరాల మంత్రము :**

రాం ఓం నమో భగవతే రక్షోఘ్న విశదాయ సర్వవిఘ్నాన్ నివారయ నివారయ స్వాహా ఓం.

**31. ముప్పై ఒక్క అక్షరాలు గల మంత్రము :**

రాం ఓం  నమో భగవతే రక్షోఘ్న విశదాయ సర్వవిఘ్నాన్

నివారయ నివారయ స్వాహా ఓం రాం ॥

**32. ముప్పై రెండు అక్షరాల మంత్రము :**

రామభద్ర మహేష్వాస రఘువీరనృపోత్తమ

భోదశాస్వాంత కాస్మాకం శ్రియం దాపయ దేహిమే ॥

**శ్రీరామ గాయత్రి :**

**దాశరథాయ విద్మహే సీతావల్లభాయ ధీమహి । తన్నోరామః ప్రచోదయాత్**

రామగాయత్రికి ముందుగా

| | | |
|---|---|---|
| ఓంకారం చేర్చితే | – | మోక్షప్రదము |
| హ్రీంకారం చేరిస్తే | – | పాండిత్యము |
| రాంబీజం చేరిస్తే | – | లక్ష్మీప్రాప్తి |
| క్లీంబీజం చేరిస్తే | – | లోకసమ్మోహనం కలుగుతుంది |

**సీతామంత్రము :**

షడక్షరి : శ్రీం సీతాయై స్వాహా

లక్ష్మణ మంత్రం : లం లక్ష్మణాయ నమః

భరత మంత్రం : భం భరతాయ నమః

శత్రుఘ్న మంత్రం : శం శత్రుఘ్నాయ నమః

ఆంజనేయం : హ్రాం హనుమతే నమః

**మంత్రపురశ్చరణ విధి :** గురువు దగ్గర మంత్రోపదేశం తీసుకుని, పాలు, పండ్లు ఆహారంగా తీసుకుంటూ జపం చెయ్యాలి. హవిష్యాన్నము కూడా తినవచ్చు. హవిష్యాన్నము అంటే బియ్యానికి నెయ్యిరాచి వండాలి. బియ్యం కడగరాదు. పాలు పంచదార కలపవచ్చు. అన్ని

రకాల రుచులు వదిలెయ్యాలి. నేలమీద పడుకోవాలి. బ్రహ్మచర్యం ఆచరించాలి. రామాలయంలో పులిచర్మం మీద కూచుని మౌనంగా జపంచెయ్యాలి. పులిచర్మం దొరకదు కాబట్టి తివాచీ వాడవచ్చు. తులసి పారిజాతము శ్రీవృక్షము (మారేడు చెట్టు) దగ్గర జపం చెయ్యవచ్చు. తామరపూసలు, తులసి పూసలు, రుద్రాక్ష మాలతో గాని అక్షమాలికతోగాని జపం చెయ్యాలి. జపంలో పదవ వంతు తర్పణ, అందులో పదోవంతు హోమం, అందులో పదోవంతు బ్రాహ్మణ సమరాధన చెయ్యాలి. ఇలా చేసినట్లైతే మంత్రసిద్ధి జరుగుతుంది.

రామమంత్రాన్ని జపించటానికి అధికారులు ఎవరు? అంటే ముముక్షువు లందరూ ఈ రామమంత్రము ఉపాసన చెయ్యవచ్చును. అలాగే ముముక్షువులైన గృహస్థులు, విరక్తులైన వానప్రస్థులు, ఆశ్రమవాసులు, బ్రహ్మచారులు యతీశ్వరులు అందరూ రామమంత్రాన్ని ఉపాసన చెయ్యవచ్చును. రామమంత్రార్ధం తెలుసుకున్న వాడు జ్ఞాని అవుతాడు. ఇందులో సందేహము లేదు. ఈ ఉపనిషత్తును పఠించిన వాడు అగ్నిపూతుడు, వాయుపూతుడు అవుతాడు. అన్ని రకాల పాపాల నుండి విడివడతాడు. బంగారము దొంగిలించిన పాపము, బ్రహ్మహత్యాపాతకము, శిశుహత్య. భ్రూణహత్య, స్త్రీహత్య చేయటంవల్ల వచ్చే పాపము, పంచ మహాపాతకాలు అన్నిటి నుంచి విడివడతాడు. నేనే రాముడిని అని భావించిన వారు సంసారులు కారు సాక్షాత్తు అతడే రాముడవుతున్నాడు. ఇందులో సందేహము లేదు.అటువంటి వాడికి జన్మరాహిత్యం కలుగుతుంది. పునర్జన్మ ఉండదు. అని చెబుతోంది ఈ ఉపనిషత్తు.

# 29. హయగ్రీవోపనిషత్తు

ఇది అధర్వణ వేదానికి సంబంధించినది. ఇందులో ఐదు మంత్రాలున్నాయి. ఈ ఉపనిషత్తు బ్రహ్మవిద్యను చెబుతోంది.

పూర్వకాలంలో ఒకసారి నారదుడు బ్రహ్మదేవుడి దగ్గరకు వెళ్ళి “దేవా! నాకు బ్రహ్మవిద్యను చెప్పవలసింది’ అన్నాడు. ఆ మాటలు విన్న బ్రహ్మదేవుడు చెబుతున్నాడు.

ఓ నారదా హయగ్రీవుని మంత్రాలను ఉపాసన చేసిన వాడికి వేదాలు, శృతులు, స్మృతులు, పురాణాలు, ఇతిహాసాలు అన్నీ చదివిన ఫలితం వస్తుంది. అతడు సమస్త ఐశ్వర్యాలు పొందుతాడు. ఆ మంత్రాలను నీకు చెబుతాను. వినవలసింది. అంటూ చెప్పటం ప్రారంభించాడు.

**విశ్వోత్తీర్ణ రూపాయ చిన్మయయానంద రూపిణే**

**తుభ్యం నమో హయగ్రీవ విద్యారాజాయ విష్ణవే స్వాహా స్వాహా నమః ॥**

విశ్వోత్తీర్ణ స్వరూపుడు, చిన్మయానందరూపుడు, విష్ణుస్వరూపుడు, విద్యలకెల్ల రాజైన హయగ్రీవా! నీకు నమస్కారము.

ఈ మంత్రాలకు బ్రహ్మ, అత్రి, రవి, సవిత, భార్గవులు – ఋషులు.

గాయత్రి, త్రిష్టుప్, అనుష్టుప్‌లు – ఛందస్సు.

హయగ్రీవుడు – దేవత.

హ్లౌం బీజం । సోఽహం శక్తిః । హ్లూం కీలకం ।

భోగ మోక్ష యోర్వినియోగః భోగమోక్షాల కోసం ఈ మంత్రాన్ని జపిస్తున్నాను. అకార ఉకార మకారములలో న్యాసము.

**ధ్యానమ్ :**

**శంఖ చక్ర మహాముద్రా పుస్తకాఢ్యం చతుర్భుజమ్ ।**

**సంపూర్ణ చంద్ర సంకాశం హయగ్రీవ ముపాస్మహే ॥**

**మంత్రం :**

**ఓం శ్రీం ఇతి ద్వ్యక్షరే** – ఓం శ్రీం రెండు అక్షరాలు.

**హ్లౌమిత్యే కాక్షరం** – హ్లౌం ఒక అక్షరము.

**ఓం నమో భగవత ఇతి సప్తాక్షరాణి** – ఓం నమో భగవతే ఏడు అక్షరాలు.

**హయగ్రీవాయేతి పంచాక్షరాణి** – హయగ్రీవాయ ఐదు అక్షరాలు.

**విష్ణవే ఇతి త్రీణ్యక్షరాణి** – విష్ణవే మూడు అక్షరాలు.

**మహ్యాం మేధాం ప్రజ్ఞాం ఇతి షడక్షరాణి** – మహ్యాం మేధాం ప్రజ్ఞాం. ఆరు అక్షరాలు

**ప్రయచ్ఛస్వాహేతి పంచాక్షరాణి** – ప్రయచ్ఛస్వాహా ఐదు అక్షరాలు.

వెరసి ఇరవై తొమ్మిది అక్షరాల మంత్రమిది.

**ఓం శ్రీం హ్లౌం ఓం నమో భగవతే హయగ్రీవాయ విష్ణవే మహ్యాం మేధాం ప్రజ్ఞాం ప్రయచ్ఛ స్వాహా.**

ఇప్పుడు ఇంకొక మంత్రాన్ని చెబుతున్నారు.

**ఓం శ్రీం ఇతిద్వేక్షరే** – ఓం శ్రీం రెండు అక్షరాలు

**హ్లౌ మిత్యేకాక్షరం** – హ్లౌం ఒక అక్షరము

**ఐం ఐం ఐం త్రీణ్యాక్షరాణి** – ఐం ఐం ఐం మూడు అక్షరాలు

**క్లీం క్లీం ఇతిద్వేక్షరే** – క్లీం క్లీం రెండు అక్షరాలు

**సౌః సౌః ఇతిద్వేక్షరే** – సౌః సౌః రెండు అక్షరాలు

**హ్రీం ఇతి ఏకాక్షరం** – హ్రీం ఒక అక్షరము

**ఓం నమో భగవత ఇతి సప్తాక్షరాణి** –ఓం నమో భగవతే ఏడు అక్షరాలు

**హయగ్రీవాయేతి పంచాక్షరాణి** – హయగ్రీవాయ ఐదు అక్షరాలు

**మహ్యం మేధాం ప్రజ్ఞామితి షడక్షరాణి** – మహ్యం మేధాం ప్రజ్ఞాం ఆరు అక్షరాలు

**ప్రయచ్ఛ స్వాహేతి పంచాక్షరాణి**– ప్రయచ్ఛ స్వాహా ఐదు అక్షరాలు.

వెరసి ముప్పై నాలుగు అక్షరాల మంత్రం ఇది.

**ఓం శ్రీం హ్లౌం ఐం ఐం ఐం క్లీం క్లీం సౌః సౌః హ్రీం ఓం నమో భగవతే**

**హయగ్రీవాయ మహ్యం మేధాం ప్రజ్ఞాం ప్రయచ్ఛ స్వాహా॥**

హయగ్రీవ మంత్రాలలో ఒకే అక్షరం ఉన్న మంత్రం కూడా ఉన్నది. దాన్ని బ్రహ్మ – ఈశ్వరుడికి, ఈశ్వరుడు – సంకర్షణునకు,

సంకర్షణుడు నారదుడికి, నారదుడు – వ్యాసుడికి, వ్యాసుడు ప్రజలకు చెప్పారు. ఈ మంత్రంలో హకార లకార ఉకారములు మూడు ఒకే రూపంలో ఉంటాయి. 'హ్లౌం' ఈ బీజాక్షరాన్ని జపించిన వారికి సంపద, సారస్వతము కూడా కలుగుతుంది. విదేహముక్తి కలుగుతుంది. అతడు సర్వలోకాలకు రాజవుతాడు.

**సర్వేషాం బీజానాం హయగ్రీవైకాక్షర బీజమనుత్తమం**
**మంత్రరాజాత్మకం భవతి హ్లౌం హయగ్రీవ స్వరూపోభవతి**
**అమృతం కురు కురు స్వాహా. తజ్జాపకానాం వాక్సిసిద్ధిః**
**శ్రీసిద్ధిః అష్టాంగయోగ సిద్ధిశ్చ భవతి.**
**సకల సామ్రాజ్య సిద్ధిం కురు కురు స్వాహా ॥**

అన్ని మంత్రాలలోకి హయగ్రీవ ఏకాక్షర మంత్రం ఉత్తమమైనది. ఇది మంత్రరాజము. హ్లౌం హయగ్రీవ స్వరూపము. 'అమృతం కురు కురు స్వాహా' అని కూడా జపం చేస్తే వాక్సిద్ధి, ధనసిద్ధి, అష్టాంగయోగసిద్ధి, సకల సామ్రాజ్యసిద్ధి కలుగుతుంది.

ఈ మంత్రజపం చేసినవాడు అపవిత్రుడైనా పవిత్రుడవుతాడు. బ్రహ్మచారి కానివాడు కూడా బ్రహ్మచారి అవుతాడు. పతితునితో సంభాషణ, బ్రహ్మహత్య, భ్రూణహత్యా పాతకముల నుండి విముక్తుడవుతాడు. మరణానంతరము పరమాత్మ సన్నిధి చేరతాడు.

ఈ ఉపనిషత్తును ఏకాదశినాడు పఠిస్తే – మహాపురుషుడవుతాడు. అతడే జీవన్ముక్తుడు. అతడికి పునర్జన్మ ఉండదు.

హయగ్రీవుడు విద్యాప్రదాత జ్ఞానప్రదాత. మంత్రశాస్త్రంలో

హయగ్రీవ మంత్రం చిన్నది కేవలం మూడు అక్షరాల మంత్రం ఉంది. దీనికి బ్రహ్మఋషి। గాయత్రి ఛందస్సు । హయగ్రీవుడు దేవత. హం బీజం । సః శక్తిః । సోహం కీలకం.

**ధ్యానమ్ :** **జ్ఞానానందమయం దేవం నిర్మలం స్ఫటికాకృతిం**
**ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే ॥**

**మంత్రం :** ఓం శ్రీం హ్సౌం ॥

**గాయత్రి :** **తత్పురుషాయ విద్మహే విద్యాప్రదాయ ధీమహి**
**తన్నో హయగ్రీవ ప్రచోదయాత్ ॥**

**గమనిక :**

గురూపదేశం పొందిన తరువాతనే మంత్రం జపం చెయ్యండి.

# ౩౦. వాసుదేవోపనిషత్తు

ఈ ఉపనిషత్తు సామవేదానికి సంబంధించినది. ఇందులో ఎనిమిది మంత్రాలున్నాయి. పుండ్రధారణ (నామాలు పెట్టుకోవటం) గురించి వివరించారు.

ఒకసారి నారదుడు వాసుదేవునికి నమస్కరించి 'దేవా! ఊర్ధ్వపుండ్రాలు ఎలా పెట్టుకోవాలి. దేనితో పెట్టుకోవాలి. ఇవన్నీ నాకు వివరించవలసింది' అన్నాడు. వాసుదేవుడు చెబుతున్నాడు.

వైకుంఠంలో పుట్టినది, నాకు ప్రీతికరమైనది, నా భక్తులచే ధరింపబడేది అయిన విష్ణుచందనము ప్రతిరోజు గోపస్త్రీలు నా దేహానికి రాసి, మళ్ళీ దాన్ని తీసేస్తారు కాబట్టి దానికి గోపీచందనము అని పేరు వచ్చింది. నా శరీరాన్ని అలంకరించేది, పరిశుద్ధమైనది, చక్రతీర్థము మధ్యన ఉండేది. పసుపు రంగులో ఉండేది అయిన ఈ గోపీచందనము మోక్షసాధనము.

గోపీచందనాన్ని చేతిలోకి తీసుకుని పాపాలను నశింపచేసేది, విష్ణువు దేహము నుంచి వచ్చినది, చక్రముతో ముద్రించబడినది, కేవలము ధరించినంత మాత్రము చేతనే మోక్షాన్నిచ్చేది అయిన ఓ గోపీచందనమా! నీకు నమస్కారము. అని ప్రార్థించి 'ఇమం మే గంగే' అనే మంత్రంతో నీటిని తీసుకుని, గోపీచందనాన్ని మర్ధన చేసి విష్ణు గాయత్రి గాని, కేశవనామాలు చెబుతూకాని గోపీచందనం ధరించాలి.

బ్రహ్మచారి, వానప్రస్థుడు – వీరిద్దరూ ముఖాన, వక్షస్తలము, కంఠము, భుజముల యందు ధరించాలి.

గృహస్థుడు గోపీచందనాన్ని మూడుసార్లు మంత్రించి 'శంఖచక్ర

గదాపాణే ద్వారకానిలయా। అచ్యుతా। గోవిందా। పుండరీకాక్షా। శరణాగతుడను. నన్ను రక్షించు అంటూ లలాటము నుంచి 12 ప్రదేశాలలో గోపీచందనము ఉంగరపు వ్రేలుతో ధరించాలి. బ్రహ్మచారి, గృహస్థుడు వీరిద్దరూ ముఖము, హృదయము, కంఠము, భుజములయందు ధరించాలి.

యతీశ్వరుడు చూపుడువ్రేలుతో శిరస్సు, లలాటము, హృదయముల యందు ప్రణవ మంత్రంతో ధరించాలి.

త్రిపుండములు - త్రిమూర్తులు, మూడు వ్యాహృతులు, మూడు వేదాలు, మూడు అగ్నులు, మూడు కాలాలు, అవస్థాత్రయము, జీవాత్మ పరమాత్మ అంతరాత్మలకు ప్రతీక.

ఊర్ధ్వపుండ్రము అకార ఉకార మకారములు గల ప్రణవ స్వరూపము. ఇది ఉన్నత పదవి నిస్తుంది.

పరమహంస అయినవాడు ముఖాన ప్రణవంతో ఒక పుండ్రము మాత్రమే ధరించాలి. ఆ పరమాత్మ విద్యుల్లతలాగా, హృదయమందే ప్రతిష్ఠితమై ఉన్నాడు అని భావించి ధ్యానించాలి. ఈ విధంగా చేసినవారు అన్ని పాపాల నుంచి విముక్తులై మోక్షం పొందుతారు.

నేను అద్వయమైన పరబ్రహ్మను. ఆదిమధ్యాంత రహితుడను. స్వయంప్రకాశిని. సచ్చిదానందమయుడను. అవ్యయుడను. నా స్వరూపాన్ని భక్తితో తెలుసుకోవాలి. నేను ఒక్కడనే విష్ణువుగా చరాచరముల యందు, సర్వభూతములయందు ఆత్మగా ఉన్నాను. బ్రహ్మరంధ్రమందు, హృదయమందు గోపీచందనము ధరించి జ్యోతి స్వరూపుడైన శ్రీమహావిష్ణువును ధ్యానించేవాడు పరమపదాన్ని పొందుతాడు.

ఉత్తమమైన గంధం గలవాడు, ఊర్ధ్వరేతస్సు గలవాడు, ఊర్ధ్వపుండ్రాలు గలవాడు, ఉత్తమయోగము కలవాడు. అయిన యతీశ్వరుడు పరమపదాన్ని పొందుతాడు. ప్రతిరోజు గోపీచందనము ధరించటం వల్ల ఉత్తమభక్తి కలుగుతుంది. ఒకవేళ గోపీచందనము లభించకపోతే తులసిచెట్టు వేరు దగ్గర మట్టిని ఊర్ధ్వపుండ్రముగా ధరించాలి. ఇలా ప్రతిరోజూ చేస్తే అపరోక్ష బ్రహ్మజ్ఞానము కలుగుతుంది.

ఈ ఉపనిషత్తును పఠించిన వాడు సమస్త పాపాలనుంచి విముక్తుడౌతాడు. అన్నితీర్థములయందు స్నానముచేసిన ఫలితం వస్తుంది. అన్నిరకాల యజ్ఞాలు చేసిన ఫలితం వస్తుంది. సర్వదేవతల చేత పూజింపబడతాడు. శ్రీమన్నారాయణుని యందు అచంచలమైన భక్తి కలుగుతుంది. ఆత్మజ్ఞానము కలిగి విష్ణుపదము చేరతాడు. అతడికి పునర్జన్మ లేదు.

# 31. త్రిపాద్విభూతి మహానారాయణోపనిషత్తు

## (పాద చతుష్టయ నిరూపణ)

'మహానారాయణోపనిషత్తు' అనే పేరుతో రెండు ఉపనిషత్తులున్నాయి. 1. కృష్ణ యజుర్వేదంలోది మహానారాయణోపనిషత్తు 2. అధర్వ వేదంలోని త్రిపాద్విభూతి మహానారాయణోపనిషత్తు. మొదటి దానిలో అనేక రకాలైన మంత్రాలు దుర్గాసూక్తము, శివుడికి, ఇతర దేవతలకు సంబంధించిన మంత్రాలు చెప్పబడ్డాయి. రెండవ దానిలో కేవలము శ్రీమన్నారాయణుడు, సాయుజ్యము గురించి చెప్పబడింది. ఈ కారణం చేతనే వైష్ణవులు మొదటి దాన్ని ఒప్పుకోరు. అందుచేతనే రెండవదయిన త్రిపాద్విభూతి మహానారాయణోపనిషత్తును చూద్దాం.

అధర్వవేదంలో ఉన్న ఈ ఉపనిషత్తు రెండు కాండలుగా ఉంటుంది. 1. పూర్వకాండ 2. ఉత్తరకాండ. ప్రతి కాండలోను నాలుగు చొప్పున అధ్యాయాలున్నాయి. ఈ రకంగా చూస్తే మొత్తంమీద 8 అధ్యాయాలు, 66 మంత్రాలు ఉంటాయి.

పూర్వకాలంలో ఒకసారి బ్రహ్మదేవుడు పరతత్త్వాన్ని తెలుసుకోవాలనే కోరికతో దేవమానము ప్రకారము వేయిసంవత్సరాలు తపస్సు చేశాడు. అంటే మన లెక్క ప్రకారం కొన్ని కోట్ల సంవత్సరాలన్న మాట. అతని తపస్సుకు మెచ్చి మహావిష్ణువు ప్రత్యక్షమై ఏ వరం కావాలి? అని అడిగాడు. ఆ మాటలు విన్న బ్రహ్మ శ్రీమహావిష్ణువును పరిపరివిధాల స్తుతించి "ఓ మహానుభావా! పరమతత్త్వరహస్యాన్ని

నాకు చెప్పవలసినది. ఓ దేవదేవా ! ఆ రహస్యాన్ని నువ్వు తప్ప వేరెవరూ చెప్పలేరు.

**త్వమేవ సర్వజ్ఞః । త్వమేవ సర్వశక్తిః । త్వమేవ సర్వాధారః । త్వమేవ సర్వస్వరూపః । త్వమేవ సర్వేశ్వరః । త్వమేవ సర్వప్రవర్తకః । త్వమేవ సర్వపాలకః । త్వమేవ సర్వనివర్తకః । త్వమేవ సదసదాత్మకః । త్వమేవ సదసద్వి లక్షణః । త్వమేవ అంతర్బహిర్వ్యాపకః । త్వమేవాతి సూక్ష్మతరః । త్వమే వాతి మహతో మహీయాన్ । త్వమేవ సర్వమూలావిద్యా నివర్తకః । త్వమేవాఖండ ఆనందః । త్వమేవ పరిపూర్ణానందః । త్వమేవ నిరతిశయానందః । త్వమేవ తురీయ తురీయః । త్వమేవ తురీయాతీతః । త్వమేవ అనంత ఉపనిషద్ విమృగ్యః । త్వమేవ అఖిలశాస్త్రైర్విమృగ్యః** అన్ని శాస్త్రములచేత చెప్పబడేవాడవు నీవే.

నువ్వే సర్వజ్ఞుడిని, సర్వశక్తివి, సర్వాధారుడవు, సరస్వస్వరూపుడవు. నీవే సర్వేశ్వరుడవు. సర్వప్రవర్తకుడవు. నీవే సర్వపరిపాలకుడవు. సర్వ నివర్తకుడవు. సదసదాత్మకుడవు. సదసద్విలక్షిణుడవు. ఓ దేవా! నీవే అంతర్బహిర్వ్యాపకుడవు నీవే అతిసూక్ష్మతరుడవు. మహత్తుకన్న మహత్తైనవాడవు. మూలఅవిద్య లేనివాడవు. నీవే మహామూలావిద్య నివర్తకుడవు. నీవే విద్యాధారకుడవు. విద్యావేద్యుడవు. నీవే అవిద్యాస్వరూపుడవు. విద్యాతీతుడవు. సర్వకారణుడవు నీవే. సర్వకారణ సమిష్టివి నీవే, సర్వకారణ వ్యష్టివి నీవే. అఖండానందుడవు, పరిపూర్ణానందుడవు, నిరతిశయానందుడవు, నీవే తురీయుడవు,

తురీయాతీతుడవు. అనంతమైన ఉపనిషత్తుల చేత అన్ని శాస్త్రాలచేత వెతకబడే వాడవు.

**త్వమేవ బ్రహ్మ, ఈశాన, పురందర, అఖిల అమరైః। ఆగమైర్ విమృగ్య।** బ్రహ్మ, ఈశానుడు, ఇంద్రుడు, నీవే దేవతలు, నీవే ఆగమాల చేత తెలుసుకోబడేవాడవు. **త్వమే వామృతమయః। త్వమే వామృతమయః। త్వమేవామృతమయః।** ముమ్మాటికీ నీవే అమృతమయుడవు. **త్వమేవ సర్వం। త్వమేవ సర్వం। త్వమేవ సర్వం।** ఈ చరాచర జగత్తంతా నీవే అయి ఉన్నావు. **త్వమేవ మోక్షః। త్వమేవ మోక్షదః। త్వమేవ అఖిల మోక్షసాధనమ్.** నీవే మోక్షము, మోక్షాన్నిచ్చేవాడవు నువ్వే. మోక్షసాధనము కూడా నువ్వే. నీవే వక్త. నీవే గురువు. నీవే తండ్రి. నీవే సర్వనియంత. ఈ జగత్తులో సర్వము నీవే. కాబట్టి ఆ పరమ తత్త్వాన్ని గురించి చెప్పగలవారు నీకన్న ఎవరూ లేరు" అన్నాడు. ఆ మాటలు విన్న శ్రీమహావిష్ణువు 'ఓ బ్రహ్మదేవా! ఈ పరమతత్త్వము అంతా **దేవదర్శి** అనే పేరుగల అధర్వణ శాఖలో ఉన్నది. దాన్నే అధర్వణ మహానారాయణోపనిషత్తు అంటారు. అదంతా గురుశిష్య సంవాదంగా ఉంటుంది. దాన్ని నీకు చెబుతాను వినవలసింది' అంటూ ప్రారంభించాడు.

పూర్వకాలంలో బ్రహ్మజిజ్ఞాసి అయిన శిష్యుడు గురువుగారి దగ్గరకు వెళ్ళి సాష్టాంగ దండప్రణామం చేసి ప్రదక్షిణలు చేసి, అతివినయంగా "ఓ గురుదేవా ! నాకు పరమతత్త్వ రహస్యాన్ని వివరించవలసినది" అని అడిగాడు. గురువుగారు అత్యంత ఆదరంతో చెబుతున్నాడు. "ఓ శిష్యాగ్రణీ ! **కథం బ్రహ్మ** ఆ బ్రహ్మము ఎలాటిది అంటే? **కాలత్రయ అబాధితం, సర్వకాల అబాధితం, సగుణ నిర్గుణ**

**స్వరూపం, ఆదిమధ్యాంతశూన్యం, సర్వం ఖిల్విదం బ్రహ్మ** మూడు కాలములలోను కూడా అబాధితమైనది, సర్వకాలములలోను అబాధితమైనది, సగుణ నిర్గుణ స్వరూపమైనది, ఆదిమధ్యాంతరహితమైనది, ఈ జగత్తంతా బ్రహ్మమయమే. **మాయాతీతం, గుణాతీతం, అనంతం, అఖండం, అప్రమేయం, పరిపూర్ణం బ్రహ్మ** అది మాయాతీతము, గుణాతీతము, అనంతము, అఖండము, అప్రమేయము, పరిపూర్ణము, అద్వితీయము. **పరమానందశుద్ధ బుద్ధ ముక్త సత్యస్వరూప వ్యాపకాభిన్న పరిచ్ఛిన్నం, సచ్చిదానంద స్వప్రకాశం, మనోవాచామ గోచరం, అఖిల ప్రమాణ గోచరం, అమిత వేదాంత వేద్యం దేశతః కాలతోః వస్తుతః పరిచ్ఛేద రహితం బ్రహ్మ.** పరమానందము, శుద్ధ బుద్ధ ముక్త సత్యస్వరూపము, వ్యాపకాభిన్నము, అపరిచ్ఛిన్నము, సచ్చిదానందము, స్వప్రకాశము, మనోవాక్కాయ కర్మలకు అందనిది. ఏ ప్రమాణాల చేత తెలియబడనిది, వేదాంత వేద్యమైనది, దేశ కాల వస్తువులచేత పరిచ్ఛిన్నము కానిది, అపరిచ్ఛేదమైనది బ్రహ్మము.

**సర్వపరిపూర్ణం బ్రహ్మ, తురీయం, నిరాకారమేకం బ్రహ్మ, అద్వైతం, అనిర్వాచ్యం, ప్రణవాత్మకం, ప్రణవాది అఖిల మంత్రాత్మకం** సర్వ పరిపూర్ణము, తురీయము నిరాకారమైనది, ఏకము, అద్వైతము, నిర్వచించటానికి వీలులేనిది, ప్రణవాత్మకము, ప్రణవ మంత్రాత్మకము ఆ పరబ్రహ్మ. **పాదచతుష్టయాత్మకం బ్రహ్మ.** ఆ పరబ్రహ్మ నాలుగు పాదాలుగా ఉంటుంది. 1. అవిద్యాపాదము 2. విద్యాపాదము 3. ఆనందపాదము 4. తురీయపాదము

అవిద్యా పాదంలో మూల అవిద్య ఉంటుంది. అది ఇంకెక్కడా

ఉండదు. మిగిలిన మూడు పాదములు శుద్ధబోధానంద లక్షణము. అమృతము. **తత్ర మధ్య మపాదం మధ్యప్రదేశే అమితతేజః ప్రవాహాకార తయా నిత్యవైకుంఠం విభాతి.** వాటిలో మధ్యమపాదం మధ్యప్రదేశంలో మిక్కిలి తేజస్సుతో నిత్యవైకుంఠము ప్రకాశిస్తూ ఉంటుంది. **తత్ నిరతిశయ ఆనంద అఖండ బ్రహ్మానంద నిజమూర్త్యాకారేణ జ్వలతి.**

అది నిరతిశయ ఆనంద అఖండ బ్రహ్మానందమై నిజమూర్త్యాకారంతో ప్రకాశిస్తుంటుంది. అపరిచ్ఛిన్న మండలాలు ఎలా కనిపిస్తాయో అలాగే అఖండ ఆనంద అమిత వైష్ణవ దివ్యతేజోరాశ్యంతర్గతమై ప్రకాశించే మహావిష్ణువు యొక్క పరమపదము ప్రకాశిస్తుంది. పాలసముద్రం మధ్యలో ఉన్న కలశము లాగా ఆ పరమపదము కనిపిస్తుంది. సుదర్శనము యొక్క దివ్యతేజస్సుతో సుదర్శన పురుషుడు ఉన్నట్లుగా, సూర్యమండలంలోని సూర్యునిలాగా, అపరిమితమైన తేజస్సుతో, అపరిచ్ఛన్న అద్వైత పరమానంద లక్షణ తేజోరాశితో ఉన్న ఆదినారాయణుడు దర్శనమిస్తాడు. అతడే తురీయ బ్రహ్మ. తురీయాతీతుడు. అతడే శ్రీమహావిష్ణువు. అతడే పరంజ్యోతి, మాయాతీతుడు, గుణాతీతుడు, కాలాతీతుడు, అఖిల కర్మాతీతుడు, సత్యము నిత్యమైనవాడు, ఉపాధి రహితుడు. అతడే పరమేశ్వరుడు, పరమపురుషుడు. ఆద్యంతరహితుడు, నిత్యపరిపూర్ణుడు, సత్యసంకల్పుడు, స్వయంజ్యోతి, స్వయంప్రకాశకుడు, అతనితో సమానమైన వారు కాని, అతని కన్న అధికులు కాని ఎవరూ లేరు. అతనికి దివారాత్రములు లేవు. కాలవిభాగము లేదు. అతడే ఆత్మ, అంతరాత్మ, పరమాత్మ, జ్ఞానాత్మ, తురీయాత్మ. అతడు నిత్యుడు, నిష్కళంకుడు, నిర్వికల్పుడు, నిరంజనుడు, నిరాఖ్యాతుడు. అతడే

నారాయణుడు. అతణ్ణి ఉపాసించిన వారు సాయుజ్యం పొందుతారు.” అని చెప్పాడు గురువుగారు.

## 2వ అధ్యాయము (సాకార నిరాకారాలు)

గురువుగారు చెప్పిన విషయాలు అత్యంత శ్రద్ధతో విన్నాడు శిష్యుడు. ఇప్పుడు అడుగుతున్నాడు. “ఓ గురుదేవా! వైకుంఠానికీ నారాయణుడికి నిత్యత్వం చెప్పబడింది. ఆయనే తురీయుడు అంటున్నారు. వైకుంఠము సాకారము నారాయణుడు కూడా సాకారుడే. తురీయము నిరాకారము. సాకారము అంటే అవయవాలున్నది. నిరాకారము అంటే అవయవాలు లేనిది. అందుచేతనే సాకారము అనిత్యము నిరాకారము నిత్యము అని చెబుతున్నారు. వేదంకూడా ఇదే మాట చెబుతోంది. సావయవము అనిత్యము. ఇది ఏ ప్రమాణంచేతనైనా తెలుస్తుంది. అందరికీ అనుభవంలో ఉన్నది. కాబట్టి సాకారానికి అనిత్యత్వము చెప్పటమే యుక్తము, ఉచితము కూడా. అలాంటప్పుడు సాకారము (నారాయణుడు) నిత్యుడు అని ఎలా చెబుతున్నారు?” అని అడిగాడు. **ఇది చాలా గొప్ప విషయం. ఇంతవరకు ఏ ఉపనిషత్తులోనూ కూడా చెప్పని విషయం.** దీనికి గురువుగారు సమాధానం చెబుతున్నారు.

“నాయనా తురీయము – అక్షరము. అని వేదం చెబుతోంది. నిత్యానిత్యాలు పరస్పర విరుద్ధాలు. చీకటి వెలుగుల లాంటివి. చీకటి ఉంటే వెలుగుండదు. అలాగే నిత్యత్వము ఉంటే అనిత్యము అనేది ఉండదు. వైకుంఠానికి, నారాయణుడికీ నిత్యత్వం చెప్పటమే ఉచితంగా ఉంటుంది. సాకారము, నిరాకారము. సోపాధికము సాకారము. ఇది

ఎలా జరుగుతుంది అంటే, అవిద్యా కారణమైన సకల కార్యకారణ జాలము అవిద్యాపాదమే. దానికన్న వేరుగా ఏదీలేదు. సమస్తమైన అవిద్యోపాధి కూడా అవిద్యాపాదమే. అలాగే అవిద్య అంటే సాకారమే.

ఇక నిరుపాధిక సాకారము ఇది మూడు విధాలుగా ఉంటుంది. 1. బ్రహ్మావిద్యాసాకారము 2. ఆనందసాకారము 3. ఉభయాత్మకసాకారము. ఈ మూడు సాకారాలు మళ్ళీ రెండుగా చెప్పబడుతున్నాయి. 1. నిత్యసాకారము 2. ముక్తసాకారము. ఇందులో నిత్యసాకారము ఆద్యంతశూన్యము, శాశ్వతము. ఇక ఉపాసనతో ముక్తిని పొందే వారి సాకారము నిత్యముక్త సాకారము అనబడుతుంది. అఖండ జ్ఞానంతోనే ఇది సిద్ధిస్తుంది.

నిరుపాధిక సాకారుడికి నిత్యత్వము సిద్ధమైనదే. అందుకే నిరుపాధికుడు నిరవయవుడు. బ్రహ్మాచైతన్యము నిరవయము అని ఉపనిషత్తులు శాస్త్రాలు చెబుతున్నాయి. సాకారము మళ్ళీ మూడు విధాలుగా ఉంటుంది. 1. విద్యాసాకారము 2. ఆనంద సాకారము 3. ఉభయాత్మకము. ప్రాధాన్యత చేతనే ఇందులో బేధము కనిపిస్తుంది. ఆ భేదము వాస్తవభేదం కాదు. రాముడు, కృష్ణుడు మొదలైన అవతారాలలో కూడా అద్వైత పరమానంద లక్షణుడైన పరబ్రహ్మకు పరమతత్త్వ పరమవిభవాను సంధానము ఆయనదే. ఒకవేళ పరబ్రమ్మకు నిరాకారమే చెప్పాలి అనుకుంటే, కేవలము నిరాకారుడైన బ్రహ్మకి ఆకాశంలాగానే జడత్వము ఆపాదించబడుతుంది. అందుఉరిచేత ఆ పరబ్రహ్మ సాకార నిరాకారాలు రెండూ స్వభావ సిద్ధాలు. అటువంటి అద్వైత పరమానంద లక్షణుడైన ఆదినారాయణుని యొక్క ఉన్మేష నిమేషములచేత మూలఅవిద్య, సృష్టి స్థితి లయాలు కలుగుతున్నాయి.

ఒకసారి ఆత్మారాముడైన ఆదినారాయణునికి స్వేచ్ఛానుసారము ఉన్మేషము (సృష్టి) కలుగుతుంది. అందువల్ల పరబ్రహ్మయొక్క సర్వకారణమైన క్రింది పాదమందు మూలకారణమైన అవ్యక్తం ఆవిర్భవిస్తుంది. అవ్యక్తం నుంచి మూలావిర్భావము, మూలావిద్యావిర్భావం జరుగుతుంది. దాని నుంచే బ్రహ్మవిద్యా శబళము కలుగుతుంది. దానినుంచి మహత్తు, మహత్తు నుంచి – అహంకారము, పంచభూతాలు, పంచభూతాల నుంచి పరబ్రహ్మ యొక్క మొదటి పాదము వచ్చినాయి. ఒక అవిద్యాండం పుట్టింది. నిజానికి దానిలో గుణాతీతుడు, శుద్ధసత్త్వమయుడు, నిరతిశయ ఆనంద లక్షణుడు, మాయోపాధికుడైన నారాయణుడు ఆవిర్భవించాడు. అతడే నిత్యపరిపూర్ణుడు. పాదవిభూతివైకుంఠనారాయణుడు. అతడే అనంతకోటి బ్రహ్మాండాల సృష్టి స్థితిలయాలకు కారణభూతుడు. మాయాతీతుడు. అతడే తురీయుడు. పరమేశ్వరుడు. **తస్మాత్ స్థూలవిరాట్స్వరూపోజాయతే । స సర్వకారణ మూల విరాట్స్వరూపోభవతి. సోనంత శీర్షా పురుష అనంతాక్షి పాణి పాదో భవతి। అనంత శ్రవణ స్పర్శమావృత తిష్ఠంతి. సర్వవ్యాపకోభవతి. సగుణ నిర్గుస్వరూరోభవతి. వివిధ విచిత్ర అనంత జగదాకారోభవతి. నిరతిశయ, నిరంకుశ, సర్వజ్ఞ సర్వశక్తి సర్వనియంత్రాది అనంత కళ్యాణ గుణకారో భవతి॥** అతని నుంచి స్థూలవిరాడ్రూపం వచ్చింది. ఆ విరాడ్రూపము కొన్ని వేల శిరస్సులు, నేత్రాలు, పాదాలు, చేతులతో సర్వాన్ని ఆవరించి ఉన్నాడు. అతడే సర్వవ్యాపకుడు, సకల నిర్గుణ స్వరూపుడు. జ్ఞాన బల ఐశ్వర్యశక్తి తేజస్వరూపుడు. జగదాకారుడు, నిరతిశయ ఆనందమయ అనంత పరమవిభూతి సమిష్టిచే

విభవాకారము, నిరతిశయ, నిరంకుశ, సర్వజ్ఞ, సర్వశక్తి, సర్వనియంతృత్వాది అనంత కళ్యాణ గుణాకారుడు. **వాచామగోచరానంత దివ్యతేజోరాశ్యాకారో భవతి** వాచామగోచరము కాని అనంత దివ్యతేజోరాసితాగా ఉంటాడు. **సమస్తా విద్యాండ వ్యాపకోభవతి** సమస్త అవిద్యాండ వ్యాపకుడు. అనంత మహామాయా విలాసాలకీ అధిష్టానమైనవాడు. **అస్యైకైక రోమకూపాంతరేషు అనంతకోటి బ్రహ్మాండాని స్థావరాణి చ జాయంతే.** అతని ఒక్కొక్క రోమకూపము నుండి అనంతకోటి బ్రహ్మాండాలు, స్థావరాలు పుట్టినాయి. **తేషు అండేషు సర్వేషు ఏకైక నారాయణావతారో జాయతే,** అన్ని అండముల నుండి ఒక్కొక్క నారాయణుని అవతారము ఆవిర్భవిస్తోంది.

**నారాయణాత్ హిరణ్యగర్భో జాయతే.** నారాయణుని నుండే అండ విరాట్స్వరూపం వచ్చింది. **నారాయణాత్ అఖిల లోక స్రష్ట ప్రజాపతయో జాయంతే. నారాయణాత్ ఏకాదశ రుద్రా జాయంతే। అఖిల లోకశ్చ జాయంతే।** నారాయణుని నుంచి అఖిల లోకస్రష్టలైన ప్రజాపతులు, ఏకాదశ రుద్రులు, అఖిల లోకాలు పుట్టినాయి.

**నారాయణాదింద్రో జాయతే, నారాయణాత్ సర్వే దేవాశ్చ జాయంతే। ద్వాదశాదిత్యాః। సర్వే వసవః సర్వే ఋషయః, సర్వాణి భూతాని, సర్వాణి ఛందాంసి, నారాయణాదేవ సముత్పద్యంతే.**

ఆ నారాయణుని నుంచే ఇంద్రుడు, సర్వదేవతలు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, ఋషులు, అన్ని ప్రాణులు ఛందస్సులు పుట్టినాయి. ఇవన్నీ కూడా **నారాయణాత్ ప్రవర్తంతే, నారాయణాత్ ప్రలీయంతే.** నారాయణుని నుంచే ప్రవర్తిల్లుతున్నాయి. చివరకు

అతనియందే లీనమవుతాయి.

**అథః నిత్యోక్షరో పరమస్వరాట్.** నిత్యుడు, అక్షరుడు, పరమస్వరాట్ నారాయణుడే.

**బ్రహ్మోనారాయణః శివశ్చనారాయణః శక్రశ్చ నారాయణః దిశశ్చ నారాయణః విదిశశ్చ నారాయణః, కాలశ్చ నారాయణః, కర్మాఖిలంచ నారాయణః మూర్తా మూర్తే చ నారాయణః, కారణాత్మకగ్ం, సర్వకార్యాత్మకగ్ం సకలం నారాయణః తదుభయ విలక్షణో నారాయణః**

బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు, దిక్కులు, విదిక్కులు, కాలము, కర్మ, మూర్తామూర్తములు, సర్వకారణాలు, సర్వకార్యాలు, ఆరెంటికీ విలక్షుడు నారాయణుడే. **పరంజ్యోతిః, స్వప్రకాశమయః, బ్రహ్మోనందమయః, నిత్యోనిర్వికల్పో నిరంజనో నిరాఖ్యాత శుద్ధోదేవ ఏకోనారాయణః నద్వితీయోస్తి కశ్చిత్.**

నారాయణుడే పరంజ్యోతి. స్వప్రకాశమయుడు, బ్రహ్మోనందమయుడు, నిత్యుడు, నిర్వికల్పుడు, నిరంజనుడు, నిరాఖ్యాతుడు, శుద్ధుడు, దేవుడు నారాయణుడొక్కడే. రెండవ వాడు లేడు. అతనితో సమానమైన వారు కాని, అతనికన్న అధికులు కాని లేరు. ఈ విషయాలు తెలుసుకున్నవాడు సంసార బంధాలన్నీ తెంచుకుని మృత్యువును జయించి అమరుడవుతాడు.

## 3వ అధ్యాయము (ప్రపంచోత్పత్తి)

ఆ మాటలు విన్న శిష్యుడు అడుగుతున్నాడు. ఓ గురువరేణ్యా ! మహామూలావిద్య ఎలా వస్తుందో వివరించారు. ఇప్పుడు ఈ ప్రపంచము ఎలా ఉత్పత్తి అయిందో చెప్పవలసినది. ఆ మాటలు

విన్న గురువు చెబుతున్నాడు. ఓ శిష్యుడా! ఈ ప్రపంచమంతా అనాదిగా కనిపిస్తూనే ఉన్నది. అయితే ఈ ప్రపంచము నిత్యమా? అనిత్యమా? అని అనుమానం కలుగుతుంది. ప్రపంచము రెండు విధాలుగా ఉన్నది. 1. విద్యాప్రపంచము 2. అవిద్యా ప్రపంచము. ఇందులో విద్యా ప్రపంచము నిత్యము అనే మాట నిజమే. ఎందుకంటే అది నిత్యానంద చిద్విలాసము. శుద్ధ, బుద్ధ, ముక్త, సత్యానంద స్వరూపము. కాబట్టి అది నిత్యమే. ఇక అవిద్యా ప్రపంచము నిత్యత్వము చూద్దాం.

1. ఇది ప్రవాహంలాగా నిత్యము అని కొందరంటారు. అంటే ప్రవాహము ఎల్లప్పుడూ ఉండదు. కాబట్టి అలాగే ఈ ప్రపంచం కూడా అనిత్యము.

2. ఇక్కడ ప్రళయము అనేది వినిపిస్తున్నది. కాబట్టి ఇది అనిత్యము అని కొందరంటారు.

ఇది ఈ రెండూ కాదు. ఎందుకని అంటే ఈ జగత్తంతా సంకోచ వికాసాత్మకమైన మాయావిలాసమే అవిద్యావిలాసము. అద్వయమైన బ్రహ్మ ఒకటే. అది తప్ప మరేదీ వివిధ ఆకారాలలో లేదు. బ్రహ్మవ్యతిరిక్తమైనదంతా బాధితమే. బ్రహ్మ ఒక్కటే సత్యము, నిత్యము, జ్ఞానము, అనంతము. అతని నుంచే ఈ అవిద్యోప సంహారాలు జరుగుతున్నాయి.

నాలుగువేల యుగాలు – బ్రహ్మకు ఒక పగలు

నాలుగువేల యుగాలు – బ్రహ్మకు ఒక రాత్రి

ఈ రెండూ కలిస్తేనే ఒకరోజు అవుతుంది. ఈ ఒక్కరోజులో సత్యలోకందాకా అన్నింటికీ సృష్టి స్థితి లయాలు జరుగుతాయి.

| | | |
|---|---|---|
| పదిహేను రోజులు | – | ఒక పక్షము |
| రెండు పక్షాలు | – | ఒక మాసము |
| రెండు మాసములు | – | ఒక ఋతువు |
| మూడు ఋతువులు | – | ఒక అయనము |
| రెండు అయనములు | – | ఒక సంవత్సరము |

బ్రహ్మమానంలో వంద సంవత్సరాలు అతని ఆయుష్యు. అతడు ఉండేది అంతవరకే. అంత్యకాలంలో అతడు హిరణ్యగర్భుని చేరతాడు. హిరణ్యగర్భుడికి కారణమైన పరమాత్మ అండ పరిపాలకుడైన నారాయణుని చేరతాడు. మళ్ళీ వంద సంవత్సరాలు అతడికి ప్రళయము. అప్పుడు జీవులన్నీ ప్రకృతిలో లీనమవుతాయి. ప్రళయంలో సర్వము శూన్యమవుతుంది. ఆ బ్రహ్మయొక్క స్థితి ప్రళయాలు ఆదినారాయణుని అంశతో అవతరించిన, అజాండ పరిపాలకుడైన శ్రీమహావిష్ణువు యొక్క అహోరాత్రాలు. ఈ అహోరాత్రాలు రెండూ కలిపి ఒకరోజు. ఇలాగే మళ్ళీ విష్ణువుకు రోజులు, పక్షాలు, మాసాలు, సంవత్సరాలు ఉంటాయి. ఆయన మానంలో ఆయన వంద కోట్ల సంవత్సరాలు ఉంటాడు. అంత్యకాలంలో ఆయన అంటే అయిన విరాట్పురుషుని చేరతాడు. ఇప్పుడు బ్రహ్మాండమంతా నశిస్తుంది. ఈ ప్రళయందాకానే ఆయన ఉంటాడు. ప్రళయంలో సర్వశూన్యమయి పోతుంది. ఇప్పుడు అండ పరిపాలక మహావిష్ణువు యొక్క స్థితి ప్రళయము విరాట్పురుషునికి ఒక రోజు. అతనికి కూడా మాసాలు, సంవత్సరాలు ఉంటాయి. ఈ రకంగా అతడుండేది శతకోటి సంవత్సరాలు. స్థితి అంతంలో ఆదివిరాట్పురుషుడు స్వాంశయైన మాయోపాధిక నారాయణుని చేరతాడు. ఈ విరాట్పురుషుని స్థితి,

ప్రళయాలు ఆ నారాయణునికి ఒకరోజు. ఇలా వందకోట్ల సంవత్సరాలు అతని ఆయువు. స్థితి అంతంలో త్రిపాద్విభూతినారాయణుని ఇచ్ఛావశంతో నిమేషము అంటే సృష్టి జరుగుతుంది. దాంతో సావరణమైన మూలవిద్యాండము విలయమవుతుంది. అప్పుడు సవిలాసమైన మూలవిద్య సర్వకార్యోపాధి సమన్వితమై, సదసద్విలక్షణమై, నిర్వాచ్య లక్షణశూన్యమై, ఆవిర్భావ తిరోభావాత్మకమై, అనాది అఖిల కారణ అనంత మహామాయా విశేషణ విశేషితమై పరమ సూక్ష్మమూలకారణమైన అవ్యక్తాన్ని చేరుతుంది. ఆ వ్యక్తము బ్రహ్మను చేరుతుంది. ఇంధనం లేని అగ్నిలాగా, మాయోపాధికుడైన ఆదినారాయణుడు స్వస్వరూపాన్ని పొందుతాడు. జీవులన్నీ కూడా స్వస్వరూపాన్ని పొందుతాయి. ఎర్రటి మంకెన్న పువ్వు దగ్గరగా ఉన్నప్పుడు స్ఫటికం ఎర్రగాను, అది లేనప్పుడు తెల్లగాను ఉంటుంది. అలాగే బ్రహ్మకు కూడా మాయోపాధి వల్ల సగుణ, పరిచ్ఛిన్న ప్రతీతి కలుగుతుంది. ఉపాధి పోగానే నిర్గుణ, నిరవయవ ప్రతీతి కలుగుతుంది.

## 4వ అధ్యాయము (ఉన్మేష నిమేషము)

అప్పుడు **తస్మాత్ నిర్విశేషం అతినిర్మలం భవతి.** అంతకన్న విశేషము లేదు కాబట్టి అతినిర్మలమవుతుంది. **అవిద్యాపాదం అతిశుద్ధం భవతి.** అవిద్యాపాదము అతిశుద్ధమవుతుంది. **శుద్ధబోధానంద లక్షణ కైవల్యం భవతి.** శుద్ధబోధానంద లక్షణ కైవల్యమవుతుంది. **బ్రహ్మణః పాదచతుష్టయం నిర్విశేషం భవతి.** బ్రహ్మయొక్క నాలుగు పాదాలు ఏ విశేషాలు లేక సమంగా ఉంటాయి. **అఖండ లక్షణానంద పరిపూర్ణ సచ్చిదానంద స్వప్రకాశం భవతి.** అఖండ లక్షణము, అనంత

పరిపూర్ణము, సచ్చిదానంద ప్రకాశము అవుతుంది. **అద్వితీయం అనీశ్వరం భవతి** అద్వితీయము, అనీశ్వరము అవుతుంది. **అఖిల కార్యకారణ స్వరూపమ్, అఖండ చిద్ఘనానంద స్వరూపమ్, అతి దివ్యమంగళాకారమ్, నిరతిశయ ఆనంద తేజోరాశి విశేషమ్, సర్వం పరిపూర్ణానంద చిన్మయ స్తంభాకారమ్, శుద్ధబోధానంద విశేషాకారమ్, అనంత చిద్విలాస విభూతి సమిష్ట్యాకారమ్, అద్భుత ఆనంద ఆశ్చర్య విభూతి విశేషాకారమ్, అనంత పరిపూర్ణానంద దివ్య సౌదామినీ నిచయాకారమ్, ఏవమ్ ఆకారం అద్వితీయాఖండ ఆనంద బ్రహ్మ స్వరూపమ్ నిరూపితమ్ ॥**

అఖిల కార్యకారణ స్వరూపము, అఖండ చిద్ఘనానంద స్వరూపము, దివ్యమంగళాకారము, నిరతిశయ ఆనంద తేజోరాశి విశేషము, సర్వపరిపూర్ణానంద చిన్మయ స్తంభాకారము, శుద్ధబోధానంద విశేషాకారము, అనంత చిద్విలాస విభూతి సమిష్ట్యాకారము, అద్భుత ఆనంద ఆశ్చర్య విభూతి విశేషాకారము, అనంత పరిపూర్ణ ఆనంద దివ్యసౌదామినీ నిచయాకారము అవుతుంది. ఇటువంటి ఆకారము కల అద్వితీయ ఆనంద బ్రహ్మస్వరూపము నిరూపితమైనది.

ఇప్పుడు శిష్యుడు "ఓ గురుదేవా! పాదబేధము ఎలా కలిగింది? అద్వైత స్వరూపము ఎలా నిరూపించబడుతుంది?" అని అడిగాడు. దానికి గురువుగారు సమాధానం చెబుతున్నారు. బ్రహ్మము అద్వైతమేనయ్యా ! ఇందులో సందేహం లేదు. **బ్రహ్మ అద్వైతమ్ వసత్యమ్ ॥** బ్రహ్మము అద్వైతమే. ఇది సత్యము. బ్రహ్మబేధము ఎక్కడా చెప్పబడలేదు. బ్రహ్మకు వ్యతిరేకమైనది లేదు. పాదబేధం అంతా బ్రహ్మస్వరూపమే. బ్రహ్మకు నాలుగు పాదాలున్నాయి. అందులో ఒకటి

అవిద్యాపాదము, మిగిలిన మూడు పాదాలు అమృతము. తమస్సుకు పరమైన జ్యోతి పరమానంద లక్షణము. పాదత్రయాత్మకమైన బ్రహ్మ కైవల్యము, శాశ్వతము. ఈ రకంగా తమస్సుకు పరమైన ఈ పురుషుని తెలిసినవాడు అమృతుడవుతాడు. ఇది తప్ప మోక్షానికి వేరుమార్గం లేదు. ఆఆత్మ తేజస్సులకు తేజస్సు. తమస్సుకు పరము. జగత్తుకు స్రష్ట. అచింత్య రూపము. ఆదిత్య వర్ణం కల పరంజ్యోతి తమస్సుకు పై భాగంలో ప్రకాశిస్తున్నది. ఏదైతే అవ్యక్తము, అనంతరూపము, విశ్వరూపము, పురాతనము, అవిద్యకు పరముగా ఉన్నదో, దాన్నే ఋతము, సత్యము అంటారు. అదే సత్యము. అదే పరము. విశుద్ధమైన బ్రహ్మము. ఇలా తమస్సు శబ్దంతో అవిద్య చెప్పబడింది. అతని ఒకపాదమే ఈజగతిన, మిగిలిన మూడు పాదాలు ద్యులోకంలో ఉన్నాయి. ఈ రకంగా మూడు పాదాలు పైన, ఒక పాదము క్రింద ఉన్నాయి. మూడు పాదాలు అంటే 1. విద్య 2. ఆనంద 3. తురీయములు. అన్నాడు గురువుగారు. ఇదంతా విన్న శిష్యుడు మళ్ళీ అడుగుతున్నాడు. “గురుదేవా! ఆత్మారాముడైన ఆదినారాయణుని ఉన్మేష నిమేషములు ఎలాంటివి? వాటిని వివరించండి” గురువుగారు చెబుతున్నాడు. ‘ఉన్మేషము’ అంటే తెరచుట, మెలకువ, స్ఫురణ అని అర్థం. నిమేషము అన్నా, నిమిషము అన్నా ఒక్కటే. రెప్పవేయుట, రెప్పపాటు, రెప్పవేసేంత కాలము, ముకుళించుట అనిఅర్థం. మన పరిభాషలో చెప్పాలి అంటే ఉన్మేషము – సృష్టి. నిమేషము – లయము. పరమేశ్వరుడు కనులు తెరిస్తే – సృష్టి. కనులు మూస్తే లయము. సృష్టి జరిగిన తరువాత స్థితి ఎంత కాలం ఉంటుందో, ప్రళయం జరిగిన తరువాత కూడా మళ్ళీ సృష్టి జరగటానికి అంతే కాలం ఉంటుంది. ఒక్కమాటలో చెప్పాలి అంటే ఉన్మేష నిమేషాలు స్థితి

ప్రళయముల కాలపరిమాణం ఒకటే. ఉన్మేష కాలంలో అవిద్యాస్థితి ఉంటుంది. నిమేష కాలంలో అవిద్యకు ప్రళయం జరుగుతుంది. ప్రళయం తరువాత గతంలో లాగానే అవిద్యాకార్యాలు అన్నీ తిరిగి పుడతాయి. కార్యకారణ ఉపాధి భేదంతో జీవుడు, ఈశ్వరుడు అనే భేదం కనిపిస్తుంది. కార్యోపాధి గలవాడు జీవుడు. కారణోపాధి గలవాడు ఈశ్వరుడు. ఈశ్వరుని యొక్క మహామాయ ఆయన ఆజ్ఞకు లోబడి ఆయన సంకల్పానుసారమే ప్రవర్తిల్లుతుంది. ఈ మహామాయ మహావిష్ణువు యొక్క యొక్క క్రీడా శరీరము. అది బ్రహ్మాది దేవతలకు కూడా గోచరం కాదు. ఎవరైతే శ్రీమహావిష్ణువును సేవిస్తారో, వారు ఈ మహామాయ నుంచి తరిస్తారు. ఇతరమైన ఏ ఉపాయం చేతకూడా మాయను దాటలేరు. అవిద్యాకార్యాలు అన్నీ అంతఃకరణలను అతిక్రమించి, కాలాన్ని అనుసరించి పుడతాయి. వాటిలో బ్రహ్మచైతన్యము ప్రతిబింబిస్తుంది. ఆ ప్రతిబింబాలే జీవులు అనబడతాయి. అయితే అంతఃకరణోపాధికులంతా జీవులే అని కొందరంటారు. ప్రతిబింబ చైతన్యమే జీవులు అని మరికొందరంటారు. ఈ జీవులకు ఉపాధి నానాత్వమే తప్ప వేరే తేడా లేదు. అంటే వీటి ఆకారాలు, శరీరాలలో మాత్రమే ఈ తేడా ఉంటుంది. అంతకన్న తేడా ఏదీలేదు. సర్వపరిపూర్ణుడైన నారాయణుడే అన్ని కాలాలలోనూ స్వేచ్ఛగా క్రీడిస్తుంటాడు. అలాగే ఈ జీవులంతా లేనటువంటి, అపారమైన విషయసుఖాల మీద ఆశ గలవారై, ఈ సంసార చక్రంలో పడి గిరగిరా తిరుగుతుంటారు. ఈ రకంగా అనాదియైన సంసారంమీద ఉన్న విపరీతమైన భ్రమతో ఈ పరంపర ప్రవర్తిల్లుతున్నది. దీంతో నాల్గవ అధ్యాయము, పూర్వకాండ పూర్తి అవుతున్నాయి.

# 5వ అధ్యాయము ఉత్తరకాండ (పరమానందము)

గురువుగారు చెప్పినదంతా విన్నాడు శిష్యుడు. ఆలోచించాడు. ఇప్పుడు అడుగుతున్నాడు. ఓ గురువర్యా! అవిద్య పూర్తిగా నశించిపోయింది కదా! మరి మళ్ళీ ఎలా పుడుతోంది? గురువుగారు చెబుతున్నాడు. వర్షాకాలం ప్రారంభం కాగానే కప్పలు కుప్పలు తెప్పలుగా పుడతాయి. అలాగే సృష్టి జరగగానే అవిద్య మళ్ళీ పుడుతుంది అన్నాడు జీవులకు అనాది సంసార భ్రమ ఎలా కలుగుతోంది? దాని నివారణ ఎలా జరుగుతుంది? మోక్షమార్గమేది? మోక్షసాధన ఏది? మోక్షోపాయమేది? మోక్ష స్వరూపమేది? సాయుజ్యము అంటే ఏది ? ఇదంతా నాకు చెప్పవలసింది. అని అడిగాడు శిష్యుడు. గురువుగారు చెబుతున్నాడు.

మానవుడు చేసిన దుష్కర్మల ప్రభావం వల్ల, జన్మాంతర వాసనవల్ల అతడికి దేహాత్మ వివేకము కలగదు. ఈ కారణంచేతనే దేహమే ఆత్మ అని భావిస్తాడు. నేను అజ్ఞానిని. జీవుడను. అత్యంత దుఃఖకారుడను. అనాది సంసారిని. అనే వాసనాబలము వల్ల సంసారమందే ప్రవృత్తి కలుగుతుంది. దానికి నివృత్తి మార్గము ఎవరికీ కనిపించదు. మిథ్యాభూతాలు, స్వప్నతుల్యమైన విషయ భోగాలనుభవించి, వివిధ రకాలైన, ఉత్కృష్టమైన కోరికలు గలవాడై, తృప్తిలేనివాడై పరుగులు పెడుతుంటాడు. అలా ఈ సంసారంలో అనేక జన్మలు ఎత్తుతూ, నికృష్టమైన రూపాలు ధరిస్తూ, ఆ దేహాలతో శుభాశుభ ఫలములు అనుభవిస్తుంటాడు. కర్మలలో కూరుకుపోయిన వారికి ఆ కర్మల విషయ ప్రవృత్తే కలుగుతుంది. అంతేకాని సంసార నివృత్తి మార్గము కనిపించదు. ఈ కారణంచేతనే ఇష్టం లేని వాటిని కూడా ఇష్టంగా

భావిస్తాడు. ఇదంతా అనాదిగా వస్తున్న సంసార విపరీత భ్రమ వల్ల కలుగుతుంది. జీవులకు ఇష్టమైన విషయాల మీద సుఖబుద్ధి, ఇష్టంలేని విషయాలమీద దుఃఖబుద్ధి కలుగుతుంది. అంతేకాని అబాధిత బ్రహ్మసుఖ విషయప్రవృత్తి కలగదు.

అసలు మానవుడికి బంధమోక్షాలు ఎలా కలుగుతున్నాయి? అంటే అజ్ఞానంవల్ల. అజ్ఞానం ఎలా వచ్చింది? భక్తి, జ్ఞాన, వైరాగ్య భావనలు లేకపోవటం చేత. అవి ఎందుకని లేవు? అంతఃకరణ మాలిన్యమువల్ల. మరి ఈ సంసారాన్ని తరించే మార్గమేది? గురువుగారు ఉపదేశిస్తున్నారు. ఓ శిష్యా! జన్మ జన్మలలో చేసిన ఉత్కృష్టమైన పుణ్యకర్మలవల్ల సత్సంగము కలుగుతుంది. దాంతో విధినిషేధ వివేకము (ఏది చెయ్యాలి? ఏది చెయ్యకూడదు? అనే జ్ఞానము) కలుగుతుంది. దానివల్ల సదాచార ప్రవృత్తి కలుగుతుంది. సదాచారము వల్ల పాపవినాశనము జరుగుతుంది. అంతఃకరణ నిర్మలమవుతుంది. నిర్మలమైన అంతఃకరణ సద్గురువును వెతుకుతుంది. సద్గురు కటాక్షంతో సర్వసిద్ధులు కలుగుతాయి. అన్ని బంధాలు నశిస్తాయి. విఘ్నాలన్నీ పోయి, సర్వశ్రేయస్సులు కలుగుతాయి.

పుట్టుగ్రుడ్డివాడికి స్వరూప జ్ఞానము ఎలా ఉండదో, అలాగే గురూపదేశము లేకుండా కల్పకోటి శతాలు గడిచినా తత్త్వజ్ఞానం కలగదు. కాబట్టి సద్గురు కటాక్ష విశేషముతోనే తత్త్వజ్ఞానము కలుగుతుంది. సద్గురు కటాక్షం కలగగానే భగవత్కథా శ్రవణాదులయందు శ్రద్ధ కలుగుతుంది. అప్పుడు హృదయంలో ఉండే అనాది దుర్వాసనాగ్రంధి నాశనమవుతుంది. అప్పుడు హృదయంలోని కోరికలన్నీ నశిస్తాయి. దాంతో హృత్పుండరీక కర్ణికలో పరమాత్మ

ఆవిర్భావం జరుగుతుంది. అప్పుడు వైరాగ్యం కలుగుతుంది. వైరాగ్యం వల్ల బుద్ధి విజ్ఞానావిర్భావము అవుతుంది. అభ్యాసం వల్ల జ్ఞానము క్రమంగా పరిపక్వమవుతుంది. పక్వమైన జ్ఞానంవల్ల జీవన్ముక్తుడవుతాడు. వాసనలతో కూడిన శుభాశుభ కర్మలు పూర్తిగా నశిస్తాయి. అప్పుడు దృఢతరమైన శుద్ధ సాత్వికవాసనతో భక్త్యతిశయము కలుగుతంది. భక్త్యతిశయముతో సర్వావస్థల యందు సర్వమయుడైన నారాయణుడే కనిపిస్తాడు. సర్వజగత్తులు నారాయణమయంగా కనిపిస్తాయి. నారాయణుని కన్న వేరైనది ఏదీ లేదు. అనే విషయం స్ఫుటంగా తెలుస్తుంది.

ఈ విషయాలు తెలిసినవాడు సర్వత్రా విహరించగలుగుతాడు. నిరంతరము సమాధిలో ఉంటాడు కాబట్టి సర్వత్రా పరమాత్మను దర్శించగలుగుతాడు. ఇటువంటి మహానుభావుడికి అప్పుడప్పుడు ఈశ్వర సాక్షాత్కారమవుతుంది. ఇతడు దేహత్యాగం చేసే సమయంలో వైకుంఠంలోని వారు అందరూ వస్తారు. అప్పుడు భగవంతుణ్ణి ధ్యానిస్తూ హృత్పద్మంలోని ఆత్మను, తనను, అంతరాత్మను చింతించి, ఉపచారాలు చేసి, పూజించి, హంస మంత్రాన్ని స్మరిస్తూ, అన్ని ద్వారాలు మూసివేసి, మనస్సును నిరోధించి, ఊర్ధ్వగమైన వాయువుతో, ప్రణవానుసంధాన పూర్వకంగా, మెల్లమెల్లగా బ్రహ్మరంధ్రం నుంచి బయటకు వెళ్ళి, 'సోహం' అనే మంత్రంతో ద్వాదశాంతస్థమైన పరమాత్మను ఏకం చేసి, పంచోపచారాలతో పూజించి, మళ్ళీ సోహం మంత్రంతో షోడశాంత స్థితమైన జ్ఞానాత్మను ఏకం చేసి, ఉపచారాలతో పూజించి, ప్రాకృతమైన ఈ దేహాన్ని వదలి, ఎదురుగా కల్పించబడిన మంత్రమయము, తేజోమయము, నిరతిశయానందమయము అయిన మహావిష్ణువు

సారూప్య విగ్రహాన్ని పరిగ్రహించి, సూర్యమండలంలో ఉన్న మహావిష్ణువు యొక్క కాలి బొటనవ్రేలు నుంచి ఆవిర్భవించిన గంగా ప్రవాహంలో బావనామాత్రంతో స్నానం చేసి వస్త్రధారణ మొదలైన ఉపచారాలతో ఆత్మపూజ చెయ్యాలి. అప్పుడు అతడు సాక్షాత్తు నారాయణుడై ప్రణవ గరుడుని ధ్యానించి, ఆయనను ఆరాధించి, ప్రదక్షిణ నమస్కారాలు చేసి, ప్రణవగరుడుని అధిరోహించి, మహావిష్ణువు యొక్క సమస్త ఆభరణాలు, చిహ్నాలు ధరించి, సుదర్శన పురుషుణ్ణి తీసుకుని, వైకుంఠంలో ఉండే వారందరితోను పరివేష్టితుడై, అభో మార్గం ప్రవేశించి, ప్రక్కన కనిపిస్తున్న అనేక పుణ్యలోకాలు దాటి, అక్కడున్న పుణ్యపురుషులను పూజించి, వారిచే పూజించబడి, సత్యలోకం చేరి, బ్రహ్మను పూజించి, బ్రహ్మచేత, సత్యలోకవాసుల చేత పూజించబడి, శైవమైన **ఈశాన కైవల్యము** పొంది, శివుని ధ్యానించి, పూజించి, శివగణాల చేత, శివుని చేత పూజితుడై, గ్రహమండలము, ఋషి మండలము దాటి, సూర్యమండలాన్ని భేదించి, కీలక నారాయణుని ధ్యానించి, ధృవమండలం చేరి, ధృవుని పూజించి, శింశుమార చక్రాన్ని భేదించి, శింశుమార ప్రజాపతి పూజించి, మహావిష్ణువు నారాధించి, అతనిచే పూజింపబడి, ఇంకా పైపైకి వెళ్ళి పరమానందాన్ని పొందుతాడు. అప్పుడు వైకుంఠవాసులంతా కూడా వస్తారు. వారిని పూజించి, వారిచే పూజించబడి, ఇంకా పైకి వెళ్ళి విరజానదిలో స్నానం చేసి భగవద్దర్శన పూర్వకంగా మళ్ళీ నదిలో మునిగి, అక్కడ పంచీకృతభూతాలతో ఏర్పడిన సూక్ష్మశరీరాన్ని వదిలి, కేవలము మంత్రమయము, దివ్యతేజోమయం, నిరతిశయం, ఆనందమయమైన మహావిష్ణువు యొక్క విగ్రహాన్ని పరిగ్రహించి, అక్కడ

నుంచి 'ఉన్నజ్జనము' చేసి, ఆత్మపూజ చేసి, నమస్కార పూర్వకంగా బ్రహ్మమయమైన వైకుంఠం ప్రవేశించి అక్కడ ఉన్న వారిని పూజించి, వారిమధ్యన అనంత ప్రాకార ప్రాసాదతోరణ విమానాలతోను, ఉపవనాలతోను ప్రకాశించే నిరుపమ, నిత్య, నిరవద్య, నిరతిశయ, నిరవధిక, బ్రహ్మానదా చలాన్ని చూస్తాడు. దానిమీద నిరతిశయ ఆనంద దివ్యతేజోరాశి ప్రకాశిస్తుంటుంది. దాని మధ్యన శుద్ధబోధానంద లక్షణము ప్రకాశిస్తుంది. దాని మధ్యన చిన్మయవేదిక. దాని మధ్యన అమిత తేజోరాశి, పరమ మంగళావాసనము ప్రకాశిస్తుంది. దాని పద్మకర్ణికలో శుద్ధ శేష భోగాసనము ఉంటుంది. దానిపైన ఆసీనుడై ఉంటాడు ఆదినారాయణుడు. అతన్ని ధ్యానించి, వివిధోపచారాలతో పూజించి ఆయన అనుజ్ఞ తీసుకుని **పంచవైకుంఠాలు** దాటి **అష్ట విరాట్ కైవల్యము** పొంది, ఆయనను ఆరాధించి ఉపాసకుడు పరమానందం పొందుతాడు.

## 6వ అధ్యాయము

గురువుగారి మాటలు పూర్తిగా అత్యంత శ్రద్ధతో విన్నాడు. ఉపాసకుడు పరమానందం చెందాడు. సావరణమైన బ్రహ్మాండాన్ని బేదించాడు. దాన్ని దాటాడు. ఆ బ్రహ్మాండ స్వరూపం ఎలా ఉందో నిశితంగా పరిశీలించి చూశాడు. బ్రహ్మజ్ఞానంతో దాని స్వరూపాన్ని తెలుసుకున్నాడు. వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు, మహర్షులు, బ్రహ్మాది దేవతలు అందరూ ఈ బ్రహ్మాండంలో కొంత భాగాన్ని మాత్రమే వర్ణిస్తారు. అంతేకాని అండ స్వరూపాన్ని ఎరగరు. బ్రహ్మాండానికి ఆవల ఉన్న దాన్ని అసలే ఎరగరు. వాళ్ళకి మోక్ష

ప్రపంచ జ్ఞానమే తెలియదు. ఇంకా బ్రహ్మాండ స్వరూపం ఎలా తెలుస్తుంది? మహదాది సమిష్టి ఆకారము కోడిగ్రుడ్డులా ఉంటుంది. అండము బంగారుమయము. మేలిమి బంగారు కాంతులు ప్రసరిస్తూ ఉంటుంది. ఉదయిస్తున్న కోటిసూర్యులకాంతి కలది. నాలుగు రకాల సృష్టి గలది. పంచమహాభూతాలచే ఆవరించబడినది. మహదహంకృతి తమస్సులతో ఆ వృతమైనది. మూలప్రకృతిచే పరివేష్టింపబడినది. ఆ అండము వైశాల్యము నాలుగు కోట్ల యోజనాలు. అందులో ప్రతి ఆవరణ అలాగే ఉంటుంది. అండ ప్రమాణము చుట్టూ ఇరవై వేల కోట్ల యోజనాల ప్రమాణము మహామండూకాది అనంత శక్తులచే అధిష్టించబడి ఉంటుంది. అదంతా నారాయణుని క్రీడాస్థలము.

ఈ బ్రహ్మాండమంతా ఇటువంటి అనంతకోటి బ్రహ్మాండాలు నిండి ఉన్నాయి. చతుర్ముఖ, పంచముఖ, షణ్ముఖ, ఇలా సహస్రముఖముల వరకు గల నారాయణాంశలతో, రజోగుణ ప్రధానులైన సృష్టికర్తలతో కూడి ఉంటాయి. విష్ణువు, మహేశ్వరుడు సత్వ, తమోగుణాలు కల నారాయణాంశలు, వారు స్థితి సంహార కర్తలు. జలప్రవాహంలో చేపలు, నీటిబుడగలు తిరిగినట్లే, మహావిష్ణువు అధీనంలో అనంతకోటి బ్రహ్మాండాలు ఉన్నాయి. మహావిష్ణువు యొక్క రోమకూపాలలో అనంతకోటి బ్రహ్మాండాలు సావరణలుగా తిరుగుతున్నాయి. ఇప్పుడు ఈ ఉపాసకుడు అన్ని బ్రహ్మాండాలలోను లోపల బయట ఉన్న ప్రపంచ రహస్యమంతా బ్రహ్మజ్ఞానంతో తెలుసుకొని, చిత్రవిచిత్రమైన పరమవిభూతి విశేషాలు చూసి ఆశ్చర్య సాగరంలో మునిగి తేలుతూ, నిరతిశయ ఆనంద పారావారుడై, సమస్త బ్రహ్మాండాలు దాటి, అమితము, అపరిచ్ఛిన్నము అనంతము అయిన తమస్సును దాటి,

మూలావిద్యాపురమును విచిత్రమైన అనంతమాయా విశేషాలతో పరివేష్టితమైన దాన్ని చూసి, అనంతమైన మాయాశక్తి యొక్క సమిష్టి ఆకారాన్ని, అనంతమైన దివ్యతేజోజ్వాలలతో అలంకరించబడిన దాన్ని, అనంతమాయావిలాసాలకు పరమాధిష్ఠానము, మూలప్రకృతికి తల్లి అయిన అవిద్యాలక్ష్మిని దర్శించి, పరిపరివిధాల ఆమెను ద్యానించి, వివిధ ఉపచారాలతో ఆరాధించి, సమస్త బ్రహ్మాండాలకు సమిష్టి జనని అయిన వైష్ణవ మాయకు నమస్కరించి, ఆమె ఆజ్ఞతో పైకి వెళ్ళి మహావిరాట్పదాన్ని పొందుతాడు. మహావిరాట్ స్వరూపం ఎలా ఉన్నది అంటే, సమస్త అవిద్యాపాదకుడు విరాట్. అనేకమైన కనులు, చెవులు, ముఖాలు, కాళ్ళు, చేతులు కలిగి భూమి ఆకాశాలను ఏకం చేసే ఒకే దేవుడు.

ఇతడి రూపం చూడటానికి వీలుకాదు. చర్మచక్షువులతో ఎవరూ ఇతణ్ణి చూడలేరు. హృదయముతోను, కోరికలతోను ఇతణ్ణి ఊహించాలి. ఇతణ్ణి తెలుసుకున్న వారు అమృతులు. అవాఙ్మానస గోచరుడైన ఆవిరాట్పురుషుని ధ్యానించి, వివిధ ఉపచారాలతో పూజించి, ఆయన అనుజ్ఞతో ఇంకా పైకి వెళ్ళి, విచిత్రమైన అనంతమైన మూలావిద్యా విలాసాలు చూసి, ఉపాసకుడు పరమానందించాడు. ఆ వైష్ణవమాయ పరమానందునికి వ్యతిరేకమైన అన్ని శక్తులచే పూజించబడుతుంది. ఆమె పురము అమితాశ్చర్యంగా ఉంటుంది. పూర్తిగా అవిద్యతో నిండి, నిత్య వైకుంఠానికి ప్రతిగా ప్రకాశిస్తుంటుంది. ఉపాసకుడు ఆపురం చేరి, యోగమాయ లక్ష్మిని ధ్యానించి, వివిధ ఉపచారాలతో ఆరాధించి, ఆమెచే పూజింపబడి, ఆమె అనుజ్ఞ తీసుకుని, ఇంకా పైపైకి వెళ్ళి అనంతమైన యోగమాయా విలాసాలను చూసి,

పరమానందం చెందాడు. **ఇవన్నీ దాటిన తరువాత పాదవిభూతి వైకుంఠపురము ఉన్నది.**

ఆ వైకుంఠపురము అత్యంత రమణీయంగా, శోభాయమానంగా ఉంటుంది. అతిఆశ్చర్యకరము, అనంతవిభూతి సమిష్ట్యాకారము అయి ఆనంద ప్రవాహములచే అలంకరించబడి, అమితమైన తరంగములచే అతిమంగళకరము, బ్రహ్మతేజో విశేషాకారములు గల బ్రహ్మవనములుచే అంతటా వ్యాపించి ఉంటుంది. దానియందు అనంతమైన నిత్యముక్తులు ఉంటారు. ఈ రకంగా అనంతచిన్మయ ప్రాసాద జాల సంకులమైన అనాది పాదవైకుంఠము ప్రకాశిస్తూ ఉంటుంది. దానిమధ్యన చిదానందాచలము ఉంటుంది. దానిపైన విభూతి నిరతిశయ ఆనంద దివ్యతేజోరాశి ప్రకాశిస్తుంటుంది. దాని మధ్యన పరమానంద విమానముంటుంది. దాని మధ్యన చిన్మయాసనముంటుంది. దాని పద్మకర్ణిక యందు నిరతిశయ దివ్యతేజోరాశి, దాని మధ్య ఆదినారాయణుడుంటాడు. అతన్ని ధ్యానించి, వివిధ ఉపచారాలతోను పూజించి, అతనిచే పూజించబడి, ఆయన ఆజ్ఞతో ఇంకా పైకి వెళ్ళి సావరణమైన విద్యామండలిని భేదించి, విద్యాపాదాన్ని దాటాలి. **విద్యావిద్యల సంధియందు విష్వక్సేన వైకుంఠపురముంటుంది.** అనంతమైన దివ్యకాంతులతో అది ప్రకాశిస్తుంటుంది. అనంత బోధానంద వ్యూహాలతో అంతటా వ్యాపించి ఉంటుంది. దాని మధ్యన కళ్యాణాచలము మీద శుద్ధానంద విమానము ఉంటుంది. దాని మధ్యన మంగళశాసనము ప్రకాశిస్తుంటుంది. దాని పద్మకర్ణికలో బ్రహ్మతేజోరాశిలో ఆసీనుడైన భగవదనంతవిభూతి, విధినిషేధ పరిపాలకుడు, సర్వప్రవృత్తికి, సర్వహేతువులకు నిమిత్తకుడు, నిరతిశయలక్షణ మహావిష్ణుస్వరూపుడు, అఖిల లోకపాలకుడు, అమిత

విక్రముడు, అయిన విష్వక్సేనుని ధ్యానించి, ప్రదక్షిణ, నమస్కారము, వివిధోపచారాలు చేసి, ఆయన అనుజ్ఞతో ఇంకా పైకి వెళ్ళి విద్యావిభూతిని పొంది, విద్యామయములైన, అంతటా ఆవరించి ఉన్న అనంత వైకుంఠాలను చూసి ఉపాసకుడు పరమానందం చెందాడు. తరువాత విద్యామయములైన అనంత సముద్రాలను అతిక్రమించి, బ్రహ్మవిద్యాతరంగిణిని చేరి, అందులో స్నానం చేసి, భగవంతుణ్ణి ధ్యానం చేస్తూ తిరిగి అందులో మునిగి, మంత్రమయమైన శరీరాన్ని వదలి, విద్యానందమయమైన దివ్యశరీరం ధరించి, నారాయణసారూప్యము పొంది, ఆత్మపూజ చేసి, **నిత్యముక్తులైన బ్రహ్మమయ వైకుంఠవాసులందరి చేత పూజింపబడి, అక్కడనుండి బ్రహ్మవిద్యా వైకుంఠాన్ని ప్రవేశిస్తాడు.** దానిమధ్యన అత్యంత ఉన్నతమైన బోధానంద ప్రాసాదాగ్రమందున్న ప్రణవ విమానముమీద ఉన్న అపార బ్రహ్మవిద్యా సామ్రాజ్యాధి దేవతను, అనాదియైన మూలావిద్యను నాశనం చేసే దానిని, అద్వితీయము, ఏకము అయిన అనంత మోక్షసామ్రాజ్య లక్ష్మిని ధ్యానించి, ప్రదక్షిణ నమస్కారములు గావించి, వివిధోపచారాలతోను పూజించి, స్తుతించి, ఆమెచే పూజితుడై, ఆమె ఆజ్ఞతో ఇంకా పైకి వెళ్ళి బోధానందమయమైన అనంత సముద్రాలను దాటి బ్రహ్మవనాలలోను, పరమ మంగళశ్రేణులలో ప్రవేశించి ఉపాసకుడు పరమానందం పొందుతాడు. **ఆ తరువాత శ్రీ తులసీ వైకుంఠపురమున్నది.** అది పరమకళ్యాణమయము, అనంత విభవము, అమిత తేజోరాశి ఆకారము, అనంత బ్రహ్మతేజోరాశి సమిష్ట్యాకారము అయిఉంటుంది. చిదానందమయమైన అనేక ప్రాకారాలతో పరివేష్టించబడి ఉంటుంది. అది అమిత బోధానందాచలముపైన ఉన్నది. బోధానంద తరంగిణి యొక్క ప్రవాహములచే

అతిమంగళమైనది, నిరతిశయానందములైన అనంత బృందావనములచే శోభితమైనది, అఖిల పవిత్రములలోను పరమపవిత్రమైనది, నిత్యముక్తులచే వ్యాపించినది, ఆనందమయమైన అనంత విమానములచే అలంకరించబడినది. అమితతేజోరాశి, దివ్యతేజోరాశి అయిన శ్రీ తులసీ వైకుంఠపురాన్ని ఉపాసకుడు ప్రవేశిస్తాడు. దానిలోపల దివ్య విమానముమీద సర్వపరిపూర్ణుడైన శ్రీమహావిష్ణువు యొక్క సర్వాంగములందు విహరించేది, నిరతిశ సౌందర్య లావణ్యాధి దేవత, శ్రీ సఖి అయిన **తులసిని** దర్శించి, ధ్యానించి, నమస్కరించి, వివిధోపచారములతో పూజించి, స్తుతించి, ఆమె అనుజ్ఞతో ఇంకా పైపైకి వెళ్ళి పరమానంద తరంగిణి యొక్క తీరానికి వెళ్ళి, అక్కడ ఉన్న శుద్ధబోధానందమయములైన అనంత వైకుంఠాలను చూసి, నిరతిశయానందం పొంది, అక్కడ ఉన్న చిద్రూపులైన పురాణ పురుషులతో పూజింపబడి, బ్రహ్మవనాలకు వెళ్ళి, నిరతిశయ ఆనందామృత సాగరంలో అమిత తేజోరాశిని దర్శించి, అక్కడ నుండి అంతకన్నా పైపైకి విమాన పరంపరల యందు అనంత తేజోపర్వత పంక్తులను చేరి, ఈ రకంగా విద్యానందాన్ని పొంది, అక్కడ ఆనంద తరంగిణి యొక్క ప్రవాహములో స్నానం చేసి, బోధానందవనం చేరి, శుద్ధబోధ పరమానందాకారము చేరి ఎల్లప్పుడు అమృతపుష్పవర్షములచే ఆవరించబడినది, పరమానంద ప్రవాహములచే వ్యాపించబడినది. మూర్తిమంతమైన పరమ మంగళములచే ఆవరించబడినది, అపరిచ్ఛిన్న ఆనందసాగరమైన ప్రదేశాన్ని చేరతాడు.

**దాని మధ్యన ఉన్న శుద్ధబోధానంద వైకుంఠము,** సహస్రానంద ప్రాకారాలతో ప్రకాశించే బ్రహ్మవిద్యాపాద వైకుంఠం చేరతాడు. అది

అనంత ఆనంద విమానజాల సంకులము. అనంతమైన బోధసౌధాలతో నిండి ఉంటుంది. పరమ ఛత్రాలతోను, తోరణాలతోను, ధ్వజాలు, చామరాలతో అలంకరించబడి ఉంటుంది. నిత్యముక్తులైన పరమానంద వ్యూహాలతో వ్యాపించబడి ఉంటుంది. అనంత దివ్యతేజః పర్వత సమిష్ట్యాకారము కలిగి ఉంటుంది. అది అనంతమైన శుద్ధ బోధానంద మండలము. అవాఙ్మానసమైన ఆనంద బ్రహ్మతేజోరాశి మండలము, అఖండ తేజోమండల విశేషము, శుద్ధానంద సమిష్టి మండల విశేషము, **అఖండ చిద్ఘనానంద విశేషము అయిన బోధానంద వైకుంఠంలో ఉపాసకుడు ప్రవేశించి, అక్కడున్న అందరితోను పూజించబడతాడు.** పరమానందాచలము మీద అఖండ బోధ విమానమున్నది. దాని మధ్యన చిన్మయాసనము విరాజిల్లుతున్నది. దానిమీద అఖండానంద తేజోమండలమున్నది. దాని మధ్యన ఉన్న ఆదినారాయణుని ధ్యానించి, వివిధోపచారాలతోను పూజించి, స్తుతించాలి. అప్పుడు ఆదినారాయణుడు ఈ ఉపాసకుని చూసి, తన సింహాసనం మీద కూర్చోబెట్టుకుని వైకుంఠవాసులందరితోను కలసి, ఇతన్ని సమస్త మోక్షసామ్రాజ్యానికి అభిషిక్తుడు గావించి, మంత్రపూతములైన ఆనంద కలశాలతో అభిషేకించి, మంగళవాద్యాలతో, సర్వోపచారాలతోను పూజించి, తనయొక్క సమస్త చిహ్నాలతోను అలంకరించి, ప్రదక్షిణ, నమస్కారములు చేసి, **త్వం బ్రహ్మాస్మి, అహం బ్రహ్మాస్మి** నువ్వు బ్రహ్మవైనావు. నేను బ్రహ్మను. **అవయోరంతరం న విద్యతే.** మన ఇద్దరికీ తేడాలేదు. **త్వమే వాహమ్, అహమేవత్వమ్.** నువ్వే నేను, నేనే నువ్వు అని అంటాడు.

# 7వ అధ్యాయము

తరువాత ఉపాసకుడు ఆయన ఆజ్ఞతో నిత్యగరుడుని ఎక్కి వైకుంఠవాసులతో కలసి పైకి వెళ్ళి బ్రహ్మానందానుభూతిని పొంది, అనంత వైకుంఠములు చూసి, నిరతిశయ ఆనందసాగరుడై, ఆత్మారాములైన వారిని లెక్కలేనంత మందిని చూసి, వారిని పూజించి, వారితో పూజింపబడి ఇంకా పైకి వెళ్ళి బ్రహ్మానంద విభూతి పొంది, అనంత దివ్యతేజములతో అలంకరించబడిన, పరమానందలహరీ వనశోభితములైన ఆనంద సముద్రాలు దాటి, బ్రహ్మానంద విభూతి విశేషాలు అతిక్రమించి ఉపాసకుడు పరమానందము పొందుతాడు. **ఆ తరువాత సుదర్శన వైకుంఠమున్నది.** అది నిత్యమంగళము. అనంత విభవము. సహస్రానంద ప్రాకార పరివేష్ఠితము. దివ్యప్రకాశము గల ఆకులు గలది. దివ్యతేజోమండలము. బృందారక పరమానందము. శుద్ధ బుద్ధ స్వరూపము. అనంత ఆనంద సౌదామినీ పరమ విలాసము. నిరతిశయ పరమానంద పారావారము. అక్కడ అనంతులైన చిద్రూపులైన అనంత పురుషులుంటారు. దాని మధ్యన సుదర్శన మహాచక్రమున్నది. అది మహాపాపాల నుంచి కూడా తరింపచేస్తుంది. పరమ పవిత్రమైనది. ఎటువంటి పాపాలనైనా, శత్రువులనైనా హరించేస్తుంది. దివ్యమైన తేజస్సుతో ప్రకాశిస్తుంటుంది. దానికి పదివేల ఆకులుంటాయి. అన్ని రకాలయిన ఆయుదాల శక్తి దానికి ఉన్నది. మహావిష్ణువు యొక్క ప్రతాపానికి నిదర్శనమిది. కొన్ని కోట్ల యోజనాల వైశాల్యము కలిగి ఉంటుంది. సమస్త దివ్యమంగళములకు ఆదికారణమైనది. దివ్యతీర్థాలకు నిజమందిరమది. దాని మధ్యన

నాభిస్థానంలో నిరతిశయ ఆనంద దివ్యతేజోరాశి ఉన్నది. **"తన్మధ్యే సహస్రారచక్రం ప్రజ్వలతి"** దాని మధ్యలో సహస్రచక్రము శోభిల్లుతున్నది. **పరమానంద సౌదామినీ ని చ యోజ్వలం** అది అఖండతేజో మండలాకారము, పరమానంద సౌదామినీ నిచయోజ్వలము. దాని మధ్యన **'షట్చతార చక్రం ప్రజ్వలతి'** 600 ఆకులు గల చక్రమున్నది. దాని మధ్యలో 300 ఆకులున్న చక్రమున్నది. దాని మధ్యన 100 ఆకుల చక్రమున్నది. దాని మధ్య 60 ఆకులున్న చక్రమున్నది. అది బ్రహ్మతేజస్సుతో ప్రకాశిస్తుంది. దాని మధ్యన షట్కోణ చక్రమున్నది. దాని మధ్యన మహానంద పదమున్నది. దానికర్ణిక యందు సూర్యచంద్ర అగ్నిమండలాలు ప్రకాశిస్తున్నాయి. అది నిరతిశయ దివ్యతేజోరాశి. దాని మధ్యన కొన్ని కోట్ల బాలభానుల ప్రకాశముగల సుదర్శన పురుషుడున్నాడు. **సుదర్శన పురుషో మహావిష్ణురేవ** ఆ సుదర్శనుడు సాక్షాత్తు శ్రీమహావిష్ణువే.

ఉపాసకుడు సుదర్శనుణ్ణి ధ్యానించి, వివిధోపచారములతో పూజించి, వానితో పూజింపబడి, ఆయన ఆజ్ఞతో పైకి వెళ్ళి, పరమానందమయమైన అనంత వైకుంఠాలను చూసి, పరమానందం పొందుతాడు. ఆ తరువాత ఉపాసకుడు క్రమంగా అనంత చిద్విలాస విభూతి విశేషాలు దాటి అద్వైత సంస్థానము చేరతాడు. అది అఖండానంద స్వరూపము. అనిర్వాచ్యము. అమిత బోధసాగరము, అమితానంద సముద్రము. నిరవయవము, నిరాధారము, నిర్వికారము, నిరంజనము, అనంత బ్రహ్మానంద సమిష్టికందము, పరమచిద్విలాస సమిష్ట్యాకారము, నిర్మలము, నిరవద్యము, నిరాశ్రయము. అనంత ఉపనిషత్స్వరూపము. అఖిల ప్రమాణాతీతము. **మనోవాచామగోచరం,**

**నిత్యముక్త స్వరూపం, అనాధారం, ఆద్యంతశూన్యం, కైవల్యం, పరమగ్ం శాంతం, సూక్ష్మాత్సూక్ష్మతరం, మహతోమహత్తరం అపరిమిత ఆనంద విశేషం, శుద్ధబోధానంద విభూతివిశేషం, అనంత ఆనంద విభూతి విశేషం, అక్షరం, అనిర్దేశ్యం, కూటస్థం, అచలం, అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యం, పరిపూర్ణం, పరమయోగి బిర్మృగ్యం.**

అవాఙ్మానసగోచరము, నిత్యముక్త స్వరూపము, అనాధారము, ఆదిమధ్యాంత రహితము, కైవల్యము, పరమము, శాంతము, సూక్ష్మతరము, మహత్తరము, అపరిమిత ఆనందవిశేషము, శుద్ధబోదానంద విభూతివిశేషము, అక్షరము, అనిర్దేశ్యము, కూటస్థము, అచలము, ధ్రువము, లోపల వెలుపల కూడా వ్యాపించినది. పరిపూర్ణమైనది, పరమయోగులచే మాత్రమే పొందబడేది. దేశకాల వస్తువుల చేత పరిచ్ఛిన్నము కానిది, నిత్యపరిపూర్ణమైనది. అఖండ ఆనంద అమృత విశేషము, శాశ్వతము, పరమపదము, స్వయంప్రకాశము, పరమానందలక్షణము, అయి ఉన్నది. దాని మధ్యన అమితఆనంద చిద్రూపాచలము, అఖండ పరమానంద విశేషము, నిత్యమంగళము, నిరతిశయ ఆనందపారావారము, **నిరుపమ, నిత్య నిరవద్య నిరతిశయ నిరవధిక తేజోరాశి విశేషం, నిరతిశయానంద సహస్రప్రాకారై రలంకృతం, శుద్ధ బోధ సౌధావళీ విశేషైర్ అలంకృతం, చిదానందమయానంత దివ్యారామై స్సుశోభితం.** నిరుపమ, నిత్య, నిరవద్య, నిరవధిక, తేజోరాశి విశేషించి నిరతిశయానంద సహస్ర ప్రాకారాలతో అలంకరించబడినది, శుద్ధ బోధావళీ సౌధ విశేషాలతో అలంకరించబడినది. **తదేవత్రిపాద్విభూతి వైకుంఠస్థానమ్.** అదే త్రిపాద్విభూతి వైకుంఠము. **తదేవ పరమకైవల్యమ్** అదే పరమ

కైవల్యము, **తదేవ అనంతోపనిషద్విమృగ్యమ్** ఉపనిషత్తులతో తెలుసుకోతగినది. **తదేవ పరమయోగిభిః ముముక్షుభిః స్సర్వై రాశాస్యమానమ్** అదే ముముక్షువులైన యోగులందరితోను కోరబడుతున్నది. **తదేవ సద్ఘనం, తదేవ చిద్ఘనం, తదేవ ఆనందఘనం** అదే సద్ఘనము, చిద్ఘనము, ఆనందఘనమై ఉన్నది. **తదేవ శుద్ధ బోధఘన విశేషమ్,** అదే శుద్ధ బోధఘన విశేషము. **అఖండ ఆనందబ్రహ్మ చైతన్య దేవతాస్వరూపమ్.** అఖండ ఆనంద బ్రహ్మచైతన్య దేవతా స్వరూపము. **సర్వాధిష్ఠానం, అద్వయం, పరబ్రహ్మ విహార మండలం, నిరతిశయ ఆనంద తేజోమండలం,** సర్వాధిష్టానము, అద్వయము అయిన పరబ్రహ్మ విహరించే మండలం, నిరతిశయ ఆనంద తేజోమండలం. **అద్వైత పరమానంద లక్షణ పరబ్రహ్మణః పరమాధిష్ఠాన మండలం,** అద్వైత పరమానంద లక్షణుడైన పరబ్రహ్మ యొక్క పరమాధిష్ఠాన మండలము. **నిరతిశయ పరమానంద పరమమూర్తి విశేషమండలం,** నిరతిశయ పరమానంద పరమమూర్తి విశేష మండలము, **అనంత పరమమూర్తి సమిష్టి మండలమ్** అనంత పరమమూర్తి సమిష్టి మండలము, **నిరతిశయ పరమానంద లక్షణ పరబ్రహ్మణః పరమమూర్తి పరమతత్త్వ విలాస విశేష మండలమ్** నిరతిశయ పరమానంద లక్షణ పరబ్రహ్మ యొక్క పరమమూర్తి పరమతత్త్వ విలాస విశేష మండలము.

**బోదానందమయ అనంత పరవిలాస విశేష సమిష్టి మండలమ్, అనంత చిద్విలాస విభూతి విశేష సమిష్టి మండలమ్, అఖండ శుద్ధ చైతన్య నిజమూర్తి విశేష విగ్రహమ్** బోధానందమయ అనంత పరమవిలాస విశేష సమిష్టిమండలము, అనంత చిద్విలాస విభూతి

విశేష సమిష్టి మండలము, అఖండ శుద్ధ చైతన్య నిజమూర్తి విశేష విగ్రహము, **అనంతానంద సముద్ర సమిష్ట్యాకారమ్, అనంతబోధాచలై రధిష్టితమ్, నిరతిశయ ఆనంద పరమ మంగళ విశేష సమిష్ట్యాకారమ్** అనంత ఆనంద సముద్రముల సమిష్ట్యాకారము, అనంత బోధాచలములచే అధిష్ఠితము, నిరతిశయ ఆనంద పరమమంగళ విశేష సమిష్ట్యాకారము **అఖండ అద్వైత పరమానంద లక్షణ పరబ్రమ్మణః పరమమూర్తి పరమతేజఃపుంజ పిండవిశేషమ్, చిద్రూపాదిత్య మండలమ్,** అఖండ అద్వైత పరమానంద లక్షణ పరబ్రహ్మ యొక్క పరమమూర్తి పరమతేజఃపుంజ పిండవిశేషము, చిద్రూపాదిత్య మండలము, **ద్వాత్రింశద్ వ్యూహబేధైరధిష్ఠితమ్** 23 వ్యూహబేధములు గలది. **అనంతోపనిషద్ అర్ధరామజాలమండలమ్** అనంతమైన ఉపనిషత్తుల అర్ధసంకులమైనది, **సామహగ్ంస కూజితైర్ అతిశోభితం** సామవేదగానములచే అతిశోభితము, **ఆనందమయ అనంత శిఖరైర్ అలంకృతం** ఆనందమయమైన అనంతకీర్తి శిఖరములచే అలంకరించబడినది, **చిదానంద రస నిర్ఝరైర్ అభివ్యాప్తం** చిదానంద నిర్ఝరములచే అభివ్యాప్తమైనది, **అమితానంద తేజోరాశి అంతరస్థితమ్** అమితానంద తేజోరాశ్యంతమున ఉన్నది. **అనంత ఆనంద ఆశ్చర్య సాగరమ్.** అనంత ఆనంద ఆశ్చర్యసాగరము, దాని మధ్యన కొన్ని కోట్ల సూర్యులకాంతితో ప్రకాశించే ప్రణవాఖ్య విమానమున్నది. అది ఆనందమయములైన శతకోటి శిఖరములతో ప్రకాశిస్తున్నది. దాని మధ్యన బోధానందాచలముపైన అష్టాక్షరీ మంటపము ప్రకాశిస్తున్నది. దాని మధ్య చిదానందమయ వేదిక ఉన్నది. దానిపైన నిరతిశయ ఆనంద తేజోరాశి ప్రకాశిస్తున్నది. దాని మధ్య అష్టాక్షరీ పద్మ విభూషితమైన చిన్మయాసనమున్నది. ఆ ప్రణవ కర్ణికయందు

సూర్యచంద్ర అగ్నిమండలాలున్నాయి. దానిలో అఖండ ఆనంద తేజోరాశి అంతర్గతమైన, పరమ మంగళాకారమైన అనంతాసనము ప్రకాశిస్తున్నది. దానిపైన మహాయంత్రమున్నది. **తస్యోపరిమహా యంత్రం ప్రజ్వలి. నిరతిశయ బ్రహ్మానంద పరమమూర్తి మహాయంత్రం, సమస్త బ్రహ్మతేజోరాశి సమిష్టి రూపమ్, చిత్స్వరూపం, నిరంజనం, పరబ్రహ్మ స్వరూపమ్, పరబ్రహ్మణః పరమ రహస్య కైవల్యమ్** అది సమస్త బ్రహ్మతేజోరాశి సమిష్టి రూపము, చిత్స్వరూపము, నిరంజనము, పరబ్రహ్మ స్వరూపము, పరబ్రహ్మ యొక్క పరమకైవల్యము.

ఆ యంత్రం మీద అన్ని కోణాలు, అని పద్మాలు, అందరు దేవతలు, అన్ని మంత్రాలు ఉంటాయి. నారసింహ, హయగ్రీవ, గరుడ, నీలకంఠ, శరణాగత నారాయణ, హయగ్రీవగాయత్రి, శ్రీమన్నారాయణ చరణౌశరణం ప్రపద్యే, శ్రీమతే నారాయణాయ నమః, నారాయణాయవిద్మహే వాసుదేవాయధీమహి. తన్నో విష్ణుప్రచోదయాత్, వాగీశ్వరాయవిద్మహే హయగ్రీవాయధీమహి, తన్నో హగ్ం స ప్రచోదయాత్, వజ్రనఖాయవిద్మహే తీక్ష్ణదంష్ట్రా యధీమహి. తన్నోనారసింహ ప్రచోదయాత్, సుదర్శనాయవిద్మహే హేతిరాజాయధీమహి. తన్నోచక్రః ప్రచోదయాత్, తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్యదీమహి, ధియోయనఃప్రచోదయాత్ ఇలా అన్ని మంత్రాలు, అన్ని మంత్రముల గాయత్రి కూడా ఉంటుంది. ఈ రకంగా ఆ మహాయంత్రం సాయుజ్యముక్తిప్రదమై ఉన్నది. దానిపైన

**నిరతిశయానంద తేజోరాశ్యభ్యంతర మాసీనం** నిరతిశయ ఆనంద తేజోరాశి మధ్యన ఆసీనుడైన **వాచామగోచర తేజోరాశ్యాకారం, చిత్సారావిర్భూత ఆనంద విగ్రహం, బోధానంద స్వరూపం, నిరతిశయ సౌందర్యపారావారమ్, తురీయ స్వరూపం, తురీయాతీతం, అద్వైత**

**పరమానందం** వాక్కుకు అందనివాడు, ఆనంద తేజోరాశి ఆకారం గలవాడు, చిత్సారావిర్భూత ఆనంద విగ్రహుడు, బోధానంద స్వరూపుడు, నిరతిశయ సౌందర్యపారావారుడు, తురీయస్వరూపుడు, తురీయాతీతుడు, అద్వైతపరమానందుడు. దివ్యమంగళవిగ్రహుడు, మూర్తిమంతమైన పరమ మంగళములచే సేవించబడేవాడు, అనంత భూషణములచే అలంకరించబడినవాడు, సుదర్శన, పాంచజన్య, పద్మ, గదా, ఖడ్గ, శార్గ, ముసల, పరిఘ మొదలైన ఆయుధములు ధరించినవాడు, **శ్రీవత్స కౌస్తుభ వనమాలాంకిత వక్షసమ్** శ్రీవత్సము, కౌస్తుభము, వనమాలలు వక్షమున ధరించిన వాడు, బ్రహ్మకల్ప వనంలో ఉన్న అమృత పుష్పాలతో పూజింపబడేవాడు, ఆదిశేషుని పడగలు అనే పదివేల గొడుగులచే ఆచ్ఛాదింపబడినవాడు, తులసిమాలలచే అలంకరించబడేవాడు, అనంత పుష్పమాలికలతో అలంకరించబడినవాడు, విశేషమైన దివ్యమైన కాంతులతో ప్రకాశించేవాడు నిరతిశయానంద చామరములచే సేవితుడు, నిర్గుణుడు, నిష్క్రియుడు, నిర్మలుడు, నిరవద్యుడు, నిరంజనుడు, నిరాకారుడు, నిరాశ్రయుడు, అద్వైత పరమానంద లక్షణుడైన ఆదినారాయణుడుంటాడు.

## 8వ అధ్యాయము

ఈ విషయాలన్నీ విన్న బ్రహ్మదేవుడు, విష్ణుమూర్తితో "స్వామీ! శుద్ధ అద్వైత పరమానంద లక్షణుడవు నీవే కదా! మరి ఈ వైకుంఠము, విమాన ప్రాకారాలు, ఇవన్నీ ఏమిటి?" అన్నాడు. దానికి సమాధానం చెబుతున్నాడు విష్ణుమూర్తి. మంచి బంగారానికి – కంకణాలు, కిరీటము, భుజకీర్తులు మొ॥ వాటితో బేధమున్నట్లే, సముద్రానికీ –

అందులో అలలు, తరంగాలు, నీటిబుడగలు, నురగలకు బేధమున్నట్లే, భూమికీ–పర్వతాలు, వృక్షాలు, గడ్డి, మొ॥ వాటికి బేధమున్నట్లే ఇదంతా. ఇవే వీనాకన్నా వేరైనవి కావు. బ్రహ్మ మళ్ళీ అడుగుతున్నాడు స్వామీ ! వైకుంఠం ఒక్కటే పరమమోక్షము అని కదా చెప్పేది. మరి అనంత వైకుంఠాలు, అనంతానంద సముద్రాలు అనంతమూర్తులు ఎలా ఉన్నాయి?

ఓ బ్రహ్మదేవా! ఒక అవిద్యాపాదంలో అనంతకోటి బ్రహ్మాండాలున్నాయి. ఒక్క అండంలో చాలా లోకాలు, చాలా వైకుంఠాలు, అనంత విభూతులు ఉన్నాయి. మరి అండాలు అన్నీ కలిపితే అనంత వైకుంఠాలు ఉన్నాయి అని అందరి అభిమతము. ఇక మిగిలిన మూడు పాదాలయందు ఏం చెప్పాలి? నిరతిశయ ఆనంద ఆవిర్భావము మోక్షమని, మోక్షలక్షణము పాదత్రయంలో ఉంది. కాబట్టి పాదత్రయము పరమమోక్షము, పరమ వైకుంఠము, పరమ కైవల్యము అని, అందుచేత శుద్ధ చిదానంద, బ్రహ్మవిలాసానందాలు, అనంత పరమానంద విభూతులు, అనంత వైకుంఠాలు, అనంత పరమానంద సముద్రాలు ఉన్నాయి" అన్నాడు.

ఆ తరువాత ఉపాసకుడు నారాయణుని పరిపరివిధాల పూజించి, ఆయన ఎదురుగా కూర్చుని, అద్వైత యోగము కలిగి మహావాక్యాలు స్మరిస్తూ **బ్రహ్మోహమస్మి, అహమస్మి బ్రహ్మోహమస్మి, యోహమస్మి బ్రహ్మోహమస్మి** బ్రహ్మనైనాను, నేను బ్రహ్మనైనాను. **అహమే వాహం మాంజుహోమి స్వాహా** నన్ను నేను హోమము చేస్తున్నాను. అహంబ్రహ్మ అనే భావనతో నది సముద్రంలో ప్రవేశించే రీతిగా, కాంతి కిరణాలు

కాంతి వలయంలో ప్రవేశించినట్లుగా, నేను సచ్చిదాత్మకుడను, అజుడను, పరిపూర్ణుడను అంటూ నారాయణునిలో ఉపాసకుడు ప్రవేశిస్తాడు. ఈ మార్గాన్ని తెలుసుకున్నవాడు కూడా సాక్షాత్తు నారాయణుడవుతాడు.

ముముక్షువైన వాడు ఈ మార్గాన్ని ఆచరించినట్లైతే, అతడు పరమానంద లక్షణుడైన పరబ్రహ్మ అవుతాడు. ఈ ఉపనిషత్తును చదివినవాడు సర్వపాపాల నుండి విముక్తుడవుతాడు. మహాపాతకముల నుండి పవిత్రుడవుతాడు. తెలిసి చేసిన, తెలియక చేసిన పాపాలనుంచి విముక్తుడవుతాడు. అన్ని లోకాలను జయించగలుగుతాడు. అన్ని మంత్రాలు జపించిన వాడవుతాడు. సకల యోగవేత్త అవుతాడు. సకల జగత్పరిపాలకుడవుతాడు. సాక్షాత్తు పరబ్రహ్మ అవుతాడు.

**ఇంతవరకు చెప్పిన ఉపనిషత్తులన్నింటిలోకి ఈ ఉపనిషత్తు చాలా గొప్పది. ఏ ఉపనిషత్తులోను చెప్పని అనేక విషయాలు ఇందులో చెప్పబడ్డాయి. వైష్ణవుడే కాదు ప్రతిమానవుడు చదివి తీరవలసిన ఉపనిషత్తు ఇది.**

*దీంతో వైష్ణవోపనిషత్తులు సమాప్తము*

శ్రీ

# పార్థసారథీయము

# చతుర్వేదభాష్యము

## (ఉపనిషత్తులు)

### (శైవోపనిషత్తులు)




ప్రముఖ శ్రీవిద్యా ప్రచారకులు

అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,

ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, మెంఫిస్, అమెరికా ఆస్థాన విద్వాంసులు,

డా॥ క్రోవి పార్థసారథి

# 32. శైవోపనిషత్తులు

వేదంలో శివుడు అని ప్రత్యేకంగా లేడు. అక్కడ ఉన్నది రుద్రుడు. ఆ రుద్రుడే కాలక్రమంలో శివుడు, ఈశ్వరుడు అనబడ్డాడు. ఈయనే పరమేశ్వర స్వరూపంగా కూడా చెప్పబడ్డాడు. మనం అభిషేకం చేసేది, హోమం చేసేదికూడా రుద్రుడికే. అందుకే రుద్రాభిషేకము, రుద్రహోమము అంటారు. అయితే తరువాత కాలంలో రుద్రుడికి రెండు రూపాలున్నాయి. 1. ఘోరము 2. శాంతము. ఘోరమైనది రుద్రుడు. శాంతమైనది ఈశ్వరుడు అన్నారు. శివుణ్ణి గురించి చెప్పే ఉపనిషత్తులు 15 ఉన్నాయి.

శివుడే పరమేశ్వరుడు అని చెప్పేవి శైవోపనిషత్తులు. ఇదికూడా సాకార బ్రహ్మోపాసనే. ఇవి మొత్తం 15 ఉన్నాయి.

| ఉపనిషత్తు | వేదం |
|---|---|
| 1. అధర్వశిరోపనిషత్తు | అధర్వణ వేదం |
| 2. అధర్వశిఖోపనిషత్తు | అధర్వణ వేదం |
| 3. కైవల్యోపనిషత్తు | కృష్ణయజుర్వేదం |
| 4. పంచబ్రహ్మోపనిషత్తు | కృష్ణయజుర్వేదం |
| 5. భస్మజాబాలోపనిషత్తు | అధర్వణవేదం |
| 6. రుద్రాక్షజాబాలోపనిషత్తు | సామవేదం |
| 7. గణపతి ఉపనిషత్తు | అధర్వణవేదం |
| 8. దక్షిణామూర్తి ఉపనిషత్తు | కృష్ణయజుర్వేదం |
| 9. శరభోపనిషత్తు | అధర్వణ వేదం |

| | | |
|---|---|---|
| 10. | బృహజ్జాబాలోపనిషత్తు | అధర్వణ వేదం |
| 11. | రుద్రహృదయోపనిషత్తు | కృష్ణయజుర్వేదం |
| 12. | శ్వేతాశ్వతరోపనిషత్తు | కృష్ణయజుర్వేదం |
| 13. | కాలాగ్నిరుద్రోపనిషత్తు | సామవేదం |
| 15. | అక్షమాలికోపనిషత్తు | ఋగ్వేదం |

రుద్రాధ్యాయము (నమకము) ఉపనిషత్తు అని చెబుతున్నప్పటికీ దాన్ని ఇక్కడ ఇవ్వలేదు. సంహిత భాగంలో ఇవ్వటం జరిగింది.

అనాదిగా వైష్ణవులకి, శైవులకి మతయుద్ధాలు జరిగినాయి. వాటి నివారణకు వైష్ణవులు ముందుకు వచ్చినట్లుగా కనిపించలా, కాని కృష్ణయజుర్వేదంలోని **రుద్రహృదయోపనిషత్తులో** మాత్రం శైవులు ముందుకు వచ్చి రాజీప్రయత్నాలు చేశారు అని తెలుస్తోంది. **విష్ణువును పూజిస్తే శివుణ్ణి పూజించినట్లే. శివుణ్ణి దూషిస్తే విష్ణువునుకూడా దూషించినట్లే. శివకేశవులు ఇద్దరూ ఒకటేనని ఈ ఉపనిషత్తులో ప్రతిపాదించారు.**

ఇక్కడ శివుడు, రుద్రుడు, మహాదేవుడు అందరూ ఒక్కడే. ఈశ్వరుణ్ణి జపించే మహామంత్రం పంచాక్షరి. దాన్నే శివపంచాక్షరి అంటారు.

# 33. పంచాక్షరీ మహామంత్రం

'మననము చేయటంవల్ల, మననం చేసేవాడిని రక్షించేదే మంత్రము' అని గతంలో చాలాసార్లు చెప్పుకున్నాం. ఏదైనా ఒక అక్షరంకాని, పదంకాని, వాక్యంగాని పదేపదే మననం చేస్తే (దీన్నే జపం అంటారు) కొంత శక్తి పుడుతుంది. ఆ శక్తి మానవుడి కోరికలు తీరుస్తుంది. మంత్రాలు అనేక రకాలుగా ఉంటాయని కూడా మనం చెప్పుకున్నాం. 1. వైదికమంత్రాలు (వేదంలో చెప్పబడినవి) 2. ఋషి దర్శితాలు (ఋషులచే దర్శించబడినవి) వేదంలో చెప్పిన మంత్రాలకు స్వరం ఉంటుంది. వాటిని అలాగే చదవాలి. స్వరంలో తేడావస్తే ఫలితంలో కూడా తేడా వస్తుంది. ఋషులు దర్శించిన మంత్రాలు బీజాక్షరాలతో సంపుటి చేయబడినవి. భాషకు ఉన్న అక్షరాలలో ఒక్కొక్క అక్షరము ఒక్కొక్క ప్రయోజనాన్ని సిద్ధింపచేస్తుంది. కాబట్టి మన ప్రయోజనాన్ని, మన కోరికను అనుసరించి ఈ మంత్రాలలో బీజాక్షరాలను సంపుటి చెయ్యటం జరుగుతుంది. వీటిలో సామాన్యంగా ఏ దేవతను ఉపాసిస్తున్నామో, ఆ దేవత పేరుకూడా ఉంటుంది. వీటిలో మళ్ళీ కొన్ని మంత్రాలు లౌకిక ప్రయోజనాలకు ఉపయోగిస్తే, కొన్ని మోక్షసాధనకు ఉపయోగించేవి. ఇలా **మోక్షసాధకాలైన మంత్రాలనే 'మహామంత్రాలు'** అంటారు. వీటికన్న గొప్ప మంత్రాలు ఇక లేవు. వీటిలో ముఖ్యమైనది **పంచాక్షరి మహామంత్రము.** ఇందులో ఐదు అక్షరాలుంటాయి. అదే **'ఓం నమశ్శివాయ'** శివ పంచాక్షరి అని చెప్పనవసరంలేదు. పంచాక్షరి అంటేనే శైవానికి సంబంధించిన మంత్రము అని తెలుస్తుంది. ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. పంచాక్షరి అంటే ఐదు అక్షరాలమంత్రం కదా? మరి 'ఓం నమశ్శివాయ' అనే మంత్రంలో ఆరు అక్షరాలున్నాయి కదా ? ఇందులో నమశ్శివాయ

అనే ఐదుఅక్షరాలు పంచబ్రహ్మలకు ప్రతీక. కాగా ఓంకారము పరబ్రహ్మ స్వరూపము. అందుకే దీన్ని **మహాపంచాక్షరి** అంటారు. చిన్న పిల్లలకు అక్షరాభ్యాసం చేసే రోజున మొదటగా వ్రాయించేది ఈ పంచాక్షరి మహామంత్రాన్నే. ఇది తారక మంత్రం. దీన్ని పఠించినంత మాత్రంచేతనే భుక్తి, ముక్తి ఏది కావాలంటే అది సిద్ధిస్తుంది. అంటే ఇహము, పరము ఏది కావాలంటే అది సిద్ధిస్తుంది.

పూర్వకాలంలో ఒకసారి నారదుడు శ్రీమహావిష్ణువును దర్శించాలనే కోరికతో వైకుంఠానికి వెళ్ళాడు. ఆ సమయంలో ధ్యానంలో ఉన్నాడు విష్ణుమూర్తి. అప్పుడు నారదుడు 'దేవాదిదేవా! ఈ లోకాలన్నీ సృష్టించేది నువ్వు. నీ నుంచే సర్వజగత్తు ఆవిర్భవిస్తోంది. ఈ జగత్తుకు లోపల బయటా అంతటా నువ్వే ఆవరించి ఉన్నావు. నువ్వే జగత్తు, జగత్తే నువ్వు. నిన్ను మించిన వారెవరూ లేరు. అలాంటప్పుడు నువ్వు ఎవరిని ధ్యానం చేస్తున్నావు? అని అడిగాడు. ఆ మాటలు విన్న విష్ణుమూర్తి చెబుతున్నాడు. 'నారదా' సృష్టి స్థితిలయాలు చేసేది నేనే. అందులో సందేహం లేదు. కాని నాతో ఈ పని చేయించేవారు ఇంకొకరున్నారు. ఆయనే పరమశివుడు. మహాదేవుడు. ఆయనే భుక్తి ముక్తిప్రదాత. ఆయన కృపాకటాక్ష వీక్షణాలవల్లనే నేను ఈ జగత్తును రక్షించగలుగుతున్నాను" అన్నాడు. ఆ మాటలు విన్న నారదుడు "దేవా! ఆ పరమేశ్వరుడు ఎవరు? అతని మంత్రము ఏది ? నాకు చెప్పి, నన్ను కృతార్థుడుగా చేయవలసింది" అన్నాడు. ఇప్పుడు శ్రీమహావిష్ణువు చెబుతున్నాడు. ఓ నారదా! "ఈ చరాచర జగత్తుయొక్క సృష్టి స్థితి లయాలకు కారణమైనవాడు, జగత్తును శాసించేవాడు, తన భక్తులను రక్షించేవాడు. భక్తుల కోరికలు తీర్చి అంత్యకాలంలో వారికి మోక్షాన్ని ప్రసాదించేవాడు ఆ పరమేశ్వరుడు.

అతడే దేవాదిదేవుడు. ఆదిదేవుడు. మహాదేవుడు. అతడు పూర్ణకాముడు – అన్ని కోరికలు తీరినవాడు. అసలు ఏ కోరికాలేనివాడు. జగత్తంతటికీ సాక్షియైనవాడు. మానవులు చేసే కర్మని బట్టి వారికి ఉత్తరజన్మలు ప్రసాదించేవాడు. భక్తులకు మోక్షప్రదాత ఆ మహాదేవుడే. అతడు వెండికొండమీద పార్వతీ సమేతుడై ఉంటాడు. అతడికి రెండురూపాలున్నాయి. 1. ఘోరము 2. శాంతము. ఘోరమైన రూపంతో శత్రువు సంహారం, దుష్టశిక్షణ చేస్తాడు. శాంతమైన రూపంతో భక్తులను కరుణించి, వారి కర్మకు తగిన ప్రతిఫలాన్ని, మోక్షాన్ని కూడా ప్రసాదిస్తాడు" అన్నాడు.

ఈ మాటలు విన్న నారదుడు "స్వామీ! ఆ మహాదేవుణ్ణి ప్రసన్నుడుగా చేసుకోవటానికి మంత్రం ఏది? నాకు వివరించవలసింది అన్నాడు. ఇప్పుడు చెప్పటం మొదలుపెట్టాడు శ్రీమహావిష్ణువు. "నారదా! నమశ్శివాయ అనే పంచాక్షరి మహామంత్రమే తారకమంత్రము. ఇందులో మొత్తం ఐదు అక్షరాలుంటాయి. అందుకే దీన్ని పంచాక్షరి అంటారు. పరమేశ్వరుడు చేసే పనులు మొత్తం ఐదు. అవే 1. సృష్టి 2. స్థితి 3. లయము 4. తిరోదానము 5. అనుగ్రహము. వీటినే పంచకృత్యములు అంటారు. ఒక్కొక్క పని ఒక్కక్క రూపంలో చేస్తాడు.

1. బ్రహ్మదేవుని రూపంలో – జగత్తును సృష్టిస్తాడు
2. విష్ణువు రూపంలో – లోకాలను రక్షిస్తాడు
3. రుద్రుని రూపంలో – సృష్టి అంతా సంహారం చేస్తాడు
4. మహేశ్వరుని రూపంలో – తిరోదానము అంటే అణువులతో సహా సంపూర్ణ నాశనము చేస్తాడు

5. సదాశివుని రూపంలో – సంపూర్ణంగా నాశనమయిన జగత్తును మళ్ళీ సృష్టించటానికి ఉద్యుక్తుడు అవుతాడు.

ఈ ఐదు పనులు ఆయనే పంచబ్రహ్మల రూపంలో చేస్తాడు. పంచబ్రహ్మలకు కూడా ప్రత్యేకంగా మంత్రాలున్నాయి. అవే

1. సద్యోజాత మంత్రము – నకారము
2. వామదేవ మంత్రము – మకారము
3. అఘోర మంత్రము – శికారము
4. తత్పురుష మంత్రము – వకారము
5. ఈశాన మంత్రము – యకారము

ఈ పంచబ్రహ్మల ప్రతిరూపమే పంచాక్షరి.

**1.** సద్యోజాతం ప్రపద్యామి సద్యో జాతాయ వై నమో నమః
భవేభవేనాతిభవే భవస్వమామ్ భవోద్భవాయ నమః

**2.** వామదేవాయ నమో జ్యేష్ఠా నమః శ్రేష్ఠాయ నమో రుద్రాయ నమః
కాలాయ నమః కలవికరణాయ నమో బలవికరణాయ నమో బలాయ
నమో బలప్రమథనాయ నమః సర్వభూతదమనాయ
నమో మనోన్మనాయ నమః

**3.** అఘోరేభ్యో థఘోరేభ్యో ఘోరఘోర తరేభ్యః
సర్వేభ్య స్సర్వశర్వేభ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః

**4.** తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి
తన్నో రుద్రః ప్రచోదయాత్

**5.** ఈశాన స్సర్వవిద్యానా మీశ్వర స్సర్వభూతానాం బ్రహ్మాధిపతి
ర్బ్రహ్మణోధిపతి ర్బ్రహ్మా శివో మే అస్తు సదా శివోమ్

నకారో బ్రహ్మరూపశ్చ । మకారో విష్ణురూపకం
శికారో రుద్రరూపశ్చ । వకారంతు మహేశ్వరమ్
యకారో సదాశివ రూపశ్చ । ఓంకారంతు పరమేశ్వరమ్.

1. నకారము – బ్రహ్మరూపము ఈ రూపంలోనే జగస్సృష్టి చేస్తాడు.
2. మకారము– విష్ణురూపము. ఈ రూపంతోనే జగద్రక్షణ చేస్తుంటాడు.
3. శికారము – రుద్రరూపము. ఈ రూపంతోనే జీవులను సంహరిస్తాడు.
4. వకారము – ఈశ్వరరూపము. ఈ రూపంతో సంపూర్ణ నాశనము చేస్తాడు.
5. యకారము– సదాశివరూపము. ఈ రూపంతోనే పునఃసృష్టిని అనుగ్రహిస్తాడు.
6. ఓంకారము– పరమేశ్వర స్వరూపము. మోక్షదాయకము.

కాబట్టి ఈ మంత్రాన్ని జపించిన వాడికి పునర్జన ఉండదు. శివుడు బోళాశంకరుడు. భక్తవశంకరుడు. 'హరహరా' అంటూ శివలింగం మీద గనక కొద్దిగా నీరు పోసి, ఒక మారేడు దళం సమర్పిస్తే ప్రసన్నుడవుతాడు"

1. **నాగేంద్రహారాయత్రిలోచనాయ । భస్మాంగరాగాయ మహేశ్వరాయ**
   **నిత్యాయశుద్ధాయ దిగంబరాయ । తస్మైనకారాయ నమశ్శివాయ ॥**
2. **మందాకినీ సలిల చందన చర్చితాయ।**
   **నందీశ్వర ప్రమథనాథ మహేశ్వరాయ**
   **మందారముఖ్య బహుపుష్ప సుపూజితాయ ।**
   **తస్మైమకారాయ నమశ్శివాయ॥**

**3. శివాయగౌరీవదనారవింద । సూర్యాయ దక్షాధ్వరనాశకాయ**
**శ్రీనీలకంఠాయ వృషధ్వజాయ । తస్మై శికారాయ నమశ్శివాయ**

**4. వశిష్టకుంభోద్భవ గౌతమాది । మునీంద్ర ప్రవరార్చిత శేఖరాయ**
**చంద్రార్కవైశ్యానరలోచనాయ తస్మై వకారాయ నమశ్శివాయ**

**5. యక్షస్వరూపాయ జటాధరాయ, పినాక హస్తాసనాతనాయ**
**దివ్యాయ దేవాయ దిగంబరాయ తస్మై యకారాయ నమశ్శివాయ**

దీన్ని శివపంచాక్షరీ స్తోత్రము అంటారు. ప్రతినిత్యం దీన్ని చదివినవాడు జీవించి ఉన్నంతవరకు సకల సుఖాలు అనుభవించి అంత్య కాలంలో కైలాసము చేరతాడు. అతడికి జన్మరాహిత్యం జరుగుతుంది" అంటూ పంచాక్షరీ మహామంత్రాన్ని వివరించాడు శ్రీమహావిష్ణువు.

# 34. అధర్వశిరోపనిషత్తు

ఇది అధర్వణ వేదానికి సంబంధించినది. ఇందులో 5 అధ్యాయాలు 32 మంత్రాలున్నాయి. ఇందులో రుద్రుడే పరమేశ్వరుడు అని ప్రతిపాదించి ఓంకారమే రుద్రరూపము అన్నారు. ఆ రుద్రుని పొందే మార్గము, ఫలితము వివరించారు.

పూర్వకాలంలో దేవతలంతా మహారుద్రుడు నివసించే స్వర్గలోకానికి వెళ్ళి దేవా! నీవెవరవు? అని అడిగారు. ఆ మాటలు విన్న రుద్రుడు "నేను ఒక్కడనే మొదట ఉన్నాను. ఇప్పుడున్నాను. భవిష్యత్తులో ఉంటాను. నాకన్న వేరైనవారు ఎవరూ లేరు" అన్నాడు. ఈ మాటలు చెప్పి అంతరిక్షంలోకి వెళ్ళిపోయి అక్కడి నుంచి చెప్పటం మొదలుపెట్టాడు. ఓ దేవతలారా! నేను త్రికాలాతీతుడను. నిత్యానిత్యుడను. బ్రహ్మము నేనే. చక్షురాది ఇంద్రియాలు నేనే. వాగింద్రియము, శ్రోత్రేంద్రియము, మనస్సు అన్నీ నేనే. పైన క్రింద మధ్య అడ్డము నేనే. దశదిశలు నేనే. పురుషుడు నేనే, స్త్రీ నేనే, నపుంసకుడు. నేనే సావిత్రి గాయత్రి, సరస్వతి. త్రిష్టుప్ అనుష్టుప్ జగతి మొదలైన చందస్సులు నేనే. గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని, ఆహవనీయాగ్ని నేనే. నేను సత్యస్వరూపుడను. గోవు నేనే, గౌరీదేవి నేనే, జ్యేష్ఠుడను, శ్రేష్ఠుడను నేనే. అధికుడు, అల్పుడు నేనే. నాలుగు వేదాలు, వేదాంగాలు, పురాణాలు, ఇతిహాసాలు, షట్శాస్త్రాలు అన్నీ నేనే. సంగీతము, సాహిత్యము నేనే. ప్రణవము నేనే. అక్షరము క్షరము రెండూ నేనే. స్థావరము జంగమము నేనే. పర్వతాలు, లోయలు, అరణ్యాలు, పచ్చిక భూములు అన్నీ నేనే ఉన్నది, లేనిది కూడా నేనే. జ్యోతిరూపంతో ప్రకాశించేది నేనే. ఉన్నది నేను ఒక్కడినే అందరూ నన్నే సేవిస్తారు.

| | | |
|---|---|---|
| బ్రాహ్మణులను | – | వేదాధ్యయనంచేత |
| భూమిని | – | సూర్యకిరణములచేత |
| హవిస్సులను | – | ఆజ్యముచేత |
| ప్రాణాన్ని | – | ప్రాణావస్థనము చేత |
| భూతపంచకాన్ని | – | బ్రహ్మచేత |
| ధర్మాన్ని | – | సత్కర్మచేత అభివృద్ధి చేస్తాను |

అన్నాడు

సర్వశాస్త్రాల యందు ప్రసిద్ధుడుగా ఉన్నవాడే రుద్రుడు. అతడే

1. శ్రీమహావిష్ణువు
2. మహేశ్వరుడు
3. ఉమాదేవి
4. వినాయకుడు
5. స్కందుడు
6. ఇంద్రుడు
7. అగ్ని
8. భూలోకము
9. భువర్లోకము
10. సువర్లోకము
11. మహర్లోకము
12. జనోలోకము
13. తపోలోకము
14. సత్యలోకము
15. భూమి

16. సూర్యుడు
17. చంద్రుడు
18. నక్షత్రాలు
19. గ్రహాలు
20. ప్రాణము
21. కాలము
22. యముడు
23. మృత్యువు
24. అమృతము
25. కాలము
26. యముడు
27. అపమృత్యువు
28. మృతము
29. భూతభవిష్య
    ద్వర్తమానాలు
30. విశ్వము
31. కృత్స్నం
32. సర్వము అతడే

మొదటగా అతడే ఓంకారము. అతడే వ్యాహృతులు. ఓ ప్రణవమా ! నీవు విశ్వరూపానివి. మంత్రము మొదట, చివర కూడా నువ్వే. శాంతి, సృష్టి, తుష్టి, హుతము, అహుతము నువ్వే. విశ్వము, అవిశ్వము, దత్తము, అదత్తము, కృతము అకృతము, పరము అపరము, అన్నీ నువ్వే. నువ్వు విశ్వరూపంగా ఉన్నావు. బ్రహ్మవిద్యా స్వరూపిణి అయిన ఉమాదేవితో కలిసిన రుద్రుని మేము పొందగలిగాము.

అందుచేత మాకు మరణము లేదు. ఇంద్రియాలు మాకు ఏ రకంగాను అపకారం చెయ్యలేవు. ఉపసంహారకర్త, మహాగ్రాసము గలవాడు అయిన మహారుద్రునికి నమస్కారము.

దేవతలందరూ హృదయమందున్నారు. అద్వితీయుడవైన నీవు హృదయ మందున్నావు. ఓంకారమే నీవు. ఓ రుద్రా ! నీకు నివృత్తి మార్గము శిరస్సు. ప్రవృత్తిమార్గమయిన సంసార చక్రము పాదాలు. మోక్షమార్గమే ఓంకారము. అది సర్వవ్యాపి, అనంతము, తారము, సూక్ష్మము, శుక్లము, వైదుత్యము పరబ్రహ్మ అని పిలువబడుతున్నది. అతడే రుద్రుడు, ఈశానుడు, భగవంతుడు, మహాదేవుడు.

ఇప్పుడు ప్రణవాన్ని గురించి చెబుతున్నారు. ఉచ్చరించగానే శరీరాన్ని పైకి లేవతీస్తుంది కాబట్టి ఓంకారమనబడుతుంది. ఉచ్చరించగానే త్రిమూర్తులు, చతుర్వేదాలు, షడంగాలు మొ॥ వాటిని, జపయజ్ఞాన్ని, బ్రహ్మల తత్త్వాలను పెంపొందింప చేస్తుంది. కాబట్టి ప్రణవమనబడుతుంది.

ఉచ్చరిస్తుండగానే నువ్వులలో నూనెలాగా అంతటా వ్యాపించి జగత్తుకు సంబంధించిన జనన మరణాది రూపంలో ప్రకాశిస్తుంది కాబట్టి సర్వవ్యాపి అనబడుతుంది. ఆద్యంతములు లేనిది కాబట్టి అనంతమనబడుతున్నది.

ఉచ్చరించినంత మాత్రంచేత గర్భజన్మ జరామరణ రూప సంసారాన్నుంచి తరింపచేస్తుంది కాబట్టి తారకమనబడుతుంది. అతిసూక్ష్మరూపంలో స్థావర జంగమము లయిన భూతముల దేహాలను అధీనం చేసుకొంటుంది కాబట్టి సూక్ష్మము అనబడుతుంది.

ఓంకారము ఉచ్చరించగానే లోపల ధ్వని, జ్ఞానము వస్తాయి కాబట్టి శుక్లము అనబడుతుంది.

అజ్ఞానాన్ని పోగొడుతుంది కాబట్టి వైద్యుతము.

జ్ఞానాన్ని వృద్ధి చేస్తుంది కాబట్టి పరబ్రహ్మ.

కల్పాంతంలో అంతా లయంచేసి తానొక్కడే ఉంటాడు కాబట్టి 'ఏకః' అనబడుతున్నాడు.

ఉన్నది రుద్రుడు ఒక్కడే. రెండవవాడు లేడు.

జగత్తులో అవిద్యతో కూడిన భూతాలను పాలిస్తున్నాడు కాబట్టి ఈశానుడు.

బ్రహ్మజ్ఞానం కలుగచేస్తాడు కాబట్టి భగవంతుడు. సృష్టి స్థితి సంహారాలు చేస్తాడు కాబట్టి మహేశ్వరుడు. మహాజ్ఞానులయిన యోగులచేత స్తుతించబడుతున్నాడు కాబట్టి మహాదేవుడు.

అతడు దశదిశల చరాచర జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. సర్వత్ర నేత్రములు కలవాడు. విశ్వరూపుడు. విశ్వతోముఖుడు. అనేక బాహువులు, పాదాలు గలవాడు. సృష్టిస్థితిలయాలు చేస్తూ మహాదేవుడు అద్వితీయుడైనాడు. ఆయన ఆత్మస్వరూపి. సచ్చిదానంద విగ్రహుడు, సూక్ష్మాతిసూక్ష్మమైనవాడు. తలవెంట్రుకలో వెయ్యోవంతు పరిమాణము గలవాడు. అతన్ని అర్చించినవారికి పునర్జన్మ ఉండదు.

ఆ రుద్రుణ్ణి తపస్సుచేతనే పొందాలి. పాశుపతవ్రతం చేస్తే అతడు ప్రీతి చెందుతాడు.

**అగ్నిరితిభస్మ, వాయురితిభస్మ, జలమితిభస్మ,**

**స్థలమితి భస్మ, వ్యోమేతి భస్మ, సర్వగ్ం హవాఇదం భస్మ.**

పంచభూతాలు భస్మము. జగత్తంతా భస్మమే అంటూ భస్మాన్ని సర్వావయవాలకు ధరించాలి. దీన్నే పాశుపతవ్రతము అంటారు. దీనివల్ల జీవుని అజ్ఞానం నశించి పోతుంది.

అధర్వశిరస్సును పారాయణ చేసినవాడు అగ్నిలాగా పవిత్రుడౌతాడు. అన్ని వేదాలు శాస్త్రాలు చదివిన వాడౌతాడు. అన్ని యజ్ఞాలు చేసిన వాడవుతాడు. అంత్య కాలంలో రుద్రసాన్నిధ్యం పొందుతాడు. అతడికి పునర్జన్మ ఉండదు. అంటూ అధర్వశిరోపనిషత్తును వివరించాడు రుద్రుడు.

# 35. అధర్వశిఖోపనిషత్తు

ఇది అధర్వణ వేదానికి సంబంధించినది. ఇందులో మొత్తం 23 మంత్రాలున్నాయి. ఇందులో పరమేశ్వరుడు ఓంకార స్వరూపుడు. కాబట్టి ఓంకారాన్ని వివరించి ఇలా పరమేశ్వరధ్యానం చెయ్యాలని చెబుతోంది ఈ ఉపనిషత్తు.

పూర్వకాలంలో ఒకసారి పిప్పలాదుడు, ఆంగీరసుడు, సనత్కుమారుడు అధర్వణ ముని దగ్గరకి పోయి నమస్కరించి “స్వామీ సృష్టి సమయంలో బ్రహ్మాది దేవతలు దేన్ని ఉపయోగించారు? ధ్యానమేది? ధ్యానింపతగింది ఏది ? ధ్యానానికి సాధనము ఏది? శ్రేష్ఠమైన ధ్యాత ఏది? ధ్యేయము ఏది? మాకు వివరించండి అని అడిగారు. ఆ మాటలు విన్న అధర్వణముని చెబుతున్నాడు. “ఓ మహర్షులారా! సృష్టి ఆదిలో ప్రణవమే బోధించబడింది. అటువంటి ప్రణవాన్నే ధ్యానం చెయ్యాలి.

ప్రణవము పరబ్రహ్మ స్వరూపము. ప్రణవానికి నాలుగు పాదాలుంటాయి. అవే నాలుగు వేదాలు. ఈ రకంగా నాలుగు పాదాలతోకూడిన ఓంకారము పరమాత్మ స్వరూపము.

1. ప్రణవము యొక్క మొదటి మాత్ర అకారము. దీనికి భూతము పృథివి. ఇది ఋక్కులతో కూడినది. దీనికి అధిదేవత బ్రహ్మ. పితృదేవతలు, అష్టవసువులు, గాయత్రి ఛందస్సు. గార్హపత్యాగ్ని ప్రధమ మాత్ర ఎరుపు రంగులో బంగారు కాంతితో ఉంటుంది.
2. ప్రణవానికి రెండవ మాత్ర ఉకారము. దీనికి భూతము ఆకాశము. ఇది యజస్సులతో కూడినది. దీనికి అధిదేవత విష్ణువు. ఏకాదశ రుద్రులు, పితృదేవతలు త్రిష్టుప్ ఛందస్సు దక్షిణాగ్ని.

రెండవమాత్ర నలుపు రంగులో విద్యుత్ కాంతితో ఉంటుంది.

3. ప్రణవము యొక్క మూడవ మాత్ర మకారము. దీనికి భూతము స్వర్గము. సామగానాలతో కూడినది. అధిదేవత రుద్రుడు. ద్వాదశాదిత్యులు, పితృదేవతలు, జగతి ఛందస్సు, ఆహవనీయాగ్ని, మూడవమాత్ర తెలుపురంగులో శుక్లవర్ణంతో ఉంటుంది.

4. ప్రణవము యొక్క చివరిది నాల్గవది అయిన అర్ధమాత్ర సామలోకము. ఓంకారము అథర్వమంత్రాలతో కూడిన అథర్వవేదము సంవర్తకాగ్ని. మరుత్తులు విరాట్టు ఏకఋషి భాస్వతి అనబడును. అకార ఉకార మకారాలకు చివర అతిసూక్ష్మమైన అర్ధమాత్ర ఉంటుంది అదే నాదము, నాల్గవమాత్ర లక్ష్మీదేవి వర్ణంతో అన్ని రంగులతోను ఉంటుంది. ఇదే ఓంకారము.

ఓంకారము నాలుగు అక్షరాలు, నాలుగు పాదాలు కలిగి ఉంటుంది. నాలుగు శిరస్సులుంటాయి. నాల్గవది అర్ధమాత్ర. ఇది స్థూలమైనపుడు హ్రస్వము, దీర్ఘము, ప్లుతము అని చెప్పబడుతుంది.

3,4 మాత్ర ప్రణవాన్ని క్రమంగా మూడుసార్లు ఉచ్చరించి నాల్గవసారి 5 మాత్రలు గల ప్రణవాన్ని ప్లుతముగా ఉచ్చరించాలి. ఇలా ఉపాసించినప్పుడు శాంతమైనది, ఆత్మయైనది, సమస్తము ప్రణవము అని ఉపాసించినట్లైతే, ఆత్మజ్యోతి ఒక్కసారిగా ప్రకాశిస్తుంది.

ఒక్కసారి ప్రణవాన్ని ఉచ్చరిస్తే పరమపదముకు, ఉత్తమమైన స్థానానికి తీసుకుపోతుంది. కాబట్టే ఓంకారము అంటారు.

ప్రాణులన్నీ లయించే స్థానం కాబట్టి ప్రళయము అంటారు.

అన్ని ప్రాణులలను పరమాత్మలో చేరుస్తుంది కాబట్టి ప్రణవము అంటారు.

నాలుగు పాదాలతో ఉన్నది. అందరి దేవతలకు, అన్ని వేదాలకు యోనిస్థానము. సకల వాచ్య వస్తువులు కూడా ప్రణవాత్మకము.

దేవతలందరూ ప్రణవ స్వరూపమే. ఈప్రణవము అందరినీ అన్ని దుఃఖాల నుండి, భయముల నుండి తరింపజేస్తుంది. కాబట్టి **'తారణము'** అనబడుతుంది.

తారణము చేస్తుంది అంటే రక్షిస్తుంది కాబట్టి **తారకము** అనబడుతుంది.

సమస్త దేవతలు విశ్రమించే స్థానము విష్ణువు అనబడుతుంది. ప్రాణులన్నింటినీ మళ్ళీ మళ్ళీ సృష్టిస్తుంది కాబట్టి **బ్రహ్మ** అనబడుతుంది.

అన్ని ప్రాణులయొక్క హృదయంలో ధ్యానయోగ్యమైన పరమాత్మను దీపములాగా ప్రకాశింపచేస్తుంది కాబట్టి **ప్రకాశము** అనబడుతుంది.

సమస్త ప్రకాశాలకు పరమప్రకాశమై మాటిమాటికీ దేహంలోని మెరుపులాగా ప్రకాశిస్తుంది కాబట్టి **'విద్యుత్'** అంటారు. సమస్త దిక్కులందు అంతర్యామిగా ప్రవేశించి సమస్త లోకాలయందు వ్యాపిస్తుంది కాబట్టి **వ్యాపి** అనబడుతుంది.

ఒక రకంగా చెప్పాలి అంటే ఇవన్నీ మహాదేవుని నామాలే.

| | | |
|---|---|---|
| ప్రణవము మొదటి మాత్ర | – | జాగ్రత్తు |
| రెండవ మాత్ర | – | స్వప్నము |
| మూడవ మాత్ర | – | సుషుప్తి |
| నాల్గవ మాత్ర | – | తురీయము |

ఒక్కొక్క మాత్ర భిన్నమాత్రలయందు లయం చెందుతాయి. ఇది స్వయంప్రకాశము. దీనికి వెలుగునిచ్చేది వేరొకటి లేదు. దీన్ని గనక శ్రద్ధగా ధ్యానం చేస్తే పూర్వపదము కలుగుతుంది. ఇది స్వయంగా బ్రహ్మ కాబట్టి మోక్షం ఇస్తుంది. ఓంకారము ధ్యానము, ధారణ, సమాధి స్థితులందు ఉపయోగిస్తుంది.

సకల కరణములు ఉపసంహరించటంవల్ల ధరింపదగిన దాన్ని ధరింపచేయుట వల్ల బ్రహ్మము తురీయము అనబడుతుంది.

స్థూలశరీరంలో ఉన్న దశేంద్రియాలను మనస్సులో స్థాపించి ధ్యానించటం వల్లనే విష్ణువు అనబడుతుంది.

సూక్ష్మదేహంలోని తత్త్వాలు ఇంద్రియాలు మనసులో చక్కగా నిలిపి ధ్యానం చేసేవాడు రుద్రుడు.

ప్రాణము ఇంద్రియాలు మనస్సులో చేర్చి నాదాంతమైన పరమాత్మ యందు నిలిపి ఈశానుడిని ధ్యానం చెయ్యాలి. ఎక్కువగా ఈశాన పరమాత్మనే ధ్యానం చెయ్యాలి. లోకంలో అన్ని ప్రాణులు త్రిమూర్తులతో సహా అందరూ పుడుతూనే ఉంటారు కాని వీటన్నింటికీ కారణమైన దానికి మాత్రం పుట్టుక లేదు. అది నాశరహితమైంది. ఇలా సమస్త కారణాలకు కారణమైనవాడు, సకల సంపదలు కలవాడు, సర్వేశ్వరుడు, శంభువు, ఆకాశం మధ్యన నివశించేవాడు అయిన పరమాత్మను ధ్యానం చెయ్యాలి. ఆ పరమాత్మే ధ్యానింపదగిన ధ్యేయవస్తువు.

ఇలా **ఒకసారి ధ్యానం చేస్తే శతాధిక యజ్ఞాలు 74సార్లు చేసిన ఫలితం వస్తుంది.** ఓంకారాన్ని ధ్యానం చేసేవాడికి ప్రణవస్వరూపము, వివిధ రకాల ధ్యానాలు, అన్ని రకాల యోగాలు, జ్ఞానము, దాని

ప్రయోజనము అన్నీ తెలుసుకోగలుగుతాడు. వాటిని తెలుసుకోగలిగేవాడు ఈశ్వరుడే. అందుచేత అన్నింటినీ వదిలి ఈశ్వరుణ్ణే ధ్యేయవస్తువుగా ధ్యానం చెయ్యాలి. ఇలా ధ్యానం చేసినవాడు జనన మరణ దుఃఖాల నుంచి విముక్తుడవుతాడు.

# 36. కైవల్యోపనిషత్తు

ఈ ఉపనిషత్తు కృష్ణయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో 26 మంత్రాలున్నాయి.

అశ్వలాయన మహర్షి పరమేష్ఠియైన ప్రజాపతి వద్దకు వచ్చి "ఓ భగవానుడా! విద్యలన్నిటిలోకి శ్రేష్ఠమైనది. సత్పురుషులచే ఉపాసించబడేది, మిక్కిలి రహస్యమైనది అయిన బ్రహ్మవిద్యను నాకు ఉపదేశించండి. మిగిలిన బ్రహ్మవేత్తల లాగా నేనుకూడా పాపాలను పోగొట్టుకుని శీఘ్రంగా పరాత్పరుణ్ణి చేరతాను" అన్నాడు. అలా అడిగిన అశ్వలాయనుడితో ప్రజాపతి ఈ విధంగా అంటున్నాడు.

"నాయనా పరబ్రహ్మతత్త్వాన్ని భక్తి, శ్రద్ధ, యోగము, ధ్యానము ద్వారా మాత్రమే తెలుసుకోవాలి. కర్మద్వారాగాని, సంతానం, ధనం మొదలయిన వాటిద్వారాగాని ఎవరూ బ్రహ్మతత్త్వాన్ని తెలుసుకోలేరు. అమరత్వాన్ని పొందలేరు. అమరత్వానికి రూపమే మోక్షము. దాన్ని త్యాగంద్వారా మాత్రమే పొందాలి. త్యాగమంటే దానధర్మాలు చేయటం కాదు. మనకున్నవన్నీ వదిలెయ్యాలి. ముఖ్యంగా రాగద్వేషాలు, కామ్యకర్మలు, అహంకార మమకారాలు త్యాగం చెయ్యాలి. ఆ పరతత్త్వం ఎక్కడో లేదు. నీ హృదయ పద్మంలోనే ఉన్నది. ఇంద్రియ నిగ్రహంగల మహర్షులు మాత్రమే దాన్ని చేరగలుగుతారు. ఓ మహర్షీ! శమదమాది నియమశీలురైన వారు పరమాత్మలో లీనం కాగలుగుతారు.

వేదాంతము వినటంవల్ల అపరోక్షజ్ఞానం కలుగుతుంది. దానివల్ల పరతత్త్వాన్ని గూర్చిన అవగాహన కలుగుతుంది. నిష్కల్మషమైన హృదయం అపరోక్షజ్ఞానం, గలిగి నియమనిష్టలు ఆచరించేవారు సన్యాసయోగం ద్వారా బ్రహ్మలోకాన్ని పొంది కల్పాంతంలో అమరత్వం

పొందుతారు. అంటే జనన మరణాల నుండి విముక్తి పొందుతారు. ఇదే క్రమముక్తి. వేదాంత ప్రవచనాలు వినటం, బ్రహ్మను గూర్చి నిశ్చయజ్ఞానం కలగటం, తపస్సు, సన్యాసదీక్ష ఇవన్నీ ఒక క్రమాన్ని తెలుపుతాయి. అందుచేత సన్యాసాశ్రమంలో ఉన్నవాడు పవిత్రుడై నిర్జన ప్రదేశంలో సుఖాశీనుడై మెడ, తల, శరీరము, తిన్నగా నిలుపుకుని, గురువుకు నమస్కరించి బాహ్యేంద్రియాలను నిరోధించి యోగంలో స్థిరంగా ఉండాలి. ఆ తరువాత హృదయకమలంలో ఉన్న అవాఙ్మానస గోచరుడు, ఇంద్రియాలకు అతీతుడు, శాంతుడు, అవ్యయుడు, ఆదిమధ్యాంత రహితుడు, కల్యాణస్వరూపుడు అయిన పరమాత్మను ధ్యానం చేసినట్లైతయితే అర్హత గలవాడు సంసార బంధనాల నుండి విముక్తి పొందుతాడు. మునీశ్వరులందరూ అద్వితీయుడు, అవ్యయుడు, ఆదిమధ్యాంతరహితుడు, నిరాకారుడు, సర్వవ్యాపకుడు, సచ్చిదానంద రూపుడు, ప్రశాంతుడు, సర్వానికీ సాక్షీభూతుడు అయిన పరమేశ్వరుణ్ణి ధ్యానిస్తారు. అతడే బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు, సమస్త దేవతాస్వరూపుడు. నాశరహితుడు. అతడే విష్ణువు, హిరణ్యగర్భుడు, కాలము, అగ్ని, చంద్రుడు అన్నీ అతడే. ఈ రకంగా సర్వదేవతా స్వరూపుడు అతడే. భూతభవిష్యద్వర్తమానాలలో ఉన్నవాడు, సనాతనుడు అయిన బ్రహ్మను అనుభవంలోకి తెచ్చుకున్న వాడు మృత్యువును జయిస్తాడు. ఈ రకంగా ఆత్మ, పరమాత్మ రెండూ ఒక్కటే అనే అనుభవం ఒక్కటే మోక్షానికి మార్గం.

అన్నిటినీ సమభావంతో చూసే యోగీశ్వరుడు సమస్త భూతాలలోనూ తన ఆత్మనే చూడగలుగుతాడు. తన ఆత్మలోనే సమస్తాన్ని చూడగలుగుతాడు. ఆత్మను క్రింద ఉండే అరణిగాను, ప్రణవాన్ని పైన ఉండే అరణిగాను చేసుకొని నిరంతరము ధ్యానమనే

అభ్యాసం వలన కలిగిన తత్త్వజ్ఞానం ద్వారా పండితుడైనవాడు పాపాలను దహించి వేస్తాడు.

అజ్ఞాని దేహాన్నే ఆత్మగా భావిస్తాడు. స్త్రీ సుఖము, అన్నపానాదులచేత ఇంద్రియాలను తృప్తిపరుస్తూ అదే సుఖము అనుకుంటాడు.

మాయాకల్పిత సంసారంలో జీవుడే భోక్త. సుఖదుఃఖాలను అతడే అనుభవిస్తాడు. అజ్ఞానాంధకారంలో ఉన్న జీవుడు గాఢనిద్రలో ఆత్మలో లీనమై అవిద్యచేత ఆచ్ఛాదించబడిన స్వరూపసుఖాన్ని అనుభవిస్తాడు. సుషుప్తిలో నిద్రపోతున్న జీవుడు జన్మాంతరకర్మ సంబంధంచే తాను చేసిన కర్మఫలాన్ని అనుభవించటానికి మళ్ళీ మేల్కొంటాడు. ఈ రకంగా జాగ్రస్స్వప్న సుషుప్తులలో క్రీడిస్తూ ఉంటాడు. అతనివల్లనే ఈ జగత్తు సృష్టించబడుతోంది. ఎవనిలో స్థూలసూక్ష్మ కారణ శరీరాలు, అవస్థాత్రయము, వీటికి అభిమాని అయిన జీవుడు లయమై పోతారో, అటువంటి పరమాత్మయే ఈ విశ్వానికి మూలకారకుడు, అఖండ జ్ఞానస్వరూపుడు.

ఆ పరమాత్మ వల్లనే ప్రాణము, మనస్సు, ఇంద్రియాలు, ఆకాశం, వాయువు. అగ్ని, జలం, పృథివి అన్నీ పుడుతున్నాయి.

ఏ పరబ్రహ్మ అందరికీ ఆత్మస్వరూపుడైనాడో, ఏ పరమాత్మ ఈ సృష్టికి ఆధారమైనాడో, ఏ మహాతత్త్వము నిత్యము సత్యము అయి ఉన్నదో, ఆ మహాతత్త్వానివి నీవే. అవస్థాత్రయాన్ని ప్రకాశింపచేస్తూ, వాటికి సాక్షీభూతుడైన పరబ్రహ్మను నేనే అని తెలుసుకున్న వాడు సమస్త బంధనాల నుండి విముక్తి పొందుతాడు.

సచ్చిదానందరూపుడను, పరమాత్మను అయిన నానుండే ఈ జగత్తు అంతా ఉద్భవించింది. నాలోనే అన్నీ ఉన్నాయి. అన్నీ నాలోనే

లయమవుతున్నాయి. అద్వితీయుడైన పరబ్రహ్మను నేనే. సూక్ష్మాతిసూక్ష్మమైనవాడను నేనే. మహత్తరమైన దానికన్న మహత్తరమైనవాడను నేనే. పురాతనుడను నేనే. ఈ విశ్వానికి కారకుడను, హిరణ్మయస్వరూపుడను, కల్యాణస్వరూపుడను నేనే.

**అపాణిపాదోహమచింత్యశక్తిః పశ్యామ్యచక్షుః సశృణో మ్యకర్ణః**

**అహం విజానామి వివిక్తరూపో, నచాస్తివేత్తా మమ చిత్సదాహమ్ ॥**

**వేదైరనేకై రహమేవవేద్యో, వేదాంతకృద్వేద విదేవచాహమ్**

**నపుణ్యపాపే మమనాస్తి నాశో, నజన్మ దేహేంద్రియ బుద్ధిరస్తి॥**

**నభూమిరాపో మమవహ్నిరస్తి, నచానిలోమేస్తి నచాంబరంచ**

**ఏవంవిదితా పరమాత్మరూపం, గుహాశయం నిష్కళమద్వితీయమ్ ॥**

**సమస్త సాక్షిగ్ం సదసద్విహీనమ్ ప్రయాతి శుద్ధం పరమాత్మ రూపమ్ ॥**

అవయవాలు లేనివాడను, ఊహకుకూడా అందని శక్తిస్వరూపుడను. కళ్ళు లేకపోయినా చూడగలను. చెవులు లేకపోయినా వినగలను. నేను అద్వితీయుణ్ణి. నాకు సాటి అయినవారు లేరు. నేను అనంగుడనైనా అందరినీ ఎరుగుదును. కాని నన్ను గుర్తించగలవారు లేరు. వేదాలలో తెలుసుకో తగ్గవాడను నేను. వేదాంతానికి కర్తను. వేదవేత్తను నేనే. నాకు పుణ్యపాపాలు లేవు. జనన మరణాలు లేవు,

దేహము, ఇంద్రియాలు, బుద్ధులు లేవు. పంచభూతాలు నాచేతనే నిర్మించబడ్డాయి. అంతేగాని పంచభూతాలతో నేను నిర్మించబడలేదు. నన్ను తెలుసుకున్న జీవులు బంధ విముక్తులౌతారు.

ఈ ప్రపంచంతో సంబంధం లేనట్టి, ఈ ప్రపంచానికి సాక్షి అయినటువంటి, పరమాత్మ స్వరూపమైన, వేదాలలో ప్రతిపాదించబడిన తత్త్వాన్ని తెలుసుకున్నవాడు అగ్నిలాగా పరిశుద్ధుడౌతాడు. ఆత్మలాగా పవిత్రుడౌతాడు, సురాపానం, బ్రహ్మహత్య, సువర్ణాపహరణం మొదలైన వాటివల్ల కలిగే పాపాలనుండి విముక్తుడౌతాడు. ఆత్మజ్ఞానం పొందటం వల్ల ఆశ్రమ ధర్మాలు అతిక్రమించిన పాపం కూడా నశిస్తుంది. ఈ విధంగా ఆత్మ స్వరూపుడైన పరమాత్మతో అపరోక్షానుభూతి పొంది అర్హుడైనవాడు మోక్షాన్ని పొందుతాడు.

కాబట్టి ఓ అశ్వలాయన మహర్షి ! జీవాత్మా, పరమాత్మ రెండు ఒక్కటే. ఆ పరబ్రహ్మ హృదయ కమలంలోనే ఉన్నాడు. సత్యశీలురై, నియమనిష్ఠలతో కర్మల నాచరించిన జ్ఞానులు మాత్రమే అతణ్ణి దర్శించగలరు. చరాచర జగత్తు పరమేశ్వర మయమని, ఆ పరమేశ్వరుడు తనలోనే ఉన్నాడని, తానే పరమేశ్వర స్వరూపుణ్ణి, పరమేశ్వరునికి తనకూ భేదం లేదని తెలుసుకున్న జ్ఞానియే పరమేశ్వర స్వరూపుడై బ్రహ్మలోకం పొంది, కల్పాంతం వరకు బ్రహ్మలోకంలో ఉండి తరువాత పరబ్రహ్మలో లీనమైపోతాడుఅని పరతత్త్వాన్ని వివరించాడు ప్రజాపతి.

# 37. పంచబ్రహ్మోపనిషత్తు

ఇది కృష్ణయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో మూడు మంత్రాలున్నాయి.

చరాచర జగత్తు అంతటా వ్యాపించి ఉన్నవాడు పరమేశ్వరుడు. అతడే మహాదేవుడు. ఈయన ఐదు దిక్కులయందు పంచబ్రహ్మలుగా ఉంటాడు. అవే 1.సద్యోజాత 2. వామదేవ 3. అఘోర 4. తత్పురుష 5. ఈశానులు. వీరు వేరు వేరు కాదు. ఈశ్వరుడే ఆ ప్రదేశంలో ఆ పేరుతో పిలువబడతాడు. వ్యష్టిగా పంచబ్రహ్మలు. సమిష్టిగా మహాదేవుడు. అందుకే మహాదేవుడు పంచబ్రహ్మాత్మకుడు అని చెబుతోంది ఈ ఉపనిషత్తు. ముందుగా పంచబ్రహ్మలను తెలుసుకుని వ్యష్టిగా వారిని ఆరాధించి తరువాత హృత్పుండరీకంలో ఉన్న మహాదేవుణ్ణి పరమేశ్వరుడుగా గుర్తించి అర్చించిన వాడికి పునర్జన్మ ఉండదు అని చెబుతోంది ఈ ఉపనిషత్తు. ఇప్పుడు ఉపనిషత్తును చూడండి.

ఒకరోజున పిప్పలాదుడు మహేశ్వరుడి దగ్గరకు వెళ్ళి 'దేవా' సద్యోజాతుడెవరు? వామదేవుడు, యత్పురుషుడు వీళ్ళంతా ఎవరు? వర్ణాలు ఎన్ని? భేదము లెన్ని? శక్తులెన్ని? వీటిని మాకు వివరించవలసింది అన్నాడు. ఆ మాటలు విన్న మహాదేవుడు "లోకంలో రహస్యాతి రహస్యమైన విషయమిది. ఇప్పుడు మీకు తెలియచేస్తున్నాను.

**1. సద్యోజాతం ప్రపద్యామి సద్యో జాతాయ వై నమో నమః**
**భవేభవేనాతిభవే భవస్వమామ్ భవోద్భవాయ నమః**

మహిపూష బ్రహ్మత్రివృత్తు స్వరము ఋగ్వేదము గార్హపత్యము మంత్రములు సప్తస్వరాలు వర్ణము పీతము, క్రియాశక్తి సర్వాభీష్ట ఫలప్రదము.

**2. వామదేవాయ నమో జ్యేష్ఠా నమః శ్రేష్ఠాయ నమో రుద్రాయ నమః**

**కాలాయ నమః కలవికరణాయ నమో బలవికరణాయ నమో బలాయ**

**నమో బలప్రమథనాయ నమః సర్వభూతదమనాయ**
**నమో మనోన్మనాయ నమః**

మహాబోధదాయకుడు. పావకాత్మకుడు, విద్యాలోకయుక్తుడు, కోటిసూర్య సమప్రభుడు, ప్రసన్నుడు, సామవేద స్వరూపుడు, గానాష్టక సమన్వితుడు, ధీరస్వరుడు, ఆహవనీయ స్వరూపుడు, అనుత్తముడు, అజ్ఞానసంహార సంయుక్తుడు, శక్తిద్వయ సమన్వితుడు, శుక్లవర్ణుడు, స్వయంగా పూర్ణబోధకుడు లోకత్రయ నియంత, ధామత్రయ సమన్వితుడు, సర్వసౌభాగ్యప్రదుడు. సర్వకర్మఫలప్రదుడు, అష్టాక్షర సంయుక్తుడు, అష్టపత్రాంతరస్థితుడు.

**3. అఘోరేభ్యో థఘోరేభ్యో ఘోరఘోర తరేభ్యః**
**సర్వేభ్య స్సర్వశర్వేభ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః**

సలిలము చంద్రుడు, గౌరి యజుర్వేదము మేఘముతో సమమైన

స్వరము సాంద్రము దక్షిణాగ్ని పంచాశద్వర్ణ సంయుక్తము, ఇచ్ఛాక్రియాన్విత స్థితి, శక్తిరక్షణ సంయుక్తము, సర్వపాపవినాశనము, దోషప్రశమనము సర్వైశ్వర్య ఫలప్రదము.

**4. తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి**
**తన్నో రుద్రః ప్రచోదయాత్**

పంచాగ్ని సంయుక్తుడు, వాయుమండల సంవృతుడు, మంత్రశక్తి నియామకుడు, అధర్వవేదస్వరూపుడు, పంచాశద్వర్ణరూపుడు, కొన్ని కోట్ల గణాలకు అధ్యక్షుడు, బ్రహ్మాండ అఖండ విగ్రహుడు, కామదుడు రక్తవర్ణుడు, సర్వాధి వ్యాధి భేషజుడు, సర్వశక్తిమంతుడు, సృష్టిస్థితి లయకారకుడు, అవస్థాత్రయాతీతుడు, తురీయుడు, సత్ చిత్ సుఖస్వరూపుడు, సర్వజనకుడు.

**5. ఈశాన స్సర్వవిద్యానా మీశ్వర స్సర్వభూతానాం బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోధిపతి ర్బ్రహ్మ శివో మే అస్తు సదా శివోమ్**

ప్రేరకుడు, పరుడు, బుద్ధిసాక్షి, ఆకాశాత్మకుడు, అవ్యక్తుడు, ఓంకార స్వరభూషితుడు, శాంతుడు, శాంత్యతీతుడు, సర్వదేవమయుడు, స్వరబాహ్యుడు, అకారాది స్వరాలకు అధ్యక్షుడు.

మహాదేవుడు – జగద్గురువు. పంచబ్రహ్మాత్మకుడు.

పంచబ్రహ్మోపాసన చేసి స్వాత్మయందున్నవాడు. తనమాయతో అందరినీ సంహరించి స్వాత్మయందున్నవాడు. పంచబ్రహ్మలకు అతీతుడు. తన తేజస్సుతో ప్రకాశిస్తున్నాడు. ఆది మధ్య అంతముల యందు ప్రకాశించేవాడు. జగద్గురువైన మహాదేవుణ్ణి దేవతలు కూడా ఎరగరు.

అతడు పరాత్పరుడు. అతడి రూపము కనిపించదు. ఈ జగత్తంతా ఎదరివల్ల ప్రకాశిస్తున్నదో, ఎవరియందు లీనము అవుతున్నదో, పరమశాంతుడైన ఆ బ్రహ్మను నేనే. నేనే సద్యోజాత మొదలైన పంచబ్రహ్మరూపుడను. పంచబ్రహ్మాత్మకముగా కనిపించేది వినిపించేది అంతా బ్రహ్మము అని తెలిసి ఈశానుణ్ణి పొందవలసింది.

ఈ జగత్తు సర్వస్వము పంచబ్రహ్మాత్మకము అని తెలిసిగనక ఉపాసన చేస్తే ఉపాసకుడు అమృతుడైన బ్రహ్మ అవుతాడు. అతడు ఎక్కడో లేడు. హృత్పుండరీకంలో ఉన్నాడు. అతడు శాంతుడు, దాంతుడు. శుద్ధచైతన్యమూర్తి ఆదిమధ్యాంతరహితుడు. ఆ మహాదేవుణ్ణి గనక సేవించినట్లైతే ఇష్టార్థసిద్ధి కలుగుతుంది. అతడికి పునర్జన్మ ఉండదు.

# 38. భస్మజాబాలోపనిషత్తు

అధర్వణ వేదానికి సంబంధించినది ఈ ఉపనిషత్తు. ఇందులో పదిహేను మంత్రాలున్నాయి. భస్మాన్ని ఎలా తయారుచెయ్యాలి. ఏ రకంగా, ఎక్కడెక్కడ ధరించాలి? దానివల్ల ఫలితము ఏమిటి? అనే విషయాలు ఇందులో వివరించబడ్డాయి.

పూర్వకాలంలో ఒకసారి భుసుండుడు కైలాసవాసి అయిన మహాదేవుడి దగ్గరకి వెళ్ళి 'మహాదేవా' భస్మము ఎలా తయారుచెయ్యాలి? దీన్ని ఎలా ధరించాలి? భస్మధారణ వల్ల ఫలితము ఏమిటి? ఈ విషయాలు వివరించవలసింది' అని అడిగాడు. ఆ మాటలు విన్న మహాదేవుడు చెబుతున్నాడు.

భస్మము చాలా పవిత్రమైనది. దాన్ని ప్రత్యేకంగా తయారుచేసుకోవాలి. ఆ విధానమంతా వివరిస్తాను వినవలసినది.

భస్మము తయారుచేసుకోవాలి అనుకునే వాడు ముందుగా తెల్లవారుఝామునే లేచి కాలకృత్యాలు తీర్చుకుని తెల్లవారకుండానే వేదమంత్రాలు చదువుతూ గోశాలలో ప్రవేశించాలి. అప్పటికి ఆవులు ఇంకా పడుకునే ఉంటాయి. అలా పడుకున్న ఆవులని చేతితో తట్టి వేదమంత్రాలు చదువుతూనే లేపాలి. పొరపాటునకూడా ఆవును కాలితో తన్నరాదు. పడుకున్న ఆవులేవగానే మలమూత్ర విసర్జన చేస్తుంది. ఆ సమయంలో చేతిలో ఉన్న బంగారు, వెండి, రాగి లేదా మట్టిపాత్రలలో విడివిడిగా గోమయము గోమూత్రము సేకరించాలి. ఈ రెండూ ఒకే పాత్రలో సేకరించరాదు.

ఏ ఆవుదగ్గర నుంచి ఈ మలమూత్రాలు సేకరించాలనదేది

ముందుగానే నిర్ణయించుకోవాలి. మనం సేకరించే ఆవు చాలా ఆరోగ్యంగా ఉండాలి. చూడటానికి కామధేనువులాగా పవిత్రంగా ఉండాలి. అంతేకాని జబ్బుపడ్డవి, బక్కచిక్కి పోయినవి, బలహీనంగా ఉన్నవి, వట్టిపోయిన ఆవులు ఇందుకు పనికిరావు. ఆవు తిన్న ఆహారం పూర్తిగా జీర్ణం కావాలి. అది తిన్న ఉలవలు, ఇతర ధాన్యాలు అలాగే పేడలో రాకూడదు. అటువంటి గోమయం భస్మానికి పనికిరాదు. గోమయం ఎప్పుడూ గట్టిగానే ఉండాలి. అది కడులుకడులుగా గట్టిగా ఉండాలి. అలా ఉంటేనే అది ఆరోగ్యమైన ఆవు.

గోమయం ఎప్పుడూ గోశాలలోనే సేకరించాలి. బయట ప్రదేశాలలో ఉన్నది పనికిరాదు. త్రోవలో బాటలో వేసిన గోమయం పనికిరాదు. ఊరిచివర, పెంటదిబ్బల దగ్గర ఉన్నది. అసలు పనికిరాదు. అందుకే గోశాలలో మాత్రమే దీన్ని సేకరించాలి. ఇలా మనకు కావలసిన గోమయము ముందుగా ఎంపిక చేసుకున్న గోవులదగ్గర సేకరించాలి. అది చాలా గట్టిగా ఉంటుంది. దానిలో కొద్దిగా గోమూత్రం పోసి శుభ్రంగా పిసికి కలపాలి. ఇప్పుడు ఆ గోమయాన్ని చిన్నచిన్న ఉండలుగా చేసి ఎండలో ఆరబెట్టాలి. ఈ పనిచేస్తున్నప్పుడు పూర్తిగా వేదపారాయణ జరుగుతూనే ఉండాలి. ఇలా ఉండలు చేసేటప్పుడు గోమయంలో ఇతర పదార్థాలు ఊక, బొగ్గుపొడి లాంటివి ఏవీ కలవరాదు. అలా కలిస్తే ఆ ఉండలు పొయ్యిలో వేసుకోవటానికి తప్ప భస్మానికి పనికిరావు.

రెండుమూడు రోజులపాటు ఈ ఉండలు పూర్తిగా ఎండిన తరువాత ఒక శుభముహూర్తాన మన ఇంటికి దగ్గరలో ఉన్న పండితులందర్నీ పిలిచి హోమం ఏర్పాటు చెయ్యాలి. అగ్నిప్రతిష్టాపన

చేసి అందరూ వేదమంత్రాలు చదువుతుండగా ఎండిపోయిన ఈ పేడ ఉండలు హోమకుండంలో వేసి ఆవునేతితో హోమం చెయ్యాలి. ఆ సమయంలో గాయత్రీమంత్రం గాని, గణపతి, పంచాక్షరి మంత్రాలు గాని వేదమంత్రాలు గాని చదువుతూ ఆజ్యహోమం చెయ్యాలి.

ముందుగా మనం తయారుచేసుకున్న పేడ ఉండలు పూర్తిగా వేసిన తరువాత అవి పూర్తిగా హుతం అయ్యేదాకా హోమం జరుగుతూనే ఉండాలి. ఆ తరువాత ఆజ్యపూర్ణాహుతి చేసి వచ్చిన పండితులందరికీ దక్షిణ తాంబూలము ఇచ్చి, భోజనాలు పెట్టి పంపాలి.

ఆ మరునాడు స్నానంచేసి నిత్యకార్యక్రమాలు పూర్తి అయిన తరువాత హోమకుండం దగ్గరకు వచ్చి వేదమంత్రాలు చదువుతూ హోమకుండంలో నిన్నటిరోజున హుతమైన పేడ ఉండలను జాగ్రత్తగా సేకరించాలి. వాటన్నింటినీ పరమపవిత్రంగా ఒక పళ్ళెంలోకి తీసుకుని వేదమంత్రాలు చదువుతూ వాటిని మెత్తగా పొడిగా చెయ్యాలి. ఇది పూర్తిగా పేడ ఉండ. ఆజ్యంతో హుతమైంది కాబట్టి తెల్లగా, మెత్తగా ఉన్న బూడిద అవుతుంది. ఒకవేళ అందులో ఏదైనా గట్టితనముంటే దాన్ని తీసెయ్యాలి. దానికోసం ఈ బూడిదను మెత్తగా జల్లించాలి. ఇప్పుడు ఆమెత్తటి బూడిదలో పచ్చకర్పూరము, జాజికాయ, జాపత్రి మొదలైన సుగంధ ద్రవ్యాలు కలిపి మెత్తగా కొట్టిన పొడికలిపి, కాసిన నీళ్ళుపోసి భస్మాన్ని కలిపి చిన్నచిన్న ఉండలుగా చేసి ఎండబెట్టి చాలా జాగ్రత్తగా దాచుకోవాలి. మనం ధారణ చేసే భస్మాన్ని మారేడుకాయలో పోసి ఉంచుకోవాలి. గోమయంతో చేసిన భస్మం పవిత్రం. వేదమంత్రాలతో ఇలా తయారుచేసినది ఇంకా పవిత్రం.

మారేడుకాయలో పోసిన భస్మం పరమపవిత్రం. ఈ రకంగా భస్మం తయారుచేసుకోవాలి.

గమనిక : దేవాలయాలలో పెట్టే విభూదిగడ్డ, బయట బజారులో అమ్మేది వట్టినాము గడ్డ. అది తెల్లగా ఉంటుంది. అంతే దానివల్ల ఇతర ఉపయోగాలేవీ ఉండవు. ధారణ చెయ్యటానికి మంచి విభూతిని జాగ్రత్తగా సేకరించండి హోమకుండంలో తీసినది ఉత్తమము.

ఇలా సేకరించిన విభూతి ధారణ చెయ్యాలి. అది ఎలా అంటే, ఎడమచేతిలో భస్మం వేసుకుని, అందులో కొద్దిగా నీరుపోసి

**వ్యోమర్ ఇతి భస్మ, వాయురితి భస్మ, అగ్నిరితిభస్మ, జలమితిభస్మ, స్థలమితి భస్మ.**

ఈ భస్మము పంచభూతాత్మకము అని చెబుతూ కుడిచేతి మధ్యవ్రేలుతో దాన్ని శుభ్రంగా కలిపి ఇప్పుడు మధ్య మూడువ్రేళ్ళతోను (తర్జని, మధ్యమ, అనామిక) భస్మాన్ని తీసుకుని శరీరంలో ఐదుచోట్ల రాచుకోవాలి. 1. లలాటము 2. భుజాలు 3. మణికట్టు 4. వక్షస్థలము 5. ఉదరము. ఈ ఐదుచోట్లా భస్మధారణ చేస్తున్నప్పుడు సద్యోజాత, వామదేవ, తత్పురుష, ఈశాన అనే పంచబ్రహ్మల మంత్రాలు చదవాలి.

1. **సద్యోజాతం ప్రపద్యామి సద్యో జాతాయ వై నమో నమః భవేభవేనాతిభవే భవస్వమామ్ భవోద్భవాయ నమః**

2. **వామదేవాయ నమో జ్యేష్ఠా నమః శ్రేష్ఠాయ నమో రుద్రాయ నమః**

కాలాయ నమః కలవికరణాయ నమో బలవికరణాయ నమో బలాయ

నమో బలప్రమథనాయ నమః సర్వభూతదమనాయ

నమో మనోన్మనాయ నమః

3. అఘోరేభ్యో థఘోరేభ్యో ఘోరఘోర తరేభ్యః
సర్వేభ్య స్సర్వశర్వేభ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః

4. తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి
తన్నో రుద్రః ప్రచోదయాత్

5. ఈశాన స్సర్వవిద్యానా మీశ్వర స్సర్వభూతానాం బ్రహ్మాధిపతి
ర్బ్రహ్మణోధిపతి ర్బ్రహ్మ శివో మే అస్తు సదా శివోమ్

ఈ రకంగా భస్మధారణ చేసిన వాడు మహాపురుషుడు. అతడికి నమస్కారం చేసినంత మాత్రంచేతనే మనపాపాలు అన్నీ తొలగిపోతాయి.

పూర్వకాలంలో ఒకసారి దుర్వాసుడు యమలోకానికి వెళ్ళాడు. అక్కడ పాపులంతా శిక్షలు అనుభవిస్తూ పెద్దపెద్దగా అరుస్తున్నారు. ఆ సమయంలో వచ్చిన గాలివల్ల దుర్వాసుడి ముఖాన ఉన్న విభూతి

రేణువు ఎగిరివెళ్ళి నరకంలో పడింది. మరుక్షణంలోనే అక్కడి పాపులంతా పవిత్రులయిపోయారు. భస్మంలో ఒక్క రేణువుకే అంత శక్తి ఉంటే, పూర్తిగా భస్మధారణ చేస్తే ఎలా ఉంటుందో ఆలోచించండి. అంటోంది ఈ ఉపనిషత్తు.

కాబట్టి ఓ **భారతీయుడా! ముఖాన విభూతి ధరించటానికి, కుంకుమ ధరించటానికి సిగ్గుపడకు. ఇది మనసంప్రదాయం. నువ్వు ఎక్కడికైనా వెళ్ళు. ఏ పని అయినా చెయ్యి. నీ సంప్రదాయాన్ని మాత్రం మరవవద్దు. అది నిన్ను సర్వదా రక్షిస్తుంది అని గుర్తించు.**

# 39. రుద్రాక్ష జాబాలోపనిషత్తు

ఇది సామవేదానికి సంబంధించినది. ఇందులో ఏడు మంత్రాలున్నాయి. రుద్రాక్షలు ఎన్ని రకాలు? వాటిని ధరిస్తే వచ్చే ఫలితం ఏమిటి? అనే విషయాలు ఇందులో చెప్పబడ్డాయి.

పూర్వకాలంలో ఒకసారి భుసుండుడు కాలాగ్ని రుద్రుణ్ణి అడిగాడు. "స్వామీ! రుద్రాక్షలు ఎలా పుట్టినాయి? అవి ఎన్ని రకాలు, వాటిని ధరిస్తే ఫలితం ఏమిటి? ఈ విషయాలు చెప్పవలసింది అన్నాడు. ఇప్పుడు కాలాగ్నిరుద్రుడు చెబుతున్నాడు.

నేను త్రిపురాసురవధ సమయంలో ఒకసారి కనులు మూసుకున్నాను. అప్పుడు ఆ కళ్ళనుంచి బిందువులు రాలి నేలమీద పడి రుద్రాక్షలైనాయి. వాటిని దర్శిస్తే చాలు పదిగోదానాలు చేసిన ఫలితం వస్తుంది. వాటిని ముట్టుకుంటే చాలు రెట్టింపు ఫలం కలుగుతుంది.

నేను కొన్నివేల దివ్యసంవత్సరాలు అలా కళ్ళు మూసుకుని ఉన్నాను. అప్పుడు ఆ కళ్ళ నుంచి జలబిందువులు భూమిమీద పడి రుద్రాక్ష వృక్షాలైనాయి. వాటిని ధరించిన వారికి పగలుగాని, రాత్రిగాని చేసిన పాపాలు పోతాయి. దర్శనంచేత లక్షపుణ్యం, స్పర్శనంచేత కోటిపుణ్యం వస్తుంది. రుద్రాక్ష ధరించి జపంచేస్తే లక్షకోట్ల సహస్రాలు ఫలితం వస్తుంది. ఇక రుద్రాక్ష ప్రమాణం ఎంత ఉండాలి అంటే?

**ధాత్రీఫల ప్రమాణం యచ్ఛ్రేష్టమేతదు దాహృతమ్**

**బదరీఫల మాత్రంతు మధ్యమం ప్రోచ్యతే బుధైః**

అధమం చణమాత్రం స్యాత్ ప్రక్రియైషా మయోచ్యతే

ఉసిరికాయలంత రుద్రాక్షలు - ఉత్తమము

రేగిపండ్లంత రుద్రాక్షలు - మధ్యమము

శనగగింజంత ఉన్నవి - అధమము

ఇవి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అని నాలుగు రకాలు

బ్రాహ్మణుడు - తెలుపువాటిని

క్షత్రియుడు - ఎరుపువాటిని

వైశ్యుడు - పచ్చనివాటిని

శూద్రుడు - నల్లనివాటిని ధరించాలి

రుద్రాక్షల సమముగాను, నున్నగాను, గట్టిగాను, ఉన్నవి మంచివి. పురుగులు కొట్టినవి, విరిగిపోయినవి, పగిలిపోయినవి, గొగ్గులుగా ఉన్నవి పనికిరావు. రుద్రాక్షకి స్వయంగా రంధ్రాలుంటే మంచిది. రంధ్రాలు వేసినవి మధ్యమము. నునుపైనవి, గట్టివి పట్టుతాడుతో ధరించాలి. పండితుడు వీటిని శరీరమంతా ధరించాలి. గీటురాతిమీద గీస్తే బంగారం లాగా గీతవచ్చినవి ఉత్తమము. వాటిని శివారాధకులు ధరించాలి.

శిఖయందు - ఒకటి, శిరస్సున - మూడువందలు, మెడలో 36, చేతులకు - 16 చొప్పున, మణికట్టున - 12 మూపున - 500, జందెముగా - 108 తోమాల ధరించాలి. కంఠానికి మూడుపేటలు, ఐదుపేటలు, ఏడుపేటలు ధరించాలి. నిద్రపోతున్నా వీటిని ధరించవచ్చు.

300 – అధమము, 500 – మధ్యమము, 1000–ఉత్తమము

శిరస్సున – ఈశాన మంత్రం

**ఈశాన స్సర్వవిద్యానా మీశ్వర స్సర్వభూతానాం బ్రహ్మోధిపతి**
**ర్బ్రహ్మణోధిపతి ర్బ్రహ్మో శివో మే అస్తు సదా శివోమ్**

కంఠం – తత్పురుష మంత్రం

**తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి**
**తన్నో రుద్రః ప్రచోదయాత్**

గళము – అఘోర మంత్రం

**అఘోరేభ్యో థఘోరేభ్యో ఘోరఘోర తరేభ్యః**
**సర్వేభ్య స్సర్వశర్వేభ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః**

హృదయం – వామదేవ మంత్రం

**వామదేవాయ నమో జ్యేష్ఠా నమః శ్రేష్ఠాయ నమో రుద్రాయ నమః**

**కాలాయ నమః కలవికరణాయ నమో బలవికరణాయ నమో బలాయ**

**నమో బలప్రమథనాయ నమః సర్వభూతదమనాయ**
**నమో మనోన్మనాయ నమః**

చేతులందు - సద్యోజాత మంత్రం

సద్యోజాతం ప్రపద్యామి సద్యో జాతాయ వై నమో నమః
భవేభవేనాతిభవే భవస్వమామ్ భవోద్భవాయ నమః

ఇక రుద్రాక్షలు ఎన్ని రకాలు అనే విషయం చూద్దాం.

ఏకవక్త్రంతు రుద్రాక్షం పరతత్త్వ స్వరూపకం
తద్ధారణాత్పరే తత్త్వేతీ యతే విజితేంద్రియః ।
ద్వివక్త్రంతు మునిశ్రేష్టం చార్ధనారీశ్వరాత్మకమ్
ధారణాత్ అర్ధనారీశః ప్రీయతే తస్య నిత్యశః ।
త్రిముఖంచైవ రుద్రాక్షం అగ్నిత్రయస్య రూపకమ్
తద్ధారణాచ్చ హుతభుక్తస్య తుష్యతి నిత్యదా ।
చతుర్ముఖంతు రుద్రాక్షం చతుర్వక్త్ర స్వరూపకం
తద్ధారణాచ్చ తుర్వక్త్రః ప్రీయతే తస్య నిత్యదా ।
పంచవక్త్రంతు రుద్రాక్షం పంచబ్రహ్మ స్వరూపకమ్
పంచవక్త్రః స్వయంబ్రహ్మ పుంహత్యాం చ వ్యపోహతి ।
షడ్వక్త్రమపి రుద్రాక్షం కార్తికేయాధి దైవతమ్
తద్ధారణాన్మహా శ్రీస్స్యాన్మహదారోగ్య ముత్తమమ్ ॥
సప్తవక్త్రంతు రుద్రాక్షం సప్తమాత్రాధి దైవతమ్

తద్ధారణాన్మహా శ్రీస్స్యా న్మహదారోగ్య ముత్తమమ్
అష్టవక్త్రంతు రుద్రాక్షం అష్టమాత్రాధి దైవతమ్
వస్వష్టక ప్రియంచైవ గంగా ప్రీతికరం తథా ।
తద్ధారణా దియే ప్రీతా భవేయుస్సత్యవాదినః
నవవక్త్రంతు రుద్రాక్షం నవశక్త్యధి దైవతమ్
తస్యధారణ మాత్రేణ ప్రియంతే నవశక్తయః ।
దశ వక్త్రంతు రుద్రాక్షం యమదైవత్య మీరితమ్
దర్శనాచ్ఛాంతి జనకం పాపానాం నాత్రసంశయః ।
ఏకాదశ ముఖం త్వక్షం రుద్రైకాదశ దైవకమ్
తదిదం దైవతం ప్రాహుస్సదా సౌభాగ్యవర్ధనమ్ ।
రుద్రాక్షం ద్వాదశముఖం మహావిష్ణు స్వరూపకమ్
ద్వాదశాదిత్య రూపం చ భిభర్త్యే వహితత్పరః ।
త్రయోదశముఖం చాక్షం కామదం సిద్ధిదం శుభం
తస్యధారణమాత్రేణ కామదేవః ప్రసీదితి ।
చతుర్దశముఖం చాక్షం రుద్రనేత్ర సముద్భవం
సర్వవ్యాధిహరంచైవ సర్వదారోగ్య మాప్నుయాత్

ఏకముఖి పరతత్త్వ స్వరూపము దీన్ని ధరించినవాడు విజితేంద్రియుడై పరతత్త్వాన్ని పొందుతాడు.

ద్విముఖము – అర్ధనారీశ్వరము – అర్ధనారీశ్వరప్రీతి

| | | |
|---|---|---|
| త్రిముఖము | - అగ్నిత్రయస్వరూపము | - అగ్నిప్రీతి |
| నాలుగుముఖాలు | - బ్రహ్మస్వరూపము | - బ్రహ్మప్రీతి |
| ఐదుముఖాలు | - పంచబ్రహ్మస్వరూపము | - బ్రహ్మహత్యాపాతక నాశకము |
| ఆరుముఖాలు | - కుమారస్వామి రూపము | - సంపద, ఆరోగ్యము |
| ఏడుముఖాలు | - సప్తమాత్రుకలు | - సంపద, ఆరోగ్యము |
| ఎనిమిది ముఖాలు | - అష్టమాత్రస్వరూపము | - గంగాప్రీతి |
| తొమ్మిదిముఖాలు | - నవశక్తి స్వరూపము | - నవశక్తుల ప్రీతి |
| పదిముఖాలు | - యమస్వరూపము | - పాపశాంతి |
| పదకొండుముఖాలు | - ఏకాదశరుద్రులు | - సౌభాగ్యము |
| పన్నెండుముఖాలు | - ద్వాదశాదిత్యులు | - ఆదిత్యులప్రీతి |
| పదమూడుముఖాలు | - కామదసిద్ధము | - కామదేవుని ప్రసన్నత |
| పద్నాలుగుముఖాలు | - నేత్రస్వరూపము | - ఆరోగ్యము సర్వవ్యాధిహరము |

రుద్రాక్షలు ధరిస్తే ఏవైనా నియమాలు పాటించాలా? అనే అనుమానం వస్తుంది. దానికే చెబుతున్నాడు. **రుద్రాక్ష ధరించినవాడు మద్యం త్రాగరాదు. మాంసం తినరాదు. ఉల్లిపాయ, వెల్లుల్లి, గోంగూరలను తినకూడదు.**

గ్రహణ సమయంలోను, అయన పుణ్యకాలంలోను, సంక్రమణం రోజున, అమావాస్య, పూర్ణిమలయందు రుద్రాక్షలు ధరిస్తే సర్వపాపాల నుండి విముక్తుడౌతాడు.

**రుద్రాక్షమూలం బ్రహ్మతన్నాళం విష్ణురేవచ**
**తన్ముఖం రుద్రఇత్యాహు తద్బిందు స్సర్వదేవతా ॥**

రుద్రాక్షమూలం – బ్రహ్మ, నాళం – విష్ణువు, ముఖం – రుద్రుడు. దాని బిందువు సర్వదేవతలు.

రుద్రాక్షను గురించి మాట్లాడినంత మాత్రం చేతనే పదిగోదానములు చేసిన ఫలితము వస్తుంది. రుద్రాక్ష ధరిస్తే – రెండు వేల గోవులు దానం చేసిన ఫలితం వస్తుంది.

చెవులయందు ధరిస్తే – 11వేల గోవుల దానఫలము

శిరస్సున ధరిస్తే – కోటి గోదానాలు ఫలము వస్తుంది.

ఈ ఉపనిషత్తును నిత్యము పఠించేవాడు బాలుడైనా, యువకుడై, వృద్ధుడైనా మహాత్ముడవుతాడు.

రుద్రాక్షలు స్త్రీలు ధరించవచ్చా? ఇది చాలా పెద్ద ప్రశ్న. వేదాలుగాని, శాస్త్రాలు గాని ఈ విషయాన్ని ప్రస్తావించలేదు. రుద్రాక్షలు ధరించినవారు పవిత్రులవుతారు. హైందవ ధర్మంలో స్త్రీకి అత్యంత పవిత్రమైన స్థానం ఉంది. భర్త చేసిన పుణ్యంలో సగభాగం భార్యకి వస్తుంది. భార్య చేసిన పాపం పూర్తిగా భర్తకే చెందుతుంది. కాబట్టి స్త్రీకి పాపంలేదు. ఆవిడ ఎప్పుడూ పవిత్రురాలే. కాబట్టి ప్రత్యేకంగా పవిత్రత కోసం స్త్రీలు రుద్రాక్షలు ధరించవలసిన అవసరంలేదు.

ఇక సంప్రదాయంలోకి వచ్చేసరికి పూర్వసువాసినులు (వితంతువులు) మాత్రమే రుద్రాక్షలు, తులసిపూసలు ధరిస్తారు. ముత్తైదువలు పగడాలు, ముత్యాలు ధరిస్తారు. హైందవ ధర్మంలో స్త్రీకి సన్యాసంలేదు. అయితే కాలం మారిపోయింది. కొందరు స్త్రీలు కూడా సన్యసిస్తున్నారు. మరి అలాంటివారు రుద్రాక్షలు ధరించవచ్చా? మనం చెప్పగలిగింది ఏముంది?

**'ఆత్మబుద్ధిః సుఖంచైవ'** వారి బుద్ధికి తోచినట్లు వారు చేయవచ్చు.

# 40. గణపతి ఉపనిషత్తు

ఇది అథర్వణ వేదానికి సంబంధించినది. ఇందులో మొత్తం నాలుగు మంత్రాలున్నాయి. పంచాయతనంలో గణపతి ఒకడు. కాబట్టి గణపతే పరమేశ్వరుడు అని చెప్పే ఉపనిషత్తు ఇది.

లం పృథివీ బీజము. ఇదే గణపతి బీజంకూడా. అందుకే లం బీజంతో గణపతికి నమస్కారం చేస్తూ ఉపనిషత్తు ప్రారంభం అవుతోంది. ఓ గణపతీ ! నువ్వు ప్రత్యక్షమైన తత్త్వానివి. కేవలము నీవే కర్తవు, భర్తవు, హర్తవు. జగత్తు రూపంలో ఉండే బ్రహ్మ నువ్వే. నువ్వే నిత్యమైన ఆత్మవి. నేను నిజమే చెబుతున్నాను. నన్ను రక్షించవలసింది, వెనక నుంచి ముందు నుంచి, ప్రక్కలనుంచి నన్ను రక్షించుము. పైన క్రింద అంతటా రక్షించు. నువ్వు వాఙ్మయుడవు. చిన్మయుడవు. ఆనందమయుడు, బ్రహ్మమయుడవు. సచ్చిదానందమూర్తివి అద్వితీయుడవు. ప్రత్యక్షబ్రహ్మవు. జ్ఞానమయుడు, విజ్ఞానమయుడు అంతా నువ్వే. ఈ జగత్తంతా నీవల్లనే పుడుతోంది, నిలుస్తోంది, లయమవుతోంది. పురాణాల గణపతి, పార్వతీదేవి చేసిన గణపతిల గురించి వివరించవలసినది 40లో

నువ్వే భూమి, ఆకాశము, అగ్ని, వాయువు, జలము. నువ్వే పరాపశ్యంతి మధ్యమవైఖరి స్వరూపాలైన వాక్కువు నువ్వే. గుణత్రయాతీతుడవు. దేహత్రయాతీతుడవు, కాలత్రయాతీతుడవు. నువ్వు మూలాధారంలోనే ఉంటావు. యోగులు నిత్యము నిన్ను ధ్యానిస్తారు. నువ్వే బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఇంద్ర, అగ్ని, వాయు, సూర్య, చంద్ర, స్వరూపుడవు. భూలోక భువర్లోక సువర్లోకాలు నువ్వే.

## అథ శ్రీ గణపత్యథర్వ శీర్షమ్

ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః భద్రం పశ్యేమాక్షభిర్య జత్రాః ।

స్థిరైరంగైః స్తుష్టువాంసస్తనూభిః వ్యశేమ దేవ హితం యదాయుః ॥

స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః । స్వస్తినః పూషా విశ్వవేదాః
స్వస్తిన స్తార్క్ష్యో అరిష్టనేమిః । స్వస్తినో బృహస్పతిర్దధాతు॥

*ఓం శాంతిః శాంతిః శాంతిః*

హరిః ఓం॥ లం॥ నమస్తే గణపతయే । త్వమేవ ప్రత్యక్షం తత్త్వమసి । త్వమేవ కేవలం కర్తాసి । త్వమేవ కేవలం ధర్తాసి । త్వమేవ కేవలం హర్తాసి । త్వమేవ సర్వం ఖల్విదం బ్రహ్మాసి । త్వం సాక్షాదాత్మాసి నిత్యమ్ ॥1

ఋతం వచ్మి । సత్యం వచ్మి ॥2

అవ త్వం మామ్ । అవ వక్తారమ్ । అవ శ్రోతారమ్ । అవ దాతారమ్। అవ ధాతారమ్ । అవానూచాన మవ శిష్యమ్ । అవ పశ్చాత్తాత్ । అవ పురస్తాత్ । అవోత్తరాత్తాత్ । అవ దక్షిణాత్తాత్ । అవ చోర్ధ్వాత్తాత్ । అవాధరాత్తాత్। సర్వతోమాం పాహి పాహి సమంతాత్ ॥3

త్వం వాఙ్మయస్త్వం చిన్మయః । త్వమానందమయ స్త్వం

బ్రహ్మమయః । త్వం సచ్చిదానందాద్వితీయోసి। త్వం ప్రత్యక్షం బ్రహ్మాసి । త్వం జ్ఞానమయో విజ్ఞానమయోసి ॥ 4

సర్వం జగదిదం త్వత్తో జాయతే । సర్వం జగదిదం త్వత్త స్తిష్ఠతి । సర్వం జగదిదం త్వయి లయమేష్యతి । సర్వం జగదిదం త్వయి ప్రత్యేతి । త్వం భూమిరాపోనలోనిలో నభః । త్వం చత్వారి వాక్పదాని 5

త్వం గుణ త్రయాతీతః। త్వం దేహత్రయాతీతః । త్వం కాలత్రయాతీతః। త్వం మూలాధారస్థితోసి నిత్యమ్ । త్వం శక్తి త్రయాత్మకః । త్వాం యోగినో ధ్యాయంతి నిత్యమ్ । త్వం బ్రహ్మా త్వం విష్ణుస్త్వం రుద్రస్త్వ మింద్రస్త్వ మగ్నిస్త్వం వాయుస్త్వం సూర్యస్త్వం చంద్రమాస్త్వం బ్రహ్మ భూర్భువస్సువరోమ్ 6

గణాదిం పూర్వముచ్చార్య। వర్ణాదిం తదనంతరమ్। అనుస్వారః పరతరః । అర్ధేందులసితమ్ । తారేణ రుద్ధమ్ । ఏతత్తవ మనుస్వరూపమ్ । గకారః పూర్వరూపమ్ । అకారో మధ్యమరూపమ్ । అనుస్వారశ్చాంత్యరూపమ్ । బిందురుత్తరరూపమ్ । నాదః సంధానమ్ । సంహితాసంధిః । సైషాగణేశవిద్యా। గణకఋషిః। నిచృద్ గాయత్రీ ఛందః। గణపతిర్దేవతా । ఓం గం గణపతయే నమః । ఏకదంతాయ విద్మహే । వక్రతుండాయ ధీమహి । తన్నో దంతిః ప్రచోదయాత్ ॥7

నిచృద్ గాయత్రీ ఛందః । గణపతిర్దేవతా । ఓం గం గణపతయే నమః ॥

**గణకఋషిః 1. నృచృద్గాయత్రీ ఛందః । మహాగణపతిర్దేవతా । గం బీజం । స్వాహా శక్తిః । గ్లాం కీలకం ఇష్టకామ్య సిద్యర్థే జపే వినియోగః**

గాం । గీం । గూ । గైం । గౌం । గః । ఇదిన్యాసము

**ఏకదంతం చతుర్హస్తం బిభ్రాణం పాశమంకుశమ్**

**అభయంవరదం హస్తైర్దధానం మూషిక ధ్వజమ్**

**రక్తం లంబోదరం శూర్పకర్ణం రక్తవాసనమ్**

**రక్తగంధాను లిప్తాంగం రక్తపుష్పై సుపూజితమ్**

**భక్తానుకంపనం దేవం జగత్కారణ మచ్యుతమ్**

**అవిర్భూతం చ సృష్ట్యాదౌ ప్రకృతే పురుషాత్పరమ్ ॥**

**ఏవం ధ్యాయతి యోనిత్యం సయోగీ యోగినాం వరః ।**

**నమోవ్రాతపతయే నమోగణపతయే నమః ప్రమథపతయే**

**నమస్తేస్తు లంబోదరాయ ఏకదంతాయ విఘ్ననాశినే**

**శివసుతాయ శ్రీవరవరద మూర్తయే నమోనమః**

మంత్రం : గం గణపతయే నమః

గమనిక : **మంత్రం గురువు గారి దగ్గర చెప్పుకుని మాత్రమే చెయ్యండి.**

ఈ మంత్రాన్ని జపం చేసినవాడు మహాపాతకాలు, ఉపపాతకాల నుంచి విముక్తుడవుతాడు. అతడికి ఏ ఆటంకాలు రావు. పగటిపూట ఈ ఉపనిషత్తును చదివితే రాత్రి చేసిన పాపము, రాత్రిపూట చదివితే పగలు చేసిన పాపము నశిస్తాయి. ధర్మార్థ కామ మోక్షాలు సిద్ధిస్తాయి.

మంత్రంమీద, భగవంతుడి మీద నమ్మకం లేని వారు ఈ మంత్రం తీసుకోరాదు. ఒకవేళ తీసుకుంటే వారికి అరిష్టం కలుగుతుంది.

ఏవైనా గడ్డు సమస్యలుండి, పనికాకపోయినట్లైతే ఈ ఉపనిషత్తును వెయ్యిసార్లు చదవండి. పనితప్పక పూర్తి అవుతుంది. ఇది అనుభవైక వేద్యము. అలా చదువుతున్న ప్రతిరోజు గణపతికి గరికతో పూజచేసి 21 ఉండ్రాళ్ళు నివేదన చెయ్యాలి.

గణపతిని గరికతో పూజిస్తే – కుబేరునితో సముడవుతాడు

పేలాలతో హోమం చేస్తే – కీర్తివంతుడౌతాడు

వెయ్యి ఉండ్రాళ్ళతో హోమం చేస్తే – కోరిన కోరిక తీరుతుంది

ఆజ్యహోమం – సర్వకామసిద్ధి

అష్టద్రవ్య హోమం – సర్వకామసిద్ధి

అష్టద్రవ్యాలుంటే

1. ఉండ్రాళ్ళు 2 బెల్లం 3. చెరకు 4. వరిపేలాలు 5. దానిమ్మ గింజలు 6.బెల్లం 7. అటుకులు 8. నల్లనువ్వులు. గణపతికి అష్టద్రవ్య హోమం ఎక్కువ ప్రీతి. ఉండ్రాళ్ళకు బదులు లడ్డూలు వాడొచ్చని ఎక్కడ ఉందో? ఏం రకం లడ్డూలు అవి? దీనికి తిరుగులేదు.ఇందులో ఉండ్రాళ్ళకు బదులుగా లడ్డూలు కూడా వాడవచ్చు.

# 41. దక్షిణామూర్తి ఉపనిషత్తు

ఇది కృష్ణయజుర్వేదానికి సంబంధించిన ఉపనిషత్తు. ఇందులో దక్షిణామూర్తి ఉపాసనకు మంత్రాలు చెబుతున్నారు.

పూర్వకాలంలో శౌనకాది మునీశ్వరులు మహాసత్రయాగం చేస్తున్నారు. ఆ సమయంలో మార్కండేయుడు అక్కడికి వచ్చాడు. ఆయన దగ్గరకు పోయి మహర్షులు "ఓ మహానుభావా ! నువ్వు మహాజ్ఞానివి. నీకు ఈ ఆత్మస్థితి ఎలా వచ్చింది? అని అడిగారు. ఓ మహర్షులారా! శివతత్త్వజ్ఞానం వల్ల నాకు ఈ స్థితి వచ్చింది అని చెప్పాడు మార్కండేయుడు. శివతత్త్వజ్ఞానమంటే ఏమిటి? అది ఎలా వస్తుంది? దీనికి దేవత ఎవరు? జపం ఏది? ఈ విషయాలన్నీ చెప్పవలసింది అన్నారు. అప్పుడు మార్కండేయుడు చెబుతున్నాడు.

దక్షిణదిక్కుగా తిరిగి ఉన్న ఈశ్వరుడే దక్షిణామూర్తి. ప్రళయ కాలంలో జగత్తంతా తనలో లీనం చేసుకుని, బ్రహ్మానందం అనుభవిస్తూ ఉంటాడు. ఆ దక్షిణామూర్తిని ప్రార్థిస్తే శివతత్త్వజ్ఞానం వస్తుంది. దానికి సంబంధించిన మంత్రాలు మీకు చెబుతాను అంటూ చెప్పటం ప్రారంభించాడు మార్కండేయుడు.

## దక్షిణామూర్తి ఉపనిషత్తు-1

## మేధాదక్షిణామూర్తి

అస్యశ్రీ దక్షిణామూర్తి మహామంత్రస్య బ్రహ్మఋషి । గాయత్రీ ఛందః । శ్రీ దక్షిణామూర్తిః పరమాత్మా దేవతాః ఓం బీజం । స్వాహాశక్తిః । నమః కీలకం । జ్ఞాన సిద్ధ్యర్థే జపే వినియోగః ॥

ఓం ఆం ఓం ॥ ఓం ఈం ఓం ॥ ఓం ఊం ఓం ॥ ఓం ఐం ఓం ॥ ఓం ఔం ఓం ॥ ఓం అః ఓం ॥ ఇతి కర హృదయాదిన్యాసః ॥

భస్మవ్యాపాండురాంగః శశిశకలధరో జ్ఞానముద్రాక్షమాలా
వీణాపుస్తై ర్విరాజత్కరతలకమలో యోగపట్టాభిరామః ।
వ్యాఖ్యాపీఠే నిషణ్ణో మునివరనికరై స్సేవితః సుప్రసన్నః
సవ్యాళః కృత్తివాసా స్సతతమవతునో దక్షిణామూర్తి రీశః ॥

మమః ॥ ఓం నమోభగవతే దక్షిణామూర్తయే మహ్యం మేధాం ప్రజ్ఞాం ప్రయచ్ఛస్వాహా ॥

## దక్షిణామూర్తి ఉపనిషత్తు-2

### నవాక్షరో దక్షిణామూర్తి

అస్యశ్రీ దక్షిణామూర్తి మహామంత్రస్య శుకఋషిః । విరాట్ఛందః । శ్రీదక్షిణామూర్తి ర్దేవతా । శ్రీం బీజం । నమశ్శక్తిః । శివాయేతి కీలకం । మేధా సిద్ధ్యర్థే జపే వినియోగః ॥

ఓం శ్రీం ఆం ॥ ఓం శ్రీం ఈం ॥ ఓం శ్రీం ఊం ॥ ఓం శ్రీం ఐం ॥ ఓం శ్రీం ఔం ॥ ఓం శ్రీం అః ॥ ఇతి కరహృదయాది న్యాసః ॥

శుద్ధస్ఫటిక సంకాశం శశిఖండ విభూషితం
వ్యాఘ్ర చర్మధరం శాంతం జటామకుట మండితం ।
ముఖపంకరుహోల్లాసం సోమసూర్యాగ్ని లోచనం

భావయామి మహాదేవం దక్షిణామూర్తి విగ్రహమ్ ॥
మనుః ॥ ఓం శ్రీం నమశ్శివాయ ఓం శ్రీం ॥

# దక్షిణామూర్తి ఉపనిషత్తు-3

## హంసదక్షిణామూర్తిః

అస్యశ్రీ హంస దక్షిణామూర్తి మహామంత్రస్య బ్రహ్మాఋషిః । గాయత్రీ ఛందః । శ్రీ హంస దక్షిణామూర్తిర్దేవతా । ఓం బీజం । నమశ్శక్తిః । సోహం కీలకం । విద్యాసిద్ధ్యర్థే జపే వినియోగః ॥

అం ఓం ఆం ॥ ఇం ఓం ఈం ॥ ఉం ఓం ఊం॥ ఏం ఓం ఐం ॥ ఓం ఓం ఔం ॥ అం ఓం అః ॥ ఇతి కరహృదయాదిన్యాసః ॥

ధ్యాయేత్పద్మాసనస్థం హృదిరవికమలే సూపవిష్టం వరేణ్యం
సచ్చి ద్బ్రహ్మామృతాఖ్యం రవిశశిదహన ఖ్యాతివిజ్ఞప్తి నేత్రం
।
చంద్రార్కానుప్రదీప్త ప్రథితనిజతనుం చంద్ర చూడావతంసం
శంభుం దేవాధినాథం పశుపతి మమలం దక్షిణామూర్తి మాద్యమ్ ॥

మనుః ॥ ఓం నమో భగవతే దక్షిణామూర్తయే హంసస్సోఽ హం మహ్యం మేధాం ప్రజ్ఞాం ప్రయచ్ఛ స్వాహా ॥

# దక్షిణామూర్తి ఉపనిషత్తు-4

## సాంబదక్షిణామూర్తి

అస్యశ్రీ సాంబదక్షిణామూర్తి మహామంత్రస్య శుకఋషిః । విరాట్ఛందః । శ్రీ సాంబ దక్షిణామూర్తిర్దేవతా । ఓం ఐం బీజం । నమః క్లీం శక్తిః । శివాయ సౌః కీలకం । ప్రజ్ఞాన సిద్ధ్యర్థే జపే వినియోగః ॥

ఓం ఐం ॥ నమః క్లీం ॥ శివాయ సౌః ॥ ఓం ఐం ॥ నమః క్లీం ॥ శివాయ సౌః ॥ ఇతి కరహృదయాదిన్యాసః ॥

వామోరూపరిసంస్థితాం గిరిసుతా మన్యోన్య మాలింగితాం
శ్యామా ముత్పలచారిణీం శశినిభం చాలోకయంతం శివం
ఆశ్లిష్టేన కరేణ పుస్తకమథో కుంభం సుధాపూర్ణకం
ముద్రాం జ్ఞానమయీం దధాన మపరే ముక్తాక్ష మాలాంభజే
॥

మనుః ॥ ఓం ఐం నమః క్లీం శివాయ సౌః ॥

# దక్షిణామూర్తి ఉపనిషత్తు-5

## దక్షిణామూర్తి మాలాః

అస్యశ్రీ దక్షిణామూర్తి మాలామంత్రస్య బ్రహ్మాఋషిః । గాయత్రీ ఛందః । శ్రీదక్షిణామూర్తిః పరమాత్మా దేవతా । ఓం బీజం । స్వాహాశక్తిః । షట్కీలకం । జ్ఞానసిద్ధ్యర్థే జపే వినియోగః ।

భస్మవ్యా పాండురాంగః ... దక్షిణామూర్తి రీశః ॥

**ఓం ఆం ఓం ॥ ఓం ఈం ఓం ॥ ఓం ఊం ఓం ॥ ఓం ఐం ఓం ॥ ఓం ఔం ఓం ॥ ఓం అః ఓం ॥ ఇతి కర హృదయాదిన్యాసః ॥**

**భస్మవ్యాపాండురాంగః శశిశకలధరో జ్ఞానముద్రాక్షమాలా**
**వీణాపుస్తై ర్విరాజత్కరతలకమలో యోగపట్టాభిరామః ।**
**వ్యాఖ్యాపీఠే నిషణ్ణో మునివరనికరై స్సేవితః సుప్రసన్నః**
**సవ్యాళః కృత్తివాసా స్సతతమవతునో దక్షిణామూర్తి రీశః ॥**

మనుః ॥ ఓం ఐం హ్రీం సౌః ఓం నమో భగవతే మేధాదక్షిణామూర్తయే విద్యా మేధా ప్రజ్ఞాదాయినే పుస్తక రుద్రాక్షమాలా ధారిణే సకల సామ్రాజ్యప్రదాయినే పరమ సదాశివ గురుమూర్తయే మమ చతుష్షష్టి కళావిద్యాః ప్రదాపయ ప్రదాపయ బ్రహ్మరాక్షస గణా నుచ్చాటయ ఉచ్చాటయ మేధాం ప్రజ్ఞా దాపయ దాపయ ఓం సౌః హ్రీం ఐం ఓం హుంఫట్స్వాహా ॥

# 42. శరభోపనిషత్తు

ఇది అథర్వణ వేదానికి సంబంధించినది. ఇందులో మొత్తం తొమ్మిది మంత్రాలున్నాయి.

ఒకసారి పిప్పలాదుడు బ్రహ్మ దగ్గరకు వెళ్ళి "ఓ బ్రహ్మదేవా! త్రిమూర్తులలో గొప్ప వారెవరు?" అని అడిగాడు. ఆ మాటలు విన్న బ్రహ్మదేవుడు. 'ఓ పిప్పలాదా! ఎవరు ఎనలేని పుణ్యకార్యాలు చేస్తారో వారికి ఈ పరమేశ్వరుడు లభిస్తాడు. నేను ఎవరి శరీరము నుంచి పుట్టానో, ఇంద్రుడు. విష్ణువు ఇతర దేవతలు ఎవరివలన పుట్టారో అతడే ప్రభువు. లోకాలకన్నింటికీ అతడే తండ్రి.

**యో బ్రహ్మాణం విదధాతి తస్మైవేదాంశ్చ సర్వాన్ ప్రహిణోతి చాగ్ర్యమ్**

**తం వై ప్రభుం పితరం దేవతానామ్ మమాపి విష్ణోర్జనకం దేవమీడ్యమ్**

**యోంతకాలే సర్వలోకాన్ సంజహార స ఏకః శ్రేష్ఠశ్చ సర్వశాస్త్రా స ఏవ**

**యో ఘోరం వేష మాస్థాయ శరభాఖ్యం మహేశ్వరః**

**నృసింహం లోకహంతారం సంజఘాన మహాబలః**

**హరిగ్ం హరం తం పాదాభ్యా మనుయాంతి సురేశ్వరాః**

**మావధీః పురుషం విష్ణుం విక్రమస్వ మహానిశి**

**కృపయా భగవా న్విష్ణుం విదదార నఖైః ఖరైః**

**చర్మాంబరో మహావీరో వీరభద్రో బభూవ హ**

**స ఏకో రుద్రో ధ్యేయ స్స ర్వేషాం సర్వసిద్ధయే**

**యో బ్రహ్మణః పంచమవక్త్ర హంతా తస్మై రుద్రాయ నమో అస్తు**

**యోపి స్ఫులింగేన లలాటజేన సర్వం జగద్భస్మసా ద్వై కరోతి॥**

బ్రహ్మదేవుని సృష్టించి అతడికి వేదాలు ప్రసాదించిన వాడిని, దేవతలకు తండ్రిని, మోహములో కూరుకుపోయిన వారు తెలుసుకోలేరు. ప్రళయకాలంలో లోకాలన్నింటినీ ఎవరు లయంచేస్తారో, అతడే శ్రేష్ఠుడు. అతడే సర్వజగత్తులు శాసించేవాడు. ఏ మహేశ్వరుడు శరభమంటే ఘోరమైన రూపాన్ని ధరించి మహాబలవంతుడై, విష్ణువును, నృసింహుణ్ణి జయించాడో, ఆ శివుణ్ణి దేవతలంతా; ఆయన పాదాలమీద పడి 'ఓదేవా! చంపద్దు, చంపద్దు' అని ప్రార్థించగా ఆ పరమేశ్వరుడు దయతో వాడియైన గోళ్ళతో చీరినాడు. ఈ కారణంచేతనే మహావీరుడు చర్మాంబరధారి అయిన రుద్రుడు వీరభద్రుడైనాడు. ఆ రుద్రుడే అందరికీ ధ్యానింపతగినవాడు. బ్రహ్మయొక్క ఐదవ ముఖాన్ని నరికిన రుద్రుడికి నమస్కారము. తన మూడవ నేత్రముతో జగత్తులను భస్మము చేయగల రుద్రునికి నమస్కారము. ఈ లోకాలను భస్మంలో చేసి తిరిగి సృష్టించిన ఆ రుద్రునికి నమస్కారము.

**పునశ్చ సృష్ట్వా పునరప్యరక్ష దేవగ్ం స్వతంత్రం ప్రకటీకరోతి**

**తస్మై రుద్రాయ నమో అస్తు। యో వామపాదేన జఘాన కాలం**

**ఘోరం పపావథ హాలాహలం తమ్ తస్మై రుద్రాయ నమో**

అస్తు ।

యో వామపాదార్చిత విష్ణునేత్ర స్తస్మై దదౌ చక్రమతీవ హృష్టః

తస్మై రుద్రాయ నమో అస్తు । యో దక్షయజ్ఞే సురసంఘా

న్విజిత్య విష్ణుం బబంధోరు పాశేన వీరః తస్మై రుద్రాయ నమో అస్తు ॥

ఏ మహాదేవుడు తన ఎడమకాలితో యముణ్ణి తన్నాడో, ఎవరు క్షీరసాగరాన్ని మథించినప్పుడు వచ్చిన హాలాహలాన్ని మ్రింగేశాడో, ఆ రుద్రుడికి నమస్కారము. ఎవరి పాదముపైన విష్ణువు నేత్రముతో అర్చించగా మెచ్చి విష్ణువుకు చక్రాన్ని ప్రసాదించాడో ఆ రుద్రుడికి నమస్కారము. దక్షయజ్ఞం సమయంలో దేవతలందరినీ జయించి విష్ణువును పెద్దత్రాడుతో బంధించిన రుద్రుడికి నమస్కారము.

యో లీలయైవ త్రిపురం దదాహ కామం కాలం సోమసూర్యాగ్ని నేత్రః

సర్వే దేవాః పశుతా మవాపుః స్వయం తస్మా త్పశుపతి ర్బభూవ

తస్మై రుద్రాయ నమో అస్తు ।

యో మత్స్యకూర్మాది వరాహ సింహో న్విష్ణుం క్రమంతం వామన మాదివిష్ణుమ్

వివిక్లబం పీడ్యమానం జఘాన భస్మీచకార మన్మథం యమంచ

తస్మై రుద్రాయ నమో అస్తు ।

ఏవం ప్రకారేణ బహుధా ప్రతుష్ట్వా క్షమాపయామాసు
శ్రీనీలకంఠం మహేశ్వరమ్॥

ఎవరు విలాసంగా త్రిపురాసురులను సంహరించారో, ఎవరికి సూర్య చంద్రాగ్నులు నేత్రాలో, ఎవరు దేవతలందరినీ పశువులుగా చేసి తాను పశుపతి అయ్యాడో. ఆ రుద్రునికి నమస్కారము. మన్మథుణ్ణి, యముడిని భస్మము చేసినవాడు అయిన రుద్రునికి నమస్కారము. దేవతలంతా ఈశ్వరుణ్ణి ఈ రకంగా స్తుతించి క్షమించమని వేడుకున్నారు.

తాపత్రయాలతోను, జన్మమృత్యుజరాదులతోను కూడిన దుఃఖాలన్నీ పరమేశ్వరుడు హరించి వేశాడు. ఇలా మంత్రాలతో స్తుతించబడే మహేశ్వరుడే దేవతలకు ఆత్మ. ఆ శంకరుడే ప్రజలను రక్షించాడు. ఆ మహాదేవుని పాదపద్మాలను విష్ణువు ఇప్పటికీ వెతుకుతూనే ఉన్నాడు. ఆ పరమేశ్వరుని భక్తితో పూజిస్తున్న విష్ణువును అనుగ్రహించాడు. ఆ మహేశ్వరుడే పరమేశ్వరుడు. అటువంటి ఆనందబ్రహ్మను ఎరిగిన వారికి భయమనేది ఉండదు. ప్రాణియొక్క హృదయము అనే గుహలో అణువు కన్న చిన్నది, మహత్తుకన్న పెద్దది అయిన ఆత్మ ఉన్నది. పరమేశ్వరుని అనుగ్రహము వల్ల శోకమోహాలకు అతీతమైన వారు మాత్రమే అతన్ని తెలుసుకోగలుగుతారు. సిద్ధులచే హృదయమున స్తుతించబడినవాడు, పరమేశ్వరుడు సత్యుడు, నిత్యుడు, శాశ్వతుడు. అతడు నిర్వికల్పుడు, నిరంజనుడు, (నిరాఖ్యుడు) పేరు లేనివాడు, ఊహించటానికి వీలులేనివాడు, తనకు ప్రభువుఎవరూ లేనివాడు, అయిన రుద్రునికి నమస్కారము. రుద్రునికన్న వేరు దైవము లేదు. అటువంటి రుద్రుడికి నమస్కారము.

రుద్రుని మహాత్మ్యాన్ని చెప్పటానికి పరమాత్మ కూడా శక్యం కాదు. అటువంటి రుద్రుడికి నమస్కారము. రుద్రుణ్ణి ధ్యానించి ఆయన కృపకు పాత్రుడు కావాలి. అటువంటి వాడికి రుద్రలోకనివాసం కలుగుతుంది. అతడికి జన్మరాహిత్యం కలుగుతుంది. అతడికి పునర్జన్మ ఉండదు.

# 43. బృహజ్జాబాలోపనిషత్తు

ఇది అధర్వణ వేదానికి సంబంధించినది. ఇందులో ఎనిమిది అధ్యాయాలు ఉన్నాయి. వాటినే బ్రాహ్మణములు అని పిలుస్తారు ఈ రకంగా ఇందులో ఎనిమిది బ్రాహ్మణాలున్నాయన్న మాట. ఇందులో భస్మతయారీ విధానము, త్రిపుండ్రధారణ, భస్మస్నానము భస్మ మాహాత్మ్యము, రుద్రాక్ష మాహాత్మ్యము, ఉపనిషత్తు మాహాత్మ్యము వివరించబడ్డాయి. **భస్మాన్ని గురించి పూర్తిగా వివరించే అద్భుతమైన ఉపనిషత్తు ఇది.**

పూర్వకాలంలో సృష్టికి ముందు జగత్తంతా నీరు ఉండేది. అప్పుడు అతడికి సృష్టి చెయ్యాలనే సంకల్పం కలిగింది. అన్నింటికన్న ముందు మనస్సులో కామం కలిగింది. కాబట్టి ప్రజాపతి సంతతిలోని ఏ పురుషుడైనా సరే తాను మనస్సులో ఏమనుకుంటాడో వాక్కుతో అదే చెబుతాడు. అదే పనిచేస్తాడు. ఇలా కామాన్ని గురించి తెలుసుకున్నవాడు ఏమి కావాలనుకుంటే అది జరుగుతుంది. ఆ తరువాత ప్రజాపతి తపస్సు చేశాడు.

భుసుండుడు కాలాగ్నిరుద్రుడి దగ్గరకు వచ్చి 'స్వామీ నాకు బృహజ్జాబాలము అనే ముక్తికోపనిషత్తును నాకు వివరించండి' అన్నాడు. కాలాగ్నిరుద్రుడు చెప్పటం మొదలుపెట్టాడు.

1. మొదట సద్యోజాతము నుండి భూమి పుట్టింది. దానినుంచి కపిలవర్ణ గోవు (నంద) పుట్టింది. ఆ గోమయము నుండి విభూతి పుట్టింది.
2. వామదేవుని నుంచి జలము పుట్టింది. దానినుంచి ప్రతిష్ట కలిగింది. దానినుంచి కృష్ణవర్ణ అయిన భద్ర అనే గోవు పుట్టింది.

ఆ గోమయము నుంచి భసితము పుట్టింది.

3. అఘోరుని నుంచి అగ్ని పుట్టింది దానినుంచి విద్య కలిగింది. దాని నుంచి రక్తవర్ణ అయిన గోవు సురభి పుట్టింది. ఆ గోమయం నుంచి భస్మ పుట్టింది.

4. తత్పురుషుని నుంచి వాయువు పుట్టింది. దానినుంచి శాంతి కలిగింది. దానినుంచి తెల్లనిఆవు సుశీల పుట్టింది. ఆ గోమయము నుంచి క్షారము కలిగింది.

5. ఈశానుని నుంచి ఆకాశము వచ్చింది. దానినుంచి అతీతమైన శాంతి కలిగినది. దానినుంచి చిత్రవర్ణ అయిన గోవు సుమన పుట్టింది. ఆ గోమయం నుంచి రక్ష కలిగింది.

ఈ రకంగా విభూతి, భసితము, భస్మ, క్షారము, రక్ష అని భస్మానికి ఐదు పేర్లున్నాయి.

1. ఐశ్వర్యానికి కారణము కాబట్టి – విభూతి
2. సర్వపాపాలనుంచి రక్షించేది – భస్మ
3. ప్రకాశించేది – భసితము
4. ఆపదలు నాశనం చేస్తుంది కాబట్టి – క్షారము
5. భూత ప్రేత పిశాచ బ్రహ్మరాక్షస అపస్మారముల వల్ల కలిగే భయం పోగొట్టేది కాబట్టి రక్ష అనబడుతుంది.

**భస్మం తయారుచేసే విధానం :**

భస్మం తయారుచెయ్యాలంటే ముందుగా గోమయం కావాలి. గోమయం సేకరించటానికి తగిన గోవుని ముందుగా ఎంచుకోవాలి. వీటిలో కపిలగోవు, తెల్లని ఆవు. ఈ రెండూ శ్రేష్టమైనవి. ఇక విచిత్రమైన అవయవాలు కలది, కుంటిది, గ్రుడ్డిది, అవయవాలు సరిగా లేనిది,

పిచ్చెక్కినది. పొగరుబోతు, పాడిచేది, శాంతమూర్తి కానిది, దూడలేనిది, పాలివ్వనిది, బాగా ముసలిది, ఓపిక లేనిది, తలవెంట్రుకలు, గుడ్డలు, ఎముకలు, మాంసము తినేది, రోగంతో ఉన్నది, ఈ గోవులు గోమయ సేకరణకు పనికిరావు. అంటే ఈ రకమైన ఆవుపేడ విభూదికి పనికిరాదు. విభూది తయారు చెయ్యటానికి శుభలక్షణాలున్న మంచి ఆవులనే ఎన్నుకోవాలి. చతుర్దశి రోజున ఉపవాసముండి ఆ మరునాడు ఉదయమే స్నానంచేసి, తెల్లవారక ముందే గోశాలలోకి వెళ్ళి ముందుగా ఎంచుకున్న ఆవును తట్టిలేపాలి. అలా లేచిన ఆవు మలమూత్ర విసర్జన చేస్తుంది. అప్పుడు మనతోపాటుగా తెచ్చుకున్న బంగారు, వెండి, రాగి, మట్టిపాత్రలలో గోమయము, గోమూత్రము విడివిడిగానే తీసుకోవాలి. గోమయం కోసం బయలుదేరినప్పటినుంచి వేదపారాయణ చేస్తూనే ఉండాలి. గోమయము నేలమీద పడకుండానే సేకరించాలి. ఒకవేళ నేలమీద పడినది, సేకరించవలసి వస్తే నేల యొక్క పవిత్రతను చూడాలి.

గోమయం సేకరించే ఆవు సంపూర్ణ ఆరోగ్యంగా ఉండాలి. అది తిన్న ఆహారం పూర్తిగా జీర్ణం కావాలి. కొన్ని ఆవులకు అవి తిన్న ధాన్యపు గింజలు అరగకుండా అలాగే పేడతోపాటుగా బయటకు వచ్చేస్తాయి. అలా వచ్చిన గింజలు శుభ్రం చేసి వాటిని వండి ఆహారంగా తీసుకుంటే స్త్రీలకు గర్భకోశవ్యాధులు నశిస్తాయి అని శాస్త్రం చెబుతోంది. 'గాయత్రీ పరివార్' సంస్థను స్థాపించిన పండితరాయశర్మ గారు ఆ గింజలను వండి ఆహారంగా తీసుకుంటూ హిమాలయాల్లో తపస్సు చేశారట.

ఆరోగ్యంగా ఉండే ఆవునుంచి వచ్చే పేడ కడులుకడులుగా

చూడటానికి కూడా అందంగా ఉంటుంది. అలా గట్టిగా ఉన్న గోమయము, గోమూత్రము విడివిడిగా పాత్రలలో సేకరించాలి. తరువాత గట్టిగా ఉన్న గోమయంలో కొద్దిగా గోమూత్రం కలిపి చిన్న చిన్న ఉండలుగా చేసి మంచి శుభ్రమైన పళ్ళెంలో పెట్టి ఎండలో పెట్టాలి. ఒక ఆవునుంచి సేకరించిన గోమయం (ఒకపేడకడి)తో 14 ఉండలు మాత్రమే చెయ్యాలి. విభూది ఇంకా ఎక్కువ కావాలంటే ఎక్కువ గోమయం సేకరించాలి. ఆ ఉండలు బాగా ఎండిన తరువాత తిథి వార నక్షత్రాలు చూసి మంచిరోజున హోమం చెయ్యాలి. ఆ హోమానికి సమిధలు ఈ గోమయం పిండాలు (ఆవుపేడ ముద్దలు) ఇక్కడ ఆజ్యహోమం చెయ్యాలి. హోమం చేసేటప్పుడు రుద్రమంత్రాలు చదవాలి. అంటే రుద్రహోమం చెయ్యాలి. పేడ ఉండలన్నీ బాగా కాలేదాకా హోమం చెయ్యాలి. తరువాత ఆజ్యపూర్ణాహుతి చేసి హోమకుండంలో అగ్నిని. ఊకతో కప్పిపెట్టాలి. లోపల అగ్నిమాత్రం ప్రజ్వరిల్లుతూనే ఉంటుంది. ఇలా నాలుగయిదు రోజులపాటు ఆపేడ ఉండలు బాగా కాలాలి. అవన్నీ మెత్తగా, తెల్లగా అయ్యేటట్లుగా కాలిపోవాలి. ఆ తరువాత ఒక మంచి రోజున శుచియై వేదమంత్రాలు చదువుతూ జాగ్రత్తగా హోమకుండంలోని ఊకను తొలగించి కాలిపోయిన పేడ ఉండలు చితికిపోకుండా జాగ్రత్తగా ఒకపాత్రలోకి సేకరించాలి. అలా సేకరించిన భస్మము అంతా పొడిగా చేసి అందులో పచ్చకర్పూరము, జాజికాయ, జాపత్రి, కర్పూరము, కస్తూరి, అగరువంటి సుగంధ ద్రవ్యాలు మెత్తగా పొడిగా కొట్టి జల్లించి భస్మంలో కలపాలి. ఇప్పుడు భస్మంలో మంచి గంధం, నీరు కొద్దిగా పోసి బాగా కలిపి చిన్న చిన్న ఉండలుగా చేసి ఎండబెట్టుకోవాలి. ఈ రకంగా భస్మం తయారవుతుంది. ఇప్పుడు సద్యోజాతాది మంత్రాలతో

భస్మాన్ని లలాటము, భుజాలు, మనికట్టు, వక్షస్థలము, ఉదరము ఈ ఐదు చోట్ల రాచుకోవాలి. అయితే శివానుష్టానపరుడు మాత్రం వంటినిండా భస్మధారణ చెయ్యాలి.

ఈ భస్మకల్పము నాలుగు విధాలుగా ఉన్నది. 1. అనుకల్పము 2. ఉపకల్పము 3. ఉపాసకల్పము 4. అకల్పము.

1. విరజాగ్ని నుంచి పుట్టినది – అనుకల్పము

   పవిత్రమైన అగ్నిలో హోమం చేసి తయారుచేసినది అన్న మాట.

2. అడవిలో ఎండిన గోమయమును సేకరించి, తయారుచేసినది – ఉపకల్పము

3. అడవిలో ఎండిపోయిన గోమయాన్ని పొడిచేసి, గోమూత్రముతో బాగా కలిపి ముద్దలుగా తయారుచెయ్యటం. ఉపాసకల్పము.

4. శివాలయంలో ఉన్న విభూది అకల్పము.

ఇందులో ఏ రకమైన భస్మమైనా సరే మానవుడి పాపాలన్నింటి నుంచీ విముక్తి కలిగిస్తుంది.

**భస్మస్నానము :** భస్మస్నానము రెండు రకాలుగా ఉన్నది. 1. మలస్నానము 2. విధిస్నానము

**1. మలస్నానము :** భస్మాన్ని రెండుచేతులతోను దాచి ప్రణవంతో మంత్రించి శిరస్సు మొదలైన అంగాలకు పూసుకోవాలి. అది మలస్నానము అనబడుతుంది.

**2. విధిస్నానము :** భస్మాన్ని చేతులతో తీసుకుని

1. ఈశాన మంత్రముతో – శిరస్సు
2. తత్పురుష మంత్రంతో – ముఖాన
3. అఘోరేభ్యః మంత్రంతో – తొడలు
4. వామదేవ మంత్రంతో – గుహ్యప్రదేశాలు
5. సద్యోజాత మంత్రంతో – సర్వాంగ ములందు రాచుకోవాలి.

దీన్ని విధిస్నానము అంటారు. ఈ భస్మాన్ని ఆపాదమస్తకము రాసుకోవచ్చును. మానవుడు అశుచి అయినప్పుడు భస్మస్నానము చెయ్యాలి.

**త్రిపుండ్రవిధి :** త్రిపుండ్రములు బ్రహ్మ విష్ణు శివాత్మకాలు. తర్జని, మధ్యమ, అనామిక మూడు వ్రేళ్ళతోను భస్మధారణ చెయ్యాలి. లేదా అనామిక, మధ్యమ, అంగుష్టము మూడువ్రేళ్ళతో చల్లుకోవాలి. శరీరంమీద 32,16,8,5 స్థానముందు భస్మలేపనం చెయ్యాలి.

**32 స్థానాలు :** శిరస్సు, నొసలు, చెవులు, కనులు, ముక్కు, నోరు, కంఠము, రెండుమూపులు, మోచేతులు, మణికట్టు, వక్షస్థలము, పక్కలు, నాభి, గుహ్యము, తొడలు, చీలమండలు, పిక్కలు, మోకాళ్ళు, పిఱ్రలు, పాదాలు. ఇవి శివుని అష్టమూర్తులు, అష్టవసువులు, అష్టదిక్పాలకులు, అష్టవిద్యేశులు.

**16 స్థానాలు :** మూర్ధము, లలాటము, రెండుచెవులు, ముక్కు, బాహుద్వయము, హృదయము, నాభి, ఊరువులు, మోకాళ్ళు, పాదాలు, వీపు. ఇవి 16 స్థానాలు. శివుడు, ఇంద్రుడు, రుద్రుడు, సూర్యుడు, విఘ్నేశ్వరుడు, విష్ణువు, లక్ష్మి, హృదయేశుడు, ప్రజాపతి, నాగుడు, నాగకన్య, ఇద్దరు ఋషికన్యలు, పాదముల యందు సముద్రాలు,

పుష్పమున తీర్థములు అధిదేవతలు.

**8 స్థానాలు :** శిరస్సు, లలాటము, చెవులు, భుజాలు, హృదయము, నాభి ఇవి ఎనిమిది స్థానాలు. వీటికి బ్రహ్మ, సప్తఋషులు అధిదేవతలు.

**5 స్థానాలు :** శిరస్సు, బాహువులు, హృదయము నాభి.

ఇవికాక దేశాచారము, గ్రామాచారము ప్రకారము భస్మధారణ చెయ్యవచ్చును.

| | |
|---|---|
| లలాటము | – బ్రాహ్మణే నమః |
| హృదయము | – హవ్యవాహనాయ నమః |
| నాభి | – స్కందాయ నమః |
| గళము | – విష్ణవే నమః |
| మధ్యమందు | – ప్రభంజనాయ నమః |
| మణికట్టు | – వసుభ్యో నమః |
| వీపున | – హరయే నమః |
| మూపున | – శంభవే నమః |
| శిరస్సున | – పరమాత్మనే నమః |

అంటూ త్రిపుండ్రధారణ చెయ్యాలి. భస్మధారణ వల్ల చేసిన పాపం అంతా పోతుంది.

కంఠమున ధరించటం వల్ల– కంఠంపై భాగంతో చేసిన పాపం పోతుంది

| | |
|---|---|
| కర్ణములందు ధరిస్తే | – కర్ణరోగాలు పోతాయి |
| బాహులందు ధరిస్తే | – చేతులతో చేసిన పాపము |

పోతుంది

రొమ్మున ధరిస్తే - మనసుతో చేసిన పాపము పోతుంది

పక్కలందు ధరిస్తే - పరస్త్రీ ఆలింగనము వచ్చిన పాపము పోతుంది

భస్మధారణ శరీరమంతా చెయ్యవచ్చును. త్రిపుండ్రములు త్రిమూర్తుల రూపము, త్రేతాఙ్నులరూపము, త్రిగుణాత్మకము, త్రిలోకాత్మకము. కాబట్టి ప్రతివారుకూడా పవిత్రమైన భస్మాన్ని ధరించాలి.

బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు అగ్నిహోత్రము నుండి వచ్చిన భస్మము ముఖ్యము. గృహస్తులకు - విరజాగ్ని నుండి వచ్చినది, మహర్షులకు - విరజాగ్ని నుంచి వచ్చినది ముఖ్యము.

గృహస్థులకు - ఔపాసనాగ్ని నుంచి తీసినది

బ్రహ్మచారికి - సమిధల నుంచి తీసినది

శూద్రులకు - శ్రోత్రియుల ఇంట వంట చేసుకునే అగ్ని నుంచి వచ్చిన భస్మము ముఖ్యము.

యతులకు భస్మము-జ్ఞానాన్నిస్తుంది

వానప్రస్తలకు - విరక్తి నిస్తుంది

వర్ణాశ్రమాతీతులకు - స్మశాన భస్మము ప్రశస్తము.

దేవాలయాల్లోని భస్మాన్ని అందరూ ధరించవచ్చు. విభూది ధరించనివాడు వేదాలు చదవరాదు. అన్ని ఆచారాలు వదలివేసినా సరే త్రిపుండ్రధారణ చేత పవిత్రుడౌతాడు. త్రిపుండ్రములు ధరించిన

వాడికి ఏ పాపములు ఉండవు.

**భస్మ మాహాత్మ్యము :** పూర్వకాలంలో వసిష్ఠుని వంశంలోని ధనుంజయుడు అనే బ్రాహ్మణుడు ఒకడు ఉండేవాడు. అతనికి వందమంది భార్యలు. పెద్దభార్య పెద్ద కుమారుడు కరుణుడు అతని భార్య శుచిస్మిత. ఒకరోజున కరుణుడు గంగానదీ తీరంలోని నృసింహస్వామి ఆలయానికి వెళ్ళాడు. అక్కడ ఒక భక్తుడు స్వామివారికి ఒక నిమ్మపండు సమర్పించాడు. కరుణుడు ఆ పండును వాసన చూశాడు. దాంతో అక్కడ ఉన్న భక్తులు కోపించి కరుణుణ్ణి ఈగగా పుట్టి వంద సంవత్సరాలు జీవించమని శపించారు. కరుణుడు ఆశ్రమానికి వెళ్ళి ఈ వృత్తాంతమంతా భార్యకు చెప్పి ఈగగా మారిపోయాడు. అది చూసి సహించలేక జ్ఞానులు ఆ ఈగను చంపేశారు. అప్పుడు అతని భార్య సుచిశ్మిత చచ్చిపోయిన ఈగను తీసుకుని అరుంధతి దగ్గరకు వెళ్ళి తన భర్తను ఎలాగైనా సరే బ్రతికించమని వేడుకుంది. అప్పుడు అరుంధతి చిటికెడు విభూతి తీసుకుని మృత్యుంజయ మహామంత్రంతో మంత్రించి ఈగమీద వేసింది. వెంటనే ఆ ఈగ బ్రతికింది. ఆ తరువాత వంద సంవత్సరాలు జీవించి శాపవిమోచనం పొందింది.

భస్మమాహాత్మ్యము తెలిపే కథ ఇంకోటుంది. పూర్వకాలంలో ఒకసారి శ్రీమహావిష్ణువు శివుని వక్షస్థలాన ఉన్న విభూతిని గోటితో తీసుకుని నోట్లో వేసుకున్నాడు. ఆ వెంటనే పరిశుద్ధమైన తెల్లరంగుతో ఈశ్వరుని వంటి సమానఛాయతో ప్రకాశించాడు. అందుచేత విభూతి సంపద కలిగిస్తుంది. దీనికి ముందు వసువులు, కుడివైపు రుద్రులు, ఎడమవైపు విశ్వేదేవతలు. వెనకవైపు ఆదిత్యులు, నాభియందు

త్రిమూర్తులు, రెండు పక్కలా సూర్యచంద్రులు ఉంటారు. విబూతి ధరించినవాడి కోరికలన్నీ తీరతాయి. విభూతి బ్రహ్మమయము. ఈ విషయం తెలుసుకున్నవాడు గొప్పవాడు అవుతాడు.

జనక మహారాజు ఒకసారి యాజ్ఞవల్క్యునితో త్రిపుండ్రవిధి చెప్పమని అడిగాడు. దానికి యాజ్ఞవల్క్యుడు సద్యోజాతాది మంత్రాలతో విభూదిని తీసుకుని మానస్తోకే మంత్రంతో ధరించాలి అని చెప్పాడు. భస్మధారణ ఫలము ఏమి? అంటే అతడు శివసాయుజ్యము పొందుతాడు. మరుజన్మ ఉండదు. పరమహంసలైన సంవర్తకుడు, అరుణి, శ్వేతకేతువు, దుర్వాసుడు, ఋభువు, జడభరతుడు, దత్తాత్రేయుడు, రైవతకుడు, భుసుండుడు మొదలైన వారు భస్మధారణ చేతనే ముక్తులైనారు.

ఈశ్వరుడికి ఎంత మహిమ ఉందో త్రిపుండ్రములకు అంత మహిమ ఉంది. ఈ మాటను ప్రజాపతి, విష్ణువుకూడా చెప్పారు. భస్మధారణ చేసినవాడు సంసార సాగరం నుంచి తరిస్తాడు అని కాలాగ్నిరుద్రుడు చెప్పాడు.

**రుద్రాక్ష మాహాత్మ్యము :** రుద్రుని కనులనుంచి వచ్చిన నీటిబిందువులే రుద్రాక్షలు. వీటిని తలచినంత మాత్రంచేతనే పదివేల గోవులు దానం చేసిన ఫలితం వస్తుంది. రుద్రాక్షే – భస్మ జ్యోతిస్సు.

రుద్రాక్షను చేతితో తాకినంత మాత్రం చేతనే – 2వేల గోవుల దానఫలితము వస్తుంది.

చెవులయందు ధరిస్తే – పదకొండువేల గోవుల దానఫలితం.

శిరస్సున ధరిస్తే – కోటిగోవులు దానము చేసిన ఫలితం వస్తుంది.

**ఈ ఉపనిషత్తు మాహాత్మ్యము :** ఈ ఉపనిషత్తును చదివినవాడు అగ్నిపూతుడు, పూతుడు అంటే – పవిత్రుడు అని అర్థం. అగ్నిపూతుడు అంటే అగ్నిలాగా పవిత్రుడు అన్న మాట. వాయుపూతుడు, ఆదిత్యపూతుడు, సోమపూతుడు, బ్రహ్మపూతుడు, విష్ణుపూతుడు, రుద్రపూతుడు అవుతాడు. అగ్నిస్తంభన, జలస్తంభన, వాయుస్తంభన, సూర్యస్తంభన చేయగలుగుతాడు. అతడి సర్వపాపాలు నశిస్తాయి. మృత్యువును జయిస్తాడు. 14 లోకాలు జయిస్తాడు. అన్ని వేదాలు, వేదాంగాలు, శాస్త్రాలు పఠించిన ఫలితం వస్తుంది. ఓంకారాన్ని జపించిన ఫలము వస్తుంది.

| | | |
|---|---|---|
| వందమంది ఉపనయనము కానివారు | – | ఒక ఉపవీతునితో సమానము |
| ఉపవీతుడు అంటే | – | ఉపనయనము అయినవాడు అని అర్థం. |
| వందమంది ఉపవీతులు | – | ఒక గృహస్థునితో సమానము |
| వందమంది గృహస్తులు | – | ఒక వానప్రస్థునితో సమానము |
| వందమంది వానప్రస్థులు | – | ఒక యతీశ్వరునినితో సమానము |
| వందమంది యతీశ్వరులు | – | ఒక రుద్రజపము చేయువానితో సమానము |

| | | |
|---|---|---|
| వందమంది రుద్రజాపకులు | – | నృసింహ ఉపాసకునితో సమానము |
| వందమంది నృసింహ ఉపాసకులు | – | బృహజ్జాబాలోపనిషత్తు అధ్యయనము చేసిన వాడితో సమానము. |

బృహజ్జాబాలోపనిషత్తు అధ్యయనం చేసినవాడికి పరమపదం లభిస్తుంది. ఇందులో ఏ మాత్రం అనుమానం లేదు.

# 44. రుద్రహృదయోపనిషత్తు

కృష్ణయజుర్వేదానికి సంబంధించిన ఉపనిషత్తు ఇది. ఇందులో ఏడు మంత్రాలున్నాయి. ఇందులో రుద్రుడు సర్వాత్మకుడు అని బాహ్యాంభ్యంతరము లందు పూర్తిగా వ్యాపించి ఉన్నాడు అని చెపుతున్నారు.

ఇక్కడ ఒక్క విషయం గుర్తించాలి. అనాదినుంచీ మనదేశంలో వైష్ణవులకు, శైవులకు పరస్పర విరోధముంది. అది ఎంతగా ఉందంటే ఒకరినొకరు చంపుకునేంత. వీరు ఒకరితో ఒకరు యుద్ధాలుకూడా చేసుకునేవారు. విచిత్రం ఏమంటే రాజీకోసం ఎవరూ ప్రయత్నించిన దాఖలాలు కూడా మనకి లేవు. కాని ఇక్కడ ఉపనిషత్తులో శైవుల దగ్గర నుంచి ఈ మాటలు వినిపిస్తున్నాయి. **శివకేశవులు ఇద్దరూ ఒకటే.** ఈశ్వరుణ్ణి దూషిస్తే విష్ణువును దూషించినట్లే. ఈశ్వరుణ్ణి పూజిస్తే విష్ణువును పూజించినట్లే **అని ఈ విషయం శైవోపనిషత్తు చెబుతున్నది.** ఇంత గట్టిగా ఈ విషయం చెప్పిన ఉపనిషత్తు ఇంకొకటి లేదు. వైష్ణవోపనిషత్తులు ఈ విషయం గురించి మాట్లాడను కూడా లేదు. ఇక ఉపనిషత్తును చూద్దాం.

ఒకసారి శుకుడు వ్యాసుడి దగ్గరకు వెళ్ళి 'తండ్రీ సర్వదేవతలకు దేవుడెవరు? ఎవరిని సేవించి దేవతలు తరిస్తారు? నాకు తెలియచెయ్యండి అన్నాడు. ఆ మాటలు విన్న వ్యాసుడు చెబుతున్నాడు.

**సర్వదేవాత్మకో రుద్రః సర్వేదేవశ్శివాత్మకాః**

**రుద్రస్య దక్షిణే పార్శ్వే రవిః బ్రహ్మాత్రయోగ్నయః**

**వామపార్శ్వే ఉమాదేవీ విష్ణోస్సోమోపితే త్రయః**

యా ఉమాసాస్వయం విష్ణుః యోవిష్ణుః సహిచంద్రమాః
యోనమస్యంతి గోవిందం తే నమస్యంతి శంకరమ్
యేర్చంతి హరింభక్త్యాతేర్చయంతి వృషధ్వజమ్
యేద్విషంతి విరూపాక్షం తే ద్విషంతి జనార్దనమ్
యేరుద్రం నాభిజానంతి తేనజానంతి కేశవమ్
రుద్రాత్ ప్రవర్తతే బీజం బీజయోనిర్జనార్దనః
యోరుద్ర స్స స్వయం బ్రహ్మా యో బ్రహ్మా సహూతాశనః
రుద్రాత్ ప్రవర్తతే బీజం బీజయోనిర్జనార్దనః
యోరుద్ర స్స్వయంబ్రహ్మా యోబ్రహ్మా సహూతాశనః
బ్రహ్మావిష్ణు మయోరుద్ర అగ్నిషోమాత్మకం జగత్
పుంలింగం సర్వమీశానం స్త్రీలింగం భగవతి ఉమా
ఉమారుద్రాత్మికా స్సర్వాః ప్రజాః స్థావర జంగమాః
వ్యక్తగ్ం సర్వం ఉమారూపం అవ్యక్తంతు మహేశ్వరమ్ ॥

సర్వదేవాత్మకుడు రుద్రుడు. దేవతలందరూ శివాత్మకులు. రుద్రుని కుడివైపు రవి బ్రహ్మత్రేతాగ్నులు ఎడమవైపు ఉమ, విష్ణువు, సోముడు ఉన్నారు. ఉమాదేవి స్వయంగా విష్ణువు. విష్ణువు చంద్రుడే. ఎవరైతే విష్ణువుకు నమస్కరిస్తారో వారు శంకరుని అర్చించినట్లే. ఎవరు విష్ణువును భక్తితో అర్చిస్తారో, వారు శివుని అర్చించినట్లే. శివుని ద్వేషించిన వారు విష్ణువును ద్వేషించినట్లే. అలాగే విష్ణువును ద్వేషించిన వారు శివుని ద్వేషించినట్లే. రుద్రుని బాగా తెలిసిన వారు కేశవుణ్ణి కూడా ఎరుగుదురు. రుద్రుడినుంచి బీజం వస్తుంది. ఆ బీజం జనార్దనుడు. రుద్రుడు స్వయంగా బ్రహ్మ. బ్రహ్మ అగ్ని. ఈ జగత్తు

అగ్నిసోమాత్మకము. జగత్తులో పుంలింగము సర్వము ఈశ్వరుడు. స్త్రీలింగము ఉమాదేవి. కంటికి కనిపించేదంతా ఉమారూపము. అవ్యక్తము ఈశ్వరుడు. ఉమాశంకరయోగమే విష్ణువు.

**అస్యత్రై లోక్యవృక్షస్య భూమౌవిటప శాఖినః**
**అగ్రంమధ్యంతథామూలం విష్ణుబ్రహ్మ మహేశ్వరాః**
**కార్యంవిష్ణు క్రియాబ్రహ్మ కారణంతుమహేశ్వరః**

భూమిమీద కొమ్మలున్న వృక్షానికి అగ్రభాగము విష్ణువు. మధ్యభాగము బ్రహ్మ, మూలము మహేశ్వరుడు. కార్యము విష్ణువు, క్రియ బ్రహ్మ కారణము మహేశ్వరుడు. ఇకనుంచీ చరాచర జగత్తంతా రుద్రుడు ఉమాదేవిల స్వరూపము అంటున్నారు.

**రుద్రోనర ఉమానారీ తస్మై తస్మై నమోనమః**
**రుద్రో బ్రహ్మ ఉమా వాణీ తస్మై తస్మై నమోనమః**
**రుద్రో విష్ణు ఉమాలక్ష్మీ తస్మై తస్మై నమోనమః**
**రుద్రో సూర్య ఉమాఛాయా తస్మై తస్మై నమోనమః**
**రుద్రో స్సోమ ఉమాతారా తస్మై తస్మై నమోనమః**
**రుద్రోదివా ఉమారాత్రీ తస్మై తస్మై నమోనమః**
**రుద్రో యజ్ఞ ఉమావేదీ తస్మై తస్మై నమోనమః**
**రుద్రో వహ్ని ఉమా స్వాహా తస్మై తస్మై నమోనమః**
**రుద్రో వేదం ఉమాశాస్త్రం తస్మై తస్మై నమోనమః**
**రుద్రో వృక్ష ఉమావల్లీ తస్మై తస్మై నమోనమః**
**రుద్రోగంథ ఉమాపుష్పం తస్మై తస్మై నమోనమః**

**రుద్రో అర్థ అక్షరస్స ఉమా తస్మై తస్మై నమోనమః**

**రుద్రో లింగం ఉమాపీఠం తస్మై తస్మై నమోనమః**

**సర్వదేవాత్మకం రుద్రం నమస్కుర్యాత్ పృథక్ పృథక్**

ఈ జగత్తులోని నరులంతా రుద్రరూపమయితే నారీజనం ఉమా (స్త్రీ) రూపము. వారికి మాటమాటకీ నమస్కారము.

రుద్రుడు బ్రహ్మ ఉమావాణి వారికి నా నమస్కారము

రుద్రుడు విష్ణువు ఉమలక్ష్మి వారికి నా నమస్కారము

రుద్రుడు సూర్యుడు ఉమఛాయాదేవి వారికి నా నమస్కారము

రుద్రుడు చంద్రుడు ఉమాతార వారికి నా నమస్కారము

రుద్రుడు పగలు ఉమరాత్రి. వారికి నా నమస్కారము

రుద్రుడు యజ్ఞము ఉమవేది వారికి నా నమస్కారము

రుద్రుడు అగ్ని ఉమస్వాహా వారికి నా నమస్కారము

రుద్రుడు వేదం ఉమశాస్త్రం వారికి నా నమస్కారము

రుద్రుడు వృక్షము ఉమతీగ వారికి నా నమస్కారము

రుద్రుడు గంధము ఉమపుష్పం వారికి నా నమస్కారము

రుద్రుడు అర్థము ఉమ అక్షరము వారికి నా నమస్కారము

రుద్రుడు లింగము ఉమపీటము వారికి నా నమస్కారము

రుద్రుడు సర్వదేవాత్మకుడు అతనికి మాటిమాటికి నమస్కారము

ఈ మంత్రాలతో ఉమాశంకరులకు నమస్కారము

ఈ మంత్రాన్ని నీటిలో నిలబడి జపం చేస్తే - బ్రహ్మహత్యాపాతకము పోతుంది.

ఓ శుకా! శివపార్వతుల స్వరూపము సచ్చిదానందము. అవాఙ్మానస గోచరము. దానికి భిన్నమైనది ఈ జగత్తులో ఏదీలేదు.

పరా, అపరా విద్యలలో పరావిద్య ఇది. పరావిద్య, అపరావిద్య రెండూ తెలుసుకోవలసినవే. అందులో ఇది పరావిద్య. నాలుగు వేదాలు, షట్శాస్త్రాలు, అంతా అపరావిద్య. దేనివల్ల అక్షరమైన ఆత్మ తెలియబడుతుందో అది పరావిద్య. పరావిద్యను ఉపాసించటంవల్ల మోక్షం వస్తుంది. అతడికి పునర్జన్మ ఉండదు అని చెబుతోంది ఈ ఉపనిషత్తు.

# 45. శ్వేతాశ్వతరోపనిషత్తు

ఇది కృష్ణయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో ఆరు అధ్యాయాలున్నాయి. ఇందులో పూర్తిగా జ్ఞానవిద్య చెప్పబడింది.

పూర్వకాలంలో బ్రహ్మవాదులంతా ఒకచోట చేరి చర్చించుకుంటున్నారు.

1. ఈ ప్రపంచానికి కారణము కాలమా, బ్రహ్మమా?
2. మనం దేనివల్ల జన్మించాము?
3. మనం ఎలా జీవిస్తున్నామా?
4. ప్రళయం జరిగినప్పుడు మనం ఎక్కడ ఉన్నాం?
5. మనం సుఖదుఃఖాలు ఎవరి అధికారముతో అనుభవిస్తున్నాము?

ఈ జగత్తుకు కారణము కాలము అంటున్నారు కాలవేత్తలు.

స్వభావము కారణము అంటున్నారు లోకాయతులు.

కర్మకారణము అంటున్నారు మీమాంసకులు

యాదృచ్ఛకము అంటున్నారు నిరీశ్వరవాదులు

పంచభూతాలు అంటున్నారు జగన్నిత్యవాదులు

ప్రకృతి కారణము అంటున్నారు శాక్తేయులు

జీవుడు కారణము అంటున్నారు యోగులు.

సంయోగము కారణము అంటున్నారు కొందరు

అయితే ఇవేవీ జగత్తుకు కారణం కాదు. జీవుడు కూడా సుఖదుః ఖాలకు కారణము కాదు.

బ్రహ్మవేత్తలంతా ధ్యానయోగంలో ఉన్నవారై అద్వితీయుడు,

కాలస్వరూపుడు, సర్వానికి కారణమైనవాడు అయిన పరమేశ్వరుని మాయాశక్తిని దర్శించగలిగారు. ఆ మాయాశక్తి త్రిగుణాత్మకమైనది. వారందరూ ఆ పరమాత్మని త్రిగుణాత్మక ప్రకృతిచే ఆవరింపబడినవాడుగా, 50 ఆకులు, 20 ప్రత్యరములు గల బండి చక్రము గలవాడుగా, ఆరు, ఎనిమిది తత్త్వాలుగలవాడుగా, ధర్మము అధర్మము జ్ఞానము అనే మూడు మార్గాలు కలవాడుగా, పుణ్యపాపములలో మోహము గలవాడుగా దర్శించారు.

ఈ బ్రహ్మచక్రంలో నివసించే జీవుడు అనాత్మ పదార్థాలనే ఆత్మగా భావించాడు. జీవుడు వేరు ఈశ్వరుడు వేరు అని భావించాడు. తరువాత జీవుడు ఈశ్వరుడు ఒకరే అని తెలిసి మోక్షం పొందుతున్నాడు. నిర్విశేషమయిన బ్రహ్మమే శ్రేష్ఠము. పరబ్రహ్మలో భోక్త, భోగ్యము, ప్రేరకుడు అనే మూడు ప్రతిష్ఠితమై ఉన్నాయి. ఈ బ్రహ్మము దేహమందు అంతర్యామిగా ఉంటుంది.

బ్రహ్మమును ఉపాసించినవారు పరమేశ్వరుణ్ణి అంతర్యామిగా తెలుసుకుని, బ్రహ్మమునందే లీనమై జనన మరణాలతో కూడిన సంసార చక్రమునుండి విముక్తు లవుతున్నారు. ఈశ్వరుడు వ్యక్తావ్యక్తములతో కూడిన విశ్వాన్ని భరిస్తున్నాడు. ఈశ్వరుడికి భిన్నమైనవాడు జీవుడు. తాను భోక్త అనుకొని బద్ధుడవుతున్నాడు. ఈశ్వర స్వరూపం తెలిసిన వెంటనే అన్ని బంధాలనుంచి విముక్తుడవుతున్నాడు.

అన్నీ తెలిసినవాడు ఈశ్వరుడు. ఏమీ తెలియని అజ్ఞాని జీవుడు. బ్రహ్మమే మాయవల్ల జీవుడుగా, ఈశ్వరుడుగా కనిపిస్తోంది. క్షరము–నశించేది. అక్షరము–నశించనిది. హరుడు–అవిద్యను హరించేవాడు.

అందుకే ఆయన పరమేశ్వరుడు. నిరంతరము పరమాత్మను ధ్యానం చెయ్యటంవల్ల తత్త్వచింతన కలుగుతుంది. ఎప్పుడైతే పరమాత్మ స్వరూపం తెలుస్తుందో, అప్పుడు అజ్ఞానము నశిస్తుంది. అజ్ఞానం గనక నశిస్తే మృత్యుభయం ఉండదు. పరమాత్మను ధ్యానం చేసినట్లైతే మరణానంతరము తానుకూడా పరబ్రహ్మ అవుతాడు. విదేహముక్తి పొందుతాడు. ఇంతకీ ఆ పరమాత్మ ఎక్కడున్నాడు? నీ హృదయమందే ఉన్నాడు. నీలోనే ఉన్నాడు. నీలో ఉన్న పరమాత్మని తెలుసుకోవటానికి ప్రయత్నించు. అరణి మథిస్తే అగ్ని పుడుతుంది అని చెబుతున్నాం. అంటే అగ్ని ఎక్కడ ఉన్నది? అరణిలోనే ఉన్నది. కాబట్టే మనం ఎప్పుడైతే దానికి రాపిడి కలిగించామో అప్పుడు అందులో ఉన్న అగ్ని బయటకు వస్తుంది. అదే విధంగా ప్రణవాన్ని ఉపాసించినట్లైతే ఆత్మస్వరూపము వ్యక్తమవుతుంది. శరీరం క్రింద కొయ్య. ప్రణవం పై కొయ్య. ఇలా భావన చేసి, ధ్యానము అనే మధనం చేసినట్లైతే పరమాత్మ సాక్షాత్కారమవుతుంది. గానుగలో వేసి తిప్పితే నువ్వులలో నుంచి నూనె వస్తుంది. పెరుగు చిలికితే వెన్న వస్తుంది. అరణి మథిస్తే అగ్ని పుడుతుంది. అలాగే తపస్సుతో తనలో ఉన్న ఆత్మ దర్శన మవుతుంది. పరబ్రహ్మ స్వరూపం పాలలో నెయ్యిలాగా చరాచర జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. ఈ విషయం తెలిస్తే జీవుడు బంధాల నుండి విముక్తుడవుతాడు.

ధ్యానం ప్రారంభించే సమయంలో మనసు, ఇంద్రియాలు వీటిని పరమాత్మ దగ్గరకు చేర్చాలి. ఇప్పుడు పరమాత్మయందు మనసును ఏకాగ్రం చేసి, స్వయంప్రకాశకుడు, సవితృదేవత యొక్క అనుగ్రహంతో స్వర్గప్రాప్తికి అనుకూలమైన శక్తితో ప్రయత్నించాలి. సవితృదేవత మా

మనసును పరమాత్మ యందు లగ్నం చేసి బ్రహ్మను పొందునట్లు చేయుగాక.

ఓ దేవతలారా ! అత్యంత ప్రాచీనుడైన పరమాత్మకు నమస్కారము., నా చిత్తాన్ని పరమాత్మలో లీనం చేస్తున్నాను. ఈ రకంగా బ్రహ్మమునందు లీనమయిన చిత్తము ముక్తపురుషులు అనుసరించిన మార్గంలోనే పయనించును గాక. ఈ రకంగా సన్మార్గంలో పయనించి ఆ పరమేశ్వరుణ్ణి సేవించాలి. అలా చేస్తేనే పూర్వకర్మ అనేది నశిస్తుంది. ఆహార విహారాలు నియంత్రించి, మనస్సును నిరోధించి, ప్రాణాయామము చెయ్యాలి. మనస్సును అత్యంత జాగ్రత్తగా జయించాలి. ఇది చాలా జాగ్రత్తగా అకుంఠిత దీక్షతో జరగాలి. ప్రాణాయామం చేసిన తరువాత ఏకాంత ప్రదేశంలో యోగాభ్యాసము చెయ్యాలి. యోగాభ్యాసము చేసేటప్పుడు మొదట అంతా మంచులాగా, గాలిలాగా కనిపిస్తుంది. తరువాత ధూమంలాగా, తరువాత అగ్నిలాగా, తరువాత సూర్యుడులాగా, తరువాత మెరుపులాగా ప్రకాశిస్తుంది. తరువాత స్పటికంలాగా కనిపిస్తుంది. తరువాత చంద్రుడు లాగా కనిపిస్తుంది. ఇవన్నీ పరబ్రహ్మ నుంచి వచ్చే కిరణాలు. ఇలా కనిపిస్తేనే యోగం సిద్ధించింది అనుకోవాలి. యోగం గనక సిద్ధిస్తే, శరీరము యోగాగ్నిమయమవుతుంది. అటువంటి యోగాగ్నిమయ శరీరికి వ్యాధులు, వార్ధక్యము, మరణము రావు.

యోగి శరీరము తేలికగా, ఆరోగ్యంగా ఉంటుంది. శరీరము తేజోవంతంగా ఉంటుంది. కంఠధ్వని స్పష్టంగా ఉంటుంది. శరీరం మంచి వాసన వస్తుంది. మూత్రపురీషాలు చాలా తక్కువగా ఉంటాయి. జిజ్ఞాసువు ఆత్మను దర్శించి ధన్యుడు, శోకాలనుంచి విముక్తుడు

అవుతాడు. అతడికి జన్మరాహిత్యం కలుగుతుంది. పునర్జన్మ ఉండదు.

ఆ పరమేశ్వరుడు తన మాయాశక్తితో ఈ ప్రపంచాన్ని సృష్టిస్తున్నాడు. సృష్టికి ముందు పరమాత్మ ఒక్కడే ఉన్నాడు. అతడే ఈ జగత్తును సృష్టించి, అందరియందు ప్రత్యగాత్మగా ఉన్నాడు. ఆ పరమాత్మే స్థితికారకుడు లయకారకుడు కూడా. ఆ పరమాత్మే ఆకాశము, భూమి అన్నింటినీ పుట్టిస్తున్నాడు. అతడికి అనేక బాహువులు, నేత్రాలు, పాదాలు ఉన్నాయి. ఈ జగత్తులోని మానవులకు, దేవతలకు, సకల ఐశ్వర్యాలకు కారకుడు. పరిపాలకుడు. అతడే రుద్రుడు, ఓ రుద్రదేవా! మంగళకరమైన ఈ శరీరము స్మరించినంత మాత్రంచేతనే పాపాలను పోగొట్టి పుణ్యం కలుగచేస్తుంది. ఓ దేవా! నీ చేతిలోని బాణము మా శత్రువులమీద ప్రయోగించు. మమ్మల్ని రక్షించు. ఆ పరమేశ్వరుని తెలుసుకున్నవాడు అమృత తుల్యుడవుతున్నాడు. అతడికి మృత్యువు రాదు. మోక్షం పొందటానికి ఇంతకన్న వేరే మార్గంలేదు.

పరమాత్మ కన్న వేరైనది ఏదీలేదు. శ్రేష్ఠమైనది లేదు. పరమాత్మకన్న పెద్దది లేదు. చిన్నదీ లేదు. ఈ రకంగా పరమాత్మను గురించి తెలిసినవాడు మరణ రహితుడవుతాడు. ఆ పరమాత్మే జీవియొక్క హృదయము అనే గుహయందుంటాడు. అతడు సర్వవ్యాపి. మంగళరూపుడు. జ్యోతిరూపుడు, అవ్యయుడు. పరమేశ్వరుడు అంగుష్టమాత్రుడై హృదయమనే గుహలో నివసిస్తున్నాడు. అతడు పరిపూర్ణుడు. జీవుల హృదయంలో ఉండి మనస్సుతో మూయబడి ఉన్నాడు. అతడే ఆత్మజ్ఞానానికి సార్వభౌముడు. ఈ రకంగా అతన్ని తెలిసినవారికి మృత్యువు ఉండదు.

సహస్రశీర్షా పురుష స్సహ స్రాక్ష స్సహస్రపాత్ ।
స భూమిం విశ్వతో వృత్వాఽత్యతిష్ఠ ద్దశాంగులమ్ ॥

పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చ భవ్యమ్ ।
ఉతామృతత్వస్యేశానో యదన్నేనా తిరోహతి ॥

సర్వతః పాణిపాదం త త్సర్వతోఽక్షిశిరోముఖమ్ ।
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమా వృత్య తిష్ఠతి ।
సర్వేంద్రియ గుణాభాసగ్ం సర్వేంద్రియ వివర్జితమ్ ।
సర్వస్య ప్రభుమీవా నగ్ం సర్వస్య శరణం సుహృత్ ॥

నవద్వారే పురే దేహీ హంసో లేలా యతే బహిః
వశీ సర్వస్య లోకస్య స్థావరస్య చరస్య చ ।
అపాణిపాదో జవనో గ్రహీతాపశ్య త్వచక్షు స్సశృణో త్యకర్ణః
స వేత్తి వేద్యం న తస్యాఽస్తి వేత్తా త మాహు రగ్ర్యం పురుషం మహాన్తహ॥

అణో రణీయ న్మహతో మహీయా నాత్మా గుహాయాం నిహితోఽస్య జంతోః
త మక్రతుం పశ్యతి వీతశోకో ధాతుః ప్రసాదా న్మహిమాన మీశమ్ ॥

వేదాహమేత మజరం పురాణం సర్వాత్మానగ్ం సర్వగతం విభుత్వాత్
జన్మనిరోధం ప్రవదన్తి యస్య బ్రహ్మవాదినో హి ప్రవద న్తి

నిత్యమ్ ॥

ఆ పరమాత్మ వేయిశిరస్సులు, పాదాలు, చేతులు గలవాడు. భూమిలోపల బయట అంతటా వ్యాపించి ఉన్నాడు. ఇప్పుడున్న జగత్తు, గతించిపోయిన జగత్తు, రాబోయే జగత్తు అంతా ఆ పరమాత్మ స్వరూపమే. అంతట పాదాలు, నేత్రాలు, శిరస్సులు, ముఖాలు, శ్రోత్రాలు గల పరబ్రహ్మ జగత్తులోని జీవుల నాశ్రయించి ఉన్నది. అదే అన్నిటికీ రక్షకుడు. ఆ పరమాత్మ నవద్వారాలు గల దేహమనే ఈ పట్టణంలో ఆత్మరూపంలో ఉన్నాడు. ఆ పరమాత్మకు కాలు చేతులేవు. అయినా శీఘ్రంగా ప్రయాణం చేస్తాడు. కళ్ళు లేవు కాని చూస్తాడు. చెవులు లేవు కాని వింటాడు. అతడు పరమాణువుకన్న సూక్ష్మమైన వాడు. మహత్తులన్నింటికన్న గొప్పవాడు. అతడు హృదయం అనే గుహలో ఉన్నాడు. ఆ పరమాత్మను దర్శించిన వాడికి దుఃఖముండదు. పరమేశ్వర అనుగ్రహంవల్ల పరమజ్ఞానం కలుగుతుంది.

ఆ పరమాత్మ తన మాయాశక్తితో ఏ కోరికా లేకుండా నానాజాతులను సృష్టిస్తున్నాడు. పోషిస్తున్నాడు. ప్రళయకాలంలో లయం చేస్తున్నాడు. అటువంటి పరమాత్మ మాకు మంచి బుద్ధిని ఇచ్చుగాక. ఓ పరమేశ్వరా ! నువ్వే పురుషుడు, స్త్రీ, బాలుడు, బాలిక, వృద్ధుడు. నువ్వు సర్వతోముఖుడవు. మాయాశక్తితో వివిధ రూపాలలో కనిపిస్తున్నావు. నల్లని తుమ్మెద, రంగురంగుల చిలుక, మేఘంలోని మెరుపు, ఋతువులు, సముద్రాలు అన్నీ నువ్వే.

సంసారమనే వృక్షంమీద రెండు పక్షులు ఒకేరూపంలో ఉన్నవి. కూచుని ఉన్నాయి. అందులో ఒకటి దొరికిన కాయలు పండ్లు తింటోంది. రెండవది ఏమీ తినకుండా దిక్కులు చూస్తోంది. వాటిలో

కాయలు పండ్లు తినేది జీవాత్మ. అది తినేది కర్మఫలాలు. రెండవది పరమాత్మ దానికి కర్మ ఉండదు. ఈ రెండూ వేరుకాదు. మానవుడు అజ్ఞానంతో జీవాత్మ పరమాత్మా వేరువేరు అనుకుంటున్నాడు. అజ్ఞానం తొలగిపోతే జీవాత్మ పరమాత్మ రెండూ లీనమై పోతాయి.

ఈ విషయం తెలిసిన వాడికి పాపపుణ్యాలుండవు. ఆ పరబ్రహ్మ నుంచే వేదాలు, వేదాంగాలు, యజ్ఞాలు, క్రతువులు, సమస్త వ్రతాలు కాలము అన్నీ పుట్టినాయి. ఈ జగత్తంతా మాయ. మహేశ్వరుడే మాయకు అధిపతి. ఈ జగత్తంతా అతని మాయచేతనే కల్పించబడింది. ప్రళయ కాలంలో పరమేశ్వరుని యందే లీనమవుతోంది. సృష్టి కాలంలో మళ్ళీ ఉత్పత్తి అవుతోంది. జగత్తును సృష్టించిన వాడు, ఇంద్రాది దేవతలకు ఐశ్వర్యాన్నిచ్చిన వాడు, అయిన పరమేశ్వరుడు మాకు యోగ్యమయిన బుద్ధిని ప్రసాదించుగాక. లోకంలో ఆ పరతత్వాన్ని తెలుసుకున్నవాడు పరమశాంతిని పొందుతాడు. ఆ పరమాత్మయే కాలస్వరూపుడు. జగత్పాలకుడు సమస్త ప్రాణులందు నిఘూఢముగా ఉన్నవాడు. అతన్ని తెలుసుకున్నవారు మృత్యుపాశాన్ని భేదించగలుగుతారు. పాలలో దానికన్న సూక్ష్మమయిన నెయ్యి ఉంది. అలాగే పరమేశ్వరుడు అన్ని ప్రాణులలోను అంతర్లీనంగా ఉన్నాడు. ఆయనను తెలుసుకున్నవాడు సర్వపాపాలనుంచి విముక్తుడవుతాడు. ఎప్పుడైతే ఆత్మజ్ఞానం కలుగుతుందో అది పగలయినా, రాత్రయినా, ఏదైనా సరే పరిశుద్ధమైన ఆత్మ ఒకటే ఉన్నది. అదే ఈశ్వరుడు. ఆ బ్రహ్మము నిత్యమైనది. పొందదగినది. పరమేశ్వరుణ్ణి నేత్రాలద్వారా పొందలేము. ఆయన ఇంద్రియాలకు కనిపించడు. ఆత్మవిచారంతో మాత్రమే అతన్ని తెలుసుకోవాలి. అతన్ని తెలుసుకున్న వారికి జన్మజరామరణ దుఃఖాలుండవు.

అవిద్య విద్య ఈ రెండూ నాశనం లేనివే. రెండూ బ్రహ్మమునందే ఉంటాయి. వీటిలో అవిద్య నాశనమవుతుంది. విద్య అమృతము. పరమేశ్వరుడు ఈ రెండింటికీ అతీతుడు. అన్నింటికీ సాక్షియైన వాడు. సకల యోనులను అధిష్టించి ఉన్నవాడు, సర్వజ్ఞుడు, కపిలవర్ణము గలవాడే పరమాత్మ.

ఈ ఆత్మ 84 లక్షల జీవరాసిని సృష్టించి వాటిలో తాను ప్రవేశించింది. పరమేశ్వరుడు మరీచి మొదలైన ప్రజాపతులను సృష్టించి, వారికి అధిపతి అయినాడు. ఆ పరమేశ్వరుడు అన్నింటికీ కారణమయిన పంచమహాభూతాల నధిష్టించి వాటిని నియమిస్తున్నాడు. జగత్కారణుడు ఆ పరమాత్మే. అతడు పంచ మహాభూతాలు, త్రిగుణాలను నియమించి ఈ జగత్తునంతా సృష్టిస్తున్నాడు. ఆ పరమాత్మ స్వరూపాన్ని తెలుసుకున్నవారు పరమాత్మ స్వరూపులవుతారు. జీవుడు తలవెంట్రుకను పదివేల భాగాలుగా చీలిస్తే, అందులో ఒక భాగం పరమేశ్వరుడు. అంత సూక్ష్మమైనవాడు. అనంతుడు. అతడు స్త్రీ కాదు, పురుషుడు కాదు, నపుంసకుడు అంతకన్న కాదు. అయినప్పటికీ ఏ శరీరాలని అంగీకరిస్తాడో, ఆ శరీరము యొక్క లింగముతోనే వ్యవహరింపబడతాడు.

ఈ సృష్టికి కారణము స్వభావమని, కాలమని రకరకాలుగా చెబుతున్నారు. ఎవరివల్ల ఈ జగత్తంతా వ్యాప్తమై ఉన్నదో అతడే పరమేశ్వరుడు, జ్ఞానరూపుడు. అతడు దోషరహితుడు, మంగళస్వరూపుడు. ఆ పరమేశ్వరుని వల్ల శుభాశుభ కర్మలు ప్రేరేపించబడి జగత్తుగా మారుతున్నాయి. అవే పంచభూతాలు.

పరమేశ్వరుడు సృష్టి చేసి అనేక వస్తువులను, జీవులను

సృష్టించాడు. ఈ సృష్టించిన వాటిని తిరిగి ఆయనకే సమర్పించేవాడు పరమాత్మను పొందగలుగుతాడు. సమస్త సృష్టికి, అవిద్యాదులకు బ్రహ్మమే కారణము. ఏ పరమాత్మ ఈ జగత్తును సృష్టిస్తున్నాడో, ఆ పరమాత్మ సంసార వృక్షము యొక్క కాలము, ఆకారము కన్న అతీతుడు. ఆ పరమేశ్వరుని తెలిసికోగలిగిన వాడు ధన్యుడు. ఈ జగత్తులో పరమాత్మ ఒక్కడే అవిద్యను నశింపచేసేవాడు. మోక్షాన్ని ప్రసాదించేవాడు. అతడు నిష్కళంకుడు, నిష్క్రియుడు, వికార రహితుడు, అనింద్యుడు. అతణ్ణి తెలుసుకోకుండా దుఃఖాన్ని అంతం చెయ్యలేము. ఆ పరమ పురుషుణ్ణి తెలుసుకున్నవాడికి పునర్జన్మ ఉండదు.

ఈ విద్యను శ్వేతాశ్వతరముని యతీశ్వరులకు చెప్పాడు. బ్రహ్మజ్ఞాన సముపార్జన కోసం ఉపనిషత్తులలో జాగ్రత్తగా పదిలపరిచాడు. పూర్వకాలంలో కేవలము అధికారము ఉన్న వారికి మాత్రమే దీన్ని చెప్పేవారు. ఇప్పుడు రాగద్వేషాలు గల శిష్యులకు, పుత్రులకు ఈవిద్య చెప్పరాదు. అంటే **రాగద్వేషాలు లేనివారికి ఎవరికైనా ఈ విద్యను చెప్పవచ్చును.**

# 46. కాలాగ్ని రుద్రోపనిషత్తు

ఇది కృష్ణయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో ఆరు మంత్రాలున్నాయి. త్రిపుండ్రధారణను వివరిస్తుంది.

సనత్కుమారుడు కాలాగ్నిరుద్రుని అడుగుతున్నాడు. ఓ పరమేశ్వరా ! త్రిపుండ్రధారణ విధిని చెప్పండి. దానికి ద్రవ్యమేది? స్థానమేది? రేఖలేవి? మంత్రమేది? దాని ఫలితము ఏది ? వివరించండి. ఆ మాటలు విన్న కాలాగ్ని రుద్రుడు చెబుతున్నాడు.

ఇది అగ్నివల్ల తయారైన బూడిద. దీనిని 1. సద్యోజాత 2. వామదేవ 3. అఘోర 4. తత్పురుష 5. ఈశాన మంత్రాలతో తీసుకుని

అగ్నిరితి భస్మ, వాయురితిభస్మ, వ్యోమేతిభస్మ, జలమితిభస్మ, స్థలమితి భస్మ అని దాన్ని మంత్రించాలి. మానసోక్తే మంత్రంతో చేతులకు రాచుకోవాలి. మనోమహంతముతమానో మంత్రం చెబుతూ నీటితో తడపాలి.

**త్రియాయుషం జమదగ్నేః కశ్యపశ్య త్రియాయుషం ।**

**యద్దేవానాం త్రియాయుషం తన్మే అస్తుత్రియాయుషం ॥**

అంటూ శిరస్సు, ముఖము, రొమ్ము, భుజముల యందు అడ్డంగా మూడురేఖలు వ్రాయాలి. ఇలా చేసిన వారికి మరుజన్మ ఉండదు" అన్నాడు. ఆ మాటలు విన్న సనత్కుమారుడు అడుగుతున్నాడు 'స్వామీ త్రిపుండ్రధారణకు ప్రమాణమేది'? దానికి రుద్రుడు చెబుతున్నాడు. ఈ రేఖలను మొగమున్నంత వరకు కనుల చివర వరకు, తలవరకు, కనుబొమల మధ్యన పెట్టుకోవచ్చు. వీటిలో

**మొదటిరేఖ** – గార్హపత్యము, అకారము బ్రహ్మ భూలోకము,

ఆత్మ, క్రియాశక్తి, ఋగ్వేదము, ప్రాతస్సవనము, మహేశ్వరుడు దేవత.

**రెండవరేఖ** – దక్షిణాగ్ని, ఉకారము, సత్వగుణము, అంతరిక్షము, అంతరాత్మ, ఇచ్ఛాశక్తి, యజుర్వేదము, మాధ్యందిన సవనము, సదాశివుడు దేవత.

**మూడవరేఖ** – ఆహవనీయాగ్ని, మకారము, తమోగుణము, ద్యులోకము, పరమాత్మ. జ్ఞానశక్తి, తృతీయసవనము, మహాదేవుడు దేవత.

ఈ రకంగా త్రిపుండ్రధారణ చేసిన బ్రహ్మచారి గృహస్తు ఎవరైనాసరే మహాపాతకముల నుండి విముక్తులవుతారు. అన్ని తీర్థముల యందు స్నానము చేసిన ఫలము దక్కుతుంది. సకల వేదపఠనము చేసిన ఫలం దక్కుతుంది. సకల రుద్రమంత్రములు జపించినవాడవుతాడు. అన్ని భోగములు పొందుతాడు మరణానంతరము శివసాయుజ్యము లభిస్తుంది. అతడికి మరుజన్మ ఉండదు.

పూర్వకాలంలో దుర్వాసుడు ధరించిన విభూది రేణువు పడి నరకంలోని పాపులంతా పునీతులై పోయారు.

పూర్వకాలంలో ఒకసాం దుర్వాస మహర్షి వంటి నిండా విభూతి పూసుకుని, రుద్రాక్షలు ధరించి యమలోకానికి వెళ్ళాడు. యమధర్మరాజు దుర్వాసుడికి స్వాగత సత్కారాలందించి ఉచితాసనం చూపించాడు. ఇద్దరూ మాట్లాడుకుంటున్నారు. అక్కడ ఉన్న నరకలోకంలోని పాపులు నరక లోకబాధలు భరించలేక గోలపెట్టి ఏడుస్తున్నారు. ఇంతలో గాలి రివ్వున వీచింది. కొద్దిసేపటికే పాపుల

కేకలు, ఏడుపులు ఆగిపోయినాయి. ఏం జరిగిందో చూడటానికి యమధర్మరాజు బయల్దేరాడు. ఆయనతో పాటుగానే దుర్వాసుడు కూడా నరకలోకానికి వెళ్ళాడు. ఇందాక వేగంగా వీచిన గాలికి దుర్వాసుని వంటిమీద విభూది ఎగిరి నరక లోకంలో పడింది. దాంతో అక్కడి పాపుల పాపాలన్నీ పటాపంచలయి పోయాయి. ఆ విషయం తెలుసుకున్న యముడు ఆశ్చర్య పోయాడు.

విభూదికి అంత మాహాత్మ్యం ఉన్నది.

# 47. జాబాలోపనిషత్తు

ఇది సామవేదంలోది. ఇందులో కేవలం నాలుగు మంత్రాలున్నాయి. అయితే జాబాలోపనిషత్తు శుక్లయజుర్వేదంలో కూడా ఉంది. ఈ రెండూ శైవోపనిషత్తులే. ఈ ఉపనిషత్తులో పుండ్రధారణ, మాహాత్మ్యము చెప్పబడ్డాయి.

ఒకసారి పిప్పలాదుడు జాబాలి మహర్షి దగ్గరకు వచ్చి తత్త్వము ఏది? జీవుడెవరు? పశువెవరు? ఈశానుడు ఎవరు? అని అడిగాడు. జాబాలి చెబుతున్నాడు.

పశుపతి అయిన ఈశ్వరుడు అహంకారంతో వ్యాపించినప్పుడు సంసార సహితుడై జీవుడవుతున్నాడు. అటువంటి జీవుడే అజ్ఞాని. పశువు. పంచకృత్య పరాయణుడే ఈశ్వరుడే. పశుపతి. పశువులు గడ్డి తిని, తెలివిలేక, ఇతరుల ప్రేరణతో కర్మచేస్తూ సుఖదుఃఖాలనుభవిస్తాయి. అలాగే జీవుడుకూడా దుఃఖాలు పొందుతున్నాడు. పశువులకు యజమానిలాగా, జీవులకు ఈశ్వరుడు పతి. జీవులకు భస్మధారణ వలన జ్ఞానం కలుగుతుంది. విభూతిని ఎలా ధరించాలి అంటే – సద్యోజాతాది పంచబ్రహ్మల మంత్రాలతో విభూదిని తీసుకుని 'అగ్నిరితిభస్మ' అనే మంత్రంతో మంత్రించి, 'మానస్తోకేతనయే' మంత్రంతో కలిపి శిరస్సు, లలాటము, వక్షము మూపులయందు ధరించాలి. త్ర్యంబక మంత్రంతో అడ్డంగా మూడురేఖలు పెట్టుకోవాలి. దీన్ని **శాంభవవ్రతం అంటారు. ఇదే శైవవ్రతం.** ఈ వ్రతాన్ని శ్రద్ధగా చేసేవాడికి పునర్జన్మ ఉండదు.

**విభూతిధారణకు ప్రమాణము :**

విభూతి ధారణకు సనత్కుమారుడు ప్రమాణం చెప్పాడు. ఇవి లలాటము నుండి కనుబొమల మధ్య వరకు ఉండాలి. ఈ రేఖలలో

1. మొదటిది గార్హపత్యాగ్ని, అకారము, రజోగుణము, భూలోకము, స్వాత్మ, క్రియాశక్తి. ఋగ్వేదము, ప్రాతస్సవనము, అధిదేవత బ్రహ్మ.

2. రెండవది దక్షిణాగ్ని. ఉకారము, సత్త్వగుణము, ఆకాశము భువర్లోకము. అంతరాత్మ. ఇచ్ఛాశక్తి. యజుర్వేదము. మధ్యాహ్నసవనము, అధిదేవత విష్ణువు.

3. మూడవది ఆహవనీయాగ్ని. మకారము, తమోగుణము. స్వర్గలోకము. పరమాత్మ, జ్ఞానశక్తి. సామవేదము, సాయంసవనము. అధిదేవత మహాదేవుడు.

ఈ రకంగా తెలుసుకుని పుండ్రధారణ చేసినవాడు పాతకముల నుండి, ఉపపాతకముల నుండి విముక్తుడౌతాడు. పుండ్రధారణ చేసినవాడు వేదాధ్యయనము చేసిన వాడౌతాడు. అన్ని తీర్థములలోను స్నానం చేసినవాడవుతాడు. రుద్రమంత్రాలు జపించిన వాడవుతాడు. అతడికి పునర్జన్మ లేదు.

# 48. అక్షమాలికోపనిషత్తు

మనం జపం చేసేటప్పుడు ఎంత సంఖ్య జపం జరిగిందో తెలుసుకోటానికి ఒక లెక్క కావాలి. ఆ లెక్క ఎలా పెట్టుకోవాలి? సాధారణంగా జపసంఖ్య కోసం జపమాల వాడటం జరుగుతుంది. ఈ జపమాల మీద మనకు ఎన్నో అనుమానాలు వస్తాయి. జపమాల ఏ పూసలతో చెయ్యాలి? అందులో ఎన్ని పూసలుండాలి? మాల ముందు నుంచి వెనక్కి త్రిప్పాలా? వెనకనుంచి ముందుకు తిప్పాలా? జపం తరువాత ఆ మాలను మెడలో ధరించవచ్చా? ఏ రకమైన మాలతో జపం చేస్తే మంచి ఫలితం వస్తుంది? పగడాల మాల, ముత్యాల మాల, రుద్రాక్షమాల, పుర్రెలమాల వీటిలో ఏది శ్రేష్ఠం ? ఇలా అనేక అనుమానాలు వస్తాయి.

ఒక్క మాట గుర్తుంచుకోండి. జపం చేసే సమయంలో ఆ దేవతకు ప్రీతికరమైన పూసలమాలతో జపం చేస్తే ఆ దేవత సంతసిస్తుంది. మంత్రం త్వరగా సిద్ధిస్తుంది. అలా అని పుర్రెలమాల, ఎముకలమాల వంటివి వామాచారతంత్రాలు. అవి నిషిద్ధాలు. ఇక లక్ష్మీమంత్రం జపం చేస్తే రుద్రాక్షమాల, తామర పూసలమాల, మారేడు కాయలమాల శ్రేష్ఠము. రుద్రాక్షమాలతో ఏ మంత్ర జపమైనా చెయ్యవచ్చు. అక్షమాలికోపనిషత్తు అని ఒక ఉపనిషత్తు ఉన్నది. ఇది ఋగ్వేదానికి సంబంధించినది. అందులో ప్రజాపతి కుమారస్వామిని అడుగుతున్నాడు. “ఓ కుమారస్వామీ! అక్షమాల ఎన్ని రకాలు? దానికి ఎన్ని దారాలుండాలి? ఎలా గ్రుచ్చాలి? ఇవన్నీ నాకు తెలియజేయవలసింది” ఆ మాటలు విన్న కుమారస్వామి చెబుతున్నాడు.

ఓ ప్రజాపతీ, జపమాలనే అక్షమాల అంటారు. జపం

చెయ్యటానికి పగడాలు, ముత్యాలు, స్పటికాలు, శంఖాలు, వెండి, బంగారము, మంచిగంధము, తామర పూసలు, రుద్రాక్షలు, తులసిపూసలు ఏవైనా వాడవచ్చు. జలమాలకు 51 పూసలు ఉండాలి. మంత్రశాస్త్రంలో అక్షరాలు 51. అందుకని మాలలో 50 పూసలు 51వది కొలికి పూస ఉండాలి. ఈ పూసలు అకారాది క్షకారాంతము వర్ణసమామ్నాయానికి ప్రతీక. ఈ పూసలు గుచ్చటానికి మూడు రకాల దారాలు కావాలి. అవే బంగారము వెండి, రాగి దారాలు. మధ్యలో బంగారము కుడివైపు వెండి ఎడమవైపు రాగిఉంచి పూసలన్నీ అగ్రమునకు అగ్రము, పుచ్ఛమునకు పుచ్ఛము కలిసేటట్లుగా మధ్యలో ప్రదక్షిణ క్రమంగా గుచ్చాలి. ఈ సూత్రములో మధ్యన ఉన్నది బ్రహ్మస్వరూపము, కుడివైపుది శైవము, ఎడమవైపుది వైష్ణవము, ముఖము సరస్వతి, పుచ్ఛము గాయత్రి, రంధ్రము విద్య, మూలప్రకృతి తెల్లనివి అచ్చులు. పసుపు పచ్చనివి కచట తపవర్గులు. మిగిలినవి హల్లులు. ఇలా ముందుగా మాలను 51 పూసలతో తయారుచేసి, పంచామృతాలు, పంచగవ్యాలు పంచగంధములతో శోధించి, పంచగవ్యాలతోను (గోమూత్రము, గోమయము, పాలు, పెరుగు, నేయి) పంచామృతాలతోను (పాలు, పెరుగు, నెయ్యి, తేనె, పంచదార) అభిషేకం చేసి, మంచిగంధపు నీటితోను, శుద్ధజలముతోను, సువాసన ద్రవ్యములతోను స్నానము చేయించి, ఓంకారంతో కూడిన దర్భకూర్చతో మార్జనము చేసి, అష్టగంధలేపనము చేసి, పంచపూజలు సమర్పించి ఆ మాలలోని పూసలను అకారాది వర్ణములుగా భావించి ఆ పూసలలోకి అక్షర దేవతలను ఆవాహన చెయ్యాలి. మొదటిపూస 'అ'కారము రెండవది 'ఆ'కారము. ఇలా పూసలమీద చెయ్యి పెట్టి మంత్రం చెబుతూ అక్షరదేవతలను పూసలలోకి ఆవాహన చెయ్యాలి.

1. ఓం అంకార మృత్యుంజయ సర్వవ్యాపక ప్రథమేఅక్షే ప్రతితిష్ఠ
2. ఓం ఆంకార ఆకర్షణాత్మక సర్వగత ద్వితీయేఅక్షే ప్రతితిష్ఠ
3. ఓం ఇంకార పుష్టిద అక్షోభకర తృతీయేఅక్షే ప్రతితిష్ఠ
4. ఓం ఈంకార వాక్ప్రసాదకర నిర్మల చతుర్థేఅక్షే ప్రతితిష్ఠ
5. ఓం ఉంకార సర్వబలప్రదసారతర పంచమేఅక్షే ప్రతితిష్ఠ
6. ఓం ఊంకార ఉచ్చాటనకర దుస్సహ షష్ఠేఅక్షే ప్రతితిష్ఠ
7. ఓం ఋంకార సంక్షోభకరచంచల సప్తమేఅక్షే ప్రతితిష్ఠ
8. ఓం ౠంకార సమ్మోహనకర ఉజ్వల అష్టమేఅక్షే ప్రతితిష్ఠ
9. ఓం  ంకార విద్వేషణకర మోహక నవమేఅక్షే ప్రతితిష్ఠ
10. ఓం  ంకార మోహకర దశమేఅక్షే ప్రతితిష్ఠ
11. ఓం ఏంకార సర్వవశ్యకర శుద్ధసత్య ఏకాదశేఅక్షే ప్రతితిష్ఠ
12. ఓం ఐంకార శుద్ధ సాత్విక పురుష వశ్యకర ద్వాదశేఅక్షే ప్రతితిష్ఠ
13. ఓం ఓంకార అఖిల వాఙ్మయ నిత్యశుద్ధ త్రయోదశేఅక్షే ప్రతితిష్ఠ
14. ఓం ఔంకార సర్వవాఙ్మయవశ్యకర చతుర్దశేఅక్షే ప్రతితిష్ఠ
15. ఓం అంకార గజాది వశ్యకర మోహన పంచదశేఅక్షే ప్రతితిష్ఠ
16. ఓం అః కార మృత్యునాశకరరౌద్ర షోడశేఅక్షే ప్రతితిష్ఠ
17. ఓం కం కారసర్వవిషహర కళ్యాణద సప్తదశఅక్షే ప్రతితిష్ఠ
18. ఓం ఖం కార సర్వక్షోభకర వ్యాపక అష్టాదశేఅక్షే ప్రతితిష్ఠ
19. ఓం గం కార సర్వవిఘ్నశమన ఏకోనవింశేఅక్షే ప్రతితిష్ఠ
20. ఓం ఘంకార సౌభాగ్యద, స్తంభనకర వింశేఅక్షే ప్రతితిష్ఠ
21. ఓం ఙంకార సర్వవినాశకర ఉగ్ర ఏకవింశేఅక్షే ప్రతితిష్ఠ

22. ఓం చంకార అభిచారఘ్నక్రూర ద్వావింశేఅక్షే ప్రతితిష్ఠ

23. ఓం ఛంకార భూతనాశకర భీషణ త్రయోవింశేఅక్షే ప్రతితిష్ఠ

24. ఓం జం కార కృత్యాది నాశకర, దుర్ధర్ష చతుర్వింశేఅక్షే ప్రతితిష్ఠ

25. ఓం ఝంకార భూతనాశకర పంచవింశేఅక్షే ప్రతితిష్ఠ

26. ఓం ఞం కార మృత్యుప్రమథన షడ్వింశేఅక్షే ప్రతితిష్ఠ

27. ఓం టంకార సర్వవ్యాధిహర, సుభగ సప్తవింశేఅక్షే ప్రతితిష్ఠ

28. ఓం ఠంకార చంద్రరూప అష్టావింశేఅక్షే ప్రతితిష్ఠ

29. ఓం డంకార గరుడాత్మక, విషఘ్న, శోభన, ఏకోనత్రింశేఅక్షే ప్రతితిష్ఠ

30. ఓం ఢంకార సర్వసంపత్ప్రద, సుభగ త్రింశేఅక్షే ప్రతితిష్ఠ

31. ఓం ణంకార సర్వసిద్ధిప్రద, మోహకర ఏకత్రింశేఅక్షే ప్రతితిష్ఠ

32. ఓం తంకార ధనధాన్యాది సంపత్ప్రద, ప్రసన్న, ద్వాత్రింశేఅక్షే ప్రతితిష్ఠ

33. ఓం థంకార ధర్మప్రాప్తికర నిర్మల త్రయస్త్రింశేఅక్షే ప్రతితిష్ఠ

34. ఓం దంకార పుష్టివృద్ధికర, ప్రియదర్శన, చతుస్త్రింశేఅక్షే ప్రతితిష్ఠః

35. ఓం ధంకార విషజ్వరఘ్న విపుల పంచత్రింశేఅక్షే ప్రతితిష్ఠ

36. ఓం నంకార భుక్తిముక్తిప్రద శాంత షట్త్రింశేఅక్షే ప్రతితిష్ఠ

37. ఓం పంకార విషవిఘ్ననాశన భవ్య సప్తత్రింశేఅక్షే ప్రతితిష్ఠ

38. ఓం ఫంకార అణిమాదిప్రది జ్యోతిరూప అష్టత్రింశేఅక్షే ప్రతితిష్ఠ

39. ఓం బంకార సర్వదోషదూర శోభన ఏకోనచత్వారింశేఅక్షే ప్రతితిష్ఠ

40. ఓం భంకార భూతశాంతికరభయానక చత్వారింశేఅక్షే ప్రతితిష్ఠ

41. ఓం మంకార విద్వేషి మోహనకర ఏకచత్వారింశేఅక్షే ప్రతితిష్ఠ

42. ఓం యంకార సర్వవ్యాపక పావన ద్విచత్వారింశేఅక్షే ప్రతితిష్ఠ

43. ఓం రంకార దాహకర, వికృత, త్రిచత్వారింశేఅక్షే ప్రతితిష్ఠ

44. ఓం లంకార విశ్వంభర, బాసుర చతుశ్చత్వారింశేఅక్షే ప్రతితిష్ఠ

45. ఓం వంకార సర్వాప్యాయనకర, నిర్మల పంచచత్వారింశేఅక్షే ప్రతితిష్ఠ

46. ఓం శంకార సర్వఫలప్రద, పవిత్ర, షట్చత్వారింశేఅక్షే ప్రతితిష్ఠ

47. ఓం షంకార ధర్మార్ధకామద, ధవళ, సప్తశ్చత్వారింశేఅక్షే ప్రతితిష్ఠ

48. ఓం సంకార సర్వకారణ, సార్వవర్ణిక, అష్టశ్చత్వారింశేఅక్షే ప్రతితిష్ఠ

49. ఓం హంకార సర్వవాఙ్మయ నిర్మల ఏకోనపంచదశదక్షేఅక్షే ప్రతితిష్ఠ

50. ఓం ళంకార సర్వశక్తిప్రదప్రధాన పంచాశదక్షే ప్రతితిష్ఠ.

51. ఓం క్షంకార పరాపరత్వ జ్ఞాపక, పరంజ్యోతీరూప, శిఖామణౌ ప్రతితిష్ఠ

అంటూ క్షకారాన్ని 51వ పూస అయిన కొలికి పూసయందు ప్రతిష్ఠించాలి. తరువాత దేవతలకు పిత్రుదేవతలకు అందరకు నమస్కారం చేసి ఈ అక్షమాలికను అనుగ్రహించమని ప్రార్ధించాలి. తరువాత ఆ మాలకు మళ్ళీ పంచపూజలు సమర్పించి

**ఓం నమస్తే భగవతి మంత్రమాతృకే, అక్షమాలే, సర్వవశంకరి**

**ఓం నమస్తే భగవతి మంత్రమాతృకే, అక్షమాలికే శేషస్తంభిని**

**ఓం నమస్తే భగవతి మంత్రమాతృకే అక్షమాలికే ఉచ్చాటిని ఓం నమస్తే**

అంటూ ప్రదక్షిణ చెయ్యాలి తరువాత ఆ మాలను సాక్షాత్తు దేవతాస్వరూపంగా భావించి నమస్కరించి దాన్ని పూజామందిరంలో ఉంచాలి. ప్రతిరోజూ భగవంతునికి పూజ చేసిన తరువాత ఈ అక్షమాలకు కూడా పంచపూజలు చేసి నమస్కరించి, పరమ పవిత్రంగా దాన్ని చేతిలోకి తీసుకుని జపంచేసి, ఆ తరువాత దాన్ని యథాస్థానంలో ఉంచాలి. ఈ రకంగా చేసిన జపం త్వరగా సిద్ధిస్తుంది.

*దీంతో శైవోపనిషత్తులు సమాప్తం*

శ్రీ

# పార్థసారథీయము

# చతుర్వేదభాష్యము

## (ఉపనిషత్తులు)

### (వేదాంతోపనిషత్తులు)



ప్రముఖ శ్రీవిద్యా ప్రచారకులు

అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,

ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, మెంఫిస్, అమెరికా ఆస్థాన విద్వాంసులు,

డా॥ క్రోవి పార్థసారథి

# 49. వేదాంతోపనిషత్తులు

వేదముల అంతమందున్నది వేదాంతము. వేదాల చివర ఉన్నది ఉపనిషత్తు. దీన్నే 'వేదాంతము' అంటారు. చరాచర జగత్తు ఏ రకంగా ఆవిర్భవించింది? ఎలా వృద్ధి పొందుతున్నది. ఏ రకంగా లయమవుతున్నది? లోకంలో జన్మించక ముందు మానవుడు ఎక్కడ ఉన్నాడు? మరణానంతరము ఎక్కడికి పోతాడు? సృష్టి స్థితి ప్రళయాలు చేసేది ఎవరు? ఈ జగత్తులో అతీతమైన శక్తి ఏదైనా ఉన్నదా. ఉంటే ఏది ? ఎలా ఉంటుంది? ఎక్కడ ఉంటుంది? దాన్ని చేరుకోవటం ఎలా? జనన మరణాదికమైన బాధలనుంచి, సంసార దుఃఖాల నుంచి విముక్తి కావాలంటే ఏం చెయ్యాలి? జన్మరాహిత్యం కావాలంటే ఎలా? ఇత్యాది ప్రశ్నలకు సమాధానమే వేదాంతము. వేదాంతాన్ని వివరించే ఉపనిషత్తులే వేదాంతోపనిషత్తులు. 108 ఉపనిషత్తులలోను 24 ఉపనిషత్తులు వేదాంతాన్ని చెబుతున్నాయి. **'బ్రహ్మ సత్యం జగన్మిథ్య'** అనే సిద్ధాంతాన్ని బోధిస్తాయి.

**"వేదాంతము అంటే అద్వైతమే. ద్వైతంలో వేదాంతం లేదు" అని చాలామంది వాదిస్తుంటారు. అది నిజంకాదు.** వేదాంతము అంటే ఉపనిషత్తు, బ్రహ్మవిచారము అని అర్థం. పరబ్రహ్మతత్త్వాన్ని తెలిపేది. మోక్షమార్గాన్ని చూపేది. మతం ఏదైనా అంతిమలక్ష్యం మోక్షసాధన. ద్వైతంలోగాని, అద్వైతంలో గాని, ఏ ఇతర మతాలలో నయినా సరే అంతిమలక్ష్యం మోక్షం. ఆ మోక్షమార్గాన్ని చూపేది, దాని వివరించేది, వేదాంతం. కాబట్టి **వేదాంతమనేది అందరికీ వర్తిస్తుంది. అంతేకాని ఏ ఒక్కరికో మాత్రమే కాదు. ఇది ఎవరి సొంతమూ కాదు.** ఇక ఉపనిషత్తులు చూద్దాం.

| ఉపనిషత్తు | వేదము |
|---|---|
| 1. శుకరహస్యోపనిషత్తు | కృష్ణయజుర్వేదము |
| 2. ఏకాక్షరోపనిషత్తు | కృష్ణయజుర్వేదము |
| 3. ప్రాణాగ్నిహోత్రోపనిషత్తు | కృష్ణయజుర్వేదము |
| 4. శారీరకోపనిషత్తు | కృష్ణయజుర్వేదము |
| 5. సూర్యోపనిషత్తు | అధర్వణ వేదము |
| 6. ముద్గలోపనిషత్తు | ఋగ్వేదము |
| 7. సావిత్రి ఉపనిషత్తు | సామవేదము |
| 8. అక్ష్యుపనిషత్తు | కృష్ణయజుర్వేదము |
| 9. అన్నపూర్ణోపనిషత్తు | అధర్వణ వేదము |
| 10. కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్తు | ఋగ్వేదము |
| 11. ముక్తికోపనిషత్తు | శుక్లయజుర్వేదము |
| 12. అధ్యాత్మోపనిషత్తు | శుక్లయజుర్వేదము |
| 13. ఆత్మోపనిషత్తు | అధర్వణ వేదము |
| 14. ఆత్మబోధోపనిషత్తు | ఋగ్వేదము |
| 15. గర్భోపనిషత్తు | కృష్ణయజుర్వేదము |
| 16. నిరాలంబోపనిషత్తు | శుక్లయజుర్వేదము |
| 17. సర్వసారోపనిషత్తు | కృష్ణయజుర్వేదము |
| 18. పైంగలోపనిషత్తు | శుక్లయజుర్వేదము |

| | | |
|---|---|---|
| 19. | మంత్రికోపనిషత్తు | శుక్లయజుర్వేదము |
| 20. | మహోపనిషత్తు | సామవేదము |
| 21. | మైత్రాయణోపనిషత్తు | సామవేదము |
| 22. | వజ్రసూచికోపనిషత్తు | సామవేదము |
| 23. | సుబాలోపనిషత్తు | శుక్లయజుర్వేదము |
| 24. | స్కందోపనిషత్తు | కృష్ణయజుర్వేదము |

ఒకే ఉపనిషత్తులో వివిధ విషయాలున్నప్పుడు వాటిని విడివిడిగా వ్రాయటం జరిగింది. ఒకే విషయం రెండు మూడు ఉపనిషత్తులలో ఉన్నప్పుడు ఆ ఉపనిషత్తుల పేర్లు కూడా చెప్పటం జరిగింది. ఇక్కడ కొన్నిచోట్ల మహామంత్రాలు కూడా ఇవ్వటం జరిగింది. వాటిని గురుముఖతః చెప్పుకోండి. పుస్తకం చూసి మంత్రజపం చెయ్యద్దు. ఇబ్బందులు ఎదురవుతాయి.

# 50. మహావాక్యాలు (శుకరహస్యోపనిషత్తు)

ఇది కృష్ణయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో 25 మంత్రాలున్నాయి. మహావాక్యాలు వాటి అనుష్టానం గురించి చెబుతోంది ఈ ఉపనిషత్తు. ఇది నాకు అత్యంత ఇష్టమైన ఉపనిషత్తు.

అసలు మహావాక్యాలు అంటే ఏమిటి? వేదం చివరి భాగాన్నే మనం ఉపనిషత్తు అన్నాం. ఇలా మొత్తం 1180 ఉపనిషత్తులు ఉన్నాయి అని గతంలో చెప్పుకున్నాం. ఈ ఉపనిషత్తులలో కొన్ని ముఖ్యమైన వాక్యాలను తీసి వాటిని మహావాక్యాలు అన్నారు. ఇవి పరబ్రహ్మను గురించి బోధిస్తాయి. అన్ని ఉపనిషత్తులలోను కలిపి 1008 మహా వాక్యాలున్నాయి. వాటిలో నాలుగు మాత్రం శ్రేష్ఠమైనవి.

1. ప్రజ్ఞానం బ్రహ్మ 2. అయమాత్మా బ్రహ్మ 3. అహంబ్రహ్మోస్మి 4. తత్త్వమసి

ఈ నాలుగు ప్రసిద్ధి చెందిన మహావాక్యాలు. ఈ నాలుగు మహావాక్యాలు నాలుగు వేదాలకు సంబంధించినవి. నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు పరబ్రహ్మ. ఆయన సర్వాంతర్యామి. అన్నింటియందు అంతర్లీనంగా ఉంటాడు. జీవాత్మ పరమాత్మల ఏకీకరణమే మోక్షము. ఆ మోక్షమార్గంలో నడిపించేవే మహావాక్యాలు. ప్రతి మహావాక్యం ఏదో ఒక ఉపనిషత్తుకు సంబంధించి ఉంటుంది. ఆ ఉపనిషత్తు ఒక వేదానికి సంబంధించి ఉంటుంది. ఈ రకంగా చూస్తే

| | | | |
|---|---|---|---|
| 1. | ప్రజ్ఞానంబ్రహ్మ | ఐతరేయోపనిషత్తు | ఋగ్వేదం |
| 2. | అయమాత్మాబ్రహ్మ | మాండూక్యోపనిషత్తు | అధర్వణవేదం |
| 3. | తత్త్వమసి | ఛాందోగ్యోపనిషత్తు | సామవేదం |
| 4. | అహంబ్రహ్మోస్మి | బృహదారణ్యకోపనిషత్తు | శుక్లయజుర్వేదం |

ఈ మహావాక్యాలన్నీ శుకరహస్యోపనిషత్తులో చెప్పబడ్డాయి. పూర్వకాలంలో దేవతలు, ఋషులు అందరూ బ్రహ్మదేవుడి దగ్గరకు వెళ్ళి శుకరహస్యోపనిషత్తు గురించి చెప్పమని అడిగారు. ఇప్పుడు బ్రహ్మదేవుడు చెబుతున్నాడు.

బ్రహ్మమానసపుత్రుడు – వశిష్టుడు. వశిష్టుని కుమారుడు – శక్తి. శక్తి కుమారుడు – పరాశరుడు. పరాశరుని కుమారుడు – వ్యాసుడు. వ్యాసుని కుమారుడు శుకుడు. వ్యాసమహర్షి తన కుమారుడైన శుకుడికి ఉపనయనం చేసి బ్రహ్మోపదేశం చెయ్యాలనుకున్నాడు. అప్పుడు కైలాసానికి వెళ్ళి, 'సదాశివా ! నా కుమారుడికి బ్రహ్మోపదేశం చెయ్యి.' అన్నాడు నేను గనక బ్రహ్మోపదేశం చేస్తే నీ కనుల ముందే నీ కుమారుడు మోక్షం పొందుతాడు. అది నీకు ఇష్టమేనా? అని అడిగాడు సదాశివుడు. ఒక్క క్షణం ఆలోచించాడు. తన కుమారుడు ముక్తి పొందుతాడు. అంతకన్నా ఇంకేం కావాలి? సరేనన్నాడు ఉపనయనానికి వచ్చాడు సదాశివుడు. అనుకున్నట్లుగానే శుకుడికి బ్రహ్మోపదేశం చేశాడు. ఇప్పుడు శుకుడు అడుగుతున్నాడు. "సదాశివా ! మోక్షద్వారం దగ్గరకు తీసుకువెళ్ళే మహావాక్యాలను నాకు వివరించి ఉపదేశించండి" అన్నాడు. సదాశివుడు చెప్పటం ప్రారంభించాడు. మహావాక్యాల ఉపదేశము అంటే ఇది రెండు రకాలుగా జరుగుతుంది. 1. నాలుగు మహావాక్యాలు కలిపి జపం చెయ్యటం. 2. 'తత్త్వమసి' మహావాక్యం ఒక్కదాన్నే జపం చెయ్యటం. ఇక్కడ రెండు పద్ధతులు ఇస్తున్నాను. మొదటగా మొత్తం నాలుగు మహావాక్యాలు కలిపి జపం చెయ్యటం.

సామాన్యంగా మహావాక్యాలు మంత్రంగా జపం చేసేవాళ్ళు మనకి కనిపించరు. పూర్తిగా మోక్షగాములే ఇలా చేస్తారు. ఒకసారి

నా దగ్గరకి ఒక పెద్దాయన వచ్చారు. 80 సం॥లు పైన ఉంటాయి. ఆయన పేరు 'రంగయ్య' వృత్తిరీత్యా డెంటిస్ట్. చాలా కాలేజీల్లో డెంటల్ ప్రొఫెసర్‌గా పని చేశారు. విశాఖపట్నం ఆంధ్రా యూనివర్శిటీ 'మెడికల్ కాలేజీలో ప్రొఫెసర్‌గా పనిచేశారు. ప్రస్తుతం విశాఖపట్నం కింగ్ జార్జి హాస్పటల్ ఎదురుగా క్లినిక్ నడుపుతున్నారు. (ప్రస్తుతం అంటే - ఎనిమిది సంవత్సరాల క్రితం నా దగ్గరకి వచ్చిన రోజున) మంచి స్థితిపరుడు. ఆయన వచ్చే సమయానికి నేను హోమం చేస్తున్నాను. కూర్చున్నారు. తరువాత తన వివరాలు చెప్పేరు. అంతా విని మీకు ఏం కావాలి? అన్నాను. నాకు ఏమీ అక్కర్లేదు. మహావాక్యాలు చెప్పుకోవాలని ఉంది. అందుకే మీ దగ్గరకి వచ్చాను. మీరు ఎప్పుడు రమ్మంటే అప్పుడు వస్తాను. అన్నారు. ఆయన యాదవుడు. నేను ఒక్కక్షణం ఆలోచించి ఒకవారం తరువాత రమ్మన్నాను వచ్చారు. మహావాక్యాలు ఉపదేశం చేసి పంపాను. ఆయన ఇటు వచ్చినప్పుడల్లా మా యింటికి వచ్చి వెళ్ళేవారు. రెండు మూడు సంవత్సరాల క్రితం ఆయన కాలం చేశారు అని విన్నాను.

ఇక్కడ విషయం ఏమంటే ఒకసారి ఈ విషయాన్ని ఒకచోట ప్రస్తావించాను. అక్కడ ఒకాయన వెంటనే అడిగారు. మీరు ఆయనకి మహావాక్యాలు చెప్పారా? అని. 'చెప్పాను' అన్నాను. 'చాలా తప్పు చేశారు. మీరు అలా చెప్పకూడదు' అన్నాడు. ఆయనకి మహావాక్యాలు చెప్పటమేమిటి?' అన్న అర్థం స్ఫుటంగా కనిపిస్తోంది. ఆయన మాటలలో ఇక్కడ మనం ఆలోచించాల్సిన విషయం ఏమంటే మహావాక్యాలు అనే పేరు తప్ప వాటిని గురించి ఈయనకి ఏమీ తెలియదు. వాటిని ఎవరికి చెప్పాలి? అనే విషయం ఈయన నిర్దేశిస్తున్నాడు. **జ్ఞానానికి మోక్షానికి అందరూ అర్హులే.** గమనించండి.

జీవితంలో పండినవారు మాత్రమే మహావాక్యానుష్టానం చేస్తారు.

సామాన్యంగా ఎవరికీ మహావాక్యానుష్టానం చెయ్యాలనే ఆలోచన కూడా రాదు. మహావాక్యాలు ఉపదేశం చేసిన గురువులు ఎందరున్నారో విచారించండి. నన్ను మాత్రం ఈ రంగయ్యగారు తప్ప ఇంతవరకు ఎవరూ మహావాక్యాలు చెప్పమని అడగలేదు. మహావాక్యాలు కూడా షడంగాలతో జపం చెయ్యాలి. ముందుగా నాలుగు మహావాక్యాలు కలిపి జపం చెయ్యటం.

అస్యశ్రీ మహావాక్య మహామంత్రస్య । హంస ఋషిః । అవ్యక్త గాయత్రీఛందః పరమహంసోదేవతా । హం బీజం । సః శక్తిః । సోహం కీలకం. మమ పరమహంస ప్రీత్యర్థే జపే వినియోగః

న్యాసము : సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ

నిత్యానందోఽబ్రహ్మ

నిత్యానందమయం బ్రహ్మ

యోవై భూమా

యోవై భూమాధిపతిః

ఏకమేవాద్వితీయం బ్రహ్మ

**ధ్యానం :**

**నిత్యానందం పరమశుఖదం కేవలం జ్ఞానమూర్తిం**
**విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యమ్**
**ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతమ్**
**భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి ॥**

**ఓం ప్రజ్ఞానం బ్రహ్మ । ఓం అహం బ్రహ్మాస్మి ।**
**ఓం తత్త్వమసి । ఓం అయమాత్మా బ్రహ్మ ॥**

ఇప్పుడు తత్త్వమసి అనే మహావాక్యాన్ని చూద్దాం. దీన్ని మొత్తం మూడు మంత్రాలుగా చెప్పుకొని ఉపాసన చెయ్యాలి.

అస్యశ్రీ తత్పద మహామంత్రస్య। హంస ఋషిః। అవ్యక్త గాయత్రీ ఛందః। పరమ హంసో దేవతా। హం బీజం। సః శక్తిః। సోహం కీలకం। మమసాయుజ్య ముక్తి సిద్ధ్యర్థే జపే వినియోగః న్యాసము

1. తత్పురుషాయ నమః 2. ఈశానాయ నమః 3. అఘోరాయ నమః 4. సద్యోజాతాయ నమః 5. వామదేవాయ 6. తత్పురుష ఈశాన అఘోర సద్యోజాత వామదేవ దేవేభ్యో నమః

**ధ్యానమ్ :**

**జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యా దతీతం**
**శుద్ధం బుద్ధం ముక్తిమప్యవ్యయం చ**
**సత్యం జ్ఞానం సచ్చిదానందరూపం**
**ధ్యాయాద్దేవం తన్మహో భ్రాజమానం ॥**

**మం॥ ఓం తత్ స్వాహా**

అస్యశ్రీ త్వంపదం మహామంత్రస్య। విష్ణు ఋషిః। గాయత్రీ ఛందః। పరమాత్మా దేవతా। ఐం బీజం। క్లీం శక్తిః। సౌః కీలకం మమ ముక్త్యర్థే జపే వినియోగః న్యాసము :

1. వాసుదేవాయ 2. సంకర్షణాయ 3. ప్రద్యుమ్నాయ 4. అనిరుద్ధాయ 5.వాసుదేవాయ 6. సంకర్షణ, వాసుదేవ, ప్రద్యుమ్నా నిరుద్ధేభ్యః

**ధ్యానమ్ :**

**జీవత్వం సర్వభూతానాం సర్వత్రాఖండ విగ్రహమ్**

**చిత్తాహంకార యంతారం జీవాఖ్యం త్వం పదం భజే ॥**

**మంత్రం : ఓం త్వం స్వాహా**

3. అస్యశ్రీ అసిపద మహామంత్రస్య । మన ఋషిః । గాయత్రీ ఛందః । అర్ధనారీశ్వరో దేవతా । అవ్యక్తాదిర్బీజం । నృసింహ శక్తిః । పరమాత్మా కీలకం । జీవబ్రహ్మైక్యార్థే జపే వినియోగః 1. న్యాసము

1. పృథ్వీద్వ్యణుకాయ 2. అబ్ద్వ్యణుకాయ 3. తేజోద్వ్యణుకాయ 4. వాయుద్వ్యణుకాయ 5. ఆకాశద్వ్యణుకాయ 6. పృథ్వివ్యస్తేజో వాయ్వాకాశ ద్వ్యణుకేభ్యో నమః

**ధ్యానమ్ :**

**జీవోబ్రహ్మేతి వాక్యార్థం యావదస్తి మనస్థితిః**
**ఐక్యం తత్త్వం లయే కుర్వన్ ధ్యాయే దసిపదం సదా ॥**

**మం॥ ఓం అసి స్వాహా**

**అఖండమండలాకారం । వ్యాప్తం యేన చరాచరం**
**తత్పదం దర్శితం యేన । తస్మైశ్రీ గురవే నమః ॥**
**స్థావరం జంగమం వ్యాప్తం యత్కించి త్సచరాచరం**
**త్వం పదం దర్శితం యేన । తస్మైశ్రీ గురవే నమః ॥**
**చిన్మయం వ్యాపితం సర్వం । త్రైలోక్యం సచరాచరం**
**అసిత్వం దర్శితం యేన । తస్మైశ్రీ గురవే నమః**

అంటోంది గురుగీత.

ఇవి మహావాక్యాలు. తత్త్వమసి అనే మహావాక్యానికి అర్థం తెలిస్తే మిగిలిన మూడింటికీ అర్థం తెలిసినట్లే. దీని వివరణ కోసం "మహావాక్యదర్పణము" అనే పుస్తకం కూడా ఉన్నది.

# 51. మహావాక్య వివరణ (పైంగలోపనిషత్తు)

మహావాక్యాలు అంటే ఏమిటి ? కైవల్య సాధనలో వీటి పాత్ర ఏమిటి అనే విషయాలు చూద్దాం.

నాలుగు వేదాలకు కలిపి 1180 ఉపనిషత్తులు ఉన్నాయి. వాటిలో 108 మాత్రమే చదవతగినవి అని తేల్చారు. అందులో కూడా పది ఉపనిషత్తులు ముఖ్యమైనవి అన్నారు శంకర భగవత్పాదులవారు. ప్రతి ఉపనిషత్తు కూడా ఏదో ఒక వేదానికి సంబంధించినదే. ఈ పది ఉపనిషత్తులలోనూ

ఐతరేయోపనిషత్తు – ఋగ్వేదంలోది

కఠ, తైత్తిరీయోపనిషత్తులు – కృష్ణ యజుర్వేదంలోవి

ఈశావాశ్య, బృహదారణ్యకాలు – శుక్లయజుర్వేదంలోవి

కేన, ఛాందోగ్యోపనిషత్తులు – సామవేదంలోవి

ప్రశ్న, ముండక, మాండూక్యోపనిషత్తులు – అధర్వవేదంలోవి

ఉపనిషత్తు అంటే బ్రహ్మవిద్య. బ్రహ్మవిద్యా పరిశీలకులైన విద్వాంసులకు కర్మ, జన్మ, మరణాలు లేకుండా చేసేది. ఆ జన్మాది మరణాదికమైన దానిని నశింపచేసి, బ్రహ్మ పదార్ధలాభం కలిగించేది

ఉపనిషత్తు.

ప్రతి ఉపనిషత్తులోనూ పరబ్రహ్మతత్త్వాన్నే చెప్పటం జరిగింది. నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు పరబ్రహ్మ. ఆదిమధ్యాంతాలు లేనివాడు. శాశ్వతుడు. స్వతంత్రుడు. ధర్మాధర్మాలు లేనివాడు. పక్షపాతం లేనివాడు. నిమిత్తమాత్రుడు. ఆనంద స్వరూపుడు. జీవులయొక్క కర్మలననుసరించి వారికి ఉత్తరజన్మలు ప్రసాదిస్తాడు. సృష్టి స్థితి లయాలకు అతడే కారణము. చరాచర జగత్తంతా అతడు వ్యాపించి ఉన్నాడు. సర్వవ్యాపి. ఈ విధంగా ఉపనిషత్తులు పరబ్రహ్మ స్వరూపాన్ని ప్రతిపాదించటంలో చాలావరకు సఫలీకృతం చెందాయి. అయితే ఉపనిషత్తుల సారమంతా మహా వాక్యాలలో ఉన్నది. మహావాక్యాలు నాలుగు. ఈ నాలుగు మహావాక్యాలు నాలుగు వేదాలకు సంబంధించిన ఉపనిషత్తుల నుండి చెప్పబడ్డాయి. అవి

1. ప్రజ్ఞానం బ్రహ్మ ఐతరేయోపనిషత్తు
ఋగ్వేదం
2. అహంబ్రహ్మాస్మి బృహదారణ్యకం
శుక్లయజుర్వేదం
3. తత్త్వమసి ఛాందోగ్యోపనిషత్తు
సామవేదం
4. అయమాత్మా బ్రహ్మ మాండూక్యోపనిషత్తు
అధర్వవేదం

ఈ మహావాక్యాలను బ్రహ్మనిష్ఠాగరిష్ఠుడైనవాడు షడంగాలతో ధ్యానం చెయ్యాలి. ఇది పరమోత్తమమైన తత్త్వము. విజ్ఞాన సహితము.

దీనిని తెలుసుకున్నవారు ముక్తిని పొందుతారు. సద్గురువైనవాడు షడంగాలను చెప్పకుండా మహావాక్యాలను ఉపదేశించరాదు. షడంగాలు అంటే

1. ఋషి 2.ఛందస్సు 3. దేవత 4. బీజము 5. శక్తి 6. కీలకము

ఉపనిషత్తులన్నీ వేదాలసారమైనట్లుగానే, మహావాక్యాలు ఉపనిషత్తులసారము. మహావాక్యాలద్వారా పరబ్రహ్మను ధ్యానించే బ్రహ్మజ్ఞానులకు తీర్థాలు, మంత్రాలు, శాస్త్రాలు, జపాలు అవసరంలేదు. పుణ్యాతీత బ్రహ్మజ్ఞాన సంపన్నులకు పుణ్యప్రదాలైన తీర్థజపాదులు ముఖ్యంకావు. వాక్యార్థ విచారణవలన వందసంవత్సరాలు ఆయుర్దాయం కలుగుతుంది. అటువంటి పూర్ణాయువు షడంగాలతో కూడిన మహావాక్యజపం ఒక్కసారి చేసినా కలుగుతుంది.

మహావాక్యాలు నాల్గింటిలోనూ 'తత్త్వమసి' అనేది ముఖ్యమైనది. ఈ వాక్యము మూడు భాగాలుగా విభజింపబడుతున్నది. 1. తత్ 2. త్వం 3. అసి. ఈ మూడింటినీ కూడా షడంగాలతో విడివిడిగా జపం చెయ్యాలి. ఈ విషయమంతా శుకరహస్యోప నిషత్తులో చెప్పబడింది.

పదాలకు వాచ్యార్థము, లక్ష్యార్థము అని రెండు రకాల అర్థాలుంటాయి. ముందుగా 'తత్' అనే పదానికి వాచ్యార్థము – ఈశత్వ, సర్వజ్ఞత్వాదులు. లక్ష్యార్థము – సచ్చిదానందమయమైన పరబ్రహ్మము. 'త్వం' అనే పదానికి వాచ్యార్థము – పంచభూతాత్మకమైన శరీరము, ఇంద్రియాలు మొదలైనవి. లక్ష్యార్థము – సచ్చిదానందమైన పరబ్రహ్మము. 'అసి' అనగా తత్, త్వం పదములయొక్క కలయిక. త్వం – నీవు. తత్ – వాడు. జీవుడు, ఈశ్వరుడు అనే భేదాలు

కార్యకారణరూప ఉపాధువల్ల కలుగుతున్నాయి. ఈ రెండు ఉపాధులను తిరస్కరించినట్లైతే మిగిలేది అద్వితీయమైన సచ్చిదానంద పరబ్రహ్మము. ఉన్నది ఒక్కటే. రెండులేవు. అదే సత్తు చిత్తు ఆనందము. దేవదత్తుడు ఒకడే అయినప్పటికీ దేశకాలమాన భేదాలతో వేరువేరుగా కనిపిస్తున్నాడు. ఇతడే అతడు అనే ప్రత్యభిజ్ఞానంతో దేశకాలమాన సంబంధాన్ని త్రోసి పుచ్చగా, ఆ దేవదత్తుడే ఇతడు అనే నిశ్చయ జ్ఞానం కలుగుతుంది. ఇదే విధంగా కార్యకారణ సంబంధాలతో ఒకే పరమాత్మ జీవుడుగా, ఈశ్వరుడుగా కనిపిస్తున్నాడు. మహావాక్యాలను విచారణ చేసినట్లైతే ఆ పరబ్రహ్మమే నేను అనే జ్ఞానం కలుగుతుంది. ఉపాధి ద్వయంకూడా తొలగిపోగా సచ్చిదానంద బ్రహ్మమే సిద్ధిస్తుంది.

కార్యమగు విద్యోపాధిని ధరించినవాడు జీవుడు. కారణమగు మాయోపాధి గలవాడు ఈశ్వరుడు. ఈ కార్యకారణ ఉపాధులు రెండింటినీ వదలినట్లైతే సిద్ధించేది – పరిపూర్ణ బోధయే. వీటిని ముందుగా సద్గురువు ద్వారా వినాలి. తరువాత మననం చెయ్యాలి. ఆ తరువాత ధ్యానం చెయ్యాలి. ఈ మూడింటివలన పరిపూర్ణ అఖండ జ్ఞానం కలుగుతుంది. ఆత్మజ్ఞానానికి భిన్నమైన లౌకిక విద్యలన్నీ నశిస్తాయి. బ్రహ్మవిద్యా పరిజ్ఞానము, బ్రహ్మప్రాప్తి కలుగుతాయి.

మహావాక్యోపనిషత్తులో వీటిని వివరిస్తూ మహావాక్యాలు సామాన్యుడికి చెప్పతగినవి కావు. సత్వగుణ సంపన్నుడు, అంతర్ముఖుడైనవాడు, గురువుకు శుశ్రూష చెయ్యటంలో ఆసక్తి గలవాడికి మాత్రమే వీటిని ఉపదేశించాలి. ముముక్షువు సాధన చతుష్టయాన్ని సాధించిన తరువాత, సంసార బంధానికీ, మోక్షానికీ విద్య, అవిద్య అనేవి రెండు కళ్ళు అని తెలుసుకుని అనాత్మ పదార్థాన్ని వదలివేసి, బ్రహ్మపదార్థాన్ని మాత్రమే తీసుకుని, దేహాన్ని విడిచి

ముక్తుడవుతున్నాడు. అని చెప్పబడింది.

ఆత్మనిష్ఠ కలగాలంటే సాధకుడికి నాలుగు లక్షణాలుండాలి. వాటినే సాధనా చతుష్టయము అంటారు. అవి 1. నిత్యానిత్య వివేకము 2. వైరాగ్యము 3. షట్సంపత్తి 4. ముముక్షుత్వము.

సాధన చతుష్టయము

చరాచర జగత్తులో పిపీలికాది బ్రహ్మపర్యంతము 84 లక్షల రకాలయిన జీవరాశి ఉన్నది. ఈ లోకంలో జన్మించిన తరువాత క్రిమికీటకాదుల నుంచి ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ చివరకు మానవుడిగా జన్మించటం జరుగుతుంది. మానవజన్మను మించిన జన్మ ఇంకొకటి లదు. అందుకే "జన్మానాం నరజన్మ దుర్లభం" అంటారు. అయితే మానవులంతా ఒకేలా ఉండరు. వారి వారి కర్మ ఫలితాన్ని బట్టి వారిలో తేడా ఉంటుంది. ఆ కర్మసంస్కారం వల్లనే కొంతమంది ఉత్తములుగా, కొంతమంది మధ్యములుగా, కొంతమంది అధములుగా జన్మిస్తారు. వీళ్ళందరూ ఈ జగత్తులో మనకి కనిపిస్తూనే ఉంటారు. వీరిలో కొంతమంది పూర్వజన్మ సంస్కారం వల్ల బ్రాహ్మణులుగా జన్మిస్తారు. ఇక్కడ బ్రాహ్మణుడు అంటే 'బ్రహ్మవిద్యను ఉపాసించే వాడు' సత్యాన్వేషి అని అర్థం. నిరంతరం పరబ్రహ్మతత్త్వసాధనలోనే లీనమై ఉండేవాడు. 'పరమేశ్వరుని ముఖాన్నుంచి బ్రాహ్మణుడు ఆవిర్భవించాడు' అని పురుష సూక్తం చెబుతోంది. ఈ చరాచర జగత్తంతా పరమేశ్వరుణ్ణుంచే ఆవిర్భవించింది. మరి బ్రాహ్మణుడు పరబ్రహ్మముఖాన్నుంచి వచ్చాడు అని ఎందుకు చెప్పారు అంటే, ఆ పరమేశ్వరుని ముఖం అమితమైన తేజస్సుతో ప్రకాశిస్తుంది. ఆ తేజస్సునే బ్రహ్మతేజస్సు అన్నాం. అటువంటి తేజగస్సు గలవాడు కాబట్టి, నిరంతరము పరబ్రహ్మ తత్త్వాన్వేషణలోనే కాలం గడుపుతాడు. కాబట్టి, బ్రాహ్మణుడు

అనబడుతున్నాడు. ఆ పరబ్రహ్మ ముఖం నుంచి ఇంద్రుడు, అగ్నికూడా ఆవిర్భవించారు. అంటే ఆయన ముఖం అగ్నితేజస్సుతో, ఇంద్రతేజస్సుతో ప్రకాశిస్తున్నది. అటువంటి తేజస్సుగలవాడు బ్రాహ్మణుడు. ఎవరైనా జన్మనా జాయతే శూద్రః కర్మనా జాయతే ద్విజః జన్మచేత శూద్రుడే. కాని అతడు చేసే కర్మలవల్లనే ద్విజుడు అనబడతాడు. దీనికి ఉదాహరణగా క్షత్రియుడుగా జన్మించిన విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అయినాడు. ఇక్కడ ఇంకొక విషయం ఏమంటే సంస్కారవంతుల ఇంట్లో జన్మించినట్లైతే, ఆ సంస్కారము మనకూ పుట్టుకతోనే వస్తుంది. ఆ తరువాత అతడు వేదవేదాంగాలు అభ్యసిస్తాడు. అగ్నికార్యం చేస్తాడు. యజ్ఞయాగాది క్రతువులు చేస్తాడు. అందుకే అటువంటి బ్రాహ్మణుడు ఉత్తముడు, శ్రేష్ఠుడు అనబడుతున్నాడు. అద్వితీయుడు, జాతి, గుణ, క్రియారహితుడు, షడూర్మలు (ఆకలి, కోరిక, శోకము, మోహము, జర, మరణము), షడ్భావాలు (ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, విశేష, సమవాయువులు), షడ్వికారాలు (ఉండటము, పుట్టటము, పెరగటము, రూపుమారటము, క్షీణించటము, నశించటము) లేనివాడు, సత్యజ్ఞాన ఆనంద స్వరూపుడు, నిర్వికల్ప సంకల్పుడు, సకల సంకల్పాలకు ఆధారమైన వాడు, సమస్త భూతాలకు అంతర్యామి, ఆకాశంలాగా బాహ్యాభ్యంతరాలలో వ్యాపించినవాడు, అవిచ్ఛిన్నమైన ఆనందము గలవాడు, అప్రమేయుడు, స్వానుభవంతో మాత్రమే గ్రహింపదగినవాడు, స్వయంప్రకాశి, భగవంతుని సాక్షాత్కారము పొంది కృతార్థుడైన వాడు, దోషరహితుడు, సద్గుణ సంపన్నుడు, అరిషడ్వార్గాలను జయించినవాడు, దంభము, అహంకారము లేనివాడు నిజమైన బ్రాహ్మణుడు అని స్మృతులు, పురాణాలు చెబుతున్నాయి. ఈ కారణంచేతనే బ్రాహ్మణుల ఇంట

పుట్టటము శ్రేష్ఠము. బ్రాహ్మణుడుగా పుట్టిన తరువాతకూడ వైదిక కర్మలు ఆచరించటం, పండితుడు గావటం, ఆత్మానాత్మ వివేకం కలిగి ఉండటము అనేవి పూర్వజన్మ పుణ్యఫలంవల్లనే కలుగుతాయి.

ఈ జగత్తులో 84 లక్షల రకాలయిన జీవరాశి ఉన్నదని గతంలో చెప్పుకున్నాం. క్రిమికీటకాలు, పశువులు, పక్షులు ఇవన్నీ కర్మఫలాన్ని అనుభవిస్తాయి. అంతేకాని కర్మను మాత్రం చెయ్యలేవు. వాటికి వివేకము ఉండదు. యుక్తాయుక్త విచక్షణా జ్ఞానము కూడా ఉండదు. ఇక దేవతల సంగతి చూసినట్లైతే, వారు అశరీరులు. కర్మ చేసే అధికారం కాని, అవకాశం కాని వాళ్ళకి లేదు. దేవతలు కూడా ఏదైనా కర్మ చెయ్యాలి అంటే భూలోకంలో మానవుడుగా జన్మించాల్సిందే. ఈ లోకంలోనే కర్మ చెయ్యాలి. అందుకే ఇది కర్మభూమి అనబడుతోంది.

కర్మ చేసే అవకాశం ఒక్క మానవులకు మాత్రమే ఉన్నది. సత్కర్మల ద్వారా తమ పాపాలను నశింప చేసుకునే శక్తి మానవుడికి మాత్రమే ఉంది. అందుకే ఈ జగత్తులో అన్ని జన్మలకన్నా, చివరకు దేవతల కన్న కూడా మానవజన్మే ఉత్తమమైనది. ఈ రకంగా ఉత్తమమైన మానవజన్మ పొంది, జీవిత లక్ష్యమైన మోక్షం కోసం ప్రయత్నించనివాడు మూర్ఖుడు. అతడు 'ఆత్మహంతకుడు' అనబడతాడు. ముముక్షత్వము, సజ్జన సాంగత్యము, అనేవి భగవత్కృప వల్లనే కలుగుతాయి. ఎన్ని శాస్త్రాలు చదివినా, యజ్ఞయాగాది కర్మలు చేసినా, దేవతలను ఉపాసన చేసినా, జీవాత్మ పరమాత్మల ఏకత్వం గురించి తెలియకపోతే ఉపయోగం లేదు. అతడికి ఎన్ని కల్పాలు గడిచినా మోక్షం రాదు. వేదాలు చదివితే మోక్షం రాదు, ధనంవల్ల మోక్షం రాదు, కర్మలు చెయ్యటం వల్ల మోక్షం రాదు. కేవలం జ్ఞానంవల్లనే మోక్షం వస్తుంది.

జ్ఞానమే మోక్షసాధనము. అందుకే విద్వాంసుడైన వాడు ఐహిక సుఖాలను వదిలిపెట్టి సద్గురువును ఆశ్రయించి, ఆయన చెప్పే విషయాలను శ్రద్ధగా వింటూ, బ్రహ్మచర్యం పాటిస్తూ, మోక్షమార్గం కోసం ప్రయత్నించాలి. సద్వస్తువైన ఆత్మను దర్శించటంలో నిమగ్నుడు కావాలి. సంసార సాగరంలో కొట్టుమిట్టాడుతున్న ఆత్మను ఉద్ధరించుకోవాలి. ఈ రకంగా ఆత్మదర్శనాతత్పరుడైన విద్వాంసుడు కర్మబంధనాల నుంచి విముక్తి పొందటానికి ప్రయత్నించాలి. అయితే యజ్ఞయాగాది క్రతువులు, వ్రతాలు, దేవతార్చన, దానము, ధర్మమువంటి కర్మలు చెయ్యనవసరం లేదా? అని అనుమానం వస్తుంది. కర్మలు చెయ్యద్దు అని కాదు. ప్రతివాడూ కర్మలు తప్పకుండా చేసి తీరాలి. కర్మలవల్ల మనస్సు నిర్మలం అవుతుంది. వాటిని అంతవరకే పరిమితం చెయ్యాలి. కర్మలు బంధహేతువులు. వాటివల్ల స్వర్గసుఖాలు కలుగుతాయి. సంసార నివృత్తి కాదు. అందుకే కర్మపరిత్యాగం చెయ్యాలి. ముందుగా కర్మలు ఆచరించి, వాటి ఫలితమైన చిత్తశుద్ధిని పొంది, ఆ తరువాత కర్మలను పరిత్యజించాలి. కర్మలు చెయ్యటంవల్ల ఆత్మజ్ఞానం రాదు. తీర్థాలు సేవించటంవల్ల ఆత్మజ్ఞానం రాదు. గురువు చేసిన బోధనలు విని, వాటిని గురించి ఆలోచించటం వల్లనే ఆత్మజ్ఞానము అనేది వస్తుంది. అందుకే విద్వాంసుడు బ్రహ్మవేత్త, దయామయుడు అయిన గురువును ఎంచుకుని శరణు వేడాలి. ఆత్మనిష్ఠ కలగాలంటే విద్వాంసుడికి నాలుగు లక్షణా లుండాలి. వాటినే సాధనాచతుష్టయము అంటారు. సత్యాన్వేషణకు విధిగా ఈ నాలుగు లక్షణాలు ఉండాలి. అలా ఉంటేనే బ్రహ్మానుభవము సాధ్యమవుతుంది. అవి 1. నిత్యానిత్య వివేకము 2. వైరాగ్యము 3. షట్సంపత్తి 4. ముముక్షత్వం.

**1. నిత్యానిత్య వివేకము :** చరాచర జగత్తులో ఆత్మ ఒక్కటే సత్యము, నిత్యము శాశ్వతమైనది. దృశ్యమానమైన ఈ జగత్తంతా భ్రమ. అందుచేతనే **'బ్రహ్మసత్యం జగన్మిథ్య'** అని చెబుతున్నారు. మిథ్య అంటే లేదు అని అర్థం కాదు. జగత్తు మాయ కాదు. మాయ అంటే లేనిది ఉన్నట్లుగాను, ఉన్నది లేనట్లుగాను కనిపించేది. ఈ జగత్తు మాయ కాదు. వాస్తవిక సత్యం. కంటికి కనిపిస్తుంది. కాని శాశ్వతం కాదు. ఇది అసత్యము అని ఋజువు చెయ్యటం కష్టం. అందుకే జగన్మిథ్య అని చెప్పటం జరుగుతున్నది. మన కళ్ళ ఎదురుగానే కట్టుకున్న కట్టడాలు కూలిపోతున్నాయి. రాజ్యాలు నాశనమయిపోతున్నాయి. ఈ సామ్రాజ్యాలు పాలించిన రాజులు మరనిస్తున్నారు. మన తాతలు, ముత్తాతలు అందరూ మరణించారు. కొంతకాలానికి మనం కూడా మరణిస్తాము. ఈ లోకంలో ఎవరూ శాశ్వతం కాదు. ఆత్మ ఒక్కటే సత్యము, నిత్యము, శాశ్వతమైనది. ఈ వస్తుజాలమంతా నశించేది. అనిత్యమైనది. అసలు ఈ జగత్తే అనిత్యమైనది. అటువంటి అనిత్యమైన ఈ జగత్తులో నిత్యమైన ఆత్మ ఒక్కటే శాశ్వతమైనది. ఈ రకంగా బ్రహ్మ ఒక్కటే సత్యమైనదని, ఈ జగత్తంతా మిథ్య అని భావించటమే నిత్యానిత్య వివేకము. ఈ విధమైన దృష్టి కలకగటమే వివేకము.

ఆత్మ అనేది నిష్కల్మషమైనది, అఖండమైనది, అద్వితీయమైనది. దేహం మాత్రం అనేక రకాల తత్త్వాలతో నిర్మించబడింది. ప్రారబ్ధకర్మ కారణంగా జీవి ఉపాధి భేదం చేత 84 లక్షల రకాలయిన జన్మలు ఎత్తుతున్నాడు. వీటన్నింటిలోకి మానవజన్మ ఉత్తమమైనది. అందుకే మానవుడిగా పుట్టిన ప్రతిజీవి, చతుర్విధ పురుషార్థాలలోను, నాల్గవదైన మోక్షమార్గాన్ని వెతుకులాడాలి. మోక్షసాధనే జీవిత ధ్యేయం. మోక్షాన్ని

పొందాలంటే ఈ జగత్తులో సత్యాసత్యాలను గురించి తెలుసుకోవాలి. దాన్నే 'ఆత్మానాత్మ వివేకము' లేదా 'నిత్యానిత్య వస్తు వివేకము' అంటారు. దేహము ఆత్మ రెండూ ఒకటి కాదు. ఈ రెండూ 'వేరు వేరు' ఈ విషయంలో అనుభవజ్ఞానం ఉండాలి. ఆత్మ నాశనము లేనిది. శాశ్వతమైనది. ఈ దేహానికి జన్మమృత్యుజరాదులు ఉన్నాయి. కాలం తీరిన తరువాత ఈ దేహం నశించిపోతుంది. కాని ఆత్మ శాశ్వతమైనది. ఆత్మకు నాశనం లేదు. ఈ విధంగా దృఢంగా జ్ఞానసముపార్జన చెయ్యటాన్నే ఆత్మానాత్మ వివేకము అంటారు. మోక్షగామి అయినవాడు ముందుగా ఈ జ్ఞానాన్ని కలిగి ఉండాలి. సాధన చతుష్టయంలో ఇది తొలిమెట్టు. జాగ్రత్తగా పరిశీలన చేసినట్లైతే ఆత్మ ప్రకాశించేది; స్వచ్ఛమైనది. దేహము తమోమయమైనది. ఆత్మచైతన్యమైనది. శరీరము జడమైనది. ఆత్మ నిత్యము సత్యము అయినది. దేహము అసత్యరూపం గలది. అనిత్యమైనది. ఆత్మ మార్పులు లేనిది. శరీరము మార్పు చెందుతుంది. బాల్యయౌవ్వన కౌమారాది దశలవల్ల, రోగాలు, దుఃఖాలు వీటివల్ల శరీరం మార్పు చెందుతుంది. ఆ తరువాత మృత్యు ఒడిలోకి జారిపోతుంది. అందుకే ఈ శరీరం అనిత్యము. వ్యష్టి రూపంలో శరీరంలాగానే సమిష్టిగా చూస్తే ఈ జగత్తుకూడా అసత్యమైనదే. అయితే కళ్ళకి కనిపిస్తున్న ఈ శరీరాన్ని, జగత్తుని కూడా కాదనలేము. ఈ కారణంచేతనే శరీరానికి, జగత్తుకు ఉన్నది **'వ్యావహారిక సత్త'** అంటారు. అంటే ఉన్నంతవరకే ఇది సత్యము. ఆ తరువాత మార్పుకు లోనై క్రమేణా నశించిపోతుంది. ఎప్పుడైతే ఇది నాశనమైందో అప్పుడు ఇదంతా అనిత్యము అని తేలిపోతుంది. అజ్ఞాని ఈ శరీరము, ఆత్మకూడా నిత్యమైనవే అని భావన చేస్తాడు. ఈ శరీరం నాది అని, శరీరము ఆత్మ ఒకటే అని

భావన చేస్తాడు. 'ఈ శరీరం నాది' అనుకోవటంలోనే ఈ శరీరం వేరు, నేను వేరు అనే భావన స్పష్టంగా కనిపిస్తున్నా, దేహాన్ని ఆత్మగా భావన చేస్తారు. ఆత్మకు దేహానికి ఏ విధమైన సంబంధము లేదు. అనే నిశ్చయానికి రావాలి. జగత్తులో సత్యము నిత్యము, శాశ్వతము అయినది ఆత్మ ఒక్కటే. అది భూత భవిష్యద్వర్తమానాలకన్నా వేరైనది; త్రికాలాలకు అతీతమైనది. ఈ విషయాలను తెలుసుకోవటమే ఆత్మానాత్మ వివేకము.

**2. వైరాగ్యము :** ఐహిక సుఖాలయందు విముఖత. ఈ లోకంలో మనం అనుభవించే సుఖాలనే ఐహిక సుఖాలు అంటారు. సిరిసంపదలు, భోగభాగ్యాలు, అధికారము, స్త్రీ సౌఖ్యము మొ॥వి. ఈ సుఖాలయందు విముఖత కలగటమే వైరాగ్యము అనబడుతుంది. అయితే వీటియందు విముఖత ఎలా కలుగుతుంది? ఈ సుఖాలు ఎక్కువగా అనుభవించినట్లైతే విముఖత కలుగుతుంది అని చాలామంది భావన చేస్తుంటారు. అది సరికాదు. ఎందుచేతనంటే అగ్నిలో ఆజ్యం పోస్తే, అగ్ని ఇంకా ప్రజ్వరిల్లుతుంది అంతేగాని చల్లారదు. అలాగే అనుభవించటంవల్ల కోరికలు తీరవు. వాటిపట్ల విముఖత పెంచుకోవాలి. నీళ్ళుపోస్తే అగ్ని చల్లారుతుంది. అలాగే విముఖత వల్లనే వరాగ్యం వస్తుంది. ఈ విముఖత అనేది మనసా వాచా కర్మణా రావాలి. ఈ లోకంలో ఏ రకమైన సుఖాన్నైనా ఇంద్రియాల ద్వారానే అనుభవించటం జరుగుతుంది. కాబట్టి వైరాగ్యం రావాలి. అంటే ముందుగా ఇంద్రియాలను అదుపులో ఉంచుకోవాలి. ఇంద్రియాలు రెండు రకాలు 1) అంతరింద్రియాలు 2)బాహ్యేంద్రియాలు. కాలు, చెయ్యి, కన్ను, ముక్కు ఇలాంటివన్నీ బాహ్యేంద్రియాలు. ప్రయత్నంమీద వీటిని కట్టడి చేయవచ్చు. కాని అంతరింద్రియాలను కట్టడి చెయ్యకపోతే

విముఖత కలగదు. అందుకే త్రికరణ శుద్ధిగా వైరాగ్యాన్ని అలవరచుకోవాలి. ఇక్కడ ఇంకొక విషయం చూడాలి. అదేమంటే వైరాగ్యము అంటే కేవలం ఇహలోక సుఖాలపట్ల విముఖత మాత్రమే కాదు. పరలోక సుఖాలపట్లకూడా విముఖత రావాలి. బ్రహ్మనుండి స్తంభం వరకు అన్ని వస్తువులు నాశనమైపోయేవే. ఇక్కడ స్తంభము అంటే చెక్కదో, సిమెంటుదో కాదు. స్తంభము అంటే – చిన్న కీటకము. బ్రహ్మ నుండి స్తంభము వరకు అంటే పిపీలికాది బ్రహ్మ పర్యంతము అన్న మాట. స్వర్గసుఖాల మీద కూడా ఏ మాత్రము కోరిక ఉండకూడదు. ఇంకా చెప్పాలి అంటే మోక్షం కావాలనే కోరిక కూడా ఉండకూడదు. అందుకే ఇహలోక సుఖాలు కాని, పరలోక సుఖాలు కాని ఏవైనా సరే కాకి రెట్టతో సమానంగా భావన చెయ్యాలి.

**3. షట్సంపత్తి :** ఇది ఆరు రకాలుగా ఉంటుంది.

1. శమము 2. దమము 3. ఉపరతి 4. తితిక్ష 5. శ్రద్ధ 6. సమాధి

**శమము, దమము** అనేవి రెండూ ఇంద్రియ నిగ్రహానికి సంబంధించినవి. గతానుభవాలు, వాటికి సంబంధించిన సంస్కారాలు మనసులో ముద్రపడి ఉంటాయి. ఏదైనా ఒక కోరికను గతంలో ఎప్పుడో అనుభవించాము. మళ్ళీ దాన్ని అనుభవించే అవకాశం రాలేదు. ఇన్నాళ్ళకు, ఇప్పుడు ఆ వస్తువు మనకళ్ళకు కనపడింది. మరుక్షణంలోనే మనసులో నిద్రాణమై ఉన్న కోరికలు నిద్ర లేస్తాయి. దాన్ని అనుభవించాలనే కోరిక బలపడుతుంది. అనుభవించటానికి ప్రయత్నిస్తాము. అయితే గతంలో అనుభవాలు అన్నప్పుడు అవి ఈ జన్మలోవి కావచ్చు. గతజన్మలలోవి కూడా కావచ్చు. ఉదాహరణకు గత సంవత్సరంలో వేసవిలో మామిడిపండ్లు మంచివి దొరికాయి.

అలాంటివే ఇప్పుడు కనిపించాయి. వెంటనే దాని జ్ఞాపకాలు బయటకు వస్తాయి. ఆ కోరికను అనుభవించాలనిపిస్తుంది. గతజన్మలో ఒక స్త్రీతో పరిచయం ఉంది. మళ్ళీ ఈ జన్మలో ఆ స్త్రీ తారస పడింది. మన మనస్సు ఆమెతో మాట్లాడాలని, ఆమెతో కాలం గడపాలని ఉవ్విళ్ళూరుతుంది. ఈ రకంగా కోరికలు అనేవి పుడుతుంటాయి. ఇక్కడ మనం గుర్తుంచుకోవలసిన విషయం ఏమంటే, గతంలో మనం అనుభవించిన వాటినే మళ్ళీ అనుభవించాలనిపిస్తుంది. అంతేకాని క్రొత్త విషయాల మీదకు మనస్సు మళ్ళదు.

ఈ కోరికలు అనుభవించటము అనేది రెండు రకాలుగా ఉంటుంది. 1. భౌతికంగా 2. మానసికంగా. ఇందులో భౌతికము అంటే కోరిక కలిగిన వెంటనే మామిడిపండును తింటాడు. లేదా ఆ స్త్రీతో కాలం గడుపుతాడు. మానసికంగా మామిడిపండును తినటమే కాక దాని రుచిని ఆస్వాదిస్తాడు. అలా ఆస్వాదిస్తూ దాన్ని తింటాడు. అలాగే స్త్రీతో గడిపేటప్పుడు కూడా అలా భౌతికంగాను, మానసికంగాను కూడా దాన్ని అనుభవించగలిగినప్పుడే అందులో హాయి, ఆనందము అనేది ఉంటుంది. అయితే కోరికలు గుర్రాల్లాంటివి అని పరుగులు పెడుతూనే ఉంటాయి. ఒక కోరిక తీరితే ఇంకొక కోరిక పుడుతూనే ఉంటుంది. కోరికలకు అంతం ఉండదు అనుభవించటం వల్ల కోరికలు తీరవు. కాబట్టి విరక్తి ద్వారానే కోరికలను గెలవాలి. దీనికి కావలసినది ఇంద్రియ నిగ్రహము. ఇంద్రియాలే మానవుణ్ణి పతనం వైపుకు తీసుకువెడతాయి. పంచభూతాల యొక్క సూక్ష్మరూపాలయిన తన్మాత్రలే జ్ఞానేంద్రియాలు. అవే 1. శబ్ద 2. స్పర్శ 3. రూప 4. రస 5. గంధాలు వీటివల్లనే మానవుడు పతనం చెందుతాడు. దీనికి ఉదాహరణగా కురంగ, మతంగ, పతంగ, భృంగ,

మీనములను చెప్పటం జరిగింది.

1. కురంగము అంటే లేడి. లేడికి శబ్దము అంటే సంగీతము ప్రాణము. వేటకాడు అడవికి వెళ్ళినప్పుడు ఒక రకమైన సాధనంతో శబ్దం చేస్తాడు. ఆ సంగీతాన్ని వినాలనే కోరికతో వేటగాడికి కనపడకుండా దాక్కున్న లేడి బయటికి వచ్చి వేటగాడికి చిక్కి ప్రాణాలు కోల్పోతుంది. 2. మతంగము అంటే ఏనుగు. ఇది అడవిలో విచ్చలవిడిగా తిరుగుతూ ఉంటుంది. అలా తిరుగుతున్న మగ ఏనుగును బంధించటానికి వేటగాడు మచ్చిక చేసుకున్న ఆడఏనుగును వదలిపెడతాడు. ఈ ఆడ ఏనుగు మగఏనుగును చేరుతుంది. దీనియొక్క స్పర్శ మగఏనుగుకు అత్యంత ఇష్టం. దానితో ఆడఏనుగు వెనక నడిచి చివరకు వేటగాడు తీసిన గోతిలో పడుతుంది మగఏనుగు. 3. పతంగము అంటే మిడత. ఇది అగ్నిని చూసి పండు అనుకుని, చివరకు అందులో పడి ప్రాణాలు కోల్పోతుంది. 4. భృంగము అంటే తుమ్మెద. ఇది ప్రతి పూవుమీద వాలి తేనెను ఆహారంగా తీసుకుంటుంది. అలా వెళ్ళినప్పుడు స్పర్శ తగలగానే ముడుచుకుపోయే చెట్లవద్దకు వెళ్ళి ప్రాణాలు కోల్పోతుంది. 5. మీనము అంటే చేప. దీనికి ఎర అంటే వానపాము చాలా ఇష్టం. జాలరివాడు గాలానికి ఎరను గ్రుచ్చి నీటిలో వేయగానే, ఆ వాసనకు ఆకర్షింపబడి, ఎరను తినాలనే కోరికతో వచ్చి గాలానికి చిక్కుతుంది. ఈ రకంగా కోరికల వలయంలో చిక్కి మానవుడు పతనం అవుతాడు. అందుకే ఆ కోరికలను అధిగమించాలి. దీనికి సాధనమే ఇంద్రియ నిగ్రహము. ఇంద్రియము రెండు రకాలు 1. అంతరింద్రియాలు 2. బాహ్యేంద్రియాలు. మానవుడు కోరికలు అనుభవించేది బాహ్యేంద్రియాలతో, కాని ఆ అనుభవాన్ని పొందేది అంతరింద్రియాలతో. అందుకే సాధకుడు ఈ రెండు రకాల

ఇంద్రియాలను అదుపు చెయ్యాలి.

దమము అంటే బాహ్యేంద్రియ నిగ్రహము. శమము అంటే అంతరింద్రియ నిగ్రహము.

మానవుడు ఈ కోరికలు అనుభవించను అని బాహ్యేంద్రియాలను బలవంతాన అరికట్టవచ్చు. అంటే ఎదురుగా ఉన్న తనకిష్టమైన మామిడిపండును తినను. అని నోటిని కట్టేసుకోవచ్చు. కాని అంతరింద్రియాన్ని అరికట్టటం తేలికైన పనికాదు. అది ఆ రుచిని ఆస్వాదిస్తూనే ఉంటుంది. అలాగే ఎదురుగా ఉన్న సౌందర్యమూర్తి అయిన స్త్రీని చూడను కూడా చూడను. అని గట్టిగా కళ్ళు మూసుకోవచ్చు. కాని మనోనేత్రం మాత్రం ఆ సౌందర్యాన్ని ఆస్వాదిస్తూనే ఉంటుంది. అందుచేత మోక్షగామియైన వాడు ఈ రెండు రకాల ఇంద్రియాలను అరికట్టాలి. అంటే శమదమాది గుణాలను అలవరచుకోవాలి.

**3. ఉపరతి :** కర్మలను పరిత్యజించటం. బాహ్య విషయాలను చిత్తవృత్తులతో ఆశ్రయించకుండా ఉండటము. విహిత కర్మలను విధి పూర్వకంగా పరిత్యజించటము. శమదమాల విషయంలో విషయ వాసనలను అదుపులో పెట్టటానికి సాధకుడి ప్రయత్నం ఉంటుంది. ఆ ప్రయత్నం గనక ఫలించి, విషయ వాసనల యందు విముఖత స్వభావంగా మారిన స్థితినే ఉపరతి అంటారు. అంటే సాధకుడికి అప్రయత్నంగానే విషయ వాసనల యందు విముఖత్వం ఉంటుంది. ఇంద్రియాల ద్వారా బాహ్యంగా వస్తువులవైపు దృష్టి మరలకుండా ఆ దృష్టిని ఇంద్రియాలలోనే లయం చెయ్యటాన్ని దమము అంటారు. మనస్సు విషయ ప్రపంచంవైపు పరుగు పెట్టకుండా లక్ష్యాన్ని గురించిన విచారణలో స్థిరంగా నిలచినప్పుడు అనుభూతమయ్యే స్థితినే శమము

అంటారు. బాహ్య వస్తువుల నుండి వచ్చే అలజడులవల్ల మనస్సు ప్రభావితం కాకపోవటమే ఉపరతి.

**4. తితిక్ష :** శీతోష్ణ సుఖదుఃఖాలను సహించే శక్తి. చింత, దుఃఖము, ప్రతీకారము లేకుండా సమస్త దుఃఖాలు సహించటం, చేయగలిగిన శక్తి ఉండి కూడా ఇతరులకు ఏ అపకారము చెయ్యకుండా ఉండటము. దుఃఖానుభవాలు, బాధలు తప్పించుకోవాలనే కోరిక లేకుండా, ప్రతీకారవాంఛ లేకుండా, శాంతంగా, సహనంతో అనుభవించటాన్నే తితిక్ష అంటారు.

**5. శ్రద్ధ :** గురువు యందు, ఆయన చెప్పే మాటలయందు అచంచలమైన విశ్వాసం ఉంచాలి. ఈ లోకంలో అనేకమంది గురువులు ఉంటారు. చిన్నతనంలో అక్షరాలు నేర్పేవారి దగ్గరనుంచి మోక్షమార్గాన్ని చూపే వారిదాకా అందరూ గురువులే. మనకు మార్గదర్శకులైన వారందరూ మనకు గురువులే. దత్తాత్రేయుడు యదుమహారాజుకు చెబుతాడు చూడండి. 'రాజా! నాకు 24 మంది గురువులు ఉన్నారు' అంటాడు. వీరిలో ఒక వేశ్యకూడా ఉన్నది. వేశ్య మీకు గురువెలా అవుతుంది? అని అడుగుతాడు యదువు. ఆ మాటలు విన్న దత్తాత్రేయుడు "రాజా! పూర్వకాలంలో ఒకానొక దేశంలో పింగళ అనే వేశ్య ఉండేది. ప్రతిరోజూ సాయంత్రం అయ్యేసరికి చక్కగా అలంకరించుకుని విటులను ఆకర్షిస్తూ ధనార్జన చేస్తూ, తన కోరికలు కూడా తీర్చుకుంటూ ఉండేది. అలాంటి వేశ్య దగ్గరకు ఒకరోజున ఒక్క విటుడు కూడా రాలేదు. ఆ వేశ్య పిచ్చి పట్టినట్లుగా లోపలికి, బయటకు తిరుగుతోంది. కాలం గడిచిపోతోంది. అర్ధరాత్రి దాటిపోయింది. ఇంక ఎవ్వరూ రారు అని నిశ్చయించుకున్నదై, లోపలకు వెళ్ళిపోయింది. ఆ సమయంలో ఆ ఇంట్లో ఉన్న

శ్రీమన్నారాయణుడి చిత్రం కనిపించింది. ఆ మరుక్షణంలో ఆ వేశ్యకు జ్ఞానోదయమైంది. లోకాలన్నింటినీ రక్షించేవాడు నారాయణుడు. అందరినీ పోషించేవాడు అతడే. అందరికీ సుఖాన్ని ఇచ్చేవాడు అతడే. అలాంటప్పుడు నేను ఎవరికోసం ఎదురు చూస్తున్నాను? ఎవరో వచ్చి, నా శరీరాన్ని తన ఇష్టం వచ్చినట్లు నలిపివేస్తుంటే అదే సుఖము అని నేను భావిస్తున్నాను. దానివల్ల నాకు కలిగే సుఖం కన్న దుఃఖమే ఎక్కువగా ఉంటుంది. నేను ఈ విషయాలేవీ గుర్తించటం లేదు. ఈ జగత్తులో అందరినీ పోషించేవాడు, అందరికీ సుఖాన్ని ఇచ్చేవాడు నారాయణుడే. కాబట్టి ఇకనుంచీ నేను ఎవరికోసం ఎదురుచూడను. శ్రీమన్నారాయణుడి పాదాలే శరణు వేడతాను అని నిర్ణయించుకుని, అలాగే ఆచరించింది. కాబట్టి ఆ వేశ్యే నాకు గురువు అంటాడు.

అసలు గురువు అనే పదానికి మార్గాన్ని చూపేవాడు, మార్గదర్శి అని అర్థం. ఏ వ్యక్తైతే నీకు మోక్షమార్గాన్ని చూపగలుగుతాడో అతడే నీకు గురువు. ఎవరైతే స్వప్నంలో కూడా కనిపించి నీకు స్వస్తత చేకూరుస్తూ ఉన్నాడో, ఎవరి దగ్గరైతే నీ ప్రశ్నలకు సమాధానం దొరుకుతోందో, ఎవరి సమీపంలో నీకు ప్రశాంతత చిక్కుతుందో, ఎవరిని దర్శించినంత మాత్రంచేతనే నీ మనస్సుకు హాయి కలుగుతుందో అతడే నీకు గురువు. అతడు చెప్పే విషయాలు నీకు బాగా అర్థం అవుతాయి. మనసుకు హత్తుకుంటాయి. అతనిమీద నీకు అమితమైన నమ్మకము అనేది ఏర్పడుతుంది. అటువంటి గురువుమీద, ఆయన చెప్పే విషయాలమీద అమితమైన శ్రద్ధ, విశ్వాసము ఉండాలి. అలాగే వేదాలు, ఉపనిషత్తులు, శాస్త్రాలు వీటిమీద పరిపూర్ణమైన విశ్వాసం ఉండాలి. దీన్నే శ్రద్ధ అంటారు.

**6. సమాధి :** దీనినే సమాధానాము అనికూడా అంటారు. ధ్యానంలో కేవలము ధ్యేయము మాత్రమే గోచరిస్తుంది. కాని సమాధి స్థితిలో నేను ధ్యానం చేస్తున్నాను అనే విషయం కూడా గుర్తుండదు. గ్రహణము, గ్రహణకర్త వీటికి సంబంధించిన స్మృతికూడా ఉండదు. ఆ ధ్యానంలో ధ్యేయం యొక్క ప్రతీతి మాత్రమే మిగులుతుంది. చిత్తం తన స్వరూపస్థితిని పొందుతుంది. అటువంటి ధ్యానాన్నే సమాధి అంటారు. ధ్యానానికి చరమాంకం సమాధి లేదా యోగానికి చరమాంకం సమాధి. ఈ సమాధి అనేది చిత్తంయొక్క సార్వభౌమమైన ధర్మము. మనస్సును దేహంనుంచి వేరుచేసి పరమాత్మతో అనుసంధానం చెయ్యటమే సమాధి. దశేంద్రియాలను వదిలేసి, వాటితో ఏ రకమైన సంబంధము లేని మనస్సుయొక్క స్థితి సమాధి. ఇంద్రియాలన్నింటినీ వాటి విషయాలనుంచి ఉపసంహరించి, అచంచలంగా ఉండే ఏకత్వభావనే సమాధి. ధ్యానం చెయ్యగా చెయ్యగా, చిత్తం ధ్యేయం యొక్క ఆకారానికి మారిపోతుంది. చిత్తానికి తనదైన స్వరూపం అంటూ ఉండదు అంటే ధ్యేయం తప్ప ఇంకేమీ గోచరించదు. అటువంటి స్థితిని పొందిన ధ్యానాన్నే సమాధి అంటారు. నిర్వికారంగా బ్రహ్మాకార వృత్తితో కూడి ఇతర భావాలు మరిచిపోయిన స్థితినే సమాధి అంటారు. నిర్వికార స్థితి అంటే ఏ విధమైన చిత్త వికారాలు ఉండరాదు. బ్రహ్మాకార వృత్తిలో లీనమై పోవాలి. ఇతర భావాలేమీ లేకుండా తానే బ్రహ్మననే భావనలో లీనం కావాలి. అదే సమాధి స్థితి.

**4. ముముక్షత్వం :** మోక్షం పొందాలనే కోరిక. అహంకారం దగ్గర నుండి శరీరానికి ఉన్న సమస్తము అజ్ఞానంచేత కల్పించబడిన బంధనాలే. ఆత్మజ్ఞానం ద్వారా ఆ బంధనాలు తెంపుకోవాలనే కోరిక సాధకుడిలో ఉండాలి. దాన్నే ముముక్షత్వం అంటారు. మోక్షము,

సాయుజ్యము, పరమపదము, ముక్తి ఇవన్నీ పర్యాయపదాలే. వీటన్నింటి అర్థం ఒకటే. ముక్తి అంటే విముక్తి. ఐహిక బంధనాల నుంచి విముక్తి. ఐహిక బంధనాల నుంచి విముక్తి పొందటాన్నే మోక్షము అంటారు. శరీరానికి ఉన్న అహంకార మమకారాలు, అరిషడ్వార్గాలు ఇవన్నీ కేవలము అజ్ఞానంతో కల్పించబడిన బంధనాలే. ఈ బంధనాలు త్రెంచుకోవాలి అంటే ఆత్మజ్ఞానము ఒక్కటే మార్గం. జ్ఞానంద్వారా ఈ బంధనాలు త్రెంచుకోవాలనే కోరిక సాధకుడిలో ఉండాలి. అదే ముముక్షత్వము. ఈ కోరిక కొద్దిగానయినా సాధకుడిలో ఉంటే, దాన్ని సద్గురువు ద్వారా పెంపొందించుకోవచ్చు.

ఆత్మసాక్షాత్కారం కలగాలంటే మనోమాలిన్యం తొలగిపోవాలి. భ్రమలు పూర్తిగా నశించి పోవాలి. మోక్షద్వారానికి 1. శమము 2. దమము 3. సంతుష్టి 4. సజ్జన సాంగత్యము అనే నలుగురు ద్వారపాలకులు. వీరిలో ఏ ఒక్కరిని గట్టిగా పట్టుకున్నా సరే మిగిలిన ముగ్గురూ వశమవుతారు. అందుచేత సర్వప్రయత్నాలు చేసి, సమస్తాన్ని త్యజించైనా సరే వీటిని గట్టిగా ఆశ్రయించాలి శాస్త్రాభ్యాసము, సజ్జన సాంగత్యము అనే తపస్సుచేత, దమముచేత ముందుగా సంసార బంధనాల నుండి విముక్తి పొందాలి. అటువంటి వ్యక్తియొక్క హృదయంలో పరమాత్మ దర్శనమిస్తాడు.

అవిద్యతో కనిపించే ఈ ప్రపంచము తమోదృష్టిగలది. బ్రహ్మ మొదలు స్థావరములదాకా గల శరీర సమూహమంతా మనస్సే. ఈ లోకమనేది అంతములేని సకల బ్రహ్మాండము. సకల వేదములందు చెప్పబడిన వివిధ కర్మలయందు ప్రీతిని కలిగిస్తుంది. ఆత్మ అంధకారస్వరూపుడు కాదు. కుత్సితమైన ఈ ప్రపంచానికి లోపల బయటా కూడా ప్రకాశింపచేసే విద్యాస్వరూపుడు. జ్యోతిర్మండల

స్వరూపుడు. ఈ ఆత్మ అపరబ్రహ్మ కాదు. ప్రకాశిస్తున్న ఆదిత్యుడే బ్రహ్మ. ఈ రకంగా అజపాను సంధాన పురస్సరముగా అనులోమ విలోమ రూపాలయిన ఉఛ్వాస నిశ్వాసలచేత "హంసః స్సోహం" అని చాలాకాలం జపించాలి. ఇలా సమ్యజ్ఞానాన్ని ఆర్జించి, త్రివృత్ స్వరూపమయిన బ్రహ్మను ధ్యానించాలి. అప్పుడు సచ్చిదానంద స్వరూప మయిన పరమాత్మ స్వయంగా ఆవిర్భవిస్తాడు.

ఈ విధంగా ఆర్జించిన జ్ఞానము ఒక్కసారిగా ఉదయించిన వేలాది సూర్యుల కాంతితో సమానంగా ఉంటుంది. పరిపూర్ణమైన సముద్రంలాగా బ్రహ్మస్వరూప రసముతో పరిపూర్ణమైనందువల్ల నశింపనిదిగా ఉన్నది. ఈ స్థితి సమాధికాదు. యోగసిద్ధి అంతకన్నా కాదు. మనోవలయము అనటానికి వీలులేదు. ఇది ప్రత్యక్ బ్రహ్మైక్యము. విద్వాంసుడు సమస్త రూపాలు, నామాలు మాయామయని తెలుసుకుని, వదలివేసి, ఏ బ్రహ్మన్ని కోరుతున్నాడో, అది అంధకారాంతరమందు ఆదిత్యవర్ణ రూపముగా ఉంటుంది. అనేక వేల సూర్యకాంతులతో ప్రకాశిస్తుంటుంది.

ఈ విషయం తెలుసుకున్నవాడు అమృతస్వరూపుడు. మహావాక్యాలకు అర్థం తెలుసుకున్నవాడు పరం జ్యోతిసు అనే ఆ జ్యోతిస్సే ఆదిత్యరూపంలో ఉన్న నేను అవుతున్నాను. ఏదైతే అర్కజ్యోతిసు, శివార్క జ్యోతిసు అని పరమాత్మ స్వరూపంగా చెప్పబడుతున్నదో అటువంటి పరంజ్యోతిసుడను నేనే. అని భావించగలుగుతాడు. ఇదే ముక్తికి మార్గము.

ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలకుడు తనకుమారుడైన శ్వేతకేతువుకు ఆత్మజ్ఞానాన్ని బోధిస్తూ 'తత్త్వంఅసి' అనే మహావాక్యాన్ని వివరిస్తాడు.

నాయనా ! శ్వేతకేతూ ! మానవుడు నిద్రించేటప్పుడు తాత్కాలికంగా ఆత్మలో లీనమవుతాడు. మరణకాలంలో వాక్కు మనసులో లీనమవుతుంది. మనస్సు ప్రాణంలో లీనమవుతుంది. ప్రాణం తేజస్సులో కలిసిపోతుంది. చివరకు అది పరమశక్తిలో కలిసిపోతుంది. ఆ శక్తి అతిసూక్ష్మమైనది. కాని విశ్వమంతా వ్యాపించి ఉన్నది. అదే సత్యము. అదే నిత్యము. అదే ఆత్మ. అదే నీవు.

జీవి అనేది ఏ రూపంలో ఉన్నప్పటికీ అంటే పులి, సింహము, మనిషి ఏదైనా కాని అనంత చైతన్య సముద్రంలో కలిసిపోయిన తరువాత తనరూపాన్ని పోగొట్టుకుంటుంది. జీవులు వాటి నామరూపాలను పోగొట్టుకుంటాయి. అవి అన్నీ ఏ తత్త్వంలో కలిసిపోతాయో, అదే బ్రహ్మ. అద్వితీయమైనది. సూక్ష్మమైనది. సర్వవ్యాపకమైనది. అదే నీవు. శ్వేతకేతూ ! అదే నీవు. శ్వేతకేతూ ! ఆకాశంలో ఉన్న సూర్యునిలో ఏ తేజస్సయితే ఉన్నదో, అదే నీలోనూ ఉన్నది. అదే నీవు. అగ్నిలో ఏ తేజస్సయితే ఉన్నదో అదే నీలోనూ ఉన్నది. శ్వేతకేతూ ! అదే నీవు.

చంద్రునిలో ఏ చల్లదనమున్నదో, అదే నీలోనూ ఉన్నది. శ్వేతకేతూ ! అదే నీవు. అని చెబుతాడు.

ఈ రకంగా పరమేశ్వర స్వరూపం తనలోనే ఉన్నది. తానే సాక్షాత్తూ పరబ్రహ్మ అని భావించినవాడు ముక్తిని పొందుతాడు.

పైంగలోపనిషత్తులో యాజ్ఞవల్క్యుడు మహావాక్యాలను వివరిస్తూ ఆ బ్రహ్మము నీవే అయి ఉన్నావు. నీవు బ్రహ్మవై ఉన్నావు. నేనుకూడా బ్రహ్మనై ఉన్నాను అని ఈ రకంగా మహావాక్యానుసంధానం చెయ్యాలి. మహావాక్యంలో పరోక్ష శబలుడై ఉన్నవాడు, సర్వజ్ఞాది లక్షణాలు గలవాడు, మాయయే ఉపాధిగా ఉన్నవాడు, సచ్చిదానంద స్వరూపుడు

జగత్కర్త అయిన ఆ పరమేశ్వరుడే తత్ అనే పదానికి అర్ధం. ఆ ఈశ్వరుడే అంతఃకరణ సహితుడై 'నేను' అనే అజ్ఞానానికి విషయమైనవాడై నీవు అనే పదానికి అర్ధం అవుతున్నాడు. ఈశ్వరజీవుల యొక్క శరీరములైన మాయ, అవిద్యలను విడిచిపెట్టి తత్, త్వం అనే పదాలకు లక్ష్యమై ఉన్న ప్రత్యగాత్మ బ్రహ్మమే అవుతున్నది.

తత్త్వమసి, అహంబ్రహ్మాస్మి అనే మహావాక్యాల అర్ధం విచారణ చెయ్యటమే, శ్రవణము, ఏకాంతంలో విన్నటువంటి దాన్ని అనుసంధానము చెయ్యటం మననము. శ్రవణ మననాలవలన సంశయాలు లేకుండా ఏకాగ్రముగా మనసును నిలిపి ఉంచటం నిధిధ్యానము. ధ్యాతృధ్యానాలను విడిచిపెట్టి, నివాతస్థిత దీపము రీతిగా ధ్యేయైక గోచరమగు చిత్తము కలిగి ఉండటమే సమాధి. అటువంటి సమాధి సమయంలో సంచితకర్మ అంతా నశించిపోతుంది. ఆ తరువాత అభ్యాస బలమువలన వేలకొలది అమృతధారలు వర్షిస్తాయి. అందుకే యోగవేత్తలు సమాధిని **'ధర్మమేఘము'** అంటారు. సమాధివల్ల అన్ని వాసనలు నశించగా, కర్మసంచయము (పుణ్యపాపాలు) నశించిపోగా, వేదాంతవాక్యము కరతలామలకమైనట్లుగా, అపరోక్ష సాక్షాత్కారము సంభవిస్తుంది. అప్పుడు ఆత్మజ్ఞాని జీవన్ముక్తుడవుతాడు.

పంచీకృత మహాభూతాలను ఈశ్వరుడు అపంచీకృతం చెయ్యాలనుకున్నాడు. అంటే సృష్టి ఆరంభంలో పంచభూతాలు పంచీకృతం చెంది జగత్తు ఆవిర్భవించింది. ఇప్పుడు లయం కావాలి. అందుకే పంచభూతాలను అపంచీకృతం చేస్తున్నాడు. లోకాలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, అంతఃకరణ చతుష్టయములన్నింటినీ పంచభూతాలలో లీనంచేసి, భూమిని జలములో, జలమును అగ్నిలో, అగ్నిని వాయువులో, వాయువును ఆకాశంలో, ఆకాశాన్ని

అహంకారంలో, అహంకారాన్ని మహత్తత్త్వములో, మహత్తత్త్వాన్ని అవ్యక్తమందు, అవ్యక్తాన్ని పరమాత్మయందు లీనం చేస్తున్నాడు. విరాట్టు, హిరణ్యగర్భుడు, ఈశ్వరుడు ఉపాధులు లీనమైపోయినందు వల్ల పరమాత్మలో లీనమవుతున్నారు. అంటే అజ్ఞానం నశించటంవల్ల పరమాత్మలో లీనమవుతున్నారు.

పంచీకృత మహాభూతాలవల్ల సంభవించిన కర్మచేత సంపాదించబడ్డ స్థూలదేహము కర్మక్షయంవల్ల, సత్కర్మపాలనవల్ల అపంచీకృతము పొంది, అనగా సూక్ష్మరూపం ధరించి, సూక్ష్మతత్త్వములో ఐక్యము పొంది, తరువాత కారణ రూపమత్వం పొందుతుంది. అంటే కారణంలో లీనమవుతుంది. ఆ తరువాత కారణత్వము కూటస్థమైన ప్రత్యగాత్మలో లీనమవుతుంది. విశ్వతైజస ప్రాజ్ఞులుకూడా తమ ఉపాధులు లయమవటంతో పరమాత్మలో లీనమవుతారు. జ్ఞానాగ్నితో బ్రహ్మాండ మంతా దహింపబడి, అది పరమాత్మలో లీనమవుతుంది. అందువల్ల బ్రాహ్మణుడు సమాహితుడై సర్వదా తత్, త్వం పదార్థాల విజ్ఞానాన్ని అనుసంధానం చెయ్యాలి. అప్పుడు మేఘాలు విడిపోయిన సూర్యునిలాగా, అజ్ఞానము తొలగిపోయి ఆత్మ ఆవిర్భవిస్తుంది.

అందువల్ల హృదయంలో పొగలేని దీపపుశిఖలాగా ఉన్న అంగుష్ఠ మాత్రమైన ఆత్మను ధ్యానం చెయ్యాలి. తనలో ప్రకాశిస్తున్న ఆ పరమాత్మను నిరంతరము, జీవితకాలమంతా ధ్యానం చెయ్యాలి. అటువంటివాడు జీవించి ఉన్నప్పటికీ ముక్తుడై, జీవన్ముక్తుడుగా కృతార్థుడవుతాడు. ప్రాప్తించిన ఆయువు తీరిన తరువాత విదేహముక్తుడవుతాడు.

# 52. మహావాక్యానుసంధానము

## (ఆత్మబోధోపనిషత్తు)

మహావాక్యాలు మొత్తం నాలుగు ఉన్నాయి. వీటిలో 'తత్ త్వం అసి' అనే మహావాక్యానికి అర్థం తెలుసుకున్నట్లైతే మిగిలిన వాటికి అర్థం చాలా తేలికగా తెలుస్తుంది. శంకర భగవత్పాదులవారు వ్రాసిన **'మహావాక్య దర్పణం'**లో కూడా 'తత్ త్వం అసి' అనే దాన్నే వివరించారు. 'మహావాక్యదర్పణము' వివరణ నేను వ్రాసినది త్వరలోనే వస్తుంది. అంతవరకూ బాగానే ఉన్నది. మోక్షప్రాప్తి కలగాలంటే మహావాక్యాలను అనుసంధానం చెయ్యాలి అన్నారు కదా ! ఈ అనుసంధానాన్ని గురించి **ఆత్మబోధోపనిషత్తు** వివరిస్తోంది.

ఈ మహావాక్యాలకన్నింటికీ ఇంచుమించుగా అర్థం ఒక్కటే.

| | | |
|---|---|---|
| ప్రజ్ఞానం బ్రహ్మ | – | జ్ఞానమే పరబ్రహ్మ |
| అహంబ్రహ్మాస్మి | – | నేనే పరబ్రహ్మనై ఉన్నాను |
| అయమాత్మాబ్రహ్మ | – | నా ఆత్మయే పరబ్రహ్మ |
| తత్ త్వం అసి | – | అది నీవు ఒక్కటే |

అది అంటే – పరమేశ్వరుడు, ఇది అంటే – జీవేశ్వరుడు. ఈ రెండూ ఒక్కటే.

వీటి అర్థాలు తెలుసుకున్నంత మాత్రాన చాలదు. వీటిని అనుసంధానం చెయ్యాలి.

అనాత్మగా ఉన్న ఈ దేహాదులన్నింటి యందు ఉన్నటువంటి 'అహం', 'మమ' అనే భావానికి 'అధ్యాసము' అని పేరు. అధ్యాసము అంటే–తప్పుగా తెలుసుకోవటము, మిథ్యాజ్ఞానము అని అర్థం.

విద్వాంసుడు ఈ మిథ్యాజ్ఞానాన్ని నిరస్త (తొలగింపబడినది, త్రోసివేయబడినది, వెళ్ళగొట్టబడినది) రూపంలో బ్రహ్మనిష్ఠతో జయించాలి. అంటే అహంకార మమకారాలు మిథ్య. కాబట్టి ఆ మిథ్యాజ్ఞానాన్ని బ్రహ్మజ్ఞానంతో జయించాలి. శరీరము, ఇంద్రియాలు వీటికన్న వేరైనదే ప్రత్యగాత్మ. అందుచేత ఈ ప్రత్యగాత్మ బుద్ధి మొదలైన వ్యాపారాలన్నింటినీ సాక్షిగా గ్రహించి, ఆ ప్రత్యగాత్మయే నేను అని తెలుసుకోవాలి. దేహము, ఇంద్రియాలే నేను అనే భ్రాంతిని వదలివెయ్యాలి. లోకానువర్తనము అంటే – లోకాన్ననుసరించి సంచరించటం. దేహానువర్తనము అంటే దేహాన్ననుసరించి సంచరించటం, శాస్త్రానువర్తనము అంటే – శాస్త్రాలలో చెప్పిన విధంగా నడచుకోవటం వీటిని వదలి, ఈ శరీరమే నేను అనే భ్రాంతిని వదలి వెయ్యాలి. లోకవాసన, దేహవాసన, శాస్త్రవాసన, దేహభ్రాంతులను పూర్తిగా పరిత్యజించాలి.

సాధకుడు స్వాత్మలో అంటే అతని ఆత్మలోనే స్థితుడై ఉండాలి. ఆత్మలో నివసించే వారికి మనస్సు నశించిపోతుంది. ఈ విషయం యుక్తి (తెలివి) స్వానుభూతి (తనయొక్క అనుభవము) శ్రుతులు (వేదమంత్రాలు, వేదవిజ్ఞానము) ద్వారా తెలుసుకోవాలి. శబ్దాదులను గౌరవించరాదు. ఆత్మను విస్మరించరాదు. అముక్త మార్గంలో నిద్రించరాదు. లోకవ్యవహారాలలో చిక్కుకోరాదు. సర్వదా ఆత్మధ్యానం మాత్రమే చెయ్యాలి. దీనివల్ల అనాత్మ (ఆత్మకానిది) బహిష్కరింపబడుతుంది. తల్లిదండ్రుల మలినాలతో పుట్టి, మలమూత్రములతో కూడిన ఈ దేహము అపరిశుభ్రమైనది. అందుచేత అసహ్యాకరమైన ఈ శరీరాన్ని దూరము చేసి (తనకన్న వేరుగా చేసి) బ్రహ్మను నేను అని భావించి కృతకృత్యుడు కావాలి. జీవాత్మ

పరమాత్మలు వేరు అనే భావం కలిగినట్లైతే అది అజ్ఞానము. ఘటాకాశాన్ని మహదాకాశంలో లయం చేసినట్లుగా, అఖండభావనతో జీవాత్మను పరమాత్మయందు లయం చెయ్యాలి. అప్పుడు స్వయంప్రకాశముగాఉన్న ఆత్మతానే అవుతాడు. అందువలన తనచే, తననే తెలుసుకుని దేహరూపంలో ఉన్న పిండాండాన్ని, సృష్టి రూపంలో ఉన్న బ్రహ్మాండాన్ని మలభాండములాగా త్యజిస్తాడు. అనాదియైన అజ్ఞానముతో, దేహమే ఆత్మ అనే భావముతో దుఃఖము పొందుతున్నాడు. అందుచేత దేహాదులయందున్న అహం అనే బుద్ధిని ఆత్మయందు నిలిపి, సర్వదా కేవలము అద్వితీయ పరబ్రహ్మ అయి ఉంటాడు.

అద్దమునందు కనిపించే అంతఃపుర ప్రతిబింబములాగా, ఏ పరబ్రహ్మయందు మిథ్యాజగత్తు కనిపిస్తున్నదో, ఆ బ్రహ్మమే నేను. అని నిశ్చయించుకుని, కృతకృత్యుడు కావాలి. అహంకారం లేనివాడికి అఖండస్థితి చేకూరుతుంది. స్వయంప్రభుడైన అతడు చంద్రునిలాగా విమలుడై, సంపూర్ణమైన ఆనందము పొందుతాడు. క్రియ గనక నశిస్తే చింతకూడ నశిస్తుంది. అప్పుడే వాసనాక్షయమవుతుంది. ఈ రకంగా వాసనా ప్రక్షాళనయే మోక్షము. అటువంటి స్థితే జీవన్ముక్తి. అన్ని ప్రదేశాలలోను, ఈ జగత్తునందంతటా, బ్రహ్మమాత్రముగా దర్శించటమే పరబ్రహ్మ సాక్షాత్కారము. ఇటువంటి భావనతోనే మనసులోపల ఉన్న వాసనలను జయించాలి. సర్వదా బ్రహ్మనిష్ఠయందు కొంచెము కూడా ప్రమాదం కలుగరాదు. ఈ ప్రమాదాన్ని బ్రహ్మవాదులైన మహర్షులు మృత్యువుగా పరిగణిస్తారు.

నీటిని ఆవరించి ఉన్న నాచును ప్రక్కకు నెట్టి వేసినప్పటికీ అది మళ్ళీ తానున్న చోటికే వచ్చి చేరుతుంది. అలాగే ప్రాజ్ఞుడు మాయను

బయటకు పంపించినప్పటికీ, అతడు గనక బ్రహ్మనిష్ఠ నుంచి క్రిందికి జారినట్లైతే, ఆ మాయవచ్చి మళ్ళీ చేరుతుంది. దీనివల్ల అతని యోగనిష్ఠ భ్రష్ఠమవుతుంది. ఈ రకంగా ఎల్లప్పుడూ ఆత్మానుసంధానం చేస్తూ, జీవించినట్లైతే, అతడు బ్రహ్మజ్ఞానాన్ని పొందుతాడు. అటువంటివాడు జీవన్ముక్తుడు. అతడు ఈ శరీరం వదలిన తరువాత కూడా ఆత్మస్వరూపుడై ఉంటాడు. భ్రాంతి లేనటువంటి సమాధిచేత ఆత్మసాక్షాత్కారము కలిగినప్పుడు, అజ్ఞానము పూర్తిగా నాశనమవుతుంది. అప్పుడు 'అఖండ సచ్చిదానందమే తాను' అని ధృవీకరించుకుని, అహంకారము మొ॥వి తాను అని భావించకుండా, వాటన్నింటినీ ఘటపటాదులలాగా ఉదాసీన భావంతో దర్శించాలి. పిపీలికాది బ్రహ్మపర్యంతము, ఈ ఉపాధులన్నీ మిథ్యా మాత్రములు కాబట్టి వాటన్నింటినీ ఉదాసీన భావంతో దర్శించటం మంచిది. ఈ రకంగా చేసి పూర్ణముగా ఆత్మని మాత్రమే తెలుసుకోవాలి. బ్రహ్మ, ఈశ్వరుడు, రుద్రుడు మొదలు ఈ విశాల విశ్వంలో ఉన్న ఉపాధి అంతా కూడా ఆత్మయే. ఆత్మకన్న వేరే తత్త్వము లేదు.

ఈ ప్రపంచమంతా అసత్య పదార్థమే. అదంతా తనయందే ఆరోపించబడి ఉన్నది. అటువంటి ఆరోపిత ప్రపంచాన్ని నిరసించగా, పూర్ణుడు, అద్వయుడు, క్రియారహితుడు అయిన పరబ్రహ్మ తానే అవుతాడు. ఈ విశ్వమంతా అసత్కల్పము, అవికల్పము అయిన ఉన్నది. వస్తువు ఒక్కటే అది అవికారము. అవిశేషము. నీ రూపం కూడా అదే. అందులో నీపేరు ఉండదు. దర్శించేవాడు, దర్శింపబడినది, దర్శనము. ఈ త్రిపుటి ఆ పరబ్రహ్మయందు లేదు. ఆ పరబ్రహ్మము నిరామయమై, నిర్విశేషమై ఉన్నది. పరిపూర్ణము, చిద్రూపము, శివము, అవిద్యారహితము, అద్వితీయము అయి ఉన్నది. నిర్విశేషమైన

పరతత్త్వంలో నీ నామము (వస్తు భిన్న ప్రపంచము) ఎక్కడ ఉంది ? ఏకాత్మక పరతత్త్వంలో భేదం చూసే వారెవరు ? బ్రహ్మము అఖండమైనది. అందులో భేదాన్ని దర్శించేవాడు లేడు. ఈ భ్రాంతికంతటికీ మూలకారణము చిత్తము. ఆ చిత్తము గనక లేకపోయినట్లైతే ఈ జగత్తే లేదు. అందుచేత చిత్తాన్ని నిశ్చలమైన స్థితిలో ఉంచాలి. అప్పుడు ప్రత్యగ్రూప పరమాత్మ యందు ఐక్యమవటం జరుగుతుంది.

అఖండానంద స్వరూపమైన పరమాత్మ తనకన్నా వేరుగా లేదని అనుభవంలో ఉన్న బ్రహ్మజ్ఞానికి బహిరంతరములందు సదానంద రసాస్వాదనము కలుగుతుంది. వైరాగ్యానికి ఫలము జ్ఞానము. దీనివల్ల ఉపరతి ఫలము కలుగుతుంది. ఉపరతి అంటే కర్మలను పరిత్యజించటం. బాహ్యవిషయాలను చిత్తవృత్తులతో ఆశ్రయించకుండా ఉండటం. ఉపరతివల్ల **"స్వానందానుభవ మహాశాంతి"** అనే ఫలము లభిస్తుంది. వైరాగ్యము కలిగికూడా జ్ఞానం రాని పక్షంలో, ఆ వైరాగ్యము నిష్ఫలమవుతుంది. వైరాగ్యము, జ్ఞానము రెండూ కలిగి ఉపరతి కలగకపోతే, ఆ రెండూ నిష్ఫలమవుతాయి. **వైరాగ్యము, జ్ఞానము, ఉపరతి మూడూ కలిగి శాంతిని పొందకపోతే - సర్వమూ నిష్ప్రయోజనమవుతుంది.** మాయోపాదికత్వము, జగత్కారణత్వము, సర్వజ్ఞత్వము, పరోక్షధర్మ విశిష్ఠత్వము, స్వరూప లక్షణాలవుతాయి. అటువంటి లక్షణాలు గల పరమాత్మయే మహావాక్యంలోని 'తత్' పదానికి అర్థం.. అంతఃకరణగలవాడై, అహం అనే తత్త్వానికి ఆధారంగా జీవుడు ప్రకాశిస్తున్నాడు. 'త్వమ్' అంటే చిదాభాసుడైన జీవుడే. జీవుడు ఆ బ్రహ్మముయొక్క ప్రతిబింబమే. ఈశ్వరుడు మాయాశరీరం గలవాడు. జీవుడు అవిద్యా శరీరం గలవాడు. ఇక్కడ **ఈశ్వరుడికి ఉపాధి అయిన**

**మాయను, జీవుడికి ఉపాధి అయిన అవిద్యను వదలి వేసినట్లైతే, జీవుడు ఈశ్వరుడు ఒకటే అవుతారు. అప్పుడు అఖండ సచ్చిదానంద రూపమైన పరబ్రహ్మ దర్శనమవుతుంది.**

ఈ రకంగా మహావాక్యాన్ని అనుసంధానం చెయ్యటమే 'శ్రవణము'. విన్న విషయాన్ని యుక్తితో అనుసంధించటమే 'మననము'. వేదాంతార్థాన్ని శ్రవణం చేసి, మననం చేసినప్పుడు నిస్సంశయంగా తెలిసిన వస్తువునందు ప్రీతిని నిలిపి, దానియందు మనస్సు నిలిపి, తదేక ధ్యానం చెయ్యటమే 'నిధిధ్యానము' అనబడుతుంది. ధ్యాతను మరచి ధ్యానమును వర్జించి, ధ్యేయమైన గోచరమగు చిత్తాన్ని గాలిలేనిచోట ఉంచిన దీపంలాగా ఉంచటమే 'సమాధి. నిర్వికల్ప సమాధిలో ఆత్మగోచరాలయిన అజ్ఞానవృత్తులు ఉంటాయి. కాని అవి ఆ సమయంలో తెలియబడవు. సమాధి నుంచి బయటకు వచ్చినప్పుడు, వారికి స్మృతి రూపంలో ఉన్న అనుభవాన్ని బట్టి, వృత్తులను ఊహించటానికి వీలవుతుంది. అనాదిగా ఉన్న ఈ సంసారంలో కోట్లకొలది సంచితకర్మలున్నాయి. అయినప్పటికీ పైన చెప్పిన సమాధివల్ల ఆ కర్మలన్నీ నశించిపోతాయి. పరిశుద్ధమైన ఆత్మధర్మము అభివృద్ధి చెందుతుంది.

ఈ నిర్వికల్ప సమాధి వేలకొలది ధర్మరూపామృతధారలను వర్షిస్తుంది. కాబట్టి యోగవేత్తలు ఈ సమాధిని **'ధర్మమేఘము'** అంటారు. వాసనలే కర్మకు కారణం. నిర్వకల్ప సమాధివల్ల శుభాశుభవాసనలన్నీ పూర్తిగా నశించిపోతాయి. వాసనాక్షయం అవటంచేత పాపకర్మలు, పుణ్యకర్మలు అన్నీ నశించిపోతాయి. 'తత్ త్వం అసి' అనే మహావాక్యం సమాధి స్థితి లభించిన తరువాత అపరోక్షమైన ఆత్మసాక్షాత్కారాన్ని ప్రసాదిస్తుంది. అనుభవించదగిన

విషయ సుఖములయందు గల అపేక్షలు నశించి, అవి మళ్ళీ పుట్టకుండా ఉన్నట్లైతే, అటువంటి స్థితిని వైరాగ్యము అంటారు. ఆత్మయందు దాగి ఉన్న చిత్తవృత్తి బయటకు రాకపోయినట్లైతే, ఉపరతి ప్రాప్తించిందని భావించాలి. అలాకాకుండా పాండిత్యముతో వైరాగ్యము ప్రాప్తిస్తుందనుకోవటం కేవలం భ్రాంతి మాత్రమే. వైరాగ్యం లేకపోతే జ్ఞానం కలగదు. ప్రజ్ఞగలవాడే స్థిత ప్రజ్ఞుడు. ఎవడు ఆనందాన్ని అనుభవిస్తున్నాడో, ఎవడు బ్రహ్మయందు ఆత్మను విలీనం చేస్తున్నాడో, ఎవడు నిర్వికారుడో, నిష్క్రియుడో, అటువంటి యతి స్థితప్రజ్ఞుడు.

ఈశ్వరుడు తత్ పదార్థమని, జీవుడు త్వమ్ పదార్థమని లక్ష్యార్థ భావంతో శోధించినట్లైతే జీవబ్రహ్మల ఏకీభావం కలుగుతుంది. అటువంటి ఏకరూప జ్ఞానరూపంలో ఉన్న చిన్మాత్ర వృత్తిని 'ప్రజ్ఞ' అంటారు. జీవాత్మ పరమాత్మల ఏకత్వ రూపజ్ఞానమే ఆకారముగా ఉన్న ప్రజ్ఞగలవాడే జీవన్ముక్తుడు. దేహము, ఇంద్రియాలే నేను అనే భావాన్ని విడిచిపెట్టి, ఆత్మ స్థితుడైనవాణ్ణి జీవన్ముక్తుడు అంటారు. తనకన్న పరబ్రహ్మ వేరుగాలేదని, మాయాకల్పిత జగన్నిర్మాణము పరబ్రహ్మ కన్న వేరుగా లేదని, ప్రజ్ఞతో తెలుసుకున్నవాడు జీవన్ముక్తుడు. సాధువులు పూజించేటప్పుడు, దుర్మార్గులు పీడించేటప్పుడు కూడా సమభావంతో ఉన్నవాడే జీవన్ముక్తుడు. బ్రహ్మతత్త్వము తెలిసిన వ్యక్తి అందరిలాగానే సంసారమందున్నప్పటికీ, రాగద్వేషాలకు వశం కాకుండా అంతర్ముఖుడై ఉంటాడు. ఈ విషయం బ్రహ్మవేత్తలకు మాత్రమే తెలుసు. ఇప్పుడు అనుభవించే సుఖదుఃఖాల అనుభవమంతా ప్రారబ్ధానికి సంబంధించినది. ఈ ప్రారబ్ధాన్ని జ్ఞానికూడా అనుభవిస్తాడు.

కలనుండి మెలకువ వచ్చిన వెంటనే కలకరిగిపోతుంది. అలాగే

మహావాక్యార్థానుభవ జ్ఞానంతో అనేక కోట్ల జన్మలయందు కూడబెట్టిన సంచితకర్మ పూర్తిగా నశిస్తుంది. ఆకాశానికి ఏ వస్తువుతోనూ సంబంధము లేదు. అలాగే తాను కూడా ఆకాశంలాగా ఉదాసీనుడను, అసంగుడను (సంబంధం లేనివాడను) అని తెలిసికొన్న యతికి కర్మలతో ఏ రకమైన సంబంధము ఉండదు. ఆ యతి ఆగామికర్మ (ప్రాప్తించేది) రహితుడు. ఆకాశానికి కుండతో సంబంధము ఉన్నప్పటికీ, అందులోని సారాయితో సంబంధం లేదు. అలాగే ఆత్మదేహమందున్నప్పటికీ, దేహధర్మాలతో దానికి సంబంధంలేదు. విడువబడిన బాణము తన లక్ష్యాన్ని భేదించకుండా వదలదు. అలాగే జ్ఞానం రాకముందు ప్రారంభమైన ప్రారబ్ధకర్మను అనుభవించి తీరాలి. అది జ్ఞానంతో నశించదు. పులి అనుకొని బాణం వదిలాడు. కాని అది ఆవు. ఆవు బాణం తగిలి మరణిస్తుంది. అలాగే ప్రారబ్ధకర్మని అనుభవించాల్సిందే. అజరుడను, అమరుడను అనే స్థిరమైన బుద్ధి గలవాడికి ప్రారబ్ధకల్పన నిజంకాదు. బ్రహ్మనిష్ఠుడైన వాడికి ప్రారబ్ధ భోగాల అనుభవం సత్యంకాదు.

దేహమే ఆత్మ అనే భ్రాంతి ఉన్నవాడికి ప్రారబ్ధం ఉంటుంది. ఈ దేహము తాను కాదు అని నిశ్చయంగా తెలుసుకున్నవాడు తానే ఆత్మ అవుతాడు. మాయా కల్పితమైన ఈ దేహానికి ప్రారబ్ధకల్పన భ్రాంతి అవుతుంది. సత్యమైన దానికి జన్మము లేదు. నాశనములేదు. లేనటువంటి శరీరానికి ప్రారబ్ధం ఎలా వస్తుంది ? అందువల్ల పరమార్థంలో ప్రారబ్ధంలేదు. జ్ఞానంవల్ల అజ్ఞాన కార్యాలన్నీ నశించినప్పుడు జ్ఞానియొక్క దేహము మాత్రము ఏ రకంగా స్థిరంగా ఉంటుంది ? అందువల్ల ప్రారబ్ధమనేది వ్యావహారిక సత్యమే గాని పారమార్థిక సత్యంకాదు. పరబ్రహ్మము పరిపూర్ణము, అనాది,

అనంతము, అప్రమేయము, అవిక్రియము, సద్ఘనము, చిద్ఘనము, నిత్యము, ఆనందఘనము, అవ్యయము, ప్రత్యగేకరసము, పూర్ణము, అనంతము, అనుపాధేయము, అనాధేయము, ఆశ్రయశూన్యము అవుతుంది.

ఆ పరబ్రహ్మ నిర్గుణము, క్రియారహితము, సూక్ష్మము, నిర్వికల్పము, నిరంజనము, అనిరూప్య స్వరూపము, మనోవాచామగోచరము, సత్ సమృద్ధము, స్వతఃసిద్ధము, శుద్ధము, బుద్ధము, అనీదృశము. ఆ బ్రహ్మము ఒక్కటిగా అద్వయముగా ఉన్నది. పరబ్రహ్మకన్న వేరైనది ఏదీలేదు.

మహావాక్యాలను శ్రద్ధగా విని వాటిని అర్థం తెలుసుకుని మననం చేసి వాటిని గనక అనుసంధానం చేసినట్లైతే సాధకుడు తానే సంగరహితుడు, అంగరహితుడు, లింగరహితుడు, ప్రశాంతుడు, అనంతుడు, పరిపూర్ణుడు, చిరంతరుడు, అకర్త, అభోక్త, అవికారుడు, అవ్యయుడు, శుద్ధ బుద్ధ స్వరూపుడయిన పరమాత్మ అవుతాడు.

# 53. ఏకాక్షరోపనిషత్తు

ఇది కృష్ణయజుర్వేదానికి సంబంధించినది ఇందులో మొత్తం మూడు మంత్రాలున్నాయి.

ఒకే అక్షరము. అదే బ్రహ్మాక్షరము. దానిలో సోమదేవతాకమైన సుషుమ్నానాడిలో దృఢముగా ఒకడున్నాడు. అతడే పరబ్రహ్మ. ఓ దేవా ! నువ్వు విశ్వానికే స్థానము. భూతాలకు ప్రభువువి. పురాతనుడు, పర్జన్యుడు, భువనాలకు రక్షకుడు, సజాతీయ, విజాతీయ భేదములు లేనివాడు, జ్ఞానులకు మార్గదర్శకుడు, లోకాలకు ప్రభువు, అన్ని విషయాలు తెలిసిన వాడు, జన్మలేనివాడు, యజ్ఞము. అన్నీ అతడే ఏకాక్షరుడు. ఓ దేవా! లోకానికి కారణము, ప్రాణము కూడా నీవే. నీ ఒక్క పాదంతోనే ఈ విశ్వమంతా వ్యాపించబడింది. నువు విశ్వకారణానివి. మంచి ధనుస్సు కలవాడివి. బాణరూపంలో ఉన్నావు. బాలభానుని వంటి కిరణములు వ్యాపింపచేసి హిరణ్యగర్భుడవై ప్రకాశిస్తున్నావు. నీ కాంతి ఆకాశంలో గరుత్మంతుడు ఉండేట్లుగా చేస్తోంది. అరిష్టము, దరిద్రము తొలగించే వాడివి నువ్వే. నువ్వు ఇంద్రుడివి, శివుడివి, కాముడివి, ప్రజలందరినీ రక్షించేవాడివి. స్వాహా స్వధా వషట్కారము అన్నీ నువ్వే. విష్ణువు యొక్క వరాహరూపం నువ్వే. రాత్రి, పగలు, భూతభవిష్యద్వర్తమానకాలాలు నువ్వే. కారణము, క్రియ, క్రతువు, పరమమైన అక్షరము అన్నీ నువ్వే. నువ్వే వేదము నువ్వే శాస్త్రము. నువ్వే ఋక్కు, నువ్వే యజస్సు, నువ్వే సామము. నీ ముఖము నుంచే వేదాలు ఆవిర్భవించినాయి. నువ్వే అగ్ని, వసువులు, రుద్రులు, దైత్యగణములు, మానవులు అన్నీ నువ్వే.

అతడు సర్వాన్ని ఎరిగినవాడు. భువనాలకు రక్షకుడు. ప్రజలకు నాభి వంటివాడు. చరాచర జగత్తుకు మధ్యన పూలలో దారంలాగా ఉన్నవాడు. ఛందోమయుడు, జ్ఞానస్వరూపి, ప్రజాపతి, అన్నింటిలోను అంతర్లీనంగా ఉన్నవాడు. రజోగుణం లేనివాడు. వేదవేత్తలలో శ్రేష్ఠుడు, హిరణ్మయుడు. బ్రహ్మవేత్తలు ఆయన్ని వేదమంత్రాలతో స్తుతి చేస్తారు. ఆయనే పురుషుడు, స్త్రీ, కుమారుడు, కుమార్తె, భూమి, ధాత, వరుణుడు, సర్వము ఆయనే. ఇంద్రుడు, వరుణుడు, రుద్రుడు, త్వష్ట, సవిత, గోపతి, విష్ణువు అన్ని భూతాలను రక్షించేది ఆయనే. అతన్ని ఎవరు తెలుసుకుంటారో అతడు బుద్ధిమంతులలో  కెల్లా బుద్ధిమంతుడు అతడికి పునర్జన్మ ఉండదు.

# 54. ప్రాణాగ్నిహోత్రోపనిషత్తు

ఇది కృష్ణయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో నాలుగు అధ్యాయాలు ఎనిమిది మంత్రాలు ఉన్నాయి. ఇందులో శరీర యజ్ఞాన్ని గురించి వివరిస్తున్నారు.

మానవశరీరంలో అగ్నిహోత్రము లేకపోయినా, సాంఖ్యయోగము లేకపోయినా, స్వధర్మవిధితో సంసారము నుంచి మోక్షము సిద్ధిస్తుంది. అన్నపాత్రను నేలమీద ఉంచి చంద్రుడు రాజుగా గల ఓషధులు, మమ్మల్ని పాపాలనుండి విముక్తి చేయుగాక. పుష్పములు ఉన్నవి లేనివి, ఫలములు ఉన్నవి లేనివి అయిన అన్ని రకాల ఓషధులు పాపాలనుంచి మమ్మల్ని రక్షించుగాక. ఓ వనదేవతా! ఆయుష్యును హరించే ఓషధులు, దుష్టశక్తులు రావటానికి వీలు కల్పించే ఓషధులను నశింపచేసేందుకు గాను విరుగుడు ఓషధిని నేను ధరిస్తున్నాను. అన్నానికి అధిపతి అయిన ఓ పరమేశ్వరా ! తేజోవంతమైన అన్నాన్ని మాకు ప్రసాదించవలసింది. అన్నదాతను పుణ్యలోకాలకు పంపవలసింది. మానవులకు, పశువులకు బలమును ప్రసాదించవలసింది. పిశాచాలు తిన్నది, రుద్రులు తిన్న అన్నాని మేము తిన్నప్పటికీ, మాకు ప్రమాదము లేకుండగాక. మాకు శుభమగుగాక. ఓ జఠరాగ్ని దేవా ! నువ్వు జీవులయొక్క బుద్ధి అనే గుహమధ్యలో సంచరిస్తున్నావు. నువ్వే యజ్ఞస్వరూపుడవు. నువ్వే బ్రహ్మ, నువ్వే రుద్రుడు. నువ్వే విష్ణువు. నువ్వే వషట్కారము. ఓ ఉదకములారా! మీరు జ్యోతిరూపాలు, రసరూపాలు, అమృతరూపాలు, బ్రహ్మస్వరూపాలు. మీకు నమస్కారము.

ఈ జలములు భూమిని పరిశోధించుగాక. భూమి – నన్ను

పరిశుద్ధుని చేయుగాక. వేదాధిపతులైన బ్రాహ్మణులు భూమిని పవిత్రము చేయుగాక. ఆ బ్రాహ్మణులచే పవిత్రము కాబడిన భూమి నన్ను పవిత్రము చేయుగాక. నేను చేసిన రకరకాల పాపాలను ఈ జలము పోగొట్టును గాక. ఉదకము అమృతస్వరూపము. కాబట్టి ఉదకాన్ని ప్రాణంలో హుతం చేస్తున్నాను. ఆ ఉదకాన్ని పంచవాయువులకు హతము చేస్తాను.

ఇప్పుడు హోమం చేసే విధానము చెబుతున్నారు.

అంగుష్టము, కనిష్టికతో – ప్రాణవాయువును

అంగుష్టము, అనామికతో – అపాన వాయువును

అంగుష్టము, మధ్యమతో – వ్యానవాయువును

అంగుష్టము, తర్జనితో – ఉదాన వాయువును

అంగుష్టము అన్నివ్రేళ్ళతో – సమాన వాయువును హోమం చెయ్యాలి.

**1. సూర్యాగ్ని :** సూర్యమండలాకారంలో ఉంటుంది. వెయ్యి కిరణాలతో ప్రకాశిస్తుంది.

**2. దర్శనాగ్ని :** సూర్యునికన్న దిగువ భాగంలో ఉంటుంది. చతురస్రాకారంతో ఆహవనీయాగ్ని రూపంతో ఉంటుంది.

**3. శారీరకాగ్ని :** దీన్నే జఠరాగ్ని అంటారు. అర్ధచంద్రాకారంలో దక్షిణాగ్ని రూపంతో హృదయంలో ఉంటుంది.

**4. కోష్టాగ్ని:** ఇది తినటం, తాగటం వల్ల వచ్చే అజీర్ణవ్యాధులు బాగు చేస్తుంది. గార్హపత్యాగ్ని రూపంతో నాభియందుంటుంది.

శారీరక యజ్ఞానికి :

1. జీవుడే – యజమాని

| | | | |
|---|---|---|---|
| 2. | బుద్ధి | – | భార్య |
| 3. | వేదాలే | – | ఋత్విక్కులు |
| 4. | అహంకారమే | – | అధ్వర్యుడు |
| 5. | చిత్తమే | – | హోత |
| 6. | ప్రాణవాయువు | – | బ్రాహ్మణాచ్ఛంసి |
| 7. | అపానవాయువు | – | ప్రతిప్రస్థాత |
| 8. | వ్యానవాయువు | – | ప్రస్తోత |
| 9. | ఉదానవాయువు | – | ఉద్గాత |
| 10. | సమానవాయువు | – | మైత్రావరుణుడు |
| 11. | దేహమే | – | వేది |
| 12. | నాసిక | – | ఉత్తరవేది |
| 13. | శిరస్సు | – | ద్రోణకలశము |
| 14. | కుడిచెయ్యి | – | స్రువము |
| 15. | ఎడమచెయ్యి | – | ఆజ్యస్థాలి |
| 16. | శ్రోత్రములే | – | ఆఘారములు |
| 17. | నేత్రాలు | – | ఆజ్యభాగాలు |
| 18. | మెడ | – | వసోర్ధార |
| 19. | పాదము | – | పోత (ఋత్విగ్విశేషుడు |
| 20. | తన్మాత్రలు | – | సదస్యులు |
| 21. | మహాభూతగణాలు | – | ప్రయాజలు |
| 22. | భూతగణాలు | – | అనుయాయులు |
| 23. | నాలుక | – | ఇడ |
| 24. | దంతోష్టాలు | – | సూక్తవాకము |

25. తాలువు – శంయవాకము
26. స్మృతి – దయ, క్షమ
27. ఓంకారము – యూసము
28. ఆశ – రశన
29. మనస్సు – రథము
30. కామము – యాగపశువు
31. తలవెంట్రుకలు – దర్భలు
32. జ్ఞానేంద్రియాలు – యజ్ఞపాత్రలు
33. కర్మేంద్రియాలు – హవిస్సు
34. అహింస – రూపయిష్టులు
35. త్యాగమే – దక్షిణ
36. మరణము – అవబృధస్నానము

ఇలా భావన చేసి ప్రాణాగ్నిహోత్రము ఆచరించాలి.

# 55. శారీరకోపనిషత్తు

ఇది కృష్ణయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో 33 మంత్రాలుంటాయి.

ఇందులో ముఖ్యంగా ఐదు విషయాలు వివరించారు. 1. పంచభూతాలు 2.గుణత్రయము 3. అవస్థాత్రయము 4. శరీరత్రయము 5. పంచకోశాలు. ఇప్పుడు వీటిని చూద్దాం.

## శారీరకోపనిషత్తు - 1

## పంచభూతాలు

సృష్టి ప్రారంభం కాకముందు ఈ జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యాన్ని పరమేశ్వర స్వరూపం ఆక్రమించి ఉన్నది. కొంత కాలానికి ఆ పరమాత్మ సృష్టి చెయ్యాలని సంకల్పించుకున్నది. అప్పుడు మొదటగా పరమేశ్వరుణ్ణించి సత్త్వగుణం బయటకు వచ్చింది. అదే అవ్యక్తము. మాయ. ఆ తరువాత సత్త్వగుణం నుంచి రజోగుణం వచ్చింది అదే మహతత్త్వము, హిరణ్యగర్భుడు. రజోగుణం నుంచి తమోగుణం వచ్చింది. అదే అహంకారము, విరాడ్రూపము. ఈ రకంగా మొదటగా ఆ పరమేశ్వరుణ్ణించి సత్త్వరజస్తమో గుణాలు వచ్చినాయి. అవే అవ్యక్త మహత్తత్త్వ అహంకారాలు, అహంకారం నుంచి మొదటగా శబ్ద స్పర్శ రూప రస గంధములు అనబడే తన్మాత్రలు వచ్చినాయి. ఆ తరువాత వాటి స్థూలరూపాలయిన పంచభూతాలు ఆవిర్భవించినాయి. శబ్ద స్పర్శ రూప రస గంధాలు వీటి గుణాలు. ఐతే ఈ గుణాలు వరుసగా ఆకాశంలో – ఒకటి, వాయువులో – రెండు, అగ్నిలో – మూడు, జలంలో – నాలుగు, భూమియందు – ఐదు ఉంటాయి. అంటే

ఆకాశంలో - శబ్దము

వాయువులో - శబ్దము, స్పర్శ

అగ్నిలో - శబ్దము, స్పర్శ, రూపము

జలము నందు - శబ్దము, స్పర్శ, రూపము, రసము

భూమియందు - శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము

ఉంటాయి. ఈ గుణాలు ఎలా ఉంటామో చూద్దాం.

**ప్రతిధ్వనిర్వియచ్ఛబ్దో । వాయౌ బీసీతి శబ్దనమ్ ।**
**అనుష్ణాశీత సంస్పర్శో వహ్నౌ భుగుభుగు ధ్వనిః ॥**
**ఉష్ణః స్పర్శః ప్రభారూపం జలే బులు బులు ధ్వనిః ।**
**శీతస్పర్శః శుక్లరూపం రసోమాధుర్యమీరితమ్ ॥**
**భూమౌ కడకడా శబ్దః కాఠిన్యం స్పర్శ ఇష్యతే ।**
**నీలాదికం చిత్రరూపం మధురామ్లాదికో రసః ॥**
**సురభీతరగంధౌ ద్వ్యౌగుణాః సమ్యగ్వివేచితాః ।**
**శ్రోత్రం త్వక్ చక్షుషీ జిహ్వా ఘ్రాణం చేన్ద్రియ పంచకమ్ ॥**

ఆకాశంలో ప్రతిధ్వని రూపంలో శబ్దము అనే గుణం ఉంది. వాయువులో సీ సీ అనే శబ్దంతోపాటు ఉష్ణము, శీతము కానటువంటి స్పర్శ గుణం ఉంది. అగ్నిలో భుగభుగ అనే ధ్వనితోపాటు ఉష్ణమనే స్పర్శ, ప్రకాశమనే రూపము ఉన్నాయి. జలంలో బుళ్‌బుళ్ అనే ధ్వనితోపాటు, తెల్లనిరూపం, చల్లని స్పర్శ, తియ్యటి రసం, అనే నాలుగు గుణాలున్నాయి. భూమిలో కడకడమనే ధ్వనితోబాటు కఠిన స్పర్శ,

నీలము, పసుపులాంటి రూపము, మధురతిక్త ఆమ్లాది రసాలు, గంధము (సుగంధం, దుర్గంధం) అనే ఐదు గుణాలు ఉన్నాయి. ఇవి పంచభూతాల గుణాలు. అలాగే ఈ భూతాలకు కార్యాలు కూడా ఉన్నాయి. కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము అనేవి జ్ఞానేంద్రియాలు పంచభూతాల కార్యాలు. ఈ ఐదు ఇంద్రియాలు చిల్లులు లేదా కంతలలో ఉంటాయి. కన్ను, ముక్కు, చెవి ఇవన్నీ కంతలే పైకి కనిపించే దొప్పలు, దొప్పలు ఇంద్రియాలు కాదు. అవి చాలా సూక్ష్మంగా ఉంటూ శబ్దస్పర్శ రూప రస గంధాలను గ్రహిస్తాయి. ఈ ఇంద్రియాలు చాలా సూక్ష్మమైనవి. అందుకే వాటి కార్యాలను బట్టి ఊహించి తెలుసుకోవటానికి వీలుంటుంది. ఎక్కువగా ఈ ఇంద్రియాలు బాహ్యావిషయాల వైపుకే పరుగులు తీస్తాయి. కఠోపనిషత్తులో చెప్పినట్లుగా బ్రహ్మ ఈ ఇంద్రియాలను బహిర్ముఖం చేశాడు. అందుకే ఇవి జీవుని స్వరూపాన్ని కాకుండా బయట వైపుకు చూస్తుంటాయి. కాని అప్పుడప్పుడు అంతర్విషయాలకు సంబంధించిన జ్ఞానం కూడా కలుగుతుంటుంది. మనం వ్రేళ్ళతో చెవులు మూసినప్పుడు, లోపల ఉన్న ప్రాణవాయువు, జఠరాగ్ని వీటికి సంబంధించిన ఒక రకమైన ధ్వని వినిపిస్తుంది. చల్లని నీళ్ళు త్రాగేటప్పుడు, మన లోపల చల్లగా స్పర్శ కలుగుతుంది. రెండు కళ్ళూ మూసుకున్నప్పుడు లోపల ఉన్న అంధకారము కనిపిస్తుంది. త్రేపులు వచ్చినప్పుడు లోపల ఉన్న రసము, గాలి బయటకు వచ్చినప్పుడు వాసన తెలుస్తుంది. ఈ విధంగా జ్ఞానేంద్రియాల వల్ల లోపల ఉన్న జ్ఞానము కూడా తెలుస్తుంది.

కర్మేంద్రియ వ్యాపారం. మాట్లాడటం, తీసుకోవటము, నడవటము, మలవిసర్జన, విషయ సంభోగము. వీటినే వచన దానా గమన విసర్గానందములు అంటారు. ఇవి కర్మేంద్రియాలు చేసే పనులు.

వాక్కు పాణి, పాద, పాయు, ఉపస్థలు కర్మేంద్రియాలు. ఇవి నోరు మొదలైన వాటి స్థానాల్లో ఉంటాయి. మనస్సు అనేది పదకొండవ ఇంద్రియం. ఇది కేవలము మానవుడికి మాత్రమే ప్రసాదించబడిన వరం. ఇది జ్ఞానేంద్రియాలకు, కర్మేంద్రియాలకు అధిపతి. ఇంద్రియాలను ప్రేరేపించేది మనస్సే. ఇది అంతఃకరణ లోపల ఉండే ఇంద్రియం. హృదయ కమలంలో ఉండే ఛిద్రమే దాని స్థానం. మనస్సు ఇంద్రియ సాయం లేకుండా స్వతంత్రంగా ఏ పని చెయ్యలేదు. ఇంద్రియాలు లేకుండా శబ్దాది బాహ్య విషయాలను గ్రహించలేదు. కన్ను మొదలైన ఇంద్రియాలు ఆయా విషయాల్లో పరిణతమైనప్పుడు, రూపము మొదలైన జ్ఞానం కలిగిన తరువాత, వాటి గురించిన గుణదోషాలను చర్చించేది మనస్సే. సత్త్వము, రజస్సు, తమస్సు అనేవి మనస్సు యొక్క గుణాలు. వీటివల్లనే మనసు మార్పు చెందుతున్నది. గుణదోష విచారణ ఆత్మగాని, ఇంద్రియాలుగాని చెయ్యవు. కేవలము మనస్సే చేస్తుంది. మనస్సులో పుట్టే కామక్రోధాది వృత్తులు అన్నీ గుణత్రయము యొక్క వికృతులే. ఈ మూడు గుణాలలోని భేదంవల్లనే మనస్సులో అనేకమైన వృత్తులు, వికారాలు పుడతాయి. మనస్సులో వైరాగ్యం, క్షమ, ఔదార్యం లాంటి దైవీ వృత్తులన్నీ సత్త్వగుణం వల్ల పుడతాయి. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాల్లాంటివి రజోగుణం వల్ల పుడతాయి. సోమరితనము, నిద్ర, భ్రాంతి లాంటి అసురీ వృత్తులు తమోగుణం వల్ల పుడతాయి. సత్త్వగుణం వల్ల, దాని కార్యాలైన వైరాగ్యాదుల వల్ల, పుణ్యం వస్తుంది. రజోగుణంవల్ల, దాని కార్యాలైన కామక్రోధాదుల వల్ల, పాపం వస్తుంది. తమోగుణము వల్ల, దాని కార్యాలైన నిద్రాదుల వల్ల, కాలనష్టము, ఆయుక్షీణము తప్ప ఏమీ ఉపయోగముండదు. వేదాంత శాస్త్రంలో 'అహం' ప్రత్యయం –

నేను అనే అభిమానం కలిగి ఉండేవాణ్ణి కర్త, స్వామి, ప్రభువు అంటారు. లౌకికంలో కూడా ఇలా జరుగుతుంది. కాబట్టి అంతఃకరణ వృత్తులలో అహంవృత్తి గల వాడే యజమాని.

జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, ఈ పదకొండు ఇంద్రియాల ద్వారా అనుమాన ప్రమాణము, శాస్త్ర ప్రమాణముల చేత తెలుసుకోబడే అన్ని పదార్థాలు, ఈ జగత్తులో కనిపించే వస్తువులు, 'ఇదమ్' ఇది అనే శబ్దంతో సూచించబడతాయి. అంటే ప్రత్యక్ష, అనుమాన, శబ్దప్రమాణాల ద్వారా, ఉపమానం ద్వారా ఇతర వాటిద్వారా తెలుసుకోబడే సమస్తమూ 'ఇదం' అనే గుర్తించాలి. సృష్టికి పూర్వం ఈ జగత్తంతా అద్వితీయమైన బ్రహ్మలో అవ్యక్తరూపంలో ఉంది. అప్పుడు దానికి నామరూపాలు లేవు. అందులో స్వగతభేదం లేదు. సజాతీయ విజాతీయ భేదం అసలే లేదు. ఇప్పుడు ఈ భేదాలేమిటో చూద్దాం.

**1. స్వగతభేదము :** ఒకేదానిలో ఉండే తేడాలు. ఉదా : ఒక చెట్టు ఉంది. దానికి ఆకులు, పూలు, కొమ్మలు, రెమ్మలు, కాయలు, పండ్లు. ఇవన్నీ ఆ చెట్టుయొక్క అంగాలే. కాని ఒకదానికి ఇంకొక దానికి అంటే ఆకుకు–కాయకు, ఆకుకు–పూవుకు పోలిక ఉండదు. ఇలా భిన్న అంగాల మధ్య ఉండే భేదాన్నే స్వగతభేదము అంటారు.

**2. సజాతీయ భేదము :** ఒకే జాతికి చెందిన రెండు వస్తువుల మధ్య ఉండే తేడా. మర్రిచెట్టు, రావిచెట్టు. ఈ రెండూ వృక్షజాతివి. కాని రెండింటి మధ్యనా తేడా ఉంది. అదే సజాతీయము.

**3. విజాతీయ భేదము :** రెండు భిన్నజాతి వస్తువుల మధ్యన ఉండే భేదము. వృక్షము, బండరాయి. ఈ రెండూ విజాతీయాలు. ఈ రెండింటి మధ్యన ఉండే తేడాను విజాతీయ భేదము అంటారు. పరబ్రహ్మలో

ఈ మూడు రకాల భేదాలు లేవు. ఈ భేదాలు అనాత్మ వస్తువులందు మాత్రమే ఉంటాయి. సద్వస్తువుకు ఈ రకమైన తేడాలుండవు. ఎందుకంటే–

**1. స్వగతభేదము :** సద్వస్తువుకు అవయవాలుండవు. సద్వస్తువు యొక్క అంశ, భాగాన్ని మనం నిరూపించలేము. స్వగతభేదమనేది అవయవాల వల్లనే కలుగుతుంది. సృష్టికి పూర్వం ఉన్న సద్వస్తువుకు అంశ అనేది లేదు. పుట్టుక లేదు. నామరూపాలు లేవు. అవయవాలు అంతకన్నా లేవు. కాబట్టి అందులో స్వగతభేదముండదు. అయితే ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. సృష్టికి పూర్వం నామరూపాలు లేవా? లేవు అని ఖచ్చితంగా చెప్పాలి. ఎందుకంటే నామరూపాలు ఉంటే సృష్టి జరిగినట్లే.

**2. సజాతీయ భేదము :** ఒకే జాతికి చెందిన రెండు వస్తువుల మధ్య ఉండే భేదాన్ని సజాతీయ భేదము అంటారు. సృష్టికి ఇన్ని జాతులు, వస్తువులు ఎక్కడున్నాయి. ఉన్నది ఒక్కటే. అద్వితీయమైన పరబ్రహ్మ. కాబట్టి సజాతీయ భేదం లేదు.

**3. విజాతీయ భేదము :** బ్రహ్మమనేది సద్వస్తువు. దానికి విజాతీయమున్నది అంటే అది అసద్వస్తువు అవుతుంది. అందుకే ఇంకొక జాతిగాని, వస్తువు కాని, లేదు. కాబట్టి పరబ్రహ్మకు విజాతీయ భేదం కూడాలేదు. అంతఃకరణ నాలుగు బాగాలుగా ఉంటుంది. అవి 1. మనస్సు 2. బుద్ధి 3. చిత్తము 4. అహంకారము. పంచభూతాలలోను ఆకాశం వాయుతో కలిస్తే మనస్సు, అగ్నితో కలిస్తే బుద్ధి, జలంతో కలిస్తే చిత్తము, పృథివితో కలిస్తే అహంకారము ఏర్పడతాయి. వీటిలో

**1. మనస్సు :** సంకల్ప వికల్పాలను కారణమైనది. ధర్మాధర్మాలను, యుక్తాయుక్తాలను గురించి ఆలోచించేది మనస్సు. మనస్సునే హృదయము అంటారు. దీనికి స్థానం గళానికి చివరి భాగం. దీనికి విషయం సంశయం.

**2. బుద్ధి :** నిశ్చయాత్మకమైనది బుద్ధి. ఏ రకమైన నిర్ణయమైనా ఇదే తీసుకుంటుంది. దీనికి స్థానం వదనం. దీనికి విషయం నిశ్చయం.

**3. చిత్తం :** చింతించేది చిత్తం. గతంలో కలిగిన అనుభవాలను గురించి ఆలోచిస్తుంది. దీనికి స్థానం నాభి. దీనికి విషయం ధారణ.

**4. అహంకారం :** నేను అనే భావన అహంకారం. దీనివల్లనే మానవుడు పట్టుదలకు పోవటం వంటివి చేస్తాడు. దీనికి స్థానం హృదయం. దీనికి విషయం అభిమానం.

కళ్ళు మొదలైన ఇంద్రియాల ద్వారా అంతఃకరణ వ్యక్తమవుతుంది. "అవే నేను" అనుకుని వాటితో తాదాత్మ్యం చెందుతూ, ఆత్మయొక్క ప్రతిబింబంలో జీవిస్తూ ఉంటుంది. అహంకారం శరీరంతో తాదాత్మ్యత చెందినప్పుడు కర్తగా, భోక్తగా తనను తాను భావిస్తుంది. సత్త్వాది గుణాలతో కలిసి అవస్థాత్రయంలో విహరిస్తుంది. ఇంద్రియ భోగ్యవస్తువులు మనకు అనుగుణంగా ఉంటే సుఖంగా ఉంటాం. లేనప్పుడు దుఃఖిస్తాము. ఈ సుఖదుఃఖాలనేవి అహంకారం ధర్మాలు. దృశ్యమానమయిన జగత్తంతా మిథ్యే. క్షణికమైన అహంకారం కూడా సత్యం కాదు. క్షణక్షణము మార్పు చెందే అహంకారం నాకు అన్నీ తెలుసు అనుకుంటుంది. అహంకారంతో సంబంధం ఉన్నంతవరకు మానవుడు ముక్తిని గురించి మాట్లాడలేడు. అహంకారం నుంచి విడివడినవాడు, తానే పరమాత్మనని తెలుసుకుంటాడు.

**పంచీకరణము :** స్థూలంగా ఉండే పంచభూతాలు ఒకదానితో ఒకటి కలిసి ఉండటాన్నే పంచీకరణ అంటారు. అదెలా జరుగుతుందంటే, ముందుగా ఆకాశం తీసుకుందాం. ఆకాశాన్ని రెండు భాగాలుగా చెయ్యాలి. మొదటి భాగంలో పూర్తిగా ఆకాశం ఉంటుంది. రెండవ భాగాన్ని మళ్ళీ నాలుగు భాగాలుగా చెయ్యాలి. వీటిలో మిగిలిన నాలుగు భూతాలను సమానంగా ఉంచాలి. అంటే

ఆకాశంలో – ఆకాశము 1/2, వాయువు 1/8, అగ్ని 1/8, జలము 1/8, పృథివి 1/8గా ఉంటాయి.

వాయువులో – వాయువు 1/2, ఆకాశం 1/8, అగ్ని 1/8, జలము 1/8, పృథివి 1/8 ఉంటాయి.

అగ్నిలో – అగ్ని 1/2 మిగిలిన నాలుగు భూతాలు 1/8 చొప్పున ఉంటాయి.

జలంలో – జలం 1/2 మిగిలిన నాలుగు భూతాలు 1/8 చొప్పున ఉంటాయి.

భూమిలో – భూమి 1/2 మిగిలిన నాలుగు భూతాలు 1/8 చొప్పున ఉంటాయి.

పంచభూతాలు ఈ రకంగా పంచీకరణ చెంది త్రిగుణాలతో కలియటం వల్ల సృష్టి ఏర్పడింది.

పంచభూతాలలో ఆకాశం కూడా శాశ్వతమైనది కాదు. ఆకాశం అంతటా వ్యాపించి ఉంటుంది. అంతేకాని అనిత్యమైనది. ప్రళయ కాలంలో భూమి జలంలో, జలం అగ్నిలో, అగ్ని వాయువులో, వాయువు ఆకాశంలో, ఆకాశం మాయలో, మాయ పరమేశ్వరునిలో లీనమై పోతాయి. అంటే ప్రళయ కాలంలో పంచభూతాలన్నీ నశించి పోతాయి. కాబట్టి ఇవేవీ ఆత్మకాదు.

# శారీరకోపనిషత్తు - 2

## గుణత్రయము

లోకంలో ముఖ్యమైనవి మూడు గుణాలు. వాటినే త్రిగుణాలు అంటారు. అవే సత్త్వరజస్తమో గుణాలు. వేదాంతవిద్య లేదా బ్రహ్మవిద్యలో వీటికి చాలా ప్రాముఖ్యత ఉన్నది. వీటిని గురించి గీతలోని 14వ అధ్యాయంలో భగవానుడు వివరించాడు.

ఈ గుణాలు మూడు ప్రకృతినుంచే ఆవిర్భవించాయి. ఇవి ప్రకృతి కార్యాలు. జగత్తులో ఉన్న జడపదార్థాలన్నీ ఈ మూడింటి యొక్క విస్తృతరూపాలే. అందుచేతనే ఇవి ప్రకృతి సంభవాలు అని చెప్పబడుతుంటాయి. ఇక్కడ విచిత్రం ఏమంటే, దేహంపై అభిమానం గలవారి మీదనే ఈ గుణాల ప్రభావం ఉంటుంది. అనాదిగా వస్తున్న అజ్ఞానం కారణంగానే ఆత్మ బంధాలలో చిక్కుకుంటుంది. ఈ మూడు గుణాలు దేహికి ఇష్టమైన భోగములందు, శరీరములందు, ఆసక్తి, అభిమానము, మమత, కలిగిస్తాయి. ఆత్మని శరీరంలో బంధించటం అంటే ఇదే. త్రిగుణాల నుంచి ఉత్పన్నమైన శరీరాదులందు, వాటికి సంబంధించిన పదార్థాలయందు, జీవాత్మకు అభిమానము కలుగుతున్నది. అవే బంధనాలు.

**సత్త్వగుణము :** ఇది నిర్మలమైనది. ప్రకాశమైనది. వికారాలు ఏ మాత్రము లేనిది. సుఖసాంగత్యము వల్ల, జ్ఞానాభిమానం వల్ల, ఈ గుణం మానవుణ్ణి బంధిస్తుంది. సత్త్వగుణ స్వరూపం చాలా నిర్మలమైనది అంటే ఏ రకమైన దోషాలు లేనిది. కాబట్టే అది ప్రకాశకము, అనామయము అనబడుతుంది. ఈ సత్త్వగుణం వలన ఇంద్రియాలలోను, అంతఃకరణలోను ప్రకాశము పెరుగుతుంది. దుః

ఖము నశిస్తుంది. దురాచారాలు నశిస్తాయి. సాధకుడికి శాంతి లభిస్తుంది. శరీరంలో ఎప్పుడయితే సత్త్వగుణం పెరుగుతుందో అప్పుడు మనోచాంచల్యము తనంత తానే పటాపంచలయి పోతుంది. సంసారం మీద విరక్తి కలుగుతుంది. మనస్సు సచ్చిదానంద స్వరూపమయిన పరమాత్మ యందే లగ్నమవుతుంది. అతని చిత్తంలో, ఇంద్రియాలలో సోమరితనము, దుఃఖము తొలగిపోయి చేతనశక్తి బాగా పెరుగుతుంది. ఈ సత్త్వగుణము జీవాత్మను సుఖజ్ఞానసాంగత్యముతో బంధిస్తుంది అన్నాం కదా ! దీనికి అర్థం ఏమిటంటే – ఏ సుఖమందు సాధకుడు భజన, ధ్యానము, సేవచేసి ఆనందిస్తాడో, దుఃఖాలను వదలివేయ గలుగుతాడో, మొదట దుఃఖకరముగా కనిపించినప్పటికీ క్రమేణా అమృతతుల్యమై పరమాత్మకు సంబంధించిన పనులలో నిమగ్నమవుతాడో అటువంటి సుఖాన్ని సాత్త్విక సుఖము అంటారు. ఈ సుఖాన్ని పొందేటప్పుడు నేను సుఖంగా ఉన్నాను అని భావన చేస్తాడు. దీనివల్ల జీవాత్మకు ఆ సుఖంతో సంబంధము ఏర్పడుతుంది. సాధనకు ఇది గొప్ప ఆటంకము. జీవన్ముక్త స్థితి పొందటానికి అడ్డుగా ఉంటుంది. సత్త్వగుణము జీవాత్మను సుఖజ్ఞానంతో బంధించటం అంటే ఇదే. జ్ఞానము అంటే బోధశక్తి. అది రాగానే 'నేను జ్ఞానిని' అనుకుంటాడు. దీనివల్ల అతడు గుణాతీత స్థితికి చేరకుండా ఆగిపోతాడు. ఈ రకంగా సత్త్వగుణం కల జీవి సుఖజ్ఞానంతో బంధించబడతాడు. సత్త్వగుణం వల్ల మానవుడు సాంసారిక భోగాల నుండి సోమరితనము, నిద్ర మొదలైన వాటి నుండి దూరమై, ఆత్మచింతన ద్వారా సాత్త్విక సుఖంలో నిమగ్నమవుతాడు. శరీరము, ఇంద్రియాలు, అంతఃకరణలలో చైతన్యము, వివేకశక్తి ఉత్పన్నమైనప్పుడు సాధకునిలో సత్త్వగుణము వృద్ధి చెందుతుంది.

త్రిగుణాలలో మిగిలిన రెండింటినీ అణచివేస్తేనే ఏదో ఒక గుణం వృద్ధి చెందుతుంది. అంటే రజోగుణము, తమోగుణాలను అణచివేసి సత్త్వగుణం వృద్ధి చెందుతుందన్న మాట. ఆ సమయంలో సాధకుడు తన మనస్సును ధ్యానము, భజన మొదలైన వాటియందు లగ్నం చెయ్యటానికి ప్రయత్నించాలి. అప్పుడే సత్త్వగుణం ఎక్కువ కాలం ఉంటుంది. లేకపోతే రజస్తమో గుణాలు విజృంభిస్తాయి. శరీరంలో చైతన్యము, తేలికదనము, ఇంద్రియాలు, అంతఃకరణ నిర్మలంగా ఉండటాన్నే "ప్రకాశం ఉత్పన్నమవటము" అంటారు. సత్యాసత్యాలు నిర్ణయించే వివేకము రావటాన్నే 'జ్ఞానము' అంటారు. శరీరంలో ఎప్పుడయితే జ్ఞానము, ప్రకాశము ఉత్పన్నమయినాయో, అప్పుడు సంసారం పట్ల వైరాగ్యం ఏర్పడి సుఖశాంతులు లభిస్తాయి. ఆ సమయంలో రాగద్వేషాలు, దుఃఖము, శోకము, చింత, భయము, నిద్ర, సోమరితనము లాంటివన్నీ దూరమై పోతాయి. మానవుడు మరణించే సమయంలో సత్త్వగుణం గనక ఎక్కువగా ఉన్నట్లైతే, అతడు స్వర్గము మొదలైన దివ్యలోకాలు పొందుతాడు. సత్త్వగుణము వృద్ధిగా ఉన్నప్పుడు మరణించే వారికి ప్రాప్తించే లోకాలలో ఏ విధమైన దోషాలు, క్లేశాలు ఉండవు. ఆ లోకాలు దివ్యప్రకాశమయాలు. శ్రేష్ఠమైన కర్మలనాచరించటం వల్ల సుఖము, జ్ఞానము, వైరాగ్యము లభిస్తాయి. ఇదే సాత్త్విక కర్మఫలము. సత్త్వగుణం వల్ల జ్ఞానం కలుగుతుంది. అందుచేత సత్త్వగుణ సంపన్నులు స్వర్గాది ఊర్ధ్వలోకాలకు పోతారు.

కర్తృత్వాభిమానము గాని, ఫలాపేక్ష గాని, లేనటువంటి పురుషునిచేత, రాగద్వేష రహితంగా చెయ్యబడే శాస్త్రవిహితమైన కర్మలనే సాత్త్విక కర్మ అంటారు. శాస్త్ర విహిత కర్మలు అంటే – వర్ణాశ్రమ ధర్మాలు, పరిస్థితుల ననుసరించి మానవుడు చెయ్యవలసినవి.

యజ్ఞము, దానము, తపస్సు మొదలైనవి. వీటిని ఆసక్తితో చేయరాదు. అంటే తాను చేసే కర్మలతో తనకు సంబంధమున్నట్లు భావించరాదు. ఈ విధంగా ఆసక్తిని త్యజించినవాడు, అహంకారంతో మాట్లాడనివాడు, ధైర్యము, ఉత్సాహము గలవాడు, వికారాలకు లోనుకాని వాడు, సాత్త్వికకర్త అనబడతాడు. అలాగే ప్రవృత్తి మార్గము, నివృత్తి మార్గము, కర్తవ్యము, అకర్తవ్యము, బంధము, మోక్షము మొదలైన వాటిని యథార్థంగా తెలుసుకునే బుద్ధినే సాత్త్వికబుద్ధి అంటారు. అలాగే నిశ్చలమైన ధారణశక్తితో తన ధ్యానయోగం ద్వారా ఇంద్రియాలను పరమాత్మ యందు నిల్పటాన్నే సాత్త్వికధృతి అంటారు. పరిశుద్ధమైన బుద్ధి గలిగి, తేలిక అయిన సాత్త్వికాహారాన్ని మితంగా తినేవాడు, విషయవాసనలు వదలి ఏకాంతంగా ఉండేవాడు, ఇంద్రియ నిగ్రహం కలిగినవాడు, రాగద్వేషాలు జయించినవాడు, వైరాగ్యము పొందినవాడు, అహంకారము, దర్పము, బలము, కోపము వదలిపెట్టిన వాడు, నిరంతరము ధ్యానంలో ఉండేవాడు. ఆ పరమేశ్వరుని చేరతాడు. అతడికి ముక్తి లభిస్తుంది. పునర్జన్మ ఉండదు. సత్త్వగుణంకూడా రెండు రకాలుగా చెప్పబడుతుంది.

1. సత్త్వం అధికంగా ఉన్న మిశ్రమగుణం 2. శుద్ధసత్త్వం. గర్వం లేకపోవటం. యమ నియమాదులు పాటించటం, భక్తి, శ్రద్ధ, ముముక్షుత్వము, దివ్యత్వము అనిత్యమైన వాటియందు విరక్తి–ఇవి సత్త్వం అధికంగా ఉన్న మిశ్రమగుణ ధర్మాలు. సంతోషంగా ఉండటం, ఆత్మానుభూతి, పరమశాంతం, తృప్తి, ఆనందం మొదలైనవి శుద్ధసత్త్వగుణాలు. అయితే గుణాతీతుడైన వాడు మాత్రమే మోక్షానికి అర్హుడు.

శుద్ధ సత్త్వగుణం–నీరులాంటిది. అది రజస్తమో గుణాలతో చేరి

జనన మరణాలతో కూడిన సంసారానికి కారణమవుతుంది. అలా కాకుండా కేవలము సత్త్వగుణంలోనే ఆత్మ ప్రతిఫలించినప్పుడు సూర్యుడిలాగా ఈ జడప్రకృతినంతటినీ స్ఫురింపజేస్తుంది. సత్త్వగుణం పరిశుభ్రమైన నీరులాగా ఉంటుంది. స్వచ్ఛమైన నీటిలో మురికి కలిస్తే, మురికి నీరవుతుంది. అందులోంచి మురికిని తొలగిస్తే మంచి నీరవుతుంది. అలాగే సత్త్వగుణంలో ఎప్పుడైతే రజస్తమో గుణాలు కలిశాయో, అప్పుడు సంసార బంధనాలు ఏర్పడతాయి. వాటిని గనక విడదీయగలిగితే బంధనాలు నశిస్తాయి. శుద్ధసత్త్వగుణం మాత్రమే ఉన్నప్పుడు బుద్ధి నిశ్చలంగా పని చేస్తుంది. అశాంతి, అలజడి ఉండవు. రజస్తమో గుణాల పాలు తగ్గినట్లైతే అంటే సత్త్వగుణం అధికంగా ఉన్నప్పుడు సాధకుడు ముక్తిమార్గంలో ప్రయాణిస్తాడు. భయం లేకపోవటము, పవిత్రమైన హృదయము, జ్ఞానయోగమునందు నిష్ఠ, ఇంద్రియ నిగ్రహము, త్యాగము, శాస్త్రాధ్యయనము, జపతపాలు, ఋజువర్తన, అహింస, సత్యము, శాంతి, త్యాగము, కోపం లేకపోవటము, భూతదయ ఇవి దైవీ సంపత్తి. శుద్ధసాత్త్వికము అన్నప్పుడు దైవత్వము అని గుర్తుంచుకోవాలి. అందుకే శుద్ధ సత్త్వగుణం కలవాడు ముక్తి మార్గంలో పయనిస్తాడు. మనసు నిర్మలం కాగానే ఆ మనసులో ఆత్మ ప్రకాశిస్తుంది. అలజడులన్నీ తొలగిపోయి పరమశాంతం లభిస్తుంది. ఇదే దివ్యము పూర్ణము అయిన స్వస్థితి.

**రజోగుణం :** వ్యక్తిలో అవిద్య వ్యక్తమయినప్పుడు రజోగుణంగా పిలువబడుతుంది. రజోగుణానికి విక్షేపశక్తి ఉన్నది. దీని స్వభావమే క్రియాశీలత్వం. కర్మ ప్రవాహమంతా దీన్నుంచే ఉదయిస్తుంది. రాగము, ద్వేషము, దుఃఖము మొదలయిన మనోవికారాలన్నీ దీన్నుంచే ఆవిర్భవిస్తున్నాయి. మాయ రజోగుణంగా వ్యక్తమయినప్పుడు

మనస్సులో విక్షేపంగా, అలజడిగా గుర్తించబడుతుంది. అప్పుడు మనస్సులో అశాంతి, అలజడి కలుగుతాయి. దీనివల్లనే కర్తలన్నీ పుడుతున్నాయి. మనసు పని చేస్తున్నప్పుడు మాత్రమే మానవుడు బాహ్యప్రపంచంలో పనులు చెయ్యగలుగుతాడు. మనసు పని చెయ్యకపోతే పనులు చెయ్యలేడు. సుషుప్తిలో మనస్సు పని చెయ్యదు. అందుకే అప్పుడు ఏ పనులు జరగవు. ఏదైనా ఒక వస్తువును చూసినప్పుడు మనసులో అలజడి ప్రారంభమై, తద్వారా కోరికలు ఉద్రేకాలు పుడతాయి. వాటిని తృప్తిపరచటం కోసం కర్మలు చేస్తాడు. కోరికలు జయించాలంటే చాలా శక్తి కావాలి. అది కష్టమైన పని కాబట్టి మానవుడు కోరికలకు బానిస అయి, వాటిని తీర్చుకోవటానికి కర్మలు చేస్తాడు. కర్మలు, వస్తువులు ఇష్టమైనవి, అయిష్టమైనవి ఉంటాయి. దీనివల్ల మనసు కష్టాలు, సుఖాలు పొందుతుంది. అంటే రజోగుణం ద్వారానే మనస్సులో ఉద్రేకాలు, అలజడి కలుగుతాయి. ఈ ఉద్రేకాల వల్లనే లోపల కోరికలను గుర్తిస్తూ, వాటిని తృప్తిపరచటానికి బయట కర్మలు చేస్తూ, ఫలితంగా సుఖాలు, దుః ఖాలు పొందుతాడు. బాహ్యంగా జరిగే కర్మలన్నీ రజోగుణం వల్లనే సంభవమవుతున్నాయి. కామము, క్రోధము, లోభము, దంభము, అసూయ, అహంకారము, మదము, మచ్చరము ఇవన్నీ రజోగుణానికి లక్షణాలు. అశాంతితో నిండిన మనస్సులో ఇవి ఎక్కువగా పుట్టి, అసంఖ్యాకంగా పెరిగి మానసిక అలజడిని ఇంకా ఎక్కువగా పెంచుతాయి. ఇవి వ్యక్తిత్వాన్ని పూర్తిగా దెబ్బతీసి, మానవుడికి భయంకరమైన బంధనాలవుతాయి.

శరీరంలో ఒక గుణాన్ని అణచి మిగిలినవి వృద్ధి చెందుతాయి అని చెప్పాం. ఇప్పుడు సత్త్వ, తమో గుణాలను అణచి రజోగుణం

వృద్ధి అవుతుంది. శరీరంలో రజోగుణం వృద్ధి చెందినప్పుడు లోభము, ప్రవృత్తి అంటే ప్రాపంచిక విషయాల యందు ఆసక్తి, స్వార్థభావనతో కర్మలనాచరించటము, అశాంతి, విషయభోగాల యందు ఆసక్తి కలుగుతుంది. ఇటువంటి సమయంలో, అంటే రజోగుణం ఎక్కువగా ఉన్నప్పుడు మరణించినట్లైతే, అతడు కర్మసంగుడుగా జన్మిస్తాడు. కర్మలయందు, వాటి ఫలితముల యందు ఆసక్తి గలవాడు కర్మసంగుడు అనబడతాడు. రజోగుణ కర్మలు గనక చేసినట్లైతే దుఃఖం వస్తుంది. రజోగుణం గలవారు మరణించిన తరువాత కూడా మళ్ళీ మర్త్యలోకంలోనే జన్మిస్తారు. భోగలాలసుడైన వానిచేత, అహంకారిచేత చెయ్యబడే కర్మలు, ఎక్కువ శ్రమతో కూడిన కర్మలన్నీ రాజసకర్మలు అంటారు. కోరికలు గలవాడు, కర్మఫలాల కోసం ఆరాటపడేవాడు, ధనాదుల యందు అత్యాశ గలిగినవాడు, ఇతరులను కష్టపెట్టేవాడు, దుష్ప్రవర్తన గలవాడు, హర్షము, శోకము గలవాడు రాజసకర్త అనబడతాడు. ధర్మాధర్మాల, కార్యాకార్యాల, యథార్థతత్త్వము తెలియజాలని బుద్ధి రాజసబుద్ధి అనబడుతుంది. కర్మఫలేచ్ఛ గల మానవుడు మిక్కిలి ఆసక్తితో ధర్మార్థ కామ విషయాలను ధారణ చేసే శక్తినే రాజసధృతి అంటారు. అయితే ఇంద్రియాల వలన కలిగే విషయ సుఖాల వల్ల లభించే సుఖము అమృత తుల్యముగా అనిపించినప్పటికీ, అది విషతుల్యము అని గ్రహించాలి. అదే రాజస సుఖము. లోకంలో మనం సుఖము అని భావించే లౌకిక సుఖమే రాజస సుఖము. ఇది క్షణికమైనది. అశాశ్వతమైనది. ఈ సుఖానుభవం దుఃఖాలకే దారి తీస్తుంది. దేహాన్నే సమస్తంగా భావించి, దానియందే ఆసక్తిని కలిగించేది. రాజస సుఖం.

**తమోగుణం :** అర్థరహితము, నిర్హేతుకము, తుచ్ఛము అయిన

విపరీత జ్ఞానాన్నే తామసము అంటారు. తమస్సు అంటే చీకటి. తమోగుణం ఆవరించిన మానవుడు జ్ఞానాన్ని చూడలేడు. చైతన్యం వైపు నడవనూ లేడు. అంధకారం అనే అజ్ఞానంలో మునిగిపోతాడు. దీనివల్ల వస్తువుయొక్క నిజస్వరూపం మరుగున పడిపోయి, అది ఇంకొకటిగా కనిపిస్తుంది. ఇక్కడ రెండు రకాల దోషాలున్నాయి. 1. అగ్రాహ్యము 2. అన్యధాగ్రాహ్యాము. అగ్రాహ్యాము అంటే ఎదురుగా ఉన్న వస్తువేదో సరిగా తెలుసుకోలేక పోవటం 2. దాన్ని సరిగా విచారించలేక ఇంకొకటిగా భావన చెయ్యటం అన్యధా గ్రామ్యము ఉదాహరణకి చీకటిలో బండరాయిని చూసి దొంగవాడు అనుకోవటం దీనివల్ల అనేక బాధలు, అలజడి, అశాంతి, హైరాణ ఇవన్నీ కలుగుతాయి. అలాగే రజ్జ సర్పభ్రాంతి కూడా, తమోగుణం సత్యాన్ని మన కంటికి కనిపించనియ్యదు. దానికి ఆవరణగా అడ్డు పడుతుంది. ఆ సమయంలో రజోగుణం మనసులో అలజడి సృష్టిస్తుంది. ఈ రెండింటి ఫలితంగా అలజడితో నిండిన మనసు అనేక వస్తువులను ఊహిస్తుంది. నిజంగా చూస్తే అవేవీ లేవక్కడ కాని అంతా భావన భ్రాంతి. అలా అన్యధా గ్రహణం వల్ల, ఉన్న వస్తువుకు వేరుగా భ్రమ కలిగిస్తూ, మానవుణ్ణి జనన మరణాలతో కూడిన సంసార చక్రంలో బంధించి వేస్తుంది. ఆ సమయంలో వస్తువు యొక్క అసలు తత్త్వం తెలియదా? అంటే తెలియదు. ఆ సమయంలో వస్తువు అసలు తత్త్వం ఆవరణలో ఉండిపోతుంది. దీనికి కారణం తమోగుణం. ఈ తత్త్వాన్ని ఊహించటానికి ప్రయత్నిస్తుంది మనస్సు. ఆ పని సరిగా చెయ్యలేక అనేక రకాలయిన ఊహలు వలయాలు సృష్టిస్తుంది. రజస్తమోగుణాలు ఎక్కువగా ఉన్నప్పుడు సత్వం కనిపించదు. ఈ తమోగుణమే

జన్మపరంపరలకు కారణమవుతుంది. దీనివల్లనే నేను అంటే దేహము అనే భావన కలుగుతుంది. అధికంగా వాసనలను ప్రోగు చేసుకోవటం జరుగుతుంది. ఈ కోరికలు అనుభవించటానికి మరణానంతరము మానవుడు పునర్జన్మ ఎత్తుతాడు. ఈ తమోగుణం చాలా శక్తివంతమైనది. దీనివల్ల ఎంత పండితుడైనా, తెలివిగలవాడు విజ్ఞుడు అయినప్పటికీ, ఎదురుగా ఉన్న వస్తువు 'లేదు' అనే విషయంలో గల సత్యాన్ని గ్రహించగలిగే శక్తి ఉండికూడా గ్రహించలేకపోతున్నాడు. సత్యాన్ని గ్రహించగల సమర్థత గలవారు కూడా, కంటికి కనిపించినదే నిజమని భావిస్తున్నారు. మాయనే నిజమని నమ్ముతున్నారు. గొప్ప పండితులు, విద్వాంసులు, తీక్షణమైన బుద్ధి గలవారు కూడా దీనిముందు ఓడిపోతారు. నిస్సహాయులవుతారు. ఈ తమోగుణం మాయలో ఒక భాగమే. ఈ తమోగుణంవల్లనే చీము, నెత్తురు, మలమూత్రాలతో నిండిన స్త్రీ దేహం చాలా అందంగా కనిపిస్తుంది దీనివల్లనే సంసార బంధనాలన్నీ కలుగుతున్నాయి. ఈ ఆవరణశక్తికి లోబడినవాడు సత్యాన్ని సరిగా గ్రహించడు. నమ్మలేక పోతాడు. విపరీతంగా భావిస్తాడు. ఆవరణలో ఉన్నంత వరకు ఆ లక్షణాల నుంచి బయటపడలేడు. దీనికి తోడు విక్షేపశక్తి, ఆ వస్తువును అనేక రకాలుగా ఊహించి, రచించి చూపిస్తుంది. తమోగుణానికి నాలుగు రకాల భావన లుంటాయి.

**1. అభావన :** ఉన్నదాన్ని సరిగా నిర్ణయించలేకపోవటం.

**2. విపరీత భావన :** వస్తువు ఉన్నది ఉన్నట్లుగా కాక ఇంకొక రకంగా గొప్పగా భావించటం.

**3. అసంభావన :** పని జరుగుతుందో లేదో అనే అనుమానం

**4. విప్రతిపత్తి :** ఉన్నదా ? లేదా ? అవునా ? కాదా ? అనే అనుమానం.

ఇవన్నీ తమోగుణ లక్షణాలు. ఎప్పుడయితే మానవుడు తమోగుణ ప్రభావానికి లోనయినాడో, అప్పుడు రజోగుణం చిత్రవిచిత్రమైన ఊహలు చేస్తుంది. అజ్ఞానము, సోమరితనము, నిద్ర, అలసత్వము, మూఢత్వము, పొరపాటుపడటము ఇవన్నీ తమోగుణ లక్షణాలు. వీటివల్లనే విచక్షణా జ్ఞానము లేకుండా, తన సామర్థ్యము ఏమిటో తెలిసికోకుండా, కేవలము మూర్ఖత్వంతో పనులు చేస్తాడు. వాటినే తామస కర్మలు అంటారు. ఈ పనులు చేసేవాడికి కొన్ని లక్షణాలుంటాయి. అవి జితేంద్రియుడు కాకపోవటము, మంచి శిక్షణ, నేర్పు లేకపోవటము, అకారణంగా ఇతర పనులకు విఘాతం కలిగించటము, సదా చింతాక్రాంతుడు కావటము, సోమరితనము, పని చెయ్యటంలో ఉపేక్ష, కాలయాపన. ఈ లక్షణాలు గలవాడు తామస కర్త అనబడతాడు. ఇలాంటివాడు సరిగా ఆలోచించలేడు. అతని కళ్ళకు పొరలు కప్పబడి ంటాయి. దీంతో అధర్మాన్ని ధర్మంగాను, అన్యాయాన్ని న్యాయంగాను భావిస్తాడు. విషయాల యందు విపరీత భావన చేస్తాడు. అటువంటి బుద్ధినే తామసబుద్ధి అంటారు. నిద్ర, భయము, చింతా, శోకము, ఉన్మత్తత మొ॥ గుణాలను నిరంతరము కలిగి ఉండే ధృతినే తామసధృతి అంటారు. నిద్ర, సోమరితనము, మోహము. వీటిని తామససుఖము అంటారు. ప్రాణ సమయంలోను, ఆ తరువాత కూడా ఆత్మను మోహింపచేస్తుంది. ఈ తమోగుణ ప్రభావం వల్లనే మానవుడు జన్మపరంపరలలో చిక్కుకుంటున్నాడు.

తమోగుణంవల్ల వచ్చే సుఖంవల్లనే ఆత్మ మోహితమవుతున్నది.

ఈ రకంగా ప్రకృతి నుంచి ఉత్పన్నమైన త్రిగుణాలు అవినాశి అయిన జీవాత్మను బంధిస్తున్నాయి. ఈ మూడు గుణాలలోను సత్త్వగుణము నిర్మలమైనది. అయినప్పటి జ్ఞానాభిమానము వల్ల మానవుణ్ణి బంధిస్తుంది. రజోగుణము రాగాత్మకము అది జీవాత్మను కర్మలు, కర్మఫలముల యొక్క సాంగత్యముతో బంధిస్తుంది. తమోగుణము దేహాభిమానము గల వారందరినీ మోహింప చేస్తుంది. అది జీవాత్మని ప్రమాదము, సోమరితనము, నిద్రలతో బంధిస్తుంది. ప్రమాదము అంటే అంతఃకరణ, ఇంద్రియాలు చేసే వ్యర్థచేష్టలు. శాస్త్రంలో చెప్పిన కర్మలను అవహేళన చెయ్యటం. చేయవలసిన కర్మల మీద మనసు లగ్నం చెయ్యకుండా ఉండటమే సోమరితనము. ఇక నిద్ర మూడు రకాలుగా ఉంటుంది. 1. తంద్ర (అలుపు) 2. స్వప్నము 3. సుషుప్తి. వీటి ద్వారా తమోగుణము జీవాత్మను ముక్తి సాధన నుంచి దూరం చేసి, జన్మమృత్యు రూపమయిన సంసారంలో చిక్కుకునేటట్లు చేస్తుంది. ఈ విధంగా సత్త్వగుణము జీవుణ్ణి సుఖాలలో నిమగ్నుడు చేస్తుంది. రజోగుణం కర్మలయందు నిమగ్నుడుగా చేస్తుండి. తమోగుణం జ్ఞానాన్ని కప్పివేసి ప్రమాదము, సోమరితనము, నిద్రలలో ముంచివేస్తుంది. ప్రతి మానవదేహంలోనూ ఈ మూడు గుణాలు తప్పక ఉంటాయి. రజస్తమో గుణాలను అణచివేసి సత్త్వగుణం వృద్ధి చెందుతుంది. సత్త్వతమోగుణాలను అణచివేసి రజోగుణం వృద్ధి చెందుతుంది. సత్త్వ, రజోగుణాలను అణిచివేసి తమోగుణం వృద్ధి చెందుతుంది.

ఇంకా చెప్పాలంటే త్రిగుణాలు కుర్చీలాట ఆడుతుంటాయి. ఒకే

కుర్చీ, గుణాలు మూడు. కాబట్టి ఎప్పుడూ ఏదో ఒక గుణం మాత్రమే గెలుస్తుంది. వృద్ధి చెందుతుంది. మిగిలిన రెండు అణచివేయబడతాయి.

ఇక్కడ మనం గుర్తించాల్సిన విషయం ఏమంటే, త్రిగుణాలూ లోప భూఇష్టాలే, ఇందులో ఏదీ పనికి రాదు. ఏదీ ఉండరాదు. గుణాతీతుడు మాత్రమే మోక్షానికి అర్హుడు. కాబట్టి సాధకుడు త్రిగుణాలను త్యజించాలి. నిర్గుణ స్థితికి చేరాలి. అప్పుడే అతడికి మోక్షమార్గం లభిస్తుంది. వీటిలో ఏ గుణమూ ఆత్మకాదు.

# శారీరకోపనిషత్తు - 3

## అవస్థాత్రయము

అవస్థలు మూడు. అవే జాగ్రస్వప్న సుషుప్తులు. వీటినే 1.జాగ్రదావస్థ 2.స్వప్నావస్థ 3. సుషుప్తి అంటారు. పరమేశ్వర స్వరూపం ఈ అవస్థలు మూడింటికీ సాక్షీభూతము.

**1. జాగ్రదావస్థ :** ఇది జీవుడు మేలుకొని ఉన్న స్థితి. ఈ స్థితిని అనుభవించేది స్థూలదేహము. రక్తము, మాంసము, మలమూత్రాలు, మజ్జ, శుక్లము, నరాలు, ఎముకలు మొదలైన అసహ్యకరమైన పదార్థాలతో నిండిపైన అందంగా చర్మం కప్పబడి ఉంటుంది. అదే స్థూలదేహము. మానవుడు తాను చేసిన కర్మననుభవించటానికే ఈ దేహాన్ని ధరిస్తాడు. సుఖదుఃఖాలు, మానావమానాలు, అనుభవించేది ఈ దేహంతోనే. వర్ణాశ్రమ ధర్మాలు, వివిధ దశలు ఈ దేహానికే వర్తిస్తాయి. జీవుడు భోగాలు అనుభవించటానికి ఈ దేహమే ఆధారము. స్థూలశరీరం ఎప్పుడూ జాగ్రదావస్థలోనే అనుభవం పొందుతుంది. ఈ స్థూలశరీరానికి, జాగ్రదావస్థకు అభిమాని వైశ్వానరుడు.

జాగ్రదావస్థే ఇతని సంచార స్థానము. జగత్తంతా బ్రహ్మమయమే. వ్యష్టిగా విశ్వుడు. సమిష్టిగా విరాడ్రూపుడు.

మాండూక్యోపనిషత్తులో **సర్వంహ్యేతద్బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మ, సోయమాత్మా చతుష్పాత్** చరాచర జగత్తంతా బ్రహ్మమయమే. ఆత్మకూడా పరబ్రహ్మ స్వరూపమే, ఆత్మకు నాలుగు పాదాలున్నాయి.

**జాగరిత స్థానోబహిఃప్రజ్ఞః సప్తాంగ ఏకోనవింశతి ముఖః స్థూలభుగ్ వైశ్వానరోప్రథమపాదః**

విశ్వంలోని జీవుల అన్నింటి స్వరూపము అయినవాడు వైశ్వానరుడు, జాగ్రదాఆవస్థ ఇతని సంచార స్థానము. ఇతనికి సప్తాంగాలు, పందొమ్మిది ముఖాలు ఉంటాయి. సప్తాంగాలు :

1. స్వరము – శిరస్సు
2. సూర్యుడు – కన్ను
3. వాయువు – ప్రాణం
4. ఆకాశం – శరీరం
5. జలం – మూత్రస్థానం
6. భూమి – పాదాలు
7. ఆహవనీయాగ్ని – నోరు

ఇతని ముఖాలు పందొనిమిది. ముఖము అంటే – అనుభవించే సాధనం. జ్ఞానేంద్రియాలు – 5, కర్మేంద్రియాలు – 5, ప్రాణాలు – 5, అంతఃకరణ చతుష్టయము – 4 = 19. ఇవి ముఖాలు. ఈ ముఖాలతో గతంలో తాను చేసిన కర్మఫలాన్ని అనుభవిస్తూ ఉంటాడు. ఐదు రకాలయిన జీవనోపాధులు, ఐదు అవస్థలుగా చెప్పబడుతున్నాయి. విశ్వ అంటే – జాగరిదావస్థ. స్థూలరూపము, చైతన్యము గల జీవి. ఇటువంటి జీవుల సమిష్టి రూపమే వైశ్వానరుడు.

విశ్వరూపము అన్నప్పుడు – ఈ జగత్తుయొక్క స్వరూపము అని అర్థం. పరమేశ్వరుడు విశ్వరూపం చూపించాడు అంటే – చరాచర జగత్తంతా తనరూపమే. ఈ జగత్తంతా తనలోనే ఉన్నది. అనే విషయాన్ని మనకి తెలియజేశాడు అన్నమాట. నిరాకారుడు పరమేశ్వరుడు. అతని యొక్క ప్రతిరూపమే ఈ జగత్తు. జాగ్రదావస్థ అంటే సర్వేంద్రియ గోచరమైనది. ప్రభోదాత్మకమైన సర్వేంద్రియ జ్ఞానముగల విశ్వుడు అనే జీవుని అవస్థనే జాగరము అంటారు. జాగ్రదావస్థలో స్థూలశరీరాభిమాని అయిన పరమేశ్వరుడు విశ్వుని రూపంలో ఉంటాడు. గృహస్తుకు గృహంలాగా జీవికి దేహం ఆధారమై ఉన్నది. జగత్తులో ఇటువంటి దేహానికి ప్రతినిధి వైశ్వానరుడు. జాగ్రదావస్థ అతని సంచారస్థానము. దీనిని అభిమానించే పురుషుణ్ణే – విశ్వుడు, చిదాభాసుడు, వ్యావహారికుడు అంటారు.

సుషుప్తిలో గాఢనిద్ర పోయాడు. ఆ తరువాత తన కర్మను బట్టి స్వప్నదశగాని, జాగ్రదావస్థ గాని పొందుతాడు. జీవుడు నేత్రంలో ఉన్న దశ జాగ్రదవస్థ. కంఠస్థానంలో ఉంటే స్వప్నావస్థ. హృదయ కమలంలో ఉంటే సుషుప్తి. జాగ్రదావస్థలో నేత్రంలో ఉంటాడు. ఇక్కడ నేత్రము అంటే – ఆపాదమస్తకము అని అర్థం. కాబట్టి చిద్రూపియైన జీవుడు జాగ్రదావస్థలో శరీరమంతా వ్యాపించి మేల్కొని ఉన్నాడు. బాగా కాల్చబడిన ఇనుపముక్క అంతటా అగ్ని వ్యాపించినట్లుగా, జీవుడు శరీరంతో అభేదభావాన్ని పొంది నేను మనిషిని అని నిశ్చయించుకుని ఉంటాడు. ఇలా దేహంతో తాదాత్మ్యం పొందిన జీవుడు ఉదాసీనుడు. సుఖి, దుఃఖి అవుతున్నాడు. ఇక్కడ సుఖదుఃఖాలు కర్మలవల్ల కలిగేవి. ఉదాసీనత స్వాభావికమైనది. బాహ్యాభోగము, మనోరాజ్యము అనే కారణాలవల్ల సుఖదుఃఖాలు లభిస్తాయి. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, అంతఃకరణ చతుష్టయములతో కూడి

జీవుడు సుఖదుఃఖాల ననుభవించే స్థితి. ఇది.

**స్వప్నావస్థ :** నిద్రలో కలలుగనే స్థితి. ఈ స్థితిలో జీవుడు కంఠస్థానంలో ఉంటాడు. జాగ్రదావస్థలో పురుషుని అనుభవాలే స్వప్నావస్థలో సాక్షాత్కరిస్తాయి. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, అంతః కరణ చతుష్టయముతో కంఠస్థానానికి వచ్చినప్పుడు జీవుడు కనేది స్వప్నము. జాగ్రదావస్థలో అనుభవించిన విషయాలు జ్ఞాపకానికి రావటమే స్వప్నము. ఈ స్థితిలో మనసు చిత్రవిచిత్రాలైన కల్పనలు చేస్తుంది. రాజులు, రాజ్యాలు, రథాలు, గుర్రాలు, ఏనుగులు, సైనికులు, యుద్ధాలు, జయాపజయాలు. వీటన్నింటినీ ఊహించుకుంటుంది. తానే రాజు అయినట్లు భావిస్తుంది. మహదానందాన్ని అనుభవిస్తుంది. ఒక్కొక్కసారి కష్టాలు కలిగినట్లుగా భావించి దుఃఖిస్తుంది. భయపడుతుంది. ఏడుస్తుంది. ఇలా సుఖదుఃఖాలన్నీ అనుభవిస్తుంది. ఈ అవస్థకు అభిమాని – తైజసుడు, స్వప్నకల్పితుడు, ప్రాతిభాసికుడు అనబడతాడు. జాగ్రస్వప్నాలు రెండు స్థితులందు రాగము, ద్వేషము, కామక్రోధాలు, దర్పము, మాత్సర్యము, అహంకారము, ఈర్ష్య, అసూయ, సుఖము, దుఃఖము కలుగుతాయి.

జాగ్రదావస్థలో అనుభవాలు బీజరూపంలో ఉండి స్వప్నకాలంలో మనకు కనిపిస్తాయి. ఇవన్నీ ఈ జన్మలోని అనుభవాలే కానక్కరలేదు. గతజన్మలవి కూడా కావచ్చు. ఈ దశలో ఇంద్రియాలన్నీ విశ్రాంతి తీసుకుంటూ ఉంటాయి. మనస్సు మేల్కొని ఉంటుంది. మనస్సు ఇంద్రియ ధర్మాలు నిర్వర్తిస్తూ ఉంటుంది. జాగ్రదావస్థలో ఇంద్రియ జ్ఞానం స్థిరంగా ఉంటుంది. స్వప్నావస్థలో స్థిరంగా ఉండదు. మనసే ఇంద్రియాల పనులన్నీ చేస్తుంది. స్వప్నమనేది కేవలము మానసిక సంబంధము. నిద్రలో విషయాలు తెలుస్తాయి. మెలకువ రాగానే అన్నీ

మాయమవుతాయి. ఈ రకంగా సూక్ష్మశరీరంతో మానవుడు ఈ అనుభూతులు పొందుతాడు. స్వప్నము సూక్ష్మదేహము యొక్క వ్యవహారము. ఈ స్థితిలో వ్యష్టిదేహాభిమాని తైజసుడు. సమిష్టిగా అతడే హిరణ్యగర్భుడు.

**స్వప్నస్థానోఽ తః ప్రజ్ఞః సప్తాంగ ఏకోనవింశతి ముఖః**

**ప్రవివిక్తభుక్ తైజసో ద్వితీయపాదః ॥**

ఆత్మయొక్క రెండవ పాదము తైజసుడు. అదే మానసిక స్థితి. ఈ స్థితికి హిరణ్యగర్భుడు అని పేరు. ఇతడు అంతర్ముఖమైన చేతన గలవాడు. స్వప్నంలో జరిగే విషయాలు మాత్రమే గ్రహించగలడు. వైశ్వానరుడికి లాగానే ఇతనికి కూడా సప్తాంగములు, పందొనిమిది ముఖాలు ఉన్నాయి.

**3. సుషుప్తి :** అంతఃకరణలో చిత్తాహంకారాలను వదలి, మనోబుద్ధులతో జీవుడు హృదయ స్థానానికి వచ్చినప్పుడు, దాన్ని సుషుప్తి అంటారు. ఇంద్రియాలన్నీ అవిద్యలో కలసిపోవటమే సుషుప్తి. ఇంద్రియాలన్నీ వ్యాపార శూన్యమైనప్పుడు నిద్ర పోతున్నాడు అంటారు. ఇదే సుషుప్తి. దీని అభిమాని – ప్రాజ్ఞుడు, అవిచ్ఛిన్నుడు, పారమార్థికుడు అనబడతాడు. ఇంద్రియ వ్యాపారము నశించిన స్థితే సుషుప్తి. శివసూత్రాలలో దీన్నే మాయ, అజ్ఞానము అన్నారు. ఇక్కడ బాహ్యవస్తుజ్ఞానము ఏ మాత్రము ఉండదు. నేను హాయిగా నిద్ర పోయాను. నాకేం తెలియదు అంటాడు. ఇలా అనటంవల్ల అవిద్యా వృత్తులు మూడు ప్రకటింపబడుతున్నాయి. –1.అజ్ఞానము 2. అహంభావము 3. సుఖము. ఈ మూడు అవస్థలు కలిసినదే సుషుప్తి. అదే నిర్వికార స్వరూపస్థితి. దీన్ని **"సంప్రసాదావస్థ"** అని కూడా

అంటారు. మనస్సు బుద్ధి కూడా హృదయంలో లీనమయ్యే స్థితి. ఈ స్థితిలో ఇంద్రియాలు, బుద్ధి ముఖ్య ప్రాణంలో కలిసిపోతాయి. ఈ రకంగా మనసు, బుద్ధి కూడా లయమయినప్పటికీ, మెలకువ రాగానే తాను సుఖంగా నిద్రించాను అని తెలుస్తోంది. అంటే జ్ఞానము మాత్రమున్నది. ఈ స్థితిలో జీవుడు వ్యష్టిగా ప్రాజ్ఞుడు సమిష్టిగా ఈశ్వరుడు. నిద్రించినప్పుడు ఏ రకమైన కోరికలు, కలలు కూడా లేని స్థితి. ప్రాజ్ఞుడు, సుషుప్తిలో సంచారం చేస్తాడు. ఇక్కడ అతని అనుభవాలన్నీ ఏకమై పోతాయి. చేతనాశక్తి లేదా గ్రహణశక్తి అస్పష్టంగా నిలచిపోతుంది. అతను అసలు చేతనుడా కాదా? అనే అనుమానం కూడా వస్తుంది.

సుషుప్తిలో ప్రాజ్ఞుడికి బ్రహ్మభావన కలుగుతుంది. ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు సుషుప్తిని గురించి వివరస్తూ "కుమారా! గాఢనిద్రలో ఉన్నప్పుడు ఇతడు సుషుప్తిలో ఉన్నాడు అంటారు. ఆ స్థితిలో జీవుడు పరమసత్తను పొందుతాడు. అంటే తన నిజస్వరూపాన్ని పొందుతాడు. తన ఆత్మను తాను పొందుతాడు. కాబట్టి అతన్ని గురించి చెప్పేటప్పుడు నిద్రిస్తున్నాడు అంటారు.

అద్దంలో చూసినప్పుడు మన ప్రతిబింబమే మనకు కనిపిస్తుంది. కాని అద్దం తియ్యగానే మాయమై పోతుంది. మన నిజరూపం మాత్రమే మిగులుతుంది. అదే విధంగా సుషుప్త్యావస్థలో మనస్సు, ఇంద్రియాలు పనిచెయ్యటం మానేస్తాయి. అప్పుడు మిగిలేది ఆత్మ మాత్రమే. ఆ ఆత్మ నిజరూపంలో మిగులుతుంది. ప్రతిబింబం లాంటి జీవభావం పోయి ఆత్మభావం మిగులుతుంది. ఆ స్థితిలో ఆత్మను **'స్వపితి'** అంటారు. తన ఆత్మ తనలోనే ఉన్నదని, నిద్రిస్తున్నదని అంటారు.

ఇంద్రియాలన్నీ అలసట చెంది ఒక్కొక్కటే మనసులో లీనమై పోతాయి. మనసు ప్రాణంలో లీనమై పోతుంది. అంటే సుషుప్తిలో ప్రాణం ఒక్కటే మేల్కొని ఉంటుంది. ఆ ప్రాణమే ఇంద్రియాల యొక్క మనస్సు యొక్క అలసటను తీరుస్తుంది. మనసుకు బంధన స్థానమైన ప్రాణమే పరదేవత" అంటాడు. అలాగే–బృహదారణ్యకోపనిషత్తులో కాశీ రాజు అజాతశత్రువు. బాలాకి అనే బ్రాహ్మణ బాలుడికి సుషుప్తి గురించి వివరిస్తాడు.

సుషుప్తిలో జీవికి బ్రహ్మభావన కలుగుతుంది. అప్పుడు అతణ్ణి ప్రాజ్ఞుడు అంటారు. కాని జీవుడు అవిద్యతో కలిసి ఉంటాడు అందుచేత అతడు పరమాత్మ కాదు. అందుకని సుషుప్తి పొందిన జీవుణ్ణి కారణ శరీరమని, తురీయావస్థ పొందిన జీవుణ్ణి మహాకారణ శరీరము అంటారు. తురీయం పైన ఉండేది తురీయాతీతము. ఈ స్థితిలో జీవి శివతుల్యుడవుతాడు. ఇక్కడ పూర్ణజీవత్వము, పూర్ణశివత్వాలు వేరుగా లేవు.

జీవుడు నిద్రిస్తుండగా ఇంద్రియాల విషయాలన్నింటినీ అంటే వాక్కు మొదలైన ప్రాణాల విజ్ఞానాన్ని పూర్తిగా గ్రహించి హృదయాకాశంలో నిద్రిస్తున్నాడు. హృదయాకాశము పరమాత్మ ఉండే చోటు. నిద్రావస్థలో ఉన్నప్పుడు పురుషుడు శరీరము, ఇంద్రియాలను తనలో లీనం చేసుకుంటాడు. ప్రాణాలన్నింటినీ తనలోకి ఆకర్షించుకుంటాడు. వాక్కు, చక్షువు, శ్రోత్రము మొ॥ ఇంద్రియాలు మనస్సుతో సహా లోపలకు ఆకర్షింపబడతాయి. ఆ స్థితిలో క్రియ అనేది ఉండదు. క్రియాఫలం అంతకన్నా ఉండదు. కాబట్టి ఆత్మ తన నిజస్థితిలో ఉంటుంది.

ఆత్మ స్వప్నావస్థలో ఉన్నప్పుడు దాని కర్మఫలాలు

ప్రారంభమవుతాయి. స్వప్నావస్థలో ఆత్మ మహారాజులా ఉంటుంది. గొప్ప బ్రాహ్మణునిలా ఉంటుంది. దేవతల్లాగా ఉచ్ఛస్థితి, అసురులలాగా నీచస్థితి పొందుతుంది. రాజుగారు తన దేశంలో స్వేచ్ఛగా తిరిగినట్లు, ఆత్మ స్వప్నంలో ప్రాణాన్ని, ఇంద్రియాలను గ్రహించి, తన దేహంలో యధేచ్ఛగా తిరుగుతుంది. అదే సుషుప్తిలో ఆనందంతో కూడిన స్థితిని పొందుతుంది.

సుషుప్తిలో ద్వైతం ఉండదు. అది అద్వైత స్వరూపం. సుషుప్తి కాలంలో సుషుప్తిని గుర్తించే ఇంద్రియాలేవీ ఉండవు. అవన్నీ తమకు కారణమైన అజ్ఞాంలో లీనమై పోతాయి. ఇతరమైన దృష్టాంతాలు ఏమీ ఉండవు. ఇలా జ్ఞానసాధనాలేవీ లేనప్పుడు కూడా ప్రకాశితమవుతున్నది కాబట్టే సుషుప్తి స్వయంప్రకాశం కలది అంటున్నాం. సుషుప్తిలో సుఖానికి విరోధియైన దుఃఖం ఉండటం లేదు. కాబట్టి మిగిలేది సుఖమే. దుఃఖము లేక అంధత్వము లేనివాడవుతున్నాడు. అంటే దేహాభిమానం కారణంగా కలిగిన అంధత్వం లాంటి దోషాలేవీ సుషుప్తిలో ఉండవు. సుషుప్తిలో గాయం తగిలినవాడు బాధను అనుభవించటం లేదు. రోగిష్టి వాడు కూడా రోగం లేనివాడు గానే ఉంటున్నాడు. ఈ రకంగా సుషుప్తిలో దుఃఖం ఉండదు అని తెలుస్తోంది. సుఖదుఃఖాలు అనుభవ ప్రమాణంచేత తెలియబడతాయి. సుషుప్తిలో కలిగే సుఖం శయ్య మొ॥ సాధనాల వల్ల వచ్చింది కాదు. నిద్రపట్టక ముందు వచ్చేది విషయజన్యమవుతుంది. కాని నిద్రపట్టిన తరువాత వచ్చే సుఖం అలాంటిది కాదు. జగద్వ్యాపారాలతో అలసిపోయిన ఆత్మ మృదువైన పాన్పుమీద విశ్రమించి నప్పుడు, అలసట, దుఃఖాలను పారద్రోలి స్వస్థచిత్తంతో శయ్యాది సుఖాల వల్ల వచ్చే సుఖం అనుభవిస్తోంది. అంతర్ముఖమైన బుద్ధివృత్తిలో తన

ఆనందమే ప్రతిబింబ మవుతుంది. అంటే – ఆ విధంగా అంతర్ముఖమైన బుద్ధి వృత్తిలో అద్దంలో ముఖం లాగా స్వస్వరూపభూతమైన ఆనందం ప్రతిబింబిస్తుంది. ఇదే విషయానందము. సుషుప్తిలో సమస్త ప్రపంచము ప్రకృతిలో లీనమైపోతుంది. అప్పుడు జీవుడు తమస్సుచే ఆచరించబడినవాడై సుఖాన్ని పొందుతాడు అని చెబుతోంది అధర్వవేదంలోని కైవల్యోపనిషత్తు. కాబట్టి సుషుప్తిలో సుఖము, అజ్ఞానము రెండూ ఉంటాయి.

## శారీరకోపనిషత్తు - 4

## శరీరత్రయము

మానవ శరీరము మూడు రకాలుగా చెప్పబడుతుంది. 1. స్థూలశరీరము 2. సూక్ష్మశరీరము 3. కారణ శరీరము

**1. స్థూలశరీరము :**

**పంచీకృత మహాభూత సంభవం కర్మ సంచితమ్ ।**
**శరీరం సుఖదుఃఖానాం భోగాయతనముచ్యతే ॥**

పంచీకరణ చేయబడిన పంచ మహాభూతాలవల్ల ఏర్పడి, ఆగామి సంచిత, ప్రారబ్ధములు గలిగిన స్థూలశరీరమే సుఖదుఃఖానుభవాలకు ఉనికిపట్టు. దీనిని పొందిన బ్రహ్మవేత్త 'ఓత' అనబడతాడు.

**త్వక్ మాంసరుధిరస్నాయు । మేదోమజ్జాస్థి సంకులమ్ ।**
**పూర్ణం మూత్రపురీషాభ్యాం । స్థూలం నింద్యమిదం వపుః॥**
**స్థూలస్య సంభవ జరామరణాని ధర్మాః ।**
**స్థౌల్యాదయో బహువిధాః శిశుతాద్యవస్థాః ॥**

చర్మము, రక్తము, మాంసము, నరాలు, మేధ, మజ్జ, ఎముకలు మొదలైన వాటితోను, మలమూత్రాలతోను కూడిన దేహాన్ని స్థూలదేహము అంటారు. ఇది అసహ్యాకరమైనది. జుగుప్సాకరమైనది. పూర్వకర్మల ననుసరించి, పంచభూతాల కయిక చేత ఈ దేహము ఏర్పడింది. జీవిభోగాలు అనుభవించటానికి ఈ దేహమే ఆధారము. స్థూలశరీరం జాగ్రదావస్థలోనే అనుభవాలు పొందుతుంది. మిగిలిన అవస్థలు ఏవీ దానికి తెలియవు. గృహస్తుకు గృహంలాగా జీవాత్మకు ఈ శరీరం ఆవాసమై ఉన్నది. జీవి తాను చేసిన పాపపుణ్యాలన్నీ ఈ శరీరం ద్వారానే అనుభవిస్తాడు జరామరణాలు, రోగాలు, బాల్యము, యవ్వనము, కౌమారము, వృద్ధాప్యము మొదలైన దశలు, చతురాశ్రమాలు, ధర్మాలు అన్నీ ఈ శరీరానికే చెందుతాయి. అలాగే మానావమానాలు కూడా ఈ శరీరానికి సంబంధించినవే. ఇదీ సంగ్రహంగా స్థూలశరీరం అంటే.

మానవుడు జీవించి ఉండగా కర్మ చేస్తాడు. ఆ కర్మ మంచి చెడు అని రెండు రకాలుగా ఉంటుంది. ఈ కర్మ ఫలితమే పాపపుణ్యాలు, స్వర్గనరకాలు. జీవి తాను చేసిన కర్మల ఫలితంగా పుణ్యపాప లోకాలనుభవించి, కర్మశేషాన్ని అనుభవించటానికి ఈ భూమిమీద అవతరిస్తుంది. అది ఎలా జరుగుతుందంటే, ఆ జీవి సూక్ష్మరూపం ధరించి మేఘాల నాశ్రయిస్తుంది. మేఘాలు వర్షంగా కురుస్తాయి. అప్పుడు ఆ జీవి వర్షపు బిందువుల రూపంలో భూమిని చేరుతుంది. అలా చేరి భూమిమీద ఉన్న ఏదో ఒక విత్తనాన్ని ఆశ్రయిస్తుంది. ఆ విత్తనం మొలకెత్తుతుంది. జీవి చేసిన కర్మని బట్టే ఆ విత్తనం కూడా లభిస్తుంది. మొలక పెరిగి చెట్టు, లేదా వృక్షము మొక్క, గడ్డిగా అవుతుంది. దాన్ని ఇతర జీవులు ఆహారంగా

తీసుకుంటాయి. ఇక్కడే జీవి చేసిన కర్మఫలం కనిపిస్తుంది. జీవి సత్కర్మలు చేస్తే, ధాన్యపు గింజలయందు ప్రవేశిస్తుంది. ఈ గింజల యందు అనేక జీవులు ప్రవేశిస్తాయి. కొన్ని కాండముగా, ఆకులుగా, ధాన్యంగా రూపాంతరం చెందుతాయి. దీని కాండము, ఆకులు, ఆవులు, గేదెలు, మేకలు వంటివి తింటాయి. పైన వచ్చే ధాన్యము మానవుడు ఆహారంగా తీసుకుంటాడు. ఇప్పుడు ఆహార రూపంలో మానవుడి శరీరంలో ప్రవేశించి, శుక్లరూపమై, స్త్రీ గర్భంలో ప్రవేశించి, పిండమై మళ్ళీ ఈ లోకంలో జన్మించటం జరుగుతుంది. ఇదంతా జీవి తాను చేసిన కర్మమీదనే పూర్తిగా ఆధారపడి జరుగుతుంది. ఒకే రూపంలో ఉన్న ఆహారం ఒకే రకమైన వారు తినాలనే నియమం ఏదీలేదు. ఉదా : జీవి ధాన్యపు గింజలలో ప్రవేశించింది. అంత మాత్రాన ఆ ధాన్యాన్ని మానవుడే తినాలనే నియమం ఏదీ లేదు. పశువులు కూడా తినచ్చు. నేలలో పెరిగే వేరు శనగలాంటి పంటలు పందులు తినేస్తుంటాయి. చేలలో పశువులు పడి మేస్తుంటాయి. ఎండబెట్టిన ధాన్యం పక్షులు తినిపోతాయి. అంతేకాదు. ఒకవేళ మానవుడే ఆహారంగా తీసుకున్నా, అది కూడా రకరకాలుగానే ఉంటుంది. బస్తాలోని బియ్యం సాధువర్తనుడు, దుర్మార్గుడు కూడా తింటారు. కసాయివాడికి, హంతకుడికి కూడా అదే ఆహారం. కాబట్టి జీవి తన కర్మని అనుసరించే పురుషుని శరీరంలో ప్రవేశిస్తుంది. అది సత్కర్మ అయితే పురుషుడు సాధువర్తనుడవుతాడు. ఈ జీవి ఏ రకమైన జన్మ ఎత్తాలనేది ముందుగానే నిర్ణయించబడి ఉంటుంది. ఆ కారణం చేత దానికి సరిపోయిన శరీరంలోనే ప్రవేశిస్తుంది. తద్వారా ఆ రూపాన్నే పొందుతుంది. అందుకే మంచి కర్మలు చేసినవారు మంచి యోనులందు జన్మిస్తారు. పాపపు కర్మలు చేసిన వారు నీచయోనులందు అంటే

పశువులు, పక్షులుగా జన్మిస్తారు. దుర్మార్గమైన పనులు చేసినవారు పాములు, తేళ్ళు, మండ్రగబ్బలుగా జన్మిస్తారు. నీచులైన వారు క్రిమికీటకాలుగా జన్మించి పుడుతూ చస్తూ ఉంటారు.

ఈ రకంగా భూమి మీదకి వచ్చినప్పుడు జీవి ధరించినదే స్థూలశరీరము. గతంలో చెప్పినట్లుగా ఈ దేహము నవధాతుమయమై ఉన్నది. అసలు ఈ దేహము ఎలా ఆవిర్భవిస్తుంది. అంటే పంచభూతాలు పంచీకృతం చెందటంవల్ల ఈ దేహం ఏర్పడుతుంది. అందుకే పాంచభౌతికమైనది ఈ దేహము అంటారు.

1. కపాలము, చర్మము, నరాలు
   ఎముకలు, మాంసము, గోళ్ళు – పృథివి యొక్క అంశలు
2. రక్తము, మూత్రము, లాలాజలము
   స్వేదము – జలము యొక్క అంశలు
3. ఆకలి, దప్పిక, ఉష్ణము, మోహము,
   మైధునము – అగ్నియొక్క అంశలు
4. నడచుట, దాటుట, శ్వాసించుట – వాయువు యొక్క అంశలు
5. కామక్రోధాలు – ఆకాశము యొక్క అంశలు

ఈ దేహము తల్లిదండ్రులు తీసుకున్న ఆహారం వల్లనే పుట్టి, ఆ అన్నంతోనే వృద్ధి చెందుతుంది. అన్నం లేకపోతే ఇది నశించిపోతుంది. ఇది క్షణికమైనది. జననానికి ముందు లేదు. మరణం తరువాత ఉండదు. అస్థిరమైనది. త్వగాది ధాతువులతోను, షడ్వికారాలతోను నిండి ఉంటుంది. త్వగాది ధాతువులు అంటే చర్మము, రక్తము, మాంసము, ఎముకలు, మేధ, మజ్జ, శుక్లము, వీర్యము ప్రాణాలు. ఇవి మొత్తం తొమ్మిది. వీటినే నవధాతువులు అంటారు. అలాగే షడ్వికారాలు అంటే ఉండటము, పుట్టటము, పెరగటము,

రూపుమారటము, క్షీణించటము, నశించటము, పంచభూతాలు, తన్మాత్రలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు అనే వివిధ తత్త్వాలతో కూడి ఉంటుంది. ప్రత్యక్షంగా కళ్ళకి కనిపిస్తుంది. సుఖదుఃఖాలను జీవి ఈ శరీరంతోనే అనుభవిస్తాడు. వర్ణాశ్రమ ధర్మాలు, బాల్య యవ్వనాది దశలు, మానావమానాలు అన్నీ ఈ శరీరానికే చెందుతాయి.

పరబ్రహ్మ తత్త్వాన్ని తెలుసుకోవటానికి ముఖ్యమైన పరికరమే ఈ శరీరము. అవిద్య అనేది అనాదిగా వస్తున్న బంధం. కాబట్టి దాన్నుంచి బయట పడటానికి ప్రయత్నించాలి. అలా కాకుండా ఈ శరీరాన్ని సుఖపెట్టాలని ప్రయత్నించేవాడు తన నాశనాన్ని తానే తెచ్చుకుంటాడు. శరీర పోషణలో కాలం గడుపుతూ ఆత్మసాక్షాత్కారం పొందాలనుకునే వాడు నదిలో మొసలిని బల్లకట్టుగా భావించి, దానిమీద నదిని దాటాలనుకునే వాడి లాంటివాడే అవుతాడు. ఈ స్థూలదేహం ఆత్మకాదు. బహునింద్యమైనది. రక్తమాంసాలు, మలమూత్రాలతో కూడినది. పూర్వకర్మల ఫలితానన్ననుసరించి భూతపంచకం ద్వారా ఈ దేహం ఏర్పడింది. సుఖ దుఃఖానుభవాలకు కేంద్రం ఈ శరీరం. జాగ్రదావస్థలో ఇది వస్తువులను గుర్తిస్తుంది. వ్యక్తిగత అహంకారం ఈ శరీరంతో తాదాత్మ్యత చెంది, సుగంధ ద్రవ్యాలు, స్త్రీలు మొదలయిన భోగానుభవాలు పొందుతుంది. ఇంద్రియాల ద్వారా అనుభవించబడే ఈ భోగాలు అనంతములు. గృహస్తుకు గృహంలాగా జీవాత్మకు ఇది ఆవాసము. అనుభవాలు పొందే నిలయము. అటువంటి స్థూలశరీరం ఆత్మకాదు. స్థూలశరీరంలో వాతము, పిత్తము, శ్లేష్మము, అనే త్రిదోషాల వల్ల కలిగే అసంఖ్యాకమైన రోగాలు, దుర్గంధము, కురూపత్వము, జ్వరం, వికలాంగత్వము,

చోరబాధలు ఉంటాయి. సామాన్య మానవుడు ఇవన్నీ అనుభవిస్తూనే ఉంటాడు. ఇటువంటి స్థూలదేహం ఆత్మకాదు.

**2. సూక్ష్మశరీరము :**

**పంచప్రాణ మనోబుద్ధి దశేంద్రియ సమన్వితమ్ ।**
**అపంచీకృత భూతోత్థం సూక్ష్మాంగం భోగసాధనమ్ ॥**

పంచప్రాణాలు, మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు ఈ పదిహేడంటితోనూ కూడినది. అపంచీకృత మహాభూతాలవల్ల ఏర్పడ్డది సూక్ష్మశరీరము. సుఖదుఃఖా లనుభవించేది దీనితోనే. దీన్ని పొందిన ఈశ్వరుడే – హిరణ్యగర్భుడు, బ్రహ్మవేత్త – అనుజ్ఞాత అనబడతాడు.

1. జ్ఞానేంద్రియాలు 2. కర్మేంద్రియాలు 3. పంచప్రాణాలు 4. పంచభూతాలు 5. బుద్ధి 6. అవిద్య 7. కామం 8. కర్మ. వీటిని అష్టపురములు అంటారు. వీటితో కూడినదే సూక్ష్మశరీరం. దీన్నే లింగశరీరము అంటారు. సూక్ష్మభూతాలతో ఉత్పత్తి అయిన ఈ శరీరం పూర్తిగా వాసనలతో నిండి ఉంటుంది. జీవుడికి గతంలో తాను చేసిన కర్మలకు అనుగుణమైన అనుభవాలు కలగటానికి ఈ వాసనలే కారణం. తనను తాను తెలుసుకోలేకపోవటమే అజ్ఞానం. ఈ అజ్ఞానం కారణంగానే ఇది అనాదిగా ఆత్మను అచ్ఛాదిస్తోంది.

ఇంతవరకూ వ్యక్తం కాకుండా ఉన్నవి అన్నీ ఇప్పుడు వ్యక్తమవుతాయి. వ్యక్తిలో గుప్తంగా ఉన్న ప్రేరణలన్నీ రహస్యంగా ఇందులో ఉన్నాయి. ఈ సూక్ష్మశరీరం పంచీకరణ చెందని పంచభూతాలతో నిర్మించబడి ఉన్నది. వాసనలతో కూడిన ఈ సూక్ష్మశరీరమే ఆత్మను మరుగుపరచి, వ్యక్తిగత అహంకారాన్ని సృష్టిస్తుంది. గతంలో వ్యక్తిత్వాన్ని ప్రభావితం చేసిన ఆలోచనలు,

కర్మలయొక్క జాడలే ఈ వాసనలు. ఈ వాసనలే ఆలోచనలను ప్రేరేపిస్తాయి. దీనివల్లనే నింతరము మనం కర్మలు చేస్తుంటాము. గతంలో చేసిన పాపపుణ్యాల ఫలితంగానే సుఖదుఃఖాలు కలుగుతాయి. జాగ్రదావస్థలో సూక్ష్మశరీరం వ్యక్తం కాదు. స్వప్నావస్థలో ఇది పూర్తిగా వ్యక్తమవుతుంది. జాగ్రదావస్థలో గడించిన అనుభవాలు, వాసనలకు అనుగుణంగా, బుద్ధి స్వప్నావస్థలో అనుభవాలు తనంత తానుగా పొందుతుంది. ఈ స్థితిలో బుద్ధి మాత్రమే ఆవరణగా ఆత్మ స్వయంగా తనలో తాను ప్రకాశిస్తూ ఉంటుంది. బుద్ధి చేసే ఏ కర్మలవల్లా ప్రభావితం కాకుండా నిశ్చలంగా, సర్వానికీ సాక్షిగా ఉంటుంది. ఉపాధులు చేసే ఏ పనులకు ఇది వికారం పొందదు. కేవలం సూక్ష్మశరీరం ద్వారా మాత్రమే వ్యక్తమయ్యే ఆత్మచైతన్యస్థితే స్వప్నము. జాగ్రదావస్థలో ఆత్మచైతన్యం స్థూల సూక్ష్మ శరీరాలు రెండింటి ద్వారా వ్యక్తమవుతుంది. కాని స్వప్నావస్థలో కేవలం సూక్ష్మశరీరం ద్వారా మాత్రమే వ్యక్తమవుతుంది. వడ్రంగి వాడికి బాడిసలాగా ఆత్మకు ఈ సూక్ష్మశరీరం కార్యకలాపాల నిర్వహణలో ఉపయోగిస్తుంది.

సూక్ష్మశరీరము ఏ రకంగా వచ్చిందంటే, పంచభూతాల రజోగుణాన్ని నాలుగు భాగాలుగా చేసి అందులోని మూడు భాగాల నుంచి ప్రాణాలను సృష్టించటం జరిగింది. ప్రాణాలు ఐదు రకాలు.

1. ప్రాణ 2. అపాన 3. వ్యాన 4. ఉదాన 5. సమానములు.

**1. ప్రాణవాయువు :** ఇది హృదయంలో ఉంటుంది. దీనికి అధిష్ఠాన దేవత 'విశిష్టకుడు' ఇది శ్వాసాదులను ఇడ పింగళ నాడుల ద్వారా బయటకు పంపుతుంది.

**2. అపాన వాయువు :** ఇది గుదస్థానంలో ఉంటుంది. దీనికి

అధిష్ఠాన దేవత 'విశ్వకర్త'. ఇది అథోముఖంగా సంచరిస్తూ శుక్లము, మలము, మూత్రము, రక్తములను కుహూనాడి, సినీవాలీనాడి ద్వారా బయటకు పంపుతుంది. దీని కారణంగానే మలమూత్రాలు అథోముఖంగా విసర్జించబడతాయి.

**3. వ్యానవాయువు :** ఇది నాభి స్థానంలో ఉంటుంది. అధిష్ఠాన దేవత 'విశ్వయోని' ఇది బయటి శీతోష్ణాలను లోపలకు, లోపల శీతోష్ణాలను బయటకు పంపుతూ ఉంటుంది. తీసుకున్న ఆహారాన్ని శరీరమంతా వ్యాపింపచేస్తుంది.

**4. ఉదాన వాయువు :** ఇది కంఠస్థానంలో ఉంటుంది. దీనిని మాటల రూపంలో వెల్లడిస్తుంది. సుషుప్తిలో ఇంద్రియాలను స్వాధీనం చేసుకుని, తనకు కారణమైన అజ్ఞానంలో మునిగిపోతుంది. జాగ్రదావస్థలో ఇంద్రియాలను వాటి వాటి స్థానాలలో నిలబెడుతుంది. ఈ వాయువు సుషుమ్నగుండా సహస్రారం దాకా సంచరిస్తుంది.

**5. సమాన వాయువు :** ఇది శరీరంలోని అన్ని అంగాలయందు వ్యాపించి ఉంటుంది. దీనికి అధిష్ఠాన దేవత 'జయుడు' ఇది జఠరాగ్నిని ప్రజ్వలింపచేసి, తిన్న ఆహారాన్ని అరిగించి, శరీరంలోని డబ్బైరెండు వేల నాడీమండలానికీ సమానంగా అందిస్తుంది.

ఉపవాయువులు కూడా ఐదున్నాయి. అవి

1. నాగవాయువు – వాంతిని కలిగిస్తుంది.
2. కూర్మవాయువు – కనురెప్పలను కదలిస్తుంది
3. కృకర వాయువు – తుమ్ములను కలిగిస్తుంది
4. దేవదత్త వాయువు – ఆవలింతలు కలిగిస్తుంది

5. ధనుంజయ వాయువు - శరీరమంతా వ్యాపించి, శరీరాభివృద్ధి కలిగిస్తుంది

పంచభూతాల రజోగుణం యొక్క నాల్గవ భాగంతో కర్మేంద్రియాలు సృష్టించ బడ్డాయి. వాక్కు, పాణి, పాదము, గుదము, ఉపస్థ అనేవి కర్మేంద్రియాలు. మాట్లాడటము, ఇవ్వటము, నడవటము, విడచుటము, ఆనందించటము అనేవి కర్మేంద్రియాల విషయాలు. అగ్ని, దేవేంద్రుడు, ఉపేంద్రుడు, మృత్యువు, ప్రజాపతి వీరు కర్మేంద్రియాలకు అధిష్ఠాన దేవతలు.

పంచభూతాల సత్త్వగుణాన్ని నాలుగు భాగాలుగా చేసి, అందులోని మూడు భాగాలతో అంతఃకరణను సృష్టించటం జరిగింది. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, అనేవి అంతఃకరణ చతుష్టయము. ఆలోచించటం, నిశ్చయించటం, స్మరించటం, అభిమానించటం, అనుసంధానం చెయ్యటం ఆవి అంతఃకరణ విషయాలు. గళము, వదనము, నాభి, హృదయము, భ్రూమధ్యము అంతఃకరణ చతుష్టయానికి అధిదేవతలు. పంచభూతాల సత్త్వగుణం యొక్క నాల్గవ భాగంతో జ్ఞానేంద్రియాలను సృష్టించటం జరిగింది. శ్రోత్రము, చర్మము, కన్ను, నాలుక, ముక్కు ఇవి జ్ఞానేంద్రియాలు. శబ్ద, స్పర్శ, రూప, రస గంధాలు వీటి విషయాలు. దిక్కులు, వాయువు, భానుడు, వరుణుడు, అశ్వనీదేవతలు వీటికి అధిష్ఠాన దేవతలు. గతంలో చెప్పినట్లుగా కోశములు ఐదు. వీటిలో అన్నమయ కోశమే స్థూలదేహము. ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాలే సూక్ష్మదేహము. సూక్ష్మశరీరంలో కామము, క్రోధము, లోభము, మోహము మొదలైనవి కలగటం వల్ల కలిగే తాపాలు శమము,

దమము, తితిక్ష మొదలైన సద్గుణాలు లభించినందువల్ల కలిగే తాపాలు, దుఃఖాలు కలుగుతూ ఉంటాయి. వీటన్నింటినీ సామాన్యుడు అనుభవిస్తూనే ఉంటాడు. ఈ సూక్ష్మదేహం ఆత్మకాదు.

**3. కారణశరీరము :**

**అనాద్యవిద్యానిర్వాచ్యా కారణోపాధి రుచ్యతే ।**
**ఉపాధి త్రితయాదన్య మాత్మాన మవదారయేత్ ॥**

వాక్కుచేత చెప్పనలవి కానిది, అది లేనిది అయిన అజ్ఞానమే కారణ శరీరము. దీనిని పొందిన ఈశ్వరుడు – 'అవ్యాకృతుడు', బ్రహ్మవేత్త **'అనుజ్ఞైకరసుడు'** అనబడతాడు.

గుణత్రయమే ఆత్మయొక్క కారణ శరీరము. ఇది సుషుప్తిలో ఉంటుంది. ఈ స్థితిలో అన్ని రకాలైన జ్ఞానము నశిస్తుంది. బుద్ధి కేవలము బీజరూపంలో ఉంటుంది. సామాన్యంగా నిద్రలో నాకేమీ తెలియదు అంటాం. అదే సుషుప్తి. ఆ స్థితిలో శరీరంలోని అన్ని అవయవాలు పూర్తిగా విశ్రమిస్తాయి. మూడు గుణాలు కూడా కలిసి మిశ్రమంగా ఉండే స్థితి ఇది. దీని ప్రత్యేకతే గాఢనిద్ర. ఈ స్థితిలో మనస్సు, బుద్ధి, ఇంద్రియాల కార్యకలాపాలన్నీ పూర్తిగా ఆగిపోతాయి. ఈ అవస్థలో మనసు విత్తనం వంటి స్థితిలో ఉంటుంది. నాకేం తెలియదు' అనేదే అనుభవం.

ఇక్కడ సత్త్వరజస్తమోగుణాలు మూడు కూడా పూర్తిగా అవ్యక్తమైన స్థితిలో బీజరూపంగా ఉంటాయి. జాగ్రస్స్వప్నాల అనుభవాలన్నీ బీజరూపంలో ఉంటాయి. ఈ అనుభవాలు జాగ్రదావస్థలో స్థూలరూపంలోను, స్వప్నావస్థలో–సూక్ష్మరూపం లోను, సుషుప్తిలో బీజరూపంలోను ఉంటాయి. వ్యక్తి గాఢనిద్రలో ఉన్నప్పుడు, అతని

శారీరక, మానసిక, బుద్ధిపరమైన కర్మలన్నీ విశ్రాంతి తీసుకుంటాయి. ఇదే అవ్యక్త స్థితి.

ఈ స్థితిలో బాహ్య ప్రపంచం ఏమీ తెలియదు. అలా అని సత్యస్వరూపం అంతకన్నా గోచరించదు. సత్యాన్ని చూడకుండా ఉన్న అవస్థ. పూర్తిగా తమోగుణ ప్రధానమైనది. 'నిద్రలో నాకేం తెలియలేదు. హాయిగా ఉంది' అంటాడు. ఇక్కడ 'ఏమీ తెలియదు' అనే విషయం తెలుస్తుంది. 'హాయి' అనేది తెలుస్తుంది. అందుకే సంపూర్ణమైన అజ్ఞానమే ఈ స్థితి ధర్మం. బుద్ధి ఉండదు కాబట్టి, బుద్ధి రూపమయిన ప్రపంచము ఉండదు. దేనినీ తెలుసుకోలేని ఈ అవస్థే కారణ శరీరము. మలినమైన సత్త్వరజస్తమో గుణాత్మకమైన అవిద్యయే కారణ శరీరము. వాక్కుచేత చెప్పనలవి కానిది, అది లేనిది అయిన అజ్ఞానమే కారణ శరీరము. ఆత్మకారణ శరీరంలో ప్రవేశించినప్పుడు తనను గురించి, ఇతరుల గురించి కూడా తెలియదు. అజ్ఞానంతో మూసుకుపోతుంది. ఈ అవస్థే రాబోయే దుఃఖాలకు కారణమవుతున్నది. అజ్ఞానం వల్ల ఏమీ తెలియక సర్వమూ నష్టమై పోయినట్లు అనిపించటం, రాబోయే సుఖదుఃఖాలకు కారణం అవటం. ఇవన్నీ కారణ శరీరానికి కలిగే తాపాలు.

ఈ మూడు శరీరాలలో ఏదీ ఆత్మ కాదు.

# శారీరకోపనిషత్తు - 5

## పంచకోశాలు

'కోశము' అంటే 'పర' కవచము అని అర్థం. శరీరంలో ఐదు కోశాలున్నాయి. అవే అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములు. వీటినే పంచకోశాలు అంటారు.

కంటికి కనిపించే స్థూలశరీరాన్నే అన్నమయకోశము అంటారు. అన్నమయకోశం లోపల ప్రాణమయకోశమున్నది. ప్రాణమయకోశం లోపల మనోమయకోశమున్నది. ఆ మనోమయకోశం లోపల కర్త ఉన్నాడు అతడే విజ్ఞానమయుడు. అదే విజ్ఞానమయకోశము. ఆ విజ్ఞానమయకోశంలోపల ఉన్నవాడు భోక్త. అతడే ఆనందమయుడు. అదే ఆనందమయకోశము. ఇలా అన్నమయకోశం నుంచి, ఆనందమయకోశం వరకు ఉండే ఈ పరంపరనే 'గుహ' అంటారు. ఈ గుహలో ఉన్నవే పంచకోశాలు.

**1. అన్నమయకోశము :** తల్లితండ్రుల చేత భుజింపబడిన అన్నము మొదలైన ఆహారంవల్ల శుక్ల శోణితములు ఉత్పత్తియై ఈ దేహము పుడుతోంది. దీన్నే స్థూలదేహము అంటారు. ఇలా అన్నంవల్ల పుట్టిన ఈ దేహము అన్నము మొదలైన వాటితోనే వృద్ధి చెందుతుంది. ఈ కారణంచేతనే అన్నవికారమైన ఈ దేహాన్ని అన్నమయకోశము అంటారు.ఇ దే స్థూలశరీరం. జననానికి ముందు లేదు. మరణం తరువాత ఉండదు. క్షణికమైనది. అస్థిరమైనది. అన్నం ఉంటేనే ఇది జీవించి ఉంటుంది. అన్నం లేకపోతే నశించిపోతుంది. త్వగాది ధాతువులతోను, షడ్వికారాలతోను నిండి ఉంటుంది. పంచభూతాలు, తన్మాత్రలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు అనే వివిధ తత్త్వాలతో కూడి ఉంటుంది. ప్రత్యక్షంగా కళ్ళకి కనిపిస్తుంది. ఇది ఆత్మకాదు. ఒకవేళ ఈ దేహమే ఆత్మ అంటే, గతజన్మలో కూడా ఈ దేహం ఉండి తీరాలి కాని లేదు. అలాగే ఈ దేహం మళ్ళీ జన్మలో కూడా ఉండదు. అంతేకాదు ఈ దేహం ఈ జన్మలో చేసిన పాప పుణ్యఫలాలు కూడా ఇప్పుడు అనుభవించదు. అందుచేత ఇది ఆత్మకాదు.

1. ఇక్కడ విషయం గుర్తుంచుకోవాలి. అన్నమయకోశం ఆత్మకాదు అని చెబుతున్నాం. ఎందుచేతనంటే అన్నంవల్లనే ఈ శరీరం నిర్మించబడింది. ఇందులో ఉండేది రక్తము, మాంసము, చర్మము, ఎముకలు, మలమూత్రాలు, హేయమయిన మలమూత్రాలతో కూడిన దేహం ఆత్మ ఎలా అవుతుంది? ఇది ఆత్మకాదు.

2. జన్మించక ముందు ఈ దేహం లేదు. మరణించిన తరువాత ఉండదు. ఈ మధ్య కాలంలోనే ఉంటుంది. అందుకే ఇది క్షణికమైనది, అశాశ్వతమైనది. ఇది ప్రతిక్షణమూ మారుతూ ఉంటుంది. బాహ్యంగా కనిపించే జడపదార్థం. మరి ఇది ఆత్మ ఎలా అవుతుంది?

3. అవయవాలతో కూడిన దేహం ఆత్మ అవటానికి వీలులేదు. ఒకవేళ కాలు చేతులు లేకపోయినా, ఈ దేహం పనిచేస్తూనే ఉంటుంది. ఇది స్వతంత్రంగా పని చెయ్యటంలేదు. వేరొకరితో నియమించబడి పని చేస్తోంది. ఈ రకంగా పరతంత్రమైన ఈ దేహం ఆత్మ ఎలా అవుతుంది?

కాబట్టి చర్మము, మాంసము మొదలైన మలినమైన వాటితో ఏర్పడిన శరీరమే తాను అని మూర్ఖుడు అనుకుంటాడు. వివేకవంతుడు ఎప్పుడూ అలా భావన చెయ్యడు. కేవలము మూర్ఖుడు మాత్రమే ఈ దేహమే నేను అను భావన చేస్తాడు. వివేకవంతుడు, జ్ఞాని తనను తాను ఆత్మగా బ్రహ్మగా తెలుసుకుంటాడు.

**2. ప్రాణమయకోశము :** ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములు అనే ఐదు ముఖ్య ప్రాణవాయువులు, నాగ, కూర్మ, కృకుర, దేవదత్త ధనుంజయములు అనే ఉపవాయువులు, వాక్కు, పాణి, పాద, పాయు, ఉపస్థ అనబడే కర్మేంద్రియాలు, ఈ పదిహేను కలిసి ప్రాణమయకోశము అనబడుతుంది. ఇది జడస్వభావము కలిగి

ఉంటుంది. ఆకలి, దప్పిక, రజోగుణము, అహంకారములతో కూడి ఉంటుంది. ఇంకా చెప్పాలంటే పాదం మొదలు శిరస్సుదాకా, శరీరమంతటా వ్యాపించి, దేహానికి బలాన్నిస్తూ, చక్షురాది ఇంద్రియాలను ప్రేరేపిస్తూ ఉండే వ్యాన వాయువే ప్రాణమయ కోశమని చెప్పబడుతోంది. ఈ వాయువులో చేతనత్వం లేదు. కాబట్టి ఇది కూడా ఆత్మకాదు.

కర్మేంద్రియాలు, పంచప్రాణాలు కలిసి ప్రాణమయకోశం అనబడుతుంది. దీనితో ఆవరించబడిన అన్నమయకోశం ప్రాణం ఉన్నట్లే అన్ని పనులు చేస్తుంది. ఇక్కడ గుర్తించాల్సిన విషయం ఏమంటే, వాయువు యొక్క పరిణామమే ప్రాణమయ కోశం. గాలిలాగానే ఇదికూడా శరీరంలోకి ప్రవేశించి నిష్క్రమిస్తుంది. దీనికి శరీరము యొక్క సుఖదుఃఖాలతో పనిలేదు. దేన్నీ తెలుసుకోదు. ఎప్పుడూ ఆత్మమీదే ఆధారపడి ఉంటుంది. ఇది శరీరంలో ఉంటే ముఖ్యప్రాణము అంటారు. అదే బయట ఉంటే గాలి. ప్రాణానికి సుఖదుఃఖాలు, సంతోష విచారాలు గుర్తించే శక్తిలేదు. అలాంటి ప్రాణం ఆత్మ ఎలా అవుతుంది? అందుకే ప్రాణమయకోశం ఆత్మకాదు.

**3. మనోమయకోశము :** జ్ఞానేంద్రియాలు, మనస్సు కలిసి మనోమయకోశము అంటారు. నేను నాది అనే సంకల్ప వికల్పాలకు హేతువు ఇదే. ఇది చాలా చంచలమైనది. అన్నమయ, ప్రాణమయ కోశాలలో వ్యాపించి ఉంటుంది. ఇంద్రియాలు అనే హోతలద్వారా, విషయాలు అనే ఆహుతులతో పెంపొంది, వాసనలనే సమిధలతో ప్రజ్వలితమైన మనోమయాగ్ని, దృశ్య ప్రపంచం అంతా దగ్ధం చేస్తుంది. అంటే ఇంద్రియాలు, వాసనలు అనే సమిధలను రగుల్కొల్పుతాయి. అప్పుడు మనోమయాగ్ని ప్రకటితమవుతుంది. ఈ జగత్తులో మనసును

మించిన అవిద్య ఇంకేదీ లేదు. మనసు నశిస్తే అన్నీ నశిస్తాయి. మనసు మేల్కొంటే అన్నీ మేల్కొంటాయి. స్వప్నంలో కూడా ఈ మనస్సు తన శక్తివల్ల భోక్తను, భోగాన్ని సృష్టిస్తుంది. జాగ్రదావస్థలో కనిపించేదంతా మనస్సు యొక్క విలాసమే. సుషుప్తిలో ఈ మనసు పనిచెయ్యదు. అందుకే అప్పుడు ఏమీ ఉండదు. ఈ జగత్తంతా మనస్సుతోనే కల్పించబడింది. బంధమోక్షాలకు కారణం మనస్సే. రాగద్వేషాలకు నిలయం మనస్సు. అటువంటి మనస్సు ఆత్మకాదు. మనోమయకోశం చాలా బలమైనది. ప్రాణమయకోశాన్ని ఇది ఆవరించి ఉంటుంది. మనోమయకోశం ఒక అగ్నికుండం. వాసనలే ఇక్కడ సమిధలు. జ్ఞానేంద్రియాలు హోతలు. ఇంద్రియాలకు భోగ్యములైన వస్తువులు ఆహుతి అవుతూ ఉంటే, జాజ్వల్యమానంగా ప్రకాశిస్తూ, బాహ్యంగా ఉన్న భౌతిక ప్రపంచాన్ని నిలిపి ఉంచుతుంది. గతంలో చెప్పినట్లుగా మనసుకన్న అవిద్య అనేది వేరుగా లేదు. అన్ని బంధాలకు కారణం మనస్సే. ఈ జగత్తంతా మనస్సుచేత కల్పించబడిందే. సుషుప్తిలో ఈ మనసు పని చెయ్యదు. బంధమోక్షాలకు ఇదే కారణం. ఈ మనస్సువల్లనే శరీరం మీద, దానికి సుఖాన్ని కలిగించే వస్తువులమీద, విషయాలమీద ద్వేషాన్ని కూడా కల్పిస్తుంది ఈ మనస్సు. ఈ కారణంచేతనే బంధమోక్షాలకు కారణం మనస్సు అంటారు. ఇది రజోగుణంతో కలిస్తే బంధం ఏర్పడుతుంది. రజస్తమో గుణాల నుంచి విడివడితే మోక్షకారణ మవుతుంది. వివేకము వైరాగ్యము ఎక్కువగా ఉండి, మనసు శుద్ధంగా ఉన్నప్పుడు మనసు ముక్తి మార్గంవైపు మళ్ళుతుంది. ఇంద్రియ భోగాలు, వర్ణాశ్రమ ధర్మాలు, జాతి కులభేదాలు, కర్మలు, గుణాలు వీటి అనుభవాలన్నీ మనసు ద్వారానే కలుగుతాయి. మనసుచేత కల్పించబడే కర్మలు, వాటి

ఫలాలను జీవుడు తనవిగా భావిస్తాడు. అందుకే మనస్సు అవిద్య అనబడుతుంది. మోక్షగామియైన వాడు మనస్సును అదుపులో ఉంచుకుని, రాగద్వేషాలను జయించాలి. మనోమయానికి ఆది, అంతము ఉంది. మార్పులకు లోనవుతూ ఉంటుంది. కష్టాలు, బాధలు దీని లక్షణాలు. ఈ లక్షణాలేవీ ఆత్మకి ఉండవు. అందుచేతనే మనస్సు ఆత్మకాదు.

**4. విజ్ఞానమయకోశము :** జ్ఞానేంద్రియాలు వాటి వృత్తులతో కూడిన బుద్ధియే విజ్ఞానమయకోశము. ఇదే మానవుడి సంసారానికి కారణము. చిత్తము, ఇంద్రియాలు వీటిని అనుసరించి పోయే చేతనం యొక్క ప్రతిబింబశక్తినే మాయ అంటారు. ఇది ప్రకృతియొక్క వికారము. జాగ్రస్వప్న సుషుప్తి అనబడే అవస్థలు, సుఖదుఃఖాలు, వాటికి సంబంధించిన అనుభవాలు, ఆశ్రమ ధర్మాలు, కర్మలు, గుణాలు, వీటికి సంబంధించిన అభిమానము, మమకారము అన్నీ ఈ విజ్ఞానమయకోశంలోనే ఉంటాయి. ఇది ఆత్మకు చాలా దగ్గరగా ఉంటుంది. అందుచేతనే ఎక్కువ ప్రకాశ వంతంగా ఉంటుంది. ఈ కోశంలో విద్యామదము, తద్వారా మహదహంకారము ఉంటాయి. ఇది మనోమయంలోపల ఉంటుంది. కాబట్టి, బుద్ధి అనేది కేవలము చిదాభాస. ఘటపటాదుల్లాగా దీనికి ఉత్పత్తి నాశనము ఉన్నాయి. అందుచేతనే ఇది ఆత్మకాదు.

ఇక్కడ ఒక విషయం గుర్తుంచుకోవాలి. అంతఃకరణ రెండు రకాలుగా ఉంటుంది. 1. కర్తృత్వ రూపం 2. కరణరూపం. కర్తృత్వ రూపాన్ని విజ్ఞానమని, కరణరూపాన్ని మనస్సని అంటారు. ఈ రెండూ ఒకదాని లోపల ఒకటి ఉంటాయి. కాబట్టి అంతఃకరణ కర్తృరూపం పొందినప్పుడు విజ్ఞానమయకోశము, కరణరూపం లోకి మారినప్పుడు

మనోమయకోశము అవుతుంది. అందుచేత అంతఃకరణని రెండు రూపాలుగా విభజించి చెబుతారు. ఇక్కడ విజ్ఞానము అంటే బుద్ధి. విజ్ఞానమయ కోశానికి 'నేను కర్తను' అనే భావన ఉంటుంది. చిత్తుయొక్క ప్రతిబింబంతో కూడిన ప్రకృతివికారమే విజ్ఞానమయకోశం. అన్నివేళలా, అన్ని విషయాలు తెలుసుకుంటూ ఉంటుంది. శరీరంతోను, ఇంద్రియాలతోను ఎప్పుడూ తాదాత్మ్యం చెంది ఉంటుంది. జాగ్రస్వప్నాది అవస్థలు, సుఖదుఃఖాది అనుభవాలు దీనికే చెందుతాయి. ఆత్మమీద ఆరోపించబడిన అధ్యాసే ఇది. ఆత్మ దీనితో తాదాత్మ్యం చెందటంవల్ల, భ్రమకు లోనై సంసార బంధనాలలో చిక్కుకుంటుంది. కాబట్టి ఇది ఆత్మకాదు.

**5. ఆనందమయకోశము :** ఆనంద స్వరూపమైన ఆత్మయొక్క ప్రతిబింబం చేత తాకబడినటువంటి, తమోగుణంవల్ల ప్రకటితమైనటువంటి వృత్తినే ఆనందమయ కోశము అంటారు. ఇది ప్రియము, మోదము, ప్రమోదము అనబడే మూడు గుణాలతో కలిసి ఉంటుంది. గతజన్మలో చేసుకున్న పుణ్యఫలంవల్ల కొంతమందికి సుఖం అనుభవించే సమయంలో ఆనందమయకోశ స్వరూపం గోచరిస్తుంది. ఆ సమయంలో ఆ జీవి ఏ ప్రయత్నం లేకుండానే ఆనందాన్ని పొందుతాడు. ఇంకా విపులంగా చెప్పాలంటే – అజ్ఞానం ఆవరించినప్పుడు 'పరమానందం పొందాను' అనే భావనే ఆనందమయకోశము. ఇందులో

| | | |
|---|---|---|
| ప్రియము | – | పుత్ర, మిత్ర, కళత్రాదులను చూసినప్పుడు కలిగేది. |
| మోదము | – | కోరుకున్నది జరిగినప్పుడు కలిగేది |
| ప్రమోదము | – | మోదము ఎక్కువగా కలగటం |

ఆనందము - ప్రమోదము విపరీతంగా కలగటము

ఆత్మయొక్క ప్రతిబింబమయిన అనాత్మ ఇది. ఇష్టమయిన వస్తువులు దొరికినప్పుడు పొంగి పొరలే సంతోషము దీని లక్షణము. పుణ్యఫలం ఫలించినప్పుడు అదృష్టవంతులు మాత్రమే దీన్ని అనుభవిస్తారు. మానవుడు తన ప్రయత్నం లేకుండానే దీన్ని అనుభవిస్తాడు. సుషుప్తిలో ఆనందమయకోశం పూర్తిగా వ్యక్తమవుతుంది. జాగ్రస్వప్నావస్థలలో పరిస్థితులమీద ఆధారపడి పాక్షికంగా వ్యక్తమవుతుంది. ఇది నిత్యమూ వికారం చెందుతూ ఉంటుంది. ఈ కారణాలు చేత ఆనందమయకోశం కూడా ఆత్మకాదు. ఇది ప్రకృతి పరిణామము.గతకర్మల ఆధారంగా ఇది ఏర్పడుతోంది. అన్ని కోశాలమధ్యన ఇది ఉంటుంది. కోశాలన్నీ నిత్యమూ మార్పు చెందుతాయి. అందుచేత మార్పుచెందే ఏ కోశమూ ఆత్మకాదు.

తైత్తిరీయోపనిషత్తులో వరుణ మహర్షి కుమారుడు భృగుమహర్షి, విద్యాభ్యాసం పూర్తిచేసి బ్రహ్మజ్ఞానం పొందాలనే కోరికతో తండ్రి దగ్గరకు వెళ్ళి పరబ్రహ్మతత్త్వాన్ని ఉపదేశం చెయ్యమని అడిగాడు. దానికి తండ్రి “కుమారా! అన్నము, ప్రాణము, నేత్రము, శ్రోత్రము, మనస్సు, వాక్కు, ఇవన్నీ పరబ్రహ్మ సాధనకు మార్గాలే. వీటన్నింటిలోను బ్రహ్మతత్త్వం ఇమిడి ఉంది. అవి దేనిలోంచి ఉత్పన్నమైనాయో, దేనితో పోషింపబడుతున్నాయో, దేనియందు లయమవుతున్నామో, అన్నింటికీ మూలవస్తువు ఏదో, దాన్ని గురించి తెలుసుకోవాలి. దాన్ని తపస్సు ద్వారానే సాధించాలి. కాబట్టి వెళ్ళి తపస్సు చెయ్యి” అన్నాడు. తండ్రి ఉపదేశాన్ననుసరించి పన్నెండు సంవత్సరాలు తపస్సు చేశాడు భృగువు. ఇప్పుడు అతడికి తెలిసింది **అన్నమేపరబ్రహ్మ.** అన్నం మూలంగానే అన్ని ప్రాణులు ఉత్పన్నమవుతున్నాయి. పుట్టిన ప్రతిప్రాణి అన్నంవల్లనే పోషింపబడుతోంది. కాబట్టి అన్నమే పరబ్రహ్మ స్వరూపము. ఇదే

మాటను తండ్రికి చెప్పాడు భృగువు. "నాయనా ! పరబ్రహ్మ సాధనలో మొదటి మెట్టుమీదే ఉన్నావు. అన్నం పరబ్రహ్మ స్వరూపమే. కాని అన్నమే పరబ్రహ్మ స్వరూపం కాదు. మళ్ళీ వెళ్ళి తపస్సు చెయ్యి" అన్నాడు తండ్రి. మళ్ళీ పన్నెండు సంవత్సరాలు తపస్సు చేశాడు భృగువు. ఈసారి తెలిసింది **'ప్రాణమే పరబ్రహ్మ'** అని. ఎందుకని అంటే లోకంలోని జీవరాశి అంతా ప్రాణంవల్లనే జీవిస్తున్నది. ప్రాణం ఉంటేనే మానవుడు జీవిస్తాడు. ఏదైనా ఒక పని చేస్తాడు. ప్రాణమే సర్వజగత్తుకు మూలాధారం. అందుచేత ప్రాణమే పరబ్రహ్మ అని నిశ్చయించుకున్నాడు. ఆ మాటే తండ్రికి చెప్పాడు. కాదన్నాడు తండ్రి. ప్రాణము పరబ్రహ్మ స్వరూపమే. కాని ప్రాణమే పరబ్రహ్మకాదు. వెళ్ళి మళ్ళీ తపస్సు చెయ్యి అన్నాడు. మళ్ళీ పన్నెండు సంవత్సరాలు తపస్సు చేశాడు భృగువు. ఇప్పుడు తెలిసింది **'మనస్సే పరబ్రహ్మ'** ఎందుకంటే జగత్తులో మనస్సువల్లనే మానవుడు ఆలోచించగలుగుతున్నాడు. ఈ ఆలోచనల వల్లనే స్త్రీ పురుషులు ఒకటౌతున్నారు. తద్వారా సృష్టి జరుగుతోంది. ఈ మాటే చెప్పాడు తండ్రికి. కాదన్నాడు తండ్రి మనస్సు పరబ్రహ్మ స్వరూపమే. కాని మనస్సే పరబ్రహ్మ కాదు. మళ్ళీ వెళ్ళి తపస్సు చెయ్యి అన్నాడు తండ్రి. మళ్ళీ పన్నెండు సంవత్సరాలు తపస్సు చేశాడు భృగువు. ఇప్పుడు తెలిసింది **'విజ్ఞానమే పరబ్రహ్మ'** విజ్ఞానము అంటే ప్రాపంచికమైన జ్ఞానము. దీనివల్లనే మానవుడు ఈ జగత్తులోని ప్రతివిషయం గురించి ఆలోచించగలుగు తున్నాడు. కాబట్టి ఇదే బ్రహ్మము అన్నాడు భృగువు. కాదన్నాడు తండ్రి. విజ్ఞానం కూడా పరబ్రహ్మమే కాని. విజ్ఞానమే పరబ్రహ్మ కాదు. మళ్ళీ వెళ్ళి తపస్సు చెయ్యి అన్నాడు తండ్రి. పన్నెండు సంవత్సరాలు తపస్సు చేశాడు భృగువు. ఇప్పుడు తెలిసింది ఆనందమే పరబ్రహ్మ. ఈ విషయమే తండ్రికి చెప్పాడు. సర్వము ఆనందం నుంచే వచ్చి అందులోనే

లీనమవుతున్నాయి. కాబట్టి ఆనందమే పరబ్రహ్మ అన్నాడు తండ్రి.

అన్నం బ్రహ్మ కాదు. ప్రాణం బ్రహ్మ కాదు. మనస్సు బ్రహ్మ కాదు. విజ్ఞానం బ్రహ్మ కాదు. ఇవన్నీ కోశములందుంటాయి. అలాగే ఆనందమయకోశము కూడా. వీటిలో ఏ కోశము, ఏ భాగము పరబ్రహ్మ కాదు. ఆనందమయకోశం కూడా పరబ్రహ్మ కాదు. ఇవన్నీ జడపదార్ధాలకు సంబంధించినవి కాబట్టి అవి ఆత్మ అయ్యే అవకాశం లేదు. **పంచకోశాలలోను ఏ కోశము ఆత్మకాదు.**

# 56. సూర్యోపనిషత్తు

ఇది అధర్వణ వేదానికి సంబంధించినది. ఇందులో నాలుగు మంత్రాలు ఉంటాయి. సూర్యోపాసన, సౌరం అష్టాక్షరీ మంత్రము చెప్పబడుతోంది.

ఈ మంత్రానికి బ్రహ్మ ఋషి గాయత్రి ఛందస్సు, ఆదిత్యో దేవతా. హంసస్సోహం అగ్నినారాయణ రక్తాంబుజ సంస్థితమ్ సప్తాశ్వరథినం హిరణ్యవర్ణం చతుర్భుజం పద్మద్వయా భయవరదహస్తం కాలచక్రప్రణేతారం శ్రీసూర్యనారాయణం య ఏవం వేద సువై బ్రాహ్మణః ॥ – బీజంయుక్తం హృల్లేఖ శక్తిః వియదాది సర్గ సంయుక్త కీలకం. చతుర్విధ పురుషార్ధ సిద్ధ్యర్థే జపే వినియోగః ।

**రక్తాంబుజ సంస్థితమ్ సప్తాశ్వరథినం హిరణ్యవర్ణం**

**చతుర్భుజం పద్మద్వయాభయ వరదహస్తం కాలచక్రప్రణేతారం**

**శ్రీసూర్యనారాయణం య ఏవం వేద సువై బ్రాహ్మణః ॥**

ఎర్ర తామరయందున్నవాడు, ఏడు గుర్రాలు పూన్చిన రథము నెక్కినవాడు, బంగారు వర్ణము గలవాడు, నాలుగుచేతుల యందు రెండు పద్మములు అభయ వరదముద్రలు ధరించినవాడు కాలస్వరూపుడు. అయిన సూర్యభగవానుణ్ణి తెలుసుకున్న వాడు ధన్యుడు. అతనికి వ్యాహృతిత్రయము కూడా తెలుస్తుంది. భర్గుడు మా బుద్ధులను ప్రేరేపించును గాక. సూర్యుడే ఆత్మ. ఆ సూర్యుని అనుగ్రహము వల్లనే జగత్తు ఆవిర్భవిస్తోంది.

సూర్యునివల్లనే పర్జన్యుడు, అన్నము, యజ్ఞము, ఆత్మ

కలుగుతున్నాయి. ఓ ఆదిత్యుడా నీవే ప్రత్యక్ష దైవము. నీకు నా నమస్కారము. నీవు కంటికి ఎదురుగా ఉన్న బ్రహ్మవు. నీవే విష్ణువు. నీవే రుద్రుడు. నీవే ప్రత్యక్షమైన ఋక్కు, యజస్సు, సామము, అథర్వణము. నీవే ఛందస్సులు. ఆదిత్యుని వల్లనే వాయువు కలుగుతున్నది. ఆదిత్యుని వల్లనే జలము, జ్యోతిస్సు, ఆకాశము, దేవతలు, వేదాలు అందరూ కలుగుతున్నారు.

ఆదిత్యుడే సూర్యమండలాన్ని ప్రకాశింపచేస్తున్నాడు. అతడే అంతః కరణ, అతడే బుద్ధి, చిత్తము, అహంకారము. అతడే ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము. ఆదిత్యుడే శ్రోత్రము, త్వక్కు, చక్షువు, రసన, ఘ్రాణము. ఆదిత్యుడే వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ. అతడే శబ్ద స్పర్శ రూప రస గంధాలు. అతడే వచనదానా గమన విసర్గ ఆనందములు. అతడు విజ్ఞానమయుడు. ఆనందమయుడు. అతడే మిత్రుడు, భానుడు. ఓ ఆదిత్యా! నన్ను మృత్యువు నుంచి రక్షించుము. సూర్యుని వల్లనే ప్రాణాలు పుడుతున్నాయి. పెరుగుతున్నాయి. నశిస్తున్నాయి. నేనే సూర్యుడను. సవిత నాకు చక్షువు. ఆదిత్యుణ్ణి తెలుసుకుని అతన్ని సేవిద్దాము. అతడు మనకు సంపదలు, దీర్ఘాయువు ఇస్తాడు. ఇప్పుడు 'సౌ అష్టాక్షరీ' మహామంత్రం చెబుతున్నారు.

**ఓవిత్యేకాక్షరం బ్రహ్మ, ఘృణిరితిద్వేక్షరే, సూర్య ఇత్యక్షరం ద్వయం, ఆదిత్య ఇతిత్రీణ్యక్షరాణి. ఏకస్యైనవ సూర్యాష్టారోమనుః**

'ఓం' అనే ఒక అక్షరము – బ్రహ్మ

ఘృణి రెండు అక్షరాలు

సూర్యః రెండు అక్షరాలు

ఆదిత్యః మూడు అక్షరాలు.

**'ఓంఘృణి సూర్య ఆదిత్యః'** ఈ మంత్రాన్ని ప్రతిరోజు జపించేవాడు బ్రాహ్మణుడవుతాడు. సూర్యుని ఎదురుగా ఉండి ఈ మంత్రం జపిస్తే మహావ్యాధులు తగ్గుతాయి. దరిద్రం నశిస్తుంది. తినరానిది తినటం వల్ల, చెయ్యకూడని పని చెయ్యటం వల్ల వచ్చే పాపం నశిస్తుంది. మధ్యాహ్నము సూర్యుని ఎదురుగా ఉండి ఈ మంత్రజపం చేస్తే పంచ మహాపాతకాలు నశిస్తాయి. ఇది సావిత్రీవిద్య. దీనియందు నమ్మకం లేని వారికి దీన్ని చెప్పరాదు. మూడు సంధ్యలయందు ఈ మంత్రజపం చేస్తే వంద క్రతువులు చేసిన ఫలం దక్కుతుంది. సూర్యుడు హస్తా నక్షత్రంలో ఉండగా ఈ మంత్రజపం చేస్తే మహామృత్యువు కూడా తప్పిపోతుంది..

ఇప్పుడు సౌర అష్టాక్షరీ మహామంత్రం పూర్తిగా చూడండి. అస్యశ్రీ సౌర అష్టాక్షరీ మహామంత్రస్య । బ్రహ్మ ఋషిః । గాయత్రీ ఛందః । సవితా దేవతా । ఘృణిరితి బీజం । సూర్యఇతిశక్తిః । ఆదిత్య ఇతి కీలకం । జపే వినియోగః న్యాసము

1. ఓం సత్య తేజోజ్వాలామాలినే
2. ఓం బ్రహ్మతేజోజ్వాలామాలినే
3. ఓం విష్ణుతేజోజ్వాలామాలినే
4. ఓం రుద్రతేజోజ్వాలామాలినే
5. ఓం అగ్నితేజోజ్వాలామాలినే
6. ఓం సర్వతేజోజ్వాలామాలినే

**ధ్యానమ్ :**

**రక్తాబ్జయుగ్మాభయదానహస్తం**
**కేయూరహారాంగదకుండలాఢ్యాం**
**మాణిక్యమౌళీం దిననాథమీడే**
**బంధూక కాంతిం విలసత్త్రినేత్రం ။**

**మంత్రం : "ఓం ఘృణి సూర్య ఆదిత్యోమ్။**

**ఆదిత్యాయ విద్మహే సహస్ర కిరణాయ ధీమహి। తన్నః సూర్యః ప్రచోదయాత్။**

**భాస్కరాయ విద్మహే మహద్ద్యుతికరాయ ధీమహి । తన్నః ఆదిత్యః ప్రచోదయాత్။** ఇది సూర్యగాయత్రి.

సూర్యమంత్రం జపించినవారు సంపూర్ణ ఆరోగ్యం పొందుతారు. ఈ మంత్రం గురువుగారి దగ్గర ఉపదేశం పొంది చెయ్యండి.

# 57. ముద్గలోపనిషత్తు

ఇది ఋగ్వేదానికి సంబంధించినది. ఇందులో పదిమంత్రాలున్నాయి. పురుష సూక్తానికి అర్థం ఇందులో చెప్పబడింది. **ఋగ్వేదంలో పదవ మండలంలోని 90వ సూక్తము పురుష సూక్తము.** దానికి అర్థం చెబుతున్నారు.

సహస్రశీర్షాపురుషః అన్నచోట సహస్ర అంటే వెయ్యి అని కాదు అనంతము అని అర్థం. సహస్రశీర్షములు అంటే అనేకమైన శిరస్సులు కలవాడు. 84 లక్షల రకాల జీవరాశి అన్నాం కదా. వీటన్నింటి శిరస్సులు తనకు గలవాడు. అలాగే వీటన్నింటి కనులు, కాళ్ళు, చేతులు గలవాడు. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ జగత్తులో ఎన్ని జీవరాసులున్నాయో (షుమారు 60 కోట్లు) అన్ని శిరస్సులు, అన్ని కాళ్ళు చేతులు, కనులు మిగిలిన శరీర అవయవాలు కలవాడు. జీవరాసి అంటే క్రిమికీటకాదులు కూడా ఉంటాయి. వాటిలో కొన్నింటికి వందకాళ్ళుంటాయి. పాములాంటి వాటికి అసలు కాళ్ళుండవు. ఇలా జీవరాసి యొక్క అవయవాలు అన్నీ తానే అయినవాడు. 'దశాంగులమ్' అన్న పదానికి అనంత యోజనము అని అర్థం. 'స భూమిం విశ్వతోవృత్వా' అంటే ఆ పరమేశ్వరుడు సర్వవ్యాపి. 'యద్భూతం యచ్చభవ్యం' భూత భవిష్య ద్వర్తమానాలలో అంతటా ఉంటాడు. కాలవ్యాప్తి అనేది చెప్పారు. తరువాత మంత్రంలో పరమేశ్వరుడికి మోక్షప్రదత్వం చెప్పబడింది. 'ఏతావానస్య మహిమా' విష్ణువు యొక్క వైభవము చెప్పబడింది. దీంతోనే చతుర్వ్యూహము చెప్పబడింది. ఆ పరమేశ్వరుడు 1.శరీర పురుషుడు 2. ఛందః పురుషుడు 3. వేదపురుషుడు 4. మహాపురుషుడు. ఇదే చతుర్వ్యూహము. "త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః' ఇందులో అనిరుద్ధ వైభవము చెప్పబడింది. 'సప్తాశ్వాసన్

పరిధయః త్రిస్సప్తసమిధః కృతాః' దీనిలో పరిధులు సమిధలు చెప్పారు. 'తం యజ్ఞం' అన్నచోట సృష్టియజ్ఞము, మోక్షము చెప్పబడింది. 'తస్మాద్యజ్ఞాస్సర్వహుతః' ఇందులో జగత్తు సృష్టి అంతా చెప్పబడింది. 'వేదాహమేతం పురుషం మహాంతం', 'ధాతాపురస్తాద్యముదా జహార' ఈ రెండు మంత్రాలలోను పరమేశ్వరుని వైభవము చెప్పబడింది. 'యజ్ఞేనయజ్ఞమయ జంతదేవాః' ఈ మంత్రంలో సృష్టికి, మోక్షానికి ఉపసంహారము చెప్పబడింది. దీనిని తెలుసుకున్నవాడు ముక్తుడు.

ఈ విషయమంతా వాసుదేవుడు ఇంద్రుడికి భగవత్ జ్ఞానాన్ని ఉపదేశించి, మళ్ళీ రహస్యమైన ఆ విషయాన్ని రెండు ఖండాలలో వివరిస్తున్నాడు. ఆ పరమ పురుషుడు నామరూపాలకు గోచరము కానివాడు. సంసారులను ఉద్ధరించాలనే కోరిక కలవాడై, చూడగానే మోక్షానిచ్చే కళ్యాణప్రదమైన వేషాన్ని స్వీకరించాడు. ఆ వేషంతోనే భూమి, ఆకాశము అంతా వ్యాపించాడు. అనంతయోజన ప్రదేశాన్ని అతిక్రమించాడు. ఆ పురుషుడే నారముల యందు నివసించేవాడు నారాయణుడు. త్రికాలాతీతుడు. తనను నాలుగు భాగాలుగా చేసుకున్నాడు. అందులోని ఒక భాగం చేతనే ఈ జగన్నిర్మాణం జరిగింది. ఈయన జగత్తును సృష్టించటానికే ప్రకృతిని సృష్టించాడు. అతడు పూర్ణకాముడు ఆప్తకాముడు, నిష్కాముడు. పరమేశ్వరుడిలోని నాల్గవభాగమే అనిరుద్ధ నారాయణుడు. అతడికి కోరికలు లేవు కాబట్టి సృష్టి చెయ్యడు. అందుచేత బ్రహ్మదేవుడికి సృష్టిని ఉపదేశించాడు.

ఓ బ్రహ్మదేవా! పంచకోశములతో కూడిన నా శరీరాన్ని హవిస్సుగా చేసి, నన్ను హవిర్భోక్తగా తలచి వసంతకాలం - ఆజ్యంగాను, గ్రీష్మఋతువు-నిర్మలంగాను, శరదృతువు హవిస్సుగాను

ధ్యానించి, అగ్నియందు హోమం చేసినట్లైతే, అంగస్పర్శ వల్ల కళేబరము వజ్రం అవుతుంది. ఆ తరువాత జీవులను సృష్టించు. అప్పుడు స్థావర జంగమాత్మకమైన జగత్తు ఆవిర్భవిస్తుంది. జీవాత్మ పరమాత్మల యోగముచే మోక్షం సిద్ధిస్తుంది. ఈ విషయం తెలిసినవాడికి ఒకే పరమాత్మ అనేకరూపాలుగా కనిపిస్తాడు. ఆత్మకి పుట్టుక లేదు. కాని అనేక విధాలుగా పుడుతున్నది. ఈ పురుషుణ్ణి అధ్వర్యులు – అగ్ని అని ఉపాసిస్తారు. యజస్సు అనేదే ఈ సర్వాన్ని కలుపుతున్నది. ఛందోగులు సామము అంటారు. అంతా దీనియందే ప్రతిష్ఠితమై ఉన్నది. సర్పాలు విషమని, సర్పవేత్తలు సర్పమని, దేవతలు ఊర్గ్ అని, మనుష్యులు ధనమని, అసురులు మాయ అని, పితృదేవతలు స్వధా అని, దేవజనవేత్తలు దేవజనమని, గంధర్వులు రూపమని, అప్సరసలు గంధమని, ఎవరు ఏ రకంగా ఉపాసిస్తే, వారికి అలాగే ప్రత్యక్షమవుతాడు. కాబట్టి బ్రాహ్మణుడు ఎప్పుడూ నేను పురుష రూపమైన బ్రహ్మను అని భావించాలి. అప్పుడు అతడు కూడా బ్రహ్మమే అవుతాడు.

ఆ బ్రహ్మము తాపత్రయాలకు అతీతమైనది. షట్కోశముల నుండి వినిర్ముక్తమైంది. షడూర్ములు లేనిది.

పంచకోశాలకు అతీతమైనది. షడ్భావాలు లేనిది.

| | | |
|---|---|---|
| తాపత్రయాలు | – | ఆధిదైవికము, ఆధిభౌతికము, ఆధ్యాత్మికము |
| షట్కోశములు | – | చర్మము, మాంసము, శోణితము, అస్థి, స్నాయువు, మజ్జ |
| అరిషడ్వర్గాలు | – | కామ, క్రోధ, లోభ, మోహా, మద, |

మాత్సర్యములు

| | | |
|---|---|---|
| పంచకోశాలు | – | అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములు. |
| షడ్భావాలు | – | ప్రియత్వము, జననము, వర్ధనము, పరిణామము, క్షయము, నాశనము. |
| షడూర్మలు | – | ఆకలి, దప్పిక, శోకము, మోహము, జర, మరణము |
| షడ్భ్రమలు | – | కులము, గోత్రము, జాతి, వర్ణము, ఆశ్రమము, రూపము |

ఇవి ఉన్నవాడు జీవుడు. ఇవి లేనివాడు దేవుడు.

ఈ ఉపనిషత్తును రోజూ పారాయణ చేసేవాడు అగ్నిపూతుడు, వాయుపూతుడు, ఆదిత్యపూతుడు అవుతాడు అతడికి రోగాలు దుఃఖాలు, బాధలు ఉండవు. మాంసభక్షణ, సురాపానము, పరదారాగమనము వల్ల వచ్చిన పాపాలు నాశన మవుతాయి. పంచ మహాపాతకాలు నశిస్తాయి. అతడికి అరిషడ్వర్గాలుండవు. అన్ని పాపాలనుంచి విముక్తుడవుతాడు. ఇది సత్యము. అతడికి పరమాత్మ సాక్షాత్కారం కలుగుతుంది. పునర్జన్మ ఉండదు. అగ్నియే సవిత, పృథివి సావిత్రి, ఎక్కడ అగ్ని ఉంటుందో అక్కడ పృథివి ఉంటుంది. ఇది ఒక జంట.

అయితే భగవంతుని యందు భక్తి శ్రద్ధ లేనివాడికి, శిష్యుడు కానివాడికి, అన్యమతస్థుడికి, నాస్థికుడికి ఈ విషయాలు చెప్పరాదు. వేదము చదవని వాడికి, వేదాలమీద నమ్మకంలేనివాడికి ఈ విషయాలు చెప్పరాదు.

# 58. సావిత్ర్యుపనిషత్తు

ఇది సామవేదంలోది. మొత్తం 14 మంత్రాలుంటాయి.

కస్సవితా కాసావిత్రీ । అగ్ని రేవ సవితా పృథివీ సావిత్రీ । స యత్రాగ్ని స్తత్ పృథివీ। యత్ర వా పృథివీ తత్రాగ్ని। స్తే ద్వే యోని స్తదేకం మిథునమ్ ॥1

క స్సవితా కా సావిత్రీ । వరుణ ఏవ సవితాస స్సావిత్రీ । సయత్రవరుణ స్తదాపో యత్ర వా ఆప స్తద్వరుణ । స్తేద్వే యోని స్తదేకం మిథునమ్ ॥2

క స్సవితా కా సావిత్రీ । వాయురేవ సవితా ఆకాశ స్సావిత్రీ । యత్ర స వాయు స్తదాకాశో యత్ర వా ఆకాశ స్తద్వాయు । స్తే ద్వే యోని స్తదేకం మిథునమ్ ॥3

క స్సవితా కా సావిత్రీ। యజ్ఞ ఏవ సవితా ఛన్దాంసి సావిత్రీ। యత్ర యజ్ఞ స్తచ్ఛన్దాంసి । యత్ర వాచన్దాంసి స యజ్ఞ స్తే ద్వే యోని స్తదేకం మిథునమ్॥4

క స్సవితా కా సావిత్రీ । స్తనయిత్ను రేవ సవితా విద్యుత్సావిత్రీ । సయత్ర స్తనయిత్ను। స్తద్విద్యుద్యత్రవా । విద్యుత్తత్ర స్తనయిత్ను । స్తే ద్వే యోని స్తదేకం మిథునమ్ ॥5

క స్సవితా కా సావిత్రీ । ఆదిత్యఏవ సవితా ద్యౌ స్సావిత్రీ । స యత్రాదిత్యస్తద్ద్యౌర్యత్ర వాద్యౌ స్తదాదిత్య । స్తే ద్వే యోని స్తదేకం మిథునమ్ ॥6

క స్సవితా కా సావిత్రీ। చంద్రఏవ సవితా నక్షత్రాణి సావిత్రీ। స యత్ర చంద్ర స్తన్నక్షత్రాణి యత్ర వా నక్షత్రాణి స చన్ద్రమా। స్తేద్వే యోని స్తదేకం మిథునమ్॥7

క స్సవితా కా సావిత్రీ। మన ఏవ సవితా వా క్సావిత్రీ। స యత్ర మన స్తద్వా గ్యత్ర వాక్తన్మన। స్తేద్వే యోని స్తదేకం మిథునమ్॥8

క స్సవితా కా సావిత్రీ। పురుష సవితా స్త్రీ పావిత్రీ। స యత్ర పురుష స్తత్ స్త్రీ। యత్రవా స్త్రీ సపురుష। స్తేద్వే యే స్తదేకం మిథునమ్ ॥9

తస్యా ఏవ ప్రథమః పాదో భూ స్తత్సవితుర్వరేణ్య మిత్యర్వై వరేణ్యమాపో వరేణ్యమ్, చంద్రమా వరేణ్యం। తస్యా ఏవ ద్వితీయః పాద భర్గమయో భువో భర్గో దేవస్య ధీమహి త్యగ్నిర్వై భర్గ ఆదిత్యోవై భర్గశ్చంద్రమా భర్గః। తస్యా ఏషా తృతీయః పాదః స్వర్ధియో యో నః ప్రచోదయాదితి స్త్రీ చైవ పురుషశ్చ ప్రజనయతో యో వా ఏతాం సావిత్రీ మేవం వేద॥ స పునః మృత్యు జయతి॥10

ఈ ఉపనిషత్తు బల అతిబల విద్యను చెబుతోంది.

1. సవిత ఎవరు ? సావిత్రి ఎవరు ?

అగ్ని సవిత. పృథివి సావిత్రి. ఎక్కడ అగ్ని ఉంటుందో అక్కడ పృథివి ఉంటుంది. ఎక్కడ పృథివి ఉంటుందో అక్కడ అగ్ని ఉంటుంది. ఇది ఒక జంట.

**2. సవిత ఎవరు ? సావిత్రి ఎవరు ?**

వరుణుడు సవిత ఉదకము సావిత్రి.

ఎక్కడ వరుణుడు ఉంటే అక్కడ జలముంటుంది. ఎక్కడ జలముంటే అక్కడ వరుణుడుంటాడు. ఇది ఒక జంట.

3. వాయువు సవిత. ఆకాశము సావిత్రి. ఎక్కడ వాయువు వుంటుందో అక్కడ ఆకాశముంటుంది. ఇది ఒక జంట.

4. యజ్ఞము సవిత. ఛందస్సులు సావిత్రి. ఎక్కడ యజ్ఞముంటుందో అక్కడ ఛందస్సులుంటాయి. ఇది ఒక జంట.

5. మేఘము సవిత. మెరుపు సావిత్రి. ఎక్కడ మేఘముంటుందో అక్కడ మెరుపుంటుంది. ఇది ఒక జంట.

6. సూర్యుడు సవిత. స్వర్గము సావిత్రి. ఎక్కడ సూర్యుడుంటాడో అక్కడ స్వర్గముంటుంది. ఇది ఒక జంట.

7. చంద్రుడు సవిత నక్షత్రాలు సావిత్రి. ఎక్కడ చంద్రుడు ఉంటాడో అక్కడ నక్షత్రాలుంటాయి. ఎక్కడ నక్షత్రాలుంటాయో అక్కడ చంద్రుడుంటాడు. ఇది ఒక జంట.

8. మనస్సు సవిత వాక్కు సావిత్రి. ఎక్కడ మనస్సుంటుందో అక్కడ వాక్కుంటుంది. ఇది ఒక జంట.

9. పురుషుడు సవిత. స్త్రీ సావిత్రి. ఎక్కడ పురుషుడుంటాడో అక్కడ స్త్రీ ఉంటుంది. ఇది ఒక జంట.

10. దీనియొక్క ప్రథమ పాదము 'భూః తత్సవితుర్వరేణ్యం'

అగ్నివరేణ్యం. జలములు వరేణ్యం. చంద్రుడు వరేణ్యం.

దీనికి రెండవ పాదము. 'భువః భర్గోదేవస్య ధీమహి'

అగ్నిభర్గుడు. ఆదిత్యుడు భర్గుడు, చంద్రుడు భర్గుడు.

దీనికి మూడవ పాదము. 'సువః ధియోయోనః ప్రచోదయాతు'

స్త్రీ పురుష సంయోగంవల్ల సంతానం కలుగుతుంది. ఈ రకంగా సావిత్రిని తెలుసుకున్న వాడు మృత్యుంజయుడవుతాడు.

బల అతిబలలకు విరాట్పురుషుడు ఋషి। గాయత్రి ఛందస్సు। గాయత్రి దేవత। అకారం బీజం। ఉకారము శక్తిః। మకారము కీలకము. క్షుదాది నిరసనమున (ఆకలి బాధలు లేకుండా) జపే వినియోగః

క్లాం। క్లీం। క్లూం। క్లైం। క్లౌం। క్లః న్యాసము.

**ధ్యానము :**

**అమృతకరతలార్ద్రౌ సర్వసంజీవనాఢ్యా**
**వఘహరణ సుదక్షౌ వేదసారే మయూఖే**
**ప్రణవమయవికారౌ భాస్కరాకారదేహా**
**సతతమనుభవేహం తౌబలతీ బలేశా ॥**

**మంత్రము :**

**ఓం హ్రీం బలే మహాదేవీ హ్రీం మహాబలే**
**క్లీం చతుర్విధ పురుషార్థ సిద్ధిప్రదే తత్సవితుర్వరదాత్మికే**
**హ్రీం వరేణ్యం భర్గోదేవస్య వరదాత్మికే**
**అతిబలే సర్వదయామూర్తే బలే**
**సర్వక్షుద్భ్రమోపనాశిని ధీమహి ధియోయోనః**
**ర్జాతే ప్రచుర్యా ప్రచోదయాత్మికే ప్రణవ శిరసాత్మికే**
**హుం ఫట్ స్వాహా ॥**

ఈ మంత్రాన్ని తెలిసినవాడు అనగా ఈ మంత్రాన్ని ఉపాసన చేసినవాడు సావిత్రియొక్క సాలోక్యం పొందుతాడు.

# 59. అక్ష్యుపనిషత్తు

ఇది కృష్ణయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో 8 మంత్రాలున్నాయి. చాక్షుష్మతీ విద్యను చెబుతోంది ఈ ఉపనిషత్తు.

ఒకసారి సాంకృతముని ఆదిత్యలోకానికి వెళ్ళి ఆదిత్యుడికి నమస్కరించి చాక్షుష్మతీ విద్యతో అతన్ని స్తుతించాడు.

**ఓం నమో భగవతే శ్రీసూర్యాక్షితే జపే నమః**

**ఓం ఖేచరాయ నమః ఓం మహాసేనాయ నమః**

**ఓం తమసే నమః ఓం రజసే నమః ఓం సత్త్వాయ నమః**

**ఓం అసతోమా సద్గమయ, తమసోమా జ్యోతిర్గమయ**

**మృత్యోర్మామృతంగమయ ఉష్ణోభగవాన్ చ్ఛుచిరూపః**

**హంసోభగవాన్ చ్ఛుచిరూపః ప్రతిరూపః**

**విశ్వరూపం ఘృణినం జాతవేదసగ్ం**

**హిరణ్మయం జ్యోతిరూపం తపంతమ్**

**సహస్రరశ్మి శ్శతధావర్తమానః పురుష ప్రజానాముదయ త్యేష సూర్యః**

**ఓం నమో శ్రీ సూర్యాదిత్యాయాక్షితేజసేஉహోవాహినీవాహినీ వా స్వాహా।**

అక్షితేజస్వరూపుడైన సూర్యభగవానుడికి నమస్కారము. ఖేచరునకు నమస్కారము. మహాసేనుడికి, తమస్సుకు, రజస్సుకు, సత్త్వానికి నమస్కారము. నన్ను అసత్తు నుండి సత్తుకు తీసుకుని

వెళ్ళవలసింది. తమస్సునుంచి జ్యోతిస్సును పొందించవలసింది. మృత్యువును అమృతంగా చేయవలసింది. ఉష్ణుడైన భగవంతుడు, శుచిరూపుడు, హంసుడు, భగవంతుడు, శుచిరూపుడు, ప్రతిరూపుడు, విశ్వరూపుడు, ఘృణిగలవాడు, జాతవేదసుడు, హిరణ్మయుడు, జ్యోతిరూపుడు, ప్రకాశించేవాడు, వేయి కిరణాలు గలవాడు, అనేక విధాలుగా ఉన్నవాడు అయిన సూర్యుడు ప్రజలకోసం ఉదయిస్తున్నాడు.

భగవంతుడైన సూర్యుడికి, అక్షితేజస్స్వరూపుడైన ఆదిత్యుడికి నమస్కారము.

ఇలా చాక్షుష్మతీవిద్యతో స్తుతిచేశాడు. దానికి సూర్యనారాయణుడు ప్రీతి చెందినవాడై "చాక్షుష్మతీ విద్యను ప్రతిరోజూ పారాయణ చేసేవాడికి కంటిరోగము రాదు. అతని కులములో ఎవరూ అంధుడు కాడు. అతడు ఎనిమిది మంది బ్రాహ్మణులకు భోజనం పెట్టినట్లైతే విద్యాసిద్ధి అవుతుంది. ఈ విషయం తెలిసినవాడు గొప్ప వాడవుతాడు. అని చెప్పాడు.

ఆ తరువాత సాంకృతముని ఆదిత్యుణ్ణి బ్రహ్మవిద్యను ఉపదేశించమని అడిగాడు. సూర్యుడు చెప్పటం మొదలుపెట్టాడు. "ఓ సాంకృతమునీ ! దేనిని తెలుసుకున్నంత మాత్రం చేత జీవన్ముక్తుడవుతావో అటువంటి ఆత్మ విద్యను చెబుతాను వినవలసింది. తత్త్వజ్ఞానము తెలియటం చాలా కష్టం. సుదుర్లభము. సర్వము, ఏకము, అజము, శాంతము, అనంతము, ధ్రువము, అవ్యయము చిద్రూపము అయిన ఆ తత్త్వాన్ని తెలుసుకుని శాంతుడవై సుఖంగా ఉండవలసింది.

ఓ మునీ ! యోగయుక్తుడవై కర్మలు చెయ్యి అఇష్టంగా కర్మచెయ్యద్దు. వాసనల యందు వైరాగ్యము పొందు. ఉదారమైన

క్రియల యందు మాత్రమే ఆసక్తి కలిగి ఉండు. తృప్తిగా ఉండు. జడమైన పనులు ఎప్పుడూ చెయ్యవద్దు. పుణ్యకర్మలను మాత్రమే చెయ్యి. మృదువైన పనులు మాత్రమే చెయ్యి. ఉద్వేగమైన పనులు చెయ్యవద్దు. ఎప్పుడూ పాపానికి భయపడు. భోగాలు కోరవద్దు. స్నేహంగా, మృదువుగా, ఉచితమైన మాటలు మాత్రమే మాట్లాడు. మనోవాక్కాయ కర్మలచేత సజ్జనులను మాత్రమే సేవించు. సంసారం నుంచి తరించటానికి ప్రయత్నించు. ఆత్మానుభవం పొంటానికి అజ్ఞాన భూమికలను పూర్తిగా వదలి జ్ఞానభూమికలను ఒకదాని తరువాత ఒకటి స్వీకరిస్తూ ఉండాలి. విచారణ అనే భూమికలో ప్రవేశించినవాడు సదాచారము పాటించాలి. ధారణ ధ్యానము చేస్తుండాలి. పండితులను (జ్ఞానులను) ఆశ్రయించాలి. పదార్థ విభాగము చేసి వినవలసిన మాటలు మాత్రమే వినాలి. కార్యాకార్యనిర్ణయము చేసుకోవాలి. పాము కుబుసాన్ని వదిలినట్లుగా అరిషడ్వర్గాన్ని వదిలెయ్యాలి. ఈ స్థితిలో గురువుల దగ్గర యధార్థాన్ని తెలుసుకోవాలి. తరువాత అసంసర్గము అనే ఇంకొక భూమికను పొందినాడు ఆధ్యాత్మిక దృష్టితో తాపసాశ్రమము లక్ష్యంగా, రాతినే ఆసనంగా, శయ్యగా చేసుకుని అరణ్యాలలో తిరుగుతూ చిత్త శాంతి పొందాలి. శాస్త్రాలు బాగా అధ్యయనం చెయ్యటం వల్ల, పుణ్యకర్మలు చెయ్యటంవల్ల, వస్తువుల యందు యధార్థమైన దృష్టి వస్తుంది.

సామాన్యము అని శ్రేష్ఠము అని అసంసర్గము రెండు రకాలు. నేను కర్తను కాను, భోక్తను కాను, బాధ్యుడను కాను, బాధకుడను కాను ఇలా భావన చెయ్యటం సామాన్య అసంసర్గము. శబ్దార్థ భావన కలిగి, మౌన మనస్సు కలిగి శాంతముగా ఉండటము శ్రేష్ఠమైన అసంసర్గము అనబడుతుంది.

తృతీయ భూమిక శ్రేష్ఠమైనది. ఇక్కడ పురుషుడు సంకల్పాలను వదిలేస్తాడు. ఈ మూడు భూమికలు అభ్యాసము చేశాడు కాబట్టి అజ్ఞానము నాశనమవుతుంది. నాల్గవ భూమికలో ప్రవేవిస్తాడు. అన్నిటినీ సమానంగా చూస్తాడు. లోకాన్ని స్వప్నంలాగా చూస్తాడు. ఇప్పుడు ఐదవ భూమిక పొందుతాడు. ఇక్కడ చిత్తము లయమయిపోతుంది. కాబట్టి జగత్తు అనే వికల్పమే కలగదు. ఈ పంచ భూమికలో అద్వైత స్థితికి చేరతాడు. ఇక్కడ నుంచి క్రమంగా 'తుర్యాభిధ అనే ఆరవ భూమిక చేరతాడు. అసత్తు, సత్తు లేనివాడై, అహంకారము అనహంకారము లేనివాడై ద్వైతాన్ని పూర్తిగా నాశనం చేస్తాడు. సందేహాలు, భావాలు లేనివాడై జీవన్ముక్తుడవుతాడు. ఇప్పుడు ఏడవ భూమిక చేరతాడు. ఇది విదేహముక్తి. జీవన్ముక్తుడు – జీవించి ఉండగానే ముక్తుడయినవాడు. అంటే అన్ని బంధనాల నుంచి విడివడినవాడు. ఆయువు ఉన్నంత వరకు జీవించి ఉంటాడు. ఆయువు తీరిన తరువాత విదేహముక్తి పొందుతాడు.

కాబట్టి ఓ సాంకృతమునీ నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని అని భావన చేసి నీవుకూడా ముక్తుడవు కావలసింది. అని బ్రహ్మవిద్యను ఉపదేశించాడు ఆదిత్యుడు.

**గమనిక :** భూమికలు రెండు రకాలు 1. అజ్ఞాన భూమికలు 2. జ్ఞాన భూమికలు. వీటి వివరాలు కావాలంటే మహోపనిషత్తు చూడండి.

# ౬౦. అన్నపూర్ణోపనిషత్తు - 1

## మోక్షవిద్య

ఈ ఉపనిషత్తు అధర్వణ వేదానికి సంబంధించినది. ఇందులో ఐదు అధ్యాయాలు 43 మంత్రాలు ఉన్నాయి.

నిదాఘుడు ఒకయోగి. బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడు ఋభుడు. ఒకరోజున నిదాఘుడు ఋభుడి దగ్గరకు వెళ్ళి 'ఓ మహానుభావా! ఏ ఉపాసనతో నువ్వు ఇంత గొప్పవాడవయినావు? మోక్షాన్నిచ్చే ఆ మహావిద్యను నాక్కూడా చెప్పవలసింది' అన్నాడు. ఆ మాటలు విన్న ఋభుడు 'ఓ నిదాఘా ! నువ్వు అడిగిన ప్రకారము దేనిని గురించి తెలుసుకున్నంత మాత్రంచేత జీవన్ముక్తుడవుతావో, దానిని నీకు చెబుతాను. వినవలసింది' అంటూ చెప్పటం ప్రారంభించాడు.

**మూలశృంగాట మధ్యస్థా బిందునాద కళాశ్రితా**
**నిత్యానందా నిరాధారా విఖ్యాతా విలసత్కచా**
**విష్ణవే శ్రీమహాలక్ష్మీ కామస్తారో నతిస్తదా**
**భగవత్యర్ణపూర్ణేతి మమాభిలషితం తతః**
**అన్నందేహితతః స్వాహా । మంత్రసారేతి విశ్రుతా**
**సప్తవింశతి వర్ణాత్మా యోగినీగణసేవితా**

మూలశృంగాటము మధ్య నున్నది. బిందునాద కళాశ్రిత, నిత్యానందమయి, నిరాధారా, ప్రకాశించు కేశపాశములు గల దేవి ఉన్నది. ఆవిడ మంత్రానికి ముందుగా శ్రీమహాలక్ష్మి బీజము, తరువాత కామరాజబీజము, తారబీజము నమః పదము, భగవతి అన్నపూర్ణే మమ అభిలషితం, అన్నందేహి, స్వాహా మొత్తం 27 అక్షరాల మంత్రం

యోగినీ గణాలచే సేవించబడేది.

**ఐం హ్రీం సౌః శ్రీం క్లీం ఓం నమో భగవతి అన్నపూర్ణే**

**మమ అభిలషితం అన్నం దేహి స్వాహా**

ఈ మంత్రాన్ని మా తండ్రిగారు నాకు చెప్పారు. ప్రతిరోజు నియ నిష్ఠలతో నేను ఈ మంత్రజపం చేస్తున్నాను. ఇలా చాలారోజులు గడిచినాయి. ఆ దేవి నాకు ప్రత్యక్షమైంది. అన్నపూర్ణా విశాలాక్షి. చిరునవ్వు నవ్వుతున్న ముఖపద్మం గలది. ఆమెను చూసి నమస్కారం చేసి నుంచున్నాను. "ఓ వత్సా! కృతార్థుడైనావు. ఏం కావాలో కోరుకో' అన్నది. వెంటనే నేను 'అమ్మా ! ఆత్మతత్త్వము నాకు స్ఫురించాలి' అన్నాను. 'తథాస్తు' అని దీవించి, ఆ దేవి అంతర్ధానమైంది. అప్పుడు నాకు ఈ జగచ్చిత్రము అంతా కనిపించింది.

భ్రమ ఐదు రకాలు

1. ఈశ్వరుడు జీవుడు వేరు వేరు.
2. ఆత్మనిష్ఠమైన కర్తృగుణం వాస్తవమా ?
3. శరీరత్రయముతో కూడిన జీవుడు సంగమము కలవాడు.
4. జగత్కారణ రూపానికి వికారిత్వము
5. కారణము కన్న భిన్నమైన జగత్తు సత్యము.

ఈ ఐదు భ్రమలు వాటిని నివృత్తి నాకు స్ఫురించింది.

1. బింబ ప్రతిబింబ దర్శనముతో భేద భ్రమ తొలగిపోతుంది.
2. స్ఫటిక లోహిత దర్శనంతో పారమార్థిక భ్రమ తొలగిపోయింది.
3. ఘటమఠాకాశ దర్శనంతో సంగి అన్న భ్రమ తొలగిపోయింది.
4. రజ్జు సర్ప దర్శనంతో కారణ భిన్నజగత్తుకి సత్యత్వ భ్రమ

తొలగిపోయింది.

5. రుచక దర్శనంతో వికారిత్వ భ్రమ తొలగిపోయింది.

ఓ నిదాఘా ! ఇప్పుడు నా చిత్తము బ్రహ్మాకారమైంది. కాబట్టి నువ్వుకూడా అలాగే తత్త్వజ్ఞానం పొందవలసింది. అన్నాడు ఋభుడు ఇప్పుడు నీకు తత్త్వజ్ఞానాన్ని బోధిస్తాను. ఓ నిదాఘా ! నువ్వు మహాకర్తగ, మహాభోక్తగ, మహాత్యాగివిగా అవవలసింది. స్వస్వరూపానుసంధానము చేసి సుఖవంతుడవు కావలసినది. నేను ఆద్యము అనంతము అయిన బ్రహ్మను. ఈ దృశ్యజగత్తు నేను కాదు. ఇలా భావన చేసి నిర్మాణం పొంది శాంతి వృత్తిగలవాడివి కావలసింది. కంటికి కనిపించేదంతా లేనిదే అని భావించు. ఆకాశంలో గంధర్వ నగరము ఎలా కనిపిస్తుందో ఎడారులలో ఎండమావులు ఎలా ఉంటాయో, అదే విధంగా దృశ్యమానమైన ఈ జగత్తు పూర్తిగా భ్రాంతి, ఓ మునీశ్వరా! మనస్సుతో సహా ఆరు ఇంద్రియాలకు అతీతుడవై తన్మయుడవు కావలసింది. నాశనము లేనిది, చిదాకాశము, అంతటా వ్యాపించినది, అఖండము, అనంతము, అశేషము అయిన పరమాత్మయే నేను అని భావన చెయ్యి. చిత్తము భావనారహితమైనప్పుడు స్వస్వరూపము సాక్షాత్కరిస్తుంది. చిత్తం లయమయితే ఆత్మ దర్శన మవుతుంది. అటువంటి దృష్టి, దేహం ఉన్నా లేకపోయినా సమానంగానే ఉంటుంది.

ముక్తులకు కూడా తురీయాతీత, పర అనేది సంభవిస్తుంది. తెలిసినవాడికే ఇది జరుగుతుంది. కేవలము తెలియని వాడికి చెప్పటంవల్ల ఏదీ జరగదు. ప్రజ్ఞతో వాసనలను అన్నీ క్షీణిస్తాయి. అప్పుడు పుణ్యపదము కలుగుతుంది. ఇదంతా అనాత్మ అని భావించే వాడికి సమాధి స్థితి వస్తుంది.

పూర్వవాసనలు లేనివాడికి మాత్రమే మనసు ధ్యానం చేస్తుంది.

వాసనలు అనేవి అడ్డుగోడలు. పూర్వజన్మ వాసన ఉంటే కర్తృత్వ భావన ఉంటుంది. అది దుఃకాన్ని కలిగిస్తుంది కాబట్టి ఆ వాసనను తగ్గించాలి. అన్నింటియందు ఆత్మ భావనే కలిగి ఉండాలి. వాసనలు లేకపోయినట్లైతే పండితుడు పట్టణంలో ఉన్నా అడవిలో ఉన్నట్లే. అంతర్ముఖుడు కావటంవల్ల నిత్యము నిద్రపోతున్నా, మేల్కొని ఉన్నా, కూచున్నా, నుంచున్నా, ఏ పని చేస్తున్నా, గ్రామాన్ని కూడా అరణ్యంలాగానే చూస్తాడు. **అంతఃకరణ గనక శీతలంగా ఉంటే జగత్తంతా శీతలమవుతుంది. నీకు అసంతృప్తి ఉన్నట్లైతే ఈ జగత్తంతా దావాగ్నిలాగా ఉంటుంది.** ఏ ప్రాణికైనా సరే లోపల ఎలా ఉంటుందో బయటకూడా అలానే ఉంటుంది. కర్మలు చేస్తూనే ఆత్మయందే ప్రీతిగలవాడై, హర్షశోకాలకు వశము గానివాడు సమాహితుడు అనబడతాడు. అన్ని ప్రాణులను తనలాగా, పరద్రవ్యాన్ని మట్టిలాగా, చూచేవాడు ఏ రకంగాను కళంకం పొందడు. బురదలో పడిన బంగారంలాగా స్వచ్ఛంగా ఉంటాడు. నేనెవరు? ఇదంతా ఏమిటి? జనన మరణాలెక్కడివి? అని నీకు నువ్వే ఆలోచించుకోవాలి. ఇలా ఆలోచించి దోషరహితమై శాంతిని పొందవలసింది. దోషరాహిత్యమైన మనస్సు సంసార వృత్తులందు నిమగ్నం కాదు. ఆవు కాలి గుర్తులో ఏనుగు పాదం పట్టదు. ఈ రకంగా అన్నింటినీ వదిలేస్తే మిగిలేది పరమాత్మే. వాసనలు వదలనంత వరకు ఆత్మ లభ్యం కాదు. అన్నింటినీ వదిలి వేయగా మిగిలేది ఆత్మ. ఆత్మ దర్శనం కావాలంటే అన్నింటినీ వదిలెయ్యాలి. దృశ్యము అనేది ఏ కొంచెమైనా మిగిలితే, అది జగత్తులోనే. బ్రహ్మజ్ఞాన స్వరూపం దానికి స్పందన ఉండదు. బ్రహ్మకన్న వేరైనది ఏదీ శాశ్వతము కాదు. ఉన్నది ఉన్నట్లుగా చూసేది పరాప్రజ్ఞ. అహంకారం లేనిది, స్థిరమైనది. ద్వంద్వములందు చలించనిది సమాధి.

నిశ్చితమైనది, అభీష్టము లేనిది, హేయము ఉపాధేయము లేనిది సమాధి. మనస్సు, అహంకారము పోయినట్లైతే పరమేశ్వర రూపం ఉదయిస్తుంది. మనస్సుతోనే మనస్సును జయించి అది పొందబడుతుంది. వాసనలు నశిస్తే చిత్తు ప్రకాశిస్తుంది. అప్పుడు సాధకుడికి ఆత్మసాక్షాత్కారము కలుగుతుంది. అన్నాడు ఋభుడు.

ఇప్పుడు నిదాఘుడు అడుగుతున్నాడు. "ఓ మహర్షీ! మీరు చెప్పిన విషయాలు బాగానే ఉన్నాయి. కాని మానవుడికి బంధాలు ఉంటాయి కదా? ఆ బంధాలు తొలగించుకుని మోక్షమార్గం వైపుకి వెళ్ళటం ఎలా? ఋభుడు చెబుతున్నాడు. 'నిదాఘా ! దేహం మీద విశ్వాసముంటే బంధమనేది ఉంటుంది. సర్వము ఆత్మస్వరూపమే. నేను దేన్నీ కోరను. అని గట్టిగా భావించాలి. అన్నీ ఆత్మ స్వరూపము అన్నప్పుడు నువ్వూ ఆత్మే. నీ కోరికా ఆత్మే. మరి ఇంకా నువ్వు కోరేది దేన్ని? ఈ విషయం ఆలోచించాలి. నేను ఇతరుడు కాదు. ఇతరుడు నేను వేరువేరు కాదు. నేను పరబ్రహ్మ స్వరూపాన్ని ఎప్పుడూ ఇలా భావన చేస్తుంటే బంధాలుండవు. అప్పుడు కర్మలు చెయ్యడు. కర్మ చెయ్యకపోవటం గొప్పతనము అని అనడు. కర్మలన్నీ వదిలేశాడు. కర్మఫలాలు వదిలేశాడు. కర్మ చేస్తాడు. కాని కర్మఫలాన్ని ఆశించడు. అంటే కర్మఫల త్యాగం చేస్తాడు. ఇటువంటివాణ్ణి 'అసంసక్తుడు' అంటారు. కర్మలయందు, వస్తువుల యందు దేనియందు ఆసక్తి కలిగి ఉండరాదు. ఎప్పుడైతే ఆత్మ రుచి తెలుసుకున్నాడో అప్పుడు సంసారము నిస్సారముగా ఉంటుంది.

జగత్తులో ఈయన కర్మలు చేసినా చేయకపోయినా ఒకటే అని భావిస్తాడు. ఇలా భావిస్తూ, దేహము జీవుడు ఒకటికాదు. ఆత్మ సర్వవ్యాపి. నేను ఆత్మస్వరూపుణ్ణి అని భావించాలి. లోకంలో ఏం

జరిగినా లేకపోయినా జీవుడు మాత్రం తన ఆత్మయందు నిష్టుడై ఉండాలి. చిత్తము చైతన్యహీనంగా ఉండాలి. చిత్తములో సంకల్పాలు విరమించటమే. సంకల్పాలు పోయిన మరుక్షణంలోనే అతడు ముక్తుడవుతాడు. అతడికి ఏ రకమైన బంధాలు ఉండవు.

ఆత్మ అనేది అన్నింటికీ అతీతమైనది. సర్వత్రా వ్యాపించింది. అలాంటప్పుడు మరి బంధమేమిటి మోక్షమేమిటి? నిరంతరము ఆధ్యాత్మిక భావనలోనే ఉండేవాడు, పవిత్రమైన మనస్సు కలవాడు, దేనీ కోరడు, సర్వానికీ అధిష్టానమైన చిన్మాత్ర యందు ఏ జీవుడు స్నేహం కలిగి ఉంటాడో అతడు జీవన్ముక్తుడు. అతడు జరిగిపోయిన దాన్ని తలచడు. వర్తమానం ఆలోచించడు. భవిష్యత్తు ఇలా ఉండాలి. అనుకోడు. అతడి మనస్సు దేనితోను నిండి ఉండదు. అసలు మనస్సే ఉండదు. అతడు బాలురయందు బాలుడు, వృద్ధులయందు వృద్ధుడు ధీరులయందు ధైర్యవంతుడు, యువకుల యందు యువకుడు. మహాదానందము గలవాడు. అతడి మనస్సు ప్రశాంతంగా ఉంటుంది. జగత్తులో ఏదీ లేదు ఉన్నది ఒక్కటే. అదే పరమాత్మ. అదే నేను. అని భావన చేస్తాడు. దీన్నే సమ్యగ్జ్ఞానము అంటారు.

**విదేహముక్తి జీవన్ముక్తి :** నిదాఘుడు అడుగుతున్నాడు. స్వామి! జీవన్ముక్తి ఏది? విదేహముక్తి ఏది? వివరించండి. అన్నాడు. చెబుతున్నాడు ఋభుడు.

# అన్నపూర్ణోపనిషత్తు - 2

## జీవన్ముక్తి, విదేహముక్తి

జీవించి ఉండగానే ముక్తి పొందటం జీవన్ముక్తి. అటువంటివాడు ఆయుష్షు ఉన్నంతవరకు జీవించి ఆ తరువాత ఈ దేహాన్ని విడిచి పరబ్రహ్మలో ఐక్యము పొందుతాడు. ఈ రకంగా దేహాన్ని విడిచి పరమాత్మలో లీనం కావటాన్నే విదేహముక్తి అంటారు. ఈ విషయాలు మహోపనిషత్తులో కూడా ఉన్నాయి.

ఆత్మ అనేది అణువుకన్న చిన్నది, ఆకాశంకన్న పెద్దది. ఈ చిద్వస్తువునందు అనంతకోటి బ్రహ్మాండ రేణువులు ఉత్పత్తి స్థితిలయము పొందుతుంటాయి. బయటకు శూన్యంగా కనిపిస్తుంది కాబట్టి పరబ్రహ్మ ఆకాశము అని చెప్పబడుతున్నది. చిత్ స్వరూపముగా ఉన్నది కాబట్టి బ్రహ్మము ఆకాశముకన్న విలక్షణమైనది. అయితే బ్రహ్మము ఆకాశంకాదు. ఆకాశములేనిది. అదియే సత్తు చిత్తు. ఆత్మవస్తువు స్వయంప్రకాశ స్వరూపము. విజ్ఞాన ఘనమైన శిలాసదృశమైనది. ఆకాశంలాగా స్వస్వరూపంలో తదధిష్ఠానముగా అనుభూతమై ఉన్నది. చిత్రవిచిత్రితముగా ఉన్న ఈ జగత్తుయొక్క వికాసాన్ని భేదిస్తున్నది. ఈ విశ్వము తత్పద లక్షణముగా ఉన్న పరమాత్మయొక్క ప్రకాశమాత్రము. అందువల్ల ఈ విశ్వము ఆత్మకన్న ప్రత్యేకమైన సత్తుగలది. ఈ జగత్తుయొక్క భేదభావముకూడా ఆత్మయందే ప్రకాశిస్తుంది. ఈ భేదమంతా ఆత్మమయమైనది. అధిష్ఠాన రూపంలో ఈ ఆత్మ అన్నింటితోనూ సంబంధం కలిగి ఉన్నది. జాతి గుణ క్రియాదులు ఆత్మకు లేవు. ఆత్మ త్రికాలబాధ్యమై సత్యమై ఉన్నది. అదే విజ్ఞానానంద స్వరూపమగు పరబ్రహ్మ. త్యాగమూర్తులకు అది పరమగతి.

సర్వసంకల్పాలను వదలివేసి శుద్ధమనస్సుతో ఆ ఆత్మను గ్రహించాలి. జాగ్రదావస్థలో ఉన్నప్పుడు ఎవరికి దృశ్యజ్ఞానము నశిస్తుందో, అతని యొక్క స్థితినే 'జ్ఞానము' అంటారు. వృత్తి జ్ఞానము లేకపోవుటయే జ్ఞానము. ఈ విషయాలను తెలుసుకున్నవాడు జీవన్ముక్తుడు. దృశ్యములేదు అనే ఆత్మజ్ఞానంతో, మనసులో ఉన్న దృశ్యభావాలను తుడిచి వేసినట్లైతే తక్షణమే మహోన్నతమైన నిర్వాణసుఖము ఉత్పన్నమవుతుంది. వాసనలను అంటే రాగద్వేషాలను సంపూర్ణంగా త్యజించటమే మోక్షము. ఎవరైతే పరిశుద్ధ వాసనలతో నిండి ఉన్నారో, వారు తిరిగి జనన మరణాలు పొందరు. వాళ్ళు యధార్థాన్ని తెలుసుకోగలుగుతారు. వారే జీవన్ముక్తులు. దృఢమైన విషయ చింతనయే బంధము. వాసనాక్షయమే మోక్షము. దేహ, లోక, శాస్త్రవాసనలే సర్వవాసనలు.

తపస్సు మొదలైన సాధనలు చేయకుండానే సహజముగా ఎవరికి భోగాలు ఇష్టం ఉండవో, వారు జీవన్ముక్తులు. కాలానుగుణంగా సుఖదుఃఖాలు అనుభవిస్తున్నప్పటికీ, సంతోషము, విషాదము పొందనివాడు జీవన్ముక్తుడు. హర్షము (సంతోషము) అమర్షము (ఓర్వలేనితనము), భయము, క్రోధము, కామము, కార్పణ్యము వంటివి లేనివాడు జీవన్ముక్తుడు. అహంకారాన్ని వదిలి, దృశ్యమును కూడా త్యాగం చేసినవాడు జీవన్ముక్తుడు. అంతర్ముఖుడై ఇష్టాయిష్టములు లేకుండా ఉండేవాడు. సుషుప్తావస్థలో ఉన్నవాడులాగా సంచరించేవాడు. జీవన్ముక్తుడు. ఎప్పుడూ ఆత్మానందం పొందేవాడు, మనసును పవిత్రంగా ఉంచుకునేవాడు, జీవన్ముక్తుడు. ఏ కోరికలు లేకుండా ఉండేవాడు జీవన్ముక్తుడు.

ఆకాశంలాగా ఎవరి హృదయము దృశ్యవిషయముల యందు

సంగమము కాకుండా ఉంటుందో, ఎవరిబుద్ధి జడముకాదో, ఎవడు చైతన్యవంతుడో వాడు జీవన్ముక్తుడు. రాగద్వేషాలను, సుఖదుఃఖాలను, లక్ష్యం చెయ్యకుండా, కోరికలు లేకుండా, నిష్కామ్యభావనతో సత్కర్యలు చేసేవాడు జీవన్ముక్తుడు. మౌనమే దీక్షగా గలవాడు, అహంభావం లేనివాడు, సంకల్పాలు, ఉద్వేగాలు లేకుండా కర్తవ్య కర్మలు చేసేవాడు జీవన్ముక్తుడు. సర్వత్ర విగతస్నేహితుడై సాక్షీభావముతో ఉండేవాడు, ఇచ్ఛారహితుడై సత్కర్మలు చేసేవాడు జీవన్ముక్తుడు. మనసునందు ధర్మాధర్మాలను, సమస్త సంకల్పాలను, ఇష్టాఇష్టాలను అన్నింటినీ వదలివేసినాడు జీవన్ముక్తుడు. కంటికి కనిపిస్తున్న ఈ దృశ్య ప్రపంచాన్ని సమ్యక్‌దృష్టితో పరిత్యజించిన వాడు జీవన్ముక్తుడు. కారము, పులుపు, ఉప్పు, చేదు, రుచి, అరుచి వీటన్నింటినీ సమభావంతో భుజించే వాడు జీవన్ముక్తుడు. వార్ధక్యము, మరణము, ఆపద, రాజ్యము, దరిద్రము వీటన్నింటినీ సమభావంతో అనుభవించేవాడు జీవన్ముక్తుడు.

ధర్మాధర్మాలు, సుఖదుఃఖాలు, జరామరణాలు, సంపూర్ణంగా, బుద్ధిపూర్వకంగా త్యాగం చేసినవాడు జీవన్ముక్తుడు. ఉద్వేగము, ఆనందము లేకుండా స్వచ్ఛమైన సమత్వ బుద్ధి గలిగి, పొంగిపోవటము, క్రుంగిపోవటము, లేకుండా ఉన్నవాడు జీవన్ముక్తుడు. సర్వేచ్ఛలను, సంశయాలను, ప్రయత్నాలను, నిశ్చయాలను జ్ఞానబుద్ధితో పరిత్యజించినవాడు జీవన్ముక్తుడు. సృష్టి స్థితి లయాలయందు ఉదయాస్తమయాదు లందు, భావాభావములందు, సమభావంతో ఉండేవాడు జీవన్ముక్తుడు. కొంచెము కూడా ద్వేషించకుండా, కాంక్షించకుండా, రాగద్వేషాలు లేనివాడు, ప్రారబ్ధకర్మలు అనుభవించనివాడు జీవన్ముక్తుడు. సంసార సంకులములో శాంతుడై ఉండేవాడు, కళాయుక్తుడై కూడా నిష్కళుడై ఉండేవాడు, మనసు

ఉండికూడా అమనస్కుడై ఉండేవాడు జీవన్ముక్తుడు. సమస్త సంపదలయందు, సమస్త వ్యవహారముల యందు ఉండికూడా వాటి స్పృహలేనివాడు జీవన్ముక్తుడు.

జీవన్ముక్తుడు తన శరీరం పడిపోయిన సమయంలో, శ్వాస ఆగిపోయిన వెంటనే జీవన్ముక్త పదవిని దాటి విదేహముక్త పదవిని చేరతాడు. విదేహముక్తుడికి జనన మరణాలుండవు. అతడు నిర్వికారుడు, సత్తుకాడు అసత్తు కాడు. దూరము కాడు, దగ్గరాకాడు. అహము కాదు, తదితరము కాదు.

జీవన్ముక్తుని పరిస్థితి ఎలా ఉంటుందంటే, అత్యంత నిశ్చలము, మహాగంభీరము. అది ప్రకాశము కాదు, చీకటికాదు. మహావ్యాపకమై సర్వత్ర నిండి ఉంటుంది. అనాఖ్యముగా, అనభివ్యక్తముగా, అతీతముగా ఉంటుంది. అది శూన్యము కాదు. సాకారము కాదు. దృశ్యము కాదు, దర్శనము కాదు, భూతపదార్థ సముదాయము కాదు. కేవలసత్తా మాత్రము. అనంతరూపంలో కలిసి ఉంటుంది. ఇదమిద్ధమని చెప్పటానికి వీలుండదు. పరిపూర్ణముకన్న అధిక పరిపూర్ణముగా ఉంటుంది. సత్తు కాదు అసత్తుకాదు సదసత్తు కాదు. భావన కాదు భావము కాదు. కేవల చిత్ పదార్థము. మహాచైతన్యము. అనంతమై, అజరమై, శివమై, ఆది మధ్యాంత రహితమై, నిరామయై ఉన్నది. అది అనాదిగా ఉన్న సత్యపదార్థము. ద్రష్ట దర్శనము, దృశ్యము అనే త్రిపుటి మధ్య భాగంలో కేవల దర్శనము ఏదైతే ఉన్నదో అది. దీనికన్న గొప్పది ఉత్తమమైనది ఏదీలేదు.

# 61. కౌషీతకీ ఉపనిషత్తు - 1
## ప్రాణమే బ్రహ్మ

ప్రాణవాయువే బ్రహ్మము అని చెబుతోంది కౌషీతకీ ఉపనిషత్తు. ప్రాణ బ్రహ్మమే సంకల్పంచేత మనస్సు అవుతోంది. మాట్లాడటానికి వాగింద్రియము (నోరు) ఉంది. చూడటానికి కళ్ళు, వినటానికి చెవులు ఉన్నాయి. ప్రాణమే బ్రహ్మ అని గుర్తించిన వాళ్ళకి దేవతలంతా దర్శనమిస్తారు. సిరిసంపదలు ఇస్తారు. జీవులందరూ ప్రాణ బ్రహ్మానికి వారి సంపదలిచ్చి పూజిస్తారు. ఈ విషయం తెలుసుకున్నవారు ఎవరి దగ్గర ఏమీ తీసుకోరాదు. యాచన చేయరాదు. యాచన చేసేవారికి గౌరవము ఉండదు.

ప్రాణబ్రహ్మాన్ని 'పైంగ్యః' అంటారు. ఇది అంతర్యామిగా ఉంది. ఈ ప్రాణమే వాక్కును పలికిస్తుంది. కళ్ళను చూసేటట్లుగా, చెవులు వినేట్లుగా, మనసు ఆలోచించేట్లుగా చేస్తుంది. సర్వమూ ప్రాణబ్రహ్మామే. దీనికి దేవతలంతా తమ తమ శక్తులు సమర్పిస్తారు. జీవులు తమ భక్తిని అర్పిస్తారు. ఈ విషయం తెలిసిన వారు ఎవరినీ యాచించరు. ఒకగ్రామంలో ఒక వ్యక్తి ఎన్నాళ్ళు యాచన చేసినా ఏమీ లభించలేదు. అతడు ఈ విషయం తెలుసుకున్నాడు. ఇప్పుడు ఆ గ్రామంలోని వారంతా అతన్ని అమితమైన గౌరవంతో చూస్తున్నారు. యాచన చెయ్యకుండా ఉండటము మహాభాగ్యము.

# కౌషీతకీ ఉపనిషత్తు - 2
## ప్రత్యేక భోగాలు

ప్రత్యేకమైన భోగాలు కోరేవారు. ఇప్పుడు చెప్పబోయే యజ్ఞం చెయ్యాలి. పౌర్ణమి రోజునగాని, అమావాస్య రోజున గాని, శుక్ల

పక్షంలోని మంచి తిథులందు గాని, ఈ యజ్ఞం ప్రారంభించాలి. పవిత్రమైన ప్రదేశంలో ఊడ్చి శుభ్రం చేసి అగ్నిప్రతిష్ఠాపన చెయ్యాలి. కుడికాలు వంచి స్రువంతోగాని, కంచుపాత్రతో గాని ఆజ్యం పొయ్యాలి. ఇలా స్వాహాకారంతో దేవతకు ఆహుతులు ఇవ్వాలి. ప్రాణదేవత నాకు కావలసిన ఈ భోగము ప్రసాదించుగాక. అంటూ ఆహుతులివ్వాలి. శ్రవణేంద్రియ దేవత నాకీ భోగము ప్రసాదించుగాక. మనోధిదేవత నాకీ భోగము ప్రసాదించుగాక. బుద్ధి దేవత నాకీ భోగము ప్రసాదించునుగాక. ఇలా ఆహుతులు సమర్పించి, ఆ ధూమాన్ని వాసన చూసి, చేతిలో ఉన్న ఆజ్యము పూర్తిగా అగ్నిలో వేసి చేతులు కడుక్కుని ఈ భావాలన్నీ సంకల్పం చేస్తే – కోరిన భోగాలు లభిస్తాయి.

## కౌషీతకీ ఉపనిషత్తు - 3
## ఇతరుల అభిమానము సంపాదించటము

'దైవస్మరః' అనే దివ్య మహిమలు సంపాదించవచ్చు. ఒక పురుషుడు కాని, స్త్రీగాని నిన్ను ప్రేమించవలసి వచ్చినప్పుడు లేదా ఎక్కువమంది నిన్ను ప్రేమించాల్సినప్పుడు ఇందాక చెప్పినట్లే యజ్ఞం చెయ్యాలి. ఓ దేవా! నీవాక్శక్తి, నేత్రశక్తి, శ్రోత్ర శక్తి, నాలో లభించుగాక. నీ మానవతేజస్సు నాలో లభించు గాక. నీ బుద్ధి నాలో లభించుగాక. అంటూ ఆహుతులు సమర్పించి, తరువాత శరీరమంతా ఆజ్యం రాచుకోవాలి. అగ్నికుండం దగ్గర నుంచుని తన కోరిక తెలియచెయ్యాలి. అప్పుడు అందరూ ఇతణ్ణి గౌరవిస్తారు.

## కౌషీతకీ ఉపనిషత్తు - 4
## ఇంద్రియ నిగ్రహము

అంతర్యజ్ఞానికి 'ప్రాతర్దనము' అని పేరు. మాట్లాడేటప్పుడు శ్వాస

పని చెయ్యదు. అప్పుడు ప్రాణశ్వాస వాక్కులో ఆహుతి అవుతుంది. గాలి పీల్చేటప్పుడు మాట్లాడలేడు. మానవుడు ఏ అవస్థలో అయినా సరే నిరంతరము ఆహుతులు ఇస్తూనే ఉంటాడు. అలాంటివారికి బహిరంగంగా చేసే ఆహుతులన్నీ అంతమయ్యే కర్మలు. ఈ విషయం తెలిసిన మహర్షులు బహిరంగ కర్మలయిన అగ్నిహోత్రం చేస్తున్నారు.

## కౌషీతకీ ఉపనిషత్తు - 5

### పాపాలు పోవటానికి ప్రతిరోజూ సూర్యారాధన

యజ్ఞోపవీతాన్ని మామూలుగా వేసుకుని ఉదకపాత్ర మీద మూడుసార్లు నీరు చల్లి 'ఓ సూర్యదేవా ! నువ్వు మా పాపాలు పోగొట్టేవాడిని. నేను చేసిన అన్ని పాపాలను నాశనం చెయ్యవలసింది' అని మూడు సంధ్యలయందు సూర్యుణ్ణి ప్రార్థించాలి. అలాచేస్తే ఎప్పుడు చేసిన పాపాలు అప్పుడే క్షయమయి పోతాయి.

## కౌషీతకీ ఉపనిషత్తు - 6

### మరణించే సమయంలో తండ్రి తన మహిమలను కుమారున కివ్వటం

మరణించటానికి ముందు తండ్రి కుమారుణ్ణి పిలిచి, ఇల్లు శుభ్రం చేయించి, అగ్నిప్రతిష్టాపన చేసి, పుత్రుని శరీరమంతా తన చేత్తో తుడిచి 'కుమారా! నా వాక్కును నీలో ప్రవేశపెడుతున్నాను' అంటాడు. అప్పుడు కుమారుడు 'నాలో ప్రవేశపెట్టబడిన నీవాక్కును గ్రహించాను' అంటాడు.

తండ్రి : నా ప్రాణశక్తిని నీలో ప్రవేశపెడుతున్నాను.

కు : నీ ప్రాణశక్తిని గ్రహించాను.

తండ్రి : నా నేత్రశక్తి, శ్రవణశక్తి, జిహ్వాశక్తి, కర్మఫలము, సుఖదుఃఖాలు, ఆనందము, రతి, సంతతి, మనసు, బుద్ధి, ప్రాణశక్తి, ఇలా తండ్రి తనలో ఉన్న ప్రతిశక్తిని పేరు పేరునా చెప్పి కుమారునిలో ప్రవేశపెడతాడు. కుమారుడు వాటిని స్వీకరించాను అని చెబుతాడు.

తండ్రి : కుమారా ! బ్రహ్మవర్చస్సు కలిగి కీర్తిప్రతిష్టలు పొందు. సర్వసౌఖ్యములు నీకు లభించుగాక. నా సర్వస్వము నీకు లభిస్తుంది. నేను జీవించినా, మరణించినా, నా సర్వస్వము నీకే లభిస్తుంది. అని చెబుతాడు.

# కౌషీతకీ ఉపనిషత్తు - 7

## ప్రతర్దనుడు

దివోదాసుని కుమారుడు దైవోదాసి. ఇతడి అసలు పేరు ప్రతర్దనుడు. ఒకసారి ఇంద్రుడి భవనానికి వెళ్ళాడు. ఇంద్రుడు ప్రవతర్దనుడిని చూసి 'ఓ ప్రతర్దనా! నీకేం కావాలో కోరుకో అన్నాడు' దానికి ప్రతర్దనుడు 'ఓ ఇంద్రా! నువు చాలా గొప్పవాడివి. నాకేం కావాలో నీకు తెలుసు కదా! అందుకని నాకు కావలసింది నువ్వే ఇవ్వు' అన్నాడు. ఆ మాటలు విన్న ఇంద్రుడు 'ఓ ప్రతర్దనా ! ఉత్తమమైన వరం మనుషుల కివ్వటం సాధ్యంకాదు. కాబట్టి నీకు కావలసింది నువ్వే కోరుకో అన్నాడు. అప్పుడు ప్రతర్దనుడు 'దేవేంద్రా! నువ్వు చెప్పినట్లే చేస్తాను. దేవేంద్రుడు చాలా గొప్పవాడు. అతడు సత్యస్వరూపుడు' అన్నాడు. చాలా సంతోషించాడు ఇంద్రుడు. "ఇంత కాలానికి నన్ను అర్థం చేసుకున్న వారు కనిపించారు. మానవులకు నేను ప్రియమైన వాడిని. త్వష్టకుమారుడు త్రిశిరుడిని చంపేశాను. వృత్రాసురుని చంపాను. అవాఙ్ముఖులను వేటకుక్కలకు ఆహారంగా

వేశాను. అనేక జీవులకు ఉత్తమగతులిచ్చాను. ప్రహ్లాదుడి రాజ్యంలోని ప్రజలకు దివ్యలోకాలిచ్చాను. పౌలోములకు, కాలకాశ్యులకు దేవలోకాన్నిచ్చాను. నాకు ఏ అపకారము జరగలేదు. నన్ను అర్థం చేసుకున్న వారికి ఏ రకమైన పాపాలు అంటవు." అంటూ ప్రతర్దనుడికి ఇంద్రుడు తన గొప్పదనాన్ని వివరించాడు. ఇంకా చెబుతున్నాడు. ఓ ప్రతర్దనా ! ప్రాణచైతన్యమే ప్రధాన తత్త్వము చెబుతాను విను.

నేనే ప్రాణాత్మని ప్రజాత్మని కూడా. కాబట్టి ఆయువుగా, అమృతమూర్తిగా నన్ను ఉపాసించవలసింది. జీవచైతన్యము శ్వాసరూపంలో ఉంది. శ్వాసే జీవాత్మ. జీవాత్మకు మరణం లేదు. దేహంలో శ్వాస ఆడుతున్నంత వరకే మానవుడు జీవించి ఉంటాడు. శ్వాసచైతన్యంతోనే జీవాత్మ ఈ లోకంలో అమరత్వం పొందుతుంది. కాబట్టి నన్ను జీవాత్మగా ఉపాసించే వారు స్వర్గం చేరతారు. ఇక్కడ ఒక చిన్న అభిప్రాయం ఉంది. 'ప్రాణశ్వాస నిరంతరము అనంత ప్రాణంలో కలుస్తుంది' అని నీ ప్రాణశక్తి గనక అనంత ప్రాణచైతన్యంతో సంబంధం పెట్టుకోకపోతే వాగింద్రియము మాట్లాడలేదు. అలాగే కన్ను చూడలేదు. చెవి వినలేదు. మనస్సు ఆలోచించలేదు. పంచప్రాణాలు ఐకమత్యంగా ఉండి ప్రాణాన్ని నడిపిస్తున్నాయి. ఇంద్రియాలను పని చేయిస్తున్నాయి. మాట్లాడే సమయంలో, చూసేటప్పుడు, వినేటప్పుడు ఆలోచించేటప్పుడు పంచప్రాణాలు ఐకమత్యముతో పని చేస్తాయి. విశ్వాసనిచ్ఛాస్వ సమయంలో కూడా పంచప్రాణాలు ఐకమత్యంగానే పని చేస్తాయి. అందువల్ల ప్రాణచైతన్యము ప్రధాన తత్త్వము" అని దేవేంద్రుడు ప్రతర్దనుడికి చెప్పాడు.

# కౌషీతకీ ఉపనిషత్తు - 8

## ప్రాణము యధార్థ తత్త్వము

నోరుపని చెయ్యదు. అలాటి మూగవాడుగా తన పని తాను చేసుకుంటాడు. కన్ను పనిచెయ్యదు. గ్రుడ్డివాడుగా ఉంటాడు. చెవులు పని చెయ్యవు చెవిటివాడుగా ఉంటాడు. మనస్సు పని చెయ్యకపోతే పిచ్చివాడవుతాడు. కాలు లేకపోతే కుంటివాడు వీరంతా ఇలాగే జీవిస్తారు. కాని ప్రాణం లేకపోతే ఇంక ఏమీ ఉండదు. కాబట్టి ప్రాణమే అన్ని ఇంద్రియాలలోను జ్యేష్ఠము, శ్రేష్ఠము అయినది. అని గతంలో చెప్పుకున్నాం. కాబట్టి ప్రాణం లేకపోతే శరీరంలో చలనం ఉండదు. బుద్ధి ప్రజ్ఞ ప్రాణాత్మ. ఇవన్నీ ఒకటిగా పని చేస్తాయి. ఇదే సుషుప్తి. ఈ స్థితిలో ఏమీ ఉండదు కలలు రావు, వాగేంద్రియము, శ్రవణేంద్రియము, నేత్రేంద్రియము ఇవన్నీ ప్రాణంలో లీనమై పోతాయి. నిద్రనుంచి లేవగానే ఇంద్రియాలన్నింటికీ ప్రాణశక్తిని ప్రసరింప చేస్తుంది ప్రాణము, దాంతో అవన్నీ చైతన్యవంతమై పని చేస్తాయి. అందుకే ప్రాణాత్మను బుద్ధిశక్తిని ఉపాసించాలి. ప్రాణమే అన్నింటినీ రక్షించేది. కాబట్టి మానవుడు ప్రాణాత్మను ఉపాసించాలి.

దేహాన్ని వదిలి వేళ్ళేటప్పుడు కూడా జీవుడు ఇప్పుడు మనం చెప్పుకోబోయేవన్నీ వెంట తీసుకుపోతున్నాడు. అన్ని రకాల వాసనలు ప్రాణశక్తితో తీసుకుపోతున్నాడు.

వాగింద్రియము వాక్కుతో సంపాదించిన వాసనలన్నీ ఇస్తుంది. ప్రాణశక్తి తాను ఆర్జించిన వాసనలన్నీ ఇస్తుంది. నేత్రేంద్రియము నేత్రాలలో తాను ఆర్జించిన వాసనలు ఇస్తుంది. శ్రోత్రేంద్రియము చెవులతో తాను ఆర్జించిన వాసనలిస్తుంది. మనస్సు తాను ఆర్జించిన

సంకల్ప వాసన లిస్తుంది. ఈ రకంగా ప్రాణాత్మ అన్నింటినీ తీసుకుంటుంది. ప్రాణాత్మే బుద్ధి, ప్రజ్ఞగా పనిచేస్తోంది. బుద్ధిప్రజ్ఞయే ప్రాణాత్మగా పని చేస్తున్నాయి. ఈ రకంగా ఈ రెండూ కలిసే దేహంలో నివశిస్తున్నాయి. ఈ దేహాన్ని విడిచి వెళ్ళేటప్పుడు కూడా ఈ రెండూ కలిసే ప్రయాణం చేస్తాయి. అన్ని జీవులలోను ఉన్న బుద్ధి, ప్రజ్ఞ రెండూ ఏ రకంగా వ్యాపించి ఉంటాయో చూద్దాం.

వాగింద్రియము ఇందులో ఒక భాగంగా ఉంటుంది. దానికి నామము భూతమాత్రా. ఘ్రాణము ఇంకొక భాగంగా చెప్పబడుతుంది. ఘ్రాణానికి గంధము భూతమాత్ర. (బాహ్యరూపము). నేత్రేంద్రియము ఒక భాగము. దానికి రూపము బాహ్యరూపము. శ్రవణేంద్రియము ఇంకొక భాగము. దానికి శబ్దము బాహ్యరూపము. జిహ్వేంద్రియము ఇంకొక భాగము. దానికి రుచి బాహ్యరూపము. రెండు చేతులు ఒక భాగము. దానికి మనం చేసే కర్మ బాహ్యరూపము. ఉపస్థ ఇంకో భాగము. ఆనందము, రతి, సంతానోత్పత్తి దానికి బాహ్యరూపాలు. రెండుపాదాలు ఇంకో భాగము. నడచుట దాని బాహ్యరూపము. అంతః కరణ ఇంకో భాగము. కోరికలు దాని బాహ్యరూపము. ఇలా అన్ని కార్యాలు కర్మలను బద్ధి ప్రజ్ఞ గ్రహిస్తున్నాయి. అన్ని రకాల నామములను వాగింద్రియంతో, అన్ని రకాల గంధాలను ఘ్రాణేంద్రియముతో, అన్ని రూపాలను చక్షురింద్రియంతో, అన్ని శబ్దాలు శ్రవణేంద్రియంతో, అన్ని రుచులు జిహ్వేంద్రియంతో, అన్ని కర్మలు చేతులతో, అన్ని దుఃఖాలు శరీరంతో, ఆనందము, రతి, సంతానోత్పత్తి ఉపస్థ ద్వారా, అన్ని రకాల గమనము పాదాల ద్వారా, అన్ని రకాల సంకల్పాలు అంతఃకరణ ద్వారా బుద్ధిప్రజ్ఞ గ్రహిస్తున్నాయి. అన్ని అనుభవాలలోను ఉన్న ఎరుక ఒకటే. ఇక్కడ గుర్తించ వలసిన విషయం ఏమంటే, కేవలం ఒక్క

వాక్కుతోనే విషయాన్ని నిర్ణయించలేం. ఎందుకంటే 'నా మనస్సు ఎక్కడో ఉంది. బుద్ధి ప్రజ్ఞ వీటితో నిండని ప్రాణశక్తితో ఏ వాసనా గుర్తించలేము. అలాగే బుద్ధి ప్రజ్ఞలేని ప్రాణశక్తితో ఏ రూపాన్ని గుర్తించలేము. సుఖము, దుఃఖము తెలుసుకోలేము. సుఖము, ఆనందము పొందలేము. దేన్ని గుర్తించాలన్నా బుద్ధిప్రజ్ఞా ఉండి తీరాలి.

మనం కేవలం వాగింద్రియాన్ని మాత్రమే తెలుసుకుంటే చాలదు. వాక్కు పలికేది ఎవరు? అనే విషయంకూడా తెలుసుకోవాలి. గంధం మాత్రమే తెలుసుకుంటే చాలదు. గంధాన్ని అనుభవించే వాడెవరు? అలాగే రూపాన్ని చూసేది ఎవరు? రసాన్ని అనుభవించేది ఎవరు? కర్మచేసేవాడెవరు? సుఖదుఃఖాలు అనుభవించేది ఎవరు? రతిసుఖాన్ని అనుభవించేది ఎవరు? ఇక్కడ మనం చెప్పుకున్న పది రకాల పనులు చేసేది ఎవరు? ఇవన్నీ బుద్ధిప్రజ్ఞకు సంబంధించినవి. ప్రాణాత్మ లేకపోతే ఈ ప్రజ్ఞామాత్రలు పని చెయ్యవు. ప్రజ్ఞామాత్ర లేకపోతే ప్రాణాత్మ పని చెయ్యదు.

అసలు విషయం ఏమంటే రూపము అనేది ప్రత్యేక వస్తువు కాదు. అన్నిరూపాలు అంతర్యామిలో ఒకటిగానే ఉన్నాయి. ప్రత్యేకంగా ఒకరూపము అనేది లేదు. బండి చక్రానికి ఆకులున్నాయి. ఇవన్నీ మధ్యలో ఉన్న ఇరుసుకు అనుసంధానం చెయ్యబడి ఉంటాయి. అలాగే ఈ భూతమాత్రలన్నీ ప్రజ్ఞామాత్రల నుంచి వచ్చినవే. ప్రజ్ఞామాత్రలు - ప్రాణాత్మ నుంచి వచ్చాయి. శ్వాస రూపంలో ఉన్న ప్రాణాత్మ ప్రజ్ఞామాత్రమే. ఇ దే ఆత్మానందము. అజరము, అమృతము. ఇక్కడ చాలా ముఖ్యమైన విషయం ఏమంటే వ్యక్తి చేసిన పుణ్యకర్మల ఆధారంగానే అతని లోకవర్తనము ఉంటుంది. కాని పుణ్యకర్మలు చేసినంత మాత్రంచేత అతడు గొప్పవాడు కాదు. అలాగే పాపపు

కర్మలు చేసినంత మాత్రంచేత పాపిష్టివాడు కాదు. తన ప్రయత్నానికి ప్రకృతి సహకరిస్తేనే ఉన్నత పదవికి వెడతాడు. అలాగే ప్రకృతికి ఆగ్రహం కలిగితేనే పాపం చేసిన వాడికి శిక్ష పడుతుంది. ఈ ప్రజ్ఞ గలవాడే లోకాధిపతి, లోకపాలకుడు. అతడే అందరికీ ప్రభువు. అతడే నా ఆత్మ.

## కౌషీతకీ ఉపనిషత్తు - 9

### బాలాకి

కొంచెం తెలిసినంత మాత్రం చేతనే అంతా తెలుసునని అనుకోకూడదు. గార్గ్యగోత్రంలో పుట్టిన బాలాకి అనేవాడు బ్రహ్మోపదేశం చేస్తానని కాశీరాజు దగ్గరకు వెళ్ళి చివరకు ఆయన దగ్గరే బ్రహ్మోపదేశం పొంది వచ్చాడు.

పూర్వకాలంలో కాశీనగరాన్ని 'అజాత శత్రువు' అనే రాజు పాలిస్తూండేవాడు. అతడు బ్రహ్మవేత్త. గార్గ్యవంశంలో పుట్టిన బాలాకి అనేవాడు వాచాలుడు. గర్విష్టి. అతడు ఒకసారి కాశీరాజు దగ్గరకు వెళ్ళి "రాజా! నీకు బ్రహ్మోపదేశం చేస్తాను" అన్నాడు. ఆ మాటలు విన్న కాశీరాజు ఆ బ్రాహ్మణుడికి వేయిగోవులు దానమిచ్చి "ఓ వేదవిదుడా! బ్రహ్మవేత్తలు, ఆధ్యాత్మిక చింతనాపరులు అందరూ జనకుని పేరే తలుస్తున్నారు. అతని దగ్గరకే పోతున్నారు. నీ ప్రభావం వల్ల నేను కూడా బ్రహ్మవేత్తనై జనకునితో సమానమైన వాడనిపించుకుంటాను. కాబట్టి నాకు బ్రహ్మోపదేశం చెయ్యవలసినది" అన్నాడు. బాలాకి చెప్పటం మొదలుపెట్టాడు. ఇతణ్ణే "గార్గ్యుడు" అని కూడా అంటారు.

"రాజా! సూర్యునిలో ఉన్న పురుషుడే బ్రహ్మ. అతన్నే నేను ఉపాసిస్తాను" అన్నాడు బాలాకి.

ఆ మాటలు విన్నరాజు సూర్యుని గురించి నాకు తెలుసును. అతణ్ణి అన్ని భూతాలకు మకుటాయమానంగా కాంతివంతంగా నేను ఉపాసన చేస్తాను. అంతేకాని అతను బ్రహ్మకాదు. ఈ రకంగా సూర్యుని ఉపాసించే వారు రాజవుతారు" అన్నాడు.

"చంద్రునిలో ఉన్న పురుషుని బ్రహ్మగా నేను ఉపాసిస్తాను" అన్నాడు బాలాకి.

"చంద్రుడు గొప్పవాడు. తెల్లని వస్త్రాలు ధరించిన సోమరాజు. అంతేకాని చంద్రుడు బ్రహ్మకాదు. ఈ రకంగా చంద్రుని ఉపాసన చేసేవారికి అన్నం లోటురాదు" అన్నాడు కాశీరాజు.

"విద్యుత్తులో పుట్టిన పురుషణ్ణి బ్రహ్మగా ఉపాసన చేస్తాను" అన్నాడు బాలాకి.

"ఆ విద్యుత్తును మహాశక్తివంతమైన దాన్నిగా నేను ఉపాసిస్తాను. అంతేకాని విద్యుత్తు మాత్రం బ్రహ్మకాదు. ఈ రకంగా అతణ్ణి ఉపాసించేవారు సంతానము పొంది తేజోవంతులు, శక్తివంతులు అవుతారు" అన్నాడు కాశీరాజు.

"ఆకాశంలో ఉన్న పురుసుణ్ణి బ్రహ్మగా ఉపాసిస్తాను" అన్నాడు బాలాకి.

"నేను ఆకాశాన్ని పూర్ణమైన దానిగా, నిశ్చలమైనదానిగా భావించి ఉపాసిస్తాను. ఈ విధంగా ఆకాశాన్ని ఉపాసించేవారు సంతానము, పశువులతో సుఖంగా ఉంటారు." అన్నాడు కాశీరాజు.

"నేను వాయువులో ఉన్న పురుషణ్ణి బ్రహ్మగా ఉపాసిస్తాను" అన్నాడు బాలాకి.

"నేను వాయురూపంలో. ఓటమి ఎరుగని సేన చేస్తున్నాను. ఈ విధంగా ఉపాసించే వారు శత్రువులను జయిస్తారు" అన్నాడు

రాజు.

"నేను జలంలో ఉండే పురుషుణ్ణి బ్రహ్మగా ఉపాసిస్తాను" అన్నాడు బాలాకి.

"జలాన్ని ప్రతిరూపంగా భావించి నేను ఉపాసన చేస్తాను. ఈ విధమైన ఉపాసన చేసిన వారికి అన్నీ వారు కోరిన వస్తువులే లభిస్తాయి" అన్నాడు రాజు.

"అద్దంలో ఉండే పురుషుణ్ణి బ్రహ్మగా భావించి ఉపాసన చేస్తాను" అన్నాడు బాలాకి.

"నేను అద్దంలో ఉండే పురుషుణ్ణి కాంతివంతుడుగా భావించి ఉపాసిస్తాను. ఆ రకంగా ఉపాసించినవాడు దీప్తిమంతుడౌతాడు. అతని సంతానం కూడా దీప్తివంతమవుతుంది అన్నాడు అజాత శత్రువు.

"మనం నడిచేటప్పుడు వెనుక నుంచి వచ్చే శబ్దాన్ని నేను బ్రహ్మగా భావించి ఉపాసన చేస్తాను" అన్నాడు బాలాకి.

"ఆ విషయం నాకు తెలుసు. నేను ఆ శబ్దాన్ని వాయువు లేక ప్రాణంగా ఉపాసిస్తాను. ఈ రకంగా ఉపాసించేవాడు పూర్ణాయుర్దాయాన్ని పొందుతాడు" అన్నాడు రాజు.

"నేను దిక్కుదలందుండే పురుషుని బ్రహ్మగా ఉపాసిస్తాను. అన్నాడు బాలాకి.

"ఆ విషయం నాకు తెలుసు. నేనా పురుషుణ్ణి రెండవవాడు కలవానినిగా వేరు చేయబడని వానిగా భావించి ఉపాసిస్తాను. దిక్కులందుండే పురుషుణ్ణి ఈ రకంగా ఉపాసించేవాడు స్నేహితులు, అనుచరులు కలవాడవుతాడు" అన్నాడు రాజు.

నేను నీడలో ఉండే పురుషుణ్ణి బ్రహ్మగా ఉపాసిస్తాను" అన్నాడు బాలాకి.

“ఆ విషయం నాకు తెలుసు. ఆ ఛాయలో ఉండే పురుషుణ్ణి మృత్యువుగా భావించి నేను ఉపాసిస్తాను. ఈ రకంగా ఉపాసించేవాడు పూర్ణాయుర్దాయుడౌతాడు” అన్నాడు రాజు.

“బుద్ధిలో ఉన్న పురుషుణ్ణి నేను బ్రహ్మగా భావించి ఉపాసన చేస్తాను” అన్నాడు బాలాకి.

“ఆ విషయం నాకు తెలుసు. అతన్ని నేను ఆత్మగల వానిగా ఉపాసిస్తాను. ఈ రకంగా ఉపాసన చేసేవాడు ఆత్మవంతుడౌతాడు. బుద్ధిమంతుడౌతాడు” అన్నాడురాజు.

గార్గ్యుడికి ఇంతకన్న విషయం తెలియదు. అందుకని మాట్లాడకుండా ఊరుకున్నాడు. అప్పుడు ఆ బ్రాహ్మణ్ణి చూసి “నీకు తెలిసిన బ్రహ్మజ్ఞానం ఇంతేనా? ఇంకేమైనా ఉన్నదా” అన్నాడు రాజు.

“ఇంతే! ఇంకేంలేదు” అని సమాధానమిచ్చాడు బాలాకి.

“ఈ కొంచెం తెలిసినంత మాత్రంచేత బ్రహ్మజ్ఞానం తెలిసినట్లు కాదు” అన్నాడు రాజు.

ఆ మాటలు విన్న గార్గ్యుడు “రాజా! నీవే శరణు. నాకు బ్రహ్మోపదేశం చెయ్యి” అన్నాడు.

అప్పుడు అజాతశత్రువు గార్గ్యుణ్ణి నిద్రపోతున్న ఒక మనిషి దగ్గరకు తీసుకుపోయి “ఓ బ్రాహ్మణ శ్రేష్టుడా! నిద్రలే” అన్నాడు. అతడు లేవలేదు. చేతితో తట్టిలేపాడు నిద్రిస్తున్నవాడు లేచి కూర్చున్నాడు.

అప్పుడు రాజు గార్గ్యునితో, “చేతితో తట్టి లేపటానికి పూర్వం పురుషుడు నిద్రిస్తున్నాడు పిలిచినా లేవలేదు. అప్పుడతడు ఎక్కడ ఉన్నాడు? ఇప్పుడు ఎక్కడ నుంచి వచ్చాడు?

జీవుడు నిద్రింస్తుండగా ఇంద్రియాల యొక్క విషయాలన్నింటినీ

అనగా వాక్కు మొదలైన ప్రాణాల విజ్ఞానాన్ని పూర్తిగా గ్రహించి హృదయాకాశంలో నిద్రిస్తున్నాడు. హృదయాకాశము పరమాత్మ ఉండే చోటు. నిద్రావస్థలో ఉన్నప్పుడు పురుషుడు శరీరము, ఇంద్రియాలను తనలో లీనం చేసుకుంటాడు. ప్రాణాలన్నింటినీ తనలోకి ఆకర్షించుకుంటాడు. వాక్కు, చక్షువు, శ్రోత్రము మొ॥ ఇంద్రియాలు మనస్సుతో సహా లోపలకు ఆకర్షింపబడతాయి. ఆ స్థితిలో క్రియ అనేది ఉండదు. క్రియాఫలం ఉండదు. కాబట్టి ఆత్మ తన నిజస్థితిలో ఉంటుంది.

ఆత్మ స్వప్నావస్థలో ఉన్నప్పుడు దాని కర్మఫలాలు ప్రారంభమవుతాయి. స్వప్నస్థితిలో ఆత్మ మహారాజులాగా ఉంటుంది. గొప్ప బ్రాహ్మణునిలా ఉంటుంది. దేవతలవలె ఉచ్చస్థితులు, అసురులవలె నీచస్థితులు కూడా పొందుతుంది. రాజుగారు తన దేశంలో స్వేచ్ఛగా తిరిగినట్లుగానే, ఆత్మస్వప్నంలో ప్రాణాన్ని, ఇంద్రియాలను గ్రహించి తన దేహంలో యధేచ్ఛగా తిరుగుతుంది. అదే సుషుప్తావస్థలో ఆనందంతో కూడిన స్థితిని పొందుతుంది.

అగ్ని నుండి చిన్న చిన్న రవ్వలు పైకి లేచినట్లుగానే ఆత్మనుండి అన్ని ప్రాణాలు. ఇంద్రియాలు, లోకాలు, దేవగణాలు, భూతగణాలు పుడుతున్నాయి. ఇదే ఆత్మకు సంబంధించిన విషయాన్ని వివరించే రహస్యోపనిషత్తు" అంటూ అజాత శత్రువు అనే రాజు గార్గ్యవంశంలోని బాలాకికి ఆత్మతత్త్వాన్ని ఉపదేశించాడు.

# 62. ముక్తికోపనిషత్తు

## చతుర్విధ ముక్తులు

**సారూప్యం తవపూజనే । శివమహాదేవేతి సంకీర్తనే**

**సామీప్యం । శివభక్తి ధుర్యజనతా సాంగత్య సంభాషణే**

**సాలోక్యం । చరాచరాత్మక తనుధ్యానే భవానీపతే**

**సాయుజ్యం । మమసిద్ధి మత్రభవతి స్వామిన్ కృతార్థోస్యహమ్ ॥**

ఓ భవానీపతీ ! నేను నిన్ను భక్తితో పూజించటంవల్ల సారూప్యమూ । శివా । మహాదేవా । అంటూ స్తోత్రం చెయ్యటంవల్ల సామీప్యము, నీ భక్తులతో సహవాసం వల్ల సాలోక్యము, చరాచరాత్మకమైన భవదీయ స్వరూప ధ్యానం వల్ల సాయుజ్యము కూడా నాకు ఈ లోకమందే కలగచేశావు. అందువల్ల నేను కృతార్థుడునైనాను. అంటాడు శంకర భగవత్పాదుల వారు శివానందలహరిలోని 28వ శ్లోకంలో

ముక్తి అంటే విముక్తి. భవబంధనాల నుండి విముక్తి. సంసార బంధనాల నుండి విముక్తి. ఈ రకంగా సంసార బంధనాల నుంచి విడివడిన వాడికి జన్మరాహిత్యం జరుగుతుంది. అతడికి పునర్జన్మ లేదు. అని చెబుతుంటారు. అయితే ముక్తి నాలుగు రకాలుగా ఉన్నది పరమేశ్వరుని రెండు విధాలుగా అర్చన చేస్తారు. 1. బాహ్యపూజ 2. అంతఃపూజ. బాహ్యపూజ చేసేవారికి లౌకికమైన కోరికలు ఉంటాయి. సిరిసంపదలు, భోగభాగ్యాలు, ఉన్నత పదవులు మొదలైనవి. వీరికి మోక్షంతో పనిలేదు. ఇక రెండవ రకంవారు అంతఃపూజ చేస్తారు.

వీరు వైదికులు, బ్రహ్మాదాదులు. వీరు శరీరంలో ఉన్న షట్చక్రాలలో - పరమేశ్వరుణ్ణి ఆరాధిస్తారు. వీరు నాలుగు రకాలుగా ఉంటారు అంటోంది ముక్తికోపనిషత్తు శివానందలహరి కూడా.

**1. సాలోక్యముక్తి :** అనాహత పద్మంలో పరమేశ్వరుణ్ణి అర్చించేవారు పరమేశ్వరుడుండే పట్టణంలోనే నివసిస్తారు. ఇక్కడే ఉంటూ పరమేశ్వరుణ్ణి ఆరాధించే వారికి సాలోక్యముక్తి వస్తుంది. అంటే పరమేశ్వరుడు నివసించే పట్టణంలోనే ఒక మూల వీరు నివసిస్తారు. చేసిన పుణ్యము క్షీణించిన తరువాత వీరు తిరిగి భూలోకంలో జన్మిస్తారు.

**2. సామీప్యముక్తి :** విశుద్ధి చక్రంలో పరమేశ్వరుణ్ణి అర్చించేవారు పరమేశ్వరుని ఆయనకు అతిదగ్గరగా సేవకులుగా ఉంటారు. వీరికి పునర్జన్మ ఉంటుంది.

**3. సారూప్యముక్తి :** ఆజ్ఞాచక్రంలో పరమేశ్వరుణ్ణి అర్చించేవారు పరమేశ్వరుని రూపం ధరించి తాముకూడా భక్తుల కోరికలు తీరుస్తుంటారు. వీరికి కూడా పునర్జన్మ ఉంటుంది.

**4. సాయుజ్యం :** సహస్రారంలో ఆ పరమేశ్వరుణ్ణి అర్చించిన వారికి సాయుజ్యం లభిస్తుంది. ఇదే జీవాత్మ పరమాత్మల ఏకీభావము. వీరికి పునర్జన్మ ఉండదు.

ఈ రకంగా నాలుగురకాల ముక్తులను వివరిస్తోంది "ముక్తికోపనిషత్తు"

# ౬౩. అధ్యాత్మోపనిషత్తు

ఇది శుక్లయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో 14 మంత్రాలున్నాయి. ఇందులో సర్వాంతర్యామి అయిన శ్రీమన్నారాయణుణ్ణి వివరిస్తున్నారు.

దేహములోపల బుద్ధి అనే గుహయందున్న వాడు, జన్మమృత్యు జరాదులు లేనివాడు, సత్యము నిత్యము శాశ్వతము అయినవాడు ఎవరికి ఈ పృథివి దేహమో, పృథివి లోపల సంచరిస్తున్నప్పటికీ ఆ పృథివి ఎవరిని తెలుసుకోలేదో అతడే శ్రీమన్నారాయణుడు. ఇదే విషయం సుబాలోపనిషత్తు, బృహదారణ్యకోపనిషత్తులలో కూడా చెప్పటం జరిగింది. జలమునందుంటాడు. జలమే అతని శరీరం. జలం అతన్నెరగదు. వాయువునందుంటాడు. వాయువే అతని శరీరం వాయువు అతన్నెరగదు. అగ్నియందుంటాడు. అగ్నే అతని శరీరం అగ్ని అతన్నెరగదు. ఆకాశమందుంటాడు. ఆకాశమే అతని శరీరం. ఆకాశం అతని శరీరం. ఆకాశం అతన్నెరగదు. మనస్సునందుంటాడు మనస్సే అతని శరీరం మనస్సు అతన్నెరగదు. అహంకారము నందుంటాడు. అహంకారమే అతని శరీరము. అహంకారము అతన్నెరగదు. చిత్తమందుంటాడు. చిత్తమే అతని శరీరం. చిత్తం అతన్నెరగదు. అవ్యక్తమందుంటాడు. వ్యక్తమందుంటాడు మృత్యువునందుంటాడు. సర్వత్రా అన్నింటియందు వ్యాపించి ఉంటాడు. కాని అవేవీ అతన్నెరగవు. అతడే శ్రీమన్నారాయణుడు.

అనాత్మగా ఉన్న ఈ దేహాదులయందు ఉన్న అహం, మమఅనే భావననే అధ్యాసము అంటారు. విద్వాంసుడు ఈ మిథ్యాజ్ఞానాన్ని బ్రహ్మనిష్టతో జయించాలి. శరీరము, ఇంద్రియాలు, వీటికన్నా వేరుగా

ఉన్న ఆత్మనే ప్రత్యగాత్మ అంటారు. ఆ ప్రత్యగాత్మ బుద్ధి మొదలైన వ్యాపారాలన్నింటికీ సాక్షి. ఆ ప్రత్యగాత్మనే నేను అని తెలుసుకుని, దేహము, ఇంద్రియాలు నేను అనే భ్రాంతిని వదిలెయ్యాలి. లోకానువర్తనము, దేహానువర్తనము, శాస్త్రానువర్తనములను వదలి తన ఆత్మ యందే స్థితుడై ఉండే యోగి మనస్సు నశిస్తుంది. యుక్తి, శ్రుతి, స్వానుభవము. వీటితోనే అన్ని విషయాలు తెలుసుకోవాలి. శబ్దాదులయిన తన్మాత్రలను గౌరవించరాదు. ఆత్మను విస్మరించరాదు. లోక వ్యవహారాలలో చిక్కుకోరాదు. సర్వదా ఆత్మ ధ్యానము చెయ్యాలి. దీనివల్ల అనాత్మ పూర్తిగా బహిష్కరింపబడుతుంది. తల్లితండ్రుల మలిన పదార్థాలతో పుట్టి, మలమూత్రములతో నిండిన ఈ దేహము అసహ్యకరమైనది. అందుకని దేహము నేను కాదు. బ్రహ్మమే నేను. అని భావించి కృతకృత్యుడు కావాలి. జీవాత్మ, పరమాత్మలు వేరుకావు. ఘటాకాశము, మహదాకాశము లాగా ఆ రెండూ ఒకటే అని భావన చేసి జీవాత్మను పరమాత్మలో లయం చెయ్యాలి. పిండాండము, బ్రహ్మాండాలను మలభాండము లాగా త్యజించాలి. అనాదియైన అజ్ఞానంతో దేహమే ఆత్మ అని భావించి దుఃఖము పొందుతున్నాడు. కాబట్టి నేను అంటే పరబ్రహ్మను అని భావించి బ్రహ్మస్వరూపం పొందాలి. అద్దంలో కనిపించే అంతఃపురము లాగా ఏ పరమాత్మ యందు ఈ మిధ్యాజగత్తు ప్రతిబింబిస్తున్నదో ఆ పరమాత్మనే నేను. అని భావించాలి. అహంకారాన్ని పూర్తిగా వదలినట్లైతే అఖండ స్థితి లభిస్తుంది. అప్పుడు సంపూర్ణ ఆనందం కలుగుతుంది. క్రియ అనేది నశిస్తే చింత నశిస్తుంది. వాసనాక్షయమవుతుంది. వాసనాక్షయమే మోక్షము. అట్టి వాడే జీవన్ముక్తుడు. పరబ్రహ్మ సాక్షాత్కారము అంటే – ఈ జగత్తునంతా పరబ్రహ్మగా చూడకలగటమే. వాసనలు పూర్తిగా

క్షయం కావాలి. అవి ఏ మాత్రం ఉన్నప్పటికీ మృత్యు సమానమని తెలుసుకోవాలి.

నీరు నాచుచేత కప్పబడి ఉంటుంది. ఆ నీటిలో సూర్యకాంతి ప్రతిబింబించదు. నాచును గనక ప్రక్కకు నెట్టివేస్తే ఆ నీటిలో సూర్యుడి ప్రతిబింబం కనిపిస్తుంది. అలాగే మాయకూడా. మాయచే ఆవరించబడిన మనసులో భగవస్సాక్షాత్కారము జరగదు. మాయను ప్రక్కకు నెట్టెయ్యాలి. అయితే ప్రక్కకు నెట్టబడిన మాయ నాచులాగానే మళ్ళీ వచ్చి చేరుతుంది. అప్పుడు యోగిభ్రష్టుడవుతాడు. మాయనుంచి పూర్తిగా బయటపడాలంటే నిరంతర భగవన్నామ స్మరణ ఒక్కటే మార్గం. దీనితో బ్రహ్మ మొదలు స్తంబమువరకు అంతా మిధ్య అని తెలుసుకుని, నేనే పరమాత్మను. నాకన్న వేరుగా ఏదీలేదు. అని త్రికరణ శుద్ధిగా నమ్మాలి.

ఈ జగత్తంతా అసత్య పదార్థవే. అది తనయందే ఆరోపించబడింది. దాన్ని గనక పూర్తిగా నిరసిస్తే తానే పరబ్రహ్మ అవుతాడు. ఈ జగత్తులో ఉన్నది ఒక్కటే. అదే పరమాత్మ. నీ సంకల్ప వికల్పాలవల్ల అది భిన్నరూపాలుగా కనిపిస్తున్నది. ఆ పరబ్రహ్మ నిరాకారుడు. మరి జగత్తంతా కంటికి కనిపిస్తున్నది కదా? ఇదంతా భ్రాంతి. భ్రాంతికి కారణము చిత్తము. అసలు చిత్తమే లేకపోతే ఈ జగత్తే లేదు.

అఖండ ఆనందస్వరూపమైన పరమాత్మ తనకన్న వేరుగా లేదు. ముందుగా వైరాగ్యాన్ని సంపాదించాలి. ఆ వైరాగ్యంవల్ల జ్ఞానము వస్తుంది. దానివల్ల మహాశాంతి కలుగుతుంది. వైరాగ్యము, జ్ఞానము రెండూ ఉండి శాంతిని గనక పొందకపోయినట్లైతే అంతా నిష్ఫలమే.

మహావాక్యాలు గురుముఖతః వినాలి. మననం చెయ్యాలి. వాటిని అనుసంధానం చేసుకోవాలి. అని చెబుతోంది ఈ ఉపనిషత్తు. మహావాక్యాలు చెయ్యటం అంటే చాలా కష్టమైన పని. మంత్రజపం చేసేవారిలో కోటికి ఒకరు కూడా మహావాక్యాలు జపం చెయ్యరు. అలా చెయ్యాలంటే పూర్వజన్మకృతము పరిణితి రెండూ కావాలి. గురువు చెప్పే విషయాలు వినాలి. వాటిని మననం చెయ్యాలి. చర్చించాలి. స్వానుభవంతో తెలుసుకోవాలి. అప్పుడు నేను పరబ్రహ్మను అనే విషయాన్ని మనస్సులో నిలిపి ఏకాకార వృత్తిని ప్రవహింప చెయ్యాలి. దాన్నే నిధి ధ్యాస అంటారు. ధ్యాతను, ధ్యానాన్ని కూడా మరచిపోయి ధ్యేయైక గోచరమైన చిత్తాన్ని గాలిలేనిచోట దీపం లాగా ఉంచటమే సమాధి అనబడుతుంది.

సమాధి రెండు రకాలుగా ఉంటుంది. 1. సవికల్ప సమాధి. 2. నిర్వికల్ప సమాధి. నిర్వికల్ప సమాధి స్థితిలో ఏమీ తెలియదు. అటువంటి నిర్వికల్ప సమాధి స్థితిలో ఉండి 'అహం బ్రహ్మాస్మి' నేనే పరమేశ్వరుడను అని భావన చేసినవాడు మోక్షం పొందుతాడు. అతడికి పునర్జన్మ ఉండదు.

# 64. ఆత్మోపనిషత్తు

## బాహ్యాత్మ, అంతరాత్మ, పరమాత్మ

బాహ్యాత్మ, అంతరాత్మ, పరమాత్మ. ఈ పదాలను తరచు వింటూ ఉంటాము. ఆ మూడింటికీ మధ్య తేడా ఏమిటో చూద్దాం.

చరాచర జగత్తుకంతటికీ ఆధారమైన వాడు పరమేశ్వరుడు. ఆ పరమపురుషుడే మూడు రూపాలు ధరించాడు. అవి 1. బాహ్యాత్మ 2. అంతరాత్మ 3. పరమాత్మ

**1. బాహ్యాత్మ :** జన్మించటము, నశించటము, అనే ధర్మాలుగల చర్మము, మాంసము, రోమాలు, కాళ్ళు, చేతులు, గోళ్ళు, పొట్ట, నాభి, కనులు, ముక్కు, చెవులు, ముఖము, ఎముకలు, మజ్జ, శుక్రము, శోణితము, శిరస్సు మొదలైన వివిధాంగాలు కలసిన స్థూలశరీరమే బాహ్యాత్మ అనబడుతుంది.

**2. అంతరాత్మ:** ఆ పరమపురుషుడే పృథివి, ఆపః, తేజో, వాయు, ఆకాశమయుడై అంటే పంచీకృతమైన భూతములనుండి జన్మించినవాడై, రాగద్వేషాలతో, సుఖదుఃఖాలతో, కామక్రోధాదులతో, సంకల్ప వికల్పాలతో, ఇంకా జ్ఞాపకశక్తి, ఉదాత్త, అనుదాత్త, హ్రస్వ, దీర్ఘ, ప్లుత, స్కలిత, గర్జిత, స్ఫుటిత, ముదిత మొదలైన అనుభవాలతో, నృత్య, గీత, వాద్య, ప్రళయ విజృంభితాదులతో, శ్రవణము చేసేవాడై, ఘ్రాణముచేసేవాడై, ఆనందించేవాడై, నియంతమై, బోధించువాడై, కర్తృత్వముగలవాడై, విజ్ఞానాత్మయై ఉండే పురుషుడే అంతరాత్మ. ఈ అంతరాత్మయే పురాణాలను, న్యాయ, మీమాంస, తర్క, ధర్మ శాస్త్రాలను వివరిస్తున్నాడు. వాసన చూడటము, ఆకర్షించటము మొదలైన కర్మ విశేషాలను చేస్తున్నాడు.

**3. పరమాత్మ:** పరమాత్మ అక్షర రూపంలో ఉపాసింపదగినవాడు. అతడే సృష్టి స్థితి లయాలకు కారణమైనవాడు. ఆద్యంతములు లేనివాడు. నిరాకారుడు, నిరంజనుడు, నిర్గుణుడు. సత్యము, నిత్యము అయినవాడు. సర్వాంతర్యామి. సర్వవ్యాపి. ఆ పరమేశ్వరుణ్ణి యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యానము, సమాధి మొదలైన యోగ ప్రక్రియలతో ఉపాసించటం జరుగుతుంది. అతడు తలవెంట్రుకలో వెయ్యోవంతు (అణుమాత్రుడై) ఉన్నాడు. ఆ పరమాత్మ పొందబడడు, జన్మించడు, మరణించడు, శుష్కింపడు, తడుపబడడు, దహించబడడు, కదలింపబడడు, భేదింపబడడు. అతడు నిర్గుణుడు. జగత్తులో జరిగే విషయాలన్నింటికీ అతడే సాక్షి. భూతభావనుడు. అనగా భూతములను అభివృద్ధి చేసేవాడు. ఆ పరమాత్మ పరిశుద్ధమైనవాడు. అతడికి కాళ్ళు, చేతులు, తల మొదలైన అవయవాలు లేవు. సూక్ష్ముడు, మమకారము లేనివాడు, శబ్దస్పర్శ రూపరస గంధాలు లేనివాడు. నిర్వికల్పుడు కోరికలు లేనివాడు. చింతించటానికి వీలుకానివాడు. రంగులేనివాడు. అశుద్ధాన్ని శుద్ధంగా, అపవిత్రాన్ని పవిత్రంగా చేసేవాడు. క్రియాశూన్యుడు. అటువంటి పరమాత్మకు సంసారములేదు.

అతడే ఆత్మసంజ్ఞగలవాడు. శుద్ధుడు. అతడు ఒక్కడుగానే ఉన్నాడు. అతనితో సమానమైనవారు కాని, అతనికన్న అధికులుగాని ఎవరూ లేరు. బ్రహ్మరూపంలో కేవలము పరబ్రహ్మమే ప్రకాశిస్తాడు. కాని సమస్త జగత్తులోనూ ఆ పరమేశ్వరుడే ప్రకాశిస్తున్నాడు. విద్య అవిద్య, భావము అభావము, గురువు శిష్యుడు అనే భేదాలతో ఆ పరబ్రహ్మ ప్రకాశిస్తున్నది. తత్త్వదర్శనములో ఆ పరబ్రహ్మమే కేవలము శుద్ధముగా గోచరిస్తున్నది. విద్యలేదు అవిద్యలేదు. జగత్తు అంతకన్నా

లేదు. పరాపరములు లేవు. ఈ జగత్తు సత్యముగా కనిపిస్తే సంసారం కలుగుతుంది. అయితే వ్యవహారంలో మాత్రమే సంసారం సత్యంగా కనిపిస్తుంది. కాని పదార్ధంలో సమస్త సంసారము అసత్యము అవుతుంది. అందులో ఉన్నదంతా మట్టే అయినప్పటికీ, ఆకారాన్ని బట్టి 'కుండ' అని పిలువబడుతోంది. ఇది కుండ అని తెలుసుకోవటానికి ఎలాటి నియమము అవసరం లేదు. అలాగే ఆత్మను పోల్చి చెప్పటానికి ఇంకొక ప్రమాణం ఏదీలేదు. ప్రమాణంలో ఆత్మయే నిత్యసిద్ధముగా ప్రకాశిస్తున్నది. ఆత్మను తెలుసుకోవటానికి దేశము, కాలము, శుద్ధి, ఇవి ఏవీ అవసరం లేదు. 'నేనే పరమేశ్వరుడను' అని చెప్పగలిగే విజ్ఞానం కావాలి. ఈ రకంగా బ్రహ్మవేత్త అనుభవంతో నేనే పరబ్రహ్మను అని తెలుసుకుంటాడు.

సూర్యుని కాంతితో జగత్తంతా ప్రకాశిస్తున్నది. అలాగే, పరబ్రహ్మయొక్క తేజస్సుచేత అనాత్మ, అసత్తు నాశనం అయిపోయి ఈ జగత్తంతా ప్రకాశిస్తున్నది. వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, సకలభూతాలు ఏ ప్రకాశంచేత అర్ధవంతము, విజ్ఞానవంతము అవుతున్నాయో, అదే ఆత్మప్రకాశము. చిన్నపిల్లవాడు ఆకలి మరచిపోయి ఆటవస్తువులతో ఆడుకున్నట్లుగా, విద్వాంసుడు అహంకార మమకారాలను వదలి ఆత్మయందు రమిస్తూ ఉంటాడు. ముని తను కోరుకున్నట్లు ఒంటరిగా తిరుగుతుంటాడు. నిష్కాముడై తనయొక్క ఆత్మతోనే సర్వదా సంతుష్టుడై, స్వయంగా సర్వాత్మభావనతో సంచరిస్తూ ఉంటాడు. ఆత్మజ్ఞాని సిద్ధుడైననూ, సదాసంతుష్టుడైనప్పటికీ, సహాయము లేనివాడయినప్పటికీ, మహాబలవంతుడు. భోజనం చెయ్యకపోయినప్పటికీ నిత్యతృప్తుడు. సమానంగా కనిపించనప్పటికీ సమదర్శనుడు. అన్ని పనులు చేస్తున్నప్పటికీ ఏ పనులు చేయనివాడు.

భోగాలను అనుభవిస్తున్నట్లు కనిపిస్తాడు కాని నిజానికి అభోక్త.

బ్రహ్మవేత్త శరీరము ఉండి కూడా శరీరం లేనివాడు. విభజించటానికి వీలు లేనివాడు. కాని అన్నిచోట్ల ఉంటాడు. అతడు సదా అనంతుడు. ప్రియాప్రియముల యందు, శుభాశుభముల యందు నిర్లిప్తంగా ఉంటాడు. సూర్యకాంతి ఉన్నప్పటికీ, చీకటిని కల్పించుకుని బాధపడుతున్నట్లుగా, వస్తు లక్షణాలు తెలియకుండా భ్రాంతితో నిండి జనులు బాధపడుతున్నారు. బ్రహ్మవేత్త అయినవాడు శరీరబంధనాల నుండి విముక్తి పొందుతున్నాడు. మూఢులైనవారు శరీర భ్రాంతినే చూస్తున్నారు. పాము కుబుసాన్ని విడిచినట్లుగా, జ్ఞాని దేహంమీద భ్రాంతిని వదలిపెడతాడు. గంగా ప్రవాహం ఎత్తు పల్లాలను సరిచేసేటట్లుగా ప్రాణవాయువు శరీరమంతా సంచరిస్తున్నది. ఈ శరీరము ప్రారబ్ధంవల్ల కర్మఫలమనుభవించటానికి వచ్చింది. లక్ష్యాలక్ష్యాలను వదలి కేవలము ఆత్మరూపుడైన బ్రహ్మవిదుడు స్వయంగా పరబ్రహ్మమే అవుతాడు.

బ్రహ్మవిదుడు జీవించి ఉన్నప్పుడే సర్వదా విముక్తుడవుతాడు. కృతార్ధుడవుతాడు. ఉపాధి నశించటంవల్ల సద్రూప అద్యయమగు పరబ్రహ్మ అవుతున్నాడు. నటుడు ఆడవేషం వేసుకున్నా, వేసుకోకపోయినా పురుషుడే అయినట్లుగా, బ్రహ్మవేత్త ఎల్లప్పుడూ బ్రహ్మమే అవుతాడు. కుండ పగిలిపోయినప్పుడు, ఘటాకాశం కూడా మహదాకాశమే అవుతుంది. అలాగే ఉపాధి నశించినప్పుడు బ్రహ్మవేత్త స్వయంగా బ్రహ్మమే అవుతున్నాడు. ఆత్మవేత్త అయినవాడు. పాలలో పాలుకలసినట్లుగా, నూనెలో నూనెపోసినట్లుగా, నీటిలో నీటిని పోసినట్లుగా, తన ఆత్మను పరమాత్మలో ఏకం చేసి సుఖిస్తున్నాడు.

ఈ రకంగా అఖండాత్మానందం అనుభవిస్తూ విదేహముక్తి పొందిన యతి మళ్ళీ జన్మించడు. అతడు కేవలము బ్రహ్మభావన పొందుతాడు.

విద్యావిషయమైన భ్రాంతులన్నీ బ్రహ్మవిజ్ఞానంలో దగ్ధమైపోయిన తరువాత, అతడికి పునర్జన్మ ఉండదు. తాడు పాములాగా ఉంటుంది. అలాగే మాయచేత కల్పించబడిన బంధమోక్షాలు యదార్ధంగా బ్రహ్మకు లేవు. సత్తు, అసత్తు, బంధము, మోక్షము ఇవేవీ బ్రహ్మలో ఉండవు. ఈ పదార్ధం ఉన్నది. ఈ పదార్ధం లేదు అని చెప్పే భావము బుద్ధియొక్క గుణము. నిత్యమైన ఆత్మలో అస్తి, నాస్తి లేవు. బంధమోక్షాలన్నీ మాయాకల్పితాలు. నిష్కళము, నిష్క్రియము, శాంతము, నిరవద్యము, నిరంజనము, అద్వితీయము అయిన తత్త్వములో కల్పన ఉండదు. నిరోధము లేదు. బద్ధుడు లేడు ముక్తుడు లేడు. సాధకుడు లేడు మోక్షం లేదు. ఇదే పదార్ధము. అదే పరమాత్మ. అంటూ బాహ్యాత్మ, అంతరాత్మ, పరమాత్మలను వివరించారు.

# 65. గర్భోపనిషత్తు - 1

## శరీర విజ్ఞానము

ఈ లోకంలో జీవి ఏ విధంగా ఆవిర్భవిస్తుంది? మాత్రు గర్భంలో పిండోత్పత్తి ఎలా జరుగుతుంది అనే విషయాలు **'గర్భోపనిషత్తు'**లో చెప్పబడ్డాయి. ఈ జగత్తులో పుట్టిన ప్రతిప్రాణీ మరణించక తప్పదు. అలా మరణించిన జీవుడు తన పాపపుణ్యాలను మూట కట్టుకుని పైలోకాలకు వెళ్ళి, తన పుణ్యఫలంతో స్వర్గలోకంలో సమస్త సుఖాలు, నరకంలో శిక్షలు అనుభవించి కర్మశేషాన్ని అనుభవించటానికి మేఘాన్ని ఆశ్రయిస్తాడు. ఆ మేఘం వర్షంగా కురుస్తుంది. ఆ వర్షపు నీటివలన ఏరులు, నదులు పొంగుతాయి. అలా ప్రవహించే నదులనుండి కాలువలు తీస్తారు. వీటి సాయంతో పంటలు పండుతాయి. గడ్డి, చెట్లు పెరుగుతాయి. గతంలో మేఘాన్ని ఆశ్రయించిన జీవి వర్షపు నీటిద్వారా భూమి మీదకు చేరి విత్తనాలలో కలసి మొలకెత్తి వాటి ఫలితాన్ని అనుభవించే పురుషుని శరీరంలో ప్రవేశిస్తాడు. అతని కర్మఫలాన్ని బట్టి గడ్డిరూపంలో పశువు శరీరంలో ప్రవేశిస్తాడు. మానవజన్మ ఎత్తే ప్రాణి పురుషుని ఆశ్రయిస్తాడు.

మానవుడు తీసుకున్న ఆహారంజీర్ణమై రసంగామారుతుంది. ఆ రసము నుండి రక్తము, రక్తము నుండి మాంసము, మాంసము నుండి క్రొవ్వు, క్రొవ్వు నుండి ఎముకలు, ఎముకల నుండి మజ్జ, మజ్జ నుంచి శుక్లము ఏర్పడుతుంది అదే విధంగా స్త్రీ గర్భంలో శోణితము ఏర్పడుతుంది. స్త్రీ పురుషుల సమాగమం జరిగిన మొదటి రాత్రి శుక్లశోణితాలు కలిసి ముద్దగా తయారవుతుంది. ఏడురోజుల తరువాత ఆముద్ద నీటిబుడగలా మారుతుంది. పదిహేనురోజులకు పిండము

అవుతుంది. అదే పిండము నెలరోజులకు గట్టిపడుతుంది. ఈ సమయంలో గర్భంలో ఉన్న పిండానికి ఒకటే ముఖము ఉంటుంది. దానిద్వారానే ఆబిడ్డ తల్లిద్వారా ఆహారం తీసుకుంటుంది. ఆముఖాన్నే నోరు అంటారు. ఈ రకంగా గర్భస్థశిశువుకు మొదటినెలలో నోరు ఏర్పడుతుంది. రెండవనెలలో శిరస్సు ఏర్పడుతుంది. ఈ నెలలోనే శ్వాసతీసుకునే అవయవం ముక్కు ఏర్పడుతుంది. ఇక మూడవనెలలో మాతృగర్భంలోని శిశువుకు కనులుఏర్పడతాయి. ఈ సమయంలోనే పాదాలుకూడా ఏర్పడతాయి. నాల్గవనెలలో చెవులు, చెవులతోపాటుగా కడుపు, నడుముకూడా ఏర్పడతాయి. ఇక ఐదవనెలలో చర్మము ఏర్పడుతుంది. చర్మముతో పాటుగా వెన్నెముక ఏర్పడుతుంది. ఆరవనెలలో సర్వావయవాలు ఏర్పడతాయి. ఏడవ నెలలో ప్రాణం వస్తుంది. అంటే గర్భస్థ శిశువుకు చలనం వస్తుందన్నమాట.

ఒకవేళ ఏ కారణం చేతనైనా ఏడవనెలలో ప్రసవం జరిగితే బిడ్డ క్షేమంగా జీవిస్తుంది. అంతకుముందు అంటే ఆరునెలలలోగా ప్రసవం జరిగితే బిడ్డ జీవించదు. ఈ కారణంచేతనే ఏడవమాసంలో ప్రాణమువస్తుంది అని చెప్పటం జరిగింది. ఇక ఎనిమిదవమాసంలో అవయవసౌష్టవం వస్తుంది. అంటే అవయవాలన్నీ సంపూర్ణంగా పెరుగుతాయి. తొమ్మిదవ మాసంలో బిడ్డ సలక్షణంగా పెరిగి, గర్భం ధరించిన 280 రోజులకు అనగా తొమ్మిదవమాసం పూర్తి అయిన పది రోజులకు ప్రసవం జరిగి, గర్భస్థ శిశువు ఈ లోకంలో కాలు పెడుతుంది.

స్త్రీ యొక్క గర్భంలో, పురుషుని శుక్లము నుంచి వచ్చిన పురుష కణాలు శోణితముతో సంయోగం చెందితే మగశిశువు, శుక్లమునుంచి వచ్చిన స్త్రీ కణాలు శోణితముతో సంయోగముచెందితే ఆడశిశువు

జన్మిస్తుంది. ఒకవేళ శోణితముతో శుక్లము నుంచి వచ్చిన పురుషకణాలు, స్త్రీకణాలు రెండూ సంయోగముచెందితే నపుంసకులు పుడతారు. సంయోగ సమయంలో తల్లిదండ్రుల మానసికప్రవృత్తి ననుసరించి పిల్లలు జన్మిస్తారు. ఆ సమయంలో తల్లిదండ్రులు చిత్తచాంచల్యానికి గురి అయితే కుంటి, గ్రుడ్డి, మూగ, చెవిటి, పిల్లలు పుడతారు.

సూర్యచంద్రులకు మానవ దేహంతో ప్రత్యక్ష సంబంధమున్నది. చంద్రుడు మనఃకారకుడు. సూర్యుడుతేజస్సుకు, ప్రాణానికి కారకుడు. అందుచేత చంద్ర, సూర్యగ్రహణాలు ఏర్పడిన సమయంలో గర్భధారణ జరిగినట్లైతే పుట్టబోయే బిడ్డలకు అంగవైకల్యం కలుగుతుంది. అయితే **గర్భిణీస్త్రీలు గ్రహణంచూస్తే పుట్టబోయే బిడ్డలకు అంగవైకల్యం కలుగుతుందని ప్రచారంలోఉన్నది. అది నిజంకాదు.**

ఒకేసారి స్త్రీ గర్భాశయము నుంచి రెండు అండాలు విడుదలయితే కవలలు కలుగుతారు. విడుదల అయిన రెండుఅండాలు కొంతమేరవరకు కలసి ఉన్నట్లైతే ఒకరితో ఒకరు అంటుకు పోయిన కవలలు (సనామీకవలలు) కలుగుతారు. మంచి ముహూర్తంలో ప్రశాంత వాతావరణంలో, ఆహ్లాదకర పరిస్థితులలో గర్భధారణ జరిగినట్లైతే, తల్లిదండ్రుల రూపము, గుణాలు కలిగిన పిల్లలు పుడతారు.

అసలు ఈ దేహము పంచభూతాత్మకమైనది. వీటిలో కఠినముగా ఉండేది భూమి. ద్రవరూపంలో ఉండేది జలం. ఉష్ణమైనది అగ్ని. సంచరించే స్వభావం గలది వాయువు. ద్వారము గలది ఆకాశము. వీటి ప్రతిరూపాలే జ్ఞానేంద్రియాలు అవి ఐదు. కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము. వీటిలో

1. భూమి - ధరించటము
2. జలము - ముద్ద చెయ్యటము
3. అగ్ని - రూపాన్ని చూడటము
4. వాయువు - సంచరించటము
5. ఆకాశము - అవకాశమివ్వటము జరుగుతుంది. పంచభూతాల లక్షణాలే తన్మాత్రలు అవే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు.

1. ఆకాశము యొక్క లక్షణం శబ్దం. అది చెవియందు ఉండి శబ్దగ్రహణం చేస్తుంది.
2. వాయువు లక్షణం స్పర్శ, అది చర్మము నందుండి ఉనికిని గ్రహిస్తుంది.
3. అగ్నియొక్క లక్షణం రూపము. అది కంటియందుండి వస్తువురూపాన్ని చూస్తుంది.
4. జలము లక్షణం రసము అది నాలుకయందుండి రుచిని గ్రహిస్తుంది.
5. భూమియొక్క లక్షణం గంధం. అది ముక్కునందుండి వాసన చూస్తుంది.

ఈ రకంగా ఇంద్రియాలకు పంచభూతాల తత్త్వాలున్నాయి. కాలు, చేయి, నోరు, పాయు, ఉపస్థ అనేవి కర్మేంద్రియాలు. వీటిలో కాలు నడుస్తుంది. చేయి ఇస్తుంది. నోరు మాట్లాడుతుంది. పాయువు విసర్జిస్తుంది. ఉపస్థ ఆనందం కలుగజేస్తుంది. ఇక మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము. వీటిని అంతఃకరణ చతుష్టయము అంటారు. వీటిలో

1. సంకల్ప వికల్పాలను చేసేది - మనస్సు
2. నిశ్చయించేది - బుద్ధి
3. అవధరణాత్మకమైనది - చిత్తము
4. స్వాభిమానమైనది - అహంకారము.

బుద్ధితో గ్రహిస్తాడు. నిశ్చయిస్తాడు. మనసుతో సంకల్పం చేస్తాడు. సంశయిస్తాడు. అహంకారముతో గర్వము గలిగి ఉంటాడు.

1. మనసుయొక్క వాసనా స్థానము - కంఠము
2. బుద్ధి యొక్క వాసనా స్థానము - ముక్కు
3. చిత్తముయొక్క వాసనాస్థానము - నాభి
4. అహంకారము యొక్క వాసనాస్థానము - హృదయము

ఈ రకంగా ఉన్న దేహంలో

ఎముకలు, చర్మము, నరాలు, వెంట్రుకలు, మాంసము ఇవి పృథివి యొక్క అంశలు.

మూత్రము, కఫము, రక్తము, శుక్లము - ఇవి జలముయొక్క అంశలు.

ఆకలి, దప్పిక, సోమరితనము, మోహము, మైథునము ఇవి అగ్ని అంశలు.

నడచుట, గీరుట, కనులు మూయుట, తెరచుట - ఇవి వాయువు అంశలు.

కామము, క్రోధము, లోభము, మోహము, భయము - ఇవి ఆకాశము అంశలు.

అయితే ఈ భూతాలకు ప్రత్యేక లక్షణాలున్నాయని గతంలో చెప్పుకున్నాం.

**పంచీకరణము :** పంచీకరణము అంటే ఒక్కొక్క భూతంలోను ఐదు భూతాలు ఇమిడి ఉంటాయి. అది ఎలా అంటే – ఒక భూతాన్ని రెండు భాగాలుగా చేస్తారు. అందులో ఒక భాగంలో ఆ భూతమే ఉంటుంది. రెండవ భాగాన్ని మళ్ళీ నాలుగు భాగాలుగా చేస్తారు. ఆ నాలుగు భాగాలలోను మిగిలిన నాలుగు భూతాలు ఉంటాయి. ఉదాహరణకు మొదటి భూతం ఆకాశాన్ని తీసుకుందాం. ఆకాశాన్ని రెండు భాగాలుగా చేశారు. ఒక భాగంలో ఆకాశం ఉంటుంది. రెండవ భాగంలో మిగిలిన నాలుగు భూతాలు సమానంగా ఉంటాయి. అంటే ఆకాశంలో 1/2 వంతు ఆకాశము, 1/8 వాయువు, 1/8 అగ్ని, 1/8 జలము, 1/8 పృథివి ఉంటాయి. భూమిలో 1/2వ వంతు భూమి, 1/8 ఆకాశు, 1/8 వాయువు, 1/8 అగ్ని, 1/8 జలము ఉంటాయి. ఈ రకంగానే ప్రతిభూతంలోను మిగిలిన భూతాలు కూడా ఉంటాయి. దీన్నే పంచీకరణము అంటారు. పంచీకరణ చెందిన పంచభూతాల వల్లనే సృష్టి జరుగుతుంది.

ఇక పంచభూతాల లక్షణాలు చూద్దాం.

ఆకాశము లక్షణము – శబ్దము

వాయువు లక్షణము – శబ్దము, స్పర్శ

అగ్ని యొక్క లక్షణము – శబ్దము, స్పర్శ, రూపము

జలము యొక్క లక్షణము – శబ్దము, స్పర్శ, రూపము, రసము

భూమియొక్క లక్షణము – శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము

మానవదేహము ఐదు వస్తువులతో కూడి నున్నది. ఆరింటిని ఆశ్రయించి ఉన్నది. ఆరు గుణములతో కూడి ఉన్నది. ఏడు

ధాతువులను, మూడు మలములను, మూడు గుణములను, నాలుగు అవస్థలను కలిగి ఉన్నది. వీటిలో ఐదు వస్తువులే పంచ భూతాలు. వీటిని వివరించటం జరిగింది. ఆరింటిని ఆశ్రయించి ఉన్నది. ఈ ఆరు షడ్రసాలు. పులుపు, ఉప్పు, తీపి, కారం, చేదు, వగరు. అలాగే షడ్విధవికారాలు.

1. ఉండుట
2. పుట్టుట
3. వృద్ధి పొందుట
4. పక్వమగుట
5. కృశించుట
6. నశించుట.

మానవ దేహంలో చక్రాలు ఆరు.

1. మూలాధారము
2. స్వాధిష్ఠానము
3. మణిపూరము
4. అనాహతము
5. విశుద్ధి చక్రము
6. ఆజ్ఞాచక్రము.

వీటినే షట్చక్రాలు అంటారు. ఈ చక్రాలు ఆయా నాడుల నాశ్రయించి ఉంటాయి. ఇక కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము. వీటినే అరిషడ్వర్గాలు అంటారు. శమము, దమము, తితిక్ష, ఉపరతి, శ్రద్ధ, సమాధానము. ఈ ఆరు గుణాలు

వాటి నిష్ఠతో చేరి ఉంటాయి. మానవశరీరము సప్తధాతువులను కూడి ఉంటుంది. అవి

1. శుక్లము
2. శోణితము
3. మాంసము
4. ఎముకలు
5. చర్మము
6. చీము
7. రక్తము

సప్తస్వరాలను కూడి ఉంటుంది. సప్తస్వరాలు వీటినే స, రి, గ, మ, ప, ద, ని అంటారు

1. షడ్జము
2. రిషభము
3. గాంధారము
4. పంచమము
5. మధ్యమము
6. రైవతము
7. నిషాదము.

ఇవి తెలుపు, ఎరుపు, నలుపు, ధూమ్రము, పసుపు, కపిలము, పాండురము అనే వర్ణాలలో ఉంటాయి.

మానవదేహము మలత్రయముతో నిండి ఉన్నది. మలత్రయము అంటే

1. అణవమల 2. మాయీకమల 3. కార్మికమల.

మూడు గుణాలు అంటే సత్వరజస్తమో గుణాలు. వీటినే

1. సాత్త్వికము
2. రాజసము
3. తామసము అంటారు.

అహింస, పరదార ద్రవ్యములందు అభిలాష లేకుండుట,కోపము లేకుండుట, గురువుకు శుశ్రూషచెయ్యటము, శౌచము (దేహశుద్ధి, మనోశుద్ధి) సంతోషము, ఋజుమార్గము, స్వోత్కర్ష దంభము లేకుండుట, దైవమందు, వేదము నందు నమ్మకము (అస్థిత్వము) ఇతరులకు అపకారము చేయకుండుట, ఇవన్నీ సత్త్వగుణం గలవారి లక్షణాలు.

నేను కర్తను, నేను భోక్తను, నేను వాచాలకుడను, నేను అభిమానం గలవాడను. అనేవి రాజసప్రవృత్తి గలవారి లక్షణాలు.

నిద్ర, సోమరితనము, మోహము, ఆశ, మైథునము, దొంగతనము, తామస ప్రవృత్తిగల వారి లక్షణాలు. తమోగుణానికి ఉండే శక్తిని ఆవరణశక్తి అంటారు. ఈ శక్తివల్లనే ఒకవిధంగాఉన్నవస్తువు ఇంకొకవిధంగా కనిపిస్తుంది. ఇదే పురుషుని సంసారానికి మూలకారణము. తమోగుణంచేత కప్పబడినవాడు ఎంతటి బుద్ధిమంతుడైనా, విద్వాంసుడైనా, నేర్పరి అయినా, విషయాన్ని సరిగా గ్రహించలేడు. తమోగుణం ఒక రకమైన భ్రమను కలిగిస్తుంది. దానివల్ల తనకు కనిపించినదే నిజం అనుకుంటాడు. తమోగుణానికి నాలుగు రకాల శక్తులున్నాయి. అవి

1. అభావన – పరమాత్మలేడు అనుకోవటం

2. విపరీతభావన - నేను శరీరాన్ని అనుకోవటం

3. అసంభావన - పని జరుగుతుందా లేదా అనే అనుమానం

4. విప్రపత్తి - ఉన్నదా? లేదా? అవునా? కాదా? అనే అనుమానం

తమోగుణ ప్రభావితుడైనవాణ్ణి ఈ శక్తులు వదలవు. తమోగుణ ప్రభావితుడు ఏదీ తెలుసుకోలేక ఒక స్థంభంలాగా కదలిక లేకుండా ఉంటాడు.

సత్త్వగుణం గలవాడు ఊర్ధ్వలోకాలయందు, రజోగుణం గలవాడు భూలోకంలోను, తమోగుణం గలవాడు అథోలోకములోను జన్మిస్తారు. సమ్యక్ జ్ఞానము అనగా బ్రహ్మజ్ఞానము - సాత్వికము, ధర్మజ్ఞానము - రాజసము, అజ్ఞానము - తామసము.

ఇక అవస్థలు నాలుగు అవి

1. జాగ్రదవస్థ 2. స్వప్నావస్థ 3. సుషుప్తి 4. తురీయము.

జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, అంతఃకరణ చతుష్టయము. ఈ పద్నాలుగింటితో కలిసినది జాగ్రదవస్థ.

అంతఃకరణ చతుష్ఠయముతో కూడినది - స్వప్నావస్థ.

ఒక్క చిత్తముతో మాత్రమే కూడినది - సుషుప్తి.

జీవునితో మాత్రమే కూడినది - తురీయము.

పాంచభౌతికమైన శరీరం మూడు రకాలుగా ఉంటుంది. అవి

**1. స్థూలదేహము :** చర్మము, మాంసము, రక్తము, నరాలు, మేద, మజ్జ, ఎముకలు మొదలైన వాటితోను, మలమూత్రాలతోను కూడినది స్థూలదేహము. ఇది చాలా అసహ్యకరమైనది. పూర్వజన్మ

కర్మల ననుసరించి, పంచభూతాల కలయిక చేత ఈ దేహము ఏర్పడింది. జీవుడు ఈ శరీరంతోనే సుఖదుఃఖాలు అనుభవిస్తాడు. స్థూలశరీరము ఎప్పుడూ జాగ్రదావస్థలోనే అనుభవం పొందుతుంది. మిగిలిన అవస్థలు దానికి తెలియవు. బాల్య, యౌవన, కౌమారాది దశలు, వర్ణాశ్రమ ధర్మాలు, మానావమానాలు, ఈ దేహానికే చెందుతాయి.

**2. సూక్ష్మదేహము :** జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, పంచప్రాణాలు, అంతఃకరణ చతుష్టయము, ఇవన్నీ కలిపి సూక్ష్మశరీరము అనబడుతుంది. ఈ సూక్ష్మశరీరాన్నే లింగశరీరము అనికూడా అంటారు. ఇది పంచీకృత భూతాలవల్ల ఏర్పడి, వాసనలతో కూడినదై, కర్మఫలాలు అనుభవిస్తూ ఉంటుంది. స్వప్నాన్ని ఈ సూక్ష్మశరీరమే అనుభవిస్తుంది.

**3. కారణదేహము :** గుణత్రయమే ఆత్మయొక్క కారణ శరీరము. ఇది సుషుప్తావస్థలో ఉంటుంది. సుషుప్తిలో అన్ని రకాలైన జ్ఞానము నశిస్తుంది. బుద్ధి కేవలము బీజరూపంలో మాత్రమే ఉంటుంది. ఈ స్థితిలో శరీరంలోని అవయవాలన్నీ పూర్తిగా విశ్రమిస్తాయి.

మనస్సు, బుద్ధి, అహంకారము, పంచభూతాలు, ఈ ఎనిమిదింటినీ అష్ట ప్రకృతులు అంటారు. వీటితో జ్ఞానేంద్రియాలు 5, కర్మేంద్రియాలు 5, తన్మాత్రలు 5 కలిస్తే, వెరసి 23 తత్త్వాలు అనబడతాయి. ఈ 23 తత్త్వాలు కలిగి ఉన్నదే మానవ దేహము. 24వ తత్త్వము అవ్యక్తము. అదే ప్రధానమైనది. ఇదే మాయ. దీనికన్నకూడా వేరైనవాడే పురుషుడు. ధాతువులు మూడు వాతము, పిత్తము శ్లేష్మము. అవి సక్రమంగా ఉంటే దేహము మంచిఆరోగ్యంగా

ఉంటుంది. అవి సక్రమంగా లేకపోతే మానవుడు వ్యాధిగ్రస్తుడవుతాడు. విషయాలను అర్ధం చేసుకోలేడు. కాబట్టి పిత్తము అనుకూలంగా ఉన్నప్పుడు చక్కగా గ్రహించగలుగుతాడు. పిత్తము తక్కువగా ఉంటే తక్కువ గ్రహిస్తాడు. అధికంగా ఉంటే ఎక్కువగా తెలుసుకుంటాడు. పిత్తము వికారము పొంది ఉంటే పిచ్చివాడవుతాడు. పిత్తాగ్ని కర్మాశయమునందు చేరి ధర్మాధర్మములు అనే కారణ వాయువు చేత ప్రజ్వలింపజేయ బడుతున్నది. అప్పుడు దానికి లోపలి అనుభవాలు, బయటి అనుభవాలు కొయ్య ముక్కలలాగా ఉంటాయి.

శరీరంలో జ్ఞానాగ్ని, దర్శనాగ్ని, కోష్ఠాగ్ని అని అగ్ని మూడు రకాల అగ్నులున్నాయి.

1. జ్ఞానాగ్ని మనసులో ఉంటుంది.
2. దర్శనాగ్ని ఇంద్రియాలయందుంటుంది.
3. కోష్ఠాగ్ని దహరమందుంటుంది.

అపానమనే వాయువుతో కలిసి ప్రతిరోజూ భుజించిన పదార్ధము జీర్ణమవుతుంది.

నేత్రమే దర్శనాగ్ని ఆ నేత్రము వికారమై ఉండి పదార్ధాలను గోచరింపచేస్తుంది. మానవుని హృదయమందు – దక్షిణాగ్ని, ఉదరమందు – గార్హపత్యాగ్ని, ముఖము నందు – ఆహవనీయాగ్ని ఉన్నాయి. అందువల్ల పురుషుడు యజమానిగా ఉండి, బుద్ధిని భార్యగాను, సంతోషాన్ని దీక్షగాను, జ్ఞానేంద్రియాలను యజ్ఞపాత్రలుగా, కర్మేంద్రియాలను పనిముట్లుగా, చేసుకుని యజ్ఞం చేస్తున్నాడు. శారీరక యజ్ఞమందు ఆయాదేవతలే తటస్థమైన ఋత్విక్కులుగా ఉండి, ఆయా స్థానములయందు యజమానునితో గూడా యజ్ఞం చేస్తున్నారు. ఆ

యజ్ఞమందు దేహమే ధర్మశాల. శిరఃకపాలమే మోక్షకుండము. కేశములే దర్భలు ముఖమే అంతర్వేది. కామమే ఆజ్యము జీవితకాలమే యజ్ఞకాలము. దహర శబ్దమే సామగానము. వైఖరీ శబ్దమే యజుర్వేదము. పరాపశ్యంతి మధ్యమలు ఋగ్వేదము. క్రూర వాక్యములు అధర్వవేదము యొక్క ఖిల (ఉపాసన) భాగములు. సత్యవాక్కులు వ్యాహృతులు. ఆయుస్సు– బలము, పిత్తము – పశువులు. మరణమే – అవభృతస్నానము.

యజ్ఞమందు అగ్నులు ప్రజ్వరిల్లుతున్నాయి. ఇందులో దేవతలు సరియైన సంసార సౌఖ్యము అనుభవిస్తున్నారు. ఈ విషయాలు తెలుసుకున్న వారందరూ యజ్ఞం చేసినవారే అవుతారు. ఇటువంటి యజ్ఞం చెయ్యలేనివాడు జీవించి ఉన్నవాడు కాదు. ఈ దేహము యజ్ఞం కోసమే ఉన్నది. యజ్ఞమువల్లనే కలుగుతున్నది. యజ్ఞానికి తగినట్లుగా వికారము చెందుతున్నది. పరిణామము చెందుచున్నది. దుఃఖసాగరంలో చేరుచున్నది.

ఈ దేహంలో దంతాలు – 32, సుషిరములు (బెజ్జములు, రంధ్రములు) – 15, దేహము యొక్క పొడవు – 96 అంగుళాలు, నాడీస్థానాలు – 14, మర్మాలు – 108. ముఖ్యమైన నాడులు –72, వీటిలో ఇడ, పింగళ, సుషుమ్నలు ప్రధానమైనవి. నాల్గవది పురీతతి. ఐదవనాడియే జీవుడు. దాని తరువాత పిత్తమున్నది. పిత్తమందు పురీతతి ఉన్నది. నాభితలానికి ఎడమవైపున రెండు అంగుళాల దూరంలో పిత్తమూలమున్నది. భుజించిన ఆహారము, మలము, మూత్రము, సారము అని మూడు విధాలుగా మారుతుంది. మూత్రము రెండు భాగాలై క్రిందుగను, ఎడమ వైపునను ప్రవహిస్తుంది. మలము ఏడు విధాలుగా దేహముయొక్క కుడివైపు నున్నది. సారము ఐదు

విధాలై దేహమందు వ్యాపిస్తుంది. ఆ కారణం చేతనే అన్నపానముల వలన రేతస్సు, రక్తము ఏర్పడుతున్నాయి. అన్నము రసముగా, రసము రక్తము, మాంసము, ఎముకలు, మజ్జ, శుక్లశోణితములుగా మారుతుంది.

శరీరంలో సంచరించేటట్లు చేసేది ప్రాణవాయువు. ఆ ప్రాణవాయువు నూలు పోగులాగా ఉంటుంది. దానివల్లనే శ్వాసపీల్చుటము, వదలటము, సంచరించటము జరుగుతున్నాయి. ప్రాణం లేకపోతే శరీరంలోని ఏ అంగము జీవించదు. వాయువు వల్లనే రక్తము హృదయము నుండి సర్వనాడులయందు ప్రవహిస్తున్నది. అక్కడ నుండి సర్వేంద్రియాలకు పోతున్నది. పాకము చేయబడిన రసము మాతృగర్భ మందు నాడీద్వారముగుండా గర్భాశయముచేరి, శిశువు యొక్క కపాలము గుండా ప్రవేశించి సుషుమ్నానాడిద్వారా గర్భకోశంలో ఉన్న జీవియొక్క ప్రాణాన్ని తృప్తిపరుస్తుంది. ఆ సుషుమ్నానాడియే బ్రహ్మనాడి. గర్భముయొక్క ప్రాణము మొదలైనవి అక్కడ కనిపిస్తాయి. జన్మించేటప్పుడు క్రిందికి జారి, పుట్టిన తరువాత హృదయమందు ఉంటుంది. దానిని జీవుడు యోగముతో నిరోధించి భృకుటి మధ్యలో ఉన్న సుషుమ్నవరకు తీసుకుపోయినట్లైతే పరమాత్మ దర్శనమవుతుంది.

ఇటువంటి దేహంలో అంతర్యామిగ, అమృతముగ, ఆత్మసాక్షిగ, ఉండేది పురుషుడు. ఆ పురుషుడు అవిద్యచేత ఆచ్ఛాదింపబడి, అభిమానియై, జీవుడు అవుతున్నాడు. జీవుడు అవిద్యలో వ్యాపింపచేయబడి ఉన్నాడు. అతనికి చాటుగా ఉన్న అజ్ఞానము బీజము. ఆ బీజము యొక్క మొలక అంతఃకరణ. దానియొక్క వృక్షము శరీరము.

ఈ శరీరంలో 8 కోట్ల రోమాలు, 8 వేల సంధులు, 9 వందల నరాలు ఉన్నాయి. గుండె 8 ఫలములు, నాలుక 12 ఫలములు, పిత్తము ఒక పడి, కఫము తూమెడు, శుక్లము రెండు తూములు, క్రొవ్వు 2 పడులు ఉన్నాయి. ఇవన్నీ నశించాయని తెలుసుకుని గర్భంలో ఉన్న జంతువులాగా, సుషుమ్నానాడిలో స్థిరముగా ఉండి, విజ్ఞానివి కావాలి. ఈ విషయాలు తెలుసుకున్నవాడికి పునర్జన్మలేదు. అతడు ముక్తిని పొందుతాడు.

## గర్భోపనిషత్తు - 2

### పూర్వజన్మజ్ఞానము

గతజన్మలో చేసిన కర్మ ఫలితాన్ని అనుభవించటం కోసం జీవుడు మళ్ళీ ఈ లోకంలో జన్మించటానికి తనకు అనువైన మాతృగర్భాన్ని ఎంచుకుని దానిలో ప్రవేశిస్తున్నాడు. మరి మాతృగర్భంలో ఉన్నప్పుడు అతడికి గతజన్మల స్మృతి, గతంలో తాను చేసిన పాపపుణ్యాలు, పూర్వజన్మ జ్ఞానము ఇత్యాదులు గుర్తు ఉంటాయా? గర్భవాసంలో శిశువు రూపంలో ఉన్న జీవుడు ఏ విధంగా ఆలోచిస్తాడు? అనే విషయాలు **'గర్భోపనిషత్తులో'** వివరించబడ్డాయి.

గర్భంలో ఉన్న శిశువు పంచభూతమయుడు, సమర్థుడు అవుతున్నాడు. పంచేంద్రియాలతో కూడిన ఆ శిశువు శబ్ద స్పర్శ రూప రస గంధాలను తెలుసు కుంటున్నాడు. సమ్యక్ జ్ఞానము (బ్రహ్మజ్ఞానము) చేత, ధ్యానముచేత పరమాత్మ స్వరూపమైన ప్రణవాన్ని తెలుసుకుంటున్నాడు. ఈ దేహంలో అష్టప్రకృతులు, అనేక రకాలైన వికారాలు ఉన్నాయి. వికారము అంటే – ఆకారంలో మార్పు,

స్వభావంలో మార్పు, స్వాభావిక స్థితినుండి మారటము. గర్భంలో ఉన్న శిశువుకు తొమ్మిదవ నెలలో అన్ని లక్షణాలు పూర్తి అవుతున్నాయి. అప్పుడు జీవుడు తన పూర్వజాతిని పూర్వకర్మను, భవిష్యకర్మను, పాపపుణ్యాలను తెలుసుకుంటాడు. నేను లెక్కలేనన్ని స్త్రీలయోనులను చూశాను. అనేక ఆహారాలను భుజించాను. అనేక స్థనాలను పానం చేశాను. అంటే ఇప్పటివరకు అనేకజన్మలు ఎత్తాను అని అర్థం.

ఈ సమస్త పృథివి నా జన్మభూమి. సమస్త భూమి స్మశాన భూమియే. నేను 84 లక్షల రకాలైన యోనులందు జన్మించాను. ఎన్నోసార్లు పుట్టాను. ఎన్నోసార్లు మరణించాను. ఎన్నోసార్లు సంసారినైనాను. చావుపుట్టుకలతోనే కాలం గడిచి పోయింది. గర్భవాసము మహాదుఃఖకరమైనది. మాతృగర్భంలో తలక్రిందులుగా వ్రేలాడుతూ మలమూత్రాదులతోకూడిన ప్రదేశంలో తొమ్మిది నెలలు ఉండాలి. ప్రక్కకు వత్తిగిలటానికి కూడా లేదు. ఆకలివేసినా, దాహం వేసినా అడగటానికి కూడాలేదు. బాధ కలిగితే కనీసం నోరారా ఏడ్వటానికి కూడా లేదు. అటువంటి గర్భవాసము చాలా దుః ఖకరమైనది. బాల్యమందు దుఃఖము, శోకము, పారవశ్యము, మూఢత్వము సంభవిస్తాయి. యౌవ్వనమందు మంచిపనులు చెయ్యకపోవటము, సోమరితనము, చెడుపనులు చెయ్యటము, విషయాసక్తి, తాపత్రయాలు బాధపెడతాయి.

వార్ధక్యమునందు చింత, వ్యాధులు కలుగుతున్నాయి. మరణమంటే మహాభయం కలుగుతుంది. ఆశ, అభిమానము, అధికమైన కామక్రోధాదులయందు చిక్కుకోవటము, అస్వతంత్రతలచేత

గొప్ప దుఃఖము కలుగుతుంది. ఈ జన్మము దుఃఖానికి కారణమై ఉన్నది. దుఃఖమయమైనది. మిగుల సహింపరానిది. నివృత్తి ధర్మము కొంచెముకూడా చెయ్యలేదు. యోగసాధన, జ్ఞానసాధన అసలే చెయ్యలేదు. దుఃఖసాగరములో మునిగి పోతున్నాను. దీనికి ప్రతిక్రియ చెయ్యటానికి అసమర్ధుడనై ఉన్నాను. అజ్ఞానమునకు మాటిమాటికీ ధిక్కారము. కామక్రోధాది సంకటములకు ధిక్కారము.

సంసారశృంఖలాలకు ధిక్కారము. మాతృగర్భము నుండి బయటకు వచ్చిన తరువాత, సద్గురువును ఆశ్రయించి బ్రహ్మజ్ఞానము పొందుతాను. యోనిద్వారము నుండి బయటపడిన వెంటనే నేను సాంఖ్యయోగాన్ని ఆశ్రయిస్తాను. యోనిద్వారము నుండి బయటకు రాగానే అశుభాన్ని నశింపచేసేవాడు, మోక్షప్రదాత అయిన పరమేశ్వరుని శరణు పొందుతాను. యోనిద్వారము నుండి బయటకు రాగానే శుభకరుడు, పురుషార్ధములనిచ్చేవాడు, అయిన జగదీశ్వరుని శరణువేడతాను.

ఈ యోనినుండి బయటకు వచ్చినట్లైతే సర్వశక్తిమంతుడు, సర్వకారణ భూతుడు, భర్గుడు, పశుపతి, రుద్రుడు, మహాదేవుడు, జగద్గురువు అయిన పరమేశ్వరుని శరణు పొందుతాను. ఈయోనిబంధము నుండి బయటకి వచ్చినట్లైతే గొప్ప తపస్సు చేస్తాను. ఈ గర్భవాసమునుండి బయటకు వచ్చినట్లైతే అమృతత్వాన్ని కలుగచేయు వాడు, ఆనందరూపుడు, అనామయుడు, నారాయణుడు అయిన ఆ పరమేశ్వరుని హృదయమందు ధ్యానం చేస్తాను. నేనిప్పుడు మాతృగర్భంలో బంధింపబడి ఉన్నాను. ఈ బంధమునుండి

విముక్తుడనైనట్లైతే అనన్యచిత్తముతో ఆ పరమేశ్వరుని ధ్యానించి, ఆయనను సంతసింపచేస్తాను.

పూర్వము నేను ఇతరులకోసం కర్మలు చేశాను. ఇప్పుడు ఒక్కడుగా బాధతో దహింపబడుతున్నాను. ఫలము అనుభవించిన వారందరూ గతించిపోయారు. పూర్వము నేను నాస్తికుడనై నిర్భయముగా అనేకసాధనలు చేశాను. ఆ పాపఫలమంతా ఇప్పుడు అనుభవిస్తున్నాను. ఇకముందు ఆస్తికుడనై కాలం గడుపుతాను.

ఈ రకంగా గతంలో జరిగిన విషయాలను మాటిమాటికీ ఆలోచించి సంసార దుఃఖాన్ని అనేకసార్లు స్మరించి, గర్భంలో ఉన్న జీవుడు వైరాగ్యమవలంబించి, అజ్ఞాన కామ్యకర్మాదులతో మోహము పొందుతున్నాడు.

ఆ జీవుడు వందలాదిస్త్రీల యోనిద్వారము పొందిఉన్నాడు. ఇప్పుడు ఈ యోనిద్వారము నుంచి విడుదల పొందటానికి ప్రయత్నిస్తున్నాడు. అలా విడుదల పొందటానికి శక్తిలేనివాడై యంత్రంలో చిక్కుకున్నవాడిలాగా బాధింపబడుతున్నాడు. దుః ఖాతిశయముచే కష్టము పొందుతున్నాడు. ప్రసవవాయువుచే పీడింపబడుతున్నాడు. జన్మించిన వెంటనే అతడు మాయచే వ్యాపింపడుతున్నాడు. అప్పుడు అతడు పరలోక సాధనాన్ని దేన్నీ స్మరించటంలేదు. అపరోక్షజ్ఞానము లేక బాధపడుతున్నాడు. పృథివీ స్పర్శ అయిన వెంటనే అనగా మాతృగర్భం నుంచి ఈ భూమిమీద పడగానే, జీవుడు క్రూరదృష్టికలవాడు, పామరుడు అవుతున్నాడు.

నీటిచే కడుగబడిన తరువాత అతడికి ఆ దృష్టిదోషము కూడా నశిస్తుంది.

జీవి పుట్టిన తరువాత, జన్మ, మృత్యు, కర్మ, శుభాశుభ సాధనలు ఏవీ స్ఫురించవు. వాసనలన్నీ బీజరూపంలో గూఢంగా ఉంటాయి. పూర్వజన్మ కర్మానుసారము ఈ భూమిమీద చరిస్తాడు. ఈ విషయాలన్నీ 'పైంగలోపనిషత్తులో' కూడా వివరించబడ్డాయి.

# ౯౯. నిరాలంబ, సర్వసారోపనిషత్తు (శిష్యుల ప్రశ్నలు)

"ఎవడు ఆలంబనమును వదలిపెట్టి నిరాలంబనమును ఆశ్రయించునో, అతడు సన్యాసి. యోగి. అటువంటి యోగి కైవల్యము పొందుతాడు." ఆ మాటలువిన్న శిష్యులకు అనుమానం వచ్చింది. అసలు బ్రహ్మమంటే ఏమిటి ? ఈశ్వరుడెవరు ? జీవుడెవరు ? ఈ రకంగా అనేక ప్రశ్నలు వారి మనసులో చోటు చేసుకున్నాయి. వాటన్నింటినీ ఒకటొకటిగా గురువుగారి ముందు ఉంచుతున్నారు. గురువుగారు సమాధానం చెబుతున్నాడు. ముందుగా శిష్యుడు అడుగుతున్నాడు

**1. గురువర్యా ! అసలు బ్రహ్మము అంటే ఏమిటి ?**

అజ్ఞానులకు మహత్తు, అహంకారముగాను, పంచభూతాలు గాను, బృహద్రూపమైన అండకోశముగాను, కర్మజ్ఞాన ఫలమైన లోకరూపముగాను అనిపిస్తుంది. ఆ బ్రహ్మము అద్వితీయమైనది. రెండవది ఏదీ లేనట్టిది. సకల ఉపాధి వినిర్ముక్తమైనది. సర్వశక్తి సంపన్నమైనది. ఆద్యంతములు లేనిది, శుద్ధమైనది, మంగళకరమైనది, శాంతమైనది, నిర్గుణమైనది, అనిర్వచనీయమైనది.

సత్యజ్ఞానమనంతమైనది ఆ బ్రహ్మము. సత్యము అనగా – నశించనిది. అవినాశి. నాశనము లేనిది. దేశకాల వస్తువులు అన్నీ నశించినా కూడా నశించనిది.

జ్ఞానము అనగా – ఉత్పత్తి వినాశరహితమైనది. ఎడతెగక ఉండునది. స్వయంప్రకాశమైన చైతన్యము. అనంతము అనగా – మట్టితో తయారయిన కుండలోని మట్టిలాగా, బంగారంతో

తయారయిన ఆభరణాలలోని బంగారంలాగా, దారంతో తయారైన వస్త్రములలోని దారంలాగా, అవ్యక్తాది వృద్ధి ప్రపంచంలో, సంపూర్ణంగా వ్యాపించి ఉండే చైతన్యము.

ఈ రకంగా సత్యజ్ఞానమనంతమైనదే బ్రహ్మము.

**2. గురుదేవా ! మరి ఈశ్వరుడంటే ఎవరు ?**

బ్రహ్మము లాగానే స్వశక్తి నాశ్రయించి ఈశ్వరత్వము పొంది, తనను ఎరుగని వారిచేత తనకన్న వేరుగా ఉన్నట్లు కనిపించే లోకాలను సృష్టించి, ఆ లోకాలయందు తానే అంతర్యామిగా ప్రవేశించి, బ్రహ్మనుండి క్రిమికీటకాలదాకా, అన్ని జీవులయొక్క బుద్ధి, ఇంద్రియాలకు నియంత అయినవాడు.

**3. గురుదేవా ! మరి జీవుడెవరు ?**

ఈశ్వరుడే బ్రహ్మ, విష్ణువు, ఈశానుడు, ఇంద్రుడు మొదలగువారికి నామ రూపాల నిచ్చి, అన్నిరకాల స్థూలశరీరాలను అభిమానించే సమిష్టి జీవుడవుతున్నాడు. ఆ సమిష్టి జీవుడు ఒక్కడే అయినప్పటికీ విడివిడిగా దేహాలను అభిమానించటానికి కారణమైన అంతఃకరణ భేదానికి వశమవటంచేత, అసంఖ్యాకమైన జీవకోటి అవుతున్నాడు.

**4. గురువర్యా ! మరి ప్రకృతి ఎవరు ?**

బ్రహ్మ నుండి బయటకు వచ్చిన నానావిచిత్రమైన జగత్తును నిర్మించటానికి సమర్థమైన బుద్ధి రూప బ్రహ్మశక్తి.

**5. మరి పరమాత్మ ఎవరు ?**

శరీరాదులకన్న పరుడవటంచేత ఆ బ్రహ్మమే పరమాత్మ

అనబడుతున్నది.

**6. హిరణ్యగర్భుడు అంటే ఎవరు ?**

ఆ బ్రహ్మమే చతుర్ముఖుడైన కర్మబ్రహ్మ. అతడే హిరణ్యగర్భుడు.

**7. ఈ జగత్తులో వివిధరూపాలలో ఉన్న జీవులెవరు ?**

ఆ బ్రహ్మమే విష్ణువు. అతడే రుద్రుడు. అతడే ఇంద్రుడు, అతడే యముడు, అతడే సూర్యుడు, అతడే చంద్రుడు. అతడే సర్వదేవతల స్వరూపము. అతడే మానవుడు. అతడే స్త్రీరూపము. అతడే పశువు. అతడే పక్షి. బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులని చెప్పబడే చాతుర్వర్ణాల వారి స్వరూపము అతడే జగత్తులో పిపిలీకాది బ్రహ్మపర్యంతము ఉన్నది. అతడొక్కడే. ఈ సర్వము పరబ్రహ్మమయమే. ఇందులో బ్రహ్మనుంచి బ్రాహ్మణులవరకు ఏ మాత్రము తేడాలేదు. జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. పరమేశ్వర మయమే.

**8. గురుదేవా ! జాతి అంటే ఏమిటి ?**

చర్మానికి జాతిలేదు. రక్తానికి జాతిలేదు. మాంసానికి అంతకన్నా లేదు. ఆస్తికీ జాతి లేదు. ఆత్మకూ జాతి అనేది లేదు. కాని కేవలము వ్యవహారానికి మాత్రమే జాతి ఉన్నది. ఇది కేవలము లౌకికమైనది.

**9. గురువర్యా ! మరి కర్మ అంటే ఏమిటి ?**

కర్మేంద్రియాలు కర్మను చేస్తుంటాయి. అలాంటప్పుడు ఆ కర్మను నేను చేస్తున్నాను అని అధ్యాత్మనిష్ఠగా చేసేదే కర్మ.

**10. మరి నిష్కామ్యకర్మ ఏది ?**

కర్మ అనేది జన్మజన్మల బంధము. ఈ విషయం తెలిసి నిత్య

నైమిత్తిక కర్మలు, యాగాలు, వ్రతాలు, తపస్సు, దానము మొదలైనవి చేస్తున్నప్పటికీ, కర్మఫలంతో నిమిత్తం లేకుండా చేసేదే నిష్కామ్యకర్మ.

**11. గురుదేవా ! జ్ఞానము అంటే ఏది ?**

దేహము, ఇంద్రియము అనే సంశయంచేత, సద్గురువును ఉపాసించటం చేత, శ్రవణమువల్ల, నిధి ధ్యానమువల్ల, దృక్కు దృశ్యము అంతా సర్వాంతర్యామియై ఉన్నది. సర్వసమానమైనది. ఘటపటాది వికార వస్తువులయందు వికార రహితమైన చైతన్యము తప్ప ఇంకొకటి ఏదీ ఇక్కడ లేదు. అనే విషయం సాక్షాత్కరించటమే జ్ఞానము.

**12. గురుదేవా ! మరి అజ్ఞానము అంటే ఏది ?**

తాడును చూసి పాము అనుకొన్నట్లుగానే కేవలము సర్వాంతర్యామి, సర్వరూపము అయిన బ్రహ్మమునందు దేవతలు, పశువులు, పక్షులు, మానవులు, స్త్రీలు, పురుషులు, వర్ణాశ్రమాలు, బంధమోక్షాలు మొదలైన అనేక భేదములచేత కల్పితమైన విజ్ఞానమే అజ్ఞానము.

**13. గురుదేవా ! సుఖమంటే ఏది ?**

సచ్చిదానంద స్వరూపం తెలుసుకుని ఆనందరూపంతో ఉండటమే సుఖము.

**14. గురువుగారూ ! మరి దుఃఖమంటే ఏమిటి ?**

అనాత్మ విషయాలయొక్క సంకల్పమే దుఃఖము.

**15. ఏది స్వర్గము ?**

సజ్జన సాంగత్యమే స్వర్గము.

**16. మరి నరకమంటే ఏది ?**

సంసారపరమైన విషయవాంఛలలో పడి కొట్టుమిట్టాడటమే నరకము.

**17. బంధము అంటే ఏమిటి ?**

అజ్ఞానవాసనచేత "నేను జన్మించాను. నేను ఉన్నాను." మొదలైన సంకల్పాలను కలిగి ఉండటమే బంధము. తల్లిదండ్రులు, భార్యాబిడ్డలు, ఆస్తిపాస్తులు వీటియందు మోహము కలిగి ఉండటమే బంధము. కర్తృత్వము, అహంకారములను గూర్చిన సంకల్పమే బంధము. అష్టైశ్వర్యాలను గూర్చిన ఆశ, వాటిని గూర్చిన సంకల్పము బంధము. కేవలము సంకల్పవమే బంధము. అష్టసిద్ధులమీద ఆశ, అష్టాంగయోగాభ్యాసము మీద సంకల్పము, వర్ణాశ్రమాలు, ధర్మకర్మ సంకల్పము, ఆజ్ఞ, భయము, సంశయము మొదలైనవి ఆత్మ గుణాలుగా భావించటం బంధము. యజ్ఞాలు, యాగాలు, వ్రతాలు, తపస్సు, వీటి విధి విధానాల సంకల్పము బంధము. కేవలము మోక్షాపేక్ష కూడా బంధమే. సంకల్పమాత్రంచేత సంభవించేదంతా బంధమే.

ఆత్మేశ్వరుడైన జీవుడు అనాత్మరూపమైన శరీరాదులను, ఆత్మగా భావించి అభిమానిస్తున్నాడు. ఆ శరీరాభిమానమే ఆత్మకు బంధము.

**18. గురువుగారూ ! మరి మోక్షము అంటే ఏమిటి ?**

నిత్యానిత్య వస్తు విచారణచేత, అనిత్యమైన సంసార దుఃఖ విషయాలను సమస్త వస్తువుల యందు మమకార బంధక్షయమే మోక్షము. శరీరాభిమానము పూర్తిగా పోవటమే మోక్షము. రాగద్వేషాలు, అహంకార మమకారాలు లేకుండా ఉండటమే మోక్షము.

**19. ఉపాస్యుడెవరు ?**

సర్వజీవుల శరీరములందు ఉన్న చైతన్య బ్రహ్మమును పొందించు గురువే ఉపాసింపదగినవాడు.

**20. గురుదేవా ! మరి శిష్యుడవెరు ?**

విద్యచేత తనకన్న వేరైన జగత్తంతా అదృశ్యమైనప్పుడు, తనకన్న వేరైన వస్తువు ఏదీ లేక తాను ఒక్కడుగానే మిగిలినవాడు.

**21. మరి విద్వాంసుడు ఎవరు ?**

బ్రహ్మము మొదలు స్తంబము వరకు సమస్తమునందు స్వరూప జ్ఞానము తెలుసుకున్నవాడు.

**22. మూఢుడెవరు ?**

శరీరములందు, వర్ణములయందు, ఆశ్రమములయందు, కర్తృత్వభోక్తృత్వాదుల యందు అహంకారభావన గలవాడు.

**23. అసురము ఏది ?**

బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడు మొదలైన వారిని ఉద్దేశించి భోగభాగ్యములు, సిరిసంపదలు సాధించటానికి ఉపాసన, జపము, అగ్నిహోత్రముల చేత అంతరాత్మను తపింపచేస్తూ, అతి ఉగ్రమైన రాగము, ద్వేషము, హింస, దంభము మొదలైన వాటిచే ఆచరించే తపస్సే అసురము.

**24. మరి తపస్సు ఏది ?**

పరబ్రహ్మను పొందాలి అనే ఆశతో 'బ్రహ్మసత్యము – జగన్మిథ్య' అనే భావము పొంది అజ్ఞానాన్ని జ్ఞానాగ్నిలో మండింపచేయుటయే తపస్సు.

**25. పరమపదమేది ?**

ప్రాణాలు, ఇంద్రియాలు, అంతఃకరణ మొదలైన వాటికన్న వేరైనది, సచ్చిదానందమయము, నిత్యము, ముక్తము అయిన బ్రహ్మస్థానమే పరమపదము.

**26. ఏది నిగ్రహింపదగినది ?**

దేశకాల వస్తు పరిచ్ఛేదములేని చిన్మాత్ర స్వరూపము.

**27. ఏది గ్రహింపదగినది ?**

సర్వరూప వ్యతిరిక్తమైనది. మాయామయమైన బుద్ధి, ఇంద్రియాలకు గోచరమైనది, ఈ జగత్తు అంతా అసత్యము అనే భావన.

**28. సన్యాసి ఎవడు ?**

ప్రాపంచిక విషయాలను పరిత్యజించి, నిర్మలుడు, నిరహంకారుడు అయి, తనకు ఇష్టమైన బ్రహ్మను శరణువేడి, తత్త్వమసి, అహం బ్రహ్మోస్మి మొదలైన మహావాక్యములయొక్క అర్థాన్ని అనుభవంలోకి తెచ్చుకుని, నేనే బ్రహ్మను అని నిశ్చయంగా తెలుసుకుని, నిర్వికల్ప సమాధితో కూడిన స్వతంత్రుడైన యతి సన్యాసి అనబడతాడు. అతడే ముక్తుడు. పూజ్యుడు. పరమయోగి, అతడే పరమహంస, అతడే బ్రాహ్మణుడు. అతడే సన్యాసి.

**29. జాగ్రదవస్థ అంటే ఏది ?**

జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, అనే 14 ఇంద్రియములచేత స్థూలమైన శబ్దాది విషయాలనుగ్రహించే స్థితి.

**30. స్వప్నావస్థ ఏది ?**

శబ్దాది విషయాలు లేకపోయినా ఆ కాలములో కలిగిన వాసనామయమైన శబ్దాదులను జాగ్రదవస్థ యొక్క వాసనలతో కలిసిన కరణములచేత గ్రహించటమే స్వప్నావస్థ.

**31. సుషుప్తి అంటే ఏమిటి ?**

పద్నాలుగు కరణముల ప్రవృత్తి లేకుండా ఉండటంచేతను, విశేషజ్ఞానము లేనందువల్ల, శబ్దాది విషయాలను తెలుసుకునే స్థితి.

అజ్ఞానంవల్ల పామరులకు ఈ లోకమంతా అసత్తు అయినప్పటికీ వాస్తవంగా కనిపిస్తుంది. లౌకికులకు సత్యబుద్ధిని ఇస్తుంది. ఈ అజ్ఞానము ఇదమిద్ధమని నిర్వచించటానికి వీలుకాదు. వాసనలతో కూడిన చతుర్దశ కరణములు, వాసనా మయమైన శబ్దాదులను ఎప్పుడు అనుభవిస్తావెూ, అప్పుడు జీవుడికి స్వప్నం కలుగుతుంది. చతుర్దశకరణములు పరిణమించినప్పుడు విశేషజ్ఞానము లేనందున శబ్దాదులను పొందేటప్పుడు ఆత్మకు సుషుప్తి కలుగుతుంది.

**32. తురీయము అంటే ఏమిటి ?**

జాగ్రస్వప్న సుషుప్తుల భావాభావములకు సాక్షిగను, భావాభావములు తనకు లేకుండ నిరంతర చైతన్యమాత్రముగా ఉండే స్థితి.

**33. అన్నమయకోశము అంటే ఏది ?**

అన్నమువలన కలుగు కార్యక్రమముల యొక్క సమూహాము. ఇదే స్థూలశరీరము.

**34. ప్రాణమయకోశము అంటే ఏది ?**

ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన, నాగ, కూర్మ, కృకుర, దేవదత్త ధనంజయములు అనే పది వాయువులతో నిండిన కోశమే ప్రాణమయకోశము.

**35. మనోమయకోశము అంటే ఏది ?**

జ్ఞానేంద్రియాలు మనస్సు, కలిసి మనోమయ కోశము అంటారు. నేను నాది అనే సంకల్ప వికల్పాలకు హేతువు ఇదే.

**36. విజ్ఞానమయకోశము అంటే ఏది ?**

జ్ఞానేంద్రియాలతోను, వృత్తులతోను కూడిన బుద్ధియే విజ్ఞాన మయకోశము. ఇది పురుషుని జనన మరణరూపమైన సంసారానికి కారణము. ఇంకా చెప్పాలి అంటే, పై మూడు కోశాలతో కూడిన అంతఃకరణయందు వాటిలోగల విశేషమును గూర్చి ధ్యానమనసాది వృత్తులు ఎక్కడ కలుగుతాయో అది విజ్ఞానమయకోశము అవుతుంది.

**37. ఆనందమయకోశము అంటే ఏది ?**

అజ్ఞానంతో పైన చెప్పిన నాలుగు కోశాలతో కూడి ఉన్నప్పుడు వటబీజములో వటవృక్షము అణిగి ఉన్నట్లుగా, స్వరూప సుఖమందు తనయొక్క కారణజ్ఞానము అణిగి ఉన్నప్పుడు అది ఆనందమయకోశము అనబడుతుంది.

స్వరూప సుఖమునందు వటబీజమందు వృక్షములాగా ప్రవర్తించుకోశమే ఆనందమయకోశము.

ఆనంద స్వరూపమైన ఆత్మయొక్క ప్రతిబింబముచేత తాకబడినటువంటి, తమోగుణంవల్ల ప్రకటితమైనటువంటి వృత్తిని

ఆనందమయకోశము అంటారు. ఇది ప్రియము, మోదము, ప్రమోదము అనే మూడు గుణాలతో కలిసి ఉంటుంది. ఇదికూడా అజ్ఞానంతో కూడినదే.

**38. కర్త ఎవరు ?**

సుఖము, దుఃఖము, బుద్ధిననుసరించి, వాటి కోరికతో దేహాంతః కరణ గలవాడు.

**39. జీవుడెవరు ?**

సుఖబుద్ధి – ఇష్టబుద్ధి, దుఃఖబుద్ధి – అనిష్టబుద్ధి, ఈ సుఖ దుఃఖాలకు, శబ్ద స్పర్శ రూప రస గంధాలు కారణాలు. పుణ్యపాప కర్మానుసారంగా లభించిన దేహాన్ని తాను ఆ విధంగా లభించిన దేహంలాగా భావించి, దేహాత్మబుద్ధితో ఉన్నవాడు జీవుడు.

**40. పంచవర్గులు అంటే ఏవి ?**

1. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, 2. పంచప్రాణాలు, 3. సత్త్వరజస్తమోగుణాలు 4. పంచభూతాలు 5. పాపపుణ్యాలు

వీటితోకూడిన శరీరము అజ్ఞానమయమైనది.

**41. లింగశరీరమేది ?**

పంచవర్గ ధర్మము గలది, జ్ఞానమువల్ల తప్ప మరి దేనికీ నశించనిది. ఆత్మసాన్నిధ్యముతో నిత్యమైనదిగా కనుపించేది. ఆత్మోపాది అయినది లింగశరీరము. అదే హృదయ గ్రంథి.

**42. క్షేత్రజ్ఞుడు ఎవరు ?**

హృదయగ్రంథి యందు ప్రతిఫలించి ప్రకాశిస్తున్న చైతన్యమే క్షేత్రజ్ఞుడు.

**43. సాక్షి అనగా ఎవరు ?**

తెలుసుకొనువాడు. తెలియబడునది. వీటిలో ఆవిర్భావ తిరోదానములను తెలుసుకొనువాడుగను, ఆవిర్భావతిరోదానములు లేనివాడుగను, స్వయంప్రకాశము గలవాడుగను, ఉండేవాడు.

**44. కూటస్థుడు ఎవరు ?**

పిపీలికాది బ్రహ్మపర్యంతము సకల ప్రాణులయొక్క బుద్ధి గుహలో అధిష్ఠించి ఉన్నవాడు. సకల ప్రాణులయొక్క బుద్ధికి స్థానమైన ఆత్మగా ప్రకాశించేవాడే కూటస్థుడు.

**45. అంతర్యామి ఎవరు ?**

తనతో కూడి ఉండు కూటస్థుడు మొదలైన వారితో భేదములుగల స్వరూపమును తెలుసుకొనే విషయంలో హేతువుగను, అన్ని దేహాలలోను మణులలో దారంలాగా లోపల ఉండి నియమించువాడుగా ప్రకాశించే ఆత్మే అంతర్యామి.

**46. ప్రత్యగాత్మ ఎవరు ?**

సత్యజ్ఞానమనంతమైనది, ఆనందమైనది, అన్ని రకాలయిన శరీర ఉపాధులు లేనిది, కటక మకుటాది భూషణ భేదములు లేని బంగారుముద్ద వంటిది, విజ్ఞానఘనమైనది, చిత్స్వభావమైనది, ఆత్మచైతన్యమైనది, బ్రహ్మమైనది, ప్రకాశించునది, అవిద్యోపాధికి లోబడినది అయిన త్వం పదార్థము ప్రత్యగాత్మ.

**47. పరమాత్మ అనగా ఏది ?**

ఆనందమగు సుఖచైతన్య స్వరూపము. అపరిమితానంద సముద్రము, అవశిష్టము అయిన సుఖస్వరూపము. సత్యము, జ్ఞానము, అనంతము, ఆనందము, లక్షణములుగా గలది పరమాత్మ.

ఉపాధికమైన త్వం పదార్థముకన్న, ఔపాధిక భేదమైన తత్ పదార్థముకన్న, విలక్షణముగా ఉన్నది. ఆకాశములాగా శూన్యమైనది. కేవలము సత్తామాత్రా స్వభావముగలది పరమాత్మ.

**48. మాయ అంటే ఏది ?**

అనాదియైనది. అంతముగలది. ప్రమాణాలకు, అప్రమాణాలకు సాధారణమైనది. సత్తు కాదు అసత్తు కాదు సదసత్తు కాదు. స్వయముగా అధికమైనది. వికారములు లేనిది. నిరూపించటానికి వీలైన లక్షణాలు లేనిది మాయ.

**49. సత్యము అంటే ఏది ?**

సత్తు అనే శౌతప్రతీతికి లక్ష్యమైనది. అసత్తు అని చెప్పరానిది. త్రికాల బాధ్యమైనది. మూడుకాలములందు ఉండేది. అస్తి రూపమైనది. రెండవది లేనిది. సజాతి విజాతి భేదములు లేనిది. సర్వకల్పనలకు అధిష్ఠానమైనది. నాశనము లేనిది. దేశకాలవస్తు నిమిత్తాదులు సర్వమూ నశించిననూ నశించనిది.

**50. జ్ఞానమనగా ఏది ?**

స్వయంగా ప్రకాశించేది. అన్నింటినీ ప్రకాశింపచేసేది. చిన్మాత్ర రూపమైనది.

**51. అనంతమనగా ఏది ?**

ఉత్పత్తి వినాశరహితమైనది. షడ్భావవికార రహితమైనది. సర్వోపాధి వినుర్ముక్తమైనది. మట్టితో చేసిన కుండలోని మట్టిలాగా, బంగారు ఆభరణాలలోని బంగారంలాగా, దండలోని దారంలాగా,

అవ్యక్తాది సృష్టి ప్రపంచంలో వ్యాపకముగా ఉండేది. నాశనము లేనిది. చైతన్యమైనది.

**52. ఆనందమనగా ఏది ?**

నీటికి సముద్రంలాగా సుఖచైతన్యానికి అధిష్ఠానమైనది. నిత్యశుద్ధ అఖండాద్వైత చిదానందైకరసము.

**53. పదార్థాలు ఎన్ని విధాలు ?**

సత్తు, అసత్తు, మిథ్య అని పదార్థాలు మూడు రకాలు. వీటిలో సత్తు బ్రహ్మము. లేనిది అసత్తు. లేని జగత్తును బ్రహ్మమునందు ఆరోపించటమే మిథ్య. బ్రహ్మమే ఆత్మగా తెలుసుకోవాలి. అనాత్మ అయిన శరీరము మొదలైన వాటిని, సమూలంగా నివృత్తి చేసుకుని సత్తా మాత్రమైన పరబ్రహ్మమందు లయం చెందటమే బ్రహ్మజ్ఞానము. జీవుడు మొదలు ఆకాశం వరకు గల ప్రపంచం అంతా అనాత్మయే. అనాత్మకు మూలమైనది మాయ. అటువంటి మాయ ఆకాశంలో మేఘాలు కనిపిస్తున్నట్లుగా బ్రహ్మమునందు కనిపిస్తున్నది. ఈ మాయ అనాదియైనది. అంతముగలది. ప్రమాణ అప్రమాణాలాకు పాత్రైనది. అది ఉన్నది కాదు. లేనిది కాదు. ఈ రెండింటికీ చెందనిది అసలుకాదు. వాక్కుకు అందనిది. విద్వాంసులచేత వర్ణింపబడు హెచ్చుతగ్గులైన భేద వ్యవహారములు గలది. యదార్థముగా లేనిది. ఆ మాయే మూలప్రకృతి. అవిద్య మొదలైన అనేక రూపాలు గలది. ప్రపంచాకారముగా పరిణమించి ఉండేది. బ్రహ్మజ్ఞాని మాయను ఈ రకంగా తెలుసుకుంటాడు.

**54. బ్రహ్మస్వరూపుడు ఎవరు ?**

నేను శరీరరమునుగాను, దశేంద్రియాలు అంతకన్నా కాను, మనస్సు, బుద్ధి, ఈశ్వరుడు అసలే కాను. అహంకారము అంతకన్నా కాను. నేను ప్రాణరహితుడను. మనోరహితుడను, పరిశుద్ధుడను, బుద్ధ్యాదులకు సర్వదా సాక్షీభూతుడను. సదానిత్యుడను. చిన్మాత్రుడను. నేను కర్తనుగాను, భోక్తనూకాను, ప్రకృతికి సాక్షిస్వరూపంగా ఉండేవాడను. నాతో కలిసి ఉన్నందువల్ల దేహాదులు చైతన్యవంతములై పనులు చేస్తున్నాయి. నేను నిశ్చలుడను, నిత్యుడను. సదా ఆనంద స్వరూపుడను. శుద్ధుడను. సదాజ్ఞానమయుడను, నిర్మలుడను. సర్వభూతములయొక్క ఆత్మను. సర్వవ్యాపకుడను. సర్వవేదాంత వేద్యమైన బ్రహ్మమును నేను. నేను అజ్ఞేయుడను. ఆకాశాది పంచ భూతములు నేను కాను. నామములు నేను కాను, కర్మలు నేను కాను, సచ్చిదానందమయమైన బ్రహ్మమును నేనే. నేను దేహాన్ని కాదు కాబట్టి నాకు జనన మరణాలు లేవు. నేను ప్రాణిని కాదు కాబట్టి ఆకలిదప్పికలు నాకు ఉండవు. నేను కర్తను కాను బంధమోక్షాలు నాకు లేవు. నేనే పరబ్రహ్మను. అని త్రికరణశుద్ధిగా భావించగలిగినవాడే బ్రహ్మస్వరూపుడు. అతడే పరబ్రహ్మ. వివరిస్తోంది 'ఆత్మోపనిషత్తు'.

# 67. పైంగలోపనిషత్తు

## స్థూలశరీరము

ఇప్పటివరకు ఈ జగత్తు ఎలా ఆవిర్భవించింది అనే విషయాన్ని చూశాం. జగత్తు అంటే కేవలము అడవులు, కొండలు, బండలు, పర్వతాలు, సముద్రాలు, నేల, నింగి ఇవి మాత్రమే కాదు. 84 లక్షల రకాలయిన జీవరాసి ఆవిర్భవించింది అన్నాము. అయితే అసలు ఈ స్థూలశరీరం ఏ రకంగా ఏర్పడింది? అనే విషయం చూద్దాం. ఈ విషయమంతా **పైంగలోపనిషత్తు**లో చెప్పబడింది.

ఈశ్వరుడు పంచీకృతమైన మహాభూతాలను తీసుకుని వ్యష్టి రూపంలోను, సమిష్టి రూపంలోను స్థూలదేహాలను సృష్టించాడు. వ్యష్టి అంటే విడివిడిగా (ఏకవచనం) సమిష్టి అంటే – అన్నీ కలిపి (బహువచనం) అని అర్థం. వాటిలో కపాలము, చర్మము, వరాలు, ఎముకలు, మాంసము, గోళ్ళు మొదలైనవి. పృథివి యొక్క అంశలు రక్తము, మూత్రము, లాలాజలము, స్వేదము మొ॥వి జలము యొక్క అంశలు. ఆకలి, దప్పిక, ఉష్ణము, మోహము, మైధునము మొ॥ అగ్నియొక్క అంశలు. నడవటము, దాటము, శ్వాస పీల్చటము, శ్వాస వదలటము అనేవి వాయువుయొక్క అంశలు, కామక్రోధాలు ఆకాశము యొక్క అంశలు. ఈ రకంగా సంచితమైన కర్మతో కూడినది, చర్మము, రక్తము మొ॥వి గలది, భార్య, పుత్రులు, మిత్రులు మొ॥ వారిని అభిమానించేది, బహుదోషములకు ఆశ్రయమైనది అయిన స్థూలదేహము ఏర్పడుతోంది అని గతంలో మనం అనేకసార్లు చెప్పుకున్నాం ఈ దేహము పాంచభౌతికమైనది అని ఆ పంచభూతాల అంశలు ఈ శరీరంలో ఎలా ఉంటాయనేది ఇప్పుడు మీకు బాగా

తెలుస్తుంది.

పంచభూతాల రజోగుణాన్ని నాలుగు భాగాలుగా చేసి, అందులోని మూడు భాగాలతో ప్రాణాన్ని సృష్టించాడు. ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము అనేవి ప్రాణము యొక్క వృత్తులు. నాగకూర్మ క్రుకుర దేవత, ధనుంజయములు ఉపవాయువులు. వీటినే ఉపప్రాణాలు అని కూడా అంటారు. హృదయము, గుదము, నాభి, కంఠము, సర్వాంగములు ప్రాణాల యొక్క స్థానాలు. పంచభూతాల యొక్క నాల్గవ రజోగుణ భాగంతో కర్మేంద్రియాలను సృష్టించాడు. వాక్కు, పాణి, పాపము, గుదము, ఉపస్థ అనేవి కర్మేంద్రియాలు. మాట్లాడటము, అర్చించటము, నడవటము, విసర్జన, ఆనందము అనేవి కర్మేంద్రియాల విషయాలు. అగ్ని, దేవేంద్రుడు ఉపేంద్రుడు, మృత్యువు, ప్రజాపతి కర్మేంద్రియాల దేవతలు.

ఇక పంచభూతాల యొక్క సత్త్వగుణాన్ని నాలుగు భాగాలు చేసి వాటిలోని మూడింటితో అంతఃకరణ చతుష్టయాన్ని సృష్టించాడు. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనేవి చిత్తవృత్తులు. ఆలోచించటము, నిశ్చయించటము, స్మరించటము, అభిమానించటము, అనుసంధానము చేయటము అనేవి అంతఃకరణ విషయాలు. కంఠము, ముఖము, నాభి, హృదయము, భ్రూమధ్యము అనేవి అంతఃకరణ స్థానాలు. చంద్రుడు, విష్ణువు, బ్రహ్మ, శంభుడు అంతఃకరణ చతుష్టయానికి దేవతలు. ఇప్పుడు పంచభూతాల యొక్క సత్త్వగుణ సంబంధమైన నాల్గవ భాగంతో జ్ఞానేంద్రియాలను సృష్టించటం జరిగింది. కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము అనేవి ఆయా వృత్తుల వలన ఏర్పడిన జ్ఞానేంద్రియాలు. శబ్ద స్పర్శ రూప

రస గంధాలు జ్ఞానేంద్రియాల విషయాలు. దిక్కులు, వాయువు, సూర్యుడు, వరుణుడు, అశ్వనీ దేవతలు జ్ఞానేంద్రియాలకు అధిష్ఠాన దేవతలు.

ఆ తరువాత పంచకోశాలు ఏర్పడ్డాయి. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములనే పంచకోశాలు అంటారు. అన్న రసముతో ప్రభవించి, అన్న రసముతో వృద్ధి చెంది, అన్నరసమయమైన పృథివిలో లీనమయ్యేది అన్నమయకోశము. ఇదే స్థూల శరీరము. కర్మేంద్రియాలతో కూడిన ప్రాణవే ప్రాణమయకోశము. జ్ఞానేంద్రియాలు మనస్సు కలసి మనోమయ కోశము. జ్ఞానంతో కలసిన బుద్ధి విజ్ఞానమయకోశము. ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశముల సమూహమే సూక్ష్మదేహము. దాన్నే లింగదేహము అంటారు. స్వస్వరూపము యొక్క జ్ఞానము ఆనందమయకోశము. ఇదే కారణ దేహము. ఈ రకంగా మానవదేహం 1. స్థూలశరీరము 2. సూక్ష్మశరీరము, 3. కారణశరీరము అని మూడు శరీరాలుగా చెప్పబడుతోంది.

1. జ్ఞానేంద్రియాలు 2. కర్మేంద్రియాలు 3. ప్రాణాలు 4. పంచభూతాలు 5. అంతఃకరణ చతుష్టయము, 6. కామము 7. కర్మము 8. తమస్సు (అవిద్య) ఈ ఎనిమిది గల దేహాన్ని అష్టపురము అంటారు. ఈశ్వరాజ్ఞతో విరాట్పురుషుడు ఒక్కొక్క శరీరమందు ప్రవేశించి బుద్ధిని అధిష్టించి విశ్వుడైనాడు. విజ్ఞాత్ముడని, చిదాభాసుడని, విశ్వుడని, వ్యావహారికుడని, స్థూలశరీరాభిమాని అని, కర్మభవుడని విరాట్టుకు పేర్లు. ఈశ్వరాజ్ఞతో ఒక్కొక్క దేహమునందు ప్రవేశించిన సూత్రాత్మ మనస్సును అధిష్టించి తైజసుడైనాయి. ఇతడికి తైజసుడు, ప్రాతిభాసికుడు స్వప్న కల్పితుడు అని పేర్లు. ఈశ్వరాజ్ఞతో

మాయోపాధికుడగు ఈశ్వరుడే అవ్యక్త సహితుడై ఒక్కొక్క కారణ దేహమందు ప్రవేశించి ప్రాజ్ఞుడైనాడు. ఇతడికి ప్రాజ్ఞుడు, అవిభిన్నుడు, పారమార్థికుడు సుషుప్త్యాభిమాని అని పేర్లు.

వేదాంత శ్రవణం వల్ల ప్రాప్తించే ఫలితము ప్రాజ్ఞుడికే చెందుతుంది. జ్ఞానము ఆవరించిన ఈ జీవుడికి 'తత్త్వమసి' మొదలైన మహావాక్యాలు జీవబ్రహ్మైక్యాన్ని బోధిస్తాయి.

అవిద్యలో ప్రతిబింబించిన చైతన్యానికి అంటే జీవుడికి మాత్రమే అవస్థాత్రయాలు చెప్పబడ్డాయి. ఆ జీవుడే జాగ్రదావస్థ, స్వప్నావస్థ, సుషుప్తి అనే మూడు అవస్థలను అనుభవిస్తూ గానుగకు కట్టిన ఎద్దులాగా జననమరణాలు పొందుతూ సంసారమనే బండి చక్రంలో పడి విసుగు విరామం లేకుండా తిరుగుతున్నాడు. జీవుడికి జాగ్రద, స్వప్న, సుషుప్తి, మూర్ఛ, మరణము అనే ఐదు అవస్థలున్నాయి. ఆయా దేవతల అనుగ్రహంతో జ్ఞానేంద్రియాలతో శబ్దము మొదలైన విషయాలను పరిగ్రహించే జ్ఞానము జాగ్రదావస్థలో జరుగుతుంది. జాగ్రదావస్థలో భ్రూమధ్యము నందు చేరిన జీవుడు ఆపాదమస్తక పర్యంతము కృషి, శ్రవణము మొదలైన అన్ని పనులకు కర్త అవుతున్నాడు. తాను చేసిన కర్మలయొక్క ఫలితాలు కూడా అనుభవిస్తున్నాడు. ఈ జీవుడే శరీరాన్ని విడచిన తరువాత లోకాంతరాలకు వెళ్ళి అక్కడ తాను ఈ లోకంలో కర్మలు చెయ్యటం వల్ల ఆర్జించిన ఫలితాన్ని అనుభవిస్తున్నాడు. అతడు సార్వభౌముని లాగా వ్యవహారాలతో అలసిపోయి నిద్ర పోవటానికి పడుకుంటున్నాడు. అంటే అంతర్భవమును ప్రవేశించటానికి మార్గాన్ని అన్వేషిస్తున్నాడు.

వాక్కు మొదలైన పనులన్నీ ఆగిపోయినప్పుడు గ్రాహ్యగ్రాహక

రూపాలను సృష్టించటమే స్వప్నావస్థ. అంటే చూసేవాడు, చూడబడేది రెండింటినీ సృష్టించటం జరుగుతుంది. స్వప్నావస్థలో జాగ్రదావస్థలోఉన్న వ్యవహారాలు లోపించి ఉంటాయి. అందుచేత విశ్వుడుగా ఉన్న ఆ జీవుడే నాడీమండలం మధ్యలో సంచరిస్తూ తైజసభావం పొంది వాసనా రూపంలో ఉన్న జగత్ వైచిత్ర్యాన్ని తన ఇష్టం వచ్చిన రీతిలో ప్రకాశింప చేస్తూ స్వేచ్ఛగా విషయాలు అనుభవిస్తున్నాడు.

చిత్తము అనే సాధనము గలది సుషుప్తి. ఆహారం కోసం వెళ్ళి తిరిగి వచ్చిన పక్షి రెక్కలు ముడుచుకుని గూటిలోనికి పోయినట్లుగా, జీవుడు జాగ్రస్వప్న అవస్థలలో ప్రాపంచిక విషయాలనుభవించి, అలసిపోయి, వాటిని విరమించి, జ్ఞాన భూమికలో చేరి ఆత్మానందం అనుభవిస్తున్నాడు.

ఒక్కసారిగా అనుకోకుండా ఇనుపగదతో గాని, కర్రతో గాని బలమైన ఆయుధంతో గాని కొట్టబడిన వాడిలాగా భయము, అజ్ఞానము గలవాడై అన్ని ఇంద్రియాలతోను కంపము చెందుతున్నట్లైతే ఆ అవస్థను మరణ సన్నిభమైన మూర్ఛావస్థ అంటారు. జాగ్రస్వప్న సుషుప్తి మూర్ఛావస్థల కన్న వేరైనదై, పిపీలికాది బ్రహ్మ పర్యంతము ఉన్న సమస్త జీవకోటికీ అభయప్రదమైనదై, స్థూలదేహాన్ని విడిపిస్తున్న స్థితి. అదే మరణావస్థ, కర్మేంద్రియాలను, జ్ఞానేంద్రియాలను, వాటి వృత్తులయిన విషయాలను పంచప్రాణాలను వదలిపెట్టి కామ్యకర్మలతోను, అజ్ఞానంతోను, పంచభూతాలతోను, కలసి ఉన్న ఈ జీవుడు పునర్జన్మ పొంది ఇతర లోకాలకు పోతున్నాడు. పూర్వజన్మల కర్మఫలంతో అతడు సుడిగుండంలో కీటకంలాగా విశ్రాంతి లేకుండా తిరుగుతూ ఉన్నాడు. మంచి పనులు చేయటంవల్ల అనేక జన్మలు

జరిగిన తరువాత, అతనికి మోక్షం పొందాలనే ఆశ కలుగుతుంది. అప్పుడు సద్గురువును ఆశ్రయించి చాలాకాలము అతన్ని సేవించి, మోక్షము పొందుతాడు. మానవుడికి విచారము లేకపోవటంచేత సంబంధము కలుగుతుంది. విచారణ వల్ల మోక్షం కలుగుతుంది. అందువల్ల విజ్ఞుడు ఎప్పుడూ విచారణ చెయ్యాలి. అధ్యారోపములు, అపవాదులచే ఆత్మస్వరూపాన్ని నిశ్చయించాలి. విజ్ఞుడు జగత్తును, జీవుణ్ణి, పరమాత్మను గురించి ఎప్పుడూ విచారణ చెయ్యాలి. జీవుడి యొక్క తత్త్వము, జగత్తు యొక్క తత్త్వము తెలుసుకున్నట్లైతే ఇక మిగిలేది ప్రత్యక్ స్వరూపమైన బ్రహ్మమే.

# 68. మంత్రికోపనిషత్తు

ఇది శుక్లయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో 20 మంత్రాలున్నాయి. బ్రహ్మనెరిగిన వారే బ్రహ్మయందు లీనమవుతారనే విషయాన్ని ఈ ఉపనిషత్తులో చెబుతున్నారు.

ఎనిమిది పాదాలు కలిగినది, త్రిసూత్రములు కల అరుణ రూపమైన అవ్యయము అవియినటువంటి తేజస్సుయొక్క మూడు మార్గములు గల హంసను అంతటా చూస్తున్నప్పటికీ చూడనట్లే ఉంటుంది. ప్రాణులకు సమ్మోహాన్ని కలిగించే కాలంలో

అజ్ఞానము అనే చీకటి పోగా సత్వగుణమున్న వారు నిర్గుణాన్ని చూడగలుగుతారు. పరిణితి చెందనివారు ఇంకొక విధంగా చూస్తారు. వికారాలకు తల్లి, అష్టరూపములు గలది మాయ. ఆ మాయనే పరిణితి చెందనివారు ధ్యానిస్తారు. ఈ మాయచేతనే జగత్తు సృష్టించబడుతున్నది. గౌరవప్రదమైనది, ఆద్యంతములు గలది, త్రిగుణాత్మకమైనది, కోరికలన్నీ తీర్చేది. అజ్ఞానులు మాత్రమే దీన్ని సేవిస్తారు. దేవుడు ఒక్కడే దీన్ని తన వశమునందుంచుకుంటున్నాడు. భగవంతుడు తన ధ్యానక్రియలతో నవ్వుతూ అనుభవిస్తాడు. పండితులు దీనిని తేలికగా చూసి పరమేశ్వరుడు శాశ్వతుడు అని చెబుతుంటారు. శాస్త్రకోవిదులు, జ్ఞానులు పరమేశ్వరుణ్ణి వర్ణించి చెబుతారు. అతడు వేదములచేత స్తుతించబడుతూ ఉంటాడు. కాలము, ప్రాణము, భగవంతుడు, మన్యువు, శర్వుడు, మహేశ్వరుడు, ఉగ్రుడు, భవుడు, రుద్రుడు, సురలు, అసురులు, ప్రజాపతి, విరాట్టు, పురుషుడు, నీరు మొదలైన రూపాలుగల ఆ ప్రభువు అధర్వమంత్రాలచే స్తుతించబడుతున్నాడు. ఆయనను 26 పదార్థముల సమ్మేళనము అని,

27 పదార్థముల సమ్మేళనమని రకరకాలుగా చెబుతారు. కాని అథర్వ ఉపనిషద్వేత్తలు మాత్రం నిర్గుణుడని, సాంఖ్యుడని అంటారు. 24 సంఖ్య కలవాడని, వ్యక్తుడని, అవ్యక్తుడని, ద్వైతుడని, అద్వైతుడని చెబుతుంటారు. జ్ఞాననేత్రం గలవారు పిపీలికాది బ్రహ్మపర్యంతము ఆ పురుషుణ్ణే చూస్తారు. బ్రాహ్మణులు అతన్నే చూస్తారు. సముద్రంలో నదులు కలిసిపోయినట్లుగా చరాచర జగత్తంతా అతనిలోనే లీనమవుతుంది. అతడే చరాచర జగత్తునంతటికీ అధిపతి. అతడే సర్వేశ్వరుడు. పరమేశ్వరుడు. మోక్షప్రదాత. అతనిని తెలిసినవారే మోక్షంపొందుతారు. వారికి పునర్జన్మ ఉండదు.

# 69. మహోపనిషత్తు - 1

## అజ్ఞానభూమికలు, జ్ఞానభూమికలు

మోక్షమార్గాన్ని వివరించేటప్పుడు అజ్ఞాన భూమికలు, జ్ఞాన భూమికలు అని రెండు రకాల భూమికలను వివరిస్తారు కదా! అసలు భూమిక అంటే ఏమిటి ? జ్ఞానభూమికలు, అజ్ఞానభూమికలు ఏమిటి ? వీటిని పూర్తిగా వివరిస్తోంది **మహోపనిషత్తు.**

అసలు భూమిక అంటే "మారు రూపము" అని అర్థం. మోక్షం కావాలంటే అజ్ఞానాన్ని పూర్తిగా విడిచిపెట్టి జ్ఞానమార్గాన్ని ఆశ్రయించాలి. అందుచేత ఇక్కడ అజ్ఞానము ఎన్నివిధాలో, జ్ఞానాన్ని ఏ రకంగా సాధించాలో చెప్పబడుతోంది. ఈ రెండు భూమికలనుండి అనేక రకాలయిన భూమికలు పుడుతున్నాయి. జీవి తన స్వరూపస్థితిలో ఉండటాన్నే మోక్షము అంటారు. తన స్వరూపము అంటే 'ఆత్మ' అని అర్థం. నేను అంటే పాంచభౌతికమైన దేహంకాదు. ఈ దేహం ఎప్పటికైనా నశించిపోయేదే. ఎన్నటికీ నశించనిది, సత్యము, నిత్యము, శాశ్వతము అయినది ఆత్మ ఒక్కటే. అందుకే నేను అంటే ఆత్మ. అంతేకాని దేహం కాదు. అటువంటి ఆత్మస్థితినే స్వరూపస్థితి అంటారు. స్వరూపస్థితిలో ఉండటమే మోక్షము. ఇది జ్ఞానంవల్లనే సాధ్యమవుతుంది. శుద్ధసత్తా మాత్రము అయిన జ్ఞానమే స్వస్వరూపము. అజ్ఞానికి మోక్షంరాదు. స్వరూపస్థితి నుండి చలించకుండా ఉండే వారియందు అజ్ఞానము ఉండదు. రాగద్వేషాలు అసలే ఉండవు. దృశ్యవిషయములయందు దృక్కు నిమగ్నమవటమే స్వరూప భ్రంశము అనబడుతుంది. దృశ్యము అంటే చూడదగినది, చూడబడేది. దృక్కు అంటే చూసేవాడు అని అర్థం. దృశ్యవిషయాలు అంటే కంటికి కనిపించే విషయాలు. ఇవన్నీ అవాస్తవాలు. ఇవాళ్ళ ఉండి రేపు పోయేవి.

అశాశ్వతాలు. ఈ రకంగా అవాస్తవము, అశాశ్వతమయి కంటికి కనిపించే ప్రాపించిక విషయాలయందు, చూసేవాడు నిమగ్నమైనట్లైతే అనగా అశాశ్వతమైన ఈ జగత్తు శాశ్వితము అని భావన చేయటం అజ్ఞానము. దీనివల్ల స్వరూపము అంటే ఆత్మస్వరూపము, (ఈ జగత్తంతా మిథ్య, పరమేశ్వరుడొక్కడే శాశ్వతుడు. అతడు సర్వాంతర్యామి. నేను కూడా పరమేశ్వరుణ్ణే. ఈ జగత్తంతా నానుండే ఉద్భవిస్తున్నది) అనే భావన పోతుంది. దీన్నే మోహము అంటారు. దీనికన్న వేరైనది ఏదీలేదు. ఇది గతంలో ఉన్నది. భవిష్యత్తులో కూడా ఉంటుంది. సంకల్పము చేసేటప్పుడు విషయాలను గురించి ఆలోచించేటప్పుడు మనస్సు ఒకవిషయం మీదనుంచి ఇంకొక విషయంమీదికి వెడుతుంది. ఈ రకంగా ఒక విషయం నుంచి వేరొక విషయం మీదకు వెళ్ళే మధ్యలో గల స్థితినే **'అమనస్కస్థితి'** అంటారు. ఉదా : ఒక్కసారిగా ఊహించని విషయం ఏదైనా విన్నాం అనుకోండి. ఆ క్షణంలో అవాక్కయిపోతాం కొద్దిసేపటికిగాని తేరుకోం. అలా అవాక్కయిన స్థితినే **'అమనస్కస్థితి'** అంటారు. ఇది కేవలము కొన్ని క్షణాలు మాత్రమే ఉంటుంది. ఈ స్థితిలో మనసు పని చెయ్యదు. **అదే స్వరూపస్థితి, ఆత్మ స్థితి అనబడుతుంది.** స్వరూపస్థితిలో సంకల్పాలన్నీ నశిస్తాయి. ఆత్మనిశ్చలంగా ఉంటుంది. అది జాగ్రదవస్థ కాదు. నిద్ర అంతకన్నా కాదు. అది సర్వోత్తమమైన స్థితి. అటువంటి స్థితినే **'ఆత్మస్థితి'** అంటారు. నేను అనే అహంకారం పూర్తిగా తొలగిపోయిన తరువాత, ద్వైతము నశించగా, అంటే భగవంతుడు వేరు, భక్తుడు వేరు అనే భావన పూర్తిగా నశించగా, చిత్తములో భేదభావన నాశనం అయిన తరువాత ఉన్నట్టి అజడమైన (సత్యమైన, శాశ్వతమైన, జ్ఞానమైన) స్థితినే స్వరూపస్థితి అంటారు. ఇక ముందుగా అజ్ఞానాన్ని చూద్దాం. ఇది పూర్తిగా అవస్థాత్రయానికి సంబంధించినది.

అవస్థాత్రయము అంటే 1. జాగ్రదావస్థ 2. స్వప్నావస్థ 3. సుషుప్త్యావస్థ.

అజ్ఞానము ఏడు అవస్థలుగా రూపుదాలుస్తుంది. వీటిలో జాగ్రదవస్థ మూడు రూపాలు, స్వప్నావస్థ మూడు రూపాలు కాగా ఏడవది సుషుప్త్యవస్థ. జాగ్రదావస్థ 1. బీజజాగ్రదావస్థ, 2. జాగ్రదావస్థ 3. మహాజాగ్రదావస్థ అని మూడు రకాలు. అలాగే స్వప్నావస్థ 1. జాగ్రస్వప్నావస్థ, 2. స్వప్నావస్థ 3. స్వప్న జాగ్రదావస్థ. అని మూడు రకాలు. ఏడవది సుషుప్తి ఈ ఏడు అవస్థలు ఒకదానితో ఒకటి కలసి అనేకరూపాలు పొందుతున్నాయి.

**1. బీజజాగ్రదావస్థ :** సృష్టి ప్రారంభం కావటానికి ముందు ఈ జగత్తంతా పరమేశ్వరమయంగా ఉండేది. అప్పుడు నామము, రూపము ఏదీలేదు. ఉన్నదంతా నిర్మలమైన చైతన్యమే. అదే పరమేశ్వర స్వరూపం. భవిష్యత్తులో కల్పించబడే జీవాది శబ్దాలకు, అర్థాలకు, విషయాలకు ఆశ్రయమవుతున్నది. అనగా ఆ పరబ్రహ్మ స్వరూపంనుంచే ఈ సృష్టి అంతా వచ్చింది. ఈ జగత్తంతా ఆవిర్భవించింది. గతంలో ప్రళయం జరిగినప్పుడు కర్మక్షయంకాని జీవరాశి అంతా, తమ తమ కర్మలతో పాటుగా ఆ పరబ్రహ్మలో లీనమయింది. ఇప్పుడు ఆ జీవరాశి అంతా బీజరూపంలో ఆతనియందే ఉన్నది. ఈ రకంగా బీజరూపంలో ఉన్న జాగ్రదావస్థనే బీజజాగ్రదావస్థ అంటారు. అదే జ్ఞప్తికి, భావానికి, అహంకారానికి క్రొత్త అవస్థ అవుతున్నది. ఇది కంటికి కనిపించని స్థితి. అందుచేతనే దీన్ని అవ్యక్తము అంటారు.

**2. జాగ్రదావస్థ :** బీజజాగ్రదావస్థ నుంచి సూక్ష్మంగా లేచిన నాది, అతడు, అది, ఇది అనే వృత్తిజ్ఞానమే జాగ్రదవస్థ.

**3. మహాజాగ్రదావస్థ :** జాగ్రత్తు అని చెప్పబడుతున్న, జన్మాంతర సంబంధమైన నేను, నాది, అతడు, అది అని స్ఫుటంగా దర్శనమిస్తున్న స్థూల జ్ఞానాన్నే మహా జాగ్రదావస్థ అంటారు.

**4. జాగ్రస్వప్నావస్థ :** జగత్తులోని కంటికి కనిపించేవి, కనిపించనివి, జగద్వికారమైనవి, సర్వప్రకారమైనవి, మనసుతో మాత్రమే కల్పించబడినవి ఇలా అనేక విషయాలున్నాయి. వీటన్నింటితోను నిండిన సృష్టిని జాగ్రస్వప్నావస్థ అంటారు. జగత్తులో ఉన్నవి లేనట్లుగా, లేనివి ఉన్నట్లుగా కనిపిస్తాయి. ఆకాశంలో ఉన్నది ఒకే చంద్రుడు కాని ఇద్దరుగా, ముగ్గురుగా కనిపిస్తారు. అలాగే ముత్యపుచిప్ప వెండిగిన్నెలాగా, ఎడారులయందు ఎండమావులులాగా కనిపిస్తాయి. ఇదంతా భ్రాంతి. ఈ భ్రాంతి మనందరికీ అనుభవంలోనే ఉంటుంది. అలాగే ఆత్మలో వివిధ రకాలుగా ఈ జగత్తు కనిపిసిస్తున్నది. అంటే పరమేశ్వర రూపం నుంచి ఈ జగత్తు అంతా ఆవిర్భవించింది. ఈ స్థితినే 'జాగ్రస్వప్నావస్థ' అంటారు. జగత్తు శాశ్వతం కాదు. కలలోని దృశ్యంలాగా అశాశ్వతమైనది. నశించేది. అయినప్పటికీ ఇది శాశ్వతము అనిపిస్తుంది.

**5. స్వప్నావస్థ :** నిద్రపోయేవాడు కలకంటాడు. ఈ రకంగా కలగనే కొద్దిసేపు ఆ కల శాశ్వతం అనుకుంటాడు. నిద్రనుంచి మేల్కొన్న తరువాత తాను కలలో చూచిన విషయాలన్నీ ఇతరులకు వివరిస్తాడు. ఇది స్వప్నము. స్వప్నావస్థ.

**6. స్వప్నజాగ్రదావస్థ :** పైన చెప్పిన అవస్థలకు ఇది భిన్నమైనది. చాలాకాలం వేదాంత విజ్ఞానము విన్నాడు. కాని ఆత్మసాక్షాత్కారం మాత్రం కలగలేదు. అందుచేత పెద్దల బోధనలు ఏవీ అర్థం కావు. ఆ కారణంచేత ప్రయత్నంమీద చాలాకాలము మహాత్ములను, అనుసరించటమే స్వప్నజాగ్రదావస్థ.

**7. సుషుప్తి :** ఇది ఈ ఆరు అవస్థల త్యాగరూపమైన జీవుని జడస్థితి. భవిష్యత్తులో దుఃఖానుభవముతో ఉన్న స్థితి. దీన్నే సుషుప్తి అంటారు. సుషుప్తి తమోగుణ రూపంలో ఉంటుంది. తమోరూపంలో

ఉన్న సుషుప్త్యవస్థలో సర్వజగత్తు లీనమైఉన్నది. దీనినే అవ్యక్తము అని కూడా అంటారు.

ఈ రకంగా అజ్ఞానభూమికలు ఒకదానితో ఒకటి కలిసి వందలాదిగా ఏర్పడుతున్నాయి. వీటివల్లనే మానవుడు సంసారసాగరంలో మునిగిపోతున్నాడు. ఇక జ్ఞాన భూమికలను చూద్దాం.

జ్ఞాన భూమికలకు సంబంధించిన జ్ఞానమే యదార్ధ జ్ఞానము. ఇవి ఏడు రకాలు. ఈ సప్తభూమికల పరంగా ఉన్నదే మోక్షము.

1. శుభేచ్ఛ 2. విచారణ 3. తనుమానసి 4. సత్త్వాపత్తి 5. అసంసక్తి 6. పదార్ధ భావన 7. తుర్యగ

ఈ భూమికలను ఆచరించినవారికి మోక్షము సిద్ధిస్తుంది. మోక్షస్థితిలో ఉన్నవాడు మళ్ళీ దుఃఖము పొందడు. ఇప్పుడు జ్ఞానభూమికలను చూద్దాం.

**1. శుభేచ్ఛ :** ఇది ముందుగా మానవుడిలో కలిగే మార్పు. అతనిలో ఉత్పన్నమయ్యే కోరిక. యదార్ధజ్ఞానము తెలుసుకోలేకపోయాననే బాధ. అది తెలుసుకోవాలనే కోరిక. అయ్యో ! ఇప్పటిదాకా మూఢినిలాగా ఉన్నాను. కాలమంతా వృధా చేశాను. ఇకమీదటైనా శాస్త్రాధ్యయనం చేసి, సజ్జన సాంగత్యము ఆచరించి యదార్ధ జ్ఞానాన్ని తెలుసుకోవాలని కోరే వైరాగ్య సహిత వాంఛనే 'శుభేచ్ఛ' అంటారు.

**2. విచారణ :** సజ్జన సాంగత్యము, శాస్త్రాధ్యయనము చేసిన తరువాత, ఆ విషయాలను మనసుకు పట్టించుకుని నిరంతరము వాటిని గురించే ఆలోచిస్తుంటాడు. ఈ రకంగా కొంతవరకు వైరాగ్యము పొంది, వీటివల్ల అంటే, శాస్త్రాధ్యయనము, సజ్జన సాంగత్యము,

వైరాగ్యములవల్ల ఏర్పడే సదాచార ప్రవృత్తినే విచారణ అంటారు. ఇదే ఆత్మవిచారణ. తనను గురించి తాను తెలుసుకోవటానికి చేసే ప్రయత్నము.

**3. తనుమానసి :** ఈ రకంగా మోక్షగామిఅయినవాడు శుభేచ్ఛచేత, విచారణచేత స్వరూపాన్ని తెలుసుకోవటానికి ప్రయత్నం చేస్తూ, అందులోని భాగంగా ఇంద్రియ వాంఛలను వదలివేస్తాడు. ఆహార నిద్రామైథునాలమీద కోరికను చంపుకుని, ఇంద్రియాలను శుష్కింపచేస్తాడు. ఇలా ఇంద్రియాలను శుష్కింపచేసే స్థితినే 'తనుమానసి' అంటారు.

**4. సత్త్వాపత్తి :** ఈ మూడు భూమికలను అభ్యాసం చెయ్యటంవలన చిత్తము నందు వైరాగ్యము ఏర్పడుతుంది. ఆ తరువాత శుద్ధ సత్త్వస్థితిని పొంది అంటే కేవలము సత్త్వగుణప్రభావము మాత్రమే కలిగి, ఆత్మయందు నిలకడ పొందుతుంది. అనగా మానవునియొక్క ధ్యాస అంతా ఆత్మమీదనే ఉంటుంది. అటువంటి స్థితిని 'సత్త్వాపత్తి' అంటారు.

**5. అసంసక్తి:** ఈ నాలుగు భూమికలను అభ్యాసం చెయ్యటంవల్ల సత్త్వగుణ ప్రధానుడై, విషయవాసనలు లేకుండా పూర్తిగా మనసును ఆత్మయందే లయం చేసే స్థితి. దీనినే 'అసంసక్తి' అంటారు.

**6. పదార్థభావన :** ఈ ఐదు భూమికలను అభ్యాసం చెయ్యటంవల్ల, బాహ్యాభ్యంతర పదార్థ భావనాశూన్యుడై అంటే తనకన్న వేరైనది. లోపలగాని, వెలుపలగాని వేరొకటి లేదు అని నిశ్చయించినవాడై, తనయొక్క ఆత్మయందు దృఢమైన స్థితిని అనుభవిస్తూ, ఇతరులతో ప్రయత్న పూర్వకముగా అవబోధనము చేయింపబడునట్టి స్థితి. అంటే ఈ జగత్తంతా పరమేశ్వరమయము.

శరీరంలోగాని, బయటగాని ఆ పరమేశ్వరునికి మించినది ఏదీలేదు. అని భావిస్తూ ఆత్మస్థితిని పొంది, ఇతరులు ఏదైనా అడిగినట్లైతే సమాధానం మాత్రం చెప్పే స్థితి.

**7. తుర్యగ :** ఈ ఆరు భూమికలను నిరంతరము అభ్యాసం చెయ్యటంవల్ల భేదభావం పూర్తిగా నశించిపోతుంది. ఆ సమయంలో అనుభవించే ఆత్మానందాన్నే 'తుర్యగ' అంటారు. ఇదే తురీయస్థితి లేదా తురీయావస్థ.

జ్ఞానులు నాలుగురకాలుగా ఉంటారు.

1. బ్రహ్మవిదుడు 2. బ్రహ్మవిద్వరుడు 3. బ్రహ్మవిద్వరీయుడు 4. బ్రహ్మ విద్వరిష్ఠుడు వీరిలో

**1. బ్రహ్మవిదుడు :** సత్త్వాపత్తి అనే నాల్గవ భూమికలో ఉంటాడు.

**2. బ్రహ్మవిద్వరుడు :** అసంసక్తి అనే ఐదవ భూమికలో ఉంటాడు.

**3. బ్రహ్మవిద్వరీయుడు :** పదార్థభావన అనే ఆరవ భూమికలో ఉంటాడు.

**4. బ్రహ్మవిద్వరిష్ఠుడు :** తుర్యగ అనే ఏడవ భూమికలో ఉంటాడు. అంటే ఇతడు ఎల్లవేళలయందు తురీయస్థితిలో సమాధిలోనే ఉంటాడు. ఇతడు జీవన్ముక్తుడు. అన్నపానాదులు కూడా తీసుకోడు. బలవంతంగా తినిపించాలి. లోకానికి ఏ పనీ చేయడు. ఒంటిమీద ఎప్పుడూ స్పృహ ఉండదు. ఐతే వీరిలో బ్రహ్మవిదుడు, బ్రహ్మవిద్వరుడు మాత్రం కొంత దేహజ్ఞానం కలిగి ఉంటారు. వారి సంస్కారాన్ని బట్టి పనిచేస్తారు. ఇటువంటి వారికి మనోనాశనము ప్రధానము. మనోనాశనము రెండు రకాలు.

**1. అరూపనాశనము :** చిత్తము మాత్రమే నాశనము చేయటం.

**2. స్వరూపనాశనము :** చిత్తముతో పాటుగా రూపాన్నికూడా

నాశనం చెయ్యటం.

జీవన్ముక్తులయందు తుర్యగ అనబడే తురీయావస్థ ఉంటుంది. ఈ అవస్థకుపైన తురీయాతీతావస్థ ఉంటుంది. అది విదేహముక్తికి సంబంధించినది. తురీయాతీతము అనగా తురీయవ్యవహారము కూడా దాటిన స్థితి. తురీయాతీత స్థితిని చేరిన వారు సాక్షాత్తు పరబ్రహ్మస్వరూపులవుతారు. మహాత్ములు, ఆత్మారాములు, మహాధన్యులు వీరిలో ఎవరు తుర్యగను చేరతారో, వారే పరమపదాన్ని చేరటానికి అర్హులు. వారే విదేహముక్తి పొందగలుగుతారు. జీవన్ముక్తులు సుఖదుఃఖాలలో మునిగిపోరు. ఇటువంటివారు చేయవలసిన పనులు మాత్రమే చేస్తారు. అటువంటి పనులు ఏవీ లేకపోతే ఏమీ చెయ్యకుండా ఉండిపోతారు. ఇటువంటి సత్పురుషులు ప్రక్కన ఉన్నవారిచే బాధితులై, నిద్రనుంచి లేచినవారిలాగా పూర్వాచారక్రమాగతులైన ఆచారాలను ఆచరిస్తూ ఉంటారు. బుద్ధిమంతులైన వారికి మాత్రమే ఏడు భూమికలు అర్ధమవుతాయి. జన్మాంతర పుణ్యముతో పశుపక్ష్యాదులుకూడా ఈ భూమికలను పొందినట్లైతే ముక్తులవుతాయి.

ఈ జ్ఞానభూమికలలో సంచరించేవారు సశరీరులైనా, అశరీరులైనా ముక్తి పొందుతారు. ఇందులో సందేహం ఏమాత్రంలేదు. హృదయ గ్రంధి విచ్ఛేదనమే జ్ఞానము. సృష్టి స్థితి లయాలకు నాకు ఏ సంబంధములేదు. ఉన్నది ఒక్కటే. అదే పరబ్రహ్మ. అంతకు మించినది ఏదీలేదు. ఆ పరబ్రహ్మయే నేను అనే స్థితిని పొందటమే ముక్తి. గ్రంధి విచ్ఛేదన రూపమయిన విముక్తి స్థితి అంటే మృగతృష్ణ (ఎండమావులు)లో నీరు ఉన్నదని భ్రమించినట్లుగా, మహదాదిస్థూలభ్రాంతి, అమహదాది దేహభ్రాంతి మొదలైన అన్ని

భ్రాంతులు నశించిన స్థితి. అంటే ఈ జగత్తుగాని, ఈ దేహంకాని ఏవీలేవు. అంతా మిథ్య. అంతా భ్రాంతి. ఇటువంటి అన్ని భ్రాంతులు నశించినట్టి స్థితి. ఈ స్థితిని చేరినవారు అనగా అజ్ఞానమనే సాగరాన్ని దాటినవారు మాత్రమే పరమపదాన్ని చేరతారు. ఆస్థితిని పొందగొరేవారు మాత్రమే ఈ సప్తభూమికలలో ఉంటారు. ఈ సప్తభూమికలకు లక్ష్యము పరబ్రహ్మపదమే అయి ఉన్నది. నువ్వు నేను, నీది నాది, అతడు ఇతడు, అనే తేడా లేనటువంటి స్థితి, సంకల్పరూప జ్ఞానము కూడా లేని స్థితి. ఉన్నది లేదు అనే వృత్తులకు అగోచరమైనది, దృశ్యము, అదృశ్యము కానిది ఏదైతే ఉన్నదో అదే మోక్షము. సర్వము శాంతించినటువంటిది, నిరాలంబన మైనది, శాశ్వతమైనది, సత్యము నిత్యమైనది, అనాభాసమైనది, అనామకమైనది, కారణములేనిది. అదే ముక్తి. అది ఈ జ్ఞానభూమికలవల్లనే లభిస్తుంది.

# మహోపనిషత్తు - 2

## జీవన్ముక్తి, విదేహముక్తి

మనం జీవన్ముక్తి, విదేహముక్తి అని రెండు పదాలు వాడతాం. వాటిని గురించి **'మహోపనిషత్తు'**లో వివరించబడింది.

జీవించి ఉండగానే ముక్తి పొందటం జీవన్ముక్తి. అటువంటివాడు ఆయుష్షు ఉన్నంతవరకు జీవించి ఆ తరువాత ఈ దేహాన్ని విడిచి పరబ్రహ్మలో ఐక్యము పొందుతాడు. ఈరకంగా దేహాన్ని విడిచి పరమాత్మలో లీనంకావటాన్నే విదేహముక్తి అంటారు.

ఆత్మఅనేది అణువుకన్న చిన్నది, ఆకాశంకన్న పెద్దది. ఈ చిద్వస్తువునందు అనంతకోటి బ్రహ్మాండ రేణువులు ఉత్పత్తి స్థితిలయము పొందుతుంటాయి. బయటకు శూన్యంగా కనిపిస్తుంది కాబట్టి పరబ్రహ్మ

ఆకాశము అని చెప్పబడుతున్నది. చిత్ స్వరూపముగా ఉన్నది కాబట్టి బ్రహ్మము ఆకాశముకన్న విలక్షణమైనది. అయితే బ్రహ్మము ఆకాశంకాదు. ఆకాశములేనిది. అదియే సత్తు చిత్తు. ఆత్మవస్తువు స్వయంప్రకాశ స్వరూపము. విజ్ఞాన ఘనమైన శిలాసదృశమైనది. ఆకాశంలాగా స్వస్వరూపంలో తదధిష్ఠానముగా అనుభూతమై ఉన్నది. చిత్రవిచిత్రముగా ఉన్న ఈ జగత్తుయొక్క వికాసాన్ని భేదిస్తున్నది. ఈ విశ్వము తత్పద లక్షణముగా ఉన్న పరమాత్మయొక్క ప్రకాశమాత్రము. అందువల్ల ఈ విశ్వము ఆత్మకన్న ప్రత్యేకమగు సత్తుగలది. ఈ జగత్తు యొక్క భేదభావముకూడా ఆత్మయందే ప్రకాశిస్తుంది. ఈ భేదమంతా ఆత్మమయమైనది. అధిష్ఠానరూపంలో ఈ ఆత్మ అన్నింటితోనూ సంబంధం కలిగి ఉన్నది. జాతి గుణ క్రియాదులు ఆత్మకు లేవు. ఆత్మ త్రికాలభాద్యమై సత్యమై ఉన్నది. అదే విజ్ఞానానందస్వరూపమగు పరబ్రహ్మ. త్యాగమూర్తులకు అది పరమగతి. సర్వసంకల్పాలను వదలివేసి శుద్ధమనస్సుతో ఆ ఆత్మను గ్రహించాలి. జాగ్రదావస్థలో ఉన్నప్పుడు ఎవరికి దృశ్యజ్ఞానము నశిస్తుందో, అతనియొక్క స్థితినే 'జ్ఞానము' అంటారు. వృత్తిజ్ఞానము లేకపోవుటయే జ్ఞానము. ఈ విషయాలను తెలుసుకున్నవాడు జీవన్ముక్తుడు. దృశ్యములేదు అనే ఆత్మజ్ఞానంతో, మనసులో ఉన్న దృశ్యభావాలను తుడిచి వేసినట్లైతే తక్షణమే మహోన్నతమైన నిర్వాణసుఖము ఉత్పన్నమవుతుంది. వాసనలను అంటే రాగద్వేషాలను సంపూర్ణంగా త్యజించటమే మోక్షము. ఎవరైతే పరిశుద్ధవాసనలతో నిండి ఉన్నారో, వారు తిరిగి జనన మరణాలు పొందరు. వాళ్ళు యదార్థాన్ని తెలుసుకోగలుగుతారు. వారే జీవన్ముక్తులు. దృఢమైన విషయ చింతనయే బంధము. వాసనాక్షయమే మోక్షము. దేహ, లోక, శాస్త్రవాసనలే సర్వవాసనలు.

తపస్సు మొదలైన సాధనలు చేయకుండానే సహజముగా ఎవరికి భోగాలు ఇష్టం ఉండవో, వారు జీవన్ముక్తులు. కాలానుగుణంగా సుఖదుఃఖాలు అనుభవిస్తున్నప్పటికీ, సంతోషము, విషాదము పొందనివాడు జీవన్ముక్తుడు. హర్షము (సంతోషము) అమర్షము (ఓర్వలేనితనము), భయము, క్రోధము, కామము, కార్పణ్యము వంటివి లేనివాడు జీవన్ముక్తుడు. అహంకారాన్ని వదిలి, దృశ్యమునుకూడా త్యాగం చేసినవాడు జీవన్ముక్తుడు. అంతర్ముఖుడై ఇష్టాయిష్టములు లేకుండా ఉండేవాడు, సుషుప్తావస్తలో ఉన్నవాడులాగా సంచరించేవాడు. జీవన్ముక్తుడు. ఎప్పుడూ ఆత్మానందం పొందేవాడు, మనసును పవిత్రంగా ఉంచుకునేవాడు, జీవన్ముక్తుడు. ఏ కోరికలు లేకుండా ఉండేవాడు జీవన్ముక్తుడు.

ఆకాశంలాగా ఎవరి హృదయము దృశ్యవిషయముల యందు సంగమము కాకుండా ఉంటుందో, ఎవరిబుద్ధి జడముకాదో, ఎవడు చైతన్యవంతుడో వాడు జీవన్ముక్తుడు. రాగద్వేషాలను, సుఖదుఃఖాలను, లక్ష్యం చెయ్యకుండా, కోరికలు లేకుండా, నిష్కామ్యభావనతో సత్కర్మలు చేసేవాడు జీవన్ముక్తుడు. మౌనమే దీక్షగా గలవాడు, అహంభావం లేనివాడు, సంకల్పాలు, ఉద్వేగాలు లేకుండా కర్తవ్య కర్మలు చేసేవాడు జీవన్ముక్తుడు. సర్వత్ర విగతస్నేహితుడై సాక్షీభావముతో ఉండేవాడు, ఇచ్ఛారహితుడై సత్కర్మలు చేసేవాడు జీవన్ముక్తుడు. మనసునందు ధర్మాధర్మాలను, సమస్త సంకల్పాలను, ఇష్టాఇష్టాలను అన్నింటినీ వదలివేసినవాడు జీవన్ముక్తుడు. కంటికి కనిపిస్తున్న ఈ దృశ్య ప్రపంచాన్ని సమ్యక్‌దృష్టితో పరిత్యజించినవాడు జీవన్ముక్తుడు. కారము, పులుపు, ఉప్పు, చేదు, రుచి, అరుచి వీటన్నింటినీ సమభావంతో భుజించేవాడు జీవన్ముక్తుడు. వార్ధక్యము, మరణము, ఆపద, రాజ్యము,

దరిద్రము వీటన్నింటినీ సమభావంతో అనుభవించేవాడు జీవన్ముక్తుడు.

ధర్మాధర్మాలు, సుఖదుఃఖాలు, జరామరణాలు, సంపూర్ణంగా, బుద్ధిపూర్వకంగా త్యాగం చేసినవాడు జీవన్ముక్తుడు. ఉద్వేగము, ఆనందము లేకుండా స్వచ్ఛమైన సమత్వబుద్ధిగలిగి, పొంగిపోవటము, క్రుంగిపోవటము, లేకుండా ఉన్నవాడు జీవన్ముక్తుడు. సర్వేచ్ఛలను, సంశయాలను, ప్రయత్నాలను, నిశ్చయాలను జ్ఞానబుద్ధితో పరిత్యజించినవాడు జీవన్ముక్తుడు. సృష్టి స్థితిలయాలయందు ఉదయాస్తమయాదు లందు, భావాభావములందు, సమభావంతో ఉండేవాడు జీవన్ముక్తుడు. కొంచెము కూడా ద్వేషించకుండా, కాంక్షించకుండా, రాగద్వేషాలులేనివాడు, ప్రారబ్ధకర్మలు అనుభవించనివాడు జీవన్ముక్తుడు. సంసార సంకులములో శాంతుడై ఉండేవాడు, కళాయుక్తుడైకూడా నిష్కళుడై ఉండేవాడు, మనసు ఉండికూడా అమనస్కుడైఉండేవాడు జీవన్ముక్తుడు. సమస్త సంపదలయందు, సమస్త వ్యవహారములయందు ఉండికూడా వాటి స్పృహలేనివాడు జీవన్ముక్తుడు.

జీవన్ముక్తుడు తనశరీరం పడిపోయిన సమయంలో, శ్వాస ఆగిపోయిన వెంటనే జీవన్ముక్త పదవిని దాటి విదేహముక్త పదవిని చేరతాడు. విదేహముక్తుడికి జనన మరణాలుండవు. అతడు నిర్వికారుడు, సత్తుకాడు అసత్తుకాడు. దూరముకాడు, దగ్గరాకాడు. అహముకాదు, తదితరము కాదు.

జీవన్ముక్తుని పరిస్థితి ఎలా ఉంటుందంటే, అత్యంత నిశ్చలము, మహాగంభీరము. అది ప్రకాశముకాదు, చీకటికాదు. మహావ్యాపకమై సర్వత్ర నిండి ఉంటుంది. అనాఖ్యముగా, అనభివ్యక్తముగా,

అతీతముగా ఉంటుంది. అది శూన్యము కాదు. సాకారము కాదు. దృశ్యము కాదు, దర్శనము కాదు. భూతపదార్ధ సముదాయము కాదు. కేవలసత్తా మాత్రము. అనంతరూపంలో కలిసి ఉంటుంది. ఇదమిద్ధమని చెప్పటానికి వీలుండదు. పరిపూర్ణముకన్న అధిక పరిపూర్ణముగా ఉంటుంది. సత్తు కాదు అసత్తుకాదు సదసత్తు కాదు. భావనకాదు భావముకాదు. కేవల చిత్ పదార్ధము. మహాచైతన్యము. అనంతమై, అజరమై, శివమై, ఆది మధ్యాంత రహితమై, నిరామయై ఉన్నది. అది అనాదిగా ఉన్న సత్వపదార్ధము. ద్రష్ట, దర్శనము, దృశ్యము అనే త్రిపుటి మధ్యభాగంలో కేవల దర్శనము ఏదైతే ఉన్నదో అది. దీనికన్న గొప్పది ఉత్తమమైనది ఏదీలేదు.

# మహోపనిషత్తు - 3

## ఆత్మసాక్షాత్కారము

ఆత్మ సాక్షాత్కారము అంటే ఏమిటి ? అది ఎలా సిద్ధిస్తుంది ? ఈ విషయాలు **మహోపనిషత్తు**లో చెప్పబడ్డాయి.

సాధకుడు తనను తాను తెలుసుకోవటాన్నే స్వరూపజ్ఞానము అంటారు. సాధకుడు జగత్తంతా నాలోనే ఉన్నది. నేనే సాక్షాత్తూ పరబ్రహ్మను. సృష్టి స్థితి లయాలకు కారకుడను నేనే. ఈ జగత్తులో నేనుతప్ప వేరేఏదీలేదు. ఉన్నది ఒక్కటే అదేపరబ్రహ్మ. నేనే ఆపరబ్రహ్మ స్వరూపాన్ని జగత్తు అంతా నానుండే సృష్టించబడుతోంది. తిరిగి నాలోనే లయమవుతున్నది. నేనే పరమేశ్వరుడను అనే విషయాన్ని తెలుసుకోవటమే ఆత్మసాక్షాత్కారము అంటారు. ఈ విషయాన్ని అనుభవం ద్వారా తెలుసుకోవాలి.

ఆత్మసాక్షాత్కారము కావాలంటే మనోమాలిన్యము తొలగిపోవాలి. భ్రమలు నశించి పోవాలి. మోక్షద్వారానికి 1. శమము 2. విచారణ 3. సంతుష్టి 4. సజ్జన సాంగత్యము అనబడే నలుగురు ద్వారపాలకులు. వీరిలో ఏ ఒక్కరిని గట్టిగా పట్టుకున్నా సరే, మిగిలిన ముగ్గురూ వశమవుతారు. అందుకని వీరిలో ఏ ఒక్కరినైనా సర్వప్రయత్నాలచేత, సమస్తాన్ని త్యజించి అయినా సరే గట్టిగా ఆశ్రయించాలి. శాస్త్రాభ్యాసము, సజ్జన సంపర్కము, అనే తపస్సుచేత, దమముచేత ముందుగా సంసారబంధ విముక్తి కోసం ప్రజ్ఞను గట్టిగా అభివృద్ధి చెయ్యాలి. అభ్యాసమువల్ల శాస్త్రవాక్యము, స్వానుభవము, సద్గురువాక్యము అనే మూడూ సమన్వయముతో ఎవరి ఆత్మలో నిరంతరమూ దర్శనమిస్తాయో అతనికి పరమాత్మ దర్శనమిస్తాడు.

ప్రతిక్షణము సంకల్పము, ఆశ, విషయములు అనే ఈ మూడింటినీ పరిత్యజిస్తూ ఉన్నట్లైతే పరమపావనమైన అమనస్కస్థితి సాధించినవాడవుతాడు. మనస్సు అకర్తగా ఉండే తూష్ణీంస్థితియే సమాధి.

అదే కేవల భావస్థితి. అది శుభప్రదమైన ఉత్తమనిర్వాణము. మనస్సుతో సంకల్పాలను పరిత్యజించి, మూగవాడిలాగా, అంధుడిలాగా, జడునిలాగా సంచరించాలి. ఈ సర్వమూ ప్రశాంతము, అజము, ఏకము, ఆది మధ్యాంత రహితము. ప్రకాశస్వరూపము, దృశ్యభావములేని అనుభవరూపము. సమస్తము ఓంకారరూపము అని చెప్పటంకూడా భ్రాంతియే. ఈ సకల దృశ్య ప్రపంచమంతా చిద్వస్తువే. ఇక్కడ చైతన్యముతప్ప ఇంకొకటిలేదు అనే భావన చెయ్యాలి.

ఈ రకంగా సర్వదా జాగరూకతతో, నిండు మనసుతో, ఆత్మ

అద్వితీయము అని తెలుసుకుని, జగత్కార్యాన్ని ఆరాధిస్తూ, తరంగాలు లేని సముద్రంలాగా నిశ్చలుడై ఉండాలి. వాసనలన్నింటికీ తృణానికి అగ్నివంటిదైన ఆత్మతత్త్వబోధయే సమాధి. అంతేకాని సమాధి అంటే తూష్ణీంస్థితి (మౌనస్థితి) కాదు. జాతిరత్నము ఇచ్ఛా శూన్యమైనప్పటికీ దానినుంచి కాంతులు వెదజల్లునట్లుగా, పరబ్రహ్మ తత్త్వము సత్తా మాత్రమైనప్పటికీ, బ్రహ్మభావముగా ఈ జగత్తు సర్వము ప్రకటితమవుతున్నది. ఆత్మయందు కర్తృత్వమున్నది. అయితే ఇచ్ఛ లేకుండా ఉంది కాబట్టి అకర్త, సన్నిధాన మాత్రమున కర్త కూడా అయి ఉన్నది. ఈ రకంగా పరస్పర విరోధంగల కర్తృత్వ రూపంలో ఉన్న ఈ చమత్కారము ఏ పరబ్రహ్మములో ఉన్నదో తెలుసుకుని, ఆ బ్రహ్మమునే ఆశ్రయించి, ఆ బ్రహ్మలోకంలోనే స్థిరంగా ఉండాలి. 'నేను నిత్యము అకర్తనై ఉన్నాను' అనే భావంతో ఒప్పునది, పరమామృతము అనబడేది, అయిన సమత్వమే జ్ఞానికి శేషించి మిగిలేది. సత్తా మాత్రస్థితిలో ఉన్నవారే మహాగుణవంతులు. వారి స్థితి శాశ్వతమైనది. మహోన్నతమైనది. అటువంటివాడు ఆకాశంలో పూర్ణచంద్రునిలాగా ప్రసన్నవదనముతో ఉంటాడు. అతడే శాంతి, సుఖము, సమభావము సిద్ధించిన మహాత్ముడు. వారు రాత్రిపూట పద్మంలాగా ఆపదలందు కృశించిపోరు. శిష్టాచారులు పోయే మార్గంలో సత్ప్రవర్తనతో సంతోషంగా ఉంటారు. అటువంటివారి దేహములు మైత్రి మొదలైన సద్గుణాలతో శోభిల్లుతుంటాయి. వారు సమత్వభావం గలవారై, సర్వదా సాధువృత్తి గలవారై, సమరసులై మార్పు లేకుండా ఉంటారు. నిర్మలాత్ములైన మహాత్ములు సముద్రంలాగా మర్యాదను అతిక్రమించకుండా ఉంటారు. సూర్యునిలాగా నియమాలను విడిచిపెట్టకుండా ఉంటారు. నేను ఎవరిని? ఈ సంసార మాలిన్యము

ఏ రకంగా వ్యాపించి ఉన్నది ? అని ప్రాజ్ఞుడు, సాధువు అయినమహాత్మునిసన్నిధిలో చక్కగా విచారణ చెయ్యాలి. నిషిద్ధకర్మలు చేయరాదు. ఆచార్యులతో కలిసి నివసించరాదు సర్వసంహార సంహర్త అయిన మృత్యువును హేళన చేయరాదు. ఈ దేహము ఎముకలు, మాంసము, రక్తము మొదలైన అశోభన పదార్థాల సమూహమే అనిగ్రహించి, దేహంమీద మమకారాన్ని విడిచిపెట్టి, సకల జీవులను ముత్యాల హారములోనిదారములాగా చిన్మాత్ర పరమాత్మగా దర్శించాలి.

ఇది కావాలి అనుకోవటం, ఇది వద్దు అని ద్వేషించటం ఇదే మనసుయొక్క స్వరూపము. ఆత్మ అటువంటి మనసుకన్న వేరుగా ఉన్నది. సద్గురువులు, శాస్త్రాలు చూపిన మార్గాన్ని అనుసరిస్తూ, స్వానుభవంలో "నేను చిద్ఘనుడైన బ్రహ్మనే అయి ఉన్నాను" అని తెలుసుకుని, శోకము లేనివాడు అశోకుడు కావాలి. జీవన్ముక్తుని దుః ఖాతీత శక్తి అద్భుతమైనది. పదునైన కత్తితో నరుకుతున్నప్పటికీ కలువపూలు పైన చల్లిన రీతిగా భావిస్తాడు. అగ్నితో కాల్చేటప్పుడు మంచు బిందువులు మీద చల్లుతున్నట్లుగా భావిస్తాడు. నిప్పులలో త్రిప్పుతున్నప్పుడు మంచి గంధపు చల్లదనాన్ని అనుభవిస్తాడు. బాణవర్షము కురిపించినప్పుడు ఎండలో నిర్మించిన జలయంత్రం నీళ్ళు జల్లుతున్నది అనుకుంటాడు. శిరచ్ఛేదన చేసినప్పుడు సుఖముగా నిద్రిస్తాడు. వాగ్బంధనము చేస్తే మౌనముద్రగా భావిస్తాడు. శ్రోత్రాన్ని బంధిస్తే నిశ్శబ్దస్థితి అనుభవిస్తాడు. అటువంటి మహోన్నతమైనస్థితి ఉపేక్షతో ప్రాప్తించదు. దృఢవైరాగ్య సాధనతో అట్టి స్థితి సిద్ధిస్తుంది. గురువాక్యంచేత, వచ్చిన స్వానుభవముతో, పరిశుద్ధ బుద్ధితో నిరంతరము అభ్యాసం చెయ్యటంచేత ఆత్మను చక్కగా దర్శించవచ్చు. ఆత్మసాక్షాత్కారం పొందవచ్చు.

దిగ్భ్రమ పూర్తిగా పోయినప్పటికీ, గతంలో లాగానే దిక్కులయొక్క జ్ఞానము ఉంటుంది. అలాగే బ్రహ్మజ్ఞానంవల్ల ఈ జగత్తులేదు అని తెలిసినా కూడా, జగత్తు కనిపిస్తూనే ఉంటుంది. అలా కనిపించినప్పటికీ జగత్తులేదనే భావించాలి. ఆత్మసాక్షాత్కారానికి సిరిసంపదలు సాయంచెయ్యలేవు. స్నేహితులు, బంధువులు, శరీరకష్టము, తీర్థాలుసేవించటము, సాయపడవు. కేవలము పరమాత్మలో తన్మయత్వం పొందే మనసుకలవాడే ఆత్మసాక్షాత్కారం పొందగలడు. దుఃఖాలు, తృష్ణ, భరించలేని చింతలు, అన్నీ మహాత్ములకు సూర్యకిరణములవల్ల అంధకారం నశించినట్లుగా నశిస్తాయి. క్రూరజంతువులు, సౌమ్యజంతువులు అన్నీ శమముగల మహాత్ముని కన్నతల్లిని చేరునట్లుగా, విశ్వాసముతో సమీపిస్తాయి. మానవుడు శమమువల్ల పరమసుఖము అనుభవిస్తాడు. అటువంటి పరమసుఖము అమృతపానం వల్ల కూడా సిద్ధించదు. లక్ష్మీదేవి అనుగ్రహంతో లభించదు. శుభాశుభాలను విని, అనుభవించి, దర్శించి, తెలుసుకొని, సంతోషము, దుఃఖము పొందనివాడు శాంతస్వరూపుడు.

ఎవరి మనసైతే మరణకాలమందు, ఉత్సవసమయమందు, యుద్ధమందు కూడా వ్యాకులత చెందకుండా స్వచ్ఛంగా ఉంటుందో, అటువంటివాడు శాంతుడు. తపస్సంపన్నులయందు, బుద్ధిశాలులయందు, యజ్ఞములు చేసిన వారియందు, చక్రవర్తులయందు, బలవంతులయందు, సద్గుణ సంపన్నులయందు, శమము (అంతరింద్రియ నిగ్రహము) కలిగి ఉండేవాడే ప్రశస్తిని పొందుతాడు. సంతోషామృత పానంతో ఎవరు శాంతచిత్తులవుతారో, అట్టివారే పరమపదమును పొందుతారు. ప్రాప్తించని వాటికోసందుః ఖించనివాడు, ప్రాప్తించినవాటితో తృప్తి చెందేవాడు, భేదభావాలు

లేనివాడు, సంతుష్టుడు. అంతఃపురంలో నివసించే సాధ్వి ఏ రకంగా లభించినవాటితో తృప్తిచెంది ఆనందంగా ఉంటుందో, అలాగే ప్రాప్తమైనవాటితో సంతృప్తి చెందేవాడు జీవన్ముక్తునిస్థితి పొందుతాడు. అదే స్వస్వరూపానందము.

ప్రాజ్ఞుడు శాస్త్రాలను, దేశకాలమానాలను అనుసరించి, ఏది సుఖమో, అది ఎలా దొరుకుతుందో, విచారిస్తుంటాడు. ఈ రకంగా ఆత్మలో విశ్రాంతి దొరికేదాకా మోక్షపదానికి దారి వెతుకుతూ ఉండాలి. సంసారార్ణవమునుండి బయటపడి, తురీయస్థితిలో విశ్రాంతి పొందేవాడు గృహస్తుగాని, సన్యాసిగాని, జీవించి ఉన్నా, మరణించినా అతడు కృతకృత్యుడు. అటువంటి జీవన్ముక్తుడు కర్మలు చేసినందువల్ల ప్రయోజనంలేదు. చెయ్యకపోతే అపకారంలేదు. మందరపర్వత రహితుడు, క్షోభిరహితుడు అయిన క్షీరసాగరంలాగా ఆత్మస్థితుడు ఆనందంగానే ఉంటాడు. దృశ్యపదార్థాలన్నీ పరమాత్మగానే దర్శించే జ్ఞానము కలిగినప్పుడు, దేశకాలవస్తు పరిచ్ఛేద, శూన్యము, శుద్ధ చిద్రూపము అయిన స్వస్వరూపము ప్రకాశిస్తుంది. అదే ఆత్మసాక్షాత్కారము. ఈ రకంగా నువ్వు భావించిన రూపంలో ఆత్మ ప్రత్యక్షమవుతుంది. స్థావరజంగమాత్మకమైన సమస్త దృశ్య ప్రపంచము, గాఢనిద్రలో స్వప్నంలాగా, ప్రళయకాలంలో నశించిపోతుంది. ఆత్మ, ఋతము, సత్యము, పరబ్రహ్మము అనే పదాలు పరబ్రహ్మకు వ్యవహారసంజ్ఞలు.

కంకణము అంటే బంగారమే కాని ఇంకొకటి కాదు. కడియము అన్నా బంగారమే. అలాగే ఈ జగత్తు అంటే పరమాత్మయే అవుతుంది. జగత్తే బ్రహ్మ, బ్రహ్మయే జగత్తు. ఆ చిత్ బ్రహ్మనుండే ఈ జగత్తుగా కనిపించే ఇంద్రజాలము విస్తారముగా ఉన్నది. దృశ్యముయొక్క స్థితే

ద్రష్ట అయిన ఆత్మకు బంధము. ద్రష్ట (చూసేవాడు) దృశ్యపదార్ధములవలన బద్ధుడవుతున్నాడు. దృశ్యముయొక్క అభావముతో జీవన్ముక్తుడవుతున్నాడు. నేను, నీవు అనే బాధలతో ఉన్నదే జగత్తు. మనస్సు వల్లనే జగత్తు అనే ఇంద్రజాలము విస్తరించి ఉన్నది. ఈ మనస్సు అనే కల్పితభావము ఎంతకాలం ఉంటుందో, అంతకాలం మోక్షంరాదు. స్వయంభువయిన పరమేశ్వరుడే ఈ జగత్తును సృష్టించాడు. అతనియొక్క మానసిక సృష్టియే ఈ జగత్తు. అందుచేతనే నామరూపాలుగల దృశ్యమాన జగత్తంతా మనస్సే అయి ఉన్నది. మనస్సులేనప్పుడు ఈ జగత్తులేదు. మనస్సు అనేది హృదయంయొక్క లోపలగాని, బయటగాని, ఇంకోచోటగాని లేదు. దానికి సత్యమైన ఉనికిలేదు. విషయ సంకల్పమే మనస్సు. సంకల్పమే మనస్సుయొక్క రూపము. ఎక్కడ మనస్సుంటుందో అక్కడ సంకల్పముంటుంది. సంకల్పము, మనసూ రెండూ వేరుకాదు. సంకల్పాలన్నీ నశించినప్పుడు పరమాత్మస్వరూపమే మిగులుతుంది.

నేను, నువ్వు, జగత్తు మొదలైన దృశ్యభ్రమ శమింపగా, దృశ్యమంతా అసత్తు కాగా, మిగిలిన స్థితే కైవల్యము. అదే ఆత్మస్థితి. మహాప్రళయం సమయంలో సకల దృశ్యజగత్తు సత్తాశూన్యమై పోతుంది. అప్పుడు సృష్టికి పూర్వములో ఉన్న శాంతి రూపమైన అద్వితీయ పరమాత్మే మిగులుతుంది. ఈ సృష్టికి పూర్వము ఏదిఉన్నదోఅదే ప్రళయము. అటువంటి ఆత్మభానుడు ఎప్పుడూ అస్తమించడు. సర్వదా తేజోవంతుడై ఉంటాడు. ఆ పరమాత్మ అజుడు (జన్మలేనివాడు) దేవుడు, సమస్త దోషరహితుడు. అతడే సర్వకర్త. సర్వస్వరూపుడు. ఎక్కడినుండి వాక్కులు వెనక్కి తిరిగి వస్తుంటాయో, దేనిని ముక్తపురుషులు తెలుసుకుంటున్నారో, దాన్నే ఆత్మ అంటారు.

ఆకాశములు మూడున్నాయి. 1. చిత్తాకాశము 2. చిదాకాశము 3. దహరాకాశము. వీటిలో చిదాకాశము అత్యంత సూక్ష్మమైనది. మనసు ఒకచోటినుండి ఇంకొక చోటికి పోయేటప్పుడు, ఆ మధ్య సమయంలో రెప్పపాటు కాలంలో అనుభవమయ్యే ఆనందమే చిదాకాశము. రెండు దృశ్యముల మధ్యనున్న ఉనికియే చిదాకాశము.

సర్వసంకల్పాలు త్రోసిపుచ్చినస్థితిలో స్థిరముగా ఉన్నప్పుడు సర్వాత్మక శాంతపదము పొందగలడు. ఔదార్యము, సౌందర్యము, వైరాగ్యములతో కూడిన పరమపద ఆనందస్థితియే సమాధి. దృశ్యము లేనే లేదు అనే భావనతో రాగద్వేషాలు నశిస్తాయి. ఆ సమయంలో మహత్తరమైన స్వరూపానందం కలుగుతుంది. అటువంటి స్థితియే సమాధి. దృశ్యము లేదనే భావనే నిజమైన జ్ఞానము. అదే కేవలభావము. చిదాత్మక విజ్ఞేయము. అదే కైవల్యస్థితి. అంతకన్న మిగిలినదంతా మిథ్య, మదించిన ఏనుగు ఆవగింజలో బంధింపబడినది. చిన్నదైన చెట్టు తొర్రలో ఒక దోమ సింహాల గుంపుతో యుద్ధం చేసింది. తామరపూసలో మేరుపర్వతము పెట్టబడినది. ఆ తామరపూసను తుమ్మెద మ్రింగివేసింది. ఇవన్నీ అసంభవాలు. భ్రమతో కూడిన వాక్యాలు. ఈజగత్తుకూడా అలాంటిదే. ఈ జగత్తుకు అస్థిత్వము లేదు. రాగద్వేషాలతో దూషితమైన చిత్తమే సంసారము. ఆ చిత్తము ఎప్పుడు రాగద్వేష రహితం అవుతుందో, అప్పుడు సంసారం నివృత్తి జరిగి మోక్షం సిద్ధిస్తుంది.

మనసుతో భావింపబడినవాడై జీవుడు దేహవాసన కలిగి ఉంటాడు. దేహవాసన పోయిన తరువాత, అతడు దేహధర్మాలకు అంటుకోడు. మనస్సుకు గొప్పశక్తి ఉన్నది. అది ఒకకల్పము కాలాన్ని ఒకక్షణంగా చేస్తుంది. అలాగే ఒక్కక్షణకాలాన్ని కల్పంగా చేస్తుంది.

ఈ సంసారమంతా మనోవిలాసం మాత్రమే. దుష్ప్రవర్తన విడిచి పెట్టనివాడు, అశాంతుడు, కేవలము ప్రజ్ఞాబలంతో ఆత్మసాక్షాత్కారము పొందలేడు. ద్వంద్వరహితమై, నిర్గుణమై, సత్యమై, చిద్ఘనమైనట్టి బ్రహ్మానందాన్ని తన ఆత్మరూపంగా తెలుసుకున్నవాడు ఎన్నటికీ భయపడడు. ఉత్తమోత్తమమైనది, మహత్తరమైనది, తేజోమయమైనది, కళ్యాణకారకమైనది, శాశ్వతమైనది, సర్వజ్ఞము, పురాణము, సనాతనము, సకల దేవతలచేత ఆరాధింపబడునది అయిన సర్వేశ్వర రూపాన్ని గురించి తెలుసుకున్నవాడు దేనికీ భయపడడు. అతడికి భయంలేదు.

'మమ', 'నమమ', ఈ రెండు పదాలే బంధమోక్షాలకు హేతువులు. మమ అనుకొన్న జీవుడు బద్ధుడవుతాడు. నమమ అనుకున్నవాడు ముక్తుడవుతాడు. చేతనాచేతనాత్మకమగు ఈ జగత్తు జీవేశ్వరాది రూపంలో ప్రకాశిస్తున్నది. ఈ సృష్టి అంతా పరమేశ్వర సంకల్పమైనది. జాగ్రదవస్థ నుండి మోక్షము వచ్చేదాకా, సంసారము జీవకల్పితమై ఉన్నది. నాచికేతాగ్ని మొదలు యోగమువరకు ఉన్న మతాలన్నీ ఈశ్వరుని విషయంలో భ్రాంతిని ఆశ్రయించి ఉన్నాయి. పొరపాటు పడుతున్నాయి. చార్వాకుల నుండి, సాంఖ్యులదాకా జీవభ్రాంతిని ఆశ్రయించి ఉన్నాయి. అందువల్ల ముముక్షువులు జీవేశ్వర సిద్ధాంతంలో బుద్ధిని ప్రవేశింపనీయరాదు. నిశ్చలబుద్ధితో బ్రహ్మతత్త్వ విచారణ చెయ్యాలి. అన్వయ వ్యతిరేక సిద్ధాంతాలద్వారా ఈతడు సాక్షాత్తు జ్ఞాని. అతడే శివుడు. అతడే హరి, అతడే బ్రహ్మ. సద్గురువు యొక్క కరుణ లేకపోతే విషయత్యాగం చాలాకష్టం. తత్త్వదర్శనము దుర్లభము. సహజావస్థ మరీ దుర్లభము.

ఈశ్వరుడే ఈ జగత్తును సృష్టించాడు అనే జ్ఞానంగలవాడు,

సర్వకర్మలను త్యాగం చేసినవాడు, అయిన యోగికి ఆత్మస్థితి సహజంగానే కలుగుతుంది. మానవుడు ఈ జగత్తులో భేదభావం గనక దర్శించినట్లైతే, అతడికి భయం కలుగుతుంది. సచ్చిదానందమనే జ్ఞాననేత్రము సర్వవ్యాపకమైనది. ప్రకాశించే సూర్యుణ్ణి గ్రుడ్డివాడు చూడలేడు. అలాగే అజ్ఞాని సచ్చిదానందాన్ని దర్శించలేడు. ప్రజ్ఞానమే బ్రహ్మ. ఆ బ్రహ్మము సత్యజ్ఞానాది లక్షణాలు గలది. అటువంటి బ్రహ్మను గూర్చిన జ్ఞానంవల్లనే మానవుడు అమృతుడవుతున్నాడు. పరాపర రూపమైన పరబ్రహ్మసాక్షాత్కారమైన తరువాత, మానవుని యొక్క హృదయగ్రంథులు విడిపోతాయి. సర్వసంశయాలు నశించిపోతాయి. అన్ని కర్మలు క్షీణిస్తాయి. కాబట్టి అనాత్మ అనే సంకల్పాన్ని పరిత్యజించాలి. జగత్తు విషయంలో నిర్వికారుడై ఉండాలి. అంతర్ముఖుడై కేవలము సంవిన్మాత్రపరుడై (అన్నీ తెలిసినవాడవై) ఉండాలి. భ్రమవల్ల ఎడారులలో నీటిగుంటలు కనిపిస్తాయి. కాని అవి మృగతృష్ణలు. అలాగే జాగ్రస్వప్నసుషుప్తులకు సంబంధించిన జగత్తంతా ఆత్మస్వరూపం దక్క వేరుకాదు.

లక్ష్యా లక్ష్యబుద్ధులను త్యజించి కేవలము ఆత్మమాత్రుడుగా ఎవడు ఉంటాడో, అతడు సాక్షాత్తూ ఈశ్వరుడే అయి ఉన్నాడు. అతడే ఉత్తముడైన బ్రహ్మజ్ఞాని. సర్వానికీ అధిష్ఠానము పరబ్రహ్మయే. ఉపమానము లేనిది, అవాఙ్మానస గోచరము, నిత్యము, సర్వగతము, సూక్ష్మాతిసూక్ష్మము, అవ్యయము అయిఉన్నది. ఈజగత్తు సర్వశక్తి మయుడగు పరమేశ్వరుని విలాసముగా ఉన్నది. సంశయము, అసంశయాలతో, ఈ సంసారము శాంతి పొందుతున్నది. మనోవ్యాధికి చికిత్స కోసం ఒక్కటే ఉపాయం ఉన్నది. ఏ వస్తువుమీద ప్రీతిఎక్కువ ఉంటుందో, దాన్ని త్యజిస్తూ వెళ్ళాలి. అప్పుడే మోక్షం సిద్ధిస్తుంది. స్వాధీనములో ఉన్నది. ఏకాంతహితమైనది, అయిన ఇష్టమైన వస్తువును

పరిత్యజించటానికి ఇష్టపడనివాడు కీటకంతో సమానము.

అసంకల్పము అనే శస్త్రంతో ఈ చిత్తాన్ని ఛేదించాలి. అప్పుడే స్వరూపము, సర్వగతము, శాంతము, అయిన పరబ్రహ్మ ప్రాప్తిస్తుంది. లోకవిషయభావనను పూర్తిగా విడిచి పెట్టెయ్యాలి. పరబ్రహ్మను గురించే ఆలోచించాలి. మనోనిగ్రహము కలిగి ఉండాలి. శాంతమనస్కుడై ఉండాలి. మనస్సు మ్రింగివేయబడిన స్థితి అదే అమనస్క స్థితి. అదే బ్రహ్మపదము. పరమమయిన పురుషయత్నాన్ని ఆశ్రయించి, చిత్తాన్ని అచిత్తముగా చేసి, హృదయాకాశంలో ఆత్మను ధ్యానించాలి. జ్ఞానము అనే చక్రాయుధంతో మనస్సును సంకోచం లేకుండా ఛేదించాలి. అప్పుడు కోరికల రూపంలో ఉన్న శత్రువులు నిన్ను బంధించలేరు. నేను నాది అనే సంకల్పమే మనస్సు. అటువంటి సంకల్పాలు లేకుండా చేసి, నిస్సంకల్పము అనే కొడవలితో మనస్సును ఛేదించాలి. శరత్కాలంలో ఆకాశంలో పట్టిన మేఘాలు, వేగంగా వీచిన గాలులవల్ల చిన్నాభిన్నమై పోయినట్లుగా, చక్కని ఆత్మవిచారంతో మనస్సు అమనస్సు కావాలి. అదే మనస్సు అంతర్ధానమైన స్థితి. అమనస్కము.

ప్రళయకాల పవనాలు వీచినప్పటికీ, సముద్రాలన్నీ ఏకమైనప్పటికీ, ద్వాదశాదిత్యులు ఒక్కసారే ప్రకాశించినప్పటికీ, మనోనాశనమైన వారికి ఏ విధమైన చింత ఉండదు. మోక్షసామ్రాజ్యము సంకల్ప రాహిత్యం చేతనే సిద్ధిస్తుంది. మనసు ఎప్పుడూ చలనం లేకుండా ఉండదు. అగ్నికి ఉష్ణము ధర్మములాగానే మనసుకు చంచలత్వము ధర్మము. చిత్తాన్ని ఆధారంగా చేసుకుని ఉన్నది, చంచలముగా ఉన్నది, అయిన స్పందనశక్తియే మనోసంబంధమైన చిత్తశక్తి. ఈ జగదాడంబరము అంతా మనసుకు సంబంధించినదే. చలనరహితమైన మనస్సు అమృతమయము. అది తపస్సు, దాన్నే

మోక్షము అంటారు. మనస్సుయొక్క చంచలత్వమే వాసనారూప మయిన అవిద్య. దీన్నివిచారణద్వారా నశించిపచెయ్యాలి.

పురుష ప్రయత్నాన్ని ఆశ్రయించి, శుద్ధచిత్తముతో మలినచిత్తాన్ని జయించాలి. మనసును నిగ్రహించాలంటే దానికి మనస్సే సమర్ధవంతమైనది. రాజును జయించటానికి రాజేసమర్ధుడు. ఇంకొకడు సమర్ధుడు కాదు. సంసారమనే సాగరంలో చిక్కి, ఆశ అనే గ్రహంతో పట్టుకోబడిన వాడికి అతనియొక్క శుద్ధ మనస్సే నావగా ఉన్నది. వివేకమైన మనస్సుతో బంధరూపంలో ఉన్న పాశాన్ని ఖండించి, సంసార సాగరం నుంచి నిన్ను నువ్వే రక్షించుకోవాలి. సాధకుడు తనను తానే ఉద్ధరించుకోవాలి. ఇతరులెవరూ కాపాడలేరు. తనలోపల జనించిన ఇష్టాన్ని ప్రాజ్ఞుడు నశింపచేసుకోవాలి. దానితో అవిద్య నశిస్తుంది. భోగవాసనను విడిచి, భేదవాసనను త్యజించి, భావాభావములను పరిత్యజించి, నిర్వికల్పుడైనవాడు సుఖిస్తాడు. అనుభవానికివచ్చే వేటికీ నీలోపల అవకాశ మియ్యవద్దు. ఇదే మనోనాశనము. అవిద్యానాశనము.

**దృశ్యములందు విశ్వాసము ప్రీతి విడిచిపెట్టి ఉండటమే మోక్షము. దృశ్యములందు విశ్వాసముప్రీతి కలిగి ఉండటమే దుఃఖము.** అవిద్య అనేది లేనేలేదు. అయినప్పటికీ అష్టప్రజ్ఞులయందు అవిద్య కనిపిస్తోంది. నామమాత్రంగా ఉన్న ఈ అవిద్య సమ్యక్‌ప్రజ్ఞగలవారియందు అసలుండదు. సమ్యక్‌ప్రజ్ఞ సిద్ధించేదాకా ఈ అవిద్య అమాయకుడైన జీవిని తనవెంట తీసుకుపోయి దుఃఖాలనే ముళ్ళపొదలలో పడవేస్తుంది. సమ్యక్‌ప్రజ్ఞ గలవారిని ఈ అవిద్య ఏమీ చెయ్యలేదు. మోహకారకమైన కోరికలున్నంతవరకూ, ఈ అవిద్య వెంటాడుతూనే ఉంటుంది. పరతత్వాన్ని అవలోకించిన వెంటనే ఈ

అవిద్య నాశనమవుతుంది. సర్వగతమైన జ్ఞానాన్ని దర్శించినట్లైతే అవిద్య తనకు తానే నశించిపోతుంది. అవిద్య నశిస్తే ఆత్మసాక్షాత్కారము జరుగుతుంది. ఆ స్థితి రావాలంటే సంకల్పాలు పూర్తిగా నశించాలి.

చిత్తాకాశములో వాసనారూపంలో ఉన్న రాత్రి నశించిన తరువాత, చిదాదిత్య ప్రకాశమువల్ల చంద్రకళ (జీవభావము) వెలవెలపోతున్నది. విషయములు అనే దృశ్యసంబంధాలు లేనట్టిది, సామాన్యరూపంలో సర్వవ్యాపకము, అనిర్వచనీయము అయిన చైతన్యమే ఆత్మ. అదే పరమేశ్వరుడు. ఈ సమస్తము నిత్యమై, సత్యమై, అక్షయమైన బ్రహ్మమే అయి ఉన్నది. మనస్సు అనే పేరుగల కల్పన ఇంకొకటి ఏదీలేదు. ఈ జగత్తులో ఏదీ జన్మించటంలేదు. మరణించటంలేదు. అందువల్ల షడ్భావవికారాలు కనిపిస్తున్న వీటన్నింటికీ అస్థిత్వము కొంచెముకూడా లేదు. ఏకముగా ఉన్నది, తేజోరూపము, స్వరూపము, సర్వసామ్రాజ్యము, అవ్యయము, చైతన్యానుపాతరహితము, చిన్మాత్రము అయిన బ్రహ్మమే ఇక్కడ ఉన్నది. అటువంటి నిత్యమైన వ్యాపకముగాఉన్న, శుద్ధమైన, చిన్మాత్రముగాఉన్న, నిరుపద్రవమైన శాంతశమ పూర్ణ నిర్వికారమైన చిదాత్మయందు మనసు విహరిస్తుంది. మనసు తన స్వభావానికి అనుగుణ్యమైన దానిని కల్పించుకుని, అన్ని దిక్కులకు పరుగుపెడుతుంది. ఎప్పుడూ మననము చేస్తుంది కాబట్టే దీన్ని మనస్సు అంటారు. ఈ మనస్సు సంకల్పము చేతనే సిద్ధిస్తుంది.

'నేను బ్రహ్మముకాదు' అనే ఆలోచనతో మనసు బంధింపబడుతున్నది. సర్వమూ బ్రహ్మమయమే అనే దృఢసంకల్పంతో మనస్సు విముక్తమవుతుంది. నేను కృశించినవాడను. దుః ఖించినవాడను. కోరికలతో బంధింపబడినవాడను, కాలు చేతులు

గలవాడను అనే భావంతో వ్యవహరిస్తూ జీవుడు బద్ధుడవుతున్నాడు. నేను దుఃఖినికాదు. నాకు దేహములేదు. బంధములేదు. అనే భావాలతో జీవి విముక్తుడవుతున్నాడు. నేను మాంసమును కాను. ఎముకలు కాను. దేహముకన్న వేరైనవాడను, నేను పరతత్త్వమును అని అంతరంగంలో నిశ్చయించుకున్నవాడు అవిద్యారహితుడై ఆత్మసాక్షాత్కారము పొందుతాడు. అనాత్మయందు ఆత్మభావన చెయ్యటంచేత అవిద్య కల్పించబడింది. పురుషప్రయత్నం తీవ్రం చేసి, భోగేచ్ఛను దూరంగా వదలి, నిర్వికల్పుడై, సుఖవంతుడు కావాలి. ఈ రకంగా అమనస్కుడైన జ్ఞానికే ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది.

# 70. మైత్రాయణ్యుపనిషత్తు

ఇది సామవేదానికి సంబంధించినది. ఇందులో ఐదు అధ్యాయాలు 36 మంత్రాలు ఉన్నాయి. సామవేదానికి సంబంధించినదే 'మైత్రేయోపనిషత్తు' అని ఇంకొకటి ఉన్నది. అదికూడా ఇలాంటిదే. అది సన్యాసోపనిషత్తులలో ఉన్నది.

పూర్వకాలంలో బృహద్రధుడు అనే మహారాజు చాలాకాలం ధర్మబద్ధంగా రాజ్యంచేసి, రాజ్యాన్ని తన జ్యేష్ఠకుమారుడికిచ్చి, ఈ శరీరము అశాశ్వతము అని భావించి అరణ్యాలకి వెళ్ళి ఒంటికాలి మీద నుంచుని తపస్సు చెయ్యటం ప్రారంభించాడు. రెండు చేతులూ పైకి ఎత్తి నమస్కారం చేస్తూ కొన్నివేల సంవత్సరాలు తపస్సు చేశాడు. అతని తపస్సుకు మెచ్చిన 'శాకాయన్యుడు' అనే మహర్షి దగ్గరకు వచ్చి "రాజా! నీ తపస్సుకు మెచ్చాను. నీకేం వరం కావాలో కోరుకో" అన్నాడు. ఆ మాటలు విన్న రాజు తపస్సు చాలించి, మునీశ్వరుడికి నమస్కరించి "ఓ మహర్షీ! నాకు ఆత్మవిద్యను వివరించవలసింది" అని అడిగాడు. ఆ మాటలకు ఆశ్చర్యపోయిన శాకాయన్యుడు 'రాజా! ఇంకేదైనా వరం కోరుకో. అన్నాడు. ఇప్పుడు రాజుగారు "ఓ మునీశ్వరా! పాంచభౌతికమైనది ఈ దేహము. ఎముకలు, రక్తము, మాంసము, మలమూత్రాలు, శుక్రశోణితాలు, వీటితో కూడుకుని చర్మంతో అందంగా కప్పబడి ఉంటుంది. దుర్గంధపూరితమైనది. సారములేనిది. కేవలము కోరికలు అనుభవించటానికే పనికి వస్తుంది. అటువంటి ఈ శరీరం వల్ల ఉపయోగం ఏదీలేదు. అరిషడ్వర్గాలు, ఆకలి, దప్పిక, ముసలితనము, రోగము, మరణము మొదలైన బాధలతో కూడి ఉంటుంది. దానివల్ల మానవులకు ప్రయోజనం లేదు.

ఈ చరాచర జగత్తంతా నశించిపోయేదే. ఇందులోని ప్రతిప్రాణి మరణించి తీరుతుంది. మళ్ళీ జన్మిస్తుంది. అనేకమంది మహారాజులు, చక్రవర్తులు ఈ రాజ్యాన్ని పాలించారు. కాని ఇప్పుడు వారెవరూ లేరు. అంతా గతించారు. సముద్రాలు ఎండిపోతున్నాయి. పర్వతాలు కూలిపోతున్నాయి. అంటే లోకంలో శాశ్వతమైనది ఏదీలేదు ఒక్క పరమేశ్వరుడు తప్ప. కాబట్టి ఓ మునీశ్వరా ! నాకు ఇవేవీ వద్దు. ఆత్మతత్త్వాన్ని బోధించి కృతార్థుణి చేయవలసింది అని ప్రార్థించాడు.

ఆ మాటలు విన్న శాకాయన్యుడు చాలా ఆనందించాడు. రాజుగారికి పూర్తిగా వైరాగ్యం వచ్చింది. ఇప్పుడు చెప్పటం మొదలు పెట్టాడు. "ఓ రాజా! ఇంద్రియాలు స్తంభించిపోగా ఈ శరీరంలోంచి బయటకు వెళ్ళిపోయేదే ఆత్మ. ఈ ఆత్మ నిర్మలమైనది. పరంజ్యోతి రూపంలో ఉంటుంది. అది అమృతము, అభయము. రాజా! నువ్వు అడిగినది బ్రహ్మవిద్య. అది ఉపనిషత్తులసారము. మా గురువుగారైన మైత్రేయుడు మాకు చెప్పాడు. దాన్ని నేను నీకు చెబుతున్నాను.

పూర్వకాలంలో ఊర్ధ్వరేతస్కులైన వాలఖిల్యులు ప్రజాపతి దగ్గరకు వెళ్ళి ఓ ప్రజాపతీ ! అచేతనమైన ఈ శరీరము ఎవరిచేత కదిలింపబడుతున్నది? దీనికి ప్రేరకుడు ఎవరు? అని అడిగారు. దానికి ప్రజాపతి "శుద్ధుడు, బుద్ధుడు, పవిత్రమైన వాడు, శాంతమైనవాడు, అనంతుడు, అక్షయుడు, శాశ్వతమైన వాడు పరమేశ్వరుడు ఈ శరీరాన్ని చేతనముగలదానిగా చేస్తున్నాడు" అన్నాడు. ఇప్పుడు వాలఖిల్యు లడుగుతున్నారు. "ఓ ప్రజాపతీ! ఈ శరీరానికి పరమాత్మ ఎలా ప్రేరకుడవుతున్నాడో వివరించండి. అన్నారు దానికి మహర్షి, అతడు శాశ్వతుడు, అనంతుడు, అదృశ్యుడు, బుద్ధి పూర్వకంగానే దేహంలో ప్రవేశించి, దేహానికి చలనము కలిగిస్తున్నాడు. సృష్టికి ముందు ఏకాకిగా

ఉన్నవాడు. అతడు ధ్యానంలోనే చాలామందిని సృష్టించాడు. వారంతా కర్ర మొద్దులలాగా ఉండిపోయారు. అప్పుడు ప్రజాపతి వాయురూపంలో వారిలో ప్రవేశించి, చలనము కలిగించాడు. వాయురూపంలో ఉన్నప్పుడు ప్రాణాపాన, వ్యాన, ఉదాన, సమానములని ఐదు అంశలుగా వాయువుని విభజించాడు.

పైకి ఉత్క్రమించేది – ప్రాణము

క్రిందికి ప్రసరించేది – అపానము

తిన్న ఆహారాన్ని అన్ని అవయవాలకు సరిగా అందించేది – సమానము. తిన్న దాన్ని పైకి పంపేది – ఉదానము.

సిరలందు వ్యాపించినది – వ్యానము

ఇలా వాయురూపంలో పరమేశ్వరుడు శరీరమంతా తిరుగుతూ, శరీరంలోనే వేడిని సృష్టించాడు. చెవులు మూడుసుకున్నప్పుడు మనం ఒకరకమైన శబ్దాన్ని వింటాము. అది గనక వినిపించకపోతే, మరణామాసన్నమైంది అని తెలుసుకోవాలి. ఇతడు హృదయము నందుండి కృతార్థుడు కాలేదు అనుకుని, విషయాలు అనుభవించాలి అనుకున్నాడు. జ్ఞానేంద్రియాలే – అతనికి పగ్గాలు.

| | | |
|---|---|---|
| కర్మేంద్రియాలు | – | గుర్రాలు |
| శరీరమే | – | రథము |
| మనస్సే | – | సారధి |

ఇతనివల్లనే శరీరము పరిభ్రమిస్తున్నది. మరణ సమయంలో ప్రేరణ ఆగిపోతుంది. కాబట్టి శరీరానికి ఇతడే ప్రేరకుడు అన్నాడు మహర్షి.

ఇప్పుడు వాలఖిల్యులు మళ్ళీ అడుగుతున్నారు. ఓ మహర్షీ !

ఆత్మని గురించి చెప్పావు బాగున్నది.కాని ఇంకొక చిన్న సందేహం వస్తోంది. అది ఏమంటే, తాను చేసిన కర్మఫలం వల్ల సదసద్యోనుల యందు జన్మించేది అయిన ఇంకొక ఆత్మ ఉన్నది అంటున్నారు కదా? మరి ఆ ఆత్మ ఎవరు? ఆత్మ ఒక్కటే అయితే దాన్ని పరమాత్మ అంటారు. మరి ఈ రెండవ ఆత్మ కర్మఫలభోక్త. అది ఎవరు? ఇప్పుడు ప్రజాపతి చెబుతున్నాడు. పరమాత్మ కాకుండా భూతాత్మ ఇంకొకడున్నాడు. భూతము అంటే పంచభూతాలు, తన్మాత్రలు అని అర్థము. అవన్నీ కలిస్తేనే శరీరమవుతుంది. అందుకే పాంచభౌతికమైనది ఈ శరీరము అంటారు. శరీరమే భూతాత్మ. శరీరంలో ఆత్మ ఉన్నది. అది ప్రకృతి సంబంధమైన గుణములచే పీడించబడుతున్నది. ఈ కారణం చేతనే భూతాత్మ పరమాత్మను చూడలేదు. ఈ భూతాత్మ కలుషితుడు, అస్థిరుడు, చంచలుడు, ఆశ, కోరిక కలవాడు, నేను నాది అనే అహంకార మమకారాలు గలవాడు. వలలోని పక్షిలాగా స్వకృతమైన కర్మఫలంతో కట్టుబడి సంసార చక్రంలో తిరుగుతున్నాడు. అన్నింటికీ కర్త భూతాత్మ. నిప్పులో బాగా కాలిన ఇనుపముద్ద సుత్తిదెబ్బలకు ముక్కలవుతుంది. అలాగే భూతాత్మ గుణములచే కొట్టిబడినదై 84 లక్షల జాతులుగా నానాత్వము పొందుతున్నది.

ఈ దేహము మైదునము వల్ల పుట్టింది. జ్ఞానము లేనిది. నరక సమానమైన యోని నుండి బయట పడుతుంది. మలమూత్రములు, రక్తమాంసములు, మజ్జ, కొవ్వు, మేధ మొదలైన మలిన పదార్థములతో నిండి సంపదతో నిండిన ధన కోశాగారములాగా కనిపిస్తుంది. మోహము, భయము, దుఃఖము, విషాదము, నిద్ర, అలసత్వము, ముసలితనము, శోకము, ఆకలి, దాహము, లోభము, క్రోధము, మాత్సర్యము, అజ్ఞానము, మూఢత్వము, గర్వము అనే తామస

గుణాలతో కలసినవాడై కుదురులేకుండా చంచలత్వము, జయించాలనే కోరిక, ధనార్జన, మిత్రులను ఆదరించటము వారికి ఆధారమవటము, ఇష్టముకాని వాటియందు ద్వేషము, ఇష్టమైన వాటియందు ఆసక్తి అనే రాజసగుణాలు కలిగి ఉంటాడు కాబట్టి నానారూపాలు పొందుతూనే ఉంటాడు. అని చెప్పాడు ప్రజాపతి. ఆ మాటలు విన్న వాలఖిల్యులు మళ్ళీ అడుగుతున్నారు. ఓ ప్రజాపతీ! భూతాత్మ ఏ రకంగా పరమాత్మలో లీనమవుతుంది? ఏ రకంగా సాయుజ్యం పొందుతుందో వివరించవలసింది. ఇప్పుడు ప్రజాపతి చెబుతున్నాడు.

ఓ వాలఖిల్యులారా! భూతాత్మ తాను గతంలో చేసిన కర్మఫలముచే బద్ధుడై సంసార చక్రంలో పరిభ్రమిస్తుంటాడు. అజ్ఞానంతో కూరుకుపోయి పరమేశ్వరుడు ఉన్నాడు అని కూడా భావించడు. భూతాత్మకు ఇదే పని, విద్యాభ్యాసం, స్వధర్మాలను ఆచరించటం, యజ్ఞయాగాది క్రతువులు చెయ్యటంవల్ల ఊర్ధ్వలోకాలకు పోతాడు. దీనికి భిన్నంగాకూడదని పనులు చేస్తే అథోలోకాలకు పోతాడు.

**తపసాప్రాప్యతే సత్త్వం । సత్త్వాత్సంప్రాప్యతే మనః**
**మనసా ప్రాప్యతే త్వాత్మా । హ్యాత్మా స్వాన నివర్తత**

తపస్సు లేనివాడికి ఆత్మజ్ఞానం ఉండదు. కర్మశుద్ధి ఉండదు. తపస్సుచే సత్వము, సత్వముతో మనస్సు, మనస్సుతో ఆత్మ పొందబడతాయి. ఆత్మప్రాప్తి చెందినవాడు తిరిగి జన్మించడు.

కట్టెలు లేకపోతే నిప్పు దానంతట అదే చల్లారిపోతుంది. అలాగే చిత్తవృత్తులు లేకపోతే చిత్తము ఉపశమిస్తుంది. మనసు ఉపశమిస్తే ఇంద్రియాలు పరమాత్ముని యందు లగ్నమవుతాయి. అదే మూఢుడికి కర్మలయందు లగ్నమవుతాయి. అసలు సంసారము అనేది ఎక్కడో విడిగా లేదు. చిత్తమే సంసారము. చిత్తం దేవియందు లగ్నమైతే

దానియందు తన్మయుడవుతాడు. చిత్తం గనక నిర్మలమైతే శుభాశుభ కర్మలను పోగొట్టును. నిర్మలాత్ముడు ఆత్మయందుండి అవ్యయమైన సుఖము పొందుతాడు. చిత్తము విషయములందు ఆసక్తమైనట్లుగా బ్రహ్మాయందు ఆసక్తమైతే బంధాల నుంచి విముక్తుడవుతాడు.

**మన ఏనమనుష్యాణాం కారణం బంధమోక్షయోః**
**బంధయా విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతం**

బంధమోక్షాలకు కారణం మనస్సు. ఆ మనస్సు విషయములయందు ఆసక్తమైతే అది బంధము, అలా కాకపోతే మోక్షము.

మనసు రెండు రకాలు 1. కామసంకల్పము. ఇది అశుద్ధము. 2. కామవివర్జము. శుద్ధము. కాబట్టి మనసును భగవంతుని యందు లయం చేస్తే సాధకుడు బంధవిముక్తుడై మోక్షము పొందుతాడు.

కాబట్టి వాలఖిల్యులారా! విషయముల యందు ఆసక్తి చూపకుండా మనసును పరమాత్మ వైపుకు మళ్ళించినట్లైతే మానవుడు బంధాల నుంచి విముక్తుడౌతాడు. అతడి జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే అవుతాయి. అంటే అతడు సాయుజ్యం పొందుతాడు. అతడికి పునర్జన్మ ఉండదు.

ఓ బృహద్రధ మహారాజా ! ఈ విషయమంతా ప్రజాపతి వాలఖిల్యులకు చెప్పాడు. అని శాకాయన్యుడు బృహద్రధ మహారాజుకు ఆత్మవిద్యను వివరించాడు.

# 71. బ్రాహ్మణుడు ఎవరు? (వజ్రసూచికోపనిషత్తు)

మనదేశంలో వర్ణవ్యవస్థ అనేది అనాదిగా ఉన్నది. బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర అని నాలుగు వర్ణాలు ఉన్నాయి. వీటినే చాతుర్వర్ణాలు అన్నారు. ఈ వర్ణ వ్యవస్థ మొట్టమొదటగా పురుష సూక్తంలో చెప్పబడింది. పరమేశ్వరుని యొక్క ముఖం నుంచి బ్రాహ్మణులు, బాహువుల నుంచి క్షత్రియులు, ఊరువుల నుంచి వైశ్యుడు, పాదాల నుంచి శూద్రులు జన్మించారు అని వేదంలో (పురుషసూక్తం) చెప్పబడింది. ఆ తరువాత భగవానుడు గీతలో **చాతుర్వర్ణం మయాసృష్టం గుణకర్మ విభాగచ** మానవులు చేసే కర్మల ననుసరించి వారిని నాలుగు వర్ణములుగా నేనే విభజించాను అన్నాడు. అయితే ఇది ఈనాడు మనకున్న కులవ్యవస్థ కాదు. వారు చేసే వృత్తిని బట్టి వర్ణనిర్ణయం జరిగింది. ఒక వర్ణం వారు ఇంకొక వర్ణంలోకి మారటం జరిగేది. అలాగే క్షత్రియుడైన విశ్వామిత్రుడు బ్రాహ్మణుడైనాడు. ఐతే ఇప్పుడు మనముందున్న ప్రశ్న ఏమంటే ఇవాల్టి రోజున అందరూ ఉద్యోగాలు చేస్తున్నారు. అటువంటి పరిస్థితిలో మరి బ్రాహ్మణుడు అంటే ఎవరు. అయితే ఈ ప్రశ్న ఇవాళ కాదు. కొన్నివేల సంవత్సరాల క్రితమే వచ్చింది. దానికి సమాధానం కూడా వేదంలోనే చెప్పబడింది. **'వజ్రసూచికోపనిషత్తు'**లో ఈ విషయం వివరించబడింది. వజ్రసూచికోపనిషత్తు సామవేదానికి సంబంధించినది.

ఈ ఉపనిషత్తు మొదటి మంత్రంలోనే

**బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రా ఇతి చత్వారోవర్ణాస్తేషాం**

**వర్ణానాం బ్రాహ్మణ ఏవప్రధాన ఇతి వేదవచానురూపం**

**స్మృతి భిరవ్యక్తమ్, తత్ర చోద్యమస్తి**

“బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రులని నాలుగు వర్ణాలు ఉన్నాయని, ఆ వర్ణాలలో బ్రాహ్మణుడు శ్రేష్ఠుడని వేదవాక్యానుసారము స్మృతులు కూడా చెబుతున్నాయి. ఆ విషయాన్ని విచారణ చెయ్యాలి” అంటే అప్పటికే ఎవరు బ్రాహ్మణుడు? అనే ప్రశ్న వచ్చింది.

**కోవాబ్రాహ్మణః? కిం జీవః? కిం దేహః? కింజాతిః ?**

**కిం జ్ఞానం ? కిం కర్మ? కిం ధార్మికః ? ఇతి**

బ్రాహ్మణుడు అంటే ఎవరు? జీవుడా? దేహమా? వర్ణమా? జ్ఞానమా? కర్మమా? ధర్మాన్ని ఆచరించే వాడా? ఎవడు బ్రాహ్మణుడు?

అనాదిగా బ్రాహ్మణుడు వేదవేదాంగాలను అభ్యసిస్తున్నాడు. అగ్నికార్యం చేస్తున్నాడు. యజ్ఞయాగాది కర్మలు చేస్తున్నాడు. అటువంటివాడు బ్రాహ్మణుడు, ఉత్తముడు అనటంలో సందేహం లేదు. కాని రానురాను చాతుర్వర్ణాలు శాఖోపశాఖలుగా పెరిగి కులాలయినాయి. ఈ రోజున కులవిద్య ఎవరూ చెయ్యటం లేదు. బ్రాహ్మణ కులంలో పుట్టినవారు కూడా వేదాధ్యయనం మానేసి బతుకుబాటలో ఇతర వృత్తులు చేపడుతున్నారు. మిగిలిన వారితో బాటుగానే జీవిస్తున్నారు. ఇప్పుడు వేదాధ్యయనం చెయ్యనివాడు, యజ్ఞయాగాది క్రతువులు ఆచరించనివాడు, కనీసం సంధ్యావందనం కూడా చెయ్యనివాడు కేవలం బ్రాహ్మణ కులంలో పుట్టినంత మాత్రంచేతనే బ్రాహ్మణుడవుతాడా? ఇదీ అనుమానం. దీనికి సమాధానమే ఈ ఉపనిషత్తు.

**జీవుడే బ్రాహ్మణుడా?** కాదు. ఎందుకంటే గతంలో జరిగిపోయినవి, భవిష్యత్తులో వచ్చేవి అనేక దేహాలున్నాయి జీవుడికి. అంటే జీవి అనేక జన్మలు ఎత్తుతాడు. ఇక్కడ జన్మలు అనేకం. కాని

జీవుడు ఒక్కడే. జీవి తాను చేసిన కర్మవల్లనే అనేక జన్మలు ఎత్తటం జరుగుతోంది. అనేక శరీరాలు ధరిస్తోంది. ఈ శరీరాలన్నింటిలోను ఉన్న జీవుడు ఒక్కడే. క్రిమికీటకాదుల నుంచి మానవుడిదాకా 84 లక్షల రకాల జీవజాలమున్నది. తాను చేసిన కర్మవల్ల రకరకాల శరీరాలు ధరించే జీవుడే బ్రాహ్మణుడు అని చెప్పటం సరికాదు.

పోనీ **దేహమే బ్రాహ్మణుడా?** అంటే కాదు అని చెప్పాలి. ఈ దేహం పంచభూతాలతో నిండినది. అన్ని వర్ణాల వారికి, అన్ని కులాల వారికి, అన్ని మతాల వారికి కూడా ఈ దేహం ఉన్నది. బాల్య, కౌమార, యవ్వన, వృద్ధాప్య దశలు అందరికీ సమానమే. జరామరణాలు అన్ని దేహాలకు ఉన్నాయి. కర్మలు ధర్మాలు అందరికీ ఒక్కటే. బ్రాహ్మణుడు తెల్లగా ఉండాలని, వైశ్యుడు నల్లగా ఉండాలనీ ఏమీ లేదు. కాబట్టి ఈ దేహము బ్రాహ్మణుడు కాదు.

పోనీ **వర్ణమే బ్రాహ్మణుడా?** అంటే చాతుర్వర్ణాలలో మొదటివాడు బ్రాహ్మణుడా? అలా ఏం కాదు. ఒకే వర్ణంలో మళ్ళీ రకరకాల తేడాలున్నాయి. ఉదాహరణకు బ్రాహ్మణ కులంలోనే చూస్తే వైదికులు, నియోగులు, తెలగాణ్యులు, కాసలనాటి వారు, ప్రథమ శాఖవారు, ఇలా అనేక రకాలు. అంతేకాదు. వీరి జన్మలలో కూడా తేడా ఉంది. ఋష్యశృంగుడు జింకవల్ల జన్మించాడు. కౌశికుడు దర్భ నుంచి, జంబూక మహర్షి జంబూకంవల్ల, వ్యాసుడు మత్స్యగంధివల్ల, శుకుడు ఘృతాచి అనే అప్సరాంగనవల్ల, గౌతముడు కుందేటి వీపునుంచి, వశిష్టుడు ఊర్వసివల్ల, అగస్త్యుడు కుండనుండి జన్మించారు. వీరందరూ తమ జాతి ప్రవృత్తిలేని మహాజ్ఞానులు, మహర్షులు. కాబట్టి కేవలము వర్ణమే బ్రాహ్మణుడు కాదు.

పోనీ **జ్ఞానమే బ్రాహ్మణుడా.** అంటే – కాదు. అని చెప్పాలి.

ఎందుకంటే? – జ్ఞానం కలిగిన క్షత్రియులు చాలామంది ఉన్నారు. మిథిలానగరాన్ని పాలించిన జనక మహారాజు, కాశీరాజు అశ్వపతి, మహావృష సామ్రాజ్యాన్ని పాలించిన జానశృతి ఇలాటివారు అనేక మంది మహాజ్ఞానులున్నారు. కాబట్టి జ్ఞానము గలవాడు బ్రాహ్మణుడు అనరాదు.

**కర్మలు చేసేవాడు బ్రాహ్మణుడా?** అంటే కాదు, ప్రతి వ్యక్తికి 1. ప్రారబ్ధము 2. సంచితము 3. అగామి అని మూడు రకాల కర్మలున్నాయి. కర్మల వలన ప్రేరేపించబడిన జీవుడు ఆ కర్మలు చేస్తాడు. కాబట్టి కర్మలు చేసేవాడే బ్రాహ్మణుడు కాదు.

మరి **ధర్మం చేసేవాడు బ్రాహ్మణుడా?** అంటే కాదు అని చెప్పాలి. ఎందుకంటే దానం చేసేవారు అనేకమంది ఉన్నారు. బలిచక్రవర్తి వంశనాశనం అవుతుందని తెలిసికూడా మూడడుగులు పేరుతో సర్వస్వాన్నీ దానం చేశాడు. దానగ్రహీత సాక్షాత్తు శ్రీమహావిష్ణువు అతనికి దానం ఇస్తే తాను సర్వనాశనమై పోతాడు అని తెలిసి కూడా దానమిచ్చాడు. అలాగే శిబిచక్రవర్తి తన దేహాన్ని కోసి దానమిచ్చాడు కర్ణుడు. ఇలాటి వారు ఇంకా చాలామంది ఉన్నారు. వారు బ్రాహ్మణులు కాదు. అందుచేత దానం చేసినవాడే బ్రాహ్మణుడు కాదు.

మనం గొప్ప గుణాలు గల వారెవరిని చెప్పినా అతడు బ్రాహ్మణుడు కాదు. అంటున్నారు మరి బ్రాహ్మణుడంటే ఎవరు? అద్వితీయుడు, జాతి, గుణ, క్రియారహితుడు, షడూర్ములు, షడ్భావాలు, షడ్వికారాలు లేనివాడు. (షడూర్ములు – ఆకలి, కోరిక, శోకము, మోహము, జర, మరణము, షడ్వికారాలు – పుట్టుట. పెరుగుట, ముదియుట, చిక్కుట, చచ్చుట, గర్భనరకస్థితి) సత్యజ్ఞానానంద స్వరూపుడు, నిర్వికల్ప సంకల్పుడు, అన్ని సంకల్పాలకు ఆధారమైన

వాడు, అన్ని భూతాలకు అంతర్యామి, ఆకాశం లాగా బాహ్యాంతరాలలో అంతటా వ్యాపించిన వాడు, అవిచ్ఛిన్నమైన ఆనందము గలవాడు, అప్రమేయుడు, స్వానుభవముతో మాత్రమే గ్రహించతగ్గవాడు, స్వయంప్రకాశి, భగవస్సాక్షాత్కారము పొంది కృతార్థుడైన వాడు, ఏ రకమైన దోషాలు లేనివాడు, శాంతి మొదలైన సద్గుణాలు కలవాడు, అరిషడ్వర్గాలను జయించిన వాడు, దంభము, అహంకారము, ఏ మాత్రము లేనివాడు, నిరంతర సత్యాన్వేషి మాత్రమే బ్రాహ్మణుడు అని చెబుతోంది ఈ ఉపనిషత్తు.

**జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః**

కాబట్టి బ్రాహ్మణత్వము **అనేది కేవలము పుట్టుకతోనే రాదు మనం చేసే కర్మని బట్టి వస్తుంది.**

# 72. సుబాలోపనిషత్తు - 1

## జ్ఞానియొక్క కర్మ, స్థితి

జ్ఞానియొక్క స్థితి ఎలా ఉంటుందో సుబాల, పైంగల ఉపనిషత్తులలో చెప్పబడింది.

ఆత్మజ్ఞాన సంపన్నుడు ముముక్షువు. అతడు ఇరవై ఒక్క తరాలను తరింప చేస్తాడు. బ్రహ్మజ్ఞానమాత్రంచేత నూటఒక్కతరాలను తరింపచేస్తాడు. జీవాత్మకు ఈ శరీరమే రథము. ఆ రథంలో కూర్చునే రథికుడు–జీవాత్మ. ఈ రథానికి సారధి– బుద్ధి. మనసు – ప్రగ్రహము (పట్టుకునే త్రాడు) ఇంద్రియాలే – అశ్వాలు. విషయాలే – మార్గాలు. ఆత్మేంద్రియ మనోయుక్తుడైన ఆ పరమేశ్వరుడే – భోక్త. అతడే – ప్రత్యగాత్మ. అతడు హృదయమందే సుప్రతిష్ఠితుడై ఉన్నాడు. ఆత్మవేత్త ప్రారబ్ధకర్మ ఉన్నంతవరకు పాము కుబుసానికి వేరుగా ఉన్నట్లుగా వ్యవహారం చేస్తాడు. అంటే తామరాకుమీద నీటిబొట్టులాగా, కర్మ చేస్తూ కూడా, దాని ఫలితాన్ని పొందకుండా ఉంటాడు. జీవన్ముక్తుడైన దేహి, ఆకాశంలో చంద్రునిలాగా అంతటా సంచరిస్తాడు. ప్రపంచంలో ఎక్కడైనా తిరుగుతాడు. ఇతడు తన ఇంట్లోగాని, ఏదైనా క్షేత్రములోగాని, శరీరాన్ని వదలి 'పరమపదము' అని చెప్పబడే కైవల్యము పొందుతాడు.

జ్ఞానియైనవాడు మహత్పదాన్ని తెలుసుకుని వృక్షమూలమున కూర్చోవాలి. మాసినగుడ్డలు ధరించి, ఏకాకియై సమాధియందుండి, ఆత్మనుకోరువాడై, ఆప్తకాముడై, (కోరికలను పొందినవాడు) నిష్కాముడై, జీర్ణకాముడై ఉండాలి. ఏనుగు నందు, సింహమందు, దోమయందు, ముంగిసయందు, సర్పమునందు, యక్ష, రాక్షస, గరుడ,

గంధర్వులయందు మృత్యువు యొక్క రూపము తెలుసుకున్నవాడు దేనికీ భయపడడు.

అతడు వృక్షంలాగానే ఉండాలి. నరకబడుచున్న వాడైనప్పటికీ కోపగించరాదు. ఆకాశములాగా ఉండాలి. కొట్టినా కోపించరాదు, సత్యముతో ఉండాలి. ఈ ఆత్మ సత్యరూపము. అన్ని గంధములకు భూమి హృదయము. అన్ని శబ్దాలకీ ఆకాశము హృదయము. గీతములన్నింటికీ అవ్యక్తము హృదయము. సత్త్వములన్నింటికీ మృత్యువు హృదయము. మృత్యువు పరుడైన దేవునియందు ఏకీభవిస్తుంది. ఆపైన సత్తులేదు. అసత్తులేదు సదసత్తు అంతకన్న లేదు.

విదేహముక్తుడు దేహము చాలించినప్పుడు అతని శరీరాన్ని దహనం చేస్తారు లేదా గోతిలో పాతిపెడతారు. బ్రహ్మవేత్తకు మాత్రమే **'ప్రవ్రజన దీక్ష'** తగినది. ప్రవ్రజన దీక్ష అంటే సన్యాసము. గృహస్థాశ్రమంలో ఉన్న భార్యపుత్రులను విడిచిపెట్టి వేయటము. బంధాలను త్రెంచుకోవటము. ఇతరులకు ఆ దీక్ష పనికిరాదు. బ్రహ్మభూతుడైన భిక్షువు (అతడే బ్రహ్మవేత్త) ఈ దేహాన్ని వదలివేసినప్పుడు, అంటే మరణించినప్పుడు సామాన్యుడికి జరిగినట్లుగా అగ్నికార్యములు, అశౌచములు, పిండోదకాలు, శ్రాద్ధకర్మలు, ఇవేవీ ఉండవు. దహించిన దానికి దహనంతో పనిలేదు. పక్వమైన దానికి పచనముతో పనిలేదు. జ్ఞానాగ్నిలో అతని కర్మ అంతా దహనమై పోయింది కాబట్టి, మళ్ళీ వేరుగా అతనికి కర్మకాండ చేయవలసిన పనిలేదు. అలాగే అతని ఆత్మ అజ్ఞానం నుంచి విడివడింది. అతని దేహము జ్ఞానాగ్నిలో ఇంతకుముందే దహించబడింది. అందుచేతనే అతడికి శ్రాద్ధకర్మలవంటివి ఏవీ ఉండవు.

ఉపాధి (శరీరము) ఉన్నంతవరకు సద్గురువుకు సేవ చెయ్యాలి. ఒకవేళ గురువు గనక గృహస్థు అయినట్లైతే, అతని పుత్రులను కూడా సేవించాలి. శుద్ధమనస్సు, శుద్ధ చిద్రూపము గలిగి, సహిష్ణుడైన బ్రహ్మనిష్ఠుడు "పరత్మాను నేను" అనే జ్ఞానం కలుగగా, దానివల్ల విజ్ఞానం కలిగి, జ్ఞేయమైన పరమాత్మను హృదయంలో దర్శించి, శాంతిని పొందగా, అప్పుడు అతడు మనస్సు, బుద్ధికూడా లేనటువంటి, నశించినటువంటి ఆ పరబ్రహ్మ స్వరూపమే అవుతాడు.

అమృతం తాగేవాడికి పాలతో పనిఉండదు. అలాగే జ్ఞానామృతంతో సంతృప్తుడయిన యోగీంద్రుడికి కర్తవ్యము ఏదీ ఉండదు. ఆత్మజ్ఞానము గలవాడే తత్త్వవేత్త. బ్రహ్మవేత్త దూరంగా ఉన్నప్పటికీ నిజానికి దూరంగా ఉండదు. ప్రత్యగాత్మ పిండస్థుడై ఉన్నప్పటికీ అనగా శరీరమునందున్నప్పటికీ, పిండవర్జితుడై అనగా శరీరాన్ని వేరుగా శవంలాగా చూస్తున్నవాడై, సర్వసన్యాసిగా ఉంటాడు. హృదయాన్ని నిర్మలం చేసుకుని, పరమాత్మను ధ్యానించి, "ఆ పరమాత్మను నేనే" అని తెలిసి, జీవుడు పరమానందము పొందాలి. జలముతో చేరిన జలములాగా, పాలతో కలిసిన పాలులాగా, నేతితో కలిసిన నెయ్యిలాగా, జీవాత్మ పరమాత్మలు ఏకీభావం చెందుతున్నాయి. ఈ రెండింటి మధ్యనా తేడా లేదు.

దేహమునందు జ్ఞానదీపము ప్రకాశించగా, బుద్ధి అఖండాకార రూపమవుతుంది. అప్పుడు విద్వాంసుడు బ్రహ్మజ్ఞానమనే అగ్నితో కర్మబంధనాలను దహించివేస్తాడు. తరువాత బ్రహ్మవేత్త పవిత్రుడు, అద్వైతరూపుడు అయిన పరమేశ్వరునిలో ఆత్మైక్యము పొంది, జలములో జలము కలిసిపోయినట్లుగా, స్వాత్మరూపుడై నిరూపాధి సంస్థితు

డవుతున్నాడు. ఆ స్థితిలో ఆత్మకు ఉపాధి (ఆధారము) ఏదీ ఉండదు. ఆకాశంలాగా ఆత్మ సూక్ష్మరూపం గలది. వాయువులాగా అది దృష్టికి గోచరించదు. బాహ్యమందు, అంతరమునందు కూడా ఆత్మనిశ్చలమైనది. జ్ఞానమనే దీపముద్వారా జ్ఞాని అంతరాత్మను దర్శిస్తున్నాడు. బ్రహ్మవేత్త అయినవాడు ఎక్కడ ఏ ప్రదేశంలో మరణించినప్పటికీ అక్కడే సర్వగతమైన ఆకాశంలాగా లయం పొందుతున్నాడు. మహదాకాశములో ఘటాకాశము లయమైనట్లుగా, తత్త్వజ్ఞాని ఆ పరమాత్మయందు తన ఆత్మను లయం చేసి నిరాలంబయోగ దర్శనము పొందుతాడు.

ధ్యానయోగము చాలాగొప్పది. వేలకొలది సంవత్సరాలు ఒంటికాలి మీద నిలబడి తపస్సు చేసినప్పటికీ, ఒక్క ధ్యానయోగముయొక్క పదహారవ వంతుతో కూడా సమానం కాదు. ఇదే తెలుసుకోవలసిన జ్ఞానము, జ్ఞేయము కూడా. లోకంలో సర్వాన్నీ తెలుసుకోవాలని ప్రయత్నం చేసేవాడు. వేలకొలది సంవత్సరాలు జీవించి కృషి చేసినా శాస్త్రముల సారాన్ని గ్రహించలేడు. అక్షర పరమాత్మను తెలుసుకోవాలి. జీవితము క్షణభంగురము. శాస్త్రపరిజ్ఞానాన్ని వదలిపెట్టి సత్యమైన పరబ్రహ్మను ఉపాసించాలి. మానవుడు బ్రహ్మతత్త్వాన్ని తెలుసుకోలేనంత వరకు కర్మలు, శౌచము, జపము, యజ్ఞము, తీర్థయాత్రలు చేస్తుండాలి. మహాత్ములైన వారికి 'అహంబ్రహ్మోస్మి' అనే భావమే మోక్షహేతువు. బంధానికి, మోక్షానికి కేవలము ఒక్క అక్షరమే తేడా. మమ (నాది) అనేది బంధానికి, నమము (నాదికాదు) అనేది మోక్షానికి హేతువు. ఈ భావనతోనే జీవి మోక్షం పొందుతాడు. మనసు గనక 'ఉన్మన' భావము (మనసును దాటిన

స్థితి, మనసు పని చేయని స్థితి) పొందినట్లైతే ద్వైతభావము కలగదు. ఉన్మనాస్థితిలో జీవుడికి పరమానందము కలుగుతుంది. మనసు ఏ ప్రదేశానికి పోతుందో అక్కడే పరమపదము ప్రాప్తిస్తుంది. పరబ్రహ్మ సర్వత్ర వ్యాపించి ఉన్నది. సమస్తము బ్రహ్మమయమే. ఈ జగత్తులో బ్రహ్మముకాని వస్తువు ఏదీలేదు. ఆకాశాన్ని ముష్టిఘాతాలతో ముక్కలుగా చేయవచ్చు. బాగా ఆకలిగా ఉన్నవాడు ఆకలి రాకుండా చేసుకోవచ్చు. అంటే అసాధ్యమైన దాన్ని కూడా సుసాధ్యంగా చేయవచ్చు. కాని **నేను బ్రహ్మను కాను అని భావించేవాడు మాత్రం మోక్షం పొందలేడు.**

# సుబాలోపనిషత్తు - 2

## అంతర్యామి

శుక్లయజుర్వేదానికి సంబంధించినది ఈ ఉపనిషత్తు. ఇందులో 15 అధ్యాయాలు 45 మంత్రాలు ఉన్నాయి.

పరమేశ్వరుడు సర్వాంతర్యామి అన్నారు కదా ! అసలు అంతర్యామి అంటే ఏమిటి? ఆయన సర్వాంతర్యామి ఎలా అయినాడు? ఈ విషయం చూద్దాం.

పరమేశ్వరుడు ఈ జగత్తునంతా సృష్టించాడు. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు మొదలైన వాటితో మానవుని కూడా సృష్టించాడు. ఈరకంగా సృష్టించిన దేహంలో తాను ప్రవేశించాలి అనుకున్నాడు. అలా ప్రవేశించటానికి రెండు ద్వారాలున్నాయి. ఒకటి పైనుండి అంటే బ్రహ్మరంధ్రంద్వారా, రెండవది క్రింద నుంచి. క్రింద నుంచి ప్రవేశించటం సేవకాలక్షణం కాబట్టి బ్రహ్మరంధ్రం ద్వారా

మానవశరీరంలో ప్రవేశించాడు. ఈ రకంగా ప్రవేశించిన తరువాత దశేంద్రియాలు, నవరంధ్రాలతో కూడిన ఈ దేహంతో భోగాలు అనుభవిస్తూ నేను, నాది అనే అహంకార మమకారాలకు లోనయినాడు. అంటే అవిద్యాపూరితుడైనాడు. దేహమే తాను అనే భ్రాంతికి లోనయినాడు. ఈ భేదం గనక తొలగిపోతే జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే అవుతాయి.

ఈ రకంగా జగత్తులోని ప్రతిశరీరంలోనూ ప్రవేశించినవాడై ఆ చైతన్యమూర్తి సర్వాంతర్యామి అయినాడు. ప్రతిజీవియందు ఆ చైతన్యము ఉండటంవల్లనే, ఆ జీవి చలించగలుగుతున్నది. ఉదాహరణకు కంటికి చూసే శక్తిలేదు. అలా ఉంటే కనులున్న వాళ్ళంతా చూడగలగాలి. కాని గ్రుడ్డివాడు చూడలేడు. గ్రుడ్డివాడికి కూడా కళ్ళుంటాయి. కాని ఆ కళ్ళకు చూసేశక్తి ఉండదు. ఈ రకంగా కంటికి చూసేశక్తి నిచ్చేది చైతన్యము అదే ఆత్మ. చెవికి వినేశక్తినిచ్చేది ఆత్మ.

పరమేశ్వరుడు సర్వాంతర్యామి. జగత్తంతా నిండి ఉన్నాడు. అన్నింటికీ తన చైతన్యశక్తిని ప్రసాదిస్తున్నాడు. అంతదాకా ఎందుకు ? గర్భంలోని శిశువుకు ఏడవ నెలలో ప్రాణం వస్తుంది అన్నాము. మరి అంతకుముందు ప్రాణం లేదా ? ఉన్నది. ప్రాణం లేకపోతే శిశువు ఎలా ఎదగగలుగుతుంది ? మరి ఏడవనెలలో వచ్చేది ఏమిటి ? అదే చైతన్యము. ఆ శిశువుకు చలనాన్ని ఇచ్చేది. అదే అంతర్యామి. ఆత్మ. ఇక పరమేశ్వరుడు తమలో ఉన్నప్పటికీ జీవులకు అతన్ని గురించి తెలియదు. కాని అతనివల్లనే ఆ జీవులు నియంత్రించబడుతూ ఉంటాయి.

పరమేశ్వరుడు భూమిలోపల ఉంటాడు. భూమే అతని శరీరము

కాని భూమి అతన్నెరగదు. భూమి లోపల ఉంటూనే భూమిని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

జలంలోపల ఉంటాడు. జలమే అతని శరీరం. కాని జలం అతన్నెరగదు. జలంలోపల ఉంటూనే జలాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

అగ్నిలోపల ఉంటాడు. అగ్నే అతని శరీరం. కాని అగ్ని అతన్నెరగదు. అగ్ని లోపల ఉంటూనే అగ్నిని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

వాయువులోపల ఉంటాడు. వాయువే అతని శరీరం. కాని వాయువు అతన్నెరగదు. వాయువు లోపల ఉంటూనే వాయువును నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

ఆకాశంలో ఉంటాడు. ఆకాశమే అతడి శరీరం. కాని ఆకాశం అతన్నెరగదు. ఆకాశం లోపల ఉంటూనే ఆకాశాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ. ద్యులోకంలో ఉంటాడు. ద్యులోకమే అతని శరీరము. కాని ద్యులోకమతన్నెరగదు. ద్యులోకంలో ఉంటూనే ద్యులోకాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

ఆదిత్యలోకంలో ఉంటాడు. ఆదిత్యలోకమే అతని శరీరము. కాని ఆదిత్య లోకం అతన్నెరగదు. ఆదిత్య లోకంలో ఉంటూనే ఆదిత్యలోకాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

దిగంతరాళాల్లో ఉంటాడు. దిక్కులే అతని శరీరము కాని దిక్కులు అతన్నెరగవు. దిక్కులయందుంటూనే దిక్కులను నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

సూర్యునిలో ఉంటాడు. సూర్యుడే అతని శరీరము. కాని

సూర్యుడు అతన్నెరగడు. సూర్యునిలో ఉంటూనే సూర్యుణ్ణి నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

చంద్రునిలో ఉంటాడు. చంద్రుడే అతని శరీరము. కాని చంద్రుడు అతన్నెరగడు. చంద్రునిలో ఉంటూనే చంద్రుణ్ణి నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

నక్షత్ర మండలంలో ఉంటాడు. నక్షత్రమండలమే అతని శరీరం. కాని నక్షత్ర మండలం అతన్నెరగదు. నక్షత్రమండలంలో ఉంటూనే నక్షత్రమండలాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

అంధకారంలో ఉంటాడు. అంధకారమే అతని శరీరము. కాని అంధకారం అతన్నెరగదు. అంధకారంలో ఉంటూనే అంధకారాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

తేజస్సులో ఉంటాడు. తేజస్సే అతని శరీరం. కాని తేజస్సు అతన్నెరగదు. తేజస్సులో ఉంటూనే తేజస్సును నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి అతడే ఆత్మ. మనస్సులోనే ఉంటాడు. మనస్సే అతని శరీరము. కాని మనస్సు అతన్నెరగదు. మనస్సులోనే ఉంటూనే మనస్సును నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

బుద్ధిలోనే ఉంటాడు. బుద్ధే అతడి శరీరము. కాని బుద్ధి అతన్నెరగదు. బుద్ధిలో ఉంటూనే బుద్ధిని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ. అహంకారంలోనే ఉంటాడు. అహంకారమే అతని శరీరం. కాని అహంకారం అతన్నెరగదు. తెలుసుకోలేదు. అహంకారంలో ఉంటూనే అహంకారాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

చిత్తమునందే ఉంటాడు. చిత్తమే అతని శరీరము. కాని చిత్తము

అతన్నెరగదు. చిత్తంలో ఉంటూనే చిత్తాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

అవ్యక్తమందు ఉంటాడు. అవ్యక్తమే అతని శరీరము.కాని అవ్యక్తము అతన్ని ఎరగదు. అవ్యక్తంలో ఉంటూనే అవ్యక్తాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

అక్షరములోనే ఉంటాడు. అక్షరమే అతని శరీరము కాని అక్షరము అతన్నెరగదు. అక్షరమందు ఉంటూనే అక్షరాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

మృత్యువునందే ఉంటాడు. మృత్యువే అతని శరీరము. కాని మృత్యువు అతన్నెరగదు. మృత్యువులో ఉంటూనే మృత్యువుని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ. అతడు సర్వభూతాంతరాత్ముడు. పాపరహితుడు. దివ్యుడు. అతడు కనుపించడు కాని చూస్తాడు. వినిపించడు కాని వింటాడు. అతడు తెలియబడడు. అర్ధంకాడు. కాని అతనికి అన్నీతెలుసు. అతడే అంతర్యామి. ఆత్మ. శాశ్వతుడు. అతడుతప్ప అన్నీ నాశనమైపోయేవే” అంటూ అంతర్యామిని గురించి వివరించబడింది ఈ ఉపనిషత్తులో.

# 73. స్కందోపనిషత్తు

ఇది కృష్ణ యజుర్వేదానికి సంబంధించినది. ఇందులో మొత్తం 15 మంత్రాలున్నాయి. ఇందులో పరబ్రహ్మ తత్వాన్ని ప్రతిపాదిస్తూ **శివకేశవులకు భేదంలేదు.** అని చెబుతున్నారు.

ఒకసారి ఒక భక్తుడు నృసింహుని దగ్గరకు వచ్చి

**ఓం అచ్యుతోస్మి మహాదేవ, తవ కారుణ్య లేశతః**

**విజ్ఞాన ఘన ఏవాస్మి శివోస్మి కిమతః పరమ్ ॥**

ఓ నృసింహదేవా! నీ దయచేత నేను శాశ్వతుడను అయ్యాను. విజ్ఞాన ఘనుడునైనాను. మంగళ స్వరూపుడనై ఉన్నాను. దీనికన్న శ్రేష్ఠమైనది ఏది? ఓ స్వామీ! అంతఃకరణ యొక్క కలవరం చేత సత్యమైనది సత్యముగా అనిపించటం లేదు. అంతఃకరణ నాశనం చేత హరిజ్ఞానస్వరూపుడుగా ఉన్నాడు. నేను జ్ఞానస్వరూపుణ్ణి కాబట్టి జనన మరణాలు లేకుండా ఉన్నాను. ఇంతకన్న శ్రేష్ఠమైనది ఏది? జడమైన వస్తువులన్నీ నశించేవే. చేతనము, అచేతనము ఈ రెండింటినీ చూసేవాడే అచ్యుతుడు. అతడు జ్ఞానస్వరూపుడు. అతడే మహాదేవుడు. అతడే హరి, జ్యోతులకెల్లా జ్యోతి అయినవాడు. పరమేశ్వరుడు.

**స ఏవహి పరంబ్రహ్మ, తద్బ్రహ్మాహం న సంశయః**

**జీవశ్శివ శ్శివోజీవ స్సజీవః కేవలశ్శివః ॥**

ఆ విష్ణువే పరబ్రహ్మ. నేను ఆ బ్రహ్మమే. దీనికి సంశయంలేదు. జీవుడే శివుడు. శివుడే జీవుడు. ఊకకప్పబడినప్పుడు అవి వడ్లు అనబడతాయి. ఊకపోగానే బియ్యము అనబడతాయి. అలాగే మాయాబద్ధుడు జీవుడు. మాయారహితుడు దేవుడు, కర్మ

నాశనమైనప్పుడు జీవుడు శాశ్వతమవుతాడు.

**పాశబద్ధ సదాజీవః పాశముక్తస్సదాశివః**

**శివాయ విష్ణురూపాయ, శివరూపాయ విష్ణవే ॥**

కర్మపాశాలతో బంధించబడిన వాడు జీవుడు. పాశముక్తుడైన వాడు శివుడు. శివుడన్నా విష్ణువన్నా ఒకటే.

**శివస్య హృదయగ్ం విష్ణుః విష్ణోశ్చ హృదయగ్ం శివః ।**

**యధాశ్శివ మయోవిష్ణుః ఏవం విష్ణుమయశ్శివః ॥**

శివుని హృదయమే విష్ణువు. విష్ణువుయొక్క హృదయమే శివుడు, శివకేశవులు ఇద్దరూ ఒకటే.

**దేహోదేవాలయ ప్రోక్తో, జీవోదేవ స్సదాశ్శివః**

**త్యజే దజ్ఞాన నిర్మాల్యం, సోఽహం భావేన పూజయేత్ ॥**

దేహమే దేవాలయం. అందులో ఉన్న జీవుడే సనాతనమయిన పరమేశ్వర స్వరూపం. అజ్ఞానం వదలి 'సోహం' అని జపించినట్లైతే ఆత్మసాక్షాత్కారం పొందుతారు.

**అభేద దర్శనం జ్ఞానం ధ్యానం నిర్విషయం మనః**

**స్నానం మనోమలత్యాగం శ్శౌచమింద్రియ నిగ్రహః**

**బ్రహ్మామృతం పిబేద్భైక్ష మాచరేద్దేహ రక్షణే ॥**

కులమత జాతిలింగ భేదాలు లేకుండా చూడటమే జ్ఞానము. మనస్సు విషయాలతో చేరకుండా ఉండటమే ధ్యానము. మనస్సులోని దోషాలు పోగొట్టటమే స్నానము, ఇంద్రియ నిగ్రహమే శౌచము, బ్రహ్మమే ఆచమనీయము, దేహరక్షణ కోసం బిచ్చమెత్తి జీవించు.

ఒక్కడుగా ఏకాకిగా వంటరి ప్రదేశాల్లో పరబ్రహ్మ సాక్షాత్కారం కోసం ప్రయత్నించు. అలా చేసినవాడే ముక్తుడు. ఆ పరమేశ్వరునకు నమస్కారము. ఆయన దయతో జన్మరాహిత్యము పొందవలసింది అన్నాడు నృసింహుడు.

**విరించి నారాయణ శంకరాత్మకం నృసింహదేవేశ తవ ప్రసాదతః**

**అచింత మవ్యక్తం అనంత మవ్యయం దేవాత్మకం బ్రహ్మనిజం విజానతే॥**

ఓ నృసింహదేవా ! నీ దయచేత త్రిమూర్తి స్వరూపము, అచింత్యము, అవ్యయము అయిన పరబ్రహ్మ నిజస్వరూపం తెలుసుకున్నాను.

**తద్విష్ణోః పరమం పదగ్ం సదాపశ్యంతు సూరయః**
**దివీవచ చక్షురాతతం తద్విప్రాసో విపన్యవో**
**జాగృవాం సస్సమింధతే విష్ణోయత్పరమం పదం ॥**

ఆకాశంలో ఉన్న వస్తువులను కళ్ళతో చూసినట్లుగా, ఆ విష్ణువు యొక్క పరపదాన్ని జ్ఞానులు మాత్రమే చూస్తున్నారు. అనేక విధాలుగా స్తుతి చేస్తున్నారు.

ఈ రకంగా జ్ఞానులు మాత్రమే పరమపదాన్ని చేరగలుగుతారు. అని చెబుతున్నది ఈ ఉపనిషత్తు. శంకరుడు చెప్పింది కూడా ఇదే.

**జ్ఞానాదేవతు కైవలం** జ్ఞానం వల్లనే మోక్షం సిద్ధిస్తుంది.

*దీంతో వేదాంతోపనిషత్తులు సమాప్తము*

శ్రీ

# పార్థసారథీయము

# చతుర్వేదభాష్యము

## (ఉపనిషత్తులు)

### (యోగోపనిషత్తులు)



ప్రముఖ శ్రీవిద్యా ప్రచారకులు

అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,

ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, మెంఫిస్, అమెరికా ఆస్థాన విద్వాంసులు,

డా॥ క్రోవి పార్థసారథి

# 74. యోగోపనిషత్తులు

ప్రజలదృష్టిలో యోగి చాలా గొప్పవాడు. అతడు నీటిమీద నడవగలడు. గాలిలో ఎగరగలడు. భూత భవిష్యద్వర్తమానాలు వారికి పూర్తిగా తెలుసు. అణిమాది అష్టసిద్ధులు అతని అధీనంలో ఉంటాయి. ఎవరికి ఏం కావాలన్నా ఇవ్వగలడు. ఏదైనా చెయ్యగలడు. అద్భుతాలు సృష్టించగలడు. అటువంటి మహానుభావుడు ఒకడికి భోజనం పెడితే కొన్ని వేలమందికి భోజనం పెట్టిన ఫలితం వస్తుంది. అతడికి వస్త్రం సమర్పిస్తే కొన్ని వేలమందికి వస్త్రదానం చేసిన ఫలితం దక్కుతుంది. **'యోగీనాం దర్శనం పుణ్యం, స్పర్శనం పాపనాశనం'** అతన్ని దర్శిస్తే చాలు ఎనలేని పుణ్యం వస్తుంది. అతన్ని స్పృశిస్తే చాలు మనం చేసిన అన్ని రకాల పాపాలు పటాపంచలయి పోతాయి. కాబట్టి మీ ఇంటికి ఎవరైనా యోగీశ్వరుడు వస్తే ఉచితరీతిని సత్కరించండి. కనీసం ఒకరూపాయి అతనికి దానం చెయ్యండి. **యోగీశ్వరుడికి చేసిన దానము వృథాకాదు. అది కొన్నివేల రెట్లయి మనకి తిరిగి వస్తుంది.**

యోగము అంటే అదృష్టము అని అర్థం. మానవుడికి అంతః దృష్టి సామర్థ్యాన్ని కలుగచేసేదే యోగశాస్త్రము. ఇది అనుష్ఠాన ప్రాధాన్యత గలది. సాంఖ్య ప్రవర్తకులు ఆగిపోయిన దగ్గర నుంచి మొదలవుతుంది యోగశాస్త్రం. అందుకే యోగానికి, సాంఖ్యానికి గట్టి సంబంధం ఉంది. వేదంలో యోగవిద్యను ప్రాణవిద్య అంటారు. 108 ఉపనిషత్తులలోను 20 ఉపనిషత్తులు యోగానికి సంబంధించినవే. చివరే. ప్రాచీన భారతీయ జైన, బౌద్ధ సాహిత్యాలలో యోగరహస్యాలు చాలా ఉన్నాయి. మండల బ్రాహ్మణోపనిషత్తు, దర్శనోపనిషత్తు అష్టాంగయోగాన్ని వివరించగా, సామవేదానికి సంబంధించిన

యోగచూడామణి ఉపనిషత్తు షష్టాంగ యోగాన్ని వివరిస్తోంది. ఇక ఉపనిషత్తులు చూద్దాం.

| | | |
|---|---|---|
| 1. | అద్వయతారకోపనిషత్తు | శుక్లయజుర్వేదము |
| 2. | అమృతనాదోపనిషత్తు | కృష్ణయజుర్వేదము |
| 3. | క్షురికోపనిషత్తు | కృష్ణయజుర్వేదము |
| 4. | త్రిశిఖబ్రాహ్మణోపనిషత్తు | శుక్లయజుర్వేదము |
| 5. | మండలబ్రాహ్మణోపనిషత్తు | శుక్లయజుర్వేదము |
| 6. | దర్శనోపనిషత్తు | సామవేదము |
| 7. | ధ్యానబిందూపనిషత్తు | కృష్ణయజుర్వేదము |
| 8. | నాదబిందూపనిషత్తు | ఋగ్వేదము |
| 9. | బ్రహ్మవిద్యోపనిషత్తు | కృష్ణయజుర్వేదము |
| 10. | యోగకుండలి ఉపనిషత్తు | కృష్ణయజుర్వేదము |
| 11. | యోగచూడామణి ఉపనిషత్తు | సామవేదము |
| 12. | యోగతత్త్వ ఉపనిషత్తు | కృష్ణయజుర్వేదము |
| 13. | యోగశిఖోపనిషత్తు | కృష్ణయజుర్వేదము |
| 14. | వరాహోపనిషత్తు | కృష్ణయజుర్వేదము |
| 15. | శాండిల్యోపనిషత్తు | అథర్వణవేదము |
| 16. | హంసోపనిషత్తు | శుక్లయజుర్వేదము |
| 17. | అమృతబిందూపనిషత్తు | కృష్ణయజుర్వేదము |

| | | |
|---|---|---|
| 18. | పాశుపతబ్రహ్మోపనిషత్తు | అధర్వణవేదము |
| 19. | మహావాక్యోపనిషత్తు | అధర్వణవేదము |
| 20. | తేజోబిందూపనిషత్తు | కృష్ణయజుర్వేదము |

| | |
|---|---|
| వీటిలో ఋగ్వేదానికి సంబంధించినవి | 1 |
| శుక్లయజుర్వేదానికి సంబంధించినవి | 3 |
| అధర్వణ వేదానికి సంబంధించినవి | 3 |
| కృష్ణయజుర్వేదానికి సంబంధించినవి | 11 |
| సామవేదానికి సంబంధించినవి | 2 |

# 75. అధ్యయతారకోపనిషత్తు

శుక్లయజుర్వేదానికి సంబంధించినది ఈ ఉపనిషత్తు. ఇందులో తొమ్మిది మంత్రాలున్నాయి.

ఈ ఉపనిషత్తు జితేంద్రియుడు, శమదమాది షడ్గుణ పరిపూర్ణుడు అయిన సన్యాసి కోసం చెప్పబడింది. నేను చిత్స్వరూపుడను అని భావన చేసి కళ్ళు మూసుకుని అర్ధనిమీలిత నేత్రాలతో, అంతర్దృష్టితో భ్రూమధ్యభాగంలో ఉన్న దహరాకాశం పైన సచ్చిదానంద రూపమైన పరమాత్మను చూస్తూ అదే ఆకారము పొందుతాడు. గర్భజన్మ జరామరణాలతో కూడిన సంసారము భయంకరమైనది. దానినుంచి తరింపచేసేది కాబట్టి తారకము అనబడుతుంది.

జీవేశ్వరులు మాయా సంబంధం గలవారు. ఈ విషయం తెలుసుకుని, నేతి నేతి పదాలతో అన్నింటినీ వదలిపెట్టగా మిగిలేది ఏదయితే ఉన్నదో అదే పరబ్రహ్మము. ఆ పరబ్రహ్మ సిద్ధి కావాలంటే అంతర్లక్ష్యము, బహిర్లక్ష్యము, మధ్య లక్షణాలను అభ్యాసం చెయ్యాలి.

**1. అంతర్లక్ష్యము :** దేహము మధ్యభాగంలో సుషుమ్నానాడి ఉన్నది. అది పూర్ణచంద్రుడిలాగా ప్రకాశిస్తున్నది. అది ఆధారచక్రము నుంచి బ్రహ్మరంధ్రందాకా ఉంటుంది. దాని మధ్యలో కుండలినీ శక్తి ఉన్నది. ఆ శక్తిని తెలుసుకున్నవాడు సర్వపాపముల నుండి విముక్తుడై మోక్షము పొందుతాడు. కుండలినీ తేజస్సును దర్శించినవాడు సిద్ధుడు. సాధకుడు చెవులు రెండూ మూసుకుంటే 'ఫూ' అనే శబ్దం వినిపిస్తుంది. ఆ శబ్దాన్ని వినేటప్పుడు భృకుటి స్థానంలో నీలజ్యోతి ననుసరించి అంతర్దృష్టితో ఆనందాన్ని అనుభవిస్తాడు.

**2. బహిర్లక్ష్యము :** నాసికాగ్రాన వివిధ రంగులతో గగనతలము కనిపిస్తుంది. శిరస్సుపైన 12 అంగుళాల జ్యోతిని దర్శించే వారికి అమృతత్త్వము సిద్ధిస్తుంది.

**3. మధ్యమ లక్షణము :** యోగి తన దేహంలో వివిధ రంగులతో కూడిన సూర్యమండలాన్ని దర్శిస్తున్నాడు. అలా దర్శించి అదే ఆకారము పొందుతున్నాడు. ఇలా దాన్ని అనేకసార్లు చూడటంవల్ల నిర్గుణాకాశము అవుతున్నాడు. దూరంగా ప్రకాశించే పరమాకాశము అవుతున్నాడు. ఈ రకంగా ఆకాశపంచకము.

1. నిర్మలాకాశము 2. నిర్గుణాకాశము 3. పరమాకాశము 4. మహాకాశము 5. తత్త్వాకాశము

ఇదే తారక లక్ష్యము అవుతున్నాడు.

తారకము రెండు రకాలు 1. పూర్వతాకము 2. ఉత్తరతారకము. ఉత్తర భాగమే అమనస్కతారకము అంటారు. ఈ రకంగా తారకాన్ని ఉపాసన చేస్తే బ్రహ్మత్వసిద్ధి కలుగుతుంది.

**తారకము :** మూర్తి తారకము, అమూర్తి తారకము అని రెండు విధాలు. యింద్రియాంతమైనది మూర్తి తారకము. భ్రూమధ్యాతీతమైనది అమూర్తి తారకము.

ఈ ఉపనిషత్తులో గురువు ప్రాధాన్యత చెప్పబడింది. గుకారము అంటే అంధకారము. రుకారము దాన్ని నిరోధించేది. అందుకే గురువు చాలాగొప్పవాడు. కాబట్టి గురువు జ్ఞానబోధ చేసి మోక్షమార్గంలో నడిపిస్తాడు. అతడికి మోక్షసిద్ధి పొందుతాడు. ఇలా అనేక విషయాలు చెప్పారు ఈ ఉపనిషత్తులో

# 76. అమృతనాదోపనిషత్తు (యోగము-షడంగాలు)

మేధావంతుడైనవాడు అన్ని శాస్త్రాలను బాగా చదివి అర్థం చేసుకుని, వంట పట్టించుకుని, బ్రహ్మపదార్ధాన్ని తెలుసుకున్నవాడై, ఆ తరువాత కొరివి కట్టెను పారేసినట్లుగా శాస్త్రాలను వదలివెయ్యాలి. అటు పిమ్మట ప్రణవము అనే రథాన్ని అధిరోహించి, మహావిష్ణువును సారథిగా చేసుకుని, బ్రహ్మలోకాన్ని అన్వేషిస్తూ రుద్రారాధనా తత్పరుడు కావాలి. ఇట్టి సాధకుడు రథమార్గమున్నంత వరకు రథంలో పోయి, తరువాత రథాన్ని కూడా వదిలి బ్రహ్మలోకానికి పోవాలి. మాత్ర, లింగ పదాలను వదిలి, శబ్దాన్ని వదలి స్వరరహితమైన సూక్ష్మమార్గాన పోవాలి.. శబ్ద స్పర్శాది తన్మాత్రలను, మనసును వశంలో ఉంచుకోవాలి.

సర్వేంద్రియాలను వశపరచుకుని సంశయమశీలుడై ఉండటమే ప్రత్యాహారము అనబడుతుంది. ప్రత్యాహారము, ధ్యానము, ప్రాణాయామము, ధారణ, సత్యాసత్య విచారణ, సమాధి అనే ఆరు అంగాలూ యోగము అనబడతాయి. ధాతువులను కొలిమిలో పెట్టి కాల్చినప్పుడు వాటి మాలిన్యం పోయినట్లే, ఇంద్రియాలకు చెందిన దోషాలు ప్రాణాయామం వల్ల పోతాయి. ప్రాణాయామ సాధనతో మనసులోని మాలిన్యం నశింపచెయ్యాలి. ధారణలతో పాపాన్ని పోగొట్టాలి. ప్రత్యాహారముతో సంసర్గ పాపములను పోగొట్టాలి. ధ్యానసాధనతో అనీశ్వర గుణములను నశింపచేయాలి.

ఈ రకంగా పాపాల్ని పోగొట్టుకుని పరమాత్మ చింతన చెయ్యాలి. రేచకము, పూరకము, కుంభకము అని ప్రాణాయామం మూడు

విధాలు. రేచకంతో శ్వాస విడవాలి. వ్యాహృతితో కూడినది. ప్రణవసహితమైనది అయిన గాయత్రీ మహామంత్రాన్ని శిరస్సుతో సహా సాధకుడు మూడుసార్లు పఠించాలి. దానినే ప్రాణాయామం అంటారు. శ్వాసవాయువును పూర్తిగా బయటకు వదలి నిరాత్మకమైన శూన్యాకాశంలో లయింపచేసి యోగము చేయుట రేచక మనబడును. తామరతూడు నుండి జలమును పీల్చినట్లుగా శ్వాస పీల్చి యోగము చేయుట పూరకము. ఉచ్ఛ్వాస నిశ్వాసలను నిలిపి, శరీరము చలింపనీయక, దమ్ముపట్టి ఉండటమే కుంభకము. అంధునిలాగా రూపాలను దర్శించాలి. చెవిటివానిలాగా శబ్దాలు వినాలి. శరీరాన్ని కొయ్యలాగా భావించాలి. ఇలా ఉండటము ప్రశాంతమనస్కుని లక్షణము. సంకల్ప రూపమైన మనస్సును విచారణచే చక్కగా తెలుసుకుని, బుద్ధిమంతుడు తన మనస్సును ఆత్మయందు స్థాపించి, ధ్యానపరాయణుడై ఉండటము ధారణ అనబడుతుంది. వేదాలకు అనుగుణంగా ఊహించటమే తర్కము. దేనిని పొంది సర్వత్ర సమముగా ఉన్న పరబ్రహ్మము నందు నిలకడ కలగి ఉండునో, అది సమాధి.

పరిశుద్ధమై దోషరహితమైన భూమిపై దర్భాసనము వేసుకుని కూర్చుని, మంత్రమూర్తిని మనసుతో భావిస్తూ రథమండలమున ప్రణవాన్ని జపించాలి. సాధకుడు ధ్యానానికి అనుకూలమైన పద్మకము, స్వస్తికము, భద్రము మొదలైన ఆసనాలలో దేన్నైనా వేసుకుని, ఉత్తర దిక్కుగా కూర్చుండి ధ్యానం చెయ్యాలి. ఒక ముక్కు రంధ్రాని బొటనవ్రేలితో మూసిపెట్టి, రెండవ రంధ్రంతో గాలి పీల్చి ధారణ చెయ్యాలి.

ఏకాక్షరము పరబ్రహ్మ స్వరూపమయిన ఓంకారముతో బ్రహ్మధ్యానపూర్వకముగ రేచకము చెయ్యాలి. ఈ రకంగా దివ్య మంత్రంతో పలుపర్యాయములు రేచకము, పూరకము చేస్తూ, మనసులోని మలినాలు నశించేదాకా ప్రాణాయామాదులు చేస్తుండాలి. మంత్రవిదులైన వాళ్ళు గతంలో చెప్పినట్లుగా స్థూలాది సూక్ష్మములగు సాధనలను నాభిస్థానము నుంచి పై భాగములో చెయ్యాలి. అడ్డముగ, నిలువుగ క్రింది భాగంలోను ప్రసరించే దృష్టిని వదలిపెట్టి ధ్యానపరాయణుడు ధైర్యము గలవాడై, చలింపని దేహము గలవాడై నిత్యము యోగాభ్యాసం చెయ్యాలి. నిశ్చలమైన మనసుతో ధారణ చెయ్యాలి. యోగకాలము 12 మాత్రలకు పెంచాలి.

అక్షరఘోషలేనిది, వ్యంజనము కానిది, స్వరము లేనిది, తాలువులు, దంతములు, నాసిక, వీటితో సంబంధము లేనిది, రేఫలేనిది, ఉభయ తాపములు లేనిది, ఆ అక్షరము కొంచెంకూడా నశించటంలేదు. ప్రాణము ఏ మార్గాన పోతుందో ఆ అక్షరం కూడా అదే మార్గాన పోతుంది. అటువంటి ప్రాణాయామ మార్గాన్ని నిత్యము అభ్యసించాలి. హృదయంద్వారము, వాయుద్వారము, బ్రహ్మరంధ్రద్వారము ఇవన్నీ మోక్షద్వారాలుగా, సుషిర మండలముగా తెలుసుకోవాలి.

యోగి అయినవాడు భయము, క్రోధము, సోమరితనము, అధికనిద్ర, అతిజాగరణ, అధికముగా తినటము, ఉపవాసము, మొ॥ వదలివెయ్యాలి. ఈ రకంగా క్రమబద్ధంగా ధ్యానాభ్యాసము చేసినట్లైతే మూడునెలలలోగా బ్రహ్మజ్ఞానము ప్రాప్తిస్తుంది. 4 నెలలో దేవతాదర్శనము కలుగుతంది. 5 నెలలలో సర్వసాధనాలు సిద్ధిస్తాయి.

6 నెలలలో కైవల్యము ప్రాప్తిస్తుంది. ఇందులో సంశయము లేదు.

5 భాగాలు భూమి, 4 భాగాలు జలము, 3 భాగాలు అగ్ని, 2 భాగాలు వాయువు, 1 భాగము ఆకాశతత్త్వము మనసుతో సంధి చేసుకుని, జీవాత్మను పరమాత్మలో నుంచి ధ్యానం చెయ్యాలి. బాహ్యంగా 15 అంగుళముల పొడవు ప్రాణవాయువు తిరుగుతున్నది. దీనిని ప్రాణము అని అంటారు. 1,30,180 శ్వాసలు అహోరాత్ర ప్రమాణము అని చెప్పబడింది.

హృదయస్థానములో ఉండేది ప్రాణము. గుదప్రదేశంలో ఉండేది అపానము. నాభిదగ్గర సమానము. కంఠప్రదేశంలో ఉదానము. అన్ని అవయవాలలోనూ ఉండేది వ్యానము. ప్రాణవాయువు – రక్తవర్ణంలో మణిలా ప్రకాశిస్తుంది. అపానవాయువు ఇంద్ర గోపమణిలాగా, సమానవాయువు ఆవుపాలవల తెల్లగ, ఉదానవాయువు నల్లగా, వ్యానవాయువు అగ్నిజ్వాలలాగా ఉంటుంది. ఎవరి బ్రహ్మరంధ్రంలో అక్కడ ఉన్న వాయుమండలాన్ని ఛేదించుకుని ఈ ప్రాణవాయువు చేరుతుందో, అట్టి యోగికి పునర్జన్మ లేదు.

# 77. క్షురికోపనిషత్తు (కృష్ణయజుర్వేదము)

పూర్వకాలంలో చతుర్ముఖబ్రహ్మ పరమేశ్వరుని సమీపించి "దేవాదిదేవా! మానవుడు సంసార బంధనాలను వదిలించుకుని అమృతత్త్వాన్ని పొందే సులభమైన ఉపాయము ఏదో నాకు సెలవియ్యవలసింది" అని అడిగాడు. దానికి పరమేశ్వరుడు

సాధకుడు జనసంచారము లేని ప్రదేశంలో ఆసనస్థితుడై సాధన చెయ్యాలి. తాబేలు తన అవయవాలను అవసరాన్ని బట్టి లోపలకి, బయటకీ తెచ్చేటట్లుగా 12 మాత్రలు గల యోగాన్ని మెల్లమెల్లగా సాధన చెయ్యాలి. శరీరంలోని అన్ని ద్వారాలను నిరోధించి, శరీరాన్ని వాయువుతో పూరించాలి. 48 మాత్రలకాలము కుంభకము చెయ్యాలి. హృదయము, ముఖము, నడుము, మెడ వీటిని నిటారుగా ఉంచాలి.

నాసికలో సంచరించే వాయువుతో ప్రాణాయామం చెయ్యాలి. అనగా ఇడానాడితో వాయువును పూరించి, కుంభించి, పింగళానాడితో రేచకము చెయ్యాలి. అలాగే పింగళానాడితో వాయువును పూరించి, కుంభించి, రేచకము చెయ్యాలి. యోగియైన సాధకుడు స్థిరమైన ఆసనంలో కూర్చుని, సమాహితేంద్రియుడై కనిష్ఠ, అనామిక, అంగుష్ఠములచేత నాసికారంధ్రాన్ని మూసి హృదయంలో ఉన్న ప్రాణాలను దృఢం చేసి దారణ చెయ్యాలి. తరువాత జంఘా ప్రదేశంలో మూడుసార్లు పూరించాలి. పాద, అంగుళీయ, గుల్ఫ, జంఘములందు, దృష్టి, మనః ప్రాణములను క్రమంగా ఆరోపించి అక్కడ నుంచి ప్రత్యాహారము చెయ్యాలి. అదేరీతిగా జాను, ఊరు, గుద, శిశ్నములందు కూడా దృష్టిమనః ప్రాణాలను ప్రత్యాహార మొనర్చాలి. ఈ రకంగా జాను, ఊరు, మూలాధార, స్వాధిష్ఠానములందు అచ్చటచ్చట కుంభకం

చేసి, మణిపూరంలో దృష్టిమనః ప్రాణాలను సమారోపించి, తజ్జయ పర్యంతము ఆశ్రయించాలి. మణిపూరకాశ్రయమగు నాడీకందకము నందు ఇడ, పింగళ మొదలైన పేర్లుగల 10 నాడులచేత ఆవరించబడిన సుషుమ్న అనే బ్రహ్మనాడి ఉన్నది. ఆ నాడీ కందకమునందు రక్త, పీత, కృష్ణ, తామ్ర, విలోహిత, పాండరాది విశిష్టములైన సూక్ష్మనాడులున్నాయి.

శరీరంలో మొత్తం 72 వేల నాడీమండలమున్నది. వీటిలో ప్రధానమైనది శుక్లనాడి. అదే సుషుమ్న. ఆ సుషుమ్ననాడిలో దృష్టి, మనసు, ప్రాణాలను సాలెపురుగు దారముతో సంచరించు రీతిగా సంచరించేటట్లు చెయ్యాలి. సుషుమ్నా మార్గమునుండి ఎర్రకలువలాగా ప్రకాశించేది, అన్ని నాడులకన్న విలువైనది అయిన హృదయ కమలమందు దృష్టి, మనసు, ప్రాణాలను ప్రత్యాహారము చెయ్యాలి. ఆ తరువాత హృదయ కమలమును భేదించి దృష్టి మనఃప్రాణాలను విశుద్ధి చక్రం చేర్చాలి. ఆ తరువాత వీటిని ఆజ్ఞాచక్రానికి సహస్రారానికి చేర్చాలి.

విశ్వ, విరాట్, ఓత్రాది పాదత్రయముకన్న పైన ఉన్న రహస్య స్వరూపమే నేను అని సర్వదా ధారణ చెయ్యాలి. తీక్షణమైన మనోధారణతో నిరంతరము యోగాన్ని ఆశ్రయించాలి. ఈ మనోధారణమనే సాధన అజ్ఞానమనే పర్వతాన్ని భేదించటానికి వజ్రాయుధము వంటిది. ఈ వజ్రాయుధము బ్రహ్మాతిరిక్తమయిన మర్మావయవాలను తెగ నరుకుతుంది. ఆ యోగబలంతో స్వాతిరిక్తమయిన భ్రమను భేదించాలి. మళ్ళీ అట్టి భ్రమ కలిగినట్లైతే, ఊరువు మధ్యభాగంలో సమనస్కముగా ప్రాణాలను స్థాపించి, మర్మప్రాణాలను విమోచనం చెయ్యాలి. ఉదయం, మధ్యాహ్నం,

సాయంత్రం, అర్ధరాత్రి. 4 కాలాలయందు ఆ సార్లు యోగధారణ చెయ్యాలి. విశుద్ధి చక్రంలో 101 నాడులున్నాయి. వాటిలో సుషుమ్నానాడి శ్రేష్ఠమైనది.

ఈ సుషుమ్నానాడి బ్రహ్మమునకు సూత్రభూతమవటం చేత పరబ్రహ్మయందు లీనమై ఉన్నది. రజస్తమోగుణ విరహితమైనందున విరజమని చెప్పబడుతున్నది. ఈనాడి బ్రహ్మరూపిణి. సుషుమ్నకు ఎడమ భాగంలో ఇడానాడి, కుడిభాగంలో పింగళానాడి ఉంటాయి. సుషుమ్నానాడిలో శ్రేష్ఠమైన బ్రహ్మస్థానమున్నది. ఆ బ్రహ్మస్థానంలో ఉన్న బ్రహ్మను తెలుసుకున్నవాడు వేదార్ధవేత్త.

శరీరంలో 72 వేల నాడులున్నాయి. వాటిలో ప్రతినాడులున్నాయి. ప్రతినాడులలో ప్రాణవాయువు యొక్క తైతిలమున్నది. నాడీగతమైన ప్రాణ ప్రచారమును యోగనిర్మాలసారమనే కత్తితో ఛేదించాలి. సుషుమ్నానాడి మాత్రం ఛేదించబడదు. ఇదే కైవల్యనాడి. దీనియందే దృష్టిమనః ప్రాణప్రచారము చెయ్యాలి. యోగియైన వాడు సుషుమ్నలో దృష్టిమనః ప్రాణాలను ఎల్లప్పుడూ దర్శించాలి.

ఈ రకంగా సుషుమ్న తప్ప మిగిలిన నాడులన్నీ శుభాశుభ భావగమనములు కలిగి ఉన్నాయి. సుషుమ్న మాత్రం మోక్షప్రదము. ఇంద్రియాలను నిగ్రహించి, విజిత చిత్తుడై, నిశ్శబ్దమైన ఏకాంత వాసమునందు సంగరహితుడై, సాంగయోగము తెలిసినవాడై, నిరపేక్షుడై, మెల్లమెల్లగా పాశాలను త్రెంచుకుని ఆకాశాన ఎగిరే హంసలాగా జీవి సంసార సాగరం దాటి మోక్షధామము చేరి సుఖిస్తాడు.

వెలుగుతున్న దీపం ఆరిపోయేటప్పుడు తనను ఆశ్రయించి ఉన్న వత్తి మొదలైన వాటిని కాల్చివేసి ఏ రీతిగా స్వయోనియందు

లయమవుతుందో, అలాగే యోగి తన నాశ్రయించి ఉన్న కర్మలను కాల్చివేసి స్వాత్మలో లయమవుతాడు. యోగవేత్త ప్రాణాయామాది సాధనాభ్యాసము చేత తీక్షణము, తీవ్రము అయిన వైరాగ్యశిల యందు జ్ఞానఖడ్గానికి పదును పెడతాడు. అలా పదునుపెట్టిన జ్ఞాన ఖడ్గముతో సంసార బంధనాలను త్రెంచి వేస్తాడు. ఆ బంధనాలు తెగిన వెంటనే ఆత్మరూపియై ప్రకాశిస్తాడు. వైరాగ్యబలంతో ఎప్పుడైతే బంధాలను వదిలించుకుంటాడో, అప్పుడే అతడు అమృతత్త్వాన్ని పొందుతాడు.

# 78. త్రిశిఖబ్రాహ్మణోపనిషత్తు

ఇది శుక్లయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో 59 మంత్రాలున్నాయి. అష్టాంగ యోగం ద్వారా ముక్తిని గురించి వివరించారు.

పూర్వకాలంలో 'త్రిశిఖి' అనే బ్రాహ్మణుడు సూర్యలోకానికి పోయి ఆదిత్యుడికి నమస్కారం చేసి దేవా! దేహమంటే ఏమిటి? ప్రాణము ఏమిటి? ఆత్మ అంటే ఏది? అని అడిగాడు. దానికి ఆదిత్యుడు ఓ మునీంద్రా! ఈ మూడు పరమేశ్వరుని స్వరూపమే. సచ్చిదానంద పురుషుడే ఈ లోకాలు సృష్టించి, మానవ శరీరంలో ప్రవేశించి అజ్ఞానంతో తాను భిన్నమైన వాడిలా భావన చేస్తున్నాడు" అని చెప్పాడు. ఆ మాటలు విన్న త్రిశిఖి మళ్ళీ అడుగుతున్నాడు. అసలు ఈ సృష్టి ఏ రకంగా చెయ్యబడింది? వివరంగా చెప్పవలసింది అన్నాడు. ఓ త్రిశిఖీ!

శబల బ్రహ్మమునుంచి – అవ్యక్తము వచ్చింది.

అవ్యక్తము నుండి – మహతత్త్వము. దానినుంచి అహంకారము వచ్చాయి. అహంకారం నుంచే చరాచరాత్మకమైన జగత్తంతా ఆవిర్భవించింది. ఒకటిగా ఉన్న అవిద్యా పిండంలో త్రికాల విభాగమున్నది.

| | | |
|---|---|---|
| 1. ఆకాశాంశలు | – | మనోబుద్ధి చిత్త అహంకారాలు |
| 2. వాయువు అంశలు | – | ప్రాణాపాన వ్యాన ఉదాన, సమానములు |
| 3. అగ్ని అంశలు | – | శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వా, ఘ్రాణములు |
| 4. జలాంశములు | – | శబ్ద స్పర్శ రూప రస గంధాలు |

5. పృథివి అంశలు - వాక్‌పాణి పాద పాయు ఉపస్థ

1. జ్ఞాన సంకల్ప, నిశ్చయ, అనుసంధాన, అభిమానాలు అంతః కరణ విషయాలు – ఆకాశకార్యాలు
2. ప్రాణాది విషయాలు సమీకరణ, ఉన్నయన, గ్రహణ, శ్రవణ, ఉచ్ఛ్వాసలు – వాయుకార్యాలు
3. శబ్ద స్పర్శ రూప రస గంధాలు జ్ఞానేంద్రియ విషయాలు – అగ్నికార్యాలు
4. జ్ఞానేంద్రియ విషయాలు – జలకార్యాలు
5. వచన, దానా, గమన, విసర్గ, ఆనందములు; కర్మేంద్రియ విషయాలు – పీథివీ కార్యాలు

కర్మేంద్రియ విషయాలు – ఇంద్రియాల యందు (జ్ఞాన, కర్మ) అంతర్భూతాలు. మనోబుద్ధులందు – చిత్తాహంకారములు అంతర్భూతాలు.

అవకాశ, విధూత, దర్శన, పిండీకరణ, ధారణలు – సూక్ష్మభూత మాత్రలు.

చంద్రుడు, బ్రహ్మ, దిక్కు, వాయువు, సూర్యుడు, వరుణుడు, అశ్వనీదేవతలు, అగ్ని, ఇంద్రుడు, ఉపేంద్రుడు, ప్రజాపతి, యముడు ఇంద్రియాలకు అధిదేవతలు. సుషుమ్న మొదలైన 12 నాడుల లోపల ప్రవర్తించిన ప్రాణాలే ద్వాదశాంగములు. ద్వాదశాంగముల గురించి పూర్తిగా తెలిసినవాడే జ్ఞాత.

ఈ భూమి పంచభూతాత్మకమైనది. ఈ భూమినుంచే ఓషధులు, ఓషధుల నుంచి అన్నము పుట్టినాయి. అన్నమునుంచే నాలుగు రకాలైన జీవజాలము ఆవిర్భవించింది. అవి

1. అండజాలు 2. శ్వేదజాలు 3. ఉద్భిజాలు 4. జారజాలు

అన్నము నుంచే రక్తము, మాంసము, మేధస్సు, అస్థి, మజ్జ, శుక్లములు పుట్టినాయి. శుక్లశోణితముల కలయికచేతనే ప్రాణులు జన్మిస్తున్నారు.

అవస్థలు మూడు. అవే జాగ్రస్వప్న సుషుప్తులు. ఇవి కాక తురీయావస్థ నాల్గవది. తురీయాతీతుడు పరమేశ్వరుడు. శరీరంలో కోశములు ఐదు. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయకోశములు. వీటిలో ఆనందమయ కోశమందు పరబ్రహ్మ ఉంటాడు. నిర్వికారుడు శివుడు. అన్ని కోశములు అతని వికారములు. కుంకుడుకాయని చేత్తో రుద్దితే ఎలా నురుగు వస్తుందో, అలాగే మనస్సంకల్పం వల్లనే అనేక వికారాలు కలుగుతున్నాయి. ఈ విధంగా మనస్సుతో కల్పించబడిన సంసారములో జీవుడు బద్ధుడౌతాన్నాడు. అలా బద్ధుడై దుఃఖపరంపరలను అనుభవిస్తున్నాడు. ఎప్పుడు ఈ జీవుడు ఆత్మజ్ఞానం పొందుతాడో అప్పుడు ఆ బంధాలు తెగిపోతాయి.

యోగంవల్ల ఆత్మజ్ఞానం కలుగుతుంది. సమ్యజ్ఞానంవల్ల యోగాభ్యాసం ఏర్పడుతుంది. ఈ విషయాలు తెలిసినవాడు జ్ఞాని. యోగంగాని, జ్ఞానంగాని అధికారికే లభిస్తుంది. అంతేకాని అన్యులకు కాదు. కాబట్టి యోగి అభ్యాస యోగముతో మనస్సు, ప్రాణాలు, ఇంద్రియాలు నిరోధించాలి. సంకల్పాలను తీవ్రధారణతో నరికి వెయ్యాలి. అష్టాంగ సాధనోపాయాలతో ప్రాణమయమైన వృత్తియే 'యోగశిఖి' అనబడుతుంది. యోగము రెండు రకాలు 1. జ్ఞానయోగము 2. కర్మయోగము. విహిత కర్మలను కర్తవ్యంగా భావించి ఆచరించటమే కర్మయోగము. చిత్తాన్ని శ్రేయోమార్గమున లగ్నం చెయ్యటం జ్ఞానయోగము. జ్ఞానయోగము సర్వసిద్ధికరము, మంగళప్రదము. ఈ

రెండు యోగాలు అతని మనస్సులో లగ్నమైతే, అతడు పరమశ్రేయోరూపంలో మోక్షము పొందుతాడు.

1. దేహేంద్రియాల యందు వైరాగ్యం కలిగి ఉండటము – యమము
2. ఎప్పుడూ పరమాత్మమీద అభిలాష కలిగి ఉండటము – నియమము
3. దృశ్య వస్తువులయందు ఉదాసీనత – ఆసనము
4. సమస్త జగత్తు మిథ్యగా భావించుట – ప్రాణాయామము
5. చిత్తాన్ని అంతర్ముఖం చెయ్యటమే – ప్రత్యాహారము
6. మనసును నిశ్చలంగా ఉంచటమే – ధారణ
7. నేనే పరబ్రహ్మని అని భావించటమే – ధ్యానము
8. ధ్యానాన్ని కూడా పూర్తిగా విస్మరించటమే– సమాధి

వీటిలో గతంలో చెప్పుకున్నట్లుగా యమము పదిరకాలు, నియమము పది రకాలు. ఇక ఆసనము 17 రకాలు అవి

1. స్వస్తికాసనము
2. గోముఖాసనము
3. వీరాసనము
4. యోగాసనము
5. పద్మాసనము
6. బద్ధ పద్మాసనము
7. కుక్కుటాసనము
8. ఉత్తానకూర్మాసనము

9. ధనురాసనము
10. సింహాసనము
11. భద్రాసనము
12. ముక్తాసనము
13. మయూరాసనము
14. మత్స్యాసనము
15. సిద్ధాసనము
16. పశ్చిమ తానాసనము
17. సుఖాసనము

ఈ ఆసనాలన్నీ సునాయాసంగ వేయగలవాడు సర్వజగత్తును జయిస్తాడు. శాండిల్యోపనిషత్తులో చెప్పినట్లుగానే అష్టాంగయోగము ఇక్కడ కూడా ఉంటుంది. తేడా అలా ఒక్క ఆసనం విసయంలోనే

మిగిలిన ఉపనిషత్తులో గతంలో లాగానే యోగమార్గం వివరించబడింది.

# 79. మండల బ్రాహ్మణోపనిషత్తు

# 80. దర్శనోపనిషత్తు అష్టాంగయోగ సాధన

దర్శనోపనిషత్తు సామవేదానికి సంబంధించినది. ఇందులో పది అధ్యాయాలు 22 మంత్రాలున్నాయి.

దత్తాత్రేయుడు తన శిష్యుడైన సాంకృతమునికి అష్టాంగయోగము వివరిస్తున్నాడు.

మండల బ్రాహ్మణోపనిషత్తు శుక్లయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో ఐదు బ్రాహ్మణాలు 13 మంత్రాలు ఉన్నాయి.

యోగసాధన చెయ్యాలి అంటే మొత్తం ఎనిమిది అంశాలు లెక్కలోకి తీసుకోవాలి. వాటినే యోగానికి అంగాలు యోగాంగాలు అంటారు. అవి ఎనిమిది. అందుకే వీటిని అష్టాంగములు అంటారు. ఈ ఎనిమిది అంగాలతో కలసినది. కాబట్టే ఇది అష్టాంగయోగము అనబడుతుంది. యోగము యొక్క అష్టాంగాలు ఇక్కడ వివరిస్తున్నారు. ఈ ఎనిమిది అంగాలనే ప్రధానంగా తీసుకుని పతంజలి మహర్షి యోగశాస్త్రం వ్రాశాడు. అందులో ఆయన కేవలము యోగం ద్వారానే మోక్షం వస్తుంది. అని చెప్పాడు. దానికే యోగదర్శనము అని కూడా పేరు. యోగశాస్త్రం మీద వివరాలు కావాలంటే నేను వ్రాసిన 'ద్వాదశ దర్శనాలు' పుస్తకంలోని యోగదర్శనం చూడండి.

చిత్తవృత్తులు ఏర్పడునన్నంత కాలం, చిత్తంమీద పురుషుని ప్రకాశం పడుతూనే ఉంటుంది. జ్ఞానం లేని కారణంవల్ల విషయలాలసుడైన పురుషుడు చిత్తంతో తాదాత్మ్యం పొందుతాడు. దీని ఫలితంగానే రాగద్వేషాలు, సుఖదుఃకాలు, సంసార బంధనాలు కలుగుతాయి. ఈ

బంధాల నుంచి విముక్తి పొందాలంటే యోగమే శరణ్యము అంటాడు పతంజలి. చిత్తవృత్తులను గనక నిరోధించినట్లైతే, పురుషుడికి చిత్తంతో సంబంధం తెగిపోతుంది. అప్పుడు పురుషుడు స్వస్వరూపాన్ని పొందుతాడు. అదే మోక్షం. అదే యోగలక్ష్యం అంటోంది యోగదర్శనం.

యోగము అంటే 'సమాధి' అని అర్థం. అది చిత్తవృత్తులు లేని సమాధి. దాన్నే నిర్వికల్ప సమాధి అంటారు. అందుకే **'యోగః చిత్తవృత్తి నిరోధకః'** అన్నాడు పతంజలి. యోగం యొక్క లక్ష్యం స్వస్వరూపాన్ని పొందటం. దీనికోసం చిత్తవృత్తులను నిరోదించాలి. ఇక్కడ నిరోధము అంటే అడ్డగించటము అని అర్థం అంతేకాని లేకుండా చేయటం కాదు "చిత్తం ఏకాగ్రస్థితి పొందినప్పుడు బాహ్యావృత్తులు ఏర్పడని స్థితినే **'నిరుద్ధస్థితి'** అంటారు. ఈ స్థితిలో అన్ని వృత్తులు, సంస్కారాలు లీనమై పోతాయి. అప్పుడు చిత్తం శుద్ధ సత్త్వగుణం కలిగి ఉంటుంది. అతని చిత్తం నిర్మలమైన దర్పణంలాగా ఉంటుంది. పురుషుడికి వివేకం కలుగుతుంది. అతడు స్వస్వరూప జ్ఞానం పొంది, ముక్తి పొందుతాడు.

చిత్తానికి ఐదు భూమికలున్నాయి అంటున్నాడు పతంజలి మహర్షి. భూమిక అంటే – అవస్థ అని అర్థం. అవి 1. క్షిప్తావస్థ 2. మూఢావస్థ 3. విక్షిప్తావస్థ 4.ఏకాగ్రవస్థ 5. నిరుద్ధం.

**1. క్షిప్తావస్థ :** ఈ దశలో చిత్తం రజోగుణం ఎక్కువగా కలిగి ఉంటుంది. మిక్కిలి చంచలమై విషయాలవైపు పరుగెడుతుంది. స్థిరత్వం అనేది ఉండదు. ఇటువంటి స్థితి యోగానికి అనుకూలం కాదు. ఇంద్రియ లోలురైన వారిలో ఈ స్థితి కనిపిస్తుంది. ఇలాంటివారు సుఖాల కోసం, భోగాల కోసం వెంపర్లాడుతుంటారు.

**2. మూఢావస్థ :** ఈ దశలో చిత్తం తమోగుణం ప్రధానమై

ఉంటుంది. నిద్రమత్తుతో ఉన్నట్టుగా మూఢంగా ఉంటుంది. సారాయి, గంజాయి మొదలైన మత్తు మందులకు అలవాటు పడ్డవారి చిత్తం ఈ రకమైనది. వీరికి సోమరితనము, బుద్ధిమాంద్యము బాగా ఉంటాయి. ఈ రకమైన స్థితి కూడా యోగానికి అనుకూలం కాదు.

**3. విక్షిప్తావస్థ:** ఈ దశలో చిత్తం సత్త్వగుణ ప్రధానమై ఉంటుంది. అయితే అప్పుడప్పుడు రజోగుణ ప్రభావం వల్ల చిత్తచాంచల్యం కలుగుతుంటుంది. కొంతసేపు నిలకడగా ఉన్నప్పటికీ, ఆ నిలకడ అనేది స్థిరం కాదు. యోగసాధనలో ప్రాథమిక దశలో ఉన్న వారిలో ఈ స్థితి ఉంటుంది.

**4. ఏకాగ్రావస్థ:** చిత్తం సత్త్వగుణ ప్రధానమైనప్పుడు ఏ రకమైన ఒడిదుడుకులు లేకుండా, అటు ఇటు కదలకుండా, కావలసిన విషయం మీద నిలిచి ఉంటుంది. ఇది యోగసాధనకు బాగా అనుకూలమైన స్థితి.

**5. నిరుద్ధావస్థ:** ఈ స్థితిలో చిత్తవృత్తులు ఏవీ ఉండవు. వృత్తులన్నీ ఉపశమించినా, సంస్కారాలు మాత్రం మిగిలి ఉంటాయి.

వీటిలో మొదటి మూడు అంటే 1. క్షిప్తావస్త 2. మూఢావస్థ 3. విక్షిప్తావస్థలు యోగసాధనకు అనుకూలం కావు. అయినప్పటికీ, రోజూ అభ్యాసం చెయ్యటం వల్ల ఈ స్థితులన్నీ తొలగిపోయి, ఏకాగ్రస్థితి వస్తుంది. అలా నెమ్మదిగా నిరుద్ధావస్థ సిద్ధిస్తుంది. నిరుద్ధ స్థితి గనక సిద్ధించినట్లైతే యోగలక్ష్యం నెరవేరినట్లే.

తీవ్రమైన సాధన చేసే వారికి ఇది ఎంతో కాలం పట్టదు. చాలా త్వరగా సిద్ధిస్తుంది. దీన్ని సాధించటానికే అష్టాంగ యోగసాధనను చెప్పాడు పతంజలి.

**అష్టాంగయోగ సాధన :**

**యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార**

**ధారణ, ధ్యాన, సమాధయె అష్టాంగాని**

(2-29)

అంటున్నాయి యోగసూత్రాలు. చిత్తంలో మాలిన్యం నశించినట్లైతే, పరిశుద్ధమైన చిత్తం లభిస్తుంది. అప్పుడు పురుషుడికి ఆత్మజ్ఞానం కలుగుతుంది. దీనికోసం అష్టాంగ మార్గం అనుసరించాలి అంటారు పతంజలి. యోగాంగాలు ఎనిమిది 1. యమము 2. నియమము 3. ఆసనము 4. ప్రాణాయామము 5. ప్రత్యాహారము 6. ధారణ 7. ధ్యానము 8. సమాధి. వీటిలో మొదటి ఐదింటినీ యమాది పంచకము అని మిగిలిన మూడింటినీ సంయమము అని అంటారు.

**1. యమము :** యమము అంటే – అణచివేయటము. వశములో ఉంచుకోవటము. అని అర్థము. ఇది ఐదు రకాలు 1. అహింస 2. సత్యము 3.అస్తేయము 4. అపరిగ్రహము 5. బ్రహ్మచర్యము. వీటిని దేశ కాలమానాది భేదం పాటించకుండా, సర్వకాల సర్వావస్థల యందు పాటించి తీరాలి. యమాన్ని పాటించే విషయంలో పట్టు విడుపులు, మినహాయింపులు ఏవీ లేవు. ఇది ఒక గొప్పవ్రతము అంటాడు. పతంజలి. ఇవి పాటిస్తే ఏం జరుగుతుంది? అనే దానికి సమాధానం కూడా చెప్పాడు.

**1. అహింస :** ఏ ప్రాణికి ఎటువంటి పరిస్థితిలోనూ కష్టము, బాధ కలిగించకుండా ఉండటం. దీన్ని సాధించిన వారి సన్నిధిలో అన్ని ప్రాణులు అత్యంత ప్రేమతో మెలగుతాయి. పూర్వకాలంలో ముని

ఆశ్రమాలు, ఋషి ఆశ్రమాలలో లేళ్ళు, పులులు, జింకలు కలిసి తిరిగేవి అని చెబుతారు. దానికి కారణం ఇదే. అహింసను పాటించే యోగిసన్నిధిలో క్రూరజంతువులు కూడా సాధుస్వభావానికి అలవాటు పడతాయి. వైరము, శత్రుత్వము అనేవి ఉండవు.

**2. సత్యము :** మనోవాక్కాయ కర్మలలో ఐక్యతను పాటించటం. ఆలోచించేదే చెప్పాలి చెప్పిందే చెయ్యాలి. దీనివల్ల సాధకుడికి కోరిన ఫలితాలు కలుగుతాయి. అమోఘమైన వాక్కు లభిస్తుంది.

**3. అస్తేయము :** పరద్రవ్యాన్ని అపహరించటం దొంగతనం లాంటివి చెయ్యకుండా ఉండటము. దీనివల్ల సాధకుడికి కావలసిన సంపదలు వస్తాయి. దివ్యరత్న ప్రాప్తి కలుగుతుంది.

**4. అపరిగ్రహము :** పరద్రవ్యం కోసం ఆశపడకుండా ఉండటం. ఎవరైనా ఏదైనా ఇచ్చినా, అవసరానికి మించి తీసుకోకపోవటం. దురాశ, లోభత్వము లేకుండా ఉండటము, దీనివల్ల పూర్వజన్మ జ్ఞానం కలుగుతుంది. భూతభవిష్యద్వర్తమాన జన్మల జ్ఞానం కలుగుతుంది.

**5. బ్రహ్మచర్యము :** లైంగిక సుఖాలకు దూరంగా ఉండటము. విషయసుఖాలు పూర్తిగా వదిలెయ్యటం. దీనివల్ల వీర్యరక్షణ జరిగి, యోగి శక్తిమంతుడవుతాడు.

**2. నియమము :** నియమము అంటే – ఏర్పాటు, కట్టు, ప్రతిజ్ఞ, ఆజ్ఞ, వ్రతనిష్ఠ అని అర్థము. యమంలాగానే నియమాలు కూడా ఐదు.

**శౌచ–సంతోష–తపః– స్వాధ్యాయ–ఈశ్వర ప్రణిధానాని నియమాః** (2–32) అవి 1. శౌచము 2. సంతోషము 3. తపస్సు 4. స్వాధ్యాయము 5. ఈశ్వర ప్రణిధానము.

**1. శౌచము :** శౌచము అంటే శుద్ధి, పరిశుద్ధము అని అర్థం. ఇది రెండు రకాలు 1. బాహ్యశుద్ధి 2. అంతఃశుద్ధి. బాహ్యశుద్ధి అంటే స్నానం చెయ్యటం, వళ్ళు శుభ్రంగా తోముకోవటం మొదలైన పనులద్వారా శరీరాన్ని శుభ్రంగా ఉంచుకోవటం. జుట్టు దువ్వుకోవటం, మంచి బట్టలు కట్టుకోవటం. ఇదంతా బాహ్యశుద్ధి. అంతఃశుద్ధి అంటే నిర్మలమైన మనస్సు కలిగి ఉండటం. మైత్రి, కరుణ, ముదిత (సంతోషము), ఉపేక్ష వంటి సద్గుణాలను అలవరచుకొని పవిత్రమైన ఆలోచనలు కలిగి ఉండటం. వీటివల్ల యోగియొక్క అంతఃకరణ పరిశుభ్రమవుతుంది. ప్రసన్నత పెరుగుతుంది. ఇంద్రియ నిగ్రహం అలవడుతుంది. ఏకాగ్రత సిద్ధిస్తుంది. మనస్సు గనక నిర్మలమైతే ఆత్మసాక్షాత్కారానికి వీలవుతుంది. ఏకాగ్రత అనేది యోగికి అత్యంతావశ్యకము.

**2. సంతోషం :** దొరికిన దానితో తృప్తి చెందటమే సంతోషము. **తన సంతోషమే స్వర్గము తన దుఃఖమే నరకమండ్రు తథ్యము సుమతీ.** తన సంతోషమే స్వర్గము, తన దుఃఖమే నరకము అన్నాడు సుమతీశతకకారుడు. దీనివల్ల సాధకుడికి అత్యంత సుఖం కలుగుతుంది.

**3. తపస్సు :** దీనివల్ల శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, ఆకలిదప్పికలుసహించ గల శక్తి లభిస్తుంది. ఇంద్రియాలన్నీ శక్తిమంతమైనాయి. ఇంద్రియ సిద్ధి, కాయసిద్ధి కలుగుతుంది. ఇంద్రియ సిద్ధివల్ల దూరదర్శనము, దూరశ్రవణము మొదలైన శక్తులు వస్తాయి. అణిమాది అష్టసిద్ధులు దివ్యశరీరంగల యోగికి మాత్రమే వస్తాయి.

**4. స్వాధ్యాయము :** తనకు తాను చదువుకోవటము. నియమబద్ధంగా వేదాలు, మంచి గ్రంథాలు, పురాణాలు పఠించటం.

తనకు ఇష్టమైన మంత్రాన్ని జపించటం. దీనివల్ల ఇష్టదేవతా సాక్షాత్కారం కలుగుతుంది. గాయత్రి మొదలైన మంత్రజపం వల్ల పుణ్యగ్రంథాలు పఠించటం వల్ల దేవతా సాక్షాత్కారము జరుగుతుంది.

**5. ఈశ్వరప్రణిధానం :** తనను తాను ఈశ్వరుడికి సమర్పించుకోవటాన్నే 'ఈశ్వర ప్రణిధానము' అంటారు. దీనివల్ల యోగసాధన పరమార్థమైన నిశ్చలమైన సమాధి లభిస్తుంది.

**3. ఆసనము :** ఆసనము అంటే – కూర్చునే పీట, కూర్చునే విధానము. శరీరం దృఢంగా, ఆరోగ్యంగా, బలంగా ఉండాలి. అలా ఉంటేనే ఏకాగ్రత అనేది సిద్ధిస్తుంది. ఈ ఏకాగ్రత అనేది బాగా వృద్ధిచెంది 'సమాధినిష్ఠ' కలుగుతుంది **కదలకుండా సుఖంగా కూర్చోవటమే ఆసనము అన్నాడు పతంజలి.** ఆసనసిద్ధి వల్ల యోగిని శీతోష్ణాలు, సుఖదుఃఖాలు బాధించవు. ధ్యానానికి కూర్చునేటప్పుడు యోగి పద్మాసనంలో కూచోవాలి. ఇది ఎక్కువమంది యోగులకు ఇష్టమైన ఆసనం. అయితే బద్ధపద్మాసనము, వీరాసనము, మయూరాసనము, వజ్రాసనము ఇలా అనేక రకాల ఆసనాలున్నాయి. వీటివల్ల శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. భగవధ్యానం చేస్తూ ఈ ఆసనాలు వెయ్యాలి. అప్పుడే అవి యోగాసనాలవుతాయి. లేకపోతే కేవలం అది శరీర వ్యాయామం అవుతుంది.

**4. ప్రాణాయామము :** ఏ విధమైన ప్రయత్నము లేకుండా స్థిరంగా, సుఖంగా, నిటారుగా కూర్చునే సామర్థ్యం పెరిగి, మనస్సును ఏకాగ్రం చెయ్యగలిగితే ఆసనసిద్ధి కలిగినట్లే అంటాడు పతంజలి. అటువంటి స్థితిలో ఉచ్ఛ్వాస నిశ్వాసలు ఆగిపోతాయి. ఆ స్థితినే ప్రాణాయామము అంటారు. పతంజలి ప్రాణాయామము నాలుగు రకాలు అన్నాడు.

**1. బాహ్యస్తంభన :** ప్రాణవాయువును బయట నిలపటం

**2. అంతఃస్తంభన :** ప్రాణవాయువును లోపల నిలపటం

**3. దీర్ఘం, సూక్ష్మం :** అవసరాన్ని బట్టి శరీరంలోని వివిధ భాగాలలో ప్రాణవాయువును కొంతసేపు ఆపటం.

**4. బాహ్యాంభ్యంతర విషయాక్షేపి :** దీన్నే సహజకుంభకము అంటారు. ప్రాణవాయువు లోపల నుంచి బయటకు గాని, బయట నుంచి లోపలికి గాని పోదు. ఈ స్థితిలో మనస్సు నిశ్చలంగా ఉంటుంది.

ప్రాణము అంటే శ్వాస. అపానము అంటే ప్రశ్వాస. వీటినే ఉచ్ఛ్వాస నిశ్శ్వాస లంటారు. వీటి గతిని నిరోధించటవే ప్రాణాయామము అనబడుతుంది. బయట ఉన్నగాలిని లోపలికి పీల్చటం – నిశ్శ్వాస. లోపలిగాలిని బయటకి వదలటం ఉచ్ఛ్వాస. ఈ రెండింటినీ నిరోధించటమే ప్రాణాయామము. ప్రాణాయామం చెయ్యాలి అంటే – ముందుగా ఆసనసిద్ధి జరగాలి. ప్రాణాయామము రేచకము, పూరకము, కుంభకము అని మూడు రకాలు. 1. గాలిని పూర్తిగా వదిలి కొంతసేపు ఉండటాన్ని రేచకము అంటారు. 2. గాలిని పీల్చి కొంతసేపు ఉండటాన్ని పూరకము అంటారు. 3. లోపలి గాలిని పూర్తిగా స్తంభింపచేయటాన్ని కుంబకము అంటారు. గాలిని స్తంభింప చేసినప్పుడు నిండుకుండలోని నీరులాగా ప్రాణవాయువు స్థిరంగా నిలచి ఉంటుంది. అందుకే దీన్ని కుంభకము అన్నారు. కుంభకము రెండు రకాలు 1.బాహ్యాకుంభకము 2. అంతఃకుంభకము. గాలిని విడిచిపెట్టిన తరువాత చేసే కుంభకము బాహ్యాకుంభకము. గాలిని పీల్చి చేసే కుంభకాన్ని అంతఃకుంభకము అంటారు. ఈ రెండింటికీ విలక్షణమైనది 'కేవల కుంభకము' రేచకము, పూరకము, బహికుంభకము, అంతఃకుంభకము వీటన్నింటినీ వదిలేసి, లోపలిగాలి

బయటకు వదలకుండా, బయట గాలి లోపలికి పీల్చకుండా ప్రాణవాయువును యథాస్థితంగా నిలిపి, చిత్స్వరూపం మీద మనసు లగ్నం చెయ్యటమే 'కేవల కుంభకము' అనబడుతుంది. ఇది రేచక పూరక కుంభకాలకు వ్యతిరేకమైన నాల్గవ ప్రాణాయామము దీనివల్ల అజ్ఞానము, పాపాలు నశిస్తాయి. నిద్ర అలసత్వము గల మందమాధ్యమాధికారులకు రేచక, పూరక, కుంభకాలు చెప్పబడ్డాయి. నిద్ర, తంద్ర (అలసత్వం) మొదలైనవి లేని ఉత్తమాధికారులకు కేవల కుంభకము చెప్పబడింది. రేచక పూరకాలను పూర్తిగా వదిలిపెట్టి సుఖంగా వాయుధారణ చేసి పరమాత్మను ధ్యానం చెయ్యటమే కేవల కుంభకం. ఇది సిద్ధించిన యోగికి ముల్లోకాల్లోనూ సాధ్యం కానిది ఏదీలేదు అని యోగవాసిష్టంలో చెప్పబడింది. ఆసనాలలాగానే ప్రాణాయామంలో కూడా పతంజలి తరువాత కాలంలో అనేక రకాలు ప్రచారంలోకి వచ్చాయి. ఏది ఏమైనా ప్రాణాయామం చెయ్యటంవల్ల చిత్తాన్ని ఆవరించిన మాలిన్యాలు తొలగిపోయి ఏకాగ్రత పెరుగుతుంది. ధారణకు యోగ్యత కలుగుతంది.

**5. ప్రత్యాహారము :** ఇంద్రియాలను బాహ్య విషయాలనుంచి మళ్ళించి, అంతర్ముఖం చెయ్యటాన్నే ప్రత్యాహారము అంటారు. చలిస్తున్న శ్రోత్రము మొదలైన ఇంద్రియాలను శబ్దము మొదలైన వాటి విషయాల నుంచి మళ్ళించి చిత్తాన్ని అనుసరింప చెయ్యటమే ప్రత్యాహారము. ప్రత్యాహారం వల్ల ఇంద్రియ వశీకరణ జరుగుతుంది. ఇంద్రియాలన్నీ సాధకుడి వశంలో ఉంటాయి. ఇంద్రియాలు వాటి స్వరూపాన్ని వదిలిపెట్టి చిత్తాన్ని అనుసరించటంతో చిత్తనిరోధము, దానితో ఇంద్రియ నిరోధము జరిగి, ఇంద్రియ నిగ్రహము సులభంగా లభిస్తుంది.

**6. ధారణ :** శరీరానికి బయటగాని, లోపలగాని ఏదైనా ఒక ప్రదేశంలో సాధకుడు తన చిత్తాన్ని నిలపటాన్నే 'ధారణ' అంటారు. ధారణను గురించి శంకర భగవత్పాదుల వారు తమ **'అపరోక్షానుభూతి'లోని 122వ శ్లోకంలో** 'మనసు వెళ్ళిన చోటల్లా బ్రహ్మసాక్షాత్కారం పొందుతూ, మనస్సును స్థిరంగా ఉంచుకోవటమే ధారణ" అంటారు. శరీరం బయట అంటే, ఏదైనా ఒక ప్రదేశంమీద గాని, వస్తువు మీద గాని చిత్తాన్ని నిలపటం. ఒక వస్తువు అంటే దేవతామూర్తి మీద గాని, మరేదైనా వస్తువు గాని. అదే ఒక ప్రదేశంమీద అంటే గోడమీద చిన్నబిందువు ఏర్పాటు చేసి దాన్నే చూడటం. దానిమీద చిత్తాన్ని నిలపటం. ఇక శరీరంలోపల అంటే షట్చక్రాలలోను ఏదైనా ఒకచక్రమంమీద, బ్రహ్మరంధ్రం, సుషుమ్ననాడి వీటిలో ఏదైనా ఒకదానిమీద చిత్తాన్ని నిలపటం. ఈ రకంగా ఒకపదార్థం మీద గాని, వస్తువు మీద గాని చిత్తాన్ని నిలపటమే ధారణ అనబడుతుంది. ఇది ఏకాగ్రదృష్టి. ఈ స్థితిలో చిత్తం తనకు కావలసిన విషయం తప్ప, ప్రక్కనే ఉన్నప్పటికీ ఇతర విషయాలను గ్రహించదు. ఇంద్రియాలన్నీ, విషయాల నుండి వెనుకకు మళ్ళినాయి. అందుచేత విషయాలను గ్రహించవు. 'ప్రత్యాహారం' గనక జరక్కపోతే ధారణ జరగదు. ప్రత్యాహారం అంటే ప్రపంచంలోని సమస్త వస్తువులందు ఆత్మభావాన్ని పొంది, మనస్సును ఆ పరమచేతనంలో ముంచి వెయ్యటం. ఇంద్రియాలు తమ బాహ్య వృత్తులన్నీ మరల్చి, చిత్తంలో లీనం చెయ్యటం కోసం చేసే అభ్యాసమే ప్రత్యాహారము. మనసు ఎక్కడికి వెడితే, అక్కడ బ్రహ్మసాక్షాత్కారం పొందుతూ, మనసును స్థిరంగా ఉంచుకోవటమే 'ధారణ'. అంటే దేనిమీద ధారణ జరిగినా, అక్కడ పరబ్రహ్మ సాక్షాత్కారం జరుగుతుంది. ఇది రాజయోగ సంబంధము.

**7. ధ్యానము :** ఏ ప్రదేశంలో చిత్తాన్ని లగ్నం చేశామో, దానియందే జ్ఞానివృత్తి అఖండ ధారావాహిక రూపంలో సాగినప్పుడు దాన్ని ధ్యానమంటారు అంటాడు పతంజలి మహర్షి. ధ్యానము అనేది ధారణవల్ల తేలికగా సిద్ధిస్తుంది. ఇతర విషయాల మీదకు పోకుండా ఉన్న జ్ఞానవృత్తి మన ధ్యేయం వైపుకు తైలధారగా సాగుతుంది. ధ్యేయంమీద చిత్తాన్ని లగ్నం చెయ్యటమే ధారణ. చిత్తాన్ని ధ్యేయం వైపుకు సాగనీయటం ధ్యానం. ధ్యానం చేసేటప్పుడు ఏకాగ్రమైన చిత్తం ధ్యేయవస్తువు మీదనే లగ్నమయి ఉండాలి. అంటే మధ్యలో ఇతర విషయాలను గురించిన ఆలోచనలు రాకూడదు.

శంకరులు ఈ ధ్యానాన్ని వివరిస్తూ "అహంబ్రహ్మాస్మి" నేనే పరబ్రహ్మను అనే సద్వృత్తితో, పరమానందాన్ని కలిగించే నిరాలంబస్థితి. దేనిమీద ఆధారపడకుండా ఉండే స్థితిని ధ్యానము" అన్నారు. అయితే ధ్యానానికి ప్రధానమైన లక్షణాలు రెండు.

1. నేనే బ్రహ్మననే భావన 2. నిరాలంబ స్థితి

ఏదైనా ఒక విషయం లేదా వస్తువుమీద మనసును నిలిపి ఉండవచ్చు. అది ధ్యానం కాదు. పరబ్రహ్మని లక్ష్యంగా చేసుకుని, ఆయనమీదనే మనసు నిలపాలి. శరీరంలోని కన్ను, కాలువంటి బాహ్యేంద్రియాలు వాటి ఇష్టప్రకారము చలించకూడదు. వాటిని కట్టడి చెయ్యాలి. శరీరం కదలకుండా నిశ్చలంగా ఉండాలి. మనస్సులో అనేక రకాలైన ఆలోచనలు వస్తాయి. వాటిని పూర్తిగా వదిలెయ్యాలి. పరబ్రహ్మతో ఏకీభావం పొందాలి. అంటే మనస్సును పూర్తిగా పరబ్రహ్మమీదనే లగ్నం చెయ్యాలి. అప్పుడు మాత్రమే సాధకుడు తన లక్ష్యాన్ని నెరవేర్చగలుగుతాడు. ధ్యానంలో ఉన్నప్పుడు ఇతర విషయాల

చింతన ఏ మాత్రం పనికిరాదు. అనాత్మ వస్తువుల్ని గురించి చింతన వదిలెయ్యాలి. విజ్ఞానమయకోశంలో ఉండే ఆత్మ సర్వదా స్వయంగా ప్రకాశిస్తుంది. అనాత్మకన్న విలక్షణంగా ఉన్న ఈ ఆత్మనే ధ్యానంలో లక్ష్యంగా తీసుకోవాలి. అప్పుడు మిగిలిన ఆలోచనలను పూర్తిగా త్యజించి, పరమేశ్వర స్వరూపాన్ని మాత్రమే ధ్యానించాలి. ఇక్కడ చాలా ముఖ్యమైన విషయం ఏమంటే, ధ్యానంలో మిగిలిన విషయాలేవీ మధ్యలోకి రాకూడదు. అహం మొదలైన వాటిని పూర్తిగా వదిలేసి, ధ్యేయవస్తువునందు మాత్రమే దృష్టి నిలపాలి. అప్పుడే సాధకుడు చేసే ధ్యానం ఫలిస్తుంది.

**8. సమాధి :** ధ్యానంలో ఉన్నప్పుడు కేవలము ధ్యేయాన్ని మాత్రమే చూస్తూ, నేను ధ్యానం చేస్తున్నాననే భావన కూడా మరిచిపోవాలి. ఆ స్థితిలో చిత్తం తన స్వరూప స్థితి పొందుతుంది. దాన్నే 'సమాధి' అంటారు. ధ్యానానికి అంతిమఘట్టం సమాధి. యోగానికి పరమావస్థ ఈ సమాధి. సమాధి స్థితిచేరటమనేది అంత తేలిక కాదు. గతజన్మల పుణ్యం, గురుకృప. వీటివల్లనే సమాధిస్థితి లభిస్తుంది. "మనసును దేహం నుంచి వేరుచేసి, పరమాత్మతో అనుసంధానం చేయటమే సమాధి"

దశేంద్రియాలను వదిలేసి, ఏ రకమైన బంధము లేనట్టి స్థితే సమాధి.

సమాధి రెండు రకాలుగా ఉంటుంది. 1. సవికల్పసమాధి 2. నిర్వికల్పసమాధి. సవికల్ప సమాధిలో, ఆ స్థితికి చేరిన తరువాత కూడా మనసులో సంకల్ప వికల్పాలు కలుగుతాయి. అంటే ఇతర విషయాలు కూడా తెలుస్తాయన్నమాట. నిర్వికల్ప సమాధిలో మనసు

కూడా పని చెయ్యదు. 'సుమన' అంటే మనసు పనిచేసే స్థితి. ఉన్మన అంటే మనసుకూడా పనిచెయ్యని స్థితి. సమాధిస్థితికి కావలసినది అదే.

**సమాధి స్వభావము :** నిర్వికల్ప సమాధిలో అద్వైతాత్మను దర్శించినప్పుడు హృదయంలో ఉన్న అజ్ఞానగ్రంథులు పూర్తిగా నాశనం అవుతాయి. వేదాంత పరిభాషలో వ్యక్తిత్వ బంధాలను గ్రంథులు అంటారు. అవిద్యవల్ల కోరికలు పుడతాయి. ఈ కోరికలు బుద్ధిలో అలజడిని రేపుతాయి. ఈ కోరికలు సాధించటానికి కర్మలు ఆచరించటం జరుగుతుంది. అజ్ఞానంవల్ల బుద్ధిలో కలిగే కోరికలు, మనస్సులో అశాంతి, శారీరకమైన కోరికలు ఇవన్నీ కార్యకారణ సంబంధము అంటారు ఇదే సంసార బంధనము. సాధకుడు ప్రయత్నంతో తన మనస్సును శాంతం గావించి, తన సహజ స్వరూపమయిన ఆత్మానుభవం పొందినప్పుడు అవిద్య, కోరికలు, కర్మలు అనే ఈ మూడు గ్రంథులు విడివడతాయి. అవి నాశనం అవుతాయి. బుద్ధిలో సహజంగా కొన్ని దోషాలుంటాయి. వాటివల్ల అద్వితీయమైన పరమాత్మలో నువ్వు, నేను, అది, ఇది అనే కల్పనలు జరుగుతాయి. ఇదంతా ఊహే. సమాధిలో బ్రహ్మయొక్క సత్యస్వరూపాన్ని చూడగలిగితే ఈ కల్పనలు, భేదభావాలు పూర్తిగా నశిస్తాయి. పరమశాంతంతో, ఇంద్రియ నిగ్రహంతో ఇంద్రియ భోగవస్తువుల నుంచి పూర్తిగా దృష్టి మరల్చాలి. సహనంతో సమాధికోసం దృఢంగా ప్రయత్నించాలి. అప్పుడు తనలోని ఆత్మే సర్వత్రా ఉండటాన్ని గ్రహించగలుగుతాడు. ఇప్పుడు అవిద్య నుంచి ఉత్పన్నమయ్యే వికల్పాలను కూడా నశింపచేస్తే, బ్రహ్మభావంలో

నివశిస్తాడు. బాహ్యప్రపంచాన్ని, ఇంద్రియాలను, మనస్సును, బుద్ధిని, జీవభావాన్ని కూడా ఆత్మలో లీనంచేసి, సమాధిలో స్థితుడైన వాడు, జనన మరణాలతో కూడిన సంసారబంధనాల నుండి విముక్తుడవుతాడు. అంతేకాని శాస్త్రపాండిత్యంతో చిలకలపలుకులు పలికేవారు ముక్తిని పొందలేరు. ఆత్మ ఒక్కటే. కాని అనేకంగా కనిపిస్తుంది. దీనికి కారణము ఉపాధి భేదము. ఈ ఉపాధులను గనక విడదీసి చూడగలిగితే ఆత్మ కేవలముగ కనిపిస్తుంది. కాబట్టి విద్వాంసుడు ఈ ఉపాధులను లయం చెయ్యటానికి సదా నిర్వికల్ప సమాధిని అభ్యసించాలి. కీటకము నిత్యము భ్రమరాన్ని ధ్యానించటం వల్ల, తాను భ్రమరత్వాన్ని పొందుతుంది. ఇదే భ్రమరకీటక న్యాయము. అలాగే ఆత్మను గురించి నిరంతర చింతన చేయటంవల్ల సాధకుడు కూడా ఆత్మస్వరూపుడవుతాడు. పరమాత్మ తత్త్వం అత్యంత సూక్ష్మమైనది. బాహ్యంగా ఉన్న మనస్సుతో దీన్ని చేరలేము. అత్యంత శుద్ధమైన బుద్ధితో, అతిసూక్ష్మమైన మనోవృత్తులతో, సమాధిస్థితిలో మాత్రమే దీన్ని తెలుసుకోగలరు. బంగారాన్ని పుటంవేసి కాల్చినకొద్దీ, దాని వన్నె పెరుగుతుంది. అలాగే ధ్యానంవల్ల మనస్సులో సత్త్వరజస్తమో గుణాలు నశించగా బ్రహ్మత్వం ప్రకాశిస్తుంది. నిరంతరమైన అభ్యాసంవల్ల శుద్ధమైన మనస్సు బ్రహ్మలో ఐక్యమైనప్పుడు సవికల్ప సమాధి కాస్తా నిర్వికల్పసమాధి అవుతుంది. నిర్వికల్ప సమాధిలో పరబ్రహ్మ తప్ప ఇంకేమీ కనిపించదు. ఆ స్థితి అద్వితీయమైన బ్రహ్మానుభవాన్ని కలగచేస్తుంది. ఈ సమాధివల్ల కోరికలు నశిస్తాయి. కర్మలు అంతరిస్తాయి. అప్పుడు అంతరంగంలోని బాహ్యాభ్యంతరాళాల్లో అప్రయత్నంగా స్వరూపం మాత్రమే స్ఫురిస్తుంది.

శ్రవణం కన్న మననం - వందరెట్లు ఉత్తమం.

మననం కన్న ధ్యానం - లక్షరెట్లు ఉత్తమం.

ధ్యానం కన్న నిర్వికల్ప సమాధి - కోటిరెట్లు ఉత్తమం.

ఇది అన్నింటికన్న పవిత్రమైనది. అనంతమైనది. నిర్వికల్ప సమాధిలో మాత్రమే బ్రహ్మతత్త్వం స్ఫుటంగా తెలుస్తుంది. మిగిలిన స్థితులలో మనసు చరిస్తూ ఉంటుంది. అందువల్ల అప్పుడు మిశ్రమ భావాలు గోచరిస్తాయి. కాబట్టి శాంతమైన మనస్సుతో, ఇంద్రియాలను నిగ్రహించి, మనస్సును పరమాత్మయందు లగ్నంచెయ్యాలి. అప్పుడు పరతత్త్వంలోని ఏకత్వాన్ని దర్శించగలుగుతారు.

1. వాక్కుని అదుపులో పెట్టుకోవటం 2. అపరిగ్రహము 3. ఎవరినుంచీ దేన్నీ ఆశించక పోవటము 4. కర్మబంధనాల నుండి విడివడటము 5. ఏకాంత జీవనము. ఇవి యోగసాధనకు మార్గాలు. ఏకాంతవాసం ఇంద్రియ నిగ్రహానికి సాయపడుతుంది. ఇంద్రియ నిగ్రహం ద్వారా మనోనిగ్రహం కలుగుతుంది. మనోనిగ్రహం వల్ల అహంకార నాశనం కలుగుతుంది. దీనివల్ల యోగి ఆనందరసానుభూతిని పొంది బ్రాహ్మీస్థితిని పొందుతాడు. అందుకే సాధకుడు చిత్తాన్ని నిరోధించాలి.

వాక్కును - మనస్సులోను

మనస్సును - బుద్ధిలోను,

బుద్ధిని - సాక్షిలోను,

సాక్షిని - ఆత్మలోను లీనం చేసినవాడు నిర్వికల్ప స్థితిలో పరమశాంతాన్ని పొందుతాడు. దేహము, ప్రాణము, ఇంద్రియాలు,

బుద్ధి మొదలైన ఉపాధులలో, దేనితో మనస్సు కలిసి ఉంటుందో, దానితోనే యోగి కూడా కలిసిపోయి అదే విధంగా మారినట్లుగా ఉంటాడు. దాన్ని గనక నివారించగలిగితే సాధకుడు అన్నింటి నుంచీ సులభంగా విడివడి సదానంద రసానుభవంలో స్థితుడవుతాడు.

**సమాధికి మార్గము :** సమాధి అంటే నిర్వికల్పసమాధి అనే గుర్తుంచుకోవాలి. అటువంటి స్థితి చేరటానికి ఏకైకమార్గం వైరాగ్యం. అంటే లౌకిక సుఖాలపట్ల విముఖత. బాహ్యప్రపంచంలోని వస్తువులను వదలటం తేలిక. కాని వస్తువులమీద ఆశను వదలాలి. వస్తువులమీద కోరికలను వదలాలి. ముముక్షువు ఈ పని చాలా తేలికగా చెయ్యగలుగుతాడు. ఇక్కడ ముఖ్యమైన విషయం ఏమంటే, విరక్తుడయిన వాడు మాత్రమే అహంకార మమకారాలు త్యజించగలుగుతాడు. అటువంటి వాడు మాత్రమే బ్రహ్మనిష్ఠను పొందగలడు. వైరాగ్యము, వివేకంతో నిండిన జ్ఞానము ఇవి రెండూ పక్షికి ఉన్న రెండు రెక్కల లాంటివి. ఒక రెక్కతో పక్షి ఎగరలేదు. అలాగే సాధకుడు కూడా వైరాగ్యము, వివేకపూరిత జ్ఞానము ఈ రెండూ ఉంటేనే లక్ష్యాన్ని చేరగలడు. ఇక్కడ ఇంకో విషయం ఏమంటే అత్యంత వైరాగ్యం గలవాడు మాత్రమే సమాధిస్థితిని చేరి అనుభవాన్ని పొందగలడు. సమాధిస్థితి పొందిన వాడికే సత్యదర్శనమవుతుంది. సత్యదర్శనం పొందినవాడు మాత్రమే సంసార బంధనాల నుంచి విముక్తుడవుతాడు. ఇలా బంధనాల నుంచి విముక్తి పొందినవాడే ముక్తుడు. అతడు మాత్రమే బ్రహ్మానందాన్ని పొందగలుగుతాడు. ఇంద్రియ నిగ్రహం ఉన్నట్లైతే, వైరాగ్యాన్ని మించిన ఆనందం ఇంకొకటి ఉండదు. దానితోపాటుగా స్పష్టమైన ఆత్మానుభవం గనక ఉన్నట్లైతే బాహ్యాభ్యంతరాలలో అతడు చక్రవర్తిలాగా ఉంటాడు. సంపూర్ణమైన

ముక్తికి ఇదే ముఖద్వారం. కాబట్టి సాధకుడు పరిపూర్ణమైన వైరాగ్యాన్ని కలిగి ఉండాలి. మనస్సును నిత్యమూ ఆత్మధ్యానంలోనే ఉంచాలి. ఈ లోకంలో మానవులని ప్రలోభపెట్టే విషయవాంఛలన్నీ విషంలాంటివి. అవి మృత్యువుతో సమానమైనవి. కాబట్టి ముముక్షువైన వాడు కులము, జాతి, మతము లాంటి సంకుచిత భావాలను త్యజించాలి. స్వార్థపూరిత కర్మలను పరిత్యజించాలి. **"నేను అంటే దేహం కాదు. నేను అంటే ఆత్మ"** అనే భావనను నిశ్చయం చేసుకోవాలి. అప్పుడు మాత్రమే 'అహం బ్రహ్మాస్మి' అనే విషయం పూర్తిగా బోధపడి లక్ష్యం సిద్ధిస్తుంది.

# 81. ధ్యానబిందూపనిషత్తు

ఇది కృష్ణయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో రెండు అధ్యాయాలు 98 మంత్రాలున్నాయి. ఇందులో ఓంకారము ధ్యానముల గురించి చెప్పటం జరిగింది.

మానవుడు ఎంత పాపంచేసినా, ఆ పాపం హిమాలయ పర్వతం అంత ఉన్నా సరే ఒక్క ధ్యానయోగంతో నశించిపోతుంది. ఇంకొక దాని కోసం మనం వెతుక్కోవలసిన పనిలేదు. ఓంకారము పరమ బీజాక్షరము. బిందువు, నాదము వీటికి పైన ఉంటుంది. అందులో శబ్దము, అక్షరాలు క్షీణించగా నిశ్శబ్దములో పరమపదముగా ఉన్నది. అనాహత చక్రంలో వినిపించే ప్రణవాన్ని విన్నవాడికి ఏ సంశయాలు ఉండవు.

తలవెంట్రుకలోని లక్షోవంతు ఉంటుంది పరబ్రహ్మ. **'వాలాగ్ర శతసాహస్రంతస్య భాగస్య భాగినః'** యోగంలో మనసు లయం అయిన తరువాత బ్రహ్మచైతన్యములో ఉన్న యోగి నిరంజన భావాన్ని పొందుతాడు. పూవులో సువాసనలాగా, పాలలో నేయిలాగా, నువ్వులలో నూనెలాగా, మట్టిలో బంగారంలాగా, మణిహారంలో దారంలాగా, అన్ని ప్రాణులయందు ఆత్మ అంతర్లీనంగా ఉంటుంది. విజ్ఞుడయినవాడు అటువంటి బ్రహ్మమునందు స్థితి గలిగి ఉంటాడు. గతంలో చెప్పినట్లుగా పాలలో నెయ్యిలాగా మానవశరీరంలో బ్రహ్మము బయట, లోపలా కూడా ఆవరించి ఉన్నది. ఈ కనిపించేదంతా ఒక వృక్షము. ఆ వృక్షము నీడ నిష్కళంకమైనది. సకల నిష్కళ భావములందు అంతటా వ్యాపించింది. 'ఓం' అనే ఏకాక్షరమే ముముక్షువైన వాడు ధ్యానం చెయ్యవలసింది. ప్రణవము యొక్క మొదటి మాత్ర అకారము

లయమైనప్పుడు భూమి, అగ్ని, ఋగ్వేదము, భూః అనే వ్యాహృతి బ్రహ్మ లీనమవుతాయి. రెండవ మాత్ర అయిన ఉకారము లయమయినప్పుడు అంతరిక్షము, యజుర్వేదము, వాయువు, భువః అనే వ్యాహృతి, విష్ణువు లీనమవుతాయి. మూడవ మాత్రమకారము లయమైనప్పుడు స్వర్గలోకము, సూర్యుడు, సామవేదము, సువః అనే వ్యాహృతి, మహేశ్వరుడు లీనమవుతాయి.

అకారము – పీతవర్ణము, రజోగుణము

ఉకారము – శ్వేతవర్ణము, సత్వగుణము

మకారము – నలుపువర్ణము, తమోగుణము

అకార ఉకార మకార అర్ధమాత్ర, బిందువు, నాదము, కళ, కళాతీతము అనే ఎనిమిది అంగాలతో ప్రకాశించేది, నాలుగు పాదాలు గలది, మూడు వ్యాహృతులు, ఐదుగురు అధిదేవతలు, ఎనిమిది స్థానాలుగల ఓంకారాన్ని తెలిసినవాడే బ్రాహ్మణుడు.

ప్రణవాన్ని ధనుస్సుగా, మనస్సు బాణంగా, బ్రహ్మ లక్ష్యంగా చేసి జాగ్రత్తగా భేదించాలి. బ్రహ్మ స్వరూప లక్ష్యమునందు ప్రయోగించిన బాణము బ్రహ్మమయము అవుతున్నది. ఈ రకంగా పరమాత్మయందు, ప్రపంచమునందు సమభావము కలిగి ఉన్నట్లైతే, అన్ని కార్యాలు, కర్మలు, నివృత్తి పొందుతాయి. ఓంకారము వల్లనే 4 వేదాలు, 16 స్వరాలు, 3 లోకాలు సర్వజగత్తు ఆవిర్భవిస్తున్నది. ఇక్కడ చిత్రం ఏమంటే–

హ్రస్యమైన ప్రణవము – పాపాలను భస్మం చేస్తుంది

దీర్ఘప్రణవము – సకల సంపదలు ఇస్తుంది

అర్ధమాత్రతో కూడిన ప్రణవము – మోక్షాన్నిస్తుంది.

ఈ ప్రణవము ఎలాంటిదంటే - 1. తైలధారలాగా అవిచ్ఛిన్నమైనది. అటువంటి ప్రణవాన్ని తెలిసినవాడు – వేదాలన్నీ చదవకపోయినా తెలిసినవాడు. హృత్పద్మ మందలి కర్ణికలో ఉన్న దీపంలాగా ప్రకాశించేవాడు, అంగుష్ఠమాత్ర ప్రమాణము గలవాడు, నిశ్చలుడు, ప్రణవస్వరూపుడు అయిన పరమేశ్వరుణ్ణే ధ్యానించాలి. ఎడమవైపున్న ఇడానాడితో వాయువును పూరించి, కుంభకము చేసి, శరీరానికి మధ్యలో జ్యోతిరూపంలో ఉన్న ఓంకారాన్ని ధ్యానం చెయ్యాలి. పూరకానికి – బ్రహ్మ, కుంభకానికి విష్ణువు, రేచకానికి రుద్రుడు, దేవతలు. జీవాత్మ క్రింద ఉన్న అరణి కొయ్య, పరమాత్మ పైనున్న అరణికొయ్య, ఈ విధంగా భావించి, ధ్యానము అనే అభ్యాసంతో పరమాత్మను దర్శించాలి. అలా ఓంకార నాదముతో రేచక, పూరక, కుంభకాదుల నాదము లయమయ్యేదాకా శక్తికొలది ధ్యానము చేస్తూనే ఉండాలి.

**గమాగమస్థం గమనాది శూన్యం ఓంకారమేకం రవికోటి దీప్తమ్**

**పశ్యంతి యే సర్వజనాంతరస్థమ్ హంసాత్మరంతే విరజాభవంతి ॥**

గమానాగమనము లందు ఉండేది, గమనాగమనాలు లేనిది, కోటిసూర్యుల కాంతితో ప్రకాశించేది, అన్ని జీవుల హృదయమందు ఉండేది, హంస రూపమైనది, ఏకమైనది, అయిన ఓంకారాన్ని దర్శించిన వారు రజోగుణరహితులై మోక్షాన్ని పొందుతారు. మూడు జన్మల సృష్టిస్థితిలయాలకు కారణమైన మనస్సు లయం చెందటమే 'విష్ణుపదము' అంటారు. హృదయ కమలము 8 దళాలతోను 32

కేసరాలతోను కూడి ఉంటుంది. ఆ కమలము మధ్యన సూర్యమండలము, దాని మధ్యన చంద్రమండలము, దాని మధ్యన అగ్నిమండలము, దాని మధ్యన దివ్యమైన కాంతి, ఆ కాంతిలో రత్నఖచితమైన పీఠమున్నది. దానిమీద వాసుదేవుడున్నాడు. ఇలా భావన చేసి శ్రీమహావిష్ణువును పూరక ప్రాణాయామంలో ధ్యానించాలి. నల్లనివాడు, నాలుగు భుజాలు గలవాడు అయిన ఆ వాసుదేవుణ్ణి నాభిస్థానంలో ధ్యానం చెయ్యాలి. కుంభక ప్రాణాయామంలో హృదయ స్థానంలో పచ్చని రత్నంలాగా ప్రకాశించేవాడు, కమలాసనుడు చతుర్ముఖుడు అయిన బ్రహ్మను ధ్యానం చెయ్యాలి.

రేచక ప్రాణాయామంలో లలాటంలో జ్ఞానాత్మ కలవాడై త్రినేత్రుడు, శుద్ధస్ఫటికం లాగా తెల్లనివాడు, నిష్కళంకుడు, పాపనాశనుడు అయిన శంకరుని ధ్యానించాలి. ఇలా చేస్తే త్రిరావృతప్రాణాయామము అంటారు. ఈ విధంగా పరమేశ్వరుణ్ణి ఆరాధించిన వారు వేదవేత్త అనబడతాడు.

ఈ రకంగా ఓంకారము ధ్యానము వివరించటం జరిగింది.

# 82. నాదబిందూపనిషత్తు

ఇది ఋగ్వేదానికి సంబంధించినది. ఇందులో 56 మంత్రాలు ఉన్నాయి. ఓంకారాన్ని వివరించే ఈ ఉపనిషత్తు మీద నాకు మక్కువ ఎక్కువ. అందుకే కొన్ని శ్లోకాలు కూడా ఇస్తున్నాను.

**అకారో దక్షిణ పక్ష ఉకారస్తూత్తరః స్మృతః ।**

**మకారః పుచ్ఛమిత్యాహు రర్ధమాత్రాతు మస్తకమ్ ॥**

ఓంకారాన్ని ఒక హంసతో పోల్చి చెబుతున్నారు. ఓంకారము అనే హంసకి అకారము కుడి రెక్క. ఉకారము ఎడమ రెక్క. మకారము తోక. అర్ధమాత్రమే మస్తకము.

**పాదాదిదకం గుణాస్తస్య శరీరం తత్త్వముచ్యతే ।**
**ధర్మోస్య దక్షిణం చక్షు రధర్మోధోపరః స్మృతః ॥**

పాదాలే గుణాలు. శరీరమే ప్రణవ తత్త్వము. దాని కుడికన్ను ధర్మము. ఎడమకన్ను అధర్మము.

**భూర్లోకః పాదయోస్తస్య భువర్లోకస్తు జానునీ ।**
**సువర్లోకః కటీదేశే నాభిదేశే మహర్జగత్ ॥**

దాని పాదాలు భూర్లోకము. జానువులు భువర్లోకము. కటిప్రదేశము సువర్లోకము. నాభి మహర్లోకము.

**జనో లోకస్తు హృద్దేశే కంఠే లోకస్తపస్తతః ।**
**భ్రువోర్ల లలాట మధ్యేతు సత్యలోకో వ్యవస్థితః ॥**

దాని హృదయము జనోలోకము. కంఠము తపోలోకము. భ్రూమధ్య భాగం సత్యలోకము.

**సహస్రారమితీ వాత్ర మంత్ర ఏవ ప్రదర్శితః ।**

**ఏవమేతాం సమారూఢో హంసయోగ విచక్షణః ॥**

దాని సహస్రారంలో ప్రణవ మంత్రము ప్రతిష్ఠితమై ఉన్నది. ఈ ప్రణవ మంత్ర పక్షిని అధిరోహించిన వాడు హంసయోగవిచక్షుణుడు.

**నభిద్యతే కర్మచారైః పాపకోటిశతైరపి ।**

**ఆగ్నేయీ ప్రథమామాత్రా వాయుర్వ్యేషా తథా పరా ॥**

ప్రణవోపాసనను శతకోటి పాపకర్మలు కూడా బాధించలేవు. ప్రణవము మొదటి మాత్ర అగ్నిదేవతాకము. రెండవది వాయుదేవతాకము.

**భానుమండల సంకాశా భవేన్మాత్రాతథోత్తరా ।**

**పరమాచార్ధ మాత్రాయా వారుణీం తాం విదుర్బుదా ॥**

ఓంకారము యొక్క ఉత్తరమాత్ర సూర్యమండలం లాగా ప్రకాశిస్తుంది. పరమమైన అర్ధమాత్ర వరుణ దేవతాకము.

త్రికాలములలోను, ఇన్ని మాత్రలతోను ఓంకారము ప్రతిష్ఠితమై ఉన్నది. నిరంతరము ధ్యానము, ధారణ, అభ్యాసము వల్లనే ఓంకారము విశదమవుతుంది. ఓంకారానికి 12 మాత్రలు ప్రసిద్ధంగా ఉన్నాయి.

**ఘోషిణీ ప్రథమామాత్రా విద్యున్మాత్రా తథాపరా ।**

**పతంగినీ తృతీయాస్యా చ్చతుర్థీ వాయువేగినీ ॥**

**పంచమీ నామధేయాతేతు షష్టీ చైంద్ర్యభి ధీయతే ।**

**సప్తమీ వైష్ణవీనామ అష్టమీశాంకరీతిచ ॥**

**నవమీ మహతీనామ ధృతిస్తు దశమీమతా ।**

ఏకాదశీ భవేన్నారీ బ్రాహ్మీతు ద్వాదశీపరా ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ప్రథమమాత్ర ఘోషిణి | 5. | నామధేయ | 9. | మహతి |
| 2. | విద్యుత్తు | 6. | ఐంద్రి | 10. | ధృతి |
| 3. | పతంగిని | 7. | వైష్ణవి | 11. | నారి |
| 4. | వాయవేగిని | 8. | శాంకరి | 12. | బ్రాహ్మి. |

ప్రణవాన్ని ఉపాసన చేస్తూ సాధకుడు

1. ప్రథమ మాత్రలో మరణిస్తే – భారతదేశంలో సార్వభౌముడుగా తిరిగి జన్మిస్తాడు.
2. ద్వితీయ మాత్రలో మరణిస్తే– మహాత్ముడుగా జన్మిస్తాడు
3. తృతీయమాత్రలో మరణిస్తే – యక్షగణంలో మహాత్ముడౌతాడు
4. నాల్గవమాత్రలో మరణిస్తే – గంధర్వుడుగా జన్మిస్తాడు
5. ఐదవమాత్రలో మరణిస్తే – చంద్రలోకంలో దేవత్వముతో నివసిస్తాడు
6. ఆరవమాత్రలో – దేవేంద్రుని సాయుజ్యం లభిస్తుంది
7. ఏడవమాత్రలో – విష్ణుపదం పొందుతాడు
8. ఎనిమిదవ మాత్రలో – రుద్రలోకంలో రుద్రుని పొందుతాడు.
9. తొమ్మిదవ మాత్రలో – మహర్లోకం పొందుతాడు
10. పదవ మాత్రలో – జనోలోకం పొందుతాడు
11. పదకొండవ మాత్రలో – తపోలోకం పొందుతాడు
12. పన్నెండవ మాత్రలో – బ్రహ్మలోకం పొందుతాడు

ఆ తరువాత శుద్ధుడు, సర్వవ్యాపకుడు, నిర్మలుడు ఎవరివలన జ్యోతిసులు పుడుతున్నాయో ఆ పరబ్రహ్మను పొందుతాడు.

యోగి అయినవాడు ఇంద్రియాలను జయించి, గుణాతీతుడై ఎప్పుడైతే మనసును లయం చేస్తాడో, అప్పుడే శివము, శాంతము అయిన బ్రహ్మను పొందుతాడు. యోగియైన వాడు తన కులంలోని వారందరినీ ముక్తులుగ చేస్తాడు. ఆ తరువాత అన్ని బంధాలు వదిలించుకున్నవాడై సూర్యుడిలాగా నిర్మలంగా ప్రకాశిస్తాడు. అటువంటి బ్రహ్మభావముచేతనే జీవుడు పరమానందము పొందుతాడు. ఈ రకంగా ఆత్మను తెలుసుకుని కాలం గడపాలి. ప్రారబ్దాన్ని పూర్తిగా అనుభవించాలి. ఆత్మజ్ఞానం కలిగినంత మాత్రం చేత ప్రారబ్ధం నాశనం కాదు. తత్త్వజ్ఞానం కలిగితేనే ప్రారబ్దం నాశనమవుతుంది. కలలో శరీరము అనేది ఉండదు. కాని ఉన్నట్లుగా జ్ఞానం కలుగుతుంది. అలాగే గతజన్మలలో చేసిన కర్మ ప్రారబ్దంగా మారుతుంది. యోగికి మరుజన్మ ఉండదు. కాబట్టి గతజన్మలలో చేసిన కర్మకూడా ఉండదు. యోగం చేసేవాడికి ఇక జన్మ అనేది ఉండదు. జన్మ అనేదే లేకపోతే ఇక స్థితి ఎలా ఉంటుంది? కుండకు మట్టి ఉపాదాన కారణము. (ప్రధాన కారణము) అలాగే ఈ ప్రపంచానికి ప్రధాన కారణము అజ్ఞానము, అజ్ఞానమే లేకపోతే ఈ జగత్తే ఉండదు. తాడును చూసి అజ్ఞాని భ్రమవల్ల పాము అనుకుంటున్నాడు. అలాగే ఈ జగత్తును అనుకుంటున్నాడు. ఇది త్రాడు అని తెలుసుకో కలిగితే పాము అనే భ్రమ విడిపోతుంది. అలాగే సర్వానికి అధిష్టానమైన ఆత్మను గురించి తెలిసినట్లైతే ఈ జగత్తు ఉండదు. మరి ప్రారబ్దము ఉన్నది అంటున్నారు కదా? అవును అది అజ్ఞానుల కోసం. జ్ఞానం కలిగితే ప్రారబ్దం ఉండదు. క్షయమయిపోతుంది. అప్పుడు బ్రహ్మము, ప్రణవముల సంధానము

వల్ల నాదము కలుగుతుంది. అదే శివుడు, మబ్బులు తొలగిపోగానే నిర్మలాకాశము కనిపించినట్లుగా, జ్యోతిరూపుడైన ఈశ్వరుడు దర్శన మిస్తాడు. యోగి అయినవాడు సిద్ధాసనంలో కూచుని వైష్ణవీ ముద్రతో కుడిచెవిద్వారా లోపలినుంచి వచ్చే నాదాన్ని వినాలి. ఇలా నాదాన్ని వింటూ తురీయాన్ని పొందాలి. మొదటలో ఈ నాదము అనేక రకాలుగా వినిపిస్తుంది.

సముద్రఘోష, మేఘగర్జన, భేరీనాదము, నదీప్రవాహశబ్దం, ప్రణవనాదం. సాధన మధ్యలో మద్దెల, ఘంటానాదం, ఇలా ధ్యానంలో రకరకాల దశలు తెలుస్తాయి. చివరలో కింకిణీ నాదము (చిరుమువ్వల శబ్దం) వేణునాదము, వీణానాదము, భ్రమరనాదము ఇవన్నీ చిన్నగా వినిపిస్తాయి. మహాభేరీనాదం కూడా వినిపిస్తుంది. చిన్ననాదాలు వినేటప్పుడు పెద్దనాదాలు వదిలెయ్యాలి. వీటిలో ఏదో ఒక నాదంతో మనసు లీనమవుతుంది.

ప్రణవోపాసనలో మనస్సు బయటి విషయాలను వదిలి పాలు నీరులా ఏకమై చిదాకాశంలో లీనమవుతుంది. యోగి ఎప్పుడూ ప్రణవనాదాన్ని సదా అభ్యాసం చెయ్యాలి. అన్ని రకాల ఆలోచనలు, కర్మలు వదిలి ప్రణవాన్ని మాత్రమే అనుసంధానం చెయ్యాలి. ప్రణవ నాదంలో చిత్తం లయమవుతుంది. చిత్తం ఎప్పుడూ ప్రణవం నందు లగ్నమై ఉంటుంది. బాహ్యవిషయాలు కోరదు.

విషయ సుఖాలకు అలవాటు పడ్డ మనస్సు, విశ్వాన్ని మరచిపోయినప్పటికీ ఏకాగ్రతను పొంది ఎక్కడికీ పోదు. మనసు ఎక్కడ లయమవుతుందో, అది విష్ణుమూర్తి సర్వోత్తమ స్థానము. ఆకాశాన్ని శబ్దాలమాదిరిగా, మనస్సులో సంకల్పాలు ప్రవర్తిల్లుతాయి. ఎంతకాలం శబ్దం ఉంటుందో, అంతకాలము ఆకాశం ఉంటుంది.

తరువాత ఉండదు. అలాగే పరమాత్మ కూడా. నాదం ఉన్నంతవరకే మనస్సు ఉంటుంది. తరువాత ఆ శబ్దము అక్షరబ్రహ్మలో లీనమవుతుంది. ప్రణవనాదంలో అంతా లీనమవుతుంది. యోగి సర్వావస్థల నుండి విడివడి మృతుడులాగా ఉంటాడు. అతడు ముక్తుడు. జీవన్ముక్తుడు. అటువంటి యోగికి శీతోష్ణాలు, సుఖదుఃఖాలు ఏవీ ఉండవు. అతడికి జన్మరాహిత్యం కలుగుతుంది. పునర్జన్మ ఉండదు.

# 83. బ్రహ్మవిద్యోపనిషత్తు

ఇది కృష్ణయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో 71 మంత్రాలున్నాయి. హంస మంత్రము సాధన చెబుతున్నారు ఇందులో.

పరబ్రహ్మయిన విష్ణువు యొక్క అనుగ్రహంతో 'ధ్రువాగ్ని మహర్షి' బ్రహ్మవిద్యను చెబుతున్నాడు.

**ఓమిత్యేకాక్షరం బ్రహ్మయదుక్తం బ్రహ్మవాదిభిః**
**శరీరం తస్య వక్ష్యామి స్థానం కాలత్రయం తథా ॥**
**తత్ర దేవాస్త్రయప్రోక్తా లోకావేదాస్త్రయోగ్నయః**
**తిస్రో మాత్రార్ధమాత్రాచ త్ర్యక్షరస్య శివస్యతు ॥**

ఓంకారము పరబ్రహ్మ స్వరూపము. అందులో త్రిమూర్తులు, ముల్లోకాలు, మూడు వేదాలు, త్రేతాజ్ఞులు, మూడు మాత్రలు, ఒక అర్ధమాత్ర, మూడు అక్షరాలు ఉన్నాయి.

1. ఋగ్వేదము, గార్హపత్యాగ్ని, పృథివీలోకము, బ్రహ్మదేవత ఇవి అకారానికి శరీరము.
2. యజుర్వేదము, అంతరిక్షము, దక్షిణాగ్ని, విష్ణువు. ఉకారానికి శరీరము.
3. సామవేదము, ద్యులోకము, ఆహవనీయాగ్ని, ఈశ్వరుడు మకారానికి శరీరము.

అకారము సూర్యమండలమందు శంఖమధ్యమున ఉన్నది.

ఉకారము చంద్రసమమైనది. చంద్రుని మధ్యలో ఉన్నది.

మకారము అగ్ని సమమైనది. ధూమము లేనిది. మెరుపుతో సమానమైనది. మూడు మాత్రలు సోమసూర్య అగ్నిరూపులు. దానిమీద దీపంతో సమానమైన శిఖ ఉన్నది. ప్రణవము పైన అర్ధమాత్ర ఉన్నది. తామరతూడులోని దారంలాగా సూక్ష్మమైనది అగ్నిశిఖ. సూర్యునితో సమానమైనది. 72 వేల నాడులు భేదించి శిరస్సునందు అన్ని భూతాలకు వరాలిచ్చేదై అంతటా వ్యాపించి ఉన్నది. ఓంకార నాదము దేనియందు లీనమవుతుందో అదే పరబ్రహ్మము. బ్రహ్మను బుద్ధిని లీనం చేసినవాడు అమృతత్వాన్ని పొందుతాడు.

ఈ శరీరంలో హంస అనే పక్షి విశ్రాంతి లేకుండా తిరుగుతూ ఉంటుంది. స్వప్రకాశము, చిదానందరూపమైనది హంస. రేచకము, పూరకము వదిలి కుంభకంలో హంస హంస అని ధ్యానించే వాడికి జరామరణాలు ఉండవు. అతడు ఈశ్వరత్వము పొందుతాడు. నిత్యము సాధన చెయ్యటానికి హంస విద్య కాక ఇంకొకటి లేదు.

గురువుదగ్గర హంస విద్యను చెప్పుకుని, ఉపాసన చేసి, తన ఆత్మే సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపమని తెలుసుకుని వర్ణాశ్రమ ధర్మాలు, దేహము, జాతి, సంబంధాలు, వేదశాస్త్రాలు అన్నింటినీ వదిలెయ్యాలి. ఈ హంస మంత్రము గురుముఖతః చెప్పుకోవాలి. నువ్వులలో నూనెలాగా, పూవులలో సువాసనలాగా, ఈ దేహంలోనే పురుషుడు ఉన్నాడు. ఏదైనా వస్తువును తెలుసుకోవాలి అంటే ముందుగా చేత్తో దీపం పట్టుకుని, ఆ వస్తువును నిర్ధారించుకుని, తరువాత దీపాన్ని వదిలెయ్యాలి. అలాగే జ్ఞానంతో జ్ఞేయమైన ఆత్మను తెలుసుకుని, తరువాత జ్ఞానాన్ని వదిలెయ్యాలి. ఈ జగత్తంతా పువ్వులాంటిది.

నిష్కళుడు గంధము వంటివాడు అని తెలుసుకోవాలి. అయితే ఈ విద్యను అందరికీ చెప్పవచ్చునా? అంటే

**నా పుత్రాయ ప్రదాతవ్యం నాశిష్యాయ కథాచన ।**
**గురుదేవాయ భక్తాయ నిత్యం భక్తిపరాయచ**
**ప్రదాతవ్యమిదం శాస్త్రం నేతరేభ్యః ప్రదాపయేత్**
**దాతాస్య నరకం యాతి సిద్ధ్యతే న కథాచన ॥**

ఈ విద్యను శిష్యుడు కాని వాడికి, పుత్రుడు కానివాడికి ఇవ్వరాదు. గురువే దేవుడు అనుకునేవాడికి, భక్తుడికి, ఈ శాస్త్రము చెప్పాలి. దీనిమీద నమ్మకం లేని వారికి ఇది చెప్పరాదు. ఒకవేళ అలా ఇచ్చినట్లైతే, ఇచ్చినవాడు నరకానికి పోతాడు. అంటే తనవాడనో, అతనివల్ల తనకు లాభం ఉంటుందనో అనర్హుడికి గనక ఇచ్చినట్లైతే, ఇచ్చిన వాడు నరకానికి పోతాడు. చెప్పుకున్న వాడికి విద్య సిద్ధించదు.

విద్యని బోధించే ఆచార్యులు కూడా మూడు రకాలు.

**చోదకో బోధకశ్చైవ మోక్షదశ్చ పరః స్మృతః**
**ఇత్యేషాం త్రివిధోజ్ఞేయ ఆచార్యస్తు మహీతలే ॥**
**చోదకో దర్శయేన్మార్గం బోధకః స్థానమాచరేత్**
**మోక్షదస్తుపరంతత్త్వం యదే జ్ఞాత్వా పరమశ్నుత్ ॥**

ఆచార్యుడు మూడు రకాలు 1. చోదకుడు 2. బోధకుడు 3. మోక్షదుడు. వీరిలో

చోదకుడు – మార్గం చూపుతాడు

బోధకుడు – స్థానము నాచరిస్తాడు

మోక్షదుడు – పరతత్త్వాన్ని బోధిస్తాడు.

ప్రాణులయొక్క దేహమందు హంస ఉన్నది. ఆ హంసయే పరమ సత్యము. హంసయే శక్తి. హంసయే పరవాక్యము. హంసయే పరవైదికము. హంసయే రుద్రుడు, పరాత్పరుడు. మహేశ్వరుడు. ఈ జగత్తంతా హంసరూపమే. కాబట్టి మోక్షగామియైన వాడు ఉత్తముడైన గురువు దగ్గర మంత్రం తీసుకుని, ఆ మంత్రాన్ని శ్రద్ధగా జపించి, సాధన చేసి పరమపదము చేరాలి అని చెబుతోంది ఈ ఉపనిషత్తు.

# 84. యోగకుండలి ఉపనిషత్తు

ఇది కృష్ణయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో రెండు అధ్యాయాలు, 18 మంత్రాలు ఉన్నాయి.

చిత్తానికి వాసన, వాయువు అని రెండు కారణాలున్నాయి. వాటిలో ఒకటి నశిస్తే రెండవది కూడా నశిస్తుంది. వీటిలో ముందుగా మానవుడు వాయుజయాన్ని ఎప్పుడూ చేస్తూనే ఉండాలి. ఇది మూడు రకాలు 1. మితాహారము 2. ఆసనము 3. శక్తిచాలనము.

**1. మితాహారము :** మితంగా, తక్కువగా తినటం. యోగవిద్యలో పాటించాల్సిన ముఖ్య సూత్రం ఆహారం. ఆహారం ఎక్కువగా తీసుకుంటే నిద్ర వస్తుంది. సోమరితనం పెరుగుతుంది. బద్ధకం అనిపిస్తుంది. అలా అని ఆహారం తక్కువగా తీసుకుంటే నీరసం వస్తుంది. ఏం చెయ్యటానికీ ఓపిక ఉండదు. అందుకని సరిపోయినంత మాత్రమే ఆహారంగా తీసుకోవాలి. అది ఎంత అనేది ఎవరికి వారే నిర్ణయించుకోవాలి. ప్రతిమానవుడు తనపొట్టను నాలుగు భాగాలు చెయ్యండి. అందులో రెండు భాగాలు మాత్రమే ఘనపదార్థాలతో నింపాలి. ఒక భాగము నీరు తాగాలి. మిగిలిన ఒక భాగము ఖాళీగా వదిలెయ్యాలి. అలా చేసినట్లైతే ఆహారం తీసుకున్న వెంటనే హాయిగా తిరగగలుగుతాడు. ఏ మాత్రం బరువుగా ఉండదు. జీర్ణశక్తి కూడా బాగుంటుంది. మనిషి మంచి ఆరోగ్యంగా ఉంటాడు. సైన్సు ప్రకారంగాని, ఆరోగ్యశాస్త్రం ప్రకారం గాని, అదే ఉత్తమం. యోగశాస్త్రం కూడా అదే చెబుతోంది. అయితే ఎంత ఆహారం తీసుకోవాలి అనే దానికి 'ఆహారం తీసుకున్న తరువాత మానవుడు, కూర్చుని హాయిగా పని చేసుకోగలగాలి. తీసుకునే ఆహారం నెయ్యి, నూనెలతోను తీపి

పదార్ధాలు, ఇష్టమైన పదార్ధాలతోను తినవచ్చు. 1. మాంసము, ఉల్లి, వెల్లుల్లి, ఇతర రజోగుణ, తమోగుణాలను పెంపొందింపచేసే పదార్ధాలు తినరాదు.

**2. ఆసనము :** ఆసనము రెండు రకాలుగా ఉంటుంది. 1. పద్మాసనము 2. వజ్రాసనము. అనేక రకాల ఆసనాలున్నా, ఈ రెండు ప్రసిద్ధమైనవే.

**1. పద్మాసనము :** రెండు పాదాలు రెండు తొలమీద ఉండాలి. కుడి తొడమీద ఎడమ పాదము. ఎడమ తొడమీద కుడిపాదము ఉండాలి. తపస్సు చేసుకునేవారు, యోగులు అందరూ సామాన్యంగా ఇష్టపడే ఆసనము.

**2. వజ్రాసనము :** ఎడమకాలి మడమను మూలకందం క్రింద ఉంచాలి. దానిపైన కుడికాలిని ఉంచాలి. ఇది వజ్రాసనము. ఏ ఆసనంలోనైనా ఎప్పుడూ తల, శరీరము నిటారుగానే ఉండాలి. నడుము ఏ మాత్రము వంగరాదు. నిటారుగా, కర్రలాగా ఉండాలి. ఈ ఆసనంలో ఎంతసేపు కూచోగలరు? అని అనుమానం వస్తుంది. ఎంతసేపైనా కూర్చోగలరు. ఇది పూర్తిగా సాధనమీద ఆధారపడి ఉంటుంది. మన శరీరం మన అధీనంలో ఉండాలి.

ఒకసారి నా భార్యకి మెడనొప్పిగా ఉంది అంటే న్యూరో డాక్టరుగారి దగ్గరకి వెళ్ళాను ఆవిడతో పాటుగా, ఆ డాక్టరుగారు నన్ను చూసి గంటల తరబడి నేలమీద కూచోకూడదు. ఆసనాలు వెయ్యకూడదు. కంఫర్ట్‌గా కుర్చీలోనే కూచోవాలి. అని చాలాసేపు చెప్పారు. ఈ చెప్పింది నాకు. బహుశః నా ముఖం చూస్తే ఆయని నేను అలా ఉంటాను అనిపించి ఉంటుంది. ఇక్కడ గమనించాల్సిన

విషయం ఏమంటే శరీరం మనం ఎటు వంచితే అటు వంగుతుంది. వెదురుచెట్టు చూడండి. ముందుగానే దాన్ని వంచి కడితే పల్లకిబొంగు అవుతుంది. లేకపోతే దొమ్మరిసాని గడ అవుతుంది. రోడ్డుమీద కొంతమంది జీవనోపాధి కోసం విన్యాసాలు ప్రదర్శిస్తుంటారు. వారిలో 'దొమ్మరులు' అనేజాతి ఒకటి. ముప్పై అడుగుల పొడవుండే వెదురుగడతో వీరు విన్యాసం చేస్తుంటారు. దాన్నే 'దొమ్మరిసానిగడ' అంటారు. శరీరం కూడా అంతే. సాధ్యమైనంతవరకు మన శరీరం మన అధీనంలో ఉండాలి. అంతేకాని డాక్టరుగారి అధీనంలో మాత్రంకాదు. అలవాటున్న వారు క్రింద నేలమీద కూచుంటే ఇబ్బంది లేదు. అలా అని అలవాటు లేనివాళ్ళు మాత్రం శరీరాన్ని అలా వంచటానికి ప్రయత్నం చెయ్యకండి. ఎముకలు విరిగిపోతాయి.

**3. శక్తిచాలనము :** ఆధారచక్రంలో స్వయంభూలింగానికి మూడున్నర చుట్టు చుట్టుకుని అధోముఖంగా నిద్రావస్థలో ఉంటుంది కుండలినీ శక్తి. దాన్ని జాగృతం చేసి ఆధారచక్రం నుంచి ఆజ్ఞాచక్రందాకా సంచరింపచెయ్యటాన్నే శక్తి చాలనము అంటారు. ఇది మళ్ళీ రెండు రకాలుగా ఉంటుంది.

1. సరస్వతీ చాలనము 2. ప్రాణనిరోధము. ప్రాణనిరోధము రెండు విధాలు. 1. సహితము 2. కేవలము. శక్తి చాలనము చేసినట్లైతే ఉదరకోశ వ్యాధులు నశిస్తాయి. ప్రాణాయామము మూడు రకాలు 1. రేచకము 2. పూరకము 3. కుంభకము. ప్రాణాయామం చెయ్యటంవల్ల శిరోవాతము పోతుంది. అన్ని రోగాలు హరించిపోతాయి. జఠరాగ్ని పెరుగుతుంది. జలోదరం తగ్గుతుంది. కుంభకం చెయ్యటంవల్ల శరీరంలోని కల్మషాలన్నీ పోతాయి. అప్పుడు యోగి బంధత్రయము చెయ్యాలి. ఇవి మూడు విధాలు 1.

మూలబంధము 2. ఉడ్డీయణబంధము 3.జాలందర బంధము. యోగి మూడు బంధాలతో కూడిన కుంభకాన్ని రోజూ చెయ్యాలి. అలా చేసేటప్పుడు పగలు నిద్ర, రాత్రి జాగారము, అతిమైధునము, నిత్యము మూత్ర పురీష నిరోధము, సరిగా తినకపోవటము, ప్రాణచింతన, ప్రయాస వీటివల్ల రోగం వస్తుంది. సాధకుడు ఇవన్నీ నాకు యోగంవల్లనే వచ్చాయి. అని చెప్పి సాధన మానేస్తాడు. యోగసాధనలో ఇది మొదటి ప్రతిబంధకము.

రెండవది సంశయము. 3 ప్రమత్తంగా ఉండటం. 4. ఆలస్యము 5. నిద్ర 6. మానెయ్యటం 7. భ్రాంతి 8. విషయము 9. పేరు లేనిది 10. యోగతత్త్వము లభించకపోవటము. యోగికి ఈ రకమైన విఘ్నాలు వచ్చినప్పుడు జాగ్రత్తగా ఆలోచించి అడుగు వెయ్యాలి. ప్రాణాయామం చేసి నిద్రావస్థలో ఉన్న కుండలినీ శక్తిని నిద్రలేపితే అది గ్రంథత్రయాన్ని భేదించి సహస్రదళపద్మము చేరి శివునితో కూడి ఆనందిస్తుంది. ఇది అనుభవైక వేద్యము. ఈ యోగప్రక్రియ అంతా ప్రత్యక్షంగా గురువుగారి దగ్గర నేర్చుకోవాలి.

తరువాత ఖేచరీ విద్యను చెబుతున్నారు. దీనిని అభ్యసించినవాడు. అజరామడుగు. గురువు ద్వారే ఈవిద్యను ఉపాసించాలి. అటువంటి వాడికి జన్మమృత్యుజరాదులు ఉండదు. ఖేచరీ విద్య దుర్లభమైనది. దాని సాధన కూడా కష్టమైనదే. అభ్యాసము మేళనము ఒకేసారి సిద్ధంచవు. జన్మాంతరాలలో ఎక్కడో అభ్యాసము సిద్ధిస్తుంది. మేళనము వందజన్మల ఫలము ఉంటేనే గాని సిద్దించదు. గురుముఖతః మేళనము పొందితే అది త్వరగా సిద్ధిస్తుంది. అప్పుడు సాధకుడు ఇదంతా గురుముఖతః యోగవిద్యను నేర్చుకోవాలి. లేకపోతే అది త్వరగా సిద్ధించదు.

# 85. యోగచూడామణి ఉపనిషత్తు

ఇది సామవేదానికి సంబంధించినది. ఇందులో 27 మంత్రాలున్నాయి. ఈ ఉపనిషత్తులో ప్రత్యేకంగా షష్టాంగయోగాన్ని చెబుతున్నారు. యోగానికి ఆరు అంగాలు ఉన్నాయి అన్నారు అవి

1. ఆసనము
2. ప్రాణసంరోధము
3. ప్రత్యాహారము
4. ధారణ
5. ధ్యానము
6. సమాధి

ఈ ఆరు యోగాంగములు

తనముందు, తన దేహంలో ఉన్న వాటిని తెలియని వాడికి సిద్ధి అనేది కలగదు. అందుకని ముందుగా శరీరంలో ఉన్న షట్చక్రాల గురించి తెలుసుకోవాలి.

**మూలాధారం గుదస్థానం స్వాధిష్టానంతు మేహనం**
**నాభిస్తుమణి పూరాఖ్యం హృదయం చాబ్జమనాహతం**
**తాలుమూలం విశుద్ధాఖ్యం ఆజ్ఞాం చ నిటలాంబుజం**
**తస్మాదూర్ధ్వ మధోముఖం వికసితం పద్మం సహస్రచ్ఛదం**
**॥**

**1. మూలాధారచక్రము :** ఇది గుదస్థానంలో ఉంటుంది. దీనికి నాలుగు దళాలుంటాయి.

**2. స్వాధిష్ఠానము :** ఇది లింగస్థానంలో ఉంటుంది. దీనికి ఆరుదళాలుంటాయి.

**3. మణిపూరము :** ఇది నాభిస్థానంలో ఉంటుంది. దీనికి పది దళాలుంటాయి.

**4. అనాహతము :** ఇది హృదయస్థానంలో ఉంటుంది. దీనికి 12 దళాలుంటాయి.

**5. విశుద్ధిచక్రము :** ఇది కంఠస్థానంలో ఉంటుంది. దీనికి 16 దళాలుంటాయి.

**6. ఆజ్ఞాచక్రము :** ఇది భృకుటిస్థానంలో ఉంటుంది. దీనికి రెండు దళాలుంటాయి.

ఆధార స్వాధిష్ఠానాల మధ్యన యోనిస్థానమున్నది. అది కామరూపమనబడు తుంది. చతుర్దళ పద్మము మధ్యన సిద్ధవందితమైన కామాఖ్యమైన యోని ఉన్నది. దాని మధ్యన పశ్చిమాభి ముఖమైన మహాలింగమున్నది. నాభిస్థానంలో ఉన్న మణిపూరాన్ని తెలుసుకున్నవాడు మహాయోగి అవుతాడు. అతడికి జనన మరణాలుండవు.

శరీరంలో 72వేల నాడీమండలం ఉన్నది. అందులో 72 నాడులు ముఖ్యమైనవి. వాటిలో పది మరీముఖ్యమైనవి. అవి

**ఇడా చ పింగళాచైవ సుషుమ్నా చ తృతీయగా**

**గాంధారీ హస్తి జిహ్వాచ పూషాచైవ యశస్వినీ**

**అలంబుసా మహూశ్చైవ శంఖినీ దశమీస్మృతా**

1. ఇడ 2. పింగళ 3. సుషుమ్న 4. గాంధారి 5. హస్తిజిహ్వ 6. పూష 7. యశశ్విని 8. అలంబుస 9. కుహు 10. శంఖిని

| | |
|---|---|
| ఎడమవైపున | ఇడ |
| కుడివైపు | పింగళ |

| | |
|---|---|
| మధ్యన | సుషుమ్న |
| ఎడమకన్ను | గాంధారి |
| కుడికన్ను | హస్తిజిహ్వ |
| కుడిచెవి | పూష |
| ఎడమచెవి | యశస్విని |
| ముఖము | అలంబుస |
| లింగదేహము | కుహు |

మూలస్థానములో శంఖిని. నాడులున్నాయి. ఇడ పింగళ సుషుమ్నలకు సోమసూర్య అగ్నులు దేవతలు. వాయువు ఐదురూపాలుగా ఉంటుంది. 1. ప్రాణ 2. అపాన 3. వ్యాన 4. ఉదాన 5. సమానములు. ఉపవాయువులు ఐదు. నాగ, కూర్మ, కృకుర, దేవదత్త, ధనుంజయములు.

| | | |
|---|---|---|
| ప్రాణవాయువు | – | హృదయము నందు |
| అపాన వాయువు | – | గుదస్థానమందు |
| వ్యానవాయువు | – | శరీరమంతటా |
| ఉదానవాయువు | – | కంఠము మధ్యన |
| సమానవాయువు | – | నాభిదేశమున ఉంటాయి |
| నాగవాయువు | – | వాంతులు |
| కూర్మవాయువు | – | కళ్ళు తెరవటం |
| కృకుర వాయువు | – | తుమ్ములు |
| దేవదత్తము | – | ఆవలింత |

ధనుంజయము - మరణించినా మనిషిని వదిలిపోదు

ఈ వాయువులు ప్రాణాధారమైన వాయువులందు తిరుగుతూ ప్రాణాలలో కొట్టబడి అటు ఇటు పరుగెతడతాయి.

హకారంతో గాలి పీల్చాలి. సకారంతో వదలివెయ్యాలి. ఇదే హంస మంత్రము. జీవుడు ఎప్పుడూ దీన్ని జపిస్తూనే ఉంటాడు. ఒకరోజుకు 21,600 సార్లు ఈ జపం జరుగుతుంది. దీన్నే అజపాగాయత్రి అంటారు. ఇదే యోగులకు మోక్షం ఇస్తుంది. దీని సంకల్పమాత్రంచేతనే మానవుడు అన్ని పాపాలనుంచి విముక్తుడవుతాడు. దీనితో సమానమైన విద్యగాని, జ్ఞానంగాని లేవు.

కుండలిని యందు పుట్టిన గాయత్రి ప్రాణధారకమైనది. ఇది ప్రాణవిద్య. దీన్ని ఉపాసన చేసినవాడు వేదవేత్త అనబడతాడు. ఆధారచక్రంలో స్వయంభూలింగానికి మూడున్నర చుట్లుగా చుట్టుకుని, అధోముఖంగా నిద్రావస్థలో ఉంటుంది కుండలినీ శక్తి. ఇది పరమేశ్వరి స్వరూపము. ఇది నిద్రావస్థలో ఉన్నంత వరకు మానవుడు అజ్ఞానంలో కూరుకుపోయి ఉంటాడు. అది జాగృతం అయింది అంటే మానవుడికి జ్ఞానము ప్రకాశిస్తుంది. సాధకుడు పద్మాసనంలో కూచుని కుడికాలి మడిమతో గుదస్థానాన్ని తన్నిపట్టి ఉచ్ఛ్వాస నిశ్వాసలు బంధించాలి. దీన్నే ప్రాణాయామము అంటారు. ఇడపింగళనాడులగుండా ఉచ్ఛ్వాస నిశ్వాసలు జరుగుతుంటాయి. సూర్యచంద్రులు ఈ రెండునాడులగుండా తిరుగుతుంటాడు. చంద్రుని కిరణాల నుండి జాలువారిన అమృతపు బిందువులను ఆహారంగా తీసుకుని నిద్రావస్థలో ఉంటుంది కుండలిని. దీన్ని జాగృతం చెయ్యాలి అంటే, కుండలినీ శక్తిని నిద్రలేపాలి అంటే,

దానికి ఆహారం అందకుండా చెయ్యాలి. ఆ ఆహారమే చంద్ర కిరణముల నుండి జాలువారిన అమృతపు బిందువులు. సూర్యచంద్రుల గమనం ఆగిపోతే అమృతపు బిందువలు అక్కడ జాలువారవు. అప్పుడు కుండలినికి ఆహారం ఉండదు. దాంతో అదికాస్తా నిద్రనుంచి మేల్కొంటుంది.

ఇలా ప్రాణాయామం చేసి కుండలినీ శక్తిని జాగృతం చేసినట్లైతే అది బుసలు కొడుతూ ఊర్ధ్వముఖంగా బయలుదేరుతుంది. అలా సుషుమ్నానాడి గుండా బయలుదేరిన కుండలినీశక్తి గ్రంధిత్రయాన్ని భేదించుకుని సహస్రారం చేరి తన భర్త అయిన మహాదేవునితో కలిసి విహరిస్తుంది. ఆ తరువాత మళ్ళీ ఆధారచక్రంలోకి వచ్చి నిద్రావస్థలో ఉంటుంది అంటే లౌకిక విషయాలలో మునిగిపోతుంది. కుండలినీ శక్తి జాగృతమైంది అంటే జ్ఞానం వికసిస్తుంది. గ్రంధిత్రయము అంటే మూడు గ్రంధులు 1.బ్రహ్మగ్రంధి 2. విష్ణుగ్రంధి 3. రుద్రగ్రంధి. ఈ విషయాలు తెలిసినవాడు, ఇలా పరమేశ్వరుణ్ణి గురించి తెలుసుకున్న వాడికి మరుజన్మ ఉండదు. అని చెబుతోంది ఈ ఉపనిషత్తు.

# 86. యోగతత్త్వోపనిషత్తు

ఇది కృష్ణయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో 142 మంత్రాలున్నాయి.

ఒకసారి బ్రహ్మదేవుడు విష్ణువుని ఆరాధించి అష్టాంగయోగసహితంగా యోగతత్త్వాన్ని నాకు వివరించవలసింది. అన్నాడు. ఇప్పుడు శ్రీమహావిష్ణువు తత్త్వజ్ఞానాన్ని చెబుతున్నాడు.

ఈ లోకంలో జీవులంతా మాయతో ఆవరించబడి ఉన్నారు. జననము, మరణము, వృద్ధాప్యము, వ్యాధి, అన్నింటినీ నశింపచేసేది, మరణ రహితమైనది, భక్తిమార్గంతో పొందదగిన కైవల్యము పరమపదమై ఉన్నది. అది భౌతిక మార్గాల ద్వారా పొందదగినది కాదు. శాస్త్రాలు చదివి, మోహంలోపడి ప్రజ్ఞవల్ల పరతత్త్వాన్ని తెలియలేదు. ఆ మోక్షపదాన్ని గురించి చెప్పటం దేవతలకు కూడా సాధ్యంకాదు. పరతత్త్వాన్ని గురించి తెలుసుకోవాలంటే అరిషడ్వర్గాలను వదలెయ్యాలి. ఆకలి, దప్పిక, సోమరితనము, శోకము, వంటి వాటివి కూడా వదిలెయ్యాలి. తృష్ణ, లజ్జ, భయము, దుఃఖము, విషాదము, హర్షము మొదలైన దోషాల నుండి విముక్తుడు కావాలి. అటువంటివాడు పరమాత్మ అనబడతాడు. అయితే యోగము మోక్షాన్ని ఎలా ఇస్తుంది? అనే ప్రశ్న వస్తుంది. ఇక్కడ గుర్తుంచుకోవలసిన విషయం ఏమంటే యోగముజ్ఞానం లేకుండా మోక్షాన్ని ఇవ్వలేదు. కాబట్టి సాధకుడు యోగము, జ్ఞానము రెండింటినీ గట్టిగా అభ్యసించాలి. అజ్ఞానంవల్ల సంసారము ఏర్పడుతోంది. జ్ఞానంవల్ల మోక్షం వస్తోంది. కాబట్టి ముందుగా జ్ఞానసముపార్జన చెయ్యాలి. తన ఆత్మస్వరూపాన్ని తెలుసుకోవటమే జ్ఞానము. ఉత్పత్తి, స్థితి, సంహారము మొదలైనవి

లేకపోవటమే కైవల్యము. యోగాలు అనేక రకాలుగా ఉన్నాయి. మంత్రయోగము, లయయోగము, హఠయోగము, రాజయోగము అనేవి యోగంలో ముఖ్యమైన రకాలు. ప్రతియోగానికి నాలుగు అవస్థలున్నాయి. అవి 1. ఆరంభము 2. ఘటము 3.పరిచయము 4.నిష్పత్తి

1. మంత్రాన్ని ఎప్పుడూ 12 సంవత్సరాలు జపంచేస్తే, అణిమాది సిద్ధులతో కూడిన జ్ఞానము మెల్లగా వస్తుంది. అల్పబుద్ధి గలవాడు మాత్రమే మంత్రయోగసాధన చేస్తాడు.

2. లయయోగము అంటే చిత్త లయము, ఈ విషయం కోటిసార్లు చెప్పబడింది. నుంచున్నా, కూచున్నా, పడుకున్నా, నడుస్తున్న పరమాత్మ ధ్యానం చేస్తూనే ఉండాలి. అదే లయయోగము.

3. యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యాన సమాధులను అష్టాంగ యోగము అంటారు.

మహాముద్ర, మహాబంధము, మహావేధ, ఖేచరీ, జాలంధరబందము, ఉడ్డియాణాబంధము, మూలబంధం, దీర్ఘకాల ప్రణవధ్యానము, వజ్రోలి, అమరోలి, సహజోలి, వీటన్నింటిని గురించి వివరించారు ఈ ఉపనిషత్తులో

యోగియైన వాడు తప్పనిసరిగా బ్రహ్మచర్యము పాటించాలి. అతడు వాయుస్తంభన చేస్తే వాయుమార్గంలో సంచరిస్తాడు. జలస్తంభన చేస్తే నీటిమీద నడవగలుగుతాడు. పంచభూతాలమీద పట్టు సాధిస్తాడు. అతడికి విపరీతమైన శక్తి వస్తుంది. అతడు చేతితో కొడితే సింహము పులివంటి జంతువులు కూడా ఒకే దెబ్బకి చచ్చి ఉరుకుంటాయి. అతడు నియతాహారాన్ని మాత్రమే తీసుకోవాలి. క్రమం తప్పకుండా

యోగసాధన చెయ్యాలి. యోగసాధన జరుగుతున్న సమయంలో యోగికి అనేక శక్తులు లభిస్తాయి. అణిమాది అష్టసిద్ధులు లభిస్తాయి. భూతభవిష్య ద్వర్తమానాలు తెలుస్తాయి. దాంతో యోగి తన సాధన వదలి ప్రక్కత్రోవలు పడతాడు. ఇది అతడికి పతన హేతువవుతుంది. కాబట్టి పూర్వాపరాలు దృష్టిలో ఉంచుకుని, నిరంతరము యోగసాధన చేస్తూనే ఉండాలి. మోక్షంపొందేదాకా ఈ సాధన నిరంతరం సాగుతూనే ఉండాలి. అప్పుడే యోగికి కైవల్యము సిద్ధిస్తుంది.

# 87. యోగశిఖోపనిషత్తు

ఇది కృష్ణయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో ఆరు అధ్యాయాలు 65 మంత్రాలు ఉంటాయి. **యోగంలేని జ్ఞానం మోక్షాన్నివ్వదు.** అలాగే **జ్ఞానంలేని యోగం సిద్ధించదు.** అనే విషయాన్ని ప్రతిపాదిస్తున్నారు ఈ ఉపనిషత్తులో.

ఒకసారి హిరణ్యగర్భుడు శంకరుడి దగ్గరకు వెళ్ళి "ఓ దేవా ! లోకంలోని జీవులన్నీ పూర్తిగా మాయలోపడిపోయాయి. ఆ జీవులన్నింటికీ ఏ రకంగా ముక్తి లభిస్తుంది. జన్మమృత్యుజరాదులు, రోగాలు లేకుండా శాశ్వతమైన సుఖాన్ని వారు ఏ విధంగా పొందుతారు? ఈ విషయం నాకు వివరించవలసింది" అని అడిగాడు. ఆ మాటలు విన్న శంకరుడు. 'పరమపదమైన కైవల్యాన్ని పొందటము అంత తేలిక కాదు. సిద్ధిమార్గంతోనే అది లభిస్తుంది. మానవులంతా తమయొక్క తెలివితేటలతో శాస్త్రాల ద్వారా పరమపదము పొందాలి అనుకుంటున్నారు. అది వీలుకాదు' అన్నాడు. ఇప్పుడు మళ్ళీ బ్రహ్మ అడుగుతున్నాడు. ఓ దేవా! బ్రహ్మము నిత్యము. జీవుడు అనిత్యము. మరి ఆ బ్రహ్మజీవుడెలా అయినాడు. ఈ విషయం నాకు తెలియజెయ్య వలసింది' అన్నాడు. ఇప్పుడు శంకరుడు చెబుతున్నాడు.

బ్రహ్మపదార్థము అన్ని భావాలకు అతీతమైనది. జ్ఞానరూపమైనది. నిరంజనమైనది, అటువంటి ఆ బ్రహ్మము నుండి అహంకారము బయలుదేరింది. ఆ పిండము గుణాత్మకమైనది, ధాతుబద్ధమైనది, పంచభూతాత్మకమైనది, సుఖదుఃఖాలతో కూడి జీవభావము కలిగినది. దాంతో విశుద్ధమైన పరమాత్మయందు జీవుడు అనే పేరు వచ్చింది. అరిషడ్వర్గాలు, జన్మమృత్యుజరాదులు, ఆకలి, దప్పిక, తృష్ణ, భయము,

దుఃఖము, విషాదము, హర్షము, ఈ దోషాలు ఏవీలేని జీవుడు శివుడు అనబడతాడు. అంటే అజ్ఞానంతోను, దోషాలతోను కూడినవాడు జీవుడు. ఈ దోషాలు, అజ్ఞానము గనక పోయినట్లైతే ఆ జీవుడే దేవుడు శివుడవుతాడు. అయితే ఈ దోషాలు ఏ రకంగా నాశనమవుతాయి అనే విషయాన్ని చెబుతాను వినవలసింది.

ఈ దోషాలు నాశనం కావాలంటే జ్ఞానం కావాలి అని కొందరంటారు. **యోగములేని జ్ఞానము మోక్షానివ్వదు. అలాగే జ్ఞానం లేకుండా యోగం మోక్షానివ్వలేదు. కాబట్టి మోక్షము కావాలి అనే వారు పూర్తిగా జ్ఞానాన్ని, యోగాన్ని కూడా అభ్యాసం చెయ్యాలి.** ముందుగా జ్ఞానము యొక్క స్వరూపము తెలియాలి. దాంతో పరమపదమైన కైవల్యము యొక్క నిజస్వరూపము పూర్తిగా తెలుస్తుంది.

అన్ని రకాలైన దోషాలతోను చుట్టుకుపోయిన జీవుడు కేవలం జ్ఞానంతో అరిషడ్వర్గాల నుంచి ఏ రకంగా విడివడతాడు? జ్ఞానము అనేది స్వాత్మలాగా పరిపూర్ణమైనది. సర్వవ్యాపకమైనది. అటువంటి పరబ్రహ్మ ఏ రకంగా ఈ మోహసాగరంలో మునిగిపోతుంది? ఏ రకంగా విద్యను వదిలి అవిద్యలో పడిపోతుంది. సంసారి అయినవాడు సుఖదుఃకాది మోహంలో పడి ఉంటాడు. అలాగే జ్ఞాని వాసనా వాసితుడై ఉంటాడు. సంసారభావము ఇద్దరికీ సమానంగానే ఉంటుంది. ఈ విషయం తెలిస్తే అజ్ఞానం ఎలా ఉంటుంది? జ్ఞాని, ధర్మజ్ఞుడు, విజితేంద్రియుడు, విరక్తుడు అయినప్పటికీ ఈ దేహముండగా యోగం లేకుండా మోక్షం పొందలేదు. దేహధారులు దేహాన్ని ధరించినవారు 1. పక్వులు 2. అపక్వులు అని రెండు రకాలు. యోగం లేనివారు, యోగరహితులు అపక్వులు. యోగం కలవారు పక్వులు.

యోగాగ్ని వల్ల దేహంలో శోకము అనేది లేకుండా పోయి

చైతన్యమవుతుంది. పార్థివదేహము జడము అపక్వము దుఃఖాన్నిస్తుంది. ధ్యానం చేసేవాడైనా సరే ఇంద్రియాలు అతడి స్వాదీనంలో ఉండవు. అతడు వివశుడవుతాడు. ఇంద్రియాలను గట్టిగా నియత్రించినా, నిగ్రహించినా, అవి బాధ పడతాయి. శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, మానసిక వ్యాధులు ఇంకా అనేక రకాలైన వాటిచేత శస్త్రాలు, అస్త్రాలచేత శరీరము బాధించబడుతుంది. దాంతో మనస్సు క్షోభిస్తుంది. ఇక్కడ ఒక్క విషయం బాగా గుర్తుంచుకోవాలి. **దేహావసానసమయంలో దేహి ఏ రూపాన్ని భావిస్తాడో, జీవుడు ఆ రూపాన్నే పొందుతాడు.** మరణించిన తరువాత మరుజన్మ ఏదౌతుంది అనేది అతడికి తెలియదు కాబట్టి ఈ జ్ఞానము వైరాగ్యము జీవుడికి కేవలము శ్రమమాత్రమే. శరీరం మీద పాకుతున్న చీమ జారిక్రింద పడుతుంది. తేలుకుట్టిన మానవుడు సుఖపడడు. మరి దేహాంతమున జీవి ఏ రకంగా సుఖపడతాడు?

ఎవరికైనా సరే. అహంకారం నశించినప్పుడే దుఃఖంకూడా నశిస్తుంది. రోగాలన్నీ నశిస్తాయి. అహంకారం లేకపోతే దుఃఖముండదు. లోకంలో జనులందరూ శరీరంతో జయించబడ్డారు. కాని యోగులు శరీరాన్ని జయించారు. అందుకే సుఖ దుఃఖాల ఫలము వారి కుండదు. ఇంద్రియాలు, మనస్సు, సుఖదుఃఖాలు, ఇవన్నీ జయించ బడినాయి. అతనికి దేనివల్లా బాధ అనేది ఉండదు. మహాభూతాలు, భూతతత్త్వాలు క్రమంగా సంహరించబడినాయి. యోగాగ్నితో సప్తధాతుమయమైన దేహం కూడా దహించబడింది. ఇప్పుడు మహాబలముగల ఈ దేహాన్ని దేవతలు కూడా గుర్తించలేరు.

ఇచ్ఛారూపుడైన యోగి అజరామరుడు. అచింత్యశక్తి గల యోగి

నానారూపాలు ధరిస్తాడు. వాటిని ఉపసంహరించుకుంటాడు. ఇతడికి యోగబలముంది. కాబట్టి మరణము పొందడు. ఇతడు హరునిచే మృతుడు. మరణించిన వాడికి మళ్ళీ మరణము ఎలా వస్తుంది. అందరికీ మరణమున్నచోట అతడు జీవించి ఉంటాడు. మూఢుడు ఎక్కడ జీవిస్తాడో, అక్కడ ఇతడు మరణిస్తాడు. అతడికి కర్తవ్యము లేదు. అతడు జీవన్ముక్తుడు.

కొంతమంది జ్ఞానులు విరక్తులైన వారుకూడా ఈ దేహంతో జయించబడతారు. (విశ్వామిత్రుడు) అలాంటి వారు పాపపుణ్యఫలితాన్ని అనుభవించాలి. ఆ తరువాత సిద్ధపురుషుడి సాంగత్యంతో మళ్ళీ యోగి అవుతాడు. అప్పుడు సంసారము నశిస్తుంది. ఇది శివభాషితము. కాబట్టి యోగం లేని జ్ఞానం మోక్షాన్నివ్వదు. జ్ఞానంలేని యోగం సిద్ధించదు. అనేక జన్మల జ్ఞానంతో యోగం సిద్ధిస్తుంది. యోగంవల్ల ఒక్కజన్మలోనే జ్ఞానం కలుగుతుంది.

కాబట్టి యోగంకన్న గొప్పది లేదు. యోగమార్గము మోక్షప్రదమైనది. చాలాకాలం పాటు జ్ఞానసముపార్జన చేసి ముక్తుడనైనాను అనుకుంటాడు. మనం చేసినంత మాత్రంచేత ఆ క్షణంలోనే ముక్తిరాదు. తరువాత ఎన్నో జన్మలు యోగంచేసి ముక్తుడవుతాడు. ఇలా యోగంవల్ల జనన మరణాలుండవు. అంటే పునర్జన్మ అనేది ఉండదు.

ప్రాణంతో సంబంధించిన చిత్తము అన్ని జీవలయందు ఉంటుంది. త్రాడుతో బంధించిన పక్షిలాగా ఈ మనస్సు అక్కడే తిరుగుతూ ఉంటుంది. అటువంటి మనసును జయించాలంటే ప్రాణమే ఉపాయము. తర్కంతోను, శాస్త్రంతోను, ముక్తితోను, మాటలతోను మనసు వశంకాదు. **మనసును జయించకుండా యోగి కావాలని**

ప్రయత్నించేవాడు పచ్చికుండని ఎక్కి సముద్రాన్ని **దాటాలనుకుంటున్నాడు.** యోగము వల్ల ఒక్క జన్మలోనే జ్ఞానం కలుగుతుంది. కాబట్టి సాధకుడు ముందుగా యోగాభ్యాసం చెయ్యాలి. యోగముకన్న గొప్పది లేదు. అని వివరించి ఓంకార ధ్యానము చెయ్యాలి అని చెబుతున్నారు. ఆ ధ్యానము యోగమార్గంలో ఏ రకంగా చెయ్యాలి? యోగమార్గం ఏది? అనే విసయాలు గురుముఖతః నేర్చుకుని సాధన చెయ్యాలి. పన్నెండు సంవత్సరాలు గురువుకు సేవచేసిన బ్రహ్మచారికి మాత్రమే ఈ విషయాలు చెప్పాలి అంటున్నాడు శంకరుడు. **కాబట్టి యోగంలో ఆసక్తి ఉన్న వారు గురువుగారి దగ్గర వీటిని అభ్యసించండి.** అంతేకాని మీకు మీరుగా యోగాభ్యాసం చెయ్యవద్దు. ఇబ్బందులు వస్తాయి.

# 88. వరాహోపనిషత్తు

ఈ ఉపనిషత్తు కృష్ణయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో ఐదు అధ్యాయాలు, 24 మంత్రాలు ఉన్నాయి. ఇందులో ముందుగా ఆత్మతత్త్వాన్ని చెప్పిన తరువాత యోగాన్ని చెబుతున్నారు.

ఋభుమహర్షి దేవమానము ప్రకారము 12 సంవత్సరాలు తపస్సు చేశాడు. వరాహస్వామి ప్రత్యక్షమై ఏంకావాలో కోరుకో అన్నాడు. దానికి ఋభుమహర్షి 'హే భగవాన్! నాకు ఏ కోరికా లేదు. బ్రహ్మవిద్యను ఉపదేశించు' అన్నాడు. చెప్పటం మొదలుపెట్టాడు వరాహస్వామి.

జ్ఞానేంద్రియాలు - 5, కర్మేంద్రియాలు–5, పంచప్రాణాలు–5, తన్మాత్రలు–5, మనస్సు బుద్ధి చిత్తము అహంకారము. 4. పంచ మహాభూతాలు–5, దేహత్రయము–3 అవస్థాత్రయము–3, త్రికాలాలు–3 వెరసి 38 షడ్భావ వికారాలు **అస్తి, జాయతే, వర్ధతే, పరిణిమతే, అపక్షీయతే, వినశ్యతి** ఆకలి దప్పిక శోకము మోహము జరామరణాలు వీటిని షడూర్ములు అంటారు. చర్మము, రక్తము, మాంసము, మేధ, మజ్జ, ఎముకలు, కామక్రోధ లోభ, మోహ, మదమాత్సర్యాలు. సత్వరజస్తమోగుణాలు, ప్రారబ్ధ, ఆగామి, సంచితకర్మలు, వచన దానాగమన విసర్గానంద పంచకము, సంకల్పము, అధ్యవసాయము, అభిమానము, అవధారణ, ముదిత, కరుణ, మైత్రి, ఉపేక్షా, దిక్కు వాయువు, అర్క, వరుణ, అశ్వనీదేవతలు, అగ్ని, ఇంద్రుడు, ఉపేంద్రుడు, మృత్యువు, చంద్రుడు, చతుర్వక్త్రుడు, రుద్రుడు, క్షేత్రజ్ఞుడు, ఈశ్వరుడు ఇలా మొత్తం తత్త్వాలు 96. ఈ తత్త్వాలను తెలుసుకున్న వాడు నన్ను చేరతాడు. అతడు ఏ ఆశ్రమంలో ఉన్నా, ఎలాంటివాడైనా

ముక్తి పొందుతాడు. ఇందులో సందేహము లేదు.

వర్ణాశ్రమ ధర్మాలు పాటించటంచేత, తపస్సువల్ల, గురువులను తృప్తిపరచటం వల్ల, సాధన చతుష్టయం వల్ల సాధకుడు జితేంద్రియుడై, అన్నింటియందు మమకారము వదలి సాక్షిచైతన్యమైన పరమేశ్వరుని యందు అహంతామతిని చేయవలెను. దుర్లభమైన మానవజన్మ ఎత్తి, అందులోను బ్రాహ్మణుడుగా జన్మించి, పరమేశ్వరుని యొక్క సచ్చిదానంద స్వరూపాన్ని తెలుసుకోలేని వాడు ముక్తుడు కాలేడు. నేను సుఖస్వరూపుడను. నేనే మహావిష్ణువును. స్వయంప్రకాశియైన ఆత్మను నేనే. అని సాధకుడు భావన చెయ్యాలి. ఈ రకంగా పరమేశ్వర స్వరూపాన్ని తెలుసుకున్న వాడికి బంధనాలు ఉండవు. అతడు కర్మకు బద్ధుడు కాడు. సర్వవ్యాపి అయిన పరమాత్మను జ్ఞాననేత్రము గలవాడు మాత్రమే దర్శించగలుగుతాడు. కళ్లు లేని వాడు ప్రకాశించే సూర్యుణ్ణి చూడలేడు. అలాగే అజ్ఞాని, పరమేశ్వరుణ్ణి దర్శించలేడు. నిర్గుణము, చిద్ఘనము అయిన స్వాత్మ రూపాన్ని తెలుసుకున్న తరువాత మానవుడు దేనికీ బభయపడడు. చిన్మాత్రము, సర్వవ్యాపి, నిత్యము, సంపూర్ణము, సుఖము, అవ్యయము అయినది సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపమే. అంతకన్న వేరయినది ఏదీలేదు. లోకం ఎప్పుడూ గ్రుడ్డివాడికి గ్రుడ్డిది. అదే నేత్రాలు కలవాడికి ప్రకాశవంతమైనది. అలాగే జగత్తు అజ్ఞానికి దుఃఖమయము, తత్త్వవేత్తకు ఆనందమయము. నేనే పరమేశ్వర స్వరూపాన్ని అని అద్వైత భావన చేసినప్పుడు ఇక బంధాలు ఎలా ఉంటాయి? బ్రహ్మజ్ఞాన సంపన్నుడు జగత్తంతా పరమేశ్వర స్వరూపంగానే చూస్తాడు.

ఈ విధంగా పరమేవ్వర స్వరూపాన్ని ఆకళింపు చేసుకున్న వాడు

కర్మలతో బంధింపబడడు. పరమాత్మ స్వరూపమే నేనుఅ ని తెలుసుకున్నవాడే జ్ఞాని. ఈ విషయం గ్రంథాలు చదివి, పెద్దలు చెబితే విని తెలుసుకోవటం కాదు. స్వానుభవంతో తెలుసుకోవాలి. స్వరూపజ్ఞానం గలవాడు దేనికీ బద్ధుడు కాదు. సర్వసాక్షియైన పరమాత్మను మనసా వాచా కర్మణా ఒక్కక్షణం భావించగలిగితే చాలు అన్నిబంధాల నుండి విముక్తుడవుతాడు. ఓ మహర్షీ! పరమహంస అయిన వాసుదేవుడనే నేను. సర్వసంగ నివృత్తమైన ఆత్మ గలిగినవాడు నన్ను పొందుతాడు. పాములాగా జనులతో సంబంధము వదలుకొన్నవాడు, శవంలాగా స్త్రీపట్ల కోరికలు లేనివాడు, విషయాలను విషంలాగా చూసేవాడు, మాత్రమే నన్ను తెలుసుకోగలుగుతాడు. పరమహంస అయిన వాసుదేవుడను నేనే. నేనే సత్యమైన పరబ్రహ్మని నాకన్న వేరైనది ఏదీలేదు. జీవాత్మ పరమాత్మ సమీపంలో ఉండటమే– ఉపానాసము. అంతేగాని శరీరాన్ని ఎండగట్టటం కాదు. అవివేకులు భోజనం మానేస్తే ఉపయోగంలేదు. పుట్టనుకొడితే పాము చస్తుందా? బ్రహ్మ ఉన్నది అని తెలుసుకోవటం పరోక్షజ్ఞానము. నేనే బ్రహ్మని అహంబ్రహ్మాస్మి అని తెలియటం ప్రత్యక్ష జ్ఞానం. ఆత్మసాక్షాత్కారము.

యోగి ఎప్పుడైతే తానే ఆత్మ అని తెలుసుకోగలుగుతాడో, అప్పుడే అతడు జీవన్ముక్తుడవుతాడు. మమ అంటే బంధము, నిర్మమ అంటే మోక్షము. అందుచేత బాహ్యచింతనగాని, అంతః చింతన గాని చెయ్యద్దు. అన్నింటినీ వదలి స్వస్థుడవు కావలసింది. ఓ మహర్షీ! కేవలము సంకల్పముచేతనే ఈ జగత్తు ఉన్నది. కాబట్టి సంకల్పాన్ని వదలి నిర్వికల్పాన్ని ఆశ్రయించి పరమపదాన్ని హృదయంలో భావన చెయ్యి. నీ ఆలోచనలు, సంభాషణ అన్నీ నాయందే ఉంచుము. అలాగే

కాలం వెళ్ళబుచ్చు. ఓ మహర్షీ! ఇక్కడ చిత్తున్నది. ఇది చిన్మాత్రము. చిన్మయము. నువ్వు చిత్తు. నేను చిత్తు. ఈ లోకాలు అన్నీ చిత్తే. అని భావించు. **రాగద్వేషాలు వదలివెయ్యి. కర్తృతత్వ భోక్తృత్వాలు వదలిపెట్టు. అప్పుడు మాత్రమే శాంతి అనేది లభిస్తుంది.**

సూక్ష్మనాడుల యందు బుద్ధిసంచారమే స్వప్నము. సంచార ధర్మంలేకపోతే స్వప్నం లేదు. పాముకుబుసానికి ప్రాణం లేదు. అందుచేత అది పుట్టలో పడి ఉన్నా పాము దాన్ని అభిమానించదు. అలాగే స్థూలసూక్ష్మ శరీరాలు అభిమానించ బడవు. అద్వైతము బోధపడితే వాసనలు నశించిపోతాయి. ప్రారబ్దము పూర్తి అయితే శరీరము నాశనమవుతుంది. కాబట్టి యోగసామ్రాజ్యము కోరేవాడు అన్ని ఆలోచనలు వదలిపెట్టి, సావధానమైన మనస్సుతో పరమాత్మను ధ్యానించాలి. ఇలా చెయ్యాలంటే ముందుగా యోగాభ్యాసము గురువుగారి దగ్గర అత్యంత శ్రద్ధతో నేర్చుకుంటే పరమేశ్వర స్వరూపాన్ని దర్శించగలుగుతాను అనే గట్టి భావనలో మనస్సు ఉండాలి.

కాబట్టి ఓ మహర్షీ! శ్రద్ధగా గురువుదగ్గర శ్రద్ధగా యోగప్రక్రియ ప్రారంభించవలసినది.

# 89. శాండిల్యోపనిషత్తు

ఇది అధర్వణ వేదంలోనిది. ఇందులో 3 అధ్యాయాలు 46 శ్లోకాలు ఉన్నాయి. యమనియమాలను అభ్యసించే యోగికోసం ఈ ఉపనిషత్తు చెప్పబడుతున్నది. ఇది కూడా అష్టాంగయోగమే.

ఒకసారి శాండిల్యుడు అనే మునీశ్వరుడు అధర్వణ మహర్షి దగ్గరకు వచ్చి అష్టాంగయోగాన్ని గురించి చెప్పమని అడిగాడు. అధర్వణముని చెప్పటం మొదలుపెట్టాడు.

1. యమ 2. నియమ 3. ఆసన 4. ప్రాణాయామ 5. ప్రత్యాహార 6.ధారణ 7. ధ్యాన 8. సమాదులు

ఇవి అష్టాంగాలు. ఇందులో యమము పది రకాలు, నియమములు పది రకాలు. ఆసనాలు ఎనిమిది. ప్రాణాయామాలు మూడు ప్రత్యాహారములు ఐదు. ధారణలు మూడు ధ్యానము రెండు విధాలు సమాధి ఒకటి. వీటన్నింటినీ గతంలో చెప్పుకున్నాం. కాని విభాగంలో తేడా ఉంది కాబట్టి మళ్ళీ చెబుతున్నాను. అంతే

**1. యమము :** ఇది పది రకాలు

1. అహింస 2. సత్యము 3. అస్తేయము (దొంగతనం చేయకూడదు) 4.బ్రహ్మచర్యము 5. దయ 6. ఆర్జవము (సరియైన నడవడి) 7. క్షమ 8. ధృతి 9. మితాహారము 10.శౌచము

**2. నియమములు :** ఇది పది రకాలు.

1. తపస్సు 2. సంతోషము 3. అస్తిత్యము 4. దానము 5. ఈశ్వర పూజనము 6. సిద్ధాంత శ్రవణము 7. హ్రీ 8. మతి 9. జపము 10. వ్రతము

అస్తిత్వము అంటే వేదోక్తమైన ధర్మాధర్మాల యందు విశ్వాసముంచటము.

హ్రీ అంటే – వేదంలో చెప్పిన లౌకిక మార్గమైన కుత్సితమైన కర్మలయందు సిగ్గు కలుగుట.

మతి – వేదం చెప్పిన విషయాలమీద శ్రద్ధ.

జపం – రెండు రకాలు 1. వాచకము 2. మానసము.

వాచకం మళ్ళీ రెండు రకాలు. 1. గట్టిగా చెప్పటం 2. నెమ్మదిగా చెప్పటం మానసిక జపము ఎక్కువ ఫలితాన్నిస్తుంది.

**3. ఆసనము :** ఇవి ఎనిమిది రకాలు.

1. స్వస్తికము 2. గోముఖము 3. పద్మము 4. వీరము 5. సింహము 6. భద్రము 7. ముక్తము 8. మయూరము

వీటిలో మీకు ఏ ఆసనంమీద ఆసక్తి ఉన్నదో, ఏది మీకు సుఖంగా ఉంటుందో ఆ ఆసనం వేసుకోవచ్చు అని చెబుతున్నాడు అధర్వణముని.

**4. ప్రాణాయామము :** ఇవి మూడు రకాలు

1. రేచకము 2. పూరకము 3. కుంభకము

**5. ప్రత్యాహారము :** ఇవి ఐదు రకాలు

1. విషయములలో సంచరించే ఇంద్రియాలను బలవంతంగా వెనక్కిలాగటము.

2. చూసిన ప్రతిదీ ఆత్మే అనే జ్ఞానము.

3. నిత్యవిహితమైన కర్మఫలత్యాగము.

4. విషయముల యందు విముఖత.

5. కాలివ్రేలు, చీలమండ, పిక్కలు, మోకాళ్ళు, తొడలు, పాయువు,

మేఢ్రము, నాభి, హృదయము, కంఠము, తాలువులు, ముక్కు, కనులు, భ్రూమధ్యము, లలాటము, మూర్ధము. వీటిలో ఆరోహణ, అవరోహణ క్రమంలో ప్రత్యాహారం చెయ్యాలి.

**6. ధారణ :** ఇది మూడు రకాలు.

1. ఆత్మయందు మనసును ధారణ చెయ్యటం
2. దహరాకాశమున, బాహ్యాకాశమున ధారణ చెయ్యటం
3. పంచభూతాల యందు ధారణ చెయ్యటం.

**7. ధ్యానము :** ఇది రెండు రకాలు

1. సగుణము 2. నిర్గుణము

వీటిలో సగుణము – మూర్తి ధ్యానము

నిర్గుణము – ఆత్మధ్యానము

**8. సమాధి :** ఆత్మని ఉన్నది ఉన్నట్లుగా ధ్యానం చెయ్యాలి.

మిగిలిన విషయాలన్నీ మండలబ్రాహ్మణోపనిషత్తు, దర్శనోపత్తులలో చెప్పినట్లుగానే ఉంటాయి. అందుకే మళ్ళీ చెప్పటం లేదు.

# 90. హంసోపనిషత్తు

ఇది శుక్లయజుర్వేదానికి సంబంధించినది

పూర్వకాలంలో గౌతముడు సనత్కుమారుని దగ్గరకు వెళ్ళి "ఓ మహానుభావా! నీవు సర్వధర్మాలు, శాస్త్రాలు తెలిసినవాడివి. కాబట్టి నిన్నొకటి అడుగుతున్నాను. బ్రహ్మవిద్యా ప్రబోధము ఏ ఉపాయంతో తేలికగా పొందవచ్చునో నాకు వివరించవలసింది" అని అడిగాడు. ఆ మాటలు విన్న సనత్కుమారుడు "మహర్షీ! లోకాలను అనుగ్రహించాలనే దృష్టితో పార్వతీదేవి పరమేశ్వరుణ్ణి గతంలో ఈ ప్రశ్న అడిగింది. అప్పుడు శివుడు **"ప్రపంచ కలనాది రహితమైన సన్మాత్రమే బ్రహ్మము"** అని చెప్పాడు. ఆ విషయాన్ని ఆవిడ నాకు చెప్పింది. ఇప్పుడు నేను నీకు చెబుతున్నాను. సావధానంగా ఆలకించవలసింది"

ఓ మహర్షీ! నువ్వు మహావేదాంతివి. బ్రహ్మనిష్ఠాగరిష్ఠుడివి. ఎల్లవేళల యందు 'హంస, హంస' అని ధ్యానం చేస్తుంటావు. అందుచేత నీకు ఆ పరమ హంసను గురించి చెబుతున్నాను.

హంస అనేది అన్ని ప్రాణులయొక్క శరీరము లందు కొయ్యలో ఉన్న నిప్పులాగా (అరణిలో ఉన్న అగ్నిలాగా) నువ్వులలో ఉన్న నూనెలాగా వ్యాపించి ఉన్నది. పాలలో ఉన్న నేతిని బయటకు తియ్యటానికి శ్రమపడినట్లే, ఇక్కడ కూడా శ్రమించాలి. దీనికి సాధనము యోగప్రక్రియ. కుండలినిని జాగృతం చెయ్యటం. అది ఎలా? అంటే

ఎడమకాలి మడమతో గుదాన్ని మూసి, ముక్కుతో గాలిని పూరించి, కుంభించి, మూలాధారము నుండి గాలిని పైకి లాగాలి. ఈ రకంగా చేసి మూలాధారంలో నిద్రావస్థలో ఉన్న కుండలిని జాగృతం

చెయ్యాలి. ఆ తరువాత సుషుమ్నను భేదించి, స్వాధిష్ఠానానికి వచ్చి అక్కడ మూడుసార్లు ప్రదక్షిణ చేసి, తరువాత మణిపూరకము చేరి, తరువాత అనాహతాన్ని చేరి, అక్కడ నుండి విశుద్ధి చక్రం చేరి అక్కడ ప్రాణవాయువును నిరోధించి ఆజ్ఞాచక్రం చేరి, అక్కడ నుండి బ్రహ్మరంధ్రం ప్రవేశించి "నేను తుర్యుడను" అని భావించినయోగి సాకారంలో తుర్యుడుగ, నిరాకాంలో తురీయాతీతుడుగ అవుతాడు.

ఈ రకంగా తురీయాతీతుడైనవాడే పరమహంస. అతడే పరవూత్మ. ఆ పరవూత్మ కొన్నికోట్ల సూర్యులకాంతితో ప్రకాశిస్తుంటాడు. అతనిచేతనే ఈ జగత్తంతా వ్యాపించబడి ఉన్నది. ఆ పరమాత్మ గనక జీవభావం పొందినట్లైతే 8 రకాల వృత్తులు కలుగుతాయి. జీవాత్మ అనాహతంలో ఉంటుంది. దానికి 12 దళాలుంటాయి. వాటిలో నాలుగు దళాలను హంసతో తాకలేము. మిగిలిన దళాలను సృజించినట్లైతే - అనగా - హంస (జీవుడు)

1. తూర్పు దళాన్ని అధిష్టిస్తే -పుణ్యకార్యములందు ఆసక్తి
2. అగ్నేయ దళాన్ని అధిష్టిస్తే -నిద్ర, అలసత్వము
3. దక్షిణ దళాన్ని అధిష్టిస్తే -క్రూరబుద్ధి
4. నైరుతి దళాన్ని అధిష్టిస్తే -పాపకార్యబుద్ధి
5. పశ్చిమ దళాన్ని అధిష్టిస్తే -ఆటపాటల యందాసక్తి
6. వాయవ్య దళాన్ని అధిష్టిసే-నడచుట యందాసక్తి
7. ఉత్తర దళాన్ని అధిష్టిస్తే -జ్ఞానులకు ఆత్మ విచారణ
   అజ్ఞానులకు కామరతి
8. ఈశాన్యదిశ దళాన్ని అధిష్టిస్తే-ఇహపర సుఖముల యందాసక్తి
9. దళముల మధ్య -వైరాగ్యము

10. కేసరముల యందు – జాగ్రదవస్థ

11. పద్మము కర్ణికయందు – స్వప్నావస్థ

12. పద్మముయొక్క రంధ్రము – నిద్రావస్థ

హృదయ కమలాన్ని వదిలితే తురీయుడవుతాడు. పరమాత్మలో లీనమైతే తురీయాతీతుడవుతాడు. ఈ రకంగా నిర్వికల్ప సమాధి సిద్ధించిన యోగి హృదయంలో ఆధారచక్రం నుంచి బ్రహ్మరంధ్రందాకా నాదము స్ఫటికములాగా నిర్మలంగా ఉంటుంది. అదే పరబ్రహ్మ.

అజపామంత్రానికి హంస – ఋషి అవ్యక్త గాయత్రి–ఛందస్సు.

పరమహంస – దేవత

హం – బీజం. సం – శక్తి. సోఽహం – కీలకం.

**అథ హంస ఋషిః । అవ్యక్తగాయత్రీ చ్ఛందః । పరమహంసోదేవతా । హం బీజం । సంశక్తిః । సోహం కీలకం ।**

**షట్సంఖ్యాహోరాత్రయో రేకవింశతి సహస్రాణి షట్ఛతాన్యధికాని భవంతి, సూర్యాయసోమాయ నిరంజనాయ, నిరాభాసాయా, తను సూక్ష్మం ప్రచోదయాత్**

ప్రతిరోజూ రాత్రి, పగలు కలిగి 21600 శ్వాసలు జరుగుతాయి. ఇదే జపము. దీనికి న్యాసము.

**హంసాం, హంసీం, హంసూం, హంసైం, హంసౌం, హంసః**

ఈ రకంగా న్యాసం చెప్పి హృత్పద్మంలో ఉన్న జీవాత్మని 'బ్రహ్మాస్మి'అని ద్యానించాలి.

యోగభావాన్ని పొందిన జీవుడికి సూర్యచంద్రులే బాహువులు,

ఓంకారమే - శిరస్సు

బిందువులతో కలసిన అకార, ఉకార, మకారాలే మూడు నేత్రాలు.

రుద్రుడు - ముఖము,

రుద్రాణి - పాదాలు.

ఈ రకంగా సగుణ, నిర్గుణ భేదములచేత ముముక్షువైన వాడు హంస ధ్యానం చెయ్యాలి. ఈ రకంగా జపం చెయ్యటం వల్ల హంసకన్న వేరొకటి లేదని అతడు నిశ్చయించుకుంటాడు.

ఈ రకంగా హంస మంత్రాన్ని ఒక కోటి జపం చేసినట్లైతే అనాహతంలో నాదబ్రహ్మము కలుగుతుంది. ఇది అనుభవంతో మత్రమే తెలుసుకోవాలి. ఈ నాదము కుడిచెవి యందు పుడుతుంది.

**అస్యైవ జపకోట్యా నాదమనుభవతి. నచదశ విధముపజాయతే**

**చిణి - ప్రథమః, చిణిచిణీతి ద్వితీయః**

**ఘంటానాద స్తృతీయః, శ్చంఖనాదశ్చర్థః**

**పంచమం తంత్రీనాదం, షష్ఠస్తాలనాదః**

**సప్తమోవేణునాదః, అష్టమో భేరీనాదః**

**నవమోమృదంగనాదః, దశమో మేఘనాదః**

**నవమం పరిత్యజ్య దశమమే వాభ్యసేత్**

మొదటి నాదము - చిణి. రెండవది - చిణిచిణి. 3. ఘంటానాదము 4.శంఖనాదము 5. వీణానాదము 6. తాళనాదము 7. వేణునాదము 8. భేరీనాదము 9. మృదంగము 10. మేఘనాదము.

ముముక్షువు వీటిలో మొదటి తొమ్మిదిని వదలి పదవదయిన మేఘనాద భావనలోనే అభ్యాసం చెయ్యాలి.

**ప్రథమే చించిణీగాత్రం ద్వితీయే గాత్రభంజనమ్**

**తృతీయేభేదనంయాతి, చతుర్ధేకంపతే శిరః**

**పంచమే స్రవతీతాలూ, షష్టే అమృత నిషేవణమ్**

**సప్తమే గూఢవిజ్ఞానం పరావాచా తథాఽష్టమే.**

**అదృశ్యం నవమేదేహం, దివ్యం చక్షు స్తథాఽమలమ్.**

**దశమంచ పరంబ్రహ్మ భవేద్బ్రహ్మాఽత్మ సన్నిధౌ**

1. చిణి శబ్దం వినిపించినప్పుడు – దేహం ఊగిపోతుంది.
2. చించిణీ శబ్దం వినిపించినప్పుడు – దేహం విరుస్తున్నట్లుంటుంది
3. ఘంటానాదం వినిపించినప్పుడు – భేదము కలుగుతుంది హృత్కమలం వికసిస్తుంది.
4. శంఖనాదం వినిపించినప్పుడు – శిరస్సు కంపిస్తుంది.
5. తంత్రీనాదం వినిపించినప్పుడు – అంగిలి యందు స్రవిస్తుంది
6. తాలనాదం వినిపించినప్పుడు – సూర్యచంద్ర మండలాలు ఏకమై స్రవించ ప్రారంభించిన అమృతపానము

7. తంత్రీనాదం వినిపించినప్పుడు – బ్రహ్మజ్ఞానం
8. భేరీనాదం వినిపించినప్పుడు – పరావాక్కతో సంయోగము కలవాడు, సర్వజ్ఞుడు అవుతాడు
9. మృదంగనాదము వినిపించినప్పుడు– అదృశ్య దర్శనము, దివ్యదర్శనము కలుగుతాయి.
10. మేఘనాదము వినిపించినప్పుడు – పరంబ్రహ్మ స్వరూపుడవుతాడు

ఆత్మజ్ఞానం చేత మనసు నిర్మూలనం కాగా, సంకల్ప వికల్పాలు, పుణ్యపాపాలు, జ్ఞానాగ్నిలో దహించబడతాయి. అప్పుడు పరబ్రమ్మ వ్యక్తావ్యక్త ప్రపంచము నందు సచ్చిదానందత్మకుడై ప్రకాశిస్తాడు.

# 91. అమృతబిందూపనిషత్తు

ఇది కృష్ణయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో 22 మంత్రాలున్నాయి. మనస్సు–పరబ్రహ్మ అనే విషయాన్ని వివరిస్తోంది ఈ ఉపనిషత్తు.

**మనోహిద్వివిధం ప్రోక్తం శుద్ధం చా శుద్ధమేవచ**

**అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామవివర్జితమ్ ॥1**

మనస్సు శుద్ధము, అశుద్ధము అని రెండు రకాలు కామసంకల్పము (కోరికలు) గలది అశుద్ధము. కోరికలు లేనిది శుద్ధము.

**మనఏవ మనుష్యాణాం, కారణం బంధమోక్షయోః**

**బంధయావిషయాసక్తం, ముక్త్యైనిర్విషయగ్ం స్మృతమ్ ॥2**

మానవుల బంధమోక్షాలకు కారణము మనస్సే అవుతున్నది. విషయాసక్తి గల మనస్సు బంధాల వైపుకు, విషయాసక్తి లేని మనస్సు మోక్షంవైపు నడుస్తుంది.

**యతోనిర్విషయస్యాస్య, మనసో ముక్తిరిష్యతే**

**అతోనిర్విషయం నిత్యం, మనః కార్యం ముముక్షుణా ॥3**

ఏ కారణంచేత విషయాసక్తము కాని మనస్సుకు మోక్షం చెప్పబడిందో, ఆ కారణంచేతనే ముముక్షువు యొక్క మనస్సు విషయ రాహిత్యం చెయ్యాలి.

**నిరస్తవిషయాసంగం సంనిరుద్ధం మనోహృది**

**యదాయత్యాత్మనోభావం తదా తత్పరం పదం ॥4**

విషయముల యందు ఆసక్తిని వదిలిని వెంటనే, హృదయమందు మనసు నిరోధింపబడి, ఆత్మరూపము పొందుతున్నది.

**తావదేవ నిరోద్దవ్యం, యావద్ధృదిగతం క్షయమ్ ।**
**ఏతద్ జ్ఞానం చ ధ్యానం చ శేషోన్యాయశ్చ విస్తరః ॥5**

హృదయంలో సంకల్పాలు క్షయం అయ్యేదాకా మనసును నిరోధించాలి. ఇదే జ్ఞానము. ఇదే ధ్యానము. మిగిలినవన్నీ అనవసరమే.

**నైవచింత్యం నచాచింత్యం నచింత్యం చింత్యమేవతత్**
**పక్షపాత వినిర్ముక్తం, బ్రహ్మ సంపద్యతే తథా ॥6**

ఆ బ్రహ్మము చింతింప వీలులేనిది. చింతించదగినది కాదు. చింతింప తగినదే. ఈ రకమైన జ్ఞానము కలిగినప్పుడు సాధకుడు పక్షపాతము లేనట్టి బ్రహ్మము అవుతాడు.

**స్వరేణ సంధయేద్యోగ మస్వరం భావయేత్పరమ్**
**అస్వరేణానుభావేన, నభావో భావఇష్యతే ॥7**

యోగాన్ని నాదంతో చేర్చాలి. బ్రహ్మను నాదరహితంగా భావించాలి. స్వరరహితంగా భావన చెయ్యటంచేత ఉన్నది (ఆ బ్రహ్మము) లేకపోవుట లేదు.

**తదేవం నిష్కళం బ్రహ్మ, నిర్వికల్పం నిరంజనం**
**తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా, బ్రహ్మసంపద్యతే ధ్రువమ్ ॥8**

ఇటువంటి ఆ బ్రహ్మము నిర్వికల్పము, నిరంజనము అయి ఉన్నది. ఆ బ్రహ్మమే నేను అని తెలుసుకోగలిగిన వాడు తానే బ్రహ్మ అవుతున్నాడు.

**నిర్వికల్ప మనంతంచ, హేతుదృష్టాంత వర్జితమ్**

**అప్రమేయ మనాదించ, యత్ జ్ఞాత్వా ముచ్యతే బుధః ॥9**

ఏ బ్రహ్మము నిర్వికల్పమైనదో, కారణము లేనిదో, ప్రమాణము లేనిది ఊహింప నలవి కానిదో, అనాదియైనదో, దానిని జ్ఞానియైన వాడు తెలుసుకొని బంధముల నుంచి విముక్తుడవుతున్నాడు.

**ననిరోధో నచోత్పత్తి ర్నబద్ధో న చ సాధకః ।**

**న ముముక్షుర్నవై ముక్త ఇత్యేషా పరమార్ధతా ॥10**

నాశనము లేదు. ఉత్పత్తి లేదు. బద్ధుడు కాడు. ఉపాసకుడు కాదు. ముముక్షువు కాదు. ఇదే నిశ్చయమైన పరమార్ధము.

**ఏక ఏవాత్మా మంతవ్యో జాగ్రస్వప్న సుషిప్తిషు**

**స్థానత్రయ వ్యతీతస్య పునర్జన్మ న విద్యతే ॥11**

జాగ్రస్వప్న సుషుప్త్యావస్థల యందు ఉన్నది ఒక్కటే ఆత్మ. ఈ మూడు అవస్థలు దాటిన వాడికి పునర్జన్మము లేదు.

**ఏకఏవహి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః**

**ఏకధా బహుధాచైవ దృశ్యతే జలచంద్రవత్ ॥12**

ఆత్మ ఒక్కటే. అది అన్ని భూతములందు ఉన్నది. నీటియందు చంద్రునిలాగా ఒకడుగాను, అనేకముగాను కనిపిస్తుంది. (ఒక సూర్యుండు సమస్త జీవులకు తానొక్కక్కడై తోచు పోలిక)

**ఘట సంవృతమాకాశం నీ యమానేఘటే యధా**

**ఘటో నీయతే నాకాశః స్తద్వజ్జీవోనభోపమః ॥13**

ఘటాన్ని తీసుకుపోయేటప్పుడు అందులోని ఆకాశాన్ని తీసుకుపోవటం లేదు. ఘటాన్ని మాత్రమే తీసుకుపోతున్నాము. అలాగే

జీవికూడా ఆకాశానికి సమానంగానే ఉన్నాడు.

**ఘటవద్వివిధాకారం, భిద్యమానం పునః పునః ।**
**తద్భేదేచ నజానాతి, సజానాతి చ నిత్యశః ॥14**

ఘటంలాగానే శరీరంకూడా వివిధాకృతులు గలది. మళ్ళీ మళ్ళీ నాశనమవుతున్న శరీరము తన నాశనాన్ని గురించి తెలుసుకోవటంలేదు. ఆత్మకు మాత్రమే ఈ విషయం తెలుసును.

**శబ్దమాయావృతోనైవ తమసోయాతి పుష్కరే ।**
**భిన్నే తమసి చైకత్వ మేక ఏవాను పశ్యతి ॥15**

పంచభూతాలతో కూడిన మాయచేత ఆవరించబడిన వాడైన మానవుడు ఆ అంధకారము నుండి బయటకు వచ్చి బ్రహ్మను తెలుసుకోలేక పోతున్నాడు. అంధకారం నుంచి బయటకు వచ్చినట్లైతే ఏకమైన స్థితిని ఒక్కడుగానే చూడగలుగుతాడు.

**శబ్దాక్షరం పరంబ్రహ్మ, తస్మిన్ క్షీణే యదక్షరమ్**
**తద్విద్వానక్షరం ధ్యాయే, ద్యదిచ్ఛే చ్ఛాన్తి మాత్మనః ॥16**

పరబ్రహ్మ శబ్దరూపంలో అక్షరంగా ఉన్నది. ఆ శబ్దము (వేదము) సమాప్తి నొందిన తరువాత మిగిలేది ఏదో, ఆ అక్షరపరబ్రహ్మను ఆత్మశాంతి కోరేవాడు ధ్యానం చెయ్యాలి.

**ద్వేవిద్యే వేదతవ్యేతు, శబ్దబ్రహ్మ పరంపచయత్**
**శబ్దబ్రహ్మణి నిష్ణాతః, పరంబ్రహ్మాధిగచ్ఛతి ॥17**

రెండు విద్యలు తెలుసుకొన్నవాడు (1. శబ్దబ్రహ్మ 2. పరబ్రహ్మ) పరబ్రహ్మను పొందుతాడు.

**గ్రంథమభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞాన తత్పరః**

**పలాలమివధాన్యార్థీ త్యజేద్గ్రంథ మశేషతః ॥18**

బుద్ధిశాలియైనవాడు వేదశాస్త్రాలను అభ్యసించి, జ్ఞానము - తెలివి, విజ్ఞానము - అనుభవజ్ఞానము లందు గట్టి ప్రయత్నము (తత్పరత) గలవాడై ఉండాలి. ధాన్యము కావలసిన వాడు పొట్టును వదిలి బియ్యం తీసుకున్నట్లుగా వేదశాస్త్రాలు వదలి ఆత్మతత్త్వాన్ని మాత్రమే స్వీకరించాలి.

**గవామనేక వర్ణానాం క్షీరస్యాప్యేక వర్ణతా**

**క్షీరవత్పశ్యతే జ్ఞానం లింగినస్తు గవాం యథా ॥19**

ఆవుల రంగులు వేరైనా, వాటి పాలరంగు ఒక్కటే. జ్ఞానము పాలవలె ఉన్నది. లింగములు (ప్రపంచంలోని వివిధ రూపములు) ఆవులలాగా ఉన్నాయి.

**ఘృతమివ పయసి నిగూఢం భూతే భూతేచ వసతి విజ్ఞానమ్**

**సతతం మనసి మంథయితవ్యం మనోమంథాను భూతేన॥20**

పాలలో నేయి దాగి ఉన్నట్లుగానే ఈ భూతములందు విజ్ఞానము దాగి ఉన్నది. అరణి మథించినట్లుగా మనసును మథించి నిష్కళంకముగ, నిశ్చలముగ, శాంతముగ ఉండే ఆ బ్రహ్మము నేనే అని తలచి పరబ్రహ్మను వెలువరించాలి.

**జ్ఞాననేత్రం సమాధాయ చోద్ధరేద్వహ్ని వత్పరమ్ ।**

**నిష్కలం నిశ్చలం శాంతం తద్బ్రహ్మాహమితి స్మృతమ్ ॥21**

జ్ఞానదృష్టిగల స్థిరచిత్తుడు మనసును మథించి నిష్కళంకమైన, నిశ్చలమైన, శాంతమైన బ్రహ్మను నేనే అని తలచాలి.

**సర్వభూతాని వాసంచ యద్భూతేషు వసత్యపి**

**సర్వానుగ్రాహకత్వేన, తదస్మ్యహం వాసుదేవః**

**తదస్మ్యహం వాసుదేవః ఇత్యుపనిషత్ ॥22**

సకల భూతములకు ఆధారమైనవాడు, అన్ని భూతములందు ఉండువాడు, అన్ని భూతములను రక్షించువాడైన వాసుదేవుడే నేను. అని ఉపనిషత్తు చెబుతున్నది.

# 92. పాశుపతబ్రహ్మోపనిషత్తు

ఇది అధర్వణ వేదానికి సంబంధించిన ఉపనిషత్తు. ఇందులో పదిమంత్రాలు ఉన్నాయి. తత్త్వాలను వివరిస్తోంది ఈ ఉపనిషత్తు.

సృష్టి ప్రారంభంకాకముందు స్వయంభువైన బ్రహ్మ సృష్టి చెయ్యాలి అని సంకల్పించాడు. ఆ సమయంలో ఒకసారి కామేశ్వరుడు, వైశ్రవణుడు, బ్రహ్మపుత్రుడు, వాలఖిల్యుడు స్వయంభువు దగ్గరకు వెళ్ళి "ఓ బ్రహ్మదేవా! జగత్తులకు విద్య ఏది? దేవత ఎవరు ? జాగ్రదాది అవస్థలకు దేవుడు ఎవరు? కాల ప్రమాణమెంత? ఎవరి ఆజ్ఞతో సూర్యచంద్రులు ప్రకాశిస్తున్నారు? ఎవరి మహిమవల్ల గగన స్వరూపము ఏర్పడుతోంది? ఇవన్నీ వినాలి అనుకుంటున్నాము. కాబట్టి మాకు తెలియచేయవలసినది" అన్నారు. ఆ మాటలు విన్న బ్రహ్మదేవుడు చెబుతున్నాడు.

సంపూర్ణ జగత్తులకు మాత్రుకావిద్య రెండు మూడు వర్ణాలతో కూడినది. కాని చతుర్మాత్రాత్మికమైన ఓంకార రూపిణి నాకు ప్రాణాత్మికమైన దేవత. ముల్లోకాలకు కూడా ప్రభువును నేను ఒక్కడినే. అన్ని యుగాలు కూడా నా వశంలోనే ఉంటాయి. రాత్రింబవళ్ళు నేను కల్పించినవే. రవియొక్క ప్రకాశము, చంద్రుడు, నక్షత్రాల కాంతి అంతా నా రూపమే. ఆకాశము నా త్రిశక్తి మాయాస్వరూపము. నాకన్న వేరుగా ఎవరూ లేరు. రుద్రుడు తమోగుణం కలవాడు. సత్త్వగుణ ప్రధానుడు విష్ణువు. రజోగుణ ప్రధానుడు బ్రహ్మ. ఇంద్రాదిదేవతలు మూడుగుణాలు కలిగి ఉన్నారు. 'కేవలము సాత్వికుడు' ఎవరూ లేరు. అఘోరమనేది సర్వసాధారణమైన రూపము. అన్ని యాగాలకు కర్త పశుపతి అయిన రుద్రుడు. రుద్రుడు యాగదేవుడు. విష్ణువు – అధ్వర్యుడు. ఇంద్రుడు హోత, మనస్సు–బ్రహ్మ.

హంస లోపల బయట అంతటా సంచరిస్తుంది. సంచరించటానికి అవకాశం లేని ప్రదేశంలో కూడా సంచరిస్తుంది. బంగారురంగులో ఉంటుంది. 96 తత్త్వములు అనే తంతువులతో వ్యక్తమవుతుంది. తొమ్మిది తత్త్వములతో మూడు ఆ వృతులు గలది. అది త్రిమూర్త్యాత్మకము. అగ్నిత్రయాత్మకము. చిద్గ్రంధి బంధము గలది. లోపల బయటకూడా అగ్ని గలది. యజ్ఞాంగ లక్షణ బ్రహ్మస్వరూపము హంస. ఉపవీత లక్షణమైన సూత్రాలు యజ్ఞాలు. బ్రహ్మలక్షణ యుక్తము యజ్ఞసూత్రము. యజ్ఞసూత్రానికి సంబంధించినదే బ్రహ్మయజ్ఞము. దాని స్వరూపము. అంగాలు. మాత్రలు. మనోయజ్ఞానికి హంస యజ్ఞసూత్రము, ప్రణవమే బ్రహ్మసూత్రము. బ్రహ్మ యజ్ఞమయము, మోక్షమయము, బ్రహ్మ సంధ్యక్రియ. మనస్సే - యాగము. సంధ్యాక్రియ. మనోయాగ లక్షణము. బ్రాహ్మణుడు అంటే యజ్ఞసూత్ర, ప్రణవ, బ్రహ్మయజ్ఞ క్రియాయుక్తుడు. దేవతలు ఎప్పుడూ బ్రహ్మచర్యాన్నే ఆచరిస్తారు.

హంస సూత్రచర్యలే యజ్ఞాలు. హంసకు, ప్రణవానికి తేడాలేదు. హంస ప్రార్ధనాకాలాలు మూడు. త్రికాలాలు, త్రివర్ణాలు, త్రేతాజ్ఞుల అనుసంధానమే యాగము. త్రేతాజ్ఞుల ఆత్మాకృతి వర్ణ ఓంకార హంసానుసంధానమే అంతర్యాగము. చిత్స్వరూపంలో ఉండే తన్మమయము తురీయ స్వరూపము. ఆదిత్యుడిలో ఉండే జ్యోతి హంస స్వరూపమే. యజ్ఞాంగము బ్రహ్మసంపత్తి. బ్రహ్మప్రవృత్తిలో ప్రణవ హంస సూత్రంతో ధ్యానము చేస్తారు.

ఇప్పుడు వాలఖిల్యుడు స్వయంభువు నడుగుతున్నాడు. హంస సూత్రాలెన్ని, దాని ప్రమాణమెంత? హృదయంలో హంస కిరణాల సంఖ్య 96. ఈ విషయం తెలిసిన వారు అమృతఫలం కలవారు.

వాజపేయము. పశుహర్త అధ్వర్యుడు, పరమాత్మ పశుపతి దేవత, స్వాధ్యాయ యుక్తులైన బ్రాహ్మణులు బ్రహ్మోపనిషత్తులను, బ్రహ్మను ఆచరిస్తారు. అందరికి ఈ బ్రహ్మయజ్ఞము ముక్తిక్రమము.

హంస అంతర్గూఢమైన ప్రమ కలది. ప్రమ అంటే యధార్థ జ్ఞానము. ప్రమాణము నుండి బయటకు పోయినది. విద్యుక్త లక్షణము కల బాహ్యమైన బ్రహ్మసూత్ర పదము తెలియతగినది. హంసాత్మకమైన ప్రణవ జ్ఞానము తెలియతగినది. ఇది తెలిసినంత మాత్రంచేతనే మానవుడు స్వయంగా శివుడు, పశుపతి అయి సర్వానికి సాక్షి అవుతాడు. అందరి మనస్సు అతని చేతనే ప్రేరణ చేయబడుతున్నది. అవయవాలన్నీ అతనిచేతనే ప్రేరణ చేయబడుతున్నాయి. ఇతనికి ప్రేరణ అనేది మాయతో వస్తుంది అంతేకాని స్వాభావికము కాదు. ఆ పురుషుడు తెలిసినదానికన్న, తెలియని దానికన్న ఇతరమైన వాడు. తర్క ప్రమాణము లేకుండా ఎవరు బ్రహ్మను తెలుసుకుంటారో వారు అన్నింటినీ తెలుసుకుంటారు. ప్రత్యగాత్మ పరంజ్యోతి, పరమాత్మ యందు మాయలేదు. విద్య, అవిద్య అనేవి వ్యావహారిక దృష్టివల్లనే కలిగాయి. అంతేకాని ఇంకొక రకంగా మాత్రంకాదు. ఇక్కడ కేవలము తత్త్వమే ఉన్నది. ఇంకేవీ లేవు. ఈ విషయం తెలిసిన వాడికి వర్ణము లేదు. ఆశ్రమము లేదు. ధర్మము లేదు. అధర్మము లేదు. విధి నిషేధము ఏదీలేదు.

ఎప్పుడైతే బ్రహ్మము స్వయంగా ప్రకాశిస్తుందో, అప్పుడు దుఃఖము ఉండదు. పరమాత్మ జగత్తును జీవాది రూపంలో చూస్తున్నా అతడు చూడనట్లే. చిద్రూపమైన వస్తువు బ్రహ్మమే. పరమాత్మకు ఏ తేడాలు ఉండవు. అంతటా తానే ఉంటాడు. వస్తువు, అవస్తువు. అంతా

బ్రహ్మమే. అందుకనే బ్రహ్మవేత్త సత్యజ్ఞాన మనంతమైన బ్రహ్మస్వరూపాన్నే దర్శిస్తాడు. పరబ్రహ్మ సాక్షాత్కారము పొందిన వాడికి మరుజన్మ ఉండదు.

# 93. మహావాక్యోపనిషత్తు

ఇది అధర్వణ వేదానికి సంబంధించినది.

భగవంతుడైన చతుర్ముఖ బ్రహ్మ అపరోక్షానుభవాన్ని మాత్రమే తెలియచేసే ఈ ఉపనిషత్తును తనయొక్క స్వానుభవంతో వ్యాఖ్యానిస్తున్నాడు.

ఇది రహస్యోపనిషత్తులలో కెల్ల అత్యంత రహస్యమైనది. సామాన్య మానవుడికి చెప్పతగినది కాదు. సత్వగుణ సంపన్నుడు, అంతర్ముఖుడైన వాడు, గురువును శుశ్రూష చెయ్యటంలో ఆసక్తి గలవాడికి మాత్రమే ఉపదేశించతగినది.

ముముక్షువు సాధన చతుష్టయాన్ని సాధించిన తరువాత, సంసార బంధానికి, మోక్షానికి, విద్య, అవిద్య అనేవి రెండు కళ్ళు అని తెలుసుకుని, అనాత్మ పదార్థాన్ని తీసివేసి, బ్రహ్మపదార్థం మాత్రమే తీసుకుని, దేహాన్ని విడిచి ముక్తుడవుతున్నాడు.

ఆత్మనిష్ట కలగాలి అంటే విద్వాంసుడికి నాలుగు లక్షణాలుండాలి. వాటినే సాధన చతుష్టయము లేదా సాధన సంపత్తి అంటారు. ఇవి మోక్షసాధనాలు. అవి

**1. నిత్యానిత్య వివేకము :** ఏది అసత్యము? ఏది సత్యము. ఏది నిత్యము? ఏది అనిత్యము? అనే విషయ పరిజ్ఞానము. బ్రహ్మాసత్యం జగన్మిథ్య. కనిపించే జగత్తంతా మిధ్య బ్రహ్మ ఒక్కటే సత్యము నిత్యమైనది శాశ్వతమైనది.

**2. వైరాగ్యము :** ఇహలోక సుఖాలపట్ల విముఖత. శరీరం మొదలు బ్రహ్మలోకం వరకు ఉండే భోగ్య పదార్థాలన్నింటి మీద ఏహ్యభావన కలగటం.

**3. షట్సంపత్తి :** ఇవి మొత్తం ఆరు.

**1. శమము -** అంతరింద్రియ నిగ్రహము

**2. దమము -** బాహ్యేంద్రియ నిగ్రహము. ఇంద్రియాలను వాటివాటి విషయాల నుంచి మళ్ళించి, వాటి స్థానాలలో వాటిని నిలిపి వేయటము.

**3. ఉపరతి -** కర్మపరిత్యాగము, బాహ్యవిషయాలను చిత్తవృత్తులతో ఆశ్రయించకుండా ఉండటము.

**4. తితిక్ష :** శీతోష్ణ సుఖదుఃఖాలను సహించే శక్తి. చింత బాధ మొదలైనవి లేకుండా, సమస్త సుఖదుఃఖాలు, కష్టాలు సహించటం. ఎదుర్కోగలిగిన సామర్థ్యం ఉండి కూడా అపకారికి ఉపకారం చెయ్యటం.

**5. శ్రద్ధ :** గురువునందు, ఆయన చెప్పే విషయాల యందు అచంచల విశ్వాసము.

**6. సమాధి :** బుద్ధిని ఎప్పుడూ శబ్ద బ్రహ్మము నందే నిలిపి ఉంచటము.

**4. ముముక్షుత్వము :** మోక్షం సాధించాలనే కోరిక. అహంకారం దగ్గర నుండి బ్రహ్మవరకు శరీరానికి అంతా అజ్ఞానంతో కల్పించబడిన బంధాలే. ఆత్మజ్ఞానం సంపాదించటం ద్వారా ఈ బంధనాలను త్రెంపి వేయచ్చు.

అవిద్యతో కనిపించే ఈ ప్రపంచము తమోదృష్టి గలది. బ్రహ్మ మొదలు స్థావరముల వరకు గల శరీర సమూహము అంతా తమస్సే. ఈ లోకము అంతము లేని సకల బ్రహ్మాండము. ఈ స్వాప్న లోకము సకల వేదములయందు చెప్పబడిన వివిధ కర్మలయందు ప్రీతిని

కలిగిస్తుంది. ఆత్మ అంధకార స్వరూపుడు కాదు. కుత్సితమైన ఈ ప్రపంచానికి లోపల బయట కూడా ప్రకాశింపచేసే విద్యాస్వరూపుడు. జ్యోతిర్మండల స్వరూపుడు. ఈ ఆత్మ అపరబ్రహ్మ కాదు. ప్రకాశిస్తున్న ఆదిత్యుడే బ్రహ్మ. ఈ రకంగా అజపాను సంధాన పురస్సరముగా అనులోమ విలోమ రూపాలయిన ఉచ్ఛ్వాసనిశ్వాసల చేత (ప్రాణాపానముల చేత) 'హంసః సోఽహం' అని చాలాకాలం జపించాలి. ఈ రకంగా సమ్యజ్ఞానాన్ని ఆర్జించి, త్రివృత్ స్వరూపమయిన బ్రహ్మను ధ్యానించాలి. అప్పుడు సచ్చిదానంద స్వరూపమయిన పరమాత్మ స్వయంగా ఆవిర్భవిస్తాడు.

ఈ రకంగా ఆర్జించిన జ్ఞానము ఒక్కసారిగా ఉదయించిన వేలాది సూర్యుల కాంతితో సమానంగా ఉంటుంది. పరిపూర్ణమయిన సముద్రంలాగా, బ్రహ్మస్వరూప రసముతో పరిపూర్ణమైనందు వలన నశింపనిదై ఉన్నది. ఈ రకమైన తత్త్వజ్ఞాన వృత్తిని సమాధి అనటానికి వీలుకాదు. అలాగని యోగసిద్ధి అనికూడా అనరాదు. మనోవలయము అనటానికి వీలుకాదు. ఈ వృత్తిని ప్రత్యక్ బ్రహ్మైక్యమని చెప్పవచ్చును. విద్వాంసుడు సమస్త రూపాలు, నామాలు మాయామయములు అని తెలుసుకుని, వదలివేసి, ఏ బ్రహ్మన్ని కోరుతున్నాడో, ఆ బ్రహ్మము అంధకారాంతము నందు ఆదిత్య వర్ణరూపముగా ఉన్నది అని తెలుసుకోవాలి. చతుర్ముఖ బ్రహ్మ ఈ విషయాన్ని ఎలా వివరించాడో, ఇంద్రుడు ఆ ఆత్మను ఏ రకంగా తెలుసుకున్నాడో, ఆ రీతిగా తెలుసుకున్న విద్వాంసుడు అమృతస్వరూపుడవుతున్నాడు. మోక్షానికి ఇంకొక మార్గం లేనేలేదు. ఈ రకంగానే పూర్వకాలంలో దేవతలు కూడా జ్ఞానయజ్ఞము చేత యజ్ఞస్వరూపుడయిన ఆత్మను యజనము

చేసి జీవన్ముక్తులైనారు. అటువంటి మంచి గుణాలు గల మహాత్ములు (పూర్వీకులు జీవన్ముక్తులు) ఎక్కడున్నారో అటువంటి వారితో చేరతారు.

**సోఽహమర్కః పరంజ్యోతి రర్కజ్యోతి రహగ్ం శివః ఆత్మజ్యోతి రహిగ్ం శుక్ర స్సర్వజ్యోతి రసావహమ్ ఎతదధర్వశిరోధీతే.**

పరంజ్యోతిసు అనే ఆ జ్యోతిస్సే ఆదిత్యరూపంలో ఉన్న నేను అగుచున్నాను. ఏదైతే అర్కజ్యోతిసు అని, శివర్కాజ్యోతిసు అని పరమాత్మ స్వరూపంగా చెప్పబడుతున్నదో, అటువంటి పరంజ్యోతిసుడను నేనే అవుతున్నాను. అధర్వ వేదానికి శిరస్సువంటి ఈ ఉపనిషత్తును ఉదయం పారాయణ చేస్తే రాత్రి చేసిన పాపాలు నశిస్తాయి. రాత్రి పారాయణ చేస్తే పగలుచేసిన పాపాలు పోతాయి. రెండు పూట్లా పారాయణ చేస్తే జన్మజన్మల పాపాలు పోతాయి. మధ్యాహ్న కాలంలో సూర్యుడికి అభిముఖంగా కూర్చుని పారాయణ చేస్తే చతుర్వేదములు పారాయణ చేసిన ఫలితము వస్తుంది. శ్రీమహావిష్ణువు సాన్నిధ్యం కూడా కలుగుతుంది.

# 94. తేజోబిందూపనిషత్తు (అఖండైకరసచిన్మాత్ర స్వరూపము)

పరమేశ్వరుడు అఖండైకరస చిన్మాత్ర స్వరూపుడు అంటారు కదా ! ఆ స్వరూపం ఏమిటో చూడండి.

అఖండైక రసము అంటే సంపూర్ణమైన ఒకే ఆనందరసము గలది. అని అర్థం. ఈ ఆనందము ఖండఖండాలుగా కాకుండా సంపూర్ణంగా ఉంటుంది. ఈ లోకంలో శిష్టాచార సంపన్నుడు, సిరిసంపదలు, భోగభాగ్యాలు ఉన్నవాడు, వేదవేదాంగవిదుడు, మంచి యౌవ్వనంలో ఉన్న మానవుడు పొందే ఆనందము మానుషానందము. దానికి ఒకటి ప్రక్కన పదిహేడు సున్నాలు పెడితే ఎంత అవుతుందో, అన్ని రెట్లుంటుంది బ్రహ్మానందం. అటువంటి సంపూర్ణమైన, అఖండైక రసమైన ఆనంద డోలికలలో విహరించేవాడు చిన్మాత్ర స్వరూపుడు. అతడే పరబ్రహ్మ.

దృశ్యమానమైన ఈ జగత్తు అఖండైక రసము. తాను అఖండైక రసమే. మంత్రము, క్రియ, జ్ఞానము, జలము, భూమి, ఆకాశము, శాస్త్రము, త్రయీవిద్య, బ్రహ్మ, జీవుడు, అన్నీ అఖండైక రసాలే. సృష్టికర్త అయిన బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, అహం అనబడే నేను (జీవుడు) తత్ అనబడే పరమేశ్వరుడు, గురువు, శిష్యుడు, మనస్సు, దేహము, బుద్ధి, చిత్తము, అహంకారము, విద్య, సుఖము, పరము అన్నీ అఖండైక రసాలే. అఖండైక రసముకన్న వేరైనది ఏదీలేదు. నేను, నువ్వు, స్థూలము, సూక్ష్మము, జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము, తల్లి, తండ్రి, భ్రాత, పతి, పత్ని అన్నీ అఖండైక రసాలే.

శాంతము, గుణము, సాక్షి, స్నేహితుడు, బంధువు, మిత్రుడు,

రాజు, రాజ్యము, పురము, ప్రజలు, జపము, ధ్యానము, పదము, గ్రాహ్యము, మహత్తు, జ్యోతిస్సు, హవిస్సు, హోమము, జపము, స్వర్గము, నరకము, ఘనము, భోజ్యము, తాను అన్నీ అఖండైక రసమైన చిన్మాత్ర స్వరూపాలే. ఈ సర్వము చిన్మాత్రయే. అఖండైక రసమే. ఈ లోకమంతా చిన్మాత్ర స్వరూపమే. నువ్వు, నేను, ఆకాశము, భూమి, వాయువు, అగ్ని, జలము, త్రిమూర్తులు, మూర్తామూర్తములు (రూపముగలవి, రూపము లేనివి) అంతా చిన్మాత్రయే. భూతము, భవ్యము, భవిష్యత్తు అంతా చిన్మాత్రయే. ద్రవ్యము, కాలము చిన్మాత్ర. జ్ఞానము, జ్ఞేయము చిన్మాత్ర. జ్ఞాతచిన్మాత్ర. సంభాషణ ఏదైతే ఉన్నదో అదంతా చిన్మాత్ర. సత్తు అసత్తు. ఆది అంతము, చిన్మాత్రయే. గురుశిష్యులు, దృక్కు దృశ్యము అన్నీ చిన్మాత్రయే.

లోకంలో దృశ్యమానమైన సర్వవస్తువులు, స్థూలదేహము, సూక్ష్మదేహము, కారణదేహము, అంతా చిన్మాత్రయే. పాపపుణ్యాలుకూడా చిన్మాత్రయే. చిన్మాత్రకన్న వేరైనది లేదు. చిన్మాత్రకన్న సంకల్పము లేదు. వేదనము (తెలివి) లేదు. మంత్రం లేదు, దేవతలేదు, వ్యావహారికము లేదు. పరబ్రహ్మ లేదు. ఏదీలేదు. ఎవడూ లేడు.

చిన్మాత్రకన్న మాయలేదు. పూజనము లేదు. మంతవ్యము (ఆలోచింపదగినది, ఊహించతగినది) లేదు. మౌనము లేదు, అమౌనము లేదు. వైరాగ్యము లేదు. సర్వమూ చిన్మాత్రయే. కంటికి కనిపించనిది చిన్మాత్రయే. వేదాంతమంతా చిన్మాత్రయే. చిన్మాత్ర కన్న గమనము లేదు. మోక్షము లేదు. లక్ష్యము అంతకన్నా లేదు. సర్వము చిన్మాత్రయే. అఖండైక రసమైన పరబ్రహ్మ చిన్మాత్రకన్న వేరుకాదు.

శాస్త్రమునందు, నాయందు, నీయందు, ఈశ్వరునియందు, అఖండైకరసుడనైన నేను ఉన్నాను అని తెలుసుకున్నవాడు సకృత్ (వెంటనే) అద్వైత సిద్ధాంత జ్ఞానముతో ముక్తి పొందుతాడు. బ్రహ్మజ్ఞానము రాగానే స్వయముగా తానే గురువవుతాడు.

చిన్మాత్ర అంటే పరబ్రహ్మకన్న వేరు కాదు. ఛాందోగ్యోపనిషత్తులో బ్రహ్మతత్త్వ విజ్ఞానము నాలుగు పాదములుగా ఉన్నది. అంటూ ఈ విశాల విశ్వంలో నాలుగు దిక్కులూ బ్రహ్మతత్త్వములో ఒక భాగము.

భూమి, ఆకాశము, సముద్రాలు, నదులు, పర్వతాలు అన్నీ రెండవ భాగము.

సూర్యుడు, చంద్రుడు, విద్యుల్లతలు, అగ్ని మూడవ భాగము. ఇక నాల్గవ భాగం. ప్రాణం బ్రహ్మ, దృష్టి బ్రహ్మ, శ్రవణం బ్రహ్మ. మనస్సు బ్రహ్మ అని చెప్పబడింది. అంతేకాదు.

భూమి, సూర్యుడు, చంద్రుడు, ఆ పరబ్రహ్మయొక్క రూపాంతరాలే. సూర్యునిలోను, చంద్రునిలోనూ నీలోనూ ఉన్న తత్త్వము ఒక్కటే. దశదిశలు, నక్షత్రాలు, నేల, నీరు, నింగి, వీటిలో ఉన్న తత్త్వమంతా ఒక్కటే. ఆకాశంలోని మెరుపులో ఏ తత్త్వమైతే ఉన్నదో అదే నీలోనూ, నాలోనూ, చరాచర జగత్తంతా వ్యాపించి ఉన్నది. అదే పరబ్రహ్మ తత్త్వము. చిన్మాత్ర స్వరూపము. అఖండైక రసము. దీనిని తెలుసుకున్నవాడే మహాజ్ఞాని.

## తేజోబిందూపనిషత్తు (ఆత్మానుభవము)

ఆత్మానుభవాన్ని వివరిస్తోంది **తేజోబిందూపనిషత్తు.**

ఆత్మదర్శనమైనవాడు ఈ విధంగా ఆలోచిస్తాడు. అతని అనుభవం

ఈ రకంగా ఉంటుంది. నేను పరబ్రహ్మ స్వరూపుడను. జ్ఞానరూపుడను. పరముడను, కేవలము శాంతరూపుడను. చిన్మయుడను. నిత్యరూపుడను, శాశ్వతుడను, సత్యరూపుడను, నేను కలిసిఉన్నాను. నేను విడిచిఉన్నాను. సర్వజీవస్వరూపుడను, చిదాకాశమయుడను.

నేను సత్పరానందరూపుడను చిత్పరానందరూపుడను. వాక్కుకు, మనస్సుకు గోచరము కానివాడను. ఆత్మానందరూపుడను. సత్యానందరూపుడను. ఆత్మారామ స్వరూపుడను. ఆత్మను, సదాశివుడను. ఆత్మప్రకాశరూపుడను. ఆత్మజ్యోతిని, రసమును, ఆదిమధ్యాంత రహితుడను, ఆకాశ సదృశుడను. నిత్యశుద్ధుడను, చిదానందుడను, సత్తామాత్రుడను, నిత్యబుద్ధుడను, ఏకసచ్చిదానందమును, సర్వాతీతుడను, రూపాతీతుడను. పరమైన ఆకాశ విగ్రహుడను భూమానందస్వరూపుడను, భాషాహీనుడను, సర్వాధిష్ఠాన రూపుడను, దేహభావ హీనుడను, చింతాహీనుడను, చిత్తవృత్తి హీనుడను. చిదాత్మైకరసుడను, ద్రుగ్రూపుడను. పూర్ణరూపుడను, నిత్యతృప్తుడను. నేనే బ్రహ్మను. సర్వమూనేనే. చైతన్యము నేనే జడము నేనే. గొప్పదైన ఆకాశ స్వరూపిని నేనే. నేనే ఆత్మను. పరాత్పరుడను. నేను ఎవరోలాగా ప్రకాశిస్తుంటాను. నేను శరీరములాగా భాసిస్తాను.

నేను శిష్యునిలాగా భాసిస్తాను. లోకత్రయాశ్రయుడను. త్రికాలములకు అతీతుడను. వేదములచే ఉపాసింపదగినవాడను నేనే. శాస్త్రంతో నిర్ణయింపబడే వాడను నేనే. చిత్తములో ఉన్నవాడను నేనే. నేను లేనిది ఎక్కడా లేదు. భూమికూడా లేదు. దానికన్న అతిరిక్తమైనది ఏదీలేదు. నేను బ్రహ్మను, సిద్ధుడను, నిత్యశుద్ధుడును, నిర్గుణుడును,

కేవలము ఆత్మరూపిని, నిరాకారుడను, కేవలము బ్రహ్మమాత్రుడను అజరుడను, అమరుడను.

నాకు నేనే ప్రకాశిస్తాను. నాకు నేనే సదాత్మకుడను. స్వయముగా ఆత్మయందున్నాను. నాకు పరాగతి నేనే. స్వయముగానే భుజిస్తాను. స్వయముగానే క్రీడిస్తాను. స్వయముగా జ్యోతిస్సు రూపాన్ని. స్వయముగానే మహారూపాన్ని నా ఆత్మయందు నేను క్రీడిస్తాను. నా ఆత్మయందే అన్నీ చూస్తాను. స్వాత్మయందు సుఖాసీనుడనై, స్వాత్మమాత్రాశిష్టుడనై ఉంటాను. స్వచైతన్యమునందు స్వయముగా ఉంటాను. స్వాత్మ రాజ్యమందు సుఖమందు రమిస్తాను. స్వాత్మ సింహాసనమునుండి స్వాత్మకన్న ఇతరమైన దానిని చింతించను.

చిద్రూపమాత్రమైన బ్రహ్మను. సచ్చిదానంద స్వరూపుడను. అద్వయుడను. నేను ఆనందఘనుడను. నేను కేవలము బ్రహ్మను. నేను ఎప్పుడూ సర్వశూన్యుడను. ఆనందవంతుడను, నిత్యానందస్వరూపుడను, ఆత్మాకాశుడను. హృదయాకాశమున చిదాదిత్య స్వరూపుడను నేనే. ఆత్మచే, ఆత్మయందు తృప్తుడను. అరూపుడను. అవ్యయుడను. ఏకసంఖ్యావిహీనుడను, నిత్యము ముక్త స్వరూపుడను. ఆకాశముకన్న సూక్ష్మమైన వాడిని. ఆద్యంతములు లేనివాడను. సర్వప్రకాశరూపుడను. సత్తా మాత్రస్వరూపుడను. శుద్ధమోక్ష స్వరూపుడను. సత్యానంద స్వరూపుడను. జ్ఞానానంద ఘనుడను. విజ్ఞానమాత్ర రూపుడను. సచ్చిదానంద లక్షణుడను. ఈ సర్వజగత్తు బ్రహ్మమాత్రమే. బ్రహ్మ కన్న వేరైనది ఏదీలేదు. అదే నేను. సదానంద స్వరూపుడను, సనాతనమైన బ్రహ్మను నేనే. నీవు అనేది అతడు అనేది నాకన్న వేరుగా ఏదీలేదు. నేనే పరమశివుడను.

నేను అతిభావ స్వరూపుడను. సుఖాత్మకుడను. నాకు సాక్షిత్వములేదు. నేనే సనాతనమైన ఆత్మను. ఆదిశేషుడు నేనే. నామరూపాలు లేనివాడను నేనే. ఆనందవిగ్రహుడను నేనే. ఇంద్రియాభావ రూపుడను. సర్వాభావరూపుడను. బంధ విముక్తిహీనుడను. శాశ్వతానంద విగ్రహుడను నేనే.

ఆది చైతన్యమాత్రుడను. అఖండైకరసుడను. వాక్కుకు, మనస్సుకు అగోచరుడను సుఖవంతుడను. అన్ని ప్రదేశాలయందు పూర్ణుడను. భూమానందమయుడను. తృప్తి రూపుడను. ఉత్కృష్ఠమైన అమృతరసుడను. అద్వితీయుడను. సత్తును అసత్తును. నేనే బ్రహ్మను. సంశయములేదు. సర్వశూన్య స్వరూపుడను. సకలాగమములందు గోచరుడను. ముక్తుడను. మోక్షరూపుడను నిర్వాణ (మోక్ష) సుఖరూపుడను.

సత్యవిజ్ఞానమాత్రుడను. సన్మాత్రుడను. ఆనందముకలవాడను. తురీయాతీత రూపుడను. నిర్వికల్పరూపుడను. అజుడను. రాగములేనివాడను. నిరంజనుడను. శుద్ధుడను, బుద్ధుడను. నిత్యుడను. విభుడను. ఓంకారానికి అర్ధరూపమైనవాడను. నిష్కళంకమయుడను చిదాకార స్వరూపుడను. నేను లేదు. అతడు నేను కాదు. నేను ఏ స్వరూపముకాను. నిర్వ్యాపార స్వరూపుడను. నిరంజనుడను. నిరాభాసుడను. మనస్సునుకాను. ఇంద్రియాలు కాను. బుద్ధినికాను. వికల్పముకాను. దేహత్రయమును కాను. (స్థూల సూక్ష్మ కారణదేహాలు) స్వప్నరూపముకాను. సుషుప్తి అంతకన్నా కాను. తాపత్రయరూపము కాను. ఈషణత్రయముకాను. నాకు శ్రవణము లేదు. చిదాత్మ విషయకమైన మననము సిద్ధికై నాకులేదు. నాకు సజాతీయ పదార్ధము

లేదు. విజాతీయ పదార్థములేదు. స్వగతము లేదు.

మనోరూపము అసత్యము. బుద్ధిరూపము అసత్యము. అహంకారము అసత్యము. నేను నిత్యుడను. శాశ్వతుడను. దేహత్రయము, కాలత్రయము, గుణత్రయము అంతా అసత్తే. నేను సత్యాత్మకుడను. శుచియైనవాడను. శ్రుతము, వేదము, శాస్త్రము, అంతా అసత్తే. నేనొక్కడనే చిదాత్మకుడను. సత్యము, మూర్తిత్రయము అసత్తు. సర్వభూతములు అసత్తు. సర్వతత్త్వములు అసత్తు. నేను. సర్వమూ వ్యాపించినవాడను. నేనే శివుడను.

గురువులేదు. శిష్యుడులేదు. మంత్రములేదు. దృశ్యములేదు. దృక్కులేదు. నేను మాత్రమే ఉన్నాను. చింత్యమైనది, న్యాయమైనది, హితమైనది, ఏదీలేదు. ప్రాణములన్నీ అసత్తే. భోగములన్నీ అసత్తే. చూడబడేది, వినబడేది అంతా అసత్తే. కార్యము అకార్యము అసత్తే. నష్టమైనది ప్రాప్తమైనది కూడా అసత్తే.

సుఖము, దుఃఖము రెండూ అసత్తు. (లేవు) సర్వమూ అసన్మయము. పూర్ణము. ఆ పూర్ణము కూడా లేదు. ధర్మము అసత్తే అధర్మమూ అసత్తే. స్వరూపము అసత్తే. సర్వరసము అసన్మయము, సర్వగంధము, సర్వఅజ్ఞానము, అంతా అసత్తే. సన్మాత్రము నేను. ఆత్మసాక్షాత్కారము పొందినవాడు ఈవిధంగా ఆత్మానుభవము పొందుతాడు. జ్ఞానియైనవాడు ఎప్పుడూ స్వాత్మమంత్రాన్నే చూడాలి. స్వాత్మమంత్రాన్నే అభ్యసించాలి. 'అహం బ్రహ్మాస్మి' (నేనే బ్రహ్మను) అనే మంత్రము కనిపించే పాపాన్ని నశింపచేస్తుంది. ఇతర మంత్రాలను నాశనం చేస్తుంది. దేహదోషాలను నశింపచేస్తుంది. జన్మపాపాన్ని నశింపచేస్తుంది. మృత్యుపాశాన్ని, ద్వైతదుఃఖాన్నీ నశింపచేస్తుంది ఈ మంత్రము.

‘అహం బ్రహ్మాస్మి’ అనే మంత్రం భేదబుద్ధిని, చింతను, దుఃఖములను నశింప చేస్తుంది. బుద్ధివ్యాధిని, చిత్తబంధాన్ని నశింపచేస్తుంది. సర్వశోకాలను నశింపచేస్తుంది. కామాదులను, క్రోధవృత్తిని, సంకల్పాలను, కోటిదోషాలను, సర్వతంత్రాలను నశింపచేస్తుంది.

ఈ మంత్రం అజ్ఞానాన్ని నశింపచేస్తుంది. ఆత్మలోకజయాన్నిస్తుంది. ఇది ఊహింపశక్యము కాని సుఖాన్నిస్తుంది. ఈ మంత్రం అనాత్మజ్ఞానమనే రాక్షసుణ్ణి సంహరిస్తుంది. అనాత్మగిరులను ఎగరగొడుతుంది. అనాత్మాసురులను హరించి వేస్తుంది. ఈ మంత్రము జ్ఞానానందాన్ని కలిగిస్తుంది. మోక్షాన్నిస్తుంది. ఇది సప్తకోటి మంత్రాలకన్న అధికమైనది. కోటిజన్మలలో చేసిన పాపాలను పోగొడుతుంది.

ఈ రకంగా ‘అహంబ్రహ్మాస్మి’ (నేనే పరబ్రహ్మను) అని భావించినవాడు సర్వపాపాలనుంచి, సర్వరోగాల నుంచి, సర్వదోషాలనుంచి, విముక్తుడై శాశ్వతమైన ఆనందాన్ని పొందుతాడు. అతడికి పునర్జన్మ ఉండదు.

*దీంతో యోగోపనిషత్తులు సమాప్తము*

శ్రీ

# పార్థసారథీయము

# చతుర్వేదభాష్యము

## (ఉపనిషత్తులు)

### (సన్యాసోపనిషత్తులు)



ప్రముఖ శ్రీవిద్యా ప్రచారకులు
అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,
ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, మెంఫిస్, అమెరికా ఆస్థాన విద్వాంసులు,
డా॥ క్రోవి పార్థసారథి

# 95. సన్యాసోపనిషత్తులు

చతురాశ్రమాలలోను సన్యాసాశ్రమం నాల్గవది ఆఖరుదీ కూడా. ఇది చాలా పవిత్రమైనది. సన్యాసము అంటే – మంచి నడవడి అని అర్ధం. పూర్వకాలంలో ఎక్కువమంది బ్రాహ్మణులు సన్యసించే వారు. అలా సన్యసించిన వారికి భార్యాబిడ్డలు, బంధువులు, మిత్రులతో ఏ రకమైన సంబంధాలు ఉండవు. ఒంటరిగా అడవులలో తిరుగుతూ సత్యాన్వేషణలో కాలం గడిపేవారు. కొంతమంది ఆశ్రమాలు నిర్మించుకుని, అక్కడే ఉంటూ తత్త్వజ్ఞానంతోనే కాలం వెళ్ళపుచ్చేవారు. వీలైనంత వరకు ప్రజలకు తత్త్వాన్ని బోధిస్తుండేవారు. బ్రాహ్మణులు మాత్రమే సన్యాసం స్వీకరించాలి. క్షత్రియులు, వైశ్యులు వానప్రస్థంలో ఆగిపోతారు. శూద్రులకు సన్యాసార్హత లేదు. ఇది ఆ రోజులలో సంప్రదాయం. ఇవాల్టిరోజున సమాజం మారిపోయింది. అనేక రకాల మార్పులు వచ్చినాయి. తత్త్వజ్ఞాన సముపార్జన చేసినవారు, దాన్ని ప్రచారం చేస్తున్న వారిలో శూద్రులు అనేకమంది ఉన్నారు. జ్ఞానవైరాగ్యాలు లేకుండా సన్యసించిన వారు అనేకమంది తమ వికృతచేష్టలతో నవ్వులపాలవుతున్నారు. వీరిలో కొంతమంది జైలుకు వెళ్ళిన సందర్భాలు కూడా ఉన్నాయి. ఇలాంటి వారంతా సన్యాసము అనే పేరుకే మచ్చ తెస్తున్నారు. సన్యాసులంతా ఇంతే అనుకునే స్థితికి కూడా సన్యాసాన్ని తీసుకువస్తున్నారు. ఇటువంటి పరిస్థితిలో సన్యాసం గురించి వేదం ఏం చెబుతోందో చూద్దాం.

చతురాశ్రమాలలోను సన్యాసాశ్రమము చాలా ఉన్నతమైనది, పవిత్రమైనది సంఘంలో సన్యాసికి ఉన్న గౌరవము చాలాగొప్పది. ప్రజలదృష్టిలో అతడు సర్వసంఘ పరిత్యాగి. పరమేశ్వరస్వరూపుడు.

సన్యాసాన్ని గురించి చెప్పే వాటిని సన్యాసోపనిషత్తులు అంటారు. ఇవి మొత్తం 17 ఉన్నాయి. చతురాశ్రమాలలో చివరిది సన్యాసము. నిరంతరము సత్యాన్వేషణలో కాలం గడిపేదే సన్యాసము. మోక్షమార్గంలో చరింపచేసేది సన్యాసము. అటువంటి సన్యాసము ఎన్ని రకాలుగా ఉంటుంది? సన్యాసి జీవన విధానమేమిటి? మొదలైన విషయాలను వివరించి చెప్పేవే సన్యాసోపనిషత్తులు.

సన్యాసం ఒకరిస్తే పుచ్చుకునేది కాదు. జ్ఞానవైరాగ్యాలు సిద్ధించిన తరువాత మాత్రమే సన్యసించాలి. సన్యాసం అంటే కేవలం కాషాయబట్టలు ధరించటం కాదు. నియమనిష్టలతో శరీరాన్ని శుష్కింపచేస్తూ చతుర్విధ పురుషార్థాలలో ఆఖరుదయిన మోక్షం కోసం ప్రయత్నించాలి.

సన్యాసి అయినవాడు ఇందుకు విరుద్ధంగా ప్రవర్తిస్తే సమాజంలో అవమానం పొందుతాడు. 'సన్యాసులంతా ఇంతే' అని జనులనుకునే ప్రమాదం సంభవిస్తుంది. సంప్రదాయం భ్రష్టు పట్టి పోతుంది.

## సన్యాసోపనిషత్తులు

సన్యాసాశ్రమం గురించి, సన్యాసులు, వారి జీవనవిధానాల గురించి చెప్పేవి సన్యాసోపనిషత్తులు. ఇవి మొత్తం 17 ఉన్నాయి.

| ఉపనిషత్తు | వేదము |
|---|---|
| 1. బ్రహ్మోపనిషత్తు | కృష్ణయజుర్వేదము |
| 2. అవధూతోపనిషత్తు | కృష్ణయజుర్వేదము |
| 3. సన్యాసోపనిషత్తు | సామవేదము |
| 4. కఠరుద్రోపనిషత్తు | కృష్ణయజుర్వేదము |
| 5. కుండికోపనిషత్తు | సామవేదము |

| | | |
|---|---|---|
| 6. | పరమహంసోపనిషత్తు | శుక్లయజుర్వేదము |
| 7. | మైత్రేయోపనిషత్తు | సామవేదము |
| 8. | జాబాలోపనిషత్తు | శుక్లయజుర్వేదము |
| 9. | నారద పరివ్రాజకోపనిషత్తు | అధర్వణవేదము |
| 10. | నిర్వాణోపనిషత్తు | ఋగ్వేదము |
| 11. | భిక్షుకోపనిషత్తు | శుక్లయజుర్వేదము |
| 12. | తురీయాతీతోపనిషత్తు | శుక్లయజుర్వేదము |
| 13. | పరమహంస పరివ్రాజకోపనిషత్తు | అధర్వణ వేదము |
| 14. | పరబ్రహ్మోపనిషత్తు | అధర్వణ వేదము |
| 15. | అరుణికోపనిషత్తు | సామవేదము |
| 16. | యాజ్ఞవల్క్యోపనిషత్తు | శుక్లయజుర్వేదము |
| 17. | శాట్యాయనోపనిషత్తు | వుక్లయజుర్వేదము |

ఇప్పుడు ఉపనిషత్తులు చూద్దాం.

# 96. సన్యాసము

సన్యాసము అంటే మంచి నడవడి అని అర్థం. అంతవరకు మానవుడు విద్యాభ్యాసం చేసి గృహస్థాశ్రమం స్వీకరించాడు. యజ్ఞయాగాదికర్మలు చేశాడు. సంసార బాధ్యతలు నెరవేర్చాడు. వానప్రస్థం స్వీకరించాడు. తరువాత సన్యసించాడు. ఈ లోకంలో మానవుడి వయస్సు వందసంవత్సరాలుగా చెప్పబడుతోంది. దాన్ని నాలుగుభాగాలుగా చేస్తే మొదటి పాతికసంవత్సరాలు బ్రహ్మచర్యము అక్కడ నుంచి యాభైసంవత్సరాల వరకు గృహస్థాశ్రమము. అక్కడ నుంచి డెబ్బైఐదు సంవత్సరాల వరకు వానప్రస్థము. ఆ తరువాత సన్యాసము. సుమారుగా సంవత్సరాలు లెక్కలోకి తీసుకోవాలి. ఆ రోజుల్లో సన్యసించే వారు ఎక్కువగానే ఉండేవారు. అయితే సన్యసించిన వారంతా నిజంగానే సత్యాన్వేషణలో ఉండేవారు. అయితే ఇక్కడ గుర్తు పెట్టుకోవలసిన విషయం ఒకటుంది. సన్యాసము అనేది ఒకరు ఇచ్చేది కాదు. ఇది ఏమీ టిఫిన్‌ప్లేటో, టీకప్పో కాదు ఇంకరిస్తే పుచ్చుకోవటానికి. ఇక్కడ చిన్న ఉదాహరణ. ఒకసారి నేను ఏదో పనిమీద హైదరాబాదు వెడదామని బయల్దేరాను. మచిలీపట్నం – సికింద్రాబాద్ రైల్లో టికెట్ రిజర్వు అయింది. రాత్రి 9.50 గం॥ వచ్చి 10.20కి బయలుదేరుతుంది రైలు. పదిగంటలకల్లా స్టేషనుకు వచ్చాను. రైలు అనివార్యకారణాలవల్ల గంట ఆలస్యం అన్నారు. అప్పుడే చెన్నై నుంచి 'పినాకిని' వచ్చి ఒకటో నంబరు ప్లాట్ ఫారమ్ మీద ఆగింది. అందులోంచి దిగాయి రెండు కొద్దిగా తెలిసిన ముఖాలు. వాళ్ళు నన్ను చూసి సరాసరి నా దగ్గరకి వచ్చారు. నాతో ఏదో చెప్పాలి అని వాళ్ళముఖం చెబుతోంది. దగ్గరకి వచ్చి 'నమస్కారం స్వామీ! ఊరు వెడుతున్నారా?' అన్నారు. 'హైదరాబాద్ వెళ్ళాలి. రైలు గంట

ఆలస్యంట. సరే ఇంతకీ మీరెక్కడి నుంచి వస్తున్నారు?' అన్నాను.

'హరిద్వార్ నుంచి స్వామి!' ఠక్కున సమాధానం చెప్పారు.

'మరి పినాకినిలోదిగారు?' అడిగాను అనుమానంగా

'హరిద్వార్ వెళ్ళి, అటునుంచి చెన్నై వెళ్ళి వస్తున్నాము' అన్నారు.

'ఏమిటి? హరిద్వార్‌లో ఏమైనా పుష్కరాలా?' అడిగాను.

'కాదు స్వామి! అక్కడ ఒక స్వామిజీ రమ్మంటేను' కొంచెం నెమ్మదిగా అన్నారు.

'స్వామీజీ మిమ్మల్ని రమ్మన్నారా?' అనుమానంగా అడిగాను.

'అవును స్వామి! సన్యాసం ఇస్తాను రమ్మన్నారు' చాలా గర్వంగా చెప్పారు.

'మరి తిరిగి వచ్చేశారు? ఇవ్వలేదా?'

'అసలేం జరిగిందంటే మేం నలుగురు స్నేహితులం. ఒక స్వామీజీని కలిసాం. మా నలుగురికీ సన్యాసంఇస్తాను అన్నారు.

'తీరా వెడితే మాలో ఇద్దరికిమాత్రం ఇచ్చి, మాఇద్దరినీ నాలుగునెలల తరువాత రమ్మన్నారు' అన్నారు కొంచెం నిరుత్సాహంగా

'బహుశః వాళ్ళిద్దరికీ ఇచ్చేప్పటికి ఆయన దగ్గర సన్యాసం అయిపోయిందేమో?' అన్నాను. ఈ మాట వాళ్ళకి కొంచెం ఇబ్బందిగా అనిపించినట్లుంది. వెంటనే 'అదేమిటి స్వామి! సన్యాసం అయిపోవటమేమిటి?' అన్నాడు. వారిలో ఒకతను నన్ను మ్రింగేలా చూస్తూ

'పోనీ! ఉండి కూడా లేదంటున్నాడేమో? లోపల బీరువాలోపెట్టి తాళం వేశాడేమో? జాగ్రత్తగా చూశారా?' అన్నాను. ఈసారి

విపరీతంగా కోపం వచ్చింది వాళ్ళకి.

'ఏమిటి స్వామి! మీరేదో తెలిసినవవాళ్ళని చెబితే మీరు అలాఅంటారు?'

'మరేమనాలి? సన్యాసం కోసం మీరు నలుగురు వెళ్ళారు. ఆయనేమో ఇద్దరికి ఇచ్చారు. మిమ్మల్ని తరువాత రమ్మన్నారు. ఇంతకీ డబ్బులు ఎంతిచ్చారు?'

'సన్యాసం ఇస్తే తలకి ఇరవైఐదు వేలు' ఇబ్బందికరంగా, చెప్పటం ఇష్టం లేనట్లుగా చెప్పారు.

'పోనీ అంత కన్న ఎక్కువిస్తాం అనకపోయారా. మీక్కూడా ఇప్పుడే ఇచ్చేవారేమో 'బ్లాక్'లో

ఏమీ మాట్లాడలేక అదేంటి స్వామీ? మరీను. అన్నారు.

'సరే సన్యాసం అంటే ఏం చేస్తారు?' ఏమీ తెలియనట్లే అడిగాను.

'ఏం లేదు. నున్నగా గుండు గీయిస్తారు. కట్టుకోవటానికి కాషాయ బట్టలిస్తారు. అడుక్కోవటానికి భిక్షాపాత్ర ఒకటి చేతికి ఇస్తారు.' అన్నారు వాళ్ళు. ఒకపని చెయ్యండి. మీకు అభ్యంతరం లేకపోతే సన్యాసం నేనిస్తాను. మా యింటికి రండి. మా సందు చివర ఒక మంగలి ఉన్నాడు. గుండునున్నాగా గీస్తాడు. ఎంతనున్నగా అంటే జీవితంలో మళ్ళీ వెంట్రుకలు మొలవ్వు. కృష్ణానదిలో స్నానంచేయించి కాషాయ వస్త్రంకూడా ఒకటిస్తాను. అడుక్కోవటానికి ఒక రేకుడబ్బా కూడా ఇస్తాను. చాలా?' అన్నాను. 'మీరు అలా అనటం ఏమీ బాగాలేదు స్వామీ!' అన్నారు. ఏమీ అనలేక

'మరి ఇంకేం అనకుంటారు చెప్పండి? సన్యాసం ఇవ్వటానికి ఆయనెవరు? పుచ్చుకోవటానికి మీరెవరు? ఇదేమైనా కాఫీగ్లాసా !

ఒకరిస్తే పుచ్చుకోవటానికి?

సన్యాసము అంటే లౌకిక విషయాలను, సంసార సుఖాలను పూర్తిగా వదలివేసి, ఆత్మసాక్షాత్కారం కోసం తపించటం. దీనికి ముఖ్యంగా కావలసింది జ్ఞానము, వైరాగ్యము. సన్యాసం నాలుగు రకాలుగా ఉంటుంది.

1) కర్మ సన్యాసం 2) వైరాగ్య సన్యాసం 3) జ్ఞాన సన్యాసం 4) జ్ఞాన వైరాగ్య సన్యాసం

ఇక మీ విషయానికొస్తే

**1. కర్మసన్యాసం :** కర్మలు చేస్తున్నవాడు ఆ కర్మలు వదిలేసి సన్యసించటం. ఇంతవరకు మీరు చేసిన కర్మలు ఏవీలేవు వదిలెయ్యటానికి

**2. వైరాగ్య సన్యాసం :** ఎప్పుడు వైరాగ్యం వస్తే అప్పుడే సన్యసించవచ్చు. కానీ మీకేమీ వైరాగ్యం రాలేదు. ఇప్పట్లో రాదుకూడా.

**3. జ్ఞానసన్యాసం :** జ్ఞానియైన వాడు సన్యసించవచ్చు. కాని మీకు ఏ రకంగాను జ్ఞానం లేదు.

**4. జ్ఞానవైరాగ్య సన్యాసం :** ఇందులో ఏ ఒక్కటీ మనకి లేదు అనుకున్నాం కదా. మరి మీకు సన్యాసం ఏమిటి?

బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు ఎవరైనా సరే ఎప్పుడు వైరాగ్యం కలిగితే అప్పుడు సన్యసించవచ్చు. వీరందరిలోను జ్ఞానవైరాగ్యాలు గలవాడు సన్యాసానికి పూర్తిగా అర్హుడు. సన్యాసం ఒకరిస్తే పుచ్చుకునేది కాదు. జ్ఞానవైరాగ్యాలతో సిద్ధించేది. ఇతరులకు ఏ మాత్రం హానిచెయ్యకుండా, శత్రువుకు కూడా హానితలపెట్టకుండా

ఉపకారమేచేస్తూ, క్రిమికీటకాదులనుకూడా తనలాగేభావిస్తూ, అరిషడ్వర్గాలను జయించి, దొరికినవితింటూ మోక్షమార్గంలో నడవాలి. ఇక్కడ ఒక చిన్నమాట.

ఒకసారి విపరీతంగా వర్షాలు వచ్చాయి. ఆ వర్షంలో కాలవవడ్డున ఒక సన్యాసి కూచుని ఉన్నాడు. అటువైపుగా పోతున్న వ్యక్తి ఆగి ఆశ్చర్యంగా చూశాడు. ఒక తేలు గబగబా వచ్చి కాలవలోని నీటిలోకి పోతోంది. ఈ సన్యాసి దాన్ని పట్టుకుని వడ్డున పడేస్తున్నాడు. పట్టుకున్నప్పుడు అతన్ని కుడుతోంది. వదలగానే మళ్ళీ కాలవలోకే పోతోంది. మళ్ళీ దాన్ని వడ్డున పడేస్తున్నాడు సన్యాసి. ఇలా జరుగుతోంది అక్కడ. చూడటానికి చాలా విచిత్రంగా ఉంది. ఇప్పుడు రైతు సన్యాసికో 'స్వామి! నువ్వేమో దాన్ని వడ్డున పడెయ్యటానికి ప్రయత్నిస్తున్నావు. అదేమో నిన్ను కుడుతోంది. నువ్వు నీ ప్రయత్నం మానటంలేదు. ఎందుకొచ్చిన బాధ. ఒక దబ్బ వేస్తే అది కాస్తా చచ్చి ఊరుకుంటుంది కదా? అన్నాడు. అప్పుడు ఆ సన్యాసి 'నాయనా ! పరోపకారం అనేది నేను చేయవలసిన పని. అందుకే ఆ తేలు చావకుండా రక్షించటానికి ప్రయత్నిస్తున్నాను. కుట్టటమనేది దాని స్వభావం. కుడుతోంది. ఏం చేద్దాం చెప్పు?' అన్నాడు.

ఇక్కడ చూడండి తేలు కుడుతోంది అని తెలిసికూడా దాన్ని రక్షించటానికి ప్రయత్నిస్తున్నాడు సన్యాసి. అపకారికికూడా ఉపకారం చెయ్యటమే సన్యాసిలక్షణం.

సన్యాసం తీసుకోతలచుకున్నవాడు ముందుగా తన ఆస్తిపాస్తులన్నీ తనతోసహా పిల్లలకు పంచేసి, తనకు వచ్చినదాన్ని

అందరికీ దానంచేసి, భార్య, బిడ్డల అనుమతితో సన్యసించాలి. అంతేగాని ఎవరిమీదో కోపంవచ్చి సన్యసించరాదు. ఇతరులు గౌరవిస్తారని స్వార్ధంతో అసలు సన్యసించరాదు. అలాంటివారు రౌరవాది నరకాలకు పోతారు. సన్యసించి పతనమైనవారికి నీచమైనగతి పడుతుంది.

సన్యసించిన వాడు కనులు, నోరు పూర్తిగా అదుపులో ఉంచుకోవాలి. నోటికి వచ్చినట్లు మాట్లాడరాదు. దొరికినవన్నీ తినరాదు. మంచి చెయ్యకపోయినా ఫరవాలేదు. చెడ్డపనులు చెయ్యకండి. భ్రష్టులు మాత్రం కాకండి.

ఆశ్రమ స్వీకారం చేసినవారుకూడా తప్పుచేస్తే జైలుపాలు కావలసి ఉంటుంది. అందుకే సన్యసించి తప్పులు చేసేకన్న అసలు సన్యసించకుండా ఉండటం మంచిది. కొంతకాలం క్రితం ఈరకంగా జైలుపాలైన స్వామిజీల గురించి మీకు తెలిసే ఉంటుంది. సన్యాసిగనక తప్పుచేస్తే, అసలు సన్యాసంమీద ఉండే గౌరవం పోతుంది. కాబట్టి ప్రతివారు **సరదా కోసమో, ఇంకొక దానికోసమో సన్యసించి సన్యాసంమీద ఉండే గౌరవాన్ని పాడు చెయ్యకండి. వ్యవస్థని, సంప్రదాయాన్ని కాపాడండి.”**

## 97. సన్యాసం ఎవరైనా తీసుకోవచ్చా?

సన్యాసము అంటే కర్మపరిత్యాగము ఇంతవరకు యజ్ఞయాగాది క్రతువులు చేశాడు. ఇప్పుడు మానేస్తున్నాడు. కర్మలు చేసేటప్పుడు యజ్ఞోపవీతం ఉంటుంది సన్యసించినప్పుడు యజ్ఞోపవీతం తీసేస్తాడు. ఇది కర్మపరిత్యాగానికి గుర్తు. కర్మ చేసేవాడే కర్మపరిత్యాగం చేస్తాడు. కాబట్టి బ్రాహ్మణులకే సన్యాస యోగ్యత ఉన్నది. మిగిలిన వారికి లేదు. మహాభారతంలో ధృతరాష్ట్రుడు వానప్రస్థం తీసుకున్నాడు. అంతేకాని సన్యాసం కాదు. ఇక శూద్రుడికి సన్యాసార్హత లేదు. ఉద్యోగం ఉన్నవాడు - ఉద్యోగం మానేస్తాడు. ఉద్యోగం లేనివాడు మానెయ్యటానికి ఏముంది? మరి శూద్రులు సన్యసిస్తే? వాళ్ళు శాస్త్రకారము సన్యసించటానికి లేదు. శూద్రులు గనక సన్యవస్థే వాళ్ళని సన్యాసులు అనరు. బైరాగులంటారు. కాని ఇవాల్టిరోజున వ్యవస్థ మారిపోయింది. బ్రహ్మ విద్యమీద, చాలామంది ఆసక్తి చూపిస్తున్నారు. ఏర్పేడు వ్యాసాశ్రమంలో యోగవాసిష్టము, రమణమహర్షి ఆశ్రమంలో త్రిపురారహస్యము ప్రతి సంవత్సరం క్రమం తప్పకుండా బోధిస్తారు. మిగిలిన కొన్ని ఆశ్రమాలకన్న వీరు చాలా నయం. సత్యాని గ్రహించాలి. దేశకాలమాన పరిస్థితులను బట్టి మనమూ మారాలి తప్పదు. ఇక కాషాయాంబ రాలంటారా? ఎవరైనా కట్టుకోవచ్చు. దానికి అభ్యంతరం లేదు. కాషాయానికి సన్యాసానికి సంబంధం ఏమీలేదు. మీకెవరికైనా కోరిక ఉంటే కాషాయాంబరాలు ధరించండి. అంతేకాని సన్యాసం జోలికి మాత్రం పోకండి.

**ఆతుర సన్యాసము :** అత్యవసర పరిస్థితిలో తీసుకునేది ఆతురసన్యాసము. మరణశయ్య మీద ఉన్నాడు. అతడికి సన్యాసం తీసుకోవాలని కోరిక. ఇటువంటి సమయంలో (ఆతుర సన్యాసం

తీసుకుని) తరువాత శాస్త్రోక్తంగా శాస్త్రబద్ధంగా తీసుకోవాలి. శంకర భగవత్పాదులవారు ఇలాగే చేశారు. మా పరమగురువులు కూడా మరణశయ్యమీద ఉండి ఇలాగే సన్యసించారు.

## 98. సన్యాసం రద్దు చేయవచ్చా?

ఉత్సాహం కొద్దీ సన్యసించాక, ఇంటి దగ్గర వాళ్ళు ఒప్పుకోకపోతే ఆ సన్యాసం రద్దు చేసుకోవచ్చా? సన్యసించటం అంటే ఈ జీవితాన్ని ఇక్కడ పూర్తిచెయ్యటం, మళ్ళీ కొత్తజన్మ ఎత్తటం. మరణించినవాడు పునర్జీవితుడు కావటం మనం చూడం కదా? మరి అలాంటప్పుడు వచ్చినవాడు మళ్ళీ ఎలా బ్రతికి వస్తాడు? సన్యాసం ఎలా రద్దు చేసుకుంటాడు? ఇక చతురాశ్రమాలలోను ఒకదాన్నుంచి రెండవ దానికి వెళ్ళటమే కాని వెనక్కి రావటం ఉండదు. గృహస్థాశ్రమము లేదా వానప్రస్థం నుంచి సన్యాసానికి వెళ్ళావు. మళ్ళీ వెనక్కి రావటం ఎలా జరుగుతుంది? అక్కడకి వెళ్ళిన తరువాత నాకు సన్యాసం నచ్చలేదు అనటానికి లేదు. ఇటువంటి పరిస్థితులు వస్తాయనే **'జ్ఞానవైరాగ్యాలు రానిదే సన్యాసాశ్రమం తీసుకోవద్దు'** అని చెప్పేది.

ఆతుర సన్యాసం తీసుకున్న వారు కొంతమంది మళ్ళీ గృహస్థులుగానే ఉన్నారు కదా ? దీనికి సమాధానం మనం చెప్పలేం. ఇది శాస్త్రసమ్మతం కాదు. ఆధునిక యుగంలో అనే పద్ధతులున్నాయి. ఉదాహరణకి వేదంలోను, స్మార్తంలోను వివాహానికి మంత్రాలున్నాయి. విడాకులకు లేవు. కాని ఆధునిక చట్టం విడాకులను ఒప్పుకుంటోంది. అలాగే శాస్త్రానికి ఏమైనా మార్పులు చేర్పులు జరిగాయేమో తెలియదు. నాకు తెలిసినంతవరకు ఏ రకమైన సన్యాసమైనా తీసుకున్న తరువాత శాస్త్రప్రకారం రద్దుచెయ్యటం జరగదు. మీకు ఇష్టమయితేనే సన్యసించండి. ఇదేమీ చిన్నపిల్ల ఆటకాదు. చచ్చిపోయినవాడు మళ్ళీ బ్రతకటం ఎంత నిజమో, సన్యాసం రద్దు చెయ్యవచ్చు అనేది కూడా అంతే నిజం. విపరీత వ్యాఖ్యానాలు చేసి శాస్త్రాన్ని భ్రష్టు పట్టించకండి. వ్యవస్థను పాడు చెయ్యకండి.

## 99. సన్యాసి భార్యతో ఉండచ్చా?

మాకు తెలిసిన స్వామి ఒకరు తమ ఇంట్లోనే భార్యతో కలిసే ఉంటారు. ఆవిడవండిన పదార్థాలే తింటారు. అక్కడే ఉంటారు. ఇంకొకాయన ప్రతి సంవత్సరము నాలుగు నెలలపాటు ఇంటికి వెళ్ళి భార్యతో కాలక్షేపం చేస్తుంటారు. దీని సంగతి ఏమిటి?

భార్యవండిన పదార్థాలు తింటూ ఇంట్లోనే ఉండాలి అనుకుంటే సుఖంగా ఆవిడతోనే కాలక్షేపం చెయ్యవచ్చు. మధ్యలో ఈ 'సన్యాసము' అనే పదం ఎందుకు? నీ భార్యతో ఉండటానికి నిన్నెవరు కాదంటారు? కాని సన్యసించిన తరువాత అలా చెయ్యటం నాకు తెలిసినంతవరకు శాస్త్రసమ్మతం కాదు. ఇంకొకాయన ప్రతిసంవత్సరము నాలుగు నెలలపాటు భార్యతో క్రమం తప్పకుండా గడిపి వస్తుంటారు అన్నారు. **బహుశః అది చాతుర్మాస్యమేమో సరిగా కనుక్కోండి.**

**సన్యాసి :** పెన్షను తీసుకోవచ్చా? పెన్షను అనేది విశ్రాంతఉద్యోగులకు ప్రభుత్వం కల్పించిన వెసులుబాటు. సన్యసించిన వాడికి ఆజన్మ అంతటితో పూర్తయింది. అతడు మరణించినట్లే. అతని పేరుకూడా మారిపోతుంది. అలాంటప్పుడు ఇంక పెన్షను ఎలా తీసుకుంటాడు? అయితే ప్రభుత్వం దృష్టిలో సన్యాసము లేదు కదా? ప్రభుత్వం కోసం కాదు కదా నువ్వు సన్యసించింది?

ఒకసారి నాకు తెలిసిన ఒకాయన రాష్ట్రప్రభుత్వంలో ఉన్నతమైన ఉద్యోగం చేసి పదవీ విరమణ పొందారు. కంచి పరమాచార్యులవారి దగ్గరకు వెళ్ళి "సన్యాసం ఇప్పించండి" అన్నాడు. దానికి ఆయన అలాగే నీ ఆస్తిపాస్తులనీ ఇతరులకు ఇచ్చేసిరా' అన్నారు. ఆ పనికూడా చేశాను స్వామీ అన్నాడు. మరి పెన్షన్ సంగతి ఏమిటి? అదికూడా

వద్దని ప్రభుత్వానికి లేఖ రాసి ఇవ్వు అన్నారు. అలాగే అన్నాడు. ఇది జరిగి 15 సంవత్సరాలవుతోంది. కాని ఇంతవరకు అతడు మాత్రం తిరిగి రాలా!

ఇక్కడ గుర్తించాల్సిన విషయాలేమంటే

1) నీకు పూర్తిగా ఇష్టమైతేనే సన్యసించు ఎవరి బలవంతము లేదు.

2) భగవంతుడి రూపాన్నే భావనచెయ్యి అంతేకాని భార్య రూపాన్ని మాత్రం కాదు.

3) ఆత్మసాక్షాత్కారం కోసం ప్రయత్నించు. అంతేకాని భార్య సాక్షాత్కారం కోసం కాదు.

4) ధనంమీద ఆశతో పెన్షన్ డ్రా చెయ్యకు. సన్యాసికి బంగారం మట్టితో సమానము. ధనం అశుద్ధంతో సమానము.

5) నియమనిష్ఠలు జాగ్రత్తగా పాటించగలిగితేనే సన్యసించు. అంతేగాని సంప్రదాయాన్ని అవహేళన చేయకు. దీనికి విరుద్ధంగా ప్రవర్తించే వారిని 'దొంగ సన్యాసులు' అనే ప్రమాదమున్నది. జాగ్రత్త.

ఒకసారి నేను ఒక ఆశ్రమానికి వెళ్ళాను. అక్కడ ఉత్తరాధికారి ఒంటరిగా కూర్చుని ఏడుస్తున్నాడు. నేను వెళ్ళి ఏమైంది స్వామి? అన్నాను. పూర్వాశ్రమంలో ఆయన మనవడు 18 సం॥ పిల్లవాడు మరణించాడట. ఆయన బాధపడుతున్నాడు. భవబంధాలు వద్దనేకదా సన్యసించింది? మరి మళ్ళీ భార్య, పిల్లలు, పెన్షన్, ఇవన్నీ ఏమిటి? కొంతమంది స్వామిజీలకి ఇతర దేశాలలో భార్యాపిల్లలు ఉన్నారని వారి శిష్యులే చెబుతున్నారు. మీకు లేకపోతే సరే. మిగిలిన వాళ్ళు మిమ్మల్ని చూసినవ్వరా?

మొన్న ఒకాయన కలిసి మాట్లాడుతూ ఒకస్వామీజీ ఆధ్యాత్మిక ఉపన్యాసం చెబుతున్నారు. ఈ శరీరంమీద వ్యామోహం వద్దు అంటున్నారు. కాని ఆయనేమో జుట్టును రంగు వేసుకుని కూర్చున్నారు. అన్నాడు.

ఇటువంటి వ్యాఖ్యలకు తావివ్వటం ఎందుకు? మిమ్మల్ని మీరు చులకన చేసుకోవటం ఎందుకు? సన్యసించిన వారికి ముఖానికి రంగుకేశాలంకరణ, మంచి దుస్తులు, అందమైన పరిచారికలు కావాలా? ఒక్కసారి ఆలోచించండి.

పదిమంది పాదాభివందనాలు చేస్తారు అనో, పీఠాధిపత్యం దక్కుతుంది. మహారాజులాగా ఉండచ్చు అనో, విలాసవంతమైన జీవితం గడుస్తుంది అనో, అనేకమంది పరిచారికలు ఉంటారనో మాత్రం సన్యసించవద్దు.

**గృహేగృహే పుస్తకభార భారమ్**
**పురే పురే పండితయూధయూధమ్ ।**
**మఠే మఠే తాపస బృంద బృందం**
**న బ్రహ్మవేత్తా న చ కర్మ కర్తా ॥**

ప్రతింట్లోనూ వేదాంతానికి సంబంధించిన పుస్తకాలు కట్టలు కట్టలుగా ఉంటాయి కాని చదివేవాడుండడు. అవన్నీ నా దగ్గర ఉన్నాయని చెప్పటం కోసమే. కేవలం అలంకారప్రాయము. ప్రతి ఊరిలోను పండిత సమూహాలంటాయి. వీరిలో జ్ఞానమన్నవారు ఒక్కరు కూడా ఉండరు. అందరూ శుష్కవేదాంతులే. ప్రతిమఠంలోనూ సన్యాసులు గుంపులు గుంపులుగా ఉంటారు. వీరిలో కొంతమందికి

వేదాంతము అనే పదానికి అర్థం కూడా తెలియదు. వీరికి పరమేశ్వరుడి మీద కన్నా ఇతర విషయాల మీదే మక్కువ ఎక్కువ. అందుచేతనే ప్రతింట్లోనూ పుస్తకాలు గుట్టలు గుట్టలుగా ఉన్నాయి. ప్రతి ఊరిలోను పండితులున్నారు, ప్రతిమఠంలోను సన్యాసి సమూహాలున్నాయి. వీరిలో యజ్ఞయాగాది క్రతువులు చేసేవారుగాని, పరబ్రహ్మ తత్త్వం తెలిసినవారుకాని ఎవరూ లేరు. అంటున్నారు. అందుచేత జ్ఞానవైరాగ్యాలు ఉన్నవారే సన్యసించటానికి ప్రయత్నించండి. అవి లేనివారు గృహస్థాశ్రమంలోనే ఉండి సన్యాసిలాగా జీవించండి.

జ్ఞానవైరాగ్యాలు లేకుండా సన్యసిస్తే మనల్ని సన్న్యాసి అని కాదు 'సన్నాసి' అంటారు. కేవలము కర్మనుపరిత్యజించటం సన్యాసంకాదు. జ్ఞానవైరాగ్యాలు ఉన్నవాడు ప్రత్యేకంగా సన్యాసం స్వీకరించవలసిన అవసరం లేదు. నేను ఎవరినీ ఏ రకంగానూ విమర్శించటం లేదు. యథార్థం చెప్పాను అంతే.

# 100. సన్యాసికి ప్రాయశ్చిత్తం ఉన్నదా?

మొన్నటిరోజున ఒకాయన నా దగ్గరకు వచ్చి "ఓంకారాన్ని ఉపాసన చేస్తే బ్రహ్మలోకప్రాప్తి జరుగుతుంది అన్నారు నిజమేనా?" అని అడిగాడు. 'బ్రహ్మలోకప్రాప్తి' అంటే మోక్షమన్నమాట. ఇది ఆర్యోక్తి. ఇలాటి మాటలు చాలా ఉన్నాయి. "ఉత్తరాయణంలో ఉరేసుకుని చచ్చినా పుణ్యమే" అన్నారు. ఉత్తరాయణం అంటే ? సంవత్సరాన్ని రెండు భాగాలుగా చేశారు. ఒకటి ఉత్తరాయణం. రెండవది దక్షిణాయనం. అయనము అంటే మార్గము అని అర్థం. సూర్యుడు ఉత్తరదిశగా ఆరు నెలలు, దక్షిణ దిశగా ఆరు నెలలు ప్రయాణం చేస్తాడు. వీటినే ఉత్తరాయణము, దక్షిణాయనము అంటారు. ఉత్తరాయణం జనవరి 14 నుంచి జులై 14 వరకు, దక్షిణాయనం జులై 15 నుంచి జనవరి 14 దాకా ఉంటాయి. ఉత్తరాయణంలో అంటే జనవరి 14 నుంచి జులై 14 వరకు పరమపుణ్యకాలమని ఆ కాలంలో మరణించిన వారు స్వర్గలోకానికి పోతారని చెబుతుంటారు. కాని నిజంగా చెప్పాలంటే ఇవి దేవయాన పితృయానాలు. వీటిలో దేవయానాన్నే ఉత్తరాయణము అంటారు. ఈ మార్గంగుండా పోయిన వారు బ్రహ్మలోకం చేరతారు. వారికి పునర్జన్మ ఉండదు. పితృయానం గుండా వెళ్ళినవారు స్వర్గసుఖాలనుభవించి కర్మశేషం అనుభవించటానికి మళ్ళీ భూలోకంలో జన్మిస్తారు. అయితే రెండుచోట్లా 'ఉత్తరాయణ'ము అనే పేరు వచ్చింది. కాబట్టి, ఉత్తరాయణ మార్గంలో ప్రయాణించిన వారు తిరిగి జన్మించరు కాబట్టి, ఈ రెండింటినీ కలిపి 'ఉత్తరాయణంలో ఉరేసుకుని చచ్చినా పుణ్యమేను' అన్నారు. ఎందుకంటే ఉత్తరాయణ మార్గంలో ప్రయాణించటం చాలా కష్టం కాబట్టి, ఆ మార్గంలో ప్రయాణించటమే అదృష్టంగా భావించి ఈ

మాట చెబుతారు. అలాగే ఓంకారోపాసన చేసినవాడు మోక్షం పొందుతాడు అనే మాటకూడా.

ఇక్కడ ఇంకొక విషయం ఏమంటే సన్యాసం తీసుకుంటే మోక్షం వస్తుందని ఎక్కడా చెప్పలేదు. ఒకవేళ అదే నిజమయితే మోక్షం పొందాలనుకునే వారందరూ సన్యాసం స్వీకరిస్తే సరిపోతుంది. అంతేకాని భౌతిక సన్యాసంవల్ల మోక్షంరాదు. కాషాయబట్ట కట్టినంత మాత్రంచేత సన్యాసికాడు. కాశీలో మరణించిన వారందరికీ ముక్తి లభిస్తుందా? అంటే లభించదు అని ఖచ్చితంగా చెప్పాలి. ఒకవేళ ఇదే నిజమైతే కాశీనగరంలో మనం నుంచోటానికి కూడా చోటుండదు. దేశం మొత్తం మీద తొంభైశాతం మరణాలు కాశీలోనే ఉంటాయి. మానసికసన్యాసము అంటే జ్ఞానవైరాగ్యాలు. ఈ రెండూ ఉన్నవాడు కాషాయం కట్టకపోయినా, ఆశ్రమస్వీకారం చెయ్యకపోయినా ముక్తిపొందుతాడు. ఆత్మజ్ఞానం కోసం అన్వేషించిన వాడే బ్రాహ్మణుడు. అతడే ముక్తి పొందుతాడు. యజ్ఞయాగాది కర్మలు, పూజలు, వ్రతాలు, స్తోత్రాలు, పారాయణలు అన్నీ పామరుల కోసం. ఇవి స్వర్గానికి తీసుకుపోతాయి.

ఈ జగత్తులో ఈషణత్రయం కన్న సంసారము వేరే లేదు. 1. ధనేషణ 2. దారేషణ 3. పుత్రేషణ. వీటిని ఈషణత్రయము అంటారు. ఈషణ అంటే కోరిక, ఆశ అని అర్థం. కోరికలు మూడు రకాలు.

1. పుత్రులను పొందటం ద్వారా ఉత్తమలోకాలకు పోవాలి అనుకోవటం. ఇదే **పుత్రేషణ.**

2. వివాహం చేసుకుని భార్యద్వారా సంతానం పొందాలి అనుకోవటం. ఇదే **దారేషణ.**

3. భార్యాబిడ్డలని పోషించటానికి ధనం కావాలి. కాబట్టి ధనం

సంపాదించాలనే కోరిక. ఇది **ధనేషణ.** కర్మ చెయ్యటానికి కూడా ధనం కావాలి.

ఈ కోరికలు తీర్చుకోవటానికే మానవుడు సంసారి అవుతున్నాడు. **'కౌపీనసంరక్షణార్థం'** అన్నట్లుగా. కాబట్టి మోక్షం పొందాలనుకున్నవాడు అమితమైన సాధన చేసి జ్ఞానవైరాగ్యాలు అలవరచుకోవాలి. ఆత్మవిచారణ ద్వారా తాను బ్రహ్మ కావాలి. పరబ్రహ్మ తత్త్వాన్ని పూర్తిగా తెలుసుకున్న వాడే బ్రహ్మ అవుతాడు. **బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి.** అయితే బ్రహ్మ విచారణ చెయ్యటానికి ఈషణ అంటే కోరిక ప్రతిబంధకమవుతుంది. కాబట్టి ముందుగా ఈషణలను (కోరికలను) చంపాలి. వాటినుంచి విముక్తి పొందాలి. ఈ కోరికలను జయించాలంటే ఆత్మవిచారణ చెయ్యాలి. దీనికి అభ్యాసము, సాధన ముఖ్యము. వేదాంతవిచారణ వల్లనే ముక్తి లభిస్తుంది. ఆత్మవిచారణ చెయ్యాలంటే కోరికలునశించాలి. ఇలా కోరికలు నశించినవాడు సాక్షాత్తు బ్రహ్మ అవుతాడు.

మనం ఏ పనిచేసినా దానివల్ల ఫలితం వస్తుంది. ఆ ఫలితం కొంత కాలమే ఉంటుంది. ఆ తరువాత క్షీణించి పోతుంది. కర్మలు చెయ్యటంవల్ల పుణ్యఫలం వస్తుంది. ఆ పుణ్యఫలం కొంత కాలం తరువాత ఉండదు. అప్పుడు ఆ జీవి తిరిగి భూలోకంలో జన్మిస్తుంది. కాని బ్రహ్మవిద్య విచారణఫలం అలాకాదు. అది క్షీణించదు. అమృతం వంటిది. దీనివల్లనే మానవుడు ముక్తిపొందుతాడు.

ఇక్కడ అనుమానం ఏమంటే ఈ పనులన్నీ గృహస్థాశ్రమంలో లేదా వానప్రస్థంలో ఉండి చెయ్యవచ్చు కదా ? సన్యసించటం ఎందుకు?

మనం చాలా జాగ్రత్తగా గుర్తించాల్సిన విషయం ఏమంటే

ప్రతిఆశ్రమంలోను కొన్ని ధర్మాలుంటాయి. వాటిని తప్పనిసరిగా పాటించాలి. సన్యాసాశ్రమానికి కూడా కొన్ని నియమాలు ఉన్నాయి. సన్యసించినవాడు ఆ నియమాలు, ధర్మాలు తప్పనిసరిగా పాటించి తీరాలి. వాటిలో చాలా ముఖ్యమైనవి.

1. జ్ఞానవైరాగ్యాలు కలిగి ఉండటం.
2. ఎవరితోను ముఖ్యంగా కుటుంబ సభ్యులతో సంబంధ బాంధవ్యాలు లేకుండా ఉండటం.
3. కేవలం పొట్టనింపుకోటానికే భిక్షాటన చెయ్యటం.
4. దేహాభిమానం లేకుండా, శరీరాన్ని శవంలాగా చూడటం.
5. ఉన్నచోట ఉండకుండా, నిరంతరము పరిభ్రమిస్తూ సత్యాన్వేషణలోనే కాలం గడపటం.

ఈ మధ్యన ఒక సన్యాసిని కలిశాను. బాగా చదువుకున్నవాడు. పూర్వాశ్రమంలో వేదపండితుడు. అంతే కాకుండా వేదాంతం కూడా బాగా తెలిసినవాడు. ఉపనిషత్తుల గురించి అనర్గళంగా మాట్లాడగలడు. బ్రహ్మవిద్య గురించి బాగాతెలిసినవాడు. చాలా మంచి సన్యాసి. అయితే భార్యాపిల్లలతో సత్సంబంధాలున్నాయి. ఈ మాట తెలిసి అవాక్కైయ్యాను. ఇది ఏ రకమైన సన్యాసం? అసలు సన్యాస ధర్మాలకే విరుద్ధం కదా? ఇంకో విషయం ఏమంటే ఆయనపేర బ్యాంకుఎకౌంటు కూడా ఉంది. అందులో కొన్ని లక్షలు డబ్బుకూడా ఉంది. వీటిని గురించి అడిగినప్పుడు ఆయన చెప్పిన సమాధానం ఇంకా ఆశ్చర్యం గొలిపింది.

“జీవితంలో ఏదైనా తప్పు చేస్తే, దానికి ప్రాయశ్చిత్తం చెప్పింది శాస్త్రం. ప్రాయశ్చిత్తం చేసుకున్న వాడికి పాపం ప్రక్షాళనమై పోతుందని గతంలో మనం చెప్పుకున్నాం కూశ్మాండ హోమం చేస్తే, పాపాలన్నీ

పోతాయి. గతంలో విదేశాలకు పోయిన వారిని, తినరాని పదార్థాలు తిన్నవారిని పీకలోతు పేడగోతిలో పాతిపెట్టి, మంత్రాలు చెబుతూ దర్భపుల్ల కాల్చి నాలుకమీద వాతపెట్టేవారు. ఈ రకమైన ప్రాయశ్చిత్తం మా తాతగారు జొన్నవిత్తుల పద్మనాభంగారికి చేశారట కూడా. కాబట్టి సన్యాసికి కూడా ఏవైనా పొరపాట్లు చేస్తే ప్రాయశ్చిత్తం చేసుకోవచ్చు అని ఆయన వాదన. అంతేకాదు నిరంతరం ఉపనిషత్తులు పారాయణ చేసేవారికి పాపాలు అంటవు. బ్రహ్మవిద్యా విచారణ చేసేవాడు పాపాలు చేసినా అవి నిప్పులో పడిన దూదిలాగా భస్మమై పోతాయి. కాబట్టి తాను పాపాలు, తప్పులు చేసినా పవిత్రుడే" ఇది సమాధానం.

ఇదంతా పచ్చి అబద్ధం. ఆత్మవంచన, ఏ ఆశ్రమంలో తప్పులు చేసినా ప్రాయశ్చిత్తం ఉన్న మాట నిజమే. కాని అది సన్యాసాశ్రమానికి వర్తించదు. సన్యాసికి ప్రాయశ్చిత్తం లేదు. అసలు నిన్ను సన్యాసం తీసుకోమని ఎవరూ బలవంతం చెయ్యలేదు. సన్యసించకుండా కుటుంబంతో కలిసి ఉంటూనే బ్రహ్మవిద్యా విచారణ చెయ్యవచ్చు. నిరంతరం ఉపనిషత్తులు చదువుకోవచ్చు. ఈపని చెయ్యటానికి సన్యాసం అవసరం లేదు. ఈషణత్రయాన్ని జయించినవాడే సన్యసించాలి. నీకు ధనం మీద కోరిక ఉంది. కుటుంబం మీద అభిమానం ఉంది. అలాంటప్పుడు సన్యాసం ఎందుకు? ఎవరికోసం? సన్యాసమంటేనే జ్ఞానవైరాగ్యాలు. అవి లేనివారికి సన్యాసం దేనికి? కాషాయం మీద మోజు ఉంటే ప్రతిరోజు ఇంట్లో అవే బట్టలు కట్టుకోండి. మీ గృహంలో ఉంటూనే సన్యాసిలా జీవించండి. మీరు ఉన్నతమైన స్థితిలో ఉన్నారని అందరూ మెచ్చుకుంటారు కూడా. అంతేకాని బలవంతపు బ్రాహ్మణార్థం వద్దు. ధర్మాలు, నియమాలు పాటించగలిగితేనే సన్యసించండి. అంతేకాని సన్యసించిన తరువాత,

సన్యాసి ధర్మాలకు విరుద్ధంగా ప్రవర్తించి సన్యాసానికి చెడ్డపేరుతేవద్దు. సంప్రదాయం నాశనం చెయ్యద్దు. సన్యాసికి ప్రాయశ్చిత్తం లేదు. తప్పులు చేసిన సన్యాసి రౌరవాది నరకాలు పట్టిపోతాడు. లోకంలో అవమానం కూడా పొందుతాడు. కాబట్టి తస్మాత్ జాగ్రత్త.

# 101. మంత్రసిద్ధులు

సన్యాసి అనగానే అతనికి ఏవో గొప్ప సిద్ధులు ఉంటాయని, గుప్పెటమూసి తెరవగానే చేతులోంచి బంగారుగొలుసులు, ఉంగరాలు వస్తాయని చాలా నమ్మకాలుంటాయి. ఇవన్నీ సిద్ధులు అంటారు. ఇవి అనేక విధాలుగా సంక్రమిస్తాయి. 1. పూర్వజన్మకృతం 2. తపశ్శక్తి 3. దేవతల వరాలు 4. ఓషధులు, మణులు, మంత్రాలు. వీటిలో దేనివల్లనైనా ఈ శక్తి సంక్రమించవచ్చు. ఈ శక్తి మనం బ్యాంకులో డిపాజిట్ చేసిన ధనంలాటిది. తీసి వాడేసుకుంటే అయిపోతుంది. అందుకే ఎవరూ కూడా తమకున్న శక్తుల్ని అల్పప్రయోజనాల కోసం వాడరు. ఆ రోజున విశ్వామిత్రుడు త్రిశంకుణ్ణి సశరీరంగా కైలాసానికి పంపినందుకు పదివేల సంవత్సరాలు చేసిన తపశ్శక్తి నాశనమైపోయింది. ఒక ఋషీశ్వరుడు వరం ఇచ్చాడన్నా శాపంపెట్టాడన్నా అతని తపశ్శక్తి కాస్తా కరిగిపోతుంది. అయితే ఇవన్నీ 'చిన్న చిట్కాలు, హస్తలాఘవ ప్రదర్శన' అంటారు, ఆధునికులు, నాస్తికులు. అయితే ఎవరికితెలిసింది వాళ్ళుచెబుతారు. లక్ష్యం చేరుకోవటానికి భిన్నమైన మార్గాలుంటాయి. ఎవరికి వచ్చిన మార్గాన్ని వారు ఎన్నుకుంటారు. అన్నింటికీ ఒకటే మార్గం కాదు.

# 102. చాతుర్మాస్యము

ఇది నాలుగు నెలలపాటు చేసే వ్రతము. సన్యాసాశ్రమం స్వీకరించిన ప్రతివారూ విధిగా ఈ వ్రతాన్ని విధిగా ఆచరించి తీరాలి.

సూర్యుడు కర్కాటకంలో ప్రవేశించిన తరువాత వచ్చే మొదటి ఏకాదశినే తొలిఏకాదశి అంటారు. మన పండగలన్నీ దీంతోనే మొదలవుతాయి. మోక్షగాము లయిన వారు ఆషాఢశుద్ధ ఏకాదశి మొదలు కార్తీకశుద్ధ ఏకాదశి వరకు నాలుగు నెలలపాటు పుణ్యతిథులుగా భావించి 'దేవశయని' అనే వ్రతం చేస్తారు. సన్యాసులు, యతీశ్వరులు కూడా ఈ కాలంలో ప్రయాణం చెయ్యకుండా ఒకేచోట స్థిరంగా ఉంటారు. దీన్నే చాతుర్మాస్యము అంటారు.

స్మార్తులు ఈ వ్రతాన్ని ఆషాఢపౌర్ణమి నుంచి కార్తీకపౌర్ణమి వరకు చేస్తే, వైష్ణవులు ఆషాఢశుద్ధ ఏకాదశి నుంచి - కార్తీక శుద్ధ ఏకాదశి వరకు చేస్తారు. ఈ మధ్య కాలంలో ప్రయాణం నిషిద్ధం. ఇలా ఎందుకు జరుగుతుందంటే - ఆషాఢ మాసం నుంచి వర్షాకాలం ప్రారంభమవుతుంది. మళ్ళీ కార్తీకమాసం దాకా వర్షాకాలమే. సన్యాసులు దేశాటన చేస్తుంటారు. సన్యాసి ఒక్కడే కాకుండా అతని వెనక శిష్యగణము కూడా ఉంటుంది. వర్షాకాలంలో పెద్దవర్షం గనక వస్తే వాగులు వంకలు పొంగి ప్రవహిస్తాయి. దీనివల్ల నదులు కూడా పొంగుతాయి. రహదార్లు మునిగిపోతాయి. కొన్నిదార్లు కొట్టుకుపోతాయి. అటువంటి సమయంలో ఈ సన్యాసి బృందం ఉన్నచోటే ఉండిపోవలసి వస్తుంది. అది ఏ ప్రదేశమో ముందుగా తెలియదు. పల్లెకావచ్చు. మారుమూల ప్రదేశం కావచ్చు. అక్కడ స్థితిమంతులు లేకపోవచ్చు. అటువంటి సమయంలో ఈ సన్యాసిబృందం ఎక్కడ బస చేస్తుంది? వీరికి భోజనాలు

ఎవరు పెడతారు? ఇవన్నీ సమాధానం లేని శేషప్రశ్నలు. వీటినుంచి తప్పుకునేందుకే ఈ కాలంలో అసలు ప్రయాణంచెయ్యవద్దు అన్నారు. ముందుగానే అన్ని సౌకర్యాలు ఉన్నప్రదేశం చూసుకుని అక్కడ బస చేస్తారు. ప్రతిరోజు జ్ఞానబోధ చేస్తుంటారు. నాలుగునెలలు పూర్తయిన తరువాత మళ్ళీ ప్రయాణమై వెళ్ళిపోతారు. ఇది స్మార్తులు చేసే పద్ధతి. అదే వైష్ణవంలో అయితే ఇంకో రకంగా ఉంటుంది. వైష్ణవులు ఆషాఢశుద్ధ ఏకాదశిని **'దేవశయనీ ఏకాదశి'** అంటారు. మోక్షగాములంతా ఈ రోజున దేవశయని వ్రతాన్ని ఆరంభిస్తారు. ఈ రోజే చాతుర్మాస్యం ప్రారంభ మవుతుంది. ఈ నాలుగు నెలల కాలము శ్రీమహావిష్ణువు నిద్రావస్థలో ఉంటాడు. ఆషాఢశుద్ధ ఏకాదశినాడు శ్రీమహావిష్ణువు ప్రతిమకు పంచామృతాలతో అభిషేకం చేసి సుగంధలేపనం కావించి ధూప దీప నైవేద్యాలు సమర్పించి "ఓ దేవా! వర్షాకాలము నాలుగు నెలలు నేను పరిశుద్ధమైన నియమాలలో కాలం గడుపుతాను. ఏ అడ్డంకులు లేకుండా నా వ్రతం పూర్తి చేయించవలసింది'' అని ప్రార్థించి, తెల్లని వస్త్రముతో శయ్య ఏర్పాటుచేసి, రెండు వైపులా తలగడలు అమర్చి దేవదేవుణ్ణి శయనింప చేస్తారు. ఆయన నిద్రిస్తే జగత్తు నిద్రిస్తుంది. ఆయన మేల్కొంటే జగత్తు మేల్కొంటుంది. ఈ వ్రతం విష్ణుభక్తులందరూ చేయవచ్చు. దీనికి కులమత భేదాలేవీ లేవు. ఈ వ్రతం ప్రారంభించటానికి మంచి చెడులు, తిథి వార నక్షత్రాలు, శౌచాశౌచాలు చూడవలసిన పనిలేదు. స్త్రీ పురుష భేదం అంతకన్నా లేదు. ఈ వ్రతం చేసినవారు మరణానంతరము విష్ణులోకం చేరతారు. ఈ వ్రతం అనేక రకాలుగా చేస్తారు.

1. ప్రతిరోజూ ఆలయం శుభ్రం చేసి, అలికి రంగవల్లులు తీర్చిదిద్దిన వారు ఏడుజన్మల వరకు బ్రాహ్మణ కులంలో పుట్టి

సత్యధర్మపరాయణులవుతారు.

2. ఈ నాలుగు నెలలూ శ్రీమహావిష్ణువును పంచామృతాలతో స్నానం చేయించినవాడు మరణానంతరము విష్ణులోకానికి వెళ్ళి సారూప్యముక్తి పొందుతాడు. అంటే లక్ష్మీదేవి, శ్రీవత్సము, సృష్టి స్థితి లయ సామర్థ్యము తప్ప రూపురేఖలు, భక్తుల కోరికలు తీర్చటములో శ్రీహరి రూపంలోనే ఉంటాడు.

4. చాతుర్మాస్యంలో ప్రతిరోజూ భగవంతుణ్ణి ఆరాధిస్తూ, భగవంతుడికి నైవేద్యం సమర్పించేటప్పుడు బంగారు తామరపువ్వును సమర్పించిన వాడు ఈ లోకంలో అనంతమైన భోగాలనుభవించి, చివరకు స్వర్గం చేరతాడు.

5. ఈ సమయంలో ప్రతిరోజూ హరిని తులసిదళాలతో అర్చించి, బంగారు తులసిదళము దానం చేసినవాడు విష్ణులోకం పొందుతాడు.

6. వ్రతసమయంలో భగవతునికి ధూపదీపాలు సమర్పించి, వ్రతాంతమున దీపపుకుందులు దానంచేసినవాడు గొప్పశ్రీమంతుడవు తాడు. సకల సౌభాగ్యాలు పొందుతాడు.

7. ఈ కాలంలో ప్రతిరోజూ రావిచెట్టుకుగాని, శ్రీమహావిష్ణువుకుగాని ప్రదక్షిణలు చేసినవాడు వైకుంఠం చేరతాడు.

8. వ్రతసమయంలో ప్రతిరోజూ సాయంత్రం దేవుని సన్నిధిన దీపారాధన చేసి, వ్రతసమాప్తిన వస్త్రము, బంగారము, దీపపుకుంది దానం చేసినవాడు ఈ లోకంలో మహాతేజస్వి అవుతాడు. మరణానంతరము వైకుంఠం చేరతాడు.

9. శ్రీమహావిష్ణువు పాదోదకాన్ని పానం చేసినవాడు విష్ణులోకం పొందుతాడు. అతడికి పునర్జన్మ ఉండదు.

10. ఈ సమయంలో ప్రతిరోజూ మూడువేళలా దేవాలయంలో 108 గాయత్రీ జపం చేసిన వాడికి పాపాలు అంటవు.

11. చాతుర్మాస్యంలో ప్రతిరోజూ పురాణశ్రవణం చేసి, వ్రతసమాప్తి యందు పుస్తకము, వస్త్రము, బంగారము దానంచేసినవాడు సకల భోగాలు అనుభవిస్తాడు.

12. చాతుర్మాస్యంలో శివనామం కాని, కేశవనామం కాని జపం చేసి, వ్రతసమాప్తిన బంగారపు శివప్రతిమగాని, విష్ణుప్రతిమగాని దానం చేసిన వాడికి మహాపుణ్యము లభిస్తుంది.

13. స్నానసంధ్యాది నిత్యకృత్యాలు పూర్తిచేసి సూర్యమండల మధ్యవర్తి అయిన శ్రీమన్నారాయణునికి అర్ఘ్యమిచ్చి, వ్రతసమాప్తి నందు ఎరుపు రంగు వస్త్రము, బంగారము, గోవును దానంచేసినవాడు పరిపూర్ణ ఆరోగ్యవంతుడవుతాడు. చిరాయువౌతాడు.

14. ప్రతిరోజూ గాయత్రీ మంత్రాన్ని జపిస్తూ, నువ్వులతో హోమంచేసి, వ్రతసమాప్తి యందు తిలపాత్ర దానం చేసినవాడు సర్వపాపముల నుండి విముక్తుడవుతాడు.

15. ప్రతిరోజూ అన్నహోమము చేసి, వ్రతాంతమందు నేతితో నిండిన కుండను, మంచి వస్త్రమును దానంచేసినవాడు మంచిఆరోగ్యము, శరీరచ్ఛాయ పుత్రపౌత్రాది సంపద కలిగి బ్రహ్మదేవునితో సమానుడౌతాడు.

16. ప్రతిరోజూ అశ్వత్థ వృక్షాన్ని పూజించి, ఆఖరు రోజున వస్త్రము,

బంగారము దానం చేసిన వాడు మంచి ఆరోగ్యవంతుడవుతాడు.

17. ప్రతిరోజూ తులసిని పూజించి, తులసి దళాలను ధరించినవాడు సర్వపాపముల నుండి విముక్తుడై విష్ణులోకము పొందుతాడు.

18. ప్రతిదినము గరికెను పూజించి శిరస్సున ధరించి, వ్రతాంతమున బంగారు గరికె దానం చేసినవాడు సర్వపాపముల నుండి విముక్తుడవుతాడు, స్వర్గాన్ని పొందుతాడు.

19. చాతుర్మాస్యములో శివకేశవులలో ఎవరిని ధ్యానించినా పుణ్యఫలము వస్తుంది.

20. ప్రతిదినము విష్ణుపాదోదకము పానము చేసినవాడు సర్వపాపముల నుండి విముక్తుడవుతాడు. అతని ఆయువు, సంపద వృద్ధి పొందుతాయి. వ్రతసమాప్తిన గోదానము చెయ్యాలి. లేకపోతే వస్త్రదానం చెయ్యవచ్చు.

21. వేదవిదులైన బ్రాహ్మణులను పూజించాలి. వ్రతసమాప్తిన బ్రాహ్మణ సమారాధన, అన్నదానము చేసినవాడు ఆయుర్దాయము, ధనము పొందుతాడు.

22. కపిలగోవును అర్చించి, ప్రదక్షిణలు చేసినా, దానమిచ్చినా గోవు శరీరం మీద ఎన్ని రోమములున్నాయో అన్ని సంవత్సరాలు స్వర్గసుఖాలు అనుభవిస్తాడు.

23. ప్రతిదినము గణపతిని, సూర్యుని అర్చించినవాడు ఆయురారోగ్య ఐశ్వర్యములు పొందుతాడు. గణపతి అనుగ్రహముతో అతడి అభీష్టములు సిద్ధిస్తాయి. అన్నిచోట్లా విజయం సిద్ధిస్తుంది.

24. చాతుర్మాస్యములో వర్షఋతువు, శరదృతువు రెండు ఉంటాయి. ఈ రోజులలో శివప్రీతికి రజత దానం చెయ్యాలి. అంత శక్తి

లేకపోతే రాగిని కూడా దానం చేయవచ్చు. ఇలా చేసిన వారికి అందమైన సంతానం కలుగుతుంది. ఈ ఫలితం కావలసిన వారు తేనెతో నిండిన వెండి పాత్రను, లేదా బెల్లంతో నిండిన రాగి పాత్రను దానం చెయ్యాలి.

25. వ్రతసమాప్తి యందు శయ్యాదానము చేసినవారు శాశ్వతమైన సుఖం పొందుతారు.

26. వర్షాకాలములో ప్రతిరోజూ గోపీచందనము దానం చేసిన వాడికి భుక్తి, ముక్తి రెండూ లభిస్తాయి.

27. వ్రతసమాప్తిన గోపీచందనము, నూతన వస్త్రములు దానం చేసిన వారికి సకలైశ్వర్యములు లభిస్తాయి. చివరకు సాయుజ్యం కలుగుతుంది.

28. ప్రతిరోజూ పంచదార లేదా బెల్లము దానం చేస్తే భుక్తి, ముక్తి కలుగుతుంది.

చాతుర్మాస్య వ్రతం పూర్తి అయిన తరువాత ఉద్యాపనకు ఎనిమిది లేక నాలుగు ఫలములు బరువుగల ఎనిమిది, నాలుగు లేదా ఒక రాగి పాత్ర నిండా చక్కెర పోసి, పాత్రపైన వస్త్రము, దక్షిణ ఉంచి నవధాన్యాలతో, లేదా పిండి వంటలతో ప్రతి పాత్రను దానం చెయ్యాలి. దానం చేసేటప్పుడు ఈ క్రింది శ్లోకాలు చదవాలి.

**శ్లో॥ తామ్రపాత్రం సవస్త్రం చ శర్కరా హేమ సంయుతం**
**సూర్యప్రీతికరం యస్మా ద్రోగఘ్నం పాపనాశనం ॥**

**శ్లో॥ పుష్టిదం కీర్తిదం నౄణాం నిత్యం సంతాన కారకం**

**సర్వకామప్రదం స్వర్గ్య మాయు ర్వర్ధన ముత్తమం ॥**

**శ్లో॥ తస్మా ద్దస్యప్రదానేన కీర్తి రస్తు సదా మమ**

**ఏవ వ్రతం తు యః కుర్యా త్తస్య పుణ్యఫలం ॥**

చక్కెరతో కూడిన రాగిపాత్ర సూర్యుడికి ప్రీతికరమైనది. సమస్త రోగాలను నశింపచేస్తుంది. పాపాలను పోగొడుతుంది. పుష్టిని, కీర్తిని ఇస్తుంది. దీని దానము వలన సంతానము కలుగుతుంది. సర్వాభీష్టములు నెరవేరతాయి. స్వర్గలోకం ప్రాప్తిస్తుంది. అటువంటి పాత్రను నేను దానం చేస్తున్నాను, నాకు ఎల్లప్పుడూ కీర్తి కలుగుగాక.

## 103. చాతుర్మాస్య వ్రత ఫలితం

చాతుర్మాస్య వ్రతం చేసిన వాడికి సంగీత ప్రావీణ్యం కలుగుతుంది. లోకంలోని స్త్రీలందరూ అతన్ని ప్రేమిస్తారు. అతడికి రాజ్యం కావాలంటే రాజ్యము, సంతానము కావాలంటే సంతానము లభిస్తుంది. ధనం కావాలంటే ధనం లభిస్తుంది. చివర కతడు మోక్షము పొందుతాడు.

చాతుర్మాస్యములో ప్రతిరోజు కూరగాని, కందమూలాలుగాని, ఫలములు గాని దానం చేసి వ్రతసమాప్తిన వస్త్రదానం చేసినవాడు రాజయోగి అవుతాడు.

**మం॥ సర్వదేవప్రియం యస్మాచ్ఛాకం తృప్తికరం నృణాం**
**దదామి తే న దేవాద్యాః సదా కుర్వంతు మంగళం**

శాకము దేవతలకు ప్రీతిని మానవులకు తృప్తిని కలిగిస్తుంది. ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! అట్టి శాకము నీకిస్తున్నాను, కాబట్టి దేవతలు నాకు శుభమును చేకూర్తురుగాక అంటూ శాకదానం చెయ్యాలి.

ప్రతిరోజూ త్రికటుకములు అంటే శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు బ్రాహ్మణునికి దానం చెయ్యాలి. అలా చేస్తే సూర్యభగవానుడు ప్రీతి చెందుతాడు. అన్ని రోగాలు నశిస్తాయి.

ఈ రకంగా ప్రతిరోజూ త్రికటుకాలు దానం చేసి వ్రతసమాప్తిని బంగారంతో చేసిన త్రికటుకలు, వస్త్రము దక్షిణలతో దానంచేసి ఉద్యాపన చేసినవాడు నూరు సంవత్సరాలు మంచి ఆరోగ్యంతో జీవిస్తాడు. చివరకు స్వర్గం చేరతాడు.

చాతుర్మాస్యంలో నిరంతరము మంచి ముత్యములు దానం చేసిన

వాడికి అన్న వస్త్రాలకు లోటురాదు. ప్రతిదినము అన్నం దానం చేసినవాడు అష్టైశ్వర్య సంపన్నుడు, కీర్తిమంతుడు అవుతాడు.

ప్రతిదినము తాను తాంబూలము సేవించకుండా, ఇతరులకు తాంబూల దానం చేసి, వ్రతసమాప్తి నందు ఎరుపు రంగు వస్త్రములు దానం చేసినవాడు మహాలావణ్య వంతుడవుతాడు. అతడికి ఏ రోగాలు రావు. మంచి మేధావి అవుతాడు. గాత్ర మాధుర్యముగల వాడవుతాడు. మరణానంతరము గంధర్వుడవుతాడు. తాంబూలము లక్ష్మీ ప్రదమైనది. అందులోని ఆకు, వక్క, సున్నము త్రిమూర్తుల స్వరూపము. అందుచేతనే తాంబూల దానం చేసిన వారికి త్రిమూర్తులు సకల సంపదలను ఇస్తారు.

ఈ సమయంలో ప్రతిరోజూ పసుపు దానంచేసి, వ్రతసమాప్తిని క్రొత్త వెండి పాత్రలో పసుపుపోసి దానం చేసినట్లైతే ఆ స్త్రీ లేక పురుషుడు సర్వసుఖాలు అనుభవిస్తారు. వారికి సౌభాగ్యము, అష్టైశ్వర్యాలు కలుగుతాయి. ఈ రకంగా పసుపు దానం చేసినవారు మంచి రూప లావణ్యాలతో దేవలోకంలో సుఖిస్తారు.

ఈ కాలంలో ఉమామహేశ్వర స్వరూపంగా భావించి, విప్రదంపతులను పూజించి, వారికి శక్త్యానుసారము సువర్ణదానం చేసి, వ్రతసమాప్తియందు ఉమా మహేశ్వరుల బంగారుప్రతిమను చేయించి దానినిపూజించి దానంచెయ్యాలి. తరువాత రుచికరమైన పిండివంటలతో భోజనంపెట్టాలి. అలా చేసిన వాడి సంపద సురక్షితంగా ఉంటుంది. మంచి కీర్తి కలుగుతుంది. ఈ లోకంలో సమస్త భోగాలు అనుభవించి అంతముందు కైలాసం చేరతాడు.

ప్రతిరోజూ ఫలదానం చేసి వ్రతసమాప్తిన వెండి ఫలమును

దానమిచ్చిన వాడి కోరికలు అన్నీ తీరతాయి. అతడు స్వర్గాన్ని చేరతాడు.

బంగారు పుష్పములు దానం చేసినవాడు ఈ లోకంలో శ్రేష్ఠమైన సౌభాగ్యము పొంది, చివరకు గంధర్వలోకం చేరతాడు.

వ్రతసమయంలో ప్రతిరోజూ దధ్యన్నము (పెరుగు అన్నం) దానంచెయ్యాలి. అంత శక్తి లేకపోతే అష్టమి, చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య, ఆదివారము, శుక్రవారములందు దధ్యన్నము దానంచెయ్యాలి. వ్రతసమాప్తిన గోదానంగాని, భూదానంగాని, వస్త్రదానంగాని చేసినట్లైతే అతడికి అక్షయమైన అన్నం దొరుకుతుంది. పుత్రపౌత్రాదివృద్ధి కలుగుతుంది. అంతమందు కైలాసం చేరతాడు.

చాతుర్మాస్య దీక్షను కేవలము కూరలు, దుంపలు, ఫలములతో గడిపి ఆఖరున గోదానం మిచ్చినట్లైతే అతడు వైకుంఠంచేరతాడు. కేవలము పాలుత్రాగి ఈ వ్రతమాచరించి, వ్రతసమాప్తిన గోదానం చేసినట్లైతే అతడు బ్రహ్మలోకం పొందుతాడు.

చాతుర్మాస్యములో ప్రతిరోజూ అరటిఆకులలో భోజనంచేసి చివరన వస్త్రములు, కంచుపాత్ర దానం చేసినట్లైతే అతడు గొప్పసుఖములు పొందుతాడు.

ప్రతిరోజూ మోదుగఆకులలో భోజనం చేసినవాడి పాపాలు సర్వము హరించి వేయబడతాయి. ఈ వ్రతమాచరించిన వాడికి బ్రహ్మహత్యాపాతకము, సురాపానము, శిశుహత్య, భ్రూణహత్య, స్త్రీహత్య, అసత్యము, పొందరాని స్త్రీలనుపొందటము వంటి వాటివలన కలిగే పాపాలు కూడా హరించుకుపోతాయి.

వ్రతసమాప్తి యందు సారవంతమైన భూమిని దానంచేసిన వాడు ఆయురారోగ్య ఐశ్వర్యాలు పొంది చివరకు వైకుంఠం చేరతాడు.

ఎప్పుడూ ఏదీఅడగని విప్రునకు, సువర్ణము, చందనముతో వృషభదానం చేసినవాడు జ్ఞానము, మోక్షము పొందుతాడు.

ఈ సమయంలో ప్రతిరోజూ పగలు ఉపవాసముండి రాత్రికి భుజించాలి. వ్రతసమాప్తిన బ్రాహ్మణ సమారాధన చెయ్యాలి. అలా చేసినవాడు కైలాసం చేరి మహాసుఖా అనుభవిస్తాడు.

చాతుర్మాస్యములో ఏకభుక్తంచేసి, వాసుదేవుని పూజించినవాడు స్వర్గలోకం చేరతాడు. ప్రతిరోజూ భూమిపైనే శయనించి, వ్రతాంతమున శయ్యాదానం చేసినవాడు శివలోకంలో గొప్పసుఖాలనుభవిస్తాడు.

ఈ కాలంలో పాయసము, తేనె, ఉప్పు, నేయి, ఫలములను విసర్జించి, కార్తీక పూర్ణిమిన వీటిని దానమిచ్చిన వాడు రుద్రలోకం పొందుతాడు.

ఈ నాలుగు నెలలు తలస్నానం చెయ్యకుండా, గోళ్ళు కత్తిరించకుండా శ్రీమహావిష్ణువును పూజించినవాడు విష్ణులోకం పొందుతాడు.

ఈ కాలంలో కూరలను పూర్తిగా వదలివేసి వ్రతాంతమునందు వెండిపాత్రతో పాటుగా పదిరకాల కూరలు, వస్త్రములు దానంచేసిన వాడికి కైలాసం ప్రాప్తిస్తుంది.

ఈ కాలంలో గోధుమలను తినకుండాఉండి వ్రతాంతమున బంగారు గోధుమలను దానం చేసినట్లైతే అశ్వమేధయాగం చేసిన ఫలందక్కుతుంది. బంగారు గోధుమలు దానంచేసేటప్పుడు ఈ క్రింది మంత్రం చదవాలి.

**మం॥ గోధూమాః సర్వజంతూనాం బలపుష్టివివర్ధనాః**

**ముఖ్యాశ్చ హవ్యకవ్యేషు తస్మా న్మే దదతు శ్రియం**

గోధుమలు సర్వజీవులకు బలాన్ని పుష్టిని ఇస్తాయి. దేవపితృకార్యములకు ఇవి ముఖ్యమైనవి. కాబట్టి నాకు సంపదలనిచ్చుగాక.

ఈ సమయంలో తనకు ఇష్టమైన కూరలు, పండ్లు తినకుండా వదలివేసి, వ్రతసమాప్తియందు వెండితోచేసిన పండ్లు లేదా కూరలను దానం చేసినట్లైతే ఆయురారోగ్య ఐశ్వర్యములు, పుత్రపౌత్రాది సంతతి కలుగుతుంది. అంతమందు స్వర్గంలభిస్తుంది.

శ్రావణ మాసంలో – శాకములు, భాద్రపదంలో – పెరుగు, ఆశ్వీయుజ మాసంలో – పాలు, కార్తీక మాసంలో – పప్పులు వదలి వెయ్యాలి. అంతేకాదు, అనేక బీజములున్న ఫలములు అంటే గుమ్మడి, జామ, సీతాఫలము, నారింజ, బత్తాయి, వంకాయలు వంటివాటిని తినరాదు.

ఉసిరి, రేగు, ఆనప, చింతకాయలను ఈ నాలుగునెలలు తినరాదు. నులక మంచంమీద గాని పట్టె మంచంమీద గాని పడుకోరాదు. ఋతుకాలము తరువాత భార్యను కలవరాదు.

బచ్చలి, మునగ, వంగ, మారేడుపండ్లు తినేవాడికి శ్రీహరి దూరమవుతాడు.

ఈ సమయంలో ఏ రకమైన వ్రతాలు చెయ్యకపోయినా, ప్రతిరోజూ క్రమం తప్పకుండా ఉదయం, సాయంత్రం స్నానంచేసి శ్రీహరిని పూజించినట్లైతే అతడు వైకుంఠము పొందుతాడు.

చాతుర్మాస్యంలో తేనె విడిచినవాడు – రాజవుతాడు. బెల్లమును విడిచిన వాడు – దీర్ఘాయుష్షు పొందుతాడు. దేవాలయంలో సంగీతాన్ని వినిపించిన వాడు – గంధర్వలోకం పొందుతాడు. సువాసనవెదజల్లే

నూనెలు విడిచినవాడికి – శత్రువులు నశిస్తారు. ఇప్పనూనె త్యజించిన వాడు – మంచి సౌభాగ్యము పొందుతాడు. కారము, పులుపు, చేదు, వగరు, తీపి – వీటిని విసర్జించిన వాడి శరీరము అందముగా ఉంటుంది.

పూలు మొదలైన భోగాలను వదలినట్లైతే విద్యాధరగణమందు చేరతాడు. యోగియైనవాడు బ్రహ్మలోకం చేరతాడు.

తాంబూలము వదలివేసిన వాడికి – రోగాలు నశిస్తాయి. పక్వాహారము విడచిన వాడు – ఇంద్రలోకం పొందుతాడు. రోజు విడిచి రోజు ఉపవాసం చేస్తే – బ్రహ్మలోకం ప్రాప్తిస్తుంది.

చాతుర్మాస్యంలో **'ఓం నమో నారాయణాయ'** అనే అష్టాక్షరీ మంత్రజపం చేసిన వాడికి పుణ్యలోకాలు కలుగుతాయి.

ఆలయంలో లక్షప్రదక్షిణాలు చేసినవాడు హంసవాహనమెక్కి వైకుంఠం చేరతాడు. ఈ నాలుగు నెలలూ బయట భోజనం చెయ్యనివాడు – దేవతా స్వరూపుడవుతాడు.

ఈ సమయంలో పూర్తిగా ఉపమాసమున్న వాడికి సాయుజ్యం లభిస్తుంది. అతడికి పునర్జన్మ ఉండదు.

మధూకర భిక్షాన్నముతిని గడిపినవాడు – వేదపారంగతుడవుతాడు.

శ్రీమన్నారాయణుడు నిద్రకుపక్రమించే రోజున ఈ వ్రతాన్ని ప్రారంభించి నాలుగు నెలలపాటు నిర్విఘ్నంగా వ్రతమాచరించినవాడు ఈ లోకంలో సకల సుఖాలు అనుభవించి, అంతమందు సాయుజ్యంపొందుతాడు.

పూర్వకాలంలో సన్యాసి బృందాలన్నీ కాలినడకనే తిరిగేవి. ఆ రోజుల్లో దారులు సరిగాలేవు. ప్రయాణ సౌకర్యాలు లేవు. అందుకని వర్షాకాలమంతా చాతుర్మాస్యం చేసేవారు. కంచి పెద్దస్వాములవారు 3సార్లు భారతీయమంతా కాలినడకన నడిచారట. కాని ఈ రోజున రహదారులు, ప్రయాణ సౌకర్యాలు మెరుగుపడ్డాయి. ఇప్పుడు సన్యాసి బృందాలుకూడా విమానం, రైలు, కారు ప్రయాణాలు చేస్తున్నారు. కాలినడకన వచ్చే స్వామి కనుమరుగై పోయాడు. ఆ రోజుల్లో సన్యాసి జీవితమంటే, ఎక్కడికైనా సరే కాలినడకనే వెళ్లాలి. రుచీపచీ లేని భోజనం చెయ్యాలి. బయటకి వచ్చినప్పుడు తప్ప, గోచీతోనే ఉండాలి. నేలమీదనే పడుకోవాలి. ఇలా కఠోర నియమాలుండేవి. కాని ఈరోజున సన్యాసిజీవితం చాలావరకు సుఖమయ మయింది. ప్రయాణం చెయ్యటానికి ఎ.సి.కార్లు, బసచెయ్యటానికి ఎ.సి. గదులు. పడుకోవటానికి సుతిమెత్తనిపరుపులు, కూర్చోవటానికి మెత్తటి హుందాఅయిన కుర్చీలు, వెనకవైపునా రెండు ప్రక్కలా, కాళ్ళ దగ్గరా ఫాన్లు. రుచికరమైన భోజనం. కూర్చుంటే మసాద్‌చేసే కుర్చీలు.

ఇక్కడ ఒకచిన్న విషయం. నాకు తెలిసిన ఒకాయన ఒకరోజున నాకు చాలా హడావిడిగా కనిపించాడు. ఏమిటి విషయం? అన్నా. మాయింటికి స్వామీజీ వస్తున్నారు భోజనానికి. అందుకని కూరలు తీసుకుపోతున్నాను అన్నాడు. రెండు సంచులనిండా ఉన్నాయి కూరలు. 'ఇవన్నీ స్వామీజీకే ! అన్నాను వాటిని చూసి అతడు అంతకన్న ఇదిగా "ఇవన్నీ మధ్యాహ్నానికేనండి బాబూ!" అన్నాడు. నాకు చిన్న అనుమానం వచ్చింది? ఎన్ని కూరలు వండుతారు? అని అడిగా. దానికి ఆయన "కనీసం పది పన్నెండు కూరలయినా వండుతాం" అన్నాడు. 'ఇవన్నీ

స్వామీజీ తినటానికే?' ఆశ్చర్యంగా అడిగా, ఆఁ !! అవన్నీ తిన్నారా? పెట్టారా? అన్నీ వండితే వారికి కావలసిన దాన్ని మాత్రం తింటారు. మిగిలినవి అలా ఉంటాయి" అన్నాడు.

గతకాలంలో అయితే **'సన్యాసీ దుఖీ! సంసారీ సుఖీ'** గృహస్థు సుఖంగా ఉంటాడు. సన్యాసి జీవితం దుఃఖమయం అనేవారు.

కాలం మారిపోయింది. ప్రపంచం మారిపోయింది. దాంతో సన్యాసి జీవితం కూడా మారిపోయి 'సుఖవంతమయింది' ఇప్పుడు వారు కాలినడకన పోలేరు. ఆ అవసరం కూడా లేదు.

అందుకే ఈ మధ్య స్వామీజీ లందరూ కలిసి ఈ చాతుర్మాస్యం 'నాలుగు మాసాలు కాకుండా నాలుగు పక్షాలకి కుదించారట. అంటే రెండు నెలలన్న మాట. ఒకసారి సభలో మాట్లాడుతూ అక్కడ స్వామీజీతోనే చెప్పాను. ప్రయాణ సౌకర్యాలు పూర్తిగా ఉన్న ఈ రోజున అసలు చాతుర్మాస్యం అవసరమే లేదు. దీన్ని పూర్తిగా మానేసినా ఇబ్బంది లేదు. **ప్రస్తుతం ఇది ఒక సంప్రదాయం మాత్రమే.**

మాధవవిద్యారణ్యుల గురువుగారు శంకరానందులవారు ఉపనిషత్తుల సారమంతా కలిపి **'ఆత్మపురాణము'** అనే పేరుతో ఒక గ్రంథం వ్రాశారు. సన్యాసులందరూ చాతుర్మాస్యంలో దీన్ని పారాయణ చెయ్యాలనేది సంప్రదాయం. దీన్ని ఇప్పుడు ఎవరూ పారాయణ చెయ్యటం లేదు సరికదా చాలామందికి ఈ విషయం కూడా తెలియదు.

చాతుర్మాస్యంలో ఈ గ్రంథం మీద ఉపన్యాసాలు చెబితే జ్ఞానాన్ని పదిమందికీ పంచినట్టూ ఉంటుంది. పారాయణ చేసినట్టూ అవుతుంది.

# 104. బ్రహ్మోపనిషత్తు

## శిఖా, యజ్ఞోపవీతాలు

గృహస్తుగా ఉండి కర్మలు చేసేవాడు శిఖ, యజ్ఞోపవీతాలు ధరిస్తాడు. సన్యాసి ఆ శిఖాయజ్ఞోపవీతాలను తీసివేస్తాడు. దీనికి కారణం ఏమిటి? అసలు జీవునియొక్క పరమార్ధం ఏమిటి ? ఈ విషయాలను వివరిస్తోంది **'బ్రహ్మోపనిషత్తు'.**

ఈ చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపం. పరమేశ్వరమయం. ఆ పరమేశ్వరుడు నిత్యము సత్యమైనవాడు. శాశ్వతుడు. అతడు పూర్ణపురుషుడు. పూర్ణపురుషుడైన ఆ పరబ్రహ్మకు నాభి, హృదయము, కంఠము, శిరస్సు అనే నాలుగు స్థానాలున్నాయి. ఈ నాలుగు స్థానాలలోను పరబ్రహ్మ నాలుగు పాదాలుగా ఉంటాడు. పూర్ణపురుషుడు జాగ్రదవస్థలో చతుర్ముఖ బ్రహ్మగా, స్వప్నావస్థలో - విష్ణువుగా, సుషుప్తిలో - రుద్రుడుగా, తురీయమునందు - పరమాత్మగా ప్రకాశిస్తుంటాడు.

విష్ణువు, ఈశ్వరుడు, సూర్యుడు ఆ పరమాత్మయే. ఆ ఆత్మకు మనసులేదు. కాళ్ళులేవు, చేతులులేవు, కళ్ళులేవు, నోరులేదు, ముక్కులేదు, చెవిలేదు. ఏవీలేవు. కేవలము అది ఒక జ్యోతిస్వరూపము. ఆ పరమాత్మయందు లోకాలు లోకాలుగా ఉండవు. దేవతలు దేవతలుగా ఉండరు, వేదాలు వేదాలుగా ఉండవు. యజ్ఞాలు యజ్ఞాలు కావు. తల్లి తల్లికాదు. తండ్రి తండ్రి కాదు. కొడుకు, కోడలు, ఛండాలుడు, సన్యాసి వీరెవరు కూడా వీరు కాదు. తపస్వి తపస్వికాదు. అటువంటి పరబ్రహ్మము అఖండముగా నిర్వాణ స్వరూపముగా ప్రకాశిస్తున్నది.

ఆ పరమాత్మను దేవతలు మహర్షులు ఎవరూ నిర్ణయించలేరు. సర్వజ్ఞుడైన జ్ఞాని మాత్రమే ఆ పరబ్రహ్మను తెలుసుకుని, దాన్ని అనుభవించగలుగుతున్నాడు. దేహంలో సమస్త ఇంద్రియాలు, ఇంద్రియాది దేవతలు హృదయ స్థానంలో ఉన్నారు. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములనే పంచప్రాణాలు హృదయమందే ఉన్నాయి. హృదయంలో ఉన్న పంచప్రాణాలు, జ్యోతిరూపఆత్మ, ఇంద్రియాల, ప్రాణాల, తేజస్సు, స్వరూపము, అయిన సూత్రాత్మ (ఇదే యజ్ఞోపవీతము) అన్నీ ఆ పరమాత్మయే అని బ్రహ్మజ్ఞానులు మాత్రమే తెలుసుకోగలుగుతున్నారు.

సూత్రాత్మ అంటే యజ్ఞోపవీతము. ద్విజులు అనగా బ్రహ్మ క్షత్రియ వైశ్యులు దీన్ని ఉపనయన కాలంలో ధారణ చేస్తారు. దీన్నే బ్రహ్మసూత్రము అని కూడా అంటారు. జగత్తంతా బ్రహ్మమయమని చాటిచెప్పే సూత్రం ఇది. దేహంలో ఉండే నాడులలో సుషుమ్నానాడి ముఖ్యమైనది. దీన్నే బ్రహ్మనాడి అంటారు. అంతఃపూజలో సుషుమ్నానాడినే బ్రహ్మసూత్రము లేక యజ్ఞోపవీతము అని భావన చేస్తారు.

యజ్ఞోపవీతము గాయత్రీ మంత్రానికి ప్రతీక. తొంభైఆరు బెత్తలు ప్రమాణం కల సూత్రము (దారము) మూడు పోగులతో తయారుచేసి దాన్ని మూడుచుట్లు త్రిప్పాలి. ఇప్పుడు రెండు చివరలు కలిపి ముడివెయ్యాలి. ఇందులోని సూత్రంలో మూడు పోగులుంటాయి. యజ్ఞోపవీతం మూడు ముళ్ళు కలిగి ఉంటుంది. ఒక్కొక్క ముడికి మూడు వరుసలుంటాయి. వరుసకు మూడు పోగులుంటాయి. ఈ రకంగా యజ్ఞోపవీతం ఇరవై ఏడు పోగులు కలిగి, తొంభై ఆరు బెత్తలు ప్రమాణంతో ఉంటుంది. ఇందులోని

ఇరవై ఏడు పోగులు - ఇరవై ఏడు భేదములు గల జగత్తు

మూడు ఆవృతులు - మూడు గుణాలు

మూడు ముడులు - మూడు గ్రంథులు

మూడు గ్రంథులు కలిసి - బ్రహ్మముడి

బ్రాహ్మణులు యజ్ఞోపవీతం ధరించి కర్మచేస్తారు. యజ్ఞోపవీతం తీసివేయట మంటే కర్మ పరిత్యాగం చెయ్యటమన్నమాట. సన్యాసికి కర్మలేదు. అందుకే అతడు యజ్ఞోపవీతం ధరించడు. సర్వకర్మలనుండి విముక్తుడైనవాడు జీవన్ముక్తుడు. అలాగే నెత్తిమీద జుట్టు అంతా తీసివేసి కేవలము శిఖధరించటము సంప్రదాయం.

సుషుమ్నానాడిలో సూక్ష్మనాడులు కలిసే చోటును గ్రంథి అంటారు. ఇది ఇరవై ఏడు సూక్ష్మనాడుల సమూహం. అందుకే యజ్ఞోపవీతంలో కూడా ఇరవై ఏడు పోగులుంటాయి. అయితే సుషుమ్నానాడి యజ్ఞోపవీతంకన్న సత్యమైనది, సహజమైనది. ఇదే కంఠసూత్రము. ఈ రకంగా ఉన్న యజ్ఞోపవీతాన్ని ధరించి బ్రాహ్మణుడు కర్మచేస్తాడు. సన్యాసి ఆ యజ్ఞోపవీతాన్ని వదిలి కర్మ పరిత్యాగం చేస్తాడు.

సృష్టికర్త అయిన బ్రహ్మతోబాటుగా జన్మించినది, పవిత్రమైనది, శ్రేష్ఠమైనది, ఆయుష్షును వృద్ధిచేసేది, అన్నింటికన్నా ముందుగాపుట్టినది అయిన ఆ యజ్ఞోపవీతాన్ని గురించి తెలుసుకోవాలి. పరిశుద్ధము, జ్యోతిస్వరూపము అయిన యజ్ఞోపవీతము పరతత్త్వ సాధకులందరికీ ప్రాప్తించునుగాక. పండితుడు (జ్ఞాని) బాహ్యకర్మలు అంటే యజ్ఞయాగాదులు నిర్వర్తించటం కోసం కేశఖండన చేయించుకొని, శరీరముమీద ఉన్న యజ్ఞోపవీతాన్ని తీసివెయ్యాలి. అక్షరపరబ్రహ్మనే

యజ్ఞోపవీతంగా భావించి ధరించాలి. ఈ యజ్ఞోపవీతము పరమాత్మను తెలియజేస్తుంది కాబట్టి దీన్ని సూత్రము అంటారు. సూత్రాత్మ స్వరూపంలో ఉన్న యజ్ఞోపవీతమే మోక్షస్వరూపమైనది.

ఈ జగత్తు మొత్తాన్ని మాలలోని పూవులను దారంలాగా, ఏ సూత్రంతో గ్రుచ్చబడి ఉన్నదో, అటువంటి పరమాత్మ అనే సూత్రాన్ని యోగవేత్త, బ్రహ్మవేత్త అయిన యోగి ధరిస్తున్నాడు. ఉత్తమమైన యోగాన్ని అభ్యసిస్తున్న విద్వాంసుడు బాహ్యసూత్రాన్ని త్యజించాలి. అంటే మామూలుగా మెడలో వేసుకొనే యజ్ఞోపవీతాన్ని తీసిపారెయ్యాలి. చైతన్యమునందలి బ్రహ్మభావనయే సూత్రము అని భావించి ధరించాలి.

బ్రహ్మస్వరూపమైన యజ్ఞోపవీతాన్ని ధరించటంవల్ల, ధ్యానించటంవల్ల, ఏ రకమైన అపరిశుభ్రత ఉండదు. ఆత్మజ్ఞానమే యజ్ఞోపవీతముగా భావించి ధ్యానించేవాళ్ళే అసలు యజ్ఞోపవీతం అంటేఏమిటో తెలిసినవారు. అటువంటి జ్ఞానులే యజ్ఞోపవీతం ధరించినవారు. ఆత్మజ్ఞానమనే యజ్ఞోపవీతం కలిగి ఉండి పరబ్రహ్మను ధ్యానించేవారికి బ్రహ్మజ్ఞానమే ఉత్తమమైనది. అందుచేత పరబ్రహ్మ జ్ఞానమే పవిత్రమైనది.

శిఖ అంటే, తలమీద వెంట్రుకలన్నింటినీ తీసివేసి, నడినెత్తిన పిలక ఉంచటం. ఈ శిఖ జ్ఞానానికి గుర్తు. అందుకే అగ్నిలాగా జ్ఞానమనే శిఖ ఉన్నవాడు విద్వాంసుడు. జ్ఞానశిఖ ధరించినవాడే విద్వాంసుడు. ఇతరులు అంటే నెత్తిన జుట్టుతో శిఖ ఉంచుకున్నవారు కేశధారులు (జుట్టు ఉన్నవారు) మాత్రమే.

వేదవిహితమైన కర్మలు చెయ్యాలి అంటే బ్రాహ్మణులు

యజ్ఞోపవీతాన్ని బాహ్యంగా కూడా ధరించాలి. బాహ్యంగా ధరించిన యజ్ఞోపవీతం బాహ్యకర్మలకు సాధనము. జ్ఞానమగు శిఖగలవారు సమస్తమైన సత్కర్మలు చేసినవారే అవుతారు. అటువంటి జ్ఞానులకు సమస్తమైన బ్రాహ్మణ్యము చెప్పబడింది. సూత్రాత్మ అనబడే యజ్ఞోపవీతము ఉత్తమమైనది. దీనిని తెలిసినవాడు 'యజ్ఞోపవీతి' అనబడతాడు. ఈ విషయాలు తెలిసినవాడు యజ్ఞస్వరూపుడు. అతన్ని యజ్ఞము చేసినవాడుగా బ్రహ్మవేత్తలు అంగీకరిస్తారు.

ఒక్కడుగా ఉన్నవాడు, తేజోవంతుడు అయిన పరబ్రహ్మ సర్వప్రాణులయందు నిగూఢముగా ఉన్నాడు. అతడు సర్వవ్యాపి. సమస్త భూతములలో నివసించు ఆత్మస్వరూపుడు. సర్వభూతాధివాసుడు. సర్వసాక్షి. చైతన్యస్వరూపుడు, గుణరహితుడు. అఖండముగా ఉన్నవాడు. జగత్తులో అన్నీ అతని వశంలోనే ఉంటాయి. పరబ్రహ్మ ఒకేరూపం కలిగి ఉండికూడా అనేక రూపాలలో కనబడుతుంది. అట్టి పరమాత్మను జ్ఞానులు హృదయంలో దర్శిస్తారు. అటువంటి వారికి శాశ్వత సుఖం లభిస్తుంది.

అగ్నిప్రతిష్ఠాపన చెయ్యాలి అంటే అరణిని మథించాలి. అలాంటప్పుడు క్రింద ఒక కర్ర, పైన ఒక కర్రపెట్టి రాపిడి కలిగించాలి. ఆ రాపిడికి అగ్నిపుడుతుంది. సాధకుడు మనస్సును క్రింది కర్రగా, ప్రణవాన్ని పైకర్రగా చేసి, ధ్యానాభ్యాసము అనే మథనం చేసి నిగూఢంగా ఉన్న ఆత్మపురుషుని దర్శించాలి.

నువ్వులలో నూనెలాగా, పాలలో వెన్నలాగా, ప్రవాహంలో జలంలాగా, కొయ్యలో అగ్నిలాగా, పరమేశ్వరుడు అంతఃకరణము నందు నిగూఢముగా ఉన్నాడు. సత్యముచేత, తపస్సుచేత, ధ్యానముచేత ఆ పరమాత్మని సాక్షాత్కరించుకోవాలి. సాలెపురుగు ఏ రకంగా

దారాలను తయారుచేసి వాటితో గూడు అల్లి అందులోకి వెడుతుందో, అదే రకంగా జీవుడు కూడా జాగ్రత్, స్వప్నాలను నిర్మించుకుని వాటిలో సంచరిస్తున్నాడు ఈ జీవుడు.

| | | |
|---|---|---|
| జాగ్రదావస్తలో | – | నేత్రములందు |
| స్వప్నావస్థలో | – | కంఠమందు |
| సుషుప్తిలో | – | హృదయమందు |
| తురీయములో | – | సహస్రారమందు ఉంటాడు |

ముక్కు, మనస్సు మొదలైన అవయవాలు ఏ పరమాత్మను దర్శించలేక వెనుతిరిగి వస్తున్నాయో, బ్రహ్మజ్ఞాని ఏ ఆత్మను తెలుసుకుని జీవన్ముక్తుడవుతాడో, ఆ పరమాత్మయే జీవునియొక్క పదార్ధము, ఆనందము. పాలలోని నెయ్యిలాగా, బ్రహ్మవిద్యా తపస్సులే స్వరూపంగా గల పరమాత్మను సర్వాంతర్యామిగా కీర్తిస్తున్నారు. అతడే మోక్షప్రదాత.

# 105. పరమహంసోపనిషత్తు

ఇది శుక్లయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో ఆరు మంత్రాలున్నాయి. నారదుడికి హిరణ్యగర్భుడు చెబుతున్నాడు.

**మం. ఓం అథ యోగినాం పరమహంసానాం కోమార్గ స్తేషాం కా స్థితి ? రితి నారదో భగవంత ముపసమే త్యోవాచ(1)**

'పరమహంస' అనే మాటను ఎక్కువగా వింటూ ఉంటాం. మరి ఈ పరమహంసలకు మార్గమేది ? వారి స్థితి ఏది ? వారి సంప్రదాయం ఏది? ఈ విషయాలను వివరిస్తోంది **పరమహంసోపనిషత్తు.**

**మం. తం భగవా నాహ యోఽయం పరమహగ్ంస మార్గో లోకే దుర్లభతరో న తు బాహుళ్యో య ద్యేకో భవతి సఏవ నిత్యకూటస్థ స్సఏవ వేదపురుష ఇతి విదుషో మన్యంతే మహాపురుషో యచ్చిత్తం తత్సదా మయ్యేవ తిష్ఠతే తస్మా దహంచ తస్మిన్నే వావస్థీయతేఽసౌ స్వపుత్ర మిత్ర కళత్ర బంధ్వాదీం చ్ఛిఖాం యజ్ఞోపవీతగ్ం స్వాధ్యాయంచ సర్వకర్మాణి సన్న్యస్యాయం బ్రహ్మాండంచ హిత్వా కౌపీనం దండ మాచ్ఛాదనం చ స్వశరీరోప భోగార్థాయ లోకస్యైవోపకారార్థాయ చ పరిగ్రహే త్తచ్చ న ముఖ్యోస్తి కోఽయం ముఖ్య ఇతి చ య దయం ముఖ్యః (2)**

పరమహంసల మార్గము అత్యంత దుర్లభమైనది. ఈ మార్గంలో సంచరించే వారు చాలా తక్కువమంది ఉంటారు. బ్రహ్మచారులలాగా, గృహస్థులలాగా ఎక్కువ మంది ఉండరు. పుణ్యక్షేత్రాలలో ఎక్కడో ఒకడు

కనిపిస్తాడు. పరమహంస మార్గంలో ఉన్నవారు నిత్యము పవిత్రులై ఉంటారు. వీరికి శిఖా, యజ్ఞోపవీతాలు ఉండవు. అయినప్పటికీ సర్వకాల సర్వావస్థలయందు పూజింపదగినవారు. ఇతడు సాక్షాత్తూ వేదపురుషుడు. ఇతడికి సంతానము, భార్య, బంధువులు, మిత్రులు, శత్రువులు ఎవరూ ఉండరు. శిఖ ఉండదు. యజ్ఞోపవీతాన్ని ధరించడు. తాను నేర్చుకున్న వేదాన్ని అధ్యయనం చెయ్యడు. ఇతడు సర్వశాస్త్ర పండితుడు. సర్వకర్మలు చెయ్యటంలో నిష్ణాతుడు. అయినప్పటికీ శాస్త్రాలు, కర్మలు అన్నీ వదలివేసినవాడు. సర్వము త్యజించి కేవలము లోకంకోసం కౌపీనము, దండ కమండలాలు, కాషాయాంబరాలు ధరించినవాడై ఉంటాడు. ఇతడికి కౌపీనము ధరించటం ముఖ్యంకాదు. ఇప్పుడు చెప్పబోయే విషయాలు మాత్రమే ముఖ్యమైనవి.

**మం.** **న దండం నకమండలుం న శిఖా న్న యజ్ఞోపవీతం నచాచ్ఛాదనం చరతి పరమ హగ్ంసో నశీతం నచోష్ణం నసుఖం నదుఃఖం న మానావమానే ఇతి షడూర్మివర్జితో నశబ్దం నస్పర్శం నరూపం నరసం నగంధం నచ మనోప్యేవంనిందా గర్వమత్సర దంభ దర్పేచ్ఛా ద్వేష సుఖదుః ఖ కామ క్రోధ లోభ మోహ హర్షా సూయాహంకారా దీంశ్చ హిత్వా స్వవపుః కుణప మివ దృశ్యతే యత స్తద్వపు రపధ్వస్తం సగ్ంశయ మిథ్యాజ్ఞానానాం యో హేతుస్తేన నిత్య నివృత్త స్తన్నిత్యబోధ స్తత్ స్వయమే వావ స్థితి స్తగ్ం శాంత మచల మద్వయానంద చిద్ఘన ఏవాస్మి తదేవ మమ పరమంధామ తదేవ శిఖా తదేవోపతీంచ పరమాత్మాత్మనోరేకత్వ జ్ఞానేన,**

**తయో ర్భేదఏవ విభగ్న స్సా సంధ్యా (3)**

శిఖాయజ్ఞోపవీతాలుండవు. స్వాధ్యాయము చెయ్యడు. యజ్ఞోపవీతముకాని, ఆచ్ఛాదన వస్త్రం (పైబట్ట) కాని ఉండవు. ఇతడి దృష్టిలో శీతోష్ణాలు, సుఖ దుఃఖాలు, మానావమానాలు అన్నీ సమానము. వీటిని పట్టించుకోడు. షడూర్మ్ములు, తన్మాత్రలు లేనివాడై ఉంటాడు. షడూర్మ్ములు అంటే 1. ఆకలి, 2. కోరిక, 3. శోకము 4. మోహము 5. జర 6. మరణము. తన్మాత్రలు అంటే 1. శబ్దము 2. స్పర్శ 3. రూపము 4. రసము 5. గంధము. వీటితోపాటుగా మనసుకూడా లేనివాడై ఉంటాడు. అంతేకాదు నింద, గర్వము, మత్సరము, దంభము, దర్పము, ఇచ్ఛ, ద్వేషము, అరిషడ్వర్గాలు (కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలు) వీటిని పరిత్యజిస్తాడు. తన దేహాన్ని ఒక శవంతో సమానంగా చూస్తాడు. ఈ శరీరము ఎప్పుడైనా నశించేదే. నిత్యమైనవాడను, శాంతస్వరూపుడను నేనే. అచలుడను నేనే. అధ్యయానంద విజ్ఞానఘనుడను నేనే. అని విశ్వసిస్తాడు. ఆ పరమస్థానమే నానివాసము అదే శిఖా యజ్ఞోపవీతాలుగా ఉన్నది. తత్త్వము, పదార్ధము అనే రెండూ విడివిడిగా లేవు. ఆ రెండూ ఒక్కటే. ఈ విషయాన్ని గ్రహించటమే సంధ్యావందనము.

**మం॥**

**సర్వా న్కామా న్పరిత్యజ్య అద్వైతే పరమే స్థితిః, జ్ఞానదండో ధృతో యేన ఏక దండీ స ఉచ్యతే, కాష్ఠదండో ధృతో యేన సర్వాశీ జ్ఞానవర్జితః, తితిక్షా జ్ఞాన వైరాగ్య శమాది గుణవర్జితః , భిక్షామాత్రేణ యో జీవే త్సపాపీ యతి వృత్తిహా, స యాతి**

నరకాన్ఘోరా న్మహారౌరవ సంజ్ఞి కాన్ ఇద మంతరం జ్ఞాత్వా స పరమహగ్ంసః (4)

అన్ని కోరికలు వదలి, అద్వైతస్థితి (జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటేననే భావన. నేను తప్ప ఈ జగత్తులో ఏదీలేదు. ఉన్నది ఒక్కటే అదే నేను అన్న స్థితి)లో ఉన్నవాడు జ్ఞానదండాన్ని ధరిస్తాడు. అతడే ఏకదండి. ఈ దండము జీవాత్మ పరమాత్మ రెండూ వేరుకాదు. ఆ రెండూ ఒకటే అన్న దానికి ప్రతీక. కేవలము ఒక వెదురుకర్రను దండముగా ధరించి పరమహంసకు పనికిరానటువంటి, యతిఆశ్రమానికి విరుద్ధమైనటువంటి లౌకికమైనభోగాలను అనుభవిస్తూ, మధురపదార్ధాలను, షడ్రసోపేతమైన ఆహారాన్ని భుజిస్తూ, జ్ఞానహీనుడై ఉండేవాడు మరణానంతరము రౌరవాది నరకాలకు పోతాడు. అక్కడ దారుణంగా శిక్షింపబడి, దుఃఖాలను అనుభవిస్తాడు. ఆత్మనిష్ఠ కలగాలంటే విద్వాంసుడికి నాలుగు లక్షణాలుండాలి. వాటినే సాధనా చతుష్ఠయము అంటారు. అవి :

**1. నిత్యానిత్య వివేకము :** ఏది సత్యము ? ఏది అసత్యము ? ఏది నిత్యము ? ఏది అనిత్యము ? అనే విషయ పరిజ్ఞానము. బ్రహ్మ ఒక్కటే సత్యము. ఈ జగత్తు అంతా మిథ్య.

**2. వైరాగ్యము :** లౌకికమైన సుఖాలపట్ల విముఖత. శరీరం దగ్గర నుంచీ బ్రహ్మలోకందాకా ఉండే భోగ్యపదార్ధాలయందు అసహ్యభావన.

**3. షట్సంపత్తి :** ఇవి మొత్తం ఆరు.

**1. శమము :** అంతరింద్రియనిగ్రహము. విషయవాంఛలనుండి,

అంతరింద్రియాల నుండి దోషదృష్టితో విరక్తిచెందటం.

**2. దమము :** బాహ్యేంద్రియనిగ్రహము. ఇంద్రియాలను వాటి వాటి విషయాలనుండి మళ్ళించి వాటి స్థానాలలోని నిలిపివేయటం.

**3. ఉపరతి :** కర్మలను పరిత్యజించటం. బాహ్యావిషయాలను చిత్తవృత్తులతో ఆశ్రయించకుండా ఉండటము. విహితకర్మలను విధిపూర్వకంగా పరిత్యజించటం.

**4. తితిక్ష :** శీతోష్ణ సుఖదుఃఖాలను సహించేశక్తి. చింత, దుఃఖము మొదలైనవి లేకుండా, ప్రతీకారము లేకుండా, సమస్త దుఃఖాలను, కష్టాలను సహించటం. ఎదుర్కొనగల శక్తిఉండికూడా, ఇతరులు చేసిన అపకారాలు సహించటం.

**5. శ్రద్ధ :** గురువునందు, ఆయన చెప్పేమాటలయందు విశ్వాసము, వేదాలు, ఉపనిషత్తులు, శాస్త్రాలయందు నమ్మకము ఉండటము.

**6. సమాధి :** బుద్ధిని ఎప్పుడూ శుద్ధబ్రహ్మమందే నిల్పిఉంచటము.

**4. ముముక్షుత్వము :** మోక్షం పొందాలనే కోరిక. అహంకారము దగ్గర నుండి శరీరానికి ఉన్న సమస్తము అజ్ఞానంచేత కల్పించబడిన బంధనాలే. ఆత్మజ్ఞానం ద్వారా ఆ బంధనాలను త్రెంచుకోవాలనే కోరిక.

యతి అయి ఉండికూడా పైన చెప్పిన సాధన చతుష్టయము కలిగి ఉండక, కేవలము బిక్షాన్నముతిని కాలము వెళ్ళబుచ్చుతూ, యతిధర్మాలు పాటించాను అనుకునే వాడు మహాపాపి. యతి అనే పదానికి అపఖ్యాతి కలిగించేవాడు.

మం॥

**ఆకాశాంబరో న నమస్కారో నస్వాహాకారో, నస్వధాకారో నినిందాస్తుతిర్యా దృచ్ఛికో భవేత్ సభిక్షుః, నావాహనం నవిసర్జనం నమంత్రం నధ్యానం నోపాసనం చ నలక్ష్యం నాలక్ష్యం నపృథఙ్నా పృథగహం న సత్త్వం న సర్వం చానికేతః స్థిరమతి రేవం స భిక్షుః సౌవర్ణాదీనాం నై వ పరిగ్రహే న్న లోకనం నావలోకనం చ నబాధకో నచా బాధకః క ఇతి చేద్బాధకోస్త్యేవ యస్మా ద్భిక్షు ర్హిరణ్యగ్ం రసేన దృష్టం చే త్స బ్రహ్మహా భవే దృస్మాద్భిక్షు ర్హిరణ్యం రసేన స్పృష్టం చేత్సపౌల్కసో భవేత్ (5)**

పరమహంసకు ఆకాశమే అంబరము. దిక్కులే అంబరముగా గలవాడు దిగంబరుడు. అతడికి నమస్కారములేదు. స్వాహాకారము లేదు. స్వధాకారములేదు. నిందాస్తుతులు లేవు. కేవలము యాదృచ్ఛికుడు. అతడు బిక్షువు. అతడికి దేవతల ఆవాహన లేదు, విసర్జనలేదు. మంత్రం లేదు. తంత్రంలేదు. ధ్యానంలేదు. ఉపాసన లేదు. లక్ష్యంలేదు. అలక్ష్యం లేదు. భేదము లేదు. అభేదం లేదు. నేను నాది అనే అహంకార మమకారాలుకాని, స్వపరభేదాలుగాని లేవు. ఒకచోట అంటే ఉన్నచోట ఉండకుండా భిక్షువుగా తిరుగుతుంటాడు. బంగారము మొదలైన విలువగల వస్తువులను తాకడు. ఆభరణాలు ధరించడు. వాహనాలు కలిగి ఉండడు. బంగారం మీద కోరిక ఉంటే బ్రహ్మ హత్యాపాతకం అంటుతుంది. బంగారాన్ని తాకితే 'పౌల్కసుడు' (చర్మకారుడు, ఛండాలుడు) అవుతాడు.

మం॥

**యస్మాద్భిక్షు ర్హిరణ్యగ్ం రసేన గ్రాహ్యంచే త్స ఆత్మహా భవే త్తస్మా ద్భిక్షు ర్హిరణ్యగ్ం రసేన న దృష్టం చనస్పృష్టం చ న గ్రాహ్యంచ సర్వేకామా మనోగతా వ్యావర్తంతే దుఃఖేచ నోద్విగ్న స్సుఖే నిస్స్పృహ స్త్యాగే రాగే సర్వత్ర శుభాశుభయో రనభి స్నేహో నద్వేష్టి నమోదతేచ సర్వేషా మింద్రియాణాం గతి రూపరమో య ఆత్మన్యే వావస్థీయతే తత్పూర్ణానందైక బోధ స్తద్బ్రహ్మైవాహ మస్మీతి కృతకృత్యో భవతి కృత కృత్యో భవతీ త్యుపనిషత్ (6) (పరమ హంసోపనిష త్సమాప్తా)**

భిక్షువు బంగారాన్ని తీసుకుంటే ఆత్మహత్య చేసుకున్నవాడవుతాడు. కాబట్టి బంగారాన్ని ప్రీతితో చూడరాదు. తాకరాదు. తీసుకోరాదు. మనసును అన్ని కోరికల నుంచి మరల్చాలి. దుఃఖము కలిగినప్పుడు సంతాపం చెందకూడదు. సుఖం కలిగితే ఆసక్తి చూపరాదు. త్యాగము మీదనే ఆసక్తి ఉండాలి. దేన్నీ ద్వేషించరాదు. మోదము పొందరాదు. ఇంద్రియ గమనాన్ని నిషేధించి, వాటిని ఆత్మయందు చేర్చాలి. పూర్ణానంద బోధమైన బ్రహ్మను నేనే అని భావించాలి. అటువంటివాడే "పరమహంస" అంటూ పరమహంసల మార్గాన్ని, వారి స్థితినీ వివరించింది ఈ ఉపనిషత్తు.

# 106. అవధూతోపనిషత్తు - 107. సన్యాసోపనిషత్తు

ముముక్షువులలో కొందరిని 'అవధూత' అంటారు కదా ! అసలు ఈ అవధూత ఎవరు? అతడి మార్గం ఏది ? అనే విషయాలను వివరిస్తున్నాయి **అవధూతోపనిషత్తు, సన్యాసోపనిషత్తులు.**

అవధూత మార్గంలో ఉన్నవాడు అత్యంత దుర్లభమైనవాడు. ఎక్కడో కోటికొక్కడు ఉంటాడు. అతడు నిత్యపూజ్యుడు. అతడే వైరాగ్యమూర్తి మహాజ్ఞాని. వేదపురుషుడు. సాక్షాత్తు పరమేశ్వర స్వరూపుడు.

అసలు అవధూత అంటే ఎవరో చూద్దాం. సన్యాసము నాలుగు రకాలు. 1. వైరాగ్య సన్యాసము 2. జ్ఞాన సన్యాసము 3. జ్ఞానవైరాగ్య సన్యాసము. 4. కర్మ సన్యాసము.

**1. వైరాగ్య సన్యాసి :** చూడటంవలన, వినటంవలన విషయాలమీద ఆసక్తి పోయి, ప్రాప్తించిన పుణ్యకర్మ విశేషమువలన సన్యసించినవాడు వైరాగ్యసన్యాసి.

**2. జ్ఞానసన్యాసి :** జ్ఞానమువల్ల, పుణ్యలోకానుభవ శ్రవణంవల్ల, లౌకిక వాంఛలు పోయి, దేహవాసన, శాస్త్రవాసన, లోకవాసనలను వదలి, అవమానమును మానములాగా తలచి, ప్రవృత్తినంతటినీ హేయముగా తలచి సాధనా చతుష్టయ సంపన్నుడై సన్యసించినవాడు జ్ఞానసన్యాసి.

**3. జ్ఞానవైరాగ్యసన్యాసి :** అన్నింటినీ క్రమంగా అభ్యసించి, సర్వము అనుభవించి, జ్ఞానవైరాగ్యములతో, స్వరూపానుసంధానముతో

దేహమాత్రావశిష్టుడై సన్యసించినవాడు జ్ఞానవైరాగ్య సన్యాసి.

**4. కర్మసన్యాసి :** బ్రహ్మచర్యము పూర్తిచేసి, గృహస్థాశ్రమం స్వీకరించి, వానప్రస్థుడై, వైరాగ్యము లేకపోయినప్పటికీ ఆశ్రమాల క్రమం ప్రకారము సన్యాసం స్వీకరించినవాడు కర్మసన్యాసి.

ఈ సన్యాసులు ఆరు విధాలుగా ఉంటారు.

1. కుటీచకుడు 2. బహూదకుడు 3. హంస 4. పరమహంస 5. తురీయాతీతుడు 6. అవధూత. వీరిని గురించి భిక్షుకోపనిషత్తులో కూడా చెప్పబడింది.

**1. కుటీచకుడు :** ఇతడు శిఖ, యజ్ఞోపవీతము కలిగి ఉంటాడు. దండ కమండలాలు ధరిస్తాడు. కౌపీనము (గోచీ)శాఠీ (పైన కప్పుకునే వస్త్రము) కంథ. (పడుకోటానికి క్రింద వేసుకునే బొంత)లను కలిగి ఉంటాడు. పితృ, మాతృ, గురు ఆరాధనాపరుడై ఉంటాడు. పిఠరము (అన్నం వండుకునే కుండ) ఖనిత్రము (గడ్డపార) శిఖ్యము (ఉట్టి) మాత్రమే సాధనాలుగా కలిగి ఉంటాడు. ఒకచోటనే అన్నం తింటాడు. అంటే సంచారం చేయవలసిన అవసరంలేదు. తెల్లని ఊర్ధ్వపుండ్రములు, త్రిదండము ధరిస్తాడు.

**2. బహూదకుడు :** ఇతడుకూడా కుటీచకునిలాగానే శిఖ, యజ్ఞోపవీతము, దండకమండలాలు, కౌపీనము, శాఠీ, కంథ ధరించిఉంటాడు. త్రిపుండ్రధారి. అయితే మధూకరము చేసుకుని ప్రతిరోజూ ఎనిమిది ముద్దలు మాత్రమే తింటాడు.

**3. హంస :** ఇతడు జడలు ధరించి ఉంటాడు. త్రిపుండ్రములుగాని, ఊర్ధ్వ పుండ్రములుగాని ధరించి ఉంటాడు. కౌపీనము మాత్రమే ధరిస్తాడు. మధూకరాన్ని మాత్రమే భుజిస్తాడు.

**4. పరమహంస :** ఇతడికి శిఖ, యజ్ఞోపవీతాలు ఉండవు. ధరించటానికి మాత్రమే ఒకే కౌపీనము ఉంటుంది. ఒక శాఠి, వెదురుదండము  కలిగి ఉంటాడు. ఐదు గృహాలయందు మాత్రమే బిక్షాటన చేస్తాడు.

**5. తురీయాతీతుడు :** గోముఖవృత్తిచే ఫలహారము చేస్తాడు. ఒకవేళ ఆహారంగా అన్నం తినే పక్షంలో మూడు ఇళ్ళలో మాత్రమే భిక్ష స్వీకరిస్తాడు. దేహమాత్రావశిష్టుడు దిగంబరుడు. శరీరాన్ని శవంలాగా చూసుకుంటాడు.

**6. అవధూత :** ఏ రకమైన నియమాలు లేనివాడు. ఏ విధమైన ఆభిజాత్యము లేకుండా, అన్ని వర్ణములవారి దగ్గరా అజగర వృత్తితో (కొండచిలువ నోటికి దగ్గరకు వచ్చిన ఆహారాన్ని తిన్నట్లుగా) ఆహారం తీసుకుంటాడు. ఎల్లవేళల యందు స్వరూపానందాన్ని అనుభవిస్తూ ఉంటాడు. చెట్లు, చేమలు, పర్వతాలతో కూడిన ఈ జగత్తును నేను కాను. నేను పరమేశ్వర స్వరూపాన్ని అంతేకాని అల్పకాలంలో నాశనమయ్యే శరీరాన్ని కూడా నేను కాను. ఈ శరీరము జడమైనది. అచేతనమైనది. అందుకే నేను శరీరాన్ని కాను. శూన్యమైన ఆకారము కలది, శూన్యమైన ఆకాశము నుండి పుట్టినది అయిన అచేతనమైన శబ్దాన్ని కాను. క్షణభంగురమైన చర్మముచేత గ్రహించబడేది అయిన స్పర్శ నేను కాను. క్షణంలో నశించిపోయే దృశ్య దర్శనములందు లీనమయ్యేది, క్షీణించునది, చూసేవాడికి మాత్రమే కనిపించేది అయిన రూపాన్ని నేను కాను. చంచలమైన జిహ్వాచే గ్రహించబడేది, మధురమైనది అయిన రసము (రుచి)ని నేను కాను. నాశనమయ్యేది, ముక్కుతో మాత్రమే గ్రహింపబడేది అయిన గంధము నేనుకాను. పంచేంద్రియాల భ్రమలేనివాడను, అన్ని కలలను వదలివేసినవాడను,

శాంతుడను అయినశుద్ధచేతనుడనే నేను. బాహ్యాంతరముల యందు వ్యాపించినవాడను. నిష్కళంకుడను. నిరంజనుడను. 'ఏకమైన ఆత్మను నేను' అని భావన చేస్తుంటాడు.

ఇలాంటి అవధూతలు ప్రస్తుత కాలంలో ఎక్కడైనా ఉన్నారా? ఈ అనుమానం చాలామందికి వస్తుంది. నెల్లూరు దగ్గర వెంకాస్వామి. ఉయ్యూరు దగ్గర పిచ్చెమ్మ. కృష్ణాజిల్లా బందరులో దొంతులమ్మ. ముమ్ముడివరం బాలయోగి ఇలాంటివారు అనేకమంది. నా చిన్నప్పుడు చెప్పేవారు. బందరులో దొంతులమ్మ అని ఒకావిడ ఉండేదట. ఒంటిమీద బట్టలు లేకుండానే తిరుగుతుండేదట. తిండికూడా తినేది కాదట. తనలో తనే మాట్లాడుకుంటూ ఉండేదట. అందరూ ఆమెను పిచ్చిది అనుకునే వారట. రోడ్డుమీద పోతూ, ప్రక్కనే పండ్లు అమ్మే బండిలోంచి ఒక పండు తీసుకోవటానికి ప్రయత్నిస్తే వాళ్ళు కొట్టేవారట. ఆవిడ నవ్వుతూ వెళ్ళిపోయేది. ఒకరోజు దుకాణదారుడు ఏమరుపాటుగా ఉన్నప్పుడు బండిమీద నుంచి ఒకపండు తీసుకుపోయింది. ఆ రోజున అతడికి రోజూకన్న రెట్టింపు లాభం వచ్చిందట. దాంతో మరునాటి నుంచి పండ్లు అమ్ముకునే వారు దుకాణాలు తెరిచి ఆవిడ వస్తుంటే రమ్మని పిలిచేవారట. తమబండిలోంచి పండ్లు తీసుకోమని అడిగేవారట. కాని ఆవిడ మాత్రం ఏమీ పట్టించుకోకుండా అలా వెళ్ళిపోయేది. ఏ బండిలోంది పండు తీసుకుందో ఆ దుకాణదారుడికి రెట్టింపు లాభం వచ్చేది. దాంతో ఆవిడ దేవత అయిపోయింది. ఊరిచివర ఒకచెట్టు క్రింద పడుకునేది. అక్కడే ఆవిడకు నివాసం ఏర్పాటు చేశారు. ఆవిడమాత్రం పిచ్చిదానిలా అలాగే తిరుగుతుండేది. మరణానంతరం ఆవిడకు అక్కడే సమాధి, గుడి కూడా కట్టించారు.

ఇంచుమించుగా ప్రతిఅవధూతా ఇలాగే ఉంటాడు. చూసేవారంతా వీరిని పిచ్చివాళ్ళనుకుంటారు. ఒక అవధూతను ఇంకొక అవధూత మాత్రమే గుర్తించగలడు.

ఇవాల్టిరోజున గుంటూరు జిల్లా ఉండవల్లి దగ్గర 'కృష్ణాయపాలెం' అనే గ్రామంలో పోలయస్వామి అని ఒక అవధూత ఉన్నాడు. పదిసంవత్సరాల క్రితం నేను ఆయన్ని చూశాను. మళ్ళీ ఇవాళ్ళ అంటే 26-10-2014న చూశాను. పూర్తిగా దిగంబరుడు. ఉన్మత్తుడుగా ఉంటాడు. దేహాభిమానం ఉండదు. తిండికూడా సరిగా తినడు. ఇలాంటివాళ్ళు ఇంకా ఎంతోమంది ఉన్నారు.

మొదటగా కుటీచకుడై, కుటీచకుడు బహూదకుడై, హంసయై, పరమహంసయై, స్వరూపానుసంధానముచేత సర్వజగత్తునూ తెలుసుకుని, దండకమండలాలు, కటిసూత్రము, ఆచ్ఛాదనము, విధ్యుక్త క్రియలు (చేయవలసిన పనులు) అన్నీ నీటిలో వదిలి, అంతకుముందు ధరించిన రంగులేని నారచీరెలు, కృష్ణాజినము కూడా వదలివేసి, దిగంబరుడై, నిత్యక్రియలను అమంత్రకంగా చేస్తూ ఉంటాడు. అభ్యంగన స్నానం చెయ్యడు. పుండ్రధారణ చెయ్యడు. లౌకిక, వైదిక కర్మలు ఇతడికి ఉండవు. సర్వత్ర పాపపుణ్యాలు, జ్ఞానాజ్ఞానములను వదలివేస్తాడు. శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, మానావమానాలను జయించినవాడు. వాసనాత్రయ పూర్వకమైన నింద, అనింద, గర్వము, మత్సరము, దంభము, దర్పము, ఇచ్ఛ, ద్వేషము, కామము, క్రోధము, లోభము, మోహము, హర్షము, అసూయ, ఆత్మసంరక్షణ అన్నింటినీ వదలివేసినవాడు. తన శరీరాన్ని శవంలాగా చూస్తూ, అప్రయత్నమంగా ఏ రకమైన నియమాలు లేకుండా, ఆవులాగా దొరికింది తిని, ప్రాణాలు

నిలుపుకుంటాడు. లభించిన దానితో తృప్తి చెందుతాడు. ఆశ అనేది లేనివాడు. సర్వశాస్త్ర పాండిత్యము కలిగి ఉండి కూడా దాన్ని భస్మం చేస్తాడు. అంటే శాస్త్ర విషయాలు తెలిసికూడా, వాటిని తలచడు. తన ఉనికిని దాచేస్తాడు. తానెవరో చెప్పడు. పెద్ద చిన్న అనే మాటలాడడు. నాకన్న వేరెవరూ లేరని భావిస్తాడు. దుఃఖముతో బాధపడడు. సుఖముతో మోదము పొందడు. రాగమునందు కోరిక ఉండదు. శుభాశుభములయందు ఆసక్తి ఉండదు. ఇంద్రియాలను జయించినవాడు. వర్ణాశ్రమ ధర్మాలను వదిలి, పగలు, రాత్రి కూడా జాగరూకుడై, సంచారం చేస్తూ, కేవలము దేహము మాత్రమే మిగిలినవాడై, పిచ్చివాడిలాగా, దెయ్యం పట్టిన వాడిలాగా ఒంటరిగా తిరుగుతుంటాడు. ఎవరితోనూ మాట్లాడడు. ఎప్పుడూ స్వరూపాన్నే ధ్యానం చేస్తుంటాడు. ఇతన్ని అవధూత అంటారు. ఇతడికి జీవితంలో కర్మలు అన్నీ క్షయం అయిపోయి ఉంటాయి. ఇతడు విదేహముక్తి కోసం ఎదురుచూస్తున్న జీవన్ముక్తుడు.

# 108. కఠరుద్రోపనిషత్తు

ఇది కృష్ణయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో మొత్తం తొమ్మిది మంత్రాలున్నాయి. బ్రహ్మవిద్యను చెబుతున్నారు.

పూర్వకాలంలో దేవతలంతా భగవంతుడైన బ్రహ్మ దగ్గరకు పోయి "ఓ బ్రహ్మదేవా! మాకు బ్రహ్మవిద్యను చెప్పవలసింది" అన్నారు. ఇప్పుడు ప్రజాపతి చెబుతున్నాడు. శిఖతో సహా నెత్తిన వెంట్రుకలు తీసేసి, జంధ్యాన్ని త్రెంచి పారేసి, కుమారుని చూసి

**"సశిఖాన్ కేశాన్ నిష్కృష్య విసృజ్య యజ్ఞోపవీతం నిష్కృష్య**
**పుత్రం దృష్ట్వా। త్వం బ్రహ్మా, త్వం యజ్ఞం, త్వం వషట్కారం**
**త్వం ఓంకారం, త్వం స్వాహా, త్వం స్వధా, త్వం ధాతా**
**త్వం విధాతా । త్వం త్వష్టా, త్వం ప్రతిష్టాసీతి ॥**

నువ్వు బ్రహ్మవు, నువ్వు యజ్ఞానివి, నువ్వు వషట్కారము, నువ్వు ఓంకారము, నువ్వే స్వాహా, నువ్వే స్వధా, నువ్వు ధాతవు, త్వష్టవు, ప్రతిష్టవు. అని చెప్పాలి. ఆ మాటలు విన్న పుత్రుడు.

**అథ పుత్రోవదత్య హం బ్రహ్మే । హం యజ్ఞం ।**
**హం వషట్కారో హమోంకారోహగ్ం స్వాహా**
**హగ్ంస్వధా, హం ధాతా । హం విధాతా**
**హం త్వష్టా, అహం ప్రతిష్టాస్మీతి ॥**

నేను బ్రహ్మను, నేను యజ్ఞాన్ని, వషట్కారాన్ని, ఓంకారాన్ని, నేనే స్వాహా, నేనే స్వదా, నేను ధాతను, నేను విధాతను, నేను త్వష్టను, ప్రతిష్టను అంటాడు. అప్పుడు సాధకుడు నడిచి వెడుతుంటాడు. కన్నీరు

విడువరాదు. కన్నీరువస్తే సంతానం నాశనమవుతుంది. వాళ్ళెవరినీ చూడకుండా ప్రదక్షిణంగా తిరిగి వెళ్ళాలి. అతడు స్వర్గం పొందటానికి అర్హుడవుతాడు. బ్రహ్మచర్యం పూర్తిచేసి, వివాహం చేసుకుని, పిల్లల్ని కని, వారికి వివాహాలు చేసి, బాధ్యతలు పూర్తిచేసి, యధాశక్తి యజ్ఞయాగాలు చేసి, భార్యా, బిడ్డలు, బంధువుల దగ్గర అనుమతి తీసుకుని సన్యసించాలి. తరువాత పన్నెండురాత్రులు హోమంచెయ్యాలి. ఈ పన్నెండురోజులు పాలు మాత్రమే ఆహారము. ఈ సమయంలో అగ్నికి, వైశ్వానరుడుకి ప్రజాపతికి, విష్ణువుకు, త్రికపాలమైన చరువును, గతంలో ఉన్న చెక్కపాత్రలు అగ్నిలో హోమం చెయ్యాలి. మట్టి పాత్రలయితే నీటిలో వెయ్యాలి. లోహపాత్రలయితే గురువు గారికి ఇవ్వాలి.

నువ్వు నన్ను వదిలిపోవద్దు. నేను నిన్ను వదలిపోను. అని త్రేతాగ్నుల (దక్షిణాగ్ని, ఆహవనీయ గార్హపత్య) నుండి గుప్పెడు బూడిద తీసుకుని నీళ్ళలో కలుపుకుని త్రాగాలి. ఇతడు శరీరంమీద కేశాలు అన్నీ తీసేసిన తరువాత యజ్ఞోపవీతాన్ని నీటిలో వదిలెయ్యాలి. ఇక్కడ విషయం ఏమంటే యజ్ఞోపవీతము ఉంటే కర్మలు చెయ్యటానికి అర్హత ఉంటుంది. కర్మలు పరిత్యజించాను అని చెప్పటమే యజ్ఞోపవీత విసర్జన. పాలుమాత్రమే త్రాగాలి. సన్యసించిన తరువాత మళ్ళీ అగ్నిని గ్రహించకూడదు. జీవులన్నింటికీ శుభంజరగాలి అని ప్రార్థిస్తూ చేతులెత్తి నమస్కారం చేస్తూ విముక్తిమార్గంలో సంచరించాలి. నిలువనీడలేకుండా తిరగాలి. భిక్షతో దొరికినది మాత్రమే తినాలి. ఏమీ దానం చెయ్యరాదు. జంతువుల నుంచి రక్షణకు, వర్షంనుంచి రక్షణకు తప్ప ఏమీ ఉంచుకోరాదు. కుండ, పాత్ర, ఉట్టి, చెప్పులు, బొంత, కౌపీనము, శాఠి, పైబట్ట, యజ్ఞోపవీతము, వేదాలు, శాస్త్రాలు, అన్నింటినీ

వదిలెయ్యాలి. స్నానపానాలు పవిత్రమైన నీటితో చెయ్యాలి. ఇసుకతిన్నెల మీద పరుండాలి. లేదా దేవాలయంలో నిద్రించాలి. నిందాస్తుతులకు క్రుంగరాదు, పొంగరాదు. బ్రహ్మచర్యపాలనలో జాగ్రత్తగా ఉండాలి. దర్శనము, స్పర్శనము, కేళి, కీర్తనము, రహస్యసంభాషణ, సంకల్పము, ప్రయత్నము, క్రియ అని మైధునము ఎనిమిది రకాలు. వీటినే అష్టవిధమైధునాలు అంటారు. వీటి విషయంలో జాగ్రత్తగా ఉండాలి. ముముక్షువులు బ్రహ్మచర్యాన్ని చాలా జాగ్రత్తగా పాటించాలి. జగత్తును ప్రకాశింపచేసేదే పరమాత్మ అని తెలుసుకోవాలి. ప్రజ్ఞానఘనుడైన పరమాత్మ అన్ని భూతములందు ఉన్నాడు. కేవలము బ్రహ్మజ్ఞానము చేతనే పరబ్రహ్మను పొందాలి. విద్యావిషయమైన బ్రహ్మసత్య జ్ఞానసుఖస్వరూపమైనది. ఆ బ్రహ్మను తెలుసుకున్నవాడు అన్ని కోరికలు పొందుతాడు. పరబ్రహ్మను గురించి తెలుసుకున్న వాడికి జరామరణాలు, ఆకలి దప్పికలు, సుఖదుఃఖాలు ఏవీ ఉండవు. ఈ చరాచర జగత్తంతా ఆ పరమేశ్వరుణ్ణించే ఆవిర్భవించింది. పంచభూతాలలో ముందుగా ఆకాశము వచ్చింది. ఆకాశము నుండి వాయువు, వాయువు నుండి – అగ్ని, అగ్ని నుండి – జలము, జలము నుండి – భూమి, భూమి నుండి – ఓషధులు అన్నీ ఆవిర్భవించాయి. పరమేశ్వరుడు పంచభూతాలను పంచీకరణ చేశాడు. దానివల్ల ఈ బ్రహ్మాండము, దేవతలు, దానవులు, యక్షులు, రాక్షసులు, కిన్నెరలు, గంధర్వులు, మానవులు, పశువులు, పక్షులు ఇలా 84 లక్షల జీవరాసి జన్మించింది. ఈ జీవరాసిలో ఆత్మస్వరూపుడయిన పరమాత్మ ప్రకాశిస్తున్నాడు. ఈ శరీరం పంచకోశాత్మకము. ఇదే అన్నమయకోశము. అన్నమయకోశంలో ప్రాణమయకోశం, ప్రాణమయకోశంలో మనోమయకోశం,

మనోమయకోశంలో విజ్ఞానమయకోశం, అందులో ఆనందమయకోశం. ఆనందమయకోశంలో ఉండే ఆనందమయుడే పరమాత్మ. ఆ పరమాత్మనే నేను అని భావనచేసిన యతికి భయమనేది ఉండదు. ఉన్నది నేనే వేరెవరూ లేరు. అన్నప్పుడు ఇంకా భయానికి తావేది? రాగద్వేషాలు, కామక్రోధాలు త్యజించిన జీవుడే సాక్షాత్తు దేవుడు అవుతున్నాడు. పరమేశ్వరుణ్ణి దర్శించాలన్నా, ఆయన్ను గురించి తెలుసుకోవాలన్నా ఇంద్రియాల వల్ల కాదు. అంటే పరమాత్మను గురించి ఇంద్రియాల చేత తెలుసుకోలేము. మనసువల్ల తెలుసుకోలేము. శాస్త్రాలవల్ల, వేదవేదాంగాల వల్ల అతడు అర్థం కాడు. కేవలం జ్ఞానం వల్ల మాత్రమే అతన్ని తెలుసుకోగలము. గురువుకు సేవ చేసి, ఆయన అనుగ్రహంవల్ల జ్ఞానాన్ని పొంది, తద్వారా పరమేశ్వర సాక్షాత్కారం పొందాలి. అహంబ్రహ్మాస్మి అని భావన చేసిన యతి ఈ చరాచర జగత్తులో ఉన్నది నేనే. నేను తప్ప ఇంకెవరూ లేరు. ఇంకా ఇతరమైనదేదీ లేదు. అని భావన చెయ్యాలి. అలా భావన చేసిన యతికి జన్మరాహిత్యం జరుగుతుంది. అతడికి పునర్జన్మ ఉండదు.

# 109. కుండికోపనిషత్తు

ఇది సామవేదానికి సంబంధించిన ఉపనిషత్తు. ఇందులో ఐదు మంత్రాలు ఉన్నాయి.

బ్రహ్మచారి. అంటే ఉపనయనము అయిన తరువాత పిల్లవాడిని తల్లితండ్రులు గురుకులానికి పంపుతారు. అక్కడ వేదవేదాంగాలు అన్నీ నేర్చుకుని, సమావర్తనము పూర్తి చేసినవాడై ఇంటికి వచ్చి తల్లితండ్రుల అనుమతితో మంచి లక్షణాలు ఉన్న కన్యను వివాహం చేసుకుని గృహస్థాశ్రమం స్వీకరించి, అగ్నికార్యం ప్రతినిత్యము చేస్తూ యజ్ఞయాగాది క్రతువులు చేస్తూ పిల్లలు పెద్దవారయిన తరువాత తాను సంపాదించిన ధనము వారికిచ్చి, లౌకికమైన కోరికలు వదలి, అరణ్యాలలో తిరుగుతూ వాయుభక్షణ చేస్తూ (అవసరమైతే నీరుకూడా త్రాగవచ్చు) కందమూలాలు తిని శరీరాన్ని నిలుపుకుంటూ, సత్యాన్వేషణ చేస్తూ భార్యతో సహా అడవులలో నివసిస్తూ వానప్రస్థ స్వీకరించి, జీవితాన్ని కొనసాగించాలి. సంసార సుఖాలు, భోగాలు అన్నీ వదిలెయ్యాలి. ఆ తరువాత ఆధ్యాత్మ మంత్రాలు చదువుతూ, దీక్ష పొంది, భార్యను కుమారుల కప్పగించి, దీక్ష పొంది, శరీరంమీద రోమాలన్నీ తీసివేసి, రెండు చేతులూ పైకెత్తి మోక్షమార్గంలో నడవాలి.

ఉండటానికి ఇల్లు ఉండకూడదు. భిక్షాన్నము తినాలి నిధిధ్యాస చెయ్యాలి. మానవుడికి కావలసిన నిత్యావసర వస్తువులు కుండ, పాత్ర, ఉట్టి, చెప్పులు, నేలమీద పరుచుకునే వస్త్రము, కప్పుకునే బొంత, గోచీ, పైగుడ్డ వీటన్నింటినీ వదలివెయ్యాలి. ప్రతిరోజూ స్నానాదులు పవిత్రమైన నీటిలోనే చెయ్యాలి. నిందాస్తుతులకు కుంగరాదు పొంగరాదు. స్నానం చేసేటప్పుడు మట్టితోనే వళ్ళు రుద్దుకోవాలి.

ఇప్పుడు అజరము, అమరము, అక్షరము అవ్యయము అయిన బ్రహ్మను సేవించాలి.

నాకు దేనితోను సంబంధము లేదు. నేను విలక్షుడను. మేఘాలతో ఆకాశానికి సంబంధం లేనట్లుగానే, నాకు ఈ దేహంతో సంబంధము లేదు. నేను నిశ్చలమైన వాడిని. అపారము అయిన వాడను. (అవతలివాడు లేనివాడను) నేనే నారాయణుడు, నరకాంతకుడు, పురాంతకుడు, అఖండ జ్ఞానస్వరూపుడు. అన్నింటికీసాక్షిని నేనే. నిరీశ్వరుడు, నిరహంకారుడు, నిర్మముడు అన్నీ నేను. శివుడు, బ్రహ్మ, రుద్రుడు అన్నీ నేనే. అని భావనచేసి అవ్యయమైన తలను భేదించి శరీరంలో నుంచి పైకి వెళ్ళాలి. తలను భేదించి పైకి వెళ్ళటము అంటే ఏమిటి? ఈ విషయం చూడండి.

అవసానకాలంలో మానవుడి ప్రాణాలు ఉత్క్రమిస్తాయి. ఉత్క్రమించటము అంటే నవరంధ్రాలలో నుంచి బయటకు వెళ్ళటం. అటువంటి వాడికి పునర్జన్మ ఉంటుంది. తాను చేసిన పాపపుణ్యాల ఆధారంగా తిరిగి భూలోకంలో జన్మిస్తాడు. కాని యోగియొక్క ప్రాణములు ఉత్క్రమించవు. అవి బ్రహ్మరంధ్రం గుండానే పోతాయి. అప్పుడు అతడికి పునర్జన్మ ఉండదు. సన్యాసికూడా యోగీశ్వరుడే అందుకని అతని ప్రాణాలు కూడా బ్రహ్మరంధ్రము ద్వారానే పోతాయి. దీన్నే "కపాలమోక్షము" అంటారు. యోగంలో నిష్ణాతుడైన వాడికి మాత్రమే అలా జరుగుతుంది. మరి మిగిలిన వారి పరిస్థితి ఏమిటి? ప్రాణం పోవటానికి శిష్యులందరూ గుటగుటలాడుతున్న గురువుగారిని కుర్చీలో కూచోబెట్టి కొబ్బరికాయతో ఆయన మాడుమీద కొడతారు. ఆమాడు పగిలిపోయి కపాలమోక్షం జరిగేదాకా ఇలా చేస్తారు.

ఒక్కొక్కసారి తలపగిలి రక్తం వరదలుగా కారుతుంది. అయినా కాయలు కొడుతూనే ఉంటారు. తలపగిలి రక్తపుమడుగులో ఉన్న గురువుగారు మోక్షం పొందుతాడు అని వారి నమ్మకం.

ఇక్కడ మనం గుర్తించాల్సి విషయం ఒకటుంది. అడవిలో పులిని చూసి జంతువులన్నీ భయపడుతున్నాయి. అది పులి అని తెలియటానికి కారణము దానివంటిమీద చారలు. ఇలా ఆలోచించి కర్రు బాగా కాల్చి వళ్ళంతా వాతలు పెట్టుకుందినక్క. దాంతో అదికాస్తా ధమ్మిన చచ్చిఊరుకుంది. అలాగే తలపగలకొడితే మోక్షం రాదు. అదే నిజమైతే దేశంలోని ప్రజలంతా తలపగలకొట్టుకుంటారు. ఇక్కడ తలపగుల్తోంది కాని మోక్షం మాత్రంరాదు. ఇదంతా పిచ్చిభ్రమ. అంతే మోక్షం కావాలంటే కొన్ని జన్మలు నుంచి పుణ్యకార్యాలు చేసి, కేవలము భగవధ్యానంలోనే కాలం గడపాలి. అటువంటివారికే మోక్షం సిద్ధిస్తుంది. అంతేకాని ఇతరులకు కాదు. నిరంతరము స్వాత్మలో క్రీడించే వారికి కపాలమోక్షం జరిగి మోక్షం సిద్ధిస్తుంది. అయితే కపాలమోక్షం దానంతట అది జరగాలి. అంతేగాని తలపగలకొడితే జరిగేది కపాలమోక్షం కాదు. ఇది కేవలము ఛాందసము మాత్రమే.

# 110. మైత్రేయోపనిషత్తు

ఇది సామవేదానికి సంబంధించినది. ఇందులో మూడు అధ్యాయాలు 73 మంత్రాలు ఉన్నాయి. ఇందులో పూర్తిగా బ్రహ్మవిద్య చెప్పబడింది.

పూర్వకాలంలో బృహద్రధుడు అనే పేరుగల రాజు రాజ్యాన్ని కుమారుడికి అప్పగించి ఈ దేహము శాశ్వతము కాదు అని భావించి వైరాగ్యం పొంది తపస్సు చేసుకోవటానికి అరణ్యాలకి వెళ్ళాడు. అక్కడ సూర్యుణ్ణి చూస్తూ రెండు చేతులూ పైకెత్తి వేయిసంవత్సరాలు తపస్సు చేశాడు. అప్పుడు శాకాయన్యుడు అనే ఋషి అక్కడికి వచ్చి 'రాజా! తపస్సు చాలించు. లేచి ఏంకావాలోకోరుకో' అన్నాడు. రాజు మహర్షికి నమస్కరించి ఓమహర్షీ ! నేను తత్త్వము తెలుసుకోవాలి అనుకుంటున్నాను. ఆత్మతత్త్వాన్ని నాకుబోధించు అన్నాడు. ఆ మాటలు విన్న మహర్షి రాజా! ఇంకేదైనా వరం కోరుకో. ఆత్మతత్త్వాన్ని మాత్రం వదిలెయ్యి. అన్నాడు ఆ మాటలు విన్న రాజు మహర్షి పాదాలు పట్టుకుని 'ఓ మహర్షీ! బ్రహ్మవిద్య కన్న గొప్పది ఏముంది? అసలు ఇతరమైన విద్యలవల్ల ప్రయోజనం ఏమిటి? సముద్రాలు ఎండిపోతాయి. కొండలు పిండి అయిపోతాయి. ధృవుడు స్థానచలనము పొందుతాడు. నీటిలో భూమి మునిగిపోతుంది. మహర్షీ ! సారం లేనిది సంసారము. దీనియందు తగుల్కొని ఇతర కోరికలు కోరినట్లైతే ఉపయోగం ఏముంటుంది? దీనికి కారణంగానే జన్మఅనేది కలుగుతున్నది. కాబట్టి నాకు ఆత్మతత్త్వము తెలుసుకోవాలని ఉంది. నాకు ఏమీ తెలియదు. కూపస్థమండూకము లాగా ఉన్ననన్ను ఆత్మతత్త్వాన్ని చెప్పి ఉద్ధరించ వలసింది. సంసారసాగరంలో ఉన్న నాకు నువ్వేదిక్కు. ఓదేవా! తల్లితండ్రులు తిన్న అన్నసారమువల్ల

శరీరము ఏర్పడింది. చైతన్యము లేని ఈ దేహము నరకప్రాయము. రక్తము, మాంసము, ఎముకలు, నరాలు, అన్నీ కలిపి కనిపించకుండా చర్మముతో కప్పబడింది. వాతము, పిత్తము, శ్లేష్మములతోను ఇతర రకాలయిన మలినాలతోను ఏర్పడినది. అటువంటి నేను అనే అభిమానంతో నిండిపోయిన నాకు నువ్వేదిక్కు. దయచేసి నన్ను రక్షించవలసింది అన్నాడు. ఆ మాటలకు పరమానందం చెందిన శాకాయన్యుడు మహారాజుకు ఆత్మతత్త్వాన్ని వివరించటం మొదలుపెట్టాడు.

ఓ రాజా! ఆత్మతత్త్వాన్ని తెలుసుకోవాలనుకుంటున్న నువ్వు ధన్యుడివి 'మరుత్తు' అనే పేరుతో ప్రసిద్ధి చెందావు. భగవంతుని తత్త్వాన్ని ఎంత చెప్పినా కూడా తనివి తీరదు. నాకు తెలిసినంత వరకు చెబుతాను వినవలసింది.

తన్మాత్రలు శబ్దస్పర్శరూప రస గంధాలు. ఇవి అర్థవంతంగాకనిపించినా నీకు మాత్రం అనర్థకాలు. వాటి అర్థాన్ని గురించి ఆలోచించేవాడు, అవంటే ఇష్టపడే వాడు పరమపదాన్ని గురించి ఆలోచించడు. మానవుడు ఎప్పుడూ ఆత్మానాత్మ వివేచనము చేస్తూ ఉండాలి. దానివల్ల సత్త్వగుణము బాగా పెరుగుతుంది. సత్త్వగుణం పెరిగితే మనసు పరిశుద్ధమవుతుంది. రాగద్వేషాలు లేని పరిశుద్ధమనసులో పరమేశ్వరుడు సాక్షాత్కరిస్తాడు. అప్పుడు సంసార దుఃఖము నశించిపోతుంది. రాజా! కట్టెలులేకపోతే నిప్పుచల్లారిపోతుంది. అలాగే ఆలోచనలు లేకపోతే మనస్సు శాంతిస్తుంది. ఆత్మను గురించి తెలుసుకున్న వాడి మనసు శాంతించి ఈ జగత్తంతా మిధ్య అని తెలుస్తుంది. రాజా! సంసారము అంటే ఎక్కడో విడిగాలేదు. చిత్తమే సంసారము. కాబట్టి చిత్తాన్ని ఏకాగ్రము

చెయ్యాలి. ఇక్కడ విచిత్రమేమంటే భార్య, పుత్రులు వీరివిషయంలో గనక మనసు లగ్నమైతే అతడు వారికి గల సాకల్య వికల్యాలు అన్నీ తనయందు ఆరోపించుకుంటాడు. దానివల్ల వాళ్ళ రూపం పొందుతాడు. ఈ రకంగా చిత్తానికి సంసారము ప్రాప్తిస్తుంది. చిత్తాన్ని ఏకాగ్రము చెయ్యటంవల్లనే అది తొలగిపోతుంది. చిత్తం గనక నిర్మలమైతే పాపపుణ్యాలన్నీ నశిస్తాయి. నిర్మలమైన చిత్తం కలవాడు స్వస్వరూప సాక్షాత్కారం పొంది నాశనము లేని బ్రహ్మానంద స్వరూపుడవుతున్నాడు. మానవుడిని దృశ్యరూపాలయందు మనసు లగ్నమైనట్లుగా పరబ్రహ్మము మీద గనక లగ్నమైతే, తేలికగా మోక్షం పొందుతాడు.

**హృత్పుండరీక మధ్యేతు భావయే త్పరమేశ్వరమ్ ।**
**సాక్షిణం బుద్ధి వృత్తస్య పరమ ప్రేమ గోచరమ్ ॥**
**అగోచరం మనోవాచా మవధూతాది సంప్లవమ్ ।**
**సత్తా మాత్ర ప్రకాశైక స్వభావం భావనాగతిమ్ ॥**

బుద్ధి వృత్తులకు సాక్షి అయినవాడు, పరమ ప్రేమాస్పదుడు అయిన పరమాత్మ హృత్పద్మంలోనే ఉన్నాడు అని భావన చెయ్యాలి.

ఆ పరమాత్మను వాక్కు చేత వివరించలేము. మనసుతో ఊహించలేము. అతడే సమస్త దుఃఖాలు పోగొడతాడు. భావాతీతము, సచ్చిదానందము అయిన పరమాత్మ ఆయనే.

ఆ పరమాత్మకు సామాన్య విశేష భావాలు లేవు. తీసుకోవటానికి, వదిలెయ్యటానికి వీలుకాదు. కలదకుండా ఉంటుంది అటువంటి పరమాత్మ గంభీరుడు, సర్వవ్యాపకుడు. కాంతికి చీకటికి సాక్షి, నిత్యుడు,

నిశ్చలుడు, సంవిద్రూపముగలవాడుగ ధ్యానించాలి. నిత్యము బుద్ధము, నిరావరణస్వరూపము సర్వవ్యాపకము అద్వితీయం ఆనందస్వరూపమయిన ఏ పరమాత్మ ఉన్నాడో ఆ పరబ్రహ్మను నేనే. అంతరంగంలో ఆశ్రయించేవాడను, ఆశాపిశాచాన్ని అవమానించే వాడిని, ఈ జగత్తును ఇంద్రజాలంలాగా చూస్తున్నవాడు, అసంగుడు నేనే. నాకు ఆపదలు రావు. వర్ణభేదము కాని, ఆశ్రమభేదము కాని, దేహాభిమానము కలవాడికే కలుగుతాయి. అటువంటివారే సుఖదుఃఖాలు కర్మఫలాలు అనుభవిస్తారు. వీటియందు ఆసక్తి లేనివారు ఆత్మానందంతో పరిపూర్ణులవుతున్నారు. దుఃఖాలనిచ్చేది, అవయవాలు గలది, ఆది అంతము గలది, వర్ణాశ్రమాచారములు గలది, అయిన ఈ చిత్తాన్ని పరిత్యజించి పరమానందమైన ఆత్మయందు నిరతుడవు కావలసినది.

ఆ తరువాత షడ్గుణైశ్వర్య సంపన్నుడగు మైత్రేయ మహర్షి కైలాసానికి వెళ్ళి పరమతత్త్వాన్ని బోధించమని మహాదేవుణ్ణి ప్రార్థించాడు. అప్పుడు మహాదేవుడు చెబుతున్నాడు. ఓ మైత్రేయా !

**దేహోదేవాలయ ప్రోక్తః సః జీవః కేవలః శ్శివః**

**త్యజేదజ్ఞాన నిర్మాల్యం సోఽహం భావేన పూజయేత్ ॥**

ఈ దేహమే దేవాలయము. ఇందులో జీవుడే శివుడు. అజ్ఞానమనే నిర్మాల్యాన్ని త్యజించి సోహం అనే భావనతో పూజించాలి.

**అభేద దర్శనం జ్ఞానం ధ్యానం నిర్విషయం మనః ।**

**స్నానం మనోమలత్యాగః శౌచమింద్రియ నిగ్రహః ॥**

**బ్రహ్మామృతం పిబేద్భైక్షమాచరే ద్దేహరక్షణే ।**

**వసేదేకాంతికో భూత్వా చై కాంతే ద్వైత వర్జితే ॥**

అభేద దర్శనమే జ్ఞానము. మనసును నిర్విషయముగా ఉంచటమే ధ్యానము. మనోమాలిన్యము తొలగించటమే స్నానము.

ఇంద్రియ నిగ్రహమే–శౌచము. బ్రహ్మానందమనే అమృతాన్ని తాగాలి. దేహరక్షణ కోసం భిక్షాటనం చెయ్యాలి. ద్వైతాన్ని నాశనం చేసి ఏకాంతంగా ఉండాలి. ఇలా చేసినవాడు మోక్షంపొందుతాడు. ఇలాచేసే జిజ్ఞాసువుకు మోక్షము తేలికగా వస్తుంది. తల్లితండ్రుల మలినాలతో పుట్టిన ఈ దేహానికి జనన మరణాలున్నాయి. సుఖదుః ఖాలకు నెలవై, అపవిత్రమై, సప్తధాతువులచే ఏర్పడి గొప్ప రోగాలు కలిగి పాపాలకు ఇల్లు అవుతున్న ఈ శరీరాన్ని తాకితే స్నానం చెయ్యాలి.

**వికారాకార విస్తీర్ణం స్పృష్ట్వా స్నానం విధీయతే ।**

**నవద్వారం మలస్రావం సదా కాలే స్వభావజమ్ ॥**

వికారాలు కలిగి, తొమ్మిది ద్వారాల నుండి నిరంతరము మలము స్రవిస్తూ ఉండే ఈ దేహాన్ని తాకితే స్నానం చెయ్యాలి.

**దుర్గంధం దుర్మలోపేతం స్పృష్ట్వా స్నానం విధీయతే ।**

**మాతృసూతక సంబంధం సూతకే సహజాయతే ॥**

**మృతసూతకజం దేహం స్పృష్ట్వాస్నానం విధీయతే ।**

**అహం మమేతి విణ్మూత్ర లేపగంధాది మోచనమ్ ॥**

దుర్గంధంతో కూడినది మలినమైనది, మాతృగర్భంలో నుంచి బయటకు వచ్చిన శరీరాన్ని తాకితే స్నానం చెయ్యాలి. చచ్చినా పుట్టినా

దేహాన్ని తాకితే స్నానం చెయ్యాలి. నేను నాది అనే మలమూత్ర పూత వల్ల కలిగే సంబంధాన్ని విడవటమే శుద్ధ శౌచము.

**శుద్ధశౌచమితింప్రోక్తం మృజ్జలాభ్యాంతు లౌకికమ్**

**చిత్తశుద్ధికరం శౌచం వాసనాత్రయ నాశనమ్ ।**

**జ్ఞానంవైరాగ్య మృత్తోమైః క్షాళనాచ్ఛే చ ముచ్యతే ॥**

కేవలము మట్టితోను, జలంతోను సలిపే శౌచము లౌకికశౌచము అనబడుతుంది. వాసనాత్రయాన్ని పోగొట్టేది చిత్తాన్నిశుద్ధి చేస్తుంది. జ్ఞానమనే మట్టితోను వైరాగ్యమనే జలంతోను కడగటం వల్ల శౌచము అనబడుతుంది. శాస్త్రానుసారము భిక్షువుకు భోజనం చెబుతున్నారు. అద్వైత భావనే భిక్ష. ద్వైతము అభక్ష్యము.

భిక్షువు సన్యసించిన తరువాత దేహాభిమానము వదలి చెరసాలనుంచి బయటకు వచ్చిన దొంగవాడిలాగా జనులకు దూరంగా నివసించాలి. ఎప్పుడైతే అహంకారము అనే కుమారుణ్ణి, ధనమనే - సోదరుణ్ణి, మోహమనే - గృహాన్ని, ఆశ అనే - భార్యని, విడిచి పెడతాడో, అప్పుడు అతడు ముక్తి పొందుతాడు. ఈ విషయం తెలిసి సన్యాసి మోహము, ఆశ, అహంకారములను భోగాలను విడిచినప్పుడు ముక్తికి అర్హుడవుతాడు.

ఒకసారి ఒక బ్రాహ్మణుడు ఒక సన్యాసిని దర్శించి ఏం స్వామీ ! మీరింకా సంధ్యావందనము చెయ్యలేదు ఎందుకని? అని అడిగాడు. దానికి ఆ సన్యాసి.

**మృతామోహమయీ మాతా జాతో బోధమయః సుతః**

**సూతకద్వయ సంప్రాప్తౌ కథం సంధ్యా ముపాస్మహే ॥**

నాకు మోహము అనే తల్లి మరణించింది. జ్ఞానమనే కుమారుడు కలిగాడు. ఇలా నాకు రెండు సూతకాలు వచ్చినాయి. మరి సంధ్యావందనం ఎలా చేస్తాను? అన్నాడు.

**హృదాకాశే చిదాదిత్యః సదాభాసతి భాసతి**

**నాస్తమేతి నచోదేతి కథం సంధ్యా ముపాస్మహే ॥**

**ఏకమేవా ద్వితీయం యద్గురోర్వాక్యైక నిశ్చితమ్**

**ఏతదేకాంత మిత్యుక్తం నమఠ్మం నవనాంతరమ్ ॥**

హృదయాకాశంలో చిద్రూప సూర్యుడు సదా ప్రకాశిస్తున్నాడు. ఆయన అస్తమించటము అనేది లేదు. కాబట్టి సంధ్యవార్చుట ఎలా? సద్గురు వాక్యముల చేత అద్వితీయమైన పరమాత్మ ఒకటి ఉన్నదనేది ఏకాంతము అనటం నిశ్చయము. మఠము కాని వనాంతరము గాని ఏకాంత ప్రదేశాలు కావు.

శాస్త్రంలో, సద్గురువు యొక్క వాక్యాలలో, అనుమానం లేనివారికి మోక్షం కలుగుతుంది. అనుమానం ఉన్న వారికి ఎన్ని జన్మలెత్తినా మోక్షంరాదు. కాబట్టి గురుయందు, శాస్త్రములయందు విశ్వాసము కలిగి ఉండాలి. కర్మపరిత్యాగము సన్యాసము కాదు. **జీవాత్మల ఐక్యమే సన్యాసము** అని చెప్పబడింది.

**వమనాహారవద్యస్యభాతి సర్వేషణాదిషు ।**

**తస్యాదికారః సంన్యాసే త్యక్త దేహాభిమానినః ॥**

**యదా మనసి వైరాగ్యం జాతం సర్వేషు వస్తుషు ।**

**తదైవ సన్యషేద్విద్యానన్యథా పతితో భవేత్ ॥**

సమస్తమైన విషయభోగాల యందు ఎవరికైతే కక్కిన కూడునందు

లాగా హేయభావముంటుందో, దేహాభిమాన రహితుడైన అట్టివాడికే సన్యాసాధికారమున్నది. అన్ని వస్తువులందు వైరాగ్యము గలవాడే సన్యసించాలి. వైరాగ్యము లేని సన్యాసికి పతనము తప్పదు.

ధనం సంపాదించాలి అనిగాని, అందరూ గౌరవిస్తారు అనిగాని, సన్యసిస్తే ఉభయ లోకభ్రష్టుడవుతాడు. అతడికి మోక్షం రాదు.

**ఉత్తమా తత్త్వచింతాయ మధ్యమాశాస్త్రచింతనమ్ ।**
**అధమా మంత్ర చింతా చ తీర్థ భ్రాంత్యధమాధమా ॥**

తత్త్వ చింతనము – ఉత్తమము, శాస్త్రచింతన – మధ్యమము, మంత్ర చింతన – అధమము, తీర్థముల యందలి భ్రాంతి – అధమాధమము.

**అనుభూతింవినామూఢో వృధా బ్రహ్మణి మోదతే ।**
**ప్రతిబింబ శాఖాగ్ర ఫలస్వాదన మోదవత్ ॥**

అనుభవం లేని మూర్ఖుడు 'బ్రహ్మ సత్యం జగన్మిథ్య' అని చెప్పి సంతోషిస్తాడు. ఇది ఎలా ఉందంటే నీటిలో కనిపించే కొమ్మమీద పండ్లను చూసి సంతసించినట్లు వ్యర్థముగా ఉన్నది.

**న త్యజేచ్ఛే ద్యుతిర్ముక్తో యోమాధూకర మాతరమ్ ।**
**వైరాగ్య జనకం శ్రద్ధా కళత్రం జ్ఞాననందనమ్ ॥**

భిక్షాటన అనే తల్లిని, వైరాగ్యమనే తండ్రిని, శ్రద్ధ అనే భార్యని, జ్ఞానమనే – కుమారుణ్ణి విడువని సన్యాసి ముక్తుడవుతాడు. అంటే భిక్షాటన, వైరాగ్యము, శ్రద్ధ, జ్ఞానములు సన్యాసికి అత్యంత ముఖ్యమైనవి.

**ధనవృద్ధా వయోవృద్ధా విద్యావృద్ధా స్తథైవచ ।**

**తే సర్వేజ్ఞానవృద్ధస్య కింకరాః శిష్య కింకరాః ॥**

లోకంలో ధనవంతులు. వయసు మళ్ళినవారు, పండితులు, అందరూ జ్ఞాన వృద్ధునకు భృత్యులే. అంతేకాదు. అతని శిష్యులకుకూడా భృత్యులే. కొందరు పండితులై ఉన్నప్పటికీ, నా మాయచేత మోహితులై, సర్వవ్యాపి అయిన నన్ను పొందలేక కేవలము పొట్ట నింపుకోవటానికి కాకులు లాగా అక్కడక్కడ తిరుగుతుంటారు.

యతి అయినవాడు రాతివిగ్రహాలు, లోహపు విగ్రహాలు, మణిమయాలు, మట్టి విగ్రహాలు పూజించరాదు. హృత్పద్మంలో ఉన్న పరమాత్మనే అర్చించాలి. మోక్షగామి అయిన వాడు బాహ్యాపూజలు చేయరాదు. సముద్రమునందు ఉంచిన నిండుకుండలాగా, పరబ్రహ్మలోపల బయట పరిపూర్ణమైనది. ఆకాశంలో ఉన్న శూన్య ఘటము లాగా సర్వాంగ స్వరూపమైనది. నువు గ్రహించబడే వాడివి కాదు, గ్రహించే వాడివి అంతకన్నా కాదు. కేవలము తత్స్వరూపుడవు.

**అహమస్మి పరశ్చాస్మి బ్రహ్మోస్మి ప్రభవోస్యహమ్ ।**

**సర్వలోక గురుశ్చాస్మి సర్వలోకేస్మి సోఽస్వహమ్ ॥**

నేను నేనే అవుతున్నాను. నేను పరుడవుతున్నాను. అన్ని లోకాలకు గురువు నవుతున్నాను. పరబ్రహ్మ నవుతున్నాను. పరమాత్మ స్వరూపము నేనే.

**అహమే వాస్మి సిద్ధోస్మి శుద్ధోస్మి పరమో స్మ్యహమ్ ।**

**అహమస్మి సదాసోఽస్మి నిత్యోస్మి విమలోస్మ్యహమ్ ॥**

**విజ్ఞానోస్మి విశేషోస్మి సోమోస్మి సకలోస్మ్యహమ్ ।**

**అహమస్మి సదాసోస్మి నిత్యోస్మి విమలోస్మ్యహమ్ ॥**

నేను సిద్ధుడను. పరిశుద్ధుడను. నేనే పరముడను, అద్వయుడను. పరబ్రహ్మ స్వరూపుడను. నేను నిత్యుడను విమలుడను విజ్ఞానము, విశేషము నేనే. సోముడు నేనే. సమస్తము నేనే. శుభము నేనే. శోకంలేనివాడను నేనే. విమలుడను నేనే అవుతున్నాను.

**మానావమానహీనోస్మి నిర్గుణోస్మి శివోస్మ్యహమ్**

**ద్వైతా ద్వైతవిహీనోస్మి ద్వంద్వ హీనోస్మి సోస్మ్యహమ్ ॥**

నాకు మానావమానాలు లేవు. ద్వంద్వాలు లేవు. త్రిగుణాలు లేవు. నేను కేవలము పరమాత్ముడను.

**భావాభావ విహీనోస్మి భాసహీనోస్మి భాస్మ్యహమ్**

**శూన్యాశూన్య ప్రభావోస్మి శోభనా శోభనో స్మ్యహమ్ ॥**

నాకు సత్యాసత్యాలు లేవు. ఇతరులచే ప్రకాశింపబడను. నేను స్వప్రకాశకుడను. అసంగుడను కాబట్టి శుభాశుభాలు, లేనివాడను. శూన్యాశూన్యములు నేనే. ప్రకాశించేవాడిని. నేనే.

నేను తుల్యాతుల్యములు లేనివాడను. నిత్యుడను, మాయామలరహితుడను. సదామంగళ స్వరూపుడను, సర్వాసర్వ రహితుడను, శుద్ధసాత్వికుడను. సత్ స్వరూపుడను. నేను అద్వైతినికాను. ద్వైతినికాను. సదసద్భేదములు లేనివాడను. మనస్సులేనందున న్సింకల్పుడను. నాకు అనేకత్వము లేదు. అఖండ ఆనంద స్వరూపుడను. అహంకారము లేనివాడను, నేను ఇతరము కాను. నాకు దేహం లేదు.

నేను ఆధారం లేనివాడను. కర్తృత్వ భోక్తృత్వాలు లేనివాడను. నిస్సంగుడను. శుద్ధమైన పరబ్రహ్మను నేనే. పరమాత్మను నేనే.

చిత్తము మొదలైనవి లేనివాడను. సర్వోత్తముడను. పరమాత్మను, సర్వదా నేను ఆత్మవిచార స్వరూపుడను, నేనే పరబ్రహ్మను. పరమాత్మను. అకార ఉకార మకార స్వరూపుడను నేనే. ధ్యాత ధ్యానము ధ్యేయము లేనివాడను, నేనే పరమాత్మను. నేను సర్వత్ర పరిపూర్ణమయిన స్వరూపం గలవాడను. సచ్చిదానంద రూపుడను, సర్వతీర్ధ స్వరూపుడను. పరమాత్మను. శివస్వరూపుడను. లక్ష్యాలక్ష్యములు లేనివాడను, ప్రమాతృ ప్రమాణములు లేనివాడను. అమేయుడను. కొలవటానికి వీలులేని వాడను.

నేను జగద్రష్టను కాను, నాకు కనులు లేవు. వృద్ధి, ప్రబోధ గలవాడను. ప్రసన్నుడను పరమాత్మను. నేను సమస్త కర్మలు చేస్తాను. ఇంద్రియాలు లేనివాడను. సమస్త వేదాంత సంతుష్టుడను నేనే, నిరంతరము భక్తసులభుడను నేనే.

ముదిత, అముదిత నామములు గలవాడను. సమస్త మౌనముల ఫలము నేనే, సర్వేంద్రియములు వృత్తికి విముఖమైఉండటమే మౌనము. ఆ మౌనఫలమే నేను. నిత్య చిన్మాత్ర స్వరూపుడను. సదా సచ్చిన్మయుడును.

నేను స్వల్పము కాదు అధికము కాదు. హృదయ గ్రంధి లేనివాడను. హృదయ కమల మధ్యమునందుంటాను. అహంకార మమకారాలు లేనివాడను. షడ్భావ వికారాలు లేనివాడను. షట్కోశాలు లేనివాడను. అరిషడ్వర్గాలు లేనివాడను. అంతరము కన్న అంతరమైన వాడను.

నాకు దేశకాలాలు లేవు. దిక్కులే అంబరము. సుఖస్వరూపుడను. బంధాలు లేవు. మోక్షరూపిని. లేదు అనేది కూడా లేనివాడను.

అఖండ ఆకాశ స్వరూపుడను. అఖండాకారుడను. ప్రపంచముక్త

చిత్తుడను. ప్రపంచ రహితుడను. సర్వప్రకాశమే రూపంగా గలవాడను. చిన్మాత్రమైన ప్రకాశరూపుడను. మూడు కాలములు లేనివాడను. కామాదులు లేనివాడను.

నాకు దేహం లేదు. గుణాలు లేవు. దేహాత్మ జ్ఞానంతో ముక్తిహీనుడను. బ్రహ్మజ్ఞానంతో ముక్తుడను. సహజంగా బద్ధుడను గాను. కాబట్టి మోక్షం లేనివాడను. బ్రహ్మజ్ఞానంతో అవిద్య పోయింది. కాబట్టి ముక్తుడను. ఏ అవస్థా లేనివాడను. కాబట్టి మోక్షము కూడా లేనివాడనై ఆనందంగా ఉన్నాను.

నేను సత్యాసత్యాలకు అతీతుడను. పోవటానికి తగిన ప్రదేశము లేనివాడను. పరిపూర్ణుడను. కాబట్టి వెళ్ళటానికి చోటు లేదు. గమనాగమనములు, అవయవాలు లేనివాడను. నేను శాంతుడను. పురుషోత్తముడను. ఈ రకంగా ఎవరికైతే అనుభవం కలుగుతుందో అతడే నేను అవుతున్నాను. ఇందులో సందేహం లేదు. అని భావన చేస్తాడు అని పరమేశ్వరుడు పరమహంస యొక్క స్థితిని నారదుడికి వివరించాడు. ఈ ఉపనిషత్తు ఒక్కసారి చదివితే చాలు అతడు పరమాత్మ స్వరూపము అవుతాడు. అతడికి పునర్జన్మం ఉండదు.

# 111. జాబాలోపనిషత్తు

ఇది శుక్ల యజుర్వేదానికి సంబంధించినది.

బృహస్పతి చెబుతున్నాడు. "యాజ్ఞవల్క్యా కురుక్షేత్రము దేవతలకు దేవయజ్ఞముగా, సర్వభూతములకు బ్రహ్మానివాసముగ ఉన్నది. ఈ కురుక్షేత్రానికి 'అవిముక్తము' అని పేరు. అక్కడ ప్రాణాలు పోయే సమయంలో జీవులకు రుద్రుడు తారక మంత్రాన్ని ఉపదేశిస్తాడు. అందుచేత జీవులు మోక్షము పొందుతారు. కాబట్టి అవిముక్త కురుక్షేత్రము అనగా కాశిని ఎల్లరూ సేవించాలి."

అత్రిమహర్షి యాజ్ఞవల్క్యునితో "అనంతము అవ్యక్తము అయిన ఆత్మను ఏ రకంగా తెలుసుకోవాలి?" అని అడిగాడు. దానికి యాజ్ఞవల్క్యుడు చెబుతున్నాడు. "పరమాత్మ అవిముక్తము నందు స్థిరముగా ఉన్నది. అందుచేత అవిముక్తమునందు ఆత్మను ప్రతిష్ఠించి ఉపాసించాలి"

అత్రి : ఆత్మ ఎక్కడ ప్రతిష్టించబడింది?

యా : అవిముక్తము వారుణకు అసికి మధ్యలో నున్నది.

అత్రి : వారుణ, అసి అనగా ఏమి?

యా : దేహేంద్రియముల వలన కలిగే పాపాలన్నీ పోగొట్టటం వలన వారుణ అనబడుతుంది. ఇంద్రియ సంబంధమైన ఇతర పాపాలను పోగొడుతుంది. కాబట్టి అసి అనబడుతుంది.

అత్రి : వీటికి స్థానమేది?

యా : భృకుటికి, నాశికకు మధ్యలోనిది వీటి స్థానము, ఈ సంధినే బ్రహ్మజ్ఞానులు సంధ్యగా భావిస్తారు. ఇది మోక్షస్థానము.

బ్రహ్మజ్ఞాన ప్రాప్తి స్థానము.

పూర్వకాలంలో ఒకసారి కొందరు బ్రహ్మచారులు యాజ్ఞవల్క్యుని సమీపించి "మంత్రము వలన మోక్షము వస్తుందా?" అని అడిగారు. దానికి యాజ్ఞవల్క్యుడు **"శతరుద్రీయ మంత్రమువలన మోక్షము సిద్ధిస్తుంది"** అని చెప్పాడు. శతరుద్రీయ మంత్రము అంటే యజుర్వేదానికి సంబంధించిన 'కైవల్యోపనిషత్తు' నమక పాఠము.

ఒకసారి జనక మహారాజు యాజ్ఞవల్క్యునితో సన్యాసము గురించి వివరించమని అడిగాడు. దానికి యాజ్ఞవల్క్యుడు "బ్రహ్మచర్యము, గార్హస్పత్యము వానప్రస్థము అనే మూడు ఆశ్రమాలు పూర్తిఅయినతరువాత సన్యాసము స్వీకరించాలి. సమయం గనక అనుకూలంగా ఉంటే మొదటి రెండు ఆశ్రమాలు నిర్వహించిన తరువాత సన్యాసము స్వీకరించవచ్చు. ఆచార నియమాలున్నా లేకపోయినా, స్నాతకుడై ఉన్నా కాకపోయినా, అగ్నికార్యములు చేసినా చెయ్యకపోయినా, **బలీయమైన వైరాగ్యము కలిగినప్పుడు సన్యాసము స్వీకరించాలి.** ఇక్కడ ప్రాజాపత్య యజ్ఞము చేయకుండానే ప్రాణరూపమైన, అగ్ని సంబంధమైన అగ్నేయేష్టిని చెయ్యాలి. ఈ యజ్ఞంలో మంత్ర పూర్వకమైన అగ్నిని వ్రేల్చి తరువాత గ్రామాగ్నిని చెయ్యాలి. గ్రామాగ్ని లభించక పోతే ఉదకములలో హోమము చెయ్యాలి. జలము సమస్త దేవతా స్వరూపము. జలముతో సకల దేవతలకు హోమము చేస్తున్నాను అని చెప్పి హోమం చెయ్యాలి. తరువాత హవిస్సును చేతితో కలిపి భుజించాలి" అన్నాడు.

ఇప్పుడు అత్రిమహర్షి అడుగుతున్నాడు. "యాజ్ఞవల్క్యా! యజ్ఞోపవీతము లేనివాడు బ్రాహ్మణుడు ఎలా అవుతాడు?"

యా : ఇంతకు ముందు చెప్పినట్లుగా హవిస్సును భుజించినవాడు పవిత్రుడవుతాడు. అతడికి ఆ పవిత్రతయే యజ్ఞోపవీతము. ఈ విషయము అన్ని శాస్త్రాలలోనూ చెప్పబడింది. కాషాయవస్త్రము, ముండనము, భార్య లేకపోవటము, పరిశుద్ధత, ద్రోహచింతన లేకుండుట, భిక్షాన్న భోజనము, వీటిని కలిగి ఉన్న సన్యాసి బ్రహ్మయే అవుతాడు. వ్యాధిగ్రస్తుడు మనస్సుతోను, వాక్కుతోను సన్యాసము స్వీకరించవచ్చును. సుఖాలనుభవించటానికి ఈ పద్ధతి పనికిరాదు. నిజమైన సన్యాసి బ్రహ్మవేత్త అవుతాడు.

సంవర్తక, అరుణి, శ్వేతకేతు, దుర్వాసుడు, ఋభ, నిధాఘ, జడభరత, దత్తాత్రేయ, రైవతక మొదలైన వారంతా ఈ విధంగా పరమహంసలు. వీరందరూ పవిత్రమైన నియమాలు గలవారు. వీరు ఇతరులకు పిచ్చివారిలాగా కనిపిస్తారు. ఈ పరమహంస త్రిదండము, కమండలము, కావడి, జలపాత్ర, శిఖ, యజ్ఞోపవీతము, వీటన్నింటినీ మంత్రపూర్వకంగా నీటిలో వదలి వెయ్యాలి. ఆత్మధ్యానము చెయ్యాలి. పరిశుద్ధ హృదయంతో ప్రాణాలు నిలుపుకోవటానికి, నియమిత కాలంలో బిక్షాన్నం తినాలి. లాభనష్టాలు సమానంగా భావించాలి. పాడుబడ్డఇల్లు, దేవాలయము, పుట్ట, పొద, చెట్టుమొదలు, నదిలోని ఇసుకదిబ్బ, కొండగుహ, చెట్టుతొర్ర, సెలయేరు, ఎడారి ప్రాంతాలలో మాత్రమే నివసించాలి. అహంకారము లేకుండా తిరుగుతుండాలి. నారాయణ ధ్యానము, ఆత్మవిచారము చెయ్యాలి. పాపప్రక్షాళనకు ప్రయత్నించాలి – ఇట్టివారే పరమహంసలు అని చెప్పాడు యాజ్ఞవల్క్యుడు.

# 112. నారదపరివ్రాజకోపనిషత్తు

ఇది అథర్వణ వేదానికి సంబంధించినది. ఇందులో 9 అధ్యాయాలు 72 మంత్రాలు ఉన్నాయి.

ఉపనిషత్తులలో సన్యాసాన్ని వివరించినవి మొత్తం 17 కాగా 1. పరివ్రాజక 2. త్రిశిఖిబ్రాహ్మణ 3. సీతా 4. చూడా 5. నిర్వాణ 6. మండల 7. దక్షిణామూర్తి 8. శరభ 9. స్కంధ 10. మహానారయణ 11. అద్వయ అనే పదకొండు ఉపనిషత్తుల సారవే ఈ నారదపరివ్రాజకోపనిషత్తు. సన్యాసాన్ని వివరించే ఉపనిషత్తులలో ఇదే ప్రముఖమైనది.

పూర్వకాలంలో నారదమహర్షి, పుణ్యస్థలాలు, తీర్థాలు, క్షేత్రాలు సేవించి వైరాగ్య భావంతో నైమిశారణ్యానికి చేరి, అక్కడ నివృత్తి మార్గంలో కాలం గడుపుతూ ఉన్న వారందరికీ కూడా ఆ మార్గాన్ని బోధిస్తున్నాడు. ఆ సమయంలో ఒకరోజున శౌనకాది మహర్షులు నారదుణ్ణి సమీపించి, ఓ దేవర్షీ! "ఏ సాధన చేస్తే మాకు మోక్షము లభిస్తుందో వివరించవలసింది" అని అడిగారు. ఆ మాటలు విన్ననారదుడు "ఓ మహర్షులారా! ఉపనయనాది సకల (44) సంస్కారములు గలవాడు, వేదవేదాంగాలు అభ్యసించినవాడు, గృహస్తాశ్రమము, వానప్రస్తము పూర్తి చేసినవాడు, సద్గురువును సేవించినవాడు, సంసార సుఖాన్ని పరిత్యజించినవాడు, సాధన చతుష్టయము గలవాడు, ఆశారహితుడు, ఈషణత్రయము లేనివాడు, శాంతుడు, దాంతుడు, అయిన సన్యాసి, స్వస్వరూప ధ్యానంలో శరీరాన్ని త్యాగంచేసినవాడు ముక్తుడవుతాడు" అని చెప్పాడు.

ఆ మాటలు విన్న మహర్షులు ఓ నారదా ! అలాగయినట్లైతే

‘సన్యాసవిధి’ని మాకు వివరించవలసింది అని అడిగారు. అప్పుడు నారదుడు మహర్షులందరినీ వెంట పెట్టుకుని సత్యలోకానికి వెళ్ళి, బ్రహ్మదేవుని పరిపరివిధాల ప్రార్థించగా, ఆయన ప్రీతిచెంది సన్యాసవిధిని గురించి వివరించటం మొదలుపెట్టాడు. “ఓ మహర్షులారా! బ్రాహ్మణవర్ణంలో పుట్టినవాడు ఉపనయనము పూర్తిఅయిన తరువాత సద్గురువును ఆశ్రయించి, ఆయనకు సేవచేస్తూ 12 సం॥ విద్యాభ్యాసం చేసి 25 సంవత్సరాలు వచ్చిన తరువాత వివాహం చేసుకుని, గృహస్థాశ్రమ ధర్మాలు నిర్వరిస్తూ మంచి పుత్రునికని 25 సం॥ గృహస్తుగా ఉండాలి. 50 నుంచి 75 సం॥ వరకు వానప్రస్థము స్వీకరించాలి. తరువాత ఏకాకిగా అరణ్యాల యందు తిరుగుతూ, నిర్జన ప్రదేశంలో ఉంటూ, ఉచితమైన సత్కర్మలు చెయ్యాలి. ఇహ, పర లోక సుఖాల యందు ఆశను వదలి, విరక్తి గలిగి, చిత్తశుద్ధి పొంది, అహంకార మమకారాలను పూర్తిగా వదలి వెయ్యాలి. సాధన చతుష్టయాన్ని కలిగి ఉండాలి. ఇలాంటివాడే సన్యాసానికి తగినవాడు.” అన్నాడు.

**సన్యాసానికి అర్హత :** సన్యాసము అందరూ తీసుకోవటానికి లేదు. దానికి కొన్ని అర్హతలున్నాయి. అవి

1. నపుంసకుడు 2. భ్రష్టుడు 3. అంగహీనుడు 4. స్త్రీ సంపర్కము గలవాడు 5. చెవిటివాడు 6. బాలుడు 7. మూగవాడు 8. నాస్తికుడు 9. చక్రాంకితమైన వాడు 10. జీవనోపాధి కోసం సన్యసించి ధనవంతుల ఇళ్ళలో ఉండేవాడు. 11. వైఖానసుడు 12. శివార్చకుడు 13. ధనార్జన కోసం వేదం చదివినవాడు 14. కుష్ఠురోగి 15. అగ్నిహోత్రం చెయ్యనివాడు. వీరికి వైరాగ్యమున్నప్పటికీ సన్యాసానికి అనర్హులు. సాధన చతుష్టయము గలవాడే సన్యాసానికి అధికారి.

పరివ్రాట్ అంటే విడిచి పెట్టేవాడు. సకల భూతాలవల్ల తాను, తనవల్ల సకలభూతాలు అభయము పొందినవాడే పరివ్రాట్ అనబడతాడు. అతడే పరివ్రాజకుడు.

1. నపుంసకుడు 2. అంగహీనుడు 3. అంధుడు 4. బాలుడు 5. పాపి 6. పతితుడు 7. జీవనోపాధికి ఇతరులను ఆశ్రయించేవాడు 8. వైఖానసుడు 9. శివార్చకుడు 10. చక్రాంకితుడు 11. పాషండుడు 12. బట్టతల గలవాడు 13. అగ్ని కార్యము చేయనివాడు 14. వైరాగ్యము లేకపోవటంవల్ల రెండు మూడుసార్లు సన్యసించిన వాడు 15. ధనం కోసం వేదాధ్యయనం చేసేవాడు. వీరు ఆతుర సన్యాసము స్వీకరించినప్పటికీ, సన్యాసానికి అర్హులు కారు. అత్యవసర కాలంలో తీసుకునేది ఆతురసన్యాసము. మరణ కాలంలో తీసుకునే సన్యాసం కూడా ఆతుర సన్యాసమే. మరణ కాలంలో తప్ప ఆతుర సన్యాసం స్వీకరించరాదు. ఒకవేళ అలా స్వీకరించినా, మళ్ళీ శాస్త్రబద్ధంగా సన్యాసాశ్రమం స్వీకరించాలి. కర్మ ఎప్పుడూ మంత్ర సహితంగానే ఉండాలి. లేకపోతే అది అకర్మ అవుతుంది. చేసిన కర్మంతా బూడిదలో పోసిన పన్నీరవుతుంది. ఆతురసన్యాసం కూడా మంత్ర సహితంగా, ప్రాజాపత్యయాగం జలంలో చేసి, ఆ తరువాతే సన్యాసం స్వీకరించాలి. మనస్సుతో గాని, శాస్త్రబద్ధంగా గాని, మంత్రావృత్తితో గాని జలంలో వేదోక్తంగా అనుష్టానం పూర్తిచేసి, విరక్తి గల విద్వాంసుడు మాత్రమే సన్యసించాలి.

**వైరాగ్యము :** వైరాగ్యం కలిగితేనే సన్యసించాలి. లేకపోతే గృహస్తుగానే ఉండాలి. కోరికలు తీరనివాడు సన్యసిస్తే నరకాన్ని పొందుతాడు. జిహ్వా, ఉపస్థ, ఉదరము, హస్తము తనఅధీనంలోకి

తెచ్చుకున్న విజితేంద్రియుడు మాత్రమే సన్యసించాలి. సంసారమునిస్సారము అని గ్రహించి సన్యసించాలి. కర్మ–ప్రవృత్తి రూపం. జ్ఞానము–నివృత్తి రూపము. అందుకని జ్ఞానం సంపాదించి సన్యసించాలి. కేవలము మంత్రజపము, కర్మ, వదిలినంత మాత్రాన అది సన్యాసం కాదు. అది ఇంకొక కర్మ అవుతుంది. ఇంద్రియాలు విషయాసక్తము లైనంతవరకు అది ప్రవృత్తి మార్గమే అవుతుంది. జ్ఞానము అంటే ఇంద్రియాలన్నీ నివృత్తి మార్గంలో విషయదూరములై ఉండాలి. ఇదే సన్యాసము. ఇలా చేసినవాడే పరివ్రాజక పదవికి తగినవాడు. పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకున్నవాడు, సనాతనబ్రహ్మని గురించి తెలుసుకున్నవాడు మాత్రమే దండాన్ని స్వీకరించి, యజ్ఞోపవీతము, శిఖ వదలిపెట్టాలి.

అనాత్మవస్తువులందు ఆసక్తిని వదలినవాడు, ఈషణత్రయాన్ని త్యజించి పరబ్రహ్మలో అనురక్తుడైనవాడు మాత్రమే బిక్షాన్నము భుజించటానికి అర్హుడు. అందరితోనూ పూజించబడినప్పుడు, నమస్కరించబడినప్పుడు పొందిన ఆనందము ఇతరులచే కొట్టబడినప్పుడు, తిట్టబడినప్పుడు, అసహ్యించుకొనబడినప్పుడు కూడా పొందగలిగినవాడే బిక్షాన్న భోజనానికి అర్హుడు. స్తుతి నింద, మానావమానాలను సమానంగా భావించినవాడే సర్వదా ఆత్మారాముడు అవుతాడు. అతడే నిజమైన భిక్షువు. సర్వవ్యాపి అయిన వాసుదేవుడను నేనే. అద్వయమైన అక్షర పరబ్రహ్మను నేనే అని భావించిన వాడే భిక్షాన్న భోజనానికి అర్హుడు. 1. శాంతి 2. శమము 3. శౌచము 4. సంతసము 5. సత్యము 6. ఆర్జవము (కపటము లేకపోవటము, చక్కని నడవడిక) 7. దీనత్వము 8. దంభము లేకపోవటం. ఈ లక్షణాలు గలవాడే కైవల్యాశ్రమమునందు నివశిస్తాడు. త్రికరణశుద్ధిగా

హింసచెయ్యనివాడు, పాపం చెయ్యనివాడు, అందరికీ మేలు చేసేవాడు మాత్రమే భిక్షువు అనబడతాడు. 1.ధైర్యము 2. క్షమ 3. ఇంద్రియ నిగ్రహము 4. అస్తేయము 5. బాహ్యాంతర శుచి 6. ప్రజ్ఞ 7. బ్రహ్మవిద్య 8. సత్యము 9. క్రోధం లేకపోవటం 10. పరమశాంతం. ఇవి ధర్మలక్షణాలు. ఈ లక్షణాలు గలవాడు ధర్మాన్ని ఆచరిస్తూ, వేదాంతం వింటూ ఋణత్రయ (దేవఋణము, పితృఋణము, మానవ ఋణము) విముక్తుడైన వాడు మాత్రమే సన్యసించాలి.

**జితేంద్రియుడు :** గతంలో అనుభవించిన సుఖాలు, రాబోయే సుఖాలు, ఈనాడు ప్రాప్తించిన భోగాల గురించి ఆలోచించనివాడు మాత్రమే ముక్తిపొందుతాడు. ఇంద్రియాలను నిరోధించినవాడు, బాహ్యేంద్రియాలతో లోపలికి, అంతరింద్రియా లతో బయటకి చూడగలిగినవాడు సర్వదా కైవల్యాశ్రమములో ఉంటాడు. శవము సుఖదుఃఖాలను ఏ విధంగా స్వీకరించదో, అలాగే ప్రాణమున్నప్పుడు కూడా ఉండగలవాడు మోక్షాన్ని పొందుతాడు. కౌపీనము, కంబళి, ఏకదండము. సన్యాసి ఈ మూడింటినే ధరించాలి. ఎక్కువ గనక ధరిస్తే రౌరవాది నరకాలు అనుభవిస్తాడు. చిరిగిపోయిన బట్టలు కుట్టుకుని బొంతగా తయారు చేసుకోవాలి. ఒకటే కాషాయవస్త్రం ధరించాలి. భేదదృష్టి లేకుండా, నిశ్చలుడై ఆశారహితుడై, ఏకాకిగా సంచరించాలి. వర్షాకాలంలో మాత్రమే ఒకేచోట ఉండాలి. భార్యాపుత్రులను వదిలి, తాను చదివిన వేదాలు, శాస్త్రాలు, చేసినకర్మలు అన్నీవదలి రహస్యంగా సంచరించాలి. కామక్రోధాదులను పూర్తిగా త్యజించి, అహంకార మమకారాలు లేనివాడే పరివ్రాజకుడు. బంగారాన్ని మట్టిని సమానంగా చూసేవాడు, ఏ జీవికీ దుఃఖాన్ని కలిగించనివాడు, ఆశ కొంచెంకూడా లేనివాడే మునీశ్వరుడు.

దంభము, అహంకారము, హింస, లోభత్వము, దీనత్వము వంటి దుర్గుణాలు లేనివాడు, ఆత్మజ్ఞాన సంపన్నుడు మాత్రమే ముక్తిని పొందుతాడు. ఇంద్రియ సుఖాలకు వశమయినవాడు దుఃఖము పొందుతాడు. ఇంద్రియాలను నియంత్రించినవాడు జ్ఞానము పొందుతాడు. ఆజ్యం పోస్తే అగ్ని చల్లారదు. అలాగే అనుభవించటం వల్ల కోరికలు తీరవు. కాబట్టి సాధకుడు కోరికలకు వశుడుకారాదు. ఇష్టాఇష్టాలు, రుచిగలవి, రుచిలేని పదార్థాలు తినికూడా వికారం పొందనివాడు, సుగంధము దుర్గంధము, హర్షశోకాల మధ్య తేడా లేనివాడు జితేంద్రియుడు. వాక్కు మనస్సు పరిశుద్ధముగా చేసికొని రహస్యంగా తిరిగేవాడు ముక్తిపొందుతాడు.

**అవమానము :** వాసనలున్నవాడు సన్యాసము స్వీకరించరాదు. వాటిని విషంలాగా చూడాలి. గౌరవములందు కోరికలుండరాదు. **అవమానము వల్ల అహంకారము నశిస్తుంది.** అందుకని అవమానమును అమృతంలాగా చూడాలి. అవమానం వల్ల సంచితపాపము కూడా నశిస్తుంది. తితిక్ష పెరుగుతుంది. తితిక్ష అంటే ఎదిరించగలిగిన శక్తి ఉండి కూడా ఎదిరించకుండా ఉండటం. దీనివల్ల తన ఉన్నత స్థితికి బాట ఏర్పడుతుంది. అందుకే అవమానాన్ని అమృతంగా భావించాలి. సన్మానాలు పొందినా, దక్షిణలు స్వీకరించినా, తన సంచితపుణ్యం నశించిపోతుంది. అందుచేత వీతరాగుడు సన్మానము విషంగాను, అవమానము అమృతంగాను భావించాలి. అవమానించబడిన వాడు ఆనందంగా ఉంటాడు. సుఖంగా తిరుగుతాడు. అవమానించిన వాడు దుఃఖిస్తాడు. చివరకు దుఃఖంలోనే నశిస్తాడు. నిందలను ఓర్చుకోవాలి. ఎవరినీ అగౌరవపరచరాదు. ఎవరితోను విరోధం పెట్టుకోలేదు. నీ మీద కోపగించిన వాడిమీదకూడా

నువ్వు కోపగించరాదు. పరమ శాంతంతో వారిని కుశలమడగాలి. అసత్యమాడరాదు. ఆత్మజ్ఞాననిష్ఠుడై నిరపేక్షుడై, ఇతరులను ఆశీర్వదించాలి. ఆశలేనివాడై, ఆత్మబలం గలిగి సుఖస్వరూపుడై సంచరించాలి. ఇంద్రియ నిగ్రహము, రాగద్వేషాలు లేకపోవటము, సకల జీవులందు దయ కలిగి ఉండటంవల్ల అమృతత్త్వము పొందుతాడు. రక్తమాంసాలు, మలమూత్రాలతో కూడి దుర్గంధ భరితమైన ఈ దేహాన్ని త్యజించాలి. నవధాతువులతో కూడిన ఈ దేహం మీద ఆసక్తిగలవాడు నరకంపొందుతాడు. దేహంలో నేను అనే అహంకారమే మృత్యుమార్గాన్ని చూపుతున్నది. సమస్త నాశనములకు కారణమైన అహాన్ని త్యజించాలి.

**పుణ్యపాపాలు :** తనను ప్రేమించే వారి యందు పుణ్యము, ద్వేషించే వారి యందు పాపము వదిలెయ్యాలి. అది ఎలా అంటే ప్రేమించే వారు చేసే స్తుతివల్ల పుణ్యము, ద్వేషించేవారు చేసే నిందవల్ల పాపము నశిస్తాయి. ఇలా సంచిత పాప పుణ్యాలు నశించగా పరిశుద్ధ చిత్తుడై మోక్షానికి అర్హుడవుతాడు. ఈ రకంగా నిదానంగా సమస్తబంధాలు, ప్రతిబంధకాలు త్యజించి, సుఖదుఃఖాలు, లాభనష్టాలు, శీతోష్ణాది ద్వంద్వములను త్యజించి, నిరంతరము పరమాత్మ యందే నివసించాలి. ఎప్పుడూ ఒంటరిగానే సంచరించాలి. ఎవరి సహకారము కోరకూడదు. ఇటువంటి వాడు సర్వదా సిద్ధి పొందుతాడు. ఒంటరిగా తిరిగే వాడికే జ్ఞానబుద్ధి కలుగుతుంది. భిక్షాన్నానికి కపాలము, నివాసానికి చెట్టుతొర్ర, కట్టుకోవటానికి గుడ్డపీలికలు స్వీకరించి, కోరికలులేకుండా, సర్వజీవులయందు సమానమైన భావన గలవాడే జీవన్ముక్తుడు. సర్వభూతహితుడు, శాంతుడు, త్రిదండి, కమండలధారి, ఎప్పుడూ పరబ్రహ్మమందే రమించేవాడు, సన్యసించి భిక్షకోసం

గ్రామంలోకి వెళ్ళాలి. ఒక్క క్షణము కూడా వృధా చెయ్యకుండా ఆత్మరతి చెయ్యటానికే భిక్షాటనము చెప్పబడింది. ఈ లక్షణాలతో సంచరించే వాడే భిక్షువు. ఇద్దరు కలిస్తే జంట, ముగ్గురయితే గ్రామము, అంతకన్న ఎక్కువైతే నగరము అని భావించాలి. మిధున, గ్రామ, నగరములు చేసే సన్యాసి, స్వధర్మము నుంచి దిగజారుతున్నాడని తెలుసుకోవాలి. అలాంటి వారికి ఉపయోగం లేని లోకాభిరామాయణం పెరుగుతుంది. ఒకరికి ఇద్దరయితే స్నేహము, లోభత్వము, మాత్సర్యము పెరుగుతాయి. పరస్పర సంబంధం వల్ల ధ్యాననిష్ఠ తగ్గుతుంది. రాగద్వేషాలు పెరుగుతాయి. అందుచేత ఒంటరిగా ఉండి, కోరికలను త్యజించాలి. మాట్లాడేటప్పుడు ప్రతి వాక్యానికి 'నారాయణ' అనే పదం వాడాలి. సర్వకాల సర్వావస్థల యందు త్రికరణశుద్ధిగా పరమాత్మ చింతన చెయ్యాలి. బ్రహ్మను గురించే మాట్లాడాలి. ఉపనిషత్తులు పఠించాలి. ఆత్మనిష్ఠ కోసం ధ్యానము చెయ్యాలి. ఆసనాలు వెయ్యాలి. మరణము, జీవితము వేటినీ గొప్పగా చెప్పరాదు. ఈ రెండిటినీ అభినందించకుండా, ఆయువు ఉన్నంతవరకు, రాజాజ్ఞ కోసం నిరీక్షించే సేవకుడిలాగా, ఎదురు చూడాలి.

**భిక్షువు :** నాలుక ఉండి లేనివాడుగ, పుంసత్వము ఉండి నపుంసకుడుగ, కాళ్ళు ఉండి కుంటివాడుగ, కళ్ళు ఉండి గ్రుడ్డివాడుగ, చెవులు ఉండి చెవిటివాడుగ, సర్వజ్ఞుడై ఉండి ఏమీ తెలియనివాడుగ ఉండాలి. ఈ ఆరు లక్షణాలు గలవాడే భిక్షువు. అతనికి ఏ బంధాలు ఉండవు. భిక్షువుకు ఆరురకాల ధర్మాలున్నాయి. అవి

**1. అజిహ్వుడు :** తినేటప్పుడు ఇష్టము, అనిష్టము లేనివాడు.

**2. షండుడు :** పసిపిల్లకాని, యవ్వనవతిగాని, వృద్ధురాలు గాని అందరినీ ఒకేలాగా చూసేవాడు.

**3. పంగువు :** కాళ్ళను అదుపులో ఉంచుకునే వాడు. భిక్షాటనకు మాత్రమే తిరిగేవాడు.

**4. అంధుడు :** నుంచున్నా, నడుస్తున్నా అతని దృష్టి నాలుగు కాడిమానులు కన్న ఎక్కువ (యాభై అడుగులు) ప్రసరించనివాడు. నేత్రాలను నియంత్రించి, నిరంతరము బ్రహ్మదృష్టిలో ఉండేవాడు.

**5. బధిరుడు :** శ్రవణేంద్రియాన్ని అదుపులో ఉంచుకున్నవాడు. స్తుతినిందలను సమానంగా భావించేవాడు.

**6. ముగ్ధుడు :** సర్వేంద్రియాలను జయించినవాడు. ఎటువంటి ఆకర్షణలకు లొంగనివాడు. లోకవ్యవహారాలతో సంబంధం లేనివాడు. ఈ విధంగా అన్ని ఇంద్రియాలు ఉండి లేనివాడు లాగా, సర్వజ్ఞుడై ఉండి పిచ్చివాడిలాగా తిరిగేవాడు భిక్షువు అనబడతాడు. అంతేకాదు 1. నటులను, నాట్యాలను చూడటం 2. జూదము ఆడటం 3. కామవాంఛ గల కాంతలతో స్నేహము 4. భక్ష్యాలు 5. భోజ్యాలు 6.రజస్వలా స్త్రీ దర్శనము. అనేవి పూర్తిబంధనాలు కాబట్టి యతి వీటిని చెయ్యరాదు. రాగము, ద్వేషము, మదము, మోహము, ద్రోహము వీటిని మనసులోకి రానుకూడా రానీయరాదు. 1. మంచము 2. తెల్లని వస్త్రము 3. శృంగార కథాశ్రవణము 4.చంచలబుద్ధి 5. పగటినిద్ర 6. దూరప్రయాణము. ఇవి యతీశ్వరుడికి పతన హేతువులు. నిరంతరము బ్రహ్మచింతన చేసేవాడు సుదూర యాత్రలు చెయ్యరాదు. ఉపనిషత్తులు ఎప్పుడూ చదువుతూ ఉండాలి. తీర్థయాత్రలు, ఉపవాస దీక్షలు, ధ్యానము విడిచిపెట్టాలి. కేవలము అధ్యయనశీలుడు, వ్యాఖ్యాన పరాయణుడు కారాదు. ఇవి శాస్త్రవాసనను పెంచుతాయి. పాపరహితము, కపటశూన్యము అయిన పరిశుద్ధ జీవనము గడపాలి. తాబేలు తన అవయవాలను అవసరమైనప్పుడు తనడిప్ప కింద

దాచుకున్నట్లుగా, యతి తన అవయవాలను తన అధీనంలో ఉంచుకోవాలి. మనోవృత్తులను నశింపచెయ్యాలి. దేనియందూ ఆసక్తి ఉండరాదు. అపరిగ్రహుడు కావాలి. ఎవరి దగ్గరా, ఎప్పుడూ ఏదీ తీసుకోరాదు. సుఖదుఃఖాది ద్వంద్వాలకు అతీతుడు కావాలి. అహంకార మమకారాలు లేకుండా ఏకాంత వాసియైన యతీశ్వరుడు సర్వబంధనముల నుంచి విముక్తుడవుతున్నాడు.

వైరాగ్యము గలవాడు బ్రహ్మచారిగాని, గృహస్థుగాని, వానప్రస్తుడు గాని ఎవరైనా సన్యసించవచ్చు. మూడు ఆశ్రమాలు పూర్తిచేసి తీసుకునేది క్రమసన్యాసము అంటారు. కర్మని, ఇతర మంత్రాలని వదలి, మోక్షమంత్రాలతో సన్యాసం స్వీకరించాలి. పరమాత్మను మాత్రమే ధ్యానం చెయ్యాలి.

**శిఖయజ్ఞోపవీతములు :** సన్యాసం స్వీకరించాలంటే శిఖ, యజ్ఞోపవీతాలను తీసెయ్యాలి. అక్షర పరబ్రహ్మమే సూత్రము. కాబట్టి అక్షర పరబ్రహ్మ అనే సూత్రాన్నే ధరించాలి. అన్నింటి యందు అంతర్లీనంగా ఉండి సర్వాన్నీ చూస్తుంటుంది కాబట్టి సర్వాంతర్యామియే సూత్రము. సూత్రము అంటే పరమపదమే. ఈ విషయం తెలిసినవాడే జ్ఞానసంపన్నుడు. సూత్రంతో మణులను మాలగా కట్టినట్లు, పరమాత్మ వల్ల సర్వభూతాలు మాలగా కూర్చబడినాయి. అటువంటి పరమాత్మసూత్రాన్ని ధరించిన యోగియే యోగవిదుడు. అటువంటి సూత్రాన్ని ధరించి, బాహ్యసూత్రాన్ని వదిలెయ్యాలి. ఎవరు పరమాత్మ భావాన్ని సూత్రంగా ధరిస్తారో, వారే చైతన్యవంతులు. అటువంటి సూత్రాన్ని ధరించిన వారు ఎంగిలిభోజనము చేసినా తప్పులేదు. అశుచి కాడు. జ్ఞానియైన వాడికి బ్రహ్మసూత్రము అంతర్గతంగా ఉంటుంది. అటువంటి జ్ఞానియే సూత్రవిదుడు. అతడే యథార్థ యజ్ఞోపవీతధారి.

జ్ఞానయజ్ఞోపవీతం ధరించిన వారికి జ్ఞానమే శిఖ, జ్ఞానమే అనుష్ఠానము. జ్ఞానమే పరమాత్మ. అగ్నికి ఏ రకంగా జ్వాల (శిక్ష) ఉన్నదో అలాగే జ్ఞానికి జ్ఞానమే శిఖ. అటువంటి జ్ఞానియే శిఖీ. అతడే విద్యావేత్త. బాహ్యశిఖ, శిఖఅనిపించుకోదు. అది జుట్టు మాత్రమే. వైదిక కర్మానుష్ఠానం చేసే వారికి మాత్రమే బాహ్యసూత్రము కావాలి. బాహ్యసూత్రము కేవలము వైదికప్రక్రియ. ఎవరికైతే జ్ఞానమే శిఖగా, యజ్ఞోపవీతంగా ఉంటుందో, అతడే సకల బ్రాహ్మణ ధర్మాలు తెలిసినవాడు.

**ముక్తికి అర్హత :** సర్వజ్ఞుడయిన విజ్ఞాని సన్యసించి, ద్వంద్వముల వల్ల వచ్చే కష్టాలు భరించగలిగినట్లైతే ఏకవస్త్రము ధరించవచ్చు. అటువంటి వాడు శిరోముండనం చేయించుకుని, అపరిగ్రహవ్రతము ఆచరించాలి. ఒకవేళ అతనికి తీవ్రమైన వైరాగ్యం ఉన్నట్లైతే, సర్వద్వంద్వాలను సంహించాలి. అప్పుడే పుట్టిన పిల్లవాడు లాగా బట్టలుకూడా లేకుండాఉండాలి. జగత్తంతా మిధ్యగా భావించి భార్య, పుత్రులు, మిత్రులు మొదలైన బంధనాలు వదిలెయ్యాలి. సర్వకర్మలు, కౌపీనము, నింద, అహంకారము, దంభము, సుఖదుఃఖాలు, కామక్రోధాలు అన్నీ వదిలెయ్యాలి. శరీరాన్ని శవముగా భావించాలి. పరబ్రహ్మ స్వరూపమయిన స్వస్వరూపాన్నే లోపల, బయట అంతటా భావించాలి. ఎవరికీ నమస్కారము చెయ్యరాదు. అగ్నికార్యము గాని, ఆశీర్వాదము గాని, నిందాస్తుతులుగాని చెయ్యరాదు. యాదృచ్ఛికంగా ప్రాప్తించినవాటితో తృప్తిచెందాలి. బంగారాన్ని ముట్టుకోరాదు. అటువంటి సన్యాసికి ఆవాహన విసర్జన, మంత్రామంత్రములు, ధ్యానోపాసనలు, లక్ష్యాలక్ష్యములు, భేదాభేదభావములు, స్వదేశ విదేశాలు అనేవి ఏవీ ఉండవు. ఏ ప్రదేశంలోనూ స్థిరంగా ఉండరాదు.

జీర్ణగృహాలు, పాడుపడ్డ దేవాలయాలు, పర్ణశాలలు, కుమ్మరిగృహాలు, యాగశాలలు, హోమకుండాల దగ్గర, నదీతీరాలు, ఇసుకతెన్నెలు, భూగృహాలు, కొండగుహలు, చెట్టుతొర్రలు, అడవులు, సముద్రతీరాల యందు విహరించాలి. సంవర్తకుడు, దత్తాత్రేయుడులాగా మారువేషాలలో తిరగాలి. సర్వజ్ఞుడై కూడా పిచ్చివాడిలాగా ఉండాలి. సదా సత్యాన్వేషణలోనే తిరుగుతుండాలి. జీవించటంకోసం మాత్రమే తినాలి. అన్నింటి యందు సమభావం కలిగి పుణ్యపాపాలకు దూరంగా ఉండాలి. పరిపూర్ణ బ్రహ్మానందబోధ స్వరూపుడై "అహంబ్రహ్మాస్మి" అనే బ్రహ్మప్రణవాన్ని జపిస్తూ భ్రమర కీటక న్యాయానుసారము మూడు శరీరాలను త్యజించి, సన్యాసదీక్షలో ఈ శరీరాన్ని త్యజించాలి. ఇటువంటి వాడే సన్యాసి. పరివ్రాజకుడు, అతడే మోక్షానికి అర్హుడు.

ఉపనిషత్తులో ఇంకా అనేక విషయాలు చెప్పబడ్డాయి. కాని ఇంతవరకు చెప్పినవి సన్యాసికి ఉండవలసిన లక్షణాలు. ఈ లక్షణాలు గలవాడే సన్యాసం స్వీకరించాలి. అటువంటి వాడే ముక్తికి అర్హుడు. ఈ లక్షణాలు లేనివాడు సన్యసించినట్లైతే అది సన్యాసము అనే పదానికే విఘాతము కలిగిస్తుంది. సన్యాసం ఒకరిచ్చేది, ఇంకొకరు పుచ్చుకునేది కాదు. ఎవరికి వారు జ్ఞానవైరాగ్యాలు వృద్ధి చేసుకోవాలి.

# 113. నిర్వాణోపనిషత్తు

ఋగ్వేదానికి సంబంధించినది ఈ ఉపనిషత్తు. ఇందులో ఐదు మంత్రాలు ఉన్నాయి.

నేనే పరమహంసను. పరివ్రాజకులు నా తరువాత చిహ్నాలు గలవారు. మన్మథ క్షేత్రపాలకులు. ఆకాశ సిద్ధాంతము గలవారు. క్షయము కానిది, నిర్మలమైనది, ఇక్కడ సంశయాలు, లేకపోవటమే దేవత. నిష్కలమే ప్రవృత్తి. నిష్కేవలమే జ్ఞానము. ఊర్ధ్వామ్నాయము నిరాలంబమయమైన పీఠం. సంయోగమే దీక్ష, వియోగము – ఉపదేశము; సంతోష పానము – దీక్ష, వివేకమే – రక్ష, కరుణయే – ఆనందమాల, హంసలాగా – నడవటం, (హంస అన్ని భూతములందు అంతర్వర్తిని) ధైర్యము అనే బొంత ధరించాలి. ఉదాసీనత అనే గోచీ పెట్టుకోవాలి. విచారణ అనే దండము, బ్రహ్మదర్శనము అనే యోగపట్టణము, ఆచరణము – శ్రీ పాదుకాపరమైన ఇచ్ఛయే – కుండలిని బంధించటం, పరాపనవాదము నుండి విముక్తి పొందటమే జీవన్ముక్తి. శివయోగ నిద్రాముద్ర అనే ఖేచరీ ముద్ర వెయ్యాలి. పరమానందం కలిగి ఉండాలి. త్రిగుణాలను వదలెయ్యాలి. వివేకంతో మాత్రమే పొందదగిన అవాఙ్మానస గోచరుడైన బ్రహ్మను మాత్రమే ధ్యానించాలి. ఈ జగత్తు అంతా అనిత్యము. అందుకే దీన్ని స్వప్నజగత్తు అంటారు. ఇది ఆకాశంలో పరుగు పెడుతున్న ఏనుగులాటిది. అలాగే దేహం కూడా, మోహగుణంతో నిండిపోయింది. (తాడులో పాములాగా కల్పించబడింది. విష్ణువిద్య మొదలైన అనేకమైన పేర్లకు లక్ష్యమైనది. ప్రయాణించే మార్గము చాలా కష్టమైనది. సంకేతము ఎప్పుడూ శూన్యం కాదు. అమరపదము దాని స్వరూపము. అది బ్రహ్మయొక్క తనయొక్క

జ్ఞానము. అజపా గాయత్రియే ఉపాస్యము. వికారము అనే దండము – ధరింపదగినది. యోగి తన యోగంతో సదానంద స్వరూపాన్ని చూడాలి. ఆనందము అనే భిక్షను తినాలి. మహాస్మశానంలో ఆనందంగా నివశించాలి. ఆనంద మఠము అంటే – ఏకాంత స్థానమే. నిర్మలమైన శరీరమే నిరాలంబమైన పీఠము. అమృతకల్లోలములు గల ఆనందమే క్రియ. పరుని, అపరుని సంయోగింప చేయటమే తారకోపదేశము. అద్వైతానందమే దేవత. అంతరింద్రియ నిగ్రహమే నియమము. త్యాగము అంటే భయము, శోకము, మోహములు పూర్తిగా వదిలెయ్యటం. కర్తవ్యము – పరాపరుల ఐక్యసాధన. స్వప్రకాశమైన బ్రహ్మతత్త్వంలో శివశక్తిని సంపుటీకరణం చేసి ప్రపంచాన్ని ఛేదించాలి. శివమే – తురీయజ్ఞోపవీతము. శివమయమైనదే శిరము.

దండము కూడా వదిలెయ్యాలి. బ్రహ్మచర్యాశ్రమంలో అధ్యయనం చేసి వానప్రస్థము చదివి సన్యసించి సర్వసందేహనాశమైన స్థితి పొందాలి.

ఈ దర్శనాన్ని కుమారుడికి, శిష్యుడికి మాత్రమే ఇవ్వాలి. ఇతరులకు ఇవ్వరాదు. ఇది మోక్షదాయకము.

# 114. భిక్షుకోపనిషత్తు

ఇది శుక్లయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో మొత్తం మూడు మంత్రాలున్నాయి. భిక్షకులలో రకాలు ఇందులో చెప్పబడ్డాయి.

మోక్షార్థులైన భిక్షకులలో నాలుగు రకాలవారున్నారు. 1. కుటీచకుడు 2. బహూదకుడు 3. హంస 4. పరమహంస. వీరిని గురించి అవధూతోపనిషత్తులో కూడా చెప్పారు.

**1. కుటీచకుడు :** రోజుకు ఎనిమిది ముద్దలు మాత్రమే తింటాడు. మోక్ష మార్గంలో ఉంటాడు. గౌతమ, యాజ్ఞవల్క్య, భరద్వాజ, వసిష్టులు ఇలాంటివారు.

**2. బహూదకుడు :** వైష్ణవసన్యాసి. త్రిదండము, కమండలము, శిఖా, యజ్ఞోపవీతాలు ధరిస్తాడు. కాషాయవస్త్రాలు ధరిస్తారు. మధుమాంసములు తినడు. రోజుకు ఎనిమిది ముద్దలు మాత్రమే తింటాడు. యోగమార్గములో ఉండి మోక్షాన్ని కోరుతుంటాడు.

**3. హంస :** వీరు పల్లెటూరిలో ఒక రాత్రి, నగరంలో ఐదు రాత్రులు, క్షేత్రములో ఏడు రాత్రులు మాత్రమే ఉండాలి. గోమూత్రము గోమయము తింటారు. చాంద్రాయణవ్రతం చేస్తుంటారు. యోగమార్గంలో ఉంటారు. పూర్తిగా మోక్షవాదులు.

**4. పరమహంస :** సంవర్తకుడు, అరుణి, శ్వేతకేతువు, జడభరతుడు, దత్తాత్రేయుడు, శుకుడు, వామదేవుడు, హారీతకుడు మొదలైన వారు ఈ కోవకు చెందినవారు. రోజుకు ఎనిమిదిముద్దలు మాత్రమే తింటారు. యోగమార్గంలో ఉండి మోక్షాన్ని కోరుతుంటారు. చెట్టుతొర్రలు, శూన్యగృహాలు, శ్మశానాలు వీరి నివాసాలు.

గోచీపెట్టుకుంటారు. లేదా దిగంబరులుగా ఉంటారు. వీరికి ద్వంద్వములు ఉండవు. ధర్మాధర్మాలు, లాభాలాభాలు, శుద్ధాశుద్ధాలు, ఏవీఉండవు. ద్వైతభావము ఉండదు. మట్టిని, రాయిని, బంగారాన్ని సమంగా చూస్తారు. అన్ని వర్ణాలవారి దగ్గర భిక్ష తీసుకుంటారు. సర్వత్రా ఆత్మనే చూస్తారు.

వీరు దిగంబరులై ద్వంద్వములు లేనివారై ఏమీ తీసుకోకుండా, ఆత్మధ్యాన పరాయణులై, ఆత్మనిష్టులై, ప్రాణాలు నిలుపుకోవటం కోసము భిక్షమెత్తుకుంటూ, పాడుబడిన ఇల్లు, గుడి, పుట్ట, చెట్టు తొర్ర, కుమ్మరి ఇల్లు, అగ్నిహోత్రశాల, నదీతీరము, కొండగుహ, సెలయేటి గట్టులయందు ఉంటారు. బ్రహ్మమార్గంలో చరిస్తూ సన్యాసిగా దేహత్యాగము చేస్తారు.

# 115. తురీయాతీతోపనిషత్తు (శుక్లయజుర్వేదం)

పూర్వకాలంలో ఒకసారి పితామహుడైన చతుర్ముఖబ్రహ్మ తన తండ్రియైన శ్రీమన్నారాయణుని సమీపించి **అథ తురీయాతీతావధూతానాం కోయం మార్గస్తేషాం కాస్థితిరితి.**

"తురీయాతీత అవధూతలకు మార్గమేది? వారి స్థితి ఎలాంటిది? నాకు వివరించండి'' అని అడిగాడు. ఆ మాటలు విన్న శ్రీమన్నారాయణుడు చెబుతున్నాడు.

"అవధూత మార్గంలో ఉన్నవాడు దుర్లభతరుడు. ఎక్కడో ఒక్కడుంటాడు. అయినప్పటికీ అతడు నిత్యపూజ్యుడు. అతడే వైరాగ్యమూర్తి అతడే జ్ఞానకారుడు. అతడే వేదపురుషుడు. ఎవడు మహాపురుషుడో వాని చిత్తము నాయందే ఉంటుంది. నేనూ అతని యందే ఉంటాను. అతడు మొదట కుటీచకుడై, కుటీచకుడు బహూదకుడై, 'అహంసత్యం'ను అవలంభించి హంసుడై, హంసుడు పరమహంసుడై, స్వరూపానుసంధానముచే సర్వప్రపంచాన్ని తెలుసుకుని, దండము, కమండలము, కటిసూత్రము, కౌపీనము, ఆచ్ఛాదనము, విద్యుక్తక్రియలు అన్నీ నీటిలో వదిలి, దిగంబరుడై, రంగులేని పాతనారచీరలు, కృష్ణాజినము కూడావదిలి, నిత్యక్రియలను అమంత్రకముగా చేస్తూ, అభ్యంగనస్నానము, ఊర్ధ్వపుండ్రధారణ వదలి, లౌకిక, వైదిక కర్మలను విసర్జించి, సర్వత్ర పుణ్యాపుణ్యములను వదిలి, జ్ఞానాజ్ఞానములను వదిలి, శీతోష్ణములు, సుఖదుఃఖములు, మానావమానములు జయించి, వాసనాత్రయ పూర్వకమైన నింద, అనింద, గర్వము, మత్సర్యము, దంభము, దర్పము, ఇచ్ఛ, ద్వేషము, కామము, క్రోధము, లోభము, మోహము, హర్షము, అమర్షము,

అసూయ, ఆత్మసంరక్షణాదికము అన్నీ వదలి, తన శరీరాన్ని శవంలాగా చూస్తూ, అప్రయత్నంగా, నియమం లేకుండా, లాభాలాభములను సమంగా చేసి, ఆవులాగా దొరికింది తిని ప్రాణాలు నిలుపుకుంటూ, లభించిన దానితో తృప్తిపడి ఆశలేనివాడూ, సర్వవిధ పాండిత్యము భస్మం చేసి అంటే దాన్ని తలచకుండా, స్వరూపమును మరుగుపరచి, పెద్ద, చిన్న అనే మాటలాడక, సర్వోత్కృష్టత్వము, సర్వాత్మకత్వములకు అద్వైతము కల్పించి, అప్రమత్తుడై నాకన్న వేరెవరూ లేరని, దేహగుహ్యాదీం ధనము ఆత్మయందు ఉపసంహరించి, దుఃఖముతో ఉద్వేగము చెందక, సుఖముతో మోదముపొందక, రాగమందు కోరికలేనివాడై, శుభాశుభములందంతట స్నేహములేనివాడై, సర్వేంద్రియుడై, పరముడై, పూర్వమందున్న ఆశ్రమాచారాలను స్మరిస్తూ, విద్యాధర్మములను స్మరిస్తూ, వర్ణాశ్రమాచారాలనువదలి, పగలు, రాత్రి కూడా జాగరూకుడూ, సంచారశీలుడై, దేహముమాత్రము మిగిలినవాడై, ఎల్లప్పుడు ఉన్మత్తత లేనివాడై, బాలుడు, ఉన్మత్తుడు, పిశాచంపట్టినవాడిలాగా ఏకాకిగా తిరుగుతాడు. ఎవరితోనూ మాట్లాడకుండా, ఎప్పుడూ స్వరూపాన్నే ధ్యానం చేస్తూ, అన్నింటినీ వదలి, ప్రణవాత్మకంగా దేహాన్ని వదలిపెట్టినవాడు 'అవధూత' అనబడతాడు.

# 116. పరమహంస పరివ్రాజకోపనిషత్తు

ఇది అధర్వణ వేదానికి సంబంధించినది. ఇందులో మొత్తం 12 మంత్రాలున్నాయి. పరమహంస లక్షణాలు, ప్రణవబ్రహ్మము. ఈ రెండింటినీ వివరించారు.

ఒకసారి బ్రహ్మదేవుడు తన తండ్రియైన నారాయణుడి దగ్గరకు వెళ్ళి 'ప్రభూ! పరమహంస పరివ్రాజకుని లక్షణాలను వివరించండి' అని అడిగాడు. నారాయణుడు చెప్పటం మొదలుపెట్టాడు.

'బ్రహ్మదేవా! మంచిగురువు దగ్గర అన్నివిద్యలు నేర్చుకున్నవాడై ఇహము, పరముల గురించి పూర్తిగాతెలుసుకుని, ఈషణత్రయము, (ధనేషణ, దారేషణ, పుత్రేషణ), వాసనాత్రయము (లోకవాసన, విషయవాసన, శాస్త్రవాసన), అహంకార మమకారాలు పూర్తిగా వదలివైచి, మోక్షగామియై గృహస్థాశ్రమము స్వీకరించి ఆ తరువాత వానప్రస్థుడై అప్పుడు సన్యసించాలి. ఒకవేళ వైరాగ్యము గనక కలిగినట్లైతే ఎప్పుడైనా సన్యసించవచ్చు. బ్రహ్మచారిగాని, గృహస్థుగాని, వానప్రస్థుడుగాని, సన్యాసిగాని, స్నాతకుడుగాని, అస్నాతకుడుగాని, ఏ క్షణాన విరక్తుడైతే, ఆ క్షణంనుంచే సన్యాసం స్వీకరించవచ్చు.

విరక్తుడైనవాడు తల్లి, తండ్రి, భార్య, పిల్లలు, బంధువులు, మిత్రులు వీరి దగ్గర నుంచి అనుమతి తీసుకుని ప్రాజాపత్యేష్టి లేదా అగ్నియేష్టి చెయ్యాలి. ఒకవేళ ఇది ఆతురసన్యాసమైతే మనస్సుతోగాని, వాక్కుతోగాని సన్యసించాలి. ఇలా సన్యసించినప్పుడు ఆత్మశ్రాద్ధము, విరాజాహోమము చేసి, నెమ్మదిగా నీటిలో దిగి ఓంకారంతో శిఖను తీసివేసి యజ్ఞోపవీతము నీటిలో వదలి, కట్టుకున్న వస్త్రము కూడా వదలి వ్యాహృతిత్రయంతో స్వరూపధ్యానం చేస్తూ **'సన్యస్తంమయా'**

అని మూడుసార్లు చెప్పాలి. ఇప్పుడు అతడు సన్యసించినట్లే. ఈ మాటను మొదటిసారి చిన్నగా, రెండవసారి కొంచెం పెద్దగా, మూడవసారి పెద్దగా అందరికీ వినిపించేటట్లుగా చెప్పాలి. చేతులురెండూ పైకెత్తి నమస్కరిస్తూ మహావాక్యాలు చెబుతూ ఉత్తరదిశగా సాగిపోవాలి. ఇది సన్యాసము. ఒకవేళ ఆతురసన్యాసము తీసుకుంటే, ఆ తరువాత గురువుగారి దగ్గరకు వెళ్ళి శాస్త్రబద్ధంగా సన్యసించాలి. ఆతురసన్యాసము అంటే అత్యవసర పరిస్థితిలో స్వీకరించేది. సామాన్యంగా మరణమాసన్నమైన వాడికి, అతడి కోరిక తీర్చటం కోసం సన్యాసం ఇవ్వటం జరుగుతుంది. అతడు సన్యాసి కాగానే కొద్దిసేపటికే ప్రాణాలు వదలుతాడు. శంకర భగవత్పాదుల వారు తన తల్లి అనుజ్ఞ పొంది ఆతురసన్యాసం తీసుకున్నారు. ఆ తరువాత గోవిందాపాదాచార్యుల వారివద్ద శాస్త్రబద్ధంగా సన్యసించారు. అయితే ఇక్కడ ఒక చిన్న అనుమానం. సన్యసించిన తరువాత ఏకారణం చేతనైనా కాదని మళ్ళీ గృహస్థు కావచ్చా? శాస్త్రంలో ఇటువంటి ప్రశ్నలు రావా? సన్యసించటము అంటే ఈ జవితం ఇక్కడితో పూర్తయిపోతుంది. ఆత్మశ్రాద్ధము పెట్టుకోవటం కూడా జరుగుతుంది. సన్యాసం స్వీకరించిన తరువాత అది మరుజన్మ. ఇప్పుడు సన్యసించిన వాడు తిరిగి సంసారి కావచ్చా? అని అడిగితే మరణించినవాడు తిరిగి తనభార్యతో సంసారం చెయ్యవచ్చా? అని అడుగుతున్నారు. మరణించిన వాడు పునర్జీవితుడైతే మళ్ళీ సంసారి అవుతాడు. కాని అనుభవంలో మరనించిన వారు పునర్జీవితుడు కావటం ఎక్కడా చూడలా పురాణాల్లో మాత్రమే ఇలాంటి కథలున్నాయి. ప్రాయశ్చిత్తం చేసికొంటే సరిపోదా? మరణించిన వాడికి ప్రాయశ్చిత్తం చేసినా తిరిగి జీవించడు కదా? అందుకే ఇలాటి ప్రశ్నలకు సమాధానం

ఉండదు. విజ్ఞులు చెప్పిందే మనకి ఆచరణ యోగ్యం అంతే. అయితే కొంత కాలం క్రితం ఒకాయన ఆతుర సన్యాసం తీసుకుని ఇంటికి వచ్చాడని, విజయవాడలో తన ఇంట్లో వాళ్ళు ఆయన సన్యసించటానికి ఒప్పుకోలేదని, అప్పుడు మళ్ళీ ఆయన తన సన్యాసాన్ని రద్దు చేసుకున్నారని చెబుతారు.

ఇలా సన్యసించినవాడు రాగద్వేషాలు పూర్తిగా వదలి, అహంకార మమకారాలు వదిలి, తన దగ్గర ఉన్న వస్తుసామాగ్రిని కూడా పూర్తిగా వదిలెయ్యాలి. సన్యసించ తలచుకున్నవాడు 'విశ్వజిద్' యాగం లాంటి ఒక యాగం చెయ్యాలి. అంతకుముందే తనకున్న ఆస్థిపాస్థులు తనతోసహా కుమారులకు పంచి ఇవ్వాలి. ఇప్పుడు తన వాటాగా వచ్చిన ఆస్థితిని అందరికీపంచి ఇచ్చేయ్యాలి. ఒకవేళ అతను ఉద్యోగి అయి పెన్షను తీసుకుంటునట్లైతే, ముందుగా పెన్షనువద్దని ప్రభుత్వానికి కాగితం వ్రాసి ఆ తరువాతే సన్యసించాలి. ఒకవేళ సన్యసించిన తరువాత కూడా, గతజీవితంలోని పెన్షను తీసుకుంటున్నాడు అంటే అది చాలాపెద్ద మోసము ఎందుకంటే ఆ పేరుతోఉన్న వ్యక్తి మరణించాడు. మరణించిన మనిషి మళ్ళీ సంతకం పెట్టి నెలనెలా పెన్షను ఎలా తీసుకుంటాడు? మరణించిన వారి పేరుతో పెన్షను తీసుకోవటం రాజద్రోహం ఆత్మద్రోహము కూడా.

సన్యసించిన వ్యక్తి లోకంలో అందరినీ సమానంగా చూస్తూ, రాగద్వేషాలు, అహంకార మమకారాలు వదలి సమస్త జీవరాసిని తనలాగే చూసుకోవాలి. భిక్షాటనతోనే కడుపునింపుకోవాలి. విధిగా చాతుర్మాస్యం చెయ్యాలి. మిగిలిన ఎనిమిది నెలలు ఒంటరిగా సత్యాన్వేషణలో కాలం గడపాలి. దిగంబరుడుగానే ఉండాలి. ఊరివారికోసం కౌపీనం ధరించవచ్చు. ఆశ్రమంలో అయితే ఒకరోజు,

తీర్థంలో మూడురోజులు, పట్టణంలో ఐదురోజులు, క్షేత్రంలో ఏడురోజులు ఉండచ్చు. అంతకుమించి ఉండరాదు. అలా ఉంటే అక్కడి వారితో చనువు, సంబంధాలు ఏర్పడతాయి. నిరంతరము అలా తిరుగుతూ, దొరికింది తింటూ, రహస్యస్థలంలో మాత్రమే నివాసముండాలి. తన ఉనికిని బయటకు తెలియచెప్పరాదు. ద్వంద్వాలు శుభాశుభాలు, లాభనష్టాలు, సుఖదుఃఖాలు అసలుఉండరాదు. చాతుర్మాస్యము తప్పనిసరిగా చెయ్యాలి. క్షౌరము చేయించుకోరాదు. కూర్చోవటము, పడుకోవటము అంతా నేలమీదనే కావాలి. స్త్రీలతో సంబంధాలు ఉండరాదు. సాధ్యమైనంత వరకు స్త్రీలను దూరంగాఉంచాలి. రాత్రింబవళ్ళు నిద్రలేక స్వరూపానుసంధానంతో కాలం గడపాలి. ఇవి పరమహంస పరివ్రాజకుని లక్షణాలు.

ఇక్కడ ఒక విషయం గుర్తించండి. సన్యసించటం వేరు, పీఠాధిపత్యం వేరు. ప్రతిసన్యాసి పీఠాధిపతికాడు. బ్రాహ్మణుడి మహారాజయోగం ఉన్నది అంటే అది సన్యాసమే.

## ప్రణవము-బ్రహ్మము

బ్రహ్మదేవుడు తన తండ్రిని అడుగుతున్నాడు ప్రణవబ్రహ్మము అంటే ఏమిటో చెప్పండి. అపుడు నారాయణుడు చెబుతున్నాడు.

ప్రణవానికి 16 మాత్రలుంటాయి. అవస్థలు నాలుగు 1. జాగ్రదావస్థ 2. స్వప్నావస్థ 3. సుషుప్త్యావస్థ 4. తురీయావస్థ. ఇవి ఒక్కొక్కటి మళ్ళీ నాలుగు భాగాలుగా అవుతాయి. 1. జాగ్రదావస్థ – ఇవి నాలుగు రకాలు.

1. జాగ్రత్ జాగ్రదావస్థ
2. జాగ్రత్స్వప్నావస్థ

3. జాగ్రసుషుప్త్యావస్థ

4. జాగ్రత్తురీయము

అలాగే స్వప్నావస్థ తదితర అవస్థలు కూడా. మొత్తం - 16. అవస్థలకు నాయకులు విశ్వ, తైజ, ప్రాజ్ఞ్య, తురీయులు. వారుకూడా అవస్థల మాదిరిగానే విభజింపబడతారు. ముందుగా జాగ్రదావస్థలో

1. జాగ్రద్విశ్యుడు 2. జాగ్రత్తేజసుడు 3. జాగ్రత్సాజ్ఞుడు 4. జాగ్రతురీయుడు

తురీయావస్థలో 1. తురీయవిశ్వుడు 2. తురీయ తైజసుడు 3. తురీయప్రాజ్ఞుడు 4. తురీయ తురీయుడు

ఇలాగే మిగిలిన వారు కూడ

| | | |
|---|---|---|
| అకారము | - | జాగ్రద్విశ్వుడు |
| ఉకారము | - | జాగ్రత్తైజసుడు |
| మకారము | - | జాగ్రత్ప్రాజ్ఞుడు |
| అర్ధమాత్ర | - | జాగ్రత్తురీయుడు |
| బిందువు | - | స్వప్నవిశ్వుడు |
| నాదము | - | స్వప్నతైజసుడు |
| కల | - | స్వప్నప్రాజ్ఞుడు |
| కలాతీతము | - | స్వప్నతురీయుడు |
| శాంతి | - | సుషుప్తవిశ్వుడు |
| శాంత్యాతీతము | - | సుషుప్తతైజసుడు |

| | | |
|---|---|---|
| ఉన్మని | – | సుషుప్తప్రాజ్ఞుడు |
| మనోన్మని | – | సుషుప్తతురీయుడు |
| వైఖరి | – | తురీయవిశ్వుడు |
| మధ్యమ | – | తురీయతైజసుడు |
| పశ్యంతి | – | తురీయప్రాజ్ఞుడు |
| పరయందు | – | తురీయతురీయుడు |
| జాగ్రన్మాత్రా చతుష్టయము | – | అకారాంశము |
| స్వప్నమాత్రా చతుష్టయము | – | ఉకారాంశము |
| సుషుప్తిమాత్రాచతుష్టయము | – | మకారాంశము |
| తురీయమాత్రా చతుష్టయము | – | అర్ధమాత్రాంశము |

ఇదే ప్రణవబ్రహ్మము. ఇది పరమహంస, తురీయాతీత, అవధూతలు మాత్రంచేతనే ఉపాసించబడుతుంది. దానితోనే బ్రహ్మత్వం ప్రకాశిస్తుంది. దాంతోనే విదేహముక్తి కలుగుతుంది.

ఆత్మజ్ఞానమే – యజ్ఞోపవీతము. ధ్యాననిష్టయే శిఖ. అతడు అన్ని కర్మలు చేస్తాడు. కర్మపవిత్రము అతడు బ్రాహ్మణుడు, బ్రహ్మనిష్ఠాపరుడు, దేవుడు, ఋషి, తపస్వి, శ్రేష్టుడు. జగద్గురువు. ఇతడే లోకాలను ఏలుతున్న మహానుభావుడు. అతడే నేను అని తెలుసుకోవాలి. పరమహంసపరివ్రాజకుడు నిత్యవుడు. అతడే వేదపురుషుడు, అతడే నేను అని తెలిసిన వారికి పునర్జన్మ ఉండదు.

# 117. పరబ్రహ్మోపనిషత్తు

ఇది అధర్వణ వేదానికి సంబంధించినది. ఇందులో ఎనిమిది మంత్రాలున్నాయి. యజ్ఞోపవీతం ధరించిన వారు ముక్తులవుతారు. అని చెబుతున్నారు.

ఒకసారి మహాశాలుడు పిప్పలాదుడి దగ్గరకు వచ్చి "బ్రహ్మపురంలో ఎవరుంటారు. నిత్యాత్మ నుండి సృష్టి ఎలా జరుగుతుంది? ఇదంతా ఎవరివల్ల జరుగుతోంది!" ఈ విషయాలు చెప్పవలసింది అన్నాడు. పిప్పలాదుడు చెబుతున్నాడు.

విద్యలలో కెల్లా బ్రహ్మవిద్య శ్రేష్ఠమైనది. పరబ్రహ్మ దేవతలవల్ల, ప్రాణముల వల్ల బ్రహ్మపురములో ప్రకాశిస్తూ ఉన్నాడు. అతడు తుమ్మెదలాగా తనను తాను నియమించుకుంటాడు. కుక్కలాగా కర్మలేనివాడు. ఏ రకమైన కర్మచెయ్యకుండా అలా చూస్తూఉంటాడు. కర్మకరుడై రైతులాగా ఫలమనుభవిస్తాడు. కర్మయొక్క మర్మము పూర్తిగా తెలిసినవాడు. జ్ఞాతృకర్మ చేస్తాడు. కర్మయొక్క మర్మము తెలిసి కర్మ చెయ్యాలి. ఎవరైనాసరే వలవిసరి ఇతన్ని లాగలేడు. ప్రాణదేవతలు నలుగురు అతని నాడులు హిరణ్మయ కోశంలో, అమృతుడై నాడీత్రయంలో సంచరిస్తాడు. ఇష్టాపూర్తకర్మలు చెయ్యడు. అంటే యజ్ఞయాగాది క్రతువులు చెయ్యడు. ఆరామాలు, తటాకాలు నిర్మించడు. ప్రతిష్టలు చెయ్యడు వాటిని గురించి పట్టించుకోడు. చిన్నపిల్లవాడు కోరికలు లేకుండా ఏ విధంగా ఆనందం అనుభవిస్తాడో అలాగే ఇతడు కూడా ఆనందం అనుభవిస్తాడు.

ఈ విషయాలు తెలిసినవాడు పరంజ్యోతియై జ్యోతులకు జ్యోతిసు అయి అందరినీ ఆనందింపచేస్తాడు. దానికి పరమైన చిత్తము ఏదైతే

ఉన్నదో, అది పరమాత్మను ఆనందింపచేస్తుంది. ఈశ్వరుణ్ణుంచి శుభ్రవర్ణమై పుట్టినది. తిరిగి ఆ మార్గము నుండే స్వప్నస్థానము చేరుతుంది. జలగలాగా కోరిన రీతిగా ఈశ్వరుని నుంచి పుట్టినది. ఎనిమిది కపాలములు కలిపి స్థనములాగా వ్రేలాడతాడు. ఇంద్రుడు కారణంగా గలవాడు. శుభకర్మలచేత అంటుకోబడడు. ఈ దేవుని అనుగ్రహించే పురుషుడు ప్రణవహంసయే పరబ్రహ్మ. ప్రణవమే జీవుడు. ఈ విషయాలు తెలిసినవాడు బ్రహ్మత్వాన్ని పొందుతాడు.

బ్రాహ్మణుడు అంతశ్శిఖ యజ్ఞోపవీతాలు ధరిస్తాడు. ముముక్షువు అంతశ్శిఖ యజ్ఞోపవీతధారణ చెయ్యాలి. కర్మిష్టియైన గృహస్థుడు బాహ్యంగా వీటిని ధరిస్తాడు. అంతరుపవీతం పైకి కనిపించదు. లోపల ఉండే తత్త్వాలను మేళనము చేస్తుంది. అది సత్తుకాదు. అసత్తు కాదు, సదసత్తు అంతకన్నా కాదు. భిన్నము కాదు. అభిన్నము కాదు. ఉభయము కాదు. అంతర్జీవ బ్రహ్మకు నాలుగు స్థానాలున్నాయి. 1. నాభి 2. హృదయము 3. కంఠము 4. తల. అవస్థలు నాలుగు జాగ్రస్స్వప్న సుషుప్తి తురీయములు. ఆహవనీయాగ్ని, గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని, సభ్యాగ్నులు. జాగ్రదావస్థలో – బ్రహ్మ, స్వప్నంలో – విష్ణువు, సుషుప్తిలో – రుద్రుడు, తురీయంలో – చిన్మయమైన అక్షరము. నాలుగు అవస్థలు నాలుగు వేళ్ళకు చుట్టినట్లుగా ఉన్నాయి. 96 తత్త్వాలు 96 తంతువుల లాగా విభజించి కలపటం జరిగింది. జ్ఞానపూరితమైనదే త్రిగుణ స్వరూపము.

త్రిమూర్తి స్వరూపాన్ని వేరుగా తెలుసుకుని, పరబ్రహ్మల పేర్లుగల తొమ్మిదిపీటలు వేసి, దాన్ని ముప్పేట చేసి, సూర్యచంద్ర అగ్నిరూపముగా ఏకం చేసి, మొదట మధ్య చివర ఒకటిగా ఉండేటట్లుగా మూడుచుట్లు చుట్టి, త్రిమూర్తిత్వాన్ని అనుసంధానము

చేసి, మొదలు చివర కలిపి, మూడింటిని అద్వైత గ్రంధిగా ఏర్పాటు చేసి, నాభి నుంచి బ్రహ్మబిలము దాకా వేరు వేరుగా 27 తత్త్వాలతో సంబంధమున్న, త్రిగుణోపేతమైన, త్రిమూర్తి లక్ష లక్షిత్వమైన ఏకత్వాన్ని ఆపాదించాలి.

యజ్ఞోపవీతంలో ప్రతిపోగు యోగ్యమైనదే. బ్రహ్మాదులందరికీ, దేవతలకు, మునులకు, ఋషులకు ముక్తి ఒక్కటే.

బ్రహ్మ ఒక్కటే. బ్రాహ్మణత్వము ఒక్కటే. వర్ణాశ్రమాలు మాత్రమే వేరువేరుగా ఉన్నాయి. యతికి మోక్షానికి శిఖాయజ్ఞోపవీతమైన ప్రణవము ఒక్కటే కావాలి. హంస–శిఖ, ప్రణవము –ఉపవీతము, నాదము –సంధానము. ఇదే ధర్మము. ఇతరమైన ధర్మము ఏదీలేదు. ప్రణవము నాదము, హంస త్రివృత్సూత్రము, ముప్పేటత్రాడు, హృదయంలో చైతన్యముంటుంది. బ్రహ్మ మూడు విధాలు. ఈ విషయం తెలిసికొని, ప్రాపంచిక యజ్ఞోపవీతాన్ని వదలాలి. శిఖతో సహా గుండు గీయించెయ్యాలి. విద్వాంసుడు మెడలో ఉన్న జంధ్యము తీసెయ్యాలి. అక్షర పరబ్రహ్మమే సూత్రముగా ధరించాలి. జన్మరాహిత్యం కోసం అహర్నిశలు కృషి చెయ్యాలి. సూత్రము అంటే పరమపదము. ఆ సూత్రాన్ని తెలుసుకున్నవాడు ముముక్షువు. వేదవేత్త వాడే విప్రుడు. పంక్తి పావనుడు, ఈ సూత్రాన్ని యోగవేత్త, యోగి, యతి ధరించాలి. యోగవిజ్ఞాన తత్పరుడు బాహ్యసూత్రాన్ని ధరించాలి. ఇలా ధరించేవాడు ముక్తిని పొందుతాడు.

లోకంలో ఎవరు యజ్ఞోపవీతులో, సూత్రవేత్తలో, జ్ఞానము అనే శిఖ కలవారో, వారందరికీ జ్ఞానమే గొప్పది. వారికి జ్ఞానము పవిత్రము. అగ్నికి శిఖలాగా జ్ఞానమనే శిఖ ఉన్నవాడు 'శిఖి' అనబడతాడు. అంతేకాని జుట్టును పిలకగా కలవారు శిఖావంతులు కారు. వైదిక,

లౌకిక కర్మలయందు అధికారము గలవారు బ్రాహ్మణాభాస సూత్రంతో పొట్ట పోసుకుంటున్నారు. వీరు జన్మజన్మలకు 'నిరయము' అనే నరకాన్ని పొందుతారు.

ఎడమభుజం మీద నుంచి కుడిమొల వరకు బ్రహ్మసూత్రము సవ్యంగా ఉంటుంది. బయటకు లాగానే లోపలకూడా తత్త్వాలు అనే తంతువులతో కలిసి, నాభి దగ్గర నుంచి బ్రహ్మరంధ్రము దాకా ప్రమాణమున్న సూత్రాన్ని బుద్ధిమంతుడు ధరించాలి. వీరు దారముతో తయారుచేసిన సూత్రము శాస్త్రప్రకారము ధరించాలి. జ్ఞానమయమైన శిఖాయజ్ఞోపవీతాలు ఎవరికుంటాయో, వారు సకల బ్రాహ్మణత్వము కలిగి ఉన్నారు. యజ్ఞోపవీతము పరమము, పరాయణము. ఈ యజ్ఞోపవీతం ధరించినవాడు ముక్తినిపొందుతాడు.

# 118. ఆరుణికోపనిషత్తు

ఈ ఉపనిషత్తు సామవేదానికి సంబంధించినది. ఇందులో ఐదు అధ్యాయాలు 29 మంత్రాలు ఉన్నాయి.

ప్రజాపతి కుమారుడు అరుణిముని. ఒకసారి తన తండ్రి దగ్గరకి వెళ్ళి "ఓ తండ్రీ! ఏ ఉపాయంతో సకల కర్మలను వదలగలను?" అని అడిగాడు. దానికి ప్రజాపతి "నాయనా! నీ భార్య, పుత్రులు, శిఖ, యజ్ఞోపవీతము, యజ్ఞాలు, యాగాలు, సర్వకర్మలు, లోకాలు అన్నింటినీ విడిచిపెట్టటం వల్ల అన్ని కర్మలు విడవగలవు. తరువాత దండము, కౌపీనము, కాషాయవస్త్రము పరిగ్రహించు, మిగిలిన వాటిని వదలివెయ్యి. గృహస్థుగాని, బ్రహ్మచారిగాని, వానప్రస్థుడుగాని, మూడు అగ్నులను జఠరాగ్నిలో సమారోపణ చెయ్యాలి. యజ్ఞోపవీతము భూమియందుగాని, జలమునందుగాని వదలాలి. బహూదకుడు భిక్షాపాత్ర, వస్త్రము, త్రిదండము, లౌకికాగ్నులు పరిత్యజించాలి. ఇలా పరిత్యజించి ఏ మంత్రాలు లేకుండానే అన్ని కర్మలు చెయ్యాలి. ఊర్ధ్వలోకాలనిచ్చే కర్మలు వదలెయ్యాలి. అన్నాన్ని ఔషధంలాగా తినాలి. మూడు సంధ్యలలోను స్నానం చెయ్యాలి. సంధ్యావందనము ఆత్మలోనే చెయ్యాలి. వేదాలన్నింటిలోను అరణ్యకాలు మాత్రమే చదవాలి. ఉపనిషత్తులు చదవాలి. **'ఖల్వహంబ్రహ్మ'** నేనే బ్రహ్మనవుతున్నాను. నిశ్చయము సూచించటం వల్ల సూత్రభూతము బ్రహ్మము. సూత్రరూపమైన బ్రహ్మను నేనే. ఈ విషయం తెలిసినవాడు త్రివృత్సూత్రాన్ని పరిత్యజించాలి. అతడు **'మాయాసన్యస్తం'** అని మూడుసార్లు చెప్పి అన్ని భూతాలకు నా నుండి అభయము కలుగుగాక. అని చెప్పాలి. నావల్లనే సమస్త ప్రకృతి ప్రవర్తించుచున్నది. ఓ దండమా ! నువ్వు నాకు మిత్రుడవు. ఆ భావంతోనే నేను నిన్ను

తీసుకుంటున్నాను. నన్ను రక్షించు. దుష్టజంతువుల నుండి ఆపద కలగకుండా చూడు. నువ్వు ఇంద్రుని వజ్రము వంటిదానవు. వృత్రాసురుని సంహరించావు. అటువంటి నువ్వు నాకు మేలు కలుగచెయ్యి. నాయందున్న పాపాన్ని పోగొట్టు. ఈ మంత్రము చెబుతూ కుడిచేత్తో దండము పట్టుకోవాలి. కౌపీనం ధరించాలి. అహింస, అస్తేయము, అపరిగ్రహము సత్యము వంటి నియమాలు పాటించాలి. అయితే దీనివల్లనే మోక్షం రాదు. పరమహంస పరివ్రాజకుల ధర్మాలు కొన్ని ఉన్నాయి. అవి నేలమీదనే కూచోవాలి. నేలమీదనే పడుకోవాలి. మట్టిపాత్ర, సొరకాయబుర్ర, చెక్కపాత్ర వాడాలి. అరిషడ్వర్గాలు, రాగదేవర్షులు అన్నీ వదిలెయ్యాలి. అహంకారం పనికిరాదు. అబద్ధం వాడరాదు. వర్షాకాలము నుండి నాలుగునెలలు దీక్షలోఉండాలి. ఆషాఢపౌర్ణమి నుంచి కార్తీక పౌర్ణమిదాకా చాతుర్మాస్యము పాటించాలి. మిగిలిన ఎనిమిదినెలలు వంటరిగా పర్యటించాలి.

ఈ విషయాలు తెలిసినవాడు ఉపనయనం తరువాత అరిషడ్వర్గాలు, అన్ని రకాలదుర్గుణాలు వదిలెయ్యాలి. పూర్వజన్మ కృతము ఉంటే బాల్యంలోనే సన్యసించాలి. తండ్రి కొడుకు, భార్య, పిల్లలు, సంసారము, యజ్ఞోపవీతము, అగ్ని, శాస్త్రాలు, వేదాలు, కర్మలు అన్నీ వదిలెయ్యాలి. బిక్షకోసం మాత్రమే గ్రామంలోకి రావాలి. వాక్కు అంతా ఓంకారముగానే ఉండాలి. ఈ విషయాలు తెలిసినవాడు విద్వాంసుడు.

బ్రహ్మచర్యంలో సన్యసించినవాడు – మోదుగ, బిల్వము, రావి మేడి కర్రతో చేసిన దండము వాడాలి. కృష్ణాజినము, యజ్ఞోపవీతము వదిలెయ్యాలి. ఇలా చేసిన సన్యాసి పరమపదాన్ని దర్శిస్తాడు. స్వయంప్రకాశి అవుతాడు. విష్ణుపదము స్వయంప్రకాశము. ఈ విషయం త్రికరణ శుద్ధిగా తెలిసినవాడికి మరుజన్మ లేదు.

# 119. యాజ్ఞవల్క్యోపనిషత్

ఇది శుక్లయజుర్వేదానికి సంబంధించినది. ఇందులో నాలుగు మంత్రాలున్నాయి. సన్యాసి లక్షణాలను వివరిస్తోంది ఈ ఉపనిషత్తు.

ఒకసారి విదేహరాజైన జనకమహారాజు యాజ్ఞవల్క్యుడికి నమస్కరించి 'సన్యాసియొక్క లక్షణాలేమిటో వివరించవలసింది' అని అడిగాడు. ఇప్పుడు యాజ్ఞవల్క్యుడు చెప్పటం మొదలుపెట్టాడు.

జనక మహారాజా! సన్యాసి కావాలంటే ముందుగా బ్రహ్మచర్యము పూర్తి చేసి తరువాత గృహస్థుడై అక్కడి నుంచి సన్యాసం పుచ్చుకోవచ్చు. లేదా వానప్రస్థుడై సన్యాసం స్వీకరించవచ్చు. బ్రహ్మచారిగాని, గృహస్థుగాని, స్నాతకుడుగాని, అగ్నికుడు కాని, కాకపోనీ ఎవరైనా సరే ఎప్పుడు విరక్తి కలిగితే అప్పుడు సన్యాసం తీసుకోవచ్చు.

రాజా ! కొందరు ప్రాజాపత్యేష్టిని చేస్తారు. అది చేసినా లేకపోయినా అగ్నియేష్టిని మాత్రం చెయ్యాలి. అగ్నియే ప్రాణము. త్రైధాతవీయము చెయ్యాలి. త్రిధావులు అంటే త్రిగుణాలు. ఇతడు దానికి కారణము. ఋత్విక్కులు దేనివల్ల ప్రకాశిస్తారో 'తంజానన్' అనే మంత్రము చేత అగ్న్యాఘ్రాణము చెయ్యాలి. 'ఏషవా అగ్నేర్యోనిః ' అనే మంత్రంతో గ్రామాగ్నిని తెచ్చి ఆఘ్రాణము చెయ్యాలి. అగ్నిని అక్కడ ఉంచరాదు. నీటిలో హోమము చెయ్యాలి. జలమే సర్వదేవతలు. కాబట్టి సర్వదేవతలకు హోమము చేస్తున్నాను అని ఆజ్యంతో కూడిన హవిస్సు హోమం చెయ్యాలి. బ్రహ్మను ఉపాసించాలి. శిఖయజ్ఞోపవీతం త్రెంచి 'సన్యస్తంమయా' అని మూడుసార్లు అనాలి అయితే జంధ్యము లేనివాడు బ్రాహ్మణుడు ఎలా అవుతాడు? అనే ప్రశ్న వస్తుంది. అతడికి ప్రణవమే యజ్ఞోపవీతము. ప్రాశనముచే ఆచమనం చేసి ఇది చెయ్యాలి.

లేదా సన్యాసి రంగువెలసిన వస్త్రంధరించి బోడిగుండు గలవాడై, అపరిగ్రహుడు, శుచి, అద్రోహి అయి భిక్షాటన చేస్తూ బ్రహ్మత్వమునందు ఉండాలి. ఇది సన్యాసుల మార్గము ఆ సన్యాసి బ్రహ్మవేత్త. ఇక పరమహంస అనగా సంవర్తక, అరుణి, శ్వేతకేతు, దుర్వాస, ఋభు, నిదాఘు, దత్తాత్రేయ, శుక, వామదేవ, హారీత, హరీతక, మొదలైన వారు ఉన్మత్తులులాగా తిరుగుతుంటారు. వీరు పిచ్చివారు కాదు. పరస్త్రీ, పుర, పరాన్ముఖులై త్రిదండము, కమండలము, తినేకంచము, జలపవిత్రము, శిఖ, యజ్ఞోపవీతము అన్నీ 'భూస్వాహా' అని నీటిలో వదలి, ఆత్మాన్వేషణ చేస్తుంటారు. పుట్టినవారు పుట్టిన రూపంలో అంటే దిగంబరులుగా ద్వంద్వములు లేనివారు, ఎవరిదగ్గరా ఏవీ తీసుకోరు, తత్త్వాన్వేషణలో సంపన్నులై, పవిత్రమైన మనసు కలవారై, ప్రాణాలు నిలవటంకోసం భిక్షచేసి పొట్ట నింపుకుంటూ, లాభాలాభాలు సమానంగా చూస్తూ, చేతిలోనే అన్నం పెట్టించుకుని తింటూ, కమండలంలోనే నీరు త్రాగుతూ, ఆ పూటకి కావలసిందే అడుగుతూ రెండవపాత్ర లేనివాడై, నీరున్న చోటే కమండలము గలవాడై అంటే నీటిగుంటలో నీరే త్రాగుతూ ఎవరినీ బాధించకుండా, రహస్య ప్రదేశంలో నివసిస్తూ, పాడుపడిన ఇల్లు, దేవాలయము, గడ్డి ఉన్నచోటు, పుట్ట, చెట్టుమొదలు, అగ్నిహోత్రశాల, నదీతీరము, కొండగుహలు, చెట్టుతొర్రలు, సెలయేరున్న ప్రదేశములందు శాశ్వత నివాసము ఏర్పరచుకోకుండా శుభాశుభాలతో నిమిత్తము లేకుండా సన్యాసంతో దేహత్యాగం చెయ్యాలి.

పరమహంస అంటే దిగంబరుడు. నమస్కారము, దారాపుత్రాభిలాష, లక్ష్యాలక్ష్యములు, ఏవీ లేని సన్యాసి. ఇతడు సాక్షాత్తు

పరమేశ్వరుడు, ఒక సన్యాసి తనకన్న ముందు సన్యసించిన వారికి నమస్కారం చెయ్యాలి. తనతో ధర్మంలో సమానమైనవారికి నమస్కారం చెయ్యాలి. ఇతరులకు చెయ్యరాదు. ప్రమాదము గలవాడు, బాహ్యచిత్తుడు, లోభి, కలహోత్సాహకుడు కూడా సన్యాసులుగా ఉంటారు. అది సరికాదు. ఆత్మజ్ఞానానికి కర్మతో పనిలేదు. భగవంతుడైన ఈశ్వరుడే వీటిలో ప్రవేశించాడు అనే భావనతో కుక్కలకు, గాడిదలకు, ఆవులకు, అందరికీ సాష్టాంగ నమస్కారం చెయ్యాలి. ఆడువారు అంటే రక్తమాంసాలున్న బొమ్మలు, అవయవాలున్న యంత్రాలు, వీరికి అందమేమిటి? చర్మము, రక్తము, మాంసము వేరు చేసి చూడు. వీరి అందం తెలుస్తుంది. ఎందుకు అనవసరంగా మోహపడతారు? నీకు అందంగా కనిపించిన ఈ మాంసపు ముద్దలు స్మశానంలో కుక్కలు, నక్కలు పీక్కు తింటాయి. లోకంలో స్త్రీలు కంటికిఇంపై పాపాగ్ని శిఖలలాగా పురుషుణ్ణి గడ్డిలాగా తగలపెడతారు. దూరాన్నించే మండించేవి, సరసములైన నీరసములు అయిన స్త్రీలు నరకాగ్నికి ఇంధనం వంటివారు. కాముడు అనే కిరాతకుడు పురుషులు అనే పక్షులను పట్టుకోవటానికి విసిరిన వలలే స్త్రీలు, చెరువులో ఉన్న చేపలు అనే పురుషులను పట్టుకోవటానికి త్రాడుకు కట్టిన గాలములే స్త్రీలు. అన్ని రకాలయిన దోషాలకు పెట్టెలు స్త్రీలు. వారితో ఇంకపనిలేదు. స్త్రీ ఉన్న వాడికి భోగేచ్ఛ ఉంటుంది. స్త్రీ లేనివాడికి భోగభూమి ఉండదు. స్త్రీని వదలినట్లైతే జగత్తును వదలినట్లే. జగత్తును విడిచిపెడితే సుఖపడతాడు. ఉపయోగంలేని కుమారుడు ఉన్నంతవరకు తల్లితండ్రులను కష్టపెడుతూనే ఉంటాడు. పుత్రుడు గర్భపాతముతో ప్రసవముతో బాధ పెడతాడు. పుట్టిన

తరువాత చిన్నప్పుడు బాలారిష్టాలు, అల్లరిపనులు, ఉపనయనం చేసినా చదువురాకపోవటం, పండితుడైనా వివాహసమస్య, యవ్వనంలో పరస్త్రీవాంఛ, కుటుంబం పెరిగితే దరిద్రము, ఇలా పుత్రుల దుఃఖానికి అంతంలేదు. ధనవంతుడు కూడా చనిపోతాడు. యతి పాణి, పాద, నేత్రవాక్కు, జిహ్వాచపలుడు కారాదు. జితేంద్రియుడు, బ్రహ్మభూతుడు కావాలి. శత్రువుని, మిత్రుణ్ణి, తనను సమానంగా చూడాలి. కోపం ఉండరాదు. ధర్మార్థ కామ మోక్షాలకు శత్రువైన, స్వాశ్రయాన్ని నాశనం చేసే కోపానికి నమస్కారము. జనులు నిద్ర పోయేటప్పుడు సన్యాసి మేల్కొంటాడు. జనులు మేల్కొన్నప్పుడు సన్యాసి నిద్రపోతాడు. చిత్తు ఇక్కడే ఉంది. నేను చిన్మాత్రుణ్ణి, లోకమంతా చిత్తే అని భావిస్తాడు. యతులకు పరమహంసలకు పరమపదము లభిస్తుంది. వారికి జన్మరాహిత్యం కలుగుతుంది. దీనికన్న పరమైనది లేదు.

**గమనిక :** సన్యాసి ఎక్కడ నివసించాలి? ఎలా తినాలి, అనే విషయాలు ఆ రోజులకు అనుగుణంగా చెప్పబడ్డాయి. ఈరోజున వారు నివసించటానికి నదీతీరాలు, పాడుబడిన ఇల్లు, దేవాలయాలు లేవు. స్మశానాలు కూడా కబ్జా చేసి అమ్ముకుంటున్న రోజులివి. కాబట్టి సన్యాసి ఏకాంత ప్రదేశంలో ఉండాలి అనే విషయం మాత్రం గుర్తించండి.

ఇక్కడ ఇంకో అనుమానం వస్తుంది. 1. స్త్రీలు పురుషులనే పక్షులను పట్టుకోవటానికి విసిరే వలల వంటివారు. అంటూ స్త్రీని నీచంగా చెప్పారు కదా?

2. స్త్రీలు కూడా సన్యాసం తీసుకోవచ్చు కదా? మరి అలాంటప్పుడు పురుషులు అంతే కదా?

నిజమే. స్త్రీలని గురించి చెబితే సభ్యతగా ఉండదు అని అలా చెప్పారు. అంతేకాని స్త్రీకి పురుషుడెంతో, పురుషుడికి స్త్రీ కూడా అంతే. ఇక రెండవది. ప్రస్తుతం స్త్రీలు కూడా చాలామంది సన్యాసాశ్రమం తీసుకుంటూనే ఉన్నారు. వారిని 'యోగిని' అంటారు. ఇలా తపస్సు చేసిన స్త్రీలు పూర్వకాలంలోను ఉన్నారు. (ఉదా॥ రామాయణంలో తపస్సు చేసుకుంటున్న వేదవతిని బలాత్కరించబోయాడు రావణుడు.) శారీరక పరిస్థితిని బట్టి స్త్రీలకు కొన్ని ఇబ్బందులు ఉంటాయి. అందుకే స్త్రీకి సన్యాసం చెప్పరు.

# 120. శాట్యాయనీయోపనిషత్తు

ఇది శుక్ల యజుర్వేదానికి సంబంధించినది. ఇందులో ఐదు మంత్రాలున్నాయి. వైష్ణవనిష్ఠని వివరిస్తున్నారు ఇందులో

**మన ఏవమనుష్యాణాం కారణం బంధమోక్షయోః**

**బంధాయ విషయాసక్తం, ముక్తైనిర్విషయం స్మృతమ్ ॥**

మనస్సే బంధమోక్షాలకు కారణము, విషయముల యందు ఆసక్తమైన మనస్సు బంధము, విషయవాసనలు లేని మనస్సు ముక్తము. జీవులయొక్క మనసు ఎప్పుడూ విషయములయందు చిక్కుకుని ఉంటుంది. బ్రహ్మమందు ఆసక్తి కలిగిన మనసు ముక్తమవుతుంది. సంసారము అంటే – చిత్తమే. జీవికి దేనిమీద చిత్తం లగ్నమై ఉంటుందో దానియందు ఆసక్తి ఉంటుంది. ఇది సనాతన రహస్యము–వేదవేత్త కానివాడు పరమాత్మను గురించి చింతించలేడు. అతడు బ్రహ్మవేత్త కాలేడు పరమపదాన్ని పొందలేడు. విష్ణువును గురించి తెలుసుకున్న వాసుదేవుడు విప్రత్వము పొందుతాడు. శ్రోత్రీయులు బ్రహ్మను కోరికలు లేనివారై ఉపాసన చేస్తారు.

ఈషణత్రయాన్ని అంటే ధనేషణ, దారేషణ, పుత్రేషణలు వదలి ఋణత్రయము లేనివాడై మౌనియై బ్రహ్మవేత్త అయినవాడు ఎక్కడో ఒకచోట ఆశ్రమంలో ఉండాలి. ఇతడు సన్యాసియై త్రిదండము, ఉపవీతము, వస్త్రము, కౌపీనము, శిఖ ధరించాలి. ఈ ఐదింటిని పంచమాత్రలు అంటారు. వీటిని ఎప్పుడూ ధరించే ఉండాలి. ప్రాణాలు పోయేదాకా వదలరాదు. మరణించిన తరువాత యతితోపాటు వీటిని పాతిపెట్టాలి.

విష్ణులింగము రెండు రకాలు 1. వ్యక్తము 2. అవ్యక్తము. ఈ రెండింటిలో ఒకదాన్ని కూడా వదలరాదు. వదిలితే పతితుడవుతాడు. త్రిదండము వైష్ణవ లింగము విప్రులకు ముక్తి సాధనము. సర్వధర్మాలకు నిర్వాణము అని వేదానుశాసనము. వీరు వైష్ణవ లింగంతోపాటు శిఖాయజ్ఞోపవీతాలు కలిగి శుద్ధమైన చిత్తముగలవారై, ఆత్మనే బ్రహ్మగా భావించి చిద్రూపాన్ని ఉపాసిస్తూ పుణ్యకీర్తి గలవారవుతారు.

కుటీచక, బహూదక, హంస, పరమహంసలు వృత్తిచేత వేదము గలవారు. వీరు విష్ణులింగాన్ని బాహ్యంగాను అంతరంగంగాను నిత్యము ధరిస్తారు. పంచ యజ్ఞాలు గలవారు. ఉపనిషత్తులలో చెప్పబడిన వారు. బ్రహ్మవిద్యలో నిష్ణాతులు. ఎక్కడో ఒంటరి ప్రదేశాలలో ఒంటరిగా జీవిస్తారు. త్రిసంధ్యల యందు స్నానము, తర్పణ, మార్జనము పంచయజ్ఞాలు మరణించేదాకా చెయ్యాలి. గాయత్రీమంత్రాన్ని జపించాలి. ఏకాగ్రమైన భక్తితో శ్రీహరిని సేవించాలి. గురుసేవ చెయ్యాలి. ఓంకారాన్ని బ్రహ్మయందు హోమము చెయ్యాలి. అదే జ్ఞానయజ్ఞము అన్ని యజ్ఞాలకన్నా ఉత్తమము.

జ్ఞానమే దండము, జ్ఞానమే శిఖ, జ్ఞానమే జందెము, సర్వము జ్ఞానమయము. అదే బ్రాహ్మణ్యము. పరివ్రాజకులు ఎలా పుట్టారో అలాగే ఉంటారు. అంటే దిగంబరంగా ఉంటారు. అరిషడ్వర్గాలను జయిస్తారు. నిందాస్తుతులు వదిలేస్తారు. చెట్టులాగా నిశ్చలంగా ఉంటారు. నరుకుతున్నా కదలరు. అలాంటివారు ఈ లోకంలోనే అమృతులు. బంధువులను, మిత్రులను వప్పించి, ద్వంద్వాలు లేనివాడై తూర్పు లేదా ఉత్తరం దిశగా వెళ్ళాలి. భిక్షాన్నము మట్టిపాత్ర లేక సొరకాయ బుర్రలో తినాలి. గడ్డిబొంత, ఆకులు వేసుకుని పడుకోవాలి.

రెండు నెలలొకోసారి శిరముండనం చేయించుకోవాలి. చంకలు, ఉపస్థశిఖ తీయరాదు. చాతుర్మాస్యము చెయ్యాలి. నదీతీరము, చెట్టుతొర్ర వంటిచోట్ల ఉండాలి. కోపం ఉండరాదు. సన్యాసంలో తన నిజధర్మాన్ని వదలినవాడు మహాపాతకి అవుతాడు. వైష్ణవ నిష్ఠ వదలినవాడు దొంగ అవుతాడు. మిత్రద్రోహి అవుతాడు.

దొంగ, మిత్రద్రోహి, గురుతల్పగతుడు వీరందరికీ ప్రాయశ్చిత్తము ఉంది కాని అవ్యక్తమైన విష్ణులింగము వదలిన వాడికి ప్రాయశ్చిత్తములేదు. ఈ రకంగా సన్యసించినవాడు ముందుతరాల వారిని, తరువాత తరాలవారిని తరింపచేస్తారు. ఈ రకమైన వైష్ణవనిష్ఠను నమ్మకములేనివాడికి, భక్తిలేనివాడికి, శిష్యుడు కాని వాడికి, వైష్ణవుడు కానివాడికి చెప్పరాదు.

*దీంతో సన్యాసోపనిషత్తులు సమాప్తము*

శ్రీ

# పార్థసారథీయము

# చతుర్వేదభాష్యము

## (ఉపనిషత్తులు)

### (దశోపనిషత్తులు)



ప్రముఖ శ్రీవిద్యా ప్రచారకులు

అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,

ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, మెంఫిస్, అమెరికా ఆస్థాన విద్వాంసులు,

డా॥ క్రోవి పార్థసారథి

# 121. దశోపనిషత్తులు

నాలుగు వేదాలకు కలిపి మొత్తం 1180 ఉపనిషత్తులు ఉన్నాయి. వీటిలో 108 మాత్రమే ముఖ్యమైనవి అని గతంలో చెప్పుకున్నాం. అయితే 108 ఉపనిషత్తులు చదవటమనేది సామాన్యమైన విషయంకాదు. అందుకే పది ఉపనిషత్తులు చదివితే చాలు అన్నారు శంకర భగవత్పాదుల వారు. అవే **దశోపనిషత్తులు** అనబడతాయి.

**ఈశ కేన కఠ ప్రశ్న ముండక మాండూక్య తిత్తిరి**
**ఐతరేయం చ ఛాందోగ్యం బృహదారణ్యకం దశః ॥**

1. ఈశావాశ్యోపనిషత్తు (శుక్లయజుర్వేదంలోది)
2. కేనోపనిషత్తు (సామవేదంలోది)
3. కఠోపనిషత్తు (కృష్ణయజుర్వేదంలోది)
4. ప్రశ్నోపనిషత్తు (అధర్వణ వేదంలోది)
5. ముండకోపనిషత్తు (అధర్వణవేదంలోది)
6. మాండూక్యోపనిషత్తు (అధర్వణ వేదంలోది)
7. తైత్తిరీయోపనిషత్తు (కృష్ణయజుర్వేదంలోది)
8. ఐతరేయోపనిషత్తు (ఋగ్వేదంలోది)
9. ఛాందోగ్యోపనిషత్తు (సామవేదంలోది)
10. బృహదారణ్యకోపనిషత్తు (శుక్ల యజుర్వేదంలోది)

ఈ పది ఉపనిషత్తులు ప్రత్యక్షంగా బ్రహ్మవిద్యను, మోక్షమార్గాన్ని వివరిస్తాయి. మోక్షం పొందటానికి మాండూక్య మొక్కటి చాలు

అన్నారు. మాండూక్యోపనిషత్తుకు గౌడపాదులవారు కూడా కారికలు వ్రాశారు. కారిక అంటే శ్లోకరూపంలో ఉన్న సూత్రము.

ఈ ఉపనిషత్తులలో బ్రహ్మవిద్యను చాలా వివరంగా చెప్పారు. హృదయోపాసన, సత్యబ్రహ్మోపాసన, గాయత్రోపాసన ఓంకారోపాసన ఇలా రకరకాల రూపాలలో పరబ్రహ్మోపాసనను వివరించారు.

ఈ పది ఉపనిషత్తులకు త్రిమతాచార్యులు అంటే 1. శంకర భగవత్పాదుల వారు 2. రామానుజాచార్యులు 3. మధ్వాచార్యులు ఎవరి మతాలకు అనుగుణంగా వారు వ్యాఖ్యలు వ్రాశారు.

ఇప్పుడు దశోపనిషత్తులలో ఏం చెప్పారో చూద్దాం.

# 122. ఈశావాస్యోపనిషత్తు

"ఇది శుక్లయజుర్వేదానికి సంబంధించినది. ఉపనిషత్తులోని మొదటి మంత్రంలోని మాటవల్లనే దీనికాపేరు వచ్చింది. మహత్తరమైన ఆధ్యాత్మిక సత్యాలు ఇందులో ఉన్నాయి. సంహితలో అంతర్గతంగా ఉన్నది కాబట్టే ఈశావాస్యానికి **'సంహితోపనిషత్తు'** అని పేరు వచ్చింది. ఇది మొత్తం మంత్రరూపంలో ఉంటుంది. కాబట్టి దీనికి **'మంత్రోపనిషత్తు'** అని పేరు. మంత్రోపనిషత్తులలో కూడా ఈశావాస్యము మకుటాయమానమైనది.

ఇందులో మొత్తం పద్దెనిమిది మంత్రాలున్నాయి. ఆ మంత్రాలు ఆత్మయొక్క సత్యస్వరూపాన్ని వ్యక్తం చేస్తుంటాయి. ఇవి కర్మకాండకు ఉపయోగించవు. అజ్ఞానాన్ని తొలగించి ఆత్మసాక్షాత్కారాన్ని కలుగచేస్తాయి. జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటే అనే అద్వైత సిద్ధాంతాన్ని ప్రబోధిస్తాయి. ఈ ఉపనిషత్తులో పూర్తిగా ఆత్మధ్యాన నిష్టనవలంభించటానికి అధికారియైన సన్యాసికి అతడు చేయవలసిన ధర్మాలు వివరించబడుతున్నాయి.

**ఈశావాస్యమిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్ ।**
**తేనత్యక్తేన భుంగీథా మాగృథః కస్య స్విద్ధనమ్ ॥**

అనిత్యమైన ఈ ప్రపంచంలో పరివర్తనాశీలమైనది ఏదైతే ఉన్నదో, అదంతా పరమేశ్వరుడి చేతనే ఆవరించబడి ఉన్నది. మనకళ్ళకు కనిపించేదంతా ఆత్మస్వరూపము, పరమేశ్వరమయము. ఈ ఐశ్వర్యము నిత్యముకాదు. అశాశ్వతమైన వాటిమీద కోరికను వదలిపెట్టు. ప్రాపంచిక సుఖాలను పరిత్యజించు. ఇతరుల ధనాన్ని ఆశించకు.

ఇతరుల మీ ఆధారపడకు. జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటే అని తెలిసినప్పుడు సంసార బంధనాలుండవు. సృష్టిలోని వస్తువులన్నీ పరమాత్మ స్వరూపమే అయినప్పటికీ నామరూపక్రియాదులచే వేరువేరుగా కనిపిస్తాయి. ధనేషణ దారేషణ పుత్రేషణ అనబడే ఏషణ త్రయాన్ని చంపుకో. సంపదల కోసం ప్రాకులాడకు. సిరిసంపదలు శాశ్వతం కాదు. సర్వమూ పరమేశ్వరమయం కాబట్టి నిష్కామ్యకర్మ చెయ్యి. దొరికిన దానితో తృప్తిపొందు. అందులోనే శాశ్వతమైన ఆనందాన్ని అన్వేషించు. అనుభవించటంవల్ల కోరికలు తీరవు.

సర్వసంగపరిత్యాగం చేసినప్పటికీ ఆత్మధ్యానంలో లీనం కాలేనివారు, కర్మాధికారం కలవారు, యజ్ఞయాగాదులైన ధర్మకర్మలు చేస్తూ చిత్తశుద్ధి సంపాదించుకోవాలి. లేకపోతే వారికి పతనం తప్పదు. నిస్వార్థకర్మలు, పుణ్యకర్మలు చేస్తే తప్ప పతనంనుంచి తప్పించుకోలేరు. పాపకర్మలు అంటుకోకుండా ఉండాలంటే ఇంతకు మించిన మార్గం మరొకటి లేదు. నిష్కామకర్మ చేసేవాడికి కర్మఫలము అంటదు. ఆత్మస్వరూపం తెలుసుకోలేనివారు ఆత్మఘాతకులు. అన్ని ప్రాణులయందు  ఆత్మ ఉన్నదని తెలుసుకోలేనివారు ఆత్మహత్య చేసుకునే వారితో సమానులు. వీరు అజ్ఞానాంధకారంలో మునిగిపోయి మరణానంతరము పాపలోకాలకు పోతారు. అజ్ఞానము ఆవరించి ఉండటంచేత వీరు మళ్ళీ మళ్ళీ పుడుతుంటారు. అజ్ఞానులు ఇంద్రియ సుఖాలపట్ల ఆసక్తి కలిగిఉంటారు. అందుచేతనే వీరికి పునర్జన్మ తప్పదు. ఆత్మతత్వాన్ని సాక్షాత్కరింపచేసుకోవటం పట్ల నిర్లక్ష్యం ప్రదర్శించేవారు ఆధ్యాత్మికంగా ఆత్మహత్య చేసుకున్న వారే. ఇక ఆత్మను గురించి వినండి.

ఆత్మ చలనంలేనిది శాశ్వతమైన సత్యస్వరూపమే ఆత్మ. ఇది

చాలా వేగంగా ప్రయాణం చేస్తుంది. శరీరంలోని ఇంద్రియాలకు అధిపతి మనస్సు. ఇది చాలా వేగంగా ప్రయాణిస్తుంది. కాని ఆత్మ మనస్సుకన్న చాలా వేగంగా ప్రయాణిస్తుంది. ఆత్మ సర్వవ్యాపి. ఇంద్రియాలు దీన్ని ఎరగవు. ఆత్మ అన్నిలోకాలలోనూ లోపలా బయటా కూడా ఉంటుంది. అందుచేతనే ఆత్మ తాను ఒకఅడుగైనా కదపకుండానే అన్నింటికన్నా ముందు ఉంటుంది. ఆత్మ ఉండటంవల్లనే అంతరిక్షంలోని వాయువు సమస్త ప్రాణులకు కర్మలు చెయ్యటానికి కదలిక ఇస్తాడు. అంటే ఆత్మయే ప్రాణశక్తిని వాయువునందుంచి అతని ద్వారా జీవకోటిని చైతన్యం చేస్తోంది.

**తదేజతి తన్నైజతి తద్దూరే తద్వంతికే ।**

**తదంతరస్య సర్వస్య తదుసర్వస్యాస్య బాహ్యతః ॥**

ఆత్మకు చలనమున్నది. చలనం లేదు. అనగా నిజమైన స్థితిలో ఆత్మ చలించదు. ఆత్మ నిశ్చలమైనప్పటికీ మనసుకు ఆధారం కావటంచేత చలించినట్లు కనిపిస్తుంది. ఆత్మ దూరంలో ఉన్నది. దగ్గరగా ఉన్నది. అంటే సర్వత్రా వ్యాపించి ఉన్నది. అజ్ఞానులకు మాత్రం దూరంగా ఉన్నది. వాళ్ళు దానిని చేరుకోలేరు. జ్ఞానులకు మాత్రం చాలా దగ్గరలో ఉంటుంది. ఆత్మ లోపలా బయటా ఉన్నది. సృష్టికి అతీతమైనది. అది ఉపాధియుతము, ఉపాధిరహితము కూడా. అందుచేత అంతటా వ్యాపించి ఉన్నది. అన్ని భూతాలనూ తనలో చూడగలిగినవాడు ఎవరినీ ద్వేషించడు. అతడిని సమదర్శి అంటారు. స్వార్థబుద్ధి వల్లనే ద్వేషం కలుగుతుంది. **అన్ని జీవులయందు ఆత్మ ఒక్కటే అనే విషయం గ్రహించినప్పుడు ద్వేషానికి, అసహ్యానికి తావుండదు.** ఆత్మజ్ఞానం సంపాదించిన వానికి, లోకంలోని సమస్త

భూతములు తన ఆత్మగానే కనిపిస్తాయి. తనకు మించిన వేరు వస్తువుండదు. అట్టివాడికి సుఖదుఃఖాలు ఉండవు. ఆత్మ ఆకాశంలాగా సర్వవ్యాపకమైనది. దీనికి స్థూల సూక్ష్మ కారణ శరీరాలు లేవు. ఇది అన్నింటినీ చూస్తుంది. అన్నిటినీ చుట్టుకుని ఉంటుంది. ఆత్మపరిశుద్ధుడు, అశరీరి. గాయములు లేనివాడు (అవణుడు) అస్నాయువు. పాపరహితుడు, పరిపూర్ణుడు, స్వచ్ఛము, సర్వదర్శి, సర్వవిదుడు, సర్వోత్తముడు. జీవుల కర్మలననుసరించి వారికి భోగ్యపదార్థాలు అందజేశాడు. సృష్టికర్తలను నియమించాడు. ప్రజాపతులకు వారి వారి విధులను అప్పగించాడు. అతని శాసనాలను ఎవరూ ఉల్లంఘించలేరు. ఇప్పుడు కర్మ, ఉపాసనల సమన్వయం వినండి.

**అంధం తమః ప్రవిశన్తి యేఅవిద్యాముపాసతే**
**తతో భూయ ఇవతే తమోయ ఉ విద్యాయాగ్ం రతాః ॥**

అవిద్యను ఆరాధించేవారు అంటే ఆత్మజ్ఞానం లేకుండా యజ్ఞకర్మలను ఆరాధించేవారు గాఢాంధకారంలో పడిపోతారు. కర్మలను వదలి కేవలం ఉపాసనలో నిమగ్నమైనవారు ఇంకా అంధకారంలో పడిపోతారు. అందుచేతనే జ్ఞానరహితమైన ఉపాసనవల్లగాని, ఉపాసనా రహితమైన జ్ఞానంవల్లగాని సద్గతి కలుగదు. వీటిని విడివిడిగా అనుష్టించేవారు ఆత్మజ్ఞానానికి దూరమై తామసలోకాలకు పోతారు. ఆత్మజ్ఞానానికి కర్మాచరణ, ఉపాసన రెండూ ముఖ్యమే. అప్పుడే సత్ఫలితం ఉంటుంది. విద్యోపాసన (ఉపాసన) వల్ల దేవలోకము, అవిద్యోపాసన (కర్మల) వల్ల పితృలోకము వస్తాయి. వీటినే ఉత్తరాయణ, దక్షిణాయనాలు అంటారు. ఈ రెండూ తెలిసినవాడు అవిద్యచే

మృత్యువును జయించి విద్యతో దైవత్వం పొందుతాడు. విద్య అవిద్య రెండూ పరమేశ్వర స్వరూపాలే. ఈ రెంటినీ సమానంగానే ఉపాసించాలి. అవిద్య (కర్మాచరణ) వల్ల శరీరం వదిలి, విద్య (ఉపాసన)తో జన్మరాహిత్యం పొందాలి. జగత్తును దాటటానికి కర్మాచరణ, జన్మరాహిత్యానికి ఉపాసన రెండూ అవసరమే అని తెలిసి ఆచరించినవాడు కర్మవలన సంచిత కర్మను నాశనం చేసి, ఉపాసన వల్ల దైవత్వం పొందుతాడు. అసంభూతి (ప్రకృతి)ని ఉపాసించేవారు అంధకారంలో ప్రవేవిస్తారు. సంభూతి (సాకారబ్రహ్మ, హిరణ్యగర్భుడు)ని ఉపాసించేవారు అంతకన్నా ఘోరమైన చీకటి లోకాలలో ప్రవేశిస్తారు. ఈ రకంగా సంభూతిని ఉపాసించటం వల్ల ఒక ఫలితము, అసంభూతిని ఉపాసించటం వల్ల ఒక ఫలితము వస్తుంది. సంభూతిని ఉపాసించేవాడు అణిమాది అష్టసిద్ధులు పొందుతాడు. అవ్యక్తోపాసన చేసేవాడు ప్రకృతిని లయం చెయ్యగలుగుతాడు. ఈ రెంటినీ అర్చిస్తే ముందుగా మృత్యువును జయించి తరువాత అమృతత్వం పొందుతాడు.

సాధకుడు విద్య, అవిద్యల సత్యాన్ని తెలుసుకుని ఆత్మసాధనలో పురోగమించాడు. అజ్ఞానం తొలగిపోయింది. సత్యదర్శనమయింది. సూర్యుణ్ణి ప్రత్యక్షంగా చూస్తూ “ఓ సూర్యుడా! ప్రజాపతి పుత్రుడా! స్వర్గవీధిలోని బాటసారీ ! సర్వపోషకా ! నీ కిరణాలను కాస్త తొలగించు, కాంతిని ఉపసంహరించుకో, నీ అనుగ్రహంతో నీరూపాన్ని చూడటానికి వీలుగా నీతేజస్సును ఉపసంహరించుకో. నేను దేహత్యాగం చేస్తున్నాను. కాబట్టి నా ప్రాణములు అనంతవాయువులో కలిసిపోవుగాక, శరీరం భస్మమై పోవుగాక. సంకల్ప వికల్పాత్మకమైన ఓ మనసా! పూర్వకర్మలను గుర్తు తెచ్చుకో.”

**అగ్నేనయసుపథారాయే అస్మాన్ విశ్వాని దేవవయునానివిద్వాన్**

**యుయోధ్య స్మజ్జుహురాణమేనో భూయిష్టాంతే నమ ఉక్తింవిధేమ**

ఇంతవరకూ బంధనాలలో కూరుకుపోయిన సాధకుడు శరీరాన్ని, బంధనాలను త్యజిస్తూ "ఓ అగ్నిదేవా! నేను చేసిన పుణ్యఫలము అనుభవించటానికి నన్ను సన్మార్గంలో తీసుకుపో. ఓ దేవా ! నేను చేసిన కర్మలన్నీ నీకు తెలుసు. నా పాపాలన్నీ నశింపచెయ్యి, జనన మరణాలతో విసిగిపోయాను. తండ్రీ! పునరావృత్తి రహితమైన లోకాలకు నన్ను తీసుకునిపో. నీకు అనేక వేల నమస్కారాలు" ఈ రకంగా సాధకుడు తనను ఉత్తరాయణ మార్గం (అర్చిరాది మార్గం) ద్వారా బ్రహ్మలోకానికి తీసుకు పొమ్మని, జన్మరాహిత్యం చెయ్యని పరమేశ్వరుణ్ణి అవసాన దశలో ప్రార్థిస్తున్నాడు'' అంటూ ఈ ఉపనిషత్తును ముగించారు.

# 123. కేనోపనిషత్తు - 1

## ఆత్మ చైతన్యము

సామవేదంలోని తలవకార బ్రాహ్మణంలో కేనోపనిషత్తు ఉన్నది. అందుచేతనే దీనిని **'తలవకారోపనిషత్తు'** అంటారు. 'కేన' అనే పదంతో ప్రారంభమవటం చేత ఈ ఉపనిషత్తుకు 'కేనోపనిషత్తు' అని పేరు వచ్చింది.

బ్రహ్మజిజ్ఞాసి అయిన శిష్యుడు గురువుగారిని అడుగుతున్నాడు. "స్వామీ! నేలమీద రథముగాని, నీటిపైన పడవగాని చైతన్యవంతము కావాలంటే ఎవరిదైనా ప్రేరణ ఉండాలికదా? అలాగే మనస్సు, ఇంద్రియాలు అన్నీ జడములు. ఇవి తమంత తాము వ్యవహరించలేవు. మనస్సును ఆదేశిస్తున్న ప్రభువెవరు? ప్రాణవాయువు ఎవరి ప్రేరణ వలన చరించుచున్నది? వాక్కు ఎవరి ఆజ్ఞచే వర్తించుచున్నది? అలాగే కనులు, చెవులు మొదలైనవన్నీ ఎవరి ప్రేరణచేత చరించుచున్నాయి? ఆ శక్తిని గూర్చి నాకు తెలియచేయండి.

శిష్యుడు అడిగిన ప్రశ్నకు గురువు చాలా సంతోషించి ఈ విధంగా చెప్పటం మొదలుపెట్టాడు. "ఇంద్రియాలు వేరు ఆత్మ వేరు. ఇంద్రియాలే ఆత్మకాదు. చెవికి శబ్ద గ్రహణశక్తిని మనస్సుకు ఆలోచనా శక్తిని, వాక్కుకు సంభాషణా శక్తిని, కంటికి దృశ్యశక్తిని ప్రసాదించే చైతన్యమూర్తి 'ఆత్మ' కాబట్టి ఇంద్రియాలే ఆత్మ అనే భ్రాంతిని వీడి వాటికి వశ్యుడు కానివాడు అమరుడౌతాడు.

ఇంద్రియాలను ప్రేరేపించేది ఆత్మ. కాబట్టి వాటికి ఆత్మతత్త్వము ఏమిటో తెలియదు. ఆత్మయొక్క శక్తిచేతనే కన్నుచూస్తోంది.

చెవివింటోంది. నోరు మాట్లాడుతోంది. మనస్సుఆలోచిస్తుంది. ప్రాణంపనిచేస్తోంది. కాబట్టి వాటికి ఆత్మను గురించి తెలియదు. అటువంటి ఆత్మను ఇంద్రియాల నుండి వేరుచేసి, ఇంద్రియాలకు లోబడకుండా జీవించేవాడు మృత్యువుని జయిస్తాడు. ఇంద్రియాలన్నీ జడాలు. వాటికి చైతన్యం లేదు. కాని చైతన్యం ఉన్నట్టు కనిపిస్తాయి. ఆత్మశక్తి వాటి వెనుక ఉండి నడిపిస్తున్నది. అజ్ఞాని ఇంద్రియాలుచేతనాలు అనుకుంటాడు. జ్ఞాని ఆత్మస్వరూపం తెలుసుకుంటాడు. ఆత్మను గుర్తించటం ఎలా? అంటే....

ఆత్మ ఎక్కడైతే ఉన్నదో అక్కడికి కన్నుగాని, మాటలుగాని పోలేవు. అందుచేత ఇంద్రియాలతో ఆత్మను గుర్తించ వీలుకాదు. ఇంద్రియాలను ప్రేరేపించేదే ఆత్మ కాబట్టి ఇంద్రియాలు తమను నడిపించే ఆత్మను చేరలేవు. ఆత్మ ఇంద్రియాలకే కనిపించనప్పుడు వాటిద్వారా ఆత్మను మనమెలా చూడగలం? ఆత్మ అనేది మనకు తెలిసిన దానికన్నా భిన్నమైనది. తెలియని దానికన్న అతీతమైనది. అంటే అవ్యక్తమైనది. దాన్ని అనుభవం ద్వారా మాత్రమే తెలుసుకోవాలి. ఇది ప్రమాణాలకు, తర్కానికి అందదు. అందుచేత గురువు ద్వారా మాత్రమే ఆత్మను గురించి తెలుసుకోవాలి.

మాటలు దేనిని, ప్రకటించలేవో, దేనివల్ల మాటలు ప్రకాశితమౌతున్నాయెూ అదియే బ్రహ్మము, ఆత్మ. సామాన్య జనులుపాసించే దేవతాప్రతిమలు బ్రహ్మము కాదు. వాటి రూపంలో ప్రకాశించే మూలతత్త్వమే బ్రహ్మ. కనులు ఆత్మను చూడలేవు. కాని కనులకు చూసేశక్తిని ప్రసాదిస్తున్నదే ఆత్మ. ముక్కు ఆత్మను వాసన చూడలేదు. కానీ ముక్కుకు వాసన చూసే శక్తిని ప్రసాదించేది ఆత్మ. ఈ రకంగా ఇంద్రియాలన్నీ పనిచేసే శక్తిని ఆత్మద్వారానే పొందుతాయి.

ఇంద్రియాల కార్యకలాపాలకు సాక్షి. నియంత కూడా ఆత్మే. ఈ రకంగా ఇంద్రియాలకు శక్తిని ప్రసాదించే బ్రహ్మమును గురించి ఇంద్రియాలు తెలుసుకోలేవు.

నాయనా ! పరబ్రహ్మ స్వరూపమును నేను తెలుసుకున్నాను' అని ఎవరైనా అంటే అది వట్టి అబద్దము. అతని జ్ఞానము అత్యల్పమైనది. మానవులేకాదు, ఈ మాట దేవతలు చెప్పినా అబద్ధమే. **నేను బ్రహ్మమును బాగా తెలుసుకున్నాను అని అన్నవాడికి తెలిసింది చాలా తక్కువ. అతడు తెలుసుకోవలసినది చాలా ఉన్నది"** అన్నాడు.

గురువుగారి మాటలకు శిష్యుడు ఆలోచించి బ్రహ్మను సాక్షాత్కరింపచేసుకుని "గురువర్యా ! నేను బ్రహ్మము గూర్చి తెలుసుకున్నాను" అన్నాడు. దానికి గురువుగారు.

నాయనా ! నీవు తెలుసుకున్నది చాలా తక్కువ బ్రహ్మజ్ఞానం పొందినవాడు బ్రహ్మమే సర్వస్వము అంటాడు. బ్రహ్మము గురించి ఎవరికి తెలియదో అతనికి తెలుసు. ఎవరికి తెలుసో అతనికి తెలియదు. ఎందుచేతనంటే పండితులకు బ్రహ్మము తెలియదు. జ్ఞానులకు తెలుసు. బ్రహ్మము మానసిక భావాలకతీతమైనది. ఎవరైతే బ్రహ్మసాక్షాత్కారం పొందుతారో వారు మాత్రమే దాన్ని గురించి గ్రహిస్తారు. మానసిక వికారం ద్వారా ఆత్మస్ఫూర్తిని గోచరింప చేసుకునేవాడు అమరత్వం పొందుతాడు. అమరత్వం పొందటమంటే ఆత్మయొక్క స్వభావాన్ని పొందటం. అజ్ఞానమనేది సంసార బంధనానికి కారణం మనోవికారాలన్నిటిలోనూ ఆత్మ కలిసి ఉంటుంది. ఆ వికారాలకు స్ఫూర్తినిచ్చేది ఆత్మ. ఆత్మసాక్షాత్కారం పొందినవాడు ప్రతివికారంలోనూ ఆత్మను చూడగలుగుతాడు.

జ్ఞానంవల్ల భేదదృష్టిపోయి కష్టసుఖాలు, లాభనష్టాలు అన్నీ ఒకటే అవుతాయి. దీపం వల్ల చీకటి తొలగిపోయినట్లుగా జ్ఞానంవల్ల అజ్ఞానం నశిస్తుంది. అజ్ఞానం నశించిన వాడికి ఆత్మసాక్షాత్కారమవుతుంది. అదే జీవన్ముక్తి" అంటూ కేనోపనిషత్తు లోని ఆత్మచైతన్యాన్ని గురించి వివరించారు.

# కేనోపనిషత్తు - 2

## ఉమాదేవి

జగత్తులో పరమేశ్వరతత్వాన్ని మించినది ఏదీలేదు. గెలుపు ఓటములు, జయాపజయాలు, సుఖదుఃఖాలు అన్నీ పరమేశ్వరుని లీలలే. వీటికి ఎవరూ అతీతులు కారు. శత్రుసంహారము, విజయము అనేవి తమశక్తి సామర్ధ్యాల వల్లనే లభించాయని అనుకోరాదు. ఆ విధంగా ఊహించి దేవతలకు కనువిప్పు కలిగించాడు పరమాత్మ.

ఒకసారి దేవదానవ సంగ్రామం మహాభీకరంగా జరిగింది. అందులో దేవతలు విజయం సాధించారు. ఆ విజయం తమవల్లనే సాధించబడిందని, దానికి కారణం తామేనని దేవతలలో ప్రతివారూ గర్వంతో విర్రవీగిపోయారు. దీనికంతటికీ కారణమైన పరబ్రహ్మను మరచిపోయారు. విజయోత్సాహంతో దేవతలంతా సభ తీర్చారు. అందులో ఎవరి ప్రతాపాన్ని వారు చెప్పుకోవటం మొదలుపెట్టారు. ముందుగా అగ్నిదేవుడు తను అగ్నిజ్వాలలు ప్రజ్వలింపచేస్తే, ఆ అగ్ని శిఖలలో రాక్షసులు మాడిపోతూ దిక్కు తోచక పలాయనం చిత్తగించారు. అంటూ తన శక్తి సామర్ధ్యాల గురించి గర్వంగా చెప్పాడు. తరువాత వాయువు లేచి తను చండప్రచండంగా గాలులు వీస్తుంటే వాటి తాకిడికి నిలవలేక రాక్షసులు పలాయనం చిత్తగించారు అన్నాడు.

ఈ రకంగా దేవలంతా తమ పరాక్రమాన్ని గొప్పగా చెప్పుకుంటున్నారు.

బ్రహ్మతత్త్వం ఇదంతా గమనిస్తోంది. దేవతల అహంకారం పోగొట్టాలని నిర్ణయించుకుంది. అనుకున్నదే తడవుగా వారి ఎదుట భయంకరమైన యక్షరూపంలో ప్రత్యక్షమైంది. చూశారు దేవతలు. అదేమిటో వారికి అర్థం కాలేదు. ఆ రూపాన్ని చూసి భయపడ్డారు. ఏం చెయ్యాలో పాలుపోలేదు. ఆ రూపం ఏమిటో వారికి తెలియలేదు. దాన్ని గురించి తెలుసుకోవాలనుకున్నారు.

దేవాసుర సంగ్రామంలో రాక్షసులను భయంకరమైన అగ్ని కీలలతో కాల్చివేశానని చెప్పినవాడు అగ్నిదేవుడు. అందుకని దేవతలందరూ అగ్నిదేవుని సమీపించి "ఓ అగ్నిదేవా! ఏదో భయంకరమైన తత్త్వం ఇక్కడ ప్రత్యక్షమైంది. అదేమిటో మాబుద్ధికి అర్థం కావటం లేదు. కాబట్టి నీవు వెళ్ళి దాన్నిగురించి తెలుసుకుని రావలసినది" అన్నారు.

'సరే' అని బయలుదేరాడు అగ్నిదేవుడు. ఆ తత్త్వాన్ని సమీపించాడు. భూతంలాటి ఆ తత్త్వం అగ్నిదేవుని చూసి అడిగింది "ఎవరు నువ్వు"?

"నేను అగ్నిదేవుడను. లోకంలో అందరూ నన్ను 'జాతవేదుడు' అంటారు'

"అయితే నీ శక్తి సామార్థ్యాలేమిటి?"

"లోకంలోని ఏ వస్తువునైనా సరే క్షణంలో కాల్చి బూడిద చేస్తాను".

'అంత గొప్పవాడినా'? అయితే ఈ గడ్డిపోచను దగ్ధం చెయ్యి' అంటూ ఒక గడ్డి పరకను అక్కడ ఉంచింది ఆ తత్త్వం.

ఆ గడ్డిపరకను చూచి చాలా తేలిక భావంతో మంటలు సృష్టించాడు అగ్నిదేవుడు. గడ్డిపరక కాలలేదు. భయంకరమైన అగ్నిశిఖలు సృష్టించాడు. లాభం లేకపోయింది. గడ్డిపోచ అలానే ఉంది. అగ్నిదేవుడు వెనుక్కు తిరిగి దేవతల వద్దకు వెళ్ళి "ఆ తత్త్వం ఏమిటో నాకూ పాలుపోలేదు. దాన్ని అర్థం చేసుకోవటానికి నా శక్తి చాలలేదు" అన్నాడు.

అప్పుడు దేవతలంతా వాయుదేవుని సమీపించి "దేవా! నీవు చాలా గొప్పవాడివి కదా! ఆ తత్త్వం ఏమిటో నువ్వైనా కనుక్కో" అన్నారు.

'సరే' అని బయలుదేరాడు వాయువు, ఆ తత్త్వాన్ని సమీపించాడు. పూర్వంలో లాగానే ఆ తత్త్వం ప్రశ్నించింది.

"ఎవరు నువ్వు?"

'నేను వాయుదేవుడను. ఆకాశంలో సంచరిస్తుంటాను. కాబట్టి నన్ను 'మాతరిశ్వుడు' అని కూడా అంటారు.'

"నీ శక్తి ఏమిటి?"

"లోకంలో ఏ వస్తువునైనా సరే నా గాలులతో ఎగురగొట్టగలను."

"అయితే దీన్ని ఎగరగొట్టు" అంటూ ఇదివరకటి లాగానే గడ్డిపోచను అక్కడ ఉంచింది ఆ తత్త్వం. వాయుదేవుడు తన బలాన్ని కూడగట్టుకుని ముందుకు వెళ్ళాడు. భయంకరమైన గాలులు వీచాడు. గడ్డిపోచ కదలలేదు. వచ్చిన దారినే వెనక్కు వెళ్ళి దేవతలతో "ఆ తత్త్వం ఏమిటో నాకు అర్థం కాలేదు" అన్నాడు.

అప్పుడు దేవతలందరూ తమ ప్రభువైన ఇంద్రుని దగ్గరకు వెళ్ళి అతనికి జరిగిన సంగతంతా వివరించి "దేవేంద్రా! ఆ విచిత్రమైన

తత్త్వం ఏమిటో నువ్వైనా కనుక్కోవలసినది” అన్నారు.

**స తస్మిన్నే వాకాశేస్త్రి యమాజగామ బహుశోభమానాం ఉమాం**

**హైమవతీం తాం హోవాచ కిమే తద్ యక్షమితి ॥**

‘సరే’ అంటూ తన వజ్రాయుధం తీసుకుని ఆ తత్త్వం దగ్గరకు వెళ్ళాడు దేవేంద్రుడు. వెంటనే ఆ శక్తి మాయమై పోయింది. దాని స్థానంలో మహాసౌందర్యరాశి యైన ఒక స్త్రీమూర్తి కనిపించింది. ఆమె హిమవంతుని కుమార్తె హైమవతి. ఆమెను ఉమాదేవి అనికూడా అంటారు.

ఆశ్చర్యంగా చూసిన ఇంద్రుడు ఉమాదేవిని ప్రశ్నించాడు “అమ్మా! దేవతల నందరినీ భయభ్రాంతులతో ముంచివేసిన ఆయక్షుడెవరు? ఆ తత్త్వము ఏమిటి”?

“ఆశక్తియే బ్రహ్మము” అని ఉమాదేవి సమాధానమిచ్చింది. ఆ తరువాత ఇంద్రునితో “ఓ దేవేంద్రా! బ్రహ్మము వల్లనే కదా మీరు విజయం పొందింది. మీ గొప్పదనానికి కారణము బ్రహ్మము. మీ అల్పబుద్ధివల్ల ఇప్పటివరకు కనుపించిన తత్త్వమే బ్రహ్మమని గుర్తించలేక పోయారు. ఆ బ్రహ్మతత్త్వమే మీ శరీరంలో శక్తిని వ్యాపింప చేస్తోంది. దానివల్లనే మీరంతా అసురులను సంహరించగలిగారు. దానివల్లనే ఈ మహాత్మ్యము మీరు పొందగలిగారు. అంతేగాని అదంతా మీగొప్పదనం అని అహంకరించకండి” అని చెప్పి అదృశ్యమై పోయింది.

పరబ్రహ్మతత్త్వాన్ని చూసినందువల్లనే అగ్ని, వాయువు, ఇంద్రుడు

మిగిలిన దేవతల కన్న గొప్పవారైనారు. బ్రహ్మాన్ని ముందుగా తెలుసుకున్నవారు వారే. ఆ శక్తియే బ్రహ్మమని ముందుగా తెలుసుకున్నవాడు ఇంద్రుడు. అందుకనే అతడు దేవతలలో శ్రేష్ఠుడైనాడు. దేవతల గొప్పదనానికి, వారి శక్తికి కారణము బ్రహ్మము. వారి ప్రాణమే బ్రహ్మము.

ఈ జగత్తులోని మెరుపుతీగ బ్రహ్మము. మానవుని రెప్పపాటు కూడా బ్రహ్మమే. దాని వల్లనే మనస్సు బాహ్యప్రపంచాన్ని గురించి తెలుసుకుంటుంది. తెలుసుకున్న దాన్ని జ్ఞాపకం ఉంచుకుంటుంది. దానివల్ల ఇతరమైన వాటిని ఊహిస్తుంది.

మనస్సుకున్న శక్తులు మూడు.

1. విషయాన్ని గ్రహించటం 2. జ్ఞాపకముంచుకోవటం 3. ఊహించటం. వీటిన్నింటికీ కారణమే బ్రహ్మమే.

అదే అన్ని జీవులకు ఆత్మ. అందుచేత పూజనీయమైనది. ఈ విషయం తెలిసిన వాడిని అన్ని జీవులూ ప్రేమిస్తాయి. అన్ని జీవులూ తమ ఆత్మగా భావిస్తాయి. అతడే పరమాత్మ స్వరూపుడు.

"తపస్సు ఇంద్రియ నిగ్రహము, యజ్ఞయాగాదులు బ్రహ్మజ్ఞానానికి ముఖ్యమైనవి. వేదాలు చదవటంవల్ల బ్రహ్మజ్ఞానం పొందటానికి అవసరమైతే శక్తి వస్తుంది. శమ దమాదులు కర్మలు దీనికి గోడలవంటివి. బ్రహ్మజ్ఞానాన్ని పొందినవాడు సాక్షాత్తు బ్రహ్మస్వరూపుడు అంటూ కేఠపనిషత్తును ముగించటం జరిగింది.

# 124. కఠోపనిషత్తు - 1

## నాచికేతాగ్నిచయనము

"శిష్యులారా ! స్వర్గంలో మృత్యుభయముండదు. వార్ధక్యము ఉండదు. ఆకలి దప్పికలు ఉండవు. శోకం ఉండదు. అటువంటి స్వర్గాన్ని పొందటానికి 'అగ్నిచయనము' అనే క్రతువు ఉన్నది. గౌతముని కుమారుడైన నచికేతుడికి యమధర్మరాజు ఆ క్రతువును బోధించి, ఇక నుంచి నీ పేర అది **'నాచికేతాగ్నిచయనము'** అని పిలువబడుతుందని వరమిచ్చాడు. ఆ విషయం ఇప్పుడు చూద్దాం.

కఠోపనిషత్తు కృష్ణయజుర్వేదంలోనిది. పూర్వకాలంలో 'గౌతముడు' అని గొప్ప పండితుండేవాడు, అతడు వేదవేదాంగవిదుడు. మహాతపస్వి. ఇతనికే 'వాజశ్రవసుడు' అని ఇంకో పేరుకూడా ఉంది. మరణానంతరము ఉత్తమలోకాలు పొందటం కోసము "విశ్వజిత్' అనే యాగం చెయ్యాలనుకున్నాడు. ఈ యాగం చేసేవారు తమ సర్వస్వాన్ని దానం చెయ్యాలి. సన్యాసం తీసుకునేముందు గృహస్థుకుడా తన ఆస్తినంతా దానం చేస్తాడు. విశ్వజిద్ యాగము కూడా ఇంచుమించు ఇలాంటిదే.

వాజశ్రవసుడు యాగము ప్రారంభించాడు. విశ్వజిద్యాగము నిర్విఘ్నంగా పూర్తయింది యాగంలో ఆఖరుగా దశదానాలు ఇవ్వాలి. దానం తీసుకునేందుకు పండితులంతా వచ్చి ఉన్నారు. అంతా కోలాహలంగా ఉంది. వాజశ్రవసుడు దానాలు చేస్తున్నాడు. పండితులు స్వీకరిస్తున్నారు. అన్ని దానాలు పూర్తి అయినాయి. ఇక గోదానము మొదలు కాబోతోంది. ఆ గోవులు తమ ఆఖరి గ్రుక్క నీటిని

త్రాగేసినాయి. ఆఖరి గడ్డి పరకను తినేసినాయి. వాటికి ఇంకా నీరు త్రాగటానికి గాని, మేతమెయ్యటానికి గాని ఓపికలేదు. కదలలేని స్థితిలో ఉన్నాయి. ఇంతెందుకు? చావుకు సిద్ధంగా ఉన్నాయి.

వాజశ్రవసుని కుమారుడు నచికేతుడు. వయసులో చిన్నవాడైనా మహాగుణశాలి. తండ్రిమీద భక్తిప్రపత్తులున్నవాడు. అతను ఆ ఆవులను చూసి ఈ విధంగా అనుకొంటున్నాడు. "ఈ ఆవులు నీరుత్రాగినాయి. గడ్డి తిన్నాయి. వాటికి పాలు పితికారు. ఇప్పుడివి శక్తిహీనములై ఉపయోగం లేకుండా పోయినాయి. ఇవి మళ్ళీ నీళ్ళు త్రాగుతాయని, మేతమేస్తాయని నమ్మకం లేదు. ఏ క్షణంలోనైనా చావటానికి సిద్ధంగా ఉన్నాయి. ఇటువంటి ఆవులను దానం చేసినవాడు **'ఆనందము' అనబడే పాపలోకాలకు పోతాడు.** నా తండ్రి స్వర్గం పొందాలనే కోరికతో నరకలోకాలు కొని తెచ్చుకుంటున్నాడు. ఏ విధంగానైనా తండ్రిని పాపలోకాల నుంచి రక్షించాలి" అనుకున్నవాడై తండ్రి దగ్గరకు వెళ్ళి "తండ్రీ! ఈ యాగంలో మీకున్న సర్వసంపదా దానం చెయ్యాలి కదా! నేను మీ సంపదలో ఒకడిని. మరి నన్ను ఎవరికి దానం చేస్తారు" అన్నాడు.

ఆ మాటలు వినికూడా వాజశ్రవుడు వెంటనే సమాధానమివ్వలేదు. నచికేతుడు మళ్ళీ అడిగాడు. ఎవరితోనో మాట్లాడుతున్నట్లుగా ప్రక్కకు తిరిగాడు తండ్రి. కుమారుడు వదల్లేదు. తండ్రిని నిర్బంధించాడు. దాంతో విసిగిపోయిన వాజశ్రవసుడు "నిన్ను మృత్యుదేవత అయిన యముడికి దానమిస్తాను" అన్నాడు. తొందరలో మాట అయితే అన్నాడు కాని వెంటనే పశ్చాత్తాపం చెందాడు.

తండ్రి మాటలువిన్న నచికేతుడు చాలా దుఃఖించాడు. దూరంగా

పోయి ఒంటరిగా కూచుని "నా తండ్రికి ఉన్న పుత్రులలో గాని, విద్యార్థులలో గాని నేను ఉత్తమశ్రేణిలోనే ఉన్నాను. అలా కాదనుకున్నా కనీసం మధ్యమశ్రేణి లోనైనా ఉంటాను. అంతేగాని అధమశ్రేణిలో మాత్రం ఉండను. మరి తండ్రి నన్నెందుకు యముడి కిస్తానన్నాడు? యముడి దగ్గరకు పోయి నేనేమి చెయ్యాలి? ఏమైనా సరే. తండ్రిమాట జవదాటరాదు. ఆయనకు అసత్య దోషం అంటనీయకూడదు. యమపురికి వెళ్ళి తీరాల్సిందే". అని నిశ్చయించుకుని తండ్రి దగ్గరకు వెళ్ళి "తండ్రీ! మన పూర్వుల చరిత్రచూడు. ఎవరూ ఎప్పుడూ అబద్ధం ఆడలేదు. మరి నువు కూడా ఆ బాటలోనే నడవాలి. పొలములోని పైరులాగా మానవుడు పుడతాడు, నశిస్తాడు. ఈ మాత్రం దానికి ఆలోచన ఎందుకు? నేను యమపురికి బయలుదేరుతాను. నాకు సెలవిప్పించండి". అని ప్రార్థించి తండ్రి దగ్గర సెలవు తీసుకుని యమపురికి ప్రయాణం కట్టాడు.

ఆ సమయంలో యముడు బ్రహ్మదర్శనానికి వెళ్ళాడు. కాబట్టి నచికేతుడు యమపురి చేరేప్పటికి యముడు అక్కడలేడు. మృత్యుదేవుడు తిరిగివచ్చేవరకు నచికేతుడు అక్కడే ఉన్నాడు. ఈ రకంగా యముని గృహంలో మూడురోజుల గడిచినాయి. తిరిగి వచ్చిన యముడికి భటులు బ్రహ్మతేజస్సుతో వెలుగొందుతున్న బాలుని వృత్తాంతం చెప్పి "ప్రభూ అగ్నిదేవుడే మనింట్లో అతిథిరూపంలో ప్రవేశించాడు. మీరు లేనప్పుడు అతిథిగా వచ్చాడు. ఈ మూడు రోజులు భోజనం కూడా చెయ్యలేదు. గృహస్థాశ్రమ ధర్మానుసారం అతణ్ణి సాదరంగా ఆహ్వానించండి. అలా కాకపోతే ఆ గృహస్థు పుణ్యఫలమంతా పోతుంది. ధర్మరతికి దూరుడౌతాడు. అతడికి పుత్రపౌత్రులుండరు. పాడిపంటలు కూడాకరువౌతాయి" అన్నారు.

అప్పుడు యముడు నచికేతుని వద్దకు వచ్చి "ఓ విప్రుడా! నీకు నమస్కారము. నీవు నా యింటికి అతిథిగా వచ్చి మూడురోజులు భోజనం లేకుండా ఉన్నావు. అందుచేత నీవు భోజనం చెయ్యని ఒక్కొక్క రాత్రికి ఒక్కొక్కటి చొప్పున మూడు వరాలిస్తాను కోరుకో" అన్నాడు. ఆ మాట విన్న నచికేతుడు ఓ దేవా! నువు ఇస్తానన్న వరాల్లో మొదటిది అడుగుతున్నాను. నీ దగ్గర నుండి తిరిగి నేను ఇంటికి వెళ్ళేటప్పటికి నా తండ్రి కోపం లేకుండా శాంతచిత్తముతో సాదరంగా నన్ను అక్కున చేర్చుకోవాలి" అన్నాడు.

"నచికేతా! నువు ఇంటికి వెళ్ళగానే నీ తండ్రి కోపమంతా పోయి నిన్ను ప్రేమతో స్వీకరిస్తాడు. నిన్ను చూడగానే ఆయన ఆనందపరవసుడౌతాడు. ఆందోళన లన్నీ పోయి సుఖంగా ఉంటాడు" అన్నాడు యముడు. నచికేతుడు యముణ్ణి రెండోవరం అడిగాడు. "యమధర్మరాజా! స్వర్గంలో మృత్యుభయంలేదు. ఇక్కడ వార్ధక్యము, ఆకలిదప్పికలు ఉండవు. శోకం ఉండదు. అటువంటి స్వర్గము పొందటానికి 'అగ్నిచయనము' అనే క్రతువున్నది. అది నీకు బాగా తెలుసు. నాకు దాన్ని ఉపదేశించు" అన్నాడు.

యమధర్మరాజు అగ్నిచయనమనే క్రతువంతా ఉపదేశించాడు. నచికేతుడు దాన్ని పూర్తిగా గ్రహించాడు. తనకు ఆక్రతువు పూర్తిగా తెలిసింది అనటానికి నిదర్శనంగా తు.చ. తప్పకుండా తిరిగి యమునికి ఒప్పగించాడు. నచికేతుని మేధాశక్తికి అబ్బురపడ్డాడు యముడు. ఆ ఆనందంతో నీ బుద్ధి సూక్ష్మతకు సంతోషించాను. అదనంగా ఇంకో వరం ఇస్తున్నాను. బ్రాహ్మణకుమారా! నీ జ్ఞాపకశక్తి అమోఘం, అద్భుతం. దానికి గుర్తుగా ఈ వరం తీసుకో. స్వర్గప్రాప్తికి కారణమైన అగ్నిచయనము ఇక నుంచీ నీ పేరుమీద 'నాచికేతాగ్నిచయనము'

అని పిలువబడుతుంది. నీ పేరు చిరస్థాయిగా ఉంటుంది. ఈ క్రతువును తెలుసుకున్నవాడు 'త్రినాచికేతుడు' అని పిలువబడతాడు. అతడు జనన మరణాలనుంచి విముక్తుడౌతాడు. జ్ఞానకర్మలు అనుష్టించటం ద్వారా దేవేంద్ర పదవి పొందుతాడు. నాచికేతాగ్నిచయనం చేసిన వాడికి పాపం అంటదు. రాగద్వేషాలు ఉండవు. అతడు స్వర్గ సామ్రాజ్యంలో ఆనందిస్తాడు.

అంటూ నాచికేతాగ్నిచయనము గురించి వివరించాడు యమధర్మరాజు.

# కఠోపనిషత్తు - 2

## బ్రహ్మవిద్య

'అగ్నిచయనము' గురించి తెలుసుకున్న తరువాత నచికేతుడు ఆత్మతత్వాన్ని వివరించమని యమధర్మరాజును ప్రార్థించాడు. అప్పుడు యమధర్మరాజు అతణ్ణి అనేక విధాలుగా పరీక్షించి, చివరకు ఆత్మతత్వాన్ని వివరించాడు.

"ఓ మృత్యుదేవతా! మానవుడి మరణం మీద నాకు అనేక అనుమానాలున్నాయి. మరణించిన తరువాత ఇంద్రియాలు, అవయవాలు, మనస్సు మొదలైన వాటితో జీవాత్మకు సంబంధం ఉంటుందని కొందరు, ఉండదని కొందరు అంటారు. ఇందులో నిజం ఏది? నాకు వివరంగా చెప్పవలసినది" అని అడిగాడు నచికేతుడు.

నచికేతుడు అడిగింది ఆత్మజ్ఞానం గురించి. అది అర్హత ఉన్నవాళ్ళకు తప్ప ఇతరులకు చెప్పరాదు. మరి నచికేతుడికి ఆ అర్హత ఉన్నదా? ముందుగా ఈ విషయం తెలియాలి. అందుకే "నచికేతా!

ఈ విషయం మీద దేవతలకు కూడా సందేహం ఉన్నది. ఇది అంత తేలికగా అర్థంకాదు. అందుకని ఇంకేదైనా వరం కోరుకో" అన్నాడు యముడు. దానికి నచికేతుడు.

"ఆర్యా ! దేవతలకు కూడా ఈ విషయం అర్థం కాకపోవచ్చు కాని దాన్ని వివరించి చెప్పగల సమర్థుడవు నీవే. అందుకని నాకు ఆ విషయం వివరించు" అన్నాడు. "నచికేతా! పుత్రులు, పౌత్రులు, ధనకనక వస్తు వాహనాలు ఏవైనా కోరుకో. సుఖజీవనం చెయ్యి. అంతే గాని ఈ విషయం మాత్రం వదిలెయ్యి" అన్నాడు యముడు. రాజా! ఈ భోగాలన్నీ నేడు ఉంటాయి. రేపు ఉండవు. ఇవి అనిత్యమైనవి. అశాశ్వతమైన భోగభాగ్యాలు నాకువద్దు ఇలాంటివి ఎన్ని ఉన్నా ఆత్మజ్ఞానానికి సాటియైనది ఏదీలేదు. అందుచేత నాకు ఆత్మజ్ఞానాన్ని గురించి వివరించవలసింది" అన్నాడు నచికేతుడు. నచికేతుని పట్టుదలకు సంతసించినవాడై యముడు అతనికి ఆత్మజ్ఞానాన్ని వివరించటం మొదలుపెట్టాడు.

"నచికేతా! శ్రేయస్సు, ప్రేయస్సు అని రెండు విషయాలను శ్రుతులు చెబుతున్నాయి. ఇక్కడ శ్రేయస్సు అంటే విద్య. ప్రేయస్సు అంటే అవిద్య. పునరావృత్తి రహితమైన మోక్షమార్గమే శ్రేయస్సు. కాగా ఐహిక సుఖాలలో ఓలలాడించేది ప్రేయోమార్గము. మానవుడు ఈ రెంటిలో ఏదో ఒక మార్గాన్ని అనుసరించి తీరాలి. ఈ రెండు మార్గాలు కలిసి ఉన్నట్టుగానే కనిపిస్తాయి. విజ్ఞుడైనవాడు దీన్ని విభజించి శ్రేయోమార్గాన్నే ఎన్నుకుంటాడు. ఈ రెండూ విరుద్ధ స్వభావాలు గలవి. వీటిలో శ్రేయోమార్గము కాంతి కాగా ప్రేయస్సు చీకటి. అవిద్యలో మునిగినవాడు తనను తాను గొప్పపండితుడుగా భావించుకుంటాడు. ధనధాన్యాలు, భార్యాపుత్రులు ఇవే లోకమనుకుంటాడు. ఇలాంటివాడు

జనన మరణాలతో బాధపడుతుంటాడు.

ఆత్మజ్ఞానం అనే పదం వినటానికి కూడా చాలామందికి అర్హత ఉండదు. అందుకే వాళ్ళు దాన్ని ఇష్టపడరు. కొందరికి విన్నా అది అర్థంకాదు. అసలు దీన్ని గురించి చెప్పే గురువు దొరకటం కూడా చాలా విశేషం. 'నేను బ్రహ్మని' అనే జ్ఞానం పొందిన గురువు ద్వారా ఈ విషయాన్ని తెలుసుకోవటం పూర్వజన్మ సుకృతం.

కర్మవల్ల లభించే ఫలితం అనిత్యము. దానివల్ల ఆ తత్త్వం లభించదు. కర్మలు అనిత్యం. ఆత్మ నిత్యం. ఈ విషయం తెలిసికూడా నేను అగ్నిచయనం చేశాను. దాని ఫలితంగా మృత్యుదేవతనయ్యాను. నచికేతా! మానవుడు ఆత్మను ఇంద్రియాల నుండి వేరు చేసి శాశ్వత ఆనందాన్నిచ్చే ఆత్మతత్త్వాన్ని పొందుతాడు. నీవు దానికి పూర్తిగా అర్హుడవు.

వేదాలన్నీ ముక్తకంఠంతో దేన్ని గురించి చెబుతున్నాయో, తపస్సు వల్ల దేన్ని పొందుతామో బ్రహ్మచర్యాది నియమాలు, వ్రతాలు దేని కోసం ఆచరిస్తారో, అది 'ఓం' అనే పదం. ఇదే పరబ్రహ్మ పేరు లేదా గుర్తు. శబ్దం కాబట్టి ఇది అపరబ్రహ్మ (హిరణ్యగర్భుడు)

ఇదే పరబ్రహ్మ. ఓంకారాన్ని ఏ రూపంలో ఉపాసిస్తే ఆ సాధకుడు ఆ రూపాన్నే పొందుతాడు. బ్రహ్మప్రాప్తికి ఓంకారాన్ని ఆశ్రయించటమే మంచిది. ఆత్మకు చావు పుట్టుకలు లేవు. ఆత్మ తనంత తానుగా పుట్టినది. స్వయంభువు. నాశరహితమైనది. శాశ్వతమైనది. శరీరం మరణించినా ఆత్మ మరణించదు. ఆత్మ చంపేదీ కాదు, చంపబడేదీ కాదు. ఆత్మ సూక్ష్మమైన వాటికన్న సూక్ష్మమైనది. పెద్దవైన వాటి కన్న ఇంకా పెద్దది. ఇది జీవియొక్క హృదయ పద్మంలోని ఉంటుంది.

జితేంద్రియుడు ఆత్మగొప్పదనాన్ని గ్రహించి దుఃఖాల నుండి దూరమవుతాడు. ఇంద్రియలోలులు ఆత్మను గుర్తించలేరు. ఆత్మ కదలకుండా ఒకచోట కూర్చునే చాలా దూరం పోతుంది. నిద్రపోతూనే అన్ని ప్రదేశాలు తిరుగుతుంది. అనిత్యమైన శరీరాల మధ్యన శరీరం లేనిదిగా, అశ్శాతమైన వాటి మధ్య శాశ్వతమైనదిగా ఉంటుంది. ఆత్మ నిత్యము సత్యము, సర్వవ్యాపకమైనది. అటువంటి ఆత్మను గుర్తించగలిగిన వాడికి దుఃఖం లేదు.

ఆత్మసాక్షాత్కారం వేదాలు వల్లించటంవల్ల, గ్రంథాలు చదవటం వల్ల, ధారణశక్తి వల్ల, వినటంవల్ల ఉపదేశం పొందటంవల్ల లభించదు. అది ఆత్మవల్ల మాత్రమే సాధ్యమవుతుంది. అర్హుడైన వ్యక్తికి ఆత్మ తన నిజస్వరూపం చూపుతుంది.

వేదాలలో చెప్పిన పాపకర్మలు వదలిపెట్టనివాడు ఇంద్రియలోలుడు, ఏకాగ్రత లేనివాడు, మనశ్శాంతి లేనివాడు బ్రహ్మజ్ఞానం పొందలేడు.

శరీరంలో పరబ్రహ్మ ఉండేచోట ఇద్దరున్నారు. వారిలో ఒకడు కర్మఫలం అనుభవించేవాడు. రెండవవాడు సంసారబంధనాలు లేనివాడు. ఈ రకంగా ఆ ఇద్దరూ విలక్షణమైన తత్వాలు కలిగి ఉంటారు. వీరిద్దరే వెలుగు. నీడ.

ఈ శరీరం రథం వంటిది. కర్మఫలాన్ని అనుభవించే జీవాత్మ దాని యజమాని. బుద్ధే సారథి. మనస్సే కళ్ళెం. ఇంద్రియాలే గుర్రాలు. విషయమే మార్గం. కాబట్టి ఇంద్రియాలను నడిపే సారథి నేర్పరి కాకపోతే, గుర్రాలు అదుపులో ఉండవు. అందుకనే

ఇంద్రియాలు – మనస్సు అధీనంలోనూ

మనస్సు - బుద్ధి అధీనంలోనూ

బుద్ధి - యజమాని అధీనంలోనూ ఉంటాయి.

విజ్ఞానహీనుడు మనసును అదుపులో ఉంచుకోలేడు. తాను చేరవలసిన గమ్యం చేరలేడు. మోక్షాన్ని పొందలేడు. వివేకవంతమైన బుద్ధిని కలిగినవాడు, మనస్సును అదుపులో ఉంచగలిగినవాడు, పరమపదాన్ని చేరతాడు.

ఇంద్రియాలకన్న - వాటి విషయాలు (లక్షణాలు) శ్రేష్ఠమైనవి

విషయాలకన్న - మనస్సు శ్రేష్ఠమైనది

మనస్సుకన్న - బుద్ధి శ్రేష్ఠమైనది

బుద్ధికన్న - మహత్తత్త్వం శ్రేష్ఠమైనది

మహతత్త్వముకన్న - అవ్యాకృత ప్రకృతి గొప్పది

ప్రకృతికన్న - సూక్ష్మరూపి అయిన పురుషుడు గొప్పవాడు

అంతకు మించినది ఇంకేమీలేదు. ఇదే పరాకాష్ఠ. అతణ్ణి చేరిన తరువాత తిరిగి రావటం లేదు.

ఆత్మ అనేది సూక్ష్మమైన బుద్ధిచేత మాత్రమే గ్రహించబడుతుంది. ఆత్మ సర్వవస్తుజాల మందూ ఉన్నది. కాని పైకి కనపడదు. సూక్ష్మబుద్ధి గలవారు మాత్రమే దాన్ని గుర్తించగలరు. వివేకవంతుడు

ఇంద్రియాలను - మనస్సులో లీనం చెయ్యాలి

మనస్సును - బుద్ధిలో లీనం చెయ్యాలి

బుద్ధిని - మహతత్త్వంలో లీనం చెయ్యాలి

మహతత్త్వాన్ని - ఆత్మలో లీనం చెయ్యాలి

శబ్దము, రూపము, రసము, వాసన, నాశనము లేనిది, నిత్యము, అనాది అయినది. ఆత్మ సర్వభూతసాక్షియైన మహత్తత్త్వము కన్న శ్రేష్ఠమైనది. నిశ్చలమైనది; ఆత్మతత్త్వాన్ని తెలుసుకున్నవాడు మృత్యువు వాతపడడు. అతడికి అమరత్వం సిద్ధిస్తుంది.” అంటూ నచికేతునికి ఆత్మతత్త్వాన్ని వివరించాడు యముడు.

ఈ రకంగా నచికేతుడు మృత్యుదేవత అయిన యముని దగ్గర ఆత్మతత్త్వాన్ని తెలుసుకున్నాడు.

# 125. ప్రశ్నోపనిషత్తు (ప్రశ్న-1)

## ప్రాణికోటి పుట్టుక

"బ్రహ్మజ్ఞాన జిజ్ఞాసుడైన శిష్యుడు మంచి గురువును ఎంచుకోవాలి. అటువంటి గురువు శిష్యుల యొక్క సందేహాలను తీర్చి, వారికి బ్రహ్మజ్ఞానము ఉపదేశిస్తాడు. పూర్వకాలంలో పిప్పలాదుడు తన శిష్యులకు చేసిన బ్రహ్మోపదేశము ఇప్పుడు చూద్దాం.

ఈ ఉపనిషత్తు అధర్వవేదానికి సంబంధించినది.

పిప్పలాద మహర్షి మహాజ్ఞాని. బ్రహ్మవేత్త. ఒకరోజు భరద్వాజుని కుమారుడైన సుకేశుడు, శిబి పుత్రుడైన సత్యకాముడు, సూర్యుని మనుమడైన గార్గ్యుడు, అశ్వలుని కుమారుడైన కౌశల్యుడు, విదర్భ దేశీయుడైన వైదర్భి, కత్యుని మునిమనుమడైన కబంధి అనే వారు పిప్పలాద మహర్షి దగ్గరకు వచ్చారు. వీరందరూ నియమనిష్ఠలతో జీవితం గడుపుతున్నవారు. వేదాలను అధ్యయనం చేసినవారు. సగుణ బ్రహ్మారాధనలో శ్రేష్టులు. ఇప్పుడు నిర్గుణ బ్రహ్మను తెలుసుకోవాలనే తలంపుతో సరి అయిన గురువు కోసం వెతకటం మొదలుపెట్టారు. ఆ కాలంలో పిప్పలాదుడు మహాజ్ఞాని, బ్రహ్మవేత్త. అందుచేత ఆయనదగ్గర బ్రహ్మజ్ఞానసముపార్జన చెయ్యాలనే తలంపుతో ఆచార ప్రకారము సమిధలు చేతితో పట్టుకుని పిప్పలాదుణ్ణి దర్శించారు. వచ్చిన వారిని చూసి పిప్పలాదుడు "నాయనలారా! మీరందరూ బ్రహ్మతత్త్వాన్ని తెలుసుకోవటం కోసం నా దగ్గరకు వచ్చారు. చాలా ఆనందంగా ఉంది. అయితే ఒక సంవత్సరం పాటు బ్రహ్మచర్యం పాటిస్తూ నియమనిష్ఠలతో, తపస్సుచేస్తూ, ఆశ్రమ ప్రాంగణంలో కాలం గడపి ఆ తరువాత మీ ప్రశ్నలు అడగండి. నాకు తెలిసినంత వరకూ

సమాధానం చెబుతాను" అన్నాడు. అలాగే అని మహర్షి చెప్పినట్లే సంవత్సరకాలం నియమనిష్ఠలతో పూర్తి చేశారు. ఆ తరువాత ఒకరోజు కత్యుని మునిమనుమడైన కబంధి పిప్పలాదుణ్ణి అడిగాడు" ఓ మహర్షీ! జగత్తులోని ప్రాణికోటి అంతా ఎక్కడ నుండి పుడుతున్నది?" పిప్పలాదుడు కబంధుడికి ఈ రకంగా చెబుతున్నాడు. కబంధా! "ప్రజాపతి సంతానాన్ని పొందాలనే కోరిక గలవాడై తపస్సు చేశాడు. ఇక్కడ తపస్సు అంటే పూర్వకల్పంలో తాను చేసిన సృష్టిని ధ్యానించటం.

ఈ రకంగా తపస్సు చేసి 'రయి', 'ప్రాణము' అనే జంటను సృష్టించాడు.

'రయి' అంటే అన్నము, పదార్థము, చంద్రుడు అని అర్థం. చంద్రునివల్లనే భూమిమీద ద్రవత్వము, రసము కలుగుతున్నాయి. చంద్రుడే ఓషధులకు, వనస్పతులకు కారకుడు. ఓషధులు, వనస్పతులే అన్నము. ఈ రకంగా పదార్థము అంటే చంద్రుడు, అన్నము. ఇక శక్తికి ప్రతీక సూర్యుడు. అతడు అగ్నితత్త్వాత్మకుడు. అగ్నే ప్రాణం. కాబట్టి అన్నము, ప్రాణము ద్వారానే జీవం వర్ధిల్లుతున్నది. ఈ రకంగా ప్రజాపతి సృష్టించిన జంటలు మూడు (1) చంద్రుడు–సూర్యుడు 2) పదార్థము–శక్తి 3) ప్రాణము–అన్నము.

ఆదిత్యుడే ప్రాణము, అతడే అగ్ని, అతడే భోక్త, అతడే సమస్త జీవరాసుల కార్యకలాపాలకు కారణం. అందుచేత అతడే సమిష్ఠి ప్రాణం, చంద్రుడే రయి. స్థూలము సూక్ష్మము మూర్తామూర్తము అంతా పదార్థమే. పదార్థం, ప్రాణం రెండూ ఒక్కటే.

సూర్యుడు తూర్పు దిక్కున ఉదయించి అక్కడి ప్రాణులపై తన కిరణములు ప్రసరింప చేస్తున్నాడు. సూర్యకిరణాలలో ప్రాణమున్నది.

లక్ష్మీనారాయణుల దివ్యసౌందర్యాన్ని దర్శిస్తూ ఉండటము ఇది శాశ్వత స్థితి. అయితే మోక్షాన్ని కైవల్యము అని, భగవత్ర్పాప్తి (పరమపదము) అని రెండు రకాలుగా విడదీశారు.

అద్వైత సిద్ధాంతంలో – జగత్తులో ఉన్నది ఒక్కటే. అదే పరబ్రహ్మ. జీవాత్మ పరమాత్మల ఏకీభావమే మోక్షము. **జ్ఞానాదేవతుకైవల్యం** జ్ఞానంవల్లనే మోక్షం వస్తుంది. ముక్తి పొందిన వాడికి పునర్జన్మ ఉండదు. **బ్రహ్మసత్యం జగన్మిథ్య** ఇదే అద్వైత సారం.

ముక్తి నాలుగు రకాలు అంటోంది ముక్తికోపనిషత్తు. అవి

1. **సాలోక్యముక్తి :** పరమేశ్వరుణ్ణి అనాహత పద్మంలో ఆరాధించేవారు. పరమేశ్వరుడు నివశించే పట్టణంలోనే ఒక మూల నివసిస్తారు.
2. **సామీప్యముక్తి :** విశుద్ధి చక్రంలో పరమేశ్వరుణ్ణి అర్చించేవారు ఆయనకు అతిదగ్గరగా సేవకులై ఉంటారు.
3. **సారూప్యముక్తి :** ఆజ్ఞాచక్రంలో పరమేశ్వరుణ్ణి అర్చించేవారు పరమేశ్వరుని లాగానే రూపం ధరించి భక్తుల కోరికలు తీరుస్తారు.
4. **సాయుజ్యం :** సహస్రారంలో పరమేశ్వరుణ్ణి అర్చించే వారికి సాయుజ్యం లభిస్తుంది. వీరికి పునర్జన్మం ఉండదు.

పై మూడు రకాల వారికీ పునర్జన్మ ఉంటుంది. వైకుంఠంలో ఉండే గరుడుడు. నారదుడు ఆదిశేషుడు, లక్ష్మీదేవి కైలాసంలో ఉండే నందీశ్వరుడు, పార్వతీదేవి, మణిద్వీపంలో ఉండే వశిన్యాదిదేవతలు అందరూ నిత్యముక్తులు.

అద్వైత సిద్ధాంతంలో కూడా ముక్తి పొందిన ఆత్మలన్నీ

పరమేశ్వరునిలో లీనం కావు. అందులో కొన్ని

**జీవన్ముక్తాః చరంతేతే త్రిషులోకేషు సర్వదా**

పవిత్రాత్మలు జీవన్ముక్తులై ముల్లోకాలలోను సంచరిస్తూ ఉంటారు. ఎవరైనా ఒక పవిత్రమైన కార్యం ప్రారంభిస్తే, అది పూర్తి అయ్యేందుకు అన్ని రకాలుగాను తోడ్పడతారు. ఇది సత్యం. సహస్ర చండీయాగం చేసినప్పుడు నేను ఈ పవిత్రాత్మలను దర్శించాను. ఇప్పుడుకూడా నేను ఈ పుస్తకం వ్రాస్తున్నపుడు వారు నా దగ్గర కూర్చుని ఉండటం నేను చూశాను. ఆశలేని స్థితి, కోరికలు లేని స్థితే మోక్షము అంటోంది అధర్వణ వేదం.

ఎవరు ఏ రకంగా చెప్పినప్పటికీ రాగద్వేషాలు, కామక్రోధాలు, అరిషడ్వర్గాలు జయించిన వారు, ఈ చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే అని అనుభవ పూర్వకంగా తెలుసుకోగలిగిన వారు ముక్తులవుతారు అదే మోక్షము. వారికి పునర్జన్మ ఉండదు.

# 134. ఫలశృతి

ఇప్పటివరకూ 108 ఉపనిషత్తులను పూర్తిగా తెలుసుకున్నాం. అయితే ఈ విషయాలు తెలుసుకోవటంవల్ల ఫలితము ఏమిటో చూద్దాం.

మోక్షమనేది యోగంవల్ల సిద్ధించదు. సుఖంవల్ల సిద్ధించదు. కర్మవల్ల, విద్యవల్ల, ధనంవల్ల సిద్ధించదు. బ్రహ్మఒక్కటే అనే జ్ఞానంవల్ల మాత్రమే మోక్షం సిద్ధిస్తుంది. పరతత్త్వాన్ని తెలుసుకోలేనప్పుడు శాస్త్రాలను చదవటం, చర్చలు చేయటం వ్యర్థం. దానివల్ల ఏ మాత్రం ఫలితం ఉండదు. పరతత్త్వం గనక అర్ధమయినట్లైతే, శాస్త్రాధ్యయనం నిరర్థకం. అజ్ఞానమనే సర్పంవల్ల కాటు వేయబడిన వాడికి బ్రహ్మ జ్ఞానమే ఔషధం. అంతేకాని వేదాలు, శాస్త్రాలు, మంత్రాలవల్ల ఏమీ ప్రయోజన ముండదు.

మందు త్రాగితేనే రోగం తగ్గుతుంది. అంతేకాని మందు పేరు వందసార్లు చెప్పినప్పటికీ ఉపయోగం ఉండదు. అలాగే అపరోక్షానుభవం వల్ల మోక్షమొస్తుంది కాని 'బ్రహ్మ'మనే పదాన్ని పదేపదే ఉచ్చరించటంవల్ల మాత్రంరాదు. కనిపించే ప్రపంచాన్నంతటినీ మన దృష్టిలో నుంచి తుడిచివేసి ఆత్మతత్త్వాన్ని తెలుసుకోవాలి. అంతేకాని కేవలం జపతపాలవల్ల, దానధర్మాలవల్ల, అర్చనల వల్ల మోక్షం లభించదు.

రాజు కావాలంటే శతృసంహారం చెయ్యాలి. అంతేకాని ఊరికే కూర్చుని నేను రాజును కావాలనుకుంటే రాజుకాలేడు. ముందుగా ఆత్మస్వరూపాన్ని గురించి తెలుసు కోవాలి. అది తెలుసుకున్నవాడు

బంధనాలన్నీ తెంచుకుని కైవల్యము పొందుతాడు.

ఆత్మసమస్తాన్ని చూస్తూ ఉంటుంది. కాని దానిని ఎవరూ చూడలేరు. అన్ని విషయాలను వింటూనే ఉంటుంది. కాని దానిని ఎవరూ గ్రహించలేరు. అంతెందుకు? ఈ జగత్తునంతటినీ ఆత్మే సృష్టిస్తోంది. కాని ఆత్మ మాత్రం సృష్టించబడటం లేదు.

ఆత్మయొక్క సన్నిధిమాత్రం చేతనే దేహం, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, ఇవన్నీ విషయాలలో ప్రవృత్తమౌతున్నాయి.

ఆత్మకు చావు పుట్టుకలు లేవు. హెచ్చు తగ్గులు లేవు. అది ఏ విధమైన మార్పులకూ లోనుకాదు. అది నిత్యమైనది. శాశ్వతమైనది. శరీరం నాశనమయి పోయినా ఆత్మమాత్రం నాశనం కాదు.

దేనిద్వారా సర్వమూ అనుభవించబడుతున్నాయో? ఏది తానుగా అనుభవించ బడుతుందో? అటువంటి అన్నిటికీ సాక్షి ఆత్మ. ఈ ఆత్మ తనంతటతానే అనుభవింప బడుతోంది. కాబట్టి తనకు తానే సాక్షి.

అయితే పరబ్రహ్మ, ఆత్మ రెండూ వేరుకాదు. ఈ రెండూ ఒక్కటే అనేదే భవ బంధాల నుండి విముక్తిని పొందటానికి మార్గం. ఈ విషయం తెలిసినవాడే మోక్షం పొందుతాడు. బ్రహ్మను గురించి తెలుసుకున్నవాడు మళ్ళీ సంసార చక్రంలో పడడు. బ్రహ్మ సత్యము, జ్ఞానము, అనంత స్వరూపము కలది. అది విశుద్ధము, పరము, స్వతః సిద్ధము, నిత్యము అయి ఉన్నది.

ఆత్మకన్న వేరైన వస్తువేదీ లేదు. జీవాత్మ, పరమాత్మ రెండూ ఒక్కటే. అలా కాదని, అనేకమంది బ్రహ్మలున్నారనుకునేవాడు జనన

మరణాలతో కూడిన సంసార చక్రంలోపడి తిరుగుతుంటాడు. ముముక్షువైనవాడు వాసనాత్యాగం చెయ్యాలి. నేను కర్తను, నేను భోక్తను అనరాదు. లోక వాసనలను, శారీరక వాసనలు వదలిపెట్టి సంసారమందున్న బంధనాలను తొలగించుకోవాలి. అప్పుడు ఆత్మసాక్షాత్కారమవుతుంది.

బ్రహ్మ అంటే ఎవరు? జాతి, నీతి, కులము, గోత్రములకు అతీతమైనది, నామము, రూపము, గుణము, దోషము లేనిది, దేశకాల వస్తువులన్నిటికన్న భిన్నమైనది. అదే బ్రహ్మ. సాధకుడే బ్రహ్మ. సత్వగుణ ప్రధానుడైన జ్ఞానికి మాత్రమే ఆత్మసాక్షాత్కారమవుతుంది. ఐహికపరమైన కోరికలతో శరీరం శుష్కింపచేసి తపస్సు చేసినంత మాత్రంచేత ఆత్మసాక్షాత్కారం కాదు.

జనులందరూ ఆధ్యాత్మికమైన ఉపన్యాసాలు వింటారు. వాటిని గురించి చర్చిస్తారు. దీనివల్ల ఉపయోగం ఉండదు.

విన్న విషయాన్ని మనస్సుకు పట్టించుకోవాలి. దాన్ని గురించి తీవ్రంగా చర్చించాలి. ఆ తరువాత ఆచరించాలి. జగత్తులోని ప్రతివస్తువు నందు బ్రహ్మను చూడగలగాలి. అంటే జగత్తులో ఉన్న అన్నివస్తువులూ బ్రహ్మమయమని తెలుసుకోవాలి.

ఇంద్రియాలను అదుపులో పెట్టుకుని, కోర్కెలను త్యజించిన వాడే మోక్షానికి అర్హుడు. అతడే జీవన్ముక్తుడు. అతడు కూడా సామాన్యుని లాగానే మరణించినప్పటికీ అతని ప్రాణాలు ఉత్క్రమించవు.

బ్రహ్మరంధ్రం గుండా బయటకు పోయి, పరబ్రహ్మలో లీనమై పోతాయి.

కాబట్టి సాధకులారా! కేవలము ఉపనిషత్తులను వినటంవల్ల, చదవటంవల్ల ఉపయోగం లేదు. అందులోని విషయాలను మనస్సుకు పట్టించుకోవాలి. సృష్టిలోని ప్రతివస్తువును బ్రహ్మమయంగానే చూడాలి. అప్పుడే అతడికి మోక్షం సిద్ధిస్తుంది.

చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. 84 లక్షల జీవరాశి పరమేశ్వర స్వరూపమే అని మనసా వాచా కర్మణా భావించటమే ఆత్మసాక్షాత్కారము. ఆత్మసాక్షాత్కారం పొందిన వాడికి పునర్జన్మ ఉండదు. అటువంటి స్థితిని పొందటమే వేదాధ్యయనం చెయ్యటం వల్ల వచ్చే ఫలితము.

చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపం. అందులోని 84 లక్షల జీవరాసులు పరమేశ్వరుడికి ప్రతిరూపం. కులాలు లేవు. మతాలు లేవు. వీటిని వేదంలో చెప్పలేదు. మానవులు చేసే పనిని బట్టి వర్ణవ్యవస్థ ఏర్పడింది. అంతేకాని వేదంలో కులము, మతము, జాతుల గురించి ఎక్కడా చెప్పలేదు. ఎవరూ ఎక్కువా కాదు ఎవరూ తక్కువా కాదు. మానవులంతా సమానమే. వేదంలో చేసిన ప్రార్ధనలన్నీ ఇవే. "ఓ పరమేశ్వరుడా! మా దేశంలో వర్షాలు బాగా కురవాలి. పంటలు బాగా పండాలి. మేమంతా పిల్లా పాపలతో సుఖంగా జీవించాలి" అనే ప్రార్ధించారు. అంతేకాని ఎవరిలోనూ స్వార్ధంలేదు. ధర్మాన్ని రక్షించాలి. అధర్మాన్ని ఎదిరించాలి. అందరూ సుఖంగా ఉండాలి. ఇదే వేదంయొక్క

సారాంశం.

వేదంలో శైవము, వైష్ణవము అని విడిగా ఎక్కడా చెప్పలేదు. నారాయణుడు – నారములయందు (నీటియందు) ఉండేవాడు. పంచభూతాలను తన వశంలో ఉంచుకున్న వాడు అలాగే శివుడు – శుభప్రదుడు, మంగళకరుడు. ఇవన్నీ పరమేశ్వరునికి విశేషాలు. అంతేకాని వేరు వేరురూపాలు కాదు. సాకారంగాని, నిరాకారం గాని, ద్వైతంగాని, అద్వైతం గాని అన్నీ మోక్షమార్గాలే. పరమేశ్వరుణ్ణి ఏ రకంగా ఆరాధించినా మోక్షం వస్తుంది అని చెబుతోంది వేదం. వేదంలో చెప్పిన విషయాలకు తమకు నచ్చిన రీతిలో విపరీత వ్యాఖ్యలు చెయ్యకుండా చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే అని తెలిసినవాడు మోక్షం పొందుతాడు.

ప్రపంచం మొత్తానికి తెలిసింది ఒక్కటే. అదే ప్రేమ. ఈ జగత్తులోని ప్రతిజీవిని ప్రేమించు. పిపీలికాది బ్రహ్మపర్యంతము పరమేశ్వరస్వరూపమే, నీ తోటివారిని ప్రేమించు. సర్వమానవ సమానత్వాం, విశ్వకళ్యాణం కాంక్షించు. ప్రపంచంలో అందరూ సుఖసంతోషాలతో వర్థిల్లాలి. ఇదే వేదసారం.

శైవం లేదు, వైష్ణవం లేదు, సాకారం లేదు, నిరాకారం లేదు, కులం లేదు, మతం లేదు, జాతి లేదు లింగభేదం అంతకన్నా లేదు. ఆస్తికత్వం, నాస్తికత్వం అసలే లేవు. జగత్తంతా పరమేశ్వరమయం. జగత్తులోని ప్రాణులన్నీ సమానమే అని భావించగలిగిన ప్రతివాడు మోక్షం పొందుతాడు. ఇందులో సందేహం లేదు.

విశ్వమానవాళి అంతా ఒకటే. ఇందులో ఎక్కువ తక్కువలు లేవు. సమసమాజ స్థాపన, సర్వమానవ సమానత్వము, సౌభ్రాతృత్వము, విశ్వమానవకళ్యాణము, విశ్వశాంతి ఇవే వేదంలో చెప్పిన విషయాలు. వీటిని దృష్టిలో పెట్టుకుని వేదాధ్యయనం చేసిన వారికి ఇహము, పరము రెండూ సిద్ధిస్తాయి.

ఈ పుస్తకాన్ని ఆసాంతం చదివిన మీకందరికీ ఆ పరమేశ్వరుడు ఆయురారోగ్య ఐశ్వర్యాలు, సిరిసంపదలు, భోగభాగ్యాలు, ధనధాన్యాలు, ఉన్నత పదవులు, మంచి సంతానము, పుత్రపౌత్రాభివృద్ధి, మనశ్శాంతులను కలగజేసి, అంత్యకాలంలో మోక్షాన్ని ప్రసాదించాలని ప్రార్థిస్తున్నాను.

*క్రోవి వంశోద్భవుడు, హరితస గోత్రీకుడు*

*శ్రీమతి లక్ష్మీనరసమ్మ, శ్రీ పురుషోత్తమశర్మ గార్ల పౌత్రుడు*

*శ్రీమతి సత్యపర్వతవర్ధనమ్మ, శ్రీ కృష్ణమూర్తిగార్ల జ్యేష్ఠపుత్రుడు*

*పరమానందనాథ దీక్షానామధేయుడు అయిన*

***డా॥ క్రోవి పార్థసారథి***

*సర్వజన ఆమోదము పొందునట్లుగా, అత్యంత సులభశైలిలో వ్రాసిన*

***పార్థసారథీయము అను చతుర్వేద భాష్యము*** *సమాప్తము*

*సర్వేజనాః సుఖినోభవంతు*

*సమస్త సన్మంగళాని భవంతు*

*ఓం తత్సత్*

ప్రాచీన భారతీయ విజ్ఞాన భాండాగారమైన వేదాన్ని ఆదరించండి. సంప్రదాయాన్ని కాపాడండి. మీ గౌరవాన్ని పెంపొందింప చేసుకోండి.